# శ్రీమద్భాగవతము

## మొదటి సంపుటము

(ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్ధ స్కంధములు)

*సరళాంధ్ర పరివర్తన:*

**డా॥ ఏల్చూరి మురళీధరరావు**

**రామకృష్ణ మఠం**

దోమలగూడ, హైదరాబాదు-500 029.

# తొలిపలుకు

శ్రీ మద్భాగవతం అష్టాదశ మహాపురాణాలలో అవిరళ ప్రచారానికి నోచుకొన్న వాసుదేవ కథా కలశ రత్నాకరం. స్వరబ్రహ్మ భూషితమైన పవిత్ర వాగ్వీణపై పారాశర్య మహర్షి మ్రోయించిన ఆత్మ సంగీతాన్ని నిర్విక్రియుడైన శుకయోగి ఉపదేశింపగా సన్నిహితమరణుడైన పరీక్షిన్న రేంద్రుడు ఆలకించిన భక్తి యోగసారం. కర్మజ్ఞానశాస్త్రానుష్ఠానాలతో సాధింపరాని మోక్షఫలాన్ని హరినామ సంకీర్తనతో అవలీలగా పొందవచ్చునని చాటి చెప్పిన మహేతిహాసం. వేదాంత ధర్మాన్ని విదగ్ధ కవితాశిల్పంతో అనుసంధించి శ్రీకృష్ణవైభవ ప్రకాశన కావించిన పుణ్య కథాకోశం.

భాగవతం సంసారాసక్తులైనవారు భగవత్ప్రాప్తిని సాధించే మార్గాన్ని మనస్సులకు హత్తుకొనే మధురమైన సంవిధానంతో బోధిస్తున్నది. 1. భగవంతుడు సర్వేంద్రియ ప్రేరకుడు, సర్వజీవ నియామకుడు 2. భగవన్నామ సంకీర్తనమే భక్తులకు విహిత కర్తవ్యం 3. భగవంతుడు నిర్గుణుడైనందున ఆయన తత్త్వం సమగ్రంగా తెలియాలంటే అపరోక్షజ్ఞానమొక్కటే తగినట్టిది 4. అట్టి జ్ఞానానికి భక్తియోగం పరమ సాధనం 5. భక్తియోగానికి వైరాగ్యం అవసరం – అని దీని యందు ప్రతిపాదింపబడింది. అనుభవైక వేద్యమైన ఈ సత్యాన్ని శ్రీకృష్ణ జీవిత సందేశంగా వినిపించిన మహాగ్రంథం ఇది.

భాగవతం భక్తిరసాయనం. సర్వరసాశ్రయుడైన శ్రీకృష్ణపరమాత్మ లీలా మానుషవిగ్రహుడై కావించిన చర్యలలో భాగవత ధర్మం సమ్మోహనకరమై ప్రకాశించింది. వ్రజకులావాసంలోని మధుర శృంగారం, రాజవంశాల మధ్య చెలరేగిన సంగ్రామాలలో రక్తపాతం, ఋష్యాశ్రమాలలో హరికథాశ్రవణ ఫలంగా జిగిదేరిన తత్త్వనవనీతం – అన్నీ ధర్మరక్షణ కోసం నేలకు దిగివచ్చిన ఆయన జీవితంలో ఐక్యం చెంది భాగవతం పవిత్ర గ్రంథమై భక్తులను పులకింపజేస్తుంది.

వ్యాస హృదయాన్ని ఆవిష్కరించడం మహానుభవం కలిగిన పండితులకే తప్ప అనభిరూపులకు సులభం కాదు. అదీకాక ఛందోబద్ధమైన గ్రంథాల కంటె సర్వసుబోధ్యమైన వ్యావహారశైలిలో రచింపబడిన కృతుల అవసరం సాహిత్యంలో ఎప్పుడూ ఉంటుంది. గహనమైన శ్రీమద్భాగవతానికి కీ॥ శే॥ శతఘంటం వేంకటరంగ శాస్త్రులవారు అతి గంభీరమైన ప్రౌఢ వచనంతో కావించిన అనువాదం సుప్రసిద్ధమైనది. సామాన్యులకు దురవగాహమైన ఆ గ్రంథాన్ని కీ॥ శే॥ దొడ్ల వేంకటరామరెడ్డిగారు సరళమైన శయ్యలోనికి పరివర్తించి, యథోచితమైన మార్పులతో పోతనగారి పద్యోదాహరణలతో ఒక సరికొత్త పాఠాన్ని రూపొందించి మాకు ప్రకాశనార్థం అందజేశారు. దానిని మూల పాఠంతో సరిచూచి, ఆధునిక పాఠకులకు ఉపయుజ్యమైన ధోరణిలో సులభశైలిలో సరిక్రొత్తగా వచనంలో రచించి ఇమ్మని మేము ఆంధ్రశ్రీ విష్ణుపురాణ కర్తలు, పండితాగ్రేసరులు అయిన శ్రీ ఏల్చూరి మురళీధరరావుగారిని కోరాము. మేము సంస్క ృతంలో పూజ్యశ్రీ తపస్యానందస్వామి చరణుల ఆంగ్లానువాద సమేతంగా ప్రచురించిన శ్రీమద్భాగవత పురాణానికి శ్రీతపస్యానందులవారు సమకూర్చిన విపుల భూమికను కూడా వారిచేతనే తెనిగింపజేసి ఆ ముద్రణలో చేర్చాము. అది అశేష భక్తపాఠక లోకాదరణకు నోచుకొన్నది. దానికే ఈ ప్రస్తుత ముద్రణం పునఃపరిష్కృత సుపరివర్ధితమైన సర్వాంగసుందర రూపమని తెలియజేయటానికి ఎంతో సంతోషిస్తున్నాము. ఇందుకు శ్రీ మురళీధరరావు గారికి మా నితాంత ధన్యవాదాలు.

రామకృష్ణ మఠం ప్రచురణలను ఎంతో ఆసక్తితో ఆదరిస్తున్న పాఠక లోకం దీనిని కూడా తప్పక అనుశీలింపగలదని ఆకాంక్షిస్తున్నాము.

– ప్రకాశకులు

రామకృష్ణ మఠం,
హైదరాబాదు
విజయదశమి–2008

# విషయానుక్రమణిక

## భూమిక

## ప్రథమస్కంధం 5

## విషయానుక్రమణిక

## ద్వితీయస్కంధం 122

విషయానుక్రమణిక

## తృతీయ స్కంధం 213

## చతుర్థస్కంధం 427

# శ్రీమద్భాగవత ప్రకాశం

## భూమిక

**మూలం : పూజ్యశ్రీ తపస్యానంద స్వామి**
**అనువాదం : డా॥ ఏల్చూరి మురళీధర రావు**

## ౧

## పురాణ వాఙ్మయావిర్భావం

శ్రీమద్భాగవతనామంతో వెలసిన ప్రకృతానువాదం పురాణములని పేర్కొనబడుతున్న హిందూధర్మ నియామకగ్రంథాలలో ప్రసిద్ధమైనది. ఈ పురాణ శబ్దానికి 'పూర్వకాల కథావిశేష' మన్న అర్థం నిరూఢమై ఉన్నది. క్రీస్తుకు పూర్వం ఐదవ శతాబ్ది నాటినుంచి పురాణవాఙ్మయం ఈనాడు లభిస్తున్న పాఠాన్ని సంతరించుకోవడం మొదలయినా, దీని మౌలికరూపం అంతకు బహుపూర్వకాలానికే, అంటే వేదసంహితల నాటికే స్పష్టమయింది. యజ్ఞసమయంలో ఋక్సామచ్ఛందాలతోపాటు ఉచ్ఛిష్ట రూపమై పురాణం ఆవిర్భవించినదని ఈ శబ్దోదంతం అథర్వణవేదంలో తొలిసారిగా ప్రస్తావింపబడింది. శతపథ బ్రాహ్మణం, గోపథ బ్రాహ్మణం, బృహదారణ్యకోపనిషత్తు – వీటిలో పురాణప్రశంస లున్నాయి. మహాభూత (పరమాత్మ) నిశ్వసిత ముఖంగా వేదేతిహాస పురాణ వాఙ్మయం ఉప్పతిలినట్లు బృహదారణ్యకం ప్రబోధించింది.

చిత్రమేమిటంటే, ఈ ఉదాహరణ లన్నింటిలోనూ **'పురాణ'** శబ్దం ఏకవచనంలో అనువిద్ధమై ఉంటున్నది. దీనిని బట్టి ఆదికాలంలో ఇది వేదాధ్యయనకు ఒక సాంగ సాధన ప్రక్రియగా మాత్రమే ఉండేదని, కొన్నాళ్ళకు ప్రత్యేకశాఖగా వేర్పాటుచెంది, బహుముఖీన మతసాహిత్యంగా రూపుదిద్దుకొన్నదని విమర్శకు లూహిస్తున్నారు. దీర్ఘకాలం నిర్వర్తింపవలసిన యజ్ఞదీక్షావిధులలో నడుమ నడుమ విరామవేళలలో అక్కడ గుమిగూడిన వారందరూ ఇష్టకథావినోదంగా ప్రపంచ సృష్టి, పూర్వరాజన్యులూ మహర్షుల వంశచరిత్రలు మొదలైన ప్రాక్కథనాలను ఆఖ్యానోపాఖ్యానాలతో, నానారుచిరార్థసూక్తులతో పురాణశ్రవణ చేయటం పరిపాటిగా ఉండేది. అశ్వమేధం, రాజసూయం మొదలైన ప్రభుయజ్ఞాలలో ధర్మనిర్వహణార్థం యజ్ఞకర్మలను నెరవేర్చిన ప్రసిద్ధ రాజవంశాల పుణ్యచరిత్రలను, వేదమంత్రాల, యజ్ఞయాగాదుల పుట్టువులను గూర్చి పారిప్లవాఖ్యానం అన్న పేరిట పురాణశ్రవణ చేయటం నియతంగా కనుపిస్తున్నది. వైదిక కర్మకలాపం లోని ఈ ఆఖ్యానభాగాలను పురాణవాఙ్మయ ప్రథమ రూపాలుగా పరిగణింపవచ్చు.

## వేద పురాణ సంహితల పృథక్కరణం

ఆదిమదశలలో ఈ పురాణ పఠనాన్ని యజ్ఞానికి కూర్చున్న బ్రాహ్మణులే స్వయంగా నిర్వర్తించి ఉండాలి. అయితే ఇది కర్మకలాపంలో ప్రధానకల్పం కానందువల్ల కాబోలు, కాలక్రమాన యాజకుల నుంచి వర్ణసాంకర్యం చెందిన సూత (క్షత్రియునికి బ్రాహ్మణస్త్రీ యందు జన్మించిన సంతానం) పౌరాణికులకు సంక్రమించింది. ఈ విభాగాన్ని గురించిన ఐతిహ్యం వాయు, బ్రహ్మాండ, విష్ణుపురాణాలలో కనుపిస్తుంది. వ్యాసమహర్షి పురాణ సంహితను నిర్మించిన తర్వాత సూతశిష్యుడు రోమహర్షణునికి ఉపదేశించగా అతను దానిని భాగాలు చేసి సుమతి, అగ్నివర్చుడు, మిత్రాయువు, శాంశపాయనుడు, అకృతవర్ణుడు, సావర్ణి అనే ఆరుగురు శిష్యులకు

బోధించాడు. వీరిలో అకృతవర్ణుడు, సావర్ణి, కాశ్యప శాంశపాయనులు వేర్వేరుగా మూడు పురాణ సంహితలను రూపొందించారు. రోమహర్షణుని మాతృకతో కలిపి ఈ గ్రంథజాతమంతా పురాణవాఙ్మయానికి మూలమై నిలిచింది.

సుశ్రుతమైన ఈ ఉదంతం పురాణవాఙ్మయం లోని అనేక ముఖ్యలక్షణాలను గ్రహించటానికి మనకెంతగానో ఉపకరిస్తుంది. దీని మూలంగా ఆనాడు యాజ్ఞికులైన బ్రాహ్మణులకు స్వాధీనమై వారి అధ్యయనాధ్యాపనాలలో ప్రసక్తమైన పురాణం ఒకటుండేదని తెలుస్తుంది. వేదవిభాగకర్తగా పేరెన్నిక గన్న వ్యాసుడు శ్రౌతకర్మల నుంచి ఈ పురాణసంహితను వేరుచేసి, విషయక్రమాన్ని బట్టి పునారచించి కాలాను గుణంగా అవసరమైన మార్పుచేర్పులతో లోకులకు తెలియజేయమని బ్రాహ్మణేతరులైన సూతులకు దీనిని అప్పగించాడు. ఆపస్తంబ ధర్మసూత్రాలలో పురాణాల నుంచి ప్రాకరనిర్దేశం చేయకుండా ప్రమాణీకరించిన మూడు ఉదాహరణలు, భవిష్యపురాణం నుంచి ఒక ఉదాహరణ కనుపిస్తుండటాన్ని బట్టి క్రీ.పూ. 600–300 నాటికే పురాణ వాఙ్మయం ఒక ప్రత్యేకశాఖగా రూపుదిద్దుకొన్నదని చెప్పవచ్చు. ఈ విధంగా వేద సంహిత ఎటువంటి పాఠభేదమూ లేకుండా సువ్యవస్థితమై ఉన్న రోజులలోనే వేద తత్త్వాన్ని విశదీకరిస్తున్న పురాణాలు పెక్కుమంది ప్రవక్తలు, భక్తవతంసులు వ్యాప్తిలోనికి తెచ్చిన మతసిద్ధాంతాల సారాన్ని జీర్ణించుకొని, తమ సమకాలంలో ప్రవర్తిల్లిన వైజ్ఞానిక, సాంఘిక, చారిత్రిక వృత్తాంతాలతో అనేక రహస్యాలను వెల్లడిచేస్తూ కనీసపక్షం క్రీ. పూ. 6–వ శతాబ్ది నుంచి క్రీ.శ. 12–వ శతాబ్ది వరకు రచింపబడుతూ వచ్చాయి.

## మహాపురాణ – ఉపపురాణాలు

ఈ ప్రకారం రూపొందిన పురాణాలలో మహాపురాణ లక్షణోపేతములై ప్రాచీనతమాలుగా గుర్తింపబడినవి పద్దెనిమిది ముఖ్యపురాణా లున్నాయి.

వీటి పేర్లు: బ్రాహ్మ పురాణం, పద్మ పురాణం, విష్ణు పురాణం, వాయు పురాణం, భాగవత పురాణం, నారదీయ పురాణం, మార్కండేయ పురాణం, వరాహ పురాణం, అగ్ని పురాణం, భవిష్య పురాణం, బ్రహ్మవైవర్త పురాణం, లింగ పురాణం, స్కాంద పురాణం, వామన పురాణం, కూర్మ పురాణం, మత్స్య పురాణం, గరుడ పురాణం, బ్రహ్మాండ పురాణం. ఈ నామక్రమం వీటి పౌర్వాపర్యాన్ని కాని, గుణోత్తరతను గాని సూచించే ఉద్దేశంతో సమకూర్చినది కాదు. అసలు అష్టాదశ పురాణాలన్న ఈ వ్యవహారం బహుశః పద్దెనిమిది సంఖ్య పవిత్రమైనదనే ఉద్దేశంతో, ప్రాచీన వాఙ్మయంలో ఉదాహరింపబడిన పురాణనామాలను ఏకత్రపరచి క్రీ. శ. 7వ శతాబ్ది ప్రాంతంలో రూపొందింపబడినట్లు తెలుస్తున్నది. అయితే ఈ పురాణాల సంఖ్యానాసక్తి అంతటితో తనూకృతం కాలేదు. విదేశీయ దండయాత్రల వల్ల, అనుక్షణ పరిణామ శీలమైన రాజకీయ స్థితిగతుల వల్ల ఏర్పడిన మార్పులకు అనుగుణంగా నూతన మత సిద్ధాంతాల దృక్కోణం నుంచి వేదధర్మాన్ని వాఖ్యానింపగోరిన మనీషితల్లజుల కృషి వల్ల క్రీ.శ. 650 – 800 మధ్యకాలంలో ఉపపురాణాలనే పేరుతో మళ్లీ పద్దెనిమిది పురాణాలు పృథక్కరింపబడ్డాయి.

మహాపురాణ మన్న శబ్దం మహత్త్వ గుణౌత్కృష్ట్యాలను సూచిస్తుండగా, ఉపపురాణమన్న పేరే అనాధిక్యాన్ని, దాని సంక్షిప్తతను వెల్లడిస్తున్నది. వాయు పురాణం ఉపపురాణమంటే ఒక ఉపభేదమాత్రమని పేర్కొన్నది. సౌరపురాణం వీటిని ఖిలపురాణాలుగా నిర్దేశించింది. అందువల్ల ఉపపురాణాలలో అనేకం తమ గౌణలక్షణాన్ని అంగీకరింపకపోయినా, వాటిని అష్టాదశ మహాపురాణాలకు అనుషంగికంగానో, పరిపూరకంగానో పరిగణించాలని విమర్శకులు భావిస్తున్నారు.

౨

## పురాణలక్షణాలు : విషయవివేచన

పురాణాలలో మార్కండేయ పురాణం వంటివి ఒకటో రెండో తప్ప తక్కిన వన్నీ ఏకాశ్రయంగా శివుడు, విష్ణువు, శక్తి మొదలైన ఆరాధ్యమూర్తులలో ఎవరినో ఒకరినే ప్రధానీకరిస్తున్న మాట సత్యమే. ఆయా గ్రంథాలలో అధ్యసింపబడిన ముఖ్యదేవతల మాహాత్మ్యవర్ణనలో తక్కినవారందరూ అప్రధానంగా చిత్రింపబడినందువల్ల వీటిలో ఆనాటి మతకలహాల సంకుచిత దృష్టి కనుపిస్తున్నదని అతిగంభీరమైన వేదధర్మాన్ని అర్థం చేసుకోలేనివారు అపోహపడుతుంటారు. ఆ మాటకొస్తే వేదాలలో ఇటువంటి మహత్త్వారోపణ అనేక సూక్తాలలో అనేక విధాలుగా మనకు గోచరిస్తుంది. ఇది సర్వవ్యాపకమై, నిఖిల జగజ్జన్మాది కారణీభూతమైన పరమాత్మ తత్త్వాన్ని జ్ఞానదృష్టితో అన్వీక్షించిన వేదఋషుల మహాప్రతిభకు నిదర్శనమే తప్ప, భేదకల్పన తాత్పర్యంతో చేసిన ఉపాధినిరూపణ కాదు. సర్వజ్ఞులై నిర్విక్రియులైన ఆ మహామునుల దర్శనసారమే పరబ్రహ్మతత్త్వాన్ని శబ్దప్రమాణంతో అభివర్ణిస్తున్న పురాణాలలోనూ మనకు ప్రత్యక్షమౌతుంది. ఆ వాక్యాలు భగవన్మార్గ రతులైన భక్తులకు భగవంతుని యందు నిశ్చల భక్తిసంపదను పెంపొందింప జేస్తాయి. దానివల్ల స్వరూపావస్థితి కలుగుతుంది. అందులో అన్యదేవతానిర్వాదానికి ఆస్కారమే లేదు. ప్రతిపురాణంలోనూ జీవకళ ఉట్టిపడే అతి మనోహరమైన శైలిలో లోకాతిశాయిగా వర్ణింపబడిన తన ఉపాస్యదైవతం యొక్క అపూర్వ మూర్తి చిత్రణను, రూప నామాదులను, నివేశ స్థలాన్ని, ప్రసాధన సామగ్రిని, దేవాసుర మనుష్యలోకాలపై నెరపిన ప్రభావ ప్రాభవాలను మనసారా చదువుకొని పాఠకుడు తనదైన ఒక విశిష్టభావనతో మనస్సును ధ్యేయవస్తువుకు అనుగుణంగా మలుచుకొని ధ్యానధారణ చేయగలుగుతాడు.

ఇక పురాణాలలో ఏయే విషయాలు వర్ణనీయాలన్న ప్రశ్నకు సమాధానం

నామలింగానుశాసనంలో అమరసింహుడు (క్రీ.శ. 6 వ శతాబ్ది) పేర్కొన్నదానిని బట్టి – 1. సర్గము (గుణముల పరిణామమైన సృష్టిసామాన్యం) 2. ప్రతిసర్గము (భగవంతుడు చరాచరాత్మకమైన విరాడ్రూపాన్ని గ్రహించటం) 3. వంశము (దేవతలు, రాక్షసులు, మహర్షులు, మనువులు, మహారాజుల వంశావళి) 4. మన్వంతరము (భగవదనుగ్రహపాత్రులై ఆయా కాలాలలో వర్తిల్లిన వారి ధర్మసమీకరణం) 5. వంశానుచరితం (రాజవంశాల కథనం) అని మొత్తం ఐదు లక్షణాలున్నాయి. ఆదికాలంలో సాంగోపాంగంగా నిర్వర్తింపవలసిన వైదిక యజ్ఞయాగాలలో పఠనీయాలై ఉండటం వల్లనే పురాణాలకు ఈ నియమిత తాత్పర్యం ఏర్పడి ఉండాలి. కాలక్రమాన పురాణవాఙ్మయం వేదధర్మాన్ని ఆచరణసులభమైన సందేశరూపంలో జనసామాన్యానికి అందిస్తూ వైయక్తిక భక్తి మార్గాలను ప్రబోధించే విశిష్ట మత సాహిత్యంగా రూపొందిన తర్వాత మహాపురాణాన్ని విపులార్థంలో నిర్వచింపవలసిన ఆవశ్యకత కలిగింది. భాగవత, బ్రహ్మవైవర్త పురాణాలలో ప్రాగ్లక్షణాలకు మరొక అయిదింటిని కలిపి మొత్తం దశలక్షణాలను నిరూపించారు. ప్రాథమికంగా వెలసిన లక్షణాలు ఉపపురాణాలకు మాత్రమే వర్తిస్తాయని, మహాపురాణం దశలక్షణోపేతమని ఒక వాదం ఉన్నది కాని అది సూక్ష్మపరిశీలనకు నిలిచేది కాదు. పురాణవాఙ్మయంలో పెరుగుతూ వచ్చిన కథనీయ వస్తువిస్తృతి వల్ల దాని స్వరూప ప్రతిపాదనలోనూ ఈ పరిణామాలు కలిగాయని మనం ఊహింపవచ్చును.

వ్యాసభాగవతం (12. 7. 9 – 10)లో పేర్కొన్నదానిని బట్టి మహాపురాణ దశ లక్షణాలు ఈ విధంగా ఉన్నాయి–

1. **సర్గము:** గుణక్షోభఫలంగా మహత్తత్త్వము, దానినుంచి అహంకారము, దానినుంచి తన్మాత్రలు, వాటి నుంచి ఇంద్రియార్థాలు సంభవించిన ఉదంతం.

2. **విసర్గము:** ఈశ్వరానుగృహీతములై వర్తిల్లుతున్న మహదాదుల కార్య ఫలంగా బీజంనుంచి వేరొక బీజం పుట్టినట్లు ప్రాణివర్గం తమ తమ పూర్వకర్మవాసనలను బట్టి నానారూపాలను ధరించటం.

3. **వృత్తి:** ప్రాణుల జీవకల్పనకు వృత్తి అని పేరు. ఈ వృత్తి ఒక తీరుగా ప్రాణుల స్వభావ కామప్రేరణానుగుణంగా జరుగుతుంటుంది.

4. **రక్షణము:** వేదవిధులు ఎంతకాలం సక్రమంగా అనుష్ఠింపబడు తుంటాయో అంతకాలం సృష్టి యథావిధిని జరుగుతుంటుంది. ఆ విధులను ఉల్లంఘించి వర్తించినప్పుడు సృష్టిక్రమానికి ముప్పు వాటిల్లుతుంది. ఆ విధంగా సృష్టికి ముప్పుకావించే వారిని రాక్షసులు అంటారు. రాక్షసతత్త్వం గల ప్రాణులు ప్రతి యుగంలోనూ తలెత్తి వ్యవహరిస్తుంటారు. వారిని సంహరించే నిమిత్తం భగవానుడు దేవ ఋషి మనుష్య తిర్యగ్రూపాలను ధరించి ఆ కార్యాన్ని నెరవేరుస్తుంటాడు. అటువంటి భగవద్రూపాలే అవతారాలు. ఆ అవతారాల ఊహలీల రక్షణ మనబడుతుంది.

5. **మన్వంతరము:** మన్వంతరమంటే ఆరు విషయాల సమాకలనం – ఇందులో మనువు చరిత్ర, మనుపుత్రుల చరిత్ర, ఆ మనువు కాలంలోని దేవతలు దేవేంద్రుడు సప్తర్షుల చరిత్రలు, ఆ మనుకాలమందలి భగవదంశావతారం యొక్క చరిత్ర ఉంటాయి.

6. **వంశము:** బ్రహ్మప్రభువులై శుద్ధాత్ములైన రాజుల అన్వయాన్ని వర్ణించటం.

7. **వంశానుచరిత:** ఆ రాజుల వలన ఏయే వంశాలు కలిగాయో, ఆ వంశధరుల చరిత్రను వివరించడమే వంశానుచరితం.

8. **నిరోధము:** విశ్వానికి ఉత్పత్తినంటి లయం కూడా ఉంటుంది. ఆ లయం నిత్యము, నైమిత్తికము, ప్రాకృతికము, ఆత్యంతికము అని నాలుగు విధాలు. బ్రహ్మాది సర్వభూతాలకు ఎల్లప్పుడు ఉత్పత్తి ప్రళయాలు

తప్పకుండటం నిత్య ప్రళయం. బ్రహ్మ, నారాయణుడు సృష్టిని ఉపసంహరించి, శయనించే ప్రళయ కాలాన్ని నైమిత్తిక ప్రళయం అంటారు. బ్రహ్మాండకోశం ఏర్పడటానికి మూలము లైన మహదాదులు లయించినప్పుడు వాటిమూలాన ఏర్పడిన కోశం లయించటానికి ప్రాకృతిక ప్రళయం అని పేరు. ఆత్యంతిక లయమంటే మోక్షం. సర్వమూ బ్రహ్మమే గాని తద్భిన్నమైనది వేరొకటి లేదన్న భావం ఏర్పడటమే మోక్షలక్షణం. నాలుగు విధాలైన ఈ లయాలను నిరూపించడం నిరోధము లేదా సంస్థ అనబడుతుంది.

9. **హేతువు:** సృష్టికి నిమిత్త కారణం జీవుడు. జీవుడే లేకపోతే సృష్టి కూడా లేనట్లే అవుతుంది. కాబట్టి జీవుడు హేతువు అనబడుతున్నాడు. ఈ నిమిత్తత్వం అవిద్య చేత జీవుడు కర్మమునకు కర్తృత్వం వహించినందువల్ల కలుగుతున్నది. ఈ నిమిత్తత్వం అనుశయాత్మకమని కొందరు, అవ్యాకృతమని మరి కొందరు అంటుంటారు. చైతన్య ప్రాధాన్యం వలన అనుశయత్వం, ఉపాధి ప్రాధాన్యం వల్ల అవ్యాకృతత్వం కలుగుతున్నాయి.

10. **అపాశ్రయము:** సర్వానికీ బ్రహ్మమే ఆశ్రయం. ఆశ్రయం వ్యతిరేక రూపం, అన్వయ రూపం అని రెండు విధాలు. జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అనే మూడవస్థలు మాయాకల్పితములై దేహానికి కలుగుతున్నాయి. ఈ మూడవస్థలలోనూ క్రమంగా విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అనే పేర్లతో నెలకొని అవస్థాత్రయాన్ని కేవలం సాక్షిమాత్రుడై వీక్షిస్తూ జీవవృత్తితో ఉండటం అన్వయక్రమం. సమాధి మొదలైన అవస్థలలో బ్రహ్మమునకు, సంసారానికి ఎటువంటి సంబంధమూ లేదని, బ్రహ్మము కేవలాధిష్ఠానభూతుడని ఏర్పడుతున్నది. ఆ దృష్టితో చూడటం వ్యతిరేక రూపం. ఈ రెండింటినీ ఆశ్రయం అంటారు. పరమాత్మ ఈ సర్వసృష్టికి సత్తా మాత్రమై ఉంటుంది. సృష్టి ఆ సత్పదార్థ ప్రపంచమేనని గుర్తించటం పరమాత్మాశ్రయం అనబడుతుంది. ఆ పరమాత్మ గర్భాధానం మొదలు మరణ పర్యంతం దేహానికి సర్వావస్థల లోనూ (అవస్థలు – నిషేకం, గర్భం, జన్మం, బాల్యం, కౌమారం,

యౌవనం, వయోమధ్యం, ముసలితనం, మృత్యువు అని తొమ్మిది) అధిష్ఠానమాత్రంగా ఉన్నట్లు భావించడాన్ని సంయుతం అని, సాక్షిమాత్రంగా ఉన్నట్లు భావించడాన్ని అసంయుతం అని వ్యవహరిస్తారు. ఈ విధానాన్నే అపాశ్రయం అంటారు.

ఈ నిభృత సన్నివేశాలన్నీ భగవత్సంకల్పాధీనములై దృశ్యమాన ప్రపంచంలో సంభవిస్తున్నాయి. జాగతిక వ్యవహారాన్ని దృష్టిలో ఉంచుకొని భక్తులకు భగవత్తత్త్వవివేకాన్ని కలిగించే మహాసంకల్పంతో పురాణాలలో ఈ విషయాలు సాకల్యంగా వివరింపబడ్డాయి. ప్రాక్తనకాలంలో తత్కాల గోచరీ భూతమైన చరిత్ర, భూగోళశాస్త్రం, జ్యోతిర్వివేకం, ప్రకృతి విజ్ఞానం, సమాజ స్వరూపం మొదలైన విషయాలను గురించిన వివరణలు కూడా వీటిలో పెక్కుచోట్ల కానవస్తుంటాయి. ఆ వివరణల ఉద్దేశం ఈనాడు వైజ్ఞానికులు తమ పరిశోధనలలో తెలిసివచ్చిన కొన్ని ఫలితాలను శాస్త్ర సత్యాలుగా తదేక ప్రయోజనంతో ప్రకటిస్తున్నట్లు కాక చరాచర భూతజాతం లోనూ అంతర్యామిగా వెలుగొందుతున్న పరబ్రహ్మవస్తువు యొక్క అభిజ్ఞానాన్ని మనలో జాగృతం చేసి, ఆ పరమాత్మ భక్తికి ముఖ్యలక్షణమైన ప్రేమభావాన్ని తళుకొత్తించి, ప్రేమమయ జీవితాన్ని ఉపదేశించడమేనని తెలిస్తే శుష్కతర్కాలకు తావుండదు.

భాగవతానికి చాలా అర్వాచీనమైన బ్రహ్మవైవర్త పురాణం, ఈ దశ లక్షణాలను వేరొక విధంగా ఉపదేశించింది. అందులోని వివృతులు -- **సృష్టి** (మహత్తత్త్వ సంభవం); **విసృష్టి** (చరాచరాత్మక ప్రపంచోత్పాదనం); స్థితి (ఈశ్వరేచ్ఛ చేత నిరోధింపబడిన సమస్త లోకాన్నీ స్వాజ్ఞయందు నెలకొల్పే నియోగస్థాపన); **పాలన** (జీవుల రక్షణ మోక్షణాదులు); **కర్మ వాసన** (పూర్వకర్మ వాసనలను బట్టి దేహధారణ కలుగుతుండటం); మన్వంతరం (మనువుల కథానకం); **ప్రళయ వర్ణన** (మహత్తత్త్వంలో లోకాలు విలీనం కావడం); **మోక్ష నిరూపణ** (మోక్షస్వరూప కథనం); **హరి కీర్తన** (భగవత్తత్త్వ గుణానువర్ణనం); **దేవ కీర్తన** (దేవతలను గూర్చిన మహిమవర్ణనం) అన్నవి.

బ్రహ్మవైవర్తం క్రీ.శ. 8-16 శతాబ్దాల మధ్యకాలంలో ఉత్పన్నమై పురాణాలన్నింటిలోనూ అత్యాధునికం కావటం వల్ల అందులో ఆనాటికి విశేష ప్రాముఖ్యాన్ని కోల్పోయిన ఋషులు, రాజవంశాల చరిత్రల స్థానంలో మారుతున్న కాలానికి అనుగుణంగా ఈ సరిక్రొత్త లక్షణాలు వచ్చిచేరాయి.

## పురాణాలలో భాగవతానికి గల స్థానం

ఇంత విస్తారమైన మతసాహిత్య గ్రంథజాతంలో భాగవతానికి గల స్థానం ఎటువంటిది? అష్టాదశ మహాపురాణాలను గూర్చిన ప్రాస్తావిక శ్లోకాలలో భాగవత నిర్దేశాన్ని తనకన్వయించుకొని దేవీ భాగవతం ఈ విష్ణు భాగవతాన్ని ఉపపురాణాల లోనికి విసిరివేసింది. ఈ విషయమై సారవిచారం చేసిన ప్రొ॥ హజరా 'కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా' (సం. 2; పుట. 281) లో దేవీ భాగవతాన్ని క్రీ. శ. 12వ శతాబ్దికి చెందిన ఆధునిక రచనగా నిర్ణయించి, పాఠకులలో శాక్తేయ మత విశ్వాసాన్ని పెంపొందించేందుకు ఇది తనను తాను మహాపురాణంగా ప్రకటించుకోవలసి వచ్చిందని, ఈ ఉద్దేశంతోనే దేవీ భాగవతం మత్స్య, స్కాంద, అగ్ని పురాణాలలో కనుపిస్తున్న భాగవత లక్షణ నిరూపణను అత్యంత శ్రద్ధతో అనుసరించిందని అభిప్రాయపడ్డారు. ఒకవేళ ఇంకేదైనా ఆధారం లభించి కాలాంతరంలో దేవీభాగవతవాదమే అంగీకృతమైతే, అప్పటికీ విష్ణు భాగవతం ఒక గొప్ప పురాణం గానే నిలిచి ఉంటుంది గాని ఉపపురాణాల స్థాయికి మాత్రం దిగిరాదని చెప్పవచ్చును. లోకంలో దీనికేర్పడిన ప్రసిద్ధి సామాన్యమైనది కాదు. వర్ణనాతీతమైన గుణ మాహాత్మ్యంతో అలరారుతున్న ఈ మహాగ్రంథం ఆసేతుశీతాచలవ్యాప్త పండిత మండలీ కంఠస్థగిత విమల మణిహారమై, నానామతప్రస్థాన సిద్ధాంతావిరుద్ధ ప్రమాణ తర్క సాధనోపాలంభ పూర్వక దుర్విగాహ భక్తి స్వరూప నిరూపణ ఫలవ్యాచిఖ్యాసువులకు ఆలవాలమై, గీర్వాణ వాణీ తరుణారుణ చరణారవింద మరందాస్వాదలోల హృన్మత్త మిళింద చక్రవర్తులచే బహుభాషల లోనికి అనూదితమై, మోక్షాభిలాషుల మనస్సులలో భద్ర ముద్రాంకితమై, నిజానికి

పురాణమంటే ఇదేనన్నంత అవిరళమైన ప్రచారాన్ని గడించింది. ఇందులో వైష్ణవధర్మ ప్రబోధమే ప్రధాన మైనప్పటికీ ఈ ప్రతిపాదన అన్యమత ప్రస్థానాలను అధఃకరించే సంకుచితదృష్టితో కాక అవిచ్ఛిన్న తైలధారా ప్రవాహరూపమైన భక్తిభావాన్ని హృదయంగమంగా ప్రసరింపజేస్తున్నది. రసవంతమైన ఈ చిత్రణలోని ఔదాత్య గాంభీర్యాలు, అపూర్వమైన శయ్యాసౌభాగ్యం, మధుర పద గుంఫనం, భావనిర్భర కవితాశిల్పం మొదలైన విశేషాలను చూస్తే ఇంక ఏ పురాణమూ దీనికి సాటిరాదని తెలుస్తుంది. ఆధ్యాత్మిక శిఖరాల నధిరోహించిన ఈ ఉద్గ్రంథం భారతదేశం లోని సారస్వతేయుల మహా ప్రతిభకు ప్రథమోదాహరణమై శాశ్వతికంగా నిలిచి ఉంటుంది.

3

## భాగవత రచనాకాలం

వర్తమాన సాహిత్య పరిశోధకులు శ్రీమద్భాగవత రచనాకాలం, ప్రస్తుతం లభిస్తున్న భాగవత పాఠక్రమాలను గూర్చి ఇదమిత్థంగా ఏ సంగతీ చెప్పలేకపోతున్నారు. ప్రొ॥ హజరా చెప్పినదాన్ని బట్టి భాగవతం యొక్క ప్రకృతపాఠం క్రీ. శ. 6 వ శతాబ్ది పూర్వార్ధంలో రూపొంది ఉండాలి. అయితే మత్స్య పురాణం (క్రీ. శ. 4 వ శతాబ్ది పూర్వార్ధం)లో వచ్చిన భాగవత ప్రశంసను బట్టి దీనికంటె భిన్నమైన మూలపాఠం ఒకటి అప్పటికే రచితమై ఉండవచ్చునని ఆయన అంగీకరించాడు. 'ఫిలాసఫీ ఆఫ్ ది భాగవత' అనే విపుల పరిశోధన గ్రంథం మొదటి సంపుటానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో ప్రొ॥ సిద్ధేశ్వర భట్టాచార్య "మొత్తంమీద శ్రీమద్భాగవతానికి మూడు దశలలో మార్పుచేర్పులు జరిగాయని నిర్ణయించవచ్చు, మొదటి దశలో అతి ప్రాచీనమైన విషయజాతం మాత్రమే మాతృకాప్రాయమై సమకూడగా క్రైస్తవ యుగారంభ కాలానికి రెండవ దశలో దీనికి మహాపురాణ లక్షణాలకు అనురూపమైన సంసిద్ధి, ఇక చిట్టచివరి దశలో తమిళ దేశపు సాధుమండలి

కృషివల్ల నేటి రూపమూ సిద్ధించాయి; ఈ దృక్కోణం నుంచి పరిశీలిస్తే శ్రీమద్భాగవత ప్రకృతపాఠం ఆళ్వారులకు సమకాలంలో రూపొందినదని నమ్మవచ్చు" అన్నారు.

శ్రీమద్భాగవతం మూడు వేర్వేరు దశలలో పెంపు చెందినదన్న ఈ వాదానికి ఉపబలంగా భాగవతంలో ఆంతరంగిక సాక్ష్యాలు కొన్నయినా లేకపోలేదు. ద్వితీయ స్కంధం తొమ్మిదవ అధ్యాయంలో ఈ పురాణాన్ని బ్రహ్మ నారదునికి ఉపదేశిస్తూ, యథోచితంగా విస్తరింపజేయడాన్ని అనుమతించాడు. తృతీయ స్కంధంలో భాగవతం సంకర్షణుని నుంచి సనత్కుమారునికి, అతని నుంచి సాంఖ్యాయనునికి, అతనిచే పరాశరునికి, అతని మూలాన మైత్రేయునికి, అతని ద్వారా విదురునికీ ప్రబోధితమైనట్లు వివరింపబడింది. అదే – ప్రథమ స్కంధంలో వ్యాసునికి తపస్సిద్ధి వల్ల చేకూరినట్లు, వ్యాసముఖంగా శుక యోగికి అందినట్లు, శౌనకుడు మునులతో అన్నాడు. భాగవతం మూడు దశలలో వేర్వేరుగా విస్తృతిని పొందినదన్న వాదానికి ఈ పరంపరాక్రమం కొంత సూచకమై ఉండవచ్చు.

భాగవత రచన ఆళ్వారుల వైష్ణవ మతోద్యమానికి సమకాలికమన్న వాదానికి ఆధారం ఏకాదశ స్కంధం (అధ్యా. 5. 38–40)లో 'కలియుగంలో భగవత్ప్రాప్తి అతిసులభం కావడంవల్ల కృతాదియుగాలలోని జనులందరూ కలియుగంలో జన్మించగోరుతారు, కలియుగజాతులు సామాన్యంగా నారాయణపరులన్న మాట అటుండగా ద్రవిడదేశంలో కావేరీ తామ్రపర్ణీ కృతమాలా నదుల తీరమందు జన్మించినవారు ఆ తీర్థజలాలను గ్రోలి శుద్ధచిత్తులై హరిభక్తు లవుతారు' అని ఉన్నది. దీనినిబట్టి ఈనాడు మనకు లభిస్తున్న భాగవతపాఠాన్ని ఆళ్వారుల మత బోధనల వల్ల ప్రభావితులైన దాక్షిణాత్యు లెవరో ఆమూలచూడంగా పరిష్కరించి ఉంటారని భావింపవచ్చు. అంతకు పూర్వం లభిస్తున్న పాఠాలు ఎటువంటివైనా ఈ చిట్టచివరి పరిష్కర్త చేతిలో భాగవతం పూర్తిగా సరిక్రొత్త రూపాన్ని సంతరించుకొన్నది. భాగవత మాహాత్మ్య కథనంలో – 'భక్తి కాంత ద్రవిడదేశంలో పుట్టి కర్ణాట

మహారాష్ట్రాల మీదుగా బృందావనం చేరుకొని యౌవనోచిత వపుర్విజృంభణను పొందిన' దన్న వర్ణనలో ఈ దాక్షిణాత్య కవి భక్త్యావేశం పరిస్ఫుటంగా ధ్వనిస్తున్నది.

భాగవతంలో దాక్షిణాత్యుల అభినివేశాన్ని పట్టియిచ్చే సూచనలు ఇంకా ఒకటి రెండు కనిపిస్తాయి. గ్రంథంలో పెక్కుచోట్ల ఉత్తరదేశంలోని నగరాల అలంకరణలను వర్ణించినపుడు పునరుక్తప్రాయమైన వాక్యాల వల్ల వైవిధ్యం కొరవడింది. దీనికి తోడు సరస్వతీ నదీతీరప్రదేశాల లోనూ, చివరికి సముద్రం ఒడ్డున ఉన్న ద్వారక లోనూ సమృద్ధిగా పెరిగిన అరటి తోటలను, తాటితోపులను పేర్కొన్నారు. ఆ ప్రాంతాలలో వాటి పెరుగుదల విషయం అనుమానాస్పదమని ఒప్పుకోక తప్పదు. ఇది ముమ్మూర్తులా దక్షిణదేశవాసులకు పరిచితమైన వాతావరణం. అదే బలరాముడు దక్షిణదేశయాత్రకు వచ్చిన సన్నివేశంలో రచయితకు ఆ ప్రాంతంలోని తీర్థక్షేత్రాలలో ఉన్న ప్రత్యక్షపరిచయం కారణంగా ఆ ప్రదేశాలను కన్నులకు కట్టినట్లు వర్ణించటం జరిగింది. ఉత్తరదేశ వర్ణనలను వీటితో సరిపోలిస్తే ఎంతో పేలవంగా, శ్రుత పాండిత్యం వలె గోచరిస్తాయి.

మహాపురాణంలో అవశ్యవర్ణనీయాలుగా నిరూపితాలైన దశలక్షణాలను కథాంతర్లీనమైన భక్తిభావానికి అనుసంధించి, వస్త్వైక్యాన్ని పాటించడంలో భాగవతం చాలావరకు కృతకృత్యం కాగలిగిందనే చెప్పాలి. వీటిలో పరమకాష్ఠను చేరుకొన్న అపాశ్రయ నిర్వహణకౌశలం మూలాన మనస్సులను ద్రవింపజేసి అపరోక్షానుభూతిని ప్రసాదించే వాసుదేవకథామృతం దీనిలో దివ్యతేజోమయమై వెల్లివిరిసింది. భక్తి రూపమైన ధర్మాన్ని ప్రబోధిస్తున్న శాస్త్రసారగంభీరిమ వల్ల తక్కిన కథాంశాలన్నీ ఉద్దీప్తిని పొందాయి. పరబ్రహ్మాత్మకు డైన శ్రీమహావిష్ణువు సంపూర్ణతేజమై పుడమికి దిగివచ్చిన శ్రీకృష్ణ పరమాత్మ లీలామానుషచర్యలను, ఆయన జీవితసందేశాన్ని భాగవతంలోని మొదటి మూడు స్కంధాలలో తనివితీరా వర్ణించిన తర్వాత తొమ్మిది స్కంధాలలో శ్రీకృష్ణావతార తత్త్వం, ఆయన ఉపదేశించిన

భక్తియోగస్వరూపం, సవిస్తరంగా వ్యాఖ్యానింపబడ్డాయి. ఈ కథాపరిగతిలో ప్రస్ఫుటించిన వస్త్వైక్యం, భక్తిభావబంధురమైన వస్తుకళలో పరిణతినందిన విదగ్ధభావనాశిల్పం, దీప్తిమత్కవితా శైలి – ఈ గ్రంథాన్ని రచించిన మహాకవి అలౌకిక ప్రతిభాశ్రీవిలసనాన్ని తారస్వనంలో ఆలపిస్తున్నాయి. ఆ మధురాపనలో నినదిస్తున్న ఆళ్వారుల వైష్ణవ ధర్మప్రబోధాల తాదాత్మ్యాన్ని బట్టి శ్రీమద్భాగవతపాఠం ఏ అజ్ఞాత వైష్ణవ మనీషితల్లజుని కుశల కరాంగుళుల చేతనో పునర్లిఖితమై ఉంటుందని ఊహించడం సత్యదూరం కానేరదు. ఆళ్వారుల ఉద్యమం క్రీ. శ. 5 – 8 శతాబ్దాల నడిమికాలంలో ప్రవర్తిల్లిన కారణంచేత భాగవత పురాణం దీనికి సమసామయికం గానో, ఈషద్వ్యవహితం గానో రచితమై ఉండాలి. ప్రొ॥ హజరా క్రీ. శ. 6వ శతాబ్ది పూర్వపాదమని నిర్ణయించారు.

భాగవతం పదమూడవ శతాబ్దినాటి వోపదేవుని రచన కావచ్చునని ఉదితాస్తంగమితంగా తలయెత్తిన ప్రవాదం ఒకటున్నది. విఖ్యాత అరబ్ విద్వాంసుడు అల్బరూని (కీ.శ. 1030) భారతదేశాన్ని అధికరించి వ్రాసిన గ్రంథంలో వైష్ణవ భాగవత ప్రస్తావం ఉన్నదని గుర్తించిన తర్వాత ఈ వాదమిప్పుడు పర్యుదస్తమైపోయింది. ప్రొ॥ సిద్ధేశ్వర భట్టాచార్య *'ఫిలాసఫీ ఆఫ్ ది భాగవత'* గ్రంథం (పుట 131) నుంచి: "వాసుదేవపరాయణమని అల్బరూని కావించిన భాగవత ప్రశంసతో వోపదేవుని కర్తృత్వ సమస్య నిరాధారిత మవుతున్నది" అన్న వాక్యాన్ని ఉదాహరించారు.

ప్రొ॥ బి. యన్. కృష్ణమూర్తి శర్మ గారు భాగవత రచనాకాలాన్ని గురించి లభిస్తున్న బాహిరసాక్ష్యాలను పరిశోధించి *'ఆనల్స్ ఆఫ్ ది భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ పూనా'*, సంపుటి 14 (1932 – 33) లో వ్రాసిన విమర్శవ్యాసంలో ఆసక్తిదాయకమైన విషయాలను వెల్లడించారు. గౌడపాదాచార్యుడు (7వ శతాబ్దం) ఉత్తర గీతల వ్యాఖ్యానంలో ఆ గ్రంథంలోని ద్వితీయాధ్యాయం 46వ శ్లోకాన్ని వివరిస్తూ, భాగవత పురాణం నుంచి: "తదుక్తం భాగవతే – తేషా మసౌ క్లేశ ఏవ శిష్యతే, నాన్య ద్యథా

స్థూలతుషావఘాతినామ్” అని పేర్కొన్న భాగాన్ని వీరు గుర్తుపట్టి తొలిసారిగా దీనిని జిజ్ఞాసువుల దృష్టికి తీసుకొనివచ్చారు. ఈ ఉదాహృత శ్లోకం భాగవతం దశమ స్కంధం పధ్నాలుగో అధ్యాయంలో “శ్రేయః స్రుతిం భక్తిముదస్య తే విభో క్లిశ్యన్తి యే కేవలబోధలబ్ధయే! తేషా మసౌ క్లేశ ఏవ శిష్యతే, నాన్యద్యథా స్థూలతుషావఘాతినామ్” (శ్లో.4) అన్న చోట కనిపించింది. 1933 లో ఈ వ్యాసం అచ్చుయినప్పుడు గొప్ప సంచలనం రేకెత్తించి భాగవతం పదమూడవ శతాబ్దినాటి వోపదేవుని రచనమన్న విపరీతవాదాన్ని లేవదీసిన విల్సన్, మెక్డొనాల్, కోల్‌బ్రూక్, బర్నొఫ్ మొదలైన ప్రాచ్యభాషావేత్తల ప్రతిపాదనలన్నీ నేలవిడిచిన సాములని చక్కగా రుజువు చేసింది. ప్రొ॥ శర్మ గారి ఉపపత్తి మూలాన ఈ కృతిరచన ఏడవ శతాబ్దికి పూర్వం, 5–8 శతాబ్దుల మధ్యకాలం నాటి ఆళ్వారుల ఉద్యమావగాహనతో, అంటే ప్రస్తుతం అందరూ అంగీకరిస్తున్నట్లు క్రీ. శ. 6వ శతాబ్ది పూర్వపాదంలో జరిగి ఉండాలి.

భాగవతాన్ని చక్కటి శైలిలో ఇంగ్లీషు లోనికి అనువదించిన శ్రీ ఎన్. రఘునాథన్ దీని రచనాకాలాన్ని గురించిన వ్యతిరేకసాక్ష్యాలను ప్రోదిచేసి ఈ విషయమై మరొక విలువైన దృక్కోణాన్ని వెలికి తెచ్చారు. శ్రీకృష్ణకల్పభూజానికి పెనవేసుకొని అవినాభావంగా ప్రవర్తిల్లిన రాధాలతిక ప్రేమమయజీవితాన్ని గురించి భాగవతం ఎన్నడూ స్మరింపలేదు. దశమస్కంధం (అధ్యా. 30 – శ్లో. 28) లోని రాసలీలా సన్నివేశంలో శ్రీకృష్ణుడు గోపికలను తన్మయ విభ్రమాలలో ముంచెత్తి అంతర్హితుడై నప్పుడు ‘అనయా ఆరాధితః’ అని ఉన్న దళాన్ని తీసుకొని ‘ఆరాధితః’ అనడం రాధా నామాన్ని సూచిస్తునదని రాధాప్రేమతత్త్వ ప్రచారకులు అంటుంటారు. కాని భాగవతంలో రాధాప్రసక్తి లేదు. ఆమెకు ప్రాముఖ్యం బ్రహ్మవైవర్తం, పాద్మం ఇత్యాది అనంతరీయ పురాణాలలో వచ్చింది. శ్రీకృష్ణాతిమానుషతత్త్వాన్ని ప్రబోధిస్తున్న అత్యంత ముఖ్యగ్రంథమైన భాగవతంలో రాధాప్రేమస్వరూపం ఎందుకు కనిపించడం లేదన్న ప్రశ్నకు విమర్శకులు సమాధానం చెప్పవలసి ఉంటుంది. రఘునాథన్ గారి అభిప్రాయానుసారం ఈ సమస్యను మూడు విధాలుగా

పరిష్కరింపవచ్చు. ఒకటి: శ్రీకృష్ణ భక్తితత్త్వంలో రాధ ప్రమేయం లేని భక్తిమార్గమొకటి ఉండి ఉండాలి. రెండు: భాగవత కర్త ఉద్దేశపూర్వకంగా రాధ పాత్రను తన గ్రంథం నుంచి తొలగించి ఉండాలి. మూడు: ఈనాడు మనం భావిస్తున్నట్లు శ్రీకృష్ణ భక్తి సంప్రదాయంలో రాధాతత్త్వం ప్రవేశించటానికి పూర్వమే భాగవత రచన జరిగి ఉండాలి. భాగవతం కంటె ప్రాచీనతమాలైన విష్ణు పురాణ, హరివంశాలలో రాధ పాత్ర లేకపోవటం ఈ చివరి వాదానికి ప్రోద్బలకంగా ఉన్నది. అయితే పూర్వకాలపు గ్రంథాలలో రాధ ప్రస్తావన అసలు లేదని కూడా అనుకోకూడదు. క్రీ.శ. 1వ శతాబ్దినాటి గాథాసప్తశతిలో: "కృష్ణా! రాధిక నెమ్మోమున కంటుకొన్న కెంధూళిని తుడిచివేస్తూ నీవు గోపికా ముఖరేఖలలోని ముగ్ధకౌమారాన్ని తొలగించివేశావు" (1–89) అన్న పంక్తిలోనూ, భట్టనారాయణుని (6 వ శతాబ్దం) వేణీసంహారం, ఆనందవర్ధనుని (9 వ శతాబ్దం) ధ్వన్యాలోకం మొదలైన గ్రంథాలలోనూ రాధాప్రశంస లున్నాయని ఆయన పేర్కొన్నారు. దీనిని బట్టి క్రీ. శ. ఆరవ శతాబ్ది నాటికే శ్రీకృష్ణగాథతో రాధాపరిచయం సువిజ్ఞాతమని; పాద్మ, బ్రహ్మవైవర్త పురాణాల కాలంలో కల్పింపబడినది కాదని తెలుస్తున్నది.

ఆళ్వారుల ఉద్యమంతో శ్రీమద్భాగవతానికి గల అభినివేశాన్ని గూర్చిన అంతర్గత సాక్ష్యాన్ని శ్రీ రఘునాథన్ త్రోసిపుచ్చారు. ఈ రెండింటినీ ముడివేయటం సరికాదని ఆయన ఉద్దేశం. అయితే, ఆయన తన వాదానికి ఆధారంగా చూపిన ఉదాహరణలు ఎంత విలువైనవో, దశమస్కంధం లోని ఉదాహరణ కూడా అంతే విలువైనది. దానిని నిరుత్తరంగా, త్రోసిరాజనకూడదు. మొత్తంమీద ఉపలభ్యమానమైన గ్రంథపర్యాప్తిని బట్టి భాగవతం గాథాసప్తశతి కంటె ముందు వ్రాయబడి ఉండాలని ఆయన సిద్ధాంతం. ఇది 5–8 శతాబ్దాల మధ్య ప్రవర్తిల్లిన ఆళ్వారుల ఉద్యమస్వరూపాభిజ్ఞానంతో క్రీ. శ. 6వ శతాబ్ది పూర్వపాదంలో భాగవత పురాణం పునారచితమై ఉండాలన్న వాదానికి బాధకం కాదు.

ఈ విధంగా భాగవత రచనాకాలాన్ని వెనక్కి తీసుకొనివెళ్లే ప్రయత్నంలో మరొక విపరీత సన్నివేశం ఎదురవుతున్నది. క్రీ. శ. 1017లో జన్మించిన శ్రీమద్రామానుజుల బహువిస్తారమైన గ్రంథజాతంలో కనీసం ఒక్కచోట నైనా భాగవతాన్ని గురించిన ప్రస్తావం ఎక్కడా కనిపించడం లేదు. ఆయన ప్రమాణీకరించిన విష్ణు పురాణం (క్రీ.శ. 4వ శతాబ్ది) భాగవతాని కంటె ప్రాక్తనమే అయినా అనేక విధాల గుణగరిష్ఠం కాదని మాత్రం ఒప్పుకోవలసి ఉంటుంది. శ్రీమద్భాగవతమంత పవిత్రమైన గ్రంథం, అందులోనూ దక్షిణదేశంలో ఉత్పన్నమై ఆళ్వారుల మతోద్యమ స్వరూపం తెలిసి ప్రత్యేకంగా దానిని బహువిధాల ప్రశంసించిన గ్రంథం, ఆసేతు హిమాలయ వైష్ణవ మతవ్యాప్తికి నిరుపమానంగా తోడ్పడిన గ్రంథం – క్రీ. శ. 5–8 శతాబ్దాల మధ్యకాలంలో వెలువడి ఉంటే ఆ మతవ్యాప్తికే కంకణం కట్టుకొన్న రామానుజులకు తప్పకుండా తెలిసి ఉండాలి. అందువల్ల ఆయన ఉదాసీనతకు కారణం ఏమిటన్న ప్రశ్నకు రెండు సమాధానాలను ఊహింపవచ్చు. ఒకటి: భాగవతం దక్షిణదేశంలో క్రీ. శ. 5–8 శతాబ్దాల మధ్యకాలంలో రచితమన్న ఊహ సరైనది కాదు. ఇది ఉత్తరభారతంలోనే వ్రాయబడినప్పటికీ అల్బరూని (క్రీ.శ. 1030) ప్రస్తావించిన నాటికి దక్షిణాన దీని ఉనికి ఇంకా తెలిసి ఉండక పోవచ్చు. రెండు: సైద్ధాంతిక భేదాలు ఉన్నందువల్ల రామానుజులు దీని ప్రస్తావన మానుకొని ఉండాలి.

ఇందులోని ద్వితీయపక్షాన్నీ అంగీకరించటమే కొంత మేలనిపిస్తోంది. ఎందుకంటే రామానుజమతం విష్ణుపారమ్యబోధకాలైన పాంచరాత్రా గమాలను శిరసా వహించి ప్రచారంలోనికి తెచ్చినందువల్ల – శివ కేశవులను సర్వసమానంగా పరిగణించిన భాగవతం కంటె తన మతానికి దగ్గరగా ఉన్న విష్ణు పురాణమే ఆయనకు అభిమానపాత్రమై ఉండటంలో ఆశ్చర్యం లేదు.

ఇక రామానుజుల సిద్ధాంతంలో వైకుంఠనిలయుడైన శ్రీమన్నారాయణుడు విరాట్స్వరూపుడు కాగా భాగవతం శ్రీకృష్ణుడినే పరమాత్మస్వరూపునిగా (భగవాన్ స్వయం) చిత్రీకరిస్తున్నది. చైతన్యమతం, వల్లభ సంప్రదాయాలలో

భాగవత ధర్మమే అంగీకరింపబడుతోంది. భాగవతం శ్రీకృష్ణుని 'వాసుదేవ' పదంతో ప్రధానంగా వ్యవహరిస్తుండగా, పాంచరాత్రాగమాన్ని అనుసరించే వారికి నారాయణ నామం కీర్తనీయమై ఉంటున్నది. భాగవతులు, పాంచరాత్రికులు శ్రీమహావిష్ణువునే ధ్యేయమూర్తిగా ఉపాసించినప్పటికీ ఈ వ్యవచ్ఛేదం వారిలో చాలా పూర్వకాలం నుంచి కొనసాగుతూ వస్తున్నది. అందువల్ల పాంచరాత్రాలకు సన్నిహితంగా ఉన్న విష్ణుపురాణాన్ని స్వీకరించి, భాగవతాన్ని పరిహరించడంలో రామానుజుల ఉద్దేశం ఇదే అయి ఉండాలి. పైగా ఇందులో అద్వైతమతం (అందులోని అవాంతరశాఖ ఏదైతే నేమి) ప్రతిపాదింపబడింది. భగవానునికి ప్రపంచంతో శారీరిశరీర సంబంధం కంటె శక్తిమత్‌శక్తిగుణానుబంధం భాగవతంలో ప్రధానంగా అగుపిస్తుంది. రామానుజులు వీటిలో పూర్వపక్షాన్ని అవలంబించారు. ఇన్ని కారణాల వల్ల అనంతరకాలంలో నింబార్కుడు, చైతన్యుడు, వల్లభాచార్యుడు, శంకరదేవుడు మొదలైన వారెందరో శిరోధార్యంగా పరిపూజించిన శ్రీమద్భాగవతం పట్ల రామానుజులు ఔదాసీన్యం వహించి ఉండాలి. అంతేకాక ఆయన ఉదాహరింపనంత మాత్రాన భాగవత గ్రంథం అసలు ఆవిర్భవింపనే లేదని నిర్వికల్పంగా తీర్మానించటానికి అవకాశం లేదు.

## భాగవతంలో శ్రీకృష్ణ వైభవప్రకాశనం

శ్రీ మద్భాగవతం భగవానుడైన శ్రీకృష్ణుని మహిమాతిశయాన్ని కాంతాయతనమైన వాగర్థలీలతో రమ్యంగా ఉపదేశిస్తున్నది. ఆ కథానకముఖాన తక్కిన అవతార విశేషాలన్నీ శ్రీకృష్ణతేజంలో అంతర్లీనమై శ్రీకృష్ణవైభవ ప్రకాశనకు ఉల్లాసదోహదాలుగా పరికరించాయి.

కావ్యక్రియాకల్పంలో ఇతివృత్తశరీరానికి ఆద్యంతాలలో నిబంధింపబడిన వాక్యప్రబంధం ఆ గ్రంథతాత్పర్యాన్ని ప్రతిఫలిస్తుందనే సూత్రం ఒకటున్నది. ప్రాజ్ఞప్రతిజ్ఞాతమైన ఈ నియమనం భాగవతానికీ అనువర్తిస్తుంది. ఇందులో ప్రథమ స్కంధం పూర్తిగా శ్రీకృష్ణమహిమ వర్ణనమే. ఇక చివరి మూడు

స్కంధాలలో శ్రీకృష్ణాతిమానుషత్వం, ఆయన ఉపదేశసారం, శ్రీకృష్ణ నిర్యాణానికి అనంతరీయ ఘటనలు ప్రాతిభమైన కథనశిల్పంతో విశదీకరింపబడ్డాయి.

నైమిశారణ్యంలో శౌనకాదుల విచికిత్సకు సమాధానంగా సూతమహర్షి ప్రబోధించిన భాగవత పురాణం శ్రీకృష్ణతత్పరమై ఉండటం ఆ ఋషుల అభీష్టానుసారంగానే జరిగింది. కథాప్రారంభంలో వారతనిని –

**సూత జానాసి భద్రం తే భగవాన్ సాత్వతాం పతిః**
**దేవక్యాం వసుదేవస్య జాతో యస్య చికీర్షయా.**

**తస్య కర్మాణ్యుదారాణి పరిగీతాని సూరిభిః**
**బ్రూహి నః శ్రద్దధానానాం లీలయా దధతః కలాః**

**అథాఖ్యాహి హరే ర్ధీమ న్నవతారకథాః శుభాః**
**లీలా విదధతః స్వైర మీశ్వరస్యాత్మమాయయా.**

**వయం తు న వితృప్యామ ఉత్తమశ్లోకవిక్రమే**
**యచ్ఛృణ్వతాం రసజ్ఞానాం స్వాదుస్వాదు పదే పదే.**

**కృతవాన్ కిల వీర్యాణి సహ రామేణ కేశవః**
**అతిమర్త్యాని భగవాన్ గూఢః కపటమానుషః**

(1-1-12, 17-20)

'అయ్యా! భగవానుడు దేవకీ వసుదేవులకు జన్మించాడని అంటారు. ఆయన అవతారకార్యం ఏమిటి? ఆ పరమేశ్వరుని మూర్తిభేదాలు ఏవేవో, ఆయన ఉదార చరితలలో ఏయే కథలను సూరిజనులు కీర్తిస్తుంటారో, వినిపించు. భగవచ్చరిత్రలను ఎంత విన్నా మాకు తనివితీరదు. ఆయనను గూర్చిన ప్రతి వచనమూ మధుర మధురమై మరీమరీ వినాలని కుతూహలం గొలుపుతుంటుంది. భగవానుడు కపటమానుషవేషం ధరించి రామునితో కలిసి కావించిన అతిమానుషాలైన మహాశ్చర్యకార్యాలను వినాలని కోర్కెలు

క్రేళ్లుదాటుతున్నాయి' అని అడిగారు. ఈ ప్రశ్నలకు సమాధానంగానే భాగవత పురాణం అవతరించింది.

అంతేకాదు. వాసుదేవ మాహాత్మ్య వర్ణనకు అంకితమై భక్తి నిర్భరమైన మహా గ్రంథాన్ని లోకకల్యాణార్థం వినిర్మించాలన్న మహాశయమే వ్యాసమహర్షిని భాగవత రచనకు పురికొల్పింది. కృత్యాదిని వ్యాసుడు తనకు మనశ్శాంతి చేకూరని కారణం ఏమిటో ఊహింపలేక వ్యాకులచిత్తుడై ఉండగా, నారదుడు వచ్చి హరిభక్తి మహిమను వర్ణించి నైష్కర్మ్యసిద్ధి ఎంత కలిగినా, జ్ఞానం ఎంత నిరుపాధికమయినా హరి భక్తి లేనినాడు శోభిల్లదని వివరించి –

**యథా ధర్మాదయశ్చార్థా మునివర్యానుకీర్తితాః**
**న తథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః.** (1–5–9)

అంటూ వ్యాసుని భాగవతరచనకు ప్రోత్సహించాడు. ద్వాదశ స్కంధంలో కూడా –

**కలిమలసంహతి కాలనోఽఖిలేశో**
**హరి రితరత్ర న గీయతే హ్యభీక్ష్ణమ్**

**ఇహ తు పున ర్భగవా నశేషమూర్తిః**
**పరిపఠితోఽనుపదం కథాప్రసఙ్గైః.** (12 –12– 65)

అని కలికలుషసంహారకారకుడైన శ్రీహరి మహిమానువర్ణనం ఇంత నిండుగా మరే ఇతర గ్రంథంలోనూ కావింపబడలేదని స్పష్టంగా ఉన్నది. ద్వితీయ స్కంధంలో –

**శృణ్వతః శ్రద్ధయా నిత్యం గృణతశ్చ స్వచేష్టితమ్**
**కాలేన నాతిదీర్ఘేణ భగవాన్ విశతే హృది.**

**ప్రవిష్టః కర్ణరన్ధ్రేణ స్వానాం భావసరోరుహమ్**
**ధునోతి శమలం కృష్ణః సలిలస్య యథా శరత్.**

**ధౌతాత్మా పురుషః కృష్ణపాదమూలం న ముఞ్చతి**
**ముక్తసర్వపరిక్లేశః పాన్థః స్వశరణం యథా.** (2-8-4, 5, 6)

అని భాగవత ఫలశ్రుతి వ్యంగ్యంగా ఉపదేశింపబడింది. మోక్షమంటే శాశ్వత సుఖానుభవం. ఆ సుఖం నిరతిశయానందరూపం. భగవదనుగ్రహఫలమైన ఆ మోక్షాన్ని పొందటానికి భక్తి ఒక్కటే పరమసాధనం. ఆ భక్తి నిరపాయం కావాలంటే అందుకు శ్రద్ధ అవసరం. శ్రద్ధాభక్తులు కలగాలంటే భగవంతుని యెడ ప్రీతి జనించాలి. అందుకు ఆయన చరిత్రలను తెలుసుకోవాలి. భగవచ్చరిత్రలను శ్రద్ధాపూర్వకంగా అనుదినం చదివితే, వింటే భగవదనుగ్రహఫలం కలుగుతుంది. ఆ అనుగ్రహఫలంగా భగవానుడు భక్తుని అంతఃకరణలో పొడచూపుతాడు. భగవత్ప్రవేశంతో అంతఃకరణమందలి మలినాలన్నీ నశించిపోతాయి. తత్ఫలంగా చిత్తశుద్ధి కలుగుతుంది. శుద్ధచిత్తుడు దేహసంబంధ భోగాలన్నింటినీ నిరసించి సర్వక్లేశాలకు అతీతుడై భగవత్పాదమూలాన్ని చేరి అదే తనకు పరమసుఖ నివాసస్థానంగా వెలుగొందుతాడు' అని ఉపర్యుక్త వాక్యార్థం.

ఈ విధంగా భాగవతంలో శ్రీకృష్ణ వైభవ ప్రకాశనం సర్వాంగీణమై అనంతముఖీనంగా గోచరిస్తున్నది. ఉన్న పన్నెండు స్కంధాలలో దశమం, ఏకాదశం - దాదాపు గ్రంథంలో సగభాగం - శ్రీకృష్ణుని జీవితాన్ని, ఆయన ఉపదేశసారాన్ని వివరిస్తుండగా మొదటి రెండు స్కంధాలలోనూ శ్రీకృష్ణావతార ప్రభావం, మూడవ స్కంధంలో ఆయన సమకాలంలో వర్తిల్లిన భక్తవతంసులు విదురోద్ధవుల స్మృతిరూపసంవాదం నిబద్ధమై ఉన్నాయి.

## మహావిష్ణు భావనలో శ్రీకృష్ణాధ్యాసికం

ఉపర్యుక్త విశేషాలను బట్టి శ్రీమద్భాగవతం వైష్ణవ మతగ్రంథమే అయినప్పటికీ ఇందులో శ్రీకృష్ణావతార తత్త్వం, ఆయన ఉపదేశించిన భాగవత ధర్మం మాత్రమే ప్రధానీకరింపబడ్డాయి. అయితే కృష్ణభక్తులు

కొందరు శ్రీకృష్ణుడు విష్ణ్వవతారమన్న మాటను తిరస్కరించి, శ్రీకృష్ణుడే స్వయంగా భగవానుడని, విష్ణువు ఆయన తేజోఽంశ మాత్రమేనని ఒక వాదాన్ని లేవదీయడంతో భాగవతంలోని శ్రీకృష్ణాధ్యాస ఒక జటిలసమస్యగా రూపొందింది. ఇటువంటి విషయాలలో విశాల దృక్పథం కలిగిన భక్తులకు ఈ వాదవివాదాలు కుతూహలజనకంగా ఉండక పోవచ్చును గాని, భాగవతం వంటి ముఖ్యగ్రంథాన్ని గురించిన విమర్శ కాబట్టి దీనిని ప్రస్తావింపక తప్పదు. బెంగాల్‌లోని చైతన్య సంప్రదాయానికి చెందిన ఈ వాదం ఇటీవలే వెలువడిన డా॥ సిద్ధేశ్వర భట్టాచార్యగారి 'ది ఫిలాసఫీ ఆఫ్ భాగవత' అనే పరిశోధన గ్రంథంలో మళ్లీ సరికొత్త ఉపపత్తులతో సాక్షాత్కరించింది. భాగవతంలో శ్రీకృష్ణవైభవాన్ని ప్రకాశింపజేసే అనేక విషయాలతోపాటు వీరు ప్రథమ స్కంధంలో సూతుడు విరాట్పురుషుని అవతారాలను పేర్కొన్న తర్వాత –

**అవతారా హ్యసంఖ్యేయా హరేః సత్త్వనిధే ర్ద్విజాః**
**యథా విదాసినః కుల్యాః సరసః స్యుః సహస్రశః.**

**ఋషయో మనవో దేవా మనుపుత్రాః మహౌజనః**
**కలాః సర్వే హరే రేవ స ప్రజాపతయ స్తథా.**

**ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవా న్స్వయమ్**
**ఇన్ద్రారివ్యాకులం లోకం మృడయన్తి యుగే యుగే.**

(1: 3: 26–28)

అంటూ అవతారాలలో తక్కినవన్నీ అంశకళలు కాగా, 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్' అని ఉన్న దళాన్ని వీరు ప్రమాణీకరించారు. ఉదాహృత సన్నివేశాన్ని బట్టి ఈ శ్లోకార్థం సందేహాస్పదంగానే ఉన్నది. అంతకుముందు భగవల్లీలావతారాలను పేర్కొన్నప్పుడు కృష్ణావతారం తక్కిన అంశావతారాలలో ఒకటిగా మాత్రమే చెప్పబడింది. శ్రీకృష్ణుని మహావిష్ణువు యొక్క అంశావతారంగా నిరూపించిన శ్లోకాలు గ్రంథంలో అసంఖ్యాకంగా ఉన్నాయి. విష్ణుపారమ్యాన్ని బోధిస్తున్న పురాణాలన్నింటిలో వలెనే భాగవతం

లోనూ శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవులకు జన్మించినపుడు మహావిష్ణు దివ్యతేజో**౭**ంశతో అవతరించినట్లు వర్ణింపబడింది. శ్రీకృష్ణ నిర్యాణ ఘట్టంలో వేటగాని శరాఘాతంవల్ల శ్రీకృష్ణుడు భౌతికకాయాన్ని త్యజించి శ్రీమహావిష్ణువులో లీనమైనట్లుగానే అభివర్ణింపబడింది. పైగా మొత్తం గ్రంథంలో ఈ ఒక్క శ్లోకంలో మాత్రమే స్వవచోవిరుద్ధంగా శ్రీకృష్ణుడే భగవానుడన్న ప్రతిపాదన అగుపిస్తున్నది. ఈ వాక్యాన్ని తమ మతవైశిష్ట్యానికి అనుగుణంగా సమన్వయింప గోరినవారు తలకెత్తుకొని శ్రీకృష్ణుడే విరాట్పురుషుడని అర్థకల్పన చేశారు. అయితే ప్రకరణాన్ని బట్టి – ఆధికారిక మాత్రాలయిన అంశావతారాలలో కళాలేశం మాత్రమే ప్రకటింపబడిందనీ, సాక్షాన్నారాయణుడు సర్వశక్తిసమగ్రుడై అవతరించిన అతివిశిష్టమైన కృష్ణావతారం సంపూర్ణావతారమనీ దీని అర్థం. అంతే కాని శ్రీకృష్ణుడే శ్రీమహావిష్ణువుగా అవతరించాడని అన్వయించటం సమంజసం కాదు. నిజానికి భాగవతమతాన్ని బట్టి భగవానునికి రూపమే లేదు. దేహాంతర్యామియై ఉన్న భగవంతునికి ఉపాసనార్థం విరాడ్రూపాన్ని ఋషులు ప్రతిపాదించారు. ఆ విరాట్పురుషుని అవతారాలలో ఒకదానికొకటి తారతమ్యాన్ని కలిగి ఉంటుందనటం భావ్యం కాదు. అయితే శ్రీకృష్ణ మహిమానువర్ణనకు, శ్రీకృష్ణ జీవిత చిత్రణకు అంకితమైన గ్రంథం కాబట్టి ఇందులో శ్రీకృష్ణపారమ్యం సర్వాతిశాయిగా వర్ణించబడింది. అదే రామాయణాన్ని చూస్తే శ్రీరామచంద్రుని దివ్యగాథను గానం చేసిన మహేతిహాసం కనుక అందులో శ్రీరామావతార ప్రశంస కనబడుతుంది. ఆ గ్రంథాలను చదువుకొని తమ మనోభావనకు అనువైన రూపాన్ని ఎన్నుకొని భక్తులు అందులోని దివ్యత్వాన్ని స్వానుభవగోచరం చేసుకొంటారు.

౫

## భాగవతంలో శ్రీమహావిష్ణువర్ణన: రూపనివేశాదికం

పురాణాలన్నింటివలెనే శ్రీమద్భాగవతం కూడా ఏకదేవతా పారమ్యాన్ని ప్రబోధిస్తున్నా, శ్రీమహావిష్ణుకథావస్తుకంగా రచింపబడిన మాట సత్యమేనని

పూర్వోదాహృతవిషయాలను బట్టి నిరూపితమయింది. అయితే ఆ విధమైన పరమేశ్వర భావనలో అన్యదేవతానిర్వాదం అణుమాత్రమైనా లేదు. అందులో ప్రతిపాదింపబడిన తత్త్వం శైవ, శాక్తేయ మతానురోధకుల సిద్ధాంతీకరణలకు వ్యతిరేకం కాదు. సజాతీయ విజాతీయ భేదశూన్యమైన పరబ్రహ్మం స్వలీలావిలసనార్థం రజస్సత్త్వతమో గుణాలను ఆశ్రయించి బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మకమై సృష్టి స్థితి లయాలను ప్రకల్పిస్తున్న శాస్త్రోదితాన్ని గ్రంథాదిలోనే ఉపపాదించటం వలన మూర్తిత్రయంలో ఏ ఒక్కరిని ఉపాసించినా అది పరతత్త్వోపాసనమేనని సూక్ష్మంగా ఉపదేశించినట్లయింది. ఉపాధికృతభేదం జీవుల సర్వాత్మభావనకు ప్రతిరోధంగా పరిణమింపకూడదని భాగవతం పెక్కుతావులలో నొక్కి వక్కాణిస్తూనే ఉన్నది. అయితే త్రిమూర్తులలో బ్రహ్మదేవుని ఇలువేల్పుగా ఆరాధించే సంప్రదాయం లేనందువల్ల, ఆయనకు ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ఆపాదింపక, శ్రీమహావిష్ణునాభికమలోద్భవునిగా అభివర్ణించి నిరూఢలక్షణ మూలాన విష్ణుపారమ్యాన్ని సంకల్పించినట్లు కనబడుతుంది. అందువల్ల హరిహరులు మాత్రమే ఉపాస్యదైవతాలుగా ఏర్పడి శైవ వైష్ణవాలు ప్రచారంలోనికి వచ్చాయి. కాని భాగవత పురాణం వీరిరువురినీ సమానులుగానే పరిగణించింది. చతుర్థస్కంధంలోని రుద్రగీతాధ్యాయంలో "అథ భాగవతా యూయం ప్రియాః స్థ భగవా న్యథా, నమద్భాగవతానాం చ ప్రేయానన్యోఽస్తి కర్హిచిత్" (4. 24. 30) అన్నచోట విష్ణుభక్తు లందరూ శైవులని, శివభక్తులందరూ వైష్ణవులని, వీరియందు తారతమ్యనిరూపణకు యత్నించటం పాపహేతువని – హరిహరాభేదం స్పష్టంగా కనిపిస్తుంది. హరిహరుల అభేదభావాన్ని ప్రకటించే ఇటువంటి వర్ణనలు భాగవతంలో అవిరళంగా ఉన్నాయి. అయినప్పటికీ శ్రీమద్భాగవతం వైష్ణవేతివృత్తాన్ని స్వీకరించినదంటే అందుకు కారణం శుద్ధ సత్త్వస్వరూపము, సర్వాభివ్యాపకము అయిన శ్రీమహావిష్ణువిరాణ్మూర్తి నిర్గుణమైన పరబ్రహ్మాన్ని సాధుమార్గంలో సర్వోత్కృష్టంగా అభివ్యంజింపజేయటమేనని గ్రహించాలి.

జీవేశ్వర వ్యవస్థను కల్పించి ఉపాధిభూతాలైన గుణాలను, ఆ గుణాలను కలిగిన జీవులను ప్రకాశింపజేస్తున్న స్వతఃప్రకాశమూర్తిగా శ్రీ మహావిష్ణు దివ్యతేజం పరబ్రహ్మతత్త్వాన్ని సర్వాంగీణంగా ప్రస్ఫుటీకరించటం వలన దానియందే భగవద్భావన కావించటం జరిగింది. అందుచేతనే ఇహపరాలలో కామ్యకామితాలను సాధింపదలచినవారు ఇతర దేవతామూర్తులను సేవింపగా, సర్వాతీతమైన కైవల్యపదాన్ని పొందదలచిన మోక్షాభిలాషులు పరబ్రహ్మాత్మకుడైన శ్రీమహావిష్ణువును ఆరాధించాలని భాగవతం ఉపదేశించింది.

మతభేదాల సంకుచితదృష్టితో కావించే తారతమ్య నిరూపణలను పరిహరించి భాగవత పురాణం శ్రీమహావిష్ణుతేజంలో సర్వాత్మకమైన పరబ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదిస్తున్నదని తెలుసుకొన్నాము. అయితే నిర్గుణమైన పరతత్త్వానికి ఈ విధంగా ప్రకృతిగుణాలను ఆరోపించటం ఎందుకు? ఆ సగుణబ్రహ్మానికి హరిహరబ్రహ్మలు ముగ్గురూ మూడు ప్రత్యేకమూర్తులని భాసింపజేయటం ఎందుకు? అని కొంత విమర్శదృక్పథం కలవారు ఆలోచిస్తుంటారు. ఈ సందేహనిరాసానికి వేదాంత గ్రంథాలలో తగిన సమాధానాన్ని కనుగొనడం ఏమంత సులభం కాదు. సగుణ బ్రహ్మాన్ని గురించిన చర్చలలో తత్త్వనిరూపణకు ప్రాధాన్యం ఇచ్చినట్లు ఈ త్రిమూర్తుల స్వరూప నిరూపణను అవి పరమార్థభూతంగా స్వీకరించకపోవటమే దీనికి కారణం. అయితే పరమార్థవిద్యను మానవధర్మపరిణామానికి అనుసంధించి దేవతామూర్తుల విశేషవిధులను, చర్యాలీలలను ఆఖ్యానోపాఖ్యానాలతో నాటకీకరించి చిత్తపరికర్మను సాధించే పౌరాణికుల సాహిత్యశిల్పానికి ఈ బాహుళ్యం అతిరమ్యంగా ఉపకరించింది. కేవల సూత్రప్రాయంగా భగవంతుని యందు సగుణ భావన చేసి, దృశ్యమాన వస్తువులన్నీ ఈశ్వరమూర్తులేనని చెప్పి ఊరుకొన్నట్లయితే పురాణాలలోని ఆ మనోహర కల్పనా శిల్పమూ, జగన్నుతి పాత్రమైన కథా సంవిధానమూ సారస్వతేయులకు ఈనాడు సంక్రమించి ఉండేవే కావు. ఆకర్షణీయమైన

చిత్రణకౌశలం కానవచ్చే ఆ కథాకథనంలో కొంత స్వాతిశయ మనిపించే వాక్యజాతం ఉన్నా, అందులోని భక్తిసందేశాన్ని, లోకకళ్యాణకాంక్షను చూసి సామాన్యపాఠకులు - అంటే పురాణాలు ఏ అనభిరూపుల కోసం వ్రాయబడినవో, ఆ బహుళసంఖ్యాక జనులు – ఇట్టే ఆకర్షితులవుతారు. ఈ విషయంలో తాత్త్వికుని దృష్టికంటె కవి దృష్టి ప్రధానంగా కనిపిస్తుంది. అందుచేతనే పురాణాలు అతిగంభీరమైన భగవత్తత్త్వాన్ని కరతలామలకంగా ఉపదేశించే వేదాంతగ్రంథాలు గాను సరళ సుందరశైలిలో వ్రాయబడిన ఉత్తమ సాహిత్యరచనలు గాను ఈనాటికీ అవిరళప్రచారంలో ఉన్నాయి. అతి సంక్లిష్టమైన ఈ రెండింటి సంయోజనను పురాణ వాఙ్మయం సంసాధించిన తీరును మనం అర్థం చేసుకోగలిగితే మనకు ఆ మహాత్ముల ప్రాతిభ కథనశిల్పకౌశలం ఎంతటిదో తెలిసివస్తుంది.

శ్రీమద్భాగవతం లోని ప్రత్యక్షరం లోనూ ఈ విధమైన సంయోజన (synthesis) మనకు సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. మానవు లందరూ సర్వేంద్రియ ప్రేరకుడు, సర్వజీవనియామకుడు అయిన భగవంతుని యందు మనస్సు నిలిపి, తదాజ్ఞానుసారంగా ప్రవర్తిల్లిన స్వధర్మాలను ఆచరించాలని ఈ కథాముఖంగా ఉపదేశింపబడింది. భగవంతుడు నిర్గుణుడు కాబట్టి అతని తత్త్వావగాహనకు అపరోక్ష జ్ఞానం, అట్టి జ్ఞానోపలబ్ధికి భక్తియోగం పరమసాధనాలుగా ఉన్నాయి. భక్తులు తమ తమ అధికారాన్ని బట్టి భగవంతుని తండ్రిగా, తల్లిగా, గురువుగా, మిత్రునిగా లేక ఏ అభీష్ట వ్యక్తిగా నైనా ఉపాసింపవచ్చునని ఇందులో నిరూపితమయింది. సాధారణంగా ఉపనిషత్తుల లోనూ, బౌద్ధగ్రంథాల లోనూ పూజ్యులైనవారిని, ఆచార్యులను 'భగవన్!' అని సంబోధించడం మనము చూస్తుంటాము. అయితే పురాణాలలో ఈ విధమైన వ్యవహారం మనుష్యమూర్తులకు గాక కేవలం భగవంతునికి, భగవంతుని అవతారాలకు మాత్రమే అనువర్తిస్తుంది. ఈ భగవచ్ఛబ్దాన్ని వివరిస్తూ విష్ణుపురాణం భగవంతుడంటే 'భగ' అనే దివ్యలక్షణోపేతుడని అభివర్ణించింది. 'భగ' అంటే– 1. ఐశ్వర్యము 2.

ధర్మము 3. యశస్సు 4. శ్రీ 5. జ్ఞానము 6. వైరాగ్యము అనే ఆరు మహితలక్షణాల పూర్ణాభివ్యక్తి కలిగిన సంజ్ఞ అని చెప్పబడింది. (ప్రత్యంతరాలలో ఇందులోని రెండవ లక్షణానికి వీర్యము అనే పాఠాంతరం కూడా ఉన్నది.) తాత్పర్యతః ఈ ఆరు నిర్దేశాలూ పరిపూర్ణుడైన ఒక్క భగవంతుని యందు మాత్రమే సార్థకంగా అన్వయిస్తాయి. వైష్ణవపురాణా లన్నింటిలో వలెనే శ్రీమద్భాగవతంలో కూడా శ్రీమహావిష్ణువే సర్వేశ్వరుడన్న ప్రతిపాదన కనబడుతుంది. నిరాకారుడైన ఆయనకు సర్వమూర్త్యాశ్రయమైన ఆదిమ రూపం ఉన్నది. చతుర్దశ భువనాలుగా, తద్భువనాతీతమైన మహాతేజస్సుగా అభివ్యక్తమైన విరాడ్రూపమే భగవత్పురుషరూపం. ఈ పురుషశబ్దం శరీరవాచికం. అంటే భగవానుడు శరీరాన్ని ధరించటమని అర్థం. భగవానుడు కేవల చైతన్యమాత్రుడు. ఆ చైతన్యం శక్తితో కూడినది. ఆ శక్తి మొట్టమొదట వ్యవహృతిని పొందినప్పుడు తత్ఫలంగా ప్రకృతి పురుష మహదహంకారాలు, ఆకాశాది పంచతత్త్వాల సూక్ష్మాంశలైన పంచభూతాలు ఉద్భవించాయి. ఆ తొమ్మిది తత్త్వాల నుంచి ఏకాదశేంద్రియాలు, పంచమహాభూతాలు జనించాయి. నిర్గుణుడైన పరమాత్మ ఆ విధంగా అఖండ సచ్చిదానంద స్వరూపుడై సర్వోపరిస్థమైన వైకుంఠధామంలో నెలవొందినట్లు వర్ణింపబడింది. దుఃఖ తమః పాప వికారాలకు అతీతమైన ఆ దివ్యధామం, తదంతర్వాసులైన మహాత్ములు ప్రకృతిగుణాల వలన జన్మించినవారు కాక అలౌకిక స్వప్రకాశ మహానంద స్వరూపమైన శుద్ధసత్త్వము యొక్క మూర్తులని శ్రీమద్భాగవతం అభివర్ణిస్తున్నది. సర్వోపాధి విరహితమై ఇంద్రియాతీతమైన ఆ మోక్షవాసాన్ని కళాత్మకమైన భవ్యభావనతో, ప్రసన్న సరస్వతీకమైన పదసంపదతో కన్నులకు కట్టిన తీరు ఎన్నతగినదిగా ఉన్నది. మహర్షిమండలోపాసిత రాజహంసలు, మంజుల శుక పికాలాపాలు, వాసంతిక ప్రసవమధులాలస మదద్విరేఫాలు, స్వాదుఫలవృక్షాలు, అతిలోక సౌందర్యోత్కరం మిథునీభవించినట్లున్న యువతీయువకులు, వారి ప్రేమవిహారాలకు అనువైన స్వర్ణతీరాలు అక్కడ మనకు సాక్షాత్కరిస్తాయి.

భక్తిభావోత్ఫుల్లమైన ఆ వర్ణనలో విశృంఖల చిత్తవృత్తికి, ఇంద్రియ లోలుపతకు చోటులేదు. ఓంకారనాదాన్ని అనుకరిస్తున్న తుమ్మెద రెక్కల సవ్వడికి గండుకోయిలల కిలకిలారవాలు సద్దుమణిగాయట. తులసీదళాల దివ్యసుగంధాలకు రమణీయోద్యానవనాల సురభిళ పరిమళాలు మరపుకు వచ్చాయి. కాంచన విమానాలలో సుఖోపవిష్టులై ఉన్న స్త్రీ పురుషులు పరస్పర సౌందర్య దిదృక్షువులు కాకపోగా హరినామసంకీర్తనలతో మైమరచి ఉంటారట. ఈ విధంగా తేజోమయమైన శ్రీమహావిష్ణునిలయం లోని పరిసరసౌందర్యమంతా అపూర్వమైన భక్తిభావనకు ఉద్దీపనగా మాత్రమే చిత్రింపబడింది. వైకుంఠనివేశితుడైన శ్రీమహావిష్ణువు రూపవైభవాన్ని కూడా – 1. అంగము (భగవంతుని శరీరచిహ్నాలు) 2. ఆయుధము (ధర్మరక్షణకు ఆయన చేపట్టిన మహాయుధాలు 3. ఆకల్పము (దేహాలంకరణ సామగ్రి) 4. ఉపాంగము (ఇతరాభరణాదులు) అనే నాలుగు శీర్షికల క్రింద ప్రతీకాత్మకంగా నిరూపించి చెప్పారు భగవంతుని ఆ సగుణరూపం కేవల మానవీకరణగా (anthropomorphism భగవదవతారాలు మన వలెనే మానవాకృతిలో ఉంటాయన్న ప్రాచీనుల ఊహ) కాక గంభీరమైన ఒక ఆధ్యాత్మిక రూపకల్పనమని, భక్తులు ధ్యానగోచరం చేసుకోవలసినదని నొక్కిచెప్పడానికే ఆయనను చలద్రూపునిగా, సుఖాసనాసీనునిగా, శయానమూర్తిగా, భక్తుల హృదయమందిరాలలో నివసించే దయామయునిగా చిత్రించడం జరిగింది. వేదత్రయాత్మకమైన గరుత్మద్రథాన్ని అధిరోహించి ఆయన త్రైలోక్య సంచారం కావిస్తుంటాడు. సృష్ట్యాదికాలంలో ఆయన ప్రళయపయోధిజలాలలో కాలాత్మకుడైన సహస్రశీర్షుడు ఆదిశేషునిపై శయనించి ఉన్నట్లు వర్ణింపబడింది. వియన్మండల మధ్యస్థమైన మహాశ్వేత పద్మాసనం పైని, ఇరువైపుల మబ్బుగములలో గుమిగూడిన భక్తబృందాలు వింజామరలు వీస్తుండగా, ఆయన సుఖోపవిష్టుడై ఉంటాడు. ఆయన శక్తిరూపధరులైన దేవపరిచారకులు ఆయన ఆసనాన్ని పరివేష్టించి తత్తదుచితాసనాసీనులై భక్తిపారవశ్యంలో శ్రీహరి స్తోత్రాలను గానం

చేస్తుంటారు. ఆయన ఒకప్రక్క అణిమాద్యష్టసిద్ధులు (1. అణిమ లేదా అణుత్వము: శిలలో సహితం ప్రవేశింపగలిగి ఉండటం, అత్యంత సూక్ష్మరూపాన్ని పొందటం 2. మహిమ: ఏనుగు, పర్వతం, ఆకాశం – వీని వంటి గొప్ప రూపాన్ని పొందటం 3. గరిమ: కొండంత బరువు కలిగినవాడవటం 4. లఘిమ: దూదివలె మిక్కిలి తేలికగా ఉండటం 5. ప్రాప్తి: భూమియందే ఉండి వ్రేలి కొసతో చంద్రుని స్పృశింపగలగటం 6. ప్రాకామ్యం: స్వేచ్ఛావర్తనం, భూత భౌతిక పదార్థాలలో తన రూపం అడ్డగింపబడక పోవటం, నీటియందు వలెనే భూమియందు మునిగి తేలగలగటం, సంకల్పించినదంతా సత్యమే (సఫలమే) కావటం 7. ఈశిత్వం: (వ్యష్టిగా) భూతాల సృష్టి స్థితి సంహారాలను చేయగలగటం 8. వశిత్వం: పంచ భూతాలు, పాంచభౌతిక పదార్థాలు – అన్నిటినీ తన అధీనంలో ఉంచుకొనటం), అష్టప్రకృతులు (1. అవ్యక్తము 2. బుద్ధి 3. అహంకారము 4. పంచ తన్మాత్రలు – మొత్తం ఎనిమిది), త్రైవిభూతులు (సత్త్వాదిగుణ సామ్యావస్థలు), త్రిశక్తులు (ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు) కొలువుతీరి ఉండగా వేరొక ప్రక్క విష్ణుపార్షదులు, ఆ వెనుక బ్రహ్మర్షులు, దేవర్షులు, అష్టదిక్పాలకులు, భాగవతోత్తములు నిలిచి ఉంటారు. సుదర్శన చక్రాద్యాయుధాలు సహితం ఆయనను సేవిస్తుంటాయని వర్ణింపబడింది. లోకోత్తరమైన భక్తిభావం తొణికిసలాడే ఆ పవిత్రవాతావరణంలో సహస్రశీర్షుడైన అనంతుని శయ్యగా చేసికొని ఉన్నప్పటి శ్రీమహావిష్ణువు స్వరూపాన్ని ఆపాదమస్తకం ఏ విధంగా ధ్యానించాలో భాగవతం చక్కగా నిర్దేశిస్తున్నది. తృతీయ స్కంధం 28–వ అధ్యాయంలోని ఆ వర్ణన పదమూడు శ్లోకాలలో ఉన్నది –

**సంచితయే ద్భగవత శ్చరణారవిందం**
**వజ్రాంకుశ ధ్వజ సరోరుహ లాంఛనాఢ్యమ్**
**ఉత్తుంగ రక్తవిలసన్నఖచక్రవాళ**
**జ్యోత్స్నాభి రాహతమహద్ధృదయారవిందమ్.**

యచ్చౌచ నిఃసృత సరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్న్యధికృతేన శివః శివోఽభూత్
ధ్యాతు ర్మనఃశమలశైలనిసృష్టవజ్రం
ధ్యాయే చ్చిరం భగవత శ్చరణారవిందమ్.

జానుద్వయం జలజలోచనయా జనన్యా
లక్ష్మ్యాఖిలస్య సురవన్దితయా విధాతుః
ఊర్వో ర్నిధాయ కరపల్లవరోచిషా య
త్సంలాలితం హృది విభో రభవస్య కుర్యాత్.

ఊరూ సుపర్ణభుజయో రధిశోభమానా
వోజోనిధీ అతసికాకుసుమావభాసౌ
వ్యాలమ్బి పీతవరవాససి వర్తమాన
కాంచీకలాపపరిరంభి నితంబబింబమ్.

నాభిహ్రదం భువనకోశ గుహోదరస్థం
యత్రాత్మయోని ధిషణాఖిల లోకపద్మమ్
వ్యూఢం హరిన్మణివృష స్తనయో రముష్య
ధ్యాయే ద్ద్వయం విశదహార మయూఖగౌరమ్.

వక్షోఽధివాస మృషభస్య మహావిభూతేః
పుంసాం మనోనయన నిర్వృతి మాదధానమ్
కంఠం చ కౌస్తుభమణే రధిభూషణార్థం
కుర్యా న్మనస్యఖిలలోకనమస్కృతస్య.

బాహూంశ్చ మందరగిరేః పరివర్తనేన
నిర్ణిక్త బాహువలయా నధిలోకపాలాన్
సంచింతయే ద్దశశతార మసహ్యతేజః
శంఖం చ తత్కరసరోరుహ రాజహంసమ్.

కౌమోదకీం భగవతో దయితాం స్మరేత
దిగ్ధామరాతిభటశోణితకర్దమేన
మాలాం మధువ్రత వరూథగిరోపఘుష్టాం
చైత్యస్య తత్త్వ మమలం మణి మస్య కంఠే.

భృత్యానుకంపితధియేహ గృహీతమూర్తేః
సంచింతయే ద్భగవతో వదనారవిందమ్
యద్విస్ఫురన్మకరకుండలవల్గితేన
విద్యోతితామలకపోల ముదారనాసమ్.

యచ్ఛ్రీనికేత మలిభిః పరిసేవ్యమానం
భూత్యా స్వయా కుటిలకుంతలవృందజుష్టమ్
మీనద్వయాశ్రయ మధిక్షిపదబ్జనేత్రం
ధ్యాయే న్మనోమయ మతంద్రిత ఉల్లసద్భ్రు.

తస్యావలోక మధికం కృపయాతి ఘోర
తాపత్రయోపశనాయ నిసృష్ట మక్ష్ణోః
స్నిగ్ధస్మితానుగుణితం విపులప్రసాదం
ధ్యాయే చ్చిరం విపులభావనయా గుహాయామ్.

హాసం హరే రవనతాఖిల లోక తీవ్ర
శోకాశ్రు సాగర విశోషణ మత్యుదారమ్
సమ్మోహనాయ రచితం నిజమాయయాస్య
భ్రూమండలం మునికృతే మకరధ్వజస్య.

ధ్యానాయనం ప్రహసితం బహులాధరోష్ఠ
భాసారుణాయిత తనుద్విజ కుందపంక్తి
ధ్యాయేత్స్వదేహ కుహరేఽవసితస్య విష్ణో
ర్భక్త్యాఽఽర్ద్రయార్పితమనా న పృథగ్దిదృక్షేత్.

## భగవత్ప్రతీకానుశీలనం

ఈ విధంగా భాగవతం మహాపూరుష పూజాక్రమాన్ని భౌతికదృష్టితో వివరిస్తున్నంత మాత్రాన భక్తిపరులు ఆ మూర్తికల్పనలో ఉన్న ఆత్మవిద్యా సంబంధిత చిత్రణలను గ్రహింపకపోరు. భాగవత గ్రంథం సర్వశక్తిమంతునిగా ప్రతిపాదిస్తున్న ఆ ఉపాస్యమూర్తి కేవలం సాధకుల సౌలభ్యం కోసం మానవాకారంలో కల్పింపబడిన సామాన్యమూర్తి కాదని, దీప్తమతులైన మహర్షి తల్లజులకు ధ్యానగోచరుడైన సర్వాత్మకుని పరతత్త్వావిష్కరణమని నిరూపించటానికి ద్వాదశ స్కంధంలోని పదకొండవ అధ్యాయంలో శ్రీమహావిష్ణువిరాణ్మూర్తి యొక్క ఆసనాయుధాదులను, వాటి ధారణలోని అంతరార్థాన్ని వివరించటం జరిగింది. సచ్చిదానంద నిలయమైన ఆ భగవత్పురుష రూపమే చతుర్దశ భువనాలుగా వెలసి విలసిల్లింది. భూమి పాదాలుగా, దివము శిరస్సుగా, నభస్సు నాభిగా, సూర్యుడు నేత్రాలుగా, వాయువు నాసికలుగా, దిక్కులు కర్ణాలుగా, ప్రజాపతి మేఢ్రంగా, మృత్యువు అపానంగా, లోకపాలకులు బాహువులుగా, చంద్రుడు మనస్సుగా, యముడు కనుబొమలుగా, లజ్జ పైపెదవిగా, లోభము క్రింది పెదవిగా, వెన్నెల దంతాలుగా, భ్రమము స్మయంగా, వృక్షాలు రోమాలుగా, మేఘాలు కేశాలుగా ఆయన అవయవ సంవిధానం అమరింది. దృశ్యమాన ప్రపంచాన్ని పరమాత్మ సంస్థానంగా నిరూపించే సార్థక ప్రయత్నానికి ఇది ఉపక్రమణికగా వెలుగొందుతున్నది. ఆ మూర్తియొక్క ఆత్మతేజస్సు కౌస్తుభ వ్యపదేశంతో ఆయనను అలంకరిస్తున్నది. ఆ కౌస్తుభకాంతి శ్రీవత్సమనే పేరుతో ఆయనను విభూషించింది. గుణమయి అయిన శక్తి ఆయన కంఠంలో అలరారుతున్న వైజయంతీ వనమాల. పీతాంబరం త్రయీగతమైన ఛందస్సు, వర్ణత్రయాత్మకమైన ఓంకారం బ్రహ్మసూత్రం, సాంఖ్య యోగాలు మకరకుండలాలుగా, సర్వోత్తమమైన బ్రహ్మలోకం మౌళిగా ప్రకల్పింపబడ్డాయి. అవ్యాకృతమైన అనంతాఖ్య ప్రకృతితత్త్వం ఆదిశేషుడు ఆయనకు తల్పం. ప్రధానాత్మకమూ, ధర్మజ్ఞానాదికమూ అయిన సత్త్వగుణం ఆ మహాత్ముని పద్మాసనం. ఓజస్సహోబలయుత ప్రాణతత్త్వం కౌమోదకీ గద.

ఉదక తత్త్వం ఆయన చేతిలోని పాంచజన్య శంఖం. తేజస్తత్త్వమే సుదర్శన చక్రం. నభస్తత్త్వం నందక ఖడ్గరాజం. ఆయన చేతిలో విరాజిల్లుతున్న లీలాకమలం భగశబ్దార్థమైన ఐశ్వర్యాదిషడ్భావలక్షణ లక్షితం. భగవానుడు తన్మాత్రరూప రథాన్ని అధిష్ఠించి వరదాభయాది ముద్రలతో తత్తత్కార్యాలను నిర్వహిస్తుంటాడు. ధర్మము చామరంగా, యశస్సు వ్యజనంగా, వైకుంఠలోకం నిర్భయాతపత్రంగా ఆయనను ఉపచరిస్తుంటాయని, యజ్ఞరూపుడైన ఆ పరమపురుషుని త్రయీవేదం గరుత్మద్రూపంలో వహిస్తున్నదని, ఆయన ఆత్మశక్తియైన శ్రీదేవి యెడబాటు లేక నిరంతరం ఆయనను ఆరాధిస్తుంటుందని, పాంచరాత్రాగమ తంత్రాదులు విష్వక్సేన రూపంలో ఆయనకు పార్షదముఖ్యుడై నిలువగా, అణిమాద్యష్టసిద్ధులు నందాదిరూపాలను దాల్చి యెనమండ్రుగురు ద్వారపాలకులుగా ఉంటారని వర్ణింపబడింది. ఇక సూర్యమండలం భగవత్పూజాస్థానమని, మంత్రదీక్ష తత్పూజాసంసారమని, భగవత్పరిచర్య భక్తులకు దురితక్షయకారకమని భాగవతం చెబుతున్నది. భాగవతోపపాదితుడైన ఆ మహాపురుషుడు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ మూర్తులతో ఉపాసనాదులకు స్థానమై విలసిల్లుతున్నాడు. ఇంతవరకు వర్ణించినది భగవానుని బాహ్యరూపం కాగా విశ్వము, తైజసము, ప్రజ్ఞ, తురీయము అని ఆయనకు ఆంతర రూపాలు నాలుగున్నాయి. వీటి మూలాన భగవానుడు విశ్వరూపంలో బాహ్యార్థాలను, తైజసరూపంలో మనస్సును, ప్రజ్ఞారూపంలో అజ్ఞానకార్యాదికాన్ని ప్రవర్తింపజేస్తుంటాడు. జ్ఞానాత్మకమైన ఆయన తురీయరూపం పై మూడింటికి సాక్షిమాత్రంగా నిలిచి ఉంటుంది. ఈ విధంగా నిరాకార నిర్గుణ చైతన్యమాత్ర తత్త్వానికి పరిచర్యార్థమై పాదాద్యంగాలను, గరుడ వాహనాద్యుపాంగాలను, సుదర్శనాద్యాయుధాలను, కౌస్తుభాద్యలంకారాలను కల్పించుకొని ఉపాసకులు శ్రీహరి యొక్క విరాడ్రూపాన్ని ధ్యానింపవలసి ఉంటుంది. స్వప్రకాశుడు, స్వమహిమపూర్ణుడు, అవిచ్ఛిన్నజ్ఞానుడు అయిన ఆ పురుషమూర్తి తన మాయ నధిష్ఠించి బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపాలతో భిన్నుడుగా గోచరిస్తూ విశ్వసృష్టిస్థితిలయాలను కావిస్తుంటాడు.

ఈ విధంగా భాగవతపురాణం అభివర్ణిస్తున్న విశాల విష్ణుతత్త్వాన్ని బట్టి ఇదేదో భగవదవతారవాదాన్ని మానవీకరణతో నెలకొల్పటానికి ప్రవేశపెట్టిన సంకుచితదృక్పథం కాదని సులభంగానే గ్రహింపవచ్చు. నిజానికి ధ్యానము, ఉపాసన, పూజ, తపస్సు, స్వాధ్యాయం మొదలయిన ఏ ప్రయత్నమూ లేకుండా మానవునిలో ఇంతటి దైవీసత్త్వసంపద, ధర్మమర్మాభిజ్ఞానం ఉంటాయనుకోవటానికి వీలులేదు. అందుకు సాధకునియొక్క మనస్సులో నిత్యానిత్యవివేకాన్ని ప్రవేశపెట్టి అహంకారరూపమైన బంధాన్ని నిర్మూలించి బ్రహ్మాత్మానుభవానికి ప్రేరేపింపగల మంచి సాధనమొకటి కావాలి. పురాణాలలో కథాపరిగతి ననుసరించి కావింపబడే వర్ణనలు, భవ్యప్రబోధాత్మక కథాసంవిధానం, భగవన్నామసంకీర్తనం వంటివి భక్తిపరుల మనస్సులలో ఆయా ఉపాస్యదేవతల పట్ల భక్తిభావాన్ని పెంపొందిస్తాయి. ధ్యానధారణకు ఉపక్రమించిన భక్తుడు తన మనోమందిరంలో ఒక ధ్యేయమూర్తిని అధిష్ఠింపజేసుకోవటానికి ఈ విధమైన వర్ణనలు సహకరించేవిగా ఉన్నట్లయితే అతను తన్మూలాన అభ్యాసం మొదలు పెట్టి కాలక్రమాన స్వరూపనిష్ఠను పొందగలుగుతాడు. అదే గనుక సాధ్యమైతే పురాణాలలోని త్రైప్రమాణిక వాస్తవికతలు (three dimensional factualities), కథాకాలం, ఆ కథ జరిగిన ప్రదేశాలు మొదలైనవాటిని గురించిన ప్రశ్నలన్నీ అసంబద్ధాలుగా పరిణమిస్తాయి. చరిత్ర అప్రధానమై, పురాణాలు చిత్రించిన ఒక భావనామూర్తి (thought-form) మాత్రమే ప్రధానమై, అది భక్తునియొక్క ధ్యాననిష్ఠకు, సమ్యగ్ జ్ఞానానికి ఆధారంగా నిలుస్తుంది. ఆ దైవధ్యానంతో భక్తుడు తనలోని దైవీసంపదను పెంపొందించుకొంటాడు. వ్యక్తావ్యక్తాత్మకమైన పరబ్రహ్మతత్త్వం అతనికి ధ్యానగోచర మవుతుంది. తరతరాలుగా మనకు కనుపిస్తున్న భక్తాగ్రేసరులు, సాధువతంసుల చరిత్రలన్నీ ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యాలని ఒప్పుకోక తప్పదు. ఈ భావరూపాలు 'చరిత్ర' అనే పేరుతో మనము గ్రహించినదానికంటె మరింత శక్తిమంతంగా, చిరస్థాయికంగా, పరివర్తనాత్మకంగా మన

మనస్సులలో నెలకొని ఆధ్యాత్మిక సత్యాలుగా బలపడి స్వస్వరూపానుసంధానానికి దోహదం చేస్తాయి. తనలో ఉన్న దివ్యశక్తులను ఉద్దీపింపజేసి తనకు పరమ లక్ష్యమైన కైవల్యపదాన్ని చేరుకొన్నటానికి మానవుడు గ్రహించిన సాధనాలలో వైష్ణవారాధనం ఒకటి. ఆ మతసిద్ధాంతాన్ని ప్రబోధించే అత్యుత్తమగ్రంథాలతో ఒకటయిన భాగవత పురాణం శ్రీకృష్ణ వర్ణనముఖంగా, కథా కథన మూలంగా, స్తుతిరూపంగా, ఆధ్యాత్మిక తత్త్వవివేచన ద్వారా పాఠకుని మనస్సులో వైష్ణవధర్మం పట్ల పూర్ణవిశ్వాసాన్ని కలిగించి, అతనిలో స్వస్పంద సుందరమైన భక్తిభావాన్ని ఉద్దీపింపజేయగలిగితే గ్రంథకర్త లక్ష్యం సిద్ధించినదనే చెప్పాలి. ఈ విషయంలో శ్రీమద్భాగవతం కృతకృత్యమైనదంటే కాదనేవారెవరు?

## భాగవత తత్త్వదర్శనం

ద్వైతాద్వైత శైవ వైష్ణవాది ప్రత్యేక మతానుయాయి దృక్పథాలు లేనివారు శ్రీమద్భాగవతాన్ని చదివినప్పుడు అందులో చిత్రితమైన ఆధ్యాత్మికత సాధారణంగా భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథాలలో కనిపించే ఏ ఒక్క సిద్ధాంతానికో కట్టుబడినది కాదనే అభిప్రాయం కలుగుతుంది. ఉపనిషత్తులు, భగవద్గీత, ద్వైత విశిష్టాద్వైత శాఖాంతరాలు, కేవలాద్వైతం, చార్వాక దర్శనం మొదలైన మతభేదాలన్నింటికీ గ్రంథంలోని వివిధ సన్నివేశాలలో సముచితమైన స్థానం ఉన్నది. వీటిలో ఏ ఒక్క మతవిశ్వాసాన్నీ అనాదరింపకుండా భాగవంత ఇన్ని విరుద్ధశాఖలను ఒక్క చోటికి నిరాక్షేపణీయంగా తీసుకొనిరాగలిగింది. ఈ ప్రయత్నంలో వీటిలోని లోపాలను ఎత్తిచూపాలనే కోరికకు బదులు గ్రంథకర్త సమన్వయదృక్పథం మాత్రమే మనకు కనిపిస్తుంది.

ఈ సమన్వయదృక్పథానికి పరమోదాహరణగా భాగవతం ధర్మార్థకామాలకు, చివరికి మోక్షానికి కూడా అతీతమైన పంచమ పురుషార్థాన్ని భక్తి మార్గాన్ని ఉపదేశించింది. ఈ భక్తి సిద్ధాంతం చాలామంది

భావించినట్లు మనశ్శుద్ధికరమూ పరమపద సోపానమూ మాత్రమే గాక జ్ఞానాజ్ఞానాది సమస్త ద్వంద్వభావాలకు అతిక్రాంతమైన కేవలత్వమని, ఫలనిరపేక్షకమైన మహానందస్వరూపమని గ్రంథకర్త ఆశయం. ప్రకృతిగుణాలను ఆశ్రయించినప్పుడు స్వార్థభయాదిమాలిన్యాలు జీవులను కర్మ జ్ఞానకాండలకు పురికొల్పినట్లుగా నివృత్తిపథం లోనికి ప్రవేశించిన శుద్ధ భక్తులను ప్రేరేపించలేవు. అందుచేత సగుణభక్తి సర్వోత్కృష్టమార్గం కానేరదని భాగవత నిర్దేశం.

శ్రీమద్భాగవతం తృతీయస్కంధంలో ప్రకృతిగుణస్పర్శ కలిగిన అతుంగ భక్తిరూపం తమో రజ స్సత్త్వ లక్షణోపేతమని నిశ్చయింపబడిది. ఈ త్రివిధ భక్తులలో తామసికప్రవృత్తి కలవారు దంభమాత్సర్యప్రేరితులై వైరశుద్ధిని (శత్రువులను చంపి పగతీర్చుకొనటం) కోరి హింసాపూర్వకమైన ఉపచారాలతో, కలుష నైవేద్యాలతో క్షుద్రశక్తులను ఆరాధిస్తారు. రాజసిక భక్తులు విగ్రహారాధనపరులై ఐహిక సుఖాలను, సౌభాగ్యవృద్ధిని ఆశించి నిత్యపూజలు చేస్తుంటారు. ఇక సత్త్వోద్రిక్తమైన భక్తికి అశాశ్వతికమై, దుః ఖనిలయమైన సంసారం పట్ల ఉదయించిన విరక్తి భావమూ, తీవ్రమైన మోక్షాభిలాష కారణాలు. అందువలన సాత్త్వికభక్తులు కర్మనిర్హారాన్ని కోరి భగవంతుని దయామయునిగా సంకల్పించి తత్ప్రసాదనానికి అర్చావిధులను నిర్వహిస్తారు. వీరికి ఐహిక ప్రేరణలు లేక పోయినా మోక్షపదాన్ని చేరాలనే కోరిక మాత్రం మిగిలే ఉంటుంది. నవవిధ భక్తి మార్గాలను దృష్టిలో ఉంచుకొని శ్రవణ మననాదులతో కాలం గడుపుతుంటారు. మోక్షాభిలాషకమే అయినప్పటికీ 'అభిలాష' ఉన్నది కాబట్టి ఈ సత్త్వమార్గాన్ని కూడా భాగవతం గుణాత్మకంగానే పరిగణించింది.

ఈ విధమైన భక్తిభేదాలన్నింటికీ భాగవతంలో చోటున్నది కాని, దేహాత్మజ్ఞానాలకూ, జనన మరణ పునరావృత్తి రహితమైన మోక్షానికీ, ప్రకృతిగుణాలకూ సుదవీయసమైన నిర్గుణభక్తికి మాత్రం భాగవతంలో ఉత్తమోత్తమ స్థానం కల్పింపబడింది. భగవత్కృప వలన భక్తునికి నిత్య

నిరతిశయ అవిచ్ఛిన్న రాగోదయం కలిగి భగవదాయత్తచిత్తుడై చివరికి సముద్రాన్ని జొచ్చిన గంగానది వలె భగవంతునితో ఐక్యానుసంధానం చేసి కేవల జ్ఞానస్వరూపుడై వెలుగొందుతాడు. శ్రేయఃపరమార్థాలను, చివరికి మోక్షాన్నీ కూడా అతిగమించిన స్థితిని చేరుకొని కేవల ప్రేమస్వరూపుడై నిరంతర భగవత్సేవాపరాయణుడై ఆయనకు దాసునిగా, శిశువుగా, నెచ్చెలిగా, ప్రేయసిగా భక్తి నెరపుతాడు. తురీయాతీతమైన ఆ దశను భాగవతం పంచమ పురుషార్థమని పేర్కొన్నది. ఆ విధంగా భక్తి కావించిన దీప్తమతులు శుక నారద సనకాదుల జీవితగాథ లనేకం భాగవతంలో ఉన్నాయి. వీరందరి భక్త్యాదర్శాన్నీ లోకంలో ప్రవర్తిల్లజేయటానికి అధ్యాత్మశాస్త్రంలో సవిశేషద్వైతాన్ని పోలిన నిర్విశేష ద్వైతసిద్ధాంత మొకటి అవసరం. భాగవతం ఆదరించిన మతభేదమంటూ ఏదన్నా ఉంటే అది ఇదొక్కటేనని చెప్పవచ్చును. అదైనా సంకుచితదృక్పథం కలిగిన మతావేశం కాదు. మానవజీవితానికి పరమార్థం భక్తి ఒక్కటేనని చెప్పటమే దీని ఉద్దేశం. మనమందరమూ ఆ జగన్నాటకసూత్రధారి నటింపజేస్తున్న లీలానాటకంలో పాత్రధారులమని, జీవులందరికీ వ్యావహారికమైన శరీరభేదమే తప్ప వాస్తవభేదం ఏమీ లేదని, పరస్పర ప్రేమానురాగాలు, భగవద్భాగవత సేవలతో మెలగటమే సర్వజన కర్తవ్యమని భాగవతం ఉపదేశిస్తున్నది. ఈ విధమైన భక్తి లేదా సేవాభావం ఆత్మవికాసానికి పరమకాష్ఠమని చెబుతూ, భాగవతం దీనిని పంచమ పురుషార్థమంటున్నది. ఇది సాధకుల చరమలక్ష్యమైన తురీయ పురుషార్థానికి కూడా అతీతమైన శ్రీ కైవల్యపదం. ఈ దశను చేరుకొన్నవారు చరాచర సమర్త భూతాలలో భగవంతుడు అంతర్యామిగా ఉన్నాడని. సర్వమూ విష్ణుమాయా విలాసమేనని గుర్తించి అభేదదర్శనులై స్మృతిమోహం. తుదకు మోక్షాభిలాష కూడా లేక చిత్తాన్ని నిరంతర భగవదాయత్తం చేసి వర్తిల్లుతారు. ఇట్టివారినే భాగవతోత్తములని అంటారు. ఆ సర్వోత్తమస్థితిలో వారు ఇంద్రియజయాన్ని సాధించి కార్యకర్మల పట్ల కర్తృత్వ భోక్తృత్వాదులను త్యజించి ఈశ్వరేచ్ఛానుసారంగా వర్తిల్లుతూ

బ్రహ్మైక్యానుసంధానానికి కూడా అతీతమైన భగవత్సేవలో జీవితాన్ని పండించుకొంటారు.

౬

## పౌరాణిక దృక్పథం : ఆధునిక పాఠకులకు ఎదురయే సమస్యలు

శ్రీమద్భాగవతానికి కావింపబడిన ఈ అనువాదాన్ని ప్రకృతి, విశ్వము, మానవాళి మొదలైన విషయాలపై ఆధునిక విజ్ఞానశాస్త్ర దృక్పథం చేత ప్రభావితులైన పెక్కుమంది పాఠకులు చదివే అవకాశం ఉంది. అట్టివారికి పురాణాలలో తరచు కనుపించే విశ్వవిజ్ఞానం, భూగోళశాస్త్రం, చరిత్ర ఇత్యాది వర్ణనలను అర్థం చేసుకోవటం గొప్ప అవరోధమే కాగలదు. పూర్వపు రోజులలో దీనిని గురించిన వాదోపవాదాలు లేకపోవటం వలన, పురాణాల లోని సృష్టివిజ్ఞానం కూడా మతవిశ్వాసంలో ఒక భాగమైనందువల్ల – ఇదొక సమస్యగా ఉండేది కాదు. కాని ఈనాడు మెకాలే వ్యంగ్యోక్తులలో చెప్పాలంటే, "ముప్ఫై అడుగుల ఎత్తుగల రాజులు, ముప్ఫైవేల సంవత్సరాల రాజ్యాలతో నిండిన చరిత్ర; ఇక్షు మహాసముద్రం, వెన్న సముద్రాలతో తయారుచేసిన భూగోళశాస్త్రం" వంటివి చూసి అతను చకితుడయే అవకాశం ఉన్నది. విశ్వోత్పత్తిని గురించిన ఆధునిక విజ్ఞానశాస్త్ర దృష్టి ప్రకారం – ఉష్ణత, గమనముల విషయమై జరిగిన పరిశోధనల ప్రకారం – అంటే బిగ్‌బ్యాంగ్ సిద్ధాంతానుసారం – సుమారు పదిహేను వందల కోట్ల సంవత్సరాల క్రితం అనూహ్యమైన సాంద్రత ఉన్న కొన్ని కోట్ల డిగ్రీల వేడిగల గోళం పగిలి ఆ ముక్కలు ఆకాశగంగ వలె అన్య బ్రహ్మాండ వ్యవస్థలలో ఉన్న జలధారల వలన చల్లబడి బహుదీర్ఘ కాలానికి భూతశక్తుల సంయోగం కలిగినప్పుడు కార్య కారణ శృంఖలాముక్తమైన ఉపోత్పాదనగా రూపు దిద్దుకొన్నాయి. ఆ పరిణామక్రమంలో భూమండలం, జీవజాలం, చైతన్యశక్తి ఆవిర్భవించినవని, కాలాంతరంలో భూతశక్తుల వికట తాండవం వలన ఈ సృష్టి సమస్తం లయావస్థను చేరుకొంటుందని భావింపబడుతున్నది.

ఈ విశ్వోత్పాదన పరిణామంలో కేవల ఉపలక్షణమైన చైతన్యశక్తికి ఎటువంటి ప్రత్యేకస్థానమూ లేదు. ఆధునికుల అభికలన (computation) ప్రకారం భూమ్యావిర్భావం జరిగి రెండు వందల కోట్ల సంవత్సరాలు, దానిపై జీవోత్పత్తి జరిగి నూరుకోట్ల సంవత్సరాలు అయినట్లు తెలుస్తున్నది. అతి దీర్ఘమైన ఈ పరిణామక్రమవికాసంలో మానవజాతి ఏ పది లక్షల సంవత్సరాల క్రితమో ఉత్పన్నమై ఉండాలి. ఇక మానవుల సాంఘిక జీవితాన్ని గురించిన వివరాలంటూ మనకు ముప్పైవేల సంవత్సరాల పూర్వం నుంచి; నాగరికతను గురించి ఆరువేల సంవత్సరాల కాలం నుంచి లభిస్తున్నాయి. వ్యక్తిగతంగానో లేక సామూహికంగానో ఈ జీవనోత్పత్తికి ఏదయినా పరమకారణం ఉన్నదో లేదో తెలుసుకోవాలని ఈ ఆధునిక శాస్త్రీయ దృక్పథానికి ఆసక్తి లేదు. ఆత్యంతికాలను గురించిన మౌలికాలోచనలను సంశయాత్మకంగా త్రోసిపుచ్చటం కూడా ఈ శాస్త్రీయ దృక్పథం లోని భాగమే. ప్రజ్ఞానమన్నదే కాలాంతరంలో నిర్వాప్యమైన ఉపలక్షణం కాబట్టి సృష్టిలో దేనికీ ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని కల్పింపరాదని వీరి అభిమతం.

విజ్ఞానశాస్త్రాల అనుభూతిమూలకతా (ప్రయోగ) వాదంలో పడి తనచుట్టూ గిరిగీచుకొని బయటకు రాలేకపోతున్న ఆధునిక మానవునికి అందులోని అసమగ్రతలు, స్వమతావేశం కనిపించకపోగా పురాణాల దృష్టికోణం ఎంతో ప్రతిబంధకం గాను, హాస్యాస్పదం గాను అగపడుతుంది. పౌరాణిక దృక్పథంలో కూడా పాఠకులను మంత్రముగ్ధులను కావించే లోతైన పరిశీలన, దేశకాలాల అపరిమేయతను గురించిన స్పష్టావగాహన ఉన్నాయని తెలియక, వ్యంజనపూర్వకంగా చెప్పిన అనేకవిషయాల లోని అంతరార్థాలు అర్థం కాక, అక్కడక్కడ కనిపించే చిన్న చిన్న లోపాలను కూడా గోరంతను కొండంతలు చేసి విమర్శించటం జరుగుతున్నది. ఆధునికవిజ్ఞానం చెప్పినట్లు గాక ఈ సృష్టి సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మము యొక్క సంకల్పం వలన ప్రాదుర్భవించినదని పౌరాణికుల దృష్టి. అనంతమైన కాలంలో ఈ సృష్టి ప్రళయాలు ఆవృత్తిక్రమాన జరుగుతూనే ఉంటాయి (భాగ.

2-2; 16-31). స్వాంశ సంభూతులైన జీవులు తమ తమ కర్మముల ననుసరించి తత్తత్కర్మఫలానుభవార్థం శరీరాలను ధరించి, సృష్ట్యంతంలో భగవానుడు స్థూలసూక్ష్మరూప ప్రపంచాన్ని అవ్యక్తము లోనికి ఆకర్షించేటంత వరకు సంసారంలో పరిభ్రమిస్తుంటారు. అందువల్ల ఈ సృష్టికి నిశ్చితారంభమంటూ లేదని, ఆ కారణాన అనాదియైన కాలము ఆధునికులు భావిస్తున్నట్లు రేఖానుమితం (linear) కాదని, ఆవృత్తిశీలమని (cyclic) సిద్ధాంతం.

## బ్రహ్మ జీవితకాలం

బ్రహ్మదేవుడు జగత్సృష్టికర్త. పరబ్రహ్మస్వరూపుడైన శ్రీమహావిష్ణువు సృష్టిరచనను సంకల్పించినప్పుడు తత్సాధనభూతుడై ప్రభవించినవాడు. ఈ సృష్టి జరిగే కాలం బ్రహ్మకు ఒక పగలు కాగా, ప్రళయకాలం రాత్రి అవుతున్నది. వేయి చతుర్యుగాల కాలం బ్రహ్మదివసంగా ఉన్నప్పుడు రోజంతా భూతసృష్టి జరిగినట్లే, బ్రహ్మదేవుని రాత్రి కాలంలో సత్యలోకం వరకు గల లోకాలన్నీ ప్రళయపయోధి జలాలలో మునిగిపోతాయి. రాత్ర్యంతంలో బ్రహ్మరూపధరుడైన శ్రీమహావిష్ణువు మేల్కాంచి, ఆ బ్రహ్మమూలకంగా పునఃసృష్టికి ఉపక్రమిస్తాడు. ఈ విధంగా బ్రహ్మ దివసావసానంలో ప్రతిరాత్రి జరిగే ప్రళయానికి నైమిత్తిక ప్రళయం అని పేరు. ఇటువంటి 360 దివారాత్రాలు బ్రహ్మకు ఒక సంవత్సరం. అతని జీవితకాలం నూరు సంవత్సరాలు. కాబట్టి బ్రహ్మజీవితకాలం ఎంత మహాప్రమాణవంతమో తెలియాలంటే దీనిని మానవమానం లోనికి మార్చిచూడాలి. మనుష్యమానంలో ఒక సంవత్సరం ఒక రోజు వంతున 360 మానవ సంవత్సరాలు దేవతలకు ఒక సంవత్సరం. అటువంటి పన్నెండువేల దేవమాన సంవత్సరాలు, అంటే మనుష్యమానంలో 4,320,000 సంవత్సరాలు ఒక చతుర్యుగం (కృత లేదా సత్య, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగూ కలిసి ఒక చతుర్యుగం). అటువంటి రెండువేల

చతుర్యుగాలు బ్రహ్మకు ఒక అహోరాత్రం, 360 అహోరాత్రాలు ఒక సంవత్సరం. దీనినిబట్టి బ్రహ్మ సంవత్సర కాలం, బ్రహ్మ జీవితకాలం ఎంత మహాప్రమాణవంతమో ఊహింపగలము. మనుష్య మానంలో ఇది 311,040,000,000,000 సంవత్సరాలు.

బ్రహ్మ జీవితకాలంలోని ఈ శత సంవత్సరాలను రెండు సగాలుగా, అంటే రెండు పరార్ధాలుగా విభజించి, బ్రహ్మజీవితం ద్విపరార్ధికమని చెప్పబడింది. ఈ రెండు పరార్ధాల తర్వాత బ్రహ్మజీవితానికి అంతంలో ప్రాకృతిక ప్రళయం సంభవించి వ్యక్తావ్యక్తాత్మిక అయిన ప్రకృతి లోనికి సమస్తం లీనమై, ఆ ప్రకృతి అవ్యక్తములో విలీన మవుతున్నది. తనలో నిక్షిప్తమై ఉన్న సచరాచరజగత్తు విలయం చెందినప్పుడు కాలస్వరూపుడైన నారాయణుడు ప్రళయపయోధిజలాలలో యోగనిద్రకు ఉపక్రమిస్తాడు. సృష్టికాలం వలెనే ప్రళయకాలం కూడా రెండు పరార్ధాలు గడిచిన తర్వాత నిరుపాధికంగా ఉన్న స్థితిలో మహాభూత చైతన్యాదులు సృజింపబడి నారాయణ నాభి కమలంలో నుంచి బ్రహ్మాండకటాహం ఆవిర్భవిస్తుంది. అందులో నుంచి అపర (మరొక) బ్రహ్మ ఉదయించి మళ్లీ సృష్టిక్రమం మొదలవుతుంది.

ఈ సహస్ర చతుర్యుగ పర్యాప్తమైన బ్రహ్మదివసాన్ని పధ్నాలుగు మన్వంతరాలుగా విభజించారు. ఒక్కొక్క మన్వంతరం ఒక్కొక్క మనువు యొక్క పరిపాలన కాలం అన్నమాట. మనమిప్పుడు ఇందులో ఏడవమనువు అయిన వైవస్వతుని పరిపాలన కాలంలో ఉన్నాము. అతనికి పూర్వం ఆరుగురు మనువులు, ఒక్కొక్కరు 74 1/2 చతుర్యుగాల చొప్పున సుమారు 459 చతుర్యుగాల కాలం, అంటే మనుష్యమానంలో 198,28,80,000 సంవత్సరాల కాలం పరిపాలించారు. వారి పేర్లు: స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఔత్తమి, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు. వీరి తర్వాతివాడు ప్రస్తుతం పరిపాలిస్తున్న మనువు వైవస్వతుడు. ఇతని తర్వాత ఏడుగురు మనువుల కాలం గతించి బ్రహ్మ దివసాంతంలో నైమిత్తిక ప్రళయం

సంభవిస్తుంది. ఆ రానున్న మనువుల పేర్లు: సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి. భగవదవతారాల నియమనాల ననుసరించి ధర్మరక్షణ, ప్రజావృద్ధి కావించటం వీరికి విహితకర్తవ్యం. ప్రతి మన్వంతరంలోనూ జగత్పాలన వ్యవహారంలో మనువు సాహాయ్యానికై ఇంద్రుడు, సప్తర్షులు ఉద్భవిస్తుంటారు. భగవదవతారాల వలన ధర్మరక్షణ కావింపబడుతుంది. ఈ సమయంలో శ్రీహరి ఆత్మజ్ఞానసంపన్నులైన మహావ్యక్తులుగా, వైశ్య శూద్రానేక వర్ణాశ్రమ ధర్మ ప్రవర్తకులుగా స్వాంశతో అవతరించి మనుధర్మపాలనకు తోడ్పడుతుంటాడు. చతుర్యుగావసానంలోని ప్రతి కలియుగాంతానికీ లోకంలో వేదధర్మానికి ఆదరువు నశించి వేదాలు కాలగర్భంలో కలిసిపోతాయి. అప్పుడు నిర్వ్రిక్రియులైన మహర్షులు జన్మించి తపోమూలకంగా వేదాలను పునరుద్ధరిస్తారు. ప్రతి మన్వంతరం లోనూ, అంటే దరిదాపుల డెబ్బైఆరు చతుర్యుగాల కాలంలోని కృత త్రేతా ద్వాపర కలియుగాల పునరావృత్తిలో ప్రతి కృతయుగం ధర్మము యొక్క పరమకాష్ఠతో మొదలై నానాటికీ ధర్మచ్యుతి సంభవించి చివరికి కలియుగం ఆధర్మనిలయ మవుతుంటుంది. చతుర్యుగాంతంలో భగవానుడు కల్క్యవతారం ధరించి ధర్మాన్ని పునరుద్ధరించిన తర్వాత సత్యకాలంతో మళ్లీ ఒక చతుర్యుగం ఆరంభమవుతుంది.

మనమిప్పుడు వర్తమాన బ్రహ్మ జీవితంలోని ద్వితీయ పరార్ధంలో పద్మ కల్పం (కొంతమంది దీనినే వరాహ కల్పమని అంటారు) అనబడుతున్న ప్రథమ దివసంలో సప్తమ మనువైన వైవస్వతుని కాలంలో ఉన్నాము. ఈ మన్వంతరాల క్రమంలో మొదటివాడైన స్వాయంభువుని కాలంలో శ్రీమద్భాగవతం తృతీయ స్కంధంలో అభివర్ణింపబడిన కపిలావతారం, ధ్రువోపాఖ్యానం మొదలైన గాథలన్నీ జరిగాయి. ఆ తొలిరోజులలో మనుష్యుల ఆయుర్దాయం – భ్రష్టధర్మమైన మన కలికాలపు రోజులలో కంటె ఎంతో అధికాధికంగా ఉండినందువల్ల భాగవతాది పురాణోదంతాలలో

స్వాయంభువాదుల పాలనలో అతిదీర్ఘకాలం జీవించినవారి అద్భుతగాథలు వర్ణింపబడి – ఇందాక మనము చూసిన మెకాలే పరిహాస వాక్యాలకు అవకాశం లభించింది. ఉదాహరణకు, ధ్రువుని పాలనకాలం ముప్పైవేల సంవత్సరాలు – వర్తమాన పరిస్థితులలో నమ్మశక్యం కాకపోయినా, పౌరాణికుల కాలపరిదృష్టికి అవిరోధంగానే ఉంటుంది.

## విశ్వేతిహాసం – ఆధునిక ప్రపంచ చరిత్రల వివాదం

పునరావృత్తిశీలమైన ఈ పౌరాణిక దృశ్యభూమిక తోనే ముఖ్యంగా రేఖానుమిత సంప్రత్యయం పైని ఆధారపడిన ఆధునిక ప్రపంచ చరిత్ర దృక్పథానికి సంఘర్షణ కలుగుతున్నది. పురాతత్త్వశాస్త్ర పరిశోధనలతో లభించిన కొద్దిపాటి ఆధారాలను పురస్కరించుకొని, కొంత అనుమాన ప్రమాణంతో కొంత ఊహాగానంతో – సుమారు నూరుకోట్ల సంవత్సరాలకు పూర్వం జీవోత్పత్తి జరిగిన ఈ భూమండలం పైని ముప్పైవేల సంవత్సరాల క్రితం సాంఘికంగా సార్థకమైన ఉనికి కలిగిన మానవజాతి ఆవిర్భవించి ఉండాలని నిర్ణయిస్తున్నారు. ఉపలభ్యమానమైన శిలాఖండాలు, అస్థికలు, లోహసాధనాలు, మృణ్మయ పాత్ర నిర్మితులను బట్టి – గడిచిన ఈ ముప్పైవేల సంవత్సరాల సుదీర్ఘమైన చరిత్రలో మానవుడు శిలా యుగాల నుంచి లోహ యుగం దాకా నాగరికతా వివిధ దశలను చవిచూసినట్లు భావింపబడుతున్నది. నిజానికి ఆరేడు వేల సంవత్సరాలకు పూర్వకాలం నాటివి మాత్రమే మనకు ఈజిప్టు, అసీరియా ప్రాంతాలలో నాగరికతావశేషాలని చెప్పదగిన ఆధారాలు లభిస్తున్నాయి. ఏది ఏమైనా, పురాణాలు మాత్రం ఇప్పటికి రెండువందల కోట్ల సంవత్సరాల క్రితం, స్వాయంభువ మనువు పాలన కాలం నుంచి మానవజాతి నాగరికతాసంస్కృతులు ప్రారంభమైనవని నిర్ధారిస్తున్నాయి.

ఈ విధంగా పరిభ్రమణశీలమైన కాలగతిపై ఆధారపడిన పౌరాణిక చరిత్ర పరిధి ఆధునిక దృష్టికోణాని కంటె చాలా విశాలమైనదని

చెప్పవచ్చును. విశ్వేతిహాసంతో పోలిస్తే మానవజాతి చరిత్ర బుద్బుదప్రాయం మాత్రమేనని పురాణాల దృష్టి. పైగా మానవుని దేశకాలాలను గురించిన విషయనిశ్చయంలో ప్రాచీనులకు, ఆధునికులకు మౌలికమైన దృష్టిభేదం ఉన్నది. ఇంతకు ముందే అన్నట్లు పురాణాల దృష్టి కాల పునరావృత్తి ధోరణిపై ఆధారపడి ఉండగా, ఇదానీంతనుల దృష్టి రేఖానుమిత క్రమాన్ని ప్రధానీకరించింది. కల్పాలు, యుగాలను గురించి మనమింతకు క్రితం చూసిన దానిని బట్టి ఆధునికుల దృష్టిలో పురాతనమైనదంతా అసంస్కృతం; ఆధునికమైనదే ప్రగతి, పురోభివృద్ధి అన్న భావాన్ని ఈ యుగ సిద్ధాంతం అన్యధాకరిస్తున్నది. పురాణాల దృష్టి ప్రకారం కృతయుగపు సర్వోత్కృష్ట్యంతో మొదలైన మానవజాతి కలియుగాంతానికి పతనావస్థను చేరుకొంటుంది. అప్పుడు భగవదవతారలీల వలన మళ్లీ సత్యకాలం మొదలవుతుంది. ఇది జంతుదశలో నుంచి మానవుడు ఈనాటి ఉన్నతస్థితికి చేరుకొన్నాడన్న ఆధునికుల జీవపరిణామ సిద్ధాంతానికి పూర్తిగా విరుద్ధం. పురాతత్త్వశాస్త్ర పరిశోధనలను బట్టి ఆధునిక విద్వాంసులు గడిచిన ముప్ఫైవేల యేండ్లుగా నరజాతిపరిణామ వివరాలను, పదివేల సంవత్సరాల పూర్వం నాటి మానవ సమాజ విశేషాలను వెలికి తీయగలిగామని అనుకొంటున్నారు. అయితే వీరికి లభించిన సాక్ష్యాధారాలను చూస్తే ఈ వ్యాఖ్యాకరణలో ఊహాగానమే ఎక్కువనటానికి ఏ మాత్రం సందేహం లేదు.

దీనికి తోడు పురాణాలలోని చారిత్రికదృక్పథం ఆధునిక చరిత్రకారులు సాక్ష్యాలనుకొంటున్న విషయాలపై ఆధారపడినది కాదు. అందులో పేర్కొనబడిన ఉదంతాలన్నీ స్పష్టంగా ఎవరు ఏ కాలంలో వ్రాసినవో ఊహించటానికి వీలులేని సాంప్రదాయిక రచనలు. అవి మనకు బహుపూర్వకాలం నాటినుంచి పరంపరీణంగా అందివస్తున్నవి. ఆధునిక చరిత్రకారులలో కొందరు సహృదయంతో ఆ కృతులలో ప్రతిఫలిస్తున్న మానవేతివృత్తాన్ని దర్శింపగలిగినా, మొత్తంమీద వాటికి చారిత్రకోపయోగిత ఉన్నదని మాత్రం ఒప్పుకోరు. ఇకపోతే పౌరాణిక కథనాలను శిరసావహించి

అవే చరిత్రలంటున్నవారూ ఉన్నారు. పౌరాణిక చరిత్రలన్నీ విశ్వేతిహాసానికి సంబంధించినవి కావడం వల్ల, నేటి చరిత్రకారులు ఆశిస్తున్న సాక్ష్యాధారాలపై ఆధారపడినవి కాకపోవడం వల్ల ఆ కథనాలను ఆధునికుల చరిత్ర రచనా ప్రణాళికలో చేర్చడానికి వీలులేదన్న మాట సత్యమే. అంత మాత్రాన అవి సుసంగతాలు కావనుకోవడమూ తప్పే. ఈ చరిత్రనిర్మాతలు కేవలం ఆరేడు వేల సంవత్సరాల క్రితపు ఈజిప్షియన్, అసీరియన్ నాగరికతాచిహ్నాలను మాత్రమే కనుగొనగలిగారు. వెల్స్ మహాశయుడు అన్నట్లు మనకు అనుక్రమణికా సహితమైన చరిత్రాధారాలు సుమారు క్రీస్తుపూర్వ 800 నుంచి మాత్రమే. అంటే క్రీ.పూ. 776 లో ఒలింపిక్ క్రీడోత్సవాలు, క్రీ.పూ. 753 లో రోమన్ సామ్రాజ్యస్థాపన జరిగినప్పటి నుంచి మాత్రమే లభిస్తున్నాయి. అంతకు పూర్వం మనకు దొరికినవల్లా కొన్ని ప్రాగైతిహాసిక జీవావశేషాలు, కొన్ని శిలోపకరణాలు, లోహసాధనాలు, ఇతర అవశేషాలు. వీటి ఆధారంతో ఆరువేల సంవత్సరాల పూర్వపు చరిత్ర సమస్తం ఊహాగానాలతో కూటసృష్టి కావింపబడుతున్నది. ఇదంతా కాలపు రేఖానుమితప్రమాణంతో – పోనీ ఆ రేఖైనా ఎప్పుడు ఏ చోట మొదలయిందో, అంతకు పూర్వం అక్కడ ఏముండేదో, ఇప్పుడున్న చోటినుంచి ఎక్కడికి దారితీస్తున్నదో తెలియకుండా సంపాదించిన ఒక చరిత్రశకలం తప్ప – అదే పరమసత్యం కాదు. ఇన్ని ప్రతిబంధకాలు ఉన్నప్పటికీ సత్యాన్ని దర్శించామనే మిథ్యానందంతో పురాణాలు మనకందించిన ప్రాక్చారిత్రిక విశ్వేతిహాసాన్ని చూసీచూడనట్లు ఊరకుండటం కంటె అజ్ఞానం మరొకటుండదు. కనీసం పూర్వనిశ్చయముక్తులై న్యాయదృష్టి గల మేధావులు విషయనిష్పక్షపాతంగా ఉండాలని ఆశించటంలో తప్పులేదు కదా!

ఇటువంటి పరిమితజ్ఞానంతో వినిర్మింపబడిన చరిత్ర శకలాలను సంపాదించటమే విద్యాధ్యయన మనుకొనే సంకుచితమనస్కులు ఇకనైనా కళ్లు తెరిచి పురాణాలు అందజేస్తున్న ఆద్యచారిత్రిక, విశ్వచరిత్రాత్మక విశేషాలను అధ్యయన చేస్తే బాగుంటుంది. కనీసం తమకు గల చరిత్ర పరిచయం చాలా

తక్కువని; మానవుని గతచరిత్ర అంత స్వల్పకాలికమూ, సామాన్యతరమూ కాదనైనా వారికి అనిపింపక మానదు. ఆ విశాలదృక్పథం వారి భావపరిధిని విస్తరింపజేస్తుంది. హెచ్. జి. వెల్స్ ఒకచోట, “ఐరోపీయ సమాజంలో, సుమారు ఒకటిన్నర శతాబ్ది క్రితం దాకా, తమ పూర్వకాలికవిశేషాలను గురించిన అవగాహన అంతంత మాత్రం గానే ఉండేది. 1799లో లండన్ మహానగరంలో ఒక పుస్తక విక్రేతల సంఘం అచ్చువేసిన ‘యూనివర్సల్ హిస్టరీ’ అనే గ్రంథంలో – ప్రపంచం క్రీ. పూ. 4004 లో (అదేదో అక్షరాలా తెలిసినట్లు!) సృజింపబడింది, ఆ తర్వాత ఉత్తరాయణ సంధికాలంలో, బస్రానుంచి రెండు రోజులు ప్రయాణించాక వచ్చే యూఫ్రేట్స్ తీరాన ఈడెన్‌లో సృష్టికి మకుటాయమానుడైన మానవుని సృష్టి జరిగింది” అని వ్రాసిన పుస్తకాన్ని పరిహసించినట్లు, ఆ జల్పనదోషానికి పాల్పడకుండా, అటువంటి పరిహాసానికి గురికాకుండా తోడ్పడుతుంది. దీనితో అంతరతమ్యానికి ఆయనే భారతీయ మేధావులపై గౌరవభావంతో వ్రాసిన – “ప్రాచీనులలో ఒక్క భారతీయతత్త్వవేత్త మాత్రమే మానవాస్తిత్వపు బహుపురాతన యుగాలను గురించి అర్థం చేసుకొన్నట్లు కనబడుతుంది” అన్న వాక్యాన్ని చూడండి. మన చరిత్రకారులు అవగాహనలోపం వల్ల పొరపాటును చేయడం లేదు కదా?

ఇక పౌరాణికులు తమ కథోదితాలన్నీ ప్రజ్ఞానచిత్తులైన మహాత్ములకు అంతఃప్రేరణ వలన, దైవప్రేరణ వలన, శ్రుతిప్రకాశనం వలన బుద్ధిగోచరమైన సంప్రదాయోక్తులని అంటారు. ఒకవేళ ఆ వాదాన్ని అంగీకరించినా, అంతఃప్రేరణలు, శ్రుతిస్ఫోటవైఖరులు గతానుగతికంగా మనకు సంక్రమించేనాటికి – ఈనాడు పురాతత్త్వపరిశోధనలలో లభించిన వస్తుసామగ్రిని, వివిధోల్లేఖాలను ప్రధానసాధనాలుగా గ్రహించినవారు దానికి ఊహాశక్తిని జోడించి చరిత్రను పునారచిస్తున్నట్లే – కొంత విస్మృతిని, కొన్ని కూర్పు తీర్పులను పొందినట్లు మాత్రం ఒప్పుకోవలసి ఉంటుంది. కాబట్టి ఉభయపక్షాల లోనూ గుణదోషాలు ప్రాయోభవితం గానే ఉన్నందు

వల్ల రెండింటిలో తత్తదుచితమైనదానిని ఎటువంటి దురభిమానం లేకుండా సరిచూసుకొని స్వీకరించటం మేలు. మొత్తానికి చరిత్రయొక్క రేఖానుమితప్రమాణం మనకు తెలిసినంతలో మానవుని సమీపభూతకాలాన్ని గురించి కొంత స్పష్టంగా చెప్పగలదేమో కాని అతిప్రాచీన కాలం నాటి విశేషాలను, మనిషి భవితవ్యం, విశ్వచరిత్రలో అతనికి గల ప్రాముఖ్యం మొదలైనవాటిని గురించి ఏమీ చెప్పలేకపోతున్నది. పౌరాణికులు నిర్దేశించిన ఆవర్త్యమాన గతిక్రమం వలన మానవుని యొక్క బుద్ధిమత్తకు, చరాచర సమస్తజీవులలో అతనికిగల ప్రాగ్రియతకు, శీలౌన్నత్యంతో అతడు సాధింపదగిన పరమోన్నత స్థితికి అగ్రతాంబూలం లభించింది. వట్టి భౌతికవాదులకు ఈ చరిత్ర పునరావృత్తివాదం దోషజుష్ట మనిపింపవచ్చును గాని ఇందులో మానవజీవితాన్ని నిరర్థకత నుంచి సార్థకతకు పరివర్తింపజేసి, ఉత్తమ గుణశీలాలతో ఆధ్యాత్మికసంపదను పెంపొందింపజేసే శుభలక్షణం ఉన్నది. చరిత్ర స్వరూప ప్రతిపాదన కోసం ఈనాటి విజ్ఞానశాస్త్ర చరిత్రను చూసినా అందులోనూ పరిశోధకుని ఊహల పోహళింపులు, దూరకల్పనలు నిశ్చయాత్మకజ్ఞానానికి అవరోధాలనే ఏర్పడుతున్నది. అయినప్పటికీ పురాతత్త్వశాస్త్రాన్ని ఈ విధంగా దైవీకరించి మానవుని బహుప్రాచీనకాలానికి నిర్ణయకర్తపు కమ్మనటం దురభిమానం కాకపోతే అంధవిశ్వాస మనుకోవాలి.

## సృష్టితత్త్వం : పౌరాణిక భావన

పౌరాణికులు ప్రతిపాదించిన ఈ ఆవృత్తిశీల సృష్టిసిద్ధాంతానికి ఆధునికుల దృష్టిసీమలో ఉన్న జీవపరిణామవాదం తోనూ, మానవ నాగరికతా సంస్కృతుల క్రమికవికాసం తోనూ ఎటువంటి అభ్యుపగతీ సిద్ధించటం లేదు. అయితే ప్రకృతి నుంచి చతుర్వింశతి తత్త్వాలు ఉదయించి బ్రహ్మాండకటాహం రూపొందిన వర్ణనతో దీనిని పోల్చి చూడవచ్చును. పురాణాలలో సర్గము అని చెప్పబడే భాగంలో సృష్టిక్రమం ఈ విధంగా ఉంటుంది:– ప్రకృతి (జగత్తునకు ఉపాదానకారణం), దానినుండి మహత్తత్త్వము; అహంకారము; సత్త్వరజస్తమస్సులు; సాత్త్వికాహంకారము

నుండి అధిదేవతలు, అంతఃకరణము; రజస్సు నుండి కర్మజ్ఞానేంద్రియాలు; తామసాహంకారము నుండి తన్మాత్రలు, భూతములు ఆవిర్భవించాయి.❖

వీటిలో ప్రకృతితత్త్వం నుంచి ఆవిర్భవించినవే అయినా భూతాదులకు పూర్వదశలోనివన్నీ మానసికమైనవి మాత్రమే నన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. భౌతిక దశలోని భూతాదులైనా ఆధునిక దృక్పథానికి భిన్నంగా – తామసికాహంకారము నుండి ఉద్భవించినవని చెప్పబడింది. ఈ పదార్థాలు కూడా పృథక్స్థితిలో ఉన్నప్పుడు ఇతర భౌతిక పదార్థాలను, భూర్భువరాది లోకాలను తమకు తాముగా ప్రకల్పింపలేవు. పృథక్కులుగా ఉన్న ఆ భూతాదుల లోనికి భగవానుడు ప్రవేశించి సంయోగాన్ని కల్పించినపుడు మాత్రమే బ్రహ్మాండ రచన జరుగుతున్నది. ఈ సృష్టికర్త అయిన బ్రహ్మకే హిరణ్యగర్భుడని కూడా పేరున్నది. ఈ భూతాదులను

---

❖ ప్రకృతి నుంచి చతుర్వింశతి తత్త్వాల ఆవిర్భావక్రమం ఈ క్రింది విధంగా ఉంటుంది.



ఉపకరణాలుగా స్వీకరించి బ్రహ్మదేవుడు కాలము, కర్మఫలవాసనలు అన్నవాటి - మూలాన నానాలోకాంతరితులైన జీవులను ఉపకల్పిస్తాడు. జీవులంటే మనకు నిత్యజీవితంలో ప్రత్యక్ష పరిదృశ్యమానమై ఉన్న జీవకోటి ఒక్కటేనని భావింపనక్కరలేదు. భాగవత కథాక్రమంలో తరచు కానవచ్చే దేవాసుర యక్ష రాక్షస గంధర్వాప్సరో భూత పిశాచాదులందరూ కర్మఫలభోగాయతనాలైన దేహాలను ధరించిన జీవులే. ఈ విధంగా సృష్టికర్త అయిన బ్రహ్మతోపాటు బ్రహ్మాండభాండం వరకు లీనావస్థలో నుండి

---

→
1. అధిదేవతలు: వీరు పధ్నాలుగురు - దిక్కు, వాయువు, ఆదిత్యుడు, వరుణుడు, అశ్వినులు, జ్ఞానేంద్రియాలకు; అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మిత్రుడు, ప్రజాపతి కర్మేంద్రియాలకు అధిదేవతలు.

**జ్ఞానేంద్రియాలు - 5**

| | ఇంద్రియము | ఇంద్రియకార్యము | అధిదేవత |
|---|---|---|---|
| 1. | శ్రోత్రేంద్రియము | శబ్దగ్రహణ | దిక్కు |
| 2. | త్వగింద్రియము | స్పర్శగ్రహణ | వాయువు |
| 3. | చక్షురింద్రియము | రూపగ్రహణ | సూర్యుడు |
| 4. | రసనేంద్రియము | రుచిగ్రహణ | వరుణుడు |
| 5. | ఘ్రాణేంద్రియము | వాసనాగ్రహణ | అశ్వినులు |

**కర్మేంద్రియాలు - 5**

| | ఇంద్రియము | ఇంద్రియకార్యము | అధిదేవత |
|---|---|---|---|
| 1. | వాగింద్రియము | పుణ్యపాప మిశ్ర సంభాషణ | చతుర్ముఖుడు |
| 2. | పాణీంద్రియము | దాన ప్రతిగ్రహములు | ఇంద్రుడు |
| 3. | పాదేంద్రియము | గమనాగమనములు | ఉపేంద్రుడు |
| 4. | పాయురింద్రియము | మలవిసర్జన | మిత్రుడు |
| 5. | ఉపస్థేంద్రియము | శుక్ర మూత్ర విసర్జన | ప్రజాపతి |

→

ప్రపంచావస్థను పొందిన వస్తుశక్తి యొక్క విస్తారమును వర్ణించిన భాగానికే పురాణదశ లక్షణాలలో ఒకటయిన 'సృష్టి' అని పేరు. గుణక్షోభఫలంగా మహత్తత్త్వము, దానినుంచి అహంకారము, దాని నుంచి తన్మాత్రలు, ఆ తన్మాత్రల నుంచి ఇంద్రియార్థాలు సంభవించిన విధానాన్ని వెనుక చెప్పినట్లు సృష్టి లేక సర్గము అన్నారు. కనుక పౌరాణికుల ఉద్దేశంలో సృష్టికి పూర్వం ఈశ్వరశక్తి నుండి భూతాదుల యొక్క ఆవిర్భావమే ఉన్నది కాని బ్రహ్మ

---

→

2. అంతఃకరణము: మనో బుద్ధి చిత్తాహంకార చతుష్టయానికి అంతఃకరణమని పేరు. ఈ నాల్గింటికి అధిదేవతలు చంద్రుడు, బ్రహ్మ, క్షేత్రజ్ఞుడు, రుద్రుడు.

**అంతఃకరణ చతుష్టయం**

| ఇంద్రియము | ఇంద్రియకార్యము | అధిదేవత |
|---|---|---|
| 1. మనస్సు | సంకల్ప వికల్పములు | చంద్రుడు |
| 2. బుద్ధి | నిశ్చయ జ్ఞానము | చతుర్ముఖుడు |
| 3. చిత్తము | చంచలమై ధారణ చేసేది | క్షేత్రజ్ఞుడు |
| 4. అహంకారము | నేననే అభిమానం | రుద్రుడు |

ఈ అధిదేవతలు, అంతఃకరణము సాత్త్వికాహంకార ఫలాలు.

3. తన్మాత్రలు, పంచభూతములు: పృథ్వి (నేల), అపః (నీరు), తేజస్సు (వెలుగు), వాయువు (గాలి), ఆకాశం, ఇంద్రియాలకు అగోచరమైన చైతన్యశక్తి అనే ఆరు ధాతువుల సంయోగం వలన బ్రహ్మాండం ఏర్పడుతున్నది. ఈ ఆరింటిలోనూ మొదటిదైన పృథివి అన్నింటికన్నా స్థూలమైనది. ఆకాశం చైతన్యశక్తి చందాన సర్వవ్యాపకమైనది. శబ్దం ఆకాశానికి వ్యక్తమైన గుణం. ఇది అనాది కనుక బ్రహ్మమని వ్యవహరింపబడుతున్నది. శబ్దం అనాహతం, ఆహతం అని రెండు విధాలు. అనాహతమైన మూలనాదం ఆహతమైనప్పుడు శబ్ద పరమాణువులుగా సంయోగాన్ని చెందుతుంది. గాలి లేనప్పుడు నిశ్చలంగా ఉన్న సమయంలో చెరువు

→

సృష్టిలో (దీనికే విసర్గము అని పేరు) ఒక జీవము మరొక జీవముగా క్రమికవికాసాన్ని చెందటమనే ఆలోచనకే తావు లేదు. బ్రహ్మసృష్టిలోని ప్రాణివర్గం వాటి వాటి పూర్వకర్మవాసనలను బట్టి నానారూపాలను ధరిస్తుంటాయి. ఇదంతా మహదాదుల కార్యమనే చెప్పబడింది. మహదాదులు కూడా ఈశ్వరానుగృహీతములై వర్తిల్లుతున్నవి. ఈ పూర్వవాసనావిధానం దేహధారణ వరకే ఉన్నది కాని దేహాన్ని ధరించిన తర్వాత స్వభావ కామప్రేరణానురూపంగా యుక్తాయుక్తకర్మలను చేపట్టి

---

→

నీరు కదలిక లేక ఉండి, గాలి వీచినప్పుడు అలలు పుట్టినట్లుగానే నిశ్చలమైన అనాహతంలో ఈశ్వరకర్మ అనే నిమిత్తకారణం వలన సూక్ష్మమైన తరంగాలు పుట్టి శబ్దం ఆహతంగా మారుతుంది. అప్పుడు ఆకాశ పరమాణువులు సంయోగం చెంది శబ్ద పరమాణువు లేర్పడుతాయి. ఆకాశతత్త్వంలో శబ్దస్వరూపం జనించినట్లే వాయుతత్త్వంలో స్పర్శమూ, అగ్నితత్త్వంలో రేఖామండలమూ, జలతత్త్వంలో రసమూ, పృథ్వీతత్త్వంలో గంధమూ జన్మించి ఇంద్రియగ్రాహ్యమైన పదార్థాలు ఏర్పడుతున్నాయి. ఇది సృష్టితత్త్వం.

శబ్దతత్త్వం వలన ఆకాశతత్త్వం కలిగింది. ఆకాశానికి గుణమై రూపొందిన శబ్దానికి స్పర్శం తన్మాత్రగుణం అయింది. ఆ స్పర్శగుణం వలన వాయుతత్త్వమూ, వాయువుకు తన్మాత్రగుణమైన తేజోరూపం వలన ఉదకతత్త్వమూ ఏర్పడ్డాయి. ఉదకానికి గంధం తన్మాత్రగుణం కాగా, గంధం వలన భూమితత్త్వం జనించింది. ఆ భూమికి శబ్ద స్పర్శ రూప రస గంధాలు ఐదూ తన్మాత్రగుణాలైనాయి.

ఇలా పొడకట్టిన పృథివ్యప్తేజో వాయ్వాకాశా లనే పంచభూతాలు, శబ్ద స్పర్శ రూప రస గంధాలైన పంచగుణాలు, చర్మము కన్ను ముక్కు చెవి నాలుక అనే బుద్ధీంద్రియాలు, వాక్కు పాదము పాణి పాయువు ఉపస్థ లనే కర్మేంద్రియాలు సాధనాలుగా మనోబుద్ధ్యహంకారాలు రాజస తామస సాత్త్విక గుణాల వల్ల ఉద్రేకింపబడి ప్రజాసృష్టి విస్తరిల్లుతోంది.

తత్త్వశమంతో ఆత్యంతిక లయాన్ని పొందే అవకాశం జీవుల చేతుల్లోనే ఉన్నది. కనుక తాత్పర్యతః అంతమన్నది జీవులకే ఉన్నదిగాని జగత్తునకు లేదు. అనంతమైన కాలప్రవాహంలో సృష్టిప్రళయాలు ఆవృత్తిక్రమాన పునః పునః జరుగుతూనే ఉంటాయి కాబట్టి విశ్వానికి ఉత్పత్తివికాసాల క్రమనిష్పాదితపరిణామోదంతం ప్రత్యేకంగా విధింపబడలేదు.

## పురాణోదిత విశ్వస్వరూపం

దీనికి తోడు పురాణాలు అభివర్ణిస్తున్న జగద్విస్తృతిని, ఆ చిత్రణలో ఉన్న నిరవధిక దృష్టివైశాల్యాన్ని ఏమాత్రం పరిశీలించినా పౌరాణికులు భావించిన విశ్వస్వరూపం ఆధునికదృష్టికి ఎంత విభిన్నంగా ఉన్నదో అర్థమవుతుంది. అనంతమైన ఈ విశ్వాన్ని గురించి శాస్త్రపరిశోధకులు అత్యంతశక్తిమంతమైన దూరదర్శినుల సాయంతో కనుగొన్న అసంఖ్యాక నక్షత్ర నక్షత్రావస్థాన విశిష్టమండలాల ఉనికిని బట్టి ఈనాడు మనకు తెలిసిన ఖగోళ విజ్ఞానమంతా ఏర్పడింది. అయితే పురాణాలలో వర్ణించిన దానిని బట్టి ఈ విశ్వంలో మన భూమితో కలిపి వివిధప్రమాణాలు కలిగిన పధ్నాలుగు పృథఙ్మండలాలు ఉన్నాయి. వీటికే లోకాలని పేరు. ఈ లోకాలను అధోలోకాలు, ఊర్ధ్వలోకాలు అని ఏడేసిగా విభజించారు. పురాణాలలో వీటి వర్ణన కొంత దురవగాహంగా ఉన్నమాట నిజమే కాని మొత్తంమీద అందరూ ఇవి ఒకదానిపై ఒకటిగా అమరి ఉన్నాయని మాత్రం అంగీకరిస్తున్నారు. అయితే పురాణగాథలలోని వ్యక్తులు ఒక లోకంలో నుంచి మరొక లోకం లోనికి – ఈనాడు మనము ఎత్తైన మేడలలో ఒక అంతస్తులో నుంచి మరొక అంతస్తుకు వెళ్ళినట్లు – వెళ్తుండటం చూస్తే ఈ లోకాల అమరిక విషయాన్ని అర్థంచేసుకోవటం కష్టమేననిపిస్తుంది. ఇంతకన్న ఈ వర్ణనలన్నీ పౌరాణికుల ప్రణాళికలో ధ్వనిగర్భితంగా ప్రకల్పింపబడిన భావనాజగత్తులని, వీటి యాథాతథ్యం వివాదాస్పదమని అంగీకరించటం మేలు. ఈ లోకాలన్నీ ప్రకృతిలో మన ఊహకందని వివిధస్ఫూర్తులని, చర్మచక్షువులకు ప్రస్ఫుటించే లోకనహేతుమాత్రాలు కావని భావింపవలసి ఉంటుంది. ఇవన్నీ విశ్వభావన

కావించిన ఆనాటి మహర్షుల దృశ్యభూమికలని, నిత్యానుభవంలో మనకు తెలిసిన ఖగోళవిజ్ఞానంతో దీనికి వైరుధ్యాన్ని ఆపాదింపకూడదని తాత్పర్యం. ఆధునికులు భావిస్తున్నట్లు కాక ఈ లోకాల పరికల్పనలో జీవచైతన్యం లోని వివిధభూమికలను ఆవిష్కరించే సార్థక ప్రయత్నం ఉన్నది. జీవులు కర్మఫలవాసనలను నశింపజేసుకొని నిత్యానిత్య వివేకం చేత అహంకారబంధనాలను నిర్మూలించి ఆత్మపరిశుద్ధిని సాధించేకొద్దీ సూక్ష్మ సూక్ష్మతరాంశలతో ప్రకృతి యొక్క ఈ స్ఫూర్తులు స్వానుభవంలో గోచరిస్తాయి. ఆత్మప్రకాశం వలన ప్రపంచావస్థలో ఉన్న భూతాదులు ప్రకాశితమై, ప్రకాశమానమైనట్లుగా స్ఫురించే అనేక దశలను ఈ లోకాల వర్ణనలో సూక్ష్మంగా వ్యవస్థీకరించినట్లు మనకు తెలిసివస్తుంది. 'ఇది నేను నివసిస్తున్న భూమి' అని మనచే మనోవిలాసంగా భావింపజేస్తున్న ఇంద్రియశక్తి పృథ్వీతత్త్వానికి ఉపలక్షకమని; మనకు పరిచితమైన ఖగోళ విజ్ఞానమంతా దీనిపై ఆధారపడినదేనని అర్థమవుతుంది. 'పృథ్వి' అనే ఒక విశిష్టమైన స్ఫూర్తిని – ఆ స్ఫూర్తిని మాత్రమే గ్రహించటానికి అలవాటు పడిన ఇంద్రియాలు గ్రహించి మనకు మనోగోచరితం కావిస్తున్నాయన్నమాట. ఈ విధంగా ఇంద్రియాలు గ్రహింపదగిన స్ఫూర్తివిశేషాలు సూక్ష్మ సూక్ష్మతరాలైన అంశలతో మొత్తం పధ్నాలుగున్నాయి. వీటిలో అతల – వితల – సుతల – తలాతల – మహాతల – రసాతల – పాతాళాలు నిమ్నతర పరిమండలాలు. భూలోక – భువర్లోక – స్వర్లోక – మహర్లోక – జనలోక – తపోలోక – సత్యలోకాలు సూక్ష్మతమక్షేత్రాలు. ఈ ఒక్కొక్క లోకమూ సాధకుని ఆత్మవికాసదశాక్రమంలో ఒక్కొక్క కక్ష్య అని కూడా గ్రహించాలి. ఆ విధంగా పౌరాణిక చిత్రణలోని అస్వాభావిక వర్ణనలను తొలగించి అందులోని సారాన్ని వివేకించి చూస్తే, భూమండలం పైని తప్ప విశ్వంలో మరే ఇతర స్థలంలోనూ జీవసంచారం లేదన్న ఆధునికసిద్ధాంతానికి చోటుండదు. పైగా విశ్వమంటే మన ఇంద్రియాలకు గోచరిస్తున్న పరిధి మాత్రమేనన్న సంకుచిత దృక్పథం కూడా తొలగిపోతుంది.

ఇంతకూ పురాణోదిత విశ్వస్వరూపాన్ని గురించిన మన చర్చలోని ప్రధానోద్దేశం – పౌరాణిక భావనకు, ఆధునిక శాస్త్రీయదృక్పథానికి ఉన్న వైరుధ్యాన్ని ఎంతవరకు తొలగింపగలమో చూడటమే. ఇంతకు ముందు చెప్పినట్లు జీవచైతన్యంలో వివిధస్ఫూర్తులు, వివిధ స్పందనలు ఉన్నాయని అంగీకరిస్తే, ఈ ఉభయపక్షాలకూ కొంత సమన్వయం కుదురుతుంది. విశ్వవిజ్ఞానాన్ని గురించిన ఆధునిక దృశ్య భూమిక పాక్షికదృక్పథం మాత్రమేనని, ఒక్క పృథ్వీతత్త్వాన్ని మాత్రమే గ్రహింపగల పరిమితమైన శక్తికలిగినదని, అనంతమైన ఈ విశ్వంలో మనకు తెలియని విశేషాలెన్నో ఉన్నాయని మనము అంగీకరించాలి. ఇకపోతే భూతలానికి అపార్థివ వ్యక్తులు ప్రవేశించి నిష్క్రమిస్తుండటం, భూతలం నుంచి ఇతర లోకాలకు పార్థివ శరీరాలతో ప్రయాణించటం మొదలైనవన్నీ అనేకానేక మనోవైజ్ఞానిక దృగ్విషయాల అప్రాకృతిక విషయాల రహస్యజ్ఞానం మనకుంటేనే తప్ప అర్థంకావు. అందుకు ఉన్నదల్లా ఒకటే మార్గం: సాధకుడు సగుణధ్యానానంతరం తన మనోదృష్టిని నిర్గుణ బ్రహ్మతత్త్వమందు లయింపజేసి తురీయావస్థను చేరుకొన్నప్పుడు ఆ సమాధిస్థితిలో అన్యలోకాల ఉనికిని గ్రహింపగల ఇంద్రియశక్తి అతనికి అలవడుతుంది. ఇదంతా నిజమేనని ఒప్పుకొన్నప్పటికీ, ఆ జీవులు భౌతికవస్తువులైన రథాదులను అధిరోహించి సశరీరంగానే లోకాంతరయానం చేయగలగటమన్నది మాత్రం అతిశయోక్తిగానే కనబడుతుంది. ఒకవేళ పాఠకులను ఉత్సవింపజేయటానికి పురాణకల్పకారులు ఆ విధమైన సాహిత్యశిల్పాన్ని రూపొందించారేమో ననుకోవాలి.

అంతేకాదు. ఆధునికదృక్పథం కలిగిన పాఠకులకు పురాణాలలో కనిపించే భూగోళ ఖగోళ విజ్ఞానస్వరూపం కూడా కొంత దురవగాహంగానే ఉంటుంది. ఈ విజ్ఞానాలను గురించిన వివరణ భాగవతం పంచమ స్కంధంలో సవిస్తరంగా ఉపదేశింపబడింది. ఆ వర్ణన ప్రకారం వర్తులాకారంలో ఉన్న భూతలాన్ని పరివేష్టించి ఉపర్యుపరిగా ఏడు ద్వీపాలు,

ఒక్కొక్క ద్వీపాన్ని చుట్టుకొని ఒక్కొక్క సముద్రం వంతున ఏడు సముద్రాలు ఉన్నాయి. ఒక్కొక్క ద్వీపంలోనూ ఆ ద్వీపానికి మాత్రమే విశిష్టమైన పర్వత నదీనద వ్యవస్థలున్నాయి. ఈ మొత్తానికి నడిమి భాగాన బ్రహ్మాండవ్యవస్థకు అక్షభాగమైన మహామేరువు, ఈ సమస్త ద్వీప సముద్రాలకు పరాంతికంగా లోకాలోక పర్వతం, దాని పరిధిలో లోకాలకు దివారాత్రాలను కలుగజేస్తున్న ఏకచక్ర సూర్యరథ సంచారమార్గం ఉన్నట్లు వర్ణింపబడింది. సూర్యుని ఆ వర్తుల యానక్రమం మనకు నిత్యపరిచితమైన నూనె గానుగతో సరిపోల్చబడింది. సూర్యరథానికి అధో௨క్షం సర్వమధ్యంలో ఉన్న మహామేరువుకు, ఉపర్యక్షం మహా మకరాకారంలో ఉన్న శింశుమారచక్రానికి పుచ్ఛభాగంలోని ధ్రువమండలానికి సహయోజితమై ఉన్నాయి. ఈ వర్ణనల ధోరణిని బట్టి ఇదంతా సాధకుల ధ్యానధారణ కోసం ఏర్పరింపబడిన ప్రతీకవ్యపదేశమని మనము సులభంగానే ఊహింపవచ్చును. నిజానికి పంచమ స్కంధంలోని ఈ వర్ణనకు ఉపక్రమిస్తూ ఉపదేష్ట ఈ సమస్త విశ్వం భగవాను డైన శ్రీమహావిష్ణువు నివేశమని, సాధకుడు తన దృష్టిని ధ్యాన ప్రారంభదశలో బాహ్యపదార్థాల నుంచి మరల్చి భగవానుని సర్వాంగ స్వరూప మందు, ఆ తర్వాత అతని సుస్మితాయత ముఖారవిందమందు, ఆ పిమ్మట విశ్వరూపమందు నిలిపి తురీయావస్థకు పూర్వం సగుణధ్యానాన్ని అభ్యసించాలని, ఈ వర్ణనలన్నీ ప్రారంభదశలో సాధకునికి ఒక ధ్యేయాన్ని నెలకొల్పడానికి మాత్రమే ఉద్దేశింపబడ్డాయని, స్పష్టంగానే అన్నాడు. ఈ వర్ణన భాగమంతా ముగిసిన తర్వాత పంచమస్కంధం 23-వ అధ్యాయం ఎనిమిదవ శ్లోకం (వచనం)లో-

**"ఏతదుహైవ భగవతో విష్ణోః సర్వదేవతామయం రూప మహరహః సన్ధ్యాయాం ప్రయతో వాగ్యతో నిరీక్షమాణ ఉపతిష్ఠేత నమో జ్యోతిర్లోకాయ కాలాయనాయానిమిషాం పతయే మహాపురుషాయాభి ధీమహీతి."**

అంటూ సాధకుడు సాయంతనాన ఏకాంతోపవిష్టుడై నక్షత్రతారకలను చూసి సర్వేశ్వరుడైన కాలాత్మక పురుషధౌరేయుని ధ్యానించాలని చెప్పబడింది.

అందుచేత ఈ వర్ణనలను చదివిన పాఠకులు వీటి స్వరూప నిరూపణను శంకింపవలసిన అవసరంలేదు. ఇవి భూగోళ ఖగోళ విజ్ఞానబోధనలు కావు. భగవదైక్యానుసంధానం కోసం ధ్యానధారణకు ఉపక్రమించిన సాధకుడు ఈ విశ్వాన్ని భగవత్స్వరూపంగా భగవన్నివాస స్థానంగా పరిభావించి తాదాత్మ్యాన్ని పొందటానికి మాత్రమే ఇవి ఉద్దేశింపబడ్డాయి. సామాన్యంగా ఇందుకోసం భగవత్సగుణరూప చిహ్నాలు కలిగిన ఒక మూర్తిని – లోహప్రతిమను లేదా శిలాప్రతిమను – నిత్యారాధనకు, ధ్యాన ధారణకు గాను ఇవ్వడం జరుగుతుంటుంది. ఉపాస్యదేవత ఆరాధనకు రకరకాల బొమ్మలను; త్రికోణాలలో, వృత్తాలలో, వివిధ రేఖాకృతులలో ఉన్న యంత్రాలను ఉపయోగించడం కూడా ఉన్నదే. సర్వసత్తాకమైన భగవత్పురుషరూపాన్ని వర్ణించిన మన శ్రుతి స్మృతి పురాణేతిహాస ధర్మశాస్త్ర గ్రంథాలన్నీ కేవల చైతన్యమాత్రుడైన భగవానుని శక్తివిలసనాన్ని మనకు సుపరిచితమైన విషయాల ద్వారా తెలియజేస్తున్నాయి. ఈ కల్పనావిధానం కేవలుడైన భగవానుని నిరాకార నిర్గుణ చైతన్యమాత్ర తత్త్వానికి పరిచర్యార్థకం మాత్రమేనని శ్రీమద్భాగవతం అనేక పర్యాయాలు నొక్కి వక్కాణిస్తున్నది.

## పురాణకృతుల అధిచారిత్రిక ప్రామాణ్యం

పౌరాణిక కథాకృతులను అధ్యయన చేసే ఆధునిక పాఠకులకు ఆ గాథల యొక్క చారిత్రిక ప్రామాణ్యాన్ని గురించి మరొక ప్రధానమైన సమస్య ఎదురవుతున్నది. పురాణాలలో వర్ణింపబడిన దేవతలు, వారి లీలావిలాసాలు – ఇవన్నీ వాస్తవాలేనా? భగవదవతారాలు, తదవతారకృత్యాలు నిజమైనవా? లేక వట్టి కట్టుకథలు మాత్రమేనా? అని ప్రశ్న. ఆధునిక విద్యావిధానం ప్రవేశించటానికి పూర్వం ఇదొక పెద్ద సమస్యగా భాసింపలేదేమో కాని ఈనాడు మతవిషయాలను నమ్మాలన్నా ఈ ప్రశ్న ఒక మహావరోధంగా తయారయింది. ప్రపంచ విషయమై పౌరాణిక దృష్టిని గురించి ఇందాక చెప్పిన వివరణను అంగీకరిస్తే ఇదొక సమస్య కాకపోవచ్చును గాని, నిజంగా

మనఃపూర్వకంగా దీనిని పరిష్కరించాలంటే ఆయా సంఘటనలు, చరిత్ర, పౌరాణికనిర్దేశం, ఆధ్యాత్మిక సద్భావనల మధ్యగల సంబంధ మేమిటో తెలుసుకోవాలి. ఈనాడు మనము చరిత్ర అంటున్నదాని స్వభావమేమిటో ముందుగా గ్రహిస్తే కాని ఈ విషయం అంత తేలికగా అర్థంకాదు. చరిత్ర అంటే ఒకప్పుడు నిజంగా జరిగిన అనేక సంఘటనలయొక్క ఉల్లేఖనమని భావింపబడుతున్నది. ఆ జరిగిన ఘటనలు నేడు పరిదృశ్యమానాలు కావు. ఒక ఘటన అన్నది ఆ ఘటన జరిగినంతనే అక్కడికక్కడే పరిసమాప్తిని చెందుతున్నది. దైనందిన పరిస్థితులపై ఆ విశిష్ట ఘటన నెరపిన ఒక ప్రభావముద్ర, లేదా ఆ ఘటనను జ్ఞాపకం ఉంటుకొన్నవారి జ్ఞాపకశక్తిని బట్టి నిలిచిన విశేషాలు, లేదా ఆ ఘటన జరిగినప్పుడు తత్సమకాలీనులు వ్రాసిన వ్రాతలు – ఇవన్నీ చరిత్ర ఘటనావశేషాలుగా మిగిలి ఉంటాయి. కేవలం ఒకనాడు జరిగిన సంఘటనలను గుదిగ్రుచ్చుటమే చరిత్ర అనుకొంటే ఆ చరిత్ర సమస్తం నీటిపై గీచిన బొమ్మ వంటిదే కాని తరతరాలుగా మానవాళికి నిత్యస్మరణోత్సవంగా వెలుగొందుతున్న సంప్రదాయ మనుకొన్నప్పుడు ఆ చరిత్రకు మానవులను ఉత్తేజపరచి కర్తవ్యోన్ముఖులను కావించే మహాశక్తిగా స్థానం ఉంటుంది. అప్పుడు చరిత్రకు విషయభూతమైన ఒకానొక ఘటనాక్రమం (కొంతమంది ఇదే పరమార్థమని భావిస్తుంటారు) అప్రధానమై, అది తదనంతరీయులను కలిగించే ఒక నవచైతన్యం, ఒక నూతనోత్తేజం ప్రధానమవుతుంది. ఆ ఉత్తేజం పరిమితశక్తిమంతమై కొద్దిమంది ప్రేక్షకుల దృశ్యదర్శనాలకు మాత్రమే సీమితమయితే ప్రజలు దానిని మరిచిపోవటం జరుగుతుంది. లేకుంటే ఏ విద్యాలయాల్లోనో పరిశోధకుల పరిశోధనల కోసం మిగిలి ఉండటమో, అదీ కాకపోతే పురాపత్రసంచయాలలో మూలుగుతుండటమో జరుగుతుంది. ఆ విధంగా కాలపు ఇనుపతెరల వెనుక మరుగున పడకుండా – 'ఇది ఈనాడు ఈ ప్రదేశంలో ఇలా జరిగింది' అని చెప్పటానికి వీలుగా జరిగిన కొన్ని సంఘటనలు కేవల చారిత్రికనేపథ్యాలుగా మిగిలిపోక ప్రజలలో

ఉదాత్తభావాలను ప్రేరేపించి ఆధ్యాత్మిక శక్తిసంపదలను పెంపొందించే మహాప్రభావం కలిగినవి ఉన్నాయి. విశ్వము యొక్క అధిమూలాన్ని కనుగొని విశ్వరూపాన్ని భగవద్విరాడ్రూపంగా నిరూపిస్తున్న కొన్ని ఘటనలు చారిత్రిక ఘటనలు మాత్రమే కాక ఎన్నాళ్లు గడిచినా ఇంకా మన కళ్లయెదుటనే జరుగుతున్నట్లు నిత్యనూతనంగా భాసించేవి ఉన్నాయి. ఇప్పుడవి చారిత్రిక వాస్తవికతలకు అతీతమైన పురావృత్త కథ (myth) లుగా పరిణమించి, ఆ జాతిలో వెలసిన మహాకవులు, ధర్మోపదేష్టలు, తత్త్వవేత్తలు, కళాకారుల సృజనాత్మక హృదయాల సామూహిక ప్రతిస్పందనగా, ఆ ప్రజావళి సూత్రాత్మగా అభివ్యక్తమవుతాయి. మరికొంత కాలానికి ఆ పురావృత్తకథలే ఆధ్యాత్మికసత్యాలుగా ఆవిష్కరింపబడి జగద్విలసనానికి, మానవాభ్యుదయానికి మూలకందా లవుతాయి. ఆ ప్రకారం ఒక మహోన్నత తత్త్వోపదేశంగా రూపొందటానికి పూర్వం కేవల ఘటనల సమాహార రూపమైన చరిత్ర స్థాయి నుంచి ఒక పురావృత్త కథావిశేషంగా పరిణమింప వలసి ఉంటుంది. ప్రకృతిలోని భౌతికశక్తుల సంయోగం వలన నేల, వాతావరణం మొదలైన సార్థక నిర్మితు లేర్పడి తద్వారా సభ్యసమాజ నాగరికతలు రూపుదిద్దుకొన్నట్లు, వ్యక్తులలో ఉన్న దివ్యశక్తివిలసనమే ఈ ఆధ్యాత్మికతత్త్వాలను బహుముఖీనంగా ఆవిష్కరించి, భగవదవతారాలను, తదవతార కృత్యాలను పురాణ రూపంలో మనకు ఉపదేశిస్తున్నది.

ప్రపంచంలో భారతీయ భాషాసాహిత్యాలపై ఆసక్తి ఉదయించిన తొలి రోజుల నుంచి క్రైస్తవ మతవిశ్వాసంపైని పక్షపాతదృష్టి కలిగిన పెక్కుమంది ప్రాచ్యవిద్యాధ్యయన వేత్తలు పురాణ వాఙ్మయపు ఈ అధిచారిత్రక ప్రామాణ్యాన్ని (supra - historical validity) తిరస్కరించి, ఏదో ఒక నెపంతో హిందువుల పురాణేతిహాసాలను కేవల కల్పనాకథలుగా జమకట్టే ప్రయత్నాలను చేస్తూనే వచ్చారు. చారిత్రక పురుషుడైన ఏసుక్రీస్తు యొక్క జన్మవృత్తాంతాన్ని అధికరించి, నిరాధార పౌరాణిక కథావిజ్ఞానంపై ఆధారపడిన హిందూ ధర్మాన్ని క్రైస్తవ మతంతో సరిపోల్చి తమ మతం

ఎందుకు గొప్పదో చెప్పాలని వీరి ఉద్దేశం. ఈ ఉద్దేశం వీరికి ఒక్క పురాణాధారిత హిందూధర్మాన్ని మాత్రమే గాక క్రైస్తవమత ధర్మాన్ని కూడా సరిగా అర్థం చేసుకోనందువల్లనే ఏర్పడింది. చరిత్రయొక్క పరమార్థం పూర్వకాలఘటనలను యథానుక్రమణికగా సమకూర్చటం కాదు. అసలు ఒక క్షణంలో జరిగి మరుక్షణంలో మరుగునపడే ఘటనలకు యథాతథంగా ఎటువంటి ఆధ్యాత్మికమూల్యం ఉండదు. ఇంతకు పూర్వం చెప్పినట్లు ఒకనాటి వాస్తవ ఘటనలలో స్మరణోత్సవాలుగా మిగిలిన అంశాలు మాత్రమే చరిత్ర కాగలదని, చరిత్ర పునాదిపై వెలసి పురావృత్త కథావిశేషాలుగా విలసిల్లినవి మాత్రమే ఆధ్యాత్మికసత్యాలుగా రూపొందగలవని గుర్తించాలి. ఉదాహరణకు, వారందరి ఆదరాభిమానాలకు నోచుకొన్న ఆ చారిత్రిక యథార్థ్యం వలన క్రైస్తవ మతానికి ప్రత్యేకంగా సమకూడినదేమీ లేదు కాని, ఏసుక్రీస్తు యొక్క పురావృత్త కథాప్రతీకల వలన మాత్రం క్రైస్తవ మతానికి ఎంతో వేలు చేకూరింది. కథ కంటె కథాసందేశానికి ప్రాధాన్యం లభించింది. ఒకానొక వడ్రంగి భార్య దాంపత్య ధర్మసూత్రాన్ని అతిక్రమించి ఒక కొడుకును కన్నదని; అతను పెద్దవాడయి నీతి నియమాలను, భక్తివిశ్వాసాలను ప్రబోధించాడని; అతని నాయకత్వాభిలాషను చూసి స్వజాతీయులే అసూయపడ్డారని – చెప్పుకొనే ఈ వృత్తాంతం వలన భావితరాలకు చేకూరగల లాభం ఏమీ లేదు. అయితే అతను త్రిత్వమునందలి రెండవవానిగా కనపరుపబడ్డాడని, అతను మేరీమాత నిష్కళంక గర్భధారణ ఫలమని, మానవాళికి ముక్తిదాతగా అవతరించిన మహాత్ముడని, సిలువపై అతని శ్రమానుభవం మానవుల పాపపరిహారార్థం కావించిన ప్రాయశ్చిత్తమని, అతను మృతులలో నుండి లేచిన వాడని, తనను శరణుజొచ్చినవారిని సిలువపై చిందించిన రక్తము ద్వారా పరిరక్షింపగలడని – చెప్పినప్పుడు చారిత్రిక పరిధులను అతిగమించి పురావృత్త కథానుభవంగా పరిణమించి ప్రపంచవ్యాప్తమైన ఒక ఆధ్యాత్మిక శక్తిగా వెలుగొందుతున్న క్రీస్తు జీవితసందేశం మనకు వినిపిస్తుంది. పైని చెప్పిన ఘటనలన్నీ చారిత్రిక

యాథార్థ్యాలని రుజువు చేయటం అసాధ్యమైనప్పటికీ ఆ మతానుయాయుల మనోమందిరాలలో క్రీస్తు జీవితం ఒక ఆధ్యాత్మిక సత్యమై ఆ మహనీయుని బోధనల సారం వారి జీవితాలకు వెలుగును ప్రసాదిస్తుంది. ఆ వెలుగులో నడిచి నిరంతరసాధనతో ఉన్నత కక్ష్యలను ప్రవేశించినకొద్దీ ఆత్మపరిశుద్ధి కలుగుతుంది. ఆ ధ్యేయమూర్తిని శ్రీకృష్ణుడన్నా శ్రీరాముడన్నా సాధకుని పరమానుభవం ఇదే. ఆ కథాసంప్రదాయాలు మానవజీవితాలను ముందుకు నడిపించిన తీరును బట్టి వాటి ప్రామాణికతను ఊహింపవలసి ఉంటుంది.

ఒక జాతిచరిత్రలో పురావృత్తకథావిశేషాలుగా పరిణమించే ఉద్ఘటనలు ఆ జాతీయులకు సుపరిచితమైన దేశకాలాల నుంచి మాత్రమే ఆవిర్భవించి ఉండాలనే నియమం ఎక్కడా లేదు. నిజానికి అవి చరిత్రతో ఎటువంటి సంబంధమూ లేని ఆదర్శాలు కూడా అయి ఉండవచ్చును. ఈశ్వరశక్తి విలసనగా ప్రకృతితత్త్వం నుంచి బాహిరిల్లిన ఈ జగత్తులో సర్వమూ విషయసాపేక్షంగానే తప్ప ఆధ్యాత్మికమైనవి, అతీంద్రియమైనవి ఉండకూడ దనుకోవటం సరికాదు. ఇంద్రియానుభవం చేత బోధగమ్యమైనది మాత్రమే వాస్తవమని, ఇంద్రియాతీతమై పరావిషయికమైన (trans-subjective) ప్రతి ఆదర్శమూ అవాస్తవమని అంధవిశ్వాసాన్ని కలిగి ఉండటం మానవుని అజ్ఞతను మాత్రమే తెలియజేస్తుంది. ఆ విధమైన ఆదర్శమూర్తి కల్పన అతని జీవితంపై నెరపుతున్న ప్రభావప్రాభవాలతో సరిపోలిస్తే ఇంద్రియ ప్రమితి వలన కలిగిన జ్ఞానం ఎంత స్వల్పతరమో, ఆ జ్ఞానం అతని జీవితంపై నెరపుతున్న ప్రభావం ఎంత అల్పమో తెలుస్తుంది. అందువల్ల ఆధ్యాత్మిక సత్యాలుగా ఆవిష్కరింపబడిన పురావృత్తకథ లన్నింటిలోనూ తప్పనిసరిగా చారిత్రికయాథార్థ్యం ఉండనవసరంలేదు. అవి వాస్తవమైనవే కావచ్చు; కాకపోనూ వచ్చు. ఒకవేళ వాస్తవాలే అయినప్పటికీ ఈనాడు ఆ ఘటనలలోని పూర్వాపరాల క్రమం మన మనస్సులలో నుంచి తొలగిపోయి, పార్యంతికంగా అందులోని సందేశం మాత్రమే మిగులుతున్నది. నిజానికి ఒక వ్యక్తి చారిత్రిక వ్యక్తే అయినా పురావృత్త కథలోనికి అవతరించిన తర్వాత గాని అతని

జీవితంలోని పారమార్థిక సందేశం మనకు అనుభూయమానం కాదు. ఆ విధంగానే తారీఖులు, దస్తావేజులతో పనిలేని అధిచారిత్రిక ప్రామాణ్యం ఈశ్వరేచ్ఛాప్రేరితమైన శక్తి విలాసానికి తప్పక ఉంటుంది. హిందువులు ప్రతినిత్యం ఆరాధించే విష్ణువు, శివుడు, జగన్మాత మొదలైన ఇష్టదైవతాల విషయం కూడా అంతే. వారి పుట్టుక, ఉనికి మనవలె పృథ్వీగతాలు కాకపోయినా ప్రతిమాకల్పన చేసికొని మనము వారి సాన్నిధ్యాన్ని అనుభవిస్తున్నాము. పరతత్త్వము యొక్క సగుణరూపాలుగా అవతరించినవారితో సరిపోలిస్తే మనము భౌతికద్రవ్యాలని అంటున్నవన్నీ ఆ దివ్యకాంతిలో వెలవెపోతాయి.

మానవుడు భగవంతుని చేరుకొనేకొద్దీ భగవంతుడు మానవుని సమీపిస్తుంటాడు. మానవ మనస్సుకు ఏయే రూపం బోధగమ్యం కాగలదో ఆయా రూపాలను ధరించి భగవంతుడు భక్తుని అభీష్టానుసారం మెలగుతుంటాడు. అందులో మన ప్రమాణనిరూపణలకు, తర్కవితర్కాలకు తావులేదు. ఆయన యందలి పూర్ణవిశ్వాసంతో స్వరూపనిష్ఠ కలిగిన మహాత్ములు తొలుత కావించిన వర్ణనల ఆధారంగా ధ్యేయాకారాన్ని మలుచుకొని అనంతరీయసాధకులు అదే పరమానుభవాన్ని స్వాత్మగోచరం చేసికొనగలుగుతున్నారు. ఈ క్షణంలో ఉండి మరుక్షణంలో లేక ద్రుత గమనంతో పరిచరించే కొన్ని సంఘటనల సమాహార కల్పనమైన చరిత్రయొక్క పరిధులను దాటి ఆత్మోన్నతిని సాధించిన మహనీయుల అనుభవాలు, అనుభావాలు, ప్రకృతితత్త్వ విజ్ఞానం తెలియటం వల్ల సమున్నతాదర్శాలతో జీవితానికి ఒక గమ్యాన్ని, సార్థకతను ఏర్పరించే విశాలమైన దృక్పథం వారికి అలవడుతుంది. అదిగో ఆ సువిశాల దృశ్యభూమిక తోనే సమస్త చరాచరాలలో ఈశ్వరశక్తి విలాసాన్ని చూడగలిగే పరమాద్భుతమైన పురాణవాఙ్మయం అవతరించింది.

ఏతావతు తేలినదేమిటంటే పురాణాలను చరిత్రగా, భూగోళవిజ్ఞానంగా, లేక వట్టి కల్పనానల్ప శిల్ప ప్రపంచమాత్రంగా అన్వీక్షింపకూడదు. ఈ

కథలను కట్టుకథలుగా కొట్టిపారవేసే ఆధునికులు ప్రజలకు ఎంత హానిచేస్తున్నారో, వాటిని సర్వ సత్యాలుగా నిరూపించాలనే పండితులు కూడా అంతే అన్యాయం చేస్తున్నారు. చరిత్ర – కల్పన ఈ రెండింటి మిథ్యావాతావరణాన్ని మించిన ఒక సముదాత్త లక్ష్యం ఆ గ్రంథాలలో మనకు సాక్షాత్కరిస్తుంది. ఆ చిత్రణలో ఏ కథ చెప్పినా, ఏ పూర్వ సన్నివేశాన్ని నెమరువేసుకొన్నా, ఏ వ్యక్తిని స్మరించినా, చివరికి ఏ నదీనదాలను, పర్వత ప్రదేశాలను ప్రస్తావించినా అంతటా హారంలోని దారంలా అమరిన భక్తి నిర్భరత ఉన్నది. ద్రుతగాములైన క్షణికసంభవాలను ఆధ్యాత్మికసత్యాలుగా శాశ్వతీకరించి జీవితానికి సార్థక్యాన్ని చేకూర్చాలనే పవిత్రాశయం ఉన్నది. ఆ మహోన్నత లక్ష్యాన్ని వారి రచన ఎంతవరకు సాధించినదో చూడాలే కాని, గౌణవిషయాలను పట్టుకొని ప్రాకులాడటం అనవసరం. తత్త్వశాస్త్రం, చరిత్ర, సంప్రదాయాలు అనే పునాదిపై సాహిత్యమనే రమ్యమైన హర్మ్యాన్ని వినిర్మించి సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, ప్రేమదయాస్వరూపుడు అయిన భగవానుని రూపనామాలను ధ్యానధారణలో నిలుపుకొని ఆయనను ఆరాధించి ఆయనతో ఇష్టసల్లాపాదులొనర్చి సర్వోపచారాలతో సేవించుకోవటానికి భక్తులను ప్రేరేపించే మహాశక్తి ఆ గ్రంథాల లోని ప్రత్యక్షరంలోనూ ఉన్నది. భగవంతుని యొక్క సగుణరూపాలు, భగవదవతారాల లీలావిలాసాలు హిందువుల మనోమందిరాలలో పురాణాల వల్లనే సుస్థిరంగా నిలిచిపోయాయి. మానవాళికి స్మరణోత్సవాలుగా నిలిచిన ఘటనలుగా పరిశీలిస్తే వాటిలో ఎంత చరిత్రవస్తువు ఉన్నదో, చరిత్రను అతిగమించిన శాశ్వత సత్యా విష్కరణ సంకేతాలుగా అంత పారమార్థికత ఉన్నది.

బ్రహ్మానికి మూర్తామూర్త భేదాలున్నవన్న విషయం ప్రాజ్ఞ ప్రతిజ్ఞాతమే. ఉదాహరణకు బృహదారణ్యకోపనిషత్తు (2–2–1)ను పేర్కొనవచ్చును. శ్రీమద్భాగవతం, తక్కిన పురాణాలు ఈ భేదద్వితయాన్ని అంగీకరించినా, భక్తుల కోసం మూర్తభేదాన్నే ప్రధానీకరించి చెప్పాయి. ప్రస్తావతః

మూర్తామూర్తాలలో మనము అమూర్తము అంటున్నది కేవలాద్వైత పరమావస్థ అని, దాని యొక్క శక్తికార్యమే మూర్తిమత్త్వమని గ్రహించాలి. లేకపోతే అమూర్తమంటే సర్వశూన్యమనే విపరీతార్థం ఏర్పడుతుంది. అదే విధంగా అమూర్తము లేదా పరబ్రహ్మతత్త్వము లేకుండా కేవల మూర్తిమత్త్వమే ఉన్నదంటే ఆ స్థితికి, ఉన్నత మానవావస్థకు అభేదం సిద్ధించి ఈశ్వరనిరాసానికి తావు కలుగుతుంది. అందువల్లనే పురాణాలలో – విశిష్య శ్రీమద్భాగవత పురాణంలో సర్వేసర్వత్ర – పరతత్త్వానికి మూర్తామూర్తభేదాన్ని మొదట నిరూపించి, ఆ తర్వాత మూర్తరూపాన్ని భగవానుడని వ్యవహరించటం జరుగుతున్నది. ఆ భగవానుడొక ప్రత్యేక వ్యక్తి కాదని, పరమపురుషుడని గ్రహించాలి. ఆ పరమపురుషునికి ఒక ఆద్యరూపం ఉన్నప్పటికీ పురుషశబ్దం శరీర వాచికం కాబట్టి సర్వాత్మకుడైన ఆయనను ఏ రూపంలో ఆవాహన చేస్తే ఆ రూపంలో సాక్షాత్కరింపగలడని చెప్పబడింది. ఆయనను మానవీకరించి, భగవదవతారాలను మానవాకృతిమంతాలుగా భావిస్తున్నామంటే మానవమేధ అభ్యూహింపగల సమున్నతావస్థ అదేనని, ఆయన యొక్క నైజావస్థ వాఙ్మనోతీతమని గ్రహించాలి. భగవంతుని యొక్క ఆ ఆద్యరూపాన్ని భక్తజనుల కోసం వాస్తవికత ఉట్టిపడే చిత్రీకరణ కౌశలంతో ప్రతీకాత్మకంగా గోచరీభవింపజేస్తున్న పురాణాలలోని వర్ణనలను చదువుతుంటే – ఆ దివ్యలక్షణాలు, ఏతన్నివాసాదికం, ప్రసాధనసామగ్రి, అంగోపాంగ ఆయుధాకల్పాదులు, ఆయనను పరివేష్టించి ఉన్న పార్షదాదులు, ఆయన సృజనశక్తి, మోక్షదాయకత్వం, లోకరక్షణలీలలు, పరమహంసలు సాధువులు సద్భక్తులను అనుగ్రహించిన కథానకాలు – ఇన్ని మహనీయ లక్షణాలు కలిగిన వ్యక్తి ఒకరు మనతోపాటు ఈ భూమండలం పైని పుట్టి పెరిగారంటే, మనకు పరిచితమైన లోకంలో అటువంటి వ్యక్తిని మనము ఊహింపలేము. అద్భుతమైన ఈ విషయాన్ని చిత్రిస్తున్నప్పుడు పురాణాలు ప్రత్యక్షరంలోనూ ఆ లోకోత్తరతను, అతీంద్రియాత్వాన్ని సార్థకంగా వ్యంజింపజేయాలని ప్రయత్నించటం వలన అందులోని అనేక ఘటనలు

ఈనాడు మనకు అసాధ్యమనిపిస్తుంటాయి. ఆ ఘటనలను కథాభాగం నుంచి విడదీసి వేరుగా చూసినట్లయితే ఎంతో విలక్షణంగానూ, కొంత అవిశ్వసనీయంగానూ కనుపింపవచ్చును. కాని పూర్వాపరాలను అనుసంధించుకొంటూ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివినప్పుడు శ్రద్ధాళువుల మనస్సులలో భక్తిభావమే కలుగు తుంది. భగవంతుని మానవమనస్సుకు అంత సన్నిహితంగా తీసుకొనివచ్చి మానవునిలో నిరుపమాన భక్తిసంపదను పెంపొందించి మానవాళి అభ్యుదయానికి ఉపకరించిన మహనీయగ్రంథావళిగా ప్రపంచంలోని ఏ సారస్వతమూ పురాణ వాఙ్మయానికి సాటిరాదు.

పౌరాణికాభివర్ణనలలో కనుపించే ఈ ఆధ్యాత్మిక లక్ష్యం, చరిత్ర – భూగోళ విజ్ఞానాల విషయంలో ఇందాక మనమనుకొన్న విశ్వసద్భావన, ద్వాదశ స్కంధం లోని రెండు శ్లోకాలలో అతి స్పష్టంగా నిర్దేశింపబడింది. భక్తాగ్రేసరులైన అనేక రాజన్యులు, విశ్వవిజేతల వంశచరిత్రలను స్మరించినప్పుడు –

**"కథా ఇమాస్తే కథితా మహీయసాం**
**వితాయ లోకేషు యశః పరేయుషామ్**

**విజ్ఞాన వైరాగ్య వివక్షయా విభో**
**వచో విభూతీ ర్నతు పారమార్థ్యమ్.**

**యస్తూత్తమ శ్లోకగుణానువాదః**
**సంగీయతేఽ భీక్ష్ణ మమంగళఘ్నః**

**తమేవ నిత్యం శృణుయా దభీక్ష్ణం**
**కృష్ణేఽ మలాం భక్తి మభీప్సమానః**

(12 : 3 : 14 – 15)

అని శుకయోగి పరీక్షిన్మహారాజుతో అంటాడు. "ఓ రాజా: ఎందరెందరో రాజులు తమ జీవితకాలంలో మహాయశస్సును గడించి చివరికి నామమాత్రావశిష్టులైన వారి కథలనేకం నీకు వినిపించాను. ఈనాడు వీరందరినీ పేర్కొనటం విజ్ఞాన వైరాగ్య వివక్షార్థమే తప్ప పరమార్థభావంతో కాదు. మర్త్యులు భగవంతుని యెడ స్థిరభక్తిని కోరి దానిని సాధించాలి. అందుకు భగవత్కథాశ్రవణ మొక్కటే పరమ సాధనం. శ్రీకృష్ణార్పితచేతస్కులై నిత్యమూ తదీయలీలలను ఆకర్ణించాలి" అని దీని భావం. భాగవత పరమోద్దేశం కూడా ఇదే.

శ్రీమద్భాగవతం వంటి మహాగ్రంథాన్ని ఎంత సంగ్రహంగా పరిచయం చేద్దామన్నా తప్పక ప్రస్తావింపవలసిన విషయాలెన్నో ఇంకా మిగిలే ఉన్నాయి. భాగవతం లోని భక్తి సిద్ధాంత స్వరూపం, భాగవత ధర్మోపదేశం, భాగవత పాఠపరిష్కరణ వంటివి ఎన్నో ఉన్నాయి. ఇప్పటికే ఈ పీఠిక చాలా పెద్దదయింది. అందువల్ల ఒక్కొక్క స్కంధాన్ని గురించిన అనుశీలనను తత్తత్స్కంధాదులలోనూ; దశమ స్కంధ విశేష వివరణ, భాగవతంలోని అధ్యాత్మతత్త్వం, భాగవతానువృత్త భగవదవతార తత్త్వకథనం – ఇత్యాదుల విమర్శను తృతీయసంపుటం లోనూ చేర్చాము.

– శ్రీ తపస్యానంద స్వామి

# భాగవత ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.
పంచాశద్వర్ణరూపేణ యయా వ్యాప్తమిదం జగత్
శబ్దబ్రహ్మమయీం వాణీం భజే తాం పరదేవతామ్.

సనందనం శ్రీసనకంలీ సనాతనం
సనత్కుమారం చ సనత్సుజాతమ్
శ్రీవాసుదేవం చ శుకం మహాంతం
నమామి భక్త్యా నిజబోధసిద్ధ్యై.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః.
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున వసిష్ఠ బలీ న్విభీషణాదీన్
పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి.

యతః సర్వాణి భూతాని ప్రతిభాంతి స్థితాని చ
యత్రైవోపశమం యాంతి తస్మై పరాత్మనే నమః.

యం శైవాః సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినః
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్మేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః.

జన్మాద్యస్య యతోఽన్వయాదితరత శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యంతి మత్సూరయః
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గోఽమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి.

ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవ మత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్
శ్రీమద్భాగవతే మహాముని కృతే కిం వా పరై రీశ్వరః
సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభిః శుశ్రూషుభి స్తత్క్షణాత్.

నిగమకల్పతరో ర్గలితం ఫలం
శుకముఖా దమృతద్రవసంయుతమ్
పిబత భాగవతం రసమాలయం
ముహు రహో రసికా భువి భావుకాః !

# ప్రథమ స్కంధం

శ్రీమదఖిల చరాచరాత్మక వస్తువిస్తారానికి మూలహేతువైన పరబ్రహ్మానికి అభివందనం.

అన్ని వస్తువులకూ మూలమైన వస్తువు పరవస్తువు. దాని విస్తారమే ప్రపంచ మనబడుతున్నది. శబ్దబ్రహ్మం ఆ పరబ్రహ్మానికి అభివ్యంజకం. పరబ్రహ్మమంటే సత్యజ్ఞానాత్మకమైన శాశ్వత వస్తువు. భూత భవిష్య ద్వర్తమానాలు దానిని బాధింపలేవు. అది నిర్వికారం, నిరవయవం, నిత్యం, సర్వవ్యాపకం.

సచ్చిదానంద స్వరూపమూ, జగదేకపావనమూ అయిన ఆ పరబ్రహ్మం నిత్యచైతన్యవంతమైనది.

చైతన్యానికి లక్షణం శక్తి.

ఆ శక్తివలన అఖండస్వరూపమైన పరబ్రహ్మం స్వలీలాకల్పిత విశ్వంలో అనేకానేక రూపాలలో విద్యోతిస్తున్నది.

అటువంటి అనేక రూపాలలో ఖండస్వరూపమైన కాలం కూడా ఒకటి.

## కాలస్వరూపం

కాలం కూడా భగవత్స్వరూపమే. ఆకాశమార్గంలో ప్రాక్పశ్చిమాల నడుమ సూర్యుని సంచారక్రమాన్ని అనుసరించి కాలస్వరూపంలో రోజు, నెల, సంవత్సరం, యుగం మొదలైన ప్రమాణవిభాగం జరిగింది.

యుగాలు నాలుగు: కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం.

మనుష్యమానం ప్రకారం కృతయుగానికి 17,28,000 సంవత్సరాలు, త్రేతాయుగం 12,96,000, ద్వాపరయుగం 8,64,000, కలియుగం 4,32,000 సంవత్సరాలు.

ఈ చతుర్యుగానికి మహాయుగం అని పేరు. దీని ప్రమాణం 43,20,000 సంవత్సరాలు.

డెబ్భై ఒక్క మహాయుగాలు కలిసి ఒక మన్వంతరం. ఇటువంటి పధ్నాలుగు మన్వంతరాలు బ్రహ్మదేవునికి ఒక పగలు. మళ్లీ పధ్నాలుగు మన్వంతరాల కాలం బ్రహ్మకు ఒక రాత్రి. ఇరవై ఎనిమిది మన్వంతరాల బ్రహ్మ దినాన్ని కల్పం అంటారు. 360 కల్పాలు ఒక బ్రహ్మసంవత్సరం. అటువంటి సంవత్సరాలు శత ప్రమితమైన దాకా బ్రహ్మకు ఆయుష్కాలం.

రెండువేల మహాయుగాలు బ్రహ్మకు ఒక సంపూర్ణ దివారాత్రం. ఇందులో మన్వంతరాల నడిమి కాలంలోనూ, రేయింబవళ్ల నడిమి కాలంలోనూ సంభవించే ప్రళయకాలం కూడా కలిసి ఉన్నది. 7,20,000 మహాయుగాలు ఒక బ్రహ్మ వత్సరం.

మనుష్యమానంలో బ్రహ్మజీవితకాలం 29,30,40,00,00,00,000 సంవత్సరాలు.

అనంతమైన ఈ కాలమానంలో ఎన్నో మహాయుగాలు గడిచిపోయాయి. ఎందరెందరో బ్రహ్మలు గతించారు.

ఇప్పుడున్న బ్రహ్మకు పద్మసంభవుడని పేరు. ఇప్పటికి ఆయన కాల మానంలో 50 సంవత్సరాలు గడిచి, 51 వ సంవత్సరంలో శ్వేతవరాహ కల్పంలో ఆరు మన్వంతరాల తరువాత ఏడవదైన వైవస్వత మన్వంతరంలో 27 మహాయుగాలు గతించాయి. 28వ మహాయుగంలో సత్య త్రేతా ద్వాపరాల అనంతరం కలియుగం ఇప్పుడు నడుస్తున్నది.

> సత్యయుగంలో ధర్మం నాలుగు పాదాల, త్రేతా యుగంలో మూడు పాదాల, ద్వాపరంలో రెండు పాదాల, చివరికి కలియుగంలో భూమిపై ఒక్క పాదంతోనూ నడయాడుతుంది. ఈ విధంగా కాలం గడిచే కొద్దీ అనుష్ఠాతలకు స్వధర్మం పట్ల శ్రద్ధాభక్తులు సన్నగిల్లుతుంటాయి. లోకంలో ధర్మం నానాటికి తగ్గి, అధర్మం బలపడుతుంది.

## శౌనకాదుల విచారం

కలియుగం ప్రారంభమైన తొలిరోజుల లోనే ధర్మం ఏకపాదమాత్రమై, మూడు పాదాల అధర్మం ఎటుచూసినా విలయతాండవం చేయసాగింది. ఆ విపరీత వర్తనకు చింతించి శౌనకాది మహర్షు లందరూ 'యుగదోషాలకు లోనుకాకుండా భగవంతుని చేరుకొనే మార్గం ఏమై ఉంటుంది?' అని వితర్కించారు. అశేష పుణ్యఫలదాయకమైన సత్త్రయాగనిష్ఠలో జీవితశేషాన్ని గడిపివేయడమే ఉత్తమమార్గమని వారికి అనిపించింది. ఆ మహాయాగం వేయి సంవత్సరాలు దీక్షానియమాలతో నిరంతరాయితంగా జరుగవలసి ఉన్నది. యజ్ఞానుష్ఠానికి కావలసిన సర్వసంభారాలనూ ఏ లోటూ లేకుండా సమకూర్చుకొన్నాక అంత దీర్ఘకాలం పాటు ప్రశాంతంగా నివసించ డానికి అనువైన చోటుకోసం వెతికి ఋషులందరూ ఉత్తరభారతదేశంలో గౌరముఖుని ఆశ్రమానికి సమీపంలో వెలసి విలసిల్లుతున్న నైమిశారణ్యం తమకు అన్ని విధాలా తగిన ప్రదేశమని నిశ్చయించారు.

## నైమిశారణ్యం

నైమిశారణ్య మంటే పరమపవిత్రం. పాపలతలకు లవిత్రం, సకల సన్నుతులకు పాత్రం అయిన విష్ణుక్షేత్రం.

పూర్వం పరమేష్ఠి మనోమయమైన ఒక చక్రాన్ని నిర్మించి, వాయుమండలం లోనికి విడిచిపెట్టాడు. అది మహావేగంతో పరిభ్రమిస్తుండగా ఎదురుగాలి తాకిడికి దాని నేమి విరిగి నేల కొరిగింది. ఆ నేమి పడిన ప్రదేశానికి నైమిశ మని పేరు వచ్చింది.

కాలక్రమాన అక్కడొక మహారణ్యం వెలిసింది. దానికి నైమిశారణ్య మని ప్రఖ్యాతి కలిగింది.

## సత్త్రయాగ విశేషం

ఈ యాగానికీ, ఇతర యాగాలకూ కొంత భేదం ఉన్నది. ఇందులో ఋత్విజులే యజమానులై కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. ఇక్కడ శౌనకుడు నాయకుడై ఇతర మునుల సహకారంతో ఆ యాగాన్ని నిర్వహించాలని సంకల్పించాడు. ఎనభై ఎనిమిది వేలమంది ఋషులకు నాయకుడుగా ఉన్నందున ఆయనకు 'కులపతి' అని ప్రసిద్ధి కలిగింది.

## సూత సమాగమం

ఆ విధంగా శౌనకాదులు నైమిశారణ్యానికి వెళ్లి సత్త్రయాగం మొదలుపెట్టి, ఒకనాడు, ప్రాతఃకాలంలో ఆచరింపదగిన అగ్నిహోత్రాది నిత్య నైమిత్తిక కృత్యాలను నెరవేర్చి, కూర్చొని ఉండగా ఆ ప్రదేశానికి సూతమహర్షి వచ్చాడు. మునులందరూ ఆయనను యథావిధిగా సత్కరించి, ఉచితాసనాసీనుని కావించి, ఆదరోక్తులతో ఈ విధంగా పలికారు:

'సౌమ్యా! ఉగ్రశ్రవా: నీవు లోకపావనుడైన రోమహర్షణ మహామునికి జన్మించావు. సత్కులాభిజాతుడివై వ్యాసమహర్షి కరుణాప్రసాదానికి

నోచుకొన్నావు. ఆయన సన్నిధిలో సకల పురాణేతిహాస ధర్మశాస్త్రాలను తరిచి చూశావు. ఆ తర్వాత బ్రహ్మతత్త్వం సగుణమా? నిర్గుణమా? అన్న విషయాన్ని గురించి పరిశోధించి మహర్షుల తాత్పర్యాన్ని గ్రహించావు. గ్రహించడమే కాదు, దానిని పలుచోట్ల విచ్చి వివరించావు. కనుక నీకు తెలియని తత్త్వరహస్యాలు లేవు. నీచే నిశ్చితమైన వివేక సారాన్ని, పరమ శ్రేయస్సాధనాన్ని మాకు తెలియజెప్పు.

సూతాగ్రణీ! కలియుగంలో జనులు ఎక్కడ చూసినా అలసులు, మందమతులే కాక రోగపీడితులై నానావిధాల బాధలు పడుతున్నారు. వారి ఆయుర్దాయమూ అతి స్వల్పకాలికం. భక్తి ఉన్నా బహుశాస్త్ర శ్రవణమూ, బహురూప కర్మాచరణమూ సాధ్యంకాదు. అందువల్ల మోక్షధర్మానికి ఏది సారభూతమో, ఏది సకలజనులకూ సులభంగా ఆచరింపదగి ఉన్నదో, దానిని ఏర్పరచి మాకు విశదీకరించడానికి నీ వొక్కడవే తగినవాడవు. ధర్మనిరూపణ వలన నీకు మేలు కలుగుతుంది; నీ వలన లోకానికీ మేలు కలుగుతుంది.

సూతవర్యా! భగవంతుడు దేవకీ వసుదేవులకు అవతరించాడని అంటారు. ఆయన అవతారకార్యం ఏమిటి? ఎవడు సమస్తభూతాత్మకుడై భూతక్షేమవృద్ధులను కోరి నేలకు దిగివస్తాడని అంటారో, ఏ మహాత్ముని దివ్యనామాన్ని పలికినంత మాత్రాన ఘోర సంసారదుఃఖాలు సమసిపోతాయో, ఏ అభయదాయకుని చూసి భయాలు కూడా భయపడి పారిపోతాయో, ఏ మహానుభావుని పాదాలను ఆశ్రయించి మానవులు గంగోదక స్నానమహిమ కంటె సర్వోత్తమమైన మహిమను పొందడమే కాక తమ సాన్నిధ్యమాత్రం చేత అన్యులకు కూడా పావనత్వాన్ని ప్రసారింపగలుగుతున్నారో, అట్టి భగవంతుని పుణ్యచరిత్రాన్ని విని చిత్తశుద్ధిని పొందాలని ఎవరికి మాత్రం ఉండదు, చెప్పు? ఆ పరమేశ్వరుని మూర్తిభేదాలు ఏవేవో, ఆయన ఉదార చరితలలో వేనిని సూరిజనులు సదా కీర్తిస్తూ ఉంటారో, ఆ కథలన్నిటినీ మాకు వినిపించు. భగవత్కథలు ఎన్ని

విన్నా మాకు తనివితీరదు. ఆయనను గూర్చిన ప్రతి వచనమూ మధురమై మరీ మరీ వినాలని కుతూహలం గొలుపుతూ ఉంటుంది.

రౌమహర్షణీ! భగవానుడు లీలామానుషవేషాన్ని ధరించి అతిమానుషాలైన గోవర్ధనోద్ధరణాది మహాశ్చర్య కార్యాలను కావించాడంటారు. వాటి నన్నింటినీ ఆకర్ణించాలని కోర్కెలు క్రేళ్లురుకుతున్నాయి. యాగదీక్షాపరులమైన మాకు భగవత్కథలను వినడానికి అవకాశం ఉంటుందా, అని సందేహించకు. కలియుగం ప్రవేశించింది. మేము మాత్రం ఈ లోకంలో ఎంతకాలమని ఉంటాము? విష్ణుపదం చేరాలని నిశ్చయించుకొన్నాము. అందుకు హరికథాశ్రవణమే పరమోపాయమని మా అభిమతం. అందుకోసమే వైష్ణవమైన ఈ మహాపుణ్యక్షేత్రాన్ని చేరి దీర్ఘ సత్త్రయాగాన్ని ప్రారంభించాము. ఈ యాగంలో అష్టాదశపురాణాలను ఆలించడమూ ఒక ప్రకరణం. కనుక నీవు మా కోర్కెను తప్పక తీర్చాలి. మా పరితాపానికి తరణోపాయంగా భగవంతుడే నిన్నిక్కడకు పంపించాడని భావిస్తున్నాము.

మహానుభావా! కలి శక్తి ఇంతింతనరానిది. అది సకల సత్త్వాలనూ హరింప గలదు. అటువంటి కలిని అతిక్రమించాలని పూనుకొన్నాము. సముద్రతరణానికి కర్ణధారి వలె మా ఉద్యమానికి తారకమై నీవు సాక్షాత్కరించావు. అయ్యా! ధర్మరక్షణార్థం అవతరించిన శ్రీకృష్ణ పరమాత్మ తన అవతారాన్ని ఉపసంహరించి వెళ్లి పోయిన తర్వాత లోకంలో ధర్మం ఎవరిని ఆశ్రయించింది? ఇవన్నీ మాకు వివరించు. సూతుడంటే పౌరాణికుడే కదా! పురాణమర్మాన్ని మాకు విశదీకరించు.'

## సూతకృత గురుస్తుతి

పురాణవిద్యాప్రవీణుడైన సూతమహర్షి మునుల సంప్రశ్నానికి ఎంతో సంతోషించి, వారిని అభినందించి, మంగళాచరణకై ఈ విధంగా వ్యాసభగవానుని సన్నుతించాడు:

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సంన్యాసియై యొంటిఁ బో
వ మహాభీతి నొహెూ! కుమార! యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు చిక్కంజేసె ము న్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

సీ. కార్యవర్గంబును గారణసంఘంబు
నధికరించి చరించు నాత్మతత్త్వ

మధ్యాత్మ మనఁబడు, నట్టి యధ్యాత్మమ్ముఁ
దెలియఁజేయఁగ జాలు దీప మగుచు

సకలవేదములకు సారాంశమై యేక
మై యసాధారణ మగు ప్రభావ

రాజకం బైన పురాణమర్మంబును
గాఢ సంసారాంధకారపటలి

గీ. దాఁటఁ గోరెడివారికి దయదలిర్ప
నే తపోనిధి వివరించె నేర్పడంగ
నట్టి శుకనామధేయు మహాత్మగేయు
విమల విజ్ఞానరమణియు వేడ్కఁ గొలుతు.

క. నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి వ్యాసపదములకు నమ

స్కారము చేసి వచింతు ను
దారగ్రంథంబు దళిత తనుబంధంబున్.

## శౌనకాదుల ప్రశ్నలకు సమాధానం

గురు దేవతా నమస్క్రియల అనంతరం రోమహర్షణసుతుడు ఈ విధంగా ప్రసంగించాడు–

'మునీంద్రులారా! జగద్వల్లభుడైన శ్రీకృష్ణభగవానుని గూర్చి ప్రశ్నించి లోకమంగళకరమైన ఇతివృత్తాన్ని మీరిప్పుడు ప్రస్తావించారు. మీ పరిప్రశ్నలో 1. శాస్త్రసారం 2. భగవత్కృత్యం 3. సృష్ట్యాదిలీలలు 4. అవతార కథ 5. శ్రీకృష్ణవృత్తం 6. ధర్మరక్షణం అనే ఆరు సందేహాలు అంతర్భూతాలై ఉన్నాయి. వీటిలో మొదటి భావాన్ని గురించి చెపుతున్నాను, వినండి.

## 1. శాస్త్రసారం

సంయమీంద్రులారా! లోకంలో ధర్మం ప్రవృత్తి లక్షణం, నివృత్తి లక్షణం అని రెండు విధాలు. ప్రవృత్తి లక్షణ ధర్మం స్వర్గాదులను ఉద్దేశించి ప్రవర్తిల్లుతున్నది. స్వర్గాదులన్నీ అపరాలే కనుక స్వర్గఫలాన్ని కోరి ఆచరించిన ధర్మం కూడా అపరమే అవుతుంది. స్వర్గాదులందలి కాంక్షను విడిచి మోక్షమే ఆదర్శంగా గ్రహించి మోక్షసాధకాలయిన భగవత్కథల పట్ల శ్రవణం, ఆదరం మొదలుగా గల రూపాలలో భక్తిని కలిగి ఉండటం నివృత్తిధర్మం.

భగవంతుడు పరముడు. ఆయనను గూర్చిన ధర్మమూ పరసాధకమే. ఈ పరధర్మమే ఏకాంతికశ్రేయాన్ని కలిగిస్తుంది. పరధర్మానుష్ఠానంలో ఫలకాంక్షలేదు. ఈ ధర్మాచరణలో ఎటువంటి విఘ్నాలూ కలుగవు.

## ధర్మస్వరూప నిరూపణం

మునివృషభులారా! ధర్మపదార్థం జ్ఞానానికి అంగభూతమని శ్రుతులు వచిస్తున్నాయి. అంతమాత్రంచేత అది భక్తికి హేతుభూతం కానేరదని శంకింపకూడదు.

> ధర్మం వలన భక్తి కలుగుతుంది. భక్తి వలన వైరాగ్యం. వైరాగ్యం వలన జ్ఞానమూ కలుగుతాయి.

జ్ఞానం సాక్షాత్కారరూపమైనది. అది శుష్కతర్కాల వల్ల సిద్ధించేది కాదు. ఎప్పుడు బుద్ధి ఏకాగ్రమౌతుందో అప్పుడు జ్ఞానం ఉదయిస్తుంది. ఎప్పుడు పర విషయప్రీతి నశిస్తుందో అప్పుడు బుద్ధి ఏకాగ్రమవుతుంది. అటువంటి ప్రీతినాశాన్నే వైరాగ్యం అంటారు. వైరాగ్యంతోపాటు పరమార్థప్రీతి ఉండాలి. ఆ పరమార్థ ప్రీతినే భక్తి అని అంటారు. అటువంటి భక్తిని కలుగజేసేదే ధర్మం కాని ఇతర ధర్మాలు కావు. ఇతరధర్మాల వల్ల శ్రమతప్ప మిగిలేదేమీ ఉండదు. అందువల్లనే నేనిందాక ధర్మం వల్ల భక్తి, భక్తి వలన వైరాగ్యం, దాని మూలాన జ్ఞానం కలుగుతాయని అన్నాను.

అయితే ధర్మం అన్నది మోక్షం కోసమే అయినా, స్వర్గం కోసమే అయినా – దానిని అనుష్ఠించే సమయంలో అంతో ఇంతో శ్రమ కలుగదా? అంటే, తప్పక కలుగుతుంది. కాని మోక్షార్థమైన శ్రమవల్ల శాశ్వతఫలం చేకూరుతుంది. మళ్ళీ మళ్ళీ దానికోసం శ్రమింపవలసిన అవసరం ఉండదు కదా!

స్వర్గాన్ని కోరి అనుష్ఠించిన ధర్మం వలన స్వర్గమయితే కలుగుతుంది కాని అది తాత్కాలికం. శాశ్వతఫలం కాదు. తాత్కాలికఫలం భుక్తమైన వెంటనే నశించిపోతుంది. మళ్ళీ ఆ ఫలాన్ని ఆశించి శ్రమింపకా తీరదు, ఆ శ్రమ ఒకనాటికి తీరేదీ కాదు. దీన్నిబట్టి చూస్తే మోక్షార్థమైన శ్రమ వాస్తవానికి శ్రమే కాదనవచ్చు. మరి స్వర్గాదిఫలానికి కూడా నాశనం లేదని శ్రుతి చెప్పడం లేదా? అంటే, ఆ వాక్యం కేవలం ప్రరోచనార్థమని తెలుసుకోవాలి. కర్మార్జితమైన లోకం వలెనే పుణ్యార్జితమైన లోకం కూడా నశించిపోతుందని శ్రుతులే గట్టిగా చెబుతున్నాయి కదా!

## భక్తి – వేదాంతశ్రవణం

ఈ విధంగా వివేకించి చూసినప్పుడు కేవలం వేదాంతశ్రవణాదికం వల్లనే తత్త్వసాక్షాత్కారం కలుగుతున్నది కదా. ఇక భక్తి దేనికోసం? అని సందేహం కలుగవచ్చు.

సాక్షాత్కారం పరోక్షం. అపరోక్షం అని రెండు విధాలు. స్వానుభవం వలన సిద్ధించినది అపరోక్షసాక్షాత్కారం. వేదాంతవాక్యాలను విన్నందువలన 'తత్త్వస్వరూపం ఇదీ' అని తెలియవచ్చునే కాని, ఆ భావం అనుభవసిద్ధం కానేరదు. ఈ విధమైన జ్ఞానాన్ని పరోక్షసాక్షాత్కారం అంటారు. దీని వలన లభించే ఫలం అతి స్వల్పతరం.

అన్నం తింటే ఆకలి చల్లారుతుంది. ఆ సంగతి తెలిసినంత మాత్రాన ఆకలి తీరుతుందా? విన్నదానికీ, అనుభవించినదానికీ ఎంత భేదమో, పరోక్షాపరోక్షాలకు అంత భేదం ఉన్నది.

> వేదాంత శ్రవణంచేత సాధ్యం కాని అవరోక్షానుభూతిని కలిగించే ఏకసాధనం భక్తి. అది మొట్టమొదట హరికథామృతాన్ని ఆస్వాదింపజేస్తుంది. ఆ అమృతాన్ని గ్రోలినంత మాత్రాన చిత్తం ద్రవీభూతమవుతుంది; ప్రేమాశ్రువులు చిప్పిల్లుతాయి; పులకాంకురాలతో మేను గగుర్పొడుస్తుంది. ఈ చిహ్నాలన్నీ అపరోక్షసాక్షాత్కార లక్షణాలు. భగవత్తత్త్వానుభవానికి నిదర్శనలు. ఇటువంటి అనుభూతి వేదాంత శ్రవణాదుల వల్ల కలుగలేదు కనుక అవి భక్తికి సాటిరావు.

ఈ భక్తిరూపధర్మాన్ని శాస్త్రం బోధిస్తుంది. కనుక సకలశాస్త్రాలకూ సారం 'భక్తి' మాత్రమేనని తెలుసుకోవాలి.

## కామభోగ నియమం

ధర్మానికి అర్థం, అర్థానికి కామం, దానికి ఇంద్రియప్రీతి, దానివలన మళ్ళీ ధర్మార్థాదులూ తరంగ పరంపరా క్రమంలో జరుగుతున్నప్పుడు మోక్షం సిద్ధింపదని కొంతమంది అంటారు కాని, ఆ మతం ఉపాదేయం కాదు. ఎందుకంటే, ధర్మానికి ఫలం ముక్తి. అంతేకాని ధర్మానికి ప్రపంచార్థం ఫలం కాదు. ముక్తికి భక్తి ఒక్కటే పరమసాధనం. ధర్మానికి అర్థం, అర్థానికి కామం ఫలమన్నప్పుడు – ధర్మపూర్వకంగా అర్థాన్ని సంపాదించటం, దానివలన

అన్నపానాదులను గ్రహించి ఇంద్రియప్రీతిని పొందటం కర్తవ్యాలని సరిపెట్టుకోకూడదు. దేహధారణకు అవసరమైన మేరకే కామాన్ని నియమించాలి. తత్త్వార్థజ్ఞానమే దేహధారణకు ఫలమనీ, కామభోగాల కోసం దేహం ఏర్పడలేదనీ గ్రహించాలి.

## ధర్మజిజ్ఞాస – తత్త్వజిజ్ఞాస

మునులారా! ధర్మజిజ్ఞాస అన్నా తత్త్వజిజ్ఞాస అన్నా రెండూ ఒకటేననీ, అందువల్ల ధర్మమే తత్త్వమనీ కొందరు అంటుంటారు. కాని ఆ మాటను తత్త్వవేత్తలు అంగీకరింపరు. ఏమంటే? తత్త్వశబ్దానికి అర్థం జ్ఞానం; ధర్మం కాదు. తత్త్వ జ్ఞాన శబ్దాలు ఒకదానికొకటి పర్యాయపదాలు. ధర్మం బహురూపకం. అనేకానేక రూపాలలో గోచరిస్తూ ఉంటుంది. జ్ఞానమంటేనో? అది ఏకమూ అద్వితీయమున్నూ. ఆ జ్ఞానాన్ని బ్రహ్మమని ఔపనిషదులు, పరమాత్మ అని హైరణ్యగర్భులు, భగవానుడని సాత్వతులూ పేర్కొంటారు. ఆ పరమాత్మ సర్వాంతర్యామి. పరమాత్మ తత్త్వబోధకు వేదాంతాదిశ్రవణం కావించి పరమార్థాన్ని గ్రహిస్తారు. భగవత్కథా శ్రవణం కూడా వేదాంతాది శ్రవణం లోనికే వస్తుంది. శ్రవణం వలన పరమాత్మ ఎటువంటిదో బుద్ధిగ్రాహ్య మవుతుంది. అది పరోక్షజ్ఞానమని అనుకొన్నాము కదా! అంత మాత్రాన మనశ్శాంతి కలుగదు. ఆ పరమాత్మను సందర్శించాలని మహోత్సాహం ఉదయిస్తుంది. ఆ ఉత్సాహం పెంపొందే కొద్దీ పరవిషయాల పట్ల వైముఖ్యం పెరుగుతూ ఉంటుంది. అలా వైరాగ్యాదులు జనిస్తున్నాయి. వైరాగ్యంతో భగవద్దర్శన కాంక్షారూపమైన అనురాగం తీవ్రతర మవుతుంది. ఆ అనురాగాన్నే భక్తి అంటారు. ఆ భక్తి క్రమక్రమంగా వృద్ధిగాంచి చిత్తాన్ని భగవత్పరం చేస్తుంది. అప్పుడు భగవానుడు మనలోనే క్షేత్రజ్ఞుని రూపంలో ఉన్నవాడు దర్శనాన్ని ప్రసాదిస్తాడు. దానినే అపరోక్షసాక్షాత్కారం అన్నారు.

మునీంద్రులారా! ధర్మానికి భక్తి ఫలమవుతుండటాన్ని చూశాము కదా! కనుక భక్తిని సాధింపగోరినవారు మొట్టమొదట వారి వారి వర్ణాశ్రమాల

ప్రకారం స్వధర్మాన్ని పాటించాలి. ధర్మానుష్ఠానంలో ఒక రహస్యం ఉన్నది. ఏది భగవంతునికి సంతోషమో అదే ధర్మం. భగవత్సంతోషణమే ధర్మసిద్ధి అని తెలుసు కోవాలి. ఎటువంటి ధర్మమయినా భక్తిహీనమైతే నిరర్థకం అవుతుంది. అందువల్ల ధర్మాన్ని భక్తిపూర్వకంగా ఆచరించాలి.

## భక్తి లక్షణాలు

ఇక భక్తి అంటే ఎటువంటిదని సందేహం రావచ్చు. భక్తికి కొన్ని లక్షణాలు ఉన్నాయి.

> సర్వమూ భగవద్రూపమే అన్న విశ్వాసాన్ని సంపూర్ణంగా కలిగి ఉండడం ప్రథమలక్షణం. చరాచరభూతజాతం లోనూ భగవంతుని చూడటం ద్వితీయలక్షణం. ఏకాగ్రమైన బుద్ధితో నిరంతరం భగవత్కథలను వినటం, ఆయన నామాన్ని సంకీర్తించటం, ఆయనను పూజించటం, ధ్యానించటం మూడవ లక్షణం. త్రికరణశుద్ధిగా తనను తాను భగవంతునికి సమర్పించుకొని జీవితాన్ని గడపటం పరమ లక్షణం. ఇటువంటి లక్షణాలతో కూడిన వర్తనను భక్తి అంటారు.

అహంకారం పైకొని ఫలాభిసంధిపూర్వకమైన కర్మలను వదలనీయదు కదా? అంటే, ఆ మాట నిజమే అయినా దాన్ని జయించాలి. భగవద్ధ్యానమనే వాడి ఖడ్గాన్ని ధరించి వివేకవంతులు తమలోని అహంకారగ్రంథిని త్రుంచివేయాలి. అది పెరిగే కొద్దీ అహంకారం సన్నగిలుతుంది.

> భగవన్నామరుచి ఎలా కలుగుతుందంటే, ఆయన కథలను తరచు వింటుండాలి. వినగా వినగా రాగం అంకురించి అతిశయించడం సహజం. హరికథాశ్రవణం పట్ల అభిరుచి కలగకపోతేనూ మార్గం లేకపోలేదు. అటువంటివారు మొట్టమొదట పుణ్యతీర్థాలను సేవించాలి. తత్ఫలితంగా

మహాత్ముల సేవాభాగ్యం లభిస్తుంది. దానివలన శ్రవణేచ్ఛ, దాని వలన నామరుచీ కలుగుతాయి. ఇన్ని మాటలెందుకు; ఎవరు శ్రీకృష్ణభగవానుని పుణ్యకథలను ఆకర్ణిస్తారో, ఆయనను కీర్తిస్తారో వారి హృదయాంతరంలో భగవానుడు నిలిచి మలినవాసనలను నిర్మూలిస్తాడు. అందువలన బుద్ధి విక్షేపరహితమై నిశ్చలమౌతుంది; తత్ఫలితంగా రజస్తమో గుణాలు సన్నగిల్లుతాయి. అవి ఎప్పుడు సన్నగిలుతాయో అప్పుడే కామ లోభాది భావాలు అణగారిపోతాయి. అప్పుడు చిత్తం సత్త్వప్రధాన మవుతుంది. అపూర్వమైన ప్రశాంతి కలుగుతుంది. ప్రసన్నచిత్తునికి కోరికలన్నీ దూరమవుతాయి. కోరికలు నశించినందున అతను సంగరహితు డవుతాడు. ముక్తసంగునికి భగవత్తత్త్వ విజ్ఞానం సిద్ధిస్తుంది. దానివలన చిజ్జడరూపమైన అహంకారం వాసనాసహితంగా నశిస్తుంది. అసంభావనా విపరీత భావనలన్నీ రూపుమాస్తాయి. సంశయం నశించినప్పుడు బుద్ధి ఏకాగ్రమై భగవన్ముఖ మవుతుంది. భగవంతుడు సాక్షాత్కరిస్తాడు. అందాకా ఫలోన్ముఖం కానటువంటి కర్మల సంగతి ఏమంటే? కర్మలు వాసనా ప్రేరణ వల్ల వర్తిస్తాయి. వాసనాక్షయం కలిగేసరికి ప్రేరేపకత్వం లేక కర్మలు జరగవు. కర్మాచరణం లేనప్పుడు ఫలప్రాప్తీ ఉండదు. ఈ రహస్యాన్ని గ్రహించినవారు మనస్సుకు ప్రసాదగుణాన్ని చేకూర్చే భక్తిని ఎంతో సంతోషపూర్వకంగా భగవంతునిపట్ల నిరంతరమూ కలిగి ఉంటారు.

## త్రిమూర్తి తత్త్వ విచారం

సూతుడు పలికిన వాక్యాలను విని శౌనకాదులు – 'అనఘా! హరిహర బ్రహ్మలని మూర్తులు ముగ్గురుండగా వారిలో హరినే ఎందుకు పెద్దచేసి చెప్పావు?' అని అడిగారు. సూతుడు వారి తలంపును గ్రహించి ఇలా అన్నాడు:

'మునులారా! పరతత్త్వమంటే ఒకటేనని, అనేకం కాదని అంగీకరిస్తారు కదా. ఆ పరతత్త్వాన్ని పరమపూరుషుడని కూడా పేర్కొంటారు. పురం అంటే శరీరం. ప్రపంచమనే శరీరానికి మూలం కావడంవల్ల పరమపూరుషుదనబడుతున్నాడు. అతను చైతన్యస్వరూపుడు. చైతన్యంలో జ్ఞానమూ శక్తీ రెండూ కలిసిమెలిసి వేరు చెయ్యడానికి వీల్లేకుండా ఉంటాయి. ఆ రెండింటిలో శక్తి జ్ఞానాన్ని అనుసరించి వర్తిల్లుతుంది.

శక్తి – సత్త్వరజస్తమస్సులనే తత్త్వాలతో ముప్పిరితాడులా అల్లుకొని ఉంటుంది. ఆ మూడు తత్త్వాలనూ మూడు గుణాలని కూడా అంటారు. జ్ఞానం శక్తిని శాసించేది కనుక జ్ఞానాన్ని పరమేశ్వరు డన్నారు.

పరమేశ్వరుడు తన శక్తిగతాలైన ఆ గుణత్రయాన్ని ఉపాధులుగా గ్రహించి బ్రహ్మ హరి హర నామాలతో సృష్టి స్థితి లయాలను కావిస్తుంటాడు. అందులో తమోగుణం కేవల లయాత్మకం. దానికి స్వతః ప్రవృత్తిప్రకాశం కలగదు. రజస్సుకు కొంత స్వతఃప్రవృత్తి ప్రకాశం ఉన్నది కాని అది విక్షేపాత్మకం కావడం వల్ల అన్నివేళల ప్రకాశింపలేదు. అందువలన అది సోపాధిక జ్ఞానహేతువై కించిద్బ్రహ్మప్రకాశక అవుతున్నది. సత్త్వము శుద్ధమయినందున సాక్షాద్బ్రహ్మప్రకాశకం అవుతున్నది. మకిలి లేని పరిశుద్ధమైన అద్దాన్ని శుద్ధసత్త్వానికి, కొంచెం మాసిన దర్పణాన్ని రజస్సుకు, మసిపూసిన అద్దాన్ని తమస్సుకు సాటిచేసి ఆ మూడింటిలోని ప్రతిబింబాలనూ పోల్చిచూస్తే నేను చెప్పింది సులభంగా బోధపడుతుంది.

తపోధనులారా! జ్ఞానం ఎల్లవేళలా ఒకే రూపంలో ప్రకాశిస్తూ ఉంటుంది. దాని ప్రకాశానికి ఎన్నడూ హెచ్చుతగ్గులుండవు. శక్తిపదార్థం జ్ఞానాన్ని ఆశ్రయించి దానికి ఉపాధిభూతమై మూడు విధాలుగా ఉంటుందని వివరించాను. ఆ మూడింటిలో సత్త్వము శుద్ధం కనుక దానిలో జ్ఞానప్రకాశం మలినం లేని అద్దంలో దీపకాంతిలా హెచ్చుతగ్గులు లేక యథాస్థితంగా ఉంటుంది. తమస్సు చాలా మందం కనుక దానిలో జ్ఞానప్రకాశం కేవలం

మలినదర్పణం లోని దీపికాప్రకాశంలా మందమై లయాత్మకమై లేనట్లే ఉంటుంది. రజస్సు సంగతి అంటేనో? అది సత్త్వంవలె అంత పరిశుద్ధమూ కాదు; తమస్సువలె మిక్కిలి మాలిన్యవంతమూ కాదు. అది ఆ రెంటికీ మధ్యావస్థలో ఉంటుంది. అందువల్ల జ్ఞానప్రకాశమూ మధ్యావస్థ లోనే ఉంటుంది.

ఈ ఉపాధులు మూడింటిలో రజస్సు సృష్టికారకం, సత్త్వం స్థితికారకం, తమస్సు లయకారకమూ అవుతాయి. అందులో సత్త్వం శుభదాయకం కనుక మూడింటిలో విశిష్టమైనదని చెప్పాలి. అటువంటి విశిష్టోపాధితో కూడి ఉన్నప్పుడు బ్రహ్మాన్ని హరి అనీ, రజోరూపమైన ఉపాధితో కూడి ఉన్నప్పుడు బ్రహ్మ అనీ, తమోరూపమైన ఉపాధితో కూడినప్పుడు హరుడనీ వ్యవహరిస్తారు. ఉపాధి వైశిష్ట్యాన్ని బట్టి భగవంతునికి ఆ విధంగా మూర్తిత్రయరూపమైన భేదం కలుగుతున్నది. ఉదాహరణకు దారువు, ధూమం, అగ్ని – వీటిలో కొయ్యను తమస్సుకు, పొగను రజస్సుకు, మంటను సత్త్వానికి సాటిచేయవచ్చు. వీటిలో అగ్ని కార్యకారిగా ఉన్నది. అలాగే బ్రహ్మ హరి హరులలో వారి వారి ఉపాధిభేదాన్నీ ఫలభేదాన్నీ అనుసరించి ఉత్తరోత్తరంగా విశిష్టు లవుతారు. సత్త్వమూర్తి అయిన హరిని భక్తులు క్షేమార్థులై ఆశ్రయించడానికి కారణం అదే.

> అందువల్ల విష్ణువును పెద్దచేసి చెప్పడం శాస్త్రసమ్మతమే కాక పూర్వాచారం కూడా. అటువంటి ఆచారాన్ని ప్రతిపాదించిన వాళ్లెవరంటే? ఏతన్మాత్రులు కారు; సర్వజ్ఞులై నిర్వ్యక్రియులైన మహా మునులు దానిని ప్రతిపాదించారు. అటువంటి పెద్దలు నియమించిన ఆచారం ప్రమాణ మనడలో ఏ మాత్రమూ సందేహించకూడదు.

## అన్యదేవతారాధన

అయితే, అన్యదేవతలను కొంతమంది ఆరాధించడం లేదా? అంటే, ఆ మార్గాన్ని అవలంబించేది కామార్థులు మాత్రమేనని, ముముక్షువులు ఎన్నడూ చేయరనీ సమాధానం. ముముక్షువులకు ప్రధానమైనది శాంతం ఒక్కటే. అన్య దేవతలకు దానిని ప్రసాదించగల శక్తి చాలదు. అంతేకాక నారాయణమూర్తులలో అయినా అన్నీ శాంతమూర్తులు కావు. వాటిలో ఏవి శాంతమూర్తులో అవి మాత్రమే ముముక్షువులచే ఉపాసింపబడుతున్నాయి. వస్తుతత్త్వాన్ని బట్టి ఫలతత్త్వం ఉంటుంది.

ముముక్షువులు ఆ విధంగా ఉపాసిస్తారన్నంత మాత్రాన వారికి ఇతరదేవతల యెడ అగౌరవ మనుకోకూడదు. దేవత లందరూ ఏ రూపాన ఉన్నా, ఏ పేరున వెలసినా మూమ్మూర్తులా పరమాత్ముని అంశమాత్రులే తప్ప స్వతంత్రులు కారు. వారు తత్తధికార నియమితులై ఆశ్రయించినవారికి తమ యోగ్యతానురూపంగా ఫలాలను ప్రసాదిస్తుంటారు. వారి అధికారాలు స్వల్పం; వారిచ్చే ఫలితాలు కూడా ఆ కోవలోకే వస్తాయి. రాజస స్వభావులకు ప్రియమవుతున్నవంటే అది గుణనైజ మన్నమాట. అందువల్ల అటువంటి గుణాలను కలిగినవారు ఆయా దేవతలకు ఆరాధిస్తారు. మోక్షాన్ని ప్రసాదించటానికి తగిన శక్తిమంతులు కానందున ముముక్షువులు వారిని ఆశ్రయించరు.

> సుఖమన్నది అందరకూ ప్రాప్యమే కదా, అంటే సుఖం అందరికీ పరమప్రాప్యమే అయినా అందులో క్షణికమూ శాశ్వతమూ అని కొంత తారతమ్యం ఉన్నది. శాశ్వత సుఖం ఉత్తమోత్తమం. కనుక సుఖాన్ని కోరేటప్పుడు శాశ్వత సుఖాన్నే కోరడం మంచిది. మోక్షం ఒక్కటే శాశ్వత సుఖం. అటువంటి మహాఫలాన్నిచ్చే మోక్షం పరమ ప్రాప్యం గనుకా, వాసుదేవుడు ఒక్కడే మోక్షప్రదుడు గనుకా, అతనినే భజింపమని సర్వశాస్త్రాలూ బోధిస్తున్నాయి.

## వేద బోధ

మునులారా! యజ్ఞయాగాదులు మోక్షప్రదాలని వేదం బోధిస్తున్నది కదా? అంటే వేదతాత్పర్యం కూడా వాసుదేవపరమే కాని, వాసుదేవుని కంటె అన్యులకు న్యపరం కాదు. ఆ వేదాలు కూడా వాసుదేవుడినే ఆరాధిస్తున్నాయి. అందువల్ల వేదాలయితేనేమి, యాగాలయితేనేమి, మరి ఇతరాలయితేనేమి, అన్నీ వాసుదేవప్రాప్తికి ఉపాయాలే. కనుక అవన్నీ తత్పరాలే అన్నది ఫలితార్థం.

అయితే మరి శాస్త్రజ్ఞానం సంగతి ఏమిటి? అని అడిగితే – శాస్త్రజ్ఞానమూ వాసుదేవుని గురించే చెబుతున్నది. కనుక అది కూడా వాసుదేవతత్పరమే అవుతున్నది. ధర్మశాస్త్రం వ్రత దానాదుల వల్ల పొందదగిన స్వర్గాదిఫలాన్ని ప్రతిపాదిస్తోందనీ, అందువలన అది స్వర్గాదిఫల పరమవుతుందే కాని వాసుదేవపరం ఎలాగవుతుందని శంకిస్తారేమో? స్వర్గాదిఫలాలు ఆనందాంశమాత్రా లవుతాయి. వాసుదేవు డంటేనో? ఆనందఘనస్వరూపం. అంశమెప్పుడూ పూర్ణంలో అంతర్భూతమే కనుక ఆనందాంశను ప్రతిపాదించే ధర్మశాస్త్రం కూడా ఆనందఘనమైన వాసుదేవుని పరమే అనడం నిర్వివాదాంశం. ఈ విధంగా ఎన్ని మార్గాల విచారించినా సర్వశాస్త్రాలకూ మూలం శ్రీ వాసుదేవుడే. శాస్త్రజాలమంతా చివరికి ఆయన పరమే అవుతున్నది.

## 2. భగవత్కృత్యం

శౌనకాదులు సూతమహర్షి వాక్యాలను సాంతంగా విని, 'మహాత్మా! ఏ వస్తువులో జగత్సృష్టి తత్ప్రవేశ, తన్నియమాది లీలలున్నాయో – ఆ వస్తువులో సర్వశాస్త్రాలకూ సమన్వయం ఉండాలి. శాస్త్రతాత్పర్యమూ మాకు అలాగే కనబడుతున్నది. సర్వశాస్త్రాలూ వాసుదేవపరములు అన్నావు. నీ మాట మాకు బోధపడకుండా ఉన్నది' అన్నారు. సూతుడు వారి సందేహాన్ని గ్రహించి, తొలుత వారడిగిన ప్రశ్నలలో రెండవదైన భగవత్కృత్యాన్ని వివరించాడు.

'అన్నింటికీ మూలమైన పదార్థం ఒకటున్నది. దానికి సత్పదార్థమని పేరు. 'సత్' అంటే త్రికాలాబాధితమైన, షడ్వికారరహితమైనదని అర్థం. ఆ పదార్థానికి రూప నామాదు లుండవు. ఏమంటే, ఏదయినా కంటికి కనిపించినప్పుడు అది ఇటువంటిదని గ్రహించడానికి వీలుగా దాని లక్షణాలను బట్టి ఏదో ఒక పేరు పెట్టడం సాధ్యమవుతుంది. ఆ పదార్థం కంటికి కనపడేది కాదు. అందువల్ల దానికి రూపమూ, నామమూ ఏర్పడవు. అయినా అది సర్వవ్యాపకంగా ఉంటుంది. ఆ అర్థాన్ని బోధించే 'పరమాత్మ' అనే పేరుతో దాన్ని వ్యవహరించారు. ఆ వస్తువు సర్వవ్యాపకమె ఇంతదని చెప్పడం ఎవరి తరమూ కాదు కనుక దానిని 'బ్రహ్మము' అన్నారు. బ్రహ్మ మంటే గొప్పదని భావం. దాని వలన సృజింపబడి, సర్వమూ దాని అధీనంలోనే ఉంటుందని దానిని పరమేశ్వరుడు అన్నారు. మరి ఆ సత్పదార్థానికి చెందిన లక్షణాలలో బుద్ధిగోచరమైన వాటిని బట్టి భగవానుడు, వాసుదేవుడు మొదలైన పేర్లు కలిగాయి.

మునులారా! ఆ వాసుదేవుడు నిర్గుణుడు. నిర్గుణుడంటే గుణరహితుడని పొరబడకూడదు. ఆ మాటకు గుణాలన్నింటికీ అతీతుడని అర్థం. భగవానుడు జ్ఞాన స్వరూపుడు కదా! జ్ఞానం ఎల్లవేళలా శక్తితో కూడి ఉంటుంది. జ్ఞానం సంకల్పించినప్పుడు శక్తి విస్తరిస్తుంది. ఆ విస్తారమే సృష్టి అనబడుతోంది. సృష్టి అంటే విస్తరించినదని అర్థం.

శక్తికి మాయ అనే నామాంతరం ఉన్నది. మాయా శబ్దానికి – 'ఉన్నదని గాని, లేదనిగాని నిశ్చయించి చెప్పడానికి వీలులేనిది' అని అర్థం. విస్తరించినపుడు దాని ఉనికి స్పష్టంగా కనబడుతుంది. లీనమయినప్పుడు కనబడదు. కనుక అది భావాభావ పదార్థం. అంటే, శక్తికి ప్రత్యేకావస్థ ఉన్నదని గాని లేదని గాని నిర్ణయించడం సాధ్యంకాదని, దాని కలిమిలేములు దాని వ్యవహారావస్థలను బట్టి మారుతుంటాయనీ సారాంశం.

సత్త్వరజస్తమస్సులనే త్రిగుణాలు శక్తికి లక్షణాలు. పరమేశ్వరుడు వాని మాయతో కూడి జగత్సృష్టి కావించాడు. అందువల్ల పరమేశ్వరుడే జగత్కారణం. ఆయన మాయ వలన ఆకాశాదులు కలుగుతున్నాయి. అంటే పరమేశ్వరశక్తి ఆకాశాది రూప పరిణామాన్ని తాల్చిందన్నమాట. అలా జనించిన ఆకాశాదులలో పరమేశ్వరుడు ప్రవేశించాడు. ఆయన ప్రవేశించడమంటే గృహప్రవేశం వంటిది కాదు; అనుస్యూతం. అనగా పరమేశ్వరుడు తన శక్తినంటుకొని ఆ శక్తి ఏయే రూపాలను ధరిస్తుందో వాటన్నిటిలోనూ ఉంటాడని తాత్పర్యం. శక్తికీ శక్తిమంతునికీ ప్రత్యేకావస్థలు లేవు కనుకనూ, శక్తి అన్నది శక్తిమంతుని కార్యజాతంలో ఉండేది కనుకా, శక్తిమంతుడైన పరమేశ్వరుడు శక్తి తోడుగా తత్కార్యములైన చరాచర భూతజాతంలోనూ ఉన్నాడని తెలుసుకోవాలి. పంచదారకూ దాని తీపికీ వేర్వేరు భావాలు లేవు. పంచదారతో ఏ పదార్థాన్ని చేసినా దానినంటుకొని తీపికూడా ఉంటుంది. ఇదే నిదర్శనం.

> మునులారా; భగవంతుడు గుణాతీతుడని, ఆకాశాదులు గుణాలని, గుణాతీతుడు గుణాలలోను ప్రవేశించాడనీ అనుకొన్నాము. అప్పుడు ఉపాధి కారణం వల్ల గుణాతీతుడయినా, అతడు గుణవంతుని వలెనే కనుపిస్తాడు. గుణవంతుడంటే – 'గుణాలైన ఈ ఆకాశాదులు నా అధీనాలే' అన్న అభిమానాన్ని వాటిపట్ల కలిగి ఉండటమని తాత్పర్యం. వాస్తవ స్థితిని చూస్తేనో? భగవంతుడు నిర్వికల్పుడు; ఆకాశాదులన్నీ భగవంతుని చిచ్ఛక్తి యొక్క విజృంభణాలు. భగవంతుడు విజృంభణాలలో రూపొందడం, వాటన్నిటినీ నియమించడం మొదలయినవి కేవలం లీలలు మాత్రమే.

## 3. సృష్ట్యాది లీలలు

మునితల్లజులారా! ఆ భగవంతుడు ఆ విధంగా సృష్టిసర్వస్వంలోనికీ ప్రవేశించినందున ఆతడు ప్రతి భూతమందునా అంతర్యామియై ఉన్నాడు.

ఆతడు లేని భూతమే కలుగదు. భూతాలు ఉపాధిభేదం వలన నానారూపాలో ఉంటాయి. భూతజాతం నానాత్వాన్నిబట్టి వాటిలో అంతర్యామియై ఉన్న భగవంతుడూ నానారూపాలను తాల్చినట్లు మనకనిపిస్తుంది. అక్కడ తనుభేదాన్ని బట్టి తనుమద్భేదాన్ని ఊహిస్తున్నామన్న మాట. అగ్ని ఒకటే అయినా అది దహించే దారువుల ఆకృతిని బట్టి నానారూపాలలో తోచే విధాన, భగవంతు డొకడే ఉన్నా ఉపాధి నానాత్వాన్ని బట్టి అతనికి నానాత్వం కల్పింపబడుతోందని తాత్పర్యం. ఈ విధానాన్ని భగవద్బహురూపత్వ లీల అంటారు. భగవంతుడలా నానారూపాలను తాల్చి తాను నిర్మించిన చతుర్విధభూతాల మనస్సు మొదలయిన సూక్ష్మేంద్రియాల మూలాన విషయాలను భోగిస్తున్నట్లు కాన్పిస్తాడు. ఈ విధానాన్ని భగవద్భోగలీల అన్నారు.

## 4. భగవల్లీలావతారాలు

మునులారా! భగవంతుని లీలావతారాలు అసంఖ్యాకంగా దేవతలు, పశుపక్షిమృగాది తిర్యక్కులు, మనుష్యులు మొదలైన రూపాలలో ఉన్నాయి. అందులో అన్ని అవతారాలకూ ఆదినారాయణావతారం బీజభూతం. అది ప్రథమావతారం. వరాహావతారం రెండవది; నారదావతారం మూడవది; నరనారాయణావతారం నాల్గవది; కపిలావతారం ఐదవది; దత్తాత్రేయం ఆరోది; యాజ్ఞం ఏడవది; ఋషభ, పృథు, మత్స్య, కూర్మ, ధన్వంతరి, మోహినీ, నరసింహ, వామన, పరశురామ, వేదవ్యాస, శ్రీరామ, రామకృష్ణావతారాలు ఎనిమిది మొదలు క్రమంగా పందొమ్మిదవుతాయి. ఇవన్నీ ఇప్పటికి గడిచినవి. ఇక బుద్ధ కల్క్యవతారాలను భగవానుడు ధరింపబోతున్నాడు. ఈ అవతారాలలో అంశావతారాలు కొన్ని, అంశాంశమాత్రాలు కొన్నీ ఉన్నాయి. ఇక ఋషులు, మునులు, సుర నర ప్రజాపత్యాదులు – వారి మాటేమిటంటే? వారందరూ భగవద్విభూతులు.

## అవతార ప్రయోజనాలు

తపస్వులారా! అవతార సంఖ్యాక్రమాలను వివరించాను. వాటి ప్రయోజనాలను కూడా వినండి. భగవంతుడు లోకసృష్టిని సంకల్పించి మొట్టమొదట నారాయణావతారాన్ని ధరించాడు. ఈ అవతారాన్ని విరాడ్రూపమనీ అంటున్నారు. ఇది మహదహంకార పంచతన్మాత్ర నిష్పన్నమైన ఏకాదశేంద్రియాలు, పంచమహాభూతాలు – కలిసి మొత్తం పదహారు కళలతో కూడినది. ఈ పదహారింటిని షోడశకళ లంటారు. కళ అంటే అంశమన్నమాట. భగవద్రూపం అంటువంటిదేనా అని అడిగితే, భగవంతునికి రూపమే లేదు కదా! భగవంతుడు దేహాంతర్యామిగా ఉంటాడు. ఉపాసనార్థం అతని విరాడ్రూపాన్ని ప్రతిపాదించారు. ఆ రూపం ఎటువంటిదంటే? రజోగుణాదుల స్పర్శ పొరయని కేవల సత్త్వమయరూపం. సహస్రశీర్షాలు, సహస్రాక్షులు, సహస్ర పాదాలు, సహస్ర ఊరువులు, సహస్రభుజాలు, సహస్రముఖాలతోనూ, సహస్ర కిరీట కుండలాంబరాల తోనూ విరాజిల్లుతూ మహాద్భుతంగా వెలసినట్టిది.

ఆ విధంగా విరాణ్మూర్తి వెలసి ఏకార్ణవమైన జలాలలో విశ్రమించి సమాధిరూప నిద్రను తాల్చింది. ఈ ఉత్తమరూపం యోగిజనుల జ్ఞాననేత్రాలకు మాత్రమే గోచరిస్తుంది. అన్యులు దానిని చూడలేరు. ఇది ఇతరావతారాల వంటిది కాదు. ఎలాగంటే? ఇతరావతారాలకు జనన మరణాలున్నాయి. దీనికి లేవు. ఇది వికార రహితమై నిరంతరమూ యథాస్థితిలో ఉండేది. అంతేకాదు. ఇది సర్వావతారాలకూ బీజభూతమూ, నివేశస్థానమూ అయినటువంటిది. అవతారాలన్నీ దానిలో నుంచి పుట్టి తమ తమ కార్యాలను నెరవేర్చి తిరోధానమై చివరికి మళ్ళీ ఈ అవతారమూర్తినే చేరుతాయి. దీని బీజభూతత్వం అవతారాలకు మాత్రమే కాదు. దేవ మనుష్య తిర్యగాది సమస్తసృష్టికి ఇదే బీజం. మరి దీనికీ ఇతరబీజాలకూ భేదమున్నది. ఇతర బీజాలు ఒకదానిని పుట్టించి తాము నశిస్తున్నాయి. ఈ బీజమంటేనో,

అవ్యయం. దీని నుంచి ఎన్ని జన్మించినా దీనికి మాత్రం వ్యయమూ నాశనమూ కలుగవు.

విరాణ్మూర్తి యోగనిద్రావశుడై ఉండగా, ఆతని నాభిసరోవర మందలి కమలం నుంచి సర్వసృష్టికీ అధిపతి అయిన చతుర్ముఖ బ్రహ్మ ఉదయించాడు. తర్వాత మరీచ్యాదులు పుట్టి ప్రపంచాన్ని నిర్మించారు. లోకనిర్మాణానికి ఉపాదానపదార్థం ఏమిటంటే – ఈ విరాణ్మూర్తి యొక్క అవయవ సంస్థానం వలన లోకవిస్తార మంతా కల్పింపబడింది. ఈ విరాణ్మూర్తి అప్పుడు కౌమారమనే సర్గవిశేషానికి ఉపక్రమించి బ్రాహ్మణుడై దుశ్చరమైన బ్రహ్మచర్యావ్రతాన్ని ఆచరించాడు. ఇది ప్రథమావతారం.

## వరాహావతారం

భూతలం మొట్టమొదట పాతాళగతమై ఉండేది. దానిని పైకి లేవనెత్తితే కాని లోకసృష్టికి అవకాశం లేకపోయింది. భగవంతు డప్పుడు వరాహావతారమెత్తి ఆ కార్యాన్ని నెరవేర్చాడు.

## నారదావతారం

కర్మము బంధకారణమని తెలియక లోకులందరూ కర్మాలతో తగిలి వర్తింప సాగారు, ఆ భ్రాంతి తొలగితే కాని లోకానికి మేలు కలిగే మార్గం ఏర్పడదు. భ్రాంతి తీరడానికి దివ్యజ్ఞానబోధ ఒకటే పరమసాధనం. భగవంతుడు దేవర్షిత్వాన్ని గ్రహించి నారదుడనే పేర వెలసి పాంచరాత్రాగమాన్ని బోధించాడు.

## నరనారాయణావతారం

భగవనుడలా జ్ఞానబోధ చేసినప్పటికీ బోధసిద్ధికి శమదమాలు అత్యవసరమైనాయి. వాని తత్త్వాధ్యాపనకు భగవంతుడు యముని అంశతో నరనారాయణ రూపాలను ధరించి స్వానుష్ఠానపూర్వకంగా శమదమాల తత్త్వాన్ని లోకానికి తెలియజెప్పాడు.

## కపిలావతారం

ఆ శాస్త్రం కాలగర్భంలో కలిసి ఖిలమైపోయింది. దాని ఉద్ధరణార్థం భగవంతుడు కపిలావతారమెత్తి సిద్ధేశ్వరుడై తత్త్వనిర్ణయాత్మకమైన సాంఖ్యశాస్త్రాన్ని ఆసురి అనే బ్రాహ్మణునికి బోధించి ఆ శాస్త్రాన్ని సముద్ధరించాడు.

## దత్తాత్రేయావతారం

కాలం గడిచేకొద్దీ తత్త్వవిచారం సన్నగిల్లింది. భగవానుడు అత్రి మహా మునికి అనసూయాదేవి యందు దత్తాత్రేయుడనే పేర జన్మించి అలర్క మహారాజుకు, మరికొందరు బ్రహ్మవాదులకూ ఆత్మవిద్యను బోధించి ఆ శాస్త్రాన్ని ఉద్ధరించాడు. అన్వీక్షకి అని దాని పేరు. అన్వీక్షకి అంటే జీవాత్మ పరమాత్మల తత్త్వాన్ని విచారించే తర్కవిద్య.

## యజ్ఞావతారం

మరికొంత కాలానికి లోకపరిపాలనా సౌష్ఠవం తగ్గసాగింది. భగవంతుడు రుచిమహర్షికి ఆకూతి కడుపున యజ్ఞుడనే పేరుతో జన్మించి యామాది పుత్త్రులను గాంచి, వారితో స్వాయంభువ మన్వంతరాన్ని పరిపాలించి లోకపాలక విధానాన్ని సముద్ధరించాడు.

## ఋషభావతారం

కాలవశాన సాంఖ్యశాస్త్రమంటే దురవబోధమయిన కేవల తర్కవిద్యారూపానికి పరిణమించింది. తర్కాలలో పడి జనులు అగతికులయ్యారు. భగవానుడు అగ్నీధ్రుని కొడుకు నాభికి మేరుదేవి యందు ఋషభుడై సర్వాశ్రమ పూజితమైన పరమహంసాశ్రమ విధానాన్ని తెలిపి లోకకళ్యాణం కావించాడు.

## పృథురాజావతారం

తపోవ్రతాదులు కూడా కాలక్రమాన ఉడిగిపోజొచ్చాయి. దానితో జనులందరూ అన్నమయశరీరు లయ్యారు. వారికి వలసిన భోజనపదార్థాలు పుష్కలంగా లభించని పరిస్థితి ఏర్పడింది. మహర్షులు ఆ దురవస్థను చూసి సైరింపలేక భగవంతుని ప్రార్థించారు. భగవానుడు పృథురాజుగా అవతరించి ఆహారయోగ్యాలయిన సస్యాదులను, ఓషధులను భూమిమీద మొలిపించి, పోషించి, వాటి పంటలతో జీవించే మార్గాన్ని ప్రజలకు నేర్పాడు. పృథివిని ఆ విధంగా దోహదం చేసి జీవరాశికి ఆహారాన్ని సమకూర్చిన కారణాన ఈ అవతారం ఎంతో విశిష్టమైనది.

## మత్స్యావతారం

కొంతకాలానికి చాక్షుష మన్వంతరం వచ్చింది. ఆ మన్వంతరావసానంలో అకాల జలప్రళయం సంభవించింది. భగవంతుడు మత్స్యరూపాన్ని ధరించి వైవస్వత మనువును మహీరూపమైన నావ నెక్కించి రక్షించాడు.

## కూర్మావతారం

మరికొంత కాలానికి దేవదానవులు అమరత్వాన్ని కోరి అమృతాన్ని సాధింపదలచి మందరగిరిని కవ్వంగా అమర్చి క్షీరాబ్ధిని మథింపసాగారు. బరువు ఎక్కువై ఆ గిరి కవ్వం క్రుంగసాగింది. సురాసురులకు గత్యంతరం కనిపించలేదు. అందరూ కలిసి భగవంతుని ప్రార్థించారు. భగవానుడు వారి మొర విని కమఠరూపం దాల్చి తన మూపున ఆ కొండను ధరించి వారి కోరికను ఈడేర్చాడు. అప్పుడు వారు రెట్టించిన పట్టుదలతో ఒకరినొకరు మించుతూ సముద్రాన్ని మథించారు.

## ధన్వంతరి అవతారం

అప్పుడు భగవంతుడు ధన్వంతరి రూపాన అమృతకలశం చేతబట్టి సముద్రాంతరం నుంచి వెడలి వచ్చాడు.

## మోహిని అవతారం

ఆ అమృతం కోసం సురాసురులకు పోరు కలిగింది. భగవానుడు మోహినీ వేషం తాల్చి వచ్చి ఆ ఇరుతెగలవారినీ మోహవశులను కావించి సురలకు అమృతాన్ని ఇచ్చాడు.

## నరసింహావతారం

కొంతకాలానికి హిరణ్యకశిపు డనేవా డొకడు రాక్షస భావాన్ని ఆశ్రయించి లోకకంటకు డయ్యాడు. అతని దుండగాలు ఇన్నీ అన్నీ అని చెప్పతరం కాదు. అంతెందుకు: భగవంతుడనే మాటను ఉచ్చరించినవాళ్లనల్లా అతను చంపసాగాడు. అతనికి ప్రహ్లాదుడు జన్మించి భగవద్భక్తు డయ్యాడు. హిరణ్యకశిపుడు ఆ పసివాడు తన కొడుకని కూడా యెంచక జాలిమాలి నానావిధాల బాధించి చూశాడు. ఎట్టకేలకు 'భగవంతుడు ఉన్నాడా' అనే విషయమై తండ్రీ కొడుకులకు పెద్దవాదం గోరంతలు కొండంతలయింది. భగవంతుడు ముమ్మాటికీ ఉన్నాడని ప్రహ్లాదుడు నొక్కి చెప్పాడు. ఆ మాటకు హిరణ్యకశిపుడు భగ్గున మండిపడి 'ఓరి మూర్ఖుడా! నీ భగవంతుడు ఎక్కడున్నాడురా?' అని రెట్టించి అడిగాడు. భగవంతుడు లేని చోటంటూ లేదని ప్రహ్లాదుడు బదులు చెప్పాడు. 'అలాగయితే అతనిని మనయెదుట ఉన్న ఈ స్తంభంలో చూపించు' అని ఉల్లాసభావంతో పలికి హిరణ్యకశిపుడు ఆ స్తంభాన్ని మోదాడు. ప్రహ్లాదుడు హరిని ప్రార్థించాడు. భగవంతుడు నృసింహరూపంలో ఆ స్తంభాన్నుంచి వెలువడి లోకశత్రువయిన దైతేయుని తన తొడలపై ఉంచుకొని చాపలు అల్లేవాడు తుంగలను విడదీసినట్లు తన వాడి గోళ్లతో వాడిని చీల్చి చంపి జగన్మంగళం కలిగించాడు.

## వామనావతారం

మరికొంత కాలానికి బలిచక్రవర్తి ముల్లోకాలనూ ఆక్రమించాడు. అతని దాడికి దేవతలు ఓడిపోయి దిక్కు కానక భగవంతుని శరణుజొచ్చారు.

అప్పుడు భగవానుడు వామనావతారంలో బలిని మూడడుగుల నేల అడిగి, అది నిమిత్తంగా ముల్లోకాలనూ సాధించి ఇంద్రుడికి మళ్లీ అప్పజెప్పి దేవతల ఆరాటాన్ని ఉపశమింపజేశాడు.

## పరశురామావతారం

రాజులు మదించి స్వధర్మాన్ని మరిచి విచ్చలవిడిగా ప్రవర్తింపసాగారు. వారి దుర్వృత్తుల వలన భగవంతునికి ఎంతో ఆగ్రహం కలిగింది. భగవంతుడు పరశురామావతారంలో రాజలోకాన్ని ఇరవై ఒక్కమార్లు వెతికి సంహరించి ధాత్రీతలాన్ని నిఃక్షత్రియం కావించి ధర్మాన్ని సముద్ధరించాడు.

## వ్యాసావతారం

జనులు మందమతులై వేదార్థాన్ని చక్కగా తెలుసుకొనలేకపోయారు. భగవంతుడు పరాశరమహర్షికి సత్యవతి యందు వ్యాసనామంతో అవతరించి వేదకల్పానికి శాఖ లేర్పరచి వేదాన్ని ఉద్ధరించాడు.

## రామావతారం

మళ్లీ కొంతకాలానికి రాక్షసబాధ ఎక్కువయింది. రావణాసురుడు రాక్షసరాజై ముజ్జగాలనూ ఉడ్డుడికించాడు. దేవతలు మొరపెట్టుకొన్నారు. భగవానుడు దశరథునికి శ్రీరాముడనే పేరు అవతరించి సముద్రుని నిగ్రహించి సేతువు కట్టి రక్కసులను జక్కాడి సురల అభిమతాన్ని నెరవేర్చాడు.

## బలరామ, కృష్ణ అవతారాలు

మరికొంత కాలానికి పాపం మూడు కాళ్లతో చరింపసాగింది. భూమికి భారం మోయరానిదయింది. భూదేవి మొరపెట్టింది. భగవానుడు బలరామ, కృష్ణ రూపాలలో నేలకు దిగివచ్చి పాపాత్ములను తునిమి భూభారాన్ని ఉడిపి లోకానుగ్రహం కావించాడు.

## బుద్ధావతారం

ఇంతలో కలియుగం ప్రారంభమయింది. రాక్షసులందరూ బ్రాహ్మణాది యోనులలో జన్మిస్తారు. వారికి మోహాన్ని కలిగించడానికే భగవంతుడు కీకట (మధ్య గయా) దేశంలో బుద్ధుడనే పేర అవతరింపనున్నాడు.

## కల్క్యవతారం

కలియుగాంతంలో యుగసంధి సమయాన పాలకులు స్వార్థపరులై ధర్మాన్ని దూరీకరించి పరద్రవ్యాపహరణాదులకు ఒడిగడతారు. లోకాలు తల్లడిల్లి అల్లాడుతాయి. అప్పుడు భగవంతుడు విష్ణుయశుడనే బ్రాహ్మణునికి కల్కి పేరిట జన్మించి జగద్గురువై ధర్మాన్ని పరిరక్షిస్తాడు.

మునులారా! సత్యనిధి అయిన భగవంతుని అవతారాలను లెక్కించడం సాధ్యంకాదు. అయినా వానిలో ప్రధానమైన కొన్నింటిని గురించి సంక్షేపంగా తెలియజేశాను.

## అవతార తారతమ్యాలు

మునీంద్రులారా! భగవంతుని అవతారాలలో నేను చెప్పిన మత్స్యాద్యవతారాలు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాలు కలిగినవైనా జ్ఞానక్రియాశక్తులు ఆ యా కార్యాలకు ఎంత మాత్రం ఆవశ్యకమో అంత మాత్రమే చూపించాయి. వాటిని అంశావతారాలని అంటారు. కౌమార నారదాద్యవతారాలు కేవలం ఆధికారిక మాత్రా లయినందున వాటిలో కళాలేశం మాత్రమే ప్రకటితమయింది. అందులో కౌమారాదులు జ్ఞానాంశలు కాగా పృథురాజాదులు శక్త్యంశను ప్రకటించాయి. కృష్ణావతారం అన్ని అవతారాలలో విశిష్టమై వెలుగొందుతున్నది. సాక్షాన్నారాయణుడే సర్వశక్తిసమగ్రుడై కృష్ణ భగవానుని రూపంలో అవతరించినందున అది పూర్ణావతారం.

## అవతార కీర్తనఫలం

ఆర్యులారా! భగవదవతార విశేషాలనూ, ఆ యా అవతారాల లోని కార్య ప్రయోజనాలనూ సంగ్రహించి చెప్పాను. ఎవరు భక్తిశ్రద్ధలతో శుచిగా అతిగోప్యమైన ఈ భగవదవతారక్రమాన్ని ప్రతినిత్యమూ కీర్తిస్తారో, వారికి దుఃఖగ్రామమైన సంసారం నుంచి విముక్తి లభిస్తుంది. భగవత్కీర్తనకూ ఫలం ఇదే.

## ముక్తితత్త్వం

ముముక్షువులారా! ముక్తిస్వరూపం ఎటువంటిదనే ప్రశ్న ఒకటున్నది. జీవునికి దేహంతో కలిగే సంబంధం బంధమని, ఆ సంబంధం తొలగిపోవటమే ముక్తి అవుతుందనీ సామాన్యంగా అంటుంటారు. దేహంలో స్థూలము సూక్ష్మము అని రెండు పొరలున్నాయి. ఆ రెండూ జీవుని ఆవరించి ఉండేవి. అంతే తప్ప అవి జీవుని బంధించి ఉండేటటువంటివి కావు. ఏమంటే, జీవునికి రూపమే లేదుకదా! రూపం లేనివానిని ఆపై బంధించడం ఎలా వీలవుతుంది? అవి జీవుని బంధించడమే నిక్కమైతే, మరణకాలంలో జీవుడు వాటిని దిగవిడిచి వెళ్లిపోగలగాలి. ఇక బంధనం ఎటువంటిదంటే మమకారరూపమైనది. మమకారమంటే 'నేను' 'నాది' అన్న భావం. ఎవరికి దేనియందు రుచి కలుగుతుందో వారికి దానియందు మమకారం ఉదయిస్తుంది. జీవుడు చిదేకరసుడు; ఆ చిత్స్వరూపాన్ని మించిన రసపదార్థం లేదు. దేహమంటేనే పాంచభౌతిక పదార్థం. ఆ పదార్థం లోనిది మాధుర్యమంటూ ఉంటే అది తుచ్ఛమైనది. కనుక జీవుడు ఉత్తమమైన రసపదార్థాన్ని వదిలి తుచ్ఛమైన వాటికి ప్రాలుమాలడం జరగదు. అందువల్ల జీవునికి దేహరూపసంబంధ మన్నదే ఉండదు.

ఈ మాట ప్రత్యక్షానుభవానికి విరుద్ధమంటారా? స్థూలదృష్టికి అలా కనిపించడం నిజమే. నేనిందాక మహత్తు మొదలైనవి పరమేశ్వరుని శక్తిగుణాలని సూచించాను. అవి జీవునికి నిలయస్థానంగా స్థూలశరీరాన్ని

రచిస్తాయి. అంత మాత్రాన జీవుడు దేహబద్ధుడు కాడు. ఇంటిలో మనం కాపరమున్నట్లు జీవుడు ఆ దేహంలో ఉంటాడు. ఇల్లు మనకు ఏ విధంగా ఆవరణమాత్ర మవుతుందో అలాగే జీవునికి దేహం స్వరూపావరణ మాత్రం అవుతున్నది. మేఘమండలం వాయువును ఆశ్రయించి విరిసి ఆకాశాన్ని కప్పిపుచ్చుతున్నది. అంత మాత్రాన మేఘమండలానికీ ఆకాశానికీ సంబంధం కలుగుతుందా? దుమ్ము రేగి గాలిలో వ్యాపిస్తున్నది. అంతమాత్రం చేత గాలికీ ధూళికీ సంబంధం ఉన్నదంటామా? మేఘమండలం ఆకాశ స్వరూపాన్ని, దుమ్ము వాయుస్వరూపాన్ని కప్పిపుచ్చినట్లే, దేహం జీవుని స్వరూపాన్ని కప్పిపుచ్చుతోందని గ్రహించాలి.

## అధ్యాసం

మునులారా! జీవుడన్నా ఆత్మ అన్నా అర్థం ఒకటే. ఆత్మ ఎల్లవేళలా ద్రష్ట – అంటే చూచేవా డన్నమాట. దేహం దృశ్యము – అంటే చూడబడేది. వాస్తవస్థితి ఇలా ఉండగా ద్రష్ట అయిన ఆత్మలో దృశ్యత్వాది శరీరధర్మాలను ఆరోపించి శరీరమే ఆత్మగా భావిస్తారు. ఈ పొరపాటుకు కారణం అజ్ఞానమే. ఈ విధంగా ఆరోపించడం అధ్యాస మనబడుతున్నది. అది అవ్యక్తం; అంటే ఇంద్రియాలకు కనిపించేది కాదు. ఎందుచేతనంటే ఇంద్రియాలకు అవయవాలు కల వస్తువులు మాత్రమే గోచరిస్తాయి. సూక్ష్మశరీరానికి అవయవాలు లేవు. కనుక అది దృశ్యం కాదు. ఈ అవయవాలు లేకపోవడం ఎందుకంటారేమో! స్థూల సూక్ష్మ శరీరాలు రెండూ గుణాల యొక్క కార్యాలే అయినా, గుణాలు స్థూలశరీర రచనావిధానంలో మాత్రమే కరచరణాది అవయవరూప పరిణామాన్ని పొందుతున్నాయి. ఆ కారణాన సూక్ష్మశరీరానికి ఆకారం ఏర్పడదు. అందువల్ల అది దృష్టికి గోచరం కాదు. దృష్టికి కనుపించనిదాని తత్త్వం ఇట్టిదని నిరూపించడం ఏలాగు? చూడరానిదొకటి ఉన్నదనడానికి ప్రమాణం ఏమిటి? అంటే, సూక్ష్మశరీరాన్నే లింగశరీరం అంటారు. అది ఆత్మకు ఉపాధి అయినప్పుడు మాత్రమే ఆత్మునికి

జీవత్వం కలుగుతున్నది. అలా కానినాడు ఆత్మునికి జీవత్వమే కలగదు. దాన్ని బట్టి సూక్ష్మశరీరం ఒకటున్నదని ఏర్పడుతున్నది.

## సూక్ష్మశరీరం ఎందుకు?

అయితే జీవుడికి ప్రారబ్ధకర్మఫలభోగార్థం స్థూలశరీరం భోగాయతనమై ఉపాధిగా ఉండగా వేరొక శరీరంతో పనేముందని ప్రశ్నింపవచ్చు. ఈ కర్మఫలం సంచితం, ప్రారబ్ధం, ఆగామి అని మూడు విధాలు. సంచితంలో ఏ కొంతభాగాని కయినా భోగ్యావసరం కలిగితే దానిని ప్రారబ్ధ మంటారు. శేషించిన దానిని సంచితం అంటారు. ఆ శరీరంతో మళ్లీ చేయబడి ఉత్తరోత్తరానుభవానికి వచ్చేదానిని ఆగామి అంటారు. జీవుడికి ప్రారబ్ధ కర్మఫలభోగం తోటే సర్వకర్మఫలభోగమూ పూర్తయినట్లు కాదు. సంచిత కర్మం అలాగే ఉన్నది. ఆ సంచితంలో మళ్ళీ ఏ కొద్ది భాగమో పక్వమై భోగించే అవసరం కలుగుతుంది. జీవుడు ప్రకృతం ఉన్న స్థూలశరీరాన్ని విడిచిపెట్టిన తర్వాత పునర్భోగ్యమైన కర్మఫలానికి అనుకూలంగా పంచభూతాలు శరీరాన్ని కల్పిస్తున్నాయి. జీవుడు పూర్వదేహం నుంచి సూక్ష్మశరీరంతో బయలుదేరి ఆ కొత్త శరీరాన్ని ప్రవేశించి దానిచేత అనుభవింపవలసినవన్నీ అనుభవిస్తున్నాడు. జీవుని రాకపోకలు ఈ సూక్ష్మశరీరం ద్వారా జరుగుతుంటాయి. అందుకు వేరే ఒక సాధనం లేనందువల్ల సూక్ష్మశరీరం అవసర మవుతున్నది.

## ముక్తిమార్గం

ఈ విధంగా స్థూల సూక్ష్మ శరీరాల నుంచి ముక్తి కలగాలంటే జీవుడికి మమకారం పూర్తిగా నశించాలి. మమకారం నశించాలంటే స్వరూపజ్ఞానం కలగాలి. ఈ స్థూల సూక్ష్మదేహాలు రెండూ కారణ కార్యరూపాలు మాత్రమేనని, మాయచేత కల్పింపబడ్డాయని, వాటితో తనకు ఎటువంటి సంబంధమూ లేదని గ్రహించడమే స్వరూపజ్ఞానం. అది శ్రవణ మనన

భక్త్యాదుల ఫలరూపమై సిద్ధిస్తుంది. ఆ జ్ఞానోదయం కలిగినంతనే జీవునికి తన జీవత్వభావం నశిస్తున్నది. అంతే కాదు. ఆతనికి బ్రహ్మత్వం కలుగుతున్నది. అనగా జీవుడు తాను బ్రహ్మమేనని తెలుసుకొంటాడు. దీనినే ముక్తి అంటారు. ఆ భావాన్ని పొందగలిగే విధానాన్ని ముక్తిమార్గం అంటారు.

## బ్రహ్మత్వమంటే ఏమిటి?

సంసృతి అంటే జనన మరణ రూప ప్రవాహమని, దానికి కారణం భగవన్మాయ అనీ తెలుసుకొన్నాము. మాయకు చిక్కి ఉన్నంతకాలమూ సంసారం తప్పదు. మాయ తొలగి బ్రహ్మత్వం కలిగే మార్గం ఏమిటంటే, మాయ అన్నది భగవంతుని శక్తి అని పేర్కొన్నాము. ఆ శక్తిని ఈశ్వరదేవి అని కూడా అంటారు. ఆ శక్తి క్రీడలే సంసారభ్రమణలు. ఆ శక్తి యెప్పుడు తన క్రీడను చాలిస్తుందో అప్పుడే సంసారభ్రమణం తనంతట తానుగా విరమిస్తుంది. ఆ విరామంతో బ్రహ్మత్వం – అంటే స్వరూపజ్ఞానం – సిద్ధిస్తుంది.

ఆ శక్తి క్రీడలు ఆవరణరూపకములు, విక్షేపరూపకాలని రెండు విధాలు. అవి రెండూ అవిద్యాత్మకాలే; అంటే జ్ఞానాన్ని కప్పిపుచ్చేవే అవుతాయి. ఆ రెంటిలో విక్షేపం జ్ఞానోదయంతో సంభవిస్తుంది; దాని వెంటనే ఆవరణం తొలగి; జీవుడిగా ఉపాధులుగా ఉన్న సదసత్తులు రెండూ దగ్ధప్రాయా లవుతాయి. జ్ఞానం వాటిని దహించి ఇంధనం లేని అగ్నివలె తాను కూడా ఉపరమిస్తుంది. అప్పుడు జీవునికి బ్రహ్మరూపం ప్రాప్తమవుతున్నది; అంటే జీవుడు పరమానందరూపుడై వెలుగొందుతాడు.

## భగవంతునికి జన్మాదిరాహిత్యం

మునులారా! ఈశ్వరుడు, దేహగతు డైనప్పుడు జీవు డనబడుతాడని, దేహమన్నది, కర్మఫలమని, కర్మలను గుణాలు కారణాలని, గుణాలు

ఈశ్వరశక్తి సంబంధాలని వివరించాను. దీనిని బట్టి ఈశ్వరునికి కూడా శక్తికార్యాలయిన జనన మరణాదులు తప్పవని శంకించడానికి అవకాశం ఉన్నది. కర్తృత్వం ఉన్నప్పుడు, భోక్తృత్వం కలుగుతుంది. భగవంతునికి కర్తృత్వం లేదు. ఎందుకు లేదంటే కర్తృత్వ లక్షణాలను ముందు విచారిద్దాము. 'నేను', 'నాది' అనే భావాలు కర్తృత్వ లక్షణా లౌతాయి. అట్టి భావాలు లేనప్పుడు కర్తృత్వమే కలగదు. ఈశ్వరునికి అట్టి భావాలు లేవు కనుక ఈశ్వరకర్తృత్వ మన్నది లేదు.

ఈశ్వరుడు జగత్కర్త అని ఒకవంక చెబుతూ అదే నోటితో అతనికి కర్తృత్వం లేదని చెప్పడం ఎలా సరిపడుతుందని అడిగితే కర్తృత్వానికి అహంకార మమకారాలు – అంటే – నేను, నాది అనే భావాలు లక్షణాలని, అవి గుణసంబంధాలని, గుణాలు శక్తికార్యాలనీ అన్నాను. ఆ శక్తి అంటేనో, అది ఈశ్వరశక్తే అవుతుందిగాని మరొకటి కాదు. శక్తి యెప్పుడూ శక్తిమంతుడిని ఆశ్రయించుకొని అతని ఇష్టానుసారం వర్తిస్తుందే గాని అతనిని పైకొని ఉండదు. శక్తిమంతుడైన ఈశ్వరుడు సంకల్పించినపుడు ఈశ్వరశక్తికి వ్యవహారం కలుగుతున్నది. అతని సంకల్పంలో అహంకార మమకారాలు లేవు గనుక ఈశ్వరునికి కర్తృత్వం లేదు. ఎప్పుడు కర్తృత్వం లేదో కర్మాదులు ఫలాన్ని కలిగించినా దానిని భోగించే కారణమూ కలగదు. భోగకారణాలు కలుగనినాడు భోగ్యసాధనాలయిన శరీరాదులు కలగవు. శరీరాదులు కలగడమే జన్మ మనబడుతుంది. భగవంతునికి అటువంటి జన్మలు కలుగవు. భగవంతుడు అంతర్యామియై శరీరగతుడైన కారణాన జీవు డనబడుతున్నాడు. అంత మాత్రాన ఆయనకు జననమరణాలు కాని, తత్సంబంధ కర్మాదులు కాని కలుగవు.

అవతారాలు భగవంతునికి జన్మలు కావా? అంటే అవి ఆయన లీలావిశేషాలే కాని కర్మఫలాలు కావు. కర్మఫలాలయిన పుట్టటం గిట్టటాలను మాత్రమే జననమరణాలంటాము. ఈశ్వరుడు సర్వస్వతంత్రుడు. జీవుడూ

అటువంటివాడే కాని అహంకార మమకారాలకు చిక్కినపుడు తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి పరతంత్రు డవుతున్నాడు.

జీవునికి కర్మకర్తృత్వం వలె భగవంతునికి కూడా జగత్కర్తృత్వం ఉండగా, జీవుడు మాత్రం కర్మఫలబద్ధుడు కావడమూ భగవంతుడు కాకపోవడమూ ఎలా పొసగుతుందంటే, భగవంతుని జగత్కర్తృత్వం కేవల సాక్షి మాత్రకం. జీవుని కర్మకర్తృత్వం ఫలభోగభావపూర్వకం. కనుక భగవంతుడు ఒకవిధంగా కర్త అని భావించినా భోక్త మాత్రం కాడు. జీవుడు కర్త, భోక్త రెండూ అవుతున్నాడు.

## తత్త్వరహస్యం – తర్కం

మునులారా! ఈ తత్త్వరహస్యం వట్టి తర్కబుద్ధికి అందదు. ఎటువంటి బుద్ధికి అందుతుందంటే, ఎవరి బుద్ధి కుటిలత్వాన్ని వీడి భక్తిసాంద్రమై భగవత్పాదకమలాలపై వ్రాలి, 'నీవే శరణమ'ని వర్తిల్లుతుందో అటువంటి వారికి అది స్పష్టంగా బోధపడుతుంది. భగవంతునికి సర్వాత్మసమర్పణ కావించి తదేకభావపరులైనవారికి గర్భవాసాదిరూప జన్మక్లేశాలు తొలగిపోతాయి; వారు కృతార్థు లవుతారు.

## భక్తికి పరమసాధనం

**మునులారా! అటువంటి పరమభక్తిని అలవరచే ఉత్తమ సాధనం భాగవతం. భాగవతాన్ని మించిన సాధనం లేదు. అది భగవచ్చరిత్ర సముచ్చయమై వేదతుల్యంగా అలరారుతున్న పవిత్ర గ్రంథం. దానిని శ్రీ వేదవ్యాస మహర్షి సర్వలోకమంగళార్థమై రచించాడు. మునులారా! శ్రీ వ్యాసమహర్షి జననాదికం, ఆ మహనీయుడు ఈ గ్రంథాన్ని రచించిన కారణం వినదగ్గవి కనుక చెపుతున్నాను వినండి.**

## వసురాజు చరిత్ర

ద్వాపరయుగం కడపటి భాగాన చేదిదేశాన్ని వసురాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఒకనాడతను వేటకై అడవికి పోయి అక్కడొక మునిపల్లెను చూశాడు. దానిని వీక్షించినంతనే అతని మనస్సులో అపూర్వమైన నిర్వేదం కలిగింది. చేతిలోని శస్త్రాలను పారవేసి, నిష్ఠతో అతను తపస్సు చేయడం మొదలుపెట్టాడు.

ఒకనాడు దేవేంద్రుడు సురలతో వసురాజు వద్దకు తరలివచ్చి, 'రాజేంద్రా! దయార్ద్రమైన ధర్మబుద్ధితో రాజ్యాన్ని పరిపాలించావు; రాజ్యలక్ష్మి నీ కనుసన్నలలో మెలగి అనంత భోగభాగ్యాలను చూరగొన్నావు. అటువంటి మహారాజ్యవిభవాన్ని వదిలి కారడవి జొచ్చి మహాక్లేశకరమైన తపశ్చర్యకు పూనుకొన్నావు. అనఘా! ఇది నీకే తగును. నీ వర్ణ ధర్మ పరిపాలనమూ నీ తపోదీక్షా నాకెంతో మెచ్చుగొలిపాయి. నీవు నాతో చెలిమి చేసి నా వద్దకు వస్తూ పోతూ ఉండాలి. ధర్మసమ్మతంగా మళ్ళీ రాజ్యం చెయ్యాలి. నీకు దేవత్వం, స్వర్ణరత్నమయ దివ్యవిమానం, ఇంద్రమాలిక అనే పేరుగల కనకమాలిక, వేణుయష్టి ఇస్తున్నాను. ఈ మాలికలోని కమలాలు ఎన్నటికీ వాడిపోవు. దీనిని ధరించి ఉన్నప్పుడు ఎటువంటి ఆయుధమైనా నిన్ను నొప్పించలేదు. ఈ వేణుదండం దుష్టనిగ్రహ శిష్టపరిపాలన క్షమమై నిన్ను సేవిస్తుంటుంది' అని చెప్పి వాటిని బహూకరించి వెళ్ళాడు. వసురాజు దేవేంద్రుని ఉపదేశానుసారం తపస్సు చాలించి రాజ్యభారం వహించి ఆ విమానాన్నెక్కి ఊర్ధ్వలోకాలలో చరింపసాగాడు. అతనలా ఉపరితలాన చరిస్తూ ఉన్నందున అతనికి ఉపరిచరుడని పేరు వచ్చింది.

వసురాజు ఆ కనకమాలికను దాల్చి వేణుయష్టికి ఏటేటా మహావిభవంగా ఇంద్రోత్సవం చేయసాగాడు. ఇంద్రు డతనిని మెచ్చి వరం ఇచ్చాడు. ఆ వరఫలంగా అతనికి బృహద్రథుడు, మణివాహనుడు, సౌబలుడు, యదువు – మొదలుగా అయిదుమంది కొడుకులు గలిగారు. వసురాజు వారిని వేర్వేరు దేశాలకు అభిషిక్తులను చేశాడు. వారందరూ వంశకర్తలై పరిఢవిల్లారు.

వసురాజు రాజ్యానికి సమీపంలోనే కోలాచల పర్వతమూ శుక్తిమతీ నదీ ప్రవాహమూ ఉన్నాయి. ఒకనాడు కోలాచల పర్వతం శుక్తిమతిని కామించి అడ్డగించింది. వసురాజు ఆ పర్వతం గర్వోద్ధతికి కినిసి దానిని తన పాదంతో తొలగద్రోశాడు. అయినా శుక్తిమతికి పర్వతసమాగమం వలన వసుపదుడనే పుత్రుడు, గిరికా నామంతో ఒక కూతురూ పుట్టారు. శుక్తిమతి వారిద్దరినీ తీసికొని వెళ్లి వసురాజుకు తన కృతజ్ఞతాసూచకంగా కానుక ఇచ్చింది. ఆ రాజు వసుపదుని తనకు సేనాపతిని చేసుకొని గిరికను ధర్మపత్నిగా స్వీకరించాడు.

కొన్నాళ్ళకు గిరిక ఋతుమతి అయింది. ఆమెచే మృగమాంసాన్ని భుజింపజేయాలని రాజును పితృదేవతలు ఆజ్ఞాపించారు. అతను మృగవధార్థం అడవికి వెళ్ళాడు. అక్కడా అతని మనస్సు గిరికను గూర్చిన తలపులతోనే నిండి ఉన్నది. ఆ ఇంతి ముద్దుపలుకులను, కలికి క్రాల్గన్నుల మేలి లీలలను, వక్షువచన్నుగవ బిగువును, కాంచీపదస్థలాల నిగారింపును, లలిత ముఖచంద్రమండల దీప్తులను, తుమ్మెద రెక్కల వలె మిక్కిలిగా నలుపెక్కిన కుంతలాల కాంతులను, నెల జవ్వనపు విలసనాన్ని, అలసభావం లోని పొలుపునూ మెలుపునూ తలచి తలచి ఆమెయందేలీనచిత్తుడై విభ్రమ పారవశ్యాన్ని పొందాడు. అనురాగాతిశయం వలన అతనికి అక్కడే రేతఃస్కందమయింది.

వసురాజు ఆ వీర్యాన్ని సేకరించి ఒక ఆకుదొప్పలో చేర్చి డేగ మెడకు ఆ దొప్పను కట్టి దానిని తీసుకొనిపోయి గిరికకు ఇమ్మని పంపించాడు. ఆ డేగ హుటాహుటిని వెళుతుండగా దాని మెడనున్నది వేరొగ డేగ చూసి అది మాంస ఖండమనుకొని వచ్చి దానిని తాకింది. ఆ రెండింటి పోరాటంలో మెడనున్న దొన్నె చిరిగి అందులోని వీర్యం జారి గాలికి కొట్టుకొనిపోయి యమునానది నీటిలో పడింది.

ఆ నీటిలో అద్రిక అనే అప్సరస బ్రహ్మశాపం వలన చేప రూపంలో ఉన్నది. ఆ చేప ఏదో ఆహారపదార్థమనుకొని వసువీర్యం లోని రెండు

చుక్కలను మ్రింగివేసింది. వీర్యశక్తి మూలాన దానికి గర్భం వచ్చి పది నెలలు నిండాయి. ఆ సమయంలో ఒక జాలరి చేపల కోసం వల విసిరి ఏటి నీటిలో దింపేసరికి నెలలునిండిన మీను దానిలో చిక్కుకొన్నది. వాడు దానిని ఇంటికి తీసుకొనివెళ్ళి చీల్చగా దాని పొట్టలో ఒక కొడుకూ ఒక కూతురూ ఉన్నారు. ఆ జాలరి పసికందు లిద్దరినీ తమ యేలికయిన దాశరాజుకు ఒప్పగించాడు. ఆ అప్సరసకు ఎప్పుడు మానుష ప్రసవ మవుతుందో అప్పుడు దానికి శాపమోక్షం కలుగుతుందన్న బ్రహ్మవాక్యానుసారం అది మీనశరీరాన్ని విడిచి దివ్యవనితగా మారి దేవలోకానికి వెళ్ళిపోయింది.

మత్స్యం కడుపునుంచి పుట్టిన కారణాన ఆ బాలునికి మత్స్యరాజని, ఆ బాలికకు మత్స్యగంధి అనీ పేర్లు కలిగాయి. మత్స్యరాజు పెరిగి పెద్దవాడై ధర్మవర్తనుడై మత్స్యదేశానికి అధిపతి అయ్యాడు. దాశరాజు మత్స్యగంధిని తన కూతురుగా చేసుకొని అల్లారుముద్దుగా చూసుకొన్నాడు. ఆమె తన తండ్రి నియోగించిన ప్రకారం యమునానదిలో ధర్మనిర్వహణార్థం ఓడ నడుపుతుండేది.

## వ్యాస జననం

ఒకనాడు వసిష్ఠుని మనుమడూ, శక్తి కుమారుడూ అయిన పరాశమహర్షి తీర్థయాత్రలకు వెళ్తూ ఆ యమునానది ఓడ రేవుకు వచ్చి, అక్కడ ఏకవస్త్రయై ఓడను ఎక్కవచ్చేవారి కోసం నిరీక్షిస్తూ ఒంటరిగా ఉన్న మత్స్యగంధిని చూసి, ఆమెపై మరులుగొని, ఆమె జన్మోదంతాన్ని దివ్యదృష్టి వలన గ్రహించి, ఆ కాంతతో ఏకాంతంగా చెలిమి చేసి ఒక శుభవేళ ఆమెతో సంగమించాడు.

**ఆ.వె. 'ఎంత శాంతులయ్యు నెంత జితేంద్రియు**
**లయ్యుఁ గడు వివిక్తమైన చోట**
**సతుల గోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెండుఁ;**
**గాము శక్తి నోర్వఁగలరె? జనులు'.**

రాజేంద్రా! ఆ మత్స్యగంధికి సద్యోగర్భమై ఒక కుమారుడు ఉదయించాడు. అతని దేహకాంతి నల్లనిదైనందున అతనిని కృష్ణు డన్నారు. అతనినే కృష్ణద్వైపాయనుడనీ పిలుస్తారు. ఆ బాలుడు కృష్ణాజినంతో, కపిలజటామండనంతో, కమండువుతో జనించి తల్లి యెదుట నిలిచి చేతులు జోడించి, 'అమ్మా! నీకు పని పడినపుడల్లా నన్ను స్మరించు. వెంటనే వస్తాను' అని పలికి తపోవనానికి వెళ్ళి మహాఘోరతపస్సు చేసి కృతకృత్యు డయ్యాడు.

తపోనంతరం కృష్ణద్వైపాయనుడు దివ్యదృష్టితో విలోకించి లోకంలో వేద విభాగాదికమూ యుగధర్మాదికమూ సాంకర్యాన్ని పొందాయని గ్రహించాడు. భౌతిక శరీరాలకు నానాటికీ శక్తి సన్నగిల్లి మనుషులందరూ సత్త్వహీనులు, ధైర్యశూన్యులు, మందప్రజ్ఞులు, అల్పాయువులూ, దుర్బలులై అపక్షీణించి ఉన్నారు. ఆ దురవస్థను చూసి కృష్ణునికి వర్ణాశ్రమాలకు మేలుచేయాలనే తలపు కలిగింది. అదీకాక ఆనాటి దాకా వేదమంతా ఏకమై విడదీయడానికి లేక సామాన్యప్రజ్ఞకు గహనంగా ఉన్నది. ఆయన వేదాన్ని విభాగించి ఋగ్యజుస్సామాథర్వణాలనే పేరిట నాలుగుగా చేశాడు. వేదాన్ని అలా విభాగించినందువలన ఆ మహర్షికి వేదవ్యాసుడని పేరు వచ్చింది.

లోకోపకారార్థం కృష్ణద్వైపాయనుడు వేదవిభజన కావించినా, సర్వజనులకూ అది ఉపయోగింపలేదు. అప్పుడు మళ్ళీ ఆలోచించి మహర్షి సకల పురాణాలనూ వివిధ శాస్త్రాలనూ రచించి సర్వజనోపకారార్థం సమస్తశాస్త్రాలనూ చిలికి సారాన్ని తీసి పంచమవేద మని పేరుపొందిన శ్రీ మహాభారతాన్ని వ్రాశాడు.

## వ్యాసుని పరితాపం

చిరకాల తపస్సు చేసి పరమజ్ఞానాన్ని సాధించి తత్త్వార్థాన్ని సమగ్రంగా తెలుసుకొని దాని సారాన్ని బహుశాస్త్రరచనాముఖంగా లోకానికి చూరయిచ్చినా వ్యాసునికి మనశ్శాంతి కలగలేదు. ఒకనాటి ప్రభాతవేళ సరస్వతీజలాలలో తీర్థాదీకం కావించి చిత్తాన్ని కుదుటపరుచుకొని

ఏకాంతప్రదేశంలో కూర్చొని, 'నా సంగతి నాకే ఎంతో వింతగా ఉన్నది. గురుజనుల ఆజ్ఞను తలదాల్చి నడుచుకొన్నాను; వ్రతాలు సలిపాను; యజ్ఞాలు చేశాను; తపస్సులు ఆచరించాను; ఏకాగ్రబుద్ధిని సంపాదించాను; త్రికాలజ్ఞానాన్ని పొందాను; తత్త్వసారాన్ని అసాంతం గ్రహించాను; కాలవేగానికి యుగధర్మాలు తలక్రిందవుతున్నాయని చూసి లోకహితాన్ని పరిశీలించాను. యజ్ఞకర్మలు పరమశుద్ధికరాలని, అవి లోపింపకపోవడమే లోకహితమనీ గ్రహించి, అందుకోసం వేదాలన్నీ వల్లెవేసి అందులోని విధులు ఇవి, అర్థవాదాలివి, మంత్రస్వరూపం ఇది – అని తెలుసుకోవడం కుశాగ్రమతులకే సాధ్యం కానప్పుడు తక్కినవారి గతేమిటని చింతించి, పరిజ్ఞాన శూన్యులైన సామాన్యులు కూడా యజ్ఞాది కర్మలను సులువుగా అనుష్ఠించడానికి తగిన విధాన వేదాన్ని విభాగించి ఋగ్యజుస్సామాథర్వణాలను కూర్చాను. అట్టి కర్మలకు స్త్రీలు, శూద్రులు చాలరని వారికోసం నిగమార్థాలన్నీ ఏర్చి భారతమనే పేర కూర్చాను. ఇంత పరిజ్ఞానం ఉన్నా, లోకోపకారార్థమై ఇంత పాటుపడినా నాకు మనశ్శాంతి కలుగలేదు. ఎంత ఊహించినా కారణం అంతుపట్టకుండా ఉన్నది. బ్రహ్మము వలె జీవుడు కూడా పూర్ణుడన్న భావం స్థిరపడితే మనశ్శాంతి సిద్ధిస్తుందని అన్నారు. ఇది నాకు తెలియనిదేమీ కాదు. ఇంత తెలిసి ఉన్నప్పటికీ నా జీవాత్మకు పరమాత్మతో ఐక్యం కలిగినట్లు కనిపించదు. కారణం ఏమై ఉంటుంది?' అని తలపోయసాగాడు.

## వ్యాస నారద సమావేశం

వ్యాసుడు ఆ విధంగా చింతిస్తుండగా అక్కడికి నారదమహర్షి వచ్చాడు. వ్యాసుడు ఆయనను యథావిధిని పూజించి సుఖాసనావ కూర్చుండబెట్టాడు. నారదుడు వ్యాసుని ముఖాన్ని చూసి, 'ఓహో! మహాత్ములు కూడా మోహవశులవుతారు గదా? అని లోలోపల నవ్వుకొని, 'మహాత్మా! జీవులకు సంతోషం నైజం. జీవుడు దానిని అనుభవించడానికి శారీరక వ్యాధులు,

మానసిక దుఃఖాదులు అడ్డుపడుతుంటాయి. సామాన్యులకు కలిగే అడ్డంకులేవీ లేనందువల్ల నీ జీవుడు భగవత్తత్త్వానుజనితమైన ఆ స్వాభావిక సంతోషంతో నిత్యమూ సుఖానుభూతిని చెందుతుంటాడు. మహాత్మా! సర్వధర్మాలకూ ముల్లెమూటగా మహాద్భుతమైన భారతాన్ని రచించి కృతకృత్యుడవయ్యావు. సనాతనమూ నిత్యమూ అయిన బ్రహ్మతత్త్వాన్ని వివేకించావు. మరి తత్త్వసిద్ధినీ పొందావు. ఇంతటివాడివయినా అకృతార్థుని వలె శోకిస్తున్నావని నీ ముఖలక్షణాలను బట్టి తెలుస్తున్నది. నీ దుఃఖానికి కారణం ఏమిటి?' అని ప్రశ్నించాడు.

ఆ మాటలు విని వ్యాసుడు, 'దేవర్షివర్యా! నీవు చెప్పినవన్నీ ఆచరించిన మాట నిజమే. అయినా ఎందుకో నా మనస్సుకు పరితోషం కలుగలేదు. కారణమూ తెలియదు. బ్రహ్మమానసపుత్రుడవు కనుక నీ జ్ఞానం అగాధం. నీకు తెలియని సంగతులు కలుగవు. ఎవడు కారణకార్యాలు రెండింటికీ నియంతయై వెలుగొందుతాడో, ఎవడు నిస్సంగుడయి తన సంకల్పమాత్రాన చరాచరాత్మక సమస్త ప్రపంచ సృష్టిస్థితిలయాలను కావిస్తాడో ఆ అనాదిసిద్ధపురుషుని నిరంతర నిదిధ్యాసానికి విషయాకృతునిగా చేసికొని ఉపాసించావు. అటువంటి నీకు సర్వరహస్యాలూ కరతలామలకం కావడం వింత కాదు. నీవు త్రిలోకసంచారివి. యోగబలంతో సర్వప్రాణుల అంతరాలలోనూ ప్రాణవాయువు వలె సంచరిస్తూ వారి పాప పుణ్యకరణాలకు సాక్షిభూతుడవై ఉంటావు. సర్వజ్ఞుడివి కదా, నీకు తెలియనిదేముంది? మునివర్యా! నా యెడ కరుణించి నా ఈ కొరతకు కారణాన్ని వివరించు' అని ప్రార్థించాడు.

## నారదోపదేశం

వ్యాసుని మనోవేదనను సాంతంగా విన్నాక నారదుడు మాట్లాడాడు.

**ఉ. 'అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం**
**చించక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం**
**చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁ గాక; నీకు నీ**
**కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా!**

**మ. హరినామస్తుతి చేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ**
**సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు; శ్రీ**
**హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ**
**కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్.**

**మ: అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వ పా**
**ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్**
**జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచుం**
**దపసుల్ సాధులు ధన్యు లౌదురు గదా, తత్త్వజ్ఞ! చింతింపుమా.'**

మునీంద్రా: ఎంత నైష్కర్మ్యసిద్ధి కలిగినా, జ్ఞానం ఎంత నిరుపాధికమయినా, హరిభక్తి లేకుంటే అది ఎంత మాత్రమూ శోభించదు. ఫలాకాంక్ష లేకుండా కర్మను ఈశ్వరునికి సమర్పించకపోతే అది ప్రశస్తం కాదు. జ్ఞానవాచాకర్మలు ఎంత కౌశలాలయినా భక్తిహీనమైనప్పుడు అంతా నిరర్థకం. కనుక నీవు నిఖిల బంధమోచనం కొరకు వాసుదేవుని లీలావిశేషాలను భక్తితో అభివర్ణించు. మహానుభావుడవు యథార్థ దర్శనుడవు, ధృతవ్రతుడవు, సకల దిగంతలోల ధవళకీర్తిశాలివి అయిన నీ కిది ఒక గొప్పకార్యం కాదు.

మునివర్యా! భగవత్తత్త్వాన్ని ఎంతో వివరించానన్నావు. అంత మాత్రాన అది సామాన్యులకు అర్థం కాదు. పైగా నీవు దానిని అర్థాంతరంగా వచించావు. దానిని గ్రహించే శక్తి వారికుండదు. అంతే కాక నీ వచనాలకు వారు విపరీత భావాలను కల్పించి నామ రూప భేదాలకు చిక్కి ఇదమిత్థమని

నిశ్చయించుకొనలేక పెనుగాలికి తూలే పడవల్లాగా విహ్వలమతులై పరితపిస్తారే తప్ప గట్టు చేరరు. ఒక నిదర్శనాన్ని చెబుతాను చూడు. పురుషునకు విషయమందలి రక్తి స్వభావసిద్ధమని, అట్టివానికి కామ్యకర్మలను ఆచరించడం ధర్మమవుతుందని అన్నావు. నీ తాత్పర్యాన్ని అతను తెలిసికొనలేక బాహ్యార్థాన్నే నమ్మి కేవల కామ్యకర్మానుష్ఠానమే తనకు విధిగా భావించి నడచుకొంటాడు. నీ ఉద్దేశం అదికాదు. పురుషునికి విషయానురక్తి స్వభావజన్యం కనుక స్వభావం మారేవరకూ ఆ అనురక్తి తొలగదని, స్వభావమన్నది క్రమక్రమంగా మారేదే కాని ఒకంతట మార్చగలిగేది కాదు కనుక అతను తన కామ్యకర్మలను చేస్తూ ఫలాన్ని ఈశ్వరునికి అర్పిస్తూ ఉండాలని, అలా చేస్తూ రాగా కొంత కాలానికి నైష్కర్మ్యసిద్ధి కలుగుతుందని. తత్ఫలంగా చిత్తశుద్ధి, దానితో జ్ఞానమూ, జ్ఞానంతో నివృత్తిమార్గపూర్వక ప్రవృత్తీ కలిగి చిట్టచివరికి శుభాన్ని పొందుతాడనీ, నీ తాత్పర్యం. నీ ఉద్దేశం ప్రాకృతులకు బోధపడదు. అందువలన అతను నీ వచనంలోని బాహ్యార్థాన్నే నమ్మి వర్తిల్లుతాడు. అతనికి దాని వల్ల మేలు చేకూరకపోగా కీడు కలుగుతున్నది.

మునీంద్రా! పరమేశ్వరుడు నిర్వికల్పక సుఖాత్మరూపుడని అందరూ గ్రహించలేరు. పైగా అది అనుభవసిద్ధం. ఆ అనుభవం ప్రయత్నం వలన సాధ్యపడుతుంది. ప్రయత్నించాలంటే ఆ విషయం పట్ల విశ్వాసం కలగాలి; విశ్వాసం కలగడానికి దాని సంగతి స్ఫుటం కావాలి. అందుకు జ్ఞానమే పరమసాధనం. అంత జ్ఞానోపలబ్ధికి ఎంతో చిత్తశుద్ధి ఉండాలి. ఆ చిత్తశుద్ధి నివృత్తిమార్గాన కాని జనింపదు. ఆ మార్గానికి ఎవడో అత్యంత నిపుణుడు తప్ప అందరూ సమర్థులు కారు. ఈ సంగతులను నీవు తలపోసి, గుణబద్ధుడై, ఆ కారణాన దేహాభిమానంతో ఉన్న పురుషునికి ఏది ఉపయోగమో దానిని ఆచరించు. అటువంటివారి చిత్తాలను భగవల్లీలల వలె అన్యవిషయాలు ఆకర్షింపలేవు. వారి బుద్ధిపరిపాకమూ తావన్మాత్రమే అవుతుంది. బుద్ధి ఒకసారి వస్తుపరమైనప్పుడు వస్తువు దాని శక్తి ప్రకారం పని చేస్తుంది. కనుక

దేహాభిమానుల నుద్ధరించడానికి నీవు భగవల్లీలలను వివరించి చెప్పాలి.

మునీంద్రా! నీ పాఠకుడు భగవల్లీలాపరుడై స్వధర్మాలైన కర్మాదులను పరిత్యజించి ఎటూ కడతేరక రెంటికీ చెడిన రేవడవుతాడేమోనని శంకించవద్దు. భగవంతుని పాదపద్మాలపై భక్తి నిలిపినవాడు స్వధర్మకర్మలను వదిలిపెట్టినా అతనికి కీడు కలగదు. అతని భక్తి అంతగా పరిపాకానికి రాకపోతే అతని గతేమిటని అడుగుతావేమో! అతని భక్తి ఆ జన్మంలో అంత ఉత్తమస్థితికి రాకపోయినా, ఉత్తరజన్మలో అతను ఏ లోకాన ఉన్నా, ఏ శరీరంలో ఉన్నా, తొల్లింటి భక్తి యొక్క వాసన ఆ శరీరాన్ని అంటిపెట్టుకొని ఉండి, అతనికి శుభాన్నిస్తుంది. భక్తిని దూరంచేసి ఎన్ని కర్మలు చేసినా ఫలం లేదు. భక్తిహీనులు వారి కర్మబలం వల్ల తత్తత్కర్మఫలానుభవ యోగ్యాలైన శరీరాలను ధరిస్తూ ఒకనాటికీ తెంపు కానక బ్రహ్మ మొదలుకొని స్థావరం దాకా తిరుగుతూనే ఉంటారు. వారికి నిత్యసుఖం ఎన్నటికీ లభించదు. భగవద్భక్తుడు పూర్వకర్మవశాన నీచజన్మ ఎత్తినా భక్తి అతనిని వెన్నంటి వచ్చి అతని మనస్సును సంసారక్లేశాల వైపు ప్రసరింపనీయదు. భక్తిహీనుడు నిరంతరమూ సంసారక్లేశాలలో కొట్టుమిట్టాడుతుంటాడు. ఇద్దరి కర్మలూ ఒకే విధమయినప్పటికీ భక్తియొక్క కలిమిలేములను బట్టి వారు కావించే కర్మలకు ఎంత తారతమ్యం కలుగుతున్నదో ఊహించి చూడు.

మునీంద్రా! పూర్వజన్మం లోని భక్తి ఆ జన్మంతో సమసిపోక జన్మాంతరానికి వెన్నంటి రావడం నిజమేనా? అని కొందరు సందేహిస్తారు. భక్తి ఒకసారి రుచి మరిగితే ఎన్నటికీ మరువనీయదనడం అనుభవైకవేద్యమైన సత్యం. భక్తికి అంత మహిమ ఉన్నది.

మహాత్మా! నీవు లోకానుగ్రహార్థమై అవతరించావు. లోకమంటే పరమేశ్వరుని వ్యక్తరూపమే తప్ప వేరేమీ కాదు. లోకారాధనం ఈశ్వరారాధనమే అవుతుంది. ఈ సంగతిని ఇంచుక తలపోసి నీవు వచ్చిన కార్యాన్ని నెరవేర్చు.

> భగవత్ప్రాప్తికై కొందరు దీర్ఘకాలం తపస్సులను చేస్తారు; కొందరు వేదాధ్యయన యజ్ఞాదులను కావిస్తారు; కొందరు తటాకాదులను నిర్మిస్తారు; కొందరు సూనృతవ్రతం ఆచరిస్తారు; కొందరు దానాల నిస్తారు. ఇవన్నీ యోగ్యమైనవే, సందేహం లేదు. అయినా, వీటన్నిటికన్నా భగవద్గుణానువర్ణనమే ఉత్తమమని పెద్దలంటారు. ఏమంటే? ఈ చెప్పినవి అన్నీ కొంతలో కొంత దయాత్యాగాదులను సూచిస్తాయి. భగవత్ప్రాప్తికి హృదయం ద్రవీభూతం కావాలి. అందుకు భగవద్గుణానువర్ణన వలె అన్యకర్మలు సమర్థాలు కావు.

మునీంద్రా! పూర్వజన్మలలో దేనిదేనియందు రక్తిని కలిగి ఉంటారో ఆ రక్తి వాసనలు జన్మాంతరాలలో వాటి వాటి అదును ప్రకారం అంకురించి వ్యవహరింపజేస్తాయని అన్నాను. సామాన్యరుచుల సంగతే యిలా ఉండగా ఇక భగవద్భక్తి సంగతి చెప్పేదేముంది? ఇందుకు నా జీవితమే నిదర్శనం.

## నారదుని పూర్వజన్మవృత్తాంతం

మునివర్యా! నేను పూర్వజన్మంలో ఒక దాసికి పుత్రుడనై జన్మించాను. నా తల్లి వేదవాదుల ఇంట ఊడిగం చేస్తూ జీవిస్తుండేది. ఒకయేట వర్షాకాలం వచ్చింది. వేదవాదులు యాత్ర చాలించి చాతుర్మాస్యదీక్షకు ఒకచోట విడిదిచేశారు. నా తల్లి కూడా వారివెంట ఉన్నది. అప్పటికి నాకు అయిదేళ్ళుంటాయి. అంత పసితనంలోనే మా అమ్మ నన్ను వేదవాదుల పరిచర్యకు నియమించింది. నేనూ నా బాల్యచాపల్యాన్ని మాని ఆటపాటలు విడిచి ఇంద్రియాలను నిగ్రహించి మితభాషినై అనుకూలవృత్తితో వారిని కొల్వసాగాను. వారూ నా యెడ కరుణించారు. వారి యెంగిళ్ళను తింటుండడం వలన నాలో హేయభావం నశించింది. వారి కనుసన్నలలో మెలగిన కారణాన సద్వృత్తుడ నయ్యాను. అలా నా పాపాలన్నీ సమసిపోయాయి. తత్ఫలంగా నా చిత్తం విశుద్ధమయింది. ఆ మునులు

భగవంతుని సంకీర్తిస్తూ భగవత్కథలను గానం చేస్తూ కాలం గడుపుతుండేవాళ్ళు. వారి పుణ్యవచనాలను వింటుండటం వలన నాకూ భగవత్కథా శ్రవణమంటే ఆసక్తి మెండయింది. దానితో భగవద్భజనమంటేనూ ప్రీతి కలిగింది. క్రమక్రమంగా నాలో నిబిడమై ఉన్న రజస్తమోగుణాలు సన్నగిల్లాయి; భక్తి దినదినాభివృద్ధి కాంచింది.

చూస్తూ ఉండగానే నాలుగు మాసాలు గడిచాయి; అంతలోనే మునుల దీక్షాకాలమూ గడిచిపోయింది. అక్కడి నుంచి వెళ్ళే ముందు వారు నా శ్రద్ధావినయాలకూ, భక్తికీ మెచ్చి పసివాడినైనా నాకు తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించి, 'నాయనా!' జీవులకు వారి వారి ప్రారబ్ధకర్మానుసారంగా స్వభావం ఉంటుంది. ఆ స్వభావం దానికి రుచించినట్లు కర్మలను చేయిస్తుంది. ఆ కర్మలే స్వధర్మాలవుతాయి. నీవు నీకు స్వధర్మాలైన కర్మలను విడిచిపెట్టకు. వాటి నన్నింటినీ భగవదర్పితం కావిస్తూ ఉండు. అలా చేయడం వలన తాపత్రయం నశిస్తుంది. కర్మలు నైజదోషవంతాలయినా వాటివలన మేలు కలగకపోదు. నెయ్యి మొదలైన పదార్థాలను యథాస్థితిని సేవించినప్పుడు రోగం కలుగుతుండగా, వాటినే మరికొన్ని పదార్థాలలో కలిపి పుచ్చుకొంటే అవే ఔషధాలై రోగాన్ని హరిస్తుండడం చూస్తూనే ఉన్నాముకదా! అలాగే కర్మలు కూడా భగవదర్పితాలు కాని నాడు జననమరణరూప సంసారానికి హేతువు లవుతున్నాయి. ఆ కర్మలనే భగవదర్పితం కావిస్తే, అవే సంసారనివృత్తిని కలిగిస్తున్నాయి. ఈ సంగతిని గ్రహించి మసులుకోవాలి సుమా!' అని చెప్పి వెళ్ళిపోయారు.

## సాధుసేవాఫలం

వ్యాసమునీంద్రా! ఆ విధంగా మహాత్ములు దయతో కావించిన ఉపదేశాన్ని నమ్ముకొని భగవన్నామాన్ని జపిస్తూ స్వధర్మాలయిన కర్మలను చేస్తుండేవాడివి. భగవంతుడు నా అనుష్ఠానానికి ప్రసన్నుడై నాకు భక్తినీ, జ్ఞానైశ్వర్యయోగాలనూ ప్రసాదించాడు. సాధుసేవాఫలంగా నాకు ఇంత

మహాభ్యుదయం కలిగింది. సాధువులు సహజ దయామూర్తులు. లోకకల్యాణమే వారి పరమతాత్పర్యం. వారి కరుణాకటాక్ష వీక్షణం రవ్వంత సోకితే చాలు. వారి అనుగ్రహం ఫలించి మొట్టమొదట ధర్మం పట్ల శ్రద్ధ కలుగుతుంది. ఆ శ్రద్ధ భగవత్కథలను వినాలన్న కుతూహలాన్ని కలిగిస్తుంది. అందువల్ల భగవదాసక్తి, దాని వలన భగవద్భక్తి, దాని మూలాన తత్త్వ విజ్ఞానమూ కలుగుతాయి. మునీంద్రా! ఈ విషయాలన్నింటినీ చక్కగా పర్యాలోచించి, నీ అవతారకార్యాన్ని తలపోసి మందమతులకు భగవదనుగ్రహం సులభ సాధ్యమయేటట్లు చేయవలసిన భారం నీ భుజస్కంధాలపై ఉన్నది.

## సంసార తరణోపాయం

మునీంద్రా! ఈ సంసారదుఃఖాలన్నవి ఘోరమైనవి మాత్రమే గాక లెక్కకు మిక్కిలిగా మితిమీరి ఉన్నాయి. ఆ దుఃఖాలకు చిక్కి పరితపించేవారికి భగవదనుగ్రహం తప్ప వేరే శరణ్యం లేదు. భగవదనుగ్రహాన్ని పొందడానికి భగవత్కీర్తన స్మరణలే పరమసాధనాలు. కీర్తన స్మరణాదులు కావించాలంటే మనస్సు పరమేశ్వరుని వంకకు మళ్ళాలి. అలా మనస్సు మళ్ళడానికి వస్తువు యొక్క గుణాతిశయాలు తెలియాలి. ఆ జ్ఞానం హృదయాన్ని వస్తువు వంకకు లాగుతుంది. కనుక నీవు విష్ణుమహిమలను సమగ్రంగా వరించి లోకానికి మహోపకారం చేయాలి ఈశ్వరమహిమలు హృదయాన్ని సులభంగా అతివిచిత్రంగా ఆకర్షిస్తాయి' అని పలికాడు.

## జన్మాంతర విషయస్మృతి

వ్యాసమహర్షి ఆ వచనాలను విని, 'బ్రహ్మనందనా! ఆ తర్వాత నీ వయః కాలం ఎలా గడిచింది? ఆ నాటి నీ దాసీపుత్రశరీరాన్ని ఎలా విడిచిపెట్టావు? కల్పాంతరంలో జరిగిన సంగతులన్నీ నీ కీ నాడు ఎలా జ్ఞప్తికి వచ్చాయి? కాలం సమస్తాన్నీ మరిచిపోయేట్లు చేస్తుంది కదా?' అని అడిగాడు. అతని ఆంతర్యాన్ని గ్రహించి నారదు డిలా అన్నాడు:

'మునీంద్రా! మా అమ్మకు నే నొకణ్ణే పుత్రసంతానం. అందువల్ల ఆమె ప్రాణాలన్నీ నా యందే మూర్తీభవించాయి. ఆమెకు నా యోగక్షేమాల తోడిదే లోకంగా ఉండేది. స్త్రీలకు సహజంగానే స్వతంత్రం తక్కువ; అందులోనూ నా తల్లి మరీ మూఢురాలు. ఆ కారణాన ఆమె పుత్రవాత్సల్యం నా యెడ గొంతెమ్మ కోరికలుగా కురియసాగింది. అవి కొనసాగే దారీ తెన్నూ కనిపించలేదు. దానితో ఆమె నిరంతరం పరితపింపసాగింది. ఆమె పరితాపం నాకు దుర్భరమైపోయింది. దానికి దైవభక్తి తోడై ఒక విధమైన వైరాగ్యాన్ని పుట్టించింది. ఆ వైరాగ్యం నన్ను ఇంటిలో నిలువనీయలేదు. తూర్పేదో పడమర ఏదో తెలియకపోయినా ఇంటిలో నుంచి ఎక్కడికన్నా పారిపోవాలనిపించేది. ఎన్నడూ ఇల్లు విడిచి కాలు బయటపెట్టిన వాణ్ణి కాను. ఒకవంక నా బాల్యావస్థ, మరో వంక మాతృప్రేమ బంధనాలై నన్ను కదలకుండా ఆపివేశాయి. ఎటూ తోచక సర్వం భగవదిచ్ఛాధీనమని నిశ్చయించి కాలం కోసం ఎదురుచూస్తూ ఇంటనే ఉన్నాను.

ఆ రోజుల్లో మాకు ఆవొకటి ఉండేది. అది రాత్రి పూట పాలిచ్చేది. ఒకనాటి రాత్రి పూరిమేస్తూ అది పొలాల వెంబడి దారి తప్పి సకాలంలో ఇంటికి తిరిగిరాలేదు. నా తల్లి దానిని వెతకబోయింది. దారిలో ఆమెను పాము కరిచింది. అది నిమిత్తంగా నా తల్లి ప్రాణాలు విడిచింది. ఆమె అలా అకాలమృత్యువు వాతబడటమంటే భగవదనుగ్రహమేనని, భగవంతుడు ఎప్పుడు ఎవరికి ఎలా మేలుచేస్తాడో అతనికే తెలియాలనీ తలపోసి, నే నంతటితో ఇల్లు వదిలి ఉత్తరదిశ పట్టి ఊళ్ళు, పల్లెలు, గోకులాలు, రత్నాది ఖనిజప్రదేశాలు, కృషీవలుల నివాసస్థానాలు, నదీపర్వత తటగ్రామాలు, పుష్పవాటికలు, వనోపవనాలు క్రమంగా దాటి ఒక మహారణ్యం చేరుకొన్నాను. ఆ కాననం గజతుండహతులతో విరిగి నేలకు రాలిన వృక్షశాఖలతోను, సువర్ణరజతాది ధాతువర్గం తోను, మహోన్నత పర్వతాల తోనూ క్రిక్కిరిసి ఉన్నది. ఆ కొండల నడుమ ఉన్న విశాల తటాకాలు నిర్మల జలపూరితాలై నానావిహంగాల వివిధ కలస్వనాలతో మకరందపానంతో

మత్తెక్కిన మధుప బృందాల రొదలతో శోభాయమానంగా ఉన్నాయి. ఎక్కడ చూసినా పచ్చిక బయళ్లు, వెదురు పొదలు, రెల్లు జొంపాలు పరుచుకొని ఉన్నాయి. అందులోనే మహాఘోర భయంకర మృగ పన్నగాలూ నిండి ఉన్నాయి.

వాటి నన్నింటినీ చూస్తూ నడుస్తున్నాను. ఆకలిదప్పులు బాధిస్తున్నాయి. అలపుసొలపులు పైకొన్నాయి. ఇంద్రియాల పాటవం సన్నగిల్లింది. శోష వస్తున్నది. ఎవ్వరూ తోడు లేరు. ఎలాగో ముందుకు సాగి ఒక నదీతీరాన్ని చేరి అక్కడ స్నానం చేసి ఆచమించి జలాలను గ్రోలి ఒక్కింత సేదదీరి నలుదెసలా కలియజూశాను. ఆ నిర్జనారణ్యంలో ఒకచోట మద్ది చెట్టొకటి కనిపించింది. మెల్లగా అక్కడికి వెళ్ళి దాని నీడను కూర్చుండి మునీంద్రుని ఉపదేశాన్ని స్మరించి, అంతర్యామియై వెలుగొందుతున్న భగవంతుని నిండైన భక్తితో తలపోయసాగాను. నా కన్నులలో ఆనందబాష్పాలు చిప్పిల్లాయి; ప్రేమాతిశయం వలన మేను గగుర్పొడిచింది; ఆనందార్ణవంలో ఓలలాడాను; సర్వమూ మరిచిపోయాను.

కొంతసేపటికి మెలకువ వచ్చింది. నిరంతరమూ నా కనుమ్రోల వర్తిస్తూ ఉండిన భగవద్రూపం – సర్వలోక తాపహరమైనది – ఎందుకో అప్పుడు కన్ను మరిగినట్లయింది. అందుకు ఎంతో దుఃఖం కలిగింది. చిత్తాన్ని సమాయత్తం చేసుకొని సంవిత్తమం కావించి ఆ దివ్యరూపాన్ని మనసారా ధ్యానించాను. ఎంత ధ్యానించినా భగవంతుడు కానరాలేదు. నెమ్మది నెమ్మదిగా విసుగూ అలసటా నన్ను పైకొన్నాయి. నా పట్టుదలను రెట్టించాను. అంతలో ఆ వనాంతరం నుంచి ఒక గంభీర నిస్వనం ఇలా వినవచ్చింది:

> 'వత్సా! ఈ జన్మలో నీవు నన్ను చూడలేవు. నా బింబం పరిశుద్ధమైన హృదయదర్పణంలో మాత్రమే ప్రతిఫలిస్తుంది. అటువంటి హృదయశుద్ధి ఉత్పన్నయోగులకు తప్ప అన్యులకు కలుగదు. ఆ యోగం సిద్ధించటానికి కామాది మలినాలు పోవాలి.

నీ చిత్తం ఇంకా కషాయాత్మకంగా ఉన్నది. అది పండుబారాలి. నీవు నా యెడ ఎంతో భక్తి గలిగి వర్తించావు. నీ భక్తికి మెచ్చాను. అందుకు గుర్తుగా నా దివ్య రూపాన్ని ఒకసారి నీకు ప్రదర్శించాను. అది తార్కాణగా నీవు ఇంకా భక్తి గలిగి మెలగాలి. నీ యందు మిగిలి ఉన్న కామరూప మలినాలన్నీ నశిస్తాయి. అప్పుడు నీవు ఈ దాసీపుత్ర శరీరాన్ని త్యజించి నా పార్షదులలో ఒకడివై అలరారుతావు. నా అనుగ్రహపరిణామం వలన ఎన్నటికీ తరుగులేని భక్తిభావం నీకు నా యందు నిశ్చయంగా కుదురుకొంటుంది. ప్రళయాంతంలో కూడా చలింపని భక్తీ, పూర్వస్మృతీ నీకు కలుగు గాక!'

మునీంద్రా? ఆ పలుకులు సర్వవ్యాపకుడు, అశరీరుడూ అయిన భగవంతుని ఆదేశవచనాలుగా భావించి, ఏ వంకనుంచి అవి వినవచ్చాయో ఆ వంకకు తిరిగి, 'స్వామీ! మహాప్రసాదం' అని సాష్టాంగదండప్రణామం చేసి, నిరంతర భగవన్నామ సంకీర్తనలతో, భగవల్లీలాస్మరణలతో పొద్దుపుచ్చుతూ తగిన కాలానికై ఎదురు చూడసాగాను. కాలక్రమాన నా లోని మదమత్సరాలు సమగ్రంగా నశించాయి. కోరిక లుదయించడం సమసిపోయింది. నిరంతర నిర్భర మహానందంలో ఓలలాడసాగాను. సంవత్సరాలు క్షణప్రాయంగా గడిచి, అచిరకాలంలోనే నాకు దేహ వియోగం కలిగింది. నా ప్రారబ్ధకర్మమంతా క్షయించినందున పంచభూతమయమైన నా శరీరమూ నశించింది. నాకు భాగవతదేహం సిద్ధించింది. ఆ తనువు కర్మఫలం కాదు; భగవదనుగ్రహఫలం. అందువలన అది శుద్ధము, నిత్యమూ అయి అలరారుతుంది.

మునీంద్రా! కొంతకాలానికి కల్పాంతం సంభవించింది. శ్రీమన్నారాయణుడు సర్వలోకాలనూ ఉపసంహరించాడు. సమస్తమూ ఏకార్ణవమయింది. సృష్టికర్త భగవంతునిలో శయనించాడు. బ్రహ్మదేవుని ఉచ్ఛ్వాసతో కలిపి నేను కూడా భగవంతునిలో ప్రవేశించాను. అప్పుడాయన

ఏకార్ణవజలాలలో శయనించాడు. మర్త్యమహాయుగాలు వేయి కలిసి బ్రహ్మకు ఒక పగలవుతాయి. పగటి వేళ ముగియగానే బ్రహ్మ శయనిస్తాడు. మళ్ళీ వేయి మర్త్యమహాయుగాలు బ్రహ్మకు రాత్రి కాలం. రాత్రి గడిచినంతనే బ్రహ్మ మేల్కొంచి పునస్సృష్టికి ఉపక్రమిస్తాడు. ఆ విధంగా బ్రహ్మ శయనించి మేల్కొనే లోపున నాలుగువేల యుగాలు (వేయి మహాయుగాలు) గడిచాయి. అందాకా నేను భగవానునిలో ఉండి బ్రహ్మ పునఃసృష్టికి పూనుకొనగానే ఆయన నిఃశ్వాసరూప వాయువు నుండి మరీచ్యాదులూ, నేనూ జన్మించాము.

అలా జన్మించిన నేను బ్రహ్మచర్యానిష్ఠుడ నయ్యాను. నా తండ్రియైన బ్రహ్మ నాకు స్వరబ్రహ్మభూషితమైన ఈ వీణను ప్రసాదించాడు. దీనిపై మూర్ఛనాలాపగతులను మ్రోయిస్తూ హరికథలను పాడుకొంటూ ఈశ్వరాజ్ఞ ప్రకారం లోకమంగళార్థమై ముల్లోకాల బహిరంతరాల లోనూ సంచరిస్తుంటాను. భగవదనుగ్రహం వలన నాకు కామగమనం అలవడింది. నా గతికి అడ్డు కలుగదు.

మునీంద్రా! భగవంతుడు తీర్థపాదుడు. ఆతని పాదపద్మాల నుండి ప్రభవించినందువల్ల గంగాతరంగిణి లోకపావనకర మాహాత్మ్యాన్ని పొంది తీర్థప్రఖ్యాతిని గడిచింది. ఆ పైని ప్రియశ్రవుడు – అంటే నిఖిల జగన్మోహకాలైన తన చేష్టితాలను పాడుతుండగా వినుటయందు సంతోషాన్ని పొందేవాడు – తీర్థపాదుడైనందు వల్ల ఆతని పాదాలను ఆశ్రయించినవారు పరిశుద్ధులవుతారు. ప్రియశ్రవుడైనందున తన మహిమలను సంకీర్తించేవారి యందు ప్రీతిగలిగి దర్శనాన్నిస్తాడు. నేను ఆయన పాదాలను తలదాల్చి ఆయననే ఉగ్గడిస్తుంటాను కనుక ఆ మహాత్ముడు నాకు తలచినదే తడవుగా దర్శనభాగ్యాన్ని ప్రసాదిస్తున్నాడు.

## హరికథానువర్ణన ఫలం

మునీంద్రా! పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అన్నవి పంచభూతాలు. అవి మొట్టమొదట అతిసూక్ష్మరూపాన ఉంటాయి. వాటిని

తన్మాత్రలనీ, విషయాలనీ అంటారు. ఒక్కొక్క తన్మాత్రకు ఒక్కొక్క గుణం ఉంటుంది. మనస్సుకు విషయభోగేచ్ఛ కలిగినప్పుడు అది ఆయా తన్మాత్రలలో తగులుకొంటుంది. దానితో కామలోభాలు పైకొంటాయి. ఆ విధంగా కామలోభాదులైన అరిషడ్వర్గానికి చిక్కిన మనస్సును బంధాల నుంచి విడిపించడానికి యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధిరూప యోగవిశేషాలను అనుష్ఠిస్తారు. అటువంటి యోగాన్ని వేయేండ్లు సేవించినందువలన ఎంత ఫలం కలుగుతుందో అంతకన్నా అధికఫలం హరిచర్యానువర్ణనం ఒక్కసారి కావిస్తే కలుగుతుంది. కనుక చిత్త శుద్ధికి భగవత్కీర్తనమే ఉత్తమం. అదే అందరికీ సులభసాధ్యమైన సాధనం.'

## భాగవత రచనం

ఆ విధంగా నారదమహర్షి వ్యాసమునీంద్రుని భాగవత రచనకు ప్రోత్సాహపరిచి వీడ్కొని వెళ్ళిన తర్వాత వ్యాసుడు సరస్వతీ నది పశ్చిమతీరానికి వెళ్లాడు. అక్కడ ఋషిజనకర్మయోగ్యమైన శమ్యాప్రాసమనే ప్రదేశం ఉన్నది. అందులో బదరీషండమండితమైన ఒక భాగాన్ని వ్యాసుడు తన ఆశ్రమంగా చేసుకొన్నాడు.

ఒకనాడు బాదరాయణుడు సంధ్య వార్చి ఆశ్రమంలో కూర్చుండి నారదుని ఉపదేశాన్ని స్మరించి మనస్సును ఏకాగ్రవృత్తిలో నిలిపి భక్తియోగాన్ని ఆశ్రయించి పరమేశ్వరుని ధ్యానించాడు. భగవంతుడు ప్రసన్నుడయ్యాడు. ఆ తోడ్తోనే ఆయనను ఆశ్రయించి ఉన్న మాయ కూడా సాక్షాత్కరించింది.

వ్యాసుడు ఆ మాయను చూసి, 'ఓహో! జీవుడు త్రిగుణాతీతుడై ఉన్నప్పటికీ అతనిని ఆవరించి స్వరూపజ్ఞానాన్ని మరిపించి, గుణబద్ధుని చేసి, కర్తృత్వాదులకు చిక్కించి, పరానికి దూరీకరించి సంసారసాగరంలో పడద్రోసి పరితపింపజేసేది ఈ మాయే కదా! ఇన్నాళ్ళకు దీన్ని కన్నారా చూడగలిగాను. దీనికి చిక్కి నేను కూడా బాధలకు గురికాక తప్పలేదు. లోకానికి ఇంత

అనర్థాన్ని కలిగిస్తున్న దీనిని తొలగించే ఉపాయం ఏమిటి?' అని ఆలోచింపసాగాడు. అంతలోనే భక్తి కూడా రూపాన్ని ధరించి అతని కళ్ళ ముందు అవతరించింది. వ్యాసమహర్షి భగవత్స్వరూపాన్నీ, మాయాభక్తులనూ వివేకించి చూసి, 'భగవంతుడు నిత్యానందస్వరూపుడు. జీవుడూ అట్టివాడే కాని మాయామోహితుడై విపరీతధర్ముడవుతున్నాడు. ఆ వైపరీత్యం పోవడానికి భక్తి ఒక్కటే పరమౌషధం. నారదమహర్షి చెప్పిన వాక్యాలు నాకిప్పుడు స్పష్టంగా తెలిసివచ్చాయి. ఆయన ఉపదేశాన్ని శిరసావహించి, ఆత్మలాభాన్నీ లోకకల్యాణాన్నీ సాధింపగల సాత్వత సంహితను శ్రీమద్భాగవతాన్ని విరచిస్తాను' అని నిశ్చయించి, గ్రంథరచన మొదలుపెట్టి అనతికాలంలోనే పూర్తి చేశాడు.

## భాగవత ప్రచారం

మునీంద్రులారా! వ్యాసమహర్షి కృతమైన ఆ భాగవతం పరమపురుషుడైన శ్రీకృష్ణపరమాత్మ లీలలతో నిండి ఉన్నది. ఆ పవిత్రగ్రంథాన్ని విన్నంతనే భగవద్భక్తి జనిస్తుంది. అందువలన మర్త్యులకు శోక మోహ భయాదులన్నీ అణగిపోతాయి. గ్రంథాన్ని వ్రాసినంత మాత్రాన ఫలం చేకూరదు. అది లోకంలో ప్రచారాన్ని పొందాలి. అందుకు వ్యాసమహర్షి ఆ గ్రంథాన్ని తన పుత్రుడూ, పుట్టుకతోనే నివృత్తినిరతుడూ అయిన శుకమహర్షిచేత చదివించాడు.

## నివృత్తిరతుడు – భగవద్భక్తి

శౌనకాదులు ఆ మాట విని, 'సూతాగ్రణీ! శుకమహర్షి నివృత్తిరతుడన్నావు. అటువంటి వానికి ఎట్టి అపేక్షా ఉండకూడదు. చివరికి శబ్దాది విషయరక్తి కూడా ఉండదు. అతనెప్పుడూ పరమాత్మరతుడై ఉంటాడు. అటువంటివాడు భాగవతాన్ని చదవడం వింత కాదా?' అని అడిగారు. సూతుడు వారి భావాన్ని గ్రహించి, 'మునులారా! భగవద్గుణాలు ఎంతవారినైనా ఆకర్షిస్తాయి. వస్తుశక్తి అటువంటిదనుకోవాలి. సామాన్యులు

కూడా ఆత్మారాములవలె భగవద్గుణానువర్ణనం కావిస్తారు. కానీ కార్యం ఒకటే అయినా అందులో సంకల్పభేదం ఉన్నది. సామాన్యులు ఏది చేసినా దాని వెనుక ప్రతిఫలాపేక్ష ఉంటుంది. ఆత్మారాములకు ఫలాపేక్ష ఉదయింపదు. వారి బుద్ధి కేవలం భగవద్గుణానుభవపరమై అలరారుతుంది' అని చెప్పాడు.

## భాగవత ప్రాశస్త్యం

'మునులారా! ఈ భాగవతం ముముక్షువులకు అత్యంత ప్రీతికరం. ఇందులో పరమోత్తమమైన భాగవతధర్మం నిరూపింపబడింది. పరికించి చూడగా ఇతర ధర్మాలు అంతో యింతో ఫలకాంక్షతో కూడి ఉంటాయి; భాగవతధర్మంలో అటువంటి ఫలకాంక్షకు లేశమాత్రమైనా అవకాశం లేదు. 'మోక్షకాంక్ష అయినా ఉండదా? అది ఫలకాంక్ష కాదా?' అని అడిగితే, భాగవతధర్మంలో ఆ మోక్షకాంక్ష కూడా లేదు. నిర్హేతుకమైన భగవదారాధన మొక్కటే ఈ భాగవతధర్మ లక్షణం. అంతే కాక ఈ ధర్మం యొక్క పరమత్వాన్ని అధికారతత్వాన్ని బట్టి కూడా గ్రహింపవచ్చు. ఏమంటే ఈ ధర్మాన్ని అనుష్ఠించడం అనధికారులకు సాధ్యం కాదు. ఎవరి హృదయం నిర్మత్సరమై భూతదయార్ద్రమై ఉంటుందో వారు మాత్రమే ఇందుకు తగినవారు. ఈ కారణాల వలన భాగవతం శాస్త్రరీతి గానూ కర్మకాండవిషయాలను ప్రతిపాదించే శాస్త్రాలకన్నా ఉత్తమోత్తమ మవుతున్నది. ఇది జ్ఞానకాండ శాస్త్రాని కంటె మేలని చెప్పాలి. ఎలాగంటే? జ్ఞానప్రతిపాదిక శాస్త్రాలు – అంటే వైశేషికాదులు ద్రవ్యగుణాదులను గురించి మాత్రమే తెలుపుతాయి. భాగవతం అన్ని ద్రవ్య గుణాలకూ మూలమైన పరమార్థవస్తువును వివరిస్తున్నది.

## పరమార్థ వస్తువు

భాగవతం వివరిస్తున్న ఆ వస్తువు సాక్షాత్తూ భగవంతుడే. ఆయన అంశమే జీవుడు. ఆ వస్తుశక్తికే మాయ అని పేరు. ఆ శక్తి కార్యమే జగత్తు.

జీవుడు – మాయ – జగత్తు సర్వమూ ఆ వస్తువేనని, దానికి భిన్నమైనది ఇసుమంతయినా కలుగదని భాగవతశాస్త్రం బోధిస్తున్నది. అందువలన దీనికి జ్ఞానకాండశాస్త్రాల లోనూ వైశిష్ట్యం ఉంటున్నది. పైగా ఇది ఆధ్యాత్మికాది తాపత్రయాన్ని ఉన్మూలించి పరమసుఖాన్ని కలిగించేది కనుక జ్ఞానకాండ విషయ శాస్త్రాని కంటె శ్రేష్ఠతమం.

ఇంకొక విశేషం ఏమిటంటే, కర్మశాస్త్రానుష్ఠానానికి ఎంతో ద్రవ్యం కావాలి. జ్ఞానశాస్త్రానుష్ఠానానికి ఎంతో శ్రమపడాలి. దీనికి ఆ రెండూ అక్కరలేదు. అయత్నంగా నైనా దీని ఫలాన్ని పొందవచ్చు. అంతే కాక శ్రీమద్భాగవతాన్ని ఏ మనుష్యమాత్రుడో లేక ఏ దేవమాత్రుడో కాక వ్యాసరూపాన అవతరించిన శ్రీమన్నారాయణుడే స్వయంగా వ్రాశాడు. కనుక కర్తృదృష్టితో విచారించినా దీనికి వైశిష్ట్యం ఉన్నదని వెల్లడవుతుంది. మునులారా! దీని వైశిష్ట్య ప్రశంస ఇంతటితో ముగిసినట్లు కాదు.

భాగవతాన్ని వినాలనే కోరిక అనేకానేక జన్మలలో ఆర్జించిన పుణ్యం పరిపక్వమైతే కాని జనింపదు. దీనిని విన్నవారికి నిఖిల జగజ్జన్మాది కారణీభూతుడైన పరమాత్మ శ్రీమన్నారాయణుడు వెంటనే ప్రసన్నుడవుతాడు.

దీనిని వినేటప్పుడు శ్రోతలకు తెలియకుండానే వారి హృదయాంతరాలలో పరమానంద రసానుభవం పెల్లుబికి ఉప్పొంగడమే అందుకు ప్రథమ నిదర్శనం. మనస్సు ఎల్ల వేళలా భగవత్పరమై ఉండటం ద్వితీయ నిదర్శనం. భగవంతుడు భక్తుని హృదయ మందిరంలో నివసించడమే తృతీయ నిదర్శనం. భక్తుడు తనలో అంతర్యామియై భగవంతుడు వర్తిస్తున్నాడని తెలుసుకోవడం అన్నింటి కన్నా పరమ నిదర్శనం. భక్తిని పుట్టించి భగవంతుని వశపరచుకొనే సామర్థ్యం మరే యితర శాస్త్రానికీ లేదు.

వేదమనే కల్పవృక్షానికి పండి వైకుంఠం నుంచి నారదమహర్షి చేత నేలకు కొనిరాబడి శుకముఖం నుంచి జారి అమృతం జాలువారుతున్న భాగవత దివ్యఫలం రసాలమై ఒప్పారుతుంది. దాని రసాలను గ్రోలినవారికి సర్వ పురుషార్థ సంపత్తీ తప్పక చేకూరుతుంది.

దానిని మీకు సంపూర్ణంగా రుచి చూపిస్తాను.

## భాగవత కల్పకబీజాలు

మునులారా! పరీక్షిన్నరేంద్రుని జన్మవృత్తాంతం, అతను కలిని నిగ్రహించిన ఉదంతం, తక్షకుడు కాటువేయగా మృతుడు కావడం, శ్రీకృష్ణుని వైభవానికి ప్రకాశకమైన పాండవ మహాప్రస్థానం – వీటిని బీజభూతాలుగా కలిగి భాగవత కల్పవృక్షం శాఖోపశాఖలుగా విస్తరిల్లుతుంది.

## అశ్వత్థామ దుర్వర్తనం

మునిసత్తములారా! ద్వాపర యుగాంతంలో కౌరవ పాండవులకు కురుక్షేత్రంలో మహాఘోరమైన యుద్ధం జరగడమూ, ఆ దారుణ రణమధ్యంలో ఇరుపక్షాల లోనూ వీరులు ఒకరితో ఒకరు పోరి వీరస్వర్గాన్ని చూరగొనడమూ, దుర్యోధనుడు భీమసేనుని గదాహతికి తొడలు విరిగి నేలకూలడమూ సాకల్యంగా మీరు వినే ఉంటారు. దుర్యోధనుని పాటుకు అశ్వత్థామ క్రోధమూర్ఛితుడై హితాహితజ్ఞానాన్ని వీడి తన మిత్రునికి ప్రియాచరణం కావించడమే ప్రధానంగా భావించి మహాదారుణ కృత్యానికి సాహసించాడు. ఆ కార్యం అకార్యమని, దుర్యోధనుడు ఎంత మాత్రమూ సమ్మతింపడని, అది లోకనిందాస్పదమని అతనికి తెలియకపోలేదు. అయినా క్రోధం అతనిని నిలువనీయలేదు. ఒక రాత్రివేళ పాండవ శిబిరం లోనికి రహస్యంగా ప్రవేశించి గాఢ నిద్రావశులై మైమరచి ఉన్న పాంచాలీసుతుల తలలు నరికి అక్కడి నుంచి పారిపోయాడు.

## అర్జునుని శపథం

ఆ తర్వాత కొంతసేపటికి ద్రౌపది నిద్ర మేలుకొని, రక్తసిక్తమై ఉన్న పొత్తిళ్లలో కొడుకుల మృతదేహాలను చూసి హృదయవిదారకంగా విలపింపసాగింది. అర్జునుడు పుత్రమరణవార్త వినగానే ఆమె వద్దకు వెళ్ళి, 'ప్రేయసీ! దుఃఖించకు. ఇదంతా బ్రాహ్మణాధముడైన అశ్వత్థామ చేసిన దుండగం. ఆ శిశుఘాతకుని తల తరిగి తెచ్చి నీకిస్తాను. నీవు వాడి శిరస్సును ఆసనంగా చేసికొని ఉపవిష్టురాలివై మనశ్శాంతిని పొందు' అని బాసచేసి ఓదార్చి గాండీవాన్ని ధరించి ప్రయాణోన్ముఖుడయ్యాడు. రథాన్ని పూన్చి సిద్ధం చేశారు. కృష్ణభగవానుడు సారథ్యం వహించాడు. పార్థుడు రథమెక్కి అశ్వత్థామ వెళ్ళిన దారిని పసిగట్టి అతనిని వెంటాడాడు.

## అశ్వత్థామతో యుద్ధం

అర్జునుని రాకను దూరాన్నుంచి చూసినప్పుడు అశ్వత్థామకు తను కావించిన అకార్యం కళ్ళముందు నిల్చినట్లై గుండె ఝల్లుమన్నది. అతని హృదయం తల్లడిల్లింది; ప్రాణాలు దక్కే ఉపాయం ఏమిటన్న భయంతో దిక్కు తోచలేదు. రథాన్ని దారి మళ్ళించి అమితోద్వేగంతో భయాందోళనలతో హయాలను ముందుకు దూకించాడు. ఆ విధంగా ఉరుకులు పరుగులతో రథాశ్వాలు కొంత దూరం పరిగెత్తి ఆయాసంతో సొమ్మసిల్లి నిలిచిపోయాయి. వాటితోపాటే అతని ఊహలన్నీ స్తంభించాయి. కొంతసేపటికి తెప్పరిల్లి గత్యంతరం లేక పార్థుని ఎదుర్కొనడం తప్పదని గ్రహించాడు. అప్పటికి అతని అస్త్రాలన్నీ వ్యయమై బ్రహ్మశిరోనామకాస్త్ర మొక్కటే మిగిలి ఉన్నది. అతనికి ఆ అస్త్రప్రయోగమే తప్ప ఉపసంహారం తెలియదు. అయినా ప్రాణం మీదికి వచ్చినదని అతను వేరే ఆలోచన లేకుండా ఆచమించి శుచిర్భూతుడై ఆ మహాస్త్రాన్ని ధ్యానించి ప్రయోగించాడు.

ఆ విధంగా అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రం మహోగ్రతేజంతో దిగ్దిగంతాలను ఆవరిస్తూ పార్థుని వంకకు రాసాగింది. అర్జునుడు ఆ తేజః

పుంజాన్ని చూసి, 'కృష్ణా! ఏదో కలరూపు తెలియరాని మహాదారుణమైన తేజం, సర్వతోముఖమై వస్తున్నది. నీవు మూలపురుషుడవు, ప్రకృతికి పరుడవైన సాక్షాదీశ్వరుడవు, స్వయంప్రకాశకత్వ ప్రభావం చేత మాయను అతిక్రమించి స్వరూపానందస్థితిని విరాజిల్లే సర్వజ్ఞుడవూ కనుక నీకు తెలియనివి లేవు. ఈ కానవస్తున్న తేజం ప్రాణిలోక మంతటినీ దహింపనున్నట్లు కనుపిస్తున్నది. భక్తరక్షకా! లోకరక్షణానికి నీవే దిక్కు; జాగుచేయక లోకులను కాపాడు' అని ప్రార్థించాడు.

ఆ మాటలకు శ్రీకృష్ణుడు, 'పార్థా! అశ్వత్థామ నీకు భయపడి గత్యంతరం లేదని ఆత్మరక్షణార్థం బ్రహ్మశిరోనామక మహాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రమే ఇప్పుడు తన తేజాన్ని లోకభీకరంగా ప్రసరింపజేస్తూ నీ మీదికి వస్తున్నది. అతనికి అస్త్రోపసంహార క్రమం తెలియదు. ప్రయోగోపసంహారాలు రెండూ సక్రమంగా తెలియనివాడు అస్త్రాన్ని ప్రయోగించకూడదు. అయినా ప్రాణాపాయానికి వెరచి అధర్మమన్న జంకు లేకుండా అత నీ అకార్యానికి తెగించాడు. మరే ఇతరాస్త్రమూ దీనిని అడ్డుకొనలేదు. నీవూ ఆ అస్త్రాన్నే ప్రయోగించు. అది దీనిని ఉపశమింపజేసి తానూ ఉపశాంతిని పొందుతుంది. సర్వాస్త్రప్రయోగకుశలుడివి నీకు చెప్పవలసిన దేమున్నది?' అని పలికాడు.

అర్జును డా మాట విని ఆచమించి శుచియై కృష్ణునికి ప్రదక్షిణం చేసి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ రెండస్త్రాలూ ఒకదాని నొకటి ఎదుర్కొని అగ్నిపరంపరలను కురుస్తూ మహాభీకరమై గోచరించాయి. వాటి తేజఃపుంజం ప్రళయకాల సంకర్షణ ముఖాగ్ని వలె భూనభోంతరాళాలలో క్రమ్ముకొనగా చూసి ముల్లోకాలూ భయవిహ్వలమై ఆ వహ్నితాపానికి ప్రజ్వలింపసాగాయి. పార్థుడు ప్రజోపద్రవమూ లోకనాశనమూ కాగలవని శంకించి శ్రీకృష్ణుని అనుమతిని పొంది అస్త్రద్వయాన్ని ఉపసంహరించి కన్నులలో నిప్పులు కురిపిస్తూ అశ్వత్థామను పట్టి పశువులాగా త్రాటితో కట్టి తన శిబిరానికి బయలుదేరాడు.

## అర్జునుని ధర్మబుద్ధి

అప్పుడు శ్రీకృష్ణుడు పార్థుని ధర్మబుద్ధిని పరీక్షింపనెంచి అతనిని చురచురా చూస్తూ, 'పార్థా! ఇతను బ్రాహ్మణాభాసుడు. వీడిని రక్షించడం తగదు. మైమరచి నిద్రిస్తున్న పసివాళ్ళను – ఏ అపరాధమూ ఎరుగని అమాయకులను – నిశా సమయంలో చేజేతులా కుత్తుకలు తరిగి చంపిన ఈ పాపాత్ముడు మనవచ్చునా? ఏమరి ఉన్నవాడు, మద్యపానవశుడు, పిశాచగ్రస్తుడు, నిద్రాగతుడు, బాలుడు, స్త్రీలు, శరణాగతులు, విరథులు, భీతులు – వీరు శత్రువులైనా చంపరాదని ధర్మశాస్త్రం. ధర్మం తెలిసినవాడు అటువంటి నిస్సహాయుల జోలికి వెళ్ళడం కూడా తగని పనే. ఈ దుష్టుడు బ్రాహ్మణ జన్మమెత్తి ద్రోణాచార్యులకు శుశ్రూషించి సర్వధర్మాలనూ అధ్యయనించి ఇంత ఘోరపాతకానికి ఒడిగట్టాడు. తన ప్రాణరక్షణ కోసం మరొకరి ప్రాణాన్ని బలిపెట్టే ఖలుడి కన్నా దురాత్ముడు వేరే ఒకడుండడు. వీడికి మరణాంత శిక్షే తగిన ప్రాయశ్చిత్తం. అర్జునా! శోకవశురాలైన పాంచాలితో నీవు బాసచేసిన వన్నీ వట్టి ఓదార్పు మాటలేనా? పార్థా! ఇతను పాతకుడు; ఆకతాయి; పుత్ర హంతకుడు; మీదు మిక్కిలి బ్రహ్మబంధువు. వీడిని వెంటనే హతమార్చు' అని క్రోధవచనాలతో రెట్టించి పలికాడు.

అర్జునుడు శ్రీకృష్ణుని పలుకులను శాంతంగా విని, 'కృష్ణా! నువ్వు చెప్పిన దంతా నిజమే. అయినా గురుపుత్రుడు కనుక ఇతనిని చంపడానికి నాకు చేతులు రావడం లేదు' అని పలికి అశ్వత్థామను తీసుకొనివెళ్ళి పుత్రశోకార్తయై ఉన్న పాంచాలికి అప్పగించాడు.

## బంధ విమోచనం

అశ్వత్థామ పాంచాలి మోము వంకకు చూడలేక తాను కావించిన తప్పిదానికి సిగ్గుపడుతూ తలవంచుకొన్నాడు. అతనిని చూసినంతనే పాంచాలీ హృదయం నీరైపోయింది. ఆమె దిగ్గున లేచి అశ్వత్థామకు నమస్కరించి, అర్జునుని వంకకు మరలి, 'అయ్యో! ఎంత అపచారం జరిగింది. ఇతను

బ్రాహ్మణమాత్రుడే కాదు; గురు పుత్రుడు. కనుక మనకు గురువుతో సమానం. ఎవరి అనుగ్రహం వల్ల మీరు ధనుర్వేదాన్నీ, ప్రయోగోపసంహారపూర్వకంగా అస్త్రగ్రామాన్నీ పొందనోచారో, ఆ మహాత్ముడు ద్రోణాచార్యుడు పుత్రరూపంలో ప్రత్యక్ష మవుతున్నాడు. ఆ మహనీయుని అర్ధాంగి వీరకుమారుని కన్నది. ఈ కొడుకు కోసం పతితో సహగమనాన్ని మానుకొని కొసప్రాణంతో ఎదురుచూస్తున్నది. ఇతనూ వెళ్ళిపోతే ఆమె గతి ఏం కావాలి? ధర్మజ్ఞా! గురుకులం ఎంతో పూజనీయమూ, వంద్యమూ అని మీకు తెలుసు. అటువంటి కులానికి మీ వల్ల కీడు రాకూడదు. గౌతమి సామాన్యురాలు కాదు. పతిదేవతావ్రతయై లోకవిఖ్యాతిని గడించింది. నాలాగా పుత్రశోకార్తిని ఆమెకూ అంటగట్టవద్దు. రాజులు ఇంద్రియపరవశత్వాన నైనా బ్రాహ్మణకులానికి కోపం తెప్పించకూడదు. ఈ ధర్మాన్ని అతిక్రమించిన రాజకులం సకల బంధుమిత్ర పరివార సమేతంగా నిరంతర శోకాగ్నిలో కూలి పరిదగ్ధ మవుతుంది' అని మహోదాత్తంగా ప్రసంగించింది.

మునులారా! కరుణారసం ఉట్టిపడుతున్న పాంచాలి పలుకులలో ఆమె ధర్మ దీక్ష, న్యాయనిరతి, నిష్కపట స్వభావం, సహన శీలం, సర్వసమతాభావ మహత్త్వం వెల్లడయినాయి. ధర్మనందనుడు ఆమె సౌజన్యాన్ని ఎంతగానో అభినందించాడు. అక్కడున్న వారందరూ మేలుమేలని ఏకగ్రీవంగా తమ ఆమోద సమ్మోదాలను తెలియజేశారు. భీముడు మాత్రం కన్ను లెఱ్ఱజేసి పండ్లు కొరుకుతూ 'తనకూ తన రాజుకూ ప్రియం కలగాలని పసివాళ్ళను అందునా నిద్రిస్తున్న వాళ్ళను రాత్రివేళ దొంగచాటుగా వచ్చి గొంతు కోసిన పాపాత్ముణ్ణి నరికి పోగులు పెట్టక ఇంకా చూస్తున్నారేమిటి?' అని రోషకషాయస్వరంతో హుంకరించాడు.

ఒక వంక ద్రౌపదీ మరో వంక భీముడూ ఆ విధంగా చెరొక తీరునా పలికే సరికి ఏం చెయ్యాలో పాలుపోక అర్జునుడు శ్రీకృష్ణుని మోము వంకకు చూశాడు. భగవానుడు అతని మనోభావాన్ని గ్రహించి, 'అర్జునా! దుష్టుడు వధ్యుడనీ, బ్రాహ్మణుడు అవధ్యుడనీ రెండు ధర్మాలు నేనే శాసించాను. ఆ

రెండింటికీ విరోధం కలగకుండా పాంచాలికి నీ విచ్చిన మాటను పాటించి, నాకూ మీ అన్నకూ ప్రియాన్ని చేకూర్చు' అన్నాడు. అర్జునుడు కృష్ణుని ఆదేశాన్ని ఊహించి 'బ్రాహ్మణాభాసునికి శిరోముండనం, ధనాహరణం, దేశబహిష్కారం అర్థదండన లౌతాయి గాని దేహదండనం కూడ'దన్న ధర్మశాస్త్రాన్ని స్మరించి అశ్వత్థామ శిరోరత్నాన్ని, అతని పుట్టుకతో అతనితోనే పుట్టినదాన్ని కేశపాశ సమేతంగా కోసి తీసుకొని అతనిని శిబిరం నుంచి పంపించివేశాడు.

## ఉదకదానాలు

ఆ తర్వాత పాండవులు భారతయుద్ధంలో హతులైన జ్ఞాతులకు ఉదక దానాలు కావించాలని సంప్రదాయం ప్రకారం పాంచాలీ సహితంగా స్త్రీలను ముందు తరలించి ఆ వెనుక తామూ బయలుదేరి కృష్ణునితో కలిసి గంగానదీ తీరానికి వెళ్ళి శ్రీహరి పాదపద్మపరాగరేణుస్పర్శచే పావనమైన ఆ దివ్యతరంగిణిలో స్నానం చేసి పరలోక జ్ఞాతులకు తిలోదకా లిచ్చి వారికై దుః ఖించి మళ్ళీ స్నానాలు చేసి శుచిర్భూతులై కూర్చున్నారు.

## శ్రీకృష్ణుని ద్వారకాప్రయాణం

అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ గాంధారీ ధృతరాష్ట్రులను, కుంతీద్రౌపదులను, పాండవులను, తదితర బంధువులను అందరినీ పేరు పేరునా పలకరించి, 'జనన మరణాదులు కాలవశాన దాపురించేవి. ఎంతవారికైనా కాలాన్ని అతిక్రమించడం సాధ్యం కాదు కదా!' అని ఓదార్పులు పలికి, 'ధూర్తులైన ధార్తరాష్ట్రులు పరమపతివ్రతను పాంచాలిని కేశపాశం పట్టి యీడ్చిన పాపానికి ఫలితంగా మృతిచెందారు. ఆ దుష్టులు కపటమార్గాన హరించిన రాజ్యం మళ్ళీ ధర్మరాజు వశమయింది. రాజైనాక అజాతశత్రుడు ఉత్తమ కల్పకవిధానంగా మూడు అశ్వమేధ యాగాలు చేయడం మంచిది. అతని కీర్తి ఇంద్రుని కీర్తి వలె దిగంతాలకు విస్తరిల్లుతుంది' అని ఆదేశించి, వ్యాసాది బ్రహ్మర్షులను పూజించి

ప్రతిపూజలంది అందరికీ వీడ్కోలు పలికి ద్వారవతికి ప్రయాణమై ఉద్ధవ సాత్యకులతో రథాన్నెక్కబోతున్నాడు.

## ఉత్తరా గర్భరక్షణం

ఇంతలో అభిమన్యుని భార్య ఉత్తర భయాందోళనలతో కృష్ణుని వద్దకు పరుగు పరుగున వచ్చి, 'దేవా! రక్షించు. నన్ను రక్షించు. తప్తాయసమైన బాణం ఒకటి నన్ను వెంటాడుతున్నది. నా కోసం నే నెప్పుడూ భయపడను. నా కడుపున ఉన్న శిశువు కోసం పరితపిస్తున్నాను. నా గర్భాన్ని కాపాడు. ఎక్కడ చూసినా మరణభయం తాండవిస్తున్నది. నిర్భయుడవైన నీవే నాకు దిక్కు' అని దీనంగా వేడుకొన్నది.

శ్రీకృష్ణుడు ఆమె మొరాలించి, 'ఓహో! తనకు జరిగిన పరాభవానికి ప్రతీకారంగా అశ్వత్థామ పాండవు లందరినీ నాశనం చేయాలని అస్త్రప్రయోగం చేశాడు. ఇది బ్రహ్మాస్త్రం. బహుముఖాలతో మీదికి వస్తున్నది' అని అనుకొంటుండగానే అయిదు బాణాలు రివ్వు రివ్వున వచ్చి పాండవులు ఐదుగురి మీదా పడబోతున్నాయి. కుంతీతనయులు ఆ బాణాలను నిగ్రహింపగల దివ్యాస్త్రాలను ఎక్కుపెట్టారు. అమోఘమైన బ్రహ్మాస్త్రాన్ని ప్రతిఘటించే శక్తి పాండవులకు లేదని, వారికి రానున్న ముప్పు వేరొక మార్గాన తొలగేది కాదని గ్రహించి శ్రీకృష్ణపరమాత్మ వెంటనే సుదర్శనాన్ని ప్రయోగించాడు. అది ద్రౌణి బాణాలను తుంచివేసి పాండవులను రక్షించింది. అప్పుడు భగవానుడు ఉత్తర గర్భాన్ని తన మాయతో కప్పి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని తన చక్రాయుధతేజంతో ఉపశమింపజేశాడు.

ఆ విధంగా శ్రీకృష్ణుడు పాండవులను కాపాడి ఉత్తరాగర్భాన్ని రక్షించి మళ్ళీ ప్రయాణోన్ముఖు డయ్యాడు.

## కుంతీ స్తవం

అప్పుడు కుంతీదేవి తన కొడుకులను, కోడలిని వెంటబెట్టుకొని వచ్చి శ్రీకృష్ణ పరమాత్మను సన్నుతించింది–

'కృష్ణా! ఇదే నీకు భక్తి పూర్వక నమస్కారం. నా కంటె పెద్దదానివి నాకు నమస్కరించవచ్చా? అనవద్దు. ఆదిపురుషుడవు కనుక నీవు పెద్దలకు కూడా పెద్దవైనావు. అంతే కాదు. సర్వజ్ఞుడవై ప్రకృతిలో కానవస్తూనే ప్రకృతికి అతీతంగా ఉండి దాన్ని నియమిస్తూ అంతర్యామివై ఆకాశం వలె సర్వమూ వ్యాపించి ఉంటావు. ఈ జగన్నాటకంలో సమస్తపాత్రలనూ నీవే ధరించి అభినయిస్తావు. పాత్రల నామరూపాలను చూసి లోకం భ్రమిస్తున్నదే గాని సర్వపాత్రధారివి నిన్ను మాత్రం గుర్తు పట్టదు. సర్వసంపూర్ణుడవు అయినా కంటికి కాన్పింపవు. మా బోటి మూఢబుద్ధులకు నీవు కనిపించక పోవడంలో వింత లేదు. నిర్మలాత్మకులూ నిరంతరమూ నిన్నే మననం చేసే శీలం కలవారూ అయిన పరమహంసలకు కూడా నీ స్వరూపం మృగ్యం గానే ఉంటున్నది. నీ మాయ నిన్ను అనవరతం కప్పి ఉంచి నీ స్వరూపాన్ని కానరానీయదు. కంటికి కూడ కానరానివాడవు భక్తియోగాన్ని సముద్ధరించడానికి అవతారలీలలను ప్రదర్శిస్తావు. అట్టి మహానుభావుడవు నీవు సర్వజనుల నమస్కృతులకూ అర్హుడవని నీకు నమస్కరించడం మా బోంట్లకు బహుజన్మ సుకృతఫలంగా అబ్బిన మహాభాగ్యం. కనుక పునః పునర్నమస్కారాలు ఆచరిస్తాను.

కృష్ణా! ఆ నాడు దేవకీదేవిని కంసుని బారినుండి కాపాడినట్లు నన్నూ నా కొడుకులనూ విపత్పరంపరల నుంచి రక్షించావు. నీ కన్నా మాకు దిక్కెవ్వరు? నీవు నాకు చేసిన ఉపకారాలు అన్నీ ఇన్నీ

కావు. చిన్నప్పుడు భీముడిని విషాన్నం నుంచి కాపాడావు. లక్క యింటిలో చిక్కుకొని కాలి చావనున్న మమ్మల్ని కాపాడావు. హిడింబాది రాక్షసుల బారి నుంచి తప్పించావు. చెరగు మాసిన పాంచాలికి నిండు సభలో కానున్న పరాభవాన్ని తొలగించావు. భార్యాసహితులై కారడవులలో లెక్కమీరిన ఇక్కట్లు పడుతున్న నా పుత్రులకు తోడునీడవై చరించావు. దుర్యోధన ప్రేరితుడై వచ్చిన దుర్వాసుని శాపానికి ఎడమీయక మమ్మందరినీ రక్షించావు. ఇప్పుడీ బ్రహ్మాస్త్రం నుంచి బ్రతికించావు.

కృష్ణా! మా అనుభవాన్ని బట్టి చూడగా భగవద్దర్శనానికి ఆపదలే దారిదీపాలని నా కనిపిస్తున్నది. కనుక నాకు ఆపదలనే అనుగ్రహించు. శుభాన్ని కోరి అందరూ భక్తులవుతుండగా ఈ విధంగా ఆపదలను అడిగానని పరిహసిస్తావేమో? లోకంలో అజ్ఞానులు మంచి కులంలో జన్మించడమో, మహైశ్వర్యాలను సంపాదించడమో, వేదశాస్త్రాది సంపదలో, ధనధాన్యాలో దొరికితే చాలనుకొంటారు. అవి మదాన్ని పెంచి మనస్సును పాడుచేసి నీ నుంచి దూరం చేస్తాయి. వారికి సంసార చక్ర నివారకమైన నీ దివ్యదర్శనం ఏ నాటికీ కలుగదు. ఆపదలు మదాన్ని అణిచివేసి మనస్సును నీ పాదారవిందాలపై నిలుపుతాయి. అందువలన నే నెప్పుడూ విపత్పరంపరలనే కోరుకొంటాను.

**శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!**
**లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా**
**నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణ సంధాయకా!**
**నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!**

దేవా! దేవకీపుత్రమాత్రుని నిన్నిలా శ్లాఘించడం న్యాయం కాదని అనవద్దు. నీవు కాలరూపుడవు. సకల లోకాలనూ

నియమిస్తున్నవాడవు. నీకు ఆద్యంతాలు కలుగవు. నీ సేవకు ఎల్లవారూ తగినవారే. ఉత్తమ మధ్యమ అధమాది వైషమ్యాలు నీకు కలుగవు. ఎల్లరయందూ ఏకభావంతో వర్తిల్లుతావు. కనుక నిన్ను శ్లాఘించడం కన్న మానవులకు పుణ్యకార్యం ఏమున్నది?'

కృష్ణా! యశోద చిన్ననాట నిన్ను త్రాటితో కట్టబోతుండగా కళ్లలో నీళ్లు నింపుకొని మోము వాల్చి భయాన్ని అభినయించిన ఆ నాటి నీ అమాయికపు రూపు జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా ఈనాటికీ నాకు మోహం కలుగుతున్నది.

దేవా! నీ అవతారాన్ని గురించి బహువిధాల ఊహిస్తుంటారు. ధర్మజుని కీర్తి నిలుప వచ్చావని కొందరంటారు. యదువంశానికి వన్నె కూర్చాలని అవతరించావని అంటారు. కొందరు దేవకీ వసుదేవులు వారి పూర్వజన్మలలో కోరిన కోర్కెలను పండించేందుకు పుడమికి దిగివచ్చా వంటారు. లోకరక్షణార్థం విచ్చేశావని కొందరు ఉగ్గడిస్తారు. భూమిభారావతరణకని కొందరు, అవిద్యా కామకర్మలకు చిక్కి సంసార సాగరంలో ఈదులాడేవారిని చేదుకొనడానికని కొందరు, ఒక్కొక్కరూ ఒక్కొక్క రీతిని భావిస్తారు.

భక్తలోలా! సంసార సాగర తరణానికి నీ పాద తరణి కంటె వేరొక సాధనం లేదు. ఆ నీ పాదతరణిని చేరడానికి నీ నామశ్రవణ కీర్తనమే ఉత్తమమైన మార్గం.

స్వామీ! మేమందరమూ నిన్నే నమ్ముకొని, నిన్నే అనుసరిస్తున్న నీ అనుజీవులం. మాకు నీ తోడిదే లోకం. నీవే మాకు పరాయణం. నీ నామమే మాకు పారాయణం. ఈ దీనులను విడిచిపెట్టి వెళ్ళడం నీకు న్యాయమేనా?

తండ్రీ! దుర్యోధనాది రాజమండలానికి ఎంతో కావించిన ఈ పాపులకు మాకు నీ పాదారవిందాల కంటె శరణ్యాంతరం లేదు. జీవుని దర్శనం కలుగనినాటి ఇంద్రియాల స్థితి వలె నీ దర్శనం లేనినాడు పాండవులకు నామరూపాలు కూడా దక్కవు. అన్నీ ఉన్నప్పటికీ మేము లేనివాళ్లమే అవుతాము.

*స్వామీ! నీ పాదస్పర్శ భూదేవికి శోభాకరమై ఒప్పారింది. నీ కటాక్షవీక్షణల సద్భాగ్యం వలన దేశమంతా లతావృక్ష సస్యమహౌషధి సంపన్నమై వెలసింది. స్వామీ! యాదవ పాండవుల పట్ల నాకు గల స్నేహపాశం నా బుద్ధిని అప్పుడప్పుడు వారి వంకకు లాగుతుంటుంది. ఆ మమకారాన్ని త్రుంచివేస్తే కాని నా చిత్తం అప్రతిహతంగా నీ యందు నిలవదు. ఈ మేలు నాకు చేయగలవాడవు నీ వొక్కడవే. దేశానికీ లోకానికీ ఇంత శుభాన్ని చేకూర్చినవాడవు నీకు నా మొర ఒక లెక్కలోనిది కాదు'*

అని ప్రార్థించింది.

కృష్ణుడు ఆ మాటలకు చిరునవ్వుదాల్చి, 'అమ్మా! నీవు కోరినట్లే అగు గాక!' అని మాట ఇచ్చాడు.

తీర్థయాత్రలను ముగించుకొని పాండవులందరూ హస్తినాపురానికి తిరిగి వెళ్ళారు. కృష్ణుడక్కడ కొన్నాళ్ళుండి కుంతీదేవిని, పాంచాలిని వీడ్కొని ధర్మరాజు వద్దకు వెళ్ళి తన ద్వారకా గమన సంకల్పాన్ని తెలియజేశాడు. ధర్మరాజు అందుకు సమ్మతింపక కృష్ణుణ్ణి మరి కొంతకాలం నిలిపాడు.

ధర్మజుని ప్రీతికై శ్రీకృష్ణపరమాత్మ హస్తినలో ఇంకా కొన్నాళ్ళున్నాడు.

## ధర్మరాజు పరితాపం

భారతసంగ్రామం నాటి సంక్షోభం ధర్మరాజు మనస్సులో నాటుకొని అతను నానాటికీ శోకంతో కుమిలిపోసాగాడు. వ్యాసాది మహర్షులు వెళ్ళి

శాంతివచనాలు చెప్పి చూశారు. అయినా అతనికి ఊరట కలగలేదు. భీష్ముని వలన తప్ప అన్యుల వల్ల ధర్మజునికి శాంతి చేకూరదని శ్రీకృష్ణపరమాత్మకు తెలుసు. అయినా లోక విడంబనార్థం ఆ మహాత్ముడు కూడా అతనికి ఎన్నో ఉపాఖ్యానాలతో ఇతిహాస పూర్వకంగా శాంతిని ప్రబోధించాడు. ఎన్ని చెప్పినా ధర్మరాజు పరితాపం తీరలేదు. అతను మాటిమాటికీ ఆ యుద్ధాన్నే జ్ఞాపకం చేసుకొని కలత చెందేవాడు.

'ఈ శరీరం నీటిబుడగ వంటిది. ఎప్పుడో ఒకప్పుడు కుక్కలూ నక్కల పాలుగాక మానదు. అటువంటి దానికోసం స్వార్థపరుడినై పద్దెనిమిది అక్షౌహిణుల ప్రాణాలు తీయించాను. ఎందరో నోరులేని పసివాళ్ళ ప్రాణాలను కోల్పోయారు. బ్రాహ్మణులెందరో మరణించారు. ఎందరో బంధుమిత్రులు నశించారు. అన్నదమ్ము లెందరో హతులయ్యారు. చివరికి గురువులను కూడా చంపించాను. ఇందరి చావుకు నేనే కారణమయ్యాను. అయ్యయ్యో! నా అజ్ఞానానికి ఏమనుకోవాలి? నా వంటి దురాత్ముడికి నరకం తప్పదు. ఎన్ని వేల యేండ్లు అనుభవించినా నాకు నరకమోక్షం కలుగుతుందన్న ఆశయినా లేదు.

రాజులకు యుద్ధం తప్పదని, యుద్ధకృత్యం ధర్మమవుతుందని, యుద్ధంలో వైరులను చంపడం తప్పు కాదని పెద్దలంటారు. యుద్ధం ఎప్పుడు ధర్మమవుతుంది? తన ప్రజలకు శత్రువుల వల్ల కీడు వాటిల్లినపుడు, దానిని తొలగించడానికి సామ దాన భేదోపాయాలు సాగనినాడు దండం తప్పకపోతే అప్పుడు యుద్ధం ధర్మవుతుంది. అప్పుడు కావించే యుద్ధం తన కోసం కాక ప్రజల కోసం కావించేది కనుక ధర్మం అన్నారు. ఇదే సర్వశాస్త్రాలకూ పరమార్థం. అంతే కాని రాజ్యలోభంతో చేసిన యుద్ధం ఎన్నటికీ ధర్మమనిపించుకోదు. భారతయుద్ధం రాజ్యం కోసం జరిగినదని అందరికీ తెలుసు. అది అటువంటిది కాదని, అందులో ఏదో ధర్మసారం ఉన్నదని వాదించి సాధించడం శాస్త్రాలకు విపరీతార్థం కల్పించి మసి పూసి మారేడుకాయ చేసినట్లు. అలా చేసి లోకం కళ్ళు మూసినా అంతరాత్మను

మోసగించలేము కదా! ఎందరో స్త్రీలు అనాథలయ్యారు. ఎందరో పుత్రహీనులయ్యారు. వారికి నేను చేసిన అపకారం ఒకనాటికి తీరేది కాదు. ఈ మహాపాతకానికి ప్రాయశ్చిత్తం లేదు. ప్రాయశ్చిత్త యోగ్యమైన గృహస్థాశ్రమ ధర్మాలు ఉన్నాయి గాని, అవి ఇటువంటి ఘోర పాపానికి చాలవు. ఆ ధర్మాలను ఆశ్రయించి యజ్ఞాలు చేసి చేజేతులా తెలిసి చేసిన పాతకాన్ని పోగొట్టుకోవాలని అనుకోవడం బురదను బురదనీళ్ళతో కడగడమే' అని లోలోపల చింతిస్తూ వ్యాకులపాటు వలన నానాటికీ కృశింపసాగాడు.

## భీష్మోపదేశం

కృష్ణభగవానుడు ధర్మజుని మనస్తత్త్వం తెలిసినవాడు కనుక సమయం వచ్చిందని గ్రహించి, 'ధర్మజా! మేము చెప్పవలసినదంతా చెప్పాము. నీకు మనశ్శాంతి కలిగినట్టు లేదు. సర్వధర్మాలూ తెలిసినవాడు భీష్ముడున్నాడు. అతనే నీ దుఃఖాన్ని ఉపశమింపజేయగలవాడు. ఉత్తరాయణ పుణ్యకాలానికై ఎదురుచూస్తూ రణక్షోణిలో శరతల్పగతుడై ఉన్నాడు. అతని వద్దకు వెళ్దాం పద' అని ధైర్యం చెప్పాడు.

పాండవులు, వ్యాస ధౌమ్యాదులు వాహనాలెక్కి బయలుదేరారు. కృష్ణుడు కూడా పార్థుని రథంలో కూర్చున్నాడు. అందరూ వెళ్ళి భీష్మునికి నమస్కరించి నిలబడ్డారు. అంతలోనే అక్కడికి పర్వత నారదాది మహర్షులు, శిష్యసమేతంగా పరశురాముడు, వసిష్ఠుడు విశ్వామిత్రుడు గౌతముడు అత్రి సుదర్శనుడు శుకుడు కాశ్యపుడు బృహస్పతి మొదలుగా గల దేవర్షులు, బ్రహ్మర్షులు ఎక్కడెక్కడివారూ వచ్చిచేరారు.

భీష్ముడు వారందరినీ గౌరవించి, కృష్ణుని విశేషించి సత్కరించి, ధర్మరాజు వంక చూసి ప్రేమపూర్వకంగా ఇలా అన్నాడు:

'ధర్మనందనా! బ్రాహ్మణులను, ధర్మాన్ని, భగవత్స్వరూపుని మీరు ఆశ్రయించారు. అయినా చెప్పరాని కష్టాలు పడ్డారు. ఇది నిజంగా

అన్యాయం. పాండురాజు చనిపోయినప్పుడు నోరులేని పసికూనలు మీ కోసం కుంతి ఎన్ని పాట్లు పడిందో నాకు తెలుసు. ఇదంతా కాలవశాన జరిగింది.

**ఉ. వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం**
**బాయుచు నుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై**
**పాయుచుఁ గూడుచుండు నొక భంగిఁ జరింపదు, కాల మన్నియుం**
**జేయుచునుండుఁ గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్.**

**ఉ. రాజఁట ధర్మజుండు, సురరాజసుతుం డఁట ధన్వి, శాత్రవో**
**ద్వేజకమైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్ర సం**
**యోజకుఁడైన చక్రి యఁట, యుగ్రగదాధరుఁ డైన భీముఁ డ**
**య్యాజికిఁ దోడు వచ్చునఁట యాపద గల్గుట కేమి చోద్యమో!**

**అ.వె. ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వేళ నెవ్వని**
**కేమి సేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు!**
**అతని మాయలకు మహాత్ములు విద్వాంసు**
**లడఁగి మెలఁగుచుండు రంధు లగుచు.**

ధర్మనందనా! అంతా దైవతంత్రం ప్రకారమే జరుగుతుంది. భారతయుద్ధానికి గాని, అందులో పద్ధెనిమిది అక్షౌహిణుల ప్రాణాలు పోవడానికి కాని కారణం నువ్వు కాదు. ఆ చింత మాని నీ ధర్మాన్ని ఆచరించు. ఈ కృష్ణుడు సాక్షాత్తూ శ్రీమదాదినారాయణుడు. రక్షణ లేనివారిని రక్షించే ప్రభువు నీ సమక్షంలోనే ఉన్నాడు. ఈ మహానుభావుడు తన మాయావిశేషం వలన లోకమోహాన్ని కావిస్తూ గాఢవర్తనుడై యాదవకులంలో చరిస్తున్నాడు. ఇతని ప్రభావం శివుడు, నారదుడు, కపిలాచార్యులకు తెలుసు. ఇంతటివాడిని నీవు నీ మేనత్త కొడుకని, మిత్రుడని, సుహృత్తముడని, సచివుడని, సారథి అనీ భావిస్తావు. ఇతను ఈశ్వరుడే అయితే నీచవృత్తి అయిన సారథ్యం ఎందుకు చేస్తున్నాడంటే ఈశ్వరుడు సర్వసృష్టికీ సారథి. ఆయన సారథ్యం లేనినాడు ప్రపంచమే నిలువదు. ఆయనకు ఎక్కువ తక్కువలన్న భేదభావాలు కలుగవు. ఆయన సర్వసమదర్శి.

లోకంలో వైషమ్యభావానికి మూలం ఏమిటి? రాగద్వేషాలు మూలం. లేని దానిని కోరుకోవడం రాగలక్షణం. కోరిన వస్తువును సంపాదించాలంటే మధ్యలో ఎదురైన ఆటంకాలను వారింపవలసి వస్తుంది. అప్పుడు తారసిల్లినవారి యెడ ద్వేషం కలుగుతుంది. భగవంతుడు పూర్ణుడు. అందువలన ఆయనకు కోరిక గాని, కోరదగినది గాని, పొందదగినది గాని ఉండదు. అంతే కాక భగవంతుడు అద్వయుడు. సర్వమూ తానే అయివున్నప్పుడు – తనకు భిన్నమైన పదార్థమే లేనప్పుడు నేను – నాది అన్న భావాలకు అవకాశ మేర్పడదు. ఆ భావాలు లేనినాడు రాగద్వేషాదులకు అవకాశమే లేదు.

ధర్మనందనా! భగవంతుడు రాగద్వేషాదిరహితు డైనప్పటికీ ఏకాంత భక్తులకు వశుడై వర్తిస్తాడు. అయితే దృష్టాంతం చూపమంటా వేమో? అందుకు ఎక్కడికో పోనక్కరలేదు. నేను నా ప్రాణాలను వదలదలిచి భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించాను. ఇదిగో చూడు భగవంతుడు నా కట్టెదుటికి వచ్చి నిలిచాడు. భగవంతునికి తన దాసులపై ఎంత దయ ఉంటుందో నువ్వే ఊహించు.

ధర్మనందనా! భగవంతుని దయను సంపాదించడం ఎలాగంటే, భక్తి పూతమూ ఏకాగ్రమూ అయిన మనస్సుతో ఈ మహానుభావుని దివ్యనామాలను సంకీర్తిస్తూ ఈతని ఆనతి ప్రకారం నడుచుకొనడం ఒక్కటే పరమసాధనం. వేరొక పని లేదు. అలా చేసినవాడు కామ్యకర్మల బంధాల నుంచి విముక్తుడవుతాడు. ముక్తి కలిగినదని గ్రహించడమెలాగంటే, మనస్సుకు నిరంతరం నిండారిన సంతోషం కలగడమే ముక్తికి లక్షణం.'

అని పలికి భీష్ముడు, 'హే కృష్ణా! భక్తవత్సలా! ఈ తనువును విడిచి వేస్తున్నాను. అందాకా ప్రసన్నహాసారుణ లోచనోల్లసితమైన నీ ముఖారవిందం నా ధ్యానపదంలో వెలుగులీనాలని కరుణించు స్వామీ!' అని సంప్రార్థించాడు.

ధర్మరాజు భీష్మునికి నమస్కరించి, 'మహాత్మా! నీకు తెలియని ధర్మగ్రామం ఉండదు. జన్మసాఫల్యానికి ధర్మవర్తనమో జీవగర్ర అన్నారు. మనుష్యులు భిన్న భిన్న స్వభావులై ఉన్నప్పుడు ఏయే స్వభావానికి ఏయే ధర్మం యుక్తమవుతుందో సామాన్యులకు తెలియదు. అవి నాకు విశదంగా బోధపరచి లోకకల్యాణం కావించు' అని ప్రార్థించాడు.

అప్పుడు భీష్ముడు ధర్మజునికి (1) మానవ సాధారణ ధర్మాలు (2) వర్ణాశ్రమ విశేష ధర్మాలు (3) రాగ వైరాగ్య నిమిత్తాలైన ప్రవృత్తి నివృత్తి లక్షణ ధర్మాలు (4) దానధర్మాలు (5) రాజధర్మాలు (6) మోక్షధర్మాలు (7) స్త్రీ ధర్మాలు (8) సంక్షేప విస్తరోపాయ భగవద్ధర్మాలు (9) ధర్మార్థ కామ మోక్ష ప్రకారాలు (10) వాటికి అనువైన ఉపాయాలు తెలియజెప్పి, ఏతద్వివరణార్థం ఎన్నో ఉపాఖ్యానాలను, ఇతిహాసాలను బోధించాడు.

## భీష్మ నిర్యాణం

ఇంతలో ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చింది. అది జ్ఞానులకు శరీరత్యాగానికి ఉచితమైన కాలం. భీష్ముడు శరీరాన్ని విడిచిపెట్టాలని సంకల్పించి, వాగ్వ్యాపారాన్ని చాలించి కట్టెదుట పీతాంబరధారియై ఉన్న శ్రీకృష్ణభగవానుని యందు మనస్సు నిలిపి కన్నులు మూసి ధ్యానగతుడయ్యాడు.

భీష్ముడు భక్తమాత్రుడే కాక జ్ఞానితల్లజుడై నందువల్ల దేహాదుల పట్ల మమకారం ఎన్నడో సమసిపోయింది. అందువలన ఆ మహనీయునికి యుద్ధంలో తగిలిన గాయాల బాధ తలపుకు రాలేదు. ఆ బాధ అప్పుడప్పుడు అంతో ఇంతో అనిపించినా, శ్రీకృష్ణసందర్శన మహాభాగ్యం చేకూరి మనస్సు భగవల్లీనమై ఆ కొంచెపు బాధ కూడా తెలియరాలేదు. అందుమూలాన ధ్యానధారణాసమాధులు నిర్వికల్పాలైనాయి. తత్ఫలంగా సర్వేంద్రియ వృత్తి విభ్రమాలు తొలగిపోయాయి. ఆ విధంగా సమాధియోగస్థితుడై –

మ. త్రిజగన్మోహననీలకాంతిఁ దను వుద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నన్నెప్పుడున్.

మ. హయరింఖాముఖధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చు వేడ్క నని నా శస్త్రహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్.

మ. నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూడ్కులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై.

క. తనవారిఁ జంపఁజాలక
వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్
ఘనయోగవిద్యఁ బాపిన
మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

సీ. కుప్పించి యెగసిన కుడలంబుల కాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబు చేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నా లావు నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ

గీ. గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు; నిన్నుఁ గాఁతు
విడువు మర్జున ! యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి వచ్చెడు దేవుండు దిక్కు నాకు.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు పొమ్మంచు న
ర్జున సారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁబూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁజేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్.

క. పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలఁకులు వదలించు ఘనునిఁ గొనిచెద మదిలోన్.

ఆ. వె. మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా
మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమ తోడఁ జెలువొందు జగదాది
దేవుఁ డమరు నాదు దృష్టియందు.

మ. ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కడై తోఁచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న స
స్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

అని స్తుతించి ఆత్మస్వరూపుడైన శ్రీకృష్ణుని యందు మనోవాగ్దర్శన వృత్తులను నిలిపి అంతశ్శ్వాసుడై, దివసావసానంలో పక్షులు గూటిని చేరుకొన్నట్లు శాంతనవుడు నిరుపాధికబ్రహ్మాన్ని చేరుకొన్నాడు.

ఆ సమయంలో భూలోక స్వర్లోకాలలో దేవదుందుభులు మ్రోగాయి; సాధుస్తుతులు ఉచ్చైస్స్వరంతో చెలరేగి భూనభోంతరాళాలలో

ప్రతిధ్వనించాయి; పుష్పవృష్టి కురిసింది. మహర్షులు శ్రీకృష్ణుని వేనోళ్ళ పొగిడి తత్పరమతులై తమ తమ ఆశ్రమాలకు బయలుదేరారు. ధర్మరాజు భీష్ముని భౌతికకాయానికి యథోచితంగా సంస్కారాలను జరిపించి కృష్ణునితో కలిసి హస్తినాపురానికి తిరిగివచ్చాడు.

## ధర్మరాజు పట్టాభిషేకం

హస్తినకు చేరుకోగానే ధర్మరాజు పుత్రశోకార్తులై ఉన్న గాంధారీ ధృతరాష్ట్రుల వద్దకు వెళ్ళి నమస్కరించి వారిని ఓదార్చాడు. వారూ కొంత ఊరట చెంది, 'నాయనా! పితృపైతామహంగా నీకు సంక్రమించిన రాజ్యాన్ని అధిష్ఠించు' అని శాసనగర్భంగా బలవంతపెట్టారు. వారితో కలిసి శ్రీకృష్ణుడు కూడా గట్టిగా చెప్పాక ధర్మరాజు వారి ఆజ్ఞను శిరసావహించి రాజ్యం అధిష్ఠించి ధర్మ సహితంగా పరిపాలింపసాగాడు.

## ధర్మజుని పరిపాలన ప్రభావం

ధర్మనందనుని పరిపాలనలో ధర్మం సురక్షితమై నెలకు మూడు వానలు కురిసి వసుంధరాతలం సర్వసస్యాఢ్యమై శోభిల్లింది. రత్నాకరం రత్నాదిసంపదల తోను, పర్వతాలు ధాతుసమృద్ధి తోను పరిఢవిల్లాయి. లతావనస్పతులు ఫల పుష్పాలతో చెలువొందాయి. ఆయా ఋతువులలో ఓషధులు పుష్కలంగా పండాయి. ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికాలైన శారీర మానస వ్యాధులు వలసపోయాయి. రాజ్యమంతా యథాసుఖంగా ఉన్నది.

## శ్రీకృష్ణుని ద్వారకా ప్రయాణం

శ్రీకృష్ణుడు పాండవకార్యాలను తీర్చిదిద్ది చెల్లెలు సుభద్రను ఓదారుస్తూ ధర్మరాజాదులకు శోకోపశమనాలు కావిస్తూ కొన్ని నెలలు హస్తినాపురంలో గడిపి ద్వారకకు పయనమై ధర్మరాజుకు సమస్కరించాడు. ఆ రాజు కృష్ణుని విడువలేక గుండెలకు హత్తుకొని ఎంతో ఆదరించి యెట్టకేలకు

సమ్మతించాడు. ఆ తర్వాత కృష్ణుడు పెద్దలందరికీ నమస్కరించి, పిన్నల ప్రణామాల నందుకొని, చెలులను కౌగిట చేర్చి మన్నించి తదితరులను యథోచితంగా సత్కరించి రథం ఎక్కాడు. కృష్ణుని ఎడబాటును సహింపలేక పాండవ ధృతరాష్ట్ర ధౌమ్య కృపాచార్య విదురాదులకు, కుంతీ ద్రౌపదీ సుభద్రాది స్త్రీజనానికి కన్నీళ్ళ పర్యంతమయింది. కాని ప్రయాణ శుభసూచకం కాదని వారందరూ దుఃఖాన్ని లోలోపలే దాచుకొన్నారు. భేరీ శంఖ మృదంగాలు, వీణావేణువాద్యాలు ప్రయాణ మంగళసూచకంగా మ్రోగాయి. కౌరవ సుందరీమణులు సౌధతలాల నుంచి కృష్ణునిపై పుష్పవృష్టిని కురిపించారు. అర్జునుడు వెన్నంటి నిలిచి శ్వేతచ్ఛత్రాన్ని పట్టాడు. ఉద్ధవుడు, సాత్యకి చెరొక వంక నిలబడి వింజామరలు వీచారు. బ్రాహ్మణుల ఆశీర్వచనాలు మారుమ్రోగాయి.

## పురస్త్రీల శ్రీకృష్ణతత్త్వాభివర్ణనం

శ్రీకృష్ణభగవానుని రథం కదిలి రాజమార్గాన్ని ప్రవేశించింది. పురస్త్రీలు మార్గానికి రెండువైపులా ఉన్న ఎత్తైన మేడల మీదికి చేరి విస్ఫారితనేత్రాలతో రెప్పలల్లార్పకుండా చూసి లేత తామరతూండ్ల వంటి చేతులతో ఒకరికొకరు చూపుతూ శ్రీకృష్ణతత్త్వాన్ని మనసారా వర్ణించారు –

'ఆహా! ఈ పరమపూరుషుని కల్యాణగుణాలు బ్రహ్మవేత్తలకయినా కీర్త నీయాలంటే మనవంటివాళ్ళ సంగతి వేరే చెప్పాలా!

సత్త్వాదిగుణాలు ఈ మహాత్మునిలో లీనమైనప్పుడు నిష్ప్రపంచ మవుతుంది! సృష్టి అంతా సర్వశూన్యమయినప్పుడు ఈ మహానుభావుడు నిజస్వరూపమైన అద్వయస్థితిలో ఉంటాడుట కదా!

నిష్ప్రపంచావస్థానంలో జీవులు కూడా అందులోనే లీనమై ఉంటారు సుమా! బ్రహ్మత్వం కలిగిన జీవులకు లయం ఎలా

కలుగుతుంది? లయమంటే జీవులకు ఉపాధిభూతమైన సత్త్వాది శక్తులు లయమౌతాయని అర్థం!

బ్రహ్మాత్ములైన జీవులకు స్వయంగా లయం లేదు కదే?

సత్త్వాదిగుణశక్తులకు సంక్షోభం కలిగినప్పుడు ఏమవుతుంది? లీనావస్థలో నుంచి శక్తులు దృశ్యావస్థకు వస్తాయి. అదే సృష్టి!

అటువంటి మార్పుకు కారణం ఏమిటి?

ఈశ్వరుని కాలశక్తి ప్రేరణమే కారణం!

ఆ శక్తి కార్యమేమిటో నాకు వివరించి చెప్పవూ?

నామరూపాలు లేని జీవులకు నామరూపాలను కల్పించడమే దాని కార్యం....

అయితే శక్తికీ మాయకూ భేదం ఏమిటో నాకు అర్థం కాలేదమ్మా!

నామభేదమే తప్ప శక్తికీ మాయకూ వేరేమీ భేదాలు లేవు.

ఈ మాయ అన్నది చేతనమా? లేక వట్టి జడమా?

మాయ స్వయంగా జడస్వరూపిణి అయినప్పటికీ పరమేశ్వరుని అధిష్ఠాన ప్రభావంవల్ల ప్రవర్తిల్లుతూ అది చేతన వలెనే కనిపిస్తుందిలే!

మోహమంటే ఏమిటో నాకు అర్థమయేట్లు వివరించవూ?

నామరూపాలు సత్యమని భ్రమించడమే మోహ మనబడుతోంది!

జీవులకు మాయామోహం కలిగినపుడు స్వరూపజ్ఞానం ఎలా చేకూరుతుంది?

అందుకు స్వధర్మ కర్మలను ఆచరించి శుద్ధచిత్తులై నైష్కర్మ్యసిద్ధిని గడించాలి. భక్తియోగంలో అంతఃకరణాన్ని నిర్మలమొనర్చి ఏకాగ్రమతులై పరతత్త్వాన్ని గ్రహించినపుడు స్వరూపజ్ఞానం కలుగుతుంది....

భక్తియోగాన్ని పొందే సద్బుద్ధి మాకు ఏ విధంగా అలవడుతుంది?

దానిని ఈ మహనీయుడే దయతో అనుగ్రహించాలి తల్లీ!

అలాగైతే మనమూ ఈయనతో ద్వారకకు వెళ్ళిపోతే బాగుంటుంది కదూ! గుణాతీతుడైన ఈ మహాత్ముడు గుణకార్యం అయిన రూపాన్ని ఎందుకు ధరించాలి?

ఎందుకంటే – రాజులు తమోమతులై స్వధర్మాన్ని మరిచి అధర్మాన్ని అవలంబించినపుడు ధర్మసంస్థాపన కోసం స్వేచ్ఛామతియై సత్త్వగుణాన్ని అధిష్ఠించి భగవానుడు అవతరిస్తాడు కనుక! ఇది భగవదవతారమని నీవంటున్నావు గాని మాకెలా తెలుస్తుంది?

అమ్మా! ఒక్క విషయం గుర్తుంచుకో. ఎక్కడెక్కడ దయాధర్మాలు, సత్యప్రతిజ్ఞ, యథార్థోపదేశకత్వం, లోకోత్తరమైన మహాద్భుత కర్మలూ కాన వస్తాయో అవన్నీ భగవదవతారాలే!

ఈ ప్రియకీర్తనుని అవతార సంచారాల కలిమి వల్ల యదువంశం, మథురా నగరం పరమపావనమై ధన్యతను గాంచాయి....

ఈ పరమపావనుడు ద్వారకను రాజధానిగా చేసుకొన్నందువల్లనే అందులోని జనబృందాలకు ఈ ముకుందుని ఈ గోవిందుని ఈ నందనందనుని సానుగ్రహ మందహాస

మధురవిలోకన సుందర వదనారవిందాన్ని కన్నులారా కనుగొనే మహాభాగ్యం కలిగింది కదూ!

ఆహా! వ్రజకాంతలు ఈ జన్మలో ఈ జగన్మోహనునికి ప్రియురాండ్రు కావడానికి తొలి జన్మలలో ఎన్ని నోములు నోచి ఈశ్వరుని ఆరాధించారో!

ఈ సుభగుని ప్రాణనాథునిగా చేకొని నిరంతరం సంతోషంతో కాపురం చేస్తున్న రుక్మిణీ ప్రముఖ పతివ్రతలు వారి పూర్వజన్మలలో నియత నిర్మల మనస్సులతో ఎంత భక్తి పూర్వకంగా ఎటువంటి పుణ్యవ్రతాలను ఆచరించారో! భాగ్య మంటే వారిదే మహాభాగ్యం!

మన స్త్రీ జన్మకు స్వాతంత్ర్యమూ సుఖమూ లేకపోవడం లోకసిద్ధమై ఉండగా, ఈ లోకపావనమూర్తిని పంపించి నిస్సంకోచంగా పారిజాతాది వస్తువులను తెప్పించుకొంటున్న సత్యభామాదుల జన్మమే జన్మం!'

– అని స్త్రీలందరూ వారి వారి మనోగత రుచులను స్తుతుల రూపంలో వెల్లడించారు.

కృష్ణుడు వారి మాటలను ఆలకిస్తూ ధర్మరాజు తన రక్షణకోసం పంపిన చతురంగబలాలతో, తన వియోగాన్ని ఓర్వలేక వెన్నంటి వస్తున్న కౌరవప్రియులతో ముందుకు సాగాడు.

## శ్రీకృష్ణుని ద్వారకా ప్రవేశం

శ్రీకృష్ణుడలా హస్తినాపురం నుంచి వెలువడి కొంతదూరం వెళ్ళాక తన వెంటవచ్చిన ఆత్మీయులందరినీ వెనుకకు మరలించి, కురుజాంగల పాంచాల శూరసేన దేశాలను, యమునా సరస్వతీ తటప్రదేశాలను, బ్రహ్మావర్త కురుక్షేత్ర మత్స్యాలను, మరుభూములను, సౌవీర ఆభీర సైంధవాలను

విలోకిస్తూ ఆయా ప్రదేశాల లోని ప్రజలు భక్తి పూర్వకంగా కావించిన పూజాదికం గ్రహిస్తూ సూర్యుడు పడమటికి వాలే సమయానికి ద్వారకను చేరుకొని, డస్సిన రథాశ్వాలకు సేదతీరేదాకా కొంత సేపు ఆగి, ఆ దేశజనులకు తన రాక తెలిసేందుకు పాంచజన్యాన్ని పూరించాడు. ఆ తెల్లని శంఖం కృష్ణుని పెదవుల శోణకాంతిని పొంది, ఎర్ర కలువల నడుమనున్న రాజహంసిలా అతని కరకమల సంపుటాంతరంలో శోభిల్లి మహాధ్వని కావించింది.

జగద్భవభయాపహమైన ఆ శంఖారావం చెవిసోకినంతనే ద్వారకావాసుల ఉల్లం పల్లవించింది. పురజనులందరూ ఒకరితో ఒకరు పోటీలు పడి పురాన్ని అలంకరించారు. గోపుర ద్వారమార్గాలు లలిత పుష్ప పల్లవ తోమరాలతో రమణీయంగా భాసించాయి. పొడయెండకు కూడా సందులేనట్లు చిత్రధ్వజ పతాకాదులు లేచాయి. రాజమార్గాలను, పుణ్యవీథులను, చతుష్పథాలను ఊడ్చి పన్నీటి జలాలు చల్లి ఫలపుష్పతోమరాలను తీర్చారు. గృహద్వారాలు పూర్ణకుంభాలతో బలిద్రవ్యాలతో ధూప దీపాలతో పాలు పెరుగులు అక్షతలు పక్వఫలాలు ఇక్షుకాండలతో కన్నుల పండువుగా నిండారాయి.

కృష్ణుని రాక విని ప్రద్యుమ్న సాంబ గదాదులు సంతోషపరవశులై హుటాహుటిని శంఖతూర్యనినదాలతో బ్రహ్మఘోషలతో మంగళద్రవ్యాలతో తరలి దిగ్గజాన్ని పోలిన రాచయేనుగును సాలంకృతంగా ముందుంచుకొని ఎదురువచ్చారు. నగర వాసులు కానుకలు తీసుకొని పైపైని పడుతూ తోసుకొనివచ్చి తండ్రిని కనుగొన్న బిడ్డల వలె కూర్మిపేర్మలతో కృష్ణుని సమీపించి, 'ప్రభూ! ఏ నీ పాదారవిందం బ్రహ్మేంద్ర సనకాదులకు సేవ్యమానమై తనరారుతున్నదో, ఏ నీ పాదారవిందం సంసారసాగర తరణపరాయణులకు పరమ పారాయణమో, ఆ నీ పాదారవిందానికి, త్రిలోకమోక్షావహమైన దానికి ఇదే – ప్రణమిల్లుతున్నాము. ఎవనిని కాలం కూడా ఆశ్రయించి గాని వర్తింపలేదో, ఎవనికి జగద్రక్షణ భరణాదులు

స్వయంకల్పిత నిరంతర వ్యాపారాలో, ఎవని దివ్యమంగళవిగ్రహం సర్వసౌభాగ్యనిధానమై ప్రేమస్మిత స్నిగ్ధవిలోచన సుందర వదనారవింద రమణీయమై స్వర్లోకవాసులకు కూడా దుర్దర్శమై ఒప్పారుతుందో, ఆ జగజ్జీవుని నిన్ను కనుగొనని క్షణం మాకు కోటి సంవత్సరాలతో సమానం. స్వామీ! ఎన్నడూ మమ్మల్ని విడిచి వెళ్ళకు!' అని వినయమధురంగా పలికి కానుకలను అర్పించారు.

కృష్ణుడంతట పెద్దలకు ప్రణమిల్లి, వాచానతులతో కొందరిని, సమాలింగనాలతో కొందరిని, శుభాశీర్వచనాలతో కొందరిని, హస్తగ్రహణాలతో కొందరిని, మందహాసాలతో కొందరిని, దయార్ద్రదృష్టివిశేషాలతో కొందరిని ఆపూజ్యచండాలమూ అందరినీ ఆదరించి ఊరడించి ఇష్టాలను కూర్చి మన్నించి, గురు వృద్ధ బ్రాహ్మణాశీర్వాదాలను తలతో గ్రహించి, వందిస్తుతులను చిత్తగిస్తూ రాజమార్గాన్ని ప్రవేశించాడు.

కులస్త్రీలు మేడలెక్కి కృష్ణునివంక చూపు నిలిపి, తమ ఆనందాన్ని వెల్లడిస్తూ అతనిపై దోసిళ్ళతో పూలవాన కురిపించి తమ జన్మసాఫల్యమైనట్లు భావించారు –

**సీ. కలుముల నీనెడి కలకంఠి యెలనాఁగ**
**వర్తించు నెవ్వాని వక్షమందు**
**జనదృక్చకోరక సంఘంబునకు సుధా**
**పానీయపాత్ర మే భవ్యు ముఖము**
**సకల దిక్పాల సమితికి నెవ్వాని**
**బాహుదండంబులు పట్టుగొమ్మ**
**లాశ్రితశ్రేణి కే యధిపుని పాద రా**
**జీవయుగ్మంబులు చేరుగడలు**

**ఆ.వె. భువనమోహనుండు పురుషరత్న మెవండు**
**చిరపరిచితుఁ డయ్యుఁ బరఁగు నెవఁడు**
**క్షణవినూత్నుఁ డగుచుఁ; గంటి మ మ్మహనీయుఁ**
**గంటి కఱవు తీఱెఁ గాదె మాకు!**

కృష్ణుడు నగరాన్ని ప్రవేశించి తల్లిదండ్రులకు మ్రొక్కి తక్కిన తల్లులకు నమస్కరించాడు. వారందరూ అతనిని కౌగిట చేర్చుకొని స్తనక్షీరాలు తొలుకాడగా అతనిని తొడలపై కూర్చుండబెట్టుకొని హర్షబాష్పాలతో జలకమార్చి దీవించారు.

కృష్ణుడు కొంతసేపు వారందరినీ వినయ మధురోక్తులతో సంతోషపెట్టి తన మేడకు వెళ్లాడు.

చిరకాలానికి దేశాంతరం నుంచి తిరిగివచ్చిన ప్రాణనాథుని దూరాన్నుంచి చూడగానే శ్రీకృష్ణపత్ను లందరూ ప్రవాసవ్రతలైనా ఉత్కంఠను ఆపుకోలేక మనస్సుల లోనే అతనికి సమాలింగన సన్మానాల నర్పించి, సిగ్గుతో తలవంచుకొని క్రీగంటి చూడ్కులతో అతని ముఖంలోనికి చూసి, కొడుకులను అందించే నెపంతో అతని గాఢాలింగనాన్ని పొంది ఆనందాశ్రువులు పొంగివస్తున్నా భావగాంభీర్యాలు కనుక లోలోపలే అణచుకొని అపూర్వమైన సుఖానుభూతిని పొందారు.

సహజంగానే చంచలస్వభావ, చపలచిత్తురాలూ అయిన లక్ష్మి అంతటామె అతని వియోగాన్ని సహింపలేక స్థిరంగా గుండెలో గూడుకట్టుకొని ఉంటుందంటే, అన్యకాంతల సంగతి వేరే చెప్పేదేమ్నుది?

మునులారా! ఒక్కొక్కప్పుడు భగవంతుని వర్తనం సామాన్యదృష్టికి చిత్రంగా తోచవచ్చు. ఇటు చూడండి, లోకంలో పాపాత్ములు రాజులై పుట్టి అధర్మమార్గాన్ని తొక్కారు. వారు జీవించి ఉండటం భూమికి మోయరాని బరువయింది. భగవంతుడు అవతరించి వెదురు పొదలతో వాయువులా రాజులలో రాజులకు అన్యోన్యాంతఃకలహాగ్నిని కూర్చి పద్దెనిమిది అక్షౌహిణుల

సైన్యాన్ని ఒక్కసారిగా భస్మీపటలం చేసి భూభారాన్ని తగ్గించాడు. మానవలోకంలో అవతరించినపుడు ఆ భగవంతుడు మానుషవేషానికి తగినట్లుగా ప్రాకృతపురుషుని వలెనే ప్రవర్తిస్తాడు. మదనాంతకుని కూడా మోహపరవశుని కావించిన ఆయనను చూసి సామాన్యస్త్రీలు మోహపడటంలో వింత లేదు. ఆయన స్త్రీలతో సలిపిన క్రీడలన్నీ లీలామాత్రాలే కాని కామవశాలు కావు. భగవంతుడు పూర్ణుడైనందున ఆయనకు కోరదగినదేదీ ఉండదు. ప్రకృతిస్థితుడై వ్యవహరిస్తున్నా దన్నమాటే గాని ఆ మహాత్ముడు ప్రకృతిగుణాలకు అతీతుడై ఉంటాడు. భగవదైశ్వర్య ప్రభావమంటే ఇదే. ఈ రహస్యాన్ని గ్రహింపలేక అబలలు మౌఢ్యానికి చిక్కి అహంకారాది వృత్తుల వలె పరమేశ్వరుడు తమకు వశమై ఉంటాడని భ్రమించి వర్తించారు. భగవత్క్రీడలలోని పరమార్థాన్ని తెలుసుకొన్న జ్ఞానులకు ఇది విచిత్ర మనిపించదు.

## పాండవ వంశాంకురం

మునీంద్రులారా! ఉత్తరాదేవి గర్భవతిగా ఉన్నదని చెప్పాను కదా, భగవంతుడు ఆమె గర్భంలోనికి ప్రవేశించి అంగుష్ఠమాత్రశరీరుడై ఆమె కడుపున పడిన శిశువు ప్రాణాన్ని కాపాడసాగాడు. ఆ శిశువు తన చెంత నున్న మహాపురుషుని కనక రత్న కిరీటం, నీలసుందర దివ్యగాత్రం, పీతాంబరం, దీర్ఘ చతుర్బాహువులు, తప్త కాంచన కుండలాలు, క్రోధ తామ్రవిలోచనాలను వింతగా చూసి, ఇతనెవరో? అని లోలోన పరీక్షింపసాగింది.

చూస్తూ ఉండగానే ఉత్తరకు నెలలు నిండాయి. గర్భంలోని ఆ మహాపురుషుడు అంతర్ధాన మయ్యాడు. ఒకనాటి శుభలగ్నాన పాండవ వంశాంకురం జన్మించింది. కొడుకు పుట్టినందుకు అందరూ సంతోషించారు.

ధర్మరాజు ధౌమ్యకృపాదులతో సంప్రదించి వారి ఆదేశానుసారం శిశువుకు జాతకర్మాదులను కావించి అందరికీ వివిధ దాన మృష్టాన్నాలతో విందు చేశాడు.

## నామకరణం

పాండవ శిశువుకు నామకరణ సమయం దగ్గరపడగానే ధర్మరాజు జ్యోతిష్కులను పిలిపించి ఆ బిడ్డకు తగిన పేరుపెట్టాలని అభ్యర్థించాడు. వారు జన్మనక్షత్రాదులను పరీక్షించి, ' రాజా! ఈ పాపడు పాండవుల వంశోద్ధరణకై అవతరించిన కారణ జన్ముడు. శ్రీమహావిష్ణువు చేత రాతుడు (ఇవ్వబడినవాడు) కనుక ఇతనికి విష్ణురాతు డనే పేరు అన్వర్థంగా ఉంటుంది' అని ఆదేశించారు.

## జాతక ఫలం

ఆ తర్వాత జ్యోతిష్కులు శిశువు జాతకాన్ని పరిశీలించి, 'ధర్మనందనా! ఇతను గొప్ప రాజవుతాడు; ప్రజాపరిపాలనంలో మనుపుత్రుడై ఇక్ష్వాకువును తలపింపజేస్తాడు; బ్రాహ్మణభక్తి సత్యవ్రతాలచే శ్రీరామచంద్రునికి సరిపోలుతాడు; శరణాగత రక్షణలో శిబిచక్రవర్తిని మరపిస్తాడు; ధనుర్విద్యావిశారదుడై అగ్ని వలె చెనకరాక సముద్రుని వలె దాటరాక బహుకాలం రాజ్యాన్ని పరిపాలిస్తాడు. సజ్జనులకు హిమవంతుని చందాన సేవ్యుడై భూమి వలె శాంతుడు, బ్రహ్మ వలె సమదృష్టి కలవాడు, శంకరుని వలె ప్రసాదకరుడు, రంతిదేవుని వలె ఉదారమతి, యయాతి వలె ధార్మికుడు, బలి వలె ధృతిమంతుడు, ప్రహ్లాదుని వలె విష్ణుభక్తుడూ అయి సమస్త సద్గుణ ప్రభావంతో శ్రీకృష్ణునికి సాటివస్తాడు. అంతే కాదు. ఇతను వృద్ధులను ఉపాసించి, పెక్కు హయమేధయాగాలను అనుష్ఠించి, ధర్మనిర్వహణార్థం కలిని నిగ్రహించి దిగంత విశ్రాంత కీర్తిమంతు డవుతాడు. జనమేజయాది రాజర్షులకు జనకుడై ఉత్తమలోకాలను అధిరోహిస్తాడు. శృంగి శాపం వల్ల ఇతనికి తక్షకుని ద్వారా మృతి కలుగుతుంది. ఆ సంగతిని ముందుగానే తెలుసుకొన్నవాడై శుకమహర్షి వలన ఆత్మతత్త్వాన్ని గ్రహించి గంగాజలాలలో పాంచభౌతికదేహాన్ని త్యజించి విష్ణుపదాన్ని చేరుకొంటాడు' అని జాతక ఫలాన్ని విశదీకరించారు.

ధర్మరాజు వారి మాటలకు ఎంతో సంతోషించి, వారందరినీ యథోచిత సత్కారాలతో గౌరవించి పంపాడు.

విష్ణురాతుడు గర్భస్థుడై ఏ మహాపురుషుని కనుగొన్నాడో, ఆ మహానుభావుడు సర్వప్రాణులనూ అతని హృదయాంతరంలో నిలిచి పరీక్షిస్తుంటాడు.

గర్భస్థశిశువుగా ఉన్నప్పుడు శ్రీమహావిష్ణువుచే విశిష్టంగా పరీక్షితుడైనందున విష్ణురాతునికి పరీక్షిత్తు అని పేరు కలిగింది.

## ధర్మజుని యాగసంకల్పం

శ్రీకృష్ణభగవానుడు ధర్మరాజు మనశ్శాంతి కోసం భీష్ముని వద్దకు తీసుకొని వెళ్ళి సమస్త ధర్మాలనూ వినిపింపజేసినా అతనికి మనస్సు లోని కొరత పూర్తిగా తీరలేదు. జ్ఞాతివధ వల్ల కలిగే మహాపాతకపు శంక అతనిని వెన్నాడుతూనే ఉన్నది. ఆ పాపానికి ప్రాయశ్చిత్తంగా అతను అశ్వమేధ యాగాలు చేయాలని సంకల్పించాడు.

యాగమంటే మాటలతో పనికాదు. అందుకు ఎంతో ధనం కావలసివచ్చింది. అంతే కాదు. ఆ ధనం న్యాయంగా ఆర్జించినదై ఉండాలి. అన్యాయార్జితమైన విత్తంతో యాగం చేయకూడదు.

న్యాయార్జితంగా రాజులకు రాజ్యపు ఆదాయంలో ఆరవ పాలు, దుష్టశిక్షణవల్ల లభించే ధనమూ మాత్రమే అందుబాటులో ఉంటుంది. ఆ విధంగా వచ్చిన ధనాన్ని రాజ్యపరిపాలనార్థమై వినియోగించాలే తప్ప ఇతరకార్యాలకు వెచ్చింపకూడదు.

అందువల్ల ధర్మరాజు యాగనిర్వహణకు కావలసిన ధనం లభించలేదు. తన సంకల్పం నెరవేరే మార్గం తోచక అతను చింతాక్రాంతు డయ్యాడు.

అన్నగారి మనోదుఃఖాన్ని చూడలేక భీమాదులు కృష్ణునితో ఆలోచించారు. పూర్వం మరుత్తుడనే రాజు యజ్ఞం చేసి ఆ యజ్ఞభూమిపై సువర్ణ

పాత్రాదిరూపమైన అపరిమితధనాన్ని అక్కడే విడిచిపెట్టాడు. ఆ చోట పుట్టలూ గుట్టలూ పెరిగి ఆ ధనాన్ని కప్పివేశాయి. ఆ సంగతి ప్రస్తావనకు వచ్చింది. అక్కడ ఉన్న ధనాన్ని తెచ్చి ధర్మరాజుని యజ్ఞాన్ని కొనసాగించాలని నిశ్చయించుకొన్నారు.

ఆ సంపదలను తెప్పించాక ధర్మరాజు మూడు అశ్వమేధయాగాలు చేసి యజ్ఞేశ్వరుడైన శ్రీహరిని ఆరాధించాడు. ఆ యజ్ఞాలకు ఆహూతుడై కృష్ణుడు వచ్చి కొన్ని నెలలుండి అర్జునుని ద్వారవతికి తీసుకొని వెళ్ళాడు.

## విదుర ధర్మజుల సంభాషణం

పాండవులు జ్ఞాతులకు ఉదకతర్పణలు కావించి హస్తినకు తిరిగివెళ్ళినప్పుడు విదురుడు మాత్రం గంగాతటం నుంచి తీర్థయాత్రకు బయలుదేరి మైత్రేయ మహర్షిని సందర్శించి తత్త్వార్థాన్ని గురించి తనకున్న సందేహాలు అడిగి సమాధానాలు తెలుసుకొన్నాడు. తత్ఫలంగా అతనికి భగవంతుని యెడ ఏకాంతభక్తి ఉదయించింది. అంతటితో అతను సంతృప్తుడై హస్తినాపురానికి మరలివచ్చాడు.

చాలా కాలానికి గృహోన్ముఖుడైన విదురునికి పాండవులు, ధృతరాష్ట్రుడు, యుయుత్సుడు, సంజయుడు, కృపాచార్యులు, కుంతి, గాంధారి, ద్రౌపది, సుభద్ర, ఉత్తర, కృపి, ఇంకా పాండవజ్ఞాతుల భార్యలు, బంధువర్గం అందరూ ఎదురేగి స్వాగతించారు. మూర్ఛానంతరం వికారరహితమై ఇంద్రియాలు కుదుటబడినట్లు విదురుని దర్శనం వలన ఉల్లాసం కలిగి, అతనిని యథావిధి ఆదరించి, ఇంటికి తీసుకొనివచ్చి స్నాన పానాది సర్వోపచారాలతో గౌరవించారు. విదురుడు భోజనం చేసి కొంచెం విశ్రమించి సేదతీర్చుకొన్నాడు.

అప్పుడు ధర్మనందనుడు విదురుని ఉచితాసనంపై కూర్చుండబెట్టి తనవారందరూ వింటుండగా కుశలప్రశ్నలు వేశాడు. 'అయ్యా! మీ రెక్కల

చాటున పెరిగాము. మీ అనుగ్రహం వల్ల చిన్నప్పుడు విషానలాది విపత్పరంపరల బారినుంచి బయటపడ్డాము. మమ్మల్ని మరిచిపోలేదు కదా. ఏ వృత్తితో మీరు ఇన్నాళ్ళూ భూసంచారం కావించారు? ఏయే తీర్థాలను సేవించారు? అనఘా! మీవంటి తీర్థభూతులు పరమభాగవతులు తీర్థాలకే తీర్థములై వెలసినట్టివారు. ద్వారకానగరాన్ని వీక్షించారా? అక్కడ మన బంధుమిత్రాదులు కుశలమేనా? శ్రీకృష్ణుని సందర్శించారా? క్షేమమే కదా?' అని అడిగాడు. విదురుడు ఆ వచనాలను విని, 'ఔరా! అసత్యం చెప్పకూడదు. ధర్మనందనునికి అప్రియమూ పలుకకూడదు' అని లోలోన తలపోసి, మాట తప్పించి, తన తీర్థయాత్రానుభవాలను మాత్రమే వివరించి విరమించాడు. అక్కడే ఉంటూ తన అన్న ధృతరాష్ట్రునికి, తక్కినవారికి ప్రీతికరంగా మెలగజొచ్చాడు.

మునులారా! విదురుడంటే ఎవరో యెరుగుదురా? అణిమాండవ్య మహర్షి శాపం వల్ల యముడు శూద్రకులంలో విదురుడై జన్మించాడు. ఆ శాపం నూరేండ్లు. అందాకా యమలోకపాలనం ఏమయిందంటారా? యముని కోసం అతని తండ్రి సూర్యుడు ఆ భారాన్ని వహించాడు.

## ధృతరాష్ట్రునికి విదురోపదేశం

సంయమీంద్రులారా! ఒకనాడు ధృతరాష్ట్రుడు ఏకాంతంగా ఉన్న అదను కనిపెట్టి విదురుడు రహస్యంగా అతని వద్దకు వెళ్ళాడు. 'కౌరవేంద్రా! మనకు కాలం సమీపించింది. దానిని ఎదుర్కోవడమూ దాటడమూ సాధ్యం కాదు. ఇక నీవు ఇక్కడ ఉండకూడదు; వెంటనే బయలుదేరు. సిరి పోయినా సరే గాని ప్రాణాలు నిలిస్తే చాలనుకొంటారు. ప్రాణాలు అంత తీపి అయినా కాలం మూడినప్పుడు ఏమి చేసినా పోకుండా ఆగవు.

నీ తల్లిదండ్రులు చనిపోయారు; కొడుకులందరూ గతించారు; భ్రాతలూ బాంధవులూ నశించారు. ముసలితనం నిన్ను మింగివేస్తున్నది. ఇంకా వట్టి ఇంటి కోసం ఈ మమకారం దేనికి? కళ్ళు కనిపించవు; చెవులు వినిపించవు;

పండ్లన్నీ రాలిపోయాయి; బుద్ధి సన్నగిల్లింది; ఆకలిదప్పు లుడిగాయి; ఇంకా నీకు జీవితాశ పోదేమి?

రాజా! ఈ మొండిప్రాణం కోసం, భీముడు పడవేసే పిండాని కోసం నోరు చాచి సిగ్గులేకుండా వేచి ఉంటావా? ఎవరిని నీవు విషాగ్నిపాలు చేసి భార్యాపరిభవ రాజ్యాపహరణాది క్లేశపరంపరలకు అప్పగించావో వారు కనికరించి మొహాన కొట్టిన కూడు తిని బ్రతకమూ ఒక బ్రతుకేనా? అటువంటి ప్రాణాలు ఉంటేనేమి? పోతేనేమి? ఈ నీచజీవితం ఇంకానా? ఇంతకన్నా దిగజారినా బతికే ఉంటావా? మృత్యువన్నాక నిన్ను వదులుతుందా? చీకుబొంతలా జరాజీర్ణమైన శరీరం దాచినా నిలిచేది కాదు. ఆశలను దులిపి విరాగియై తనుత్యాగం చేయగలవాడే ధీరుడు. అంత వైరాగ్యం నాకు ఈ ముసలితనంలో ఎక్కడినుంచి వస్తుందంటావేమో, వైరాగ్యం జ్ఞానఫలంగా కలుగుతుంది. ఆ జ్ఞానం కొందరికి పూర్వసుకృతఫలంగా పుట్టుక తోనే పుడుతుంది. అటువంటి పుణ్యాత్ములు ఎంతో అరుదుగా ఉంటారు. పెక్కుమంది దానిని పరుల ఉపదేశం వల్ల పొందుతారు. ఇంక నువ్వూ నీ భావిగతిని ఆలోచించుకొని ఉత్తరదిశగా వెళ్ళు. ఆలస్యం చేయవద్దు' అని ప్రబోధించాడు.

## ధృతరాష్ట్రుని ప్రయాణం

తమ్ముడి మాటలను విని ధృతరాష్ట్రుడు తెలివి తెచ్చుకొని గుండె రాయిచేసి కొని స్నేహపాశాలను తెంచివేసి ఎవరికీ చెప్పకుండా ఆ రాత్రికి రాత్రి బయలుదేరి ఉత్తరాభిముఖంగా వెళ్ళిపోయాడు.

పతిని వెన్నంటి గాంధారి కూడా హిమవత్పర్వతాన్ని చేరింది. వారిద్దరినీ అనుసరించి విదురుడూ అక్కడికి వచ్చాడు.

మృత్యుభయాకులమై చావుదెబ్బలతో కూడిన సంగ్రామం శూరులకు ప్రియంకరమైనట్లు తుహినదుర్భరమైన హిమాచలం సన్న్యాసులకు ప్రియావహం గానే ఉంటుంది.

## ధర్మజుని విచారం

తెల్లవారగానే ధర్మనందనుడు దినకృత్యాలు తీర్చి విప్రులను తిల గో కనక వస్త్రాదిదానాలతో యథావిధిగా పూజించి గురుజనులకు అభివాదం చేయడానికి ధృతరాష్ట్రుని మందిరానికి వెళ్ళాడు. అక్కడ గాంధారీ ధృతరాష్ట్రులు, విదురుడు లేరు. ధర్మజుడు నివ్వెరపోయి పరిచారకులను విచారించాడు. వారు మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు.

అప్పుడు ధర్మరాజు సంజయుని చూసి, 'సంజయా! కళ్ళు కనిపించని పండు ముసలి నా తండ్రిగారెక్కడ? పుత్రశోకంతో క్రుంగిపోతున్న నా తల్లి గాంధారి యెక్కడ? మందమతినై వారికేదయినా అపచారం చేశానా? దుఃఖాన్ని భరింపలేక ఏ అఘాయిత్యమో చేయలేదు కద? మా తండ్రి చనిపోయిన నాటి నుంచి మమ్మల్ని చేరదీసి ఒళ్ళో దాచుకొని కాపాడిన తల్లిదండ్రు లేమయ్యారు?' అని డగ్గుత్తికతో అడిగారు.

జరిగిన సంగతి సంజయుడికీ తెలియదు. అతను కూడా వారికోసం దిగులుపడి 'రాజేంద్రా! ధృతరాష్ట్ర విదురులు రాత్రి చాలాసేపు ఏకాంతంగా మాట్లాడుకొన్నారు. ఆ తర్వాత వారిని గురించి నాకు తెలియదు. నేను మోసపోయాను' అని దుఃఖాన్ని పొందాడు.

## నారదోపదేశం

మునులారా! అంతలోనే నారదమహర్షి తుంబురునితో కలిసి అక్కడికి వచ్చాడు. ధర్మజుడు వారికి ప్రణమిల్లి, యథార్హపూజలు కావించి, 'నారదమహర్షి వర్యా! మా పెదతల్లిదండ్రులు గాంధారీ ధృతరాష్ట్రులు ఎక్కడికి వెళ్ళారో ఏమయ్యారో తెలియక దుఃఖాబ్ధిలో మునిగి ఉన్న మాకు మా పురాకృత సుకృత ఫలంగా మీ దివ్యదర్శనం లభించింది. మాకు దారిచూపండి' అని వేడుకొన్నాడు.

నారదమహర్షి అతని మాటలు విని, 'రాజేంద్రా! దుఃఖించకండి. సర్వమూ ఈశ్వరాధీనం. ఒకరితో ఒకరు కూడటం, ఒకరి నొకరు వీడటం

ఈశ్వరకల్పితం గానే జరుగుతున్నది. ఆటలాడుతున్నవాని చేతిలోని బంతి వలె విశ్వగమనం జగత్ర్కీడి అయిన భగవంతుని ఇచ్ఛానుసారం ప్రవర్తిల్లుతుంది. బండివాడు ముక్కుతాడుతో ఎడ్లను కట్టినట్లు భగవంతుడు కార్యాకార్యవిధాయక నిగమసూత్రంతో లోకాలనూ లోకేశులనూ బంధించి వర్ణాశ్రమరక్షణ భారాలను యథేచ్ఛగా మోయిస్తుంటాడు. సర్వం ఈశ్వరేచ్ఛానుసారం కనుక ఇందులో ఎవరూ దేనికీ కర్తలు కారు.

రాజేంద్రా! జీవదృష్టితో పరిశీలిస్తే లోకం నిత్యవస్తువు. దేహదృష్టితో చూసినపుడు అదే అనిత్యం. లోకం శుద్ధబ్రహ్మరూపమని కొందరు, అనిర్వచనీయ మని కొందరు చెబుతారు. చక్కగా విచారించితే అది ఈ రెండింటికీ విలక్షణమని తెలుస్తుంది. చిజ్జడాంశయోగదృష్టితో పరికిస్తే అది నిత్యమూ అనిత్యమూ రెండూ అవుతుంది. ఈ నిత్యానిత్యాది భావాలు నాలుగూ మోహఫలాలే కాని పరమార్థసత్యాలు కావు.

మోహఫలం వల్ల స్నేహభావం కలుగుతుంది. ఆ స్నేహం శోకకారణ మవుతున్నది. కనుక ఇటువంటి అజ్ఞానజనితమైన మనస్తాపం కూడదు.

రాజా! నీ దుఃఖానికి కారణం ఏమిటి? నిన్ను విడనాడి వెళ్ళినందు వల్ల నీ తల్లిదండ్రులు రక్షణహీనులయ్యారని దుఃఖిస్తావా? లేక ఎట్లా బతుకుతారో ఏమిటో అని దుఃఖిస్తావా? రెండింటా నీ దుఃఖం నిష్కారణమే. ఈ దేహాదులు కాల కర్మ గుణాల అధీనంలో ఉంటాయి. కాలమూ గుణమూ సంక్షోభిస్తాయి. దానినే కర్మము అంటారు. ఆ కర్మము జన్మకారక మవుతున్నది. కాలం నిమిత్తకారణం; గుణాలు ఉపాదాన కారణాలు. కాల కర్మ గుణాలు మూడింటికీ వశమై పాంచభౌతికాలైన ఈ జడశరీరాలు వర్తిల్లుతుంటాయి. ఈ మూడింటికీ విభాగం కలిగినప్పుడు దేహం పతనమవుతోంది.

ధర్మజ్ఞా! నీ దేహమే నశ్వరస్వభావం కలిగినదై నీటిబుగ్గ వంటిది కాగా ఇతరుల దేహం కొరకు విచారిస్తావేమిటి? విచారించి మాత్రం నువ్వు చేయగలిగినదేమున్నది? పాము నోట్లో పడినట్లు కాలానికి, కర్మకు,

గుణాలకు చిక్కిన ప్రాణి ఏమీ చెయ్యలేదు. కనుక వారి దేహార్థమైన నీ శోకాన్ని చాలించు.

కాదు. వారి జీవనార్థం శోకిస్తున్నానంటావా? చేతులున్న నర వానరాదులకు చేతులు లేని జంతువులు ఆహారం. పాదాలు కలిగిన - పశు పక్షి మృగాదులకు పాదాలు లేని తృణాదులు ఆహారం. వ్యాఘ్రాది మహాబలం కలిగిన సత్త్వాలకు అల్పజంతువులు ఆహారం. జీవం చరాచరాలు అన్నింటిలోనూ ఉన్నది. కనుక జీవునికి జీవుడే ఆహార మన్నమాట. ఈ విధంగా సర్వజీవులకూ జీవనవ్యవస్థను భగవంతుడే ఏర్పరచి ఉంచాడు. పుట్టించినవాడు పెట్టకమానడు. కనుక నీ తల్లిదండ్రులను గూర్చిన చింత నీకు తగదు.

రాజా! జగత్సర్వమూ చేతులున్న, చేతులు లేని జీవరాశితో నిండి మృత్యుగ్రస్తమై ఉండటాన్ని చూశావు కదా. ఇన్ని రూపాలలో ఉన్న జగత్తంతా భగవంతుడే కాని భగవంతుని కంటె వేరు కాదు. ఆ భగవంతుడు ఒక్కడే కాని పెక్కుమంది భగవంతులు ఉండరు. మరి భగవంతు డొకడే అయితే, లోకమంతా భగవద్రూపమే అయితే, లోకంలో కనుపిస్తున్న సజాతీయ విజాతీయ భేదాలకు కారణం ఏమిటి? అని అడగవచ్చు. అలాగైతే లోకమంటే ఏమిటో ముందుగా పరిశీలించాలి. భోగించే వస్తు సముదాయాన్ని, భోగింపబడే వస్తు సముదాయాన్ని లోకం అంటారు. ఆ రెండూ ఆత్మ - అంటే భగవత్స్వరూపాలే అవుతాయి. అందులో జాతిభేదం ఎలా కలిగిందంటే? సజాతీయ శబ్దానికి ఒక్క కోటికి సంబంధించినదని భావం. ఒక దృష్టాంతం విను. వృక్షాలన్నీ ఒక్క వృక్షజాతికి చెందినవే కదా. అది సజాతీయం. విజాతీయమంటే వేరు వేరు జాతులకు సంబంధించినవని అర్థం. వృక్షాలు వృక్షవర్గానికి సంబంధించినట్లే పశువులు పశువర్గానికి చెందుతాయి. కనుక వృక్షజాతికీ పశుజాతికీ ఉన్న భేదం స్పష్టమే. ఈ భేదాన్ని విజాతీయభేదం అంటారు. ఈ భేదాలన్నీ ఉపాధిభేదాల వల్ల ఏర్పడుతున్నవే గాని ఆ ఉపాధుల బహిరంతరాలలో ఉన్న పరమార్థవస్తువుల భేదాన్ని బట్టి

ఏర్పడలేదు. బహిరంతరాలలో ఉన్న వస్తువు ఒక్కటే. ఆ ఏకవస్తువునే భగవంతుడు అంటాము. అంటే, సృష్టిలో తనుభేదమే కాని తనుమద్భేదం లేదు.

ధర్మరాజా! ఒక్కడే అయితే అనేక రూపాలలో ఎలా గోచరిస్తున్నాడని నీవు అడగవచ్చు. భగవంతు డొక్కడే అయినా తన మాయాప్రభావం వల్ల పెక్కింటిగా కనిపిస్తాడు. ఆ బహుత్వం కేవలం భ్రాంతి జనితం. అట్లా ఎందుకు కనిపించాలి? అంటే, అది భగవత్సంకల్పం. ఆ భగవంతుడు ఎక్కడ ఉంటాడు? అంటే, ఎల్లెడలా ఉంటాడు. ఇప్పుడు ద్వారకలో దృష్టిగోచరరూపాన్ని దాల్చిన కృష్ణుడు ఆ భగవంతుడే కదా. అక్కడుండటం దేనికి? అంటే, ఆయన సురద్వేషులైన దుష్టులను సంహరించడమనే సురకార్యాన్ని నెరవేర్చడానికి అవతరించాడు. ఆయన కార్యం ఇంకా కొంత మిగిలి ఉన్నది. అందాకా ఆయన అక్కడుంటాడు. మీరూ అందాకా వేచి ఉండాలి.

రాజా! ధృతరాష్ట్రుని సంగతి అడిగావు. పూర్వం దేవనది సప్తమహర్షుల ప్రీత్యర్థమై ఏడు పాయలుగా చీలింది. అక్కడొక పుణ్యాశ్రమం ఏర్పడింది. ధృతరాష్ట్రుడు ఆ ఆశ్రమాన్ని చేరి యోగవ్రతుడై స్నానజపహోమాదులు చేస్తూ జలాహారం మాత్రమే స్వీకరించి యమాన్ని అధిష్ఠించి పుత్రాది ఈషణాలను వదిలి ఆసన ప్రాణాయామ ప్రత్యాహారాదులను ఆచరిస్తూ చితాసనుడూ హరిభావనుడూ అయి ధారణను సాధించి గుణకార్యాలకు దూరుడై చిత్తాన్ని ధ్యానగతిని పొందించి విజ్ఞానియై దృశ్యం నుంచి ఆ చిత్తాన్ని తొలగించి ద్రష్ట అయిన క్షేత్రజ్ఞుని యందు చేర్చి అక్కడి నుంచి దానిని బ్రహ్మము నందు కూర్చి స్థాణువులా నిశ్చలుడై ఉన్నాడు. ఈ యోగాన్ని అష్టాంగ యోగ మంటారు. ఈ యోగం వలన ఘటాకాశం మహాకాశమునందు వలె క్షేత్రజ్ఞుడు బ్రహ్మము నందు లయిస్తాడు. ఆ స్థితిలో ఉన్నవారికి బహిరింద్రియ క్షోభమూ అంతరింద్రియక్షోభమూ కలుగవు. ఈ క్షోభమన్నది మాయాగుణ కార్యం. మూడు గుణాలనూ అణచివేసినపుడు వాటి కార్యమూ నిలిచిపోతుంది.

గుణవ్యహారం లేనినాడు గుణవాసనలు కలుగవు. ఈ వాసనలే ఉత్తరజన్మకు హేతువులు కనుక వాసనాక్షయంతో జన్మరాహిత్యమూ కలుగుతున్నది.

ధృతరాష్ట్రుడు సర్వకర్మసన్న్యాసి అయ్యాడు కనుక అతనిని మళ్ళీ లోకవ్యవహారానికి ఈడ్చి అంతరాయం కలిగించకూడదు. కనుక నీవు అతనికై వెళ్ళవద్దు. అతను నేటికి అయిదవనాడు శరీరాన్ని త్యజిస్తాడు. అతని శరీరం యోగాగ్ని వలన భస్మీభూత మవుతుంది. గాంధారి అతని చెంతనే ఉన్నది. ఆమె పతివ్రతా శిరోమణి. ఆమెకూ కర్మ పరిపాకమైనది కనుక ఆమె ఆ అగ్నిలోనే ప్రవేశించి ప్రాణత్యాగం చేస్తుంది. విదురుడు అక్కడే ఉన్నాడు. అతనా వింతలను చూసి తీర్థయాత్రకు వెళ్తాడు' అని చెప్పి తుంబురునితో పాటు స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు.

## ఉత్పాతాలు

అలా కొన్ని నెలలు దేశమంతటా దుర్నిమిత్తాలు వ్యాపించాయి.

రాజ్యంలో పంటలు వట్టిపోయాయి. ఓషధులు సకాలంలో పండవు. అసత్యం విచ్చలవిడిగా విహరింపసాగింది. క్రోధ లోభ క్రౌర్యాలకు అడ్డు లేకపోయింది. వ్యవహారాలన్నీ కపట పూర్వకాలైనాయి. సఖ్యమంటే వంచనాసహితమయింది. భార్యాభర్తలకు మనస్సులు కలవక వేర్పాటు భావం పెరిగింది. కొడుకులు తండ్రులను తెగనాడజొచ్చారు. శిష్యులకు తెల్లవారి లేస్తే గురునిందావచనాలే దినపాఠమైనాయి. శాస్త్రాలు మూలబడ్డాయి. పెద్దలు కూడా న్యాయాన్ని అనుసరించడం మానివేశారు.

కాలగతి ఆ విధంగా అధర్మప్రవృత్తులతో మహాచిత్రమై కానవచ్చేసరికి ధర్మనందనుడు చూసి భీముణ్ణి పిలిచి, 'తమ్ముడూ! మన అర్జునుడు ద్వారకకు వెళ్ళి ఏడు నెలలయింది. ఇంకా రాలేదు. కారణమేమిటో తెలియదు. శ్రీకృష్ణ పరమాత్మ లీలావతారాన్ని ఉపసంహరిస్తాడని నారద మహర్షి సూచించాడు. అటువంటి దేదైనా సంభవించిందా అని అనుమానం కలుగుతోంది. అదిగో కుక్కలు మోర ఎత్తి మన కట్టెదుటనే నిర్భయంగా మొరుగుతున్నాయి.

సూర్యోదయంతో నక్కలు వాటికి ఎదురై నోట నిప్పులు కక్కుతూ ఏడుస్తున్నాయి. కాకులూ గద్దలూ గుంపులు గుంపులుగా గుమిగూడుతున్నాయి. గాడిదలు ఓంద్రపెడుతున్నాయి. ఉత్తమాశ్వాలు కంట నీరు కారుస్తున్నాయి. దిక్కులన్నీ పొగకప్పినట్లు ఉన్నాయి. సూర్యుని కాంతి తరిగింది. భూమి కంపిస్తున్నది. ప్రపంచాన్ని అన్ని పరివేషాలూ చుట్టుముడుతున్నాయి. మింట మబ్బులు కమ్ముకొనకుండానే ఉరుములు ఉరిమి భూమిని ఉగ్రూతలూగిస్తూ పిడుగులు రాలిపడుతున్నాయి. కటిక చీకట్లు ముసిరి గాలి భోరున వీస్తూ నెత్తురు వానలు కుండపోతగా కురుస్తుంటే చూడడానికి భయంగా ఉన్నది. గ్రహాలు ఒకదానితో ఒకటి పోరాడటం వలన భూమ్యాకాశాలు మండుతున్నట్లు ప్రకృతి భయానకంగా కనిపిస్తోంది. నదీనద సరోవరాలు కలకబారాయి. దూడలు పాలకై తల్లి పొదుగును మూచూడవు. గోవులు కళ్ళనీళ్ళు కారుస్తాయి. దేవతా విగ్రహాలు చెమర్చి వెలవెలపోయినట్లున్నాయి. పట్టణాలు గ్రామాలు వనాలు ఆరామాలు శోభా విహీనంగా కనబడుతున్నాయి.

తమ్ముడూ! ఇవన్నీ బలవత్తరమైన అశుభాన్ని సూచిస్తున్నాయి. ఏ పరమేశ్వరుని ప్రసాదంగా మనకు సిరిసంపదలే గాక ప్రాణాలు సైతం దక్కాయో, ఆ పరమపూరుషుడు తన సౌభాగ్యాన్ని త్యజించి ఉంటాడా?' అని అడిగాడు.

## అర్జునాగమనం

ఇంతలో అర్జునుడు ద్వారకనుంచి మరలివచ్చి ధర్మజుని పాదాలపై మోకరిల్లి లేచి కన్నీరు పెట్టుకొని మోడులా నిలబడ్డాడు. ధర్మజుడు కాంతివిహీనంగా ఉన్న అతని ముఖ వైఖరిని చూసి నారదమహర్షి వాక్యాన్ని గుర్తుతెచ్చుకొని తమ్ముని పలుకరించాడు. 'నాయనా! ద్వారకానగరంలో మనవారందరూ క్షేమమేనా? పూజ్యుడు మన మాతామహుడు శూరసేనుడు కుశలమే కదా! మన మేనమామ వసుదేవుడు క్షేమమే కదా! ఆయన భార్యలు

దేవకీదేవి మొదలుగా గల ఏడుగురూ కొడుకు కోడళ్ళతో సుఖంగా ఉన్నారా? ఉగ్రసేనుడూ అతని తమ్ముడూ కుశలమేనా? అక్రూరాదులు మంగళమే కదా! సాత్వతపతి బలరాముడూ, యాదవ వీరాగ్రణి ప్రద్యుమ్నుడు, సుషేణ చారుధేష్ణ సాంబ ఋషభాది కుమారులు, సునంద నంద ప్రముఖ భాగవతులు, రామకృష్ణుల భుజశక్తిని నమ్ముకొన్న ఇతరులూ అందరూ నెమ్మదిగా ఉన్నవారే కదా! ఏ పరమ పూరుషుడు లోకాభ్యుదయాన్ని కోరి యదుకులాబ్ధిని అవతరించాడో, ఏ మహానుభావుని బాహుదండ రక్షణభాగ్యం వలన యాదవులు పౌరుషవంతులై లోకపూజ్యతను గాంచి పరమానందాన్ని చూరగొంటారో, ఏ దేవదేవుని పాదచర్యాప్రభావం కలిమి చేత సత్యభామాది షోడశసహస్రాధిక కల్యాణవతులు దేవభోగ్యాలైన పారిజాతాదులను పొందగలిగారో, ఏ జగదేకవీరుని మాహాత్మ్యం వల్ల సురేంద్రభోగ్యమైన సుధర్మసభా మండపం యాదవుల పాదస్పర్శలకు లోనయిందో, ఆ భక్తవత్సలుడు బ్రహ్మణ్యుడు భగవంతుడు సుహృద్బంధు మిత్ర పరివార సమేతంగా సుధర్మపీఠికను అధిష్ఠించి సుఖోపేతుడై ఉన్నాడా?

నాయనా! అర్జునా! నీకు సుఖమే కదా? నీ ముఖరేఖలలో దైన్యభావం గోచరిస్తున్నది. కారణం ఏమిటి? అక్కడ ఎక్కువ కాలం ఉన్నందు వల్ల చులకన చేశారా? గౌరవాదరాలు సన్నగిల్లాయా? తలవంపు సూచనలు కానవచ్చాయా? అర్థులకు మాట తప్పలేదు కద! గో బ్రాహ్మణులను గాని, స్త్రీ బాల వృద్ధులను గాని ఉపేక్షించలేదు కదా. నిందితురాలిని గాని మలినవస్త్రను గాని పొందలేదు కద! సమానుల వల్లనో అధముల వలననో దారిలో నీకు పరాజయం కలిగిందా? పిన్నలకు అతిథులకు భృత్యులకు గర్భిణులకు ముందు పెట్టక నీవు భుజింపవు కదా. నింద్యవర్తన లాచరింపవు కదా. పార్థా! ఎన్నడూ లేని ఈ విన్నదనమేమిటి? ప్రియాతిప్రియుడూ పరమాంతరంగుడూ అయిన ఆత్మబంధువును ఎడబాసినట్లు నిస్తేజుడవై ఎందుకున్నావు?' అని ప్రశ్నలను కురిపించాడు.

## శ్రీకృష్ణ నిర్యాణ కథనం

అర్జునుడు కొంతసేపటికి సమాహితచిత్తుడై, కన్నీరు తుడుచుకొంటూ నిట్టూర్పులు నిండగా డగ్గుత్తికతో ఇలా అన్నాడు.

'అన్నా! ఎవని ప్రాపు వల్ల మత్స్యయంత్రాన్ని త్రుంచి రాజాధిరాజుల తేజాన్ని రూపుమాపి ద్రౌపదిని చూరగొన్నానో, ఎవని సన్నిధానమాత్రాన దేవేంద్రుని ఎదిరించి అగ్నిదేవునికి ఆహారంగా ఖాండవవనాన్ని ఇవ్వనోచానో, ఎవని అనుగ్రహం వలన మయబ్రహ్మ నిర్మించిన జగన్మోహనమైన సభాభవనం మనకు సంప్రాప్తమైనదో, ఎవని అండ చూసుకొని నీ రాజసూయాధ్వరానికి పెక్కుమంది రాజుల నుంచి పన్నులను స్వీకరింప గలిగామో, ఎవరి పేర్మి వలన భీమసేనుడు రాజచక్రానికి భయాస్పదుడైన జరాసంధుని తెగటార్చి మహాభైరవునికి బలి కాబోతున్న రాజలోకానికి ప్రాణప్రదానం చేయగలిగాడో, రాజసూయావబృథ మహాభిషేకం నాడు పరమపావనచరిత పాంచాలిని నీ ధర్మపత్నిని దుశ్శాసనాది కితవులు నిండు సభలో జుట్టుపట్టి ఈడ్చి వస్త్రాపహరణం చేయదలిచి పరాభవించినపుడు ఆమె దిక్కుతోచక మొరపెట్టుకొంటే ఎవడు ఆలకించి ఆ సాధ్వీమతల్లి మానాన్ని కాపాడి ఆ పాపాత్ముల భార్యలూ అలాగే కురులు జారవిడిచి గోడు గోడు మనేట్లుగా దుష్టశిక్షణ కావించాడో, ఆ నాడు మనమందరమూ కుడిచి కూర్చున్న వేళ దుర్వాసుడు దుర్యోధనప్రార్థితుడై పదివేలమంది శిష్యులతో అకాలంలో అతిథియై రాగా, నీవతనికి ఆతిథ్యం పలికి మాధ్యాహ్నికాన్ని తీర్చికొని రమ్మని స్నానానికి పంపగా చూసి ద్రౌపది ఏమి చేయడానికీ తోచక తనను స్మరించినంత మాత్రాన ఆమెకు సాక్షాత్కరించి ఏ మహానుభావుడు అక్షయపాత్ర అంచుకు అంటుకొని ఉన్న ఒక్క మెతుకును తృప్తిగా భుజించి ముల్లోకాలకూ తృప్తిని ఘటింపగా – నది ఒడ్డున ఉన్న దుర్వాసాదులు ఆకలి తీరి కడుపు నిండి గ్రున తేన్చి నీ వద్దకు రావడానికి కూడా సిగ్గుపడి దూరాన్నుంచే పారిపోయినందువల్ల ఆ పరమకోపి శాపం మనకు

రెప్పపాటులో తప్పిపోయిందో, ఆ దేవదేవుడు నాలోని తేజస్సును తీసుకొని నన్ను ఏకాకిగా విడిచి వెళ్ళిపోయాడు.

అన్నా! సఖుని ప్రియుని, పరమోపకారిని, పురుషోత్తముని కోల్పోయాను; నాకంతా శూన్యంగా కనుపిస్తున్నది. ఆ మహాత్ముడు నిష్క్రమించాక అతని భార్యలను వెంటబెట్టుకొని ఇక్కడికి బయలుదేరాను. దారిలో కొంతమంది బోయలు ఎదురై మీద పడ్డారు. ఆ దుర్మార్గులను ఓడి అబల వలె నేను నా వెంటనున్న స్త్రీలను దొంగలకు సమర్పించి ఇటు వచ్చాను. అన్నా! ఏ రథికుడు ఏ హయాలను పూన్చిన ఏ రథమెక్కి ఏ అస్త్రాలతో ఒకనాడు కౌరవ మహాసాగరాన్ని సంక్షోభింపజేశాడో, ఆ రథికుడే ఆ హయాల్ని పూన్చిన ఆ రథాన్నే ఎక్కి ఆ అస్త్రాలనే ప్రయోగించినా సామాన్యులైన దొంగల చేతిలో ఓడిపోయాడు. చక్రి ఒక్కడు వెంట లేనందువల్ల సర్వమూ తలక్రిందు లయిపోయింది.

**సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని**
**బలమున నా కిచ్చెఁ బాశుపతము**

**నెవ్వని లావున ని మ్మేన దేవేంద్రు**
**పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ**

**గాలకేయ నివాతకవచాది దైత్యులఁ**
**జంపితి నెవ్వని సంస్మరించి**

**గోగ్రహణము నాఁడు కురుకులాంభోనిధిఁ**
**గడచితి నెవ్వాని కరుణఁ జేసి**

**ఆ.వె. కర్ణ సింధురాజ కౌరవేంద్రాదుల**
**తలల పాగ లెల్లఁ దడవి తెచ్చి**
**యే మహాత్ము బలిమి నిచ్చితి విరటుని**
**పుత్త్రి యడుగ బొమ్మ పొత్తికలకు.**

మ. గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశచక్రంబులో
గురుశక్తిన్ రథయంతయై నొగలపైఁ గూర్చుండి యే మేటి నా
శరముల్ వాఱకమున్న వైరుల బలోత్సాహాయురుద్యోగ త
త్పరతల్ చూడ్కుల సంహరించె నమితోత్సాహంబు నా కిచ్చుచున్.

మ. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని కైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగె నెవ్వని దయాదృష్టిన్ నరేంద్రోత్తమా.

చ. వసుమతి దివ్యబాణముల వ్రయ్యలు వాసి కొలంకు సేసి నా
రసములు మాటుగాఁ బఱపి రిపులెల్లఁ జూడ సా
హసమున నీటఁబెట్టితి రణావని సైంధవుఁ జంపువేళ నే
యసురవిరోధి భద్రగతి నందయి వచ్చుటఁ జేసి భూవరా.

సీ. చెలికాఁడ రమ్మని చీరు న న్నొకవేళ
మన్నించు నొకవేళ మఱఁది యంచు

బంధుభావంబునఁ బాటించు నొకవేళ
దాతయె యొకవేళ ధనము లిచ్చు

మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు
బోధియై యొకవేళ బుద్ధిసెప్పు

సారథ్య మొనరించుఁ జనవిచ్చి యొకవేళఁ
గ్రీడించు నొకవేళఁ గేళిసేయు

తే. నొక్క శయ్యాసనంబున నుండు, గన్న
తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁ గాచు
హస్తములు పట్టి పొత్తున నారగించు
మనుజనాథ! యెవఁడు; వాని మఱువగలవె.

అన్నా! ఇక యాదవుల సంగతి ఏం చెప్పమంటావు? వారు బ్రాహ్మణ శాపహతులై కల్లు తాగి కైపెక్కి మైమరచి పరస్పరం పోరాడుకొని నలుగురైదుగురు తప్ప అందరూ నాశనమయ్యారు. ఆ సర్వేశ్వరు డట్లా బలహీనులకూ బలోన్నతులకూ వైరాలు పెంచి అందరినీ రూపుమాపి భూభారాన్ని తొలగించి కృతకృత్యుడై వెళ్ళిపోయాడు. భగవంతుని లీలలను గ్రహించడం మనవంటివారి తరం కాదు' అని పలికి అర్జునుడు శ్రీకృష్ణాయత్తచిత్తుడై శ్రీకృష్ణ సుందర పాదాలవిందాలను ధ్యానింపసాగాడు. అతనికి భగవంతుని గీతోపదేశం స్మరణకు వచ్చింది. భగవత్స్మరణ సంజనితానందవివశుడై శోకం ఉపశమింపగా విరక్తుడై శాంతిని పొందాడు.

మునులారా! అన్ని శోకాలకూ ద్వైతభ్రమే కారణం. అది 'నేను', 'నాది' అనే అహంకార మమకార రూపాలలో ఉంటుంది. అటువంటి భ్రమకు దేహమే కారణం. దేహానికి లింగశరీరం బీజమవుతుంది. దానికి గుణాలు మూలం. ఆ గుణాలకు ప్రకృతే పుట్టినిల్లు. ఎప్పుడు 'బ్రహ్మాస్మి' అన్న జ్ఞానం అనుభవసిద్ధమవుతుందో అప్పుడు ఆ జ్ఞానంలో ప్రకృతి లీనమౌతుంది. అప్పుడు ప్రకృతి వేరనే భావం నశిస్తుంది. ఎప్పుడు ప్రకృతి అలాగవుతుందో అప్పుడే దాని గుణాల యొక్క వ్యవహారం నశిస్తుంది. ఆ అవస్థను నైర్గుణ్యావస్థ అంటారు. ఆ అవస్థ సిద్ధించినపుడు గుణకార్యమైన లింగశరీరం నశిస్తుంది. తత్ఫలితంగా పునర్జన్మ కారణం తొలగిపోతుంది. బ్రహ్మాస్మి జ్ఞానం ఉదయించడానికి బుద్ధి నిలకడను చెందాలి. బుద్ధి స్తిమితం కావాలంటే కామాదుల అలజడి పోవాలి. అందుకు భగవద్ధ్యానం ఒక్కటే పరమోపాయం.

## పాండవ మహాప్రస్థానం

మునులారా! శ్రీకృష్ణభగవానుడు అవతారాన్ని ఉపసంహరించడమూ, యాదవకుల వినాశమూ విని ధర్మరాజు నారదమహర్షి వచనాలను తలపోసి నిశ్చలచిత్తుడై స్వర్గగమనానికి నిశ్చయించాడు. కుంతీదేవి భగవంతుని యందలి ఏకాగ్రభక్తితో తన ఆత్మను పరమాత్మలో అనుసంధించి

సంసృతిమూలమైన దేహాన్ని పరిత్యజించింది. ధర్మనందను డప్పుడు ఇంద్రునికి మనుమడై తనతో సాటిరాగల పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేసి మున్నీరు ఒడ్డాణంగా ఉన్న ధాత్రీమండలాన్ని అతనికి అప్పజెప్పి, శూరసేనుని కొడుకు వజ్రుణ్ణి మథురాపురానికి రాజును చేసి తన భుజాలపైని బరువును దించి చేతులు కడుక్కొన్నాడు.

అనంతరం ధర్మరాజు ప్రాజాపత్యమనే యజ్ఞాన్ని కావించి, అగ్నులను ఆత్మారోపణం చేసుకొన్నాడు. మమతాహంకారాలను దిగవిడిచి వస్త్రాభరణాలన్నింటినీ త్యజించి సర్వబాధావినిర్ముక్తుడై ఇంద్రియాలను తదాధారమైన మనస్సునందు, మనస్సును దానికి అధిష్ఠానమైన ప్రాణమునందు, ప్రాణాన్ని దాని గతిని నిరోధించే అపానమునందు, సవ్యాపారమైన ఆ అపానాన్ని దానికి అధిష్ఠాతృ దేవత అయిన మృత్యువు నందు, ఆ మృత్యువును దానికి కారణభూతాలైన పంచభూతాల ఐక్యము నందు, దానిని గుణత్రయమందు, ఆ మూడు గుణాలనూ అవిద్య యందు, సర్వార్థాలకూ ఉపహేతువైన ఆ అవిద్యను జీవాత్ముని యందు, ఆతనిని కూటస్థుడైన పరబ్రహ్మము నందు విలోమక్రమంలో లయింపజేసి, సర్వవ్యాపారాలూ మాని, నారచీరలు కట్టి, ఆహారం ఉజ్జగించి, తల విరబోసికొని మౌనియై తమ్ముల వంకకైనా తల తిప్పక చెవిటివాని వలె ఎవరినీ వినిపించుకోక జడోన్మత్తపిశాచం పూనినట్లు ప్రవర్తిస్తూ పూర్వులు మెట్టిన ఉత్తరదిశను బట్టి కాలినడకన వెళ్ళిపోయాడు.

ఆ విధంగా ఉత్తరదిశకు వెళ్ళినవారికి పునరావృత్తి కలుగదు.

భీమాదులు కూడా ధర్మపరబుద్ధులు కనుక కలిపురుషుని అకార్యాలను చూసి, అన్నింటికీ భగవచ్చరణారవిందమే పరమాశ్రయమని నిశ్చయించి, ఆ దివ్యపదాన్ని హృదయసద్మాలలో పాదుకొలిపి, అన్నగారి అడుగుజాడలను వెన్నంటి నడిచి, భగవద్ధ్యాన సముజ్జీవిత భక్తియోగంలో విశుద్ధాత్ములై

విషయాలకు లొంగినవారికి దుర్గమమైన విధూతకల్మషస్థానాన్ని శ్రీమన్నారాయణ పరమపదాన్ని చేరుకొన్నారు.

పతులు ఆ విధంగా తనను విడనాడిపోయిన వెంటనే ద్రౌపది కూడా వాసుదేవుని యందు పరమభక్తిని నిల్పి ఆయనను అనుగమించింది.

విదురుడు తీర్థయాత్రలు కావిస్తూ చిట్టచివరికి ప్రభాసతీర్థం చేరి అక్కడ కృష్ణావేశచిత్తుడై శరీరాన్ని పరిత్యజించాడు. ఆ వెనువెంటనే అతనిని పితృగణాల వారు యమలోకానికి తీసుకొని వెళ్ళి ఆయన అధికారస్థానంలో ఆయనను నిలిపారు.

మునులారా! ఈ భగవత్ప్రయాణాన్నీ, పాండవ మహాప్రస్థానాన్నీ భక్తి శ్రద్ధలతో ఆకర్ణించేవారు హరిభక్తి పునీతులై ముక్తిని పొందుతారు. నటుడు నాటక ప్రదర్శనార్థం వివిధ పాత్ర వేషాలను ధరించి ప్రదర్శన ముగిసిన తర్వాత నిజరూపంలో కనుపించినట్లు భగవంతుడు లోకనాటకార్థమై వివిధావతారాలను ధరిస్తూ కార్యం తీరినంతనే ఆ వేషాలను విడిచిపెడుతూ స్వరూపస్థితుడై వెలుగొందుతాడు.

భగవంతుడలా కార్యార్థమై దేహధారి కావడమూ, కార్యానంతరం తత్కార్య సాధనమాత్రమైన ఆ దేహాన్ని త్యజించివేయడమూ చూస్తే ముల్లు గుచ్చుకొన్నప్పుడు దానిని తీసేందుకు వేరొక ముల్లు తెచ్చి, గుచ్చుకొన్న ముల్లును బయటికి తీసి ఆ తర్వాత రెంటినీ పారవేసిన వైనం గుర్తుకు వస్తుంది.

## పరీక్షిత్తు పరిపాలనం

పట్టాభిషిక్తుడు కాగానే పరీక్షిత్తు బ్రాహ్మణోత్తముల ఉపదేశాలను దలదాల్చి ఎంతో శ్లాఘనీయంగా పరిపాలింపసాగాడు. అతనికి ఉత్తరుని కుమార్తెను ఇరావతినిచ్చి పెళ్ళిచేశారు. ఆ దంపతులకు నలుగురు కొడుకులు – జనమేజయుడు, శ్రుతసేనుడు, ఉగ్రసేనుడు, భీమసేనుడు జన్మించారు.

కృపాచార్యుని ఆచార్యునిగా గ్రహించి పరీక్షిత్తు గంగాతీరంలో మూడు అశ్వమేధయాగాలను చేశాడు. ఆ యాగాలకు దేవతలే స్వయంగా వచ్చి వారి వారి హవిర్భాగాలను స్వీకరించారంటే అతని ప్రభావం ఎంతటిదో మీరే ఊహింపగలరు.

ఆ తర్వాత పరీక్షిత్తు దిగ్విజయయాత్రకు బయలుదేరాడు. అతనలా వెళ్తుండగా ఒకానొకచోట ఒక అజ్ఞాతపురుషుడు రాజవేషాన్ని ధరించి గోమిథునాన్ని కాల దన్నడం కనిపించింది. పరీక్షిత్తు అక్కడ ఆగి ఆ అజ్ఞాతవ్యక్తిని తన పరాక్రమంతో నిగ్రహించాడు.

ఇంతదాకా చెప్పి సూతుడు మాటాడకుండా ఊరుకొన్నాడు. శౌనకుడు ఉండబట్టలేక ఇలా అన్నాడు:

'మహాత్మా! రాజవేషధారియై గోవృషభాలను కాలదన్నిన ఆ పాపాత్ముడెవడు? అటువంటి దుష్టుణ్ణి నరేంద్రుడు సంహరింపక కేవలం అడ్డుచెప్పి విడిచిపెట్టడం దేనికి? ఈ కథ భగవంతుని చరిత్రతో గాని, భగవద్భక్తుల చరిత్రతో గాని సంబంధించినదైతే మాకు వివరించి చెప్పు.

అయ్యా! నీవంటి పౌరాణిక తల్లజునికి ఏది చెప్పాలో ఏది చెప్పకూడదో నియమిస్తున్నాననుకోకు. ఏమంటే దుష్టుల కథలతో ఆయువంతా వ్యర్థమవుతుందే గాని ఫలం ఉండదు. భగవత్కథలు అటువంటివి కావు. ఆ కథలను నిమిషమాత్రం విన్నా మహాశుభం కలుగుతుంది. మాకా ముసలితనం. ఆయుశ్శేషమూ కొద్దిగానే ఉన్నది. దేహం అనిత్యం కదా! అయినా మాకు వెంటనే మృత్యుభయం లేదు. ఎందుకంటే మునీశ్వరుల పిలుపు నందుకొని యముడు కూడా ఈ యాగానికి వచ్చి ఉన్నాడు. అదిగో అక్కడున్నాడు చూడు. ఆయన మా వలెనే విష్ణుకథాశ్రవణపరుడు కనుక ఈ యాగం ముగిసిన దాకా ఇక్కడే ఉంటాడు. మునుల యాగానికి యమధర్మరాజును పిలిపించడం దేనికంటావేమో! యాగసమాప్తి జరిగే

లోపల వారికి మృత్యుభయం ఉండకూడదని ఆయనను రప్పించారు. ఆయన ఇక్కడున్నంత కాలం మాకు మృత్యుభయం లేదు.

సూతాగ్రణీ! జీవితకాలం చాలా పరిమితం. మృత్యువు ఎప్పుడు కబళిస్తుందో తెలియదు. ఈ పరిమితకాలంలో సగం పగటితోను, సగం రాత్రితోను తెలియకుండానే గడిచిపోతుంది. ఆ పగళ్ళు మందబుద్ధులకు పనికిరాని పనులతో వ్యర్థమవుతాయి. రాత్రులను నిద్ర హరిస్తుంది. ఇది తెలిసి వివేకవంతులు జీవమున్నంతవరకు భగవత్కథలను ఆకర్ణిస్తూ భక్తి గలిగి మసులుకొంటారు. భగవద్భక్తితో జీవితాన్ని సార్థకం చేసుకొంటారు. అట్టి సంకల్పం తోనే మేమిక్కడ సమావేశమయ్యాము. కనుక భగవద్విషయంలో మాకు తనివి యెన్నటికీ తీరదు' అని పలికాడు.

సూతుడు వారి ఆంతర్యాన్ని గ్రహించి ఇలా అన్నాడు.

## పరీక్షిత్తు దిగ్విజయ యాత్ర

'మునులారా! పరీక్షిన్నరేంద్రుడు కురుజాంగలాలలో నివసిస్తూ భూమండలాన్ని పరిపాలిస్తున్న కాలంలో అతని రాజ్యం లోనికి కలి ప్రవేశించింది. నరేంద్రుడు ఆ సంగతి విని యుద్ధసన్నద్ధుడై ధనుర్బాణాలను గైకొని నల్లని గుర్రాలను పూన్చి సింహధ్వజాన్ని కూర్చిన రథం ఎక్కి చతురంగబలసమేతంగా దిగ్విజయార్థం తరలి భద్రాశ్వం, కేతుమాలం, భారతం మొదలైన దేశాలను, ఉత్తర కురుభూములను జయించి అక్కడి పెద్దల వలన పాండవేయుల కీర్తి విస్తారాన్ని, వారి యందలి ప్రీతితో శ్రీకృష్ణ భగవానుడు అశ్వత్థామ బ్రహ్మాస్త్రం బారినుంచి గర్భస్థుడై ఉన్న తనను రక్షించిన వృత్తాంతాన్ని, పాండవులకు వాసుదేవుని యెడ గల భక్తి విశ్వాసాలను, కృష్ణుడు పాండవులపై కురిపించిన వివిధ ప్రేమరూప విశేషాలనూ తెలుసుకొంటూ, వారిని యథోచిత పారితోషికాలతో సత్కరిస్తూ ముందుకు సాగాడు.

## గోవృషభాల సంవాదం

ఆ విధంగా పరీక్షిత్తు బహుదూరం ప్రయాణించి సరస్వతీ తీరంలోని కురుక్షేత్రానికి వచ్చాడు. అక్కడ ఒక్క కాలు మాత్రం గల ఒక వృషభమూ, దాని చెంతనే పిల్లనెడసిన తల్లి వలె పరితపిస్తున్న ఒక గోమాత కనిపించాయి. నరపాలుడు వాటిని చూసి సంగతేమిటో అని కొంతసేపు రథం ఆపాడు.

ఆ సమయంలో వృషభం గోవును చూసి, 'అమ్మా, నీకు ఆరోగ్యమే కదా? నీ ముఖం చిన్నబోయినట్లున్నది. కారణం ఏమిటో నాకు చెప్పు. నీ మనస్సుకు ఏదయినా బాధ కలిగిందా? నీ పిల్లలు నిన్ను విడిచి వెళ్ళిపోయారా? వారి కోసం విచారిస్తున్నావా? మూడు కాళ్ళు విరిగి ఒంటికాలనున్న నన్ను చూసి దుఃఖిస్తున్నావా? ధర్మశూన్యులైన రాజుల చేత పాలింపబడే దౌర్భాగ్యం దాపరించిందని విలపిస్తున్నావా? యజ్ఞాలు మంత్రాదిలోపపూర్వకంగా చేయబడుతున్నందున హవిర్భాగాలు అసురుల పాలవుతాయని వాపోతున్నావా? సకాలంలో వానలు లేక జనులు కటకటలాడుతున్నారని చింతిస్తున్నావా? భార్యలను పోషింపరనో, తల్లిదండ్రులు తమ బిడ్డలను పెంచి పెద్దచేయలేరనో వగపు కలిగిందా? బ్రాహ్మణులు నిందిత కర్మలకూ నీచకృత్యాలకూ సరస్వతిని విక్రయిస్తారని, బ్రతుకు తెరువు కోసం నీచసేవావృత్తిని స్వీకరిస్తారని, క్షత్రియలోకం కలికి తలవంచి కంచే చేను మేస్తుందని, దుష్టుల పరిపాలనలో రాష్ట్రాలు మహోపద్రవానికి లోనవుతాయని దుఃఖిస్తున్నావా? ప్రాణిలోకం దేహరక్షణమే పరమార్థంగా భావించి పొట్టకూటి కోసం పడరాని పాట్లు పడి అదే లోకంగా పెట్టుకొని ఆత్మతత్త్వాన్ని బొత్తిగా ఆలోచించడం లేదని విచారిస్తున్నావా? నీ భారమంతటినీ దూరం చేయడానికి అవతరించిన భగవానుడు నిన్ను వదిలి వెళ్ళిపోయాడని రానున్న గడ్డురోజులను తలచుకొని శోకిస్తున్నావా? తల్లీ! నీ మనోవ్యాధికి కారణం ఏమిటో చెప్పు. నీ ముఖరేఖల లోని దైన్యాన్ని చూస్తే ఏదో వ్యాకులపాటుతో సతమతమవుతున్నావని చెప్పకుండానే తెలుస్తోంది. బలవంతులకు కూడా దాటరాని కాలగతి నీ సౌభాగ్యాన్ని హరించివేసిందా?' అని అడుగుతున్నది.

ఆ గోవు కలవరపాటుతో బావురుమని, 'అయ్యా! నీకు తెలియనిదేముంది? అయినా నన్నడిగావు కనుక చెబుతున్నాను. ఎవరి కరుణ వల్ల నీవిన్నాళ్లూ నాలుగు పాదాలతో నడవగలిగావో, సత్య శౌచ దయా శాంతి త్యాగాలు, సంతోషార్జవ శమ దమ తపస్సామ్యాదులు, తేజశ్శౌర్య బలాలు, కర్తవ్యానుసంధానం, స్వాతంత్ర్యం, క్రియానైపుణ్యం, శాంతి ధైర్యాలు, మార్దవం, ప్రాగల్భ్యం, వినయం, శీలసంపద, మనోబలం, ఇంద్రియపాటవం, భోగాలకు ఆస్పదమై ఉండటం, ఎటువంటి పరిస్థితి లోనూ చలింపని అక్షోభ్యత్వం, స్థిరత్వం, ఆస్తిక్యం, సత్కీర్తి, పూజనీయత్వం, గర్వం లేకపోవడం మొదలైన మహాగుణాలు ఎవని యందు నిత్యనిలయాన్ని పొందాయో, ఆ మహానుభావుడు, జగద్రక్షకుడు, శ్రీనివాసుడు ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. ఆయన లేని అదను కనిపెట్టి కలి ప్రవేశించింది. ఇక నాకూ నీకూ మాత్రమే గాక దేవతలు పితృగణాలు సాధుజనులు వర్ణాశ్రమాలు ఎవరి మీద ఆధారపడాలా? అని పరితపిస్తున్నాను.

అయ్యా! జగన్మాత మహాలక్ష్మిని బ్రహ్మ మొదలుకొని సమస్త లోకాలూ ఉపాసించడం నీకు తెలిసిన సంగతే. అటువంటిది ఆమె కూడా ఎవరి పాదపద్మాల లావణ్యం పైని పేరాసతో స్వస్థానమైన పద్మాన్ని సైతం విడువగలిగిందో ఆ మహాత్ముని శ్రీమచ్చరణాలు, పద్మకులిశాంకుశ ధ్వజరేఖాలాంఛితాలు నా పైని సోకడం వలన త్రైలోక్య కీర్తివిస్తారానికి నోచుకొన్న నాకన్నా ధన్యాత్మురాలు ఉండబోదని గర్వపడ్డాను. రాక్షసాంశతో పుట్టి రాజులను మోయలేక బాధపడుతుంటే నా కోసం పద్దెనిమిది అక్షోహిణుల ప్రజాభారాన్ని రూపుమాపి, నడవలేక నడవలేక కుంటుతూ బాధపడుతున్న నీకు మళ్ళీ పూర్ణపదత్వాన్ని కలిగించారని యదువంశ కలశరత్నాకరంలో ఏ మహానుభావుడు దివ్యమంగళ విగ్రహుడై ఉదయించాడో, ఏ మహాత్ముని చరణరేణు సంసర్గం వలన నా మేను సస్యాదిరూప పులకాంకితమై శోభిల్లుతుండేదో ఆ పురుషోత్తముని వియోగానికి దుఃఖింపనివాళ్ళు కూడా ఉంటారా?' అని విలపించింది.

## రాజవేషధారి దురాగతం

ఇంతలో అక్కడికి రాజవేషధారి ఒకడు చేతిలో బెత్తాన్ని పట్టుకొనివచ్చి ఆ గోవృషభాలను నిష్కారణంగా కాలదన్నసాగాడు. అవి దెబ్బలకు తట్టుకొనలేక కాపాడే దిక్కు లేకపోయిందని గోడు గోడుమని అరిచి మొరపెట్టుకొన్నాయి.

అంతదాకా అక్కడే నిలబడి చూస్తున్న పరీక్షిన్నరేంద్రుడు కోపంతో మండిపడి కోదండాన్ని ఎక్కుపెట్టి, 'ఓరి దురాత్ముడా! ఎవడివిరా నువ్వు? ఈ లోకమంతా నా భుజాపరిరక్షితమని తెలియదా? తెలిసీ కండకావరంతో బలహీనులను పీడిస్తున్నావా? వేషానికేం, మహారాజులా ఉన్నావు. నువ్వు చేస్తున్నది రాజయోగ్యమైన కార్యం కాదు. శ్రీకృష్ణార్జును లిద్దరూ ఈ లోకాన్ని విడిచివెళ్ళారనా ఒళ్ళు విరుచుకొని భయం లేకుండా సిగ్గు లేకుండా నిరపరాధులను రహస్యంగా పీడించడానికి తెగించావు? నిన్ను చంపి పాతర వేసినా తప్పు లేదు' అని సజల జలధరధ్వానంతో గంభీరంగా మందలించాడు.

అనంతరం పరీక్షిత్తు వృషభాన్ని చూసి, 'ఓ వృషభేశ్వరా! నీ వెవరవు? ఒంటికాలితో కుంటుతున్నా వెందుకు? నీ తక్కిన మూడు కాళ్ళకూ ఏమయింది? మీ సంభాషణమంతా విన్నాను. నాకు మనఃఖేదాన్ని కలిగించేందుకు నేలకు వచ్చి సంచరిస్తున్న దేవతవు కాబోలు! బాహుబలరక్షితమైన ఈ ధాత్రీమండలంలో దుఃఖాన్ని పొందినవాణ్ణి నిన్ను తప్ప ఇంకొకరిని చూడలేదు. వృషభరాజా! శోకం మాను; భయపడకు' అని ధైర్యం చెప్పాడు.

ఆ తర్వాత పరీక్షిన్నరేంద్రుడు గోవు వంకకు మరలి, 'అమ్మా! దుష్టులను శిక్షించడానికి నేనుండగా నీకు భయం లేదు. దుఃఖాన్ని వదిలి సంతోషంగా ఉండు. ఏ రాజు రాజ్యంలో ప్రజలకు దుర్జనభయం ఉంటుందో ఆ రాజుకు ఇహలోకంలో ఆయురారోగ్య కీర్తిభాగ్యాలూ పరలోకంలో సుఖభోగాలూ తరిగిపోతాయి. దీనరక్షణం రాజధర్మాలన్నింటిలో ప్రధానమైనది.

నిరపరాధులకు కీడు తలపెట్టిన ఈ దుర్మార్గుడికి మరణమే తగిన శిక్ష. ఇదిగో వీడిని క్షణంలో కడతేరుస్తాను' అని ప్రతిన చేసి, అదే ఊపున వృషభాన్ని చూసి, 'అయ్యా! నీకు నాలుగు కాళ్ళు స్వభావసిద్ధంగా ఉండి ఉండాలి. అందులో మూడు కాళ్ళు తెగి ఉన్నాయి. నీ కాళ్ళను ఖండించిన కర్కోటకుడెవడు? నిరపరాధులు, సాధువులూ అయిన నీ వంటివారికి వైరూప్యాన్ని కలిగించి మచ్చలేని రాజుల కీర్తికి మచ్చ తెచ్చిన వాడెవడో చెప్పు. వాడిక బ్రతికిలేడనే అనుకో. వాడు దేవుడే కానీ; మరొకడు కానీ; వాడి బాహుదండాలను సమూలంగా నరుకుతాను. ఎప్పుడో ఆపద వచ్చినపుడు పెడదారి తొక్కినా తప్పు లేదనుకోవచ్చు గాని, ఇతరవేళలలో కుత్సితానికి సిద్ధపడ్డవాళ్ళను రాజు ఏ మాత్రం ఉపేక్షింపకూడదు' అని ఓదార్పులు పలికాడు.

## వృషభ పరీక్షిత్తుల సంవాదం

పరీక్షిత్తు మాటలకు వృషభరాజు నిట్టూర్చి, 'రాజాగ్రణీ! దీనజనులకు అభయ మివ్వడం పాండవేయులకు యుక్తమే గదా. మీ వంశీయులు అటువంటి మహాపురుషులు కాబట్టే జగన్నాథుడు శ్రీకృష్ణపరమాత్మ వారికి దూతగా తోడు నిలిచాడు.

రాజేంద్రా! నా దుఃఖానికి కారణం అడిగావు. ప్రాణుల క్లేశకారణాన్ని గురించి నానామతాలు ఉన్నాయి. అందులో ఏది సత్యమో నా బోంట్లకు తెలిసిరాదు. ఎవరి సుఖఃదుఖాలకు వారే కారణమని నాస్తికులంటారు. వారి వారి సుఖదుఃఖాలకు వారి వారి కర్మమే కారణమని మీమాంసకులు వాదిస్తారు. గ్రహాదిరూప దేవతలు కారణమని దైవజ్ఞులు నొక్కి చెబుతారు. కర్మమంటే జడము కనుక అది కారణం కానేరదని, స్వభావమే కారణమని లోకాయతికులు నిరూపిస్తారు. ఆ మాట యుక్తికీ ఊహకూ సరిపడదని దాన్ని కొందరు నిరసిస్తారు. వీటిలో ఏది సత్యమో నువ్వే విమర్శించు' అన్నాడు.

ఆ వచనాలను పరీక్షిత్తు విని, 'ఔరా! ఇతని భావం ఎంతో నిగూఢంగా ఉన్నది. ఎవరూ దేనికీ కర్త కాలేరని, సర్వమూ పరమేశ్వరాధీనమై

నడచుకొంటుందనీ ఇతని తాత్పర్యం' అని తలపోసి, 'ధర్మజ్ఞా! నీ అపకారి ఎవరో వారిని చెప్పకపోగా నన్నే తేల్చుకోమన్నావు. అధర్మం చేసినవారికి కలిగే నరకాదులు వారిని చూపించిన వారికి కూడా కలుగుతాయని ధర్మం ఉన్నది. దానిని జ్ఞాపకం చేశావు. సత్యం తెలియక అజ్ఞానం వల్ల నిర్దోషుల యందు కూడా దోషాన్ని ఆరోపించడం జరుగుతుంటుందని, అలా చేసేవాళ్ళు నిజంగా నేరం చేసినవాళ్ళు పొందే నరకాదులను తామూ అనుభవింపక తప్పదని నీ తాత్పర్యమైనట్లు నాకు బోధపడింది. నీ ధర్మజ్ఞానాన్ని బట్టి చూడగా నీవు వృషభరూపాన్ని తాల్చిన ధర్మదేవతవని భావిస్తున్నాను. అయ్యా! సర్వమూ పరమేశ్వరాధీనమని, ఆతని మాయావిధానం మనోవాక్కులకు అందదని సూచించినదంతా సత్యమే.

ధర్మానికి తపము శౌచము దయ సత్యము అని నాలుగు పాదాలు. కృతయుగాంతంలో గర్వరూపమైన అధర్మం తలయెత్తడం వల్ల తపోరూపమైన పాదం తెగిపోతుంది.

త్రేతాయుగం మూడు పాదాలతో నడుస్తుంది. త్రేతాంతానికి సంగరూపమైన అధర్మం వ్యాపించడం వల్ల శౌచరూపమైన పాదం తెగి ద్వాపరానికి రెండే పాదాలు మిగులుతాయి.

ద్వాపరయుగం ముగిసే వేళకు మదరూపమైన అధర్మం పైకొన్నందువల్ల దయారూపమైన తృతీయపాదం విరిగిపోతుంది.

ఇక చివరిదైన కలియుగంలో తస్యరూప పాదం ఒక్కటే మిగిలి ఉంటుంది.

వృషభారాజా! ఈ యుగంలో కలిపురుషుడు అసత్యాన్ని పెంపుచేసి, నాల్గవ పాదాన్ని కూడా హరింప జూస్తుంటాడని నాకు సూక్ష్మంగా తెలియజెప్పావు. గోరూపాన్ని ధరించిన ఈమె భూదేవి అని ఇప్పుడు గ్రహించాను. ఈ దేవి సాక్షాత్తు భగవంతుని చరణారవిందాన్ని మోసే భాగ్యానికి నోచుకొన్నది. అందుకు ప్రతికృతిగా ఆ పరమదయామూర్తి ఈమె

భారాన్ని దూరం చేశాడు. అంత మహాభాగ్యాన్ని పొందిన ఈ తల్లి భగవద్వియోగ దౌర్భాగ్యం పాలయింది. ఈమె దుఃఖకాలం ఇంకా ముగియలేదు. అబ్రహ్మణ్యులు, నామమాత్రులూ అయిన శూద్రులకు భోక్తగా మారి వారికి ఊడిగం చేసే దుర్గతి కూడా తనకు దాపరింపనున్నదని ఈమె కన్నీళ్ళు పెట్టుకొన్నది. ఇంతటికీ ఈ కలిపురుషుడే కారణం. వీడిని తుదముట్టించితే గాని ఈ ముప్పు తప్పదు' అని పలికి ఖడ్గాన్ని చేతబూనాడు.

## కలిపురుషుని శరణాగతి

మునులారా! ఆ విధంగా పరీక్షిత్తు కత్తి పైకెత్తినంతనే రాజవేషాన్ని ధరించి వచ్చిన కలిపురుషుడు భీతిల్లి వెలవెలబోయి నిలువెల్లా నీరుకారి ప్రాణాలు దక్కే ఉపాయం కనిపించక ఆ నరేంద్రుని పాదాలపై వ్రాలి దయచూడమని వేడుకొన్నాడు. దీనవత్సలుడు శరణాగతరక్షకుడు పరమయశోవిశాలుడు అయిన ఆ మహారాజు శరణు కోరినవారిని చంపరాదన్న ధర్మాన్ని పాటించి, అతనిపై జాలిపడి చిరునవ్వు నవ్వుతూ, 'అర్జునా! యశోధారులకు కేలుమోడ్చినవారు భయాన్ని పొందరు. అయినా నీవు అధర్మబంధుడివి కనుక నీ వంటివారికి నా రాజ్యంలో చోటు దొరకదు. అనృతం, లోభం, చౌర్యం. దౌర్జన్యం, అలక్ష్మి, కపటం, కలహం, దంభం నిన్ను అంటిపెట్టుకొని ఉంటాయి. నువ్వింకా ఇక్కడే ఉంటే ఎలాగైనా సరే నువ్వూ నీతోపాటు నీ పరివారం రాజదేహాల లోనికి ప్రవేశించక మానరు. మీ వల్ల కలిగే అనర్థం అంతా యింతా కాదు. ఏ దేశం సత్యధర్మాలకు స్థానమై ఉన్నదో, ఏ దేశంలో యజ్ఞకోవిదుల నానాయజ్ఞాల చేత యజ్ఞేశ్వరుడైన పరబ్రహ్మము సమారాధితుడవుతున్నాడో, చరాచర జీవకోటి బహిరంతరాలలో వాయువు వలె చరించే భగవంతుడు ఏ దేశంలో యజ్ఞపూజితుడై తత్కర్తలకు అమోఘాభీష్టాలను కూర్చి వారి యోగక్షేమభారాన్ని వహిస్తుంటాడో, అటువంటి పరమపవిత్రమైన ఈ బ్రహ్మావర్తదేశంలో నీవు కాలు మోపడానికి వీలులేదు' అని ఆజ్ఞాపించాడు.

## కలి నివాసస్థానాలు

ఆ పలుకులకు కలిపురుషుడు తీగతెగిన ఆకులా గడగడలాడి చేతులు జోడించి, 'సార్వభౌమా! నీకు శరణన్నాను; నాకు నిలవడానికి ఇంత నీడయినా వద్దా? ఏ వంక చూసినా నీవు శరచాపహస్తుడవై నా కన్నుల యెదుట నిలబడ్డట్లే ఉన్నది. నిన్ను మీరి నడుచుకోవడం నాకు శక్యమా? ఎక్కడో అక్కడ తలదాచుకోడానికి నాకు దారి చూపు. ఆ చోటేదో నువ్వే నిర్దేశించు' అని ప్రార్థించాడు.

అప్పుడు పరీక్షిన్నరేంద్రుడు వానిని కరుణించి, 'కలీ! జూదం, మద్యపానం, స్త్రీలు, ప్రాణివధ అనే నాలుగూ క్రమంగా అసత్యానికి, మదోన్మాదానికి, సంగమానికి, క్రౌర్యానికి మనికిపట్లవుతాయి. ఆ చోట్లలో నీవుంటావు' అని మాట యిచ్చాడు.

దానికి కలి, 'స్వామీ! ఈ నాలుగింటికీ నిలకడయిన చోటు మరొక్కటి కూడా సెలవీయండి' అని వేడుకొన్నాడు. పరీక్షిత్తు అతని మాటకు ఆలోచించి, 'కలీ! నీ కోరిక ప్రకారం సువర్ణాన్ని అయిదవదానిగా నిర్ణయించాను' అని పలికాడు.

పరీక్షిత్తు మాటలకు కలిపురుషుడు సంతోషించాడు. సువర్ణం అనగానే అసత్యం, మదం, కామం, రజోమూలకాలైన హింసావైరాలు అన్నీ కలిసినట్లే కనుక అతనికి ఎంతో ప్రియమైనట్లు తోచింది. అతనంతటితో సంతసించి ఆ నరేంద్రునికి నమస్కరించి బ్రతుకు జీవుడా అని కాలికి బుద్ధిచెప్పాడు. అందుచేత శ్రేయస్కాములైనవారు కలిస్థానాలకు దూరంగా ఉండాలి.

## పరీక్షిత్తు ఆజ్ఞాబలం

మునీంద్రులారా! పరీక్షిన్నరేంద్రుడు ఆ విధంగా కలిని నిగ్రహించి దయాతపశ్శౌచాలు మూడింటినీ సముద్ధరించి ధర్మరూపవృషభం కోలుపోయిన మూడు పాదాలనూ యథాస్థితికి చేర్చి, భూదేవికి సౌభాగ్యాన్ని

కూర్చి ఎనలేని యశశ్శ్రీలతో తులతూగుతూ ప్రజానురంజకంగా రాజ్యాన్ని పరిపాలించాడు. ఆ పార్థివచంద్రుని ఆజ్ఞాబలం ఇంతదాకా వ్యాపించి ఉన్నందువల్లనే మీరిక్కడ ఏ అవరోధమూ లేకుండా సత్రయాగాన్ని చేయగలిగారు. అతని మహిమాతిశయానికి ఇంతకంటె నిదర్శన ఏం కావాలి?

## పరీక్షిన్నిర్యాణం

ఆ తర్వాత పరీక్షిత్తుకు బ్రాహ్మణశాపం కలిగింది. తనకు తక్షకుని వలన చావు కలుగనున్నదని తెలుసుకొని ఆ ధీరోదాత్తుడు నిర్భీకుడై సర్వసంగాలనూ పరిత్యజించి చిత్తాన్ని భగవదాయత్తం చేసి వ్యాసపుత్త్రుడైన శుకయోగీంద్రుని వలన భగవతత్త్వరహస్యాన్ని కూలంకషంగా గ్రహించి గంగానదీతోయాలలో తనుత్యాగం చేశాడు.

జీవిత చరమసంధ్యలోనైనా క్షణకాలం భగవంతునిపై మదినిల్పి భగవత్కథామృతాన్ని తనివితీరా గ్రోలినవారికి మోహబంధాలు పటాపంచలై పోతాయి.

నిజానికి వాసుదేవుడు ఏనాడు ఏ క్షణంలో ఈ లోకాన్ని విడిచిపెట్టాడో ఆ నాడే ఆ క్షణంలోనే కలి ఈ లోకాన్ని ప్రవేశించాడు.

అయినా పరీక్షిన్నరేంద్రుడు పరిపాలిస్తున్నంత కాలమూ తన ఆటలు సాగవని తెలిసి పాము పడగ క్రింద దాగిన కప్పలాగా చడీచప్పుడూ లేకుండా ఊరుకున్నాడు.

## కలియుగ విశేషం

మునులారా! ఇతర యుగాల కంటె కలియుగంలో ఒక విశేషం ఉన్నది. ఇతర యుగాలలో పుణ్యాన్ని కార్యరూపంలో ఆచరిస్తే గాని ఫలం దక్కదు. కలియుగంలో కార్యరూపంలో పుణ్యం చెయ్యకపోయినా, ఆ సంకల్పం కలిగినంత మాత్రాన ఫలం సిద్ధిస్తుంది. ఎక్కడ పుణ్యముంటుందో అక్కడ కలికి

నిలకడ ఉండదు. ఈ రహస్యం తెలిసి అప్రమత్తులై వర్తించేవారు కలి భయాన్ని సులభంగా నిరసింపగలరు. ఈ భావాన్ని తలపోసి పరీక్షిత్తు తుమ్మెద పోకడ ననుసరించి కలి సారాన్ని పూర్తిగా గ్రహించి అతనిని బ్రతకనిచ్చాడు.

## సర్వశాస్త్రసారం

మునివరేణ్యులారా! వాసుదేవుని కథతో పడుగుపేకలా కలిసిపోయిన పరీక్షిన్నరేంద్రుని చరిత్రాన్ని మీరు కోరినట్లు వివరించాను. శుభాలను కోరినవారు భగవద్గుణకర్మలను ఆశ్రయించిన మంచి కథలను శ్రద్ధాభక్తులతో సేవించాలి. ఇదే సర్వశాస్త్రసారం.

## శౌనకాదుల కృతజ్ఞత

సూతుని వాక్యాలను సమాధానచిత్తంతో విని శౌనకాదులు, 'సౌమ్యా! కలకాలం చల్లగా వర్ధిల్లు. మేము కలిపురుషునికి భయపడి ఈ సత్త్రయాగం మొదలుపెట్టాము. మంచి పని అన్నాక మొదలుపెట్టడం సులభమే కాని కార్యసమాప్తికి విఘ్నాలెన్నో ఉంటాయి. పోనీ ఆ చిక్కులన్నీ దాటినా కార్యఫలం నిశ్చయం కాదు. మా శరీరాలు యాగాగ్నిధూమాలకు పొగిలి ససిచెడ్డాయి. సూతాగ్రణీ! నీవు దయతో మాకిప్పుడిచ్చిన గోవింద పాదారవింద మకరందాన్ని గ్రోలినందున మా ప్రాణాంకురాలు మళ్ళీ చిగురించాయి. నీ సంసర్గం వలన మాకింతటి పరమభాగ్యం కలిగింది. భగవద్భక్తుల సాంగత్యం స్వల్పకాలికమైనా మహాశుభాన్ని కలుగచేస్తుంది. సజ్జన సాంగత్యానికి స్వర్గాపవర్గాది సుఖాలు సయితం సాటిరావు. ఇక తుచ్ఛమైన లౌకికసుఖాల సంగతి వేరే చెప్పాలా?

## శ్రీమద్భాగవతం

సూతవర్యా! భగవంతుడు ప్రాకృతగుణరహితుడు. అయినప్పటికీ ఆయన కళ్యాణగుణాలు అనంతంగా ఉన్నాయి. ఆ గుణాలు ఇన్నీ అన్నీ అని వివరించి

శంకరాదులు కూడా గణింపలేరు. అంతటి మహనీయుని కథలంటే చెవి కోసుకోని రసజ్ఞులుంటారా? హరి చరిత్రల కన్న పరాయణమూ పరమపురుషార్థదాయకమూ అయినవి భాగవతులకు వేరే ఏమున్నాయి? అటువంటి కథల సముదాయమైన భాగవతాన్ని వినిపించాలంటే భగవత్ప్రధానుడవైన నువ్వే తగినవాడివి. ఏ మహాపురాణం పరమజ్ఞాన సాధకమో, ఏ మహాపురాణాన్ని పరమభాగవతోత్తముడు పరీక్షిన్నరేంద్రుడు శుకయోగిముఖంగా విని భగవత్పాదమూలాన్ని చేరగలిగాడో, ఏ మహాపురాణం పుణ్య సత్త్వశోధకమై మహాద్భుత యోగనిష్ఠాదాయకమై శ్రీకృష్ణలీలాసముపన్నమై భాగవతు లందరికీ ఇంపుగొలుపుతుందో, ఏ మహాపురాణం కర్మ జ్ఞాన భక్తియోగాలను ప్రకాశింపజేసి నక్షత్రాల నడుమ పూర్ణచంద్రబింబంలా పురాణప్రపంచానికి మేలుబంతి కాగలదో, ఆ మహాపురాణాన్ని మాకు తెలిసేటట్లు వివరించి చెప్పు' అని అడిగారు.

సూతుడు వారితో ఇలా అన్నాడు.

## పారీక్షిత మహాభాగవతం

'మౌనీంద్రులారా! మేము విలోమజాతి వాళ్ళము. ఏనాటి సుకృతమో పండి జ్ఞానవృద్ధుడైన శుకయోగిని సేవించే భాగ్యం మాకు లభించింది. ఆ కారణాన మీ ఆదరణానికి నోచుకొన్నాను. నా జన్మమూ సఫలమైంది. మహాత్ములతోడి సంబంధం కనీసం సంభాషణరూప మాత్రమైనా ఒక్కింత కలిగితే తత్ఫలంగా దుష్కులజనన నిమిత్తమైన మనోమాలిన్య రూప వ్యాధి సామాన్యులకు కూడా నశిస్తుండగా ఇక భగవన్నామ కీర్తనపరాయణుల సంగతి వేరే చెప్పాలా? ఇంతెందుకు! భగవన్నామాన్ని కీర్తించేవారికి దుష్కులజనన రూపమైన దోషాలు కలుగవు. భగవంతుని శక్తి ఎలాగో, ఆయన గుణాలు కూడా అలాగే అనంతమైన మహత్త్వం కలిగి ఉంటాయి. అందువల్లనే ఆయనను అనంతు డన్నారు. అనంత అన్న శబ్దం ఒక్కటి చాలు భగవత్తత్త్వమంతా సూచిత మవుతుంది.

మునులారా! బ్రహ్మాదులు శ్రీదేవీకటాక్షప్రాప్తికై నిరంతరమూ తపించి పోతారు. ఆ దేవి వారివంకనైనా చూడక తనను కోరనట్టి ఏ పరమాత్మని స్వయంగా వలచి చేరి ఆయన పాదరేణు సేవాపరతంత్రురాలై అదే పరమభాగ్యంగా ఉవ్విళ్ళూరుతుంటుందో, ఏ పరాత్పరుని పాదాగ్రం నుంచి జారిన తోయం బ్రహ్మకు అర్ఘ్యోదకమూ, ముక్కంటికి శిరఃస్నానోదకమూ అయి మూడు లోకాలకూ జీవనోపాయ మవుతున్నదో, ఎవరు తప్ప వేరొకడు భగవంతుడని పిలువదగడో, ఎవనియందు అనురక్తులై సత్పురుషులు చిరసంరూఢమైన దేహాద్యభిమానాన్ని విడిచి స్వాభావికమైన అహింసోపశమనాన్ని పొంది పరమహంసపదాన్ని చూరగొంటారో, అటువంటి భగవంతుని పుణ్యచరిత్రాన్ని చెప్పమన్నారు. పక్షులు ఎంత పైకెగిరినా ఆకాశం అంచును చూడలేనట్లు, జ్ఞానులు కూడా భగవల్లీలావిశేషాల అంతాన్ని తెలుసుకోలేక పోయారు. ఇక నా సంగతి చెప్పనక్కర్లేదు. అయినా మీరు కోరినది నా బుద్ధికి తెలిసినంతలో చెప్పాను. వినండి.

## పరీక్షిత్తు శాపవృత్తాంతం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు రాజ్య పరిపాలనం చేస్తూ ఒకనాడు వేటకై వనానికి వెళ్ళి మృగాల వెంటబడి చాలా దూరం నడిచి అలిసిపోయాడు. ఆకలి వేసి దప్పిక కలిగింది. ఎంత వెతికినా ఎక్కడా జలాశయం కానరాలేదు. అతనలా ముందుకు సాగి సమీపంలో ఉన్న మునిపల్లెను చేరుకొన్నాడు. అక్కడైనా నీరు దొరకవచ్చునని గంపెడంత ఆశతో అతను లోపలికి వెళ్ళి అక్కడ లేడి చర్మాన్ని కప్పుకొని విరిసిన జటాజూటం ధరించి కన్నులు మూసుకొని తపస్సు చేసుకొంటున్న ఒక ఋషిని చూశాడు. దాహం ఓర్వలేక రాజు ఆ మునిని నీరడిగాడు. ఆ తపస్వి ప్రాణేంద్రియాలను నిరోధించి ఉపరతుడై తురీయావస్థను చేరి నిర్వికారుడూ బ్రహ్మభూతుడూ అయినందున ఆయనకు పరీక్షిత్తు పలుకులు వినబడలేదు.

పరీక్షిత్తుకు దాహతాపం క్షణక్షణానికీ దుర్భరం కాసాగింది. చిత్తశాంతి తప్పింది. అందువల్ల అతను మునీంద్రుడు ఉలుకూ పలుకూ లేకుండా ఉండటానికి హేతువును ఊహింపలేక, ఇది నిజంగా సమాధినిష్ఠేనా లేక రాజనిరాదరణమా తెలుసుకుందామని, చేరువనే ఉన్న ఒక చచ్చిన పామును తన వింటికొనతో ఎత్తి ఆ ముని మూపున వేసి అక్కడి నుంచి హస్తినాపురం దారిపట్టాడు.

ఆ ఋషి పేరు శమీకుడు. ఆయనకు శృంగి అనే కుమారుడున్నాడు. శమీకుడు సమాధిస్థితిలో ఉన్నందున అతనికి తనపై పడిన పాము సంగతే తెలియదు. ఆ సమయంలో శృంగి తన తోటి పిల్లలతో కలిసి ఎక్కడో ఆడుకొంటున్నాడు. ఆటలు తీరి ఆశ్రమానికి రాగానే తండ్రి మూపున వ్రేలాడుతున్న మృతసర్పాన్ని చూసి అతను ఇందాక పరీక్షిత్తు తమ యింటికి వచ్చి పోవడాన్ని చూశాడు కనుక అతనే ఈ అపచారాన్ని చేసి ఉంటాడని గ్రహించాడు.

శృంగికి చెప్పలేనంత దుఃఖం పొర్లివచ్చింది. 'బలోన్మత్తులైన రాజుల అధర్మాన్ని ఏమనవచ్చు! బ్రాహ్మణులు తమ గృహపాలస్థానానికి రాజులను నియమించారు. ఆ రాజులు స్వామిద్వారంలో నిలబడి కుండలోని కూడు తింటున్నారు. ఇన్నాళ్ళూ దుష్టజనులను శాసించిన శ్రీకృష్ణుడు ఈ లోకాన్ని వదిలిపెట్టాడని గదా ఈ రాజులకు ధర్మమర్యాదను ఉల్లంఘించే గుండె ధైర్యం వచ్చింది! ఇక నేనే పూనుకొని వీడికి బుద్ధిచెబుతాను. ఇదిగో చూడు నా శక్తి' అని పలికి రోషకషాయనేత్రుడై కౌశికీనదికి పోయి ఆచమించి శుచియై,

ఉ. **'ఒడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాఱు మా**
**టాడకయున్న మజ్జనకు నంసతలంబున వైచి దుర్మద**
**క్రీడఁ జరించు రాజు హరికేశవు లొడ్డినఁ గావఁ జచ్చుఁబో,**
**యేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానల హేతిసంహతిన్.'**

అని శపించి ఆశ్రమానికి వచ్చి తండ్రికోసం గొంతెత్తి ఏడవడం మొదలు పెట్టాడు. శమీకుడు ఆ ఏడ్పు విని బహిర్ముఖుడై కనువిచ్చి మూపున నున్న సర్పశవాన్ని అవతలికి తోసి సుతుని వంక మరలి, 'నాయనా! ఎందుకేడుస్తున్నావు? నీకు కీడుచేసినవారెవరు?' అని అడిగాడు. శృంగి జరిగిన వృత్తాంతమంతటినీ పూస గుచ్చినట్లు వినిపించాడు.

శమీకుడు పూర్తిగా విని, 'నాయనా! నీవింకా చిన్నవాడివి. మునులకు శాంత గుణం పరమమిత్రం; క్రోధం హితానికి శత్రువు. నువ్వు మిత్రుని దూరం చేసుకొని హితశత్రువును చేరదీశావు. ఇంతకన్నా అజ్ఞానం ఉంటుందా? రాజు చేసిన తప్పుకు గాను దండించానంటావా? అలాగైనా దండన యెప్పుడూ దోషానురూపంగా ఉండాలి. గిల్లింత తప్పుకు ఇంత ఘోరదండనం తగునా? ఓరి అపక్వమతీ! రాజంటే విష్ణువు యొక్క తేజోంశ. అంతే గాని మనుష్యప్రాయుడు కాడు. రాజు యొక్క దుర్నిరీక్ష్యమైన తేజం రక్షిస్తుండడాన్ని బట్టి ప్రజలు ఏ భయమూ లేకుండా సుఖంగా ఉంటారు. రాజు లేనినాడు కాపరి లేని గొర్రెల మందలా సర్వలోకమూ చోరమయమై చేటొందుతుంది. చోరుల కారణంగా ప్రజాధనం నశిస్తుంది. ఈ రెండింటికీ మనం ఈనాడు నిమిత్తభూతుల మైనాము. నిష్కారణంగా పాపం మూటగట్టుకొన్నాము.

నాయనా! రాజు లేని రాజ్యం పడే అగచాట్లు చెప్పతరం కాదు. ప్రాణ మాన ధనాలు దక్కవు. సదాచారం నిలువదు. జనులు కుక్కలూ కోతుల కన్న హీనంగా ప్రవర్తిస్తారు. వర్ణసాంకర్యం కలుగుతుంది. రాజంటే ధర్మపాలకుడు. అంతేకాని ఏతన్మాత్రు డెవరో కాదు. అందులోనూ పరీక్షిన్నరేంద్రుడు రాజలోకానికే అలంకారం.

అంతటి భాగవతోత్తముడు వేరొకడుండడు. ఆ పుణ్యాత్ముడు ఎన్నో హయమేధాలు జరిపి రాజర్షి వర్యుడని కీర్తి గడించాడు. అతను ధర్మదేవత అపరావతార మనడం అతిశయోక్తి కాదు. అతనికి క్షుత్పిపాసారూపమైన

గొప్ప ఆర్తి కలిగింది. అటువంటప్పుడు ఎంతవారికయినా హితాహిత విచారం ఉండటం చాలా అరుదు. ఆపత్కాలంలో ఏమిచేసినా గొప్ప తప్పుగా ఎన్నకూడదు. అయ్యో! సార్వభౌముని శపించి నీచకృత్యానికి ఒడిగట్టావు. నీవు కావించిన పాపానికి ప్రతివిధానం ఉన్నట్లు లేదు. కుమారా! భగవద్భక్తులు పరులు చేసిన వంచనా తిరస్కారాలను గాని, నిందా శాపాలను గాని, తర్జన భర్జనలను కాని మనస్సుకు పట్టించుకోరు. పరీక్షిద్రాజు పరమ భాగవతుడు కనుక నీకు ప్రతిశాపాన్ని ఇవ్వడు. హా! దైవమా! అపక్వమతి అయిన ఈ పిన్నవాడు నీ భక్తుని యెడ తప్పుచేసి నీకూ అపరాధంచేశాడు. ఇదంతా అజ్ఞాన కృతం కనుక ఇతనిని మన్నించు. అయ్యో! ఈ శాపఫలంగా ఏమి కానున్నదో కదా! అయ్యో! ఏమి చేసేది?' అని పుత్రుని అకార్యానికి వగపు చెంది, తన శిష్యుణ్ణి రావించి, రాజుకు జరిగినదంతా తెలియజెప్పమని పంపించాడు.

## పరీక్షితుని పశ్చాత్తాపం

ఇంటికి వెళ్ళి ఆకలిదప్పులు తీర్చుకొని కడుపు చల్లగా సేదదీరాక పరీక్షిత్తుకు పరామర్శజ్ఞానం తలయెత్తింది. అతను తన అకార్యాన్ని నెమరువేసుకొని అలమట చెంది, 'అయ్యో! ఎంత అజ్ఞానినై ప్రవర్తించాను! అదీ ఇంకెక్కడో గాక నిరపరాధీ బ్రహ్మతేజుడూ అయిన మునీశ్వరుని యెడ కావించాను. అయ్యయ్యో! మహర్షి నవమానించడం ఈశ్వరుని అవమానించడమే అవుతుంది. నా ఈ దుష్టకర్మకు ఫలితంగా అప్రతికార్యమైన మహాదుఃఖం నాకు తప్పదు. అదీ వెనువెంటనే వచ్చినట్లయితే నాకు ప్రాయశ్చిత్తమై ఈ చెడుబుద్ధి మళ్లీ పుట్టకుండా ఉంటుంది. బ్రహ్మకులాగ్నిని రేపాను. ఇది నా రాజ్యాన్ని అట్టుపుట్టానవాళ్ళు కనబడకుండా బలకోశసహితంగా దహిస్తుంది గాక; అప్పుడైనా ఈ పాపాత్ముడికి గో ద్విజ దేవతానీకం పట్ల పాపబుద్ధి జనింపకుంటుంది గాక' అని విచారపడసాగాడు.

## ప్రాయోపవేశం

పరీక్షిన్నరేంద్రుడలా విచారపడుతుండగా శమీకశిష్యుడు వచ్చి 'రాజా! శమీకమహర్షి పంపగా వచ్చాను. నిన్ను నీ అకార్యానికని మా ఋషితనయుడు శృంగి శపించాడు. తక్షకుని వల్ల నీకు బాధ కలుగుబోతున్నది. ఆ సంగతి నీకు తెలియజెప్పమని మా గురువుగారు ఆనతీయగా వచ్చాను' అని పలికి వెళ్ళి పోయాడు.

ఆ మాటలకు రాజు ఎంతో సంతోషించి, 'ఆహా! శృంగి నాకు నిజంగా మేలుచేశాడు. ఇంతదాకా నేను చేసిన ధర్మాలన్నీ ఇహపర లోకసాధనకు పనికివచ్చేవే తప్ప అంతకు మించినవి కావు. ఈ రెండు లోకాలూ అనిత్యాలే కాక దుఃఖప్రాయాలు. వీటిని ప్రాజ్ఞులు హేయమని గర్హిస్తారు. సర్వపురుషార్థ సిద్ధి మాత్రమే వాంఛనీయమైనది. అదొక్కటే సుస్థిరం. అది శ్రీకృష్ణపదసేవనం వలన తప్ప వేరొక తీరున ప్రాప్తింపదు' అని నిశ్చయించి, గంగానదిలో ప్రాయోపవేశం చేశాడు. శ్రీమహావిష్ణు పాదపద్మార్చిత తులసీరేణు సంసర్గతోయాలతో నిండి లోకాలనూ లోకపాలకులనూ పవిత్రీకరించే ఆ దివ్యవాహిని మర్త్యమాత్రులకు సేవ్యమవుతుండగా ఆ సన్నమరణుల సంగతి చెప్పాలా?

## మునుల సందర్శనం

ప్రాయోపవిష్టు డైనాక పరీక్షిన్నరేంద్రుడు సర్వసంగపరిత్యాగం చేసి మునివ్రతాన్ని పూని భగవచ్చరణారవిందాలను అనన్యభావంతో ధ్యానింపబూనాడు. ఆ సంగతి తెలిసి ఒకవైపు నుంచి అత్రిమహర్షి, వసిష్ఠుడు, చ్యవనుడు, శరద్వంతుడు, వేరొక దిక్కు నుంచి అరిష్టనేమి, భృగువు, అంగిరసుడు, ఇంకొక చాయ నుంచి ఉతథ్యుడు, ఇంద్రుడు, ప్రమథులు, ఇధ్మవాహుడు, మేధానిధి, దేవలుడు, ఆర్ష్టిషేణుడు, మరొక పక్కనుంచి భరద్వాజుడు, గౌతముడు, పిప్పలాదుడు, మైత్రేయుడు, ఔర్వుడు, అగస్త్యుడు, ఇంకొక వలని నుంచి వేదవ్యాస నారదాదులు అతని వద్దకు వచ్చారు.

వారితోపాటు దేవర్షులు, బ్రహ్మర్షులు, రాజర్షులు వారి వారి శిష్యులతో కలిసి తీర్థయాత్ర నెపంతో అక్కడికి వచ్చి చేరారు. మహానుభావులకు తీర్థయాత్ర లెందుకంటా రేమో? వారు తీర్థాలకు, లోకాలకు పావనత్వాన్ని కలిగించేందుకు తీర్థయాత్రాభిగమనం ఆచరిస్తారు. అంతేకాని ఆత్మశుద్ధి అవసరమై కాదు. అగ్ని వలె పరిశుద్ధులైన వారికి వేరే శుద్ధితో పనేముంది?

పరీక్షిత్తు వారందరికీ తలవంచి మొక్కి అర్ఘ్యాసనాల నర్పించి పూజలు కావించి చేతులు మోడ్చి, 'మహాత్ములారా! మీరు బ్రాహ్మీభూతులు. రాజులు ఎంత గొప్పవారయినా వారికి అంతో యింతో రజోగుణస్పర్శ తప్పదు. అందువల్ల వారి కర్మల లోనూ రజోమాలిన్యం ఉండి తీరుతుంది. అందుచేత రాజకులం బ్రాహ్మణోత్తముల చేరువకు కూడా రాకూడదు. అంతే కాదు, వారి కాళ్ళు కడిగిన నీళ్ళు పడే చోటి దగ్గరకు కూడా వెళ్ళకూడదు. మహాత్ములారా! అటువంటి నింద్యకర్మలతో కూడిన రాజకులంలో పుట్టినప్పటికీ నేను పరమపావనమూర్తులైన మీ అనుగ్రహానికి నోచి కృతార్థుడ నైనాను. ఈ పాపాత్ముని జీవితమంతా గృహాసక్తమై వ్యర్థమయిపోయింది. అది చూసి భగవంతుడు ద్విజశాపరూపంలో నన్ను అనుగ్రహించాడు. తత్ఫలితంగా నాకు విరక్తి జనించింది. నా చిత్తం పరమేశ్వరాయత్త మయింది. ఈ శరణార్తుని యెడ మీరూ, ఈ గంగామతల్లీ ప్రసన్నులవుతారు గాక!

**మ. 'ఉరగాధీశు విషానలంబునకు మే నొప్పింతు శంకింప నీ**
**శ్వర సంకల్పము నేఁడు మానదు భవిష్యజ్జన్మ జన్మంబులన్**
**హరిచింతారతియున్ హరి ప్రణుతి భాషాకర్ణనాసక్తియున్**
**హరి పాదాంబుజసేవయుం గలుగ మీ రర్థిం బ్రసాదింపరే.'**

అని మొక్కి తనయుడైన జనమేజయునికి రాజ్యాన్ని అప్పగించి గంగానది దక్షిణతీరంలో కొసలు తూర్పు దెసకు పరిచిన దర్భాసనంపై ఉత్తరాభిముఖంగా తిరిగి కూర్చున్నాడు. అతని మనోనిశ్చయానికి దేవతలు సాధువాదాలు పలికారు. దేవదుందుభులు మ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది.

## మునుల ప్రశంసలు

అప్పుడు ఋషివర్యు లందరూ ఆశ్చర్యపడి, రాజర్షివర్యా! భగవత్ప్రాప్తిని కోరి సార్వభౌమపదాన్ని తృణప్రాయంగా త్యజించడం మీకే చెల్లింది గాని అన్యులకు సాధ్యంకాదు. శ్రీకృష్ణానువర్తులైన పాండవేయులకు ఇదొక వింత కాదు' అని ప్రశంసించి, 'ఈ భాగవతాగ్రేసరుడు రజశ్శోకరహితమైన ఉత్తమలోకాన్ని పొందాలని నిశ్చయించాడు. ఇతను ఈ మేను విడిచినంతదాకా మనమందరం ఇక్కడే ఉండాలి' అని పరస్పరం అనుకోసాగారు. పక్షపాతం లేక సత్యపూతమైన వారి మధుర గంభీర వచనాలను పరీక్షిత్తు విని, 'మునివర్యులారా! పరమజ్ఞాని తల్లజులైన మీ వంటి వేదమూర్తు లందరూ ఇక్కడికి రావడం నా భాగ్యవిశేషం. మీకు పరానుగ్రహం నైజం. ముల్లోకాలలోనూ మీరు కోరతగినది లేదు. నా కా మృత్యువు సమీపించింది. ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటో సెలవీయండి. మీ రెరుగని తత్త్వార్థాలు లేవు' అని వినయపూర్వకంగా ప్రార్థించాడు.

## అవధూత సమాగమం

అంతలో అక్కడికి ఒక అవధూత ఏతెంచాడు. అతని దిగంబరత్వానికి ఆశ్చర్యపడి చుట్టుప్రక్కల పిల్లలందరూ అతని చుట్టూ మూగివచ్చారు.

అతని కర చరణాలు, ఊరు బాహువులు, అంసక పోల గాత్రాలు పూవు సోకినా కందిపోయేటంత సుకుమారంగా ఉన్నాయి. ఆ అవధూత కంబుకంఠంతో, గూఢజత్రూవిశాలోన్నత వక్షోభాగంతో, సమావర్తనాభితో, తిర్యఙ్నిమ్నరేఖారమ్యమైన ఉదరంతో, ప్రలంబ బాహుయుగ్మంతో, శ్యామసుందర వర్ణంతో విరాజిల్లుతూ పదహారేండ్ల ప్రాయాన్ని తలపింపజేస్తూ స్త్రీ జనులకు కూడా మోహపారవశ్యాన్ని కల్పించే మనోహరరూపంతో చూసినకొద్దీ ఇంకా చూడాలనిపించే దివ్య సుందర విగ్రహంతో తేజరిల్లుతున్నాడు.

మునివర్యులు ఆ దిగంబరుని చూచి పూర్వపరిచయం వలన అతను శుకయోగి అని గుర్తించి తటాలున లేచి ఎదురేగి తోడితెచ్చి యథార్హ పూజా సత్కారాలతో గౌరవించారు. పరీక్షిత్తు ఆయనకు తగిన రీతిని భక్తిపూర్వకంగా ఉపచారాలను ఆచరించాడు. ఆ అవధూత వారి మర్యాదలను అంగీకరించి, ఋష్యాదుల ప్రార్థనం మేరకు ఆసనాన్ని గ్రహించి, గ్రహతారాపరివృతుడైన శీతకరుని వలె వారి మధ్య వెలుగొందాడు.

## పరీక్షిత్తు కోరిక

అప్పుడు పరీక్షిత్తు ఆ వచ్చిన అవధూత శుకమహర్షి అని మునుల వలన తెలుసుకొని, ఆయనను చేరబోయి సాష్టాంగప్రణామం ఆచరించి చేతులు జోడించి, 'శుకయోగీశ్వరా! శ్రీకృష్ణభగవానుని అనుగ్రహం పాండవులతో సమాప్తం కాలేదు; పాండవ వంశజుడ నైన నా యెడ కూడా ప్రసరిస్తున్నది. మీరు సర్వసిద్ధిసంపన్నులైన మహాత్ములు; మీ వర్తనం నా వంటి భాగ్యహీనుని మాటలకు అందదు; యదృచ్ఛాగతిని ఎల్లెడలా సంచరిస్తుంటారు. మీ దర్శనభాగ్యం కోసం ముముక్షువులు ఎంతగానో ఉవ్విళ్ళూరుతుంటారు. అట్టివారు నేడిక్కడికి రావటం ఆ భగవానుని కరుణావిశేషం కాకపోతే మరేమిటి? మీరు మాకు నేడిలా అతిథులై విచ్చేసిన కారణాన మేము క్షత్త్రబంధువుల మయినా సాధుజన సంసేవ్యుల మైనాము. మరణం ఆసన్నమైనవారు ఏమి చేయాలో, దేనిని చింతించాలో, అతనికి ఏది సేవ్యమో, ఏది త్యాజ్యమో తెలియజెప్పండి.

మీకు సర్వం కరతలామలకం కనుక మిమ్మల్ని ఈ విధంగా ప్రార్థిస్తున్నాను. మీరు గృహస్థుల యిండ్లలో గోదోహనమాత్రకాలమయినా విలువరు. ఎలాగో ఇక్కడికి వచ్చి కొంతసేపు నా చెంత కూర్చుండడానికి సమ్మతించారు. ఇది నా భాగ్యవిశేషం. ఈ సమయం మించిపోతే మీ సందర్శనం కూడా నాకు దుర్లభమవుతుంది. నా ప్రార్థనం అంగీకరించి నన్ను దయ చూడండి' అని వేడుకొన్నాడు.

# ద్వితీయస్కంధం

శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రుని ప్రార్థనను అంగీకరించి ఇలా అన్నాడు.

## ఆసన్నమరణుని కర్తవ్యం

'రాజేంద్రా! నీవు కోరిన అర్థం మోక్షహేతువు కనుక అది సర్వలోకహిత ప్రతిపాదకం. బ్రహ్మవేత్తలూ అందుకు సమ్మతింపగలరు. గృహాసక్తులకు తత్సంబంధమై వినదగిన విషయాలు వేలకువేలు ఉన్నాయి. అవన్నీ ఆయుష్కాలాన్ని హరిస్తాయే గాని మేలు చెయ్యవు. జీవులకు ఆయుష్కాలం అతిస్వల్పం. అందులో సగం పగలు రూపాన, సగం రాత్రి రూపాన వ్యయమైపోతుంది. పగటిభాగమంతా ధనార్జన కుటుంబరక్షణలతో తెలియకుండానే గడిచిపోతుంది. రాత్రి భాగాన్ని నిద్రారతులు మింగివేస్తాయి.

కుటుంబం మొదలైనవన్నీ నీటిబుడగల వలె క్షణభంగురాలు. వాటికై అనర్ఘమైన ఆయుష్కాలాన్ని వ్యర్థపరుస్తున్నారు. ఎందుకిలా నడిచిపోతున్నదని ఆలోచిస్తే, అజ్ఞానం వల్ల అని తేలికగానే గ్రహింపగలము. ఇందులో అజ్ఞానం ఎక్కడున్నదంటే భార్యాపుత్రదేహదులన్నీ ఆత్మకు పరికరాలు మాత్రమే. ఆత్మ నిత్యం; పరికరాలు అనిత్యం. అనిత్యాలని ఎందుకన్నామంటే భార్యాదులు

నశించిపోవడాన్ని ప్రతివ్యక్తీ కళ్ళారా చూస్తూనే ఉన్నాడు. స్వానుభవమే ఇందుకు ప్రమాణం. ఒకవంక అలా చూస్తున్నప్పటికీ అందులోని మిథ్యాత్వం మన బుద్ధికి ఎక్కడం లేదు. కారణం ఏమంటే? విషయానురాగమే కారణం.

రాజా! ఆయుష్కాలం ఇలా వ్యర్థమవుతున్నదని మొట్టమొదటే చక్కగా గ్రహించి, ప్రతిక్షణమూ సార్థకమయ్యేట్లు చూసుకోవాలి. ఆసన్నమరణుడు ఏం చెయ్యాలన్న ప్రశ్నకు ఇదే సమాధానం.

## దేనిని వినాలి?

రాజా! నీ తక్కిన ప్రశ్నలకు సమాధానం విను. పరమేశ్వరుడు సర్వాత్ముడు కనుక సర్వాంతర్యామి. ఆయన ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీమత్త్వము, జ్ఞానము, వైరాగ్యములతో షడ్గుణైశ్వర్య సంపన్నుడు కనుక భగవానుడని పిలువబడుతున్నాడు. ఆ పరమాత్ముని కథలను వినడం, నామాన్ని కీర్తించడం, ఆయన మహిమలను స్మరించడం – ఇవి మరణం ఆసన్నమైనవారు తప్పక చేయాలి. ఇంతకు మించి వారు చేయగలిగినదేమీ ఉండబోదు.

## సాంఖ్య, కర్మయోగ ఫలాలు

రాజా! ముక్తికి సాంఖ్యమే పరమసాధనమని కొందరు, కర్మయోగం పరమసాధనమని కొందరు వాదిస్తుంటారు.

సాంఖ్యమంటే ఏమిటి? ఆత్మానాత్మ వివేకం. దానివల్ల చేకూరే ఫలం ఏమిటి? తత్త్వం బోధపడటం.

యోగం అంటే ఏమిటి? స్వభావం పరిశుద్ధమయేట్లు వర్తించడం. దాని ఫలం ఏమిటి? చిత్తశుద్ధి కలుగుతుంది.

రాజా! వట్టి తత్త్వజ్ఞాన చిత్తశుద్ధులతో మాత్రమే ఫలం కలుగదు. తత్త్వం స్వానుభవసిద్ధం కావాలి. ఆ అనుభవం భగవద్గుణానుభవం వలన తప్ప వేరొక రీతిని లభ్యపడదు. భగవద్గుణానుభవానికి ఏతన్నామకీర్తన, స్మరణాదులే పరమసాధనాలు. అందుకు చిత్తశుద్ధి తోడ్పడుతుంది.

## ప్రమాణం

ఇందుకు ప్రమాణం ఏమిటో చూపించమంటే, మహాత్ముల వర్తనమే పరమప్రమాణం.

మహాత్ములు చిత్తశుద్ధిని పొంది, విధి నిషేధ శాస్త్రాలను దాటి, కేవలబ్రహ్మనిష్ఠను సాధించి, అత్యున్నతస్థితిలో ఉన్నప్పటికీ హరిగుణ సంకీర్తనమంటే చెవికోసుకొంటారు. కనుక నీవు కూడా భగవన్నామసంకీర్తనంలో జీవితాన్ని పండించుకోవాలి.

అయితే ఎంత మహాత్ములైనా శాస్త్రవిహితధర్మాన్ని అతిక్రమించడం తప్పు కాదా? అని అడిగితే, ఈ ధర్మాలన్నవి గుణాలను బట్టి ఉంటాయి. గుణాలను ఆశ్రయించడం వల్ల కలిగే సుఖం తుచ్ఛమైనది; అదీ శాశ్వతం కాదు. సుఖానుభవమే జీవితావధిగా ఎంచినవాడు దానికోసం ప్రాకులాడటం వెర్రితన మనిపించుకొంటుంది.

కనుక తుచ్ఛసుఖాలను విడిచిపెట్టి సర్వోత్తమమూ, శాశ్వతమూ అయిన సుఖాన్ని కోరుకోవాలి. భగవత్కళ్యాణ గుణాలనే అమృతం వలన అటువంటి పరమసుఖం చేకూరుతుంది.

విధినిషేధశాస్త్రాలు గుణబద్ధులకు మాత్రమే ప్రమాణం. వాటిని అనుష్ఠించడం వలన వారు క్రమక్రమంగా సత్త్వాభివృద్ధిని గాంచి, ఉత్తమస్థితికి అర్హులవుతారు.

మహాత్ములు గుణాతీతులు కనుక వారు ఆ శాస్త్రాలను పాటింపక పోయినా దోషం లేదు. ఒకవేళ వారు ఆ శాస్త్రాలను పాటించినట్లయితే అది లోకసంగ్రహార్థమని తెలుసుకోవాలి.

## భాగవత పురాణ ప్రశంస

రాజా! భాగవత పురాణశ్రవణమే అటువంటి లోకోత్తర సుఖప్రాప్తికి సులభోపాయం. ఆ పురాణంలో భగవన్నామ కీర్తనమే ప్రధానం. వేదతుల్యమైన ఆ మహాగ్రంథాన్ని నేను ద్వాపరాంతంలో నా తండ్రి శ్రీకృష్ణద్వైపాయనుని వద్ద చదువుకొన్నాను. నైర్గుణ్యనిష్ఠుడ నైన నాకు సగుణ బ్రహ్మలీలామయమైన భాగవతం ఎలా రుచించినదంటావేమో! హరిలీలలు ఎటువంటివారినైనా ఆకర్షిస్తాయి. ఆ లీలలలో అంతటి మాధుర్యం ఉన్నది. ఆ లీలలు సనకాదులంతటి మహర్షులనే ఆకర్షించాయంటే, నావంటివారి సంగతి ఇక చెప్పేదేముంది? ఆ శ్రీమద్భాగవత పురాణాన్ని నీకు వినిపిస్తాను; సావధానమతితో విను. నీ కోరిక తీరుతుంది.

## నామకీర్తన ఫలం

ఈ నామకీర్తనం ఫలార్థులకు ఈప్సితార్థసాధనను, ముముక్షువులకు మోక్షసాధనను, జ్ఞానులకు భయరాహిత్య మహాఫలాన్నీ ప్రసాదిస్తుంది. సిద్ధులకూ సాధకులకూ ఇంతకన్నా శ్రేయస్సునిచ్చేది మరొకటి లేదు.

ఈ మాటకు వేరే ప్రమాణాలతో పనిలేదు. ఇది స్వతఃప్రమాణ సిద్ధం.

## శ్రద్ధాభక్తులు

రాజా! శ్రద్ధలేని భక్తి నిరర్థకం. శ్రద్ధ ఉంటే భక్తి త్వరగా నిర్హేతుకమవుతుంది. దానిని సంపాదించడానికి ఎంతో పాటుపడతారు. నీవు హరిభక్తుడవు కనుక నేను చెప్పేది వినడానికి పాత్రత ఉన్నవాడవు. పాత్రమెరిగి చేసిన దానం ఫలకారి కాగలదు. నీ భక్తిని శ్రద్ధాన్వితం చేయాలని నా ఉద్దేశం.

రాజా! జీవితమంతా వృథాగా గడిచిపోయిందని, మృత్యువు నోరు తెరిచి మింగబోతున్న ఈ చివరి క్షణంలో ఏమి చేయగలననీ చింతింపకు. జీవిత ప్రయోజన చింత లేనివారికి జీవితకాలం ఎంత ఉన్నా వ్యర్థమే అవుతుంది.

జీవిత ప్రయోజన చింత కలిగి, 'అయ్యో! నా కాలమంతా నిరర్థకంగా గడిచిపోతున్నదే' అన్న ఆలోచన కలిగినవారికి ఈప్సితార్థం ముహూర్తమాత్రాన సిద్ధిస్తుంది. ఒక తార్కాణం చెప్పమంటావా?

## ఖట్వాంగ చరిత్ర

పూర్వం ఖట్వాంగుడనే రాజు ఉండేవాడు. అతని కాలంలో సురాసురులకు ఘోరమైన యుద్ధం జరిగింది. దేవతలు ఖట్వాంగుని సహాయాన్ని కోరారు. అతను నిర్జరుల విన్నపాన్ని మన్నించి వెళ్ళి రాక్షసులను ఓడించాడు. అమరులందరూ అతని తేజోబలప్రౌఢిని అభినందించి అభీష్టవరప్రదానం చేయదలిచారు.

ఖట్వాంగుడు సురలను తన ఆయుష్కాలశేషం ఎంతో చెప్పమని అభ్యర్థించాడు. వారు మొగామొగాలు చూసుకొని, 'రాజా! నీకింకా ఒక్క ముహూర్తం మాత్రమే ఆయుశ్శేషం ఉన్నది' అని చెప్పారు.

ఆ మాట విని ఖట్వాంగుడు విచారింపకపోగా, 'ఓహో! ఇంకా రెండు గడియల కాలం ఉన్నది కదా' అని సంతోషించి, వెంటనే విమానారూఢుడై భూలోకానికి తిరిగి వచ్చి సర్వసంగాలనూ త్రెంచివేసి శ్రీహరి శరణుజొచ్చి ఆ రెండు గడియలలోనే ముక్తిని చూరగొన్నాడు.

రాజా! నీకింకా ఏడు దినాలున్నాయి. ఈ లోపల ఎంతయినా చేసుకోవచ్చు. ఇక జాగుచేయక ఉత్తమపదప్రాప్తికి కావలసిన సాధనసంపత్తిని చేకూర్చుకొనడం మంచిది.

## ధారణా యోగం

రాజేంద్రా! ముక్తికి వైరాగ్యమే ప్రథమసాధనం. వైరాగ్యమంటే సర్వసంగ పరిత్యాగం. ఇది నా దేహం, నా భార్య, నా పుత్త్రుడు – ఈ మొదలైన మమకారం సంగమనబడుతున్నది. అట్టి మమకారాన్ని విడిచిపెట్టాలి. ఇంటిలో ఉంటే ఎప్పుడో ఒకప్పుడు ఇంటిపైని మమకారం తలయెత్తక

మానదని సాధకులు ఇల్లు విడిచి వెళ్ళిపోవడం కూడా ఉన్నది. వైరాగ్యంతోపాటు బ్రహ్మచర్యవ్రతాన్ని అనుష్ఠించాలి. ఆ వ్రతానుష్ఠానానికి స్నానాదులకు యోగ్యమైన పుణ్యతీర్థంలో నివసించడం యుక్తంగా ఉంటుంది. అక్కడ శుచిగా ఏకాంతప్రదేశాన్ని ఏర్పరచుకొని విధి ప్రకారం ఆసనాదులను కల్పించుకొని, ఆసనం పైని మంచి దర్భలను, దానిపైని జింకచర్మాన్ని, ఆ పైని శుభ్రవస్త్రాన్నీ పరిచి దానిపై కూర్చుండి ప్రాణాయామపూర్వకంగా ఓంకారాన్ని జపించాలి. దానివలన మనశ్చాంచల్యం ఉడిగిపోతుంది. తత్ఫలంగా బుద్ధి ఏకాగ్రమవుతుంది. ఆ బుద్ధిని శుభార్థమైన భగవద్రూపమందు నిలపాలి. ఈ విధానాన్ని ధారణాయోగమంటారు.

## ధ్యానం

ఆ విధంగా ధారణ కావించి ధ్యానించాలి. ధ్యానానికి ఒక ధ్యేయం ఉండాలి. ధ్యేయమనగానే అది సాకారమవుతున్నది. భగవంతుడు నిరాకారుడయినప్పటికీ ధ్యేయార్థం అతని హస్త పాదాద్యవయవాలతో కూడిన రూపాన్ని కల్పించి, దానియందే బుద్ధి నిలిపి ఏకాగ్రతతో ధ్యానించాలి. ధ్యానసమయంలో ధ్యేయవస్తువును వదలి వేరొకదానిని స్మరింపకూడదు. ఇది ధ్యానక్రమం.

## సమాధి – మోహము

ఈ ధ్యానం దృఢమైనకొద్దీ మనోవృత్తులు లయిస్తాయి. దానితో మనస్సు ధ్యేయాకారాన్ని పొంది అందే స్థిరపడుతుంది. ఈ స్థితిని సమాధి అంటారు. ఈ స్థితిలో పరమానందం స్ఫురిస్తుంది. ఆ ఆనందానుభవమే మోక్షం.

## అంతరాయాలు

రాజా! ఈ స్థితికి అంతరాయాలు కలుగుతాయి. ఎలాగంటావా? మనస్సు అనేదానికి ప్రత్యేకంగా ఒక రూపం లేదు. మూడు గుణాల సముదాయాన్ని మనస్సు అంటారు. ఆ మూడింటిలో ఏయే గుణం

ఎప్పుడెప్పుడు వ్యవహరిస్తుందో మనస్సు ఆయా గుణాలకు అనుగుణంగా రూపొందుతుంది. గుణాలను ఎంత అణిచిపెట్టినా సమయం వచ్చేసరికి తలయెత్తక మానవు. అందులో రజోగుణం తలయెత్తినపుడు విక్షేపమూ, తమోగుణం పైకొన్నపుడు మోహమూ కలుగుతాయి.

విక్షేపం వలన సమాధిస్థితి చలిస్తుంది; దానితో మనస్సు ధ్యేయాకారం నుంచి జారి ఇతరవిషయాల పట్ల లగ్నమవుతుంది అంటే మనస్సు మళ్ళీ దాని వృత్తులకు ఆరంభిస్తుందన్నమాట. దానితో మమకారాదులు జనిస్తాయి. తత్ఫలంగా వైరాగ్యం నశిస్తుంది. వెనువెంటనే సంసారం పుడుతుంది. దీనినే మోహమంటారు. మోహం వలన జడప్రవృత్తి కలిగి మందులై చరిస్తారు.

## అంతరాయాలను దాటే ఉపాయం

రాజా! అంతరాయాలు కలిగినపుడు మళ్ళీ ధారణా యోగాన్ని ఆశ్రయించి మనస్సును నిరోధించాలి. అంతకన్నా అంతరాయ నివారణకు వేరే ఉపాయం లేదు. మనస్సు తనకు రుచించిన వస్తువు వెంట తగిలి అందే నిలవడమన్నది దాని నైజం. రుచి గల పదార్థాలన్నింటిలో భగవద్భక్తిరసం ఉత్తమోత్తమమైనది. ఆ రుచిని ఒక్కసారి చవిచూస్తే ఇక దానిని వదలాలనిపించదు. ఎలాగైనా ప్రయత్నించి ఆ రుచిని ఒక్కసారి మనస్సుకు చవిచూపించాలి. ఆ తర్వాత అది తనంతట తానే దాని కోసం పరుగిడుతుంది. మోక్షపరాయణులు పరమానందరస ఘనమైన భగవంతుని యోగాలంబనమూర్తిగా, ధ్యేయమూర్తిగా గ్రహించి ధ్యానిస్తుండాలి. అలా చేస్తూ రాగా అంతరాయాలన్నీ క్రమంగా నశించి పరమానంద సుఖం కలుగుతుంది.

## ధ్యేయ విచారం

పరీక్షిన్నరేంద్రుడు శుకయోగి వాక్యాలను సాంతం విని –

'బ్రహ్మర్షివర్యా! పురుషార్థసిద్ధికి భక్తి ఒక్కటే పరమసాధనమని, భక్తి

కుదురుకొనడానికి స్మృతిధారారూపమైన ధారణాయోగం ఉత్తమసాధనమని, ధారణకు మనస్సు ఏకాగ్రమై ఉండాలనీ చెప్పారు.

కాని చిత్తం చంచలాచంచలమై నిరంతరం స్థూలప్రపంచమందే తగిలి ఉంటుంది. దానిని విషయాల నుంచి మళ్ళించి భగవంతుని యందు నిలపాలంటే ఎంతో కష్టకార్యం. ఒకవేళ ప్రయత్నించినా దానికి ఏదో ఒక ఆలంబనం ఉండాలి. నిరాలంబస్థితిలో చిత్తం నిలువదు కదా! ఆ ఆలంబనపదార్థమైనా స్థూలమై దృశ్యంగా ఉండాలి.

ఆర్యా! భగవంతునికి రూపమే లేదన్నారు. కనుక భగవత్స్వరూపం దృశ్యం కాదు. ఆ దృశ్యంలో మనస్సును ఎలా నిలపాలి? ఏమిచేయాలో సెలవీయండి' అని అడిగాడు. శుకమహర్షి సమాధానం చెప్పాడు.

## ధ్యేయము - విరాడ్రూపము

రాజా! భగవంతుడు నిరాకారుడు, సాకారుడు రెండూ అవుతాడు. నిరాకారుడనగానే ఆకారం లేనివాడని అర్థం కాదు. ఆకారరహితమైనది శూన్యం అవుతుంది. నిరాకారుడంటే సూక్ష్మాతిసూక్ష్మమై ఇంద్రియాలకు అగపడని రూపం కలవాడని అర్థం. భగవంతుని సాకారరూపం స్థూలరూపమవుతుంది. ఆ రూపం విరాడ్రూపం. దానినే విశ్వరూపమనీ అంటారు. ఆ రూపంలో భూత వర్తమాన భవిష్యదాత్మకమైన మూడు విధాల ప్రపంచం ఉంటుంది. ఆ సమిష్టి ప్రపంచాన్ని బ్రహ్మాండమంటారు. ఆ బ్రహ్మాండమే భగవచ్ఛరీరం. ఆ బ్రహ్మాండశరీరంలో అంతర్యామిగా భగవంతుని సూక్ష్మశరీరం ఉంటుంది.

సాధకులు మొట్టమొదట విశ్వరూపాన్ని ధ్యేయంగా పెట్టుకోవాలి. అది వారికి సులభమార్గమౌతుంది.

## విశ్వరూపుని శరీరావరణలు

రాజా! భగవంతుని శరీరంలో మహత్తు, అహంకారం, ఆకాశం, వాయువు, తేజస్సు, జలము, పృథివి అని ఏడు తత్త్వాలు ఉన్నాయి. వాటిని

సప్తావరణలని అంటారు. భగవంతుడు ఆ సప్తావరణలలో అంతర్యామియై సమస్తం నడిపిస్తుంటాడు.

## విరాట్పురుషుని అవయవసంస్థానం

ఆ విరాణ్మూర్తికి పాతాళమే పాదమూలం. రసాతలం పార్ష్ణిభాగం. మహాతలం ప్రపదస్థలం. తలాతలం గుల్ఫభాగం. సుతలం జంఘప్రదేశం. వితలం జానుప్రదేశం. అతలం ఊరుభాగం. భూతలం జఘనభాగం. ఇది అతని అధోదేహం.

ఇక నభస్తలం నాభీప్రదేశం, స్వర్లోకం ఉరస్థలం, మహర్లోకం గ్రీవాభాగం, జనలోకం వదనభాగం, తపోలోకం లలాటప్రదేశం , సత్యలోకం శిరోభాగమూ అవుతాయి. ఇది ఊర్ధ్వదేహం.

ఇంద్రాదిదేవతలు బాహువులు. దిగ్దేవతలు చెవులు. శబ్దం శ్రోత్రేంద్రియం. అశ్వినీదేవతలు నాసిక. గంధం ఘ్రాణేంద్రియం. అగ్ని ముఖం.

అంతరిక్షం నేత్రస్థానం. సూర్యుడు నేత్రం. అహోరాత్రాలు కనురెప్పలు. బ్రహ్మపదం భ్రూవిజృంభ సమకాలం.

జలం తాలువులు. రసం జిహ్వేంద్రియం. వేదాలు బ్రహ్మరంధ్రం. యముడు దంష్ట్రలు. పుత్త్రాది స్నేహకళలు దంతాలు.

అపారమైన సృష్టి కటాక్షవిక్షేపం. లజ్జ పై పెదవి. లోభం క్రింది పెదవి. ధర్మం స్తన ప్రదేశం. అధర్మం పృష్ఠభాగం. ప్రజాపతి మేఢ్రం. మిత్రావరుణులు వృషణాలు.

సముద్రం కుక్షితలం. పర్వతాలు అస్థిచయం. నదులు నాడులు. వృక్షాలు రోమాలు. వాయువు నిఃశ్వాసం. కాలం గమనం. ప్రాణిజాత సంసారం క్రియ.

మేఘజాలం కేశపాశం. సంధ్య దుకూలం. అవ్యక్తం హృదయం. సర్వవికార కోశమైన చంద్రుడు మనస్సు. మహత్తత్త్వం విజ్ఞానశక్తి. రుద్రుడు అహంకారం.

అశ్వాశ్వతరిగజోష్ట్రాలు గోళ్ళు. సమస్త మృగ పశుగణాలు శ్రోణిస్థానం. పక్షులు శిల్పి నైపుణ్యం. స్వాయంభువ మనువు బుద్ధి. మనుజుడు నివాసం.

విద్యాధర, చారణ, గంధర్వాప్సరసలు షడ్జాతి స్వరశ్రుతి. ప్రహ్లాదుడు స్మృతి. విప్రుడు వదనం. క్షత్రియుడు భుజం. వైశ్యుడు తొడ. శూద్రుడు పాదం.

వివిధ రూప నామ వసు రుద్రాది దేవగణోపపన్నమూ, హవిస్సాధ్యమూ అయిన యజ్ఞ ప్రయోగం కర్మ.

ఈశ్వర విగ్రహానికి ఈ విధంగా అవయవ సంస్థానం విరాజిల్లుతున్నది.

రాజా! ఇటువంటి విరాణ్మూర్తియందు ముముక్షువు తన మనస్సును స్వబుద్ధి బలంతో దృఢంగా నిలిపి ఉంచాలి. ముముక్షువు చేయవలసిన ముఖ్యకార్యం ఇదే.

భగవంతుడు తానొకడే అయినప్పటికీ జీవుల బుద్ధివృత్తుల మూలాన సర్వమూ అనుభవిస్తుంటాడు. ఇందుకు వేరే నిదర్శన లెందుకు? జీవుడు తానొకడే అయినా స్వప్నావస్థలో వివిధజీవులను కల్పించి వారి ఇంద్రియ వ్యవహారాలను చూస్తుండటం మనకు అనుభవసిద్ధమే కదా!

భగవంతుడు కేవల సత్యానందమూర్తి, కనుక మోక్షానందాన్ని కోరినవారు ఆ మూర్తినే భజించాలి. ఇతర మూర్తులను భజించేవారికి సంసారం తప్పదు.

## అంతఃపురుష ధారణాయోగం

రాజా! కొందరు తమ హృదయాంతరంలో నివసిస్తున్న – చూపుడు వ్రేలి మాత్రపు ప్రమాణంలో ఉన్న – శంఖ చక్ర గదాధర చతుర్భుజుని ధ్యేయంగా గ్రహించి ధారణ చేస్తారు.

ఆ విధంగా ధారణ చేసేవారు తమ హృదయాంతర్వర్తి అయిన మహాపురుషుడు ప్రసన్నమైన ముఖరేఖలతో, తామరరేకుల వలె విప్పారిన కన్నులతో ఆకర్షణీయంగా ప్రకాశిస్తూ, కడిమిపువ్వుల లోని పుప్పొడి వంటి కపిలవన్నె వస్త్రాన్ని ధరించి, తళుకు తళుకుమంటున్న రత్నహారాలను అలంకరించుకొని, స్ఫురన్మహామణి కిరీట కుండలాంచితుడై, యోగీశ్వర హృదయకమల కర్ణికాంతరంలో పాదాలు నిలిపి, శ్రీదేవీ పరిష్కృతవక్షుడై, కంఠంలో కౌస్తుభహారం, ఉరోభాగాన వైజయంతీ వనమాలిక శోభిల్లగా, రుచిర కుటిల నీలకుంతలాలు ఫాలభాగాన వ్రేలాడుతుండగా లోకాభిరామంగా వెలుగొందుతూ, చిరునవ్వు వెన్నెలలు విరజిమ్ముతూ, భ్రూభంగ మాత్రాన మహానుగ్రహసంపదలను సమకూర్చుతూ, ధ్యానమాత్రాననే తనవెంట నిలిచి ఉండేవాడని భావించి ధారణ చేయడం మంచిది.

## ధ్యాన పూర్వాంగం

రాజా! ధ్యానానికి ఉపక్రమించినవారు మొట్టమొదట ధ్యేయము యొక్క స్థూలాకారమూర్తిని భావించి, దాని శరీరావయవాలను ఆపాదమస్తకం ఒకటొకటిగా ధ్యానం చేయాలి.

ఈ అవయవచింతనం ఎంత కాలం ఇలా చేయాలి? అంటే, ఆ మూర్తి సమగ్రంగా మనస్సులో నిలిచి భక్తి స్థిరమయిన దాకా చేయవలసి ఉంటుంది.

## ధారణాయోగ మహిమ

రాజా! ఈ యోగమహిమను వర్ణించి చెప్పడం సాధ్యంకాదు. ఒక దృష్టాంతం చెబుతాను విను.

పూర్వం ఒకప్పుడు ప్రళయకాలంలో బ్రహ్మకు స్మృతి తప్పింది. అతను ఈ ధారణాయోగాన్ని ఆశ్రయించి హరిని ధ్యానించాడు. భగవానుడు సంప్రీతుడై స్మృతిని అనుగ్రహించాడు. ఆ బలంతో బ్రహ్మ తొల్లింటి సృష్టిని సంస్మరిస్తూ యథాపూర్వకంగా మళ్ళీ సృష్టికి ఉపక్రమించాడు.

ధారణాయోగ మహిమను నిరూపించడానికి ఇంతకంటె వేరే నిదర్శన ఏం కావాలి?

## ధారణకు యోగ్యతా లక్షణం

రాజా! ఈ యోగానికి అందరూ యోగ్యులు కారు. ఎవరు ఫలాభిసంధిని విడిచి విరక్తులై శుద్ధాత్ములవుతారో వారు మాత్రమే దీనికి అర్హులని చెప్పాలి.

అయితే వేదాల మాటేమిటి! ఏయే కర్మలు చేసినప్పుడు ఏయే ఫలం కలుగుతుందో వేదం చెబుతుంది. ఆ బోధనలను విని అర్థశూన్యాలైన స్వర్గాది నామాలను ఆలకించి జనులు వాటి యందలి మమకారంలో చిక్కుకొంటారు. అవి మాయామయములని తెలుసుకోలేక వాటికి సంబంధించిన వాసనలలో తగిలి అదే పరమసుఖమని పరిభ్రమిస్తుంటారు. వారు వాస్తవార్థాన్ని గ్రహింపలేరు.

## జీవిత విధానం

రాజా! భోగ్యపదార్థాల లోని సారం నామమాత్రం. అందులో చిక్కుకుంటే జీవితమంతా వ్యర్థమైపోతుంది.

విద్వాంసులు ఆ విధంగా జీవితాన్ని వృథా చేసుకోకూడదు. జీవయాత్ర ఎలాగుండాలంటే శరీరధారణకు ఎంత అవసరమో, అంత మాత్రమే భోగ్యవస్తువులను గ్రహించాలి. వేరొకమార్గంలో జీవయాత్ర సాగుతుంటే ఆ కాస్త భోగ్యపదార్థాన్ని కూడా విడిచిపెట్టాలి. కార్యసిద్ధి ప్రధానం. అందుకు సులభమార్గం ఉండగా చిక్కుదారి త్రొక్కడం వివేకవంతుల లక్షణం కాదు.

**సీ. కమనీయ భూమిభాగములు లేకున్నవే**
**పడియుండుటకు దూది పఱుపు లేల?**

**సహజంబులగు కరాంజలులు లేకున్నవే**
**భోజన భాజన పుంజమేల?**

**వల్కలాజిన కుశావళులు లేకున్నవే**
**కట్ట దుకూలసంఘంబు లేల?**
**గొనకొని వసియింప గుహలు లేకున్నవే**
**ప్రాసాద సౌధాది పటలమేల?**

**తే. ఫలరసాదులు గురియవే పాదపములు?**
**స్వాదుజలముల నుండవే సకలనదులు?**
**పొసఁగ భిక్షంబు వెట్టరే పుణ్యసతులు?**
**ధనమదాంధుల కొలువేల? తాపసులకు.**

రాజా! బుద్ధిమంతులైనవారు క్షణికములై, దుఃఖమయాలైన విషయాల పట్ల విరక్తి పొంది, స్వతస్సిద్ధుడు, ఆత్మరూపుడు, ప్రేమవిషయుడు, నిత్యసత్యుడు, భజనీయగుణాకరుడు అయిన ఆ పరమాత్ముని భావించాలి. నియతులై భగవదనుభవానంద సుఖలాలసులై ఆయనను సేవించుకోవాలి.

భగవంతుని సేవించినవారికి సర్వానర్థాలకూ కారణభూతమైన అవిద్య తనంతట తానే నశించిపోతుంది. భగవత్పరాఙ్ముఖులై సంసారపు జంజాటంలో ఇరుక్కొన్నవారు తమ తమ కర్మఫల దుఃఖాలను అనుభవిస్తూ ఎట్టకేలకు వైతరణిలో పడి పరితపిస్తారు.

## సద్యోముక్తిక్రమం

రాజా! యతీంద్రులు మరణకాలం సమీపించిందని తెలుసుకొని తనుత్యాగం చేస్తారు. వారు పుణ్యదేశ పుణ్యకాలాదుల కోసం వేచి ఉండనక్కరలేదు. ముక్తికి దేశకాలాలు ముఖ్యం కాదు.

ఆసన్నమరణులు సుఖకరమైన ఆసనంలో స్థిరంగా కూర్చొని, ఇంద్రియార్థాలకు విముఖులై, మనస్సును వాటినుంచి మరలిస్తారు. అలా చేసినప్పుడు ఇంద్రియాలు సత్త్వహీనమై స్వాధీనం లోకి వస్తాయి. అలా మనస్సును నిగ్రహించడానికి బుద్ధి సాధనమవుతుంది. మనోనిగ్రహం కావాలంటే బుద్ధి అలా సాధనమై నిశ్చలంగా ఉండాలి. బుద్ధి నిశ్చలం

కావడానికి క్షేత్రజ్ఞుని యందు లయించాలి. ఈ క్రమాన్ని సాధించి, తర్వాత క్షేత్రజ్ఞుని శుద్ధతత్త్వమందు చేర్చి అక్కడనుంచి బ్రహ్మమునందు కలపాలి. అప్పుడు జీవబ్రహ్మలకు ఐక్యం కలుగుతుంది. తత్ఫలంగా పరమశాంతి సిద్ధిస్తుంది. ఆ తర్వాత వారికి చేయదగిన పనేదీ మిగిలి ఉండదు. సర్వవిధాలా ఉపరతులై ఉంటారు.

రాజా! కాలము, దేవతలు, గుణాలు, గుణవికారాలైన అహంకార మహత్తత్త్వాలు, వాటికి మూలమైన ప్రకృతి – ఇవి పరమాత్మ సంబంధమైనవి. ఆత్మ సంబంధాలు ఆత్మను బాధింపలేవు. పరమాత్మను చేరినవాడు పరమాత్మ వంటి వాడే అవుతాడు. అందువల్ల అతనిని కాలాదులు బాధింపలేవు.

కాలాదులను అతిక్రమించాలంటే వాటన్నిటికీ మూలమైన పరతత్త్వాన్ని చూరగొనడమే ఉపాయం.

## యోగాభ్యాసానికి పూర్వాంగం

రాజా! యోగాన్ని గుడ్డిగా అభ్యసింపకూడదు. యోగాభ్యాసకులు మొట్టమొదట ఆత్మానాత్మవివేకాన్ని సంపాదించాలి. ఆ వివేకం శాస్త్రజ్ఞానం వల్ల, పెద్దల ఉపదేశాన్ని వినడం వల్ల లభ్యపడుతుంది. ఆ వివేకాన్ని ఆశ్రయించి అనాత్మపదార్థాలను తెలుసుకొని వాటిని త్యజించాలి. అలా చేసినప్పుడు విషయప్రీతి మాత్రమే గాక విషయవాసనలు కూడా నశించిపోతాయి. విషయవాసనలు నశించిన తర్వాతే యోగాభ్యాసానికి పూనుకోవాలి.

## షట్చక్రాలు

రాజా! శరీరంలో గుదస్థానం మొదలు శిరస్సు దాకా ప్రాణవాయువు సంచరిస్తుంటుంది. ఆ సంచారం ఒకచోటి నుంచి మరొకచోటికి క్రమక్రమంగా పయనిస్తుంది. అటువంటి చోట్లు శరీరంలో ఆరు ఉన్నాయి. వాటినే షట్చక్రాలని అంటారు.

గుదస్థానంలో ఉన్నది మూలాధార చక్రం. దాని పైన నాభిస్థానంలో మణిపూరక చక్రం, ఆ పైని హృదయస్థానంలో అనాహత చక్రం, కంఠస్థానంలో విశుద్ధ చక్రం, భ్రూమధ్యస్థానంలో ఆజ్ఞా చక్రం, శిరోభాగాన సహస్రారమనే చక్రమూ ఉన్నాయి.

## సద్యోముక్తి : యోగాభ్యాస విధానం

యోగి మూలాధారచక్రాన్ని గట్టిగా బిగించి పట్టి అక్కడ ఉన్న ప్రాణవాయువును లేపి మణిపూరకచక్రానికి కొనిపోయి, అక్కడినుంచి దానిని అనాహత చక్రానికి చేర్చి, అటునుంచి ఆ వాయువును మెల్లగా విశుద్ధ చక్రానికి నడిపించాలి. ఆ చక్రాన్ని దాటి ఆజ్ఞాచక్రాన్ని చేరే లోపల వాయువు బహిర్గమించే ద్వారాలు ఏడు ఉన్నాయి. కన్నుల రెండు, నాసికారంధ్రాలు రెండు, చెవి రంధ్రాలు రెండు, నోరు – వీటిని సప్తద్వారాలంటారు. ఆ ద్వారాలను మూయకపోతే ప్రాణవాయువు వాటిద్వారా వెలికిపోతుంది. ఆ ద్వారాలను మూసి ప్రాణవాయువును విశుద్ధ చక్రం నుంచి ఆజ్ఞా చక్రానికి చేర్చాలి. అలా చేర్చి దానినక్కడ అర్ధమూహూర్తమాత్ర కాలం నిలిపి ఉంచాలి.

ప్రాణవాయువును ఆజ్ఞాచక్రం లోనికి చేర్చిన తరుణంలో ఇహపరసుఖాల పట్ల మిక్కుటమైన కోరిక కలుగుతుంది. ఆ కోరికలను తీవ్రంగా నిరసించి ప్రాణవాయువును సహస్రారానికి చేర్చాలి.

ఆ విధంగా సహస్రారం లోనికి ప్రవేశించిన వాయువు బ్రహ్మరంధ్రాన్ని చీల్చుతుంది. ఆ తోడ్తోనే బ్రహ్మతాదాత్మ్యం సిద్ధిస్తుంది.

ఈ విధానాన్ని సద్యోముక్తి అంటారు.

## క్రమముక్తి విధానం

రాజా! కొందరు యోగులు బ్రహ్మలోకాన్ని సాధించాలని అనుకోవడం మనము చూస్తుంటాము. కొందరు స్వర్గాదిలోకాలలో అణిమాదిసిద్ధులతో

విహరించాలని కోరుకోవడమూ ఉన్నది. అటువంటివారు దేహం చాలించి వేరొక యానమార్గంలో వెళ్ళవలసి ఉంటుంది. ఆ మార్గాన్ని అర్చిరాదిమార్గం అంటారు.

కాంక్షాలేశం మిగిలిన యోగులకు భోగాపేక్ష అంతో ఇంతో ఉండక తప్పదు. అందుచేత వారి జీవుడు లింగశరీరంతో ఉత్క్రమిస్తాడు. వారు ఆ లింగశరీరంతో ముల్లోకాల బహిరంతరాళాల లోనూ తమ ఇష్టం వచ్చినట్టు సంచరింపగలరు. వారు విద్యా తపో యోగ సమాధి సంపన్నులు కనుక వారికి అటువంటి సంచారాలు సాధ్యమవుతాయి.

కర్మయోగులకు అవి ఎంత మాత్రమూ సాధ్యం కావు.

లింగశరీరంతో ఉత్క్రమించిన జీవుడు తొలుత ఆకాశమార్గాన్ని పట్టి జ్యోతిర్మయమైన సుషుమ్నా నాడి సాయంతో వైశ్వానరాభిమాని దేవతను చేరుకొంటాడు.

అక్కడ జీవునికి సర్వసంగ పరిత్యాగం కలుగుతుంది. తారామండల మార్గాన్ని మెట్టి, సూర్యాది నివాసస్థానమైన శింశుమార చక్రాన్ని ప్రవేశిస్తాడు. ఆ చక్రాన్నే విష్ణుచక్రం అంటారు.

శింశుమారం నుంచి తరలి జీవుడు మహర్లోకాన్ని చేరి అక్కడ కల్పాంతం వరకూ క్రీడిస్తుంటాడు.

కల్పాంతంలో లోకాలన్నీ అనంతుని ముఖాగ్నిజ్వాలలలో సంతప్తమై పరితపిస్తాయి. జీవు డదిచూసి సర్గాదులు కూడా నశ్వరమైనవేనని గ్రహించి, అక్కడి నుంచి బయలుదేరి ద్విపరార్ధస్థాయికమై సనకాదియోగులకు క్రీడాస్థానమైన బ్రహ్మలోకాన్ని చేరుకొంటాడు.

అక్కడ ఉండగా జీవుడు బ్రహ్మపదప్రాప్తికి దూరులై క్రింది లోకాలలో దురంత సంసార దుఃఖాలలో క్రుంగుతున్నవారిని చూసి వారికై ఎంతో జాలిపడుతుంటాడు.

బ్రహ్మలోకస్థుడైన జీవునికి శోకార్తి భయాల వలన కాని, జరామరణ భయాల వలన గాని ఎటువంటి వ్యసనాలూ కలుగవు.

## విష్ణుపదప్రాప్తికి మూడు మార్గాలు

బ్రహ్మలోకాన్ని చేరిన జీవులకు విష్ణుపదప్రాప్తికి మూడు గతులున్నాయి.

కొందరు తమ తమ పుణ్యాతిశయం వలన బ్రహ్మలోకానికి వెళ్తారు. పుణ్యం ఎంత మంచిదయినా, కొద్దో గొప్పో వాసన అంటిపెట్టుకొని ఉంటుంది. అది శుభవాసనగా ఉంటుంది. ఆ వాసనాఫలాన్ని అనుభవించి తీరాలి. అందుచేత వారు మరుసటి కల్పంలో ఆధికారిక పదవులను పొంది ఆ ఫలాన్ని అనుభవించి అనంతరం విష్ణుపదాన్ని చూరగొంటారు.

కొందరు బ్రహ్మను ఉపాసించి ఆ లోకంలోనే ఉండి బ్రహ్మతో కలిసి విష్ణుపదాన్ని చేరుకొంటారు.

మరికొందరు భగవద్భక్తి ఫలంగా బ్రహ్మలోకప్రాప్తికి నోచుకొని, అక్కడ కొంతకాలం నివసించి, తమ ఇచ్ఛవచ్చినపుడు బ్రహ్మాండాన్ని భేదించి విష్ణుపదాన్ని చేరుకొంటారు.

## బ్రహ్మాండ స్వరూపం

రాజా! బ్రహ్మాండమంటే భగవంతుని శరీరమేనని సూచించాను.

భగవంతుడు సమస్తానికీ మూలం. శక్తి ఆయనను ఆశ్రయించుకొని ఉంటుంది. ఆ శక్తినే ప్రకృతి అంటారు.

ప్రకృతి అంశ వలన మహత్తత్త్వం కలుగుతుంది. మహత్తత్త్వాంశతో అహంకారం ఏర్పడుతుంది. అహంకారాంశతో శబ్దతన్మాత్రం, దాని అంశ నుంచి గగనం, గగనాంశతో స్పర్శతన్మాత్రం, స్పర్శతన్మాత్రాంశ వలన వాయువు, దాని అంశతో రూపతన్మాత్రం, దాని అంశతో తేజమూ, తేజోంశతో రసతన్మాత్రం, దాని అంశ వలన జలం, జలాంశతో గంధతన్మాత్రం, దాని అంశతో పృథివి ఏర్పడతాయి.

వీటి కలయిక ఫలంగా చతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండం ఏర్పడుతున్నది. ఈ బ్రహ్మాండమే విరాడ్రూపం.

## సప్తావరణ స్వరూపం

రాజా! ఈ విరాడ్రూపానికి ఏడు ఆవరణలున్నాయని తొలుత నీతో సూచనగా అన్నాను. వాటిని వివరిస్తున్నాను విను.

అన్నింటిలోకీ మొదటి ఆవరణం పృథివి. దానికి అండకటాహం అని పేరు.

ఈ పృథ్వీకటాహం కోటి యోజనాల వైశాల్యం కలిగినదని కొందరు, యాభై కోట్ల యోజనాల వైశాల్యమని కొందరు అంటారు.

అండకటాహం ఆవరణను కప్పి జలావరణం ఉంటుంది. దానిని ఆవరించి తేజోరూపావరణం, దానిని చుట్టుకొని వాయురూపావరణం, దానిని ఆవర్తించి ఆకాశ రూపావరణం, దానికి వెలుపల అహంకారావరణం, దానికి ఆవరణగా మహత్తత్త్వావరణం ఉన్నాయి.

ఆ ఆవరణలు ఒకదానికంటె ఒకటి పది రెట్లు పెద్దవిగా ఉంటాయి.

ఈ ఏడింటి మీద నున్నది ప్రకృతిరూపావరణం. అది మహావ్యాపకం కనుక దాని విరివి ఇంత అని చెప్పలేక బ్రహ్మాండం అన్నారు.

## ఆవరణ భేదనప్రకారం

రాజా! వైష్ణవపదాన్ని చేరడానికి ఈ ఆవరణలు ఏడింటినీ భేదించి పోవాలని చెప్పాను కదా. ఆ క్రమం ఇప్పుడు వివరిస్తున్నాను.

బ్రహ్మలోకాన్ని దాటిన జీవుడు లింగదేహంతో మొట్టమొదట పృథివ్యాత్మకత్వాన్ని పొందుతాడు. ఆ తర్వాత ఎక్కడికి వెళ్తానో అన్న భయాన్ని మాని, పృథివి రూపంలో జలాత్మకత్వాన్ని పొందుతాడు.

తర్వాత జలరూపంలో జ్యోతిర్మయత్వం కలుగుతుంది. అనంతరం తేజోరూపంలో వాయ్వాత్మకత్వాన్ని పొంది అక్కడ కష్టాలు కన్నీళ్ళు, ఆకలిదప్పులు, భయక్లేశాలు మొదలైన బాధలేమీ లేకుండా సకలభోగాలనూ అనుభవించి, భోగావసానంలో ఆ వాయువును శబ్దప్రమాపకమైన ఆకాశంలో విలీనం కావిస్తాడు. అంతటితో లింగశరీరాత్మకములైన పంచభూతాలూ ఉపసంహార మవుతాయి.

అనంతరం అతను ఇంద్రియాలను ఉపసంహరింపబూని ఘ్రాణంతో గంధతన్మాత్రను, రసనతో రసతన్మాత్రను, దృష్టి చేత రూపతన్మాత్రను, త్వక్కు వలన స్పర్శతన్మాత్రను, శ్రోత్రముతో శబ్దతన్మాత్రను లయింపజేసి ప్రాణంతో ఆకూతిని పొందుతాడు.

అంటే ఆయా కర్మేంద్రియాలతో చేయదగిన తత్తత్క్రియలను విడిచివేస్తాడని అర్థం.

రాజా! స్థూల సూక్ష్మభూతాలను అతిక్రమించే విధానాన్ని తెలిపాను. ఈ భూతసూక్ష్మేంద్రియాలన్నింటికీ అహంకారం లయస్థాన మవుతుంది.

ఆ అహంకారం వైకారికం, తైజసం, భూతాది అని మూడు విధాలు.

జీవుడు ఆ అహంకారత్రయాన్ని క్రమంగా అతిక్రమించి అర్చిరాదిమార్గంలో విజ్ఞానతత్త్వాన్ని లయించి నిఖిల గుణలయస్థానమైన ప్రకృతిని ప్రవేశిస్తాడు.

ఈ ప్రకృతినే ప్రధానమంటారు. ప్రధానగతులైనవారు ఆనందమయు లవుతారు.

వారికి సర్వోపాధులూ నశిస్తాయి. ఆ తర్వాత ప్రకృతిని దాసి పరమాత్మలో ఐక్యమవుతారు.

ఆ విధంగా సర్వోత్తమగతిని పొందిన భాగవతోత్తములకు పునరావృత్తి కలుగదు.

## ముక్తికి పరమమార్గం

రాజా! నీ వడిగిన ప్రశ్నలకు సమాధానంగా వేదబోధితాలైన సనాతనమార్గాలను – సద్యోముక్తినీ, క్రమముక్తినీ విశదీకరించాను. ఈ రెండు మార్గాలనూ పూర్వం బ్రహ్మదేవుడు ప్రార్థింపగా భగవానుడు స్వయంగా ఉపదేశించాడు. బ్రహ్మ ఆ అర్థాన్ని గ్రహించి, వేదాలన్నింటినీ సాకల్యంగా పరిశీలించి, సంసార విముక్తికి భగవద్భక్తి ఒక్కటే పరమసాధనమని నిశ్చయించాడు.

కనుక ముక్తికి భక్తి కన్నా ఉత్తమమార్గం లేదు," అన్నాడు శుకయోగి.

## భగవంతుడు ఉన్నాడా? అని సందేహం

పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రుని వాక్యాలను సాంతగా విని, 'యోగీశ్వరా! లోకంలో ఏ వస్తువైనా ఒకసారి అనుభవించాకనే మనకు దానియందు రుచి కలుగుతుంది. పూర్వానుభూతం కాని ఒక అపరిచితవస్తువు పట్ల రుచి జనించడానికి అవకాశమే లేదు. అటువంటి అనుభూతికి భోగ్యపదార్థం ఒకటి ఉండాలి; అది మనకు లభించాలి. అప్పుడు దాని రుచిని అనుభవిస్తాము. ఒక వస్తువు మనవద్ద లేనప్పుడు అది ఎక్కడ ఉన్నదో తెలుసుకొని, ఆ చోటు వెతికి, దానిని సాధించి, దాని అనుభూతిని పొందడానికి ప్రయత్నిస్తాము. అలా ప్రయత్నించాలంటే ముందుగా ఆ వస్తువొకటి ఉన్నదనే నిశ్చయం మనకుండాలి. ఎక్కడా లేని గగన కుసుమాల కోసం ఆశపడము కదా!

భక్తి అంటే భగవత్తత్త్వానుభూతి అన్నారు. అసలు భగవంతు డనేవాడు ఉంటే అతని తత్త్వాన్ని అనుభవించాలనే కోరిక, తత్సాధనయత్నమూ, తత్ఫలానుభూతీ కలుగుతాయి. భగవంతు డనేవాడు ఉన్నాడో లేడో నిశ్చయంగా ఎలా తెలుస్తుంది?' అని అడిగాడు.

అతని ప్రశ్నకు తల పంకించి, శుకమహర్షి ఇలా అన్నాడు:

'రాజా! ఇటువంటి అనుమానం నీకే కాదు, లోకానికి కూడా ఉన్నది. ఈ సందేహన్ని తీర్చితే నీకూ, నీ మూలాన లోకానికీ మేలు కలుగుతుంది. శ్రద్ధగా విను.

ఒక వస్తువు ఉన్నదో లేదో నిశ్చయించడానికి ప్రత్యక్షం – అనుమానం అని రెండు ప్రమాణాలు ఉన్నాయి. వాటిని ఆధారం చేసికొని నీ ప్రశ్నార్థాన్ని విచారిద్దాము.

రాజా! ఈ విషయమై భగవంతుడు లేడనే మతం ఒకటీ, ఉన్నాడనే మతం ఒకటీ మొత్తానికి రెండు మతాలు కనిపిస్తున్నాయి. ఈ రెండు మతాలవారూ తమ తమ వాదాలకు (1) శాస్త్రప్రమాణం (2) అనుమానప్రమాణం (3) అనుభవప్రమాణం అనే ప్రమాణాలను గ్రహిస్తారు.

భగవంతుడు లేడనేవారిలో (1) చార్వాకులు (2) బౌద్ధులు (3) శూన్యవాదులు అని మూడు తెగల వారున్నారు.

చార్వాకులలో (1) పురుషుడే ఆత్మ అనేవారు (2) స్థూలశరీరం ఆత్మ అనేవారు (3) ఇంద్రియాలే ఆత్మ అనేవారు (4) ప్రాణం ఆత్మ అనేవారు (5) మనస్సు ఆత్మ అనేవారు – అని అయిదు శాఖలున్నాయి. ఇవన్నీ ఒకదాన్ని ఒకటి ఉత్తరోత్తరం పూర్వ పూర్వాన్ని ఖండిస్తుంటాయి.

బౌద్ధులలో (1) యోగాచారులు (2) మీమాంసకులు అని రెండు వర్గాల వారున్నారు.

యోగాచారులు బుద్ధిని ఆత్మపదార్థంగా నిరూపించాలని యత్నిస్తారు.

మీమాంసకులలో మళ్ళీ రెండు అవాంతరశాఖలు ఉన్నాయి. అజ్ఞానమే ఆత్మ అని ఒక శాఖ, అజ్ఞానోపహిత చైతన్యం ఆత్మ అని మరొక శాఖ వాదిస్తారు.

తార్కిక మతమని ఇంకొక మతం ఉన్నది కానీ, అది మీమాంసక మతానికే చెందుతుంది.

శూన్యమతం ప్రకారం ఆత్మ అంటే శూన్యమే. ఈ మతంవారిని మాధ్యమిక బౌద్ధు లంటారు.

ఆమూలాగ్రం విచారిస్తే ఈ మతాలలో ఏ ఒకటీ వారు పురస్కరించుకొని పలికే ప్రమాణాలకే నిలువలేవు. వారు శాస్త్రప్రమాణాలను చూపుతున్నారు కదా? అని ప్రశ్నించవచ్చు. శాస్త్రవాక్యాలకు అపార్థాలను కల్పించి వాదిస్తారు. వారు ఉదాహరించే వాక్యాలనే చక్కగా విచారించి చూస్తే అవే వారి వాదాన్ని ఖండిస్తుంటాయి.

రాజా! ఒక వస్తువు ఉన్నదా? లేదా? అని నిశ్చయించడానికి ముమ్మందుగా చూసేవాడొకడు, చూడబడే వస్తువొకటి – ఈ రెండూ ఉండాలి. అందులో ఏ ఒకటి లేకపోయినా మన ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరవుతుంది కదా.

నీ కంటి యెదుట ఏమున్నది? ప్రపంచం ఉన్నది. దానిని నీవు చూస్తున్నావా? లేదా? చూస్తున్నానంటే, ఆ చూచేవాడెవడు? నేనే నంటావా? నీవెవరు? నీ దేహమా? దేహమే అయితే అది జడపదార్థం. దానికి చూసే శక్తి లేదు. కనుక నీవు అన్న పదార్థం నీ దేహం కాదు. అంతే కాక 'నా దేహం' అన్నప్పుడు నీవు, నీ దేహమూ రెండూ వేర్వేరని అర్థం వస్తున్నది. దీనిని బట్టి కూడా చూచేది నీ దేహం కాదని ఏర్పడుతున్నది.

ఇక చూసేవాడెవడు? 'నేను చూస్తున్నాను' అన్నప్పుడు, దేహం జడపదార్థం కనుక, అది చూడలేదు కనుక, నీ దేహంలో అంతర్యామియై ఎవడో ఒకడు ఉండి చూస్తూ ఉండాలన్నమాట. అలా 'నేను చూస్తున్నాను' అని ఎవడంటున్నాడో, వాక్యార్థం అతనికే సమన్వయిస్తుంది. అదిగో అతనే భగవంతుడని గ్రహించాలి. ఆ భగవంతుడే నీ లోనూ నా లోనూ చరాచర సమస్త ప్రపంచం లోనూ ఉన్నాడు.

భగవంతుడలా సమస్త ప్రపంచం లోనూ అంతర్యామియై ఉన్నాడనటానికి ప్రమాణం ఏమిటంటావా? సమస్త ప్రపంచాన్నీ చూస్తున్నా నన్నావు. ఆ

చూసేవాడెవడో వివరించాను. ఇక చూడబడే పదార్థాన్ని గురించి విచారిద్దాము.

ఏ వస్తువయినా కనబడాలంటే దానికి స్వయంప్రకాశకత్వం ఉండాలి. అలా లేనినాడు అది కంటికి కనిపించే అవకాశమే లేదు. చీకటిలోని వస్తువు కన్ను పొడుచుకున్నా కనబడకపోడమే ఇందుకు నిదర్శనం.

దీనిని బట్టి నీ కంటికి కనిపిస్తున్న ప్రపంచం తనంతట తాను ప్రకాశించేదిగా ఉండాలని తేలింది కదా! అయితే ప్రపంచం నీ దేహం వలెనే జడస్వరూపం. జడవస్తువుకు ప్రకాశకత్వం కలుగదు. ప్రపంచం జడస్వరూపమైనప్పటికీ దృశ్యం గానే ఉన్నది.

ఈ పరస్పర విరుద్ధాంశాలు ఎలా కలుగుతున్నాయి? వస్తువు స్వయంప్రకాశం కాకపోయినా పరప్రకాశితమై కాన్పింపవచ్చునని, చీకటిలోని వస్తువు దీపప్రకాశితమై కనిపించడమే ఇందుకు నిదర్శనమని అంటే, ఆ వాదాన్నీ పరిశీలిద్దాము.

చీకటిలోని వస్తువు దీపప్రకాశితమైనట్లే ప్రపంచం కూడా జడస్వరూపం కనుక స్వప్రకాశం కాక పరప్రకాశితమై కనిపిస్తోందని అంగీకరిద్దాము. అయితే దానిని ఆ విధంగా ప్రకాశింపజేస్తున్నది ఎవరు? ఎవరో ఒకరు ఉండాలి కదా. అతనే భగవంతుడు. ఆ భగవంతుడు నీ యందు నా యందు ఉన్నట్లే సర్వప్రపంచం లోనూ అంతర్యామియై దానిని ప్రకాశింపజేస్తున్నాడు. దీనిని బట్టి భగవంతుడంటూ ఒకడున్నాడని నిశ్చయింపవచ్చును కదా!

రాజా! భగవంతుడు ఉన్నాడని నిశ్చయించడానికి మరొక మార్గం కూడా ఉన్నది.

ముందుగా నీ సంగతే చూద్దాము. నీ యందు బుద్ధి మొదలైన సాధనాలు ఉన్నాయని అంగీకరిస్తావు కదా? వాటివల్లనే కదా నీకు బాహ్యపదార్థ జ్ఞానం

కలుగుతున్నది? అట్టి జ్ఞానాన్ని బుద్ధ్యాదులు నీకు స్వశక్తి వలన కలిగిస్తున్నాయా? లేక పరుల శక్తి వలన కలిగిస్తున్నాయా? స్వశక్తి వలన కలిగిస్తున్నాయని అంటే, ఆ జ్ఞానం నీకు అన్నివేళలా కలుగుతుండాలి. నువ్వు సుముఖంగా ఉన్నప్పుడే నీకు బాహ్యజ్ఞానం కలుగుతున్నది. పరాఙ్ముఖుడి వైనప్పుడు నీ కటువంటి జ్ఞానం కలగడంలేదు.

దీనివలన ఏమని తెలుస్తోంది? ఇంద్రియాదులు కూడా దేహం వలెనే జడములని, వాటికి స్వశక్తి అంటూ ఏమీ లేదని, వాటిని నడిపించే కర్త ఒకడున్నాడని, అతని కర్తృత్వానికి లోబడి అవి వ్యవహరిస్తున్నాయని స్పష్టపడుతున్నది.

ఆ కర్తనే మనము భగవంతు డంటున్నాము. అయితే ప్రత్యక్షప్రమాణం సంగతి ఏమంటావా? నీ వుండడమనేది నీకు అనుభవసిద్ధమే కదా. నీ అనుభూతే నీకు ఉత్తమోత్తమమైన ప్రత్యక్షప్రమాణం.

రాజా! భగవంతుడు సర్వదేశ సర్వకాలాలలోనూ ఉన్నాడు. ఆ ఉండటం ఎక్కడో మిన్నులు పడ్డచోట గాక అంతర్యామియై సామీప్యాని కన్నా సమీపంలో ఉన్నాడు. అతని ఉనికి అనుభవగోచరమని గ్రహించి భక్తిపూర్వకంగా మెలగాలి.

> భక్తి అంటే పువ్వులతో పూజచేసి ప్రసాదాలు పంచుకోవడం కాదు. భగవంతుని ఉనికిని అనుభవసిద్ధం చేసుకొని, అతనిని ఎన్నడూ మరువక, ఎల్లవేళలా అతనికి సాధన మాత్రులమై అతని ఆజ్ఞానుసారంగా నడుచుకోవడం. అట్టి భక్తి స్థిరపడాలంటే భగవత్కథలను వినడం, భగవంతుని స్మరించడం, భగవన్నామాలను సంకీర్తించడం – ఇవన్నీ ఎంతో తోడ్పడతాయి. అలా చేయడం వలన భగవంతుని గూర్చిన విస్మృతి కలుగదు. భక్తుడు ఎల్లప్పుడూ మెలకువతో ఉండగలుతాడు.

## సకామభక్తి - వివిధ దేవతారాధనం

రాజా! మనుష్యజన్మ ఎత్తినవారికి కర్తవ్యమేమిటో తెలిపాను. అది మృత్యువు సమీపించిన వారికి మరింత ముఖ్యం.

నేనింతవరకూ చెప్పినదంతా నిష్కామపరం. ఇక సకాముల సంగతి చెబుతున్నాను.

సకాములు ఎంత భక్తిపరులైనా, వారి భక్తి తత్తత్కామాది దేవతలను గూర్చి మాత్రమే ఉంటుంది.

ఎలాగంటే, భక్తులలో బ్రహ్మవర్చస్సును కోరినవాడు బ్రహ్మను, ఇంద్రియ శక్తిని కోరినవాడు ఇంద్రుని, ప్రజాసంతానాన్ని కోరినవాడు దక్షాది ప్రజాపతులను, భోజనకాముడు అదితిని, స్వర్గకాముడు ఆదిత్యులను, రాజత్వకాముడు అగ్నిని, ధనకాముడు వసువులను, ప్రభావకాముడు భూదేవిని, దేశప్రజాసాధనకాముడు సాధ్యులను, ప్రతిష్ఠాకాముడు భూమ్యంతరిక్షాలను, సౌందర్యకాముడు గంధర్వులను, స్త్రీకాముడు ఊర్వశిని, సర్వాధిపత్యకాముడు పరమేష్ఠిని, యశఃకాముడు యజ్ఞపూరుషుని, విత్తసంచయకాముడు ప్రచేతసుని, విద్యాకాముడు శంకరుని, దాంపత్య ప్రీతి కాముడు పార్వతిని, ధర్మకాముడు విష్ణువును, సంతానకాముడు పితృదేవతలను, రక్షా కాముడు యక్షులను, బలకాముడు మరుద్గణాన్ని, రాజ్యకాముడు మనురూపదేవతలను, శత్రుసంహారకాముడు నిరృతిని, భోగకాముడు చంద్రుని ఆరాధిస్తారు. ఈ బ్రహ్మాదులందరూ భగవదంశమాత్రులై ఒకొక్కరు ఒక్కొక్కదానికి అధికారు లవుతారు. వారి అధికారం ఎంతో, వారిచ్చే ఫలం కూడా అంత మాత్రమే ఉంటుంది. వారిచ్చే అ ఫలమైనా క్షణికప్రాయం. అందువల్ల అవి నిష్కాములకు రుచించవు. ఎందుకంటే నిష్కాముల దృష్టి శాశ్వతసుఖమందే లగ్నమై ఉంటుంది. ఆ మహాసుఖాన్ని ప్రసాదించడానికి సర్వశక్తిమంతుడైన భగవంతు డొకడే సమర్థుడు.

అందువల్ల నిష్కాములకు పరమపూరుషు డొక్కడే భజనీయుడు. నిష్కాములు అతనినే భజిస్తారు.

## భగవదారాధన ఫలం

రాజా! భగవంతుడు నిష్కాములకు తప్ప ఇతరులకు భజనీయుడు కాడా? అని శంకింపవద్దు.

భగవంతుడు సర్వలోకైకారాధ్యుడు. అకామి గాని, సర్వకామి గాని, నిష్కామి గాని ఎవరైనా భగవంతుని భజింపవచ్చును. ఎవరెట్టివారైనా భగవంతుని తీవ్రభక్తితో ఆరాధించినవారికి కోరిన కోరికలన్నీ ఫలిస్తాయి. అంతే కాదు. వారు భగవదనుగ్రహానికి పాత్రులై క్రమక్రమంగా అంతంలో ఉత్తమగతిని చూరగొంటారు.

**మ. అమరేంద్రాదులఁగొల్చు భంగి జనుఁ డా యబ్జాక్షు సేవింపఁగా**
**విమలజ్ఞాన విరక్తి ముక్తు లొదవున్, వేయేల? భూనాథ; త**
**త్కమలాధీశ కథా సుధారసనదీ కల్లోలమాలా పరి**
**భ్రమ మెవ్వారికి నైనఁ గర్ణయుగళీపర్వంబు గాకుండునే.**

అన్నాడు శుకయోగి.

## జీవితార్థ ప్రశంస

శౌనకాదులు సూతుని మాటలను విని, 'పౌరాణికాగ్రణీ! రౌమహర్షణీ! మహర్షి శిరోమణీ! ఇంకా ఏయే అర్థాలను రాజు శుకయోగిని అడిగాడో, వాటన్నిటినీ మాకు వినిపించు. అందుకు నీవు తగినవాడవు. సూతవర్యా! పరీక్షిన్నరేంద్రుడు పరమభాగవతుడు. అతను పసిప్రాయం నుంచి పనికిరాని ఆటపాటలను మాని శ్రీకృష్ణలీలలే బాలక్రీడలుగా చేసి తోడి బాలురను కూడి ఆడుకొనేవాడు. శుకయోగి అంటేనో, భాగవతోత్తముడు. అట్టివారిద్దరూ ఒకచోట కూడి సత్కాలక్షేపం చేయబూనిననాడు భగవదుదార గుణాలను ప్రకటించే కథలెన్నో ప్రస్తావనకు వచ్చి ఉంటాయి.

సూతాగ్రణీ! హరికథాప్రసక్తిలో గడిచే నిమిషం ఒక్కటైనా సార్థక మవుతుంది. తక్కిన పురుషాయుష్కాలం దివారాత్రగ్రస్తమై వ్యర్థమవుతుంది.

జీవితకాలం ఎంత ఉన్నదో అంతకాలం జీవించడం ఒకటే జీవితఫలంకాదు.

**సీ. అలరు జొంపములతో నభ్రంకషంబులై**
**బ్రదుకవే వనములఁ బాదపములు?**
**ఖాదన మేదనాకాంక్షలఁ బశువులు**
**జీవింపవే గ్రామసీమలందు?**

**నియతిమై నుచ్ఛ్వాస నిఃశ్వాస పవనముల్**
**ప్రాపింపవే చర్మభస్త్రికలను?**
**గ్రామసూకర శునకశ్రేణు లింటింటఁ**
**దిరుగవే దుర్యోగదీనవృత్తి?**

**తే. నుష్ట్రఖరములు మోయవే యురుభరములఁ?**
**బుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు**
**లడవులందు నివాసములందుఁ బ్రాణ**
**విషయభరయుక్తితో నుంట విఫల మార్య!**

**సీ. విష్ణుకీర్తనముల వినని కర్ణంబులు**
**కొండబిలములు సద్గుణనిధాన!**
**చక్రి పద్యంబులఁ జదువని జిహ్వలు**
**గప్పల జిహ్వలు గణ్యచిత్త!**

**శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు**
**కేకిపింఛాక్షులు కీర్తనీయ!**

**కమలాక్షు పూజకుఁ గాని హస్తంబులు**
**శవము హస్తంబులు సత్యసూక్తి!**

**ఆ.వె. హరిపద తులసీదళామోదరతి లేని**
**ముక్కు పందిముక్కు మునివరేణ్య!**
**గరుడగమను భజన గతిలేని పదములు**
**పాదపముల పాదపటలి యనఘ!**

సూతవర్యా! మాకింకా జీవితశేషం కొద్ది మాత్రమే ఉన్నది. ఆ రవ్వంతయినా సార్థకమవుతుందని ఇక్కడ సమకూడాము. అయ్యా! హరిభక్తి ఒక్కటే జీవితార్థం. ఆ భక్తి పెంపొందాలంటే హరికథలను వినడం కన్న వేరొక మార్గంలేదు. ఆ కథలతో మా హృదయాన్ని తనిపి మాకు పరమానందాన్ని కలిగించు' అని కోరారు.

## సృష్టి స్థితి లయాల వివరణం

సూతుడు శౌనకాదుల ప్రశ్నకు సమాధానంగా అనంతర కథను కొనసాగించాడు.

'మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకవచనాల వలన ఆత్మతత్త్వాన్ని గ్రహించాడు. శ్రీకృష్ణభగవాను డొక్కడే పరమసేవనీయుడని నిశ్చయించుకొన్నాడు. ఆ తర్వాత

**ఆ.వె. సుతుల హితుల విడిచి, చుట్టాల విడిచి, యి**
**ల్లాలి విడిచి, పశుగృహాళి విడిచి**
**రాజు హృదయ మిడియె రాజీవనయనుపై**
**ధనము విడిచి జడ్డుఁదనము విడిచి.**

ఆ విధంగా నరేంద్రుడు శ్రీకృష్ణాయత్తచిత్తుడై, 'బ్రహ్మవిద్వరేణ్యా! నీవు కావించిన హరికథాకీర్తనం వలన నా అజ్ఞానం పటాపంచలయింది. నీ మాటల వల్ల భగవచ్చరిత్రాకర్ణనకు మనస్సెంతో ఉవ్విళ్ళూరుతున్నది.

మహర్షివర్యా! భగవంతుడు ఈ విశ్వాన్ని ఏ తీరున పుట్టించి, రక్షించి, లయింపజేస్తాడో వివరించండి. భగవానుడు అవ్యయుడని మీరన్నారు. ఈ సృష్టి స్థితి లయాలు అతని అవ్యయత్వానికి భంగం కలిగింపవా? పరమేశ్వరుడు సర్వశక్తిసంపన్నుడని చెప్పారు. ఆ మహాత్ముడు ఏయే శక్తులను అధిష్ఠించి బ్రహ్మాదిరూపాలతో వినోదిస్తాడు? ఆ వినోదరూపాలు ఏయే కాలాలలో జరుగుతాయి? అవన్నీ ఏకకాలంలో జరుగుతాయా? ఒకదాని వెంట ఒకటి జరుగుతాయా? ఏకత్వంలో ఉన్న భగవంతుడు ఆ విధంగా భిన్నరూపాలను ఎందుకు ధరిస్తాడు? భిన్నరూపాలను తాల్చకపోతే అతనికి ఏమవుతుంది? ఈ సంశయాన్ని తీర్చండి' అని ప్రార్థించాడు.

మునులారా! శుకయోగి అతని సంశయపరంపరను తీర్పనెంచి, యథార్థ స్ఫురణకై భగవంతుని యెడ చిత్తాన్ని పాదుకొల్పి ఈ విధంగా స్తుతించాడు:

## శ్రీ శుకమహర్షి కృత భగవత్స్తుతి

**మ.** పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భావస్థాన సం
హరణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై
పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం బ్రాపింప రాకుండు దు
స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

**ఉ.** ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభు లీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో
షావళిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జలంగునండ్రు నే
నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

**ఉ.** ఏ పరమేశు పాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధితో నుభయలోకము లందుల జడ్డువాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

చ. తపములఁ జేసియైన మతి దానము లెన్నియుఁ జేసియైన నే
జపములఁ జేసియైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంతవిపదంచితరీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

మ. యవనవ్యాధపుళిందహూణ కష కంకాభీరచండాల సం
భవులుం దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కళ్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదు మదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్.

మ. తపముల్ సేసిననో మనోనియతినో దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుం డౌనని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుండౌఁ గాక నా కెప్పుడున్.

మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ కుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యే విభు పాదపద్మభజనోత్కర్షంబులం దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము నే సేవించెదన్.

మ. జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే
భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్య తా న వ్విభున్
మగనింగా నియమించి తద్భువనసామ్రాజ్యస్థితిన్ సృష్టిపా
రగుఁ జేసెన్ మును బ్రహ్మ నట్టి గుణి నారాధింతుఁ జిత్తంబునన్.

ఉ. మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై
లూనత నొంద రట్టి మునిలోకశిఖామణినిన్ విశంకటా
జ్ఞానతమోనభోమణిని సాధుజనాగ్రణి నేను మ్రొక్కెదన్.

ఎవడు పూర్ణుడై విలసిల్లుతూనే పంచ మహాభూత యోగాన శరీరాలనే పురాలను సృజించి అందులోనే తానుండి, పురుష భావంతో సందీపిస్తూ, పంచమహాభూతాలనూ పదకొండు ఇంద్రియాలనూ ప్రకాశింపజేస్తూ, షోడశాత్మకుడై శోభిల్లుతూ, జీవత్వమనే నృత్తవినోదం నెరపుతుంటాడో, ఆ భగవంతుడు నా అంతఃకరణాన్ని ప్రబోధించి, నా వాక్ప్రసూనమాలికలలో మంజు నవరస మకరంద మాధుర్యాన్ని నింపి శిష్టజనులకు అమందానందాన్ని కలుగజేస్తాడు గాక!'

మునులారా! భగవత్ప్రార్థన చేసి, వేదవ్యాసునికి ప్రణతులర్పించి, శుకమహర్షి ఇలా అన్నాడు.

## నారద బ్రహ్మ సంవాదం

'పరీక్షిన్నరేంద్రా! పూర్వం ఒకనాడు నారదమహర్షి బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి 'దేవా! ఆత్మతత్త్వం తేటతెల్లమయేట్లు ఉత్తమజ్ఞానాన్ని నాకు చక్కగా బోధించు. మహాత్మా! ఆత్మజ్ఞానానికి సాధనం ఏమిటి? ఆత్మకు ప్రపంచం ఉపలక్షణభూతమని, అందువల్ల ప్రపంచజ్ఞానమే ఆత్మజ్ఞానమని అంటారు. అదే నిజమైతే ఈ ప్రపంచం స్వతస్సిద్ధమా? కారణ కార్యమా? ఇది కారణకార్యమయితే ఈ ప్రపంచం ఎవని వలన ప్రకాశితమవుతున్నది? దీనికి అధిష్ఠానమేది? ఆశ్రయమేది? ఎవని చేత సృజింపబడింది? ఈ ప్రపంచం ఎవనిలో లీనమై ఉన్నది? ఎవని యందు లయిస్తుంది?

దేవా! నీవు సర్వజ్ఞుడవు కనుక నీకు తెలియని రహస్యం ఉండదు. నేను కోరిన విషయజాతాన్ని సమగ్రంగా వివరింపగలవు' అని అడిగాడు.

## నారదుని ఆశ్చర్యం

ఆ సమయంలో బ్రహ్మదేవుడు తపోవ్రతుడై సమాధినిష్ఠలో ఉన్నందున నారదుని ప్రశ్నలకు బదులు చెప్పలేదు. ఆ బ్రహ్మర్షి అది గ్రహించి, 'దేవా! నీవు స్వతంత్రుడవైన పరమేశ్వరుడవని, సాలె పురుగు దారాన్ని కల్పించినట్లు నీ

శక్తి చేత ప్రాణికోటిని సృజించి, పరిపాలిస్తుంటావని, సమస్త స్థూల సూక్ష్మార్థాలూ మనుష్యత్వాది నామాలతో ద్విపదత్వాది రూపాలతో శుక్లాది గుణాలతో నీ వల్లనే కలుగుతున్నాయని, వేరొక కర్త ఉండటం సాధ్యం కాదని ఇన్నాళ్ళుగా భావిస్తున్నాను. ఇప్పుడు నీవు సమాహిత చిత్తుడవై ఘోరతపాన్ని ఆచరించడం చూడగా నా నమ్మకం బీటలువారుతున్నది. నాకు తీరని శంక జనిస్తున్నది. లోకేశ్వరుడవు నీకూ పారతంత్ర్యమేనా? లేకుంటే నీ కీ తపస్సేమిటి? నీకు ఉపాస్యుడెవడు? ఎవడు నీకు విజ్ఞానాన్ని ఉపదేశించాడు? నీకు ఆశ్రయు డెవడు? ఎవని అధీనంలో నీ వున్నావు? నీ స్వరూపం ఏమిటి' అని ప్రశ్నలను కురిపించాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు ప్రబోధితుడై నారదునితో ఇలా అన్నాడు.

'నాయనా! భగవంతుని వైభవాన్ని ప్రదర్శించే ధర్మాలను గురించి అడుగుతున్నావు. నీ కోరిక నెపంతో నా యందు దయచూపుతున్నావు. నీవడిగిన అర్థం సర్వోపకారకమైనది. దానిని నా నోట పలికే భాగ్యాన్ని నాకు కూర్చావు. భగవన్మహిమాభివర్ణనతో నా మనస్సు ప్రసన్నం కాగలదు.

## పరమేశ్వరుడు

నాయనా! నా కంటె అధికుడు పరమేశ్వరుడున్నాడు. ఆ సంగతి యెరుగక నన్నే పెద్ద చేసి ప్రశంసిస్తున్నావు. సాదృశ్యం వలన నీకు కలిగిన భ్రాంతే దీనికి కారణం. అయినా నీ భ్రాంతి పూర్తిగా నిరాధారం కాదు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నక్షత్ర గ్రహ తారకాదులు లోకాన్ని ప్రకాశింపజేస్తున్నాయన్న భావం ఎలా కలిగిందో అలాగే నా విషయమై కూడా నీకటువంటి భావం కలిగింది. నిజానికి సూర్యాదులు ఎంత విశ్వప్రకాశకులో నేనూ అంత మాత్రమే విశ్వప్రకాశకుడిని. ఈ రహస్యం తెలియక నన్ను జగత్కారణునిగా సంభావిస్తారు.

నాయనా! అన్నింటికీ పరమేశ్వరుడే మూలకారణం. ఆ పరమేశ్వరు డెవరంటావా? ఎవని ప్రకాశం చేత సమస్త విశ్వమూ ప్రకాశితమవుతున్నదో అతడే పరమేశ్వరుడు.

అయితే ఈ భ్రాంతి నాకెలా కలిగిందని అడుగుతావేమో. దానికి పరమేశ్వరుని మాయ కారణం. పరమేశ్వరుని శక్తికే మాయ అని పేరున్నది కదా! ఆ మాయను సామాన్యంగా జయించడం సాధ్యం కాదు. మాయ అంతటిదైతే పరమేశ్వరుడు కూడా ఆ మాయకు అధీనుడై ఉన్నాడేమో అని అనుమానించడం సహజమే. లోకంలో ఎవరి శక్తి వారికి లొంగి వర్తిల్లటమే అనుభవసిద్ధం. కనుక మాయ ఎల్లవేళలా పరమేశ్వరుని ఇచ్ఛ ప్రకారం వర్తిస్తుందని తెలుసుకోవాలి. పైగా మాయ యొక్క కపటనాటకం మనబోంట్ల ముందు సాగుతుందే కాని పరమేశ్వరుని మ్రోల సాగదు. పరమేశ్వరుడొక్కడే సర్వ స్వతంత్రుడు. మనమందరమూ పరతంత్రులమై ఉన్నవాళ్ళము. అయినా అజ్ఞానం వల్ల స్వతంత్రుల మనుకొని 'నేను', 'నాది' అని విర్రవీగుతున్నాము.

## అధిష్ఠానం

నాయనా! సృష్టికి అధిష్ఠానం ఏదని అడిగావు. సృష్టి దేనినుండి కలిగిందో అదే దానికి అధిష్ఠానం. సృష్టి అంటే ఏమిటి? విస్తరించడం. ఆ విస్తారాలలో ఏవేవి మనకు కనబడుతున్నాయి? ప్రకృతి మహదహంకారాది భూతాలు కనబడుతున్నాయి. పుణ్యపాపరూపకర్మలు, వాటికి ప్రేరకమైన కాలం, కాలపరిణామ రూపకమై సత్త్వాది గుణత్రయాత్మకంగా ఉన్న స్వభావం, కర్మఫలభోక్త అయిన జీవుడు కానవస్తున్నారు. ఇవన్నీ కార్యజాతం. కారణం లేనిదే కార్యం కలగదు. కారణం ఎవరంటే అతను సాక్షాత్తూ పరమేశ్వరుడే. అందువల్ల కారణమైన పరమేశ్వరుడే కార్యమైన సృష్టికి అధిష్ఠానం.

ఇక వేదాదుల సంగతి ఏమంటావా? వేదాలయితేనేమి, సర్వదేవతలు, సర్వలోకాలు, యజ్ఞాలు, కర్మ భక్తి జ్ఞానయోగాలు అన్నీ కార్యపరంపరే అవుతాయి. ఈ కార్యాలు కారణాధీనాలై ఆ కారణాన్ని ప్రకటిస్తుంటాయి.

ఎలాగంటే; వేదాలు భగవంతుని గూర్చి చెబుతున్నాయి. దేవతలందరూ భగవదంశతో జన్మించి అతని ఆజ్ఞకు లొంగి నడుచుకొంటున్నారు. స్వర్గాదిలోకాలు భగవంతుని ఆనందాంశాలుగా ప్రవర్తిల్లుతున్నాయి.

యజ్ఞాలు స్వర్గాదిలోకసాధనకు ఉపకరిస్తున్నాయి. యోగాలు భగవంతుని ఆరాధనరూపాలై సహకరిస్తున్నాయి. తపస్సు చిత్తచాంచల్యాన్ని పోగొట్టి ఆ చిత్తాన్ని భగవంతుని యందు నిలుపుతున్నది. జ్ఞానం కేవలం భగవదనుభవరూపం. కనుక సర్వమూ భగవత్పరమై అతని అధిష్ఠానత్వాన్ని ప్రకటిస్తున్నట్లే కదా!

## బ్రహ్మదేవుని జననం

నారదా! నేనెలా జన్మించానో, నా పని ఎంతమాత్రమో, అది కూడా నువ్వు వినాలి.

ఈ సృష్టిని సర్వపదార్థ సాక్షాత్కారవంతుడు, సర్వజగన్నియామకుడు, సర్వాంతర్యామి, నిర్వికారుడు అయిన భగవానుడు సంకల్పించాడు. ఆ సంకల్పానికి అతని శక్తి చలించి ఈక్షణరూపాన్ని తాల్చింది. ఆ ఈక్షణరూప ప్రేరణమాత్రాన నేను జన్మించాను.

భగవంతుడు ఎప్పుడు సృష్టిని సంకల్పించాడో, అప్పుడే సృష్టి మొత్తం భావాత్మకమైన పరమ సంస్కార రూపాన్ని వహించింది. ఆ రూపాన్ని నేను స్థూలం కావించాను.

ఇదే నా సృష్టికర్తృత్వం.

సృష్టివిధానం భగవంతుని చేతనే రచింపబడింది. సృష్టిసామగ్రి నంతటినీ భగవంతుడే కూర్చాడు.

## జగద్రచనా విధానం

నారదుడు ఆ వచోనిచయానికి సంతోషించి, 'దేవా! నీమాటను బట్టి పరమేశ్వరుడు ప్రేరకుడని, పరమేశ్వరప్రేరితులై జీవులు వర్తిల్లుతారని, జీవులకు కార్యస్వాతంత్ర్యం లేదని ఏర్పడుతున్నది. అదే నిజమైతే జీవేశ్వర విభాగం అసత్యమవుతుంది. జీవుడు స్వతంత్రుడు కాకపోతే అతని యందు గుణవైషమ్యానికి అవకాశం ఉండదు. గుణవైషమ్యం లేనినాడు కర్మవైచిత్రి

కలుగదు. కర్మవైచిత్రి లేనప్పుడు జగన్నానాత్వానికి ఆధారమే లేదు. దీనికి సమన్వయం ఏమిటి?' అని అడిగాడు.

బ్రహ్మ ఆ ప్రశ్నార్థాన్ని విశదీకరించాడు.

'నాయనా! సృష్టి అంటే తత్పూర్వం లేని వస్తువు క్రొత్తగా పుట్టి రావడం కాదు. ఉన్న వస్తువే ప్రవాహసరణిని విస్తరించడం సృష్టి అనబడుతోంది.

ఆ సృష్టి ప్రాకృతసృష్టి, వైకృతసృష్టి అని రెండు విధాలు.

ప్రకృతి వలన నేరుగా కలిగినది ప్రాకృతసృష్టి. ఆ ప్రకృతి వికారాన్ని చెందినపుడు కలిగినది వైకృతసృష్టి.

## ప్రాకృత వైకృత సృష్టిక్రమం

భగవంతుడు కేవలం సన్మాత్రుడు. ఆ సన్మాత్రవస్తువు చిద్రూపంలో ఉంటుంది. చిత్ అంటే జ్ఞానప్రకాశమని భావం. ఆ జ్ఞానానికి సత్త్వము, రజస్సు, తమస్సు అని మూడు అవస్థలు ఉన్నాయి. వాటినే గుణములు అంటారు.

చిద్రూపం సత్త్వాది అవస్థాత్రయరూప వికారాన్ని పొందక కేవలం స్వస్థస్థితిలో ఉన్నప్పుడు ఆ స్థితిని ప్రకృతి అంటారు.

ఆ చిత్ప్రకృతి శుద్ధసత్త్వప్రధానం. ఆ శుద్ధసత్త్వమే ఉపాధిగా కల సృష్టి ప్రాకృతసృష్టి.

ఆ ప్రకృతి గుణాత్మకమైన వికృతిని పొందినప్పుడు కలిగే సృష్టి వైకృతసృష్టి అనబడుతున్నది. వైకృతసృష్టికి గుణాలు మూడూ ఉపాధులుగా ఉంటాయి.

నాయనా! భగవంతుడు సన్మాత్రుడని చెప్పాను. సన్మాత్రవస్తువు సర్వవ్యాపి. అలా అన్నిటా వ్యాపించి ఉన్న వస్తువును 'ఆత్మ' అంటారు.

అందుచేత 'ఆత్మన్' శబ్దం సర్వవ్యాపకత్వాదులను సూచిస్తుంది.

భగవంతుడు సర్వశక్తిమంతుడు. భగవంతుడూ, ఆయన శక్తి వాగర్థాల వలె వేరుచేయరాక కలిసిమెలిసి ఉంటాయి. భగవంతుడు సృష్టిని సంకల్పించి దానిలో ఉన్న స్వశక్తి వంక చూపు సారించాడు. ఆ చూపుతో అతని శక్తి విజృంభించి కాలము స్వభావము కర్మ అనే రూపాలను తాల్చింది. వాటిలో కాలరూపాంశ భగవంతుని శక్తి యందు ముప్పిరితాడులా పెనగొని నిర్వ్యాపారావస్థలో ఉన్న సత్త్వరజస్తమో గుణాలను చెలరేపింది. స్వభావాంశ పరిణామావస్థను కూర్చింది. కర్మాంశ దానిని విస్తరింపజేసింది

ఆ విధంగా శక్తి విస్తృతిని పొందినపుడు దానిని 'మహత్తు' అన్నారు.

'మహత్తు' అంటే 'ఇంత అని నిరూపించడం సాధ్యం కానిది' అని అర్థం.

శక్తి యందు మూడు గుణాలు లీనమై ఉంటాయని చెప్పాను కదా! శక్తి ఏ అవస్థను స్వీకరిస్తే ఆ అవస్థలోనే ఆ మూడు గుణాలూ అంటిపెట్టుకొని ఉంటాయన్నది స్పష్టమే.

ఆ మహత్తులోని సత్త్వాద్యంశలు పెరిగిప్పుడు వికారదశ మొదలైంది. అంటే వైకారిక సృష్టి మొదలైనదన్నమాట.

రజస్సత్త్వాంశలు పెరిగిన ఫలంగా అహంకారం జన్మించింది.

అహంకారం లోనూ మూడు గుణాలూ కలిసివస్తూనే ఉంటాయి. ఆ మూడింటిలో సత్త్వం ప్రధానమైనప్పుడు జ్ఞానశక్తి, రజస్సు ప్రధానమైనప్పుడు క్రియాశక్తి, తమస్సు ప్రధానమైనప్పుడు ద్రవ్యశక్తి ప్రకాశిస్తాయి.

జ్ఞానశక్తితో కూడిన అహంకారానికి వైకారికం అని పేరు. క్రియాశక్తితో కూడిన అహంకారం తైజసమని, ద్రవ్యశక్తితో కూడిన అహంకారం తామసమని పేర్కొనబడుతున్నాయి.

తామసాహంకారానికి 'భూతాది' అని వేరొక పేరు కూడా ఉన్నది.

## తామసాహంకార పరిణామం

నాయనా! తామసాహంకారానికి శబ్దం గుణమవుతుంది. అందువల్ల చూచే ద్రష్ట, చూడబడే దృశ్యము అన్నవి బోధపడతాయి.

ఎప్పుడు తామసాహంకారానికి శబ్దం గుణమవుతుందో అప్పుడే ఆకాశం పుడుతున్నది.

ఆకాశానికి గుణం స్పర్శం. దానివల్ల వాయువు జనిస్తుంది.

వాయువులో అహంకారగుణమైన శబ్దము, ఆకాశగుణమైన స్పర్శము – రెండూ ఉంటాయి.

అందువల్ల వాయువు శబ్ద స్పర్శ గుణాలను కలిగి దేహధారణకు, శరీర మానస బలాలకు, ఇంద్రియపాటవానికి కారణ మవుతున్నది.

ఆ వాయువుకు కాల స్వభావ కర్మలు తోడ్పడినప్పుడు రూపగుణము, దానితో తేజస్సు కలుగుతున్నాయి.

అందువల్ల తేజస్సులో శబ్ద స్పర్శ రూప గుణాలు మూడూ ఉంటాయి.

ఆ తేజస్సుకు రసగుణంతో సంబంధం కలిగినప్పుడు జలం పుడుతున్నది.

ఆ కారణాన జలంలో శబ్ద స్పర్శ రూప రసాలు నాలుగూ ఉన్నాయి.

ఆ జలానికి గంధగుణంతో సంబంధం కలిగినప్పుడు పృథివి పుడుతున్నది.

అందువల్ల పృథివి యందు శబ్ద స్పర్శ రూప రస గంధాలు అయిదూ ఉంటాయి.

ఇది తామసాహంకార పరిణామస్వరూపం.

## తైజసాహంకార పరిణామం

తైజసాహంకారం వలన త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము – అనే జ్ఞానేంద్రియ పంచకం; వాక్కు, పాణి, పాదము, పాయువు (గుదము), ఉపస్థ – అనే కర్మేంద్రియ పంచకం; బుద్ధి, ప్రాణము జనించాయి.

ఎటువంటిదాని జ్ఞానమైనా మనకు త్వక్కు (చర్మము) మొదలైన ఇంద్రియపంచకం వల్ల తెలియరావాలి కనుక ఆ పంచకాన్ని జ్ఞానేంద్రియ పంచకం అన్నారు.

ఏ పని అయినా వాక్కు మొదలైన ఇంద్రియపంచకం చేతనే జరగాలి కనుక దానిని కర్మేంద్రియ పంచకం అన్నారు.

## వైకారికాహంకార పరిణామం

వైకారికం వలన చంద్రుడు; దిక్కులు వాయువు సూర్యుడు ప్రచేతుడు అశ్వినులు అనే దేవతాపంచకం; వహ్ని ఇంద్రుడు ఉపేంద్రుడు మిత్రుడు ప్రజాపతి అనే పంచకం ఆవిర్భవించారు.

అందులో చంద్రుడు మనస్సుకు అధిష్ఠాత అయ్యాడు.

త్వగింద్రియానికి దిక్కు, చక్షురింద్రియానికి వాయువు, శ్రోత్రేంద్రియానికి అర్కుడు, జిహ్వేంద్రియానికి ప్రచేతసుడు, ఘ్రాణేంద్రియానికి అశ్వినులు అధిష్ఠాన దేవతలైనారు.

వాగింద్రియానికి వహ్ని, పాణికి ఇంద్రుడు, పాదానికి ఉపేంద్రుడు, పాయువుకు మిత్రుడు, ఉపస్థకు ప్రజాపతి అధిష్ఠాతలయ్యారు.

## బ్రహ్మాండ నిర్మాణం

ఆ విధంగా అవతరించిన దశేంద్రియాలు, భూతేంద్రియ మనోగుణాలు ఒండొంటితో కలిసి మెలిసి వ్యవహరింపక విచ్చలవిడిగా మెలగజొచ్చాయి. అందువల్ల సమిష్టిరూపమంటూ ఏదీ ఏర్పడలేదు.

భగవచ్ఛక్తి వాటి కలయికకు ప్రయత్నించింది. శక్తిచోదితాలై క్రమ క్రమంగా వేనవేల సంవత్సరాలకు అవి ఒకదానితో ఒకటి సమకూడాయి.

ఆ కూడిక వాటికి జలతత్త్వంలో కుదిరింది. తత్ఫలంగా ఒక రూపం ఏర్పడింది. దానిని బ్రహ్మాండం అన్నారు.

అంత దాకా బ్రహ్మాండం అచేతనంగా ఉండేది. భగవానుడు కాల కర్మ స్వభావాలను అధిష్ఠించి అచేతనాలకు చైతన్యం ప్రసాదించి ఆ అండాన్ని చీల్చుకొని బయటికి వచ్చాడు.

అలా బయటికి వచ్చిన పురుషునికి సహస్రశీర్షుడు, సహస్రముఖుడు మొదలైన పేర్లు కలిగాయి.

## లోకాలు

బ్రహ్మాండంలో కొన్ని అంతరాంతరాలు ఉన్నాయి. వాటిని లోకాలంటారు.

తత్త్వపదార్థాల యొక్క సూక్ష్మ సూక్ష్మతర అవస్థలను బట్టి ఈ ఆంతరభేదం కలుగుతున్నది.

లోకాలన్నీ ఒకదానిపై ఒకటిగా కుదురుకొన్నాయి. క్రింది లోకంలోని తత్త్వపదార్థాల కంటె దాని పై లోకపు తత్త్వపదార్థాలు సూక్ష్మతరంగా అమరాయి.

## లోకసంఖ్యాదికం

లోకాలు పధ్నాలుగని కొందరు, ఏడని కొందరు, మూడేనని కొందరు భావిస్తారు.

లోకాలను బ్రహ్మాండశరీరానికి అవయవాలుగా కల్పించారు.

దీనిని బట్టి మొదటి మతం వారి ప్రకారం పధ్నాలుగు లోకాలలో క్రింది ఏడు లోకాలు బ్రహ్మాండ శరీరానికి క్రమంగా పాదాల నుంచి మొలవరకు

గల అవయవాలుగా, మీది ఏడు లోకాలు మొల నుంచి తల దాకా ఉన్న అవయవాలుగా భావించాలి.

రెండవ మతం ప్రకారం భూలోకం పాదాలు, భువర్లోకం నాభి, స్వర్లోకం హృదయం, మహర్లోకం ఉరోభాగం, జనలోకం కంఠం, తపోలోకం పెదవులు, బ్రహ్మలోకం మూర్ధంగా బ్రహ్మాండశరీరానికి అవయవాలు రూపొందాయి.

మూడవ మతాన్ని బట్టి భూలోకము, భువర్లోకము, స్వర్లోకము అనే పేర్లతో లోకాలు మూడే. అందులో భూలోకం పాదాలుగా, భువర్లోకం నాభిగా, స్వర్లోకం శిరస్సుగా బ్రహ్మాండశరీరానికి అవయవాలు అమరాయి.

ఈ అవయవ కల్పనమంతా బ్రహ్మాండమూర్తి యొక్క అవయవాలను విభజించి గ్రహించడాన్ని బట్టి ఏర్పడుతోంది.

## అవయవ తత్త్వకల్పనం

నాయనా! బ్రహ్మాండపురుషుని శరీరంలో పృథ్వీతత్త్వం పాదభాగాన, జలతత్త్వం మధ్య భాగంలో, వాయుతత్త్వం హృదయభాగంలో, తేజస్తత్త్వం ముఖభాగంలో, ఆకాశతత్త్వం శిరోభాగంలో వర్తిల్లుతుంటాయి. అలా ఒక్కొక్క స్థానాన్ని ఆక్రమించిన ఒక్కొక్క తత్త్వం నుంచి ఒక్కొక్క రూపమైన ఇంద్రియాదులు జన్మించి తమ తమ కర్మలను ఆచరిస్తుంటాయి. ఈ పంచతత్త్వాలను సాముదాయకంగా పంచమహాభూతాలని అంటారు.

చరాచర సమస్త జీవరాశి ఈ పురుషుని లోనే ఉన్నది. ఈ పురుషుని ప్రమాణం ఇంతింతని చెప్పటం సాధ్యంకాదు. సర్వమూ ఈ పురుషుడే ఆవరించి ఉంటాడు. సూర్యుడు తన మండలాన్ని మాత్రమే గాక భూమండల మంతటినీ వెలిగిస్తున్నట్లు ఈ పురుషుడు బ్రహ్మాండం లోపలి భాగాన్ని మాత్రమే గాక బహిర్భాగాన్ని సైతం ప్రకాశింపజేస్తాడు.

## లోక భోగ విశేషాలు

నారదా! ప్రాణివర్గం ఎల్లప్పుడూ సుఖాన్నే కోరుకొంటుంది. ఆ సుఖానుభవానికే భోగము అని పేరు. ఆ భోగాలు వారి వారి అనుభవకాల వ్యవధిని బట్టి క్షణికములు, దీర్ఘములు, శాశ్వతములు - అని మూడు విధాలు. ఆయా భోగ్యవస్తువుల గుణాలను బట్టి వాటి అనుభవకాలం నిర్ణయింపబడుతున్నది.

భూర్భువస్స్వర్లోకాలలో పొందే సుఖం నిత్యమైనది కాదు. నాల్గవదైన మహర్లోకం క్రమముక్తికి స్థానం. కల్పాంతసమయాన ఆ లోకంలో ప్రళయకాలాగ్ని తాపం కలుగుతున్నది. అందువల్ల అక్కడ కలిగే సుఖం భూర్భువస్స్వర్లోకాలలో సుఖాని కంటె దీర్ఘమైనదే కాని అదీ నిత్యం కాదు.

మహర్లోకం మీద జనలోకం ఉన్నది. ఆ లోకంలో ప్రవేశించినది మొదలు శాశ్వతసుఖం ప్రారంభమవుతుంది. ఆ సుఖం అమృతరూపాన ఉంటుంది.

జనలోకం పైన ఉన్నది తపోలోకం. అక్కడ కలిగే సుఖం శాశ్వతమైనదే గాక క్షేమరూపంలో ఉంటుంది.

తపోలోకానికి పైన సత్యలోకం ఉన్నది. దానినే బ్రహ్మలోకమని పేర్కొంటారు. ఆ లోకంలోని సుఖం శాశ్వతమై మోక్షరూపంలో ఉంటుంది.

## లోకసుఖప్రాప్తికి సాధనాలు

నాయనా! ఆయా లోకప్రాప్తికి తగినట్లుగా లోకంలో పెక్కు ఆశ్రమాలు, ఆ ఆశ్రమాలకు తగినట్లుగా ధర్మాలు నియమింపబడి ఉన్నాయి.

అందులో గృహస్థాశ్రమానికి విధించిన ధర్మాలను యథావిధిగా అనుష్ఠించి నందువల్ల మొదటి మూడు లోకాల లోని సుఖం చేకూరుతున్నది.

నైష్ఠిక బ్రహ్మచర్యాశ్రమ ధర్మాలను, వానప్రస్థాశ్రమ ధర్మాలను, సన్న్యాసాశ్రమ ధర్మాలను అనుష్ఠించినవారికి మహర్లోక జనలోక తపోలోక బ్రహ్మలోక సుఖాలు క్రమంగా కలుగుతాయి.

## అవిద్యా విద్యా ఫలాలు

నాయనా! భూర్భువస్స్వర్లోకాల లోని సుఖాల కోసం అనుష్ఠించే ధర్మాలు కర్మ ఫలాలే అవుతాయి. ఎందుకంటే కర్మములన్నీ అవిద్యాకార్యాలు.

అవిద్య అంటే అజ్ఞానమే. అజ్ఞానమంటే సత్యజ్ఞానం లేకపోవడం అని తాత్పర్యం.

సత్యం తెలియకపోవడం వల్ల జీవులు దూరదృష్టి లోపించి అరచేతి లోనిదే వైకుంఠమని భావించి సద్యఃఫలాలను కోరుకుంటారు.

విద్య అంటే జ్ఞానం. జ్ఞానం కలిగినప్పుడు దృష్టి దూరానికి ప్రసరిస్తుంది. అప్పుడు తుచ్ఛభోగాల పైకి మనస్సు మళ్ళదు. శాశ్వతసుఖమే కావాలని పిస్తుంది.

శాశ్వతఫలప్రాప్తికి సాధనం ఉపాసన. కర్మము సాధనం కాదు.

## దక్షిణోత్తరమార్గాలు

అవిద్యాపరులు జీవితాంతంలో ధూమాది మార్గాన్ని పట్టి అధోలోకాలు మూడింటికీ వెళ్ళి అక్కడ చేకూరే అశాశ్వత భోగాలను అనుభవించి మళ్ళీ జన్మిస్తారు.

ఈ ధూమమార్గానికే దక్షిణమార్గమని కూడా పేరున్నది.

విద్యావంతులు అర్చిర్మార్గాన్ని పట్టి మీది నాలుగు లోకాలకు వారి వారి యోగ్యతల ప్రకారం వెళ్ళి తామున్న లోకంలోని సుఖానుభవం పూర్తయినాక ఆ పైని లోకాలకు వెళ్ళి శాశ్వతసుఖాన్ని అనుభవిస్తారు.

విద్యాపరులకు పునర్జన్మ లేదు. అర్చిర్మార్గానికి ఉత్తరమార్గం అని పేరు వచ్చింది.

## యజ్ఞానుష్ఠానం

నాయనా! ఆ విరాట్పురుషుని నాభికమలం నుంచి నేను పుట్టాను. నాకు జన్మకారకుడైన ఆ మహాత్ముని యజ్ఞరూపంలో ఆరాధించాలనే తలపు కలిగింది.

యజ్ఞానికి సంభారాలు కావలసి వచ్చాయి. మొట్టమొదట యూపాదుల కోసం వెతికాను. ఎక్కడ చూసినా ప్రతి వనస్పతీ ఆ మహాపురుషుని అవయవం గానే ఉన్నది. మేక మొదలైన పశువుల కోసం వెతికాను. ప్రతిపశువూ ఆయన అవయవమే అనిపించింది. యజ్ఞానికి తగిన భూమి కోసం అన్వేషించాను. అదీ ఆయన అవయవమై కనిపించింది. తర్వాత యజ్ఞార్హమైన వసంతకాలాన్ని, యజ్ఞకర్మకు పనికిరాగల పాత్రసామగ్రిని, వ్రీహి మొదలైన ఓషధులను, నూనె నెయ్యి మొదలైన పదార్థాలను, రసాదులను, సువర్ణాది లోహాలను, మృత్తికా జలాదులను, యజ్ఞవిధానాన్ని ప్రతిపాదించే ఋగ్యజుస్సామాలను పరిశీలించాను. ఏది చూసినా ఆయన అవయవం గానే ఉన్నది. యజ్ఞానికి బ్రహ్మ, హోత, అధ్వర్యుడు, ఆగ్నీధ్రుడు అని నలుగురు ఋత్విజులు కావాలి. మరి జ్యోతిష్టోమాదులు, స్వాహాకారాది మంత్రాలు, దక్షిణలు, వ్రతాలు, దేవతలు, కర్మవిధాన గ్రంథాలు, సంకల్పం, అనుష్ఠాన విధానం, గతులు, దేవతాధ్యానాలు, ప్రాయశ్చిత్తాలు, భగవదర్పణలు మొదలైనవి యజ్ఞాంగాలు. వాటికోసం వెతికాను. అవీ ఆయన అవయవాలే అని తెలిసింది.

ఆ విధంగా సర్వమూ పరబ్రహ్మమే అని గ్రహించాను. ఆయన అంగాలనే సాధనాలుగా గ్రహించి ఆయనను యజించాను. నన్ను చూసి ప్రజాపతులు తొమ్మండుగురు, స్వాయంభువాది మనువులు, మునులు, పితరులు, సురాసుర మనుష్యులు, అందరూ ఆ పరమపురుషుని నానా విధాల ఆరాధించారు.

ఆ పరమపూరుషుడు స్వరూపం చేత అవ్యక్తుడయినా, తనను ఆరాధించిన వారి కోసం వారి వారి భావనల ప్రకారం ఆయా రూపాలలో

వ్యక్తుడవుతుంటాడు. అతను నిర్గుణుడు – అంటే గుణాలకు అతీతుడయినా, సర్గారంభంలో వివిధ గుణాలను గ్రహిస్తాడు. అతని యందే సమస్త విశ్వమూ ఇమిడి ఉంటుంది.

## సృష్టి స్థితి లయకర్తలు

నాయనా! ఆ భగవంతుని ఆజ్ఞ ప్రకారం నే నీ ప్రపంచాన్ని సృజిస్తాను. ఆ భగవానుడు విష్ణురూపం ధరించి దీనిని పాలిస్తాడు. హరుని రూపం తాల్చి దీనిని లయింపజేస్తాడు. హరిహరబ్రహ్మలనే మేము ముగ్గురమూ ఆయన విలాసమూర్తులమే కాని స్వతంత్రులం కాదు.

నాయనా! నేను మహాభక్తుడనై ఆ పరమేశ్వర ధారణను కావించాను. తత్ఫలంగా నేను పలికిన తత్త్వార్థం నాకు గోచరమైంది. నా మాట ముమ్మాటికీ సత్యం. దానికి గోరంతయినా పొల్లు కలగదు. అంత గట్టిగా ఎట్లా చెప్పగలవు? అని అడుగుతావేమో. నా మనస్సు ఏనాడూ బొంకు వంకకు మళ్ళదు. నా ఇంద్రియాలు ఎన్నటికీ తప్పుదారి తొక్కవు. అందుకే నన్ను వేదమయుడని, అఖిల తపోమయుడని, నిఖిల ప్రజాపతి అనీ పేర్కొంటారు. ఇంతటి లోకపూజత్యను గడించి, మహానైపుణ్యంతో యోగాభ్యాసం కావించి, చిత్త సమాధానాన్ని సాధించి అంతటి సాధన సంపత్తితో నా జననకారణమైన ఆ పరముని తత్త్వాన్ని గురించి ఎంతో ఆలోచించాను. అది కొంతకు కొంత మాత్రమే తెలిసివచ్చింది. సమగ్రజ్ఞానానికి గత్యంతరం తోచలేదు.

## శరణాగతి

అప్పుడు బహుకాలం విచారించి చివరికి శరణాగతి ఒక్కటే మార్గమని నిశ్చయించుకొన్నాను. త్రికరణశుద్ధిగా భగవంతునికి శరణిల్లాను. భగవానుడు నన్ను అనుగ్రహించి తన తత్త్వాన్ని నా యోగ్యతానుసారంగా నాకు బోధించాడు. అంతకు మించి ఆయన తత్త్వాన్ని తెలుసుకోవడం నా వంటి వారికి సాధ్యం కాదు. మనమంటేనో? అందరమూ పరిమితులమే.

భగవానుడు అపరిమితుడు. పరిమితులకు అపరిమితులను తెలుసుకొనడం సాధ్యం కాదు కదా!

యథార్థం ఇలా ఉండగా భగవత్తత్త్వ పరమార్థం ఏమిటి? అని సందేహం కలుతుంది. దీనికి సమాధానం ఒక్క భగవంతునికే తెలియాలి. అన్యులకు తెలిసే ఉపాయం లేదు. అయితే ఆ పరమార్థాన్ని గురించి పలువురు పలువిధాలుగా చెబుతుంటారు కదా? అంటే, ఆ మాటలు వారి వారి బుద్ధి ప్రసరించినంత మేరకు ఊహించి పలికిన పలుకులే గాని పరమార్థాలు కావు. భగవంతుడు జగత్తులను పుట్టించాడని, భగవంతుడే జగత్కారణం అని చెప్పడం ఉన్నది. ఆ మాటలన్నీ ఆ చెప్పేవారి ఊహావిలాసాలే తప్ప పరమార్థాలు కావు.

భగవంతుడు ఇటువంటివాడు అని తెలియకపోతే ఆయనను కీర్తించడం ఎలా సాధ్యం? అంటే భక్తులు ఆయన లీలావతారకృత్యాలను ఆధారంగా గ్రహించి తోచినంతలో ఆయనను సంకీర్తిస్తారు. భగవత్తత్త్వం అగమ్యం కనుకనే దానిని స్పష్టంగా వర్ణింపలేక శ్రుతులు 'నేతి నేతి' వాక్యాలతో చెప్పబూనాయి. భగవానుడు కేవల జ్ఞానస్వరూపుడని ఆ వాక్యాల తాత్పర్యం. అంతకు మించి ఆయనను గూర్చి పలికే పలుకులన్నీ కుతర్కాలే.

## పరమేశ్వరుని లీలావతారాలు

నాయనా! ఆ పరమేశ్వరుని లీలావతారాలు ఒకటీ రెండూ కావు. లెక్క లేనన్ని ఉన్నాయి. గడ్డిపరక మొదలుకొని ప్రకృతి పర్యంతం ఉన్నవన్నీ ఆయన విభూతులే. వాటిలో కొన్ని సుందరావతారాలను చెబుతాను విను.

### వరాహావతారం - భూసముద్ధరణం

హిరణ్యాక్షుడనే దైత్యుడు బలోద్ధతుడై భూమిని చాపచుట్టగా చుట్టి సముద్రంలోకి విసిరి పారవేశాడు. భగవానుడు వరాహరూపం తాల్చి తన కోరలతో హిరణ్యాక్షుని చీల్చి చంపి సముద్రాంతరం నుంచి భూమిని పైకెత్తాడు. ఈ అవతారం సర్వయజ్ఞస్వరూపమైనది.

## సుయజ్ఞావతారం – లోకపీడాపహరణం

ముల్లోకాలకు మహాపీడ సంభవించింది. జీవరాశి తల్లడిల్లసాగింది. అప్పుడు భగవానుడు రుచిప్రజాపతికి ఆకూతి యందు సుయజ్ఞుడనే పేర అవతరించి, దక్షిణను పెండ్లాడి 'సుయాము'లనే దేవతలను కని, ఇంద్రపదవిని చేపట్టి లోకపీడను హరించాడు. ఆ అవతార లీలా కృత్యానికి ముచ్చటపడి సుయజ్ఞుని మాతామహుడు వసువు అతనికి 'హరి' అని పేరు పెట్టాడు.

ఆ నాటినుంచి భగవంతునికి హరి అని పేరు వచ్చింది.

## కపిలావతారం – బ్రహ్మవిద్యా ప్రతిపాదనం

కర్దమ ప్రజాపతికి దేవహూతి యందు తొమ్మిది మంది కుమార్తెలు, ఒక కుమారుడు జన్మించారు.

కర్దముని కొడుకుకు కపిలుడని పేరు పెట్టారు. అతను తత్త్వవిద్యాగురువై తన తల్లికి బ్రహ్మవిద్యను ఉపదేశించాడు. ఆ విద్యాబలం వల్ల దేవహూతికి ఆ జన్మలోనే బ్రహ్మ పదవి లభించింది. కపిలావతారం బ్రహ్మవిద్యను ప్రతిపాదించడమే గాక ఆ విద్యకు స్త్రీలు కూడా అర్హులేనని ప్రతిష్ఠాపించింది.

ఈ కపిలుడు సేశ్వరసాంఖ్యాన్ని ప్రబోధించాడు. కాలాంతరంలో నిరీశ్వరసాంఖాన్ని బోధించిన కపిలుడు ఇతను కాదు.

## దత్తాత్రేయావతారం – మహిమా నిరూపణం

బ్రహ్మమానసపుత్రుడైన అత్రి మహర్షి పుత్రసంతతి కోసం భగవంతుని గూర్చి తీవ్రతపస్సు చేశాడు. భగవంతుడు అతని దీక్షకు మెచ్చి అతనికి దత్తుడై కొడుకుగా జన్మించాడు. అత్రిమహర్షికి దత్తుడు కనుక అతనిని దత్తాత్రేయు డన్నారు.

దత్తాత్రేయుని యాదవులు, హైహయులు భక్తితో పూజించారు. ఆ

మహాత్ముడు వారి భక్తికి మెచ్చి ఐహికాలైన పశు పుత్ర ధన ధాన్యాది సంపదలు, ఆముష్మికాలయిన అణిమాద్యైశ్వర్యాలను వారికి ప్రసాదించాడు.

## సనకాద్యవతారం - బ్రహ్మవిద్యా సముద్ధరణం

పూర్వకల్పాంతంలో ప్రళయం సంభవించింది. దానితో లోకంలో బ్రహ్మవిద్యా సంప్రదాయం లోపించింది. దానిని మళ్ళీ సముద్ధరించాలని నేను హరిని గూర్చి తపస్సు చేశాను. భగవంతుడు సనక సనందన సనత్సుజాత సనత్కుమారుల రూపంలో అవతరించి బ్రహ్మవిద్యను మునులకు ఉపదేశించాడు.

## నరనారాయణావతారాలు - కామజయం

కామం తలయెత్తి విహరింపసాగింది. దానికి చేయూతగా క్రోధం చెలరేగి లోకమంతటినీ తారుమారు చేయజొచ్చింది. కామదేవతలైన అప్సరసల దాడికి మునులు కూడా తలక్రిందులయ్యారు. కామాన్ని జయించే ఉపాయమేమిటో ఎవరికీ అంతుబట్టలేదు.

అప్పుడు భగవంతుడు ధర్మునికి దక్షుని కుమార్తె మూర్తి యందు నరనారాయణ రూపాలలో అవతరించాడు.

నరనారాయణులు ఘోరమైన తపస్సు చేశారు. దేవతలు వారి పరమ తపోవ్రతానికి విఘ్నం చేయదలచి మన్మథబాణాల వంటి అప్సరసలను పంపారు. ఆ అచ్చర మచ్చెకంటులు తపోనిష్ఠలో ఉన్న నరనారాయణుల వద్దకు వచ్చి ఆ మునుల చిత్తాన్ని ఆకర్షించాలని తమకు తెలిసిన విద్యలన్నీ ప్రయోగించి చూశారు. ఆ మునులు వారిని పరిహాసపూర్వకంగా చూసి, తమ తపోబలంతో అంతకంటె ఎంతో సౌందర్యవతులైన ఊర్వశి మొదలైనవారిని అక్కడికక్కడే అవతరింపజేశారు. తమ అందాన్ని తలదన్నే వారి చందానికి దేవకాంతలు వెలవెలబోయి, తమ ఆటలింక సాగవని నిశ్చయించి, తలవంచుకొని వెళ్ళిపోయారు.

ఆ విధంగా నరనారాయణులు కామాన్ని జయించాలంటే ఇంద్రియ నిగ్రహరూపమైన తపోనిష్ఠ పరమసాధనమని లోకానికి చాటిచెప్పారు.

## ధ్రువావతారం - ధ్రువపదారోహం

ఉత్తానపాదుడనే రాజు ఉండేవాడు. అతనికి ఇద్దరు భార్యలు. వారిలో ఒకామెకు భగవంతుడు ధ్రువుడనే పేర జన్మించాడు.

రెండవ భార్య పేరు సురుచి. ఆమె ఒకనాడు ధ్రువుని నెపం చూపి పతిని నానాదుర్భాషలాడింది. ఆ మాటలకు నొచ్చుకొని ధ్రువుడు ఇల్లు విడిచి అడవులకు వెళ్ళి తపస్సుచేసి ధ్రువపదాన్ని సాధించాడు.

ధ్రువపదం సురపదానికి, సప్తర్షిమండలానికి పైన సర్వోపరిగా ఉన్నది. అతని తపోమహిమకు సురలు, సప్తర్షులు ఎంతో ఆశ్చర్యపడి బహురీతుల శ్లాఘించారు.

## పృథురాజావతారం - అన్నసమృద్ధికరణం

వేనమహారాజు దుష్టమార్గాన్ని అవలంబించి జనులను బాధింపసాగాడు. అతని వక్రవర్తనకు సహింపలేక బ్రాహ్మణులు అతనిని శపించారు. ఆ శాపవశాన అతను పౌరుషాన్నీ, ఐశ్వర్యాన్నీ కోల్పోయి, తెలివి తెచ్చుకొని, తన అకార్యానికి చింతించి మునులను శరణుకోరాడు. వారతనిపై జాలిపడి భగవంతుని ప్రార్థించారు. మునుల మొర విని పరమేశ్వరుడు వేనునికి పృథువనే పేర పుత్రుడై జన్మించాడు. పృథుజననంతో వేనునికి నరకలోకపతనం తప్పింది.

పృథువు సార్వభౌముడై పరిపాలిస్తున్న కాలంలో భూతకోటి అన్నసమృద్ధికి కరువు ఏర్పడింది. సంభారాలు తరచైనందున యజ్ఞక్రియలు సాగలేదు. అది చూసి పృథుచక్రవర్తి గోరూపధాత్రి అయిన భూతధాత్రి నుంచి ధనధాన్యాలు, ఓషధులు మొదలైనవాటిని క్షీరరూపంలో పిండి లోకాలకు సమర్పించి కరువు తీర్చాడు.

ఐశ్వర్యసమృద్ధి వల్ల భూమికి వసుమతి అని పేరు కలిగింది. పృథువు పేరు మీదుగా పృథ్వి అని ప్రసిద్ధి వచ్చింది.

## ఋషభావతారం – పరమహంస మార్గోపదేశం

కాలక్రమంగా సన్న్యాసం దారి తప్పి వర్తింపసాగింది. భగవానుడు నాభికి మేరుదేవి యందు ఋషభుడనే పేర అవతరించి, అవధూత చర్యను అనువర్తించి పరమహంసమార్గాన్ని బోధించాడు.

## హయగ్రీవావతారం – వేద జననం

నేను యజ్ఞం చేశాను. ఆ యజ్ఞంలో భగవానుడు హయగ్రీవుడనే పేర అవతరించి, తన నిఃశ్వాసల నుంచి వేదవాక్యాలను ఉపకల్పించాడు.

## మత్స్యావతారం – వేద సంగ్రహం

వేదమార్గాలు స్ఖలితములైనాయి. భగవానుడు మత్స్యావతారమెత్తి వాటిన్నిటినీ సంగ్రహించి మళ్ళీ లోకానికి ప్రసాదించాడు.

## కూర్మావతారం – మందర ధారణం

దేవదానవులు అమృతాన్ని కోరి మందర గిరిని కవ్వంగా అమర్చి క్షీరసాగరాన్ని మథింపసాగారు. ఆ పర్వతం బరువై క్రుంగిపోయింది. అప్పుడు భగవానుడు కూర్మావతారం ధరించి ఆ గిరిని మూపున మోసి వారికి ఉపకరించాడు.

## నృసింహావతారం – హిరణ్యకశిపుని వధ

హిరణ్యకశిపుడనే దానవుడు లోకభయంకరంగా వర్తించడమే గాక, భగవంతునికి పరమభక్తుడైన ప్రహ్లాదునికి పడరానిపాట్లు కలుగజేశాడు. భగవానుడప్పుడు నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని తన తొడలపై నిలువరించి సంహరించి లోకోపకారం ఒనరించాడు.

## ఆదిమూలావతారం - గజేంద్ర రక్షణం

ఇంద్రద్యుమ్నుడనే పాండ్యభూపతి అగస్త్యముని శాపం వల్ల గజమై పుట్టాడు. హూహువనే గంధర్వుడు దేవల ముని శాపం వల్ల మొసలిగా పుట్టాడు. ఆ కరిమకరులకు ఒక కొలనిలో పెద్దపోరాటం జరిగింది. ఆ పోరు వేయేండ్లు గడిచింది. తుదకు గజేంద్రుని బలం సన్నగిల్లింది. గత్యంతరం తోచలేదు.

**శా. లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్**
**నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!**

అని ఆ గజేంద్రుడు ప్రార్థించాడు. భగవానుడు అతని కన్నుల యెదుట ఆవిర్భవించి, ఆ మొసలిని సంహరించి గజేంద్రుని రక్షించాడు.

## వామనావతారం - బలిరాజ యశోరక్షణం

బలి అనే దానవచక్రవర్తి స్వర్గలోకం పైకి దండెత్తాడు. అతని దాడికి భయపడి దేవేంద్రుడు సురలతో పరుగెత్తి భగవంతుని ప్రార్థించాడు. పరమేశ్వరుడు వామనమూర్తియై జన్మించి బలిచక్రవర్తి వద్దకు వచ్చి మూడడుగుల నేల కావాలని అడిగాడు. ఆ చక్రవర్తి హితులందరూ వామనుని ఉద్దేశం గ్రహించి అతని కోర్కె తీర్చరాదని, తీర్చితే తెప్పరపు ముప్పు తప్పదని చెవిలో ఇల్లు కట్టుకొని చెప్పారు. బలిచక్రవర్తి తనకు రానున్న ఆపదను లెక్కచేయక ఆడిన మాట తప్పటం కంటె ప్రాణాలను కోల్పోవటమే మేలని పలికి వామనుని కోర్కె నెరవేర్చాడు. వామనుడు విశ్వమూర్తియై ఒక పాదం భూమి మీద, రెండవ పాదం నింగి మీద మోపాడు. భూమ్యాకాశాలు ఆ రెండడుగులకే చాలలేదు. ఏమి చేయాలో తోచక బలి మూడవ అడుగు తన తల పైని నిలుపమన్నాడు. భగవత్పాదమహాభారానికి బలిరాజు పాతాళ లోకానికి క్రుంగిపోయాడు.

బలిచక్రవర్తి దానవుడైనా హరిభక్తుడు కనుక అతని కీర్తిని శాశ్వతంగా నిలుపదలచి భగవంతుడు ఆ విధంగా అతనిని అనుగ్రహించాడు.

## హంసావతారం – భాగవత యోగోపదేశం

నారదా! శ్రీ విష్ణుదేవుడు నీ భక్తిభావానికి మెచ్చి హంసావతారం ధరించి భాగవతయోగాన్ని నీకు ఉపదేశించి ఆ రూపంలో ఆత్మతత్త్వాన్ని లోకానికి ప్రకటించిన విషయం నీకు తెలిసినదే కదా.

## మన్వవతారం – మనువంశ ప్రతిష్ఠాపనం

రాజులు మదోన్మత్తులై దుష్టమార్గంలో చరించారు. భగవంతుడు మనురూపాన అవతరించి ప్రభువై దుష్టరాజులను దండించి తన ఆజ్ఞాచక్రాన్ని సత్యలోకం దాకా వ్యాపింపజేసి లోకంలో మనువంశాన్ని ప్రతిష్ఠాపించాడు.

## పరశురామావతారం – దుష్టరాజ భంజనం

రాజులకు పెడబుద్ధులు పుట్టుకొచ్చాయి. వారు విచ్చలవిడిగా వర్తింపసాగారు. అది నిమిత్తంగా భగవానుడు పరశురామావతారమెత్తి దుష్టక్షత్రియకులాన్ని ఇరవై ఒక్కమార్లు వెతికి వెతికి పట్టి చంపిభూమికి ప్రశాంతిని కలిగిస్తాడు. ఇప్పుడు భగవానుడు ఆ అవతారం ఎత్తిన సంగతి లోకవిదితమే.

## రామావతారం – రావణ సంహార

రావణుడనే రాక్షసుడు పుట్టి ముల్లోకాలనూ తల్లడిల్లజేస్తాడు. భగవంతుడు ఇక్ష్వాకువంశంలో దశరథునికి రాముడనే పేర జన్మించి వైదేహిని పెండ్లాడి పితృవాక్య పరిపాలనార్థం భార్యతో అడవులకు వెళ్తాడు. అక్కడ రాముని భార్యను రావణుడు అపహరిస్తాడు. అది నిమిత్తంగా చేసికొని రాముడు వానరసైన్యాన్ని సమీకరించి సేతువు కట్టి, లంకను ముట్టడించి, రావణుని వధించి మాకందరికీ సుఖాన్ని కలిగిస్తాడు.

## కృష్ణావతారం - లోక కల్యాణం

ద్వాపరయుగాంతంలో అసురులు రాజులై జన్మించి పెక్కు దుండగాలను కావిస్తారు. వారి ఉనికి భూమికి దుర్భరమవుతుంది. భూదేవి భగవంతునికి మొరపెట్టుకొంటుంది. భగవానుడు యదుకులంలో బలరామ, కృష్ణరూపాలలో అవతరించి గూఢచర్య పూని మహద్భుతాలను కావిస్తాడు.

నారదా! శ్రీకృష్ణుని చరిత్రలను లెక్కించడం సాధ్యం కాదు. ఆ చరిత్రలు ఒకదాని కంటె ఒకటి వింతలను సంతరించుకొని వినసొంపుగా ఉంటాయి. చంటి బిడ్డగా ఉన్నప్పుడు చనుబాలు త్రాగే నెపంతో పూతన ప్రాణాలను హరిస్తాడు. మూడు నెలల యీడున శకటాసురుని కాలదన్ని తెగటారుస్తాడు. దోగాడే నాడు మద్దిచెట్ల జంటను కూల్చివేస్తాడు. ఏడాది కుర్రడై ఎగిరి తృణావర్తుని త్రుంచుతాడు. కాళీయుడనే సర్పరాజు యమునానదిని చేరి ఆ జలాలను విషపూరితం కావింపగా, అది తెలియని వ్రేపల్లె లోని గోగోపగోపీజనాలు ఆ నీళ్ళు తాగి ముప్పు చెందుతారు. శ్రీకృష్ణభగవానుడు వారందరినీ బ్రతికించి కాళీయుని మదమణిచి అతనిని పారద్రోలి ఆ నది నీళ్లను అందరికీపానయోగ్యం చేస్తాడు. వేసవి కాలంలో గోపాలకులు వారి పశువులను అడవిలోనే మందచేర్చి పెడతారు. ఒకనాటి రాత్రి కార్చిచ్చు తటాలున చెలరేగి ఆలమందను చుట్టుముడుతుంది. నిద్రావశులై ఉన్న గోపాలకులు మేలుకొని చుట్టుముట్టి తమ మీదికి ఒరుసుకొనివస్తున్న ఆ దావాగ్నిని చూసి భయగ్రస్తులై తామూ, తమ పశుగణమూ ఆనాటితో సరి అనుకొని ప్రాణాలు గుప్పిట పెట్టుకొని తప్పించుకొనే దారి తోచక శ్రీకృష్ణుని ప్రార్థిస్తారు. కృష్ణుడు క్షణంలో ఆ అగ్నిని ఆర్పి వారందరినీ కాపాడుతాడు. ఒకనాడు కృష్ణుడు తల్లిపై అలిగి పెరుగు బానను పగలగొడతాడు. అతని తల్లి యశోద అతనిని కట్టివేయదలిచి తాడుతెచ్చి మొలకు చుట్టబోతుంది. ఆ తాడు పొడవు సరిపోక ఆమె మరొక తాడు తెచ్చి రెండవ ముడివేసి అతనిని కట్టబోతుంది. అతను మరికొంత లావు పెరుగుతాడు. తాడు చాలక ఆమె మరీ మరీ పొడుగు తాళ్ళు తెచ్చి కట్టాలని ప్రయత్నిస్తుంది. కృష్ణుడు మరీ మరీ

పెరుగుతుంటాడు. ఎన్ని తాళ్ళు తెచ్చినా చాలకపోయేసరికి యశోద విసిగి వేసారి తన ప్రయత్నం మానుకొంటుంది. నారదా! సర్వలోకాలనూ కడుపున దాచుకొన్న భగవంతుని బంధించడమంటే సాధ్యమవుతుందా? ఒకనాడు కృష్ణుడు స్నేహితులతో కలిసి ఆడుకొంటూ మన్ను తింటాడు. ఆ సంగతి వాళ్ళు యశోదకు చెబుతారు. ఆమె కృష్ణుణ్ణి మందలిస్తుంది. కృష్ణుడు నోరు తెరిచి చూడమంటాడు. యశోద అతని నోటిలో పధ్నాలుగు లోకాలను చూసి నివ్వెరపోతుంది. గోపనాయకుడు నందుడు ద్వాదశీవ్రతం ఆచరిస్తూ ఒకనాడు స్నానార్థం చేరువనున్న యమునానదికి పోయి అక్కడొక మడుగులో మునకవేస్తాడు. అతనిని వరుణదూతలు పట్టుకొని వరుణలోకానికి తీసుకొనిపోతారు. గోకులమంతా గొల్లుమంటుంది. కృష్ణుడు యమునానదికి పోయి ఆ మడుగులోనే మునిగి వరుణలోకానికి వెళ్తాడు. వరుణుడతనిని పూజించి నందుని విడిపిస్తాడు. కృష్ణుడు నందుని తీసికొని గోపకులానికి వస్తాడు. మయుడనే దానవ విశ్వకర్మకు మాయావి పేరుతో ఒక కొడుకు పుడతాడు. ఆ మాయావి ఒకనాడు గోవుల వెంటనున్న గోపబాలకులను ఎత్తుకొనిపోయి ఎవరూ చొరరాని ఒక పెద్ద గుహ లోపల దాచిపెడతాడు. గోపికలు తమ బిడ్డల కోసం గోడుగోడున ఏడుస్తారు. కృష్ణుడు గుహ చెంతకు వెళ్ళి బాలకులను కాపాడి గోపికల వద్దకు చేర్చి వారికి సంతోషాన్ని కలిగిస్తాడు. గోపాలకులు వైకుంఠప్రాప్తిని కోరుకొంటారు. అంతటి ఆ సద్గతి జ్ఞానవైరాగ్యాల వలన తప్ప అన్యవిధాల వీలుకాదు. గోపకులంటేనో రేయింబవళ్ళు ఆలమందల వెంట తిరిగినవారే కాని వారికి జ్ఞానవైరాగ్యా లెటువంటివో తెలియవు. కృష్ణుడు వారిని అనుగ్రహించి వారి కోరిక నెరవేరుస్తాడు. గోపకులు పశువృద్ధి కోసం ప్రతి సంవత్సరం వసంతకాలంలో ఇంద్రోత్సవం జరుపుతుంటారు. కృష్ణుడు ఆ ఉత్సవాన్ని మాన్పిస్తాడు. అందుకు మహేంద్రుడు అలిగి నవమేఘాలను వదిలి ఘోరవర్షం కురిపించి గోపులను, గోవులను నీటముంచుతాడు. అప్పుడు కృష్ణుడు ఏడేండ్ల ప్రాయపువాడుగా ఉంటాడు. ఆ మహాత్ముడు గోవర్ధన పర్వతాన్ని ఒకకేల పెరికి పైకెత్తి

గొడుగుగా పట్టి దాని అడుగున గోగోపకులను ఏడు నాళ్ళు నిలిపి గాలివానల నుంచి వారిని కాపాడుతాడు. ఇంద్రుడు తన అజ్ఞానానికి సిగ్గుపడి, చింతిల్లి కృష్ణుని వేడుకొంటాడు. ఒకనాటి రాత్రి పండు వెన్నెలలో గోపికలు కృష్ణునితో రాసక్రీడ సలుపుతారు. అప్పుడు శ్రీకృష్ణుడు మురళీమధురగానంతో వారిని పరవశింపజేస్తాడు. ఆ గానమాధుర్యానికి గోపికలు మైమరచి తన్మయత్వాన్ని పొందుతారు. అప్పుడు వారిని కుబేరానుచరుడైన శంఖచూడుడు అపహరిస్తాడు. కృష్ణుడు ఆ యక్షుని సంహరించి గోపికలను రక్షిస్తాడు. ఆ తర్వాత ప్రలంబ ధేనుక దర్దుర కేశి రాక్షసులను, అరిష్ట చాణూర ముష్టికాదులను, కువలయాపీడ మహాగజాన్ని, కంస యవన నరక పౌండ్రకవాసుదేవ సాళ్వులను, ద్వివిద వానరపతిని, పల్వల దంతవక్త్రులను, సప్తమహావృషభాలను, శంబర విడూరథ రుక్మి ప్రముఖులను, మహాధనుర్ధరులని పేరొందిన భోజ మత్స్య కురు సృంజయ కేకయాది నానారాజులను నశింపజేస్తాడు. అందులో కొందరిని శ్రీకృష్ణుడు స్వయంగా చంపి బలరామాదులకు కీర్తి చేకూరేందుకు కొందరిని వారిచేత చంపిస్తాడు. ఆ మహాత్ముని సంకల్ప సహాయాలు లేకుంటే ఆ దుష్టులను చంపడం ఎవరి తరమూ కాదు. లోకప్రయోజనాన్ని కోరి భగవానుడు ఆ విధంగా వర్తిల్లజేస్తాడు. ఆయన లీలావతార కృత్యాలన్నీ లోకకళ్యాణార్థమే.

## **వ్యాసావతారం** – వేద విభజనం

నాయనా! ఒక్కొక్క యుగమూ గడిచేకొద్దీ మర్త్యులకు బుద్ధిబలం, ఆయువు తరిగిపోతుంటాయి. కలియుగం వచ్చే నాటికి ఈ రెండూ మరీ కురచనవుతాయి. బ్రాహ్మణులకు వేదాధ్యయనం వారి శక్తికి మించిన పని అవుతుంది. భగవానుడు కృష్ణద్వైపాయనుడనే పేర అవతరించి వేదమనే కల్పవృక్షం లోని శాఖలను ఏర్పరచి ఇస్తాడు. అందువల్ల ఆయనకు వేదవ్యాసుడని పేరు కలుగుతుంది.

## **బుద్ధావతారం** – పాషండ ధర్మప్రచారం

కలియుగంలో దానవులు బ్రాహ్మణులుగా పుట్టి వేదమార్గనిష్ఠులై అయః పురం రజతపురం తామ్రపురం అనే మూడు గగనంలో సంచరించేపురాలను సంపాదించి, వాటిపై లోకాలోకాలలో తిరుగుతూ లోకోపద్రవకారకులై తమకు ఎదురు లేదన్న గర్వంతో విర్రవీగుతూ యుక్తాలను విడిచిపెట్టి, అయుక్తాలను స్వీకరించి తలపొగరుతో విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. వారిని యుక్తిచేత తప్ప జయింపరాని పరిస్థితి ఏర్పడుతుంది.

అప్పుడు భగవానుడు బుద్ధరూపంలో అవతరించి పాషండ ధర్మానికి ధర్మమనే కవచాన్ని తొడిగి ప్రబోధిస్తాడు. ఆ బోధలు విని లోకులు అవే పరమధర్మా లనుకొని తదనుగుణంగా నడుచుకొంటారు. అందువల్ల హరికథాప్రచారాలు సన్నగిల్లుతాయి.

## **కల్క్యవతారం** – ధర్మ సంస్థాపనం

ఆ బౌద్ధమతం కాలక్రమాన విస్తరిల్లుతుంది. విప్రుల ముఖం నుంచి వితండవాదాలు పుడతాయి.

ఆ విధంగా ఎప్పుడు క్షత్రియవంశమంతా శూన్యమై శూద్రులు రాజులవుతారో, ఎప్పుడు యజ్ఞాదులు దుష్టకర్మలుగా భావింపబడి విలోపిస్తాయో, అప్పుడు కలియుగానికి అవసానకాలం సమీపించిందని నీవు గ్రహించాలి.

అప్పుడు భగవానుడు కల్కిరూపంలో అవతరించి ధర్మాన్ని మళ్ళీ ప్రతిష్ఠాపిస్తాడు.

నాయనా! భగవంతునికి సృష్టిసంకల్పం కలిగినప్పుడు నా రూపాన్ని ధరించి తపస్సు చేస్తాడు. ఆ సంకల్పం కార్యరూపాన్ని పొందడానికి ఆయన తొమ్మిది మంది ప్రజాపతుల రూపు తాల్చి లోకాలను సృజిస్తాడు. సృష్టికి ముగింపును సంకల్పించినపుడు ఆ భగవానుడే రుద్రాది రూపాలను వహించి

సృష్టిసంహారం చేస్తాడు.

సమస్తమూ భగవంతుని శక్తివిలాసాలే. ఆయన శక్తి ఇంతని కాని, ఇటువంటిదని కాని ఊహించడం కూడా సాధ్యం కాదు.

## భగవన్మాయా మహిమ

నారదా! భగవచ్ఛక్తిని మాయ అంటారు. ఆ మాయాతత్త్వం నాకు గాని సనకసనందనాదులకు గాని నేటివరకూ అర్థం కాలేదు. ఇక తక్కినవారి సంగతి చెప్పేదేమున్నది?

భగవంతుడు అనంతుడు. అనంతుని శక్తి అనంతమే కదా! భగవంతుని మాయాతత్త్వాన్ని సమగ్రంగా గ్రహింపలేకపోయినా, కొంతలో కొంతయినా తెలుసుకోవటం సాధ్యమే.

ముక్తిసాధనమైన ఎరుక సమగ్రంగా కలగాలంటే భగవదనుగ్రహమే సాధనం. ఆ అనుగ్రహాన్ని పొందే మార్గం ఏమిటో చెప్పనా?

## భక్తిమార్గం

ఎవరు సర్వాత్మకంగా భగవంతుని చరణారవిందాలను నమ్ముకొంటారో వారికి భగవదనుగ్రహం తప్పక కలుగుతుంది. ఇందుకు తొల్లింటి మహనీయుల చరిత్రలే ప్రమాణం. నా సంగతీ, ఈ సనకాదుల అలా ఉండనివ్వు. ప్రహ్లాదుడు, శతరూపా స్వయంభువులు, పురందర ఋషభ అంగ ధ్రువులు, ఐళ ముచుకుంద జనక గాధి రఘు సగర అంబరీష గయ యయాతి మాంధాతృ శతధన్వ రంతిదేవ దేవవ్రత బలి దిలీప సౌభరి ఉదంక భూరిషేణ విభీషణ హనుమదాదుల కీర్తి లోకమంతటా వ్యాపించినదే కదా. వారందరూ భక్తినే సాధనగా చేసికొని భగవదనుగ్రహానికి పాత్రులై భగవచ్ఛక్తిని గుర్తెరిగి దాని చదురులను దాట నేర్చారు. ఇంతెందుకు? భవుడంతటివాడు భగవదనుగ్రహాన్ని కోరి ఆయనకు భక్తుడై ఉన్నాడంటే వేరే ప్రమాణం ఏం కావాలి?

నారదా! భగవంతునికే గాక ఆయన భక్తులకు భక్తులమై ఉన్నా మహాపుణ్యం కలుగుతుంది.

అంతే కాదు. భగవద్భక్తికి స్త్రీపురుషభేదాలు, జాతిభేదాలు, కులభేదాలు లేవు. భగవంతునికి అనన్యభక్తులై ఉత్తమగతి నొందిన స్త్రీలూ శూద్రులూ హూణ శబరులూ ఎందరో ఉన్నారు.

## భగవత్స్వరూప నిరూపణం

భగవదనుగ్రహమే భక్తికి పరమసాధనమని చెప్పాను. భక్తి అంటే ఏమిటి? మనస్సును ఒక వస్తువునందు ప్రేమతో నిలిపి ఉంచడం భక్తికి సామాన్యలక్షణం. మనస్సును అలా నిలపడానికి ఆధారం ఒకటుండాలి. ఆ ఆధారం సాకారంగా ఉండాలి. భగవంతుడు నిరాకారుడు. నిరాకారమందు మదిని లగ్నం చేసి భక్తిని కలిగి ఉండటం ఎలాగనీ, భగవంతునికి రూపమంటూ ఉంటే ఆ రూపం ఎటువంటిదనీ అనుమానం రావచ్చు.

నాయనా! ఇటువంటి శంకలు ఏదో ఒక దశలో ప్రతివారికీ కలుగుతూనే ఉంటాయి. సంగతి విను.

భగవంతుడు నిత్యసుఖస్వరూపుడు. సుఖానికి భంగం కలగడం లోక సహజమై ఉండగా భగవంతుని పట్ల మాత్రం అది నిత్యమెలా అవుతుందో చూద్దాము. భంగం కలగడమంటే ఏమిటి? భంగం కలిగించేది, భంగాన్ని పొందేది – ఈ రెండూ ఉంటే గాని భంగపాటు కలగదు. సర్వమూ భగవంతుడే అయినపుడు భంగపాటు కలిగించేవాడు, భంగాన్ని పొందేవాడు ఎలా ఉంటారు? ఉండరు. ఒకదానికి భంగపాటు కలిగినపుడు దాని స్థానంలోకి మరొకరు రావాలి. సుఖమన్నది నిత్యమైనప్పుడు అది పోవడం గాని, దాని స్థానంలో మరొకటి రావడం గాని సంభవింపవు. అదీగాక భగవంతుడు అభయుడూ, అద్వితీయుడూ కనుక ఆయనకు రెండవవాడంటూ ఎవడూ లేడు. రెండవవాడు లేనప్పుడు భయపెట్టడం గాని భయపడటం గాని సంభవింపదు. కారణమే లేనప్పుడు కార్యం కలుగదు కదా.

నాయనా! సుఖస్వరూపం ఏమిటి? అంటే, ఆనందమే సుఖస్వరూపం. భగవంతుడు ఆనందమూర్తి అని ఎలా చెప్పగలవు? అని ప్రశ్నిస్తే సమాధానం ఇది: వస్తుతత్త్వం దాని గుణానుభవాన్ని బట్టి తెలుస్తుంది. గుణమంటే ఏమిటి? వస్తుధర్మము యొక్క అభివ్యక్తి గుణం. భగవంతుడు ఆనందమూర్తి అన్న విషయం ఆ ఆనందం అభివ్యక్తమైనప్పుడు గోచరిస్తుంది. అభివ్యక్తాన్ని అతని క్రియలలో మనం చూస్తాము. ఆ అభివ్యక్తి కేవలం జ్ఞానాంశమాత్రం. జ్ఞానం అనుభవైకవేద్యమే కాని మాటలలో నిర్వచించి చూపగలిగేది కాదు. ఏ భావమైనా శబ్దం వలన వ్యక్తమవుతుంది. అనుభవాన్ని చెప్పడానికి శబ్దశక్తి చాలదు. అందువల్లనే అది అనిర్వచనీయం.

అయితే వేదాదులు శబ్దమయాలు, అవి భగవత్స్వరూపాన్ని నిర్వచిస్తున్నాయి కదా? అంటావేమో. వేదాదులు కూడా 'నేతి నేతి' వాక్యాలతో భగవత్స్వరూపాన్ని ఊహింపజేస్తాయే కాని, ఇదమిత్థమని నిరూపించడం లేదు. 'నేతి నేతి' అంటే ఏమిటి? జనులు అజ్ఞానవశాన కొన్ని గుణాలను భగవంతుని యందు ఆరోపించి, ఆ గుణాలు కలవాడు భగవంతుడని చెబుతుంటారు. ఆ మాటలు సరికావని 'నేతి నేతి' వాక్యాలు బోధిస్తాయి. అనగా అజ్ఞానారోపితాలను 'నేతి నేతి' వాక్యాలు తొలగిస్తున్నాయి. ఆ అసలు వస్తువెటువంటిది? అంటే ఆ వస్తుస్వరూపాన్ని చెప్పడం అసాధ్యమని, దానిని అనుభవం చేత మాత్రమే తెలుసుకోవాలని ఇంతకు ముందే చెప్పాను.

నారదా! ఏది జ్ఞానైకరసమో, ఏది విషయకరణ సంగ శూన్యమో, ఏది నిర్మలమూ భేదరహితమూ అభయమూ అవుతుందో, ఏది శోకశూన్యమై నిరంతరం ప్రశాంతంగా ఉంటుందో, ఏది నిత్యసుఖాత్మకమో అదే పరబ్రహ్మం. ఈ

లక్షణాలను ధ్యానిస్తే భావనామాత్రరూపమైన ఒక వస్తువు నీ మనోదర్పణంలో ప్రతిబింబిస్తుంది. ఆ వస్తువు ప్రతిబింబాన్ని మనస్సులో నిలుపుకోవాలి. ఆ తర్వాత ఇక చేయదగినదేదీ ఉండదు. వారు కృతార్థులౌతారు.

నారదా! యోగాల మాటేమిటి? భేదభావాలను నశింపజేయడమే అన్ని యోగాలకూ పర్యవసానకార్యం. భేదభావాలు నశిస్తే గాని మనస్సుకు ఏకాగ్రత రాదు. కనుక సాధకులు ఏకాగ్రబుద్ధివృత్తికై వారికి వారికి అనువైన యోగాలను సాధన చేసి ఫలితాన్ని సాధిస్తారు.

ఇక జగత్తు సంగతి మిగిలి ఉన్నది. ఇది కారణకార్యాత్మకం. కారణ కార్యాలు రెండూ భగవంతుడేనని తెలిసికొన్నాము కదా! కనుక జగత్తు భగవంతుని కంటె భిన్నమైనది కాదు. భగవంతుడు నిర్వికారుడని, జగత్తు వికారమయమని, నిర్వికారం నుంచి వికారం ఏ విధంగా ఉత్పన్నమవుతుందని సందేహాలు కలుగుతాయి. పరిశీలించి చూడగా జగత్తు భగవంతునికి భిన్నం కాకపోయినా, భగవంతుడు మాత్రం జగత్తు కంటె వేరుగా ఉంటాడు. ఏమంటే భగవంతుడు కారణం, జగత్తు కార్యం. కార్యమందలి వికారాదులు కారణంలో కూడా ఉండాలని నియమమేమీ లేదు. అస్తిత్వం ప్రధానం. అది మాత్రం కారణ కార్యాలు రెండింటా ఉన్నది. దానికి వికారాదులు కలగవు.

నాయనా! జగత్తంటే భగవద్విభూతి. ఈ విభూతియోగాన్ని భగవానుడు నాకు బోధించాడు. దానిని నేడు నీకు సంగ్రహంగా తెలియజేశాను. ఇదే భాగవతం. దీనిని నీవు పెంచి పెద్దచేసి నరులకు ఏ విధంగా చెబితే భక్తి జనిస్తుందో ఆ విధంగా లోకప్రచారం చేయాలి.

పరీక్షిన్నరేంద్రా! నీవడిగిన అర్థాన్ని బ్రహ్మానారద సంవాదాత్మకంగా నిరూపించాను. దీనిని చక్కగా విమర్శించి తత్త్వాన్ని గ్రహించు.'

అన్నాడు శుకయోగి.

## పరీక్షిత్తు సందేహాలు

పరీక్షిన్నరేంద్రుడు శుకయోగి వచనాలను సావధానంగా విని ఈ విధంగా ప్రసంగించాడు:

'మహాత్మా! నారద బ్రహ్మ సంవాదాన్ని విన్నాక నా కొక నిశ్చయం కలిగింది. అదేమిటంటే–

1. మోక్షమంటే శాశ్వత సుఖానుభవం.
2. ఆ సుఖం నిరతిశయమైన ఆనందరూపంలో కలుగుతుంది.
3. ఆ మోక్షం భగవదనుగ్రహఫలం.
4. భగవదనుగ్రహాన్ని పొందడానికి భక్తి ఒక్కటే పరమసాధనం.
5. ఆ భక్తి నిరపాయం కావాలంటే శ్రద్ధ ఉండాలి.
6. శ్రద్ధాభక్తులు కలగాలంటే భగవంతునియెడ ప్రీతి జనించాలి.
7. అట్టి ప్రీతి జనించడానికి ఆయన గుణాలు రుచించాలి.
8. అటువంటి రుచి కలగాలంటే భగవంతుని చరిత్రలు తెలియాలి.
9. భగవచ్చరిత్రలను శ్రద్ధాపూర్వకంగా ప్రతినిత్యం విన్నా చదివినా భగవదనుగ్రహం కలుగుతుంది.
10. ఆ అనుగ్రహఫలంగా భగవంతుడు భక్తుని అంతఃకరణలో అడుగుపెడతాడు.
11. భగవత్ప్రవేశంతో అంతఃకరణలోని మలినాలన్నీ నశిస్తాయి.

12. తత్ఫలంగా చిత్తశుద్ధి కలుగుతుంది.

13. శుద్ధచిత్తుడు దేహసంబంధాలైన దారపుత్రాది భోగాలను నిరసించి సర్వక్లేశాలకూ అతీతుడై భగవత్పాదమూలాన్ని చేరి అదే తనకు పరమనివాసస్థానమని తెలిసికొని అందే నిలిచి ఉంటాడు.

14. ఆ విధంగా భగవత్పాదమూలాన్ని చేరినవారికి వర్ణాశ్రమాచారాలతో గాని, తపోదానధర్మాలతో గాని, వేదశాస్త్రాధ్యయనాలతో గాని ఎటువంటి ప్రయోజనమూ ఉండదు.

మహాత్మా! నేను కూడా అటువంటి ఉత్తమపదాన్ని కోరుకొన్నాను. నా కోర్కె ఎలా తీరుతుందో, నా మనస్సు సర్వసంగాలనూ వదిలి ఏ విధంగా శ్రీహరి పట్ల స్థిరవృత్తిని పొందుతుందో, ఈ కళేబరాన్ని నేనెలా నిశ్చింతగా విడువగలనో, విచారించి అందుకు అనువైన హరిచరిత్రలను నాకు వినిపించండి. సర్వలోక మంగళకరాలైన పుణ్యకథలను ఆకర్ణించి పరమపదాన్ని చూరగొంటాను.

మహాత్మా! నాకు మరికొన్ని సంశయాలు కూడా కలుగుతున్నాయి. సంశయాలన్నీ తీరితే కాని భక్తి పరిపూర్ణం కానేరదు కనుక అడుగుతున్నాను–

1. సృష్టి సమస్తం పంచమహాభూతాల సంబంధం వలన కలుగుతున్నది కదా. దేహం కూడా సృష్టిలోనే చేరుతుంది. కనుక అదీ మహాభూతాత్మకమే కావాలి. కాకపోతే భూతసంబంధం లేనినాడు దేహారంభానికి అవకాశమే ఉండదు. భగవంతుడు సర్వభూతజాతానికీ అతీతుడు. అయినా వివిధావతారాలను ధరించాడని మీరన్నారు. అవతారమంటే దేహధారణం. భూతాతీతుడైన భగవంతునికి భూతసంబంధమైన దేహారంభం ఎలా కలిగింది?

2. దేహాదులు కార్యాలు. కారణం లేక కార్యాలు కలగవు. దేహాదుల ఉత్పత్తికి పూర్వకర్మ కారణమని అంటారు. భగవంతుడు నిష్క్రియుడు. అతని దేహధారణకు కారణం ఏమిటి? భగవంతుడు శరీరాన్ని ధరించడం కర్మఫలమే అయితే, భగవదవతారానికీ సామాన్య జననానికీ ఉన్న భేదం ఏమిటి? భగవంతుడు ఏ విధంగా అధికుడు?

3. భగవద్దేహధారణం కర్మఫలం కాదని, నిర్నిమిత్తమని మీరన్నా, నిష్కారణ కార్యం ఉంటుందా? ఉంటుందంటే ఏ విధంగా ఉంటుంది?

4. భగవంతుడు త్రైలోక్యాత్మకుడని చెప్పారు. ఆ పక్షాన అతని అవయవసంస్థానం ముల్లోకాలకూ తగినట్లుగా – అంటే అంత పెద్దదిగా ఉండాలి. పోనీ ఎలాగున్నా భగవంతుడు సావయవి అని ఒప్పుకోక తప్పదు. అవయవాలు ఉన్నప్పుడు ఆకారమూ ఉండి తీరాలి. కనుక భగవంతుడు సావయవి, సాకారుడు అవుతాడు. చలిచీమ మొదలు సర్వప్రాణులూ సావయవాలు, సాకారాలు అని మనకు తెలుసు. భగవంతునికీ, చలిచీమకూ పరిమాణంలో భేదం ఉంటే ఉంటుంది గాక. దేహరచనావిధానంలో ఉన్న భేదం మాటేమిటి? ఆకారం పెద్దదైనంత మాత్రాన అధికారం వస్తుందా ? అధిక్యం వస్తుందా?

5. ఆకారం ఎప్పుడు కలిగిందో, అప్పుడే ఆ వస్తువు యొక్క అవయవసంస్థానానికి పరిమితి కూడా కలుగుతుంది. సావయవి అన్నాక పరిమితావయవి కాక మానదు. అంటే పరిచ్ఛిన్నత్వం ఏర్పడుతున్నది. భగవంతుడు సాకారుడైతే, పరిచ్ఛిన్నుడైతే, అతడు అపరిచ్ఛిన్నుడు, అప్రమేయుడు ఎలాగవుతాడు?

6. రూపం దాల్చిన వస్తువులన్నీ ఎప్పుడో ఒకప్పుడు నశింపక మానవు. భగవంతుడు రూపం కలవాడయితే అతనికీ నాశనం తప్పదు. భగవంతుడు అవినాశి అంటారు. అది ఎట్లా సరిపడుతుంది?

7. హిరణ్యగర్భుడు భూతాలను పుట్టిస్తాడని అంటారు. అతడు విరాణ్మూర్తి అంటారు. విరాణ్మూర్తి అన్నది సమష్టి రూపం. భూతాలో? వ్యష్టి రూపాలు. హిరణ్యగర్భుడు భూతాలను స్వయంగా పుట్టిస్తాడా? లేక పరప్రేరణం వల్ల కలుగ జేస్తాడా? ప్రేరకుడు ఉన్నట్లయితే అతనెవరు?

8. చతుర్ముఖబ్రహ్మ విరాణ్మూర్తి నాభికమలం నుంచి పుట్టాడని చెబుతారు. ఆ బ్రహ్మకు విరాణ్మూర్తి దర్శనమైనదని అంటారు. ఆ దర్శన కారణం ఏమిటి?

9. మాయ అంటే భగవచ్ఛక్తి అన్నారు. శక్తిని విడిచి శక్తిమంతుడు లేడు. ఆ శక్తి అప్పుడప్పుడు దాని వ్యవహారాలను మాని ఉంటుందన్నారు. అప్పుడు శక్తిమంతుడైన భగవంతుడు ఎక్కడ ఏ రూపంలో ఉంటాడు?

10. విరాట్పురుషుని అవయవాలే లోకాలవుతాయని కొందరు నిర్వచించారు. లోకాల చేత విరాట్పురుషుని అవయవాలు కల్పింపబడ్డాయని మీరు సెలవిచ్చారు. ఇందులో ఏది పరమార్థం?

11. కాలం అంటే ఏమిటి? ఆ కాలం మహాకల్పమని, అవాంతరకల్పమని విభక్తమై పరిగణింపబడుతున్నది. ఆ విభాగానికి ప్రమాణం ఏమిటి?

12. కాలప్రవృత్తి ఎటువంటిది?

13. బ్రహ్మదేవుని ఆయుఃప్రమాణం ఏమిటి?

14. సత్త్వాదిగుణాల ఫలంగా పుణ్యపాపాలు కలుగుతుంటాయని, వాటిని అనుసరించి దేవతలు మొదలైన రూపాలు వస్తాయని అన్నారు. ఆ కర్మగతులెన్ని? అవి ఎటువంటివి? వాటి పరిణామం ఏమిటి?

15. చరాచరభూతాల పుట్టుక ఏ విధంగా సంభవించింది?

16. యుగాల లక్షణం ఏమిటి?

17. యుగప్రమాణం ఏమిటి?

18. కాలాన్ని కళాకాష్ఠానిమేషాది విభాగాలతో వివరిస్తారు. ఆ సూక్ష్మాంశాల లక్షణం ఏమిటి?

19. ఏయే యుగాలలో ఏయే ధర్మాలు జరుగుతాయి?

20. యుగధర్మాలు ఆ విధంగా ప్రవర్తిల్లడానికి కారణం ఏమిటి?

21. ధర్మాలను సామాన్యధర్మాలు, విశేషధర్మాలు అని విభజించి, సామాన్యధర్మాలు సర్వజనయోగ్యాలని, విశేషధర్మాలు వర్ణాశ్రమ యోగ్యాలని నిర్ణయించారు. వాటి వివరాలేమిటి?

22. ఆపత్సమయంలో నియతధర్మానుష్ఠానం సాగదు. అప్పుడు అనుష్ఠింపదగిన ధర్మమేది?

23. తత్త్వాలు ఎన్ని ఉన్నాయి? ఆయా తత్త్వాల స్వరూపం ఏమిటి?

24. తత్త్వాలు కారణాలని, వాటి వలన కార్యాలు కలుగుతాయని వచించారు. అది ఏ తీరున సమంజసం?

25. దేవతలను పూజించేవారి విధులేవి? దేవపూజాప్రకారం ఏమిటి?

26. యోగాలు ఎనిమిది ఉన్నాయని శాస్త్రవాక్యం. వాటి విధానం ఏమిటి?

27. యోగాభ్యాసం వలన అణిమాదిసిద్ధులు కలుగుతాయని, వారు అర్చిరాది మార్గాలలో నిర్గమిస్తారని అంటారు. ఆ క్రమం ఏమిటి?

28. అప్పుడు వారు లింగశరీరంతో పయనిస్తారా? లింగశరీరాన్ని విడిచివెళ్తారా? ఆ రెండవ పక్షంలో వారి లింగశరీరానికి లయం ఎలా కలుగుతుంది?

29. వేదాల, ఉపదేశాల, ధర్మశాస్త్రాల, పురాణేతిహాసాల స్వరూపం ఏమిటి? పురాణేతిహాసాదులలో పరస్పరవిరోధాలు పొడచూపినప్పుడు ఆ వైరుధ్యాన్ని ఎలా సమన్వయించుకోవాలి?

30. భూతాల స్థితి లయాలు ఏ ప్రకారం కలుగుతున్నాయి?

31. కర్మములను ఇష్టకర్మలు, పూర్తకర్మలు అని విభజిస్తారు. వాటి స్వరూపం ఏమిటి?

32. ధర్మార్థకామాలు మూడింటినీ ఏయే విధంగా ఆచరించాలి?

33. జీవునికి మలినోపాధి ఏ కారణం వలన కలుగుతుంది?

34. పాషండసర్గం అంటే ఏమిటి? దాని వల్ల కలిగే అపకారం ఏమిటి?

35. జీవుని స్వరూపస్థితి ఏ విధంగా ఉంటుంది?

36. జీవునికి బంధమోక్షాలు కలగడానికి కారణం ఏమిటి?

37. భగవంతుడు తన మాయను అధిష్ఠించి క్రీడిస్తాడంటారు. అతని క్రీడ ఎటువంటిది?

38. భగవంతుడు ఆ విధంగా క్రీడింపవలసిన అవసరం ఏమున్నది?

39. ప్రళయకారణం ఏమిటి?

40. ప్రళయంలో భగవంతుడు సాక్షిమాత్రుడై ఉంటాడని అంటారు. అప్పుడతను మాయతో కూడి ఉంటాడా? మాయను విడిచి ఉంటాడా?

మునీంద్రా! ఈ విషయాలు అక్కడక్కడ విని గుర్తుంచుకొన్నవి. నేను విన్నవన్నీ సంప్రదాయసిద్ధాలూ, స్వానుభవపూర్వకాలూ కావు. శ్రుతపాండిత్యం మాత్రమే. మీకు సర్వమూ స్వానుభవవేద్యం కనుక మీ మాట నాకు ప్రమాణం. నేను ప్రాయోపవేశం చేసి ప్రాణాలపై ఆశ వదులుకొన్నాను. అయినా అవి నన్ను వదలనంటున్నాయి. ఎందుకో తెలుసా? మీ ముఖపద్మం నుంచి ఉదయించిన హరి కథామృతాన్ని గ్రోలి తృప్తిచెంది సందేహ రహిత స్థితిలో గాని అవి నన్ను వదిలిపెట్టవు. నా ప్రణయాన్ని అంగీకరించండి' అని ప్రార్థించాడు.

శుకమహర్షి అతని మాటలకు ప్రసన్నుడై, 'రాజా! నీ ప్రశ్నలు తత్త్వమూలాన్ని కదిలించేవి. ఇన్ని సందేహాలు నీ మనస్సును చుట్టి ఉన్నంత కాలం నీకు మనశ్శాంతి కలగదు. మనశ్శాంతి లేనినాడు భక్తి ఏకాగ్రం కాలేదు. కనుక నీవడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పడం నా విధి అవుతున్నది. శ్రద్ధగా విను!' అన్నాడు.

## జీవేశ్వర తత్త్వ విచారం

'రాజా! పరమాత్మకు జీవాత్మత్వం ఎలా కలుగుతుందన్నది నీ మొదటి ప్రశ్న భావం. జీవాత్మ పరమాత్మ యొక్క అంశమే గాని వేరు కాదు. పరమాత్మంశం ఉపాధిగతమైనప్పుడు దానిని జీవాత్మ అంటారు. పరమాత్మ జ్ఞానస్వరూపుడు కనుక అతని అంశమైన జీవుడు కూడా జ్ఞానస్వరూపుడే

అవుతాడు. దేహమంటేనో, ప్రకృతి కార్యం. దేహసంబంధాన్ని బట్టి జ్ఞానస్వరూపునికి జీవత్వం ఏర్పడుతున్నది.

ఆ సంబంధానికి కారణమేమిటో తెలుసుకోవాలి. కారణం లేక కార్యం కలుగదు కనుక సంబంధానికి కారణం ఉండి తీరాలి. అది ఏదంటే, భగవత్సంకల్పమే కారణం. మరొక కారణం లేదు. జీవునికి స్వాప్నిక పదార్థ సంబంధం కలుగుతుండటం అనుభవసిద్ధమే కదా. అది జీవుని సంకల్ప ఫలమైనట్లే ఇదీ భగవత్సంకల్ప హేతుకం.

## జీవత్వం - భ్రాంతి ఫలం

రాజా! జీవుడు జ్ఞానైకరూపుడని చెప్పాను. జ్ఞానానికి ఒకటే రూపం ఉంటుంది గాని అనేక రూపాలు, అనేక రీతులు ఉండవు. మరి జీవుడిని చూస్తే దేవ దానవ మనుష్యాది రూపాలలో బహురూపధరుడై కనుపిస్తున్నాడు. ఆ రూపాలయినా పుట్టినది మొదలు గిట్టే దాకా ఒకే తీరున లేవు. ఏకాకారునికి వివిధాకారత్వం ఎలా వస్తుందని సందేహం కలగడం సహజమే. జీవుడు ప్రకృతి విలక్షణుడై ఉన్నప్పటికీ ప్రకృతితో సంబంధాన్ని కోరి ప్రకృతివికారాలైన సత్త్వాది గుణవిషయాలతో రమించి అనాత్మ విషయాలైన దేహాదులను ఆత్మీయంగా భావించి 'నేను, నాది' అని అనుకొని సంసారాసక్తిని పొందుతున్నాడు. అందువల్ల అతనికి నానాత్వం కలుగుతున్నట్లు స్ఫురిస్తుంది. నిజానికి ఈ నానాత్వం ఉపాధి సంబంధమే కాని జీవసంబంధం కాదు. వాస్తవస్థితి ఇలా ఉండగా జీవుడు తాను నానారూపుడనని పొరబడతాడు. ఈ పొరపాటుకు కారణం భ్రాంతి. ఈ భ్రాంతి కలగడమే జీవుడికి బంధ మనబడుతోంది.

## ఈశ్వరుడు - శక్తి

రాజా! ప్రవృత్తి అంటే మాయ అని, ఆ మాయయే ఈశ్వరశక్తి అవుతుందని తెలిపాను. ఆ శక్తి శక్తిమంతుడైన ఈశ్వరుని ఆశ్రయించి అతని

ఇచ్ఛానుసారం వర్తిస్తుంది. దానికి స్వాతంత్ర్యం ఉండదు. ఈశ్వరుడు శక్తివశుడై ప్రవర్తించడం అతని సంకల్పమే అని గ్రహించాలి.

## సంకల్ప కారణం

ఈశ్వరునికి అటువంటి సంకల్పం ఎందుకు కలగాలని అడిగావు.

ఆనందం ఈశ్వర తత్త్వాలలో ఒకటి. ఆ ఆనందం అనుభవైకరూపం. అది స్వాభావికం అనడానికి మనకు లోకానుభవమే ప్రమాణం.

ఆ ఆనందానుభవం ఈశ్వరునికీ ఇష్టమే. అందుకోసమే ఆయనకు శక్తి పారవశ్య సంకల్పం కలుగుతుంది.

## భ్రాంతి ఫలం

రాజా! యథార్థాన్ని గ్రహింపలేకపోవడమే అజ్ఞానం. అజ్ఞానం వల్ల భ్రాంతి కలుగుతుంది.

స్వతంత్రుడు కాలప్రకృతులకు వశమైనట్లు లొంగి నడుచుకోవడం భ్రాంతి ఫలమే.

## భ్రాంతి నిరాసం

ఈ భ్రాంతి తొలగే మార్గం ఏమిటో విచారిద్దాము.

జీవుడు తానెప్పుడూ కాలప్రకృతులకు లొంగి ఉన్నానని భావిస్తాడు. ఆ భావం ఎప్పుడు పోతుందో అప్పుడే భ్రాంతి తొలగినట్లవుతుంది.

భ్రాంతి నిరాసం వల్ల జీవుడు తన స్వరూపాన్ని తెలుసుకొంటాడు. అప్పుడతనికి 'నేను', 'నాది' అనే భావాలుండవు. అతను పరమేశ్వరాంశమే అవుతాడు.

మమత్వభావం ఎప్పుడు నశిస్తుందో అప్పుడే విషయభోగేచ్ఛ కూడా సమసిపోతుంది. అతను కేవలానందమూర్తియై భగవత్స్వరూపుడవుతాడు.

ఇటువంటి మహోన్నతస్థితి కలగడానికి భక్తి ఒక్కటే పరమసాధనం.

## భక్తి తత్త్వం

భగవద్భక్తి అంటే ఏమిటి? జీవి తన స్వాతంత్ర్యభావాన్ని మరిచి భగవంతునికి త్రికరణశుద్ధిగా తనను తాను సమర్పించుకొని, అతనికి ప్రీతికరమైన దానిని వ్రతరూపంలో అనుష్ఠించడం భక్తి.

భక్తివల్ల తత్త్వజ్ఞానం కలుగుతుంది. దాని ఫలంగా స్వరూపావస్థ చేకూరుతుంది.

## జీవేశ్వర దేహధారణలు

రాజా! దేహాదులు నియతపరిణామవశాలు. వాటికి యోగక్షేమాలు తప్పవు. ఈశ్వరుడు దేహాన్ని ధరించినపుడు అతనికైనా దేహసంబంధ యోగక్షేమాలు తప్పవని, ఆ పక్షంలో ఈశ్వరుడు కూడా మనవంటి దేహధారులతో సమానుడేనని, అతనిని భజిస్తే కలిగే ప్రయోజనం ఏమిటని ప్రశ్నింపవచ్చు.

జీవునికి అవిద్యాకారణం వలన దేహసంబంధం కలుగుతున్నది. ఈశ్వరునికి అతని యోగమాయ చేత దేహసంబంధం కలుగుతుంది.

జీవుడు అవిద్యకు లోబడి ఉన్నాడు. ఈశ్వరుడు తన శక్తిని అధిష్ఠించి ఇచ్ఛానుసారం ప్రవర్తింపగలడు.

జీవుని రూపం మిథ్యారూపం. ఈశ్వరుని రూపం చిద్ఘనవిలాసం.

జీవుని దేహం అతని కర్మఫలం. ఈశ్వరుని దేహం లీలావిర్భావం.

కనుక దేహధారణ విషయంలో జీవేశ్వరులకు ఎటువంటి సామ్యమూ లేదు. అందువల్ల భగవదవతారాలు సామాన్య జీవుల పుట్టుకల వంటివి కావు, అందుచేత భక్తజనులకు అవి భజనీయాలే.

భగవద్భగజన వల్ల, భవదవతార భజన వల్ల మేలు తప్పక చేకూరుతుంది.

## భగవద్భక్తిఫలానికి నిదర్శనం

రాజా! భగవంతుని యెడ భక్తి కలిగి తత్పరులైనవారికి మేలు కలుగుతుందా? లేదా? అన్న ప్రశ్నకు బ్రహ్మ జీవితమే ఒక గొప్ప నిదర్శనం.

బ్రహ్మదేవునికి పుట్టుక వేళ నుంచి శ్రీమహావిష్ణు నాభి కమలమే నివాసస్థానం. ఆ నాభికమలానికి ఆధారం ఏమిటో తెలుసుకోవాలని ఒకనాడతనికి సంకల్పం ఉదయించింది.

అప్పుడు బ్రహ్మ కమలపీఠాన్ని దిగి దాని నాళాన్ని పట్టుకొని లోనికి వెళ్ళాడు. ఆ నాళం మహార్ణవాంతరానికి ప్రాకి ఉన్నందువల్ల అతను ఎంత దూరం వెళ్ళినా కొస ఎక్కడున్నదో కానరాలేదు. ఇంకా ఎంత దూరం ప్రయాణిస్తే చేరువవుతుందో అర్థం కాలేదు. చివరికి ఆయన విసిగి తన యత్నాన్ని మానుకొని మళ్ళీ యథాస్థానం చేరుకొన్నాడు.

'భగవంతుడు నన్ను ప్రపంచనిర్మాణం చేయమని ఆజ్ఞాపించాడు. నిర్మాణ విధానం ఎలాగో నాకు ఊహింపరాకున్నది. ఏమి చేయాలో తెలియడం లేదు' అని ఆయన తదేక చింతాపరుడయ్యాడు.

బ్రహ్మ ఆ విధంగా చింతామగ్నుడై ఉండగా ఒకనాడు జలార్ణవంలో నుంచి 'త–ప' అని రెండక్షరాలతో కూడిన ఒక వింత శబ్దం రెండు పర్యాయాలు వినవచ్చింది.

అకారం మొదలు క్షకారం వరకు ఉన్న అక్షరాలను అక్షరమాల అంటారు. అందులో 'క' కారం మొదలు 'మ' కారం వరకు గల అక్షరాలను స్పర్శాలని వ్యాకరణవేత్తలు నిర్వచించారు. ఆ స్పర్శాలలో 'త' అన్నది పదహారవది గానూ, 'ప' ఇరవై ఒకటవది గానూ ఉన్నాయి. ఆ రెండక్షరాలనూ కూర్చితే 'తప' అనే శబ్దం ఏర్పడుతుంది.

ఆ విధంగా 'తప–తప' అని వినవచ్చినంతనే బ్రహ్మ ఎంతో శ్రద్ధతో ఆలకించి, ఆ శబ్దం ఎక్కడినుంచి వచ్చిందో, దానిని ఎవరు ఉచ్చరించారో అని నలుదెసలా పరికించాడు. ఎక్కడా ఎవరూ కానరాలేదు. ఆయన ఆశ్చర్యవశుడై, 'ఏమిటి ఈ చిత్రం! తపశ్శబ్దం రెండుమార్లు వినవచ్చింది. ఆ శబ్దాన్ని ఎవరు పలికారో, ఎక్కడి నుంచి పలికారో తెలియరాలేదు. దీనికి కారణం ఏమిటి? దీని భావం ఏమిటి?' అని దీర్ఘంగా ఆలోచింపసాగాడు.

రాజా! ఆ శబ్దానికి తపస్సు అన్నదే అర్థం. అది సామాన్యమైనది కాదు. అన్ని ధనాలనూ విసర్జించిన సన్న్యాసులకు కూడా అది మూలధనం. బ్రహ్మ అలా పర్యాలోచించి, 'సృష్టివిధానం తెలియక చింతాక్రాంతుడనైనాను. భగవంతుడు నా స్థితిని గ్రహించి నాకు హితోపదేశంగా 'తప' అని పలికి దారి చూపించాడు. భగవదాజ్ఞను తలదాల్చి నడుచుకొంటాను' అని నిశ్చయించి, ఊపిరి బిగించి, మనస్సును నిరోధించి, కర్మజ్ఞానేంద్రియాలను నియమించి, సమాహితచిత్తుడై దేవమానం ప్రకారం వేయి సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. అతని తపస్సు నిఖిలలోక సంతాప హేతుభూతమై లోకాలు తల్లడిల్లాయి.

## వైకుంఠ దర్శనం

రాజా! భగవానుడు ఆ విధంగా సంపూజితుడై బ్రహ్మ తపోదీక్షకు సంతోషించి, ఏది పరమ శ్రేష్ఠమో, దేనికన్న పరమోత్కృష్టమైనది వేరొకటి లేదో, ఆ తనదైన లోకాన్ని పరమపదాన్ని వైకుంఠాన్ని సందర్శించే మహాభాగ్యాన్ని అతనికి కలుగజేశాడు.

వైకుంఠం పరమకైవల్యపదం. పుణ్యాత్ములు వైకుంఠాన్ని చేరి, భగవద్దర్శన భాగ్యాన్ని పొంది, ఆధ్యాత్మికాది తాపత్రయం, అజ్ఞాన భయాదులు లేక నిరంతర భగవద్భజనపరులై నిత్యసుఖోల్లాసంలో మునిగి తేలుతుంటారు.

వైకుంఠంలో రజస్తమస్సులు గాని వాటితో మిళితమైన సత్త్వం కానీ కనిపించవు. సర్వమూ శుద్ధసత్త్వగుణపూర్ణమై శోభిల్లుతుంటుంది.

వైకుంఠంలో కాలగమనం లేదు. కాలానికి నాశనసామర్థ్యం నైజగుణం. అటువంటి కాలం అక్కడ తన ఆటలు కట్టిపెట్టి అవ్యక్తమై మిన్నకుంటుంది. మాయకు అక్కడ నిలువనీడ లేదు. ఇక మాయారచిత ప్రాకృతపదార్థాల మాటే ఉండదు.

అక్కడ పార్షదులు భక్తిసమార్జితమైన పుణ్యఫలం వలన భగవత్సారూప్యాలను తాల్చి, ఆయన వలెనే శుద్ధశ్యామలవర్ణ శరీరులు, చతుర్భుజులు, పద్మనేత్రులు, పీతాంబరధారులు, ప్రవాళ వైడూర్య మరకత మణిరత్నస్థగిత సువర్ణకుండల శిరోమాలికా తేజోవిరాజమానులై దివ్యదేహాలతో మనోహరంగా వెలుగొందుతూ నిరంతర భగవత్సేవాపరులై ఉంటారు.

వైకుంఠలోకం లోని సౌరసౌధాలు మెరుగుబోండ్ల విహారాల వల్ల మెరుగుతీవెల తోడి మేఘాలను తలపింపజేస్తాయి.

అక్కడ ఒక మహారమ్యసౌధాంతరంలో శ్రీదేవి రూపుదాల్చిన సౌభాగ్యాతిశయంతో ఊయెల లూగుతూ వసంతుడు కూర్చిన భ్రమరగీతలతో తన మనోజ్ఞసంగీతాన్ని మేళవించి భగవల్లీలలను శ్రావ్యంగా గానం చేస్తూ భగవత్పాదారవింద సేవాహేవాకమే నోముగా, భగవద్భక్తియుక్తురాలై నేత్రపర్వంగా గోచరిస్తుంది. శ్రీపతీ యజ్ఞపతీ జగత్పతీ అయిన భగవానుడు చతుర్భుజయుక్తుడై పీతాంబరధారియై మణిమయ కిరీటాలంకృతుడై రత్నకుండల కాంతి కమనీయ కపోల యుగళుడై చిరునవ్వు వెన్నెలలు విరజిమ్మే నెమ్మోముతో విరాజిల్లుతూ, దివ్యాసనాన్ని అధిష్ఠించి సునంద నంద

ప్రబలార్హణాది పార్షదులు, రూపుకట్టిన పంచవింశతితత్త్వాలు భక్తిపూర్వకంగా సమర్పించే సేవలను అందుకొంటూ అనన్యయోగ్య నైజసిద్ధ మహైశ్వర్యాలతో విభాసిల్లుతుంటాడు.

రాజా! వైకుంఠనిలయం లోని పార్షదులు కూడా భగవత్సారూప్యంతో వర్తిల్లుతుంటారని చెప్పాను. ఆ పక్షంలో భగవంతు డెవరో పార్షదు లెవరో భక్తులు ఎలా గుర్తుపట్టగలరని శంక కలగటం సహజమే. భగవానుడు భక్తజన సౌలభ్యార్థం తన వక్షోభాగాన శ్రీదేవిని ధరించి త్రైలోక్యమనోభిరామంగా వెలుగొందుతుంటాడు. ఆ చిహ్నాన్ని గుర్తుపట్టి భగవంతుని ఆతని పార్షదుల నుంచి వేరు చేసి భక్తులు గౌరవిస్తారు. భక్తప్రసాదాభిముఖాలైన తన కటాక్షవీక్షణాలతో కరుణామృతాన్ని కురిపిస్తూ భగవానుడు స్వస్వరూప రమమాణుడై ఉంటాడు.

బ్రహ్మదేవుడు ఆ విధంగా వైకుంఠానికి వెళ్ళి భగవంతుని సందర్శించి పరమాహ్లాద పరిప్లుతాంతఃకరణుడై, నిలువెల్లా ఆనందపులకాంకురాలతో కంపించి, కన్నుల నుంచి ప్రేమాతిశయ జనితానంద బాష్పధారలు పొంగులువారగా ఏమి చేయాలో, ఏమి చెప్పాలో తోచక, అప్రతిభుడై ఆర్తులకు, అర్థార్థులకు ఆశ్రయాలైన భగవత్పాదారవిందాలపై వ్రాలి భక్తిపూర్ణంగా నమస్కరించాడు.

భగవానుడు సంప్రీతస్వాంతుడై అతనిని కెంగేల తాకి మందస్మితవచనాలతో ఈ విధంగా ప్రసంగించాడు.

## తపో మహిమాతిశయం

వేదగర్భా! లోకసృష్టిని కావింపుమని నిన్ను ఆజ్ఞాపించాను. సృష్టి విధానం తెలియగోరి బహుకాలం దృఢవ్రతంతో తీవ్రతపస్సు చేశావు.

కొందరు కపటతపస్సులు ఆచరించి నన్ను మెప్పించాలని ఉద్యమిస్తారు. అట్టి వెర్రివారి తపస్సులు నాకు నచ్చడం గాని, నేను మెచ్చడం గాని ఎన్నటికీ

జరగవు. నీ తపస్సు అటువంటిది కాక శుద్ధచిత్త పూర్వక మైనందువల్ల నేను అంతరంగంలో ఎంతో సంతసించాను.

ఓ బ్రహ్మా! వలసిన వరాలను యథేచ్ఛగా అడుగు. నీకు శుభమవుతుంది గాక. ఆత్మ శ్రేయాన్ని కోరి ఎంతో పరిశ్రమిస్తారు. అన్ని శ్రమలకూ పరమ ఫలం నా దర్శనమే కదా! అంతకు మించిన ఫలం లేదు కదా! అట్టి ఫలాన్ని నీకు అనుగ్రహించాను.

అందుకు నీ తపస్సే కారణం. నీవు నీ సృష్టికర్మ విధానం తెలియక విమోహితుడ వైనావు. అది గ్రహించి 'తప, తప' అని సూచ్యార్థసూచనగా నీకు తెలియజేశాను. నా భావాన్ని గ్రహించి తపస్సు చేశావు. తత్ఫలంగా మదీయ వైకుంఠ లోక సందర్శనం నీకు లభించింది.

చతురాననా! ఈ భాగ్యం నీకు సిద్ధించడం కేవలం నీ తపఃఫలవిశేషమే. అయితే ఒక్క తపోబలం ఉన్నంత మాత్రాన ఇష్టకామ్యార్థసిద్ధి కానేరదు. తపోబలానికి తోడు దైవానుగ్రహం ఉండాలి.

కర్మలకు ఫలాన్ని ఇచ్చే సామర్థ్యం స్వతస్సిద్ధం కాదు. ఫలసిద్ధి పరమేశ్వరాధీనం.

పరమేష్ఠీ! తపశ్శక్తి మహిమ ఇంతని చెప్పతరం కానిది. నేను సృష్టి స్థితిలయాలను కావింపగలుగుతున్నది కేవలం తపోబలం వల్లనే.

తపస్సు నా హృదయం. నేనే తపోరూపుడనని గ్రహించు!

## తత్త్వార్థ జిజ్ఞాస

భగవద్వచనాన్ని సాకల్యంగా ఆకర్ణించి బ్రహ్మ –

'స్వామీ! నీవు సర్వభూతజాత బుద్ధిగతుడవు. అందుచేత సర్వభూతాలకూ అధిష్ఠాతవు. నీ ప్రజ్ఞానం అప్రతిహతం. నీకు తెలియని మనోగతాలు లేవు. కనుక నా భావాన్ని ప్రత్యేకించి నీకు విన్నవింప నవసరం లేదు. అయినా నీ

ఆజ్ఞ మేరకు నా తలపును తెలుపుకొంటాను.

స్వామీ! నీవు అరూపుడవు. రూపం లేకపోయినా స్థూలసూక్ష్మాలైన వివిధరూపాలను ధరిస్తావు. ఆ రూపాలు చేతనాలని, అచేతనాలని రెండు వర్గాలుగా ఉన్నాయి. ఈ నీ క్రీడ దేని కొరకో నాకు తెలియజెప్పమని ప్రార్థిస్తాను.

ప్రభూ! నిన్ను ప్రేరేపించే వారెవ్వరూ కలుగరు. నీకై నీవే నీ మాయాశక్తిని అధిష్ఠించి ప్రపంచసృష్టి స్థితి లయరూప క్రీడావినోదాన్ని కోరి బ్రహ్మరుద్రాది రూపాలను అబినయిస్తావు. నీ యీ విధానాన్ని చూడగా, సాలె పురుగు తనలో నుండి ఊర్ణాన్ని వెలికి తీసి, తన చుట్టూ వ్యాపింపజేసి, దానిలోనే తానూ నిలిచి క్రీడించి చివరికి మళ్లీ ఆ ఊర్ణాన్ని తన లోనికే గైకొనే వైఖరి జ్ఞాపకానికి వస్తుంది. నీ లీలలు నాకు దురూహాలు. నీ లీలలను గ్రహించే బుద్ధిని నాకు ప్రసాదించు.

## వర ప్రార్థనం

దేవా! సృష్టికి నన్ను ఆజ్ఞాపించావు. నీ ఆజ్ఞను అప్రమత్తుడనై నిర్వహించే భాగ్యాన్ని నాకు కలిగించు.

సృష్టికార్యం రజోగుణప్రధానమైనది. నేను సృష్టికి పూనుకొన్నపుడు రజోగుణం నన్ను ఆవహించని సత్త్వబలాన్ని అనుగ్రహించు.

సృష్టి కూడా ఒక కర్మమే. కర్మకు ఫలోదయం తప్పదు. రజస్సు పైకొన్న వేళలలో అహంకారమూ, దానితోపాటు కర్తృత్వ భోక్తృత్వాలు కలిగి కర్మబద్ధుని కావిస్తాయి. నీ ఆజ్ఞను నెరవేర్చినపుడు నాకు అటువంటి కర్మబంధం కలుగకుండు గాక!

దేవా ! ఈ సృష్టికార్యంలో నన్ను నీ సఖునిగా భావించి అందుకు తార్కాణగా నీ పరమపవిత్రమైన కరసరోజంతో నన్ను స్పృశించావు. అంత మాత్రానికే నాకు గర్వోన్నతి కలుగకుంటుంది గాక!

సృష్టి అన్నది క్రియారూపం కనుక ఉత్తమ మధ్యమ అధమాది భేదాలతో ఉండక తప్పదు. ఆ భేదభావం నన్ను చెనకకూడదు.

అంతే కాదు. నీ పరిచర్యారూప కర్మమందు నేను ఉన్నంత కాలం స్వాతంత్ర్యాది దురభిమానం నన్ను ఆవహింపక నీ దాసుడనై మెలగే వినయశీలాన్ని నాకు ప్రసాదించు' అని ప్రార్థించాడు.

## భాగవతోపదేశం

రాజా! భగవానుడు బ్రహ్మ పలుకులకు సంతసించి, 'చతురాననా ! నీవడిగిన తత్త్వార్థం పరమరహస్యం. అయినా దానిని దాపక విజ్ఞాన పూర్వకంగా నీకు బోధిస్తున్నాను. ఈ విజ్ఞానోపలబ్ధికి భక్తి ఒక్కటే ముఖ్యసాధనం. కనుక సద్భక్తితో దానిని సాంగోపాంగంగా గ్రహించు' అంటూ అతి దురవగాహమైన తత్త్వాన్ని విశదీకరించాడు.

## రహస్యార్థం

'పరమేష్ఠీ ! నేనంటే వాస్తవంగా ఎవరినో, నా స్వరూపం ఏమిటో, నా రూపగుణకర్మలు ఏవో తెలిసికొనడమే సకల తత్త్వాలకూ సారాంశం.

ఏ తత్త్వం సృష్టికి పూర్వం రూపగుణకర్మాదులు లేక కేవల స్థితిమాత్రమై ఉంటుందో అదే నేనని గ్రహించు.

అప్పుడు స్థూలసూక్ష్మాలు, వాటికి కారణమైన ప్రకృతి – దేనికీ ప్రత్యేకంగా స్థితిమత్త్వం ఉండదు. సర్వమూ నా యందే లీనమై ఉంటుంది.

సృష్టి తర్వాత కూడా నేనొక్కడనే ఉంటాను. నాకు అన్యమైనది వేరొకటి ఉండదు.

ఈ విశ్వమంతా నేనే. దృశ్యమైనంత మాత్రాన ఈ విశ్వం నా కంటె వేరు కాదు. ప్రళయాంతరం లోనూ నేనొక్కడనే స్థితుడనై ఉంటాను.

ఈ విధంగా నేను ఆద్యంతరహితుడను, అద్వితీయుడను అయినందున నన్ను నిత్యపూర్ణు డంటారు.

నేను నా మాయను అధిష్ఠించి సృష్టిని నిర్వహిస్తాను. మాయ అన్నది నాకంటె అన్యతరమైన ప్రత్యేక వస్తువని భ్రాంతి చెందకూడదు. అది నా శక్తి మాత్రమే. శక్తి, శక్తిమంతుడు కలిసి మెలిసి ఏకాకృతిగా ఉండటమే స్వభావం.

శక్తిమంతుని సంకల్పం ప్రకారం అతని శక్తి అయిన మాయ వివిధ రూపనామపదార్థాలను రచిస్తుంది. ఆ పదార్థాలు వేర్వేరని భావింపకూడదు. అటువంటి భావం ఉన్నంత కాలం మనోదృష్టులు ఆ పదార్థములందే నిలిచి వాటికి మూలమైన వస్తువును చూడలేవు. వాస్తవ వస్తువును చూసినప్పుడు దాని శక్తిచే రచింపబడిన పదార్థాలు ఆ వస్తువు కంటె భిన్నంగా నీకు కనిపించవు. ఆ రెండింటినీ ఒక్కసారే చూడగల శక్తి నాకు కలుగదా? అని నీ వడగవచ్చు.

చూడటం అంటే బుద్ధికి గోచరించడం అని కదా, అసలు అర్థం! ఆ బుద్ధియొక్క శక్తి, విషయాన్ని గ్రహించడానికి ఉపకరిస్తుంది. ఆ శక్తి ఇంద్రియాలకు అతీతుడనైన నన్ను తెలుసుకొనడానికి చాలదు. బుద్ధికి అటువంటి శక్తి లేమికి నా మాయే కారణం. అంటే నా శక్తి బుద్ధీంద్రియంలో తావన్మాత్రమే ప్రకాశించాలని నేను సంకల్పించాను. నా సంకల్పానుసారం నా శక్తి ఆ ఇంద్రియంలో అంత మాత్రమే ప్రకాశింపగలుగుతుంది. ఇందుకు ఒక దృష్టాంతం చెబుతాను విను. గ్రహమండలంలో రాహుసూర్యులు ఎప్పుడూ ఉంటారు. అయినా సూర్యుడు ప్రకాశించినంత కాలం అతని వెలుగు ముందు మందప్రకాశుడైన రాహువు కనబడడు. ఆ తీరుననే నేనూ నా శక్తీ ఎల్లవేళలా కూడి ఉన్నప్పటికీ, నేను ప్రకాశించినంతకాలం, అంటే నన్ను చూచినంత కాలం నా శక్తి వేరుగా ప్రకాశింపదు. నా శక్తిపై చూపు నిలిపిన వారికి నేను కనుపించను.

పరమేష్ఠీ! ఈ దృశ్యప్రపంచమంతా నేనేనని చెప్పాను. నేను నా శక్తిని అధిష్ఠించి ఈ ప్రపంచ రూపాన్ని తాల్చాను. మొట్టమొదట ఆకాశాది

పంచతన్మాత్రల రూపం గైకొన్నాను. ఆ తన్మాత్రల వివిధరూపసమ్మేళనం వలన చరాచర స్థూల సూక్ష్మ ప్రపంచం ఏర్పడింది.

ప్రపంచంలోని ప్రతి వస్తువులోనూ పంచతన్మాత్రల తత్త్వం ఉన్నది. ఆ తన్మాత్రలు నేనే కనుక ప్రపంచమందున్న అధిష్ఠాతను నేనే.

ఈ సృష్టి సర్వస్వం నాచేత పరివ్యాప్తమై ఉండటం వలన నేను సృష్టికి అంతరాత్మను. అయితే సృష్టికి ఏర్పడే ఛేదన దహనాది వికృతులు సృష్టికి అంతర్వర్తి నైన నాకు కలగవు.

పరమాత్మస్వరూపుడ నైన నేను సర్వకాల సర్వావస్థల లోనూ సర్వవ్యాపకుడనై ఉన్నాను. కారణకార్యాలకు అవినాభావత్వం సహజమయినా పరమాత్మ నైన నేను కారణావస్థలో కార్యాని కంటె విశిష్టుడనై ఉంటాను. అప్పటి నా ఉనికిని జాగ్రత్ స్వప్న సుషుప్తులలో సాక్షిమాత్రం గాను, సమాధి మొదలైన ఉత్తమావస్థలలో కేవలం గాను గ్రహింపగలవు.

ఈ విషయవివేచనలో కార్యకారణరూప విచారం అన్వయముఖీనం. సమాధ్యాద్యవస్థలలో పరమాత్మ దృశ్యవస్తువుల కన్న వేరై ఉంటుదన్న విచారం వ్యతిరేక ముఖీనం.

చతురాననా! ప్రజాసర్గంలో నీకెటువంటి జారుపాటూ కలగనట్లుగా ప్రసాదింపమని కోరావు. నేను వచించిన భావాన్ని చక్కగా మననం చేసి మది నిల్పి పరమ సమాధి స్థితుడనై నేను చెప్పినట్లు నడుచుకొంటే నీ విధి నిర్వహణలో నీ కెటువంటి మోహమూ కలుగదు. ఇదే నా పరమోపదేశం!

## సృష్టి ప్రారంభం

ఆ విధంగా భగవానుడు లోకపితామహుడైన బ్రహ్మను ఆజ్ఞాపించి, అతని కన్నుల యెదుటనే తన దివ్యమంగళ విగ్రహాన్ని ఉపసంహరించి అంతర్హితుడయ్యాడు.

బ్రహ్మ అప్పుడు భగవానునికి నమస్కరించి భగవదాజ్ఞానుసారం సృష్టికి ఉపక్రమించాడు.

సృష్టికార్యంతో బ్రహ్మదేవుని విధినిర్వహణం పూర్తి కాలేదు. తను సృజించిన జగత్తుకు తానే కళ్యాణ పరంపరలు కూర్చవలసి వచ్చింది. ఇది స్వప్రయోజన కార్యంగా పరిణమిస్తుందని ఆయనకు సంశయం కలిగింది.

అప్పుడు బ్రహ్మ యమనియమాదిపూర్వకంగా మళ్ళీ తపస్సుకు పూనుకున్నాడు. ఆ తపస్సు వల్ల ఆయన మదిలోని ఆత్మలాభభావం నశించింది. ఆయన పూనిక పరోకారార్థమై రూపుదిద్దుకొన్నది.

## భాగవత సంప్రదాయం

రాజా! బ్రహ్మకు జనించిన పుత్రులలో నారదుడు తండ్రి కనుసన్నలలో మెలగి, శుశ్రూషించి ఆయనకు ఎంతో సంప్రీతి కలుగజేశాడు.

ఒకనాడు నారదుడు బ్రహ్మను సమీపించి, ప్రాంజలియై, 'తండ్రీ! భగవంతుడు ప్రకృతిని నియమిస్తాడని అన్నావు. ఆ ప్రకృతిని మాయాశక్తి అంటారని చెప్పావు. ఆ శక్తి యొక్క విచిత్రగతులను వివరించు' వినయపూర్వకంగా ప్రార్థించాడు.

అతని ప్రశ్నకు సమాధానంగా బ్రహ్మ అతనికి భగవన్మాయావిలాసాన్ని విశదీకరించాడు.

అదే భాగవతం!

భగవత్సంబంధమైనది కనుక దీనిని భాగవతం అంటున్నారు. ఇందులో సర్గప్రతిసర్గాదిగా పదిలక్షణాలు సమన్వితాలై ఉన్నాయి.

బ్రహ్మ చెప్పిన భాగవతాన్ని నారదుడు వ్యాసునికి బోధించాడు. వ్యాసుడు దానిని తన మాటలలో శిష్యులకు బోధించాడు. క్రమక్రమంగా భాగవతం లోకవ్యాప్తంగా ప్రచారం లోనికి వచ్చింది.

## భాగవత ప్రభావం

రాజా! నీవు వింటున్న ఈ భాగవతం వ్యాసరచితమైన పురాణమే అయినా, వేదముల వలెనే అనాది అని తెలుసుకోవాలి. పురాణాలు భగవదవతార చరిత్రలను బోధిస్తాయి. అవతారాలు సృష్టికి తర్వాత వచ్చినవే గాని సృష్టికి పూర్వం ఉన్నవి కావు. అందువల్ల సృష్టికి పూర్వం నుంచి పరమేశ్వరుని శ్వాసరూపంలో ఉన్న వేదాలతో పురాణాలను కలిపి చెప్పడం సరికాదని కొందరు శంకిస్తారు.

భగవంతుడు వేదముతో పురాణాలను కూడా ఏక సమయంలో బ్రహ్మకు ఉపదేశించాడు. కనుక వేదం వలెనే పురాణాలు అనాది సిద్ధమైనవి. రెండింటి లోని పరమార్థమూ అనాదిసిద్ధమైనది. అనాది తత్త్వాన్ని వివరించేవి కూడా అనాదులే అవుతాయి.

వేదాలలో పదవాక్యానువాక్యాదుల అనుక్రమం పూర్వ పూర్వకల్పాల లోని అనుక్రమణికకు ఏ మాత్రం భేదింపక యథాతథంగా నిలిచి ఉంటున్నది. ఆ కారణం వల్లనే మనం వేదాలను నిత్యమని అంటున్నాము. అయితే పురాణాల లోని కథాక్రమం పూర్వం వంటిదే అయినా వాక్యానుక్రమంలో కొంత మార్పు కనిపించే అవకాశం ఉన్నది. అప్పుడు ఆ పురాణాలు వేర్వేరు కల్పాల లోని విశేషాలను చెబుతున్నాయని గ్రహించాలి.

అంతే కాదు. పురాణాలు భగవల్లీలలను ప్రతిపాదిస్తున్నాయి. ఆ లీలలను ఎవరు విన్నవి వారు చెప్పారు. విన్నవారి వినుకలి ఒకే తీరున ఉంటుందనుకోవడం సాధ్యం కాదు. అందుచేత పురాణాలలో పరస్పర విభేదం పొడచూపినప్పుడు వక్తృభేదం ఉన్నదేమో గమనించాలి. ఎవరు ఎవరికి చెప్పారో తెలుసుకోవాలి. దానిని బట్టి ఆ వ్యత్యాసాన్ని యథాయోగ్యంగా సమన్వయించాలి.

వేదాలు అపౌరుషేయాలని, పురాణాలు పురుష కల్పితాలని గుర్తుంచుకోవాలి. వేదాల వలె పురాణాలు కూడా అనాదులే అయినా, వేదాలు

ఏకముఖంగా వ్యాపించాయని, పురాణాలు బహుముఖాల వ్యాప్తి లోనికి వచ్చాయని గ్రహిస్తే పురాణాలు వేదతుల్యం కావని నిరసించేవారి మాట నీటిమూటగా మిగిలిపోతుంది.

దేనికయినా పరమార్థం ప్రధానం. వేద పురాణాలు రెండింటిలోనూ ఆ పరమార్థం ఒక్కటే.

## పురాణ లక్షణాలు

రాజా! పురాణానికి పది లక్షణాలు ఉంటాయని చెప్పాను. అవి క్రమంగా – సర్గం, ప్రతిసర్గం, స్థానం, పోషణం, ఊతులు, మన్వంతరాలు, ఈశాన కథనం, నిరోధం, ముక్తి, ఆశ్రయం అని పేర్కొనబడ్డాయి.

ఈ దశలక్షణాలలో పదవదైన ఆశ్రయం అన్నింటిలోకీ ప్రధానమైనది. దాని తత్త్వం బోధపడాలంటే తక్కిన తొమ్మిదింటినీ తెలుసుకోవాలి.

ఈ పదింటి వివరం శ్రుతులలో ప్రసిద్ధంగా ఉన్నది. శ్రుతుల భావాన్ని పెద్దలు స్వానుభవసిద్ధం కావించుకొని తమ అనుభవాన్ని లోకానికి తెలియ జెప్పారు. మరికొందరు దానిని గూర్చి తాత్పర్యంలో వ్యాఖ్యానించారు.

## దశలక్షణ వివరణం

సర్గమంటే సృష్టిసామాన్యమని భావం. ఆ సృష్టి గుణాల పరిణామరూపం.

**సర్గము**లో ఆకాశాది పంచభూతాలు, వాటి అసాధారణ ధర్మాలైన శబ్దాదులు, ఏకాదశేంద్రియాలు, మహదహంకారాదుల విస్తృతి ఉంటుంది.

భగవంతుడు చరాచరాత్మక విరాడ్రూపాన్ని గ్రహించటం విసర్గము లేక **ప్రతిసర్గము** అని చెప్పబడింది. ఇందులో ప్రజాపతులు, మహర్షులు బ్రహ్మసృష్టిని పోలిన భూతసృష్టిని కావించడం వర్ణింపబడుతుంది.

భగవంతుడు తానే దిగివచ్చి తన సృష్టిని నియమబద్ధ మొనర్చి అది నిలిచేటట్లు చేయటం **స్థానము** అనబడుతుంది.

భగవంతుడు తన భక్తులను అనుగ్రహించడం **పోషణము** అనబడుతున్నది.

భగవంతుని అనుగ్రహానికి పాత్రులై ఆయా కాలాలలో వర్తించినవారి ధర్మాల సమీకరణమే **మన్వంతరం**.

పుణ్యకర్మలు లేదా పాపకర్మలను చేసినప్పుడు వాటి ఫలాన్ని అనుభవించాలి. ఆ ఫలాల వాసనలను **ఊతులు** అంటారు.

భగవంతుని అవతార చరిత్రలను, భగవద్భక్తుల వివిధ కథలను తెలిపే భాగం **ఈశాన కథనం** అనబడుతోంది.

జీవుడు తన ఉపాధిశక్తులతో వ్యవహారం విడిచి సూక్ష్మావస్థను పొంది ప్రకృతిలో లయమవటం **నిరోధం**.

భగవంతుడు జ్ఞానానంద శుద్ధస్వరూపుడు. జీవుడు భగవదంశమే కనుక జ్ఞానానందశుద్ధ స్వరూపుడే. అయినా జీవునికి కర్మఫలంగా దేవ మనుష్యాది రూపాలను ధరించటం ఉన్నది. ఈ నానారూపత్వాన్ని వదిలి జీవుడు తన తొల్లింటి స్థితికి చేరుకొనడం **ముక్తి**.

ఈ సృష్టి స్థితి నిరోధాలు దేనినుండి కలుగుతున్నాయో అది **ఆశ్రయం**.

ఈ ఆశ్రయాన్నే 'పరమాత్మ' అని, 'పరబ్రహ్మము' అని, 'భగవానుడు' అనీ వ్యవహరిస్తారు.

'పరమాత్మ' అంటే సర్వప్రపంచానికీ ఉపాదానమైన తత్త్వం.

## పరమాత్మ స్వరూపం

రాజా! పరమాత్మ స్వరూపాన్ని స్పష్టంగా గ్రహించాలంటే ముందుగా ఆ పరమాత్మ ఏయే విధంగా విభక్తమై ఉన్నదో తెలుసుకోవాలి.

పరమాత్మ విభాగం (1) ఆధ్యాత్మికం (2) ఆధిదైవికం (3) ఆధిభౌతికం అని మూడు విధాలు.

ఆత్మ ఉపాధిగతం అయినప్పుడు దానిని జీవుడు అంటారు. ఉపాధిగతం కానప్పుడు దానిని పరమాత్మ అంటారు.

నిజానికి ఆత్మపదార్థం ఎప్పుడూ ఒకటే. దానికి అవస్థాభేదం కలిగినప్పుడు బాహ్యదృష్టికి అది జీవాత్మ పరమాత్మలుగా విడివడినట్లు కనిపిస్తుంది.

పరమాత్మ ఉపాధిగతమైన జీవత్వాన్ని పొందిన అవస్థను ఆధ్యాత్మికం అంటారు.

ఆ జీవుడు చక్షురాది ఇంద్రియాలపట్ల అభిమానం కలిగి శరీరాదులను తనవిగా భావించిన అవస్థను ఆధిదైవికం అంటారు.

ఈ మొదటి రెండవస్థలను వదిలి మూడవదైన కేవల భూతావస్థను గ్రహించినప్పుడు దానిని ఆధిభౌతికం అంటారు.

పరమాత్మ ఈ విధంగా మూడు అవస్థలను తాల్చినా, ఆ మూడూ పరస్పర భేదాలుగా తోచినా, ఆ మూడింటిలోనూ అంతర్యామిగా ఉన్నది ఒకటే. అది ఏకమూ, అద్వితీయమూ అని గ్రహించాలి.

మూడు విధాలుగా కనిపిస్తున్న ఆ అవస్థలలో అంతర్యామిగా ఉన్నది ఏకమూ, అద్వితీయమూ అయిన ఆ పరమాత్మే అని నిశ్చయించటం ఎలాగంటే, ఆ మూడూ ఒకదానినొకటి అపేక్షించి ఉంటాయి.

దృశ్యము – అంటే చూడబడే వస్తువు. ఆ దృశ్యమే లేకపోతే, చూడడానికి సాధనమైన కన్ను, చూస్తున్న జీవుడు ఉండీ లేనట్లే లెక్క. అలా కాక ద్రష్ట లేకపోతే చూడడానికి సాధనమైన కన్ను, చూడబడుతున్న ప్రపంచం ఉన్నా లేనట్లే అవుతుంది. అలాగే చూసేవాడు, చూడబడే వస్తువు ఉండి, చూసే సాధనం లేకపోయినా తక్కిన రెండూ ఉన్నా లేనట్లే అనుకోవాలి.

కనుక దృశ్యము – దర్శనము – ద్రష్ట ఈ మూడూ పైకి స్వతంత్రంగా కనిపించినా నిజానికి పరస్పరాశ్రితమైనవి.

ఈ మూడింటి అవస్థలనూ చూస్తున్న తత్త్వం వేరొకటి ఉన్నది. అది స్వానుభవసిద్ధం.

ఆ విధంగా కేవల సాక్షిరూపంలో ఉన్న తత్త్వమే పరమాత్మ అనబడుతున్నది.

ఆ పరమాత్మ అన్నింటికీ ఆశ్రయమై ఉన్నది. దానికి ఆశ్రయమైన వస్తువు వేరొకటి లేదు. అందుకే దానిని స్వాశ్రయం అంటారు.

## సృష్టిప్రకారం

రాజా! ఆ పరమాత్మ నుంచి సృష్టి ఏ విధంగా ఉదయించిందో విను. మొదట పరమాత్మకు ఆనందానుభవ లాలసత్వం కలిగింది. తన్నిమిత్తమై పరమాత్మ విరాట్పురుషరూపాన్ని తాల్చింది. ఆ పురుషుడు తనను ఆవరించుకొని ఉన్న బ్రహ్మాండాన్ని అగలించి వెలికి వచ్చాడు.

బహిర్గతుడైన పురుషుడు తనకు అనువైన నివాసస్థలం కోసం అన్నిచోట్లా కలయజూశాడు. పరమాత్మ స్వయంగా పరమ పరిశుద్ధుడు కనుక అతని నివాసస్థానం కూడా అటువంటిదే కావాలి. ఉదకం ఒక్కటే అట్టి పరిశుద్ధ స్థానమని అతనికి తోచింది.

అప్పుడు పరమాత్మపురుషుడు జలాలను సృజించి ఆ జలార్ణవంలో వేయి సంవత్సరాలు ఉన్నాడు.

జలానికి నారం అని పేరున్నది. నారములలో ఉన్నందువల్ల పరమాత్మకు నారాయణుడని పేరు కలిగింది.

ఆ నారాయణుని సంకల్పానుసారం పృథివ్యాదికమైన ఉపాదానకారణం, కర్మాది నిమిత్తకారణం, కల్పాదిరూప కాలం, సత్త్వాది స్వభావం, జీవుడనే భోక్త జన్మించి, ఆ భగవదనుగ్రహఫలం వల్ల తమ తమ కర్తవ్యకర్మలను నెరవేర్పసాగారు.

భగవంతునికి ఆనందానుభవలాలసత్వం కలిగిప్పుడు అధ్యాత్మం, ఆధిదైవతం, ఆధిభౌతికం అనే మూడు విధాల పరమాత్మ శక్తి ఇంద్రియశక్తి, దేహశక్తి, మనశ్శక్తి అనే మూడు కొత్తతెరగుల రూపుదిద్దుకొన్నది. దీనిని శక్తిచేష్టావిభాగం అని పేర్కొంటారు.

ఇది భగవంతుని సూక్ష్మరూపం. దీని నుంచి సర్వభూతాలకూ ప్రాణమైన ప్రాణశక్తి జనించింది. ఈ శక్తిని సూత్రాత్మ అని వ్యవహరిస్తారు.

ప్రాణం ఒక రాజనుకొంటే ఇంద్రియాలను దానికి భృత్యవర్గమని చెప్పవచ్చు. ఆ ప్రాణం భూతములందు ఎంత కాలం సంచరిస్తుందో అంత కాలం మాత్రమే వాటి ఇంద్రియాలు పనిచేయగలుగుతాయి. ప్రాణసంచారం ఆగిపోగానే భూతేంద్రియాలూ నశించిపోతాయి.

శరీరాంతరంలో ప్రాణం సంచరించే విధానాన్ని క్రియ అంటారు. ఆ క్రియలకు వాటి వాటి వ్యవహార స్థానభేదాన్ని బట్టి రకరకాల పేర్లున్నాయి.

ఒక్కొక్క క్రియకు ఒక్కొక్క విధమైన ఫలం, ఆ ఫలానుభవానికి ఒక్కొక్క రూపమైన సాధనం ఏర్పడ్డాయి.

## క్రియా సాధనాలు

రాజా! విర్వాట్పురుషుని శరీరాంతరంలో ప్రాణసంచారం కలిగినప్పుడు ఆ సంచారఫలంగా ఆకలిదప్పులు ఉదయించాయి. ఆ క్షుత్పిపాసలను అనుభవించే సంకల్పం కూడా ఆ వెంటనే ఉదయించింది. ఆ అనుభవానికి సాధనంగా నోరు అనే అవయవం ఏర్పడింది. దానితోపాటే నాలుక, తాలువులు, నానారుచులు జనించాయి. వాటిని వ్యవహరింపజేసే శక్తిని అధిష్ఠాత అంటారు. ఆ శక్తికి వరుణుడని పేరు పెట్టారు.

అప్పుడు విరాట్పురుషునికి మాట్లాడాలనే కోరిక ఉదయించింది. ఆ తలపు కలిగిన క్షణంలోనే నోటిలో వాగింద్రియం ఏర్పడి మాట్లాడటం మొదలుపెట్టింది. ఆ వాక్కుకు, ఆ వాగింద్రియానికి అధిష్ఠాతను వహ్ని అన్నారు.

అంత దాకా విరాట్పురుషుడు జలాలలోనే ఉన్నాడు. అందువల్ల అతనితో కలిసి వహ్ని కూడా జలాలలో ఉండవలసి వచ్చింది. తత్ఫలితంగా వహ్నికి ప్రచార నిరోధం సంభవించింది. ఆ వహ్ని యొక్క ప్రాణవాయువు మీదికీ క్రిందికీ చరింపసాగింది. మీది ప్రచారాన్ని నిఃశ్వాసమని, క్రింది ప్రచారాన్ని ఉచ్ఛ్వాసమని పేర్కొన్నారు.

అప్పుడు వాయుప్రచారానికి యోగ్యమైన సాధనం కావలసి వచ్చింది. తలంచినంత మాత్రాన ఆ సాధనమూ కలిగింది. దానిని నాసికాపుటం అన్నారు.

ఆ తర్వాత విరాట్పురుషునికి వాసనలను మూర్కొనాలన్న కోరిక పుట్టింది. అందుకు అనుకూలంగా ఘ్రాణక్రియ, గంధమూ కలిగాయి. వాటికి అధిష్ఠాన దేవతను వాయువు అన్నారు.

అప్పటి దాకా విరాట్పురుషునికి చూపు లేదు. చూసే కోరిక కలగగానే అతనికి నయనగోళాలు, నయనేంద్రియాలు, రూపమూ పుట్టాయి. వాటికి అధిష్ఠాన దేవతగా సూర్యుడు ఏర్పడ్డాడు.

ఇంద్రియాధిష్ఠాన దేవతలు విరాట్పురుషునికి ఆత్మప్రబోధం చేయసాగారు. ఆ బోధను వినాలన్న తలంపు కలిగినంతనే అతనికి కర్ణాలు, కర్ణేంద్రియాలు, శబ్దగ్రహణం పొడమాయి. వాటి అధిష్ఠానదేవతగా దిక్కు ఉదయించింది.

వస్తువుల మృదుత్వం, కఠినత్వం, గురుత్వం, లఘుత్వం, శీతలత్వం, ఉష్ణత్వం తెలిసికొనాలన్న కోరిక ఉద్భవింపగానే అందుకు త్వగింద్రియం కలిగింది.

వాయువు త్వగింద్రియం యొక్క బహిరంతరాలు రెండింటా ఆవరించి ఉంటుంది. ఆ త్వగింద్రియం బాహ్యావాయు స్పర్శను గ్రహించినపుడు దానిని లోమం అని, అంతర్వాయు స్పర్శను గ్రహించినపుడు త్వక్కు అని వ్యవహరిస్తారు.

లోమానికి వృక్షాలు, త్వక్కునకు వాయువు అధిష్ఠాన దేవతలు.

అనంతరం ఆ పురుషునికి కార్యోత్సాహం జనించింది. అప్పుడతనికి చేతులు, బలం, ఆదానక్రియ చేకూరాయి.

అతనికి విహారకౌతుకం ఉదయించింది. అందుకు పాదాలు కలిగాయి.

కరచరణాదులకు యజ్ఞపురుషుడు అధిష్ఠాన దేవత అయ్యాడు. ఆ యజ్ఞపురుషుడు హవ్యకవ్యాది సర్వకర్మలనూ చేయిస్తాడు.

ఆ తర్వాత విరాట్పురుషునికి సంతాన సుఖలాలస జనించింది. తదర్థమై శిశ్నం కలిగింది. దానికి ప్రజాపతి అధిష్ఠాన దేవతగా నిలిచాడు. అతని మూలాన పురుషునికి కామసుఖం సిద్ధించింది.

అతనికి ధాతుమలవిసర్జనం అవసరమైంది. అందుకు గుదం మిత్రుడు ఆధిష్ఠానదేవతగా అమరింది. ఆ శిశ్న – గుదముల వలన అతనికి మూత్ర పురీష విసర్జనం కలిగింది.

ఆ పురుషునికి ఒక దేహం నుంచి వేరొక దేహానికి పయనించాలని ఉల్లాసం జనించింది. అందుకు నాభిద్వారం కలిగింది. అందులో అపానం, దాని అధిష్ఠాన దేవతగా మృత్యువు ఏర్పడ్డాయి. వాటిని ఆశ్రయించి ప్రాణాపాన బంధ వియోగ రూపమైన మరణం కలిగింది.

అప్పుడతను అన్నపానాదులను గ్రహింపదలిచాడు. అందుకు కుక్షి, ప్రేగులు, వివిధ నాడులు కలిగాయి. వాటికి నదీసముద్రాలు అధిష్ఠాన దేవతలయ్యారు. వాటిని ఆశ్రయించి తుష్టి పుష్టులు కలిగాయి.

ఆ తర్వాత అతను మాయను గూర్చి చింతింపదలచాడు. అందుకోసం మనస్సు జనించింది. దానికి చంద్రుడు అధిష్ఠానదేవత అయ్యాడు. అతని వలన కామసంకల్పం ఉదయించింది.

రాజా! స్థూలమైన త్వక్కు, సూక్ష్మమైన చర్మం, మాంసం, రక్తం, మేదస్సు, మజ్జ, అస్థి – అనే వీటిని సప్త ధాతువులని, సప్త ప్రాణాలని అంటారు. ఇవి

ఆకాశ వాయు జలాదుల వలన కలుగుతున్నాయి. అందువల్ల వీటిని పృథివ్యప్తేజోమయాలుగా నిరూపించారు.

శ్రవణాదులైన ఇంద్రియాలు శబ్దాది విషయాల వంక ఆకర్షింప బడతాయి. ఆ ఇంద్రియాలకు అహంకారం తోడై శబ్దాది విషయాలను ప్రకాశత్వ భావాలుగా చేస్తుంది.

రాజా! సర్వ వికారాలకూ మనస్సే మూల కారణం. మనస్సు నందు వికారము జనించిన వెంటనే దానిని బుద్ధి గ్రహించి తద్వికార రూపాన్ని ధరిస్తున్నది.

భగవంతుని స్థూలరూపం ఆ విధంగా పంచభూత మహదహంకార ప్రకృతులను బట్టి ఎనిమిది రూపాలవుతున్నది. ఆ ఎనిమిదింటిని అష్టావరణలంటారు.

స్థూలరూపానికి కారణమై సూక్ష్మరూపం ఉన్నది. అది అవ్యక్తమూ, నిర్విశేషం కనుక ఇంద్రియాలకు గోచరింపదు. దానికి జననస్థితిలయాలు కలుగవు. ఎటువంటి వికారాలనూ పొందదు. ఏకరూపంలో ఉంటుంది. అందువల్ల మనోవాక్కులకు అతీతంగా ఉంటుంది. దానిని గూర్చి వివరాలను అడిగితే ఎంత వేదాంతవేత్తలైనా 'కశ్చిదస్తి' (అదొకటి ఉన్నది) అని మాత్రమే చెప్పగలరు.

రాజా! నేను చెప్పిన ఈ స్థూల సూక్ష్మరూపాలు రెండూ మాయ కల్పించిన రూపాలు. వాస్తవాలు కావు. కేవలం తాత్కాలికాలు. సత్పదార్థం ఒక్కటే సత్యం. ఆ సత్యం త్రికాలాలలో ఎటువంటి మార్పునూ పొందదు. దానికి కాలవిపరిణామాలు వర్తించవు.

స్థూల సూక్ష్మరూపాలు రెండూ ఆ సత్పదార్థానికి వికారరూపాలు. వికారాలు ఎన్నటికీ సత్యాలు కానేరవు.

సత్యాలు కావనగానే అవి కుందేటి కొమ్ము వంటివని భావింపకూడదు.

సత్యానికి తాత్కాలికం, పారమార్థికం అని రెండు అవస్థలు ఉన్నాయి. స్థూల సూక్ష్మరూపాలు అందులో తాత్కాలికావస్థలు మాత్రమే.

ఆ సత్పదార్థాన్నే భగవంతుడని అంటారు. భగవంతుడు సకలైశ్వర్య సంపన్నుడు కనుక ఆతనికి కోరదగినది, పొందదగినది అంటూ గోరంతయినా ఉండదు. ఆ భగవానుడు స్వాత్మానందానుభవాన్ని సంకల్పించి ప్రపంచరూపంలో విస్తృతిని పొందుతున్నాడు. తానే బ్రహ్మరూపాన్ని ధరించి కర్మపరుని వలె ప్రపంచాన్ని నానాగతుల విభాగిస్తున్నాడు. ఆ కర్మఫలంగా రూప నామ క్రియలు ఏర్పడుతున్నాయి.

విశ్వసృష్టితో భగవంతుడు సంకల్పించిన కార్యం పరిసమాప్తం కాలేదు. ఆ సృష్టిని సక్రమంగా నిర్వహింపవలసి ఉన్నది. ఆ నిర్వాహాన్నే 'స్థితి' అంటారు. అందుకోసం భగవంతుడు ప్రజాపతి సిద్ధ చారణ గంధర్వ విద్యాధర అసుర గుహ్యక కిన్నర అప్సరో నాగ పన్నగ కింపురుష మాతృ రక్షః పిశాచ భూత ప్రేత వినాయక కూష్మాండ ఉన్మాద బేతాళ యాతుధాన గ్రహ ఖగ మృగ పశు వృక్ష పర్వత సరీసృప గణాల రూపాలను ధరించాడు.

ఈ గణాలను చరవర్గం, అచరవర్గం అని రెండుగా వర్గీకరిస్తారు. ఈ రెండింటిలోనూ ఉత్తమ మధ్యమ అధమ స్థితులు ఉన్నాయి.

ఈ విధంగా భగవానుడు నానారూపాలలో స్థలాంతరిక్షాలలో వ్యాపించి నివసిస్తాడు.

## కర్మ వైచిత్రి

రాజా! సృష్టి సమస్తం కర్మఫలమని తెలిపాను. ఆ కర్మము జడపదార్థం. దాని గతికి గుణజాలం కారణమవుతున్నది. ఆ గుణాలు సత్త్వ రజ స్తమస్సులని మూడు. అందులో ఒక్కొక్కటి ఒక్కొక్క విధమైన కర్మను ప్రేరేపిస్తాయి. గుణాలు ఒండొంటితో కలిసినప్పుడు మిశ్రరూప కర్మానికి ప్రేరణ కలుగుతున్నది.

స్వభావతః సత్త్వం దేవభోగ్యమైన స్వర్గాదులకు కారణం.

రజస్సు మనుష్యభోగ్యాలైన పశుపుత్ర ధాన్యాదులకు కారణం.

తమస్సు దుఃఖానుభవయోగ్యమైన నరకానికి కారణం.

ఈ సత్త్వాదిగుణాలు పరస్పర మిశ్రితాలైన పక్షంలో వాటి గతులు కూడా మిశ్రమాలై మిశ్రమఫలాలను కలిగిస్తాయి.

ఈ మిశ్రమానికి ఒక అంతం అంటూ ఉండదు. ఫలాన్ని బట్టి మిశ్రవిభాగం ఎటువంటిదో గ్రహింపవచ్చు.

రాజా! భగవంతుడు ఆ విధంగా బ్రహ్మరూపాన్ని ధరించి ప్రపంచాన్ని సృజించి దానిని ధర్మపూర్వకంగా పరిపాలించేందుకు వివిధావతారాలను దాల్చి సృష్టి కార్యాన్ని కొనసాగిస్తాడు. ఆ భగవంతుడే తాను సృజించిన వానిని హరింపదలిచినప్పుడు కాలాగ్నిరుద్రరూపాలలో మేఘపటలాన్ని ప్రళయఝంఝానిలం రూపుమాపినట్లు తత్తదుచిత కాలాలలో సమస్తాన్నీ హరించివేస్తాడు.

సృష్టి స్థితిలయాలు మూడింటికీ కర్త భగవంతుడే. ఆ కర్తృత్వం ఆయన మహిమాతిశయమే తప్ప కర్మఫలరూపం కాదు.

ఇదంతా అపారమార్థికమే. పారమార్థిక దృష్టికి భగవంతుని యందు కర్తృత భోక్తృత్వ లక్షణాలు సమన్వయించవు.

ఈ రహస్యాన్ని తెలుసుకొంటే తత్త్వార్థాన్ని గ్రహించినట్లే.

రాజా! ఈ సృష్టిని మహాకల్పం, అవాంతరకల్పం అని రెండుగా గ్రహింపవచ్చు. మహాకల్పంలో ప్రకృతి, మహత్తు మొదలైనవి కలుగుతున్నాయి. అవాంతరకల్పంలో స్థావరాదులు కలుగుతున్నాయి. ఈ విధానం ప్రతి మహాకల్పంలోనూ ఇదే విధంగా జరుగుతుంది.

కాలానికి కూడా స్థూల సూక్ష్మ లక్షణాలు ఉన్నాయి. ఆ కాలపరిమాణం కల్పం, అవాంతరకల్పం, మన్వంతరం ఇత్యాదిగా విభజింపబడుతున్నది.

ఇప్పటి కల్పం పద్మభవునితో ప్రారంభమైనది కనుక దీనికి పాద్మం అని పేరు.

అని సూతుడు శుకపరీక్షిత్సంవాదాన్ని చెప్పగా శౌనకాదులు విని–

'సూతాగ్రణీ! కల్పాదుల సంగతి తర్వాత చెప్పుకోవచ్చు. విదురుడు తన బాంధవులను వదలి తీర్థయాత్ర కావించాడన్నావు. ఆ భాగవతోత్తముడు విడువరాని వారిని ఎలా విడిచిపెట్టగలిగాడు? అతని తీర్థయాత్ర ఎలా గడిచింది? అతనికీ మైత్రేయునికీ ఎలా జత కలిసింది? వారిద్దరూ మాట్లాడుకొన్న అధ్యాత్మ విద్యావిశేషాలతో విదురుడు ఏమని అడిగాడో, మైత్రేయుడు ఏమిటి చెప్పాడో, తుదకు విదురుడు తన ఆత్మీయులను ఎప్పుడు ఎలా కలుసుకున్నాడో, వినాలని కుతూహలమవుతున్నది' అని అడిగారు.

సూతుడు వారి మాటలకు కలకల నవ్వి, 'అయ్యలారా! అచ్చం మీరడిగినట్లే పరీక్షిన్నరేంద్రుడు శుకయోగిని ప్రశ్నించాడు. అతనికి శుకయోగి చెప్పినది వినిపిస్తాను, సావధానంగా వినండి' అన్నాడు.

# తృతీయ స్కంధం

## హస్తిన నుంచి ప్రయాణం

'రాజా! పుత్రవాత్సల్యం ధృతరాష్ట్రుని కళ్ళను పూర్తిగా కప్పివేసింది. అందువల్ల అతనికి బాహ్యదృష్టి ఎట్లాగూ లేకపోగా ఆంతరదృష్టి కూడా నశించింది. హితాహిత వివేకం కన్నుమూసింది. కొడుకులు చేస్తున్న అకార్యాలు మనస్సుకు ఎక్కలేదు. పైగా వారంటే ప్రేమ నానాటికీ మితిమీరసాగింది. దానితో పాండవుల మీది ఆదరం సన్నగిల్లసాగింది.

ధృతరాష్ట్రుని కొడుకులు పాండవుల యెడ మత్సరగ్రస్తులై ఎలాగైనా వారిని వంచించాలని సంకల్పించి, లక్క యిల్లు కట్టించి అందులో పాండవులను పాపం కుంతీసమేతంగా ప్రవేశపెట్టి అందరూ ఆదమరిచి నిద్రిస్తున్న వేళ ఆ ఇంటికి నిప్పుపెట్టించారు. ధృతరాష్ట్రుడు ఆ సంగతి వినీవిననట్లు ఊరుకున్నాడు. దుశ్శాసనుడు దుర్యోధనాదులు పంపగా పాండవ ధర్మపత్ని పాంచాలిని చెరగుమాసి ఉన్నదానిని కొప్పు పట్టి ఈడ్చి నిండుసభ లోనికి తెచ్చి ఆ మానవతి వలువలు ఊడదీయబోయాడు. ఆమె శరణు కోరే దిక్కు లేక నిస్సహాయురాలై కన్నీరు మున్నీరుగా గోడుగోడుమని ఏడుస్తుంటే సతీమణి విలాపాలు కర్ణపుటాలను అగలించివేస్తున్నా

ధృతరాష్ట్రుడు చెవులారా వింటూ ఊరుకున్నాడే కాని దుశ్శాసనాదులను ఇంచుకైనా మందలింప లేకపోయాడు. దుర్యోధనాదులు కపటద్యూతం పన్ని ధర్మరాజును అధర్మంగా ఓడించి తమ్ములతో భార్యతో కట్టుబట్టలతో బైటికి గెంటివేశారు. అందుకు కూడా ధృతరాష్ట్రుడు కిమ్మనలేదు. ధర్మనందనుడు సత్యవ్రతుడు కనుక పందెం మేరకు పడరాని పాట్లు పడి వనవాసాది నియామాలను తీర్చి వచ్చి రాజ్యం తన భాగం తన కిమ్మని అడిగాడు. దుర్యోధనుడు నలుగురి ఎదుటా చేసిన బాస తప్పి, సూది మొన మోపినంత నేలయినా ఇవ్వనన్నాడు. అందుకు కూడా ధృతరాష్ట్రుడు నోరు విప్పలేదు. కుంతీతనయుడు మార్గాంతరం లేక శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి సంధి కూర్చమని ఆశ్రయించాడు. ఆ భగవానుడు అతని విన్నపాన్ని అంగీకరించి హస్తినాపురానికి వచ్చి నిండుసభ చేర్చి భీష్మాది ధర్మజ్ఞుల మ్రోల ఉభయపక్షాలకూ మేలు కలిగే తీరున నయోక్తులతో భయోక్తులతో అమృతోక్తులతో ధర్మాన్ని బోధించాడు. ఆ వచనాలు దుర్యోధనుని పాడు చెవులకు రుచింపలేదు. తన నట్టింట్లో అధర్మం జరుగుతుంటే కనీసం రాజధర్మంగా నైనా ధృతరాష్ట్రుడు అడ్డుపడకపోగా తన చేతిలో ఏమీ లేదన్నట్లు నటించి తప్పించుకొన్నాడు.

విదురుడు ఈ అక్రమాలన్నీ కళ్ళారా చూస్తూ చెవులారా వింటూ లోలోపలే కుమిలిపోతున్నాడు. ధార్తరాష్ట్రులకు పాండవుల వలని భయం నానాటికి పెరిగి మూర్తీభవించి వారిని వెన్నాడసాగింది. ధృతరాష్ట్రుడు తన కొడుకులకు కీడు మూడుతుందని భయపడి ఒకనాడు విదురుని రప్పించి, అతనితో మంత్రాలోచన చేసి చూశాడు. విదురుడు అతని మనోభావాన్ని గ్రహించి ధర్మాధర్మాలను చక్కగా విమర్శించి అత్యంత ప్రమాణవచనాలతో మనస్సు విప్పి మాట్లాడాడు. ఆ వచనాలను నేటికీ 'విదుర నీతి' అన్న పేరుతో లోకం నెమరువేస్తూనే ఉన్నది.

రాజా! విదుర నీతి సారాంశం చెప్పమంటావా? విను. అతను ధృతరాష్ట్రుని మాటలన్నీ విన్నాక ఏమన్నాడంటే –

'ఓయి రాజేంద్రా! ధర్మనందనుడు అజాత శత్రువు. ఇన్నాళ్ళూ అతను తనకు కలిగిన దుర్భరమైన అపరాధాలను మారుమాటాడకుండా సహించాడు. చేసిన ప్రతిజ్ఞను ఎంతవారయినా మీరడం మంచిది కాదు. ఆ ప్రతిజ్ఞ ప్రకారం అతని భాగాన్ని అతనికివ్వడం ధర్మమన్న మాట అటుంచి, ఉభయులకూ మేలు చేకూరుతుంది. కాదంటావా, నీ కొడుకుల అకార్యాలకు భీముడనే మహాసర్పం పాదతాడితమై పడగ విప్పి ఫూత్కరిస్తున్నది. ఆ బుసలకు మీరు వెలవెలబోతున్నారు. చేటు మూడిన నాడు నా మాటలు జ్ఞాపకానికి వచ్చి అయ్యో! అంతా చేజారిపోయిందే అని గుండెలు బాదుకుంటావు. పైగా ధర్మం పాండవపక్షాన ఉన్నదని తెలిసి దేవతలు, బ్రాహ్మణోత్తములు, అందరూ వారి మేలునే కోరుతున్నారు. అన్నిటికన్నా ముఖ్యవిషయం – శ్రీకృష్ణుడు నరరూపాన్ని తాల్చిన భగవానుడు కాని మానవ మాత్రుడు కాడు. రాజాధిరాజులకు కూడా పరమపూజ్యుడైన మహానుభావుడు. పాండవులకు అతని ప్రాపు లభించింది. అంతకన్నా ఏం కావాలి? అంతటివానితో నీ కొడుకు కయ్యానికి కాలుదువ్వాడు. ఇదంతా చూస్తుంటే నువ్వు చేసిన పాపం దుర్యోధనాకారంలో నీకు పుట్టి నీ ఇల్లు గుల్లచేయటానికి వచ్చినట్లున్నది. ఈ రహస్యం తెలిసికొనలేక నువ్వు నీ ప్రేమనంతటినీ ఆ మూర్ఖుడి పైన కుమ్మరిస్తున్నావు. ఇక సిరి నీ ఇంటిని విడిచిపెట్టక మానదు. నీ కులం కూలిపోక తప్పదు. రాజా! కనీసం ఇప్పుడైనా నీ రాజధర్మాన్ని పరిశీలించి చూడు. ఒక్కడి కోసం కులమంతటినీ బలిచేస్తావో, కులశ్రేయానికై ఒక్కడిని వదులుకొంటావో నిశ్చయించు. ధర్మజ్ఞులు, రాజనీతివేత్తలు తప్పక ఆ రెండవ మార్గాన్నే అనుసరిస్తారు' అని బోధించాడు.

రాజా! విదురుని హితోక్తులు అక్కడే ఉండి అంతా వింటున్న దుర్యోధనుని గుండెల్లో క్రూరనారాచాల వలె గుచ్చుకొన్నాయి. అతను రోషకషాయనేత్రుడై మండిపడి విదురుని పట్టి నిలదీసి, 'ఓరీ! ఎన్ని గుండెలురా నీకు? నిన్నిక్కడికి రమ్మని ఎవరు పిలిచారు? పిలువని పేరంటానికి తగుదునమ్మా అని ఎలా వచ్చావు? నువ్వు విషనాగువని తెలియక ఈ మూడు కాళ్ళ ముసలి నిన్ను

పాలు పోసి పెంచాడు. పాము నైజం మానుతుందా? పెట్టి పోషించిన వాళ్ళకే ప్రతికూలుడి వయ్యావు. అంతటితో ఊరుకోక నీ రక్షకుల వైరులకు హితం కోరుతున్నావు. ఇంతకన్నా అధర్మం ఉన్నదా? దురాత్మా! నీ దాసీపుత్రత్వాన్ని వెల్లడించావు. ఇక నీ వాగుడు కట్టిపెట్టు' అని గద్దించి కర్ణ శకుని దుశ్శాసనుల వంక తిరిగి, 'ఈ దుష్టుణ్ణి వెంటనే ప్రాణాలతో నగరం నుంచి గెంటించండి' అని ఆజ్ఞాపించాడు. ధృతరాష్ట్రుడు చెవులు చిల్లులుపడే అతని కఠినోక్తులను విని కూడా నోరు విప్పి తప్పని చెప్పలేకపోయాడు.

విదురుడిక ఆ చోట నిలువలేక, 'మంచి మనస్సుతో చెప్పిన నా హితవచనాలు వీరికి చేదుగా తోచాయి. ఇదంతా భగవన్మాయావిశేషమే గాని వేరేమీ కాదు. ఈశ్వరేచ్ఛ జరగక తప్పదు. ఇక ఇక్కడ ఉండకూడదు' అని లోలోన తలచి కాగల కార్యం నిశ్చయించి, చేతనున్న వింటిని మందిరద్వారంలో వదిలివేసి తీర్థసేవాపరుడై హస్తినాపురం నుంచి బయలుదేరాడు.

## విదురుని తీర్థయాత్ర

ఆ విధంగా తరలి విదురుడు దేహసంస్కారం మాని వల్కాజినాలు కట్టుకొని అవధూతగా మారి దేహయాత్రార్థం భిక్షాటనవృత్తిని గ్రహించి ఎక్కడెక్కడ భగవానుడు మూర్తిదాల్చి వెలసి ఉన్నాడో ఆయా పుణ్యక్షేత్రాలను, ఏయే ప్రదేశాలు భగవత్పాద స్పర్శ వలన పవిత్రీకరింపబడ్డాయో ఆయా వనాలను, ఉపవనాలను, పొదరిళ్ళను, పల్లెపట్టులను, పర్వతాలను సందర్శించుతూ, నదీనదాలను సేవిస్తూ, ఈశ్వరునికి ప్రీతికరాలైన వ్రతాలను అనుష్ఠిస్తూ భారతభూమి నంతటినీ కలయజుట్టి ప్రభాసక్షేత్రానికి వచ్చాడు.

అవధూత వేషంలో ఉన్నందువల్ల విదురుని ఎంతో చిరపరిచితులు కూడా గుర్తు పట్టలేకపోయారు. కౌరవ పాండవులు పరస్పర క్రోధాగ్నికి చిక్కి సలిపిన పోరాటంలో కౌరవులు కడతేరటం, ధర్మరాజు శ్రీకృష్ణుని సాయంతో పట్టాభిషిక్తుడై రాజ్యచక్రాన్ని ఎదురులేని ఆజ్ఞతో ఏకాతపత్రంగా

పరిపాలించటం అతనికి తెలియవచ్చింది. ఆ మాట విన్నంతనే కడుపులో నుంచి దుఃఖం పొంగి పొర్లింది. అతను కొంత సేపు మౌనం వహించి విధివిలాసాలకు ఆశ్చర్యపడి అక్కడి నుంచి తరలి పశ్చిమవాహిని అయిన సరస్వతీనదిని చేరబోయి, అందున్న త్రిత తీర్థం, ఉశనస్తీర్థం, మను తీర్థం, పృథు తీర్థం, అగ్ని తీర్థం, అసిత తీర్థం, వాయు తీర్థం, సుదాన తీర్థం, గో తీర్థం, గుహ తీర్థం, యమ తీర్థం అనే తీర్థాలన్నింటినీ సేవించి, ఛత్రలాంఛనాలు కలిగి దర్శనమాత్రాన శ్రీకృష్ణపరమాత్మను స్మరింపజేస్తున్న అక్కడి మందిరాలను, విష్ణ్వాలయాలను చూసుకొంటూ ముందుకు సాగి, సర్వసంపదలతో సొంపారుతున్న సురాష్ట్ర మత్స్య సౌవీర కురు జాంగల దేశాలను క్రమంగా దాటి యమునాతీరం చేరుకొన్నాడు.

## విదురోద్ధవుల సమాగమం

యమునాతీరంలో విదురునికి ఉద్ధవునితో సమాగమం సిద్ధించింది. చిరకాలం తర్వాత అనుకోకుండా ఆకస్మికంగా కనుపించిన కూర్మి నెచ్చెలిని చూసి అతనికి ప్రాణాలు లేచివచ్చినట్లయింది. సాక్షాత్తూ దేవగురువైన బృహస్పతిని శుశ్రూషించి నీతిశాస్త్రాన్ని అధ్యయనించిన వివేకశాలిని, భగవద్భక్తి రసాస్వాదనం వలన ఇంద్రియ కల్లోలాలను అణిచిపెట్టి ప్రశాంతచిత్తుడై పరమ భాగవత కీర్తిని గడించిన పుణ్యచరిత్రుని దగ్గరకు తీసుకొని ప్రేమగా బిగి కౌగిట కూర్చి ఎంతో సంతోషించాడు.

## కుశలానుయోగాలు

విదురుడు కొంతసేపటికి సంతోషపరవశత్వం తీరి, 'ఉద్ధవా! భూమి భారావతరణ కోసం నిజనాభిసముద్భవుడైన చతురాస్యుడు ప్రార్థింపగా, ఏ పురాణ పురుషులు రామకృష్ణులై అవతరించారో, ఎవరి వలన శూరుని వంశమే గాక యాదవ కులమంతా ప్రశస్తిని గాంచిందో, ఎవరి అవతారం దేవకార్యార్థమన్న విషయం నీకు తెలియనిది కాదో, ఎవరు తాము నేలకు

దిగివచ్చిన కార్యాన్ని నెరవేర్చి మళ్ళీ తమ లోకానికి మరలనున్నారో, ఆ మహానుభావులు శ్రీకృష్ణబలదేవులు శూరగృహంలో కుశలమే కదా?

మిత్రమా! వసుదేవుని తలచినపుడెల్లా నా మనస్సు ఆనందంతో ఉప్పొంగుతుంటుంది. అతను ఎల్లవారినీ కన్నతండ్రి వలె కాపాడి అమృతాసేచనం కావించి కూర్ములను కురిపించే ప్రేమజీమూతమై నా మనోవిహాయసంలో నిత్యం విహరిస్తుంటాడు. అంతటి ఉదారమతులు వేరొకరు ఉండటం సాధ్యం కాదు. కౌరవుల పట్ల అతనెంతో సౌహార్దం నెరపుతుంటాడు. ఆ పూజనీయుడు సుఖమే కదా? పూర్వజన్మలో సాక్షాన్మన్మథుడై ఏ సుందరవిగ్రహుడు రుక్మిణీదేవి తపస్సులు పండి భగవదనుగ్రహాన పుత్రుడై జన్మించాడో, ఆ యాదవసేనానాయకుడు ప్రద్యుమ్నుడు సుఖమేనా? శ్రీకృష్ణభగవానుని వలన యదు వృష్ణి భోజ దశార్హపతిగా పట్టాభిషిక్తుడైనాడే, ఆ పుణ్యాత్ముడు ఉగ్రసేన మహారాజు క్షేమమే కదా? పూర్వం పార్వతీ దేవికి కుమారస్వామియై పుట్టి ఇప్పుడు మహాపతివ్రత అయిన జాంబవతికి పుత్రుడై శ్రీహరితో సమానుడని ఖ్యాతికెక్కిన రథికాగ్రణి సాంబుడు కుశలమేనా? అర్జునుని శుశ్రూషించి ధనుర్విద్యారహస్యాలను గ్రహించి శ్రీహరి సేవాఫలంగా అనన్య యాదవ దుర్లభపదవిని పొందిన మన సాత్యకి సుఖమే కదా?

ఉద్ధవా! అక్రూరుడు మహాభక్తి సంపన్నుడు. అటువంటి వాడికి శ్రీకృష్ణుడు పరమప్రియుడైనాడంటే అందులో వింత ఏమున్నది? శ్రీకృష్ణుని పాదస్పర్శ సోకిన భూపరాగం కూడా అతను పరమ భక్తిభావంతో కన్నుల కద్దుకొని పరవశిస్తాడు. ఆ పుణ్యాత్ముని ప్రపత్తి నావంటి వారికి మార్గదీపికగా ఉంటున్నది. అతను కలలో నైనా ఎవరికీ అపకారం తలపెట్టని సౌమ్యుడు. అక్రూరుడు నిజంగా అక్రూరుడే. అతను కుశలమే కదా! సర్వయజ్ఞార్థాలనూ తనలో ఇముడ్చుకొన్న త్రయీవిద్య వలె సర్వజగదాధారుడైన దామోదరుని తన కడుపు పంటగా కన్నతల్లి, అన్ని విధాలా దైవతమాత అదితికి సాటిచేయదగిన భాగ్యవతీమతల్లి దేవకీదేవి సుఖమే కదా!

ఉద్ధవా! అంతఃకరణాన్ని తత్కార్యవిలక్షణత్వాన్ని బట్టి చిత్తము, అహంకారము, బుద్ధి, మనస్సు అని నాల్గుగా విభజించి చెబుతారు. ఆ నాల్గింటిలో చిత్తానికి వాసుదేవుడు, అహంకారానికి సంకర్షణుడు, బుద్ధికి ప్రద్యుమ్నుడు, మనస్సుకు అనిరుద్ధుడు క్రమంగా అధిదేవతలు. ఇందులో మనస్సు సర్వశాస్త్రాలకూ మూలమని దేవతలు నిశ్చయించారు. అట్టి మనస్సుకు అధిదేవత అయిన అనిరుద్ధుని అపరావతారం, యాదవులకు ఇష్టకార్యతత్పరుడు మన అనిరుద్ధుడు సుఖమే కదా? శ్రీకృష్ణుడే దైవమని మనసారా నమ్ముకొని, తత్పరిచర్యలే నిత్యకృత్యాలుగా జీవించే భక్తాగ్రగణ్యుడు సత్యభామాసుతుడు చారుధేష్ణుడు, హృదీక గదాదులందరూ సుఖమే కదా!

మిత్రమా! అర్జున శ్రీకృష్ణులను బాహుదండయుగ్మంగా చేసికొని కౌరవ సామ్రాజ్యలక్ష్మిని దుర్మదాంధుడైన దుర్యోధనుని ఒడినుండి ఒడిసి లాగి చేపట్టి ఆ ధూర్తుడు నిండు సభలో కావించిన పరాభవానికి, అకృత్యాలకు తగిన ప్రాయశ్చిత్తం చేసిన ధర్మనందనుడు విజయానువృత్తి లబ్ధ రాజ్యశ్రీని ధర్మపురస్సరంగా పరిపాలిస్తున్నాడు కదా! లోకభీకరమైన గదాదండాన్ని ధరించి రణరంగంలో కదను తొక్కి బహుచిత్రగతులతో ప్రచారించేటప్పుడు ఏ మహాయోధుని పాదఘాతానికి పుడమి కూడా పరితపిస్తుందో, ఆ భీమసేన మహాపన్నగం కౌరవులు కావించిన అపరాధ పరంపరల వల్ల పొడమిన చింతా విషాగ్నులను వెలిగ్రక్కడం లేదు కదా! ఎవడు మాయాకిరాతుడై వచ్చిన ముక్కంటిని ఎదుర్కొని బాణవర్షంతో మెప్పించి అతని వలన పాశుపతాన్ని పారితోషికంగా గైకొని మహారథులకు కూడా ప్రశంసనీయుడై వెలుగొండో ఆ పార్థుడు శత్రువులను జయించిన ఆనందార్ణవంలో ఓలలాడుతూ సుఖంగా ఉన్నాడు కదా! ఎవరిని కుంతీదేవి సవతి సుతులని ఒప్పరికింపక కన్నబిడ్డల కన్నా ఎక్కువగా ప్రేమించి స్తన్యమిచ్చి పెంచి పెద్దచేసిందో, ఎవరు ధర్మనందనాదులైన అన్నలకు కనురెప్పల వలె నిలిచి వారి ప్రీతిని చూరగొన్నారో ఆ నకుల సహదేవులు, గరుత్మంతుడు ఇంద్రుని నుంచి అమృతాన్ని పొందినట్లు వైరిబాహాంతరం నుంచి సాధించిన రాజ్యలక్షిని అనుభవిస్తూ సుఖంగా ఉన్నారు కదా!

ఉద్ధవా! పాండురాజు శరాసనద్వితీయుడై చతురంతమేదినీవలయాన్ని గెలిచి లోకైకవీరుడన్న ఖ్యాతిని గడించాడు. అంతటివానికి ఇల్లాలై కుంతీదేవి సమస్త రాజభోగాలనూ చవిచూసి చివరికి మిన్నులుపడ్డచోట తలదాచుకోవలసి వచ్చింది. స్త్రీలు పతిపరాయణజీవితలు కనుక ఆమె ఎలాగో ఆ క్లేశాలన్నింటినీ సహించింది. అంతలో పిడుగుపడినట్లు ఆమెకు భర్తృవియోగం సంభవించింది. తండ్రిలేని పిల్లలు లాలనా పాలనా లేక అనాథలు కాకుండా బొందెలో ప్రాణాలు నిలుపుకొని జీవచ్ఛవంలా జీవిస్తూ ఏటికెదురీదుతున్నది. నిర్మలమూ అసంకీర్ణమూ అయిన పరోపకారతత్త్వం కుంతి జీవితం వలన లోకానికి వెల్లడయిందని తెలిసినా ఆమె పడ్డ కష్టాలను తలుచుకొంటే నాకిప్పటికీ దుఃఖంగానే ఉంటుంది.

## భవితవ్య భయం

సౌమ్యా! ఇదంతా సరే అటుండనివ్వు. ధృతరాష్ట్రుని భావిగతిని గురించి నాకెంతో భయంగా ఉన్నది. అతను తనకంటె అన్ని విధాలా మిన్న అయిన తన తమ్ముడు పాండురాజు పరలోకగతుడై నప్పుడు అతని కొడుకులను ఆదుకోవలసినది పోయి నానావిధాల బాధించి చెప్పరాని ద్రోహం చేశాడు. అతని మేలునూ అతని కొడుకుల మేలునూ నా మేలుగా భావించి వారిని అనువర్తించి కన్నాకుగా మెలగుతున్న నన్ను నిష్కారణంగా ఊరి బైటికి వెళ్ళగొట్టించాడు. ఇదంతా ఆ ధూర్తుడు దుర్యోధనుని ప్రీతి కోసం కావించిన పాపకృత్య పరంపర. దీని ఫలితంగా ధృతరాష్ట్రునికి ఏ ఘోరనరకం సంప్రాప్తింపనున్నదో అని నేను విచారిస్తుంటాను.

## భగవల్లీలానుమోదం

మిత్రమా! నా సంగతి చెప్పమంటావా? నేను లీలామానుషవేషధారి అయిన ఆ శ్రీపతి పాదపద్మాలపై నా మనస్సు నిలిపి ఆయననే నమ్ముకొన్నాను. ఆ దయామయుని ప్రసాదఫలంగా ఆయన మహిమాతియాలను కొంతకు కొంత గ్రహింప నోచాను. అందువల్ల

ఇటువంటి భగవల్లీలలు నాకు విస్మయాన్ని కలిగించవు. త్రికరణశుద్ధిగా నన్ను నే నతనికి సమర్పించుకొని గూఢవర్తనుడనై సుఖంగా చరిస్తుంటాను.

## మదోన్మత్తుల గతి

ఉద్ధవా! విద్యా ధన కుల మదాదులు కన్ను గప్పి మనుష్యులను గుడ్డివాళ్ళను చేస్తాయి. కౌరవులు ఈ త్రివిధగర్వాంధులై ఒళ్ళు మరిచి ప్రవర్తించారు. ఇవన్నీ శ్రీకృష్ణ భగవానునికి తెలియనివి కావు. ధర్మసంస్థాపనార్థమై అవతరించిన ఆ మహానుభావుడు కౌరవులను వారి దుండగాలకు గాను ఏనాడో మట్టుపెట్టి ఉండవలసినది. సర్వసృష్టి స్థితిలయాలను సంకల్పమాత్రాన ఒడగూర్పగల శక్తిమంతునికి ఇదెంత పని? అయినా ఆ మహాత్ముడు ప్రపన్నార్తిహరుడు కనుక ఒకనాటికైనా తెలివి తెచ్చుకొని తాను చేసిన అపరాధాలకు పశ్చాత్తాపం పొంది సద్బుద్ధితో మెలగకపోతారా అని ఇంత కాలమూ వేచి చూశాడు. చిన్నప్పటి నుంచీ వారి అజ్ఞానాన్ని, అశక్తిని వారికి చెప్పి చూశాడు. పెద్దల చేత చెప్పించి చూశాడు. తానే రాయబారానికి వెళ్ళి ధర్మసూక్ష్మాలను బోధించాడు. ఎంత ఓపిక పట్టినా, ఎంత అవకాశం ఇచ్చినా వారి బుద్ధి మారలేదు. వారి మంకుపట్టు మానలేదు. అందుకు ఫలాన్ని అనుభవింపకా తప్పలేదు.

ఉద్ధవా! భగవంతునికి జన్మకర్మలు ఎన్నడూ లేవు. అయినా ఆ అనఘాత్ముడు లోకసంరక్షణార్థం జన్మించినట్లు కనిపిస్తాడు. దుష్టశిక్షణ శిష్టరక్షణ రూపకర్మలను ఆచరించినట్లు తోపజేస్తాడు. అతని కథలు అచింత్య మాయావినోదాలు. ఎన్నిసార్లు విన్నా మనకు తనివి తీరదు. అది మన భక్తిమహిమ కాదు. ఆయన చరిత్రల లోని మాధుర్యం అటువంటిది. నీవు ఆయనకు సన్నిధానవర్తివై జీవితాన్ని పండించుకొన్న ధన్యాత్ముడవు. శ్రీకృష్ణపరమాత్మను గూర్చి నీకు తెలిసిన కథలన్నీ వినిపించి నాకు సర్వేంద్రియతర్పణం చెయ్యాలి' అని అడిగాడు.

## ఉద్ధవుని సంతాపం

ఆ మాటతోనే శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవుని హృదయాంతరంలో మూర్తీభవించి నిలిచాడు. అతనికి డగ్గుత్తికపాటు కలిగింది. నోట తడి ఆరినట్లయింది. తనకు ఊహ తెలిసిననాటి నుంచి తోటి స్నేహితులతో ఆటపాటలకు పోక శ్రీకృష్ణుని పరిచర్యలే తనకు సర్వస్వం అనుకుని కాలం గడిపినవాడు, ప్రొద్దుగుడుపులకు తల్లి గొంతెత్తి ఎంత పిలిచినా వినక శ్రీకృష్ణుని సేవలు వదలి వెళ్ళలేకపోయిన వాడు, ప్రతిక్షణం ఏదో ఒక నెపంతో భగవంతుని కనిపెట్టుకొని, ఆయన కొలువునే కోరి బ్రతికినవాడు, యౌవనం అడుగుపెట్టిననాడు వెతుక్కుంటూ వచ్చిన సుఖాలన్నింటినీ కాలదన్ని చిత్తాన్ని శ్రీకృష్ణ పాదారవింద భజనాయత్తం కావించినవాడు, గాఢ భక్తియోగ సుఖతత్పరుడైన ఉద్ధవుడు తనకు ప్రియదైవంతో కలిగిన ఎడబాటును గురించి మాట్లాడలేక నిలువు నీరైపోయాడు. అతనికి ఉద్వేగభరంతో పెదవులు వణికాయి. మేను గగుర్పొడిచింది. కన్నుల నుంచి నీరు బుగ్గలపై జారి చారికలు కట్టింది.

విదురుడు అతని దుఃఖపారవశ్యాన్ని చూసి నివ్వెరపోయాడు. 'ఓహో! ఇతని భక్త్యతిశయం ఎంత గొప్పది! ఇతను నిజంగా కృతార్థుడే' అని తలపోయసాగాడు. ఉద్ధవుడు తన చిత్తాన్ని భగవల్లోకాల నుంచి మర్త్యలోకానికి మెల్లమెల్లగా మరల్చి, కన్నీళ్ళు తుడుచుకొంటూ శ్రీకృష్ణచర్యలను ఒక్కొక్కటిగా మనస్సుకు తెచ్చుకొంటూ దుఃఖంతో వెక్కి వెక్కి ఏడుస్తూ ఉబ్బి బూరటిల్లుతూ విదురునితో ఇలా అన్నాడు.

## శ్రీకృష్ణ నిర్యాణోదంతం

'మిత్రమా! క్షీరసాగరంలోని చేపలు తమతో పుట్టి తమతో మెలగుతున్న చంద్రుణ్ణి తెలుసుకోలేనట్లు, యాదవులు తమ కులంలో జన్మించి బహుకాలం కలిసి మెలిసి తిరిగిన శ్రీకృష్ణభగవానుని భగవానునిగా గుర్తింపలేకపోయారు. యాదవులంటే పరేంగితజ్ఞులు కాని సామాన్యులు కారు. అంతటివారై

శ్రీకృష్ణుడు యాదవ ప్రముఖులలో ఒకడని, తమవంటి వాడేనని పొరబడ్డారు. శిశుపాలాదులు ఆ మహాత్ముని సామాన్య నరమాత్రునిగా భావించి అతనిపై పగబూనారు. ఇదంతా దేవమాయాకార్యమని చిన్నప్పటి నుంచీ నాకు విశ్వాసం కలిగింది. ఎందరు ఎన్ని గతుల చరించినా నా చిత్తం శ్రీహరి పాదాలపై నాటుకొని అక్కడి నుంచి ఎంత మాత్రం చలింపలేదు. ఇది నా భాగ్యవిశేషమని ముమ్మాటికీ నమ్ముతున్నాను.

మిత్రమా! శ్రీహరి దివ్యమంగళవిగ్రహ దర్శనార్థులై పరమయోగు లంతటి వారు వేల వేల సంవత్సరాలు తీవ్రతపస్సులు ఆచరించి ఇష్టసిద్ధిని పొందలేక హతుశు లవుతుంటారు. అట్టి పరమేశ్వరుడు తానై తన యోగమాయామహిమను ప్రకటింపదలచి మానుష లీలాయోగ్యమైన దివ్యమంగళాకారాన్ని స్వీకరించాడు. ఓహో! ఆ లోకమోహన విగ్రహం పరమాలంకారాలకు అలంకారమై, సౌభాగ్యానికి తావలమై క్షణ క్షణ వినూత్న కళాభిరామమై నిలువెల్లా కన్నులు చేసుకొనిచూసినా తనివి తీరదు. ఆనాడు ధర్మజుని రాజసూయ యాగానికి శ్రీకృష్ణుడు రాగా, అక్కడ సమావిష్టులైన ముజ్జగాలవారూ ఆ దివ్యసుందరవిగ్రహాన్ని కన్నుల కలిమి తీరా చూసి చూసి బ్రహ్మసృష్టి చాతుర్యమంతా కలబోసినా ఇతనికి సాటిరాదని వేనోళ్ళ కావించిన పొగడ్తలు ఈనాటికీ నా చెవిలో ప్రతిధ్వనిస్తున్నాయి. ఎవని లీలావిలోకనాలు అనురాగ పూరిత దరహాస చంద్రికాశీతలాలై గోపాంగనల అలుకలను తీర్పజాలినవో, ఎవని దేదీప్యమాన తేజోమయ రూపరేఖావిలాసాలను వీక్షించే తమకంలో గోపికలు తమ పనులన్నీ వదిలి పరుగిడి అతని పంచలనే చరిస్తారో, ఎవడు జన్మరహితుడైనా తన శాంతస్వరూపానికి ప్రతిబింబాల వంటి సత్పురుషులను పరపీడల నుంచి రక్షించడానికి సమిధలలో అగ్ని పుట్టినట్లు అవ్యక్తం నుంచి వ్యక్తరూపాన్ని గ్రహించి ఆవిర్భవించాడో, ఆ మహాపురుషుని తలంపు కలిగినంతనే నాకు తన్మయత కలుగుతున్నది.

విదురా! భగవంతునికి జన్మకర్మలు కలుగవు. అట్టివాడు యాదవవంశంలో పుట్టి వారితో పెరిగి వారిని సర్వవిధాలా ఉద్ధరించాడు.

భగవంతుడు ఆ తీరున ప్రవర్తించడం అతనికి గల లోకానురాగాన్ని ప్రదర్శించడమే అని తెలుసుకోవాలి. పరమేశ్వరుని పేరు చెప్పినంతనే భయాలు కూడా భయపడి పారిపోతాయి. అటువంటివాడు మర్త్యమాత్రునికి భయపడి తానున్న పురాన్ని వదిలి వ్రేపల్లె చేరాడు. అలా చేయడం ఎందుకో ఊహించావా? యాదవులను క్రూరుల బారి నుంచి దూరం చేయడానికి భగవానుడు ఆ ఉపాయాన్ని పన్నాడు. భగవంతునికి ప్రజలపై గల ప్రేమ ఎంతటిదో, ఎవరికి ఎప్పుడు ఎలా తోడ్పడుతాడో ఈ చేతల వలననే గ్రహింపగలము.

సౌమ్యా! భగవంతుడు లోకమంగళార్థం మానుషవిగ్రహాన్ని ధరించి నందుని ఇంట ప్రకటించిన లీలలను తలచి తలచి ఆశ్చర్యపడుతుంటాను. అతను యశోదబిభీషికలకు బెడగొంది ఆమె చేతికి చిక్కక తప్పించుకొని పారిపోతూ చూపించిన మురిపాల చేష్టలు మరవాలన్నా మరుపుకు రావు. ఒకనాడు శ్రీకృష్ణ భగవానుడు తల్లిదండ్రుల చరణాలపై వాలి, 'జననీ జనకులారా! కంసుని వలని భయం నన్ను మనసారా మీకు పరిచర్య చేయనీయదు. అది నా అపరాధంగా తలంపక నన్ను మీరు కరుణించాలి' అని వినయ నయ మధురంగా పలికిన పల్కుల అంతరార్థం ఇంతింతని చెప్ప నలవికాదు. మాతాపితృసేవా తత్త్వవిచారపరులు ఆ మాటలను తమ హృదయఫలకాలపై సువర్ణాక్షరాలతో లిఖించి నిరంతరం వల్లించు కోవాలి.

మిత్రమా! సంకల్పమాత్రం చేత సర్వసిద్ధులూ మూర్తీభవించి భగవంతుని కనుసన్నలలో మెలగుతుంటాయి. అటువంటి మహాత్ముడు నేలకు దిగివచ్చి మానవమాత్రుల వలె వివిధ సుఖ దుఃఖాలను అనుభవించడంలో గల తాత్పర్యమేమిటో గ్రహించావా? ఇదంతా లోకోద్ధరణార్థమే కాని వేరేమీ కాదన్న మాట. లోకం నానాతత్త్వమయమై సమకూడినట్టిది. ఆ తత్త్వాలను సంస్కరింపగలిగితే అని పరిశుద్ధాలై ఉన్నతస్థితికి రాగలుగుతాయి. ఆ సంస్కారం క్రమక్రమంగా జరిగితేనే స్థిరంగా నిలిచి ఉంటుంది.

అందుకు తగిన మార్గం ఏమిటో ఎప్పుడైనా ఆలోచించావా? లోకంలో ఉన్నతులైనవారు తమకన్నా తక్కువవారిని చేరదీసి వారి హృదయాలలో సత్పరిణామాన్ని కలిగించడమే ఉత్తమోత్తమ మార్గం. ఈ మార్గాన్ని లోకానికి బోధించాలని పరమేశ్వరుడు స్వయంగా అవతరించి తన జీవితమే తార్కాణంగా ఈ మహానాటకాన్ని ప్రదర్శించాడు.

విదురా! ఒక్కొక్కప్పుడు భగవంతుడు అనుగ్రహించి క్రౌర్యాన్ని చూపినట్లు కనిపిస్తుంది. అది కూడా అతని పరమానుగ్రహమే కాని ఆగ్రహ ప్రదర్శనం కాదు. ఆ రూపంలో ఆ విధంగా ఆ ఉపాధి సంస్కృతం కావలసి ఉన్నదన్న మాట. శిశుపాలుడు ఎంత దుర్మార్గుడో నీకు తెలియనిది కాదు. అతను భగవంతుని యెడ నిరంతర ద్వేషబుద్ధితో వర్తించాడు. అట్టివానికి కూడా అతని సంహారాన్ని నిమిత్తంగా చేసి భగవంతుడు యోగీశ్వరులకు సైతం దుర్లభమైన ఉత్తమగతిని ప్రసాదించాడు. ఈ చరితలలోని గూఢార్థాన్ని తలచుకొంటే నాకు అమితాశ్చర్యంగా ఉంటుంది.

మిత్రమా! మహాయుద్ధోత్సుకులై నానాదేశాధిపతులు వచ్చి కౌరవపక్షాన నిల్చి అర్జునునిపై దాడి చేశారు. పేరుకు గాండీవికి ఎదురై నిలిచారే కాని వారందరి మనోదృష్టులూ రథం నడుపుతున్న శ్రీకృష్ణుని ముఖారవిందమందే నిలిచిపోయాయి. వచ్చిన పని మరచిపోయి తననే తదేకంగా తిలకిస్తున్న వారందరినీ భగవానుడు అర్జున బాణాగ్నులతో పవిత్రీకరించి ఉత్తమగతులను ప్రసాదించాడు. ఆ లోక కళ్యాణమూర్తి సందర్శన మహాభాగ్యం ఎంత ఫలప్రదమో నువ్వే ఊహించి చూడు.

మిత్రమా! శ్రీకృష్ణుడు లోకేశ్వరుడు. అతనికి సాటి రాగలవారే లేరనగా ఇక అధికుల మాటెందుకు? ఆ మహనీయుడు నిత్య నిరతిశయానందపూర్ణుడు. అతనికి కోరదగినవి కాని పొందదగినవి కాని లేనే లేవు. ఆయన బ్రహ్మేశాన మహేంద్రాది సమస్త దేవతానికరమూ ప్రతినిత్యం

పాదాభివందనం చేయగా వారు శిరస్సులపై ధరించిన నానామణిస్థగిత కిరీట కాంతులతో కసుగందిన లేత లేత పాదాలు కలవాడు. అట్టివాడు ఉగ్రసేనుని సింహాసనం ఎక్కించి అతని చెంత బంటు వలె నిలిచి 'దేవా! అవధరించు' అంటూ చేతులు జోడించి విన్నపాలు చేయడం చూసినప్పుడల్లా నాకు ప్రాణాలు గుబగుబ మంటుండేవి. చనుమొనలకు విషం పూసి పాలిచ్చే నెపంతో తనను చంపవచ్చిన మహాపాపాత్మురాలు పూతనకు కూడా ఆయన ఉత్తమగతిని కలిగించాడు. వగతోనూ, పగతోనూ ఆయనను చేరిన వారందరూ కడతేరారు.

మిత్రమా! అటువంటి పరమ దయామూర్తి, సర్వలోకశరణ్యుడు మనల్ని విడిచి వెళ్ళిపోయాడు. యాదవకులం కాలగ్రస్తమయింది. మా సంపదలన్నీ వలన పోయాయి. ఇక మా కుశలాన్ని గురించి ఏమి చెప్పమంటావు? ఆ మహాత్ముని నిర్యాణం ఒక్క యాదవ కులానికే కాదు, సమస్త లోకానికీ గొడ్డలిపెట్టుగా పరిణమించింది. సౌమ్యా! ఇక నీకూ నాకూ శరణం ఎవరున్నారు? ఎవరిని ఆశ్రయించాలి? ఏ మహాత్ముని యందు ఎవరు ఏ భావంతో మది నిల్పనోచినా మహాభాగవతులు కావడం తథ్యమో, ఆ మహనీయుని కోల్పోయిన ఈ జీవితం ఇక దేనికి?

## శ్రీకృష్ణలీలా చరిత్ర సంగ్రహం

మిత్రమా! శ్రీకృష్ణచరితలను వినగోరావు. ఆయన చరితలు ఇన్ని ఉన్నాయని గాని, ఆ చరితల తీరు ఇదిగో ఇట్టిదని కాని వచించడం మన బోంట్లకు సాధ్యం కాదు.

సౌమ్యా! లోకంలో అధర్మం నానాటికీ ఎక్కువ కాసాగింది. భూదేవి ఆ భారాన్ని మోయలేక బ్రహ్మతో మొరపెట్టుకొన్నది. బ్రహ్మదేవుడు భగవంతుని ప్రార్థించాడు. పరమేశ్వరుడు అతని విన్నపాన్ని విని కంసుని చెరలో ఉన్న దేవకీ వసుదేవులకు జన్మింపదలిచాడు. అప్పటికి కంసుడు వసుదేవునికి జన్మించిన ఏడుగురు కొడుకులను బలిగొన్నాడు. ఎనిమిదవ కొడుకు కంసుని

ప్రాణాలను హరిస్తాడని నాడు గగనవాణి పలికిన మాటను జ్ఞాపకం చేసుకొని ఆ క్రూరుడు తలక్రిందులవుతూ తగిన సమయం కోసం కనిపెట్టుకొని ఉన్నాడు. దేవకి గర్భవతి అయింది. వసుదేవుడు భయోద్విగ్నుడైనాడు. అప్పుడు భగవానుడు అవతరించి వసుదేవునికి అభయం పలికి వెనువెంటనే ఆ ప్రదేశాన్ని విడిచి నందవ్రజం చేరి తండ్రి భయాన్ని పోగొట్టాడు.

నందవ్రజాన్ని చేరాక భగవానుడక్కడ బలభద్రునితో కూడి పదకొండు సంవత్సరాలు తన తత్త్వం పరులకు తెలియరాకుండా గుప్తతేజుడై ఉన్నాడు.

నందవ్రజవం లోని వనోపవనాలు బహురమణీయమైనవి. శ్రీకృష్ణుడు అయిదారేండ్ల లేతప్రాయం నుంచి బలరామునితో గోపకుమారులతో కూడి ఆ వనాంతరాల లోని ఫలవృక్షాల చల్లని నీడలలో ఆడుకొంటూ అక్కడికి వచ్చి చేరిన నానావిధ పక్షుల కిలకిలా రవాలకు మనసారా ఆనందిస్తూ, యమునాతీరంలోని ఉపవనాలలో విహరిస్తూ, ఆటపాటలతో తోటి స్నేహితులను వినోదింపజేస్తూ, గోగణాలను మేపుతూ కాలం గడిపాడు.

అతను ఒక్కొక్క వేళ వగయేడ్పులతో గారాబు మీరి మారాము చేశాడు. ఒక్కొక్కసారి చిరునవ్వుల లేతవెన్నెలలు వెదజల్లాడు. ఒక్కొక్క తరి కొదమసింగపు చేష్టలను అనువర్తించాడు. అతని పసితనపు ఆటలు వ్రేపల్లెవారికి ముద్దులమూట లైనాయి.

మిత్రమా! కృష్టునికి కొంత వయస్సు వచ్చాక అతను గోవులను మేపుతూ కారడవులలో దూరి వెదురుగొట్టానికి చిల్లులు పొడిచి పిల్లనగ్రోవిని అల్లనల్లన మ్రోగించి వేణగానంతో లోకాన్ని పరవశింపజేశాడు. ఆ మధురగానాలు శ్రవణ పర్వాలై ఆ నాటినుంచి కృష్ణగానమనే మాట లోకవిశ్రుతంగా వినుతికెక్కింది.

శ్రీకృష్ణుని చర్యలు కంసరాజు దృష్టిని ఆకర్షించాయి. అతను కృష్ణుని రూపుమాపగోరి ఎన్నెన్నో మాయలు పన్నాడు. అతను పంపిన మాయావు లందరూ కృష్ణుని చేతుల్లో గడ్డిబొమ్మల్లా నలిగిపోయారు.

ఆ సమయంలో యమునా నదిలోని మడుగు నీరు కాళియుడనే పేరు గల సర్పరాజు అంతులోకి వచ్చి నివసించటం వల్ల అతని పడగల విషం కలిసి తాగినవారికి ప్రాణాంతకంగా ఉండేది. ఆ సంగతి తెలియక గోవులూ గోపకులూ విషజలాన్ని తాగి దుర్దశలను పొందారు. ఆ గోగోపకులను శ్రీకృష్ణుడు బ్రతికించి ఆ మడుగులో కాపురమున్న కాళియుడనే ఆ పాపరాజును బయటికి గెంటి ఆ మడుగు నీళ్ళకు పరిశుద్ధత్వాన్ని, పావనత్వాన్ని అనుగ్రహించాడు.

మిత్రమా! ధనమన్నది సద్వ్యయమైతేనే దానికి సార్థకత కలుగుతుంది. గోపాలకులు ప్రతి సంవత్సరం ఇంద్రయాగార్థం తమ ధనాన్ని వెచ్చిస్తుండే వాళ్ళు. శ్రీకృష్ణుడు ఆ యాగాన్ని మాన్పించి సమకూడిన ధనాన్ని గోపూజకై నందగోపునిచే వినియోగింపజేశాడు. దేవేంద్రునికి కోపం వచ్చి గోపకులను శిక్షింపదలచి ఘోరవర్షం కురియమని నవమేఘాలను ఆజ్ఞాపించాడు. క్షణంలో భూభాగమంతా జలార్ణవంగా మారిపోయింది. గోవులు గోపకులు నిలువ నీడ లేక తల్లడిల్లిపోయారు. శ్రీకృష్ణుడు వారిపై దయగొని తన చేతితో పైకెత్తి గోవర్ధన గిరిని గొడుగులా పట్టుకున్నాడు. గోకులమంతా దాని క్రిందికి చేరి గండం నుంచి బైటపడ్డారు. శరత్కాలపు వెన్నెలలో రజనీముఖాలలో గోపికామండలాన్ని కూడి సర్వేశ్వరుడు శ్రీకృష్ణుడు రాసక్రీడలు జరుపుతూ వేణుగాన మధుర మధురసాలతో వారికి సర్వేంద్రియతర్పణం కావించాడు.

అంతలో కంసుడు శ్రీకృష్ణుని చంపాలని ఒక వ్యూహం పన్ని మధురకు పిలిపించాడు. కృష్ణుడు బలరామునితో మధురకు వెళ్ళి, కంసుణ్ణి సంహరించి, ఉగ్రసేనునికి పట్టం కట్టి అందరికీ ఆనందాన్ని కలిగించాడు.

ఆ తర్వాత బలరామకృష్ణులకు ఉపనయన సంస్కారాలు జరిగాయి. శ్రీకృష్ణ భగవానుడు సర్వజ్ఞు డైనప్పటికీ లోకమర్యాద నిమిత్తం గురుశుశ్రూషను కోరి సాందీపనిని చేరి ఆ మహాత్ముని ఉపదేశమాత్రాన వేదవేదాంగ విద్యలన్నింటినీ గ్రహించాడు.

సాందీపనికి ఒక కొడుకు ఉండేవాడు. అతనిని పంచజనుడనే రాక్షసుడు అపహరించి సముద్రాంతరంలో దాచిపెట్టాడు. ఆ పుత్రకుని తెచ్చి ఇమ్మని గురుభార్య శ్రీకృష్ణుని కోరింది. భగవానుడు సాగరగర్భం లోనికి ప్రవేశించి పంచజనుణ్ణి పంచత్వమొందించి గురుపుత్రుని తీసికొనివచ్చి గురుదక్షిణగా సమర్పించి, ఆయన ఆశీర్వచనాన్ని గ్రహించి వెనుకకు మరలివచ్చాడు.

అప్పుడు విదర్భదేశపు రాజు కుమార్తెకు స్వయంవరాన్ని చాటించాడు. అపరలక్ష్మియైన రుక్మిణి రూపలావణ్యాలకు మరులుగొని నానాదేశాధిపతులూ కామార్తులై స్వయంవర ప్రదేశాన్ని చేరుకొన్నారు. రుక్మిణి హృదయం ఏనాడో శ్రీకృష్ణునికి అర్పితమైంది. శ్రీకృష్ణుడు కూడా ఆమె యందు బద్ధానురాగుడై స్వయంవరానికి వెళ్ళి గరుత్మంతుడు దేవతలను పారద్రోలి అమృతాన్ని గైకొన్నట్లు అక్కడ చేరిన రాజన్యమండలాన్ని కాలదన్ని, ఆమెను గాంధర్వవివాహం చేసుకొన్నాడు.

కోసలాధిపతి నగ్నజిత్తు తన కుమార్తెకు స్వయంవరం ప్రకటించి, తన వద్దనున్న ముక్కు కుట్టని ఆబోతులను లొంగదీసినవాడు కన్యావరణానికి అర్హుడని చాటింపజేశాడు. శ్రీకృష్ణుడు కోసల రంగానికి వెళ్ళి ఆ ఆబోతులను లొంగదీసి క్షణంలో వాటిని మట్టుపెట్టాడు. అంతవరకూ అక్కడ గుమిగూడి వాటితో పోరాటానికి ధైర్యం చాలక నిలబడ్డ రాకుమారులందరూ శ్రీకృష్ణునిపై విల్లెక్కు పెట్టి చుట్టుముట్టారు. ఆ కామాంధులను పారద్రోలి శ్రీకృష్ణుడు నాగ్నజితిని పరిగ్రహించాడు.

ఒకనాడు నారదమహర్షి దేవలోకం నుంచి పారిజాతపుష్పాన్ని తెచ్చి కృష్ణునికి సమర్పించాడు. మాధవుడు ఆ కుసుమాన్ని రుక్మిణికి బహూకరించాడు. అందుకు సత్యభామ అలిగి కోపగృహాన్ని చేరింది. ఆమెకు ప్రీతి కలిగింపగోరి శ్రీకృష్ణుడు స్వయంగా ఇంద్రలోకానికి వెళ్ళి నందనోద్యానవనం లోనికి చొరబడి పారిజాతవృక్షాన్ని పెకలింపబోయాడు. ఇంద్రుని దేవేరులు ఆ వార్త విని భర్తను యుద్ధానికి పురికొల్పారు.

ఆఖండలుడు కేవలం స్త్రీజన ప్రేరణవశుడై, వెనుక శ్రీకృష్ణుడు తనకు గావించిన ఉపకార పరంపరను, ఆయన పట్ల తనకు గల కృతజ్ఞతా ఋణాన్ని విస్మరించి గోవిందుని అడ్డగించాడు. కృష్ణుడు అతనిని పరాభవించి తన సంకల్పం నెరవేర్చి సత్యకు ప్రీతిగూర్చాడు. స్త్రీజనుల మాట విని పరమేశ్వరునే అడ్డగింపబోయిన ఇంద్రునికి నారీజనక్రీడామృగం అని పేరు వచ్చింది.

నరకాసురుడు చెలరేగి చెప్పరాని దుండగాలు చేయసాగాడు. శరీరం ఉన్నంత కాలం అతని క్రూరకృత్యాలు మానవని శ్రీకృష్ణుడు చక్రాయుధంతో నరకుని తలను తెగవేయనుండగా అతని తల్లి భూదేవి అడ్డుపడి భగవంతుని వేడుకొన్నది. పరమ కారుణిక స్వభావుడైన భగవానుడు ఆమె కోసం తన ఉద్యమాన్ని మాని నరకాసురుని రాజ్యాభ్రష్టుని కావించి అతని కొడుకు భగదత్తునికి పట్టం కట్టాడు. అప్పటికి నరకాసురుడు రాచకన్నెల నెందరినో పట్టితెచ్చి తన చెరలో బంధించి ఉంచాడు. వారి దుఃఖాలాపాన్ని విని శ్రీకృష్ణుడు చెర వద్దకు వెళ్ళాడు. ఆ రాచకన్నెలు అతనిని చూసి తటాలున లేచి ప్రేమ సంతోష వీక్షణాలతో తమ మనోరహస్యాన్ని వెల్లడించారు. శ్రీకృష్ణుడు వారి భావాన్ని గ్రహించి, వారందరినీ చెర విడిపించి తన మందిరానికి తీసికొనివచ్చి శాస్త్రోక్తంగా పెండ్లి చేసుకొని తన మాయాప్రభావం వల్ల అందరి యందు తుల్యానురాగం కలిగి వారు వారు కోరినట్లు భోగభాగ్యసుఖాలలో ఓలలాడించాడు. కాలక్రమాన వారు ఒక్కొక్కరూ పదేసి వంతున శ్రీకృష్ణ సదృశులైన పుత్రులను కన్నారు.

శ్రీకృష్ణుని అతిశయాన్ని చూసి ఓర్వలేక కాలయవనుడు జరాసంధుడు సాళ్వుడు మొదలైనవారు అతనిపై మాత్సర్యంతో మథురను ముట్టడించారు. శ్రీకృష్ణుడు ముచికుందాదులను నిమిత్తమాత్రంగా చేసి ఆ గర్వాంధులను మట్టు పెట్టాడు. తమవారి పతనానికి ఆగ్రహించి శంబరుడు ద్వివిదుడు బాణుడు మురదనుజుడు పల్వలుడు దంతవక్త్రుడు మొదలైనవారు వేలవేలుగా ఆయన మీదికి వచ్చారు. శ్రీకృష్ణుడు ప్రద్యుమ్నాదులచే కొంతమందిని చంపించి తానూ స్వయంగా దంతవక్త్రాదులను సంహరించాడు.

విదురా! నీ అన్న కొడుకు దుర్యోధనుడు ఆయువు మూడిన రోజులు దాపురించాక కర్ణ శకుని దుశ్శాసనుల దుర్మంత్రాలకు చెవి ఒగ్గి కురుక్షేత్రయుద్ధానికి నానా రాజలోకాన్నీ రప్పించాడు. ఆ ఘోరసంగ్రామంలో భీష్మ ద్రోణ భీమార్జునుల మూలాన పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యం నేలకూలింది. తుదకు దుర్యోధనుడు కూడా భీమసేనుని గదాఘాతానికి తొడలు విరిగి ప్రాణాలు విడిచాడు.

అప్పటికీ భూదేవి భారం పూర్తిగా తగ్గలేదు. యదుకులం వలని భారం ఇంకా మిగిలి ఉన్నది. యాదవులు మహాబలపరాక్రమవంతులై రిపుదుర్నిరీక్ష్యంగా వీను మిగిలి ఉన్నారు. అది చూసి శ్రీకృష్ణుడు కార్యం నిశ్చయించి ధర్మనందనుని సామ్రాజ్యాభిషిక్తుని కావించి పాండవాదులకు సంతోషాన్ని కలుగజేశాడు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రం నుంచి ఉత్తరాగర్భస్థమై ఉన్న అభిమన్యుని తేజాన్ని కాపాడి పాండవ కులాంకురాన్ని నిలబెట్టాడు. ధర్మసుతుని వలన మూడు అశ్వమేధయాగాలు చేయించి, అతను తమ్ములతో కూడి నిస్సపత్నరాజ్యాన్ని ధర్మమూలకంగా పరిపాలించేటట్లు చేసి ద్వారవతీనగరానికి తిరిగివచ్చాడు. తాను స్వయంగా అసక్తుడు, ప్రకృతి పురుష వివేకలక్షణ సాంఖ్యస్థితుడు అయినప్పటికీ లోకమార్గ సముద్ధరణకై సర్వోత్తమమైన గృహస్థధర్మాన్ని స్వీకరించి, నిర్దుష్టచారిత్రానికి తన వర్తనమే నిదర్శనగా కులాంగనలతో కూడి మందహాస సుందర విలోకనాలతో కొందరిని, సుధామధుర వచనాలతో కొందరిని ఆనందింపజేస్తూ, అత్యంత సంసారాసక్తుని వలె అనేక సంవత్సరాలు గడిపాడు. ప్రాణులకు బాల్యం యౌవనం కౌమారం వార్ధక్యం అని నైసర్గికావస్థలు నాలుగు ఉన్నాయి. అందులో ఒక్కొక్క అవస్థకు అనుకూలమైన నైసర్గిక ధర్మాలూ ఉన్నాయి. వాటిని ఆశ్రమ ధర్మాలని అంటారు. భగవానుడు కూడా లీలామానుష విగ్రహాన్ని ధరించినప్పుడు తత్తదవస్థా ధర్మాలు తప్పవని, వాటిని ఉల్లఘింపకూడదని, కాదని వాటిని ఎదుర్కొనడం దుఃఖానికే కాని, సుఖానికి కాదని లోకానికి చాటిచెప్పాలని భగవానునికి తలంపు కలిగింది. ఆ వెంటనే ఆయన చిత్తం భోగపరాఙ్ముఖమైంది.

సర్వేశ్వరునికి సమస్తభోగాలూ ఆయన అధీనం లోనివే. మర్త్యులకో? అవి దైవాధీనాలు. భగవాను డంతటివాడు ధర్మనిర్వహణకై స్వాధీనభోగాలను ఉజ్జగిస్తుండగా మర్త్యులు పరాధీనభోగాల యెడ కోరికలను పెంచుకోవడం తగదని వేరే ప్రత్యేకంగా చెప్పాలా?

ఒకనాడు యదుభోజకుమారులు ద్వారకలో క్రీడాపరులై ఉండగా మునులు కొందరు ఆ మార్గాన నడిచివెళ్తూ వారి కంటబడ్డారు. ఆ కుమారకులు వివేకహీనులై మునులకు అపచారం చేశారు. ఆ ఋషీంద్రులు వారిని శపించారు. అంతా భగవన్మతానుసారంగా యాదవ వంశ నిర్మూలనానికి అంకురార్పణ జరిగింది.

కొన్ని నెలలకు వృష్ణిభోజాంధకాదులు దైవప్రేరణ వల్ల ఒక యాగాన్ని సంకల్పించి అందుకు కావలసిన వివిధ పదార్థాలను సమృద్ధంగా చేకూర్చుకొని ప్రభాసక్షేత్రానికి వెళ్ళారు. అక్కడ వారందరూ స్నానాదులు ముగించుకొని పితృ దేవ ఋషి తర్పణలు కావించి, విప్రులకు ఉత్తమగోవులను వెండి బంగారాలను శయనీయాలను వస్త్రాదికాన్ని రథ గజ తురగాలను కన్యలను మాగాణి పొలాలను యథావిధిగా దానాలిచ్చి, వారిని మృష్టాన్నసంతుష్టులను చేసి 'మా ప్రాణాలు గో బ్రాహ్మణ రక్షణార్థం బగు గాక' అంటూ సాష్టాంగనమస్కారాలను ఆచరించారు.

ఆ విధంగా యాదవులు బ్రాహ్మణులను పూజించి, వారిని వీడ్కొలిపి యథేచ్ఛగా భుజించి, తమ ఆచారం ప్రకారం వారుణిని యథామతిని గొంతు పై దాకా పుచ్చుకొన్నారు. దాని కైపు వారి తలకెక్కింది. తత్ఫలంగా వివేకం కన్ను మూసింది. మైమరపు కలిగింది. ఒకరి నొకరు పరాచికాలు ఆడసాగారు. చూస్తుండగానే చీకటి పడింది. వేళాకోళాలు శ్రుతిమించి మాటలు మీరి చేతులు కలిశాయి. క్రోధానలధూమాలు వారి కన్నులను కప్పివేశాయి. ఒకరి నొకరు అడుచుకొని పొడుచుకొని అందరూ చనిపోయారు.

శ్రీకృష్ణభగవానుడు తన మాయాకార్యాన్ని చూసి, తాను వచ్చిన పని తీరినదని గ్రహించాడు. సరస్వతీజలాలలో ఆచమించి చేరువనున్న రావిచెట్టు తిన్నెమీద కూర్చొన్నాడు. అప్పుడు నేను ఆయనను సమీపించి, 'స్వామీ! నా గతి ఏమిటి?' అని వేడుకొన్నాను. భగవానుడు నా మొర ఆలకించి, 'ఉద్ధవా! బదరీవనానికి వెళ్ళమని నీకు ద్వారకలోనే చెప్పాను. ఇప్పుడూ అదే చెబుతున్నాను' అన్నాడు. భగవానుని ఆజ్ఞ అయినా ఆయన చరణారవిందాలను విడిచిపెట్టలేక, ఇంకా ఏమి జరుగనున్నదో చూతామని నేను అక్కడే నిలబడ్డాను.

భగవానుడు ఆ రావి చెట్టు బోదెను ఆనుకుని దక్షిణపాదాన్ని డాపలి తొడపై ఉంచి కూర్చున్నాడు. మిత్రమా! సర్వసృష్టికీ పరమాశ్రయుడై నిరాశ్రయుడైన ఆ శ్రీనికేతనుని విరజుని శ్యామావదాతగాత్రుని పీతకౌశేయాంబరధరుని చతుర్భుజుని సర్వవిషయ సుఖాలనూ విడిచి కూడా ఆనందపూర్ణు డైనవానిని నా స్వామిని అదే కడసారి నా కన్నులారా చూడటం.

ఇంతలో అక్కడికి భాగవతోత్తముడు, పరాశరశిష్యుడు, వ్యాసమహర్షి సఖుడు అయిన మైత్రేయుడు లోకాటనకు బయలుదేరినవాడు తలవని తలంపుగా వచ్చి శ్రీకృష్ణ భగవానుని చూసి సంతోష వివశుడై నేలకు సాగిలబడి మ్రొక్కాడు. భగవానుడు పరమానురాగ హాసపూర్ణవిలోకనాలను నా యెడ సారించి, నా మనసులోని పరితాపమంతా చల్లవారేటట్లు మైత్రేయుని సమక్షంలో నాతో అన్నాడు కదా –

'ఉద్ధవా! నీవు తొలి జన్మలలో అష్టాదశ వసువులలో ఒకడవై ఉన్నావు. విశ్వస్రష్టలైన ఆ వసువులందరూ కలసి సత్త్రయాగం చేశారు. అప్పుడు నీవు నా ప్రాప్తిని కోరి యజించావు. నీ మనోగతమైన కోరిక నాకు విదితమైంది. నీవు కోరినది అన్యజన దుర్లభం. అయినా నీకు అభీష్టసిద్ధిని కలిగిస్తాను. అందుకు నీ భక్తి మొట్టమొదటి కారణం. రెండవది – ఈ నరలోకాన్ని వదిలి నేను స్వస్థానం చేరాలని నిశ్చయించి ఏకాంత ప్రదేశానికి వచ్చాను. నా విగ్రహం

లీలాతత్త్వాన్ని త్యజించి పరమతత్త్వాన్ని పొందబోతున్నది. ఇటువంటి అపూర్వవేళ నా దర్శనం అతి దుర్లభం. నీ పూర్వ సుకృతాలు ఫలించి నీ పరమ భక్తిఫలంగా ఈ తరిని నన్ను చూచే భాగ్యానికి నోచుకున్నావు. నా అనుగ్రహానికి పాత్రుడవైనావు. ఇదే నీకు కడపటి జన్మం. ఆదిసృష్టికాలంలో నా నాభి పద్మజుడైన బ్రహ్మకు ఏ తత్త్వజ్ఞానాన్ని బోధించానో, ఏ తత్త్వజ్ఞానాన్ని పండితులు భాగవతమని ప్రశంసిస్తారో, నా మహిమావభాసమైన ఆ తత్త్వజ్ఞానం నీ హృదయానికి స్ఫురిస్తుంది గాక !' అని పరమాదరంతో పలికాడు.

మిత్రమా! నేను సర్వేశ్వరుని ప్రతిక్షణానుగ్రహానికి పాత్రుడను కానోచినందుకు నా ఆనందం మేర మీరింది; నా నిలువెల్లా జలదరించి సంతోషపులకాంకిత మయింది; నా కన్నులు తమంతట ఆనందబాష్పాలను వర్షించాయి; నోట మాట రాలేదు. ఎంతో ప్రయత్నం మీద తేరుకుని, భగవంతుని వీక్షించి, ఆయనతో అన్నాను :

'దేవదేవా! నీ పాదసరోరుహాలను ఆశ్రయించినవారికి ధర్మార్థకామమోక్షాలు కరతలామలకాలు. అనతిదుర్లభమైన ఆ పురుషార్థాలలో ఏ ఒక్కటీ నేను కోరుకొనడం లేదు. నీ పాదాబ్జసేవనే కోరుకున్నాను. దానిని నాకు అనుగ్రహించు. అదే నాకు పదివేలు.

ఏమంటావా? అఘటమానములైన నీ కృత్యాలను కాంచినంతనే నాకు మోహం కలుగుతున్నది. నీవా నిష్క్రియుడవు. అయినా కర్మలను ఆచరిస్తావు. నీకు పుట్టుక లేదు. అయినా జన్మలను ధరిస్తావు. నీవు కాలాత్ముడవు. నీ మాట అన్నంతనే లోకాలోకాలూ భయమంది తల్లడిల్లుతాయి. అంత మహామహుడవైనా నరమాత్రునికి వెరచి స్వస్థానం విడిచి దుర్గప్రదేశాన్ని ఆశ్రయించావు. నీవు నిరంతరాత్మారాముడవు. నిన్ను రంజింపజేసే వేరే వస్తువొకటి ఏముంటుంది? అట్టివాడవు బహుసంఖ్యాక ప్రమదారత్నాలను గ్రహించి గృహస్థాశ్రమ ధర్మాన్ని సాగించావు. నీవెప్పుడూ అఖండాత్మ

బోధస్వరూపుడవు. నీ మతి మంత్రార్థంలో అకుంఠితం. అట్టి సర్వజ్ఞుడవు ముగ్ధుని వలె నా బోటి అల్పమతిని ఏకాంతానికి పిలిచి కార్యమార్గాన్ని తెలుపగోరుతావు.

స్వామీ! ఈ నీ చరితలు విద్వాంసులను కూడా మోహార్ణవంలో ముంచివేసేవి. ఇక నా వంటి వారి సంగతి చెప్పేదేమున్నది?

దేవా! స్వాత్మ రహస్యప్రకాశకమైన పరమజ్ఞానాన్ని పూర్వం బ్రహ్మకు బోధించానని అన్నావు. దానిని తెలిసికొనగల అర్హత నాకుంటే నన్ను కరుణించి నాకు ఉపదేశించు. దాని ప్రభావం వల్ల నైనా నాకు అనాయాస సంసారతరణం కలుగుతుంది.'

అని నా అభిమతాన్ని విన్నవించాను. ఆ పరమగురువు నా మొర ఆలించి దయార్ద్రచిత్తుడై ఆత్మ పరమగతిని నాకు ఉపదేశించాడు.

విదురా! ఆ విధంగా నేను భగవంతుని వలన ఆత్మతత్త్వబోధమార్గాన్ని గ్రహించి ఆ లోకగురువుకు ప్రదక్షిణ ప్రణామం కావించి, ఆయన అనుజ్ఞను గైకొని బదరికాశ్రమానికి వెళ్లాలని అనుకొన్నాను. అయితే భగవదాజ్ఞ ముందుకూ ఆయన వియోగక్లేశం వెనుకకూ నన్ను ఉగ్రూత లూగించాయి. ఎలాగో గుండె రాయి చేసుకొని ఇంత దూరం వచ్చాను. ఏ చోట నరనారాయణులు పూర్వం తీవ్ర తపస్సును ఆచరించారో, ఆ బదరికాశ్రమం నా గమ్యస్థానం' అని పలికాడు.

రాజా! బంధుమిత్రాదుల దుర్మరణాన్ని విన్నంతనే విదురుడు శోకవివశుడైనాడు. అంతలోనే అతని సహజ విజ్ఞానం ప్రకాశించి అజ్ఞానాంధకారాన్ని దూరం చేసింది. కొంత సేపటికి అతను సమాహిత చిత్తుడై, 'ఇదంతా దైవయోగం. ఇందుకు వగచి ఏమి ప్రయోజనం?' అని ఊరడిల్లి, ఉద్ధవుని చేతులు పట్టుకొని –

'మహాత్మా! కృతార్థులు తమ భృత్యులకు ప్రయోజనసాధకులై వర్తిల్లడం

సహజమే. వేరొక పని వారికి కలుగదు. అట్టి నిన్ను నీ భృత్యుడు విదురుడు అర్థిస్తున్నాడు. పరమేశ్వరుడు నీకు అనుగ్రహించిన రహస్యరూప తత్త్వప్రకాశిక మహాజ్ఞానాన్ని నాకు ప్రసాదించు' అని వేడుకొన్నాడు.

రాజా! ఉద్ధవుడు విదురుని మాట విని, 'మిత్రమా! ఆత్మజ్ఞానం నీకు స్వతస్సిద్ధం. అయినా అది గురూపదేశంతో వర్ధిల్లి అర్థవంతంకావాలి. ఆ భావంతో భగవానుడు మైత్రేయుని పిలిచి, ఆత్మజ్ఞానాన్ని నీకు తెలియజెప్పమని నా ఎదుటనే అతనిని ఆజ్ఞాపించాడు. నీవు ఆ మునీశ్వరుని ఉపాసించి ఆత్మవిద్యను అధిగమించి కృతకృత్యుడవు కావాలి' అని చెప్పి, ఆ రాత్రి అతనితో గడిపి, తెల్లవారుజామున లేచి బదరికాశ్రమానికి వెళ్ళిపోయాడు.

## ఉద్ధవుని భావివర్తనం

మునివరేణ్యులారా! శుకమహర్షి ఆ విధంగా ప్రబోధించినది పరీక్షిన్నరేంద్రుడు సాకల్యంగా విని–

'శుకయోగీంద్రా! యాదవ ప్రవరులందరూ పరస్పరం కలహించుకొని చనిపోయారని మీరన్నారు. త్రిలోకనాయకుడైన శ్రీకృష్ణ భగవానుడు కూడా తన అవతారాన్ని విరమించాడని చెప్పారు. అంతటివారే వెళ్ళిపోయిన తర్వాత ఉద్ధవు డొక్కడూ బ్రతికి ఉండటం దేనికి?' అని అడిగాడు.

అతని మాటలకు శుకయోగి–

'రాజా! ఉద్ధవుడు జీవించి ఉండడానికి కారణం లేకపోలేదు. శ్రీకృష్ణ భగవానుడు ఈ లోకాన్ని వదిలి వెళ్లిన తర్వాత ఆత్మజ్ఞానాన్ని అధికారులకు బోధింపదగిన ఆత్మవంతు డొకడు కావాలని, ఉద్ధవుడు గుణసంక్షోభాలకు అతీతుడైనందున అన్ని విధాలా తనతో సమానుడని, ఆత్మజ్ఞానాన్ని లోకంలో ప్రచారం చేయగల సమర్థుడని నిశ్చయించి, శ్రీకృష్ణ భగవానుడే స్వయంగా అందుకు ఉద్ధవుని సమ్మతింపజేశాడు. వేదప్రవర్తకుడు, త్రిలోకగురువు అయిన ఆ పరమేశ్వరుని ఆజ్ఞ మేరకు ఉద్ధవుడు తన ప్రాణాలను ఉగ్గబట్టుకొని,

బదరికాశ్రమానికి వెళ్లి సమాధియోగనిష్ఠుడై శ్రీ పరమేశ్వరుని ఆరాధింపసాగాడు'

అని సమాధానం చెప్పాడు.

## గంగాతీరానికి ప్రయాణం

ఆ తర్వాత శుకయోగి ఇలా అన్నాడు:

'పరీక్షిన్మహారాజా! ఉద్ధవుని పలుకులను వినగానే విదురుడు సంతోషవివశుడై పోయాడు.

'ఆహా! భగవంతునికి నాయెడ గల ప్రేమ ఎంత అపారమైనది! ఆ దయామయుడు తన లీలామానుష విగ్రహాన్ని ఉపసంహరించే ఏకాంత సమయంలో కూడా నన్ను మరువలేదు. ఇంతకంటె నాకు వేరే భాగ్యాతిశయం ఏమున్నది! దేవా! ఈ వరాటుని యందు కూడ నీకు జాలి కలిగిందంటే ఇక పుణ్యాత్ముల సంగతి తలపోయడమెందుకు? స్వామీ! క్రీడార్థం అవతరించి నీవు ఆ శరీరంతో కావించిన కర్మలు శ్లాఘాతీతాలు. నీ దేహన్యాసం జ్ఞానులకు జ్ఞానసంపాదక మవుతుంది. విహ్వాలబుద్ధితో పశుతుల్యులై చరించేవారికి నీ తత్త్వం గోరంతైనా బోధపడదు. అట్టి నిన్ను, నా పరమ దైవాన్ని కోల్పోయాను. ఇంతకన్నా నాకు దౌర్భాగ్యం ఏమున్నది?' అని ప్రేమవిహ్వాలుడై భగవద్వియోగ చింతతో కొంత కాలం అక్కడే నిలిచి మందాకినీ తీరానికి బయలుదేరాడు.

## విదురమైత్రేయుల సమాగమం

రాజా! గంగాద్వారంలో ఒక పుణ్యాశ్రమం ఉన్నది. అక్కడ మైత్రేయ మహర్షి అగాధబోధావతారమో, భగవచ్ఛక్తి శుద్ధభావతేజోమండలమో, కరుణార్ణవాది గుణపుంజమో అన్నట్లు తీవ్ర తపోనిష్ఠుడై ఉంటున్నాడు. విదురుడు బయలుదేరిన కొన్నాళ్లకు ఆ ఆశ్రమాన్ని చేరుకుని మైత్రేయ మహర్షిని సందర్శించి కుశలానుయోగాల తర్వాత ఇలా అన్నాడు:

## కర్మఫల విచారం

“మునీంద్రా! సుఖప్రాప్తి కోసం కర్మలను ఆచరిస్తున్నాము. అయితే ఆ కర్మలకు ఫలంగా సుఖం లేదా దుఃఖవిరామం నియతంగా కలుగుతుందని చెప్పడానికి వీలులేదు. ఒకవేళ సుఖం కలిగినా అది చిరస్థాయిగా ఉండటం లేదు. పర్యవసానంగా దుఃఖమే మిగులుతున్నది. ఈ విధమైన సంసారసాగరంలో మునిగి దరిదాపులు కనిపించక జీవులు తల్లడిల్లుతున్నారు. ఈ సాగరాన్ని ఈదే ఉపాయం ఏమిటి? దరికి చేరే మార్గం ఏమిటి? అందుకు తగిన సాధనం ఏమిటి? ఏమి చేయాలి? ఇది తెలియజెప్పమని ప్రార్థిస్తాను. సర్వజ్ఞుడవు కనుక నీకు తెలియనిది ఉండదు.

## భాగవతుల కర్తవ్యం

మునివర్యా! సుకృతపరిపాకం వలన కాక అన్యవిధాల భగవత్సేవాభిరతి కలగటం సాధ్యంకాదు. అంతటి పరిపాకం పురాకృత సత్కర్మల వలన తప్ప సిద్ధింపదు. ఎవరు పూర్వజన్మంలో సత్కర్మలను పొనరింపరో వారికి చిత్తశుద్ధి, భగవత్సేవాభిరతి ఎన్నటికీ కలగవు. అట్టివారికి ‘నేను’, ‘నాది’, ‘నా కోసం’ అన్న స్వలాభ స్వభోగాలే పరమార్థాలై ఉంటాయి.

అయితే భగవంతుడు పరమదయాస్వరూపుడు. ఆయన అట్టి దుష్కృతాత్ములను కూడా ఉపేక్షింపడు. ఏ రూపాన నైనా వారిని సన్మార్గానికి తిప్పి సరిచేయాలని ఆయన సంకల్పం. అందుకు వలసినప్పుడల్లా తానే స్వయంగా నేలకు దిగివస్తున్నాడు. తన అవతారకార్యాలను కొనసాగించడానికి తగిన అధికారులను లోకంలో నియనిస్తున్నాడు.

అట్టివారిని పరమభాగవతులని అంటారు. వారు పరోపకారజీవులై లోకంలో చరిస్తుంటారు.

## భగవత్సేవా విధానం

సాధువరేణ్యా! నీవు కూడా భాగవతాగ్రేసరుడవే కనుక నాకు సంసార తరణోపాయాన్ని అనుగ్రహించటం నీకు విధివిధానమే అవుతుంది. ఏది

మాకు సుఖరూప మార్గం కాగలదో దానిని బోధించు. ఆ దారి త్రొక్కి భగవంతుని ఆరాధింపగలము. ఏ తీరున మేము భగవత్సేవ కావిస్తే మా హృదయాంతరాళాలు నిర్మల భక్తిపూరితాలై ఈశ్వర సన్నిధానానికి నోచి అనాది వేద ప్రమాణమైన అపరోక్షజ్ఞానాన్ని పొందగలవో ఆ ఉత్తమవిధానాన్ని మాకు అనుగ్రహించు.

మహాత్మా! మానవులకు వారి పూర్వ సుకృత దుష్కృత ఫలంగా సుఖ దుఃఖాలే కాక తద్రూప వాసనలు కూడా పరజన్మలో కలుగుతుంటాయి. అందులో సుకృతఫల వాసనలు శుభమార్గానికి ప్రేరేపిస్తాయి. దుష్కృతఫల వాసనలను దుర్వాసనలని అంటారు. అవి రకరకాల సంశయాలను రేకెత్తించి మనస్సును నానా మార్గాలకు మళ్లిస్తుంటాయి.

మనోనిశ్చయం కలగాలంటే ముమ్మందుగా సంశయవిచ్ఛేదం కావాలి. అది భగవత్స్వరూపజ్ఞానం వలన కాక అన్యవిధాల సిద్ధింపదు.

**మ. అవివేకానుగత స్వకార్యజలపూరాకీర్ణమై మిత్ర బం**
**ధు వధూ పుత్త్ర జలగ్రహోగ్రయుతమై దుర్దాంతమైనట్టి దు**
**ర్భవ పాథోధిఁ దరించువారె హరసంబంధక్రియాలోల భా**
**గవతానుగ్రహ నావ లేని యధముల్ కళ్యాణసంధాయకా!**

మహాత్మా! భగవత్స్వరూపజ్ఞానం కలగాలంటే–

1. భగవంతుడనగా ఎవరు? సకల సృష్టి స్థితి సంహార కారణమని చెప్పబడుతున్న భగవచ్ఛక్తి ఎవరి యందు అనువర్తిస్తుంది?

2. త్రిగుణాత్మక మాయానియంత, అందువల్ల సర్వస్వతంత్రుడు అయిన భగవంతుడు అవతారాలను ధరించటం ఎందుకు?

3. భగవానుడు ఏయే అవతారంలో ఏయే కార్యాలను ఏయే

నిమిత్తాలను కూర్చుకొని ఆచరించాడు?

4. నిఃస్పృహుడు, నిష్క్రియుడు అయిన భగవానుడు మొట్టమొదట విశ్వాన్ని ఏలాగున సృజించాడు?

5. అలా సృజించిన ఈ జగత్తుకు జీవికా విధానాన్ని ఏ రూపంలో కలిగించాడు?

6. ఆ విధానం సమ్యక్తరంగా ఉండటానికి దాని పరిపాలన వైఖరిని ఎట్లా సమకూర్చాడు?

7. భగవానుడు తుదకు నివృత్తవృత్తుడై ఈ విశ్వమంతటినీ తన హృదయాకాశంలో ప్రవేశపెట్టి యోగమాయానిద్రకు ఎలా ఉపక్రమిస్తాడు?

8. మళ్లీ పునఃసృష్టికాలంలో ఈ విశ్వంలోనికి ఏ తీరున ప్రవేశిస్తాడు?

9. ఇంతటి మహాప్రభావంతో యోగీశ్వరులకు కూడా అధీశ్వరుడైన ఆ పరమేశ్వరుడు తాను ప్రప్రథమంలో ఒకడైనప్పటికీ బ్రహ్మాది రూపాలను ఎందుకు ధరించాడు?

10. ద్విజ గోసురవర్గం సుఖంగా ఉంటే విశ్వక్షేమం పాటిల్లినట్లు ఎందుకు ఉపలక్షించాలి?

11. వారికి క్షేమాన్ని కూర్చేందుకు భగవానుడు ఏయే అవతారాలను ధరించాడు?

12. ఒక్కొక్క అవతారంలో ఏయే క్రీడలు సల్పి ఏయే కార్యాలను నెరవేర్చాడు?

వీటి వివరాలన్నీ సమగ్రంగా తెలియాలి. అంతేకాదు–

13. బ్రహ్మాండగోళం బహిరంతర్భాగాలలో అనేకలోకాలు

ఉన్నాయని ఒక్కొక్క లోకానికి ఒక్కొక్క పాలకుడు ఉంటాడని, ఒక్కొక్క లోకంలోని ప్రాణిజాతం ఒక్కొక్క విధమైన కర్మలలో మాత్రమే నియమితమై ఉంటుందని, ఈ భేద విధానమంతా తత్త్వభేదాలను బట్టి ఏర్పడుతున్నదని చెబుతారు. ఆ తత్త్వస్వరూపం ఏమిటి?

14. ఆదినారాయణుడు స్వతస్సిద్ధుడని, ఆ మహాత్ముడు జీవుల యందు ఆత్మస్వరూపంలో ఉంటాడని అన్నారు. ఆ జీవులు వివిధ స్వభావాలను కలిగి తత్తదనురూపశరీరాలను పొంది ఆ శరీరయోగ్యాలైన కర్మలను ఆచరిస్తూ నానారూపనామాలతో ఉన్నారు. జీవులకు ఈ భేదం ఎలా కలిగింది?

మహాత్మా! ఈ వివరాలను శాస్త్రానురూపంగా సమన్వయించుకొంటే పరమేశ్వర తత్త్వ చరిత్రల సారం అతిసులభంగా అర్థమౌతుంది. ఆ జ్ఞానామృతాన్ని ఎంత గ్రోలినా తనివి తీరదు. ఇదంతా శ్రీ వేదవ్యాస మునీంద్రుడు మహాభారతంలో వివరించాడు కదా, అంటే అందులో బ్రాహ్మణాది త్రైవర్ణికుల ధర్మాలు, శూద్రాదుల ధర్మాలు ప్రధానంగా వర్ణింపబడ్డాయని నా ఉద్దేశం. ఆ ధర్మవిస్తారాన్ని నేను పలుమార్లు విన్నాను. అయితే అందులో నాకెంతో ప్రీతిపాత్రమైన కృష్ణకథామృతం రవ్వంత చవిచూపబడినా, సమగ్రంగా, మనస్సుకు తృప్తి కలిగేటంత కూలంకషంగా జాలువారలేదు. వర్ణాశ్రమధర్మాలను ఎంత శ్రద్ధతో విన్నా, ఎంత భక్తితో ఆచరించినా, వాటి వలన తుచ్ఛమైన క్షణికసుఖాలు కొన్ని కలుగుతాయేమో కాని, అవి శాశ్వతానందాన్ని ఇవ్వలేవు. అందువలన ధర్మవిస్తార శ్రవణ మాత్రాన ఫలోపలబ్ధి కలుగదన్న విషయం స్పష్టమే.

శ్రీకృష్ణ కథామృతాన్ని వీనులకు విందుగా ఎంత ఆస్వాదించినా తనివి తీరదు. నీ వంటి మహానుభావులు, నారదాది భక్తాగ్రేసరులు ఎన్నోసార్లు

సభాంతరాళాలలో భగవత్కథామృతాన్ని మా బోంట్లకై కురిపించారు. అందులో మునిగి ఓలలాడినా మాకెన్నడూ చాలనిపించలేదు. అది భగవత్కథలలో నిండారిన సుధారసదోషమే కాని మా దోషం కాదు. అనఘా! ఎవనికి కర్ణరంధ్రాల మూలకంగా శ్రీకృష్ణకథామృతం హృదయాంతరాన్ని ప్రవేశించి పరవశింపజేస్తుందో అతనికి వెనువెంటనే గృహ భార్యాపుత్త్రాద్యాసక్తి రూపమైన సంసార రతి పూర్తిగా నశించిపోతుంది.

మహాత్మా! నీ సఖుడు వ్యాసమునీంద్రుడు నారాయణీయ మోక్షధర్మాలను భగవద్గుణ వర్ణనాత్మకంగా విరచించినప్పటికీ అతి సంక్షిప్తమైన వాక్యజాతం వలన గ్రంథతాత్పర్యం దురవగహంగా ఉన్నది. సామాన్యంగా నా బోటివారు గ్రామ్యసుఖ పరజాడ్యగ్రస్తులై ఉంటారు. మా బుద్ధి జాడ్యాలను హరికథామృతసేవనంతో కుదుటపరచాలని వ్యాసమునీంద్రుడు సిద్ధౌషధమైన నారాయణీయాన్ని సేకరించి, దానితో అనుపానార్థం అర్థకామాదివర్ణనను బహుళంగా సమకూర్చి ఉంటాడు. ఆ మహౌషధాన్ని శ్రద్ధాభక్తులతో సేవింప నోచిన పుణ్యాత్ములకు వారి జాడ్యాలు క్రమక్రమంగా నయమౌతాయి. ఎట్టకేలకు వారు కృతార్థులౌతారు. కొందరి జాడ్యాలు కేవలం ఔషధాన్ని సేవించినంత మాత్రాన నయం కాదు. అట్టి వారిని హరికథాసాగరంలో తీర్థమాడించాలి. నేను అటువంటి వాడినే కనుక నిన్నింతగా ప్రాధేయపడుతున్నాను.

మహాత్మా! భగవత్కథలకు అంతటి మహాప్రభావం ఉన్నా, వాటి యెడ కొందరికి ఆసక్తి కలుగదు. భాగవత తాత్పర్యమూఢులైన ఆ మందభాగ్యుల దురదృష్టం ఏమి చెప్పను? వారి స్థితి పాపం అత్యంత శోచనీయంగా ఉంటుంది. మరి కొందరు భాగవత తాత్పర్యం తెలిసీ హరికథలకు విముఖంగా ఉంటారు. వారుమరీ శోచ్యాతిశోచ్యులు. వారికై నాకు కలిగే జాలి, దుఃఖం అంతా ఇంతా కాదు. వారుమరీ సంసార దుఃఖార్తులై శరీర వా ఙ్మనో వ్యాపారాలన్నింటినీ రిత్తపుచ్చుతున్నారు. కాలం వారి ఆయువును చూస్తూ చూస్తూ ఉండగానే, వారి యెట్టయెదుటనే హరించుకొని పోతున్నది.

చివరికి వారు పతితులై సర్వభ్రష్టులవుతున్నారు. వారికి తరణోపాయం ఏమిటని నేను ఆలోచిస్తుంటాను. సర్వలోకాలకూ శాంతినిస్తున్నవాడు, జీవజాతానికి రక్షారూపసుఖాన్ని ప్రసాదిస్తున్నవాడు, సంసారదుఃఖార్తులకు పరమబంధువైన ఆ పరమేశ్వరు డొక్కడే వీరిని ఆదుకోగలడని నాకు తోచింది. ఆ పరమేశ్వరుని సేవింపగలగటం ఒక్కటే వీరికి తరణోపాయమని నిశ్చయించాను. అందువలన వారందరికీ సులభగ్రాహ్యమైన తీరున శ్రీహరి కథలలో సారభూతమైన దివ్యాంశాలను పువ్వుల నుంచి మకరందాన్ని తీసే తుమ్మెద వలె ఏర్చి కూర్చి వివరించి ఏతన్మాధుర్యాన్ని చవిచూపి వారివంటి వారందరికీ శుభాన్ని అనుగ్రహించు. ఆ పుణ్యకథామృతాన్ని గ్రోలి నేను ధన్యుడనై తరిస్తాను," అని ప్రార్థించాడు.

## విదురుని పూర్వవృత్తాంతం

విదురుని పలుకులను విని మైత్రేయుడు–

'సాధువర్యా! లోకానుగ్రహార్థమై నీవు కోరినది ఎంతో శ్లాఘ్యంగా ఉన్నది. ఈ నీ సంకల్పాన్ని బట్టి నీకు గల హరిభక్తి విశేషం ప్రకటితమౌతున్నది. మిత్రమా! బాదరాయణుని వీర్యప్రభావంతో జన్మించి భగవంతుని అనన్య భావంతో ఆరాధించిన నీయెడ ఇది విచిత్రమేమీ కాదు. నీకు శూద్రత్వం శాపవశాన కలిగినదే కాని కర్మఫలం వలన కాదు. కనుక ఉపాధికృత దోషం నీకు వర్తింపదు. అంతే కాక నీవు మర్త్యరూపంలో నేలకు దిగివచ్చిన ధర్మకర్తవు. మాండుక్యమహర్షి శాపం వలన శూద్రయోని యందు నీకు పుట్టువు కలిగింది. విను:

పూర్వం విచిత్రవీర్యుడు కౌరవరాజుగా ఉండి పిల్లలు పుట్టక మునుపే మరణించాడు. అతనితో కౌరవవంశం అంతరించే ప్రమాదం ఏర్పడింది.

వేదవ్యాసుడు విచిత్రవీర్యునికి అన్నగారు. కౌరవ వంశాన్ని నిలబెట్టమని అర్థించిన తల్లి కోరికను మన్నించి ఆయన విగతభర్తృకలైన అతని భార్యలకు సంతానప్రదానం కావించాడు. ఆ సమయంలో ఒక దాసి ఆ మునీంద్రుని

అనుగ్రహానికి నోచుకొన్నది. ఆమె గర్భవాసాన నీవు జన్మించావు. నీకు శూద్రోపాధి శాపఫలమే గానీ కర్మఫలం కాదు కనుక బ్రహ్మజ్ఞానలబ్ధి నీకు తప్పక చేకూరుతుంది.

సౌమ్యా! ఈ నీ కోరిక లోకానుగ్రహార్థమై నీకు కలిగింది. నీవు శ్రీకృష్ణ భగవానునకు ఎంతో ఇష్టుడవు. భగవానుడు నీకు ఇవ్వకూడనిది కానీ నీవు అతని నుంచి పొందరానిది కానీ లేకపోయినా, భగవానుడు తానుగా నీకు తత్త్వార్థాన్ని ఉపదేశింపక ఆ పనిని నాకు అప్పగించి వెళ్లిపోయాడు. నీవు పొందనున్న ఈ జ్ఞానం నీతో అంతరింపదని, నీ వలన లోకవ్యాప్తమౌతుందని అతని తాత్పర్యం. ఇది లోకానుగ్రహమే కదా!

## సృష్టిప్రకారం

మిత్రమా! భగవల్లీలలను గురించి అడిగావు. ఆ లీలలన్నీ ఒక రూపాన ఉండవు. అందులో కొన్ని యోగమాయావిశేషాలు; కొన్ని విశ్వ సృష్టి స్థితి లయ విషయకాలు.

భగవదవతార విశేషాలను యథాశక్తి వివరిస్తాను విను.

## ఆత్మస్వరూప వివరణం

సర్వసృష్టికి పూర్వం భగవంతుడు ఒక్కడే అద్వితీయుడై ఉన్నాడు. అప్పటి అతని రూపం ఆత్మస్వరూపం.

ఆత్మ అంటే పూర్ణమూ, సర్వవికార విరహితమూ, కేవలం 'అస్తి' (ఉన్నది) అని మాత్రం చెప్పదగినదీ అయిన ఒకానొక సారభూత మూలపదార్థం.

ఆ ఆత్మ జడస్వరూపం కాదు; శక్తిమంతం. ఆ శక్తి ఆత్మకు స్వతస్సిద్ధం. ఆ శక్తిని మాయ అంటారు.

మాయ ఎల్లప్పుడూ ఆత్మను ఆశ్రయించి ఆ ఆత్మ యొక్క అభీష్టానుసారం వర్తిల్లుతుంది.

శక్త్యాత్మల సంబంధాన్ని మనకూ మన శక్తికీ ఉన్న అవినాభావంతో పోల్చి చెప్పవచ్చు.

ఆత్మకు సత్యము – జ్ఞానము – అనంతము – రూపము – నామము అని అయిదు లక్షణాలు ఉన్నాయి.

వీటిలో సత్యము, జ్ఞానము, అనంతము అన్న మూడూ స్వరూప లక్షణాలు. రూపము, నామము అన్నవి తటస్థ లక్షణాలు. స్వరూప లక్షణాలకు ఎటువంటి పరిస్థితిలోనూ మార్పు అనేది ఉండదు. ఏ లక్షణాలకు మార్పు కలుగుతుంటుందో వాటిని తటస్థ లక్షణాలని అంటారు.

రూపాది తటస్థ లక్షణాల మార్పు కూడా ఆత్మ ఇష్టప్రకారమే జరుగుతుంది. స్వరూపలక్షణాలలో ఆత్మశక్తి ఆత్మలోనే లీనమై ఉంటుంది. కనుక దానికి వ్యవహారం ఉండదు. తటస్థలక్షణాలలో ఆత్మశక్తి ఆత్మప్రేరితమై వ్యవహారాన్ని పొందుతుంది. ఆ వ్యవహారఫలంగా రూపనామాలు ఏర్పడుతుంటాయి.

## ఆత్మ సర్వవ్యాపకత్వం

ఈ రూపనామాత్మకమైన దానిని విశ్వమంటారు. ఈ విశ్వమంతా చరాచరాత్మకం. ఈ చరాచరాలు నానా ఉపాధులతో కూడి ఉంటాయి. ఆ భేదాన్ని బట్టి సృష్టిభేదం కలుగుతున్నది కనుక ఈ భేదజాలమంతా రూపనామాత్మకమైన విషయం మాత్రమేనని గుర్తుంచుకోవాలి.

ఈ భేదజాలం అంతటిలోనూ తేనెలో ఉన్న తీయదనం వలె ఆత్మ అనుస్యూతంగా ఉంటున్నది. ఆ విధంగా అనుస్యూతమై ఉన్నప్పటికీ దాని ప్రకాశం అన్నింటిలోనూ ఒకే తీరున కనిపించదు. ఉపాధుల భేదమే అందుకు కారణం.

ఉపాధులు మందములు – మధ్యమములు – ఉత్తమములు అని మూడు

విధాలు. ఆ ఉపాధులను బట్టి వాటిలో ఉన్న ఆత్మ యొక్క ప్రకాశం కూడా మందమధ్యమోత్తమాలని మూడు విధాలు.

కుడ్యాదులు మందోపాధులు. వాటికి చైతన్యప్రకాశం లేదు. మహిషాదులు మధ్యమోపాధులు. వాటి చైతన్యశక్తి పరిమితప్రాయం. నరాదులు ఉత్తమోపాధులు.

అంతే కాని ఆత్మ లేనటువంటి పదార్థమే ఉండగదు. జడమనగా ఆత్మశూన్యపదార్థమని అనుకోకూడదు.

సర్వమూ ఆత్మస్వరూపమే అయినప్పుడు ఆత్మలేని పదార్థం ఒకటి ఉండటం ఎలా సాధ్యమౌతుంది?

## ఆత్మ ప్రకాశాప్రకాశ వివరణం

ఆత్మప్రకాశానికే జ్ఞానమని పేరు. ఈ జ్ఞానం ఉపాధిభేదత్రయాన్ని బట్టి మూడు విధాలని చెప్పాను. ఇది ఆత్మకు స్వరూపలక్షణం కనుక ఆత్మ ఉన్న అన్ని తావులలోనూ ఇది కూడా ఉండి తీరుతుంది.

ఆ విధంగా జ్ఞానం సర్వోపాధులలోనూ ఉన్నప్పటికీ దాని ప్రకాశం మాత్రం అన్నిటా ఏకవిధం కాక ఉపాధిభేదాలను అనుసరించి ప్రకాశ్యమవుతుంది.

దీనిని బట్టి మన దృష్టికి జడపదార్థాలుగా కనిపించే వస్తువులలో కూడా జ్ఞానప్రాణాలు ఉంటాయని తెలుసుకోవాలి. అయితే ఉపాధితత్త్వాలను బట్టి జ్ఞానప్రాణాంశలు వాటిలో ఉన్నప్పటికీ లేనట్లు తోపజేస్తుంటాయి. అంత మాత్రాన ఆ ఉపాధులు జ్ఞానప్రాణరహితాలని నిశ్చయింపకూడదు.

ఈ రహస్యం సూక్ష్మాతిసూక్ష్మతరమైన అంతర్దృష్టికి మాత్రమే గోచరిస్తుంది.

దీనివలన భగవంతుని సర్వాంతర్యామిత్వం బోధపడుతుంది. తత్ఫలితంగా సమదృష్టి, దాని వలన పరమశాంతి చేకూరుతాయి.

## అద్వితీయత్వ వివరణం

విదురా! సృష్టికి పూర్వం భగవంతుడొక్కడే ఉండేవాడని చెప్పాను. ఈ అద్వితీయత్వ లక్షణాన్ని పరిశీలిద్దాము.

సృష్టికి పూర్వం ఒకటి కాక రెండు వస్తువులు ఉన్నట్లయితే, అవి రెండూ ఒకదానినొకటి చూడగలిగినవి కాని, కనీసం వాటిలో ఒకటి చూచేది, మరొకటి చూడబడేది కాని అయితీరాలి. అట్లా కాని నాడు రెండు వస్తువులున్నాయని చెప్పడానికే వీలులేదు. ఆ రెండింటి లోనూ చూచేవాడొకడు ఉండి, దీనిని నేను చూస్తున్నానని చెప్పగలగాలి. అతను ఆ విధంగా చెప్పడానికి ముందుగా చూడబడే పదార్థం ఒకటి ఉండాలి. చూసేవాడికంటె అన్యతరమై చూడబడే పదార్థం ఒకటి లేనప్పుడు చూసేవాడు కూడా ఉండీ లేనివాడే అవుతాడు.

తత్త్వపరిభాషలో ఈ చూసే అతనిని ద్రష్ట అని, చూడబడే పదార్థాన్ని దృశ్యమని నిర్వచిస్తారు. దృశ్యం ఉన్నప్పుడు ద్రష్ట కూడా ఉంటాడని చెప్పాను.

ఇంతకీ దృశ్యమంటే ఏమిటి? ఈ విశ్వమే. ఇది ఎక్కడి నుంచి వచ్చింది? ద్రష్ట అయిన పరమాత్మ నుంచి వచ్చింది. అంటే, పరమాత్మ ఒక రూపాన్ని ధరించినప్పుడు ఆ రూపాన్ని మనం విశ్వం అంటున్నాము.

ఈ విశ్వానికి ప్రపంచం అని కూడా పేరున్నది. ప్రపంచం అంటే విస్తరించడం అని అర్థం. పరమాత్మ అగోచర రూపం నుంచి గోచరరూపంగా విస్తరించడమే ప్రపంచం అనబడుతోంది.

ఈ విస్తారం పంచభూతపూర్వకంగా ఏర్పడుతున్నది. కనుక ప్రపంచ శబ్దం కేవల విస్తారాన్ని మాత్రమే కాక అట్టి విస్తారానికి సాధన భూతాలైన పంచభూతాలను కూడా సూచిస్తున్నది.

భగవంతుడు ఆ విధంగా ప్రపంచింపక పూర్వం కేవలుడు, ఏకమాత్రుడు అయి కారణాత్మకంగా ఉన్నాడు. అప్పుడు ద్రష్టృ దృశ్యాలనే భావాలకే

అవకాశం లేదు. భగవానుడు అలా ఏకైకుడుగా ఉండటానికి కారణం ఏమంటావా ..... అతని ఇచ్ఛ ఒక్కటే అందుకు కారణం తప్ప వేరొక కారణం లేదు. అన్ని కారణాలకూ భగవంతుడే మూలకారణమౌతుండగా అతనికి వేరొక కారణం ఏముంటుంది?

ద్రష్టృ దృశ్యాలలో భగవంతుడు ఏకైకమాత్రుడై రెండవది లేనప్పుడు ద్రష్ట మాత్రమే అవుతాడు. ఎప్పటికైనా ద్రష్ట ఒక్కడే ఉండి దృశ్యపదార్థం లేనప్పుడు అతను ఉండీ లేనివాడే అవుతాడని మనమిప్పుడే అనుకొన్నాము.

భగవానుడు తానొక్కడు మాత్రమే ఉన్న అవస్థలో తాను ఉన్నప్పటికీ లేనివానిని గానే భావించాడని అనుకోవాలి.

ఇంకా లోతుకు దిగి విచారిస్తే, ఆ భావానికీ అవకాశం లేదు. ఏమంటే, దృశ్యభావం ఉన్నప్పుడే ద్రష్టృభావం ఉంటుంది. ఎంత చూడగలవానికైనా చూపునకు విషయభూతమైన దృశ్యపదార్థం లేనప్పుడు 'నేను చూస్తున్నాను' అనే ద్రష్టృభావం జనించడానికి అవకాశం ఎలా కలుగుతుంది? దీనినే భగవంతుని అద్వితీయావస్థ అంటారు.

భగవంతుడు శక్తిమంతుడని చెప్పాను. శక్తికి, ఆ శక్తిని కలిగి ఉన్నవానికి వేరే వేరే స్థితులు కలగవు. శక్తి, శక్తిమంతులు వాగర్థాల వలె సర్వవేళలా కలిసి మెలిసి ఉంటారు.

భగవానుడు అద్వితీయుడై ఉన్నప్పుడు అతని శక్తి అతనిలోనే లీనమై ఉన్నది. ఆ శక్తిని మాయ అంటారని ఇంతకు ముందే చెప్పాను.

ఈ మాయ అన్న శక్తిపదార్థం కారణ కార్య రూపంలో ఉంటుంది. అంటే కార్యం కారణంలో ఇమిడి ఉంటుంది. ఈ మాయావ్యవహార ఫలంగా సృష్టి ఏర్పడుతున్నది.

సృష్టి అనగానే తత్పూర్వం లేనిదానిని క్రొత్తగా పుట్టించడమని పొరబడకూడదు. అభావం నుంచి భావపదార్థం ఎన్నడూ కలగదు. కనుక

సృష్టి అంటే అప్రకాశంగా ఉన్న దానిని ప్రకాశింపజేయడమని గ్రహించాలి.

మిత్రమా! భగవానుని మాయామహాశక్తికి జ్ఞానము ఇచ్ఛ క్రియ మొదలైన అనేకాంశలు ఉన్నాయి. అంతే కాక మాయకు మూడు ధర్మాలు కూడా ఉన్నాయి. వాటిని గుణాలంటారు. అవే సత్త్వము రజస్సు తమస్సు అనబడుతున్నాయి.

ఎప్పుడు భగవంతుని జ్ఞానశక్తి ఇచ్ఛారూపాన్ని ధరిస్తుందో, ఆ సమయాన్ని కాలం అంటారు.

భగవంతుని ఇచ్ఛాశక్తి అంతకు పూర్వం స్తిమితంగా ఉన్న గుణత్రయాన్ని సంక్షోభింపజేస్తుంది. ఈ విధానాన్ని భగవద్వీర్యానుసంధాన మంటారు. భగవంతుడు తన చిదాభాసమైన వీర్యాన్ని అంటే తన శక్తిని ప్రకృతియందు అనుసంధించడం అని దీని భావం.

## భగవత్ప్రథమ రూపాంతరం - మహత్తత్త్వం

అందువలన తత్పూర్వం అవ్యక్తంగా ఉన్న ప్రకృతి వ్యక్తావస్థకు వస్తుంది. ఆ విధంగా వ్యక్తావస్థలో ఉన్న ప్రకృతిని మహత్తత్త్వం అంటారు.

మహత్తత్త్వం యొక్క ప్రథమలక్షణం విజ్ఞానం. ఇది తమస్సును – అనగా అజ్ఞానాన్ని – తొలగిస్తుంది. విజ్ఞానఫలంగా అజ్ఞానం తొలగిపోయి అంతకు ముందు పరమాత్మలో ఇమిడి ఉన్న విశ్వం ప్రకటమౌతుంది.

ఈ విశ్వానికి చిదాభాసం నిమిత్త కారణం, గుణాలు ఉపాదాన కారణం, కాలం క్షోభకారణం. ఈ మూడింటి వలన మహత్తత్త్వం ఉదయించింది. కనుక అది ఈ మూడింటికి అధీనమని చెప్పబడుతున్నది.

ఆ విధంగా ఏకమైన పరమాత్మ నుంచి మహత్తత్త్వమనే రెండవ పదార్థం జనించినందువల్ల భగవంతుడు ద్రష్ట, మహత్తత్త్వం దృశ్యం అన్న విభాగం ఏర్పడింది. అప్పుడు భగవంతుని ఏకత్వానికి ద్వితీయత్వం అంకురిస్తున్నది.

## ద్వితీయ రూపాంతరం - అహంకార తత్త్వం

భగవంతుడు తన రూపాంతరమైన మహత్తత్త్వంలో అనుస్యూతంగా ఉంటాడు. ఈ విధంగా ఉండటాన్ని అభిమానం అంటారు. ఎప్పుడయితే భగవదంశ తన రూపాంతరంలో అభిమానాన్ని పొందిందో, ఆ అభిమానాంశాన్ని జీవాత్మ అన్నారు. అంటే, అవస్థాభేదమాత్రాన భగవత్తత్త్వానికి పరమాత్మ జీవాత్మ భేదం ఏర్పడింది.

భగవంతుడు రూపాంతరాన్ని గ్రహించడమే విశ్వసృష్టికి ప్రారంభకం.

భగవంతుడు మహత్తత్త్వరూపాన్ని పొందినప్పుడు కారణకార్యాలు రెండు జనించాయని అనుకొన్నాము. మహత్తత్త్వం అహంకార రూపాంతరాన్ని పొందినప్పుడు కారణ కార్య కర్తలు ఏర్పడుతున్నాయి. వాటిలో కారణాన్ని అధ్యాత్మమని, కార్యాన్ని అధిభూతమని, కర్తను అధిదైవమని పేర్కొన్నారు. ఈ మూడింటి వికారములై ఇంద్రియాలు, పంచభూతాలు, మనస్సు ఏర్పడ్డాయి.

ఈ అహంకారం భగవంతుని ద్వితీయ రూపాంతరం.

## అహంకారత్రయం

ఈ అహంకారం వైకారికము తైజసము తామసము అని మూడు విధాలు. ఈ భేదత్రయం సత్త్వాది గుణత్రయభేదాన్ని బట్టి కలుగుతున్నది.

వైకారికం నుంచి మనస్సు, తైజసం నుంచి జ్ఞానకర్మేంద్రియాలు, తమస్సు నుంచి భూతసూక్ష్మమైన శబ్దము జనించాయి.

ఇక్కడ మనస్సంటే దేవతలని కూడా సూచ్యార్థసూచనం చేయబడింది. దేవతలకు సుమనస్సులనే పేరు కూడా ఉన్నది.

ఎందుకంటే వైకారికం సాత్త్వికం. దేవతలూ సాత్త్వికులే. అందువల్ల మనశ్శబ్దం దేవతలను సయితం సూచిస్తుంది.

ఈ దేవతలు శబ్దాది విషయాలను ప్రకాశింపజేస్తారు. అందువలన వారికి ఇంద్రియాధిష్ఠాతలని పేరు వచ్చింది.

ఈ దేవతలకూ బ్రహ్మాండసృష్టి తర్వాత వచ్చిన దేవతలకూ భేదం ఉన్నది.

కనుక ప్రకృతార్థంలో దేవతలంటే ఇంద్రియార్థ ప్రకాశకమాత్రులని అర్థం చేసుకోవాలి.

## తృతీయరూపాంతరం - ఆకాశం

ఈ శబ్దమనే భూత సూక్ష్మం నుంచి ఆకాశం జనించింది. అది పరబ్రహ్మానికి శరీరమూ, పరబ్రహ్మజ్ఞానానికి సాధనమూ అయినందున ఆకాశం శబ్దగుణమని వ్యవహారం ఏర్పడింది.

ఈ ఆకాశాన్ని కాల మాయాంశలతో భగవంతుడు వీక్షించటం జరిగింది. ఇక్కడ మాయా శబ్దానికి తామసాంశమైన ప్రకృతి అని భావం. అంశమంటే చిదాభాసమని అర్థం. అనగా ఆకాశం తామసాహంకారం వలన జనించినదని తాత్పర్యం.

ఇది భగవంతుని తృతీయ రూపాంతరం.

## చతుర్థాది రూపాంతరాలు

ఆకాశం వలన స్పర్శము జనించింది. అది వాయురూపాంతరాన్ని పొందింది. ఇది నాల్గవ రూపాంతరం.

వాయువు ఆకాశంతో కూడి అత్యంత బలవంతమై రూపతన్మాత్రను పుట్టించింది.

రూపము అంటే రంగుతో కూడినది, వర్ణము అని భావం. ఇది అయిదవ రూపాంతరం.

ఈ రూపతన్మాత్ర నుంచి తేజస్సు – అంటే అగ్ని జన్మించింది. ఇది ఆరవ రూపాంతరం.

ఈ తేజస్సు వలన సర్వలోకమూ ప్రకాశిత మవుతున్నది. ఈ తేజస్సు వాయువుతో కూడి భగవద్వీక్షితమై రసమును పుట్టించింది. ఇది ఏడవ రూపాంతరం.

ఈ రసము కాలమాయాంశ యోగంతో ఉదకాన్ని కలిగించింది. ఈ జలం అగ్నితో కూడి బ్రహ్మవీక్షితమై గంధాన్ని పుట్టించింది. ఇది ఎనిమిదవ రూపాంతరం.

ఈ గంధం కాలమాయాంశయోగాన్ని పొంది పృథివిని కలిగించింది.

ఈ విధంగా ఆకాశాది పంచభూతాలు కలిగాయి. ఈ ఎనిమిది రూపాంతరాలను బట్టి భగవంతునికి 'అష్టమూర్తి' అని పేరు వచ్చింది.

## పంచభూతాల గుణతారతమ్యం

ఆకాశం, వాయువు, అగ్ని, జలము, పృథివి – అన్న ఈ అయిదూ అయిదు తత్త్వాలు.

పంచభూతాలలో పృథివికి జలం, జలానికి అగ్ని, అగ్నికి వాయువు, వాయువుకు ఆకాశం కారణాలైనందున ఆకాశాని కంటె వాయువు, వాయువు కంటే అగ్ని, అగ్ని కంటే జలం, జలాని కంటే పృథివి గుణాధిక్యాన్ని కలిగి ఉన్నాయి. అంటే ఆకాశానికి శబ్దం ఒక్కటే గుణం. వాయువుకు శబ్దస్పర్శాలు రెండూ గుణాలు. అగ్నికి శబ్దస్పర్శరూపాలు మూడు గుణాలు. జలానికి శబ్దస్పర్శరూపరసాలు నాలుగు గుణాలు. పృథివికి శబ్దస్పర్శరూపరసగంధాలు అయిదు గుణాలు.

దీని రహస్యమేమిటంటే, కార్యంలో కారణం అనుస్యూతమై ఉంటుందని చెప్పాను. కారణమంటే కారణతత్త్వమని భావం. ఒక్కొక్క తత్త్వానికి ఒక్కొక్క గుణం ఉండటం సహజం. ఆ తత్త్వం మరో తత్త్వం నుంచి కలిగినప్పుడు దాని నైజగుణంతోపాటు దానికి కారణమైన తత్త్వగుణాలను కూడా పొందుతున్నది. పృథివికి గంధగుణం నైజం. పృథివీతత్త్వానికి కారణం జలతత్త్వం. ఆ

జలతత్త్వంలో శబ్దస్పర్శరూపరస గుణాలు నాలుగున్నాయి. జలతత్త్వం పృథివీతత్త్వంగా మారినపుడు అది తన నాల్గుగుణాలతో కలిసి మారుతున్నది. వాటి కలయిక వలన అయిదవ గణమైన గంధం ఏర్పడి పృథివీతత్త్వం జనిస్తున్నది. అందువల్ల పృథివీతత్త్వంలో దాని ప్రధానగుణమైన గంధం, పృథివీతత్త్వానికి కారణమైన జలతత్త్వం లోని నాలుగు గుణాలు కలిసి ఉండటం ఏర్పడుతున్నది. ఇలాగే తక్కిన తత్త్వాల సంగతిని కూడా కార్యకారణ సమావేశాన్ని బట్టి ఊహించుకోవాలి.

## అన్యోన్యత - కార్యసాధనం

విదురా! కాలము, మాయ, అంశము - అని మనం ప్రస్తావించినవన్నీ విష్ణుదేవుని అంశలే కాని అతని కంటె వేరు కావు. ఆ అంశను మహదాదులలో అభిమానం ఉంచినపుడు అవి వాటికి అధిదేవత లవుతాయి. కాలానికి వికృతి. మాయకు విక్షేపం, అంశానికి చేతన అన్నవి లింగములు అంటే చిహ్నాలు అవుతాయి. ఈ అధిదేవతలందరూ సమానులు. వారిలో హెచ్చుతగ్గులుండవు. ఈ కారణాన్ని పురస్కరించుకొని వారందరూ స్వతంత్రులే. అందువల్ల ఈ అధిదేవతలు ఒకరితో ఒకరు కలిసి వర్తింపక విడివిడిగా ఉండటం మొదలుపెట్టారు.

నిజానికి భగవానుడు బ్రహ్మాండనిర్మాణార్థమై ఆ అధిదేవతలను పుట్టించాడు. వారందరూ కలిసి వర్తించితేనే కాని బ్రహ్మాండరూప కార్యం సిద్ధించదు. కలిసి వర్తించకపోవటం వల్ల వారు తమకు నిర్ణయించిన కార్యాన్ని చేయలేకపోయారు.

అప్పుడు వాళ్ళందరూ పరమేశ్వరుని వద్దకు వెళ్ళి ఇలా ప్రార్థించారు.

## మహదాది దేవతల ప్రార్థనం

'దేవా! ఏ నీ పాదారవిందాలు యతులకు సంసారదుఃఖ నిరాసకాలై, ప్రపన్న జన సంతాపశాంతికి దివ్యచ్ఛత్రాలై, తాపత్రయాగ్ని మహాభీల

సంసృతి సముద్ర తరణానికి సేగిలేని ఓడలై ఒప్పారుతున్నాయో ఆ నీ పవిత్రపాదారవిందాలకు సాష్టాంగప్రణామం. స్వామీ! నీ పాదాబ్జ మహిమలు భవన్ముఖసముద్భూత వేదరాశిని ఆశ్రయించినవారికి కొంతకు కొంత మాత్రమే గోచరిస్తాయనగా మా బోంట్ల సంగతి చెప్పేదేమున్నది? వేదములు అట్టి పరమసాధనాలు కనుక నీ చరణ సందర్శన యోగ్యతార్థులు వాటిని ఆశ్రయించి, ఎంతో పరిశ్రమించి పరిశుద్ధచిత్తు లవుతున్నారు. ఇంతెందుకు! గంగాతరంగిణి సర్వలోకపావనియై ఒప్పారుతున్నదంటే, ఆ నదీమతల్లికి అంతటి మాహాత్మ్యం నీ పాదకమలాల నుంచి పుట్టినందువల్ల చేకూరింది. ఇక నీ చరణాబ్జ మహిమ ఇంతని మేము చెప్పగలమా?

దేవా! నీ పాదసరోజ సందర్శన భాగ్యానికి జ్ఞానం తప్ప వేరొక మార్గం లేదు. అట్టి జ్ఞానానికి వైరాగ్యం ఒక్కటే పరమసాధనం. దానికి చిత్తశుద్ధి కావాలి. చిత్తం పరిశుద్ధం కావాలంటే అందులోని మలినాలన్నీ నశించాలి. ఆ మల నాశనం భక్తి వలన సిద్ధిస్తుంది. ఆ భక్తినీ మాహాత్మ్యాన్ని విన్నందువల్ల కలుగుతుంది. నీ మాహాత్మ్యాన్ని వినడానికి శ్రద్ధ అత్యంతావశ్యకం. శ్రద్ధ కలగడానికి నీ పాదపద్మాలు మూలం. కనుక సర్వాత్మకంగా నీ చరణాంబుజాలను ఆశ్రయించాము.

దేవా! భక్తిపూర్వకంగా నిన్ను స్మరించినంత మాత్రాన వెనువెంట నిలిచి అభయాన్ని ప్రసాదించి కాపాడుతావు. సృష్టి స్థితి లయాలు నీకు కేళిలీలలు. నీ అవతారాలు దుష్టశిక్షణ పూర్వక శిష్టరక్షణ నిమిత్తాలు. సర్వదేహాలలో నీవు అంతర్యామివై సర్వాత్మకుడవై వెలుగొందుతుంటావు. ప్రతివ్యక్తికీ సామీప్యాని కన్నా సమీపంలో ఉన్నప్పటికీ అహంకార మమకార రూప దురాగ్రహగ్రస్తులకు అత్యంత దూరవర్తివి. నీవు ప్రేమమాత్రసాధ్యుడవు. ఈర్ష్యాదులకు దుర్లభుడవు. అట్టి దేవదేవునకు నీకు ప్రణామం.

స్వామీ! అంతర్ముఖేంద్రియులు నీ పాదారవింద మకరందాన్ని చవిచూసి అన్యవిషయాలను వర్జించి నీ తోడిదే లోకంగా ఉంటారు. ఆ మహాభాగ్యం బహిర్ముఖులకు కోటి సంవత్సరాల కయినా కలగనేరదు.

దేవా! నిర్మలాంతఃకరణమనే పాదులో భక్తి అనే లతను నాటి నీ కథాసుధారసాన్ని ప్రోదిచేస్తే వైరాగ్యం పుష్పించి జ్ఞానఫలాన్నిస్తుంది. ఆ ఫలానుభవాన్ని పొందిన భాగ్యశాలులు నీ దివ్యవాసాన్ని చేరి చిరతృప్తులై సుఖాన్ని చూరగొంటారు. నీ పద సాన్నిధ్య మహాభాగ్యానికి ఇది ఎంతో సులభమైన మార్గం. నిన్ను చేరుకొనడానికి ఆత్మసమాధియోగమనే మార్గం వేరొకటి ఉన్నది కాని అది ప్రయాసబాహుళ్యం వలన అందరికీ అందుబాటులో లేదు. మేము మొదటి మార్గాన్ని మెట్టి నీ పాదమూలాన్ని ఆశ్రయించాము. మా మొరాలకించు.

దేవా! విశ్వసృష్టికై నీవు మానవులను పుట్టించావు. అయితే త్రిగుణాలు మా కందరకీ ఏకవిధం కాక ఒక్కొక్కరికీ ఒక్కొక్కటి స్వాభావిక మయ్యాయి. ఆ గుణాలు ఒకదానితో ఒకటి కలయక వేర్వేరుగా వర్తిల్లుతున్నాయి. అందువలన నీకు క్రీడోపకరణమైన బ్రహ్మాండాన్ని సృజించడం మాకు సాధ్యం కావడం లేదు. ఈ సృష్టి సమస్తం నీ భోగార్థమే కాని వేరు కాదు కదా. నీ భోగమంటే నీ అంశలైన జీవుల భోగమే కదా.

స్వామీ! కారణం లేక కార్యం కలుగదు. ఎల్ల కార్యాలకూ మేము కారణ శరీరులము. మాకు నీవే ఆద్యుడవు. అంతే కాదు. నీవు నిర్వికారుడవు. పురాతనుడవు, ఈ సర్వానికీ అధిష్ఠాతవు. నీ వీర్యమనే మహత్తత్త్వాన్ని నీ మాయలో ఉంచావు. నీ మాయ అంటేనో దానికి పుట్టుక లేదు. అయినా అది జన్మాదికర్మలకు కారణమవుతున్నది. దేవా! నీ వీర్యనిక్షేపఫలంగా మేము జన్మించాము. నీ కార్యార్థమై పుట్టినవారమైనా మాకు కర్తవ్యం ఏర్పడకున్నది. ఏమి చేయాలన్నా తోచడం లేదు. మమ్మల్ని అనుగ్రహించి కార్యసాధనకు వలసిన జ్ఞానశక్తులను మాకు అనుగ్రహించు.'

## బ్రహ్మాండాది సృష్టి

విదురా! మహదాది తత్త్వాల ప్రార్థనోదితాన్ని భగవానుడు విని, 'ఔరా! నా శక్తి యొక్క అంశలు దేనిపాటికది ప్రత్యేకించి ఉన్నంత కాలం ఏకార్యమూ నెరవేరదు. సమిష్టిగా ఉన్నప్పుడు ఎంత పనైనా జరిగిపోతుంది. అవి ఈ మాత్రం తెలుసుకోలేక ఇంత చేద్పాటును కలిగించాయి. ఒక అంశం మరొక అంశతో కూడి వర్తించినప్పుడే ఫలోదయ మవుతుంది. కాని నాడు అవి సుస్తావస్థలో ఉన్నట్లే లెక్క. ఇన్ని విశిష్టతత్త్వాలు ఉన్నా చివరికి ఏమీ లేనట్లే అయింది' అని తలపోసి, మొట్టమొదట కాలశక్తిని ఉద్భోదించి దానితో ఇరవైమూడు తత్త్వాలనే శక్తుల లోనికి ఏకకాలంలో తాను ప్రవేశించాడు.

విదురా! కాలమంటే సంక్షోభించే శక్తి అని, ఇరవై మూడు తత్త్వాలు భగవద్రూపాంతర శక్త్యంశలనీ చెప్పాను. కాలశక్తిని క్రియాశక్తి అని కూడా అంటారు. భగవానుడు ఆ విధంగా క్రియాశక్తియుతుడై తక్కిన తత్త్వాలలోనికి ప్రవేశించి, వాటికి ఐకమత్యం కలిగించి, వాటిలో లీనమై ఉండిన కర్మశక్తిని ప్రబోధించారు.

భగవత్ప్రబోధితాలైనంతనే మహదాది తత్త్వాలన్నీ కలిసి మెలిసి వ్యవహరింపసాగాయి. తత్ఫలితంగా విరాట్పురుషదేహం ఏర్పడింది. ఆ దేహంలో చరాచర సమస్త లోకాలున్నాయి.

## పరమాత్ముని ప్రథమావతారం

విరాట్పురుషుని ఆదిపురుషుడని కూడా అంటారు. ఆ పురుషుడు హిరణ్యవర్ణుడు. అతను సర్వజీవజాలంతో బ్రహ్మాండాంతర జలాలలో వేయి సంవత్సరాలు ఉన్నాడు. మహదాదులు కారణమూ, విరాట్పురుషుడు కార్యమూ అయినందున అతనిని మహదాదిశక్తులు కన్న బిడ్డ అంటున్నాము.

ఆ పురుషునికి దైవశక్తి, కర్మశక్తి, ఆత్మశక్తి అని మూడు శక్తులు ఉన్నాయి. ఆ మూడింటినీ క్రమంగా జ్ఞాన క్రియా భోక్తృ శక్తులని అంటారు.

జ్ఞానశక్తి చైతన్యరూపమైనది. అది హృదయావచ్ఛిన్నమై ఏకరూపాన ఉంటుంది.

క్రియాశక్తి దశవిధాల వర్తిల్లుతుంది. ఆ పదింటిలో ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అన్న అయిదింటినీ ఒక వర్గం గాను, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అన్న అయిదింటినీ ఒక వర్గంగాను పేర్కొన్నారు. ఇందులో మొదటి పంచకాన్ని ప్రాణవాయువులని, రెండవ పంచకాన్ని ఉపప్రాణవాయువులని అంటారు.

భోక్తృశక్తి అధ్యాత్మాది భేదాలతో మూడు విధాల వర్తిల్లుతుంది. విరాట్పురుషుడు పరమాత్మాంశమై సమస్త వ్యష్టిరూపాలు రెండింటికీ ఆత్మరూపుడవుతాడు.

ఇది పరమాత్ముని ప్రథమావతారం. ఈ అవతారంలోనే భూతకోటి వివిధ రూపాలుగా భావింపబడుతున్నది.

## విరాట్పురుష వక్త్రాది స్థాన జననం

విదురా! మహదాదులు జగత్కారణమైన విధానాన్ని నీకు విశదీకరించాను. ఆ తత్త్వాలకు తగిన వృత్తిని కల్పించడం ఆవశ్యకమయింది. భగవంతుడు ఒక్కొక్క తత్త్వము యొక్క విజ్ఞానాన్నీ తలపోసి దానికి తగినట్లుగా వృత్తిని ఏర్పరిచాడు. ఈ వృత్తికల్పనకు అతను కావించిన ఆలోచనను తపస్సు అంటారు. తత్ఫలంగా విరాట్పురుషుని యందు కొన్ని స్థానాలు ఏర్పడ్డాయి. ఆ ప్రకారాన్ని విను.

విరాట్పురుషునందు మొట్టమొదట వక్త్రస్థానం ఏర్పడింది. అది శబ్దోచ్చారణకు యోగ్యమై వెలసింది. ఆ శబ్దోచ్చారణ కార్యానికి తగినట్లుగా వాగింద్రియం ఏర్పడింది. దానికి అగ్ని అధిష్ఠాతయై దానిని నడిపించేవాడయ్యాడు.

తర్వాత తాలుస్థానం జనించింది. అది రసజ్ఞానానికి యోగ్యమయింది. అందుకు సాధనమై జిహ్వేంద్రియం, దానికి అధిష్ఠాతగా వరుణుడు ఏర్పడ్డాడు.

ఆ పిదప నాసికా పుటాలు జనించి గంధజ్ఞానానికి యోగ్యంగా రూపొందాయి. అందుకు ఘ్రాణేంద్రియం సాధనంగా ఏర్పడింది. దానికి అశ్వినులు అధిదేవతలైనారు.

అనంతరం నేత్రస్థానాలు ఉదయించాయి. అవి రూపజ్ఞానానికి యోగ్యంగా రూపొందాయి. అందుకు చక్షురింద్రియం సాధనమై ఏర్పడింది. దానికి ఆదిత్యుడు అధిదేవత అయ్యాడు.

తర్వాత చర్మం ఏర్పడింది. అది అంతర్బహిః స్పర్శజ్ఞానానికి యోగ్యంగా రూపుదిద్దుకొన్నది. అందుకు త్వగింద్రియం సాధనమైంది. దానికి వాయువు అధిదేవతగా నిలిచాడు.

ఆ తర్వాత కర్ణములు పుట్టాయి. అవి శబ్దగ్రహణానికి యోగ్యములైనాయి. అందుకు శ్రోత్రేంద్రియం సాధకమయింది. దానికి దిగ్దేవతలు అధిష్ఠాత లయ్యారు.

తర్వాత మేఢ్రం జనించింది. అది ఆనందజ్ఞానానికి యోగ్యమయింది. అందుకు రేతస్సు సాధనమయింది. దానికి ప్రజాపతి అధిదేవత అయ్యాడు.

తర్వాత గుదం ఏర్పడింది. అది మలవిసర్జనకు యోగ్యమయింది. అందుకు పాయువనే ఇంద్రియం సాధనమైంది. దానికి మిత్రుడు అధిదేవత అయ్యాడు.

ఆ తర్వాత హస్తాలు ఉదయించాయి. అవి ప్రాణుల జీవికకు సాధనాలైనాయి. వాటికి ఇంద్రుడు అధిదేవత అయ్యాడు.

ఆ తర్వాత పాదాలు పుట్టాయి. అవి రాకపోకలకు సాధనాలుగా రూపొందాయి. వాటికి విష్ణువు అధిష్ఠానదేవత అయ్యాడు.

తర్వాత హృదయం ఏర్పడింది. అది సంకల్ప వికల్పాదులకు యోగ్యమయింది. అందుకు మనస్సు సాధనమయింది. దానికి చంద్రుడు అధిష్ఠానదేవత అయ్యాడు.

తర్వాత బుద్ధి ఉదయించింది. అది బోధన సాధనమై విలసిల్లింది. దానికి వాగీశుడు అధిదేవత అయ్యాడు.

తర్వాత అహంకారం ఏర్పడింది. అది కర్తవ్య జ్ఞానానికి సాధనమయింది. ఆ కార్యానికి చేతన ముఖ్యం. దానికి రుద్రుడు అధిదేవత అయ్యాడు.

అప్పుడు ఆ పురుషునికి శిరోభాగాన దివము, పాదతలాన భూమి, నాభి వలన అంతరిక్షం జనించాయి. ఆ మూటికీ ఒక్కొక్క విధమైన గుణమూ, దానికి తగిన వృత్తీ ఏర్పడ్డాయి.

విరాట్పురుష శిరోభాగస్థ దివస్థానంలోని గుణవృత్తులు దేవతలకు అనుకూలంగా ఉన్నందున వారందరూ దానిని ఆవాసంగా చేసికొని అక్కడికి వెళ్లిపోయారు.

అంతరిక్షం భూతలానికి అనువుగా ఏర్పడింది. భూతలం నరులకు నివాసయోగ్యంగా రూపొందింది.

దివాదుల గుణతారతమ్యానికి కారణం లేకపోలేదు. దేవతలలో సత్త్వగుణం, నరులలో రజోగుణం, భూతాదిగణమందు తమోగుణం ప్రధానంగా ఉంటాయి. గుణస్వభావాన్ని బట్టి వృత్తులుంటాయి. దివంలో సత్త్వము, భూమిపై రజస్సు, అంతరిక్షంలో తమస్సు ఉన్నందు వల్ల, ఎవరికి ఏది అనువో వారు అక్కడ ఉండటం సముచితం కనుక దేవతాదులు వారివారికి యోగ్యమైన చోట్లకు చేరుకున్నారు. ఎవరైనా తనకు అనుకూలమైన చోటు చూసుకొంటారు గాని ప్రతికూల వాతావరణంలో నిలువలేరు కదా!

## చాతుర్వర్ణ్యం

ఆ తరువాత విరాట్పురుషుని ముఖం నుంచి వేదాలు జనించాయి.

వేదాలను అధ్యయన చేయాలన్నా, అధ్యాపన చేయాలన్నా సత్త్వగుణం

ప్రధానం. అందుచేత సత్త్వగుణులు ఆ పనికి పూనుకొన్నారు.

శరీరానికి ముఖం ముఖ్యమనడం ప్రసిద్ధమే కదా! అట్టి ముఖ్యస్థానం నుంచి పుట్టిన వేదం కూడా ముఖ్యమైనదే. శరీరావయవాలలో ముఖ్యమైన ముఖస్థానం నుంచి పుట్టిన వేదాన్ని గుణత్రయంలో ముఖ్యమైన సత్త్వం ప్రధానంగా కలవారు చదివి దానినే వృత్తిగా స్వీకరించడం వలన వారిని ఉత్తమర్ణులు అన్నారు.

తర్వాత జనించినవి బాహువులు. వాటికి క్షత్త్రధర్మం నైజమై విలసిల్లింది. ఆ ధర్మం చక్కగా వ్యవహరిస్తే కాని సత్త్వానికి చోరాదుల వలని పీడ తొలగే ఉపాయం లేకపోయింది.

అప్పుడు సత్త్వం అప్రధానంగా రజస్సు ప్రధానంగా కలిగినవారు ఆ ధర్మానుష్ఠాన్ని వృత్తిగా గ్రహించారు.

క్షత్త్ర ధర్మానికి బాహువులు ఉపకరణాలు కావడం వల్ల ఆ ధర్మపరులను బాహుజులు అన్నారు.

ఆ తర్వాత వేదాధ్యయన లోకపాలన ధర్మపరులకు తగిన జీవికను కల్పింపవలసి వచ్చింది. ఈ సర్వలోకజీవికకు వ్యవసాయవృత్తి ఆధారమయింది. ఆ వృత్తికి రజోగుణం అప్రధానమూ తమోగుణం ప్రధానమూ అయిన తత్త్వం ఎంతో యుక్తంగా ఉంటుంది. అట్టి తత్త్వం కలవారు ఆ వృత్తిని స్వీకరించారు.

ఆ వృత్తి విశ్వజీవికాధారవృత్తి అయినందున దానిని స్వీకరించినవారిని వైశ్యులు అన్నారు. అంతేగాక కృష్యాదివృత్తి ఒకచోట స్తిమితంగా కూర్చొని నడుపవలసినదిగా ఉంటుంది. అందుకు ఊరువులు ముఖ్యసాధనాలు కనుక ఆ వృత్తివారిని ఊరుజులు అన్నారు.

వ్యవసాయం మొదలైన వృత్తులు కార్యరూపం తాల్చడానికి సంచలనమూ, దేహపరిశ్రమా అత్యంతావశ్యకం. ఆ కార్యం తమోగుణ

ప్రధానమైనది. అందువల్ల లోకజీవిక అయిన ఆ వృత్తిని వృద్ధిచేయటమే తమకు పరమధర్మంగా, అలా చేయటం లోకసేవాపూర్వక భగవత్సేవగా భావించి కొందరు ఆ వృత్తిని స్వీకరించారు. వారిని శూద్రులు అన్నారు. ఆ వృతికి పాదచారం ప్రధానం కనుక పాదజులు అన్నారు.

విదురా! శరీరస్థితికి ముఖము, బాహువులు, ఊరువులు, చరణాలు ఎంత ముఖ్యమో, సమాజస్థితికి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వృత్తులు కూడా అంతే ముఖ్యమైనవి. అందులో ఏ అంగం లోపించినా శరీరసౌష్ఠవం దక్కనట్లుగా నాలుగు వృత్తులలో ఏ వృత్తి లోపించినా శరీరకళ్యాణం దక్కదు.

శరీరంలో స్థానభేదం ఉన్నంత మాత్రాన ఒక అంగం గొప్పది, మరొక అంగం తక్కువది అన్న హెచ్చుతగ్గులు లేనట్లే సంఘానికి వృత్తుల ఉపయోగ విషయం లోనూ ముఖ్యతాముఖ్యతలు లేవు. అంగాలన్నీ కలిసి మెలిసి వర్తిస్తే కాని శరీరస్థితి నిలువనట్లు వృత్తులన్నీ కలిసి మెలిసి వర్తిస్తేనే కాని విరాట్పురుష శరీరవ్యవహారం జరగలేదు.

## స్వధర్మానుష్ఠాన విధి - భగవదారాధనం

విదురా! ఈ నాలుగు వర్ణాలవారూ వారి వారి వృత్తులలో మెలగుతుండటమే వారి వారి స్వధర్మమవుతుంది. ఆ స్వధర్మాన్ని శ్రద్ధతో ఆచరిస్తే వారికి చిత్తశుద్ధి జనిస్తుంది.

స్వధర్మాచరణమంటే భగవదాజ్ఞను తలదాల్చి తమ తమ శక్త్యనుసారం నెరవేర్చటమే. అదే భగవదారాధనం. వారు భగవంతునికి ప్రీతిపాత్రులవుతారు.

విదురా! విరాడ్రూపం ఎలా ఏర్పడినదో నీకు వివరించాను. ఆ రూపం తలపులకు కూడా అందరానిదై ఉండగా ఇక దాని నిరూపణ అసాధ్యమని వేరే చెప్పాలా? అయినా నీ మాటకు బదులు చెప్పకపోవటం భావ్యం కాదని, నా గురుముఖంగా నేను విన్నదానిని నాకు అర్థమైనంతలో నా వాక్కునకు

అందినంతయినా చెప్పాలని చెప్పాను. నిజంగా ఇది సాహసమే. అయినా నీవు కోరినది భగవన్మహిమాను వర్ణనాత్మకమని, అందుమూలాన నా వాక్కునకు ఇతరాలాపన జనిత దోషనివృత్తి, పావనత్వం కలుగుతాయనీ భావించి ఇంతకు సాహసించాను.

హరిగుణ సంకీర్తనం తత్పరులకు ఏకాంత లాభకరమని, దాని వల్ల శ్రోతలకు భగవత్సన్నిధి కలుగుతుందని పెద్దలంటారు కదా.

విదురా! భగవన్మహిమ అంతు లేనిది. నా బోంట్ల సంగతి అటుండనీ. చతురాస్యుడైనా యోగపరిపక్వబుద్ధితో వేయి సంవత్సరాలు అదే పూనికతో చెప్పినా భగవన్మహిమలో ఆవగింజంత కూడా వివరింపలేడు. ఆ దేవదేవుని మహిమ ఆయనకు తప్ప వేరొకరికి తెలియరాదు. ఎవడు మనోవాక్కులకు అందడో ఎవనిని తెలిసికొనలేక బ్రహ్మాదులు కూడా పరితపిస్తారో, ఆ పరమాత్మునికి పునఃపునః ప్రమాణాలను ఆచరిస్తాను.

**ఉ. అన్యకథానులాపము లహర్నిశముం బఠియించి మా**
**లిన్యము నాత్మశోభనవిలీనత నొందు మదీయ జిహ్వా సౌ**
**జన్యము నొందె నేఁడు హరి సద్గుణదివ్యకథామృతంబు స**
**న్మాన్యచరిత్రమై నెగడు మద్గురు వాక్యపదంబుఁ జెందఁగాన్.**

**మ. హరినామాంకిత సత్కథామృతరసవ్యాలోలుఁ డైనట్టి స**
**త్పురుషశ్రేష్ఠు డసత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే**
**వరమందార మరందపాన కుతుక స్వాంతద్విరేఫంబు స**
**త్వరమై పోవునె చేఁది వేములకుఁ దద్గంధానుమోదాత్మమై.**

### జీవుడు - అవిద్యాబంధాలు

విదురుడు మైత్రేయుని మాటలను విని–

'మహాత్మా! భగవానుడు సృష్ట్యాదులను లీలకై కల్పించాడని చెప్పారు.

1. భగవానుడు నిర్వికారుడు కదా? సృష్టికి పూనుకొనడమంటే క్రియాచరణమే. నిర్వికారునందు క్రియలు ఎలా కలుగుతాయి?

2. అలాగే భగవానుడు నిర్గుణుడు అన్నారు. వ్యవహారమన్నది గుణసంక్షోభ ఫలం అన్నారు. నిర్గుణంలో గుణాలు ఎలా సంభవిస్తాయి?

3. ఏ ప్రయోజనాన్ని కోరి భగవానుడు సృష్ట్యాదులను కావిస్తున్నాడు?

4. భగవంతుని సృష్టివిధానాన్ని బాలక్రీడలతో పోల్చారు. సాధారణంగా పిల్లలు ఏదైనా కోరిక జనించినపుడు ఆ కోరికకు తగినట్లుగా ఆడుకోవడం సహజమే. అంటే బాలక్రీడకు ముందుగా ఒక కామాంకురం ఉన్నది. భగవానుడు అవాప్తసమస్తకాముడు. అతనికి కోరనైనదీ పొందతగినదీ అంటూ ఏదీ ఉండదు. అటువంటివాని క్రీడకు కామాంకురం హేతువు కాజాలదు. అతని లీలాక్రీడకు కారణం ఏమిటి?

5. భగవంతుడు అద్వితీయుడని అంటారు. సర్వమూ భగవానుడే అయినప్పుడు అతని కన్న వేరైన వస్తువొకటి ఉండటం సాధ్యం కాదు. క్రీడించటం అనగానే క్రీడించేవాడితోపాటు క్రీడాపదార్థం ఒకటుండాలి. భగవంతుడు ఏ క్రీడా పదార్థంతో అంటే ఏ వస్త్వంతరంతో క్రీడ సలుపుతాడు?

6. మరి భగవానుడు అసంగుడు అన్నారు. అసంగునికి వేరొకదానితో ఎటువంటి సంబంధమూ కలుగకూడదు. భగవంతునికి క్రీడావినోదం ఉన్నదంటే, ఆ క్రీడింపబడుతున్న వస్త్వంతరంతో ఏదో ఒక విధమైన సంబంధం కలగక మానదు. అసంగునికి ఇది ఎట్లా పొసగుతుంది?

7. భగవానుడు తన మాయను అధిష్ఠించి విశ్వ సృష్టి స్థితి లయాలను కొనసాగిస్తాడని అన్నారు. మాయ అంటే భగవచ్ఛక్తి అని, అది త్రిగుణరూపం నుంచి వ్యవహరిస్తుందని, ఆ శక్తి వ్యవహారఫలంగా సృష్ట్యాదులు కలుగుతున్నాయని చెప్పారు. సృష్ట్యాదులు లీలార్థమైనప్పుడు భగవానుడు ఆ లీలలను ఏ రూపాన అనుభవిస్తున్నాడు?

8. భగవానుడు జీవాత్ముడై అనుభవిస్తున్నాడని అనుకుంటే అతనికి దేశము కాలము మొదలైన అవస్థాభేదాలు కలగాలి. భగవంతుడు సర్వగతుడంటారు. సర్వగతునికి దేశభేదం కలుగకూడదు. మరి భగవానుడు నిత్యుడు. అవిక్రియుడు అని కూడా అంటారు. నిత్యునికి కాలభేదం కాని, అవిక్రియునికి అవస్థాభేదం కాని ఉండవు కదా. దీనికి సమాధానం ఏమిటి?

9. ఈ దేశ కాల భేదభావాలు సహజమైన జ్ఞానం నశించటం వల్ల కలుగుతాయని అన్నారు. చిద్రూపుడైన భగవానునికి అనగా నిత్యజ్ఞానికి జ్ఞానచ్యుతి ఎలా కలుగుతుంది?

10. భగవానుడు జీవరూపంలో లీలలను అనుభవిస్తాడు అన్నప్పుడు జీవుడూ భగవానుడేనని ఏర్పడుతున్నది. అయితే జీవుడు నానావిధ శరీరగతుడై వివిధ సుఖదుఃఖాలను అనుభవిస్తూ నైజమైన ఆనందానికి రాక పోకలు కలిగి అనేక కర్మలను ఆచరిస్తున్నాడు. అంటే జీవునికి కర్మ సంబంధం ఉన్నదనుకోవాలి. భగవంతుడు జీవరూపు డయితే అతనికి నానాత్వమే కాక కేవలానందాత్మునిగా ఉన్నవాడు దుఃఖాన్ని, నిష్క్రియుడై ఉన్నవాడు కర్మసంబంధాన్ని పొందుతున్నాడు. ఇది ఏ విధంగా సంభవిస్తుంది?

మునివర్యా! ఈ సంశయాలు నా మనస్సును ఎన్నాళ్ళుగానో కల్లోలపరుస్తున్నాయి. తగిన రీతిని వీటికి సమాధానం చెప్పి నన్ను కృతార్థుని కావించు' అని ప్రార్థించాడు.

## మైత్రేయుని ప్రసంగం

'విదురా! భగవంతుడు అచింత్య శక్తిమంతుడు. అచింత్య విషయం బుద్ధికి అందదు. బుద్ధికి అందని దానిని గురించి వట్టి తర్కాలు చేయటం నిష్ప్రయోజనం. భగవంతుడు నిత్యముక్తుడు. నిత్యముక్తునికి బంధం ఎలా కలుగుతుంది? బంధనం కలుగని నాడు కృపణత్వాదులు ఎలా సంభవిస్తాయి? భగవంతునికి కార్పణ్యబంధాలు వాస్తవంగా లేకపోయినప్పటికీ, అతని మాయాబలం వలన అవన్నీ అతనికి ఉన్నట్లుగానే

కనబడుతుంది. స్వానుభవమే ఇందుకు నిదర్శనం. స్వప్నంలో శిరస్సును ఖండించినట్లు, ఆ తల కింద పడినట్లు ఒక్కొక్కసారి కనబడుతుంది. మనం నిద్రపోతున్నా, సాక్షి అయిన పురుషుడు ఆ దృశ్యాన్ని చూస్తూనే ఉంటాడు. మెలకువ వచ్చిన తర్వాత స్వప్నంలో చూసినది నిజం కాదని, ఆత్మవిపర్యయం అసత్యం మాత్రమేనని మళ్లీ ఆ పురుషుడే గ్రహింపగలుగుతున్నాడు.

సాక్షిమాత్రునికు వలెనే ఈశ్వరునికి కూడా ఆ మాత్రపు కార్పణ్యబంధాలైనా కలగవా? అంటే, భగవంతుడికి ఆ మాత్రపు బంధం కూడా కలగదు. ఎలాగంటే నీటిలో చంద్రబింబం వలె భగవానుడు శరీరంలో జీవుని రూపాన ప్రతిఫలిస్తాడు. నీరు కదిలినప్పుడు అందులోని చంద్రబింబమూ కదలాడినట్లు కనుపిస్తుంది. వాస్తవం విచారించితే ఈ కదలికలన్నీ జలోపాధి సంబంధాలే కాని ఆకాశంలో ఉన్న చంద్రునికి సంభవించటం లేదు. అలాగే ఉపాధి సంబంధమైన సుఖదుఃఖాదులు – అంటే దేహధర్మాలు తదభిమాని అయిన జీవునికే గాని జీవప్రతిబింబానికి మూలమైన భగవంతునికి కలగవు. కారణం ఏమిటంటావా? జీవుడి అభిమానమే కారణం.

ఆ అభిమానం పోవడం ఎలాగంటే, భగవదనుగ్రహం వలన తప్ప వేరొక మార్గాన అది నశింపదు. భగవదనుగ్రహమంటేనో? భగవద్భక్తి వలన మాత్రమే సిద్ధిస్తుంది. ఆ భక్తి నివృత్తిధర్మాచరణం వలన కలుగుతుంది. ఈ మూడింటి చేత ఆ అభిమానం క్రమక్రమంగా సన్నగిల్లి నశించిపోతుంది. క్రమక్రమంగా అని ఎందుకన్నానంటే సాధనానుసారంగా ఫలం కలుగుతుంది. సాధనక్రమం మంద్ర మధ్యమ తీవ్రాలని మూడువిధాలు. సాధనక్రమాన్ని బట్టి ఫలప్రాప్తి ఉంటుంది.

జీవునికి సర్వానర్థనివృత్తి ఎప్పుడు కలుగుతుంది? అంటే, ఎప్పుడు సర్వేంద్రియాలూ సాక్షిభూతుడు పరమాత్మ అంతర్యామి అయిన భగవంతుని యందు ఉపరతిని పొంది తదేకపరము లవుతాయో అప్పుడు సర్వక్లేశాలూ

నశించి పరమశాంతి చేకూరుతుంది. దృష్టాంతం చెప్పనా? గాఢనిద్రలో మునిగినవాడే ఇందుకు నిదర్శనం. విదురా! మైమరచి నిద్రించటం అంటే ఏమిటి? సర్వేంద్రియాలూ తమ తమ వ్యవహారాలను మాని ఉపరతిని కాంచటం గాఢనిద్ర అవుతుంది. అట్టి స్థితిలో ఉన్నవానికి ఎటువంటి క్లేశాలయినా, కనీసం స్ఫురణమాత్రంగా నైనా కలుగుతున్నాయా?

**చ. హరిచరణారవిందయగళార్చన సన్నుతి భక్తియోగముల్**
**నిరతముఁ గల్గువారు భవనీరజగర్భుల కందరాని భ**
**సురపదమందుఁ జేరుదురు సూరిజనస్తవనీయ! యట్టి స**
**త్పురుషుల పూర్వజన్మఫలముల్ గణుతింపఁ దరంబె? యేరికిన్.'**

అన్నాడు మైత్రేయుడు.

## సృష్ట్యాదులను గూర్చి విదురుని ప్రశ్నలు

రాజా! మైత్రేయుని భావాన్ని విదురుడు గ్రహించి–

'మహాత్మా! చిద్రూపుడు, అవిశేషుడు అయిన భగవంతునికి జగత్కర్తృత్వాదులు ఎలా కలిగాయో, భగవదంశమైన జీవునికి సంసారం ఏ విధంగా ప్రాప్తించిందో అన్న సంశయాలు నన్ను బాధిస్తుండేవి. భగవత్స్వాతంత్ర్యం, జీవుని పారతంత్ర్యం, జీవునికి అవిద్యాబంధం ఎలా కలుగుతుందో, ఆ బంధం ఎలా తొలగుతుందో తెలిసివచ్చింది. బంధమోక్షాల తత్త్వం మీ వలన ఇప్పటికి మనసులో నాటుకొన్నది. భగవచ్ఛక్తి అయిన మాయ వలన జీవునికి ఆనందాదిభ్రంశం వాస్తవంగా లేనిది ఉన్నట్లు తోచడం, అందుకు అజ్ఞానం కారణమవడం మొదలైనవి కూడా సదృష్టాంతంగా మీరు బోధించినందున నా సంశయాలన్నీ తీరాయి. మీ అనుగ్రహం వలన కృతార్థుడనైనాను.

మహాత్మా! పరమమూఢులూ మహాజ్ఞానులూ ఇరుతెగల వారూ సుఖాన్ని పొందుతారని, మూఢుని సుఖానికి అతనికి గల దేహాసక్తి, జ్ఞానుల సుఖానికి

వారు ప్రకృతిని దాటి భగవంతుని పొందగలగటం కారణాలని మీ వలన గ్రహించాను. అంతే కాక ఎవడు సుఖదుఃఖానుసంధానాల వల్ల ఇటు ప్రపంచంతో కలిసి ఉండలేక, ఆత్మానందసంవేదన లేకపోవడం వల్ల అటు ప్రపంచాన్ని వదిలిపెట్టలేక త్రిశంకుని వలె కొట్టుమిట్టుకులాడుతుంటాడో అట్టి మధ్యస్థునికి క్లేశాలు తప్పవని కూడా బోధపడింది.

మహాత్మా! మరొక సంశయం ఉన్నది. ప్రపంచమన్నది వాస్తవంగా లేదని, అది ప్రతీతి మాత్రమే అవుతుందని అన్నారు. ఈ ప్రతీతి దేని కోసమో తెలుపమని ప్రార్థిస్తున్నాను. భగవంతుని పాదారవిందాలను సేవించటం వలన సర్వవ్యసనాలూ తొలగుతాయన్న మాట నిజమే అయినప్పటికీ, ఆ భగవత్సేవాభాగ్యం ఒక్క సత్సంగం వలన తప్ప అన్యవిధాల సులభసాధ్యం కాదు. సత్సంగ మనగానే ఏదో ఒక రీతిని భగవత్కథాశ్రవణం నిరంతరం సాగుతూనే ఉంటుంది. అందువల్ల బుద్ధి భగవదభిముఖంగా రూపొందుతుంది. కనుకనే పెద్దలు భగవత్ప్రాప్తికి సత్సాంగత్యం సులభమార్గమని నొక్కి చెప్పారు. హరికథాశ్రవణం చేసే వారికి శ్రీహరి యందు ప్రీతి తప్పక జనిస్తుంది. ఆ ప్రేమ పెంపొందే కొద్దీ దేహాదుల పట్ల ఆసక్తి సడలుతుంటుంది. అందుకోసమే నేను హరి మహిమాతిశయాన్ని తెలుసుకోవాలని తహతహలాడుతుంటాను.

మహాత్మా! భగవానుడు మహదాదులను సృజించటం మొదలైన విషయాల ద్వారా భగవన్మహిమను వివరించారు. కాని భగవద్విభూతి విస్తారాన్ని ప్రస్తావింపలేదు. విభూతి విస్తారం అనగా నా ఉద్దేశమేమిటంటే ప్రజలు చిత్రవిచిత్రాకృతులు కలిగి పుత్రపౌత్రాదులతో ఉంటారు. వీరందరూ ఎలా కలిగారు? ప్రజాపతులెందరు? సృష్టి ప్రకారం ఏమిటి? దానిలోని విశేషాలేమిటి? మనువు లెందరు? మన్వంతరాల లక్షణం ఏమిటి? మన మన్వంతరాధిపుల వంశానుచరితాలు ఎటువంటివి? ఊర్ధ్వలోక అధోలోక భూలోకాల సన్నివేశం ఎటువంటిది? ఆ లోకాల ప్రమాణాలేమిటి? దేవమనుష్యతిర్యక్సృష్టి విధానం ఎట్టిది? పక్షి సరీసృపాల పుట్టుక,

జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు అనే చతుర్విధభూతాల ఉత్పత్తి ప్రకారం ఏమిటి? భగవానుడు తన గుణావతారాల చేత విశ్వానికి సృష్టిస్థితిలయాలను కలిగిస్తాడని అంటారు. ఏయే గుణాలు ఏయే అవతారాలను ధరించాయి? ఒక్కొక్క అవతారంలోని ఉదారవిక్రమాలు ఏమిటి? వర్ణాశ్రమాల విభాగం ఏయే రూప శీల స్వభావాలను బట్టి ఏర్పడుతుంది? ఋషుల జన్మకర్మల విధానం ఏమిటి? వేదవిభాగం ఏమిటి? యజ్ఞవిస్తరం ఎట్టిది? యమము, నియమము మొదలైన అష్టాంగ యోగాల లక్షణాలేమిటి? భక్తియోగతత్త్వం ఏమిటి? జ్ఞానస్వరూపం ఎట్టిది? జ్ఞానానికి ఉపాయమైన సాంఖ్యము యొక్క మార్గం ఏమిటి? తంత్రప్రకారం ఏమిటి? ప్రతిలోమజాతులకు ఏయే ఆచారాలు విధింపబడ్డాయి? శివపాషండ విష్ణుపాషండ మతాల భేదం ఏమిటి? జీవులకు గుణకర్మాలను బట్టి ఏయే గతులు కలుగుతాయి? ధర్మార్థకామ మోక్షాలకు పరస్పరవిరోధం కలుగని తీరున వాటిని ఎట్లా సేవించాలి? వార్తాస్వరూపం, దండనీతి ప్రకారం, వ్రతవిధానాలు, శ్రాద్ధవిధి ప్రకారం, పితృసర్గం, గ్రహ నక్షత్ర తారల కాలచక్రస్థితి, తపోదానాదులూ ఇష్టాపూర్యాదుల ఫలాలు, మనుష్యులు ఆచరించదగిన ధర్మాలు, ఆపద్ధర్మాలు, పరమధర్మాలు ఏమిటి? వీటిని గురించి సాకల్యంగా తెలిసికొనగోరుతున్నాను. గురువులు దీన వాత్సల్యపరాయణులై తమ కొడుకులకు చెప్పినట్లు శిష్యులకు కూడా చెప్పదగిన అర్థాలన్నింటినీ సరహస్యంగా బోధిస్తారు.

మహాత్మా! మహదాదులకు ప్రళయం ఎప్పుడు కలుగుతుంది? ఎలా కలుగుతుంది? ప్రళయకాలంలో పరమేశ్వరుని ఎవరు ఉపాసిస్తారు? ఆ సమయంలో అతనితో ఎవరుంటారు? జీవుని తత్త్వం ఏమిటి? పరమేశ్వరస్వరూపం ఎట్టిది? జీవేశ్వరుల ఐక్యం ఎటువంటిది? ఆ విషయాన్ని ఔపనిషద జ్ఞానం బోధిస్తుందని అంటారు. ఆ జ్ఞానస్వరూపం ఎట్టిది? ఆ జ్ఞానప్రాప్తికి ఉపాయం ఏమిటి?

మహాత్మా! విరక్తి, భక్తి, జ్ఞానం ఈ మూడూ మహాత్ముల సేవాఫలంగా తప్ప వేరొక తీరున కలుగవు. నా జ్ఞాననేత్రం అవిద్యామహాంధకారగ్రస్తమై చూడలేకపోతున్నది. అటువంటి అంధుడికి నాకు జ్ఞానప్రకాశాన్ని కలుగజేసి కృతకృత్యతను అనుగ్రహించు. జీవులకు అభయాన్ని ప్రసాదించే విషయంలో వేదాలు యజ్ఞాలు తపస్సులు దానాలు వ్రతాలు ఏవీ మహాత్ముల సేవకు కళాంశమాత్రమైనా సాటి రావు' అని పలికాడు.

## పురాణ సారం

మైత్రేయుడు విదురుని మాటలకు పులకితగాత్రుడై, కొంతసేపటికి తేరుకొని, ఇలా అన్నాడు–

'కురుప్రధానా! నీవు పురాణసారభూతమైన మహావిషయాన్ని అడిగి భగవత్కథా ప్రచారానికి నన్ను ప్రవేశపెడుతున్నావు. నీ కోరిక నాకెంతో సంతోషాన్ని కలుగజేసింది. అయ్యా! భగవన్మహిమను గూర్చి నీవిలా గుచ్చిగుచ్చి ప్రశ్నించడం వింత కాదు. నీ వలన నీ పూరువంశం సాధుసంసేవ్యమై పరిఢవిల్లుతుంది.

## భాగవత పురాణావతారం

విదురా! నరులు స్వల్పసుఖాల కోసం ఎంతటిదుఃఖానికైనా ఒడిగడతారు. అటువంటి వారికి దుఃఖశాంతిని కలిగించే ఆలోచన భగవంతునికి వచ్చింది. పరమకృపాళువుకు అది నైజమే కదా? ఆ తలంపు మేరకు భగవానుడు స్వయంగా తానై పూనుకొని భాగవతపురాణాన్ని ఋషులకు ఉపదేశించాడు. ఋషులకే ప్రత్యేకించి చెప్పడం ఎందుకంటావేమో! ఋషులు స్వప్రయోజనరహితులై పరోపకారపరాయణులై ఉన్నవారు. వారు భాగవతాన్ని లోకప్రచారం కావించి, అది సర్వజనసేవ్యంగా అందరికీ అందజేస్తారని భగవానుడు దానిని ఋషులకు బోధించాడు.

## భాగవత పురాణం

విదురా! భగవంతునికి దేశకాలాది నియతి అడ్డు రాదు. అందువల్ల అతని మహిమలకు ఇది ప్రారంభమని నిరూపించటం సాధ్యం కాదు. ఏదో ఒక కల్పాన్ని ప్రారంభంగా చేసి, అక్కడినుంచి ఆయన మహిమానువర్ణనం జరుగుతుంది.

## సనత్కుమారాదుల భగవత్సందర్శనం

పూర్వం ఒకప్పుడు సనత్కుమారాది మునులు సంకర్షణదేవుని పూజింపదలచి పాతాళానికి తరలివెళ్లారు.

స్వర్గం నుంచి పాతాళానికి వెళ్లే దారిలో వియద్గంగ ఉన్నది. మునులందరూ అందులో తీర్థస్నానాలు చేసి ఆ పవిత్రజలాలలో తడిసిన జటాకలాపాలతో శ్రీ పరమాత్ముని చరణోపధానమైన పద్మాన్ని చేరుకొన్నారు.

అక్కడ దేవదేవుడు ఆదిశేషుని ఫణాసహస్రం పైని అధివసించి, నేత్రగోళాలను మోడ్చి, అంతర్ముఖుడై తనకు ఆధారజ్యోతిర్మండలమైన వాసుదేవాఖ్య పరమానంద స్వరూపాన్ని ధ్యానిస్తూ సర్వోత్కర్షపూజాపరాయణుడై ఉన్నాడు.

దేవతలు ఆ మహాత్మునికి ప్రణమిల్లుతున్నారు. వారి కిరీటకోటి దివ్యరత్న ప్రభలు నాగేంద్రుని పైకి వ్యాపించి వేయి వేయి విధాల అతని వెలుగొందజేస్తున్నాయి. నాగకన్యలు ప్రేమాతిశయంతో కానుకలను కొనివచ్చి భగవంతునికి సమర్పిస్తున్నారు. సనత్కుమారాదులు కూడా భగవానునికి సాగిలబడి మ్రొక్కారు.

భగవానుడు కళ్ళు తెరిచి ఆ మునుల వంక చూశాడు. సనత్కుమారాదులు కేలు మోడ్చి భక్తిగద్గదస్వనులై భగవంతుని ఉగ్గడించి, 'దేవా! నీ ఆత్మస్వరూపాన్ని తెలియగోరి వచ్చాము. అనుగ్రహించు' అని ప్రార్థించారు.

## భాగవత ప్రచారం

ఆ సంకర్షణ దేవుడు నివృత్తధర్మాభిరతులైన సనత్కుమారాదులకు ఎంతో ప్రీతుడై శ్రీ మహాభాగవతాన్ని ఉపదేశించాడు.

సనత్కుమారుడు దానిని దృఢవ్రతియైన సాంఖ్యాయనునికి బోధించాడు. పరమహంస ప్రధానుడైన ఆ మునీంద్రుడు దానిని నా గురువైన పరాశరమహర్షికి, బృహస్పతికి బోధించాడు.

పరాశరుని తండ్రిని రాక్షసులు భక్షించారు. పరాశరు దందుకు ఆగ్రహోదగ్రుడై రాక్షస సత్త్రయాగానికి ఉపక్రమించాడు. అప్పుడు వశిష్ఠ మహర్షి వచ్చి సాంత్వనవాక్యాలను పలికి యాగాన్ని మాన్పించాడు.

రాక్షసులు పులస్త్యమహర్షి వంశజులు. పులస్త్యుడు తన వంశనాశనసంకల్పాన్ని పరాశరుడు మానినందుకు సంతోషించి, 'నీవు పురాణకర్తవై పెంపొందుతావు గాక' అని వరం ఇచ్చాడు.

ఆ వరబలం వలన నా గురువు సామర్థ్యం ఇనుమడించింది. ఆయన నా యెడ కరుణించి భాగవతాన్ని నాకు బోధించాడు.

ఆ విధంగా భాగవతపురాణం సంప్రదాయగతమై నాటి నుంచి నేటి దాకా వన్నె కెక్కింది.

విదురా! నీవు భక్తిపూర్వకంగా అడిగావు. శ్రద్ధానిత్యానువర్తనలతో శోభిల్లుతావు కనుక నీకు దానిని చెబుతున్నాను. శ్రద్ధగా విను.

అంటూ మైత్రేయుడు ఏమన్నాడంటే....

## భగవంతుని నిద్రావస్థ - ప్రళయం

'విదురా! భగవానుడు తన అద్వితీయ స్వరూపానందమందు ఉత్సుకుడయ్యాడు. దారువునందలి అగ్ని వలె అతని ఇచ్ఛాశక్తి అతని యందు అంతర్లీనమై నిలిచింది. వెనువెంటనే అతని క్రియాశక్తి ఉపరతిని పొందింది.

ఆ వెంటనే' భగవానుని మాయావిలోకనాత్మకమైన విశ్వం ఏకార్ణవజలంలో మునిగిపోయింది. దానినే ప్రళయమని అంటారు.

ఆ విధంగా భగవానుడు కేవలజ్ఞానశక్తియుక్తుడై ఆ ప్రళయపయోధి జలాలలో శేషతల్పాన శయనించి కనుమోడ్చాడు. దానినే నిద్రావస్థ అని పేర్కొంటారు. ఆ అవస్థలో భగవానుడు నాలుగు వేల యుగాల కాలం సృష్టిని ఉపసంహరించి ఆత్మారాముడై నిద్రలో ఉన్నాడు.

## భగవంతుని జాగ్రదవస్థ – పాద్మకల్పం

'విదురా! భగవానుడు నిద్రావస్థను చెందటానికి పూర్వం తన కాలశక్తిని పిలిచి, 'పునఃసృష్టి సమయం కాగానే నన్ను ప్రబోధించు' అని ఆజ్ఞాపించాడు. ఆ తర్వాత పునఃసృష్టికి తరుణమైనంతనే కాలశక్తి భగవంతుని ప్రబోధించింది.

భగవానుడు నిద్రావస్థలో ఉన్నపుడు తత్పూర్వం జీవావస్థలో ఉన్న సమస్తార్థాలూ కేవల సూక్ష్మావస్థను చెంది భగవంతుని యందు లీనమై ఉంటాయి. ఆ సూక్ష్మార్థాలే పునఃసృష్టికి ఉపకరణ లవుతాయి.

భగవానుడు ప్రబోధితుడైనంతనే అతనిలో లీనమై పునఃసృష్టికి ఉపకరణలు కాబోతున్న సూక్ష్మార్థాలన్నీ అతనికి మనోగోచరితాలైనాయి. వెనువెంటనే రజోగుణం సంక్షోభించింది. దానితో కర్మ ప్రారంభమైంది. తత్ఫలంగా పరమేశ్వరుని నాభిదేశమందు కమలనాళం అంకురించింది. ఆ నాళద్వారం నుంచి తత్పూర్వం లీనమై ఉన్న విశ్వసృష్టి సూక్ష్మార్థాలు బహిర్గమించి తమ వెలుగులతో ప్రళయార్ణవాన్ని వెలుగొందజేస్తూ ఒక పద్మకోశంగా ఏర్పడ్డాయి. ఆ పద్మం లోనికి భగవానుడు అంతర్యామియై ప్రవేశించాడు. ఆ పద్మం నుంచి వేదమయుడైన బ్రహ్మ స్వయంగా ఆవిర్భవించాడు. ఆ విధంగా స్వయంసముద్భూతు డైనందువల్ల బ్రహ్మకు స్వయంభువు అని పేరు కలిగింది. ఆ బ్రహ్మ పూర్వకల్పాంతం వరకు ఉన్నాడు. ఆ కల్పాంతాన భగవానుడు నిద్రావస్థను చెందినపుడు అతను కూడా

భగవంతునితో ఏకీభూతుడై లీనావస్థను పొందాడు. భగవానుడు పునఃసృష్టి ప్రారంభానికి ప్రబోధితుడైనపుడు బ్రహ్మ కూడా ప్రబుద్ధుడై ఆ దేవదేవుని నాభికమలం నుంచి వెలికి వచ్చాడు. పద్మగర్భం నుంచి వెలువడినందున అతనికి పద్మజుడని పేరువచ్చింది. పద్మజుడైన బ్రహ్మ యొక్క జీవితకాలాన్ని పాద్మకల్పం అన్నారు.

## విమోహగ్రస్తుని తపోదీక్ష

విదురా! ఆ విధంగా జన్మించిన బ్రహ్మ పద్మకర్ణికపై కూర్చుండి కన్నులు తెరిచి నలుదెసలా కలయజూశాడు. అతని ఎదుట యేమీ కానరాలేదు. అంతా సర్వశూన్యంగా తోచింది. అతనికి ఏమీ తోచలేదు. తలయెత్తి నాలుగు వైపులా పరికించి చూశాడు. ఆ సమయంలో అతనికి నాలుగు మోములు ఏర్పడ్డాయి. అందువల్ల అతనికి చతుర్ముఖుడని పేరు వచ్చింది.

చతురాస్యుడు ఆ విధంగా విమోహగ్రస్తుడై, 'నే నెవరిని? ఈ ఏకార్ణవ జలం ఏమిటి? అందులో ఈ కమలం ఉండటం ఏమిటి? ఈ కమలానికి ఆధారం ఏమిటి? ఇక్కడుండి నేనేం చేయాలి?' అని ఆలోచించి, తన నివాసస్థానమైన ఆ కమలం యొక్క ఆధారాన్ని తెలుసుకోవాలని నిశ్చయించాడు.

బ్రహ్మ అలా నిశ్చయించి, తత్కమలనాళరంధ్రం ద్వారా లోపలికి పోసాగాడు. ఎంత దూరం ప్రయాణించినా ఆ కమలం ఎక్కడి నుంచి మొలిచిందో అతనికి అర్థం కాలేదు. ఆధారం గోచరించలేదు. పైగా అక్కడ కన్నుపొడుచుకున్నా కానరాని గాడాంధకారం అలముకొని ఉన్నది. అంతకన్నా ఎక్కడికి వెళ్లాలో తెలియక అతను వెనుకకు మళ్ళి మెల్లమెల్లగా వచ్చి బయలుదేరిన చోటికే వచ్చి చేరి వాయుబంధనం చేసి చిత్త నిగ్రహం కావించి సమాధియోగస్థు డయ్యాడు.

అలా నూరేండ్లు గడిచాయి. చతురాస్యునికి జ్ఞానోత్పత్తి కలిగింది. అందాకా అతను వెతుకుతున్న కారణస్వరూపం ఏతద్జ్ఞానఫలంగా అతని

హృదయఫలకం పైని ప్రస్ఫుటించింది. తానున్న కమలపీఠానికి కానరాని మూలాధారం యోగజనితమైన విజ్ఞానం వలన అతని హృదయకమల కర్ణికలో దివ్యతేజోవిలసితమై కానవచ్చింది.

## కారణస్వరూప వర్ణనం

మ. కనియెన్ నిశ్చలభక్తియోగమహిమం గంజాతగర్భుండు శో
భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా
శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూజైత్రున్ దళత్పద్మనే
త్రు నవీనోజ్జ్వల నీలమేఘనిభగాత్రుం బక్షిరాట్పుత్రునిన్.

వ. మఱియు.

చ. అలఘుఫణాతపత్రనిచయాగ్రసమంచితనూత్న రత్న ని
ర్మలరుచిచే యుగాంతతిమిరంబు నడంచి యకల్మషోల్లస
జ్జలములఁ జేసి యందు నవసారసనాళసితైకభోగముం
గలిగిన శేషతల్పమును గైకొనియున్న మహాత్ము నవ్యయున్.

సీ. వరపీతకౌశేయపరిధాన కాంతి సం
ధ్యాంబుద రుచినిచయంబు గాఁగఁ
గమనీయ నవహేమకలిత కిరీటంబు
రమణఁ గాంచనశిఖరంబు గాఁగ

మానిత మౌక్తిక మాలికారుచి సాను
పతిత నిర్ఝర పరంపరలు గాఁగఁ
జెలువొందు నవతులసీదామకంబులు
లలితతటౌషధీలతలు గాఁగ

గీ. వరభుజంబులు నికటస్థవంశములుగఁ
బదము లంగణపాదపప్రచయములుగ
లలితగతినొప్పు మరకతాచలవిడంబి
తాత్మదేహంబు గలుగు మహాత్ముఁ గాంచె.

ఆ మహాపురుషుడు అపరిచ్ఛిన్నమై నిరుపమానమై నిఖిలలోకసంగ్రహమై స్వప్రమాణానికి తగిన ఆయామవిస్తారాన్ని కలిగి, విచిత్ర నానాభరణాంబరాద్యలంకార దీప్తులను ఆత్మీయనిర్మలద్యుతులతో ప్రకాశింపజేస్తున్న దివ్యదేహంతో, అభిమతార్థులై శుద్ధవేదోక్తులతో సన్నుతించే పురుషశ్రేష్ఠులకు అభీష్టవరప్రదాలై నఖ చంద్రికా విలసితాంగుళి పవిత్రములైన చరణారవిందాలతో, శ్రీకాంతా భూకాంతలకు ఉపధానరూపా లనదగి నీలకదళికా స్తంభాల డంబు విడంబిస్తున్న ఊరుయుగళంతో, సువర్ణమణిమయ మేఖలాకలాపాభిరామమై కడిమి మొగ్గల నునుపచ్చవన్నెలో చెన్ను మీరిన పీతాంబరపరిధానంతో, దివ్యరత్నహారశోభిత శ్రీవత్సవక్షంతో, ఉత్తమకేయూరాది భూషణ భూషిత భుజదండాలు శాఖలుగా, భోగి భోగాయతనాలు వల్కలవేష్టనాలుగా అవ్యక్తమూలమైన మహావృక్షమా అన్నట్లు తనరారుతూ, చరాచరాలకు ఆధారమై, సర్పాలకు ఆశ్రయమై సలిలావరణమై కిరీటసహస్రకనకశిఖరాలతో లసత్కౌస్తుభరత్నవిద్యోతమానమై మహాగిరిని పోలిన శరీరంతో, వేదములనే తుమ్మెదలకు నిరంతరాశ్రయమై నిజకీర్తిద్యోతకరమై చెన్నారే వనమాలిక చేత అలంకృతమైన కంఠంతో, దివ్యమణికుండల కాంతి సముద్దీపితమై అధరబింబ రాగారుణితమై సమంచిత భ్రూ నాసికా విలసితమై లోకార్తిహర దరస్మేరసుందరమై దేదీప్యమానంగా వెలుగొందుతున్న ముఖకమలంతో, కాలత్రయ స్ఫూర్తిమంతమైన సుదర్శనంతో విరాజిల్లుతున్నాడు.

## సృష్టిసంకల్పం

పరమేశ్వర సాక్షాత్కారం కలుగగానే బ్రహ్మకు తనతోపాటు తానున్న పద్మం, ఏకార్ణవజలం, ప్రళయకాల వాయువు, ఆకాశం తప్ప వేరొకటి కానరాలేదు. అది చూసి బ్రహ్మ విస్మయపరుడైనాడు. వెనువెంటనే అతని యందు రజోగుణం సముద్రిక్తమై విలసిల్లింది. దానితో చిత్తం మాయావిలాసమార్గాన్ని ప్రవేశించింది. దాని వెంటనే అతనికి

ప్రజాసృష్టిభావం ఉదయించింది. ఆ సృష్టికర్మానికి బీజం ఏమై ఉంటుదన్న తలంపు పైకొన్నది. తాను చూసిన సరోజాది పంచకమే ఆ సృష్టికి ఉపాదానసామాగ్రి కాబోలునన్న ఊహ జనించింది.

అప్పుడు బ్రహ్మ సృష్టికి ఉపక్రమించాడు.

## బ్రహ్మకృత భగవత్స్తోత్రం

బ్రహ్మ ఆ విధంగా కృతనిశ్చయుడై అంత మాత్రమైన జ్ఞానం తనకు కలిగినందుకు కృతజ్ఞతను సూచిస్తూ భగవంతుని స్తుతించాడు.

'దేవా! బహుకాలం ఉపాసించి తత్ఫలితంగా నిన్ను తెలుసుకోగలిగాను. అనవద్యమైన నీ తత్త్వజ్ఞానాన్ని పొందగలగడం కంటె ఉత్తమమైన భాగ్యం దేహధారులకు వేరొకటి ఏముంటుంది? నీవు తప్ప వేరొకటి లేదన్నదే నీ తత్త్వరహస్యం. నీవు నీ మాయాగుణయోగం వలన నానారూపాలలో ప్రపంచాకృతిని సాక్షాత్కరిస్తున్నావని తెలియనివారు 'కళ్లయెదుట ప్రపంచాన్ని చూస్తున్నాము కదా? భగవంతుని కంటె అన్యతరం లేదని ఎలా నమ్మమంటావు?' అని వాదానికి వస్తారు. వాస్తవానికి నీవు నిర్గుణ పరబ్రహ్మ వన్నదే నీ తత్త్వపరమార్థం. ప్రపంచరూపమైన ఈ ప్రతీతి అంతా నీ గుణాత్మకం. నీ సత్యరూపం అనావృత ప్రకాశం, అవికల్పం, ఆనందమాత్రం అయి జ్ఞానులకు మాత్రమే భాసిస్తుంది. ఉపాసకులను అనుగ్రహింప గోరి నీవు నీ చిచ్ఛక్తి ప్రభావంతో వివిధావతారాలను ధరిస్తావు.

దేవా! నీ ప్రకృతరూపం సర్వావతారాలకూ మూలబీజమై ఉన్నది. ఈ నీ రూపం సృష్టికి కారణమైనందున కార్యమైన విశ్వానికంటె వేరైనట్టిది. ఇదే భూతేంద్రియాలకు కూడా కారణం. అందువల్ల నీ ఈ రూపం సర్వోపాస్యరూపాలలో ముఖ్యమై ఉన్నది. అట్టి ఉత్తమరూపాన్ని నేను ఆశ్రయించాను.

దేవా! ఈ నీ రూపం సోపాధికమని, అర్వాచీనమని భావించేవారు ఇది ముఖ్యమెలా అవుతుందని అడుగుతారు. ఆంతర్యాన్ని పరిశీలించి చూస్తే తత్త్వం వారికే తెలిసి వస్తుంది. అవ్యక్తాన్ని ఉపాసించడం సాధ్యం కాదు. ఉపాసకులు నీ వ్యక్త స్వరూపాన్ని ధ్యానిస్తారు. వారి శ్రేయస్సును కోరి ఈ భువనమంగళరూపాన్ని వ్యక్తపరిచావు. ఈ నీ అనుగ్రహం ఎంతనవచ్చు? ఉపాసకులిందుకు నీకు నమస్కరించడమే తప్ప వేరొక విధాన తమ కృతజ్ఞతను చూపాలన్నా మారం లేదు. అందువల్ల ఇదే నీకు సాష్టాంగప్రణామం.

దేవా! ఇంతటి మహామహునికి నీకు నమస్కరింపని వెర్రివాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళ వెర్రికి కారణం లేకపోలేదు. నీవు జ్ఞానులకు స్వానుభవంలో తప్ప వట్టి తర్కాలకు అందేవాడివి కావు. అందువల్ల వాళ్ళు నిరీశ్వరవాదులై నిన్ను నిరసిస్తారు. అంత మాత్రాన నీకు కలిగే కొరత ఏమీలేదు. నిన్ను నిరసించినవారికి నరకమూ తప్పదు. ఎవడు వేదాలనే మలయానిలాలు మోసికొని వచ్చిన చల్లని నీ పాదారవిందాల సురభిళపరిమళాన్ని లేశమాత్రమైనా అనుభవించే పుణ్యానికి నోచుకొంటాడో, ఎవడు మహాదరంతో చేరి నీ కథలను వింటాడో, ఆ ధన్యజీవుడు నీ పాదపద్మాలను తప్పక చూరగొంటాడు. నీవతని హృదయాన్ని నిలయంగా చేసికొని నిరంతరం నివసిస్తావు. అతనిని ఎన్నటికీ ఎడబాయవు.

దేవా! ఎందాకా మర్త్యులు సర్వాభయప్రదాయకమైన నీ చరణాబ్జాలను ఆశ్రయింపరో అంతదాకా వారికి ఇల్లూ వాకిలీ భార్యాబిడ్డలూ అన్న బంధాలూ, తమ కోసమో లేక తమవారిని చూసో లేనిపోని భయాలు, వారి నిమిత్తమై రకరకాల బాధలు, వారికై శోకతాపాలు, వారి కోసం ఉన్నది చాలక తన అనంతరం కూడా సరిపడేటంత దాచిపెట్టాలన్న సంపాదనేచ్ఛ, దానివల్ల కలిగే పరాభవాలూ తప్పవు. అంతే కాదు. వాళ్ళంతటితో ఊరుకోరు. తృష్ణ వారిని ఊరికే ఉండనివ్వదు. ఏదో ఒక తీరున కోరికలు ఫలించినా ఆ లబ్ధవస్తువులను అంటిపెట్టుకొని మమకారం ఉంటుంది. మమకారం అనగానే దాని అనుచరులు భయశోకాదులు చుట్టుకొంటారు.

దేవా! నిరీశ్వరవాదులకు బుద్ధి నిశ్చయించినట్లు మనస్సు నడుచుకొంటుంది. బుద్ధిలోపం వలన వారి మనస్సు విచ్చలవిడిగా ప్రవర్తించటానికి అలవాటుపడి సర్వానర్థ నిర్మూలనకరమైన నీ కథాశ్రవణాన్ని ఉపేక్షిస్తుంది. చిత్తాన్ని నీ యందు లగ్నం కావింపనినాడు లోభం మనస్సును ఆవరిస్తుంది. లోభవశులు దీనులై కామసుఖమే పరమసుఖంగా భావించి దానిని అంతో ఇంతో సంపాదించాలని చేయరాని పనులు చేస్తారు. ఆ విధంగా వారు ఆకలిదప్పులకు, వాతపిత్తశ్లేష్మాలకు, శీతోష్ణవాతవర్షాదులకు లోనై నశ్వరాలైన దేహాల కోసం ప్రాకులాడతారు. వారికి నరకప్రాప్తి తప్పదని చింతాక్రాంతుడ నవుతుంటాను.

దేవా! ఈ కామాగ్ని ప్రోదిచేసినకొద్దీ పెంపొందుతుందే కాని తృప్తి చెంది శాంతింపదు. ఈ కామానికి అడ్డు తగిలినప్పుడు అది క్రోధంగా మారుతుంది. దానివల్ల చెప్పరాని దుఃఖాలు కలుగుతాయి. దేవా! నీ మాయాబలం ఎంతటిదో తెలిసికొనలేక వారు భ్రాంతికి చిక్కి పరితపిస్తారు. 'నేను' 'నాది' అనే భావం ఎంత కాలం ఉంటుందో, అంత కాలం వారిని ఈ భ్రాంతి విడనాడదు. ఈ భ్రాంతి ఉన్నంత కాలం సంసారం తొలగదు. సంసారం ఉన్నంత కాలం దుఃఖసమూహాలు తప్పవు. ఇదే వారి నరకప్రాప్తికి కారణం.

దేవా! ఈ దుర్గతి వట్టి అవివేకులకు మాత్రమే కాదు; కొందరు వివేకులనబడుతున్న వారికీ తప్పడం లేదు. అంటే వీరు నిజంగా వివేకులు కారన్నమాట. వట్టి తెలివి ఉన్నంత మాత్రాన అది వివేకం అనిపించుకోదు. ఎవడు నిత్యానిత్యాలను ప్రత్యేకించి గ్రహించి అనిత్యాలను త్యజించి నిత్యాలను సేవించుతున్నాడో అతనినే వివేకి అనాలి. నిత్యసేవ్యాలలో నీ కథాశ్రవణ కీర్తనాదులు ముఖ్యమైనవి. వాటితో కాలాన్ని సద్వినియోగం చేయకపోగా ఇంద్రియశక్తులను అర్థసంపాదనార్థం వినియోగించేవాడు నిక్కంగా వివేకవంతుడు కాడు. అతనికి పగలంతా ఇంద్రియ వ్యాపారంతో గడిచిపోతుంది. రాత్రులను నిద్ర కొంత వరకు, స్వప్నాలు కొంత వరకు

హరిస్తున్నాయి. ఈ విధంగా వారు దైవోపహతులై దైవప్రతిహతులై కేవలం అర్థసంపాదనపరులై నీ కీర్తనాదులకు కాలం లేక, రుచి కలుగక, సంసారంలోనే పడి తిరుగుతుంటారు.

దేవా! ఈ సంసార పరిభ్రమణం తొలగిపోవటానికి నీ ఆశ్రయం ఒక్కటే పరమసాధనం. నీ ప్రాపు పొందాలంటే నీ పరమతత్త్వాన్ని గ్రహించి ఆ దారిలోనికి ప్రవేశించి పరిశ్రమించాలి. నీ తత్త్వాన్ని తెలుసుకోవాలంటే వేదాంతశ్రవణం తప్ప మరొక సాధనం లేదు. వేదాంతశ్రవణం కావించి, తత్త్వరహస్యాన్ని గ్రహించి, నిన్ను పొందాలని నిశ్చయించి, భక్తిమార్గాన్ని మెట్టి చిత్తశుద్ధిని పొందినవారి హృదయమందిరాల లోనికి నీవు పరమానందంతో చేరి ఈప్సితార్థాలను నెరవేరుస్తావు. అంతే కాదు. ఏ రూపంలో నిన్ను నీ భక్తులు ధ్యానిస్తే ఆ రూపంలో నీవు వారికి సాక్షాత్కరిస్తావు. నీవు భక్తుల యెడ చూపే వాత్సల్యాన్ని వేయి తలల చిలువ రేడైనా పూర్ణంగా వర్ణింపలేడనగా సామాన్యుల సంగతి చెప్పేదేమున్నది? నిష్కామం, సకామం అని రెండు విధాలుగా ఉన్న భక్తిమార్గాలలో నిష్కామభక్తికే నీవు పరమసులభుడవు.

దేవా! నేను మరొక రహస్యాన్ని కూడా గ్రహించాను. అందరి హృదయాలలో అంతరాత్మవై నెలకొని ఉన్న నీవు పొరపొచ్చాలు లేని నెచ్చెలి వలె సుహృదుత్తముడవై ఉంటావు. అయినా నిన్ను అసత్పురుషులు తెలిసికొనలేరు. అయ్యో! వారి దౌర్భాగ్యానికి ఏమని మాత్రం ప్రయోజనం ఉంటుంది? నీ దయ సమస్తభూతజాతానికీ ఏకరీతిని ప్రాపణీయమై ఉన్నది. కాని దానిని భక్తితో మాత్రమే పొందే ప్రయత్నం చేయాలి. కామపూర్వక నానావిధోపచారాలతో పొందకూడదు. అందువల్ల యజ్ఞాదులైన వివిధ కర్మలు, తపో దాన వ్రతాచరణలు మొదలైనవి భక్తిసహితమైనప్పుడు మాత్రమే అవ్యయమూ, సర్వోత్తమమూ అయిన క్రియాఫలాన్ని చేకూరుస్తాయి. అవి కామనిమిత్తాలే అయితే తుచ్ఛఫలాల నిచ్చి నశించిపోతాయి. కనుక నీ యందు భక్తిని కలిగి వర్తించడం ఒక్కటే సర్వకర్మలకూ పరమార్థం.

దేవా! నీవు భేదరహితుడవు. సమగ్రబోధాశ్రయుడవు. స్వరూపచైతన్యతేజోమూర్తివై తనరారే పరమాత్ముడవు. సృష్టి స్థితి లయకారణమైన నీ మాయాశక్తిని క్రీడోపకరణగా చేసికొని ఆత్మానందాన్ని పొందుతావు. నీ అవతార విడంబనలైన దేవకీనందనాది నామాలను గాని, గుణవిడంబనాలైన సర్వజ్ఞ భక్తవత్సలాది నామాలను గాని, కర్మవిడంబనాలైన కంసారి ప్రముఖ నామాలను గాని, చివరికి ప్రాణోత్క్రమణ కాలంలో నైనా ఉచ్చరింప నోచిన జీవులకు బహుజన్మార్జిత పాపసంచయం పటాపంచలై నిరస్తావరణమైన బ్రహ్మస్వరూపాన్ని సందర్శించే మహాభాగ్యం తప్పక సిద్ధిస్తుంది. అట్టి మహానుభావునికి నీకు పునఃపునః ప్రణామాలు. ఏ నీ విశ్వాకారవృక్షానికి సృష్టికర్తనైన నేను, స్థితికర్త అయిన విష్ణువు, లయకర్త అయిన ఈశ్వరుడు గుణత్రయరూపాంతరాలతో వ్యవహరిస్తూ మూలత్రయమై నెలకొని ఉన్నామో ఆ విశ్వాత్మునికి నీకు సాష్టాంగాలు. ఎవరు అజ్ఞానవశాన విరుద్ధధర్మనిష్ఠులై నీ ఆజ్ఞను ఉల్లంఘించి, నిన్ను పొందడానికి సాధనాలుగా నీవు నిర్దేశించిన కర్మకలాపాన్ని త్యజించి, ప్రమత్తులై వర్తిస్తారో, వారి జీవితాశ లన్నింటినీ త్రుటిలో హరింపగల కాలాత్మునికి నీకు ఇదే భక్తిపూర్వక నమస్కారం. ద్విపరార్ధ ప్రమాణవంతమై, సర్వలోకనమస్కృతమై అలరారుతున్న ఉత్తమస్థానాన్ని అధిష్ఠించి ఎవని ప్రాప్తికై బహుకాలం వివిధ యజ్ఞాలను, దీర్ఘతపస్సులను ఆచరించానో ఆ యజ్ఞేశ్వరునికి నీ కిదే మొక్కుతున్నాను. ఎవడు పరమానందస్వరూపుడైన కారణాన నిరస్త సమస్త విషయసుఖుడై కూడా తాను విధించిన ధర్మకర్మ మర్యాదలను రక్షించటం కోసం స్వేచ్ఛాపూర్వకంగా పశు పక్షి మృగ మనుష్య దేవాదియోనులలో జన్మిస్తూ, రమిస్తున్న వానివలె గోచరిస్తూ, తత్తత్కాలాలకు తగిన లీలాపరివేషాలను ప్రదర్శిస్తూ సర్వాతీతుడై విహరిస్తున్నాడో ఆ పురుషోత్తమునకు నీకు ఇదే చేతులు జోడిస్తున్నాను. ఎవడు పంచపర్వమైన అవిద్యకు అతీతుడైనా నిద్రాసుఖాన్ని లోకానికి ప్రదర్శించేవాడై కల్లోలాభీలమైన ఏకార్ణవ జలరాశిలో శేషశయనం పైని నిర్వికంపస్థితిని

నిద్రాముద్రాంకితుడై నా కంటికి గోచరిస్తున్నాడో, ఎవని నిద్రను గురించిన వివిధకారణాలను – అంటే, పూర్వకల్పంలో శ్రాంతులైన జనులకు విశ్రామసుఖాన్ని కలిగించటానికని కొందరు, సర్వలోకక్లేశాలనూ గ్రహించి తానే సహిస్తూ ఆ రూపంలో ధర్మాన్ని బోధించటానికని కొందరు ఊహిస్తుంటారో, త్రైలోక్య సృష్టిరూపమైన పరమోపకారం కావించటానికి అవకాశాన్ని కల్పించే నెపంతో ఏ మహాత్ముడు తన నాభిపద్మభవనాన్ని నాకు అనుగ్రహించాడో, అట్టి కుక్షిస్థసర్వలోకునికి, నిద్రావసాన వికసన్నళిన దళేక్షణునికి నీకు జోహారు. దేవా! అద్వితీయుడవైన నీవు సర్వలోకసౌహార్ద ప్రకటనాభిలాషతో సర్వాంతర్యామివై చరిస్తున్నావు. నిజజ్ఞానైశ్వర్య నిమిత్తాన జగత్తులకు సౌఖ్యాన్ని ప్రతిపాదిస్తున్నావు. నీ కృపాకటాక్షవీక్షణప్రసారం వలన ఆజ్ఞానైశ్వర్యాలు పూర్వకల్పాలకు అనురూపంగా మళ్ళీ సృష్టిని కావింపబోతున్న నా బుద్ధిని ఆవహిస్తాయి గాక! స్వశక్తి అయిన రమతో కూడి నీవు ఏయే గుణావతారాలను గ్రహించి ఏయే కార్యాలను నిర్వహిస్తున్నావో ఆ రహస్యములన్నీ నా మదిలో ప్రస్ఫుటిస్తాయి గాక! లోకసృష్టి ప్రవణమైనప్పటికీ నా మనస్సు నిత్యం నీ యందే నిలిచి ఉంటుంది గాక! కర్మశక్తి కృతవైషమ్యాలు, వాటివలన కలిగే పాపమూ నన్ను తాకవు గాక!

**చ. భవదుదరప్రభూతమగు పద్మమునందు వసించియున్న నే**
**నవిరళ తావకీన కలితాంశమునం దనరారు విశ్వముం**
**దవిలి రచించుచున్ బహువిధంబులఁ బల్కెడి వేదజాలమున్,**
**శివతరమై ఫలింపఁ గృపసేయుము భద్ర ఫలప్రదాయకా!**

అని పలికి చతురాస్యుడు సాగిలపడి మ్రొక్కి అలసిపోయిన వలె మరి పలుకలేక మౌనం వహించాడు.

## భగవత్సాక్షాత్కారం

భగవానుడు బ్రహ్మ స్థితిని చూసి, 'వేదగర్భా! విషాదమూ తత్ఫలితంగా మనోదౌర్బల్యమూ నిన్ను పైకొన్నట్లు నీ కంఠస్వరం సూచిస్తున్నది. ఇది తగదు.

ధైర్యోత్సాహాలతో పునఃసృష్టికి నీవు ఉద్యోగించాలి. ఏ అర్థాన్ని నీవిప్పుడు కోరుతున్నావో, ఏ అర్థం ఉన్నదో లేదో అన్న విచికిత్స నీకిప్పుడిట్టి అవస్థను కలిగించిందో, ఆ అర్థాన్ని తొలుతనే నీకు సమకూర్చాను. అయినా అది ఎందుకు స్పష్టపడలేదని శంకిస్తే, నన్ను గూర్చి ఉపాసించి తపస్సు కావించు. తత్ఫలంగా నీవు నీ హృదయాంతరంలో సర్వలోకాలనూ స్పష్టంగా కనుగొంటావు.

చతురాస్యా! ఏ అర్థమైనా భక్తియుక్తమూ సమాహితమూ అయిన చిత్తానికి తోచినట్లు విక్షేపచిత్తులకు తోచదు. భక్తిసమాహితచిత్తానికి నేను సర్వాంతర్యామినై తనలోనూ, లోకంలోనూ ఏ విధంగా వ్యాపించి ఉన్నదీ, సర్వజీవులూ నాలో ఎలా ఉంటున్నదీ కనుపిస్తుంది. అట్టి నా దర్శనం కలిగినపుడు నీకూ నా బ్రహ్మస్వరూపం బోధపడుతుంది.

చతురాస్యా! నేను దారువులోని అగ్ని వలె సర్వభూతజాతం లోనూ అంతర్నిగూఢమైన రూపంతో సంచరిస్తాను. నా సందర్శనం ఎప్పుడు సిద్ధిస్తుందో ఆ క్షణాననే సర్వమోహజాలమూ తొలగిపోతుంది. అంతవరకు మోహం విడిచిపెట్టదు.

మోహమంటే ఏమిటి? అది తొలగటమంటే ఏమిటి? అని అడిగితే, అసలు జీవుడంటే ఏమిటో విచారించాలి. ఆ జీవుడనే వాడు నేనే కాని నా కంటె భిన్నుడు కాడు. నేను శరీరగతుడ నైనప్పుడు నన్ను జీవుడంటారు. నామ భేదమే కాని తత్త్వభేదం లేదు. అదీ అవస్థాభేదమే కాని నైజమైన భేదం కాదు. వాస్తవస్థితి ఇలా ఉండగా భూతేంద్రియ గుణాతిశయంతో కూడి నేను వర్తించినప్పుడు జీవరూపాన ఉన్న నన్ను వేరొకనిగా భావించి అన్యద్భావనతో వ్యవహరిస్తారు. ఈ భావమే మోహమనబడుతుంది. ఆ ఉపాధిని వేరు చేసి అందులో ఉన్న జీవుడిని ప్రత్యేకించి విమర్శించితే జీవుడు, శుద్ధబ్రహ్మాత్మకుడ నైన నేనూ ఒక్కరమే అని వెల్లడవుతుంది. అంటే, అద్వైతభావన సాక్షాత్కరిస్తుంది. దీనిని 'తత్త్వంపదార్థైక్య' మని అంటారు. ఈ స్థితినే మోక్షమంటారు.

విరించీ! ప్రజాసృష్టికి నానాకర్మకలాపం అత్యవసరమని, అందువల్ల నీ బుద్ధి కర్మపరమై వికారమొంది నాకు విముఖమవుతుందేమోనని, విచారించకు. ఎటువంటి చిత్త వికారం నీకు కలుగకుండునట్లు ప్రసాదించాను. కర్మకలాపం అనగానే రజోగుణఫలం కనుక ఆ రజస్సు వలన పాపం అంతో యింతో తప్పదని శంకించబోకు. నీ చిత్తం నా యందలి భక్తి మూలాన పరిశుద్ధమై, నా యందేలగ్నమై వర్తించినంత కాలం రజోగుణం కాని, తత్కృత కర్మకలాపజనితదోషచయం కాని నిన్ను బాధింపవు. ఏమంటే నీవు కావింపనున్న కర్మమంతా నైష్కర్మ్యమే అవుతుంది. కనుక నిన్ను ఎటువంటి పాపదోషమూ అంటదు.

చతురాననా! నీవు నా నాభికమలం పైని కూర్చుండి, 'ఈ పద్మానికి ఆధారం ఉన్నదా? లేదా?' అని సంశయించావు. అనగా నీకు 'అస్తినాస్తివిచికిత్స' ఉదయించింది. ఆ సందేహ నివారణార్థం పద్మనాళం లోపలికి వెళ్ళి అన్వేషించావు. అక్కడి నుంచి బహిర్గతుడివై ఉన్నచోటికి వచ్చి చేరి సత్యాన్వేషణ బుద్ధితో తపస్సు చేశావు. నీ సందేహం తీర్చాలని నీకు నా స్వరూపాన్ని చూపి, నేనే సర్వాధారమని బోధించాను. అంతే కాదు. ఎవరు తమ అహంకారాన్ని విడిచిపెట్టలేరో వారికి నా స్వరూప దర్శనం కాదని, ఎవరు మదేక శరణులై నడచుకొంటారో వారికి కళ్యాణం స్వతస్సిద్ధమని కూడా సూచించాను. ఎన్నటికైనా బుద్ధి ఏకాగ్రమై ఒక్కదానియందు నిలిచినప్పుడే నీకు వస్తుగతసత్యం సమగ్రంగా గోచరిస్తుంది. బుద్ధి చలించినవాడి స్థితి రెండు పడవలలో కాళ్ళు పెట్టి ప్రయాణం చేసేవాడి గతి అవుతుంది.

చతురాస్యా! నా అనుగ్రహం నీయందు సమగ్రమై ప్రసరించింది. నీ తపోనిష్ఠ, నీవింతగా కావించిన స్తోత్రం, అన్నీ నా అనుగ్రహఫలాలే అని గ్రహించు. నా ఎఱుక లేక చలిచీమైనా కదలలేదు.

కమలజా! నేను స్వరూపంచేత నిర్గుణుడను. అట్టి నన్ను లోకవిజయేచ్ఛతో సగుణునిగా వర్ణించి, లోకంలో భగవన్మహిమాభివర్ణనకు మార్గదర్శకుడవైనావు. నీ వర్తన నాకు ప్రీతిపాత్రమై విలసిల్లింది. నీవు కావించిన ఈ స్తోత్రాన్ని ప్రతినిత్యం పఠించినవారికి నేను ఎల్లవేళలా ప్రసన్నుడనై ఉంటాను. ఈనాటి నా వరం నీకూ, నీ వలన లోకానికీ శుభదాయకం కాగలదు.

వేదగర్భా! జీవులకు నా ప్రీతిని పొందటం కంటె అధికమైన ప్రాప్యఫలం కలుగదు. నా ప్రీత్యర్థమై కొందరు ఇష్టాపూర్తాలను కావిస్తారు. కొందరు తపస్సులను ఆచరిస్తారు. కొందరు దానాలు చేస్తారు. కొందరు యోగాలను అనుష్ఠిస్తారు. కొందరు సమాధిస్థితులవుతారు. వీటివలన వారందరికీ యథోచిత నిఃశ్రేయసాలు కలుగుతున్నాయి. అయినా వీరు ఈ చెప్పిన కార్యాలలో ఒక్కటయినా స్వతంత్రించి ఫలదాయకం కానేరదన్న రహస్యాన్ని గుర్తించలేరు. కార్యఫలోత్పత్తి రహస్యాన్ని అందరూ గ్రహించలేరు. ఆ కార్యాలు నన్ను గూర్చి చేయబడినప్పుడు నేను వారికి ప్రీతుడనై తత్తత్కార్యోచిత ఫలాన్ని ప్రసాదిస్తాను. ఈ మర్మం తత్త్వవేత్తలకు మాత్రమే స్పష్టం. కనుక సర్వశ్రేయాలకూ నా ప్రీతి ఒక్కటే కారణం.

పరమేష్ఠీ! భక్తికి సంకల్పం చేయూత నిస్తుంది. ఎవరు ఏది సంకల్పించి భక్తులై ఉంటారో ఆ సంకల్పితార్థం వారికి సంప్రాప్తిస్తుంది. నీవు నా స్వరూప జ్ఞానాన్ని తెలుసుకొనగోరి భక్తితో తపస్సు చేశావు. నీవు కోరినట్టి నా స్వరూప సాక్షాత్కారాన్ని నీకు అనుగ్రహించాను'

అని చెప్పి అంతర్హితుడయ్యాడు.

## ప్రాకృతాది సర్గాలు

అంతట బ్రహ్మ ఆ పరమాత్మని యందే మనస్సు నిలిపి నూరు దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. అప్పుడు ప్రళయఝంఝానిలం మహాభయంకరంగా వీచింది. ఆ గాలి వడికి జలార్ణవం పొంగి సర్వం తారుమారయింది. ఆ నీటితోపాటు అందులో ఉన్న బ్రహ్మాసనపద్మం కూడా కంపించింది. "నా తపస్సు పండి నా లోని విద్య వికాసాన్ని పొందనున్నదని దీనివలన సూచిత మవుతున్నది. విజ్ఞానబలవృద్ధిని పొందే సన్మార్గం గోచరించింది" అని భావించి బ్రహ్మ ఆ విజ్ఞానబలం ఊతగొని వాయుజలాలు రెండింటినీ త్రాగివేశాడు.

విశ్వాంతరాళం లోని వాయుజలాలు రెండూ అదృశ్యమైనాక బ్రహ్మాసనపద్మం ఒక్కటే మిగిలి ఆకసాన్నంటింది. బ్రహ్మ అది చూసి 'పూర్వప్రళయంలో లీనమైన లోకాలన్నింటినీ మళ్ళీ కల్పించాను' అని నిశ్చయించాడు. అంతలో అతనికి భగవత్ప్రేరణ కలిగింది. ఆ పద్మకోశం లోనికి ప్రవేశించి దానిని మూడుగా విభజించాడు. ఈ మూడు విభాగాలూ దేవలోకం, పితృలోకం, మర్త్యలోకం అని మూడు లోకాలైనాయి. ఈ విభాగత్రయం నిజానికి స్థూలరూపకం. పరిశీలించి చూడగలవారికి ఆ పద్మమే పధ్నాలుగు లోకాలుగా బహురూపాలుగా భావ్యమై ఉన్నది.

## లోకవిభాగం

విదురా! త్రైలోక్యవిభాగానికీ, పధ్నాలుగు లోకాలన్న విభాగానికీ భేదం లేకపోలేదు. ముల్లోకాలు కామ్యకర్మ ఫలరూపాలు. అందువల్ల వాటికి ఉత్పత్తి వినాశాలు ప్రతికల్పంలోనూ కలుగుతుంటాయి. చతుర్దశలోకాలలో మహర్లోకం మొదలు సత్యలోకపర్యంతం ఉన్న లోకాలు నిష్కామకర్మ రూపాలు. అందువల్ల వాటికి ఉత్పత్తి వినాశాలు ప్రతికల్పంలోనూ కలగవు. కల్పమంటే బ్రహ్మకు పగటిభాగం. అతనికి రాత్రి అయినంతనే కల్పకాలం

ముగిసిపోతుంది. దానితో సృష్టి లీనమైపోతుంది. తెల్లవారగానే బ్రహ్మ మళ్లీ సృష్టికి ఉపక్రమిస్తాడు. ఈ కారణం వల్ల బ్రహ్మకు సృష్టికార్యం దినకృత్యమై భాసిల్లుతున్నది.

## కాలం-సామాన్యలక్షణాలు

విదురా! భగవానుడు అద్వితీయుడు, ఏకైకుడు అయినప్పటికీ బహురూపాలలో వ్యక్తమౌతాడని అన్నాను. అటువంటి భగవద్రూపాలలో కాలం కూడా ఒకటి.

భగవంతుని శక్తి సత్త్వరజస్తమోగుణాలలో వ్యవహారాన్ని పొందుతుంది. ఆ గుణాల పరిణామాన్ని కాలం అంటారు.

కాలానికి ఆద్యంతాలు లేవు. అది నిర్విశేషం. అట్టి అవ్యక్తస్వరూపమైన కాలంలో భగవల్లీలలు కానవస్తుంటాయి. ఆ లీలల వ్యవధిని బట్టి కాలానికి విభాగాలు కల్పింపబడుతున్నాయి.

ఈ విధంగా పరిచ్ఛిన్నమైన బ్రహ్మస్వరూపమే ఈ విశ్వం. ఇది నేడు సరిక్రొత్తగా కలిగినది కాదు. ఈ కల్పంలో ఏ విధంగా ఉన్నదో పూర్వకల్పాల లోనూ అలాగే ఉన్నది. రాబోయే కల్పంలోనూ అలాగే ఉంటుంది.

ఈ విధమైన లోకపరిచ్ఛేదకత్వాన్ని కాలసామాన్యలక్షణం అంటారు.

## కాలము- విశేష లక్షణాలు

విదురా! ప్రపంచమన్నది కార్యపదార్థం. ఈ పదార్థం వివిధాంశల కలయిక వలన ఏర్పడుతున్నది.

అందులో అనేక సూక్ష్మాతిసూక్ష్మాంశలు ఉన్నాయి.

అన్నిటికన్నా స్వల్పమైన పరిమాణాన్ని పరమాణువు అంటారు. ఏ సూక్ష్మాంశం మళ్ళీ రెండుగా విభజింపబడదో, దేనికన్నా సూక్ష్మతరమైన అంశం వేరొకటి ఉండదో, ఆ సూక్ష్మాంశాన్ని పరమాణువు అంటారు.

పరమాణువుకు క్షణం అని నామాంతరం ఉన్నది. ఈ పరమాణువులు ఒకదానితో ఒకటి కలిసి విస్తరించడమే ప్రపంచ మనబడుతున్నది.

ఈ పరమాణువులు జడపదార్థాలు కదా? ఇవి ఒకదానితో ఒకటి సమకూడటం ఏ తీరున జరుగుతున్నది? పరస్పరభిన్నమైన జడవస్తువులకు చేరిక ఎలా కలుగుతున్నది? అని సంశయం కలుగవచ్చు.

పరమాణువులకు విశేషవివక్ష గాని, భేదవివక్షగాని కలుగదన్నమాట సత్యమే. అయినా అవి భగవదిచ్ఛను బట్టి ఐక్యమై పరిణామాన్ని పొందుతుంటాయి.

## మహత్తు

ఈ పరమాణు సముదాయం కలిసి వృద్ధిరూపమైన మార్పును చెందటం లేనప్పుడు దానిని మహత్తు అంటారు.

మహత్తు అంటే పదార్థము యొక్క సూక్ష్మావస్థ. ఈ మహత్తును కేవలం తత్త్వదృష్టితో చూసినపుడు దానికి అంశవివక్ష, భేదవివక్ష ఉండవు.

దానినే కొంత విశేషభేదవివక్షతతో చూసినపుడు దానికి మధ్యమావస్థ, స్థూలావస్థ ఏర్పడుతున్నాయి.

ఈ అవస్థలన్నీ కాలరూపమైన భగవచ్ఛక్తి వలన కలుగుతున్నాయి.

## పరమాణువు – అణువు – త్రసరేణువు

కాలము స్వయంగా అపరిచ్ఛేద్యమే కాని ఈ అవస్థలను బట్టి దానికి కూడా పరిచ్ఛేదనం కలుగుతున్నది. ఈ విభాగం మనకై మనం ఏర్పరచుకున్నదే తప్ప కాలానికి సహజసిద్ధంగా కలిగినది కాదు.

పరమాణుపదార్థాన్ని పరిచ్ఛేదించే కాలాన్ని పరమాణువు అంటారు.

రెండు పరమాణువులు కలిస్తే ఒక అణువు. రెండు అణువులు కలిసి ఒక త్రసరేణువు.

సూర్యకిరణాలు గవాక్షరంధ్రాల ద్వారా ఇంటిలోనికి ప్రవేశించి ప్రకాశించేటపుడు ఆ ప్రకాశంలో చాలా సన్నని నెరసులు కానవస్తుంటాయి. ఆ నెరసులు మరీ తేలికైనవి కనుక క్రింద పడక గాలిలోనే ఎగురుతుంటాయి. వాటిని త్రసరేణువులని అంటారు.

## కాలవిభాగ లక్షణాలు

ఒక త్రసరేణువును వేరు చేసి చూడటానికి పట్టే సమయాన్ని త్రుటి అంటారు.

నూరు త్రుటుల కాలం ఒక వేధ. మూడు వేధల కాలం ఒక లవం.

మూడు లవముల కాలం ఒక నిమేషం. మూడు నిమేషాలు క్షణం. ఐదు క్షణాలు కలిసి ఒక కాష్ఠ. పదిహేను కాష్ఠలు ఒక లఘువు. పదిహేను లఘువులు ఒక నాడి.

నాడికి ఘటిక (గడియ) అని కూడా పేరున్నది. రెండు గడియలు ఒక ముహూర్తం. ఆరు లేక ఏడు గడియలు ఒక యామం (జాము).

నాలుగు జాములు ఒక పగలు. అంతే కాలం ఒక రాత్రి. ఒక పగలు, ఒక రాత్రి కలిసి దినము అనబడుతుంది.

విదురా! ఆరు లేక ఏడు గడియలు ఒక జాము అవుతుందని చెప్పాను. ఎందుకంటే ఒక్కొక్కప్పుడు పగటి పూట పొద్దు తక్కువగా ఉంటుంది. అప్పుడు రాత్రి పొడవవుతుంది. ఈ హెచ్చు తగ్గుల భాగవివక్షతను నియమింపకపోతే ఈ భేదాలను ప్రత్యహమూ గణింపవలసి ఉంటుంది.

## నాడికా నిర్ణయానికి ఉన్మానం

గడియలను నిర్ణయించటానికి ప్రత్యేకంగా ఒక కొలత ఉన్నది.

ఆరు పలాల రాగితో ఒక పాత్రను ఒక్కొక్క ప్రక్క నాలుగు అంగుళాల వెడల్పు, నాలుగు అంగుళాలు ఎత్తు ఉన్నదానిని తీసుకోవాలి. ఆ పాత్ర అడుగు

భాగంలో ఐదు గురిగింజల ఎత్తు బంగారంతో చేసిన నాలుగు అంగుళాల శలాకలు నాలుగింటితో రంధ్రం చేయాలి. ఆ పాత్రను నీటిపైని ఉంచాలి.

పాత్రను నీటిపై ఉంచినపుడు అడుగున ఉన్న రంధ్రం ద్వారా నీరు లోపలికి ఎక్కుతుంది. కొంతసేపటికి నీరు నిండి ఆ బరువుకు పాత్ర నీళ్ళల్లో మునిగిపోతుంది.

అట్లా పాత్ర నిండి మునిగిపోవటానికి ఎంత వ్యవధి పట్టుతుందో ఆ కాలాన్ని గడియ అంటారు.

ఘటికా కాలనిర్ణయానికి ఉన్మానం ఇదే.

## మర్త్య సంవత్సరం

మొత్తం మీద ఎనిమిది జాములు ఒక అహోరాత్రం – అంటే ఒక దినం అవుతున్నది.

పదిహేను దినాలు ఒక పక్షం. ఈ పక్షాలు చంద్రోదయ వృద్ధిక్షయాలను బట్టి శుక్ల పక్షం, కృష్ణ పక్షం అని రెండు విధాలు. శుక్ల పక్షంలో చంద్రకళావృద్ధి, కృష్ణ పక్షంలో క్షయమూ జరుగుతుంటాయి.

రెండు పక్షాలు కలిసి ఒక మాసం. రెండు మాసాలు ఒక ఋతువు.

ఋతువులు ఆరు.

మాసాలు పన్నెండు.

మూడు ఋతువులు – అంటే ఆరు నెలల కాలం ఒక అయనం. ఇది దక్షిణాయనం, ఉత్తరాయణం అని రెండు విధాలు.

రెండు అయనాలు ఒక సంవత్సరం. ఇటువంటి నూరు సంవత్సరాలు నరులకు పరమాయువు.

ఇది మనుష్యమానంతో నిర్ణయించిన కాలవిభాగం.

## అయనాలు

అయనాలకు దక్షిణాయనం, ఉత్తరాయణం అన్న వివక్ష సూర్యుని సంచారగతిని బట్టి ఏర్పడింది.

దక్షిణాయనంలో సూర్యుడు భూమధ్యరేఖకు దక్షిణాన, ఉత్తరాయణంలో దానికి ఉత్తరభాగాన చరిస్తున్నట్లు కనిపిస్తుంది. సూర్యుని గమనాన్ని బట్టి ఈ విధంగా పేర్లు కలిగాయి.

వీటిలో సూర్యుడు దక్షిణాయనం నుంచి ఉత్తరాయణానికి వచ్చే కాలం పుణ్యకాలమని పెద్దలంటారు.

## దేవతల కాలమానం

మర్త్యమానం ప్రకారం ఒక నెల పితృదేవతలకు ఒక అహోరాత్రం. పితృదేవతల కాలమానంలో పన్నెండు అహోరాత్రాలు దేవతలకు ఒక దినం. మనుష్యమానంలో ఇది ఒక సంవత్సరం అన్నమాట.

దేవతలు, పితృదేవతలకు వారి వారి కాలమానం ప్రకారం నూరు సంవత్సరాలు పరమాయువు. అంటే మర్త్యమానంలో పితృదేవతలకు 3,000 సంవత్సరాలు, దేవతలకు 36,000 సంవత్సరాలు ఆయుష్కాలం.

## రాశిచక్రం

విదురా! ఈ కాలచక్రాన్ని సూర్యుడు నడుపుతుంటాడు. ఈ చక్రం పన్నెండు రాసులు కలిగి భువనకోశంలో తిరుగుతుంటుంది. సూర్యుని ఆజ్ఞ ప్రకారం చంద్రాది గ్రహాలు, అశ్విన్యాది నక్షత్రాలు, ఇతర తారకలు తమ తమ నియమాలను జవదాటక ఈ చక్రంలో సంచరిస్తూ కాలపరిచ్ఛేదకత్వాన్ని తెలుపుతుంటాయి.

## కాలమాన భేదాలు

ఈ పన్నెండు మాసాల కాలానికి మానభేదాలను బట్టి సౌరము, బార్హస్పత్యము, సావనము, చాంద్రము, నాక్షత్రము అని పేర్లున్నాయి.

వీటిలో సౌరాన్ని సంవత్సరం, బార్హస్పత్యాన్ని పరివత్సరం, సావనాన్ని ఇడావత్సరం, చాంద్రాన్ని అనువత్సరం, నాక్షత్రాన్ని వత్సరం అని పరిగణిస్తారు.

ఈ పేర్లు సూర్యుడు, గురువు మొదలైనవారి పరివర్తనలను బట్టి ఏర్పడుతున్నాయి.

## సూర్యోపాసన అవసరం

విదురా! ఈ విధంగా సౌరాది పంచవిధ మానాలకు సూర్యుడే మూలం. సూర్యభగవానుడు పన్నెండు మాసాలలో పన్నెండు రాసుల లోనూ చరిస్తాడు. సూర్యుడు ఏ రాశిలో ఉంటాడో ఆ రాశిలో అతని తేజం విశేషం గానూ, ఒక్కొక్క రాశికీ దూరమౌతున్నపుడు ఆయా రాసులలో అతని తేజం తక్కువ గానూ ఉంటుంది.

ఈ విధంగా సూర్యుడు పన్నెండు రాసులలో చరిస్తున్నందున అతనికి ద్వాదశాత్ముడని పేరు కలిగింది.

సూర్యుని ఆత్మశక్తే కాలరూపంలో ప్రకాశిస్తున్నది. ఆ శక్తి వలననే బీజాదులు అంకురించి పెరిగి ఫలవంతమవుతున్నాయి. ఆ శక్తే సకాలములో వారి వారి గుణాలకు చలనాన్ని కలిగిస్తున్నది.

శక్తిచలనం వలన సకాములు తమ తమ కోరికలు తీరాలని ఏదో ఒక రీతిని కర్మాచరణకు పూనుకొంటారు.

ఆ శక్తే నిష్కాములలో విషయవైరాగ్యాన్ని సకారణంగా పురికొల్పి వారికి మోహనివృత్తిని కావిస్తున్నది. కనుక అట్టి మహాశక్తికి ఆశ్రయభూతుడై అంతరిక్షంలో సాక్షాత్కరిస్తున్న సూర్యభగవానుని ఉపాసించాలి.

## యుగాల లక్షణం

విదురా! నరులకు ఒక సంవత్సరమైతే దేవమానంలో అది ఒక్క అహోరాత్రమని చెప్పాను. ఆ ప్రకారం చూడగా నరులకు మూడువందల అరవై సంవత్సరాలు గడిస్తే దేవతలకు ఒక్క సంవత్సరం గడుస్తుంది.

దేవమానంలో ఒక సంవత్సరానికి దివ్యవర్షం అని పేరు. ఆ దివ్యవర్షాలను ఒక మానంగా స్వీకరించి, దాని ప్రకారం కాలాన్ని నాలుగు విభాగాలుగా చేసి ఒక్కొక్క భాగం ఒక్కొక్క యుగంగా ఏర్పరిచారు.

అవి– 1) కృత యుగం 2) త్రేతా యుగం 3) ద్వాపర యుగం 4) కలి యుగం.

ఈ యుగాలలో కృత యుగం నాలుగువేల ఎనిమిదివందల దివ్యవర్షాల ప్రమాణం, త్రేతా యుగం మూడువేల ఆరువందల దివ్యవర్షాల ప్రమాణం, ద్వాపర యుగం రెండువేల నాలుగువందల దివ్యవర్షాల ప్రమాణం, కలి యుగం పన్నెండు వందల దివ్యవర్షాల ప్రమాణం కలిగి ఉన్నాయని కాలజ్ఞులు నిశ్చయించారు.

ఈ కాలాన్ని మర్త్యమానంతో పరిగణిస్తే ఒక్కొక్క దివ్యవర్షానికి మూడువందల అరవై సంవత్సరాల ప్రకారం 4,800ఒ360 సంవత్సరాలు కృతయుగం, 3,600ఒ360 సంవత్సరాలు త్రేతాయుగం, 2,400ఒ360 సంవత్సరాలు ద్వాపరయుగం, 1,200ఒ360 సంవత్సరాలు కలియుగం అవుతాయి. వీటిని గుణిస్తే

కృత యుగం 4,800×360 = 17,28,000
త్రేతా యుగం 3,600×360 = 12,96,000
ద్వాపర యుగం 2,400×360= 8,64,000
కలి యుగం 1,200×360= 4,32,000

సంవత్సరాలు గణనకు వస్తాయి. కృతయుగం నుంచి కలియుగం వరకు దేవమానంలో ఉన్న పన్నెండువేల సంవత్సరాలు మనుష్యమానంలో 12,000×360=43,20,000 సంవత్సరాలని ఏర్పడుతున్నది.

ఈ నాలుగుయుగాలు కలిసి ఒక మహాయుగం అనబడుతుంది. దీనికే చతుర్యుగం అని కూడా నామాంతరం ఉన్నది.

## యుగసంధులు - సంధ్యాంశలు

ప్రతి యుగకాలం లోనూ మొదటి భాగం కొంత సంధ్య అని, కడపటి కొంత భాగం సంధ్యాంశకాలమని చెప్పబడుతున్నది. ఈ సంధ్యాదుల ప్రమాణం ఒక్కొక్క యుగంలోనూ మారుతుంటుంది.

దీనిని బట్టి కృతయుగకాలంలో మొదటి నాలుగువందల దివ్యవర్షాలు సంధ్యాకాలం. కడపటి నాలుగువందల దివ్యవర్షాలు సంధ్యాంశకాలం.

ఇదే విధంగా త్రేతాయుగంలో మొదటి మూడువందల దివ్యవర్షాలు సంధ్యాకాలం. కడపటి మూడువందల దివ్యవర్షాలు సంధ్యాంశకాలం.

ఆ తర్వాత ద్వాపర యుగంలో మొదటి రెండువందల దివ్యవర్షాలు సంధ్యాకాలం. కడపటి రెండువందల దివ్యవర్షాలు సంధ్యాంశకాలం.

కలియుగంలో మొదటి నూరు దివ్యసంవత్సరాలు సంధ్యాకాలం. కడపటి నూరు దివ్యసంవత్సరాలు సంధ్యాశకాలం.

ఈ సంధ్యా సంధ్యాంశకాలాలను మర్త్యమానంలోనికి పరివర్తిస్తే -

| | **సంవత్సరాలు** | **సంధ్య** | **సంధ్యాంశ** |
|---|---|---|---|
| **కృతయుగం** | 17,28,000 | 1,44,000 | 1,44,000 |
| **త్రేతాయుగం** | 12,96,000 | 1,08,000 | 1,08,000 |
| **ద్వాపరయుగం** | 8,64,000 | 72,000 | 72,000 |
| **కలియుగం** | 4,32,000 | 36,000 | 36,000 |

అని తెలుస్తుంది.

జీవులలో ఎవరెవరు ఏయే కర్మఫలాలను అనుభవింపవలసి ఉన్నారో వారు వారు తత్కర్మఫలభోగానుకూలమైన ఉపాధులతో తత్తద్యుగ సంధ్యాకాలాలలో సృష్టింపబడుతూ యుగసంధ్యాంశ కాలాలలో లయింపబడుతుంటారు. అందువల్ల యుగసంధ్యా కాలాలను,

యుగసంధ్యాంశ కాలాలను తీసివేయగా శేషించిన మధ్య కాలాలను మాత్రమే ఆయా యుగసంజ్ఞలతో వ్యవహరిస్తారు. ఆ యుగసంజ్ఞా కాలాలలో మాత్రమే గవాలంభాది ధర్మవిశేషాలను నిర్వర్తింపవలసి ఉంటుంది.

ఆ ప్రకారం మర్త్యమానంతో గణిస్తే–

| | |
|---|---|
| **కృత మధ్యకాలం** | 17,28,000 – 2,88,000 = 14,40,000 |
| **త్రేతా మధ్యకాలం** | 12,96,000 – 2,16,000 = 10,80,000 |
| **ద్వాపర మధ్యకాలం** | 8,64,000 – 1,44,000 = 7,20,000 |
| **కలి మధ్యకాలం** | 4,32,000 – 72,000 = 3,60,000 |

దీనిని బట్టి మహాయుగంలోని 43,20,000 సంవత్సరాలలో సంధ్యా సంధ్యాంశకాలాల ప్రమాణం 7,20,000 పరిహరింపగా శేషించిన 36,00,000 సంవత్సరాల కాలం మాత్రమే యుగసంజ్ఞకు అన్వర్థమై ఉన్నది.

శాస్త్రకారులు చెప్పిన యుగధర్మాలన్నీ ఈ కాలానికే అన్వయిస్తాయి.

## యుగాలు–ధర్మపాదాలు

విదురా! కృతయుగంలో ధర్మం నాలుగు పాదాల సక్రమంగా జరుగుతుంది. త్రేతాయుగంలో ధర్మం మూడు భాగాలు, అధర్మం ఒక్క భాగం ఉంటాయి. ద్వాపరయుగంలో ధర్మం రెండు భాగాలు, అధర్మం రెండు భాగాలు వ్యవహరిస్తాయి. కలియుగం రాగానే ధర్మం ఒక్క భాగం, అధర్మం మూడు భాగాలు ప్రవర్తిల్లుతాయి

## మహర్లోకాది కాలమానం

ఈ మూడు లోకాల మీద మహర్లోకం మొదలు బ్రహ్మలోకం వరకు లోకాలున్నాయి. మనుష్య కాలమానం ప్రకారం వారికి వేయి మహాయుగాలు ఒక పగలు, వేయి మహాయుగాలు ఒక రాత్రి అవుతాయి. అంటే రెండువేల మహాయుగాలు వారికి ఒక దినం అన్నమాట. ఆ మానం ప్రకారం వారికి

కూడా నూరేండ్లే ఆయుఃప్రమాణం. మర్త్యమానంలో ఇది 31,10,40,00, 00,00,000 సంవత్సరాలు. ఆ కాలమానంలో బ్రహ్మ ప్రతిదినం పగటివేళ సృష్టించి రాత్రి కాగానే శయనిస్తాడు. అప్పుడు ముల్లోకాలకూ ప్రళయసమయం. తెల్లవారినంతనే బ్రహ్మ మేల్కాంచి పునఃసృష్టి కావిస్తాడు.

## మన్వంతరాలు

విదురా! బ్రహ్మకు ఒక్క పగటికాలం పధ్నాలుగు మన్వంతరాలుగా విభాగింపబడుతుంది. ఒక్కొక్క మన్వంతరం దాదాపుగా డెబ్బైఒక్క మహాయుగాలు. ప్రతి మన్వంతరం లోనూ ఆయా మనువు వంశంలో పుట్టినవారు రాజులై పరిపాలిస్తారు.

## సప్తర్ష్యాదులు

ప్రతి మన్వంతరం లోనూ వసురుద్రాదులు, దేవేంద్రాదులు, గంధర్వాదులు వేర్వేరుగా ఏర్పడతారు. ఈ విధానాన్ని బ్రహ్మ యొక్క దైనందిన త్రిలోకసృష్టి అంటారు.

ఈ కాలంలో జీవులు తమ తమ కర్మానుసారం దేవ పితృ మనుష్య తిర్యగాది రూపాలలో ప్రభవిస్తుంటారు.

ఒక్కొక్క మనువు కాలంలో ఒక్కొక్క సప్తర్షిమండలం ఏర్పడుతుంది

## లయతత్త్వం

భగవంతుడు సత్త్వగుణాన్ని అధిష్ఠించి మనుమూర్తులతో అవతరించి ఆత్మశక్తిని ప్రకటిస్తూ విశ్వాన్ని పరిపాలిస్తుంటాడు. బ్రహ్మకు ఒక్క పగలైనంతనే భగవానుడు తమోగుణాన్ని లేశమాత్రం వ్యవహరింపజేస్తాడు. అప్పుడది భగవద్విక్రమానికి ఉపసంహారాన్ని కలిగిస్తుంది. తత్ఫలితంగా సర్వమూ రూపనామాదులు తొలగి లయరూపమొంది భగవంతునిలో లీనమైపోతుంది. అప్పుడు భగవానుడు నిర్వ్యాపారుడై ఉంటాడు.

## భగవానుని యోగనిద్ర

బ్రహ్మకు రాత్రి అయినప్పుడు సూర్యచంద్రులకు సంచారం ఉండదు. సంకర్షణాగ్ని ప్రజ్వరిల్లి ముల్లోకాలను క్రమ్మివేస్తుంది. ఆ వేడిమికి ఓర్వలేక మహర్లోకవాసులు జనలోకాన్ని ఆశ్రయిస్తారు. అప్పుడు ప్రచండవాయువులు మహాభయంకరంగా వీస్తాయి. ఆ గాలి వడికి సాగరాలు సంక్షోభించి ఉల్లోలకల్లోలాభీలమై పొంగి సర్వం ఏకజలార్ణవంగా విశ్వాన్ని ముంచెత్తుతాయి. ముల్లోకాలూ ఆ నీటిలో మగ్నమైపోతాయి.

ఆ ఏకార్ణవజలాలలో శేషతల్పంపై భగవానుడు పరుండి జనలోకవాసుల ప్రస్తుతులను చిత్తగిస్తూ యోగనిద్రావశుడౌతాడు.

## పరార్ధాల స్వరూపం

విదురా! బ్రహ్మకు కూడా సత్యలోక కాలగతి పరిగణన ప్రకారం నూరేండ్ల ఆయుఃప్రమాణమని చెప్పాను. ఆ నూరేండ్లలో మొదటి అర్ధశతం ప్రథమ పరార్ధమని, తక్కిన యాభైఏండ్లు ద్వితీయ పరార్ధమని గణిస్తారు. ప్రథమ పరార్ధాన్ని బ్రహ్మమహాకల్పమని, ద్వితీయ పరార్ధాన్ని పాద్మమహాకల్పమని వ్యవహరిస్తారు.

ప్రథమ పరార్ధ ప్రారంభంలో శబ్దబ్రహ్మం ఉదయించింది. అందువల్ల దానికి బ్రాహ్మం అన్న పేరు అన్వర్థమై ఉన్నది.

ద్వితీయ పరార్ధం ప్రారంభమైనప్పుడు భగవానుని నాభిసరస్సు నుంచి ఒక పద్మం ఉదయించింది. అందువల్ల ఆ మహాకల్పానికి పాద్మం అని పేరు వచ్చింది.

## వరాహ కల్పం

బ్రహ్మకు ప్రథమ పరార్ధం గడిచి ఇప్పుడు ద్వితీయపరార్ధం జరుగుతున్నది. ఈ ద్వితీయ పరార్ధంలో భగవానుడు వరాహరూపాన్ని

ధరించాడు. అది హేతువుగా ఇప్పుడు నడుస్తున్న కల్పాన్ని వారాహకల్పం అంటారు.

విదురా! ఈ రెండు పరార్ధాల కాలం భగవానునికి నిమేషమాత్రమైనా కాజాలదు. మరి ఈ కాలవిభాగమంతా 'ఇది నా దేహం, ఇది నా యిల్లు, వీరు నా వారు' మొదలైన మమత్వాభిమానాలు కలిగినవారి పట్ల వర్తించినట్లు నిరంతర పరిపూర్ణుడు, పరిచ్ఛేదరహితుడు అయిన భగవానునికి అనువర్తింపదు.

## అక్షర పరబ్రహ్మస్వరూపం

విదురా! పరబ్రహ్మన్ని అక్షరుడు అన్నపేరిట కూడా వ్యవహరిస్తుంటారు. విన్నావు కదా?

క్షరము అంటే నాశనం. అక్షరుడు అంటే నాశనం లేనివాడు అని అర్థం. ఆ అక్షర పరబ్రహ్మస్వరూపం ఎటువంటిదో తెలుసా?

ఈ బ్రహ్మాండ కోశం పదహారు వికారములతో ప్రారంభమై పంచాశత్కోటి యోజనాల విస్తృతిని కలిగి ఉన్నది. దీనిని చుట్టుకొని సప్తావరణలు కనిపిస్తాయి. అవి ఒకదానికంటె ఒకటి పదిరెట్లు పెద్దవిగా ఆవరించి ఉన్నాయి.

సప్తావరణలు ఒక్కొక్కదాని లోనూ ఈ బ్రహ్మాండానికి మించిన అండరాసులు కోట్ల కొలదిగా ఉన్నాయి. వాటినన్నింటినీ కలిపి చూసినా అవి అక్షర పరబ్రహ్మస్వరూపంలో పరమాణుప్రాయమైనా కానేరవంటే ఆ స్వరూపం ఎటువంటిదో నీవే ఊహించి చూడు.

అవ్యాకృతుడు, కార్యోపాధిశూన్యుడు, ఆద్యంతరహితుడు, జగదాత్ముడు, జగత్కారణుడు అయిన భగవానుని స్వరూపం ఇదిగో ఇట్టిదని చెప్పడం బ్రహ్మవేత్తలకూ తరం కాదు.

## అవిద్యా వృత్తిపంచకం

విదురా! అవిద్య అంటే అజ్ఞానం. అది ఐదు విధాలుగా వ్యవహరిస్తుంది. తమస్సు, మోహం, మహామోహం, తామిస్రం, అంధతామిశ్రం అన్నవి ఈ అజ్ఞానవృత్తుల పేర్లు.

బ్రహ్మదేవుడు సృష్టికార్యానికి ఉపక్రమించినప్పుడు ఈ వృత్తుల నైదింటినీ ప్రకల్పించాడు.

జీవులకు స్వరూపజ్ఞానాన్ని కప్పిపుచ్చి స్వరూపప్రకాశం లేకుండా చేయటం **తమస్సు** యొక్క లక్షణం.

దేహాదుల యందు 'ఇది నేను' అన్న అభిమానాన్ని పుట్టించడం **మోహ** లక్షణం.

విషయభోగాలను అనుభవించాలన్న కోరికను మనస్సులో ఉత్పాదింపజేయటం **మహామోహ** లక్షణం.

ఆ కోరికకు విఘాతం కలిగినప్పుడు క్రోధాన్ని ప్రభవింపజేయటం **తామిస్ర** లక్షణం.

దేహానికి నాశనం కలిగితే అది సర్వనాశనంగా భావింపజేయటం **అంధతామిస్ర** లక్షణం.

ఈ అవిద్యావృత్తులు అయిదింటినీ పంచక్లేశాలని అంటారు.

## సనకాది సృష్టి

విదురా! అవిద్యావృత్తులను ప్రకల్పించిన తర్వాత బ్రహ్మదేవునికి అవి పాపాత్మకములని తోచింది. అతను వాటిని అభినందింపక చింతాక్రాంతుడై భగవద్ధ్యానపరుడయ్యాడు.

అంతట పరమేష్ఠికి ఉత్తమ సృష్టివిధానం ప్రస్ఫుటించింది. ఆ స్ఫురణ ప్రకారం నిష్క్రియులు, ఊర్ధ్వరేతస్కులు అయిన సనక, సనంద, సనాతన, సనత్కుమారులు జన్మించారు.

ఈ సనకాదులకు ప్రతికల్పంలోనూ పునస్సృష్టి ఉండదు. ఎవరు బ్రాహ్మకల్పంలో సృష్టింపబడుతారో, వారే ప్రతికల్పంలోనూ వర్తిల్లుతుంటారు. తక్కినవారికి మాత్రం ప్రతికల్పంలోనూ పునస్సృష్టి ఉంటుంది.

బ్రహ్మ వారిని పుట్టించి, 'కుమారకులారా! మీరు ప్రజోత్పత్తి కావించండి' అని నియోగించాడు.

అయితే సనకాదులు పుట్టుక తోనే బ్రహ్మవేత్తలైన మహాజ్ఞానులు. మోక్షధర్మాభిలాష వలన వారందరూ వాసుదేవపరాయణు లయ్యారు. అందువల్ల వారికి సృష్టికర్మ రుచింపలేదు. వారు బ్రహ్మనియోగాన్ని నిషేధించారు.

## రుద్రోత్పత్తి

సనకాదుల మతం వల్ల సృష్టివిస్తారం జరగలేదని బ్రహ్మదేవునికి పట్టరానంత క్రోధం ఆవిర్భవించింది. ఎంత నిగ్రహించినా ఆ క్రోధజ్వాల ఉపశమింపలేదు. ఆ క్రోధఫలంగా బ్రహ్మ కనుబొమల మధ్య నుంచి నీలలోహిత వర్ణంలో ఒక బాలుడు జన్మించి, గొంతెత్తి ఏడుస్తూ, 'దేవా! లోకంలో నేను ఏయే చోట్లలో ఉండవచ్చునో, నన్ను ఏయే పేర్లతో పిలుస్తారో, చెప్పు' అని అడిగాడు. బ్రహ్మ మెల్లగా మృదువచనాలతో అతనిని ఓదార్చి, 'నాయనా! ఏడవకు. పుట్టుక తోనే భయభ్రాంతికరంగా రోదించావు కనుక నీకు రుద్రుడు అనే పేరు సార్థకం అవుతుంది. హృదయము, ఇంద్రియాలు, ప్రాణము, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి, సూర్యుడు, చంద్రుడు, తపస్సు అనే పదకొండూ నీకు నివాసస్థానాలై అమరుతాయి. మన్యువు, మనువు, మహాకాలుడు, మహుడు, శివుడు, ఋతధ్వజుడు, ఉరురేతస్కుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు అనే పదకొండు నీ నివాసస్థానాలకు తగినట్లుగా నీకు పేర్లవుతాయి. మరి ధీవృత్తి, అశన, ఉమ, నియుత్తు, సర్పి, ఇళ, అంబిక, ఇరావతి, సుధ, దీక్ష, రుద్రాణి అనే సౌభాగ్యవతులు పదకొండుమంది నీ నివాసస్థాన యోగ్యులైనవారు నీకు భార్య

లవుతారు. వారిని గ్రహించి ఆయా పేర్లతో ఆయా చోట్లలో ప్రవర్తిల్లుతూ ప్రజాసృష్టిని కావించు' అన్నాడు.

## రుద్రగణ సృష్టి

అప్పుడు నీలలోహితుడు బ్రహ్మ ఆజ్ఞ మేరకు ప్రజాసృష్టికి పూనుకొని తన బలానికి, రూపానికి, స్వభావానికి తగినట్లుగా రుద్రగణాన్ని పుట్టించాడు.

రుద్రుని వలన జన్మించిన ఆ రుద్రగణం పుట్టీ పుట్టగానే లోకాలను ఆక్రమించి కంటబడిన వస్తువునల్లా మింగసాగింది. ఆ సంగతి తెలిసి బ్రహ్మ అతనిని రప్పించి, 'అయ్యా! నీవు పుట్టించిన ఈ రుద్రగణం లోకాలను బాధిస్తున్నది. ఇక ఇట్టివారిని సృజింపకు. సర్వభూత సుఖసంకల్పంతో తపస్సును ఆచరించు. ఆ తపస్సు ఫలించి నీవు పూర్వకల్ప ప్రకారం లోకసృష్టిని కావింపగలవు. తపశ్శక్తి మహిమ వాచామగోచరం. సర్వభూతహృదయాంతర్గతుడు, పరమజ్యోతీరూపుడు అయిన భగవానుడు కూడా తపశ్శక్తి చేత సులభప్రాప్యుడనగా ఇక ఇతర వస్తువులను గూర్చి చెప్పేదేమున్నది?' అని బోధించాడు.

నీలలోహితుడు ఆ మాట తలదాల్చి బ్రహ్మకు నమస్కరించి ఆయన అనుమతి గైకొని తపశ్చరణార్థం వనవాసానికి వెళ్లిపోయాడు.

## మరీచ్యాదుల సృష్టి

అంతట బ్రహ్మ లోకసృష్టిని గురించి మళ్లీ చింతింపసాగాడు. భగవచ్ఛక్తి అతని యందు ఆవిర్భవించింది. అతని మనస్సు నుంచి మరీచి, నేత్రాల నుంచి అత్రి, ముఖం నుంచి అంగిరసుడు, కర్ణముల నుంచి పులస్త్యుడు, నాభి నుంచి పులహుడు, చేతుల నుంచి క్రతువు, త్వక్కు నుంచి భృగుడు, ప్రాణం నుంచి వసిష్ఠుడు, అంగుష్ఠం నుంచి దక్షుడు, ఉత్సంగం నుంచి నారదుడు జన్మించి లోకసంతానహేతువులై విలసిల్లారు.

ఆ తర్వాత బ్రహ్మదేవుని దక్షిణభాగం నుంచి ధర్ముడు, పృష్ఠభాగం నుంచి మృత్యువైన అధర్ముడు, హృదయం నుంచి కాముడు, భ్రూయుగం నుంచి క్రోధుడు, అధరోష్ఠం నుంచి లోభుడు ప్రభవించారు.

బ్రహ్మదేవుని వక్త్రం వలన వాగ్దేవి, సముద్రాలు, మేఢ్రం వలన నిరృతి, పాయువు వలన పాపాశ్రయం, ఛాయ వలన కర్దముడు జన్మించారు.

## వాగ్దేవీ చతుర్ముఖుల ప్రణయం

విదురా! బ్రహ్మ వక్త్రం నుంచి వాగ్దేవి జన్మించిందని చెప్పాను కదా. ఆ దేవి రూపసౌభాగ్యాలు లోకమోహనంగా విభ్రాజిల్లాయి. బ్రహ్మ ఆమెను చూసి అపురూపమైన ఆ సౌందర్యానికి సమాకర్షితుడై కూతురన్న విషయాన్ని కూడా మరిచి ఆమెను కామించాడు.

బ్రహ్మ పుత్రులైన మరీచ్యాదులు ఆ అధర్మవృత్తికి ఎంతో చింతించి తండ్రి వద్దకు వెళ్లారు. 'మహాత్మా! సృష్టికర్తవైన నీవు కామలోలుడవు కావటం ధర్మమేనా? ఒకవేళ కామవశుడవైనా మట్టుమర్యాదులు వద్దా? కన్నకూతురినా కామించడం? నీకు పూర్వులు ఎవరైనా ఇట్టి అకార్యానికి పాల్పడ్డారా? ఇకముందైనా చేయగలరా? కలలో నైనా చేయకూడని పని చేశావే? తేజశ్శాలులకు ఇది కీర్తికరమవుతుందా? పెద్దల దారిని నడవటం పిన్నలకు క్షేమకరం అంటారు. నీవు చేసిన అకార్యాన్ని చూసి లోకంలో అందరూ అలాగే చేస్తే ఏమవుతుందో ఆలోచించావా? అందరికీ మార్గోపదేశకుడవు నీవే ఇలా చేసిననాడు లోకం గతి ఏమికావాలి? మేము ఎవరితో చెప్పుకోవాలి? ఎవడు తనలో ఉన్న జగత్తులను స్వప్రకాశబలంతో నిష్ఠమై వ్యక్తీకరించాడో ఆ భగవానుడే ఇక దిక్కవుతాడు గాక. అతనికి ప్రణామం చేసి బ్రతిమాలుకొంటాము. అతడే ఇక ధర్మాన్ని పరిపాలించి లోకరక్షణ కావిస్తాడు' అని భిన్నస్వరాలతో పలికారు.

## బ్రహ్మ తనుత్యాగం

బ్రహ్మదేవుడు వారి మాటలను విని తన తప్పిదాన్ని గ్రహించి, సిగ్గుపడి, తన అపరాధానికి ప్రాయశ్చిత్తంగా శరీరత్యాగం చేశాడు.

ఆ తనువును దిక్కులు గ్రహించాయి. అది నీహారతమస్సయింది.

## చతుర్వేదాది సృష్టి

అప్పుడు బ్రహ్మ సాత్త్వికశరీరాన్ని ధరించి మళ్లీ సృష్టి చింతకు ఉపక్రమించాడు. ఆ తలంపుతో అతని నాల్గు మోముల నుంచి నాలుగు వేదాలు ఉద్భవించాయి.

మరీచ్యాదుల వలన ప్రజలు జనించి తమ కర్తవ్యం ఏమిటో తెలియక ఆందోళన చెందసాగారు. వారికి తగిన క్రియావిశేషాన్ని కల్పించడం ఆవశ్యకమయింది.

బ్రహ్మ ఆ విషయాన్ని గురించి అంతర్ముఖుడై పునరాలోచించాడు. అప్పుడు చతుర్హోత్ర కర్మతంత్రం, ఉపవేదాలు, న్యాయాలు, నాలుగు ధర్మపాదాలు, చతుర్వర్ణాశ్రమ వృత్తులు అతని ముఖాల నుంచి వెలువడ్డాయి.

విదురా! బ్రహ్మ నాలుగు మోములలో ఏయే మోము నుంచి ఏయే వేదం జనించిందో చెబుతున్నాను విను. పూర్వముఖం నుంచి ఋగ్వేదం, దక్షిణ ముఖం నుంచి యజుర్వేదం, పశ్చిమముఖం నుంచి సామవేదం, ఉత్తరముఖం నుంచి అథర్వణవేదం ప్రభవించాయి. అలాగే శస్త్రము, ఇజ్య, స్తుతిస్తోమం, ప్రాయశ్చిత్తం యథాక్రమంగా పూర్వాదిముఖాల నుంచి జన్మించాయి.

యజ్ఞకర్మలో అప్రగీతమంత్ర స్తోత్రానికి శస్త్రము అని పేరు. ఇది హోతృకర్మం.

ఇజ్య అంటే యాగసమయంలో అధ్వర్యువు చేయదగిన కర్మవిశేషం .

స్తుతి అంటే సంప్రగీతస్తోత్రం. ఈ సంప్రగీతస్తోత్రార్థమై ఋక్సముదాయం కూడగా ఏర్పడింది స్తుతిస్తోమం. ఇది ఉద్గాతృకర్మం.

ప్రాయశ్చిత్తం అన్నది బ్రహ్మకర్మం.

అనంతరం బ్రహ్మ నాలుగు మోముల నుంచి వరుసగా ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వ వేదం, స్థాపత్య వేదం ఉద్భవించాయి. స్థాపత్యమంటే శిల్పవిద్య.

ఆ తర్వాత పంచమ వేదమైన ఇతిహాసం, పురాణం అనంతముఖీనములై బ్రహ్మ నాలుగు మోములనుంచీ ప్రభవించాయి.

విదురా! చతుర్ముఖుని ఒక్కొక్క ముఖం నుంచి మాత్రమే పుట్టిన వేదాదులు ఒక్కొక్క విషయాన్ని మాత్రమే ప్రతిపాదిస్తాయి. ఇతిహాస పురాణాలు సర్వముఖాల నుంచి పుట్టినందువలన సర్వవిషయాలనూ సూక్ష్మంగా వివరిస్తాయి.

ఆ తర్వాత షోడశ్యుక్థ్య యాగరూపమైన కర్మతంత్రం, అగ్నిష్టోమాలు, ఆప్తోర్యామ అతిరాత్రాలు, వాజపేయ గోసవనాలు బ్రహ్మముఖం నుంచి ఆనుపూర్విగా ఉదయించాయి.

ఆ తర్వాత ధర్మచతుష్పాదములైన శౌచము, దయ, తపస్సు, సత్యములను బ్రహ్మ సృజించాడు.

అనంతరం బ్రహ్మచర్యాదులైన నాలుగు ఆశ్రమాలను ఆయా వృత్తులతో ప్రభవింపజేశాడు.

## బ్రహ్మచర్య చాతుర్విధాలు

విదురా! బ్రహ్మచర్యం నాలుగు విధాలు. అవి ప్రాజాపత్యం, బ్రాహ్మం, బృహత్తు, నైష్ఠికం అని పేర్కొనబడుతున్నాయి.

ఉపనయనం మొదలు త్రిరాత్రం గాయత్రిని చదవటం ప్రాజాపత్య మనబడుతుంది.

బ్రాహ్మం అంటే సంవత్సర నియమంతో కావించే వ్రతాచరణం.

వేదగ్రహణం పూర్తయినాక వ్రతం చేయడాన్ని బృహత్తు అంటారు.

వివాహాన్ని వర్జించి జన్మాంతనిష్ఠతో ఉండటం నైష్ఠికబ్రహ్మచర్యం.

## గృహస్థాశ్రమ చాతుర్విధాలు

గృహస్థాశ్రమం కూడా నాలుగు విధాలు. అవి వార్త, సంచయనం, శాలీనం, శాలోంఛనం అని చెప్పబడుతున్నాయి.

నిషిద్ధములు కాని వృత్తులను చేపట్టడం – అనగా కృష్యాది వృత్తులను అవలంబించడం వార్త.

యాచనావృత్తికి సంచయనం అని పేరు.

దైన్యభావం లేకుండా ఒకరికి చేయిజాపక జీవించడం శాలీనం అనబడుతుంది. పండిన వెన్నులను ఏరి, ఆ గింజలతో పొట్టపోసుకొనటం శిలావృత్తి. రాలిన గింజలను ఏరుకొని తింటూ జీవిక గడపటం ఉంఛవృత్తి.

## వానప్రస్థ చాతుర్విధాలు

వానప్రస్థం కూడా వైఖానసం, వాలఖిల్యం, ఔదుంబరం, ఫేనం అని నాలుగు విధాలు.

వైఖానసం అంటే – దున్నక, విత్తుచల్లక, తమంత తాముగా మొలిచి పండిన నీవారాది ధాన్యాలతో సంతృప్తిగా జీవించడం.

ఒక నూత్నపదార్థం దొరికిననాడు పూర్వం తనవద్ద ఉన్నదానిని త్యజించి ఆ కొత్తదానితో జీవించటాన్ని వాలఖిల్యం అంటారు.

తెల్లవారుజామున లేవగానే దృష్టి ఏ దెసకు ప్రసరిస్తుందో ఆ దెస నుంచి ఫలాదులను తెచ్చి వాటితో కడుపు నింపుకొంటూ బ్రతకటం ఔదుంబరం.

తమంతట పండి రాలిన ఫలాదులతో జీవించటం ఫేన మనబడుతుంది.

## సన్న్యాసాశ్రమ చాతుర్విధాలు

సన్న్యాసాశ్రమంలో కుటీచకం, బహూదకం, హంసం, పరమహంసం అని నాలుగు విధాలు ఉన్నాయి.

తన ఆశ్రమకర్మం ప్రధానంగా ఉండేవాడు కుటీచకుడు. కర్మం అప్రధానమూ, జ్ఞానం ప్రధానంగా ఉన్నవాడు బహూదకుడు. జ్ఞానాభ్యాసనిష్ఠుడు హంసుడు. బ్రహ్మతత్త్వజ్ఞానాన్ని పొంది నిష్క్రియంగా ఉండేవాడు పరమహంసుడు. వీరిలో ఉత్తరోత్తరులు శ్రేష్ఠులని పెద్దల నిర్ణయం.

## అన్వీక్షక్యాదుల జననం

విదురా! ఆ తర్వాత అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి అనే నాలుగు విద్యలు బ్రహ్మ పూర్వముఖం నుంచి ఉద్భవించాయి.

అన్వీక్షకి అంటే ఆత్మానాత్మవివేక విద్య. ఇది మోక్షఫలదాయకం.

కర్మకాండను త్రయీ విద్య అంటారు. ఇది స్వర్గాది ఫలాన్ని ఇస్తుంది.

కృష్యాది రూపమైనది వార్త అనబడుతున్నది. దీనివల్ల జీవనఫలం దక్కుతుంది.

ఇక అర్థమైనది దండనీతి. ఇది రాజ్యపాలనకు, ధర్మరక్షణకు ఉపకరిస్తుంది.

## వ్యాహృతుల జననం

అనంతరం బ్రహ్మ దక్షిణముఖం నుంచి వ్యస్తవ్యాహృతులు మూడు, పశ్చిమముఖం నుంచి సమస్త వ్యాహృతులు మూడు, ఉత్తరముఖం నుంచి తురీయం అనే వ్యాహృతి ఒకటీ జనించాయి.

'భూః', 'భువః', 'సువః', 'మహః', 'జనః', 'తపః', 'సత్యమ్' అన్నవి ఈ సప్త వ్యాహృతులు.

## ప్రణవాది జననం

అటు తర్వాత బ్రహ్మ యొక్క హృదయాకాశం నుంచి ప్రణవము, రోమాల నుంచి ఉష్ణిక్ఛందస్సు, త్వక్కునుంచి గాయత్రీ చందస్సు, అస్థుల నుంచి జగతీచ్ఛందస్సు, మాంససారం నుంచి పఙ్క్తిచ్ఛందస్సు, ప్రాణము నుంచి బృహతీచ్ఛందస్సు ప్రభవించాయి.

## శబ్దబ్రహ్మ శరీరం

విదురా! బ్రహ్మదేవుడు మహాకల్పంలో శబ్దబ్రహ్మాత్మకుడై ఉంటాడు. ఆ విధానం విను:

కకారం మొదలు మకారం వరకు ఉన్న అక్షరాలను అయిదు వర్గాలుగా విభజించారు. ఈ పంచవర్గంలోని స్పర్శాక్షరాలు శబ్దబ్రహ్మానికి జీవం. అకారాది స్వరాలు దేహం. శషసహలనే ఊష్మాలు ఇంద్రియాలు. యరలవలనే అంతఃస్థాలు శక్తి. సప్తస్వరాలు అతని విహారప్రభవాలు.

## పరమేశ్వరుని రూపాలు

ఈ శబ్దబ్రహ్మాత్మునికి పరుడై పరమేశ్వరుడు ఉంటాడు. అతనికి వ్యక్తం, అవ్యక్తం అని రెండు రూపాలు. వ్యక్తరూపాన్ని వైఖరీవృత్తి అంటారు. అవ్యక్తాన్ని ప్రణవం అంటారు. ఆ ప్రణవం పరమేశ్వరునికి ఆత్మ. సర్వశక్తులూ పరమేశ్వరుని యందు ఉపబృంహితములై (వర్ధిల్లి) ఇంద్రాదిరూపాలను ధరించి వ్యవహరిస్తాయి. ఆ తత్త్వం పరిపూర్ణమైనది.

## స్వాయంభువ మనువు సృష్టి

ప్రజాసర్గార్థమై బ్రహ్మదేవుడు మునిసర్గాన్ని ప్రకల్పించినా వారివల్ల అనుకున్నంత లోకవిస్తృతి జరగలేదు. చతురాస్యుడది పరికించి, 'ఏమిటిది? సృష్టి విషయంలో నిత్యం అదే పనిగా నిమగ్నుడవై ఉన్నా నేను తలచినట్లు వృద్ధి కనిపించటం లేదు. దైవవిఘాతం ఇందుకు కారణమై ఉంటుందా?' అని శంకించి, తదేకంగా ధ్యానించాడు.

అప్పుడు బ్రహ్మ దేహం రెండుగా చీలిపోయింది. ఆ రెండు చీలికలలో ఒకటి పురుషరూపాన్ని, రెండవది స్త్రీ రూపాన్ని ధరించాయి. ఆ పురుష రూపానికి స్వాయంభువుడు అని, స్త్రీ రూపానికి శతరూప అని పేరు పెట్టారు.

స్వాయంభువుడు శతరూపను పెండ్లి చేసుకొన్నాడు. ప్రజాభివృద్ధికై వారు మైథునధర్మాన్ని అవలంబించారు. వారికి ఇద్దరు కొడుకులు – ప్రియవ్రత ఉత్తానపాదులు, ముగ్గురు కుమార్తెలు – ఆకూతి, దేవహూతి, ప్రసూతి జన్మించారు.

ఆకూతిని రుచిమహర్షి, దేవహూతిని కర్దముడు, ప్రసూతిని దక్షుడు పరిగ్రహించారు.

## స్వాయంభువునికి కర్తవ్యోపదేశం

అంతట స్వాయంభువుడు శతరూపతో కలిసి బ్రహ్మ వద్దకు వెళ్లి, నమస్కరించి 'దేవా! సర్వసృష్టిజాలానికీ జనకుడవైన నీవే మాకు రక్షకుడవు. సృష్టికర్తకు నీకు మా బోంట్ల వలన కాగల కార్యం ఏమీ లేదు. అయినా బిడ్డలు తమ స్వధర్మపూర్వకంగా ఏదో ఒక తీరున పితృసేవ చేయాలి. ఏ పని నీకు సమ్మతమో, ఏ పని మాకు ముల్లోకాలలో శాశ్వతకీర్తిదాయకమో, ఆ పుణ్యకార్యంలో మమ్మల్ని నియోగించు. ఏ విధంగానైనా నీకు పరిచర్య చేస్తేకానీ మాకు కృతార్థత చేకూరదు' అని సంప్రార్థించాడు.

బ్రహ్మదేవుడు అతని వినయశీలానికి సంతోషించి, 'నాయనా! నీ నిష్కాపట్యబుద్ధికి, నీ పితృసేవాతత్పరతకు మెచ్చాను. గురుజనుల ఆజ్ఞను నిర్మాత్సర్యబుద్ధితో ఆదరపూర్వకంగా, ప్రమాదరహితంగా ఔదల దాల్చటమే పుత్త్రులకు నిజమైన పితృపూజ. నీవు నీ శతరూప యందు అనుగుణమైన సత్సంతానాన్ని పొంది, ధర్మపురస్సరంగా రాజ్యమేలుతూ, యజ్ఞపురుషుని ఆరాధిస్తూ ప్రజలను నీవు కన్న ప్రజల వలె కంటికి రెప్పగా నిలిచి కాపాడాలి. ఇదే నీవు నాకు చేయదగిన పరిచర్య అని మనసారా గుర్తుంచుకో.

భగవంతునికి నీవంటే ప్రీతి కలుగుతుంది. ఏ శ్రమ భగవత్ప్రీతికరంగా పరిణమిస్తుందో అది సార్థకం. తక్కిన శ్రమలన్నీ నిరర్థకాలు. మరి భగవత్ప్రీతి కావించటమంటే ఆత్మపూజతో సమానం. అంతకంటే ఉత్తమకార్యం వేరొకటి లేదు' అని ఉపదేశించాడు.

స్వాయంభువుడు ఆ మాటలను విని, 'దేవా! నీ ఆజ్ఞను తలదాల్చి నడుచుకొంటాను. అయితే ఒక్క విన్నపం. భూమండలం నీటిలో మునిగి ఉన్నది. నాకూ నా ప్రజలకూ సకల భూతజాలానికీ నిలువ నీడ లేదు. మాకు తలదాచుకొనే స్థావరాన్ని కలిగించు. భూమిని జలార్ణవం నుంచి పైకెత్తితే కాని ఈ కార్యం నెరవేరదు' అని కోరాడు.

## వరాహావతారం

బ్రహ్మ ఆ మాటలు విని, 'అయ్యో! ఒకసారి ప్రళయజలాలను తాగి భూమిని ఉద్ధరించి దేవాది సమస్త సృష్టికి ఉపక్రమించాను. భూమి మళ్లీ పాతాళగతమై జలావృతం అయింది. కారణం ఏమిటో తెలియదు. భూమిని పునరుద్ధరించటం ఎలాగో, ఏమి చేయాలో, ఎటూ తోచడం లేదు. ఎవడు నాకు శరీరాన్ని ప్రసాదించాడో ఆ దేవదేవుడే శరణం' అని నిశ్చయించి భగవానుని ధ్యానింపసాగాడు.

బ్రహ్మ ఆ విధంగా ధ్యానిస్తుండగా అతని ముక్కు రంధ్రాల నుంచి అంగుష్ఠమాత్ర ప్రమాణం కల వరాహం ఒకటి వెలువడి క్షణంలో మహాగజమంత పెద్దదయింది. ఆ అద్భుతానికి బ్రహ్మ అచ్చెరువందాడు. మరీచిముఖ్యులు, సనకాదులు, స్వాయంభువుడు నివ్వెరపోయి చూశారు. కొంతసేపటికి బ్రహ్మ సమాహితచిత్తుడై, 'భగవానుడు నా మనస్సును పరీక్షించాలని ఈ రూపాన్ని ధరించాడు కాబోలు' అని అనుకొంటుండగా, ఆ వరాహం కొండంత పెరిగి బృహద్రూపాన్ని ధరించింది. మరీచ్యాదులు మరీ తెల్లబోయి నిశ్చేష్టులై నిలబడ్డారు. ఆ సూకరం దిక్కులు మార్మోగేటట్లు ఘుర్ఘురించింది. ఆ ధ్వని విని జనలోక తపోలోక సత్యలోకవాసులు

ఋగ్యజుస్సామ మంత్రాలతో ఆ మాయావరాహమూర్తి అయిన భగవంతుని ప్రస్తుతించారు. ఆ స్తుతులకు తన సంతోషాన్ని తెలియజేస్తున్నట్లుగా ఆ వేదమూర్తి తల పంకించి, ఘుర్ఘురించి, తోక యెత్తి, సటలు విదిల్చి, రోమాలు నిగుడించి, నింగిపై కెగసి, కాలి గిట్టలతో జలదమండలాన్ని తన్ని, తెల్లని కోరలను తిప్పుతూ, నిరీక్షణ జ్యోతులను ప్రసరింపజేస్తూ మూతిముట్టెతో వాసన లానుతూ జలగర్భం లోనికి ప్రవేశించింది. ఆ మహోత్పాతానికి సముద్రుడు లోకభీకరంగా ఉద్ఘోషించి మహోర్తుడై తరంగ హస్తాలను పైకెత్తి, 'దేవా! రక్షించు! రక్షించు!' అంటున్నట్లు నీళ్లు పైకెగజిమ్మాయి. సాగరజలం పాయలుగా విడబారింది. ఆ మహావరాహం సాగరాంతంలో ఉన్న భూమిని నిజదంష్ట్రాగ్రంతో పైకెత్తి రసాతలం నుంచి వెలికి రాసాగింది.

ఆ సమయంలో హిరణ్యాక్షుడనే దైత్యుడు వచ్చి మహాపరాక్రమంతో ఆ వరాహాన్ని అడ్డగించాడు. వరాహమూర్తి ఆ దైత్యుని వెనువెంటనే చక్రంతో తెగటార్చాడు. బ్రహ్మాదులు చూసి చేతులు జోడించి ఆ మూర్తిని భక్తిశ్రద్ధలతో సన్నుతించారు.

## శ్రీయజ్ఞవరాహమూర్తి స్తోత్రం

**సీ. దేవ! జితం, జితం తే పరమేశ్వర!**
**జితయజ్ఞభావన! శ్రుతిశరీర!**
**యనుచుఁ గారణసూకరాకారుఁ డగు నీకు**
**నతిభక్తి మ్రొక్కెదమయ్య, వరద!**
**భవదీయ రోమకూపములందు లీనంబు**
**లై యుండు నంబుధు, లట్టి యధ్వ**
**రాత్మకమై తనరారు నీ రూపంబు**
**గానంగరాదు దుష్కర్మపరుల**

**గీ. కట్టి నీకుఁ బ్రణామంబు నాచరింతు**
**మఖిల జగదేకకీర్తి! దయానువర్తి!**
**భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!**
**చిరశుభాకార! యింతిరా చిత్తచోర!**

'దేవా! ఇష్టులు దిక్షణీయం, ప్రాయణీయం, దయనీయం అని మూడు ఉన్నాయి. నీ యొక్క అవతారకృత్యాలు నీకు దీక్షణీయ మనే పేరుగల ఇష్టిగా ఉన్నది. నీ రెండు దంష్ట్రలు ప్రాయణీయమనే దీక్షానంతరేష్టి, దయనీయమనే సమాప్తేష్టిరూపాలై విరాజిల్లుతున్నాయి. ఈ ఇష్టికి నీ రేతస్సు సోమం. నీ అవస్థానమే ప్రాతస్సవనాదులు. త్వఙ్మాంసాది సప్తధాతువులు అగ్నిష్టోమ – ఉక్థ్య – షోడశీ – వాజపేయ – అతిరాత్ర – ఆప్తోర్యామాలనే సంస్థా భేదాలు. శరీరసంధులు ద్వాదశాహాదిరూప వివిధ యాగసంఘాతాత్మక సర్వసత్త్రాలుగా తనరారుతున్నాయి. ససోమములు అసోమములు అయిన యజ్ఞక్రతువులన్నీ నీ రూపములై గోచరీభూత మవుతున్నాయి. మరి నీవు యజనబంధనలచే ఒప్పుతున్నవాడవు. హవరూపివి, హవనేతవు, హవభోక్తవు, నిఖిల హవఫలాధారుడవు, హవరక్షకుడవు సమస్తం నీవే. అఖిల మంత్రాలు, సామాన్య వ్యాపృతులు నీ రూపాలే. ఎవరు వైరాగ్యం కలిగి నిష్కామకర్మాచరణ ఫలమైన సత్త్వశుద్ధిని పొంది భక్తిని సాధించి మనోజయాన్ని, చిత్తస్థైర్యాన్ని గడిస్తారో వారికి మాత్రమే నీ సాక్షాత్కార యోగ్యమైన జ్ఞానం సిద్ధిస్తుంది. అట్టి జ్ఞానప్రదాతకు నీకు పునఃపునర్నమస్కారాలు.

దేవా! స్థావర జంగమాత్మకమైన వసుమతీ చక్రాన్ని అవలీలగా సముద్ధరించు. విశ్వానికే జనకుడవైన నీవు మాకు తండ్రి వంటివాడవు. నీ పత్ని భూదేవి మాకు తల్లితో సమానం. మీ ఇరువురకూ చేతులు జోడించి మీ దయాభిక్షను అర్థిస్తున్నాము. యాజ్ఞికుడు అరణి యందు అగ్నిని నిలిపినట్లు నీ తేజాన్ని ధరించిన భూదేవి పవిత్రయై అలరారుతున్నది. ఎల్ల లోకాలూ నీ కుక్షిలో ఉన్నాయి. రసాతలం నుంచి భూమిని ఉద్ధరించటం నీకు ఏ పాటి? నీవిప్పుడు ధరోద్ధరణ కావించి మాకు నివాసస్థానాన్ని కల్పింపగలవని అర్థార్థులమై వచ్చి చేరాము.

దేవా! నీవు రసాతలం నుంచి భూమిని ఉద్ధరించి కొనితెచ్చేటపుడు నీ మేని విదుర్పులకు నీ జూలునుండి జారిపడిన జలకణాలు సోకి జనలోక తపోలోక సత్యలోక వాసులమైన మే మందరమూ పవిత్రీకృతుల మయ్యాము.

దేవా! నీ శక్తి అనంత మహిమోపేతం. లోకమంగళాన్ని కలిగించు. నీ యోగమాయలో మునిగి స్వరూపజ్ఞానాన్ని కోల్పోయిన మాకు అచింత్యమైన నీ శక్తిని గ్రహించి, నిన్ను భజించటానికి తగినంత జ్ఞానాన్ని అనుగ్రహించు' అని బ్రహ్మాదులు స్తుతింపగా పరమేశ్వరుడు సంప్రీతస్వాంతుడై తన గోటిలో ఉన్న మున్నీటి యందు భూమిని నిలిపి అంతర్హితుడైనాడు.

## వరాహచరిత్ర ప్రాశస్త్యం

విదురా! భగవన్మాయావిలాసమైన ఈ వరాహచరిత్రను భక్తితో ఆకర్ణించిన వారి హృదయాంతరంలో ప్రపన్నార్తిహరుడైన పరమేశ్వరుడు ప్రసన్నుడౌతాడు. నిజానికి భగవత్ప్రసాదాన్ని మించిన కామితార్థం ఒక్కటీ లేదు. అలతి కోర్కెలనే ఎండ మావుల వెంట ఎంత తిరిగినా శ్రమే కాని ఫలం దక్కదు.

విదురా! భగవంతుని చరిత్రలు ఎన్నో ఉన్నాయి. అందులో ఈ వరాహచరిత్రం అమృతప్రాయమై సంసార నివృత్తిని కలుగజేస్తుంది. ఈ చరితామృతాన్ని వీనులు గ్రోలి చవిగాంచినవారికి విరక్తి తనంత తానే ఉదయిస్తుంది. దీని రుచి తెలియనివారు పశుతుల్యులై సంసారజలధిలో కొట్టుకొనిపోతారు.

## హిరణ్యాక్షుని చరిత్ర

విదురుడు మైత్రేయుని మాటలను విని, 'మునీంద్రా! హిరణ్యాక్షుడెవడు? అతని జన్మవిస్తరం ఏమిటి?' అని అడిగాడు. మైత్రేయుడు చెప్పాడు.

'విదురా! హిరణ్యాక్షుని కథను పూర్వం బ్రహ్మదేవుడు దేవతలకు వినిపించాడు. అది ఒక ఇతిహాసమై ఇప్పటికీ ప్రచారంలో ఉన్నది. దానిని చెబుతున్నాను విను.

## హిరణ్యకశిపాదుల పుట్టుక

నీలలోహితుని పుత్రులలో దక్షుడు కూడా ఒకడని చెప్పాను, జ్ఞాపకం ఉన్నది కదూ! ఆ దక్షుడు శతరూపాస్వాయంభువుల కనిష్ఠపుత్రిక అయిన ప్రసూతిని వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు పదముగ్గురు కుమార్తెలు జన్మించారు. వారందరినీ మరీచి పుత్రుడైన కశ్యపునికి ఇచ్చి పెండ్లి చేశారు.

ఒకనాడు కశ్యప ప్రజాపతి సాయంసంధ్యాసమయంలో అగ్నిహోత్రాన్ని సవరించి, యజ్ఞేశ్వరుని ఆరాధించి సమాహితచిత్తుడై ఉన్నాడు. అప్పుడు అతని భార్య దితి మదనతాపపీడితయై నిలువలేక పుత్రకాంక్షతో పతి వద్దకు వచ్చి, 'ప్రాణేశ్వరా! మదించిన ఏనుగు అరటిచెట్టును కదలించినట్లు మన్మథుడు నా హృదయాన్ని అల్లకల్లోలం చేస్తున్నాడు. అంతే కాక నా సవతులు పుత్రవతులై ఉండగా, నా కింకా అటువంటి భాగ్యం కలుగలేదని హృదయం పరితపిస్తున్నది. లోకంలో ఏ కాంతలు తమ భర్తృతేజాన్ని సంతానరూపంలో గర్భములందు వహించి, ఆ కారణాన భర్తృబహుమానానికి నోచుకొంటారో ఆ కాంతల జీవితం సార్థకం అవుతుంది. అట్టి భాగ్యం కలుగనేరని కాంతల జీవితం నిరర్థకం. పుత్రవతుల యశస్సు లోకమంతటా వ్యాపిస్తుంది. మరి మా నాన్నగారు దుహితృవత్సలుడై అందరినీ చేరబిలిచి, 'కుమార్తెలారా! మీరందరూ పెళ్లిళ్లు చేసుకొని కడుపు చల్లగా పిల్లల్ని కంటే చూడాలని ఉన్నది. మీ మనస్సుకు నచ్చినవానిని వరించి, సంతానవతులై నాకు మురిపెం కూర్చాలి' అని కోరినప్పుడు మేము పదముగ్గురమూ మిమ్ము వరించి, పతిగా కోరుకొన్నాము. మా తండ్రి మమ్మల్ని మీకిచ్చి పెళ్లి చేశాడు. నాకు పుత్రసంతానాన్ని ప్రసాదించి నా కోరిక తీర్చి, మా నాన్నగారి ముచ్చట తీర్చండి. దీనజన ప్రణయాన్ని మహాత్ములు ఎన్నటికీ వమ్ముచేయరు' అని దుఃఖ దీనస్వరంతో వేడుకొన్నది.

కశ్యపుడు ఆ మాటలు విని, ఆమెకు భవితవ్యాన్ని వివరించి చెప్పాడు. 'కామినీ! నీవు కోరినట్లే నీకు ప్రియాన్ని చేకూర్చుతాను. త్రివర్గ సాధనమైన వాంఛితాన్ని కాదనే భర్త ఉంటాడా?

దితీ! అన్ని ఆశ్రమాలకూ గృహస్థాశ్రమం పోషకమైనది. సముద్ర తరణానికి నౌక వలె సంసారసాగర తరణానికి భార్య పరమసాధనం. అంతే కాదు. భార్య అంటే భర్తకు అర్ధశరీరం. అందుకే ఆమెను అర్ధాంగి అన్నారు. ఆ నమ్మకంతోనే భర్త ఇంటి బరువు బాధ్యత లన్నింటిని భార్యకు అప్పగించి నిశ్చింతగా ఉంటాడు. నరులకు ఇంద్రియవైరులతో తీరని పోరాటం ఎప్పుడూ ఉండేదే. ఆ ఇంద్రియాలను ఇతరాశ్రమాలలో ఒంటిగా నిలిచి గెలుపొందటం సులభం కాదు. అందువలన పురుషుడు భార్యను గ్రహించి గృహస్థాశ్రమస్థుడై భార్యాసహకారంతో ఇంద్రియ శత్రువులను ఉవ్వెత్తున ఊదివేసి కడతేరుస్తున్నాడు. ఆ విధంగా తనకు సర్వకాల సర్వవిధ సహకారిణి అయిన భార్యకు భర్త చేయరాని ప్రత్యుపకారం అంటూ ఏముంటుంది? జీవితకాలమంతా ఆమెకు ప్రత్యుపకారాలు చేసినా అతని కృతజ్ఞతా ఋణం తీరదు.

సతీమణీ! ఒక్కటి విను. ఇది సంధ్యాసమయం. రాక్షసులు తిరిగే వేళ. ఈ సమయంలో నీకు బావగారైన భూతేశ్వరుడు భస్మధారియై వృషభవాహనం ఎక్కి భూతగణాలతో శ్మశానధూళిధూసరితాలైన జడలను విరబోసుకొని విహరిస్తూ మూడవ కంటిని విప్పార్చి చూస్తుంటాడు. అట్టి వేళలలో అతనిని భక్తితో సమర్చించాలి. అంతే కాని కామవ్యామోహంలో తగులుకొనరాదు. సర్వభూతసమవర్తి అయిన భూతేశ్వరునికి తనవారు, పెరవారు అన్న భేదం ఉండదు. అతను గీచిన గీటు దాటినవారికి కీడు తప్పదు. అతని మర్యాదను అతిక్రమించడం అంటే అతనిని పరిహసించినట్లే అవుతుంది.

మూఢులు దేహాత్మభావులై ఈ దేహం ఏదో ఒకనాటికి రాలి కుక్కల పాలవుతుందని గ్రహింపక జడపదార్థాన్ని వస్త్రమాల్యాదులతో ఉపలాలిస్తారు. అంతకంటే నిర్భాగ్యులు ఉండరు. పరమేశ్వరునికి పిశాచవేషం ఎందుకంటావేమో! అది ఆయనకు ఒక విడంబం. అట్టి విశ్వకారణుని, సర్వనియంతను, మాయాతీతుని సామాన్యునిగా భావించి వ్యవహరించటం అజ్ఞానులకు చెల్లుతుందేమో కాని మనబోంట్లకు మాత్రం తగదు. కనుక ఒక్క

ముహూర్తమాత్రం సహించి నన్ను పలకరించకు' అని నియమించాడు.

మన్మథప్రేరణం క్షణక్షణానికీ అధికమై దుస్సహమయ్యేసరికి ఆ కామోద్రిక్త అతని మాటలను పెడచెవిని పెట్టి సిగ్గువిడిచి భర్తను వస్త్రాన్ని పట్టి ఈడ్చింది. కశ్యపుడు దితి మనస్థితిని గ్రహించి ఆ సమయంలో భార్యాప్రేరణం నిషిద్ధమైనప్పటికీ కాదనక, దైవానికి మ్రొక్కి ఏకాంతానికి వెళ్లి సతీమతాన్ని తీర్చివచ్చి స్నానాదు లాచరించి శుచియై మౌనం వహించి, ప్రాణాయామం కావించి, సనాతనబ్రహ్మమైన గాయత్రిని జపిస్తూ బ్రహ్మచింతాపరుడైనాడు.

దితికి తన అకార్యదోషం తర్వాత కొంతసేపటికి స్ఫురించింది. ఆమె సిగ్గుతో తలవంచుకొని పతి సన్నిధికి వచ్చి, 'కామోద్రేకంతో అదుపు తప్పి చేయరాని అపరాధం చేశాను. అందుకు భూతేశ్వరుడు నాపై అలుగకుండు గాక! నా గర్భానికి కీడు వాటిల్లదు గాక! ఆత్మదోషపరిహారార్థం లోకశంకరునకు శంకరునకు ప్రణమిల్లుతున్నాను. ఆర్యా! స్త్రీజాతి కటికబోయకైనా కరుణింప దగినది.

భగవానుడు, అందులోనూ నాకు బావ అయిన ఆ మహాత్ముడు సహజానుగ్రహశీలుడు కనుక దీనురాలిని నన్ను కరుణించాలి' అని తన కడుపు తీపి కొద్దీ గర్భశ్రేయాన్ని కూర్పమని మొరపట్టుకొన్నది.

కశ్యపుడు తన నియమానుష్ఠానం ముగించుకొని వచ్చి, 'కర్మఫలం ఎంత వారికైనా తప్పదు. ఆ ఫలం తత్కర్మగుణాన్ని బట్టి కలుగుతుంటుంది. ఆ గుణం కాలాన్ని బట్టి శుభాశుభ భావాలను వహిస్తుంది. సంధ్యాకాలం కామకర్మకు నిషిద్ధమని నొక్కి చెప్పాను. నా మాట వినవైతివి. రుద్రానుచరులను తిరస్కరింపరాదని అన్నాను. అది నీకు నచ్చలేదు. కారణం ఏమిటో తెలుసా? నీ చిత్తం అపరిశుద్ధం కావడమే అందుకు కారణం. దీనికి ఫలితంగా నీ గర్భవాసాన త్రిలోకకంటకులైన ఇద్దరు కొడుకులు జన్మిస్తారు. వారికి నిరపరాధులను బాధించటం, కాంతాజన నిగ్రహం నిత్యక్రీడలు. వారి

రాక్షసకృత్యాలకు మహాత్ము లెందరో గోడుగోడు మంటారు. ఆ పరమభక్తుల ఆరాటాన్ని తీర్చేందుకు శ్రీమహావిష్ణువు అవతరించి నీ కొడుకులిద్దరినీ పరిమార్చుతాడు' అని దితికి తెలియజెప్పాడు.

ఆ మాటలకు దితి నిట్టూర్చి, 'మునీంద్రా! కాముడు నా చేత అలా చేయించాడు. ఏమి చేయను? అయినా నీ పలుకులు ఒక విధంగా నాకు ఊరటను కలిగిస్తున్నాయి. నా బిడ్డలు చెడుమార్గాన నడిచినా బ్రాహ్మణ క్రోధానలదగ్ధులు కాక భగవంతుని చేత మృతి పొందటం మహాభాగ్యమే అవుతుంది. ఎటువంటి జన్మ అయితే నేమి? బ్రహ్మదండదగ్ధులై భూతభయకారకులైన వారికి నరకంలో పడి నానాహింసలకు పాల్పడేందుకంటే సాక్షాత్తూ భగవంతుని చేతిలో విముక్తి అంటే ఎంత అదృష్టం' అని ఆశ్వాసించింది.

కశ్యపుడు భార్య మాటలు విని, 'తప్పు చేయడం ఎంతవారికైనా తగదు. చేసిన తప్పును చెప్పినప్పుడు ఒప్పుకొనకపోవటం అంతకన్నా తగదు. తప్పిదాన్ని చెప్పినప్పుడు, వెంటనే యుక్తాయుక్తాలను విమర్శించాలి. తప్పు చేసినందుకు పశ్చాత్తాపం చెంది, పాపపరిహారార్థం భగవంతుని ఆరాధించాలి. ఇవి మేలు చేకూరే మార్గాలు. నీవు భగవద్భక్తురాలివై, నీ పతి యెడల ఆదరాభిమానాలతో మెలగావు. ఈ సుగుణసంపదకు ఫలంగా నీ పుత్రులలో ఒక్కరి కొడుకు సాధుసమ్మతుడై వెలుగొందుతాడు. అతని కీర్తి నిత్యనిర్మలమై భగవంతుని యశస్సుతో సమంగా శ్లాఘాపాత్రం అవుతుంది. అతని శీలం సాధుజనులకు మార్గదర్శకం. అతనిని అనుసరించినవారు మహాభక్తులై అగ్నిపుటం లోని బంగారు వలె మనఃకల్మషాలను బాసి వన్నెకెక్కుతారు. నీ పౌత్రుని నిష్ఠ విశ్వసాక్షి అయిన భగవంతునికి కూడా ప్రీతి పాత్రమవుతుంది. అతను భక్తియోగంతో తన పరిశుద్ధచిత్తంతో భగవంతుని పాదుకొల్పి అభిమానరహితుడై, పరమభాగవతాగ్రేసరుడై, మహాత్ములకు మహిష్ఠుడై లోకాలకు ప్రహ్లాదాన్ని కలిగిస్తాడు. సుస్వభావుడు, సకలగుణాకరుడు అయిన అతని హృదయంలో ఎటువంటి ఆశలూ

జనింపవు. ఏతత్ఫలంగా అతను పరుల సుఖదుఃఖాలు తనవిగా భావించి సంతోషవ్యసనాలను పొందుతుంటాడు. అందువలన అభూతశత్రుడై చంద్రుడు నిదాఘతాపాన్ని పరిహరించినట్లు లోకుల శోకాన్ని పోకార్చుతాడు. ఇంతెందుకు! నీ పౌత్రుడు బహిరంతరాత్ముని భక్తమతానురూప రూపధారిని భగవంతుని శ్రీమహావిష్ణువును కనులారా కనుగొంటాడు' అని మాట ఇచ్చాడు.

అమృతప్రాయమైన ఆ వచనాలు దితికి పుత్ర వధ శోకాన్ని పోగొట్టి ప్రమోదాన్ని కలిగించాయి.

## దేవతల పరితాపం

దితి గర్భవతియై ఆ గర్భాన్ని నూరేండ్లు ధరించింది. ఆ గర్భం పెంపొందే కొద్దీ దాని తేజం ముందు లోకప్రకాశం మందగించి చీకట్లు క్రమ్మసాగాయి. లోకపాలాది దేవతలు ప్రతిహతతేజస్కు లైనారు. వారు భయక్రాంతులై గత్యంతరం కానక బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి, 'అపూర్వమైన అంధకారం మమ్మల్ని క్రమ్మివేస్తున్నది. ఈ మహాతమస్సుకు కారణం ఏమిటో తెలియదు. నీ జ్ఞానం కాలస్పర్శను పొందదు కనుక నీకు తెలియని సంగతులుండవు. పరాపరభూతజాత మనోభావాలు నీకు సువిదితం. నీవు విజ్ఞానమూర్తి వయినా మాయ వలన దేహాన్ని ధరించావు. నీ రజోగుణం జగత్కారణమైనది. సమస్తభూతములూ నీలో ఉన్నవే. నీవు కారణకార్యాత్ముడవుగా కనుపిస్తావు కాని నిజానికి ఆత్మభావనుడవైన పరుడవు. నిష్కామవ్రతులై భక్తి యోగాన్ని అధిష్ఠించి ధ్యానైక నిరతితో శ్వాసేంద్రియాలను జయించే వారికి నీ ప్రసాదం కరతలామలకం. అట్టి నీ భక్తులకు ఎక్కడా ఎవరి వలనా భయం కలగదు. గోవులు త్రాటితో బంధింపబడినట్లు ప్రాణులు నీ వాక్కుచే నియంత్రితులై నీ పూజలు కావించి శుభాలను చూరగొంటారు. దేవా! హఠాత్తుగా చీకట్లు క్రమ్ముతున్నాయి. లోకులు కన్నుగానక తలక్రిందు లవుతున్నారు. కర్మలన్నీ విలోపించాయి. ఈ అనర్థానికి హేతువు ఏమిటో తెలియరావటం లేదు.

మమ్మల్ని అనుగ్రహించి జగత్తులకు మేలు కలిగించు' అని మొరపెట్టుకొన్నారు.

## బ్రహ్మదేవుని సాంత్వనవాక్యాలు

బ్రహ్మదేవుడు దేవతల మొర విని, 'అయ్యలారా! భయపడకండి. మీకు కలిగిన సంశయనివృత్తి కొరకు చిరకాలం క్రిందట జరిగిన వృత్తాంతాన్ని చెబుతున్నాను, వినండి'

అంటూ ఈ విధంగా ప్రసంగించాడు –

'సురలారా! నా మానసపుత్త్రులైన సనకాదులు మీకంటే ముందు జన్మించారు. వారు పుట్టుక తోనే లోకస్పృహ లేక యదృచ్ఛాగతులై సర్వలోకాల లోనూ సంచరిస్తూ ఒకానొకనాడు వైకుంఠానికి వెళ్లారు.

## వైకుంఠ వర్ణనం

వైకుంఠవాసులకు ఫలకాంక్షలు కలుగవు. వారు ధర్మనిష్ఠులై భగవదారాధన తత్పరులై విష్ణుమూర్తులై వర్తిల్లుతారు. భగవంతుడు కేవల శుద్ధతత్త్వాన్ని పూని ధర్మస్వరూపుడై ఆ భక్తులకు నిరతిశయ సుఖాలను ప్రసాదిస్తుంటాడు.

ఆ వైకుంఠంలో ఒక ఉపవనం ఉన్నది. అది సకల ఋతుసమృద్ధితో తనరారుతుంటుంది. అక్కడి వృక్షాలు ఎల్ల వేళలా ఏచి పూచి సమస్త కామఫలాలనూ కురిపించుతుంటాయి. అందువల్ల ఆ ఉపవనానికి 'శ్రేయసం ' అని పేరు వచ్చింది.

ఆ వనాంతరంలో అనేక విమల సరోవరాలు ఉన్నాయి. ఆ కొలంకుల నుంచి కమ్మని నెత్తావులను విరజిమ్మే లేతెమ్మెరలు వీచి మనస్సును హరిభక్తి పారవశ్యంలో ముంచెత్తుతాయి. ఆ సురభిళ పరిమళాలకు మాధవీమరంద పరిమళాలు కూడా సాటిరావు. ఆ కాసారాంతరాల నుంచి కోకిలల

కిలకిలారవాలు శ్రవణాభిరామంగా వినవస్తుంటాయి. తుమ్మెదలు కలువపూతేనియలకు మత్తెక్కి హరికథలను గొంతెత్తి గానం చేస్తున్నట్లు ఝుంకారాలను వీనుల విందుగా వినిపిస్తుంటాయి.

ఆ వనంలో పుట్టి పెరిగిన తులసి కమ్మ తావులను గుబాళిస్తూ భగవంతునికి అత్యంత ప్రీతికరమై విరాజిల్లుతుంటుంది. అందలి మందార కుందారవింద చంపక పున్నాగ పారిజాతాదులు తులసి భాగ్యాన్ని చూసి కలకల నవ్వుతూ తమ ఆమోదాన్ని సూచిస్తుంటాయి.

వైకుంఠంలో భాగవతులు రత్నకాంచన విమానాలను అధిరోహించి ఎల్లెడలా సంచరిస్తుంటారు. వారి జితేంద్రియత్వాన్ని పరీక్షించడానికే అన్నట్లు సుందరాంగనలు వారితో కూడి విలాసవిభ్రమాలను ఒలకబోస్తూ వివిధ పరిహాసాది చేష్టితాలతో వారిని కవ్విస్తుంటారు. లక్ష్మీదేవి దాసీజనపరివృతయై ఆ వనాంతర తులసీదళాలను సేకరించి ప్రాణేశ్వరుని సమర్చించి, అలసి సొలసి జలకేళికి అక్కడి విమల జలపూర్ణ దీర్ఘికల ఒడ్డున నిలిచి ఆ నిర్మలోదకాలలో తన నెమ్మోము ప్రతిబింబింపగా ఆ ప్రతిబింబంలోని దంతక్షత చిహ్నాలను చూసి, 'ఓహో! నా విధుని ప్రసాదానికి నోచుకొన్నాను' అని సిగ్గుతో లోలోపలే ఉప్పొంగిపోతుంది.

ఆ వైకుంఠం భగవత్కథాశ్రవణ తత్పరులకు తప్ప తదితర కథాకుతూహలులకు కాలూనరానిది. ఆ యితరుల గతి ఏమంటే, వారు ప్రక్షీణపుణ్యులై నరకాలలో పడి ఎన్నటికీ కడతేరరు. సురలారా! ధర్మతత్త్వజ్ఞానాలను సాధించేందుకు నరజన్మ ఒక్కటే యోగ్యమైనది. అంతటి ఉత్తమ జన్మను పొంది కూడా కొందరు భగవంతుని ఆరాధింపరు. వారిని గురించి ఏమి చెప్పాలి? భగవత్పరిచర్యాశీలం కలవారికి యమలోకం సుదూరమవుతుంది. వారు భగవల్లీలలను ముచ్చటించుకొంటూ ఆ ఆనందాబ్ధిలో ఓలలాడుతూ వైకుంఠానికి ప్రయాణిస్తారు. ఆ లోకం బ్రహ్మలోకానికి పైన సర్వోపరిగా ఉన్నది.

సురలారా! అష్టాంగయోగ ప్రభావంతో సనకాదులు వైకుంఠపురాన్ని ప్రవేశించారు. వారికి భగవద్దర్శనం తప్ప వేరొక కోరిక లేనందున వైకుంఠంలోని దర్శనీయస్థలాల రామణీయకం వంక చూపైనా మరలింపక ఏకదీక్షతో ఆరు కక్ష్యాంతరాలు దాటి ఏడవ కక్ష్యకు వెళ్లారు. ఆ కక్ష్యద్వారంలో ఇద్దరు ద్వారపాలకులు అతివృద్ధులైనప్పటికీ ఐదేళ్ళ లేత ప్రాయం వారివలె అగుపిస్తూ, కేయూరకిరీటాది భూషణాలు ధరించి వనమాలికలు తాల్చి గదాపాణులై కనుబొమలు చిట్లించి దీర్ఘములైన ఉచ్ఛ్వాస నిఃశ్వాసలతో రొప్పుతూ కోపారుణిత నేత్రులై నిలిచి ఉన్నారు. సనకాదులకు అందాకా ఏ కక్ష్యలోనూ అడ్డు కలగనందువల్ల వాళ్ళు ద్వారం వద్ద నిలిచి ఉన్న పాలకులను పలకరింపక లోపలికి వెళ్లబోయారు.

## శాపోదంతం

ఆ ద్వారపాలకులు దిగంబరులుగా ఉన్న సనకాదులను అడ్డగించి గదలు పైకెత్తారు. ఆ మహాత్ములు వాళ్ళని చూసి రోషకషాయనేత్రులై, 'ఏమిటీ అకార్యం! భగవత్పరిచర్య వల్ల గాక అన్యరీతుల వైకుంఠానికి వచ్చే భాగ్యం కలగదు. వైకుంఠవాసులకు భేదబుద్ధి కలగదు. ఆత్మకు పరమాత్మకు ఉన్న సంబంధం ఘటాకాశ మహాకాశాలకు గల సంబంధం వంటిదని వారు భావిస్తారు. అందువలన వారు సర్వసమదర్శనులై ఉంటారు. మీరు దైవతాల రూపంలో వైకుంఠాన్ని చేరినా ఈ తీరున భేదభావంతో వర్తించడం వింతగా ఉన్నది. ద్వారపాలకులుగా మీరిక్కడ ఉండతగరు. అయినా వైకుంఠేశ్వరునికి భృత్యులు కనుక మీ యెడ మేము తీవ్రతను దాల్పము. మీ బోంట్లకు అంతశ్శత్రురూప కామక్రోధ లోభపూర్ణమైన అధోలోకం వాసయోగ్యమైనట్లు వైకుంఠం తగదు' అని శపించారు.

ఆ బ్రహ్మదండరూప శాపానికి ద్వారపాలకులు భయాక్రాంతులై మునుల పాదాలకు మోకరిల్లారు. 'మహాత్ములారా! పాపకర్ములమైన మాకు మీరు విధించిన దండన సముచితంగానే ఉన్నది. బ్రాహ్మణావమానానికి ఇది

ప్రాయశ్చిత్తం. అయినా ఒక్క విన్నపం. అధోలోకంలో ఉన్నప్పటికీ హరిస్మరణను మరచిపోకుండా దయ చూడండి' అని ప్రార్థించారు.

## శ్రీ మహావిష్ణువు సన్నిధానం

అంతలో అక్కడికి శ్రీ మహావిష్ణువు లక్ష్మీసమేతుడై వచ్చాడు. ఒక వంక పరిచారకులు కొందరు వెల్ల గొడుగులను పడుతుండగా, ఒక వంక కొందరు రాయంచలను పోలిన వింజామరలు వీస్తుండగా, పీతాంబరం ధరించి సువర్ణకాంచి నమర్చి వనమాలికను అలంకరించుకొని, ఒక చేతిని గరుడునిపై హేలగా నిలిపి, ఒక చేతిలో లీలాకమలాన్ని భ్రమణీకరిస్తూ, మకరకుండలకాంతులను మెరుగు లీనుతున్న గండస్థలాలతో కౌస్తుభాలంకృతకంఠప్రదేశంతో మిరుమిట్లు గొలుపుతూ, ప్రేమ కటాక్షవీక్షణాలను ప్రసరిస్తూ శ్రీదేవితో వచ్చిన శ్రీమహావిష్ణువుకు సనకాదులు భక్తితో తలవంచి సాగిలబడి మొక్కారు. ఆ ముకుందుని చరణారవింద కింజల్కమిళిత తులసీపరిమళం వారికి ఎన్నడూ లేని హర్ష రోమాంచనలను కావించింది. బ్రహ్మానందం తప్ప వేరొక సుఖానందం ఎటువంటిదో ఎరుగని ఆ సర్వసంగ పరిత్యాగులు కూడా ఆ సుగంధానికి పరవశించి మైమరచిపోయారు. వారి అపూర్వ పారవశ్యాన్ని చూసి దేవదేవుని అధరబింబం పైని కుందకుసుమధవళమైన మందహాసం తొణికిసలాడింది.

సనకాదులు ఆ ప్రసన్నవదనాన్ని చూసి ధన్యులలో ధన్యులమని భావించి ఈ విధంగా సంస్తుతించారు.

## సనకాదికృత హరిస్తుతి

దేవా! మాయాతీతమైన పరమాత్మతత్త్వం నీవేనని, నీవు భక్తజనానుగ్రహార్థం శుద్ధతత్త్వమూర్తిని ధరించి వారికి ప్రతిక్షణానందాన్ని సమకూర్చుతావని బ్రహ్మదేవుని వలన విన్నాము. ఇప్పుడు కనుల పంటగా కనుగొన్నాము. ఇన్నాళ్ళూ నీవు మాకు కర్ణగోచరమాత్రుడవై ఉన్నవాడవు

ఇప్పుడు నేత్రగోచరుడ వైనావు. ఈ మహాభాగ్యం నీ అనుగ్రహ ఫలమే. 'దేవదేవా! నీ కథారసాన్ని చవిగొన్నవారికి మోక్షం కూడా హితవు కాదనగా ఇక స్వర్గాదుల సంగతి చెప్పేదేమున్నది?

దేవా! ఇంతవరకు పాపకృత్యం అంటే ఎటువంటిదో మాకు తెలియదు. అట్టి మేము నీ పరిచారకులను శపించి తీరని అపరాధం చేశాము. దీనికి నీవు ఆగ్రహించి మాకు నరకవాసాన్నే విధించినా నీ పాదభక్తికి మాత్రం లోటు లేకుండా అనుగ్రహించు. పువ్వు ముళ్ళతో ఉన్నప్పటికీ తుమ్మెద మకరందాన్ని కోరక మానదు. మా వాక్కులు నీ కోమలపాదారవిందాలకు తులసి వలెనే శోభ కూర్చటానికి నోచినవైతే, మా కర్ణరంధ్రాలను నీ దివ్యగుణకీర్తనం పవిత్రీకరిస్తే, అదే మాకు పదివేలు. మా కన్నులకు నీ దివ్యమంగళ స్వరూపాన్ని గోచరింపజేయటం వలన మేము నీ కృపకు పాత్రులమైనట్లే సంభావిస్తాము. దేవా! ఇదే నీకు పునఃపునరభివాదం' అని అన్నారు.

## శ్రీ మహావిష్ణువు అనుగ్రహం

భగవానుడు వారి మాటలను విని, తన ద్వారపాలకులను చూపుతూ, 'ఋషులారా! ఇతను జయుడు; ఇతను విజయుడు. వీరిరువురూ నాకు పార్షదులు. వీరు మీ యెడ అపరాధం చేసి నాకు కళంకాన్ని ఆపాదించారు. ఇందులో మీ దోషం ఏమీ లేదు. వీరు చేసిన దేవహేళనకు తగిన దండనను మీరు విధించడం నాకు సమ్మతమే. బ్రాహ్మణులు నాకు పరమదైవాలు. వారికి నా పరిచారకులు అపచారం చేస్తే అది నేను చేసినట్లే అవుతుంది. దాసుని తప్పు అతని స్వామిని ఆపాదిస్తుంది. అందువల్ల స్వామి కీర్తికి భంగం వాటిల్లుతుంది. కనుక మీ ప్రసాదాన్ని కోరుతున్నాను.

'మునులారా! మీ పేరు పలికినంతనే పరమపాపి కూడ పవిత్రుడవుతాడు. అట్టి మీకు నా ఈ భుజం అపచారం చేస్తే దానిని తుంచివేస్తాను గాని సహించి ఊరుకోను. ఇక నా అనుచరుల మాటెందుకు? అంతే కాదు. శ్రీదేవీ కటాక్షవీక్షణానికై లోకులు ఎన్నో నియమాలను పాటించి

పాకులాడుతుంటారు. అట్టి లక్ష్మి కూడా భక్తుల వలె నా మదికి అంత ప్రియురాలు కాదనగా, ఇక ఇతరుల ప్రసక్తి దేనికి? నా తృప్తి కోసం యాజ్ఞికులు అగ్నిముఖాన హోమాలను వేల్చుతారు. ఆ హోమాన్నం కంటె నాకు నా భక్తుని ఎంగిలి అన్నం వేయింతలు ప్రీతికరం. బ్రాహ్మణ పాదపరాగాన్ని తలదాల్చేందుకు నేను రూపాన్ని ధరించి నా కిరీటం వారి పాదాలకు సోకేటట్లు నమస్కరిస్తాను. బ్రాహ్మణుని కాళ్లు కడిగిన నీళ్లు శివలోకానికే పావనత్వాన్ని చేకూరుస్తాయి. అట్టివారు ఒకవేళ అపకారం చేసినా సైరించి చూడాలి. ఇంతెందుకు? గోబ్రాహ్మణులు, శరణ రహితమైన భూతజాతం నా రూపాంతరాలే. వారి యెడ భేదదర్శనం కావించినవాడు దురాత్ముడవుతాడు. అట్టి వాడంటే నా ఆజ్ఞానువర్తి అయిన దండధరుని పరివారం గద్దలకు కూడా అసహ్యం. మాట పరుషమైనా మనసు మంచిదయితే నేను మన్నిస్తాను. భృగుముని సంగతి మీకు తెలియదా? ఈ పార్షదులు తమ స్వామి భావాన్ని గుర్తెరుగక మీకు అపచారం చేశారు. దానికి తగిన శిక్ష వెంటనే విధింపబడి తీరాలి. వారు ఆ శిక్షను అనుభవించి మళ్లీ నా సన్నిధిని చేరుకొంటారు గాక! ఈ అనుగ్రహాన్ని మీరు వారి యెడ కటాక్షించండి' అని పలికాడు.

## సనకాదుల విన్నపం

భగవంతుని వచనాలు మితాక్షరయుక్తములే అయినప్పటికీ బహుళార్థ గంభీరంగా ఉన్నందున అందులోని పరమార్థం సనకాదులకు బోధపడలేదు. వారు హర్షపులకిత శరీరులై చేతులు జోడించి, 'దేవా! నీ ప్రభావం మాకు అగమ్యగోచరం. సర్వాధ్యక్షుడవైన నీవు పరానుగ్రహం కోరుతున్నట్లు ప్రసంగించావు. బ్రాహ్మణులు దేవతామూర్తులయితే అయ్యారు కాని, నీవు సర్వలోకాలకూ పరమదైవానివి. నీ వలన సనాతనధర్మం పుట్టి నీ అవతారములచే సురక్షితమవుతున్నది. నీవు ధర్మానికి కూడ పరమగోప్యుడవని, నిర్వికారుడవని పెద్దలు చెబుతారు. నివృత్తిపరులైన

మహాయోగులే నీ అనుగ్రహాన్ని నమ్ముకొని సంసారసాగర తరణం చేస్తారనగా, అట్టి నీ వెక్కడ? ఇతరులు నిన్ను అనుగ్రహించటం ఊసెక్కడ? అర్థార్థులందరూ లక్ష్మీ పాదరేణువులను శిరసున ధరించాలని ప్రాకులాడుతారు. అట్టి లక్ష్మీదేవి నీ మనస్సులో అణువంత చోటుకోసం భాగవతుల నుంచి నీ పరిచర్యాతత్త్వాన్ని తెలుసుకొని నీకు ఊడిగం చేస్తుంటుంది. అట్టి నిన్ను ద్విజుల పాదధూళి పవిత్రీకరింపగలదని చెప్పిన మాటలు మా బుద్ధికి అందరానివై ఉన్నాయి.

దేవా! శ్రీవత్సచిహ్నాన్ని అలంకారంగా గ్రహించావు. అది నీకు పావనత్వాన్ని కూర్చుతుందంటే ఏమనుకోమంటావు? ధర్మమూర్తివి, షడ్గుణసముల్లసితుడవు అయిన నీవు మాకు వరప్రదాతవై సత్త్వమూర్తిని గ్రహించావు. ద్విజదేవతార్థం చరాచరాత్మక సమస్తవిశ్వాన్ని నీ పాదాలపై భరించావు. వేదమార్గస్థాపనార్థం బ్రాహ్మణకులాన్ని నెలకొల్పావు. బ్రాహ్మణకులాన్ని రక్షిస్తే ధర్మాన్ని రక్షించినట్లే అవుతుందని లోకశిక్షణార్థమై మాతో ఇలా అన్నావు కాబోలు. పెద్దల మాట పిన్నలకు ప్రమాణం కదా. మరి ప్రజాక్షేమార్థం నీ అంశతో రాజులను పుట్టించావు. నీ మతమేమిటో మాకు బోధపడకుండా ఉన్నది. బ్రాహ్మణస్తుతి వలన నీ కీర్తికి కలిగే భంగం ఏమీ లేదు. ఈ నీ బ్రాహ్మణవినయం వినోదమాత్రం. నీవు నీ దౌవారికుల యెడ ఏమి చేసినా తప్పులేదు. మేము నిరపరాధులకు శాపం ఇచ్చి పాపానికి ఒడిగట్టాము. మా పాపానికి తగిన దండన మాకూ విధించు' అని వేడుకొన్నారు.

భగవానుడు వారి విన్నపాలను ఆలించి, 'ఈ నా దౌవారికులు తమ దోషానికి ఫలితంగా ఇప్పుడే రాక్షసులై జన్మిస్తారు. అయినా వీరు ఏకాగ్రతతో గొప్ప యోగాన్ని అనుష్ఠిస్తారు కనుక త్వరలోనే నా సన్నిధికి తిరిగి రాగలరు. నా నిశ్చయమే మీ నోట శాపమై వెలువడింది' అని వచించాడు. సనకాదులు స్వస్థచిత్తులై భగవానుని వైకుంఠపురాన్ని వలగొని మ్రొక్కి తదనుజ్ఞను గైకొని భగవన్మహిమలను సంకీర్తిస్తూ సంతోషంగా అక్కడి నుంచి వెళ్లిపోయారు.

## జయవిజయుల సాంత్వనం

భగవానుడంతట జయవిజయులను పిలిచి, 'శాపానికి భయపడకండి. ఆ శాపాన్ని నేను మరలింపగలను కాని అలా చేస్తే బ్రాహ్మణతేజానికి మచ్చ కలిగించి నట్లవుతుంది. అది నాకు సమ్మతం కాదు. పూర్వం ఒకనాడు నేను గృహాంతః పరతంత్రుడనై ఉండగా నా కడకు వస్తున్న శ్రీదేవిని మీరు అడ్డగించారు. ఆమె మీపై కోపించి ఇట్టి గతిని ఆనాడు నిర్దేశించింది. కనుక మీరు ఈ శాపఫలాన్ని అనుభవింపక తప్పదు. మీరు మీ జన్మాంతరాలలో నా పైని సంరంభయోగాన్ని వహిస్తారు. అల్పకాలం లోనే మీకు బ్రాహ్మణపరిభవపాపం తొలగిపోతుంది. ఎప్పటి వలెనే నా సన్నిధికి చేరుకోగలరు' అని పలికి నిజధామానికి వెళ్లాడు.

## సురలకు సహనబోధ

సురలారా! జయవిజయులు వెనువెంటనే వారి తేజస్సులను బాసి హాహాకారాలతో వైకుంఠం నుంచి దిగ్గున దిగజారి కశ్యప ప్రజాపతి వీర్యరూపంలో దితి గర్భాన్ని ప్రవేశించారు. జయవిజయులు కవలలు. వారి తేజం ముందు మీ తేజం ప్రతిహతం కావడం వలన చీకటి క్రమ్ముకొన్నది. ఇందుకు ప్రతి విధానం ఒక్కటే. ఏ మహాత్ముడు సృష్టి స్థితి లయాలకు మూలకారణమో, యోగీశ్వరులకు కూడా దాటరాని మాయ ఎవని వలన నియమింపబడి త్రిగుణరూపాన వ్యవహరిస్తుందో, ఆ ప్రథమపురుషుడు తప్ప వేరొక్కరు ప్రతివిధాన సమర్థులు కారు. భగవంతుని సత్త్వగుణోత్కర్ష సమయంలో మనకు మేలు కలుగుతుంది. అందాకా తిమిరవ్యాప్తి తరగదు. ఈ లోపున మనము చేసే విచారాలన్నీ నిరర్థకం' అని చెప్పాడు.

సురలు ఆ పలుకులు విని జంకుగొంకులు మాని బ్రహ్మను వీడ్కొని స్వస్థానాలకు బయలుదేరారు.

## మహోత్పాతాలు

ఇంతలో దితికి ప్రసవసమయం సమీపించింది. అప్పుడు భూనభోంతరాళాలలో లోకభయంకర మహోత్పాతాలు అనేకం సంభవించాయి. భూతలం కంపించి పర్వతాలు నేలమట్టమయ్యాయి. దిశలు ప్రజ్వరిల్లాయి. ఉల్కలు రాలిపడ్డాయి. పిడుగులు కురిశాయి. తోకచుక్కలు పొడిచి రానున్న పీడను సూచించాయి. పెనుగాడ్పులకు కెంధూళులు లేచి, నింగిని కప్పివేశాయి. వృక్షాలు మొదలంటా నేలకూలాయి. కారుమెయిళ్లు క్రమ్ముకొని రవిప్రకాశాన్ని అడ్డగించాయి. కటిక చీకట్లు ఆవరించాయి. సముద్రం మహోత్తుంగ కల్లోలాభీలమై విజృంభించి నేలను ముంచెత్తింది. వాపీకూపాలు, సరస్సులు, సరిత్కాసారాల జలాలు నిష్కారణంగా కలకబారాయి. వాటిలో వికసించిన కమలాలు వాడిపోయాయి. నక్కలు నోటితో నిప్పులు కక్కుతూ గ్రామాంతరాలకు వెళ్లి కూసి గగ్గోలు పెట్టాయి. కుక్కలు మోరలెత్తి ఏడ్వసాగాయి. గూబలు బిట్టరిచి గోలచేశాయి. గాడిదలు వాడి గిట్టలతో నేలను పగలదొక్కుతూ గోడుగోడుమని ఏడుస్తూ పిచ్చెత్తినట్లు గుంపులు గుంపులై ఇటూ అటూ పరుగిడజొచ్చాయి. ఆ ధ్వనులకు పక్షులు ఉలికిపడి పండుటాకుల వలె గూళ్ల నుంచి నేలకు రాలిపడసాగాయి. పశువులు వశం తప్పి మూత్రపురీషాలను విడిచాయి. ఆవులు నెత్తురు పితికాయి. మబ్బులు చీమువానలను కురిపించాయి. ఆలయాల లోని విగ్రహాలు బొటబొట కన్నీటి జాలు కార్చాయి. క్రూరగ్రహాలు అతిచార వక్రగతులకు ఉపక్రమించి శుభగ్రహాలను నీరసింపజేశాయి. విశ్వప్రళయం కానున్నదన్న భీతి వ్యాపించింది.

ఆ సమయంలో దితికి ఇద్దరు మగపిల్లలు పుట్టారు.

## దితిసుతుల నామకరణం

ఆ విధంగా జనించి దితిసుతులు అశ్మసార శరీరులై కొండల వలె పెరగసాగారు. ఆ ఇద్దరిలో గర్భాధానవేళ కశ్యపునిశరీరం నుంచి ముందు

పుట్టినవాడికి హిరణ్యకశిపుడని, దితి ముందుగా ప్రసవించినవాడికి హిరణ్యాక్షుడని పేర్లుపెట్టారు. ఆ ఇరువురూ పుట్టుక తోనే తమ పౌరుషాన్ని ప్రకటించారు. వారు నడుస్తుంటే పాదాల తాకిడికి పుడమి క్రక్కదలసాగింది. కొన్నాళ్లకు వారిద్దరూ పెరిగి వారి కటిప్రదేశాన అర్కమండలం వ్రేలాడేంతటి మహాకాయు లయ్యారు.

## హిరణ్యకశిపుడు

అంత హిరణ్యకశిపుడు బ్రహ్మను గూర్చి ఘోర తపస్సు చేశాడు. బ్రహ్మ అతనికి ప్రత్యక్షమై ఇచ్చ వచ్చిన వరం కోరుకొమ్మన్నాడు. తనకు చావు కలుగకుండా చేయమని అతను వరం అడిగాడు. పరమేష్ఠి అతనితో 'హిరణ్యకశిపా! నీకు దేవతల వలన గాని, అసురుల వల్ల గాని చావు కలుగదు' అని చెప్పి అంతర్హితుడయ్యాడు. ఆ వరగర్వోద్ధతుడై అతను చెలరేగి లోకపాలురను ఢీకొని ముల్లోకాలనూ వశపరచుకొన్నాడు.

## హిరణ్యాక్షుడు

ఒకనాడు హిరణ్యాక్షుడు తన భుజకండూతి తీరే పోరును కోరి నేరుగా త్రిదివలోకానికి వెళ్లాడు. ఆ దైత్యుని మనోబల వీర్యబలోద్ధతికి దేవతలు భయపడి గరుడుని చూచిన సర్పాల వలె పారిపోయి దాక్కున్నారు.

స్వర్గంలో తనను ఎదిరించే వారెవరూ లేకపోయే సరికి హిరణ్యాక్షుడు మరీ చెలరేగి మదించిన ఏనుగు నీరాటకు కొలనులోకి దూకినట్లు జలరాశిని ప్రవేశించాడు. అతని ఉద్ధతికి సాగరాంతరంలో ఉన్న వరుణ సైన్యం, యాదోగణాలూ పారిపోయి భయంతో చెల్లాచెదురుగా పరుగులు తీశారు. అందుకతను వెడనవ్వు నవ్వుతూ గదాదండంతో సముద్రుని తాడించి పెక్కు సంవత్సరాలు అక్కడే ఉన్నాడు.

ఒకనాడతను వరుణపురి అయిన విభావరికి పోయి వరుణుని చూసి నవ్వులాటకు పరిహాసప్రణామం చేసి, 'రాజాధిరాజా! వీరుల మాన

దుర్మదమదాపహారి వని నీ కీర్తి దిగంతరాలకు వ్యాపించి నా చెవులు చిల్లులు పడుతున్నాయి. నీవు దానవులను జయించి రాజసూయం చేశావట. ఏదీ నీ పరాక్రమం ఎటువంటిదో నాకూ కొంచెం చూపించు. నీతో సమరాన్ని కోరి వచ్చాను' అని కవ్వించాడు.

వరుణుడు అతని పరిహాసాలకు కోపగించుకోక, 'అయ్యా! అవన్నీ ఎప్పుడో చిన్నప్పటి మాటలు. యుద్ధమంటే నాకిప్పుడు ఏ ఉత్సాహమూ లేదు. ఉపశాంతిని పొందాను. రణమార్గనిష్ఠుడవైన నీకు సరైన వీరుడు ఇక్కడెవడూ లేడు. నీకు తగినవాడు పురాణపురుషుడు ఒకడున్నాడు. అతని వద్దకు వెళ్లు. ఆ పరమేశ్వరుని వలన నీ చేతుల తీట తీరి నీ శరీరం కుక్కలూ నక్కల పాలవుతుంది. సాధురక్షణ దుష్టశిక్షణల కోసం ఆ భగవానుడు నానావతారాలను ధరిస్తాడు' అని వినయంగా బదులు చెప్పాడు.

హిరణ్యాక్షుడు అతని మాటలు విని, 'భళీ! ఇన్నాళ్లకు నన్నెదిరించే జాణ ఒకడున్నాడని విన్నాను' అని ఉప్పొంగి, అతను ఎక్కడున్నాడో చూద్దామని దిక్కులను గాలింపసాగాడు.

ఆ సమయంలో నారదమహర్షి అక్కడికి వచ్చి, 'రాక్షసేశ్వరా! నీవు వెతుకుతున్న వాడు రసాతలంలో ఉన్నాడు' అని చెప్పి వెళ్లాడు.

హిరణ్యాక్షుడు హుటాహుటిని రసాతలానికి వెళ్లాడు. అప్పుడు భగవానుడు మాయావరాహరూపాన్ని ధరించి భూమిని పైకి లేవనెత్తబోతున్నాడు.

## వరాహమూర్తితో వైరం

హిరణ్యాక్షుడు ఆ వరాహాన్ని చూసి, 'ఓరి మూర్ఖుడా! మృగాధమా! ఆగాగు. పాతాళవాసులమైన మాకు బ్రహ్మ ఈ పుడమిని బహూకరించాడు. మా సొమ్మును ఎత్తుకుపోదామనుకున్నావు కాబోలు. సూకరాధమా! నువ్వు మాయవేషాలు వేసి మా వారి నెందరినో పొట్టన బెట్టుకున్నావు. నీ జిత్తులిక్కడ

సాగవు. ఇదుగో ఇదే నిన్ను రూపుమాపి నా మిత్రుల శోకాన్ని పోకారుస్తాను. ఇదిగో నా గద వేటుకు నీ తల ముక్కలు కాబోతున్నది. ఇక ఇంద్రాదులు వచ్చి బలిపూజాదులను ఎవరికిస్తారో చూస్తాను' అని కయ్యానికి కాలుదువ్వాడు. అతని ప్రల్లదాలను సహించి వరాహమూర్తి నీటి నుంచి వెలువడి బయటకు వచ్చాడు. హిరణ్యాక్షుడు ఆ మాయాకిటిని చూసి గర్జించి, 'పారిపోదామనా బైటపడ్డావు?' అని అధిక్షేపించాడు. భగవంతుని అధిక్షేపించడం తగిన పనేనా? అని శంకింపవద్దు. సిగ్గుమాలిన వాళ్లకు యుక్తాయుక్తాల విచారణ కూడానా? ఆ వరాహమూర్తి అప్పుడు తన దంష్ట్రాగ్రమందున్న భూమిని నీళ్లపై నిలువరించి, దానికి అండగా తన ఆధార శక్తిని నిలిపాడు. అంతలో బ్రహ్మాదిదేవతలు పుష్పవృష్టిని కురిపించి దేవదేవుని సమర్చించారు. హిరణ్యాక్షుడు గదాదండాన్ని పైకెత్తి అతని పైకి ఉరికాడు.

ఆదిదేవుడు అతని సంరంభాన్ని చూసి నవ్వు ఆపుకోలేక, 'ఓయి రాక్షసేశ్వరా! మేము వనచర మృగాలం అన్న మాట నిజమే అనుకుందాం. మరి మీరో? గ్రామసింహాలు. మీరు కాపు తిరుగుతుంటే మేము స్వేచ్ఛగా సంచరిస్తుంటాము. ఈ భూమి మీ సొమ్మని, దానిని హరింపవచ్చినవాణ్ణి నీకు భయపడి పారిపోతున్నానని అన్నావు. నీ వంటి గుండెలు తీసిన బంటు వెంటాడుతుండగా నేను ఎక్కడికని పారిపోయేది? ఎక్కడ తలదాచుకొనేది? గత్యంతరం లేదు కనుక నీతో పోరాడక తప్పడం లేదు. నువ్వన్నట్లు నన్ను రూపుమాపి నీ వాళ్ల శోకాన్ని పోకార్చు. పాపం వాళ్లు నీ కోసం ఎదురుచూస్తున్నారు. ఆడినమాట తప్పడం పాడి కాదు. మరి వీరాధివీరులైన మీ బోంట్లకు బొత్తిగా తగదు' అని కవ్వించాడు.

## సంకుల సమరం

హిరణ్యాక్షుడు ఆ పరిహాస వచనాలకు ఎగిరిపడి తోక తొక్కిన తాచులా బుసలు కొట్టి గదను పైకెత్తి వరాహమూర్తిని తాకాడు. ఆ మాయావరాహుడు గదాఘాతాన్ని తప్పించుకొన్నాడు. తన వేటు వమ్మయినందుకు రాక్షసుడు క్రోధమూర్ఛితుడై ఔడుగరిచి మళ్లీ గదనెత్తి బలంకొద్దీ గిరగిర తిప్పి విసిరాడు.

ఆ వేటు భగవానుని దక్షిణాంస భాగాన్ని తాకబోతుండగా దానిని కూడా ఆ మహాత్ముడు తప్పించుకొన్నాడు. ఇరువురికీ పరస్పర జిగీషాసంరంభం హెచ్చయింది. ఒకరి నొకరు తాకారు. పరస్పర ప్రహారాలను తప్పించుకొంటూ ఉభయులూ విచిత్రమండలాది గతులను ప్రదర్శించారు. తప్పిదారి తగిలిన దెబ్బలకు ఇద్దరి శరీరాలూ నెత్తుట జొత్తిల్లాయి. అలుకలు చెలరేగాయి. ఇద్దరూ తెగించి పైకొచ్చారు.

## బ్రహ్మదేవుని విన్నపం

ఆ యుద్ధాన్ని చూడటానికి బ్రహ్మదేవుడు ఋషులతో వచ్చి ఆ దైత్యుని చదురులను చూసి, 'దేవా! ఈ దైత్యులు బలగర్వోద్ధతుడై నీ పాదమూలాశ్రయం కన్న గోబ్రాహ్మణాది నిరపరాధ జీవులకు కీడు చేయటమే క్రీడగా పెట్టుకొన్నాడు. తనకు సాటిరాగలవాడు లేడని గర్వించి లోకకంటకుడై చరిస్తున్నాడు. ఈ నిరంకుశ దుర్వర్తనుణ్ణి పామును చంపినట్లు వెంటనే అణిచివేయక బాలునితో వలె క్రీడించటం దేనికి? సంధ్యాసమయం సమీపిస్తున్నది. ఇక రాక్షసులకు విజృంభించే కాలం. జాగుచేయక ఈ దురాత్ముని తెగటార్చి సురలకు మేలుకూర్చు. ఇది సర్వోత్కృష్టమైన అభిజిన్ముహూర్తం. వీడిని సంహరించటానికి ఇదే యుక్తకాలం. వీడు మృత్యువును వెతుక్కొంటూ నీ దగ్గరకు వచ్చాడు' అని హెచ్చరించాడు.

భగవానుడు ప్రేమ తళుకొత్తే చూపులతో బ్రహ్మను ఆదరించి, తన యెదుట నున్న హిరణ్యాక్షుని చూసి గదయెత్తి అతని హనుప్రదేశంపై కొట్టాడు. అతను ఆ తాకును తన గదతో వారించాడు. అతని గదాఘాతానికి భగవానుని చేతనున్న కౌమోదకీ గద చెదిరి చేయిజారి క్రిందపడింది. ఆ అద్భుతానికి బ్రహ్మాదులు వెలవెలబోయారు. దేవతలు గజగజలాడారు. భగవానుడు నిరాయుధుడయ్యాడు. హిరణ్యాక్షుడది చూసి నిరాయుధునితో యుద్ధం అధర్మమని ఆయుధప్రయోగం చేయక మిన్నకున్నాడు. భగవానుడు దేవతలకు అభయం పలికి చక్రాయుధాన్ని స్మరించాడు. తలంచిన క్షణంలోనే అది ఆయన చేతిలోనికి వచ్చింది. భగవానుడు ఆ చక్రాన్ని ధరించి శత్రువును తాకనున్నాడు.

ఖేచరులు గగనంలో విమానారూఢులై వీక్షిస్తూ భగవత్ప్రభావాన్ని గుర్తింపలేక లోలోపల తహతహలాడుతూ, 'దేవా! జాగుచేయకు; ఈ దురాత్ముని చంపు; లోకాలను కాపాడు' అని కేకలు పెట్టారు. హిరణ్యాక్షుడు పండ్లు గీటి ఔడుగరిచి చక్రాయుధుని చూసి, గదయెత్తి, 'ఇదే చచ్చావు చూడు!' అని గర్జించి, గురిచూసి పైకి విసిరాడు. భగవానుడు ఆ గదను తన వామపాదంతో ఆవలికి త్రోసి, 'అసురా! నీ గద గతిని చూశావు కదా? వేరొక ఆయుధాన్ని చేపట్టు' అని రెట్టించాడు. ఆ నవ్వులాటలకు దైత్యుడు మండిపడి అదే గదను తీసుకొని మళ్లీ విసిరాడు. వాయువేగంతో తన మీదికి వస్తున్న ఆ గదను భగవానుడు ఒడిసిపట్టి, 'అయ్యా! ఇదిగో నీ గద; మళ్లీ దీనిని తీసుకొని పోరికి తలపడు' అన్నాడు. ఆ మాట వాడికి పుండు మీద కారం చల్లినట్లయింది. హిరణ్యాక్షుడు ఆత్మపౌరుషభంగానికి ఎంతో చింతించి, తేజోవిహీనుడై, చేజారిన గదను చేపట్టడం ఇష్టం లేక, జ్వలనప్రకాశమానమైన త్రిశిఖశూలాన్ని పట్టి హరిపైకి విసిరాడు. అది మెరుపులు చిమ్ముతూ మహావేగంతో మీదికి వస్తుంటే చూసి భగవానుడు దానిని చక్రాయుధంతో తుత్తునియలు చేశాడు. హిరణ్యాక్షుడు కోపోద్దీపితుడై ముష్టి సారించి పరమేశ్వరుని వక్షోభాగాన ఘోరంగా అడిచి అంతర్ధానమయ్యాడు. గజేంద్రునిపై విసిరిన పూవు దండ వలె వచ్చి తాకిన ఆ ముష్టిఘాతం భగవానునికి వినోదప్రాయమై తోచింది.

అప్పుడు హిరణ్యాక్షుడు అదృశ్యాకారుడై మాయావ్యూహాన్ని పన్నాడు. ఎల్లెడల కారుచీకట్లు కమ్ముకొన్నాయి. ప్రచండవాయువు వీచింది. ధూళిపటలం రేగివచ్చింది. రాళ్ల వానలు కురిశాయి. పిడుగు మ్రోతలు భూనభోంతరాలను దద్దరిలజేశాయి. విణ్మూత్రాలు వర్షించాయి. ఎముకలు, కుళ్లిన మాంసపు ముద్దలు మీద పడ్డాయి. రాక్షసాంగనలు విరబోసిన వెంట్రుకలతో, దిసమొలలతో బయలుదేరి శూలాలను ఝుళిపిస్తూ లోకాలను గడగడలాడించారు. యక్షరాక్షసవీరులు రథాలెక్కి కొందరు, ఏనుగులెక్కి కొందరు, హయారూఢులై కొందరు, పదాతులై కొందరు తండోపతండాలుగా

మూగి 'పట్టుకోండి, కొట్టండి, చంపండి' అని కేకలు పెట్టారు. దేవతలందరూ అది చూసి భగవానునికి కీడు శంకించి దిగులు పడసాగారు. భగవానుడు చక్రాన్ని ప్రయోగించాడు. ఆ చక్రాన్ని చూసి రాక్షసమాయలన్నీ పటాపంచలైనాయి.

హిరణ్యాక్షుడు తన మాయ మటుమాయం అయినందుకు భగ్గున మండిపడి, భగవానుని ఎదటపడి, పిడికిలితో పొడవటం మొదలుపెట్టాడు. పరమేశ్వరుడు అతని దూకుడును చూసి, 'ఇక వీడిని ఉపేక్షింపకూడదు' అని నిశ్చయించి, తన కరతలంతో అతని కర్ణమూలాన్ని పొడిగించాడు. హిరణ్యాక్షుడు కనుగ్రుడ్లు రాలి, తల ముక్కలై తెలివి తప్పి ప్రచండవాతానికి నేలకొరిగిన మహావృక్షం వలె గిరగిర తిరిగి నేలకూలాడు.

ఆ విధంగా హిరణ్యాక్షుడు క్రిందపడి దంష్ట్రాకరాళ భీకరుడై ఉండగా చూసి బ్రహ్మాదులు, 'ఆహా! ఇతని భాగ్యం ఏమని చెప్పాలి? ముముక్షువులై యోగసమాధిని పూని పరితపించేవారికైనా ఇంతటి కలిమి చేకూరదు. ఇతనికి ఎటువంటి సద్గతి కలుగనున్నదో కదా! సరిసరి; జ్ఞప్తికి వస్తున్నది. వీరు పూర్వం భగవత్పార్షదులు. ఋషి శాపం వలన వీరికి ఇటువంటి గతి కలిగింది. కొద్ది కాలంలోనే వీరు స్వస్థానాన్ని చేరుకొంటారు' అని లోలోపలే అనుకొని భగవంతుని వంక మరలి, 'దేవా! మా కొరకై నీవు ఈ లోకపీడాకరుని పరిమార్చావు. నీ పాదభక్తి మాకు ఈ మహాభాగ్యాన్ని ప్రసాదించింది. సర్వేశ్వరా! సర్వయజ్ఞప్రవర్తకా! ఇదే నీకు ప్రణామం' అని సాగిలబడ్డారు. భగవానుడు వారి భక్తికి సంతోషించి నిత్యోత్సవ నిరంతరాయితమైన వైకుంఠానికి నిష్క్రమించాడు.

## సూతవచనం

ఇంతవరకూ చెప్పి సూతుడు శౌనకాదులను చూసి ఇలా అన్నాడు –

'మహర్షులారా! విదురుడు మైత్రేయుని వలన ఈ మహావరాహావతార చరిత్రను విని పరమానందం పొందాడు. సామాన్య పుణ్యశ్లోకుల కథలే

ఎంతో హాయిని కలిగిస్తుండగా ఇక భగవచ్చరిత్రలను గురించి ఎంతని చెప్పాలి? గజేంద్రుడు మొరపెట్టుకొన్నంతనే ఎవడు హుటాహుటిని వచ్చి ఆ మకరిని సంహరించి కరిని పరిరక్షించాడో, ఎవడు 'నీవే గతి' అని శరణు కోరినవారికి తోడునీడయై వర్తిస్తాడో, ఎవడు ఋజుమార్గవర్తులకు సుఖారాధ్యుడో ఆ భగవానుని చరిత్రలు సుధాప్రాయమైనవి కదా!

మునులారా! శ్రీ యజ్ఞవరాహావతార చరిత్రను విన్నవారికి, చదివినవారికి, తుదకు అనుమోదించిన వారికి బ్రహ్మహత్యాది పాపాలు కూడా దూరమవుతాయి.

ఈ పుణ్యకథ స్వర్గకాములకు స్వర్గాన్ని, ధనార్థులకు ధనాన్ని, కీర్తికాములకు కీర్తిని, ఆయుష్కాములకు చిరాయువును, సర్వార్థసిద్ధికాములకు నిఖిలేప్సితాలను కలుగజేస్తుంది.

ఇంతెందుకు! ఈ చరిత్రను విన్నవారికి అవసానకాలంలో భగవత్ప్రాప్తి సిద్ధిస్తుంది' అని విరమించాడు.

## శౌనకాదుల కోరిక

సూతుడు ప్రసంగించిన తర్వాత శౌనకాదులు కుతూహలం ఆపుకోలేక – 'సూతాగ్రణీ! విదురుడు శ్రీకృష్ణునికి ఏకాంతిక స్నేహితుడు. ధృతరాష్ట్రుడు కృష్ణుని మాట వినలేదని, తన అన్నగారే అయినా లెక్కచేయక అతనిని పరిత్యజించి, శ్రీకృష్ణుని ఉపదేశానుసారం తీర్థయాత్రలకు బయలుదేరాడు. మైత్రేయుడు పరమ భాగవతాగ్రేసరుడు. వారిద్దరి మాటలలో ప్రసక్తానుప్రసక్తంగా ఎన్నో హరికథా ప్రసంగాలు ప్రవర్తిల్లక మానవు. ఆ కథలు మందాకినీ తోయాల వలె పరమపావనములై మా బోంట్లకు ఇహపర శ్రేయాన్ని కలుగజేస్తాయి. వాటిని వినిపించాలని నీకు మాత్రం ఉండదా? హరికథా గానాన్ని విని తరించాలని ఎదురుచూస్తున్నాము' అని అడిగారు. సూతుడు వారితో ఇలా అన్నాడు.

# సృష్టి సంగ్రహం

మునులారా! మైత్రేయుని మాటలను విని విదురుడు, 'మునీంద్రా! ప్రజాసర్గార్థం బ్రహ్మదేవుడు ప్రజాపతులను సృష్టించి ఏమి చేశాడు? బ్రహ్మనియోగాన్ని అనుసరించి మరీచ్యాదులు, స్వాయంభువమనువు సృష్టిని ఎలా విస్తరింపజేశారు? వారు భార్యలతో కలిసి జగత్కార్యానికి పూనుకొన్నారా? లేక స్వతంత్రంగా నెరవేర్చారా?' అని అడిగాడు. మైత్రేయుడు అతని భావాన్ని గ్రహించి, 'విదురా! భగవంతుడు నిర్వికారుడు. అతని యందు చలనం కలిగిందని అనుకొన్నాము. అందుకు అదృష్టము, పురుషుడు, కాలం – ఈ మూడూ నిమిత్తాలు. అదృష్టమంటే ఏమిటి? అని అడుగుతావేమో, అది స్పష్టంగా 'ఇదిగో ఇటువంటిది' అని చెప్పేందుకు వీలు లేదు. ఎందుకంటే దృష్టం కానిది అదృష్టం. దృష్టము అన్న పదానికి చూడబడినది అని అర్థం. దృష్టికి కాన్పింపరాని దానిని గురించి, అదృష్టాన్ని గురించి, నిరూపించటం ఎవరికీ సాధ్యం కాదు. ఇక ప్రకృతికి అధిష్ఠాత అయినవానిని పురుషుడు అంటారని నీకు తెలుసు. కాలం సంగతి ఇంతకు ముందే చెప్పాను.

విదురా! భగవంతునికి చలనం కలిగినప్పుడు ఆ క్షోభ ఫలితంగా గుణత్రయం వెలువడింది. అందులో నుంచి మహత్తత్త్వం జనించింది. ఆ తత్త్వం దైవచోదితమై రజోగుణవంతం అయింది. రజోగుణానికి లక్షణం అహంకారం. ఈ విధంగా అహంకారం త్రిగుణాత్మకమై విలసిల్లింది. అందులో నుంచి ఆకాశాది భూతపంచకం జనించింది. ఆ భూతపంచకం ఒక్కొక్కటీ ప్రత్యేకించి స్వయంగా కార్యనిర్వహణం చేయలేకపోయింది. వాటికి దైవయోగం వలన కలయిక ఏర్పడింది. తత్ఫలితంగా హిరణ్మయమైన అండం జనించింది. ఆ అండకోశం చైతన్యరహితంగా ఉండటం వలన దానిని వేయి సంవత్సరాలు నీటిలో ఉంచారు. దానిని పరమేశ్వరుడు అధిష్ఠించాడు. ఆ ప్రభావం వలన బ్రహ్మ పూర్వకల్పాల ప్రకారం నామరూపాది విభాగంతో జగత్తు ఏర్పడింది.

అప్పుడు బ్రహ్మదేవుడు సృష్టికి ఉపక్రమించి (1) తామిస్రం (2) అంధతామిస్రం (3) తమం (4) మోహం (5) మహామోహం అని అయిదు పర్వాలను, వాటితో అవిద్యను పుట్టించాడు. ఆ శరీరం తమోమయమై ఆకలిదప్పులకు కారణమై రాత్రి రూపంలో ఉండటాన్ని చూసి నచ్చక బ్రహ్మ దానిని పరిత్యజించాడు. ఆ తనువును యక్షరక్షోగణాలు గ్రహించాయి. అందువల్ల వారికి క్షుత్పిపాసలు అధికతరమై ఎక్కడా తనివి తీరే ఉపాయం గోచరింపక అవి తమ తండ్రి మీదికి దూసుకొని వచ్చాయి. అందుకు బ్రహ్మ భయపడి, వాటిని బుజ్జగించి, 'నన్ను భక్షింపకూడదు. మీరు నా బిడ్డలు కదా, నన్ను రక్షించాలి' అని నచ్చజెప్పాడు. అవి దయతలిచి బ్రహ్మను విడిచిపెట్టాయి.

ప్రాణగండం తప్పిన తరువాత బ్రహ్మ ప్రశాంత్యాత్మకమైన మరొక శరీరాన్ని ధరించి దేవతలను సృజించాడు. వారు ప్రకాశమయమూ, దివసరూపమూ అయిన ఆ తనువును పరిగ్రహించారు.

అంతట బ్రహ్మ వేరొక శరీరాన్ని తాల్చాడు. అతని జఘనం నుంచి జనించి కొందరు స్త్రీలంపటులయ్యారు. వారిని మైథునప్రీతి పైకొన్నది. తమ కామం తీరే సాధనం ఎక్కడా కనిపించక వారు సిగ్గు విడిచి బ్రహ్మ వెంట పడ్డారు.

దానితో బ్రహ్మకు దిక్కు తోచలేదు. ఏమి చేసినా ప్రాణం మీదికి వస్తున్నదని విచారించి అతను భగవంతుని వద్దకు పరిగెత్తుకొని వెళ్లాడు. 'దేవా! నన్ను రక్షించు. నీ ఆజ్ఞ మేరకు సర్గకృత్యాన్ని మొదలుపెట్టాను. ఈ పాపాత్ములు పుట్టి గ్రామ్యధర్మవశులై మితిమీరిన కామంతో నన్నే వెన్నాడుతున్నారు. ఇక నన్ను కాపాడే భారం నీదే' అని ప్రార్థించాడు.

భగవానుడు బ్రహ్మ దైన్యాన్ని పరికించి, 'అయ్యా! ముందు ఈ ఘోరమైన శరీరాన్ని విడిచిపెట్టు' అన్నాడు. బ్రహ్మ ఆయన చెప్పినట్లే ఆ తనువును పరిత్యజించాడు.

బ్రహ్మ విడిచిన తనువు సంధ్య అనే పేరిట స్త్రీరూపాన్ని తాల్చింది.

సంధ్యాస్వరూపం జగన్మోహనకరంగా విరాజిల్లుతున్నది. ఆమె రత్నాలు పొదిగిన బంగారు మొలనూలు తాల్చి శరీరమంతా ఉజ్జ్వలమైన ఆభరణాలను ధరించింది. లేత వెన్నెలలను విరజిమ్ముతున్న ముఖకమలంపై శృంగార ప్రకాశికల వంటి నీలాలకలతో సమున్నత నాసికాపుటంతో, రమ్యతర దంతపంక్తితో, సముత్తుంగమైన వక్షోజాలు ఒండొంటితో రాపిడిని చెందుతుండగా, సిగ్గు తళుకొత్తే చిర్నగవు చూపులతో మదనవికాసానికి పెంపు కలిగిస్తూ లోకాతిశయంగా అలరింది.

సౌందర్యం రాశీభవించిన మన్మథదీప్తి వలె తమ కన్నుల యెదుటకు వచ్చిన సంధ్యాకాంతను చూసి మైథునప్రియులకు దిగ్భ్రమ కలిగింది. ఆమె వారిని చూపి కామస్వరూపం తెలియని ముగ్ధ వలె అమాయికత నటిస్తూ వారి మ్రోల సంచరింపసాగింది. ఆ కుమతు లది చూసి, ఆమె చుట్టూ గుమిగూడి, 'లీలావతీ! నీవు ఎవరిదానవు? నీ పేరేమిటి? ఇక్కడికి ఎలా వచ్చావు? సుందరీమణీ! నీ క్రీడాకందుకం నీ అరచేతుల ఎర్రని కాంతి సోకి అస్తమయ సూర్యబింబం వలె ప్రకాశిస్తున్నది. నీ నెన్నడుము చన్నుదోయి భారానికి సన్నగిల్లి పేదవారికి పెద్దవారితో చెలిమి తగదన్న సామెతను స్ఫురింపజేస్తున్నది. క్రీడ వలన కలిగిన అలపు సొలపులను నీ కన్నులు చెప్పకనే చెబుతున్నాయి. నీ కేశపాశం సడలి నీ ముఖచంద్రబింబం మాకు సరిగా కనిపించడం లేదు. నీ కురులను ముడిచి నీ వదనేందు సందర్శన భాగ్యాన్ని మాకు కలిగించు' అంటూ ఆమెపై ఎగబడ్డారు.

పద్మభవుడు వారి చేష్టలకు నవ్వుకొని, తన కాంతి చేత గంధర్వాప్సరోగణాన్ని సృజించి ఆ జ్యోత్స్నాతనువును త్యజించివేశాడు. దానిని విశ్వావసు ప్రముఖులు అమిత ప్రీతి పూర్వకంగా పరిగ్రహించారు.

అంతట బ్రహ్మ ఆలస్యాన్ని ఊతగా గొని భూతపిశాచాదులను పుట్టించాడు. వారు దిగంబర దేహాలతో విరియబారిన కేశాలతో చూడటానికి

అసహ్యంగా ఉన్నారు. పరమేష్ఠి వారిని చూడలేక కన్నులు మూసికొని ఆ శరీరాన్ని విడిచిపెట్టాడు. దానిని ఆ భూతపిశాచాదులు పరిగ్రహించారు. తత్ఫలంగా వారికి ఇంద్రియ విక్లేదం, అతినిద్ర దాపరించాయి. ఇంద్రియవిక్లేదబలం వలన భూతాలు భ్రాంతి గొలుపుతుంటాయి. అందువలన వాటికి ఉన్మాదులని పేరు వచ్చింది.

అప్పుడు బ్రహ్మ అదృశ్యతనువును దాల్చి సాధ్య, పితృగణాలను సృజించి, ఆ కాయాన్ని వారికి ప్రసాదించాడు. ఆ కారణాన కర్మనిష్ఠులు సాధ్య, పితృగణాలకు శ్రాద్ధాదికర్మలలో హవ్యకవ్యాలను వారికి భోజ్యాలుగా సమర్పించాలన్న నియమం ఏర్పడి ఉన్నది.

తర్వాత బ్రహ్మ అంతర్ధాన తనువును గ్రహించి సిద్ధ విద్యాధరులను పుట్టించి ఆ తనువును వారికి ఇచ్చాడు.

అనంతరం అతను ప్రతిబింబతనువును తాల్చి కిన్నెర కింపురుషులను సృజించి దానిని వారికి ఇచ్చివేశాడు. వారు దానిని గ్రహించి ప్రభాతసమయాలలో మిథునీభూతులై ప్రవర్తిల్లుతూ బ్రహ్మకర్మలను కీర్తిస్తుంటారు. ఆ తనువునందలి కేశాలు సర్ప నాగ సరీసృప ఉరగాది వివిధ సర్పజాతులై వృద్ధిని పొందాయి.

అంతటితో బ్రహ్మ కృతకృత్యుడ నయ్యానని భావించాడు. ఇక తన సర్గానికి రక్షకులను సృజింపవలసిన పని మాత్రమే మిగిలి ఉన్నది. అప్పుడు పరమేష్ఠి తన మనస్సు చేత మనువులను సృజించి, తన పురుషరూపాన్ని వారికి ప్రసాదించాడు.

అప్పుడు మనువులు తమ కట్టెదుట నున్న సృష్టివిస్తారాన్ని చూసి, 'దేవా! ఈ సృష్టి చూడగా అంతా పూర్వసృష్టి ప్రకారం ఉన్నది. అగ్నిహోత్రాది క్రియలు కూడా సుప్రతిష్ఠము లైనాయి. అందులో మేము హవిర్భాగాలను భుజిస్తాము' అని బ్రహ్మతో అన్నారు.

అటుపిదప బ్రహ్మ, తపో విద్యా యోగ వైరాగ్యాది యుక్త సమాధిరూప జితేంద్రియుడై ఋషులను సృజించి వారికి ఆ దేహాన్ని ఇచ్చాడు.

విదురా! ఇదీ సృష్టిసంగ్రహం' అన్నాడు.

మునులారా! విదురుడు మైత్రేయుని పలుకులను శ్రద్ధగా విని, 'మహాత్మా! స్వాయంభువ మనువు మిథునధర్మాన ప్రజావృద్ధిని కావించాడని, అతనికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అని ఇద్దరు కొడుకులు, దేవహూతి అనే కుమార్తె జన్మించారని, దేవహూతి కర్దమ ప్రజాపతి భార్య అయిందని చెప్పారు. వారి సంతానాన్ని గురించి తెలిసికొనగోరుతున్నాను. మరి ఆకూతిని రుచి, ప్రసూతిని దక్షుడు గ్రహించారు కదా. వారివలన ఏయే భూతసృష్టి కలిగింది? ప్రియవ్రతోత్తానపాదులు ధర్మపూర్వకంగా సప్తద్వీపాత్మకభూమిని ఏ విధంగా పరిపాలించారు?' అని అడిగాడు. మైత్రేయుడు వివరించాడు.

## కర్దముని ప్రార్థన

'విదురా! బ్రహ్మ ఆ విధంగా కర్దముని సృజించి అతనిని ప్రజాసృష్టికి నిర్దేశించిన తర్వాత కర్దముడు బ్రహ్మ ఆజ్ఞను తలదాల్చి సరస్వతీ నదీ తటానికి వెళ్లి బిందుసరోవర పుణ్యతీర్థంలో భగవంతుని గూర్చి పదివేల సంవత్సరాలు తీవ్ర తమస్సును పరమభక్తితో ఆచరించాడు. భగవానుడు అతని తమస్సుకు మెచ్చి శబ్దవేద్య బ్రహ్మతనువును ధరించి రజోరహితమూ, సూర్యతేజోమయమూ అయిన రూపంతో, శ్వేతకమల కుముదమాలికతో, స్నిగ్ధనీలాలకపరీత ముఖమండలంతో వెలుగొందుతూ పీతాంబరం కట్టి, స్వర్ణమేఖల చుట్టి కిరీట కుండలాలు ధరించి, శంఖ చక్ర గదాధరుడై, కెంగేల వెలిదామరను విలాసంగా పట్టుకొని, దరహాసచంద్రికలు వెదజల్లుతూ పేరురాన లక్ష్మి, కంధరాన కౌస్తుభం కన్నులకు మిరుమిట్లు గొలుపుతుండగా గరుత్మద్రథాన్ని అధిరోహించి, అంతరిక్షంలో నిలిచి సాక్షాత్కరించాడు.

కర్దముడు కన్నులు తెరిచి, దేవదేవుని కనుగొని, భూమిపైననే సాష్టాంగ ప్రణామం ఆచరించి లేచి, దోయిలించి ఈ విధంగా నివేదించాడు:

'దేవా! సమగ్రమైన సత్త్వానికి నిదానమైన నీ దివ్య రూపాన్ని కనుగొని నా కన్నుల కలిమి నిండారింది. నీ దర్శనార్థం బహుజన్మలెత్తి యోగసిద్ధిని గాంచిన యోగులు కూడా నిన్ను సమగ్రంగా చూడలేరు. నీ పాదపద్మం సంసార సాగర తరణానికి సేగిలేని నావ వంటిది. భక్తులు కోరిన కోరికలను నెరవేర్చడమే నీ వ్రతమై ఉన్నది. ఆ కోరికల శుభాశుభాల ఫలితానికి మాత్రం బాధ్యత ఆ కోరినవారిదే అని నీవు ఎన్నడో నిర్ణయించావు.

దేవా! నా కిప్పుడు కామసుఖాభిలాష జనించింది. కారణం తెలియదు. ఆ కోరిక తీరుతుందని సర్వాభీష్టఫల దాయకములైన నీ చరణాలను ఆశ్రయించాను. కామార్తులు తమ ఋణత్రయాపనోదానికై కాలాత్మునికి నీకు ఋణత్రయాన్ని అపాకరించే పూజలను చేస్తారు. నిన్ను పూజించిన వారికి దేవఋణ ఋషిఋణ పితృఋణాలు తీరిపోతాయి. నేను కూడా వారిని అనువర్తించి నిన్ను పూజించాను.

దేవా! కాలచక్రం చాతుర్మాస్యత్రయం అనే మూడు సంధులను, షడృతువులనే ఆరు అంచులను, ద్వాదశ మాసాలనే పన్నెండు రేకులను, మూడు వందల అరవై దినాలనే పర్వాలను కలిగి క్షణములు, లవములు అనే రెక్కలు అనంత సంఖ్యాకములై అమరగా మహావేగంతో బ్రహ్మమునందు అక్షరరూపంలో అడ్డులేకుండా పరిభ్రమిస్తూ లోకాలను అణిచివేస్తుంటుంది. అట్టి కాలచక్రం కూడా నీ చరణాతపత్రం నీడను చేరినవారిని అణుమాత్రమైనా కదిలించలేదు.

స్వామీ! ఏకాకృతివి, అద్వితీయుడవు, అనంతశక్తి సముపేతుడవు, ఆద్యపురుషుడవు అన్నీ నీవే. విశ్వసృష్టి స్థితిలయాలను కావించటానికి వేరొక సాధనం ఇసుమంత

అయినా నీకు అక్కర లేదు. నీ యోగమాయా ప్రభావంతో ఆత్మశక్తులైన సత్త్వాదులను ఆధారం చేసికొని సృష్ట్యాది కార్యం నిర్వర్తిస్తావు. ఈ నీ శక్తి తత్త్వాన్ని గ్రహించాలంటే సాలె పురుగును చూసి కొంత కొంత తెలుసుకోవచ్చు.

దేవా! నీ భక్తులకు విషయసుఖాలను ప్రసాదించటం నీకు సమ్మతం కాదంటావేమో! అది నిజమే. అయినా నాకు అటువంటి కోరిక జనించింది. అనుగ్రహించు' అని ప్రార్థించాడు.

## భగవంతుని వరప్రసాదం

భగవానుడు కర్దముని మాటలను విని, ఈ విధంగా ప్రసంగించాడు–

'కర్దమా! నాకు చేసిన పూజ గోరంత అయినా వృథాగా పోదు. ఇక ఏకాగ్రభక్తుల సంగతి వేరే చెప్పాలా? నీ నియమభక్తులకు మెచ్చాను. నీ తలంపు గ్రహించాను. నీ కోరికలను ఇచ్చాను. బర్హిష్మతీపురం రాజధానిగా బ్రహ్మావర్తాన్ని అధిష్ఠించి సప్తసాగరపరీత మహామహీచక్ర సామ్రాజ్యాన్ని ఏకాతపత్రంగా పరిపాలిస్తున్న స్వాయంభువ మనువు మంచి ఆచారసంపన్నుడు. అతను తన భార్య శతరూపతో కలిసి నేటికి మూడవనాడు నీ వద్దకు వచ్చి తన కుమార్తె దేవహూతికి నిన్ను వరునిగా కోరి, ఆమెను నీ కొసగి వివాహం చేస్తాడు. ఆమె వయోగుణశీలాభిరామ కనుక నీకు అనురూపసతియై నీ మదికెక్కి, పెక్కేండ్లు నిన్ను సేవించి, నీ వలన తొమ్మిదిమంది కుమార్తెలను పొందనున్నది. నా ఆజ్ఞానువర్తులై ఋషులు ఆ కన్యకలను పత్నులుగా స్వీకరిస్తారు. నీవు సమస్తకర్మలను నాకు సమర్పించి, సర్వభూతముల యెడ దయకలిగి ఉండటమే నా పూజగా భావించి అంతంలో సన్న్యసించి నాలో చేరి నన్నూ, ఈ జగత్తునూ కనుగొంటావు. నేను నీకు దేవహూతి యందు నా అంశంతో అవతరించి తత్త్వసంహితలను రచిస్తాను' అని పలికి అంతర్హితుడయ్యాడు. కర్దముడు భగవదాజ్ఞ మేరకు కాలాన్ని ప్రతీక్షిస్తున్నాడు.

## స్వాయంభువునితో సమావేశం

స్వాయంభువ మనువు శతరూపాదేవహూతులను వెంటబెట్టుకొని సువర్ణరథం ఎక్కి భూతలసంచారం చేస్తూ బిందుసరోవరానికి వచ్చాడు. ఆ సరోవరం సకల ఋతువులూ ఏకకాలంలో సమకూడినట్లు మొగ్గలు తొడిగి ననలెత్తి విరగపండిన తియ్యమామిడి చెట్లకు సన్నిహితంగా వకుళ వంజులాశోకరసాల మందార పారిజాతాది వృక్షాల నీడలతో ఒప్పారుతూ, శుక పిక మయూర మధుప మనోహర రుతాలకు ప్రతిధ్వను లీనుతూ, నిర్మలోదకపూరితమై కలువ పూలతో నిండి చక్ర చకోర హంస కారండవాది పక్షిసంచారరమ్యమై చూడ ముచ్చటగా ఉన్నది. దాని చుట్టూ ఉన్న అరణ్యంలో హరి హరిణ శరభ శార్దూల గజ వరాహాది మృగాలు మందలు కట్టి తిరుగుతున్నాయి.

ఆ చోటు స్వాయంభువ మనువు హృదయాన్ని అమితంగా ఆకర్షించింది. ఆయన అక్కడ వినోదింపదలచి రథం నిలిపి, పరివారసమేతంగా లోపలికి వెళ్ళాడు. అక్కడ ఒకానొక చోట ఒక వ్యక్తి, సమోన్నతుడైనవాడు నారచీరలు కట్టి జడలు దాల్చి తపస్సు చేసుకొంటున్నాడు. అతని చెంత హోమకుండం ప్రజ్వరిల్లుతున్నది.

స్వాయంభువుడు ఆ వ్యక్తి కర్దమఋషి అని తెలుసుకొని, అతని చెంతకు వెళ్లి ప్రణామం చేశాడు. కర్దముడు మనువును యథోచితసత్కారాలతో పూజించి, కూర్చుండబెట్టి ఇలా అన్నాడు:

'రాజేంద్రా ! భగవంతుని శక్తి లోకపాలనార్థం నీ రూపాన్ని ధరించింది. నీ సంచారం దుష్టశిక్షణ సాధురక్షణార్థం ప్రవర్తిల్లుతున్నది. భగవానుడు లోకరక్షణార్థమై సూర్యుడు చంద్రుడు అగ్ని ఇంద్రుడు అనిలుడు యమధర్మరాజు రూపాలను గ్రహించి, ఆయా స్థానాలను అధిష్ఠించి విశ్వపాలనం కావిస్తుంటాడు. జనులు వారి వారి కర్మానుగుణ వర్తనులై శుభాలను పొందటానికి భగవానుడు కొన్ని మర్యాదలను ఏర్పరించాడు.

వాటిని వర్ణాశ్రమధర్మాలని అంటారు. అవి ఎంత కాలం చక్కగా జరిగితే లోకం అంత కాలం సుఖంగా ఉంటుంది. కొందరు మోహబద్ధులై ఈ గుట్టు తెలియక ఆ మర్యాదలకు భంగపాటును కలిగిస్తారు. అటువంటి కష్టాలు లోకంలో వ్యాప్తిని పొందకుండా రాజులు ధనుర్ధరులై సూర్యుని రీతిగా లోకసంచారం చేస్తూ వైపరీత్యాలను అణిచివేస్తుంటారు. అలా చేయకపోతే అధర్మం పెరిగి ధర్మాన్ని అణగదొక్కుతుంది.

రాజా! నీవు లోకసంచారార్థం బయలుదేరకపోతే లోకం దుర్జనగ్రస్తమై నశించిపోతుంది. నీవు అందుకే ఇల్లుదాటి ఇటువైపు వచ్చి ఉంటావని ఊహిస్తున్నాను. అయినా నీవిక్కడికి అందుకే వచ్చావో, వేరొక నిమిత్తాన వచ్చావో తెలిసికొన గోరుతున్నాను. ఎట్లా అయినా నీ రాక మాకు పరమానందకరమే.'

కర్దముని మాట విని స్వాయంభువుడు, 'మునివర్యా! బ్రహ్మదేవునికి వేదం ఆత్మభూతమై లోకంలో ఆవిర్భవించింది. ఆ వేదం చక్కగా ప్రవర్తిల్లినంత కాలం ఈ లోకం చల్లగా ఉంటుంది. వేదాన్ని పాలింపకపోతే దానికి సరైన ప్రవృత్తి కలుగదు. వేదపాలనకు ఎవరు పడితే వారు తగరు. ఛందోమయులు, తపోయోగవిద్యాగరిష్ఠులు, నిర్మోహులు అయిన వారు మాత్రమే అందుకు తగినవారు. అందుకోసం బ్రహ్మదేవుడు తన ముఖపద్మం నుంచి మిమ్ము సృజించాడు. మీరు వేదధర్మనిష్ఠులై ఉంటారు కనుక మీకు ఏ విధంగానూ భంగపాటు కలుగకూడదు. అందుచేత మీకు కాపుగా బ్రహ్మదేవుడు మమ్మల్ని తన బాహువుల వలన పుట్టించి, మీ రక్షణ భారాన్ని మా యందు నిలిపాడు. అందువల్లనే బ్రాహ్మణుడు బ్రహ్మకు హృదయం అని, క్షత్రియుడు అంగం అని పెద్దలు అంటుంటారు. అలా బ్రహ్మ క్షత్రియులకు పరస్పర రక్షణం కర్తవ్యధర్మంగా ఉన్నది. ఆ ధర్మస్వరూపం ఎటువంటిదో నిరూపించటం మీ పని. మీరు నిరూపించిన ధర్మాన్ని నడిపించటం మా పని. అలా ఉభయులమూ ఒకరపై ఒకరు ఆధారపడి ఉన్నాము.

మునీంద్రా! మిమ్మల్ని చూడక మునుపు ధర్మవిషయమై తీరని శంకలు అనేకం నన్ను బాధిస్తుండేవి. ఈనాడు మిమ్మల్ని సందర్శింపగానే అవి తమంత తాము తీరిపోయినట్లు అనిపిస్తున్నది. ఇది నా పరమభాగ్యమని భావిస్తాను. మిమ్ము బోంట్లను సందర్శించటం, మీ పాదధూళిని శిరసున దాల్చటం, మీ మృదుమధుర భాషణలను ఆలకించటం, మీ వలన తత్త్వస్వరూపాన్ని తెలుసుకోవటం – ఇంతకన్నా మహాప్రసాదం ఏమున్నది?

మునివర్యా! ఈ కన్య నా కుమార్తె, ఈమె ప్రియవ్రత ఉత్తానపాదులకు తోబుట్టువు. ఈమెకు తగిన వరుని కోసం అన్వేషిస్తున్నాను. మీ గురించి నారదమహర్షి ద్వారా ఎన్నో విశేషాలను విన్నాను. మీరే తగిన వరులని నిశ్చయించుకొన్నాను. ఇదిగో నా సుతను ఎంతో శ్రద్ధతో మీకు కానుకగా సమర్పిస్తున్నాను, అంగీకరించండి. మా అమ్మాయి ఇంటిపను లన్నింటిలోనూ మీకు తగిన సహధర్మచారిణిగా మెలగుతుంది. రాచకుమార్తె అని ఏదీ నేర్పకుండా ఉండలేదు. ఇది విషయసంబంధమైనదిగా ఉన్నప్పటికీ అప్రయత్నప్రాప్తం కనుక విరక్తుడు కూడా తోసివేయకూడదు. అందునా కామసక్తులు అసలు కాదనకూడదు. అప్రయత్నంగా లభించిన అభీష్టకామాన్ని వదులుకొని లేనివాటి కోసం ప్రాకులాడే దీనుడు కీర్తినీ మానాన్నీ రెండింటినీ కోల్పోయి దుఃఖభాగుడవుతాడు. మీరు వివాహాన్ని కోరి ఉన్నారని, వివాహాధి నియమమైన ఉపకుర్వాణ బ్రహ్మచారివ్రతాన్ని అనుష్ఠిస్తున్నారని విని మీ కోసం గాలిస్తూ ఇక్కడికి వచ్చాను' అని చెప్పాడు.

కర్దముడు ఆ వచనాలను విని, 'నరేంద్రా! నేను పెండ్లాడగోరిన మాట నిజం. నీవు నీ కూతురికి ఇంత దాకా వివాహప్రస్తావం ఎవరితోనూ జరపలేదు. ఈ మా వివాహం లోకంలో మొట్టమొదటి దవుతుంది. పాణిగ్రహణానికి ఫలం మంచి సంతానాన్ని పొందటమే కదా. అట్టి ఫలం నీ కుమార్తెకు సమగ్రంగా కలుగుతుంది.

రాజేంద్రా! ఏ కన్యామణి లావణ్యం దేవకాంతలకు కూడా అసూయాజనకమో, ఏ తలోదరి ప్రాసాదతలాన కందుకక్రీడలు సలిపేటపుడు

జనించిన అందెల రవళి విమానచరుడైన విశ్వావసుని ఆకర్షించి అతని హృదయంలో కామాగ్నిని రగిల్చి మైమరపును కూర్చి అతని భూపతనానికి కారకమయిందని ప్రజలు చెప్పుకొంటుంటారో, ఆ లోకమోహన సుందరాంగిని, మీదు మిక్కిలి ఉత్తానపాదుని సోదరిని తనంత వలచి వచ్చినదానిని, నేను నిరాకరిస్తానని ఎలా అనుకున్నారు?

అయితే ఒక్క నియమం ఉన్నది రాజా! మానవ జన్మ ఎత్తినందుకు ఫలం పరమప్రాప్యమైన మోక్షాన్ని చూరగొనటమే. ఆ మోక్షప్రాప్తికి ధర్మార్థకామాలు మూడూ ఉత్తమ సాధనాలని అంటారు. ఈ మూడూ గృహస్థాశ్రమ ధర్మాలు. మోక్షం సన్న్యాసాశ్రమ ధర్మం. మానవులు గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, ఆ ఆశ్రమధర్మాలను సక్రమంగా అనువర్తించి, ఋణత్రయాన్ని తీర్చి, తర్వాత సన్యాసాశ్రమాన్ని అనుష్ఠించి జ్ఞానులై ముక్తిని పొందాలని సృష్ట్యాదికారణుడైన భగవానుడు శాసించాడు. గృహస్థ సన్న్యాసాశ్రమాలు రెంటికీ తారతమ్యం ఉన్నదా? అంటే, లేకపోలేదు. పుట్టుకతోనే మనుష్యులకు అంతో ఇంతో హింస, రాగద్వేషాలు మొదలైనవి ఉండకమానవు. వాటిని జయింపకపోతే ముక్తికి అవసరమైన యోగ్యత చేకూరదు. హింసారాగద్వేషాదులను జయింపటానికి తగిన అనుష్ఠానాన్ని గృహస్థాశ్రమం లోనే ప్రారంభించాలి. అలా ప్రారంభించి అహంకార మమకారాలను క్రమక్రమంగా తగ్గించుకొంటూ, తుదకు జితేంద్రియుడై పరమహంస ధర్మాన్ని ఆచరించి విజ్ఞానియై మోక్షాన్ని అందుకోవాలి. అందువల్ల నేను నీ పుత్రికను స్వీకరించి గృహస్థుడనై, ఆమె కడుపున ఒక కాయ కాయగానే సన్న్యాసాశ్రమం చేపడతాను. అది మీకు సమ్మతమైతే మీ అమ్మాయిని పెండ్లాడగలను' అన్నాడు.

## కర్దముని వివాహం

ఆ మాటకు దేవహూతి వెంటనే తన అనుమతాన్ని సూచించింది. స్వాయంభువ మనువు కుమార్తె మనస్సును గ్రహించి తానూ సమ్మతించి

ఎంతో సంతోషంతో దేవహూతిని కర్దమునికి ఇచ్చి వివాహం చేశాడు. శతరూప తన అల్లుడికి వెలలేని వస్త్రాలు, ఆభరణాదులను అరణంగా ఇచ్చి కుమార్తెకు పతీధర్మాన్ని ఉపదేశించింది. అంతటితో వాళ్ళు నవదంపతులకు వీడ్కోలు చెప్పి రాజధానికి వెళ్లిపోవాలని అనుకొన్నారు. కాని పుత్రికా విరహం కాలు కదపనీయలేదు. తల్లిదండ్రు లిద్దరూ కూతురిని గట్టిగా కౌగిలించుకొని, 'అమ్మా! నిన్ను విడిచి ఎలా ఉంటాము తల్లీ! అని కన్నీళ్లు పెట్టుకొని, ఆమె కన్నీళ్లు తుడిచి, వీపు నిమిరి శిరసు మూర్కొని ధైర్యంగా ఉండమని చెప్పి కొంత సేపటికి ఎట్లాగో గుండె రాయి చేసుకొని కూతురిని, అల్లుడిని వీడ్కొని రథం ఎక్కి తరలి సరస్వతీనది ఒడ్డున ఉన్న పుణ్యాశ్రమాలను వీక్షిస్తూ ముందుకు సాగి, స్వదేశమైన బ్రహ్మావర్తాన్ని చేరి, ప్రజలొనగిన మంగళగీతవాదిత్రపూర్వక ప్రత్యుద్గమనాన్ని ప్రేమాదరాలతో గ్రహించి రాజధాని అయిన బర్హిష్మతీపురాన్ని ప్రవేశించారు.

## బర్హిష్మతీ శబ్ద నిర్వచనం

విదురా! బర్హిష్మతి అనే పేరు ఎలా వచ్చిందో విను.

పూర్వం హిరణ్యాక్షవధకై ఆవిర్భవించిన యజ్ఞవరాహమూర్తి ఆ ప్రదేశంలో తన శరీరాన్ని విదిర్చినపుడు భగవానుని దేహం నుంచి రోమాలు అక్కడ రాలి, పచ్చని కుశకాశమయమైన బర్హిసంచయం మొలిచింది.

కొంతకాలానికి అక్కడ ఒక పట్టణం వెలిసింది. బర్హిస్సులు ఉన్నచోట ఏర్పడినందున దానికి బర్హిష్మతి అని పేరు వచ్చింది.

యజ్ఞేశ్వరుని మూలాన పెంపుగాంచిన బర్హిసంచయంతో ఋషులు యజ్ఞాలు చేసి, భగవదారాధనతత్పరులై యజ్ఞవిఘ్నకారకులైన రాక్షసాదులదుర్యత్నాలను అడ్డగించారు.

మనువు కూడా ఆ విధంగానే మహత్త్వాన్ని పొందాడు.

## స్వాయంభువుని జీవితవిధానం

విదురా! స్వాయంభువమనువుకు ప్రజానురాగమే నిజమైన రక్ష. తెల్లవారుజాముననే లేచి పరశుద్ధులై భార్యాభర్త లిద్దరూ నిండు మనస్సుతో హరికథలను వింటారు. ఆ తర్వాత మనువు ధర్మపురస్సరంగా రాజ్యపాలన విధానం నెరవేరుస్తాడు. మళ్లీ యథావిధి హరికథాశ్రవణం. శ్రీహరి నామసంకీర్తనం.

ఎటువంటి రాజభోగాలైనా స్వాయంభువునికి చిత్తవిభ్రాంతిని కలిగింపవు. నిరంతర విష్ణుసేవాపరాయణుడై ఎట్టి శారీరక మానసిక క్లేశాలూ లేకుండా అతను డెబ్భై ఒక్క మహాయుగాల కాలం అవలీలగా గడిపివేశాడు.

భగవంతుని పాదాలను ఆశ్రయించినవారికి ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. మునులంతటివారు అతనిని చేరవచ్చి హితోపదేశాలను పొందటం మొదలుపెట్టారు. లోకం మనుధర్మానుసారంగా నడుచుకొనటం మొదలుపెట్టింది.

నరులు అనుష్ఠింపదగిన వర్ణాశ్రమధర్మాలను ఆ మహామహుడు బోధించాడు.

## దేవహూతీ కర్దములు

విదురా! దేవహూతి తన తల్లితండ్రుల విరహక్లేశాలకు చిక్కక, కామద్వేషాలకూ కపటలోభాలకూ ఎడమీయక, మదమోహాలను జయించి, నిషిద్ధకర్మలను కలలో నైనా స్మరింపక పతి మనస్సును గుర్తెరిగి ఏనాడూ ఏ లోటూ చేయకుండా నడుచుకొన్నది. పరమేశ్వరుని అర్చించిన పార్వతి వలె దేవహూతి కర్దముని శుశ్రూషించి అతని మనస్సులో స్థిరమైన స్థానాన్ని సంపాదించింది.

ఆ విధంగా భర్తే దైవంగా మెలగి, తీవ్రమైన వ్రతాచరణంతో కృశించిపోయిన ఆమె సద్వర్తనకు కర్దముడు ఎంతో సంతోషించాడు.

'ప్రేయసీ! ప్రాణులకు దేహమంటే చెప్పలేనంత అభిమానం. అటువంటిది నీవు దేహాన్ని కూడా లెక్కచేయక దానిని నాకై కృశింపజేశావు. నీ పతిభక్తి నా మనస్సును ఆహరించింది. నేను తపస్సును యోగవిద్యను సమాధిని అనుష్ఠించి స్వధర్మనిష్ఠుడనై భగవత్ప్రసాదరూపములైన ఏ యే భోగాలను సాధించానో వాటన్నిటిలోనూ నీవు నాతో పాల్గొంటావు గాక.

సతీ! అర్థసంబంధములైన భోగాలన్నీ క్షణభంగురాలు. ఆ సంగతి నేను మాటలతో చెప్పినంత మాత్రాన ప్రయోజనం లేదు. నీకు దివ్యదృష్టిని ఇస్తున్నాను. దాని ప్రభావంతో నీవు వివిధభోగాలలోని తారతమ్యాన్ని స్వయంగా చూసి గ్రహింపగలవు. మరి నీవు పతివ్రతాధర్మాన్ని అనుష్ఠించి అనన్యసామాన్యమైన విభవాలను సాధించి సిద్ధిని పొందావు. ఆ సిద్ధులను యథానుమతంగా అనుభవించు. నేను రాజకుమార్తెను అన్న దురభిమానం అనేక వికారాలను కల్పిస్తుంది. అందువల్ల ప్రయోజనం ఉండదు' అని పలికాడు.

దేవహూతి భర్త మాటలను ఏకాగ్రమతితో ఆలకించి, లజ్జాసంతోషాలను చూపులలోనే వెల్లడిస్తూ ఇలా అన్నది.

'స్వామీ! తాము సెలవిచ్చిన భోగాదుల సంపదలన్నీ నిఖిల యోగమాయా విద్యావిచక్షణులైన మీకు స్వతస్సిద్ధాలని నాకు తెలుసు. మీ నియమానికి నేను అడ్డురాను. మీ అంగసంగమభాగ్యం నాకు పుత్రోత్పాదనపర్యంతమే లభిస్తుంది గాక. పతి ఉన్నప్పుడు సతులకు గుణవంతమైన ప్రసవం కలుగుతుంది. అది అంగసంగమం వలన చేకూరుతుంది. అందుకు సాధనాలను కామశాస్త్రం బోధిస్తుంది. ఆ సాధనాలు సామాన్యంగా స్నాన పాన భోజనరూపంలో ఉంటాయి. ఆ సాధనాల చేత మీ శరీర ఆరోగ్యాన్ని కాపాడుకొంటూ, నన్ను కలతపరుస్తున్న మదనతాపాన్ని చల్లార్చండి. కామభోగాలకు అనుకూలించే మనోహర భవనాది వస్తువులను సంపాయించడం గురించి కొంచెం ఆలోచించండి' అని ప్రణయమధురంగా విన్నవించింది.

కర్దముడు సతి మనోభావాన్ని గ్రహించి, ఆమె కోరికను నెరవేర్చాలని సంకల్పించి, యోగమహిమను ఆశ్రయించాడు. వెంటనే నానారత్న రమణీయమై, సర్వవస్తుసంభార సంపన్నమైన కాలగమన విమానం వారి యెదుట సాక్షాత్కరించింది.

ఆ విమానం మణిస్తంభమయమై విచిత్ర పట్టికా పతాకాలతో అలరారుతూ దివ్యగంధ మాల్యాది వివిధ పరికర బంధురమై చూడముచ్చటగా ఉన్నది. దానిలో ఒక అంతస్తులో క్షౌమకౌశేయాది వివిధ వస్త్రాలు, నానారత్నమౌక్తికాది రచితసువర్ణభూషణాలు నిండి ఉన్నాయి. మరొక అంతరువు బహుచిత్రశయ్యాసనాదులను కలిగి ప్రవాళ మరకత తోమరద్వార మనోహరమై మదనోద్దీపక వస్తుసంచయాలతో నిండి హంస పారావత కలకలనాదయుతమై కన్నులపంటగా వెలుగొందుతున్నది.

## విమానక్రీడలు

ఆ విమానం అలా సర్వాశ్చర్యకరంగా ఉన్నప్పటికీ దేవహూతి మదికి సంతోషం కలుగలేదు. కర్దముడు అది గ్రహించి, 'కళ్యాణీ! పరమేశ్వరుని ఆనంద బిందు స్పర్శతో పవిత్రీకృతమైన ఈ బిందుసరోవరాన్ని చూడు. ఇందులో తీర్థమాడినవారికి ఈప్సితానందం సిద్ధిస్తుంది. నీవు ఇందులో జలకమాడి ఈ విమానాన్ని ఆరోహించాలి' అని కర్తవ్యాన్ని బోధించాడు.

దేవహూతి భర్త మాటను తలదాల్చి ఆ కొలను దగ్గరికి వెళ్లింది. వ్రతదీక్షలో ఉన్నందున ఆమె ధరించిన నారచీర ధూళిధూసరితమై యజ్ఞధూమాంకితమై ఉన్నది. చిరకాలంగా తైలసంస్కారాదులు లేక శిరోజాలు జడలు కట్టి మట్టికొట్టుకొని ఉన్నాయి. ఆమె కన్నులు మూసుకొని, భర్త ఆనతిని తలపోసి, జలకేళికై నదిలోకి దూకింది.

ఆ సరస్సు అంతర్భాగాన ఒక దివ్యమందిరం ఉన్నది. అందులో కుముదగంధాలను కురిపిస్తూ అందంలో అప్సరసలను తలదన్నే

పదివేలమంది దేవకన్యలు నివసిస్తున్నారు. వారందరూ ముకుళితహస్తలై దేవహూతికి ఎదురేగి, 'అమ్మా! మేము నీ పరిచారికలం. ఆజ్ఞకు వేచి ఉన్నాము' అని పలికి, ఆమెకు పరిమళతైలంతో తలంటి, నలుగు పెట్టి, పసుపార్చి, పన్నీటితో స్నానం చేయించి, తడివొత్తి, దివ్యదుకూలాలను కట్టి, అనర్ఘ మణిమయభూషలు తొడిగి, కస్తూరికా చందనాదులను అద్ది, అమృతరుచిని మరపించే మధురాన్నాలతో కడుపు నింపి, పూవు తేనెల ఆసవాన్ని పానీయంగా సమర్పించి అద్దాన్ని ఎదుట నిలిపి చూపించారు.

ఆ దర్పణంలో దేవహూతి తన దివ్య మనోహరరూపాన్ని చూసి, మనస్సులో తన ప్రియుని రూపాన్ని స్మరించింది. వెంటనే కర్దముడు ఆమె కన్నుల యెదుట సాక్షాత్కరించాడు.

కర్దముడంతట ప్రేమపూర్వకంగా దేవహూతి చేయి పట్టుకొని, ఆమెను విమానం లోనికి ఎక్కించి తానూ ఎక్కాడు. ఆ విమానం రివ్వున పైకి లేచి మబ్బులను తాకింది. వాయుపథంలో విహరిస్తూ మందాకినీ ప్రవాహ రవ సుభగాలై, మహేంద్రాది దిక్పాలకులు విహరించే మేరుగిరి దరులను సమీపించింది.

అక్కడ వైస్రంభకం, స్వరసనం, నందనం, పుష్పభద్రం, మానసం, చైత్రరథం మొదలైన దేవోద్యానవనాలు ఉన్నాయి. సతీపతులు ఆ రమణీయ ప్రదేశాల సౌందర్యాన్ని తిలకిస్తూ మన్మథకేళిలీలలలో తేలియాడసాగారు.

## పుత్రికా జననం

ఈ విధంగా కర్దముడు దేవహూతికి భూగోళమంతటా గల రమ్యస్థలాలను చూపించి, తన ఆశ్రమానికి తిరిగివచ్చి అక్కడ ఆమె సురతోత్సుకతను తొమ్మిది రూపాలలో తీర్చసాగాడు. ఆ ప్రకారం నూరేండ్లు గడిచాయి. అంత సుదీర్ఘకాలమూ దేవహూతికి ఒక్క ముహూర్తం మాత్రమే అనిపించేటంత అవలీలగా రోజులు గడిచిపోయాయి.

అప్పుడు కర్దముడు తన దేహాన్ని తొమ్మిది విధాలుగా విభజించి, దేవహూతి గర్భంలోనికి తన వీర్యాన్ని తొమ్మిది విధాలుగా ప్రవేశపెట్టాడు.

పురుష వీర్యాన్ని శుక్లం అని, స్త్రీ వీర్యాన్ని శోణితం అని పేర్కొంటారు. స్త్రీ పురుషసంయోగంలో శుక్లం బలవత్తరమైనపుడు పురుష శిశువు, శోణితం బలవత్తరమైనపుడు స్త్రీ శిశువు జన్మిస్తారు.

కర్దమునికి మొదటినుంచీ కామసుఖాలపట్ల ఆసక్తి తక్కువ. దేవహూతి రతి యందు అత్యంతానురక్తయై ఉండేది. అందువల్ల శుక్లానికన్న శోణితం బలవత్తరం అయింది. తత్ఫలితంగా దేవహూతికి నెలలు నిండి మహాసౌందర్యవతులైన తొమ్మిది మంది కుమార్తెలు పుట్టారు.

## దేవహూతి పరితాపం

ఒకనాడు దేవహూతికి మునివరుని ప్రతిన స్ఫురించి, లోలోపలే విలపిస్తూ భర్త వద్దకు వచ్చి, చిరునవ్వు వెన్నెలలతో ఆయన మనస్సును సుముఖీకరించుకొని, కాలి బొటనవ్రేలిని నేలకు రాస్తూ, కన్నీటి తెరలను ఆపుకొంటూ, ఈ విధంగా డగ్గుత్తికతో పలికింది–

'బ్రహ్మర్షివర్యా! మీ శరణు జొచ్చాను. నా మాట కాదనలేక మీరు సంతానాన్ని ప్రసాదించారు. అయితే కూతుళ్ళను కనగానే సరిపోదు. వారికి తగిన వరుని చూసి, ఆ అయ్య చేతిలో పెట్టినంతదాకా తల్లిదండ్రుల భారం తీరదు. ఇక మీరు వనవాసానికి వెళ్ళిపోతారు. ఆ తర్వాత రానున్న కష్టభారమంతా నా పైని పడుతుంది. గంపంత కాపురాన్ని చక్కబెట్టేందుకు కనీసం ఒక్క కొడుకైనా పుట్టి ఉంటే బాగుండేది. నాకా పెరిగే వయస్సు కానీ తరిగే వయస్సు కాదు కదా. ఒక్కదానినీ ఈ బరువు ఎలా మోయగలనో నాకు దారీ తెన్నూ తోచడం లేదు. అన్ని చింతలూ భగవదనుగ్రహాన గట్టెక్కుతాయని మీరు ఏ చీకు చింతా లేకుండా ఉండగలరు. నేను ఇప్పటివరకూ ఇంద్రియార్థాలకు చిక్కి మీతో సంగమమే పరమార్థంగా కాలం గడిపాను.

ఏనాడూ పరమాత్మచింతనం చేసిన పాపాన పోలేదు. అన్నిటికీ మీరే ఉన్నారని నాకు గట్టి నమ్మకం. అది అజ్ఞానం అంటారా? ఒప్పుకొంటాను. అయితే కార్యఫలం మనస్సంగతత్త్వాన్ని బట్టి ఉంటుందని అంటారు. ఆ మనస్సంగం సాధుజన పరమైనదిగా ఉంటే దోషరహితమై శుభాన్ని కలిగిస్తుంది. అసాధుజన పరమైనదిగా ఉంటే సంసృతికి కారణం అవుతుంది. మరి ప్రతి కార్యమూ ధర్మమూలమై, వైరాగ్యప్రదమై, హరిసేవాత్మకంగా ఉండాలని అలా చేయనివారు బ్రతికీ చచ్చినట్లేనని పెద్దలు అంటారు. నేను భగవన్మాయకు లోనై మోసపోయాను. కాకపోతే ఎటువంటి కలుషాత్ములకైనా ముక్తిని ప్రసాదింపగల మీవంటి మహాత్మునికి భార్యనై బంధమోక్షకాంక్షిని గాక ఇలాగవుతానని ఎన్నడూ అనుకోలేదు' అని బాధపడింది.

## కపిలావతారం

కర్దముడు దేవహూతి మాటలను విని, శాంతచిత్తంతో 'రాజపుత్రీ! దుఃఖించకు. ఈనాటి నుంచి నీవు వ్రతం పూని దమ నియమ శ్రద్ధా పూర్వకంగా భగవంతుని ఆరాధించు. ఆ మహనీయుడు నీ భక్తికి మెచ్చి నీ గర్భవాసాన అవతరిస్తాడు. ఆయన అవతారం వలన నీకూ నాకూ శాశ్వతమైన కీర్తి లభిస్తుంది. ఆ పరాత్పరుడే నీకు బ్రహ్మవిద్యోపదేశం సిద్ధింపజేస్తాడు. నీ హృదయగ్రంథి వీడుతుంది' అని ప్రేమపూర్వకంగా పలికాడు.

భర్త ఆనతిని తలదాల్చి దేవహూతి భక్తిశ్రద్ధలతో దేవదేవుని ఆరాధించింది. అట్లా పెద్దకాలం గడిచిపోయింది. ఒకనాడు భగవంతుడు కర్దముని వీర్యం ద్వారా దేవహూతి గర్భంలో అవతరించాడు. దేవతలు ఆనందం పట్టలేక మంగళవాద్యాలను మ్రోయించారు. ఆకాశం నుంచి పుష్పవృష్టి కురిసింది. గంధర్వుల గానానికి అప్సరసలు మైమరచి నృత్యం చేశారు. దిక్కులు, జలములు, లోకుల మనస్సులలో ఎన్నడూ లేని ప్రసన్నత తొణికిసలాడింది.

## బ్రహ్మాదుల రాక

విదురా! అంతట ఒకనాడు బ్రహ్మదేవుడు సనక నారదమహర్షులను, మరీచాదులను వెంటగొని కర్దముని ఆశ్రమానికి వచ్చాడు.

'నాయనా! కర్దమా! నా మాటను తల దాల్చావు. నీ పితృభక్తి అత్యకలంకమని నిరూపించావు. కొడుకులు తండ్రులను సేవించడమంటే వారి మాటను పాటించడం అనే అర్థం. నీ సద్వర్తన నాకెంతో మెచ్చుగొలిపింది. నీ పుత్రికలు తమ ప్రభావంతో సృష్టివృద్ధికి పలువిధాల తోడ్పడుతారు. వారిని తగినవారి కిచ్చి స్థిరయశస్సును పొందు. భగవానుడంతటివాడు దేహధారణకు అంగీకరించి స్వమాయా యోగంతో నీకు పుత్రుడై జనించాడు. ఈ నీ పుత్రుని కపిలుడు అంటారు' అని పలికి, దేవహూతి వంక చూచి 'మనుపుత్రీ! భగవానుడు నీ గర్భాన అవతరించాడు. నీవు ధన్యురాలవు. నీ సుతుని వలన నీవు జ్ఞానవిజ్ఞానయోగాన్ని గ్రహిస్తావు. నీ అవిద్యాసంశయగ్రంథి వీడుతుంది. కర్మవాసనలన్నీ నశిస్తాయి. నీ పుత్రుడు సాంఖ్య విద్యకు ఆచార్యుడై సాటిలేని కీర్తిని గడిస్తాడు' అని చెప్పి, మరీచ్యాదులను అక్కడ నిలిపి, హంసవాహనుడై సత్యలోకానికి నిర్గమించాడు. అనంతరం సనకాదులు, నారదుడు వెళ్ళిపోయారు.

## కర్దమసుతల వివాహం

అంత కర్దముడు బ్రహ్మవచనాన్ని పర్యాలోచించి, తన పుత్రికలలో కళను మరీచికి, అనసూయను అత్రికి, శ్రద్ధను అంగిరసునికి, హవిర్భువును పులస్త్యునికి, గతిని పులహునికి, ప్రియను క్రతువునకు, ఖ్యాతిని భృగునికి, అరుంధతిని వసిష్ఠునికి, శాంతిని అధ్వర్యునికి ఇచ్చి ప్రజావృద్ధ్యర్థం పెండ్లి కావించాడు. ఆ తొమ్మండుగురు ప్రజాపతులూ వారి వారి భార్యలతో దేవహూతీకర్దములను వీడ్కొని తమ తమ ఆశ్రమాలకు వెళ్లారు.

## చతుర్థాశ్రమ ప్రవేశం

కొంతకాలానికి కర్దముడు పుత్రుడైన కపిలుని వద్దకు వచ్చి ప్రణమిల్లి, 'దేవా! పూర్వపాపాలను అనుభవించేందుకు సంసారం కలుగుతుంటుంది. అట్టి సంసారసాగరతరణానికి భక్తులు దేవతలను ఆశ్రయిస్తారు. ఆ దేవతల వలన చిత్తశుద్ధి కలుగుతుంది. కాని సంసారముక్తి మాత్రం లభించదు. శుద్ధచిత్తులు నీ పాదమూలాన్ని ఆశ్రయించి కడతేరుతారు.

దేవా! నీ భక్తులలో యోగులే గాక సామాన్యులు కూడా ఉంటారు. అట్టివారి రక్షణార్థమై నీవు గ్రామ్యులమైన మా ఇంటిలో అవతరించావు. రూపరహితుడవైన నీవు రూపం ధరించడంలో గల రహస్యం ఇదే.

దేవా! నీవు రూపాన్ని ధరించటం వలన ప్రజలకు ఎనలేని మేలు చేకూరుతుంది. వారికి నీ రూపదర్శనం వలన తప్ప వేరొక మార్గాన తృప్తి కలుగదు. నీ దర్శనభాగ్యం సిద్ధించి వారు తృప్తస్వాంతులై రెట్టించిన భక్తితో నిన్ను కొలిచి ముక్తిపదాన్ని చూరగొంటారు.

దేవా! పెద్దలెందరో నీ వలన తత్త్వాన్ని గ్రహించి కృతార్థులయ్యారు. నీవు నిత్యైశ్వర్య వైరాగ్య యశోఽవబోధ వీర్య శ్రీ పరిపూర్ణుడవు. ప్రకృతిపురుష మహదహంకార కాలేంద్రియ దేవతాత్ముడవు. శక్తి నీకు స్వాధీనయై, నీ ఆజ్ఞానుసారం ప్రవర్తిల్లుతున్నది. చిచ్ఛక్తియోగం వలన నీవు నిఖిలప్రపంచానికీ అతీతుడవై వెలుగొందుతావు. అట్టి సర్వజ్ఞుని, పరమేశ్వరుని నిన్ను ఒక్కటి అడుగుతాను.

దేవా! నాకు పుత్రుడవై వెలసి పితౄణం నుంచి నన్ను విముక్తుని గావించావు. ఆప్తకాముడనై నిండు మనస్సుతో ఆనందించాను. ఇక నాకిక్కడ కర్తవ్యకర్మలు లేవు. విశోకస్థితిని కోరుతున్నాను. అందుకు సన్న్యాసం ఒక్కటే పరమమార్గం. నేను సన్యసించేందుకు అనుజ్ఞ నివ్వు' అని అర్థించాడు.

## కపిలుని అంగీకారం

కపిలుడు ఆ మాట విని, 'మునివర్యా! మోక్షం పరమప్రాప్యమన్నది సత్యం. అది ఆత్మదర్శనం వలన గాని సిద్ధింపదు. ఆత్మదర్శనానికి సాంఖ్యయోగం ఎంతో ఉపకరిస్తుంది. ఆ యోగాన్ని పూర్వం నేను బోధించాను. అది మిక్కిలి దుర్బోధంగా ఉన్నందున, అనుష్ఠాతల శక్తిహీనత వలన కాలక్రమాన సన్నగిలి ఇప్పుడు నష్టప్రాయం అయింది. దానిని సముద్ధరించేందుకు నేను ఈ దేహాన్ని ధరించాను. నీవిక సన్న్యసింపవచ్చు. నీ కర్మలన్నింటినీ నాయందు సన్న్యసించి అమృతాన్ని కోరి నన్ను భజించు. మృత్యువును తరిస్తావు.

మునివర్యా! నన్ను భజించటంలో ఒక రహస్యం ఉన్నది. నేను సర్వభూతజాతం లోనూ ఆత్మస్వరూపుడనై అంతర్యామిగా ఉంటాను. ఎవరు తమలోనూ సమస్తభూతజాతం లోనూ నన్ను కనుగొంటారో, వారు శోకరహితులై అభయాన్ని పొందుతారు. ఈ రహస్యాన్ని గ్రహించి నీవు వర్తించు. ఈ రహస్యాన్ని అధ్యాత్మవిద్య అంటారు. ఇది సర్వకర్మలనూ ప్రశమింపజేసి సంసార నిస్తరాన్ని కలిగిస్తుంది. నేను దీనిని అమ్మకు వివరించి చెబుతాను. ఆమె కృతకృత్యురాలై మోక్షపదాన్ని అధిరోహిస్తుంది' అన్నాడు.

## కర్దముని సన్యాసం

అందుకు కర్దముడు మహానందాన్ని పొంది పుత్రుని వలగొని అరణ్యానికి వెళ్లి, అగ్నికార్యాలు వదిలి మౌనవ్రతం ధరించి, మనస్సును ఆత్మయందు నిలిపి, ఎట్టి కోరికలు లేనివాడై అహంకార మమకారాలను జయించి, యథేచ్ఛాసంచారి అయ్యాడు.

కర్దముని చిత్తం తరగలు లేని సముద్రం లాగా ఒప్పారింది. ఆ ప్రశాంతభావాన్ని అతను నిర్గుణబ్రహ్మమునందు నిలిపాడు. తత్ఫలితంగా గుణముల యొక్క కార్యపరంపర, సదసద్వివక్షలు స్వయంగా అణగారిపోయాయి.

ఆ విధంగా కొన్నాళ్లు చరించి కర్దముడు అపరోక్షానుభూతిని పొంది, ఎట్టకేలకు భాగవతగమ్యమైన ముక్తిపదాన్ని చేరుకొన్నాడు.

## దేవహూతీకపిలుల సంవాదం

విదురా! కర్దముడలా వనవాసానికి వెళ్లిన పిదప కపిలుడు ఆ ఆశ్రమం లోనే తల్లికి తోడుగా ఉన్నాడు. దేవహూతి ఒకానొకనాడు బ్రహ్మవచనాన్ని స్మరించి కపిలుని సమీపించి, 'మహాత్మా! అసద్విషయాలన్నీ క్షణభంగురాలని తెలిసి తెలిసి ఆ బంధాలకు చిక్కి గాఢాంధకారంలో పడ్డాను. ఇట్లా ఎన్ని జన్మలుగా తిరుగుతున్నానో తెలియదు. ఎట్టకేలకు నీ అనుగ్రహం నా యెడ ప్రసరించింది. తత్ఫలితంగా నిన్ను కడుపున మోసే మహాభాగ్యం కలిగింది. నా చిత్తం ప్రకాశపరమై బంధమోక్షానికి ఉవ్విళ్ళూరుతున్నది. నాకు ప్రకృతిపురుష తత్త్వజ్ఞానాన్ని అనుగ్రహించు' అని అడిగింది.

## అధ్యాత్మ విద్యోపదేశం

కపిలుడు ఆ మాట విని లోలోపల సంతసించి, 'అమ్మా! జనులకు సుఖదుఃఖాలు జన్మతోటే కలుగుతుంటాయి. అవి తొలగి నిశ్శ్రేయసాన్ని పొందగోరిన వారు అధ్యాత్మయోగాన్ని ఆశ్రయించాలి. ఆ యోగాన్ని పూర్వం కొందరు ఋషులు కోరగా విశదీకరించాను, దానిని చెబుతాను విను'

అని అధ్యాత్మవిద్యను కరతలామలకంగా ఉపదేశించాడు.

## బంధమోక్షాలకు కారణం

'మనుష్యులలో మనస్సు అనే అంతఃకరణం ఒకటున్నది. బంధమోక్షాలకు కారణం అదే.

బంధము అంటే మనస్సును ఒకదాని యందు లగ్నం చేసి ఉంచటం.

ఈ బంధం మనస్సును సత్త్వరజస్తమోగుణాలకు అంకితం చేసినప్పుడు కలుగుతుంది. బంధాలలో చిక్కిన జీవికి ఆ బంధాల నుంచి వెలువడితే కాని ముక్తి చేకూరదు.

మనస్సు గుణాతీతమై పరమేశ్వరభక్తిపర మైనప్పుడు మోక్షం కలుగుతున్నది.

## గుణసంగం

అమ్మా! మనస్సు గుణపరమైనపుడు బంధం ఏర్పడుతుందని చెప్పాను.

శరీరం అన్నది ఆత్మకు ఒక తొడుగు వంటిది. ఆ రహస్యాన్ని గ్రహింపలేక శరీరమే ఆత్మ అని పొరబడుతుంటారు.

అలాగే భార్యా బిడ్డలు, సిరిసంపదలు ఎల్ల కాలం ఉండేవి కావని అందరికీ తెలుసు. అయినా అవి తమ వలెనే సుస్థిరంగా ఉంటాయని నమ్మి, వాటి వలన కలిగే తాత్కాలిక సుఖమే పరమసుఖం అనుకొంటారు.

ఈ రెండు భావాలనూ 'అభిమానాలు' అంటారు. వీటిలో ఒకసారి తగులుకొంటే అవి నానాటికీ వృద్ధి చెందుతాయి. అప్పుడు దానిని 'కామం' అంటారు.

ఆ కామ కార్యం ఏమిటంటే అది సర్వం తానొక్కడే అనుభవించాలన్న కోరికను కలిగిస్తుంది. అట్టి భావనను 'లోభం' అంటారు.

కామలోభాలు మనస్సును మలరూపంలో ఆవరిస్తాయి. కామలోభాలు ఉన్నంతకాలం సుఖదుఃఖాలు వదలవు. ఆ మలినాలు రెండింటినీ కడిగివేస్తే మనస్సు పరిశుద్ధమవుతుంది. మనఃపరిశుద్ధి అంటే సుఖదుఃఖరాహిత్యం అన్నమాట.

సుఖదుఃఖాలు లేకపోయాక మనస్సుకు సమవృత్తి కలుగుతుంది. దానితో హితాహితజ్ఞానం ఉదయిస్తుంది.

మనస్సుకు హితాహితజ్ఞానం ఎప్పుడు కలుగుతుందో అప్పుడే హితకార్యాలను చేయాలనే సద్బుద్ధి విజృంభిస్తుంది. అహితకార్యాల పట్ల వైరాగ్యం పెంపొందుతుంది.

హితబుద్ధి కార్యం ఏమిటంటే అది తనకు పరమాశ్రయం ఏదో దానిని వెతుకుతుంది. అప్పుడు భగవంతుడు ఆ బుద్ధిని తన వంకకు మరలించి కొద్దిగా రుచిని కలిగిస్తాడు. అలా చవిగొన్న వస్తువును ప్రేమించి బుద్ధి దానిని సాధించాలని ప్రయత్నిస్తుంది. ఆ ప్రేమను భక్తి అని, ఆ సాధన యత్నాన్ని శ్రద్ధ అని పేర్కొంటారు.

శ్రద్ధాభక్తుల ఫలంగా పరమప్రేమాస్పదమైన వస్తుతత్త్వం క్రమక్రమంగా తేటపడుతుంది. ఆ వస్తువు నిరంతర జ్యోతిః స్వరూపమై, ఏకమై, ఎటువంటి పరిచ్ఛేదాలూ లేక తనలోనూ, సర్వభూతాల లోనూ ఏకరీతిని వెలుగొందుతున్నదని, ఆ వస్తువును ఆశ్రయించి ప్రకృతి ఉన్నదని తెలియవస్తుంది.

అమ్మా! ఈ యోగాన్ని భక్తియోగం అంటారు. బ్రహ్మప్రాప్తికి దీనివంటి ఉత్తమ మార్గం మరొకటి లేదు.'

అంటూ కపిలుడు ఇంకా ఇలా అన్నాడు–

## సాధుజన లక్షణం

'అమ్మా! గుణసంగమం చాలా బలవత్తరమైనది కనుక దానిని ఛేదించటం అసాధ్యమని అనుకోకూడదు. సంగమం ఎంత గట్టిగా ఉన్నా సాధుజనసంగం వలన అది క్రమక్రమంగా క్షీణించి, కొన్నాళ్లకు పూర్తిగా నశించిపోతుంది.

సాధువులంటే ఎవరు? అని తెలుసుకోకుండా సాధుజనసంగం వీలుకాదు కనుక సాధుజనలక్షణాలను ముందు గ్రహించాలి. వారి సన్నిధిలో మెలగుతూ నెమ్మది నెమ్మదిగా ఆ లక్షణాలను తానూ అలవరచుకోవాలి.

సాధువులు మూఢుల నిందాలాపాలను విని మనస్సు పాడుచేసుకోరు. సైరించి ఊరుకొంటారు.

వారు తమకు తామై దేనినీ ఆశించరు. ఏదో లేనిదాని కోసం బాధపడరు.

పరుల దుఃఖాన్ని చూసినప్పుడు వారి హృదయం వేడిమి సోకిన వెన్నవలె కరిగిపోతుంది. ఎల్లవారినీ వారు ఆత్మీయతతో చేరదీసి ఆప్యాయనం వెల్లివిరియిస్తారు.

వారు శమదమాదిసంపన్నులు. అజాతశత్రువులు. వారి మృదుమధురశీలం ఎటువంటివారి మనస్సు నైనా చూడగానే ఆకర్షిస్తుంది.

వారు అనన్యభావంతో నా యెడ భక్తి గలిగి, సర్వం నాకు సమర్పించి, నా కథలను వింటూ, నా లీలలను కీర్తిస్తూ, నా తోడిదే లోకంగా ఉంటారు.

అలా ఉన్నవారే సాధువులు. వారే నా మదికెక్కిన మహితాత్ములు.

## సాధుసంగఫలం

అమ్మా! సర్వసంగవివర్జితులు, సర్వదోషహరులు అయిన సాధువుల సాంగత్యం భక్తులకు సత్ఫలాన్ని ప్రసాదిస్తుంది. వారు నా మహిమలను ఎల్లవేళలా కొనియాడుతుంటారు. వారి సాంగత్యం వలన నా మహిమలు చెలికెక్కి సర్వేంద్రియ తర్పణం కలిగిస్తాయి. అందువలన మనోమాలిన్యం తొలగిపోతుంది. దానితో భగవంతుని యెడ శ్రద్ధాభక్తులు జనించి వృద్ధిపొందుతాయి. విషయరాగం పలాయనమౌతుంది. ఐహికాముష్మిక చింతనలు దూరమౌతాయి.

అట్టివారి మ్రోల ప్రకృతిలీలలు సాగవు. ఎట్టకేలకు వారు ప్రత్యగాత్ముడ నైన నన్ను పొందగలుగుతారు'.

## కపిలమహర్షి భక్తియోగం

దేవహూతి ఆ మాటలు విని, 'మహాత్మా! భక్తి ఎట్టిదైనపుడు యోగ్యమనిపించుకొంటుంది? భక్తికి ఫలంగా ఏది గోచరిస్తుంది? తాపత్రయ నాశాన్ని, నిరతిశయ సుఖప్రాప్తిని ఎలా సాధించాలి? నీవు చెప్పిన సాంఖ్యతత్త్వం ఏమిటి? దానికి ఏయే అంగాలు ఉన్నాయి?' అని అడిగింది. కపిలుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

'అమ్మా! దేహంలో జ్ఞానపరములైన ఇంద్రియాలు, కర్మఫలములైన ఇంద్రియాలు రెండూ ఉన్నాయి. వీటన్నింటినీ నడిపించేది మనస్సు. ఈ మనస్సు ఏ ఫలాన్ని కోరితే దాని వంకకు ఆ ఇంద్రియాలు నడుస్తాయి. ఎప్పుడూ ఏదో ఒక దానిని కోరుకోవటం ఆ కోరినదానిని పొందాలని ప్రయత్నించటం మనస్సు యొక్క నైజం. దీనినే వేదాంతపరిభాషలో యోగం అంటారు.

ఈ మనోవ్యవహారం శుభాశుభాలు రెండింటా వర్తిలుతూనే ఉంటుంది. ఏ పరమార్థాన్ని కోరి మనస్సు ఈ విధంగా పరుగులు తీస్తుంటుంది? అంటే ఆనందాన్ని కోరి వ్యవహరిస్తుందని తెలుసుకోవాలి.

ఆనందం అనగానే, దానిని కలిగించే పదార్థం ఒకటి ఉండాలి. పదార్థాలు క్షణికానందదాయకం, శాశ్వతానందదాయకం అని రెండు విధాలు:

> ఆనందానుభవ వాంఛ అందరికీ ఉంటుంది. దానిని వదలుకోమంటే ఎవరూ ఒప్పుకోరు. అయితే రెండు విధాలైన ఆనందాలలో ఏది శాశ్వతమో తెలుసుకొని, దానినే పొందగోరటం ఉత్తమోత్తమ లక్షణం. అట్టి శాశ్వతానందాన్ని ఇచ్చే పదార్థం ఏదో గ్రహించి దానిని పొందటానికి చేసే ప్రయత్నాన్ని వాస్తవమైన యోగం అని పెద్దలు అన్నారు.

మనస్సు నిరంతరమూ ఆనందాభిలాష వలన ప్రేరితమై ఒక పదార్థం పైని వ్రాలి, తృప్తి చెందక, అక్కడ నుంచి వేరొక పదార్థానికి పరుగెత్తుతూ ఎక్కడా నిలకడ లేకుండా ఉంటుంది. అందుకు ఆ పదార్థాల మాధుర్యం నిత్యం కాకపోవడమే కారణం. ఆ మనస్సుకు సాటిలేని మధురఫలాన్ని ఒక్కసారి రుచిచూపితే, అది ఆ ఫలరసాన్ని గ్రోలుతూనే ఉంటుంది. ఆ ఫలం శాశ్వతమైనది కనుక మనస్సు ఎంత దాని మాధుర్యాన్ని అనుభవించినా అది తరిగిపోదు. పైగా మనస్సుకు దాని యందు రుచి మిక్కుటమై దానితోడిదే లోకంగా ఉండగలుగుతుంది.

అట్టి ఫలం ఏదని అడిగితే, దేనికి షడ్వికారాలు కలుగవో, అందువలన ఏది శాశ్వతమై సేవించిన కొద్దీ క్రొత్త క్రొత్త రుచులను కలుగజేస్తుందో, అట్టి ఫలం ఒక్క భగవంతుడే అని సమాధానం చెప్పాలి. తక్కిన ఫలాలన్నీ క్షణికములు, దుఃఖపర్యవసానాలు అవుతాయి. మనస్సుకు భగవద్రూపఫలాన్ని అందిస్తే అది దాని రుచిని చూచి, ఇతర ఫలాభిసంధిని మాని, అందులోనే ఏకాగ్రతను పొందుతుంది. ఎప్పుడు మనస్సు ఆ విధంగా ఏకాగ్రమవుతుందో అప్పుడు మనోవశమై వర్తిస్తే జ్ఞాన కర్మేంద్రియాలు చోదకుడు లేక తమ తమ వ్యవహారాన్ని కోల్పోతాయి. ఈ విధానాన్ని భక్తియోగం అంటారు.

## భక్తుల వర్తనం

ఇక భక్తియోగాన్ని అవలంబించినవారి వర్తనలను విను:

భక్తులైనవారు సర్వేంద్రియ వ్యాపారాలను నా సేవలో వినియోగిస్తారు. వారు నా కథలను తప్ప వృథా ప్రసంగాలను వినరు, పలకరు. వారి కన్నులు నా దివ్య రూపాలను తప్ప అన్యాకృతులను ఇచ్చగింపవు, చూడవు. నా తోడిదే వారికి జీవితసాఫల్యంగా ఉంటుంది. వారు చివరికి మోక్షాన్ని కూడా ఆశించరు. అట్టి వారికి ముక్తి లేదా? అని శంకింపవద్దు. ముక్తిని

వారు కోరకపోయినా స్వయంగా నేను దానిని వారికి ప్రసాదిస్తాను. తత్ఫలంగా వారు నన్ను చేరుకొంటారు.

## షడ్విధ భక్తులు

అమ్మా! ఈ భక్తి మధురభక్తి, వాత్సల్యభక్తి, సఖ్యభక్తి, గురుభక్తి, హితభక్తి, దైవభక్తి అని ఆరు విధాలు.

భక్తికి ముఖ్యలక్షణం ప్రేమ. ప్రేయసీప్రియులు పరస్పరం చూపుకొనే ప్రేమను భగవంతుని యెడ చూపినప్పుడు దానిని మధురభక్తి అంటారు.

తండ్రి తన పుత్రుని యెడ చూపే ప్రేమను భగవంతుని యెడ చూపినప్పుడు దానిని వాత్సల్యభక్తి అంటారు.

సఖుడు తన ప్రియసఖుని యెడ చూపే భక్తిని భగవంతుని యెడ చూపినప్పుడు దానిని సఖ్యభక్తి అంటారు.

శిష్యుడు గురువు పట్ల చూపే విశ్వాసరూపప్రేమను భక్తుడు భగవంతుని యెడ చూపినప్పుడు దానిని గురుభక్తి అంటారు.

హితుడు తన హితునికి హితాన్ని కలుగజేసినట్లు భగవంతునికి హితాన్ని కూర్చటం హితభక్తి.

పిన్నలు పెద్దవారి యెడ చూపే పూజారూపప్రేమను భగవంతుని యెడ చూపినప్పుడు అది దైవభక్తి అవుతుంది.

## భక్తికి ఫలం

తల్లీ! ఏ తీరుననైనా నన్ను ఆశ్రయించినవారిని కాలచక్రం బాధింపలేదు. ఇహపరాలు రెండింటినీ తృణీకరించి, భార్యాపుత్రపశుగృహాది సర్వస్వం త్యజించి నా విశ్వతోముఖాన్ని అనన్యభక్తియోగంతో కొందరు ఆరాధిస్తారు. వారికి సంసార తరణం తప్పక కలుగుతుంది.

భయాలన్నింటిలో మృత్యుభయం చాలా భయంకరమైనది. మృతిభయానికి లోకమంతా వెరచి తల్లడిల్లుతుంటుంది. నేను తప్ప అన్యులెవరూ ఆ భయాన్ని తీర్చలేరు. నా పరమభక్తులను చూసి మృత్యువే భయపడి పారిపోతుంది. కనుక భక్తియోగాన్ని ఆశ్రయించి నా యెడ చిత్తాన్ని చేర్చినందు వల్ల పరమపురుషార్థం తప్పక చేకూరుతుంది.

తల్లీ! మృత్యువంటే దేహపతనమని భావిస్తారు. దేహం ఎప్పుడో ఒకప్పుడు రాలిపోతుంది. అది దాని స్వభావం. దానిని తప్పించటం సాధ్యం కాదు. అయితే నిజానికి అది మృత్యువుకాదు. మృత్యువంటే ఆత్మనాశనమే. నిజమైన మృత్యువుకు ఆ మృత్యువు సంభవించినప్పుడు మళ్లీ జనన మరణాలు ఉండవు. అవి లేకపోవటమే మృత్యుభయనాశనం. అట్టివారు నన్ను చేరి సర్వకాలం సుఖాతిశయాన్ని చూరగొంటారు. ఈ సంగతిని చక్కగా గ్రహించాలి.

## తత్త్వలక్షణం

అమ్మా! తత్త్వలక్షణాలను వినగోరావు. ఈ ప్రపంచం చరాచరాత్మకమై ఉన్నదని కన్నారా చూస్తున్నారు. అది నిమిషనిమిషానికి మార్పుచెందటం కూడా చూస్తూనే ఉన్నారు. ఈ ప్రపంచానికి మూలకారణం ఏదైనా ఉన్నదా? లేదా? అన్న ప్రశ్న విచారపరులకు కలుగక మానదు. ఈ విషయమై నానామతాలు ఉన్నాయి. వాటిలో శూన్యమతం, స్వభావమతం – ఇవి రెండూ ప్రధానమైనవి. మొట్టమొదట ఏమీ లేక సర్వశూన్యంగా ఉండేదని, శూన్యం నుంచి ప్రపంచం కలిగినదని చెప్పటం శూన్యవాదం. శూన్యమంటే అభావం. అభావం నుంచి భావం అనగా ఉనికి ఎన్నడూ ఏర్పడదు. కనుక శూన్యవాదం యుక్తికి కూడా నిలువదు.

స్వభావ శబ్దానికి రెండు అర్థాలున్నాయి. నైజం అని ఒక అర్థం, 'ఉండుట' అన్నది రెండవ అర్థం. నైజమంటే ధర్మం అనగా గుణం అవుతుంది. ధర్మి (గుణి) కలుగక ధర్మం (గుణం)

ఉండదు. గుణిగుణాలెప్పుడూ అవినాభావాలు. కనుక నైజమన్నది గుణిని వదిలి గుణాన్ని మాత్రమే సూచిస్తుంది. 'ఉండుట' అనే రెండవ అర్థాన్ని బట్టి అసలు పదార్థం ఒకటున్నదని నిశ్చయిస్తే దృశ్యాదులు ఆ పదార్థం యొక్క వివిధావస్థలు అవుతాయి. సారాంశం ఏమిటంటే స్వభావవాదంలో మొదటి భాగం గుణాన్ని మాత్రమే తెలుపుతుంది. రెండవ భావం గుణిగుణాలు రెండిటినీ తెలుపుతుంది. ఈ రెండిటిలో మొదటిదానిని తత్త్వజ్ఞులు అంగీకరించరు.

అమ్మా! స్వభావవాదంలో ద్వితీయపక్ష పదార్థాన్ని ఆత్మ అని, పురుషుడని నిర్వచిస్తారు. ఆత్మకు జన్మాదులు కలుగవు. అది స్వయంజ్యోతి, సర్వప్రకాశకం, చైతన్యరూపం, నిర్గుణం, నిస్సంగం అయి సూక్ష్మాతిసూక్ష్మరూపంలో ఉంటుంది. అందువల్ల ఇంద్రియాలు ఆ పదార్థాన్ని స్వశక్తి వలన కాని, సాధనాంతరశక్తి వలన కాని చూడలేవు. ఆ పదార్థం ఇంద్రియాలకు కానరానందున దానిని అవ్యక్తము, నిరాకారము అని అంటున్నారు. వస్తువు వ్యక్తం కానంతమాత్రాన ఆకారరహితం కావాలని ఎక్కడా లేదు. ఇక్కడ నిరాకారం అన్నప్పుడు ఆ వస్తువు ఇంద్రియాలకు గోచరింపనంత సూక్ష్మాతిసూక్ష్మమైన ఆకారం కలిగినదని గ్రహింపవలసి ఉంటుంది.

## ఆత్మ-శక్తి

అమ్మా! ఆ పరమపదార్థం చైతన్యాత్మకమని చెప్పాను. చైతన్యమంటే శక్తిమంతమని తాత్పర్యం. ఆ పదార్థమూ, దాని శక్తీ నిప్పు, దాని వేడిమి రెండూ వేర్వేరుగా లేనట్లుగానే ఎల్లవేళలా కలిసిమెలిసి ఉంటాయి. ఆ శక్తిని మాయ అని, ప్రకృతి అని పేర్కొంటారు. ఆ శక్తి దాని వ్యవహారదశలో సత్త్వరజస్తమస్సులనే మూడు రూపాలలో వర్తిస్తుంది. ఆ మూడింటినీ త్రిగుణములు అన్నారు.

## ఆత్మశక్తి వ్యవహారం

ఆత్మకు జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అని మూడు శక్తులున్నాయి. దానికి కోరిక కలిగినపుడు తనలో ఉన్న ఇచ్ఛాశక్తిని ప్రేరేపిస్తుంది. ఆ శక్తి నానారూపాలను దాల్చి వివిధగతుల వర్తిస్తుంది.

ఈ శక్తి ప్రేరణను గురించి 'దేనికి?' 'ఎప్పుడు' 'ఎందుకు?' అనే ప్రశ్నలు కలుగుతున్నాయి. ఆ ప్రశ్నలకు వివిధ సమాధానాలు కూడా చెప్పబడుతున్నాయి. నిజానికి వీటిలో యుక్తికి నిలిచే సమాధానం ఒక్కటీ లేదు. ఎందుకంటే ఆ రహస్యం దానికి మూలమైనపదార్థం ఒక్కదానికి తెలియాలి. ఇతరులెవరూ చెప్పలేరు.

అమ్మా! ఆ పదార్థం ఏకమై, అద్వితీయమై, వేరొకటి లేనిదై ఉన్నది. అందువలన సర్వమూ అది ఒక్కటే. సర్వమూ అదే అయినప్పుడు దృశ్యములైన దేహాదులు కూడా అదే కావాలి కదా? దేహాదులు నశించటాన్ని మనం చూస్తున్నాము. ఆ పక్షంలో దేహాదులతో ఆ పదార్థం కూడా నశిస్తున్నదని అంటావేమో. దృశ్యపదార్థాల జనన నాశనాలను గురించి ఆలోచిస్తే, అది అచ్చంగా మనము కలలో చూస్తున్న జనన నాశనాల వలెనే ఉంటుంది. కలలో మనం చూస్తున్నవాటిని ఆ క్షణంలో సత్యములనే మనం భావిస్తున్నాము. మేల్కొంచినపుడు స్వప్నదృష్ట విషయాలన్నీ సత్యములు కావని మనకే తెలిసిపోతుంది. మూలమైన పదార్థం దేహాది దృశ్యావస్థలను పొందటమూ, అవి నశించటమూ అటువంటివేనని గ్రహించు.

## అధ్యాసం

అమ్మా! దేహధారణాదికాలన్నీ ఆత్మశక్తి యొక్క కార్యములని చెప్పాను. మూఢులు ఆ రహస్యాన్ని గ్రహించలేక శక్తికర్మలకు తామే కర్తలమని భావిస్తారు. ఈ విధమైన భావాన్ని అధ్యాసము అంటారు.

అధ్యాసానికి కారణం ఏమిటి? నరుని ఆత్మజ్ఞానాన్ని ప్రకృతి కప్పిపుచ్చటం వలన అధ్యాసం కలుగుతుంది. ఇందువల్ల జీవుడు వాస్తవానికి కర్త, సర్వస్వతంత్రుడు, సాక్షీభూతుడు, కేవలానందాత్మకుడు అయినప్పటికీ పరతంత్రుడనని భావిస్తాడు. ఈ భావన వల్ల సాంసారికత్వం, బంధకత్వం అతనికి కలుగుతున్నాయి. పురుషుని కార్య కారణ కర్తృత్వాలకు ప్రకృతి కారణమని, ప్రకృతియొక్క సుఖదుఃఖ భోక్తృత్వానికి పురుషుడు కారణమని విజ్ఞులు తెలుసుకొంటారు.'

## ప్రకృతి పురుష లక్షణాదులు

దేవహూతి అప్పుడు 'మునీంద్రా! జగత్తులోని స్థూల సూక్ష్మరూప కార్యాలకు ఈశ్వరుడు కారణమని, అతనిని ఆశ్రయించి ప్రకృతి వ్యవహరిస్తున్నదని బోధించావు. ఈశ్వరుని లక్షణం ఏమిటి? ప్రకృతి లక్షణం ఏమిటి?' అని అడిగింది. కపిలుడు ఇలా అన్నాడు.

'అమ్మా! ఏది స్వయంగా నిర్విశేషమయినా సమస్త విశేషాలకూ ఆశ్రయం అవుతున్నదో, ఏది స్వయంగా అవ్యక్తమైనప్పటికీ గుణత్రయాన్ని అధిష్ఠించి కార్యకారణరూపంలో వ్యక్తరూపంలో వ్యక్తమవుతున్నదో, ఏది నిత్యమో – దానిని ప్రకృతి అంటారు. ప్రకృతికి ప్రధానము అనే నామాంతరం కూడా ఉన్నది.

ఈ ప్రకృతి ఇరవైనాలుగు తత్త్వాలుగా ఉంటుందని బ్రహ్మవాదులు చెబుతారు. అవి – ఐదు మహాభూతాలు, గంధాదుల తన్మాత్రలు అయిదు, పది ఇంద్రియాలు, అంతఃకరణవృత్తులు నాలుగు – కలిసి చతుర్వింశతి గణం. ఈ ఇరవైనాల్గింటినీ ప్రకృతితత్త్వాలు అంటారు. పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశం – వీటిని పంచమహాభూతాలు అంటారు. ఈ పంచమహాభూతాలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క లక్షణం ఉన్నది. వాటిని తన్మాత్రలంటారు. త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము – ఇవి పంచజ్ఞానేంద్రియాలు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ – ఇవి

పంచకర్మేంద్రియాలు. ఇవిగాక ప్రతివ్యక్తిలోనూ అంతఃకరణమని ఒకటున్నది. అహంకారము, బుద్ధి, మనస్సు, చిత్తము – అనే నాలుగూ దానికి వృత్తులు. వీటన్నిటినీ కలిపి చతుర్వింశతి తత్త్వాలు అంటారు. ఈ తత్త్వసముచ్చయాన్ని సగుణబ్రహ్మము అంటారు.

కొందరు కాలాన్ని కూడా చేర్చి తత్త్వాలు ఇరవైఅయిదని చెబుతారు. కాలము అన్నది ప్రకృతి యొక్క అవస్థావిశేషమని వారి భావం. ఇది ఈశ్వర ప్రభావమని కొందరు భావిస్తారు. వాస్తవం విచారించితే భగవంతుడే కాలరూపంలో పరిగణింపబడుతున్నాడు. భగవానుడు తత్త్వముల బహిరంతర్భాగాలు రెండింటిలోనూ ఉన్నాడు. ఆ ఉండటం తత్త్వాల అంతర్భాగంలో పురుషరూపాన, బహిర్భాగంలో కాలరూపాన ఉన్నాడు.

భగవానుడు సంకల్పించినపుడు అతనికి శక్తిచలనం కలుగుతుంది. ఆ చలనంతో మొట్టమొదట మహత్తత్త్వం ఉదయిస్తుంది. ఆ మహత్తు జగానికి అంకురకారణం. పూర్వప్రళయంలో జగదంకురమైన ప్రళయకాలికతమం ప్రకృతిలో లయమౌతుంది. ఆ లయంతోనే విశ్వమంతా మహత్తులో లీనమై బీజరూపంలో ఉంటుంది. పునస్సృష్టి కాలంలో మహత్తత్త్వం తన తేజస్సుతో ఆ తమస్సును గ్రసించివేస్తుంది. అప్పుడు మహత్తులో దాగి ఉన్న విశ్వం స్ఫుటగోచర మవుతుంది. దీనినే పునస్సృష్టి అంటారు.

## అంతఃకరణ నైజలక్షణాలు

అమ్మా! మనుష్యులలో అంతఃకరణం ఒకటున్నదని చెప్పాను. అది మహత్తత్త్వాత్మకంగా ఉంటుంది. ఆ అంతఃకరణ సత్త్వగుణంతో కూడి రాగాది రహితమై స్వచ్ఛంగా భగవదుపలబ్ధికి స్థానమై, భగవంతుని ఉపాస్యరూపాలు ప్రతిబింబించటానికి యోగ్యంగా ఉంటుంది. నీటి యందు మాలిన్యాదులు లేనప్పుడు ఆ నీరు తీయగా, తేటగా, చల్లగా ఉండటం ఆ నీటికి నైజలక్షణం అయినట్లు, అంతఃకరణం వృత్తిరహితమై ఉన్నప్పుడు వికారరహితంగా, శాంతంగా ఉండటం దానికి నైజలక్షణం.

## అహంకార లక్షణాలు

అంతఃకరణం రజోగుణం చేత ఉద్రిక్తమైనపుడు ఆ స్థితిని అహంకారం అంటారు.

ఆ అహంకారం మనస్సుకు, ఇంద్రియాలకు, మహాభూతాలకు ఉత్పత్తి హేతువు.

అహంకారానికి వైకారికం, తైజసం, తామసం అని మూడు రూపాలున్నాయి.

అహంకారానికి అధిదేవత అనంతుడు. ఆ అనంతుడు సహస్రశీర్షుడు. అతనికి సంకర్షణుడు అని నామాంతరం.

అహంకారం మనోముఖమైనప్పుడు కర్తృత్వం, ఇంద్రియముఖమైనప్పుడు కరణత్వం, భూతరూపమైనప్పుడు కార్యత్వం కలుగుతాయి. ఈ కర్తృ కరణ కార్యత్వాలు మూడూ అహంకార లక్షణాలవుతాయి.

## వైకారికాదుల విశేషాలు

తల్లీ! అహంకారరూపత్రయంలో వైకారికం వలన మనస్తత్త్వం జన్మిస్తుంది. మనస్సుకు లక్షణం కామవృత్తి. ఈ కామవృత్తి సంకల్ప వికల్పాల రూపంలో వర్తిస్తుంది.

మనస్సుకు అధిదేవత అనిరుద్ధుడు. అతను శరత్కాలంలో వికసించిన నల్లకలువ రంగులో ఉంటాడు. అతని ఆజ్ఞప్రకారం ఇంద్రియదశకం వర్తిల్లుతుంది.

తైజసాహంకారం వలన బుద్ధితత్త్వం ఉదయిస్తుంది. ఈ బుద్ధితత్త్వం ద్రవ్యములయొక్క బాహ్యస్ఫురణ విజ్ఞానానికి కారణం. ఇది అయిదు విధాలుగా వర్తిస్తుంది. వాటిని సంశయం, విపర్యయం, నిశ్చయం, స్మృతి, స్వాపము అని పేర్కొంటారు. వీటికే బుద్ధివృత్తులు, బుద్ధిలక్షణాలు అని కూడా పేర్లున్నాయి.

ఈ తైజసాహంకారశక్తి క్రియాశక్తి, విజ్ఞానశక్తి అని రెండు విధాలు. ఆ రెంటిలో క్రియాశక్తి ప్రాణసంబంధి గాను, విజ్ఞానశక్తి బుద్ధిసంబంధి గాను ఉంటాయి. ఈ రెండు శక్తులు కూడినప్పుడు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు వ్యవహృతిని పొందుతాయి. అందువలన దశేంద్రియాలు తైజసములే అవుతాయి.

తామసాహంకారం వలన శబ్దతన్మాత్ర జనించింది. శబ్దము శ్రోత్రగ్రాహ్యం. శబ్దన్మాత్ర వలన ఆకాశం జనించింది. శబ్దానికి అర్థబోధనం, వ్యవహితవస్తుజ్ఞానం, నభస్తన్మాత్రత్వం అన్నవి లక్షణాలు. భూతాదులకు అవకాశాన్ని (చోటును) కలిగించి బహిరంతర్వ్యవహారాన్ని కూర్చటం, ప్రాణేంద్రియమనస్సులు మూడిటికీ స్థానమై నాడ్యాదులరూపంలో వర్తించటం ఆకాశము యొక్క లక్షణాలు.

ఆకాశం వలన స్పర్శతన్మాత్ర జనించింది. ఈ స్పర్శం త్వక్కు వలన తెలియబడుతుంది. మృదుత్వం, కఠినత్వం, శీతలత్వం, ఉష్ణత్వం అన్నవి వాయుతన్మాత్రత్వ లక్షణాలు.

స్పర్శతన్మాత్ర వలన వాయువు జనించింది. వృక్షశాఖాదులను చలింపజేయటం, తృణాదులను మేళవించటం సంయోగం, ద్రవ్యగంధఘ్రాణం, దూరశబ్దాలను కర్ణములచే గ్రహింపజేయటం సర్వేంద్రియ ధారకత్వం అన్నవి వాయుకర్మములు. వీటిని వాయులక్షణాలని కూడా అంటారు.

వాయువు వలన రూపతన్మాత్ర జన్మించింది. ద్రవ్యములకు ఆకృతిని కూర్చడం, ద్రవ్యోపసర్జనత్వం, ద్రవ్యపరిణామప్రతీతి, తేజస్తన్మాత్రత్వం అన్నవి రూపతన్మాత్ర లక్షణాలు. ఈ రూపము నేత్రగ్రాహ్యం.

రూపతన్మాత్ర వలన తేజస్సు జనించింది. వస్తుప్రకాశనం, తండులాదిపచనం, పానము, భక్షణము, హిమమర్దనం, శోషణం, క్షుత్పిపాసలు – ఇవి తేజోలక్షణాలు.

తేజస్సు వలన రసతన్మాత్ర ఉదయించింది. రసము జిహ్వాగ్రాహ్యం. ఈ రసము ఏకరూపమే అయినా భౌతికద్రవ్యసంసర్గం వలన మధురము (తీపి), ఆమ్లము (పులుపు), లవణము (ఉప్పన), కటుకము (కారం), కషాయము (వగరు), తిక్తము (చేదు) అని ఆరు విధాలుగా ఉన్నది.

రసతన్మాత్ర వలన జలం ఉదయించింది. తడపటం, ముద్దచేయటం, తృప్తికలిగించటం, జీవనం, ఆప్యాయనం, మృదూకరణం, తాపహరణం, ఊరటం – ఇవి జలలక్షణాలు.

జలము వలన గంధతన్మాత్ర జనించింది. ఈ గంధము ఘ్రాణగ్రాహ్యం. ఇది కూడా ఏకరూపమే కాని, అది కలిసే ద్రవ్యాలను బట్టి మిశ్ర గంధం, దుర్గంధం, సురభి గంధం, శాంత గంధం, ఉగ్ర గంధం, ఆమ్ల గంధం అని ఆరు విధాలు.

గంధతన్మాత్ర వలన పృథివి జనించింది. ప్రతిమాదిరూపంలో ఆకాశాన్ని కలిగించటం, జలాదివిలక్షణత్రయాన్ని అపేక్షించకపోవటం, జలాదులకు ఆధారం కావటం, ఆకాశాదులకు అవచ్ఛేదకత్వం, సర్వప్రాణుల గుణాలను ప్రకటించటం – ఇవి పృథ్వీలక్షణాలు.

> ఆకాశానికి శబ్దం గుణమూ, శ్రోత్రం గ్రహణసాధనం అవుతాయి.
>
> వాయువుకు గుణం స్పర్శం. త్వక్కు దానికి గ్రహణసాధనం.
>
> తేజస్సుకు రూపం గుణం. నేత్రములు దానికి గ్రహణసాధనాలు.
>
> జలానికి రసం గుణం. జిహ్వా దానికి గ్రహణసాధనం.
>
> పృథివికి గంధము గుణం. ఘ్రాణం దానికి గ్రహణసాధనం.

ఆకాశాది పూర్వ పూర్వ భూతములకు వాయువు మొదలైన ఉత్తరోత్తర భూతాలతో సంయోగం కలిగినప్పుడు వాయువునందు దాని నైజగుణమైన

స్పర్శంతో ఆకాశగుణమైన శబ్దం కూడినప్పుడు రెండు గుణాలు, తేజస్సుతో ఆకాశవాయువులు కూడినప్పుడు తేజోగుణమైన రూపంతో ఆకాశవాయుగుణాలైన శబ్దస్పర్శాలు కూడి మూడు గుణాలు, అట్లాగే జలమునందు నాలుగు గుణాలు, పృథివియందు అయిదు గుణాలు కనుపిస్తుంటాయి.

## విరాణ్మూర్తి జననం

అమ్మా! భూతములు అయిదని చెప్పాను. వాటితో మహత్తు, అహంకారం కలిపి ఏడవుతాయి. ఈ ఏడూ మొదట ఒకదానితో ఒకటి కలయక ప్రత్యేకించి ఉండసాగాయి. అందువలన ఏదీ ఏర్పడని పరిస్థితి కలిగింది. అప్పుడు జగత్తుకు మూలమైన ఈశ్వరుడు కాలకర్మగుణోపేతుడై వాటిలో ప్రవేశించి వాటికి పరస్పర సంయోగాన్ని కూర్చాడు. తత్ఫలితంగా అచేతనమైన బ్రహ్మాండరూపం ఏర్పడింది. ఆ అండము నుంచి సమష్టిరూపుడైన విరాణ్మూర్తి జన్మించాడు. ఆ అండాన్ని విశేషం అని కూడా పేర్కొంటారు. దానిని జలాదులు చుట్టి ఆవరణలుగా ఉంటాయి. ఆ ఆవరణలు ఒక్కొక్కటీ ఒకదానికంటె ఒకటి పదిరెట్లు పెద్దవి. వీటన్నింటిని చుట్టి ప్రధానం అనబడే మహత్పదార్థం ఆవరణగా ఉంటుంది. ఈ విధంగా లోకవిస్తారమంతా భగవద్రూపమే.

## భగవత్ప్రవేశం

బ్రహ్మాండం లోపల పధ్నాలుగు లోకాలున్నాయి. ఆ బ్రహ్మాండం జలాంతరం నుంచి పైకి వచ్చింది. మహదాది చతుర్ముఖాంత సమష్టిరూపంలో ఉన్న ఆ అండం లోనికి భగవానుడు ప్రవేశించాడు. అప్పుడతనిని అనిరుద్ధుడు అన్నారు. అండంలోనికి ప్రవేశించిన తర్వాత భగవానుడు ప్రవృత్తిముఖుడై సమష్టి రూపంలో ఉన్న ఇంద్రియగణాన్ని విభజించాడు. తత్ఫలంగా సమష్టిరూప చతుర్ముఖ శరీరంలో ఉన్న ఇంద్రియగణం వ్యష్టిరూపాన్ని పొందింది.

## ఇంద్రియగణ వ్యష్టిప్రకారం

తల్లీ! చతుర్ముఖశరీరం నుంచి మొట్టమొదట ముఖం వెలువడింది. అనగా దేవాది వ్యష్టిశరీరుల వ్యష్టిముఖాలు కలిగాయన్నమాట. ఆ ముఖం నుంచి ఆయా శరీరుల వ్యష్టిరూపవాక్కు జన్మించింది. ఆ వాక్కుతో వాగింద్రియానికి అధిష్ఠాతగా వహ్ని ఉదయించింది. అనంతరం నాసికలు జనించాయి. అందులో నుంచి ఘ్రాణము ప్రాణసహితంగా వెలువడింది. ఘ్రాణానికి అధిష్ఠాతయై వాయువు పుట్టింది. తర్వాత నేత్రగోళాలు కలిగాయి. దానినుంచి చక్షురింద్రియం వ్యక్తమయింది. దానికి సూర్యుడు అధిష్ఠాతయై వెలిశాడు. తర్వాత కర్ణములు, దానిలో శ్రోత్రం కలిగాయి. శ్రోత్రాలకు దిక్కులు అధిష్ఠాతలైనాయి. తర్వాత చర్మము, రోమములు, కేశములు జనించాయి. వాటినుంచి తరులతాదులైన ఓషధులు కలిగాయి. అంతట శిశ్నం కలిగింది. దానివెంట రేతస్సు జనించింది. అందులో నుంచి జలం ఉద్భవించింది. తర్వాత గుదము కలిగింది. అందులో నుంచి అపానం వెలువడింది. అపానం నుంచి సర్వలోక సంహర్త అయిన మృత్యువు ఉద్భవించింది. తర్వాత హస్తాలు ఏర్పడ్డాయి. వాటికి ఇంద్రుడు అధిష్ఠాత అయ్యాడు. తర్వాత పాదములు ఏర్పడ్డాయి. అందులో నుంచి గతి వెలిసింది. గతికి ఉపేంద్రుడు అధిష్ఠాత అయ్యాడు. తరువాత నాడులు పుట్టాయి. వాటినుంచి రక్తము కలిగి నదులై పారింది. తర్వాత ఉదరం ఏర్పడి క్షుత్పిపాసలు కలిగాయి. వాటినుంచి సముద్రం ఉద్భవించింది. తర్వాత హృదయం, దానినుంచి మనస్సు, అందుండి చంద్రుడు, అతని నుంచి బుద్ధి, దాని నుంచి బ్రహ్మ జనించారు. బ్రహ్మము నుంచి అహంకారం పుట్టింది. దానికి రుద్రుడు అధిదేవత అయ్యాడు. రుద్రుడు చిత్తరూపాన్ని దాల్చాడు. తర్వాత క్షేత్రజ్ఞుడు పొడచూపాడు.

అలా అధిదేవతలు ఏర్పడి విరాట్పురుషుడు ప్రవృత్తికార్యానికి పూనుకొనేట్లు చేయ సమకట్టారు. అగ్ని వాక్కుతో అతని ముఖాన్ని

ప్రవేశించింది. విరాట్పురుషుడు చలింపలేదు. అప్పుడు వాయువు ఘ్రాణముతో నాసిక లోపలికి ప్రవేశించింది. అప్పటికీ విరాణ్మూర్తి కదలలేదు. సూర్యుడు చక్షుస్సుతో ఆ మూర్తి నేత్రగోళాల లోనికి ప్రవేశించాడు. అప్పుడు కూడా ఫలం కలుగలేదు. అంతట దిక్కులు శ్రోత్రముతో అతని కర్ణములలోనికి ప్రవేశించాయి. అప్పుడూ ఫలం లేకపోయింది. ఆ తర్వాత ఓషధులు రోమముల ద్వారా త్వక్కును, జలములు ఉపస్థేంద్రియం ద్వారా మేఢ్రాన్ని, మృత్యువు పాయ్వింద్రియద్వారాన గుదమును, ఉపేంద్రుడు గతితో పాదాలను, ఇంద్రుడు బలంతో హస్తాలను, నదులు లోహితముతో నాడులను, సముద్రాలు క్షుత్పిపాసలతో ఉదరాన్ని, చంద్రుడు మనస్సుతోను, బ్రహ్మ బుద్ధితోను, రుద్రుడు అహంకారముతోను క్రమంగా ఒక్కొక్కరూ విరాట్పురుషుని హృదయం లోనికి ప్రవేశించి యథాశక్తి ప్రయత్నించారు. అప్పుడు కూడా ఆ అండం ప్రవృత్తిముఖం కాలేదు. అంతట క్షేత్రజ్ఞుడు చిత్తముతో అతని హృదయంలోనికి అవతరించాడు.

అప్పుడు అండం ప్రవృత్తిముఖం అయింది. అది చూసి ప్రాణము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి తమ తమ అశక్తతను గ్రహించి విరక్తి చెందాయి.

> తల్లీ! దీని సారాంశమేమిటంటే, ప్రాణాదులన్నీ జడపదార్థాలు. వాటికి స్వతంత్రశక్తి కలుగదు. అందువల్ల అవి ఏదన్నా చెయ్యాలన్నా స్వతంత్రించి చేయలేవు. కనుక వాటిని నమ్ముకొంటే ప్రయోజనం ఉండదు. అన్నింటికీ కర్త పరమేశ్వరుడు. అతనియందు ఎల్లవేళలా భక్తి నిలిపి అన్యముల యెడ గాఢవిరక్తిని జనింపజేసి చిత్తాన్ని ఏకాగ్రం చేసినపుడు జ్ఞానం ఉదయిస్తుంది. ఆ జ్ఞానపూర్వకంగా క్షేత్రజ్ఞుని చింతించాలి'

అన్నాడు.

## ఆత్మ స్వరూపం

అది విని దేవహూతి, 'మునీంద్రా! జగత్తు ఎలా కలిగిందో, దాని వ్యాపారం ఏమిటో తెలిపాను. భగవదైశ్వర్యాన్ని వివరించి ఆ మహాత్ముడొక్కడే భజనీయుడని సూచించావు. ఆ భగవంతుడు ఆత్మస్వరూపుడని బోధించావు. ఆత్మ ఇంద్రియాతీతం. ఇంద్రియముల చేత ఆత్మను చూడటం శక్యం కాదు. కనులారా చూడనిదానిపై బుద్ధిని ఎలా నిలపాలి? ఎలా అనుసంధానం చేయాలి? ఉపాయాన్ని వివరించు' అని కోరింది.

కపిలుడు దేవహూతి భావాన్ని గ్రహించి, 'తల్లీ! ఆత్మ అనగా జీవుడే కాని వేరు కాదు. కేవలుడుగా ఉన్నప్పుడు ఆత్ముడని, ఉపాధిని ప్రవేశించినప్పుడు జీవుడని, ఏకపదార్థానికే అవస్థాభేదాన్ని బట్టి వేర్వేరు పేర్లు కలుగుతున్నాయి. ఆత్మ ఆ విధంగా ప్రకృతిరూపదేహాదులలో ఉన్నా దానికి ప్రాకృత గుణాలైన ధర్మాలు– దేవత్వమనుష్యత్వాదులు గాని , ఆ దేవత్వాదులకు కారణమైన సత్త్వాది జనిత సుఖదుఃఖాదులు కాని కించిన్మాత్రమూ అంటనేరవు. ఏమంటే ఆత్మ ఎట్టి వికారాన్నీ పొందదు. వికారమంటే పరిణామం. పరిణామమంటే ఒకటి మరొకటిగా మారటం అని భావం. దేవ మనుష్యాది రూపాలు అన్నీ ప్రకృతి పరిణామాలే గాని ఆత్మ పరిణామాలు కావు. ఆత్మ వికారవిధురం కనుక ప్రకృతివికారాలు ఆత్మ సంబంధులు కావు. మరి ఆత్మ అకర్త (కర్తృత్వం లేనిది) కనుక గమనాదులైన బాహ్యసాంసారిక వ్యాపృతులు కూడా దానివి కావు. ఆత్మ నిర్గుణము కనుక సత్త్వాదిగుణాలు దానికి కలుగవు.

ఆత్మపదార్థం నిర్వికార మనటానికి దృష్టాంత మేమంటావా? జలార్కన్యాయమే దృష్టాంతం. సూర్యుని ప్రతిబింబాన్ని నీటిలో చూస్తున్నాము. అలా నీటిలో మనకు కనుపించిన సూర్యుని ప్రతిబింబం సూర్యబింబమే అనుకుంటాము. ఇందుకు కారణం భ్రాంతి. సూర్యుడు నీటిలో ఉండటం కాని, నీటి యొక్క వృద్ధిక్షయాలను బట్టి సూర్యుడు వృద్ధిక్షయాలను పొందటం కాని, నీటిలో కదలికలేర్పడినప్పుడు సూర్యుడు కూడా కదలటం కానీ ఉండవు.

అలాగే జీవాత్ముడు దేవ మనుష్యాది శరీరాలలో ఉన్నప్పటికీ ఆ శరీరాలకు కలిగే వృద్ధిక్షయాలను గాని, ఇతర వికారలను గాని తాను పొందటం లేదు.

అయితే దేహగతమైనప్పుడు ఆత్మకు దేహగుణాలు అంటకపోవటం సాధ్యమేనా? అని అడగవచ్చు. దేశము, కాలము, స్వభావము అని మూడు విప్రకర్షలు ఉన్నాయి. దేశ విప్రకర్షకు జలసూర్యాదులు, స్వభావ విప్రకర్షకు ఆకాశాదులు ఉదాహరణలు. ఈ విప్రకర్షల కారణం వలన జలాంతర్గత సూర్యబింబానికి జలధర్మాన్ని అంటగట్టినట్లు దేహాంతర్గతమైన ఆత్మకు ఆ దేహధర్మాదులు ఆరోపింపబడుతున్నాయి. ఇదంతా భ్రాంతి ఫలమే కాని వాస్తవం కాదు.

## తాదాత్మ్యాధ్యాసం

తల్లీ! ఆత్మ అటువంటిదైతే దానికి దేవ మనుష్యాది దేహయోగం, సాంసారిక ప్రవృత్తులలో కర్తృత్వం, సుఖాద్యనుభవం మొదలైనవి ఎలా కలుగుతున్నాయి? అని శంకింపవచ్చు. దేహాత్మాభిమానం వలన, స్వతంత్రాత్మాభిమానం వల్ల నీవు శంకించిన భ్రాంతులన్నీ కలుగుతున్నాయి. దీనిని తాదాత్మ్యాధ్యాస మంటారు. దీనికి అహంకారం కారణం. అహంకారం ఏమి చేస్తున్నది? అంటే సత్యాన్ని కప్పిపుచ్చుతున్నది. తత్ఫలితంగా కర్తృత్వాభిమానం పైకొంటున్నది. దానితో ప్రకృతి సంగమం కలుగుతున్నది. ఆ సంగమఫలంగా ప్రకృతి సంబంధ ధర్మాధర్మాలకు, రాగద్వేషాది దోషాలకు గురి అవుతూ ఉత్తమ, మధ్యమ, అధమములైన దేవ మనుష్య తిర్యగ్యోనులలో పుట్టి తత్తత్కర్మాధీన సుఖదుఃఖాలను అనుభవించి శాశ్వతసుఖం అంటే ఏమిటో తెలియక సంసారసాగరంలో కొట్టుకొనిపోతున్నారు. జీవుడు ఆ విధంగా ఎందుకు చేయాలి? అని అడుగుతావేమో. జీవుడు మొట్టమొదట ఆనందాత్ముడుగానే ఉన్నాడు. అభిమానం వలన అతనికి ఆనందస్థితి నుంచి పతనం కలిగింది. మళ్ళీ ఎప్పటివలెనే యథాస్థానం చేరి నైజానందాన్ని అనుభవించాలని అతను ప్రాకులాడుతాడు. ఆ సంకల్పం మంచిదే అయినా

అందుకోసం అతను క్షణికములు, దుఃఖాంతములు అయిన విషయాలలో తగులుకొంటాడు. అతని ప్రయత్నాలన్నీ కలలోని ధనప్రాప్తిని పోలి ఉంటాయి. అందువల్ల అతినికి జననమరణరూప సంసృతి ఎన్నటికీ నశించదు.

## సంసార తరణోపాయం

తల్లీ! ఈ సంసారభ్రమణం తీరటానికి మనోనియమం ఒక్కటే పరమసాధనం. మనస్సు నిరంతరం ఆనందార్థమై ప్రాకులాడుతున్నా విషయార్థాలను పట్టుకొని అది ప్రాకులాడుతున్నది. విషయాలు తాత్కాలికానందాన్ని ఇచ్చినా తుదకు దుఃఖకరములే అవుతాయి. ఏమంటావా? విషయాలు అస్థిరాలు. అవి ఇచ్చే ఫలం కూడా అస్థిరమే అవుతుంది. గత్యంతరం ఏమంటావా? మొట్టమొదట 'విషయానందము యొక్క స్వరూపం ఇది' అన్న సంగతిని బుద్ధి చక్కగా గ్రహించాలి.

అప్పుడు విషయముల పట్ల వైరాగ్యం జనిస్తుంది. దానితో శాశ్వతానంద పదార్థాన్ని వెతకటం ప్రారంభమవుతుంది. అట్లా వెతకగా వెతకగా శాశ్వతానందాన్ని ఇచ్చే పదార్థం భగవంతుడు ఒక్కడే అని రూఢిగా తెలిసివస్తుంది. అంతట ఆ ఆనందానుభూతికి కాంక్ష మిక్కుటమై దానిని పొందే ఉత్తమ మార్గాన్ని గురించి విచారం మొదలవుతుంది. అలా విచారింపగా భక్తి ఒక్కటే ఉత్తమ మార్గం అని ఏర్పడుతుంది. అప్పటికి జీవుడు భగవద్భక్తిపరుడై భక్తికి ముఖ్యాంగమైన ధ్యానానికి ఉపక్రమిస్తాడు.

తల్లీ! సంసార భ్రమణనివృత్తికి ఇదే ఉపాయం.

## స్థిర భక్తియోగం

తల్లీ! భక్తి స్థిరం కావాలంటే మార్గం లేకపోలేదు. మనస్సుకు చాంచల్యమన్నది నైజమని చెప్పాను కదా. అట్టి మనశ్చలనాన్ని

మానివేయాలి. అందు యమనియమాది యోగాలు సాధనాలవుతాయి. కనుక వాటిని అభ్యసించాలి. అలా అభ్యసించాలంటే వాటియందు శ్రద్ధ కలగాలి. శ్రద్ధ కలగాలంటే ముందు ఆ యోగాల విషయమై నమ్మకం కుదరాలి. అట్టి విశ్వాసం బలపడటానికి పెద్దల చరిత్రలను, భగవత్కథలను వింటుండాలి. అట్లా వినగా వినగా హృదయం ప్రేమార్ద్రమవుతుంది. దానితోపాటు సత్యము, బ్రహ్మచర్యం, సంగత్యాగం, నిర్వైరం, సర్వభూత సామ్యభావం, మౌనం, వర్ణాశ్రమోచిత స్వధర్మానుష్ఠానం, మితాహారవ్యవహారం, యదృచ్ఛాలాభసంతుష్టి, వివిక్తదేశనివాసం, శాంతి, మైత్రి, కరుణ–వీటన్నిటినీ వ్రతరూపంలో అనుష్ఠించాలి. ఎల్లవేళలా ఆత్మసంతుష్టిని అలవరచుకొని, పుత్ర కళత్ర దేహగేహాదులందు 'నేను, నాది' అనే భావాన్ని వదిలి, 'ప్రకృతి అంటే ఏమిటి?' అని వివేకించి, తత్త్వాన్ని గ్రహించి, సంకల్ప వికల్పాద్యవస్థలు మాని, భగవంతుని తప్ప వేరొక వస్తువును తలపోయని ఏకాగ్రతను సాధించాలి.

## జీవునికి శుద్ధాత్మదర్శనం

తల్లీ! జీవుడు అహంకారము చేత కప్పబడి ఉన్నప్పుడు శుద్ధాత్ముని కనుగొనటం ఎలా సాధ్యమౌతుందని అడిగావు.

మనందరం గగనస్థితుడైన సూర్యుని చూస్తున్నాము. ఎలా చూస్తున్నాము? అని అడిగితే కన్నులతో చూస్తున్నామంటారు. అయితే కన్ను అన్నది జడపదార్థం. అది సాధనం మాత్రమే కాగలదు. ఆ నేత్రానికి దృష్టిశక్తి దానికి అధిష్ఠాత అయిన సూర్యుని వల్లనే కలుగుతున్నది. కనుక గగనస్థితుడైన సూర్యుని చేత అధిష్ఠితమైన కంటితో తద్గగనస్థితుడైన సూర్యుని మనం చూస్తున్నాము. అలాగే అహంకారావచ్ఛిన్నుడైన ఆత్ముని చేతనే పరమాత్ముని కనుగొనాలి. ఆ పరమాత్ముడు అహంకారము చేత కప్పబడి జీవాత్ముడనబడుతున్నాడు. అహంకార కారణం వల్ల ఒక్కడే చూసేవాడుగా, చూడబడేవాడుగా ఏర్పడుతున్నాడు. అహంకారం నశిస్తే ఇద్దరూ ఒకటేనని తెలుస్తుంది. దీనినే ఆత్మసాక్షాత్కారం అంటారు.

## పరమాత్మ

తల్లీ! ఆ పరమాత్మ ఎట్టివాడంటే అతను నిరంతర భాసమానుడై, ప్రధానమునకు అధిష్ఠాత అయిన సర్వకార్యప్రకాశకుడు, సర్వాంతర్యామి, పరిపూర్ణుడు అని గ్రహించాలి. ఆ పరబ్రహ్మము సూక్ష్మాతిసూక్ష్మమై ఉంటుంది కనుక నేత్రాదులైన ఇంద్రియాలకు గోచరం కాదు. అట్టి వస్తువును కనుగొనటం ఎలాగంటే, గగనస్థుడైన సూర్యుడు జలములందు ప్రతిఫలిస్తాడు. ఆ జలాంతర సూర్య ప్రతిబింబం ఇంటి గోడ మీద ప్రతిఫలిస్తుంది. గృహస్థులు మొదట గోడమీద ఉన్న సూర్యుని ప్రతిబింబాన్ని చూసి, అది నీటిలో ఉన్న సూర్యబింబానికి ప్రతిఫలనమని గ్రహించి, ఆ తర్వాత గగనస్థితుడైన సూర్యుని కేసి చూస్తారు. జలమునందు, గోడపైని ప్రతిఫలించిన సూర్యబింబం సూర్యబింబాభాసమే తప్ప అసలు బింబం కాదు. అదే విధంగా అహంకార ప్రకారములైన భూతేంద్రియమనస్సు లనే మూడింటి యందు ప్రతిఫలించిన బ్రహ్మాభాసాన్ని చూసి, దాని మూలంగా పరమాత్మను దర్శింపగలగాలి. 'నేను, నాది' అన్నవి అహంకార లక్షణాలు. 'నేను' అంటే ఏమిటి? అని విచారించితే పరమాత్మ తత్త్వం తెలియటం, అతని దర్శనం కావటం రెండూ సిద్ధిస్తాయి.

సుషుప్తి దశలో భూతసూక్ష్మేంద్రియ మనోబుద్ధ్యాదులు లయాన్ని పొందుతాయి. అంటే వాటికి వ్యవహారం ఉండదన్నమాట. అప్పుడు జీవుడు నిరహంకారుడై ఉంటాడు. అహంకారం ఎప్పుడు వ్యవహరింపదో అప్పుడు జీవునికి తాను కూడా నశించినట్లే అనిపిస్తుంది. ధనవంతుడు తన ధనాన్ని కోల్పోయినపుడు ధనంతో పాటు తాను కూడా నశించినట్లు భావించటం లోకంలో ఉన్నదే. ఇట్టి మిథ్యాభిమానాలకు ప్రకృతి ఒక్కటే కారణం. ఈ ప్రకృతికి అధిష్ఠాతయై కార్యకారణసముదాయాన్ని ప్రకాశింపజేస్తూ పురుషుడుంటాడు. ఈ విషయాన్ని వివేకపూర్వకంగా విచారించితే కాని బోధపడదు. ఆ బోధ ఎప్పుడు స్థిరమవుతుందో అప్పుడు పరమాత్మప్రాప్తి సిద్ధిస్తుంది' అన్నాడు.

## ప్రకృతి పురుష వియోగం

దేవహూతి కపిలుని మాటలను విని, 'మునివర్యా! ప్రకృతి పురుషుల స్వరూపస్థితిని గ్రహించి ప్రకృతి నుంచి పురుషుని వేరు చేసి ఏకస్థుడైనపుడు మోక్షమవుతుందని అన్నావు. మరి ఆ పురుషుడే జీవుడు, అన్నావు. ఈ ప్రకృతి పురుషులు ఒకరి నొకరు విడిచి స్వతంత్రంగా ఉండరు. పురుషుడు లేకపోతే ప్రకృతికి స్వరూపస్థితి కలుగదు. ప్రకృతి లేనినాడు పురుషునికి అభివ్యక్తి కలుగదు. కనుక ప్రకృతి పురుషులు పరస్పరం ఆశ్రయించుకొని ఉండాలి. ఈ ఆశ్రయమూ వాగర్థాల వలె నిత్యమే కాని తాత్కాలికం కాదు. దీనిని బట్టి చూడగా ప్రకృతి పురుషులకు వియోగం కలగటానికి అవకాశం అసలు లేనే లేదని నా అభిప్రాయం. పృథివీ గంధములకు, జల రసాలకు ఉన్న అవినాభావమే ప్రకృతి పురుషుల సంబంధం లోనూ ఉన్నది. అందులో ప్రకృతి అంటే శక్తి. అది గుణమయి అనబడుతున్నది. గుణాలు ప్రకృతి ఉన్నంత కాలం వ్యవహరిస్తుంటాయి. ప్రకృతి పురుషులకు వియోగం సంభవించినప్పుడు ప్రకృతి వ్యవహారం నుంచి పురుషుడు విముక్తిని పొందటం ఎలా సాధ్యమవుతుంది? అతనికి కైవల్యం ఎలా కలుగుతుంది?' అని అడిగింది. కపిలుడు ఇలా అన్నాడు.

## తత్త్వజ్ఞానం – కైవల్యముక్తి

'తల్లీ! ప్రకృతి పురుషుల సంబంధం అని నీవన్నది కేవలం భావమాత్రం. ఆ సంగతి తత్త్వవివేకం వల్ల స్పష్టపడుతుంది. అయితే తత్త్వవివేకం కలిగిన తర్వాత కూడా ఒకవేళ ఆ భావం మారితే ఏమవుతుంది? అప్పుడు మళ్ళీ సంబంధరూప బంధం కలగదా? అని అడగవచ్చు.

జీవులకు సాధనసంపత్తి చాలనప్పుడు మాత్రమే అటువంటి సంబంధం కలిగే అవకాశం ఉన్నది. అందుచేత వారు తగినంత సాధనసంపత్తిని సమకూర్చుకోవాలి.

సాధనసంపత్తి అంటే కర్మముల యందు ఫలాపేక్ష లేకుండటం, వర్ణాశ్రమోచిత ధర్మాలను యథావిధిగా ఆచరించటం- ఇవి ముఖ్యాంగాలు. వీటిని పాటించటం వలన మనశ్శుద్ధి కలుగుతుంది. అట్టి పరిశుద్ధచిత్తంతో నిరంతరం భగవత్కథాశ్రవణం కావించాలి. అలా చేస్తుండగా భక్తి స్థిరపడుతుంది. అప్పుడు ప్రకృతి పురుష తత్త్వవిచారానికి యోగ్యమైన శక్తి కలుగుతుంది. ఆ విచారఫలంగా తత్త్వవివేకం ఉదయిస్తుంది. అట్టి వివేకం ఉదయించినప్పుడు వైరాగ్యం కలుగుతుంది. ఆ వైరాగ్యఫలంగా బుద్ధి క్షణికాంశాలను వదిలి పరమార్థమందు నెలకొంటుంది. దీనిని సమాధి అంటారు.

ఈ సమాధిస్థితి ఫలంగా ప్రకృతి నశించినట్లవుతుంది. పురుషుడప్పుడు కేవలుడు, స్వతంత్రుడు, స్వానందనిష్ఠుడు అవుతాడు. దారువును మథింపగా అందులో అగ్ని పుడుతున్నది. ఆ అగ్ని చేతనే ఆ దారువు దగ్ధమై నశించిపోతున్నది. అలాగే ప్రకృతిని విచారింపగా జ్ఞానం ఉదయమై ఆ జ్ఞానం చేతనే ప్రకృతి దగ్ధప్రాయమవుతున్నది.

ప్రకృతి పురుషులు శక్తిమంతులని చెప్పాను. శక్తియందు దృష్టి ఉన్నంత కాలం శక్తిమంతుడు స్ఫురింపడు. శక్తి మీది దృష్టిని శక్తిమంతుని మీదికి మరల్చినప్పుడు శక్తి బొత్తిగా స్ఫురణకు రాక దగ్ధప్రాయ మవుతుందని తాత్పర్యం.

ఇక బోధ లేని వారి సంగతి ఏమంటావా? బోధ లేనంత కాలం ప్రకృతిదోషమైన బంధం తప్పదు. సాధనసంపత్తి మూలకంగా బోధ కలుగుతున్నది.

బోధవంతునికి ప్రకృతి బంధకారణం కానేరదు. నిద్రిస్తున్నప్పుడు కలలో తల నరకబడినట్లుగా అనిపిస్తుంది. మెలుకువ వచ్చేసరికి అది కేవలం మిథ్య అవుతున్నది కదా.

## సమాధిస్థితికి కాలనిర్ణయం

తల్లీ! ఇట్టి స్థితి కలగటానికి ఎంతకాలం పట్టుతుంది? అని అడిగితే ఇంత కాలమని నిర్ణయించటం సాధ్యం కాదు. ఒకటి మాత్రం చెప్పవచ్చు. కర్మవాసనలన్నీ నశించిన వెంటనే ఈ స్థితి కలగటం మొదలవుతుంది. కర్మవాసనలు నశించటంతో చిత్తశుద్ధి, దాని వెంటనే అధ్యాత్మరతి, దానితో బ్రహ్మలోకపర్యంతం ఉన్న సమస్తమూ అస్థిరమన్న భావం స్థిరం కావటమూ, తత్ఫలంగా వాటిపై విరక్తి కలగటమూ, అంతటితో అతను భగవంతుని వంకకు మరలి భగవంతుని సేవించటమూ, భగవానుడు ప్రసన్నుడై అతనికి జ్ఞానాన్ని ప్రసాదించటమూ, అతను ఆ విధంగా జ్ఞానియై మిథ్యార్థాలను నిరసించి, ధీరుడై, శరీరపతనం వరకు అలాగే ఉండి, ఆ తర్వాత కైవల్యాన్ని పొంది, పునరావృత్తి రహితుడు కావటమూ ఒకదానివెంట ఒకటి సమకూడుతాయి.

కైవల్యపదవి అంటే స్వస్వరూపస్థితి. ఇది ఒక్కొక్కరికి బహుజన్మల అనంతరం కలుగుతుంటుంది. ఒక్కొక్కరికి ఆ జన్మలోనే కలుగుతుంది. ఈ ద్వితీయవర్గంలో చేరినవారు తత్పూర్వం ఎన్నో జన్మలెత్తి పరిపాకచిత్తులై అప్పుడు పొందిన జన్మ కడపటి జన్మవారుగా ఉంటారు.

## యోగభ్రంశ కారణాలు

తల్లీ! ఈ యోగాన్ని ఆశ్రయించి సాగించేటప్పుడు సాధకులకు అణిమాదిసిద్ధులు కొన్ని కలుగుతాయి. అవి మాయాజనిత విశేషములే కాని శాశ్వతాలు, పరమార్థాలు కావు. ఆ మాయకు లోబడినవారు పై మెట్టు ఎక్కలేక నడుమనే భ్రష్టులవుతారు. వారికి పునరావృత్తులు తప్పవు. కనుక ఈ విషయంలో జాగరూకులై మెలగాలి.

యోగభ్రష్టులకు పునర్జన్మ కలిగినప్పుడు పూర్వం ఏ స్థితిలో ఉండగా

భ్రష్టులయ్యారో ఆ స్థితికి తగిన శరీరధారణాదులను పొంది, పునఃప్రయత్నం చేసి సిద్ధిని గడిస్తారు.

## యోగాదర్శం

ఈ యోగమన్నది కామ్యార్థము, కైవల్యార్థము అని రెండు విధాలుగా ఉంటున్నది.

కామ్యార్థులు పునర్జన్మంలో తాము పొందాలనుకున్న అన్ని ఈప్సితార్థాలను పొందుతారు. అంతే కాని వారికి మోక్షం లభించదు.

కైవల్యార్థులు లౌకిక సుఖభోగాల వ్యామోహం లేక ఈప్సితార్థానుసారం యోగవిద్యను అనుష్ఠించి కైవల్యాన్ని పొందుతారు.

మతి ఎంతో గతి అంతేనని పెద్దలు ఊరికే అన్నారా?

## అష్టాంగ యోగం

తల్లీ! సాధనసంపత్తిని అష్టాంగయోగం అంటారు. దీనిని సబీజయోగం, సాలంబనయోగం అని కూడా నిర్వచిస్తారు.

ఈ యోగానికి 1. యమము 2. నియమం 3. ఆసనం. 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణం 7. ధ్యానం 8. నిదిధ్యాసం – అని ఎనిమిది అంగాలు ఉన్నాయి. అందుచేతనే దీనికి అష్టాంగయోగం అని పేరు కలిగింది.

## సాధనక్రియా సప్తకం

ఈ యోగానికి అంతర్భూతంగా వివేకాది సాధనక్రియలు ఏడు ఉన్నాయి. 1. ఫలాభిలాష వదిలిపెట్టడం 2. శక్త్యనుసారం తన ఆశ్రమానికి తగిన ధర్మాలను చేయటం 3. నిషిద్ధవ్యాపారాలను వదలటం 4. దైవం తన ప్రయత్నానికి ఎంత ఇస్తే అంతతో సంతోషించటం 5. ఆత్మవేత్తలను సేవించటం 6. ధర్మార్థకామాల కోసమైనా గ్రామ్యధర్మాలను చేయకపోవటం

7. మోక్షధర్మాల యెడ అనురాగం కలిగి ఉండటం – ఈ ఏడూ సాధనక్రియలు.

## సహకారులు

ఈ యోగానుష్ఠానానికి 1. విజనమై (జనసంచారం లేని) నిరుపద్రవమైన చోట ఉండటం, 2. ఆహారవ్యవహారాలు మితంగా ఉంచుకోవటం – ఇవి రెండూ ఎంతో సహకరిస్తాయి.

## అన్నదోష త్రయం

అన్నానికి జాతిదుష్టం, ఆశ్రయదుష్టం, నిమిత్తదుష్టం – అని మూడు దోషాలు ఉన్నాయి.

గంజాయి, వెల్లుల్లి వీటి స్పర్శ తగిలిన పదార్థం జాతిదుష్ట మనబడుతుంది.

అక్రమంగా ధనార్జన చేసిన చండాల పతితాదుల ద్రవ్యం ఆశ్రయదుష్టం.

వెంట్రుకలు, ఎంగిలి మొదలైనవి కలిసిన అన్నం నిమిత్తదుష్టం.

వీటిని తాకకూడదు.

## మితభోజన విధానం

ఎప్పుడూ కడుపులో సగభాగం మాత్రమే అన్నము మొదలైన భోజ్యపదార్థాలతో నింపించాలి. తక్కిన సగంలో ఒక భాగాన్ని నీటితో పూరించి, మిగిలిన పాతిక భాగం వాయుప్రచారానికై వదిలిపెట్టాలి.

ఇది మితభోజన విధానం.

## వ్యవహార నియతి

ఈ వ్యవహారం మానసికం, వాచికం, కాయికం అని మూడు విధాలు.

మనోవాక్కాయములలో దేనిచేతా పరప్రాణికి నొప్పి కలిగించకుండటం

అహింస అనే నియతి అవుతుంది.

సంకల్పమాత్రాన గాని, వాక్కు చేత గాని, సంజ్ఞ చేత గాని అసత్యాన్ని ఆచరింపకపోవటం సత్యము అన్న నియతి లక్షణం.

అలాగే మనసా వాచా కర్మణా పరుల ధన విషయంలో సత్యవర్తనం కలిగి ఉండటం అస్తేయం అనబడుతుంది.

దేహయాత్రకు ఎంత అవసరమో అంత మాత్రమే సంపాదించి, అందుకు మాత్రమే వినియోగించటం పరిగ్రహనియతి.

జితేంద్రియత్వం, కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతానుష్ఠానం, శుచి, వేదాధ్యయనం, భగవదారాధనం– ఇవి కూడా వ్యవహారనియమాల లోనికే వస్తాయి.

ఇంకా మౌనం, ఆసనజయం, స్థైర్యం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణం, ధ్యానం, సమాధానం, వీటిని కూడా ఆ వర్గంలోనే చేర్చాలి.

ఇటువంటి ఉత్తమోపాయముల చేత మనస్సును ఇంద్రియార్థాల వంకకు ప్రసరింపనీయక నిలిపి, శుభాశయమందు మాత్రమే స్థిరంగా పాదుకొల్పాలి.

## మౌనాదుల లక్షణం

మౌనం అనగానే మాట్లాడకపోవటం మాత్రమే కాదు. మనోవాక్కాయ శక్తులను కేంద్రీకరించి పరమార్థతత్త్వపరిశోధనకు కాలాన్ని వినియోగించటం మౌనము యొక్క పరమోద్దేశం.

## ఆసన జయం

ఆసనజయం అంటే ఒకచోట కూర్చుండినపుడు ఎంతసేపు కూర్చున్నా శరీరానికి శ్రమ కలగకపోవటం.

ఆసనాలు పెక్కు విధాలు. వాటిలో స్వస్తికాసనం మేలు.

**'ఊరు జంఘాంత మాదాయ పాదాగ్రే జానుమధ్యగే**
**యోగినో య దవస్థానం స్వస్తికం త ద్విదు ర్బుధాః'**

అని స్వస్తికాసన లక్షణం.

పరిశుభ్ర ప్రదేశంలో ఎక్కువ ఎత్తు గాని, ఎక్కువ లోతు గాని లేని మధ్య విధమైన పీఠాన్ని అమర్చి, దానిపై దర్భలు పరిచి, వాటిమీద జింక చర్మాన్ని ఉంచి, దానిపైన ఉతికి ఆరవేసిన మంచి వస్త్రాన్ని పరిచి కూర్చోవాలి. స్వస్తికాసనం మొదలైన ఆసనాలను చూసి నేర్చుకొని గురువు పర్యవేక్షణలో అభ్యాసం చేయాలి.

ఈ ఆసన శుద్ధి దేనికంటే యోగాభ్యాసం చేసేటప్పుడు శరీరం నుంచి ఒక విధమైన తేజశ్శక్తి జనిస్తుంది. ఆ శక్తిని భూమి ఆకర్షించకుండా ఉండటానికి ఆకర్షణ ప్రాతికూల్యములైన కాష్ఠరచితపీఠం - దర్భాదులు లేదా మెత్తని వస్త్రం, జంతుచర్మం వంటివాటిని కూర్చొనటానికి వాడాలి. దీనివల్ల తేజశ్శక్తి శరీరంలో నిలిచి క్రమంగా వృద్ధిపొందుతుంది.

## ప్రాణ శోధనం

బాహ్యావాయువును లోపలికి పీల్చుకొనడం పూరకమని, అలా లోపలికి పీల్చిన గాలిని లోపలనే నిలపటం కుంభకమని, లోపలి వాయువును బయటికి వదిలిపెట్టడం రేచకమని యోగశాస్త్రం చెబుతున్నది.

ముక్కు కుడి రంధ్రాన్ని ఇడ అని, ఎడమ రంధ్రాన్ని పింగళ అని అంటారు.

ఒకసారి కుడి రంధ్రం ద్వారా వాయువును పీల్చి ఎడమ రంధ్రం గుండా వాయువును వదలటం, మళ్ళీ ఎడమ రంధ్రం ద్వారా పీల్చి కుడి రంధ్రం గుండా వదలటం - ఇలా కొన్ని ఆవృత్తులను చేయటం ప్రాణశోధనం అనబడుతుంది. యోగసాధకులు దీనిని తప్పనిసరిగా అభ్యసించాలి.

ఇలా చేయటం ఎందుకంటే, రజోగుణ కారణం వలన చిత్తం ఏకాగ్రతను పొందక బాహ్యార్థాల వంకకు ప్రసరిస్తుంటుంది. ఆ రజస్సును అదిమితే గాని చిత్త చాంచల్యం స్తంభించదు. రజస్సును అణచాలంటే ప్రాణబంధనం ఒక్కటే పరమోపాయం.

రజోగుణం ప్రధానంగా కలవారు దీనిని మరీ ముఖ్యంగా నేర్చుకోవాలి. అగ్ని సువర్ణాదిలోహాల లోని మాలిన్యాన్ని తొలగించి ఆ లోహాన్ని శుద్ధిపరిచినట్లుగా ప్రాణవాయువు చిత్త చాంచల్య రూపక మాలిన్యాలను నిర్మూలించి మనస్సును ఏకాగ్రంగా తీర్చిదిద్దుతుంది.

## ప్రాణాయామాది ఫలాలు

ప్రాణాయామం వలన వాత పిత్త శ్లేష్మాది దోషాలు నశిస్తాయి. ప్రత్యాహారం వలన విషయసంసర్గం ఉడిగి పోతుంది. ధారణ యోగం వల్ల పాపాలు నశిస్తాయి. ధ్యానం వలన రాగాదులు నశిస్తాయి.

ధ్యానంలో మనోవృత్తి ఉంటుంది. ఆ వృత్తికి లయవిక్షేపాలు కలుగుతుంటాయి.

మనస్సు నిర్వికల్పమై ఉండటానికి దానికొక ఆలంబన కావాలి. ఆ ఆలంబనను ధ్యేయము అంటారు. మనోవృత్తిని నిరోధించి ధ్యేయమందు నిర్వికల్పంగా నిలపడమే సమాధి.

## ధ్యేయాకారం – సమగ్రధ్యానం

ధ్యానమూర్తిని ఎటువంటివానినిగా భావించి ధ్యానించాలి? అనే సందేహం కలుగుతుంది. నీలోత్పలదళ శ్యామల వర్ణాంగుడు, లసత్పంకజ కింజల్క పీతాంబరధరుడు, శంఖ చక్ర గదాయుతుడు, శ్రీవత్సాంకితవక్షుడు, కౌస్తుభాలంకృతకంధరుడు, మత్తమధుకరధ్వనికలిత వనమాలాదిహార శోభితుడు, కిరీటాంగదనూపుర విరాజితుడు అయి, ప్రసన్నవదనాంభోజంతో,

పద్మపత్రారుణేక్షణాలతో ఒప్పారుతున్న దివ్యమూర్తిని భావించి, అతనిని తన హృదయకమలంలో నిలిపి, ఆ మహనీయుని అనుగ్రహామృత వర్షాన్ని ప్రతీక్షించుతూ ధ్యానించాలి. ఆ లీలా మూర్తిని సర్వాంగసమగ్రంగా ధ్యానిస్తే అది సమగ్రధ్యానం అనబడుతుంది.

## అవయవ ధ్యానం

ఆ లీలా మూర్తిని పాదాదిక్రమంగా ఒక్కొక్క అవయవాన్నే మనస్సులో నిలిపి ధ్యానించటం అవయవధ్యాన మనబడుతుంది. భక్తుడు భగవానుని ఆ విధంగా ధ్యానిస్తూ, ధ్యానకాలంలో తన హృదయాంతరంలో పొంగి పొరలుతున్న ప్రేమరసంతో ఆ మూర్తిని జలకమాడిస్తూ, నిండు విశ్వాసంతో తదేకచిత్తుడై ఉండాలి.

## సమాధి

సమాధి సబీజమని, నిర్బీజమని రెండు రకాలు. ఇందులో సబీజ సమాధిని సాకారమని, నిర్బీజసమాధిని నిరాకారమని అంటారు.

సాకారమునందు మనస్సును నిలపటం సులభం. అదే నిరాకారంపైని మనస్సును నిలపటం దుష్కరం. ఈ రెండింటిలోనూ చిత్తం ఉపరతిని చెందటమే ఫలం.

సబీజసమాధిలో చిత్తోపరతి క్రమక్రమంగా కలుగుతుంది. నిర్బీజసమాధిలో చిత్తోపరతి బహుప్రయత్నపూర్వకం అవుతుంది.

## సమాధి ప్రథమావస్థా లక్షణాలు

భక్తుడు భగవంతుని ధ్యానింపసాగినప్పుడు అతని భావం ప్రేమార్ద్రమవుతుంది. తత్ఫలంగా అతని హృదయం ద్రవీభవిస్తుంది. అపూర్వమైన ఆనందంతో పులకాంకురాలు కలుగుతాయి. అతని కన్నులు

ప్రమోద బాష్పకణాలను వర్షిస్తాయి. నిలువెల్లా గగుర్పొడుస్తుంది. అతని చిత్తవృత్తి భగవంతునితో ఐక్యాన్ని పొంది ఎనలేని పాపవశ్యంలో మునిగిపోతుంది. అతను పరమానందవార్ధిలో ఓలలాడుతాడు. ఇవి సమాధి ప్రథమావస్థా లక్షణాలు.

## బ్రహ్మాకార వృత్తి

తర్వాత అతని మనస్సు ధ్యేయవస్తువు నుంచి తొలగిపోతుంది. అందువల్ల నిర్విషయం అవుతుంది. అప్పుడు మనస్సుకు ఎటువంటి ఆశ్రయమూ కలగదు. ఆశ్రయం లేకపోవడం వలన మనస్సు ఎక్కడా రక్తి లభించక లయమైపోతుంది. అంటే వృత్తిరహితం అవుతుంది. వృత్తిరహితమైనప్పుడు మనస్సు బ్రహ్మాకారంగా పరిణమిస్తుంది.

ఇందుకు నిదర్శనం ఏమిటంటావా? మనస్సే ఇందుకు నిదర్శనం. ఎలాగంటే, అగ్నికి ఆశ్రయం ఉన్నప్పుడు అది ఆ ఆశ్రయరూపాన్ని పొంది పెరుగుతుంది. ఆశ్రయం పోగానే ఆ అగ్ని మహాభూతరూపానికి పరిణమిస్తుంది.

## వృత్తి రాహిత్యం

భక్తునికి మనోవృత్తి ఉన్నప్పుడు ధ్యానించేవాడు, ధ్యానము, ధ్యేయమైన భగవానుడు – ఈ మూడు భావాలు ఉంటాయి.

ఈ మూడింటినీ త్రిపుటి అంటారు. మనోవృత్తి లయించినప్పుడు మనస్సు త్రిపుటీరహితమై బ్రహ్మాకారతను పొంది దాని మహిమమందే నిష్ఠితం అవుతుంది. ఆ స్థితిలో అతనికి సుఖదుఃఖాది ద్వంద్వాలేవీ స్ఫురింపవు.

ఎందుకంటే మనస్సు వృత్తి సహితమైనప్పుడు మాత్రమే ఈ ద్వంద్వాలు గోచరిస్తాయి. వృత్తిరహితస్థితిలో అవి ఉన్నా వాటి ఉనికిని గమనించే తత్త్వం ఉండదు. అందువల్ల అతనికి ఆ ద్వంద్వభావాలు ఉండీ లేనివే అవుతాయి.

## సమాధి - గాఢనిద్ర

సమాధి, గాఢనిద్ర రెండూ ఒకటి కావు. ఈ రెండు అవస్థలలోనూ మనస్సు వృత్తిరహితమై ఉంటుంది గాని సమాధ్యవస్థలో అవిద్య ఉండదు. సుషుప్తిదశలో అవిద్య ఉంటుంది. ఈ రెంటికీ గల భేదం ఇదేనని గ్రహించాలి.

## అవిద్య - అహంకారం

ఈ అవిద్య దేనికి కలుగుతుంది? అంటే, అది అహంకారానికి కలుగుతుంది.

'నేను, నాది' అనే భావం అహంకారం. ఈ అహంకారం యోగాభ్యాసప్రభావం వల్ల నశించిపోతుంది.

అవిద్యకు ఎప్పుడూ ఏదో ఒక ఆశ్రయం ఉండాలి. అహంకారం అటువంటి ఆశ్రయమని చెప్పాను. అహంకారం యోగాభ్యాసఫలంగా నశించినప్పుడు అవిద్య ఆశ్రయం లేనిదవుతుంది. ఆశ్రయం లేని కారణాన అవిద్య నశించినట్లవుతుంది.

## ద్వంద్వములు ఆత్మధర్మములా?

సుఖదుఃఖాదులన్నీ దేహధర్మాలే కాని ఆత్మధర్మాలు కావు. దేహధర్మాలని నిశ్చయంగా ఎలా చెప్పగలవు? అంటే, ఆత్మ అన్నది నిత్యవస్తువు. ధర్మి ఉన్నంత కాలం దాని ధర్మం కూడా నిత్యమే కాక తప్పదు. సుఖదుః ఖాదిద్వంద్వము లంటేనో, అవి వస్తూ పోతూ ఉండేవే తప్ప నిత్యములు కావు. నిత్యమైన ఆత్మకు అవి ధర్మాలయితే అవీ నిత్యాలుగానే ఉండాలి కదా? దీనిని బట్టి ద్వంద్వాలన్నీ నిత్యమైన ఆత్మధర్మాలు కావని స్పష్టమవుతున్నది.

దేహధర్మాలను ఆత్మధర్మాలుగా భావించటానికి కారణం అవిద్య. అవిద్య అంటే అజ్ఞానం. అజ్ఞానం అంటే విపరీతజ్ఞానం. అజ్ఞాన కారణం వలన

దేహమే ఆత్మగా భావింపబడుతున్నది. అటువంటి దేహాత్మబుద్ధి ఉన్నంత కాలం దేహధర్మాలను ఆత్మధర్మాలుగా భావించటం నైజమవుతుంది.

అయితే యోగి సంగతేమిటి? అతను అపరోక్షీకృతమైన ఆత్మతత్త్వం కలవాడు. అతనికి ఆత్మ తప్ప వేరొకటి కలుగదు. ఆత్మ నిత్యం, ద్వంద్వాలు రాకపోకలు గలవి. కనుక యోగి ఎల్లవేళలా ద్వంద్వాలను దేహధర్మాలుగా తృణీకరించి, వాటిని లెక్కచేయక ఆత్మనిష్ఠుడై ఉంటాడు.

యోగికి కూడా దేహ మున్నంత కాలం ఆ దేహభావం అంతో ఇంతో ఉండక తప్పదు కదా? అనవచ్చు. కల్లు తాగినవాడు తన ఒంటిమీద నున్న వస్త్రం దైవవశాన ఉన్నదో ఊడిందో తెలిసికొనలేనట్లుగానే, బ్రహ్మతత్త్వరసాన్ని తాగినవాడు తన శరీరస్థితిని గురించి ఆలోచన చేయడు.

'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం' అన్నారు కనుక, యోగసాధనకు కూడా శరీరం ఆవశ్యకమని, శరీరమే లేనప్పుడు యోగాన్ని సాధించటం ఎలాగని శంకింపవద్దు.

యోగికి శరీరభావం సాధనావస్థలో మాత్రమే ఉంటుంది. సిద్ధావస్థలో ఉండదు.

## జీవన్ముక్తుడు

యోగసిద్ధుని జీవన్ముక్తుడని, స్థితప్రజ్ఞుడని అంటారు.

జీవన్ముక్తునికి స్థితావస్థ, వ్యుత్థితావస్థ అని రెండు అవస్థలు ఉన్నాయి. స్థితావస్థలో ఉన్నవాడు కేవలం ఆత్మనిష్ఠుడై ఉంటాడు కనుక అతనికి దేహాది లోకజ్ఞానం అణుమాత్రమైనా ఉండదు. ఆ అవస్థ నుంచి అతను బహిర్ముఖుడైనప్పుడు వ్యుత్థితుడు అనబడుతున్నాడు. ఆ విధంగా అతను బహిర్ముఖుడైనప్పుడు కూడా అతని చిత్తం స్థితావస్థ లోని వాసనలతో నిండి ఉంటుంది. దేహాదికం అతనికి స్వప్నతుల్యమై భాసిస్తుంది. అందువల్ల అతనిని దేహధర్మాలు చలింపజేయలేవు.

## యోగి - ప్రారబ్ధ కర్మఫలం

దేహం ప్రారబ్ధభోగాయతనం కనుక యోగి కూడా తన కర్మఫలాన్ని భోగింపక తీరదని, అలా భోగించేటప్పుడు అతనికి దేహభావం లేకపోవటం సాధ్యమేనా? అని ప్రశ్నింపవచ్చు.

ప్రారబ్ధాన్ని దేహధారులందరూ భోగించి తీరాలన్న మాట నిజమే. అది నిర్వివాదాంశం. ఆ ఫలం భుక్తమయితే కాని నశింపదు. అయితే ఆ భోగమంతా దేహసంబంధమే కాని ఆత్మసంబంధం కాదు. ఆ భోగం ఎంతకాలం అనుభవించాలో అంత కాలం మాత్రమే ఆ దేహం ఉంటుంది. ప్రారబ్ధకర్మఫలభోగం పూర్ణమైన తర్వాత ఆ దేహం క్షణకాలం కూడా ఉండదు.

స్థితప్రజ్ఞుని దేహం కూడా ఫలభోగపర్యంతం తత్తత్ఫలవిశేషాలను అనుభవిస్తుంది. అయినా అతనికి దేహభావం లేనందున దేహం పడే పాట్లు స్ఫురణకు రావు. అతను ఆత్మలోకంలో ఉండటమే అందుకు కారణం.

## యోగి - పునర్జన్మం

యోగికి పునర్జన్మ కలుగదా? అన్న ప్రశ్నకు సమాధానంగా అసలు పునర్జన్మ ఎందుకు కలుగుతుందో విచారించాలి.

పునర్జన్మకు కారణం కోరిక. కోరిక కలిగినప్పుడు దానికి ఫలం తప్పక కలుగుతుంది. ఆ ఫలాన్ని అనుభవింపక తప్పదు. తత్ఫలానుభవార్థం యోగ్యమైన ఒక శరీరం ఉండాలి. అలా శరీరం కలగటమే పునర్జన్మము అనబడుతుంది.

కోరిక లన్నాక అవి పుత్రాది ప్రాపంచిక సుఖార్థములో లేక పరలోక భోగార్థములో అవుతాయి. యోగికి అటువంటి వాటిపై ఏ వ్యామోహమూ కలగదు. అందువలన అతడు నిష్కాముడై ఉంటాడు.

కామం ఎప్పుడు లేదో అప్పుడు సంగము కూడా ఉండదు. కామసంగాలు రెండూ లేనినాడు పునర్జన్మకు అవకాశం ఏర్పడదు.

## జీవన్ముక్తుని ఆత్మజ్ఞానస్వరూపం

తల్లీ! జీవన్ముక్తుడు ఆత్మవేత్త అని చెప్పాను. అతని ఆత్మజ్ఞానం ఎటువంటిదో చెప్పాలంటే మండుతున్న కొరివిని దృష్టాంతంగా గ్రహించాలి. ఆ కొరివి మండుతున్నప్పుడు అందులో నుంచి పొగ, విస్ఫులింగాలు వెలువడుతుంటాయి. ఆ కొరివి మంటకు, అందులో నుంచి వెలువడే పొగ మొదలైనవాటికీ ఏ విధంగా సంబంధం లేదో, అలాగే పరమాత్మునికి, అతని ఉనికి వలన కానవస్తున్న భూతేంద్రియాదులకు సంబంధం లేదని జీవన్ముక్తుడు త్రికరణశుద్ధిగా భావిస్తాడు. అయితే పరమాత్మ ఉనికిని బట్టి భూతేంద్రియాదులు కానవస్తాయని ఒక వంక చెబుతూ పరమాత్మకు వాటితో సంబంధం లేదనటం ఎలా పొసగుతుందని అంటావేమో? భూతేంద్రియాంతః కరణలకు సోపాధికజీవులకు పరమాత్మ కారణం అయినప్పటికీ, ఆ పరమాత్మ కార్యములైనవాటి కన్నింటికీ పరుడై ఉంటాడని తాత్పర్యం. జీవన్ముక్తుని ఆత్మ జ్ఞానం ఈ విధంగా ఉంటుంది.

## జీవన్ముక్తుడు - కారణకార్యభావం

జీవన్ముక్తుడు కారణ కార్యాలను ఏ విధంగా అనుశీలిస్తాడంటే, చతుర్విధాలుగా ఉన్న సర్వభూతములు కార్యాలని, అవి ఏకము, అద్వితీయము అయిన పరమాత్మ యొక్క విశేషాలే అని తెలుసుకొని, వాటిలో పరమాత్మను, పరమాత్మలో వాటిని అభేదదృష్టితో అనుశీలిస్తాడు.

## ఏకమైన ఆత్మకు నానాత్వం

తల్లీ! ఆత్మ ఏకము, అద్వితీయము అని అంటూనే దానికి నానాత్వం కలుగుతుందనటం ఎలా సరిపోతుందని శంకింపకు. ఈ నానాత్వం ప్రకృతిగుణాల వైషమ్యం వల్ల గుణముల యొక్క ఫలం వల్ల ఏర్పడిన

ఉపాధులకు కలుగుతున్నదే గాని, ఆ ఉపాధులలో ఉన్న ఆత్మకు కలగడం లేదు. కర్రలు పొట్టివీ, పొడుగువీ తెచ్చి నిప్పులో వేసినప్పుడు ఆ కట్టెల నుంచి ప్రకటమైన అగ్నికి భేదం లేకపోయినా కట్టెలకు మాత్రం హ్రస్వదీర్ఘాదిభేదం కనబడుతున్నట్లే పరమాత్మకు ఎటువంటి భేదమూ లేకపోయినా తత్తదుపాధికృత భేదం ఆత్మయందు ఆరోపింపబడుతున్నది. తత్ఫలంగా నానాత్వం గోచరిస్తున్నది.

## ప్రకృతి తత్త్వవిచారం

తల్లీ! ప్రకృతిని మనం అనేక పర్యాయాలు స్మరించాము. ప్రకృతి అంటే, పరమాత్ముని యొక్క శక్తిని ప్రకృతి అంటారు. ఆ శక్తి యొక్క స్వరూపం ఇట్టిదని ఊహించడం కూడా సాధ్యం కాదు. ఆ శక్తి దాని కార్యాలను బట్టి నామరూపాలను పొందుతున్నది. అది కారణ కార్యాత్మికంగా ఉంటుంది.

పరమాత్మ శరీరస్థుడైనప్పుడు అతనిని జీవుడు అంటారు. శక్తి వ్యవహరించేటప్పుడు దాని వ్యవహారఫలం జీవుని కప్పిపుచ్చుతున్నది. అందువల్ల ఇంద్రియాలన్నీ శక్తికార్యములందే తగిలి జీవుని మరిచి వర్తిల్లుతున్నాయి. ఇదే అజ్ఞానజనితమైన భ్రాంతి వలన జరుగుతున్నది. ఈ భ్రాంతినే బంధమని అంటారు.

## భ్రాంతి వినాశం

తల్లీ! ఈ భ్రాంతి పరమేశ్వర ప్రసాదం కలిగితే తప్ప అన్యవిధాల తీరదు. ఆ ప్రసాదఫలంగా జీవుడు ప్రకృతిలీలలను గ్రహించి వాటికి లోబడక అతీతుడై ఉంటాడు. అలా ఉండటం ప్రకృతిజయం అనబడుతుంది.

ప్రకృతిని జయించినవాడు బ్రహ్మాత్వ సంపన్ను డవుతున్నాడు. అంటే, పరమాత్మ ప్రసాదఫలంగా తత్పూర్వం కన్నులను కప్పి ఉంచిన భ్రాంతిరూపమైన అజ్ఞానం నశించిపోతుంది. అజ్ఞానం నశింపగానే స్వతస్సిద్ధమైన జ్ఞానం ఎట్టి ఆవరణమూ లేక యథాస్థితంగా ప్రకాశిస్తుంది.

అప్పుడు సర్వమూ స్వస్వరూపమని బోధపడుతుంది'.

## భక్తి యోగం

విదురా! దేవహూతి కపిలుని మాటలను విని,

'మహాత్మా! సాంఖ్యశాస్త్రం ప్రకారం ప్రకృతి పురుష మహదాదులను పరస్పరవిరోధం లేకుండా వివరించి, వాటియొక్క తత్త్వగ్రహణానికి భక్తియోగం ప్రధానమని చెప్పావు. ఆ భక్తి యోగమార్గాన్ని నాకు విశదీకరించి సులభగ్రాహ్యంగా తెలియజెప్పు. ఒకదానియందు భక్తి కలగాలంటే తక్కినవానియెడ గల అనురాగం నశించాలి. అటువంటి విరక్తి ఎలా కలుగుతుంది?

జీవులందరూ రాగాత్ములై సంసారంలో మునిగి ఉన్నారు. వారి రాగములన్నీ పుణ్యం వలన నశిస్తాయని అంటారు. ఆ పుణ్యాన్ని జీవులు దేనికి భయపడి ఆచరిస్తారు?

భగవానుడు పరాత్పరుడు అన్నారు. కాలమే అతని రూపం అన్నారు. కాలం లక్షణాలు ఏమిటి?

దేహాదులు మిథ్యాభూతములైనా అజ్ఞానవశాన అవి నిజమైనవే అన్న భ్రాంతి జనించటమూ, తత్ఫలంగా అభిమానం పుట్టుకొని రావటమూ, ఆ అభిమాన ప్రేరితమై బుద్ధి పరిపరి విధాల కర్మలను చేయటం, ఆ కర్మల ఫలాన్ని అనుభవించడానికి జీవలోకం జనన మరణ రూపమైన సంసారతిమిరంలో పడి దారి తెలియక ప్రాకులాడటం కనబడుతున్నది. అటువంటి పతిత జీవలోకానికి యోగరూప ప్రకాశాన్ని చూపించి ప్రబోధాన్ని కలిగించడానికే నీవు అవతరించావు. నేను కోరిన విషయాలను తెలిపి ప్రబోధం కావించు'

అని కోరింది. కపిలమహర్షి ఆమె జిజ్ఞాసను చూసి ప్రహృష్టస్వాంతుడై ఇలా అన్నాడు.

## స్వభావము - భక్తియోగం

తల్లీ! జీవులు పూర్వజన్మలలో ఎన్నోకర్మలను చేసి ఉంటారు. ఆ కర్మల యొక్క ఫలాలు వివిధ రూపాలలో వివిధ గతులలో ఉంటాయి. వాటిలో కొన్ని ఒక్కొక్క రాశికి సంబంధించి ఉంటాయి. అలా రాసులు రాసులుగా ఏర్పడిన కర్మఫలాలలో ఒక్కొక్క రాశి కర్మలు ముమ్మందుగా పరిపక్వమై అనుభవయోగ్యాలు అవుతాయి. అప్పుడు ఆ కర్మఫలాలను అనుభవించటానికి తగిన దేహం కలుగుతుంటుంది. అలా ఫలానుభోగానికి యోగ్యమైన కర్మను ప్రారబ్ధకర్మ అంటారు. ప్రతి కర్మకు ఫలోదయంతో పాటు దానికి అనురూపమైన వాసనలు కూడా ఉంటాయి. ప్రారబ్ధకర్మంతో ఆ వాసనలు జీవిని వెన్నంటి ఉంటాయి. ఆ వాసనాసముచ్చయాన్ని స్వభావం అంటారు.

కర్మఫలం మాత్రం భుక్తం కాగానే నశించిపోతుంది. కర్మఫలవాసనలు మిగిలి ఉండి, వాటి సమయం వచ్చినప్పుడు రేగి తద్వాసనానురూపమైన భావాలను కలిగించి, అటువంటి వివిధకర్మలకు ప్రేరేపించి జీవులచే ఆ కర్మలను ఆచరింపజేస్తాయి.

ప్రతి శరీరం లోనూ సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలు భోగ్యఫలానురూపములై నిలిచి ఉంటాయి. స్వభావం ఆ గుణాలను అవి చేయదగిన కార్యాలకు పురికొల్పి, ఆ గుణాల రూపంలో వ్యవహరిస్తుంది.

## అభిప్రాయం

గుణత్రయంలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క విధమైన వృత్తి ఉన్నది. ఆ వృత్తినే అభిప్రాయమంటారు.

ప్రతి వ్యక్తికీ అతని స్వభావ గుణభేదాలను బట్టి అభిప్రాయం ఉంటుంది. అందుచేత ప్రతివ్యక్తికీ స్వభావ గుణభేదాలను బట్టి అభిప్రాయభేదాలు వాటిని బట్టి మానసిక ప్రేమ వివిధ రూపాలలో ఏర్పడుతుంటాయి.

భక్తి కూడా అటువంటి మానసిక ప్రేమే. అందువల్ల భక్తిలోనూ అనేక భేదాలు ఉన్నాయి. గుణత్రయభేదాన్ని బట్టి భక్తి మొదట మూడు

విధాలవుతున్నది. ఆ త్రివిధభక్తి మళ్ళీ సంకల్పభేదాలను బట్టి ఒక్కొక్కటీ మూడు విధాలుగా ఉన్నది.

## నవవిధ భక్తి ప్రకారాలు

తల్లీ! భక్తికి భేదదర్శనం ప్రధానం. దానికి గుణాలు అంగములు; సంకల్పాలు ఉపాంగాలూ అవుతాయి. ఇందువల్ల భక్తి మొత్తం తొమ్మిది విధాలుగా ఉంటున్నది. ఆ విధానం ఎటువంటిదో విను.

## అవాంతర భేదాలు

భక్తి తామసరూపమైనప్పుడు దానికి క్రోధం జీవగఱ్ఱ అవుతున్నది. ఆ క్రోధం హింసాపూర్వకమని, దంభపూర్వకమని, మత్సరపూర్వకమని సంకల్ప భేదాలను బట్టి మొత్తం మూడు విధాలు.

భక్తి రాజసరూపంలో ఉన్నప్పుడు అహంకారం దానికి జీవగఱ్ఱ అవుతుంది. అది విషయవాంఛాపరం, యశఃకాంక్షాపరం, ఐశ్వర్య కాంక్షాపరం అని త్రివిధం.

భక్తి సాత్త్వికరూప మైనప్పుడు పాపక్షయార్థం, పరమేశ్వరప్రీత్యర్థం, శాస్త్రవిధికర్తవ్యతా భావపూర్వకం అని మూడు విధాలు.

ఈ విధంగా భక్తియోగం గుణాలను బట్టి తొలుదొల్త మూడు విధాలై, సంకల్పాలను బట్టి ఒక్కొక్కటీ తిరిగి మూడు విధాలై, మొత్తం మీద తొమ్మిది విధాలుగా ఉన్నది.

ఈ తొమ్మిది విధాలూ శ్రవణ కీర్తనాది భేదాలను బట్టి తిరిగి ఒక్కొక్కటీ తొమ్మిది విధాలవుతుంది.

ఇలా భక్తియోగం చివరికి ఎనభైఒక్క విధాలుగా ఉంటుంది. ఇందులో పూర్వపూర్వానికంటె ఉత్తరోత్తరం ఎక్కువ మేలు.

ఇవన్నీ సగుణ భక్తి ప్రకారాలు.

## నిర్గుణ భక్తి

తల్లీ! నిర్గుణభక్తి లక్షణాలను విను. నిర్గుణభక్తిని పరాభక్తి అని, ఆత్యంతికభక్తి అని పేర్కొంటారు. ఈ భక్తిలో ఫలాపేక్ష గాని, భేదదర్శనం గాని ఉండవు. సర్వగుణాలకూ నేను ఆశ్రయుడను కనుక నా గుణవర్ణనం చెవిసోకినంతనే నిర్గుణభక్తుని మనస్సు నా వంకకు అవిచ్ఛిన్నంగా ప్రసరిస్తుంది.

ఇవి నిర్గుణ భక్తియోగానికి ప్రధానలక్షణాలు.

## భక్తి ఫలభేదాలు

సగుణభక్తులు నా రూపాలను ధ్యేయంగా పెట్టుకొని నన్ను ఆరాధిస్తారు. నిర్గుణభక్తులు నా తత్త్వాన్ని ధ్యేయంగా గ్రహించి ఆరాధిస్తారు.

సగుణభక్తులు వారి వారి భక్తివిశేషాలను బట్టి సాలోక్య సమానైశ్వర్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యాలను కోరి నన్ను భజిస్తారు. నేను వారికి తద్భక్తి యోగ్యమైన సాలోక్యాదులలో ఏదో ఒకటి అనుగ్రహిస్తాను. అంతటితో వారికి తృప్తి కలుగుతుంది.

నిర్గుణభక్తులు ఏదీ కోరరు. సాయుజ్యం ఇద్దామన్నా వద్దంటారు. నన్ను సేవించే భాగ్యం ఒక్కటే వారికి పరమకాంక్షగా ఉంటుంది.

త్రిగుణాలను దాటి బ్రహ్మభావాన్ని పొందాలంటే నిర్గుణభక్తి ఒక్కటే పరమోపాయం.

## నిర్గుణభక్తుని జీవితవిధానం

తల్లీ! నిర్గుణభక్తుని జీవిత విధానం ఎటువంటిదో విను. అతను తన వర్ణాశ్రమాలకు తగిన నిత్య నైమిత్తిక కర్మలను ఫలాభిసంధిరహితంగా, ఇవన్నీ స్వధర్మాలే అన్న సద్భావంతో ఆచరిస్తుంటాడు. అతని పూజావిధానం శ్రద్ధాయుక్తమై, నిష్కామమై ఉండటమే కాదు, అతను గోరంత హింసకు కూడా

ఎడమీయడు. నా ప్రతిమలను దర్శించినా, వాటికి పూజా స్తుతి వందనాదులను చేసినా, అతనికి పండుగగా ఉంటుంది.

అతను సర్వభూతముల యందు భగవద్భావనపరాయణుడై ఉంటాడు. మిన్ను విరిగి మీదపడినా ధైర్యాన్ని వదలడు. అతని వైరాగ్యం వర్ణనాతీతం. మహాత్ముల సేవ, దీనుల యెడ కారుణ్యం, సాటివారి యందు ప్రేమాదరాలు అతనికి నైజగుణాలు. శమము, నియమము, ఆధ్యాత్మికానుశ్రవణం, నామసంకీర్తనం, ఋజువర్తనం, పెద్దల తోడి చెలిమి, వినయం అతనికి నిత్యవ్రతాలు.

## భాగవత ధర్మాలు

తల్లీ! ఈ చెప్పినవన్నీ భాగవత ధర్మాలు. వీటిని అనుష్ఠించటం వలన చిత్తం అహంకారాది మలినరహితమై పరిశుద్ధ మవుతుంది. శుద్ధచిత్తానికి నన్ను గూర్చి శ్రవణమాత్రభాగ్యం కలిగినా వెనువెంటనే నా వంకకు మరలి యోగరతం అవుతుంది. గంధం వాయుప్రేరణ వలన తన స్థానమైన పుష్పాన్ని వదిలి ఘ్రాణేంద్రియాన్ని చేరినట్లు యోగరతమైన చిత్తం అప్రయత్నంగా నన్ను చేరుకొంటుంది.

## ప్రతిమాది పూజాఫలం

తల్లీ! భగవానుడు లేనిచోటు గాని వస్తువు గాని ఉండదు. అందుచేతనే అతనిని భూతాత్ముడు అన్నారు.

ఈ రహస్యం తెలియక భగవానుడు ప్రతిమాది రూపంలో ఉన్నట్లు భావించి అర్చించేవారు కొందరుంటారు. సర్వభూతముల యందు ప్రత్యక్షమై ఉన్న భగవానుని వదిలి ఎక్కడో ప్రతిమలో ఉన్నాడని భావించి అతనిని అర్చించటమంటే బూడిదలో హోమం చేసినట్లే అనుకోవాలి. అన్ని శరీరాలలోనూ భగవంతుడు

అంతర్యామిగా ఉన్నాడని తెలియక కొందరు స్వపరభేదభావాన్ని పాటిస్తారు. వారు ఆ విధంగా చేయడం నన్ను ద్వేషించినట్లే అవుతుంది. అట్టివారు భూతవైరులనబడుతారు. వారికి మనశ్శాంతి ఎన్నడూ ఉండదు. అట్టి భూతనిందకులు ఎంతో శ్రమించి, కొండంత పూజా ద్రవ్యసంభారాన్ని నాకై సేకరించి తెచ్చి సమస్తక్రియా యోగపూర్వకంగా నా ప్రతిమలను అనుదినం పూజిస్తే పూజించనీ, అట్టి పూజ నాకు ఎంతమాత్రం ప్రీతికరం కానేరదు. సర్వభూతవర్తి నైన నేను తనలో ఎలాగో, ఇతర భూతజాతం లోనూ అలాగే ఉన్నానన్న తత్త్వాన్ని గ్రహించేంతవరకే స్వధర్మపరులకు ప్రతిమార్చనం అంగీకారయోగ్య మవుతుంది. భిన్నదర్శనులు నన్నెంత భిన్నభావంతో పూజించినా వారికి మృత్యుభయం తొలగదు.

నా పూజావిధానాలలో సమదర్శనం ఉత్తమోత్తమం. అట్టి పూజను భక్తులందరూ అభ్యసించి నిష్ణాతులు కావాలి.

## సమదర్శి సర్వోత్తముడు

తల్లీ! సృష్టి సమస్తం జడచేతనాత్మకంగా ఉన్నది. జడముల కన్న చేతనములు ఉత్తమమైనవి. చేతనములలో ప్రాణవృత్తి కలిగినవి ఇంకా మేలు. వాటిలో జ్ఞానవంతమైనవి మిన్న. అందులో ఇంద్రియవృత్తిమంతాలైన వృక్షాదులు ఉత్తమాలు. అందులో స్పర్శవేదుల కంటె రసవేదులైన మత్స్యాదులు మేలు. వాటికంటె గంధవేదులైన భ్రమరాదులు మరింత మేలు. అంతకంటె శబ్దవేదులైన సర్పాదులు, వాటికంటె రూపభేదవేదులైన కాకాదులు, వాటికంటె ఉభయతోదంతములైన అశ్వాదులు ఉత్తమము లవుతాయి. మరి పాదములు లేని వాటికంటె పాదములు ఉన్నవి మేలు. బహుపాదము లున్నవాటికంటె నాలుగు పాదాలు కలిగినవి మేలు. వాటికంటె ద్విపాదులైన మనుష్యులు మేలు. వారిలో నాలుగు వర్ణాలవారు

ప్రశస్తులు. వారిలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు. వారిలో వేదజ్ఞులు ఉత్తములు. వేదజ్ఞుల కన్న వేదార్థవేత్తలు శ్రేష్ఠులు. వారి కన్న సంశయవిచ్ఛేదకులైన మీమాంసకులు ఉత్తములు. వారికన్న స్వధర్మానుష్ఠానపరులు అధికులు. వారిలో నిష్కాములు ఉత్తములు.

తల్లీ! ఎవడు తన కర్మములను, వాటి ఫలాలను మాత్రమే కాక తన శరీరాన్ని కూడా నా సేవార్థమై సమర్పించుకొంటాడో అతడు నాకు నిరంతరం అవ్యవహితుడై ఉంటాడు. కనుక అతను సర్వోత్తముడు. అట్టి కర్తృత్వాభిమానరహిత సమదర్శి కంటె అధికుడైన వాడిని ఒక్కడినైనా నేనెరుగను. సర్వోత్తముని కంటె ఉత్తముడెవరో నాకు తెలియదు.

## ఈశ్వరుని రూపం

తల్లీ! భగవానుడు సర్వభూతజాతం లోనూ ఏ రూపంలో ఉంటాడంటే, జీవకళారూపంలో ఉంటాడు. అందుచేత సర్వభూతబహూకరణం భగవంతుని బహూకరించడమే అవుతుంది. ఆ భావంతో సర్వభూతతృప్తిని ఘటించాలి.

## యోగభేద సమన్వయం

తల్లీ! నీవు కోరినట్లే అష్టాంగయోగం, భక్తియోగం రెండింటిని గురించీ చెప్పాను. వాటిలో ఏది మేలని అడగవచ్చు. రెండూ సమానమైనవే. ఆ రెంటిలో దేనిని అనుష్ఠించినా పురుషోత్తమప్రాప్తి సిద్ధిస్తుంది. చలచిత్తులకు అష్టాంగయోగం ఉపకరింపగా నిశ్చలచిత్తులకు భక్తియోగం ఎక్కువ సహకరిస్తుంది.

## కాల స్వరూపం

తల్లీ! ఇక కాలస్వరూపాన్ని విను. కాలం పరబ్రహ్మస్వరూపమని చెప్పబడుతున్నది. కాలప్రభావానికి మేర ఉండదు. అది సర్వభూతాలలో ప్రవేశించి నిఖిలానికీ ఆశ్రయమై ఉంటుంది.

కాలం ఆ విధంగా భూతములలో ఉండి భూతముల చేత భూతములను హరింపజేస్తున్నది. ఆ కాలమే విష్ణువనే పేరిట వెలసి యజ్ఞఫలదాయకం అవుతున్నది.

కాలానికి ప్రియాప్రియాలు, స్వపరభేదం, మరే ఇతర భేదాలు లేవు. అది సమస్తజీవరాశికి అంతకారకమైన మహాశక్తి.

## కాల ప్రభావం

తల్లీ! గాలి వీచటం, సూర్యుడు ఎండ కాయటం, పర్జన్యుడు వర్షించటం, నక్షత్రాలు ప్రకాశించటం, ఓషధులు, లతావనస్పతులు ఆయా ఋతువులలో పుష్పించి ఫలించటం, నదులు ప్రవహించటం, సముద్రం కట్టలు తెగి ప్రవహించకపోవటం, అగ్ని ప్రజ్వరిల్లటం, భూమి దుర్వహమైన పర్వతాల బరువుకు నీట మునగక తేలుతుండటం – ఇవన్నీ కాలభయం చేత తప్ప మరొకటి కాదు. ఆ కాలానికి వెరచి ఆకాశం నిశ్శ్వాసోచ్ఛ్వాసాలకు ఎడమిస్తున్నది. అంతే కాదు. మహత్తత్త్వం కూజా కాలాజ్ఞకు లోబడి అంకురాత్మకమై ఉన్న స్వదేహాన్ని సప్తావరణపరివృతమైన లోకం రూపంలో విస్తరింపజేస్తున్నది. బ్రహ్మాదులు గుణనియంతలై చరాచరాత్మక సమస్తలోకాలనూ తమ అధీనంలో ఉంచుకొంటారు. అంతటి వారు కూడా కాలాజ్ఞకు లోబడి విశ్వాన్ని సృజిస్తుంటారు.

కాలానికి ఆద్యంతాలు లేవు. మేఘాలు వాయువిక్రమం చేత చలిస్తున్నప్పటికీ దాని విక్రమాన్ని తెలిసికొనలేనట్లుగా జనులు కాలానికి వశవర్తులై ఉన్నా దాని ప్రభావాన్ని గుర్తింపలేరు.

తల్లీ! జనులు సుఖంగా ఉండగోరి అందుకోసం నానా వస్తువులను ఎంతో శ్రమకోర్చి సమకూర్చుకొంటారు. ఆ వస్తువులన్నీ కాలప్రభావం చేత క్షణంలో చూస్తూ ఉండగానే నశించిపోతాయి. ఆ నష్టాన్ని చూసుకొని వారు ఎంతగానో శోకిస్తారు. ఎల్ల వస్తువులూ వారికి లభించినట్లే లభించి వారి చేతికి అందరాకుండా మాయమైపోవటంతో అర్థంకాక, ఆ లాభనష్టాలన్నీ

కాలవశమని గ్రహింపలేక అజ్ఞానవశులై వారు ఆ విధంగా శోకార్తు లవుతున్నారు.

## అనిత్యవస్తు భావనా ఫలం

తల్లీ! దేహమన్నది అనిత్యం. అటువంటి దేహానికి భార్యాబిడ్డలు, ఇల్లూ వాకిలి, ధన ధాన్య వాహనాదులు – 'నావి' అనుకొనేవన్నీ పరివారం. దేహమే అనిత్యమైనపుడు దాని పరివారం కూడా అటువంటిదేనని చెప్పనవసరం లేదు.

అయినా జీవులు అనిత్య వస్తువులనే నిత్యాలని భావిస్తున్నారు. ఆ భావన వలని దోషమేమిటంటే భావనలకు కూడా ఫలం తప్పదు. ఆ ఫలాన్ని అనుభవింపకా తీరదు. ఆ అనుభవార్థం జన్మలు కలుగుతాయి.

తల్లీ! భావనలన్నీ జీవులు సుఖార్థమై కోరుకొనేవి. ఆ సుఖం ఎన్ని జన్మలెత్తినా లభించదు. అయితే జీవులు సుఖభావనలను బట్టి ప్రాకులాడటం ఎడారిలో ఎండమావులకోసం పరిగెత్తడం వంటిది. వాస్తవం ఇలా ఉన్నా వారికి విరక్తి ఏ మాత్రం కలగటం లేదు. వారికి నరకం తప్పదు.

## దుర్మతి దుఃఖాలు

తల్లీ! అనిత్యసుఖాలకై పరితపించేవారికి నరకంలో నైనా దేహాభిమానం నశించదు. అందువలన వారు నరకంలో కూడా తమకు కావలసిన ఆహారాది సౌఖ్యాలను చేకూర్చుకొంటున్నారు. మరి ఆ నరకదేహాన్ని త్యజిద్దామన్న ఆలోచన వారికి నరకంలో అయినా రాదు. అటువంటి దురవస్థలో ఉన్న భార్యాపుత్రులను గురించి, గృహపశువిత్తాదులను గురించి, బంధుమిత్రులను గురించి అదే పనిగా ఆలోచిస్తూ, వారికోసం నానా కష్టాలు పడుతూ, జీవుడు తనను తాను కృతార్థునిగా భావిస్తుంటాడు. వారి పోషణను గురించిన చింత నానాటికీ పెరుగుతుంటుంది. వారి పోషణార్థమై తన నిలువెల్లా దహించుకొనిపోతున్నా సహిస్తాడే కాని అతను తన యత్నాన్ని మాత్రం వదలడు. ఈప్సితార్థం మంచి మార్గాన సిద్ధింపకపోతే వాడు

ఘోరపాతకాలకైనా తెగిస్తాడు. ఆ దురాశయుని చిత్తేంద్రియాలన్నీ స్త్రీసంభోగాది రహస్యమాయలకు, బిడ్డల తేనెపలుకులకు వశమై అదే లోకంగా ఉంటాడు. దుఃఖాలు ఎన్ని వచ్చి మీద పడినా వాటికి ప్రతివిధానాలను ఆచరిస్తూ సంసారమే పరమసుఖమని అతను భావిస్తుంటాడు. ధనం లభింపని నాడు అతను ఎంతటి హింసకైనా వెనుదీయడు. అట్లా సంపాదించిన ధనాన్ని తనకై వ్యయింపక పుత్రకళత్రాది పోషణార్థం వినియోగిస్తాడు. ఇక అతని పోషణం సంగతేమిటి? అంటే, పుత్రాదులు తినగా మిగిలిన దానితో కడుపు నింపుకొని జీవిస్తాడు. స్వపోషణ సౌఖ్యం మాటైనా అతనికి జ్ఞాపకం రాదు.

కొన్నాళ్ళకు దుర్బలత్వం కలుగుతుంది. అప్పుడు స్వయంగా కష్టపడి సంపాదించే శక్తి సన్నగిల్లుతుంది. తత్ఫలితంగా జీవిక లోపిస్తుంది. అప్పటికైనా అతను ఊరికే ఉండలేడు కదా! లోభపిశాచానికి వశుడై పడరాని పాట్లు పడి వాంఛితార్థం చిక్కని నాడు పరద్రవ్యాలకు ఆశపడతాడు. అదీ లభించనినాడు కుటుంబాన్ని భరించలేక కృపణుడై చింతాసాగరంలో పడి తల్లడిల్లుతాడు.

అతనికి కుటుంబ భరణ శక్తి ఉడిగిననాడు అతని భార్యాబిడ్డలే అతనిని లెక్క చేయరు. వారి గతి ఎలాగుంటుందంటే, రైతు చేతిలో పడ్డ ముసలి ఎద్దు గతికన్నా హీనంగా ఉంటుంది. అప్పటికన్నా విరక్తి జనిస్తుందా అంటే అదీ లేదు. అతను తను పెంచినవారి పంచన చేరి దయాభిక్ష కోసం ప్రాకులాడుతుంటాడు. అంతలో ముదిమి హెచ్చి వైరూప్యం తారసిల్లి కాటికి కాళ్ళుచాచుకొని కూర్చుంటాడు. అయినా అతడు ఆ ఇంటిని అంటిపెట్టుకొని తొడగగ్రల పడి ఉండి ఇంట్లోవాళ్ళు కుక్కకు పారేసినట్లు వేసిన మెతుకులను గతుకుతుంటాడు. అంతలో రోగాలు వచ్చి మీదపడతాయి. దాని మూలాన ఆకలి చచ్చి, చేష్ట లుడిగి, ఉత్క్రమణకాలం దాపరిస్తుంది. ప్రాణవాయువు చలిస్తుంది. కఫం అడ్డుపడుతుంది. కనుగ్రుడ్లు వెళ్ళుకొని బయటకి వస్తాయి.

ప్రాణసంచారం ఉడుగుతుంది. పొట్ట ఉబ్బరిస్తుంది. గొంతులో గురగురలు పుడతాయి. ఆ లక్షణాలను చూసి బంధుజనాలు ఏడుస్తూ అతనికి చుట్టుకొని, 'నాకేమి చెబుతావు?' అని గుచ్చి గుచ్చి అడుగుతారు. వాడు పాపం బదులు చెబుదామని ప్రయత్నిస్తాడు కానీ నోరు రాదు. అతనికి ఎంతో దుఃఖం కలుగుతుంది. తత్ఫలంగా అతనికి బుద్ధినశిస్తుంది.

## జీవుని యమలోక ప్రయాణక్లేశాలు

తల్లీ! ఆ దుర్మతికి మరణసమయం వచ్చినంతనే ఇద్దరు యమదూతలు వచ్చి అతని యెదుట నిలిచి క్రోధవీక్షణాలను అతనిపై ప్రసరింపజేస్తారు. అతను వారి ఘోరరూపాలను చూసి మహా భయగ్రస్తుడై మూత్రపురీషాలను విసర్జించి ప్రాణలను విడిచిపెడతాడు. అంటే అతని ప్రాణాలు స్థూలశరీరాన్ని వదిలిపెడతాయి. అక్కడి నుంచి ఆ దూతలు అతని ప్రాణాలను యాతనా శరీరం లోనికి జొనిపి పాశాలతో అతని మెడను కట్టి గొడ్డును అదలించినట్లు బెదిరించుతూ ముందుకు తోస్తూ నడిపిస్తారు. నడిచే శక్తి లేకపోయినా అతను వారి బెదిరింపులకు భయకంపితుడై నడవలేక నడుస్తాడు. అతనిని దారిలో కుక్కలు పట్టి పీక్కుతింటాయి. అప్పుడు అతను ఆర్తిని పొంది, అయ్యో! ఎంత పాపం చేసి ఇక్కడికి వచ్చాను, అని తన పూర్వపాపాలను నెమరువేసుకొంటాడు. ఆకలి హెచ్చవుతుంది. దప్పిక మితిమీరుతుంది. ఒక ప్రక్క బీరెండ, మరొక వంక కార్చిచ్చు అతనిని దహిస్తుంటాయి. ఆ రెండిటికీ తోడై పెనుగాలి వీస్తుంది. అతనిని మార్గమధ్యంలో దూతలు మలమల మాడుతున్న ఇసుకపై నడిపిస్తారు. అతను నడవలేక ఓపిక లేక ఆగితే ముళ్ళ కొరడాలతో వీపుపైన వాతలు వేస్తారు. అతను అట్లా పడుతూ లేస్తూ తొంభై తొమ్మిది యోజనాల దూరం రెండు ముహూర్తాలలో నడవవలసి ఉంటుంది. అతనలా నడిచి నడిచి యమలోకాన్ని ప్రవేశిస్తాడు.

## జీవుని యమలోకబాధలు

తల్లీ! దుర్మతి ఆ విధంగా యమలోకాన్ని ప్రవేశించినంతనే అతనిని నిలువెల్లా మండే కొరకంచులతో కాలుస్తారు. ఆకలి అని అతను అన్నప్పుడల్లా అతని చేతనో లేక అన్యుల చేతనో అతని మాంసాన్నే కోయించి రుచి చూపిస్తారు. అతను అయ్యో అని బాధతో కలవరిస్తున్నా చెవిపెట్టక అతని పైకి కుక్కలను గద్దలను ఉసిగొలిపి అతని ప్రేగులను పెరికిస్తారు. పాములతో కరిపిస్తారు. తేళ్ళను తెచ్చి కుట్టిస్తారు. అతనిని ముక్కలు ముక్కలుగా కోసి మృగాలకు వేస్తారు. పర్వతశిఖరాల నుంచి క్రిందికి దొర్లిస్తారు. నీటిలో ముంచి ఊపిరి ఆడకుండా అణిచిపెడతారు. అట్లా అతను పాపం నశించినంత దాకా తామిస్రము, అంధతామిస్రము, రౌరవము మొదలైన నరకాలలో యాతనలను అనుభవించి ప్రక్షీణపాపుడై మళ్ళీ ఇక్కడికి తిరిగి వస్తాడు.

## జీవుని గర్భవాస ప్రవేశం

తల్లీ! దుర్మతి అయిన ఆ జీవుని పూర్వపాపం అంతా నరకానుభవంతో నశించిన తర్వాత అతని సంచితకర్మలలో పరిపక్వమైనదానికి ఫలోదయం అవుతుంది. దానిని అనుభవించేందుకు తగిన శరీరం అవసరమౌతుంది. ఆ శరీరం భోగింపనున్న ప్రారబ్ధకర్మఫలాన్ని బట్టి ఉంటుంది. ఆ ఫలానుభవం కొందరికి మర్త్యదేహంలో కలుగుతుంది. అటువంటివారి క్లేశాలను గురించి చెబుతాను విను.

## పిండోత్పత్తి

ఆ జీవుడు సూక్ష్మాతిసూక్ష్మరూపం దాల్చి వర్షంతో నేలకు వాలి ఆహార పదార్థాల నిచ్చే పైర్లు మొదలైనవాటి వేళ్ళను ఆశ్రయించి చిట్టచివరికి వాటి పండ్లను చేరుకొంటాడు. ఆ పదార్థం పురుషభుక్తమై అతని రేతస్సుగా మారుతుంది. ఆ రేతస్సు స్త్రీగర్భాన్ని చేరి ఒకనాటికి శోణితంతో కలయికను పొందుతుంది.

## మాసక్రమవృద్ధులు

అది అంతట మూడు దినాలలో ఉండగా రూపొందుతుంది. ఆ ఉండ పది దినాలలో రేగుపండంత అవుతుంది. అది క్రమక్రమంగా మాస పిండాకృతిని దాలుస్తుంది. ఆ పిండానికి ఒక నెలకల్లా శిరస్సు, రెండవ నెలకు చేతులు, కాళ్ళు మొదలైన అవయవాలు ఏర్పడతాయి. మూడవ నెలకు గోళ్లు, వెంట్రుకలు, ఎముకలు, చర్మం, లింగ రంధ్రాదులు కలుగుతాయి. నాలుగవ నెలలో సప్తధాతు సంపత్తి సమకూడుతుంది. ఐదవ నెలకు ఆకలిదప్పులు కలుగుతాయి. ఆరవ నెలకు దానిని జరాయువు కప్పుతుంది. అప్పుడది తల్లి గర్భంలో దక్షిణపార్శ్వాన చలిస్తూ తల్లి భుజించే అన్నపానాదులతో ధాతువృద్ధిని పొందుతుంది. అప్పుడు ఆ పిండము యొక్క అంగాలన్నీ అతిసుకుమారంగా ఉండడం వల్ల తల్లి కుక్షిలో ఉన్న క్రిములు క్షుధార్తిని పొందినపుడు ఆ పిండాంగాలను పొడిచి తింటాయి. ఆ బాధ అంతింతని చెప్పరానంత అధికంగా ఉంటుంది. అంతే కాక తల్లి భుజించే పదార్థాల రసాలు కటువులుగా, తీక్షణములుగా, ఉష్ణములుగా, లవణ క్షారాదులుగా ఉండి ఆ పిండశరీరానికి సోకుతాయి. ఆ వేదన పిండానికి దుస్సహమవుతుంది. అది పేగులలోని జరాయువులో చిక్కి శక్తి చాలక కదలలేక తలవాల్చి కుక్షిపై నుంచి పంజరస్థపక్షి వలె వ్యథ పొందుతుంది. ఆ జీవుడలా తన జన్మస్థానమైన విణ్మూత్రగర్తంలో పడి ఉండగా అతనికి దైవవశాన పూర్వస్మృతి కలిగి వేయి జన్మల కర్మలన్నీ స్పష్టంగా తెలిసివస్తాయి. వాటన్నింటినీ జ్ఞాపకం చేసుకొని నిట్టూర్పులను విడిచి బాధపడుతుంటాడు.

ఏడవ నెల మొదలు అతనికి జ్ఞానం ఉదయించి ప్రసూతివాతక్షోభం అర్థమవుతుంది. అతను ఆ బాధకు ఓర్వలేక గడగడ వణుకుతూ సప్తధాతువులు తనకు బంధనాలై ఉన్నందుకు ఎంతో పరితపిస్తూ గర్భవాసక్లేశం తప్పే మార్గం తోచక భగవంతుని స్తుతిస్తాడు.

## గర్భవాస జీవుని భగవత్స్తుతి

ఎవని వలన ఈ జగత్తు సృజింపబడుతున్నదో, ఎవడు ఈ జగద్రక్షణకై నానారూపాలలో అవతరిస్తున్నాడో, ఎవడు నా బోటి దురాత్ములకు తగినట్లుగా గర్భవాసరూపమైన శిక్షా విశేషాన్ని విధిస్తున్నాడో, ఎవని ప్రాపు లభించినంతనే సర్వభయదుఃఖాలు నశిస్తున్నాయో, ఎవడు దేహాకార పరిణత మాయను అండగా గైకొని కర్మావరణబద్ధుని వలె తల్లి గర్భంలో పొడముతున్నప్పటికీ వాస్తవానికి స్వతంత్రుడై ఉంటాడో, ఎవడు దుఃఖాత్మక హృదయగతుడై అఖండబోధ విస్ఫూర్తి వలన చలింపక నిరుపాధికుడు, నిర్వికారుడు అయి వెలుగొందుతున్నాడో, ఆ భగవానునికి నమస్కరిస్తున్నాను.

స్వామీ! ఈ పంచభూత రచిత శరీరంలో ప్రచ్ఛన్నుడనుగా గోచరిస్తానే కాని వాస్తవస్థితిని విచారిస్తే నాకూ, ఈ శరీరానికీ సంబంధం లేదు. నేను ఇంద్రియగుణార్థ చిదాభాసాత్మకుడను. నీవో సర్వజ్ఞుడవు, ప్రకృతి పురుషనియంతవు అయి ఈ శరీరం లోనే అకుంఠితమహిమోన్నతిని కలిగి ఉన్నావు. నీకూ నాకూ గల తారతమ్యం అంత మాత్రమే. ఈ జ్ఞానం కలిగిననాడు బంధాలన్నీ నశిస్తాయని అంటారు.

స్వామీ! నీ మాయకు చిక్కి స్మృతిని కోల్పోయి బహుగుణకర్మనిబంధనమైన సంసారంలో పడి పడరాని పాట్లు పడుతున్నాను. నేను కోల్పోయిన ఆత్మస్మృతి ఒక్క నీ అనుగ్రహం వలన తప్ప వేరొక తీరున నాకు కలుగదు. అందుకోసమే నీకు ఈ విధంగా మొక్కుతున్నాను. ఇలా అంటున్నానంటే అందుకు కారణం ఏమిటంటావా? ఇప్పుడు నాకు త్రైకాలికజ్ఞానం కలగటమే కారణం. అది కలిగినందుకు నిదర్శనమేమిటంటావా?

ఆత్మస్మృతిని కొంత పొంది నీ అనుగ్రహాన్ని కోరుకొనడమే అందుకు నిదర్శనం.

స్వామీ! తేనెయందు మాధుర్యము వలె స్థావర జంగమాలు అన్నింటి లోనూ అనుస్యూతుడవై నీవున్నావు. నీవు సర్వాంతర్యామివి కనుక నా యందు నీవుండి నాకు ఈ జ్ఞానాన్ని ప్రసాదించి, సర్వవిధాలా నాకు నమస్కార్యుడవైనావు. నా విన్నపం చెప్పనా? మల మూత్ర రుధిర గర్తమైన మాతృగర్భం లోనికి వచ్చి పడ్డాను. జఠరాగ్ని నన్ను దహించివేస్తున్నది. ఇక్కడి నుంచి బైటపడే భాగ్యం ఎన్నడో అని నెలలూ రోజులూ లెక్కిస్తున్నాను. ఈ దీనునిపయినీ కృపాదృష్టి సారించు.

పట్టుమని పది నెలలు లేవు, నాకు ఇటువంటి దివ్య జ్ఞానాన్ని ఇచ్చి ఉపకరించావు. ఆ మాట సత్యం. నీవు పరమకరుణాత్మకుడవు. పరోపకృతి నీకు స్వభావసిద్ధం. జీవమాత్రు లెవరూ నీకు ప్రత్యుపకారం చేయగల సమర్థులు కారు. చేదోయిని శిరస్సున కీలించి, నీకు నమస్కరించడం ఒక్కటే జీవులు నీకు చూపగల కృతజ్ఞతాకార్యం.

స్వామీ! శారీరక సుఖదుఃఖాలను పశ్వాది జీవుల వలె మానవజీవులు కూడా అనుభవిస్తుంటారు. అంత మాత్రపు పోలికను చూసి కొందరు పశ్వాదులకు, మానవులకు గల భేదం ఏమిటని ప్రశ్నిస్తారు. పశ్వాది జీవులకు నీవు వివేకాన్ని అనుగ్రహింపవు. మర్త్యజీవులకు ఆ మహాభాగ్యాన్ని కరుణించావు. నీవిచ్చిన ఆ భాగ్యాన్ని నీ సేవలో వినియోగించటం కన్నా మేము నీకని ఏమి చేయగలము? నీవిచ్చిన వివేక భాగ్యాన్ని నేను ఏ విధంగా వినియోగించుకొన్నానో చెప్పనా? ఆ భాగ్యవిశేషం వల్ల శమ దమాది సంపత్తిని పొందగలిగాను. దాని ఫలమేమిటంటే, బహిరంతరము లన్నింటిలోనూ నిండి అహంకారాస్పదుడైన భోక్త వలె కానవచ్చే నిన్ను

అపరోక్షంగా చూచే భాగ్యానికి నోచుకొన్నాను.

స్వామీ! ఈ గర్భవాసం బహుదుఃఖమయమై ఉన్నది. కాని నాకు మాత్రం ఇక్కడినుంచి బైటికి వెళ్ళడం సుతరామూ ఇష్టం లేదు. ఎందుకంటే, ఆ బహిః ప్రదేశం గాఢాంధకూపప్రాయం. అందులోకి కాలుపెట్టగానే నీ మాయ నన్ను ఆవరిస్తుంది. తత్ఫలంగా దేహగేహాదుల యెడ నాకు అహంకార మమకారరూప మిథ్యాభిమానం పెచ్చరిల్లుతుంది. దానికి చిక్కి సంసారబద్ధుడనై కొట్టుమిట్టుకలాడవలసి వస్తుంది. అందుకు వెరచి ఇక్కడే ఉండి ఏ వ్యాకులపాటూ లేకుండా బుద్ధిసాహాయ్యాన్ని పొంది నీ పాదాలను ఆశ్రయించి నానాగర్భవాసరూప దుఃఖాల నుంచి తప్పించుకొని ఆత్మోద్ధరణం కావించుకొంటాను'.

## జీవుని జననం

తల్లీ! గర్భస్థజీవుడు ఆ విధంగా భగవంతుని ప్రార్థిస్తాడు. అంతలో అతనికి నెలలు నిండుతాయి. ప్రసూతివాతం ఉపక్రమించి గర్భం నుంచి అతనిని వెలికి తోస్తుంది. అతను రక్తజరాయువులు చుట్టుముట్టగా మలసంజాత క్రిమి విధంగా తలక్రిందుగా నేలనుబడి ఏడుస్తాడు. అతను నేలబడినంతనే అతనికి గర్భవాసమందలి వివేకం తొలగి విపరీత జ్ఞానం కలుగుతుంది.

## జీవుని శైశవక్లేశాలు

అలాగు పునర్జన్మను పొందిన ఆ జీవుని శైశవభావాలు అన్యులకు తెలియరావు. అందువల్ల శిశువు తలంపు ఒక విధంగాను, శిశుపోషకుల చేతలు మరొక విధంగాను ఉంటాయి. తనకు ఎదురైన ఆ ప్రతికూల వాతావరణాన్ని మార్చుకోలేక ఆ శిశువు గొల్లుమంటుంది. ఏడుస్తోంది కదా అని పక్క వేసి పడుకోబెడతారు. ఆ పడక క్రిమికీటకాలతో బాధాస్పదంగా ఉంటుంది. ఆ పసికూన లేవటానికి, కూర్చోవటానికి, ఒళ్ళు గోక్కోవటానికి

శక్తిలేక ఆ బాధను ఏడుపు రూపంలో వెల్లడి చేస్తుంది. ఆ ఏడ్పుకు కారణం తెలియక తల్లి మొదలైనవారు తమకు తోచిన ఏవో ఉపచారాలను చేయజూస్తారు. బాధ ఒకటీ ఉపచారం మరొకటీ కావటం వల్ల ఆ ఏడ్పు చల్లారదు.

## జీవుని యౌవన క్లేశాలు

ఆ కూనకు కొంత కాలానికి యౌవనం వస్తుంది. దానితో అతనికి కామం ఉద్భవిస్తుంది. ఆ కామం వాంఛితార్థాలను పొందమని అతనిని ప్రేరేపిస్తుంది. ఆ ప్రకారం అతను వివిధకార్యాలకు పూనుకొంటాడు. కోరికలు కొనసాగనప్పుడు అతని మనస్సులో క్రోధం చెలరేగుతుంది. క్రోధం వల్ల కలహాలు, కలహాల వల్ల ఆత్మనాశనం సంభవిస్తాయి. దేహం పంచభూతాత్మకమైనదని, దేహానికీ దానిలో ఉన్న ఆత్మకూ ఎటువంటి సంబంధమూ లేదని తెలియక, కామ కారణం వల్ల దేహమే ఆత్మ అని, దేహార్థములన్నీ ఆత్మార్థములే అని, అజ్ఞానవశుడైన నరుడు రూఢిగా నమ్ముతున్నాడు. అందువల్ల కలిగిన కుత్సితభావమే అతనిని సర్వకర్మలకూ ప్రేరేపిస్తున్నది. అట్లా అతను కర్మ బద్ధుడై అవిద్యా కర్మబంధన రూప సంసారంలో తగులుకొంటాడు.

సంసారమన్నాక దాని వల్ల కలిగే క్లేశాలను అనుభవింపక తీరదు.

కామములన్నీ శుభములు, దుష్టములు అని రెండు విధాలు. దుష్టకామతృప్తికై శ్రమించేవారికి పూర్వం కలిగినట్లే నరకప్రాప్తి మొదలైనవి మళ్ళీ తప్పవు.

## సాహచర్య ఫలం

తల్లీ! మోక్షమనగానే అది శుభంకరమని, మోక్షం కలగాలనే కాంక్ష కూడా ఒక కామమేనని, అట్టి కామము దుష్టఫలదాయకం కావటానికి కారణం ఏమిటని సందేహం కలుగవచ్చు.

కామము అంటే కోరిక. ఆ కోరిక దానికి కలిగే సాహచర్యాన్ని బట్టి శుభాశుభఫలాలను ప్రసాదిస్తున్నది.

ఎలాగంటే – సత్యము, శౌచము, దయ, మౌనము, శ్రీ, హ్రీ, కీర్తి, క్షమ, శమదమైశ్వర్యాదులు ఆత్మను ఉద్ధరిస్తాయి. వీటితో సాహచర్యం గల కామం శుభఫలాన్ని ఇస్తుంది.

ఆ కామమే అసత్యాది దుష్టసాహచర్యాన్ని పొందినప్పుడు విపరీతఫలాన్ని కలిగిస్తున్నది. సాంగత్యబలం ఎంత గట్టిదో చూడు.

## స్త్రీసంగ క్లేశాలు

దేహాత్మబుద్ధికలవారు దుష్టులవుతారు. వారికి శాంతి ఎంత మాత్రం కలగదు. హితాహితజ్ఞానం అసలే ఉండదు.

స్త్రీలందరూ నైజగుణం చేత సాధారణంగా ఈ కోవలోనికే వస్తారు. జీవితమంతా క్రీడా మృగప్రాయలై వర్తిస్తారు. వారితో సంగమం వారిని అధోగతికి దిగజార్చుతుందే కాని ఉద్ధరింపదు. అందువల్ల స్త్రీసంగమాన్ని సర్వథా విడిచివేయాలి.

స్త్రీ సంసర్గాన్ని మాత్రమే కాదు, స్త్రీ సంసర్గం కలిగినవారిని కూడా వర్జించాలి. ఎందుకంటే వారి సంసర్గం వలన కలిగేటంతటి మోహసంబంధం వేరే ఏ సంసర్గం చేతనూ కలుగబోదు.

చూడు. సర్వసృష్టికి కర్త బ్రహ్మదేవుడు. అందువల్ల జీవకోటి అంతా బ్రహ్మకు బిడ్డలవుతారు. ఆ బ్రహ్మ సరస్వతిని సృజించాడు. ఆమె గొప్ప రూప లావణ్య విలాసవతిగా రూపొందింది. బ్రహ్మ ఆ విలాసాలకు విమోహితుడై తాను కన్న కూతురినే కామించాడు. ఆమె అతని బారినుంచి తప్పించుకోవాలని మృగరూపాన్ని దాల్చింది. బ్రహ్మ కూడా సిగ్గుమాలి మృగరూపాన్ని ధరించి ఆ లేడి వెంటపడ్డాడు. సృష్టికర్త అయిన బ్రహ్మ గతే ఇట్లా ఉండగా అతను సృష్టించినవారి సంగతి వేరే చెప్పాలా? కాముని బారికి

చిక్కనివారు లేరా? అని అడుగుతావేమో. ఒక్క నారాయణ ఋషి తప్ప తక్కిన వారందరూ కొంతకు కొంత మతిభ్రంశం పొందినవారే కాని పొందనివారు లేరు సుమా!

## స్త్రీ సంసర్గం

తల్లీ! భగవన్మాయాబలం స్త్రీమయమై వర్తిల్లుతున్నది. ఎలాగంటావా? స్త్రీలు కనుబొమ్మ కదిలించినంత మాత్రాన దిగ్దేవతలను కూడా తమ పాదాక్రాంతులను చేసుకోగలరు. స్త్రీల సంగమం నరకద్వారమవుతుంది. అందులో నుంచి తప్పించుకొని మనిషిగా మనడం ఎలాగంటావా? భగవంతుని సేవించి ఆత్మబోధను కలిగి యోగరూఢులు కావడం ఒక్కటే మార్గం.

దేవమాయ స్త్రీ రూపంలో తనను చేరవస్తుంది. అలా వచ్చినది కసువు కప్పిన బావి అని, అది మృత్యువని గ్రహించాలి. ఎవరికి జన్మాంతంలో స్త్రీ సంసర్గాభిలాష మెండుగా ఉంటుందో వారు మరు జన్మలో స్త్రీలై పుడుతున్నారు. అట్లా జన్మించిన స్త్రీలు కామోద్రేకానికి చిక్కి తమ యెదుట పురుషరూపంలో ఉన్న మాయను మోహించి, ఇల్లూ వాకిలీ, పిల్లా పీచూ, ధనధాన్యాది సంస్థితిని కోరి పత్నీత్వాన్ని పొందుతున్నారు. వారి హొయలకు చిక్కిన పురుషులు బోయవాడి పాటకు పరవశించి, వాడి వలలో పడ్డ జంతువు గతిని పొందుతారు.

ఆ విధంగా స్త్రీ సంసర్గానికి లొంగి వాళ్ళు తాము చేసిన కర్మల ఫలాన్ని అనుభవించడానికి తత్తదనురూపమైన లింగశరీరాన్ని ధరించి ఒక లోకం నుంచి వేరొక లోకానికి పోతూ, మళ్ళీ కర్మలను ఆచరిస్తూ ఆ ఫలానుభవార్థం లోకలోకాలలో పుడుతూ గిడుతూ ఒకనాటికీ తెంపు లేక తిరుగుతుంటారు.

## జనన మరణాలంటే ఏమిటి?

తల్లీ! స్థూలశరీరం భూతేంద్రియమనోమయం. ఆ శరీరంతో కర్మఫలాలు

అనుభవింపబడుతున్నాయి.

ఆ శరీరం లోపల లింగశరీరం ఉన్నది. అది జీవునికి ఉపాధి అవుతుంది.

కర్మఫలం భుక్తమై నశించిపోతుంది. అప్పుడు జీవుడు స్థూలశరీరాన్ని త్యజించి లింగశరీరంతో వెలువడుతున్నాడు.

స్థూలశరీర లింగశరీరాల పరస్పర వియోగం మరణ మనబడుతుంది. సంచిత కర్మలో పరిపక్వమైన దానిని భోగించటానికి తదనుకూలమైన స్థూలశరీరం లోనికి జీవుడు మళ్ళీ లింగశరీరంతో ప్రవేశిస్తాడు. ఆ రెండింటి కలయికను జన్మము అంటారు.

## జీవునికి జనన మరణ రాహిత్యం

జీవునికి కూడా జననమరణాలు ఉన్నాయని కొందరంటారు. అది అజ్ఞాన ఫలమే కాని సత్యం కాదు.

జీవుడు అంటే ద్రష్ట మాత్రమే అని చెప్పాను. అతని దృష్టికి మాయాదోషం అడ్డు కలిగిస్తుంది. అప్పుడతనికి దేహాత్మాభిమానం జనిస్తుంది. అదే అతనికి మరణంతో సమానం.

అంతే కాని జీవునికి జననమరణాలు కలగవు. కనుక మరణం కలుగుతుందని భయపడి విహ్వలతను పొందటం, జీవనార్థమై సంభ్రమదైన్యాలను చెందటం రెండూ అనవసరమే.

భోగ్యకర్మమే జీవుని జీవనవిధానాన్ని ముందుగా సమకూర్చుతున్నది. ఎంత శ్రమించినా అంతకు మించి ఎక్కువ గాని, తక్కువ గాని గోరంత కూడా ఫలితం ఉండదు. ఎవడు యోగాన్ని అభ్యసించి విరాగియై బుద్ధినైర్మల్యాన్ని పొంది సమదర్శి అవుతాడో అతనికి జీవగతి కరతలామలకం. అతనికి శరీరాసక్తి గాని, మాయా కార్యములయందు అభిరతి గాని ఉండవు.

అతనినే ధీరుడు అని అంటారు. అతనెప్పుడూ ముక్తసంగుడై ఉంటాడు.

## కర్మ చతుష్కం

తల్లీ! కర్మములు 1. నిత్యములు 2. నైమిత్తికములు 3. కామ్యములు 4. నిషిద్ధములు అని నాలుగు విధాలు.

నిత్య నైమిత్తికాల వల్ల తాత్కాలికఫలోదయం మాత్రమే కలుగుతుంది. తక్కినవి ఉచ్చ నీచ జన్మలకు కారణమవుతాయి.

నిషిద్ధకర్మలను ఎవరూ ఎన్నడూ చేయకూడదు. కర్మతత్త్వరహస్యమంతా కామ్యవర్గంలో ఇమిడి ఉన్నది.

## సకామ నిష్కామ కర్మలు

తల్లీ! కర్మము ఒకటే అయినా బుద్ధితత్త్వాన్ని బట్టి రెండు ఫలాలను ఇస్తున్నది.

ఫలాభిసంధి పూర్వకమైన బుద్ధితో చేయబడే కర్మ కామ్యకర్మ మనబడుతుంది. ఫలాభిసంధి లేని బుద్ధితో చేయబడే కర్మ నిష్కామ కర్మ మనబడుతుంది.

సకామంగా చేసినా నిష్కామంగా చేసిన కర్మకు ఫలోదయం తప్పదు.

సకామకర్మఫలాన్ని కర్త అనుభవించి తీరాలి. నిష్కామకర్మఫలాన్ని కర్త కోరలేదు కనుక దానిని అతను అనుభవించటం కాని, దానికోసం జన్మమెత్తడం గాని తేవనే చెప్పాలి.

అయితే ఆ ఫలం ఏమవుతుంది? అంటే, పరోపకార్థమై ఆ విధంగా భగవదర్పితం అవుతుంది.

## కామ్యకర్మ ఫలగతులు

కామ్యకర్మి కామవశుడై ఆ ఫలభోగార్థం గృహస్థాశ్రమాన్ని స్వీకరిస్తున్నాడు. అతని బుద్ధి ఆ ఆశ్రమధర్మాలలో తగులుకొంటుంది. అందువల్ల అతనికి భగవదారాధన రూప ధర్మాలు రుచింపవు. ఒక వేళ

కొంతకు కొంత రుచించినా దానిని పాటించడానికి తగినంత మానసిక నైర్మల్యానికి అవకాశం ఉండదు.

సకామి అయినవాడు శాస్త్రవిహిత క్రతుకర్మలను శ్రద్ధతో ఆచరించి, దేవ పితృ దేవతలను పూజించి, యజ్ఞం చేసి సోమపానాదులను కావించినప్పుడు ఏమవుతుంది? అంటే, అవన్నీ పుణ్యకర్మలే అయినా సకామములు కనుక అతనికి చంద్రలోకప్రాప్తి కలుగుతుంది. అతనక్కడ తన పుణ్యానికి తగినట్లుగా భోగాలను అనుభవిస్తాడు. ఆ పుణ్యమంతా భుక్తమై నశించిన తర్వాత అతను మళ్ళీ జన్మింపవలసి ఉంటుంది.

## పుణ్యలోకాల కాలం

తల్లీ! పుణ్యలోకాలు నిత్యములు కావు. వాటికి లయం ఎప్పుడంటావా? భగవానుడు నారాయణుడు తనయొక్క దివసావసానంలో శేషపర్యంకం పైని శయనిస్తాడు. అట్లా శయనించటం దైనందిన ప్రళయం అనబడుతుంది. ఆ ప్రళయం తోనే పుణ్యలోకాలన్నీ లయమవుతున్నాయి. అందువల్ల పుణ్యలోకాలకు నిత్యత్వం కలుగనేరదని ఫలితార్థం.

## నిష్కామ కర్మ గతులు

తల్లీ! గృహస్థులలో కూడా తమ ధర్మాలను నిష్కామబుద్ధితో నిర్వర్తించేవారు ఉన్నారు. వారి కర్మఫలం భగవదర్పితం కావటం వలన వారికి చిత్తశుద్ధిని భగవానుడు ప్రసాదిస్తాడు. శుద్ధచిత్తులు చేసే ప్రవృత్తిధర్మాలన్నీ నివృత్తిధర్మనియతితో ఉంటాయి. ఫలితంగా వారికి అహంకార మమకారాలు నశిస్తాయి. ఎట్టకేలకు వారికి ప్రశాంతి చేకూరుతుంది.

ఆ స్థితిలో వారి ప్రాణాలు ఉత్క్రమించినప్పుడు వారి జీవులు సూర్యమండలమార్గాన్ని అనుసరించి విశ్వతోముఖుడు, జగదుపాదాన నిమిత్తకారణుడు అయిన పరమపురుషుని చేరుకొంటారు.

## హిరణ్యగర్భోపాసన ఫలం

కొందరు హిరణ్యగర్భుని ఉపాస్యదైవతంగా నిలిపి ఆరాధిస్తారు. అలా ఉపాసించేటప్పుడు హిరణ్యగర్భుని పరమేశ్వరభావంతో ఉపాసించితే వారికి క్రమముక్తి కలుగుతుంది.

## సద్యోముక్తి

తల్లీ! ఉపాసకుల భావాన్ని బట్టి క్రమముక్తి కలగటమో, సద్యోముక్తి కలగటమో సిద్ధిస్తుంది.

కేవలం పరమునందే చిత్తమును కూర్చినవారు ఆ పరస్థానాన్ని చూరగొంటారు. అంతకంటె పై మెట్టు లేనందున, అదే పరాత్పరం కనుక, దానిని పొందినవారిని సద్యోముక్తులు అంటారు.

## క్రమముక్తి

ఆ విధంగా కాక పరస్థాన విభూతులను ఉపాసించిన వారు మొదట ఆ విభూతుల స్థానాన్ని చేరి, వారితో కలిసి ఎట్టకేలకు పరమపదాన్ని చేరుకొంటారు. అందువల్ల వారి ముక్తిని క్రమముక్తి అంటారు.

## బ్రహ్మాండోపసంహారం

తల్లీ! హిరణ్యగర్భునికి కూడా ఆయుఃపరిమాణం ఉన్నది. అది ద్విపరార్ధపర్యాప్తం. ఆ రెండు పదార్థాలు కలిసి మనుష్యమానంలో 15,55,20,00,00,00,000 సంవత్సరాలు. ఆ కాలం సమాప్తమైనంతనే హిరణ్యగర్భుడు బ్రహ్మాండాన్ని ఉపసంహరించి పరమేశ్వరుని చేరుకొంటాడు.

బ్రహ్మాండం పంచమహాభూత పంచతన్మాత్ర దశేంద్రియ మనోహంకారాదులనే తత్త్వాలతో కూడుకొని ఉంటుంది. ఆ తత్త్వాలు కేవల సూక్ష్మావస్థను దాల్చటం బ్రహ్మాండోపసంహారం అనబడుతుంది.

## పరమపదం

హిరణ్యగర్భోపాసకులు తమ అవసానమైనాక బ్రహ్మలోకాన్ని చేరుకొంటారు. వారి అభిమానం పూర్తిగా నశించి ఉంటుంది కనుక వారికి పునరావృత్తికి అవకాశం కలుగదు. వారు బ్రహ్మలోకం లోనే ఉండి, బ్రహ్మకు అవసానకాలం వచ్చినప్పుడు అతని వెంట పరమపదాన్ని ప్రవేశిస్తారు.

హిరణ్యగర్భోపాసనం మహోత్తమమైనదిగా ఉన్నప్పటికీ అందులో కొంత భేదదృష్టి ఉన్నది. అందువల్ల తదుపాసకులకు కాలాంతరంలో క్రమముక్తి కలుగుతున్నది.

భగవంతుని అభేదదృష్టితో ఉపాసించినవారు వెంటనే భగవత్పదాన్ని చేరుకోగలరు. వారు బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ ముక్తికోసం వేచి ఉండటం సంభవింపదు.

భగవానుడు సర్వభూతహృదయస్థుడై ఉన్నాడు. ఉత్తమపదాన్ని కోరిన నీవు అతనిని అభేదదృష్టితో భజించాలి.

## సనత్కుమారాదుల సంగతి

తల్లీ! సనత్కుమారాదుల సంగతి మాత్రం ఇందుకు పూర్తిగా భిన్నం. వారు నిష్కాములు. వారు పరమేశ్వరుని యొక్క ఐశ్వర్యాన్ని అనుభవించి, ప్రళయాంతంలో సగుణ పరబ్రహ్మన్ని పొంది, అనంతరం కల్పప్రవర్తనార్థమై పూర్వం వలెనే మళ్ళీ జన్మిస్తారు. వారి పదవులన్నీ కేవలం అధికారిక పదవులే కనుక వారి జన్మలు కర్మఫలంగా కలిగినవి కావు.

## పితృలోకగమనం

కొందరు నిత్య నైమిత్తిక కామ్యకర్మను, పితృపూజలను శ్రద్ధాభక్తులతో చేస్తారు. అయినా వారి దృష్టి రజోగుణాత్మకం కావటం వల్ల ధర్మార్థకామములందే నిలిచి ఉంటుంది. వారికి గ్రామ్యవిషయాలు

రుచించినట్లుగా దివ్యామృతప్రాయములైన భగవత్కథలు రుచింపవు. వారు సూర్యునికి దక్షిణంగా ఉన్న మార్గాన్ని బట్టి పితృలోకానికి వెళ్ళి అక్కడ వారి కర్మాధీనభోగాలను అనుభవించి, తమ పుణ్యఫలం అంతం కాగానే వచ్చి పుత్రపౌత్రాది రూప బహుజన్మలను పొందుతారు.

## భేదాభేద దర్శనం

తల్లీ! సృష్టిలోని పదార్థాలలో నిరుపయోగమైనది ఒక్కటీ లేదు. అవి దేశకాల పాత్రములను బట్టి రకరకాలుగా ఉపకరిస్తుంటాయి. పరమార్థదృష్టికి అవన్నీ సమానములే అవుతాయి.

పదార్థాలన్నీ ఆ విధంగా సర్వసమమై ఉన్నప్పటికీ ఇంద్రియవృత్తుల వల్ల వాటిలో ప్రియము, అప్రియము అన్న భేదభావం ఏర్పడుతున్నది. ఆ వైషమ్యభావం చిత్తాన్ని ఆక్రమించినప్పుడు హేయమైన ఉపాదేయాలు సంభవిస్తాయి.

అయితే సమదర్శనులు, నిస్సంగులు అయినవారి చిత్తం భేదదర్శనం వల్ల కలిగే వైషమ్యభావాలకు అతీతంగా ఉంటుంది.

సమదర్శనం అంటే సర్వం భగవదాత్మకమే అన్న అభేదదృష్టి. సమదర్శనులకు ఉపాధిభేదమైనా కానరాదా? అని శంక కలగవచ్చు. ఉపాధులు వివిధములై ఉంటాయి. అయినా వారి దృష్టి ఆ ఉపాధులను పాటించదు. వారి దృష్టి ఆ ఉపాధులలో ఉన్న తత్త్వమునందే లీనమై ఉంటుంది. ఆ తత్త్వం ఏకము, నిర్వికల్పమూ కనుక వారికి భేదదృష్టికి అవకాశమే ఉండదు. వారు సర్వవేళలా ఆ ఆత్మనే పర్యాలోకిస్తూ పరమానందపదారూఢులై ఉంటారు.

## ఏకమైన ఆత్మకు నానాత్వ ప్రతీతి

తల్లీ! ఆ ఆత్మ జ్ఞానమాత్రస్వరూపమై తేజరిల్లుతుంటుంది. ఆ స్వరూపాన్ని పరమాత్మ అని, పరబ్రహ్మమని, పురుషుడని, ఈశ్వరుడని పేర్కొంటారు.

ఏకము, అద్వితీయము అయిన ఆ పరతత్త్వం అనేకవిధాలుగా గోచరించడానికి కారణం ఏమిటి? అంటే, ద్రష్టయొక్క దృశ్యకరణాల వ్యవహారఫలంగా ఆత్మ ఆ విధంగా నానారూపాలలో గోచరిస్తుంది. రకరకాల పారదర్శక శక్తి గల అద్దాలను చూస్తే ఈ విషయం స్పష్టంగా అర్థమౌతుంది.

## యోగము - బ్రహ్మప్రాప్తి

ఆత్మస్వరూపం జ్ఞానమాత్రమని చెప్పాను. జ్ఞానం నిత్యమైనది కనుక ఆత్మ ప్రాప్తి కూడా నిత్యమే అవుతుందని, నిత్యమైనది అయితే సాధనసాధ్యం కాదని, సాధనసాధ్యం కానిది యోగప్రాప్యం ఎలా అవుతుందని, అడుగుతావేమో. యోగఫలం ఏమిటి? ప్రాపంచిక సంగాన్ని పదిలించడమే యోగఫలం. అయితే ప్రత్యక్షంగా ఉన్న ప్రపంచంలో జీవిస్తూ, దానితో సంగాన్ని పూర్తిగా తెంచుకోవటం ఎలా సాధ్యం ? అని ప్రశ్నింపవచ్చు. నిజానికి ప్రపంచం అంటే ఏమిటి? బ్రహ్మమే ప్రపంచం. బ్రహ్మభిన్నమైనది ఆవగింజంతయినా లేదు. ఆ బ్రహ్మము నిర్గుణం. ఇంద్రియాలు బ్రహ్మముఖం అయనప్పుడు సర్వం బ్రహ్మపదార్థంగానే గోచరిస్తుంది. అవి బ్రహ్మపరాఙ్ముఖము లైప్పుడు ఆ బ్రహ్మమే ప్రపంచరూపంలో కానవస్తుంది. ఇందుకు కారణం ఏమిటి? అంటే, ఏకమైన బ్రహ్మము శబ్దాది ధర్మాలతో కూడిన అర్థరూపంలో అవభాసిస్తున్నది.

## అవభాస లక్షణాలు

అవభాసం ఎటువంటిది? అంటే, అది మహత్తత్త్వరూపం లోను, త్రిగుణాత్మకమైన అహంకారం, పంచభూతాలు, ఏకదశేంద్రియాలు, జీవుడు, జీవశరీరమైన అండకోశం అనే రూపాల లోనూ ఉంటుంది.

## అవభాస నివారణోపాయం

ఈ రహస్యాన్ని గ్రహించాలంటే శక్తి కావాలి. ఆ శక్తి మనలోనే ఉన్నది. అదీ బ్రహ్మశక్తే అవుతుంది. అది మనలోనే ఉన్నప్పటికీ నానావిధాలుగా పరిచ్ఛిన్నమై ఉన్నది. అట్లా చెదిరి ఉన్న శక్తిని కూర్చి ఏకాగ్రం కావిస్తే సర్వం బోధపడుతుంది.

ఆ శక్తిని ఏకాగ్రం చేయాలంటే సాధకులు శ్రద్ధాభక్తియుక్తులై నేను చెప్పిన భక్తియోగాన్ని ఆశ్రయించి నిత్యసమాహితులు, నిస్సంగులు, విరక్తులు అయితే వారిలోని శక్తి కేంద్రీకరిస్తుంది. అప్పుడు వారికి తత్త్వరహస్యం తెలిసివస్తుంది.

## యోగాల తారతమ్యం

తల్లీ! భగవత్ప్రాప్తికి జ్ఞానయోగం సాధనమని చెప్తుండగా భక్తియోగం సాధనమెలా అవుతుంది? అన్న ప్రశ్న రాకుండా వివరిస్తున్నాను. జ్ఞానయోగమన్నది నిర్గుణ బ్రహ్మనిష్ఠాపరం. భక్తియోగమో? సగుణ బ్రహ్మనిష్ఠాపరం. రెండింటికీ ఫలం ఒక్కటే. అయినా జ్ఞానయోగానికి ఆత్మను పొందటం ఫలమని, భక్తియోగానికి ఈశ్వరుని పొందటం ఫలమని కొందరంటారు. ఈశ్వరుడు, ఆత్మ రెండూ ఒకటే. వేర్వేరు కాదు. శాస్త్రమార్గభేదాలను బట్టి ఏకము, అద్వితీయము అయిన పరమాత్మే వివిధమైనట్లుగా బుద్ధికి గోచరిస్తుంది. పాలు కంటికి తెల్లని ద్రవమాత్రంగా, జిహ్వకు మధురపదార్థంగా, చర్మానికి శీతలద్రవ్యంగా కనుపించడమే ఇందుకు నిదర్శనం.

## భగవత్ప్రాప్తికి శాస్త్ర మార్గాలు

తల్లీ! అన్ని శాస్త్రాల తాత్పర్యమూ భగవత్ప్రాప్తి ఒక్కటే. తాత్పర్యం ఒక్కటే అయినా సాధకుల యోగ్యతకు అనుకూలంగా మార్గభేదాలు తెలుపబడ్డాయి. ఇష్టాపూర్తాలు చేసినవారికి భగవత్ప్రాప్తి కలుగుతుందని ఒక శాస్త్రం

అంటుంది. దానధర్మాలు చేసినవారికి భగవత్ప్రాప్తి చేకూరుతుందని వేరొక శాస్త్రం బోధిస్తుంది. తపస్సని ఒకటి, స్వాధ్యాయం అని మరొకటి, మీమాంసమని ఇంకొకటి, ఇంద్రియజయం అని వేరొకటి, నిషిద్ధకర్మత్యాగం అని మరొకటి, అష్టాంగయోగం అని ఒకటి, నిష్కామకర్మయోగం అని ఒకటి, సర్వకర్మసన్యాసం అని ఒకటి, అనేకవిధాలుగా ఉపదేశిస్తాయి. ఏ మార్గంలో వెళ్ళినా చివరికి ప్రాప్యుడైన భగవంతుడు అందరికీ ఒక్కడే. మార్గం నేరుగా ఉంటే గమ్యాన్ని త్వరగా చేరుకొంటారు. అది వంకరటింకరలుగా ఉంటే ప్రయాణం క్లిష్టమై చేరవలసిన చోటికి చేరుకోవటానికి చాలా కాలం పడుతుంది.

తల్లీ! భక్తియోగం సకామము, నిష్కామము అని ద్వివిధంగా ఉన్నదని, సకామభక్తి యందు మూడు గుణాలు వ్యవహరిస్తున్నందున అది తిరిగి మూడు విధాలవుతుందని, నిష్కామభక్తి యందు గుణవ్యవహారం లేనందున అది ఏకవిధమని, చెప్పాను. కాలస్వరూపం అవ్యక్తగతిని ప్రసరించే తీరును, అవిద్యాకర్మల వలన జీవులు ఆత్మదర్శనం చేసికొనలేక, నానావిధ జననమరణరూసంసృతిని పొందుతారని వివరించాను.

తల్లీ! ఈ తత్త్వబోధ పరమరహస్యమైనది. దానిని యోగ్యులకు మాత్రమే ఉపదేశించాలి ఖలులకు, అవినీతులకు, స్తబ్ధులకు, దురాచారులకు, దాంభికులకు, భార్యా పుత్ర దేహ గేహ విత్తాసక్తులకు, భక్తిహీనులకు, భాగవతద్వేషులకు చెప్పకూడదు. ఎందుకంటే అటువంటివారికి చేసే ఈ బోధ అరణ్యరోదనమై నిరర్థకం అవుతుంది.

ఈ బోధ ఫలించాలంటే పాత్రశుద్ధి ఉండాలి. శ్రద్ధ, భక్తి, నీతి, అసూయ లేకపోవటం, సర్వభూతహితత్వం, శుశ్రూషారతి, వైరాగ్యం, శాంతి, శుద్ధి, నిర్మత్సరత – ఇవి మనస్సును పరిశుద్ధం చేస్తాయి. ఇవి గల ధీమంతులు తత్త్వోపదేశానికి పాత్రులవుతారు. వారికి చేసిన బోధ ఫలిస్తుంది.

తల్లీ! నేను చెప్పిన బోధను శ్రద్ధతో విని మననం చేసుకొని నా యందు చిత్తాన్ని నిలిపి నన్ను కీర్తించినవారు తప్పక నన్ను చేరుకొంటారు'.

## శ్రీ కపిలావతార స్తుతి

దేవహూతి కపిలాచార్యుని బోధనను సాకల్యంగా ఆకర్ణించి, మోహపటలం పటాపంచలు కాగా సాంఖ్యశాస్త్ర ప్రవర్తకు డైన ఆ ఋషీశ్వరునికి ప్రణమిల్లి ఈ విధంగా సన్నుతించింది.

'వస్తువు దృగ్గోచరమైనపుడు బుద్ధి దానిని గ్రహిస్తుంది. బుద్ధిస్థమైనదానిని గురించి ఊహ వెల్లడింపగలుగుతుంది. దేవా! నీ రూపం భూతేంద్రియమనస్సులలో వ్యాపించి కార్యకారణబీజమై ఉన్నది. నీవు నిష్క్రియుడవు. సర్గాదులన్నీ నీ శక్తిజన్యములు. నీ శక్తి గుణత్రయవిభాగాన్ని పొంది వ్యవహరించేటప్పుడు సర్గాదులు కలుగుతున్నాయి. నీకు భోగ్యభోగ భావాలు కలుగవు. నీవు సృష్టి సమస్తం జీవుల భోగార్థమే సృజించావు. ఏకరూపమైన నీ శక్తి ఇంత విచిత్ర భోగాస్పద సృష్టిని ఏ విధంగా చేయగలిగిందని అనుమానిస్తారు. నీ శక్తి సమిష్టిరూపంలో ఏకమయినా, వ్యష్టిరూపాన్ని తాల్చినపుడు వివిధగతులలో వ్యవహరిస్తుంది. దాని వ్యవహారాదులను ఊహించటం, వర్ణించటం ఎంతవారికైనా సాధ్యం కాదు. అది కేవలం నీ సంకల్పమాత్రాన వ్యవహారాన్ని పొందుతున్నది. అట్టి నిన్ను స్తుతించటం నా వంటివారి తరంకాదు.

దేవా! నీ నాభికమలం నుంచి నీకు ప్రథమపుత్త్రుడై జన్మించి సమస్త సృష్టికీ కర్త అయిన బ్రహ్మ కూడా నీ స్వరూపాన్ని కానలేక యథామతి నిన్ను ధ్యానించాడు. ఇక నా వంటి అజ్ఞానుల సంగతి ఏమని చెప్పను?

స్వామీ! నీవు యుగాంతంలో సమస్తసృష్టిని నీ ఉదరకోశంలో భరించి, మాయాశిశురూపాన్ని వహించి వటపత్రశాయివై కాలి బొటనవ్రేలిని నోటలో ఉంచుకొని శైశవలీలలలో ఉంటావు. సమస్త సృష్టిని గర్భాంతరంలో ధరించిన నిన్ను నా కడుపున ఎలా మోయగలిగానో అంతుపట్టకుండా ఉన్నది.

దేవా! దుష్టశిక్షణ శిష్టరక్షణార్థం నీవు దేహాన్ని ధరిస్తావు. ఆ రహస్యాన్ని నీ వరాహాద్యవతారాలు వెల్లడిస్తాయి. ఇప్పుడు నీవు జ్ఞానమార్గాన్ని సులభగ్రాహ్యంగా బోధించేందుకు అవతరించావు. నీ దర్శనభాగ్యానికి నోచుకొన్నాను. కృతార్థురాలినయ్యాను.

దేవా! నీ నామాన్ని పరాకుగా నైనా విన్నా, కీర్తించినా, స్మరించినా, నీకు తల ఒగ్గినా, అతి దురాచారుడైన చండాలుడు కూడా పునీతుడై యజ్ఞాదులకు అర్హుడవుతుండగా, నిన్ను పది నెలలు మోసి కన్న నా భాగ్యం ఎంతని వర్ణించను? ఏ జన్మలోనో నేను చేసుకొన్న పుణ్యవిశేషం ఫలించి ఈ నాడు నీ సందర్శనం నాకు కలిగింది కాబోలు. వేదగర్భుడవై, నిజతేజోవిశేష విధ్వస్త గుణ ప్రవాహుడవై, నిర్విషయ చేతోమాత్ర పరిచింతనీయుడవుగా అలరారుతున్న పరబ్రహ్మానికి నీకు నా కృతజ్ఞతను ఏ విధంగా చూపగలను? ఇవే నీకు నా పునఃపునఃప్రణామాలు.

ఉ. **ఈ విధ మాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ**
**త్పావనమైన నీ గుణాకథామృత మాత్మలఁ గ్రోలి సర్వ తీ**
**ర్థావళిఁ గ్రుంకినట్టి ఫల మందుదు రంచు సమస్తవేదముల్**
**వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్.**

అని అంజలించింది.

## కపిలుని ఉపచారవాక్యాలు

కపిలమహర్షి ఎంతో సంతోషించి, 'తల్లీ! మంచివారు ఆచరింపవలసిన మార్గాన్ని బోధించాను. ఆ దారిలో నడిచేవారికి జీవన్ముక్తి శీఘ్రంగా కలుగుతుంది. నేను చెప్పిన మతం బ్రహ్మవాదులు సేవించిన భక్తిమతం. దానిని విశ్వాసపూర్వకంగా అనుష్ఠించు. నీకు ముక్తి తప్పక చేకూరుతుంది. ఆ విధంగా చేయనివారికి మృత్యురూప సంసార పరిభ్రమణం తప్పదు' అని చెప్పి ఆమెకు వీడ్కోలు పలికి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

## దేవహూతికి జీవన్ముక్తి

విదురా! కర్దముడు ప్రవ్రజితుడైన నాటి నుంచి దేవహూతి హృదయం వియోగదుఃఖాగ్నిలో కుమిలిపోసాగింది. అయినా ఆమె కళ్ళలో ప్రాణాలు నిలుపుకొని కొడుకును చూసుకొంటూ నిర్లిప్తంగా రోజులు గడిపింది. ఇప్పుడు పుత్రవియోగం కూడా దాపురించింది. ఆ వియోగద్వయక్లేశం తత్త్వజ్ఞానానికి ఉపశమింపనంత మిక్కుటంగా ఆమెకు తోచింది. ఆమె దూడను పోగొట్టుకొన్న గోవు చందమై దైన్యమంది పుత్రరూపుడైన భగవానుని ధ్యానించి, గృహాదుల పట్ల వైరాగ్యం కలిగి, తన భోగార్థం భర్త తనకు యోగమహిమతో సృజించి ఇచ్చిన దివ్యాంబరాలను, నవరత్నఖచిత విభూషణాలను, కరిదంతఘటిత శయనాలను క్షీరఫేన సదృశ మృదులాస్తరణాలను, సువర్ణమయపీఠాలను, మరకతమణి ఖచిత విమల స్ఫటికభిత్తితలాంతర రత్నదీప కాంతికాంతమణిమయ సాలభంజికాభిరామ మందిరాంగణాలను, విహంగమధుర ధ్వనులతో, మంజుప్రసవ మరందస్వాదలోల హృన్మత్తమిళిందగానాలతో నిండి సొంపారుతున్న కల్పకపాదపోద్యానవనాలను, విద్యాధరసేవిత విహారయోగ్య మహోత్పల గంధబంధురకాసారాలను, మహేంద్రసుందరీజన ప్రార్థనీయ నిరుపమాన వైభవోల్లసిత వివిధోపభోగాలను త్యజించి, వల్కలు గట్టి జడలు ధరించి సరస్వతీ తీర బిందుసరోవర ప్రాంతంలో సమాహిత చిత్తురాలై తీవ్ర తపస్సుకు ఉపక్రమించింది.

దేవహూతికి యోగానుష్ఠానఫలంగా చిత్తం ఏకాగ్రమై బ్రహ్మజ్ఞానం అనుభవసిద్ధమై విలసిల్లింది. ఆమె చిత్తం కపిలమహర్షి ఉపదేశించిన భగవద్రూపమందు అనన్యభావంతో స్థిరంగా పాదుకొన్నది. ఆమెకు దేహాభిమానరూప జీవభావం నివర్తించింది. దానితో క్లేశాలన్నీ అంతరించాయి. పరమనిర్వృతి జనించింది. అంతటి నిత్యారూఢ సమాధియోగఫలంగా గుణకార్యములైన భ్రమలన్నీ శాంతించాయి. ఆమెకు కలలో నుంచి మేల్కొన్నట్లు దేహభావనల సారవిహీనత తెలిసివచ్చింది. ఆమె శరీరం సంస్కారరహిత మైనప్పటికీ మనోవ్యాధి లేనందున నివురుకప్పిన నిప్పువలె రాజిల్లింది. నిరంతర వాసుదేవైకధ్యానం వలన ఆమె కట్టుబట్టలు ఉండటం గాని, పోవటం గాని ఎరుగదు. దేహస్థితిగతులు ప్రారబ్ధకర్మాధీనాలు గనుక ఆ కర్మఫలం భుక్తమైనంతనే దేవహూతి జీవన్ముక్తిని గాంచింది.

ఆమె ముక్తిగాంచిన ఆ స్థలాన్ని సిద్ధాశ్రమం అంటారు. ఆమె శరీరం యోగమహిమ చేత నదీరూపాన్ని దాల్చి సిద్ధులకు పరమసేవనీయమై అలరారింది.

## కపిలుని యోగనిరతి

విదురా! కపిలమహర్షి తల్లిని వీడ్కొని ఈశానదిశను బట్టి సముద్రతీరం చేరాడు. అక్కడ సముద్రుడు ఆయనకు స్వాగతం పలికి తపోదీక్షకు నివాసయోగ్యమైన స్థానాన్ని చూపాడు.

అక్కడ కపిలమహర్షి సాంఖ్యాచార్యు లందరూ ప్రస్తుతులు చేస్తుండగా లోకశాంతికై యోగ సమాహితచిత్తుడయ్యాడు.

విదురా! దేవహూతీ కపిల సంవాదాన్ని తెలిపాను. ఈ ముని మతం ఆత్మయోగ రహస్యవిషయం. భక్తి శ్రద్ధలతో దీనిని విన్నా చదివినా బుద్ధి భగవత్పరమై భగవత్పాదారవిందప్రాప్తి సిద్ధిస్తుంది.'

అంటూ మైత్రేయుడు ఇంకా ఇలా అన్నాడు.

# చతుర్థ స్కంధం

## మనుపుత్రికల వంశచరిత్ర

విదురా! మనుపుత్రికల వంశ చరిత్రను చెబుతున్నాను, శ్రద్ధగా విను.

స్వాయంభువ మనువుకు శతరూపయందు ఆకూతి, దేవహూతి, ప్రసూతి అని ముగ్గురు కుమార్తెలు, ఇద్దరు కొడుకులు జన్మించారని చెప్పాను.

ఇంతమంది సంతానం కలిగినా, ఇద్దరు కులదీపకులైన సత్పుత్రులు ప్రభవించినా, స్వాయంభువ మనువుకు బహుపుత్ర వాత్సల్యం తీరలేదు. అందుచేతనో లేక మరే ఇతర కారణంచేతనో అతను తన జ్యేష్ఠపుత్రిక ఆకూతిని పుత్రికాధర్మంగా రుచిమహర్షికి ఇచ్చి పెండ్లి చేశాడు.

## పుత్రికా ధర్మం

పుత్రికాధర్మం అంటే – తండ్రి తన పుత్రికకు వరుని నిశ్చయించి, 'ఈ నా పుత్రికకు జన్మించిన పుత్రుడు నాకు పుత్రుడగు గాక!' అని వరునితో పలికి, వరుడు అందుకు అంగీకరించిన తర్వాత, 'నా భార్యకు జన్మించిన పుత్రుడు నా శ్వశురునికి పుత్రుడగు గాక!' అని అతని నోట పలికించి, అనంతరం పాణిగ్రహణోత్సవాన్ని జరిపించటం. ఇది శాస్త్రసమ్మతమైన దత్తస్వీకారం.

## ఆకూతి సంతానం - శ్రీ యజ్ఞావతారం

ఆకూతిని వివాహమాడిన రుచి గొప్ప మహర్షివతంసులలో ఒకడు. బాల్యం నుంచి బ్రాహ్మణధర్మనిష్ఠుడై బ్రహ్మతేజస్సును దాల్చి పరమాసమాధియుతంగా భార్యతో కలిసి భగవంతుని ఆరాధించాడు. శ్రీమహావిష్ణువు అతనిని అనుగ్రహించి నిజతేజోంశతో యజ్ఞుడనే పేరిట అతనికి సుతుడై అవతరించాడు. విష్ణువును బాసి లక్ష్మి ఉండదు కనుక ఆమె కూడా స్వీయాంశతో ఆ పుణ్యదంపతులకు దక్షిణ అనే శుభనామధేయంతో కుమార్తెగా అవతరించింది.

ముందే అనుకున్న ప్రకారం స్వాయంభువుడు యజ్ఞుని తన యింటికి కొని వచ్చి పెంచసాగాడు. దక్షిణ తన తల్లిదండ్రుల ఇంటనే అల్లారుముద్దుగా పెరిగింది. వారికి యుక్తవయస్సు వచ్చింది. వారు లక్ష్మీమురళీధరుల అంశజులైనందున పృథ్విపై ఒకరి నొకరు విడిచి ఉండలేరని, వారిరువురికీ శాస్త్రోక్తంగా వివాహం జరిపించారు.

వారికి దోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతుడు, ఇడాస్పతి, ఇధ్మడు, కవి, విభువు, వహ్ని, సుదేవుడు, రోచనుడు అని పన్నెండుగురు కుమారులు జన్మించి, మాతాపితృ సంతోషఫలాలుగా పుట్టిన కారణాన తుషితులు అని పేరుపొంది దేవతలైనారు.

యజ్ఞుడు దేవేంద్రుడయ్యాడు. స్వాయంభువుని పుత్రులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, వారి పుత్రపౌత్రాదులు రాజులై లోకధర్మాన్ని సముద్ధరిస్తూ ప్రజానురంజకంగా పరిపాలించారు.

విదురా! దేవహూతి చరిత్రను సవిస్తరంగా విన్నావు; ఇక ప్రసూతిని బ్రహ్మపుత్రుడైన దక్షప్రజాపతి గ్రహించాడు. వారి యశోవల్లరి ముల్లోకాలనూ చల్లగా అల్లుకొన్నది.

## కర్దమ ప్రజాపతి సంతతి

కర్దముని పుత్రికలలో ప్రథమ పుత్రిక అయిన కళను మరీచిమహర్షికి ఇచ్చి పెండ్లి చేశారు. వారికి కశ్యపుడు, పూర్ణిముడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు.

పూర్ణిమునికి విరజుడు, విశ్వగుడు అని ఇద్దరు కొడుకులు, దేవకుల్య అనే కుమార్తె జన్మించారు. ఈ దేవకుల్య అంతకు పూర్వజన్మలో గంగానదిగా పుట్టి శంతనుని వల్ల, సంతానాన్ని కన్న తర్వాత ఈ విధంగా పూర్ణిముని ఇంట వెలసింది.

## దత్తాత్రేయాది జననం

కర్దముని రెండవ కుమార్తె అనసూయను అత్రిమహాముని స్వీకరించాడు. వారికి నారాయణాంశతో దత్తాత్రేయుడు, రుద్రుని అంశతో దుర్వాసుడు, బ్రహ్మదేవుని అంశతో సోముడు జన్మించారు.

విదురా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులు క్రమంగా సృష్టి స్థితి లయాలకు ప్రవర్తకులై ఉన్నారు. అట్టివారు అత్రి మహాముని ఇంట జనించటం ఆశ్చర్యకరంగా ఉన్నది కదూ?

ఒకప్పుడు బ్రహ్మదేవుడు అత్రి మహామునిని పిలిచి, 'మునివర్యా! నీవు వివాహం చేసికొని ప్రజాసృష్టిని కావించు' అని ఆదేశించాడు. అత్రిముని ఆ వచనాన్ని తలదాల్చి, తపస్సుకై ధర్మపత్నితో కలిసి ఋక్షపర్వతానికి వెళ్ళి నిర్వింధ్యానదీ మధురజలాల లాలనలో పెరిగి పెంపొందిన పుష్పఫలవృక్షాల సురభిళ పరిమళమిళిత సుగంధవాయు వీచికల గుబాళింపులు మత్తెక్కిస్తున్న ఒక సాంద్రారణ్యంలో ఆశ్రమాన్ని కల్పించుకొని, ప్రాణాయామం అనుష్ఠించి మనో నియమాన్ని సాధించి ద్వంద్వాలను జయించి ఒక్క కాలిపై నిలిచి వాయుభక్షణమాత్రుడై 'జగదీశ్వరుని శరణుకోరాను; భగవానుడు నాకు ఆత్మసదృశసంతానాన్ని ప్రసాదించు గాక' అని శతసంవత్సరాలు

ఘోరతపస్సును ఆచరించాడు. తపోవహ్ని అతని మూర్ధం నుంచి వెలువడి ముల్లోకాలనూ దహింపసాగింది. త్రిమూర్తు లది చూసి, 'ఇక ఉపేక్షిస్తే లోకాలన్నీ దగ్ధప్రాయాలు కాగలవు' అని తలపోసి, అప్సరోగణ మునిజన సిద్ధ గంధర్వ విద్యాధర పన్నగాదులు వెంట రాగా దేవతానీకంతో కలిసి అత్రిముని ఆశ్రమానికి వచ్చారు.

వారి రాకతో ఆ మునీశ్వరునికి మనఃప్రకాశం కలిగింది. ఆయన కన్నులు తెరిచి తన యెదుట హంసగరుడ వృషభారూఢులై తమ తమ చిహ్నాలతో తేజరిల్లుతూ చిరునవ్వు వెన్నెలలను కురిపిస్తున్న త్రిమూర్తులను చూచి దిగ్గున లేచి సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆ మూర్తుల తేజః ప్రభావానికి అతని కన్నులు నిమీలితములైనాయి. కేలుమోడ్చి చిత్తాన్ని వారియందు నిలిపి ఈ విధంగా ప్రసంగించాడు.

## అత్రికి త్రిమూర్తి తత్త్వదర్శనం

'పరమాత్ముడు ప్రతియుగం లోనూ విశ్వసృష్టిస్థితిలయాలను సంకల్పించినప్పుడు తన మాయా గుణాలను విభజింపగా మూర్తిత్రయరూపంలో వెలువడిన బ్రహ్మ విష్ణుమహేశ్వరులకు, మీకు ప్రణామం.

మహాత్ములారా! పుత్త్రప్రాప్తికై నేను భగవానుని ప్రార్థించాను. మీరు మనోదృష్టికి కూడా అందరాని తేజోమయమూర్తులు. మరి మీ గురించి నేను స్మరింపనైతిని. మీ రిక్కడికి రావడం నాకు ఆశ్చర్యానందాలను కలుగజేసింది. మీ రాకకు కారణం తెలిపి నన్ను కృతార్థుని గావించండి' అన్నాడు.

త్రిమూర్తులు ఆ మాటకు చిరునవ్వు నవ్వి, 'మునివర్యా! నీ సంకల్పం మంచిది. నీ సంకల్పం ప్రకారం నీ వనుకొన్నది భావ్యమే. జగదీశ్వరుని శరణు కోరి నీవు తపస్సు చేశావు. ఆ పరతత్త్వం మా ముగ్గురి రూపాన్ని దాల్చి ధర్మపరిపాలన కావిస్తున్నది. కనుకనే మేము ముగ్గురం నీకు

సాక్షాత్కరించాము. ఏకమైన ఆ పరతత్త్వానికీ మాకూ భేదం లేదు. మా అంశలతో ముగ్గురు పుత్రులు నీకు జనించి లోకవిశ్రుతులై నీ యశశ్చంద్రికలను వెల్లివిరియింపజేస్తారు' అని పలికి, ఆ దంపతుల పూజలంది అంతర్ధానం చెందారు. ఆ వరఫలంగా బ్రహ్మాంశతో సోముడు, విష్ణ్వంశతో దత్తాత్రేయుడు, మహేశ్వరాంశతో దుర్వాసుడు జన్మించారు.

## శ్రద్ధా సంతానం

కర్దముని మూడవకూతురు శ్రద్ధను అంగిరసుడు చేపట్టాడు. వారికి సినీవాలి, కుహువు, రాక, అనుమతి అని నలుగురు కుమార్తెలు, బృహస్పతి, ఉచథ్యుడు అని ఇద్దరు కొడుకులు జనించారు. వారు స్వారోచిషమన్వంతరంలో ఖ్యాతిని గడించారు.

## హవిర్భుక్కు సంతానం

కర్దముని నాల్గవ కుమార్తె హవిర్భుక్కును పులస్త్యమహర్షి వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు అగస్త్యుడు, విశ్రవసువు జన్మించారు.

అగస్త్యుడు పూర్వజన్మలో బడబాగ్నిగా ఉన్నాడు. విశ్రవసువు ఇళబిలను, కేకసిని పెండ్లాడాడు. అతనికి ఇలబిల వలన కుబేరుడు జనించి యక్షాధిపతి అయ్యాడు. తల్లి పేరుమీదుగా అతనికి ఐలబిలుడనే ఖ్యాతి కలిగింది. కేకసి వలన రావణ కుంభకర్ణ విభీషణులు ముగ్గురూ పుట్టారు.

## గతి సంతానం

కర్దముని ఐదవ కుమార్తె గతిని పులహుడు గ్రహించాడు. వారికి కర్మశ్రేష్ఠుడు, వరీయాంసుడు, సహిష్ణుడు అని ముగ్గురు కొడుకులు ఉదయించారు.

## క్రియ సంతానం

కర్దముని ఆరవ కూతురు క్రియను ప్రజాపతి వివాహం చేసుకున్నాడు. వారికి బ్రహ్మతేజోవిరాజితులైన వాలఖిల్యులు అరవై వేల మంది జన్మించారు.

## ఊర్జ సంతానం

కర్దముని ఏడవకూతురైన ఊర్జను వసిష్ఠుడు స్వీకరించాడు. వారికి చిత్రకేతుడు, సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, శక్తి మొదలైనవారు పెక్కుమంది ఉదయించారు.

## చిత్తి సంతానం

కర్దముని ఎనిమిదవ పుత్రిక చిత్తిని అధ్వర్యుడు పరిణయమాడి, ఆమె యందు దధ్యంచుడనే కుమారుని గావించాడు. దధ్యంచుడు హయశీర్షంతో జన్మించినప్పటికీ, తల్లిదండ్రుల మాట జవదాటక ధృతవ్రతుడై పేరెన్నిక గన్నాడు.

## ఖ్యాతి సంతానం

కర్దముని తొమ్మిదవ పుత్రిక ఖ్యాతిని భృగుమహర్షి చేపట్టాడు. వారికి ధాత, విధాత అని ఇద్దరు కొడుకులు, శ్రీదేవి అవతరించారు.

కర్దముని పెద్ద కొడుకు మేరుముని ప్రథమపుత్రిక యతిని పెండ్లి చేసుకున్నాడు. వారికి మృకండుడు, మృకండునికి జగద్విఖ్యాతుడైన మార్కండేయుడు జన్మించారు.

విధాత మేరుముని ద్వితీయ పుత్రిక నియతిని వివాహం చేసుకొన్నాడు. వారికి ప్రాణుడు, ప్రాణునికి వేదశిరుడు జన్మించారు.

కొంత కాలానికి భృగువుకు కవి, శుక్రుడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు.

విదురా! ఈ కర్దమ ప్రజాపతి వంశవృత్తాంతాన్ని శ్రద్ధతో విన్నవారికి పాపక్షయం కలుగుతుంది.

## దక్ష వంశానుక్రమం

విదురా! దక్షుడు స్వాయంభువ మనువు కుమార్తె ప్రసూతిని భార్యగా గ్రహించాడని చెప్పాను కదా. ఆ దంపతులకు పదహారు మంది కుమార్తెలు జన్మించారు. వారిలో శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి అని పదముగ్గురిని ధర్మువుకు ఇచ్చి పెండ్లి చేశారు. తక్కిన ముగ్గురిలో స్వాహను అగ్నికి, స్వధను పితరులకు, సతిని ఈశ్వరునికి ఇచ్చి చేశారు.

## ధర్మువు సంతానం

ధర్మువుకు శ్రద్ధ వలన శ్రుతము, మైత్రి వలన ప్రసాదము, దయ వలన అభయము, శాంతి వలన సుఖము, తుష్టి వలన ముదము, పుష్టి వలన స్మయము, క్రియ వలన యోగము, ఉన్నతి వలన దర్పము, బుద్ధి వలన అర్థము, మేధ వలన స్మృతి, తితిక్ష వలన క్షేమము, హ్రీ వలన ప్రశ్రయము కలిగాయి.

వీటిలో శ్రద్ధాదులు ధర్మలక్షణాలు, శ్రుతాదులు వాటి అంశలూ అవుతాయి.

## నరనారాయణుల జననం

ధర్మువుకు మూర్తివలన నరనారాయణులు జన్మించారు.

వారి జనన కాలంలో దిక్కులు ప్రసన్నములై ఆహ్లాదాన్ని కూర్చాయి. వాయువులు హాయిగా వీచాయి. నదులు ఉప్పొంగాయి. సముద్రాలు ప్రశాంతిని పొందాయి. దేవవాద్యాలు మారుమ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది. మునులు మహానందవశులై సన్నుతించారు. కిన్నర గంధర్వ మధురగానాలు వినిపించాయి. అప్సరసలు నృత్యం చేశారు. లోకాలకు మేలు జరిగింది.

## బ్రహ్మాదుల సన్నుతులు

ఆ సమయంలో బ్రహ్మాది దేవతలు గుమిగూడి వచ్చి, 'ఎవడు తన మాయా బలంతో గగనతలాన గంధర్వనగరం లాగున తనలో విశ్వమంతటినీ విరచించి, ఆ జగత్తులకు వెలుగును చేకూర్చే నిమిత్తమై ధర్మని ఇంట అవతరించాడో, ఎవడు మా వంటివారికి శాస్త్రముఖంగా తప్ప ప్రత్యక్షంగా ఎరుగరానివాడైనా జగన్మర్యాదను కాపాడే ఉద్దేశంతో తన సత్త్వగుణం నుంచి మమ్ములను పుట్టించి శ్రీనికేతనమైన అరవిందాన్ని అతిశయించే విశిష్టలోచనాన్ని తెరిచి కరుణామయదృష్టిని మా యెడ సారించుతున్నాడో, ఆ పరమాత్మునికి ప్రణామాలు. ఆ శుభదృష్టి మా యెడ నిరంతరం ప్రసరిస్తుంది గాక' అని స్తుతించారు.

నరనారాయణులు బ్రహ్మాదుల పూజలంది గంధమాదనానికి వెళ్లారు. తపోదీక్షితులై లోకానికి వ్రతానుష్ఠానమహిమను వెల్లడించారు. ఆ తర్వాత వారే భూభారనివారణార్థం కురువంశంలో నరుడు అర్జునుడనే పేర, యదువంశంలో నారాయణుడు కృష్ణుడనే పేర అవతరించారు.

## స్వాహా సంతానం

స్వాహాకు అగ్ని వలన పావకుడు, పవమానుడు, శుచి అని ముగ్గురు పుత్రులు కలిగారు. వారికి నలభైఅయిదు మంది కొడుకులు పుట్టారు. ఈ విధంగా అగ్నితో కలిసి అతని వంశం నలభైతొమ్మిది మందితో వెలసింది.

ఈ అగ్నులకు బ్రహ్మవాదులు అగ్నిదేవతాకములైన యాగాలలో అగ్నిక్రియలను ఆచరిస్తారు. ఆ అగ్నులు అగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సోమ్యులు, పితరులు, ఆజ్యపులు, సాగ్నులు, నిరగ్నులు అని ఏడు విధాలుగా ఉన్నాయి.

## స్వధా సంతానం

పితరులు స్వధ వలన అయుత, ధారుణి అని ఇద్దరు కుమార్తెలను కన్నారు. ఆ ఇద్దరూ బ్రహ్మవాదినులు, జ్ఞానవిజ్ఞానవతులు అయి

సంసారసుఖాలను తృణీకరించి మోక్షమార్గం లోనికి ప్రవేశించారు.

## సతీదేవి ఆత్మాహుతి

సతీదేవి శివుని పెండ్లాడి ఆయననే అనువర్తింపసాగింది. దక్షుడు నిష్కారణంగా శివునియెడ వైమనస్యాన్ని చూపడం మొదలుపెట్టాడు. తండ్రి వలని ఆ అవమానాన్ని సతీదేవి సహింపలేక శరీరాన్ని యోగాగ్నికి అప్పగించింది.

## దక్షయజ్ఞం

మునులారా! విదురుడు ఆ మాట విని, 'ఋషివర్యా! తండ్రులు పుత్రికలను ఎంతో ప్రేమగా చూసుకొంటారు. దక్షుడు విపరీతపథాన్ని ఎందుకు అవలంబించాడు? మరి శివుడంటే ఏతన్మాత్రుడు కాడు; చరాచరాలకూ గురుస్థానీయుడు. సృష్టిప్రళయ కారకుడైన శివునికి శత్రువులుండటం అసంభవం. అంతేకాక ఆ మహాత్ముడు లోకారాధ్యుడైనప్పటికీ ఆత్మారామునిగా వెలుగొందుతున్నవాడు. ఆయన ఏ కోరికలూ లేనివాడు. అట్టి శివుని యెడ దక్షునికి పగ ఎందుకు కలిగింది?' అని అడిగాడు. మైత్రేయుడు ఈ విధంగా పలికాడు.

విదురా! పూర్వం మరీచ్యాదిప్రజాపతులు అద్భుతమైన సత్త్రయాగాన్ని అనుష్ఠించారు. ఆ యాగానికి మునులు, ఋషులు, దేవతలు, మహేశ్వరుడు, అందరూ వచ్చారు. దక్షుడు కూడా రెండవ సూర్యుడో అన్నంత మహాప్రకాశంతో తేజరిల్లుతూ యాగస్థలికి వచ్చి చేరాడు. బ్రహ్మాదు లందరూ సభాప్రదేశాన్ని దేదీప్యమానం కావిస్తున్న అతని దివ్యతేజాన్ని చూసి తమ కన్నులను తామే నమ్మలేనంతగా ఆశ్చర్యపోయారు. సదస్యులు, అగ్నులు తమ తమ ఆసనాలనుంచి దక్షుని సత్కారపూర్వకంగా ఆహ్వానించారు. దక్షుడు బ్రహ్మకు నమస్కరించి, ఆయనచే అనుజ్ఞాతుడై, ఉచితాసనం పైని కూర్చున్నాడు. శివుడు దక్షుని ముందరే కూర్చొని ఉన్నాడు.

## శివ దూషణ

దక్షుడు శివుని మహోగ్రహంతో చూసి కన్నులతో నిప్పులను కురిపిస్తూ సభాస్తారుల వైపు తిరిగి, 'బ్రహ్మర్షులారా! సురాగ్నులారా! సజ్జనప్రవర్తనాన్ని గురించి ఒకటి రెండు మాటలు చెబుతాను వినండి. నేనంటున్నది అజ్ఞానఫలమని గాని, మత్సరజన్యమని గాని అనుకోవద్దు. ఈ శివుడు లోకపాలనపదవిని అనుష్ఠించాడే కాని ఆ పదవికి తగిన నడవడిక ఇతని యందు కనబడదు. ఏమంటారా? ఇతను నా పుత్రికను – సావిత్రికి దీటువచ్చే మహాపతివ్రతను – సతీదేవిని బ్రాహ్మణాగ్ని సాక్షికంగా పెండ్లిచేసుకొన్నాడు. అందువల్ల ఇతను నాకు శిష్యుడవుతాడు. శిష్యులు గురువులను చూడగానే ఎదురేగి నమస్కరించడం లోకమర్యాద. ఈ మర్కటలోచనుడు పెద్దల మార్గాన్ని దూషించాడు. ఇతనికి కనీసం తప్పుచేశామన్న సిగ్గన్నా ఉన్నట్లు లేదు. చివరికి వాక్సత్కారమయినా చేశావా? అంటే అదీ లేదు. అయ్యయ్యో! సతికి నేను తెలియక అన్యాయంగా గొంతుకోశాను. అదటుండనీ. ఇతను ఏం చూసుకొని ఇంత గర్వపడుతున్నాడో తెలియడం లేదు. పరివారమంటేనో భూతప్రేతగణం. నివసించేది శ్మశానంలో. ఆస్తిపాస్తులు చూద్దామంటే వల్లకాటి బూడిద, శవాల ఎముకలూ, పుర్రెలూ తప్ప మరొకటి లేదు. కట్టుకొందుకు బట్టలు లేక దిసమొలతో జుట్టు విరబోసుకొని పిచ్చివాడిలా విచ్చలవిడిగా తిరుగుతుంటాడు. తమోగుణానికి ప్రతిరూపాల వంటి భూతప్రేతగుణాలు ఇతనికి ప్రజలు. అట్టి మదోన్మత్తజనులకు ఏలికనయ్యానని కాబోలు ఇతను ఒళ్ళు మరిచి హితాహితజ్ఞానదూరుడై కన్నూ మిన్నూ కాననట్లు ప్రవర్తించాడు. శివుడి పేరుతో వెలసిన ఈ తమస్స్వరూపునికి, ఈ అశుచికి ఈ క్రూరుడికి వేదసరస్వతిని కట్టబెట్టినట్లు నేను పరమసాధ్వీమతల్లి అయిన నా చిట్టి తల్లి పాపం సతీదేవిని ఇచ్చి అపచారం చేశాను. ఈ అకార్యం బ్రహ్మ బోధన వల్ల జరిగిందే తప్ప నేను మనసారా చేసింది కాదు', అని నోటి తీట తీరేటట్లు తిట్టిపోశాడు.

## దక్షకృత శివశాపం

అప్పటికీ శివుడు మాట్లాడలేదు. దక్షుడంతటితో చల్లారక మరీ మరీ రెచ్చిపోయి, ఆచమించి శుచి అవుతుండగానే సదస్యముఖ్యులు దక్షుని భావాన్ని గ్రహించి, 'వద్దు, వద్దు' అని నొక్కి చెప్పారు. దక్షుడు వారి హెచ్చరికలను లెక్కచేయక, 'ఈ భవుడు దేవయజ్ఞాలలో హవిర్భాగాన్ని ఇంద్రాది దేవతలతో సమానంగా గ్రహిస్తున్నాడు. ఇతను దేవగణాధముడు కనుక ఈనాటి నుంచి ఇతనికి ఆ మర్యాదలు లేకుండా పోతాయి' అని శపించాడు.

## దక్షాదులకు నందీశ్వరుని శాపం

శంకరుడు అందుకు కూడా శాంతం గానే ఉండిపోయాడు. కాని అతని పరివారంలో ముఖ్యుడైన నందీశ్వరుడు తోక తొక్కిన తాచులా ఎగిరిపడి, నిప్పులు కక్కాడు. 'సభాసదులారా! ఈ దక్షునికి క్షణభంగుర శరీరాభిమానం ఎంత ఉన్నదో ఇతని మాటలే చాటి చెబుతున్నాయి. ఆ దురభిమానం ఇతనికి బహిరంతరదృష్టులు రెండూ కనబడకుండా చేసింది. ఇతనికి ఈ భేదదర్శనం ఇలాగే ఉంటుంది గాక! తత్త్వజ్ఞానం ఎన్నటికీ కలుగకుండు గాక! మాయాగుణబద్ధుడై గ్రామ్యసుఖాసక్తితో ఉంటాడు గాక! భేదవచన పరమార్థతత్త్వాన్ని తెలుసుకొనలేక అర్థవాదాలే సత్యాలని నమ్మి మతి చెడి నిరంతర కర్మ పరతంత్రుడై ఉంటాడు గాక! అనాత్మభూత దేహాదులందు ఆత్మాధ్యాసం కావించి, జ్ఞానహీనుడై పశుప్రాయంగా మారి అత్యంత స్త్రీకాముకుడు అవుతాడు గాక! ఇతని ముఖం మేషముఖం అవుతుంది గాక! ఇతనిని అనుసరించిన మందబుద్ధులు కూడా శంకరుని అవమానించిన పాపాత్ము లవుతారు గాక! ఇతని వలెనే వారు కూడా శివనిందాపచారానికి ఫలితంగా జననమరణ సంసృతి చక్రంలో పడి ఉంటారు గాక! వేదాలలోని అర్థవాక్యాలు పువ్వుల వలె నెత్తావులను గుబాళింపజేస్తూ చవులూరిస్తుంటాయి. ఆ రుచులకు తగిలి మైమరచి హరద్వేషులైనవారు

మోహాంధకారంలో చరిస్తారు గాక! ఇతను కావించిన హరతిరస్కారాన్ని విన్న ఫలంగా బ్రాహ్మణులు భక్ష్యాభక్ష్యవిచారశూన్యులై సర్వభక్షకులు, కేవల దేహపోషణార్థ విద్యాతపోవ్రతులు, విత్తారాములుగా మారి నిత్యయాచకు లవుతారు గాక!' అని మహోగ్రహోదగ్రుడై రోషానలజ్వాలలను వెలిగ్రక్కుతూ శపించాడు.

## భృగువు ప్రతిశాపం

నందీశ్వరుడు ఆ విధంగా బ్రాహ్మణులను శపించేసరికి అక్కడే కూర్చున్న భృగుమహర్షి విని కోపోద్దీపితుడై, 'ఎవరు శంకరవ్రతాన్ని అవలంబిస్తారో వారూ, వారిని అనుసరించినవారూ అందరూ పాషండులు, సచ్ఛాస్త్రవైరులు, నష్టశౌచులు, మూఢబుద్ధులు, జటాభస్మాస్థిధారులు, సురాపూర్వక శైవదీక్షాపరులూ అవుతారు గాక! వేదమార్గం సనాతనము, ఋషిగణసేవితం, సర్వలోకమంగళకరం అయిన మహనీయ మార్గం. జనార్దనుడు దానికి అధిదైవతం. పరమపరిశుద్ధమూ, సనాతనమూ అయిన శబ్దబ్రహ్మాన్ని నిందించినవారు పాషండులై వారు కొలిచే ఆ భూతరాట్టునే చేరుకొంటారు గాక' అని బ్రహ్మదండాన్ని పోలిన ప్రతిశాపాన్ని ఇచ్చాడు.

శివుడు వారి అన్యోన్య శాపవచనాలను విని పరస్పరవినాశనం జరుగుతున్నందుకు విచారించి, వికలమనస్కుడై అక్కడినుంచి వెళ్ళిపోయాడు. దక్షుడంతట సహస్రవర్షపర్యంతమైన ఆ సత్త్రయాగాన్ని కొనసాగించి, శ్రీహరిని పూజించి, గంగా యమునా సంగమంలో అవబృథస్నానం కావించాడు. సదస్యులు కూడా తీర్థస్నానాలు చేసి శుద్ధచిత్తులై తమ తమ నెలవులకు వెళ్ళిపోయారు.

## సతీదేవి కోరిక

కొంతకాలానికి దక్షుని ప్రజాపతి నేతగా అభిషేకించారు. ఆ పదవికి అతనెంతో గర్వించి వాజపేయ యాగాన్ని చేసి బ్రహ్మనిష్ఠులలో ముఖ్యుడై

బృహస్పతి సవనాన్ని సంకల్పించాడు. మహోత్తమమైన ఆ యజ్ఞానికి బ్రహ్మర్షులు, దేవర్షులు, సురలు, పితృగణం సపత్నీకంగా తరలి నభోమార్గాన పయనిస్తూ దక్షసవనోత్సవ ప్రసంగాలతో ముందుకు సాగారు.

ఆ పలుకులు కైలాసంలో ఉన్న సతీదేవికి వినవచ్చాయి. సిద్ధ విద్యాధర గంధర్వాంగనలు చూడముచ్చటగా అలంకరించుకొని మనోహరులను కూడి మహోత్సాహంతో వెళ్తుంటే ఆమె నివ్వెరపోయి చూసింది.

సతీదేవి తన తండ్రి కావింపనున్న యజ్ఞం సంగతి విని శివుని సమీపించి, 'దేవా! మీ మామ దక్షప్రజాపతి సవనాన్ని సంకల్పించాడట. అదిగో చూడండి. దేవతానికరం ఉత్సవసంరంభంతో నెట్టుకొని ముందుకు పోతున్నారు. మీకు సమ్మతమైతే మనం కూడా వెళ్ళి యాగాన్ని చూసివద్దాము. అక్కడికి నా తోబుట్టువులు భర్తలతో కలిసి తప్పకుండా వస్తారు. వారిని, మా అమ్మను, ఆమె తోబుట్టువులను, అందరినీ ఒక్కచోట చూసే భాగ్యం నాకు కలుగుతుంది. అక్కడకి వచ్చిన మహర్షి జనులను సేవించే భాగ్యమూ అలవడుతుంది. ఈ కారణాలను బట్టి అక్కడకు వెళ్ళాలని నా మనస్సు ఉవిళ్ళూరుతున్నది. గుణత్రయాత్మకమైన ఈ ప్రపంచాన్ని స్వమాయాప్రభావంతో వినిర్మించిన మీకు ఇది ఒక గొప్ప విషయం కాకపోవచ్చు. నేనంతటి తత్త్వజ్ఞురాలిని కాను. సామాన్య స్త్రీనైన నాకు తక్కినవారి వలెనే పుట్టినిల్లనగానే కోర్కెలు క్రేళ్ళుదాటుతాయి.

దేవా! అక్కడ చూడండి. ఆకాశమండలమంతా హంసధవళ విమానాలతో దేదీప్యమానంగా విరాజిల్లుతున్నది. దక్షునితో ఎటువంటి బంధుత్వమూ లేని కాంతలు కూడా భర్తలతో కలిసి ఆ యజ్ఞానికి వెళ్తుండగా, కడుపారా కన్నతండ్రి యింట గొప్ప వేడుక జరుగబోతున్నదని విన్న కూతురు మనోగతి ఎలా ఉంటుందో మీరే ఊహించండి. పిలవని పేరంటానికి పోవడం ఎందుకంటారేమో? పుట్టింటికి, భర్త యింటికి, స్నేహితుల యింటికి వెళ్ళడానికి వనితలకు పిలుపుల పట్టింపులుండవు. ఆ చోట్లలో వారికి

సర్వస్వాతంత్ర్యం ఉంటుంది. నా ప్రణయాన్ని మనస్కరింపగలరని ప్రార్థిస్తున్నాను. ఏ మీ కృపావిశేషం నాకు మీ శరీరంలో అర్ధభాగాన్ని ప్రసాదించిందో, ఆ కృపావిశేషం ఈనాటి నా విన్నపాన్ని మన్నింపగలదని నమ్ముతున్నాను. నన్ను అనుగ్రహించండి' అని విన్నవించుకొన్నది.

## పరమశివుని హితబోధ

విదురా! శంకరుడు సతీదేవి ప్రణయాన్ని విని చిరునవ్వు నవ్వుతూ, ఆమెను అనునయించాడు. 'సతీ! మన చుట్టాల ఇంటికైతే పిలవకపోయినా పోవచ్చునని అన్నావు. అహంకారం ఒకరి కొకరికి అరమరలను కలిగించనంత కాలం నీవన్నమాట యుక్తంగానే ఉంటుంది. విద్య, తపోమహిమ, ధనము, సౌందర్యం, వయస్సు, కులము – ఈ ఆరూ సజ్జనుల యందు సుగుణాలు, దుర్జనుల యందు విగుణాలూ అవుతాయి. దుర్జనులు విద్యాధనాదుల కలిమి వల్ల గర్వించి మైమరచి మదాంధులవుతారు. తత్ఫలంగా వారు పెద్దలను లెక్కచేయరు. మరి వారిని ఆ కుటిలబుద్ధి ఊరికే ఉండనివ్వదు. మాటలలో, చేతలలో ఆ కౌటిల్యం బయటపడుతూనే ఉంటుంది. పెద్దలు వారి కడకు వచ్చినపుడు వారు కన్నుగీటి, మాట మీరుతారు. కోరచూపులు చూస్తారు. నిరాదరణ సూచనలను వెల్లడిస్తారు. దుర్జనులు ఎంత ఆత్మీయులైనా వారి యిండ్లకు వెళ్ళకూడదు. కుటిలులైన దుర్జనుల దురుక్తుల వలె శత్రువులు యుద్ధసమయంలో ప్రయోగించిన ఆయుధాలు కూడా మర్మాలను నాటి మనఃపరితాపాన్ని కలిగింపలేవు. ఆ గాయాలు ఏ నాటికీ మానవు.

సతీ! నీవు నీ జనకునికి ప్రేమభాజన పుత్త్రికవు కావడం నాకు తెలియనిది కాదు. అయినా నీవు నన్ను చేసుకొన్నప్పటినుంచీ నీ జనకుని ఆదరానికి దూరమయ్యావు. నిరహంకారులు వారి పుణ్యఫలం వలన ఉన్నత కీర్తిని, పదవులను చూరగొంటారు. అది చూసి దుష్టులు సహింపలేరు. పైగా వారితో కయ్యానికి కాలుదువ్వుతారు. హరి ఎంతటివాడో నీకు తెలుసు. ఆ

మహానుభావుని యెడ రాక్షసులకు గల భావమే నా మాటకు నిదర్శనం.

> కళ్యాణీ! పెద్దలు ఒకరి కొకరు ఎదురేగి అభివాదన పూజాదులు కావించటం ఎరుగుదువు కదా. వారు ఆ విధంగా నమస్కరిస్తున్నది పరస్పర శరీరాలకు కాదు. వారిలో అంతర్యామియై ఉన్న పరమపురుషునికి ప్రణమిల్లుతారు. అభివాదనశీలురకు, పెద్దలను గౌరవించేవారికి ఆయువు, విద్య, యశస్సు, బలం వర్ధిల్లుతాయి. భగవానుడు సర్వశరీరాలలోనూ అంతర్యామియై ఉంటాడు. ఆ మహాత్ముడు స్థూలేంద్రియాలకు గోచరింపడు. ఆ పరమాత్మునికి నేను నా మనస్సులో నిరంతరం నమస్కరిస్తాను. నీ తండ్రి ఈ రహస్యం తెలియక ఆనాడు ప్రజాపతుల సత్రయాగంలో నేను లేచి తనకు బాహ్యమర్యాదలు చేయలేదని తలచి నిర్నిమిత్తంగా నన్ను దూషించి తిరస్కరించాడు. అందువల్ల అతను, అతని కోటిలోని వారు నాకు మాన్యులు కారు. నా హితవచనాన్ని పాటింపక నీ వక్కడికి వెళితే నీకు ఎంత మాత్రం మేలు కలుగదు. మర్యాద కలవారికి స్వజనతిరస్కారం కంటె మరణమే మేలు'.

అని పలికి, 'ఈమెను అక్కడికి పంపినా, పంపకపోయినా రానున్న కీడు రాక తప్పదు' అని లోలోన తలచి, మరి మాటాడక మిన్నకున్నాడు. విదురా! సర్వజ్ఞులకు తెలియని రహస్యం ఉంటుందా?

## సతీదేవి నిశ్చయం

సతీదేవికి పుట్టింటికి వెళ్ళాలన్న కోరిక మరింత బలపడసాగింది. భర్త అందుకు సమ్మతింపక ఆమెను నిరుత్సాహపరుస్తూ వచ్చాడు. ఒక వంక తండ్రి చేస్తున్న మహాయజ్ఞానికి వెళ్ళి తాను కూడా అందులో పాల్గొనాలనే కోరిక, మరొక వంక పతి అనంగీకారం చెరొక వైపుకూ లాగుతుండగా ఆమె చిత్తం డోలాయమానం కాజొచ్చింది. పైకి చెప్పుకోలేని బాధ, దుఃఖం లోలోన

ప్రజ్వరిల్లుతున్నందున ఆమె మేను కంపింపసాగింది. ముఖం చిన్నబోయింది. కన్నులు బాష్పధారలను వర్షించాయి. ఊర్పులు వెచ్చనై భారంగా వెలువడ్డాయి. స్త్రీ జాతికి నైజమైన మౌఢ్యం మైకొన్నది. అర్ధశరీరం ఇచ్చిన పతిపైని కూర్మిసైతం సన్నగిల్లింది.

ఆ విధంగా సతీదేవి శోకరోషావిల చిత్తంతో తండ్రి యింటికి వెళ్ళాలని బయలుదేరింది. శివుడు మారుమాట చెప్పక ఊరుకొన్నాడు. శివపార్షదులు ప్రయాణ సామగ్రిని సిద్ధం చేసి వృషభవాహనంపై ఆమె నెక్కించి మంగళ వాద్యాలను మ్రోగిస్తూ సంరంభంతో వెంట నడిచారు.

## దక్షుని ఉపేక్ష

సతీదేవి కొంతకాలానికి తండ్రి యజ్ఞశాలను చేరుకొన్నది. ఆ శాల హిరణ్మయ మృణ్మయ లోహమయ దారుమయ పాత్రలతో నిండి కుశ చర్మాదులు పరువబడి బ్రహ్మ ఘోషలతో ప్రతిధ్వనిస్తున్నది. సతీదేవి ఇంటి గుమ్మంలో కాలు పెట్టగానే తల్లి, తోబుట్టువులు చుట్టూ చేరి ప్రేమాదరపూర్వకంగా ఆలింగనాదులతో ఆమెను సత్కరించి, కుశలప్రశ్న లడిగి, ఉచితాసనం పైని కూర్చుండబెట్టారు. ఆ శాలలో ఉన్నవారెవరూ ఆమె వంక నైనా చూడలేదు. దక్షుడు రుద్రభాగాన్ని కల్పింపక యజ్ఞం చేయసాగాడు.

దక్షడు శివుని యెడ చూపిన ఉపేక్షాభావాన్ని సతీదేవి గ్రహించి, 'నా భర్త వీరందరికీ ఇంత హేళన పాత్రం ఎందుకు కావాలి?' అని లోలోపల దుఃఖించి ముల్లోకాలనూ దహింపబోతున్నంత మహా క్రోధాన్ని వహించింది. ఆమె వెంట వచ్చిన భూతగణాలవారు ఆమె సంకల్పాన్ని, ఆమె ముఖంలో ప్రస్ఫుటిస్తున్న క్రోధలక్షణాలను గ్రహించి, ఆ యజ్ఞాన్ని విధ్వంసం చేయడానికి ముందుకురికారు. సతీదేవి వారిని వారించి, 'ఓహో! దక్షుడు తనవలె కర్మాచరణం చేయగలవారు లేరని గర్వించాడు. ఈ శివద్వేషిని ఏమనాలి?' అని పరిపరి విధాల చింతించింది. తండ్రి యెదుట నిలబడి ఈ విధంగా అన్నది.

## సతీదేవి ఆగ్రహం

'ఎవడు శరీరధారులందరికీ ప్రియాతి ప్రియుడో, ఎవడు నిర్వైరుడు, సర్వాత్ముడు అయి విరాజిల్లుతున్నాడో, అట్టి మహాత్మునికి నీవంటి ప్రతికూలవర్తనులు పుట్టరు. పరుల గుణాలలో నెరసు లెన్నడం సాధువులకు తగదు. పెద్దలు స్వల్పగుణాలను కూడా ఎంతో పెద్దచేసి మన్నిస్తారు. అటువంటిది మహాత్ములను కూడా నీవు తృణీకరించావు. కుత్సితులు వారి పాదధూళి కైనా సాటిరారు. మహాత్ముల యెడ ఈర్ష్యగొని వారిని నిందిస్తుంటే చూచేవారికీ ఎంతో అసహ్యంగా ఉంటుంది.

శివశబ్దం లోకమంగళకరం. ఆ రెండక్షరాలను పొరపాటున ఉచ్చరించినా చేసిన పాపాలన్నీ పటాపంచలవుతాయి. అట్టి పవిత్రమూర్తిని, అనుల్లంఘ్యశాసనుని ద్వేషించావు. నీవు చేస్తున్నది సరైనదో కాదో కనీసం చేసిన తర్వాత నైనా విచారింపలేకపోయావు. మహాత్ముల హృదయమధుపాలు బ్రహ్మానందామృతాన్ని కోరి ఏ పూజ్యుని పాదపద్మాన్ని ఆశ్రయిస్తాయో, ఆ విశ్వబాంధవుని యెడ తీరని అపచారం చేసి అపరాధివయ్యావు. ఆ సర్వేశ్వరుడు విభూతి దాల్చి పునుకదండలను అలంకరించుకొని జడలు విరబోసికొని పిశాచపరిచారుడై వల్లకాటిలో కాపురం ఉంటాడని ఆయనను నిందించావు. అవి నీ బుద్ధికి దోషాలుగా తోచాయి. శంకరుడు ఆ విధంగా ఉండటం శివమో అశివమో బ్రహ్మాది మహాత్ములను అడిగి అయినా తెలుసుకొనరాదా? ఆ మహనీయుడు కాలద్రోసిన దానిని పెద్దలు తలదాల్చడం లోని పరమార్థం ఏమిటో గ్రహింపగలిగావా?

ధర్మపరిపాలకుడైన ఈశ్వరుని దుర్మతులు నిరంకుశులై నిందించినప్పుడు ఏమి చేయాలి? వారి నోరు మూయించటం ప్రథమపక్షం. అది చేతకాకపోతే చెవులు మూసుకొని అక్కడ నుంచి వెళ్ళిపోవటం ద్వితీయపక్షం. శుభాత్ములు అటువంటప్పుడు ప్రాణత్యాగం చేయడం సర్వోత్తమం. శివదూషకుడవైన

నీవల్ల కలిగిన ఈ శరీరాన్ని నేనిక ఎంతమాత్రం వహింపకూడదు. తెలిసో తెలియకో విషాన్నం తిన్నామని తెలియగానే తిన్నది జీర్ణింపకముందే వెలిగ్రక్కటం మంచిది కదా!

> దేవ మనుష్యాదులకు గతిభేదాలతో పాటు ధర్మభేదాలు కూడా స్వతస్సిద్ధాలు. అటువంటి ధర్మాలు ఎవరు ఏ విధంగా చేయవలసినదీ వేదాలు నిశ్చయించి అందుకు తగిన కర్మవిధులను బోధిస్తున్నాయి. ఆ కర్మకలాపమంతా కర్మబద్ధులకే కాని ఆత్మారాములకు కాదు. శివుడు నిరంతరం ఆత్మారాముడై ఉన్న మహాత్ముడు. ఆ రహస్యం ఎరుగక కర్మనిష్ఠులు ఆయనను అధిక్షేపించటం తగదు. వేదచోదిత ధర్మాలను నిరసించేవాడు నిందార్హుడు కాడా? అని వాదిస్తావేమో. వేదాలు ప్రవృత్తి నివృత్తి ధర్మలక్షణాలు రెండింటినీ బోధిస్తాయి. అందులో ప్రవృత్తి లక్షణ ధర్మాలు రాగాత్మకమైనవి. నివృత్తి లక్షణ ధర్మాలు వైరాగ్యాన్ని కలిగిస్తాయి. మొదటివి సంసారులకు రుచిస్తాయి. రెండవరాశివి ఆత్మారాములైన యోగులకు అభిమతాలవుతాయి.

యోగులు ద్వంద్వాతీతులు. వారికి విధినిషేధాలు రెండూ ఉండవు. ఎప్పుడైనా వారు విధి నిషేధాలను పాటిస్తున్నారంటే అది లోకకల్యాణార్థమే తప్ప ఆత్మార్థం కాదు. ఈ ద్వివిధనిష్ఠలను ఒకే వ్యక్తి ఒకే సమయంలో పాటించడం సాధ్యంకాదు. నీవు మిక్కిలి ఆయాసపడి యజ్ఞశాలలు నిర్మించి మహోత్తమయజ్ఞాలను చేస్తున్నానని గర్వపడుతున్నావు. ఇంత కష్టపడీ నువ్వు సమార్జించే ఫలం ధూమమార్గాన వెళ్ళి పొందే లోకాలు మాత్రమే కదా! అవి యజ్ఞాన్న పరితృప్తులు ప్రాకులాడవలసినవే గాని మావంటి వారికి కోరదగినవి కావు. మేము కోరుకొనేవన్నీ ఇచ్ఛామాత్రజన్యమైనవి. కోరిక, ఫలప్రాప్తి మాకు ఏకకాలంలోనే జరుగుతాయి. ఈ యజ్ఞాదిఫలాలు మాకు కాదు; అవి బ్రహ్మజ్ఞులకు మాత్రమే సేవనీయాలు. అవి పుణ్యలోకాలే గాని భోగ్యలోకాలు కావు.

మహాత్ములకు అపకారం చేయదలచినవారి జన్మం జన్మమే కాదు. అటువంటి జన్మ దేనికి కాల్చనా? అయ్యో! ఈ కుజనప్రసంగాలకు సిగ్గవుతున్నది. ఈ తనువును ఇంకా ధరిస్తే శంకరుడు నన్ను 'దాక్షాయణీ' అని పరిహాసం చేయక మానడు. ఆ తీరుగా నైనా నీ పేరు చెవిసోకి నీకు నేను జన్మించానన్న విషయం గుర్తుకు వస్తుంది. అంతకంటె అసహ్యమైనది నాకు వేరే ఏముంటుంది? కనుక నీ తనువు నుంచి పుట్టిన ఈ శవప్రాయ శరీరాన్ని ఇప్పుడే త్యజించివేస్తున్నాను' అన్నది.

## సతీదేవి దేహపరిత్యాగం

విదురా! ఆమె ఆ విధంగా నిశ్చయించి, నాలుగడుగులు ఉత్తరదిశకు నడిచి, పీతాంబరం కట్టి, ఆచమించి, శుచియై, కన్నులను మూసి, యోగమార్గం అధిష్ఠించి, ఆసనజయం కావించి, ప్రాణాపానవాయువులను స్వగతుల నుంచి నిరోధించి, ఐక్యాన్ని గూర్చి, నాభి చక్రమందు చేర్చి, అక్కడి నుంచి ఉదానవాయువును లేపి ఆ మూడింటినీ మనస్సుతో హృదయస్థానానికి తీసుకొనివచ్చి, అక్కడి నుంచి కంఠం ద్వారా భ్రూమధ్యానికి నడిపి భర్తృపాదారవింద ధ్యానైకచిత్తురాలై సమస్తం మరచి పవనాగ్ని ధారణను కావించింది. ఆ సమాధి యోగాగ్ని వెనువెంటనే ప్రజ్వరిల్లి ఆమె శరీరాన్ని దగ్ధం చేసింది. ఏ శరీరాన్ని పూజ్యాతిపూజ్యుడైన శంకర భగవానుడు తన అంకాన కూర్చి ఆదరించాడో, ఆ శరీరం అగ్నిజ్వాలామాలికలకు ఆహుతి కావడం చూసి భూమ్యంతరిక్షాలు హాహాకారాలు చేసి, 'ఈ దక్షుని దౌర్జన్యాన్ని, ఏమనాలి? తన అపరాధ ఫలంగా తన తనూజాత తనుత్యాగం చేస్తుండగా ఇతను కన్నారా చూస్తాడే కాని, 'తల్లీ, వద్దమ్మా' అని మాటమాత్రమైనా అనడు. ఈ శివద్వేషికి దురంతదుర్యశం కలుగుతుంది గాక' అన్న కేకలు మార్మోగాయి.

సతీదేవి పాటును చూసి శివపార్షదులు కత్తులు దూసి దక్షుని మీదికి ఉరికారు. అధ్వర్యుడైన భృగుమహర్షి యజ్ఞభంగానికి అదిరిపడి దక్షిణాగ్నిలో అభిచారహోత్రం కావించాడు. ఆ హోమకుండం నుంచి పూర్వం తమ తపోబలంతో చంద్రమండలాన్ని చేరుకొన్న ఋషులు, దేవతలు వేల కొలదిగా వెలువడి ఆ యజ్ఞశాలలో మండుతున్న కొరివి కట్టెలను తీసుకొని శివపార్షదుల వెంటబడ్డారు. వారు బ్రహ్మతేజానికి భయపడి పరుగులుపెట్టారు.

## వీరభద్రావతారం

విదురా! సతీదేవి తనుత్యాగం చేసిన సంగతి నారద మహర్షి వలన రుద్రునికి తెలియవచ్చింది. ఆయన మండిపడి మెరుపుతీగల వంటి తన జటలలో ఒకటి పెరికి, అట్టహాసం కావించి దానితో భూతలాన్ని మోదాడు. ఆ భూభాగం నుంచి సహస్ర భుజాలతో సూర్యత్రయాన్ని పోలిన నేత్రత్రయంతో జ్వాలారూప శిరోజాలతో కరాళ దంష్ట్రలతో కపాలమాలికలతో భయంకరాకారుడైన వీరభద్రుడు అవతరించి, వివిధాయుధాలను చేతబూని రుద్రుని యెదుట నిలిచి, కేలుమోడ్చి, 'ప్రభూ! ఆనతివ్వు' అని అడిగాడు.

## రుద్రుని ఆజ్ఞ

రుద్రుడు వీరభద్రుని చూచి, 'వీరభద్రా! నీవు నా ప్రమథగణానికి నేతవై వారితో కలిసి వెళ్ళి దక్షుని, అతని యజ్ఞాన్ని ధ్వంసం కావించు. నా అంశతో పుట్టిన నీకు ఎదురుండదు' అని ఆజ్ఞాపించాడు.

వీరభద్రుడు రుద్రునికి ప్రదక్షిణం కావించి, మృత్యువుకు కూడా మృత్యువైన శూలాన్ని కరతలాన ధరించి సింహనాదం చేసి నూపుర ధ్వనులు ఘల్లుఘల్లుమనగా బయలుదేరాడు. అతని వెంట రుద్రపార్షదులు వేనవేలుగా నడిచి వచ్చారు.

అందరూ దక్షుని యజ్ఞవాటి మార్గాన్ని ప్రవేశించి ముందుకు సాగారు.

## మహోత్పాతాలు

వీరభద్రాదుల పాదసంఘట్టనలతో కెంధూళులు రేగి దివికి లేచాయి. దక్షయజ్ఞ ఋత్విజులు, సదస్యులు ఉత్తరదిశను క్రమ్మిన ధూళి మేఘాలను చూసి, 'ఏమిటి ఈ వింత! ఏ వంక చూసినా గాడ్పులు లేవు. ఈ ధూళి పటలం ఎక్కడినుంచి వచ్చింది? ఇది చోరులు దాడి చేసిన దుమ్మనుకొందామంటే ప్రాచీనబర్హి రాజై ఉండగా చోర సంచారానికి అవకాశమే లేదు. ఆవులు దూడలకై గుంపులు కట్టాయా? అంటే ఇది సమయం కాదు. ఒకవేళ ప్రళయం గాని రావడం లేదు కదా!' అని తలకొక తీరున ఊహింపసాగారు.

దక్షుని భార్య ప్రసూతి ఆ ధూళిమేఘాలను చూసి, 'ప్రజాపతి చేసిన అపరాధానికి ఇది ఫలం అనిపిస్తున్నది. ఆయన తన కన్నబిడ్డలు, వచ్చిన పెద్ద మునుషులు ఇంతమంది చూస్తుండగా చిన్ని కుమార్తెను సతీదేవిని భరింపరాని తలవంపుల పాలుచేశాడు. ఆ అవమానానికి సతీపతి రుద్రుడు ఊరుకొంటాడా? అతను ప్రళయ కాలరుద్రుడై జటాకలాపుడై శూలాగ్రానికి దిగ్గజాలను గ్రుచ్చి ధరించినప్పుడు వివిధాయుధాలను తాల్చిన బాహుదండాలే ధ్వజపటాలుగా పైకి లేచి దిక్కులు పిక్కటిల్లేటట్లు అట్టహాసం కావించి విలయతాండవం చేయగా చెలరేగిన దుమారం కాబోలు. అతనికి క్రోధం కలిగించి బ్రహ్మదేవుడు కూడా బతికి బట్టకట్టడం కలలోని మాట. నా మనస్సు కీడు శంకిస్తున్నది. ఏదో అకార్యం జరుగక మానదు' అని గజగజలాడుతూ దిగులు చెందసాగింది.

## దక్ష సంహారం

అంతటిలో మహోత్పాతాలు భయావహంగా పైబడి భూనభోంతరాళాలను దద్దరిల్లజేశాయి. అంతలోనే రుద్రపార్షదులు వివిధరూపాలలో అవతరించి సాయుధులై యజ్ఞశాలలను ముట్టడించారు.

వారిలో కొందరు ప్రాగ్వంశాన్ని పాడుచేశారు. కొందరు పత్నీశాలను భగ్నం చేశారు. అగ్నీధ్రశాలను కొందరు నేలమట్టం కావించారు. పాకశాలను కొందరు పడగొట్టారు. కొందరు యజ్ఞపాత్రలను ముక్కలు ముక్కలు చేశారు. అగ్నులను కొందరు ఆర్పివేశారు. అగ్నికుండంలో కొందరు మూత్రం పోశారు. వేదిమేఖలలను కొందరు విరిచి పారేశారు. విహారాలను కొందరు, సదస్సులను కొందరు ఆక్రమించారు. కొందరు మునులను పట్టి చావగొట్టారు. కొందరు ముని పత్నులను జడిపించారు. సదస్యులు, ఋత్విజులు చెల్లాచెదరై పారిపోయారు. దేవతలు వారి దాడికి భయపడి కాలికి బుద్ధిచెబుతుండగా వారిని కొందరు వెంటాడి పట్టుకొని కాలదన్ని నేలరాచారు. కొందరు మఖశాలపై రాళ్ళు రువ్వారు. మణిమంతుడు భృగుమహర్షిని బంధించి, 'అయ్యా! ఆనాడు సభాస్థలిలో మెలివేసిన మీసాలు ఇవేనా?' ఇని దెప్పిపొడుస్తూ మీసాలను పట్టి గట్టిగా ఊడబెరికాడు. నందీశ్వరుడు భృగుని పట్టుకొని, 'స్వామీ! దక్షుడు శివుని దూషించేటప్పుడు కన్నులెగరవేశావు కదా. ఆ కన్నులు ఇవేనా?' అని కన్నులను పెరికివేశాడు. చండీశ్వరుడు పూషుని బంధించి, 'దేవా! దక్షుడు శివుని దుమ్మెత్తిపోసినప్పుడు ఇకిలించి పండ్లు చూపించావు. ఆ దంతాలు ఇవేనా?' అని అతని పళ్ళు రాలగొట్టాడు. వీరభద్రుడు దక్షుని నేలకు తోసి తొక్కి పట్టి రొమ్ము మీద కత్తి మొన గుచ్చి బైటికి లాగబోయాడు. అది ఊడిరాలేదు. వీరభద్రుడు కుపితుడై వివిధాయుధాలను భయానకంగా కురిపించాడు. అందులో ఒక్కటయినా దక్షుని శరీరం లోనికి చొరలేకపోయింది. అతనందుకు ఆశ్చర్యపడి కొంతసేపు ఆలోచించి, యజ్ఞపశువును వధించే ఉపాయాన్ని ఊహించి దక్షుని గొంతు బిగించి నులమసాగాడు. ప్రేతభూతపిశాచాలు అది చూసి భళిభళీ అని కేకలు వేశాయి. ఇతరులు విపరీతాలను పలికారు. దక్షుని ప్రాణాలు పంచభూతాలలో కలిసిపోయాయి. వీరభద్రుడు అతని మెడను తెగవేసి ఆ తలను దక్షిణాగ్నిలో హోమం చేసి యజ్ఞశాలను తగలబెట్టి సైన్యంతో తిరిగి కైలాసానికి వెళ్ళిపోయాడు.

## దేవతల వేడికోలు

విదురా! దేవగణం ఆ విధంగా రుద్రపారిషదుల చేత భంగపడి తెగిన శరీరాలతో రొప్పుతూ రోజుతూ బ్రహ్మ వద్దకు వెళ్ళి చేతులు జోడించి జరిగిన సంగతిని ఆయనకు విన్నవించారు. బ్రహ్మదేవుడు వారి మొరలు విని, 'సురలారా! మీరు చెప్పినది జరగబోతున్నదని ముందుగానే తెలిసి నేను, శ్రీహరి అక్కడికి రాలేదు. మేము ఎందుకు రాలేదనైనా మీరు తలంపరైతిరి. శివుడు చేసినది తప్పని మీ భావన. పెద్ద లౌకవేళ తప్పు చేసినా శ్రేయస్కాములు వారికి బదులు చెప్పకూడదు. ఆ సంగతి సరే. భవుడు నిరపరాధి. మీరందరూ కలిసి యజ్ఞభాగం అతనికి అందకుండా నిషేధించారు. ఇది అతని యెడ నిష్కారణంగా చేసిన అపరాధం కదూ! ఆ మహాత్ముడే ఆగ్రహిస్తే ఏమైఉండేది? ముల్లోకాలూ భస్మీపటలమైపోవూ? దక్షుని పరుషవచనాలచే ప్రజ్వరిల్లిన శివక్రోధాగ్ని సతీదేహత్యాగరూప వాయుసముద్దీపితమై భగభగభగ మండుతున్నది. శంకరుని బలవీర్యం 'ఇంత' అని మీరే కాదు, మరెవ్వరూ ఎరుగరు. ఆ మహాత్ముని ప్రసన్నుని గావింపగల వారెవరో నాకు అంతుపట్టడం లేదు. ఇక మిగిలిన దొక్కటే. శివుడు శీఘ్రప్రసాది. ఇప్పటికైనా మీరు మీ తప్పు గ్రహించి అతని పాదాలను ఆశ్రయించండి. మీ యజ్ఞం మళ్ళీ కొనసాగుతుంది' అని ఆదేశించాడు. అందుకు దేవ పితృ ప్రజాపతు లందరూ అంగీకరించి, తమవెంట కైలాసానికి బ్రహ్మను కూడా రమ్మని ప్రార్థించారు. బ్రహ్మ అందుకు సమ్మతించి, వారిని వెంటబుట్టుకొని కైలాసానికి బయలుదేరాడు.

## కైలాస వర్ణనం

విదురా! ఆ కైలాసం వివిధ ధాతుచిత్రితమై, నానామణి ద్యుతులను విరజిమ్ముతున్న శిఖరాలతో నిండి ఉంటుంది. ఆ శిఖరాలలో సిద్ధసుందరీ సుందరులు విహరించే అందమైన కందరాలెన్నో ఉన్నాయి. అక్కడి పొదరిండ్లు మందమారుతాల మధురస్పర్శలకు పులకరించి, పూల తీగెలను చేతులుగా

చేసుకొని పథికజనులను స్వాగతిస్తున్నట్లుగా కదలాడుతుంటాయి. చిలుకలు, గోరువంకల మృదుమధురాలాపాలు వీనులకు విందుగా వినిపిస్తుంటాయి. తుమ్మెదలు పూలతేనెలను గ్రోలిన ఆనందాతిశయాన్ని శ్రుతిపక్వమైన ఝుంకారనాదాలలో పలికిస్తూ పాంథులను పరవశింపజేస్తాయి. అక్కడ పూచి ఏపుగా పెరిగి సొంపారుతున్న చూత కదంబ పున్నాగ చంపకాశోక వకుళ కురవక మందార పారిజాతాది వృక్షారామాల తోను, కుంద కుటజ మల్లికా మాలతీ వాసంతికాది లతామంటపాల తోను, వికచ కుముదోత్పల కమల కల్హార మనోహర కాసారాల తోను, కమలాది కింజల్క పరాగ పరీత నూత్న వర్ణాభిరామములైన హంస సారసాదులతో అలరారుతూ ఆ ప్రదేశం సర్వేంద్రియ తర్పణను కావిస్తుంటుంది. ఆ పర్వతంలో సింహవ్యాఘ్ర వరాహ శరభాది క్రూరమృగాలు స్వేచ్ఛగా విహరిస్తుంటాయి. వాటి చెంతనే లేళ్ళు, జింకలు చెంగు చెంగున గంతులు వేస్తూ చెట్ల కొమ్మలకు ఊయల లూగుతున్న కపిరాజులతో జతకలిపి ఆటలాడుకొంటుంటాయి. అక్కడి వనాంతరాలు మృగనాభి వాసనా వాసిత గండశిలా మండితాలై హృదయానంద సంధాయకంగా భాసిల్లుతుంటాయి. సతీదేవి స్నానపవిత్రయై తన కృతజ్ఞతను వెల్లడిస్తున్నట్లుగా గంగానది ఆ గిరిప్రదేశాన్ని చుట్టి పారుతుంటుంది.

## అలకాపురవర్ణనం

విదురా! బ్రహ్మాదులు ఆ విధంగా కైలాస విశేషాలను పరికిస్తూ ముందుకు సాగి అలకాపురాన్ని చేరుకొన్నారు. ఆ పురబహిర్భాగంలో అలక, అలకనంద అని రెండు నదులున్నాయి. ఆ నదులు శ్రీ మహావిష్ణుపాదపద్మ స్పర్శభాగ్యానికి నోచుకొన్న లోకపావనకర దివ్యవాహినులు. అవి సుర సుందరీసుందరులకు జలక్రీడలతో విహారశ్రమను అపనయింప జేయగలిగినవై మరున్నారీ కుచకుంభ పంకిల జలపూర్ణములై లోకాభిరామంగా వెలుగొందుతుంటాయి. బ్రహ్మాదులు ఆ నదీద్వయాన్ని దాటి ముందుకు వెళ్ళి అక్కడ ఒక వటవృక్షాన్ని చూశారు.

## ఆదిమునీశ్వర దర్శనం

ఆ వటవృక్షం శతయోజనోన్నతమై డెబ్భైఅయిదు యోజనాల పర్యంతం ఊడలు పరిచి నీడలతో చిమ్మచీకట్లను కప్పుతున్నది. అదేమి వింతో గాని అంత పెద్ద వృక్షంలో పక్షి గూడు చూద్దామన్నా ఒక్కటీ లేదు. ఆ వటవృక్షం క్రింద ఒక వ్యక్తి భస్మావలిప్తదేహుడై దండ కమండలాలను, జటాజినాలను ధరించి సంజమబ్బులను పోలిన నల్లని శీర్షభాగాన శశిరేఖ శీతమయూఖాలను వెదజల్లుతుండగా, దర్భాసనంపై ఎడమ పాదాన్ని కుడి తొడ మీదికి చేర్చి కూర్చొని దక్షిణభుజాన్ని వామజానుతలాన నిలిపి వీరాసనస్థుడై కుడిచేయి మణిబంధంలో అక్షమాలను దాల్చి చూపుడు వ్రేలు, బొటనవ్రేళ్ళ అగ్రభాగాలను చేర్చి తర్కముద్రను పట్టి అతిప్రశాంతంగా ఆసీనుడై ఉన్నాడు. అతనిని పరివేష్టించి సునందనాది శాంతసిద్ధులు, కుబేరాదులు అమిత భక్తితో ఆరాధిస్తున్నారు. ఆ దివ్యపురుషుడు విద్యాతపోయోగస్థుడై జగన్మంగళాన్ని చింతిస్తూ, చెంతనున్న నారదునికి సనాతన బ్రహ్మవిద్యను ఉపదేశిస్తున్నాడు. ఆ విధంగా బ్రహ్మానంద నిర్వాణం సాక్షాత్కరించినట్లు దర్శనమిచ్చిన ఆ ఆదిమునీశ్వరునికి బ్రహ్మాదులు నమస్కరించారు.

## బ్రహ్మదేవుని ప్రార్థనం

మహేశ్వరుడు బ్రహ్మాదులకు ప్రతిపూజలను కావించాడు. ఆ వెంటనే రుద్రానుచరులైన సిద్ధమహర్షులు కూడా బ్రహ్మదేవుని అభ్యర్చించారు. అప్పుడు పరమేష్ఠి దరహాసప్రసన్నముఖుడై ఈ విధంగా ప్రార్థించాడు.

> "దేవా! నీవు మాకందరికీ నమస్కార్యుడవు. నీ మహిమైశ్వర్యాలు మాకు అవిదితాలు కావు. నీవు జగత్కారణుడవు, ప్రకృతి పురుషులకు బీజభూతుడవు కనుక విశ్వేశ్వరుడ వనదగి ఉన్నావు. అయినప్పటికీ నీయందు భేదభావం కాని వికారములు కాని తలయెత్తవు. నా వచనం

బాహ్యదృష్టులకు విరుద్ధవచనంగా తోపవచ్చును. కాని తత్త్వవేత్తలు ఆ విధంగా తలంపరు. ఏమంటే శివశక్తులు రెండూ కలిసి మెలిసి వేరుచేయరానివై వెలుగొందుతుంటాయి. వాటిలో శివతత్త్వమంటే జ్ఞానస్వరూపం. శక్తితత్త్వం క్రియాస్వరూపం. జ్ఞానానికి సంకల్పం కలిగినప్పుడు క్రియాతత్త్వం వ్యవహృతిని పొందుతున్నది. తత్ఫలంగా సృష్టి ఏర్పడుతున్నది. ఇదంతా నీ యొక్క క్రీడావిలాసమే తప్ప కర్మఫలానుభోగ్యత కాదు. సృష్టికార్యానికి సాధనాలు అవసరం లేదా? అని కొందరు సంశయిస్తారు. అందకు ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ నీవే అని గ్రహిస్తే ఈ సంశయం తలయెత్తే అవకాశం ఉండదు. నీ యీ విచిత్ర రచనా తత్త్వాన్ని తెలియదలిస్తే సాలెపురుగును చూసి కొంతకు కొంత గ్రహించవచ్చు.

దేవా! వేదవాఙ్మయం ధర్మార్థాలను సమకూరుస్తుంది. వేద ధర్మరక్షణార్థం దక్షుని నిమిత్తంగా నిలిపి ఆ అధ్వరాన్ని నీవు సంకల్పించావు. ధర్మ మర్యాదలను నిర్మించి బ్రాహ్మణులు దృఢవ్రతులై వాటిని ఆచరించే విశ్వాసాన్ని కూర్చావు. ఎవరెవరు ఏయే శుభకర్మాలను అనుష్ఠింపగోరితే వారి వారికి తగినట్లుగా అనుష్ఠానభేదాలను నిశ్చయించావు. ఆయా అనుష్ఠానాలకు తగినట్లుగా స్వర్గాపవర్గఫలాలను ప్రసాదిస్తావు. అశుభ కర్మలను పొనరించేవారిని నరకకూపానికి త్రోసివేస్తావు. ఎంతటివారికైనా నీ ఆజ్ఞలను ఉల్లంఘించటం తరం కాదు.

దేవా! ఫలాన్ని కోరి కర్మలను ఆచరించే భేదదర్శనులకు దుఃఖం తప్పదు. కర్మపరులను ఆశాపాశాలు పలువిధాల ఆటలాడిస్తాయి. ఆ పాశాలలో చిక్కుకొని వారు స్వపరతత్త్వజ్ఞానరహితులై లేని ఆధిక్యాన్ని కోరి పరుల ఉన్నతిని చూడలేక పడరానిపాట్లు పడుతుంటారు. వారి అసూయ

దుర్భాషణల రూపంలో వెలిబ్రాకుతుంది. వారు కేవలకృపణులు. సమదర్శనులు వారిని చూసి కరుణామృతవర్షాన్ని కురిపిస్తారే కాని క్రోధావేశాలకు లోను కారు. దైవోపహతులైన అటువంటి దురాత్ముల యెడ నీవంటి వారి దృష్టి అనుగ్రహపూర్వకం కావాలే కాని ఆగ్రహపూర్వకమైతే నిన్నెదిరించి నిలువగల సమర్థులు ఈ లోకంలో ఎవరున్నారు?

దేవా సర్వయజ్ఞాలకూ నీవే ఫలప్రదుడవై ఉండగా నీకు మరొకరు హవిర్భాగాన్ని ఇవ్వడమూ, ఇవ్వకపోవడమూ ఎలా పొసగుతుంది? ఒకవేళ వారు హవిర్భాగాలను నీకు సమర్పిస్తే అది వారి భక్తికి నిదర్శన మవుతుందే కాని నీకేదో భాగాన్ని పంచియివ్వడం కాదు కదా? యాజకులు కుత్సితమతులై తమ ధర్మాన్ని ఆచరింపకపోతే దానివల్ల నీకు కలిగే నష్టం ఏమున్నది? యాజకుల దోషాలను యజమానులందు ఆరోపించడం ఉచితమో, అనుచితమో సర్వజ్ఞుడవు నీకు చెప్పగలవారెవరున్నారు? ఆగ్రహాన్ని ఉపశమింపజేసి దక్షునికి ప్రాణదానాన్ని, భగునికి నేత్రదానాన్ని, భృగునికి శ్మశ్రురోహణాన్ని, పూషునికి దంతాలను అనుగ్రహించి శిలాఖడ్గ వికలాంగులైన దేవ ఋత్విగాదులకు అంగసాకల్యాన్ని కూర్చి యథాపూర్వం కావించి యజ్ఞసంపూర్తిని కరుణించు. చేసిన అపరాధానికి ఫలంగా దేవతలు యజ్ఞశేషాలను పూర్ణంగా నీకు సమర్పిస్తారు.

## శివుని ప్రార్థనం

ఆ మాటలకు శంకరుడు చిరునవ్వు నవ్వి, 'పరమేష్ఠీ! దేవమాయోపహతులు బాలకుల వలె అజ్ఞానులు కావడం ఉన్నదే. అయినా దండ్యులకు తగిన దండనను విధించడం తప్పదు కనుక వారికి ఆ విధంగా కలుగజేశాను. దక్షుని తల దగ్ధమైపోయింది. అతనికి మేక తల అవుతుంది

గాక. భగుడు మిత్రుని నేత్రదృష్టిని పొందుతాడు. పూషుడు యజమాని దంతాలతో పిష్టపురోడాశాన్ని భుజిస్తాడు గాక. దేవాదులు అశ్వినుల బాహువుల వలన కృతబాహులు, పూషుని హస్తముల చేత కృతహస్తులు అయి ఎప్పటి వలె సుఖంగా ఉంటారు గాక. భృగునికి మేక మీసాలు కలుగుతాయి గాక' అని పలికాడు.

అందుకు బ్రహ్మాదులు ప్రీణితస్వాంతులై, 'దేవా! నీవు వచ్చి యజ్ఞాన్ని సందర్శించాలని మా కోరిక' అని ప్రార్థించారు. వారి నివేదనలను శివుడు అంగీకరించాడు. అందరూ కలిసి యజ్ఞస్థానానికి వెళ్ళారు.

## దక్షుని పునర్జీవితం

యజ్ఞపశువు తలను తెచ్చి దక్షుని శరీరానికి అతికించారు. శివుడు ఆ వంకకు చూపు సారించాడు. దక్షుడు గాఢనిద్ర నుంచి మేల్కాంచినవాని వలె లేచి, శరత్కాలసరోవరోపమంగా శివ ప్రసాదదృష్టి చేత స్వాపరాధకలుషాన్ని బాసి నిర్మలాంతఃకరణుడై శివుని స్తుతించాలని యత్నించాడు. కాని ప్రియపుత్రీ శరీరత్యాగ దుఃఖం పైకొని డగ్గుత్తుక పాటొదవించింది; వ్యసనాశ్రువులు అతని నేత్రగోళాల నుంచి ధారలై కురియసాగాయి. దక్షుడు కొంత సేపటికి నెమ్మది వహించి ఈ విధంగా విన్నవించుకున్నాడు.

## దక్షకృత ప్రార్థనం

'స్వామీ! నా తప్పిదానికి తగిన రీతిని నన్ను శిక్షించావు. మళ్ళీ అనుగ్రహించావు. ఈ అనుగ్రహం వివేకవంతులైన శిక్షాపాత్రులకు పునశ్శిక్ష వంటిది. దేవా! నీవు గాని, శ్రీహరి గాని దుష్టాత్ముల నైనా ఉపేక్షింపరు. ఇక దృఢవ్రతుల సంగతి చెప్పేదేమున్నది?

దేవా! ఆత్మతత్త్వ సంప్రదాయాన్ని విస్తరించాలనే తలంపు నీకు కలిగింది. అందులకై బ్రహ్మరూపాన్ని దాల్చి నాల్గు మోముల దానిని వెల్లడించావు. ఆ విస్తారం వేదమై విలసిల్లింది. వేదప్రచారార్థం విద్యాతపోవ్రతపరాయణులైన

విప్రులను సృజించి, వారి మూలకంగా తత్ప్రచారాన్ని కావించావు. ఆ కారణం వలన నీవు బ్రాహ్మణుల యెడ ప్రీతి కలిగి పశుపాలకుడు పశువులను కాపాడినట్లు వారిని సమ్యక్తరంగా పరిపాలిస్తావు.

స్వామీ! నీ తత్త్వాన్ని తెలుసుకొనలేక ఆనాడు నిండుసభలో నిశితశరతుల్య దుర్భాషణలను పలికి నిన్ను నొప్పించి మహాపరాధం చేశాను. నా అపరాధానికి నరకవాసమే శిక్ష కావలసి ఉండగా నా తప్పును సైరించి నా యెడ కరుణార్ద్రదృష్టిని సారించావు. నేను ధన్యుడ నయ్యాను. నీకు నేను చేయగల ప్రత్యుపకారం ఏమిటో నాకు తెలియరావడం లేదు. నీవు చేసిన మేలుకు నీవే సంతోషిస్తావు గాక!' అని తన తప్పుకు ఎంతో పశ్చాత్తాపం చెంది, సవినయంగా ప్రార్థించాడు.

విదురా! పరమేశ్వర పరమేష్ఠు లిరువురూ దక్షుని సదుక్తులకు సంతోషించి, యజ్ఞకార్యానికి ఆమతించారు. దక్షుడు ఋత్విగాదులతో యజ్ఞానికి కూర్చున్నాడు.

## విష్ణుదేవతాక మహాయజ్ఞం

ఋత్విజులు యజ్ఞభంగభీతులై వీరసంసర్గ శుద్ధిని కోరి త్రికపాలం, పురోడాశం, నిర్వపణం మొదలైన యజ్ఞసంతతితో విష్ణుదేవతాకమైన యష్టిని సంకల్పించారు. అధ్వర్యుడు శుద్ధచిత్తంతో వేల్చి ధ్యానించాడు.

## విష్ణు సందర్శనం

ఆ విధంగా నిర్మలాంతఃకరణుడైన దక్షుడు అధ్వర్యుకృత్యానికి కూర్చున్న భృగువుతో కలిసి ద్రవ్యత్యాగం కావింపగానే సర్వేశ్వరుడు శ్రీమన్నారాయణుడు ప్రసన్ను డయ్యాడు.

సీ. మానిత శ్యామాయమాన శరీర దీ
ధితులు నల్దిక్కులఁ దీటుకొనఁగఁ
గాంచనాంబర నూత్న కాంతి విలాసంబు
తొలుకారు మెఱుపుతోఁ జెలిమి సేయ

లక్ష్మీసమాయుక్త లలిత వక్షంబున
వైజయంతీ ప్రభల్ వన్నె సూప
హాటక రత్న కిరీట కోటి ద్యుతుల్
బాలార్క రుచులతో మేలమాడ

తే. లలిత నీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ
బ్రవిమలాత్మీయ దేహజప్రభ సరోజ
భవ భవామర ముఖ్యుల ప్రభలు మాప
నఖిల లోకైక గురుఁడు నారాయణుండు.

చ. సలలిత శంఖచక్ర జలజాత గదా శర చాప ఖడ్గ ని
ర్మలరుచులన్ సువర్ణరుచిమన్మణి కంకణ ముద్రికా ప్రభా
వళులను దేజరిల్లు భజవర్గ మనర్గళ కాంతియుక్తమై
విలసిత కర్ణికార పృథివీరుహమున్ బురణింప బిట్టుగన్.

క. సరసోదార సమంచిత
దరహాస విలోకనములఁ దగ లోకములం
బరితోషము నొందింపుచుఁ
బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్.

చ. మఱియును రాజహంసరుచిమద్భ్రమణీకృత తాలవృంత చా
మరములు వీవఁగా దివిజమానిను లచ్ఛ సుధామరీచి వి
స్ఫురిత సితాతపత్రరుచిపుంజము దిక్కులఁ బిక్కటిల్లఁగాఁ
గరివరదుండు వచ్చె సుభగస్తుతి పర్ణ సుపర్ణయానుఁడై.

ఆ తీరున భగవానుడు శ్రీమహావిష్ణువు గరుడారూఢుడై సువర్ణకాంచికతో రవితేజోవిరాజమానకిరీటంతో నీలాలకభ్రమరమండిత ముఖనీరేజంతో శంఖ చ క్రాబ్జ శర చాప గదా సి చర్మ సమలంకృత భుజచతుష్టయంతో వనమాలా పరిష్కృత వక్షోభాగస్థిత శ్రీ మహాలక్ష్మితో సొబగొందుతూ, ఇరువైపులా వీస్తున్న రాయంచల వంటి వింజామరల చల్లగాలికి హాయి చెందుతూ పూర్ణచంద్రనిభశ్వేతాతపత్రం నీడలో కూర్చుండి చిరునవ్వు తళుకొత్తే ముఖదీప్తులతో దిశలను వెలుగొందజేస్తూ నేత్రపర్వంగా సాక్షాత్కరించాడు.

## దక్షకృత శ్రీ మహావిష్ణు స్తోత్రం

బ్రహ్మరుద్రాదులు లేచి శిరస్సున కేలు గూర్చి నమస్కరించారు. దక్షుడు శుచియై సువర్ణపాత్రలో పూజాద్రవ్యాలను కూర్చి తెచ్చి, చేతులు జోడించి,

'దేవా! ప్రకృతి స్పర్శ జన్య దోషాలకు బహిరావరణలో ఏది ఉన్నదో, అదే నీ స్వరూపం. నీవు సకల మనో వృత్తులకూ బాహ్యుడవు కనుక నిత్య శుద్ధ చిన్మాత్ర స్వరూపుడవు. భేదశూన్యుడవు, స్వస్వరూపాను సంధానుడవు అయినందున మనోవృత్తులు నీ యందు వ్యవహృతిని పొందవు. అందువల్ల నీ స్వరూపం నిత్య శుద్ధమై విలసిల్లుతున్నది. అట్టి నీ రూపం జడమాత్రం కాదా? అని శంకింప వీలులేదు. ఆ రూపం జ్ఞానైకరసం. అభయుడవు, అభయదాయకుడవు కనుక నీ ఉపాసకులకు చిత్తశుద్ధి, తన్మూలకంగా భయాత్మక సంసారనివృత్తీ కలుగుతున్నాయి.

స్వామీ! నీవు నీ మాయను అధిష్ఠించి దేవాది శరీరాలను దాల్చి పురుష నాట్యాన్ని అభినయిస్తావు. నీవు సర్వస్వతంత్రుడవని తెలియక, నీ అభినయతత్త్వాన్ని గ్రహింపలేక, రాగాదియుక్తులై మలినమతు లైనవారికి నీ తత్త్వం దురవగాహం. సర్వజ్ఞుడవైన నీ లీలలు నీకే తెలియాలి' అని సన్నుతించాడు.

## ఋత్విజుల స్తుతి

అంతట ఋత్విజులు కరకమలాలను, నెన్నుదుట ఘటించి, 'స్వామీ! ఉపాధిరూపమలశూన్యా! రుద్రాది వివిధరూపధారీ! నందీశ్వరుని శాపం వలన కర్మపరతంత్రులమై నీ స్వరూపజ్ఞానానికి దూరవర్తుల మయ్యాము. నీ యజ్ఞస్వరూపం ధర్మోపలక్షణభూతమని వేదాలు వక్కాణిస్తున్నాయి. అందుచేతనే మేము నిన్ను యజ్ఞాకృతిమంతునిగా భావించి నీ యజ్ఞస్వరూపాన్ని ఆరాధిస్తున్నాము' అని ప్రస్తుతించారు.

## సదస్యుల స్తుతి

ఋత్విజుల తర్వాత సదస్యులందరూ జతకూడి, 'దేవా! ఈ సంసార మార్గంలో ఎన్నటికీ విశ్రాంతిస్థానం దొరకదు. దారి పొడవునా ఎన్నో దుర్గమాలు అడ్డువస్తాయి. ఎంతో ప్రయాసపడితే కాని వాటిని దాటడం సాధ్యం కాదు. విషయరూపములైన ఎండమావులు మార్గంలో ఎక్కడ చూసినా కనిపించి వాటి వెంట పరుగులు తీయిస్తుంటాయి. అహంకారమనే భారాన్ని మోయలేక శరీరం తొట్రిల్లుతున్నది. ద్వంద్వములనే లోతు గోతులలో తటాలున జారిపడటాలూ, భగ్నశరీరులమై లేవడాలూ తప్పడం లేదు. వీటన్నిటినీ ఏదో ఒక లాగున సహిద్దామన్నా శోకదావాగ్ని పైకొని దహించి వేస్తున్నది. దుర్జనులనే క్రూరమృగాలు పెట్టే బాధలు ఇంతింతనరానివి. నీ పాదపద్మాలను ఆశ్రయించడం తప్ప శరణ్యాంతరం మాకు గోచరింపదు. ఆ చల్లని ప్రాపును మాకు కటాక్షించి మమ్మల్ని దయచూడు' అని వేడుకొన్నారు.

## రుద్రుని స్తుతి

అంతట రుద్రుడు ముందుకు వచ్చి, 'వరదా! ఏ నీ చరణాంబుజాలు నిష్కాములకు నిరంతర సేవనీయాలో, ఆ నీ పాదములందు చిత్తాన్ని నిలిపాను. నీ భక్తుడనని జ్ఞానహీనులు నన్ను తిరస్కరిస్తే తిరస్కరిస్తారు గాక.

అందుకై నేను సుంతయినా చింతపడను. నేను నీ హృదయంలో మెదిలితే అదే నాకు పదివేలు. కైలాసాదులకన్న నీ అనుగ్రహమే నాకు పరమవాంఛనీయం' అన్నాడు.

## భృగుని స్తుతి

తర్వాత భృగుడు వచ్చి నమస్కరించి, 'స్వామీ! నీ మాయ ఇట్టిదని తెలియరాదు. ఆ మాయకు బ్రహ్మాదులు కూడా వశులే. తత్ఫల మేమిటంటే, మొట్టమొదట జ్ఞానం విలోపిస్తుంది. దానితో తపస్సు వ్యాప్తి చెందుతుంది. ఆ కటిక చీకటిలో చిక్కుకొని వారు తమ లోపలే అంతర్యామివై ఉన్న నిన్ను కనుగొనలేరు. నీ తత్త్వాన్ని గ్రహింపలేరు. బ్రహ్మాదుల గతే అట్లా ఉండగా మా బోంట్ల సంగతి వేరే చెప్పాలా? భక్తులకు నీ కంటె పరమబాంధవుడు వేరెవరుంటారు? నా యెడ ప్రసన్న దృష్టిని సారించు' అని ప్రార్థించాడు.

## బ్రహ్మదేవుని స్తుతి

అప్పుడు బ్రహ్మదేవుడు కేలుమోడ్చి, 'దేవా! సర్వమూ నీవై వెలసిన మహాత్ముడవు. ఇంద్రియ వశులు ఈ పరమరహస్యం ఎరుగక నీ విలాసపదార్థాలను చూసి భేదదర్శనులవుతున్నారు. ఆ దృష్టి ఉన్నంత కాలం నీ స్వరూపాన్ని కనుగొనడం వీలుకాదు. వస్తువెప్పుడు జ్ఞేయమవుతుంది. జ్ఞేయాన్ని గ్రహించే శక్తి జ్ఞాన మనబడుతుంది. ఆ రెండు శక్తులకూ సత్త్వాది గుణాలు కారణం. ఆ కారణానికి నీవే ఆశ్రయస్థానీయుడవు. ప్రపంచం నీ మాయామయమే కానీ స్వతంత్రం కాదు. నీవు ప్రపంచాంతరితుడవు, ప్రపంచాతీతుడవు అయిన మహనీయుడవు' అని ఉగ్గడించాడు.

## ఇంద్రుని ప్రార్థన

ఇంద్రుడు ప్రణామం చేసి, 'స్వామీ! బ్రహ్మదేవుడు వచించినట్లుగా ప్రపంచము మాయాత్మకమై అనిర్వచనీయం కావచ్చును గాక. నీ స్వరూపం మనోబుద్ధులకు అందరానిది అగు గాక. రాక్షస వినాశాన్ని సూచించే

దివ్యాయుధాలను ధరించిన ఎనిమిది భుజాలతో కన్నుల పంటగా ఉన్న నీ దివ్యదేహాన్ని మా బోంట్ల కొరకు సాక్షాత్కరింపజేశావు. విశ్వభావనామయము, మనోనయనానందకరమూ అయిన నీ దివ్యమంగళ రూపానికి పదివేల దండాలు' అని పలికాడు.

## ఋషిపత్నుల ప్రార్థన

అంతట ఋషిపత్నులు బారులుతీరి, 'యజ్ఞేశ్వరా! నిన్ను సమారాధించే కలిమి మా బోంట్లకు లభించేందుకు ఈ యజ్ఞాన్ని బ్రహ్మదేవుడు ఉపకల్పించాడు. దక్షుని మీది కోపంతో పశుపతి ఆ యజ్ఞాల్ని ధ్వంసం చేశాడు. యజ్ఞవాటిక శ్మశానవాటికగా మారింది. నీ పుండరీకాక్ష దృష్టిని సారించి దీనిని పవిత్రీకరించు' అని వేడుకొన్నారు.

## ఋషుల ప్రార్థన

అప్పుడు ఋషులు ముందుకు వచ్చి, 'దేవా! సర్వకర్మలకు కర్తృత్వం మీదే అయినా కర్మములు నీకు అన్వయింపవు. ఈ అఘటమానశక్తి నీకు గాక వేరెవరికి సాధ్యం? లక్ష్మీ ప్రసాదాన్ని కోరి లోకులు వివిధ తపో ధర్మాదులను ఆచరిస్తారు. ఆ లక్ష్మీదేవి తానై వలచి వచ్చి నీ పాదాలను ఆశ్రయించింది. అట్టి నిన్ను గూర్చి యేమని వర్ణింపగలము?' అని సంస్తుతించారు.

## సిద్ధుల ప్రార్థన

ఋషుల వెంట నిలిచిన సిద్ధులు భక్తిపూర్వకంగా అభివందనం చేసి, 'దేవా మా మనోమత్తేభం నిరంతర క్లేశదవానల తాపంతో దప్పిక గొని దీనమై ఉన్నది. అది నీ కథాసుధా విబుధ కల్లోలినిలో మునిగి తాపాన్ని బాసి బ్రహ్మైక్యసంపత్తిని బడసి సంసారతాపవిదూరం కాగల వరాన్ని మాకు ప్రసాదించు' అని ప్రార్థించారు.

## దక్షపత్ని ప్రార్థన

అప్పుడు దక్షపత్ని వచ్చి ప్రణమిల్లి, 'ఈశ్వరా! స్వాగతం. జగత్పతీ! ప్రసన్నుడవై మమ్ములను కరుణించు. అధీశా! నీవు లేకుంటే ఈ యజ్ఞస్థితి తల లేని మొండెం వంటి దవుతుంది. శ్రీనివాసా! శ్రీకాంతా సమేతుడవై మమ్మందరినీ కాపాడు' అని వేడుకొన్నది.

## లోకపాలకుల ప్రార్థన

తర్వాత లోకపాలకులు గుమిగూడి నిలిచి, 'స్వామీ! శుద్ధచిత్తులకు మాత్రమే నీ శుద్ధతత్త్వమూర్తి దర్శనం కలుగుతుంది. మే మందరమూ బహిర్ముఖులము. అహంకార మమకారాలు మమ్మల్ని వదలవు. అందువల్ల ప్రత్యగ్దృష్టి మాకు సహజం. అట్టివారికి నీవు పృథివ్యాధి పంచభూతోపలక్షిత జీవి మాత్రుడవుగా కానవస్తావు. ఇది నీ మాయాకార్యమే తప్ప అన్యం కాదు. నీ స్వస్వరూపం మా ఇంద్రియాలకు గోచరింపదు' అన్నారు.

## యోగీశ్వరుల స్తుతి

వారి తర్వాత యోగీశ్వరులు వచ్చి, 'స్వామీ! విశ్వాత్మకా! ఎవరు నీ యందు పృథగ్భావాన్ని చూడరో వారే నీకు ప్రియతములు. మా భక్తి అనన్యవృత్తి పూర్వకమై నీ యందే నిలిచేటట్లు అనుగ్రహించు. దేవా! భజనీయమూర్తులు పెక్కుమంది ఉండగా వారందరినీ విడిచి నీ యందే మాకు అవ్యభిచారిభక్తి ఏ తీరున కలుగుతుందని సందేహించకు. పరమేశ్వరా! జగదుత్పత్తి స్థితి లయాలన్నీ నీ మాయాగుణము యొక్క కార్యాలు. నీ మాయ నీ లోనే ఉండి నీకు స్వాధీనయై నీ సంకల్పవికల్పాల ప్రకారం ప్రవర్తిల్లుతున్నది. ఆ సంకల్పాలు రూపు దాల్చినప్పుడు ఆ రూపాలను బట్టి ఆత్మభేద బుద్ధి; భేదభ్రాంతి కలుగుతున్నాయి. ఈ భేద దర్శనాలకు అతీతుడవై నీవు స్వరూపావస్థాన నిష్ఠలో ఉంటావు. అట్టి పరమాత్మను నిన్ను ఆశ్రయించాము' అన్నారు.

## శబ్దబ్రహ్మ స్తవం

అప్పుడు శబ్దబ్రహ్మ ముందుకు వచ్చి, 'స్వామీ! నేను గాని నన్ను వెలువరించిన బ్రహ్మ గాని తదితరులు గాని నీ పరతత్త్వాన్ని ఎరుగము. నీవు నిర్గుణడవైనా సత్త్వగుణాన్ని అధిష్ఠించి ధర్మాదులకు ప్రేరకుడవై అలరారుతున్నావు. నీ శక్తి విలసనాన్ని అభివ్యంజించే ప్రౌఢిని నాకు అనుగ్రహించు' అని ప్రార్థించింది.

## అగ్ని స్తవం

ఆ తర్వాత అగ్ని ముందుకు వచ్చి, 'దేవా! నీ తేజం వలన నేను సముత్తేజుడనై యజ్ఞాలలో ఆజ్యంతో తడిసిన హవిర్భాగాన్ని ధరిస్తాను. అగ్నిహోత్ర దర్శపూర్ణమాస చాతుర్మాస్య పశు సోమాలనే పంచవిధ యజ్ఞాలు నీ స్వరూపాలు. 'ఆశ్రావయ' 'అస్తుశ్రౌషట్' 'యజయే' 'యజామహే' 'వషట్కార' నామక పంచవిధ యజుర్మంత్రమూర్తివై అలరారుతున్న నీకు నమస్కారం' అని పలికాడు.

## దేవతాదుల స్తుతి

అనంతరం దేవతలు ముందు నిలిచి, 'దేవా! కల్పాంతంలో సమస్తవిశ్వాన్ని నీ గర్భగోళంలో ఇమిడ్చి, ఏకార్ణవంలో జలశాయివై యోగనిద్రను దాల్చి ఆత్మ నిరతిని పొందుతావు. అధ్యాత్మవిమర్శదక్షులైన సిద్ధపురుషుల హృదయాలకు మాత్రమే నీ దివ్యస్వరూపం గోచరీభూతమవుతుంది. నీకు మా యెడ గల కరుణా విశేషం ఎంతటిదో ఈనాడు మా కన్నుల యెదుట సాక్షాత్కరించి ప్రకటితం చేశావు. సర్వలోక శరణ్యుడవైన నీకు దేవతానీకం ప్రణమిల్లుతున్నది, అని సన్నుతించారు.

## గంధర్వుల వేడుకోలు

వారి తర్వాత గంధర్వులు చేరి, 'స్వామీ! మరీచాద్యులే గాక బ్రహ్మరుద్రాదులు సైతం నీ అంశాంశలై అలరారుతున్నారు. నీ సృష్టి అయిన

ఈ విశ్వమంతా నీకు క్రీడా సాధనం. గంధర్వుల మందరమూ నీకు సమర్పిస్తున్న నిత్య ప్రణతులను ప్రీతిపూర్వకంగా గ్రహించు' అన్నారు.

## విద్యాధరుల సన్నుతి

అటుపిమ్మట విద్యాధరులు నమస్కరించి, 'దేవా! నీ మాయకు లోనైన వారికి జన్మపరంపరలు తప్పవు. జన్మం కలగగానే మాయ మళ్ళీ ఆవరిస్తుంది. తత్ఫలంగా శరీరమే ఆత్మ అనే అభిమానం కలుగుతున్నది. ఆ అభిమానాన్ని విడిచిపెట్టలేక వారికి మహోత్పథులైన పుత్త్రాదుల వలన నిందలు కలుగుతుంటాయి. బాధలు ఎంత కష్టపెడుతున్నా దుర్మతులకు అసద్విషయాల పట్ల దురాశ తొలగదు.

దేవా! అన్ని దుఃఖాలకూ ఆత్మ మోహమే మూలకారణం. ఆ మోహాన్ని తప్పించుకొన గోరిన వారికి నీ దివ్య కథామృతసేవనం తప్ప వేరొక మార్గం లేదు. ఆ భాగ్యాన్ని మాకు కరుణించు' అని మ్రొక్కారు.

## బ్రాహ్మణుల స్తుతి

అంతట బ్రాహ్మణులు బారులు తీరి–

**'త్వం క్రతు స్త్వం హవి స్త్వం హుతాశస్స్వయం**
**త్వం హి మన్త్ర స్సమిద్దర్భపాత్రాణి వై**
**త్వం సదస్యర్త్విజో దంపతీ దేవతా**
**హ్యగ్నిహోత్రం స్వధా సోమ ఆజ్యం పశుః.**

అని స్తోత్ర పాఠాలు గానం చేశారు. 'దేవా! తొల్లి నీవు యజ్ఞవరాహమూర్తివై మదించిన ఏనుగు తామరతూండ్లను లాగినట్లు పాతాళగత భూమండలాన్ని దంష్ట్రాగ్రంతో పైకి లేవనెత్తి యోగిజన ప్రస్తుతులను అందుకొన్నావు. వేదమూర్తీ! యజ్ఞసంకల్పరూపా! నీ దర్శనార్థులమై వేచి ఉంటాము. ప్రస్తుతం మేము సత్కర్మల నుంచి భ్రష్టుల

మయ్యాము. నీ నామస్మరణ వల్ల సకల విఘ్నాలు తొలగిపోతాయి. నీ కరుణ ఉంటే యజ్ఞవిఘ్న భయాలు కలుగవు. మా యెడ ప్రసన్నుడవై మమ్మల్మి కటాక్షించు' అని పలికారు.

విదురా! దక్షుడంతట ఆ యజ్ఞాన్ని భగవదనుగ్రహంగా సాంతం కావించాడు. భగవానుడు నిత్యానంద పరితృప్తుడు యజ్ఞాహుతులతో ఆయనకు నిమిత్తం లేదు. అయినా తనకు నిర్దేశింపబడిన త్రికపాల పురోడాశాన్ని గ్రహించి, సంప్రీతుడై దక్షునితో ఇలా అన్నాడు.

## దక్షునికి ఉపదేశం

'దక్షా! నేను గుణమయమైన నా మాయను అధిష్ఠించి విశ్వసృష్టి స్థితి లయాలకు తగిన బ్రహ్మ హరి హర రూపాలను ధరించి ఆయా కార్యాలను యథాయోగ్యంగా నిర్వహిస్తాను. ఈ త్రిమూర్తులు జగత్కారణులని, ఆత్మస్వరూపులని, ఈశ్వరులని, సాక్షిమాత్రులని, స్వయంప్రకాశులని, భేదరహితులని గ్రహించు. నా స్వస్వరూపం కేవలం అద్వితీయమైనది. సర్వం నా యందు ఉండగా; నేను సర్వమునందు ఉంటాను. అజ్ఞులు ఈ సత్యాన్ని గ్రహింపలేక బ్రహ్మరుద్రభూతాదులను నా కంటె అన్యములని తలచి భేదదర్శను లవుతున్నారు.

శరీరంలో తల మొదలు పాదాల దాకా పెక్కు అంగాలు ఉన్నాయి. ఆ అంగాలు శరీరం కంటె ఏ విధంగా వేరు కావో, ఆ విధంగా నా యందు పొడమిన సర్వసృష్టి నా కంటె భిన్నం కాదు. ఈ భేద బుద్ధి నశించాలంటే సర్వమూ నా స్వరూపమేనని ఆకళింపు కావాలి. ఎవరు మత్పరులై ఉంటారో వారికి భూతభేదదృష్టి నశిస్తుంది. త్రిమూర్తులము మేము ముగ్గురమూ ఏకస్వరూపులము, సర్వభూతాత్ములముగా ఉంటాము. ఎవరు మా ముగ్గురినీ అభేదబుద్ధితో సేవిస్తారో వారికి శాంతి చేకూరుతుంది'.

అని పుండరీకాక్షుడు దక్షునికి అభేద దర్శనాన్ని ఉపదేశించాడు.

## యజ్ఞ పరిసమాప్తి

దక్షుడు ఆ పలుకులను శిరసావహించి, యజ్ఞేశ్వరుని త్రికపాలేష్టి చేత ఆరాధించి, ద్వివిధములైన ప్రధానాంగరూపయజ్ఞాల చేత సురలను పూజించి, రుద్రునికి రుద్రభాగాన్ని సమర్పించి, సోమపానులను, తదితరులను తత్తత్కర్మలతో తృప్తిపరచి, ఋత్విగ్జన పురస్సరంగా అవభృథస్నానం చేసి కృతకృత్యుడయ్యాడు.

విష్ణ్వాదులు దక్షునికి ధర్మమందు స్థిరబుద్ధి కలిగేటట్లు అనుగ్రహించి యథాస్థానాలకు వెళ్ళారు.

## సతీదేవి పునర్జన్మ

విదురా! ఆ తర్వాత దక్షసుత సతీదేవి మేనకయందు హిమవంతుని వలన పునర్జన్మను గాంచి, ప్రళయకాలంలో ఈశ్వరుని పొందిన శక్తి వలె అనన్యభావంతో సేవించి శివుని అర్ధాంగి అయింది.

మిత్రమా! ఈ వృత్తాంతమంతా బృహస్పతి శిష్యుడు, పరమభాగవతోత్తముడు అయిన ఉద్ధవుని వలన విన్నాను. ఈ పరమేశ్వర చరిత్రం పరమపవిత్రమైనది. దీనిని ప్రతినిత్యం చదివినా, విన్నా ఆయుస్సు, కీర్తి వృద్ధిపొందుతాయి. పాపాలు నశిస్తాయి. పరమభక్తి సిద్ధిస్తుంది.

## అధర్ముని సంతానం

విదురా! సనకాదులు, నారదుడు, ఋభువు, ఆరుణి– వీరు బ్రహ్మమానస పుత్రులని తెలిపాను. వారు పుట్టుకతోనే ఇంద్రియనిగ్రహపరులు, నైష్ఠికులు అయి వివాహాలను మానుకొన్నారు. అందువల్ల వారికి సంతానవృద్ధి కలుగలేదు.

అధర్ముడు మృష అనే కాంతను గ్రహించి దంభుడు, మాయ అని ఒక కొడుకును, కూతురును కన్నాడు. వారిద్దరూ అధర్మాంశతో పుట్టినవారు కనుక వావివరుసలు మాని ఒకరినొకరు కూడారు.

నిర్మతికి సంతానం కలుగలేదు. అతను అధర్ముని పిల్లలను పెంచుకొన్నాడు.

వారికి లోభము, నికృతి జనించారు. తల్లిదండ్రుల వలెనే వారు కూడా ధర్మవిరుద్ధంగా జతకూడారు. వారికి క్రోధము, హింస, కలి, దురుక్తి కలిగారు. కలి దురుక్తులు మిథునీభావాన్ని గ్రహింపగా వారికి యాతన, నిరయం పుట్టారు.

అధర్ముని వంశవిస్తరం జరిగే కొద్దీ లోకంలో సంసృతిహేతువులైన అధర్మవృక్షశాఖలు ప్రబలంగా వ్యాపించాయి.

శ్రేయఃకాములు ఈ అధర్మసంతతిని సేవింపకూడదు.

అధర్మమంటే ప్రళయహేతువు కనుక అతని సంతానాన్ని ప్రతిపర్వం అంటారు. ఈ ప్రతిపర్వాన్ని సమీపించినంత మాత్రానే తీరని ఆత్మమలం అంటుతుంది. వివేకవంతులు వీరి చెంతకు కూడా వెళ్ళకూడదు.

## స్వాయంభువ మనువంశం

విదురా! శ్రీహరి అంశతో బ్రహ్మ, బ్రహ్మ అంశతో స్వాయంభువ మనువు జన్మించారని, స్వాయంభువుడు శతరూపను పెండ్లి చేసుకొన్నాడని, వారికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అని ఇద్దరు కొడుకులు పుట్టారని చెప్పాను. వారిద్దరూ వాసుదేవుని కళాస్వరూపాలై అవతరించిన రాజన్యోత్తములు. ఆ మహాత్ముల పుణ్యచరిత్రలనే నేనిప్పుడు చెప్పబోతున్నాను.

## ఉత్తానపాదుని సంతతి

ఉత్తానపాదుడు సునీతి, సురుచి అని ఇద్దరు కన్యలను వివాహం చేసుకొన్నాడు. అతనికి సునీతి యందు ధ్రువుడు, సురుచి యందు ఉత్తముడు జన్మించారు.

ఉత్తానపాదునికి సురుచి అంటే మక్కువ ఎక్కువ. ఒకనాడతను తన ప్రియతమ అయిన సురుచి పుత్త్రుని ఉత్తముని తొడపై కూర్చొనబెట్టుకొని

ముద్దాడుతున్నాడు. ఆ సమయంలో సునీతి కొడుకు ధ్రువుడు తండ్రిని చేరవచ్చి, తాను కూడా తండ్రి ఒడిలో కూర్చోవాలని సంబరపడ్డాడు. ఉత్తానపాదుడు ఆ శిశువును వారించాడు. సురుచి అది చూసి, 'ధ్రువా! నీకు రాజు తొడపై చోటులేదు. దీనిని బట్టి నీవు రాజ్యార్హత లేనివాడవని గ్రహించు. కారణం ఏమిటంటావా? పరాయిదాని కడుపున పుట్టడమే నీకు అర్హత లేకపోవడానికి కారణం. ఇంకా పసితనం పోక నీ అధికారం ఎంతటిదో తెలియక అందరాని సంపద కోసం అర్రులు చాచావు. రాజ్యాధిపత్యాన్ని కోరినవాడివే అయితే తపస్సు చేసి శ్రీమహావిష్ణువును ఆరాధించి నా కడుపున బుట్టి నీ కోరికను తీర్చుకో' అని మర్మగర్భంగా అధిక్షేపించింది.

## ధ్రువుని మనోవేదన

ఆ పలుకులు ధ్రువునికి ములుకులై సోకాయి. దండతాడిత సర్పం వలె అతను కోపానిలచిత్తుడై నిలువెల్లా కంపించిపోయాడు. సవతి తల్లి తనపై విరుచుకు పడటమూ, తండ్రి అంతా చూస్తూ ఏమీ పట్టనట్లు ఊరుకోవటమూ అతని శోకాన్ని ఇనుమడింపజేశాయి. అతను రొప్పుతూ రోజుతూ బిగ్గరగా ఏడుస్తూ బిరబిర వెళ్ళి తల్లి ఒడిలో పడి విలపింపసాగాడు. సునీత ఎంత బుజ్జగించినా ధ్రువుడు ఏడుపు మానలేదు. కారణం ఊహింపలేక ఆమె దిగులుపడసాగింది. ఇంతలో అక్కడికి వచ్చినవారు జరిగినదంతా వివరించారు.

## సునీతి ఉపదేశం

సునీతి అది విని దవానలం చుట్టుముట్టి దహించివేస్తున్న లతామతల్లిక లాగా దుఃఖాగ్నితో పరితపించి, సవతి పలుకులను పదే పదే జ్ఞాపకం చేసుకొని కలువరేకుల వంటి కన్నుల నుంచి వెచ్చని బాష్పధారలు కారుతుండగా నిట్టూర్పులు వెలువడుతుండగా ఎంతోసేపు దుఃఖించి, కొడుకును దగ్గరకు తీసుకొని, 'నాయనా! ఒకరిపై నిందమోపడం దేనికి? పూర్వజన్మ కర్మఫలాలు ప్రారబ్ధ జన్మలో అనుభవానికి వస్తాయి. కనుక ఇది

మనకు స్వకృతాపరాధఫలమే అనుకోవాలి. నన్ను భార్య అని చెప్పుకోవడానికి రాజే సిగ్గుపడుతుండగా సవతి ఏదో అన్నదని బాధపడితే ప్రయోజనం ఏమిటి? నా వంటి నిర్భాగ్యురాలి కడుపున పుట్టి నా చన్ను గుడిచి పెద్దవాడివైన నీకు రాజానుగ్రహం ఎలా కలుగుతుంది? నీకు రాజ్య మమకారమే ఉంటే, సురుచి మాటలను మహోపదేశంగా గ్రహించి తపస్సు చేసి శ్రీమహావిష్ణువు పాదపద్మాలను ఆరాధించు. ఆ భగవానుడు లోకపాలనార్థం సత్త్వగుణాన్ని అధిష్ఠించిన మహానుభావుడు. ఆయన పాదాలను బ్రహ్మ అంతటివాడు సేవించి తత్ఫలంగా జితాత్మ ప్రాణులకు కూడా అభివందనీయ మయిన పరమేష్ఠి పదాన్ని పొందగలిగాడు. ఎవరి మాటో ఎందుకు? నీ పితామహుని సంగతి విను. ఆ మహాత్ముడు తదేక మతితో అపరిమిత దక్షిణ పూర్వకంగా అనేక మహాయజ్ఞాలను ఆచరించి, ఆ దేవదేవుని కరుణ వల్ల ఎవరూ సాధింపలేని ఇహపరభోగాలు అన్నింటినీ సాధించాడు. ఆయనను నమ్ముకొన్న వారికి ఆపదలు లేవు. ఆయన భక్తవత్సలుడు. ముముక్షువులు కూడా ఆయన పాదమృగ్యులై కాచుకొని ఉంటారు. ఆ పరమపూరుషుని నీవు స్వధర్మవిశుద్ధమూ, అనన్యభావమూ అయిన చిత్తంతో భజించు. దుఃఖాలను బాపి, సుఖాలను చూపగలవాడు ఆయన కంటె మనకెవరున్నారు? ఒక్క మాటలో చెప్పాలంటే, లోకం ఏ లక్ష్మీకటాక్ష లబ్ధికై తహతహలాడుతుంటుందో, ఆ లక్ష్మీదేవి ఆయన పాదాలను తన కరకమలాలతో లాలిస్తున్నది. నాయనా! భగవదారాధనం వల్ల నీ కోరిక నెరవేరుతుంది. నా మాట విని, దుఃఖాన్ని దిగమింగుకొని, కర్తవ్యకర్మను భక్తిపూర్వకంగా ఆచరించు' అని ఓదార్చింది.

## ధ్రువ నారదుల సమావేశం

ధ్రువుడు తల్లి మాటలు విని కృతనిశ్చయుడై దృఢచిత్తంతో ఇంటినుంచి బయలుదేరాడు. ఆ సమయంలో నారదమహర్షి వచ్చి ధ్రువుని చేరదీసి, అతని శిరస్సుపై తన చేయి ఉంచి, 'నాయనా! క్షత్రియులు మానభంగాన్ని

ఓర్వలేకపోతే వారికి తేజస్సు దక్కదు. నీ వింకా పసివాడివి. సవతి తల్లి మాటలకు తెంపుచేసి సర్వసమృద్ధమైన రాజమందిరాన్ని విడిచి ఒంటరిగా పయనింపబూనడం తగిన పనేనా? ఇక్కడి నుంచి ఎక్కడికి వెళతావు? అవమానించారంటావా? వారు నీ వారే గాని పెరవారు కారు కదా?' అని బుజ్జగించాడు.

ధ్రువుడు నారదమహర్షికి నమస్కరించి, 'మునీంద్రా! భగవద్ధ్యాన మహిమ వల్లనో యోగసిద్ధి ప్రభావం వల్లనో నా మనస్సులోని ఆవేదన మీకు అర్థమైంది. సురుచి నా పినతల్లి కావచ్చు గాక. ఆమె నోట వచ్చిన మాటలు సహింపరానివి. వాటివల్ల నా హృదయానికి తీరని గాయం ఏర్పడింది. ఆ వ్రణబాధ తొలగాలంటే నేనిక్కడి నుంచి తొలగక తప్పదు' అని వినయనిర్భరోక్తులతో సమాధానం చెప్పాడు.

నారదుడు ఆ మాటలు విని, 'నాయనా! నీ కింకా ఆటలాడుకొనే వయస్సు దాటలేదు. నీ పసితనం ఎక్కడ? మానావమాన వివేకజ్ఞానం ఎక్కడ? ఒకవేళ అటువంటి వివేకం ఉన్నా మోహం ఎంత మాత్రమూ తగదు. మోహ మంత దుఃఖహేతువు లోకంలో వేరొకటి లేదు. సుఖదుఃఖాలన్నవి పూర్వకర్మల ఫలంగా కలుగుతుంటాయి. దుఃఖానికి నివృత్తి కలుగదా? అంటే, ఈశ్వరానుగ్రహ మొక్కటే దుఃఖాలన్నింటికీ నివారణోపాయం. పురుషప్రయత్నం వలన కార్యాన్ని సాధింపలేమా? అని అంటావేమో. ప్రయత్నాలు స్వతఃఫలకారులు కావు. అవి కూడా భగవదనుగ్రహం ఉన్నప్పుడే ఫలిస్తాయి.

నాయనా! తల్లి ఉపదేశాన్ని నమ్మి శ్రీమహావిష్ణువు ప్రసాదాన్ని కోరి యోగనిష్ఠను వహింపబోతున్నావు. భగవదారాధనమంటే నీవు అనుకొన్నంత సులభం కాదు. మునులంతటివారు నిస్సంగులై తీవ్రసమాధి యోగాన్ని పూని భగవత్పదాన్ని అన్వేషిస్తూ వేలవేల జన్మాలెత్తి కూడా సంపూర్ణ మనోరథులు కాలేకపోతున్నారు.

నాయనా! అదను చూసి నాటిన విత్తనం ఫలిస్తుంది. ఒకప్పుడు అన్నీ కలిసివచ్చినా అది పంటకు రాక రిత్తపోతుంది. దీనిని జ్ఞాపకం ఉంచుకొని నీవు నీ ప్రయత్నాన్ని మాను. సుఖదుఃఖాలు దైవవిహితాలు. ప్రాప్తించినదానిని సంతోషంతో అనుభవిస్తూ సంసారాన్ని తరించాలి. అధికుల యెడ ప్రీతిని, అల్పుల యెడ కరుణను, సమానుల యెడ మైత్రిని నెరపే ఉచితజ్ఞుడు పరితాపాలను పొందడు' అని చెప్పాడు.

ధ్రువుడు ఆ మాటలను విని, 'మహాత్మా! క్షాత్రస్వభావులై దుర్వాక్యబాణఘాతాలతో గుండెలు పగిలిన నా వంటి అవినీతులకు మీ పలుకులు రుచింపకపోయినా, అవి పరమశాంతికి మార్గదర్శకాలైన సదుపదేశాలన్న సత్యం హృదయగోచర మవుతూనే ఉంటుంది. నా మనస్సు మీకు తెలియనిది కాదు. నా తల్లిదండ్రులే కాదు, లోకంలో వేరెవ్వరూ పొందనట్టి త్రిభువనోత్కృష్టపదాన్ని పొందగోరాను. అందుకు నిరపాయమైన ఉపాయాన్ని అనుగ్రహించండి. మునీంద్రా! మీరు సంకల్పిస్తే అసాధ్యమన్నది ఉండదు. మీరు బ్రహ్మదేవుని అంశ వలన ప్రాదుర్భవించిన మహాత్ములు. భగవత్తత్త్వాన్ని లోకహితార్థమై వీణాగానపూర్వకంగా చాటి చెబుతూ; సూర్యుని వలె సర్వత్రగులై చరిస్తుంటారు. నా విన్నపాన్ని అంగీకరించి ఫలసాధనకు మార్గనిర్దేశం చెయ్యండి' అని ప్రార్థించాడు.

## నారదుని ఉపదేశం

నారదుడు ధ్రువుని పలుకులకు సంతోషించి, 'నాయనా! నీ తల్లి చెప్పిన మార్గం నీకు శిరోధార్యం. పరమభక్తితో వాసుదేవుని భజించు. ధర్మార్థ కామమోక్షాలన్నవి నాలుగూ పురుషార్థాలే. వాటిలో దేనిని పొందగోరినా అందుకు భగవత్పాదారవింద సేవ ఒక్కటే పరమోపాయం. అంతకు మించిన ఉపాయం వేరొకటి లేదు. యమునాతీరంలో మధువనం ఉన్నది. ఆ పుణ్యక్షేత్రంలో శ్రీహరి నిత్యసన్నిహితుడై ఉంటాడు. నీ వక్కడికి వెళ్ళి ఆ దివ్యతీర్థం లోని కాళిందీ పుణ్యోదకాలలో త్రిషవణ స్నానం చేసి, దేవతా

నమస్కారాదులను యథోచితంగా ఒనర్చి, దర్భాదులతో స్వస్తికాద్యుచితాసనాన్ని కల్పించుకొని, మనోమాలిన్య నిరసనార్థం పూరక కుంభక రేచకరూప త్రివిధ ప్రాణాయామాన్ని అభ్యసించు. తత్ఫలంగా నీకు స్థిరబుద్ధి సిద్ధిస్తుంది. అనంతరం నీ చిత్తాన్ని శ్రీహరి యందు నిలిపి ఆయనను ధ్యానించు.

**'భూః పాదౌ యస్య నాభి ర్వియదసురనిలః చంద్రసూర్యౌ చ నేత్రే**
**కరావాశాః శిరో ద్యౌః ముఖమపి దహనో యస్య వాసో-యమబ్ధిః**
**అంతస్థం యస్య విశ్వం సురనరఖగగో భోగి గంధర్వదైత్యైః**
**చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి.'**

అని ధ్యానార్థం మూర్తిని సంకల్పించి, ఆ దివ్యమూర్తిని నీ హృదయపీఠికపై నిలిపి ధ్యానించు. ఆ ప్రభువు దివ్యమంగళ విగ్రహ చింతనైక పరులకు అన్యపదార్థస్మరణం వెనువెంటనే తొలగిపోతుంది. ఇది ధారణాఫల మవుతుంది. దానితో నిర్వృతి కలుగుతుంది. అది సమాధిఫలంగా పర్యవసిస్తుంది.

నాయనా! భగవంతుని 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అని ద్వాదశాక్షర మంత్ర జప పురస్సరంగా ధ్యానించాలి. ఈ మంత్రాన్ని సప్తరాత్రాలు జపిస్తే ఖేచర దర్శనం కలుగుతుంది. పూజార్థం ద్రవ్యాదులను సమకూర్చుకోవద్దా? అని అడుగుతావేమో. దేశకాలాలను బట్టి దూర్వాంకురాది వివిధ ద్రవ్యాలను సంపాదించి పూజించడం సముచితమే. పూజ్యమూర్తిని శిలాదుల చేత నిర్మించుకొనవచ్చు. ఆ మూర్తిని సలిలాదుల చేత అర్చించాలి. అర్చించినంతకాలం భగవన్మూర్తికి తాను సమర్పిస్తున్న సలిలాది ద్రవ్యాలు కూడా హరిమయాలే అన్న భావం మనస్సులో వెలుగొందాలి. పూజకు మనోవృత్తి నియమం ప్రధానం. దానివెంట మౌనం రెండవది. చిత్తశాంతి మూడవది.

ఇందు మూలాన పూజాసాద్గుణ్యం కలుగుతుంది. అందుకు ఆహారనియమం కూడా అవసరం. సాత్త్వికాలైన వన్యాహారాలను భుజించాలి. అది వీలయినంత మితంగా ఉండాలి. పూజాదికాలం కాక మిగిలిన కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. భగవానుడు తన మాయను అధిష్ఠించి లోకకల్యాణార్థం లీలావతారాలను ధరించి లోకహితాన్ని ఆచరిస్తుంటాడు. ఆ పుణ్యచరిత్రలతో కాలం గడపాలి. భగవదర్చనలో ప్రత్యుపచారానికి ద్వాదశాక్షర మంత్రం చాలు.

నాయనా! ఈ విధంగా వాసుదేవుని త్రికరణశుద్ధిగా ఆరాధించే భక్తులకు ఆ మహనీయుడు ప్రసన్నుడై అభీప్సితాలను సంపూర్ణంగా ప్రసాదిస్తాడు. అభీప్సితాలను పొందే కోరికతో కాక ముక్తిని కాంక్షించిన వారు ఇంద్రియార్థాల పట్ల విరక్తులై ధ్యానయోగాన్ని పూనాలి. ఉపాసకులు దేనిని కోరితే భగవంతుడు దానినే ఇస్తాడన్న ప్రతిజ్ఞావాక్యాన్ని మరచిపోకూడదు' అని పలికి, ధ్రువునికి ద్వాదశాక్షర మంత్రాన్ని ఉపదేశించాడు.

అంతట ధ్రువుడు నారదమహర్షికి ప్రదక్షిణలు చేసి అర్ఘ్య సత్కారాలను శాస్త్రోక్తంగా ఆచరించి మధువనానికి వెళ్ళాడు.

## నారదోత్తానపాదుల సమాగమం

విదురా! ధ్రువునికి శ్రీ వాసుదేవ మంత్రాన్ని ఉపదేశించి, తపోదీక్షితుని కావించిన తర్వాత నారదమహర్షి ఉత్తానపాదుని అంతికానికి వెళ్ళాడు. ఆ రాజేంద్రుడు ఆయనను యథోచిత సత్కారాలతో పూజించి, సుఖాసీనుణ్ణి చేసి, కుశలానుయోగాలతో సంతృప్తిని కలిగించాడు. నారదుడు సేదతీరి, ఆ రాజు వంక చూచి, 'రాజేంద్రా! నీ ముఖమండలంలో ఏదో విన్నబాటున్నట్లు కనిపిస్తున్నది. ధర్మార్థ కామాలలో ఏదయినా విలోపించినదని చింతిస్తున్నావా?' అని అడిగాడు. ఉత్తానపాదుడు ఆ మాటలకు చలించి, 'బ్రహ్మర్షివర్యా! నా పుత్రుడు ధ్రువుడు అయిదేళ్ళ పసివాడు,

స్త్రీజననిర్దయాకారణం వల్ల ఇంటి నుంచి గెంటివేయబడి ఏ తోడూ లేకుండా ఒక్కడూ అడవికి కాలి నడకన బయలుదేరి వెళ్ళిపోయాడు. ప్రయాణ శ్రమకు లోనై సొమ్మసిల్లుతాడో, నిద్రాసమయాదులలో క్రూరమృగాల వాతబడతాడో అని దిగులవుతున్నది. బుద్ధిహీనత వల్ల నేను స్త్రీవశవర్తినై నా అంకాన కూర్చుండ వచ్చిన బిడ్డను తోసివేసి అవమానించాను. నా కన్నా వేరే పాపాత్ములెవరుంటారు?' అని తన చింతా కారణాన్ని వెల్లడించాడు. నారదుడు ఆ మాట విని, 'రాజోత్తమా! నీ పుత్రుని ప్రభావం ఎటువంటిదో తెలియక ఇంతగా దుఃఖిస్తున్నావు. అతను దైవరక్షితుడు. అతని కోసం దిగులుపడకు. అచిరకాలంలోనే అతను లోకపాలకులకు కూడా సాధ్యం కాని మహాకార్యాన్ని సాధించి దిగంత విశ్రాంత కీర్తిమంతుడై క్షేమంగా తిరిగివస్తాడు' అని ఊరడించి వెళ్ళాడు. ఉత్తానపాదుడు ఆయన అమోఘ వచనాలను విన్న తర్వాత ధైర్యం తెచ్చుకొని కొడుకు మీది ప్రేమతో రాజ్యవైభవాలన్నింటినీ విస్మరించి, అతని రాకకోసం ఎదురుచూడసాగాడు.

## ధ్రువుని తపఃక్రమం

విదురా! ధ్రువుడు ఆ విధంగా మధువనాన్ని చేరి, కాళిందీ జలాలలో స్నానం చేసి, ఆ రాత్రి ఉపవసించి, నారదమహర్షి ఉపదేశించిన తీరున యోగపూర్వకంగా హరిధ్యానం చేయసాగాడు. ఆహారనియతి పాటించి మూడు రోజుల కొకసారి వంతున వెలగపండ్లో రేగుపండ్లో తిని మొదటి నెల గడిపాడు. అదే ప్రకారం జీర్ణ తృణ పర్ణాలతో రెండవ నెల గడిచింది. మూడవ నెలలో తొమ్మిది రోజులకొకసారి జలాహారుడై, నాల్గవ నెలలో పన్నెండు రోజుల కొకసారి కేవలం వాయుభక్షణుడై కాలం గడిపాడు.

అప్పటికి అతనికి శ్వాసజయం కలిగి ధారణాయోగం సిద్ధించింది. రోజులు క్షణాలలా దొర్లిపోసాగాయి. అతను వాయునిరోధం కావించి, ఒంటికాలిపై స్థాణువు వలె నిలిచి మనస్సును విషయపరాఙ్ముఖం చేసి

భగవత్కల్యాణ రూపం పైని బుద్ధి నిలిపి అనన్యభావంతో ధ్యానగతుడై ఏడవ నెల గడిపాడు.

ఆ విధంగా ధ్రువుడు ధ్యానమగ్నుడైనప్పుడు అతని అంగుష్ఠ భారాన్ని భరింపలేక ఏనుగు బరువుకు అల్లల్లాడిన ఓడవలె పుడమి ఊయల లూగసాగింది. ముల్లోకాలూ కంపించాయి. అతని ప్రాణనిరోధక్రియ వల్ల లోకాలకు ఉచ్ఛ్వాసనిఃశ్వాసాలు స్తంభించాయి. సురలు దిక్కుతోచక లోకపాలకులను వెంటగొని శ్రీమహావిష్ణువు శరణుజొచ్చి, 'దేవా! చరాచర సమస్త ప్రపంచానికీ ప్రాణనిరోధం సంభవించింది. ఈ ఉపద్రవానికి నివారణోపాయం ఏమిటో మాకు అర్థం కావటం లేదు. ఈ బాధ తొలగించి లోకమంగళం కావించు' అని మొరపెట్టుకొన్నారు.

భగవానుడు వారి మొర విని, 'భయపడకండి. ఉత్తానపాదుని పుత్త్రుడు ధ్రువుడు మనస్సులో నన్ను పాదుకొల్పి ప్రాణనిరోధపూర్వకంగా తపస్సు చేస్తున్నాడు. ఉగ్రమైన అతని తపస్సు వలన ఈ పరిస్థితి కలిగింది. నేను వెళ్ళి ఆ పసివాణ్ణి తపోదీక్ష నుంచి విరమింపజేస్తాను. మీకు మేలు కలుగుతుంది; మీ మీ తావులకు నిశ్చింతగా వెళ్ళండి' అని అభయదానం చేశాడు. దేవతలు స్వస్థచిత్తులై ఆ దేవదేవునికి నమస్కరించి, తమ తమ తావులకు వెళ్ళిపోయారు.

అంతట భగవానుడు గరుత్మద్రథాన్ని అధిరోహించి మధువనానికి వచ్చాడు. ఆ సమయంలో ధ్రువుడు యోగపరిణద్ధ స్వబుద్ధిచేత తన హృదయంలో భగవానుని విలోకిస్తూ అందులో లీనమై ఉన్నాడు. వైకుంఠుడు మధువనిలో అడుగు పెట్టేసరికి ధ్రువుని హృదయకోశాంతర దివ్యమూర్తి అదృశ్యమైపోయింది. ఆకస్మికంగా తన మనస్సులోని రూపం కానరాకపోయేసరికి అతను నివ్వెరపోయి, కనులు విప్పి చూశాడు. అతని యెదుట భగవానుడు గరుడారూఢుడై కానుపించాడు. ధ్రువుడు సర్వేశ్వరునికి సాష్టాంగప్రణామం చేశాడు.

భగవానుడు తనను కౌగిట గూర్చినట్లు, శిరస్సును మూర్కొనినట్లు ధ్రువుని మనస్సుకు లీలగా గోచరించింది. ఆనందపరవశుడై అతను భగవంతుని స్తుతింపదలిచాడు. తన మనోభావాన్ని సార్థకంగా అభివ్యక్తీకరింపగల నేర్పు చాలక, ఆనందాతిశయంతో నోట మాటరాక, అప్రతిభుడై నిలబడిన తన భక్తుని కలవరపాటును గుర్తించి భగవానుడు దయగొని, తన చేతిలోని వేదమయశంఖంతో ధ్రువుని కపోలతలాన్ని స్పృశించాడు. ఆ స్పర్శ ప్రభావం వల్ల ధ్రువునికి అత్యద్భుతమైన వాక్చాతుర్యం జనించింది. అతను ఈ విధంగా స్తుతించాడు:

## ధ్రువకృత హరిస్తోత్రం

'ఏ అఖిలశక్తిధరుడు నాలో ప్రవేశించి, సుప్తస్థితిలో ఉన్న నా ప్రాణేంద్రియాలను, వాక్కును సంజీవింపజేశాడో, ఆ పరమపూరుషునికి నమస్కారం!

దేవా! నిత్యైక స్వరూపా! ఆత్మశక్తి అయిన మాయను అధిష్ఠించి, మహదాదులతో కూడిన విశ్వాన్ని సృజించి, చైతన్యరూపంతో అందులోనికి ప్రవేశించి, బహురూప నామాలతో గోచరించే నీకు భక్తిపూర్వక ప్రణామం!

స్వామీ! బ్రహ్మదేవుడు ఈ చరాచర జగత్తులను సృష్టిస్తాడని అంటారు. అది సృష్టిరహస్యం తెలియనివారు అజ్ఞానవశులై అనే మాట. సృష్టించడం అంటే అంతకు పూర్వం లేనిదానిని కొత్తగా కల్పించడం అని కాదు.

నీవు ప్రసాదించిన జ్ఞానప్రభావాన్ని, పూర్వకల్ప ప్రపంచాన్ని మళ్ళీ రచించడమే బ్రహ్మసృష్టి అనబడుతున్నది.

దేవా! నీ పాదపద్మం భక్తుల పాలిటి కల్పకం. ముముక్షువులకు కూడా అదే శరణ్యం!

సంసార సముద్రాన్ని దాటడానికి ఆధారనౌక అయిన నీ పాదపద్మాన్ని సేవింపక, కేవల శవతుల్యమైన శరీరానికి విషయ సుఖభోగాలను కట్టబెట్టాలని లోకులు ప్రాకులాడతారు. వారే నష్టాత్ములు.

లోకేశ్వరా! నీ పాదారవింద పరిచర్య వలన, నీ కళ్యాణ కథాసుధారస పానం వలన కలిగే పరమ సుఖాన్ని చవిగొన్నవారు మోక్షాన్ని కూడా లెక్కచేయరు.

ఇక – స్వర్గాదులైన అల్పసుఖ విషయాలను గురించి వేరే పేర్కొనడం దేనికి?

తండ్రీ!

నీ భక్తులతోడి నిత్యసంగమ భాగ్యాన్ని నాకు ప్రసాదించు.

వారివలన నీ గుణకథామృతాన్ని తనివి తీరా ఆస్వాదించి, వ్యసనాత్మక సంసారాన్ని దాటడానికి అవకాశం కలుగుతుంది.
స్వామీ! కార్య కారణాత్మకమూ, నానా రూప ప్రాణివర్గ సంకులమూ అయి కంటికి కానవస్తున్న ఈ ప్రపంచమంతా నీ స్థూలరూపం.

ఇది దృశ్యం కనుక, కంటితో చూసి దీని తత్త్వాన్ని కొంతకు కొంతయినా గ్రహింపగలము. నీ స్వరూపం ఈ దృశ్యప్రపంచానికి పరమైనట్టిది. అది దృశ్యం కాదు కనుక మనోవాక్కులకు అందరానిది. కేవల బుద్ధిమాత్ర గమ్యం.

మహాత్మా! కల్పాంతంలో సర్వదృశ్య ప్రపంచాన్నీ నీ కుక్షిలో నిక్షేపించి, ఏకార్ణవ జలమధ్యంలో శేషతల్పం పైని పవ్వళించి, సమయం వచ్చినప్పుడు నీ నాభిసరోజం నుంచి చతురాస్యుని పుట్టించి, పునస్సృష్టిని కావిస్తావు.

అయినా–

నీవు నిత్యముక్తుడవు – జీవుడు నిత్యబద్ధుడు.

నీవు పరిశుద్ధుడవు – జీవుడు మలిన స్వరూపుడు.

నీవు సర్వజ్ఞుడవు – జీవుడు కించిజ్ఞుడు.

నీవు చైతన్యాత్ముడవు – జీవుడు జడాత్ముడు.

నీవు నిర్వికారివి – జీవుడు సవికారి.

నీవు అనాదిపూరుషుడవు – జీవుడు ఆద్యంతవంతుడు.

నీవు షడైశ్వర్య సంపన్నుడవు–జీవుడు నిరంతరదరిద్రుడు.

నీవు త్రిగుణాధీశుడవు – జీవుడు గుణపరతంత్రుడు.

ఇన్ని వైలక్షణ్యాల మూలాన – నీవు నీ చిచ్ఛక్తి వలన సర్వావస్థలకు సాక్షివవుతావు. జీవుడు సర్వావస్థలను తానే అనుభవిస్తున్నట్లు భావిస్తాడు.

దేవా! నీవు అటువంటి నిర్వికారుడవైనా లోకస్థితి పరిపాలనార్థం విష్ణురూపాన్ని ధరించావు.

అవిద్యాది వివిధ శక్తులు విరుద్ధగతులను కలిగి ఉన్నప్పటికీ కార్యార్థమై ఆనుపూర్విగా వచ్చి నీ యందు చేరుతుంటాయి.

అట్టి బ్రహ్మమునకు, విశ్వకారకునకు, ఏకమూర్తికి, అనంతునకు, ఆద్యునకు, ఆనందమాత్రునకు, అవికారునకు నమస్కరిస్తున్నాను.

నీవు పురుషార్థమూర్తివి కనుక నీ పాదపద్మ సేవ వలన సర్వార్థాలూ కలుగుతాయి. అందువల్ల సనకాదులు కూడా నిన్ను ఆశ్రయిస్తారు.

నిన్ను ఆశ్రయించినవారు దీనులని నీవు ఏనాడూ భావింపవు.

అప్పుడే ఈనిన ఆవు దూడను కాపాడినట్లు మమ్మల్ని పరిపాలించు!'

## భగవానుని వరప్రసాదం

భగవానుడు ధ్రువుని మనస్కరించి, 'నాయనా! నీ మనోభీష్టం నాకు తెలుసు. పశువులకు కట్టే కంబాన్ని పోలి గ్రహ నక్షత్ర తారాది జ్యోతిశ్చక్రానికి ఏ స్థానం ఆధారమై ఉన్నదో, లోకత్రయం నశించినప్పటికీ ఏ స్థానం నశింపదో, ఏ స్థానానికి ధర్మాగ్ని కశ్యప దేవేంద్ర దండధర ప్రభృతులు నక్షత్రరూపులై ప్రదక్షిణ సంచారాన్ని కావిస్తారో, ఆ భద్రస్థానాన్ని నీకిచ్చాను. ఇంతవరకు దీనిని ఎవరూ తాకి యెరుగరు. నీ తండ్రి తన రాజ్యమంతటినీ నీ చేతనుంచి ధర్మాశ్రయుడై తపోవనానికి నిర్గమిస్తాడు. నీ సవతి తల్లి కొడుకు ఉత్తముడు వేటకై అడవికి పోయి అక్కడ మరణిస్తాడు. నీ సవతి తల్లి తాను చేసిన ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా కొడుకును వెతుక్కుంటూ అడవికి వెళ్లి అగ్ని పాలవుతుంది. నీవు నిష్కంటకంగా రాజ్యాన్ని పరిపాలిస్తూ యజ్ఞేశ్వరుడనైన నన్ను భూరిదక్షిణలతో ఆరాధిస్తూ ఐహిక భోగాలన్నింటినీ యథేచ్ఛంగా అనుభవిస్తూ ఇరవైఆరు వేల సంవత్సరాలు జీవిస్తావు. అంత కాలమూ నన్ను స్మరిస్తావు. అప్పుడు నీవు నేను చెప్పిన సర్వోత్తమ స్థానాన్ని అధిరోహిస్తావు. నీకు పునర్జన్మ కలుగదు' అని పలికి అంతర్ధానమయ్యాడు.

## ధ్రువుని విచారం

విదురా! ఆ మాటలు ధ్రువుని మనస్సుకు అంతగా రుచింపలేదు. తనకు లభించిన వరమూ అతనికి ప్రీతిపాత్రం కాలేదు. ఏమంటే, అతను ముక్తిప్రదుడైన భగవంతుని కృపకు పాత్రుడై కూడా తనకు ముక్తినిమ్మని అడగటం మరచిపోయాడు. సవతి తల్లి మాటలు తననింకా బాధిస్తూ ఉండటం వలన ఒక విధమైన మోహం అతనిని ఆ సమయంలో కప్పివేసింది.

అతను మోసపోయానని గ్రహించాడు. 'అయ్యో! సనందనాది మునీశ్వరులకు సయితం బహుజన్మ సమాధియోగ్యమైనట్టి హరిపాదచ్ఛాయను నేను ఆరు నెలలలో పొందడానికి నోచుకొని, చేజేతులా జారవిడుచుకొన్నాను. ఇదంతా నా భేదదృష్టి వల్ల కలిగిన ఫలం. అయ్యో! నా వంటి దౌర్భాగ్యులెవరుంటారు? మోక్షప్రదుని ఆశ్రయించి, అనిత్య పదవిని కోరాను. దేవతలు నన్ను చూసి ఓర్వలేక నాకు ఇటువంటి ఆలోచనను కలిగించి ఉంటారు. నారద మునీంద్రా! మానావమానాలు తెలియని పసిపిల్లవాడినని ఆనాడు మందలించారు. మీ మాటే నిజమయింది. తత్త్వార్థాన్ని విచారిస్తే సర్వం ఏకమూ, అద్వితీయమూ అవుతుంది. మాయ ఆవరించినపుడు ద్వైతం కనబడుతుంది. నేను దైవమాయాహతుడనై భ్రాంతికి చిక్కి తోబుట్టువనే ఒక శత్రువున్నాడని తలచి ఆ శోకాగ్నిలో తపిస్తూ, స్వప్నావస్థలో భిన్న పదార్థాలను చూసినవాడి గతికి పాల్పడ్డాను. విశ్వాత్మకుని మెప్పించడమే అతిదుర్లభం. అటువంటి పరమాత్ముని మెప్పుకు నోచుకొని, అల్పమైన కోరికను కోరాను. చచ్చినవాడికి చికిత్స చేసినట్లు, నా తపస్సంతా బూడిదలో పోసిన పన్నీరైంది. చక్రవర్తిని ఆశ్రయించి, పిడికెడు బియ్యం కోరినట్లయింది. ఇప్పుడేమి చేయడం?' అని అతను చింతాపరుడైనాడు.

## ఉత్తానపాదుని రాక

విదురా! ధ్రువుడు ఆ విధంగా చింతించి తపస్సు చాలించి వెనుకకు బయలుదేరాడు. ఆ సంగతి ఉత్తానపాదునికి తెలిసింది. అతను చనిపోయాడనుకున్న మనిషి బ్రతికే ఉన్నాడని తెలిసినంత సంతోషపడి, ఆ శుభవార్తను తెచ్చినతనికి అపరిమిత ధనం పారితోషికంగా ఇచ్చి, పుత్రునికి ఎదురేగాలని నిశ్చయించి, మంత్రులను, బ్రాహ్మణులను, కులవృద్ధులను, బాంధవులను వెంటగొని సువర్ణ రథం ఎక్కి శంఖ దుందుభి వేణు ప్రముఖ వాద్య ధ్వనులతో తరలి వెళ్ళాడు. ఆతని వెంట సునీతి ఒక శిబిక నధిరోహించి తరలింది. సురుచి తన పుత్రుడైన ఉత్తమునితో వేరొక శిబిక నెక్కి వచ్చింది.

వారందరూ పురానికి దగ్గరలో ఉన్న ఉపవనాన్ని చేరుకొన్నారు. అంతలో ధ్రువుడు వచ్చి వారిని చేరుకొన్నాడు. ఉత్తానపాదుడు పుత్రవాత్సల్యంతో హుటాహుటిని తేరు దిగి తహతహపాటుతో నిలువెల్లా కంపిస్తుండగా కొడుకును నిండు కౌగిట చేర్చుకొని, శిరస్సు మూర్కొని, ఆనందాశ్రువులలో అతనిని జలకాలాడించాడు. ధ్రువుడు తండ్రి పాదాలపై వ్రాలి, దీవెనలను పొంది, తల్లికి మొక్కి, సురుచి పాదాలపై ప్రణమిల్లాడు. ఆమె అతనిని లేవదీసి, కౌగిటచేర్చి, బాష్పగద్గదవచనాలతో 'నాయనా! చిరంజీవివై వర్ధిల్లు' అని దీవించింది.

విదురా! సవతి తల్లి కనుక ఆమె మాత్సర్యం ఏమైంది? గతాన్ని ఎలా విస్మరింపగలిగింది? అని అడుగుతావేమో. భగవానుడు మైత్రి మున్నగు సర్వగుణాలకూ సముద్రుడంటివాడు. ఆ భగవానుడు ఎవరికి ప్రసన్నుడవుతాడో వారితో లోకమంతా మైత్రి కావిస్తుంది. నీరు పల్లపు నేలకు పారడం నైజమే కదా.

అనంతరం ధ్రువుడు, ఉత్తముడు ఒకరి నొకరు కౌగిలించుకొని ఆనందపరవశులయ్యారు. సునీతి తన ప్రాణానికి ప్రాణమైన పుత్రుని కౌగిట హత్తుకొని, పుత్రశరీర స్పర్శసుఖం వలన చన్నులు చేపి మైమరచిపోయింది. పోయిన దనుకొన్న వస్తువు చేరువైనప్పుడు అటువంటి మనోగతి సహజమే కదా.

అప్పుడు అక్కడున్నవారందరూ సునీతిని కొనియాడి, 'సాధ్వీ! భగవానుడు ప్రణతార్తిహరుడు. ఆయనను ధ్యానించేవారికి మృత్యువును జయించే శక్తి కూడా అవలీలగా కలుగుతుంది. నీ చిత్తశుద్ధి, నీ నిజమైన భక్తి ఈనాడు ఫలించాయి. భాగ్యవతులలో భాగ్యవతి వైనావు. నీ సుతుడు భూమండలాధిపతి అవుతాడు. సుఖసంపదలతో వర్ధిల్లు తల్లీ' అని ఆశీర్వదించారు.

## ధ్రువుని పురప్రవేశం

ధ్రువుడు తిరిగివచ్చాడని వినగానే పౌరులు ఆనందార్ణవంలో ఓలలాడారు. రసాల పల్లవ ప్రసూన ముక్తాదామ తోరణాలతో వీథులను శృంగారించి, కదళీస్తంభాలను పోకచెట్లను ద్వారతలాలలో అలంకరించి పూర్ణజలకుంభాలను, బలిదీపాలను ముంగిళ్లలో తీర్చి నిలిపారు. శుభదీపకళికలు మిన్నులంటుతున్న సౌధతల ప్రాకార గోపురాలలో వెలుగులీనసాగాయి. రాజమార్గాలు పన్నీటిజల్లులతో ఎన్నడూ లేని సౌభాగ్యాన్ని సంతరించుకున్నాయి.

ధ్రువుడు మత్తగజాన్ని ఆరోహించి తల్లిదండ్రుల తోను బ్రాహ్మణాదుల తోను పురప్రవేశం చేశాడు. పౌరులు లాజాక్షతలతో పుష్పవృష్టి కురిపించి కర్పూర నీరాజన లిచ్చారు. పతివ్రతామణులు దీవెనలు వర్షించారు. ధ్రువుడు వారందరి ప్రేమానురాగాలను తలవంచి అందుకొంటూ శ్రవణమధుర మంగళగానాలను ఆకర్ణిస్తూ నగరు లోపలికి ప్రవేశించాడు.

ఆ నగరు గోడలు మరకతస్ఫటికరచితాలై నీడలు వారుతున్నాయి. లోపలి గదులు మణిదీప కాంతులతో వింత సోయగాలను విరజిమ్ముతున్నాయి. రత్నాలు పొదిగి క్రొమ్మెరుగులీనుతున్న సాలభంజికలతో, దంతరచిత సువర్ణమయ పర్యంకాసనాలతో సౌధాంతరం నిండి ఉన్నది. పద్మోత్పలాదులు విరియబూచిన జలాలలో కేరింతలు కొడుతున్న కారండవ పక్షుల తెలివెలుగులను ఉద్దీపింపజేస్తూ సోపాన పంక్తుల వైడూర్యకాంతులు మిరుమిట్లు గొలుపుతున్న అందమైన నడబావులను, వివిధతరులతాగుల్మాదులతో శుక పిక మధుకర మధురనాదాలతో ఒప్పారుతున్న ఉద్యానవనాలను చూసి అవ్యక్తానందాన్ని పొందుతూ ధ్రువుడు సౌధం లోపలికి అడుగిడి, తండ్రి ఉపలాలనలను అందుకొంటూ దేవభోగాలలో తేలియాడసాగాడు.

## రాజ్యాభిషేకం

ధ్రువునికి రాజ్యభారాన్ని వహించడానికి తగిన వయస్సు వచ్చింది. ఉత్తానపాదుడు కూడా వృద్ధుడైనాడు. ప్రజలు తన కుమారుని యెడ భక్తిగౌరవాలు కలిగి ఉన్నారనీ, అతనికీ ప్రజలంటే అమితాదరం కలదని, వారి పరస్పర ప్రేమానురాగం చిరస్థాయికం కావాలని నిశ్చయించి అతను కొడుకుకు పట్టాభిషేకం చేయాలని సంకల్పించాడు. ప్రజానురాగవర్ధిష్ణువైన ధ్రువునికి రాజ్యభారాన్ని అప్పగించి, ఐహికభోగవిరక్తుడై ఆ మహారాజు తపోవనానికి వెళ్ళిపోయాడు.

## వివాహం

విదురా! శింశుమారుడని ఒక రాజు ఉండేవాడు విన్నావు కదా! ఆయన కుమార్తె భ్రమి. ఆ వయోవిలాసవతిని పెండ్లాడి ధ్రువుడు ఆమె యందు కల్పుడు, వత్సరుడు అని ఇద్దరు కొడుకులను, తనవంటి యశోదీప్తిమంతులను కన్నాడు.

కొంతకాలానికి ధ్రువుడు వాయువు కుమార్తె ఇళను వివాహం చేసుకున్నాడు. వారికి ఉత్కలుడనే పేరిట ఒక కొడుకు, అతిలోక సౌందర్యరాశి అయిన ఒక కుమార్తె కలిగారు.

## ఉత్తముని మరణం

విదురా! ధ్రువుని తమ్ముడు ఉత్తముడు వివాహం కాకముందే ఒకనాడు మృగయావినోదానికై హిమవత్పర్వతానికి వెళ్ళి అక్కడ ఒక యక్షుని వలన మరణించాడు. సురుచి ఎంతకాలానికీ కొడుకు ఇంటికి తిరిగిరాకపోయేసరికి అడవులకు బయలుదేరి, అక్కడ ఒక అగ్నిప్రమాదంలో ప్రాణాలు విడిచింది.

## ధ్రువ గుహ్యకాదుల యుద్ధం

ఉత్తముని ఒకానొక యక్షుడు సంహరించాడన్న వార్తను వినగానే ధ్రువుడు మండిపడి విజయశీల రథాన్ని అధిరోహించి ఉత్తరదిశకు వెళ్ళి హిమవద్గిరి

సాను ప్రదేశాన్ని దాటి అలకాపురి చేరి శంఖాన్ని పూరించాడు. ఆ మహాశంఖారావం దశదిశలలో ప్రతిధ్వనించింది. ఆ ఘోరనాదానికి గుహ్యకస్త్రీల గర్భాలు అవిసి జారాయి. అలకాపురిలో ఉన్న గుహ్యక సైనికులు ఆ ధ్వని విని ఆయుధాలు ధరించి పురం వెడలి వచ్చి యుద్ధానికి ధ్రువునితో తలపడ్డారు. ధ్రువుడు వారిలో ఒక్కొక్కని ఫాలపట్టిక పైనా మూడేసి బాణాలు నాటుకొనేటట్లు ఏకకాలంలో శరాలను ప్రయోగించి తన ధనుర్విద్యాప్రవీణతను లోకాశ్చర్యంగా ప్రదర్శించాడు. ఆ బాధకు గుహ్యకులు పాదతాడిత పన్నగాల వలె చెలరేగి ప్రాస శూల పరిఘ పరశ్వథ శక్తి నిస్త్రింశాది వివిధాయుధాలను ధ్రువునికి రెట్టింపుగా విసిరి, విచిత్రమైన రెక్కలు గల సాయకాలు పెక్కింటిని ఎడతెరిపి లేకుండా మీదికి ప్రయోగించారు. ఆ తీరున ఒక్కుమ్మడిని పదమూడువేల బాణాలు వచ్చి ధ్రువుని రథాన్ని, గుర్రాలను, సారథిని కప్పివేశాయి. మహావర్షధారలు పర్వతాన్ని మరుగుపుచ్చినట్లు నలువైపుల నుంచి శరపరంపర వచ్చి ధ్రువుని కలరూపు తెలియరాకుండా క్రమ్ముకొనేసరికి ఖేచరులు హతాశులై, 'అయ్యో! మనుపుత్రుడు గుహ్యక పుణ్యజన మహార్ణవంలో మునిగి అసువులు బాశాడు అని హాహాకారాలు చేశారు.

ఆ ధ్వనులు నలుదిక్కులకూ కలయబ్రాకి, బాణపు రెక్కల మ్రోతలతో కలిసి నిస్వనించి రథమధ్యగతుడైన ధ్రువుని కర్ణరంధ్రాలను అగల్పసాగాయి. అతను వాటిని లెక్కచేయక వింటి నారిని సారించి మేఘమండలాన్ని చెల్లాచెదరు చేసిన ఝంఝూమారుతం వలె వైరిబాణపరంపరపై శరవర్షాన్ని కురిపించి ఆ అమ్ములను వమ్ము చేశాడు. ధ్రువుని రథం అప్పుడు మంచుతెరలను చీల్చి కానవచ్చిన రవిబింబం వలె సాక్షాత్కరించింది. అదే సమయంలో వైరులందరూ బాణహతులకు తలలు తెగి తొడలు విరిగి బాహువులూడి పట్లుదప్పి నేలకూలారు. రణభూమి వీరమనోహరంగా విభాసించింది. సింహాన్ని చూచిన ఏనుగుల వలె చావగా మిగిలిన వీరులందరూ చెల్లాచెదరై పారిపోయారు. ధ్రువుని ఎదిరింపగలవాడు ఒక్కడూ కానరాలేదు.

## మహోత్పాతాలు

అంతట ధ్రువునికి అలకాపురాన్ని సందర్శించాలన్న ఉత్సాహం జనించింది. అతి ప్రయత్నం మీద అతను తన కుతూహలాన్ని అణచుకొని, సారథీ! రాక్షసులు మహామాయావులు. వారి కపటచేష్టలు ఊహింపరానివి' అని పలికేటంతలోనే సాగరఘోషను పోలిన ఒక ఘోరనాదం వినవచ్చింది. ఆ ధ్వనితోపాటు నభోమండలమంతా తళతళ మెరుపులతో, ఫెళఫెళ గర్జిస్తున్న ఉరుములతో నిండిపోయింది. సుడిగాడ్పులకు పెంధూళులు రేగి దెసలను కప్పివేశాయి. రక్తవర్షం విణ్మూత్ర మేదః పూయాలతో కలిసి కుంభించింది. కబంధాలు బారులు కట్టి అంతరిక్షమంతటా ఆవరించాయి. నభోభాగంలో మహాపర్వతం ఒకటి కానవచ్చి పైకి రాలబోతున్నట్లు విజృంభించింది. గదా పరిఘాది క్రూరాయుధాలు రాలిపడ్డాయి. రాళ్ళవాన కురిసింది. ఘోరసర్పం ఒకటి బుసలుకొడుతూ కన్నుల వెంబడి నిప్పులు కురుస్తూ చుట్టుకొన్నది. సింహవ్యాఘ్రమదేభాలు గుంపులు గుంపులుగా పైకి ఉరకసాగాయి. సాగరం కల్లోలాభీలమై భోరున నినదిస్తూ ధరామండలాన్ని గ్రసింపబోతున్నదానివలె గోచరించింది. ఆ విపరీతాలకు ధీరులు సయితం తహతహ పడసాగారు.

## మహామునుల ఆదేశం

విదురా! ఆ విపరీతాలను మునులు కనుగొని, ధ్రువుని సమీపించి, 'ఉత్తానపాద సుతాగ్రణీ! నీకు జయోఽస్తు ఎవని నామం చెవిసోకినంతనే మృత్యువు కూడా వెరచి పరుగిడుతుందో, ఆ భక్తార్తిహరుడు భగవానుడు నీకు ప్రసాదించిన అస్త్రరాజాన్ని మరచావా? దానిని ప్రయోగించు. విజయం నిన్ను వరిస్తుంది' అని గుర్తుచేశారు.

## నారాయణాస్త్ర ప్రయోగం

ధ్రువుడు మునీశ్వరుల హెచ్చరికను విని ఆచమించి శుచియై నారాయణాస్త్రాన్ని సంధించి ప్రయోగించాడు. జ్ఞానోదయం వలన

వ్యసనపరంపర మటుమాయమైనట్లు ఆ దివ్యాస్త్ర ప్రభావం వలన గుహ్యకమాయలన్నీ క్షణంలో పటాపంచలై సమసిపోయాయి. అంతే కాక ఆ అస్త్రం నుంచి స్వర్ణపుంఖాలు, హంసపక్షాలు కలిగిన వివిధ బాణాలు వెలువడి పెద్దగా రొదచేస్తూ గుహ్యక రాక్షస సేనలన్నింటినీ చీల్చి చెండాడసాగాయి. గుహ్యకాదులు చేతిలోని ఆయుధాలను విసరివేసి, గరుత్మంతుణ్ణి చూసి పాములు పడగ దించుకొని పారిపోయినట్లు నలుదిక్కులకూ పరిగెత్తారు. కొందరు చేతులు తెగి, కొందరు తొడలు విరిగి మొదలు నరికిన చెట్లలా కూలిపడ్డారు. కొందరు తలలు తెగి నేలకు వ్రాలి నెత్తుటి వరదలో కొట్టుకొనిపోయారు. ఆ విధంగా శ్రీమన్నారాయణాస్త్ర మహాప్రభావం వలన రణరంగంలో హతులైన వారందరూ మహాయోగుల సరణిని సూర్యమండలాంతరములైన ఉత్తమ పుణ్యలోకాలను చూరగొన్నారు.

## స్వాయంభువుని హితోపదేశం

గుహ్యకాదులు ధ్రువుని చేతిలో హతమారుతున్న వృత్తాంతాన్ని స్వాయంభువ మనువు విని జాలిపడి ఋషులను వెంటగొని ధ్రువుడి వద్దకు వచ్చి, 'నాయనా! అతి రోషం పాపానికి, ఆ పాపం మూలాన అది నరకానికి ద్వారమవుతుంది. అట్టి రోషానికి వశుడవై నిరపరాధులైన ఆ పుణ్యజనులను తెగటార్చావు. నాయనా! ఇటువంటి పని మన కులానికి తగదు. నీ తమ్ముని చంపినవారు నిరపరాధు లెట్లా అవుతారని సందేహించకు. వీరిలో ఏ ఒక్కడో నీ తమ్ముని చంపి ఉంటాడు. ఒక్కడి కోసం అందరినీ చంపడం లౌకిక న్యాయం అనిపించుకోదు. ఇక ఆధ్యాత్మిక దృష్టి మాటేమిటి? దేహాలు జడములైనట్టివి. అవి వారి వారి భోగ్యకర్మ ఫలానుసారంగా పంచభూత సమ్మేళనం వలన కలుగుతాయి. ఆ విధంగా కలిగిన దేహాలు నిజానికి జడములే కనుక ఎట్టి కార్యానికైనా తగిన సామర్థ్యం కలవి కావు. జడములైన శరీరాలను సాధనగా గైకొని సర్వకార్యాలనూ చేయిస్తున్నది ఏమిటో తెలుసా? శరీరాంతరమైన ఆత్మ ఆ పనులు చేయిస్తున్నదని కొందరంటారు. అది అజ్ఞానవచనమే తప్ప నిజం కాదు. శరీరాంతరమైన ఆత్మకు రెండవస్థలు లేవు.

అది ఏకము, సర్వవ్యాపి అయినట్టిది. కనుక నీ లోనూ నా లోనూ ఉన్నది ఒక్క ఆత్మే గాని వేరు వేరు ఆత్మలు కావు. ఒక్కటే అయిన ఆత్మ తనను తాను హింసింపదు కదా.

హింసకు కారణం ఏమిటి? అంటే, దేహాత్మాభిమాన రూపమైన అజ్ఞానమే కారణం. ఆ అజ్ఞానం అహంకారం రూపంలో సర్వకార్యాలనూ చేస్తున్నది. అజ్ఞానం అంటే పశువృత్తి అన్నమాట. అది మానవులకు తగదు భగవత్సేవకులైన సాధువుల సంగతి ఇక వేరే చెప్పేదేమున్నది? నీవు దురారాధ్యుడైన భగవానుని సర్వభూతాత్మ భావంతో కొలిచి మెప్పించి హరిదాసుల వినుతికెక్కావు. నీతి నియమాలను అభ్యసించావు. పరమపదాన్ని సాధించావు. అట్టి నీ వెక్కడ? ఈ దురితకార్యం ఎక్కడ?

> నాయనా పెద్దల యెడ వినయం, నీచుల యెడ కరుణ, సముల యెడ మైత్రి, నిఖిల జంతువుల యెడ సమబుద్ధి కలిగి వ్యసనాలను నిరాకుల బుద్ధితో సహించడం సత్పురుషుల శీలం అవుతుంది. సత్పురుషులకు భగవానుడు ప్రసన్నుడవుతాడు. భగవత్ప్రసాదానికి పాత్రుడైన సత్పురుషుని ప్రాకృతగుణాలు సమీపింపనేరవు. అందువల్ల అతనికి జీవత్వబుద్ధి నశిస్తుంది. అతను సుఖాత్మకమైన బ్రహ్మాన్ని పొందుతాడు.

నాయనా! నీ తమ్ముణ్ణి చంపారనే భావాన్ని ఉద్దేశించి ఈ విధంగా అంటున్నాను. ఆత్మకు భ్రాతృపుత్రాది భావం అణుమాత్రం కూడా కలగదు. కనుక చంపడం కాని, చంపబడటం కాని ఆత్మకు కలగవు. పంచభూతాలు దేహాద్యాకార పరిణామాన్ని పొందుతాయి. ఆ దేహాలు స్త్రీ పురుష రూపాలను ధరిస్తాయి. స్త్రీ పురుషుల మైథున ఫలంగా సంసారం ప్రవర్తిల్లుతున్నది. ఆ భూతాదులు పాలక రూపాన పరిణమించినప్పుడు వాటి ప్రవర్తనను లాలనమని, అది హంతృదేహాకార పరిణామాన్నిపొందినప్పుడు వాటి సమ్మర్దం భూతసంహారకమని చెప్పబడుతోంది.

ఇట్లా ఎందుకు జరగాలి? అంటే, ఇదంతా పరమాత్ముని మాయావిలాసం అని గ్రహించు. ఇది భగవంతుని మాయావిలాసం అయితే భగవంతునికి, అతని మాయకు సంబంధం ఏర్పడుతుందా? అంటే, సంబంధం ఎంత మాత్రం కలుగదు. అలాగైతే జడమాత్రములైన దేహాల వలన, గుణాల వలన సర్గాదులు ఏ విధంగా కలుగుతున్నాయి? అని అడగవచ్చు. భగవంతుడు నిమిత్తమాత్రుడు. ఆయన నిమిత్తమాత్రాన కార్యకారణాత్మకమైన విశ్వమంతా పరిభ్రమిస్తున్నది. నిదర్శనం ఒకటి చెప్పనా? సూదంటురాయి సాన్నిధ్యంలో ఇనుపముక్క చలించడమే ఇందుకు నిదర్శనం.

భగవంతుడు నిమిత్తమైనప్పుడు సృష్టి స్థితి విలయాలు ఆయన వలననే కలుగుతున్నాయని ఎందుకు భావించకూడదు? అంటే, భగవంతుడు శక్తిమంతుడు. ఆ శక్తి నానారూపాలలో ఉంటుంది. వాటిలో కాలశక్తి కూడా ఒకటి. ఆ కాలశక్తి వలన గుణక్షోభ కలుగుతుంది. తత్ఫలితంగా సృష్ట్యాది వివిధ శక్తులు ఏర్పడతాయి. ఆ శక్తులు తత్తత్కార్యాలను నెరవేరుస్తాయి. ఆ శక్తుల కార్యాన్ని భగవంతుని యందు ఆరోపిస్తారు. దానివల్ల అకర్త అయినవాడు (కర్త కానివాడు) కర్త గాను, అహంత అయినవాడు హంత గానూ భాసిస్తున్నాడు. ఆ విధంగా గోచరించడానికి కారణం ఏమిటంటావా? అధ్యారోప దోషమే కారణం.

పరమేశ్వరుని శక్తి అనిర్వచనీయమైనది. అటువంటి శక్తి ఒకటి అనాదిగా ఉన్నదని నిశ్చయించడం ఎలాగంటే, వస్తువు యొక్క శక్తిని దాని కార్యాల వలన ఊహించినట్లు భగవచ్ఛక్తిని కూడా తత్కార్యజాతాన్ని బట్టి కొంతకు కొంత ఊహింపవచ్చు. ఆ శక్తి కార్యాలు ఏవేవి? అని అడుగుతావేమో. జ్ఞానేచ్ఛాక్రియలు ఆ శక్తి కార్యాలు. ఆ శక్తికి ఆద్యంతాలు లేవు కాని అవస్థాభేదం మాత్రం ఉన్నది. ఆ అవస్థలను లీనావస్థ అని, విక్షేపావస్థ అని పేర్కొంటారు. లీనావస్థలో ఉన్నప్పుడు శక్తికి ఎట్టి వ్యవహారమూ ఉండదు. విక్షేపావస్థలో సర్వవ్యవహారాలూ కలుగుతున్నాయి. ఆ కారణాన శక్తి వ్యవహారఫలమైన సర్వసృష్టీ ఆద్యంతాలు కలిగినదవుతున్నది.

శక్తివ్యవహారం విషయమై కానవస్తున్నదని, దానిని బట్టి శక్తిమంతుడైన భగవానుని యందు వైషమ్యం సూచిత మవుతుందని కొందరు సందేహిస్తారు. కాని భగవంతునికి మిత్రులు గాని, శత్రులు గాని ఉండరు. ఆయన అందరి యెడ సమానుడై ప్రవర్తిస్తాడు. కర్మవైషమ్యాన్ని బట్టి ఫలవైషమ్యం ఏర్పడుతున్నది. ఆ ఫలవైషమ్యాన్ని భగవంతునికి ఆరోపిస్తున్నారు. గాలి ఏ వంకకు వీస్తే ఆ వంకకు ధూళి చెలరేగినట్లు కర్మము ఎడమ వైపు లాగితే ఆ విధంగా భూతజాతం ప్రవర్తిస్తుంది. ప్రారబ్ధ కర్మఫల వాసనల వైషమ్యాన్ని బట్టి కర్మవైషమ్యం కలుగుతుంది.

నాయనా! భగవంతుడు పూర్ణస్వరూపుడు. ఆయనకు వృద్ధిక్షయాలు గాని, చలనాదులు గాని కలగవు. భూతములు కర్మాధీనములై తత్తత్కర్మాను సారంగా వృద్ధి క్షయ కాలాకాల మృత్యువులను పొందుతుంటాయి. ఈ విచిత్ర లోకప్రవృత్తిని చూసి ఊహకు అందినట్లుగా కారణాన్ని నిశ్చయిస్తారు. కర్మము కారణమని కొందరు, స్వభావం కారణమని కొందరు, కాలం కారణమని కొందరు, కామం కారణమని కొందరు నానావిధాల భావిస్తారు.

భగవానుడు అవ్యక్తుడు కనుక కంటికి కానరాడు. కంటికి కనిపిస్తే – ఇదిగో ఆయన పనులిట్టివని చెప్పవచ్చు. మరి భగవంతుడు అప్రమేయుడు, సర్వ శక్తిమంతుడు. అందువలన ఆయన చర్యల యొక్క తత్త్వం కాని, హద్దు కాని బుద్ధికి కూడా అందదు. అటువంటి విషయాన్ని గురించి వట్టి వాదాలు చేయడం కాలహరణమే తప్ప కార్యసాధకం కాదు.

నాయనా! కుబేరాదులు నీ తమ్ముని చంపారన్న భ్రాంతిని విడనాడు! భూతరాశికి కలిగే జననమరణాదులకు తత్తత్కర్మమే కారణం. కర్మము భగవదాజ్ఞ ప్రకారం ఫలిస్తుంటుంది. ఫలనియామకునికి ఫలం కలుగదా? అని శంకిస్తావేమో. అహంకార మమకారాలు ఉన్నప్పుడు కర్మఫలం దాని కర్తకు కలుగుతుంది. భగవంతునికి అహంకార మమకారాలు లేవు కనుక ఆయనకు కర్మఫలం అణుమాత్రమైనా కలగదు.

హృదయగ్రంథి అయిన అహంకారం ఏ విధంగా తొలగిపోతుంది? అన్న జిజ్ఞాస ఉదయించటం సహజమే. ఎవని ఆజ్ఞాబద్ధులై విశ్వస్రష్టలు కూడా ముక్కు తాడుతో కట్టిన యెడ్ల వలె వర్తిల్లుతారో, అయిదేండ్ల పసివాడవైనా సవతి తల్లి మాటకు నొచ్చి, కన్నతల్లిని కూడా విడనాడి మహారణ్యంలో దీర్ఘతపస్సు చేసి ఎవరిని ఆరాధించావో, ఎవరి అనుగ్రహఫలంగా ముల్లోకాలకూ మీదిదైన ఉత్తమపథం నీకు లభ్యమయిందో, ఎవడు తన భక్తులకు అమృతమూ తదితరులకు మృత్యువూ అయి భాసిస్తున్నాడో, ఎవడు ఎల్లవారిలోనూ వర్తిల్లుతున్నాడో, అసద్రూపమైన ఈ విశ్వం ఎవని వలన సద్రూపమైనట్లు ప్రతీతమవుతున్నదో ఆ జగత్పరాయణుని సర్వవిధాల ఆశ్రయించి, అపరోక్షానుభూతిని పొందినప్పుడు అహంకార మమకార రూప హృదయగ్రంథి తొలగిపోతుంది. ఔషధం వలన జాడ్యం నయమైనట్లు బహుశ్రుతం వలన శ్రేయోవిరోధిదోషం ఉపశమిస్తుంది. అభయాన్ని కోరినవాడు దోషాన్ని త్యజించాలి. అంతకంటె వేరొక మార్గం లేదు.

నాయనా! కుబేరుడంటే ఎవరనుకొన్నావు? సాక్షాత్తూ ఈశ్వరుని సఖుడు. సామాన్యుడు కాదు. పుణ్యజనులు అతని పరివారం. కుబేరుని పరివారాన్ని చంపడం నీవు ఈశ్వరునితో విరోధానికి తలపడినట్లవుతుంది. మహాత్ముల తేజశ్శక్తి ఇంతింతన రానిది. వారి వలన మన కులానికి ముప్పు కలగకుండా ఉండేటట్లు చూడు. ఇప్పటికైనా నీవు వినయప్రియవచనాలతో ఆ అలకాధిపతిని ప్రసన్నుని కావించుకో' అని చెప్పాడు.

ధ్రువుడు ఆ వచనాలను సాకల్యంగా విని స్వాయంభువునికి ప్రణామం చేశాడు. ఆ మనువు మనుమని దీవించి, ఋషులతో నిజస్థానానికి వెళ్ళాడు.

## ధ్రువ కుబేరుల మైత్రి

ధ్రువుడు తన పితామహుని ఉపదేశాన్ని పాటించి, రోషక్రోధాలను పరిత్యజించాడు. కుబేరుడు అతని శాంత స్వాంతతకు ఎంతో సంతోషించి యక్ష

కిన్నర చారణ సమేతంగా ధ్రువుని వద్దకు వచ్చాడు. ధ్రువుడు కుబేరునికి నమస్కారపూర్వక యథోచిత సత్కారాలను కావించాడు.

అంతట కుబేరుడు ధ్రువుని చేరదీసి, 'క్షత్రియపుత్రా! క్రోధాన్ని త్యజించడం సులభం కాదు. అట్టిదానిని నీవు నీ పితామహుని ఉపదేశ బలం వలన ఎడబాయ గలిగావు. ఇందుకు ఎంతో సంతోషంగా ఉన్నది. నీ తమ్ముని యక్షులు చంపారనడం కాని నీవు యక్షులను చంపావనడం కాని సరికాదు. సమస్త భూతజాతం యొక్క జననమరణాలకు కాలమే కారణం. ఆ రహస్యాన్ని గ్రహింపక అజ్ఞానవశులై వర్తించిన వారికి దేహాత్మభావం ఉదయించి బలపడుతుంది. 'నేను, నాది' అన్న బుద్ధి దృఢమై స్వప్నార్థాలను పోలిన దేహాదులను చిరస్థాయులుగా తలచి వ్యవహరిస్తారు. ఆ వ్యవహార ఫలంగా సుఖదుఃఖాదులు పొడముతున్నాయి.

మిత్రమా! భగవన్మాయ అన్నది గుణమయమై సర్వక్రియలనూ ఆచరిస్తున్నది. భగవంతుడు సర్వస్వతంత్రుడు. ఆయన మాయాకార్యఫలాలు ఆయనను అంటవు. ఆయన సర్వభూతాత్మ శరీరుడు. ఆయనను భజించినవారికి జనన మరణ రూపమైన సంసారం తొలగిపోతుంది. భగవద్భజనం ఎట్టిదంటావా? భగవంతుడు సర్వభూతముల లోనూ ఉన్నాడని గుర్తెరిగి, భగవంతుని స్వరూపాన్ని గ్రహించి, భగవంతునికీ భూతజాతానికీ ఎటువంటి సంబంధమూ లేదని తెలుసుకొని, ఆ స్థితిలో ఉండటమే భగవద్భజనసారం. నీవూ ఆ విధంగా భగవంతుని భజించు. నీకు మేలవుతుంది.

మిత్రమా! నీకేదైనా కోరిక ఉన్నదా? జంకుగొంకులు మాని నీ భావాన్ని నాకు తెలియజెప్పు. నీవు భగవత్పాదారవిందరతుడవు కనుక వరాలను పొందడానికి తగిన అర్హత ఉన్నవాడవు' అన్నాడు.

ధ్రువుడు కుబేరుని పలుకులను విని, 'యక్షేశ్వరా! సర్వానర్థాలకూ మూలమైనది తమోగుణం. దానిని దాటడం సులభమనిపించదు. ఆ

తమస్సాగరతరణానికి భగవత్పాదస్మరణ మొక్కటే పరమసాధనం. అట్టి స్మరణమందు నా బుద్ధి నిశ్చలమై ఉండే వరాన్ని నాకు కరుణించు' అని కోరాడు. కుబేరుడు అందుకు ప్రీతుడై ఆ వరాన్నిచ్చి అలకాపురానికి నిర్గమించాడు.

## బదరికాశ్రమానికి ప్రయాణం

విదురా! ధ్రువునిలో భగవత్ప్రజ్ఞ మేల్కొన్నది. అతను నిజావాసానికి వచ్చి, బహుద్రవ్యపూర్వకంగా వివిధ యజ్ఞాలను చేసి, సర్వకర్మ ఫలప్రదుడైన యజ్ఞేశ్వరుని ఆరాధిస్తూ ఆ పరమాత్ముని యందు నిండు భక్తితో మది నిలుపుకొని సర్వాత్ముని తన లోను సర్వభూతాల లోనూ పరికిస్తూ, దయార్ద్ర ధర్మదృష్టితో రాజ్యపరిపాలన కావింపసాగాడు. ప్రజలందరూ ధ్రువుని కన్నతండ్రి వలెనే భావించారు. ధ్రువుడు నియతచిత్తుడై భోగానుభవం చేత ప్రారబ్ధ పుణ్యక్షయం, యజనాది నిత్యకర్మానుష్ఠానం వలన ప్రారబ్ధ పాపక్షయం కలుగుతుండగా త్రివర్గ సాధకంగా కాలం గడుపుతూ ఇరవై ఆరువేల సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు.

అప్పటికి ధ్రువునికి నిర్మలస్థితి కలిగింది. విశ్వమంతా భగవన్మాయారచితమై కలలోని గంధర్వ నగరం వలె క్షణికమై ఉన్నదని, నిత్యం కాదని, అతనికి అనుభవ సిద్ధమయింది. దానితో భార్యాపుత్ర మిత్ర అంతఃపురాదులందే కాక సర్వభూమండల మందు అతనికి విరక్తి జనించింది. తన కుమారుని రాజ్యపీఠిపై నిలిపి విరాగియై బదరికాశ్రమానికి వెళ్ళిపోయాడు.

## ధ్రువుని యోగనిష్ఠ

ధ్రువుడు ఆ విధంగా బదరికారణ్యాన్ని చేరి మందాకినీ శుద్ధోదకాలలో స్నానం చేసి శుచియై యుక్తాసనాన్ని సమకూర్చుకొని ఆసనజయం కావించి వాయు నిరోధమొనర్చి మనోబలంతో ఇంద్రియాలను వశపరచుకొని

ధారణాయోగనిష్ఠుడై మనస్సును విరాడ్రూపంలో లయింపజేశాడు. అతనికి ధ్యాతృ ధ్యాన ధ్యేయ భేదాలు నశించి కేవల సమాధిస్థితి కలిగింది. దానివెంట స్థూలదర్శనం కూడా క్రమంగా నశించింది. ఆనందబాష్పాలు కురియసాగాయి; మనోలయం సిద్ధించింది. దానితో అభిమానం నశించింది ; కేవలానందస్వరూపస్థితి కలిగింది.

## విష్ణుదూతల సందర్శనం

ధ్రువుడు ఆ స్థితిలో ఉండగా ఒకనాడు పూర్ణచంద్రమండల నిభమైన విమానం దశదిశలకు తన కాంతులతో మెరుగులు దిద్దుతూ గగనతలం నుంచి అతని వద్దకు వచ్చి నిలిచింది. ఆ విమానంలో నీలగాత్రులైన పురుషులిద్దరు కిరీట కేయూర కుండలాది నానాలంకృతులను దాల్చి గదాధరులై ఉన్నారు. ధ్రువుడు వారికి నమస్కరించి భగవన్నామ సంకీర్తన కావించాడు. వారు ధ్రువుని సమీపించి మందహాస పూర్వకంగా, ‘ఓ రాజేంద్రా! మేము విష్ణుదూతలము. ఐదేండ్ల ప్రాయం నాడే నీవు ఏ దేవుని తీవ్రతపంతో మెప్పించి వరాలను పొందావో ఆ పరమేశ్వరుడు పంపగా వచ్చాము. నిన్ను శ్రీ మహావిష్ణుపదానికి తీసికొనిరమ్మని ఆజ్ఞ అయింది. నీవు పోనున్న ఆ సమున్నత పదం సప్తర్షులకు కూడా సాధింపరానట్టిది. ఆ స్థానం వారి శీర్ష దేశానికి ఊర్ధ్వమై ఎంతో దూరాన ఉన్నది. ఆ పదాన్ని రవిచంద్ర గ్రహ నక్షత్ర తారాగణం చుట్టి ప్రదక్షిణ కావిస్తుంటుంది. అట్టి విష్ణుపథాన్ని సాధించిన నీ భాగ్యమే భాగ్యం. నీకై భగవానుడు ఈ విమానాన్ని పంపాడు. దీనిని అధిరోహించు’ అన్నారు.

## విష్ణుపథ గమనం

ధ్రువునికి వారి పలుకులు మధుర మధురంగా నిస్వనించాయి. అతను లేచి స్నానమాడి అలంకరించుకొని మునిజనులకు నమస్కరించి వారి దీవెనలు పొంది విమానానికి ముమ్మారు ప్రదక్షిణం చేసి పూజించి పార్షదులకు అభివాదం చేశాడు. అతనికి పూర్వరూపం తొలగిపోయి

జ్యోతిర్మయరూపం సిద్ధించింది. విష్ణుదూతలు అతనిని విమానం ఎక్కించారు. దేవదుందుభులు మ్రోగాయి ; పుష్పవృష్టి కురిసింది.

## జననీ దర్శనం

విదురా! ఆ సమయంలో ధ్రువునికి అతని తల్లి కనిపించింది. అతనామెను చూసి, 'అమ్మా! నిన్ను వదలి నేను పుణ్యలోకానికి వెళ్ళవలసి వచ్చిందా?' అని దీనహృదయుడైనాడు. విష్ణుదూతలు అతని మనోభావాన్ని గ్రహించి, 'ధ్రువకుమారా! అదిగో చూడు; నీ తల్లి నీకన్నా ముందే దేవయానం ఎక్కి స్వర్గానికి ప్రయాణింపనున్నది' అన్నారు. ఆ మాటలకు ధ్రువుడు పరమానందభరితుడయ్యాడు. విమానం బయలుదేరింది.

## విమాన ప్రయాణం

ఆ విమానం గ్రహమండలాన్ని దాటి ముల్లోకాలను గడిచి సప్తర్షి మండలాన్ని అతిగమించి పరమపదాన్ని చేరుకొన్నది. ధ్రువుడు దారి పొడవున వైమానిక స్తుతివచనాలను ఆకర్ణిస్తూ కుసుమవర్షాలను తలతో గ్రహిస్తూ భగవద్ధ్యానపరుడై ఉన్నాడు.

విదురా! ధ్రువుడు చేరిన స్థానం జ్యోతిశ్చక్రాన్ని ఆధారంగా గ్రహించి కట్టు కంబాన్ని చుట్టి తిరిగే వృషభం వలె ఆవర్తిస్తుంటుంది. ఆ స్థానం తన ప్రకాశంతో ముజ్జగాలను వెలుగొంద జేస్తుంటుంది. ఆ విష్ణుపదం ధ్రువమైనది కనుక, ధ్రువుడక్కడ నెలకొన్నాడు కనుక అది ధ్రువమండలం అనబడుతున్నది. భగవత్కరుణా పాత్రులకు మాత్రమే అది ప్రవేశింపదగి ఉన్నది. నిత్యశుభాలను కావిస్తూ శాంతి, సమదర్శనం, సర్వభూతానురంజకత్వం కలిగి పరిశుద్ధులై అచ్యుతుడే ప్రియాతిప్రియుడని త్రికరణశుద్ధిగా విశ్వసించిన ఏకాంతభక్తులకు అది స్వతస్సిద్ధం. అన్యులు దానివంకనైనా చూడలేరు. ధ్రువుడు ఆ స్థానాన్ని సాధించి త్రైలోక్యశిరోరత్నమై తేజరిల్లాడు.

## నారదుని ప్రశంసావచనం

విదురా! ఆ సమయంలో ప్రచేతసులు, బ్రహ్మ సత్త్రయాగం జరుపుతున్నారు. నారదమహర్షి అక్కడికి వెళ్ళి ఆ సభలో వీణ వాయిస్తూ ఈ విధంగా గానం చేశాడు :

'ఆహా! ధ్రువుని మహిమ వర్ణనాతీతం. సునీతి పాతివ్రత్యఫలమై జనించిన ధ్రువుని భాగ్యమే భాగ్యం. బ్రహ్మర్షులు వేదవాదశీలురయితే అవుతారు గాక; భగవద్ధర్మ మర్మాలను గ్రహించి ఉంటే ఉంటారు గాక. ధ్రువుని వలె పరమపదాన్ని సాధించినవారు మాత్రం ఉండరు. ధ్రువా! ఐదేండ్ల పసిప్రాయం నాడు సవతి తల్లి నిందాగర్భవచనాలకు రోసి అడవికి వెళ్ళి నా ఉపదేశాన్ని పాటించి, అపరాజితుడై నా భక్తపరాజితుడైన భగవానుని తీవ్రతపస్సుతో మెప్పించి అల్పకాలాన ఈ ఉత్తమపదాన్ని సాధించిన నీ జన్మమే జన్మం. నీ చరిత ధన్యం!'

నారదమహర్షి వాక్యాలకు అందరూ పులకితగాత్రులై మహాసంతోషాన్ని పొందారు.

## ధ్రువచరిత్ర మాహాత్మ్యం

విదురా! నారదమహర్షి వంటి భాగవతోత్తముని ప్రశంసకు పాత్రమైన ధ్రువుని సచ్చరిత్రను గూర్చి నా మాటలలో ఏమని వర్ణించగలను?

ధ్రువుని చరిత్ర మహామహిమోపేతం. అది సాధుసమ్మతం. మహా శుభదాయకమైన ఈ చరిత్రను వినీతులై చదివినవారు ధన్యులవుతారు. అపకీర్తి తొలగి ఎనలేని యశస్సు కలుగుతుంది. ఆయుర్వృద్ధి చేకూరుతుంది.

ఈ భాగవతాగ్రేసరుని చరిత్రను విన్నవారు మనశ్శాంతిని పొంది నిష్పాపులు, క్లేశరహితులు అయి పరమభక్తిని గాంచి, ఎట్టకేలకు ధ్రువస్థానాన్ని చేరుకొంటారు.

మహత్త్వాభిలాషులకు తీర్థం, శ్రోతలకు సౌశీల్యాది సుగుణదాయకం, తేజస్సును అభిమానించినవారికి తేజోభివర్ధనం, మనస్సులకు మనోమలినహరం అయిన ఈ చరిత్రను శుచిగా బ్రహ్మవేత్తలున్న సభలలో కీర్తించినవారికి సర్వశుభాలూ కలుగుతాయి.

పౌర్ణమి నాడు కాని, అమావాస్య నాడు, ద్వాదశి నాడు, శ్రవణ నక్షత్రం ఉదయించిన రోజున, దినక్షయమందు గాని, వ్యతీపాతమందు గాని, గ్రహణ సంక్రమణ కాలంలో, లేదా ఆదివారాలలో ఈ పుణ్యశ్లోకుని చరిత్రను నిష్కామమతియై భగవత్పాదైక భక్తితో శ్రద్ధావంతులకు వినిపించినవారు ఆత్మసంతుష్టిని పొంది సిద్ధిని చూరగొంటారు.

ఈ భగవన్మార్గ ప్రదీపకమైన జ్ఞానామృతాన్ని జ్ఞానులకు ఆస్వాదనీయంగా అందజేసినవారికి దేవతలు ప్రసన్నులవుతారు.

## ప్రచేతసు లెవరు?

విదురుని పలుకులను మైత్రేయుడు విని, 'మహాత్మా! ప్రచేతసుల సత్రయాగంలో నారదమహర్షి ధ్రువచరిత్రను గానం చేశాడని అన్నావు. ప్రచేతసులంటే ఎవరు? ఎవరి పుత్రులు? కులమేది? సత్రయాగాన్ని ఎక్కడ చేశారు? నారద మునీంద్రుడు హరిభక్తితత్త్వాన్ని చూరలిచ్చిన మహాత్ముడు కదా, ఆయన ఆ సభలో ఇంకా ఏయే కథలను వివరించాడు. ఆ ఋషివర్యుని నోట వచ్చిన మాట ఎట్టిదయినా మహాప్రసాదమే అవుతుంది' అని అడిగాడు.

## ధ్రువవంశ చరిత్ర

మైత్రేయుడు విదురుని ప్రశ్నకు ఈ విధంగా బదులు చెప్పాడు:

'విదురా! ధ్రువునికి ఇళాగర్భంలో ఉత్కలుడు, భ్రమి యందు కల్పుడు, వత్సరుడు జన్మించారని, వైరాగ్యోదయం అయిన తర్వాత ధ్రువుడు ఉత్కలునిపై రాజ్యభారం ఉంచి తపస్సుకు వెళ్ళిన వృత్తాంతాన్ని ఇందాక అనుకొన్నాము.

## ఉత్కలుడు

ఉత్కలుడు పుట్టుక తోనే పరమశాంతచిత్తుడు, నిస్సంగుడు, సమదర్శనుడు అయినందువల్ల అతనికి సార్వభౌమ సంపదలు రుచింపలేదు. అతను యోగాగ్ని వలన కర్మవాసన లన్నింటినీ దహించి, ఆత్మబోధను పొంది బ్రహ్మాస్వరూపానుసంధానుడైనాడు. అతని చర్యలు బాల జడ అంధ బధిర ఉన్మత్త చర్యలుగా పరిణమించాయి. అతని తత్త్వం ప్రజలకు నచ్చలేదు. కులవృద్ధులు, మంత్రులు, ప్రజల భావాన్ని గ్రహించి వత్సరునికి రాజ్యాభిషేకం చేశారు.

## వత్సరుని సంతానం

వత్సరుని భార్య సర్వద్ధి. ఆ దంపతులకు ఆరుగురు కొడుకులు– పుష్పార్ణుడు, చంద్రకేతుడు, ఇషుడు, ఊర్జుడు, వసుడు, జయుడు ఉదయించారు.

పుష్పార్ణుడు ప్రభ అనే రాజకన్యను వివాహం చేసుకొన్నాడు. వారికి ప్రాతరుడు, మధ్యందినుడు, సాయంసముడు అని ముగ్గురు కొడుకులు జన్మించారు.

పుష్పార్ణుని ద్వితీయకళత్రం పేరు ప్రభ. ఆమెయందు అతనికి ప్రదోషుడు, నిశీథుడు, వ్యుష్టి అనే ముగ్గురు కొడుకులు కలిగారు.

## వ్యుష్టి సంతానం

వత్సరుని మనుమలలో వ్యుష్టి పుష్కరిణిని వివాహం చేసుకొన్నాడు. వారికి సర్వతేజుడనే కొడుకు జన్మించాడు.

సర్వతేజుని భార్య ఆకూతి. వారి కుమారుడు చక్షువు.

చక్షువు నడ్వలను పెళ్ళాడాడు. ఆ మిథునానికి పన్నెండుమంది కొడుకులు – పురువు, కుత్సుడు, త్రితుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, ఋతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, సుద్యుమ్నుడు, శిబి, ఉల్మకుడు పుట్టారు.

ఉల్మకుని భార్య పుష్కరిణి. వారికి అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగీరసుడు, గయుడు అని ఆరుగురు పుత్రులు.

అగునికి సునీథ యందు వేనుడు ప్రభవించాడు.

## వేనుడు

వేనుడు పుట్టినదాదిగా దుశ్శీలుడై ప్రవర్తించాడు. అతని కోసం అంగుడు పడరాని పాట్లు పడ్డాడు. అయినా వేనుని చెడు నడతలు మారలేదు. అతనికి యుక్తవయస్సు వచ్చే దాకా ఎదురు చూసి, ఇక చేసేదేమీ లేదని నిశ్చయించుకొన్నాక రాజ్యాన్ని అతనికి అప్పజెప్పి అంగుడు వనాలకు వెళ్ళిపోయాడు.

వేనుడు రాజైనాక చేసిన దుండగాలు భరింపరానివిగా పరిణమించాయి. ప్రజలు గగ్గోలు పెట్టారు. అది చూసి మునులందరూ కలిసి బ్రహ్మదండంతో వేనుని వధించారు.

రాజ్యానికి పాలకుడు లేకపోయేసరికి అంతా అల్లకల్లోలం అయింది. చోరుల బాధ ఎక్కువ అయింది. ప్రజలను ఆదుకొనే నాథుడు లేక శత్రువులు వచ్చిపడ్డారు.

అప్పుడు ఋషులు వేనుని దక్షిణహస్తాన్ని మథించారు. అందులో నుంచి నారాయణాంశతో పృథుచక్రవర్తి జన్మించాడు,' అన్నాడు మైత్రేయుడు.

విదురు డది విని 'మహాత్మా! అంగుడు సౌగుణ్యవంతుడు, మహాసాధువు, సుశీలుడు, సుబ్రహ్మణ్యుడు కదా! అట్టి సజ్జనునికి అంతటి దుష్టుడు కొడుకుగా ఎలా పుట్టాడు? కొడుకు చెడు నడతలకు తండ్రి ఊరు విడిచి వెళ్ళడం ఏమిటి? వేనుడు ఎటువంటి దుండగాలను చేశాడు? ధర్మకోవిదులైన మునులు వేనునికి అంత తీవ్ర దండనను విధించడం దేనికి? రాజంటే అతనిలో లోకపాలకుల తేజం ఉంటుందని అంటారు. అతను దోషం చేశాడనుకొన్నా, అతనిని అవమానించడం ప్రజలకు తగిన పనేనా? మహాత్మా! నీవు

పరాపరాలు రెండూ తెలిసిన వాడవు. ఈ సంశయాలను తీర్చు' అని ప్రార్థించాడు.

## వేనుని జననం

మైత్రేయుడు ఆ ప్రశ్నలు విని, 'విదురా! ఒకప్పుడు అంగుడు హయమేధయాగాన్ని సంకల్పించి, సవనదీక్ష పూని, యజమానకృత్యాన్ని సాంగోపాంగంగా నిర్వహించాడు. బ్రహ్మవాదులైన ఋత్వికులు ఆ యజ్ఞానికి దేవతలను సవినయంగా ఆమంత్రించారు.

యాగానికి దేవతలు రాలేదు. అందుకు ఋత్విజులు ఆశ్చర్యచకితులయ్యారు. 'రాజా! హవ్యాలలో ఎటువంటి దోషాలూ కలుగలేదు. బ్రాహ్మణులు ధృతవ్రతులై సారతర మంత్రాలను పఠించారు. హవ్యాలను అతిశ్రద్ధతో అర్పించాము. దేవతలకు ఏ విధమైన అపరాధమూ జరిగినట్లు తోచదు. అయినా వారు వచ్చి తమ తమ హవిర్భాగాలను గ్రహింపలేదు. కర్మసాక్షులైన దేవతలు రాకపోవడానికి కారణం మాకు అర్థం కావటం లేదు అని విన్నవించుకొన్నారు.

ఆ మాటతో అంగునికి మనోవైకల్యం జనించింది. అతను సదస్యుల అనుమతితో మౌనవ్రతాన్ని చాలించి, 'మహాత్ములారా! దేవతలు ఆమంత్రితులైనప్పటికీ నా యజ్ఞానికి రాకపోవడం ఏమిటి? హవిర్భాగాన్ని గ్రహింపకపోవడం ఏమిటి? ఏదో దోషం కలిగి ఉండకపోతే వారు ఆ తీరున ప్రవర్తింపరు. నా యందు దోషం ఏదైనా ఉన్నట్లయితే మోమోటమి మాని కలరూపును తెలియజెప్పమని వేడుకొంటున్నాను' అన్నాడు.

సదస్యులు కొంతసేపు పర్యాలోచించి, 'రాజేంద్రా! యజ్ఞవిషయంలో ఎవరి లోపమూ ఉన్నట్లు లేదు. పోతే కారణం ఒక్కటే కనిపిస్తున్నది. నీకు పుత్రప్రాప్తి కలుగలేదు. అపుత్రకులు ఇచ్చే హవిర్భాగాలను గ్రహించటం దేవతలకు సమ్మతం కాదు కాబోలు. అందువల్లనే వారు వచ్చి ఉండరని

భావిస్తున్నాము. నీకు పుత్రప్రాప్తి కలిగితే దేవతలు నీ యజ్ఞహవిర్భాగాలను తప్పక స్వీకరిస్తారు.

రాజా! పుత్రకామేష్టి అనే యజ్ఞం ఒకటి ఉన్నది. దానిని ఆచరించి యజ్ఞేశ్వరుని ఆరాధించు. నీకు తప్పక సుతోదయ మవుతుంది. ఆ యజ్ఞానికి యజ్ఞేశ్వరునితోపాటు దేవతలు కూడా ఏతెంచి తమ తమ హవిర్భాగాలను అందుకొంటారు. ఎవరు ఏ కోరికతో ఆరాధిస్తే వారికి ఆ కోర్కెను దేవదేవుడు ప్రసాదిస్తాడు' అన్నారు.

అంగరాజు పుత్రకామేష్టిని ప్రారంభించాడు. విష్ణుదేవతాకమైన పురోడాశాన్ని కల్పించి విధివిహితంగా వేల్చారు. ఆ అగ్నికుండం నుంచి ఒక పూరుషుడు శుద్ధాంబర సువర్ణ మాల్యధారియై సిద్ధపాయసపూర్ణమైన స్వర్ణకలశాన్ని కరతలాన దాల్చి వెలికి వచ్చాడు. అంగరాజు బ్రాహ్మణుల అనుమతిని గొని అగ్నిపూరుషునికి అంజలించాడు. అతడొసగిన పాయసపాత్రను వినయ సంతోష పూర్వకంగా గ్రహించి, ఆఘ్రాణించి, దానిని భార్యకు అందజేశాడు. ఆమె దానిని భుజించి కొన్నాళ్ళకు గర్భవతియై కొడుకును కన్నది. అతనికి వేనుడని పేరుపెట్టారు.

## వేనుని బాల్యదుర్వర్తనం

వేనుని మాతామహుడు మృత్యుడు. చిన్ననాటి నుంచి వేనుడు మృత్యునికి వత్సలుడై, అతనిని అనువర్తించి పెరిగాడు. విల్లమ్ములు ధరించి కనిపించిన సాధుమృగాలను నిర్దయుడై నిష్కారణంగా వధించేవాడు. కటికవాడు పశువులను నరికినట్లు తోటి స్నేహితులను బంధించి అతిక్రూరంగా వారిని హతమార్చేవాడు.

కాలం గడిచిన కొద్దీ వేనుని దుర్మార్గవర్తనం పెచ్చురిల్లసాగింది. ప్రజలు అతని పేరు వింటేనే భయంతో గడగడలాడేవారు.

కొడుకు చెడు నడతలను మాన్పిద్దామని అంగరాజు పెక్కు విధాల శాసించి చూశాడు. వేనుడు చక్కబడే ఉపాయం లేదని గ్రహించి చివరికి ఆశలు వదులుకొన్నాడు.

## అంగరాజు వైరాగ్యం

అప్పటికి అంగరాజుకు జీవితమంటే విరక్తి జనించింది. 'అయ్యో! అనపత్యదోష నివారణార్థం భగవంతుని ఆరాధించినప్పుడు దుస్సంతానప్రాప్తి వలన ఇటువంటి కష్టం కలుగబోతున్నదని కలలో కూడా అనుకోలేదు. ఈ దుష్టుణ్ణి కని లోకకంటకుడనై అపకీర్తికి ఒడిగట్టాను. తీరని మనోవ్యథ నన్ను దహించివేస్తున్నది. సంతానం సుఖకరం కావడానికి మారుగా భరింపరాని దుఃఖాగ్ని కుండం అయింది. పుత్రవాత్సల్యపాశం లోకంలో తండ్రులకు సుపుత్రుల పట్ల చెల్లితే చెల్లింది కాని; కుపుత్త్రుల యెడ ఎంత మాత్రమూ కూడదు. ఇతని వల్ల నాకు ఉత్తరగతి కనువైన మేలు కలుగకపోగా, చేటు మూడింది' అని కొంత తడవు ఆలోచించి, 'కాదు, కాదు మేలే అయింది, సుపుత్రకుల చర్యలకు సంతోషించే తల్లిదండ్రులు గృహాసక్తులై భావిగతిని తలపోయరు. వీడు నాకు సంసారభోక వైరాగ్యప్రదు డయ్యాడు. ఇది మేలు గాక కీడెలా అవుతుంది? ఈతని కారణాన గదా, ఆత్మగతి విచారభావం ఇన్నాళ్ళకు నాలో ఉదయించింది!' అని తలపోసి, సర్వసుఖాలకూ దూరంగా రోజులు గడుపుతూ, ఒకనాటి నడిరేయిని భార్యాగృహాదులను త్యజించి అడవులకు వెళ్ళిపోయాడు.

అంగరాజు తమను విడిచిపెట్టి వెళ్ళిన సంగతి విని అమాత్య పురోహిత సుహృదాదు లందరూ దుఃఖార్తులై అతని కోసం నలువైపులా అన్వేషించారు. అయినా కుయోగులకు పరమపురుష దర్శనం సిద్ధింపనట్లు, వారికి అతని జాడ తెలియరాలేదు. చాలాకాలం వెతికి వేసారి విఫలమనోరథులై మరలి వచ్చి రాజ్యవిప్లవాన్ని నిండు దుఃఖంతో ఋషులకు విన్నవించారు.

## వేనుని పట్టాభిషేకం

భృగువు మొదలైన మహర్షులు ఆ సంగతి విని, 'రాజు లేని రాజ్యంలో ప్రజలు పశువర్తను లవుతారు. అది లోకమంగళం కాదు. వేనుడు దుష్టుడే కావచ్చు, అతనిని ప్రజలు మెచ్చకనూ పోవచ్చు. అరాజత్వదోషం కంటె దుష్టరాజత్వ దోషం కొంతకు కొంత నయం' అని నిశ్చయించి, సునీథను రావించి ఆమె కొడుకుకు శాస్త్రోక్తప్రకారంగా పట్టాభిషేకం చేశారు. వేనుడు రాజయ్యాడని వార్త నలుగురికీ తెలిసేసరికి పామును చూసి ఎలుకలు పారిపోయినట్లు దేశంలోని దొంగలందరూ చెట్టుకొకరు, పుట్టకొకరుగా తలదాచుకొన్నారు.

## వేనుని నిరంకుశపాలనం

వేనుడు తనకు లభించిన అష్టలోక పాలకైశ్వర్యానికి గర్వాంధుడై నిరంకుశ వృత్తిని అవలంబించాడు. అతని దుర్విహారాలకు భూనభోంతరాళాలు చాలలేదు. యజ్ఞాలు చేయరాదని, హోమాలు వేల్వరాదని, దానాదుల నీయరాదని, అతను దేశమంతా చాటించాడు. మహాభాగులకు అవమానాలు తప్పలేదు. ధర్మం తలదాచుకోవలసి వచ్చింది.

## మునుల సంతాపం

మునిముఖ్యులు ఆ సంగతి విని, ఇతనిని రాజుగా చేయడం కట్టెకు రెండు వైపులా నిప్పు ముట్టించినట్లయింది. పాము తనను పాలుపోసి పెంచినవాడి పట్ల కృతజ్ఞత చూపక పోగా కరవడం మాననట్లు ఈ దురాత్ముడు తనకు రాజ్యాధిపత్యాన్ని ఇచ్చిన ప్రజలనే చిత్రహింసలు పెడుతున్నాడు. దుష్టప్రకృతి తన నైజాన్ని ఎన్నటికీ మార్చుకోదు. అట్లాగని ధర్మం తెలిసినవారు ఉపేక్షించి ఊరుకోకూడదు. ఏదో విధాన దానిని అణిచిపెట్టాలి. దాన భేద దండోపాయాలు ఇతని యెడ ఫలింపవు. సామాన్ని ఆశ్రయించి యథాశక్తి హితబోధ చేసి చూద్దాము. మన మాటలు అతనికి నచ్చితే మేలవుతుంది. లేకపోతే మన ధర్మాన్ని మనం నెరవేర్చినట్లవుతుంది. అతని పాపం మనను

తాకదు. ఈ విధంగా చేయడం మన కిప్పుడు కర్తవ్యమా? కాదా? పట్టుచీర నిచ్చినవారు పీటను కూడా ఇవ్వాలని అంటారు. ఇతను దుష్టుడని తెలిసినప్పటికీ ఆపద్ధర్మాన్ని ఆశ్రయించి రాజును చేశాము. అందువల్ల అతనికి మంచి చెప్పడం మన బాధ్యతే అవుతుంది. అతను మన మాట వినక ధిక్కరించితే? అది లోక తిరస్కారమే కాగలదు. అప్పుడు మనం ఆగ్రహించి మన తేజోగ్నితో అతనిని దహించినా పాతకం కలగదు' అని నిశ్చయించుకొని, వేనుని వద్దకు వెళ్ళారు.

## వేనునికి హితోపదేశం

'రాజేంద్రా! నీకొక హితం చెప్పాలని వచ్చాము. దానివల్ల నీకు ఆయుస్సు, సంపద, తేజస్సు, కీర్తి వర్ధిల్లుతాయి. ఎవరు స్వధర్మాన్ని త్రికరణశుద్ధిగా నెరవేరుస్తారో వారికి ఆ ధర్మం ఐహికాముష్మిక సుఖాలు రెండిటినీ సమకూరుస్తుంది. ధర్మం నశించిననాడు దానితో ఐశ్వర్యం కూడా నశిస్తుంది. ఈ సూత్రాన్ని విస్మరింపకూడదు.

పాలకునికి ధర్మపాలనమే స్వధర్మం. ప్రజాక్షేమైక వర్తనమే అతనికి పరమధర్మం. సామాన్యంగా ప్రజలకు దుష్టమంత్రుల వలన, చోరుల వలన బాధ కలుగుతుంటుంది. అట్టి బాధల నుంచి ప్రజలను రాజు సంరక్షించాలి. అట్టి రక్షణార్థం ధనం కావలసి వస్తుంది. రాజు ఆ ధనాన్ని ప్రజల నుంచి విధిహితంగా స్వీకరించాలి. అటువంటి ధనాన్ని బలి అంటారు.

మరొక విశేషం కూడా ఉన్నది. ఏ రాజు యొక్క రాజ్యంలో ప్రజలు వర్ణాశ్రమోచిత ధర్మపూర్వకంగా భగవంతుని ఆరాధిస్తారో, ఆ రాజు పట్ల భగవంతుడు ప్రసన్నుడవుతాడు. భగవత్ప్రీతికి నిదర్శనం ఏమిటంటావేమో? రాష్ట్రప్రజలందరూ సర్వార్థ సంపన్నులై ఉండటమే అందుకు నిదర్శనం. యజ్ఞములు భగవత్పరాలు. దేవతలు భగవదంశ సంభూతులు. యజ్ఞం వలన దేవతలు సంతృప్తులై వాంఛితార్థాలను ప్రసాదిస్తారు. దేవతా నిరసనం తగదు' – అని బోధించారు.

## వేనుని తిరస్కార భాషణం

విదురా! వేనుడు ఆ మాట విని, 'అయ్యయ్యో! అధర్మాన్ని ధర్మమని; ధర్మం అధర్మమని మీరు అనుకొంటున్నారు. ఇంతకంటె వెర్రివాళ్ళుంటారా? ఏమంటే, పోషించిన వాడిని భూషించడమే ధర్మం. ఇది కాదనరు కదా? ప్రజలను పోషించేవాడెవడు? రాజు. ఎట్లా పోషిస్తున్నాడు? జీవనవృత్తులు కల్పించి పోషిస్తున్నాడు. నేను రాజునై ఆ విధంగా ప్రజలను పోషిస్తుండగా వారు నన్ను వదలి అన్యులను ఆరాధించడం ధర్మమవుతుందా? మీ ఉపదేశం 'భర్తృసేవ మాని జారుని పూజించమనడం' వంటిది కాదా? పైగా ఈశ్వరుడు రాజరూపంలో ఉంటాడని మీరే అన్నారు. కంటి యెదుట నున్న రాజరూప భగవంతుని అవమానించినవారు ఉభయలోకదూరులు కారా?

మునులారా! దేవతల సంగతి ప్రస్తావించారు. హరి హర బ్రహ్మలు, ఇంద్రాది వాయు వరుణ యమ సోమ సూర్య పర్జన్య కుబేరాదులు, భూదేవి, ఇంకా కొందరు మహిమోపేతులు మాత్రమే శాపానుగ్రహ సమర్థులు. సామాన్యులు కారు. వారందరూ తమతమ అంశలతో రాజు శరీరమందు నివసిస్తారు. ఆ కారణాన రాజును సర్వదేవ మయుడన్నారు. కనుక రాజే అగ్రభోజనీయుడు, ఆరాధ్యమూర్తి అవుతాడు. నన్ను నిర్మత్సర బుద్ధితో ఆరాధించడం ఎల్లవారికీ కర్తవ్యం' అన్నాడు.

## వేనుని మరణం

ఆ మాటలకు మునుల కోపాగ్ని ప్రజ్వరిల్లింది. 'యజ్ఞేశ్వరుడైన శ్రీమహావిష్ణువును నిందిస్తున్నానని ఈ దుష్టునికి ఈషణ్మాత్రమైనా సిగ్గు లేదు. ఎవరి అనుగ్రహ ఫలంగా తనకు ఈ మహైశ్వర్యం కలిగిందో ఈ కృతఘ్నుడు మర్చిపోయాడు. ఇతనుంటే ఇక లోకం ఉండదు' అని నిశ్చయించి మునులు హుంకరించారు. వేనుడు భగవన్నిందాఫలంగా అప్పటికే సగం చచ్చి ఉన్నాడు. మునుల హుంకారం తక్కిన సగం ప్రాణాన్ని హరించింది. అతను

విగతజీవుడై నేలకూలాడు. ఋషులు స్వస్థానాలకు వెళ్ళిపోయారు. వేనుని భార్య పతికై శోకిస్తూ మంత్రయోగంతో ఆ శవాన్ని రక్షింపసాగింది.

## రాజ్యరక్షణకు మునుల నిర్ణయం

ఒకనాడు మునులు సరస్వతీ పుణ్యజలాలలో తీర్థస్నానం చేసి, ఒడ్డున అగ్నిహోత్ర క్రియలు నిర్వర్తించి, సత్కథాగోష్ఠిలో నిమగ్నులై ఉండగా ఆకస్మికంగా మహోత్పాతాలు కలిగాయి. మునులు అది చూసి, 'ఏమిటిది! ఉత్పాతాలు లోకభయంకరంగా గోచరిస్తున్నాయి. రక్షకుడు లేనందువల్ల ప్రజలు దొంగలపాలు కానున్నారా?' అని శంకింపసాగారు. అంతలో పెనుధూళి రేగి దిక్కులను ఆక్రమించింది. ఆ ధూళిమేఘాలను చూసి, 'ఇవి జనులు పరస్పర ధనాపహరణార్థం గుంపులు గుంపులుగా యుద్ధానికి సన్నద్ధులైనపుడు చెలరేగిన ధూళిమేఘాలు కాబోలు. అయ్యో! దేశమంతా దొంగలపాలయింది. ఈ ముప్పును తప్పించే మార్గం ఏమిటి? తపోధనులమైన మనము కూడా దీనిని ఉపేక్షిస్తే మన తపస్సంతా పగిలిన కుండ లోని నీరవుతుంది. దీనిని వారింపక తప్పదు. అయితే మార్గమేమిటి? రాజును ప్రతిష్ఠించడమే మార్గం. ఎవరిని ప్రతిష్ఠించాలి? అంగరాజంటే రాజర్షి తల్లజుడు గాని, సామాన్యుడు కాదు. అతని వంశం వేనుడితో అంతరింపకూడదు' అని నిశ్చయించి, అందరూ కలిసి వేనుని నగరానికి వచ్చారు.

## నిషాదుల జననం

ఆ విధంగా మునులు రాజ్యరక్షణార్థం వచ్చి, వేనుని శవం మంత్రరక్షితమై ఉన్నదని విని, దానిని తెప్పించి ఊరుభాగాన్ని మథించారు. అందులో నుంచి ఒక పురుషుడు – కాకివర్ణం మరుగుజ్జు శరీరం చట్టిముక్కు రక్తశిరోజాలు రక్తనేత్రాలు కలవాడు – బయల్వెడలి, 'మునులారా! నా పేరు బాహుకుడు; మీకందరికీ నమస్కారం; ఏమి ఆజ్ఞ?' అని అడిగాడు. మును లతనిని

కూర్చుండమని సంజ్ఞ చేస్తూ 'నిషీద!' అన్నారు. అది కారణంగా అతనికి నిషాదుడని పేరు వచ్చింది.

నిషాదుని వంశం వారందరికీ నిషాదులని పేరు కలిగింది. వారు పర్వతారణ్య ప్రదేశవాసు లయ్యారు.

## పృథుచక్రవర్తి జననం

ఆ విధంగా వేనుని కలుషాలన్నీ నిషాదాకృతిలో బహిర్గతమై అతని శరీరం పరిశుద్ధిని పొందాక మునులు అతని బాహువులను మథించారు. ఆ బాహువుల నుండి ఒక మిథునం జనించింది. మునులు ఆ దంపతులను చూసి, 'ఓహో! భగవానుని లోకరక్షక కళలు ఈ పురుషుని రూపంలోను, ఆయనను ఎడబాయని రమాదేవి అంశ ఈ సుందరి రూపంలోను నేలకు దిగివచ్చినట్లున్నది. ఇతను రాజప్రథముడై లోకమంతటా తనకీర్తి ప్రథనాన్ని కావిస్తాడు. కనుక ఇతనికి 'పృథు' వనే నామం సార్థకం కాగలదు. ఈ సాధ్వీమణి సతతార్చిష్మత్త్వ కారణం వల్ల 'అర్చిస్సు' (కాంతి) అని పేరుపొంది పృథువును అనుసరిస్తుంది గాక! లక్ష్మీనారాయణులు లోకరక్షణార్థం ఈ తీరున అవతరించారు. మనము చరితార్థులమైనాము' అని వేనోళ్ళ ప్రశంసించారు. ఆకాశం గంధర్వగానాలతో మార్మోగింది. పుష్పవృష్టి కురిసింది.

అంతట లోక పితామహుడు దేవర్షి పితృగణసమేతుడై వచ్చి వైన్యుని దక్షిణ హస్తతలాన చంద్రరేఖను, వామచరణమందు పద్మలాంఛనాన్ని పరికించి, 'ఈతడు జగజ్జన రక్షాదీక్షతో అవతరించిన విష్ణుకళ శ్రీమన్నారాయణాంశ సంభూతుడైన చక్రవర్తి' అని కొనియాడాడు.

## పృథువు పట్టాభిషేకం

అప్పుడు బ్రహ్మావాదు లందరూ కలిసి దేశంలో అరాజకత్వాన్ని మాన్పి ప్రజాక్షేమాన్ని కలిగించేందుకు పృథువుకు పట్టాభిషేకం సంకల్పించారు.

నాలుగు దిక్కుల నుంచి అభిషేక సంభార ద్రవ్యాలు వచ్చాయి. నదీసాగరాలు, లతాతరువులు, భూమ్యంతరాళాలు, పశుపక్ష్యాదులు, ఒకటేమిటి సర్వభూతాలూ లోకాద్భుతకరంగా కానుకలు సమర్పించాయి. పృథువు అభిషిక్తుడై రెండవ అగ్ని వలె తేజరిల్లాడు.

## దేవతల కానుకలు

పృథురాజ పట్టాభిషేకానికి దేవతలందరూ తరలివచ్చారు. కుబేరుడు ఉత్తమ సింహాసనాన్ని, వరుణుడు చంద్రకాంతులను విరజిమ్ముతున్న శ్వేతాతపత్రాన్ని, వాయువు చామరయుగ్మాన్ని, ధర్ముడు కీర్తిమయమాల్యాన్ని, దేవేంద్రుడు అనర్ఘ కిరీటాన్ని, యముడు దండాన్ని, బ్రహ్మదేవుడు వేదాత్మక వచనాన్ని, భారతీదేవి దివ్యమైన కంఠహారాన్ని, విష్ణువు సుదర్శన చక్రాన్ని, శ్రీదేవి తరుగులేని సంపదలను, రుద్రుడు కరవాలాన్ని, రుద్రాణి శరచ్చంద్ర చంద్రికా ధవళమైన చర్మాన్ని, సోముడు సుధామయ దివ్యాశ్వాలను, త్వష్ట సుందరమైన రథాన్ని, వహ్నిదేవుడు అజ గోశృంగరచిత మహాకోదండాన్ని, భాస్కరుడు కిరణమయ సాయకాలను, భూదేవి యోగమయ పాదుకలను, దివము నిత్యప్రసూన బలిని, ఖేచరులు నాట్య గీత వాదిత్ర కౌశల్యాన్ని, అంతర్ధాన శక్తి చాతుర్యాన్ని, ఋషులు సత్యాశీర్వాదాన్ని, సముద్రుడు తనయందు ఉద్భవించిన శంఖాన్ని, సింధునదం రథవీథులను బహూకరించారు.

## స్తుతి తత్త్వవిమర్శ

అంతట సూత మాగధవందులు ప్రస్తుతులు కావించాలని ముందుకు వచ్చారు. పృథువు వారి మనోభావాన్ని గ్రహించి, 'అయ్యలారా! ప్రఖ్యాతగుణులైనవారు స్తోత్రాదులకు అర్హతను కలిగి ఉండటం సహజమే. అట్టివారిని గూర్చిన మీ స్తుతి వచనాలు స్వభావోక్తులవుతాయి. తక్కినవారిని ఉగ్గడించడం ద్వివిధ దోషజుష్టమై నింద్యమనిపించుకొంటుంది. తనయందు లేని గుణాలను ఉన్నట్లుగా నిరూపిస్తే విజ్ఞునికి సంతోషం కలుగదు.

గుణగణాన్ని ప్రస్తుతించడం ఆ గుణ సంపాదన ప్రబోధార్థమని కొందరంటారు. ఈ విధమైన స్తోత్రపాఠం పైకి గుణప్రాయమై తోపవచ్చును గాని పరామర్శించితే అది హేళనం చేయడమే కదా!

అంతే కాక లోకంలో జనుల గుణతత్త్వాన్ని వారి కార్యాలు వెల్లడిస్తాయి. కార్యాలను బట్టి కర్తలకు భూషణ దూషణాదులు అన్వయిస్తారు. నేనింత దాకా ఎటువంటి కార్యాన్నీ చేయనైతిని. కనుక నా స్వభావగ్రహణకు మీకు అవకాశం కలుగలేదు. అదీ గాక ఆత్మవిమర్శాపరులైన వివేకవంతులు స్వగుణకీర్తనను వినాలంటే సిగ్గుపడతారు. మిథ్యాస్తుతులకు ఉబ్బి బూరటించడం కుమతుల లక్షణం' అని వారించాడు.

## సూతాదుల సమాధానం

విదురా! సూతాదులు ఆ వచనసారాన్ని ఆకళింపు చేసికొని, 'ప్రజావరద రాజేశ్వరా! ఛాయాదేవితో కూడిన సూర్యుని వెలుగు వలె నీ కీర్తి నీ నామధేయాన్ని అనుసరిస్తుంది. శ్రీమన్నారాయణుడు తన మాయా యోగవశాన వేనుని వంశంలో నీ రూపాన జనించాడు. నీ మహిమవర్ణన కావించడానికి బ్రహ్మాదులే అశక్తులనగా మా బోంట్ల సంగతి చెప్పేదేమున్నది? భగవదంశావతారుల కథా సుధారసం ఎంత గ్రోలినా తనివి తీరుదు. ఆ ఆదరం మమ్మల్ని ఇలా పలికిస్తుంటుంది. కథాంశాలంటే వాటిని మునిముఖ్యులు ప్రకటిస్తారు. వారు పలికినదానిలో మా హ్రస్వబుద్ధులకు అందినంతలో మా వాక్కులకు శక్యమైనంతలో మేము హరికథా సంకీర్తన కావిస్తుంటాము. మా పలుకులు మిథ్యాస్తుతులు కానేరవు.

## సూత మాగధాదుల స్తుతులు

రాజేంద్రమా! నీవు ధార్మికప్రవరుడవై దుష్టశిక్షణ పూర్వక శిష్టరక్షణరూప ధర్మప్రచారాన్ని పొనరిస్తావు గాక! నీ శరీరంలోని లోకపాలకుల అంశలు తత్తత్కాలోచితంగా యథారీతిని వర్తించి ప్రజాపోషణ, ప్రజానురంజనాది

కార్యాలను ప్రోదిచేస్తాయి గాక. సూర్యుడు సకాలంలో భూతలం నుంచి జలాలను గ్రహించి అదను వచ్చినంతనే ఆ జలాలను సర్వభూత సమబుద్ధితో వర్షించినట్లుగా నీవు సకాలంలో ప్రజల నుంచి పన్నులను గ్రహించి దుర్భిక్షాదికాలాలలో ఆ ధనాన్ని ప్రజలకై వినియోగిస్తావు గాక. భూదేవి తన యెదపై పాదం మోపినప్పటికీ సహిస్తున్న తీరున నీ తలపైని ఆర్తులు కాలూనినా నీవు సహిస్తావు గాక. ఇంద్రుడు వర్షాలను కలుగజేసి వర్షాభావక్లేశాన్ని తొలగించినట్లు నీవు అన్నాతురులకు అన్నదానాన్ని కావిస్తావు గాక. చంద్రమండలం అమృతధారలను కురిసి లోకానందాన్ని కలిగించే తీరున నీ ముఖమండలం అనురాగం ఉట్టిపడే చూపులను వెదచల్లి దేశానికి ఆప్యాయన మందజేస్తుంది గాక. అనన్యజ్ఞాతవర్తివి, నిగూఢకార్యదక్షుడవు, అనంత మాహాత్మ్యగుణధాముడవు, సంయతమూర్తివి, గంభీర మేధావంతుడవు అయి వరుణుని వలె అర్థగుప్తిని కావిస్తావు గాక. వేనుడనే అరణిని మథింపగా పుట్టిన అగ్నివైన నీవు శత్రుదుర్నిరీక్ష్యుడవై నిర్వక్రపరాక్రమంతో విరాజిల్లుతావు గాక. వాయువు సూత్రాత్మయై లోలోననే ఉండి ఉదాసీనుని వలె వర్తించినట్లు నీవు నిపుణులైన నీ చారుల ద్వారా ప్రజల బాహ్యాభ్యంతర కర్మగతులు తెలుసుకొంటూ, లోకనిందాస్తుతులకు చలింపనివాడవై వెలుగొందుతావు గాక. దండింపదగని వాడు శత్రువు కొడుకైనా దండింపక, దండింపవలసినవాడు సొంత కొడుకైనా విడిచిపెట్టక నిష్పక్షపాత బుద్ధిని నెరపుదువు గాక. ఎందాకా రవికిరణ ప్రచారం ఉంటుందో అంత దాకా నీ ఆజ్ఞాచక్రం ఎదురులేనిదై ఆమానసాచలపర్యంతం అభివ్యాప్త మవుతుంది గాక. ప్రజారంజకంగా రాజ్యాన్ని పరిపాలించి రాజశబ్దాన్ని సార్థకం చేస్తావు గాక. సత్యసంధా ధృత వ్రత కంకణుడివై బ్రహ్మతత్త్వాన్ని మరువక వృద్ధజన సేవాతత్పరుడివై సర్వభూత హితాపాదివై దీనుల యెడ వత్సలతను, పరస్త్రీల యెడ మాతృభక్తిని నెరపుతూ పేరెన్నికగంటావు గాక. ధర్మవిగ్రహుడవై స్వభార్య అర్ధాంగి అన్న మాటను అక్షరాక్షరం సత్యమని రూఢి కావిస్తూ ప్రజలకు తండ్రి వంటివాడివై ప్రశస్తిని

పొందుతావు గాక. శరీరధారు లందరికీ ఆత్మరీతిని ప్రియతముడవు, సుహృజ్జనులకు ఆనందవర్ధనుడవు అయి, ముక్తసంగుల సాంగత్యంలో వర్ణనీయచరితుడవై విలసిల్లుతావు గాక. శిష్టులకు శరణ్యుడవు, దుష్టులకు దండధరుడవు అయి దిగంత విశ్రాంత చిరయశోదీధితులను వెలియింపజేస్తావు గాక. కూటస్థుడు, అద్వయుడు అయినప్పటికీ ఏ మహాత్ముడు అవిద్యాపరులకు నానాత్వప్రతీతుని వలె భాసిల్లుతున్నాడో ఆ షడ్గుణైశ్వర్యసంపన్న భగవానుని అంశగా నీవు జన్మించావనడం కంటె వేరు విధంగా నిన్ను శ్లాఘించడం సాధ్యం కాదు. ఆ సూర్యభగవానుని వలె నీవు చైత్రరథం ఎక్కి, శరాసనధారివై ఉదయాచల పర్యంతం మహీప్రదక్షిణ కావిస్తూ, భూపాలక లోకపాలకుల మర్యాదలను అందుకొంటూ, వారి సతీమణులు నిన్ను చక్రాయుధునిగా భావించి పలికే స్తుతివాక్యాలను ఆకర్ణిస్తూ ఆయుష్మంతుడివై వర్ధిల్లుతావు గాక. ప్రజలకు వృత్తులను సమకూరుస్తూ దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాల రెక్కలను తెగనరికినట్లు నీవు నీ కోదండంతో పర్వతవిదళనం కావించి సమత్వాన్ని కూర్చి గోరూపధారిణి అయిన భూదేవి వలన నిఖిలార్థాలను పొందుతావు గాక. నీవు సరస్వతీ నది పుట్టిన చోట శతాశ్వమేధయాగాలను ఆచరిస్తావు గాక. నీ చరితలు వివిధ గాథలుగా ప్రచారం పొందటాన్ని వింటావు గాక. నీ అసదృశ తేజో విశేషంతో లోకకంటకం సముత్పాటిత మవుతుంది గాక. నీవు దిశావధులను జయించి అప్రతిహతమైన ఆజ్ఞాచక్రాన్ని సారిస్తూ సురాసురస్తుత్యమాన మహాప్రభావుడివై భూలోకాన్ని పరిపాలిస్తావు గాక.

రాజేంద్రా! నీ యాగాశ్వాన్ని ఓర్వలేనితనం వల్ల ఇంద్రుడు అపహరిస్తాడు. నీవు పద్మోపవనంలో ఏకాంతంగా ధ్యానమగ్నుడవై సనత్కుమారుని ఉపాసించి, భక్తియోగరహస్యాన్ని గ్రహించి, బ్రహ్మప్రాప్తి సాధన విజ్ఞానాన్ని చూరగొంటావు' అని పలికారు.

పృథురాజు వారి మాటలను తలదాల్చి, 'సూతమాగధులారా! మీరు నాకు రాజధర్మాన్ని ఉపదేశించారు' అని పలికి, యథోచిత సత్కారాలతో వారిని తృప్తిపరిచి, ప్రకృతివర్గాన్ని సత్కరించాడు' అన్నాడు మైత్రేయుడు.

## గోదోహన వృత్తాంతం

విదురుడు మైత్రేయుని పలుకులకు మహాశ్చర్యపరుడై, 'మునివర్యా! భూదేవి గోరూపాన్ని ఎందుకు ధరించింది? ఆ ధేనువును పితకడానికి రాజు దేనిని వత్సంగా తెచ్చి నిలిపాడు? ఆ దోహన ప్రకారం ఏమిటి? భూమండలం మిట్టపల్లాలతో కూడి ఉంటుంది. పృథువు దానికి సమత్వాన్ని ఏ విధంగా కలగజేశాడు? దేవేంద్రుడు పృథు చక్రవర్తి యాగాశ్వాన్ని ఎందుకు హరించాడు? బ్రహ్మవిద్వరేణ్యుడైన సనత్కుమారుని వలన జ్ఞానవిజ్ఞానాలను పొంది పృథురాజు ఎటువంటి సద్గతిని పొందాడు? భగవానుడు పృథురాజావతారంలో ఏయే లీలలను ప్రదర్శించాడు? ఇవన్నీ వినాలని కోరిక క్రేళ్ళురుకుతున్నది. వైన్యరూపాన్ని ధరించి భూదేవి వలన సకలార్థాలనూ పిండిన ఆ భగవానునికి, నీకు – భక్తుడూ అనురక్తుడూ అయిన విదురుడు కావిస్తున్న విన్నపాన్ని మనస్కరించు' అని వేడుకొన్నాడు.

మైత్రేయుడు పరమ పవిత్రమైన పృథుచరిత్రాన్ని ఆసాంతం వినిపించాడు;

## ప్రజల దీనాలాపాలు

పృథువు రాజ్యాధిపత్యాన్ని వహించినంతనే ప్రజలు అతనిని సందర్శించి, 'రాజేంద్రా! భూతలమంతా అన్నవిహీనమై ఉన్నది. మాకు తిన మెతుకు లేదు. తొరటలోని నిప్పు చెట్టంతటినీ కాల్చినట్లు జఠరాగ్ని మమ్మల్ని దహించివేస్తున్నది. మాకు జీవికకు ఆధారం ఏమిటో అంతుబట్టడం లేదు. నీవే దిక్కని ఇక్కడికి వచ్చాము. ఆకలి తీర్చి మమ్ము కాపాడగల కరుణాత్ముడవని నిన్ను శరణువేడుతున్నాము' అని ప్రార్థించారు.

## భూదేవి పలాయనం

ప్రజల దీనాలాపాలను విని పృథురాజు విచార సముద్రంలో మునిగిపోయాడు. ఎన్నడూ లేని ఈ అన్నాభావానికి కారణం ఏమిటని ఎంతో సేపు ఆలోచించి, 'అన్నోత్పాదన భూమి వలన కలగాలి. ఆమెనే అడిగి

సస్యనాశానికి కారణం తెలుసుకోవాలి' అని నిశ్చయించి, త్రిపురాంతకుని వలె క్రోధరూపాన్ని దాల్చి శరాసనానికి తీవ్రమైన బాణాన్ని సంధించి, లేడిని వెంబడించిన వేటగాని వలె భూదేవి వెంటబడ్డాడు. ధాత్రి అతని ఉగ్రరూపానికి వెరచి పరుగెత్తసాగింది. పృథువు ఆమెను వెన్నంటి సాగాడు. భూమి దిక్కులు, విదిక్కులు దాటి అంతరిక్షానికి వెళ్ళినా పృథువు ఆమెను విడిచిపెట్టలేదు. ఎక్కడికి వెళ్ళినా అతని బారినుంచి తప్పించుకొనే అవకాశం లేదని గుర్తించి భూదేవి దీనాతిదీనయై ఇలా అన్నది;

## భూదేవీ పృథురాజుల సంవాదం

'రాజా! నేను స్త్రీ మాత్రురాలను. ఎట్టి పాపానికీ ఒడిగట్టినదాన్ని కాను. దీనురాలిని. ఒకవేళ స్త్రీలు తప్పు చేసినా సామాన్యులు కూడా సహిస్తారే గాని చంపబూనరు. ధర్మం తెలిసిన రారాజువు నీకు నేను చెప్పగల ధర్మం ఏమున్నది? మహార్ణవానికి నావ కైవడిని విశ్వానికి నేనున్నాను. నన్ను చంపితే నిన్నూ నీ ప్రజలనూ భరింపగలవారెవరు?' అని ప్రశ్నించింది.

పృథువు ఆమె మాటలకు మండిపడి, 'ఎటువంటి తప్పిదమూ చెయ్యలేదన్నావు, విను; యజ్ఞాలలో భాగాన్ని గ్రహించి అందుకు ప్రత్యామ్నాయంగా వసుధాన్యాదికాన్ని సమకూర్చమని నిన్ను శాసించాను. నా శాసనాన్ని ఉల్లంఘించావు. ఇది నీ మొదటి తప్పు. బ్రహ్మదేవుడు లోక వినియోగార్థం ఓషధీబీజాలను నీలో సృజించాడు. వాటిని వెలికి రానీయకుండా దాచిపెట్టావు. ఇది నన్ను అవమానించడమే కదా? ఇచ్చిన తృణాన్ని ఆరగించి పాలు పితకని గోవును దండించడం న్యాయమే. ఇదిగో ఇదే ఈ బాణంతో నీ కొవ్వంతా బైటికి తీసి ఆకలితో గగ్గోలు పెడుతున్న నా ప్రజల సంతాపాన్ని పోగొడతాను. భూతదయ లేని ప్రాణులను నిర్దాక్షిణ్యంగా వధించడమే రాజధర్మం. ఇందులో స్త్రీహత్యాపాతకం అన్న ప్రసక్తి లేదు. దుర్మదంతో స్తబ్ధతను పొంది స్వధర్మాన్ని విస్మరించావు. నువ్వు లేనినాడు ప్రజలకు నిలువ నీడ ఉండదనుకొని గర్వంతో విర్రవీగుతున్నావు. నిన్ను నరికి

పోగులు పెట్టి ప్రజలను నా యోగబలంతో మోస్తాను చూడు’ అని రూక్షవీక్షణుడై బాణం వేయబోతున్నాడు.

## పృథురాజ స్తవం

విదురా! ఆ విధంగా కృతాంతుని వలె తన్ను వెన్నంటుతున్న పృథుచక్రవర్తిని చూసి భూదేవి భయకంపితురాలై నమస్కరించింది.

‘ఎవడు స్వమాయారచిత నానాశరీరధారియై గుణమయుని వలె గోచరిస్తున్నాడో, ఎవడు స్వరూపానుభవజ్ఞులకు నిరస్తమాయుడై వెలుగొందుతాడో, ఎవడు ద్రవ్యక్రియాహేతువులైన అధిభూతాధ్యాత్మికాధి దైవతాల లోని అహంకార వీచికలు రాగద్వేషాదులకు అతీతుడై తేజరిల్లుతున్నాడో, ఎవని ఆజ్ఞను తలదాల్చి విధాత నన్ను సర్వజీవాధార భూమిగా నియమించాడో, ఎవని నిదేశానుసారం నేను చతుర్విధభూత సంఘాన్ని భరింపనోచానో ఆ సర్వస్వతంత్రుడే ఆయుధధారియై నన్ను అంతం చేయవచ్చినప్పుడు నాకు శరణెవ్వరు?’ అని చిన్నబోయి, పృథురాజును ఈ విధంగా సన్నుతించింది;

‘దేవా! ఇటువంటిదని చెప్పరాని మాయకు ఆశ్రయుడవై, ఆ మాయను అధిష్ఠించి చరాచరాత్మక ప్రపంచాన్ని సృజించే నీవే నీ మాయను బూని ఈ రూపున ప్రజాపరిపాలనార్థం అవతరించావు. నీకు రక్షణధర్మం పొసగినట్లు సంహార కార్యం తగదు.

సర్వతంత్ర స్వతంత్రా! నీ మాయామహిమ దాటరానిది. ఒక్కడవే అయినా పెక్కు రూపాలలో గోచరిస్తావు. చేయడమూ, చేయించడమూ అన్నీ నీ లీలలే. అకృతాత్ములకు నీ లీలావిలాసాలు గోచరింపవు. మహా భూతేంద్రియ బుద్ధ్యహంకారాలు, వాటి అధిష్ఠాన దేవతలు నీ శక్తివిలాసాలే. ఆ శక్తుల వలన నీవు జగజ్జనన స్థితి లయాలను కావిస్తావు. ఏతద్రూప సముత్కట నిరుద్ధ శక్తిమంతునికి, పరమపూరుషునికి, నీకు ప్రణామం.

దేవా! నీ చేత నిర్మితమై భూతేంద్రియాంతఃకరణాత్మకమైన ఈ విశ్వాన్ని నెలకొల్పుబూని, మున్నీట మునిగి ఉన్న నన్ను ఆదివరాహమూర్తివై జలాంతరం నుంచి సముద్ధరించి, సముద్ర సలిలాలలో నావను నిలిపినట్లు నన్ను నిలిపి, భూతకోటిని నా పైన నిలిపావు. పుట్టించినవాడవు నీవే గిట్టింపదగునా? జితేంద్రియులకు యశఃకరమైన కార్యాన్ని చేయడమే విహిత కర్తవ్యం. ఎంతటివారికైనా యథేచ్ఛావర్తనం సముచితం కాదు గదా?

## సారగ్రహణ మార్గం

'రాజేంద్రా! నా విన్నపం ఒకటున్నది. అభయమిచ్చి దానిని ఆలకించు. తుమ్మెద పువ్వుల లోని సారమకరందాన్ని క్రోలుతుందే గాని పుష్పనాశనానికి పాల్పడదు. తెలివిగలవారు వస్తుసారాన్ని గ్రహించాలే గాని వస్తుధ్వంసానికి పూనుకోవడం తెలివి కాదు. సారగ్రహణ మార్గం ఏమిటని అడుగుతావేమో? తత్త్వదర్శనులు ఉభయలోక మంగళార్థం అనేక యాగాలను ఉపదేశించారు. వాటిలో వ్యవసాయాదులు ఇహలోక మంగళ సాధనాలూ, అగ్నిహోత్రాదులు పరలోక శుభార్థ సాధనాలూ అవుతాయి. పెద్దల మాటను పాటించడం ఎప్పటికైనా శ్రేయస్కరం. మూఢ బుద్ధితో యోగమార్గాన్ని వదిలి యథేచ్ఛాకార్యతత్పరు లైనవారికి ప్రయత్నక్లేశమే తప్ప కార్యసిద్ధి ఎన్నటికీ చేకూరదు.

రాజా! విధాత ఓషధులను సృజించాడు. ఆ ఓషధులను అసాధుజనులు విచ్చలవిడిగా తినటం మొదలుపెట్టారు. భూపాలకులు మర్యాదలను నియమింపక ఉపేక్ష వహించారు. లోకమంతా చోరప్రాయమై అధర్మనిలయం కాజొచ్చింది. ఓషధులు లభింపకపోతే యజ్ఞాదులకు విఘ్నం కలుగుతుందని రానున్న ముప్పును గ్రహించి ఓషధీబీజాలను నా కడుపులో దాచి ఉంచాను. అవి కాలక్రమాన నాలో జీర్ణించాయి. ఇందులో నా తప్పేమిటో చెప్పు?

## గోదోహన ప్రకారం

రాజా! ఇప్పుడు ఆ ఓషధులను పొందే మార్గం ఏమిటంటావా? గోరూప ధారిణినైన నన్ను పితికితే అవి మళ్ళీ లభిస్తాయి. నన్ను పితకడానికి వత్సాలను, దోహనపాత్రలను, దోహకులను సమకూర్చు. నేను చేపిన తర్వాత బలప్రదమైన అన్నాన్ని క్షీరరూపంలో ఇస్తాను. ఆ క్షీరధారల వల్ల సర్వభూతజాతానికీ అన్న సంపాదన కలుగుతుంది. ఇందుకు ఒక్క ప్రతికృతిని మాత్రం కోరుతున్నాను. నా యందు మిట్టపల్లాలు ఉండటం వలన వర్షేతర కాలాలలో జలాలు మళ్ళలో సమృద్ధిగా నిలవడం లేదు. అది చదును చేసి నాకు మేలు చేయగలవని అడిగాను' అన్నది.

## ఓషధి గ్రహణం

భూదేవి ప్రియహితకరంగా చెప్పిన మాటలు పృథురాజు మనస్సును చూరగొన్నాయి. అతను మనువును దూడగా కల్పించి, తన చేతిని పాత్రగా ఒడిసిపట్టి, తానే దోహకుడై ఆ గోరూపధాత్రి నుంచి సకలౌషధులను గ్రహించాడు.

విదురా! పృథువు వలె సారగ్రహణం ఎటువంటి వారికైనా కర్తవ్యమే కదా. అందుచేత అతని తర్వాత ఇతరులు తమ తమ మతానుసారంగా పృథుభావిత ధాత్రి నుండి క్షీరాలను గ్రహించారు.

## ఋష్యాదుల క్షీరసంపాదనం

ఎలాగంటావా? విను. ఋషులు బృహస్పతిని దూడగా, వాఙ్మనః శ్రవణేంద్రియాలను పాత్రలుగా అమర్చి వేదమయక్షీరాలను గ్రహించారు. దేవతలు మహేంద్రుని వత్సంగా నిలిపి, హిరణ్యాన్ని పాత్రగా సంతరించి సోమము, వీర్యము, ఓజస్సు, బలం అనే శక్తులను స్వీకరించారు. ఆ సోమం వారికి అమృతం గాను, వీర్యం మనశ్శక్తిగా, ఓజస్సు ఇంద్రియశక్తిగా, బలం దేహశక్తిగా సమకూడాయి.

ఆ తర్వాత దానవ దైతేయులు ప్రహ్లాదుని గోవత్సంగా కూర్చి, ఇనుప పాత్రను తెచ్చి కల్లును పితికారు. గంధర్వులు, అప్సరోగణం విశ్వావసువును లేగదూడగా చేసి పద్మమయ పాత్రలో మధుసౌభగమైన గాంధర్వాన్ని పితికారు. పితృదేవతలు అర్యముని వత్సంగా నియమించి యామపాత్రలో గవ్యాన్ని పితికారు. సిద్ధవిద్యాధరులు కపిలుని గోశిశువుగా కూర్చి నభః పాత్రలో అణిమాది సిద్ధులను పితికారు. కింపురుషాదులు మయుని వత్సంగా చేసి మనఃపాత్రమందు సంకల్పమాత్రాన అంతర్ధానమయ్యే మహాద్భుతమాయలను సంపాదించారు. యక్ష రక్షో భూత పిశాచగణాలు భూతేశుని లేగగా నిలబెట్టి కపాలపాత్రలో రక్తాసవాలను పితికారు. పడగలు లేని దందశూకాదులు, సఫణులైన సర్పనాగాలు తక్షకుని వత్సంగా నిలిపి బిలపాత్రలో విషాన్ని పితికాయి. పశువులు వృషభాన్ని దూడగా ఉంచి అరణ్య పాత్రికలో యవాన్ని పితికి తీసుకొన్నాయి. దంష్ట్రలు గల క్రవ్యాదిమృగాలు సింహాన్ని వత్సంగా చేసి స్వకళేబర పాత్రలో మాంసాన్ని పితికాయి. పక్షులు గరుత్మంతుని గోశిశువుగా నిలిపి ఆత్మపాత్రలో కీటఫలాదులను పితికి తీసుకొన్నాయి. వనస్పతులు వటవృక్షాన్ని వత్సంగా చేసి ఆత్మపాత్రలో పృథగ్రోమాలను పితికాయి. పర్వతాలు హిమవంతుని దూడగా చేసి సానుపాత్రలో నానాధాతువులను పిండాయి.

ఆ విధంగా వారు తమ జాతి ముఖ్యులను వత్సాలుగా ఉపకల్పించి, వారి వారికి అనువైన అన్నాలను సమృద్ధంగా పితికి తీసుకొన్నారు.

## పట్టణాదుల కల్పనం

తన పౌరులందరికీ అన్నోదకాలకు కరువు లేకుండా భూదేవి సస్యసమృద్ధిని అనుగ్రహించినందుకు పృథురాజు పరమప్రీతుడై భూమిని ఆత్మపుత్రికగా సంభావించి, ఆమె కోరికను నెరవేర్చడానికి సముద్యమించాడు. తన వింటికొపుతో గిరిశిఖరాలను చూర్ణం చేసి ఆయా చోట్ల నిమ్నోన్నతాలను చక్కజేసి ప్రజలకు వాసయోగ్యతను కలిగించాడు.

పృథువు కావించిన ఈ సత్కార్యఫలంగా భూమండలం పైని అంతకు పూర్వం ఎన్నడూ లేని పట్టణాలు, పురాలు, గ్రామాలు నానారూప దుర్గాలు, గొల్లపల్లెలు, గోవ్రజాలు, శిబిరాలు, సువర్ణాద్యుత్పత్తి స్థానాలు, కర్షక గ్రామాలు, పర్వతప్రాంత గ్రామాలు వెలిశాయి.

సుఖనివాసానికి, ఆహారవిహారాలకు ఏర్పాట్లు జరిగిన తర్వాత ప్రజలు తమ తమ వృత్తులకు అనువైన చోట్లను ఎన్నుకొని ఆయా ప్రదేశాలలో ఈతిబాధలు లేక సుఖజీవితం గడపసాగారు.

## శతాశ్వమేధ యాగదీక్ష

విదురా! సరస్వతీనది కొంత దూరం తర్వాత తూర్పు ముఖంగా ప్రవహిస్తున్నది. ఆ నదికి, దృషద్వతీ నదికి మధ్యప్రదేశాన్ని బ్రహ్మావర్త దేశమని అంటారు. అందులో మనుక్షేత్రం ఉన్నది. పృథురాజు ఆ పుణ్యక్షేత్రంలో నూరు అశ్వమేధయాగాలను చేయాలని సంకల్పించి దీక్ష వహించాడు.

దేవేంద్రుడది విని, 'ఓహో! శతక్రతువనే బిరుదు నాకు తప్ప ఇంతవరకు వేరొకరికి చేకూరలేదు. ఇతను నన్ను మించదలచి కాబోలు ఇప్పుడు యాగాన్ని తలపెట్టాడు. చూస్తూ ఊరుకుంటే నా పదవి ఇక దక్కదు' అని లోలోన వితర్కించి పృథుయజ్ఞ మహోత్సవాన్ని భగ్నం చేయాలని నిశ్చయించుకొన్నాడు.

యజ్ఞం ప్రారంభించారు. యజ్ఞేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు, ఆయన వెంట బ్రహ్మ మహేశ్వరులు, లోకపాలకులు, సిద్ధ విద్యాధర దైత్య దానవ గంధర్వాప్సరోగణం, సునంద నందాది పార్షదులు తరలివచ్చారు. భగవత్సేవాభిరతులై కపిల నారద సనకాది యోగీశ్వరులు, భాగవతులు వచ్చారు.

ఆ యజ్ఞానికి వలసిన సామగ్రినంతటినీ భూదేవి హవిస్సు రూపంలో సమకూర్చింది. వాహినులు క్షీర దధ్యన్న పాన ఘృత తక్ర ఇక్షు ద్రాక్షాది రసాలను తెచ్చి నింపాయి. వృక్షాలు తమ శరీరాలను పెంచి ఫల పుష్ప మధువులను వర్షించాయి. రత్నాకరాలు రత్నరాసులను కొనివచ్చి కానుకలిచ్చాయి. పర్వతాలు భక్ష్య భోజ్య చోష్య లేహ్యములనే చతుర్విధాన్నాలను సిద్ధపరిచాయి. లోకులు, లోకపాలకులు యథోచితంగా ఉపాయనాలను సమర్పించారు. పృథురాజు పరమవైభవంగా తొంభై తొమ్మిది అశ్వమేధ యాగాలను జరిపాడు.

## యజ్ఞాశ్వ హరణం

నూరవ యజ్ఞం మొదలైంది. ఇంద్రునికి మనసు మనసులో లేదు. స్పర్ధాసూ యలతో వ్యాకులచిత్తుడై ఒక్క క్షణం ఆలోచించి, 'ఈ యజ్ఞం కొనసాగితే నా పేరు దక్కదు' అని నిశ్చయించి మారువేషం ధరించి యజ్ఞశాల నుంచి మేధ్యాశ్వాన్ని దొంగిలించి గగనమార్గాన వినిర్గమించాడు.

రాజుతో యజ్ఞం చేయిస్తున్న అత్రిమహర్షి యోగబలం వల్ల ఇంద్రుని దుండగాన్ని తెలుసుకొన్నాడు. పృథురాజు కొడుకును పిలిచి, 'నాయనా! ఇంద్రుడు పాషండమతియై అధర్మకవచాన్ని ధరించి యజ్ఞాశ్వాన్ని అపహరించి దూరానికి పారిపోతున్నాడు' అని ఆకసాన ఇంద్రుడు పయనిస్తున్న మార్గాన్ని చూపించాడు.

## పృథుసూనుని విజయం

పృథుతనయుడు ఆ మాటతో క్రోధవిశుడై నిలునిలుమని అదిలించుతూ ఇంద్రుని వెన్నాడుతుండగా ఒక వ్యక్తి జటాధారియై, బూదిపూసిన మేనితో అతనికి ఎదురయ్యాడు. రాజకుమారుడు ఆ వ్యక్తిని పరికించి చూసి, 'ఔరా! ఎంత తప్పుచేయబోయాను! ఇతను మహాముని. ఇంద్రుడని పొరబడ్డాను' అని ఎక్కుపెట్టిన బాణాన్ని ఉపసంహరించాడు. అత్రిమహర్షి అది గ్రహించి,

'రాజపుత్రా! అతను మునీంద్రుడు కాడు. నీ తండ్రి యజ్ఞఘాతకు డైన ఇంద్రుడు; జాగుచేయకు; వెంటనే తెగటార్చు' అని పెద్దగా అరిచాడు. రాజనందనుడు ఆ కేక విని క్రోధాకారం దాల్చి ఏనుగు పై కురికిన మృగరాజు వలె ఇంద్రుని తరిమి పైకొన్నాడు. నాకేశ్వరుడు యజ్ఞాశ్వాన్ని వదిలి మాయమైపోయాడు. పృథుసుతుడు దానిని వెంటబెట్టుకొని యాగశాలకు వచ్చాడు. అతని అద్భుతకృత్యానికి మహర్షులు సంతసించి అతనికి 'విజితాశ్వుడు' అని పేరుపెట్టారు.

ఆ తర్వాత మేధ్యాశ్వాన్ని ఇతరులు అపహరించడానికి వీలులేకుండా బంగారు తాళ్ళతో సువర్ణ చషాలంబ యూపస్తంభానికి గట్టిగా కట్టారు. పృథురాజు మళ్ళీ యజ్ఞం ప్రారంభించాడు. ఇంద్రుడు మళ్ళీ అదృశ్యరూపంలో వచ్చి ఆ అశ్వాన్ని దానిని కట్టి ఉంచిన బంగారు పగ్గాలతో హరించి తీసికొనిపోసాగాడు. మహర్షి ఆ సంగతి మళ్ళీ పృథునందనునికి తెలిపి, 'ఈ దొంగను విడిస్తే జరిగేదేమిటో చూశావా?' అని హెచ్చరించాడు. రాజసూనుడు ఇంద్రవధకు సన్నద్ధుడై విల్లెత్తి నారి సంధించాడు. ఇంద్రుడు వెంటనే అశ్వాన్ని వదిలి తాను ధరించిన రూపాన్ని విడనాడి అంతర్ధానం చెందాడు. విజితాశ్వుడు ఆ అశ్వాన్ని యజ్ఞశాలకు కొనివచ్చాడు.

## పాషండ మతాలు

ఇంద్రుడు ఆ విధంగా హయహరణార్థం ధరించిన ప్రచ్ఛన్నరూపాలు పాషండములై ఉన్నందున అటువంటి రూపాలను ధరించిన వారిని పాషండులు అనసాగారు. ఆ రూపాలలో నగ్నం, రక్తపటం మొదలైన భేదాలు అనేకం ఉన్నాయి. అందులో నగ్నరూపధరులను జైనులని అంటారు. రక్తాంబరధరులను బౌద్ధులని పేర్కొంటారు. కాపాలికాదులు కూడా ఈ పాషండకోటి లోని వారే.

విదురా! ఇంద్రానుకృతులుగా లోకంలో వెలసిన ఆ రూపాలన్నీ అధర్మాత్మకాలని తెలియక మూఢులు కొందరు అవే ధర్మాలని భ్రమించి వారు

పలికే హేతువాదాల పైపై మెరుగులకు వశపడి ఆ మతాలను ఆదరించడం మొదలు పెట్టారు.

## ఋత్విజుల అనునయోక్తులు

అది చూసి పృథుచక్రవర్తి ఈ విధానం ఇంకా కొనసాగితే అధర్మం వృద్ధిచెందగలదని భయపడి ఆ మతాలకు మూలమైన ఇంద్రుని రూపుమాప నిశ్చయించి బాణసంధానం చేయబోయాడు. ఋత్విజులు అతని క్రోధ భయానక రూపాన్ని చూసి అతని భావాన్ని గ్రహించి, 'రాజా! యజ్ఞదీక్షలో ఉన్న నీ విప్పుడు యజ్ఞపశుప్రాణాన్ని తప్ప వేరొక ప్రాణాన్ని తీయకూడదు. అన్యప్రాణివధ మహాపాతకం. ఈ దుండగీని సంగతి ఏమిటంటావా? ఈ యజ్ఞవిఘ్నకారి చేసినది మహాపరాధం. వీర్యవంతాలైన మంత్రాలతో వహ్నిముఖాన ఉచితాహుతులను వేల్చి శతమఖుని రప్పించి మేమే అతనిని చంపి నీ అభిమతాన్ని నెరవేరుస్తాము. ప్రస్తుతానికి నీ ఉద్యమాన్ని విరమించు' అని చెప్పి స్రుక్పాణులై వేల్పసాగారు.

## బ్రహ్మదేవుని శాంతివచనం

అంతలో బ్రహ్మ సమీపించి, 'ఋత్విజులారా! వద్దు, వద్దు, సురేశ్వరుని చంపబూనకండి, అతను భగవదంశసంభూతుడు; వధ్యుడు కాడు. ఏ సురలను మీరు యజ్ఞంచేత ఆరాధిస్తున్నారో వారందరూ ఇతని వంశం వారే అన్న సత్యాన్ని మరువకండి. ఇతనితో సఖ్యం కావించుకొనడమే ఉచితం. ఇతను పృథురాజు యజ్ఞభంగాన్ని సంకల్పించి చేసినదంతా అన్యాయమేనంటారా? కావచ్చు. ఇప్పటికే ఇతని వల్ల పాషండప్రచారం మెండయింది. పృథుని సంగతి ఏమంటారా? ఆ రాజు తొంభై తొమ్మిది యజ్ఞాలతోనే దీక్షాపూర్తి చేస్తాడు గాక' అని చెప్పి వారి యత్నాన్ని విరమింపజేశాడు.

## పృథువుకు హితోపదేశం

విదురా! బ్రహ్మదేవుడు ఆ విధంగా ఋత్విజులను శాంతపరిచి పృథువు వంకకు మరలి, 'రాజా! ఇంతవరకు నీవు చేసిన యజ్ఞాలు చాలు. మరొక మాట కూడా విను. నీవు మోక్షధర్మజ్ఞుడవు. మోక్షార్థం నీవు నూరు యజ్ఞాలు చేయడం ఆవశ్యకం కాదు. ఇంద్రునిపై రోషభావాన్ని విడిచిపెట్టు. మీరిద్దరూ భగవంతుని అంశమూర్తులు కనుక మీకు పరస్పరవైరం తగదు. యజ్ఞదీక్ష భంగమైనదని చింతింపవద్దు. నా మాటను ఆదరించు. నీవు పరమశాంతికై యత్నిస్తున్నవాడవు. నీ యత్నం కొనసాగనినాడు నిన్ను రోషం పైకొంటుంది. దానితో మోహం కలుగుతుంది. మోహగ్రస్తులకు శాంతి కలగదు. మరొక రహస్యం కూడా ఉన్నది. నీ యత్నం నిజానికి దైవోపహతం. అందుకు ఇంద్రుడు నిమిత్తమాత్రుడు. ఇంద్రుని వైమనస్యానికి కారణం లేకపోలేదు. అతను శతమఖుడన్న బిరుదాన్ని వహించాడు. నీవూ శతమఖుడవు కావడం అతనికి తలవంపు, దేవతలకు దురాగ్రహం అవుతుందని అతను భావించి నీ యజ్ఞవిఘ్నాన్ని తలపోసి పాషండాలను కల్పించాడు.

రాజా! ధర్మోద్ధరణ సంకల్పంతో విష్ణుదేవుడు సమయానురూప కార్యాలను ఆచరిస్తాడు. వేనుని అపచారం వల్ల ధర్మానికి భంగం వాటిల్లింది. ఆ ధర్మోద్ధరణకై భగవానుడు వేనుని అంగం నుంచి నీ రూపాన అవతరించాడు. అట్టి నీవు ధర్మగ్లానికి అవకాశం ఇవ్వకూడదు. విశ్వసృష్టి విధానాన్ని తలపోసి సృష్టికర్తల సంకల్పాన్ని నెరవేర్చు. అధర్మహోమభూతమైన ఇంద్రమాయ వలన పాషండ మతం పుట్టి ప్రచండం కాబోతున్నది. ఆ మార్గాన్ని అరికట్టి లోకాన్ని సముద్ధరించు' అన్నాడు.

పృథువు ఆ పలుకులను విని దీక్ష చాలించి ఇంద్రుని యెడ పగమాని అవభృథస్నానం చేసి యజ్ఞానికి వచ్చిన విప్రులను శ్రద్ధాభక్తులతో అర్ఘ్యదక్షిణల నిచ్చి సత్కరించాడు. వారందరూ సంతృప్తిని పొంది, 'రాజాధిరాజ మూర్ధన్యా! నీవు చేసిన దానమానాది సత్కారాలకు పితృ దేవ ఋషి మానవులందరూ ఎంతో సంతోషించారు. నీకు శుభమగు గాక' అని దీవించి వెళ్ళారు.

## భగవదాగమనం

అంతలో వైకుంఠుడు మహేంద్రుని వెంటగొని వచ్చి, 'రాజేంద్రా! నీ యాగదీక్షా విఘ్నకారి ఇదిగో స్వయంగా వచ్చి ఆత్మాపరాధాన్ని మన్నించమని నిన్ను ప్రార్థిస్తున్నాడు. ఇతని యెడ ప్రసన్నహృదయుడవై లోకంలో మైత్రీధర్మాన్ని నెలకొల్పు. అజ్ఞులు దేహమే ఆత్మ అని భావించి దేహచ్ఛేదనాదులతో తృప్తిని పొందుతారు. దేహములు జడపదార్థాలు కనుక వాటికి వినాశనం తప్పదని, దేహాంతర్వర్తి అయిన ఆత్మకు జనన వినాశనాలు కలుగవని, ఆ ఆత్మవస్తువు సర్వాంతర్యామియై ఉంటుందని విజ్ఞులు తెలిసికొని అజ్ఞుల వలె భ్రాంతులు కానందున కలలో నైనా భూత ద్రోహానికి పాల్పడరు. నీ బోంట్లు కూడా అవిద్యాత్మకమైన అజ్ఞానానికి లోనై మోహాన్ని పొందితే, వృద్ధసేవా ఫలమంతా ఏమైనట్లు?

## దేహాత్మల తారతమ్యం

> రాజా! శరీరాలన్నీ అవిద్యా కామకర్మ ఫలాలు. విద్వాంసులకు వాటియందు మమకారం ఉండదు. శరీరాసక్తితో కలిసి ఇల్లూ వాకిలి, భార్యాబిడ్డలు మొదలైనవి ఏర్పడతాయి. శరీరాసక్తి లేనివారికి గృహాపత్యధనాసక్తులు ఎందుకుంటాయి? ఈ శరీరాలు బాల్య యౌవనాది భేదాలతో వివిధావస్థలను కలిగి ఉంటాయి. వాటికి ఆద్యంతాలు తప్పవు. అవి నానావిధ మలినాలతో కూడి కేవల జడాలు, సగుణాలు, స్వకారణ భూషిత గుణాశ్రయాలు, గృహాదిసమావృతాలు, పరిచ్ఛిన్నాలు అయి దృశ్యాలుగా ఉంటాయి. ఆత్మ అంటేనో ఈ లక్షణాలన్నిటికీ విరుద్ధంగా ఏకము, శుద్ధము, స్వయంప్రకాశము, నిర్గుణము, గుణాశ్రయము, సర్వవ్యాపకము, సాక్షిమాత్రము అయినట్టిది.

ఈ రహస్యాన్ని గ్రహించినవారు భగవానుడు తమ హృదయాంతరంలో నిలిచి ఉన్నప్పటికీ దేహగుణాలు తదనువర్తనీయాలు కావన్న

నిశ్చయభావంతో ఉంటారు. వారు ఫలాశారహితులై స్వధర్మానుష్ఠాన పూర్వకంగా నన్ను నిత్యం శ్రద్ధతో ఆరాధిస్తారు. దానివల్ల వారి మనస్సులు క్రమక్రమంగా ప్రసన్నములవుతాయి. దానితో సంగం వీడుతుంది; సమ్యగ్దర్శనం ఏర్పడుతుంది. తత్ఫలంగా శాంతి కలుగుతుంది.

## శాంతి స్వరూపం

శాంతి అంటే ఒక అపూర్వమైన ఉదాసీన స్థితి. ఆ స్థితినే బ్రహ్మత్వమని, కైవల్యమని అంటారు. దేహ జ్ఞాన కర్మేంద్రియ మనో బుద్ధ్యాదుల వృత్తులకు ద్రష్ట మాత్రంగా ఉండటమే ఉదాసీనత్వం. ఆ విధంగా శాంతిని పొందినవారికి పునర్జన్మ ఉండదు.

## సంసృతి వివేకం

రాజా! జనన మరణాలు దేహానికా? ఆత్మకా? అని సందేహం కలిగినప్పుడు వివేకించి చూడగా అవి దేహానికే తప్ప ఆత్మకు కావని తెలిసివస్తుంది. దేహస్థమైన ఆత్మకు జనన మరణాలు లేవనడం ఎలాగంటే, దేహాలు గుణప్రవాహాలు. గుణాలు తమ తమ వ్యవహారాలకు యోగ్యమైన శరీరాలను గ్రహిస్తాయి. అందువల్ల వాటికి నానావిధములైన రూపాలు కలుగుతున్నాయి. ఈ నానాత్వం ద్రవ్య క్రియాకారక చిదాభాస స్వరూపభేదాలను బట్టి కలుగుతున్నది.

తత్త్వవేత్తలు ఈ రహస్యం తెలిసినవారు కనుక వారు శరీరాలకు కలిగే సంపద్విపత్తులకు గాని, హర్షశోకాదులకు కాని వికృతిని పొందక నా యందు బద్ధసౌహృదులై ఉంటారు. నీవు కూడా అంతటివాడివే కనుక సుఖదుఃఖాలను, ఉత్తమ మధ్యమాధమ స్థితులను సమదృష్టితో పరికిస్తూ ఇంద్రియాలను, మనస్సును జయించి అఖిల లోకాలనూ సంరక్షించాలి.

## స్వధర్మాచరణ ఫలం

అందుకు నేనొక్కడనూ శక్తుడనా? ఇంత పని చేయగలనా? అని సందేహించకు. అమాత్యాది పరివారాన్ని నీకు సమకూర్చాను. లోకరక్షణకు దండాదులు తప్పవని, దండాదికం పాపానికే దారితీస్తుందని, అందుచేత ఈ రాచరికాన్ని త్యజించి తపస్సు చేతనో, లేక మరొక విధాననో పుణ్యాన్ని ఆర్జింపవచ్చునని అనుకోకు. రాజులకు ప్రజాపాలనమే స్వధర్మం. వారికి అంతకంటె శ్రేయోమార్గం కలగదు. ప్రజలు ధర్మపరులై నడుచుకొంటే ఆ ధర్మవర్తన సమార్జిత పుణ్యంలో ఆరవ పాలు రాజుకు చెందుతుంది. అది ఆతనికి పరలోక సుఖకారి అవుతుంది.

రాజు ప్రజారక్షకుడు కాలేకపోతే జనులు నిర్భయులై దోషాచరణకు పాల్పడతారు. వారి దోషం రాజు కావించే పుణ్యాన్ని హరించడమే కాక అతనికీ సంక్రమిస్తుంది. ప్రజారక్షకుడు కాని రాజు ప్రజల వలన పన్నులు తీసుకొని అనుభవించడం పాపమవుతుంది.

రాజా! అన్నిటికీ ప్రధానమైనది ధర్మం. అర్థకామాదులు ధర్మాన్ని అనుసరించాలి. ఈ సంగతిని మనస్సులో ఉంచుకొని బ్రాహ్మణానుమతి ప్రకారం ధర్మబద్ధంగా రాజ్యాన్ని పరిపాలించు. అప్పుడు నీ యెడ ప్రజానురాగం స్థిరమవుతుంది.

రాజా! నీ శమదమాది సుగుణాలు, నీ నిర్మత్సరస్వభావం నాకు మెప్పును కలిగించి నన్ను నీకు వశీకృతుని చేశాయి. అట్టి శుభగుణాలు లేనివారు ఎన్ని యజ్ఞాలు చేసినా నాకు ప్రీతికలగదు. వారికి నేను ఎన్నటికీ వశపడను. సమచిత్తులలో నేను ఎల్ల వేళలా నిలిచి ఉంటాను. వారియందు నా ఉనికిని గుర్తెరిగి వారు నన్ను ఆరాధిస్తారు.

రాజా! సనకాది సిద్ధులు శీఘ్రకాలంలో నీ ఇంటికి రాబోతున్నారు. వారిని సేవించి ఇంకా తెలియగోరిన విషయాలను వారి వలన తెలుసుకో' అని పలికాడు.

## పృథు మహేంద్రుల మైత్రి

విదురా! పృథురాజు భగవద్వచనాలను శిరసావహించి ఇంద్రుని యెడ తను కావించిన అపరాధానికి సిగ్గుపడి ఆ దోషానికి ప్రాయశ్చిత్తంగా శతక్రతువు పాదాలపై సాగిలబడ్డాడు. ఇంద్రుడు సాదరంగా అతనిని లేవనెత్తి కౌగిట చేర్చి అంతకు పూర్వం అతని యెడ గల రోషద్వేషాలను విడనాడి నిండు మనస్సుతో స్నేహం చేశాడు.

## పృథువు భక్తిపరిపాకం

భగవానుడంతట యథార్హ పూజలంది పృథురాజును వీడ్కొనబోతున్నాడు. ఆ రాజు భగవంతుని పాదపద్మాలను తన వక్షఃస్థలాన నిలిపి గట్టిగా పట్టుకొని విడిచిపెట్టలేకపోయాడు. భగవానుడు అతని ననుగ్రహించి ప్రయాణాన్ని చాలించాడు. ఆ అనుగ్రహ విశేషానికి పృథువు నేత్రాలలో ఆనందాశ్రువులు ఉబికి వచ్చాయి. కన్నీటి తెరల వల్ల దృష్టి మందగించి అతను భగవంతుని సంతృప్తిగా చూడలేక చేతులు జోడించి నోట మాట లేకుండా కొంతసేపు నిశ్చేష్టుడై నిలబడి ఎట్టకేలకు కన్నులు తుడుచుకొని నెమ్మది వహించి, 'అయ్యో! భగవత్పాదం భూతలాన్ని తాకరాదు. భక్తుల మీది ప్రేమాతిశయం వల్ల భగవానుడు ఆ నియమాన్ని పాటింపడు కాబోలు' అనుకొంటూ, గరుడుని వీపుపై చేయి ఉంచి కంటి కరువుతీరా ఆ దివ్య మూర్తిని వీక్షిస్తూ అన్నాడు కదా,

## భగవత్స్తోత్రం

'కైవల్యపతీ! అహంకారం ఉన్నంత కాలం దేహాభిమానమూ ఉంటుంది. దేహాభిమానులకు సకల సుఖాలూ ఉపభోగ్యాలౌతాయి. ఆ సుఖాలు నరకవాసులకు కూడా లభిస్తాయి. అట్టి సుఖాలను బ్రహ్మాదులు ప్రసాదిస్తారు. బ్రహ్మాదులందరికీ ఈశ్వరుడవైన నిన్ను తుచ్ఛసుఖాల నిమ్మని నేను కోరలేదు. ఒకవేళ

నీవు ఇస్తానన్నా వద్దనే అంటాను. అయితే నేను కోరేదేమిటో చెప్పమంటావా? ఏ నీ పాదకమల కథాసుధారసం మహాత్ముల హృదయాంతరాలలో జనించి వారి ముఖద్వారాన స్రవించి కర్ణామృతమై విరాజిల్లుతుందో, దానిని తనివితీరా చవిగొనే భాగ్యాన్ని అనుగ్రహించు. కైవల్యపతి వయిన నిన్ను కైవల్యం కూడా ఇమ్మని కోరను. నీ కథామృత పానభాగ్యం లేని కైవల్యం నాకెందుకు? నీ దివ్య కథలను ఆకర్ణించాలని నా కోరిక. అందుకు పదివేల వీనులను కోరుకొంటాను. అదొక్కటే నేను కోరుకొనే వరం.

దేవా! కైవల్యం లేనినాడు రాగద్వేషాదులు పైకొని వ్యాకులపాటును కలుగజేస్తాయని, వ్యాకుల చిత్తులకు భక్తి సుఖం దూరమవుతుందని నాకు భయం లేదు. నీ పాదాంభోరుహ సుధారసంలో ఒక్క బిందువు యొక్క తావి సోకిన గాలి దూరాన నుంచి వీచి పైన వాలినా కుయోగులకు, విస్మృత వర్తను లైనవారికి, అంతకన్నా అధములకు కూడా ఆత్మజ్ఞానం కలుగుతున్నది. మోక్షాది సర్వసుఖాలూ భక్తియందే అంతర్లీనమై ఉన్నాయి.

దేవా! భక్తికి ముక్తి ఫలమై ఉండగా ముక్తిని కోరక వట్టి భక్తిని కోరానని నాకేమీ సంకోచం లేదు. పశుప్రాయులు తప్ప గుణజ్ఞు లెప్పుడూ గుణాన్నే వరిస్తారు. ఇందుకు శ్రీదేవియే నిదర్శనం. ఆ దేవి సర్వపురుషార్థ సంగ్రహమైన నీ అంశనే వరించింది కదా. నేను కూడా ఆ విధంగానే నిన్ను కోరుకొన్నాను. ఒకే వస్తువును ఇద్దరు కోరినప్పుడు వారికి పరస్పర వైరం జనించే అవకాశం ఉన్నదని, అందుకు దేవేంద్ర కలిపురుషుల చరిత్రమే నిదర్శనమని, శ్రీదేవి వలె నేను కూడా నీకు భక్తుడ నైతే మాకు కలహం సంభవింపవచ్చునని శంకిస్తావేమో. ఏకపతిని వలచిన సవతులకు మత్సర మేర్పడటం నైజమే. శ్రీదేవి, నేను నీ యందు మనసు గొని

నిన్ను ఉపలాలించే వేళలలో మాకు అన్యోన్యమాత్సర్యం కలిగినా కలుగవచ్చును కాని దానికి నేను కలతచెందను. భక్తుల గుణాలను గోరంతలను కొండంతలుగా భావించే నీవుండగా నాకు దిగులెందుకు? శ్రీదేవి జగజ్జనని కనుక బ్రహ్మాదులు కూడా ఆమెను ప్రార్థిస్తుండగా, అట్టి మహనీయురాలి సేవలను వదిలి నీవు నా అల్ప సేవలను మెచ్చుకొంటావా? అని నేనెన్నడూ భావించను. స్వామీ! నీవు నిత్యానంద నిరతుడవు. పరసేవా సంతోషాన్ని ఆశించే వాడవు కావు. అందువల్ల సేవావిషయంలో హెచ్చు తగ్గుల భావన కాని, దానిని బట్టి కలిగే పక్షపాతాది బుద్ధులు కాని నీ యందు పొడచూపవు. నీకు రమాదేవి ఎంతో నీ భక్తులు కూడా అంతే. కనుక ఆ విధమైన చింత నాకు ఏ నాడూలేదు.

దేవా! నీవు మాయాగుణ విలాస కార్యాలకు అతీతుడవు. అందువలన నిష్కాములు జ్ఞానులైనప్పటికీ నిన్ను భజిస్తారు. ఏమి కోరి భజిస్తున్నారంటావా? వారు నిన్నేమీ కోరరు. నీ పాదస్మరణానందం వారిచేత అలా చేయిస్తున్నది. దయానిధీ! నా ఇచ్చవచ్చిన వరాన్ని కోరమన్నావు. ఈ తీరున నన్ను ప్రలోభపెట్టడం ఎందుకో నా ఊహకు అందే విషయం కాదు. ఇట్టి వాక్యం లోకాన్ని మోహప్రవాహంలో ముంచెత్తుతుంది. వేదమందలి ఇట్టి వాక్యాల చేత ప్రోత్సాహితులై పునఃపునః ఫల కాంక్షతో జనులు కర్మమార్గాన ప్రవర్తిల్లడం నీకు తెలియనిది కాదు. దేవా! నీ మాయచేత ఒక ప్రక్క ఖండితులై ఉన్నవారిని మళ్ళీ తెగవేయడం తగదు. వారికి హితం కలిగే మార్గాన్ని ఉపదేశించాలి. నీ మాయాఖండన విధానాన్ని బోధించాలి. ఏకమైన నీ స్వరూపంలో బహుత్వాన్ని కనుగొనడమే నీ మాయా ఖండనమని లోకులకు తెలియాలంటే నా చరిత్రమే అందుకు

నిదర్శనం. ఏదీ కోరుకొనవా? అంటావేమో. ఏదీ నేను కోరను. తండ్రులు పుత్రుల కోరికలను అప్రార్థితంగా నెరవేరుస్తారు. లోక జనకుడవు. నాకు ఏది హితమో దానిని ప్రసాదించు'

అని వేడుకొన్నాడు.

## అభీష్ట వరదానం

విదురా! భగవానుడు పృథురాజు వచనాలను విని, 'రాజా! నా యెడ స్థిరభక్తిని కోరుతున్నావు. నీ కోరిక నెరవేరుతుంది గాక. నా మాయ దురత్యయమైనది. అయినా దానిని నీ భక్తిఫలంగా నీవు దాటగలుగుతావు. అప్రమత్తుడవై వర్తించు. నా ఆజ్ఞను పాటించినవారికి నిఖిల శుభాలూ కలుగుతాయి. ఎట్టి వరాన్నీ కోరడంలేదన్న నీ నిశ్చయం ఎంతో శ్లాఘ్యమై ఉన్నది. నా యందు భక్తిగలవారు స్వర్గాపవర్గ నరకాలను అన్నింటినీ సమదృష్టితో చూస్తారు. తారుమారు పడరు.

మహారాజా! రోష మన్నది దుస్త్యజమైన భావం. దానిని నీవు అవలీలగా త్యజించి నాకెంతో ప్రీతి పాత్రుడవైనావు' అని అతనిని ప్రశంసించి, అతని పూజలందుకొని ప్రయాణోన్ముఖుడయ్యాడు.

అప్పుడు పృథువు భగవానుని వెంట వచ్చిన దేవ పితృ గంధర్వ సిద్ధ చారణ పన్నగ కిన్నరాదులను, అప్సరసలను, మర్త్యులను, ఖగ భూతాదులను, పార్షదులను యజ్ఞేశ్వర సత్కార బుద్ధితో సత్కరించాడు. భగవానుడు సోపాధ్యాయుడైన పృథువు చిత్తాన్ని అపహరించి కొనిపోతున్న వానివలె పార్షదాదులతో తన ధామానికి తరలి వెళ్ళాడు. తనకు ఆత్మదర్శనాన్ని ప్రసాదించి నయనపథానికి దూరంగా పయనిస్తున్న ఆ దేవదేవునికి పృథుచక్రవర్తి చేతులు జోడించి నమస్కరించి తన పురానికి బయలుదేరాడు.

## పుర ప్రవేశం

పృథువు ఆ విధంగా యజ్ఞశాల నుంచి పురమధ్యానికి తరలివస్తున్నాడన్న వార్త వెల్లడయినంతనే నగరమంతా పుష్ప మౌక్తిక దుకూల స్వర్ణతోమరాలతో అలంకృతమైంది. చత్వరాలలోనూ రాజవీథులలోనూ చందనోదకాలను చల్లి నెత్తావి ధూపాలు నిలిపారు. ద్వారాలు కదళీ పూగస్తంభ సమాలంకృతాలై నవ్యశోభతో విరాజిల్లాయి. సువాసినులు పుష్పమాలికలను చేత నుంచుకొని పుష్పాక్షతలను, ఫలహరిత యవలాజలను పళ్లెరాలలో నించి బలినీరాజన దీపాలమర్చి అతని రాకకోసం ఎదురుచూస్తున్నారు.

పృథువు పురముఖానికి వచ్చినంతనే అమాత్యులు, బ్రాహ్మణోత్తములు, పౌర జానపద ముఖ్యులు ఎదురేగి అతనిని సత్కరించారు. శంఖనాదాలు, దుందుభి ఘోషలు మారుమ్రోగాయి. బ్రాహ్మణాశీర్వచనాలు మంగళాస్పదంగా వినిపించాయి. రాజవీథి కిటకిటలాడుతున్నది. సౌధోపరితలాల నుంచి మంగళసేసలు వర్షించాయి. హారతులు ప్రజ్వరిల్లాయి.

ఆ విధంగా పృథువు నగరప్రవేశం చేసి పౌరజానపదాదులను యథోచితంగా పలకరించి గృహాభ్యంతరాన్ని చేరుకొన్నాడు. మనస్సును శ్రీమన్నారాయణాంకితం చేసి ప్రజలకై మహోపయోగకర కార్యాలను పెక్కింటిని కావించి, తన పాలనలో ప్రజల కడుపు చల్లగా ధర్మాన్ని పాదుకొల్పాడు. అతని ఆజ్ఞ స్వయంగానే ధర్మవర్తనులై లోకమార్గ ప్రవర్తకులైన బ్రాహ్మణులను, విష్ణుభక్తులను వదిలి తక్కిన ఎల్లెడలా ఎదురులేక సాగింది.

## పృథుని ధర్మశాసనం

విదురా! పృథుచక్రవర్తి కొంతకాలానికి మహాసత్త్రదీక్షను స్వీకరించాడు. అమరులు, బ్రహ్మర్షులు, దేవర్షులు, మహాత్ములందరూ వచ్చి యథావిధిని పూజలందుకొని సుఖాసనాలపై కూర్చొన్నారు. పౌరులు, జానపదులు ఉత్సాహంతో వచ్చి చేరారు.

పృథురాజు తారాగణమధ్యచంద్రుని వలె ప్రసన్నతేజోవిరాజమానుడై ఆ సభామధ్యంలో లేచి నిలబడ్డాడు. జానువులను తాకుతున్న బలిష్ఠమైన బాహువులతో, కెందామరలను పోలిన అందమైన కన్నులతో, పొందికైన నాసికతో, చిరునవ్వు వెన్నెలలను కురిపిస్తున్న ముఖరేఖావికాసంతో, జగద్రక్షాదక్షమైన విశాలవక్షంతో, బృహచ్ఛ్రోణీతలంతో లోకసమ్మోహనకరంగా అలరారుతుండగా, అశ్వత్థపత్ర శోభాయ మాన త్రివళి, ఆవర్తనాభి, కాంచనోరుద్వయం, ఉదగ్రచరణాలు, కంబుకంఠం సహజాలంకృతులై విరాజిల్లుతున్నాయి. నిద్దపు నీలశిరోజాలు రమ్యమైన అతని ముఖ చంద్రబింబానికి మెరుగులు దిద్దుతున్నాయి. వ్రతనియమం వల్ల ఎటువంటి ఆభరణాలనూ ధరింపకపోయినా నైజశోభాసముల్లాసంతో అతని దివ్యరూపం అతిమనోహరంగా విభాసిల్లుతున్నది. జింక చర్మాన్ని కట్టుకొని చేతిలో కుశలు దాల్చి శిశిరస్నిగ్ధ వీక్షలను తమపై ప్రసరింపజేస్తున్న అతనిని చూసి సభాసదులందరూ హర్షోత్కర్షంతో జయజయధ్వానాలు చేశారు.

అప్పుడు పృథువు, 'సభాసదులారా! ముందుగా మీ అందరికీ వందనం. ధర్మజిజ్ఞాసువునై నా మనసులోని మాటను వెల్లడిస్తున్నాను. ఇది ధర్మజ్ఞుడననే దురభిమానంతో మీకు ధర్మప్రవచనం చేయబూనానని నన్ను అపార్థం చేసుకోవద్దు. ప్రజలను యథోచితమార్గాన నడిపించడానికి, వారికి తగిన వృత్తులను కల్పించడానికి, యథాన్యాయ దండనీతిని ప్రయోగించడానికి విధాత నన్ను నియమించాడు. ఆయన ఆజ్ఞను తలదాల్చిన నా అనుష్ఠానక్రమం సర్వసాక్షి అయిన ఈశ్వరునికి పరితోషాన్ని కలిగిస్తుంది గాక. బ్రహ్మవాదులు కామపూరణ లోకాలను చూరగొంటారు గాక!

ప్రజలను ధర్మమార్గంలో నడవడమూ, తదర్థమై రాజులు పన్నులు గ్రహించడమూ ధర్మమని, ఆ విధంగా చేయనినాడు రాజులకు పుణ్యైశ్వర్యాలు నశించడమే గాక వారికి ప్రజల పాపఫలం కూడా సంక్రమిస్తుందని పెద్దలన్నారు. అయ్యలారా! ధర్మతత్త్వం ఈ విధంగా ఉన్నది కనుక మీరందరూ మీ మీ ధర్మాలను నియతంగా పాటించండి. మీరు ధర్మాన్ని ఆచరించడమంటే

నాకు పరలోకార్థపిండదానం చేయడమన్నమాట. మీ ధర్మాలను మీరు పరమేశ్వరార్పణ బుద్ధితో చేస్తున్నట్లు భావించండి. అది నన్ను అనుగ్రహించడం అవుతుంది. పితృదేవతలారా! దేవర్షులారా! ఇందుకు మీరందరూ అనుమోదిస్తారు గాక. కార్యకర్తృఫలం దాని ప్రేరకులకు, తదనుమోదకులకు కలుగుతుంది కదా.

## నిరీశ్వర మతం - ప్రత్యక్షప్రమాణం

కర్మములు కర్తవ్యాలైనప్పటికీ వాటిని వాసుదేవపరం చేయడం సరికాదని, నేను నిరూపించిన మార్గం వేదాలకు సమ్మతం కాదని, కర్మమే ఫలాన్ని ఇస్తున్నదని, కర్మానికి ఫలదాత అంటూ వేరొకడు లేడని వాదించేవారు ఉన్నారు. ఆర్యులారా! అట్టివారు ధర్మవిమోహితులు, శోచనీయులు అని నా ఉద్దేశం. వారి మతాన్ని అనుసరించి పరమేశ్వరుడు లేడన్న మాట. ప్రత్యక్ష ప్రమాణాన్ని మాత్రమే అంగీకరించి వారు ఆ విధంగా వాదిస్తారు. అనుమాన ప్రమాణం వారికి నచ్చదు.

## నిరీశ్వర మతఖండనం - ప్రమాణాంతరాలు

భోగాయతనాలుగా ఉన్న శరీరాలు ఇహపర లోకాలు రెండింటిలోనూ కానవస్తున్నాయి. ఆ శరీరాలు ఒక్క రూపుననే ఉండక చిత్రవిచిత్రాకృతులలో ఉన్నాయి. ఈ చిత్రవిధానానికి కర్త ఒకడు ఉండక తప్పదు కదా? ఇటువంటి విషయ నిర్ణయాల పట్ల వట్టి ఊహలు చాలవు. పెద్దల అనుభవాన్ని బట్టి సిద్ధాంతీకరించాలి. మనువు, ఉత్తానపాదుడు, ధ్రువుడు, ప్రియవ్రతుడు, నా పితామహుడైన అంగరాజు మొదలైన వారి మతమేమిటో చూడండి. ఇక పరమేశ్వరుడు ఉన్నాడని శంకరుడు, బ్రహ్మ, ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి మొదలైనవారందరూ నొక్కి ఏకగ్రీవంగా పలికిన పలుకులను పరిశీలించండి. అంతటి మహానుభావుల ఆప్తవాక్యం ప్రమాణం కాదనగలమా? వేదతాత్పర్యాన్ని పరిశీలించండి. వీటన్నిటినీ త్రోసివేసి కర్మములే ఫలదాయకములని వాదిస్తే ఎలా చెల్లుతుంది?

## కర్మతత్త్వ విచారం

అంతేకాదు. కర్మమన్నది సచేతనం కాదు. జడవస్తువుకు ఫలమిచ్చే శక్తి ఎలా వస్తుంది? కర్మాధి దేవతలు తత్తత్కర్మ ఫలాల నిస్తున్నారని అనుకోవడానికీ వీలులేదు. ఆ దేవతలకు కర్మఫలదాన స్వాతంత్ర్యం ఎక్కడిది? ఉన్నదంటారా? దానిని కూడా విమర్శించి చూద్దాము. కర్మమంటే అది కూడా ఒక ధర్మం. ఆ ధర్మానికి స్వర్గాపవర్గ మోక్షాలు ఫలాలని చెప్పబడుతోంది కదా, ఇందులో ఏయే ఫలానికి ఎవరెవరు అధికారులుగా ఉన్నారు? పైగా ఒకే విధమైన కర్మకు అనేక విధాలుగా ఫలాలు కలుగుతుండటం మనకు తెలిసిందే. ఈ ఫల తారతమ్యానికి కారణం ఏమిటి? ఈ ఫలానికి కారకులుగా చెప్పబడుతున్న దేవత లెవరు? వారూ జీవప్రాయులే కదా? వారూ మోక్షార్థం మరొకరిని ప్రార్థింపవలసినవారే కదా? అందువల్ల వారినీ పరతంత్రులనే అనుకోవాలి. ఈ విషయాలన్నింటినీ సొంతం విచారిస్తే – అన్నిటికీ మూలం ఒకటున్నదని, ఆ మూల వస్తువునే పరమేశ్వరుడంటారని, ఆ పరమేశ్వరునికి ఘటనాఘటన విఘటన రూప సమస్త శక్తులు కలవని, ఆ ఈశ్వరుడే సర్వ కర్మ ఫలదాయకుడని ఏర్పడుతుంది.

ఇదే మన పెద్దల సిద్ధాంతం. సమీచీనమైన ఈ త్రోవను బట్టి మీరందరూ సద్ధర్మపరులై ఫలం పరమేశ్వరార్పణగా మీ మీ కర్మలను ఆచరించండి. ఎవని పాదసేవాభిరుచి జనించినంతనే తత్పాదప్రభవ గంగాజల క్షాళితమైనట్లుగా అశేష జన్మార్జిత బుద్ధిమలం నశిస్తుందో, ఎవని పాదమూలాశ్రయం వైరాగ్య విజ్ఞాన మోక్షదాయకమో, ఎవని పాదాబ్జరసలుబ్ధులకు పునర్జననాదులు కలుగవో ఆ పరమేశ్వరుని ఆరాధించండి.

## భగవదారాధన విధానం

భగవంతుని ఆరాధించే విధానం చెప్పమంటారా? ఆరాధించడం ఎందుకు? భగవత్ప్రీతిని పొందడానికే కదా. ఆ కార్యం మనోవాక్కాయ కర్మలచేత సాధ్యమవుతుంది. ఎలాగంటే, భగవద్గుణాలను చింతించడం మనః కర్మమని, అధ్యయ నాధ్యాపన స్తుతులు కావించడం వాక్కర్మమని, భగవత్సేవాదికం కాయకర్మమని తెలుసుకోవాలి. ఆ కర్మలన్నింటినీ నిష్కపటంగా ఆచరించాలి. భగవానుడు బ్రహ్మాదుల సేవలను మాని మా బోంట్ల సేవకు సంతోషిస్తాడా? అని శంకింపకండి. ఆ దేవదేవుడు అందరికీ సాధ్యుడే. ఫలం మాటేమిటి? అని అడుగుతారేమో. అది అధికారానుగుణంగా ఉంటుంది. కనుక అందరూ భగవంతుని నిష్కామబుద్ధితో భజించాలి.

> భగవానుడు గణరహితుడైనప్పటికీ విశుద్ధ విజ్ఞాన ఘనస్వరూపుడు. నిర్విశేషుడే కాని కర్మామార్గాన నానావిశేష గుణవంతుడు. యజ్ఞోపకరణాలైన వ్రీహ్యాది ద్రవ్యాలు, శుక్లాది గుణాలు, అవఘాతాది క్రియలు, వివిధ మంత్రాలు, యాగోపకరణాలు, సర్వ సంకల్పాలు, పదార్థశక్తి, జ్యోతిష్టోమాదులు సమస్తం భగవద్రూపమే అని గ్రహించాలి. కనుక 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః' అన్నట్లు సర్వయాగాలను, వాటి అంగకల్పనలను భగవద్దృష్టితో చేయాలి. భిన్నదృష్టితో ఎంతమాత్రమూ చేయకూడదు.

ఆర్యులారా! యాగాలు, యజ్ఞాంగాలు మాత్రమే కాదు, యాగఫలం కూడా భగవద్రూపమే. అగ్ని దారుస్థితమై ఉన్నప్పుడు ఆ దారుధర్మమైన దీర్ఘత్వ వక్రత్వాది రూపమైన పరిణాహంతో గోచరించినట్లు భగవానుడు పరమానంద స్వరూపుడై నప్పటికీ అవ్యక్త తత్క్షోభక వాసనా ధర్మజన్యమైన ఈ శరీరాలలో విషయాకారబుద్ధి నొంది తదభివ్యంగ్యానందరూపుడై క్రియాఫలరూపంలో విభాసిస్తాడు. కనుక మీరు భగవానునకు భక్తులై సర్వభావాలలోనూ ఆయననే

భజించండి. యజ్ఞభోజనులకు అధీశ్వరుడు, సర్వలోకేశ్వరుడు అయిన హరిని దృఢవ్రతులై నిరంతరం స్వధర్మ పూర్వకంగా భజించితే మీరు నన్నూ అనుగ్రహించిన వారవుతారు. తితిక్షా తపోవిద్యా తేజోవిరాజమాన వైష్ణవకులంలో పరమసమృద్ధరాజతేజం ఏనాటికీ ప్రవేశింపదు గాక.

బ్రాహ్మణవర్యులారా! మీరే దైవత స్వరూపులని, మీ సేవామహిమ వల్లనే పవిత్ర కీర్తిమూర్తిని అయిన శ్రీదేవి తనకు అనపాయినిగా లభించిందని భగవానుడు స్మరిస్తుంటాడు. మీ సేవ అంటే సర్వాంతర్యామికి చేసే సేవ అన్నమాట. భగవానుడు లోకసంగ్రహార్థం తాను విధించిన ధర్మాల తాత్పర్యాన్ని విశదీకరించడానికి బ్రాహ్మణకులాన్ని పుట్టించాడు. జనులారా! అంతటి మహనీయులైన బ్రాహ్మణుల్ని సేవ మీ కన్నివిధాలా మేలు చేస్తుంది.

నిరంతర బ్రాహ్మణసేవ నిశ్చితం కనుక సర్వదేవతా ముఖభూత వహ్నియందు యజ్ఞాద్యనుష్ఠానాలను మానవలసి వస్తుందని, చిత్తశుద్ధిని, దాని వలన జ్ఞానోదయాన్ని తత్ఫలంగా ముక్తిని సంపాదించే అవకాశం ఉండదని శంకింపవద్దు. బ్రాహ్మణసేవా నిరతులకు ఇవన్నీ స్వతస్సిద్ధంగానే అలవడుతాయి.

మరి అగ్ని కూడా జడపదార్థమే. కనుకనే అగ్ని ముఖంగా వేల్చినంత మాత్రాన భగవానుడు తృప్తిపడటం లేదు. ఆ వేల్చడం భగవదుద్దేశపూర్వకంగా చేసినప్పుడు మాత్రమే ఆ పదార్థం భగవదర్పితమై భగవంతునికి ప్రీతిపాత్ర మవుతున్నది. అగ్ని అన్నది ఒక ద్వారం మాత్రమే. ఆ ద్వారం పరిశుద్ధమైనది కనుక హుతపదార్థం పరిశుద్ధంగా గమ్యస్థానాన్ని చేరుకొంటున్నది. ఈ రహస్యాన్ని తెలుసుకొన్నవారు కనుక తత్త్వవేత్తలు బ్రాహ్మణముఖంగా దేవతోద్దేశంతో అగ్నియందు వేల్చడం జరుగుతున్నది.

## తత్త్వవేత్తల లక్షణం

తత్త్వవేత్తలంటే ఎవరని అడుగుతారేమో? భగవంతుడు సర్వమయచైతన్యమూర్తి అని, సర్వభోగాలు చిత్స్వరూపమందే చేరుతాయని – ఈ రహస్యాన్ని గ్రహించినవారు తత్త్వవేత్తలవుతారు. ఇక బ్రాహ్మణులంటేనో? భగవత్ శ్రద్ధ, తపస్సు, మంగళకరమైన వర్తన, సత్స్వభావం, మౌనం, సంయమ సమాధులు కలిగి నిత్యము, శుద్ధము, సనాతనము అయిన వేదాన్ని భరించేవారు బ్రాహ్మణులు. అట్టి తత్త్వవేత్తల, బ్రాహ్మణుల పాదకమల రజః కణాన్ని నేను నా కిరీటాన యావజ్జీవం వహిస్తాను గాక. బ్రాహ్మణ పాదధూళిని తలదాల్చినవారికి పాపపటలం క్షయించి సర్వశుభోదయమై శ్రద్ధా శీల కృతజ్ఞతలు కలుగుతాయి. అంత పుణ్యానికి నోచినవారిని సర్వసంపదలు తమంత తామే వరిస్తాయి. బ్రాహ్మణకులం నన్నునుగ్రహిస్తుంది గాక; గోవులు నాకు ప్రసన్నమగు గాక; జనార్దనుడు సానుచరుడై నన్ను కరుణించు గాక' అని ప్రసంగించాడు.

## సభాసదుల ప్రతివచనం

విదురా! పృథురాజు మాటలను విని దేవ పితృదేవ బ్రాహ్మణులు జేజేలు పలికారు. ప్రజలు లేచి కేలుమోడ్చి, 'రాజేశ్వరా! పుత్త్రేణ జయతే లోకాన్ అన్న శ్రుతివచనం అక్షరాలా నిజం. పూర్వం హిరణ్యకశిపుడు భగవన్నిందాహేతువు చేత నరకానికి వెళ్ళనుండి ప్రహ్లాదుని ప్రభావం వలన దానిని తప్పించుకొన్నాడంటారు. నేడు నీ తండ్రి వేనుడు తన పాపఫలంగా బ్రహ్మదండనిహతుడై ఉండి నిన్ను కన్న కారణాన కడతేరాడు. నీవు మాకు ప్రభుడ వైనందున మేము కృతార్థులమయ్యాము. నీవు శాశ్వతంగా భూమిని పరిపాలిస్తావు గాక. నీవు నీ సేవకులను అనుశాసించడం చిత్రమేమీ కాదు. మహాత్ములకు ప్రజానురాగం నైజగుణం. మేము కర్మతత్త్వం తెలియని దివాంధులమై ఉండగా నీవు మమ్మల్ని తమస్సాగరం నుంచి దరిజేర్చావు' అని పలికారు.

అప్పుడు సభాస్తారులందరూ లేచి,

**'నమో వివృద్ధసత్త్వాయ**
**పురుషాయ మహీయసే!**
**యో బ్రహ్మక్షత్ర మావిశ్య**
**బిభర్తీదం స్వతేజసా'**

అని ఈశ్వరదృష్టితో పృథురాజుకు నమస్కరించారు.

## సనకాదుల దర్శనం

ఆ వెంటనే నభోమార్గాన ఒక దివ్యతేజోమండలం కానవచ్చింది. సభ్యులు విస్తుపోయి ఆ వంకకు దృష్టిసారించారు. అంతరిక్షం నుంచి సిద్ధపురుషులు నలుగురు సూర్యతేజస్సుతో ప్రకాశిస్తున్నవారు నేలకు దిగివచ్చారు. పృథువప్పుడు నారదాదుల వచనాన్ని స్మరించి, వచ్చినవారు సనకాదులని గ్రహించి, పూజోపకరణాలను తలదాల్చి వారికి ఎదురేగాడు. సదస్యులు అతని వెంట నడిచారు.

పృథువు ఆ మహాత్ములను యథోక్తంగా పూజాదులతో సత్కరించి, వారి పాద ప్రక్షాళన జలాలను శిరస్సున ప్రోక్షించుకొని వారిని సువర్ణపీఠాలపై సుఖాసీనులను చేసి, వైతానికాగ్నుల వలె ప్రకాశిస్తున్న వారికి వినయ వినమితోత్తమాంగుడై ఈ విధంగా విన్నవించాడు–

## పృథురాజు ప్రార్థన

'మంగళమూర్తులారా! మీ దర్శనం యోగులకు కూడా దుర్లభం. అట్టిది నేడు నాకు ప్రాప్తమయింది. ఈ మహాభాగ్యం నేను కావించిన ఏనాటి శుభకర్మలో ఫలించినందువల్ల కలిగినదని భావిస్తాను. శివకేశవులు, బ్రాహ్మణులు, భాగవతులు ఎవరిని అనుగ్రహిస్తారో వారికి ఇహపరాలలో దుర్లభమైనది ఉండజాలదు. భగవానుడు సర్వత్రగుడై నప్పటికీ ఆయన కలరూపును లోకప్రవర్తకులైన మన్వాదులు సైతం కాననేరని చందాన మీరు

సర్వలోక సంచారులైనా జనులు మీ నిజరూపాన్ని సందర్శింపలేరు. ఏ గృహస్థుల ఇండ్లకు మహాత్ములు వచ్చి అర్ఘ్య పాద్యాసన పరిచర్యాత్మార్పణలను స్వీకరిస్తారో ఆ గృహస్థులు ఎంత దరిద్రులైనా ధన్యులవుతారు. భాగవతుల పాదధూళి సోకని గృహాలు, ఆ గృహస్థులు నిఖిలసంపదలు కలిగినా, క్రూరసర్పాలకు ఆలవాలమైన భూరుహాల వలె చేరరానివారై ఉంటారు.

మహాత్ములారా! మీకు స్వాగతం. మీరు బాలురైనప్పటికీ ముముక్షువులై శ్రద్ధతో మహావ్రతాలను అనుష్ఠిస్తారు. ధీరులంటే మీరే ధీరులు. మీరు నడిచిన దారి మావంటివారికి రాజమార్గం. ఇంద్రియార్థమే పరమార్థమని భావించి అందుకు ఎన్నో కర్మలను ఆచరించాము. అది వ్యసనబీజాలను మళ్ళీ విత్తడానికి సేకరించినట్లయింది. ఆ బీజాలను నాటి దరిలేని సంసారసాగరాన్ని కల్పించుకొన్నాము. అందులో నిలువు లోతుకు మునిగి ఉన్నాము. మా బోంట్లకు కుశలం ఏ నాటికైనా కలుగుతుందా?

మహాత్ములారా! అభ్యాగతులను కుశలప్రశ్న పూర్వకంగా ఆదరించడం లోకసంప్రదాయం. ఆ మర్యాదను నేను మీ యెడ పాటించడం లేదు. ఏమంటే శుభాశుభాలు రెండూ కేవల బుద్ధివృత్తులు. ఆ వృత్తులు ఇంద్రియారాముల యెడ వ్యవహరించినట్లు ఆత్మారాముల యందు వ్యవహరించవు. అందుచేత మీ వంటివారిని చూచినప్పుడు అటువంటి ప్రశ్నలకు అవకాశం కలగదు.

ఆత్మారాములారా! దరిలేని ఈ సంసారసాగరంలో మునిగి తారుమారవుతున్న వారికి పారమార్థిక క్షేమం ఏ విధంగా కలుగుతుందో అనుగ్రహించండి. తపోనిష్ఠులు మీకు తెలియని రహస్యం ఉండదు. లోకసుహృదులైన మీరు మా వంటి వారిపై నెనరుంచడం సహజమే. ఇంతెందుకు? భగవానుడు భక్తానుగ్రహార్థం మీ బోటి సిద్ధపురుషుల రూపంలో అవతరిస్తాడు కదా' అని విన్నవించాడు.

విదురా! మితాక్షరాలు, సారవంతాలు, మీదు మిక్కిలి శ్రుతిప్రియాలు అయి అర్థగాంభీర్యం ఉట్టిపడుతున్న ఆ వచనాలు సనకాదులకు ఎంతో ప్రీతి కలిగించాయి. వారు తమ సమ్మతిని దరహాసపూర్వకంగా అభివ్యక్తం చేశారు.

## ఆత్మతత్త్వం

విదురా! పృథువు మాటలను విని సనత్కుమారుడు, 'రాజా! సర్వభూత హితాత్మకుడ వైన నీకు సమస్తం విదితమే. అయినా సాధుమార్గానుసారం అడుగుతున్నావు. సాధువులు ఒకరి నొకరు కలుసుకోవటం వారికి ఎంతో ప్రీతికరంగా ఉంటుంది. సాధుజనులతో సంభాషణ, వారిప్రశ్నలు ఎల్లవారికీ శుభదాయకంగా పరిణమిస్తాయి.

రాజా! మధువైరి పాదారవింద గుణానువాదం నీకు స్వతస్సిద్ధం. భగవద్గుణానువాదం సామాన్యుల అంతఃకరణ కషాయాలనే కరిగిస్తుండగా నీ సంగతి చెప్పేదేమున్నది?

రాజా! పారమార్థిక క్షేమాన్ని పొందే మార్గం తెలిసికొన గోరావు.

## నిర్గుణ బ్రహ్మాభిరతి

రాజా! అన్ని శుభాలకూ చిత్తశుద్ధి మూలమని, శుద్ధచిత్తులకు దేహాదుల మీద మమకారం నశించి వైరాగ్యం జనిస్తుందని, తత్ఫలంగా పరమాత్మ యందు అత్యంత రతి కలుగుతుందని, అదే పరమ మార్గమని శాస్త్రం విమర్శించి నిశ్చయించింది. అట్టి వైరాగ్యపూర్వక నిర్గుణబ్రహ్మాభిరతి దుర్లభమని కొందరు అనవచ్చు. ఆ మాట యుక్తియుక్తం కాదు. పెద్దల అనుభవసిద్ధాన్ని కాదన్నంతనే సత్యం అసత్యం కానేరదు.

## సాధన భేదాలు

ఆ స్థితి అందరికీ ఒక్క రీతిగానే కలుగుతుందా? అని అడగవచ్చు. అన్ని చోట్లా ఏకమూలికా ప్రయోగం ఫలకారి కాదు. అధికారి భేదాన్ని బట్టి

సాధనభేదం ఉంటుంది. ఉత్తమాధికారులకు శ్రవణ మాత్రాన అట్టి స్థితి కలుగుతుంది. ఇతరులకు ఇతర సాధనలు ఉన్నాయి. ఎవరికి ఎటువంటి సాధనం అనుకూలిస్తుందో తెలుసుకొని దానిని అనుష్ఠించి సిద్ధిని పొందాలి.

## సాధన పంచకం

ఆ సాధనాంతరాలను గురించి విను. శ్రద్ధ అన్నది ప్రధానం. శ్రద్ధతో భగవద్ధర్మాలను ఆలకించడం రెండవది. విన్నదానిని ఆచరించడం మూడవది. ఆచరణం వల్ల కలిగిన అనుభవాన్ని ఊతగొని తత్త్వార్థాన్ని విచారించడం నాల్గవది. విచారం వల్ల కొంత నిగ్గు తేలుతుంది. దానియందు చిత్తాన్ని నెలకొల్పి ఉపాసించడం అయిదవది. ఈ అయిదూ సాధన పంచక క్రమం అనబడుతోంది.

## చిత్త నిరోధం

రాజా! నిరంతరోపాసనం అందరికీ సాధ్యం కాదు. మనస్సు అప్పుడప్పుడూ కొంత బహిర్గత మవుతుంటుంది. అట్టి సమయాలలో హరికథా శ్రవణం చేయాలి. అందువల్ల చిత్తం బాహ్యావస్తుగతం కాక భగవంతునందే నిలిచి ఉంటుంది. ఇది ఒక విధమైన ఉపాసనే అని చెప్పాలి.

## సజ్జన గోష్ఠి

రాజా! సత్త్వము, రాజసము, తామసము అని మూడు గుణాల రూపంలో ఆత్మశక్తి వ్యవహరిస్తుంది. తామసులు కేవలం అర్థారాములు; రాజసులు ఇంద్రియారాములు. వారితో కావించే సాంగత్యం అటువంటి చిత్తవిక్షేపాన్నే కలుగజేస్తుంది. సాధకులు అట్టివారి గోష్ఠిని విడిచిపెట్టాలి. అలా కానినాడు ఎప్పుడో ఒకప్పుడు మనస్సు అర్థకామాదుల వంకకు మళ్ళి ముప్పు తెస్తుంది.

## వివిక్త నివాసం

లోకం సామాన్యంగా అర్థకామ జనులతో నిండి ఉంటుంది. వారి సాంగత్యం నుంచి తప్పుకోవాలంటే ఎవ్వరూ లేని వివిక్తదేశాన్ని

ఆశ్రయించాలి. వివిక్తదేశాన్ని ఆశ్రయించినంత మాత్రాననే ఫలం లేదు. చిత్తం ఏకాగ్రమై అర్థకామరహితమై ఉండటమే సర్వోపాసనలకూ తాత్పర్యం కనుక చిత్తాన్ని ఆ విధంగా నిలువరించాలి.

## ఆత్మాలంబనం

చిత్తం నిరాధాంరలో నిలిచేది కాదు కదా. దానికి ఏదైనా ఆధారాన్ని సమకూర్చాలి. అందుకు ఆత్మ ఒకటే తగిన ఆధారం. కనుక వివికదేశాశ్రయులై ఆత్మారములై ఉండాలి. ఒంటరిగా ఉండటం ఎలాగంటావా? హరిగుణామృతాన్ని గ్రోలుతూ తన్మయుడై ఉన్నవారికి వేరొకటి కనబడదు. వారికి ఎక్కడున్నా ఎటువంటి భయమూ కలగదు. దేహభావం ఉన్నప్పుడే భయాదులు కలుగుతాయి.

## అహింస

రాజా! పరమార్థ సాధకులు అహింసావ్రతాన్ని అనుష్ఠించాలి. మనోవాక్కాయాలలో దేనిచేతనూ పరప్రాణికి ఎటువంటి బాధనూ కలిగించకూడదు. దీనికే అహింసావ్రతమని పేరు. అహింసా వ్రతానుష్ఠానానికి శమదమాదులు అత్యంతావశ్యకాలని గుర్తుంచుకోవాలి.

ఈ విధానం పరమహంస చర్యమని గుర్తెరిగి సాధకులు వ్రతనిష్ఠను పాటించాలి.

## ద్వంద్వ సహనాదికం

రాజా! ఉపాసకుడు తనకు నిజంగా ఏది మేలో ఆలోచించుకొని, దానియందు మనసు నిలిపి సాధనను కొనసాగించాలి. ఉపాసనాంతంలో మేలు చేకూరడానికి పాత్రలను బట్టి మార్గాంతరాలు ఉంటాయి. అన్యమార్గాలను నిందింపకూడదు. తన యోగక్షేమమే ప్రధానమనుకొని

ప్రవర్తింపకూడదు. అట్టి ప్రవర్తనలో స్వప్రయోజన దోషం ఉన్నందువల్ల మేలు చేకూరదని తెలుసుకోవాలి.

ఒక పనికి పూనుకొన్నప్పుడు సుఖదుఃఖాది ద్వంద్వాలు తప్పక కలుగుతాయి. వాటిని ఏవగించుకొనక సహించడం నేర్చుకోవాలి. కర్మపూరములైన భగవద్గుణాలను తరచు హరిభక్తుల వలన వింటుండాలి.

ఇలా చేయడంవల్ల చిట్టచివరికి నిర్గుణాభిరతి కలుగుతుంది.

## ఉపదేశం

ఆ విధంగా నిర్గుణాభిరతి కలిగినవారు ఆచార్యోపదేశానికి అర్హులవుతారు. ఆ ఉపదేశఫలంగా వైరాగ్యం తీవ్రతరం అవుతుంది. దానితో విజ్ఞానం ఉదయిస్తుంది. అహంకారం నిర్వాసనం అవుతుంది.

## అహంకార విధాలు

రాజా! అహంకారం పంచమహాభూత ప్రధానమై ఉన్నది. ఆ అహంకారం అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం అనే రూపాలలో వ్యవహరిస్తుంది.

## అహంకార నాశనం

రాజా! అహంకార వ్యవహృతి జీవుని జ్ఞానాన్ని కప్పిపుచ్చుతుంది. ఆ ఆవరణం తొలగితే కాని జీవునికి స్వరూపస్థితి బోధ కలుగదు. అహంకారం సబీజంగా నశించాలి. లేకపోతే అది మళ్ళీ తలయెత్తి కీడు చేయగలదు.

## నిర్వాసనా క్రమం

రాజా! అహంకార సబీజనాశనాన్ని నిర్వాసనం అంటారు. ఆ మహాఫలం భగవద్రతి, గుర్వనుగ్రహం, విజ్ఞానం – ఈ మూడింటి వల్ల కలుగుతుంది.

ఒక్కొక్కప్పుడు అహంకారం తాత్కాలికంగా తల ఒగ్గి ఉండటం కూడా

జరుగుతుంది. అప్పుడు కర్తృత్వం, భోక్తృత్వం, ద్రష్టు దృశ్య భేదాలు ఉంటాయి. అది సోపాధికంగా నశించినప్పుడు అటువంటి కర్తృత్వాది భావాలు ఉండవు. ఆ భావాలు లేనపుడు పురుషునికి బాహ్యప్రపంచం గాని, ఆంతర సుఖదుఃఖాత్మక ప్రపంచం గాని ఏర్పడవు.

రాజా! ఇందుకు నిదర్శనం ఏమంటావా? స్వప్నావస్థలో నీవు, నీ భృత్యులు సేవ్యసేవకరూపంలో గోచరిస్తారు. ఆ స్వప్నం నశించినప్పుడు అందులోని భేదం కూడా నశించి నీ వొక్కడవే శేషిస్తావు కదూ! అన్ని అవస్థలకు అంతఃకరణం ఉపాధిభూతమై ద్రష్టు దృశ్య సంబంధకారణం అవుతున్నది. అంతఃకరణమంటే ఏమిటని అడుగుతావేమో? ప్రారబ్ధ కర్మఫల వాసనల సముచ్చయం అంతఃకరణం. అంతఃకరణవృత్తిని అహంకారం అంటారు. ఆ వృత్తి ఉన్నంత కాలం భేదదృష్టి తొలగదు. జలము, దర్పణం మొదలైనవి సూర్యాదిబింబాలకు ప్రతిబింబ నిమిత్తాలు అవుతున్నాయి. ఆ విధంగా నిమిత్తాలైన ఉపాధులు తొలగినప్పుడు బింబ ప్రతిబింబాలు కానరావడం లేదు కదా. ఇది నిదానంగా పరిశీలిస్తే ఏకము, అద్వితీయము అయిన ఆత్మయందు ఈ భేదప్రతీతికి ఉపాధిగా ఉన్న అంతఃకరణమే కారణమని, ఉపాధి నశించిననాడు భేదభావం నశించి సర్వం ఆత్మరూపం అవుతుందని స్పష్టపడుతుంది.

> రాజా! మోక్షానికి సంగరహితమైన ఆత్మరతి కారణమవుతుందని, అనాత్మరతులకు జనన మరణరూప సంసారం తప్పదని, చెప్పాను కదా. సంసారానికి హేతువేది? అని అడుగుతావేమో, సంగమే కారణం. ఎలాగంటావా? జీవులకు ప్రారబ్ధ భోగ్యఫలానుసారంగా వాసనలు ఉంటాయి. ఆ వాసనలు గుణరూపాన్ని ధరిస్తాయి. గుణాలు ఇంద్రియాల ద్వారా వ్యవహరిస్తాయి. ఇంద్రియాలు బాహ్యపదార్థాల వలన ఆకర్షింపబడతాయి.

విషయాకర్షణల మూలాన మనస్సు ఆయా పదార్థాల వంకకు మళ్ళుతున్నది. మనస్సు మళ్ళీ బుద్ధియొక్క విచారశక్తిని ఆకర్షిస్తుంది. దానివల్ల స్మృతికి అవరోధం కలుగుతుంది. స్మృతి అంటే పూర్వాపరాలు రెండింటినీ కూర్చే శక్తి. స్మృతి చెడినప్పుడు జ్ఞానభ్రంశం కలుగుతున్నది. జ్ఞానభ్రంశాన్నే ఆత్మనాశం అంటారు.

ఆత్మనాశం అంటే ఆత్మ నశించటం అని కాదు. ఆత్మ నిత్యం కనుక దానికి నాశం ఎన్నడూ కలుగదు. ఆత్మ ఒకటి ఉన్నదని, అది దాని ఉనికి ఇటువంటిదని గ్రహించే శక్తి కూడా లేనినాడు ఆత్మ ఉన్నా లేనిదే అవుతుందని తాత్పర్యం. ఆ నిరంజన స్థితిని ఆత్మనాశం అంటారు.

ఆత్మనాశం వల్ల దోషమేమిటంటే, ఏ వస్తువు నీకు నిజంగా ప్రియతమమైనదో, దాని కంటె అన్యతమ వస్తువులు నీకు నచ్చేవిగా ఉంటాయి. ఇది స్వార్థాన్ని కోల్పోయి పరార్థానికి ప్రాకులాడటం అన్నమాట.

మనుష్యులకు, స్థావరాలకు భేదం దేనిలో ఉన్నది? నిజంగా ఆలోచిస్తే జ్ఞాన భేదం తప్ప వేరొక భేదం లేదు. అట్టి జ్ఞానం విషయేంద్రియార్థాల అభిధ్యానం వల్ల భ్రంశమైనప్పుడు సర్వార్థనాశం జరిగి స్థావరతుల్యత్వం కలుగుతున్నది. కనుక ధర్మార్థకామమోక్షాలకు విఘాతకారణం సంగమేనని, మోక్షార్థులు సంగభావాన్ని ప్రయత్నం చేసి మరీ త్యజించాలని స్పష్టపడుతున్నది. ఆత్మనాశం వల్ల అటువంటి జ్ఞానానికి అవకాశం పోతున్నది.

రాజా! ధర్మార్థకామమోక్షాలను పురుషార్థాలు అంటున్నాము గాని వాస్తవ దృష్టికి మోక్షం ఒక్కటే పురుషార్థం. ఏమంటావా? ధర్మార్థకామాలు మూడింటికీ కాలభయం – అంటే కాలగ్రస్తములై నశించటం అన్నది ఉన్నది. అందువల్ల అవి నిత్యములు కావు; మోక్షం ఒక్కటే నిత్యం. ఏది నిత్యమో అదే పరమ పురుషార్థం.

రాజా! బ్రహ్మాదులు పరులని, తదితరులు అపరులని సంకేతం ఉన్నది. వారికి గల భేదం ఏమంటే గుణక్షోభానికి ముందు జనించి వారు పరులు. గుణక్షోభానంతరం జనించినవారు అపరులు. ఈ ఇద్దరూ కాలానికి లోబడి నశించేవారే కాని శాశ్వతికులు కారు. మోక్షాభిరతి కూడా పదార్థరతి వంటిదే అయితే, అట్టి రతులలో ఒకటి శుభార్థహేతువు, రెండవది అనర్థహేతువు అనడం ఎట్లా జరిగిందని సందేహం కలుగుతుంది. నిజానికి మేలును కోరినవారందరూ ఏదో ఒక పదార్థాన్ని ఆశ్రయించి ఆ మేలును పొందాలనుకొంటారు. పదార్థం దోషవంతమైతే దాని దోషం ఆశ్రయించిన వారికి కలుగుతున్నది. ఈ రహస్యాన్ని గ్రహించి యుక్తాయుక్తాలు పరిశీలించి యుక్తాన్ని మాత్రమే ఆశ్రయించాలి.

అయితే – ఇది నిత్యం, ఇది అనిత్యం అన్న జ్ఞానం ఎలా కలుగుతున్నది? ఏది దేహము, ఇంద్రియాలు, ప్రాణము, బుద్ధి, అహంకారాల వలన కప్పబడి రూపుదాల్చుతున్నదో అది అనిత్యం. తద్భిన్నమైనది నిత్యం. ఆ నిత్యపదార్థం సమస్తరూపాలలో అంతర్యామియై సాక్షిగా ప్రకాశిస్తుంటుంది. దానిని ఆత్మ అంటారు. 'నీవు' అన్నప్పుడు నీ స్థూలరూపం కాదు. ఆ రూపంలో ఉన్న ఆత్మ అని గ్రహించు. ఆ ఆత్మను గూర్చి అనుసంధానం కావించు, అది నీకు గోచరిస్తుంది.

నీలో ఉన్నది జీవుడే కాని వేరొకటి లేదంటావేమో? జీవుడు అంటే ఎవరు? ఆత్మ వస్తువు దేహాదిపరివృతమై పారతంత్ర్యాన్ని పొందినపుడు జీవుడు అంటున్నాము. పారతంత్ర్య రూపమైన జీవత్వం నశించినప్పుడు ఆ జీవుడే ఆత్మ అవుతాడు. ఈ పారతంత్ర్యం ఎక్కడినుంచి వచ్చింది? అంటే భ్రాంతి వల్ల కలిగింది. భ్రాంతి తొలగే ఉపాయం ఏమిటి? అని అడగవచ్చు. ఈ విశ్వమంతా సదసద్వస్తువులతో నిండి కార్యకారణాత్మకమై కనిపిస్తున్నది కదా? ఇది వాస్తవస్వరూపం విశ్వప్రతీతి

కలుగుతున్నది. ఈ ప్రతీతికి కారణం ఏమిటి? మాయ ఒక్కటే కారణం. మాయ ఎలా తొలగుతుంది? వివేకోదయం కలిగినప్పుడు మాయ తొలగుతుంది. అప్పుడు కర్మకళంకరహితమై నిత్యముక్తి పరిశుద్ధ విబుద్ధమైన తత్త్వం ప్రత్యక్షమవుతుంది.

## జ్ఞానోదయానికి సాధనం

ఈ జ్ఞానోదయం కలగాలంటే భక్తి తప్ప వేరొక సాధనం లేదు. ఇందులో ఉన్న రహస్యమేమిటంటే జ్ఞానోదయం అనగా పూర్వం లేని జ్ఞానం కొత్తగా వస్తుందని కాదు. జ్ఞానము నిత్యము, సత్యము అయినట్టిది. దానిని అహంకార మమకారాదులు ఆవరించి ఉంటాయి. ఆ కారణాన జ్ఞానము కప్పబడి మేఘావృత సూర్యుని వలె ప్రకాశం లేనిదవుతుంది. ఆవరణం తొలగినంతనే అది యథారూపమై ప్రకాశిస్తుంది. ఆ ఆవరణం తొలగడానికి భక్తి ఒక్కటే పరమసాధనం.

## భక్తి విధానం

భక్తికి ఆలంబన కావాలి. భగవంతుని సాకారరూపం అందుకు మహోత్తమమైన ఆలంబనం. మోక్షసాధకులు ఓంప్రథమంగా భగవత్సాకార రూపాన్ని భావించి, మనస్సును ఆయన పాదపద్మాలపై నిలిపి చిరభక్తి చేత జ్ఞానులౌతారు.

యతుల సంగతి ఏమంటావా? వారు యమాదులను ఆశ్రయించి ఇంద్రియనిగ్రహాన్ని సాధించి అమనస్కులవుతారు. అయితే వారు భక్తియోగులైన సాధువుల స్థితిని అందుకోలేరు.

ఎందుకంటే అహంకారమనే హృదయగ్రంథి ఉన్నది. అది కర్మాశయమై ఉంటుంది.

యమ నియమాదులన్నీ కర్మ రూపాలు. కర్మములు జరుగుతున్నంత కాలం అహంభావం అంతో ఇంతో ఉండక

తప్పదు. ఆ భావం నశించితే కాని జ్ఞానం యథావిధిని నిరాతంకంగా ప్రకాశించదు.

అహంభావం భక్తి వలన తప్ప వేరొక తీరున సంపూర్ణంగా నశించటం సాధ్యం కాదు. ఎందుకంటావా? భక్తికి శరణాగతి లక్షణం. శరణిల్లినప్పుడు 'నీవే గతి' అన్న భావ మొక్కటే ఉంటుంది. 'నేను' అనే భావానికి చోటుండదు.

కనుకనే భక్తివల్ల అహంభావం (నేను అనే భావం) నశిస్తుందని అన్నాను.

రాజా! సంసారం ఒక మహాసముద్రం. అది అరిషడ్వర్గమనే పెను మొసళ్ళగుంపుతో నిండి ఉన్నది. ఆ మొసళ్ళను తప్పించుకొని సంసార సాగరాన్ని ఈదడం మహాకష్టం. భగవత్పాదమనే నావ నెక్కితే మొసళ్ళకు చిక్కక సులభంగా సంసారార్ణవాన్ని దాటవచ్చు. కనుక భగవత్పాదాన్ని నావగా గ్రహించి భక్తి అనే కర్ణధారిని ఆశ్రయించి దుస్తరమైన సంసార సాగరాన్ని తరించాలి'

అని బోధించాడు.

## గురుదక్షిణ

విదురా! పృథుచక్రవర్తి ఆ బోధలన్నింటినీ విని, 'బ్రహ్మవిద్వరేణ్యా! మీ దర్శన భాగ్యాన్ని ఆర్తత్రాణపరాయణుడైన భగవానుడు పూర్వం నాకు అనుగ్రహించాడు. ఆ అనుగ్రహాన్ని కొనసాగించడానికే మీరిప్పుడు దయచేసి నాకు బోధితవ్యాన్ని బోధపరిచి మీ పరమకారుణిక స్వభావాన్ని సుప్రకటితం చేశారు. మీకు గురుదక్షిణగా ఏమి సమర్పింపగలనో నా ఊహ కందడంలేదు. రాజ్యాదులను ఇద్దామంటే అవి మీకు మీ భుక్తావశేషాలు. నా దేహాన్ని సమర్పించు కొందామంటే దేహాభిమానాన్ని సమగ్రంగా త్యజించిన మీరు ఈ భౌతిక పదార్థాలను ఆదరింపరు.

మహాత్ములారా! బ్రాహ్మణుడు కేవలం క్షున్నివారణార్థం భుజిస్తాడే గాని జిహ్వాచాపల్యార్థం తినడు; దేహాన్ని కప్పుకొనేందుకు ఏదో ఒక గుడ్డను కట్టుకొంటాడే కాని అలంకరణార్థం ధరింపడు; తన సొమ్మును ధారపోస్తాడే తప్ప పరుల సొమ్మును ఆశింపడు. అందువల్ల సర్వం బ్రాహ్మణాధీనమై ఉన్నది. క్షత్రియాదులు బ్రాహ్మణానుగ్రహాన్ని పొంది అన్నాదులను స్వీకరిస్తారు. వారికి సత్త్వశుద్ధి లేనందున స్వతంత్రులు కారు. మీరు నాకు అనుగ్రహించిన పరమోపకారానికి నా కృతజ్ఞతను ఏ విధంగా తెలియజేయాలో నాకు తెలియదు. రాజ్య బల కోశాత్మక భూమండలాన్ని దారపుత్రగృహాదులను నా ప్రాణాలను మీకు సమర్పిస్తాను. వాటితో మాకు పనేమిటని అంటారా? మీ కొరకు మీరు వాటిని స్వీకరించడం లేదు. ధర్మసంస్థాపనార్థం స్వీకరించాలి. ఏమంటే, ధర్మం వేదబద్ధమై ఉన్నది. వేదశాస్త్రజ్ఞులు రాజ్యాధిపత్యానికే కాక సర్వలోకాధిపత్యానికి కూడా తగినవారు. ఇవన్నీ మీకు అంగీకారయోగ్యం కాకపోతే మీరొనర్చిన దీనోద్ధరణ కార్యంచేతనే మీరు సంతోషిస్తారు గాక. మీకు ప్రతికృతి కావింపదలచినవాడు. వినోదపాత్రు డవుతాడు. నా అంజలి ఒక్కటే మీకు ప్రతికృతి' అని సాష్టాంగప్రణామం చేశాడు. సనకాదులు రాజు శీలానికి మెచ్చి గగనమార్గం పట్టారు.

## పృథుని యోగనిష్ఠ

విదురా! పృథుచక్రవర్తి సనత్కుమారుని ఉపదేశం ప్రకారం అధ్యాత్మశిక్షకు లోనై చిత్తాన్ని ఏకాగ్రపరచి తత్త్వవిచారం కావించి సత్యం గ్రహించి తదేక నిష్ఠుడై ప్రాప్తకాముడ నైనానని భావించాడు. ఋషిజనుల ఆదేశాన్ని తలదాల్చి కాలానుగుణంగా స్వశక్తి స్వధనాలను బట్టి కర్మములను బ్రహ్మార్పణగా చేయసాగాడు. తత్ఫలంగా అతనికి నిస్సంగత్వం సిద్ధించింది. దానితో బుద్ధి సమాహితమయింది. భగవంతుడు సర్వకర్మాధ్యక్షుడని; ప్రకృతికి పరుడు, సాక్షిమాత్రుడు అయినవాడని; భగవత్సాన్నిధ్య బలంతో ప్రకృతి

నానారూపాలను ధరిస్తూ తత్తదుచితకర్మలను కావిస్తున్నదని అతనికి స్వానుభవసిద్ధమై గోచరించింది. పృథుచక్రవర్తి ఆ రహస్యాన్ని ఊతగొని గృహస్థు డయినప్పటికీ, సామ్రాజ్యాధిపత్యాన్ని అనుభవిస్తున్న రాజయినప్పటికీ, సూర్యుడు జలదర్పణాదులలో ప్రతిబింబించినా అందులోని మలినాదులకు దూరంగా ఉంటున్నట్లు ఇంద్రియార్థాలలో సక్తుడు గాక నిరహంకారుడై స్వధర్మాన్ని ఆచరింపసాగాడు.

## పృథుచక్రవర్తి పరిపాలనాదికం

పృథురాజు భార్య పేరు అర్చిస్సు. వారికి విజితాశ్వుడు, ధూమ్రకేశుడు, హర్యశ్వుడు, ద్రవిణుడు, నృకులుడు అని ఐదుగురు కొడుకులు కలిగి లోకపాలక గుణసంపన్నులై విలసిల్లారు. అతను ధర్మనిష్ఠుడై సూర్యుడు ఎండగాచి రసాలను పీల్చి సమయం వచ్చినపుడు ఆ రసాలను లోకానికి వర్షిస్తున్నట్లు ప్రజల నుంచి పన్నులను స్వీకరించి ఆ అర్థాన్ని అవసరానుసారం వారికే వినియోగిస్తూ అగ్నివలె తేజోదుర్ధర్షుడు, మహేంద్రుని పోలిన దుర్జయుడు, భూదేవి వంటి సహనశీలి, కల్పవృక్షం వలె సర్వాభీష్టదాయకుడు, పర్జన్యుని తీరున కామవృష్టికరుడు అయి, గాంభీర్యంలో సముద్రుని, స్థిరత్వమందు మేరుగిరిని, శాసనవిధానంలో ధర్ముని, ఐశ్వర్యంలో పురందరుని, కోశాధ్యక్షత యందు కుబేరుని, అర్థగుప్తి యందు వరుణుని తలపింపజేస్తూ వాయువు వలె ఓజోబలశాలియై, రుద్రుని వలె అవిషహ్యుడై వెలుగొంది సౌందర్యంతో కందర్పుని స్మరింపజేస్తూ మృగేంద్ర ధైర్యం కలిగి, జనవాత్సల్య ప్రకటనలో మనువుకు సాటివాడై, ప్రభుత్వంలో బ్రహ్మదేవునికి, బ్రహ్మవాదంలో బృహస్పతికి దీటై, జితేంద్రియుడై, గోవులు గురువులు విప్రులు వైష్ణవుల యెడ నిరాడంబర నిర్మల శ్రద్ధాభక్తులను నెరపుతూ హ్రీ వినయశీలాలచే నిరుపమానుడై, పదార్థ సంపాదన తత్పరతను ఉపేక్షింపక లోకాభివంద్యచరిత్రుడై అలరారాడు. అతని కీర్తి రఘురాముని కీర్తి వలె ముల్లోకాలలోనూ అభివ్యాపించింది.

## వానప్రస్థం

ఆ విధంగా పృథురాజు భగవదాజ్ఞ ప్రకారం తన జన్మసాఫల్య సిద్ధికరంగా అనేక సంవత్సరాలు ధర్మపరిపాలనాదిక స్వధర్మాన్ని కొనసాగించి పుత్రికా వాత్సల్యంతో పరిపాలిస్తుండిన భూమిని పుత్రులకు అప్పగించి తపోవనానికి బయలుదేరాడు. జనులు పితృవియోగాన్ని సహించలేని పసిపిల్లల వలె విలపిస్తూ వద్దు వద్దని అడ్డుపడ్డారు. ఎట్ట కేలకు వారిని సమాధానపరచి అతను రాజ్యాన్ని వదిలి తపోవనం చేరుకొన్నాడు. అర్చిస్సు కూడా అతని వెంటనడిచింది.

## పృథుని యోగసిద్ధి

పృథువంతట వానప్రస్థోచితమైన కఠినవ్రతాన్ని పూని యోగస్థితుడై కందమూల ఫలాహారాలతో కొంతకాలం, తృణపర్ణాశనుడై కొంతకాలం, జలాహారుడై కొంత కాలం, చివరకి వాయుభక్షుడై కొంతకాలం శరీరధారణ కావిస్తూ, ఎండకాలంలో పంచాగ్ని మధ్యంలోనూ, చలికాలంలో కుత్తుకబంటి నీటిలోనూ నిలిచి మౌనదీక్ష వహించి కటికనేలపై పడుకొని శమదమాదినిష్ణాత, ఊర్ధ్వరేతస్కుడు అయి భగవానుని ఆరాధించాడు.

అతని తపస్సు ఫలించింది. అతను జ్ఞానాగ్నిదగ్ధుడయ్యాడు; వాసనలన్నీ నశించాయి; ఆశయం నిర్మలమైంది; అరిషడ్వర్గం అంతరించింది.

## జ్ఞానవిరతి

ఆ విధంగా సనత్కుమారుని ఉపదేశానుసారం వర్తించి అధ్యాత్మయోగంతో పురుషోత్తముని ఆరాధించి పృథురాజు ఏకాంతభక్తిని పొందాడు. దానితో చిత్తశుద్ధి, వైరాగ్యం, జ్ఞానమూ సిద్ధించాయి. ఆ జ్ఞానఖడ్గం దుర్ఘటమైన అహంకారాన్ని ఖండించింది. దాని జీవకోశం విచ్ఛిన్నమైపోయింది. దానితో దేహాత్మబుద్ధి నశించింది; ఆత్మగతి కలిగింది.

అంతట పృథురాజు జ్ఞానం చేత సాధ్యాన్ని సాధించి, గుచ్చుకొన్న ముల్లును వేరొక ముల్లుతో తీసి రెండింటిని పారవేసినట్లు జ్ఞానాన్ని కూడా వదిలి విరతుడైనాడు.

## పృథురాజు ముక్తి

విదురా! యోగగతులన్నవి చిత్తైకాగ్ర్య సంపాదనకు మాత్రమే ఉపకరిస్తాయి. ఆ తర్వాత వాటివల్ల సాధింపదగిన ఫలం ఉందనే చెప్పాలి. చిత్తైకాగ్ర్యమంటే భగవద్రతి నిశ్చలం కావడానికి సాధనమన్నమాట. అట్టి రతి భగవత్కథా శ్రవణాదుల వల్ల కలుగుతుంది. ఆ రతి ఎంత గాఢమైతే పరమాత్మానుసంధానం అంత తీవ్రం అవుతుంది. పృథురాజు ఆ విధంగా పరమాత్మానుసంధానుడై దేహత్యాగం సంకల్పించి ముక్తాసనుడయ్యాడు.

## ముక్తాసన క్రమం

మూలాధారాన్ని గుల్ఫముల చేత బిగించి మూలాధారం లోని వాయువును లేపి నాభిస్థానానికి చేర్చి అక్కడినుంచి ఆ వాయువును క్రమక్రమంగా ఉదరస్థాన హృదయస్థాన కంఠస్థాన భ్రూమధ్యదేశాలను దాటించి బ్రహ్మరంధ్రం లోనికి ప్రవేశపెడతారు. అప్పుడు యోగికి స్పృహ తప్పుతుంది. అతని ప్రాణవాయువు బాహ్య వాయువును, అతని తేజస్సు బాహ్యతేజస్సును, శరీరం క్షితిని, ఇంద్రియచ్ఛిద్రాలు ఆకాశాన్ని, అందలి ద్రవాంశం నీటిని చేరి లయిస్తాయి. దీని అర్థమేమిటంటే శరీరం పంచభూతాంశ సమ్మేళనం వల్ల ఏర్పడుతున్నది. శరీరంగా ఏర్పడిన పంచభూతాంశను విడివడి తమ తమ మూలభూతాలతో చేరుతున్నాయని దీని అర్థం. ఈ విధానాన్ని మహాభూతజయం అంటారు. దీనివల్ల అద్వితీయాత్మ ప్రతిపత్తి కలుగుతుంది.

## అహంకార లయం

విదురా! అహంకారం గుణత్రయాన్ని బట్టి మూడు విధాలుగా వ్యవహరిస్తుంది. అందులో తామసాహంకార వ్యవహారం స్థూలంగా,

రాజసికాహంకార వ్యవహారం సూక్ష్మంగా, సాత్త్వికాహంకార వ్యవహారం సూక్ష్మతరంగా ఉంటాయి.

ఈ వ్యవహారమంతా పంచతత్త్వాలను ఆశ్రయించి ఉంటుంది. అందువల్ల ఒక్కొక్క రూపున ఉన్న అహంకార కార్యాన్నీ అణచివేయాలంటే ఆ అహంకారానికి సంబంధించిన పంచతత్త్వాలను ఉపసంహరించాలి. అందులో మొట్టమొదట తామసాహంకారాన్ని నశింపజేయాలి. ఆ అహంకారాన్ని తత్సంబంధములైన పృథ్వీ జల తేజో వాయ్వాకాశతత్త్వాలలో క్రమక్రమంగా లయింపజేయాలి. అప్పుడు తామసికాహంకార కార్యాలు నశిస్తాయి. రాజసాహంకారాన్ని, దాని తర్వాత సాత్త్వికాహంకారాన్ని అలాగే లయింపజేయాలి.

## జీవుని స్వరూపస్థితి

విదురా! మనస్సు అంటే అంపచీకృత పంచతన్మాత్రల కార్యం. ఆ మనస్సును ఇంద్రియాల లోను, ఇంద్రియాలను తదుత్పత్తి స్థానములైన తన్మాత్రల లోను లయింపజేయాలి. అప్పుడు నభస్సును, ఇంద్రియాలను వేరు చేసి భూతాది అయిన అహంకారంతో చేర్చాలి. తరువాత ఆ అహంకారాన్ని మహత్తత్త్వంలో లయింపజేయాలి.

మహత్తత్త్వం సర్వగుణ కార్యాలకూ హేతువు. దానిని మాయోపాధి ప్రధానుడైన జీవుని యందు లయింపజేయాలి. అప్పుడు జీవుని మాయోపాధి నశిస్తుంది; జీవుడు బ్రహ్మభూతు డవుతాడు; అంటే, స్వరూపస్థితిని చూరగొంటాడు.

విదురా! జీవుడంటే వాస్తవానికి బ్రహ్మమే. కాని ఆవరణలు కర్మాధీనత వల్ల అతనిని చుట్టుకొని దేహమే తానన్న భ్రాంతికి లోనవుతున్నాడు. జీవుని ఆవరించి ఉన్న తెరలన్నీ తొలగినప్పుడు అతనికి స్వరూపస్థితి కలుగుతుంది. పృథురాజు ఆ విధంగా చేసి జ్ఞాన వైరాగ్య బలంతో బ్రహ్మానుసంధానం కావించి స్వరూప స్థితిని పొందాడు.

# పృథుపత్ని శోకం

పృథురాజుతో కలిసి అరణ్యానికేగిన అర్చిస్సు వనవాసక్లేశాన్ని లెక్కచేయక భర్తృవ్రత ధర్మాన్ని అనుష్ఠిస్తూ, పతికి శుశ్రూషలు కావిస్తూ ఋషియోగ్యములైన కందమూలాదులతో దేహధారణ చేయసాగింది. అనతి కాలంలోనే ఆమె శరీరం ఎంతో కృశించింది. అయినా భర్తృ కర స్పర్శ సమ్మానసుఖం ఆమె శారీరక మానసిక వేదనలను మరపింపజేసింది. ఆమెకు భర్తృ సన్నిధానమే పరమసౌఖ్యమై భాసించింది.

పృథురాజు ప్రాణం విడిచినంతనే ఆమెకు దుఃఖం మితిమీరింది. ఓదార్చేవా రెవరూ లేకపోయారు. అతిప్రయత్నం మీద శోకాన్ని దిగమ్రింగి లేని సత్తువను తెచ్చుకొని నదీస్నానం చేసి శుచిర్భూతురాలై పతికి ఉదకదానాలు సమర్పించి అంతరిక్షస్థులై ఉన్న దేవతలకు నమస్కరించి అగ్నికి ముమ్మారు ప్రదక్షిణలు కావించి పతి పాదైకధ్యానచిత్తంతో వివశురాలై ప్రాణత్యాగం చేసింది.

పృథురాజపత్ని పరమ పాతివ్రత్యాన్ని తిలకించి దేవతలు ఆశ్చర్య సంతోషాలను పొందారు. దేవతూర్యాలు మంగళధ్వనులు దిగంతాలలో మారుమ్రోగాయి. అమరస్త్రీలు ఆమెపై కుసుమవర్షం కురిపించి, 'లక్ష్మీకుమారి శ్రీ మురళీధరుని భర్తగా నోచుకొన్నట్లు ఈ పతివ్రతామణి పృథువును పతిగా పొంది ధన్యురాలయింది. ఈమెకు భర్తృ సహితంగా పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది గాక. నరులకు ఆయుష్కాలం అతిస్వల్పం. అదీ చంచలాతిచంచలం. అయినప్పటికీ వారు భగవత్పదాన్ని సాధింపగలిగారు. ఇక వారికి దుర్లభమన్నది ఏమున్నది? మోక్షసాధనకు మనుష్యజన్మ వంటి ఉత్తమ సాధనం మరొకటి లేదు' అని వేనోళ్ల ప్రశంసించి, 'ఔరా! అంతటి ఉత్తమ జన్మకు నోచుకొన్నవారు విషయలౌల్యానికి లోనై ఆత్మద్రోహానికి పాల్పడుతున్నారు. వీరికంటె వంచితులుంటారా?' అని ఆశ్చర్యపోయారు. పృథువు ధర్మపత్నీసమేతంగా విష్ణులోకానికి వెళ్లాడు.

## పృథుచరిత్ర మాహాత్మ్యం

విదురా! మహాప్రభావుడైన పృథు చక్రవర్తి చరిత్రను భక్తి శ్రద్ధలతో చదివినా విన్నా పృథువుకు కలిగిన ఉత్తమలోక గతులు కలుగుతాయి. బ్రాహ్మణులు బ్రహ్మవర్చస్సంపన్నులు, క్షత్రియులు రాజ్యాధిపతులు, వైశ్యులు పశ్వాది సమృద్ధులు, శూద్రులు ఉత్తములు అవుతారు. స్త్రీ పురుషులలో ఈ ఉత్తమశ్లోకుని పుణ్యచరిత్రను భక్త్యాదరాలతో మూడు సార్లు వింటే సంతానహీనులకు ఉత్తమ సంతానం కలుగుతుంది. నిర్ధనులు ధనాఢ్యులు, అస్పష్టకీర్తిమంతులు యశోవిశాలురు, మూఢజనులు పండితులు అవుతారు.

ఈ చరిత్ర ధన్యము, యశస్యము, ఆయుర్వర్ధనము, స్వర్గప్రదము, కలిమల హరణము అయిన పుణ్యచరిత్ర. ధర్మార్థకామమోక్షాలను కోరినవారు అభీష్టసిద్ధిని ప్రసాదించే ఈ దివ్యకథానకాన్ని పరమ శ్రద్ధావంతులై ఆకర్ణించి, కాంక్షావ్యాప్తిని పొందగలరు. ఈ చరిత్రను విని యుద్ధాభిముఖుడైన రాజుకు శత్రువులు తమంత తాముగా వచ్చి పృథురాజుకు ఇచ్చినట్లు కప్పాలను తెచ్చి సమర్పిస్తారు. శత్రుసంహార శ్రమ కలగదు. సంగరహితుడై భగవంతుని యెడ నిర్మలభక్తి నిలిపి ఈ ఉపాఖ్యానాన్ని ప్రతినిత్యం చదివినా, విన్నా నిశ్చలభక్తి కలిగి భవార్ణవాన్ని తరించి దివ్యపదం చేరి పార్థవీగతిని పొందుతారు.

## పృథువంశం

పృథువు తర్వాత అతని కుమారుడు విజితాశ్వుడు సార్వభౌముడై తన తమ్ములలో హర్యశ్వునికి ప్రాగ్దేశాన్ని, ధూమకేశునికి దక్షిణ దిగ్భాగాన్ని, వృకునికి పశ్చిమ దేశాన్ని, ద్రవిణునికి ఉత్తర దేశాన్ని పంచియిచ్చి ఆయా దేశాలకు వారిని రాజులుగా చేసి భ్రాతృవాత్సల్యం చూపి రాజాధిరాజన్న పేరు గడించాడు.

విజితాశ్వుడు పృథుని యజ్ఞకాలంలో ఇంద్రుని తరిమి, అశ్వాన్ని గైకొని అతనిని సంహరింపక విడిచిపెట్టినందుకు కృతజ్ఞతగా అమరేశ్వరుడు అతనికి

అంతర్ధాన శక్తిని ప్రసాదించాడు. అది మొదలు విజితాశ్వునికి అంతర్ధానుడనే ప్రసిద్ధి కలిగింది.

## విజితాశ్వుని సంతానం

పూర్వం పావకుడు, పవమానుడు, శుచి వసిష్ఠశాపహతులై మనుష్యజన్మ నెత్తవలసి వచ్చింది. వారు ముగ్గురూ విజితాశ్వునికి శిఖండిని యందు జన్మించి శాపవిముక్తులై పూర్వస్థితిని పొందారు.

విజితాశ్వునికి నభస్వతి అని మరొక భార్య ఉన్నది. వారికి హవిర్ధానుడు జన్మించాడు.

## విజితాశ్వుని రాజ్యపరిత్యాగం

విదురా! రాజులు ఎంత మంచివారైనా ప్రజల వృత్తిని బట్టి పన్నులు గ్రహించడం, తప్పులకు తగిన దండన నిచ్చి శుల్కం విధించడం తప్పనిసరి అవుతుంది. ఈ పనులు రాజధర్మాలని సరిపెట్టుకొన్నా వాటిని కొనసాగించడంలో అంతో ఇంతో దారుణం చేయక తప్పదు. ఆ విధంగా రాచరికాన్ని నిలబెట్టుకోవడానికి పరులను పీడించడం విజితాశ్వునికి బాధాకరంగా ఉండేది. అతను ఆ పనులు చేయలేక దీర్ఘసత్ర యాగం సంకల్పించి, ఆ నెపంతో రాజ్యాన్ని త్యజించి సమాధినిష్ఠుడై భగవానుని ఆరాధించి పరమపదాన్ని పొందాడు.

## హవిర్ధానుని సంతానం

హవిర్ధానుని భార్యపేరు హవిర్ధాని. ఆ దంపతులకు ఆరుగురు కొడుకులు – బర్హిష్మదుడు, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు జన్మించారు. అందులో బర్హిష్మదుడు కర్మతంత్రాన్ని, ప్రాణాయామాది యోగాలను ఆసాంతం నేర్చుకొని లెక్కలేనన్ని యజ్ఞాలు చేశాడు. అతను

ఒకదాని తర్వాత మరొకటిగా యజ్ఞశాలలను నిర్మించుకొంటూ పోవడం వల్ల కొంత కాలానికి ధరాతలమంతా యజ్ఞభూమిగా విలసిల్లింది. అతను యజ్ఞకార్యాలలో భూతజాతాన్ని ప్రాచీనాగ్రబర్హిస్సులతో నింపినందు వల్ల అతనికి ప్రాచీనబర్హి అని పేరు వచ్చింది.

## ప్రాచీనబర్హి సంతానం

విదురా! పూర్వం ఒకప్పుడు సప్తర్షులు సత్రయాగం కావించారు. ఆ యజ్ఞకాలంలో అగ్నిదేవుడు ఋషిపత్నులను చూసి కామవశుడయ్యాడు. తన భర్త మనస్సులో మొలకెత్తిన కోరికను స్వాహాదేవి గ్రహించి, భర్తృవ్యతిక్రమాన్ని తప్పింప దలచి తానే సప్తర్షిభార్యల రూపంలో అగ్నిదేవుని చెంతకు వెళ్ళింది. అగ్ని ఆ రహస్యాన్ని గ్రహింపక, తనకు కానవచ్చిన రూపం ఋషిభార్యేనన్న భ్రాంతితో మహానురక్తుడై ఆమెను కలిసి తన కోరికను తీర్చుకొన్నాడు. ఆమె శుకరూపాన్ని ధరించి అతని వీర్యాన్ని శరస్తంభాన పారవేసింది. ఆ రూపాన్ని సముద్రుడు కాపాడి, తన సంతతి వలె నెనరుచూపి పెంచసాగాడు. అందువల్ల ఆమె సముద్రుని కుమార్తె అయింది. ఆమెకు శతధృతి అని పేరుపెట్టారు.

## ప్రచేతసుల జననం

శతధృతి లోకోత్తర సౌందర్య లావణ్యవతియై అల్లారుముద్దుగా పెరగసాగింది. ఆమె నూపురాలను ధరించి రాజహంసి వలె నడయాడుతుంటే ఆ వింత సోయగాన్ని చూసి సురాసుర గంధర్వ ముని సిద్ధ పన్నగాదులందరూ ఆశ్చర్య వశులయ్యారు.

కొంత కాలానికి ప్రాచీనబర్హి బ్రహ్మనిదేశాన్ని శిరసావహించి శతధృతిని వివాహం చేసుకొన్నాడు. వారికి తుల్యనామవ్రతులు, ధర్మపారగులు అయిన పదిమంది కొడుకులు జన్మించారు. వారికి తల్లిదండ్రులు ప్రచేతసులని పేరుపెట్టారు. ప్రాచీనబర్హి వారిని ప్రజాసర్గానికి ఆజ్ఞాపించాడు.

# మహేశ్వరుని ఉపదేశం

ప్రచేతసులు పితృవాక్యబద్ధులై తపశ్చరణార్థం పశ్చిమ దిశకు వెళ్ళారు. మార్గమధ్యంలో వారికి సముద్రం వలె విశాలమైన ఒక సరోవరం కానవచ్చింది. మహాత్ముల హృదయం వంటి స్వచ్ఛమైన నీటితో నిండి ఉన్న ఆ కొలను నీలరక్తోత్పలాంభోజ కల్హారేందీవరాలకు పుట్టినిల్లై హంస సారస చక్రవాక కారండవ పక్షి కూజితాల తోను, భ్రమరగీతాల తోను అతిమనోహరమై ఒప్పారుతున్నది. ఒడ్డున ఉన్న లతా వృక్షాలన్నీ నిలువెల్లా పూచి అనిర్వచనీయమైన ఆనందపు పులకరింతలకు పారవశ్యాన్ని పొందినట్లు కానవచ్చాయి. సరోగత పద్మకోశాల లోని పుప్పొళ్ళను వెదచల్లడమే ఆటగా పవనుడు కాన్పించాడు. ఆ కొలను నుంచి మృదంగ పణవపూర్వక గాంధర్వం వెలువడి మనోహరమై గగనచరుల సంచారాలకు ఆలవాల మయింది.

ప్రచేతసు లది చూసి ఎంతో విస్మయమంది ఆ వినోదాన్ని చూస్తూ అక్కడే నిలబడ్డారు. అంతలో ఆ సరస్సు నుంచి పరిచర సిద్ధ విద్యాధర సంగీతాలకు ఆనందిస్తున్న ఒక వ్యక్తి తప్తకాంచన కాంతిదేహంతో మిరుమిట్లు గొలుపుతూ ప్రచేతసుల వద్దకు నడిచి వచ్చాడు. ఆ వ్యక్తి రూపురేకలను బట్టి శ్రీకంఠుడని ఊహించి అపూర్వమైన శివదర్శన భాగ్యానికి సంతోషవశులై వారతనికి నమస్కరించారు.

త్రిలోచనుడు వారి శీలసంపదలకు, దర్మజ్ఞతకు మెచ్చి ఈ విధంగా పలికాడు:

> 'బర్హిష్మంతుని పుత్రకులారా! మీరొనర్పదలచిన కార్య మేమిటో నాకు తెలుసు. మీరు వాసుదేవుని ఆశ్రయింపదలిచారు. వాసుదేవ ప్రసన్నులంటే నాకూ ఎంతో దగ్గరివారన్నమాట. అందువల్ల మీకు మేలు చేయగోరి నా దర్శనం ఇచ్చాను.
>
> నాయనలారా! ప్రకృతి పురుషులన్న తత్త్వం తెలుసును కదా. ప్రకృతిని ప్రధానమని, సూక్ష్మమని పేర్కొంటారు. పురుషుని

జీవుడు అంటారు. వాసుదేవుడు ప్రకృతి పురుషులకు పరుడై ఆ రెండింటినీ నియమిస్తుంటాడు. ఎవరు నిష్ఠతో నూరు జన్మలు స్వధర్మాన్ని ఆచరిస్తారో వారికి బ్రహ్మత్వం చేకూరుతుంది. అంతకంటె విశేషంగా ధర్మాచరణ చేసినవారు నన్ను పొందుతారు. మేమిరువురమూ అధికారమాత్రులము. అధికారాంతంలో మాకు నాశం ఉన్నది. అందువల్ల మమ్మల్ని పొందినవారు మాతోపాటు నశిస్తారు. వాసుదేవు డొక్కడే శాశ్వతుడు.

వాసుదేవునికి ఎన్నడూ నాశనం కలుగదు కనుక ఆయనను ఆశ్రయించిన భక్తులకు కూడా నాశనం లేదు. వారు ప్రపంచాతీత వైష్ణవపదాన్ని పొంది చిరస్థాయిగా వెలుగొందుతారు. అందువల్ల భాగవతులు భగవంతుని వలె నాకు అత్యంత ప్రీతిపాత్రులు. అట్టి ప్రియులకు పవిత్రము, పరమ మంగళ ప్రదమూ, నిశ్శ్రేయసకరమూ అయినదానిని ప్రసాదించడం నా అభిమతం. కనుక భగవత్స్తోత్రాన్ని ఉపదేశిస్తాను. శ్రద్ధగా వినండి'

అని పలికిన పరమేశ్వరునికి ప్రచేతసులు భక్తిపూర్వకంగా అంజదించారు. వారికి శంకరుడు నారాయణ పరమైన స్తోత్రాన్ని ఈ విధంగా ఉపదేశించాడు:

### రుద్రగీత

**జితం త ఆత్మవిద్ధుర్యస్వస్తయే స్వస్తిరస్తు మే**
**భవతా రాధసా రాద్ధం సర్వస్మా ఆత్మనే నమః.**

**నమః పఙ్కజనాభాయ భూతసూక్ష్మేన్ద్రియాత్మనే**
**వాసుదేవాయ శాన్తాయ కూటస్థాయ స్వరోచిషే.**

**సఙ్కర్షణాయ సూక్ష్మాయ దురన్తాయాన్తకాయ చ**
**నమో విశ్వప్రబోధాయ ప్రద్యుమ్నాయాన్తరాత్మనే.**

**నమో నమోఽనిరుద్ధాయ హృషీకేశేన్ద్రియాత్మనే**
**నమః పరమహంసాయ పూర్ణాయ నిభృతాత్మనే.**

స్వర్గాపవర్గద్వారాయ నిత్యం శుచిషదే నమః
నమో హిరణ్యవీర్యాయ చాతుర్హోత్రాయ తన్తవే.

నమ ఊర్జ ఇషే త్రయ్యాః పతయే యజ్ఞరేతసే
తృప్తిదాయ చ జీవానాం నమః సర్వరసాత్మనే.

సర్వ సత్త్వాత్మదేహాయ విశేషాయ స్థవీయసే
నమ స్త్రైలోక్యపాలాయ సహఓజోబలాయ చ.

అర్థవిజ్ఞాయ నభసే నమోఽన్తర్బహిరాత్మనే
నమః పుణ్యాయ లోకాయ అముష్మై భూరివర్చసే.

ప్రవృత్తాయ నివృత్తాయ పితృదేవాయ కర్మణే
నమోఽధర్మవిపాకాయ మృత్యవే దుఃఖదాయ చ.

నమ స్త అశిషామీశ మనవే కారణాత్మనే
నమో ధర్మాయ బృహతే కృష్ణాయాకుణ్ఠమేధసే
పురుషాయ పురాణాయ సాంఖ్యయోగేశ్వరాయ చ.

శక్తిత్రయసమేతాయ మీఢుషేఽహఙ్కృతాత్మనే
చేత ఆకూతిరూపాయ నమో వాచోవిభూతయే.

దర్శనం నో దిదృక్షూణాం దేహి భాగవతార్చితమ్
రూపం ప్రియతమం స్వానాం సర్వేన్ద్రియ గుణాఞ్జనమ్.

స్నిగ్ధప్రావృడ్ఘనశ్యామం సర్వసౌన్దర్య సంగ్రహమ్
చార్వాయత చతుర్బాహుం సుజాతరుచిరాననమ్.

పద్మకోశపలాశాక్షం సున్దరభ్రు సునాసికమ్
సుద్విజం సుకపోలాస్యం సమకర్ణవిభూషణమ్.

ప్రీతి ప్రహసితాపాఙ్గమలకై రుపశోభితమ్.
లసత్పఙ్కజకిఞ్జల్క దుకూలం మృష్టకుణ్డలమ్.

స్ఫురత్కిరీట వలయ హార నూపుర మేఖలమ్
శఙ్ఖ చక్ర గదా పద్మమాలామణ్యుత్త మర్ధిమత్.

సింహస్కన్ధత్విషో బిభ్రత్సౌభగ్రీవ కౌస్తుభమ్
శ్రియానపాయి న్యాక్షిప్త నికషాశ్మోరసోల్లసత్.

పూరరేచక సంవిగ్నవలి వల్గదలోదరమ్
ప్రతి సంక్రామయద్విశ్వం నాభ్యావర్తగభీరయా.

శ్యామశ్రోణ్యధిరోచిష్ణుదుకూల స్వర్ణమేఖలమ్
సమాచార్వఙ్ఘ్రి జఙ్ఘోరు నిమ్నజాను సుదర్శనమ్.

పదా శరత్పద్మపలాశరోచిషా
నఖద్యుభి ర్నో౽న్తరఘం విధున్వతా
ప్రదర్శయ స్వీయ మపాస్తసాధ్వసం
పదం గురో మార్గగురు స్తమోజుషామ్.

ఏతద్రూప మనుధ్యేయ మాత్మశుద్ధి మభీప్సతామ్
యద్భక్తియోగో౽భయదః స్వధర్మ మనుతిష్ఠతామ్.

భవాన్ భక్తిమతా లభ్యో దుర్లభః సర్వదేహినామ్
స్వారాజ్యస్యాప్యభిమత ఏకాన్తేనాత్మవి ద్గతిః.

తం దురారాధ్య మారాధ్య సతామపి దురాపయా
ఏకాన్తభక్త్యా కో వాఞ్ఛేత్పాదమూలం వినా బహిః.

యత్ర నిర్విష్టమరణం కృతాన్తో నాభిమన్యతే
విశ్వం విధ్వంసయ న్వీర్యశౌర్య విస్ఫూర్జిత భ్రువా.

క్షణార్ధే నాపి తులయే న స్వర్గం నాపునర్భవమ్
భగవత్సఙ్గి సఙ్గస్య మర్త్యానాం కిముతాశిషః.

అథానఘాఙ్ఘ్రే స్తవ కీర్తితీర్థయో
రన్తర్బహిఃస్నానవిధూత పాప్మనామ్

భూతేష్వనుక్రోశ సుసత్త్వశీలినాం
స్యా త్సఙ్గమోఽనుగ్రహ ఏష న స్తవ.

న యస్య చిత్తం బహిరర్థ విభ్రమం
తమోగుహాయాం చ విశుద్ధ మావిశత్
యద్భక్తియోగానుగృహీత మఞ్జసా
ముని ర్విచష్టే నను తత్ర తే గతిమ్.

యత్రేదం వ్యజ్యతే విశ్వం విశ్వస్మిన్నవభాతి యత్
తత్ త్వం బ్రహ్మ పరంజ్యోతి రాకాశమివ విస్తృతమ్.

యో మాయయేదం పురురూపయాసృజ
ద్బిభర్తి భూయః క్షపయత్య విక్రియః
యద్భేదబుద్ధిః సదివాత్మ దుఃస్థయాం
త మాత్మతన్త్రం భగవన్ ప్రతీమహి.

క్రియాకలాపై రిదమేవ యోగినః
శ్రద్ధాన్వితాః సాధు యజన్తి సిద్ధయే
భూతేన్ద్రియాన్తః కరణోపలక్షితం
వేదే చ తన్త్రే చ త ఏవ కోవిదాః.

త్వమేక ఆద్యః పురుషః సుప్తశక్తి
స్తయా రజః సత్త్వతమో విభిద్యతే
మహానహం ఖం మరుదగ్నివార్ధరాః
సురర్షయో భూతగణా ఇదం యతః.

సృష్టం స్వశ క్త్యేద మనుప్రవిష్ట
శ్చతుర్విధం పుర మాత్మాంశకేన
అథో విదుస్తం పురుషం సన్తమన్త
ర్భుఙ్క్తే హృషీకై ర్మధు సారఘం యః.

స ఏష లోకా నతిచణ్డవేగో
వికర్షసి త్వం ఖలు కాలయానః
భూతాని భూతైరనుమేయ తత్త్వో
ఘనావలీ ర్వాయు రివావిషహ్యః.

ప్రమత్త ముచ్చై రితి కృత్యచిన్తయా
ప్రవృద్ధలోభం విషయేషు లాలసమ్
త్వ మప్రమత్తః సహసాభిపద్యసే
క్షుల్లేలిహానోఽహి రి వాఖు మన్తకః.

కస్త్వత్పదాబ్జం విజహాతి పణ్డితో
యస్తేఽవమాన వ్యయమానకేతనః
విశఙ్క యాస్మద్గురు రర్చతి స్మ
యద్వినోపపత్తిం మనవ శ్చతుర్దశ.

అథ త్వమసి నో బ్రహ్మన్ పరమాత్మన్ విపశ్చితామ్
విశ్వం రుద్రభయధ్వస్త మకుతశ్చిద్భయా గతిః.

ఇదం జపత భద్రం వో విశుద్ధా నృపనన్దనాః
స్వధర్మ మనుతిష్ఠన్తో భగవత్యర్పితాశయాః.

తమేవాత్మాన మాత్మస్థం సర్వభూతేష్వవస్థితమ్
పూజయధ్వం గృణన్తశ్చ ధ్యాయన్త శ్చాసకృద్ధరిమ్.

యోగాదేశ ముపాసాద్య ధారయన్తో మునివ్రతాః
సమాహితధియః సర్వ ఏతదభ్యసతాదృతాః.

ఇదమాహ పురాస్మాకం భగవాన్ విశ్వసృట్ కృతిః
భృగ్వాదీనా మాత్మజానాం సిసృక్షుః సంసిసృక్షతామ్.

తే వయం నోదితాః సర్వే ప్రజాసర్గే ప్రజేశ్వరాః
అనేన ధ్వస్తతమసః సిసృక్ష్మో వివిధాః ప్రజాః.

అథేదం నిత్యదా యుక్తో జపన్నవహితః పుమాన్
అచిరాచ్ఛ్రేయ ఆప్నోతి వాసుదేవపరాయణః.

శ్రేయసా మిహ సర్వేషాం జ్ఞానం నిఃశ్రేయసం పరమ్
సుఖం తరతి దుష్పారం జ్ఞాన నౌ ర్వ్యసనార్ణవమ్.

య ఇమం శ్రద్ధయా యుక్తో మద్గీతం భగవత్స్తవమ్
అధీయానో దురారాధ్యం హరి మారాధయత్యసౌ.

విన్దతే పురుషోఽ ముష్మాద్యద్య దిచ్ఛత్య సత్వరమ్
మద్గీత గీతాత్సుప్రీతా చ్ఛ్రేయసామేకవల్లభాత్.

ఇదం యః కల్య ఉత్థాయ ప్రాఞ్జలిః శ్రద్ధయాన్వితః
శృణుయా చ్ఛ్రావయే న్మర్త్యో ముచ్యతే కర్మబన్ధనైః.

గీతం మయేదం నరదేవనన్దనాః
పరస్య పుంసః పరమాత్మనః స్తవమ్
జపన్త ఏకాగ్రధియ స్తపో మహ
చ్చరధ్వ మన్తే తత ఆప్స్యథేప్సితమ్.

అని శ్రీ మహేశ్వరుడు కావించిన నారాయణపరస్తోత్ర తాత్పర్యం ఏమిటంటే–

'దేవా! ఆత్మవేత్తలకు రక్షకుడవై, జ్ఞానులకు జ్ఞానివై అలరారుతున్న నీ సర్వోత్కర్ష ఆత్మవిదులకు ఆనందదాయకమై

ఉన్నది. నేనూ నీ భక్తుడనే కనుక నాకు కూడా అటువంటి ఆత్మానందలాభం కలుగుతుంది గాక. ఇతర రూపాలైన ఆనందాలు ఎన్నో ఉండగా ఈ ఆత్మానందమే ఎందుకు కావాలని అడగవచ్చు. ఆ ఇతరానందములన్నీ క్షణికమైనవి. నీ ఆత్మానందం నిత్యము, సుస్థిరం మాత్రమే కాక పరాత్పరం. మరి నీ ఆనందరసాస్వాదులకు ఎన్నటికీ వినాశం లేదు. అందువల్ల నీ ఆత్మానందలాభాన్ని కోరుకొన్నాను. స్వామీ! నీవు సర్వోత్కృష్టుడవు. సర్వస్వరూపుడవు అయినప్పటికీ నీ భక్తులకు దృష్టిగోచరతృప్తిని కలిగించేందుకు ప్రపంచరూపాన్ని ధరించావు. ఇదే నీకు ప్రణామం.

దేవా! నీ సర్వస్వరూపత్వం వేనోళ్ళ కొనియాడదగినది. విశ్వమనే పద్మాన్ని నీవు నీ నాభిప్రదేశాన ధరించి పద్మనాభుడ వైనావు. కనుక సర్వసృష్టికి నీవే కారణాత్ముడవు. ఎప్పుడు కారణాత్ముడ వైనావో అప్పుడే నీవు సృజించే ప్రాణి కోటికి ఉపాధులైన స్థూల పంచ మహాభూతాలకు, తన్మాత్రలకు, ఇంద్రియాలకు నియామకుడవైనావు. అవి తమ తమ పనులను నీ ఇచ్ఛానుసారం నెరవేరుస్తున్నాయి. అట్టి అంతఃకరణ చతుష్టయాధిష్ఠాతకు నీకు ప్రణామం.

దేవా! నీవు జగదధిష్ఠాతవు. చిత్తాన్ని అధిష్ఠించినా దాని వికారాలకు లోను గాక స్వప్రకాశంతో వెలుగొందేవాడవు. ఆ కారణాన నిన్ను వాసుదేవుడు అన్నారు. అట్టి వాసుదేవునకు, శాంతమూర్తికి, కూటస్థునికి నీకు ప్రణామం.

దేవా! అహంకారాన్ని అధిష్ఠించి సూక్ష్మ దురంత ధర్మాలను నడుపుతూ తుదకు నీవే అంతకుడవై నీ ముఖాగ్ని చేత విశ్వమంతటినీ రూపుమాపుతావు. ఏ విధంగా నీవు

జగత్కారణుడవో అదే విధంగా జగదంతకుడ వైనావు. అందువల్ల నిన్ను సంకర్షణుడు అన్నారు. అట్టి నీ సంకర్షణ రూపానికి అభివాదం. నీవు బుద్ధికి అధిష్ఠాతవై విశ్వప్రబోధం కావిస్తూ అంతరాత్మ రూపాన అందరిలోనూ ఉన్నావు. అందువల్ల నిన్ను ప్రద్యుమ్నుడు అన్నారు. అట్టి నీ ప్రద్యుమ్న రూపానికి ప్రణామం.

దేవా! మనస్సుకు అధిష్ఠాతవై ఇంద్రియాలను తమ తమ కార్యాలకు ప్రేరేపిస్తావు. అందువలన నిన్ను అనిరుద్ధుడు అన్నారు. అట్టి నీ అనిరుద్ధరూపానికి ప్రణమిల్లుతున్నాను. పరమహంస వలె పుణ్యాపుణ్యాలకు అతీతుడవై వృద్ధి క్షయ రహిత తేజోమూర్తిగా విశ్వవ్యాపకుడవై సూర్యరూపంలో ప్రకాశిస్తున్న నీకు నమస్కారం. స్వర్గాపవర్గాలు రెండింటికీ నీవు ద్వాపరరూపుడవు. సర్వాంతఃకరణ నిలయా! నీకు నమస్కారం. యజ్ఞాలను తత్సాధన రూప కర్మల చేత విస్తరింపజేస్తున్న అగ్నిహోత్రరూపా! నీకు నమస్కారం. దేవతలకు, పితృదేవతలకు సోమరూపంలో అన్నాన్ని అనుగ్రహిస్తున్న దేవా! నమస్కారం. స్వర్గాపవర్గ సాధన ప్రకాశక వేద స్వరూపా! నమస్కారం.

దేవా! ఇంతవరకూ నీ తేజస్వితను స్తుతించాను. ఇక నీ జలత్వాదులను గూర్చి వర్ణింపగల వాక్కును నాకు ప్రసాదించు. జీవులకు కటుతిక్తాది షడ్రసాల రూపంలో తృప్తిని కలిగిస్తున్న సర్వ రసాత్మకా! నమస్కారం. సర్వప్రాణి శరీర విస్తృత విరాడ్రూపా! నమస్కారం. పృథ్వీస్వరూపా! నమస్కారం. ఓజస్సహోబలాలతో ఒప్పారుతూ ప్రాణరూపంలో ముల్లోకాలనూ పరిపాలిస్తున్న వాయురూపా! నమస్కారం. అర్థబోధార్థం శబ్దాన్ని గుణంగా గ్రహించి అంతర్బహిర్వ్యవహారాలకు ఆధారభూతుడవై తనరారుతున్న ఆకాశరూపా! నమస్కారం.

ఆకాశాది పంచమహాభూతస్వరూపుడవే గాక యజ్ఞ దానాది రూప పుణ్యశరీరుడవు. వానిచే సాధింపదగిన స్వర్గాది లోకస్వరూపుడవు. వానిచే సాధింపదగిన స్వర్గాది లోక స్వరూపుడవు అయిన దేవదేవా! నమస్కారం.

దేవా! ప్రవృత్తి నివృత్తి రూప కర్మస్వరూపా! నీకు నమస్కారం. ఆ ప్రవృత్తి నివృత్తి రూప కర్మద్వయ ఫలములైన పితృలోక దేవలోకాలను కూర్చేవాడవు నీవే. ధర్మపరులకు దుఃఖాలను కల్పించి, వారికి మృత్యువువై తదీయ నాశన రూపాన అధర్మాన్ని నశింపజేస్తావు. సర్వకర్మ ఫలదాతా! సర్వమంత్రాత్మకా! కృష్ణరూప ధర్మాత్మా! అవ్యాహతజ్ఞానా! పురాణపురుషా! సాంఖ్యయోగేశ్వరా! కర్తృ కర్మ కరణ శక్తి త్రయాశ్రయా! అహంకారాత్మక రుద్రరూపా! సర్వవాగ్గర్భస్థానా! జ్ఞానక్రియారూపా! నమస్కారం.

స్వామీ! నీ దర్శనభాగ్యాన్ని కోరుతున్నాను. ఎటువంటి రూపదర్శనం కావాలంటావా? ఏ నీ రూపం భాగవతార్చితమై భక్తులకు ప్రియతమమో, ఏ నీ రూపదర్శనం వలన సర్వేంద్రియ తర్పణం కలుగుతుందో, ఆ దివ్యరూపాన్ని చూడగోరుతున్నాను. వర్షకాల మేఘ శ్యామలవర్ణ స్నిగ్ధమై సర్వసౌందర్య సమగ్రమై యథోచిత సర్వావయవ రుచిరమై భాసించే నీ మూర్తిని సందర్శింపగోరుతున్నాను.

దేవా! అజ్ఞులకు గురుడవై జ్ఞానమార్గాన్ని ప్రకాశింపజేస్తావు. స్వధర్మపరులై నీ యెడ భక్తి గలిగినవారికి అభయాన్ని ప్రసాదిస్తావు. ఆత్మశుద్ధిని కోరుకొనేవారికి నీ దివ్యరూపం ధ్యేయమవుతుంది. స్వారాజ్యసిద్ధి పొందినవారు కూడా నిన్నే ప్రార్థిస్తారు. ఆత్మవిదుల ఏకాంతభక్తికి నీవే పరమగతివి. దేహధారులకు దుర్లభుడవై నా భక్తులకు కొంగు పసిడివై చరిస్తావు.

దేవా! నిన్ను పూర్ణంగా ఆరాధించడం ఎంతటి వారికైనా శక్యం కాదు. నిన్ను పూజించేందుకు భక్తిపుష్పం తప్ప వేరొకటి యుక్తం కాదు. నీ భక్తులకు నీ యొక్క పాదమూలాశ్రయం తప్ప స్వర్గాదుల నిచ్చినా కాలద్రోస్తారు. నీ భక్తుల వంక విశ్వవిధ్వంసకుడైన మృత్యువు కూడా కన్నెత్తి చూడలేదు. నీ సంగతి అటుండనీ. నీ భక్తుల తోడి క్షణకాలపు సహవాసానికి స్వర్గాపవర్గాలు సాటి రావు. ఇక క్షణభంగురములైన ఐహిక రాజ్యాదిభోగాల సంగతి చెప్పడానికేమున్నది! నీ పాదతీర్థాన్ని సేవించినవారు బహిర్మలములే గాక ఆంతరములైన రాగాదిమలినాల స్నిగ్ధతలు కూడా ఊడిపోయి శుద్ధశీల చిత్తులై మహాత్ములవుతారు. అట్టివారి సాంగత్యాన్ని నాకు అనుగ్రహించు.

దేవా! నీ తత్త్వార్థాన్ని తెలియగోరి పలుదారులు త్రొక్కి నానావిధాల ప్రాకులాడతారు. ఆ రహస్య గ్రహణకు భక్తి తప్ప వేరొక సాధనం లేదు. నీ తత్త్వరహస్యం ఏమిటంటే పరమతేజస్సే నీ తత్త్వం. దానిని పరబ్రహ్మమంటారు. ఆకాశం వలె అది ఎల్లెడల నిండి ఉంటుంది. నీ తేజఃప్రకాశితమై విశ్వం బహిరంతరాలలో ప్రకాశమాన మవుతున్నది. ఈ విశ్వం సృష్టి స్థితి లయాలకు లోనవుతున్నా అజ్ఞానులు దానినే పరమార్థమని భావిస్తారు. ఇట్టి భ్రాంతికి కారణం ఏమిటంటే నీ మాయే కారణం. మాయ అంటే ఏమిటి? అనిర్వచనీయమైన నీ శక్తిని మాయ అంటున్నాము. అది కారణమని ఎందుకనాలి? అంటే నీ మాయ తన విలాసాలను ప్రకటిస్తుంటుంది. ఆ విలాసాలలో పడి లోకం భ్రాంతి చెంది అవే పరమార్థాలని భావిస్తుందే గాని దానికి మూలమైన నిన్ను స్మరింపదు. నీ మాయ నిన్ను మాత్రం భ్రమింపజేయదా? అని అడుగుతారు. నీ ఇచ్ఛానుసారంగా వర్తించే మాయాలీలలు నీ ముందు సాగుతాయా? ఎందుకంటే నిర్వికారుడవు,

సర్వస్వతంత్రుడవు, భేదరహితుడవు కాబట్టి నీ మాయాలీలలకు నీవు సాక్షిమాత్రుడవై ఉండటమే కారణం.

దేవా! నీ తత్త్వగ్రహణార్థం వేదపాఠాలు కావిస్తారు. వేదపాఠ మాత్రాన ఎవరూ కోవిదులు కాలేరు. వేదబోధిత తత్త్వం స్వానుభవసిద్ధమైనప్పుడు వాస్తవజ్ఞానం కలుగుతుంది. ఆ తత్త్వం స్వానుభవసిద్ధం కావడానికి దానిని స్వధర్మంగా అనుష్ఠించాలి. ఆచరణం లేని పలుకులు చిలుక పలుకులే కదా. అలా పలికేవారు మిథ్యాచారు లవుతారు.

దేవా! నీ శక్తికి సత్త్వ రజ స్తమస్సులు నైజగుణాలు. అవి ముప్పిరిత్రాటి వలె పెనగొని ఉంటాయి. ఆ శక్తి నిన్ను ఆశ్రయించి ఉంటుంది. నీవు సంకల్పించినప్పుడు ఆ నీ శక్తి నిజంగా శక్తి కలిగిన దవుతున్నది. అప్పుడు దాని మూడు గుణాలు కాలానుకూలంగా వ్యవహరిస్తున్నాయి. ఆ వ్యవహార ఫలంగా మహదహంకార భూతేంద్రియ గణాలు ఏర్పడుతున్నాయి. ఆ ఏర్పాటును ప్రపంచం అంటారు.

దేవా! ఆ ప్రపంచం నీ కంటె భిన్నమైనది కాదు. అయినా దానిని నీ కంటె భిన్నమని భావిస్తారు. ఇది హ్రస్వదృష్టి. పారమార్థిక దృష్టి కాదు. జడమైన ప్రపంచానికి వ్యవహారం ఎలా కలుగుతున్నది? అంటే నీవు నీ శక్తియోగం వల్ల జరాయుజ అండజ స్వేదజ ఉద్భిజ్జరూప శరీరాలను దాల్చి వాటియందు నీ అంశతో ప్రవేశిస్తావు. అప్పుడవి వ్యవహారాన్ని పొందుతున్నాయి. ఆ విధంగా ప్రవేశించినందున నిన్ను పురుషుడు అంటారు.

దేవా! నీవు శరీరస్థుడవై తేనెటీగలు పుష్పరసాన్ని గ్రోలినట్లు విషయసుఖాలను అనుభవించేటప్పుడు నిన్ను జీవుడు అంటారు. వాస్తవం విచారిస్తే ఇందులో నీవు చేసినది కాని, అనుభవించినది

కాని ఏమీలేదు. సూదంటురాయి దగ్గర ఇనుపముక్క వలె నీ సాన్నిధ్యంలో నీ శక్తి చలించడమూ, తత్ఫలంగా ఇదంతా ఏర్పడటమూ జరుగుతున్నది. ఆ రహస్యం తెలియక నీ శక్తి కార్యాన్ని నీ యందు ఆరోపించి తలకొక తీరున ఆలోచిస్తారు. సూదంటురాయి దగ్గర ఇనుపముక్క కదలికను పొందడం ఎంత నైజమో నీ సాన్నిధ్యంలో నీ శక్తి, దానిచే రచితమైన ప్రపంచం చలించడమూ అంతే నైజం.

దేవా! నీ శక్తి ఈ విధంగా సృష్టిక్రియకు పూనుకొనడం, ఆ సృష్టిలోని భూతజాతం ఒకదానిచే ఒకటి హరింపబడటం మహాద్భుతాలు. ఈ రహస్యం తెలియక విషయలాలసు లైనవారు పాము చేత గ్రసింపబడుతున్న మూషికం వలె ఆ విషయాల చేతనే మ్రింగబడి వినాశాన్ని పొందుతారు. ఇది గ్రహించి మన్వాదులు సరే, సృష్టికర్త అనబడుతున్న బ్రహ్మ కూడా వేరే మార్గం తోచక నీకు దాసోహమన్నారు. పరమాత్మా! సర్వభయాపహారివి నీవే మాకు గతి. ఇదే నీకు పునఃపునః నమస్కరిస్తున్నాను.'

అని శ్రీ మహేశ్వరుడు ప్రచేతసులతో ఇంకా ఇలా అన్నాడు:

'రాజపుత్రులారా! ఈ స్తోత్రాన్ని రుద్రగీత అని, యోగాదేశమని ప్రవచిస్తారు. ఈ పరమస్తోత్ర భావాన్ని అనుభవానికి తెచ్చుకొంటూ సర్వాంతః కరణ సమర్పణగా భగవంతుని స్వధర్మానుష్ఠాన పూర్వకంగా ఆరాధిస్తూ సమాహితచిత్తులై దీనిని జపించండి.

నాయనలారా! ఈ స్తోత్రం నేటిది కాదు, బ్రహ్మదేవుడు ప్రజాసర్గముఖుడై ఏతత్కార్యానికి భృగ్వాదులను మమ్మల్ని నియమించి దీనిని ఉపదేశించాడు. మేము దీనిని జపిస్తూ ప్రజాసృష్టి చేశాము. ఎవరు నిత్యయుక్తులై వాసుదేవ పరాయణమైన బుద్ధితో దీనిని సావధానంగా జపిస్తారో వారికి సర్వశ్రేయాలలో ఉత్తమమైన జ్ఞానం సిద్ధిస్తుంది. ప్రారబ్ధ కర్మఫలములైన

వివిధ వాసనలతో కూడి మహాసముద్రప్రాయమై ఉన్న సంసారసాగరాన్ని దాటడానికి జ్ఞానమనే నావ తప్ప వేరొక సాధనం లేదు. అట్టి జ్ఞానం చేకూరడానికి భక్తి ఒక్కటే పరమసాధనం. నేను నిర్దేశించిన తీరున ఏకాగ్రమతితో ఈ పరమపురుష స్తవాన్ని జపించి, ఆ స్తోత్రపాఠం వల్ల ఉజ్జీవితమైన బుద్ధితో మీ స్వధర్మాన్ని ఆచరించడమే పరమతపస్సుగా చేసి భగవంతుని ఆ విధంగా ఆరాధిస్తే తపఃపరిపాకం కలిగి మీ కోరికలు సిద్ధిస్తాయి.'

విదురా! మృత్యుంజయుడు ప్రచేతసులకు ఈ విధంగా రుద్రగీతను ఉపదేశించి అంతర్హితుడయ్యాడు. ప్రచేతసులు పదివేల సంవత్సరాలు జలాంతరంలో నిలిచి శ్రీహరి స్తవాన్ని జపిస్తూ తపస్సు చేశారు.

## నారదుని ఉపదేశం

ఒకనాడు నారదమహర్షి ప్రాచీనబర్హి వద్దకు వచ్చి, 'రాజవర్యా! నీవు కర్మాసక్తుడవై నడుచుకొంటున్నావు. కర్మముల వల్ల నీకు ఎటువంటి మేలు కలిగింది? ప్రాణిజాత మనగానే దుఃఖనాశం, సుఖప్రాప్తి కలగాలని ప్రాకులాడటం ఉన్నదే. కర్మముల వల్ల ఈ రెండూ కలుగవని తెలియదా?' అని ప్రశ్నించాడు. ఆ రాజు నారదుని మాటలను విని, 'ఋషివర్యా! కర్మముల వలన మోక్షం కలుగుతుందని నమ్మి కర్మాసక్తుడ నైనాను. కర్మము మోక్షప్రదం కాదంటే మోక్షప్రాప్తికి మార్గం ఉపదేశించి నన్ను కృతార్థుని చేయండి' అని ప్రార్థించాడు.

నారదుడు అతని జిజ్ఞాసను గ్రహించి, 'రాజా! మోక్షప్రాప్తికి కోరిక నశించడం ముఖ్యం. కోరిక నశించాలంటే యమనియమాదులు స్థిరం కావాలి. అందుకు అహింసాదులను అనుష్ఠించాలి. ఎన్నో యాగాలు చేశావు. యాగాలలో పశుహింస తప్పదు. నీవు యజ్ఞాని కోసం నిర్దయామతివై చంపిన పశువులు మందలు మందలై నీవు చేసిన అపకారాన్ని తలచుకొంటూ నీ రాక కోసం నిరీక్షిస్తున్నాయి. ఏ నాడు నీవు నీ శరీరాన్ని విడిచి పరలోకంలో

అడుగుపెడతావో, ఆనాడు నిన్ను ఆ పశువులన్నీ కలిపి చుట్టుముట్టి వాడి కొమ్ములతో చీల్చి చెండాడబోతున్నాయి. ఇందుకు నిదర్శనగా పురంజనోపాఖ్యానం ఒకటున్నది. దానిని విను.

## పురంజనోపాఖ్యానం

రాజా! పూర్వం పురంజనుడనే రాజు గొప్ప కీర్తిశాలి ఉండేవాడు. అతనికి ఒక మిత్రుడు ఉండేవాడు. అతని పేరూ ప్రవర్తనా ఎవరికీ తెలియనందున అతనికి అందరూ కలిసి అవిజ్ఞాతుడని పేరుపెట్టారు. ఒకప్పుడు పురంజన మహారాజుకు లోకంలో ఉన్న భోగాలన్నింటినీ తనివితీరా అనుభవించాలని కోరిక ఉదయించింది. అందుకు తగిన మంచి ప్రదేశాన్ని వెతుకుతూ అతను దేశంలోని పల్లెలు, పట్టణాలు తదితర ప్రదేశాలు కలయజూసి తన మనస్సుకు నచ్చిన ప్రదేశం కనిపించక చివరికి విసిగి వేసారి హిమవత్పర్వత దక్షిణ సాను ప్రదేశానికి వెళ్లాడు.

అక్కడ ఒకానొక చోట నవద్వారాలు కలిగి ఉన్న ప్రాకారంతో సువర్ణ రజతమయ శిఖరాలతో వైడూర్య ముక్తా మరకత పద్మరాగ ఖచిత హర్మ్యగృహాలతో మిన్నంటుతున్న చైత్య ధ్వజ పతాకాది విలసిత సభాస్థల చత్వర రథ్యా క్రీడాపణ ప్రదేశాలతో విద్రుమరచిత వితర్దికలతో చూసిన కొద్దీ మరింత చూడాలనిపించేటట్లు మనోహరమై ఉన్న పట్టణం ఒకటి కనిపించింది. అక్కడ ఎటు చూసినా శాఖలు చాచి నిండారా పండి పథికశ్రేణికి నీడలిచ్చి సేద తీర్చి ఫలాహారాలను అందించటమే స్వధర్మమైనట్లు ఒప్పారుతున్న వివిధ మహోన్నత వృక్షాల తోను, పూవుజొంపాలతో కూడిన లతాహస్తాలు గాలికి ఊయల లూగుతుండగా బాటసారులను ఆతిథ్య స్వీకారానికై రమ్మని ఆహ్వానిస్తున్నట్లున్న పొదరిండ్ల తోను అలరారుతున్న ఉపవనాలు కన్నులకు విందుగా కానవచ్చాయి. ఆ లతావృక్షాల చిగుళ్లను, పండ్లను మెక్కి చిలుకలు, గోరింకలు, కోయిలలు శ్రవణ మనోహరంగా పాడుతూ బాటసారులకు విశ్రాంతిని కలుగజేస్తున్నాయి. తుమ్మెద పూదేనెలను

గ్రోలి మత్తెక్కి ఐహిక భోగపరుల ప్రవర్తనలను నిరూపిస్తున్నట్లు ఝుంకార ధ్వనులు మార్మోగుతున్నాయి. ఆ చోటనున్న సరోవరాలు అతి విశాలములై స్వచ్ఛ జలాలతో నిండి కమల కుముద పరిమళాలను వెదజల్లుతున్నాయి. మందమారుతాలు శీతల జలశీకరాలతో పుష్పపరాగాలను మేళవించి తీసికొనివచ్చి పథికులపై పన్నీరు చల్లి పూరెమ్మ వీవెనలను వీస్తున్నట్లు మంద మందగతిని వచ్చి శరీరాలను తాకి పులకరింపజేస్తున్నాయి. కోయిలలు పథికజనులను సాదరంగా రమ్మని ఆహ్వానిస్తున్నట్లు కషాయ స్వరాలతో గొంతెత్తి గానం చేస్తున్నాయి. సింహ వ్యాఘ్రాలు మునివ్రతాన్ని పూని జితేంద్రియత్వాన్ని సాధించినట్లు తమతో సారంగ మృగాదులను కలుపుకొని నిరాబాధంగా సంచరిస్తున్నాయి.

రాజా! ఆ ఉపవనంలో ఒక సౌందర్యరాశి పసుపుపచ్చని చీర కట్టుకొని బంగారు ఒడ్డాణం దాల్చి మౌక్తికమాలను పోలిన పలువరుస, బింబఫలాన్ని నిరసించే ఎఱ్ఱని పెదవులు, గంధఫలిని మేలమాడే నాసిక, నిండు జాబిల్లిని లెక్కచేయని ముఖ కాంతులు దేదీప్యమానంగా వెలుగొందుతుండగా, ఒండొంటిని ఒరుసుకొంటున్న చనుదోయిపై పయ్యెదను సవరించుకొంటూ, కటాక్ష విక్షేప భ్రూవిలాసాలతో మనస్సులోని మన్మథభావాన్ని చెప్పక చెబుతూ, చిరునవ్వు లేవెన్నెలలతో చూపరుల మనస్సులను పరవశింపజేస్తూ, కాలి అందెల రవళితో మదిలో కొత్త కోరికలను రేకెత్తింపజేస్తూ రాయంచ నడకలతో మందమందగతుల సంచరిస్తున్నది. ఆమెను పరివేష్టించి ఒక పంచశీర్షపన్నగం, పదుగురు మేటులు ఇంకా పెక్కుమంది చెలికత్తెలు ఉన్నారు.

రాజా! ఆ మదిరాక్షి కడకంటి చూపులు తూపులై, పురంజనుని ఎదలో నాటుకొన్నాయి. అతనామె చెంతకు వెళ్ళి, "సుందరీ! నీ వెవ్వతెవు? ఎవరిదానవు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? ఎవరి ఆజ్ఞకు లోబడి ఈ పదుగురు భటులూ నీకు దాసులై ఉన్నారు. వీరి కమసన్నలలో మెలగుతూ నీకు సేవికలై ఉన్న ఈ లతాలలితాంగు లెవరు? ఐదు పడగలు విప్పి నీకు

చల్లని నీడనిస్తూ నిన్ను వెన్నంటి వస్తున్న ఈ పంచశీర్ష పన్నగం ఎవరు? రూప విలాసాలనుబట్టి చూడగా నీవు మనుష్యాంగనవు కావు. నీ ముఖవీక్షణాలు ఎవరినో వెతుకుతున్నట్లున్నాయి. ధర్ముని కోసమా? అలాగైతే నీవు హ్రీదేవతవు. భవుని కోసం అన్వేషిస్తున్నావా? ఆ పక్షాన నీవు భవానివి కాబోలు. బ్రహ్మను వెతుకుతున్నావా? అప్పుడు భారతివి నీవే. విష్ణుని కొరకు వేచి ఉన్నావా? ఇందిరవు కాగలవు. దేవస్త్రీలు నేలపై కాలూనరు. అందువల్ల నీవు దేవకాంతవు కావేమో, నీ పాదపద్మాలను ఆశ్రయించి నీకు సర్వ కామాలను సమకూర్చగల పతికోసం ఎదురు చూస్తుంటే ఆ భాగ్యం నా కనుగ్రహించు. లజ్జాలలితములు, స్మిత విలసితాలు అయిన నీ క్రీగంటి చూపుల తూపులు సోకి శిథిలేంద్రియుడనై నీ పొందుకోసం తహ తహలాడుతున్నాను. నీ దాసుడు మరుడు నిన్ను వెన్నాడుతున్నాడు. నీ సుందర భ్రూకార్ముక వినిర్ముక్త శరఘాతాలకు నన్ను గురిచెయ్యకు. లేత మబ్బుల వంటి ముంగురులు అడ్డు నిల్వగా దోబూచులాడుతున్న నీ ముఖ చంద్రబింబాన్ని కన్నుల విందుగా కనుగొనే భాగ్యాన్ని ప్రసాదించి నన్ను అనుగ్రహించు. చూపులను నాపై సారించి నీ కన్నులలో వెన్నెలలు కురిపించు" అన్నాడు.

ఆ సుందరాంగి పురంజనునికి మధుర మందస్మితమాలికను కానుకగా సమర్పించి, 'అయ్యా! నాకూ నీకూ గోత్రనామాలను ఎవరేర్పరిచారో వారిని మన మిద్దరమూ ఎరుగము. ఈ పురాన్ని ఎవరు నిర్మించారో వారు కూడా మనకు తెలియదు. నేనీ చోటును ఆశ్రయించుకొని ఉన్నాను. ఇక్కడివారిలో ఒక్కనిని మాత్రం ఎరుగుదును. నా చుట్టూ ఉన్న ఈ పదిమందీ నాకు సఖులు. వారిని నడిపిస్తున్న అతనిని బృహద్బలు డంటారు. వారి ఆజ్ఞ ప్రకారం వర్తిస్తున్న ఈ సుందరీమణు లందరూ నా చెలికత్తెలు. ఈ ఐదు తలల పాము నిద్రిస్తున్నప్పుడు మేల్కొని నన్నూ ఈ ఊరినీ కాపాడుతున్నది.

అయ్యా! నీ విక్కడికి వచ్చి గ్రామ్యకామ్యాలను కోరడం నా భాగ్యమను కొంటాను. నీతో వివాహమంటే ఎన్ని జన్మలుగానో నోచుకొన్న పుణ్యఫలం. నీవు నవద్వారయుతమైన ఈ పురానికి నేతవై నాతో కామోపభోగాలను

శతమానం అనుభవించు. నీవంటి రసజ్ఞుడు తనంతట తాను వలచి వచ్చినప్పుడు కాదని త్రోసిపుచ్చి, నైష్ఠికుని, నైపుణ్యరహితుని, నీరసమతిని, మృత్యుభయాకులితుడై ముంజేతిలోని సుఖాన్ని దిగవిడిచి రేపటి గురించి ఆలోచించే పశుతుల్యుడి వరిస్తానా? కొందరు గృహస్థాశ్రమం మంచిది కాదంటారు. వారు మతిహీనులని నే నంటాను. ఇందులో పొందరాని అర్థకామాలు మరెందులో ఉన్నాయి? పుత్రపరిష్వంగ సుఖం కావాలనుకుంటే గృహస్థాశ్రమమే కదా ఆశ్రయం. అమృతాన్ని, కీర్తిని పొందగోరితే అందుకు గృహస్థాశ్రమం కాక వేరే సాధనం ఏమున్నది?

అయ్యా! నివృత్తిధర్మపరులకు గృహస్థాశ్రమం లోని సుఖాలు అందని మ్రానిపండ్ల వంటివి. గృహస్థులకు స్వర్గభోగాలు కూడా చేకూరగలవు. యతులు తలక్రిందులుగా తపస్సు చేసినా సిద్ధింపని సుఖాలు గృహస్థుల అందుబాటులో ఉంటాయి. జన్మసాఫల్యం కోరినవారికి భూతసేవ కంటె ఉత్తమసాధనం వేరొకటి లేదు. గృహస్థుడు పితృ దేవ మర్త్యులకు మాత్రమే గాక నిఖిల భూతజాతానికీ మేలు చేయగలుగుతాడు. అందుకే అన్ని ఆశ్రమాలలో గృహస్థాశ్రమం ఉత్తమమని అంటారు.

వీరాగ్రణీ! స్త్రీ లెప్పుడూ విఖ్యాతుడు, వదాన్యుడు, ప్రియదర్శనుడు అయిన పురుషోత్తముడు తమకు భర్త కావాలని కోరుకొంటారు. అట్టివాడు స్వయంగా వచ్చినపుడు కాదనే మందభాగ్యురాలు ఉంటుందా? భోగిభోగోపమాలైన నీ భుజాల పరిష్వంగానికి వెలి కాగోరే దీనురాలు ఉంటుందా?' అని పలికింది.

రాజా! వారి అన్యోన్య సంభాషణం పరస్పర ప్రేమను రెట్టింపు చేసింది. పురంజనుడు అక్కడి గాన వినోదాలకు ఆనందిస్తూ స్త్రీల పరిచర్యలకు ఆనందిస్తూ నూరేండ్లు అవలీలగా గడిపివేశాడు.

రాజా! ఆ పురద్వారాలు తొమ్మిదింటిలో ఏడు పై భాగంలోనూ రెండు క్రింది భాగంలోనూ ఉన్నాయి. ఆ ఏడింటిలో అయిదు పూర్వభాగాన, ఒకటి దక్షిణభాగాన, ఒకటి ఉత్తరపార్శ్వాన ఉన్నాయి. పూర్వ ద్వారాలు

అయిందింటిలో ఖద్యోత, అవిర్ముఖి అన్న రెండూ ఒక్కచోట ఉన్నవి. వాటికి చేరువనే నళిని, నాళిని అని రెండు ద్వారాలు ఉన్నాయి. పూర్వద్వారాలలో మిగిలిన ఐదవదానిని ముఖ్యము అని పేర్కొంటారు. దక్షిణ ద్వారాన్ని పితృహువు అని, ఉత్తర ద్వారాన్ని దేవహూవు అని అంటారు.

ఖద్యోత అవిర్ముఖద్వారాలకు కావలిగా ద్యుమంతుడు ఉంటాడు. నళినీ నాళినీ ద్వారాలకు రక్షకుడు అవధూతుడు. ముఖ్యద్వారాన్ని రసజ్ఞుడు, విపణుడు అని ఇద్దరు, పితృహూ దేవహూ ద్వారాలను శ్రుతధ్వని అనేవారు రక్షిస్తుంటారు.

రాజా! పురంజనుడు ద్యుమంతుడనే చెలికానితో కలిసి ఖద్యోత అవిర్ముఖి ద్వారాల నుంచి వెలువడి విభ్రాజితాలనే జనపదాలకు వెళ్తుంటాడు; అవధూతుడనే సఖునితో కలిసి నళిని నాళి అనే ద్వారాలనుంచి వెలువడి సౌరభానికి వెళ్తాడు; రసజ్ఞుడు, విపణుడు అనే మిత్రులతో కలిసి ముఖ్యద్వారాన విషయానికి వెళ్ళి భాషణ చిత్రాన్నాలను పొందుతుంటాడు; శ్రుతధ్వనితో కలిసి పితృహూద్వారం నుంచి వెలువడి దక్షిణ పాంచాలాన్ని, దేవహూద్వారాన వెలువడి ఉత్తర పాంచాలాన్ని చూస్తుంటాడు.

ఆ పురానికి పశ్చిమభాగంలో రెండు ద్వారాలు ఉన్నాయని చెప్పారు. వాటిని ఆసురి అని, నిరృతి అని చెబుతుంటారు. ఆ రాజు దుర్మదుడనే చెలికానితో ఆసురిద్వారం నుంచి వెలువడి గ్రామకవిషయాన్ని, లుబ్ధకుడనే చెలికానితో నిరృతిద్వారం నుంచి వెలువడి వైశసమనే విషయాన్ని పొందుతాడు.

రాజా! ఆ పురంలో ఇద్దరు గ్రుడ్డివాళ్ళు నిర్వాక్కు, పేశస్కరుడు అనే పేర్లతో నివసిస్తుంటారు. ఆ రాజు వారిని తోడు తీసుకొని రాకపోకలు సాగిస్తుంటాడు. అతను అంతఃపురాన్ని ప్రవేశించినప్పుడు అతని వెంట విషూచనుడనే వాడొకడు ఉంటాడు. అతని తోడ్పాటుతో రాజు భార్యాపుత్రుల వలన కలిగే మోహ ప్రసాద హర్షాదులను మనసారా అనుభవిస్తుంటాడు.

రాజా! ఆ విధంగా పురంజనుడు అజ్ఞత్వాన్ని పొంది కామ సాధన కర్మలలో తగుల్కొని భార్య మాటకు జవదాటక ఆమె సురాపానం చేస్తే తానూ అదే ఆచరిస్తూ, ఆమె భుజించినప్పుడే తాను భుజిస్తూ, ఆమె సుఖమే తన సుఖంగా, ఆమె దుఃఖమే తన దుఃఖంగా, ఆమె గానమే తన గానంగా, ఆమె హాసమే తన హాసంగా, కూర్చున్నా నిల్చున్నా నడిచినా పరిగెత్తినా చూచినా కనులు మూసుకొన్నా తాకినా విన్నా మూర్కొన్నా సర్వకాల సర్వావస్థల లోనూ ఆమె తోడిదే లోకంగా భావించి స్వాతంత్ర్యాన్ని అతి సంతోషంగా వదులుకొని తన కిష్టం లేకపోయినా ఆమె కనుసన్నలలో నడుచుకొంటూ తుద కామె క్రీడామృగం వలె తయారయ్యాడు.

రాజా! ఒకనాడతను మృగయా వినోదానికై ఉత్సాహపడి స్వర్ణకవచాన్ని ధరించి అక్షయతూణీరాన్ని, మహాధనువును చేతగొని ప్రయాణసన్నద్ధు డయ్యాడు. ఆ వెంటనే సారథి దండికాద్వయం, చక్రయుగ్మం, బృహదక్షం, మూడు టెక్కెములు, అయిదు బంధనాలు, రెండు ఒరలు, ఏడు చర్యాద్యావరణలు, ఐదు ప్రహారాలు కలిగిన సువర్ణభూషిత రథాన్ని ఆయత్తపరచి హయపంచకాన్ని పూన్చి అధిష్ఠించి ఒకచేత పగ్గాలను పట్టి తీసుకొనివచ్చాడు. పురంజనుడు ఆ రథం ఎక్కి తన సేనాపతి ఏకాదశుని వెంటబెట్టుకొని కలలోనైనా విడిచిపెట్టని భార్యను విడనాడి సానుపంచకమైన అరణ్యం లోనికి వెళ్ళి ఆసురీవృత్తిని వహించి ఘోరాత్ముడై నిరనుగ్రహ బుద్ధితో తీవ్రబాణాలను ప్రయోగించి వనగోచరాలను సంహరింపసాగాడు.

రాజా! జీవహింస విషయంలో రాజులకు ఆరు నియమాలు ఉన్నాయి. సామాన్య నిత్యశ్రాద్ధాదులలో జీవహింస చేయకూడదు. ప్రఖ్యాత శ్రాద్ధాదులలో మాత్రమే శాస్త్రానికి చంపవచ్చు. ఆ కార్యమైనా అత్యవసరమైనంత మేరకు మాత్రమే అంగీకరింపబడింది. అంతకు మించి చంపకూడదు. అందులోనూ వన్యమృగాలను మాత్రమే చంపవచ్చునని చెప్పబడింది. ఈ నియమజ్ఞానం కలిగి వర్తించేవారు కావించిన కర్మ హింసాత్మకమైనా వారు దాని దుష్ఫలానికి పాత్రులు కారు. ఆ నియమాలను

పాటింపని వారు కర్తృత్వాభిమానులై తత్కర్మఫలబద్ధు లవుతారు. కర్మఫల బద్ధులు తెలివి చెడి సంసార ప్రవాహంలో పడి అధోగతి పాలవుతారు.

పురంజనుడు వేటకు వెళ్ళి మృగయా నియమాలను పాటింపక కంటికి కనిపించిన జంతువునల్లా తరిమి తరిమి తన యిష్టం వచ్చినట్లు చిత్రపక్ష శరాలను నాలుగు దిక్కులకూ ప్రయోగించి ఘోర హత్యాకాండ మొదలుపెట్టాడు. శరవిద్ధాలై ప్రాణాలను కోల్పోతున్న మృగాల దీనాక్రందనగతులు వనవాసులైన కరుణాత్ములకు దుస్సహంగా అనిపించాయి. అతనా విధంగా ఔగాములు విచారింపక వివిధ మృగాలను వేటాడి అలసటతో ఇంటికి తిరిగివచ్చి యథోచిత మజ్జన భోజనాదులు కావించి సేదతీరి సాలంకృతుడై పాన్పుచేరి భార్యకోసం నిరీక్షించాడు.

పురంజన గృహిణి ఎంతసేపటికీ శయ్యాగృహానికి రాకపోయేసరికి సంగతేమిటో తెలుసుకొనగోరి అతను అంతఃపుర పరిచారికలను పిలిచి, 'ఇంతులారా! మీకూ మీ ఈశ్వరికీ కుశలమే కదా? తల్లిగాని, పతిదేవత అయిన ఇల్లాలు కాని లేని ఇంట సంపదలు రుచింపవు. ఆ ఇల్లు శిథిలీకృత రథం వంటిదవుతుంది. అట్టిదానిని ప్రాజ్ఞు డధిష్ఠింపడు. వ్యసన సాగరంలో మునిగిన నన్ను దరిచేర్చే లలితారత్నం నా ప్రియురాలు ఎక్కడున్నది?' అని అడిగాడు. వారు, 'రాజా! నీ ప్రియురాలి మనోభావమేమిటో మాకు అర్థం కావడం లేదు. ఇదిగో ఇక్కడ కటిక నేలపై పడుకొని ఉన్నది' అని ఆమెను చూపించారు.

రాజా! పురంజనుడు తన ప్రియురాలి దగ్గరకు వెళ్ళి ఆమె ముఖరేఖలలో భేదభావాన్ని చూచినంతనే అతని మనస్సు చింతా వ్యాకులాక్రాంత మయింది. అతను నెమ్మదిగా ఆమెను తాకి మృదువచనాలతో ఊరడింపబోయాడు. ఆమె తన ప్రణయకోపాన్ని కుటిల వీక్షణాలలో ప్రదర్శించింది. అతనామె దుఃఖాన్ని గుర్తించి అనునయ పాండిత్యాన్ని ఆశ్రయించి సామం ప్రయోగించి ఆమె పాదపద్మాలను తన తొడపై ఉంచుకొని, 'ప్రియా! తప్పు చేయడం

మానవసహజం. అది తగిన శిక్షతో సమసిపోతుంది. లోక విషయమే ఇలా ఉండగా ఆత్మీయుల సంగతి వేరే చెప్పాలా! పాలకులు తప్పు చేసిన తమ సేవకులను యథోచితంగా దండించాలి. అలా చేయకపోవడం ఆ సేవకుల దౌర్భాగ్యం. రాజదండనం మహానుగ్రహరూపమే గాని ఆగ్రహ ప్రదర్శనం కాదు. దండితుడు తన తప్పిదానికి సిగ్గుపడాలే కాని దండనానికి దుఃఖింపకూడదు. దుఃఖపడటం అజ్ఞానానికి నిదర్శనం.

సుదతీ! అనురాగభార వ్రీడాబంధుర విలాససుందరమూ, దరస్మిత విలోకన మనోహరమూ అయిన నీ ముఖపద్మాన్ని నీలాలక భ్రమర విముక్తిచే దర్శనయోగ్యం కావించి కమ్మని తేనె పలుకొక్కటి పలికి ఈ దీనుని పరితాపాన్ని తొలగించు. సఖీ! నీ అలుకకు కారణం ఏమిటి? ఎవరైనా నీ యెడ అపరాధానికి పాల్పడ్డారా? ఆ అపరాధి బ్రాహ్మణుడో విష్ణుదాసుడో కాకపోతే వాడు ముల్లోకాలలో ఎక్కడున్నా పట్టి తెచ్చి మట్టుపెడతాను. ప్రియురాలా! నీ వదనమండలం తిలకరహితమై ఉన్నది. నీ నగుమోము చిన్నబోయినట్లున్నది. కోప భీషణత వల్ల నీ చూపు రాగశూన్యమై అపూర్వస్థితిని దాల్చింది. నీ చనుదోయి బింకం సడలింది. నీ అరుణాధర మందు కుంకుమపరాగం విలోపించింది. కారణం ఏమిటి? వేటపై మక్కువ గొని నిన్ను ఎడబాసి విచ్చలవిడిగా చరించానని ఆగ్రహించావా? నీ ప్రియుని మన్నించి అతనిపై నీ దయాప్రసారదృష్టిని సారించు. ప్రేయసీ! కుసుమాస్త్రహతుడై పౌరుషం విడిచి శరణుజొచ్చిన ప్రాణనాథుని కనికరింపకపోవడం న్యాయమేనా?' అని దైన్యభావంతో పరిపరి విధాల వేడుకొన్నాడు.

కాంతుని ఏకాంత సాంత్వనలకు స్వాంతమంతా వింత పులకరింతలతో కంతుని పలకరింతలతో ఎంతో సంతోషాన్ని కలిగింపగా ఆ కాంత అంతటితో అలుక మాని మంగళస్నానం చేసి రుచిరాంబరం ధరించి అలంకరించుకొని సొబగులు మీరగా వచ్చి పురంజనుని చెంతకు చేరింది. అతనా కామినీమణిని ఏకాంతంలో కలుసుకొని ఆమె కౌగిలింతలకు పరవశించి

రహస్సల్లాపవివశుడై వివేకాన్ని కోల్పోయి ఆమె తోడిదే లోకంగా రేయింబవళ్ళు గడపసాగాడు. అతనికి పరబ్రహ్మానుసంధానం ఏనాడూ జ్ఞాపకానికి రాలేదు. భార్యా సమాగమమే అతనికి పరమ పురుషార్థమై భాసించింది.

రాజా! అతని జవ్వనమంతా ఆ విధంగా రెప్పపాటు కాలం వలె అవలీలగా గడిచిపోయింది. క్రమంగా వారికి నూటపదకొండుమంది కొడుకులు, ఒక కుమార్తె కలిగారు. అతను వారందరికీ తగిన సంబంధాలు చూసి పెండ్లిండ్లు చేశాడు. ఒక్కొక్క కొడుకుకూ నూర్గురేసి కొడుకులు పుట్టారు. అతని వంశం పుత్ర పౌత్ర క్రమాన తామరతంపరగా వర్ధిల్లింది. అంతలో అతనికి కాలం ఆసన్న మయింది.

రాజా! ఆ సమయంలో చండకేశుడనే గంధర్వరాజు మూడువందల అరవై మంది గంధర్వులను, అంతమంది సితాసిత గంధార్వాంగనలను వెంటగొనివచ్చి పురంజనుని పురాన్ని ముట్టడించాడు. ఆ పురానికి కావలిగా ఉన్న పంచశీర్షపన్నగం వారందరినీ అడ్డగించి నూరేండ్లు పోరాడి అలసటతో నేలకొరిగింది. పురరాష్ట్రబాంధవులందరూ కకావికలయ్యారు. పురంజనుడు వారి వ్యాకులపాటును లెక్కచేయక పరివారం తెచ్చిపెట్టినది తింటూ మధు మధురాసవాలకు మరిగి స్త్రీలోలుడై రానున్న ముప్పును గమనింపలేదు. పురం నానాటికీ క్షీణింపసాగింది.

రాజా! పూర్వం ఒకప్పుడు కాలకన్యక వివాహం చేసికొనగోరి పతి కోసం ముల్లోకాలూ తిరిగింది. ఆమె వికృతరూపాన్ని చూసి ఆమెకు దుర్భగ అని పేరు పెట్టి ఎవరూ ఆమెను పెండ్లి చేసుకొనడానికి ముందుకు రాలేదు. ఒకనాడు నేను బ్రహ్మలోకం నుంచి భూలోకానికి వస్తుండగా ఆ కన్యక నన్ను చూసి ఆగర్భసన్న్యాసినని తెలిసినా వెనుకాడక కామమోహితయై నన్ను వరించింది. నేను తగదని నిషేధించాను. అందుకు ఆమె కినుక వహించి, 'సదా సంచారి'వి కమ్మని నన్ను శపించింది. ఆ శాపానికి నేను ఆగ్రహింపక,

'కామినీ! నీవు వెళ్ళి యవనేశ్వరుడిని ఆశ్రయించు!' అని ప్రబోధించాను. ఆమె నా మాట విని యవనేశ్వరుడైన భయుని వద్దకు వెళ్ళి, 'యవన వృషభా! నిన్ను నా మనోహరునిగా వరించాను. నీ తలంపు మదిలో నాటుకొని నన్ను నేనే మరచిపోతున్నాను. శాస్త్రబోధ, లోకమర్యాద లోకంలో అందరికీ అనుష్ఠేయాలే. దాన పరిగ్రహాలు రెండూ శాస్త్రసిద్ధాలు, వాటిని ఆదరింపని వారు బాలుర వలె శోచనీయు లవుతారు. నాకై నేనుగా వచ్చి నన్ను నీకు సమర్పించుకొంటున్నాను. నన్ను నిరాకరింపక దయతో స్వీకరించు. దీనులను కరుణించడం కంటె ఉత్తమమైన ధర్మం వేరొకటి లేదు. ఇది దేవరహస్యం' అని పలికింది.

యవనేశ్వరుడు ఆ మాటలకు మందహాసం చేసి, 'అమ్మాయీ! నీ గతిని గూర్చి యోగదృష్టితో అనుశీలించాను. నీవు వరించేవారందరూ నిన్ను నిషేధిస్తారు. అయితే నా గతేమిటని అడుగుతావేమో? అవ్యక్తగతివై ప్రపంచమంతా పర్యటిస్తూ కర్మనిర్మిత లోకాన్ని ఆశ్రయించి నీకు తోడుగా ఉండమని నా సేనను నీతో పంపిస్తున్నాను. ఆ సేనాసాహాయ్యంతో నీవు ప్రాణినాశం కావిస్తావు. ఇదిగో ఇతను నా సోదరుడు ప్రజ్వారుడు. నీవు నాకు చెల్లెలి వవుతావు. మీ యిద్దరి తోడ్పాటుతో నేను భీమసైనికుడనై లోకమంతటా సంచరిస్తాను' అని చెప్పి ఆ కన్నెను మొత్తానికి ఎలాగో ఒప్పించి కాలకన్యకా ప్రజ్వారులను కూడి సైన్యయుతుడై భూమండల మంతటా సంచరింపసాగాడు.

ఒకనాడు యవనేశ్వరుడు ఆ పురంజన పురాన్ని ఆక్రమింపదలచాడు. కాలకన్యక ముందుగా వెళ్ళి పురంలోనికి ప్రవేశించి అందులోని సారాన్ని పీల్చి పిప్పి చేసింది. దానివెంట యవనులు నానాద్వారాల నుంచి లోనికి చొచ్చుకొనివెళ్ళి పీడించారు. గంధర్వ యవనుల దొమ్మి జరిగి పురమంతా ససిచెడి శిథిలప్రాయమై పోయింది. రాజు సిరి తరిగిపోయింది. అతనిని కృపణత్వం పైకొన్నది. కుటుంబమమకారం దుర్భరమై అతను వ్యాకులసాగరంలో మునిగాడు. పుత్త్రులు, పౌత్రులు, అమాత్యులు,

పరిచరులు మొదలైనవారందరూ అతనియెడ తొల్లింటి ఆదరాన్ని చూపడం మాని నిర్లక్ష్యం చేయసాగారు. మురిపాలు కురిపించిన భార్య కూడా పూర్వస్నేహాన్ని సడలించింది. అతనికి ఏమి చేయాలో మార్గం తోచలేదు. అతని భార్య, పిల్లలు, పరివారం ప్రతివారూ తమ తమ స్థితిని చూసుకొని పరితాపతప్తులై చిరాకుపడటం మొదలుపెట్టారు. వారి దుఃఖాన్ని చూసి పురంజనునికి నిలువెల్లా వణకసాగింది.

రాజా! పురంజనుడు ఆ దుఃఖాలను చూడలేక దగ్ధవృక్షకోటరాన్ని త్యజింపబూనిన సర్పరాజు వలె ఆ పురాన్ని విడిచిపెట్టాలని ప్రయత్నించాడు. యవనుల ముట్టడి సందులేకుండా కొనసాగుతున్నది; గంధర్వులు కదలనివ్వరు. అతను దిగులుతో చిక్కి సత్త్వహీనుడై కదలలేకపోయాడు. భయుడు అతని పైకి ఉరికాడు. యవనులతనిని పట్టుకొని కట్టి పశువు లాగా ఈడ్వసాగారు.

అటువంటి దుఃస్థితిలో కూడా పురంజనుడు తనకోసం ఆవంతైనా చింతపడలేదు. అతని మనస్సంతా భార్యాబిడ్డల మీదే ఉన్నది. ఏదో చెప్పలేని దిగులుతో అతను కన్నీరు మున్నీరుగా ఏడుస్తాడు. 'అయ్యో! పుత్త్రకులారా! పౌత్రులారా! మిమ్మల్ని విడిచి ఎలా వెళ్ళేది? ఈ పరిచారకులను, పరివారాన్ని, ధనధాన్యాలను వదిలిపెట్టి ఎలా వెళ్ళగలను? దయితారత్నమా! ఇక నీ గతేమిటి? దిక్కులేని బిడ్డలను ఒక్క రెక్కన నీవు మాత్రం ఎన్నాళ్లని పోషిస్తావు? కాంతామణీ! నేను స్నానం చేయకపోతే నీవు చేయవు! నేను తిననినాడు నీవూ భుజింపవు. నాకు కోపం వచ్చినప్పుడు గడగడ వణకుతావు; గట్టిగా అంటే ఎదురు చెప్పవు. పొరబాటున తగని పనిని నేను తెలియక చెయబోతుంటే నయవినయాలతో నా తప్పు నాకు తెలియజెప్పి ఆ అకార్యం నుంచి నన్ను మరలిస్తావు. ఇట్టి గృహిణీమతల్లిని నిన్ను బాసి గృహస్థ ధర్మాలను ఎలా నెరవేర్చగలను? నా అవివేకం ఏమనుకోవాలి? నా భార్య వీరపత్ని; వీరజనని. నాతో సహగమనం చేస్తుందే కాని నన్ను విడిచి క్షణమైనా ఉండదు.

నాయనలారా! ఇన్నాళ్ళూ నీడలో చల్లగా పెరుగుతున్నారు. ఇక మీ గతి సముద్రంలో తటాలున పగిలిన ఓడయొక్క చీలికల గతివంటిదవుతుంది కాబోలు. నేటితో మీకూ నాకూ చూపులు తీరాయి. మిమ్మల్ని విడిచిపెట్టడం తప్పనిసరి కాగల కడకాలం దాపురించింది' అని లోలోపలే కుమిలిపోసాగాడు. అంతలో పంచశీర్షపన్నగం దగ్ధమై రూపుమాసి ఆయా మహాభూతాలలో కలిసిపోయింది. పురంజనునికి అటువంటి దురవస్థలో కూడా తన చిరకాల మిత్రుడు అవిజ్ఞాతుడు ఏనాడూ జ్ఞాపకానికి రాలేదు.

## పరలోక బాధలు

రాజా! పురంజనుడు ఆ విధంగా మృతిచెంది పరలోకంలో కాలు పెట్టగానే అతను తన యజ్ఞార్థం చంపిన పశువులు అతని వల్ల పూర్వం తామనుభవించిన బాధలను తలచుకొంటూ అతని కోసం ఎదురు చూస్తున్నవి వచ్చి మీదపడి బాకుల వంటి కొమ్ములతో పొడిచి పొడిచి నుగ్గునూచం చేసి కసితీర్చుకొన్నాయి. అతను తమోగ్రస్తుడై స్మృతి కోల్పోయి అనేక సంవత్సరాలు దురంతమైన ఆర్తితో కుమిలి పోయాడు.

## పురంజనుని పునర్జన్మ

రాజా! ప్రారబ్ధ కర్మఫలభోగార్థం తదనుగుణమైన శరీరాన్ని ఊతగా గ్రహించి జీవుడు జన్మిస్తుంటాడు. అట్లా జన్మించిన ఆ జీవితకాలంలో పెక్కు కోర్కెలను కోరుతూ తదర్థమై వివిధ కర్మలను ఆచరిస్తూ కర్మఫలభోగానంతరం ఆ దేహాలను వదిలిపెట్టి పునః ప్రారబ్ధ కర్మఫలభోగార్థం జన్మిస్తుంటారు.

ఈ పునర్జన్మ విషయంలో ఒక విశేషం ఉన్నది. మానవుడు తన అవసాన కాలంలో ఏ కోర్కెను ప్రగాఢంగా కోరుకొంటూ శరీరాన్ని విడిచిపెడతాడో ఆ కోర్కె తక్కినవాటికంటె ముందుగా ఫలోన్ముఖం అవుతుంది. ఆ ఫలాన్ని అనుభవించడానికి తగిన శరీరం వస్తుంది. అవసానకాల వాంఛ ఎంత బలవత్తరమైనదో చూడు.

పురంజనుడు తన అవసాన దశలో భార్యనే స్మరిస్తూ ప్రాణాలు విడిచాడు. అవసాన కాలంలో అతను కామవివశుడై శరీరాన్ని వదిలినందువల్ల, కామోత్కటానికి స్త్రీ రూపం ఎంతో తగినది కావడం వల్ల అతను స్త్రీ జన్మ నెత్తవలసి వచ్చి విదర్భరాజుకు పుత్రికగా జన్మించాడు. విదర్భరాజును పాండ్య మలయధ్వజుడు జయించి అతని కుమార్తెను పెండ్లాడాడు. వారికి ఒక కుమార్తె, ఏడుగురు కొడుకులు పుట్టారు.

మలయధ్వజుని పుత్రిక శమదమాదివ్రతయై వన్నెకెక్కింది. ఆమెను అగస్త్య మహర్షి కిచ్చి వివాహం చేశారు. వారికి ధృతచ్యుతుడు, ధృతచ్యుతునికి ఇధ్మవాహుడు జన్మించారు.

## మలయధ్వజుడు

మలయధ్వజుడు శ్రీభగవానుని ఆరాధింపగోరి రాజ్యాన్ని కొడుకులకు పంచి పెట్టి కులగిరిని చేరి చంద్రమస, తామ్రపర్ణి, నవోదకం మొదలైన నదులలో స్నానమాడి బాహ్యాభ్యంతరమలాలను తొలగించుకొని కఠిన తపోనిష్ఠుడై కందమూల ఫల పర్ణ తృణ జలాహారాలతో దేహయాత్ర గడుపుకొంటూ ద్వంద్వాలను జయించి అనిలాశనుడై ఇంద్రియజయాన్ని పొంది సమదర్శనత్వం సాధించి కామాదులను వాసనలతోపాటు నిర్మూలించి బ్రహ్మతాదాత్మ్యభావనుడై మ్రానివలె నిలిచి నూరు దివ్యవర్షాలు వాసు దేవుని యెడ ఆత్మరతిని కావించాడు. దేహాదులు ఆత్మ కాదని, జడములు మాత్రమేనని, ఆత్మప్రకాశితాలై ఇంద్రియాలు వ్యవహరిస్తున్నాయని, అంతః కరణవృత్తులకు ఆత్మ సాక్షిమాత్ర మవుతుందని అతనికి అనుభవసిద్ధమై తెలిసి వచ్చింది. అతని హృదయాంతరంలో విశుద్ధజ్ఞానదీపిక ప్రకాశించింది. విశ్వమంతా బ్రహ్మాత్మకమై ఉండటం, బ్రహ్మము తనలోనూ తాను బ్రహ్మము లోనూ ఉండటం అతనికి స్పష్టపడింది. తర్వాత ఆ జ్ఞానం కూడా నశించిపోయింది.

మలయధ్వజుని భార్య చంద్రచంద్రిక వలె పతి ననుసరించి తీవ్రవ్రతయై జడలు దాల్చి నిరంతర భర్తృపరిచర్యలతో కాలం గడుపుతూ ఒకనాడు యథా ప్రకారం అతని సన్నిధిసేవకు పోయి అతను బ్రహ్మైక్యం పొందిన సంగతి తెలియక కొంతసేపు వేచి చూసింది. ఎంతసేపటికీ అతను బహిర్ముఖుడు కాకపోయేసరికి ఆమె కలత చెంది పాదాలను తాకి చూస్తే అవి చల్లబడి ఉన్నాయి. అది చూడగానే ఆమె ప్రాణాలు జివ్వుమన్నాయి; కన్నుల వెంబడి అశ్రుధారలు కురియసాగాయి. ఆ నిర్మానుష ప్రదేశంలో ఆమెకు మాట సాయం కూడా లేకపోయింది. ఆ దీనురాలు మాటిమాటికి పతి అడుగులపై వాలుతూ, లేని సత్తువను తెచ్చుకొని లేస్తూ, గుండెలు మోదుకొంటూ బిగ్గరగా ఏడుస్తూ, 'ప్రాణనాథా! లేవండి; క్షత్రియాధాములు దొంగలై భూమండలాన్ని నానా ఇబ్బందులు పెడుతున్నారు. ఆ చోరుల బారినుంచి ధాత్రీచక్రాన్ని కాపాడండి' అని గగ్గోలుపడుతూ కొంతసేపు దుఃఖించి గత్యంతరం కనబడక ఉపశాంతి వహించి, కాష్ఠాలను సంగ్రహించి చితిపేర్చి పతి కళేబరాన్ని దానిపైకి చేర్చి నిప్పు రగిల్చి సహగమనం చేయబోతున్నది.

## అవిజ్ఞాతుని ఉపదేశం

ఇంతలో పురంజనుని మిత్రుడు అవిజ్ఞాతుడు యాదృచ్ఛికంగా అక్కడికి వచ్చి వైదర్భిని చూసి, 'కళ్యాణీ! నేను నీ సఖుడిని. పూర్వం మన మిద్దరమూ మానససరోవరంలో హంసలమై వేయేండ్లు విహరించి సుఖస్థితి ననుభవించాము. అంతట నీవు కామభోగచిత్తవై నన్ను వదిలి భూమిపై సంచరిస్తూ పంచారామం నవద్వారం ఏకపాలకం త్రికోష్ఠకం షడ్వణిక్కులం పంచవిపణం పంచప్రకృతికం స్త్రీధనం అయిన ఒక స్త్రీని కలిశావు.

ఎలాగంటావా? విను. శబ్దాదివిషయాలు ఐదూ కలిసి పంచారామం; వక్త్ర నాసాది రంధ్రాలు తొమ్మిదీ తొమ్మిది ద్వారాలు; ప్రాణం ఏకపాలకుడు; పృథ్వీ జల తేజస్సులు మూడూ త్రికోష్ఠకం; జ్ఞానేంద్రియాలు ఐదూ మనస్సుతో కలిసి షడ్వణిక్కులం; కర్మేంద్రియాలు అయిదూ పంచ విపణాలు;

భూతపంచకమే పంచప్రకృతికం; శక్తి అన్నది ఏలిక; వీటితో కూడిన దేహం నివాసస్థానం. నీవు నన్నెడబాసి అటువంటి దేహాన్ని ప్రవేశించి ఆ యింతికి చిక్కి దానితో రమిస్తూ స్మృతిని కోల్పోయావు. ఆ స్త్రీ సంగఫలంగా ఇట్టి పాపదశ నీకు ప్రాప్తించింది. నిజంగా చూస్తే నీవు విదర్భరాజపుత్రివి కావు. ఇతను నీకు పతి కాడు. నీవు పురుషుడవు. అయినా స్త్రీనని అనుకొంటావు. కారణమేమంటావా? నా మాయాయోగమే కారణం.

భ్రాంతిని మాని నీవు నా స్వరూపాన్ని అవలోకించు. మన మిద్దరమూ అనాది పరిశుద్ధులము. మనకు అణుమాత్ర భేదమైనా లేదు. భేదభావానికి కారణం తెలుసా? విద్యావిద్యల ఉపాధిభేదాలను బట్టి భేదభావాలు కలుగుతున్నాయి. వస్తువు ఒకటే అయినా అద్దంలో ప్రతిఫలించినప్పుడు బింబిత వస్తువు కంటె బింబం వేరుగా కనబడటం ఉన్నది కదా. అలాగే నీకూ నాకూ భేదం అన్నది ప్రతీతి గోచరమే తప్ప వాస్తవం కాదు' అని పలికాడు.

రాజా! అవిజ్ఞాతుడంటే ఎవరనుకున్నావు? భగవానుడే అవిజ్ఞాతుడు. భగవానుడు ఆ విధంగా బోధించిన తర్వాత అంతవరకూ తనను వైదర్భినిగా భావిస్తుండిన అవిద్యోపాధికుడైన జీవుడు స్మృతిపొంది తనకు, పరమాత్మకు కలిగిన వియోగాన్ని గ్రహించాడు.

రాజా! భగవానుడు విశ్వప్రకాశకుడు కాని పరోక్షప్రియుడు. అందువల్ల అధ్యాత్మతత్త్వాన్ని పురంజన కథావ్యాజంతో నీకు బోధించాను' అన్నాడు

ప్రాచీనబర్హి ఆ మాట విని, మునీంద్రా! సంకేతగూఢార్థములై ఉన్న నీ పలుకులు జ్ఞానులకు తెలిసినట్లు మా బోంట్లకు సుబోధంగా లేవు. వాటి అర్థాన్ని వివరించండి' అని ప్రార్థించాడు. నారద మహర్షి అతనితో ఇలా అన్నాడు:

## సంకేత వివరణం

'రాజా! శరీరాలు ఏకపాదులు, ద్విపాదులు, త్రిపాదులు, చతుష్పాదులు అని రకరకాలుగా ఉంటాయి. జడములైన వాటన్నిటికీ పురములని పేరు.

అట్టి జడపురాలకు చైతన్యాన్ని కూర్చే అతనికి పురంజనుడని వ్యవహారం. అంటే జీవుడని భావం. అవిజ్ఞాతుడు అంటే గుణక్రియానామాదులు లేనివాడని అర్థం. అతనినే ఈశ్వరుడు, పరమాత్మ అని పేర్కొంటారు. ఆ ఈశ్వరుడు దేహాదులలో ప్రతిఫలించినప్పుడు జీవుడని వ్యవహరిస్తున్నాము. ఈశ్వరజీవులకు బింబ ప్రతిబింబ న్యాయాన్ని బట్టి వారు చిరమిత్రులవుతారు.

ఈశ్వరుడు ప్రకృతి గుణాలను గ్రహింపదలచినప్పుడు ప్రకృతి రచితమైన పురాన్ని వరించి పురుషు డనబడుతాడు. ఆ శరీరంలో ఒక అంతఃకరణ ఉన్నది. అది 'నేను', 'నాది' మొదలైన అభిమానాన్ని కలిగిస్తుంది. దానిని బుద్ధి అంటారు. బుద్ధినే మన కథలో ప్రమదగా వర్ణించుకొన్నాము. పురుషుడు బుద్ధి అనే ఆ ప్రమదను ఆశ్రయించి ఇంద్రియగుణాలను అనుభవిస్తాడు. దీనిని రతి అంటారు. జ్ఞాన కర్మేంద్రియాలు పురుషునకు నెచ్చెలులు; ఆ ఇంద్రియాల వృత్తులు సఖీజనం.

ప్రాణానికి ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అని అయిదు వృత్తులున్నాయి. అందువల్ల ప్రాణం పంచశీర్షపన్నగంగా వర్ణింపబడింది. జ్ఞాన కర్మేంద్రియాలు రెండింటినీ మనస్సు ప్రేరేపిస్తుంటుంది కనుక మనస్సుకు బృహద్బలుడనే కథా వ్యవహారం కలిగింది. శబ్దాదులు ఐదూ పంచవిషయాలు. వాటి సముదాయమే పాంచాలం. వాటికి నడుమ నవద్వారపురం ఉంటుంది. రెండు కన్నులు, రెండు నాసికా పుటాలు, నోరు– ఈ అయిదూ పూర్వద్వార పంచకం. కుడి కన్నుకు ఖద్యోతమని, ఎడమ కన్నుకు అవిర్ముఖి అని పేర్లున్నాయి. కుడి ముక్కును నళిని అనీ ఎడమ ముక్కును నాళిని అని పేర్కొంటారు. కుడి చెవి దక్షిణ ద్వారం; ఎడమ చెవి ఉత్తర దార్వం. గుదశిశ్నాలు పశ్చిమద్వార ద్వయం.

రూపము ప్రకాశితం కనుక విభ్రాజితమని, దృష్టి దర్శనసాధనం కనుక ద్యుమంతుడని, గంధము సౌరభ విషయమని, ఘ్రాణము అవధూతుడని, ఆస్యము ముఖ్యనామక ద్వారమని, వాగింద్రియం విపణమని, రసనేంద్రియం

రసజ్ఞుడని, వాగ్వ్యవహారం ఆపణమని, చిత్రమైన అన్నం బహ్వోదనమని, దక్షిణ కర్ణం పితృహువని, ఉత్తర కర్ణం దేవహువని, కాలోపలక్షక సంవత్సరం చండవేగుడని, మున్నూట అరవై పగళ్ళు మూడు వందల అరవైమంది గంధర్వులని, మున్నూట అరవై రాత్రులు మూడు వందల అరవైమంది గంధర్వాంగనలని, పరలోకాన్ని మెచ్చని కాలాన్ని కన్యక అని, అది మృత్యువుకు చెల్లెలని, మృత్యువు భయుడనే యవనేశ్వరుడని, ఆధి వ్యాధులు మృత్యు సైనికులని, భూతాలకు శీఘ్ర మృత్యుహేతుభూతమైన శీతోష్ణద్వివిధ జ్వరం ప్రజ్వారుడని, ప్రవృత్తి నివృత్తి శాస్త్రం పాంచాల దేశమని, శ్రోత్రం పితృయాన దేవయాన ప్రాప్తిసాధనం కనుక శ్రుతధరుడని, మేఢ్రం ఆసురమనే పేరుగల పశ్చిమ ద్వారమని, వ్యయామం గ్రామకమని ఉపస్థం దుర్మదుడని, గుదం నివృతి అని, నరకం వైశసమని, వాయువు లుబ్ధకుడని, హస్తపాదాలు క్రియాగతులను కావించే అంధచరులని, హృదయం అంతఃపురమని, మనస్సు విమోచనమని, పురుషుడు సాక్షిస్వరూపుడైనప్పటికి గుణలిప్తుడై తద్గుణ క్రియా విక్రియలు తనవిగా తలచి తమోరజస్సత్త్వ ధర్మాలైన మోహ హర్ష ప్రసాదాలను పొందుతాడని, దేహం రథమని, ఇంద్రియాలు గుర్రాలని, సంవత్సరవేగం గతి అని, పుణ్య పాపకర్మలు రథచక్రాలని, గుణత్రయం మూడు టెక్కెములని, పంచప్రాణాలు బంధనమని, మనస్సు పగ్గమని, బుద్ధి సారథి అని, హృదయం రథికస్థానమని, ద్వంద్వాలు రెండు కూబరాలని, ఇంద్రియాలు అయిదూ పంచప్రహరణాలని, సప్తధాతువులు సప్తావరణలని, ఎండమావుల వెంట పరుగులు తీసే ప్రవృత్తి ఆసురి అని, ఏకాదశేంద్రియాలు సైన్యమని, సైన్యమూలాన పంచవిధ హింసలను కావించటం ఇంద్రియక్రీడ అని ఈ కథాస్వరూపాన్ని గ్రహించాలి.

ప్రాచీనబర్హీ! పురుషుడంటే జీవుడు. ఆ జీవుడు వస్తుగతిని బట్టి నిర్గుణుడైన ఆత్మస్వరూపు డవుతాడు. అయినా అతనికి 'నేను – నాది' అన్న అభిమానం కలిగినప్పుడు అతనిని అజ్ఞానం ఆవరిస్తున్నది. తత్ఫలంగా ప్రాణధర్మాలైన అశన పిపాసాదులు, అంధత్వాదులైన ఇంద్రియధర్మాలు,

కామాదులైన మనోధర్మాలు స్వధర్మాలుగా అతను భావించి వాటివల్ల కలిగే నానా దుఃఖాలను తానే అనుభవిస్తున్నట్లుగా నమ్మి క్లేశాల పాలవుతున్నాడు.

ప్రకృతికి పరుడు, గురుడు, స్వప్రకాశుడు అయిన పురుషుడు ప్రకృతి గుణాలలో ఎప్పుడు తగులుకొంటాడో అప్పుడతనికి తత్తద్గుణాభిమానం జనిస్తున్నది. పురుషునికి ప్రకృతి సంబంధం ఎందుకు కలుగుతున్నది? అంటే ప్రకృతి పురుషులు అవినాభావులు. పురుషునికి సంకల్పం కలిగినప్పుడు ప్రకృతి సంబంధం కలుగుతున్నది. సంకల్పం మాత్రం ఎందుకు కలగాలి? అంటే, 'దేవస్య ఏష స్వభావః' అన్నారు. భగవానునికి తన శక్తి స్వరూపమైన ప్రకృతితో కలిగే సంబంధ వియోగాలు ఆయన ఇచ్ఛాధీనాలు. ఆ సంబంధ వియోగాలను సృష్టిలయాలని అంటారు. సృష్టికాలంలో శక్తితో సంబంధం, లయకాలంలో శక్తితో వియోగం కలుగుతున్నాయి.

రాజా! గుణములు సత్త్వము, రజస్సు, తమస్సు అని మూడు విధాలని, అవి ముప్పిరి త్రాడు వలె పెనగొని ఉంటాయని చెప్పాను. పురుషుడు గుణబద్ధు డైనప్పుడు అతనిని ఆయా గుణాలు పైకొని ఆడిస్తాయి. అతను స్వాతంత్ర్యం కోల్పోయి ఆయా గుణం ఆడించినట్లు బొమ్మవలె ఆడుతుంటాడు. ఆ ఆటలకు తగినట్లుగా ఫలం ఉదయిస్తున్నది. సత్త్వగుణం ప్రకాశభూయిష్ఠమైనది. కనుక దాని చేత ప్రేరితమైన కర్మలు కూడా సత్త్వ ప్రధానములై తద్విధ లోకప్రాప్తి ఫలాన్ని కలుగజేస్తాయి. అలాగే రజోగుణం ఆయాస బాహుళ్య లోకప్రాప్తిని కలిగిస్తుంది. తమస్సు దుఃఖోత్కట లోక ప్రాప్తిని కలిగిస్తుంది.

రాజా! కర్మఫలానుభవం కూడా అతివిచిత్రంగా ఉంటుంది. ఒక్కొక్క విధమైన కర్మఫలాన్ని అనుభవించేందుకు తదనుకూలమైన దేవమనుష్యతిర్యగాది శరీరాలు కలుగుతున్నాయి. అంతే కాదు. ఆ శరీరాలు ఆయా కర్మఫలాలను బట్టి స్త్రీపున్నపుంసకాలలో ఏదో ఒకటిగా ఉండటం జరుగుతున్నది. కాబట్టి ఒకడు పురుషరూపాన్ని దాల్చి కొంత కర్మఫలాన్ని

భోగించి ఆ శరీరం వదలి స్త్రీరూపాన పుట్టి మరొక విధమైన కర్మఫలాన్ని అనుభవించి ఆ తనువును వదలి నపుంసకుడై జన్మించి వేరొక తీరున కర్మఫలాన్ని అనుభవిస్తాడు. ఈ స్త్రీ పురుష నపుంసక లింగభేదం దేవ మనుష్య తిర్యగాది శరీరాలకు కూడా వ్యాపిస్తుంది.

ఆకటికి చిక్కిన కుక్క ఇల్లూ ఇల్లూ తిరిగి తిట్టినా కొట్టినా సహించి దొరికినచోట నాలుగు మెతుకులు గతికి బ్రతుకుతున్నట్లు కామాశయుడైన జీవుడు ఉచ్చనీచాలకు లోనై పడుతూ లేస్తూ ప్రారబ్ధ సుఖ దుఃఖాలను అనుభవిస్తుంటాడు.

దుఃఖాలు దైవికములు, భౌతికములు, ఆత్మికములు అని మూడు విధాలు. దేవతల వల్ల కలిగేవి దైవికదుఃఖాలు. అన్యప్రాణుల వలన కలిగేవి భౌతిక దుఃఖాలు. తన శరీర వ్యవహారం వలన కలిగినవి ఆత్మహేతువులు. ఈ త్రివిధ దుఃఖాలు ఏయే హేతువుల వల్ల కలుగుతున్నవో ఆయా హేతువుల వల్లనే అవి నివారితం కాగలవని తలచి తదనుకూలమైన ప్రతిక్రియలను సంకల్పిస్తుంటారు. కాని ఈ ప్రతిక్రియల వల్ల కలిగే శాంతి తాత్కాలికం. వీటి వల్ల పూర్ణశాంతి కలుగనేరదు.

తాత్కాలిక నివృత్తి తలమీది బరువును భుజం మీదికి దించినట్లవుతుంది గాని ఆత్యంతిక నివృత్తి కాదు. కర్మఫల నివృత్తి మరొక కర్మ వల్ల ఎన్నటికీ కలుగదు. కారణమేమంటావా? ప్రతిక్రియలు కూడా దుఃఖ స్వరూపాలు కావడమే కారణం. ప్రవృత్తి నివృత్తి కర్మలు రెండూ అవిద్యా ప్రాప్తమైనవే. ఒక విధమైన అవిద్య వలన జనించినది వేరొక విధమైన అవిద్య వలన పోవడమంటే ఒక చెడ్డ కల వచ్చినప్పుడు కలిగిన భయాన్ని పోగొట్టుకొనేందుకు మళ్ళీ కలగనడం వంటిదన్నమాట.

రాజా! పరమార్థ స్వరూపుడైన ఆత్మవ్యక్తి తనకు ఈ విధమైన అనర్థ దుఃఖపరంపర కలుగుతున్నట్లు భావించడమే సంసారం. అట్టి భావన సత్యం కాదు. అది తనంతట తాను నివర్తింపదు. దృష్టాంతం విను. స్వప్నం మనః

కార్యం. స్వప్నం ఉన్నంత కాలం స్వప్న భయాదులు కూడా ఉంటాయి. మేలుకొనగానే ఆ కలలన్నీ కల్లలని తెలిసివస్తుంది. అలాగే సంసారమన్నది ఒక పగటి కల. సంసారం ఉన్నంత కాలం ఆ దివాస్వప్న దుఃఖాదులు నివర్తింపవు.

ఇందుకు కారణమేమంటావా? అజ్ఞానమే కారణం. అజ్ఞాననివృత్తి ఎలాగంటావా? భగవద్భక్తి వలన అది నశిస్తుంది. సంసారనివృత్తి వైరాగ్యపూర్వక జ్ఞానం వలన నశిస్తుందని, భక్తి వల్ల నశింపదని శాస్త్రం చెబుతున్న దంటావేమో? వైరాగ్యం కలగాలంటే మనస్సు క్షణిక రుచిర పదార్థాలను వదిలి నిత్యము, క్షణక్షణ వినూత్న రుచిమంతం అయిన పదార్థాన్ని సేవించాలి. అట్టి పదార్థం ఎక్కడున్నదంటే, ఒక్క భగవంతుడు మాత్రమే అట్టి రుచిరపదార్థం. మనస్సు ఆ భగవంతుని యెడ నిశ్చలమై నిల్చినప్పుడు దానికి తదితర పదార్థాలు రుచింపవు. ఆ విధంగా రుచింపనప్పుడు మనస్సు ఆ పదార్థాల వంకకు మళ్ళదు. దానినే వైరాగ్యమని అంటారు. ఆ వైరాగ్యం ఉదయించిన నాడు జ్ఞానోదయం కలుగుతుంది. జ్ఞానోదయం వల్ల అజ్ఞానం, ఆ అజ్ఞాన మూలకమైన సంసారం నివృత్తిని పొందుతున్నాయి.

అటువంటి భక్తి నాకెలా కలుగుతుంది? అంటే, అచ్యుతుని కథలను వినగా వినగా అట్టి భక్తి కలుగుతుంది. భగవత్కథలను గ్రంథాదులలో చదవటం, చదువుతుండగా వినటం రెండూ శ్రవణమందే చేరుతాయి. అయితే విశదాత్ములు, సాధువులు అయిన భాగవతోత్తముల ముఖతః భగవత్కథలను తెలుసుకొనడం గుణవత్తరమని చెప్పాలి. అటువంటి మహాత్ములు వెల్లివిరియించిన భగవత్కథా సుధారస ప్రవాహంలో మునిగి ఓలలాడేవారికి ఆకలిదప్పులు, శోకమోహాలు గుర్తుకు రావు. రాజా! క్షుత్పిపాసాదులు స్వభావజనితాలు. పరమౌషధసేవ చేత తప్ప వాటి వల్ల కలిగే బాధ తొలగదు. భగవద్భక్తి ఒక్కటే అందుకు దివ్యౌషధం. ఆ దివ్యౌషధ ప్రాప్తికి నోచుకోని లోకం హరికథా కలశరత్నాకరం వంక కన్నెత్తి చూడనైనా చూడదు.

రాజా! బ్రహ్మ, మహేశ్వరుడు, మనువు, దక్షాది ప్రజాపతులు, నైష్ఠికులైన సనకాదులు, మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, తుదకు నేను, మేమందరమూ వేదాలను వల్లించిన వాళ్ళమే; తపస్సమాధి నిష్ఠలు సలిపిన వాళ్ళమే; ఇంత చేసినా లోకసాక్షి అయిన ఆ పరమాత్ముని చూడనోచిన వాళ్ళము కాము. మేమందరమూ శబ్దబ్రహ్మామందే వర్తిల్లుతూ మంత్రాలు సంకేతించిన భగవద్విభూతులను భజిస్తాము. అపరిచ్ఛిన్న మూర్తి దర్శనం మాకింతవరకూ లభింపలేదు. కేవల లోకవ్యవహారపరులై వైదికమార్గంలో తగిలి ఉన్నంత కాలం బుద్ధి విచ్ఛిన్నమై ఏకాగ్రం కాలేదు. కనుక ఆత్మదర్శనయోగ్యమైన సుస్థితి ఏనాటికీ కలుగబోదు. కర్మకలాపం వీనులకు విందై పరమార్థరూపంలో కనబడుతుంది. అంత మాత్రాన అదే సత్యమని దానియందు పరమార్థదృష్టిని నిలుపరాదు. లోకం భగవద్విలాసం. ఆ విలాసాన్ని ఆశ్రయించి కర్మకలాపం ఉంటుంది.

రాజా! ఆలోచించి చూస్తే ఏనాటికైనా కర్మమన్నది వేదము యొక్క పరమార్థం కానేరదు. మలినమతులు వేదతాత్పర్యాన్ని తెలుసుకొనలేక కర్మమే వేదతాత్పర్యమని నమ్మి వారి మతాన్ని చిలుక పలుకులతో ప్రకటిస్తుంటారు. ఆ మాటలు నమ్మవద్దు. నీవు లోకంలో ఉన్న దర్భలన్నీ తెచ్చి ప్రాచీనాగ్రాలుగా వాటిని దేశమంతటా పరిచి ఎన్నో జీవాలను వధించి యజ్ఞాలు చేసి సంతోషంతో ఉబ్బి బూరటిల్లావు. నీ అంత ఘనుడు లేడని లోకం నిన్ను సహస్రముఖాల శ్లాఘిస్తున్నది. ఇంత చేసినా వైదిక కర్మ అంటే ఏమిటో, పారమార్థిక కర్మ అంటే ఏమిటో ఈ నాటికీ నీకు తెలియలేదు. కర్మతత్త్వసారం ఏమిటని అడుగుతావేమో. స్వార్థమైన కర్మ వాస్తవమైన కర్మ కాదు. ఏది భగవంతునికి పరితోషాన్ని కలిగిస్తుందో అదే వాస్తవమైన కర్మ. ఏది భగవంతుని యందు మనోలయం కావింపగలుగుతుందో అదే వాస్తవమైన విద్య. భగవంతుడు సర్వసృష్టికి మూలము, పరమాత్ముడు కనుక క్షేమార్థులకు ఆయన పాదమూలమే శరణమవుతుంది. భగవంతు డొక్కడే పరమప్రియుడు.

తక్కిన వారెవరూ కారు. భగవంతుడు దయామూర్తి, శ్రేయఃప్రదుడు కాబట్టి సర్వభయాలనూ నివారింపగలడు. ఈ సంగతి గ్రహించినవాడే విద్వాంసుడు.

రాజా! నీవు వేటాడే సమయంలో ఎన్నో మృగాలను చూశావు. అవి జంటలై పుష్ప వనాంతరాలలో యథేచ్ఛావిహారాలు కావిస్తూ జలతరంగాల మధురగీతాలకు మైమరచి ఇంద్రియార్థతృప్తితో పరవశించి తమ కొరకు కాచుకొని భక్షించడానికి ఉవ్విళ్ళూరుతూ మీదికురకబోతున్న తోడేళ్ళను గాని, వెన్నంటి వస్తున్న వేటగాళ్ళను గాని చూడక తటాలున కాలగతిని పొందటం నీకు తెలియనిది కాదు కదా? ఆ విధంగానే సంసారి అనే మృగం కాంతా గృహమనే పూదోటలోనికి చొరబడి క్షుద్రకామ్య సుఖాలనే పూవు తేనెలను వెతుకుతూ మిథునత్వంలో రంజిల్లుతూ తదేకమతియై కాంతా సల్లాపములనే పాటలను వింటూ పగళ్ళనే తోడేళ్ళు ముందులేచి పొంచి ఉండటాన్నీ, రాత్రులనే బోయవాళ్ళు తరుముకొని వస్తున్న దృశ్యాన్నీ చూడలేక ఎట్టకేలకు దివాంధుడై సమసిపోతున్నాడు. రాజా! ఇకనైనా మృగచేష్టితాలను తలపోసి మనోజయం సాధించి కర్ణశ్రావ్య కర్మబోధనలకు లొంగక కాముక చర్యాశ్రమమైన గృహాశ్రమాన్ని వదలి హంసశరణమైన భగవత్ప్రీతిని చూరగొని సర్వవైరాగ్యాన్ని పొందు' అన్నాడు.

## దేహపతనం - కర్మఫలభోగం

విదురా! ప్రాచీనబర్హి నారదుని మాటలను సాకల్యంగా ఆకర్ణించి, 'మహాత్మా! కర్మములు శరీర సాధన సాధ్యమైనవి. అవసాన కాలమందు సర్వకర్మలకూ సాధనంగా ఉన్న శరీరం పతనమవుతున్నది. కర్మపరులు తమ కర్మఫలాలను లోకాంతరాలలో అనుభవిస్తారని వేదప్రవక్తలు చెబుతారు. కర్మఫలం అనుభవించాలంటే శరీరం ఉండాలి. లోకాంతరగతులైన కర్మపరులు ఏ శరీరంతో తమ కర్మఫలం అనుభవిస్తారో నాకు అర్థం కాలేదు. ఈ సంశయం తీర్పగలరని అడుగుతున్నాను' అన్నాడు.

నారదుడు వెంటనే – 'ఓ రాజా! ప్రతి స్థూలశరీరంలోనూ అంతర్భూతమై లింగశరీరం అని ఒకటున్నది. అది మనఃప్రధానంగా ఉన్నది. కర్మలను స్థూలశరీరం మొట్టమొదటనే చేయడం లేదు. కర్మములన్నీ లింగశరీరం చేత ప్రేరేపింపబడి స్థూలశరీరం చేత చేయబడుతున్నాయి. కాబట్టి కర్మారంభానికి లింగశరీరమే కారణం. స్థూలశరీరం పతనం చెందిన తర్వాత కూడా లింగశరీరం శేషించి ఉంటుంది. ఆ లింగశరీరంతో జీవుడు తన కర్మఫలాలను అనుభవిస్తాడు. ఏయే లోకాలలో ఏయే కర్మఫలాలను జీవుడు అనుభవింపవలసి ఉంటుందో ఆయా లోకాలకు జీవుడు ఆ లింగశరీరంతో వెళ్ళి అక్కడ కర్మఫలానుభోగ్యమైన శరీరాన్ని ప్రవేశించి ఆ ఫలాలను అనుభవిస్తున్నాడు. కర్మఫలానుభవం పూర్తయిన దాకా లింగశరీరం నశింపదు. రాజా! కలలో ఎన్నో అనుభవిస్తున్నావు. నీ స్వప్నావస్థ యందు నీ స్థూలశరీరం జడప్రాయమై పడి ఉంటుంది. అప్పుడు సర్వం లింగశరీరం చేత జరుగుతున్నాయి. ఈ అనుభవాన్ని స్మరించినట్లయితే నీ సందేహం తీరిపోతుంది.

రాజా! ఈ లింగశరీరానికి మార్పు కలుగదా? అని సందేహం రావచ్చు. పురుషుని జీవితకాలంలో గాని మరణానంతరం గాని లింగశరీరానికి మార్పు కలుగదు. అంతమాత్రాన కర్మలను చేస్తున్న శరీరం ఒకటి, తత్ఫలాలను అనుభవించే శరీరం మరొకటి అనుకోవద్దు. 'నేను, నాది' అనే అహంకారభావంతో చేయబడినప్పుడే కర్మఫలం కర్తకు భోగ్యమవుతుంది. ఆ ఫలభోగార్థం యుక్తశరీర ధారణరూప జన్మాంతరాలు విధిగా కలుగుతున్నాయి. జన్మాంతరాలలో స్థూలదేహం లేకపోయినా పూర్వం స్థూలదేహాంతరమై ఉండిన లింగశరీరం మనఃప్రధానమైనది, అది అలాగే ఉంటుంది.

## జన్మాంతరం – లింగశరీరం

జన్మాంతరంలో లింగశరీరంతోపాటు పూర్వపు స్థూలశరీరం ఎందుకు రావడం లేదు? అంటే, కర్మఫలాన్ని అనుభవించేందుకు స్థూలశరీరం

అవసరమే కాని, ఒక్కొక్క కర్మఫలానికి ఒక్కొక్క విధమైన స్థూలశరీరం యోగ్యమవుతుంది. అన్ని కర్మఫలాలకూ ఏకరూప స్థూలశరీరం ఉపయోగింపదు. కర్మలను బట్టి ఫలాలు భిన్నభిన్నాలుగా ఉంటాయి కనుక ఒక్కొక్క కర్మఫలభోగానికి ఒక్కొక్క రూపమైన శరీరం యోగ్యమవుతుంది. కనుక లింగశరీరంతో తత్పూర్వం ఉండిన స్థూలశరీరం జన్మాంతరాలలో ఏర్పడటానికి అవకాశం లేదు.

## పూర్వ పరజన్మల స్వరూపం

రాజా! పూర్వజన్మ పరజన్మల ప్రస్తావం వచ్చింది కాబట్టి అవి నిజంగా ఉన్నాయని నిశ్చయించడం ఎలాగో చూద్దాము. ప్రతివ్యక్తి యొక్క చిత్తవృత్తి ఎటువంటిదో అతని జ్ఞానేంద్రియ వ్యవహారాన్ని బట్టి స్పష్టపడుతున్నది కదా. ఏ జన్మలో నైతే నేమి, ఈ చిత్తవృత్తి కొత్తగా పుట్టడం లేదు. ఎందుకంటావేమో? కారణము లేక కార్యం ఉండదు. ఉంటుంది అని వాదిస్తే శూన్యపదార్థం నుంచి భావపదార్థం రాగలదని అంగీకరించాలి. అభావం నుంచి భావం ఏర్పడదు కదా. అందువల్ల ప్రకృతజన్మలోని చిత్తవృత్తికి కారణం ఉండాలి. చిత్తవృత్తి శరీరోత్పత్తితో కలుగుతున్నది కాబట్టి జన్మాంతర శరీరోత్పత్తికి కారణం ఉన్నట్లే జన్మాంతర చిత్తవృత్తికీ కారణం ఉండి తీరాలి. అందువల్ల పూర్వజన్మ చిత్తవృత్తి వాసన జన్మాంతర చిత్తవృత్తికి కారణమని ఏర్పడుతున్నది.

> అయితే చిత్తమన్నది స్వయంగా వ్యవహరింపరాదా? అంటే, అది జడము కాబట్టి దానికి స్వతంత్ర వ్యవహారం ఉండదు. మరి ఎప్పుడో ఒకప్పటి మన అనుభవంలోని విషయం కాలాంతరంలో స్మృతికి వస్తుండడం మన ప్రకృతానుభవమే నిరూపిస్తున్నది. ఒక్కొక్కప్పుడు కలలో ప్రకృతజన్మలో ఎన్నడూ కనీ వినీ ఎరుగని అపూర్వ విషయాలను అనుభవిస్తుంటాము. ఇది స్వాప్నికస్మృతి అన్నమాట. ఈ స్మృతికి పూర్వానుభవం ఏదో ఉండాలి కదా. ఈ

అనుభవాలను బట్టి పూర్వజన్మ పరజన్మలు ఉన్నాయని సిద్ధాంతం ఏర్పడింది.

## లింగశరీర జనన స్థితిగతులు

ఇక ఈ లింగశరీరం ఎప్పుడు పుట్టింది? అన్న ప్రశ్న మిగిలి ఉన్నది. లింగశరీరం అంటే మనోబుద్ధీంద్రియార్థగుణాల పరిణామరూపం. మనోబుద్ధ్యాదులు ఎప్పుడు కలిగాయో అప్పుడు లింగశరీరం ఉద్భవించింది. ఎంతదాకా లింగశరీరం ఉంటుందో అంత దాకా దానికి స్థూలశరీర సంబంధం తప్పదు. సుషుప్తి, మూర్ఛ, సంతాపం, మృత్యువు మొదలైన వేళలలోనూ లింగశరీరం ఉంటుందా? అంటే తప్పక ఉంటుంది. అయితే ఒక్క విశేషం. సుషుప్త్యాదులందు ఇంద్రియవ్యవహారం స్తంభించిపోతుంది. అందువల్ల అహంకారం ఉన్నప్పటికీ ప్రకాశం లేనిదవుతుంది. అహంకారం ప్రకాశింపనందున లింగశరీరమూ స్ఫురణకు రాదు. గర్భావస్థ యందు, బాల్యదశలోనూ లింగశరీరం స్థితి వేరుగా ఉంటుంది. ఆ సమయాలలో ఇంద్రియాలు సమగ్రంగా వర్తింపని కారణాన లింగశరీరం మాటుపడి ఎల్లకాలం ఉండే చంద్రుడు అమావాస్య నాడు కాన్పింపనట్లుగా ఉంటుంది. అంత మాత్రాననే లింగశరీరం నశించినట్లు భావింపకూడదు. సంసారం సత్యం కాదని చెప్పాను. అసత్యపదార్థము యొక్క వృత్తి మాత్రం ఎట్లా నిలిచి ఉంటుందంటావా? సంసార చింతాపరుల విషయంలో మాత్రమే నేను చెప్పినది వర్తిస్తుంది. నిరర్థకచింతనలు స్వప్నంలో రూపుదాల్చి కనిపించడం లేదా? సంసార విషయమూ అటువంటిదేనని భావించాలి.

రాజా! లింగశరీరం జడమైనప్పటికీ జీవుడు దానికి చైతన్యం కలుగజేస్తున్నాడు. జీవుడు ప్రారబ్ధదేహాన్ని త్యజించి పరదేహాన్ని ప్రవేశించినప్పుడు లింగశరీర సహితంగా ప్రవేశిస్తున్నాడు. హర్ష శోక భయ సుఖ దుఃఖాదులు జీవునికి లింగశరీరం ద్వారానే అనుభవానికి వస్తున్నాయి. జీవుడు ప్రకృత దేహారంభానికి కారణమైన కర్మఫలానుభవం

సమాప్తమైనంతదాకా తన దేహమందలి అభిమానాన్ని వదిలి పెట్టడు. పరదేహం ప్రాప్తమైనప్పుడు అతని అభిమానాన్నీ ఆ క్రొత్త దేహమందే ఉంటున్నందున అతనికి పూర్వపు దేహస్మరణమన్నా ఉండదు.

జీవుని ఈ పూర్వ దేహత్యాగ పరదేహప్రాప్తులు తృణజలూక న్యాయాన జరుగుతుంటాయి. జీవుడు ప్రాప్తదేహుడై ఆ దేహప్రారబ్ధక కర్మఫలాలను ఇంద్రియాల చేత అనుభవిస్తూ కర్మలు చేస్తున్నంత కాలం అతనికి మనోవృత్తి ఉంటుంది. ఆ మనోవర్తనమే సంసార కారణం. దానినే అవిద్య అంటారు. అవిద్య ఉన్నంతకాలం కర్మబంధం తప్పదు.

## కర్మ ఫల నిశ్చయం

కర్మఫలం అదృశ్యం కాబట్టి అనుమాన ప్రమాణ సాధ్యం మాత్రమేనని, అది కాలాంతర భోగ్య మవుతుందని ఎట్లా నిశ్చయించావు? అంటే, కర్మ ప్రవాహంలో ఈ సర్వమూ యుక్తమే కాగలదు. కర్మప్రవాహం ఎట్లా తీరుతుంది? అవిద్య ఎప్పుడు నశిస్తుందో అదీ అప్పుడే నశించిపోతుంది.

అవిద్య అంటే ఏమిటి? అజ్ఞానం. ఏది అజ్ఞానం? సత్యాన్ని చక్కగా గ్రహింపలేకపోవటమే అజ్ఞానం. అజ్ఞానం నశించినప్పుడు సత్యం ప్రతీతమవుతుంది. అప్పుడు కర్మతత్త్వం స్పష్టపడుతుంది. దానితో వైరాగ్యాదులు ఉదయిస్తాయి. తత్ఫలంగా కర్మప్రవాహం నశిస్తుంది.

అజ్ఞానమంటే ఎటువంటిది? అని అడగవచ్చు. వివిధరూపమైన జగత్తును మనము కళ్ళారా చూస్తున్నాము కదా. ఈ జగత్తు భగవంతుని కంటె భిన్నమైనదని తలచి వ్యవహరించడం అజ్ఞానమన్నమాట. అట్టి అజ్ఞానం ఎలా పోతుంది? అంటే చూడు. సత్యానికి అర్థం ఏమిటి? విశ్వమంతా భగవదాత్మకమే గాని తద్భిన్నము కాదన్న భావం. రూఢి అయినప్పుడు తత్పూర్వం ఉన్న భావం నశించిపోతుంది. చీకటిలో త్రాడును చూసి పామనుకొని భయపడటం, దీపపు వెలుతురులో చూసిన తర్వాత ఆ త్రాడు

పాము కాదని నిశ్చయించడమూ ఇందుకు నిదర్శనలు. అందువల్ల నీవు సర్వవిధాలా భగవంతుని భజించు' అని బోధించి ప్రాచీనబర్హికి వీడ్కొలిపి వెళ్ళాడు.

ఆ తర్వాత ప్రాచీనబర్హి కొడుకులను ప్రజారక్షణకు నియమించి తపోవ్రతుడై కపిలాశ్రమానికి వెళ్ళి కోరికలు లేని ఏకాగ్రమతితో భగవంతుని భజించి విదేహకైవల్యం పొందాడు.

విదురా ! నారదమహర్షి బోధించిన ఈ మార్గం మనశ్శోధకం, సర్వోత్కృష్ట ఫలప్రదం అయినట్టిది. ఆ దారిని నడచినవారికి జనన మరణ భ్రమణం తొలగిపోతుంది.

> విదురా! అహంకారాన్ని ఆశ్రయించి బుద్ధి వర్తిస్తుంటుంది. అహంకారం నశింపనంత వరకు బుద్ధికి హితాహిత వివేక నిర్ణయశక్తి కలుగదు. ఆ శక్తి కలుగనంత వరకు సంశయాలు తొలగవు. కాబట్టి అహంకార విచ్ఛేదానికై మొట్టమొదట పూనుకోవాలి.

## ప్రచేతసుల తపఃప్రకారం

విదురుడు ఆ మాటలను విని, 'మునీంద్రా! ప్రచేతసులు రుద్రగీతా పూర్వకంగా హరిని ఆరాధించారన్నావు. వారు ఏ గతిని పొందారు? వారికి గిరీశుని దర్శనం అనాయాచితంగా లభించింది. అతని ప్రాపుగాంచిన వారికి మోక్షము సిద్ధమే. ప్రచేతసులు ఆయనను దర్శింపక పూర్వమే ముక్తులై ఉన్నారా? లేక తద్దర్శన ఫలంగా ముక్తిని పొందారా? ఈ వివరం చెప్పు' అని ప్రార్థించాడు. మైత్రేయుడు చెప్పాడు.

'విదురా! ప్రచేతసులు ఆ విధంగా బోధితులైనప్పుడు వారికి పరోక్షమాత్ర తత్త్వజ్ఞానమే కలిగింది. అంతట వారు సముద్రాంతరం చేరి అక్కడ భగవానుని రుద్రగీత స్తోత్ర రూప యజ్ఞాన ఆరాధిస్తూ పదివేల సంవత్సరాలు తపస్సు

చేశారు. అప్పుడు భగవానుడు కనక కుండల కిరీటాది భూషితుడై మేరుపర్వత శిఖరాన ఉన్న నీలమేఘం వలె గరుడవాహనాన్ని అధిరోహించి శ్రీదేవితో పంతానికి వస్తున్నట్లున్న వనమాల వక్షఃస్థలంపై అలరారుతుండగా కిన్నరాదులు స్తుతులు చదువుతూ వెంటరాగా సకల పరివార సమేతంగా వారికి సాక్షాత్కరించి, 'నృపకుమారులారా! శుభమస్తు. మీకు ఇచ్చవచ్చిన వరం ఏమిటో చెప్పండి. సౌహార్దంలో మీరు అన్యోన్యసమానులు. మీ భక్తికి మెచ్చాను. రేయింబవళ్ళు రుద్రగీతా పూర్వకంగా ఏకమతితో నన్ను ప్రస్తుతించేవారికి వారి అభీప్సితవరాలనే గాక శోభనమైన ప్రజ్ఞను కూడా ఇస్తాను. మీరు మీ తండ్రి ఆజ్ఞను సంతోషంగా తలదాల్చినందున మీ యశస్సు లోకప్రచారమవుతుంది. మీకు ఒక కుమారుడు కలుగుతాడు. అతను గుణాలలో పరమేష్ఠికి సాటియై పుత్రశబ్దాన్ని సార్థకం చేసి లోకదీపకుడవుతాడు.

ప్రచేతసులారా! పూర్వం దేవేంద్రుడు కండుమహర్షి తపస్సును భగ్నం చేయగోరి కమలలోచన అనే అప్సరస కుమార్తె ప్రమ్లోచనను అతని వద్దకు పంపాడు. ఆ ముని ఆమె సౌందర్యానికి లోబడ్డాడు. ఆమె గర్భవతియై ఆ పిండాన్ని అక్కడ ఒక వృక్షవాటికలో పడవేసి వెళ్ళిపోయింది. ఆ పిండం కన్యయై జనించి ఆకలితో ఏడవసాగింది. ఆ పసికందుపై సోమరాజు జాలిగొని అమృతాన్ని స్రవించే తన చూపుడు వ్రేలిని ఆమె నోటికి అందించాడు. అమృతపానంవల్ల ఆమె సోమ పుత్రికగా అల్లారుముద్దుగా పెరిగి యౌవనవతియై ఉన్నది.

మీరందరూ ఏకశీలురు; ఆమె కూడా మహాశీలవతి. ఆ కన్యను పెండ్లాడండి. ఆమె మీ అందరియెడ సమానానురాగంతో వర్తింపగలదు. ఆమెతో కూడి మీరు వేయి దివ్య వర్షాలు సమస్తభోగాలను అనుభవిస్తారు. నాకు భక్తులు కాబట్టి కామాది మలినాలు మిమ్మల్ని తాకవు. మీరు విరక్తులై మా సన్నిధిని చేరుకొంటారు.

## గృహాశ్రమం - పరమపదం

గృహాశ్రమవాసులకు పరమపదం సిద్ధిస్తుందా? అని వెనకాడవద్దు, గృహాశ్రమంలో ఉన్నప్పటికీ శుభకర్మలను కావిస్తూ నా కథాశ్రవణంతో కాలం గడిపేవారికి గృహాదులు బంధకారణాలు కావు. ఆ నా కథలను ఎవరి ద్వారా వింటే మంచిదని అడుగుతారేమో? బ్రహ్మవాదులు చెప్పగా విని తెలుసుకోవాలి. నాకు అనేకానేక మూర్తులు ఉన్నాయి. ఒక్కొక్క మూర్తిని గురించి ఒక్కొక్క కథ చెబుతాను. నా కథలను వింటుడేవారికి వారి వారి అభిరుచులను బట్టి నా మూర్తులలో ఒక్కొక్కటి ప్రీతిపాత్ర మవుతుంది. నా రూపాలలో ఏ రూపం ఎవరికి ఇష్టమైతే నేను వారికి ఆ రూపంలో ప్రసన్నుడ నవుతాను. వారు నన్ను దర్శించి శోక మోహ రహితులై వెలయగలరు’

అని పలికాడు.

## ప్రచేతసులచే భగవన్నుతి

విదురా! భగవద్దర్శన మాత్రాన ప్రచేతసుల రజస్తమస్సులు నశించాయి. వారు కేలుమోడ్చి హర్షగద్గద వచనాలతో భగవంతుని స్తుతింపబూనారు:

‘దేవా! నీవు సమస్త క్లేశాలనూ నశింపజేస్తావు. నీ ఉదారగుణ నామాలు సకల శ్రేయస్సాధనాలని శ్రుతులు నిరూపిస్తున్నాయి. నీ తత్త్వం ఇటువంటిదని ఊహింపగల మనశ్శక్తి, వర్ణింపగల వచశ్శక్తి మాకు లేవు. నీ మార్గం నయనాదులైన ఇంద్రియాలకు కూడా తెలియరానిది. నీవు స్వరూపస్థితుడవై శుద్ధ శాంత స్థితిమంతుడవై సృష్టి స్థితి లయ నిమిత్తమాత్రాన స్వమాయ నధిష్ఠించి బ్రహ్మాది రూపాలను తాల్చి వ్యవహరిస్తావు. అజ్ఞానం సంస్కృతిని హరిస్తుంది. నీకు రూపము వలెనే నామమూ

కలుగనేరదు. అయినా నీవు కావించే కార్యాలను బట్టి నీకు హరి కృష్ణ వాసుదేవాది నామాలను పెట్టుకొంటారు. నీవు సర్వసత్త్వానికి ప్రభుడవై కమలనాభుడవు కమలమాలాధరుడవు కమలనేత్రుడవు కమలపాదుడవు కమల కింజల్క పిశంగ శుభ్రవస్త్రుడవు సర్వభూత నివాసుడవు సర్వసాక్షివి అయి విరాజిల్లుతున్నావు.

స్వామీ! క్లేశ పరంపరలకు వశులమై మాకు సర్వక్లేశ సంక్షయకరమైన నీ రూపాన్ని సందర్శించే మహాభాగ్యం అనుగ్రహించావు. నీ కరుణ ఎంతని చెప్పగలము? అదను వచ్చినప్పుడు ప్రభువులు దీనులకు చిరస్మరణీయమైన కార్యాలను చేయడం ఆ ప్రభువులకు కర్తవ్యం. ప్రభువుల కరుణావిధానం వారి కర్తవ్య నిర్వహణలో ఒక భాగం మాత్రమే. నీవో? నీ వంకకు మా హృదయాలను మరలించు కొనడమే గాక నీ సందర్శనమిచ్చి మమ్ము ధన్య ధన్యులను కావించావు. నీ స్మరణ మాత్రాననే సర్వభూతాలకు ఉపశాంతి కలుగుతుంది.

దేవా! నీవు క్షుద్రభూతములందు కూడ అంతర్యామివై ఉన్నవాడవు కనుక ఎవరేమి కోరుకొంటారో నీకు తెలియనిది కాదు. మేమిప్పుడు ప్రత్యేకించి విన్నవించడం దేనికి? మా ఇచ్ఛవచ్చిన వరం కోరుకోమన్నావు. సర్వపురుషార్థభూతుడవు, మోక్షమార్గప్రవర్తకుడవు అయిన నిన్ను సందర్శింప గలిగాము. అదే మాకు పదివేలు. అంతకన్న కోరదగినది మాత్రం ఏముంటుంది? స్వభావాన్ని బట్టి తుమ్మెద చంచలాతిచంచలమై సంచరించేదయినా దానికి పారిజాతపుష్పం లభించినప్పుడు ఆ మకరందాన్ని వదులుకొని అన్యపుష్పాలకు ఆశపడదు. ఆ తీరుననే మాకు నీ పాదమూలాశ్రయం లభించినప్పుడు దానిని వదిలి అంతకంటె గొప్పది ఏమున్నదని వేరొకటి మేము కోరగలము?

దేవా! ఒక్కటి కోరమన్నావు గనుక కోరుకొంటాము. నీ మాయకు లోనై కర్మమార్గంలో తగులుకొని కొట్టుమిట్టాడుతూ ఎన్ని జన్మలెత్తినా ప్రతి జన్మలోనూ నీ భక్తుల సంగమం మాకు కలిగే వరాన్ని అనుగ్రహించు. రాజ్యభోగాలు స్వర్గాపవర్గాలు ఉండగా వాటిని కాదని భాగవతుల సంగమం దేని కొరకు? అంటే, రాజ్యభోగాదులు భాగవతుల చెలిమికి గోరంత సాటి రావు. సత్సంగంలో ఉన్న మహిమ ఎటువంటిదంటే భాగవతులు నీ పరిశుద్ధ చరిత్రలను కీర్తిస్తుంటారు. అట్టి చరిత్రలు లవమాత్రమన్నా చెవిసోకితే ఆ భాగ్యానికి నోచినవారి హృదయాంతరాళం నిర్వైరమై పరిశుద్ధ మవుతుంది. ఎప్పుడు వైరభావం లేదో అప్పుడు భూతభయం ఉండదు. మరి రిత్త కోరికలూ జనింపవు. అందువల్ల విరక్తి కలుగుతుంది. దానితో ముక్తసంగు లవుతారు. వారి భావం నీ యందే నిలకడ గలిగి ఉంటుంది. వారావిధంగా ఏకాగ్రమతులై నిన్నే ధ్యానిస్తూ నీ తోడిదే లోకంగా జీవితశేషాన్ని గడిపివేస్తారు.

స్వామీ! అట్టి భక్తుల పాదరేణువులు సోకి నదీ క్షేత్రాలు తీర్థభూతము లవుతుండగా సంసార భయగ్రస్తుడికి వారితో సమాగమం రుచింపక పోతుందా? దేవా! మహేశ్వరుడు నీకు ప్రియసఖుడు. ఆయనతో కలిగిన సమాగమ ఫలంగా నిన్ను దర్శింపగలిగాము. నీవే మాకు గతివైనావు. సంసారమృత్యుబాధను తొలిగించే వైద్యుడవు, ప్రాపుగా నీవు మాకుండగా మాకు కోరదగినది మరేమున్నది? అయినా మా ఆంతర్యాన్ని విన్నవిస్తాము. మేమొనర్చిన స్వాధ్యాయం, మేము కావించిన గురూపసదనం, విప్రసిద్ధానువర్తనగా నడచుకొన్న మా నడత, మేము చేసిన ఆర్యప్రణామాలు, సర్వభూతములందు అసూయారహితంగా మేము ఆచరించిన భాతృ సుహృద్భావం,

జలమధ్యగతులమై బహుకాలం అనుష్ఠించిన పరమ తపస్సు నీ పరితోషానికి ఉపకరిస్తాయి గాక.

స్వామీ! మనువు, స్వయంభువుడు, భవుడు, తదితర మహాత్ములు బహుకాలం తీవ్ర తపస్సు చేసి విశుద్ధాత్ము లైనవారే నీ మహిమ యిట్టిదని గాని, ఇంతమాత్రమని గాని చెప్పలేకపోయారు. ఇక మా బోంట్ల సంగతి చెప్పాలా? అయినా మా అల్పబుద్ధికి తోచినంతలో వర్ణింపక మానలేదు. నీకు అందరూ సములు; హెచ్చుతగ్గులు నీ మనస్సులో అడుగుపెట్టవు. రాగాదిరహితుడవు కనుక నిత్యశుద్ధుడవు పూర్ణుడవు పరమపూరుషుడవు వాసుదేవుడవు సత్త్వస్వరూపుడవు; నీకు మా వలన కలిగే ప్రయోజనం ఏమీ లేదు. ఇవే మా నమస్కృతులు. ఇంతకంటే మే మేమీ సమర్పింపలేము'

అని సాగిలబడ్డారు.

విదురా! ప్రచేతసులు భగవద్దర్శన మాత్రాననే సంతుష్టిని చెందలేదు. భగవంతుడు ఎల్లవేళల సాక్షాత్కరించి తమ ఎదుటనే ఉండాలని వారి తాత్పర్యం. భగవానుడు భక్తవత్సలుడు కాబట్టి ఎంతో ప్రీతిచెంది వీరికి అభిమతసిద్ధిని ప్రసాదించాడు.

అంతట ప్రచేతసులు నీటినుంచి బయటికివచ్చి నలుదెసలా పరికించారు. వృక్షాలు మిన్నులొరసి నేలను మాటుపుచ్చి స్వర్గమార్గాన్ని నిరోధిస్తున్నట్టుగా పెరిగి ఉన్నాయి. ప్రచేతసులది చూసి, 'ఔరా! ప్రాచీనబర్హి సన్యసించినందువల్ల దేశమంతా అరాజకమైపోయింది కాబోలు. రాజు లేనందున నేలదున్ని పైర్లు పెట్టేవారు లేకపోయినట్లున్నది. అందువల్ల వృక్షాలు విచ్చలవిడిగా మొలిచి పెరిగి భూమిని కప్పివేశాయి కాబోలు' అని తలచి అలుక వహించి 'భూమండల మంతా భూజరహిత మవుతుంది గాక' అంటూ తమ ముఖాల నుండి నిప్పుగాడ్పులను ప్రభవింపజేశారు. ఆ మారుతాగ్నులు ప్రళయకాలాగ్ని రుద్రుల భంగి చెలరేగి తరుజాలాన్ని

కాల్పసాగాయి.

బ్రహ్మదేవుడది చూసి ప్రమోచన అనే దేవకాంతను పిలిచి, ఆమె కడుపున కొన్ని వృక్షాలను దాల్చి కాపాడమని నియోగించి, ప్రచేతసుల కడకు వచ్చి సాంత్వన వాక్యాలతో వారి కోపాన్ని చల్లార్చాడు. ప్రమోచన తన గర్భంలో దాచిన వృక్షాలను అప్పుడు వెలిబుచ్చింది. కన్యకారూపంలో అవతరించిన ఆ వృక్ష సంతతికి మారిష అని పేరుపెట్టి బ్రహ్మ ఆమెను ప్రచేతసులకు కానుకగా ఇచ్చాడు. వారామెను వివాహం చేసుకొన్నారు.

విదురా! దక్షుడు అయోనిజుడైనప్పటికీ తొల్లిటి శివనిందాపచార ఫలితంగా మనుష్య యోని యందు పుట్టవలసి వచ్చింది. అతడు ప్రచేతసుల వీర్యాన మారిషాగర్భంలో క్షత్రియజాతి యందు జనించాడు. పుట్టుక తోనే అతనికి తేజోమహిమ, దక్షత్వము స్వతస్సిద్ధ మైనాయి. అతను చాక్షుష మన్వంతరంలో ఈశ్వరచోదితుడై ప్రజాసర్గం చేసి దక్షుడని పేరు గడించాడు. మరీచి ప్రభృతులు వారి వారి నియమితకార్యాలకు పూనుకొన్నారు. ప్రజాసర్గం ఎటువంటి అడ్డంకులు లేక కొనసాగింది.

## ప్రచేతసుల ముక్తి

విదురా! ఆ విధంగా వేయి దివ్య సంవత్సరాలు గడిచాయి. అప్పుడు ప్రచేతసులకు జ్ఞానం ఉదయించింది. దానితో శ్రీ మహావిష్ణువు పూర్వం చెప్పిన వచనాలు వారికి స్మరణకు వచ్చాయి. అంతట వారు భార్యను తమ పుత్రుల వద్ద వదలి సన్యసించి పశ్చిమ సముద్రతీరాన్ని బట్టి ప్రయాణించి అక్కడ తొలుత జాబాలి సిద్ధి పొందిన పుణ్యాశ్రమం చేరుకొని ఆత్మవిచార దీక్షాపరులయ్యారు.

భూతములు నానారూపాలలో చరాచరాత్మకంగా ఉన్నప్పటికీ వాటన్నిటి లోనూ ఉన్న ఆత్మ ఒకటే గాని వేరు వేరైన ఆత్మలు కావని తత్త్వశాస్త్రం బోధిస్తున్నది. ఆ భావం స్వానుభవసిద్ధ మైనప్పుడు గాని సందేహాలు తీరవు.

సందేహాలకు కారణం మనస్సు. మనస్సుకు బహిర్వస్తువులతో

సంయోగం ఇంద్రియాల మూలకంగా కలుగుతున్నది. అట్టి సంయోగ ఫలంగా మనస్సు బహిర్ముఖమై ఇంద్రియాల వంకకు ప్రసరిస్తున్నది. తత్త్వార్థం స్వానుభవసిద్ధం కావాలంటే మనస్సు దాని బాహ్యసంచారం మాని ఏకాగ్రమై తత్త్వవిచారం చేయాలి. మనస్సు ఆ విధంగా కావడానికి మనస్సుకు సారథి భూతాలయిన ఇంద్రియాలను నిగ్రహించాలి. ఇంద్రియనిగ్రహ ఫలంగా మనస్సుకు బాహ్యప్రచారం ఉడిగిపోతుంది. అంతట ప్రాణాలను నిరోధించి జితాశనులై శరీరం మూలాధారం మొదలు శిరస్సు వరకు వంకర లేనట్లుగా స్తిమితంగా కూర్చోవాలి. తత్ఫలంగా శాంతి కలుగుతుంది. అప్పుడు ఆత్మను బ్రహ్మ మందు చేర్చి నిలపాలి. తత్ఫలంగా బ్రహ్మాత్మైక్య భావం సిద్ధిస్తుంది. దానితో భేదభావాలు నశించిపోతాయి.

విదురా! ప్రచేతసులు ఆ విధంగా తత్త్వశాంతికి పూనుకొన్నారు. ఆ తరిని నారదమహర్షి వారి వద్దకు వచ్చాడు. ఆ మహర్షిని చూసి వారు లేచి ప్రణామాది సత్కారాలతో యథావిధిని పూజించి ఆయనను సుఖాసీనుని చేసి స్వాగతం పలికి, 'మునివర్యా! మీ దర్శనం మా సుకృతఫలమే తప్ప వేరొకటి కాదు. మహాత్మా! లోకమంగళ దాయకులై మీరు సూర్యుని రీతి సంచరిస్తుంటారు. వెనుక శివకేశవులు మాకు అధ్యాత్మతత్త్వం ఉపదేశించారు. గృహాసక్తుల మయినందువల్ల ఆ ఉపదేశాన్ని మేము మరచినట్లయింది. మీరు మమ్మల్ని కరుణించి మళ్ళీ మాకు ఆ తత్త్వాన్ని బోధింప వేడుతున్నాము. మీ బోధను అనుసరించి అజ్ఞానమూలకమై దరిగానరాని భవసాగరాన్ని దాటుతాము' అని పలికారు.

విదురా! నారదుడు వారి కోరిక విని నారాయణావేశిత చిత్తుడై,

'ప్రచేతసులారా! గృహాసక్తిని తగిలి హరిసేవను వదిలి సుఖార్థం ఎన్ని కర్మలను చేసినా మరెన్ని జన్మలెత్తినా ఫలాన్ని

పొందలేరు. ఎందుకంటే జన్మకర్మాదు లన్నింటికీ హరిసేవ ఒక్కటే ఫలం. విశ్వాత్ముడు, సర్వేశ్వరుడు అయిన భగవంతుని ఏ జన్మలో సేవింప నోచుకొంటారో ఆ జన్మమే జన్మ కాని తక్కిన జన్మలు జన్మలు కావు. ఇంతెందుకు ! భగవదర్పితమైన కర్మమే కర్మము; భగవదర్పితమైన మనస్సే మనస్సు. భగవదర్పితమైనప్పుడే జీవితం జీవితమవుతుంది. అలా కానప్పుడు అన్నీ వ్యర్థమే.

ప్రచేతసులారా! మనిషి పుణ్యాత్ములైన తల్లిదండ్రులకు పుడితే పుట్టవచ్చు; ఉపనయనాది సంస్కారాలను పొందితే పొందవచ్చు; వివిధ యజ్ఞాలను చేస్తే చేయవచ్చును. యావజ్జీవం వైదికకర్మలను కావిస్తే కావింపవచ్చును. ఘోరతపస్సులను ఆచరిస్తే ఆచరింపచ్చును. వాక్చమత్కారాన్ని, నానావధాన సామర్థ్యాన్ని, బుద్ధి నైపుణ్యాన్ని, ఇంద్రియశక్తిని సంపాదిస్తే సంపాదింపవచ్చు. ప్రాణాయామాది యోగాలను అభ్యసించి సాంఖ్యతత్త్వ పరిజ్ఞానంతో వైరాగ్యాదులను పొంది సర్వసన్యాసి అయితే కావచ్చునేమో. అయితే ఇందులో ఒకటి గాని, అన్నీ కలిపి కాని భగవత్సేవాపరమైనప్పుడే శ్రేయస్సాధనాలవుతాయి. కాకపోతే అన్నీ నిరర్థకాలవుతాయి.

ప్రచేతసులారా! ఆత్మ కన్న ప్రియమైనది లేదు. ఇతరములు ప్రియం కావడం లేదా? అని అంటారేమో. అవన్నీ ఆత్మార్థమే ప్రియమవుతున్నాయని సమాధానం. ఆత్మమంటేనో? అది సర్వలోక వ్యాపకమై ఉన్నది. ఆత్మకు ప్రియమైనప్పుడు సర్వలోక ప్రీతి కలుగుతున్నది. వృక్షమూలంలో నీరు పోసినప్పుడు దాని శాఖోపశాఖలకు పత్ర పుష్ప ఫలాదు లన్నింటికీ తృప్తి కలుగుతున్నది కదా. భోజనం చేసినప్పుడు సర్వేంద్రియాలకు తృప్తి కలుగుతున్నది కదా. అలాగే భగవదారాధనం వల్ల సర్వలోక సంతృప్తి కలుగుతుంది.

ప్రచేతసులారా! ఆ విధంగా చేయక ఒక్కొక్క కొమ్మ దగ్గర నీరుంచినా, ఒక్కొక్క అవయవానికి తృప్తి కలుగజేసినా సర్వవృక్షప్రీతి గాని సర్వేంద్రియ

ప్రీతి గాని ఏ విధంగా కానేరదో అలాగే భగవంతుని వదలి ఇతర దేవతలను ఆరాధించినప్పుడు తత్తద్దేవతలకు ప్రియమవుతుందే గాని సర్వాత్మకునకు ప్రీతి కలగదు.

సూర్యుని వలన వర్షాకాలంలో వర్షాలు పడి నీరు చేరుతున్నది. వేసవి రాగానే ఆ నీరు సూర్యుని తిరిగి చేరుకొంటున్నది. మరి చరాచర భూతములన్నీ పృథ్వీతత్త్వం నుంచి శరీరాలు దాల్చి తుట్టతుదకు పృథ్వీతత్త్వాన్నే చేరుకొంటున్నాయి. ఇవన్నీ అనుభవసిద్ధాలు. అలాగే చేతనాచేతన ప్రపంచమంతా భగవంతుని వలన ప్రకటమై కట్టకడకు ఆయనలో లయిస్తున్నది.

ప్రచేతసులారా! గుణప్రవాహ ఫలమైన ప్రపంచానికంతటికీ భగవంతుడే ఆధారభూతుడని చెప్పడం వల్ల భగవంతుని యెడ సోపాధికత్వాన్ని నిరూపించడం లేదా? అని శంకింపవద్దు. భగవానుడు సర్వోపాధిరహితుడు. అట్టి నిరూపాధికుని వలన కలిగినవి కూడా నిరుపాధికాలే కాని సోపాధికాలు కావు.

ప్రపంచం భగవద్భిన్నంగా కనిపించడానికి కారణం ఏమిటి? అంటే ప్రపంచం నిజంగా భగవద్భిన్నమో కాదో ముందు నిర్ణయించాలి. ప్రపంచం భగవద్భిన్నమైన ఒక ప్రత్యేక వస్తువయితే అది సర్వకాల సర్వావస్థల లోనూ ఉండాలి కదా. ఆ విధంగా కాక అది మేల్కొన్నప్పుడు కానుపిస్తూ నిద్రించేటప్పుడు కానరాక గగన గంధర్వనగరాన్ని పోలి ఉన్నది. సూర్యునికంటే అతని ప్రకాశం ఏ విధంగా వేరు కాదో ఆ విధంగానే భగవంతుని కంటె ప్రపంచం వేరు కాదు.

భగవంతుని కంటె వేరు పదార్థం కానటువంటి ప్రపంచం భగవద్భిన్నంగా కనబడడానికి కారణం ఏమిటని గదా, ఆలోచిస్తున్నాము. త్రివిధమైన అహంకారమే అందుకు కారణం. ఆ అహంకారానికి కారణమేమంటారా? భేదభ్రమ ఒక్కటే కారణం. భ్రమాకార్య మేమిటంటారా?

వాస్తవంగా లేని వస్తువును ఉన్నట్లు తోపజేయడమే భ్రమాకార్యం. ఈ అహంకార భ్రమలకు ఉత్పత్తి స్థానమేదని అడుగుతారా? అన్నింటికీ ఉత్పత్తిస్థానమైన భగవానుడే వీటికి కూడా ఉత్పత్తి కావాలి గదా అని మీరనుకోవచ్చు. భగవానుడు అసంగుడు. అసంగుని యందు అహంకార భ్రమాదులు కలుగవు. కాబట్టి భగవానుడు వీటికి ఉత్పత్తిస్థానం కానేరడు.

భగవానుడు అసంగుడయితే ఆయన యందు ప్రపంచోత్పత్తి లయాలు మాత్రం ఎట్లా కలుగుతున్నవంటారా? అకాశమందు ఒకప్పుడు చీకటి ఒకప్పుడు ప్రకాశమూ వస్తూ పోతూ ఉండటం మనకు తెలిసిన విషయమే. ఆ విధంగా రాకపోకలను గలిగిన తమఃప్రకాశాలు ఆకాశానికి వర్తించనట్లే ప్రపంచోత్పత్తిలయాలు కూడా భగవానునికి వర్తించవు. కారణ మేమిటంటారా? ఉత్పత్తిలయాలు భగవచ్ఛక్తి యొక్క త్రిగుణరూప ప్రవాహాలు. భగవానుడంటేనో? గుణాతీతుడై ఉంటాడు. అనగా గుణము యొక్క కార్యం గుణియందు ఆరోపింపబడి ఆ విధంగా గుణియైన భగవానుడు సర్వకారణ కారణం అవుతున్నాడు. అనగా నిమిత్తోపాదానకారణాలు, కర్త భగవంతుడే అవుతున్నాడు.

## ఆత్మైకత్వ భావ భజనం

ప్రచేతసులారా! భగవానుడు ఆత్మస్వరూపంలో సర్వదేహులయందు ప్రకాశిస్తూ, కాలప్రధాన పురుషాకృతులలో వెలుగొందుతూ స్వతేజో నిరస్త నిఖిల గుణప్రవాహుడు, సంకల్ప వికల్పరహితుడు, అద్వయుడు, అభేదదృష్టి గోచరుడు, అనాది మధ్యలయుడు, నిత్యానందుడు, చిద్ఘనుడునై ఉంటాడు. జీవబ్రహ్మైక్యం కోరినవారు భగవంతుని ఈ విధమైన భావంతో భజించాలి. అట్లా భజించనినాడు ఐక్యము కలుగదు. కారణ మేమంటారా? పదార్థాల గుణం ఏకమైనప్పుడే వాటికి కలయిక కలుగుతుంది గాని గుణభిన్నాలకు కలయిక ఉండదు కదా.

## శుద్ధచిత్త సమర్పణ

ప్రచేతసులారా! భగవత్పరతత్త్వాన్ని అందరూ తెలుసుకొనలేరు. అటువంటి అజ్ఞులు భగవంతుని ఏ విధంగా అర్చించాలి? అంటే, వారు మొట్టమొదట చిత్తశుద్ధిని పొందాలి. చిత్తశుద్ధికి సాధనానుష్ఠానాన్ని పాటించాలి. సర్వభూతముల యెడ దయగలిగి ఉండటం, అప్రార్థితంగా ఎప్పుడు ఎంత ప్రాప్తిస్తే అంతటితో సంతుష్టి చెందటం, సర్వేంద్రియాలను నియమించి ఉపశాంతి పొందటం – వీటిని సాధనగా అనుష్ఠించితే చిత్తము పరిశుద్ధమవుతుంది. అట్టి చిత్తశుద్ధితో తనను భగవంతునకు సమర్పించుకొని 'త్వమేవ శరణ' మని ఉండటం భక్తి. అట్టి భక్తులకు భగవానుడు సంతోషించి వారి హృదయాలలో నిరంతరం నిలిచి ఉంటాడు.

భగవానుడు సర్వాంతర్యామి కనుక అందరి చిత్తాలలోనూ ఉంటాడని, భక్తుల చిత్తాలలో మాత్రమే ఎల్లవేళలా ఉంటాడనడంలో విశేషమేమిటని అడగవచ్చు. భక్తులు వారి చిత్తాలను భగవంతునికి సమర్పించినందున వారి హృదయాలు కామరహితములై స్వచ్ఛదర్పణాలవలె నిర్మలములై ప్రకాశిస్తాయి. స్వచ్ఛదర్పణంలో ప్రతిబింబం యథాస్థితిని ఉన్నదున్నట్లు కనబడినట్లు హృదయాంతర్వర్తి అయిన భగవానుడు భక్తుల నిర్మలచిత్తాలలో విస్పష్టంగా గోచరిస్తుంటాడు. భక్తులు ఆ విధంగా తోచిన భగవద్బింబాన్ని చూసి తన్మనస్కులై విస్మృతి చెందక నిరంతరం తదేక భావపరులై ఉంటారు. చిత్తము పరిశుద్ధం కానినాడు భగవానుడు అంతర్వర్తి అయినా స్పష్టపడకుంటాడు. అందువల్ల మలినాత్ములు తమలో ఉన్న భగవంతుని కనుగొనలేకపోతారు. ఆ ఇద్దరికీ తారతమ్యం ఇదేనవి గుర్తుంచుకోవాలి.

ప్రచేతసులారా! భగవానునకు భక్తివలె విద్యాధనికుల గర్వపూర్వక పూజలెంతమాత్రమూ పనికిరావు. అందువల్లనే భక్తుడు నిత్యదరిద్రుడైనా భగవంతునికి ప్రియతముడు కాగలడు. నిత్యపూర్ణుడై ఎప్పుడూ ఏ కొదవలేని భగవానునికి అన్యుల దానాలకోసం అర్రులుచాచి ఉండవలసిన అగత్యం లేదు. సకల సంపదలకు నివాసస్థానం లక్ష్మి. అట్టి లక్ష్మి కూడ భగవంతుని నిరంతరం అనువర్తిస్తున్నప్పటికీ ఆయన భక్తులవలె ఆమెనంతగా ప్రేమింపడు. ఆ లక్ష్మిదేవి కాళ్ళు పట్టుకొని పైకి వచ్చిన భాగ్యసంపన్నుల సంగతి వేరే చెప్పాలా?

## ధ్రువ నిదర్శనం

నాయనలారా! నా మాటకు నిదర్శన మేమిటంటారా? మీ వంశంలో పుట్టి పేరెన్నికగన్న ధ్రువుడే ఇందుకు నిదర్శనం. అతను అయిదేండ్ల ప్రాయపువాడై ఉండగా సవతితల్లి అతనిని నానాదుర్భాషలాడింది. ఆ మాటలతనికి నిశితబాణాలైసోకాయి. తల్లిదండ్రులను వదలి అతను వనమార్గం పట్టాడు. మార్గమధ్యంలో అతనికి నేనెదురై సంగతి విచారించి అతని మనసు పసిగట్టి తగిన తీరున ఉపదేశించాను. అతను ముక్కు పచ్చలారని అర్భకుడై ఉండి నా ఉపదేశం ప్రకారం భగవంతుని ఆరాధించి మెప్పించి అన్ని పదవులకు పై నున్న ధ్రువపదాన్ని అధిష్ఠించాడు. ఆ స్థానమంటే సప్తర్షులు కూడా తలయెత్తి చూడవలసిన సర్వోన్నత పదవి అన్నమాట. మీరు శివుని ఉపదేశాన్ని పొందారు. ఆ ప్రకారం మీరు భగవానుని ఆరాధించండి; మీకు సంసారనివృత్తి కలుగుతుంది' అని ప్రబోధించాడు.

విదురా! నారదుడు ఆ విధంగా వారికి ఉపదేశించి భగవత్కథలు మరికొన్ని చెప్పి బ్రహ్మలోకానికి వెళ్ళాడు. ప్రచేతసులు నారదుడు చెప్పినట్లు భగవత్పాదపద్మాన్ని ధ్యానించి సద్గతిని పొందారు.

విదురా! నీ వడిగిన నారద ప్రచేతస్సంవాదాన్ని, ఉత్తానపాదుని వంశాన్ని వివరించాను. ప్రియవ్రతుడు నారదునివలన అధ్యాత్మ విద్యను గ్రహించి తిరిగివచ్చి కొంతకాలం రాజ్యపరిపాలన కావించి అంతట రాజ్యాన్ని కొడుకులకు పంచియిచ్చి భగవత్పదం చేరుకొన్నాడు' అని మైత్రేయుడు విదురునితో అన్నాడు.

రాజా! మైత్రేయుడు చెప్పిన హరికథలను విన్నంతన విదురునికి భక్త్యావేశంతో మేను గగుర్పొడిచింది. కన్నుల వెంబడి హర్షాశ్రువులు జారాయి. కొంతసేపటికి అతను తేరుకొని మైత్రేయునికి నమస్కరించి, 'యోగీశ్వరా! భగవద్దర్శనానికి తమఃపారాన్ని దాటాలి; అది దాటే మార్గం నాకు బోధించారు; ఇది మీకు నాయెడ గలిగిన అనుగ్రహ విశేషం; నేను ధన్యధన్యుడ నయ్యాను; కృతజ్ఞుడను. ఇక సెలవు తీసుకొంటాను' అని పలికి అతనికి వీడ్కొలిపి ప్రవృద్ధభావుడై అక్కడి నుంచి తరలి స్వజన సందర్శనోత్సుకతతో హస్తినాపురానికి బయలుదేరాడు.

నాయనా! పరీక్షిన్నరేంద్రా! భగవానునకు సర్వాత్మ సమర్పణ కావించిన రాజుల చరిత్రలు వినిపించాను. ఈ చరిత్రలు విన్నవారికి ఆయురర్థకీర్తులు, కుశలైశ్వర్య సద్గతులు కలుగుతాయి.'

చతుర్థస్కంధము సంపూర్ణం.

# శ్రీమద్భాగవతము

## రెండవ సంపుటము

(పంచమ షష్ఠ సప్తమ అష్టమ నవమ స్కంధములు)

*సరళాంధ్ర పరివర్తన:*

**డా॥ ఏల్చూరి మురళీధరరావు**

**రామకృష్ణ మఠం**

దోమలగూడ, హైదరాబాదు-500 029.

# విషయానుక్రమణిక

## శ్రీమద్భాగవత కథాముఖం



## పంచమ స్కంధం

## షష్ఠ స్కంధం

## సప్తమ స్కంధం

## అష్టమ స్కంధము 329



## గజేంద్రమోక్షఘట్టం 336

## నవమ స్కంధము 411

## శ్రీమద్భాగవత కథాముఖం

### దశమస్కంధ విశేషవివృతి 505

# శ్రీమద్భాగవత కథాముఖం

**ఆంగ్లమూలం : శ్రీ తపస్యానంద స్వామిజీ**

**తెలుగు సేత : డా॥ ఏల్చూరి మురళీధర రావు**

## ప్రథమ స్కంధం

శ్రీమద్భాగవత ప్రథమ స్కంధం విషయప్రవేశముఖంగా భాగవత గ్రంథావిర్భావానికి కారణమైన కథాపరిశ్రయాన్ని, ద్వాపరాంతంలో ధర్మవిప్లవం సంభవించినపుడు శిష్టాతర్పణార్థం నేలకు దిగివచ్చిన శ్రీకృష్ణభగవానుని ప్రాభవత్యాన్ని మనోహరమైన సంవిధానశిల్పంతో అభివర్ణిస్తున్నది. నైమిశారణ్యంలో మహాసత్త్రదీక్షితులై ఉన్న ఋషులు విశ్రాంతి సమయంలో తమ ఆశ్రమానికి వచ్చిన సూత రోమహర్షణుని భగవల్లీలాకృత్యాలను గురించి ప్రశ్న లడుగుతారు. శ్రీకృష్ణనిర్యాణంతో ప్రారంభమైన కలికాలంలో మానవుని ఆధ్యాత్మిక జీవితం గతేమిటని ఆందోళన చెందుతారు. వారి ప్రశ్నలకు సమాధానంగా సూతుడు భాగవత ధర్మాన్ని ఉపదేశించి, శ్రీకృష్ణలీలావిలాసాలను సంకీర్తిస్తున్న భాగవతపురాణ కథాశ్రవణే అందుకు కర్తవ్యమని అంటాడు. ఆ విధంగా శ్రీకృష్ణభగవానుని అవతారకృత్యాలను, ఉపదేశాలను ముముక్షులోకానికి ప్రీతిదాయకంగా సమర్పించిన శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణపాత్ర సర్వాంగశోభతో వెలసి విలసిల్లింది.

ఆ తర్వాత సూతుడు భాగవత పురాణకర్త వేదవ్యాసమహర్షి స్వయంగా తన కొడుకు శుకయోగికి ఉపదేశించిన పాఠాన్ని శ్రీశుకుడు ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహీపతికి బోధిస్తున్న సమయంలో తానూ అక్కడ ఉండి నేర్చుకొన్నానని ఋషులతో అంటాడు. సాత్యవతేయుడు భాగవత రచనకు పూనుకొన్న ఆ ఉదంతం సవిస్తరంగా వివరింపబడింది. ఈ సందర్భంలోనే భాగవతాగ్రేసరుడైన నారదమహర్షి పూర్వజన్మ వృత్తాంతం స్మరింపబడింది.

శుకయోగి ఆసన్నమరణుడైన పరీక్షిత్తుకు భాగవతాన్ని ఎందుకు వినిపింపవలసి వచ్చిందని ఋషులు ప్రశ్నింపగా సూతుడు మహాభారత యుద్ధానంతరం ద్రోణసుతుడు అశ్వత్థామ ఉపపాండవులను వధించి ఉత్తరగర్భంలో ఉన్న పాండవవంశాంకురాన్ని సైతం హతమార్పగోరి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించటం, శ్రీకృష్ణుడు బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించి పరీక్షిత్తుకు ప్రాణదానం చేయటం మొదలైన అనేక సన్నివేశాలను ప్రస్తావించాడు. లోకహితవిధాతలైన శ్రీకృష్ణుడు, పాండునందనులు జనహృదయాలలో సుప్రతిష్ఠితులై సర్వాంతికతమంగా మెలగిన వృత్తాంతం సంక్షేపకృతమే అయినా అతిమనోహరసంవిధానంతో అద్భుతంగా చిత్రింపబడింది. ఆ తర్వాత పాండవ మహాప్రస్థానం, శ్రీకృష్ణనిర్యాణం జరిగాయి. ఈ ఘట్టాలను చదివి కంటతడి పెట్టని వారుండరు. శ్రీకృష్ణపరమాత్మ అవతారపరిసమాప్తి కాగానే భూమిపై అడుగుపెట్టిన కలిపురుషునితో పాండవపౌత్రుడైన పరీక్షితునికి వివాదం సంభవిస్తుంది.

పరీక్షితుని రాజ్యపాలనలో శాంతిభద్రతలు నెలకొన్నాయి. దేశం సుభిక్షమయింది. కలిపురుషుడు లోకంలో ప్రవేశపెట్టిన అపక్షయాన్ని, ధర్మభ్రంశతను అతను సమర్థంగా నిరోధింపగలిగాడు. అయితే క్షణికావేశానికి లొంగి పాల్పడిన అవివేకకృత్యానికి ఫలంగా అనతికాలంలో అతను తక్షక సర్పదష్టుడై మరణింపగలడని ఋషిశాపం తగిలింది. పశ్చాత్తాపతప్తుడైన పరీక్షిత్తు సర్వసంగాలను విడిచి దేహత్యాగార్థం ఉపవాసదీక్ష గొని ఉన్న సమయంలో అనభ్యూహితంగా శుకమహర్షి అక్కడికి వస్తాడు. తన వలెనే మృత్యుముఖంలో ఉన్న మానవులు ఆత్మజ్ఞానోపలబ్ధికి ఏమి చేయాలని పరీక్షిత్తు

ఆయనను అడుగుతాడు. అతని ప్రశ్నకు సమాధానంగా శుకయోగి అపరోక్షజ్ఞానసంపదకు ఆలవాలమైన శ్రీమద్భాగవతాన్ని ఉపదేశించాడు.

ఈ విధంగా ఇతివృత్త తదాముఖం లోని ఒక్కొక్క సన్నివేశం లోనూ సర్వాత్మకుడైన శ్రీకృష్ణుని మహిమాతిశయం పరిసర్పించినదంటే గ్రంథకర్త అపూర్వకథాకథనకౌశలమే అందుకు కారణం. వివిధస్కంధముక్తాశోభితమైన భాగవతహారంలో ఈ ప్రథమ స్కంధం, తరళస్ఫూర్తితో విడంబిస్తున్నది. నిజానికి భాగవతంలో అతిప్రసిద్ధమై శ్రీకృష్ణలీలాసర్వస్వ మనదగిన దశమ స్కంధానికి ఈ మొదటి స్కంధమే పరిపూర్ణతను ఆపాదింపజేస్తున్నది. గ్రంథానికి నాందీముఖమే అయినా శ్రీకృష్ణావతార తాత్పర్యనిరూపకమైన ఈ భాగాన్ని మనము పరిసమాపన భరతవాక్యంగా పరిగణించాలి. భాగవతాన్ని ఆధారపరచుకొని వెలువడిన అసంఖ్యాకరచనలలో కూడా ఈ స్కంధసారమే బహుళీకరింపబడింది. ఈ సందర్భంలో 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్న దళాన్ని కూడా మనము ప్రత్యేకంగా స్మరించాలి. తక్కిన అన్ని చోట్ల శ్రీకృష్ణావతారం కళ లేదా అంశమాత్రమని ప్రసక్తింపబడగా, ఈ ఘట్టంలో శ్రీకృష్ణావతారం పూర్ణావతారమని, అన్యావతారాల కంటే విలక్షణమని ప్రతిపాదించటమే గ్రంథకర్త ఆశయం. వైష్ణవమతంలో శ్రీకృష్ణాతిమానుషతత్త్వం ప్రాధాన్యాన్ని సంతరించుకొన్న తర్వాత పరిణతి నందిన భక్తిరసావేశం ఈ నిరూపణలో ప్రతిధ్వనిస్తున్నది.

## ద్వితీయ స్కంధం

శ్రీ మద్భాగవతంలోని ద్వితీయస్కంధం చాలా చిన్నదనే చెప్పాలి. ఇందులో కేవలం పది అధ్యాయాలు మాత్రమే ఉన్నాయి. అయితే ఈనాడు మనకు లభిస్తున్న పరిబృంహిత భాగవతపాఠానికి మూలరూపం ఇదేనని భావింపబడుతుండటం వల్ల దీనికి విశేషప్రాధాన్యం లభించింది.

ఈ స్కంధంలోని తొమ్మిదవ అధ్యాయంలో బ్రహ్మదేవుడు ప్రజాసర్గం కావిస్తున్న వేళలలో గుణస్పర్శ వలన తనకు బంధనం ఏర్పడకుండా అంటే (నేను సృష్టికర్తను అనే అధ్యాస వలన మమత్వాభిమానం, దేహాత్మభావం కలుగకుండా) కర్తవ్యోపదేశం చేయమని శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తాడు. ఈ

ప్రశ్నకు శ్రీమహావిష్ణువు చెప్పిన సమాధానమే శ్రీమద్భాగవత గ్రంథసారాంశం:

శ్రీభగవానువాచ–

**అహమేవాసమేవాగ్రే నాన్య ద్య త్సదసత్పరమ్**
**పశ్చాదహం యదేతచ్చ యో వశిష్యేత సో స్మ్యహమ్.**

**ఋతేஉ ర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని**
**తద్విద్యాదాత్మనో మాయాం యథా భాసో యథా తమః.**

**యథామహాన్తి భూతాని భూతేషూచ్చావచేష్వను**
**ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్.**

**ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాత్మనః**
**అన్వయవ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా❖.**

---

❖ దీనికి పోతన్న గారి తెనిగింపు చూడండి :

**సీ. పరికింప మ త్స్వరూప స్వభావములును**
**మహితావతారకర్మములు దెలియు తత్త్వ**
**విజ్ఞానంబు దలకొని మత్ప్రసాదమునఁ**
**గల్గెడి నీకుఁ గమలగర్భ!**

**సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొకరుండ గలిగి**
**యుండుదు వీతకర్మి నగుచు**
**సమధిక స్థూల సూక్ష్మ స్వరూపములుఁ ద**
**త్కారణ ప్రకృతియు దగ మదంశ.**

**ఆ. మందు లీనమైన నద్వితీయుండనై**
**యుండు నాకు నన్యమొకటి లేదు**
**సృష్టికాలమందు సృష్టినాశంబున**
**జగము మత్స్వరూప మగును వత్స!**

**క. అరయగ గల్పప్రళయాం**
**తరము ననాద్యంతవిరహితక్రియ తోడన్**
**బరిపూర్ణనిత్యమహిమం**
**బరమాత్ముడనై సరోజభవ! యే నుందున్.** (భాగ. 2–250, 251)

సుప్రసిద్ధమైన ఈ నాలుగు శ్లోకాలు చతుఃశ్లోక భాగవతమనే పేరుతో అవిరళప్రచారాన్ని పొందాయి. ఇదే అధ్యాయం లోని 43వ శ్లోకంలో బ్రహ్మ, భగవానుడు తనకుపదేశించిన దశలక్షణసమన్విత భాగవతపురాణాన్ని నారదునికి బోధించిన ఉదంతం ప్రస్తావనకు వచ్చింది.

నాలుగవ అధ్యాయం చివరినుంచి తొమ్మిదవ అధ్యాయం చివరి దాకా ఉన్న భాగమంతా నారద హిరణ్యగర్భులకు జరిగిన సంభాషణ; శుకయోగి చేసినదల్లా దానిని ఉదాహరించటం మాత్రమే. ఆ సంభాషణ ముఖంగా విశ్వవిజ్ఞానాన్ని గురించిన సిద్ధాంతాలు, వివిధమతాల మౌలికస్వరూపం – ఆ తరువాతి స్కంధాలలో సవిస్తరంగా పేర్కొనబడినవే – ఇక్కడ సంక్షిప్తరూపంలో ప్రశంసించబడ్డాయి.

స్థూలంగా ఈ సిద్ధాంతాల స్వరూపం ఇది: శ్రీ మహావిష్ణువు పరబ్రహ్మాత్మకుడు; సృష్టి ఆయన విభూతి లేదా శక్తి యొక్క అభివ్యక్తరూపం. కాలము, కర్మము, ప్రకృతి ఈ సృష్టిరచనకు ముఖ్యప్రేరణలు. గుణక్షోభఫలంగా మహత్తత్వము, దాని నుండి అహంకారము, అహంకారం నుంచి తన్మాత్రలు, వాటి నుంచి ఇంద్రియార్థాలు సంభవించాయి. దీనికి సర్గవిధానమని పేరు. ఈశ్వరానుగ్రహం లేక ఈ మహదాదులకు స్వతంత్రవర్తన సాధ్యం కాదు. భగవత్సంకల్పం వలన భూతాదులు సంయోగం చెంది బ్రహ్మాండకటాహం ఆవిర్భవించింది. సర్గమంటే మహదాదుల సృష్టి కాగా, విసర్గం ఆ మహదాదుల కార్యమైన సృష్టి అన్నమాట. దీనినే బ్రహ్మసృష్టి అని పేర్కొంటున్నారు. బీజం నుంచి బీజం పుట్టినట్లుగా మహదాదుల కార్యఫలంగా ఆవిర్భవించిన బ్రహ్మాండకటాహంలో చతుర్దశభువనాలు, దేవాసుర గంధర్వ మనుష్య పశు పక్ష్యాది సమస్తచరాచర ప్రాణివర్గం, గ్రహ తారకాదులు అభివర్ణింపబడ్డాయి. ఈ సృష్టిలోని సమస్త వస్తువులు సర్వాత్మకుడైన భగవానుని వ్యక్తరూపాలేనని ఈ వర్ణనలను బట్టి మనము గ్రహించాలి. ఈ సృష్టిలో నిరుపయోగమైన వస్తువంటూ ఏదీ లేదు. సమస్త వస్తువులకు పార్యంతికమైన ఏదో ఒక ప్రయోజనం ఉన్నది. స్థావర

జంగమాత్మక సమస్తజీవకోటి, ఆ జీవుల సమస్త భౌతిక శారీరికశక్తియుక్తులు ఇవన్నీ సర్వజీవనియామకుడు, సర్వేంద్రియప్రేరకుడు అయిన శ్రీభగవానుని దివ్యవిభూతులే గనుక ఒక్కొక్క భువనంలోనూ ఒక్కొక్క చోటు కల్పింపబడినదని నిరూపించటమే ఈ విసర్గవర్ణన లోని పరమోద్దేశం. ఈ విధంగా ధ్యానధారణ చేయదలచిన సాధకులు స్వీయానుభవాన్ని జోడించి మూర్తికల్పన కావించుకొనటానికి యోగ్యమైన ప్రకృతిదివ్యత్వనిరూపణ ఇందులో ఉన్నది.

ప్రకృతిలో భగవానుని క్రీడావ్యాప్తధర్మాన్ని అభివర్ణించిన తర్వాత జగన్నాటక సూత్రధారణకు జీవసమాజం లోనికి లీలామానుషవిగ్రహుడై అవతరించిన ఆ పురుషధౌరేయుని కాంతవిలాసాల సంగ్రహ పరిచయం చేయబడింది. ఈ అవతారాలకు భగవల్లీలావతారాలని పేరు. ప్రథమ స్కంధంలో పేర్కొన్న చతుర్వింశత్యవతారాలకు ద్వితీయస్కంధం లోని ప్రకృత వర్ణనకు కొంత వ్యత్యాసం ఉన్నది. శ్రీకృష్ణుని అవతారగాథ విస్తరితమైనప్పటికీ ఆతనికి ప్రత్యేకస్థానాన్ని కల్పించాలనే ప్రయత్నం లేకపోవటం ఇందులోని విశేషం.

సర్గాదులు, భగవల్లీలావతారాలను వర్ణించిన తర్వాత బ్రహ్మ నారదునితో అన్న మాటలు ప్రత్యేక పరిశీలనార్హాలు. విశ్వభావనుడైన భగవానుడు స్వయంగా తనకు ఉపదేశించిన భాగవతాన్ని నారదునికి వినిపించిన తర్వాత బ్రహ్మ శ్రీ భగవానుడు సర్వశక్తిమంతుడని, ఆయన ప్రకృతిస్థుని వలె వ్యవహరించినప్పటికీ ప్రకృతిగుణాతీతుడని, మానవులలో భక్తిభావాన్ని ఉద్దీపింపజేయటానికి నారదుడు శ్రీమద్భాగవతాన్ని యథోచితంగా విస్తరింపజేయవచ్చునని అంటాడు –

**సో–యం తే–భిహిత స్తాత భగవాన్ విశ్వభావనః**
**సమాసేన హరే ర్నాన్య దన్యస్మా త్సదసచ్చ యత్.**

**ఇదం భాగవతం నామ యన్మే భగవతోదితమ్**
**సంగ్రహో యం విభూతీనాం త్వమేతద్విపులీకురు.**

**యథా హరౌ భగవతి నృణాం భక్తి ర్భవిష్యతి**
**సర్వాత్మ న్యఖిలాధారే ఇతి సఙ్కల్ప్య వర్ణయ.**

**మాయాం వర్ణయతో ముష్య ఈశ్వరస్యానుమోదతః**
**శృణ్వతః శ్రద్ధయా నిత్యం మాయయా త్మా న ముహ్యతి.**

(భాగ. 2. 7. 50 – 53)

ఈ విధంగా ఆలోచిస్తే ప్రకృతస్కంధం శ్రీమద్భాగవతం లోని బ్రహ్మాండ మీమాంస, బ్రహ్మ మీమాంసలకు సంబంధించిన మత సిద్ధాంతాలన్నింటికీ ప్రాకరమై ఉన్నది. పైని పేర్కొన్న శ్రీమద్భాగవత చతుఃశ్లోకి, ఇందులోని ఆదిభౌతిక ఆధ్యాత్మిక భక్తిసిద్ధాంతాలకు, సచ్చిదానందస్వరూపు డైన భగవానుని సర్వాత్మభావానికి సమ్యఙ్నిదర్శనగా రూపుదిద్దుకొన్నది. అంతే కాదు. శ్రీమద్భాగవతమూలాన్ని చారిత్రికంగా అధ్యయన చేయదలచిన వారికిది మార్గదీపకంగా వెలుగొందుతున్నది. భక్తులీనాడు భాగవతసారమని భావిస్తున్న ఈ శ్లోకచతుష్కమే ఒకనాడు భాగవతపాఠాన్ని విస్తరింపబూనిన వారందరికీ ఆధారభూమిక అయి ఉండాలి. మొత్తం మీద ఈ విధమైన విపులీకరణను ప్రారంభించిన వాడు నారదుడని పైన ఉదాహరించిన శ్లోకాలను బట్టి స్పష్టంగా తెలుస్తున్నది. నారదుని నుంచి ఈ కథావిధానం వ్యాసునికి సంక్రమించింది. వ్యాస నారదుల సమావేశం జరిగినప్పుడు నారదుడు వ్యాసునికి భాగవతమాహాత్మ్యాన్ని వివరించి ఆ భాగవతాన్ని రచింపమని ఆదేశించినట్లు ప్రథమస్కంధంలో చెప్పబడింది. అయితే ఆ భాగవత కథ వ్యాసునికి ధ్యానగోచరం అయినట్లు కూడా అందులో ప్రసక్తమై ఉన్నది. నారదుడే ఈ గ్రంథం ప్రథమనిర్మాత అయితే తన రచనను వ్యాసునికి స్వయంగా ఉపదేశింపక ధ్యానించి చూడమని ఎందుకు చెప్పాడు? తనకు తెలిసిన కథను గాక ధ్యాత విశేషాన్ని ఎందుకు వ్రాయమన్నాడు? ఇది జాగ్రత్తగా ఆలోచింపవలసిన విషయం. దీనిని బట్టి పరంపరాగతమైన మాతృకావివేకానికి అనంతరీయ రచయితలు తమకు సమకాలంలో ప్రవర్తిల్లిన అనేక శిష్టాచారాలను అనుసంధిస్తూ వచ్చారని మనము గ్రహింపవలసి

ఉంటుంది. నారదమహర్షికి కర్తృత్వాన్ని ఆపాదించిన వారెవరో తమ పూర్వకాలపు మాతృకను విస్తరింపగా వ్యాసమహర్షి పేరుతో మరెవరో దానిని పునర్నిర్మించి ఉంటారు. ఈ విధమైన విస్తరణలో అనౌచిత్యం లేదని భాగవతమే తాత్పర్యతః అంగీకరిస్తున్నది. స్వధర్మనిరతులైన జనులలో భక్తిభావాన్ని పెంపొందింపజేయటానికి అనుకూలమైన వాతావరణాన్ని కల్పించి, భక్తివైరాగ్యమూలకంగా అపరోక్షజ్ఞానసిద్ధిని ఉపదేశించటమే శ్రీమద్భాగవత పురాణం ఆశించిన మహాప్రయోజనం.

## తృతీయ స్కంధం

ఈ తృతీయస్కంధంలో ముప్పైమూడు అధ్యాయాలున్నాయి. ఇందులోని కథావిషయం శ్రీశుకుడు పరీక్షిన్మహారాజు ప్రశ్నలకు చెప్పిన సమాధానమే అయినప్పటికీ నిజానికి విదురోద్ధవులు, విదుర మైత్రేయుల సుదీర్ఘసంభాషణలను ఉదాహరించటం మాత్రమే ఇందులో జరిగింది. మధ్య మధ్య సందర్భానుగుణంగా వచ్చిన అనేక స్తోత్రాలతోపాటు – శుక పరీక్షితుల ఆధ్యాత్మికచింతన లోని గభీరిమ మనకు ఈ స్కంధంలో పరిచితమవుతుంది. శ్రీకృష్ణ నిర్యాణానంతరం అతని ప్రియసఖుడు, భక్తాగ్రగణ్యుడు అయిన ఉద్ధవుడు విరక్తిగొని బదరికాశ్రమానికి పయనిస్తుండగా మార్గమధ్యంలో హస్తిన నుంచి తీర్థయాత్రలకు బయలుదేరిన విదురు డతనికి ఎదురవుతాడు. ఉద్ధవు డతనికి యాదవవినాశం, శ్రీకృష్ణావతార పరిసమాప్తి ఘటిల్లిన ఉదంతాలను తెలియజేస్తాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుని జీవితాన్ని, శ్రీకృష్ణుని జీవిత సందేశాన్ని సమీక్షించిన తీరు నిజంగా అద్భుతావహంగా ఉంటుంది. విదురుడు మైత్రేయుని వద్దకేగి ఆత్మతత్త్వాన్ని గ్రహించాలని శ్రీకృష్ణుడు తనతో అన్న మాటను కూడా ఉద్ధవు డతనికి తెలియజేస్తాడు. ఆ తర్వాత విదుర మైత్రేయులకు జరిగిన సుదీర్ఘసంభాషణ తృతీయ స్కంధం లోని ఇరవైఒక్క అధ్యాయాలకు వ్యాపించటమే గాక చతుర్థ స్కంధం లోనికి కూడా ప్రాకింది.

ఈ అధ్యాయాలలో సర్గము (ప్రాకృతిక సృష్టి), విసర్గము (బ్రహ్మచే కావింపబడిన గౌణసృష్టి), శ్రీవరాహావతార వర్ణన, కాల స్వరూపం,

లోకాలోకాల ప్రమాణం, హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మకారణం, హిరణ్యాక్ష వధ, దేవహూతీకర్దముల ప్రణయవృత్తాంతం, శ్రీకపిలావతారం, కపిలుడు తన తల్లి దేవహూతికి ప్రేమతత్త్వాన్ని, జ్ఞానస్వరూపాన్ని విశదీకరించి సాంఖ్యశాస్త్రాన్ని ఉపదేశించటం మొదలైన ముఖ్యఘటన లున్నాయి.

పురాణ దశలక్షణాలలో ఆద్యమైన సర్గవిధానం ఈ స్కంధంలోని ముఖ్యవిషయమని కొంతమంది వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు. స్కంధాదిలో మైత్రేయుడు మహదాదుల సృష్టిభూమికను విదురునికి ఉపదేశించి, దానినే కపిలుడు దేవహూతికి విశదీకరించి ఉన్నట్లయితే వీరి భావన సమంజసంగానే ఉండేది. సర్గమంటే ప్రకృతి నుంచి చతుర్వింశతి తత్త్వాల వికాసదశ అనుకొన్నాము. వీటిని ఉపకరణలుగా స్వీకరించి సృష్టికర్త బ్రహ్మ సమస్తచరాచర జీవకోటిని సృజించటం జరుగుతుంది. ఇది విసర్గం. ప్రాకృతిక ప్రళయావధి ముగిసిన తర్వాత లీనావస్థలో ఉన్న ప్రకృతి మళ్ళీ కాల కర్మ స్వభావ ప్రేరణల ననుసరించి అభివ్యక్త మవుతుండటాన్ని సర్గవిధాన మంటున్నాము. ప్రకృతి నుంచి మహత్తత్వం, అహంకారము, బుద్ధి, మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, తన్మాత్రలు, పంచభూతాలు అనే చతుర్వింశతి తత్త్వాలు ఆవిర్భవించటంతో ప్రాథమిక సృష్టిక్రియ ముగిసినట్లే. తృతీయస్కంధంలో 26వ అధ్యాయం లోని కపిలోపదేశం దీనినే ప్రధానీకరించింది.

ఈ సర్గవిధానంలో ఈనాడు మనము (ఇవల్యూషన్) అంటున్న దశకు ప్రాథమిక రూపం వర్ణింపబడింది. దీనిని (ప్రీ క్రియేటివ్ ఇవల్యూషన్) లేదా సృష్టిపరిణామ పూర్వదశ అని పేర్కొనవచ్చును. ఈ దశలో అపృథక్స్థితి నుంచి అనేకానేక పృథగ్రూపాలు క్రమికవికాసాన్ని చెందటం జరుగుతుంది. ఈ విధంగా రూపుగొన్న ఇరవైనాలుగు తత్త్వాలు సృష్టిరచనకు మూలద్రవ్యాలవుతాయి. అయితే ఇవన్నీ పృథగ్రూపాలుగానే ఉంటాయి గాని వివిధ భౌతిక దేహాలుగా సంయోగాన్ని చెందలేవు. స్వతంత్రంగా వాటికి ఆ శక్తి లేదు. ఈశ్వరానుగ్రహం వలన మాత్రమే ఈ తత్త్వాలు పరస్పరాకృష్టాలై

బ్రహ్మాండకటాహం ఆవిర్భవించి, ప్రళయపయోధి జలాలలో నాభికమలాసనాసీనుడైన బ్రహ్మదేవునితో పాటు శ్రీమన్నారాయణుడు యోగనిద్ర నుంచి మేల్కొంటాడు. బ్రహ్మ అంటే అతడు పరబ్రహ్మము యొక్క వ్యక్తరూపమే గాని తద్భిన్నమైనవాడు కాడు. ఒక విధంగా చెప్పాలంటే ఈ బ్రహ్మ శ్రీమన్నారాయణునికి, మహదాదులకు మూలమైన ప్రకృతికి మధ్యవర్తి అన్నమాట. కుట్మలితమై ఉన్న విశ్వకమలానికి పూర్ణవికాసం కలిగించి చతుర్దశ భువనాలను ప్రకల్పించటంతో పరబ్రహ్మము యొక్క సృష్ట్యాత్మకదేహం వ్యక్తదశకు చేరుకొంటున్నది.

అనేకానేక వత్సరాలు కావించిన తపఃఫలంగా బ్రహ్మకు పరబ్రహ్మ సాక్షాత్కారం కలిగి సృష్టిరచనకు ఆనతి లభించింది. అప్పటి నుంచి జరిగిన విసర్గమనే విధానంలో సర్గమందలి తత్త్వాలు ఆధారమవుతాయి. ఇందులో సృష్టిపరిణామమనే ఆలోచనకు తావులేదు. పూర్వకల్పాల లోని ప్రణాళికను అనుసరించి ఆయా జీవుల కర్మలను బట్టి, స్వీయసంకల్పానుసారం బ్రహ్మ చరాచర సృష్టిరచనకు పూనుకొంటాడు. మొదట కుమారులని పేరుపొందిన సనకాది యోగితల్లజులను సృజించి బ్రహ్మ వారిని జీవసృష్టి కావింపమని ఆదేశిస్తాడు. సత్త్వగుణసంపన్నులై నిర్విక్రియులైన ఆ మహాయోగులందుకు నిరాకరించి సాధుమార్గాన్ని అవలంబిస్తారు. బ్రహ్మకు ఆగ్రహం కలుగుతుంది. ఆ రౌద్రభావం నుంచి రుద్రుడు ఉద్భవిస్తాడు. సృష్టివిస్తరణకే అవతరించి రుద్రుడు తనవలెనే రుద్రమూర్తులైనవారిని ప్రభవింపజేస్తాడు. అతనిని విరమింపజేసి బ్రహ్మ పదిమంది మానసపుత్రులను – మరీచి, అత్రి, అంగిరుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతుడు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు, నారదుడు అనే పేర్లుగల ప్రజాపతులను సృజిస్తాడు. వీరిలో నారదుడు తప్ప తక్కినవారందరూ సృష్టికర్మకు ఉపక్రమిస్తారు. బ్రహ్మ సంకల్పానుసారం లోకంలో అసుర గంధర్వ పితృ భూత పిశాచ కిన్నర కింపురుషాద్యనేక జీవకోట్లు ఆవిర్భవిస్తాయి.

ఇంత జరిగినా సృష్టిక్రియ మందగతిని కొనసాగుతున్నదని బ్రహ్మకు తీవ్రమైన అసంతృప్తి కలుగుతుంది. ఆ సమయంలో ఆయన శరీరం నుంచి

స్వాయంభువ మనువు, శతరూప ఉదయించారు. వారు ఆయన రూపునే, అంటే మనుష్యాకృతినే పుణికి పుచ్చుకొన్నారు. తొలిసారిగా స్త్రీపుంసభేదం ఏర్పడింది. ఇంతవరకు జరిగిన సృష్టిసమస్తం బ్రహ్మ సంకల్పాధారితమో, బ్రహ్మ శరీరసముత్థితమో కాగా శతరూపాస్వాయంభువులు దాంపత్యధర్మాన్ని అవలంబించి సంతానాన్ని కన్నారు. స్త్రీ పుంసయోగోద్భవమై మానవజాతి తామరతంపరగా విస్తరిల్లింది.

పదవ అధ్యాయంలో ఈ విధమైన సృష్టిరచన తొమ్మిది విధాలని, అందులో ఆరు సర్గవిధానానికి, మూడు విసర్గానికి అనువర్తితవ్యాలని పేర్కొనబడింది. ప్రకృతి నుంచి జనించిన మహత్తత్త్వము, సత్త్వరజస్తమో గుణాత్మకమైన అహంకారము, భూతసూక్ష్మములు లేదా తన్మాత్రలు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు, మనస్సు, అవిద్య అన్నవి ఆరూ సర్గానికి చెందినవి. ఏడవది వనస్పతులు ఓషధులు లతలు త్వక్సారములు వీరుధములు ద్రుమములు అనే ఆరు విధాల స్థావరాల సృష్టి, ఎనిమిదవది తిర్యక్కుల సృష్టి. ఈ తిర్యక్కులలో చీలిన గిట్టలు గల (ద్విఖుర) జంతువులు తొమ్మిది, ఏకఖుర జంతువులు ఆరు, కాలికి ఐదేసి గోళ్ళు కలిగిన జంతువులు పదమూడు – మొత్తం ఇరవై ఎనిమిది భూచరాలు, ఇలాగే ఇరవైఎనిమిది ఖేచరాలు కలిసి యాభైఆరు భేదాలున్నాయి. ఇక తొమ్మిదవది ఆశాజీవనులైన మనుష్యుల సృష్టి. ఈ మానవులలో సమాధి యోగ తప ఆభిజాత్య వైరాగ్యసంపన్నులైన ఋషులు సర్వోత్తమ శక్తిమంతులు. అసుర గంధర్వాదులైన దేవతల సృష్టి కూడా ఈ విసర్గం లోనిదే.

నిత్య నైమిత్తికాది ప్రళయాలకు కాలము ద్రవ్యము గుణము ఆధారాలని చెప్పినందువలన ఈ సందర్భంలో మైత్రేయుడు కాలస్వరూపాన్ని గురించిన ప్రస్తావన చేయవలసి వచ్చింది. సర్గ విసర్గాల తత్త్వాన్ని అర్థం చేసుకోవటానికి ఈ కాలవిభాగ పరికలన ఉపయోగపడుతుంది. ఈ చర్చలో పరమాణు కళ మొదలుకొని బ్రహ్మజీవిత పర్యంతమైన కాలస్వరూపాన్ని గురించిన ప్రస్తావన చేయవలసి వచ్చింది. పదకొండవ అధ్యాయంలో ద్విపరార్ధ స్వరూపనిర్ణయం

జరిగింది. ఈ లెక్కలలో మనుష్యమానం, దేవమానం, చతుర్యుగాలు, మన్వంతరాలు, బ్రహ్మకల్పం, పరార్ధం, ద్విపరార్ధం మొదలైన విభాగాలను చూస్తే ఇతరదేశాలలోని ప్రజలవలె కాక భారతీయ పౌరాణికులు అనంతమైన కాలతత్త్వాన్ని శాస్త్రదృష్టితో పరిశోధించి కాలము యొక్క గమన ప్రమాణాలు అన్ని చోట్ల ఒకే తీరున ఉండవని గుర్తించి, కాలగతిని గురించిన అనేక సిద్ధాంతాలను, పరిగణనలను దృష్టిలో ఉంచుకొని ఈ విధమైన అభికలనలను నిరూపించటానికి ప్రయత్నించారని మనకు అర్థమవుతుంది. స్వభావరీత్యా కాలము ఆవృత్తిశీలమని గ్రహించిన వీరు చతుర్యుగాలు (నలభైమూడు లక్షల ఎనభైవేల సంవత్సరాలు), మన్వంతరాలు, పరార్ధం, ద్విపరార్ధం మొదలైనవి ఒకదాని ననుసరించి మరొకటి మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటాయని నిర్ణయించారు.❖ కాలము యొక్క అతివిస్తారమైన ఈ ప్రాగ్భూమికను, వివిధ కాలాలలో వివిధ లోకాలలో కాలనిర్ణయంలో ఉన్న ప్రమాణవైవిధ్యాన్ని దృష్టిలో ఉంచుకొన్నవి గనుకనే పురాణవాఙ్మయంలో మనకు వేలాది సంవత్సరాలు జీవించిన వ్యక్తుల ప్రస్తావనలు తరచు గోచరిస్తుంటాయి. కేవలం ఇదమిత్థమని రుజువుచేసి చూపటానికి వీలైన సాక్ష్యాధారాలతో మాత్రమే వినిర్మింపబడుతున్న ఈనాటి చరిత్ర విజ్ఞాన దృష్టికి ఈ సంవిధానంతో మౌలికమైన విభేదం ఉన్నది. పురాణాలు ప్రస్తుతీకరించినది

---

❖ పురాణాల పరిగణనను అనుసరించి బ్రహ్మ జీవితకాలావధి ఈ ప్రకారంగా ఉంటుంది: 360 మానవ సంవత్సరాలు = దేవతలకు ఒక సంవత్సరం. 12,000 దేవతల సంవత్సరాలు = ఒక చతుర్యుగం (అంటే కృత త్రేతా ద్వాపర కలి యుగాల ఒక ఆవృత్తి; మనుష్యమానంలో ఇది 43,20,000 సంవత్సరాలు). 2,000 చతుర్యుగాలు = సృష్టికర్త బ్రహ్మకు ఒక అహోరాత్రం, ఇటువంటి 360 బ్రహ్మదివసాలు = ఒక బ్రహ్మమాన వత్సరం, 50 బ్రహ్మ వత్సరాలు = ఒక పరార్ధం, బ్రహ్మ జీవిత కాలం 2 పరార్ధాలు. మనుష్యమానంలో ఇది 3,11,04,00,00,000 సంవత్సరాలు. ఆ తర్వాత రెండు పరార్ధాల కాలం ప్రళయసమయం. ప్రళయాంతంలో నూతన బ్రహ్మతో మళ్ళీ సృష్టిక్రమం మొదలవుతుంది. ఒక సృష్టిప్రళయావధి, అంటే నాలుగు పరార్ధాల కాలం శ్రీ మహావిష్ణువు యొక్క నిమేషం

→

కేవలం దృశ్యమానమైన ప్రపంచచరిత్రను మాత్రమే కాదు. మొత్తం బ్రహ్మాండ కటాహంలో ద్విపరార్ధాల పర్యంతం విస్తరించిన విశ్వవిజ్ఞానాన్ని గురించి తమకు ధ్యానగోచరితమై సాధకుల ధ్యానధారణకు యోగ్యమైన విశేషాలను క్రోడీకరించి పురాణవాఙ్మయం మానవజాతికి ఒక అమూల్య సంపదను బహూకరిస్తున్నది. మనకు గల పరిమిత దృష్టితో చరిత్రను పరిశీలించాలనుకొనేవారికి ఈ నిరూపణ పరిహాసభాజనంగా కనుపింపవచ్చునేమో గాని సూక్ష్మంగా ఆలోచించి చూస్తే వారికి దీనిలోని పరమార్థం స్ఫురింపక మానదు.

తృతీయ స్కంధం లోని చివరిభాగం (అధ్యా. 25-31)లో భగవదవతారమైన కపిలుడు దేవహూతికి తత్త్వోపదేశం చేయటం జరుగుతుంది. ఇందులో జ్ఞాన భక్తి మార్గాల సమగ్రస్వరూపం ఎంతో చక్కగా వివరింపబడింది. ఇది కేవలాదర్శాల చర్చగా మిగిలిపోక నిత్యజీవితంలో ఆచరింపదగిన అనుష్ఠాన వేదాంతమై ఉండటం విశేషం. శ్రీమద్భాగవతం ప్రతిపాదిస్తున్న బ్రహ్మాండ మీమాంస, పారలౌకిక మీమాంసల సారనవనీతం ఇందులో చోటుచేసుకొన్నది. ఏకాదశ స్కంధంలో శ్రీకృష్ణుడు ఉద్ధవునికి కావించిన తత్త్వోపదేశంతోపాటు జ్ఞాన భక్తి మార్గాలకు కరదీపికగా వెలుగొందుతున్న ఈ భాగం ముఖ్యమైనది.

---

→

(కనురెప్ప పాటు కాలప్రమాణం. ఒక చతుర్యుగసహస్రాన్ని అంటే 4,320,000 × 1000= 4,320,000,000 సంవత్సరాల కాలాన్ని పధ్నాలుగు మన్వంతరాలుగా విభజించారు. ఒక్కొక్క మన్వంతరానికి ఒక్కొక్క మనువును అధిపతిగా నిర్ణయించారు. ప్రకృతం శ్వేతవరాహకల్పంలో వర్తమాన బ్రహ్మ యొక్క 51వ సంవత్సరం నడుస్తున్నది. ఈ కల్పంలో ఆరుగురు మనువుల తర్వాత ఏడవ మనువు వైవస్వతుడు ఇప్పుడు అధిపతిగా ఉన్నాడు. ఈ మనువుల పేర్లు:

1. స్వాయంభువుడు 2. స్వారోచిషుడు 3. ఔత్తమి 4. తామసుడు 5. రైవతుడు 6. చాక్షుషుడు 7. వైవస్వతుడు 8. సావర్ణి 9. దక్షసావర్ణి 10. బ్రహ్మసావర్ణి 11. ధర్మసావర్ణి 12. రుద్రసావర్ణి 13. రౌచ్యసావర్ణి 14. ఇంద్రసావర్ణి.)

ఈ స్కంధంలోని ఎనిమిదవ అధ్యాయంలో భాగవత పాఠం విస్తరిల్లిన విషయాన్ని గురించి మరొక ఆసక్తిదాయకమైన ప్రస్తావం ఉన్నది. ప్రథమస్కంధంలో భాగవతం వ్యాసుని మూలంగా అభివ్యాప్తమైనదని చెప్పబడింది. ద్వితీయ స్కంధంలో వచ్చిన నారదుని కర్తృత్వవిషయం ఇంతకుముందే చర్చించాము. ఇక ఈ మూడవ స్కంధంలో సరిక్రొత్తగా సనత్కుమారుని పేరు వచ్చింది:

**ప్రోక్తం కిలైత ద్భగవత్తమేన**
**నివృత్తి ధర్మాభిరతాయ తేన**
**సనత్కుమారాయ స చాహ పృష్టః**
**సాంఖ్యాయనాయాఙ్గం ధృతవ్రతాయ.**

**సాంఖ్యాయనః పారమహంస్యముఖ్యో**
**వివక్షమాణో భగవద్విభూతీః**
**జగాద సోఽ స్మద్గురవే న్వితాయ**
**పరాశరాయాథ బృహస్పతే శ్చ.**

**ప్రోవాచ మహ్యం స దయాలు రుక్తో**
**మునిః పులస్త్యేన పురాణ మాద్యమ్**
**సో హం తవైత త్కథయామి వత్స**
**శ్రద్ధాలవే నిత్య మనువ్రతాయ.** (భాగ. 3. 8.7-9)

దీనిని బట్టి భగవానుడైన శ్రీ సంకర్షణుని ద్వారా సనత్కుమారుడు, ఆయన ముఖతః సాంఖ్యాయనుడు శ్రీమద్భాగవతాన్ని నేర్చుకొన్నారని, పరమహంసలలో ముఖ్యుడైన సాంఖ్యాయనుడు ఆ పాఠాన్ని పరాశరునికి బోధింపగా, ఆయన పులస్త్యుని ఆదేశాన్ని మన్నించి దయతో మైత్రేయునికి ఉపదేశించాడని తెలుస్తున్నది.

దీనిని బట్టి భాగవత పాఠక్రమంలో ఇది మూడవ సంప్రదాయమని, వ్యాసుని సంపాదకత్వంలో రూపొందిన ప్రకృతగ్రంథం దీనితో పరిపూర్ణతను

సంతరించుకొన్నదని ఫలితార్థం. దీనికి తోడు మైత్రేయుడు బ్రహ్మాండస్వరూపాన్ని గురించి చెప్పిన విషయాలు, శాస్త్రీయవివరణ స్కంధాంతం లోని కపిలోపదేశంలో సమగ్రంగా ఉన్నదని మనము గుర్తుంచుకోవాలి.

## చతుర్థ స్కంధం

శ్రీమద్భాగవత చతుర్థస్కంధంలో ముప్పైఒక్క అధ్యాయాలున్నాయి. ఇంతకు మునుపే పేర్కొన్నట్లు తృతీయ స్కంధం సర్గవిధానాన్ని ప్రధానీకరింపగా, ఈ స్కంధంలో విసర్గ విధానం ప్రసక్తమైనదని భావింపబడుతున్నది. ఈ రెండింటికీ గల వ్యత్యాసం శశ్వదుక్తమే: సర్గము సృష్టిపూర్వమైన సహజ పరిణామదశ కాగా విసర్గము ఆ సృష్టి లోనికి నివసనార్థం జీవకోటిని ప్రభవింపజేసిన ప్రక్రియాశిల్పం. తృతీయ స్కంధాన్ని వివేకించినవారు అందులో సర్గవిధానం రెండుసార్లు, విశిష్య కపిలోపదేశంలో కొంత విస్తృతంగా వర్ణింపబడినదని, కథాక్రమాన్ని అనుసరించి ఆ స్కంధంలో బ్రహ్మ యొక్క సృష్టి కూడా అంతే ప్రాముఖ్యానికి నోచుకొన్నదని, అందుచేత ఒకే సర్గంలో సర్గవిసర్గాలు రెండూ నిసర్గశోభతో సంసర్గాన్ని పొందాయని తేలికగానే గుర్తింపగలరు. ఆ దృష్టితో ఆలోచించి చూస్తే ప్రకృత స్కంధంలో బ్రహ్మసృష్టికి లేశమాత్రనివేశమే ఉన్నట్లు కనబడుతుంది. మన కర్థమైనంతలో స్వాయంభువ మనువు, అతని ధర్మపత్ని శతరూపల సృష్టితో బ్రహ్మసృష్టికి విరామం లభించినదనే అనుకోవాలి. అప్పటి నుంచి లోకంలో సృష్టిక్రియకు తృతీయపురుషార్థమైన కామం ఆధారభూతమయింది. అందుచేత చతుర్థ స్కంధం విసర్గాని కంటె మహారాజుల వంశావళులను ప్రకీర్తిస్తున్న వంశానుచరితానికి ఉదాహరణీయమని భావించటం మేలు. నిజానికి ఈ విధమైన అన్వయాలన్నీ లక్ష్యలక్షణాల పట్టింపు గల వ్యాఖ్యానకర్తల శ్రద్ధధానతే తప్ప పురాణకర్తల దృష్టిలో ఉన్న ప్రధానవిషయాలు కావు. ఈ సత్యం మనకు ఏ పురాణాన్ని తీసి చూసినా, పురాణ దశలక్షణాలు అందులో ఒక వరుస క్రమంలో గాక వేర్వేరు అధ్యాయాలలో వికీర్ణమై ఉన్నాయని సులభంగానే తెలుస్తుంది.

చతుర్థ స్కంధం బ్రహ్మదేహం నుంచి స్త్రీ పురుషరూపాలలో ఆవిర్భవించిన శతరూపాస్వాయంభువుల కథతో మొదలవుతుంది. లోకంలో స్త్రీ పుంసయోగోద్భవమైన సంతానాన్ని కన్న తొలి దంపతులుగా వారి జీవితం పరిచిత్రిత మయింది. వారికి ఆకూతి, ప్రసూతి, దేవహూతి అని ముగ్గురు కుమార్తెలు, ఉత్తానపాద ప్రియవ్రతులనే ఇద్దరు కొడుకులు జన్మిస్తారు. బ్రహ్మ సృజించిన ప్రథమ పురుషుడైన స్వాయంభువుడు సమస్తభూమండలాన్ని ఒక్క గొడుగు క్రిందికి తెచ్చిన ఉదంతాన్ని బట్టి అతను క్షత్రియకులానికి కూడా ఆద్యపురుషుడని చెప్పక చెప్పినట్లయింది. పౌరాణికులకు తెలిసిన ఈ భూమండలం స్వరూపాన్ని గురించి ప్రస్తావనయా మనము దీని తర్వాతి స్కంధంలో తెలుసుకొంటాము. ఆ పిమ్మట మనుపుత్రికలలో అనేకులకు బ్రహ్మమానసపుత్రులైన ప్రజాపతులతో వివాహాలు జరిగి లోకంలో బ్రాహ్మణకులం ఆవిర్భవించింది. దేవహూతీ కర్దముల వివాహోదంతం తృతీయ స్కంధంలో మనకు తెలిసిందే. తక్కిన మనుపుత్రికలు, వీరందరికీ కలిగిన సంతానం, ఇంకా ఉత్తానపాదుని వంశం మొదలైనవి ఈ స్కంధంలోని ప్రధానకథలు. వీరిలో చాలామంది బహుకుటుంబికులై మానవాన్వయం బ్రహ్మతోషకరంగా పరిఢవిల్లసాగింది.

స్వాయంభువునికి ముగ్గురు కుమార్తె లనుకొన్నాము. కపిలునికి జననీజనకులై ధన్యత గడించిన దేవహూతీకర్దములకు తొమ్మిదిమంది కుమార్తెలు జన్మించారు. వారిని మరీచ్యాది ప్రజాపతులకిచ్చి వివాహాలు చేశారు. స్వాయంభువుని పెద్దకూతురు ఆకూతి రుచిప్రజాపతి భార్య అయింది. ఆ దంపతులకు యజ్ఞుడు, దక్షిణ జన్మించి పూతచరితులని పేరెన్నిక గన్నారు. ఈ అన్నాచెల్లెళ్ళు పతీపత్నులై స్వాయంభువమన్వంతరంలో దేవపదాన్ని అధిరోహించిన పన్నెండు మంది సంతానాన్ని కన్నారు. ఈ సందర్భంలో మన్వంతరం అంటే ఒక్కొక్క మనువు యొక్క పరిపాలనా కాలమని, ఒక్కొక్క మన్వంతరంలోనూ ఆయా మన్వంతరానికి చెందిన దేవతలు, సప్తర్షులు, మనువు, మనుపుత్రులు, ఇంద్రుడు ఉంటారని, ఆయా మన్వంతరాలలో ప్రవర్తిల్లిన భగవదవతారాలు ప్రత్యేకంగా ఉంటాయని

మనము గుర్తించుకోవాలి. ఒక్కొక్క బ్రహ్మయొక్క జీవితకాలంలోనూ పధ్నాలుగు మన్వంతరాలు కలిసి ఆయనకు ఒక దివసకాలం – అంటే ఒక కల్పకాలం అవుతుంది.

స్వాయంభువుని రెండవ కుమార్తె ప్రసూతి పేరు ఇంతకు ముందే వచ్చింది. ఈమెను బ్రహ్మదేవుని వరప్రసాదం వలన ప్రజాపతులలో అగ్రగణ్యుడని పేరుగడించిన దక్షప్రజాపతి కిచ్చి వివాహం చేశారు. ఆ దంపతులకు కాలక్రమాన పదహారుగురు కుమార్తెలు జన్మించారు. వారిలో పదముగ్గరిని ధర్మప్రజాపతి వరించాడు. ఆ తరువాతి కుమార్తెను అగ్ని, ఇంకొక కుమార్తెను పితృదేవతలు, చిన్న కూతురు సతిని రుద్రుడు వివాహం చేసుకొన్నారు. యజ్ఞభాగం విషయమై దక్షునికి రుద్రునితో ఘర్షణ సంభవించి, కోపోద్రిక్తుడైన రుద్రుడు దక్షాధ్వరాన్ని ధ్వంసం చేయటంతో మొదటి అధ్యాయంలో ప్రారంభమైన కథ ఏడవ అధ్యాయంలో ముగుస్తుంది. ఈ స్కంధంలోని ముఖ్యమైన ఉదంతాలలో ఇదొకటి.

ఆ తర్వాత ఐదు అధ్యాయాలలో ఉన్నది సుదీర్ఘమైన ధ్రువచరిత్రం. ఈ ధ్రువుడు స్వాయంభువుని జ్యేష్ఠసుతుడు ఉత్తానపాదునికి జనించాడు. సవతి తల్లి దుర్నీతిని సహింపలేక ఇల్లు విడిచి తపోదీక్ష గైకొని శ్రీమహావిష్ణువును ధ్యానించి, ఆయన కరుణాప్రసాదం వలన సర్వోన్నతస్థితిని పొంది, తండ్రి వద్దకు తిరిగివచ్చి ఆయన అనంతరం పృథ్వీభారాన్ని వహించి హైందవసంప్రదాయంలో భక్తవతంసులని పేరెన్నిక గన్న రాజులలో అగ్రగణ్యు డయ్యాడు. కథాక్రమాన్ని బట్టి తండ్రి వానప్రస్థాన్ని స్వీకరించిన తర్వాత అతను ముప్పైఆరువేల సంవత్సరాలు రాజ్యపాలన చేసినట్లు నిరూపిత మవుతున్నది. దీనిని బట్టి కల్పాదిమకాలంలో మానవుని జీవనప్రమాణం అతిదీర్ఘతరమైన రోజులలో ఈ కథ జరిగినదని మనము గ్రహించాలి. అయితే ఈ విధంగా పురాణాలలో చెప్పబడిన ప్రతి ఒక్క విషయం కేవలం చారిత్రికదృష్టితో వంశావళులను క్రోడీకరించటానికి చేసిన ప్రయత్నం మాత్రమే నని భావిస్తే అది పొరపాటే అవుతుంది.

ధ్రువచరిత్ర తర్వాత పదకొండు అధ్యాయాలలో శ్రీమహావిష్ణ్వవతారభూతుడని చెప్పబడిన పృథుచక్రవర్తి యొక్క జీవితోదంతం, భక్తితత్త్వాన్ని లోకవ్యాప్తం కావించటానికి ఆయన చేసిన కృషి వర్ణింపబడ్డాయి. పృథువుకు పూర్వం రాజ్యాన్ని పరిపాలించిన వేనుడు ప్రజాకంటకుడై అధర్మవర్తనకు మారుపేరయ్యాడు. కరువు కాటకాలతో క్షోభిల్లుతున్న కాశ్యపీఖండాన్ని సస్యశ్యామలం చేయవలసిన గురుతరబాధ్యత పృథువు భుజస్కంధాలపై పడింది. ఆ విధంగా భూమండలాన్ని మానవసమాజ క్షేమధామంగా తీర్చిదిద్దిన పృథుచక్రవర్తి దేశాన్ని గ్రామాలుగా, పట్టణాలుగా విభజించి భారతచరిత్రలో పరిపాలనసౌకర్యాలకు రూపకల్పన మొదలుపెట్టాడు. అతని విస్తారమైన జీవితానుభవం, అతడు కావించిన బహుళాశ్వమేధ యాగాలు, ఇంద్రునితో అతనికి సంభవించిన కలహం మొదలైనవన్నీ జీవకళ ఉట్టిపడేటట్లు చిత్రీకరింపబడ్డాయి. సమర్థుడైన పరిపాలకుడుగా, సర్వసమర్పణశీలుడైన భక్తుడుగా అతని జీవితం చరితార్థమయింది.

ఆ తర్వాత ఎనిమిది అధ్యాయాలలో పృథుచక్రవర్తి పౌత్రుడైన ప్రాచీనబర్హి వృత్తాంతం, అతని సుతులు ప్రచేతసుల వృత్తాంతం అభివర్ణింపబడ్డాయి. వైదికధర్మాన్ని అవలంబించి క్రతుకృత్యాలలో నిమగ్నుడై కర్మారంభాన్ని త్యజింపలేకపోయిన ప్రాచీనబర్హిమహారాజుకు నారదుడు భక్తిమార్గాన్ని ప్రబోధిస్తాడు.

**శబ్దబ్రహ్మణి దుష్పారే చరన్త ఉరువిస్తరే**
**మన్త్రలిఙ్గై ర్వ్యవచ్ఛిన్నం భజన్తో న విదుః పరమ్.**

**యదా యమనుగృహ్ణాతి భగవా నాత్మభావితః**
**స జహాతి మతిం లోకే వేదే చ పరినిష్ఠితామ్.**

**తస్మా త్కర్మసు బర్హిష్మ న్నజ్ఞానాదర్థకాశిషు**
**మార్థదృష్టిం కృథాః శ్రోత్ర స్పర్శిష్వస్పృష్టవస్తుషు.**

**స్వం లోకం న విదుస్తే వై యత్ర దేవో జనార్దనః**
**ఆహు ర్ధూమ్రధియో వేదం సకర్మక మతద్విదః.**

**ఆస్తీర్య దర్భైః ప్రాగగ్రైః కార్త్స్న్యేన క్షితిమణ్డలమ్**
**స్తబ్ధో బృహద్వధా న్మానీ కర్మ నావైషి యత్పరమ్.**

**తత్కర్మ హరితోషం య త్సా విద్యా తన్మతి ర్యయా.**

(భాగ. 4. 29. 45 –49)

ఒక వంక ధ్రువుడు, పృథుచక్రవర్తి మొదలైనవారు కావించిన అనేక యజ్ఞయాగాలను వేనోళ్ళ ప్రశంసించి, మరొకవంక నారదుని నోట కర్మకలాపాలు మోక్షకారణాలు కావని చెప్పించటం పైకి దోషయుక్తంగా కనుపింపవచ్చునేమో కాని నిజంగా ఇందులో ఎటువంటి వికల్పమూ లేదు. యజ్ఞయాగాదులతో సకర్మకాలైన వైదికారాధనల స్థానంలో భక్తిప్రధానమైన భాగవతధర్మం, పాంచరాత్రాగమాల వంటి ప్రమాణగ్రంథాలు నిరూపించి పౌరాణిక దేవతామూర్తుల పూజాక్రమాలు క్రమక్రమంగా చోటుచేసుకొంటున్న చారిత్రిక పరిణామానికిది నిదర్శన మని మనము భావింపవచ్చును. అయితే భాగవతం బౌద్ధ జైనాది నవీనమతాల వలె గిరిగీసుకొని యజ్ఞకర్మలను కేవలనిరర్థకాలని తృణీకరింపలేదు. పసిపిల్లలకు రోగనిర్మూలన కోసం చేదు మందును తేనెలో రంగరించి, ముందు తేనె రుచి చూపించి ఆ తరువాత మందును తినిపించినట్లు శ్రీమద్భాగవతం ఐహికసుఖాసక్తులైన మానవులను కేవలానుభవానందస్వరూపమైన మోక్షమార్గానికి మళ్ళించే పరోక్షవాదాలుగా వైదికయజ్ఞకర్మలను ఉపదేశిస్తున్నది. నారదమహర్షి కావించిన ప్రబోధంలోని అంతరార్థం ఇదే. ఈ అర్థాన్ని ఉపస్కరించుకొనే చిత్రమైన పురంజనోపాఖ్యానానికి రూపకల్పన జరిగింది. నారదుడు ప్రాచీనబర్హికి –

**అర్థేహ్యవిద్యమానేఽ పి సంసృతి ర్నఽ నివర్తతే**
**ధ్యాయతో విషయానస్య స్వప్నే నార్థాగమో యథా.**

**ఏవం పఞ్చవిధం లిఙ్గం త్రివృత్ షోడశవిస్తృతమ్**
**ఏష చేతనయా యుక్తో జీవ ఇత్యభిధీయతే.**

**అనేన పురుషో దేహానుపాదత్తే విముఞ్చతి**
**హర్షం శోకం భయం దుఃఖం సుఖం చానేన విన్దతి.**

**యథా తృణజలూకేయం నాపయాత్యపయాతి చ**
**న త్యజే న్మ్రియమాణోఽపి ప్రాగ్దేహాభిమతిం జనః.**

**యావదన్యం న విన్దేత వ్యవధానేన కర్మణామ్**
**మన ఏవ మనుష్యేన్ద్ర భూతానాం భవభావనమ్.**

**యదాక్షైశ్చరితాన్ ధ్యాయన్ కర్మాణ్యాచినుతే సకృత్**
**సతి కర్మణ్య విద్యాయాం బన్ధః కర్మణ్యనాత్మనః.**

**అత స్తదపవాదార్థం భజ సర్వాత్మనా హరిమ్**
**పశ్యం స్తదాత్మకం విశ్వం స్థిత్యుత్పత్త్యప్యయా యతః.**

(భాగ. 4. 29. 73 – 79)

అంటూ భాగవత ధర్మాన్ని ప్రబోధిస్తాడు. మానవ శరీరాన్ని పురంగా అభివర్ణిస్తూ, ఇంద్రియార్థ నిరసనార్థం పురంజనుని ఉపాఖ్యానం అతిరమ్యంగా చిత్రింపబడింది. భ్రాంతచిత్తత వల్ల కాంతాలోలుడై ఐహిక బంధాలలో చిక్కుకొని శ్రేయోమార్గానికి దూరమైన పురంజనుడనే ఆ కల్పిత పాత్ర యొక్క జీవితోదంతాన్ని సరహస్యంగా నిరూపించి నారదుడు భక్తిపరులే భగవానునికి ప్రీతిపాత్రులని విశదీకరిస్తాడు. భాగవతంలో భావగతం చేసికొనవలసిన ముఖ్యవిషయం ఇదే.

ఇదే సందర్భంలో ప్రస్తావనకు వచ్చిన ప్రచేతసుల కథావర్ణన చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది. లోకంలో సామాన్యంగా శివభక్తులకు, విష్ణుభక్తులకు నడుమ రగుల్కొనే వైషమ్యాన్ని తొలగించటమే ఈ కథాపరమోద్దేశం. ఇందులో ప్రచేతసులకు అధ్యాత్మతత్త్వాన్ని బోధించిన

మహేశ్వరుడు వారితో శ్రీమహావిష్ణువును ఆరాధింపమని అంటాడు. విష్ణుభక్తులందరూ తన భక్తులతో సమానమని, తన భక్తులు విష్ణుభక్తులతో సమానమని హరిహరాభేదాన్ని నొక్కిచెప్పి –

**స్వధర్మనిష్ఠ శతజన్మభిః పుమాన్**
**విరించతామేతి తతఃపరం హి మామ్**
**అవ్యాకృతం భాగవతోఽథ వైష్ణవం**
**పదం యథాహం విబుధాః కలాత్యయే.**

**అథ భగవతా యూయం**
**ప్రియాః స్థ భగవాన్ యథా**
**నమద్భాగవతానాం చ**
**ప్రేయా నన్యోఽస్తి కర్హిచిత్.**

(భాగ. 4. 24. 29 – 30)

అంటాడు. అదే విధంగా విష్ణువు కూడా తనను రుద్రగీతతో ఆరాధించినవారికి సర్వార్థసిద్ధులు కలుగుతాయని

**యే తు మాం రుద్రగీతేన**
**సాయం ప్రాతః సమాహితాః**
**స్తువన్త్యహం కామవరా**
**న్దాస్యే ప్రజ్ఞ చ శోభనామ్**

(భాగ. 4. 30. 10)

అని ప్రచేతసులతో అంటాడు. ఈ విధంగా భక్తిమార్గానురోధకమైన శ్రీమద్భాగవతంలో ఈ చతుర్థస్కంధానికి విశేషప్రాధాన్యం ఉన్నది. లోకాభిరక్షణ కోసం రాజధర్మాలను నిర్వహిస్తూ భక్తవతంసులై జీవితాన్ని స్వస్వరూపానుభవంతో తరింపజేసుకొన్న అనేకానేక రాజన్యుల పుణ్యచరిత్రలు, వారి గుణశీలాలు ఇందులో నోరారా కీర్తింపబడ్డాయి. ఈ కథలలో వలెనే లోకంలోనూ ఉత్తమభక్తులైనవారి జీవితాలలో ఎదురుదెబ్బలు

తగిలి, ఒక్కుమ్మడిని కష్టాలు చుట్టుముట్టినపుడు ఆ అగ్నిపరీక్షకు తట్టుకొనే సామర్థ్యం వారికి చేకూరి, వారిని ఒక దివ్యశక్తి కాపాడుతుండటం మనము తరచు చూస్తుంటాము. అందుచేత భగవానుని అవతారగాథ లెంత పవిత్రమైనవో, భగవత్ప్రతీకలైన ఆ భక్తాగ్రేసరుల పుణ్యచరిత్రలు కూడా అంతే పవిత్రమైనవని మనము గ్రహించాలి. ఆ గాథాకర్ణనం వలన మానవహృదయాలు భక్తినిలయాలవుతాయి. ఈశ్వరీయప్రభావాన్ని చిత్రించే సర్గ విసర్గాలను నిరూపించిన తర్వాత వంశానుచరితాదులను వర్ణించటంలోని పురాణాల ఉద్దేశం ఇదే.

## పంచమ స్కంధం

శ్రీ మద్భాగవత పంచమస్కంధంలో ఇరవై ఆరు అధ్యాయాలున్నాయి. ఇందులో ఉన్న 666 శ్లోకాలు, గద్యాలలో గద్యభాగమే అధికం.

ఈ స్కంధంలో మహాపురాణ దశ లక్షణాలలో ఒకటయిన స్థితి లేదా స్థానము అనే అంశం వర్ణితమైనదని పెద్దలంటారు. 'స్థితి ర్వైకుణ్ఠవిజయః' అని భాగవతం దీనిని నిర్వచిస్తున్నది. (భాగ. 2. 10. 4). ఇందులో భువనకోశ వర్ణన, భూమండల వర్ణన సువిస్తరంగా చేయబడ్డాయి. భువనకోశంలో వెలసిన వివిధలోకాలలో సమస్త చరాచరజీవకోటి నెలకొని ఉన్నది.

స్థిత్యనంతరం భాగవతంలో వృత్తివర్ణన చేయబడింది. ఈ వృత్తి యొక్క నిర్వచనం ద్వాదశస్కంధంలో –

**వృత్తి ర్భూతాని భూతానాం చరాణా మచరాణి చ**
**కృతా స్వేన నృణాం తత్ర కామాచ్చోదనయాపి వా**

(భాగ. 12. 7. 13)

అని కనుపిస్తుంది. సర్గవిసర్గాలచే స్థితియందు వెలసిన చరాచరముల యొక్క జీవికకు అనువైన వృత్తికల్పనమని దీని అర్థం.

ఇంతకు పూర్వమే అనుకొన్నట్లు ప్రధానేతివృత్తానికి ప్రత్యక్షానురోధం లేని అనేక గౌణవిషయాలను వర్ణించటం కూడా పురాణరచనాశిల్పంలో ఒక భాగమే. తద్రీత్యా ఈ స్కంధంలోని మొదటి పదిహేను అధ్యాయాలలో స్వాయంభువ మనువు కాలం నుంచి భూతలాన్ని పరిపాలించిన పెక్కుమంది రాజన్యుల పుణ్యచరిత్రలను పేర్కొనటం జరిగింది. ఇంతకు మునుపు స్కంధంలో స్వాయంభువుని పెద్ద కొడుకైన ఉత్తానపాదుడు మొదలుకొని ప్రాచీనబర్హి కాలం దాకా వెలసిన రాజుల కథలను గురించి తెలుసుకొన్నాము. ఈ స్కంధంలో మనువు ద్వితీయపుత్రుడైన ప్రియవ్రతుని వంశక్రమం చిత్రితమయింది. ఆజానజంగా శమదమాదిసంపత్తి చేకూరి వైరాగ్యోదయం కలిగిన ప్రియవ్రతుడు నారదమహర్షి ఉపదేశాన్ని పాటించి నివృత్తిమార్గం లోనికి ప్రవేశించినా, బ్రహ్మ ఆదేశాన్ని అనుసరించి మళ్ళీ రాజధర్మాన్ని తలకెత్తుకొని సంసార గతుడై ఉంటూనే తదతీతునిగా వర్తించటం నేర్చుకొంటాడు. భువనకోశానికి కేంద్రబిందువుగా ఉన్న జంబూద్వీపాన్ని, దాని చుట్టూ ద్వీపాలను, సప్తసముద్రాలను ఉపకల్పించి, భూతలంలో అనేకానేక నదీపర్వతాలను నెలకొల్పిన మహితాత్మునిగా ఈతడు పేరెన్నిక గన్నాడు. సూర్యసంచార మార్గంలో సూర్యరథాన్ని అనుసరించి ఇతను రథాన్ని నడిపించినప్పుడు ఆ చక్రాల తాకిడికి నేల చీలి సముద్రాలు ఏర్పడినట్లు వర్ణింపబడింది. ఆ ద్వీపసముద్రాలను గురించిన విపుల వర్ణనమూ ఈ అధ్యాయంలోనే ఉన్నది. రథచక్రం ఒరపిడికి సముద్రాలు ఆవిర్భవించినవనే సిద్ధాంతంలో ఉన్న ప్రతీక ఏమిటో గ్రహించటం కష్టమే. బహుశః కాథికునికి కూడా ఈ అనుమానమే కలిగింది కాబోలు.

> **"యావదవభాసయతి సురగిరి మనుపరిక్రామన్ భగవా నాదిత్యో వసుధాతల మర్ధేనైవ ప్రతప త్యర్ధే నావచ్ఛాదయతి తదా హి భగవదుపాసనోపచితాతి పురుషప్రభావ స్తదనభినన్దన్ సమజవేన రథేన జ్యోతిర్మయేన రజనీమపి దినం కరిష్యామీతి సప్తకృత్వస్తరణి మనుపర్యక్రామ ద్వితీయ ఇవ పతఙ్గః"**
>
> (5.1.30)

అంటూ సర్వశక్తిమంతుడైన శ్రీ భగవానుని నమ్ముకొన్నవారికి అసాధ్యమైనదేదీ ఉండదని సమర్థించాడు.

ప్రియవ్రతుని కొడుకు అగ్నీధ్రుడు – ధర్మసమ్మతంగా సకల ప్రజానురంజకంగా రాజ్యపాలన చేసినవాడు – చివరికి ఒక అప్సరస సౌందర్యానికి ముగ్ధుడై ఆమె యందు నాభి అనే మహనీయుని సుతునిగా కంటాడు. నాభి కాలంలో వైదికకర్మలు నిర్నిరోధంగా కొనసాగాయి. ఒకానొక యజ్ఞంలో శ్రీ మహావిష్ణువే స్వయంగా తాను నాభి యింట జన్మింపగలనని వరాన్ని ప్రసాదించి, ఋషభుడనే పేరిట ఉదయించి రాజర్షితల్లజు డయ్యాడు. గృహస్థాశ్రమంలో ఉంటూనే మానవులు పరమహంసపదాన్ని చేపట్టవచ్చునని శ్రీ ఋషభావతారం లోకానికి వెల్లడిచేసింది. ఋషభసుతులలో తొమ్మిది మంది నవయోగులని ప్రఖ్యాతి గడించి అధ్యాత్మవిద్యాసంపన్ను లయ్యారు.

ఏకాదశ స్కంధంలో అమోఘమైన వీరి దర్శనసారం మనకు పరిచయ మవుతుంది. భరతుడు తప్ప ఋషభసుతులలో తక్కినవారందరూ బ్రహ్మనిష్ఠులై బ్రాహ్మణులయ్యారు. ఋషభుడు సలక్షణంగా రాజధర్మాన్ని నిర్వహించి, పరమార్థవిదుడై అంతకాలంలో పరమహంస జీవితం గడిపాడు. ఆయన జీవితోదంతం, బోధనల సారం నాలుగవ అధ్యాయం మొదలుకొని ఆరవ అధ్యాయం వరకు విస్తరించి ఉన్నది. జైన మతస్థులు కూడా తమ అధ్యాత్మగురువులైన తీర్థంకరులలో ఒకరిగా ఈ ఋషభాచార్యులను పరిగణించటం విశేషం.

ఋషభసుతు లందరిలో అతని తర్వాత రాజ్యానికి వచ్చిన భరతుడు సుప్రసిద్ధుడు. ప్రజానురంజకుడైన ఆ రాజు పేరుమీదుగా అప్పటివరకు అజనాభవర్షమని పిలువబడుతున్న భూమిభాగానికి భారతవర్షమని వ్యవహారం ఏర్పడింది. సార్వభౌముడై దేశాన్ని ఏకాతపత్రంగా పరిపాలించి, వార్ధకంలో అతను వానప్రస్థాన్ని స్వీకరించాడు. బంధహేతువులైన సర్వసంగాలను త్యజించి తపోదీక్ష గైకొన్న ఆ మహానుభావుడు చివరి రోజులలో ఒక హరిణశాబకం పైని మమకారం పెట్టుకుని అదే ప్రాణంగా

జీవిస్తూ ఉత్తరజన్మలో హరిణమై పుట్టాడు. ఆ విధంగా జననమరణాల చక్రభ్రమణంలో కొట్టు మిట్టుకులాడి, కొంతకాలానికి మనుష్యజన్మను పొందిన తర్వాత కర్మలన్నీ ఫలకారణాలేనని గ్రహించి, కర్మారంభాన్ని కూడా విడిచిపెట్టి జడభరతుడని పేరుపొందాడు. ఒకనాడు తన ప్రాంతానికి వచ్చిన రహూగణుడనే రాజుకు అతను భక్తితత్త్వాన్ని విశదీకరిస్తాడు. పంచమస్కంధం లోని ముఖ్యఘట్టాలలో ఒకటయిన ఈ జడభరతోపాఖ్యానం సప్తమాధ్యాయం మొదలుకొని పధ్నాలుగవ అధ్యాయం వరకు అద్భుతమైన సంవిధాన శిల్పంతో ఎంతో ఆకర్షణీయంగా రచింపబడింది. పదిహేనవ అధ్యాయంలో భరతుని వంశంలో భక్తాగ్రేసరుడైన గయుడనే రాజు కాలం దాకా ఆవిర్భవించిన రాజులందరి కథలూ సంక్షిప్తంగా ఉన్నాయి.

ఇక పదహారవ అధ్యాయం మొదలుకొని స్కంధాంతం వరకు భువనకోశ వర్ణన మనిపించే విపులమైన వర్ణన భాగం ఉన్నది. ఆధునికవిజ్ఞానంతో పరిచయం ఉన్నవారికి ఇందులోని భూగోళ ఖగోళ విజ్ఞానాల స్వరూపం కొంత సత్యదూరంగా భాసింపవచ్చును కాని ఇక్కడ ప్రసక్తమైనది కేవలైహికదృష్టితో కావించిన వర్ణన కాదని మళ్ళీ ఒకసారి మనము గుర్తుంచుకోవాలి. ఈ అధ్యాయారంభం లోనే పరీక్షిత్తు

> **“తత్రాపి ప్రియవ్రతరథచరణపరిఖాతైః సప్తభిః సప్త సిన్ధవ ఉపక్లుప్తా యత ఏతస్యాః సప్తద్వీపవిశేషవికల్ప స్త్వయా భగవన్ ఖలు సూచిత ఏతదేవాఖిలమహం మానతో లక్షణతశ్చ సర్వం విజిజ్ఞాసామి. భగవతో గుణమయే స్థూలరూప ఆవేశితం మనో హ్యగుణేఽపి సూక్ష్మతమ ఆత్మజ్యోతిషి పరే బ్రహ్మణి భగవతి వాసుదేవాఖ్యే క్షమ మావేశితుం తదుహైతద్గురో ర్హస్యనువర్ణయతుమితి.**
>
> (భాగ. 5. 16. 2 – 3)

అని శుకయోగితో అంటాడు. ఈ సమస్తవిశ్వం విశ్వాత్ముని యొక్క స్థూలరూపమని, ఈ స్థూలరూపంలో గోచరిస్తున్న అద్భుతావహ సౌందర్యాన్ని,

విలక్షణతను ధ్యానధారణ చేసి, జగత్తులు తన యందు వసింపగా తాను జగత్తులలో వసిస్తున్న శ్రీ వాసుదేవుని సర్వాంతర్యామితను స్వానుభవంలో అవగాహన చేసికొని, తత్పరమేశ్వర సూక్ష్మరూపాన్ని దర్శించటానికి మాత్రమే ఈ సన్నివేశం ఉద్దేశితమయింది. సకలలోకోత్తరుడని భావింపబడుతున్న ఆ భగవానుని ఉనికి కల్పితమాత్రం కాదని, వాస్తవికమని, కేవల సత్యమని మనకు తెలియటమే దీని అంతరార్థం. నిర్గుణమైన ఆత్మతత్త్వాన్ని తంత్రమార్గంలో తెలిసికొనగోరినవారు ప్రాథమిక దశలో యంత్రాలకిచ్చే ప్రాధాన్యం ఎటువంటిదో, భువనకోశవర్ణనలో భువనకోశానికి ఉన్న ప్రాధాన్యం కూడా అంతమాత్రమేనని మనము జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ విధమైన అభివర్ణనలో ఎంతటి పటిష్ఠమైన ప్రణాళిక ఉన్నదో, ఎంతటి వాస్తవికచిత్రణ ఉన్నదో, అంతటి సూచ్యార్థసూచన, గర్భితార్థప్రకాశనం నిబిడమై ఉన్నాయి. ఆ మాటలలో కనిపించేది అవద్యమైన గద్యం కాదు; పూర్ణకవితాత్మకమైన సుష్ఠ్వభివ్యక్తి. నీరసమై, శుష్క పదాడంబరతతో కూడిన వచనాని కంటె సాలంకృతమై సగుణమై సార్థకమైన కవిత్వానికి భావవ్యక్తీకరణశక్తి పుష్కలంగా ఉంటుంది. ధ్యానానికి కూర్చున్న సాధకునికి తుచ తప్పకుండా చేసే వర్ణనల వల్ల ప్రత్యేకంగా ఒరిగే ప్రయోజనం ఏమీ లేదు; కావలసినదల్లా ఒక్కటే: అత్యంత దురవగాహమైన భగవతత్త్వరహస్యాన్ని, ఈశ్వరీయశక్తివిలసనను, ఇంద్రియాతీతమూ ఇంద్రియానుభవనీయమూ అయిన ఆ దివ్యశక్తి ఉనికిని మానవమనోమయ కోశంలో ప్రస్ఫుటింపజేయగల అభివ్యక్తీకరణ శక్తి మాత్రమే. ఈ విధమైన సాధనక్రమం ఆచరణయోగ్యమని భావించినవారు భగవత్ స్థూలరూపపరికల్పనార్థం ఈ భాగాన్ని మనస్సుకు తెచ్చుకొంటే బాగుంటుంది. లేదంటే దీనిని విడిచిపెట్టి ముందుకు సాగటం మంచిది.

పదహారవ అధ్యాయం నుంచి ఇరవైయవ అధ్యాయం వరకు భూమండలంలోపరితల స్వరూపం, భూగోళ విజ్ఞానం మొదలైన విషయాలు చర్చింపబడ్డాయి. పద్మపత్రాకారంలో ఉన్న ఈ భూతలాన ఏడు

ద్వీపాలున్నాయి. ఒక్కొక్క ద్వీపాన్ని మరొక ద్వీపం నుంచి వేరుచేస్తూ పర్యావరణలో ఒక్కొక్క సముద్రం ఉంటుంది. ఈ విధంగా ఏడు సముద్రాలున్నాయి. అన్నింటికీ నడిమి భాగంలో ఉన్నది జంబూద్వీపం. జంబూద్వీపానికి వెలుపల లవణసముద్రం; లవణసముద్ర పర్యావరణలో ప్లక్షద్వీపం; ప్లక్షద్వీపాన్ని చుట్టుకొని ఇక్షుసముద్రం; ఆ తర్వాత శాల్మలద్వీపం, దానికి బయట సురాసముద్రం; తదుపరిగా కుశద్వీపం, దాని చుట్టూ ఘృతసముద్రం; ఘృతసముద్రానికి బహిరావరణలో క్రౌంచద్వీపం, దానిని ఆవర్తించి క్షీరసముద్రం; ఆ పైని శాకద్వీప దధిసముద్రాలు; చివరిగా పుష్కరద్వీపం, శుద్ధజలార్ణవం ఉన్నాయి. పుష్కరద్వీపం నడిమి తలాన పదివేల యోజనాల సమున్నతమైన మానసోత్తరమహాశైలం ఉంటుంది. ఆ పర్వతాగ్రాన లోకాలకు వెలుగును ప్రసాదిస్తున్న శ్రీ సూర్యనారాయణుని యొక్క మహారథం ఆ లోకాలకు అభిముఖంగా వర్తులాకారంలో ప్రయాణిస్తుంటుంది.

శుద్ధజలార్ణవానికి బహిరావరణలో – భూమికి కేంద్రంగా ఉన్న మేరుపర్వతానికీ, పుష్కరద్వీపంలోని మానసోత్తరమహాశైలానికీ ఎంత దూరం ఉన్నదో, అంత మేరకు విస్తరించి – సమస్తాన్ని ఆవరిస్తున్న లోకాలోకపర్వతం ఉన్నది. లోకాలోకానికి వెలువల ఉన్నది వట్టి అలోకం. సూర్యుని కాంతి కిరణాలకు అక్కడ ప్రవేశం లేదు. లోకానికీ అలోకానికీ నడిమితలంలో ఉన్న చోటు కాబట్టే దానికి లోకాలోకపర్వతమని పేరువచ్చింది.

ఈ విధంగా శ్రీమద్భాగవతంలో భువనకోశగతాలైన అనేక ప్రదేశాలు, అనేకవర్షాలకు గల వైశిష్ట్యాలన్నీ క్రమంగా వర్ణింపబడ్డాయి. అయితే ఒకటి మాత్రం స్పష్టం. మనము నివసిస్తున్న ఈ జంబూద్వీపం తప్ప తక్కిన ప్రదేశాలన్నీ మనకంటె శారీరికంగా, మానసికంగా అన్ని విధాలా శ్రేష్ఠులైనవారికి నివాసస్థానాలు. భూతలాన పుణ్యకర్మలను ఆచరించినవారు ఉత్తమఫలానుభవార్థం ఆ ప్రదేశాలకు వెళ్ళి భోగకాలం తీరినంత దాకా అక్కడ నివసిస్తుంటారు. అందువల్ల వారికి సుఖానుభవానికే తప్ప నూతన

కర్మారంభానికి ఆస్కారం ఉండదు. ఆ అవకాశం, ఒక్క జంబూద్వీపవాసులకు మాత్రమే పరిమితం. కేవల సుఖోపభోగానికి మాత్రమే ఉద్దిష్టాలైన ఆ ప్రదేశాలలోని వారికి జంబూద్వీపవాసులకు వలె మోక్షానుభవయోగ్యత కూడా లేదు.

భాగవతకర్త బ్రహ్మాండ కటాహంలో వెలసి విలసిల్లుతున్న ఈ ద్వీపసప్తకాన్ని వర్ణించేముందు ముమ్మొదటగా సర్వమధ్యంలో ఉన్న జంబూద్వీపాన్ని వర్ణించటం జరిగింది. రచయిత లోకపరిశీలనకు నిదర్శనమైన ఈ భాగం ప్రకృతస్కంధంలో 16 నుంచి 19 దాకా నాలుగు అధ్యాయాలలో ఉన్నది. ఈ జంబూ ద్వీపంలోనే మనకు ఆవాసమైన భారతవర్షం ఉన్నది.

సప్తసముద్రాలకు, సప్తద్వీపాలకు, సమస్త బ్రహ్మాండకోశానికి మధ్య నివిష్టమైన జంబూద్వీపం నడిమి భాగంలో మహాప్రమాణం కలిగిన మేరుపర్వతశిఖరం ఉన్నది.

**"యస్యైకం చక్రం ద్వాదశారం షణ్ణేమి త్రిణాభిసంవత్సరాత్మకం సమామనన్తి తస్యాక్షో మేరోర్మూర్ధని కృతో మానసోత్తరే కృతేతరభాగో యత్ర ప్రోతం రవిరథచక్రం తైలయన్త్ర చక్రవద్భ్రమన్మానసోత్తరగిరౌ పరిభ్రమతి తస్మిన్నక్షే కృతమూలో ద్వితీయోఽ క్ష స్తుర్యమానేన సమ్మిత స్తై లయన్త్రాక్షవద్ ధ్రువే కృతపరిభాగః"**

(భాగ. 5. 22. 13-14)

అని భాగవత వచనం. గానుగలో నడుమ పాతిన నిలువు దిమ్మలా సర్వప్రపంచానికి మధ్యతలంలో భూమిచక్రానికి ఇరుసు వంటి మేరుపర్వతాన్ని సూర్యరథచక్రపు అక్షం ఒకటి తాకుతుండగా, సూర్యరథం మేరువు చుట్టూ పరిభ్రమిస్తుంటుంది. ఈ మధ్యమేరువుకు ఉత్తర దక్షిణాలలో మూడేసి పర్వతశ్రేణులు లవణసముద్రతీరాలను కలుపుతూ, భూభాగాన్ని మొత్తం ఏడు ద్వీపాలుగా విభజిస్తున్నాయి. ఇవి కాక మధ్యధరాప్రాంతంలోనే

ప్రాక్పశ్చిమాలలో రెండు పర్వతశ్రేణులు వ్యాపించి ఆ ప్రదేశాన్ని మొత్తం మూడు భాగాలుగా విడదీశాయి. ఆ విధంగా జంబూద్వీపంలో పర్వతశ్రేణుల చేత విభక్తమైన భూమిభాగాలు మొత్తం తొమ్మిది ఉన్నాయి. మహామేరువు చుట్టూ ఉన్న భూమిభాగానికి ఇలావృత వర్షమని పేరు. ఇలావృతానికి ఉత్తరంలో రమ్యక హిరణ్మయ కురువర్షాలు, దక్షిణంలో కింపురుష కేతుమాల భద్రాశ్వ వర్షాలు కనిపిస్తాయి. ఈ తొమ్మిది వర్షాలలోనూ శ్రీ మహావిష్ణువు వేర్వేరు రూపనామాలతో వెలసి భక్తాభీష్టాలను అనుగ్రహిస్తున్నాడు. వీటిలో ఒక్క భారతవర్షం తప్ప తక్కిన ప్రదేశాలన్నీ సుఖానుభవయోగ్యత చేత కొంతకు కొంత స్వర్గతుల్యాలని చెప్పదగి ఉన్నా, నరనారాయణాధిష్ఠితమైన ఒక్క భారతవర్షంలో మాత్రమే కర్మానుచరణకు అవకాశమేర్పడి, ఆ సుకృత దుష్కృత ఫలాలను అనుభవించేందుకు ఇతర లోకాలకు వెళ్ళటం జరుగుతున్నది. ఆ కర్మఫలం తీరిన వెంటనే నూతనకర్మాచరణకు వారు మళ్ళీ భూలోకానికి రావలసి ఉంటుంది. పైగా జీవులకు మోక్షసాధన మహావకాశం ఒక్క భూలోకంలోనే లభ్యపడుతున్నది. అందుచేతనే దేవతలు కూడా భారతవర్షంలో జన్మించాలని తహతహలాడుతుంటారు.

భూమండలానికి ఉపరిభాగంలో భువర్లోకం, స్వర్లోకం, మహర్లోకం, జనలోకం, తపోలోకం, బ్రహ్మలోకం అని ఆరు పుణ్యలోకాలు, అధోభాగంలో అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళములనే సప్తలోకాలు యథాసన్నివిష్టంగా ఉపక్లుప్తాలై ఉన్నాయి. భువనకోశానికి మూలదేశంలో శ్రీ భగవానుని చతుర్వ్యూహాలలో ఒకటయిన సంకర్షణ వ్యూహం అనంతుడనే పేరిట నిలిచి ఉన్నది. బ్రహ్మలోకానికి పైనున్న నక్షత్రావస్థానమండలా లన్నింటికీ నడిమి భాగంలో, శింశుమారచక్రానికి తోక వైపున ధ్రువమండలం ఉన్నది. ఈ ఉపవర్ణితభాగమంతా సర్వాత్మకుడైన భగవానుని స్థూలరూపాన్ని ధ్యానగోచరం కావించుకొని స్వప్రకాశానందమయమైన ఆయన సూక్ష్మరూపాన్ని స్వానుభవంలో తెలుసుకొనగోరిన సాధకుల మననధారణ కోసమే తప్ప భూగోళ ఖగోళ విజ్ఞానాలను సమీకరించాలనే కేవలైహికదృష్టితో

రచింపబడినది కాదని ఇంతకుముందే అనుకొన్నాము. ఆ విధంగా ధ్యానమూలకంగా శుద్ధము బుద్ధము ముక్తము కేవలము అఖండము సచ్చిదానందమయము అయిన భగవత్తత్త్వాన్ని గ్రహించినవారికి స్థూలరూపం నుంచి సూక్ష్మరూపం లోనికి నివేశింపజేసే ఈ సాధన రహస్యం ఆలోచనామృతమైన పూర్ణసత్యమని (సత్యస్య సత్యమ్), అవిచారితరమణీయం కాదని తేటతెల్లమవుతుంది.

స్కంధాంతంలో మనకు కనిపించేది దాదాపు 37 గద్యపద్యాలలో ఉన్న నరకలోకవర్ణనం. ఆంగ్లంలో దీని శబ్దార్థం సరిగా తెలియక హెల్ అని అనువదిస్తుంటారు కాని నిజానికి పర్గేటరీ అనటం మేలు. ఈ యాతనాభూములలో కేవలం జీవుల యొక్క పాపాలకు శిక్షవిధించటం మాత్రమే ఉద్దేశం కాదు. లోకంలో ప్రతిషిద్ధలక్షణమైన అధర్మాన్ని కావించేవారి శ్రద్ధావైసాదృశ్యం బహురీతులుగా ఉన్నట్లే, వారికి కలిగే కర్మఫలాలు కూడా బహురీతులుగా ఉంటాయి. అనాదిసిద్ధమైన అవిద్య వలన కామనలు చెలరేగి పాపకర్మలను చేయించినప్పుడు, తత్పరిణామంగా సిద్ధించే ఫలాలను అనుభవించటం వలన జీవునికి మళ్ళీ చిత్తపరిశుద్ధి, నైర్మల్యం కలుగుతాయి. ఈనాడు న్యాయశాస్త్ర విచక్షణులలో పెక్కుమంది మొండికెక్కిన గడ్డు నేరస్తులకు కూడా కారాగార శిక్ష విధించటం, వారిని నిర్దాక్షిణ్యంగా ఉరితీయటం కంటె వారియెడ ఆప్యాయిత నెరపి ఆదరాభిమానాలు చూపించి వారి మనస్సులలో పరివర్తనను తీసుకొనిరావటం మంచిదని భావించేవారున్నారు. నేరం చేసినవారి పట్ల మనము కక్ష సాధింపు ధోరణిని, క్రౌర్యాన్ని, శిక్షావిధానంలో అసమానతను చూపించితే, ఆ నేరస్తుని మనస్సులో కార్పణ్యం కరుడుగట్టి అతను మరింత కఠోరచిత్తుడయే ప్రమాదం ఉన్నది. సాటి నేరస్తుల సాహచర్యంలో అతను మరింత దుష్టునిగా మారే అవకాశం కూడా లేకపోలేదు. అందుచేతనే ఆనాటి పౌరాణికులు యాతనానుభవంలో మనస్సును పశ్చాత్తాపతప్తం కావించి, పాపసంకల్పాలు తలయెత్తకుండా ప్రక్షాళింపగల మహాశక్తి ఉన్నదని నిశ్చయించారు. ఆ విధంగా దుష్కర్మఫలాన్ని

అనుభవించిన జీవునికి మళ్ళీ సన్మార్గం లోనికి ప్రవేశించి, ఆత్మోన్నత్యాన్ని సాధించేందుకు మరొక అవకాశం లభిస్తుంది. నరకలోకాల వర్ణనలో కనిపించే అనేక కఠినశిక్షల స్వరూపాన్ని గురించి తెలుసుకొన్న వెంటనే, అసలు ఈ నరకాలనేవి నిజంగా ఉన్నాయా? ఆ నరకాలలో నిజంగానే శిక్షలు విధింపబడతాయా? అని పాఠకులకు సందేహం కలగటం సహజమే. కపిలోపదేశంలో మానవులు దేహయాత్రాసందర్భంలో నరకాని కంటె దుర్భరమైన అనేకబాధలకు గురి కావలసి ఉంటుందని చెప్పబడింది. మానవలోకమే ఇలా ఉన్నప్పుడు నరకయాతనలు మరీ భరింపరానివిగా ఉంటాయని ఎందుకనుకోకూడదు?

ఈ రోజులలో మతబోధనలను విశ్వసించి, ఆర్షధర్మానుగుణంగా నడుచుకొనే ఆస్తికులకు కూడా నరకమంటే అవిశ్వాసం ప్రబలుతున్నది. ఈ అవిశ్వాసం ఒక మోజుగా మారుతున్నప్పటికీ, నిజానికి నరకాన్ని విశ్వసించటం వలన సిద్ధించే ముఖ్యప్రయోజనం ఒకటున్నది. ఈ లోకంలో మనం చేసే అధర్మకృత్యాలన్నింటికీ మనము శిక్ష ననుభవింపక తప్పదని, తప్పుచేసినవారందరూ ఎక్కడో నరకంలో గాక ఈ జన్మలోనే కష్టాల రూపంలో తమ పాపఫలాన్ని ఏదో ఒక విధంగా అనుభవిస్తారని నమ్మిననాడు జనులందరూ సద్వర్తనులై ఈ ప్రపంచం మనకు మరింత నివాసయోగ్యమైన సుక్షేత్రంగా పరిణమిస్తుంది. అంతవరకు సామాన్యులకు ఇహలోకభయం కాకపోతే నరకభయం అన్నా ఉంటే కొంతకు కొంత మేలు. ప్రాడ్వివాకులు ఏమనుకొన్నా సరే గాని, నేరానికి విధించే శిక్ష పూర్తిగా నిష్ప్రయోజకమనటం ఏమంత సబబు కాదు. దోషకర్మకు ప్రాయశ్చిత్తంగా కష్టాలను విధించటం సమంజసమే.

కష్టాలలో ఉన్నప్పుడు మనిషి మనస్సు పశ్చాత్తాపతప్తమై పరిశుద్ధమవుతుంది. కష్టాలే మనిషిని మహాత్మునిగా పవిత్రీకరిస్తాయి.

## షష్ఠ స్కంధం

శ్రీమద్భాగవత షష్ఠస్కంధం లోని పందొమ్మిది అధ్యాయాలలో మొత్తం 849 శ్లోకాలున్నాయి. ఈ స్కంధంలో అధికరింపబడినది 'పోషణ' మనే అంశమని పెద్దలంటారు. పోషణకు భగవదనుగ్రహమనే పేరు కూడా ఉన్నది. ఈ విషయం "పోషణం తదనుగ్రహః" అని ద్వితీయ స్కంధం 10.4 లో ప్రస్తావనకు వచ్చింది. దుష్టశిక్షణ శిష్టరక్షణల కోసం నేలకు దిగివచ్చిన శ్రీ భగవానుడు తన భక్తులకు స్వర్గాపవర్గాలకు అతీతమైన కైవల్యపదాన్ని ప్రసాదించటం ఈ పోషణ యొక్క ముఖ్యలక్షణం. పురాణ లక్షణాలు పదింటిలో నాలుగవదిగా వర్ణింపబడిన రక్షణము యొక్క విస్తృతపరిధిలో ఈ పోషణ కూడా ఒకటి.

**రక్షాచ్యుతావతారేహా విశ్వస్యానుయుగే యుగే**
**తిర్యఙ్మర్త్యర్షిదేవేషు హన్యన్తే యై స్త్రయీద్విషః.**

(భాగ. 12. 7. 14)

అని శ్రీమద్భాగవత వచనం. వేదవిధులు సక్రమంగా అనుష్ఠింపబడినంత కాలం సృష్టి యథావిధిగా జరుగుతుంది. ఆ విధులను ఉల్లంఘించినప్పుడు సృష్టిక్రమానికి ముప్పువాటిల్లుతుంది. ఆ విధంగా సృష్టికి ముప్పుకావించే వారు రాక్షసులు. ఆ రాక్షసతత్త్వం కలిగిన ప్రాణులు ప్రతియుగంలోనూ తలయెత్తి వ్యవహరిస్తుంటారు. అట్టివారిని సంహరించటానికి భగవానుడు అవసరం వచ్చినపుడల్లా దేవ ఋషి నర తిర్యగ్రూపాలను దాల్చి ఆ కార్యాలను నెరవేరుస్తుంటాడు. అట్టి భగవద్రూపాలకు అవతారాలని పేరు. ఆ అవతారాల ఊహాలీల రక్షణ మనబడుతున్నది. సంసార సాగరం నుంచి నిస్తరించి మానవులను ముక్తిశిఖరాలపై అధివసింపజేయటం కంటె భగవదవతారాలకు ప్రయోజనం వేరొకటేమున్నది? భగవంతుని ఆ అనుగ్రహం ఎంత అవ్యాజమైనదంటే, ఒక్కొక్కసారి కేవల పాపవర్తనులు, అరక్షణీయులు అయిన దుష్టాత్ములనుకూడా ఏదో ఒక నెపంతో రక్షించటం జరుగుతుంటుంది. షష్ఠ స్కంధంలో అటువంటివే కథలు రెండు – అతులనిర్భాగ్యుడు, పరమకిరాతకుడు

అయిన అజామిళుని కథ ఒకటి, విశ్వరూప వృత్రాసురులను హరించి బ్రహ్మహత్యాపాతకానికి ఒడిగట్టి సకలైశ్వర్యాలను కోలుపోయిన ఇంద్రుని కథ ఒకటి – చదివి తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి.

ఈ స్కంధంలోని మొదటి మూడు అధ్యాయాలలో కుశలసంవిధానంతో భక్తిరసప్లావితంగా ప్రకల్పింపబడిన అజామిళోపాఖ్యానం ఉన్నది. ధర్మవర్తనుడైన అజామిళుడు కుజనమైత్రీఫలంగా పాపజీవితానికి అలవాటుపడి చేయరాని పనులు చేస్తాడు. మరణశయ్యపై ఉండగా తనను తీసికొనిపోవటానికి వచ్చిన యమదూతలను చూసి భయాకులితచిత్తుడై అతను తనకు తెలియకుండానే భగవన్నామాన్ని ఉచ్చరిస్తాడు. అంతిమక్షణంలో అసంవిదితంగా నైనా భగవన్నామసంకీర్తన కావించిన ఫలంగా విష్ణుదూతలు వచ్చి అతనిని రక్షించి యామ్యపాశ బంధనాల నుంచి విడిపించి ఆత్మస్నేహంలో వైష్ణవ జ్ఞానదీపాన్ని వెలిగిస్తారు. అతనికి సద్యోముక్తి కలుగుతుంది. దీనిని బట్టి, జీవితమంతా పాపాలు చేసినవాడు అంతకాలంలో – అదీ తన కొడుకును పిలిచాననుకొని – అనుద్దేశపూర్వకంగా ఉచ్చరించిన భగవన్నామానికే అంత విలువ ఉన్నదంటే, అనుస్యూత భాగవత ధర్మాన్ని అనుష్ఠించి భగవంతునికి నిషాష్ఠానుసేవ చేసి నిరంతరాయితంగా భక్తిసల్పిన భగవత్కీర్తనపరులకు కలిగే మహాఫలం ఎంతటిదో! భగవన్నామదివ్యత్వం ఎటువంటిదో! ఊహించుకోవాలి.

**ఏవం స విప్లావిత సర్వధర్మా**
**దాస్యాయః పతిః పతితో గర్హ్యకర్మణా**
**నిపాత్యమానో నిరయే హతవ్రతః**
**సద్యో విముక్తో భగవన్నామ గృహ్ణన్.**

**నాతః పరః కర్మ నిబన్ధ కృన్తనం**
**ముముక్షుతాం తీర్థపదానుకీర్తనాత్**
**న యత్పునఃకర్మసు సజ్జతే మనో**
**రజస్తమోభ్యాం కలిలం తతో న్యథా.**

**య ఏవం గృహ్య మితిహాస మఘాపహమ్**
**శ్రుణుయా చ్ఛ్రద్ధయా యుక్తో యశ్చ భక్త్యానుకీర్తయేత్.**

**న వై స నరకం యాతి నేక్షితో యమకిఙ్కరైః**
**యద్యప్యమఙ్గలో మర్త్యో విష్ణులోకే మహీయతే.**

(భాగ. 6. 2. 45 – 48)

"అజామిళుడు చేయని అధర్మం లేదు. చెప్పని అసత్యం లేదు. నరకానికి అతనికంటె వెళ్ళదగినవారు వేరొకరు లేరన్నంతగా అపకృత్యాలు చేసిన ఆ పాపవ్రతునికి భగవన్నామోచ్చారణ మాత్రాన సద్యోముక్తి కలిగింది. కర్మనిబంధనాల నుంచి తప్పించుకొనగోరినవారికి భగవన్నామసంకీర్తన కంటె వేరొక శరణు లేదు. భగవన్నామం మనస్సును పాపకర్మల నుంచి మళ్ళించి భగవత్పరం కావిస్తుంది. భగవత్పరమైన మనస్సు ఇంద్రియవిముఖమై, రజస్తమోదూరమై శుద్ధసత్త్వమయం అవుతుంది. భగవద్భక్తిపరులకు వేరొక ఫలంతో నిమిత్తం లేదు. భక్తికి పరమఫలం భక్తే. పవిత్రమైన ఈ అజామిళోపాఖ్యానాన్ని పఠించినవారు యమదూతలకు దుర్నిరీక్ష్యులై విష్ణుపదాన్ని అధిగమిస్తారు" అని భాగవతం అంటున్నది.

**మ్రియమాణో హరే ర్నామ**
**గృణన్ పుత్త్రోపచారితమ్**
**అజామిళో ప్యగా ద్ధామ**
**కిం పునః శ్రద్ధయా గృణన్.** (భాగ. 6.2.49)

అని ఈ కథాపుణ్యఫలశ్రుతి! అంతకాలంలో తన పుత్త్రుని సాహాయ్యాన్ని కోరి 'నారాయణా!' అని పిలిచిన అజామిళుడు శ్రీ భగవన్నామోచ్చారణ మహాపుణ్యఫలంగా శ్రీమహావిష్ణుపరమధామాన్ని చేరుకొన్నాడు. అసంకల్పితోదితంగా నారాయణనామసంకీర్తన కావించిన వానికే అంతటి మహాఫలం సిద్ధింపగా, శ్రద్ధాభక్తులతో కావించే నైష్ఠికులకు ఎంతటి సుస్థితి కలుగుతుందో!

శ్రీ మద్భాగవతం లోని ఈ శ్లోకాలు ఔపచారికమాత్రాలని, కథాఫలాన్ని ఉద్దీప్తం చేయటానికే తప్ప నిజంగా భక్త్యుపస్కారకాలు కావని కొంతమంది వ్యాఖ్యాతలు అభిప్రాయపడుతున్నారు. అభిరామమనోహరంగా రూపొందిన కథాకథనకౌశలమే ఇందులో ప్రధానమని, కావ్యానుశాసనవృత్తి అనుషంగికమని వీరి తాత్పర్యం. వీరు సాహిత్యికులే కాని పారమార్థికులు కారని గ్రహించాలి. భగవన్నామాన్ని ఉచ్చరిస్తే ఎటువంటి పాపాలు చేసినా విముక్తి కలుగుతుందని, అందువల్ల చేయవలసినవన్నీ చేసి చివరికి 'నారాయణా!' అంటే చాలని కుతర్కాలు చేసేవారి విపరీత వాదానికి అజామిళోపాఖ్యానంలో తావులేదు. భగవన్నామకీర్తనను బోధించటం పాపవర్తకులను ప్రోత్సహించే ఉద్దేశంతో జరగలేదు. భగవన్నామమంటే అంత తేలిక కాదని, భగవన్నామాన్ని పాపాలు చేసి తప్పించుకొనే సులభోపాయంగా పరిగణింపరాదని, భగవన్నామాన్ని చులకన చేయటం భగవదపరాధమేనని, అపరాధాలలో నామాపరాధం మహాపరాధమని వైష్ణవాచార్యు లందరూ ఏకగ్రీవంగా నిర్ణయించారు. పైగా అజామిళు డుచ్చరించిన భగవన్నామం యాదృచ్ఛికమనీ అనుకోవటానికి వీలులేదు. జీవితచరమకాలంలో భగవన్నామోచ్చారణ చేయాలనే సద్బుద్ధి జీవితంలో భగవత్పరమైన అభ్యాసం ఉన్నవారికి మాత్రమే కలుగుతుంది. అజామిళుని కథలో అటువంటిది కూడా లేదంటే, అది కేవలం భగవదనుగ్రహఫలమన్నమాట. మంచి చేసినవారికి మంచి, చెడు చేసినవారికి చెడు అన్నది న్యాయదృష్టితో కావించే వివేచన. భగవదనుగ్రహం న్యాయాన్యాయాలకు అతీతమైన ఫలం. అందుచేతనే దానిని అనుగ్రహం అన్నారు. అజామిళునికి ముక్తి అతను చేసిన సత్కార్యాల వలన మాత్రమే కలిగి ఉంటే భగవదనుగ్రహమన్న ప్రశంసే ఉండేది కాదు. నామోచ్చారణ మహిమను, భగవదనుగ్రహ మాహాత్మ్యాన్ని ఆ కథ మనకుపదేశిస్తున్నది. అంతేకాని, తప్పులు చేసి తప్పించుకోమని కాదు.

**అథాపి మే దుర్భగస్య విబుధోత్తమదర్శనే**
**భవితవ్యం మఙ్గలేన యేనాత్మా మే ప్రసీదతి.**

**అన్యథా మ్రియమాణస్య నాశుచే ర్వృషలీపతేః**
**వైకుణ్ఠనామగ్రహణం జిహ్వా వక్తు మిహార్హతి.**

**క్వ చాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరపత్రపః**
**క్వ చ నారాయణే త్యేతద్భగవన్నామ మఙ్గలమ్.**

(భాగ. 6. 2. 32-34)

అని తాను బహుజన్మలలో కావించిన సుకృతఫలమే ఈనాడు తన నోట పావనమైన భగవన్నామాన్ని పలికించినదని అజామిళుడే ఈ కథలో అంటాడు. ఈ దృష్టితో చూస్తే భగవదనుగ్రహం న్యాయమే కదా. ❖

---

❖ ఈ ఘట్టం ఆంధ్రభాగవతములో ఈ విధంగా వర్ణింపబడింది.

వ. పాతకుండ నగు నాకు న వ్విబుధోత్తమదర్శనంబు పురాకృతం బగు మదీయపుణ్య విశేషంబునం గాని పొంద శక్యంబు గాదు తత్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నం బయి యొప్పె నట్లు గాకుండెనేనిఁ గలుషవర్తనంబున వృషలీభర్తనై యుండి మృతిఁబొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణ నామగ్రహణంబు సంభవింపనేరదు మరియును.

ఆ. పాతకుండ జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను
మానలోభమోహమత్సరుండ
నాకు నెట్లు దొరకు నారాయణుని దివ్య
నామ విమలకీర్తనంబు మదికి.

సీ. దారుణమోహాంధకారపూరితుఁడను
హరి విస్మయస్మరణార్హమతినె
పంచమహాతీవ్ర పాతకోపేతుఁడ
హరి విస్మయస్మరణార్హమతినె
కౌటిల్య కితవవికార పారీణుండ
హరి విస్మయస్మరణార్హమతినె
యఖిలదుఃఖైక ఘోరార్ణవమగ్నుండ
హరి విస్మయస్మరణార్హమతినె

తే. నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ
మంద భాగ్యుండ నేనేడ? మధువిదారి
దివ్య గుణనామకీర్తన తెఱఁగ దేడఁ ?
బూర్వసుకృతంబు లే కెట్లు పొందఁగలుగు."

(ఆంధ్ర భాగ. 6.144-146)

దీనిని బట్టి శ్రీ మద్భాగవతం భాగవత ధర్మంలో నామసంకీర్తన కిచ్చిన స్థానం తేటతెల్లమవుతుంది. 'నామ్నైవ స్తోతవ్యం' అన్న ఆభాణకం ఉన్నదే. ప్రసిద్ధమైన వేదమంత్రా లన్నింటికీ దేవతాస్తుతిహేతుమత్త్వం కూడా అర్థం చెప్పుకోవాలని వ్యాఖ్యాతలు నిర్ణయించారు. అందువలన కేవలస్తోత్రమాత్రాలుగా కనుపించే నామావళులలో కథాగతమైన భగవద్వశీకరణఫలానికి తోడు నామసంకీర్తనఫలంగా భక్తిసంపదను పెంపొందింపజేసే శక్తి ఉన్నదని గ్రహించాలి. అంతే కాదు. అంతకాలంలో ఆర్తచిత్తుడైన అజామిళుడు కావించిన సంకీర్తనకు ఫలంగా అతనికి లభించినది మోక్షమని, భక్తి కాదని మనము గుర్తుంచుకోవాలి. అయితే, అంతకాలంలో అసంకల్పితంగా ఆచరించడానికే అంతటి ఫలం ఉంటే, జీవితమంతా భక్తిమార్గంలో పయనించేవారికి చేకూరే ఫలం ఏమిటి? అన్న ప్రశ్నకు సమాధానం తెలియాలి.

**నామోచ్చారణ మాహాత్మ్యం హరేః పశ్యత పుత్త్రకాః**
**అజామిళో పి యేనైవ మృత్యుపాశా దముచ్యత.**

**ఏతావతాలమఘనిర్హరణాయ పుంసాం**
**సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్**
**విక్రుశ్య పుత్త్ర మఘవాన్ యద జామిలోఽ పి**
**నారాయణేతి మ్రియమాణ ఇయాయ ముక్తిమ్**

(భాగ. 5.3.23-24)

అని యమగీతలో వచ్చింది. భాగవతవ్యాఖ్యలో శ్రీధరుడు ఈ దళాన్ని ప్రమాణీకరించి, భక్తిసాధన వల్ల కేవలం పాపాలను చేయటం మానుకొనటమే కాదు, ఆ పాపాలను చేయాలనే సంకల్పాన్ని కూడా మనసు నుంచి తొలగింపవచ్చునని నిర్ధారించాడు. ఆ విధంగా పాపసంకల్పాలను భస్మసాత్కరించి, చిత్తశుద్ధిని సాధింపగలవారికే భగవానుని యందు అవిచ్ఛిన్న తైలధారా ప్రవాహరూపమైన భక్తినైరంతర్యం ఉదయిస్తుంది. భక్తిశాస్త్ర సూత్రానుసారం భగవానుడు భక్తునికి ప్రసాదింపగల గొప్ప కానుక మోక్షం కాదు; భక్తే. అందువల్లనే దానికి పంచమపురుషార్థమని పేరు వచ్చింది.

పంచమస్కంధంలో శుకయోగి పరీక్షితుని ప్రశ్నకు సమాధానంగా –

**రాజన్ పతి ర్గురురలం భవతాం యదూనాం**
**దైవం ప్రియః కులపతిః క్వచ కిఙ్కరో వః**
**అస్త్వేవ మఙ్గం భగవాన్ భజతో ముకున్దో**
**ముక్తిం దదాతి కర్హిచిత్స్మ న భక్తియోగమ్**

(భాగ. 5. 6.18)

అంటూ శ్రీ భగవానుడు మోక్షమైనా సులభంగా ఇస్తాడేమో కాని, భక్తిని మాత్రం ఎంతో అరుదుగా ప్రసాదిస్తాడని అంటాడు. మోక్షానికంటె భక్తి యొక్క గరీయస్త్వం భాగవతంలో అనేకపర్యాయాలు ప్రసక్తమవుతూనే వచ్చింది. కాశీక్షేత్రంలో మరణించినవారికి మోక్షం కరతలామలకమని పెద్దలంటారు.❖

అంతకాలంలో నామసంకీర్తనఫలం కూడా అంతేనని అజామిళోపాఖ్యానం అద్భుతంగా నిరూపిస్తున్నది. అయితే భక్తిసాధన అటువంటిది కాదు. పాపాల నుంచి విముక్తి పొందితే చాలదు. పాపాలు చేయకుండా ఉంటే చాలదు. పాపసంకల్పమైనా మనస్సులో చొరనీయకుండా నిత్యనిర్మలమైన సుస్థితిని మనస్సు సాధించాలి. అందుకు సాధనం భక్తి ఒక్కటే.

ఇంకొక విషయం కూడా ఉన్నది. తెలిసో తెలియకో శక్తిమంతమైన ఔషధాన్ని సేవిస్తే ఆ ఔషధం శరీరంపై తన ప్రభావాన్ని ప్రసరింపక మాననట్లు, భగవన్నామకీర్తన తెలిసి చేసినా తెలియక చేసినా దాని ఫలం ఒక్కటే. ఈ మాటే

---

❖ ఈ విషయాన్ని కాశీ ఖండంలో శ్రీనాథుడు ఇలా వర్ణించాడు.

శా. కింకుర్వాణఘటాపురందరాదికమహా గీర్వాణకోటీ కిరీ
టాంక ప్రస్థిత నూత్నరత్న రుచిధారాశ్లేష కిమ్మీర ప
త్పంకేజుండు హరుండు జంతువులకుం బ్రాణాంతకాలంబునం
దోంకారాక్షరమంత్రరాజము ఘటించున్ దివ్యకాశీస్థలిన్.

**యథాగదం వీర్యతమ ముపయుక్తం యదృచ్ఛయా**
**అజానతో ప్యాత్మగుణం కుర్యాన్మన్త్రో ప్యుదాహృతః.**

(భాగ. 6. 2. 19)

అని పరీక్షితునితో శుకయోగి అంటాడు. 'నారాయణ!' అని నోరారా ఉచ్చరించినపుడు అజామిళుని దృష్టిలో ఉన్నది అతని పుత్రుడని, భగవంతుడు కాడని లెక్కకు రాలేదు. యమదూతలను చూచినప్పటి భయం, అప్పటి అతని నిస్సహాయత అతని నోటివెంట ఆ పవిత్రాక్షరాలను పలికింపజేశాయి. భాగవత ధర్మంలోని ఔదాత్యమంతా ఇందులో నిక్షిప్తమై ఉన్నది. నామోచ్చారణ కావించిన వారి దెసకు శ్రీ భగవానుని దృష్టి నిర్వ్యాజంగా ప్రసరిస్తుందని చెప్పటమే ఇందులోని పరమార్థం. పైగా ఫలదాయకత్వం నామస్మరణ మందే ఉన్నది గాని, సంస్మర్త మనోభావనలో లేదు. ఈ విధమైన నిర్హేతుక జాయమాన కృపావిపాకం హేతువాదులకు వింతగా అనిపింపవచ్చునేమో కాని భాగవత ధర్మాధ్వనీనులకు ఇందులో శంక లేశమైనా ఉండదు. ఇకపోతే వాదన కోసం వాదించేవారు దీనిని అర్థవాద మంటారేమో. కీర్తనఫలం సంగతెలా ఉన్నా, అంతకాలంలో ఉచ్చరించిన దానికే అంత ప్రభావం ఉంటే, జీవితాంతం ఆచరించిన దానికి ఎంత ఫలం ఉంటుంది! ఈ కారణం వల్ల నైనా మానవులు ఆకర్షితులయితే, అంతకన్న కావలసిన దేముంటుంది? అందుచేతనే, భాగవతం 6.2.49 లో

**మ్రియమాణో హరే ర్నామ గృణన్ పుత్రోపచారితమ్**
**అజామిళోఽ ప్యగా ద్ధామ కిం పునః శ్రద్ధయా గృణన్.**

అని ఉన్న శ్లోకం అర్థవాదమో, అతిశయోదితమో కానేరదని; నామసంకీర్తనకు నిజంగా అంతటి మహాశక్తి ఉన్నదని; ఈ విషయాన్ని శంకించేవారికి సంకీర్తన ప్రభావం ఎంతటిదో తెలియదని, చాలామంది వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు. అటువంటి శంకాకులత్వానికి నామాపరాధమని పేరు. మరికొంతమంది వ్యాఖ్యాతలు 'స్థితస్య గతి శ్చింతనీయా' అనుకొని, మూలంలో అతను నారాయణస్మరణ కావించటానికి

పూర్వం 'వివశు' డైనాడన్న దళాన్ని ప్రమాణీకరించి, నిజంగా నారాయణుని స్మరించాలనే ఉద్దేశ్యం తోనే అతను 'నారాయణా!' అని పలికినట్లుగా వ్రాశారు. వీరి వాదాల విషయం ఎలా ఉన్నా, అజామిళుడు తన జీవితం పాపపంకిలం కావటానికి పూర్వం ధర్మనిష్ఠుడేనని, దుస్సాంగత్యాలు మరిగి అధర్మమార్గం అవలంబించాడని భాగవతమే అంటున్నది. తాను చిన్ననాడు చేసుకొన్న ఆ సుకృతాల ఫలమే అంతకాలంలో అతని నోట భగవన్నామాన్ని పలికించినదని మనము గుర్తుంచుకోవాలి. అంతే కాదు. సన్మార్గానికి మళ్ళిన తర్వాత అజామిళుడు చాలా కాలం జీవించాడు. ఆదర్శమైన వర్తనతో అపురూపమైన భక్తియోగాన్ని అనుష్ఠించి ఆత్యంతికమైన లయాన్ని పొందాడు. కనుక అతని జీవితంలో భగవన్నామమే అతనిని సత్పథం లోనికి ప్రవేశపెట్టి, అతని చేతనే సత్కార్యాలను చేయించి, అతని చేత ఫలాన్ని అనుభవింపజేసినదని, సర్వమూ భగవన్నామసంకీర్తన ఫలమేనని తాత్పర్యం.

వృత్రకథకు ఉపోద్ఘాతంగా చతుర్థాధ్యాయం నుంచి అష్టమాధ్యాయం వరకు ప్రచేతసాత్మజుడైన దక్ష ప్రజాపతి వంశవిస్తరణగాథను శుకయోగి ప్రస్తావించాడు. దక్షుని కుమార్తెలలో అదితికి కశ్యప ప్రజాపతితో వివాహం జరిగింది. వారికి త్వష్ట జన్మించాడు. అతని సుతుడు విశ్వరూపుడు. విశ్వరూపుడు తపస్సంపన్నుడై బ్రహ్మవేత్తలలో అగ్రపదవిని సాధించాడు. ఒకప్పుడు ఇంద్రుని యొక్క దుష్ప్రవర్తనకు కుపితుడై బృహస్పతి దేవతలకు ఆచార్యత్వాన్ని వదులుకొన్నాక, చేసేది లేక ఇంద్రుడు మహాశక్తిమంతుడైన విశ్వరూపుని ఆశ్రయిస్తాడు. జన్మరీత్యా అసురులతో తనకు రక్తసంబంధం ఉన్నప్పటికీ విశ్వరూపుడు సురేశ్వరునితో శైష్యోపాధ్యాయిక నెరపి అతనికి నారాయణ కవచాన్ని ఉపదేశించాడు. తత్ఫలంగా ఇంద్రుడు శక్తిసంపన్నుడై దైత్యులను జయించి, అసురబంధువైన గురువును నిస్సంకోచంగా చంపివేశాడు.

ఆ తర్వాత తొమ్మిదవ అధ్యాయం మొదలుకొని పదమూడవ అధ్యాయం వరకు సుదీర్ఘమైన వృత్రకథ ఉన్నది. విశ్వరూపుని తండ్రి త్వష్ట ఇంద్రుని

దుష్ప్రవర్తనకు ఆగ్రహోదగ్రుడై శత్రుసంహారహోమాన్ని అనుష్ఠించి యజ్ఞాగ్నులలో నుంచి వృత్రుడనే అసురుని ప్రభవింపజేస్తాడు. వృత్రాసురుని నేతృత్వంలో సురవైరులు విజృంభించి దేవతలను పరాభవిస్తారు. దధీచి వెన్నెముకను వరంగా అడిగి సంపాదించిన వజ్రాయుధాన్ని ప్రయోగించి ఇంద్రుడు విజయాన్ని సాధిస్తాడు. మహాదాత అని పేరు పొందిన దధీచి ఆత్మత్యాగానికి వెనుదీయక లోకక్షేమాన్ని కోరి తన వెన్నెముకను ఇంద్రునికి దానం ఇస్తాడు. దేవాసురులకు జరిగిన ఘోర సంగ్రామంలో ఇంద్రునికి దానివల్లనే జయం కలుగుతుంది.

ఇంద్రునితో వృత్రాసురునికి జరిగిన యుద్ధంలో ఇంద్రుని బలప్రౌఢిమ కంటె వృత్రాసురుని మహోన్నతవ్యక్తిత్వమే ఉజ్జ్వలంగా ప్రకాశించింది. ఇంద్రునితో సమంగానో, అంతకన్న ఎక్కువగానో పోరాడిన వృత్రుడు దేవేశ్వరునికి గంభీరమైన ధర్మసూక్ష్మాన్ని ఉపన్యసించి, భగవంతుని నోరారా స్తుతిస్తాడు.

**అజాతపక్షా ఇవ మాతరం ఖగాః**
**స్తన్యం యథా వత్సతరాః క్షుధార్తాః**
**ప్రియం ప్రియేవ వ్యుషితం విషణ్ణా**
**మనోఽ రవిన్దాక్ష! దిదృక్షతే త్వామ్.**

(భాగ. 6. 11. 26)

“రెక్కలు రాని పక్షిపిల్లలు తల్లికోసం ఎదురుచూసినట్లు, ఆకలిగొన్న లేగలు మాతృస్తన్యానికి కలవరించినట్లు, చిరవిరహపరితాపంతో కృశించిన ప్రియురాలు ప్రియుని కోసం కలలు కన్నట్లు, ఓ ప్రభూ! అరవిందాయతలోచనా! నా మనస్సు నీ కోసం తహతహలాడుతున్నది” అన్న అతని మాటలు వింటుంటే ఎంతటి కఠోరచిత్తునికైనా కనులు చెమ్మగిలక మానవు. శ్రీమద్భాగవతంలో మనము చదివే అనేక స్తోత్రాలలో చాలా అందమైనవాటిలో ఇదొకటి.

క్రూరకర్ముడైన వృత్రాసురుని యొక్క ఈ భక్తి భావోద్రేకం పరీక్షిత్తును ఆశ్చర్యచకితుని కావిస్తున్నది. సత్త్వతమస్సుల ఈ చిత్రసమ్మేళనానికి అంతరార్థ మేమిటని అడుగుతాడు. అందుకు సమాధానంగా శుకయోగి పద్నాలుగవ అధ్యాయం మొదలుకొని పదిహేడవ అధ్యాయం వరకు వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలియజేస్తాడు. పూర్వజన్మలో అతని పేరు చిత్రకేతుడని, చిరకాలం సంతానం లేక యజ్ఞేశ్వరుని ఆరాధించి ఆయన కరుణ వల్ల పుత్రసంతానానికి నోచుకొన్నాడని అంటాడు. అయితే చిత్రకేతుని ఇతరభార్యలు సవతి కొడుకు పైకి రావటం ఇష్టం లేక అతనికి విషప్రయోగం చేస్తారు. వారి దుశ్చర్యను చూసి చిత్రకేతుడు సంసారజీవితంలో సుఖమన్నది ఎండమావితో సమానమని గ్రహించి వానప్రస్థాన్ని స్వీకరించి ధర్మరతుడై కాలం గడుపుతుంటాడు. కొంత కాలానికి సంకర్షణుడు అతని యెడ ప్రసన్నుడై అతనికి గంధర్వరాజపదవిని ప్రసాదిస్తాడు. చిత్రకేతుడు గంధర్వరాజైనాక నిరంతర భగవన్నామకీర్తనపరాయణుడై అప్సరోబృందాన్ని వెంటగొని నానాదేశసంచారం చేస్తుంటాడు. ఒకప్పుడు కైలాసనగరం వద్ద ఉమామహేశ్వరులను చూసి అపహాస్యం చేసినందుకు ఆ దేవి కోపించి నీచయోనిజాతుడవు కమ్మని శపిస్తుంది. ఆ విధంగా శప్తుడైన చిత్రకేతు గంధర్వుడు అభిచారహోమం చేస్తున్న త్వష్ట యాగాగ్నిలో వృత్రునిగా అవతరించి ఇంద్రునితో ఘోరయుద్ధం చేస్తాడు. శాపవశాన క్రూరకర్ముడైనా అతని మనస్సులో వెనుకటి భక్తిభావం ఇంకా సమసిపోలేదు. యుద్ధరంగంలో వధోత్సుకుడైన శత్రువు యెదుట నిలిచి ధర్మప్రసంగం చేసి దైవధ్యానం కావించటంలోని అంతరార్థం ఇదేనని శుకయోగి పరీక్షితునికి వివరిస్తాడు. పది అధ్యాయాలలో ఊపిరి సలుపనీయని వేగంతో సాగిపోయిన ఈ చిత్రకేతూపాఖ్యానంలో రచయిత గ్రథనకౌశలమే కాక భక్తినిర్భరమైన స్తోత్రనైపుణి కూడా వన్నెకెక్కింది.

వృత్రాసురవధతో కశ్యపగృహిణి దితి మనస్సు ప్రక్షోభించింది. ఇంద్రుని బలపరాక్రమాలను అరికట్టి అతనిని పరాభవింపగల సుతుని కోసం ఆమె

చేసిన ప్రయత్నాలన్నింటినీ ఇంద్రుడే విఫలం చేస్తూవచ్చాడు. ఆమె గర్భం ధరించిన తర్వాత అనాచార సమయం చూసి ఆమె గర్భంలో ఉన్న శిశువును ఖండఖండాలుగా నరికివేశాడు. జననానికి పూర్వమే ఇంద్రదర్శనం కలిగిన పుణ్యఫలానికి దితిసుతులు మహాభక్తులై మరుత్తులనే పేరిట పేరెన్నిక గన్నారు. ఈ కథా భాగమంతా 18, 19 అధ్యాయాలలో విస్తరించి ఉన్నది. మనోభీష్టసిద్ధికై దితి కావించిన పయోవ్రతమనే వ్రతాన్ని ఆచరించే విధానం 19వ అధ్యాయంలో సమంత్రకంగా వివరింపబడింది.

అజామిళోపాఖ్యానం, ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతక విమోచనం ఈ స్కంధం లోని ముఖ్యఘట్టాలు. ఈ కథానకాలను భూమికలుగా స్వీకరించి సోత్కంఠమైన కథనకౌశలాన్ని, గంభీరమైన వేదాంతప్రవచనాన్ని నాదబ్రహ్మానందమయాలైన మనోహరస్తోత్రాలను పాఠకులకు రుచి చూపించటం ఇందులోని విశేషం. భగవంతుని యొక్క కృపాదృష్టి ఎంత అవ్యాజమైనదో, ఎంత అనూహ్యమైనదో, మనము ప్రసరింపవచ్చునని అనుకోవటానికి కూడా వీలులేని తావులలో ఎంత నిర్భరంగా జాలువారుతుందో తెలుసుకోవాలంటే ఈ స్కంధాన్ని చదివి తీరాలి.

## సప్తమ స్కంధం

శ్రీమద్భాగవత సప్తమస్కంధం లోని పదిహేను అధ్యాయాలలో ఏడువందల యాభై శ్లోకాలున్నాయి. ఈ స్కంధంలో అధికరింపబడిన విషయానికి 'ఊతి' అని పేరు. ఊతి అంటే కర్మఫలవాసన. ఈ కర్మఫలవాసనల యొక్క ప్రేరణ మానవజీవితం పైని ఎటువంటి ప్రభావాన్ని నెరపుతుందో, దాని పర్యవసానం ఎలా ఉంటుందో, ఈ స్కంధంలో మనము చూస్తాము. "ఊతిశ్చ వాసనా ప్రోక్తా తత్తత్కర్మానుసారిణీ" అని పెద్దలంటారు. పూర్వజన్మం లోని శుభాశుభకర్మలను బట్టి 'నేను కర్తను', 'నేను భోక్తను', అని భావింపజేసే సంస్కారరూపవాసనలను ఊతులని పౌరాణికులు వ్యవహరిస్తుంటారు. ఈ ఊతులు హేతుభేదం చేత శుభరూపాలు,

అశుభరూపాలు అని రెండు విధాలుగా ఉంటాయి. మహానుభావులు, లోకోత్తరులు అయిన ఉత్తమపురుషుల సాంగత్యం లభించినప్పుడు సాధకులు కావించే ప్రయత్నాలను అనుసరించి ఈ సంస్కారరూపవాసనలు పెంపొందటం, నశించటం జరుగుతుంటుంది. మహానుభావుల అనుగ్రహం వలన వాసనలు శుభప్రతిపాదకాలుగా పరిణమిస్తాయి. వారి కోపం వలన అశుభప్రతిపాదకా లవుతాయి. అశుభవాసనల కారణం వల్లనే భగవానుడైన శ్రీమన్నారాయణుని ద్వారపాలకులు జయవిజయులకు సనకసనందనుల శాపం, శ్రీమహావిష్ణుద్వేషం సంప్రాప్తించాయి. రాక్షసవంశంలో జన్మించిన ప్రహ్లాదునికి శుభవాసనల మూలాననే గర్భస్థుడుగా ఉన్న కాలంలోనే భగవద్భక్తి ఉదయించింది. మహానుభావుల ఆగ్రహం వలన అశుభపరంపరలు చేకూరినట్లే, వారిని భక్తిశ్రద్ధలతో సేవించి జీవితాన్ని పండించుకొన్నవారికి వారి అనుగ్రహం వలన ఆత్మోన్నత్యం చేకూరుతుంది. మహాదర్శానికి నిదర్శనంగా సప్తమస్కంధం లోని రెండు కథలు పేర్కొనదగినవి. ఆ రెండు కథలలో ఒకటి ప్రకృతస్కంధంలో ప్రధానవక్త అయిన నారదుని కథే. పూర్వజన్మలో అతనిపేరు ఉపబర్హణుడు. గంధర్వ గాయనబృందానికి నేతనన్న గర్వంతో బ్రహ్మసత్రానికి తీరిన మునులను అధిక్షేపింపగా వారతనిపై ఆగ్రహిస్తారు. మునుల శాపఫలంగా నారదుడు మానవలోకంలో ఒక బ్రాహ్మణదాసికి పుత్రుడై జన్మింపవలసి వస్తుంది. కొంత కాలానికి బ్రహ్మవాదులైన పెద్దలు కొంత మంది ఆ మార్గాన ప్రయాణిస్తూ అతనిని తమతోపాటు తీసికొనివెళ్తారు. వర్షాకాలంలో చాతుర్మాస్యదీక్ష గైకొని ఉన్న మహాత్ములకు శుశ్రూష కావించిన సత్ఫలంగా అతనికి శాప విముక్తి కలుగుతుంది. అవధూత మార్గం లోనికి ప్రవేశించి దేవర్షి పదాన్ని అధిరోహిస్తాడు.

రెండవది వైకుంఠంలో శ్రీమన్నారాయణుని ద్వారపాలకులు జయవిజయులు కుమారులని పేరుపొందిన సనకాదులను అవమానించి శాపగ్రస్తులై అసురులుగా జన్మించిన ఇతివృత్తం. జయవిజయులు ఏడు

జన్మలు భక్తులుగా ఉండటం కంటె మూడు జన్మలు శత్రువులుగా ఉండటమే మేలని భావించి హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, రావణ కుంభకర్ణులుగా, శిశుపాల దంతవక్త్రులుగా జన్మించి హరితో వైరం పెట్టుకొంటారు. శ్రీమహావిష్ణువుకు ఆగర్భశత్రువులైన వారి జీవితోదంతం వైరభక్తికి శాశ్వతోదాహరణగా మిగిలిపోయింది. మృత్యుభయం వారి మనస్సులను నిరంతర వైరిస్మరణానుభావానికి అంకితం చేసి, ఆ వైరి శ్రీమన్నారాయణుడే గనుక వారిని నిరంతర శ్రీమన్నారాయణ ధ్యాన పరవశులను కావించింది. నారాయణ నామస్మరణతో వారు సకల కిల్బిషాలను భస్మసాత్కరించి శ్రీహరి కరకమలసంజాత మోక్షపదవీ నదవీయసులై లోకంలో వైరభక్తిమార్గానికి ఆదిపురుషులయ్యారు. దీని విపులవివరణ భాగవత దశమ స్కంధంలో వస్తుంది.

జన్మత్రయాన్ని పొంది శ్రీహరితో వైరానుబంధాన్ని పెట్టుకొన్న జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, రావణ కుంభకర్ణులుగా, శిశుపాల దంతవక్త్రులుగా దుష్ప్రవర్తకులై లోకకంటకు లయ్యారు. శ్రీహరి నరసింహమూర్తిగా, శ్రీరామచంద్రునిగా, శ్రీకృష్ణునిగా అవతరించి వారికి శాప విముక్తిని ప్రసాదించాడు. ధర్మజ రాజసూయంలో శ్రీకృష్ణునికి బద్ధవిరోధులైన శిశుపాల దంతవక్త్రులు చక్రహతు లైనప్పుడు వారి తేజం శ్రీకృష్ణతేజంలో విలీనం కావటాన్ని చూసి ఆశ్చర్యపోయిన ధర్మరాజుకు నారదుడు చెప్పిన సమాధానం వినిపిస్తూ శుకయోగి హిరణ్యకశిపుని ఉదంతాన్ని, ప్రహ్లాద చరిత్రను వివరించాడు.

వైరనిర్యాతనం అభిలషించి విష్ణుకంటకుడైన హిరణ్యకశిపుని ఇంటనే భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు జన్మించటం భాగవతంలోని మరొక విశేషం. భారతీయ భక్తిసంప్రదాయంలో చిరస్మరణీయుడై భాసురిల్లిన ప్రహ్లాదుని పుణ్యజీవితం తెలియని వారుండరు. భక్తిసిద్ధాంతానికి ఆలంబనగా నవవిధ భక్తులను సూత్రీకరించిన భక్తవతంసుడూ ఇతనే.

ప్రహ్లాద ఉవాచ –

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్**
**అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్.**
**ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా**
**క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽ ధీత ముత్తమమ్.**

(భాగ. 7. 5. 23 – 24)

భాగవత సప్తమ స్కంధం లోని ఆధికారికేతివృత్తం ఇతని శుభచరిత్రమే. మహానుభావుల తోడి సాంగత్యం కర్మఫలవాసనలపై ఏ విధంగా తన ప్రభావాన్ని నెరపుతుందో ప్రహ్లాదుని బాల్యవర్ణనలో సాకల్యంగా వివరింపబడింది. దైత్యవంశంలో జన్మించిన ప్రహ్లాదుడు కులాచారాన్ని బట్టి ఇంద్రియానురక్తుడై లోకహింసకు పాల్పడి విష్ణువిరోధి కావలసి ఉన్నా, మాతృగర్భంలో నారదమహర్షి ప్రబోధాన్ని విన్నందువల్ల సత్త్వోద్రేకం చెంది భక్తిమార్గాన్ని అవలంబించాడు. అధ్యాత్మ తత్త్వవిదులలో ప్రబర్షుడైన నారదమహర్షి వాక్ప్రభావం గర్భస్థశిశువు మనస్సుపై ప్రసరించి, ప్రసవించేనాటికే అతనిని శాంతచిత్తునిగా మార్చివేయగలిగింది. బాల్యవయోవస్థ నాటినుంచే అతని శీలసౌమ్యత హిరణ్యకశిపునికి కంటగింపుగా మారింది. గురూపదేశముఖంగా అతనిలో పరివర్తన తీసుకొనిరావాలని అతని ప్రయత్నం; గురుకులంలో ఉన్న విద్యార్థులను కూడా తమోదూరులను కావించి భక్తివేదాంతం ఉపదేశించాలని ప్రహ్లాదుని ప్రయత్నం. హిరణ్యకశిపుడు ఎన్ని కష్టాలు పెట్టినా విష్ణుసాహాయ్యం కలిగిన ప్రహ్లాదుడు చలింపలేదు. దైత్యరాజు ఆగ్రహోదగ్రుడై గదాప్రహారంతో అతని తల పగలగొట్టబోయాడు. శ్రీమహావిష్ణువు లేని చోటంటూ లేదని, సభలోనూ, సభాస్తంభం లోనూ ఏకరీతిని వెలుగొందుతున్నాడని తన భక్తుడు చెప్పిన మాట నిలబెట్టటం కోసం శ్రీమహావిష్ణువు స్తంభాకాశం నుంచి నరసింహరూపుడై అవతరించి దైత్యసంహారం చేసిన కథంతా మొత్తం ఏడెనిమిది అధ్యాయాలకు విస్తరించింది. భగవానుడు స్వయంగా రూపుదాల్చి వైరశుద్ధిని కోరుతున్న

భక్తునికి స్వహస్తాలతో మోక్షాన్ని ప్రసాదించటమంటే ఎంత అదృష్టమో కవికంఠోక్తి విరహితం గానే మనము ఊహింపగలము. భగవానుని ఈ వైరిసంహారలీలలో లోకవిడంబనమే తప్ప నిజంగా ప్రతీపభావం లేదు. ఎంత కలుషచిత్తుడైనా విద్వేషభక్తితో తననే స్మరించిన సుకృతానికి పరమపదాన్ని ప్రసాదించటమే ఆయన అవ్యాజ కరుణాతిరేకానికి దృష్టాంతం.

హిరణ్యకశిపుని సంహారానికి అనుబంధంగా సురుచిరమైన ప్రహ్లాద స్తోత్రం ఉన్నది. భాగవతంలోని స్తోత్రానుబోధన లన్నింటిలో అతి గంభీరమైనది, సువిస్తరితమూ అయిన ఈ స్తోత్రం భక్తిజ్ఞానమార్గాల గమ్యస్థానం ఒకటేనని, ఆశ్రిత ప్రత్యయితుడైన పరమేశ్వరుని దయావాప్తికి భక్తిపథం సులభమని అతిరమ్యంగా ప్రతిపాదిస్తున్నది. సంసారగతులైన జీవులందరూ ముక్తిపొందితే తనకు మోక్షం లభించినా, లభింపకపోయినా ఆనందమేనని ప్రహ్లాదుడన్న మాటలో భక్తివేదాంత సారమంతా ప్రతిధ్వనించింది:-

**ప్రాయేణ దేవ మునయః స్వవిముక్తికామా**
**మౌనం చరన్తి విజనే న పరార్థనిష్ఠాః**
**నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకో**
**నాన్యం త్వదస్య శరణం భ్రమతోఽ నుపశ్యే.**

(భాగ. 7. 9. 44)

ఓ ప్రభూ! లోకంలో మునులు తమ యొక్క ముక్తికోసమే ప్రాకులాడుతుంటారు. తమకు శాశ్వతఫలం కలిగితే చాలనుకొని ఇతరుల పట్ల మౌనం వహిస్తారు. నేనొక్కడినీ సంసారం నుంచి బయటపడి నా తోడివారిని వారి కర్మకు విడిచి పెట్టాలనే సంకల్పం నాకెన్నడూ లేదు. వారికి మాత్రం నీవు తప్ప వేరొక శరణెవరున్నారు? - అని ఈ శ్లోకభావం. సరిగా ఇదే విధమైన త్యాగశీలం, సర్వభూతహితాభిలాష నవమ స్కంధంలో రంతిదేవుడు కావించిన ప్రార్థనలో పరిస్ఫుటించాయి -

**న కామయేఽ హం గతి మీశ్వరా**
**త్పరా మష్టర్ధియుక్తా మపునర్భవం వా**
**ఆర్తిం ప్రపద్యేఽ ఖిల దేహభాజా**
**మన్తః స్థితో యేన భవ న్త్యదుఃఖాః.**

**క్షుత్తృట్ఛ్రమో గాత్రపరిశ్రమశ్చ**
**దైన్యం క్లమః శోకవిషాదమోహాః**
**సర్వే నివృత్తాః కృపణస్య జన్తో**
**ర్జిజీవిషో ర్జీవజలార్పణా న్మే.**

(భాగ. 9. 21. 12 – 13)

బౌద్ధమతంలో సర్వభూతహిత చింతనుడైన బోధిసత్త్వుని మహాదర్శనం వలెనే వైష్ణవ వేదాంతం కూడా స్వార్థవిదూరమైన విశ్వప్రేమకు అంకితమై విలసిల్లిన దనటానికి ఇంతకంటె ఏమి కావాలి?

ప్రహ్లాదచరిత్ర అనంతరం మయుని దుశ్చర్య చేత విహతయశుడైన రుద్రుడు శ్రీమహావిష్ణువు సాయంతో త్రిపురదహనం కావించిన ఉదంతం పదవ అధ్యాయంలో ఉన్నది. ఆ తర్వాత పదకొండవ అధ్యాయం మొదలుకొని పదిహేనవ అధ్యాయం వరకు అయిదు అధ్యాయాలలో వర్ణాశ్రమ ధర్మాలకు అనుగుణంగా రూపుదిద్దుకొన్న ఆదర్శ సమాజవ్యవస్థ యొక్క సంక్షిప్తవర్ణన మనకు కనుపిస్తుంది. వేదచోదితాలైన ఈ ధర్మాలను ఆచరించటం వలన మానవుడు ఆత్మోన్నత్యాన్ని సాధించి ముక్తసంగుడు కాగలడని శ్రీమద్భాగవతం ఉపదేశించింది. ఈ పరమలక్ష్యంతోనే నారదుడు యుధిష్ఠిరునికి బోధించిన ధర్మసారాన్ని మనము జ్ఞాపకం ఉంచుకోవాలి:

## 1

చాతుర్వర్ణ్యంలో బ్రాహ్మణునికి గల స్థానం మహోన్నతమైనది. ఈ స్థానం బ్రాహ్మణుని యొక్క నిఃస్వార్థచిత్తాన్ని, ఉదాత్తశీలాన్ని, సమాజ క్షేమానుసంధానంలో అతను వహింపవలసిన బాధ్యతాయుతమైన పాత్రను

దృష్టిలో ఉంచుకొని ఒక ఆదర్శమూర్తికల్పనకు ఉద్దేశింపబడింది. పరమేశ్వర నిఃశ్వసిత రూపమైన వేదాన్ని సలక్షణంగా అభ్యసించి, విద్యార్థులచేత కంఠస్థం చేయించి, జీవితాన్ని ఆ వేదార్థానికి అనుగుణంగా మలుచుకొని బ్రాహ్మణుడు సర్వయజ్ఞాలను ఆచరించాలి. ఈ విధమైన వేదోపదిష్ట కర్మాచరణం వలన హవిర్భోక్తలైన దేవతలకు ఆహారం లభించి యజ్ఞేశ్వర తృప్తి ఘటిల్లుతుందని, యజ్ఞేశ్వరతృప్తి కలిగితే భూతజాతానికి మేలు జరుగుతుందని, అందువల్ల సమాజశ్రేయోభ్యుదయాలకు వైదికక్రతుకలాపం ఆవశ్యకమని ఈ దేశంలో తరతరాలుగా విశ్వసింపబడుతున్నది. వేదోక్తమైన ఈ కర్మకాండను సాంగోపాగం అధ్యయనించి బ్రహ్మనిష్ఠులైనవారే బ్రాహ్మణులు. అందుచేతనే దేహధారులలో బ్రాహ్మణులు వరిష్ఠులని భగవానుడే స్వయంగా శిరసు వంచాడు.

**సంస్కారా యదపిచ్ఛిన్నాః**
**స ద్విజోఽ జో జగాద యమ్**
**ఇజ్యాధ్యయన దానాని**
**విహితాని ద్విజన్మనామ్.**

**జన్మ కర్మావదాతాని**
**క్రియాశ్చాశ్రమ చోదితాః**

(భాగ. 7. 11. 13)

అని భాగవతం అంటున్నది. జాతకర్మం మొదలుకొని మరణపర్యంతం విధింపబడిన పదహారు సంస్కారాలను అపరివిఘ్నంగా నెరవేర్చి స్వధర్మపరాయణులైన ఉత్తమపురుషులే బ్రాహ్మణులు. దీనిని బట్టి బ్రాహ్మణులు క్షత్త్రియులు వైశ్యులు శూద్రులు అన్న విభాగం వేదకాలంలో జన్మమును బట్టి ఏర్పడినది కాదని, దేహమనస్సులను ఉత్తమాదర్శాలకు అనుకూలంగా మలిచే సంస్కారాలను విధివిహితంగా అనుష్ఠించి స్వధర్మనిరతులైన సద్వర్తనులకు మాత్రమే ఈ సంజ్ఞ చెల్లుతుందని, ఇతరులకు

అనువర్తింపదని మనము గుర్తుంచుకోవాలి. దీనినే "జన్మకర్మావదాతానాం క్రియా శ్చాశ్రమచోదితాః" అని మూలం అంటున్నది. లోకంలో స్వార్థదృష్టి, ఐహికసుఖాసక్తి పెచ్చరిల్లిన కొద్దీ ఈ సంస్కారాలను అమనస్కంగా నిర్వహించటమో, అసలే మానివేయటమో జరుగుతూ వచ్చింది. అప్పుడు వర్ణవిభాగకల్పన లోని ఆదర్శాలు మారి జన్మను బట్టి వర్ణాన్ని నిర్ణయించే రోజులు వచ్చాయి. గుణకర్మవివేచనతో సంబంధం లేని ఆధునిక వర్ణవ్యవస్థను, కులవ్యవస్థను చూసి ఇదే వేదోపదిష్ట మనుకొంటే పొరబాటవుతుంది.

బ్రాహ్మణునికి ఉపనయనాన్ని రెండవజన్మగా పరిగణించారు. ఉపవీతుడై రెండవ జన్మను పొందిన బ్రాహ్మణునికి (1) అధ్యయనము (2) అధ్యాపనము (3) యజనము (4) యాజనము (5) దానము (6) ప్రతిగ్రహణము అన్నవి విహితధర్మాలు. ఈ ధర్మాలను సమాజాభ్యుదయానికి సోపానాలుగా అమర్చటమే బ్రాహ్మణుల కర్తవ్యం.

## 2

చాతుర్వర్ణ్యంలో బ్రాహ్మణుని యశఃప్రథిమకు, సంఘంలో అతనికి లభించిన ఉన్నతస్థితికి అతని శీలసంపద, త్యాగగుణం మాత్రమే కారణాలని; పదవి, అధికారం, ఐశ్వర్యం మొదలైనవాటికి అతని జీవితంలో ప్రాధాన్యం ఎన్నడూ లేదని మరిచిపోకూడదు. నాటికీ నేటికీ బ్రాహ్మణులు ఏ నాడూ ఐశ్వర్యవంతులు కారు. వారు గురుకులాలలో అధ్యాపనరతులై యజ్ఞయాగాలలో భాగధేయాన్ని వహిస్తూ యదృచ్ఛాలాభసంతుష్టితో అనాయాసంగా దైన్యమన్నది లేకుండా జీవితాన్ని గడపాలి.

**వార్తా విచిత్రా శాలీన యాయావరశిలోఞ్ఛనమ్**
**విప్రవృత్తి శ్చతుర్ధేయం శ్రేయసీ చోత్తరోత్తరా.**

(భాగ. 7. 11. 16)

అని వారి జీవికను గూర్చి చెప్పబడింది. వ్యవసాయం, పశుసంరక్షణ, అయాచితంగా వచ్చిన ప్రదేశనాలు, పైరుపొలాలలో నేలరాలిన ధాన్యపుగింజలను ఏరుకొనటం వీరి జీవనాధారవృత్తులు. ఈ నాలుగింటిలో చివరిదైన శిలోంఛనం సర్వశ్రేష్ఠమైనది. దేశంలో ఎప్పుడైనా దండయాత్రలు, జనోపద్రవాల వలన శాంతిభద్రతలు క్షీణించి దుర్భిక్షపరిస్థితి నెలకొన్నప్పుడు ఆపద్ధర్మంగా వీరు వాణిజ్యం మొదలైన ఇతరవృత్తులను చేపట్టవచ్చును కాని శ్వవృత్తిని అవలంబించి నీచుల సేవలో కుదురుకొనటం మాత్రం తగని పని. అంటే, లోకానికి నివృత్తి మార్గాన్ని చూపించి ప్రజలను ఐహికభోగాల నుంచి విముఖీకరింపవలసిన బ్రాహ్మణుడు ఆత్మరక్షణ కోసం తన ఆదర్శాలను వదులుకొని ఉదరపోషణ జరిగితే చాలనుకోవటం అధర్మం అన్నమాట. అంతటి నిఃస్వార్థజీవను లైనప్పుడే బ్రాహ్మణులను "సర్వవేదమయో విప్రః" అని గౌరవించటం జరుగుతుంది.

**శమో దమ స్తపః శౌచం సన్తోషః క్షాన్తి రార్జవమ్**
**జ్ఞానం దయాచ్యుతాత్మత్వం సత్యం చ బ్రహ్మలక్షణమ్.**

(భాగ. 7. 11. 12)

అన్నవి బ్రహ్మనిష్ఠులకు ఉపలక్షణాలు.

ఆపద్ధర్మాలుగా అంగీకరించిన వృత్తులను స్వలాభం చూసుకొని అవే నిత్యవృత్తులుగా మార్చుకొనకూడదు. దేశంలో పరిస్థితులు బాగుపడిన తర్వాత ఎప్పటి వలె బ్రాహ్మణులు స్వధర్మాన్ని అనుసరించాలి.

**3**

తాత్పర్యతః మన సమాజంలో వర్ణ నిర్ణయం తల్లిదండ్రుల వర్ణాన్ని అనుసరించి జరుగుతున్నప్పటికీ ఈ ఆనువంశికసూత్రాని కంటె వ్యక్తుల యొక్క ప్రవర్తనమే ముఖ్యమని, దుర్వర్తను లైనవారు జన్మరీత్యా సంక్రమించిన వర్ణధర్మాన్ని చేపట్టే అధికారం కోల్పోయినందువల్ల తమ వర్ణాన్ని

మార్చుకోవాలని శ్రీమద్భాగవతం ఉపదేశిస్తున్నది.

**యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభివ్యంజకమ్**
**యదన్యత్రాపి దృశ్యేత తత్ తేనైవ వినిర్దేశేత్.**

(భాగ. 7. 11. 35)

ఈ నియమం వల్లనే మనకు బ్రహ్మజ్ఞానాన్ని పొంది బ్రాహ్మణులైన పెక్కుమంది క్షత్రియుల కథలు పురాణేతిహాసాలలో కనుపిస్తుంటాయి. శ్రీమద్భాగవత కథలో భరతమహారాజు పుత్త్రులలో అధికసంఖ్యాకులు బ్రాహ్మణులుగా మారిన ఇతివృత్తం ప్రసక్తమయింది. ఏకాదశ స్కంధంలో భాగవతధర్మాన్ని పరమాద్భుతంగా ఉపన్యసించిన నవకవులు వీరిలోనివారే. ఈ కథలన్నీ వర్ణనిర్ణయం కర్మానుగుణమే కాని కేవల జన్మనియమితం కాదన్న భావాన్ని నొక్కి చెబుతున్నాయి. చాతుర్వర్ణ్య వినిర్దేశం సమాజంలో కొన్ని వర్గాలవారి ప్రయోజనాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొన్న స్వార్థపరుల సృష్టి అని విమర్శించేవారు ఔరసత్వసూత్రాన్ని ఎంతో విశాలదృష్టితో సవరిస్తున్న ఈ శ్లోకభావాన్ని పరిశీలించటం మంచిది.

## 4

వాస్తవం ఇలా ఉండగా, కాలగతి ననుసరించి వర్ణనిర్ణయంలో కర్మప్రాధాన్యం తొలగిపోయి క్రమక్రమంగా జన్మమొక్కటే ప్రధానమన్న నిశ్చయం బలపడుతూ వచ్చింది. ఈ నిర్ణయం దోషజుష్టమని ఇంతకు ముందే అనుకొన్నాము. అసలు వర్ణనిర్ణయమన్న ఆలోచన మానవస్వభావాన్ని ప్రేరేపిస్తున్న సత్త్వరజస్తమోగుణాల ఆధిక్యానాధిక్యాలను బట్టి రూపుదిద్దుకొన్నది. వ్యక్తులలో జన్మరీత్యా సంక్రమించిన వర్ణానికి విపరీతమైన ప్రవర్తన కనుపించినప్పుడు వారి కర్మలను బట్టి వర్ణాన్ని నిర్ణయించాలన్న భాగవతోపదేశానికి కారణం ఇదే. వ్యక్తులకు జీవితంలో సమకూడే అనేకఫలాలు వారి స్వభావగతికి తగినట్లుగానే ఉంటుండటాన్ని మనము చూస్తుంటాము. వర్ణం కూడా ఆ విధంగా స్వభావానుగుణంగా ఉండటమే

ఉచితమని చెప్పాలి. స్వధర్మభ్రష్టులైనవారు సామాన్యులైతే వారి జీవితంలో ఆ దోషఫలితం అంత స్పష్టంగా కనుపింపదేమో కాని, ఆత్మోన్నత్యాన్ని సాధింపగోరి చిత్తశుద్ధితో ఉపాసన మొదలు పెట్టినవారి జీవితంలో నైతికపతనం సద్యోదుష్ఫలితాన్ని చూపుతుంది. వారి సాధనలో ఏకాగ్రత దెబ్బతింటుంది. తపస్సు నిర్వీర్యమవుతుంది. మనస్సు గతితప్పి అపమార్గాలకు మళ్ళుతుంది. అందువల్ల సాధకుల యొక్క సాధనక్రమ పరిగతిని, ఆశయసాధనలో పరిణామదశను సూచించే ఒక నైతిక సాపేక్షత (మోరల్ రిలేటివిటి) ఉండటం అవసరమే. కర్మలను బట్టి వర్ణనిర్ణయం జరిగినప్పుడు ఆశ్రమస్థులు తమ తమ స్వభావప్రేరణలను సులభంగా గుర్తించి సాధనక్రమాన్ని అందుకు తగినట్లు ఏర్పరుచుకోగలుగుతారు. ఈ కర్మాచరణం జన్మరీత్యా జరిగితే ఈ ప్రక్రియ మరింత సులభం అవుతుంది. మానవులు స్వధర్మాన్ని అనుసరించి తీరాలనే అనుశాసనం ఎంత సాభిప్రాయమో దీనినిబట్టి మనము గ్రహింపగలము. ఇటువంటి స్వధర్మరతులకు సాధనోపాయంగా కల్పింపబడినదే తప్ప వర్ణవ్యవస్థ స్వార్థపూరిత సంకుచితదృష్టితో చేసినది కాదని గుర్తుంచుకొంటే విమర్శలకు తావుండదు. జీవితంలో మనోవికారాలు, నైతికపతనాలు మొదలైనవాటి ప్రభావం సామాన్యుల కంటె ఆధ్యాత్మికసాధనకు ఉపక్రమించినవారిపై మరింత ఎక్కువగా ఉంటుంది. నడిచేవారి కాళ్ళకు తగిలినట్లు దెబ్బలు నిలుచున్నవారి కాళ్ళకు తగలవు కదా!

## 5

వర్ణాలలో సాధనక్రమానికి తగిన దశానిర్ణయమే తప్ప హెచ్చు తగ్గుల పరిగణనకు ఆస్కారం లేదనటానికి మరొక దృష్టాంతం చూపబడుతున్నది. ఈ వర్ణాలకు గల గుణవిశేషాలను అటుంచి, అన్నింటి ప్రధానలక్ష్యమూ ఆత్మోన్నత్యమేనన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఈ వర్ణాలన్నింటికీ ఏకాదర్శంగా ముప్పై లక్షణాలను పెద్దలు నిర్ణయించారు.

నారద ఉవాచ -

నత్వా భగవతేఽ జాయ లోకానాం ధర్మహేతవే
వక్ష్యే సనాతనం ధర్మం నారాయణముఖాచ్ఛ్రుతమ్.
యోఽ వతీర్యాత్మనోం శేన దాక్షాయణ్యాం తు ధర్మతః
లోకానాం స్వస్తయే ధ్యాస్తే తపో బదరికాశ్రమే.

ధర్మమూలం హి భగవాన్ సర్వవేదమయో హరిః
స్మృతం చ తద్విదాం రాజన్ యేన చాత్మా ప్రసీదతి.

సత్యం దయా తపః శౌచం తితిక్షేక్షా శమో దమః
అహింసా బ్రహ్మచర్యం చ త్యాగః స్వాధ్యాయ ఆర్జవమ్.

సన్తోషః సమదృక్సేవా గ్రామ్యేహోపరమః శనైః
నృణాం విపర్యయేహేక్షా మౌన మాత్మవిమర్శనమ్.

అన్నా ద్యాదేః సంవిభాగో భూతేభ్యశ్చ యథార్హతః
తేష్వాత్మదేవతా బుద్ధిః సుతరాం నృషు పాణ్డవ.

శ్రవణం కీర్తనం చాస్య స్మరణం మహతాం గతేః
సేవేజ్యావనతి ర్దాస్యం సఖ్య మాత్మసమర్పణమ్.

నృణా మయం పరో ధర్మః సర్వేషాం సముదాహృతః
త్రింశల్లక్షణవాన్ రాజన్ సర్వాత్మా యేన తుష్యత.

(భాగ. 7. 11. 5 - 12)

ఈ విధంగా సత్య దయా శౌచాది లక్షణాలు సకలవర్ణాలకూ సమానమే అయినప్పుడు, సకలవర్ణాల లక్ష్యమూ ఆధ్యాత్మిక లక్ష్యసాధనమే అయినప్పుడు, ఆ వర్ణాలలో ఒకటి ఎక్కువనీ ఒకటి తక్కువనీ కావించే వివేచన అర్థరహితం అనిపింపక మానదు. ఉదాహరణకు 'అణుశక్తి' అనే శాస్త్రాన్ని ఒక విద్యార్థికి బోధింపదలచినప్పుడు బోధకుడు ఆ విద్యార్థి అవగాహనశక్తిని,

అతని విద్యాస్థాయిని దృష్టిలో ఉంచుకొని అందుకు తగినట్లు బోధిస్తాడు. ఆ శాస్త్రాన్ని నేర్చుకొన్న విద్యార్థి దానిని లోకోపయోగానికి, లోకవిధ్వంసానికి రెండింటికీ ఉపయోగింపవచ్చును. అందుచేత కొన్ని విషయాలను బోధించేటప్పుడు విద్యార్థి సంస్కారాన్ని కూడా పరిశీలించాలి. ఆ విద్యార్థి చేతలను బట్టి శాస్త్రంలో గుణదోషాలను మనము ఆరోపింపకూడదు. వర్ణనిర్ణయం కూడా అటువంటిదే. ఆధ్యాత్మిక పురోగమనాన్ని అభిలషించిన సాధకులను వారి పూర్వజన్మవాసనలు, వారి కర్మఫలాలు ఏ విధంగా పరిగణింపగలవో సూచనగా తెలియజేయటానికి వర్ణమనే పథకాన్ని మన ప్రాచీనులు రూపొందించారు. ఇది స్వభావనిర్ణీతమే అయినప్పటికీ, పుట్టుకను బట్టి లభించిన సంకేతాన్ని గ్రహించి వ్యక్తులు తమ ప్రవర్తనను తీర్చిదిద్దుకోవటం మంచిది.

## 6

శ్రీమద్భావతం సారాంశతః ఉపదేశిస్తున్నది నివృత్తిరూపమైన పరమహంసమార్గమే. ప్రహ్లాదస్తోత్రం వంటి కొన్ని తావులలో గృహస్థాశ్రమం తీవ్రవిమర్శకు గురైన మాట నిజమే కాని అక్కడ కూడా ఏ ఆశ్రమాన్నీ అధః కరించే ప్రయత్నం జరగలేదు. జీవితం లోని అన్ని ఆశ్రమాలకూ మోక్షసాధనయత్నంలో తుల్యప్రయోజనం ఉన్నదని అంగీకరింపబడింది. సన్న్యాసాశ్రమం అన్ని ఆశ్రమాలలో ఉత్తమోత్తమమని పేర్కొన్నా, అన్ని ఆశ్రమాలలోనివారూ స్వధర్మరతులై ఫలాసక్తిని విడిచి ముక్తసంగులు కాగలరని స్కంధాంతంలో చెప్పబడింది.

**ఏతై రన్యైశ్చ వేదోక్తై ర్వర్తమానః స్వకర్మభిః**
**గృహేऽ ప్యస్య గతిం మాయా ద్రాజ్యం స్తద్భక్తిభాఙ్నరః.**

(భాగ. 7. 15. 67)

## అష్టమ స్కంధం

శ్రీమద్భాగవతం అష్టమ స్కంధం లోని ఇరవైనాలుగు అధ్యాయాలలో 931 శ్లోకాలున్నాయి. ప్రథమాధ్యాయంలో మన్వంతరాభివర్ణన, ధర్మసంస్థాపనార్థం లీలాపురుషవిగ్రహుడై నేలకు దిగివచ్చి భక్తకోటిని సముద్ధరించిన శ్రీభగవానుని లోకోత్తరవిలాసాభివర్ణన కావింపబడ్డాయి. ఈ మన్వంతరం పురాణ దశలక్షణాలలో ఒకటి. మన్వంతరమంటే ఒక మనువు యొక్క పరిపాలన కాలం అన్నమాట. సృష్ట్యాదిని భగవదంశతో అవతరించిన మన్వాదుల కృత్యాలేమిటి? అని ప్రశ్నించిన పరీక్షితునితో శుకయోగి ఈ విధంగా అంటాడు –

**రాజోవాచ –**

**మన్వన్తరేషు భగవన్ యథా మన్వాదయ స్త్విమే**
**యస్మిన్ కర్మణి యే యేన నియుక్తా స్తద్వదస్వ మే.**

**ఋషి రువాచ –**

**మనవో మనుపుత్రాశ్చ మునయశ్చ మహీపతే**
**ఇన్ద్రాః సురగణాశ్చైవ సర్వే పురుషశాసనాః.**

**యజ్ఞాదయో యాః కథితాః పౌరుష్య స్తనవో నృప!**
**మన్వాదయో జగద్యాత్రాం నయన్త్యాభిః ప్రచోదితాః.**

**చతుర్యుగాన్తే కాలేన గ్రస్తాఞ్ఛ్రుతిగణాన్ యథా**
**తపసా ఋషయో పశ్యన్ యతో ధర్మః సనాతనః.**

**తతో ధర్మం చతుష్పాదం మనవో హరిణోదితాః**
**యుక్తాః సఞ్చరయన్త్యద్ధా స్వేస్వే కాలే మహీం నృప!.**

**పాలయన్తి ప్రజాపాలా యావదన్తం విభాగశః**
**యజ్ఞభాగభుజో దేవా యే చ తత్రాన్వితాశ్చ తైః.**

**ఇన్ద్రో భగవతా దత్తాం త్రైలోక్యశ్రియ మూర్జితామ్**
**భుఞ్జానః పాతి లోకాంస్త్రీన్ కామం లోలే ప్రవర్షతి.**

**జ్ఞానం చానుయుగం బ్రూతే హరిః సిద్ధస్వరూపధృక్**
**ఋషిరూపధరః కర్మ యోగం యోగేశరూపధృక్.**

**సర్గం ప్రజేశరూపేణ దస్యూన్ హన్యా త్స్వరాడ్వపుః**
**కాలరూపేణ సర్వేషా మభావాయ పృథగ్గుణః.**

**స్తూయమానో జనైరేభి ర్మాయయా నామరూపయా**
**విమోహితాత్మభి ర్నానాదర్శనైర్న చ దృశ్యతే.**

**ఏతత్కల్పవికల్పస్య ప్రమాణం పరికీర్తితమ్**
**యత్ర మన్వన్తరాణ్యాహు శ్చతుర్దశ పురావిదః.**

(భాగ. 7. అధ్యా. 14)

భగవదుపదిష్టమైన వేదధర్మాన్ని పరిరక్షించటానికి నియుక్తులైన ఈ మనువులు మానవమానంలో 3008 లక్షల సంవత్సరాల సుదీర్ఘకాలం పాటు లోకపాలన కావిస్తుంటారు. ఈ మన్వంతరం, కల్పాదుల విశేష వివరణ 13వ అధ్యాయంలో కూడా ఉన్నది. స్వాయంభువ స్వారోచిష ఉత్తమ మన్వంతరాలు మొదటి మూడింటిలో జరిగిన ఉదంతాలు ఇంతకు మునుపు స్కంధాలలో వచ్చాయి. ప్రకృత స్కంధంలో చతుర్థ మనువైన తామసుని కాలంలో సంభవించిన భగవల్లీలాకృత్యాల రమ్యకథనం రెండవ అధ్యాయం మొదలుకొని నాలుగవ అధ్యాయం వరకు పరమాద్భుతమైన సంవిధానంతో రచితమయింది. భారతీయ వేదాంత వాఙ్మయజగత్తుకు ఆభరణాయమానమైన గజేంద్రమోక్షం ఈ భాగంలోనిదే. భగవానుడు తనను నమ్ముకొన్నవారు ఆపదలకు లోనై ఆత్మరక్షణకు చేసిన సర్వప్రయత్నాలు విఫలమైనాక నిస్సహాయస్థితిలో కంటనీరు పెట్టుకొని నీవే దిక్కని ఆక్రోశించినపుడు వారి నమ్మకాన్ని వమ్ముచేయడని ఈ ఘట్టం అద్భుతంగా నిరూపిస్తున్నది. ఆర్తుడైన గజరాజు మొర విని ఆశ్రితమందారుడు శ్రీమన్నారాయణుడు ఆపద నుండి

రక్షించి మోక్షాన్ని ప్రసాదించటం ఇందులోని కథ. పుట్టెడు దిగులుతో ధైర్యం విలోలమైనప్పుడు గజరాజు కావించిన పరమేశ్వర ప్రార్థనకు సాటిరాగల ప్రార్థన ఏ వాఙ్మయంలోనైనా ఎంతో అరుదుగా రచింపబడుతుందనటంలో సందేహం లేదు.

ఇక పంచమాధ్యాయం మొదలుకొని పన్నెండవ అధ్యాయం వరకు ప్రాధాన్యమానంగా కనుపించేది క్షీరసాగరమథనం, తత్పూర్వాపరాల పరమరమణీయమైన చిత్రీకరణ. ఆ కథాప్రారంభంలో రైవత చాక్షుషాంతరాల ప్రస్తావన ఉన్నది. ఆరవ మనువైన చాక్షుని కాలంలోనే పాలకడలిని చిలికి అమృతాన్ని వెలికి తీశారు. స్థూలంగా జరిగిన కథ ఇది: దుర్వాసుని శాపఫలితంగా దేవతలు సర్వైశ్వర్యాలను కోల్పోయి బలిచక్రవర్తి చేతిలో పరాభూతులై స్వర్గాన్ని విడిచిపెట్టి పారిపోయారు. వారు మళ్ళీ స్వర్గాధిపత్యాన్ని పొందాలంటే ఒక్కటే గత్యంతరం కనబడింది. వారు అసురులతో పొత్తు కుదుర్చుకొని క్షీరసాగరాన్ని మథించి మృత్యువిజయానికి అమృతాన్ని సంపాదించాలి. ఏదో విధంగా చివరికి రాక్షసులను లోబరచుకొని అమృతం వారికి దక్కకుండా చేస్తే దేవతలకు శాశ్వతజయం కలుగుతుంది. అంతా దేవతలనుకొన్నట్లే జరిగింది. అమృతాన్ని సంపాదించి ఆ అమృతపానంతో చిరంజీవులై దేవతలు స్వర్గానికి తిరిగివచ్చారు. రాక్షసులు కుపితులై దేవతలతో యుద్ధానికి సిద్ధపడ్డారు. దేవాసురులకు పోరు ఘోరంగా జరిగింది. దైవబలం కలిగిన దేవతలు దైవోపహతులైన రాక్షసులను అవలీలగా ఓడించారు. దేవదానవులు క్షీరసాగరాన్ని మథించినప్పుడు వెలికి వచ్చిన శ్రీదేవిని రచయిత వర్ణించిన తీరు ఎంత కుశలవచత్సుధోరణిని వెల్లడిస్తున్నదో చూడండి –

**తత శ్చావిరభూత్ సాక్షాచ్ఛ్రీ రమా భగవత్పరా**
**రఞ్జయన్తీ దిశఃకాన్త్యా విద్యుత్సౌదామనీ యథా.**

**తస్యాం చక్రుః స్పృహాం సర్వే ససురాసురమానవాః**
**రూపౌదార్యవయో వర్ణ మహిమాక్షిప్త చేతసః.**

తస్యా ఆసనమానిన్యే మహేన్ద్రో మహదద్భుతమ్
మూర్తిమత్యః సరిచ్ఛ్రేష్ఠా హేమకుమ్భైర్జలం శుచి.

అభిషేచనికా భూమిరాహర త్సకలౌషధీః
గావః పఞ్చ పవిత్రాణి వసన్తో మధుమాధవౌ.

ఋషయః కల్పయాఞ్చక్రు రభిషేకం యథావిధి
జగుర్భద్రాణి గన్ధర్వా నట్యశ్చ ననృతుర్జగుః.

మేఘా మృదఙ్గపణవమురజానకగోముఖాన్
వ్యనాదయ ఞ్ఛఙ్ఖ వేణు వీణా స్తుములనిఃస్వనాన్.

తతో భిషిషిచు ర్దేవీం శ్రియం పద్మకరాం సతీమ్
దిగిభాః పూర్ణకలశైః సూక్తవాక్యై ర్ద్విజేరితైః.

సముద్రః పీతకౌశేయవాససీ సముపాహరత్
వరుణః స్రజం వైజయన్తీం మధునా మత్తషట్పదామ్.

భూషణాని విచిత్రాణి విశ్వకర్మా ప్రజాపతిః
హారం సరస్వతీ పద్మ మజో నాగాశ్చ కుణ్డలే.

తతః కృతస్వస్త్య నోత్పలస్రజం
నవద్విరేఫాం పరిగృహ్య పాణినా
చచాల వక్త్రం సకపోల కుణ్డలం
సవ్రీడహాసం దధతీ సుశోభనమ్.

స్తనద్వయం చాతికృశోదరీ సమం
నిరన్తరం చన్దనకుఙ్కుమోక్షితమ్
తతస్తతో నూపురవల్గుశిఞ్జితై
ర్విసర్పతీ హేమలతేవ సా బభౌ.

విలోకయన్తి నిరవద్య మాత్మనః
పదం ధ్రువం చావ్యభిచారిసద్గుణమ్

**గన్ధర్వయక్షాసుర సిద్ధచారణ**
**త్రైవిష్టపేయాదిషు నాన్వవిన్దత.**

(భాగ. 8. 8. 8 – 19)

ఈ కథా పరిశ్రయం లోనే శ్రీమహావిష్ణువు మందరపర్వతాన్ని మూపున ధరించటానికి ఆదికూర్మం గాను, అమృత విభజనకు మోహిని గాను అవతరింపవలసి వచ్చింది.

చతుర్దశమనువులలో చివరి ఏడుగురిని గూర్చిన వర్ణనలు అష్టమ స్కంధంలోని పదమూడు, పధ్నాలుగవ అధ్యాయాలలో కనుపిస్తాయి. ఈ సందర్భంగా చరాచరాత్మక జగద్విస్తార పరిపాలనలో మనువులు వహిస్తున్న పాత్ర, బ్రహ్మదివసకాలంలో చతుర్దశ మన్వంతరాల ప్రమాణం మొదలైనవన్నీ చర్చింపబడ్డాయి. బ్రహ్మ జీవితంలో కల్పమని పేరుగల ఒక దివసకాలం మనుష్యమానంలో నలభైమూడు కోట్ల ఇరవైలక్షల సంవత్సరా లవుతుంది. ఈ మొత్తాన్ని పధ్నాలుగు మన్వంతరాలుగా విభాగించారు.

పధ్నాలుగవ అధ్యాయం మొదలుకొని ఇరవైమూడో అధ్యాయం వరకు ఇప్పుడు నడుస్తున్న వైవస్వతమన్వంతరంలో జరిగిన ఒక విశిష్టమైన ఘటన అభివర్ణింపబడింది. అసుర గురువైన శుక్రాచారుని ఆర్తిజ్యంలో బలిచక్రవర్తి అనేక యజ్ఞాలు చేసి మహాబలుడై దేవతలను స్వర్గంనుంచి బహిష్కరిస్తాడు. అతని దుశ్చర్యలను సహింపలేక దేవతలు శ్రీమహావిష్ణువును ఆశ్రయిస్తారు. పాదాక్రాంతులైన ఆదితేయులకు అభయదానం చేసి శ్రీమహావిష్ణువు వామనుడై బాలబ్రహ్మచారిగా బలిచక్రవర్తిని సందర్శించాడు. మూడడుగులు దానం అడిగి ఒక కాలితో భూమండలాన్ని, వేరొక కాలితో సమస్తవిశ్వాన్ని ఆక్రమించి మూడవ అడుగు బలి శిరస్సుపై మోపి వామనావతార విష్ణువు అతనిని పాతాళానికి అణగద్రొక్కిన కథ అందరికీ తెలిసినదే, ఇక్కడ ఎంతో ఉత్కంఠతో వర్ణింపబడింది. ఈ సందర్భంలో మానవజీవితాన్ని స్వర్గధామంగా మలుచుకోవటానికి ఆవశ్యకమైన ధర్మాలెన్నో ప్రస్తావనకు వచ్చాయి. భగవానుడు తన భక్తుని కరుణింపదలచినప్పుడు అతని చిత్తశుద్ధిని

పరీక్షింపగోరి ఐశ్వర్యమదాన్ని, పదవీగర్వాన్ని పూర్తిగా అణిచివేసే క్లిష్టపరిస్థితులను కల్పించి నానాకష్టాలకు గురిచేస్తాడని, ఆ పరీక్షకు నిలబడి సర్వార్పణబుద్ధితో శ్రీ భగవానుని ఆశ్రయించినవారు భగవత్కృపాపాత్రులు కాగలరని ఈ కథాతాత్పర్యం. వితరణ శీలి, సత్యవర్తనుడు అయిన బలిచక్రవర్తి సమస్త చరాచరాలలోనూ ఉన్నది పరమాత్ముడేనని, ఈ ధన ధాన్య లక్ష్మీ సంపదలపై ఐశ్వర్యం తనది కాదని విస్మరించి దేహాత్మభావాన్ని పెంచుకొంటాడు. మహాదాత అయిన తన చెంతకు వచ్చి త్రైలోక్యరాజ్యలక్ష్మీ మహనీయవైభవాలను కోరుకొనక మూడడుగుల నేల అడిగాడని జగద్వల్లభునితో వేళాకోళపు మాటలంటాడు. వామనరూపంలో ఉన్న మహావిష్ణువు విశ్వరూపాన్ని ధరించినప్పుడు, ఇంతకాలమూ తాను మహావిషయాలనుకొన్నవి ఆ జగదీశ్వరుని మ్రోల అణువు కంటె అణుతరాలని తెలిసివచ్చి అతని మనస్సు భగవన్మహిమాతిశయాన్ని గుర్తింపగలుగుతుంది. వాగ్దానభంగానికి సిగ్గుపడి అవమానభారంతో కుమిలిపోతూ తన శిరస్సును భగవత్పాదానికి అర్పించిన మహాపుణ్యఫలంగా అతనికి పాతాళలోకాధిపత్యం చేకూరుతుంది. సావర్ణి మనువు కాలంలో అతను దేవేంద్రుడై స్వర్గాన్ని పరిపాలింపగలడని శ్రీమహావిష్ణువు వరాన్ని ప్రసాదిస్తాడు.

అయితే భగవత్కృత్యాలలో పక్షపాతం ఉన్నదా? అంటే, లేదనే చెప్పాలి. దేవాసురులలో శ్రీహరి దేవతలకు అధిక లాభాన్ని కట్టబెట్టి అసురులను చిన్న చూపు చూశాడనే విమర్శ యుక్తియుక్తమైనది కాదు. జీవులందరూ గుణబద్ధులు. ఆ గుణాల యొక్క సమ్మేళనల వల్ల స్వభావప్రేరణలు మార్పు చెంది జీవులలో రాగద్వేషాలు కలుగుతున్నాయి. భగవానుడు ఈ గుణకర్మలు రెండింటికీ అతీతుడు. అందుచేత భగవానునికి గుణబద్ధులైన జీవుల యెడ కరుణాప్రసారమే తప్ప రాగద్వేషాలు కలిగే అవకాశమే లేదు. ప్రాణికోటి జీవితాలలో కాలగతి ననుసరించి సంభవించే విపరిణామాలకు వాసనాకృత స్వభావప్రేరణలే కారణం. భగవంతుని దృష్టి అందరియెడ సమానమే. కాలం కలిసివచ్చినప్పుడు భగవత్కృప ఫలోన్ముఖమై, కలిసిరానప్పుడు నిష్ఫలం అవుతుంటుంది.

అష్టమ స్కంధాంతంలో శ్వేత వరాహం ప్రారంభించటానికి పూర్వం అతీత కల్పావసానంలో సంభవించిన నైమిత్తిక ప్రళయం అభివర్ణింపబడింది. సాయంసంధ్యకు ఉపక్రమించి జలతర్పణ కోసం ప్రాంజలిబద్ధుడైన సత్యవ్రత మహారాజు చేతులలో ఒక చిన్ని చేప వచ్చిపడుతుంది. ఆ చేప శ్రీమహావిష్ణువేనని తెలియక దానికి ఆవాసాన్ని కల్పింపబోయిన సత్యవ్రతుడు చివరికి తన యెదుటనున్నది వేదమయుడైన శ్రీ పరమేశ్వరుడేనని గ్రహిస్తాడు. మత్స్యరూప భగవానుడు సత్యవ్రతునికి జ్ఞానబోధ కావించి అతని ఓడను ప్రళయార్ణవజలాల నుంచి సురక్షితప్రదేశానికి చేరుస్తాడు. భగవన్మత్స్యావతార లీలతో ప్రారంభమైన నూత్నకల్పంలో సత్యవ్రతుడు వైవస్వత మనువుగా అవతరించాడు. మనమిప్పుడున్నది ఆ సప్తమ మనువు వైవస్వతుని కాలమే.

## నవమ స్కంధం

శ్రీమద్భాగవత నవమస్కంధం ఇరవైనాలుగు అధ్యాయాల లోని 964 శ్లోకాలలో సర్గ ప్రతిసర్గాల కాలంలో ఏర్పడిన వంశ వంశానుచరితాలను అనుబోధిస్తున్నది. వంశమంటే మన్వాదుల సంతతి యొక్క చరిత్రమని, వంశానుచరిత్ర ప్రజాపతుల యొక్క సృష్టివిస్తారమని, పురాణ లక్షణాలలో ఈ వంశము కూడా ఒకటని ఇంతకు మునుపే అనుకొన్నాము. దీనిని గురించిన వర్ణన ద్వాదశ స్కంధంలో ఇంకా విశదంగా కనబడుతుంది.

ఆధునిక భావాలు కలిగిన పాఠకుల దృక్పథంలో భాగవతపురాణ మంతటిలోకీ నీరసమైనది ఈ నవమ స్కంధమేనని చెప్పాలి. వంశావళులు, రాజుల పేర్లు మృద్వీచికలలా ముసురుకొనివచ్చే మండుటెడారి వంటి ఈ కథాక్షేత్రంలో ఎక్కడో మరుమధ్యశాద్వల ప్రాంతాల వలె భక్తశిఖామణులైన ఖట్వాంగాంబరీష జామదగ్న్య భగీరథ రంతిదేవుల జీవిత ప్రబంధాలు, శ్రీరామావతార వర్ణన ముక్తాముక్తంగా అగుపిస్తాయి. తక్కినదంతా ఏ రాజు తర్వాత ఏ రాజు వచ్చాడో పేర్కొనటం, వీలుంటే ఆ రాజులలో ఇద్దరు ముగ్గురిని గురించి ముక్తసరిగా నాలుగు మాటలు చెప్పటం మాత్రమే

కనబడుతుంది. ఆ పట్టికలను చదువుతుంటే ఆ రాజుల స్వరూప స్వభావాలు ఎటువంటివి? వారు నివసించిన ఆ యుగాల లక్షణాలేమిటి? వారు నిజంగానే ఆ రోజులలో పుట్టి పెరిగారనటానికి ఆధారాలేమిటి? అనే ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోతాయి. విబుధహృదయావర్జకమైన భాగవత నందనోద్యానంలో మోడువారిన ఆ వంశవృక్షాలను తెచ్చి నాటటం వలన సిద్ధించిన మహాప్రయోజనం ఏమిటంటే సమాధానం చెప్పటం కష్టమే. మొత్తం మీద ఆ వివరాలను ఓపికగా చదివే పాఠకులకు ఆనాటి మహనీయ సంస్కృతి వైభవాన్ని గురించి తెలిసేదేమీ ఉండదు. కాని ఎప్పుడో అనేక శతసహస్రసంవత్సరాలకు పూర్వం అనంతమైన భూమిభాగాన్ని అసంఖ్యాకులైన రాజులు పరిపాలించారనే అస్పష్టమైన అవగాహన మాత్రమే మిగులుతుంది.

అయితే భాగవతాధ్యేతల మనోమందిరాలలో రచయిత ప్రతిష్ఠింపదలచిన అభిప్రాయం కూడా అచ్చం ఇదేనేమో! ద్వాదశ స్కంధంలో శుకయోగి భాగవతకథను సాంతం వినిపించిన తర్వాత పరీక్షితునితో అంటాడు –

**మమతాం మయ్యవర్తన్త కృత్వోచ్చైర్మర్త్యధర్మిణః**
**కథావశేషాః కాలేన హ్యకృతార్థాః కృతా విభో.**

**కథా ఇమాస్తే కథితా మహీయసాం**
**వితాయ లోకేషు యశః పరేయుషామ్**
**విజ్ఞాన వైరాగ్య వివక్షయా విభో**
**వచోవిభూతీ ర్నతు పారమార్థ్యమ్.**

(భాగ. 12. 3. 13–14)

ఓ రాజా! నీకింతవరకు సాధువర్తనులై తమ కీర్తివల్లరిని మూడు లోకాలకు ప్రాకించి పుణ్యలోకాలను చేరుకొన్న మహనీయు లందరి కథలనూ వినిపించాను. ఆ కథాశ్రవణం వలన నీ మనస్సు నిత్యానిత్యవివేకపూర్ణమై (ఆ వివేకఫలంగా మానవులు తాము సాధించామనుకొనే గొప్పదనాలు,

ప్రాపంచిక సుఖభోగాలు ఎంత అశాశ్వతమైనవో గుర్తించి) సత్యజ్ఞానానందమయం కాగలదని ఆశిస్తున్నాను. దృశ్యమానమైన ఈ జగత్తు ప్రాతిభాసికం మాత్రమే; పారమార్థికం కాదు – అని ఈ శ్లోకతాత్పర్యం. దీనిని బట్టి చరాచరభూతజాలం లోనూ భగవదన్యమైన పదార్థమేదీ లేదని, సమస్తం ఆ భగవంతుని యెడ భక్తిభావాన్ని ఉద్దీపింపజేయటానికే ఉద్దేశితమని గ్రహించాలి.

పురాణాలలో లభిస్తున్న ఈ వంశావళులను, కొద్దిమంది రాజుల యొక్క దేశకాలాదుల వివరణలను ఏకత్రపరిచి, గహనోపమాలుగా ఉన్న ఈ పట్టికల ద్వారా కొంతకు కొంత ప్రాచీన భారతదేశచరిత్రను పునర్నిర్మించాలని భారతీయవిద్వాంసులు కొంత కాలంగా ఈ రంగంలో కృషిచేస్తున్నారు. బ్రిటిష్ చరిత్రకారులు క్రీ.పూ.325 లో అలెగ్జాండర్ భారతదేశం మీదికి దండెత్తిన నాటినుంచి లభిస్తున్న చరిత్రాధారాలను కథనీయవిషయాలుగా గుర్తించి, అంతకు పూర్వం చరిత్రవద్భావంతో వివేచనీయమైన అంశమేదీ ఈ దేశంలో లేదని అభిప్రాయపడ్డారు. అయితే బహుప్రాచీనకాలం నుంచి రథ్యాప్రవాహన్యాయంగా కొనసాగుతూ వస్తున్న భారతీయ సంస్కృతిస్వరూపాన్ని గుర్తెరిగినవారు వాచోయుక్తి లోపించిన ఈ వితథవాక్యాన్ని తిరస్కరింపక మానరు. ఈ విధంగా పురాణాలన్నీ ప్రత్యక్షకథనాలని ఒక వర్గం, విప్రకృష్టాన్వయాలని ఒక వర్గం – విమర్శకులలో రెండువర్గాలు ఏర్పడ్డాయి. ఈ రెండింటిని సత్యదృష్టితో వివేకించి చరిత్రనిర్మాణంలో పురాణ వాఙ్మయానికి గల పరిమితులను గమనిస్తూనే, వాటిలోని చరిత్రాంశాన్ని వెతికితీయవలసిన అవసరం ఈనాడు కనబడుతున్నది. మనము పరిశోధనకు మూలద్రవ్యంగా స్వీకరించిన వస్తువు అస్పష్టమని, ఏ వివరాలూ లేకుండానే నామధేయసూచికలుగా వీనుమిగిలిన వంశానువర్ణనలు దోషజుష్టాలని, ఆ కాలపు చరిత్ర – పురాతత్త్వశాస్త్రాధారాలు లభించటం లేదని, చరిత్రను గురించిన ఆధునికావగాహనకు దీనితో పొత్తు కుదరదని మనము మరచిపోకూడదు. ఏ ఆధారకల్పనకూ అవకాశం లేని

రోజులలో ప్రాదుర్భవించిన సంప్రదాయవల్లరికి నిత్యవసంతాగమాన్ని కల్పించిన సారస్వతరచనలుగా వీటి యాథాతథ్యాన్ని లోచూపుతో అనుశీలించాలి. ఏ ఆధారమూ లేకపోవటం కంటె, ఏదో ఒకటి లభించటం మేలే అనుకోవాలి.

మనము చర్చిస్తున్న భారతదేశపు ప్రాక్చరిత్ర (ప్రోటో హిస్టరీ) అని చెప్పదగిన కాలాన్ని గురించి ఇటీవలే ప్రాచార్య ఆర్. సిద్ధాంతశాస్త్రి గారు వ్రాసిన "హిస్టరీ ఆఫ్ ది ప్రీ కలియుగా ఆఫ్ ఇండియా" అనే గ్రంథం వెలువడింది. "ప్రీ కలియుగా" అంటే కలియుగానికి పూర్వకాలం. శ్రీకృష్ణనిర్యాణం నాటినుంచి దీని పరిగణన ప్రారంభమయింది. ఆంగ్లేయకాలమానం ప్రకారం శ్రీకృష్ణనిర్యాణం క్రీ.పూ. 3102 లో జరిగింది. ఈ గ్రంథనిర్మితికి రచయిత కావించిన మౌలికకృషి శ్లాఘనీయమైనదే. భాగవతం, విష్ణు పురాణం, మత్స్య పురాణం, మహాభారతం మొదలైన గ్రంథాలలోని అన్వయక్రమాలన్నింటినీ క్రమపద్ధతిలో సేకరించి, ఆదిమనువైన స్వాయంభువుని కాలం నుంచి ఇప్పటి మనువైన వైవస్వతుని దాకా ప్రవర్తిల్లిన రాజవంశాలను నిరూపించాలని వీరి ప్రయత్నం. అయితే పౌరాణికులు పరిగణించిన కాలస్వరూపాన్ని త్రోసిరాజని వీరు ఆధునికచరిత్రకారుల ధోరణిలో కాలనిర్ణయం చేయగోరుతున్నారు. ఇది నేలవిడిచినసాము కావటం వల్ల వీరి వాదంలో వాస్తవికత కంటె ఊహాగానాలకే ప్రాధాన్యం లభించింది.

పురాణాలు నిరూపించిన చరిత్ర ప్రకారం ఇప్పుడు నడుస్తున్న కాలానికి శ్వేతవరాహ కల్పమని పేరు. దీనికే పద్మకల్పమని కూడా పేరున్నది. స్వాయంభువ మనువుతో ఈ కల్పం ఆరబ్ధమయింది. స్వాయంభువుని కొడుకులు ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడు చక్రవర్తులై జగన్నుతిపాత్రులయ్యారు. వీరిలో ఉత్తానపాదుని వంశంలో మహాభక్తుడైన ధ్రువుడు, అతినిరంకుశుడైన వేనరాజు, మహాప్రభువుగా కీర్తికెక్కిన పృథుచక్రవర్తి, శిష్టి, రిపుడు, చాక్షుషుడు మొదలైన ప్రసిద్ధపురుషులు

జన్మించారు. చాక్షుషుడు దీర్ఘాయుష్మంతుడై ఐదుగురు మనువుల తర్వాత ఆరవ వానిగా రాజ్యానికి వచ్చి భూమండలాధిపత్యాన్ని వహించాడు. ప్రియవ్రతుని వంశం చిరకాలికమై ప్రశస్తి గడిచింది. నాభిమహారాజు, ఋషభుడు, భరతుడు, గయుడు మొదలైనవారు ఈ వంశంలో ఉదయించారు. సిద్ధాంత శాస్త్రిగారి గ్రంథంలో నలభై ఇద్దరు రాజుల ప్రశంస ఉన్నది. పౌరాణికుల వంశచరిత్రలను నమ్మితే ఈ రాజులందరూ స్వాయంభువుని నుంచి చాక్షుని వరకు ఆరు మన్వంతరాలకాలం - అంటే దాదాపు 2,59,20,000 సంవత్సరాల పాటు రాజ్యపాలన చేసి నట్లవుతుంది. పౌరాణికుల ఈ నిర్ణయాన్ని కాదని నవీన మతాన్ని స్థాపింపబూనిన వీరు ఇంతమంది రాజులకు చరిత్రలో ఏ విధంగా స్థానాన్ని కల్పింపగలమని ఆలోచించినట్లు లేదు. పురాణాలనుంచి చరిత్రను త్రవ్వి తలకెత్తాలంటే ఎదుర్కొనక తప్పని మొదటి చిక్కు ఇదే. ఈ గ్రంథ గ్రంథిని విడతీయటానికి పరిష్కారమార్గం ఇంతకు మునుపే మనము పరిశీలించాము.

శ్రీమద్భాగవత నవమస్కంధం సప్తమ మనువైన వైవస్వతుని రాజభూయంలో భూమండలాన్ని పరిపాలించిన పెక్కుమంది రాజన్యుల చరిత్రలను వివరిస్తున్నది. వైవస్వతుడు శ్వేతవరాహానికి పూర్వకల్పంలో ద్రవిడదేశాధిపతి సత్యవ్రతమహారాజుగా జన్మించిన కాలంలో భగవానుడు మత్స్యరూపుడై అతనికి సాక్షాత్కరించాడు. ఆ వృత్తాంతమంతా అష్టమ స్కంధం, 24వ అధ్యాయంలో వర్ణింపబడింది. పరమపురుషసేవాభాగ్యానికి నోచుకొన్న సత్యవ్రతుడు ఉత్తరజన్మలో శ్రాద్ధదేవుడనే పేరుతో వివస్వంతుని పుత్రునిగా ఉదయించాడు. తండ్రి పేరు మీద ఇతనికి వైవస్వతుడని పేరు వచ్చింది. ఈ స్కంధంలో భారతదేశంలోని ప్రధాన రాజవంశాలలో ఒకటైన సూర్యవంశానికి సూర్యభగవానుని అంశతో జన్మించిన వైవస్వత మనువును, చంద్రవంశానికి సాక్షాత్తు చంద్రుని వంశకర్తలుగా నిరూపించే ప్రయత్నం జరిగింది. వైవస్వత మనువుకు ఇక్ష్వాకువు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూషకుడు, నరిష్యంతుడు, పృషధ్రుడు, నభగుడు, కవి - అని పదిమంది కొడుకులు

పుట్టారు. వీరిలో ఇక్ష్వాకువు సూర్యవంశానికి మూలపురుషుడు. ఈ వంశంలోని రాజుల సంఖ్య ఎనభై నాలుగని శాస్త్రిగారు నిర్ణయించారు. ఈ రాజులలో కాకుత్థ్సుడు, మాంధాత, అంబరీషుడు, హరిశ్చంద్రుడు, దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు, ధర్మవిగ్రహుడై భారతీయసంస్కృతిని మోక్షపురుషార్థానికి అభిముఖంగా నడిపించిన ఆదర్శమానవుడు శ్రీరామచంద్రుడు మొదలైనవారెందరో ఉన్నారు. శైశవంలో విద్య నభ్యసించి, యౌవనంలో విషయానురక్తులై వార్ధకంలో మునివృత్తి నవలంబించిన రాజులతో ధర్మపరిపాటికి నిదర్శనగా అభిపన్నమైన ఈ అన్వయం మహాభారతయుద్ధంలో మరణించిన బృహద్బలునితో అంతరించిపోయింది.

మనుపుత్రులలో ఇతర రాజులందరూ వంశకర్తలయ్యారు. సూర్యవంశంలో అనేక శాఖలు ఉద్భవించాయి. వీటిలో మిథిలానగరాన్ని పరిపాలించిన విదేహరాజవంశం, వైశాలిని పాలించిన రాజవంశం, శర్యాతి కులం, నభగాన్వయం, నృగరాజ వంశం, నరిష్యంతుని వంశం ప్రఖ్యాతిని గడించాయి.

చంద్రవంశానికి మూలపురుషుడు చంద్రుడే. బ్రహ్మమానసపుత్రుడైన అత్రిమహర్షి నేత్రాలనుండి స్రవించిన అమృతబాష్పాల వలన ఉదయించిన ఈ చంద్రునికి బుధుడు జన్మించాడు. చంద్రవంశం శాఖోపశాఖలుగా విస్తరిల్లింది.

ఈ విధంగా పురాణాలలో కనుపిస్తున్న వర్ణనలను బట్టి సూర్యవంశ చంద్రవంశాలు ఏకకాలంలో ఉద్భవించినవో, కావో నిర్ణయించటం కష్టమే. ప్రొఫెసర్ శాస్త్రిగారు సూర్యవంశం అస్తమించిన తర్వాతి కాలంలో చంద్రవంశానికి ప్రసిద్ధి కలిగినదని భావించారు. అయితే మహాభారత యుద్ధంలో మరణించిన సూర్యవంశపు చిట్టచివరి రాజు బృహద్బలుని సంగతిని దృష్టిలో ఉంచుకొని ఈ విషయాన్ని పునఃపరిశీలించాలి.

శ్రీకృష్ణ సర్వాధిక్యాన్ని అభిసరించిన శ్రీమద్భాగవత పురాణంలో

శ్రీకృష్ణోదయానికి మూలమైన చంద్రవంశమే ప్రధానీకరింపబడింది. భారతదేశ సంస్కృతి చరిత్రలో సుప్రసిద్ధులైన పురూరవుడు, నహుషుడు, యయాతి, పురువు, దుష్యంతుడు, భరతుడు, హస్తి, కురుమహారాజు, శంతనుడు, విచిత్రవీర్యుడు, పాండురాజు, యుధిష్ఠిరుడు మొదలైనవారు ఈ వంశంలో ప్రభవించారు. సిద్ధాంత శాస్త్రిగారు చంద్రవంశరాజులు 76గురి పేర్లను ఉదాహరించారు. కలిప్రవేశ కాలం వరకు కొనసాగిన ఈ వంశం కలి ముదిరిన కొద్దీ క్రమక్రమంగా అంతరించిపోయింది.

చంద్రవంశంలో అనేకశాఖలు ఉద్భవించాయి. వీటిలో కాశీనగరాన్ని పరిపాలించిన క్షత్రవృద్ధుని వంశం, హర్యశ్వుని తర్వాత పాంచాలదేశాన్ని పరిపాలించిన రాజవంశం, అహిచ్ఛత్రుని పేరిట వెలసిన రాజవంశం, కాంపిల్యనగరాన్ని పరిపాలించిన రాజవంశం ప్రసిద్ధమైనవి.

శ్రీమద్భాగవత కథాసౌధ నిర్మాణానికి చంద్రవంశం లోని ప్రధానపురుషులలో ఒకడైన యయాతి సంతతివారు ఆధారస్తంభాలుగా నిలిచారని చెప్పాలి. యయాతికి యదువు, తుర్వసుడు, ద్రుహ్యుడు, అనువు, పురు మహారాజు జన్మించారు. వయసు మీరిన తర్వాత యయాతికి యౌవనభోగాలను మళ్ళీ అనుభవించాలని వాంఛ కలిగింది. తండ్రిమీది అభిమానంతో పురువు అతని వార్ధక్యాన్ని స్వీకరించి, తన యౌవనాన్ని తండ్రికి ధారపోశాడు. యయాతి సంసార విరక్తుడైనాక పురునికి రాజ్యభారాన్ని అప్పగించి, తక్కిన కొడుకులను తత్తదుచితస్థానాలలో సామంతులుగా నియమించి, వారికి సార్వభౌమాధికారాన్ని నిషేధించాడు.

యయాతి సుతులలో పురు చక్రవర్తి, యదువు ప్రజానురంజకంగా రాజ్యపాలన చేసి తమకు సాటివచ్చే కుమారులను పొంది ధన్యజీవితులయ్యారు. పురు చక్రవర్తి అనంతరీయులలో మహాభారత సంగ్రామకర్తలైన కౌరవ పాండవులు; యదువు వంశంలో యాదవ సాత్వత సృంజయులు జన్మించారు. ఈ యదు కులంలోనే శ్రీమద్భాగవత

కథాసూత్రానికి నాయకమణి అయిన శ్రీకృష్ణపరమాత్మ అవతరించాడు. నవమ స్కంధంలోని చివరి రెండు అధ్యాయాలలో యదువు మొదలుకొని శ్రీకృష్ణుని వరకు జన్మించిన యాదవుల వివరాలున్నాయి.

ఈ విధంగా నవమ స్కంధం లోని వంశవృక్షవిశేషాలన్నీ చరిత్ర పరిశోధకులకు ఆసక్తిదాయకం కావచ్చును గాని, సామాన్యపాఠకులకు మాత్రం విసుగనిపించి ఈ భాగాన్ని విడిచిపెట్టి ముందుకు సాగిపోయే అవకాశం ఉన్నది. అయితే ఈ స్కంధంలోని ప్రతి అధ్యాయం లోనూ భక్తిభావాన్ని సముద్దీపింపజేస్తున్న అనేక ప్రసంగాలు తప్పక చదవవలసినవి, ఆలోచింపవలసినవి ఉన్నాయి. గ్రంథవిస్తరభీతి వలన వాటన్నింటినీ ఇక్కడ ఉదాహరించే వీలులేక అధ్యాయసంఖ్యను మాత్రం పొందుపరుస్తున్నాము –

**(అధ్యాయ సంఖ్య కథావివరణ)**

| | |
|---|---|
| 4–5 | అంబరీషోపాఖ్యానం |
| 8–9 | గంగావతరణం |
| 10–11 | శ్రీరామావతారం |
| 15–16 | పరశురామ చరిత్ర |
| 18–19 | యయాతి చరిత్ర |
| 20 | దుష్యంత భరతోదంతం |
| 21 | రంతిదేవుని చరిత్ర |

# పంచమ స్కంధం

## సంసారాసక్తులకు భగవత్ప్రాప్తి

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి పలుకులను విని, 'మునివర్యా! ప్రియవ్రతుడు ఆత్మవిద్యను గ్రహించి ఆత్మారాముడైన తర్వాత గృహాసక్తుడై రాజ్యపరిపాలన చేసి చివరికి పరమపదాన్ని పొందాడని మీరన్నారు. గృహాసక్తి అనగానే కర్మబంధాలన్నింటికీ అదే మూలం. కర్మబద్ధునికి స్వరూపజ్ఞానం మరుగుపడుతుంది. తత్ఫలంగా అతను బద్ధజీవుడై వివిధక్లేశాలకు గురికాక తప్పదు. సంసారక్లేశాలను రోసి సర్వసంగపరిత్యాగం చేసి ఆత్మజ్ఞానులై భగవత్పాద మూలాన్ని ఆశ్రయించి మనశ్శాంతిని చూరగొన్న భాగవతులకు గృహాసక్తి అంటూ మళ్ళీ కర్మబంధాలు జనిస్తాయా? గృహాసక్తి పైకొన్న తర్వాత ఎటువంటి మహాత్ములకైనా సంసారసాగరమగ్నత తప్పదు కదా! ఆ విధంగా సంసారమగ్ను లైనవారికి మళ్ళీ నిశ్చలమతి, ఈశ్వరపదప్రాప్తి కలుగుతాయా? సంసారాసక్తికీ భగవత్ప్రాప్తికీ నైజవిరోధం కదా? ఈ సందేహాలను నివృత్తి చేయగలరని అడుగుతున్నాను' అని ప్రార్థించాడు. శుకమహర్షి అతనితో ఇలా అన్నాడు:

## శుభమార్గఫలం

రాజేంద్రా! సంసారాసక్తి, భగవత్ప్రాప్తి పరస్పరవిరుద్ధా లన్నమాట నిజమే. అయితే ఒక్క విశేషం ఉన్నది. సంసారముఖులు భగవంతునికి విముఖులని అనుకోకూడదు. సంసారం లోనికి ప్రవేశించీ సిద్ధి పొందినవారెందరో ఉన్నారు. అంతా మనఃస్థితిని బట్టి ఉంటుంది. సంసారంలో ఉన్నప్పటికీ భగవత్పరులైన వారి మనస్సు తామరాకు మీది నీటిబొట్టు వలె ఉంటుంది. వారు సర్వం భగవదాత్మకమన్న భావంతో వర్తిస్తుంటారు. అన్నింటికీ భావం ప్రధానం.

పునస్సంసారాసక్తులకు భగవద్భావం ఎలా కలుగుతుందని శంకించావు. భగవత్పాదారవిందమరందరసం ఒక్కసారి రుచి చూస్తే, మనస్సు ఏదైనా ఒక అంతరాయం వల్ల కొంతకాలం ఆ రుచిని స్మరింపక పోయినా పూర్వాభ్యాసఫలం దానిని మళ్ళీ ఆ వైపుకు లాగుతుంది. శుభమార్గఫలం ఎన్నడూ స్వరూపనాశం పొందదు.

## ప్రియవ్రతుని చరిత్ర

రాజేంద్రా! నీ ప్రశ్నకు ప్రియవ్రతుని చరిత్రే సమాధానం. దానిని చెబుతాను విను. ప్రియవ్రతుడు ఆ విధంగా నారదుని వలన పరమార్థతత్త్వాన్ని గ్రహించి ఆత్మజ్ఞానవ్రతు డయ్యాడు. ఆ సమయంలో అతని తండ్రి వయసు మీరి రాజ్యభారాన్ని వహింపలేని స్థితిలో ఉన్నాడు. రాజ్యం సురక్షితం కాకపోతే అరాజకమై ఇక్కట్ల పాలవుతుంది. అంతకంటె రాజులకు పాపకార్యం వేరొకటుండదు. ప్రియవ్రతుడు వయస్సును బట్టి, గుణాలను బట్టి రాజ్యభారం వహించటానికి తగిన సుస్థితిలో ఉన్నాడు. అందువల్ల ప్రియవ్రతుని తండ్రి అతనిని ధాత్రీభరణానికి ప్రోత్సహించాడు. ప్రియవ్రతుడు నిరంతర సమాధి యోగవ్రతుడై సకలేంద్రియాలను భగవదర్పణం కావించినందువల్ల రాజ్యపాలనకు అంగీకరిస్తే మనస్సు మళ్ళీ అనాత్మభూత ప్రపంచాదులలో తగులు కొనడమూ, ఆత్మజ్ఞానచ్యుతి కలగడమూ తప్పవని తలపోసి

పితృవాక్యం అనుల్లంఘనీయ మైనప్పటికీ ఆయన మాటను పాటించటం అతనికి సమ్మతం కాలేదు.

## బ్రహ్మ ఉపదేశం

రాజా! బ్రహ్మదేవుడు సృష్టికర్త కాబట్టి సృష్టిసంప్రదాయ వృద్ధి కోసం ఎంతో జాగరూకుడై అంతరాయాలను నివారిస్తుంటాడు. చతురాస్యుడు ప్రియవ్రతుని భావాన్ని గ్రహించి హంసారూఢుడై మూర్తిగొన్న వేదాలతో, మరీచ్యాది మహర్షులతో సత్యలోకం నుంచి తరలి మార్గమధ్యాన సురలు విమానారూఢులై కావించే పూజలను అందుకొంటూ, సిద్ధ సాధ్య గంధర్వ చారణ కిన్నరుల ప్రస్తుతులను ఆలకిస్తూ గంధమాదన పర్వతగుహకు విచ్చేశాడు. నారదమహర్షి ఆయనను చూడగానే తటాలున లేచి నిలబడి జనకుని స్వాగతించి సాగిలపడి మ్రొక్కాడు. ఆ వెంటనే స్వాయంభువమనువు, ప్రియవ్రతుడు లేచి పరమేష్ఠిని పూజించారు. బ్రహ్మదేవుడు వారి పూజల నందుకొని దయార్ద్రమందహాస విలోకనాలతో వారిని ఆదరించి ప్రియవ్రతుని వంకకు మరలి వాత్సల్యంతో ఈ విధంగా ప్రసంగించాడు:

'నాయనా! ప్రియవ్రతా! నీకొక సంగతి చెప్పాలని వచ్చాను. నేను చెప్పనున్నది నీ మనోనిశ్చయానికి అనుకూలంగా ఉండకపోవచ్చు. అంత మాత్రాన నీవు నా మాటలను కాదనకు. మరి నేను చెప్పబోతున్నది భగవద్వచనమే గాని నా భావం కాదు. భగవానుడు నా ముఖతః నిన్ను ఆజ్ఞాపిస్తున్నాడు.

నాయనా! నేను గాని ఈ నారదమహర్షి గాని నీ తండ్రి గాని స్వతంత్రులము కాము. అందరమూ భగవదాజ్ఞానుసారం నడుచుకొంటున్నాము. భగవన్నిర్మాణాన్ని మార్చకూడదా? అంటావేమో. పరమాత్ముని నిర్మాణాన్ని మార్చటానికి అర్థపతులు, ధర్మపరులు, మనీషామతులు, విద్యానిధులు, తపోధనులు, యోగీశ్వరులు – వీరిలో ఎవరూ స్వయంగా కాని బలవదాశ్రయలబ్ధి చేతనైతేనేమి సమర్థులు కారు.

ఇంతెందుకు? పరమేశ్వరుని విధి ప్రకారం జీవునికి దేహయోగం కలుగుతున్నది. దేహాలు జీవు లనుభవింప వలసిన శోకమోహసుఖదుః ఖాదులకు తగినట్లుగా కల్పింపబడుతున్నాయి. భోగ్యఫలం భుక్తమైనంతనే ఆ దేహాలు పతనమవుతున్నాయి. జనన మరణ విషయాల యందే జీవునికి స్వాతంత్ర్యం లేదంటుంటే తక్కినవాటిని గురించి అనుకోవడం ఎందుకు? కర్మాచరణలో కూడా జీవునికి స్వాతంత్ర్యం లేదా? అంటే, అందులోనూ లేదు. కర్మములు వేదప్రతిపాదితాలు. వేదాలు పరమేశ్వరుని ఆజ్ఞాజాలమాత్రాలు. జీవులు వేదసూత్రనిబద్ధ కర్మపరులై ముక్కుతాడు బిగించిన ఎడ్లవలె నడుచుకోక తప్పదు.

నాయనా! దేహయోగ కర్మాచరణలందు స్వాతంత్ర్యం లేకపోయినా భోగవిషయంలో నైనా స్వాతంత్ర్యం లేదా? అని సందేహం కలుగవచ్చు. భోగవిషయంలో కూడా జీవునికి స్వాతంత్ర్యం లేదు. ఎలాగంటావా? గుణాలను బట్టి కోరికలు, కోరికలను బట్టి కర్మములు, కర్మములను బట్టి తత్ఫలాలు, కర్మఫలాలను బట్టి నర తిర్యగాది భోగశరీరాలు, ఆ శరీరాలతో అనుభవింపనైన సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. ఆ సుఖదుఃఖాదులను అనుభవింపక తీరదు. సృష్టి సకలం ఈ విధంగా నియమబద్ధమై ఉన్నది. ఇదే భగవదాజ్ఞ. ఆ ఆజ్ఞను అతిక్రమించటం ఎంత వారికయినా సాధ్యం కాదు.

అయితే ముక్తసంగుల మాటేమిటి? అంటే వారికి కూడా ప్రారబ్ధశరీరసంబంధ కర్మఫలభోగం తప్పదు. కాని వారి కర్మఫలానుభవానికి, తదితరుల కర్మఫలానుభవానికి భేదం లేకపోలేదు. ముక్తసంగుల కర్మఫలానుభవం ఎల్ల వేళలా అభిమానరహితంగా ఉంటుంది. అందువల్ల స్వప్నార్థాన్ని మేల్కొన్నవారు భావించినట్లుగా కర్మఫలానుభవాన్ని వారు సంభావిస్తారు. కనుకనే వారికి దుఃఖాదులు కలుగవు. అన్యులంటేనో, 'అయ్యో! నా కిది దాపురించింది కదా' అని ఏడుస్తూ అనుభవిస్తూ దుఃఖాల పాలవుతున్నారు. అనుభవవిధి ఇద్దరికీ ఒకటే అయినా అభిమానము యొక్క కలిమి లేములను బట్టి దుఃఖాదుల కలిమి లేములు కలుగుతున్నాయి.

అభిమానమంటే ఎటువంటిదో ఎంతటిదో గ్రహించి చూడు.

> నాయనా! కర్మఫలం పునర్జన్మాంకురం అవుతుందని, జన్మ మొదలుకొని భోగ్యఫలవాసనలు ఉంటాయని, ఆ వాసనలు తమ స్వభావప్రకారం పునఃకర్మలను చేయిస్తాయని, ఆ వాసనలు శుభాశుభమిశ్రమాలుగా ఉంటాయని, ఆ శుభవాసనాప్రేరిత కర్మములన్నీ అశుభప్రదాలే అవుతాయని, ఆ కర్మలకు మళ్ళీ అశుభఫలాలు కలగటమూ వాటిని అనుభవించటానికి తత్తద్యోగ్యశరీరాలు రావటమూ తప్పదని, సంసారం ఈ విధంగా తెంపులేని దవుతుండగా ముముక్షువుకు మాత్రం దీనిని తప్పించుకోవటం ఎలా వీలవుతుందని సందేహం కలుగుతుంది. ముముక్షువుకు అభిమానం లేనందున వాసనలచే ప్రేరేపింపబడిన కర్మ ఫలాలన్నీ భుక్తమైనాక దగ్ధబీజన్యాయంగా నశించిపోతాయి. అతను ప్రారబ్ధకర్మఫలాలను ఎట్లా అనుభవిస్తాడంటావా? నిరభిమానబుద్ధితో అప్రతీకారంగా అనుభవిస్తాడు. దగ్ధబీజాలు మళ్ళీ మొలకెత్తనట్లు గానే ముముక్షువుల కర్మఫలాలు పునర్జన్మకారణాలు కానేరవు.

కారణం లేకుండా కార్యం కలుగదు కదా? అప్రతీకారమతితో అనుభవించటం అంటే ఏమిటని అడగవచ్చు. రోగాదులు సంభవించినప్పుడు వాటికి తగిన చికిత్స చేయక మిన్నకుండటం అప్రతీకారబుద్ధి కానేరదు. అది మౌఢ్యమవుతుంది. రోగాదులు వచ్చినందుకు దుఃఖపడక ఓరిమివహించి రోగనివారణోద్యమాలను సాగించటమే అప్రతీకారసహనం అంటే.

ఇంటిలో ఉన్నప్పుడు సుఖభోగాలను అనుభవింపక తప్పదని, భోగ్యాలను ఒకవంక భోగిస్తూ అభిమానరహితంగా ఉండటం సాధ్యం కాదని, అభిమానమున్నంతకాలం మోక్షం కలుగదని, గృహపరిత్యాగం కావించి సన్న్యాసం తీసుకొని వనాంతరాలకు వెళ్తే మోక్షం సిద్ధిస్తుందని అనుకొంటున్నావా? నాయనా! శరీరధారులకు కామక్రోధాది నిత్యవైరులు

ఆరుగురున్నారు. ఆ వైరిషట్కం మనలో ఎంతకాలం ఉంటుందో అంతకాలమూ ఇంటనున్నా మింటనున్నా వనాంతరం జొచ్చినా సంసారభయం తొలగదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ వైరిషట్కం తోడి సంబంధమే సంసారం. అట్టి హితశత్రువులను దూరంగా ఉంచడమే సన్న్యాసం. ఆ వైరులను సన్న్యసించాలి గాని వారిని చేరదీసి గృహాదులను సన్న్యసించి నందువల్ల ఫలితం లేదు. ఆ వైరులను తొలగించటం ఎలాగంటే? వాళ్ళు వట్టి మాటలతో పొమ్మంటే పోరు. కారణ మేమిటంటావా? వాళ్ళు బహిశ్శత్రువులు కారు; ఆంతర శత్రువులు. మన ఇంద్రియాలను ఆశ్రయించుకొని ఉంటారు. ఇంద్రియాలను జయించామంటే నిరాశ్రయులై నిలువ నీడ లేక తమంత తాముగా తొలగిపోతారు. ఈ విధానమే ఇంద్రియజయం అనబడుతున్నది. జితేంద్రియులు ఇంట్లో ఉన్నా మరెక్కడున్నా వారికి సేగిలేదు.

ఆ శత్రువులను గృహాశ్రమంలో ఉంటున్నవారు ఎట్లా జయించాలి? అంటే, వారి కార్యమేమిటో మొదట గ్రహించి వారి చేతలకు భంగం కలిగించాలి. వారు చేసే పనేమిటంటే, కంటికి కనబడకుండా మనస్సులో దాగి ఉండి సమయం వచ్చినప్పుడు తలయెత్తి విహరిస్తారు. వారి విజృంభణాన్ని నిగ్రహించితే చాలు, బందీకృతులై క్రమక్రమంగా శక్తి సంపద లుడిగి నశిస్తారు. అప్పుడు నీ గృహం శత్రువులకు దుర్గమం అవుతుంది.

నాయనా! ఇదంతా సామాన్యులు గూర్చిన ఉదంతం. నీవు సామాన్యుడవు కావు. పరమేశ్వర పాదకమలకోశ దుర్గాన్ని ఆశ్రయించి అంతఃస్థులై ఉన్న వైరులను నిర్మూలించావు. ఇక నీకు భయమెందుకు? ఈ వృథా విచికిత్స మాని భగవంతుడిచ్చిన భోగాలను నిస్సంగబుద్ధితో అనుభవించి, తర్వాత ఆత్మనిష్ఠను గ్రహించాలి. భోగకాంక్ష పైకొంటుందని వెనకాడవద్దు. నీ నిస్సంగబుద్ధే నిన్ను కాపాడుతుంది' అని బోధించాడు.

రాజా! ఆ పరమేశ్వరశాసనాన్ని ప్రియవ్రతుడు తలదాల్చి బ్రహ్మకు యథోచితపూజలు కావించాడు. బ్రహ్మ అతనిని అభినందించి వాచామగోచరం, వ్యవహారశూన్యం అయిన స్వస్వరూపాన్ని ధ్యానం చేస్తూ

అంతర్ధానం చెందాడు. పుత్రుని మహిమను నేత్రపర్వంగా తిలకించి కృతార్థుడ నైనానని భావించి, నారదుని అనుమతిని పొంది ప్రియవ్రతుని యందు రాజ్యభారం నిలిపి విషయవిష జలాశయాత్మకము, అత్యంతదుస్తరము అయిన గృహాసక్తిని వదలి స్వాయంభువ మనువు పరమార్థ సాధనోన్ముఖు డయ్యాడు.

## ప్రియవ్రతుని సంతానం

రాజేంద్రా! ప్రియవ్రతుడు ఆ విధంగా రాజయి విశ్వకర్మ ప్రజాపతి కుమార్తె బర్హిష్మతిని వివాహం చేసుకొన్నాడు. వారికి అగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహుడు, మహావీరుడు, హిరణ్యరేతుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి – అని పదిమంది కొడుకులు, ఒక కుమార్తె – ఊర్జస్వతి జన్మించారు.

ప్రియవ్రతుని కొడుకులందరూ రూప వీర్య గుణశీలాదులలో తండ్రికి సాటివచ్చినవారు. వారిలో కవి, మహావీరుడు, సవనుడు బాల్యం నుంచి ఆత్మవిద్యాపరులు, ఊర్ధ్వరేతస్కులై సంసారభావాన్ని త్యజించి పరమహంసాశ్రమాన్ని గ్రహించి ఉపరతిని గాంచి సకలజీవనికాయావాసము, భవభీతులైన జనులకు పరమ శరణభూతము అయిన భగవత్పాదారవిందమందు భక్తిపూతచిత్తాలను పాదుకొల్పి తదేక చింతను లయ్యారు. తత్ఫలంగా వారి అంతఃకరణలు పరమపవిత్రములై విలసిల్లాయి. ఆ శుద్ధాంతఃకరణ లందు సర్వభూతాత్మభూతుడు ప్రత్యగాత్ముడు యథాస్థితిని సన్నిధిభాగ్యాన్ని ప్రసాదించాడు. ఆ దర్శనమహాభాగ్యఫలంగా వారికి దేహాదులందలి మమకారశేషం కూడా నశించింది. వారికి తాదాత్మ్యం కలిగింది.

రాజా! ప్రియవ్రతునికి రెండవ భార్య యందు ఉత్తముడు, తాపసుడు, రైవతుడు – అని ముగ్గురు కొడుకులు పుట్టారు. వారందరూ మన్వంతరాధిపతులయ్యారు.

ప్రియవ్రతుడు పదకొండు అర్బుద సంవత్సరాల కాలం రాజ్యాన్ని

పరిపాలించాడు. పురుషకారసారపరిపూర్ణాలైన బాహుదండాలతో అతను విల్లెత్తి నారి సారించినంతనే ఆ మహాకోదండగుణనినాదానికి శత్రువుల గుండెలు వ్రీలుతుండేవి. అందువల్ల అతనికి యుద్ధాదిక్లేశాలు గాని పరిపాలనలో శ్రమలు గాని కలిగేవి కావు.

రాజా! ప్రియవ్రతుని ప్రథమభార్య బర్హిష్మతి స్త్రీజన నైజ లలిత లజ్జా శృంగారభావాలను మధుర దరహాసాలను కటాక్షవీక్షణాలను ప్రాణనాథుని యెడ ప్రసరింప జేస్తూ స్వప్రేమాతిశయాన్ని నిరంతరాయితంగా వెల్లడిస్తూ భర్త అనురాగానికి నోచుకొన్నది. ఆ ప్రియవధూటి నర్మభాషణలు అతనికి నిత్యనూతనంగా భాసించేవి. అతను ఆ విధంగా సతీలోలుడై వివేకాన్ని కోల్పోయాడా? తనను తాను మరచిపోయాడా? అనిపించేటట్లు ఆమె తోడిదే లోకమై, ఆమె సన్నిధిలో వివిధభోగసౌఖ్యాలను చూరగొనసాగాడు.

## దివారాత్రుల నిర్మాణం

రాజేంద్రా! సూర్యుడు లోకాలోక పర్యంత ధాత్రీతలాన్ని తేజోమయం చేస్తుండటం మనకు కనుపిస్తున్నదే కదా! భాస్కరుడు ఆ విధంగా సమస్త భూమి భాగాన్ని ఏకకాలంలో వెలిగించడం లేదు. ఎందుకంటే సూర్యుడు మేరుపర్వతాన్ని చుట్టి సంచరిస్తాడు. అతను ఆ మహాద్రిని చుట్టి రావడానికి ఒక్క దివారాత్రకాలం పడుతుంది. సూర్యుడు మేరుగిరిని చుట్టివచ్చేటప్పుడు అతను దానికి ఏ వైపున ఉంటే ఆ వైపు సూర్యుని వెలుగు ప్రసరిస్తుంది. ఆ వెలుగున్న కాలం ఆ దెసకు పగలవుతుంది. అతని ప్రకాశం కొండకు ఏ ప్రక్కన ఉండదో అటువైపు చీకటి ఉంటుంది. ఆ కాలం అక్కడివారికి రాత్రి అవుతుంది. ఈ విధంగా భూలోకంలో దివారాత్రాలు ఏర్పడుతున్నాయి.

## సప్తసముద్ర – సప్తద్వీప నిర్మాణం

ప్రియవ్రతుడు రాత్రులను కూడా పగలుగా చేయదలచి తేజోరయాలలో సూర్యరథానికి సాటియైన రథం ఎక్కి, సూర్యుని వెంటనంటి ఏడు పర్యాయాలు సంచరించాడు. అంతటి మహాకార్యం అతనికి ఎలా సాధ్యపడిందని

అడుగుతావేమో? భగవదుపాసనాత్మక ప్రభావవంతులకు అసాధ్యమన్నది ఉన్నదా? ప్రియవ్రతుడు ఆ తీరున సప్తపర్యాయాలు సంచరించినప్పుడు అతని రథచక్రాంచలాల రాపిడి వలన భూతలాన విడివిడిగా ఏడు చీలికలు ఏర్పడ్డాయి. ఆ చీలికలలో నిలిచిన గర్తజలాలను సప్తసముద్రాలని అన్నారు. ఆ సప్తసముద్రాల మధ్య నిలిచిన ఏడు భూభాగాలు సప్తద్వీపాలుగా వెలసి విలసిల్లాయి.

## సప్తద్వీపాధిపతులు

ప్రియవ్రతు డంతట తనను అనువర్తించి తన చెంతనే ఉన్న కొడుకులలో ఒక్కొక్కరిని ఒక్కొక్క ద్వీపానికి అధిపతిగా నియమించాడు. తన కుమార్తె ఊర్జస్వతిని శుక్రునికిచ్చి వివాహం చేశాడు. ఆ దంపతులకు దేవయాని అనే కుమార్తె కలిగింది.

## ప్రియవ్రతుని వైరాగ్యం

రాజా! ప్రియవ్రతుడు ఆ విధంగా రాజ్యపరిపాలన చేస్తుండగా ఒకనాడతనికి నారదుని ఉపదేశం మనసుకు వచ్చింది. 'అయ్యో! రాజ్యాది ప్రపంచసంగమం వల్ల ఇంద్రియాలకు లొంగి వివేకం కోల్పోయి విషయ విషపూర్ణ మహాసముద్రంలో మునిగి కామభోగాలకు గాను స్త్రీమాత్రురాలికి వినోదక్రీడామృగాన్ని అయ్యాను. ఛీ! నా బ్రతుకెందుకు?' అని ఆత్మనింద గావించుకొని సంసార వైముఖ్యం పొంది భుక్తభోగమయిన సామ్రాజ్యాన్ని శవప్రాయంగా పరిత్యజించాడు. అతని మనస్సు విమలమై ఆ పరిశుద్ధమానసంలో భక్తి సుస్థిరంగా ప్రకాశించింది. ప్రియవ్రతు డంతట జ్ఞానోదయం కలిగి చరితార్థు డయ్యాడు. రాజా! ప్రియవ్రతుని మహిమలను బుధులు నాటికీ నేటికీ వేనోళ్ళ కొనియాడుతుంటారు.

## అగ్నీధ్రుడు

రాజేంద్రా! ప్రియవ్రతుని జ్యేష్ఠపుత్రుడు అగ్నీధ్రుడు పితృవాక్యప్రకారం సప్తద్వీపాలలో నడిమిదైన జంబూద్వీపానికి నాయకుడై ఆ ద్వీపవాసులను కన్న

బిడ్డల వలె ధర్మపురస్సరంగా పరిపాలింపసాగాడు. అతనికి పుత్రవాంఛ జనించింది. అభిలషితార్థసిద్ధి కోసం అతను ప్రజాపతిని ఆరాధించాలని సంకల్పించుకొని సురనారీ క్రీడాస్థానమైన మందరగిరి సానుప్రదేశానికి వెళ్ళి పుష్పాదిక పూజాద్రవ్యాలను సమకూర్చుకొని బ్రహ్మదేవుని పూజించి ఏకాగ్రమతితో తపస్సు చేశాడు. పితామహుడు అతని ధర్మదీక్షకు సంతుష్టుడై 'పూర్వచిత్తి' అనే అప్సరోరత్నాన్ని పిలిచి అగ్నీధ్రుని కోరిక నెరవేర్చమని ఆదేశించాడు.

## రసరాజభోగాలు

ఆ కాంతామణి అంతట బ్రహ్మ సభను వదలి మందర గిరి సానుప్రదేశానికి వచ్చి, ఆ చోట ఉన్న శుభ్రజలపూర్ణకమలాకరాలను, వాటిని చుట్టుకొని నింగినంటుతున్న వివిధతరువులను, ఆ వృక్షాల మీదికి ప్రాకి బంగారు తీగెలను పోలిన పుష్పితలతాహస్తాలను చాచి పథికులను పిలుస్తున్నాయా అన్నట్లున్న పొదరిండ్లను చూస్తూ, ఆ విటపశాఖాగ్రాలను అధిరోహించి షడ్జాదిస్వరాలను పలుకుతున్న మయూరాదివిహంగాల మనోజ్ఞరుతాలను ఆలకిస్తూ, సరోవరాంతర హంసకారండవాది పక్షుల విచిత్రకూజితాల ప్రతిరుతాలను వింటూ, విలాసగతులు వెల్లివిరియగా అక్కడ తిరుగాడసాగింది. ఆ సుందరి లలితగతి విన్యాస విలాసాలను ఆమె పాదాలమణినూపురఘుణఘుణారవం శ్రవణపర్వంగా ప్రకటించి అగ్నీధ్రుని చెవిసోకి ఆ వంకకు అతని మనస్సును ఆకర్షించింది. అతను సమాధియోగముద్రలో ఉన్న కన్నులను మెల్లమెల్లగా తెరచి, ఆ ధ్వని వచ్చిన వంకకు తలత్రిప్పి మధుకరాంగన వలె పూలతావులకు పరవశిస్తూ, క్రీగంటి చూపులను వెలయిస్తూ, మధురమధురంగా లలితగానాలాపనలు చేస్తూ, మోవితేనియల కోసం ప్రాకులాడుతున్న కొదమతేటిగుంపులకు బెదిరి తడబాటు వల్ల ఎగిసి పడుతున్న చందోయి మీది పయ్యెదను సవరించుకొంటూ, వీడిన కచభరాన్ని చక్కనొత్తుకొంటూ, అసియాడే నెన్నడుము నుండి జారుతున్న పసిడి ఒడ్డాణాన్ని కీలిస్తున్న ఒక మోహనాంగిని

చూసి మదనపరవశుడై వివేకం కోల్పడి జడుని వలె ఆ ఇందుముఖిని చేరబోయి, 'ఓ సుందరీ! నీ వెవరు? ఈ గిరితటానికి ఎలా వచ్చావు? పరదేవత అయిన ఆ భగవానుని మాయవా? ధనుర్ద్వయాన్ని దాల్చావు. ఆ విండ్లకు నారులు లేవు. ఆ శరాసనాలు ఆత్మ రక్షణార్థమో లేక అజితేంద్రియులై మృగతుల్యులైన మా వంటివారిని వేటాడటానికో తెలియదు. భగవంతుని శతపత్రాలే పత్రాలైన బాణాల జంటను కూర్చావు. అవి ఈకలు లేకున్నా పదునుతేరి ఉన్నాయి. వాటిని ఎవని పైని ప్రయోగింపదలిచావు? నిన్ను చూస్తే మనస్సు కంపిస్తున్నది. నీ విక్రమం మాకు క్షేమకరం అవుతుంది గాక. నీ శిష్యులు నిన్ను పరివేష్టించి వేదశాఖలను చదువుతున్న ఋషిగణాల వలె సరహస్య సామగానాలను కలస్వనాలతో ఆలపిస్తూ నీ కబరీభార విలులిత సుమనోవర్షలాలసులై చరిస్తున్నారు. నీ చరణపద్మ నూపురరత్నాలు అరూపముఖర భాషితాలతో మాకు వీనులవిందు చేస్తున్నాయి. కదంబకాంతు లీనుతున్న నీ నితంబమండలం పైని పరివేషం కొరవి వలె మిరుమిట్లు గొలుపుతున్నది. ఈ వింత ఏమిటి? నీ యెదపైని రెండు కొమ్ములు కఠోరపూర్ణములై కానవస్తున్నాయి. వాటిలో ఏమి నింపి ఈ గుణాలను వాటికి సమకూర్చావు? నీ నడుము కృశించి అసియాడుతున్నది. అట్టిది ఈ శృంగభరాన్ని మోయగలదా? నీ శృంగములందు నా చూపునాటుకొన్నది. మరి నీ శృంగాల పైని కెంజాయ సురభి పంకపు నెత్తావులు నా ఆశ్రమాంతర మంతా పరచి పిసాళిస్తున్నవి. చెలీ! రొమ్మున ఇట్టి అపూర్వావయవాలు, మోమున మధురాలాపవిలాసం, మోవియందు సుధాదరహసితాలు గల జనులు ఏ లోకంలో ఉంటారు? వారిని ఒక్కసారి నాకు చూపగలవా? నీ వదనం కమ్మతావులను వెదజల్లుతున్నది. అది సుధాశనభాగ్యఫలం కాబోలు. నీవు శ్రీమహావిష్ణుకళవని భావిస్తాను. కాకపోతే విష్ణునేత్రాలను పోలిన నీ కన్నులు రత్నకాంతులను విరజిమ్ముతూ మోడ్పు లేక విప్పారి ఉండటం సాధ్యమేనా? నీ నెమ్మోము కదలాడుతున్న చేపల జంట గలిగి ద్విజపంక్తిరుచిరము, భ్రమరసంకులము అయి సరోవరాన్ని తలపింపజేస్తున్నది. నీ కరసరోజ స్పర్శకు క్రీడాకందుకం పరిభ్రమితమవుతూ

నా కందోయికి విభ్రాంతి గొలుపుతున్నది. నీ కుటిల జటాభరం విడజారినదని ఎరుగవా? ధూర్తుడు అనిలుడు నీ నీవిబంధాన్ని సడల్చాడు. అదీ గ్రహింపవా? నీ రూపం తపోధనుల తపస్సును భగ్నపరుస్తుంది. ఏ మహాతపస్సు చేసి ఇటువంటి రూపాన్ని సంపాదించావు? చెలీ! నాతో తపస్సు చేయటం నీకు అభిమతమేనా? సంసృతివిస్తారకుడు ఆ బ్రహ్మదేవుడు నాయెడ ప్రసన్నుడగుగాక. ఆ బ్రహ్మదత్తవైన నిన్ను నా ప్రియురాలిని విడనాడలేను. నా మనోనయనాలు నీ యందు లగ్నమైనాయి. చారుశృంగీ! నీ అనువ్రతుడనయ్యాను. నన్ను పాలించు. నీ సచివలు నన్ను అనుమతిస్తారు గాక" అని పలికాడు.

## సంతానోదయం

అగ్నీధ్రుడు లలనానునయ విశారదుడై పలికిన విషయసుఖ విదగ్ధవచనాలను పూర్వచిత్తి విని, అతని బుద్ధి రూప శీల విద్యా వయ శ్రీ మహౌదార్యాలకు ముగ్ధురాలై అతనికి వశవర్తిని అయిపోయింది. వారు జంబూద్వీపాంతరం అంతటా ఇచ్ఛావిహారాల నొనరిస్తూ అనేకసహస్రవత్సరాలు భోగాలలో ఓలలాడారు.

వారికి నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అని తొమ్మిదిమంది కొడుకులు కలిగారు. పూర్వచిత్తి అంతటితో ఆ కుమారులను విడిచి నలువ కొలువుకు వెళ్ళిపోయింది.

అగ్నీధ్రసుతులు తండ్రి వలెనే దృఢగాత్రులు, బలోపేతులుగా పెరిగి యుక్తవయస్కు లయ్యారు. అగ్నీధ్రుడు జంబూద్వీపాన్ని నవఖండాలుగా విభజించి ఒక్కొక్కరిని ఒక్కొక్క ఖండానికి అభిషేకించాడు. ఆ ఖండాలు వారి వారి పేర నాభి వర్షం, కింపురుష వర్షం, హరి వర్షం, ఇలావృత వర్షం, రమ్యక వర్షం, హిరణ్మయ వర్షం, కురు వర్షం, భద్రాశ్వ వర్షం, కేతుమాల వర్షం అని ప్రసిద్ధి గడించాయి.

అగ్నీధ్రుడు కామభోగతృప్తి కలుగనందున ఆ అచ్చరమచ్చెకంటిని మరచిపోలేక ఆమెనే తలపోస్తూ వేదోక్తకర్మలను ఆచరింపసాగాడు. తత్ఫలంగా అతనికి ఆమె లోకమే సంప్రాప్తించింది. మతి యెంతో గతి అంతేనని అన్న మాట ఉన్న మాటే గదా!

అగ్నీధ్రసుతులకు మేరువు పుత్రికలతో అనురూపవివాహబంధం ఏర్పడింది. నాభి మేరుదేవిని, కింపురుషుడు ప్రతిరూపను, హరివర్షుడు ఉగ్రదంష్ట్రను, ఇలావృతుడు లతను, రమ్యకుడు రమ్యను, హిరణ్మయుడు శ్యామను, కురువు నారిని, భద్రాశ్వుడు భద్రను, కేతుమాలుడు దేవవతిని పెండ్లాడారు.

## పుత్రకామేష్టి

నాభికి ఎంతకాలానికీ పుత్రసంతానం కలుగ లేదు. అతను తన భార్య మేరుదేవితో కలిసి యజ్ఞదీక్షపూని యజ్ఞపురుషుని శ్రద్ధాభక్తులతో యజించాడు.

యాజ్ఞికులు యజ్ఞఫలదాత యొక్క అనుగ్రహాన్ని కోరి ద్రవ్యము దేశము కాలము మంత్రము ఋత్విక్కు దక్షిణవిధానం అనే ఏడు ఉపాయాలతో యజ్ఞేశ్వరుని యజిస్తారు. భగవానుడు భక్తవత్సలుడు కనుక శ్రద్ధాశుద్ధభావాలను పెద్దచేసినట్లు అన్యసాధనాలకు అంతగా సులభసాధ్యుడు కాడు. భగవానుని అనుగ్రహం ఎవరి పైన ప్రసరిస్తుందో వారి కోర్కెలను ప్రసాదించేందుకు తానే స్వయంగా దివ్యమంగళవిగ్రహం తాల్చి ప్రసన్నుడవుతాడు.

భగవానుడు నాభికి ప్రీతుడై దీర్ఘబాహు చతుష్టయంతో శ్రీవత్సలాంఛనాంచిత వక్షోభాగంతో లోక మోహనకరంగా విరాజిల్లుతూ పీతాంబరం కట్టి స్ఫురత్కిరణమణిమయ మకుట కుండల కటక కటిసూత్ర హార కేయూర నూపురాద్యంగ భూషణాలు ధరించి శంఖ చక్ర గదా పద్మ కౌస్తుభ వనమాలా పరిష్కృతుడై తేజరిల్లుతున్న దివ్యరూపంతో అతని యజ్ఞవాటియందు సన్నిధి కావించాడు.

## ఋత్విజుల పరమేశ్వరస్తవం

ఆ పరమేశ్వరుని కాంచినంతనే అక్కడున్న ఋత్విక్సదస్యయజమానుల అంతరంగాలు పెన్నిధిని గన్న పేద మనుస్సు వలె ఉప్పొంగాయి. వారు భక్తివినమ్రులై ఆ దేవదేవుని యథావిధి అర్చించారు. ఋత్విజులు కేలుమోడ్చి "పూజ్యాతిపూజ్యా! పరిపూర్ణుడవు కాబట్టి నీకు సమర్పింపదగిన పదార్థమేదీ లేదు. అయినా నీ భృత్యులము మేము భక్తిపుష్పాన్ని సమర్పిస్తున్నాము. ఇంతకు మించి ఏమీ చేయలేని అశక్తులము. మా పూజలను అంగీకరించు. స్వామీ! పదార్థరూపపూజలను కాకుంటే వాగ్రూపపూజనైనా చేయరాదా? అని నవ్వుతావేమో? నిన్ను వాక్కు చేత పూజించాలంటే నీ దివ్యస్వరూప గుణక్రియలు తెలియాలి. అవి మేమెరుగము. ఇక నిన్ను ఏ విధంగా ఉగ్గడింపగలము? నీకు "నమో నమః" అనడం కంటె ఉత్తమమార్గాన్ని సాధువులెవరూ ఉపదేశింపరైరి. నీ రూపాదులు వారికి కూడ దుర్విజ్ఞేయం కావడమే అందుకు కారణం. నీ రూపమైన విశ్వం కన్నుల యెదుట స్పష్టంగా కనుపిస్తుండగా దుర్విజ్ఞేయమని చెప్పడం సమంజసమేనా? అంటే దృశ్యప్రపంచమంతా ప్రకృతిగుణవ్యతికరం మాత్రమే. ప్రపంచమందు మనస్సు లగ్నం చేసినవారికి వట్టి నామరూపాదులు స్ఫురిస్తాయే గాని అంతకు మించి లభించేదేమీ ఉండదు. ఈ నామరూపాదులు ప్రకృతి విలాసాలు. మరి నీవో? ప్రకృతిపురుషులకు పరుడవు, నామరూపాలకు అతీతుడవు. స్తుతులన్నీ నామరూప ఆకారాలకు ఆస్పదాలు. ఆ మూడింటికీ అతీతుడైన నిన్ను ఆ మూడిటి చేత పరిగణించటం సాధ్యమవుతుందా? ఇక మా బోంట్ల చేతనైనది ఒక్కటే. ఏ నీ గుణాలు సకలజీవకోటి పాపనిర్మూలన మంత్రాలో ఆ నీ గుణాలను నోరారా కొనియాడగలము. అదీ సమగ్రంగా చేయగలమా? అంటే చేయలేమని నీకు తెలుసు. నీ గుణోత్కరంలో లవలేశమాత్రం పలుక గలిగితే ఆ మాత్రానికి అసాధ్యాన్ని సాధించామనే అనుకోవాలి. అవాఙ్మనసగోచరుడ వైన నీవు భక్తులకు సుఖారాధ్యుడవు. భక్తులైనవారు అనురాగపూర్వకంగా ఏమి పలికినా సంతోషిస్తావు. ఏమి ఇచ్చినా పరిగ్రహిస్తావు. నీ కిచ్చినది

తులసీదళమే కావచ్చు; దూర్వాంకురం కావచ్చు; గరిటెడు నీరు కావచ్చు. ఆ ఇచ్చేది అనురాగపూర్వకంగా ఇస్తే నీకు ప్రీతిపాత్రమవుతుంది. భక్తి ఒక్కటే ప్రధానం గాని పదార్థాలు ప్రధానం కాదు.

స్వామీ! అవాప్తకాముడవైన నీకు ఇవ్వదగినదేమీ లేకపోయినా నీ స్వరూపములైన పురుషార్థాలను కోరి నిన్ను భజిస్తారు. ఆ పక్షాన బహ్వంగపూర్వకము లైన ఈ యజ్ఞాదిరూపక భజనలు మాత్రం దేనికంటే ఇవన్నీ నీ ఆరాధకుల భావనావిశేషాలు. అంతే కాని వీటి కోసం నువ్వు ఆశపడతావని కాదు. యజ్ఞాది పూజలను అభిలషింపకపోతే ఇప్పుడిక్కడికి రానుగదా? అని అంటే, దేవా! ఏది మాకు నిజంగా హితమో గ్రహింపజాలని బాలిశులమై నీ ప్రేమను చూరగొనటానికి యజ్ఞం ఒక సాధనమని భావించి అందుకు పూనుకొన్నాము. ఈ యజ్ఞం కూడా నీ మహిమమే గాని వేరొకటి కాదని మాకు తెలియ జెప్పేందుకు నీవిక్కడికి వచ్చావు. అంతే కాని పూజ నపేక్షించి వచ్చినవాడవు కావు. నీవు పరమ వరదుడవు; ఎవరు ఏ భావంతో నిన్ను ఆశ్రయిస్తే వారికి ఆ భావజాలాన్ని సమకూర్చటం నీకు వ్రతమై ఉన్నది. నిన్ను సందర్శింపగోరి ఈ యజ్ఞరూపాన నిన్ను ఆరాధించాము. ఇది నిమిత్తంగా గ్రహించి మాకు దర్శనమిచ్చావు. ఈ మహానుగ్రహానికి పాత్రులము కానోచిన మా భాగ్యం మాకే అచ్చెరువు గొలుపుతున్నది.

దయానిధీ! సర్వసంగపరిత్యాగపూర్వకంగా తీవ్రజ్ఞానాలంబులై నిఖిలకలుషాలను బాసి నీ స్వభావులైన ఆత్మారాములకు కూడా నీ గుణకథనం పరమమంగళ మనగా చంచలత్వాది విక్షేపరూప దురవస్థలకు పుట్టినిళ్ళ వంటి మా బోటి బాలిశులకు నీ స్మరణ గుణకథనాదు లెంత ఆవశ్యకాలో చెప్పతరమా? శ్రీమంతములైన నీ చరణారవిందాలను స్మరించటమూ, నీ గుణనామాలను కీర్తించటమూ సామాన్యస్థితి యందే గాక జ్వరమరణ్యాద్యవస్థలలో సైతం మాకు చేకూరే భాగ్యాన్ని ప్రసాదించు. ఇదే మేము కోరుకొనే పరమ వరం.

దేవా! సంతానవంతుడే పురుషార్థవంతుడని ఈ రాజర్షి భావించి అపత్యకాముడై నీ వంటి సుతుని కోరి ఈ యజ్ఞరూపాన నిన్ను ఆరాధించాడు. స్వర్గాపవర్గాలనే కాక సమస్తపురుషార్థాలను ప్రసాదింపగల నిన్ను ఈ చిన్ని కోరిక అడగటమంటే దరిద్రుడు మహారాజును చేరి ఒక గడ్డిపోచను ఇమ్మనటం వంటిదవుతుంది. ఈ విధంగా కోరడానికి కారణం ఏమిటి? సంసారి భావం. ఈ సంసారి భావం ఎందుకు కలిగింది? ప్రకృతి ఆవరించినప్పుడు ఇటువంటి భావం కలుగుతున్నది. ఇది తొలగే మార్గం ఏమిటి? పెద్దలను ఉపాసించాలి. అప్పుడు నీ మాయాతత్త్వం గోచరిస్తుంది. దానివల్ల నీ మాయకు లోను కావటమూ, మాయావృతుడై విషయవిషానికి లోబడటమూ, తత్ఫలంగా ప్రకృత్యావరణంలో పతనమందటం – ఇవన్నీ తప్పుతాయి.

స్వామీ! ఈ రాజుకు తోడ్పడి ఈ యజ్ఞంలో మంత్రమూలకంగా నిన్నిక్కడికి ఆహ్వానించి గొప్ప తప్పుచేశాము. మా అపరాధాన్ని సైరించి మమ్ము కాపాడు" అని ప్రస్తుతించారు. నాభి కూడా సాష్టాంగనమస్కారం చేశాడు.

భగవానుడు వారి ప్రస్తుతుల నాలకించి నాభి సాష్టాంగనమస్కారాన్ని అంగీకరించి, 'యాజ్ఞికులారా! నా వంటి సుతుడు ఈ రాజన్యునికి కలగాలని వరమడిగారు. మీరు కోరిన వరం అత్యంత దుర్లభం. అద్వితీయుడ నైన నాకు నేనే సాటినవుతాను గాని మరొకరు సాటి రారు. మీరు బ్రహ్మజ్ఞులు; మీ వచనాలు రిత్త కాకూడదు. నాకు సాటి లేనందువల్ల నేనే నా అంశతో ఈ మేరుదేవి యందు అవతరిస్తాను' అని పలికి, అంతర్హితు డయ్యాడు.

## ఋషభావతారం

రాజేంద్రా! మేరుదేవి కొన్నాళ్ళకు గర్భవతియై ఒక కొడుకును కన్నది. ఆ బాలుడు వజ్రాంకుశాది సర్వశుభ లక్షణలక్షిత పాదాద్యవయవాలు కలిగి శమదమవైరాగ్య మహైశ్వర్యవిభూతులతో వెలుగొంది పుట్టుక మొదలుకొని సర్వభూతసమదృష్టి నెరపసాగాడు. ఆ బాలుని తేజోబలాలను సంపత్కీర్తులను ప్రభావోత్సాహాలను అతని తండ్రి గ్రహించి, 'ఋషభు'డని అతనికి పేరు పెట్టాడు. అతని గుణవిశేషాలకు బ్రాహ్మణులే గాక ప్రజలందరూ

మహానందాన్ని పొంది అతనిపై ఎంతో కూర్మి నింపి రాజ్యపాలనకు సమర్థుడని ఏకగ్రీవంగా అన్నారు.

## నాభి సమాధియోగం

ఋషభుడు యుక్తవయస్కుడైనంతనే అతనికి రాజ్యాభిషేకం కావించి నాభి భార్యాద్వితీయుడై బదరికాశ్రమానికి వెళ్ళి అక్కడ నరనారాయణ రూపంలో వెలసి ఉన్న వాసుదేవుని సమాధి యోగ పూర్వకంగా ఉపాసించి కృతార్థుడయ్యాడు. ఋషభుడు రాజ్యాభిషిక్తుడు కాగానే అతని రాజ్యానికి 'అజనాభ వర్షం' అని పేరు పెట్టారు.

## ఋషభుని ఆశ్రమ ధర్మానుష్ఠానం

రాజా! అజనాభవర్షమంతా కర్మక్షేత్రం. కర్మమంటే అర్థం ధర్మమనే. ప్రజలు వర్ణాశ్రమోచిత కర్మలను నిర్వర్తించటమే వారికి విహిత ధర్మం. 'యథా రాజా తథా ప్రజా' అంటారు కదా. రాజులను అనుసరించే ప్రజల నడవడి ఉంటుంది. ఋషభదేవుడు భగవత్కళావతారు డైనప్పటికీ ప్రజలకు స్వధర్మానుష్ఠానమార్గాన్ని చూపేందుకు గురుకులవాసం కావించి విద్యలను అభ్యసించి గురుదక్షిణ లర్పించి, మొదటి ఆశ్రమధర్మాన్ని యథాక్రమంగా అనుసరించాడు. రెండవ ఆశ్రమధర్మానికి సమయం వచ్చింది.

## ఋషభుని ద్వితీయాశ్రమం

ఋషభు డంతట ఇంద్రదత్త అయిన జయంతిని పెండ్లాడి గృహస్థాశ్రమాన్ని స్వీకరించాడు. ఆ దంపతులకు నూర్గురు కొడుకులు జన్మించారు. వారిలో భరతుడు పెద్దవాడు. తక్కిన తొంభైతొమ్మిది మందిలో కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, ఇంద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు – అని తొమ్మిదిమంది ప్రధానులయ్యారు. వారి తర్వాతి వారైన కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రమీళుడు,

చమసుడు, కరభాజనుడు – అనే తొమ్మిదిమంది భాగవతధర్మరహస్యాలను గ్రహించి పరమభాగవతు లయ్యారు. తక్కినవారు తండ్రి ఆజ్ఞను జవదాటక వినయమతులై శ్రుతివచనాలను ఆదరిస్తూ యజ్ఞాలు చేస్తూ కర్మశుద్ధిని పొంది బ్రాహ్మణు లయ్యారు.

రాజేంద్రా! భగవానుడు సర్వస్వతంత్రుడు, సర్వేశ్వరుడు, కేవలానందమూర్తిమంతుడు. అట్టివాడు ఋషభావతారం ఎత్తినప్పుడు అతని యందు భగవల్లక్షణాలన్నీ నిత్యసిద్ధములై ఉంటాయి కదా. అయితే లోకధర్మాన్ని స్వీకరించిన ఋషభుడు సామాన్యుని వలె కర్మములను చేపట్టి జనులు ఏయే కాలంలో ఏయే ధర్మాలను అనుష్ఠించాలో, ఏయే ఆచారాలను అనువర్తించాలో, గృహమేధి ఏ విధంగా శమము మైత్రి కరుణ మొదలైనవాటిని పాటించాలో, ధర్మార్థాలను రక్షించాలో, యశస్సును సంపాదించాలో, ప్రజారంజనం కావించాలో, మోక్షం ఎట్లా సంపాదించాలో, స్వయంగా ఆచరించి గృహధర్మనిరూపణకు లోకమార్గదర్శి అయ్యాడు. ఇదంతా ప్రజాశిక్షార్థమే కాని కర్మబంధక్రమం కాదు.

రాజా! భగవానుడు ధర్మస్వరూపుడు. సర్వధర్మ ప్రతిపాదకమైన వేదం ఆయన వలన లోకానికి వెల్లడయింది. అట్టి భగవదవతారమైన ఋషభుడు కూడా బ్రాహ్మణనిరూపితమార్గాన్ని తలదాల్చి ధర్మమార్గంలో ప్రజాశాసనం కావిస్తూ, దేశకాలద్రవ్యాలను ఏమరక వయశ్శ్రద్ధలను పాటిస్తూ, ఋత్విక్సంపత్తిని పెంపు చేస్తూ, నానాదేవతోద్దేశ పూర్వకంగా సమస్త యజ్ఞాలనూ ఒక్కొక్కటీ నూరేసిమార్లు యథావిధిగా నిర్వర్తించాడు. అతని రాజ్యకాలంలో ఎవరికీ ఎందులోనూ లోటన్నది లేక ప్రజలందరూ రాజంటే భక్తివాత్సల్యాలను వర్షింపసాగారు.

## ప్రజానాయకత్వ ధర్మం

రాజా! ప్రజానాయకత్వం కత్తిమీద సాము వంటిది. నాయకుడు తొక్కిన దారినే ప్రజలు నడుస్తారు. ఏ రాజ్యంలోనయినా మార్గదర్శి రాజు. రాజు

స్వధర్మాన్ని ఉపేక్షిస్తే జనులు దానినే అనుసరిస్తారు. దేశం అధర్మానికి ఆటపట్టవుతుంది. తత్ఫలంగా లెక్కలేనన్ని దుఃఖాలు దాపరిస్తాయి. కాబట్టి రాజులు ఎల్లప్పుడు జాగరూకులై నిలువెల్లా కన్నులుగా ప్రజాసౌఖ్యార్థం పాటుపడుతుండాలి.

## ఋషభుని ఉపదేశాలు

ఋషభుడు దేశసంచారం బయలుదేరి నానాదేశాలు దాటి కొన్నాళ్ళకు బ్రహ్మావర్తదేశానికి వచ్చాడు. అక్కడ బ్రహ్మర్షులు సభతీరి ఉన్నారు. ప్రజలు గుంపులు గుంపులుగా చేరారు. ఋషభుని పుత్రులూ వచ్చారు. తన కొడుకులు ప్రణయవినయాన్వితులు, పరమజాగరూకులు అని తెలిసినా ఋషభుడు వారిని నిమిత్తీకరించి ప్రజోపదేశార్థం ధర్మాలను తెలుపగోరి ఇలా అన్నాడు:

## మర్త్యశరీరం - ధర్మసాధన

'సుతులారా! విషయలాలస, దానిని అనుభవించే కోరిక ప్రాణికోటి అంతటికీ సామాన్యం. అందుకోసమే అయితే మనుష్యజన్మం ఎత్తనవసరం లేదు. శరీరాలన్నింటిలోకీ మర్త్యశరీరం ఉత్తమోత్తమం. ఆ శరీరం బహుజన్మకృత పుణ్యఫలంగా కలుగుతున్నది. అట్టిదాన్ని దానికి తగిన కార్యాలకు మాత్రమే వినియోగించాలి. అలాగు చేయటమే స్వధర్మానుష్ఠానం. అట్లా చేయకపోవటం ధర్మవ్యతిక్రమం. దానివల్ల పాతకం చుట్టుకొంటుంది.

మనుష్యశరీరానికి యోగ్యమైన కార్యమేమిటని అడిగితే భగవదారాధన మొక్కటే దానికి యోగ్యమైన కార్యం. దానినే తపస్సు అంటారు. తపఃఫలంగా చిత్తశుద్ధి కలుగుతుంది. శుద్ధచిత్తులకు బ్రహ్మసుఖం కలుగుతుంది. ఆ సుఖమే మోక్ష మనబడుతుంది.

## మోక్షము - మహాత్ముల సేవ

నాయనలారా! మోక్షప్రాప్తికి సాధనం ఏమిటని అడుగుతారేమో. మహాత్ముల సేవ ఒక్కటే అందుకు పరమసాధనం. మహాత్ములంటే ఎవరని

అడిగితే? సర్వభూతజాతం లోనూ ఉన్నది ఒక్క భగవంతుడే అన్న భావాన్ని అలవరించుకొని, సమస్తజీవకోటిని ఆత్మసమంగా చూసుకొంటూ, మిన్నులు మీద పడినా చలింపక, అపకారులకు కూడా ఉపకరిస్తూ, పరమేశ్వరుని యందు సుహృద్భావం ఉండటమే జన్మసాఫల్యమని నిశ్చయించుకొని, దేహం ధర్మానుష్ఠానం కోసమే తప్ప భోగార్థం కాదనే నిర్ణయం కలిగి, అయాచితంగా లభించినదానితో సంతుష్టిని పొంది దేహధారణమాత్రవ్రతులై పుత్రకళత్రాదులందలి మమకారాన్ని బాసి, గృహాదులు స్వధర్మానుష్ఠాన యోగ్యోపకరణలని భావించేవారు మహాత్ములు. అంటే అపరిచ్ఛిన్నాత్ములు మహాత్ములని తాత్పర్యం.

ఈ నియమాలను అనుసరించటం వల్ల ఫలమేమంటారా? ఇందు మూలాన అంతఃకరణ మలినాలన్నీ నశిస్తాయి. నిర్మలాంతఃకరణలో ఆత్మప్రకాశం యథారూపాన దీపిస్తుంది. ఆ దీప్తిఫలంగా జ్ఞానశక్తి విజృంభిస్తుంది. అందువల్ల యథార్థం అనుభూత మవుతుంది. అప్పుడు వారిలో ఒక అపూర్వమైన తేజస్సు కానవస్తుంది.

## ఉపదేశం

అట్టి మహాత్ములను సేవించినప్పుడు వారు అనుగ్రహించి ఉపదేశిస్తారు. ఆ ఉపదేశవాక్యం వారి తేజశ్శక్తితోపాటు శ్రవణరంధ్ర మార్గాన హృదయాంతరం లోనికి ప్రవేశించి, అక్కడ శేషించి ఉన్న సంశయాది మాలిన్యాలను పటాపంచలు చేస్తుంది. ఉపదిష్టునికి ఆత్మస్వరూపం యథాస్థితిని పొడచూపుతుంది. అది నిదానంగా అతను గురూపదేశం ప్రకారం వర్తించి, క్రమక్రమంగా సిద్ధి పొందుతాడు. సామాన్యుల ఉపదేశాలకు అంత తేజశ్శక్తి ఉండదు కాబట్టి, అవి ఒక చెవిదూరి మరొక చెవి గుండా బైట పడతాయే గాని అంతఃకరణను ప్రవేశింపవు. నీరు ఒకటే అయినా పాత్రశుద్ధిని బట్టి పూజ్యమవుతున్నట్లుగా, ఉపదేశం ఒకటే అయినా ఆ ఉపదేశకుని మాహాత్మ్యాన్ని బట్టి ఫలాన్నిస్తుంటుంది. అందువల్లనే ప్రతివారూ ఉపదేశకులు కాలేరు.

## శరీర ధారణం

పుత్రులారా! జీవులకు శరీరధారణ ప్రారబ్ధఫల భోగార్థమై జరుగుతున్నది. ఆ ఫలం శుభము అశుభము అని రెండు విధాలుగా ఉంటుంది. ఇంద్రియప్రీతి కలగటమే పరమార్థంగా భావించి అందుకు ధర్మాధర్మాలను లెక్క చేయక వర్తించటం వల్ల అశుభఫలం కలుగుతుంది. ఇంద్రియప్రీతికిలోనుగాక ధర్మదృష్టితో వర్తించటం వలన శుభఫలం కలుగుతుంది. అశుభఫలాన్ని పాపమని, శుభఫలాన్ని పుణ్యమని అంటారు. ఏది పరమపురుషార్థప్రాప్తికి అడ్డుపడుతుందో అది పాపం. ఏది మోక్షసాధనకు తోడ్పడుతుందో అది పుణ్యం. ఒక వంక పాపాన్ని అనుభవిస్తూ మళ్ళీ ఆ శరీరంతోనే అటువంటి పాపాలను చేస్తుంటారు. అంతకన్న అజ్ఞానులుండరు. అజ్ఞానమంటే ఏమిటని అడుగుతారేమో? నిజంగా తనకు ఏది మేలుచేస్తుందో తెలియకపోవటమే అజ్ఞానం. అంటే విపరీతజ్ఞానం అజ్ఞానమన్నమాట.

## అజ్ఞాన ఫలం

నాయనలారా! అజ్ఞానఫలం ఏమిటో తెలుసా? ప్రాణికోటి సర్వవేళల ఆనందానుభవార్థం ప్రాకులాడుతుంటుంది. ఆ ఆనందం శాశ్వతికమని, క్షణికమని రెండు విధాలు. క్షణికాలను విడిచిపెట్టి శాశ్వతాన్ని ఆశ్రయించటం నైజం. అట్టి శాశ్వతానందాన్ని కలిగించేది ఎటువంటిదో ముందుగా తెలుసుకోవాలి. అజ్ఞానం దానికి అడ్డునిలుస్తుంది. దానితో నిత్యానిత్యాలను ఎరుగలేక అజ్ఞానులు కనిపించినదాన్ని, వినిపించినదాన్ని ఆశ్రయిస్తారు. అంతటితో అది ముగిసినట్లు కాదు. అజ్ఞానులు తమ ఆనందప్రాప్తికై వివిధ కర్మలను ఆచరిస్తారు. ఆ కర్మలకు ఫలాలు ఉదయిస్తాయి. ఆ ఫలభోగార్థం మళ్ళీ మళ్ళీ శరీరధారణ చేయవలసివస్తుంది. ఇది ఒకనాటికి తీరే క్రమం కాదు. దీనినే అజ్ఞానఫలం అంటారు.

అజ్ఞానానికి కారణం ఏమిటి? సాధన లోపమే కారణం. కంటి అద్దం మాలిన్యవంత మైనపుడు వస్తువు యథారూపంలో అగుపింపకపోవడమే దీనికి నిదర్శనం.

## శరీర బంధమోచన మార్గం

పుత్రులారా! ఈ శరీరబంధం తొలగే మార్గం ఏమిటి? అంటే, చెబుతున్నాను. జీవరాశి కేవలం సుఖార్థం వర్తిల్లుతున్నదని, ఆ సుఖం పరము అపరము అని రెండు విధాలని, పరమసుఖం శాశ్వతం అని అపరసుఖం క్షణికం అని, క్షణికసుఖం ఇంద్రియానికి ఇంద్రియార్థాలతో సంబంధం కలిగినప్పుడు ప్రాప్తమవుతుందని, వివరించాను. ఇట్టి సంబంధాలలో స్త్రీ పురుష మైథున సంబంధం గాఢమైనదిగా ఉంటుంది. దీనివల్ల స్త్రీపురుషులకు హృదయబంధనం ఏర్పడుతున్నది. ఈ బంధనఫలంగా జనులకు గృహ క్షేత్ర పుత్ర కళత్ర ధన దేహాదుల యెడ 'నేను', 'నాది' అన్న భావం బలపడుతున్నది. దీనినే హృదయగ్రంథి అంటారు.

ఈ మైథునక్రియ యథోచితమై సుఖమాత్రానుభవం కాకూడదా? అప్పుడది తాపకరం అవుతుందనడంలో ఔచిత్యం ఏమున్నది? అని అడగవచ్చు. స్త్రీ జాతికి, పురుషజాతికి ఈ హృదయ గ్రంథులు వేర్వేరు రూపాలలో ఉంటాయి. అవి రెండూ కలిసినప్పుడు ఆ ముడి గట్టిపడి దుర్భేద్యంగా ఉంటుంది. ప్రతివ్యక్తికీ హృదయగ్రంథి తప్పనిసరిగా ఉంటుంది. అది అతని మనస్సులో తన దేహేంద్రియాదులందు మాత్రమే 'నేను' 'నాది' అనే మోహాన్ని కలిగిస్తుంది. స్త్రీ పురుషుల హృదయగ్రంథులు పెనగొన్నప్పుడు 'నేను' 'నాది' మొదలైన ప్రత్యేకభావాలు పోయి 'మేము' 'మాది' అని మారి, గృహధనాదిపరంపరను పుట్టించి వాటన్నింటినీ వదలలేని మోహాన్ని పెంచుతుంది. మోహం ఉన్నంతకాలం పరమసుఖం లభించదు. ఆ పరసుఖాన్నే ముక్తి అంటారు.

ఈ బంధాలను ఉపాయమూలకంగా విడదీసుకోవాలి. ఉపాయానికే సాధనమని నామాంతరం ఉన్నది. బంధవిమోచనానికి ఇరవైఅయిదు సాధనాలు ఉన్నాయి. ఆ సాధనాలను వివరిస్తాను వినండి.

## పంచవింశతి సాధనాలు

**హంసే గురౌ మయి భక్త్యానువృత్త్యా వితృష్ణయా ద్వన్ద్వతితిక్షయా చ**
**సర్వత్ర జన్తోర్వ్యసనావగత్యా జిజ్ఞాసయా తపసే హానివృత్త్యా.**

**మత్కర్మభి ర్మత్కథయా చ నిత్యం మదేవసఙ్గా ద్గుణకీర్తనాన్మే**
**నిర్వైరసామ్యోపశమేన పుత్రా జిహాసయా దేహగేహాత్మ బుద్ధేః.**

**అధ్యాత్మయోగేన వివిక్తసేవయా ప్రాణేన్ద్రియాత్మాభిజయేన సధ్య్రక్**
**సచ్ఛ్రద్ధయా బ్రహ్మచర్యేణ శశ్వదసమ్ప్రమాదేన యమేన వాచామ్.**

**సర్వత్ర మద్భావవిచక్షణేన జ్ఞానేన విజ్ఞానవిరాజితేన**
**యోగేన ధృత్యుద్యమసత్త్వయుక్తో లిఙ్గం వ్యపోహేత్కుశలోఽ హమాఖ్యమ్.**

**కర్మాశయం హృదయగ్రన్థిబన్ధ మవిద్యయా సాదిత మప్రమత్తః**
**అనేన యోగేన యథోపదేశం సమ్యగ్వ్యపోహ్యోపరమేత యోగాత్.**

భగవంతుడనైన నాయందు భక్తి చేయటం, భగవత్పరమై ఉండటం, తృష్ణ లేకుండటం, సుఖదుఃఖాది ద్వంద్వాలను అప్రతీకారబుద్ధితో సహించటం, ఐహికములవలెనే ఆముష్మికాలు కూడా దుఃఖపూరితాలే అన్న నిశ్చయాన్ని కలిగి ఉండటం, పరమార్థ తత్త్వమేమిటి? అని విచారించటం, మనస్సు ఏకాగ్రం కావాలని తపస్సు చేయటం, కామకర్మలను విడిచివేయటం, స్వధర్మాలన్నింటినీ భగవంతుని కొరకు దృఢనిశ్చయంతో నిర్వర్తించటం, భగవత్కథలను వినటం, ప్రజలందరికీ వినిపించటం, భగవద్భక్తులతో నివసించటం. భగవద్గుణాలను కీర్తించటం, ఏ ప్రాణి యందూ వైరభావం లేకుండటం, జీవరాశి సంతతినీ ఆత్మసమంగా చూడటం, ఉపశాంతిని పొందటం, దేహగేహాదులందు 'నేను' 'నాది' అని భావింపకపోవటం, ఆత్మబోధక శాస్త్రాలను చదివి అందులోని భావాన్ని అభ్యసించటం, అభ్యాసకాలంలో మనస్సుకు విక్షేపం కలుగని తీరున నిర్జన ప్రదేశంలో నివసించటం, ఇంద్రియ మనః ప్రాణాలను జయించి స్వాధీనపరచుకోవటం, సాధువుల యెడ శ్రద్ధ చూపటం, బ్రహ్మచర్యవ్రతాన్ని ఆచరించటం, కర్తవ్య

మైనదానిని తప్పించుకొనక యథాయోగ్యంగా నిర్వహించటం, మితభాషిత్వం, భగవానుడు సర్వవ్యాపకుడన్న జ్ఞానాన్ని అనుభవసిద్ధం చేసుకొనటం, బుద్ధిని భగవంతునందే సమాధి చేయటం – ఇవి పంచవింశతి సాధనాలు.

ఈ సాధనాలను సాధించినవాడు ధైర్యప్రయత్న వివేకయుక్తుడై తనలో ఉన్న అహంకారరూపమైన ఉపాధిని నిరసింపగల సమర్థుడవుతాడు. ఏతత్ఫలంగా అవిద్య వల్ల ఏర్పడిన కర్మాశయమైన హృదయగ్రంథి తనంత తానుగా విడిపోతుంది. అటుతర్వాత అతను సాధింపవలసిన సాధనాలు ఇంకేమీ ఉండవు.

## లోకప్రబోధ ఫలం

పుత్త్రులారా! ఈ లోకం తత్త్వజ్ఞానవిమూఢు లైన ప్రజానీకాలతో నిండి ఉన్నది. ఆ ప్రజలకు నేను చెప్పిన అర్థాన్ని ఉపదేశించి వారిని సన్మార్గానికి మళ్ళించాలి. అంతే కాని మళ్ళీ వారిని కర్మారంభానికి పురికొలిపి అధోగతికి లాగకూడదు. మూఢులకు ఉపదేశం చేస్తే ఫలితం ఉంటుందా? అని వెనుకాడవద్దు. తప్పక ఉంటుంది. అయితే మూఢులకు ఉపదేశించటం ఎట్లాగంటారేమో? తండ్రులు కొడుకులకు, గురువులు శిష్యులకు, రాజులు ప్రజలకు బోధించాలి. ఆ బోధ క్రమక్రమంగా విస్తరించి లోకమంతటా వ్యాపిస్తుంది. తత్ఫలంగా లోకోద్ధారక మవుతుంది. ఆ ఉపదేశించిన వారూ భగవదనుగ్రహపాత్రు లవుతారు.

## భక్తి – అనుష్ఠానం

సుతులారా! ఈ భక్తిమార్గాన్ని సంసార మగ్నునికి ఉపదేశించట మంటే గుడ్డివాడిని మంచి త్రోవకు నడిపించటం వంటిది. ఆ విధంగా చేయని గురువు గురువు కాడు; తండ్రి తండ్రి కాడు; తల్లి తల్లి కాదు.

పుత్త్రులారా! నన్ను ప్రాకృతుని వలె తలపోయవద్దు. నా యీ మనుష్యాకారశరీరం నా ఇచ్ఛావిలసితమే తప్ప ప్రాకృతులకు వలె కర్మఫలాధీనం కాదు. నా హృదయం శుద్ధసత్త్వాత్మకం. అధర్మం నా

దరిదాపులకైనా రాజాలదు. అందువల్ల నన్ను ఋషభుడని అంటారు. నాకు మీరు జన్మించారు కనుక మీరందరూ నాకు సమానులే అవుతారు. నా పలుకులు రాగద్వేషరహితాలు కాబట్టి మీరు తలదాల్పగలరు. భరతుడు మీ అందరిలోనూ పెద్దవాడు. మీరందరూ నిర్మత్సర బుద్ధితో అతనిని శుశ్రూషించండి. తత్ఫలంగా నన్ను సేవించటమూ, ప్రజలకు సాధుమార్గం చూపి వారిని పరిపాలించడమూ రెండూ నెరవేరగలవు.

## భూతముల తరగతులు

నాయనలారా! ఈ సృష్టి సమస్తం చేతనాచేతన భూతజాలంతో కూడి ఉన్నది. వీటిలో చేతనములు అచేతనాల కంటె ఉత్తమమైనవి. చేతనాలలో స్థావరములు, జంగములు అని రెండు విధాలున్నాయి. లతావృక్షాదులు స్థావరాలు. చలిచీమ మొదలు బ్రహ్మపర్యంతం జంగమాలు.

స్థావరములు అంటే పుట్టిన చోటనే కదలక ఉండేవి అని అర్థం. ఒకచోటి నుంచి వేరొక చోటికి పోగలిగినవి జంగమాలు.

ఈ చేతనాలలో లతాదుల కన్న పిపీలికాదులు, వాటి కంటె పశుపక్ష్యాదులు, వాటి కంటె మనుష్యులు, వారి కన్న ప్రమథాదులు, అంత కంటె గంధర్వులు, వారిని మించి సిద్ధులు, అంత కన్న కిన్నరులు, వారి కన్న అసురులు, వారి కంటె అమరులు, వారి కంటె ఇంద్రుడు, ఇంద్రుని కంటె దక్షాది బ్రాహ్మపుత్రులు, వారి కంటె భవుడు, అతని కంటె బ్రహ్మ ఉత్తమోత్తములు. జ్ఞానాధిక్యాన్ని బట్టి ఈ తారతమ్యం కలుగుతున్నది. నేను సర్వోత్తముడనై ఉన్నాను. ఎందుకంటే నేను పరమజ్ఞానపూర్ణుడను. సృష్టిలో వెలసిన చేతనాచేతనములన్నీ నా అంశలు; అంశాంశలు.

## ఉత్తమ పూజనీయులు

పుత్రులారా! నేను సర్వోత్తమత్వం వలన పరమపూజనీయుడనే అయినప్పటికీ నాకు మాత్రం బ్రాహ్మణులు సర్వవిధాల పూజనీయులు. వారికి

సాటి రాగలవారు వేరొకరు లేరు. బ్రాహ్మణుడు శ్రద్ధతో ఇచ్చిన అన్నం నాకెంతో తృప్తి గొలుపుతుంది. యజ్ఞాలు చేసి అగ్ని ముఖాన నా కోసం ఘృతాదులను వేల్చుతారు కాని అవి బ్రాహ్మణులు ఇచ్చిన నైవేద్యం వలె తృప్తికరాలు కావు.

## బ్రాహ్మణాధికతకు కారణం

బ్రాహ్మణులను గురించి ఇంతగా ఎందుకు చెబుతున్నానంటే – వేదం నాకు శరీరం వంటిది. ఆ శరీరాన్ని బ్రాహ్మణులు భరిస్తారు. అంతే కాదు. వారికి నేను తప్ప మరొకటి ప్రార్థనీయం కాదు. సత్త్వము, శమము, దమము, సత్యము, అనుగ్రహము, తపస్సు, తితిక్ష, అనుభవం అనే ఎనిమిదింటికి వారు స్థానభూతులై నిరంతరం నా యందలి భక్తిభావంతో నిండి ఉంటారు. వారికి రాజాధిరాజు వచ్చి ప్రార్థించినా స్వీకరింపదగిన వస్తువంటూ ఉండదు. పైగా వారి వల్ల లోకోపకారం జరుగుతుంటుంది. ఈ కారణాల మూలాన బ్రాహ్మణులు అగ్రగణ్యులని అన్నాను. అట్టి బ్రాహ్మణులను మీరు ఎల్లవేళలా ఆరాధించాలి. బ్రాహ్మణారాధనం భగవంతుడ నైన నన్ను ఆరాధించడం వంటిదే.

## ఉత్తమపూజా విధానం

వత్సలారా! ఉత్తమపూజ అంటే నిరాకారు డైన భగవంతునికి కావించే సమర్చనం. సృష్టిలోని సమస్తభూతజాతం భగవదధిష్ఠానమై ఉన్నది. అట్టి జంగమాజంగమ భూతాలను నిర్మత్సరబుద్ధితో సంభావించడమే భగవత్పూజ. మరొక విశేషం. సర్వ వ్యాపారాలు మనోవాఙ్మయాదులైన ఇంద్రియాల మూలకంగా జరుగుతుంటాయి. ఆ వ్యాపృతులన్నింటినీ నాకు పరమైనట్లుగా భావించి వాటి ఫలాన్ని నాకు సమర్పిస్తుండాలి. ఆ విధంగా చేయకపోతే కాలపాశ కారణమైన విమోహం మిగిలి ఉంటుంది.

భగవద్ధ్యాన విధానంలో అనేకరీతు లున్నాయి. భగవంతుడు నిరాకారుడని భావించి కొందరు ధ్యానధారణకు ఉపక్రమిస్తారు.

## పరమహంస ధర్మాలు

పరీక్షిన్నరేంద్రా! ఆ విధంగా ఋషభుడు రాజభక్తిని, బ్రాహ్మణసేవను ప్రజలకు ఇహపర కళ్యాణార్థం బోధించి భరతునికి రాజ్యాన్ని అప్పగించి మునులకు పరమహంసధర్మాన్ని బోధింపదలిచాడు. పుత్రులను చేరబిలిచి, 'ముని అయినవాడు పరమోపశముడై కర్మలను త్యజించాలి. కర్మములను విడిచినా వాటియందు అభిమానం ఏ కొంచెమో మిగిలి ఉండక తప్పదు. అది కూడా నశిస్తేనే కాని పరమహంసుడు కాలేడు' అని వివరించాడు.

## అవధూత పదం

రాజా! ఋషభుడు ఆ విధంగా పలికి కొడుకులను ఆ మార్గం తానే నడిచి చూపాలని నిశ్చయించాడు. భార్యాపుత్రగృహాదులను విడనాడి, అగ్నులను ఆత్మారోపణ మొనర్చి, బ్రహ్మావర్తాన్ని వదిలి కాలు లాగిన చోటికి అగమ్యంగా తిరగటం మొదలుపెట్టాడు. ఎవరు పిలిచినా పలకడు; ఎవరేమన్నా ఉలకడు. కౌపీన మాత్రమైనా లేకుండా అతను విరియబారిన వెంట్రుకలతో ఊళ్ళు పల్లెలు ఆకరాలు అగడ్తలు పుష్పారామాలు శిబిరాలు గోవ్రజాలు మందభూములు బిడారులు గిరివనాశ్రమాలలో తిరగటం మొదలుపెట్టాడు. తాను సంచరిస్తున్న ప్రదేశం ఏమిటో, అక్కడి విశేషాలేమిటో తెలుసుకోవాలన్న కుతూహలం అతనికి లేదు. అతని ఉనికి చూసి చెవిటివాడని కొందరు, మూగ అని కొందరు, అంధుడని కొందరు, పిచ్చివాడని కొందరు, పిశాచగ్రస్తుడని కొందరు తలకొక్క మాటగా చెప్పుకొనసాగారు. అతని మార్గమధ్యంలో కొందరు మూఢులు చేరి ఒకచోట అతనిని అదిలించారు; ఒకచోట మీద పడి చావ బాదారు; ఒకచోట ఉమ్మివేశారు; ఒకచోట మూత్రాదులు చల్లారు; ఒకచోట రాళ్ళు రువ్వారు; ఒకచోట నానాబాధలు పెట్టారు. ఆ విధంగా మూఢులు పరిపరి విధాల పరాభవించినా ఋషభునికి చీమకుట్టినట్లయినా తెలియరాలేదు. ఎట్టి దురవస్థలోనూ అతనికి మనశ్చాంచల్యం కలుగలేదు. అందుకు నిదర్శనగా అతని ముఖమండలం నిరంతర దరహాస మనోజ్ఞమై తేజరిల్లసాగింది.

రాజా! ఋషభు డొకప్పుడు స్మశాన భూమిలో పడుకుంటాడు; ఒకప్పుడు ధూళిలో పొర్లాడుతాడు. ఒకప్పుడు కొండచిలువ లాగా కదలక మెదలక రోజుల తరబడి పడి ఉంటాడు; మూత్రపురీషాలను విసర్జించి అందులోనే పడుకొంటాడు. అతని పురీషం నుంచి సువాసనలు లేచి దవ్వులకు వీస్తుంటాయి. ఎవరేది నోటబెట్టినా దానిని మ్రింగివేస్తాడు. అతని చర్యలన్నీ కాక మృగ గవాదుల చర్యలను మరపింపసాగాయి. స్నానాదులు లేకపోయినా అతని శరీరం దివ్యతేజోమండలమై వెలుగొందుతూ ప్రజాదృష్టిని ఆకర్షింపసాగింది.

రాజా! ఇట్టి నడతల భావం ఏమిటని అడుగుతావేమో? వాసుదేవుని యెడ ఆత్మతాదాత్మ్యం చేసినవారికి భేదభావం లేశమాత్రమూ ఉండదు. భేదబుద్ధి నశించినవారికి సర్వం భగవదాత్మకమై ఉంటుంది. అటువంటివారు నిత్యపరిపూర్ణులు కాబట్టి ఆత్మారాములై ఉంటారు. అణిమాదిసిద్ధులు వారిని ఆశ్రయించుకొని ఉంటాయి. అంత మహిమోపేతులైనా వారు మాత్రం ఆ సిద్ధులను లోలోన కూడా తలచుకోరు.

## ఆత్మారాములకు యోగైశ్వర్యాల వైముఖ్యం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకయోగి మాటలను విని, 'మహాత్మా! ఆత్మారాములందు జ్ఞానాన్ని యోగబలసముద్దీపితమై కర్మబీజాలను దగ్ధమొనర్చి ఉంటుంది. అట్టివారు ఏమిచేసినా ఫలకాంక్ష లేనందువల్ల పునర్జన్మాంకురాలైన కర్మబీజాలు మొలవనేరవు కదా! వారికి యోగైశ్వర్యాల వైముఖ్యం దేనికి? వాటిని ఎందుకు త్యజించాలి?' అని అడిగాడు. శుకుడు వివరించాడు.

'రాజా! చక్కటి ప్రశ్న అడిగావు. కిరాతుని స్వభావం తెలిసిన మృగాలు అతను నిజంగా చచ్చి నేలపై పడి ఉన్నప్పటికీ అతని పాటు నిజమని నమ్మవు. అతని దరిదాపులకు పొరపాటున కూడా వెళ్ళవు. అలాగే మనస్సు వాంఛారహితమై మృతప్రాయంగా ఉన్నదని దానిని విశ్వసించడం గాని,

అజాగ్రతతో ఉండటం గాని తగదు. మనస్సుకు చంచలత్వం నైజం. అందువల్ల అది ఒకచోట నిలబడక కామాలను పెంపొందిస్తూ కామార్థాల వెంటబడి పరుగిడుతుంటుంది. కామాన్ని అంటిపెట్టుకొని క్రోధాదులు ఉంటాయి. అటువంటి మనస్సుతో చెలిమి చేయటం యోగికి జారుని భార్యతో పొందు చేకూరినట్లవుతుంది. జారవనిత తన కోరిక తీరేందుకు అవసరమైతే భర్త ప్రాణాలనైనా కుదువపెట్టినట్లు, మనస్సు దాని కోరిక నెరవేరిన దాకా ఎంతటి పనికయినా పురికొలుపుతుంది.

మనశ్చాంచల్య శక్తికి నిదర్శనం చెప్పనా? సౌభరి ప్రముఖుల నెందరినో చెప్పవచ్చు. వారు మహాతపోవంతులైనా, శ్రీమహావిష్ణువు యొక్క మోహినీ రూపం కనబడగానే బహుకాలార్జితమైన తపశ్శక్తిని కూడా కోల్పోయి భ్రష్టులయ్యారు. వారు వారి మనస్సును నమ్మడం వల్లనే ఆ విధంగా జరిగింది. చాంచల్యం మనస్స్వభావం కనుక, స్వభావం అవకాశం వచ్చినప్పుడు విజృంభింపక మానదు కనుక, అది తన అధీనమని ఎవ్వరు గాని ఎప్పుడు గాని తలచి పరాకు చెందకూడదు. ఈ సంగతిని పెద్దలెంతోమంది స్వానుభవ పూర్వకంగా పలికారు. కాబట్టి మనస్సు విషయమై ఇంత మాత్రపు జాగ్రత్త చాలునని చెప్పటం సాధ్యం కాదు. ఎప్పుడూ దానినొక కంట కనిపెడుతూనే ఉండాలి. ఒక్క క్షణం కనురెప్ప పాటు కాలం పరాకు చెందినా మనస్సు తలయెత్తి కామ క్రోధ మద లోభ శోక మోహ భయాదులకు అప్పగించి వేస్తుంది. తత్ఫలంగా కర్మబంధం తగులుకొంటుంది.

## ముక్తి – దేహాభిమానాభాసం

రాజా! ఋషభుడు భగవంతుడై కూడా తన ప్రభావాన్ని మరుగుపుచ్చి లోకోపకారార్థం అవధూతత్వాన్ని గ్రహించి జడుని వలె కనబడుతూ, తానున్న ఆశ్రమతత్త్వాన్ని, అంటే సర్వవిషయానువృత్తి త్యాగం, ఆత్మ పరమాత్మల అభేదదర్శనం, అవ్యవహితుడు కావటం, దేహాభిమానాన్ని త్యజించటం మొదలైన లక్షణాలను ప్రకటించాడు.

రాజా! అభేదవృత్తి వలన ఆధారాధేయభావం నశిస్తుంది. అవ్యవహితత్వం వలన ఉపాసనాబుద్ధికి అవకాశం తొలగిపోతుంది. మనోనిగ్రహబలం వలన దేహాభిమానం వీడిపోతుంది.

దేహాభిమానం నశించినప్పుడు దేహపతనం కాదా? అని అడుగుతావేమో. ఏదో ఒక సంస్కారకారణం వల్ల దేహాభిమానం భాసమాత్రం శేషించి ఉంటుంది. ఆ దేహాభిమానం వల్ల దేహం కుమ్మరి చక్రం వలె చరిస్తుంటుంది. ఆ అభిమానాభాసం అవిద్యా వాసన వలన జనించినది కాదు కనుక, పైగా అది యోగమాయావాసనాత్మకం కనుక, భాసమాత్రమైన ఆ అభిమానం భుక్తమైనవెంటనే దేహపతనం కలుగుతుంది. అట్టివారు జీవన్ముక్తులవుతారు.

## అగ్నిప్రమాదం

రాజా! ఋషభుడు ఆ విధంగా యోగమాయావాసన చేత కాందిశీకుడై కొంకణ కుటకాది దక్షిణ కర్ణాటదేశాలు తిరిగి కుటక గిరివనం చేరి నోట పాషాణకబళం ఉంచుకొని అటూ యిటూ సంచరింపసాగాడు.

కుటకగిరివనంలో వెదురుపొదలు మెండు. ఆ పొదలు గాలివేగానికి ఒకదానినొకటి తాకి ఆ రాపిడికి నిప్పు రగులుకొన్నది. చూస్తూ ఉండగానే మంటలు ఆకాశానికి లేచాయి.

ఆ సమయంలో ఋషభుడు పొదల నడుమ చిక్కుకొన్నందున అతని దేహం కూడా ఆ మంటలలో కాలి బూడిదైపోయింది. అతనికి బహిర్భావం నశించినందువల్ల వెదురు పొదలు మండటం మొదలైన సంగతే అసలు తెలియరాలేదు.

## కలియుగ ప్రథమబీజం : పాషండ మతప్రచారం

రాజేంద్రా! అవధూతవర్తనం నాలుగు ఆశ్రమధర్మాలకూ అతీతమైనది. ఋషభుడు లోకకల్యాణార్థం అవధూతవేషాన్ని స్వీకరించి తదనుగుణంగా నడుచుకొన్నాడు. ఆ మహాత్ముడు దక్షిణకర్ణాటాది దేశాలకు వెళ్ళినప్పుడు అక్కడి జనులు అతని వేషాన్ని చూడటం, అతని మాటలను వినటం జరిగింది.

కలియుగారంభం నుంచి అర్హతుడనే రాజు ఆ దేశానికి పాలకుడు. అతనికి ప్రజలు అవధూతవేషాన్ని గురించి చెబుతారు. అతను ఆ మహానుభావుని పరమార్థవృత్తిని గ్రహింపలేకపోయినా, బాహ్యలక్షణాలను మెచ్చుకొని, వాటిని తాను అవలంబించడమే కాక ప్రజల చేత కూడా అనుసరింపజేస్తాడు. ఆ కార్యం పులిని చూసి నక్క వాతలు పెట్టుకొన్నట్లవుతుంది. కాలక్రమేణా అర్హత ధర్మానికి లోకంలో వ్యాప్తి పెరుగుతుంది. శౌచాదులు హేయములుగా పరిగణింపబడతాయి. దేవహేళనలైన అపవ్రతాల పట్ల అభిరుచి కలుగుతుంది. ప్రజలు ముండితశిరస్కులవుతారు. బ్రాహ్మణ దూషణలు, యజ్ఞపురుష నిందలు, పరలోక నిరసనలు మితిమీరుతాయి. వేదబాహ్యమైన స్వేచ్ఛాప్రవర్తనం వ్యాపిస్తుంది. ఒకరిని చూసి ఒకరు ఆ పెనుచీకటిలో మునిగిపోతారు. వారి మతానికి పాషండ మతమని పేరువస్తుంది. తత్ఫలంగా అధర్మం పెంపొందుతుంది.

అదే కలియుగప్రథమ బీజం. భవితవ్యం తప్పదు కదా!

రాజా! సకలవేదాలకు, సమస్తలోకాలకు, దేవబ్రాహ్మణగోవులకు పరమగురువైన ఋషభుని విశుద్ధచరిత్రను వినిపించాను. ఈ చరిత్ర చెవిసోకినంతనే సమస్తదుశ్చరితలు నశించి, పరమమంగళం చేకూరుతుంది. దీనిని శ్రద్ధాన్వితులై చదివినవారికి, విన్నవారికి వాసుదేవుని యందు ఏకాంతిక భక్తి జనిస్తుంది. ఆ భక్తి ప్రవాహంలో మునిగినవారికి విషయనివృత్తి కలిగి నిఖిల పాపమూలమైన సంసారతాపం ఉపశమిస్తుంది. వారు ప్రాప్తసమస్తార్థులవుతారు. కైవల్యం తనంతట తాను వలచి వచ్చినా వారు దానిని ఆదరింపరు.

రాజేంద్రా! భగవత్ప్రాప్తి కోసం లోకం పలుతెరగుల ప్రాకులాడుతుంటుంది. అట్టి భగవానుడు మీకు, యాదవులకు ప్రభువు గురువు ప్రియుడు స్నేహితుడు దైవము కులపతి కావడమే కాక దూత భృత్యుడు అయి తన అనుగ్రహాన్ని మీ యెడ కుమ్మరించాడు. మీ భాగ్యం ఏమనాలి! ఆ దేవదేవుడు తనను కొలిచినవారికి ముక్తినైనా ఇస్తాడు కాని, పరాభక్తిని అంత సులభంగా ఇవ్వడు.

రాజా! దేహాద్యభిమానం వలన హితాహితవివేకనష్టులై శ్రేయోమార్గం విడిచి జనులు నశిస్తారు. ఏ మహాత్ముడు అటువంటి మూఢ మతుల మేలుకోరి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించాడో ఆ ఋషభదేవునికి ప్రణామం!

## భరతుని చరిత్ర

రాజేంద్రా! భరతుడు తండ్రి ఆజ్ఞమేరకు రాజ్యభారం వహించి విశ్వరూపుని కుమార్తె పంచజనిని వివాహం చేసికొన్నాడు. ఆ దంపతులకు సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు, ఆచరణుడు, ధూమ్రకేతుడు అని ఐదుగురు కొడుకులు పుట్టారు.

భరతుని పుత్రులందరూ సర్వభూతాది అయిన అహంకారానికి పంచసూక్ష్మ భూతాల వలె అనురూపవర్తనులై విలసిల్లారు.

తత్పూర్వం ఆ దేశానికి అజనాభ వర్షమని పేరుండేదని చెప్పాను. భరతుడు రాజైనంతనే దానికి భరత వర్షం అని పేరుపెట్టారు.

## భగవదారాధనం

రాజా! భరతుడు స్వధర్మాన్ని యథావిధిగా అనువర్తించడమే గాక ప్రజలందరినీ వారి వారి ధర్మాలలో నియమించి వారిని అమిత వాత్సల్యంతో పరిపాలించాడు.

సర్వజ్ఞుడైన భరతుడు ప్రజాక్షేమార్థం అనేక ధర్మకార్యాలను ఆచరించాడు. దర్శపూర్ణమాస చాతుర్మాస్య పశుయాగ సోమయాగాలను, అయూప యజ్ఞాలను, సయూప క్రతువులను శ్రద్ధాభక్తులతో నెరవేర్చి చాతుర్హోత్రవిధానంతో యజ్ఞేశ్వరు డైన భగవంతుని ఆరాధించాడు.

## కర్మఫలం కర్తృ భావనాధీనం

రాజా! ఎటువంటి కర్మమునకైనా ఫలం తప్పక జనిస్తుంది. యాగములు కూడా కర్మములే అయినందున, వాటిని సాంగోపాంగంగా చేసినప్పుడు ధర్మమనే ఫలం ఉదయిస్తుంది. ఆ ఫలాన్నే అపూర్వము అంటారు.

ఒక్కొక్క యజ్ఞంలోనూ ఒక్కొక్క మంత్రం చేత ఒక్కొక్క దేవతను ఆమంత్రిస్తారు. దేవతలందరూ అధికారులు మాత్రమే. అందువల్ల వారిచ్చే ఫలం వారి అధికారాన్ని బట్టి ఉంటుంది. కనుకనే దేవతలిచ్చే ఫలాలు సమగ్రమైనవి కాక స్వల్పమాత్రంగా ఉంటాయి. యాగాలను ఫలార్థులై ఆచరిస్తారు. ఆ ఫలం అనుభవింపక తీరదు. ఫలభోగార్థం జన్మాంతరాలు కలుగుతుంటాయి.

భగవానుడు సర్వదేవతలకు పరదేవత. ఆ పరమేశ్వరుని నిష్కామబుద్ధితో భావించి స్వధర్మాలను ఆచరించి ఆత్మార్థం కోరుకొనక ఫలాన్ని భగవదర్పితం కావిస్తే, ఆ కర్మ వలన జనించే ఫలం చిత్తశుద్ధికరమై తుదకు ముక్తిదాయకం అవుతుంది. కర్మ రహస్యం ఇదే. కాబట్టి ఎవరు ఎటువంటి కర్మను ఆచరించినా తత్కర్మదేవతను పరిచ్ఛిన్నభావంతో ఆరాధింపక పరమేశ్వర విరాడ్రూపాన్ని అనుసంధించి తదేకధ్యానంతో విహితకర్మను నెరవేర్చాలి. అప్పుడు చిత్తశుద్ధి జనిస్తుంది. శుద్ధచిత్తుని హృదయాకాశంలో భగవానుడు ప్రకాశిస్తాడు.

రాజేంద్రా! భరతుడు తన యాగాలన్నింటినీ అటువంటి సద్భావనతో చేసినందువలన, భగవానుడు సాకారుడై ఆతని హృదయాంతరంలో నిత్యనివాసం ఉన్నాడు. రాజా! కర్మము ఒకటే అయినా కర్త భావనవిశేషాన్ని బట్టి ఫలవిశేషం కలుగు తుండటం గ్రహించావా?

రాజా! భావన అంటేనో? అది స్వభావసిద్ధం. స్వభావం అంటేనో? ప్రారబ్ధ కర్మఫలవాసనా సముచ్చయం. ఆ స్వభావం త్రిగుణాత్మకంగా వ్యవహరిస్తుంది. గుణవ్యవహారాన్ని బట్టి వర్ణాదులు ఏర్పడుతున్నాయి.

## భరతుని తపోవ్రతం

భరతుడు పెక్కు వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసి తండ్రి తాతల నాటినుంచి వచ్చిన ఆ రాజ్యాన్ని విభజించి కొడుకులకు అప్పగించి, సర్వసంపన్నిలయమైన గేహాన్ని త్యజించి తపస్సు చేయడానికి పులహాశ్రమానికి వెళ్ళాడు. దానినే హరిక్షేత్రమని కూడా అంటారు.

## హరిక్షేత్ర మహిమ

రాజా! ఆ క్షేత్రమహిమ ఇంతింతనరానిది. అక్కడి భక్తులు భగవానుని ఏ రూపంలో ధ్యానిస్తే ఆయన వారికి ఆ రూపంలో దర్శన మిస్తాడు. ఇది నాటికీ నేటికీ జరుగుతున్నది.

పులహాశ్రమ ప్రాంతంలో గండకీనది ప్రవహిస్తున్నది. ఆ నదిలో సాలగ్రామశిలలు వెలసి గండకీతోయాలకు పావనత్వాన్ని కలుగజేస్తున్నాయి.

## భరతుని తపఃక్రమం

భరతుడు ఆ పుణ్యాశ్రమాన్ని చేరుకొని ఏకాకియై అక్కడి ఉపవనంలోని కిసలయ కుసుమ తులసీదళాలతో కందమూలఫలోపహారాలతో శుద్ధోదకాలతో భగవంతుని ఆరాధింపసాగాడు. పరమేశ్వరానుగ్రహఫలంగా అతనికి విషయవాంఛలన్నీ నశించి ఉపశాంతి సిద్ధించింది. అనన్యమైన భక్తిపారవశ్యంతో ఆనందాశ్రువులు కురియగా తన్మయుడై అతను తన దీక్షను కొనసాగించాడు.

ఆ విధంగా భరతుడు భగవద్వ్రతుడై అనుసవనార్ద్రాభిషేకమూ కపిశమూ అయిన జటాకలాపంతో తేజరిల్లుతూ, సూర్యోదయమైనంతనే సూర్యుని యెదుట నిలిచి, ‘ఏ తేజం రజో రూప ప్రకృతికి పరమై ప్రకాశిస్తున్నదో, ఏ తేజం సర్వేంద్రియప్రేరకుడైన సవితృని స్వరూపభూతమో, ఏ తేజం సర్వకర్మప్రదమో, ఏ తేజం విశ్వమంతటికీ అంతర్యామియై నిజశక్తి చేత కాంక్షాపర జీవులను పరిపాలిస్తూ వారి బుద్ధిగతులను గ్రహిస్తున్నదో ఆ పరమ తేజం నాకు శరణం’ అని ధ్యానిస్తూ దినకృత్యాలను మొదలుపెట్టేవాడు.

## ప్రారబ్ధ కర్మఫల మమకారం

రాజా! ఆ విధంగా ప్రవ్రజితుడైన భరతుడు ఒకనాడు గండకీనదిలో యథాప్రకారం స్నానం చేసి నిత్యకృత్యాలు తీర్చి తీర మృత్తికపై కూర్చుండి బ్రహ్మాక్షరమైన ప్రణవం జపిస్తుండగా ఒక చూడిలేడి దప్పిగొని అక్కడికి వచ్చి

నీరు గ్రోలసాగింది. అదే సమయంలో ఆ సమీపాననే ఉన్న సింహమొకటి మహాభయంకరంగా గర్జించింది.

జింకలు స్వభావతః భీరుజంతువులు. లేడి ఆ గర్జనధ్వనికి బెదిరి నీరు గ్రోలటం మాని తటాలున ఎగిరి దూకింది. భయవిహ్వాల వేగాలకు దాని చూలు జారి నీటిలో పడింది. లేడి తన ఒంటరితనానికి, జరిగిన గర్భపాతానికి, ఎదుటనున్న సింహానికి దిగులొంది అక్కడికక్కడే మరణించింది.

ఇదంతా చూస్తూ నిలబడ్డ భరతుడు, 'అయ్యో! ఈ మృగశిశువు నదిలో పడి కొట్టుకొనిపోతున్నది. రక్షింపకపోతే దీనికి చావుతప్పదు' అని తలచి జాలిగొని తటాలున నీటిలో దిగి దానిని పట్టితెచ్చి ఆశ్రమంలో ఉంచి పూటపూట దానికి తగిన మేత సంపాదించి తెచ్చిపెడుతూ, క్రూరజంతువుల నుంచి కాపాడుతూ, దువ్వి లాలిస్తూ, 'దీనికి తోడూ నీడా ఎవరూ లేరు. నేనే సర్వస్వమని అనుకొంటున్నది. నేను కాదంటే ఇక దీనికి వేరొక దిక్కు లేదు. నమ్మి శరణుజొచ్చినవారిని రక్షించేందుకు పెద్దలు ఎంతటి స్వార్థాన్నయినా విడిచి పెడతారు' అని తలపోసి ఆ భారం వహించి, ఆ లేడిపిల్లను తనతో కూర్చుండబెట్టుకొని, పూజార్థం ఫలకుసుమాదులను సేకరించే నిమిత్తం అడవికి వెళ్ళినప్పుడు దానినీ వెంటబెట్టుకొనిపోతూ, చీమ చిటుక్కు మన్నంతనే దానికి ఏ కీడు కలిగిందో అని తహతహలాడుతూ, దూరం నడవలేదని భుజాని కెత్తుకొని నడుస్తూ, తాను పరుండినప్పుడు దానిని రొమ్ముపైన పడుకొన బెట్టుకొంటూ, అది ఎప్పుడైనా రెప్పపాటు కాలం కనుమరుగయితే సర్వం కోల్పోయిన దీనుని వలె దుఃఖోద్విగ్ను డవుతూ, 'నా ప్రాణమా! ఎక్కడికి వెళ్ళావు? తల్లి పోయినది మొదలు నన్ను నమ్మి నా దగ్గరే ఉన్నావు. నీ మనస్సు తెలుసుకొనలేక కష్టపెట్టానా? ఈ నిర్భాగ్యుని తప్పు మన్నించి తిరిగి రా. అయ్యో! నువ్వు తిరిగివచ్చి ఆశ్రమంలో ఎప్పటివలె సంచరిస్తుంటే చూసే భాగ్యం నాకు కలుగుతుందా? తోడేలు వాత పడలేదుకదా! నక్కనోట చిక్కలేదు కదా! పులివచ్చి మింగలేదు కదా! అదిగో సర్వలోకక్షేమోదయుడు సూర్యభగవానుడు అస్తమిస్తున్నాడు. ఇంకా నీవు రాకపోవడం ఏమిటి?' అని

దీనచిత్తుడవుతూ కాలం గడపసాగాడు. అతనికి దాని తోడిదే లోకమై దాని కోసమే కన్నులలో ప్రాణాలు నిలుపుకొని ఉన్నాడు.

రాజా! అతను సమాధిగతుడై కనులు మూసినప్పుడు ఆ లేడిపిల్ల వచ్చి శరీరం నిమిరి, యోగభంగం కావించినా, దర్భాసనాన్ని పాడుచేసినా అతనికి కోపం రాదు. ఎప్పుడైనా అతను కొంచెం కసురుకొన్నప్పుడు అది భయపడి ఆటలు చాలించి దూరానికి వెళ్ళిపోతే అతను దానిని వెతకబోతాడు. మట్టి నేలపై దాని చిరుగిట్టల జాడలు చూసి, ఓహో! ఈ లేడిపిల్ల కాలి గిట్టల గుర్తులు భూదేవికి పెట్టని అలంకారాల వలె భాసిస్తున్నాయి. ఈ ధరాకాంత ఎన్ని నోములను నోచిందో కదా' అని నివ్వెరపోతాడు. 'చంద్రా! నా హరిణబాలకుడు వనసీమల కేగాడు. లోకతాపాన్ని చల్లార్చే నీవు నా హరిణకుమారకుని సింహాది క్రూరమృగభయతాపం నుంచి కాపాడుతావు కదూ. ద్విజరాజా! కురంగపుత్రకవియోగతాప దవాగ్నికి లోనై ఈ ద్విజరాజు మనస్సు వేసవి నాటి మెట్టతామర వంటిదయింది. నా పుత్రకుని చూపి నీ చల్లని శాంతకిరణామృతంలో నన్ను తడపవూ?' అని వివిధగతుల వ్యాకులపాటు చెందుతాడు.

రాజా! ఆ మమకారఫలంగా స్నానాచారాది నియమాలు, యమాద్యనుష్ఠానాలు, భగవత్పరిచర్యాదులు భరతునికి నానాటికీ సన్నగిల్లాయి. అది అతని ప్రారబ్ధకర్మఫలవిశేషం కాకపోతే విడువరానట్టి భార్యాపుత్రగృహాదులను విడిచి అభిమానాన్ని జయించిన రాజర్షి ఎక్కడ? ఆత్మకళ్యాణానికి భంగకరమైన ఈ తుచ్ఛ మమకారం ఎక్కడ? ఆ మమకారమైనా సజాతి యందు గాక చతుష్పాదజంతువు పైని కలగటం వింతగా లేదూ?

## అంత్యకాలభావం మరుజన్మ బీజం

రాజా! ఇంతలో ఎలుక బొరియను వెతుక్కుంటూ వచ్చే పాము వలె భరతుని కోసం మృత్యువు వచ్చింది. ఆ మరణసమయంలోనూ అతను తన

పెంపుడు లేడి పైనే పంచప్రాణాలు ఉంచి, దానినే తన మనస్సులో నింపుకొని, దాని గురించే ఆలోచిస్తూ ప్రాణాలు వదిలాడు.

జీవులు అంత్యకాలంలో ఏ భావంతో శరీరాన్ని విడిచిపెడతారో ఆ భావఫలాన్ని ముందుగా అనుభవింపవలసి ఉంటుంది. అందుకు ఆ జీవి తదనుకూలమైన శరీరాన్ని ధరించవలసి ఉంటుంది. ఈ నియతి తప్పదు. (గీత. 8–6)

## మృగభరతుడు

భరతుడు తన అవసానకాలంలో మృగాన్ని తలపోస్తూ ప్రాణాలు విడిచినందువల్ల మరుజన్మలో అతను మృగమై పుట్టాడు. మృగజన్మం కలిగినా అతనికి పూర్వతపోబలం వలన ప్రాక్తన జన్మజ్ఞానం వెన్నంటి వచ్చింది. మృగభరతుడు ఆ జ్ఞాన బలంతో తన పూర్వకథానకాన్ని పరిశీలించి కర్మగతిని గ్రహించాడు. 'సర్వసంగాలను విడనాడి విజనారణ్యం చేరి భగవంతుని యందు మనస్సును నిశ్చలభక్తితో చేర్చి, తదేకచింతాస్మరణ కథాకర్ణనాలతో కాలం గడిపి సమాహిత చిత్తుడనై ఉన్నవాణ్ణి ఎట్టకేలకు లేడిపిల్ల నిమిత్తంగా నా బుద్ధి చెదిరి ఆత్మవేత్తల దారికి దూరమై ఈ తనువు దాల్పవలసి వచ్చింది!' అని చింతాక్రాంతు డయ్యాడు.

ఆ చింతాఫలంగా మృగరూపభరతునికి గాఢవైరాగ్యం జనించింది. ఆ వైరాగ్యఫలంగా అతను తల్లిని విడనాడి పులహాశ్రమానికి వెళ్ళి మళ్ళీ ఎక్కడ బంధాలలో చిక్కుకొంటానో అని పునస్సంగ దోషానికి వెరచి ఏకాకిగా ఉండి ఎండుటాకులు, గడ్డిపరకలు తిని శరీరయాత్ర గడుపుతూ, సమయం వచ్చినంతనే ఆ మృగశరీరాన్ని వదిలాడు.

## గహనా కర్మణో గతిః

భరతుని కర్మబంధనం అంతటితో ముగియ లేదు. అతను మళ్ళీ తనువు దాల్చి ప్రారబ్ధశేషాన్ని అనుభవింపవలసి వచ్చింది.

రాజా! కర్మఫలం జీవులను ఎంత దూరం ఈడ్చుకొనిపోతుందో ఊహింపలేము. అందువల్లనే పెద్దలు 'గహనా కర్మణో గతిః' అంటారు.

అయితే జ్ఞానాగ్ని ఉదయించినంతనే సంచిత ప్రారబ్ధ ఆగామిరూప త్రివిధకర్మఫలాలు నశిస్తాయని, జ్ఞానికి పునర్జన్మాంకురం శేషింపనందున అతను ముక్తు డవుతాడని కొందరంటారు.

సమగ్రమైన జ్ఞానం కలిగినప్పుడు కర్మఫలం వాసనలతో సహితం నశిస్తుందన్న మాట నిజమే. అప్పుడు పునర్జన్మ కారణం ఉండదు. కర్మశేషం లేనందున వారు ముక్తులవుతారు.

వాసన ఏ మాత్రం మిగిలిఉన్నా జన్మాంతరం తప్పదు. ఈ రహస్యాన్ని గ్రహించాలి.

కర్మము ఆరబ్ధం, అనారబ్ధం అని రెండు విధాలు. ప్రకృతశరీర కారణమైన కర్మము ప్రారబ్ధమనబడుతుంది. జ్ఞానము లేనట్టి తత్పూర్వజన్మల లోనూ, ప్రకృతజన్మలో జ్ఞానం కలగక పూర్వమూ చేసిన భోగ్యముఖం కాని కర్మఫలం అనారబ్ధ మనబడుతుంది.

బాణాన్ని వదిలిన తర్వాత దాని తీవ్రత ఎంతో, అంతదూరం అది పోయి తీరుతుంది. ఆ లోపల దానికేదయినా అడ్డుపడితే ఏమవుతుందని అడగవచ్చు. ఆ తీవ్రత అడ్డుపడిన దానికి తగిలి తత్ఫలాన్ని అది అనుభవిస్తుంది. ఎట్లాగైతేనేమి? దాని తీవ్రత ఫలం ఏదో ఒకదానిలో భుక్తమవుతున్నది. మరొక విషయం. అడ్డు పడే వస్తువు అత్యంత శక్తిమంతము, దుర్భేద్యము అయితే బాణం మొక్కపోయి క్రిందపడుతున్నది.

అడ్డుపడదగిన వస్తువులలో భగవంతుడొక్కడే ఉత్తమోత్తముడు. కనుకనే 'మా మేకం శరణం వ్రజ' అని చెప్పబడింది.

కర్మము ధర్మాధర్మరూపం. వాటి ఫలాలను క్లేశములు అంటారు. అవి అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశాల రూపంలో ఉంటాయి. జ్ఞానోదయం

కలుగగానే పునర్జన్మ కారణాలైన ఈ క్లేశబీజాలు దగ్ధమై ప్రతీతి మాత్రంగా మిగిలి ఉంటాయి. అవి కేవల కర్మాభాసలు మాత్రమే. దగ్ధబీజాలు పునరంకురానికి ఎట్లా సమర్థాలు కావో, వీటి గతీ అంతే. బాణాన్ని సంధించి, ప్రయోగించకపోతే తానుగా అది ఏ పనీ చేయలేదు. అట్లాగే అనారబ్ధఫలాలు ఎటువంటివైనా జ్ఞానోదయానంతరం మృతప్రాయంగా ఉంటాయి.

బీజం అంకురించేందుకు తగిన పరిస్థితులుండాలి. అట్టి పరిస్థితులు లేనినాడు బీజం స్వస్థానంలోనే నశిస్తున్నది. అలాగే అనారబ్ధకర్మలకు వ్యవహారయోగ్య పరిస్థితులు లేనప్పుడు అవి కూడా స్వరూపనాశాన్ని పొందుతాయి.

ఆ కాలంలో ఆంగిరస గోత్రప్రవరుడైన ఒక బ్రాహ్మణుడు శమ దమ తపోనిష్ఠను పూని స్వాధ్యాయాధ్యాపనాలు కావించి, సంతోష తితిక్షాప్రశ్రయవంతుడై బ్రహ్మకర్మల తాత్పర్యాన్ని గ్రహించి అతిథులకు, అభ్యాగతులకు అన్నదానాలను సమర్పిస్తూ, ధర్మసంపత్ఫలమైన ఆనందాన్ని అనుభవిస్తుండేవాడు. ఆయనకు భార్యలిద్దరు. అందులో పెద్ద భార్యకు శ్రుతశీలాచారరూపౌదార్య గుణాలలో తండ్రికి సాటివచ్చే కొడుకులు తొమ్మిది మంది జన్మించారు. రెండవ భార్యకు ఒక కూతురు, ఒక కొడుకు పుట్టారు.

## యోగభ్రష్టుల జననం

రాజా! ఐశ్వర్యాదులను కోరి కొందరు, ముక్తిని కోరి కొందరు యోగం ఆచరిస్తుంటారు. ఆ యోగం సమాప్తం కాకముందే వారు మరణిస్తే మొదటి తరగతివారు శ్రీమంతుల ఇండ్లలోను, రెండవ తరగతి వారు శుచిమంతుల ఇండ్లలోను, వారికి యుక్తమైన చోట్ల జన్మిస్తారని శాస్త్రం.

భరతుని కర్మఫలం రెండవ తరగతి లోనిది కాబట్టి అతను ఆ బ్రాహ్మణ గృహంలో రెండవ భార్యకు పుత్రుడై జన్మించాడు (గీత. 6-41).

## జడభరతుడు

జన్మించినది మొదలుగా భరతుడు సంగఫలజ్ఞానం కలిగి ఆ కర్మబంధనిరసనం ఏ విధంగా సాధ్యమవుతుందని తలపోసి, భగవచ్చరణాశ్రయమే మార్గమని నిశ్చయించి, ఎవరితోనూ కలియక, నిరంతర భగవదాయత్తచిత్తుడై హరికథా శ్రవణ స్మరణ కీర్తనలు కావిస్తూ, ఉన్మత్తుని వలె జడుని వలె, అంధుని వలె, చెవిటివాని వలె నిర్లిప్తంగా లోకానికి కాన్పించసాగాడు. అందువల్ల అతనికి జడభరతుడని పేరుపెట్టారు.

## జడభరతుని విద్యాభ్యాసం

ఆ విధంగా అతను జడునిగా కనబడినా తండ్రి మాత్రం ఉపేక్షింపకుండా స్వధర్మతత్పరుడై అతనికి ఉపనయనం చేసి, శౌచాచమనాది కర్మనియమాలను బోధించి, సమావర్తనాది సంస్కారాలను యథావిధిగా నిర్వర్తించాడు.

నిజానికి జడునికి గార్హస్థ్యధర్మాదులను నెరవేర్చే అధికారం లేదు. శాస్త్రవిధి అట్లా ఉన్నదని తండ్రులకు పుత్రవాత్సల్యం లేకుండా పోతుందా?

వేదవ్రతాద్యనంతరం శ్రావణాదిమాసాలలో వేదాధ్యయనం చేయిస్తారు. అందుకు మొదటి మెట్టుగా చైత్రాది మాసచతుష్టయంలో ప్రణవశిరస్సమేత త్రిపదగాయత్రీజపం కావిస్తారు. ఆ బ్రాహ్మణుడు పాపం జడభరతుడికి అన్నీ సలక్షణంగా బోధించాడు కాని అతనికి అందులో ఒక్కటయినా తలకెక్కలేదు.

బ్రహ్మచారులు వివాహాన్ని అపేక్షించి అధ్యయనం దాకా దీక్ష వహిస్తారు. ఆ దీక్షను ఉపకుర్వాణం అంటారు. ఆ దీక్షాకాలంలో శౌచాచమనాధ్యయన వ్రతనియమ పూర్వకంగా గురుసేవ, అగ్నిపరిచర్యాదులను చేయటం బ్రహ్మచారిధర్మం. కొడుకును అనుశాసించటం తండ్రికి ధర్మం కాబట్టి ఆ విప్రుడు జడభరతుని కూర్చుండబెట్టుకొని అన్ని ధర్మాలనూ ఎంతో ఓపికగా చెప్పిచూశాడు. అవీ అతనికి తెలియరాలేదు.

చూస్తూ చూస్తూ కన్నబిడ్డ ఇట్లాగైనాడని ఆ బ్రాహ్మణుడు దుఃఖించి దుఃఖించి ఆ దుఃఖానికి శరీరాన్ని అప్పగించాడు. అతని రెండవ భార్య పతితో కలిసి ఉండాలని నిశ్చయించి, తన సంతానాన్ని సవతికి అప్పగించి భర్తృలోకాన్ని సాధించింది.

## బంధు నిరాదరణ

రాజా! జడభరతుని పెదతల్లి పుత్రులందరూ కేవల కర్మమాత్రనిష్ఠులు. వారికి భరతుని ప్రభావం గోరంతయినా గోచరింపలేదు. మీదుమిక్కిలి అతనిని జడునిగా భావించి శాసించటం మానుకొన్నారు. ప్రజలు కూడా అతని గురించి అలాగే అనుకొని అతను కనబడినప్పుడల్లా 'ఉన్మత్తా!'. 'జడా', 'బధిరా' 'మూగవాడా', 'పిచ్చివాడా' అని కేకలు వేసి గేలిచేయటం మొదలుపెట్టారు.

ఇన్ని కష్టాలు చుట్టుముట్టినా భరతునికి చీమకుట్టినంతయినా బాధలేదు. అతను తన గురించి ఎవరేమన్నా లెక్కచేయక తన లోకంలో తానుండే వాడు. ఎవరయినా కూలికి పిలిస్తే వెళ్ళి వాళ్ళు చెప్పిన పనులు చేస్తూ, వెట్టి పనులు చెబితే వాటినే కొనసాగిస్తూ, వాళ్ళు దయతలిచి అంతో ఇంతో వెట్టికూడు పడేస్తే రుచులెన్నక దానినే భుజిస్తూ అతను దేహయాత్ర గడపసాగాడు. ఇంద్రియప్రీతి అంటే ఏమిటో అతనికి తెలియదు. నిత్యనివృత్తుడు కాబట్టి విశుద్ధానందానుభవం అతనికి స్వభావసిద్ధంగా అలవడింది. ఆ విధంగా అతను పరమానంద సాగరంలో ఓలలాడుతుంటే అతనికి ద్వంద్వనిమిత్తసుఖదుఃఖాలు ఎన్నడూ స్ఫురణకు రాలేదు. అభిమానరహితు డైనందున శీతోష్ణవాతవర్షాలను లెక్కచేయక ఎండగానీ వానగానీ ఎద్దులాగా నేలబడి మట్టిలో పొర్లాడు తుండేవాడు. సంస్కారం లోపించి శరీరం ధూళిగప్పి ఉండటం వల్ల అతని బ్రహ్మవర్చస్సు సానపెట్టని మణిలా నిగూఢమై అన్యులకు గోచరింపకుండా పోయింది.

భరతుడు బ్రాహ్మణబీజాన జన్మించి బ్రాహ్మణుడై ఉన్నా, అతని మొలకు మురికి జందెం ఊగాడుతున్నా, జనులు అతని కులగోత్రాలను

గ్రహింపలేకపోయారు. అతని అన్నలు పిడికెడు మెతుకులు దానం చెయ్యకపోగా, 'భరతా! ఎవడి కడుపు కూటికి బత్తెం వాడే స్వయంగా సంపాదించుకోవాలి' అని నీతివాక్యాలు చెబుతూ మళ్ళు చక్కబెట్టడానికి అతనిని కూలి పనికి పంపించే వారు. అతను వారు చెప్పినట్లే వెళ్ళి పనికి పూనుకొనే వాడే కాని భావం అన్యపరమై ఉండటం వల్ల మిట్టపల్లాలను సరిగా చూసి పనిచేయలేక పోయేవాడు. గుప్పెడు పిండి ఇచ్చినా, పురుగు పట్టిన మినుముల నిచ్చినా, అడుగంటిన గంజి మెతుకులు తెచ్చిపడవేసినా, ఏది ఇస్తే అతను దానిని అదే అమృతం అన్నట్లు తింటుండేవాడు.

## కాళికాదేవికి బలి

రాజా! ఆ దేశంలో శూద్రుడొకడు చోరనాయకుడు ఉండేవాడు. ఎంత కాలానికీ అతనికి సంతానం కలుగలేదు. భద్రకాళికి నరబలి ఇచ్చినట్లయితే సంతానప్రతిబంధం తొలగిపోతుందని ఎవరో అతనికి నచ్చజెప్పారు. అతను నరబలిదీక్ష పూని వధార్థం పురుషపశువును పట్టితెమ్మని పరిచారకులను ఆజ్ఞాపించాడు. వారు బయలుదేరి దేశమంతా వెతికి ఎక్కడా కాంక్షితార్థం కానరాక ఖిన్నులై తిరుగుముఖం పట్టారు.

ఒకనాటి రాత్రి అన్నలందరూ కలిసి భరతుని చేని కాపుదలకు పంపించారు. అతను వారి మాటకు బదులుచెప్పక అలాగే వెళ్ళి ఆ చేనిలోని మంచె పైని కూర్చున్నాడు. ఆ సమయంలో చోరనాయకుని సేనలు ఆ మార్గాననే పయనిస్తూ మంచెపై ఒంటరిగా కూర్చొని ఉన్న భరతుని కనుగొని 'ఓహో! మన పంట పండింది. మన స్వామి కార్యార్థం వీడికంటె తగినవాడు ఉండడు' అని నిశ్చయించి, అతనిని త్రాటగట్టి నాయకుడు చెప్పిన పని నెరవేరినందుకు సంతోషంగా గంతులు వేస్తూ కాళికాదేవి ఆలయానికి తీసుకువెళ్ళారు.

అక్కడ భరతుని బలికి సిద్ధం చేశారు. ఆలయం లోనివారు కొందరతనికి జలకమార్చి, మంచి వస్త్రాలు ధరింపజేశారు. కొందరు గంధం అద్దారు.

కొందరు పూమాలలు తెచ్చి తొడిగారు. కొందరు పంచభక్ష్యపరమాన్నాలు వడ్డించారు. కొందరు బలిపూజా విధానాలు సాగించి మృదంగ పణవఘోషపూర్వకంగా ఆ పురుషపశువును కాళీగర్భాలయానికి తరలించారు.

రాజా! కాళికాదేవి మద్యప్రియ అని, మద్యానికి మారుగా పురుషరక్తాన్ని సమర్పిస్తే ఆ దేవి సంతోషించి అభీప్సితార్థాలను వెంటనే ఇస్తుందని ఒక మతం ఉన్నది. దేవీస్తోత్రంలో మద్యప్రియాది శబ్దాలు కొన్ని ఉన్నాయి. భక్తుల మదోన్మత్తాదులను హరిస్తుందని ఆ శబ్దాల అర్థం. ఆ రహస్యం తెలియక మూఢలోకం విపరీతభావంతో వర్తిస్తుంటుంది.

కాళికాదేవి అంటే భగవచ్ఛక్తివిలాసమే కాని క్షుద్రదైవతం కాదు. ఆ శక్తి వలన సర్వం సృష్టిస్థిత్యాదులను పొందుతున్నాయి. అందువల్లనే ఆ దేవిని లోకమాత అంటారు. అటువంటి లోకమాత ఎక్కడ? ఆమె తన బిడ్డల రక్తం కోరటం ఎక్కడ? ఇంతకన్న మౌఢ్యం ఉన్నదా?

రాజా! చిత్తము రజస్తమోరూప మలినాల చేత ఆవరింపబడినప్పుడు హితాహితాలు స్ఫురింపవు. అందువల్ల మలినస్వభావం విపరీతాశయాలకు మూలమై హింసాది దారుణకార్యాలను చేయిస్తుంది. అటువంటి స్వభావం పైకొన్నప్పుడు అది యుక్తాయుక్త విచారానికి చోటివ్వకపోవడమే గాక, ఆ మలిన స్వభావజనిత భావమే యుక్తమని తోపింపజేస్తుంది. భరతుడు బ్రహ్మభూతుడు, బ్రహ్మర్షిపుత్త్రుడు, నిర్వైరుడు, సర్వభూతసుహృదుడు, తన ప్రాణాలిమ్మన్నా కాదనక ఇచ్చేవాడు, అటువంటి సత్పురుషునికి చూడు ఇట్టి దురవస్థ దాపురించింది. ఇదంతా కర్మఫలవిశేషం కాకపోతే మరేమిటి?

రాజా! భరతుని తీసుకొనివచ్చి కాళికాదేవి విగ్రహం ముందు నిలబెట్టగానే పురోహితుడు కత్తి పైకెత్తి అతని తల నరకబోయాడు. అంతలో భరతుని బ్రహ్మతేజం కాళీవిగ్రహాన్ని తాకి ఆమెకు నిలువెల్లా మంటలు రేపింది. ఆ దేవి చివుక్కున లేచి మహాట్టహాసం కావించి క్రూరదంష్ట్రాకరాళ కాంతులను

వెదజల్లుతూ కన్నుల వెంబడి నిప్పులు రాలుస్తూ పురోహితుని చేతిలోని ఖడ్గాన్ని ఊడబెరికి దానితో అక్కడున్న పాపాత్ముల తలలు తరిగి ఆ వేడి నెత్తురులు గ్రోలి, వాళ్ళ పుర్రెలను చెండాడి పాడి విహరించింది. ఒకరికి చేయదలచిన కీడు తుదకు కర్తనే చెరుస్తుంది సుమా.

రాజా! భరతునికి జరిగినదేమీ అంతుబట్టలేదు. అతని మనస్సు సర్వాంతర్యామి అయిన భగవంతుని యందే లీనమై ఉన్నందువల్ల అతనికి వేరొకటి గోచరింపలేదు.

అంతే కాదు. భయసంభ్రమాలు దేహాత్మభావం ఉన్నప్పుడు మాత్రమే కలుగుతాయి. దేహాత్మభావరూపమైన గ్రంథి ఎప్పుడు నశిస్తుందో అప్పుడే విపరీతభావాలు కూడా నశించిపోతాయి. దేహాత్మభావం నశించినవాడు సర్వభూతసుహృత్తయి వర్తిల్లుతాడు.

> దేహభావమే లేనినాడు దేహరక్షణం ఎట్లా జరుగుతుందని అడగవచ్చు. ప్రారబ్ధకర్మ ఫలం భోగమైనంతదాకా పిడుగుపడినా ఆ దేహానికి పతనం ఉండదు. అంతవరకు ఆ దేహరక్షణాదికం భగవంతుడే భరించి ఎప్పుడు ఏది చేస్తే ఉచితమో అప్పటికి ఆ ప్రకారం నడుపుకొని పోతుంటాడు.
>
> కారణం ఏమిటో చెప్పనక్కరలేదు. భాగవతపరమహంసులకు తనకు భేదం లేదని భగవంతుడే ప్రతిజ్ఞాపూర్వకంగా అన్నాడు కదా!

## శిబికా వహనం

రాజా! సింధు సౌవీరదేశాల పేర్లు విన్నావు కదా. ఆ కాలంలో వాటికి రహూగణుడనే రాజు ఉండేవాడు. ఒకప్పుడతను ఇక్షుమతీ నదీతీరానికి వెళ్ళి అక్కడున్న కపిలమహర్షిని సందర్శించి ఆయన వలన తత్త్వజ్ఞానాన్ని తెలిసికొనగోరి పల్లకిని సిద్ధంచేయమని ఆజ్ఞాపించాడు. పెద్దబోయ మోతగాండ్ర కోసం ఊరిలోనికి వెళ్ళి కొంతమందిని చేర్చుకొని వస్తుండగా,

మార్గమధ్యంలో ఒక లేతప్రాయపు వ్యక్తి (భరతుడు) ఎదురయ్యాడు. మంచి దృఢగాత్రుడైన అతనిని చూసి, 'ఇతను ఎంత బరువైనా గాడిద మోసినట్లు మోయగల బలశాలి. మన పనికి పనికివస్తాడు' అని తలచి అగ్రవాహకుడు అతనిని కూడా వెంటబెట్టుకొని వచ్చాడు.

రాజు పల్లకీలో కూర్చున్నాడు. బోయలు పల్లకీని భుజాల మీద ఉంచుకొని అడుగులో అడుగు వేసుకొంటూ నడవసాగారు. ఆ కొత్త బోయ తన అడుగుల క్రింద చలిచీమలు పడి చస్తాయేమో అని భయపడుతూ, బాణపాతదూరం ముందుచూసుకొంటూ మెల్లమెల్లగా నడవసాగాడు. అతని అడుగులకు తక్కిన బోయల అడుగులతో జతకుదరక పల్లకి ఊగులాడసాగింది. రహూగణుడది చూసి, 'పల్లకి ఊగులాడుతున్నది. సంగతేమిటి? చూసి నడవండి' అని మందలించాడు. వాహకులు రాజు మాటకు జడిసి, 'ప్రభూ! మేము ఎప్పటి వలెనే సరిగా మోస్తున్నాము. ఇతనెవరో కొత్తగా మాకు దాపరించాడు. ఇతనితో కలిసి నడవటం చేతకావటం లేదు' అని విన్నవించారు. రహూగణుడు ఆ మాట విని, 'సంసర్గదోషం వల్ల నిర్దోషులు కూడా కష్టాల పాలు కాగలరన్న మాటకు వేరే నిదర్శనం ఎందుకు? ఇదుగో కళ్ళముందే జరుగుతున్నది' అని లోలోన తలచి, ఆ కొత్తబోయను పలకరించి, 'అన్నా! నీ వొక్కడవే ఇంతదూరం మోసి అలిసినట్లున్నావు. వయసు మీరింది కాబోలు. ఈ బోయీలు నీకు సాటి వస్తారా?' అని నిందాగర్భంగా పలికాడు. ఆ పలుకులను చెవిబెట్టక భరతుడు యథాప్రకారం నడవసాగాడు.

## రహూగణునితో సంవాదం

రాజా! పల్లకీ మళ్ళీ యథాప్రకారం ఊగులాడసాగింది. రహూగణుడు మండిపడి, 'బోయ రాజా! నా మాట వినబడలేదా? వినీ లెక్కలేదా? నీకు బ్రతుకంటే ఆశ ఉన్నట్లు లేదు. బ్రతుకగోరినవాడివే అయితే రాజాజ్ఞను ఉల్లంఘిస్తావా? ఇదిగో చూడు నీ మాంద్యం అణగగొడతాను. అప్పుడు గాని నీకు నా స్వరూపం తెలిసివచ్చేట్లు లేదు' అని పరుషంగా కసురుకొన్నాడు.

ఆ కొత్తబోయ, రాజు మాటలు విని, 'అయ్యో! రాజునన్న అభిమానం ఇతని చేత ఈ విధంగా పలికిస్తున్నది. రజస్తమోవృత్తులకు ఇది సహజమే కదా!' అని లోలోపల నవ్వుకొంటూ ఇలా అన్నాడు:

'రాజా! నీ పలుకులు ఉపాలంభ పూర్వకంగా ఉన్నాయే కాని సత్యమో కాదో విచారించి చూడు. నేనెంతో బరువు మోసి అలిసిపోయానని అన్నావు. బరువనేది ఒకటున్నదా? పోనీ ఉన్నదనుకొందాము. ఆ బరువును మోస్తున్నదేది? చక్కగా నడవటం లేదన్నావు. నడుస్తున్నదేది? గతిశ్రమ కలిగిందేమో అన్నావు. ఆ శ్రమ దేనికి? మోసేది గాని నడిచేది గాని శ్రమ చెందినది గాని దేహమని అంటావా? దేహం పంచభూతాత్మకం, జడపదార్థం. జడానికి లాఘవ భారాదులు తెలుస్తాయా? నేను బలశాలినని అన్నావు. బలమన్నది దేహధర్మమో ఆత్మధర్మమో విచారించావా?

రాజా! నీవు పలికిన వక్రోక్తులన్నీ దేహాత్మబుద్ధి పలికించిన పలుకులే గాని వేరేమీ కాదు. నీవు చెప్పిన వ్యవహారమంతా అజ్ఞానకల్పితం. అది దేహాభిమానులకు చెల్లుతుందేమో గాని అట్టి అభిమానం లేని నాకు వర్తించదు. మరి నన్ను జీవన్మృతుడని అన్నావు. ఆ గతి నాకే కాదు. సమస్త పరిణామ వస్తువులకు నియతమైనది. వికృతికి ఆద్యంతాలు తప్పవు కదా! రాజాజ్ఞను ఉల్లంఘించానని అన్నావు. రాజభావం ఒకటి ఉన్నట్లయితే శాసించేవాడు, శాసనాన్ని బట్టి కర్తవ్యం అని భేదకల్పన సాధ్యమవుతుంది. రాజభృత్యభావాలు భేదబుద్ధి వ్యవహారాలు సత్యాలు కావు. ఈశ్వరుడను అనే అభిమానం నీకు ఉన్నట్లయితే, ఈశిత్వం ఏమిటో? మేము చెయ్యవలసినది ఏమిటో చెప్పు. నాకు ప్రతీకారం చేస్తానన్నావు. నేను బ్రహ్మభూతుడను. బ్రహ్మభూతునికి నీ ప్రతీకారరూప చికిత్సల వలన ప్రయోజనం ఏముంటుంది? నీ మాటలన్నీ పిష్టపేషణాలు.'

అని ఈ విధంగా బదులు పలికి, 'ఎటువంటి వారికైనా ప్రారబ్ధకర్మఫలభోగం తప్పదు. ఆ ఫలం భుక్తమై గాని నశింపదు. నా

ప్రారబ్ధకర్మ ఫలం నన్నీపనికి నియమించింది. ఈ విధంగా కాని అది నశింపదు' అని లోలోన తలచి మళ్ళీ పల్లకిని భుజాని కెత్తుకొన్నాడు.

## రహూగణుని ప్రార్థన

రాజా! రహూగణుడు తత్త్వవిచారపరుడు కాబట్టి ఆ మాటలు ములుకులై అతని మనసు నాటాయి. అతను వెంటనే పల్లకి నుంచి దిగివచ్చి రాజాభిమానం త్యజించి ఆ బోయ అడుగులకు తలవంచి మొక్కి, 'మహాత్మా! నీ వెవ్వడవు? నీ యజ్ఞోపవీతచిహ్నాలు నీవు బ్రాహ్మణుడవని తోపింపజేస్తున్నాయి. అవధూతలు దత్తాత్రేయాదులు ఉన్నారంటారు. వారిలో నీవొకడివా? నీ తండ్రి ఎవరు? ఎక్కడుంటావు? ఇక్కడికి వచ్చిన కారణం ఏమిటి? కపిలాచార్యుడవు నీవు మా మేలుకోరి వచ్చావా? ఇంద్రుని వజ్రానికి, మహేశ్వరుని త్రిశూలానికి, యముని దండానికి దేనికీ నీవు భయపడవు. నీ ధీరత్వం అపూర్వం. బ్రాహ్మణావమానం అంటే నా ఒళ్ళంతా వడవడ వణుకుతుంది. నీ విజ్ఞానవీర్యాలు అత్యంతనిగూఢమైనవని నీ పలుకులు ప్రకటిస్తున్నాయి. నీ వెవరివో తెలుపగోరుతున్నాను. నీ మాటల లోని భావం సూక్ష్మదర్శనులైన మహాత్ములకే అభేద్యమై ఉండగా నా బోంట్ల సంగతి వేరే చెప్పాలా? మహాత్మా! ఈ సంసారసాగరానికి అంతేమేమిటో అర్థంకాకుండా ఉన్నది. అది తెలిసికొనగోరి, ఆత్మతత్త్వజ్ఞమణి యోగీశ్వరుడు మీదు మిక్కిలి శ్రీహరి జ్ఞానకళావతారం అయిన కపిలాచార్యుని ఉపాసించాలని బయలుదేరాను. నేను వెతుకుతున్న ఆ యోగీశ్వరుడవు నీవేనేమో అనిపిస్తున్నది. మహాయోగులు లోకనిరీక్షణార్థం ప్రచ్ఛన్నగతిని సంచరిస్తారు. వారి గతి సంసారంలో పడి కొట్టుమిట్టుకులాడుతున్న అంధులకు తెలియరాదు.

మహాత్మా! భరించేవారికి భారశ్రమ, నడిచేవారికి గమనాయాసం స్వానుభవసిద్ధాలు. అవి నీ యెడ కలుగవని అన్నావు. అది సంభవమేనా? లోకమంతా వ్యవహారమాత్రమే గాని సత్యము కాదన్నావు. ఘటాదులతో నీరు

మొదలైనవి మోసి తెస్తాము. ఘటాదులు వస్తురూపాలు కాకపోతే జలాహరణాది క్రియలు ఎలా కొనసాగుతాయి? కార్యం అన్నది కళ్ళారా కనబడుతున్నది. కార్యానికి కరణం ఉండాలి. ఆ రెండిటికీ సత్యత్వం లేదంటే ప్రమాణవిరుద్ధ మనిపిస్తుంది. సత్యత్వం కానివి మిథ్య లవుతాయి. ఇంద్రియగోచరాలు మిథ్యలెలా అవుతాయి? భారవహనాదిక్లేశాలు నీకు లేవని అన్నావు. నీకు అంటే నీ ఆత్మకని నా ఉద్దేశ్యం. గిన్నెలో నీరుపోసి నిప్పుమీద ఉంచినప్పుడు ఆ అగ్ని వేడిమి మొట్టమొదట గిన్నెకు కలుగుతుంది. తర్వాత గిన్నె వేడిమి దానిలోని నీటికి వ్యాపిస్తుంది. అటుపిమ్మట నీటి వేడిమి అందులో ఉన్న తండులాదులకు (బియ్యం మొదలైనవాటికి) పాకుతుంది. ఆ తండులాదులు వేడిమికి ఉడికి అన్నమవుతున్నాయి. అట్లాగే తాపాదులు మొదట దేహానికి, తర్వాత దేహాంతరాలైన ఇంద్రియాలకు, ఇంద్రియాల తాపం తదంతర్గతమైన ప్రాణానికి, దాని తాపం మనస్సుకు, మనస్తాపం తత్సమీపవర్తి అయిన ఆత్మకు సంసర్గకారణం వలన కలుగుతాయి కదా?

మహాత్మా! స్వామి భృత్య న్యాయం నిత్యం కాదని, జడునికి ప్రతీకారం నిరర్థకమని అన్నావు. మొదటిది నిత్యమో కాదో అటుండనివ్వు. ప్రజాపరిపాలనం కావాలంటే శాసకు డొకడు ఉండవద్దా? స్తబ్ధునికి ప్రతీకారం పిష్టపేషణమయితే అవుతుంది గాక. చెడుత్రోవలో నడిచేవారిని దండించవద్దా? దండనను ఈశ్వరుడే విధించాడు. అతని ఆజ్ఞను తలదాల్చి వర్తించటమే భగవదారాధన మవుతుంది. భగవంతుని ఆరాధించేవారికి పాపక్షయం అవుతుంది. ఇది మహాఫలం కదా!

మహాత్మా! రాజాభిమానాంధుడనై మహాత్ముని యెడ అపరాధం చేశాను. నా తప్పును మన్నించి నన్ను అనుగ్రహించు. నీ కరుణావిశేషం చేత నా పాతకమంతా దగ్ధమవుతుంది గాక. మదోన్మత్తుల అకార్యాలు పెద్దలను ఏమీ చేయలేవు గాని తత్కర్తలను మాత్రం చెరిచి తీరుతాయి. అట్టి మహాభయం నన్ను కలవరపరుస్తున్నది' అని వినయవినమ్రుడై వచించాడు.

## జ్ఞానోపదేశం

రాజా! ఆ బోయ అతని మాటలు విని, 'అయ్యా! విద్వాంసుని వలె మాటాడుతున్నావు. నీ యందు విద్వత్తు కానరాదు. ఎందుకంటావేమో? నీవు స్వామివని మేము భృత్యులమని భావిస్తున్నావు. ఈ సంబంధం లౌకికవ్యవహారమాత్ర మైనది. ఇట్టిదానిని సత్యమని తత్త్వవేత్తలు ఎన్నడూ తల పోయరు. అసలు సత్యపదార్థం ఎటువంటిదో ముందుగా గ్రహించు. త్రికాలాల లోనూ దేనికి మార్పు కలుగదో అది సత్యమవుతుంది. సంబంధం వియోగాంతమైనది. కనుక అది త్రికాలాబాధ్యం కాదు. అందువల్ల అది సత్యమూ కాదు.

అయ్యా! లోకం సంగతేమిటని అడుగుతావా? లోకం దృశ్యమాత్రమైనది. దృశ్యమో? నశ్వరం. తార్కాణ మేమంటావా? జాగ్రదవస్థలో మాత్రమే ప్రపంచం కానవస్తుంది. గాఢనిద్రావస్థలో అది లేశమాత్రమైనా కనిపించదు. కలలో ఎన్నో చూస్తాము. మేలుకొన్న తర్వాత కలలో కన్నవన్నీ కల్లలవుతున్నాయి కదా! ఈ విధంగా స్వప్నదృష్టాంతాన్ని బట్టి అనుమానప్రమాణం చేత ప్రపంచతత్వాన్ని నిశ్చయించాలి.

అయ్యా! వేదాంతులు కూడా కర్మములను ఈశ్వరార్పణబుద్ధితో కావిస్తారని, కర్మములు సత్యములు కాకపోతే వారు అట్లా ఎందుకు చేస్తారని, కర్మములు సత్యాలని, కర్మములు సత్యాలు కాబట్టే వాటికి ఫలం ఉదయిస్తున్నదని, ఈశ్వరార్పణబుద్ధితో చేసిన కర్మమునకు పరమార్థప్రాప్తి ఫలమవుతుందని, కర్మసత్యత్వాన్ని బట్టి కర్మాత్మకమైన సంసారం సత్యమే అవుతుందని వాదిస్తావా?

అయ్యా! సంసారమన్నది కూడా మనఃకల్పితమే కాని సత్యమైనదికాదు. మనస్సంటే ఏమిటో గ్రహించి చూడు. మూడు గుణాల వాసనా సంపుటాన్ని మనస్సు అంటారు. ఆ వాసనల ప్రేరణల వల్ల జ్ఞానేంద్రియాలు, వాటి ప్రేరణ మూలాన

కర్మేంద్రియాలు వ్యవహరిస్తున్నాయి. ఇంద్రియవ్యవహారం తత్తద్గుణవాసనాప్రేరణలను బట్టి ఉంటుంది. ఎట్టి వ్యవహారానికైనా ఫలం ఉండక తప్పదు. ఫలమన్నాక అది భుక్తమయితే కాని నశింపదు. ఫలభోగార్థం తత్తదనురూపదేహాదులు కలుగుతాయి. అనగా భోగ్యఫల భేదాలను బట్టి ఆ ఫలాలను భోగించే దేహాలు చిత్రవిచిత్రంగా ఏర్పడుతున్నాయి. ఈ విధానాన్ని సంసారచక్రం అన్నారు. కనుక సంసారం మనఃకల్పితమే గాని వాస్తవికం కాదు.

అంతే కాక మనస్సు గుణాభిమానాన్ని పొందినప్పుడు మాత్రమే సంసారం కలుగుతున్నది. అట్టి అభిమానం నశించినప్పుడు కళ్యాణం సిద్ధిస్తున్నది. దీనిని బట్టి సంసారానికి గాని, నిశ్శ్రేయసానికి గాని రెంటికీ మనస్సే కారణమని ఏర్పడుతున్నది కదా!

సంసార ప్రవృత్తి నివృత్తులు దేనికి? అని అంటే, ఇవి అభిమానానికి కలుగుతున్నాయి. ప్రమాణ మేమంటావా? అభిమానం తలచూపినప్పుడు ప్రవృత్తి, అది లీనమైనప్పుడు నివృత్తి కలుగుతుండటం అందరికీ స్వానుభవమే కదా!

అయ్యా! ఈ అభిమానాన్నే జీవుడంటారు. అభిమానం జడపదార్థం కాబట్టి జడమునకు వ్యవహారం ఎక్కడిదని శంకిస్తావేమో? అభిమానం జడమన్నమాట సత్యం. జడమునకు స్వతంత్ర వ్యవహారం లేదనడమూ సత్యమే. అన్ని దేహాల లోపల ఆత్మ ఉన్నది. ఆ ఆత్మ సాక్షి మాత్రుడై ఉంటాడు. ఆత్మసాన్నిధ్యం వలన అభిమానం వ్యవహరిస్తున్నది. సూదంటురాయి సాన్నిధ్యం వలన ఇనుపముక్క చలించటమే ఇందుకు నిదర్శనం. ఈ రహస్యం తెలియక అభిమానరూప జీవుని కార్యాన్ని ఆత్మయందు ఆరోపిస్తారు. అభిమానానికి అంతరాత్మతో సాన్నిధ్యం ఎలా

కలిగినదని అంటావా? ఆత్మ అన్నది శరీరాంతరం లోనే ఉన్నందువల్ల దాని సాన్నిధ్యం ఆత్మకు కలుగుతున్నది. ఆత్మ ఎప్పుడు శరీరాన్ని విడిచిపెడుతుందో అప్పుడు అభిమానం వ్యవహరించటం లేదు కదా! మరణావస్థయే ఇందుకు నిదర్శనం.

ఆత్మ సాన్నిధ్యంలో అభిమానం వ్యవహరిస్తుందని అన్నాను. ఆ పక్షాన అభిమానకృత పుణ్యపాపాలు ఆత్మకు సంసర్గరూపాన అంటవా? అని అడగవచ్చు. కర్తకు ఫలకాంక్ష ఉన్నప్పుడు అతనికి కర్మఫలం కలుగుతుంది. ఫలకాంక్షలు లేనినాడు ఫలం అంటదు. సూదంటురాయి సాన్నిధ్యంలో ఇనుపముక్క చలిస్తున్నప్పుడు దాని చలనవిశేషాలు సూదంటురాయికి అంటటం లేదు కదా! కారణం ఏమిటి? ఇనుప ముక్క చలనాదులను సూదంటురాయి కోరలేదు. కోరిక లేనందున సూదంటురాతికి ఇనుపముక్కతో సంగమం ఏర్పడటం లేదు. సంగమున్నప్పుడే అభిమానాదులు జనిస్తాయి. అదే విధంగా ఆత్మ స్థితి కూడా అని తెలుకోవాలి.

అయ్యా! మనస్సన్నది ఒక కరణ మవుతుందే గాని భిన్నకరణాత్మకం కాదని, మనస్సు ఒకటే ఉన్నప్పుడు సంసారానికి, మోక్షానికి రెండింటికీ అది కారణం ఎట్లా అవుతుందని శంకిస్తావేమో? మనస్సన్నది ఏకకరణ మన్నమాట సత్యం. మనస్సుకు రూపభేదం లేకపోయినా అవస్థాభేదం ఉన్నది. అవస్థా భేదాన్ని బట్టి ఏకమైన మనస్సు సంసారమోక్షాలు రెండిటికీ కారణ మవుతున్నది. అవస్థాభేదం ఎట్లా కలుగుతుంది? అంటే, గుణాన్ని బట్టి అవస్థాభేదం కలుగుతున్నది. మనస్సు గుణబద్ధమైనప్పుడు సంసారహేతువవుతుంది. గుణబద్ధం కానప్పుడు మోక్షహేతువు అవుతుంది. దీపాన్ని ఉదాహరణగా గ్రహించు. దీపకాంతి నైజంగా తెల్లని ప్రకాశరూపంలో ఉంటుంది. వత్తిని నూనెలో తడిపి వెలిగించినప్పుడు దాని ప్రకాశం పొగచూరి ఉంటుంది.

దీపకాంతి యొక్క శుద్ధాశుద్ధ ప్రకాశాలకు నూనె యొక్క అసంబంధ సంబంధాలు ఏ విధంగా కారణమో, ఆ విధంగానే మనస్సుకు ఏర్పడే గుణాగుణసంబంధాలు సంసారమోక్షాలకు కారణమవుతాయి.

## అభిమాన కార్యాలు

అయ్యా! మనస్సుకు పదకొండు వృత్తులు ఉన్నాయి. అందులో ఐదు వృత్తులు పంచజ్ఞానేంద్రియపరాలు, ఐదు వృత్తులు పంచకర్మేంద్రియపరాలు. జ్ఞానేంద్రియా లైదింటికి శబ్ద స్పర్శ రూప రస గంధాలు విషయాలవుతాయి. కర్మేంద్రియాలైదింటికి విసర్గ రతి గతి వచన శిల్పాలు క్రమంగా కార్యాలవుతాయి. అభిమానం సంగతేమిటని అంటావేమో? దానికి జ్ఞానేంద్రియాలకు వలె ప్రత్యేక విషయం, కర్మేంద్రియాలకు వలె ప్రత్యేక కార్యం ఏదీ లేదు. అది 'నాది' అనే కేవల భోగాయతనత్వ భావంలో ఉన్నది. స్వీకార్యమే దానికి విషయం. అనగా అభిమానానికి దేహం విషయమన్నమాట.

అయ్యా! దేహం వేరని, అభిమానం వేరని కొందరంటారు. ఆ పక్షాన దేహవృత్తి అని మరొకటి ఏర్పడి అభిమానవృత్తి పన్నెండవది అవుతుంది. ఆ అభిమానం ఆత్మసాన్నిధ్యాన అహంకార రూపాన్ని తాల్చి జీవుడనబడుతుంది.

## విషయభేదాలు - కారణం

ఈ శబ్దాది పంచవిధవిషయాలు స్వభావ సంస్కార కర్మ కాలాల నిమిత్తం చేత పెక్కు భేదాలను పొందుతున్నాయి. ఆ భేదాలు లెక్కలేనన్ని ఉన్నాయి. అవన్నీ విషయముల యొక్క స్వశక్తి వలన ఏర్పడుతున్నవా? లేక పరస్పరసంయోగ కారణం వలన ఏర్పడుతున్నవా? అని సందేహింపవచ్చు. విషయాలు జడములు కాబట్టి వాటికి ప్రత్యేకమైన స్వశక్తి కలుగదు. స్వశక్తి లేనప్పుడు వాటికి పరస్పరసంయోగమూ కలుగనేరదు. కాబట్టి స్వశక్తి గాని సంయోగము గాని విషయ విభేధాలకు కారణాలు కావు. మరి విషయ

విభేదనం ఎట్లా కలుగుతున్నది? అంటే, జీవుని సాన్నిధ్యప్రభావం వలన విషయముల వ్యవహారాలు, వాటి అంతర్భేదాలు కలుగుతున్నాయి.

ఈ మనోవిభూతులు నిత్యానిత్యాలు రెండూ అవుతాయి. ప్రవాహరూపంలో వాటికి నిత్యత్వం కలుగుతున్నది. జాగ్రత్స్వప్నదశలలో వాటికి జననమూ, సుషుప్తి సమయంలో తిరోభావమూ కలుగుతున్నందువల్ల అనిత్యత్వం సంప్రాప్త మవుతున్నది. ఈ మూడవస్థలలోనూ జీవుడు వాటిని దర్శిస్తున్నాడు కాబట్టి జీవుని క్షేత్రజ్ఞుడు అంటారు. అతను ఈ మూడవస్థలలోనూ మార్పు లేక చూస్తుండటం వలన జనన స్థితి లయాది శూన్యుడవుతాడు. క్షేత్రజ్ఞుని సాన్నిధ్యంలో మనో విభూతులు, తద్విభూతుల కార్యరూపమైన ప్రపంచం ఏర్పడుతున్నాయి. అందువల్ల క్షేత్రజ్ఞుడు జగత్కారణ భూతు డవుతున్నాడు. క్షేత్రాలు నానావిధాలై పెక్కు రూపాలలో ఉన్నాయి. ప్రతిక్షేత్రం లోనూ ఒక్కొక్క క్షేత్రజ్ఞుడు ప్రత్యేకంగా ఉంటున్నట్లు గోచరిస్తుంది. ఏకము అద్వితీయము అయిన పరమాత్మ వివిధక్షేత్రాలలో ప్రకాశించటం మూలాన క్షేత్రభేదాలను బట్టి క్షేత్రాంతర ప్రతిబింబాలకు కూడా నానాత్వం కల్పింపబడుతున్నది. క్షేత్రజ్ఞులను ఆత్మ లంటారు. ఈ ఆత్మలందరికీ మూలమైన ఆ వస్తువును పరమాత్మ అంటారు.

## జీవుడు – ఈశ్వరుడు

అయ్యా! ఈ క్షేత్రజ్ఞుడు రెండు విధాలుగా ప్రకాశిస్తుంటాడు. అతడు త్వంపదార్థ విషయు డైనప్పుడు, అంటే 'నీవు' అనే భావాన్ని ప్రకాశింప జేసేటప్పుడు జీవుడు అనబడుతున్నాడు. తత్పదార్థ విషయుడైనప్పుడు, అంటే భగవద్భావాన్ని ప్రకాశింప జేసేటప్పుడు ఈశ్వరుడు అనబడుతున్నాడు.

జీవుడంటే పరిచ్ఛిన్నుడు, పరప్రకాశితుడు, జ్ఞానవిషయుడు, పరోక్షుడు అని గ్రహించాలి. ఈశ్వరుడు సర్వవ్యాపి, పూర్ణుడు, స్వయంజ్యోతి అయినందువల్ల జ్ఞానవిషయుడు, తదాశ్రయభూతుడు, పరోక్షుడు, అపరోక్షుడు అవుతాడు. ఆ భగవానుడు సర్వవ్యాపి కావున నిఖిల స్థావర జంగమాలలో

ప్రాణస్వరూపాన ప్రవేశించి వాటికి నియామకుడై ఉంటాడు. విశ్వమంతా అతని మాయా (శక్తి) విలాసమే.

## మాయా జయం

అయ్యా! మాయను నిరసించినవాడు ఆత్మతత్త్వవేత్త అవుతాడు. అయితే మాయను నిరసించటం ఎట్లాగంటావేమో? జ్ఞానోదయం అయినంతనే మాయ తనంతట తానే తొలగిపోతున్నది. జ్ఞానోదయం ఎట్లా కలుగుతుంది? అంటే మనోజయం వల్ల జ్ఞానోదయం అవుతుంది. మనోజయం ఎట్లాగని మళ్ళీ ఒక సందేహం. మనస్సు మమకారరూపంలో వర్తిస్తుంటుంది. ఆ మమకారాన్ని వదిలిననాడు మనస్సుకు స్వరూపనాశం కలుగుతుంది. మమకారాన్ని వదలటమంటే సామాన్యమేమీ కాదు. అందుకు భగవచ్చరణోపాసనమే ఉపాయం. భగవత్పాదమూలాన్ని ఆశ్రయింపనంతవరకు మనస్సు దాని ఆటలను మానదు. మనస్సు ఆడే ఆట లేమిటని అడుగుతావేమో? శోక మోహ రాగ ద్వేష వైరాదులు మనోనాటకాలు. ఆ ఆటల విలాసమే సంసార మనబడుతుంది. ఈ సంగతి గ్రహించి వర్తించి నంతదాకా సంసారభ్రమణం తప్పదు.

మనోవ్యవహారమంతా ఆనందానుభవార్థమే కాని వేరొకటి కాదు. అందుకోసం అది ఏదో ఒక పదార్థాన్ని ఆశ్రయిస్తుంటుంది. లౌకికపదార్థాలన్నీ క్షణికానందప్రదాలు, దుఃఖాంతములు అయినట్టివి. ఆ కారణాన మనస్సు ఒక పదార్థం నుంచి మరొక పదార్థానికి దూకుతూ ఎక్కడా తనివి తీరక పరిభ్రమిస్తుంటుంది. భగవంతుడు పూర్ణుడు, అవ్యయ శాశ్వతానంద స్వరూపుడు అయినందువల్ల మనస్సుకు భగవదాలంబనను కూర్చినట్లయితే అది ఆ నిత్యపదార్థమందు లగ్నమై అందులోనే లీనమవుతుంది. ఆ లీనమైన ఫలంగా మనోభ్రమణలు ఉడిగిపోతాయి. ఈ విధానాన్ని మనోనాశన మంటారు. ఏ వస్తువు గాని దాని నైజవ్యవహారాన్ని మానినప్పుడు అది నశించినట్లే కదా! మనస్సును ఈ విధంగా భగవత్పరం చేయటాన్ని పరాభక్తి అంటారు.

అయ్యా! మనస్సనేదానిని ఒక దర్పణానికి సాటి చేయవచ్చు. దర్పణంలో మూలవస్తువు ప్రతిఫలిస్తుంది. ఆ ప్రతిఫలించిన ప్రతిబింబాన్ని చూస్తున్నప్పుడు మనస్సు మూలవస్తువు వంకకు మళ్ళదు. మూలవస్తువును చూస్తున్నప్పుడు దర్పణంలోని ప్రతిబింబం కనిపించదు. అలాగే మనస్సు భగవత్పర మైనప్పుడు భగవద్విలాసమైన ప్రపంచం కానరాదు. భగవద్విలాసాన్ని చూస్తున్నప్పుడు భగవంతుడు కానరాడు. భగవద్విలాసం క్షణక్షణపరిణామాలతో కూడి శాశ్వతైక రూపం లేకుంటుంది కాబట్టి, అట్టి దానిని ఆశ్రయించినప్పుడు మనస్సుకు కూడా అటువంటి గతులే కలుగుతాయి. అందువలన క్షణికానందరూపమైన ప్రపంచాన్ని మాని శాశ్వతానందకరమైన భగవన్మూర్తిని ఆశ్రయించాలని తాత్పర్యం.'

రాజా! రహూగణుడు ఆ పలుకులను విని 'స్వామీ! పరమేశ్వరావతారస్వరూపుడవు కానీ ఏతన్మాత్రుడవు కావు. ఆత్మానందప్రకాశకుడవు కాబట్టి నీ యందు దేహాభిమానం ఆవంతయినా కనబడదు. ఈ బ్రాహ్మణవేషంలో చరిస్తున్నదెందుకో నాకు ఊహాతీతంగా ఉన్నది. ఇదే నీకు సాష్టాంగప్రణామం. ఇంతకంటె ఎక్కువ చేయలేని అశక్తుడిని. జ్వరగ్రస్తులకు శీతలౌషధం వలె, గ్రీష్మసంతప్తులకు పన్నీటి చందాన దేహాభిమాన సర్పదష్టునికి నాకు మీ వచనాలు అమృతోపమాలు.

స్వామీ! అధ్యాత్మయోగతత్త్వాన్ని గురించి బోధించావు. నా మందమతికి మీ తాత్పర్యం దురవగాహంగా ఉన్నది. బరువులు మోయటం, దూరాలు గమనించటం మొదలైన వ్యాపారాలన్నీ దేహమూలాన జరుగుతున్నాయి. భారవహన గమనాదిక్రియల వలన శ్రమ, ఆయాసం కలగటం అందరికీ స్వానుభవసిద్ధమే. అటువంటి అనుభవస్థిరవిషయాలను కూడా మిథ్యలన్నావు. నీ భావం తేటపడదు. నా సంశయం తీర్చి నన్ను కృతార్థుణ్ణి చేయగోరుతున్నాను' అన్నాడు.

రాజా! అవధూత అతని సంశయాలను విని, 'అయ్యా! ఏదేది కంటికి కనిపిస్తుందో అది రూపాన్ని కలిగి ఉంటుంది. ఆ రూపాలను దేహములని

అంటారు. రాయి మొదలు మనుష్యుల వరకు దేహాలు అనేకం ఉన్నాయి. ఆ దేహాలలో కొన్ని చలనాదులు కలవి గాను, కొన్ని చలనాదులు లేనివి గాను ఉంటాయి. చలనాదులు లేనివాటిని జడము లని, చలనాదులు కలవాటిని చరము లని పేర్కొంటారు. జీవరాశిలో మళ్ళీ చరములు, స్థిరములు అని రెండు భేదాలున్నాయి. వృక్షాదులు స్థిరవర్గానికి, పశు పక్షి సరీసృప మనుష్యాదులు చరవర్గానికి చెందుతాయి.

ఈ జడజీవభేదం కేవలం ఉపాధిని బట్టి ఏర్పడినది కాదు. ఉపాధుల చలనాదివ్యాపారాలను బట్టి కలుగుతున్నది. ఈ చలనాదులు నిమిత్తవిశేషా లవుతాయి. ఉపాధు లంటేనో, పార్థివములు – అనగా పృథ్వీతత్త్వమయములై ఉంటాయి. అవి మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి చివరికి మట్టిలోనే కలిసిపోతున్నాయి. అన్నిటిలోనూ ఉన్నది మన్నే కాని వేరేమీ కాదు. ఆ దేహాలకు వాటి రూపచలనాదివ్యాపారాలను బట్టి నామభేదం కలుగుతున్నది. ఈ నామభేదాలను పట్టుకొని ఊగులాడుతూ అసలు వస్తువును మరచిపోతున్నారు.

అయ్యా! దేహాలకు బరువులు మోయటం వంటి అనేక వ్యాపారాల వలన ఆయాసం కలుగుతున్నదని, అది స్వానుభవసిద్ధమని అన్నావు. ఈ దేహంలో పాదాద్యవయవాలు అనేకం ఉన్నాయి కదా! నీవు చెప్పిన ఆయాసం ఈ అవయవాలలో దేనికి కలుగుతున్నది? నడిచేటప్పుడు పాదాలకు, బరువు మోసినప్పుడు భుజాలకు శ్రమకలుగుతున్నదని నిరూపిస్తావా? అయ్యా! ఆయాసాన్ని వివరించేటప్పుడు నా కాళ్ళకని, నా భుజాలకని అంటారు కదా, దాని భావం ఏమిటి? నేను అనే పదార్థం ఒకటి ఉండటమూ, ఈ అవయవాలన్నీ తత్సంబంధాలు కావటమూ ఏర్పడుతున్నది. అందువల్ల ఆ 'నేను' అన్న పదార్థమే లేకపోతే ఆ అవయవాయాసభావం జనించటానికే అవకాశం లేదని కూడా తేలుతున్నది. ఆ 'నేను' అనే పదార్థం ఏమిటి? అది దేహం కాదు. ఎందుకంటావా? 'నా దేహం' అంటున్నాము గాని 'నేను దేహాన్ని' అనటం లేదు కదా! ఆ సంగతి అటుండనివ్వు. ముందు పల్లకి సంగతి విచారిద్దాము.

పల్లకి అన్నది పార్థివమని మనకు తెలుసు. దానిని మోస్తున్నది ఏది? దేహం. అదీ పార్థివమే. పల్లకీలో ఉన్నది ఏది? ఒక దేహం. అది కూడా పార్థివమే. పల్లకి, దానిని మోస్తున్న దేహం, ఆ పల్లకిలో ఉన్న దేహం మూడూ పార్థివాలే కనుక, అవన్నీ జడములే. జడములకు సుఖభావం ఎక్కడున్నది? సౌవీరపతి అయిన రహూగణుడు పల్లకీలో ఉన్నాడంటావా? రహూగణుడనే పేరు నీ దేహానికే గాని నీ దేహంలో ఉన్న 'నేను' అనే పదార్థానికి కాదు కదా! సంగతి ఇలా ఉండగా 'నేను' అనే భావాన్ని అజ్ఞానవశాన రహూగణుడనే పేరుగల దేహమందు ఆరోపించావు. దానితో దుర్మదాంధత్వం నీ కన్నుగప్పింది. తత్ఫలంగా దయాదాక్షిణ్యాలు మాయమైనాయి. దీనులను పట్టుకొని వెట్టి పనులకు నియోగించావు. ఈ పని జన పరిపాలనమని పొగడుకొంటావు. జ్ఞానులిది అంగీకరిస్తారా?

అయ్యా! నిప్పు మీది గిన్నె సాదృశ్యాన్ని చెప్పావు. భారవహనాది ఆయాసాలు పై అవయవం నుంచి ఒక్కొక్క అవయవానికి వ్యాపిస్తూపోతాయని నీ భావం కాబోలు! దేహమంతా పృథ్వీ వికారమే అవుతుంది; పృథ్వి అన్నదో – అసత్పదార్థమే గాని సత్పదార్థం కాదు. పృథ్వి అన్నది పరమాణుసంయోగం చేత ఏర్పడుతుందని, ఆ పరమాణువులు నిత్యమైన సత్పదార్థం అవుతాయని, క్లేశాదికం ఆ పరమాణువులకు కలుగుతున్నదని, అంటావా? ఈ అణుకవాదం కేవల యుక్తియుక్తమే గాని సత్యం కాదు. ఒక్క మాట విను. పృథ్వి జడమన్నప్పుడు పృథ్విగా ఏర్పడిన పరమాణువులు కూడా జడములే అవుతాయి కదా! అణువులు చైతన్యాత్మకాలంటావా? ఆ పక్షాన వాటి సంయోగఫలమైన పృథ్వి కూడా చైతన్యాత్మకమే అవుతుంది. పృథ్వి జడమని మొట్టమొదటే నిశ్చయించాము. కాబట్టి నీ వంటున్న వాదం నిలువదు. పైగా నీ అభిమానం ఎప్పుడు దేహం వైపుకు మళ్ళుతుందో, అప్పుడు మాత్రమే దేహబాధ నీకు కలుగుతున్నది. అభిమానం లేనప్పుడు ఆ బాధ నీకు తెలిసిరాదు. ఈ రహస్యాన్ని కూడా గ్రహించు.

మరి దేహాంతర్గతుడైన ఆత్ముడు నిర్వికారుడు, నిస్సంగుడు, జ్యోతిస్స్వరూపుడు అయినవాడు. నిర్వికారునికి దేహవికారములంటవు. నిస్సంగునికి దేహంతో సంబంధం ఉండదు. జ్యోతిస్స్వరూపుడు కాబట్టి సర్వమూ తత్ప్రకాశితమై వెలుగొందుతుంది. అగ్నిచేత మండింపబడుతున్న పదార్థం ఆ అగ్నికి తాపాన్ని కలిగించగలుగుతుందా? ఆత్మ సాన్నిధ్యంలో వ్యవహరించే దేహావయవాల తాపాదులు కేవలం జ్యోతిస్స్వరూపమైన ఆత్మను తాకలేవు కదా.

అయ్యా! సృష్టి సమస్తం మాయా విలాసమే అవుతుంది. ఆ విలాసం ద్రవ్య స్వభావ ఆశ్రయ కాలాదుల రూపంలో కానవస్తుంటుంది. వాటివలన స్థూలత్వ కృశత్వాలు, అణుత్వ బృహత్త్వాలు, సత్త్వాసత్త్వాలు, చేతనా చేతనత్వాలు అనే ద్వైతవ్యవహారమంతా కలుగుతున్నది. ఆ వ్యవహారాలు త్రికాలబాధితాలు కాబట్టి సత్యములు కావు. అట్టి అసద్వస్తువులతో ఏర్పడిన ప్రపంచం మిథ్య కాక తప్పదు. ఈ సంగతి స్పష్టంగా గుర్తుపెట్టుకోవాలి.

## ఏది సత్పదార్థం?

సత్పదార్థమేది? అని అడుగుతావా! ఏది త్రికాలబాధితం కాక ఏకరూపాన ఉంటుందో, అది ఒక్కటే సత్పదార్థం. జ్ఞానసత్యత్వం వ్యావహారికమా? లేక పారమార్థికమా? అని శంకిస్తావా? వ్యావహారిక సత్యత్వం అశుద్ధము, సద్వితీయము, బాహ్యాభ్యంతరసహితము, పరిచ్ఛిన్నము, విషయాకారము, సవికారము అయినట్టిది. పారమార్థిక సత్యత్వం శుద్ధము, అద్వితీయము, బాహ్యాభ్యంతర శూన్యము, పూర్ణము, నిర్విషయము, నిర్వికారము అయినట్టిది. ఈ లక్షణాలను బట్టి పరిశీలిస్తే జ్ఞానసత్యత్వం పారమార్థికమని స్పష్టపడుతుంది. ఆ జ్ఞానాన్నే పరమాత్మ అని, పరబ్రహ్మ మని, భగవంతు డని, వాసుదేవు డని వివిధనామాలతో పేర్కొంటారు. జ్ఞానమనేది సద్వస్తువుకు స్వరూపలక్షణం. ఆ లక్షణాన్నే ఆ వస్తువుకు పేరుగా గ్రహిస్తారు. వేరొక మార్గాన దానిని పేర్కొనటం సాధ్యం కాదు.

## జ్ఞానము నిత్యప్రాప్తం

రహూగణా! ఈ జ్ఞానాన్ని పొందటం వీలవుతుందా? అని సందేహింపనక్కరలేదు. ఈ జ్ఞానము నిత్యప్రాప్తం. దానిని క్రొత్తగా పొందనవసరం లేదు. అది నిత్యప్రాప్తమే అయినా దానిని అజ్ఞానావరణం చుట్టుకొని ఉంటుంది. ఆ ఆవరణ తొలగినంతనే జ్ఞానం స్వతఃప్రకాశమాన మవుతుంది.

## అజ్ఞానావరణ నివారణం

అజ్ఞానావరణం ఎలా తొలగుతుందంటే, అందుకు తపోవ్రతాలు, యజ్ఞదానపరోపకారాలు, వేదాధ్యయన జలాగ్నిసూర్యోపాసనలు సాధనాలుగా చెబుతారు. కాని వాటివల్ల కలిగే ఫలమేమీ ఉండబోదు. ఫలకారి అయిన సాధనం ఏది? అని అడుగుతావేమో. మహాత్ముల సేవ ఒక్కటే సకలావరణలను హరిస్తుంది. మహాత్ములు భగవత్కథాకీర్తనలు కావిస్తుంటారు. ఆ కథాకీర్తనలు ప్రస్తావ మాత్రంగా నైనా చెవిసోకితే, గ్రామ్యకథారుచి సన్నగిల్లుతుంది; బుద్ధి వాసుదేవుని వంకకు మరలుతుంది. ఎప్పుడు బుద్ధి వాసుదేవముఖ మవుతుందో అప్పుడే తత్ప్రకాశం సర్వాంతరాయాలను పటాపంచలు చేస్తుంది. తత్త్వం గోచరమవుతుంది. దానినే జ్ఞానోదయ మంటారు.

## అవధూత చరిత్రం

ఇందుకు నిదర్శన కావాలా? నా చరిత్రే ఈ విషయాన్ని స్పష్టీకరిస్తుంది. నేను పూర్వం ఒకప్పుడు భరతు డనే పేర రాజుగా ఉండి సర్వసంగాలను వదిలి భగవంతుని ఆరాధిస్తుండేవాడిని. నాకొకనాడు మృగశిశురక్షణరూప సంగమం కలిగింది. తత్ఫలంగా పరమార్థాన్ని కోల్పోవడమే గాక మృగమై పుట్టవలసి వచ్చింది. అయినా నేను చేసిన భగవదారాధన ప్రభావం వల్ల పూర్వస్మృతి నిలిచి, ఆ మృగజన్మలో కూడా భగవద్భక్తిని విడనాడలేదు. ఏ కర్మఫలానుభవార్థం నాకు మృగశరీరం వచ్చిందో, ఆ కర్మఫలం భుక్తమైనంతనే ఆ శరీరానికి పతనం కలిగింది. ఇప్పుడిదిగో ఈ జన్మనెత్తి జనసంగానికి దూరంగా చరిస్తున్నాను. నన్నిప్పుడు జడభరతుడంటారు.

రహూగణా! నీవెవరివని అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పాను. జ్ఞానప్రాప్తి అన్నది ప్రాప్తప్రాప్తి అని నీకు వివరించాను. జ్ఞానప్రాప్తి అన్నా ముక్తి అన్నా ఒకటే అవుతుంది. ఎందుకంటావేమో? ముక్తి అంటే బంధం తొలగిపోవటం. అజ్ఞానావరణమే బంధం. అది తొలగినప్పుడు జ్ఞానం (ముక్తి) స్వతస్సిద్ధమవుతున్నది.

అజ్ఞానావరణం అభిమానరూపంలో ఉంటుంది. అభిమానం వలన మోహం జనిస్తుంది. మొట్టమొదట దానిని ఛేదించాలి. స్మృతిలాభం చేత కాని మోహవిచ్ఛేదం కాదు. స్మృతిలాభం సత్పురుషసేవాపూర్వక హరికథాకర్ణనాదుల వలన కలుగుతుంది. స్మృతిలాభాన్ని చూరగొని అజ్ఞానరూప సంసారసాగరాన్ని దాటాలి. భగవత్పదప్రాప్తి, సంసారసాగర తరణం ఏకకాలంలోనే సాధించబడతాయి.

## సంసార మహారణ్య వర్ణనం

రహూగణా! సంసారాన్ని మహారణ్యానికి సాటిచేయవచ్చును. బేహారుల బిడారు ధనార్జన కోసం కీకారణ్యాలను ప్రవేశించినట్లు, జీవకోటి సుఖాన్ని కోరి సంసారం లోనికి ప్రవేశిస్తుంటుంది. ఈ సంసారారణ్యంలో కామము క్రోధము మోహము మదము మాత్సర్యము అహంకారము అనే పెనుదొంగలు పొంచి ఉంటారు. ఆ దొంగలను బుద్ధి అనే నాయకుడు నడిపిస్తుంటాడు. వారు ఆ నాయకుని ప్రేరణ మూలాన ఉత్సహింపగా జీవుల బిడారు సంసారారణ్యం లోనికి దూరి కష్టపడి సంపాదించుకొన్న సుఖమనే ధనాన్ని కొల్లగొడుతుంటారు.

ఇంకా ఆ అరణ్యంలో భార్యాబిడ్డలనే నక్కలు తిరుగుతూ, కొల్లపోగా మిగిలిన సుఖధనాన్ని తోడేళ్ళు గొర్రెపిల్లల్ని తిన్నట్లు హరించివేస్తుంటాయి. ఆ అడవి కామకర్మాదులనే తృణలతాగుల్మాదులతో నిండి చొరరాక దుర్జనులనే మశక మక్షికాదుల వలని బాధతో కూడి ఉంటుంది. ఆ వనాంతరంలో విహరించేటప్పుడు అక్కడక్కడ అఘటనదేహాదిరూప గంధర్వనగరాలు

కనిపిస్తుంటాయి. అందులో సువర్ణమనే కొరివి దయ్యం వెంటబడి తిరుగుతుంటుంది.

జీవుల బిడారు గృహధనదేహాదులందు ఆత్మాభిమానాన్ని దాచుకొని ఆ అడవిలో పయనించేటప్పుడు ఒక్కొక్క చోట స్త్రీరూప ఝంఝూనిలం వీస్తుంది. ఆ సుడిగాలి ఉరవడికి కోరికలనే రేణువులు చెలరేగి కప్పివేస్తాయి. దుమ్ము క్రమ్ముకొన్నందువల్ల కన్నులు మూతపడి కర్మసాక్షిదేవత లనే దిక్కులను కానక దారితప్పి చరించటం జరుగుతుంది. అలాగున తిరుగాడుతున్నప్పుడు ఒక్కొక్క వేళ కొండీడులనే నల్ల పురుగులు చెవి కుట్టటం, ప్రల్లదులనే గూబల రొద బాధపెట్టటం సంభవిస్తాయి. ఆ బిడారు దాహదీనమై ఎండమావుల వెంట పరిగెత్తి పరిగెత్తి అలిసి అధర్మవృక్షాల నీడలకు ప్రాకటం, పాషండ మతాలనే నిర్జలనదులు చొచ్చి దేబెరించటం, దుఃఖాత్మక గృహదావాగ్నిలో పడి పరితపించటం, రాజులనే యక్షుల చేతజిక్కి ధనమనే ప్రాణాన్ని కోల్పోయి నిర్వేదాన్ని పొందటం, సాహసికులు ముట్టడించి సర్వమూ నిట్టనిలువున దోపిడీ చేయగా నిర్విణ్ణులై శోకమోహమూర్ఛావశులు కావటం – ఇవన్నీ ప్రాప్తమవుతుంటాయి. ఆ బిడారు అటువంటి బాధలను అతికష్టంమీద తప్పించుకొని చివరికి మనోరథమాత్ర పితృపుత్రాది సౌఖ్యరూప నగరాన్ని చేరుకొని, అక్కడ ముహూర్తకాలం నిర్వృతుల వలె సంతోషాన్నిపొంది, అంతలో అందులోనుంచి బయటపడి అసాధ్యాలనే నునుకొండల పైకి ప్రాకటం మొదలవుతుంది. ఆ మార్గం విఘ్నాలనే ముండ్ల తోను కరుకురాళ్ళ తోను నిండి ఆ బాటసారుల పాదాలకు గుచ్చుకొని గాయమవుతుంది. ఆ నొప్పికి వారు వికల మనస్కు లవుతారు. అంతలో జఠరాగ్ని చెలరేగి దుస్సహ మనిపిస్తుంది. కుటుంబ భారం దుర్భరమవుతుంది. అంతకంతకు విసుగు జనిస్తుంది. దానిని లోలోపల దాచుకొనలేక జనులపై వెళ్ళగ్రక్కుతారు. నిద్ర అనే అజగరం వాళ్ళను మింగవస్తుంది. అప్పుడు బంధుమిత్రాదు లందరూ వారికి దూరమౌతారు. దుష్టులనే దందశూకాలు కాటువేస్తాయి. దిక్కుతోచక వాళ్ళు మోహమనే మహాంధకూపంలో జారిపడతారు.

ఆ విధంగా పడరాని పాట్లు పడినా కంటికి కానవచ్చిన పరస్త్రీ రూప క్షుద్రరసాల కోసం అర్రులు చాస్తారు. అప్పుడు పరస్త్రీస్వాములనే జుంటీగలు వారిని కరవవస్తాయి. ఆ బాధనెట్లాగో ఓర్చుకొని ఏదో ఒక తీరున ఈప్సితాలను ఛాయామాత్రంగా సంపాదించుకొంటారు. అంతలో లాతి బలవంతులు పైకొని ఆ రవ్వంత లాభాన్నీ హరిస్తారు. అంతా సర్వనాశనమై గోడుగోడుమంటారు. అంతటితో నైనా తమ అడియాసలను విడిచిపెట్టరు. ఆత్మసుఖార్థం పరద్రవ్యాల మీద కన్నువేస్తారు. వారికి ఎట్టకేలకు ఆశాభంగమే గాక అవమానం కూడా కలుగుతుంది. విరోధాలు పెరుగుతాయి. ఉన్న డబ్బును కోల్పోయి స్థానభ్రష్టులు, సహాయరహితులుగా వారు మృతప్రాయులవుతారు. బిడారు వారిని వదిలివేసి క్రొత్తవాళ్ళను చేర్చుకొని తన పని తాను సాగిస్తుంది. అట్లా సాగించినా సంసారమహారణ్యాన్ని దాటి, అది గంతవ్యస్థానం చేరినట్లు ఒక్కనాటికీ కనిపించదు.

రహూగణా! ఈ అడవిని దాటడానికి ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన సాధనసామగ్రిని కూర్చుకొని పయనం సాగిస్తారు. ఎట్లాగంటావా? ఒకడు స్త్రీ అనే లతను వెంటబెట్టుకొని అరణ్యం దాటాలని ప్రయత్నిస్తాడు. ఆ లతను ఆశ్రయించుకొని ఉన్న పుత్రులనే విహంగాలు మధురరుతాలను కావిస్తుంటాయి. ఆ ధ్వనులను విని అతను తన్మయుడవుతాడు. ఆ స్థితిలో అతను ఎంత నడిచినా కాలం గడుస్తుందే కాని దూరం తరగదు. అంతలో కాలచక్రమనే సింహసమూహం అతనిని తార్కొంటుంది. ఒక్కొక్కసారి అతనికి క్రూరపాషండులనే కొంగలు, గద్దలు, రాబందులతో చెలిమి వాటిల్లుతుంది. ఆ పొందు మేలుకాదని అతను గ్రహించి వాటిని విడనాడి, బ్రాహ్మణులనే హంసకులాన్ని చేరబోతాడు. ఆ హంసల శీలం అతనికి రుచించదు. అతను వాటిని వదిలిపెట్టి ఆచారభ్రష్టులైన కోతులను సమీపిస్తాడు. వాడికి ఆ కోతి చేష్టలు రుచిస్తాయి. ఆ ఆనందంలో మునిగి జీవితావధిని మరిచి, కేవల దృష్టప్రయోజనాలైన గృహాలనే చెట్లమీద క్రీడిస్తూ, సురతేచ్ఛతో కొంతకాలం గడుపుతాడు. తత్ఫలంగా ఆలుబిడ్డల తోడి సంబంధం గట్టిపడుతుంది. అతను

రాగాదులనే కొండలోయలలో పడతాడు. అక్కడ మృత్యువనే మత్తగజం అతని నెదుర్కొంటుంది. దానిని చూసి భయగ్రస్తుడై అతను ప్రాక్తనకర్మమనే తీగను పట్టుకొని వేళ్ళాడి ఆ ముప్పు తప్పించుకొని బ్రతుకు జీవుడా అని ఎట్టకేలకు బిడారులోకి వచ్చి పడతాడు. రాజా! అతని గతి తిరుగుడు కపిలయెద్ల గతివంటిదవుతుందే గాని ఒక్కనాటికీ అతను గమ్యస్థానాన్ని చేరుకోలేడు.

## గంతవ్యప్రాప్తికి సాధనం

రహూగణా! గంతవ్యాన్ని చేరాలనే కోరిక నీకు నిజంగానే ఉంటే, మొట్టమొదట నిన్ను సేవిస్తున్న దండును విడిచిపెట్టు; భూతములనే నీకు మిత్రులుగా గ్రహించు; విషయసంగాన్ని త్యజించు; హరిసేవ కావించు. భగవత్సేవాఫలంగా నీకు జ్ఞానఖడ్గం ప్రాప్తమవుతుంది. ఆ ఖడ్గాన్ని చేతబూని నీవు నడుస్తున్న దారిలోని ముళ్ళపొదలను ఛేదిస్తూ ప్రయాణాన్ని కొనసాగించు. ఎట్టకేలకు గంతవ్యస్థానాన్ని చేరుతావు. వేరే ఉపాయం లేదు' అన్నాడు.

## రహూగణుని విన్నపం

రాజా! రహూగణుడు ఆ ఉపదేశసారాన్ని సాకల్యంగా విని, 'మహాత్మా! జీవులు కోటిజన్మ లెత్తినా ఆ అన్నింటిలో మనుష్యజన్మ ఉత్తమమైనది. స్వర్గలోకజన్మం మేలు కాదా? అని శంకిస్తారు. ఆ జన్మ భోగార్థమే గాని పరమార్థసాధనార్థం కాదు. ఎందుకంటే, పరమార్థాన్ని సాధించడానికి భాగవతమహాత్ములతో సమాగమం ఉండాలి. అది నరలోకంలో సులభంగా సిద్ధిస్తుంది. స్వర్గంలో దొరికేది కాదు. మీ పాదపరాగం నా పైని సోకనోచిన ధన్యాత్ముడను. నా జన్మము నేటికి సఫలమయింది. మీ బోంట్ల చరణధూళి సోకినవారికి భగవద్భక్తి కలగటం వింత కాదు. మీ అనుగ్రహం వలన దుస్తర్కమూలమైన నా అవివేకబలం ఉడిగిపోయింది.

మహాత్మా! అవధూత లిటువంటివారని తెలిసికోవటం సులభం కాదు. వారు వృద్ధులుగా బాలురుగా పెద్దలుగా పిన్నలుగా వటువులుగా ఏ

రూపంలోనైనా ఉండవచ్చు. శరీరంలో ఆ అవధూతతత్వాలను తెలిసికొనడం కేవలం ఉపాధులను బట్టి వీలుకాదు. కనుక నేను అందరికీ ప్రణమిల్లుతాను. రాజులు పదవీగర్వాంధులై ఉత్తములను అవమానించి చేటొందుతారు. అందుకు నేనే నిదర్శనం. రాజులకు క్షేమాన్ని అనుగ్రహించు' అని ప్రార్థించాడు.

పరీక్షిన్నరేంద్రా! ఆ బ్రహ్మర్షికుమారుడు తన మహానుభావత్వాన్ని కప్పిపుచ్చి చరిస్తుండినా, రహూగణునికి అతని పుణ్యవిశేషం కలిమివల్ల ఆయనతో సమాగమభాగ్యం లభించింది. ఆ మహాత్ముడు రహూగణుని వేడికోలును విని అతనియెడ కరుణించి ఆత్మతత్త్వాన్ని అతనికి ఉపదేశించి నిస్తరంగసాగరం వలె ప్రశాంతచిత్తుడై యథామతిని వెళ్ళిపోయాడు.

ఆ విధంగా రహూగణుడు తత్త్వజ్ఞానాన్ని పొంది అవిద్యారోపితమైన ఆత్మాభిమానాన్ని పరిత్యజించాడు. రాజా! భాగవతసేవాప్రభావం ఎటువంటిదో చూడు. నరేంద్రా! ఈ భరతుని చరిత్ర క్షేమకరము ఆయుర్వర్ధనము ధన్యము యశస్యము అయి స్వర్గాపవర్గాలను ప్రసాదిస్తుంది. దీనిని విన్నవారికి చదివినవారికి కొనియాడినవారికి నిఖిలశ్రేయస్సులు అప్రయత్నంగా ఒనగూడుతాయి.

## భరతవంశానుక్రమం : సుమతి

పరీక్షిన్నరేంద్రా! ఋషభుని పుత్రుడైన ఆ భరతునికి సుమతి అనే పుత్రుడు జన్మించి తాతకు సమ్మతమైన జీవన్ముక్తిమార్గాన్ని అవలంబించాడు. ఆ సుమతియే బుద్ధావతారమని కొందరు పాషండులు కలియుగంలో భావిస్తారు. ఆ భావం వేదసమ్మతం గాని ఆర్యసమ్మతం గాని రెండూ కాదు.

ఆ సుమతికి ధ్రువసేన యందు దేవతాజితుడనే కొడుకు జన్మించాడు. దేవతాజితునికి ఆసురియందు దేవద్యుమ్నుడు, అతనికి కేతుమతి యందు పరమేష్ఠి, అతనికి సువర్చల యందు ప్రతీహుడు కలిగారు.

ప్రతీహుడు ఆత్మవిద్యను పెక్కుమందికి వివరించడమే గాక స్వయంగా అనుష్ఠించి అపరోక్షజ్ఞాని అయ్యాడు. అతనికి ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత అని ముగ్గురు కొడుకులు జన్మించి యజ్ఞకర్మలలో నైపుణ్యం వహించారు.

ప్రతిహర్తకు స్తుతియందు వ్యోముడు, భూముడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు. భూమునికి ఋషికుల్య యందు ఉద్గీథుడు జనించాడు. అతనికి దేవకుల్య యందు ప్రస్తోత, ప్రస్తోతకు వరరుత్స యందు విభుడు ప్రభవించారు. విభునికి భారతి యందు పృథుషేణుడు పుట్టాడు. అతనికి ఆకూతి యందు నక్తుడు, అతనికి గయుడు పుట్టారు.

## గయుని చరిత్ర

రాజా! భరతుడు జగద్రక్షాదీక్షితు డైనందున అతని కళ గయుని రూపంలో అవతరించింది. గయుడు దయార్ద్రధర్మబుద్ధితో ప్రజాపరిపాలన చేస్తూ, దుష్టులను అణగద్రొక్కి, పరమేశ్వరార్పణగా యజ్ఞాదిసత్కర్మలను ఆచరిస్తూ రాజర్షిప్రవరు డనే కీర్తిని సంపాదించాడు. బ్రహ్మవేత్తలను సేవించి భక్తియోగరహస్యం గ్రహించి పరిశుద్ధచిత్తుడై దేహాత్మభావం ఎడబాసి భగవత్తాదాత్మ్యాన్ని పొందాడు. గయుని పోలిన బ్రహ్మవిదుడు, ధర్మరక్షకుడు, శ్రీయుతుడు, సాధుసేవకుడు, వివిధయజ్వ, సత్సభాపూజ్యుడు అయిన రాజు వేరొకడుండటం అరుదని చెప్పవచ్చు. సత్కర్మాచరణలో అతను తనకు తానే సాటి అనిపించుకొన్నాడు.

## గయుని ప్రభావం

రాజా! దక్షప్రజాపతి కన్యకలు శ్రద్ధా మైత్రీ దయా ప్రముఖలు గయుని ఎంతో మెచ్చుకొని పుణ్యనదీజలాలతో అతనిని అభిషేకించారని చెప్పడం కంటే ఆతని ఆధిక్యాన్ని గురించి వేరే చెప్పాలా? అతడు నిష్కాముడై ఉన్నప్పటికీ ధాత్రీదేవి అతని గుణాన్ని దూడగా చేరదీసి కడుపు నిండుగా చేపి, అతని ప్రజలకు సర్వకామాలను పితికింది. అతను అకాము డైనప్పటికీ వేదాలతనికి అప్రార్థితంగా సకలకామాలను సమకూర్చాయి. అతని మాటకు జంకి

రాజులందరూ ధర్మమార్గం తప్పక జనరంజకంగా నడుచుకొన్నారు. బ్రాహ్మణులు తమ ధర్మంలో ఆరవ వంతును కప్పంగా తమకై తామే అతనికి అర్పించారు. ఇంద్రుడు స్వయంగా వచ్చి గయుని యజ్ఞాలలో సోమాన్ని దిగద్రావి మైమరచిపోయేవాడు. గయుని శ్రద్ధావిశుద్ధభక్తియోగానికి భగవానుడు ప్రీతుడై అతని పూజలను అమిత సంతోషంతో స్వీకరించాడు. గయుని మహిమ పురాణవిదులకు గాథారూపమై లోకమంతటా వ్యాపించింది.

## గయుని సంతానం

రాజా! గయునికి జయంతి యందు చిత్రరథుడు, స్వాతి, అవరోధనుడు అని ముగ్గురు కొడుకులు పుట్టారు. చిత్రరథునికి పూర్ణ యందు సమ్రాట్టు జన్మించాడు. అతనికి ఉత్కల యందు మరీచి ఉదయించాడు. మరీచికి బిందుమతి యందు బిందుమతుడు, భోజ యందు మన్యువు, ప్రపన్యువు ఉద్భవించారు. మన్యువుకు సత్య యందు భువనుడు, భువనునికి దోష యందు త్వష్ట, అతనికి విరోచన యందు విరజుడు ప్రభవించారు. విరజుడు విషూచి యందు సత్యజిత్తు మొదలైన కొడుకులు నూర్గురిని, ఒక్క కుమార్తెను పొంది ప్రియవ్రతుని వంశానికి వన్నె తెచ్చి నిజయశశ్చంద్రికలను బహుదూరం వ్యాపింపజేసి విబుధస్తవనీయుడై విలసిల్లాడు' అని అన్నాడు.

## భూగోళ పరిణామాదులు

మహర్షులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకయోగి సమాధానం విని, 'మహాత్మా! ప్రియవ్రతుని చక్రనేమి యొక్క రాపిడికి భూమండలాన సప్తసాగరాలేర్పడి ధరాతలాన్ని ఏడు ద్వీపాలుగా విభజించాయని తెలిపావు. ఎందాకా సూర్యరశ్మి సోకుతుందో, ఎందాకా చంద్రతారాగణం కానవస్తుందో, అంతదాక భూమండలం వ్యాపించి ఉన్నదని వివరించారు. అట్టి భూమండలం యొక్క పరిణామలక్షణాలను తెలుసుకోవాలని కుతూహలంగా ఉన్నది. అది ఎందుకు తెలుసుకోవాలని ఉన్నదో కూడా చెబుతున్నాను: భూమండలమంటే

భగవద్గుణాత్మక స్థూలరూపం కదా! ఆ రూపం ప్రత్యక్షగోచరం కాబట్టి దానియందు మనస్సు ప్రవేశింపనోచితే, తర్వాత అదే తనంతట తానే క్రమక్రమంగా నిర్గుణము సూక్ష్మము అయిన పరబ్రహ్మమందు చేరగలుగుతుంది. పరబ్రహ్మ తత్త్వాన్ని గ్రహించి స్వానుభవసిద్ధం చేసికొనడమే కదా జన్మఫలం! ఆ కారణాన మిమ్మల్ని నేడు ఈ విధంగా కోరుతున్నాను' అన్నాడు.

శుకమహర్షి ఆ ప్రశ్నకు హర్షించాడు. 'రాజేంద్రా! భగవంతుని విభూతివిశేషాలను అడుగుతున్నావు. అతని మాయావిభూతిస్థాన విశేషాలకు ఇది అంతమని, ఇది రూపమని, ఇవి లక్షణాలని సహస్రదివ్య వర్షాలు ఊహించినా బుద్ధికి కూడా అందవు. ఇక మాట సంగతి చెప్పేదేమున్నది? అయినా నీ కోరికను రిత్తపుచ్చకూడదు కాబట్టి, భూగోళంలోని ప్రధానవిషయాలను సూచ్యార్థసూచకంగా ప్రస్తావిస్తాను.

## సప్తద్వీప సప్తసాగరాలు

ఆ చక్రనేమి తిరిగేటప్పుడు మొట్టమొదటి రాపిడికి విభాగమైన భూభాగాన్ని జంబూద్వీప మంటారు. అది భూగోళానికి మధ్యద్వీపం. ఆ ద్వీపం లక్షయోజనాల విస్తీర్ణం కలిగినది. దానిని చుట్టి ఏర్పడిన గర్తాన్ని క్షారోదం అంటారు. దానికి లవణ సముద్ర మనే నామాంతరం కూడా ఉన్నది. ఆ సముద్ర విస్తీర్ణమూ లక్షయోజనాలే.

లవణసముద్రాన్ని చుట్టి ఉన్న భాగాన్ని ప్లక్షద్వీప మంటారు. దాని విస్తీర్ణం రెండు లక్షల యోజనాలు.

ప్లక్షద్వీపాన్ని చుట్టి ఏర్పడిన గర్తం ఇక్షుసముద్ర మనబడుతుంది. దాని విస్తీర్ణం రెండు లక్షల యోజనాలు.

ఇక్షుసముద్రాన్ని చుట్టి ఏర్పడిన భూభాగం శాల్మలీద్వీపం. దాని విస్తీర్ణం నాలుగు లక్షల యోజనాలు.

శాల్మలీద్వీపాన్ని ఆవర్తించి నాలుగు లక్షల యోజనాల విశాలమైన సురాసముద్రం ఉన్నది.

సురాసముద్రానికి పర్యావరణలో ఏర్పడిన భూభాగానికి కుశద్వీపం అని పేరు. దాని విస్తీర్ణం ఎనిమిది లక్షల యోజనాలు.

కుశద్వీపాన్ని చుట్టి ఏర్పడిన గర్తం ఘృతసముద్రం. అది ఎనిమిది లక్షల యోజనాల విస్తీర్ణాన్ని కలిగి ఉన్నది.

ఘృతసముద్రానికి చుట్టూ ఏర్పడిన భూభాగం క్రౌంచద్వీపం. దాని విస్తీర్ణం పదహారు లక్షల యోజనాలు.

క్రౌంచద్వీపానికి వెలుపల వలయాకృతిలో ఏర్పడిన గర్తానికి దధి సముద్రం అని పేరు. అది పదహారు లక్షల యోజనాల మహావిస్తార మైనది.

దధి సముద్రాన్ని ఆవర్తించి ఏర్పడిన భూభాగం ముప్ఫైరెండు లక్షల యోజనాల శాకద్వీపం.

శాకద్వీపాన్ని చుట్టుకొని ఏర్పడిన గర్తం క్షీరసాగరం. అది కూడా ముప్ఫైరెండు లక్షల యోజనాల విస్తీర్ణాన్ని కలిగి ఉన్నది.

క్షీరసాగరాన్ని పరివర్తించి అరవైనాలుగు లక్షల యోజనాల మహావైశాల్యం కలిగిన పుష్కర ద్వీపం ఉన్నది.

పుష్కర ద్వీపానికి బహిర్వలయంలో అంతే విస్తృతిని కలిగిన స్వాదూదక సముద్రం వెలిసింది.

మొత్తం మీద భూమండలం కోటి ఇరవైఏడు లక్షల యోజనాల విస్తీర్ణం కలిగిన భూభాగం తోను, అంతే విస్తీర్ణం కలిగిన జలభాగం తోను కూడి ఉన్నది. భూ జల భాగాలు రెండూ కలిసి రెండుకోట్ల యాభైనాలుగు లక్షల యోజనాల విస్తీర్ణమవుతుంది.

రాజా! స్వాదూద సముద్రాన్ని చుట్టి ఏమున్నదని అడుగుతావేమో? అక్కడ లోకాలోక పర్వతం ఉన్నది. కంటికి కనబడేది లోకం, కంటికి కానరానిది

అలోకం. ఆ పర్వతం దృశ్యాదృశ్యాల రెండిటి మధ్య నిలిచి రెండిటినీ వేర్వేరు కావిస్తున్నందువల్ల దానికి లోకాలోకం అని పేరు వచ్చింది.

లోకాలోక పర్వతం యొక్క ఆవలి భాగంలో ఏమున్నదో చర్మనేత్రానికి అగోచరం.

## జంబూ ద్వీపం

భూమధ్యభాగంలో ఏర్పడిన ద్వీపాన ఒక జంబూవృక్షం ఉన్నది. ఆ వృక్షనామాన్ని బట్టి ఆ ద్వీపానికి జంబూద్వీపం అని పేరు వచ్చింది.

## జంబూ ద్వీప కులగిరులు

జంబూద్వీపానికి మధ్యభాగంలో మేరుపర్వతం ఉన్నది. దానికి ఉత్తరాన నీలపర్వతం, దానికి ఉత్తరాన శ్వేతపర్వతం, దానికి ఉత్తరదిశలో శృంగపర్వతం ఉన్నాయి.

మేరువుకు దక్షిణదిశలో నిషధపర్వతం, దానికి దక్షిణాన హేమకూటం, అక్కడనుంచి దక్షిణాన హిమాచలం ఉన్నాయి.

## జంబూద్వీప నవఖండాలు

జంబూద్వీప నవఖండాలలో మధ్య భాగాన మేరుపర్వతం ఉన్నదని చెప్పాను. ఆ పర్వతం ఉన్న ప్రదేశం ఇలావృతం, రమ్యకం, హిరణ్మయం, కురువు, హరి, కింపురుషం, భారతం, కేతుమాల, భద్రాశ్వం అని తొమ్మిది వర్షాలుగా ఏర్పడింది.

మేరుమహానగానికి ఉత్తరాన నీలపర్వతం మొదలుకొని దక్షిణాన నిషధపర్వతం వరకు వ్యాపించి ఉన్న ప్రదేశం ఇలావృత వర్షం.

నీలపర్వతం నుంచి శ్వేతపర్వతం వరకు విస్తరించి ఉన్న భూమిభాగం రమ్యక వర్షం.

శ్వేతపర్వత శృంగపర్వతాలకు మధ్య నున్న ప్రదేశం హిరణ్మయ వర్షం.

శృంగపర్వతం నుంచి ఉత్తరాన లవణ సముద్రం వరకు ఉన్నది కురు వర్షం.

నిషధపర్వతానికి హేమకూటానికి మధ్య వెలసిన ప్రదేశం హరి వర్షం.

హేమకూటం నుంచి మేరువుకు దక్షిణ దిశలో ఉన్న హిమవత్పర్వతం వరకు విస్తరించిన భూమిభాగం కింపురుష వర్షం.

హిమాచలానికి దక్షిణపార్శ్వంలో లవణ సముద్రానికి మధ్యనున్న ప్రదేశం భారత వర్షం.

నీలపర్వతాన్ని కదిసి దానికి పశ్చిమ భాగాన మాల్యవంత పర్వతం ఉన్నది. మాల్యవంతానికి ఆవలి భాగం కేతుమాల వర్ష మనబడుతోంది.

నిషధపర్వతాన్ని అంటిపెట్టుకొని దానికి తూర్పు భాగంలో గంధమాదన పర్వతం ఉన్నది. దానికి చేరువగా ఉన్న ప్రదేశాన్ని భద్రాశ్వ వర్షం అన్నారు.

ఈ విధంగా నవఖండాలు ఏర్పడ్డాయి.

## పర్వతాల విస్తీర్ణాదులు

మేరుగిరికి ఉత్తరపార్శ్వంలో ఉన్న నీల శ్వేత శృంగపర్వతాలు మూడూ తూర్పుదెసకు రెండువేల యోజనాలు సాగి లవణాబ్ధిని తాకుతున్నాయి. ఆ మూడింటిలో నీలపర్వతం కంటె శ్వేతపర్వతం, దానికంటె శృంగపర్వతం నిడుపులో దశాంశాని కంటె కొంచెం ఎక్కువ ఉంటాయి.

మేరుపర్వతానికి దక్షిణభాగంలో ఉన్న నిషధాదిగిరులు కూడా తూర్పు దెస నిడుదలై పదివేల యోజనాల పొడవు కలిగి ఉంటుంది.

మాల్యవంతం గంధమాదనం ఒక్కొక్కటి పదివేల యోజనాల ఆయామం కలిగి ఉంటాయి.

## మేరు పర్వతం

రాజా! మేరుపర్వతం కనకమయమై కులగిరులకు రాజు వంటిదై భూమండలపద్మానికి కర్ణిక వలె ఒప్పారుతున్నది. ఆ పర్వతం ఎత్తు లక్ష యోజనాలు. అందులో పదహారు వేల యోజనాలు భూమిలోనికి ప్రాకి ఉంటుంది. భూమిమీద అది ఎనభైనాలుగు వేల యోజనాల పొడవు, పదహారువేల యోజనాల వెడల్పు కలిగి కానవస్తుంది. ఆ గిరి శిరోభాగం ముప్పై రెండు యోజనాల వెడల్పు గలది.

## ఉప పర్వతాలు

మేరుగిరికి తూర్పున మందర పర్వతం, దక్షిణాన మేరుమందర పర్వతం, పడమటి భాగాన సుపార్శ్వ పర్వతం, ఉత్తర దిశ యందు కుముద పర్వతం ఒక్కొక్కటి పదివేల యోజనాల పొడవు, అంతే వెడల్పు కలిగి మేరువుకు ఊతకర్రల వలె నిలిచి ఉన్నాయి. అందులో మందర శిఖరం పైని చూత వృక్షం, మేరుమందర శిఖరాన జంబూవృక్షం, సుపార్శ్వ శిఖరాన కదంబవృక్షం, కుముదశిఖరాన వటవృక్షం ఉన్నాయి. అవి ఒక్కొక్కటి పదకొండు వందల యోజనాల ఎత్తు వెడల్పులను కలిగి శాఖోపశాఖలతో విస్తరించి ఆ మహాద్రుల పైని కేతనాల వలె అలరారుతున్నాయి.

## క్షీరాది తటాకాలు

ఆ పర్వత శిఖరాలలో నూరు యోజనాల విస్తీర్ణం కలిగిన గొప్ప మడుగులు ఉన్నాయి. వాటిలో ఒకటి పాలతోను, ఒకటి తేనెతోను, ఒకటి చెరుకు రసం తోను, ఒకటి తేటనీటి తోను నిండి ఉబుకు లాడుతుంటాయి. ఉపదేవగణాలు ఆ క్షీరాదులను గ్రోలి యోగైశ్వర్యాదులను పొందుతుంటారు.

## నందనాది వనాలు

అక్కడ నందనం, చైత్రరథం, వైభ్రాజికం, విశ్వతోభద్రం అని నాలుగు దేవోద్యానాలు ఉన్నాయి. వేల్పులు వారి ప్రేయసులతో వచ్చి ఆ

వనవిహారాదులతో ఆనందిస్తుంటారు. ఆ విహార సమయాలలో అక్కడ సిద్ధగంధర్వాదుల సంగీత నాట్యాదులు మనస్తృప్తికరంగా ఉంటాయి.

## అరుణోదయ ప్రవాహం

మందరగిరి కొమ్ముపై ఉన్న చూత వృక్షాగ్రం నుంచి అమృతమధురాలైన దివ్యఫలాలు గిరిశిఖరాలంత పెద్దవి పండి రాలి పగిలి రసాలను గుమ్మరిస్తుంటాయి. ఆ రసాలు కూడి యేరై ఇలావృత వర్షాన తూర్పుముఖంగా ప్రవహిస్తుంటాయి. ఆ చూతరసాలు అరుణవర్ణంలో ఉన్నందువల్ల ఆ ప్రవాహానికి అరుణోదయం అని పేరువచ్చింది. పార్వతీపరిచారిక లైన దేవవనితలు అక్కడికి వచ్చి ఆ జలాలను సేవించి వెళ్ళేటప్పుడు వాటి దివ్యవాసనలను వారి శరీరముఖంగా లలితమారుతాలు తీసికొనిపోయి ఆ చుట్టుప్రక్కల పదివేల యోజనాల ప్రాంతాన్ని పరిమళింపజేస్తాయి.

## జంబూ నది

మేరుమందర శిఖరాన పెద్దజంబూవృక్షం ఉన్నది. ఆ వృక్షఫలాలు గజప్రమాణంలో ఉంటాయి. ఆ పండ్లు రాలినప్పుడు ఫలరసాలు కూడి జంబూనది పేర ప్రవహించి క్రిందికి దిగి ఇలావృత వర్షం యొక్క దక్షిణ భాగాన ప్రవహిస్తాయి. ఆ యేటి రెండు ఒడ్లలోనూ ఉన్న మన్ను ఆ జంబూఫలరసంలో తడిసి మాగి వాతార్కపుటపాకం పొంది సువర్ణమవుతుంది. అది జంబూనదీరసం వలన కలిగినందువలన దానిని జాంబూనదం అంటారు. ఆ సువర్ణాన్ని దేవతాదులు కొనివచ్చి, కటక కటిసూత్ర మకుటాది భూషణాలుగా నిర్మించి అలంకరించుకొంటారు.

## పంచముఖి

సుపార్శ్వగిరి శిఖరాన గొప్ప కదంబవృక్షం ఉన్నది. ఆ వృక్షవివరం నుంచి అయిదు మధుధారలు పంచముఖాల వెలువడి ఆ గిరిశృంగాలపై పడి క్రిందికి జారి ఇలావృతవర్షం పశ్చిమభాగాన్ని తడుపుతూ ప్రవహిస్తాయి. ఆ

తేనియలను గ్రోలినవారి ముఖాల నుంచి కమ్మని వాసనలు వెడలి మారుతానీతములై నూరు యోజనాలు వ్యాపిస్తుంటాయి.

## శతవల్కజాత నదాలు

కుముదపర్వత శిఖరాన వటవృక్షం ఉన్నదని చెప్పాను. ఆ వృక్షాన్ని శతవల్కం అంటారు. దాని స్కంధం నుంచి మహానదాలు వెలువడి క్రిందికి పారుతూ పయోదధిఘృతమధుగుణాన్నాలను, వస్త్రశయనాసనాది సమస్తవస్తుసామగ్రిని కోరినవారికి కోరినంత ప్రసాదించి ఇలావృతవర్షానికి ఉత్తరదిశగా ప్రవహిస్తాయి. ఆ నదీజలాలను సేవించినవారికి మేనిపై ముడతలు రావు; వెంట్రుకలు నెరయవు; చెమట వాసనలు పుట్టవు; శ్రమ తెలియదు; ఆధివ్యాధులు గాని శీతోష్ణవివర్ణతలు గాని జరామరణాలు గాని చేరరావు. వారు యావజ్జీవం నిరతిశయ సుఖజీవులై విలసిల్లుతారు.

## మేరుపరిసర పర్వతాలు

మేరుపర్వతానికి క్రిందిభాగంలో నలు వైపుల కురంగ, కురర, కుసుంభ, వైకంకత, త్రికూట, శిశిర, పతంగ, రుచక, నిషధ, శితివాస, కపిల, శంఖ, చారు, విహంగ, ఋషభ, నాగ, కాలాంజన, నారదాది గిరులు పద్మకర్ణికకు కేసరాల వలె ఆ మహాద్రిని ఆవరించి ఉంటాయి. మేరు గిరికి తూర్పుభాగంలో జఠర దేవకూటాలు, దక్షిణ భాగంలో కైలాస కరవీరాలు, పశ్చిమాన పవన పారియాత్రాలు, ఉత్తరాన త్రిశృంగ మకరాలు నిలిచి ఆ మేరుభారాన్ని మోస్తున్న దిగ్గజాల వలె అలరారుతుంటాయి. అందులో జఠర దేవకూట పవన పారియాత్రాలు నాలుగూ దక్షిణోత్తరాలుగా ఉంటాయి. అవి ఒక్కొక్కటి పద్దెనిమిదివేల యోజనాల నిడుపు, రెండువేల యోజనాల వెడల్పు కలిగినవి. కైలాస కరవీర త్రిశృంగ మకర పర్వతాలు నాలుగూ పూర్వపశ్చిమాలకు సాగి, పద్దెనిమిదివేల యోజనాల నిడుపు, రెండువేల యోజనాల వెడల్పు కలిగి చూడ ముచ్చటగా ఉంటాయి.

## బ్రహ్మ పురం

మేరుపర్వతశిఖర మధ్యభాగంలో బ్రహ్మపురం ఉన్నది. అది పదివేల యోజనాల నిడుపు వెడల్పులను కలిగి సమచతురస్రంగా సువర్ణమయమైన గొప్ప పట్టణం. ఆ పురానికి మనోవతి అని నామాంతరం ఉన్నది. దానికి ఎనిమిది వైపుల లోకపాలకుల పట్టణాలు– దేవేంద్రుని అమరావతి, అగ్నిదేవుని తేజోవతి, యముని సంయమనీ పురం, నిర్ఋతి కృష్ణాంజనం, వరుణుని శ్రద్ధావతి, వాయువు గంధవతి, కుబేరుని మహోదయ, ఈశానుని యశోవతి ఉన్నాయి. ఆ నగరాలు ఒక్కొక్కటి రెండువేల అయిదువందల యోజనాల విస్తీర్ణం కలిగినవి.

## గంగా నిర్గమం

రాజేంద్రా! భగవానుడు పూర్వం వామనావతారమెత్తి బలిచక్రవర్తి దాతృత్వాన్ని పరీక్షించేందుకు అతనిని మూడడుగుల నేలనిమ్మని అడగటమూ, బలిచక్రవర్తి అందుకు సమ్మతించటం, వామనుడు దక్షిణ పాదాన్ని జాపటం, దానికి భూభాగమంతా చాలక పోవటం, తర్వాత వామపాదం యొక్క అడుగులోపల ఊర్ధ్వకటాహమంతా ఇమిడిపోవటమూ నీకు తెలిసే ఉంటుంది. భగవానుడు వామపాదాన్ని చాచినప్పుడు ఆయన కాలి బొటన వ్రేలి గోరుకొన తాకి ఊర్ధ్వకటాహం చీలి అందులో ఒక బొరియ ఏర్పడింది. ఆ రంధ్రం నుంచి జలధార వెలువడి భగవత్పాదపద్మ ప్రక్షాళన భాగ్యానికి నోచి ఆ శ్రీచరణ కుంకుమ కింజల్కం కెంజాయ దాల్చి మనోభిరామంగా శోభిల్లింది. భగవత్పాదస్పర్శ ఫలంగా ఆ నదికి భగవత్పది అని పేరు కలిగింది.

ఆ విధంగా వెడలిన జలధారను ఉత్తానపాదుని పుత్రుడు ధ్రువుడనే పరమభాగవతుడు చూసి, 'ఆహా! ఇది నా కులదేవతా పాదారవిందోదకం' అని భక్తిపరవశుడై ఆనందాశ్రువులు కురియగా ఆ పుణ్యజలాలను నేటికీ సేవిస్తుంటాడు.

ధ్రువపదానికి క్రింద సప్తర్షు లుంటారు. ముముక్షువులు అన్యపురుషార్థాలను ఉపేక్షించినట్లు ఇతర యోగాలన్నింటినీ వదిలి ఆ నదీజల నిరంతర సేవాయోగమే ఉత్తమోత్తమ తపస్సని భావించి తమ జటాజూటాలలో ఆ నీటిని ధరిస్తారు.

ఆ ప్రవాహం ధ్రువపద సప్తర్షిమండలాలను దాటి చంద్రమండలాన్ని ఆవరించి మేరునగశిఖాగ్రాన ఉన్న బ్రహ్మసదనాన్ని ప్రవేశించి అక్కడ నాలుగు పాయలుగా చీలింది. ఆ నాల్గింటిని సీత, అలకనంద, చక్షుస్సు, భద్ర అని పేర్కొంటారు. వాటిలో సీతానది బ్రహ్మసదనం నుంచి తూర్పు పార్శ్వాన బయలుదేరి కేసరం అవష్టంభం మొదలైన పర్వత శిఖరాల మార్గాన ప్రయాణించి కుముదకుకురాది గిరిశృంగాలను దాటి, క్రిందికి జారి మేరుప్రాగ్భాగం పైకురికి, గంధమాదన శిఖరాలను దాటి భద్రాశ్వవర్షం ప్రవేశించి దాని మధ్యప్రదేశానికి ఇంపుగూర్చుతూ ముందుకు సాగి తూర్పునుంచి లవణసముద్రాన్ని చేరుతున్నది. చక్షుస్సు పశ్చిమపార్శ్వాన నడిచి మాల్యవంత శిఖరాలకు దిగి, అక్కడి నుంచి జారి కేతుమాలవర్ష మధ్యభాగాన్ని పవిత్రీకరిస్తూ పశ్చిమ లవణాబ్ధిలో పడుతున్నది. భద్రానది ఉత్తర మార్గాన్ని తొక్కి శృంగవంతశిఖరం ప్రవేశించి, అక్కడి నుంచి ఉత్తర కురువర్షం చేరి ఉత్తర లవణార్ణవంలో కలుస్తున్నది. అలకనంద బ్రహ్మసదనం నుంచి దక్షిణద్వారాన బయలుదేరి నానాగిరికూటాలను దాటి మహావేగంతో హేమకూట హిమకూటాలను అతిక్రమించి కర్మక్షేత్రమైన భారతవర్షాన్ని చేరి దక్షిణాన లవణ సముద్రాన్ని సంగమిస్తున్నది.

ఇవి కాక మేరువు మొదలైన పర్వతాలకు పుత్త్రికలై ప్రవహించే నదులు ప్రతివర్షం లోనూ వేనవేలుగా ఉన్నాయి. వాటిలో కొన్ని నదులు పశ్చిమాభిముఖం గాను, కొన్ని పూర్వముఖం గాను పారుతున్నవి. పశ్చిమ ముఖంగా పారే వాహినులను నదములు అని, పూర్వముఖంగా పారే వాహినులను నదులని అంటారు.

## భూలోక స్వర్గాలు

రాజా! జంబూద్వీపంలో ఉన్న భారతవర్షం ఒక్కటి మాత్రమే కర్మక్షేత్రం. తక్కిన వర్షాలు ఎనిమిదీ భోగక్షేత్రాలు. స్వర్గగతులు వారి వారి పుణ్యశేషాలను ఆయా వర్షాలలో భోగిస్తారు. ఆ కారణాన వాటిని భూలోక స్వర్గాలని అంటారు.

భోగక్షేత్రాలలో నివసించే పురుషులకు పదివేల సంవత్సరాల ఆయుః ప్రమాణం విహితమై ఉన్నది. వారు జరావ్యాధిభయాలు లేక దృఢాంగులు, గజబలులు అయి వయోబలమోదాలతో పరిఢవిల్లుతూ దేవతుల్యులై సురతభోగాలను అనుభవిస్తారు. వారికి ఆయుశ్శేషం సంవత్సరం మాత్రమే ఉన్నదనగా వారి భార్యలు గర్భవతు లవుతారు. అంతవరకు వారికి సురతభోగవిషయంలో ఎటువంటి అంతరాయమూ కలుగదు.

ఇంకొక విశేషమేమిటంటే పురుషులెవరైనా ప్రమాదవశంగా నైనా ఇలావృతవర్షాన్ని ప్రవేశిస్తే వారు స్త్రీలవుతారు. ఇది భవానీదేవి శాపం. అందువల్ల పురుషులెవరూ ఆ చాయలకు కూడా వెళ్ళరు.

ఆ ఎనిమిది వర్షాలలోనూ పెక్కు వనాశ్రమాలు ఉన్నాయి. అవి సర్వ ఋతువులలోనూ కిసలయ కుసుమ ఫలభరితాలై సొబగారుతుంటాయి. అక్కడి కొండ చరియలలో సరోవరాలనేకం ఉన్నాయి. వాటి జలాలు కమలకల్హారపరాగమనోజ్ఞాలై హంస కారండవాది విహంగ మృదుమధుర స్వనసంకులాలై శ్రవణాది సర్వేంద్రియతర్పణ కావిస్తుంటాయి. దేవతలు వారి వారి సుందరీమణుల తోనూ పరిచారికాది బృందాల తోనూ వచ్చి ఆ సరస్సులలో యథేచ్ఛా జలక్రీడలు సలుపుతుంటారు.

## నవవర్షాలలో భగవత్సేవావిధానాలు

రాజేంద్రా! భగవానుడు రూపనామ రహితు డైనా భక్తులకు సేవాభాగ్యాన్ని కలిగింపగోరి వివిధమూర్తులు ధరించి సన్నిధి కావిస్తుంటాడు. భగవానుడు

ఇలావృత వర్షంలో చంద్రశేఖరరూపం, భద్రాశ్వ వర్షంలో హయగ్రీవమూర్తి రూపం, హరి వర్షంలో నృసింహరూపం, కేతుమాల వర్షంలో కామదేవస్వరూపం, రమ్యక వర్షంలో మత్స్యావతారరూపం, హిరణ్మయ వర్షంలో కూర్మావతారరూపం, ఉత్తర కురు వర్షంలో యజ్ఞవరాహమూర్తి రూపం, కింపురుష వర్షంలో సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రమూర్తి రూపం, భారత వర్షంలో నారాయణావతార రూపం ధరించి భక్తజనమందారుడై సేవింపబడుతుంటాడు.

## మూర్తి భేదాలను బట్టి మంత్రభేదాలు

రాజేంద్రా! నవవర్షాలలోని భగవన్మూర్తి భేదాలను బట్టి మంత్రభేదాలు ఉన్నాయి.

ఇలావృత వర్షంలో చంద్రశేఖరమూర్తికి 'ఓం నమో భగవతే వాసుదేవాయ సర్వగుణ సాంఖ్యానాయావ్యక్తాయ నమః' అని జపమంత్రం.

భద్రాశ్వ వర్షంలో హయగ్రీవమూర్తికి 'ఓం నమో భగవతే ధర్మాయాత్మవిశోధనాయ నమః' అని జపమంత్రం.

హరి వర్షంలో నృసింహమూర్తికి 'ఓం నమో భగవతే నరసింహాయ నమ స్తేజ స్తేజసే, ఆవిరావిర్భవ – వజ్రనఖ – వజ్రదంష్ట్ర – కర్మాశయాన్ రంధయ రంధయ – నమ ఉగ్రస్వభావాయ మహాత్మనే తమో గ్రస గ్రస స్వాహా – అభయ మభయ మాత్మని భూయిష్ఠా' అని మంత్రం.

కేతుమాల యందు 'ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వగుణ విశేష విలక్షితాత్మనే – ఆకూతీనాం – చిత్తానాం – చేతసాం చ – విశేషాణాం – చాధిపతయే – షోడశకలాయ – ఛందోమయాయ, అన్నమయాయ, అమృతమయాయ, సర్వమయాయ, సహసే, ఓజసే, బలాయ, కాంతాయ, కామాయ నమస్తే – ఉభయత్ర భూయాత్' అని కామదేవ మంత్రం.

రమ్యక వర్షంలో మత్స్యావతారమూర్తికి 'ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమ స్సత్త్వాయ ప్రాణాయౌజసే సహసే బలాయ మహామత్స్యాయ నమః' అని జపమంత్రం.

హిరణ్మయ వర్షంలో కూర్మావతార మూర్తికి 'ఓం నమో భగవతే అకూపారాయ సర్వసత్త్వ గుణవిశేషాయ నోపలక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమోఽ వస్థానాయ నమస్తే' అని జపమంత్రం.

ఉత్తర కురు వర్షంలో యజ్ఞావరాహమూర్తికి 'ఓం నమో భగవతే మంత్రతత్త్వలింగాయ యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహీధరాయ మహాపురుషాయ నమః కర్మశుక్లాయ త్రియుగాయాగుణాయ నమస్తే' అని జపమంత్రం.

కింపురుష వర్షంలో శ్రీరామచంద్ర రూపానికి 'ఓం నమో భగవతే ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణ శీలవ్రతాయ నమ ఉపశిక్షితాత్మనే నమ ఉపాసిత లోకాయ నమ స్సాధువాద నికర్షణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజాయ నమః' అని జపమంత్రం.

భారత వర్షంలో శ్రీమన్నారాయణావతార మూర్తికి 'ఓం నమో భగవతే ఉపశమశీలాయ ఉపరతానాత్మ్యాయ నమో కించన విత్తాయ ఋషి ఋషభాయ నారాయణాయ పరమహంసాయ పరమగురవే ఆత్మారామాధి పతయే నమో నమః' అన్నది జపమంత్రం.

## భరతవర్ష విశేషాలు: ముఖ్యశైలాలు

రాజేంద్రా! భారతవర్షంలో అనేక మహాశైలాలు కనిపిస్తాయి. వాటిలో మలయం, మంగళప్రస్థం, మైనాకం, త్రికూటం, ఋషభం, కూటరం, కోల్లం, సహ్యం, వేదగిరి, ఋశ్యమూకం, శ్రీశైలం, వేంకటం, మహేంద్రం, వారిధరం, వింధ్యం, శుక్తిమంతం, ఋక్షగిరి, పారియాత్రం, ద్రోణం, చిత్రకూటం, గోవర్ధనం, రైవతకం, కకుంభం, నీలం, కాకముఖం, ఇంద్రకీలం, రామగిరి అన్నవి ఇరవైఏడూ ముఖ్యమైనవి.

## ముఖ్య నదులు

రాజేంద్రా! ఈ ముఖ్యపర్వతాలలో పుట్టి ప్రవహిస్తూ భారతజనులకు నామస్మరణ పానాదుల వలన పావనత్వాన్ని కూర్చుతున్న నదులు అనేకం ఉన్నాయి. వాటిలో చంద్రపట, తామ్రపర్ణి, యవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, శిల, సురస, నర్మద, చర్మణ్వతి, సింధువు, శోణనద, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయు, భోగవతి, సుషమ, శతద్రు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అసిక్ని, విశ్వ అనే నలభైమూడు నదులు ముఖ్యమైనవి.

## పురుషార్థసంపాదనకు యోగ్యస్థానం

రాజా! కర్మము సాత్త్విక రాజస తామస గుణప్రేరితమై కొనసాగుతూ తత్తద్గుణానురూపంగా ఫలిస్తుంటుందని, ఆ ఫలాలను అనుభవింపక తీరదని, ఫలభోగార్థం జీవులు తదనురూప గుణశరీరాలను దాల్చి పుట్టి ప్రారబ్ధఫలం అనుభవించి ఆ తనువులను వదిలి సంచిత కర్మఫలశేషభోగార్థం మళ్ళీ మళ్ళీ తత్తదనుగుణదేహాలను ధరిస్తుంటారని తెలిపాను. అట్టి కర్మమును అనుభవించడానికి, జన్మకారణమైన అవిద్యాబంధాన్ని తెగనాడి పురుషార్థాన్ని పొందడానికి జీవులు భారత వర్షంలో జన్మిస్తారు. భారతవర్షంలో పుట్టినవారికి అవిద్యానిరసనోపాయం ఏమిటంటావా? మహాపురుష సంగమే ముఖ్యోపాయం. ఆ సత్సంగఫలంగా అనన్యమైన భక్తియోగం సిద్ధిస్తుంది. ఇవే పరమసాధనాలు. ఈ రెండూ భారతవర్షజాతులకు వర్ణాశ్రమక్రమంలో అలవడేందుకు అవకాశం ఎంతైనా ఉన్నది.

## దేవతలకు భారతవర్ష జన్మాభిలాష

రాజేంద్రా! నరులు స్వర్గసుఖాన్ని కోరి దుష్కరమైన తపోవ్రతక్రతుదానాదికాలు చేసి దానిని సాధిస్తారు. స్వర్గలోకవాసులైన సురలు

స్వర్గసుఖాలు తుచ్ఛమైనవని తలపోసి, 'ఈ స్వర్గభోగాలకు ఏనాటికైనా అంతమంటూ ఒకటున్నది. తర్వాత మళ్ళీ జన్మింపక తప్పదు. ఆ జన్మ లెటువంటివో ఊహింపలేము. ఇక భోగపరులకు భగవత్పాదస్మరణమంటే ఎంతో అరుదయిన సంగతి. జన్మరాహిత్యం ఒక్కటే ఉత్తమోత్తమసుఖం. అది భగవత్సేవ వలన తప్ప వేరొక తీరున కలిగేది కాదు. హరి సేవకు నరజన్మమందు వలె అన్యజన్మలలో అవకాశం ఉండదు. కల్పాంతస్థానాన్ని సాధించి మళ్ళీ జన్మపరంపరలో చిక్కుకొనడం కంటె సర్వసంగత్యాగ మూలకంగా నిత్యమైన హరిపదాన్ని చేరనోచిన భారతవర్షజన్మం క్షణావస్థాయి అయితేనేమి? సర్వవిధాల వాంఛనీయం కదా! మాకు కూడా భారతవర్షంలో మనుష్య జన్మం కలుగుతుంది గాక. అయ్యో! శ్రీవైకుంఠుని కథాసుధానదులలో గ్రుంకులాడి భాగవతుల తోడి సంగమభాగ్యం చేకూరి ఆనందింపగలిగే కలిమి లేనినాడు బ్రహ్మలోకమే వచ్చినా మరే లోకం లభించినా గర్హ్యమవుతుందే గాని క్షణమాత్రమైనా కోరదగదు. అన్యులకు దుర్లభమైన భగవదాశ్రయసంపద కలిగినా, మోక్షానికై ప్రయత్నింపని వారి గతి ఎంత శోచ్యమైనది! వృక్షాన్ని ఆశ్రయించిన పక్షులు బోయ వలలో ఒకసారి చిక్కి ఎట్లాగో తప్పించుకొని, మళ్ళీ ఆ చెట్టునే చేరి మళ్ళీ ఆ బోయవలకు చిక్కి నశించినట్లు జీవులు ఏదో ఒక విధంగా మనుష్యత్వాన్ని పొంది, ముక్తి కాములు గాక భోగార్థులయితే, వారి అవివేకానికి ఏమనుకోవాలి?

భగవానుడు నిత్యపూర్ణుడు. అటువంటివాడు కూడా భారత వర్షంలోని జనులు సమర్పించిన పురోడాశాదులను ఎంతో ప్రీతితో పరిగ్రహిస్తాడు. భారతవాసుల భాగ్యమే భాగ్యం. భగవానుడు సర్వకామప్రదుడు. కోరినవారికి కోరినదానినే ఇస్తాడు. నిష్కామబుద్ధితో భగవానుని ఆరాధించినప్పుడు కామఫలములన్నీ కాలగతాలై నశించిపోతాయి. ఏదీ కోరక భగవంతుని ఆరాధించేవారికి నిత్యమైన మోక్షాన్ని భగవానుడు అనుగ్రహిస్తాడు. పూర్వం మేము చేసిన యజ్ఞాధ్యయన సత్యాది సత్కర్మల ఫలంగా మాకిప్పుడు స్వర్గలోక నివాసం అలవడింది. ఆ కర్మలలో ఏదేని శేషించి పునర్జన్మకు కారణంగా ఉంటే

మాకు భారతవర్షంలో నరజన్మ లభిస్తుంది గాక. అలాగు జన్మించి భక్తవత్సలు డైన భగవానుని భక్తి చేసి పరమార్థాన్ని పొందాలిగాక' అని లోలోన పరితపిస్తారు. రాజా! భారత వర్షంలోని నరజన్మ విశేషం ఎంతటిదో నీవే ఊహించి చూడు.

## ఉపద్వీపాలు

రాజా! జంబూద్వీపానికి ఎనిమిది ఉపద్వీపాలు ఉన్నాయి. వాటిని స్వర్ణప్రస్థం, చంద్రశుక్లం, ఆవర్తనం, రమణకం, మందేహారుణం, పాంచజన్యం, సింహళం, లంక అని పేర్కొంటారు. పూర్వం సగరచక్రవర్తి అశ్వమేధయాగానికి ఉపక్రమించి యజ్ఞాశ్వాన్ని విడిచిపెట్టాడని, దానిని ఇంద్రుడు హరించాడని, సగరుని పుత్రులు ఆ అశ్వాన్వేషణపరులై ధాత్రిని త్రవ్వారని, తత్ఫలంగా జంబూద్వీపంలో ఎనిమిది ఉపద్వీపాలు ఏర్పడ్డాయని కొందరంటారు.

## ప్లక్ష ద్వీపం

రాజేంద్రా! ఈ ద్వీపంలో మహాప్లక్ష (రావి) వృక్షం ఒకటున్నది. దానిని బట్టి ఆ ద్వీపానికి ప్లక్షద్వీపమని పేరువచ్చింది. ఆ ద్వీపంలో అగ్నిదేవుడు సప్తజిహ్వుడనే పేర విలసిల్లుతున్నాడు.

## ప్లక్షద్వీప సప్తఖండాలు

తొల్లింటి ప్రియవ్రతుని సుతుడు ఇధ్మజిహ్వుడు ఆ ప్లక్షద్వీపాన్ని పరిపాలిస్తుండేవాడు. అతనికి ఏడుగురు కొడుకులు పుట్టారు. అతను ప్లక్షాన్ని ఏడు ఖండాలుగా విభజించి ఏడుగురికీ అప్పజెప్పాడు. ప్రియవ్రతాత్మజుల పేర్ల మీదుగా ఆ సప్తఖండాలకు శివము, యశస్యము, సుభద్రము, శాంతము, క్షేమము, అభయము, అమృతము అని ప్రసిద్ధి కలిగింది.

## ప్లక్షద్వీప సప్తపర్వతాలు

ఆ ద్వీపంలో మణికూటం, వజ్రకూటం, ఇంద్రసేనం, జ్యోతిష్మంతం, ధూమ్రవర్ణం, హిరణ్యగ్రీవం, మేఘమాలం అనబడే కులపర్వతాలు ఏడు కనిపిస్తాయి. ఆ పర్వతాలు ఏడూ ప్లక్షద్వీపంలోని సప్తవర్షాలకు సరిహద్దులుగా ఉన్నాయి.

## ప్లక్షద్వీప సప్తమహానదులు

ఆ ద్వీపంలో అరుణ, నృమణ, ఆంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర అని ఏడు మహానదు లున్నాయి.

## చాతుర్వర్ణ్యం

ప్లక్షద్వీపమందలి జనులు హంసులు, పతంగులు, ఊర్ధ్వాయనులు, సత్వాంగులు అనే పేర్లతో నాలుగు వర్ణాలుగా ఉంటారు. వారందరూ ఆ ద్వీపమందలి నదీజలాలను స్నానపానాదిరూపాలలో సేవించటం వలన ఆ నీటి ప్రభావంతో నిరస్తరజస్తమోగుణులై ఆయుర్వృద్ధి కలిగి సహస్రవత్సరాలు జీవిస్తారు. వారి దేహాలు దేవతల శరీరాల వలెనే చెమర్పవు; బడలికలు పొందవు.

## సూర్యోపాసనం

ప్లక్షద్వీపవాసులు సూర్యోపాసకులు. స్వర్గద్వారభూతుడు వేదమయుడు అయిన ఆ సూర్యభగవానుని త్రయీ విద్యాపూర్వకంగా ఉపాసించి, 'ప్రత్నస్య విష్ణో రూపం యత్సత్యర్తస్య బ్రహ్మణ అమృతస్య మృత్యోశ్చ సూర్య మాత్మాన మీమహీ' అన్న మంత్రాన్ని జపిస్తారు.

ప్లక్షాది సప్తద్వీపాలలో పురుషులకు పుట్టుకతోనే ఆయువు, ఇంద్రియోజస్సహోబల బుద్ధివిక్రమాలు పుష్కలంగా కలుగుతాయి.

## శాల్మలీ ద్వీపం

రాజేంద్రా! ఈ ద్వీపంలో ప్లక్షవృక్ష మంతటిది ఒక శాల్మలీ (బూరుగు) వృక్షం ఉన్నది. ఆ వృక్షాన్ని బట్టి ఆ ఖండానికి శాల్మలీ ద్వీపం అని పేరు వచ్చింది.

ఆ శాల్మలీ వృక్షమూలంలో గరుత్మంతుడు నివసిస్తుంటాడు. ఆ పక్షిరాజు రెక్కలల్లార్చినప్పుడు బృహద్రథంతరాది వేదానువాదశబ్దాలు వెలువడతాయి. ఆ విహంగమేశ్వరుడు ఆ విధంగా నిజావయవ భూతాలయిన ఆ శబ్దాలతో శ్రీమహావిష్ణువును సన్నుతిస్తాడు.

## శాల్మలీ ద్వీప సప్తఖండాలు

ఆ ద్వీపాన్ని ప్రియవ్రతుని సుతుడు యజ్ఞబాహుడు పరిపాలించాడు. అతనికి ఏడుగురు కొడుకులు జన్మించారు. అతను ఆ ద్వీపాన్ని ఏడు భాగాలుగా విభజించి ఆ ఏడుగురికీ పంచియిచ్చాడు. ఆ ఖండాలకు వారి పేర సులోచనము, సౌమనస్యము, రమణకము, దేవబర్హము, పారిబర్హము, ఆప్యాయనము, అభిజ్ఞాతము అని ప్రసిద్ధి కలిగింది.

## సప్తగిరులు

ఆ సప్తఖండాలలో సులోచనమందు స్వరస పర్వతం, సౌమనస్యమందు శతశృంగ పర్వతం, రమణకమందు వామదేవ గిరి, దేవబర్హమందు కుముదాద్రి, పారిబర్హమందు ముకుంద పర్వతం, ఆప్యాయనమందు పుష్పవర్ష నగం, అభిజ్ఞానతమందు శతశ్రుతి పర్వతం వెలసి విలసిల్లాయి.

## సప్తనదులు

అక్కడ అనుమతి, సినీవాలి, సరస్వతి, కుమువు, రజని, నంద, రావు అని ఏడు నదులు ప్రవహిస్తుంటాయి.

## చాతుర్వర్ణ్యం

ఆ ద్వీపమందలి పురుషులు శ్రుతధరులు, విద్యాధరులు, వసుంధరులు, ఇధ్మధరులు అనే పేర్లతో నాలుగు వర్ణాలుగా వెలుగొందుతారు.

## సోమోపాసనం

శాల్మలీ ద్వీపవాసులు వేదమయుడు ఆత్మస్వరూపుడు అయిన సోముని వేదపూర్వకంగా యజించి 'స్వగోభిః పితృదేవేభ్యో వ్యభజన్ శుక్లకృష్ణయోః, అంధః ప్రజానాం సర్వాసాం రాజా న స్సోమ అస్సు' అనే మంత్రాన్ని జపిస్తారు.

## కుశద్వీపం

ఈ ద్వీపంలో దేవనిర్మితమైన ఒక కుశస్తంభం ఉన్నది. ఆ స్తంభాన్ని బట్టి దానికి కుశద్వీపం అని పేరువచ్చింది. ఆ ద్వీపాన్ని ఘృతసముద్రం చుట్టి ఉంటుంది. దాని విస్తీర్ణం ఎనిమిది లక్షల యోజనాలని చెప్పాను.

## కుశద్వీప సప్తఖండాలు

కుశద్వీపాన్ని ప్రియవ్రతుని సుతుడు హిరణ్యకేతుడు పరిపాలించాడు. అతనికి వసుదానుడు, దృఢరుచి, నాభి, గుప్తుడు, సత్యవ్రతుడు, విప్రుడు, వామదేవుడు అని ఏడుగురు కొడుకులు పుట్టారు. హిరణ్యరేతుడు కుశద్వీపాన్ని ఏడు ఖండాలుగా విభజించి ఆ ఏడుగురికీ ఇచ్చి తాను తపస్సుకై వనసీమలకు వెళ్ళిపోయాడు. ఆ ఏడుగురి పేర్ల మీదుగా వాటికి వసుదానము, దృఢరుచి, నాభి, గుప్తము, సత్యవ్రతము, విప్రము, వామదేవము అని ప్రసిద్ధి కలిగింది.

## కుశద్వీప కులగిరులు

కుశద్వీపంలో బభ్రువు, చతుశ్శృంగము, కపిలము, చిత్రకూటము, దేవనీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము అని పేర్లుగల ఏడు మహాపర్వతాలున్నాయి. ఆ పర్వతాలు ఒక్కొక్క వర్షానికి సరిహద్దుగా నిలిచి ఆ ద్వీపాన్ని ఏడు భాగాలుగా చూపుతున్నాయి.

## సప్త వాహినులు

ఆ ద్వీపమందు రసకుల్య, మధుకుల్య, శ్రుతవింద, మిత్రవింద, దేవగర్భ, మృతచ్యుత, మంత్రమాల అని ఏడు నదులు ప్రవహిస్తున్నాయి. కుశద్వీపవాసులు ఆ నదుల నీటిని త్రాగి పవిత్రులయ్యారని ప్రసిద్ధి.

## చాతుర్వర్ణ్యం

కుశద్వీపంలోని ప్రజలు బ్రాహ్మణులు కుశులని, క్షత్రియులు కోవిదులని, వైశ్యులు అభిలాషులని, శూద్రులు కుశకులని నాల్గు తెగలుగా వ్యవహరింపబడుతున్నారు.

## అగ్న్యుపాసనం

అగ్నిదేవుడు వారికి ఉపాస్యదైవం. ఆ దేవుని వారు వహ్నిదేవతాకము లైన వివిధకర్మములతో ఆరాధిస్తూ, 'పరస్య బ్రహ్మణ స్సాక్షాజ్జాతవేదోఽసి హవ్యవాట్, దేవానాం పురుషాంగానాం యజ్ఞేన పురుషం యజ' అనే మంత్రాన్ని జపిస్తారు.

## క్రౌంచ ద్వీపం

రాజా! ఇక్కడ క్రౌంచమనే పేరుగల గొప్ప పర్వతం ఉన్నది. ఆ గిరి పూర్వం మదించి సూర్యుని మార్గాన్ని అవరోధించింది. అప్పుడు కార్తికేయుడు తన ఖడ్గాన్ని దానిపై విసిరివేశాడు. ఆ కత్తి తాకు వేడిమికి ఆ కొండలోని పొదలన్నీ నిట్టనిలువున దగ్ధమయ్యాయి. అప్పుడు వరుణుడు ఆ గిరిని కరుణించి అడ్డుపడి కాపాడాడు. ఆ క్రౌంచపర్వతం పేర ద్వీపానికి క్రౌంచద్వీపం అని వ్యవహార మేర్పడింది.

## క్రౌంచద్వీప సప్తఖండాలు

క్రౌంచద్వీపాన్ని ప్రియవ్రతుని సుతుడు ఘృతపృష్ఠుడు పరిపాలించాడు. అతనికి ఆమోదుడు, మధువహుడు, మేఘపృష్ఠుడు, సుదాముడు, ఋషిజ్యుడు,

లోహితార్ణుడు, వనస్పతి అని ఏడుగురు కుమారులు కలిగారు. ఘృతపృష్ఠుడు క్రౌంచద్వీపాన్ని ఏడు ఖండాలుగా విభజించి ఏడుగురు కొడుకులను ఒక్కొక్క ఖండానికి అభిషేకించి భగవత్పాదారవిందసేవారతుడై తపోవనానికి వెళ్ళిపోయాడు. ఆ ఏడు ఖండాలకు ఆ సప్తపుత్రకుల పేర్లే పేర్లుగా ఏర్పడ్డాయి.

## సప్త కులగిరులు

రాజా! క్రౌంచద్వీపమందు శుక్లము, వర్ధమానము, భోజనము, ఉపబర్హణము, ఆనందము, నందనము, సర్వతోభద్రము అని ఏడు కులగిరులు ఉన్నాయి. అవి ఒక్కొక్కటి ఒక్కొక్క ఖండానికి సరిహద్దుగా కనిపిస్తాయి.

## సప్త నదులు

ఆ ద్వీపమందు అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల అను పేర్లతో అలరారే నదీసప్తకం ఉన్నది.

## చాతుర్వర్ణ్యం

ఆ ద్వీపవాసులు గురువులు, ఋషభద్రులు, విణకులు, దేవకులు అని నాలుగు తెగలుగా ఉంటారు.

## వరుణోపాసనం

క్రౌంచద్వీపవాసులకు వరుణుడు ఉపాస్యదైవతం. వారు తమ ద్వీపంలో ప్రవహించే పుణ్యనదీ జలాలను గైకొని పూర్ణాంజలులతో ఆపోమయదేవుని ఆరాధించి 'ఆపః పురుషవీర్యాః స్థపునంత్యో భూర్భువస్సువః, తా నపునం త్వ మీత ఘ్న్య స్స్పృశతామాత్మా నా భవః' అనే మంత్రాన్ని జపిస్తారు.

## శాక ద్వీపం

రాజా! ఈ ద్వీపంలో ఒక గొప్ప శాకవృక్షం ఉన్నది. ఆ టేకుచెట్టును బట్టి ఆ ఖండానికి శాకద్వీపమని పేరువచ్చింది.

## శాకద్వీప సప్తఖండాలు

ఆ ద్వీపాన్ని ప్రియవ్రతుని సుతుడు మేధానిధి పరిపాలించాడు. అతనికి పురోజవుడు, మనోజవుడు, వేపమానుడు, ధూమ్రానీకుడు, చిత్రరథుడు, బహురూపుడు, విశ్వచారుడు అని ఏడుగురు కొడుకులు జన్మించారు. మేధానిధి తన రాజ్యాన్ని సప్తవిభాగాలు చేసి ఏడుగురు కొడుకులకూ పంచియిచ్చి తపోవనానికి వెళ్ళిపోయాడు. ఆ ఏడుగురు కొడుకుల పేర్ల మీదుగా శాకద్వీపంలో ఏడు ఖండాలు వెలసి పేరెన్నిక గన్నాయి.

## సప్త కులగిరులు

ఆ ద్వీపంలో ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రస్రోతము, దేవపాలము, మహాసనము అనే పేర్లతో కులగిరులు ఏడు కనిపిస్తాయి. అవి ఒక్కొక్క ఖండానికీ సరిహద్దులు.

## సప్తవాహినులు

ఆ ద్వీపంలో అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపరి, సహస్రధృతి, నిజధృతి అని పేర్లు గల ఏడు నదులు ఆ వర్షాన్ని పవిత్రీకరిస్తూ ప్రవహిస్తుంటాయి.

## చాతుర్వర్ణ్యం

శాకద్వీపవాసులు ఋతవ్రతులు, సత్యవ్రతులు, దానవ్రతులు, సువ్రతులు అనే పేర్ల నాలుగు వర్ణాలవారిగా కలిసి మెలిసి ఉంటున్నారు. వారు ప్రాణాయామాది యోగాలను అభ్యసించి రజస్తమస్సులను జయించి పరమసమాధి గన్న ధన్యజీవితులు.

## వాయుదేవోపాసనం

వారికి వాయుదేవుడు ఉపాసనాదైవం. ఆ దేవుని వారు 'అంతఃప్రవిశ్య భూతాని యోబిభర్త్యాత్మ కేతుభిః, అంతర్యామీశ్వర స్సాక్షాత్పాతు నో యద్వశే ఇదమ్' అనే మంత్రపూర్వకంగా జపిస్తారు.

## పుష్కర ద్వీపం

ఆ ద్వీపంలో పరమేష్ఠికి ప్రీతికరమైన ఒక మహాపుష్కరం ఉన్నది. ఆ పుష్కరం బంగారపు వహ్నిశిఖల వలె ఉన్న లక్షోపలక్షల రేకులతో విరాజిల్లుతుంటుంది. ఆ పుష్కరప్రాశస్త్యాన్ని బట్టి ఆ దీవికి పుష్కర ద్వీపం అని పేరు కలిగింది.

## మానసోత్తర పర్వతం

పుష్కరద్వీప మధ్యభాగంలో పదివేల యోజనాల పొడవు వెడల్పులను కలిగిన మానసోత్తర పర్వతం ఆ దీవిని రెండు భాగాలుగా విభజిస్తున్నది. ఆ కొండ కొమ్మున నలుదిక్కుల దేవేంద్రాది లోకపాలకుల నివాసదేశాలు నాలుగున్నాయి. సూర్యరథచక్రం మేరుగిరిని చుట్టి దివారాత్రాలను ఏర్పరిస్తూ ఆ మానసోత్తర గిరి మీదనే తిరుగుతుంటుంది.

## పుష్కర ద్వీప సప్తఖండాలు

ఆ ద్వీపాన్ని ప్రియవ్రతుని పుత్రుడు వీతిహోత్రుడు పరిపాలించాడు. అతనికి రమణకుడు, ధాతకుడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు. అతను పుష్కరద్వీపాన్ని రెండుగా విభజించి కొడుకు లిద్దరికీ పంచిపెట్టి వనవాసానికి వెళ్ళిపోయాడు. ఆ పుత్రుల పేర ఆ రెండు ఖండాలకు రమణకం, ధాతకం అని ప్రసిద్ధి కలిగింది.

ఆ ద్వీపవాసులు బ్రహ్మసాలోక్యపరులై ఉంటారు. అందుకని వారు భగవంతుని బ్రహ్మరూపాన తత్తత్కర్మములతో ఆరాధిస్తూ 'యత్తత్కర్మమయం లింగం బ్రహ్మలింగం జనోఽర్చతి, భేదే నైకాంత మద్వైతం తస్మై భగవతే నమః' అనే మంత్రాన్ని జపిస్తారు.

## లోకాలోక పర్వతం

రాజేంద్రా! స్వాదూదక సముద్రానికి అవతల ఒక మహాపర్వతం ఉన్నది. అది పన్నెండు కోట్ల యాభై లక్షల యోజనాల విస్తారమై, యాభైకోట్ల

యోజనాల విస్తృతమై భూమండలంలో నాల్గవ భాగాన్ని ఆక్రమిస్తున్నది. సూర్యచంద్ర ధ్రువాదుల కిరణాలు ఆ పర్వతం వరకు వ్యాపిస్తాయే గాని ఆవలికి ప్రసరించవు.

రాజా! సూర్యాదుల రశ్మి ఎందాక ప్రసరిస్తుందో ఆ ప్రదేశాన్ని లోకం అని, తర్వాతి ప్రదేశాన్ని అలోకం అని అంటారని; లోకాలోక ప్రదేశాలకు మధ్య నిలిచి ఆ పర్వతం ఆ రెంటినీ వేరుచేస్తుండటం వలన దానికి లోకాలోకపర్వతమని పేరు వచ్చిందని చెప్పాను. అందులో అలోక ప్రదేశం లోకప్రదేశమంత విశాలమై మహావిశుద్ధస్థానమై అలరారుతున్నది. అత్యంత పవిత్రమైన ఆ ప్రదేశం యోగీశ్వరులకు తప్ప అన్యులకు చొరరానిదిగా ఉన్నది.

## స్వర్ణ దేశం

రాజేంద్రా! మానసోత్తర గిరికి మేరుపర్వతానికి మధ్యనున్న భూభాగం స్వర్ణమయమై విమల దర్పణం వలె తేజరిల్లుతుంటుంది. అందుమూలాన ఆ చోట ఏ వస్తువు గాని జనింపదు; అక్కడ ఏ ప్రాణిసంచారమూ ఉండదు. దేవతలు మాత్రం అక్కడికి క్రీడావినోదార్థం వచ్చిపోతుంటారు.

## దిగ్గజాలు

ఆ పర్వతాగ్రం పైని నాలుగు దిక్కుల ఉత్తరాదిగా నాలుగు దిగ్గజాలు ఋషభము, పుష్కరచూడము, వామనము, అపరాజితము అనే పేర్లు గలవి నిలిచి ఉంటాయి. జగదీశ్వరుడు సర్వలోకస్థితికై ఆ విధంగా వాటినక్కడ నియమించాడు.

రాజా! భగవానుడు తన మాయాకల్పితమైన మహాలోకం సురక్షితంగా నడిచేందుకు కేవల శుద్ధతత్త్వమూర్తిని గ్రహించి శంఖచక్రగదాధారియై ఆ పుణ్యక్షేత్రంలో కల్పాంతపర్యంతం వెలసి ఉంటాడు. ఆ దేవదేవుని విష్వక్సేనాది పార్షదులు అర్చిస్తుంటారు. మహేంద్రాదులు ఆయన కళాంశభూతులై ఆయన అభిమతానుసారం నడచుకొంటారు. భగవాను డంతర్యామియై వారి వలన తత్తత్కార్యాలను చేయిస్తుంటాడు.

## బ్రహ్మాండ కపాలాలు

రాజా! సృష్టిసమస్తం ఒక గోళరూపంలో ఉంటుంది. ఆ గోళం ఇంతదని చెప్పడం సులభసాధ్యం కాదు కాబట్టి దానిని బ్రహ్మాండమని అన్నారు. ఆ బ్రహ్మాండానికి భూభాగం క్రింది చిప్ప, అంతరిక్షం పైని చిప్ప అవుతాయి. ఆ చిప్పలను కపాలములని అంటారు. ఆ రెండింటి మధ్య సూర్యుడు వర్తిల్లుతాడు.

ఆ అండం అచేతనం కాబట్టి దానిని మృతమని పేర్కొంటారు. అటువంటి మృతమందు తోచిన కారణం చేత సూర్యునికి మార్తాండుడని పేరు వచ్చింది. ఆ అండం హిరణ్మయమై వెలుగొందుతుంటుంది. బ్రహ్మదేవుడు ఆ అండమునందు జన్మించిన కారణాన హిరణ్యగర్భుడని అంటున్నారు.

రాజా! ఆకాశభూనభోదిక్కు లనే కల్పనమూ, సర్గాపవర్గనరకాలనే కల్పనమూ సూర్యుని వలన ఏర్పడుతున్నాయి. అంతే కాక సూర్యుడు దేవతలు, తిర్యక్కులు, మనుష్యులు, అఖిల సరీసృపాలు, పశుపక్షిమృగాలు, తరు లతా గుల్మాదులైన సర్వ చరాచరవర్గానికి ఆత్మసన్నిభుడు, నాయకుడు, అధిష్ఠాత అని గ్రహించాలి.

## బ్రహ్మాండ కపాల పరిమాణనిర్ణయ విధానం

రాజా! బ్రహ్మాండగోళానికి భూమండలం గగనమండలం రెండూ రెండు చిప్పల వలె ఉన్నాయని వివరించాను. వాటి పరిమాణాన్ని ఏ విధంగా నిర్ణయించాలో చెబుతున్నాను, విను. ఒక గింజను రెండు సమభాగాలుగా చీల్చి అందులో ఒక చీలికను కొలిచి దాని పరిమాణాన్ని నిశ్చయించితే, రెండవదాని పరిమాణం కూడా అంతేనని నిశ్చయించవచ్చు కదా! అలాగుననే బ్రహ్మాండమందలి ఒక చిప్ప అయిన భూమండలం యొక్క పరిమాణాన్ని నిశ్చయించినప్పుడు గగనమండలం యొక్క పరిమాణం కూడా అంతేనని ఏర్పడుతుంది.

## సూర్య గతులు

సూర్యుడు భూగగనమండలాల మధ్య భాగంలో మందము క్షిప్రము సమము అనే మూడు గతులలో సంచరిస్తుంటాడు. ఆ మూడు గతులకు ఉత్తరాయణం దక్షిణాయనం విషువు అని క్రమంగా పేర్లు పెట్టారు.

## మకరాది రాసులు

మకరాదిరాసులు సూర్యునికి ఆరోహణావరోహణ స్థానాలు. సూర్యుని ఆరోహణావరోహణగతిని బట్టి దివారాత్రాలకు దీర్ఘ హ్రస్వ సమానభేదాలు ఏర్పడుతున్నాయి. సూర్యుడు మేష తులారాసులలో సంచరించేటప్పుడు దివారాత్రుల కాలమానం సమం గాను; వృషభాది రాశిపంచకంలో సంచరించేటప్పుడు పగటి కాలం ఒక గడియ హెచ్చు, రాత్రి కాలం ఒక గడియ తక్కువ గాను, వృశ్చికాది రాశిపంచకంలో సంచరించినప్పుడు పగటికాలం ఒక గడియ తక్కువ గాను, రాత్రి కాలం ఒక గడియ ఎక్కువ గాను ఉంటుంది. ఇది స్థూలనిర్ణయం. వృషభాది రాశిపంచక సంచారకాలం దక్షిణాయనమని, వృశ్చికాది రాశిపంచక సంచారకాలం ఉత్తరాయణమని వ్యవహారం కలిగింది.

## అహోరాత్రాలు

సూర్యుడు ఆ విధంగా మానసోత్తరగిరిని చుట్టిరావడానికి పట్టే కాలం ఒక అహోరాత్రం. మానసోత్తర పర్వతం చుట్టుకొలత తొమ్మిదికోట్ల యాభై ఒక్క లక్షల యోజనాలు. అంటే, సూర్యుడు ఒక్క అహోరాత్రంలో సంచరించే దూరం ఇదన్నమాట.

## ఉదయాది కాలనిర్ణయం

ఆ మానసోత్తరగిరికి తూర్పుదిక్కున దేవధాని అని పేరుగల ఇంద్రపురం, దక్షిణపార్శ్వాన యముని సంయమనీపురం, పశ్చిమపార్శ్వాన నిమ్లోచనీ అని పేరుగల వరుణ పురం, ఉత్తరభాగాన విభావరి అని పేరుగల సోముని

పురమూ ఉన్నాయి. సూర్యుడు దేవధాని పురాన్ని ప్రవేశించినప్పుడు ఉదయ కాలం, సంయమనీ పురాన్ని ప్రవేశించినప్పుడు మధ్యాహ్న కాలం, నిమ్లోచనిని ప్రవేశించినప్పుడు అస్తమయ కాలం, విభావరిని ప్రవేశించినప్పుడు నిశీథికాలం అవుతాయి. ఈ కాలవిశేషాన్ని బట్టి మేరునగం నాలుగుదెసల నివసిస్తున్న భూతజాతానికి ప్రవృత్తినివృత్తులకు అవకాశం ఏర్పడుతున్నది. సూర్యుడు మేరువును వలగొనేటప్పుడు ఆ గిరికి దక్షిణవర్తిగా, భానుడు దానికి వామభాగవర్తిగా ఉంటారు.

## దిశల దూరం

పూర్వదిశలో ఉన్న ఇంద్రనగరం నుంచి దక్షిణదిశనున్న యమపురానికి రెండుకోట్ల ముప్పై ఏడు లక్షల డెబ్బై అయిదు యోజనాలు దూరం. సూర్యుడు ఆ దూరాన్ని పదిహేను గడియలలో నడుస్తాడు. యమపురం నుంచి నిమ్లోచనికి, నిమ్లోచని నుంచి విభావరికి అంతే దూరమని గ్రహించాలి.

## ఉదయాస్తమయ స్థానాలు

సూర్యుడు ఎక్కడ ఉదయిస్తే, అక్కడి నుంచి నేరుగా అవతలి వైపున దారం పట్టుకొన్నట్లు ఉన్నచోట అస్తమిస్తాడు. అనగా ఉదయాస్తమయస్థానాలు ఒకదానినొకటి సూత్రపట్టినట్లు ఋజురేఖలో ఉంటాయి. ఎక్కడ మధ్యాహ్నంగా ఉన్నదో ఆ చోటినుంచి క్రింది స్థానానికి దారాన్ని నిటారుగా పట్టుకొన్నామంటే ఆ ప్రదేశమంతా నిశీథిగా ఉంటుంది.

సోమాదులైన ఇతరగ్రహాల, నక్షత్రాల ఉదయాస్తమయాలు జ్యోతిశ్చక్రంలో ఇదే విధంగా నియతక్రమాన జరుగుతుంటాయి.

## సూర్య రథం

రాజోత్తమా! సూర్యరథం యొక్క ఇరుసు మేరుశిఖరం మొదలు మానసోత్తరం వరకు వ్యాపించి, ఒక కోటి యాభైఏడు లక్షల యాభైవేల యోజనాల పొడవున ఉంటుంది. ఆ ఇరుసుకు రవిరథచక్రం అమర్చబడి

తైలయంత్రచక్రం వలె మానసోత్తరాన తిరుగుతుంటుంది. అనగా సూర్యరథం ఏకచక్రాత్మక మాత్రమని తెలుసుకోవాలి.

## రథచక్ర వర్ణనం: మాసాది నిర్ణయం

ఆ చక్రానికి మూడు రంధ్రాలు, ఆరు పూటీలు, పన్నెండు ఆకులు ఉంటాయి. రెండేసి ఆకుల సందు గడిచే కాలం మాసమని, రెండేసి పూటీల మధ్యస్థలం గడిచే కాలం ఋతువని, ఒక్కొక్క రంధ్రాన్ని దాటే కాలం చాతుర్మాస్యమని నిర్ణయించారు. ఆ విధంగా పన్నెండు నెలలు ఆరు ఋతువులు, మూడు చాతుర్మాస్యాలు ఏర్పడుతున్నాయి.

ఆ ఇరుసు యొక్క నాలుగవ భాగంలో మరొక ఇరుసు ముప్పైతొమ్మిది లక్షల ముప్పైఏడు వేల అయిదువందల యోజనాల పొడవు గలది అమరి, గానుగబండి వంటిదై ధ్రువుని పైకి సాగి ఉంటుంది.

సూర్యరథంలో సారథి కూర్చునే చోటు ముప్పైఆరు లక్షల యోజనాయతం, నవలక్షయోజన విశాలం అయినట్టిది. ఆ రథం నొగలు కూడా అంతే పరిమాణం కలిగినవి. అరుణుడు సూర్యుని ముందు పశ్చిమముఖుడై కూర్చుండి ఛందస్సులనే గుర్రాలను ఏడింటిని పూన్చి ఆ రథాన్ని నడుపుతుంటాడు. వాలఖిల్య ఋషులు అంగుష్ఠమాత్రశరీరులు అరవై వేలమంది సూర్యుని ఎదుట నిలిచి సూక్తవాకాలతో ఆయనను నతించి నుతించుతుంటారు. గంధర్వాప్సరోగణాలు పదునాల్గురు చేరి ఇద్దరిద్దరు జతలై ప్రతినెల సూర్యుని వివిధనామకర్మములతో ఉపాసిస్తారు.

రాజేంద్రా! భూమండలం తొమ్మిది కోట్ల యాభై ఒక్క లక్షల యోజనాలని తెలిపాను. సూర్యుడు ఒక్క క్షణంలో అందులో రెండు వేల యోజనాల నాలుగు వందల క్రోసులు నడుస్తాడు.'

## సూర్యాదిగ్రహ ప్రదక్షిణ విచారం

మునులారా! శుకమహర్షి ఆ విధంగా చెప్పిన మాటలను విని పరీక్షిన్నరేంద్రుడు, 'మహాత్మా! సూర్యుడు మేరువుకు, ధ్రువునికి

ప్రదక్షిణచేస్తుంటాడని; అప్పుడు మేరుగిరి దక్షిణవర్తిగాను, సూర్యుడు ఆ గిరికి వామభాగవర్తిగాను ఉంటాడని మీరన్నారు. ఎవరయినా ఒక వస్తువుకు ప్రదక్షిణ కావించేటప్పుడు ఆ వస్తువు అతనికి కుడిచేతి వైపున ఉంటుంది. మీరు చెప్పినది చూడగా లోకరీతికి వ్యతిరిక్తంగా ఉన్నది. ఇది ఏ రీతిని సమన్వయించాలో తెలియజెప్పండి' అని అడిగాడు. శుకమహర్షి అతనితో ఈ విధంగా పలికాడు:

'రాజేంద్రా! కుమ్మరి చక్రం తిరుగుతుండటం చూచి ఉంటావు కదా. ఆ చక్రం తిరిగేటప్పుడు పిపీలికాది జంతువులు ఆ చక్రాంతర ప్రదేశాలలో ఉండి అవి కూడా తిరుగుతుంటాయి. అప్పుడు చక్రగమనం ఒక వంకకు, ఆ జంతువుల గమనం వేరొక వంకకు మారుతున్నది. కారణమేమిటని అడుగుతావేమో? తిరుగుతున్న చక్రము యొక్క ప్రదేశాంతరాల నుంచి ఆ జంతువులు తిరుగుతుండటమే కారణం.

అలాగే కాలచక్రం నక్షత్రాదిరాశితో మేరువును, ధ్రువుని ప్రదక్షిణీకరించినప్పుడు ఆ చక్రాంతంలో ఉన్న సూర్యాదిగ్రహాలు నక్షత్రాంతర రాశ్యంతరాలను పొందుతుంటాయి. అప్పుడు ఆ గ్రహాల గతి చక్రగతికి భిన్నంగా ఏర్పడుతున్నది.

## కాలనియతికి కారణం

రాజా! కాలనియతికి కారణం చెబుతున్నాను, విను. భగవంతునికి గల లోకానుగ్రహమే కాలం. భగవానుడు లోకక్షేమాన్ని కోరి తన రూపాన్ని పన్నెండు రూపాలుగా విభజించి, రెండేసి మాసాలను ఒక్కొక్క ఋతువుగా కల్పించి, ఆయా ఋతువులకు తగినట్లు కర్మభోగానుసారంగా శీతోష్ణాదిగుణాలను ఏర్పరించాడు. ఆ సౌకర్యఫలంగా ఇక్కడి పురుషులందరూ సూర్యనారాయణుని వారి వారి వర్ణాశ్రమాచారాల ప్రకారం వేదోక్త వివిధకర్మముల చేత, ధ్యానాది వివిధయోగాల చేత శ్రద్ధాభక్తులతో ఆరాధించి భుక్తకర్ములై పరమశ్రేయాన్ని పొందుతారు.

భూనభోభాగాల మధ్య కాలచక్రం తిరుగుతున్నప్పుడు దాని గతిని బట్టి మేషాది రాశినామక చైత్రాది ద్వాదశమాసాలు ఏర్పడతాయి. ఆ మాసాలకు చాంద్రమానంలో శుక్ల కృష్ణ పక్షాలు, సపాద నక్షత్రద్వయ అహోరాత్రాలు, సంవత్సరాయనాలు కలుగుతున్నాయి. సూర్యభగవానుడు సంవత్సరంలోని ఆరవ వంతు కాలంలో రెండు రాసులు నడుస్తాడు. ఆ కాలం ఋతువనబడుతుంది. సంవత్సరంలో సగభాగకాలం ఆయనమనబడుతుంది. ఇక సూర్యభగవానుడు ద్యావాపృథివీమండలాలతో నభోమండలమందు వర్తించినప్పుడు అప్పటి గమనభేదాన్ని బట్టి సంవత్సరం, పరివత్సరం, ఇళావత్సరం, అనువత్సరం, ఇద్వత్సరం అనునవి కలుగుతున్నాయి.

## పదమూడు మండలాలు

రాజా! భూమండలానికి నూరు యోజనాల దవ్వున మేఘమండలం, దానికి పదివేల యోజనాల దూరంలో రాహుమండలం ఉన్నాయి. రాహుమండలం మీద పదివేల యోజనాల దూరాన సూర్యమండలం ఉన్నది. భూమండలం నరాదులకు వలె మేఘమండలం సిద్ధాదులకు స్థానభూతం. రాహుమండలం పదమూడువేల యోజనాలు, సూర్యమండలం పదివేల యోజనాలు విస్తరించి ఉన్నాయి.

## చంద్ర మండలం

రాజేంద్రా! సూర్యమండలం మీద లక్షయోజనాల దూరంలో చంద్రమండలం ఉన్నది. దాని విస్తారం పన్నెండు వేల యోజనాలు. సూర్యుని గతికంటె చంద్రుని గతి ద్రుతతరం కాబట్టి సూర్యుడు ఒక సంవత్సరం నడిచే మార్గాన్ని చంద్రుడు ఒక్క నెలలో నడుస్తాడు. సూర్యునికి ఒక మాసం పట్టే దూరాన్ని చంద్రుడు సపాదనక్షత్ర ద్వయం లోను, రవికి ఒక పక్షం పట్టే దూరాన్ని చంద్రుడు ఒక్క దినంలోను గమిస్తాడు. చంద్రుడు ఒక్కొక్క నక్షత్రాన్ని దాటడానికి ముప్ఫై ముహూర్తాలు పడుతుంది.

చంద్రగతి ద్రుతం కాబట్టి చంద్రుడు ఎల్లవేళలా రవికి అగ్రచారిగా ఉంటాడు. చంద్రకళల వృద్ధిక్షయాలను బట్టి శుక్లపక్ష కృష్ణపక్ష విభాగం ఏర్పడుతున్నది. పితృదేవతలకు శుక్లపక్షం పగలు, కృష్ణపక్షం రాత్రి అవుతాయి.

చంద్రుడు సర్వజీవకోటికి ప్రాణజీవమయుడు మాత్రమే కాక మనోమయుడు, అన్నమయుడు, అమృతమయుడు అయినవాడు. దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప లతాదు లన్నీ చంద్రుని వలన ప్రాణాప్యాయనాన్ని పొందుతున్నాయి. ఆ కారణాన చంద్రుని సర్వమయుడని వర్ణిస్తారు.

## నక్షత్ర మండలం

పరీక్షిన్నరేంద్రా! చంద్రమండలానికి పైన లక్ష యోజనాల దూరాన నక్షత్రాలు ఉంటాయి. అవి అభిజిత్తుతో కలిసి మొత్తం ఇరవై ఎనిమిదవుతాయి. ఆ నక్షత్రాలు కాలచక్రంలో ఈశ్వరయోజితాలై మేరుగిరికి దక్షిణాననే వర్తిస్తాయి.

## శుక్ర మండలం

నక్షత్రమండలం మీద రెండు లక్షల యోజనాల దవ్వున శుక్రమండలం ఉన్నది. శుక్రుని గతి కూడా సూర్యుని గతితో పాటు ఉంటుంది. అందువల్ల శుక్రుడు సూర్యునికి కొంచెం ముందుగానో వెనుకగానో చరిస్తుంటాడు. శుక్రుడు తరచుగా లోకానికి శుభాన్నే సంకల్పిస్తుంటాడు. శుక్రచారాన్ని బట్టి వర్షం నిర్ణయింపబడుతుంది. వర్షప్రతిబంధం కలిగినప్పుడు దానిని శుక్రుడే ఉపశమిస్తాడు.

## బుధ మండలం

శుక్రమండలం మీదుగా రెండు లక్షల యోజనాల దూరాన బుధమండలం ఉన్నది. బుధుడు శుక్రుని వలెనే సూర్యుని అనుసరించి అతనికి కొంచెం ముందో వెనుకనో నడుస్తుంటాడు. బుధుడు నైజంగా సౌమ్యుడై

లోకహితాన్ని కోరుతుంటాడు. బుధుడెప్పుడైనా సూర్యుని అతిక్రమిస్తే అది అతిచారం అనబడుతుంది. అప్పుడు అతివాతం, కేవల మేఘాడంబరం, అనావృష్టి మొదలైన ఉత్పాతాలు కలుగుతాయని పెద్దలంటారు.

## అంగారక మండలం

బుధమండలానికి పైన రెండు లక్షల యోజనాల దూరంలో అంగారక మండలం ఉంటుంది. అంగారకుడు మూడేసి పక్షాలకు ఒక్కొక్క రాశిని దాటుతాడు. అతను వక్రించినప్పుడు మిక్కిలి అశుభుడై లోకానికి చేటు కలిగిస్తాడు.

## గురు మండలం

అంగారక మండలానికి పై భాగంలో రెండులక్షల యోజనాల దవ్వున గురు మండలం ఉంటుంది. గురువు ఒక్కొక్క రాశిని దాటడానికి ఒక్కొక్క సంవత్సరం పడుతుంది. అతను వక్రింపకపోతే బ్రాహ్మణకులానికి మేలు కలుగుతుంటుంది.

## శని మండలం

గురుమండలం మీద రెండు లక్షల యోజనాల దూరాన శని మండలం ఉంటుంది. శని మందగతుడు కాబట్టి అతనికి శనైశ్చరుడని సార్థకనామం కలిగింది. అతడు ముప్పదేసి మాసాలకు ఒక్కొక్క రాశిని దాటుతుంటాడు. ఆ రాశిలో ఉన్నంత వరకు అతని ఉనికి వలన తద్రాశిస్థులకు అశాంతికరంగా ఉంటాడు.

## సప్తర్షి మండలం

శనిమండలానికి పైన పదకొండు లక్షల యోజనాల దూరంలో సప్తర్షిమండలం ఉంటుంది. అక్కడ సప్తర్షులు లోకహితైకపరులై ధ్రువస్థానమైన విష్ణుపదాన్ని ప్రదక్షిణీకరిస్తుంటారు.

## విష్ణు పదం

సప్తర్షిమండలం మీద పదమూడు లక్షల యోజనాల దూరంలో విష్ణుపదం అలరారుతుంటుంది. అక్కడ ధ్రువుడు నెలకొని కల్పాంతజీవులకు సేవ్యుడై ఉంటాడు. ధ్రువునితో పాటు అగ్ని, ఇంద్రుడు, ప్రజాపతి, కాశ్యపుడు, ధర్ముడు అనేవారు సైతం నక్షత్రభావాన్ని పొందారు. వారందరూ ధ్రువుని ప్రదక్షిణీకరిస్తుంటారు.

## ధ్రువస్థాన బలం

రాజేంద్రా! ధ్రువుని ప్రభావాన్ని నీకు సవిస్తరంగా తెలిపాను. వడ్లను దంచేటప్పుడు కళ్ళంలో పశువులు మూడు బంతులుగా తిరుగుతుంటాయి. వాటికి నడిమి భాగంలో మేధిస్తంభం ఉంటుంది. అట్లాగే అవ్యక్తవేగకాలచక్రమనే కళ్ళంలో పరిభ్రమిస్తుండే గ్రహ నక్షత్రాది సకల జ్యోతిర్గణాలకు ధ్రువుడు నడిమి నున్న మేధిస్తంభమై భాసిస్తుంటాడు. అతనిని ఊతగొని గ్రహనక్షత్రాదిగణం బహిరంతర్యోగాన కాలచక్రయోగాన్ని పొంది వాతోదీరితాలకు క్రిందపడక సంచరిస్తుంటుంది. గ్రహాదులు నిరాధారంగా సంచరిస్తున్నా క్రిందపడని కారణం ఏమంటావా? విహంగాలు, మేఘాలు కర్మ సహాయాన మింట చరిస్తూ ఏ విధంగా క్రిందపడవో, అలాగే జ్యోతిర్గణాలు కూడా ప్రకృతిపురుష సంయోగము చేత అనుగృహీతాలై కర్మనిర్మితగతి నుంచి జారుపాటు లేక నిరాధారంలో సంచరిస్తున్నా అక్కడి నుంచి క్రిందపడక నిలిచి ఉంటాయి.

## శింశుమార చక్రం

రాజేంద్రా! ఈ జ్యోతిశ్చక్రం భగవంతుని శింశుమారసంస్థానమని యోగధారణాక్రమంలో వర్ణిస్తుంటారు. ఆ కల్పనావిధానాన్ని విను. శింశుమారం కుండలాకారంగా తలక్రిందయి ఉంటుంది. దాని పుచ్ఛాగ్రాన ధ్రువుడు, లాంగూలాన ప్రజాపతి అగ్ని ఇంద్రుడు ధర్మకర్త, దాని పుచ్ఛమూలాన ధాతృవిధాతృలు, దాని కటిప్రదేశాన సప్తర్షులు, దక్షిణావర్త

కుండలీభూతమైన దాని శరీర దక్షిణభాగాన ఉదగయనాలైన అభిజిదాది పునర్వసు పర్యంత చతుర్దశ నక్షత్రాలు, దాని సవ్యభాగంలో దక్షిణాయనాలైన పుష్యాది ఉత్తరాషాఢాంత చతుర్దశ నక్షత్రాలు, దాని పృష్ఠతలాన దేవమార్గం, పూర్వభాగాన ఆకాశ గంగ, కుడియెడమ శ్రోణిప్రదేశాలలో పునర్వసు పుష్యనక్షత్రాలు, దక్షిణపాద వామపాదాలలో ఆర్ద్రాశ్లేషలు, దక్షిణ నాసికా వామనాసికలలో అభిజిదుత్తరాషాఢలు, దక్షిణ వామలోచనాలలో శ్రవణ పూర్వాషాఢలు, దక్షిణ వామకర్ణాలలో ధనిష్ఠామూలలు, వామపార్శ్వ వక్రాలలో మఖాద్యష్ట దక్షిణాయన నక్షత్రాలు, దక్షిణపార్శ్వవక్రాలలో మృగశీర్షాదులైన ఉదగయన నక్షత్రాలు ఎనిమిది, దక్షిణ వామస్కంధాలలో శతభిగ్జ్యేష్ఠలు, ఉత్తర హనుప్రదేశాన అగస్త్యుడు, అధర హనుప్రదేశాన యముడు, ముఖాన అంగారకుడు, ఉదర భాగాన శని, కకుద్భాగాన గురువు, వక్షాన సూర్యుడు, హృదయపద్మంలో నారాయణుడు, మనస్సున చంద్రుడు, నాభిప్రదేశాన శుక్రుడు, స్తనాల యందు అశ్వినులు, ప్రాణాపానాలలో బుధుడు, గళమందు రాహువు, సర్వాంగకాలలోనూ కేతువు, రోమములందు తారాగణం ఉన్నట్లు కల్పిస్తారు.

రాజేంద్రా! ఇది భగవంతుని సర్వదేవతామయ రూపం. ప్రతిదినం రేపూ మాపూ సంధ్యా వేళలలో శుచియై మౌనవ్రతం పూని ఈ దివ్యమూర్తిని మనోనేత్రంతో వీక్షిస్తూ 'నమో జ్యోతిర్లోకాయ కాలాయనాయ అనిమిషాం పతయే మహాపురుషాయాభి ధీమహి' అనే మంత్రపూర్వకంగా ఆవృత్తిపూర్వకంగా జపించి మ్రొక్కి స్మరించేవారికి తత్తత్కాల జనిత పాపాలన్నీ నశించిపోతాయి.

## రాహు మండలం

రాజేంద్రా! సూర్యమండలానికి క్రింద పదివేల యోజనాల దూరంలో ఒక మండలం ఉంటుందని, రాహువనే రాక్షసాధముడు సింహికకు జన్మించినవాడు భగవత్కారుణ్యవిశేషాన అమరత్వ గ్రహత్వాలను పొంది నక్షత్రరూపంలో అక్కడ ఉంటాడని, అతని ఉనికి వల్ల ఆ మండలానికి రాహు మండలమని పేరు

వచ్చిందని కొందరంటారు. రాహువు యొక్క జన్మకర్మాదులను గూర్చి ముందు ముందు వివరిస్తాను.

## సూర్య చంద్ర గ్రహణాదులు

రాజా! పూర్వం సముద్రమథనకాలంలో రాహువు దేవతల పంక్తిలో కూర్చొని సుధాపానానికి పాల్గొనే సాహసం చేశాడు. ఆ సంగతి రవిచంద్రులు చూసి వెల్లడించారు. ఆ నాటినుంచి అతను వారిపై పగబూని పదమూడు వేల యోజనాల విస్తారమైన తన మండలంతో పదివేల యోజనాల ఆయామం కలిగిన సూర్యమండలాన్ని, పన్నెండువేల యోజనాల ఆయతమైన చంద్రమండలాన్ని మింగబోయాడు. భగవంతుడప్పుడు అతని పైని చక్రాయుధాన్ని ప్రయోగించాడు. రాహువందుకు వెరచి రవిచంద్రుల నుంచి తప్పుకొన్నాడు. ఆనాటి నుంచి రాహువు యొక్క ఉపసర్పణాన్ని సూర్యచంద్రగ్రహణాలని అంటారు.

| | | | |
|---|---|---|---|
| 13. | 1300000 | పదమూడు లక్షలు | ధ్రువమండలం (విష్ణుపదం) |
| 12. | 1100000 | పదకొండు లక్షలు | సప్తర్షి మండలం |
| 11. | 200000 | రెండు లక్షలు | శని మండలం |
| 10. | 200000 | రెండు లక్షలు | గురు మండలం |
| 9. | 200000 | రెండు లక్షలు | అంగారక మండలం |
| 8. | 200000 | రెండు లక్షలు | బుధ మండలం |
| 7. | 200000 | రెండు లక్షలు | శుక్ర మండలం |
| 6. | 100000 | ఒక లక్ష | నక్షత్ర మండలం |
| 5. | 10000 | పదివేలు | చంద్ర మండలం |
| | | | (12వేల యోజనాల విస్తారం) |

| | | | |
|---|---|---|---|
| 4. | 10000 | పదివేలు | సూర్య మండలం (10వేల యోజనాల విస్తారం) |
| 3. | 10000 | పదివేలు | రాహు మండలం (13వేల యోజనాల విస్తారం) |
| 2. | 100 | నూరు | మేఘ మండలం (సిద్ధాదుల స్థానం) |
| 1. | -- | | భూమండలం |
| | ------- | | |
| | 3530100 | | |

భూమికి, ధ్రువమండలానికి ముప్పై అయిదు లక్షల ముప్పైవేల నూరు యోజనాల దూరం.

## అధోలోక సప్తకం

రాజా! భూలోకానికి క్రింద అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము అని ఏడు అధోలోకాలు ఉన్నాయి. వీటిలో అతలం భూలోకానికి క్రింద పదివేల యోజనాల దూరంలో ఉంటుంది. తక్కిన వితలాదులన్నీ ఈలాగుననే ఒకదానికొకటి పదివేల యోజనాల ఎడంలో ఉంటాయి. దీనిని బట్టి భూలోకానికి, పాతాళానికి ఉన్న దూరం డెబ్భైవేల యోజనాలన్నమాట. అధోలోకాలన్నింటిలోనూ స్వర్గానికంటె అధికమైన కామభోగ ఐశ్వర్య ఆనందాలకు తావలమైన భవనాలు, వనోపవనాలు ఉన్నాయి. ఆ కారణాననే వాటికి బిలస్వర్గాలని పేరువచ్చింది. అందులో నెలకొన్న దైత్య దానవ నాగాధిపులు పుత్ర కళత్ర బాంధవాదులను కూడి వివిధ వినోదరతులై, కామభోగాలకు ఈశ్వరప్రతిహతి తమ కెన్నటికీ కలుగదన్న గుండె ధైర్యంతో నిత్యసంతుష్టులై సుఖిస్తుంటారు.

## అధోలోకాలు

భూలోకం క్రింద

10000 యోజనాలు అతలలోకం

10000 యోజనాలు వితలము

10000 యోజనాలు సుతలము

10000 యోజనాలు రసాతలము

10000 యోజనాలు తలాతలము

10000 యోజనాలు మహాతలము

10000 యోజనాలు పాతాళము

------

70000 యోజనాలు.

## మయుని నిర్మాణ కౌశలం

రాజా! మాయావి అయిన మయుడు గొప్ప నిర్మాణకౌశలం కలవాడని అంటారు. అతని నిర్మాణకౌశలాన్ని చూడాలంటే ఆ అధోలోకాల లోనే చూడాలి. అక్కడి ప్రాకార గోపురాలు, సభాచైత్యాలు, చత్వరప్రసాదాలు వివిధరత్నరచితాలై కాంతు లీనుతుంటాయి. ఆ సౌధకుడ్యాలకు అలంకారప్రాయంగా రూపొందించిన శుకశారికలు, పారావతాలు నానామణివినిర్మిత చిత్రశిల్పాలు జీవకళ ఉట్టిపడుతుంటాయి. ఆ భవనోద్యానం లోని తరువులు మహోన్నతములై లలితలతాలింగితమనోజ్ఞంగా కిసలయ కుసుమ స్తబక ఫలాలతో నిండి ఉంటాయి. ఆ తీవెడోలికలలో కేళీవిహంగాలు ఊగులాడుతూ లేతచిగుళ్ళను, నిండారా పండిన మధురఫలాలను మెక్కి మృదుమధురరుతాలలో వీనులకు ఆమెతలు కూర్చుతుంటాయి.

ఆ ఉద్యానవనాంతరాలలోని విశాల సరోవరాలు నిర్మల శీతోదకాలతో నిండి ఉంటాయి. అందులోని కమల కువలయాలు హంస కారండవాది పక్షులు రెక్క లల్లార్చినపుడు రేగిన తరగలకు లలిత లలితంగా కదలాడుతుంటాయి. ఆ పక్షులు స్నిగ్ధభావంతో ఆ పద్మాదులపయిని కూర్చుండి ఉయ్యెలలూగుతూ కలధ్వనులు కావిస్తుంటాయి. ఆ ఇందీవరాల మకరందాన్ని గ్రోలి గండు తుమ్మెదలు మైమరచి యథేచ్ఛగా ఝుంకారాలు కావించటం చూసి ఆనందింప వలసిందే కాని చెప్పనలవి కాదంటే నమ్ము.

## అధోలోకాలలో రవిప్రచారం

రాజా! అధోలోకాలలో  రవిప్రచారం కలుగదు. ఆ కారణాన అక్కడ రేయింబవళ్ళనే కాలవిభాగం లేదు. మరి అక్కడివారికి వెలుతురెట్లాగని శంకిస్తావేమో? అక్కడున్న ఫణీంద్రుల ఫణాగ్రమణికిరణాలు సూర్యకిరణాలకు మారుగా వారికి వెలుతురును సమకూరుస్తుంటాయి. ఆ లోకాలలోని అన్నపానాలు దివ్యౌషధిరసాయనాత్మకా లైనందువల్ల ఆ లోకవాసులు ఆధివ్యాధులు గాని జరా ఫలితాలు గాని వైవర్ణ్యం గాని స్వేదాది దుర్గంధాలు గాని ఎటుంటివో ఎరుగరు.

## అతల విశేషాలు

రాజేంద్రా! అతలలోకంలో మయుని పుత్త్రుడు బలుడు నివసిస్తున్నాడు. అతను షణ్ణవతి (96) మాయలకు సృష్టికర్త అని పేరుపొందాడు. ఆ మాయలలో కొన్ని ఇప్పటికీ మాయావంతులు ప్రదర్శిస్తూనే ఉన్నారు. బలుని మాయలలో ఒక్కటి మాత్రం ఉదాహరణార్థం చెబుతాను విను. అతను ఆవులిస్తాడు. ఆ ఆవులింతనుంచి స్వైరిణులు, కామినులు, పుంశ్చలులు అనే త్రివిధస్త్రీగణం జనిస్తుంది. ఆ స్త్రీలు అతలలోకాన్ని జొచ్చిన పురుషులకు హాటకమనే రసాన్ని త్రాగమని ఇస్తారు. ఆ రసాన్ని గ్రోలినంతనే ఆ పురుషులు తామే ఈశ్వరస్థానీయుల మని, సిద్ధులమని, అయుత మహాగజబలులమని భావించి, ఉపభోగచతురులై ఆ ఇంతుల క్రీగంటి చూపులకు చిరునవ్వులకు

సల్లాపాలింగనాలకు పారవశ్యాన్ని పొందుతారు. అప్పుడు వారతనితో యథేచ్ఛాభోగాలను అనుభవిస్తారు.

## వితల విశేషాలు

వితలంలో స్మరహరుడు హాటకేశ్వరుడనే పేర ప్రజాసృష్టి వృద్ధినిమిత్తం భవానీమిథునీభూతుడై పారిషద వర్గంతో ఉంటాడు. ఆ పరమేశ్వరుని వీర్యం హాటకి అనే నదీరూపాన ప్రవహిస్తుంటుంది. ఆ నదీరసాన్ని అనలుడు వాయుసహాయంతో త్రాగి ఉమ్మివేశాడు. ఆ ఉమ్మి హాటక సువర్ణమనే పేరుగాంచి, దేవేంద్రాంతఃపుర కామినీకాముకులకు వివిధభూషణయోగ్యమై ఉపకరించింది.

## సుతల విశేషాలు

పూర్వం భగవానుడు మహేంద్రునికి ప్రీతి సలుపగోరి అదితిగర్భంలో వామనుడై జనించి బలిచక్రవర్తిని మూడడుగుల నేల యాచించి రెండడుగులకే లోకద్వయాన్ని ఆక్రమించాడు. మూడవ అడుగునకు బలి తన శిరస్సు నిచ్చాడు. అప్పుడు భగవానుడు బలి సత్యవర్తనకు మెచ్చి అతనికి సుతలలోకాధిపత్యాన్ని ప్రసాదించాడు. నాటినుంచి బలి ఆ లోకాన్ని చేరి దేవేంద్రాదులకు సైతం దుర్లభమైన సర్వశ్రీలను అనుభవిస్తూ స్వధర్మమందు నిలిచి భగవంతుని ఆరాధిస్తూ సుఖంగా ఉన్నాడు.

రాజేంద్రా! బలికి అంతటి ఐశ్వర్యం కలిగిన కారణం ఏమిటో తెలుసా? ఉత్తమపాత్రునికి చేసిన భూదానఫలమని కొందరంటారు. ఆ మాట యుక్తమైనది కాదు. అలాగని దానాలు చేయటం వల్ల ఫలం ఉండదని నా ఉద్దేశం కాదు. దానాలకు ఫలం తప్పకుండా ఉంటుంది. అయితే అది తావన్మాత్రమే గాని నిష్ఫలం కాదు. బలి ఐశ్వర్యానికి అతని భగవద్భక్తే కారణం.

కర్మబంధం నుంచి తప్పించుకోవాలని లోకులు సాంఖ్యయోగాది నానోపాయాలను ఆశ్రయిస్తుంటారు. అట్టివారికి సహితం అతీతమైన

కర్మబంధం భగవన్నామోచ్చారణ మాత్రాననే పటాపంచ లవుతుంది. తుమ్మినప్పుడో ఆవులించినప్పుడో భగవన్నామాన్ని ఉచ్చరిస్తారు. అంతమాత్రాన కూడా కర్మబంధం సడలిపోతుంది. ఇక బుద్ధిపూర్వకంగా భక్తితో భగవన్నామకీర్తనం కావించినప్పుడు కలిగే ఫలం ఎంతటిదో చెప్పతరమా! బలిచక్రవర్తి తన శరీరమొక్కటి తప్ప సర్వం భగవంతునికి శ్రద్ధాభక్తులతో సమర్పించుకొన్నాడు. అట్టి భక్తునికి భగవంతుడు అంతటి భాగ్యాన్నివ్వటంలో వింత ఏమున్నది?

రాజా! ఐశ్వర్యమన్నది ఆత్మజ్ఞాన విస్మృతికారణమై ఉండగా, భక్తునికి దానినే ఇవ్వటంలో భగవంతుని ఉద్దేశమేమిటని అడగవచ్చు. ఈ శంకకు బలిచక్రవర్తే సమాధానం చెప్పాడు. అతని వాక్యాలనే అనువదిస్తాను విను.

'దేవేంద్రుడు మహావిద్వాంసుడు. అతనికి బృహస్పతి ఆలోచనగురువు. అంతటివాడై ఉండి ఆ అమరేశ్వరుడు ఏ త్రైలోక్యాధిపత్యభోగాన్నో భగవంతుని అర్థించాడు కాని పరమార్థాన్ని కోరుకొనలేదు. అయ్యో! కాలవేగం ఇంతా అంతా కాదు. అది మన్వంతరాలకు కూడా మార్పును కలిగిస్తుంటుంది. అట్టి కాలము ముందు ఈ ఆధిపత్యాలు ఎంతని నిలుస్తాయి? ఐశ్వర్యాదులన్నీ క్షణభంగురాలు. నా పితామహుడైన ప్రహ్లాదునికి వాసుదేవుని ప్రసాదం లభించింది. అదే పదివేలుగా ఆయన భావించాడు. భగవానుడు ఆయనను పిలిచి, 'నాయనా! నీ తండ్రి రాజ్యాన్ని గ్రహించి పరిపాలించు' అని స్వయంగా ఆదేశించాడు. నా పితామహుడు ఆ మాట విని, 'స్వామీ! నీ పరిచర్యాభాగ్యమే నాకు చాలు' అని భగవత్సేవనే వరించాడు. ఆ మహానుభావుని మార్గాని కంటె ఉత్తమమైన మార్గం ఉన్నదా? నా బోటి రాగలుబ్ధులకు అంతటి మహాభాగ్యం కలుగుతుందా?' అని బలిచక్రవర్తి ఆత్మతృప్తిని పొందాడు.

రాజేంద్రా! ఆనాడు భగవంతుడు బలిచక్రవర్తిని నిలువు దోచి కొండలోయ వంటి సుతలానికి అతనిని నెట్టివేయటం అతనిని అనుగ్రహించటమే కాని ఆగ్రహమనుకోకు. ఆ మాటకు తార్కాణమేమిటని అడుగుతావేమో? భగవానుడు గదను చేతబూని బలి వాకిట కావలి కాయటమే నిదర్శనం.

రావణుడు దిగ్విజయార్థం బయలుదేరి బలిపురానికి వచ్చి అతని అనుమతి పొందకుండా లోపలికి ప్రవేశించాలని చూశాడు. భగవానుడు తన పాదాంగుష్ఠంతో ఆ అసురేశ్వరుని ఉవ్వెత్తున పారమీటాడు. అతను పదివేల యోజనాల దవ్వున పడ్డాడు. బలిచక్రవర్తి మహిమ ఎంతటిదో ఊహించు. ఆ మహనీయుని చరిత్ర ఎంత చెప్పినా వినదగినది. దానిని సవిస్తరంగా మరొకసారి వివరిస్తాను.

## తలాతల విశేషాలు

తలాతలలోకం మయుని నివాసం. మయుడు త్రిపురాధిపత్యానికి వచ్చిన కొన్నాళ్ళకు గర్వించి లోకాలకు కీడు చేయసాగాడు. శంకరుడు లోకక్షేమార్థం త్రిపురాలను దహించాడు. అంతట మయుడు గర్వం మాని శంకరుని శరణువేడాడు. ఆ భగవానుడు కరుణించి అతనికి పూర్వపు పదాన్ని పునరనుగ్రహించాడు. మహాదేవుని ప్రాపు కలిగినందువల్ల మయునికి విష్ణుచక్రభయం తొలగింది. అతను మాయావులకు ఆచార్యుడై అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు.

## మహాతల విశేషాలు

కద్రూతనయులు, తక్షక కాళియాదులు, మహామస్తకులు, మహాక్రోధవశులు అయినవారు గరుడునికి భయపడి పుత్రకళత్రాదులతో మహాతల లోకంలో కాపురం ఉంటున్నారు.

## రసాతల విశేషాలు

ఫణులు, నివాతకవచ కాలకేయాది దైత్యదానవులు సాహసబలగర్వితులై సురలను బాధింపసాగారు. ఇంద్రుడు సరమను వారివద్దకు పంపాడు. ఒకనాడు ఆ సరమ వారి యెదుట ఇంద్రప్రభావాన్ని స్తుతించింది. అది విని వారు భయకంపితులై ఆ నాటినుంచి రసాతలంలోనే అణిగి ఉన్నారు.

## పాతాళ విశేషాలు

పాతాళంలో పంచశీర్షులు, సప్తశీర్షులు, శతశీర్షులు అయిన ఫణిరాజులు – వాసుకి శంఖ కులిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంభళ అశ్వతర దేవదత్తప్రముఖులు ఉంటారు. వారి ఫణాగ్రమణిమరీచులు అక్కడి చీకట్లను చీల్చి వెలుతురును ప్రసరింపజేస్తుంటాయి.

## ఆదిశేషువు

రాజేంద్రా! ఆదిశేషువు వేయి తలలతో ఒప్పారుతూ పాతాళలోకంలో ముప్ఫైయోజనాల అంతరువును ఆక్రమించి మహాప్రభావుడై విరాజిల్లుతుంటాడు. అతడు భగవంతుని తామసాంశమని, ద్రష్టృదృశ్యాలు రెండిటికీ ఏకీకరణలక్షణమైన అహంకారానికి అధిష్ఠాత అని, అందువలన ఆతనికి సంకర్షణుడనే పేరువచ్చిందని చెబుతారు. సాత్వత తంత్రనిష్ఠులు అతనిని చతుర్వ్యూహోపాసనలతో ఆరాధిస్తారు.

ఆదిశేషువుకు అనంతుడని సైతం పేరున్నది. అతను తన వేయి పడగలలో ఒక పడగమీద భూమండల మంతటినీ ఆవగింజ వలె ధరించి ఉంటాడు. అతను విశ్వోపసంహారాన్ని తలచినప్పుడు అతని కనుబొమలు ముడిపడతాయి. అప్పుడతని భ్రూమధ్య ప్రదేశం నుంచి సన్నికర్షణుడనే రుద్రుడు త్రిశూలధారియై మూడు నేత్రాలతో, ఏకాదశవ్యూహాలతో జగద్భీతావహంగా అవతరిస్తాడు. అదే అతని తామసత్వ లక్షణం.

ఆ అనంతుని అరుణనఖమణి రుచిమంతమైన పాదకమలయుగ్మానికి నాగరాజులు తమ మణిమయ మస్తకాలతో ఏకాంతభక్తి కావిస్తారు. ఆ అనంతుని భుజాలు రజతస్తంభాలను పోలి ఉంటాయి. నాగకన్యలు తద్భుజాలింగన లాంఛనాలైన చందనాదులతో ప్రకాశిస్తూ తమ అనురాగాలను లలితస్మితాలోలవిలోకనాలలో ప్రకటిస్తారు. ఇది అతని సుభగత్వ లక్షణం.

ఆ అనంతుడు రోషామర్షాలు మాని లోకక్షేమపరాయణుడై నీలాంబరం ధరించి నవతులసీగంధలోల మధుకరమధుర ఝంకారాల తోడి వైజయంతీ మాలికను కంఠసీమలో అలంకరించుకొని, ఏకకుండలాన్ని దాల్చి భుజాన నాగలిని పూని, నిజసంతోషాతిశయాన్ని సూచించే అరమోడ్పు కన్నులతో, స్నేహార్ద్రభావాన్ని ప్రకటించే క్రీగంటి చూపుతో ఉన్నప్పుడు ఆ మూర్తిని బలభద్రరూపంలో సురలు, ఉరగులు, యక్షులు, సిద్ధ గంధర్వ విద్యాధర మునిగణాలు ఉపాసిస్తుంటారు. ఆ దేవదేవుడు వారి ధ్యానాలను గ్రహించి ముముక్షువులకు అంతర్గతుడై అనాది కాలకర్మవాసనా గ్రథితమూ, అవిద్యామయమూ, త్రిగుణాత్మకమూ అయిన హృదయగ్రంథిని విదళించివేస్తాడు. అతని మహానుభావత్వం ఎంతటిదో వినగోరితే, నారదుడు తుంబురుసహితుడై బ్రహ్మసభలో కావించిన ఆదిశేష స్తవాన్ని చదువుతున్నాను, విను.

## నారదకృత బలభద్ర స్తుతి

రాజేంద్రా! సకాములకు పొందనైన వివిధ ప్రవృత్తిధర్మ పరిపాకగతులను విశదీకరించాను. కర్మకారులు తమ తమ కర్మానుసారగతులను పొందక తప్పదు. ఇంకా ఏమైనా వినాలని ఉంటే అడుగు.'

## కర్మఫల వైచిత్రి

మునులారా! శుకమహర్షి ఆ విధంగా పలుకగానే పరీక్షిన్నరేంద్రుడు ఇంచుక యోచించి, 'మునీంద్రా! ఏకరూపకర్మాన్నే పెక్కుమంది ఆచరిస్తారు. అందుకు ఫలం ఏకరూపంలో ఉండక బహువిధాలవుతుందని మీరన్నారు. ఏకవిధకర్మమునకు ఫలగతి వైషమ్యం కలుగుతున్న కారణం ఏమిటి?' అని అడిగాడు. దానికి శుకమహర్షి బదులు చెప్పాడు.

రాజేంద్రా! కర్మములన్నీ స్వభావ ప్రేరితములై జరుగుతుంటాయి. స్వభావరహితమైన పదార్థం సృష్టిలో కలుగనేరదు. స్వభావం సత్త్వరజస్తమో గుణాల రూపుదాల్చి వ్యవహరిస్తుంటుంది. అనగా ప్రారబ్ధకర్మఫల

వాసనాసముచ్చయం స్వభావమని గ్రహిస్తే, ఆ స్వభావ వర్తనం త్రిగుణాత్మకంగా ఉంటున్నదని, ఏ సమయంలో ఎట్టి వాసన వీస్తుందో ఆ సమయానికి దానికి సరియైన సంకల్పం పుట్టటం స్వభావసిద్ధమేనని, ఆ సంకల్పాన్ని అనుసరించి గుణశక్తి పైకొని వ్యవహరిస్తుందని అర్థమౌతుంది. ఆ వ్యవహారాన్నే కర్మమని అంటారు. కాబట్టి భోగ్యఫలవాసనల భేదాలను బట్టి సంకల్పభేదాలు, వాటిని బట్టి కర్మఫలభేదాలు కలుగుతున్నాయి. కనుక బాహ్యదృష్టికి కర్మము ఏకరూపంలో ఉన్నట్లు కనిపించినా కర్మానుష్ఠాతల సంకల్పభేదాలను బట్టి ఫలభేదాలు కలుగుతున్నాయి. అంతే కాక వాసనలలోనూ కోట్ల కొలది అంశాంశభేదాలు ఉంటాయి. ఆ భేదాలను బట్టి ఫలములందు సహితం అంశాంతరభేదాలు కలుగుతున్నాయి. అందువల్లనే 'గహనా కర్మణో గతిః' అన్నారు.

## శుభాశుభాలు

కర్మానుష్ఠాత యొక్క సంకల్ప శుభాశుభాలను బట్టి కర్మములన్నీ శుభములు, అశుభములు అని రెండు విధాలు. శుభఫలానికి పుణ్యగతులున్నట్లే అశుభఫలానికి నరకగతులు కలుగుతాయి. ఆ రెండు గతులలోనూ శ్రద్ధాతారతమ్యాలను బట్టి లెక్కలేనన్ని భేదాలు ఉన్నాయి.

## నరక స్థానాలు

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి మాట విని, 'మునివర్యా! నరకములన్నవి అనుభవ విశేషములా? లేక దేశవిశేషాలా? దేశవిశేషాలయితే అవి ముల్లోకాల లోపల ఉంటాయా? లేక వేరే నరకస్థానాలు ఉన్నాయా?' అని అడిగాడు. శుకమహర్షి చెప్పాడు.

'రాజేంద్రా! నరకములు నీవన్నట్లు దేశవిశేషాలే. అవి ముల్లోకాల లోపలనే దక్షిణ దిశలో భూమికి క్రింది భాగాన, అండజలాశయానికి మీది భాగాన ఉంటాయి. పితృపతియైన వైవస్వతయముడు భగవదాజ్ఞాప్రకారం ఆ చోట నిలిచి దూతలు తన లోకానికి తీసికొనివచ్చే మృతపురుషులకు వారి వారి

దుష్టకర్మానుసారంగా శిక్షలను విధిస్తుంటాడు. అగ్నిష్వాత్తాది పితృగణాలు కూడా అందే నివసిస్తూ తమ గోత్రజులకు మేలు కలగాలని కోరుకొంటూ అక్కడే సమాధినిష్ఠులై ఉంటారు.

### నరకాల సంఖ్య

నరకాలు ఇరవై ఒకటని కొందరి మతం. అవి తామిస్రము అంధతామిస్రము రౌరవము మహారౌరవము కుంభీపాకము కాలసూత్రము అసిపత్రవనము సూకరముఖము అంధకూపము క్రిమిభోజనము సందంశము తప్తోర్మి వజ్రకంటకశాల్మలి వైతరణి పూయోదము ప్రాణరోధము విశసనము లాలాభక్షము సారమేయాదనము అవీచిరయము రేతఃపాతము అని పేర్కొనబడుతున్నాయి.

ఇవిగాక క్షారకర్దమము రక్షోగణభోజనము శూలప్రోతము దందశూకము అవటనిరోధనము అపర్యావర్తనము సూచీముఖము అని ఏడు నరకాలు అదనంగా ఉన్నాయని మరొక మతం. ఈ మతం ప్రకారం నరకాలు ఇరవైఎనిమిది అవుతాయి.

## నరకబాధలు

### 1. తామిస్రం

ఎవరు పరుల భార్యలను గాని, ధనాపత్యాలను గాని హరిస్తారో, వారిని యమకింకరులు కాలపాశాలతో కట్టి బలాత్కారంగా తామిస్ర నరకంలో పడవేసి ఆహార పానీయాల నివ్వక పడతిట్టుతూ, కట్టెలతో కొట్టి, కొండల మీది కెక్కించి అక్కడి నుంచి క్రిందికి నెడుతూ వివిధకష్టాలకు గురిచేస్తారు. ఆ పాపాత్ములు బాధకు తాళలేక ఎట్టకేలకు మూర్ఛిల్లుతారు. అప్పటికి గాని వారిని విడిచిపెట్టరు.

## 2. అంధతామిస్రం

భర్తను మోసగించి అతని భార్యతో ఉపభోగించిన వారిని అంధతామిస్రానికి త్రోసి బాధలు పెడతారు. అక్కడ నానాబాధలు పడి దృష్టి తప్పి స్మృతి చెడి మొదలు నరికిన మానులా అంగవైకల్యం కలిగి ఆ యాతనలను అనుభవింపవలసి ఉంటుంది.

## 3. రౌరవం

నేను; నాది అనే స్వాభిమానం కలిగి, ఆత్మార్థమై పరభూతాలకు ద్రోహం చేసి, తనను తన కుటుంబాన్ని రక్షించుకొనేవారికి రౌరవప్రాప్తి కలుగుతుంది. ఏ భూతాదులకు తాము ద్రోహం చేశారో, ఆ భూతాలు అక్కడ రురుమృగాలై వేచి ఉండి ఆ ద్రోహులక్కడికి రాగానే వారిని నానాహింసలకు గురిచేస్తాయి. ఏ మృగాల కొమ్ములు సర్పదంష్ట్రల కన్న అతిక్రూరంగా ఉంటాయో ఆ మృగాలను రురువులు అంటారు.

## 4. మహారౌరవం

ఎవరు కేవలం తమకోసం భూతద్రోహం చేస్తారో, ఆ నరాధములను మహారౌరవానికి త్రోసివేస్తారు. అక్కడ మహారురువులు కోకొల్లలుగా ఉంటాయి. పాపాత్ములు తమ చోటికి రాగానే అవి మీదపడి వాడి కొమ్ములతో చీల్చి పొగులు పెట్టి మాంసాన్ని కబళిస్తాయి.

## 5. కుంభీపాకం

పశు పక్ష్యాది ప్రాణులను హింసించే నిర్దయాత్ములకు కుంభీపాకపతనం తప్పదు. అక్కడ వారిని సలసల మరిగే నూనె భాండాలలో వేసి అదిమిపెడతారు.

## 6. కాలసూత్రం

ఇది పది యోజనాలకు విస్తరించిన నరకం. తల్లిదండ్రులకు బ్రాహ్మణులకు ద్రోహం చేసినవారిని దీనిలో పడవేసి, వారి క్రింద నిప్పుసెగల

నుంచుతారు. అన్నపానాల నివ్వరు. ఆ అగ్నితాపానికి పరితపిస్తూ, ఆకలిదప్పులకు చిక్కి సొక్కి సోలి నిలువలేక పడుతూ లేస్తూ 'అయ్యో! అయ్యో!' అని గొంతెత్తి ఏడుస్తూ పడరాని పాట్లు పడతారు. పశువుకు ఎన్ని రోమాలుంటే అన్ని వేల సంవత్సరాల వంతున వారక్కడ ఘోరవేదనలను అనుభవిస్తారు.

## 7. అసిపత్ర వనం

కొందరు స్వధర్మమైన వేదమార్గాన్ని నిర్నిమిత్తంగా వదలి పాషండ మతాన్ని గ్రహించి తదనుగుణంగా నడుచుకొంటారు. అట్టివారికి అసిపత్రవనప్రాప్తి కలుగుతుంది. ఆ నరకంలో తాటి ఆకులు రంపాల వలె పదునెక్కి ఉంటాయి. అందువల్లనే ఆ నరకానికి ఆ పేరు కలిగింది. పాషండులను అక్కడ అసిపత్రాలతో పట్టి కోస్తారు. ఆ నిశితఘాతాలకు తుత్తునియలైన తనువులతో నెత్తురులు గ్రక్కుతూ, ఆర్తనాదాలు చేస్తూ రక్షించేవారు లేక పరిపరివిధాల పరితపిస్తారు.

## 8. సూకర ముఖం

రాజులు గాని రాజపురుషులు గాని అదండ్యులను దండించినా, బ్రాహ్మణునికి శరీరదండన విధించినా, వారిచేత అకార్యాన్ని చేయించినా ఆ దోషఫలితంగా సూకరముఖ నరకప్రాప్తి కలుగుతుంది. అక్కడ యమభటులు వారిని పట్టి చెరకుగడల వలె నిలువుకు విరిచి నలిగులి చేస్తారు. ఆ దుష్టులక్కడ బాధతో ఏడుస్తూ నొప్పి భరించలేక తెలివితప్పి పడి ఉంటారు.

## 9. అంధ కూపం

రాజా! ఈశ్వరుడు ప్రతిజీవికీ తగిన వృత్తిని కల్పిస్తుంటాడు. ఆ జీవులలో కొన్నిటి వృత్తులు పరులకు బాధ కలిగించేవిగా ఉంటాయి. నల్లులు దోమలు మొదలైన క్షుద్రజంతువులు ఈ కోటిలో చేరతాయి. వాటికి మనుష్య రక్తపానాదులే వృత్తి కాబట్టి అవి తమ వృత్తిని కావించేటప్పుడు పరులకు కలిగే బాధను గ్రహింపలేవు. అయినా అవి చేసే దంశనవృత్తులు బుద్ధిపూర్వకంగా

చేసినవి కావు. అలా జీవరాశిని చంపినవారికి అంధకూపప్రాప్తి విధింపబడింది. ఆ నరకంలో పూర్వం వారిచేత చంపబడిన జీవజాలం వారికై వేచి ఉండి వారక్కడికి వచ్చిన వెంటనే నానావిధాల వారిని బాధిస్తాయి. వారు తత్పీడితులై నిద్రానిర్వృతులు లేక దుష్టశరీరంలోని జీవాత్మవలె పరితపిస్తారు.

## 10. క్రిమి భోజనం

తనకు ప్రాప్తమైన అన్నాన్ని అతిథి భృత్యాదులకు పంచిపెట్టక, పంచయజ్ఞాలను కావింపక తానొక్కడే భుజించేవాడిని వాయసతుల్యు డంటారు. అట్టివారిని క్రిమిభోజన నరకంలోనికి పడద్రోస్తారు. ఆ నరకంలో నూరువేల యోజనాలకు విస్తరించిన క్రిమికుండం ఉన్నది. ఆ కుండంలో పడిన వెంటనే అందులో ఉన్న పురుగులు చుట్టుముట్టి వారిని కొద్దికొద్దిగా తింటుంటాయి. వారు ఆకలి బాధను తట్టుకొనలేక ఆ పురుగులను తినడం మొదలుపెడతారు. ఆ విధంగా తమకు పాపపరిహారం కలిగే దాకా వారక్కడ దుఃఖభాజనులై ఉంటారు.

## 11. సందంశం

బ్రాహ్మణధనాన్ని దొంగతనం గానో, బలాత్కారం గానో అపహరించినవారు, పరుల సొమ్ము దొంగతనం చేసినవారు సందంశ నరకంలో పడతారు. అక్కడ వారిని ఎర్రగా కాలిన ఇనుప పటకార్లతో పట్టి అగ్నిపిండాలకు గుచ్చి గుచ్చి బాధిస్తారు.

## 12. తప్తోర్మి

స్త్రీలు గాని పురుషులు గాని మదనాంధులై పొందరానివారిని పొందినట్లయితే, వారిని తప్తోర్మి లోనికి తోసి కశాఘాతాల పాలుచేస్తారు. లోహంతో స్త్రీ పురుషరూపాలను నిర్మించి ఆ విగ్రహాలను ఎర్రగా కాల్చి స్త్రీ ప్రతిమను పురుషుని చేత, పురుషుని ప్రతిమను స్త్రీ చేత కౌగిలింపజేసి ఘోరంగా హింసిస్తారు.

## 13. వజ్రకంటక శాల్మలి

జంతువులతో సంగమించే వారిని వజ్రకంటక శాల్మలీనరకంలో పడవేసి అక్కడున్న ముండ్ల బూరుగ చెట్టుకు కొరత వేస్తారు. ఆ చెట్టు ముళ్ళు వజ్రపు ముళ్ళ కంటె పదునెక్కి ఉంటాయి. ఆ ముళ్ళను నిలువెల్లా గుచ్చి భరించరాని బాధతో అలమటింపజేస్తారు.

## 14. వైతరణి

సత్కులంలో జన్మించినా ఆ కులాచారాలను త్యజించి పాషండులై వర్తించే వారికి వైతరణి శరణమవుతుంది. ఆ నది విణ్మూత్రపూయశోణితాలతో కేశనఖాస్థిమేదో మాంస వసలతో నిండి మురిగి దుర్భర దుర్గంధ బంధురమై అగడ్త వలె ఉంటుంది. అందులోకి తోయబడిన ఆ పాపాత్ములను అక్కడి జలజంతువులు పొడిచి పొడిచి చీల్చి చీల్చి నములుతుంటాయి. వారు తమ కర్మఫలాన్ని ఆ విధంగా అనుభవింపవలసి ఉన్నందువలన ఎన్ని పాట్లకు లోనైనా ప్రాణాలను మాత్రం కోల్పోరు. వారి కప్పుడు తాము చేసిన పూర్వదుష్కృతాలు జ్ఞాపకం వచ్చి, వాటినే తలచి తలచి ఖేదిస్తుంటారు.

## 15. పూయోదం

బ్రాహ్మణులకు జన్మించినా శూద్రస్త్రీసక్తుడై శౌచాచారనియమాలను దిగనాడి సిగ్గువిడిచి స్వైరవృత్తిని చరించేవారు పూయోదప్రాప్తులవుతారు. ఆ పూయోదం పూయ విణ్మూత్ర శ్లేష్మలాలాపూర్ణమై అత్యంతాసహ్యంగా ఉంటుంది. వారందులో పడి ఆ పూయాదులను తింటూ దుఃఖపడుతుంటారు.

## 16. ప్రాణరోధం

బ్రాహ్మణులు కుక్కలను గాడిదలను పెంచి వాటిని వెంటగొనిపోయి వేటలాడినా, మృగాలను నిర్నిమిత్తంగా చంపినా, వారిని యమభటులు ప్రాణరోధం లోనికి పడద్రోసి క్రూరమైన బాణాలతో గుచ్చి బాధిస్తారు.

## 17. వైశసం

కేవల దాంభికులై యజ్ఞాలను సంకల్పించి పశుహింస చేసేవారిని వైశసంలో వేస్తారు. వారి నక్కడ యమకింకరులు వివిధహింసల పాలుచేసి హతమారుస్తారు.

## 18. లాలాభక్షం

కామాంధులై సవర్ణ అయిన భార్యచేత తన శుక్లాన్ని త్రాగించినవారిని లాలాభక్షమందలి రేతఃకుల్యలో పడవేసి వారిచేత ఆ రేతఃపానం చేయిస్తారు.

## 19. సారమేయాదనం

గృహాదులకు నిప్పుపెట్టడం, ప్రాణులచే విషాన్ని తినిపించటం, గ్రామాలకు బిడారులకు చెడుచేయటం వంటి అక్రమాలకు పాల్పడిన రాజులు, చోరులు సారమేయాదనప్రాప్తులై అక్కడున్న వజ్రకఠోర దంష్ట్రలు కలిగిన ఏడు వందల కుక్కలు కరుస్తుండగా అవిసి చస్తారు.

## 20. అవీచి రయం

మొహమాటం వలన గాని, లంచం తీసికొని గాని తప్పుడు సాక్ష్యం చెప్పినవారిని, క్రయవిక్రయాల పట్ల బొంకిన అసత్యపరులను అవీచిరయానికి పంపిస్తారు. అక్కడ నీటివలె కనుపించే నునుపు రాయి ఒకటి మహాప్రమాణంలో ఉంటుంది. ఆ పాపాత్ములను శతయోజనోన్నత శిఖరాగ్రాల నుంచి తలక్రిందులుగా ఆ బండమీదికి త్రోసివేస్తారు. వారు ఆ శిఖరాగ్రాల నుంచి దొర్లి దొర్లి నువ్వుగింజలంత తునియలై ఆ బండమీద పడ్డా కర్మానుభవకారణాన అసువులను కోల్పోరు. వారిని మళ్ళీ మళ్ళీ అదే విధంగా హింసిస్తుంటారు.

## 21. రేతఃపానం

బ్రాహ్మణుడు గాని, అతని భార్య గాని కల్లు త్రాగినా, రాజులు లేదా వైశ్యులు వ్రతకారణాననో పొరపాటుననో సోమపానం చేసినా, సుర త్రాగినా,

వారిని రేతఃపాన నరకంలో రొమ్ముమీద కాలు నిలిపి తొక్కి పట్టుకొని సలసల మరుగుతున్న ఉక్కు నీటిని వారి నోటిలో బలవంతంగా పోస్తారు.

## 22. క్షార కర్దమం

తాము అధములై వర్తిస్తూ ఆత్మాభిమాన గర్వం వలన కన్నుగానక మైమరచి జన్మము విద్య ఆచారము వర్ణాశ్రమాదులలో తమకంటె అధికులైన వారిని చులకన చేసినవారిని క్షారకర్దమ నరకంలో పడవేస్తారు. వారందులో తలక్రిందుగా పడి బాధలను పొందుతారు.

## 23. రక్షోగణ భోజనం

భైరవాదులకు నరబలి పెట్టేవారు, కామరూపగణాలై పురుషులను పీడించే స్త్రీలు రక్షోగణభోజన నరకప్రాప్తులవుతారు. అక్కడ రాక్షసులు వారిని కటికవారు గొర్రెలను నరికినట్లు ముక్కముక్కలు చేసి భక్షించి నెత్తురు త్రాగి ఆటపాట నవ్వులతో ఆనందిస్తారు.

## 24. శూల ప్రోతం

నిరపరాధులను నమ్మించి, మోసగించి, అడవులలోనూ ఊళ్ళలోనూ కొరత వేసి, ఉరితీసి హింసించటమే క్రీడగా పెట్టుకొన్నవారికి శూలప్రోత నరకం ప్రాప్తిస్తుంది. అక్కడ వారిని యమభటులు కొరతకో ఉరికో అప్పగిస్తారు. ఎంత కష్టపెట్టినా కర్మానుభవహేతువు చేత వారికి ప్రాణాలు పోవు. వారిని కాకులు, గద్దలు మొదలైన పక్షులు నిలువునా పొడిచి తింటాయి. అప్పుడు వారు తమ దుష్కర్మలను జ్ఞాపకానికి తెచ్చుకొని దిగులొందుతారు.

## 25. దందశూకం

ధూర్తస్వభావం వలన జంతుపీడనను కావించేవారు దందశూక నరకప్రాప్తులై అక్కడున్న పంచశీర్ష సప్తశీర్ష పన్నగాలకు మూషికాల వలె ఆహారమై దుఃఖాన్ని పొందుతారు.

## 26. అవటనిరోధం

పిన్నవారిని, గుడ్డివారిని, బలహీనాలైన ఇతర ప్రాణులను పట్టి గుంటలో పడద్రోసి, గాదెలలో పూడ్చి, గుబురులలో దాచి బాధించే వారు ఉన్నారు. వారికి అవటనిరోధం శరణమవుతుంది. వారిని విషవహ్నిశిఖలలో వేసి తొక్కిపట్టి నానావిధాల హింసిస్తారు.

## 27. అపర్యావర్తనం

తమ యింటికి వచ్చిన అతిథులను, అభ్యాగతులను యథావిధిని ఆదరింపక క్రోధదృష్టితో చూచేవారు అపర్యావర్తన నరకంలో పడి, కాకులు గద్దలు మొదలైన పక్షుల వజ్రకఠోరనాసికాగ్రాల పాలై కన్నులు పోయి ఉమ్మలిస్తారు.

## 28. సూచీముఖం

ధనవంతులమని విర్రవీగి అన్యులయెడ నిరసనభావాన్ని ఓరకంటి చూపులలోనే వెల్లడిచేస్తూ, స్వయంగా గురువే తనవద్దకు ఏదో ఒక పనిమీద వచ్చినప్పుడు కూడా ఆదరింపకపోగా తననేమి అడుగుతాడో అని లోలోన శంకిస్తూ, ఏ సత్కార్యానికైనా స్వధనాన్ని ఏమాత్రం వినియోగింపక, రేయుంబవలు నిద్రాసుఖాలు లేక పిశాచగ్రస్తుని వలె తన ముల్లెను కడుపులో పెట్టుకొని కాపాడుతుండే ఆ నీచులకు సూచీముఖనరకం కలుగుతుంది. అక్కడ వారిని యమభటులు పగ్గాలతో ఆపాదమస్తకం కట్టిపడవేస్తారు. వారు కదలలేక మెదలలేక ఆ దురవస్థకు కారణమైన తమ పూర్వదుష్కృతాన్ని తలపోసి తలపోసి విలపిస్తారు.

రాజేంద్రా! ఇటువంటి నరకాలు యమలోకంలో వేలవేలు ఉన్నాయి. పాపాత్ములు వారి వారి పాపాలకు తగిన నరకస్థానాలలో పడి పాపఫలాలను అనుభవిస్తారు.

రాజేంద్రా! పాపాత్ములకు వలె పుణ్యాత్ములకు వారి వారి పుణ్యాలకు తగిన భోగస్థానాలు స్వర్గలోకంలో ఉన్నాయి. పాపపుణ్యాలు రెంటినీ చేసినవారి గతేమిటని అడగవచ్చు. వారు పాపపుణ్యాలను ఆయా లోకాలలో అనుభవించి, కర్మానుష్ఠానార్థం మళ్ళీ మర్త్యలోకంలో జన్మిస్తారు. ఇక నివృత్తి లక్షణమైన మోక్షమార్గాన్ని గురించి విన్నావు కదా!

రాజేంద్రా! బ్రహ్మాండకోశంలో పధ్నాలుగు కోశాలు ఉన్నాయని పురాణాలలో వికల్పింపబడిన లక్షణాలను తెలిపాను. ఈ బ్రహ్మాండం భగవంతుని స్థూలరూపం. ఆ పరమేశ్వరుని సూక్ష్మరూపం వేరుగా ఉంటుంది. ఆ రెండింటినీ తెలుసుకోవాలి. సూక్ష్మరూపగ్రహణం అంత సులభసాధ్యం కాదు. తత్త్వావగాహనకు పూర్వం స్థూలరూపాన్ని గ్రహించి దానిని ధ్యానించాలి. ఆ ధ్యానఫలంగా స్థూలరూపం హృదయంలో పాదుకొంటుంది. దానిని ఆధారంగా పెట్టుకొని సూక్ష్మరూపాన్ని గ్రహించి దానిలో చిత్తలయం కావించాలి.

శ్రద్ధా భక్తి విశుద్ధమతులై భగవంతుని యొక్క స్థూల సూక్ష్మరూపాలను యథాక్రమం ఆరాధించిన వారికి పరతత్త్వం సుబోధ్యమై అచిరకాలంలో సంప్రాప్తిస్తుంది.

# షష్ఠ స్కంధం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి వచనాలను సాంతంగా విని, 'ఋషిచంద్రమా! నివృత్తికర్మపరులు అర్చిరాది మార్గాన బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ బ్రహ్మతో ఉండి, కల్పాంతసమయాన బ్రహ్మతోపాటు ముక్తిని పొందుతారని, ప్రవృత్తికర్మపరులు గుణత్రయవ్యవహారం నశింపనందు వల్ల వారి వారి కర్మఫలాలను భోగించేందుకు తత్తదనురూపదేహాలతో జన్మిస్తుంటారని, కర్మములు కర్తృసంకల్పాలను బట్టి శుభాశుభాలనే రెండు విధాలుగా ఉన్నందువల్ల శుభకర్మలను చేసినవారు ఆ ఫలక్షయాంతం వరకు స్వర్గాదిభోగాలను అనుభవిస్తారని, స్వర్గ లక్షణాలంటే ఇటువంటివని, అశుభకర్మ లొనర్చినవారు నరకప్రాప్తు లవుతారని తెలిపి; వివిధ నరకాలను, వాటిలోని యాతనావిశేషాలను బోధించారు. ఇంకా స్వాయంభువ మన్వంతర చరిత్రను, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుల వంశక్రమాన్ని, భూమండల సన్నివేశ లక్షణాలను, జ్యోతిర్గుణలోకం స్వరూపాన్ని, అధోలోకప్రకారాన్ని తెలిపి ఈశ్వరసృష్టి వైచిత్ర్యాన్ని బోధపరిచారు. నరులు నరకాలలో పడకుండా తప్పించుకొనే మార్గమేమిటో ఎరుకపడదు. ఆ మార్గాన్ని తెలియజెప్పండి' అని ప్రార్థించాడు. శుకమహర్షి అతని మనోభావం గ్రహించి –

## పాపము - ప్రాయశ్చిత్తము

'రాజేంద్రా! పాపకర్మఫలంగా నరక ప్రాప్తి కలుగుతున్నది. పాపమంటే ఏమిటి? ఏది శ్రేయస్సునకు విరోధమో అది పాప మనబడుతోంది. ఆ పాపం మనోవాక్కాయకర్మముల మూలాన చేయబడుతున్నది. ఏ దేహంతో ఒక్కొక్క పాపం చేయబడుతున్నదో ఆ దేహం ఉండగానే ఆయా పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం చేసుకొంటే వారు నరకాలకు వెళ్ళడమూ, అక్కడ తీవ్రయాతనలను అనుభవించడమూ తొలగుతుంది. రోగం కలిగినప్పుడు రోగికి బాధ కలగటమూ రోగనిదానజ్ఞుడైన వైద్యుడు తగిన మందివ్వగానే రోగోపశాంతి కలిగి ఆ రోగగ్రస్తుడు సుఖంగా ఉండటమూ లోకానుభవమే కదా! అట్లాగే పాపాలకు కూడా ఆ పాపపరిహారవేత్తలు విధించిన ప్రాయశ్చిత్తాలను పాటించి పాపపరిహారం పొందవచ్చును. తత్ఫలంగా నరక యాతనలు తప్పుతాయి. ఆయా పాపాల గౌరవలాఘవాలను బట్టి ప్రాయశ్చిత్తాలు వివిధగతులుగా ఉంటాయి. పాపానికి తగిన ప్రాయశ్చిత్తాన్ని వెంటనే చేసివేయాలి. అప్పుడే పాపబాధ తప్పుతుంది' అని చెప్పాడు.

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు ఆ వచనాలను పర్యాలోచించి, 'మునిసత్తమా! మీ మాటలను బట్టి చూడగా ప్రాయశ్చిత్తం కూడా ఒక విధమైన దండనమే అని, రాజదండాదుల వలన కొన్ని దోషాలు ఉపశమించినట్లు ప్రాయశ్చిత్తం వలన పాపం ఉపశమిస్తుందని తేలుతున్నది. అది నిజమే కావచ్చు. అయితే ఒక తప్పును ప్రాయశ్చిత్తంతో ఉపశమింపజేసి అంతటితో సరిపెట్టక మళ్ళీ అదే తప్పును చేసేవారి మాటేమిటి? అట్టివారికి ప్రాయశ్చిత్తాలు గజస్నానమాత్రాలు కావా?' అని అడిగాడు. శుకమహర్షి వెంటనే సమాధానం చెప్పాడు.

## ప్రాయశ్చిత్త ఫలం

'రాజా! చక్కగా విమర్శించి అడిగావు. తప్పు జరిగినదంటే ఆ తప్పు బుద్ధిపూర్వకమో అబుద్ధిపూర్వక కృతమో మొట్టమొదట నిశ్చయించాలి.

ఎందుకంటావేమో?' దండన తాత్పర్యం గాని, ప్రాయశ్చిత్త తాత్పర్యం గాని ఏమిటి? దోషి యొక్క బుద్ధియందు మార్పు కలిగించటమే. ఆ విధంగా బుద్ధి మార్పు కలుగకపోతే కోటి దండనలు, శతకోటి ప్రాయశ్చిత్తాలు అన్నీ నిరుపయోగం అవుతాయి. అబుద్ధిపూర్వకంగా తప్పుచేసినవాడు దండన ప్రాయశ్చిత్తాదుల చేత తాను చేసిన అపరాధాన్ని గ్రహించి ఆ తప్పు జరిగినందుకు అనుతాపాన్ని పొంది మళ్ళీ అటువంటి దోషం జరగకుండా నడుచుకొంటాడు. బుద్ధి పూర్వకంగా తప్పు చేసినవారి గతి అటువంటిది కాదు. వారి బుద్ధియందు మార్పు అంత సులభంగా కలుగదు. ఎలాగైనా కృషిచేసి వారికి బుద్ధి మారేటట్లు చూడాలి. ఆ మార్పు వచ్చినట్లయితే వారు మళ్ళీ ఆ దోషానికి పూనుకోరు. దోషపరిహారానికి ప్రాయశ్చిత్తం చేసి మళ్ళీ అటువంటి దోషమే చేశాడంటే, ప్రాయశ్చిత్తం వలన అతనికి బుద్ధి మార్పు కలుగలేదని తేటతెల్లమవుతుంది. అట్టివారి విషయంలో ప్రాయశ్చిత్తాలు నీవన్నట్లు గజశౌచమనే అనుకోవాలి.

## కర్మం వలన కర్మఫలం నశిస్తుందా?

ఒక కర్మము వలన వేరొక కర్మఫలం నశిస్తుందా? అని అడగవచ్చు. కొంతకు కొంత తగ్గుతుందే గాని సంపూర్ణంగా పరిహృతం కాదు. ఆ కారణం వల్లనే ఫలవాసనలు శేషించి ఉండి పునః ప్రవృత్తికి బీజాలు అవుతున్నాయి. కర్మఫలం సమూల ధ్వసం కావాలంటే జ్ఞానమొక్కటే పరమప్రాయశ్చిత్తమని గ్రహించాలి. జ్ఞానసంపత్తి లేనివారు ఏమిచేయాలని అడుగుతావేమో. రోగబాధకు భయపడేవాడు పథ్యాహారాన్ని గ్రహించి రోగానికి ఎడమీయక ఏ విధంగా జాగ్రత్త పడుతున్నాడో, అదే విధంగా జ్ఞానసంపత్తి లేనివాడు జ్ఞానప్రతిబంధకాలను నిషేధిస్తూ జ్ఞానోత్పత్తికి సహకరించే కార్యాలను ఆచరించాలి. అట్లా చేస్తూ రాగా కొంత కాలానికి జ్ఞానోదయం అవుతుంది.

## జ్ఞానోత్పత్తి సహకార కర్మలు

ఆ సహకార కర్మములు ఎటువంటివో చెబుతున్నాను విను. అన్ని

సహకారకర్మలకు మనోనిగ్రహాన్ని మునుముందుగా సాధించాలి. మనోనిగ్రహానికి తపస్సు ప్రధానమైన సాధనం.

మనస్సును, ఇంద్రియాలను – ఈ రెండింటినీ ఏకీకరించటమే తపస్సు. తపస్సుకు బ్రహ్మచర్యం ఊతకర్ర వంటిది. అష్టాంగలక్షణాలు బ్రహ్మచర్యంలో ఇమిడి ఉన్నాయి. తపస్సుతోపాటు శమము, దమము, త్యాగము, అహింస, స్నాన శౌచ జపాదులను త్రికరణశుద్ధిగా పాటించాలి. శమఫలంగా మనోనిగ్రహం, దమఫలంగా బాహ్యేంద్రియ విధర్మనిగ్రహం, త్యాగఫలంగా 'నాది' అనే అభిమాననాశం, అహింసా ఫలంగా సర్వభూతములు తన వంటివే అన్న సద్భావం అలవడతాయి. వెదురు కంపలో వెదుళ్ళు ఒకదానినొకటి ఒరుసుకొని నిప్పు రగిల్చి ఆ నిప్పులో దగ్ధమై నశిస్తున్నట్లుగా కర్మముల వలన జ్ఞానాగ్ని జనించి ఆ వహ్నిచేత మనోవాక్కాయకృత సర్వపాపాలూ సమూలంగా దహింపబడి నశించిపోతున్నాయి.

## భక్తిరూప ప్రాయశ్చిత్తం

రాజా! ఈ జ్ఞానమార్గరూప ప్రాయశ్చిత్తం అతిదుష్కరం కాబట్టి అందరూ దీనిని పాటించలేరు. సర్వసులభమైన ప్రాయశ్చిత్తం వేరొకటి ఉన్నది. దానిని భక్తిమార్గమంటారు. ఆ మార్గానికి తపస్సు మొదలైనవి అంత ముఖ్యములు కావు. మనస్సును భగవంతుని అధీనం చేస్తే చాలును. అంతకు మించి ఏమీ చేయనవసరం లేదు. సూర్యుడు తుహినరాశిని కరిగించినట్లు భక్తియోగం సమస్తపాపాలను రూపుమాపుతుంది.

భక్తిమార్గంలో మరొక విశేషం ఉన్నది. ఇతరమార్గాలలో యత్నవిఘాతమనే భయమొకటి కనిపిస్తుంది. భక్తిమార్గాననో? నిర్భయంగా సంచరింపవచ్చు. అంతే కాదు. భక్తి అంటూ కొద్దో గొప్పో ఉంటేనే ఇతరమార్గాలు ఫలకారు లవుతాయి. భక్తి లేనినాడు కోటి ప్రాయశ్చిత్తాలు చేసినా హృదయం లోని మాలిన్యం తొలగదు. భక్తిలేని ప్రాయశ్చిత్తం లోకపావన గంగాజలంతో కల్లుకుండను కడగటం వంటిది. పైగా

కర్మకలాపం సాకల్యంగా జరిగితేనే కాని జ్ఞానం అంకురింపదు. భక్తిసంగతి అట్లా కాదు. గోరంత భక్తి కలిగిన జ్ఞానబీజం మొలకెత్తటానికి కారణమవుతుంది. దానికి బుద్ధిని భగవంతుని యెడ నిలిపితే చాలు. అదే మనఃపూర్వకంగా చేసినట్లయితే తత్ఫలం ఎటువంటిదో వేరే చెప్పనక్కరలేదు.

అంతేకాదు. భక్తికి జాతి మత దేశాది నియమాలు లేవు. అనురాగం ఒక్కటుంటే చాలు. ఇందుకు నిదర్శనం ఏమిటని అడుగుతావేమో? చెబుతాను విను.

## అజామిళోపాఖ్యానం

పూర్వం కన్యాకుబ్జపురంలో అజామిళుడనే బ్రాహ్మణకుమారుడొక డుండేవాడు. అతనికి ఒక దాసితో పొత్తు కలిసింది. తత్ఫలంగా అతను సదాచారాలన్నీ కట్టిపెట్టి, దానితోడిదే లోకంగా ఉండేవాడు. వారికి పదిమంది కొడుకులు పుట్టారు. అంత పెద్ద కుటుంబాన్ని పోషింపవలసిన భారం అజామిళుని నెత్తిమీద పడింది. దానినతను సన్మార్గాన పోషించే ఉపాయం తోచక ఎక్కడో జూదమాడి మరెక్కడో దొంగతనం చేసి ఇంకెక్కడో ఎవరినో మోసగించి ఏదో ఒక తీరున నాలుగు రూకలు సంపాదించి ఆలుబిడ్డలను పోషించటం మొదలుపెట్టాడు. ఆ విధంగా అకార్యాలను చేసేటప్పుడు అత నొక్కొక్కవేళ రాజభటులకు పట్టుబడి, శిక్షితుడై బందీ కావటం కూడా జరుగుతుండేది.

చూస్తూ ఉండగానే అతనికి యౌవనమంతా గడిచిపోయి ముసలితనం వచ్చిపడింది. ఎనభై ఎనిమిదేండ్లు నిండాయి; మరణకాలం సమీపించింది. ఒకనాడు యమభటులు ముగ్గురు భయంకరాకారులు పాశహస్తులై అజామిళుని చెంతకు వచ్చారు. వారిని చూచినంతనే అతనికి ప్రాణాలు నిలువునా తోడుతున్నట్లయింది. అతని కడపటి కొడుకు నారాయణు డనేవాడు అతనికి ముద్దులమూటగా ఉండేవాడు. అతను భయపడి సహాయానికై ఆ కొడుకును 'నారాయణా!' అని కేకవేసి పిలిచాడు.

ఆ అరుపుతో శ్రీవిష్ణుపార్షదు లక్కడికి తటాలున వచ్చారు. అప్పటికే యమకింకరులు అజామిళుని హృదయాన్ని పాశాలతో కట్టి ఈడుస్తున్నారు. విష్ణుపార్షదులు వారిని అవతలికి నెట్టారు. యమభటులు వారిని చూసి, 'అయ్యలారా! పీతాంబరాలు ధరించి కిరీటకుండల మండితాంగులై పుష్కరమాలికలు కంఠసీమకు పెట్టని భూషణాలై కళకళలాడుతుండగా, ధనుస్తూణీర ఖడ్గ గదాశంఖచక్రపద్మాలను నాలుగు చేతులలో దాల్చి దిక్కులను దేదీప్యమానం కావిస్తున్న మీ రూపాలు లోకాద్భుతకరంగా ఉన్నాయి. మీ రెవరు? దేవతలో, ఉపదేవతలో, సిద్ధసత్తములో తెలియరావటం లేదు. మేము యమకింకరులము. ధర్మరాజశాసనాన్ని సాగిస్తున్నాము. మమ్మల్ని అడ్డగించి మా రాజశాసనాన్ని నిషేధిస్తున్నారెందుకు?' అని అడిగారు.

## ధర్మాధర్మ దండాదండనల విచారం

శ్రీ విష్ణుదూతలు వారి మాటలను విని చిరునవ్వు దాల్చి, 'యమదూతలారా! మీరు నిజంగా ధర్మరాజు ఆజ్ఞను నడుపుతున్నవారేనా? అలాగయితే ధర్మాధర్మాల లక్షణాలను ఎరిగినవారై ఉండాలి. ఆ లక్షణాలేమిటో చెప్పండి. దండాన్ని ఎట్లా ధరించాలి? దానికి తగిన స్థానం ఏది? ఏమి చేసినవారు దండనార్హులవుతారు? వారిలో అందరూ దండ్యులవుతారా? కొందరు మాత్రమేనా?' అని ప్రశ్నించారు.

యమదూతలు వారితో, 'అయ్యా! ధర్మమంటే వేదచోదితమైన విధానం. వేదనిషిద్ధమైనది అధర్మం. వేదము సాక్షాన్నారాయణుని వలన జనించినదని, అది భగవంతుని నిఃశ్వాసమాత్ర మని, తత్కారణాన స్వయంవ్యక్తమని శ్రుతులు పలుకున్నాయి. నారాయణు డనగా ఎవరంటే, ఎవనిలో త్రిగుణాత్మకప్రాణిజాలమంతా శాంతాది గుణాలతో, బ్రాహ్మణాది నామాలతో, అధ్యయనాది క్రియలతో, వర్ణాశ్రమాది భేదాలతో వర్తిస్తున్నదో ఆతడే నారాయణుడు.

## ధర్మాధర్మాలకు సాక్షులు

దేహి ఆచరించే ధర్మాలకు సాక్షులెవరంటే, వినండి. సూర్యుడు, వహ్ని, ఆకాశము, వాయువు, గోవులు, చంద్రుడు, సంధ్య, అహోరాత్రాలు, దిక్కులు, జలము, భూమి, కాలము, ధర్మము - ఇవన్నీ సాక్షులవుతాయి. మూఢులు అజ్ఞానాంధులు కాబట్టి తమ రహస్యకృత్యాలను ఎవరూ చూడరని అనుకొంటారు. అంతకన్న ప్రమాద భ్రాంతులేముంటాయి? సూర్యాదులను కన్నుగప్పి గిల్లింతపనిని కూడా చేయటం ఎవరి తరమూ కాదు. బాహ్యకృత్యాలు వారికి గోచరిస్తే గోచరింపవచ్చును గాని, మానసికాలు వారికి ఏ విధంగా గోచరిస్తాయని శంకింప నవసరం లేదు. వారు సర్వసాక్షులు. వారికి గోచరింపని బాహ్యాభ్యంతరాలు ఉండవు. ఏ పని అయినా వారికి వెనువెంటనే స్పష్టమవుతుంటుంది.

## దండస్థానము - దండ్యులు

ఇంతమంది సాక్షుల మూలాన తెలియబడుతున్న అధర్మం దండస్థాన మవుతుంది. అధర్మకారులు దండ్యు లవుతారు. దండనం వారి వారి దోషాలను బట్టి ఉంటుంది. పుణ్యపాపాలు గుణతత్త్వాన్ని బట్టి ఉంటాయి. గుణసంగమం కర్మమునకు కారణమవుతుంది. జీవులందరూ గుణబద్ధులు కాబట్టి, గుణసంగమం కర్మకారణమవుతుంది. కాబట్టి, కర్మమును అంతో యింతో చేయని జీవులుండరు. జీవులు చేసే ఆ కర్మములకు ఫలమూ ఉండక తప్పదు. ఆ ఫలం శుభమో అశుభమో మిశ్రమమో అవుతుంది. అది కర్తల బుద్ధిని బట్టి ఉంటుంది. ఆ ఉదయించిన ఫలాన్ని అనుభవింపక తీరదు. ఆ అనుభవం లోకాంతరాలలో ప్రాప్తిస్తుంటుంది.

## కర్మము - పాపము

కర్మము కేవలశుభము కాకూడదా? అని శంకింపవచ్చును. అగ్ని యందు పొగ లాగున కర్మము నందు పాపమన్నది అంతో యింతో అంతర్భూతమై ఉంటుంది. ఆ కారణాన ఎంత ధర్మాత్ము డయినా అంతో యింతో పాపం చేయటమూ, తత్ఫలాన్ని అనుభవించటమూ తప్పనిసరి అవుతున్నది.

## ధర్మాధర్మ జ్ఞాపకాలు

ధర్మాధర్మజ్ఞాపకులు సూర్యాదులు ఉన్నారని చెప్పాము. వారు మాత్రమే కాదు. వారి వారి గుణాలే వారి వారి ధర్మాధర్మాలకు జ్ఞాపకములవుతాయి. గుణాన్ని దాచిపెట్టి వ్యవహరించటం ఉన్నది కదా? అంటే, ఎంత దాచినా గుణమన్నది దాని సమయం వచ్చినప్పుడు తలయెత్తక మానదు. వృక్షాదులు చిగిర్చి పుష్పించటం వాటికి నైజం. అయినా ఆ వికాస కార్యానికి తగిన అదను వసంత ఋతువు వచ్చినప్పుడు మాత్రమే అది జరుగుతున్నది. ఇతర ఋతువులలో జరగటం లేదు. వసంత ఋతువు నందు మాత్రం తప్పక జరుగుతున్నది. అలాగే ఏ గుణమయినా దానికి సమయం వచ్చినప్పుడు వ్యవహరిస్తుంది; అసలు వ్యవహరింపక మానటం అనేది ఉండదు. తక్కిన సమయాలలో దాగి ఉంటుంది.

ఈ సంవత్సరం ఎలాగో పూర్వ – పర సంవత్సరాలలోనూ ఇదే విధంగా వసంతకాలగుణ ధర్మం ప్రకటిత మవుతున్నది. కనుక పూర్వ పర సంవత్సరాల వసంతకాల గుణధర్మానికి ప్రకృత సంవత్సర వసంతకాల గుణధర్మం అభిజ్ఞాపక మవుతున్నది. అలాగే ప్రకృత జన్మమందలి గుణాల ధర్మాధర్మాలు పూర్వ పరజన్మల లోని ధర్మాధర్మాలకు అభిజ్ఞాపకము లవుతాయి. అంటే ప్రకృతజన్మమందలి వ్యక్తి యొక్క కర్మను పరిశీలిస్తే తత్కర్మకు మూలమైన గుణం స్పష్టపడుతుంది. ఆ గుణం కలుగటానికి ఆ వ్యక్తి పూర్వజన్మలలో చేసిన కర్మస్వరూపం ఎటువంటిదో బోధపడుతుంది. దానితోపాటు ఆ వ్యక్తి ఇప్పుడు చేస్తున్న కర్మమునకు ఎటువంటి ఫలం కలుగనున్నదీ, ఆ ఫలానుభవానికి ఉత్తర జన్మ ఎటువంటిది రానున్నదీ గ్రహింపవచ్చును.

## ధర్మదేవత

ధర్మదేవత భగవత్స్వరూపమే గాని తదన్యతరం కాదు. కనుక అతనికి త్రికాలజ్ఞానం స్వతస్సిద్ధం. కాగా అతను సకలజీవుల లోనూ అంతర్యామియై వారి వారి ధర్మాధర్మాల తత్త్వాలను స్వయంగా పరికిస్తూ వారు కావించే

ధర్మాధర్మాల ఫలాలను అనుభవించటానికి తత్తదుచిత భోగాయతనాలను నియమిస్తుంటాడు. విత్తొకటయితే చెట్టు వేరొకటి మొలవదు కదా! ఆ చెట్టు వేరొక గుణాన్ని కలిగిన విత్తును ఇవ్వదు కదా!

## జీవుడు - పూర్వపరస్మృతి జ్ఞానం

నిద్రించేవారికి స్మృతిజ్ఞానం కలుగదు. అందువలన నిద్రితుడు నిద్రాకాలమందు అనుభూయమానమైన స్వప్నశరీరాన్ని మాత్రమే కంటాడు గాని పూర్వోత్తర జాగ్రదాది దేహాలను చూడటం లేదు. ఆలాగుననే జీవుడు అవిద్యోపాధిగతు డైనప్పుడు తత్కాలశరీరాన్ని మాత్రమే ఎరుగును గాని పూర్వోత్తర శరీరాలను ఎరుగజాలడు.

## జీవుని సంసార వృత్తాంతం

జీవుని సంసారం గతి ఎటువంటిదంటే, కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, శబ్దాదివిషయాలు అయిదు, మనస్సుతో కలిసి మొత్తం పదహారున్నాయి. వాటిలో కర్మేంద్రియాలు తమ తమ పనులను చేస్తుంటాయి. జ్ఞానేంద్రియాలు వాటి వాటి విషయాలను గ్రహిస్తుంటాయి. జీవుడు పదహారింటిలోనూ ఉండి జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయాలు అన్నింటినీ అనుభవిస్తుంటాడు. ఈ అనుభవమే జీవుని సంసారవృత్త మనబడుతుంది.

ఈ పదహారింటితో కూడిన శరీరాన్ని లింగశరీరమని అంటారు. ఈ లింగశరీరమే జీవునికి గుణత్రయకార్యములైన హర్ష శోక భయార్తులను కలిగిస్తుంటుంది. సాలెపురుగు తనకై తానే తంతువులను నిర్మించుకొని ఆ తంతువులలోనే తాను చిక్కి అందులో నుంచి బయటపడలేక గిజగిజలాడుతున్నట్లు, జీవుడు తన అజ్ఞానరచితమైన షడ్వర్గంలో చిక్కుకొని ఆ వర్గం నియమించే పనులు తనకు ఇష్టం ఉన్నా లేకపోయినా చేస్తూ బద్ధుడై ఉంటాడు. అందులో నుంచి బయట పడరాదా? అంటే, ఆ షడ్వర్గం అతని కన్నులు కప్పి నిర్గమనోపాయాన్ని తెలియనీయకుండా చూస్తుంటుంది.

అందువల్ల అతను దానినుంచి వెలువడలేక బద్ధుడై అందులోనే ఉండిపోతాడు. ఆ గుణత్రయ కార్యం ఎప్పుడు ప్రారంభమయింది? అంటే అది అనాది. కాలపురుషునితో సమానం.

## కర్మమును చేయకుండరాదా?

'అడుసు త్రొక్కనేల? కాలు కడుగుటేల?' అన్నట్లు కర్మఫలములను చేయటమెందుకు? తత్ఫలానుభవార్థం జన్మాంతరాలను పొందటమెందుకు? అని అడగవచ్చు? ఎటువంటి కర్మనూ చేయకుండా ఒక్క క్షణమన్నా ఊరికే ఉండలేకపోతారు. ఎందుకంటే కర్మములు నేడు జీవులు సరిక్రొత్తగా కల్పించి చేస్తున్నవి కావు. ప్రారబ్ధకర్మఫల వాసనలైన రాగాదులు తత్తద్రూపకర్మములకు పురికొల్పుతుంటాయి. ఆ వాసనలంటేనో? పూర్వజన్మసంస్కారజనిత గుణకార్యాలు కదా! జీవులు ఆ విధంగా స్వాభావిక గుణ బలాలకు చిక్కి స్వాతంత్ర్యహీనులై వర్తిల్లుతారు. అంతే కాక వారికి వారి కర్మఫలానుభవానికి యోగ్యమైన స్థూలసూక్ష్మశరీరాలు స్వతస్సిద్ధంగా సమకూడుతాయి. కాబట్టి శరీరం ఉన్నంతకాలం దాని స్వభావం తప్పదు. స్వభావం ఉన్నంత కాలం అది వ్యవహరింపక మానదు. ఆ వ్యవహారాలనే కర్మములు అంటున్నాము. దీనిని బట్టి జీవరాశికి కర్మము నైజమని తెలుస్తున్నది.

## సంసృతి నివారణమార్గం

పురుషునికి ప్రకృతిసంగమమే సంసారమవుతున్నదని, సంసారం వర్తించే తీరు ఇట్టిదని వివరించాము. ఇక సంసారబంధనం తొలగే మార్గం ఏమిటన్న ప్రశ్నొక్కటి ఉన్నది. దేహి ఎప్పుడు ప్రకృతి సంగమాన్ని విడిచిపెడితే అప్పుడు సంసారబంధనం తొలగిపోతుంది. ఆ బంధనం తొలగటమే ముక్తి అనబడుతుంది. ప్రకృతిసంగమం ఎట్లా తొలగుతుంది? అంటే, అసలు ప్రకృతి ఏమిటో తెలుసుకోవాలి. ప్రకృతి అన్నది పరమేశ్వరుని శక్తివిలాసమే కాబట్టి శక్తివిలాసమే పరమార్థమని అనుకొనక శక్తిమంతుడైన పరమేశ్వరునందు బుద్ధి లీనమయితే ప్రకృతి సంగమం తొలగినట్లవుతుంది.

## అజామిళుని పాశబంధ కారణం

ఈ అజామిళుని సంగతేమంటారా? ఇతను మొట్టమొదట మంచి స్వభావం కలిగి సదాచార సంపన్నుడై క్షమాదయాది సద్గుణ లక్షణాలను కలిగి, ధృతవ్రతుడు మృదుచిత్తుడు దాంతుడు అయి సత్యాన్ని వదలక శుచియై మంత్రవిద్య నభ్యసించి గురువులను అగ్నిని అతిథులను వృద్ధులను యథావిధిగా సేవిస్తూ, నిరహంకారుడు సర్వభూతసుహృదుడు మితభాషి అసూయారహితుడు అయి పరమసాధువుగా ఉండేవాడు. ఒకనాడితని తండ్రి పండ్లు పువ్వులు దర్భలు కట్టెపుల్లలను తెమ్మని అడవికి పంపాడు. అక్కడ దాసి ఒకతె కల్లు త్రాగి మైమరచి పోకముడి వీడిన సంగతి కూడా తెలియక పరాకున పడి ఉన్నది. శూద్రుడొకడు దానితో ఆడుతూ పాడుతూ తదేకలోకాన విహరిస్తున్నాడు. వారిద్దరూ అజామిళుని కంటబడ్డారు. అది నిమిత్తంగా ఇతనిని మదనుడు ఆవేశించాడు. ఇతను స్వవిద్యాధైర్యాలను ఆశ్రయించి మదనుని ఢీకొనజూశాడు కాని ఆ ఆటలు మరుని మ్రోల సాగలేదు. ఆ దాసి సర్వకాల సర్వావస్థల లోనూ ఇతని కన్నులలో మెలగసాగింది. చదువుసంధ్యలు నానాటికి సన్నగిల్లాయి; స్వధర్మం మంటగలిసింది. చివరికి తను ఆ దాసికి బంటుగా కుదురుకొని ఇల్లాలిని వదిలి దాని యింటజేరి పిత్రార్జితమంతా దానికి ధారపోసి దానితో గ్రామ్యసుఖాలను అనుభవిస్తూ దాని క్రీడామృగం కన్నా హీనంగా బ్రతికాడు.

ఇతనికి దానివలన సంతానం పుట్టు కొచ్చింది. కుటుంబపోషణార్థం కావలసిన ధనం కనుమరుగయింది. ఇతనప్పటికి కుటుంబభరణమే పరమార్థంగా భావించి శాస్త్రాన్ని ఉల్లంఘించి న్యాయాన్యాయాలను దవ్వుచేసి స్వేచ్ఛావర్తనుడై జూదాలు, మోసాలు, దొంగతనాలు వృత్తిగా గ్రహించి ఎలాగయితే నేమి? నాలుగు కాసులు తెచ్చి కుటుంబాన్ని పోషింపసాగాడు. ఈ విధంగా ఇతని జీవితమంతా పాపపంకిలమయింది. దండన వల్ల తప్ప వేరొకదానితో ఇతనికి పాపపరిహారం కలగదు. అందుకని మేమితనిని దండపాణి వద్దకు తీసుకొని పోతున్నాము' అన్నారు.

## విష్ణుదూతల సమాధానం

విష్ణుదూతలు ఆ మాటలను సాంతంగా విని, 'యమదూతలారా! ధర్మదర్శనుల సభలో అధర్మం ప్రవేశించింది. కాకపోతే దండింపరాని పుణ్యాత్ములను దండసభాసభ్యులు నిష్కారణంగా దండనల పాలుచేస్తారా? ఏ సాధువులు ప్రజలకు తండ్రులు, బాలకులు, సమానులు అవుతారో, అట్టి సాధువులయందే కనరాని వైషమ్యం కానవస్తుంటే ఇక ప్రజలకు దిక్కెవ్వరు? పెద్దలు దేనిని అంగీకరిస్తారో అదే లోకానికి ప్రమాణం. అందువల్లనే లోకం పెద్దల త్రోవను అనుసరిస్తుంటుంది. కంచే చేను మేసినట్లు లోకం ధర్మాధర్మ చింత మాని ఎవరి తొడపైని తలనుంచి హాయిగా ఉంటున్నదో, అట్టి భూతవిశ్వాసుడు తననే నమ్ముకొని తనకు సర్వార్పణం చేసినవారి గొంతులు కోయటం ఉచితమేనా? అదే జరిగితే లోకానికి గతేమిటి?

యమదూతలారా! ఈ అజామిళుడు దురంతపాపం చేశాడని అన్నారు. పాపాలకు ప్రాయశ్చిత్తాలు లేవా? ప్రాయశ్చిత్తాల చేత పాపాలు నిస్సత్త్వాలు కావా? చౌర్యం, సురాపానం, మిత్రద్రోహం, బ్రహ్మహత్య, గురుదారసంగం, స్త్రీ హత్య, రాజ పితృహత్యలు మొదలైనవి మహాపాతకాలని అంటారు. ఇవే కాక ఇంతకంటె కోటిరెట్లు హెచ్చయిన పాపాలు కూడా హరినామస్మరణమాత్రాన తొలగి పోతాయి. అంతేకాదు. కోటి కోట్ల జన్మల పాపరాశికి సహితం హరినామస్మరణ పరమప్రాయశ్చిత్తమవుతుంది. భగవన్నామాన్ని స్మరించేవాడు పాపరహితుడు కావడమే కాదు – పునీతుడు కూడా అవుతున్నాడు. ఎప్పుడు పునీతు డయినాడో అప్పుడే అతను భగవత్కరుణకు పాత్రుడు కాగలడు.

పాపపరిహారార్థం మనువు గౌతముడు యాజ్ఞవల్క్యుడు మొదలైన బ్రహ్మవాదులు వ్రతాదిరూప ప్రాయశ్చిత్తాలను విధించి ఉండగా వాటిని కాదని హరినామస్మరణరూప ప్రాయశ్చిత్తాన్ని ఇంతగా ఉగ్గడించడం తగునా అని శంకింపవద్దు. వ్రతాలు పాపపరిహారానికే కాని చిత్తశుద్ధికరాలు కావు. హరినామ స్మరణ మన్నదో? పాపమలినాన్ని దూరీకరించటమే గాక చిత్తాన్ని

శుద్ధిపరచి ఉత్తమశ్లోకుల గుణాలను మనోమందిరంలో నిక్షేపిస్తుంది. దాని ఫలమేమంటారా? అది పునఃపాపాచరణప్రవృత్తిని అణిచిపెడుతుంది. ఇతరమార్గాలేవీ అందుకు చాలవు. ఎందుకంటే చిత్తమన్నది సర్వపాపాలకూ నిలయం. పాపమలం చిత్తాన్ని అంటి పెట్టుకొని స్వభావానుగుణమైన వాసనలను వీస్తుంటుంది. ఇతర ప్రాయశ్చిత్తాలు ఆ వాసనలను మాత్రమే తొలగిస్తాయి. చిత్తమలాన్ని హరింపలేవు. హరినామస్మరణ సర్వ మలాపహర మైనది. దాని ప్రభావం వలన చిత్తం ఎన్నటికీ మళ్ళీ పాపముఖం కాదు.

## అజామిళుని పాపపరిహారాదికం

అజామిళుడు తన అవసానకాలంలో భగవన్నామస్మరణ కావించాడు. ఆ పుణ్యఫలంగా ఇతని పాపాలన్నీ పరిహృతాలై ఇతను పుణ్యజీవనుడయ్యాడు. అయితే భగవన్నామస్మరణను ఇతను మనఃస్ఫూర్తిగా చేయలేదని, భయాతురత వలన తన కొడుకు నారాయణు డనేవాడిని చేరబిలిచాడని, అది భగవన్నామస్మరణ ఎలాగవుతుందని ప్రశ్నిస్తారేమో? బుద్ధిపూర్వకంగా కాని, అబుద్ధి పూర్వకంగా నైతేనేమి (అంటే కాలుజారిపడటమో, తేలుకుట్టడమో, పాము కరవడమో, జ్వరాదితాపాలు కలగడమో సంభవించినప్పుడు) హరి అనే రెండక్షరాలను ఉచ్చరించితే వాడిక నరకయాతనలకు తగడు. ఎలాగంటారా? తెలిసి కాని, తెలియక కాని అగ్నిని తాకినప్పుడు అది కాల్చక మానదు. అలాగే హరినామస్మరణను తెలిసి చేసినా తెలియక చేసినా పాపజాతం దహింపబడక మానదు. ఔషధమే ఇందుకు నిదర్శనం. వస్తుగుణం బుద్ధిని ఆశ్రయింపదు కదా!

దూతలారా! మేము చెప్పిన ఈ ధర్మాన్ని గురించి మీకు సందేహం ఉన్నదంటే మీరు మీ ప్రభువు వద్దకు వెళ్ళి తెలుసుకోండి. ఆయనకు తెలియని ధర్మ రహస్యాలు లేవు' అని చెప్పారు.

రాజా! విష్ణుపార్షదులు ఆ విధంగా ప్రసంగించి అజామిళుని యమపాశబంధం నుంచి విడిపించారు. అతను మృత్యువు బారినుంచి తొలగి

భయం మాని ఎదుటనున్న హరిపార్షదులకు సాష్టాంగ ప్రణామం చేసి ఏదో పలుకబోతున్నాడు. హరికింకరులు అతని భావాన్ని ఊహించి అక్కడ ఉండకూడదని నిర్ణయించి అంతర్ధానం చెందారు.

అజామిళుడు వారి సంవాదాన్ని విని, 'ఒకరు బోధించిన ధర్మం త్రయీబోధ్యమై గుణాశ్రయంగా ఉన్నది. రెండవవారు బోధించిన ధర్మం శుద్ధనిర్గుణమైన భాగవత ధర్మంగా ఉన్నది.' అని నిశ్చయించుకొన్నాడు. హరిమహిమ చెవిసోకినందువలన అతనియందు భగవద్భక్తి తలయెత్తింది. అతను తన చెడు నడతలను తలపోసి పశ్చాత్తాపం చెంది, 'అయ్యో! అజ్ఞానవశాన ఇన్ని కష్టాలు పాలయ్యాను. శూద్రస్త్రీ యందు పుత్ర రూపాన జనించాను; బ్రాహ్మణజాతిని పాడుచేసుకొన్నాను; దుష్కృతాలు చేసి చేసి కులానికి తీరని మచ్చ తెచ్చాను; సాధువులకు దూషణపాత్ర మయ్యాను; సతికి దూరమైనాను; జరభిని కూడాను; సోమాన్ని వదిలాను; కల్లు త్రాగాను; కని పెంచిన తల్లిదండ్రులను వదిలి కృతఘ్నుడ నైనాను; కేవల కామాంధుడనై ధర్మహాని చేశాను; నాకు నరకం తప్పదు.

నన్ను పాశాలతో కట్టి ఈడ్చారు. ఆ తరిని సిద్ధపురుషులెవరో నలుగురు తటాలున వచ్చి ఆ పాశాల నుంచి నన్ను విడిపించారు. నేను స్వస్థత పొంది కన్ను తెరిచి చూసేటప్పటికి నన్ను కట్టినవారు గాని, విడిపించినవారు కాని కనబడరైరి. ఇది కల అనుకోవాలో కల్ల అనుకోవాలో ఊహకన్నా అందటం లేదు. ఏది యెలాగున్నా నాకు ఆత్మప్రసాదం లభించింది. ఇది ఆ మహాపురుషుల దర్శనభాగ్యమే గాని వేరొకటి కాదు. కాగా ఇంతటి మహాభాగ్యం నా పూర్వపుణ్యఫలం కాబోలు. కాకపోతే దాసీ సంగమం వలన అశుచియైన నా యీ నాల్కకు హరినామోచ్చారణ భాగ్యం కలుగుతుందా? బ్రాహ్మణ్యాన్ని త్యజించి సిగ్గు వదిలి వంచనావృత్తిని జీవిస్తుండిన ఈ మహాపాపి యెక్కడ? పరమమంగళకరమైన 'నారాయణ' నామోచ్చారణ మెక్కడ? ఇకనైనా నాకు సంసార గాఢాంధకార కూపస్థ జీవితం కలుగకుంటుంది గాక!

ఇదంతా మనఃకార్యమని నాకిప్పుడు స్పష్టమయింది. మనస్సును నియమిస్తాను గాక! మనోనియతి సాధించినవారికి దృశ్యసామస్త్యం మిథ్యాభూతమవుతుంది. సత్యం స్పష్టపడుతుంది. బంధనమన్నది అవిద్యాకామకర్మ నుంచి పుడుతున్నది. ఆ బంధనను తెంచివేయాలి. అందుకు మనశ్శక్తి తగినంత చేకూరాలి. ఆ శక్తి సంపాదనకు శాంతి, మైత్రి, కారుణ్యము, సర్వభూతహితత్వం ముఖ్యాంగాలు. వాటి నలవరచుకొని ఆత్మవంతు డయితే తప్ప, వేరొక విధాన ఆత్మ మాయ అనే స్త్రీకి లొంగి దానికి వశమై క్రీడామృగం వలె చరించే మహాదౌర్భాగ్యం తొలగదు. దేహగేహాదు లెన్నటికీ స్థిరమైనవి కావు. అటువంటి అస్థిరమైన వాటి పట్ల 'నేను, నావి' అన్నటువంటి అభిమానాన్ని పాదుకొల్పాను. ఇదంతా మాయావిశేషం కాకపోతే మరేమిటి? అన్నిటికన్నా ముందు అభిమానాన్ని బయటకు గెంటాలి. అందుకు మనశ్శుద్ధి కావాలి. ఆ మనశ్శుద్ధి భగవన్నామసంకీర్తన వలన గాక అన్య కార్యాల వలన సిద్ధింపదు' అని లోలోన నిశ్చయించు కొని, పుత్త్రాదిక స్నేహబంధాన్ని త్రుంచివేసి గంగాద్వారానికి బయలుదేరాడు.

## వైకుంఠ గమనం

రాజేంద్రా! అజామిళునికి ఇంతమాత్రపు భాగ్యం అలవడిన కారణమేమిటో తెలుసా? అది క్షణకాల సాధుసంగ ఫలమని గ్రహించు. ఆ విధంగా అతను గంగాద్వారం చేరుకొని యోగాన్ని వహించి ఇంద్రియనిగ్రహం కావించి మనశ్చాంచల్యాన్ని ఉడిపి బుద్ధిని ఏకాగ్రం చేసి సమాధినిష్ఠుడయ్యాడు. ఆ సమయాన పూర్వం అతనికి దర్శనమిచ్చిన పుణ్య పురుషులు మళ్ళీ ప్రత్యక్షమయ్యారు. అతను వారికి సాష్టాంగ ప్రణామం కావించి ఆత్మకళేబరాన్ని గంగాజలాలలో త్యజించివేశాడు. వెనువెంటనే అతనికి హరిపార్షదరూపం కలిగింది. అంతలో కాంచన విమానం ఏతెంచింది. విష్ణుదూత లతనిని ఆ విమానంలో కూర్చుండబెట్టుకొని హరిలోకానికి తీసుకొనివెళ్ళారు.

రాజేంద్రా! నిఖిలధర్మాలనూ తెగనాడి దాసిని కామించి అదే లోకంగా కాలం గడిపి చెప్పరాని నింద్యకృత్యాలు చేసి నరకాన పడనున్న మహాపాపాత్ముడు సయితం భగవన్నామసంకీర్తన పుణ్యఫలం వలన ముక్తుడు కాగా, హరిభక్తుల సంగతి వేరే చెప్పాలా? ముముక్షువులకు భగవన్నామానికి మించిన పాపక్షయసాధనం వేరొకటి లేదు. ప్రాయశ్చిత్తాలు ఎంత కఠినమైనవయినా తాత్కాలిక పాప హరాలు కాగలవేమో కాని, పాపపునరావృత్తి మూలక రజస్తమః కృత మనోమాలిన్యాన్ని మాత్రం వదిలింపలేవు.

> రాజేంద్రా! మనుష్యులు కర్మలను చేయటం నైజమనుకొన్నాము. ఆ కర్మములు శుభాశుభాలుగా ఉంటాయి. ప్రతికర్మమునకు తదనుగుణమైన ఫలం ఉదయింపక మానదు. ఆ ఫలాన్ని కర్త అనుభవింపక తీరదు. ఫలానుభవార్థం తగిన శరీరాలు కలుగుతుంటాయి. ఆ శరీరాలు తత్తత్కర్మఫలాలను అనుభవించి నశిస్తాయి. శరీరాలు ఆ విధంగా అనుభవింపవలసిన కర్మఫలాల వాసనాసముచ్చయాన్ని అంతఃకరణ మంటారు.
>
> ఏయే సమయాన ఏయే కర్మఫలం భోగ్యమవుతుందో ఆయా సమయాన తత్తత్కర్మఫలవాసనలు విజృంభించి మళ్ళీ తత్తద్రూపకర్మములకు ప్రేరేపిస్తాయి. అట్టి కర్మములను ఇంద్రియాలు కొనసాగిస్తాయి. శుభకర్మఫల వాసనలు వీచినప్పుడు శుభభావాలు కలిగి ధర్మకార్యాలు చేయబడి జీవుడు ఉత్తమగతికి పోగలుగుతాడు. ఆ అశుభకర్మఫలవాసనలు వీచినప్పుడు అశుభాశయాలు జనించి అధర్మకార్యాలు చేయబడి జీవుడు అధోగతి పాలవుతాడు.

అశుభకర్మముల వలన కలిగే దోషం మలము – విక్షేపము – ఆవరణము అని మూడు విధాలు. మలరూపదోషం విషయాసక్తిని కలిగించి నిషిద్ధకర్మలకు ప్రేరేపిస్తుంది. ఇది మలదోషలక్షణం. మనస్సుకు నిలకడ కుదరక ఆ వంకకు

ఈ వంకకు పరిగెడుతుంటుంది. ఇది విక్షేపదోషలక్షణం. ఘటాన్ని దీపం మీద ఉంచినప్పుడు దీపకాంతిని బహిఃప్రకాశమానం కానీయక నిరోధిస్తున్నట్లే, ఆవరణదోషం ఆత్మప్రకాశాన్ని కప్పిపుచ్చుతుంది. ఆత్మప్రకాశం కలుగనినాడు బుద్ధి 'నే నెవరిని' అనే సత్యాన్ని గ్రహింపక పొరబడుతుంటుంది. ఇది ఆవరణ దోష లక్షణం.

## దోషత్రయ నివారణప్రక్రియ

రాజేంద్రా! ఈ దోషత్రయం పోవాలంటే గంగాస్నానం, భగవన్నామోచ్చారణం, భూతదయ, నిష్కామకర్మానుష్ఠానాలను పాటించాలి. ఇవి నాలుగూ దోషనివారణప్రక్రియలు. ఈ నాల్గింటిలో ఏ ఒక్కదానిని అనుష్ఠించినా మలినదోషం తొలగిపోతుంది. మలినదోషానికంటె విక్షేపదోషం తీవ్రతరమైనది. భగవద్ధ్యానం, అజపాజపం, యోగం, భగవద్బుద్ధితో గురువును సేవించటం, వేదాంతప్రవేశం – ఈ అయిదింటిలో ఏ ఒక్కదానిని నేర్చినా విక్షేపదోషం, మలదోషం రెండూ తొలగుతాయి. ఆవరణదోషం తీవ్రతరమైనది. అపరోక్ష జ్ఞానం చేత తప్ప మరి దేనిచేతనూ ఆ దోషం నివృత్తిని పొందదు.

రాజా! మలవిక్షేపదోషనివారణ సాధనాలు అన్నింటిలోకీ భగవన్నామోచ్చారణం శ్రేష్ఠమైనది. ఆ నామస్మరణను తెలిసి చేసినా తెలియక చేసినా శుభఫలం తప్పదు. వస్తుశక్తి ఇచ్ఛను ఆశ్రయింపదని ముందే చెప్పానుకదా.

రాజా! ఈ ఇతిహాసం సర్వపాప నివారం, పరమరహస్యం అయినట్టిది. దీనిని శ్రద్ధాభక్తులతో విన్నవారికి పఠించినవారికి నరకాలు దూరం కావడమే గాక యమభటులు సమీపించాలనుకొన్నా దగ్గరికి రాలేరు. ఎంతటి మహాపాపాత్ములకు సహితం విష్ణులోకప్రాప్తి కలుగుతుంది. అక్కడ వారు పూజితు లవుతారు.

## యమభటుల విన్నపం

రాజేంద్రా యమదూతలు ఆ విధంగా నిరాకృతులై యముని సందర్శించి, 'దేవా! జీవలోకమంతా త్రివిధ కర్మలను ఆచరిస్తూ తత్తత్కర్మఫలాలను అనుభవిస్తుంటుంది. ఏ జీవి ఏ ఫలాన్ని ఎప్పుడనుభవించాలో విధివిధానం ఉండాలి. ఆ విధానాన్ని విధించే అధికారీ ఉండాలి. ఆ శాసించేవాడు ఏకవ్యక్తిగా ఉండాలే కాని బహువ్యక్తులు కారాదు. బహువ్యక్తులైనప్పుడు అభిప్రాయభేదాలు కలిగి కార్యక్రమం యథావిధిని నడవటం సాధ్యంకాదు. పైగా ఒకరికి దండనీయు డైనవాడు వేరొకరికి రక్షణీయుడుగా తోపవచ్చును. అప్పుడు దండవిధానమే తారుమారవుతంది. కర్మకారులు పెక్కుమంది అయినప్పుడు వారి వారికి తగిన వ్యవస్థను కావించేవారు మాత్రం పెక్కుమంది ఎందుకుండకూడదు? అని ప్రశ్నింపవచ్చు. పెక్కుమంది ఉండటం అన్నది ఉపచారమాత్రమే. చక్రవర్తి ఒక్కడే సర్వులకూ శాసనకర్త అవుతాడు. తక్కిన వారందరూ అతని ఆజ్ఞలను కొనసాగించేవారుగా ఉంటారు. ఎటుచూచినా శాసనకర్త ఏకవ్యక్తిగా ఉండాలన్నమాట తథ్యం.

దేవా! సర్వలోకాలకు నీ వొక్కడవే శాసనకర్తవని, నరుల పుణ్యపాపాలను విచారించి యథార్థదండనలను విధించే శాస్తవు నీవొక్కడవేనని తలచి ఇన్నాళ్ళుగా నీ ఆజ్ఞను తలదాల్చుతున్నాము. నేడు మా తలపు వమ్మయింది. నేటి నీ ఆజ్ఞ ప్రకారం మేము వెళ్ళి ఒక మహాపాపిని పాశాలతో బంధించి ఇక్కడికి తీసుకొనిరానుండగా అంతలో ఆ పాపాత్ముడు భయగ్రస్తుడై 'నారాయణా' అని అరిచాడు. ఆ అరుపుతో ఎవరో నలుగురు వచ్చి అతనికి అభయం పలికి మేము కట్టిన పాశాలను సడలించి అతనిని వదిలిపెట్టారు. వారెవరు? అట్లా ఎందుకు జరిగింది? నీ ఆజ్ఞను వారు ఉల్లంఘించటం ఏమిటి? మాకేమీ అంతుపట్టడం లేదు' అని విన్నవించారు.

దండధరుడు వారి సందేహాన్ని విని, 'భటులారా! ఈ ప్రపంచం స్థావరజంగమాత్మకమై ఉన్నది. ఈ ప్రపంచానికి 'నేను' ఈశ్వరుడనని మీరు భావించారు. అది పొరపాటు. ఆ ప్రమాదఫలాన్ని మీరనుభవించారు.

ఏమంటారా? మనందరినీ శాసించే మహాపురుషుడు ఒకడున్నాడు. తంతువులలో వస్త్రంవలె ఈ విశ్వమంతా అతనిలో ఓతప్రోతమైవున్నది. బ్రహ్మ విష్ణు రుద్రులు సయితం అతని అంశమాత్రులై విశ్వసృష్టిస్థితిలయాలను కావిస్తుంటారు. సమస్తలోకం ఆ మహాపురుషుని వశమై ముక్కుతాడుతో కట్టిన ఎద్దువలె వర్తిల్లుతుంది. ఆ మహాపురుషుని పాశాలు ఎటువంటివంటే, ఆయన వాక్కులే ఆ పాశాలు. ఆ వాక్సముచ్చయమే వేదమని అనబడుతున్నది.

దూతలారా! ఆ మహాపురుషుని చేష్టితాలను గురించి అడుగుతారేమో? అతని చేష్టితాలను గ్రహించాలంటే రజస్తమోగుణాలను జయించి కేవల సత్త్వప్రధానులు కావాలి. అట్టివారికి మాత్రమే సృష్టి రహస్యం కొంత స్పష్టపడుతుంది. అష్టదిక్పాలకులమైన మేము, బ్రహ్మ, సుర సిద్ధ సాధ్య మరుదగణం, విశ్వవసువులు, లోకసృష్టికర్తలైన ప్రజాపతులు, భృగువు మొదలైన మహర్షులు - రజస్తమస్సులలో తగులుకొనక సత్త్వప్రధానులమై ఉంటాము. అటువంటిది మాకు కూడా ఆ మహాత్ముని భావాలు గాని, కార్యాలు గాని గోచరించవు. ఇక అన్యుల మాట వేరే చెప్పేదేమున్నది? నేత్రాలు రూపాలను గ్రహిస్తాయి. రూపాలు తమ్మెరింగిన నేత్రాలను గ్రహింపలేవు. అదే విధంగా ఆ మహాత్ముడు హృదయాంతర్యామియై చిత్తేంద్రియప్రాణవాక్కులన్నింటినీ దర్శిస్తుంటాడు. ఆ చిత్తేంద్రియాదులు అతనిని చూడలేవు. ఇక చిత్తాదులు తమకు తెలియనిదానిని గురించి ఏమి చెప్పగలవు?

## హరిపార్షదులు - వారి ధర్మం

భటులారా! ఆ మహాత్ముడు ఆత్మ తంత్రుడు, అతని శక్తిని మాయ అంటారు. ఆ మాయ అతని ఇచ్ఛానుసారం వ్యవహరిస్తుంది. ఆ మహాత్ముని సేవించినప్పుడు ఆయన గుణస్వభావాదులను కొంతకు కొంత తెలిసికొనటమూ, వాటిని కొంతకు కొంత అలవరచుకొనటమూ జరుగుతుంది. అతని పరిసేవకులు అటువంటి మహాభాగ్యాన్ని చవిచూసి ఈ లోకాన చరిస్తుంటారు. వారిని హరిపార్షదులంటారు. లోకంలో హరిభక్తులకు ఎవ్వరి

వలన నైనా గోరంత కూడా అపకారం వాటిల్లకుండా వారిని కాపాడటమే హరిపార్షదుల ధర్మం.

## భాగవత ధర్మం

భటులారా! ఆ భాగవతధర్మం అతి విశుద్ధము, అత్యంత దుర్బోధము అయినందువల్ల పరమ గుహ్యమై ఉన్నది. ఆ ధర్మాన్ని బ్రహ్మ శంకరుడు నారద సనత్కుమార కపిల మను ప్రహ్లాద జనక భీష్మ బలి శుకు లంతటివారు కూడా కొంతకు కొంత మాత్రమే ఎరుగుదురు. నేను కూడా అంతంత మాత్రమే గ్రహించాను. కాబట్టి భాగవత ధర్మం ఇట్టిదని సమగ్రంగా ఎవరూ చెప్పలేరు.

## లోకులకు పరమధర్మ సాధనం

దూతలారా! భగవద్భక్తిని అలవరించు కొనటమే లోకులకు పరమధర్మమై ఉన్నది. ఆ భక్తి ఎలా సిద్ధిస్తుంది? అని అడగవచ్చు. భగవన్నామాన్ని కీర్తించటం వలన ఆ భక్తి క్రమక్రమంగా సిద్ధిస్తుంది. హరినామకీర్తనకు అంతటి మాహాత్మ్యం ఉన్నదా? అని అడుగుతారేమో. ఆ సంగతి మీరే కళ్ళారా చూశారు. అజామిళుడు భక్తితో ఆ పని చేయలేదని, ప్రాణోత్క్రమణసమయంలో మిమ్మల్ని చూసి భయపడి తన కొడుకును 'నారాయణా!' అని కేకవేసి పిలిచాడంటారా? పుత్రవాత్సల్యవ్యాజాన అయితేనేమి, నారాయణశబ్దాన్ని ఉచ్చరించినంత మాత్రాననే అజామిళునికి ముక్తి కలగటం మీరు చూశారు కదా! ఇక నియమపూర్వకంగా భగవద్గుణకర్మనామాలను కీర్తించే పుణ్యాత్ముల సంగతి చెప్పాలా?

## వేదసారం - భక్తియోగం

భటులారా! హరినామోచ్చారణలో ఇంతటి మహిమ ఉండగా దానిని వదిలి యజ్ఞకర్మలతో జీవితాన్ని గడపటం ఎందుకంటారా? అజ్ఞానమే అందుకు కారణం. యజ్ఞాదులు వేదవిధులు కదా? అంటే, వేదవచనాలు పుష్పితలతిక వలె అర్థవాదరుచిరంగా ఉంటాయి. ఏ కర్మములకు ఏ ఫలాలు

ఉంటాయో వేదాలు నిరూపిస్తాయి. అంతే కాని ఆ కర్మములను చేయవలసినదని వేదాలు విధింపవు. జడమతులు ఆ మాటలు పరమార్థంగా భావించి నడుచుకొంటారు. ధీమంతులో? సర్వమూ విమర్శించి సారం తెలుసుకొని ఆ ప్రకారం వర్తిస్తారు. సారమేమంటారా? భక్తియోగమే వేదసారం. ఆ భక్తికి చిత్తశుద్ధి ఆధారం. చిత్తశుద్ధి అంటే – చిత్తము దాని చాంచల్యాన్ని మాని ఏకాగ్రం కావటం. చంచలమతులకు ఏకాగ్రతను కలుగచేసేందుకు యజ్ఞాదికర్మలు సాధనాలుగా చెప్పబడ్డాయి. ఆ కర్మలను చేస్తూ రాగా కొంతకాలానికి చిత్తం కర్మఫలదాత వంక చేరి నెమ్మదిగా నిలకడను పొందుతుంది. ఇదే వేదవిధుల తాత్పర్యం.'

## హరిభక్తులు – పూర్వపాపం

భటులారా! భగవద్భక్తు లెన్నటికీ దండ్యులు కారు. ఈ సంగతి మరిచిపోకండి. భగవద్భక్తులయితే మాత్రం వారికి పూర్వపాపం కలుగదా? అని దానిని అనుభవింపక తప్పించుకోవటం సాధ్యమా? అని శంకిస్తారేమో? భగవద్భక్తుల పూర్వపాపాలన్నీ హరిగుణకీర్తన మాత్రాననే సమసిపోతాయి. అంతే కాదు. వారియెడ పాపాల పునరంకురానికి అవకాశం కూడా కలుగబోదు.

## హరిభక్తుల లక్షణాలు

హరిభక్తులను గుర్తించటం ఎలాగంటారా? ఎవరు సాధువులు గాను, సమదర్శనులుగా ఉంటారో, వారందరూ హరిశరణాగతులని గ్రహించండి. అట్టివారి వద్దకు మీరు పొరపాటుగా నైనా చేరబోకండి. ఎందుకంటారా? భగవంతుడు గదాధారియై వారిని కాపాడుతుంటాడు. హరిభక్తులను దండించటం నాకు మాత్రమే కాదు, కాలానికైనా వీలుకాదు.

## పాపాత్ముల లక్షణాలు

అయితే మేము ఎవరి దగ్గరికి పోవాలి? అంటారేమో! పాపాత్ముల వద్దకే మీరు వెళ్ళాలి. వారి లక్షణాలేమిటి? అంటే, ఎవరు భగవత్పాదారవింద

మకరందాన్ని మెచ్చక నిరయమార్గమైన గృహాద్యభిమానానికి చిక్కి ఉంటారో, వారందరూ అసాధువులని గుర్తించండి. వారిని ఇక్కడికి తీసుకొనిరండి. ఏ నిర్భాగ్యుడు ఒక్కనాడు కనీసం భగవన్నామాన్ని ఉచ్చరించటం గాని, భగవంతుని భజించటం గాని, ఆయనకు ప్రణమిల్లటం గాని, సేవించటం కాని చేసి యెరుగడో వాడు తప్పక దండింపదగినవాడు.

భటులారా! మీరు తెలియక అపరాధం చేశారు. తెలియక తప్పుచేసినా ఆ తప్పును గ్రహించి క్షమాపణను వేడటం ధర్మం. మన్నన వేడినవారిని మన్నించటం కూడా ధర్మమే. భగవానుడు పరమధర్మస్వరూపుడు కాబట్టి మీ కోసం నేనతనిని క్షమాపణ వేడుకొంటున్నాను, అని చెప్పి, 'భక్తవత్సలా! నా భటులు చేసిన తప్పుకు గాను నేను నమస్కరిస్తున్నాను' అని సాగిలపడ్డాడు.

నరేంద్రా! భగవత్కీర్తనం సకలపాపప్రాయశ్చిత్తమే గాక లోకమంగళకరం అయినట్టిది. ఆ మహనీయుని చరితలు చెవి సోకినంతనే హృదయంలో ఒక విధమైన మార్పు కలుగుతుంది. అదే భక్తిబీజం! ఆ భక్తివలన చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధికి వ్రతాదులు లేవా? అంటావేమో. వ్రతాదులు పైపై కల్మషాన్ని తొలగిస్తాయేకాని చిత్తనైర్మల్యాన్ని కలిగింపలేవు.

> భగవత్పాదమరంద మన్నదో, మలాన్ని సబీజంగా ఊడ్చివేస్తుంది. కాగా ఆ మకరందాన్ని ఒకసారి గ్రోలినవారికి గుణ కార్యములైన ఐహికభోగకర్మలు రుచించవు. చిత్తమాలిన్యాలన్నీ కోరికల వలన కలుగుతున్నాయని, కోరికలను జయించినవాడు శుద్ధచిత్తుడు కాడా? అని, భగవద్భక్తి వేరే ఎందుకని శంకింపవచ్చు. చిత్తశుద్ధి నిమిత్తం కోరికలను జయించాలని ప్రయత్నిస్తారు. కేవలం వట్టి ప్రయత్నాల వల్లనే కామ బీజం సంపూర్ణంగా తొలగిపోదు. అది బీజమాత్రమై సిద్ధంగా ఉంటుంది. అదను వచ్చినప్పుడు తలయెత్తి పునఃప్రవృత్తికర కర్మములను చేయిస్తుంది. భగవద్భక్తి అంటేనో? కామాన్ని సమూలంగా

పెకలించివేస్తుంది. భక్తులు భగవదిచ్ఛాప్రేరిత కర్మములను మాత్రమే నిర్వర్తిస్తారు. అందుచేత వారికి తత్కర్మఫలాలు అంటవు.'

## ప్రారబ్ధము - శాంతి

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు ఆ మాటలు విని, 'మహాత్మా! శాంతివలన కూడా ప్రారబ్ధం నశిస్తుందా?' అని అడిగాడు. శుకమహర్షి అతని మనోభావాన్ని గ్రహించి 'రాజా! భోగ్యకర్మఫలం ప్రారబ్ధమని పిలువబడుతున్నది. వింటినుంచి విడిచిన బాణం వంటిది భోగ్యకర్మ యొక్క ఫలగతి. ప్రయోగతత్త్వాన్ని బట్టి బాణగతి మంద మధ్యమ తీవ్రాలుగా ఉన్నట్లుగానే భోగ్యకర్మఫలగతి కూడా ఉంటుంది. నారినుంచి వెలువడిన తర్వాత బాణాన్ని మరల్చటం ఎట్లా సాధ్యం కాదో, అట్లాగే ప్రారబ్ధకర్మగతి కూడా మరలింపరానిది. బాణగతిని మరలింపలేకపోయినా, తగిన ఉపాయం చేత దాని గతిని అడ్డగించటం ఎట్లా సాధ్యమో, అట్లాగే ప్రారబ్ధకర్మఫలగతిని అడ్డగింపవచ్చును. శాంతులన్నీ అటువంటివే. బాణగతి మహోత్కట మయితే, దానికి అడ్డుగా నిలిపిన వస్తువు తగినంత శక్తి గలది కాకపోతే, బాణం ఆ వస్తువును చీల్చుకొని ముందుకు దూసుకొనిపోతుంది. అట్లాగే ప్రారబ్ధకర్మఫలగతి కూడా తీవ్రం అయితే, తదర్థశాంతి తగినంత శక్తి గలది కాకపోతే, ఆ ప్రారబ్ధకర్మఫలాన్ని అనుభవింపక తప్పదు. రాజా! నివారణార్థం ప్రయోగించిన వస్తువుల బలాబలాలను బట్టి ఫలభోగపు స్థితిగతులు ఉంటాయి. ఒక్కటి మాత్రం మరువకూడదు. భోగ్యఫలం అనుభవోన్ముఖం కాకమానదు. అయితే దాని తీవ్రతను తగ్గించవచ్చు.

భోగ్యాన్ని ముందుగా జ్యోతిశ్శాస్త్రాన్ని బట్టి నిశ్చయించి దానికి ప్రతీకారం చేయవచ్చును కదా? అంటావేమో. మృత్యురూపమైన కర్మఫలానికి తప్ప తక్కినవాటికి ఉపశాంతి కలిగింపవచ్చునే కాని, ప్రారబ్ధకర్మ విధానానికి స్వరూపనాశం కలిగింపలేము. శరీరమనే వృక్షం సమయం వచ్చినప్పుడు కర్మఫలమనే చిగురును ధరింపక మానదు. చిగురును గిల్లివేయటం సాధ్యపడినట్లే కర్మఫలం ప్రారంభమైన తర్వాత దానిని తొలగింపవచ్చును.

ప్రారబ్ధాన్ని భోగించి తీరాలి అన్నప్పుడు దాని భావం ఇదేనని గ్రహించాలి. అంటే, ప్రారబ్ధం దాని శక్తికొద్దీ పోవలసినంత దూరం పోయి తీరుతుందని, ప్రతీకారాదుల వలన దానిని అడ్డగించినప్పుడు దాని తీవ్రతను అడ్డగించే వస్తువు గ్రహిస్తుందని, ఎట్లాగైనా ప్రారబ్ధఫలం స్వయంగానో పరప్రాపక రూపాననో భుక్తమై నశిస్తున్నదని తాత్పర్యం.

మరి అడ్డుపడే వస్తువు సామాన్యమైనది అయితే ఆ కర్మతీవ్రతకు అది లక్ష్యమై ఆ బాధను అనుభవిస్తున్నది. ఆ వస్తువు దుర్భేద్యమైనది అయితే కర్మతీవ్రత దానిని ఏమీ చేయలేకపోతుంది. వస్తువును అడ్డువేసినప్పుడు ఉత్తమోత్తమమైన వస్తువును తెచ్చి అడ్డువేయాలి.

మరి ఆ ఉత్తమోత్తమవస్తువు ఏదని అడుగుతావేమో? పరమేశ్వరుడే ఆ వస్తువు. అతని చాటుకు చేరితే ఆ మహాత్ముడు సర్వకర్త అయినవాడు కాబట్టి అన్ని కర్మఫలాలూ అతనిలో లయించి పోతాయి. కాబట్టి భగవత్ శరణాగతి కంటె ఉత్తమమైన రక్షకవస్తువు లేదు. భగవంతుని శరణు వేడటం కంటె ఉత్తమసాధనమూ లేదు.

రాజేంద్రా! పూర్వం అగస్త్యమునీంద్రుడు మలయపర్వత శిఖరాన భగవంతుని అర్చిస్తుండేవాడు. అక్కడికి మునులు కొంతమంది వెళ్ళారు. ప్రస్తావవశంగా గుర్తుకు వచ్చిన ఈ ఇతిహాసాన్ని ఆ మహనీయుడు వారికి చెప్పాడు. దీని సారాన్ని గ్రహించి ఆ విధంగా నడుచుకొని చరితార్థుడవు కావాలి' అన్నాడు.

## స్వాయంభువ మన్వంతర సృష్టివిస్తార కథనం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి మాటలను విని, 'ఓ మునీంద్రా! పూర్వం స్వాయంభువ మన్వంతరంలో దేవాసురనరమృగపక్షి నాగాదుల సృష్టిని గూర్చి తృతీయస్కంధంలో సంక్షేపంగా తెలియజెప్పారు. భగవానుడు ఏ శక్తిని ఉద్రేకింపజేసి ఏ ప్రకారం సృష్టిని విస్తరింపజేశాడో వినాలని కుతూహలంగా ఉన్నది' అని అడిగాడు. అతనితో శుకమహర్షి ఇలా అన్నాడు.

రాజా! ప్రాచీనబర్హికి ప్రచేతసులనే పుత్త్రులు పదిమంది జన్మించి సముద్రాంతరం నుంచి వెలువడి భూమిపై నిలిచి నలువైపుల పరికించటమూ, ధరాతలమంతా వివిధ వృక్షాలతో నిండి ప్రాణిసంచారానికి సందివ్వకుండటము, వారదిచూసి, 'ఓహో! ప్రాచీనబర్హి నారదుని ఉపదేశాన్ని పాటించి నివృత్తిమార్గాన్ని త్రొక్కినందువల్ల దేశం అరాచకమయింది. కృష్యాదులు సన్నగిల్లాయి. భూమిని దున్ని చక్కజేసేవారు లేకపోబట్టి భూభాగమంతా ఇట్లా ఉన్నది' అని తలపోసి కోపావేశులై లతాగుల్మవృక్షాదులను దహించేందుకు వారి ముఖాల నుంచి అగ్నిమారుతాలను పుట్టించడమూ, ఆ నిప్పుగాడ్పులు వృక్షాదులన్నింటినీ కాల్చి బూడిదచేయటమూ వినే ఉంటావు.

## ప్రాచేతసులకు స్వధర్మబోధ

నరేంద్రా! వనస్పతులకు ప్రభువు సోముడు. వనస్పతుల గతి ఆ విధంగా రూపు మాసినందుకు అతనెంతో బాధపడి ప్రాచేతసులను సందర్శించి, 'మహాభాగులారా! ప్రజాపతులు లోకవృద్ధిని కావిస్తారు. మీరంతటివారై ఉండి దిక్కులేని వృక్షాలకు ఈ కీడు చేయవచ్చునా? పైగా వృక్షకోటి ప్రత్యుపకారాన్ని అపేక్షింపక జీవకోటికి ఆహారాన్ని కూర్చుతున్నది. భగవానుడు సృష్టికి ఉపక్రమించి, తాను సృష్టింపనున్న సపాద నిష్పాద సహస్త నిర్హస్త ద్విపాద చతుష్పాదాది చరాచర సకలజీవరాశికి ఆహారార్థమై ఓషధులను ముందుగా పుట్టించి, జీవకోటికి అన్నవసతిని కూర్పమని వాటిని నియమించాడు. ఆ తర్వాత ప్రజాసర్గనిమిత్తం మిమ్ము నిర్దేశించాడు. మీ తండ్రి, మీ తాతముత్తాతలందరూ ప్రజాసర్గభారాన్ని వహించి వన్నె గాంచారు. మీ పెద్దల దారిని మీరు వదలకూడదు. మీ కోపాలను వదిలిపెట్టండి. బాలురకు తల్లిదండ్రులు, కంటికి రెప్ప, సతికి పతి, భిక్షువులకు గృహస్థుడు, అజ్ఞానులకు ప్రాజ్ఞుడు ఎట్లాగో ప్రజలకు రాజు అటువంటి ఆత్మీయుడు కావాలి.

ప్రాచేతసులారా! మరొక మాట. భగవానుడు సర్వభూతశరీరాల లోనూ ఆత్మభూతుడై ఉంటాడు. ఇంతెందుకు? లోకాలన్నీ భగవన్నిలయమే కదా!

లోకంలో దేనికి అపకారం కావించినా భగవంతునికి అపకారం చేయటమే అవుతుంది. నిదర్శన మేమంటారా? మీరే ఇందుకు నిదర్శకులవుతారు. ఎలాగంటారా? మీరింతకు పూర్వం భగవత్ప్రీతికి పాత్రులయ్యారు. కారణమేమిటి? మీ సమదృష్టే కదా కారణం? అది అంతలోనే మరిచిపోవచ్చునా? ఆత్మవిచారం చేసి చూడండి. కోపాన్ని ఉపశమింపజేయండి. కోపశాంతి అంటే గుణాలను జయించటం అన్నమాట. ఇకనైనా వృక్షదహనాన్ని నివారించి శేషించినవాటికి మేలుచేయండి.'

ఇదిగో ఈ కన్య వార్క్షి. ఈమెను ఇన్నాళ్ళూ ఈ వృక్షాలు అల్లారుముద్దుగా పెంచాయి. ఈమెను గ్రహించి ఈమెకు ఆశ్రయమైన వృక్షాలను, పక్షులను రక్షించండి' అని పలికి ఆ కన్యను ప్రచేతసులకు సమర్పించాడు. వారామెను ధర్మపురస్సరంగా గ్రహించి పెండ్లాడారు.

## దక్షునిచే ప్రజాసృష్టి

రాజా! ప్రాచేతసులకు ఆ కన్య వలన దక్షుడు జనించి తన మనశ్శక్తి చేత దేవాసురమనుష్యులను పుట్టించి వారిని క్రమంగా నభఃప్రదేశాన, జలప్రదేశాన, భూప్రదేశాన వసింపజేశాడు. అయితే వారి వలన దక్షుడు ఆశించినట్లు ప్రజాసర్గం వర్ధిల్లలేదు. అతనందుకుగాను చింతపడి వింధ్యగిరిప్రాంత పర్వతాలకు వెళ్ళి, అఘమర్షణ తీర్థంలో స్నానం చేసి శుచియై నియతితో తీవ్రతపస్సును ఆచరించి భగవానుని ఈ విధంగా స్తుతించాడు.

## హంసగుహ్య స్తోత్రం

'సర్వోత్తమా! నమోనమః. దేవా! సర్వము నీ చిచ్ఛక్తి విలాసకృతమే. ఆ శక్తి అవితథమని సర్వవిదితం. దేవా! గుణత్రయవ్యవహారం నీ శక్తి విలాసమే కాని వేరొకటి కాదు. జీవుడు నీ మాయావిలాసం వలన గుణత్రయాభాసు డవుతున్నాడు. అట్టి మాయకు నీవు నియంతవు. బాహ్యదృష్టిమాత్రుడైన జీవుడు తనను నియమిస్తున్న శక్తిస్వరూపుడవు నీవేనని ఎరుగలేడు. గుణాలు తమను ప్రకాశింపజేస్తున్న గుణిని గుర్తింపలేక పోవటం ఉన్నదే కదా!

గుణాలు జడము లైనందున గుణిని ఎరుగలేకపోతే పోవచ్చును గాని, తదన్యతరుడైన జీవుడు నిన్ను ఎందుచేత గుర్తింపలేక పోతున్నాడని తెలిసికొనగోరినవారు ప్రశ్నిస్తారు. జీవుడు దేహము ఇంద్రియాలు అంతః కరణముల స్వరూపాలను, దేవతావర్గాన్ని, వాటికి మూలభూతమైన గుణాలనూ తెలిసికొనగలడే కాని నిన్ను మాత్రం తెలిసికొనలేడు. ఏమంటే, నీవో అనంతుడవు. జీవుని జ్ఞానశక్తి అన్నదో పరిచ్ఛిన్నం. పరిచ్ఛిన్నుడు అపరిచ్ఛిన్నుడిని గ్రహించటం ఎలా సాధ్యపడుతుంది?

జీవునికి నిన్ను తెలియగల శక్తి కలగాలంటే – ఈ సృష్టి సమస్తం నామరూపప్రతీతి మాత్రం. ఆ ప్రతీతికి మనస్సు కారణం. మనస్సుకు దర్శన స్మరణ వృత్తులు నశిస్తే జీవునికి నిన్ను తెలిసినకొనగల శక్తి కలుగుతుంది. మనోవృత్తు లన్నవో? ఉపరతి వలన నశిస్తాయి. మనస్సు ఆ తీరున ఉపరతి పొంది సమాధిగత మైనప్పుడు దర్పణము వలె పరిశుద్ధంగా ఉంటుంది. అటువంటి పరిశుద్ధచిత్తంలో నీవు కేవల జ్ఞానస్వరూపహంసుడవై ప్రకాశిస్తావు. ఇదే జీవుడు నిన్ను తెలియటం అంటే.

దేవా! గాఢనిద్రయందు వలె మనోలయమూ, జాగ్రత్స్వప్నాలలో వలె విక్షేపకమూ కాక జ్ఞానమాత్రంగా ఉండే స్థితిని సమాధి అంటారు. అందుమూలాన సమాధిదశలో నీవు కాన్పించటమూ, నిన్ను తెలిసికోవటమూ రెండూ సిద్ధించేవే. నీవు సర్వాంతర్యామివి కాబట్టి అన్నిచోట్లా ఉన్నందువల్ల ఎక్కడైనా నిన్ను చూడవచ్చును కదా, అని శంకిస్తారు. నీవు సర్వాంతర్యామివే అయినా నీ ప్రతీతిస్థానం పరిశుద్ధంగా ఉండాలి. పరిశుద్ధమైనచోటనే నీ ప్రతిబింబం కానవస్తుంది. మురికి అద్దంలో రవిబింబం కానవస్తుందా? కాబట్టి నీ దర్శనం శుద్ధ మనస్సునందు మాత్రమే ప్రతీతమవుతుంది. నీవు ఆత్మస్వరూపమందు అందరిలోనూ ఉంటావు. అయినా అందరూ నిన్ను కనుగొనలేరు. ఎందుకంటే – ప్రకృతి, పురుషుడు, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు – ఇవన్నీ నీ శక్తి రూపాలు. ఆ శక్తులు త్రిగుణాత్మకాలు, షోడశవికారరూపాలుగా వ్యవహారాన్ని పొందుతున్నాయి. వాటిలో నీవు

నిరూఢుడవై ఉంటావు. దారువులో అంతర్గతుడై ఉన్న అగ్నిని పంచదశ సామిధేని మంత్రాలతో ఋత్విజులు ప్రకాశింప జేస్తున్నట్లుగా, అహంకారపరిచ్ఛిన్నుడవై ఉన్న నిన్ను వివేకమూలాన ప్రకాశింపజేయవచ్చును. అహంకారం తొలగినంతనే నీవు కానవస్తావు. నిరహంకారులు కేవల నిర్వాణసుఖానుభవరూపంలో నిన్ను సందర్శిస్తారు.

దేవా! రూపనామాదులు గుణముల యొక్క కార్యాలు. నీవో నిర్గుణుడవు; అంటే, గుణాతీతుడవు. కాబట్టి నీ రూపం గుణ కార్యములైన మనోవాగాది ఇంద్రియాలకు అందదు. అందువల్ల నీవు ఇటువంటి వాడవని ఊహించటం కూడా సాధ్యం కాదు. ఆ కారణాన నీ విశ్వరూపం కూడా నీ మాయాకల్పితమే కాని సత్యం కాదు.

అన్ని కారణాలకు మూలకారణమై, అందువలన ఆదికారణం అనబడుతూ; ఏకము, అసదృశము, సర్వదృశ్యాలకు బీజము అయి, సర్వాధారంగా ఏది ఉన్నదో; దేని ఆధారం వలన సర్వము వ్యవహరిస్తున్నదో; సర్వసంబంధమూర్తి, సర్వలయస్థానం ఏది ఉన్నదో; అట్టి అనాదిసిద్ధమైన, సజాతీయ విజాతీయ శూన్యమైన, సత్త్వస్వరూపమైన పరబ్రహ్మాన్ని నిన్ను గూర్చి ఇదమిత్థమని నిర్ణయించటం ఎవరికి సాధ్యమవుతుంది?

దేవాదిదేవా! నీవు ఉన్నావని యోగులు అంటారు. నీవు లేవని సాంఖ్యులు వాదిస్తారు. ఈ వాదవివాదాలు నీ మాయాశక్తుల కోలాహలమే గాని వేరు గాదు. నీవే లేకపోతే ఈ ప్రపంచం ఉంటుందా? ఏమంటావేమో! ప్రపంచమంటే నీ శక్తి విస్తారమే కదా! ఇంకా నీవున్న సంగతిని నీ అవతారాలు వేనోళ్ళ చాటుతాయి.

నీ అవతారకార్యాలంటే అవి సామాన్యములా? నీ పాదాలను ఆశ్రయించినవారిని అనుగ్రహింపగోరి దేశకాలానుగుణంగా నీవు రూపుదాల్చి నీ భక్తులకు మేలు చేకూరుస్తావు. వాయువు ఏకరూపంలో ఉన్నా నానాపుష్పసంబంధ హేతువు చేత వివిధగంధవంతమై భాసిస్తున్నట్లు నీవు

అందరియందు ఏకరూపంలో అంతర్యామివై ఉన్నా వారి వారి పూర్వవాసనలు కారణం కాగా వివిధగతులలో కానవస్తావు. అట్టి నీకు పునః పునర్నమస్కారాలు.

## దక్షునికి భగవత్సాక్షాత్కారం

రాజేంద్రా! దక్షుడు ఆ విధంగా స్తుతింపగానే అతని యెదుట ఒక దివ్యమూర్తి నీలమేచకశరీరం కలిగి పీతాంబరం ధరించి శంఖ చక్ర ఖడ్గ చర్మ బాణ కోదండ పాశ గదాయుధాలను ఎనిమిది చేతులలో పట్టుకొని, కిరీట కటక మకర కుండల కాంచికా అంగుళీయ వలయ నూపురాంగభూషణాలు క్రొమ్మెరుగు లీనుతుండగా శ్రీవత్స కౌత్సుభ వనమాలలు హృదయపీఠిని అలంకరిస్తుండగా వచ్చి సాక్షాత్కరించాడు. ఆ మంగళ మూర్తిని నారదాది మహర్షులు, నందాది పార్షదులు, లోకపాలకులు చేరి ఆరాధిస్తున్నారు. సిద్ధ చారణ గంధర్వులు ప్రస్తుతులు కావిస్తున్నారు.

ఆ పరమాశ్చర్యరూపాన్ని చూసి దక్షుడు సాధ్వసానందాలతో అప్రతిభుడైనాడు. అతని సర్వేంద్రియ ద్వారాల నుంచి హర్షజలం చిప్పిల్లింది. అతనికి నోట మాట రాలేదు. అతను ముందుకు వంగి ఆ దివ్యమూర్తికి సాగిలబడ్డాడు.

## భగవదాదేశం

రాజేంద్రా! భగవానుడు దక్షుని చూసి సంతసించి, 'ప్రాచేతసా! ప్రజావృద్ధికై నీ పూనిక విఫలం కావటమూ, దానిని సాధింపగోరి నీవు శ్రద్ధాపూర్వకంగా తపస్సు చేయటమూ నే నెరుగుదును. ఈ నీ తలంపు నాది గాని నీది కాదు. నా తలంపును కొనసాగింపనెంచి నీవు, చేసిన తపస్సు నాకెంతో ప్రీతిని కూర్చింది. నీవు తపస్సిద్ధుడ వైనావు. నీవు ప్రజాపతులు, మునులు, విబుధేశ్వరులు, బ్రహ్మ, భవుడు – నా అంశలై భూతోద్భవహేతువులు కాగలరు. నాయనా! యమనియమాదిరూప తపస్సు నాకు హృదయం, విద్య తనువు, ధ్యానాదిక్రియ, ఆకృతి, క్రతువులు అంగాలు, ధర్మం ఆత్మ, దేవతలు ప్రాణాలు.

దక్షా! ఈ జగత్సర్గానికి పూర్వం నేనొక్కడనే ఉన్నాను. అప్పటికి గ్రాహ్యగ్రాహకములైన బాహ్యాభ్యంతరాలు లేవు. నేను చైతన్యమాత్రుడనై సర్వతః ప్రసుప్తుని వలె ఉంటాను కాబట్టి ఇంద్రియ వృత్తులకు కనబడను. నాలో లీనమై ఉన్న నా మాయా శక్తికి స్వల్పమాత్ర చలనాన్ని అంగీకరించాను. ఆ శక్తి గుణమయిగా ఏర్పడింది. తత్ఫలంగా బ్రహ్మాండం ఏర్పడింది. అందులో నుంచి బ్రహ్మ ఉద్భవించాడు.

ఆ బ్రహ్మ మహావీర్యవంతుడై ఉండి సృష్టిశక్తి తనకు లేనట్లు చింతింపసాగాడు. ఆతని చింతను గ్రహించి తపస్సు చేయమని ఆజ్ఞాపించాను. ఆతడు నా ఆజ్ఞప్రకారం వర్తించి శక్తిమంతుడై లోకసర్గసమర్థులైన మీ అందరిని సృజించాడు.

నీకు సంతతి కలిగే ఉపాయాన్ని చెబుతాను విను. ఇదిగో ఈమె పంచజనుడనే ప్రజాపతి పుత్రిక రసిక్ని. సుశీల. నీవు సుబ్రహ్మణ్యుడవై ఈమెను భార్యగా గ్రహించి మిథునధర్మాన్ని అనుష్ఠించు. ప్రజాసర్గానికి వృద్ధి కలుగుతుంది. నిన్ను చూసి నీ క్రిందివారు నా మాయా మహిమ వలన మిథునీభావాన్ని కోరి ప్రజలను గాంచి తద్విధంగా నన్ను పూజిస్తారు' అని చెప్పి అంతర్ధాను డయ్యాడు.

## హర్యశ్వుల జననం

రాజేంద్రా! దక్షుడంతట పాంచజనిని పెండ్లాడి విష్ణుమాయాప్రేరితుడై ఆ కాంత వలన పదివేల మంది హర్యశ్వులనే పుత్రులను కన్నాడు. వారందరూ ఆచార స్వభావాదులలో అనురూపులై విలసిల్లారు. దక్షుడు వారిని ప్రజాసర్గార్థం నియమించాడు.

## హర్యశ్వుల తపోదీక్ష

హర్యశ్వులు పశ్చిమదిశను బట్టి సింధునదీ సాగరసంగమప్రదేశానికి వెళ్ళి, అక్కడ ముని సిద్ధసేవిత నారాయణసరస్తీర్థం చేరి

తపోవ్రతానుష్ఠానపరులై ఆ పుణ్యతీర్థంలో ఆచమించారు. ఆ క్షణమే వారి హృదయాలు రాగాది మలరహితా లైనాయి. వారికి పరమహంసనిష్ఠాభావం జనించింది. అంతట వారు తండ్రి ఆజ్ఞను తలపోసి ప్రజావృద్ధికై ఉగ్రతపస్సు చేశారు.

## నారదోపదేశం

ఒకనాడు నారదమహర్షి అక్కడికి వచ్చి తపోనిష్ఠులై ఉన్న వారిని చూసి, 'బాలకులారా! మీరు సృష్టికోసమై ఉద్యమించినవారు. ఇంత పెద్ద పనికి పూనిన వారు కార్య యుక్తాయుక్తాలను గూర్చి ముందుగా తెలుసుకోవలసిన ముఖ్యవిషయాలు కొన్ని ఉన్నాయి. అందులో మొట్టమొదట భూవిస్తారాదికం తెలుసుకోవాలి. ఆ భూమిలో ఏకపురుషమైన రాష్ట్రం ఉన్నది. దానిని తెలుసుకోవాలి. ఆ రాష్ట్రంలో బిలమొకటి ఉన్నది. ఆ బిలాంతరం నుంచి వెలికి వచ్చే మార్గం లేదు. ఆ రాష్ట్రంలో బహురూపాలను ధరించే స్వైరిణి ఒకతె ఉన్నది. దాని చెంత ఒక పురుషుడుంటాడు. ఆ రాష్ట్రంలో ఒక నది రెండు దరులనూ ఒరుసుకొని పారుతుంటుంది. ఆ నదీగర్భాన పంచవింశతి అనే అద్భుత గృహం ఒకటున్నది. అందులో చిత్రకథుడనే హంసు డొకడుంటాడు. ఆ గృహాంతరంలో ఒక యంత్రం వజ్రనిర్మిత మన్నట్లుగా ఉన్నది – తనకై తానే తిరుగుతుంటుంది. ఇవన్నీ తెలిసికొనక సృష్టికి పూనారంటే వెర్రితనం కాదా?' అని చెప్పాడు.

నారుదుని గూఢాభిప్రాయం వారికి వెనువెంటనే బోధపడలేదు. వారొకచోట సమావేశమై ఆ ముని వాక్యాలను ఒకటొకటిగా విమర్శింపసాగారు. 'భూవిస్తారాదికం తెలుసుకోవాలి' అని మహర్షి చెప్పాడు. భూశబ్దానికి క్షేత్రమనే అర్థం ఉన్నది. క్షేత్రమంటే మనము ఏమని గ్రహించాలి? లింగశరీరమని గ్రహింపవలసి ఉంటుంది. లింగశరీరాన్ని తెలుసుకోవటమంటే ఏమిటి? శరీరములన్నీ నశ్వరములని, పరమసాధ్యం మోక్షం ఒక్కటేనని, దానికి సాధన కావాలని, అట్టి సాధనగా నశ్వరపదార్థమైన

శరీరాన్ని ఆశ్రయించి అసత్కర్మలు ఎన్ని చేసినా ఫలం లేదని గ్రహింపదగి ఉన్నది' అని వారిలో ఒకడు పలికాడు.

రెండవవాడు అతని మాటనందుకొని 'ఏకపురుషరాష్ట్రకమంటే ఏమిటి? భగవానుడు అద్వితీయుడు, ఏకపురుషుడు అయినవాడు. అతని రాష్ట్రం ఏది? భగవానుడు స్వాశ్రయుడు స్వాధారుడు సర్వసాక్షి అయినవాడు. అతనిని ఆధారంగా గైకొని ఈ భూమండలమంతా ఉన్నది. కాబట్టి రాష్ట్రమంటే ఇక్కడ జగమే అని గ్రహించాలి. అట్టి జగదీశ్వరుని తత్త్వాన్ని గ్రహింపక అసత్కర్మలను ఆచరించటం వలన ప్రయోజనం కలుగదని ఋషి పల్కిన రెండవ వాక్యము యొక్క తాత్పర్యం' అని చెప్పాడు.

## బిలము

మూడవవాడు అతని మాటనందుకొని బిలాన్ని గురించి మహర్షి ప్రస్తావించాడు. ఆ బిలాన్ని చొచ్చినవాడు మళ్ళీ బయటికి రాలేడట! దీని భావమేమిటి? పరతత్త్వాన్ని జొచ్చినవారికి పునరావృత్తి కలుగదని వింటుంటాము. కాబట్టి మహర్షి చెప్పిన బిలం పరతత్త్వమే కాదగి ఉన్నది. పరతత్త్వాన్ని చేరుకోవాలంటే అసత్కర్మలు ఉపయోగింపవు' అని మహర్షి భావం అనుకొంటానని మూడవ వాడు చెప్పాడు.

## స్వైరిణి

అంత నాల్గవవాడు ముందుకు వచ్చి 'బహురూపధారిణి అయిన స్వైరిణి అక్కడున్నదని మహర్షి అన్నాడు. స్వైరిణి అంటే నిలకడ లేనిదని అర్థం. చాంచల్యం మనస్సుకు నైజం. చాంచల్యానికి కారణమేమిటని విచారిస్తే గుణసంసర్గం కారణమని తెలుస్తున్నది. మనస్సు గుణవశమై వర్తిస్తుందని, ఆ కారణాన మనస్సు స్వైరిణి వంటిదని మహర్షి హెచ్చరిక చేశాడు' అని పలికాడు.

## పురుషుడు

ఐదవవాడు అతని మాటనందుకొని 'ఆ స్వైరిణిని ఆశ్రయించి ఒక పురుషుడుంటాడని మహర్షి చెప్పాడు. పురుషుడు కుత్సితభార్యను ఆశ్రయించి స్వాతంత్ర్యం వీడి దాని సుఖదుఃఖాలే తన సుఖదుఃఖాలుగా భావిస్తూ జీవితాన్ని గడుపుతుండటం మనకు లోకంలో కనుపిస్తున్న సంగతే. అలాగే జీవుడు కూడా గుణసంగబుద్ధికి లోబడి స్వాతంత్ర్యం పోయి అది యాడ్చినట్లల్లా వ్యవహరించి చెడుతున్నాడని మహర్షి తాత్పర్యం' అని వ్యాఖ్యానించాడు.

## ప్రవాహం

ఆరవవాడు అతని మాటనందుకొని 'ప్రవాహం సంగతి మహర్షి చెప్పాడు. ప్రవాహాన్ని దేనితో పోల్చవచ్చు? మాయకు పోల్చి చెప్పవచ్చు. ఏటికి దరులున్నట్లు మాయకు సృష్టిలయాలు రెండూ రెండు తీరాలు. ఆ మాయానదిలో క్రోధాహంకారము లనే పెను మకరతిమింగిలాలు ఉన్నాయి. వాటికి చిక్కిన వారు మళ్ళీ వెలికి రాలేరని మహర్షి సూచించాడు' అని ప్రసంగించాడు.

## అద్భుత గృహం

అతని మాటను మరి ఒకడందుకొని 'పంచవింశతి అనే గృహం మాటేమిటి? తత్త్వాలు ఇరవై అయిదు ఉన్నాయని, సృష్టిసమస్తం పంచవింశతి తత్త్వాత్మకం అని చెప్పారు. ఋషిభావం కూడా ఇదే కాబోలు' అన్నాడు.

## చిత్రకథకుడైన హంసుడు

అతని మాటను ప్రక్కనున్నవా దందుకొని 'ఆ గృహంలో ఉన్న చిత్రకథకు డెవరు? భగవానుడు అంతర్యామియై ఉన్నాడని అంటారు. కనుక హంసుడు అంతర్యామి అయిన చిత్రకథకుడు కావాలి. హంస ఏమిచేస్తున్నది? క్షీరనీరాలను గ్రహించి వేరుచేసి క్షీరాన్ని గ్రహిస్తున్నది. అలాగే హంసుడు

కూడా చిజ్జడప్రపంచం నుంచి చిత్తును వేరుచేసి గ్రహిస్తున్నాడు. అతని చిత్రకథ అంటే ఏమిటి? బంధమోక్షాలను నిరూపించటమే అతని చిత్రకథ' అన్నాడు.

## యంత్రం

దానిని మరొకడు అందుకొని, 'స్వయంగా తిరిగే యంత్రాన్ని మహర్షి ప్రస్తావించాడు. ఆ యంత్రం కాలచక్రం కాబోలు. కాలచక్ర సంచార విధానమే శాస్త్రం. శాస్త్రం గుణాలను ఆశ్రయించి ఉంటుంది. గుణధోరణిలో ప్రవేశించినవారికి నివృత్తిమార్గం కానరాదు' అన్నాడు.

రాజా! హర్యశ్వులు ఆ విధంగా ఋషి వచనాలను విమర్శించి తాత్పర్యాన్ని గ్రహించి ఆయనకు ప్రదక్షిణనమస్కారాలు చేసి నివృత్తి మార్గాన్ని స్వీకరించారు. నారదు డంతట వీణవాయిస్తూ స్వరబ్రహ్మమందు చిత్తాన్ని లయింపజేసి సాక్షాత్కరించిన భగవానుని స్మరించుకొంటూ లోకయాత్రాశీలియై నిష్క్రమించాడు.

## దక్షుని విచారం

రాజా! దక్షుడు తన పుత్త్రులైన హర్యశ్వులు నివృత్తిమార్గపరులైన సంగతి విని, 'అయ్యో! నా సుతులు శీలవంతులని, పిత్రాజ్ఞను జవదాటరని అనుకొన్నాను. సత్సంతానలాభం కూడా దుఃఖహేతువే అయింది కదా!' అని చింతపడసాగాడు. బ్రహ్మదేవుడు అతనిని ఓదార్చి, 'దక్షా! పాంచజని యందు మళ్ళీ పుత్త్రులను పొందు' అని చెప్పిపోయాడు. దక్షుడు ఆ కాంతయందు శబలాశ్వులనేవారిని వేయిమంది పుత్త్రులను బడసి వారిని ప్రజాసర్గానికి నియమించాడు.

## శబలాశ్వుల నివృత్తిధర్మస్వీకారం

వారు పిత్రాజ్ఞను తలదాల్చి నారాయణ సరస్తీర్థానికి వెళ్ళి అందులో ఆచమించి బయటికి వచ్చారు. ఆ తీర్థసేవాఫలంగా వారి మనోమలినం జిడ్డూడిపోయింది. వారంతట ప్రణవజపం ఆచరిస్తూ జలాహారులై కొన్ని

నెలలు, వాయుభక్షులై కొన్ని నెలలు తీవ్రంగా తపస్సు చేశారు. వారు నారాయణమహామంత్రాన్ని జపిస్తుండగా నారదుడు వచ్చి హర్యశ్వులకు చెప్పినట్లే వారికీ బోధించి, 'దాక్షాయణులారా! మీరు కూడా మీ అన్నల మార్గాన్ని అనుసరించండి. మీ భ్రాతృ వాత్సల్యాన్ని లోకానికి వెల్లడి చేయండి. అట్టి ధర్మవిదులకు పుణ్యం వీడని చుట్టమై అంటిపెట్టుకొని ఉంటుంది. భ్రాతృవత్సలులు మరుత్తులతో కలిసి సుఖిస్తారు' అని చెప్పిపోయాడు. శబలాశ్వులు ఆ ఉపదేశవచనాలను విని అన్నలు వెళ్ళిన దారినే అనుసరించి పరమపురుషుని పొందారు. గడిచిపోయిన రాత్రులు మళ్ళీ తిరిగిరానట్లు పరమపదస్థులు మళ్ళీ జన్మింపరు.

## దక్షుని శాపం

రాజా! శబలాశ్వులు నివృత్తి మార్గాన్ని స్వీకరించేసరికి వివిధ మహోత్పాతాలు కలిగాయి. దక్షుడు ఆ ఉత్పాతాలను చూసి కారణమేమిటో? అని తలపోయసాగాడు. ఆ తరిని చారులు వచ్చి శబలాశ్వుల వృత్తాంతాన్ని దక్షునికి తెలియజెప్పారు. ఆ మాటతో అతను పుత్రశోకార్తు డయ్యాడు. అంతలో అక్కడికి నారదుడు వచ్చాడు. అతనిని చూచినంతనే దక్షుడు రోషవివశుడై ఔడుగరిచి 'ఔరా! నా కొడుకులు సాధువులు, ధర్మప్రవృత్తులూను. అట్టివారికి భిక్షావృత్తిని బోధించి అసాధుకార్యం చేశావు. ఉభయశ్రేయః కాములు ఋణత్రయాన్ని తీర్చి కర్మవిచారం కొనసాగించాలని, వారు నివృత్తిమార్గనిష్ఠ లయితే ఉభయలోక భ్రష్టులవుతారని శాస్త్రం చెబుతున్నది. పెద్దలు అలాగే ఆచరిస్తున్నారు. నారదా! నీవు ధర్మవేత్తవై ఉండి నా సుతులకు అధర్మమార్గం ఉపదేశించి వారిని ఉభయలోకభ్రష్టులను చేశావు. బాలకుల గతిని నాశనం చేసినవాడు భగవత్కీర్తికి ముప్పుకావించేవాడు కాడా? భగవత్కీర్తికి వమ్ముతెచ్చిన నీవూ ఒక భాగవతుడనని చెప్పుకొంటూ తిరుగుతున్నావు. భాగవతులు భూతానుగ్రహపరవశులు. నీవో? నిర్వైరులకు వైరం పుట్టించి వారి సౌహృదాన్ని చెడగొట్టావు. బుద్ధిభేదం కలిగినంతనే వైరాగ్యమవుతుందా? వైరాగ్యం జ్ఞానఫలం కాదా? కర్మోపశాంతి మాత్రాననే

మమకారబంధం తెగిపోతుందా? విషయములు ఎంత తీవ్రమైనవో మాటలను బట్టి తెలియదు. వాటిని అనుభవించినప్పుడు మాత్రమే అది బోధపడుతుంది. విరక్తి ఎప్పుడు కలుగుతుంది? విషయములు నిస్సారమైనవి, బహువిధదుఃఖాలతో కూడినవి అని బుద్ధిస్థమైనప్పుడు వాటియందు విరక్తి జనిస్తుంది. ఆ సంగతి ఎప్పుడు బుద్ధిస్థమవుతుంది? అనుభవం మీద తేటపడుతుంది. విషయస్వరూపానుభవజ్ఞానం కలుగక పరోపదేశమాత్రాన వైరాగ్యాన్ని పొందటం పచ్చికాయను పండవేసినట్లు కాదూ? సాధుమార్గాన్ని మెట్టి గృహస్థులమై కర్మలను ఆచరించి భగవత్ప్రీతికి పాత్రులము కాబోతున్న మాకు నీవు క్షమింపరాని అపచారం చేశావు. నాకు కావించిన ఈ అపకారాన్ని నేనెలాగో సైరింపగలనేమో కాని, నా సంతానానికి కావించిన కీడు మాత్రం సహింపరానిది. నీవు నీ అకార్యానికి ఫలం అనుభవింపక తీరదు. ఒకచోట నిలువక సర్వకాలం సర్వలోక సంచారశీలివి అవుతావు గాక!' అని శపించాడు. నారదుడు మారు తలంపక ఆ శాపాన్ని గ్రహించి, 'దక్షా! సాధువులు తాము కష్టపడినా పరోపకారం చేయటమే వారికి ధర్మవర్తనం. నేను నీ సుతులకు పరమశ్రేయోమార్గాన్ని తెలియజెప్పాను. నన్ను నిష్కారణంగా శపించావు. అయినా దానిని గ్రహిస్తున్నాను' అని చెప్పి వెళ్ళిపోయాడు. రాజా! శాంతము సాధుశీలం కదా!

## దక్షుని పుత్రికలు – వారి వంశాలు

రాజేంద్రా! దక్షుని పరితాపాన్ని బ్రహ్మదేవుడు చూసి అతనిని ఓదార్చి పాంచజని వలన పుత్రికలను పొందమని చెప్పి వెళ్ళాడు. దక్షుడు పాంచజని వలన అరవైమంది కుమార్తెలను కన్నాడు. వారందరూ పితృప్రియ లైనారు. అందులో పది మందిని ధర్మునికి, పదముగ్గురిని కశ్యపునికి, ఇరవైఏడుగురిని చంద్రునికి, ఇద్దరిని భూతునికి, ఇద్దరిని అంగిరసునికి, ఇద్దరిని కృశాశ్వునికి, తక్కిన నలుగురినీ మళ్ళీ కశ్యపునికి ఇచ్చాడు.

## ధర్ముని సంతానం

ధర్ముని పత్నులు భానువు, లంబ, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప అనే పేర్లతో చెల్వొందినవారు. భానువుకు వేదఋషభుడు, అతనికి ఇంద్రసేనుడు జనించారు. లంబకు విద్యోతుడు, అతనికి స్తనయిత్నువు పుట్టారు. కకుప్పుకు సంకటుడు, అతనికి కీకటుడు ఉదయించారు. జామికి భూదుర్గాభిమానదేవతలు, వారికి స్వర్గనందులు కలిగారు. విశ్వకు విశ్వదేవులు ప్రభవించారు. వారికి సంతానం కలుగలేదు. సాధ్యకు సాధ్యగణం ప్రభవించింది. ఆ గణానికి అర్థసిద్ధి ఉద్భవించాడు. మరుత్వతికి మరుత్వంతుడు, జయంతుడు జన్మించారు. జయంతుడు వాసుదేవాంశసంభూతు డైనందున అతనికి ఉపేంద్రుడని పేరు వచ్చింది. ముహూర్తకు మౌహూర్తికదేవగణం ప్రాదుర్భవించింది. ఈ గణం భూతాదులకు తత్తత్కాలఫలాన్ని ఇస్తుంటుంది. సంకల్పకు సంకల్పుడు, అతనికి కాముడు పుట్టారు. వసువుకు ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వస్తుడు, విభావసుడు అనే పేర్లతో ఎనిమిది మంది వసువులు పుట్టారు.

## వసు సంతానం

వసుపుత్రులలో ద్రోణునికి అభిమతియందు హర్షశోకభయాదుల జననం కలిగింది. ప్రాణునకు ఊర్జస్వతి గర్భాన సహుడు, ఆయువు, పురోజవుడు ఉదయించారు. అర్కునికి వాసన అను పత్నియందు దర్పాదిపుత్రులు జనించారు. అగ్నికి వసోర్ధార యందు ద్రవిణకాది సుతవర్గం ఉద్భవిల్లింది. ఆ తర్వాత అగ్నికి కృత్తిక అనే ద్వితీయభార్య యందు స్కంధుడు పుట్టాడు. స్కంధునికి విశాఖాదులు కలిగారు. దోషునికి శర్వరియందు హరి అంశతో శింశుమారుడు ఉదయించాడు. వస్తునికి అంగిరస్సునందు శిల్పాచార్యుడు విశ్వకర్మ పుట్టాడు. విశ్వకర్మకు చాక్షుష మనువు, అతనికి సాధ్యులు జనించారు. విభావసునికి ఉష అనే భార్యయందు వ్యుష్టి, రోచిస్సు, ఆతపుడు జనించారు. ఆతపునికి దివసుడు పుట్టి మనుష్యుల కర్మజాగరణాలకు నిమిత్తుడయ్యాడు.

భూతునికి సురూపయందు కోటి రుద్రగణాలు పుట్టాయి. అతనికే వేరొక భార్యవలన గంధర్వులు, కాష్ఠకు గిట్టలు లేని మృగాలు, దనువుకు అరవైఒక్కమంది కుమారులు కలిగారు.

రాజా! ఆ అరవైఒక్కరిలో ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, అయోముఖుడు, శంకుశిరుడు, స్వర్భానుడు కపిలుడు, అరుణి, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపకుడు, ధూమ్రకేతుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు అనేవారు పద్దెనిమిదిమంది ముఖ్యులు. దనువుకు వైశ్వానరుడనే మరొక కొడుకు కూడా ఉన్నాడు.

స్వర్భానునికి కుమార్తె జన్మించింది. ఆమె పేరు సుప్రభ. ఆమెను నముచి పెండ్లాడాడు. వృషపర్వునికి శర్మిష్ఠ ఉదయించింది. ఆమెను యయాతి పెండ్లాడాడు. వైశ్వానరునికి ఉపదానవి, హయశిరస్సు, పులోమ, కాలక అని నలుగురు కూతుళ్ళు పుట్టారు. ఉపదానవిని హిరణ్యాక్షుడు, హయశిరస్సును క్రతువు పెండ్లాడారు. పులోమకు పౌలోములు, కాలకకు కాలకేయులు జన్మించారు. వారికి నివాతకవచులనే రాక్షసులు నలభైవేలమంది జన్మించారు.

రాజేంద్రా! నివాతకవచులు మహాయుద్ధశాలురై యజ్ఞాదులకు విఘ్నాలను కల్పింపసాగారు. అప్పుడు దేవేంద్రుడు నీ పితామహుడైన అర్జునుని స్వర్గలోకానికి రప్పించాడు. పార్థుడు ఆ నివాతకవచులను పరిమార్చి ఇంద్రునికి ప్రీతి కలిగించాడు.

విప్రచిత్తికి సింహిక వలన నూటొక్కమంది కొడుకులు పుట్టారు. వారిలో పెద్దవాడు రాహువు. తక్కిన వారందరికీ కేతువులని పేరువచ్చింది. వారందరూ గ్రహస్థానాలను పొందారు.

నరేంద్రా! అదితి వంశాన్ని చెబుతాను విను. అదితికి కశ్యపుని వలన వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట, సవితృడు, భగుడు, ధాతృడు, విధాతృడు, వరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు జన్మించారు. వారిలో

వివస్వంతునికి సంజ్ఞయందు శ్రాద్ధదేవుడు, మనువు, యమీయములనే మిథునమూ ఉదయించారు. యమీయములకు అశ్వినులు జన్మించారు.

ఛాయకు శనైశ్చరుడు, సావర్ణి మనువు, తపతి అనే కుమార్తె కలిగారు. తపతి సంవరణుని పతిగా వరించింది. అర్యముడు మాతృకను వివాహం చేసుకొన్నాడు. వారికి చర్షణులు జన్మించారు. వారికి కృతాకృతప్రేత వినాయకాది ఘోరులు జనించి ఏకాదశరుద్రులకు పార్షదులయ్యారు.

## ఏకాదశ రుద్రులు

రాజా! ఏకాదశరుద్రు లెవరంటా వేమో? రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, ఏకపాదుడు, అహిర్బుధ్నుడు, బహురూపుడు, మహత్తు. వీరు ఏకాదశరుద్రు లనబడుతున్నారు.

## అంగిరస్సు మున్నగు వారి సంతానం

అంగిరస్సు స్వధ వలన పితృదేవతలను, అధర్వాంగిరోనామక వేదాన్ని కన్నాడు. కృశానుడు అర్చి వలన ధూమ్రకేశుని, ధిషణ అనే భార్యయందు వేదశిరోదేవుడు, వయుడు, మనువు అనేవారిని పొందాడు. కశ్యపునికి రెండవసారి ఇవ్వబడిన భార్యల పేర్లు – వినత, కద్రువ, పతంగి, యామిని. వారిలో వినతకు విష్ణువాహనమైన గరుడుడు, సూర్యసారథి అయిన అనూరుడు పుట్టారు. కద్రువకు సర్పకులం జనించింది. పతంగికి పక్షిగణం పుట్టింది. యామినికి శలభాలు కలిగాయి. చంద్రుని పత్నులు కృత్తికాదులు ఇరవైఏడుగురూ ఇరవైఏడు తారలై వెలుగొందుతున్నారు.

## దక్షుని శాపం

రాజేంద్రా! చంద్రునికి దక్షుని ఆగ్రహం మూలాన శాపం కలిగింది. తత్ఫలంగా అతను క్షయరోగపీడితుడు, సంతానహీనుడు అయ్యాడు. ఆ రోగం వలన అతనికి కళలు తగ్గటం మొదలైంది. అతను మళ్ళీ దక్షుని అనుగ్రహానికి

పాత్రుడై కళాక్షయాన్ని పోగొట్టుకొన్నాడు. ఆ కారణాని చంద్రునికి కళాక్షయవృద్ధులు ఏర్పడ్డాయి.

## కశ్యపుని సంతానం

రాజా! దక్షుడు తన కుమార్తెలలో పదముగ్గురిని కశ్యపునికి మొదటిసారి భార్యలుగా ఇచ్చాడని చెప్పాను. వారు అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ట, సురస, ఇళ, ముని, క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి అనే పేర్లతో లోకమాతలై విలసిల్లారు.

వారిలో తిమికి తిమింగలాది జలజంతువులు, సరమకు సారమేయాది శ్వాపదాలు, సురభికి గోమహిషాదులైన ఏకశఫాలు, తామ్రకు శ్యేనగృధ్రాదులు, క్రోధవశకు దందశూకాది సర్పాలు, మునికి అప్సరోగణం, ఇళకు భూమిజాలు, సురసకు యాతుధానులు, అరిష్టకు గంధాదులు జ్ఞానవంతులై విలసిల్లారు. బ్రహ్మదేవుడు వారియందు ఆత్మానుసంధానం కావించి మానుషజాతిని కల్పించాడు. పూషుడు మునుపు దక్షయజ్ఞం నాడు పండ్లికిలించి అపహాస్యం చేసిన సంగతి, అతనికి దంతభంగం జరిగిన సంగతి చెప్పాను. అది మొదలుకొని దంతాలు లేనందువల్ల అతను పిష్టభోజనుడయ్యాడు. అతనికి సంతానం కలుగలేదు. అతను త్వష్టదైత్యుని సోదరి అయిన రచనను పెండ్లిచేసుకొన్నాడు. వారికి సన్నివేశుడు, విశ్వరూపుడు అని ఇద్దరు కొడుకులు కలిగారు.

రాజా! బృహస్పతి సురలకు గురువుగా ఉండేవాడు. దేవతలు గురువును ఉపేక్షించారు. అది కారణంగా బృహస్పతి వారితో సంబంధం వదులుకొన్నాడు. దేవతలు అసురులకు భాగినేయుడైన విశ్వరూపుని పురోహితునిగా వరించారు.'

ఆ మాట విని పరీక్షిత్తు 'మునీంద్రా! సురలు తమ గురువుకు ఏమి అపచారం చేశారు?' అని అడిగాడు. శుకుడు చెప్పాడు.

## బృహస్పతికి అపచారం

రాజా! ఒకానొకప్పుడు దేవేంద్రుడు కొలువుతీరి ఉన్నాడు. బ్రహ్మావాదులైన మహర్షులు ఒక వంక, మరుత్తులు వసువులు రుద్రులూ ఆదిత్యులు ఒక ప్రక్క, విశ్వదేవ సిద్ధ సాధ్య చారణ గంధర్వు లొక క్రేవ, విద్యాధరులు, అప్సరసలు కిన్నరులు, పతగులు, ఉరగాధిపులు ఒక చాయ, అశ్వినులు ఒక వరుస యథార్హస్థానాలను అలంకరించారు. శచీదేవి ఇంద్రునితో అర్ధాసనాన్ని అధిష్ఠించింది. మహారాజలాంఛనాలైన శ్వేతచ్ఛత్ర చామరాలు వెలయగా వందిమాగధాదులు స్తుతిగీతాలను పాడసాగారు.

ఆ సమయంలో బృహస్పతి ఆ సభకు వచ్చాడు. దేవేంద్రుడు త్రిభువనైశ్వర్యమదోన్మత్తత వల్ల గురువుకు ఎదురేగి స్వాగతం పలకడమూ, పూజాదులతో సత్కరించడము చేయకపోగా ఉపేక్ష వహించి చూసీ చూడనట్లు ఊరుకొన్నాడు. అంగిరసుడు ఆ తిరస్కారభావాన్ని చూసి, 'ఐశ్వర్యమదం ఎంతటివారి నైనా పాడుచేస్తుంది' అని గ్రహించి, వచ్చిన దారినే తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. సురగురువు ఆ విధంగా మరలిపోగానే ఇంద్రుడు చూసి తన అపరాధాన్ని గుర్తించి 'అయ్యో! ఐశ్వర్యమదం నా కన్నుగప్పింది. నీచమతినై గురుతిరస్కారం చేశాను. ఇతరులకు ప్రార్థనీయమైనా కాని మహేంద్రశ్రీ నాకు లభించినందు వలన దేవేశ్వరపదవి సంప్రాప్తించింది. ఆ లక్ష్మితోనే గర్వం నన్ను ఆవరించింది. తత్ఫలంగా అసురభావానికి లోనయ్యాను. రాజు సింహాసనాధిష్ఠితుడై ఉన్న తరిని ఎటువంటి వారు వచ్చినా తన స్థానాన్ని వదిలి వెళ్ళి ప్రత్యుత్థానాదులు చేయకూడదని కొందరంటారు. ఆ మాట ధర్మబాహ్యం. అది పాటింపదగినది కాదు. ఆ బోధనలు కేవలం అజ్ఞానజనితములే గాని యుక్తాయుక్తాలు తెలిసి చేసినవి కావు. అటువంటి మాటలను నమ్మి చరించే వారి గతి చిల్లి పడవ నెక్కి జలాశయాన్ని దాటగోరినవారి గతి అవుతుంది. ఇంతటితో అయినా తెలివి తెచ్చుకొని గురుదేవుని పాదాలకు మోకరిల్లి ఆయన ప్రసాదసిద్ధివల్ల పాపకల్మషాన్ని బాపుకొంటాను గాక!' అని చింతించి గురుగృహానికి తరలివెళ్ళాడు. దేవేంద్రుడు

తన యింటికి వస్తున్న సంగతిని బృహస్పతి యోగబలంతో గ్రహించి ఇల్లు వదిలిపోయి అధ్యాత్మమాయామహిమచే అంతర్ధానం చెందాడు. దేవేంద్రుడు గురువు ఇంటికి చేరుకొని ఆయన జాడ తెలియక దిగులుతో తహతహలాడసాగాడు.

## గురుధిక్కార ఫలం

అసురులది సరైన అదనుగా తీసుకొని తమ గురువైన భార్గవుని సమ్మతి పొంది ఆయుధపాణులై సురల మీదికి దండెత్తి క్రూరనారాచాలను కురిపించారు. దేవతలు కాళ్ళు తెగి కొందరు, చేతులు విరిగి కొందరు అసురుల తాకిడికి ఓర్వలేక తారుమారయ్యారు. ఇంద్రుడికి గత్యంతరం లేక ఆ సురలను వెంటగొని బ్రహ్మవద్దకు వెళ్ళి ఆయనను శరణుజొచ్చాడు.

## సురలకు బ్రహ్మోపదేశం

చతురాస్యుడు వారిని ఊరడించి, 'సురలారా! సకలవిధాల మీరు సమృద్ధులు. అసురులు మీకెందులోనూ చాలినవారు కారు. అట్టివారిచేత ఈనాడు మీకిట్టి పరాభవం కలిగింది. కారణాన్ని గ్రహించారా? మీరు మీ గురువుకు కావించిన అపరాధం ఈ విధంగా ఫలించింది. గురువు నతిక్రమించి మీరిలా కాగా; అసురులు వారి గుర్వాజ్ఞను తలదాల్చి మీ తలదన్నారు. అంతే కాదు వారు స్వర్గలోకం తర్వాత నా సదనాన్ని కూడా ఆక్రమింపగల శక్తిని సంపాదించారు. సురలారా! గో విప్ర విష్ణువులను సేవించే రాజులకు అశుభాలు ఏనాటికీ కలుగనేరవు. మీ గురువు విప్రమాత్రుడే గాక పరమశాంతుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన మహాత్ముడు. అంతటివారి కృపాదృష్టికి మీరు దూరమైనారు. ఇప్పుడేమిటి చెయ్యాలంటారా? త్వష్టృపుత్రుడైన విశ్వరూపుని ఆశ్రయించండి. అతడు మీ కోరిక నెరవేర్చగలడు. అతను అసురపక్షపాతి అంటారా? కావచ్చు గాక; అది మీరు సైరించాలి' అని ప్రబోధించారు.

## విశ్వరూపుని పౌరోహిత్యం

రాజా! దేవేంద్రాదు లంతట బ్రహ్మను వీడ్కొని విశ్వరూపుని వద్దకు వెళ్ళి, 'అయ్యా! అతిథులమై నీ ఆశ్రమానికి వచ్చాము. నీకు శుభమగు గాక. సాధువులైన పుత్త్రులు తాము పుత్త్రవంతులైన తర్వాత కూడా పితృశుశ్రూషే పరమధర్మంగా ఉంటారు. ఇక బ్రహ్మచారుల సంగతి చెప్పేదేమున్నది? అయ్యా! ఆచార్యుడు వేదమూర్తి అని, తండ్రి బ్రహ్మమూర్తి అని, తల్లి ధాత్రీమూర్తి అని, భ్రాత ఇంద్రమూర్తి అని, భగిని దయామూర్తి అని, అతిథి ధర్మమూర్తి అని, అభ్యాగతుడు అగ్నిమూర్తి అని, సర్వభూతజాతం ఆత్మమూర్తి అని అంటారు. తండ్రులకు పరుల వలన పరాభవమహార్తి కలిగినప్పుడు పుత్త్రులు ఆ ఆర్తిని తమ తపశ్శక్తి వలన తొలగించాలి. ఇంతకీ మేము వచ్చిన పని ఏమిటంటావా? మమ్మల్ని పరాభవించిన వారిని జయింప గోరుతున్నాము. అందుకు నిన్ను పురోహితునిగా వరించాము. ఇదే నీకు నమస్కరిస్తున్నాము. పెద్దవారు పిన్నవారికి మ్రొక్కరాదంటావా? కార్యముల పట్ల అది తప్పు కాదు. కాగా పసివాడయినా జ్ఞానవంతు డయితే అతనే జ్యేష్ఠుడవుతాడు. మా విన్నపాన్ని అనుగ్రహించు' అని వేడుకొన్నారు.

రాజా! విశ్వరూపుడు వారి మాటలను విని చిరునవ్వు దాల్చి, 'సురవరులారా! మీకు తెలియని ధర్మ సూక్ష్మాలు లేవు. పౌరోహిత్యం బ్రహ్మవర్చస్సును హరిస్తుందని ధర్మవేత్తలు నిర్ణయించారు. అయితే మీ వంటి లోకేశ్వరులు వచ్చి అడిగినప్పుడు కాదనటం నా బోటి వాడికి తగదు. ఒక్క సంగతి వినండి. పురోహితుడంటే గురువు. గురువు ఆజ్ఞను తలదాల్చటం శిష్యులకు ఆత్మధర్మం. శిష్యుల సంగతి అటుండనిస్తే, పురోహితుని సంగతేమిటంటారా? పౌరోహిత్యం వల్ల ధనలాభం కలుగుతుందని, ఆ వృత్తిని స్వీకరించి ధనార్జన చేసి సత్కర్మలను చేయవచ్చునని కొందరనుకోవచ్చు. అంతకన్న హ్రస్వదృష్టులు, నీచమతులు వేరొకరు ఉండరు. దరిద్రులయితే జోలిగట్టి భిక్షమెత్తి దొరికినంతలో సత్కర్మలను ఆచరింపవచ్చును. సత్కర్మానుష్ఠానం చేద్దామని అమ్ముడుపోవటం అధర్మం. నాకు ధనకాంక్ష

కలుగనందువల్ల నింద్యవృత్తిని నా మనస్సు అంగీకరించదు. ద్రవ్యార్థం నేను మీ అభీష్టాన్ని నెరవేర్చలేను. మీరు నాకు గురువుల వంటి వారు. తండ్రుల మాట ఎటువంటిది కానీ కొడుకులు శిరసావహింపక తీరదు. మీ కార్యార్థం నాకు గల కలిమినే గాక నా ప్రాణాన్నిమ్మన్నా సంతోషంగా సమర్పిస్తాను' అని చెప్పి దేవపౌరోహిత్యాన్ని అంగీకరించాడు.

## దేవకార్య నిర్వహణం

రాజా! విశ్వరూపుడు ఆ విధంగా సురపౌరోహిత్యాన్ని అంగీకరించిన వెంటనే దేవతలకు మేలుచేయవలసి వచ్చింది. దేవతలకు హితకల్పన మంటే ఏమిటి? అసురసమృద్ధినితగ్గించటమే సురహితం కదా! అసురులను చూద్దామంటే వారు గురువైన శుక్రాచార్యుని విద్యాబలం వల్ల సర్వసమృద్ధంగా సురక్షితులై ఉన్నారు. శుక్రుని విద్యాబలం మాత్రం సామాన్యమైనదా? విశ్వరూపుడది చూసి వైష్ణవవిద్యను ఆశ్రయించాడు. ఆ విద్యాప్రభావం వలన అసురులు అవలీలగా ఓడిపోయారు. అంతట విశ్వరూపుడు సురసమృద్ధిని కోరి వైష్ణవ విద్యను దేవతలకు అనుగ్రహించాడు. ఆ విద్యను నారాయణ కవచమని అంటారు.

## నారాయణకవచ మహిమ

రాజేంద్రా! ఈ కవచ మహిమ ఇంతని ఎంత చెప్పినా తక్కువే. ఒక్క నిదర్శనం చెబుతాను విను. పూర్వం కౌశికుడని ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను ఈ విద్యను ధరించి ఒకానొక నిర్జనప్రదేశం చేరి అక్కడి యోగధారణాప్రభావంతో తన శరీరాన్ని త్యజించాడు. ఒకనాడు చిత్రరథుడనే గంధర్వరాజు తన స్త్రీజనంతో విమానమెక్కి గగనమార్గాన పయనిస్తుండగా అతని విమానం కౌశికుని దేహత్యాగప్రదేశానికి సూటిగా మీది భాగానికి వచ్చి అక్కడి నుంచి కదలక తటాలున నేలకు దిగింది. అప్పుడక్కడ వాలఖిల్యాది మహామును లున్నారు. వారదిచూసి, 'చిత్రరథా! కౌశికుని అస్థులు ఇక్కడున్నాయి. అవి ఆకర్షించినందు వల్ల నీ విమానం నేలకు దిగివచ్చింది. ఆ

అస్థులను నీవు తీసికొనివెళ్ళి ప్రాకృతవాహిని అయిన సరస్వతీనదిలో తన్మధ్యభాగాన నిక్షేపించి స్నానం చేసి వెళ్ళవచ్చు' అని పలికారు. చిత్రరథుడు ఆ అస్థులను తీసికొని విమానం ఎక్కాడు. అది యథాపూర్వంగా గగనమార్గాన ఎగిరింది. గంధర్వపతి సరస్వతీనదిని చేరి ఆ నదీమధ్యప్రదేశాన కౌశికుని అస్థులను నిమజ్జనం చేసి ఆచమనవిధులను నెరవేర్చి వెళ్ళాడు.

రాజా! ఈ కవచపారాయణానికి నియమమేమిటంటే, శుచియై ఆచమించి యథార్థమైన ఆసనాన ఉత్తరాభిముఖుడై కూర్చుండి మౌనియై మనస్సును శ్రీమన్నారాయణమూర్తి యందు నిలిపి అంగన్యాస కరన్యాస పూర్వకంగా ఈ కవచాన్ని పారాయణ చేయాలి. ఈ మంత్రపారాయణ వల్ల ఆధ్యాత్మిక అధిదైవిక అధిభౌతిక భయాలన్నీ తొలగిపోతాయి.

## ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతకం

రాజా! విశ్వరూపునికి సోమపానం, సురాపానం, అన్నాదనం అని మూడు తలలుండేవట! అతను హవిర్భాగాలను బాహాటంగా అమరులకు ఇస్తూ పరోక్షంగా తన మేనమామలైన అసురులకు అందజేస్తుండేవాడట. ఆ కపటకృత్యాన్ని దేవేంద్రుడు గ్రహించి ఆగ్రహించి విశ్వరూపుని మూడు తలలను నరికివేశాడట. అతని సోమపానశిరస్సు కపింజలం గాను, సురాపానశిరస్సు కలవికం గాను, అన్నాద శిరస్సు తిత్తిరిగాను మూడు పక్షులుగా ఏర్పడ్డాయట!

రాజా! విశ్వరూపుని వధించిన ఫలంగా ఇంద్రునికి బ్రహ్మహత్యా దోషం చుట్టుకొన్నది. అతను సురరాజు అయినప్పటికీ ఆ పాతకాన్ని సంవత్సర పర్యంతం వహించాడు. అంతలో అతనికి లోకాపవాదం మెండయింది. అప్పుడు ఇంద్రుడు ఆ పాతకాన్ని నాలుగు పాళ్ళుగా విభజించి భూమికి, జలాలకు, వృక్షాలకు, స్త్రీలకు ఒక్కొక్క భాగం పంచిపెట్టి తాను దోషరహితు డయ్యాడు.

## ఇంద్రకృత బ్రహ్మహత్యాదోష విభాగక్రమం

రాజేంద్రా! ఇంద్రుడు తన దోషాన్ని పంచిన క్రమమెట్టిదో చెబుతున్నాను విను. భూమిలో బావులు మొదలైన జలాశయాలను త్రవ్వుతారు. ఆ త్రవ్విన గోతులను తిరిగి పూడ్చరు. భూమికి అదొక చింతాకర విషయం కాసాగింది. భూదేవి ఇంద్రుని వద్దకు వచ్చి 'సురేశ్వరా! నా హృదయంలో త్రవ్వబడిన గర్తాలు తమంతట తాము కాలక్రమాన పూడేటట్లు వరమిస్తే నీ బ్రహ్మహత్యాదోషంలో నాల్గవ పాలు నేను గ్రహిస్తాను' అన్నది. ఇంద్రుడు సరేనన్నాడు. రాజా! భూమి మీద ఎక్కడెక్కడ బీడుపడిన నేలలు నేటికీ కనబడుతున్నాయో అవన్నీ బ్రహ్మహత్యారూపములే అని గ్రహించాలి.

ఇంద్రుడంతట తన పాపంలో ఒక భాగాన్ని గ్రహింపమని జలాలను కోరాడు. అవి, 'దేవేశ్వరా! మాలో ఏ ద్రవం వచ్చి చేరినా దానికి ఆకృతి పరిమాణం హెచ్చు కాగలదని వరమిచ్చినట్లయితే నీ కోరిక మాకు సమ్మతమే' అన్నాయి. ఇంద్రుడందుకు వెంటనే అంగీకరించాడు. జలాలు సురేశ్వరుని దోషంలో ఒక భాగాన్ని స్వీకరించాయి. జలములందలి నురుగు మొదలైనవి తత్పాపరూపాలని గుర్తించాలి.

ఇంద్రుడు ఆ తరువాత వృక్షాలను కోరాడు. భూరుహాలు అతని తలంపును విని, 'సురరాజా! మమ్మల్ని నిష్కారణంగా నిట్టనిలువున నరుకుతుంటారు. ఆ అపకారాన్ని మేమెలాగో సహిస్తాము. నరికిన మ్రోడులు మళ్లీ తామంత తామే చిగిర్చి పెరిగేటట్లు వరమిస్తే నీ పాతకంలో ఒక భాగాన్ని మేము భరిస్తాము' అని చెప్పాయి. ఇంద్రుడలాగే వరమిచ్చి తన పాతకాన్నుంచి ఒక భాగాన్ని బాపుకొన్నాడు.

ఇక ఒక్క భాగం శేషించి ఉన్నది. ఆ భాగాన్ని గైకొమ్మని ఇంద్రుడు స్త్రీలను కోరాడు. వారది విని 'దేవేశా! మేము ప్రసవించినందాక సంభోగ సుఖానికి అంతరాయం గాని, మేము ధరించిన గర్భాలకు తన్మూలాన బాధగాని లేకుండేటట్లు వరాన్ని ఇవ్వగలిగితే నీ కోరికను నెరవేరుస్తాము' అన్నారు.

ఇంద్రుడు తథాస్తు అన్నాడు. అతని పాపశేషాన్ని స్త్రీలు గ్రహించారు. స్త్రీలకు ప్రతిమాసంలో కలిగే రజస్స్రావం ఆ దోషరూపమే. ఆ విధంగా దేవేంద్రుడు తన పాపాన్ని బాపికొని సుఖంగా ఉన్నాడు.

రాజా! దోషాలను ప్రతిఫలపూర్వకంగా గ్రహించినప్పుడు గృహీతలయందు ఆ దోషలక్షణాలు వివిధరూపాలలో ప్రకటమవుతాయి. ఆ దోషఫలాలను అనుభవింపక తీరదు. ఈ రహస్యాన్ని తెలిసినవారు పరుల వలన ఆ దోషపరిహారార్థం దానాదులను గ్రహించాలంటే జంకుతారు.

మరొకవిశేషం. సుకృతదుష్కృతాలలో దేనిని కావించినా ఏదో ఒక విధంగా దానివల్ల కలిగే ఫలం భుక్తమై నశించాలి. వేరొక విధాన నశింపదు. ఇది విధివిధానం. ఈ సంగతి తెలిసినవారు తమ దోషాలను తామే సహింపబూనుతారు కాని పరాక్రాంతం చేసి అన్యులను తమ కోసం బాధపెట్టాలనుకోరు.

## వృత్రుని జననం

రాజా! విశ్వరూపుడు త్వష్ట కొడుకని చెప్పాను. త్వష్ట ఇంద్రుని అకార్యం, తన పుత్రుని మరణవృత్తాంతం విని, 'ఔరా! ఇంద్రుడింత ద్రోహి అయినాడా? ఇతనిని శిక్షించక మానను' అని నిశ్చయించి, అందుకు తగినవాడిని పొందగోరి 'అభిచార' మనే ఇష్టి మొదలుపెట్టి 'ఇంద్రశ్శత్రో వివర్ధస్వ' అని ఉచ్చరిస్తూ అగ్నిముఖాన వేల్చాడు. ఆ దక్షణాగ్ని నుంచి ఒక ఘోరాకారుడు యుగాంతకృతాంతుని వంటివాడు వెలికి వచ్చాడు. ఆ వెలువడినవాడు దినదినం ఒక్కొక్క బాణప్రమాణాన పెరిగి కరిగించిన రాగివంటి నెత్తుటి మీసాలతో, మధ్యందిన సూర్య బింబాన్ని పోలిన నేత్రాలతో, కాలిన కొండవంటి ఆకారంతో ఘోరదర్శనుడై నక్షత్రాలను నాకబోతున్నట్లు నాలుక చాచి, ముల్లోకాలను కబళింప బోతున్నట్లు నోరు అప్పళించి, భూమి కంపించేటట్లు పాదాలు మోపి, దెసలు చీలేటట్లు కేకలువేస్తూ లోకమంతటినీ ఆక్రమించాడు.

ఆ కారణాన అతనిని వృత్రుడు అన్నారు.

రాజా! దేవతలు ఆ వృత్రుని సంగతి విని సేనలను కూర్చుకొని దాడివెడలి అతనితో తలపడి దివ్యాస్త్రాలను వర్షించారు. వృత్రుడు ఆ అస్త్రాలను దిగమ్రింగాడు. అందుకు సురలు మహాశ్చర్యభయవిహ్వాలులై దారితోచక భగవానుని వద్దకు వెళ్ళి

## అమరకృత విష్ణుస్తవం

'పంచమహాభూతాలు, తద్వినిర్మిత జగత్త్రయం, తదధీశులైన బ్రహ్మాదులు, వారి వెనుక మేము – ఏ కాలానికి వెరచి బలిసమర్పిస్తున్నామో, ఆ కాలానికి కూడా భయదుడైన సర్వేశ్వరుడు మాకు శరణమగు గాక. దేవాదిదేవా! నిన్నే శరణు కోరి వచ్చాము. నీవు నిఖిలోపాధి పరిచ్ఛేదరహితుడవు, పూర్ణుడవు, రాగాదిరహితుడవు అయిన పరమేశ్వరుడవు. నిన్ను కాదని పరిచ్ఛిన్నమూర్తులను ఆశ్రయించటం కుక్క తోకను ఊతగొని సముద్రాన్ని దాటగోరినట్లవుతుంది. నిన్ను ఆశ్రయించిన వారికి సర్వవాంఛితాలూ ఈడేరుతాయి. పూర్వం మనువు మొరపెట్టుకొనగా మత్స్యమూర్తివై కొమ్ముకొనపైని భూమండలాన్ని నిలిపి దానిని నావగా చేసి మనువు పరితాపాన్ని తీర్చావు. పద్మభవుడు ప్రళయార్ణవ జలాలలో తన ఆసనరాజీవం నుంచి చలింపగా అతని నుద్ధరించినవాడవు.

దేవా! అద్వైత మూర్తీ! నీ మాయావిశేషం వలన మమ్మల్ని పుట్టించి విశ్వసృష్టికి ప్రేరేపించావు. నీ ఆజ్ఞ తలదాల్చి వర్తిల్లుతున్నాము. నీవు నిరాకారుడవైనా అంతర్యామివై ఉండి మమ్మందరినీ మా మా కార్యాలకు ప్రేరేపిస్తున్నా వాస్తవస్థితిని గ్రహింపలేక మేము సర్వశక్తిమంతులమని భావించి ప్రమాద పడుతున్నాము. ఏ మహాత్ముడు నిత్యుడు, నిర్వికారుడు అయినప్పటికీ మాటిమాటికీ మేము శత్రువశమైనప్పుడల్లా మా బాధలను తీర్పగోరి యుగయుగాలలో తన మాయను అధిష్ఠించి తత్తత్కార్యాలకు తగినట్లుగా మమ్ము రక్షిస్తున్నాడో ఆ విశ్వాత్మకుడు జగత్కారణస్వరూపుడు ప్రధాన

పూరుషుడు విశ్వాతీతుడు మాకు దిక్కగు గాక. దేవా! మేమందరమూ నీ వారము. మాకు మేలుకూర్చు' అని స్తుతించారు.

రాజా! అంతలోనే పశ్చిమ దిక్కున శంఖచక్రగదాధారి, శ్రీవత్సకౌస్తుభవక్షో విశాలుడు అయిన ఒక దివ్యమంగళ మూర్తి కానవచ్చాడు. శ్రీవత్సకౌస్తుభాలు తప్ప తక్కిన అన్ని విషయాలలో ఆ మూర్తికి సరూపులై కొందరు అతనిని పరివేష్టించి సేవావిధిలో నిమగ్నులై ఉన్నారు. దేవతలు వారిని వీక్షించి శ్రీమన్నారాయణుడు పార్షదసహితంగా సందర్శన మిచ్చిన సంగతిని గ్రహించి పరమానంద పరవశులై, 'నమస్తే యజ్ఞవీర్యాయ వయసే ఊతయే నమః' 'నమస్తే అస్తచక్రాయ నమస్సుపురుహూతయే' – అని సాగిలపడి లేచి మళ్ళీ ఈ విధంగా స్తుతించారు.

'దేవా! నీవు నిర్గుణస్వరూపుడవు, గుణత్రయనియామకుడవు అయినట్టివాడవు. ఈ సృష్టి అన్నదో గుణత్రయకార్యం. ఇట్టి సృష్టిలోని వారు సృష్టినియామకుని నిన్ను ఏ విధంగా గుర్తింపగలరు? నారాయణా! వాసుదేవా! ఆదిపూరుషా! మహానుభావా! శుద్ధధర్మాధారా! పరమకళ్యాణా! నిరంతరకారుణికా! నీ స్వరూపం కేవలాత్మసుఖానుభవమాత్రమై ఉన్నది. ఆ దివ్యరూపం ఆత్మోపలబ్ధ మవుతుందే గాని వేరొకరికి కానరాదు. ఆ ఉపలబ్ధి అయినా పరమహంస పరివ్రాజకులకు తప్ప అందరికీ సాధ్యం కాదు. వారికయినా సర్వావస్థలలోనూ లభించదు. వారు నిష్పందమైన ఆత్మయోగ సమాధిలో నిష్ఠులై పరమధర్మాన్ని ఊతగొని తమ చిత్తాన్ని మూసి ఉంచిన తమః కవాటాన్ని తెరిచినప్పుడు మాత్రమే ఆ ఉపలబ్ధి వారికి కలుగుతుంది. అదయినా ప్రత్యగ్రూపంలో కలుగుతుందే తప్ప జ్ఞేయమాత్రమై దృశ్యగోచరం కాని నీ పరాగ్రూపంలో ఏనాటికీ కలుగబోదు.

స్వామీ! నీ మాయావిలాసాలు ఇటువంటివని ఊహకు కూడా అందవు. ఇక వాటిని మాటలతో చెప్పటం ఎలాగు? ఎలాగంటావా? నీవు నిర్గుణుడవు నిర్వికారుడవు అశరీరుడవు అనాశ్రయుడవు అయి వెలసినవాడవు. నీ శక్తి వలన సగుణమైన ఈ విశ్వం కలుగుతున్నది. నీ శక్తి కార్యాన్ని నీ యందు

ఆరోపించినందు వల్ల నీవే సృష్టిస్థితిలయాలకు కర్తృత్వాన్ని వహిస్తున్నావు. ఈ సృష్టికార్యానికీ నీకూ ఉన్న సంబంధమేమిటి? అని ఊహించి సమవాయసంబంధ మన్నారు గాని ఎటువంటి సంబంధమూ లేక నీ వొక్కడవే దీనిని సాగింపగలవు. నీ చిత్రగతి బుద్ధికి గోచరించదు.

దేవా! సృష్టి అంటే గుణవిసర్గం కాబట్టి జడమయినట్టిది. జడము నందు చైతన్యం ఎలా కానవస్తుందని వాదిస్తుంటారు. కార్యమునందు కారణం అనుస్యూతమై ఉన్నది కనుక కార్యమైన సృష్టియందు కారణమైన నీ శక్తి అనుస్యూతం గానే ఉంటుంది. శక్తికి శక్తిమంతునికి వేర్పాటు లేనందువల్ల నీ శక్తి ఉన్నదంటే నీవున్నావనే అర్థం. నీవు అందులో జీవరూపంలో ఉంటావు. సృష్టి మొత్తంలోనూ నీవున్నప్పుడు సృష్టిలో కొన్ని పదార్థాలు నిర్జీవంగా ఉండటం ఎట్లా పొసగుతుందని శంకిస్తారు. పదార్థం జడమైనంత మాత్రాన నిర్జీవం అనుకోకూడదు. ఏ పదార్థంలో నీ శక్తి నిర్వ్యాపారస్థితిలో ఉంటుందో, ఆ పదార్థంలో చైతన్యకార్యం బహిర్దృష్టికి కనిపించదు. ఆ రహస్యం తెలియక పదార్థాలను జడములని అంటారు. జడమంటే చైతన్య వ్యాపార రహితపదార్థమే కాని చైతన్యరహితపదార్థం కాదు.

దేవా! నీ ప్రవేశఫలం ఏమిటంటే ఉపాధి ఏతన్మూలాన వ్యవహృతిని పొందుతున్నది. సూదంటు రాయి ముందుండే ఇనుప ముక్క స్వయంగా అస్వతంత్రమైనది, స్వతంత్రచలనం కలిగినట్లు వ్యవహరించటమే ఇందుకు నిదర్శనం. ఆ వ్యవహారాన్నే కర్మము అంటారు. కర్మమునకు ఫలం స్వతస్సిద్ధం. ఆ ఫలం శుభాశుభ రూపాలలో ఉంటుంది. ఉపాధి జడమని, జడవస్తువు పరప్రేరితమై వ్యవహరించేటప్పుడు ఫలం రెండు విధాలుగా ఉండటానికి కారణమేమిటని, ఫలభేదానికి కర్త ఎవరని శంకిస్తారు. ఉపాధి స్వభావాన్ని బట్టి ఫలభేదం ఉంటుంది. అంతే కాని అంతర్యామి యొక్క భేదభావం వలన భేదఫలాలు కలగటం కాదు. స్వభావ భేదానికి కారణం లేకపోలేదు. స్వభావమంటే ప్రారబ్ధ భోగ్యకర్మఫల వాసనాసముచ్చయం. కర్మఫలవైచిత్రిని బట్టి స్వభావం ఏర్పడుతున్నది. కర్మము అనాది, అంటే ఈ సృష్టితో వచ్చినది.

అంతే కాదు. సృష్టి కూడా కర్మఫలమే. కర్మవైచిత్రిని బట్టి ఫలవైచిత్రి కలుగుతున్నది. కర్మవైచిత్రికి కారణం ఉన్నదా? అని శంకిస్తారు. కారణం లేక కార్యం కలగదు. ఆ కారణమేమిటో నీకే తెలియాలి.

దేవా! కర్మఫలములైన శుభాశుభాలను నీవే జీవరూపంలో అనుభవిస్తున్నావని కొందరంటారు. నీవు కేవలాత్మారాముడవని, అట్టి నీవు తుచ్ఛములైన కర్మఫలాలను అనుభవిస్తావనటం పొసగదని మరికొందరంటారు. ఈ వాదాలన్నీ ఇటీవలివారి ఊహలు మాత్రమే. నీ పుట్టుపూర్వాలు వారికెలా గోచరిస్తాయి? శాస్త్రాల మాటేమిటని, అడగవచ్చు. శాస్త్రాలంటే వివిధమతభావాలనే కదా? ఆ భావాలన్నీ వారి వారి మేధాశక్తి దర్పణంలో స్ఫురించిన స్ఫురణలు మాత్రమే. మేధాశక్తి ఏకరూపంలో ఉండదు. ఆ కారణాన భావభేదాలు కలుగుతాయి. శాస్త్రాలు ఏకముఖంగా ఉండకపోవటమే దీనికి నిదర్శనం. ఏకవస్తువే ఒకరికి గుణవంతంగా వేరొకరికి గుణరహితంగా కనబడుతున్నది. అంతే కాదు. ఒక్క వస్తువే ఒక్క వ్యక్తికే ఒకప్పుడు హితకరం, వేరొకప్పుడు దోషవంతం అవుతున్నది. ఇదంతా బుద్ధి యొక్క రుచిభేదాన్ని బట్టి కలుగుతున్నదని స్పష్టం.

దేవా! వికల్ప వితర్క విచార ప్రమాణాభాస కుతర్కాలతో నిండి ఉన్న ఆ శాస్త్రాలను పరీక్షించితే తత్తత్కర్తల దురాగ్రహం స్పష్టమవుతుంది. అటువంటి దురాగ్రహచిత్తులకు నీవు ఎన్నటికీ బోధపడవు. అయితే ఆ శాస్త్రాల వల్ల ఫలం లేదా? అంటే, లేకేమి? మా బోంట్లు బుద్ధి కలవరం కలిగి ఇదమిత్థమని నిశ్చయించుకొనలేక పలుపోకలకు చిక్కి గంతవ్యం చేరలేకపోవటమే ఫలం.

స్వామీ! నీవు అనంతగుణుడవు. నీ మహాత్మ్యానికి లోతుపాతులు లేవు. సంసారం మాయామయమైనది. నీవో ఉపరతుడవు. నీ మాయ నీ ఇచ్ఛ ప్రకారం వర్తిస్తుంది. నీకు దుర్ఘటమన్నది లేదు. నీకు సమవిషమభేదమే లేదు. ఎల్లరయందు నీ వొక్కడవే అంతరాత్మవై వర్తిల్లుతావు. ఆ పక్షాన సమవిషమాలు లోకంలో కానవస్తున్నాయంటే అవి వారి వారి మతిభేదాలను బట్టి కలిగిన మతభేదాలే తప్ప వాస్తవమైనవి కావు. పెనుచీకటిలో రజ్జువొకటి పడి

ఉన్నప్పుడు దాని స్వరూపజ్ఞానం లేని వాడు ఆ తాటిని చూసి సర్పమని భ్రాంతిపడటం సార్వలౌకికమే కదా. ఆ భ్రాంతికి అజ్ఞానమే కారణం. అజ్ఞానమంటే విపరీతజ్ఞానమని భావం. మురికి అద్దంలో ప్రతిబింబం విపరీతంగా కనిపించడమే దీనికి నిదర్శనం. ఈ భ్రాంతి తొలగాలంటే వాస్తవ జ్ఞానోదయం కావాలి. తాటిని చూసి సర్పభ్రాంతి పడినవాడికి దీపాన్ని తెచ్చి చూపించినప్పుడు అతనే తన ప్రమాదాన్ని గ్రహించి భ్రాంతిని విడిచి అది రజ్జువనే యథార్థజ్ఞానాన్ని పొందుతున్నాడు కదా. కాగా, భ్రాంతి కూడా ఒక కార్యమే. కార్యానికి కారణం ఉండాలి. కారణమేమిటో మా బుద్ధులకు గోచరింపదు.

దేవా! నీ స్వరూపజ్ఞానం కలిగే సంవిధానం ఏమిటని, భ్రాంతి తీరే ఉపాయం ఏమిటని అడుగుతుంటారు. నీ మహిమామృత రసబిందువు ఒక్కటి ఆస్వాదింప గలిగితే భ్రాంతిరూపవిషాలన్నీ నశిస్తాయి. నీ స్వరూపం తేటపడుతుంది. ఏకాంత భక్తులు, పరమభాగవతులే ఇందుకు నిదర్శనం.

దేవా! సురాసురు లిద్దరూ నీ విభూతులే అవుతారు. అందరికీ నీవే ఈశ్వరుడవు. దండ్యులకు దండన రూపమైన సంస్కారం కలిగించేందుకు సమయానుసారంగా వివిధరూపాలు ధరించి, వారిని శిక్షించి సృష్టిని నిలిపావు. నీ వారమైన మాకు వృత్రుడిప్పుడు చేయరాని అపకారం చేసి తత్కారణాన దండనార్హుడయ్యాడు. నీకు మా యెడ దయ ఉన్నదనటానికి నీవిప్పుడు ప్రసన్నుడవుకావటమే నిదర్శనం. నీ మంగళరూపాన్ని చూడనోచాము; మా మొర విన్నవించాము. నీవే గతివని నమ్ముకొన్నాము. ప్రియాతి ప్రియమూ, మధురాతిమధురమూ అయిన మాటొకటి చల్లగా పలికి మా అంతస్తాపాన్ని చల్లార్చు.

ఎవని శక్తి యొక్క విస్తార వ్యవహార ఉపసంహారాలు సృష్టిస్థితిలయాలో, ఎవడు అట్టి తన శక్తి విలాసాలకు వినోదిస్తాడో, ఎవడు చరాచర సమస్త ప్రపంచ బహిరంతరాలలో ప్రత్యగాత్మ పరమాత్మ ప్రధాన రూపాలలో విరాజిల్లుతుంటాడో, ఎవడు దేశ కాల దేహావస్థాన విశేషాలకు తగినట్లుగా

ఉపాదానము ఉపలంభకుడు అయి ఆత్మానందాన్ని అనుభవిస్తుంటాడో, ఎవడు నిర్లేపస్వరూపుడు పరబ్రహ్మవాచ్యుడు అయిన పరమాత్మస్వరూపుడో, అగ్నికి దాని అంశలైన విస్ఫులింగాల వలె ఎవనికి మేము అంశమాత్రులమై ఉన్నవారమో, ఎవడు బుద్ధ్యాదులకు సైతం సాక్షియై ఉన్నవాడో, అట్టి మహానుభావునికి తెలియనిది, మేము చెప్పగలిగినది ఏముంటుంది?

సర్వజ్ఞా! వివిధ పాపజనిత సంసార పరిభ్రమ శాంతిదాయకమైన నీ పాదపద్మాల చల్లని నీడలో తలదాచుకొన్నాము. ఇదే నీకు ప్రణామం'

అని మళ్ళీ సాగిలబడ్డారు.

## వృత్ర వధోపాయం

రాజా! భగవానుడు సురల ప్రణయాలను విని, 'అమరవర్యులారా! మీ జ్ఞానానికి మెచ్చాను. ఆత్మకు సంసారిత్వం లేదని మీరు పలికిన పల్కులు పరమసత్యాలు. మీ భక్తి నాకెంతో సంతసాన్ని కూర్చింది. నేను ప్రీతుడనయితే మీకు దుర్లభమైనదేదీ లేదు. నా ప్రీతిని పొందటానికి ఏకాంతభక్తి ఒక్కటే పరమసాధనం. తత్త్వవిదు లందరూ దానినే కోరుకొంటారు. విషయములు ఎన్నటికీ సద్వస్తువులు కావు. అట్టి అసత్పదార్థాలను సత్పదార్థాలుగా భావించేవాడు కేవల కృపణమాత్రుడు. కృపణులకు ఏది వారికి శ్రేయస్సో తెలియదు. అటువంటివారికి కోర్కెలీడేర్చేవాడు కూడా కృపణుడే అవుతాడు. ఎవడు నిశ్శ్రేయసం తెలుసుకొంటే వాడే విద్వాంసుడు. విద్వాంసుడు అజ్ఞుడికి కర్మప్రవృత్తిని బోధింపడు. మంచి వైద్యుడు రోగికి అపథ్యాన్ని ఇవ్వడు కదా!

సురేశ్వరా! మీరు వెనువెంటనే దధీచి ఋషిసత్తముని వద్దకు పోయి అతని శరీరాన్ని యాచించండి. అతను శుద్ధబ్రహ్మజ్ఞాన సంపన్నుడు. అతని శరీరం విద్యావ్రతతపస్సారం. ఆ మునీంద్రుడు అశ్వినులకు అశ్వశిరోనామక బ్రహ్మవిద్యను ఉపదేశించి జీవన్ముక్తు డైనాడు. నారాయణ కవచాన్ని త్వష్టకు బోధించాడు. ఆ మహాకవచాన్ని త్వష్ట వలన అతని పుత్త్రుడు విశ్వరూపుడు, అతని వలన నీవు గ్రహించారు. మీరతనిని యాచించడమే గాక అశ్వినులను

కూడా ప్రార్థించమని చెప్పండి. మీ ప్రణయాన్ని ఆ ముని అంగీకరించి శరీరాంగాలను దానం చేస్తాడు. ఆ అంగాలతో ఒక ఖడ్గాన్ని విశ్వకర్మ నిర్మించాలి.

ఇంద్రా! ఆ ఖడ్గాన్ని నీవు హస్తతలాన ధరించు. ఆ ఖడ్గాన్ని నీవు చేతబట్టినంతనే నా తేజం నీ లోనికి ప్రవేశిస్తుంది. దానితో నీవు వృత్రుని తెగనరుకు. అతడు మరణించినంతనే మీరు మీ మీ అస్త్రాయుధాల తేజాన్ని పొందగలరు. మీకు మేలు కలుగుతుంది. నా భక్తులెన్నడూ దుఃఖాన్ని పొందరు' అని పలికి అంతర్హితు డయ్యాడు.

## దేవతల ప్రార్థనం

రాజా! అంతట దేవతలు దధీచి వద్దకు వెళ్ళి అతనికి నమస్కరించి, 'మునీంద్రా! మహాత్ములకు లోకకళ్యాణమే ప్రధానం. అందుకోసం వారు ప్రాణాలనైనా లెక్కచేయరు. దిలీప జీమూతవాహన శిబిరాజాదుల చరిత్రలు లోకప్రసిద్ధాలు. నేడు లోక కళ్యాణార్థం మీరు మీ శరీరాన్ని ఇవ్వవలసినట్లు ఏర్పడింది. మేము అందు నిమిత్తమై వచ్చాము' అని విన్నవించారు. దధీచి వారితో 'సురలారా! శరీరాన్ని మీకివ్వటమంటే చైతన్యాన్ని దాని ఆశ్రయం నుంచి తొలగించటమన్నమాట. జీవింపగోరినవానికి దేహానికంటె ప్రియమైనది ఉండబోదు. అట్టి దేహాన్ని కోరవచ్చునా? విష్ణుప్రేరణ వలన వచ్చామంటారా? ఆ విష్ణువే స్వయంగా వచ్చి అడిగినా జీవితార్థి తన దేహాన్ని ఇవ్వగలడా?

లోకకళ్యాణార్థం నా శరీరాన్ని కోరుతున్నారు. లోకకల్యాణ మంటే ఏమిటి? జీవరాశి సుఖమే కదా! లోకకళ్యాణవాంఛ ఎందుకు కలుగుతుందో విచారించారా? సుఖాభిలాష అందరికీ ఉంటుంది. అది నైజం. సుఖాన్ని కోరేవారు 1. స్వార్థులు 2. దీర్ఘదర్శి స్వార్థులు 3. ఉదాత్త స్వార్థులు 4. పరోపకారైక స్వార్థులు అని నాలుగు తెగలుగా ఉంటారు. వారిలో కేవలసుఖార్థి ఎన్నడూ ఇతరులకు సుఖాన్ని తలపెట్టడు. దీర్ఘదర్శి సుఖార్థి

భావం ఏమిటంటే తాను ఇతరులకు మేలు చేస్తే వారి వలన తనకు సుఖం కలుగుతుందని చేస్తాడు. ఉదాత్త సుఖార్థి భావం ఏమిటంటే అందరూ సుఖంగా ఉంటే అందరిలో ఒకడైన నాకూ సుఖం కలుగుతుందని అనుకొనేవాడు. ఈ ముగ్గురూ ఇంద్రియగమ్యసుఖాన్నే దృష్టిలో ఉంచుకొని వర్తిస్తారు. నాలుగోవాడి సంగతి అటువంటిది కాదు. ఇంద్రియగమ్యసుఖం తాత్కాలికమే గాని శాశ్వతం కాదని, బుద్ధిగమ్యసుఖం ఒక్కటే శాశ్వతమని; అందువల్ల మొదటిది ప్రేయమని, రెండవది శ్రేయమని పేర్కొనబడుతుందని; ఆ శ్రేయమే నిశ్చయమైన కళ్యాణమని; అట్టి కళ్యాణానికి పట్టుగొమ్మ 'నేను' 'నాది' అన్న భావం తొలగిపోవటమేనని; అది త్యాగరూపమని; శాశ్వతమైన సుఖం కోరినవారికి త్యజింపరాని దంటూ ఉండదని ఈ నాల్గవ తరగతివారి అంతర్భావం. ఇదే వాస్తవికమైన ధర్మం' అని పలికాడు.

ఆ ఋషి వచనాలను దేవతలు విని 'అయ్యా! మహాత్ములెప్పుడూ సర్వభూత హితైక చిత్తులు. ఆ కారణాన వారు ఉత్తమ శ్లోకులకు సైతం కీర్తిపాత్రులవుతున్నారు. అట్టి మహాత్ములకు త్యజింపరాని వస్తువొకటి ఉంటుందా? లోకమంటారా, అది ఎప్పుడూ స్వార్థపరమే. స్వార్థపరులకు త్యాగబుద్ధి కలిగే అవకాశం లేదు. వారిచ్చే దానాదులలోనూ ప్రతిఫలాపేక్ష ఉండి తీరుతుంది. మరొక విశేషం. స్వార్థపరులకు పరక్లేశవిచారం కొంచెమయినా ఉండదు. హితాహితవిచారమే ఉంటే యాచించటం గాని లేదనటం గాని రెండూ ఉండవు' అన్నారు.

రాజా! దధీచి వారి మాటలను విని, 'బృందారకులారా! మీ ధర్మదృష్టిని తెలియగోరి అలాగన్నానే కాని నా మనస్సులో వేరొకటి లేదు. ఒక్క సంగతి వినండి. నా శరీరాన్నే కోరుతున్నారు. నేనున్నంత కాలం నా శరీరం ఉంటుంది. అనగా నా శరీరానికి నేను ప్రీతిపాత్రుడ నన్నమాట. అటువంటిది ఏదో ఒక తరిచూసి ఈ శరీరం తటాలున నన్ను విడిచివేస్తుంది. ఇటువంటిదాని కోసం నాకు మమకారమెందుకు? ఇదే ఈ తనువును మీ కివ్వటానికి సంసిద్ధంగా ఉన్నాను. అనిత్యమైన ఈ దేహం వలన భూతాదులకు

మేలు కలుగుతుందంటే భూతదయాపరుడు దేహత్యాగానికి వెనుదీయడు. పరోపకారమే పరమధర్మమని, శరీరం పరోపకారార్థమేనని తత్త్వవేత్తలు పలికారు. ఆ పరమధర్మార్జనకు అదును చిక్కటమే దుర్లభం. ఎట్లాగో చేజిక్కిన తరిని చేతులారా పోగొట్టుకొనేవాడు చరాలకే గాక స్థావరాలకు కూడా మహాశోచనీయుడని చెప్పాలి.

సురలారా! భూతముల శోకహర్షాలు తన శోకహర్షాలుగా భావించి వర్తించటమే పరమధర్మం. ఆ భావం పుణ్యశ్లోకులను ఎడబాయదు. మరొకటి చూడండి. విత్తమయితే నేమి, పుత్త్రాదులు గాని, దేహాలు గాని క్షణభంగురాలు. వాటిని పరోపకారార్థం వినియోగించినప్పుడే అవి సార్థకతను పొందుతాయి. కానినాడు విత్తమంటారా? పరహస్తగతమై నశిస్తున్నది. పుత్త్రాదులు స్వలాభపరత వల్ల ధర్మదూరులై చెడిపోతారు. దేహం కుక్కల పాలవుతున్నది' అని చెప్పి ప్రాణేంద్రియమనోబుద్ధులను నియమించి సర్వబంధాలనూ విడిచి పరమయోగస్థుడై ఆత్మను పరమాత్మయందు తాదాత్మ్యం కావించి శరీరాన్ని వదిలాడు.

## వజ్రాయుధ నిర్మాణం

అంతట దేవతలు విశ్వకర్మను పిలిచి 'నీవు పోయి దధీచి అంగాలను గ్రహించి ఖడ్గాన్ని నిర్మించు' అని చెప్పారు. విశ్వకర్మ తన ప్రయోగ కౌశలాన్ని నెరపి ఖడ్గాన్ని రూపొందించి ఇంద్రునికి తెచ్చియిచ్చాడు. ఆ ఖడ్గమే వజ్రాయుధం. దేవేంద్రుడు ఆ ఖడ్గాన్ని చేతబూనినంతనే అతనిలో ఒక నూత్నతేజస్సు అంకురించింది. అతనంతట సాయుధుడై ఐరావతం ఎక్కి సురసేనా సహితంగా తరలి వృత్రుని ఎదుర్కొన్నాడు.

## దేవదానవుల యుద్ధం

రాజేంద్రా! ఇదంతా ఎప్పుడు జరిగిందో తెలుసా? తొలి మహాయుగ మందలి త్రేతాయుగ ప్రారంభకాలంలో జరిగింది. ఎక్కడ జరిగిందో కూడా చెప్పవద్దూ? నర్మదానది ఒడ్డున జరిగింది. దేవేంద్రుడు ఆ విధంగా యుద్ధానికి

తరలినంతనే రుద్రులు, వసువులు, ఆదిత్యులు, అశ్వినులు, అగ్ని, దేవతలు, మరుత్తులు, ఋషభ సాధ్య విశ్వదేవులు, పితృదేవతలు అతనిని అనుసరించారు.

ఇంద్రుడు వస్తున్నట్లు తెలిసి వృత్రుడు యుద్ధసన్నద్ధు డయ్యాడు. అతని వెంట నముచి, శంబరుడు, అనర్యుడు, ద్విమూర్ధుడు, వృషభుడు, అంబర హయగ్రీవ శంకుశిరో విప్రచిత్తులు, అయోముఖ పులోమ వృషపర్వ హేతి ప్రహేతులు, ఉత్కట ధూమ్రకేశ విరూపాక్ష కపిల విభావసులు, ఇల్వల పల్వల దందశూక వృషధ్వజ కాలనాభ మహానాభ భూతసంతాపన వృకులు, మాలి, సుమాలి మొదలైన దైత్యదానవయక్షరాక్షసాదులు క్రోధపరీతులై సువర్ణకవచాలను ధరించి రణరంగం లోనికి చొరబడ్డారు.

రాజా! ఇరుసేనలు తలపడ్డాయి. వృత్రుని సైన్యం గదా పరిఘ బాణ ప్రాస పరశు తోమర ముద్గరాది వివిధాయుధాలను ప్రయోగించి, నానాశస్త్రాస్త్రాలను వర్షించి దేవతలను నొప్పించారు. అమరులు హస్తలాఘవాన్ని మెరిపించి దానవ ప్రయుక్త ఖడ్గాదులను మార్గమధ్యం లోనే తుత్తునియలు చేశారు. అసురులు తమ ఆయుధాలన్నీ వట్టి పోతుండటం చూసి కోపక్రోధవివశులై పెనువృక్షాలను, గిరిశిఖరాలను పెల్లగించి తెచ్చి సురలపై విసిరారు. నిర్జరులు వాటిని సైతం పుప్పొడి చేసి మహాద్భుతంగా విక్రమాటోపాలను చూపారు. అసురవీరులు తమ యత్నాలన్నీ రిత్తపోయినందుకు చింతిల్లి ఉక్కుదక్కి డీలుపడి వృత్రుని వదిలి పారిపోయారు.

వృత్రుడు తన పరివారం పలాయన మవుతుంటే చూసి నవ్వుతూ 'విప్రచిత్తీ! పులోమా! మయా! అనర్వా! శంబరా! పుట్టినది గిట్టకమానదు. చావుకు ప్రతీకారమే లేదు. శరీరానికి మృత్యువు తప్పనిదైనా దాని పరిత్యాగానికి శ్లాఘ్యమార్గాలు రెండు ఉన్నాయి. యోగరతుడై బ్రహ్మనిష్ఠతో కళేబరాన్ని వదలటం మొదటి మార్గం. యుద్ధంలో వెన్నుచూపక పోరాడి హతమారటం రెండవ మార్గం. ఈ రెండు మార్గాలూ ధర్మసమ్మత మైనవే గాక అత్యంత దుర్లభాలు కూడా నని గ్రహించండి. వీటిని పాటించినవారికి కీర్తి

స్వర్గమూ రెండూ చేకూరగలవు. మీరు తొక్కిన దారి సరికాదు; ఆ మార్గాన సాగితే ఉభయభ్రష్టు లవుతారు' అని గంభీర స్వరంతో పలికాడు. అసురులతని పిలుపును చెవిబెట్టక చల్లగా జారుకొన్నారు.

## ఇంద్రవృత్రుల యుద్ధం

రాజా! వృత్రుడు ఎంత పిలిచినా అతని పరివారం తిరిగిరాక పారిపోతుంటే చూసి అతను తోకతొక్కిన త్రాచువలె మండిపడసాగాడు. అంతలో అమరులు వారి మీదికి వచ్చి పడ్డారు. వృత్రుని కోపక్రోధాలు రెట్టించాయి. అతను మహోగ్రమూర్తియై, 'సురలారా! ఆ పారిపోతున్న అసురులు మూత్రపురీషప్రాయులు. వారిని పరిమార్చటం శౌర్యమనిపించుకోదు. మీకు యుద్ధశ్రద్ధతో పాటు ధైర్యం ఉన్నట్లయితే, మీరందరూ గ్రామ్యసుఖలాలసులు కాకపోతే రొమ్మిచ్చి ఎదుట నిలిచి పోరికి రండి' అని అదిలించి లోకమంతా నిశ్చేష్టమయ్యేటట్లు గర్జించాడు. అతని సింహగర్జనకు దేవతలు పిడుగుపడినట్లు మూర్ఛిల్లి నేలకు పడ్డారు. వృత్రుడు ముందుకు దూకి తామరతూండ్లవలె చెల్లాచెదురుగా నేలబడి ఉన్న నిర్జరులను కాలితో నలిపి నుగ్గుచేయసాగాడు. అతని ఘోరకృత్యానికి దిక్కుల వెంబడిని హహాకారాలు ప్రతిధ్వను లీనసాగాయి.

ఇంద్రుడది చూసి గదయెత్తి వృత్రుని మీదికి విసిరాడు. వృత్రుడు దానిని పూలచెండులా ఎడమచేతితో పట్టుకొని ఐరావతం కుంభస్థలాన్ని తాకేటట్లు తిప్పికొట్టాడు. ఆ వ్రేటు తాకి ఆ మహాగజం తల పగిలి ఘూర్ణిలుతూ నెత్తురులు గక్కుతూ ఏడు విండ్ల మేర వెనుకకు పోయింది. ఇంద్రుడు తన వాహనం పాటును చూసి విషణ్ణచిత్తు డయ్యాడు. వృత్రుడది గ్రహించి యుద్ధధర్మాన్ని పాటించి ఇంద్రుని పైకి తన గదను విసరటం మానాడు. సురవల్లభుడంతట సుధలు స్రవించే తన కరతలంతో ఆ గజేంద్రాన్ని నిమిరి సేదతేర్చి మళ్ళీ యుద్ధానికి సిద్ధపడ్డాడు.

రాజా! దేవేంద్రుడు ఆ విధంగా వస్తుంటే వృత్రుడు చూసి, 'పురందరా! బ్రహ్మహత్య కావించావు. గురుద్రోహం చేశావు. ఇంతటి ఘోరపాపాలు చేసీ లజ్జింపక నన్నెదురింప వచ్చావు. నీవిట్లా రావటం నా భాగ్యమనుకొంటాను. ఇదిగో నేను నా యీ శూలాగ్రంతో నీ హృదయాన్ని చీల్చి నా అన్న ఋణాన్ని తీర్చుకొంటాను. సురాధమా! నా అన్న ఆత్మవిదుడు, దీక్షితుడు, బ్రాహ్మణప్రవరుడు అని పేరుపొందాడు. అతను నీ ప్రార్థనల వల్ల నీకు గురువయ్యాడు. అట్టి వాడిని నమ్మించి చేరదీసి స్వర్గకాముడు యజ్ఞపశువు తలనరికినట్లు బలిగొన్నావు. నీయందు దయాభావం గోరంతయినా ఉండి ఉంటే ఇంత ఘోరం చేస్తావా? నీ వంటి పాతకి శరీరం పురుషాదులకయినా వెక్కసం గదా! అంతే కాదు. నీ దుష్టశరీరాన్ని దహించటానికి అగ్నిదేవుడు సయితం సిగ్గుపడతాడు. నీవు గద్దలకు, నీ తోడివారు భూతపతులకు బలి అవుతారు గాక!

ఇంద్రా! నీకు వజ్రం ఉన్నదని గర్వపడుతున్నావేమో? నీ వజ్రం నా తలను తెగగోస్తే నేను కర్మబంధాన్ని బాపుకొంటాను. నా దేహంచేత భూతబలిని కూర్చుతాను. నేను పరమసంతోషపూర్వకంగా ఆత్మవంతుల చరణపరాగాన్ని ఆశ్రయిస్తాను. సురేశ్వరా! వజ్రాన్ని చేతపట్టావు. ఇంక జాగుదేనికి? కృపణుడిని యాచించటం వలన దరిద్రుడికి కలిగిన ఫలం నీ గదకు ప్రాప్తమయిందని, నీ వజ్రాయుధం గతి అంతే కానున్నదని భయపడుతున్నావా? నీ వజ్రం దధీచి తేజోవిరాజితం. నీవో విష్ణుప్రేరితుడివై వచ్చావు. ఆ భగవానుడు ఏ వంక నిలిస్తే ఆ వంకకు జయశ్రీలు తప్పవు. నా సంగతి ఏమంటావా? నేను గ్రామ్యపాశాలను త్రుంచివేసి భగవచ్చరణారవింద లీనచిత్తుడనై ఉత్తమగతిని పొందటానికి సిద్ధమయ్యాను. నా సిరిసంపదల సంగతి ఏమంటావా? అవి రాగ ద్వేష భయాలకు మద కలహాయాస వ్యసనాలకు కారణాలు కాగలవే కాని శాంతిప్రదాలు ఎన్నడూ కావు. అందువలననే శ్రీ భగవానుడు తన ఏకాంతభక్తులకు సంపదల నివ్వడు. ఆ దయానిధి ఎవ్వరికి త్రివర్గాయాసాన్ని తొలగిస్తాడో వారికి అకించనగోచరమూ

అతిదుర్లభమూ అయిన భగవత్ప్రసాదం కొంగుబంగారమని తెలుసుకో' అని చెప్పి, భగవంతుని స్తుతించాడు:

## వృత్రకృత భగవత్స్మరణం

'దేవా! నీ దాసానుదాసునిగా నన్ను గ్రహించు. నా మనస్సుకు నీ గుణస్మరణం, నా వాక్కుకు నీ గుణకీర్తనం, నా శరీరానికి నా పరిచర్యాపరత్వం నిరంతరాయితంగా చెలువొందే వరాన్ని నాకు ప్రసాదించు. వేరే కోర్కెలు లేవా? అని అడుగుతావేమో. రసాతలాధిపత్యం ఇస్తానన్నా, సార్వభౌమపదం అనుగ్రహిస్తానన్నా, బ్రహ్మలోకాన్ని కట్టబెడతానన్నా, సర్వయోగసిద్ధులు సమకూర్చుతానన్నా, చివరికి ధ్రువపదంలో అధిష్ఠింపజేస్తానన్నా నాకు వద్దు. ఇంతెందుకు? మోక్షం కూడా నాకు వద్దు. నా మనస్సు దేనిని కోరుతున్నదంటావా? రెక్కలు రాని పసిపిల్లలు ఆకలిగొని తల్లికోసం తహతహలాడినట్లు, త్రాటగట్టిన దూడ ఆకలికి ఓర్వలేక తల్లి గోవును చూడాలని అలమటించినట్లు, విరహవిషణ్ణ అయిన సతి దేశాంతర గతుడైన పతికోసం కలవరించినట్లు నా మనస్సు నిన్ను చూడాలని రెపరెపలాడుతున్నది. సర్వసౌభాగ్య నిధీ! పూర్వకర్మఫలసంప్రాప్తమైన సంసారచక్రంలో కొట్టుమిట్టుకులాడి విసిగి వేసారాను. ఏ నాటి పుణ్యమో ఫలించి నీ అనుగ్రహలేశం నాకు సిద్ధించింది. తత్ఫలంగా దేహగేహపుత్రాదుల యందలి నా మమకారం సడలిపోయింది. అది మళ్ళీ తలయెత్తకుండా ఉండేటట్లు కరుణించు; ఉత్తమశ్లోకులైన నీ భక్తుల తోడి నెయ్యం తొలగిపోకుండా అనుగ్రహించు.'

రాజా! వృత్రుడు ఆ విధంగా భగవంతుని ప్రార్థించి విజయాని కంటె రణమరణమే పరమశ్రేయమని తలచి శూలాన్ని చేతపట్టి దేవేంద్రుని పైకి విసిరాడు. ఆ శూలం యుగాంతాగ్నిజ్వాలాభీలమై అంతరిక్షమంతటినీ ప్రదీపింపజేస్తూ ఇంద్రుని మీదికి దూసుకొని వచ్చింది. సురరాజు తన వజ్రంతో దానిని ఖండించి వృత్రుని దక్షిణభుజాన్ని భోగిభోగాకారమైనదానిని తెగనరికాడు. ఆ విధంగా దక్షిణబాహువు తెగినా వృత్రుడు వెనకాడక

సంరంభించి వామహస్తాన పరిఘనెత్తి ఇంద్రుడి కపోలభాగాన్ని, అతని ఐరావతాన్ని కొట్టాడు. ఆ తాకు వడికి సురేంద్రుని వజ్రం అతడి చేతినుంచి జారి క్రిందపడింది. ఆ మహాద్భుతకర్మకు ఖేచరులు వృత్రుని ప్రశంసించారు. ఇంద్రుని దురవస్థకు బృందారకుల హాహాకారాలు మిన్నుముట్టాయి. సురనాథుడు శత్రువు మ్రోలబడిన తన వజ్రాన్ని తిరిగి తీసుకోవాలంటే సిగ్గుపడ్డాడు.

## వృత్రుని ప్రోత్సాహవచనాలు

రాజా! వృత్రుడు ఇంద్రుని భావం గ్రహించి, 'నిర్జరేశ్వరా! వజ్రాన్ని గైకొని వైరిని తెగటార్చు. ఒక్క ఓటమి కలిగినంత మాత్రాన వెలవెలపోవటం తగదు. ఓడుగెలుపులు నిలకడ లేనివి. సర్వకాల సర్వవిధ సర్వజయం జగదుత్పత్తి కర్త స్థితికర్త లయకర్త అయిన ఆ సర్వేశ్వరునికి సర్వజ్ఞుడికి ఒక్కడికే చెల్లును గాని తదితరులకు ఎన్నడూ కలుగదు. నీవిట్లు విషాదదైన్యాలను పొందటానికి సమయం కాదు.

స్వర్గాధిపా! ప్రాణులకు ఓజస్సహోబల ప్రాణామృతాలు గాని మృత్యువు గాని కలుగుతున్నందుకు మూలకారణం ఏమిటో గ్రహించావా? అవి వారి యత్నాధీనాలు కావు. మరేమంటే, వాటి రాకపోకలకు భగవానుడొక్కడే హేతువనుకోవాలి. లోకమంతా వలలో చిక్కిన పక్షి పోలిక ననుసరిస్తుంది. మూఢులు ఈ రహస్యం తెలియక తామే సమస్తానికి హేతువు లని భావించి విర్రవీగుతారు.

సురనాయకా! పురుషుడు, ప్రకృతి, మహత్తత్త్వం, అహంకారం, భూతేంద్రియాశయాలు, ఇవి పరస్పరం కూడి సర్గాదులను కలిగిస్తున్నవని కొందరనుకొంటారు. వారు వెర్రివారు. భూతములన్నీ జడములు. జడములకు సంయోగ వియోగ రూపమైన స్వతంత్రశక్తి కలగదు. కనుక భూతములు భూతములను సృజించటం గాని, భూతములు భూతములను గ్రసించటం గాని ఎన్నడూ సంభవింపదు. ఈశ్వర నిర్మాణం ప్రకారం అవి వర్తిల్లుతాయి. చేతి బొమ్మలాటలు చూస్తుంటాము గదా!

అమరేశ్వరా! ప్రాణాదులకు స్వాతంత్ర్యం లేదనటానికి మరొక నిదర్శనం విను. ఆపదలు రావాలని ఎవరూ కోరుకొనరు. కోరకపోయినా రానైనప్పుడు అవి తప్పక వస్తూనే ఉన్నాయి. ఆయురారోగ్యయశశ్శ్రీలను అందరూ ఎంతో ఆశిస్తారు. తలచినంతనే అవి రావటం లేదు. దీనిని బట్టి ఏమని తెలుస్తున్నది? ద్వంద్వాదులు పురుషాధీనాలు కావని, వాటి రాకపోకలకు కారణాంతరం ఉంటుందని, ఎప్పుడు ఏది ఎవరికి ఏ విధంగా కలగాలో అప్పుడది వారి వారికి ఆ విధంగానే కలుగుతున్నదని, అనివార్యాలు సంప్రాప్తమైనప్పుడు తలవంచి అప్రతీకారబుద్ధితో సహించాలని, వేరు మార్గం లేదని స్థిరపడుతున్నది కదా!

లోకపాలకా! మరొక విశేషం కూడా విను. భగవచ్ఛక్తిని ప్రకృతి అంటారు. ఆ ప్రకృతి తనకు వ్యవహార దశ కలిగినప్పుడు సత్త్వరజస్తమోగుణరూపాలను తాల్చి వ్యవహరిస్తుంది. ఆత్ముడు అనగా శక్తిమంతుడు సాక్షిమాత్రుడై ఉంటాడు. ఈ రహస్యం ఎరుగనివారు ప్రకృతిగుణాలను ఆత్ముని యందు ఆరోపించి అవి ఆత్మ గుణాలనుకొని వ్యవహరిస్తారు. ఈ వ్యవహారమే బంధక మనబడుతున్నది. ఆత్ముడు సాక్షిమాత్రుడే అయినా అతని శక్తి అయిన ప్రకృతి యొక్క వ్యవహారమంతా అతని వ్యవహారమే కదా అని, ఆ కారణాన ప్రకృతి గుణాలు ఆత్ముని గుణాలు ఎందుకు కాకూడదని కొందరు వాదిస్తారు. ఆత్మసాన్నిధ్యం వలన గుణములకు వ్యవహారశక్తి కలుగుతున్న సంగతి నిర్వివాదాంశం. అయితే ప్రతిగుణమూ దాని స్వభావాన్ని అనుసరించి తత్ప్రకారంగా వర్తిస్తుంది. స్వభావమంటే ప్రారబ్ధకర్మఫలవాసనల సముచ్చయమే కదా. జీవులు పూర్వజన్మాలలో చేసిన వివిధ కర్మముల ఫలాలు భోగ్యకాలమందు శరీరస్థములై వాసనారూపంలో నిలిచి మళ్ళీ తత్తద్రూపకర్మలకు ప్రేరేపిస్తున్నాయి. ఏ వ్యక్తియందు చూసినా మూడు గుణాలూ ఏకకాలంలో వర్తింపకుండటమూ, ఒకదాని వెంట ఒకటి వ్యవహరించటమూ మనకు తెలిసినదే కదా! సూదంటు రాయి మ్రోల ఇనుప ముక్కల వ్యవహారం ఎటువంటిదో ఆత్మ సాన్నిధ్యంలో గుణత్రయవ్యవహారం

అటువంటిదేనని, ఆ వ్యవహారంలోని మంచిచెడుగులు ఆ కాలాన వ్యవహరించే గుణము యొక్క స్వభావాన్ని బట్టి కలుగుతున్నదని, గుణకార్యఫలానికి సాక్షిమాత్రుడైన ఆత్ముడెన్నటికీ కారణభూతుడు కాదని గ్రహించాలి. ఆ విధంగా గ్రహించి వర్తించేవాడు ముక్తు డవుతాడు.

నరేంద్రా! యుద్ధం సంగతి ఏమంటావా? అది జూదం వంటిది. బాణాలు పాచికలకు, వాహనం పలకకు, ప్రాణమన్నది జూదంలో ఒడ్డే పణానికి సాటిచేయవచ్చు. జూదంలో గెలుపోటములను ముందుగా నిర్ణయింపలేనట్లు యుద్ధంలో కూడా జయాపజయాలను ముందుగా నిశ్చయించటం సాధ్యం కాదు. జూదంలో సర్వస్వం కోల్పోయినంతదాకా జూదరి ఆట మాననట్లే యుద్ధంలో కూడా ప్రాణాలు పోయినంతదాకా యుద్ధవీరుడు వెనుదిరగక పోరాటాన్ని కొనసాగిస్తాడు. నా బాహువు తెగింది. అలాగని నా ధర్మాన్ని విడనాడలేను. ఇదిగో నా శక్తికొద్దీ పోరాడి నీ ప్రాణాలను హరింపబోతున్నాను' అని పలికాడు.

రాజా! ఇంద్రుడు అతని మాటలను సాంతం విని అతని నిష్కాపట్యాన్ని ఎంతో మెచ్చుకొని క్రిందపడి ఉన్న వజ్రాన్నెత్తి చేతిలో ధరించి 'వృత్రా! నీవు పరమాత్ముని సర్వాత్మకంగా భజించినందువల్ల నీలో అసురభావం తొలగిపోయింది. దానితో విష్ణుమాయను ధరించావు; మహాపురుషుల స్థానాన్ని అలంకరించావు. దానవులకు రజోగుణం నైజం. అట్టి రజః స్వభావులు భగవంతుని యెడ ఇంతటి దృఢవిశ్వాసం కలిగి ఉన్నారంటే ఎంతో ఆశ్చర్యకరంగా ఉన్నది. లోహం వహ్నితప్తమై శుద్ధిగాంచినట్లు రజస్తమస్సులు భగవద్భక్తితప్తము లైనప్పుడు శుద్ధి పొందక మానవు. అగ్నికి వస్తువుల యొక్క జాత్యాదిభేదం లేనట్లే భక్తికి కూడా దేవాసురాది భేదభావం కలగదు. మరి భక్తులంటే పరమానందసముద్రంలో ఓలలాడుతారే గాని స్వర్గాదిభోగరూపమైన మురికి గుంటలో నీటిని ఆశించే వారు కారు. అందువల్ల నీ యీ తత్త్వం వింత కాదు' అని పలికాడు.

రాజా! కొంతసేపటికి ధర్మజిజ్ఞాసావచనాలు తుదముట్టాక మళ్ళీ ఇద్దరూ సమరోన్ముఖులయ్యారు. వృత్రుడు తన ఇనుపకట్ల గుదియను ఎడమ చేత్తో పైకెత్తి ఇంద్రునిపైకి విసిరాడు. దేవేంద్రుడు దానిని వజ్రాయుధం చేత హరించి వృత్రుని వామహస్తాన్ని కూడా త్రుంచివేశాడు. వృత్రుడు ఆ తీరున రెండు చేతులూ కోల్పోయి, రెక్కలు తెగిన పక్షి మింటినుంచి నేల రాలినట్లు, భూమి పైకొరిగి నెత్తుట దోగుతూనే నోరు ఉప్పళించాడు. అతని క్రింది హనువు నేలను, మీది హనువు ఆకసాన్ని తాకాయి. అతనంతట ఆకాశాన్ని నాకబోతున్నట్లు నాలుక చాచి, ముల్లోకాలను కబళింప బోతున్నట్లు పెనుకోరల నోటిని విచ్చి ఇంద్రుణ్ణి అతని ఐరావతంతో పాటు ఒక్కుమ్మడిని మ్రింగివేశాడు. వృత్రుని కార్యాన్ని చూసి సురలు మహర్షులు ప్రజాపతులు హాహారవాలు చేశారు. దేవతల ఆర్తనాదం మిన్నుముట్టింది.

## వృత్ర సంహారం

ఇంద్రుడు వృత్రుని కడుపు లోపలికి చొచ్చి నారాయణ కవచ రక్షణ, యోగమాయాబలం తోడుకాగా చెక్కుచెదరక చేతనున్న వజ్రాయుధంతో అతని కుక్షిని చీల్చి బైటికివచ్చి శిరస్సును తెగవేశాడు. ఆ వేటుకు అతని గొంతు పూర్తిగా తెగబారలేదు. ఇంద్రుడు మళ్ళీ అతని కంఠాన్ని తెగనరికాడు. ఈ తీరున ఒక యేడాది గడిచింది. చిట్టచివరకు అతని కుత్తుక తెగి తల నేలకు రాలింది. ఆ సంతోషానికి దేవదుందుభులు మ్రోగాయి; సిద్ధులు జయజయధ్వానాలు చేశారు; గంధర్వుల గానాలు వినవచ్చాయి; మహర్షులు వృత్రసంహార వీర్యమంత్రాలతో దేవేంద్రుని ప్రస్తుతించారు. పుష్పవృష్టి కురిసింది.

రాజా! వృత్రుని తల తెగి అవతల పడగానే అతని దేహంనుంచి దివ్యజ్యోతి ఒకటి వెలువడి అందరు చూస్తుండగానే పైకెగిరి భగవంతుని చేరుకొన్నది. వృత్రసంహారంతో ముల్లోకాలు సంతాపం మాని స్వస్థచిత్తత గాంచాయి. లోకపాలకులు దేవర్షి పితృ భూత దైత్య దైవానుచరులు బ్రహ్మేశ్వరులు తమ తమ నెలవులకు వెళ్ళిపోయారు.

రాజా! ఇంద్రునికి మాత్రం వృత్రవధ సంతోషకారి కాలేదు. అతను బరువెక్కిన గుండెలతో, స్వస్థానం చేరుకొన్నాడు. మనస్సు కుదుటపడలేదు...'

అంటున్న శుకమహర్షిని పరీక్షిన్నరేంద్రుడు–

'మునివర్యా! వృత్రవధకు బ్రహ్మేశ్వరులు కూడా సంతసించారు కదా, మహేంద్రునికి మాత్రం సంతోషం కలుగకపోవటానికి కారణం ఏమిటి?' అని అడిగాడు.

అందుకు శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

## ఇంద్రుని చింతాకారణం

రాజేంద్రా! వృత్రుని విక్రమానికి తాళలేక సురలు, మహర్షులు దేవేంద్రుని కడకు వచ్చి వృత్రవధను కోరారు. సురరాజు వారితో 'విశ్వరూపుని చంపి బ్రహ్మహత్యకు ఒడిగట్టి ఏదో విధంగా దానిని భూ జల వృక్ష స్త్రీల అనుగ్రహం వలన తొలగించుకొన్నాను. ఇంతలో వృత్రుని చంపవలసి వస్తోంది. ఇదీ బ్రహ్మహత్య కాకమానదు. దీనికి ప్రతిక్రియ ఏమిటి?' అని చింతాక్రాంతుడై ప్రసంగించాడు.

బ్రహ్మర్షులు దేవేంద్రుని తలంపు గ్రహించి 'నిర్జరేశ్వరా! నీవు బ్రహ్మహత్యాదోషానికి భయపడుతున్నావు. తల్లిదండ్రులను గోబ్రాహ్మణాచార్యాదులను చంపిన మహాపాపి కూడా పరమేశ్వరారాధన మూలాన పునీతుడై సుఖముదితు డవుతున్నాడు. ఇంతెందుకు? చరాచరప్రపంచాన్ని వధించినా ఆ పాతకం భగవత్కీర్తనమాత్రాన భస్మీపటలం కాగలదు. అది అటుండనివ్వు. వృత్రుడు ఖలుడు. ఖలసంహారం దోషకారణం కాదు. ఒకవేళ నువ్వు అటువంటి దోషాన్ని శంకించితే, మేము నీ చేత హయమేధయాగాన్ని చేయించి ఆ మహాధ్వరముఖంగా భగవంతుని ఆరాధిస్తాము. వృత్రవధపాతకం నీ వంక ప్రసరింపదు' అని చెప్పి అనునయించి అతని చేత వృత్రుని చంపించారు.

## ఇంద్రునికి బ్రహ్మహత్యాభయం

రాజేంద్రా! ఇంద్రుడు ఆ విధంగా వృత్రుణ్ణి చంపి స్వస్థానానికి చేరుకొన్న తర్వాత కొన్నాళ్ళకు ఒక పండు ముసలి చండాలి క్షయరోగపీడితురాలై దగ్గుతూ గడగడ వణుకుతూ నెత్తురోడుతున్న చీకు వస్త్రాలతో నెరిసిన వెంట్రుకలతో మహాభయంకరాకార ఇంద్రుని వద్దకు వచ్చింది. ఇంద్రుడా ఘోరరూపాన్ని చూసి భయపడి పరుగెత్తసాగాడు. ఆ చండాలి అతనిని వెన్నంటి నిలువు నిలువుమని గద్దిస్తూ తరుముకొని వచ్చింది. వేయి కన్నుల వేల్పు దాని బారినుంచి తప్పించుకొనే ఉపాయంతోచక దిక్కులన్నీ గాలించి యెట్టకేలకు ఈశాన్య దిశను పట్టి పరిగెత్తి మానససరోవరం చేరి అక్కడి పద్మనాళతంతువులలో తలదాచుకొన్నాడు. ఆ చోటు బ్రహ్మహత్యకు చొరరానిది కాబట్టి ఆ ముసలిచండాలి ఆ బహిఃప్రదేశాన కాచుకొని కూర్చున్నది.

రాజా! హవిర్భాగానికి ఇంద్రుడు శరీరధారణ చేయవలసి ఉన్నది. హవిర్భాగాన్ని హవ్యవాహనుడు తెచ్చి అతని కందజేస్తూంటాడు. ఇంద్రుడు జలమధ్యంలో ఉండటం వల్ల అగ్ని దేవునికి ఆ ప్రదేశం చొరరానిదయింది. ఆ కారణాన ఇంద్రునికి యజ్ఞపురోడాశాది భాగాలు అందరాలేదు. సురపతి నానాటికీ సర్వాహారదూరుడై కృశించిపోతూ అక్కడే ఒక వేయి సంవత్సరాలున్నాడు.

## నహుషుని దురాగతం

ఇంద్రుడు స్వర్గలోకాన్ని వదలి వెళ్ళేసరికి నహుషుడు దానిని ఆక్రమించాడు. అతను విద్యాతపోయోగబలశాలి కావడం వల్ల ఇంద్రపదవి అతనికి సులభంగా చేజిక్కింది. స్వర్గాధిపతి కాగానే అతనిని ఐశ్వర్యమదాంధత్వం పైకొన్నది. నహుషుడు మైమరచి ధర్మదృష్టి తప్పి ఇంద్రపత్ని శచీదేవిని చెరపట్టాడు. రాజా! అధర్మదోషం తప్పదు. నహుష డా దేవీనిమిత్తాన తిర్యగ్యోనిగతుడై కొండచిలువగా జన్మించాడు.

## హయమేధ యాగం

రాజా! ఇంద్రుడక్కడ మానససరోవర జలాంతరాన చింతాపరితప్తుడై కళవళపడుతుండగా ఒకానొకనాడు 'ఇంద్రాగచ్ఛ' అని తననెవరో రమ్మనటం అతనికి వినవచ్చింది. ఆ పిలుపుతో అతను భగవంతుని ధ్యానించాడు. అంతలో బ్రహ్మర్షులక్కడికి వచ్చి సురేంద్రుని అశ్వమేధదీక్షితుని చేసి యథావిధిని ఆ మహాయజ్ఞాన్ని సాగించి యజ్ఞేశ్వరుని ఆరాధించారు. తత్ఫలంగా ఇంద్రుని బ్రహ్మహత్యాదోషం సూర్యాతపానికి మంచు కరిగినట్లు రూపుమాసింది. సురపతి కృతార్థుడై స్వస్థానం చేరి ఎప్పటి వలెనే సుఖంగా ఉన్నాడు.

పరీక్షిన్నరేంద్రా! ఈ ఉపాఖ్యానాన్ని ప్రతిపర్వసమయం లోనూ విననోచినవారు విముక్తపాపులై ధనసమృద్ధి, కీర్తివృద్ధి కలిగి శత్రుభయం లేక ఆయురారోగ్యక్షేమలాభాలను చవిగొంటారు.'

## దానవునికి భగవద్భక్తి మార్గం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు వృత్రుని చరిత్ర విని శుకయోగిని చూచి, 'మునీంద్రా! భూమిలో పరమాణువులెన్ని ఉంటే జంతువులన్ని ఉంటాయి. ఆ జంతువులలో మనుష్యుల సంఖ్య అల్పాల్పమాత్రం. ఆ మనుష్యులలో ఎవరో కొందరు మాత్రమే శ్రేయఃకాము లవుతారు. అట్టివారిలో ఏ కొందరో ముక్తిరూప పరమశ్రేయస్సును వరిస్తారు. మహాత్మా! ముక్తి అన్నది కోరుకోగానే ఒడిలో వచ్చి పడదు. ముముక్షువు పరమసత్త్వోపేతుడై సర్వాభిమానం వర్జించి ఆత్మారాము డైనప్పుడు ముక్తుడవుతాడు. కనుకనే ముముక్షువులు కోటానుకోట్లమందిలో ఎవడో ఒక్కడు మాత్రమే ముక్తిని పొందుతున్నాడు. అట్టి ముక్తులను పెక్కుమందిని వెతికి చూసినా వారిలో భాగవతుడొక డుండటం దుర్లభమవుతున్నది.

మహాత్మా! లోకవృత్తం ఈ విధంగా ఉన్న సంగతి మీకు తెలియనిది కాదు. వృత్రుని సంగతినే విచారిద్దాము. వాడు రజఃప్రధానమైన దానవకులంలో

పుట్టాడు. సర్వలోకాలను వేధించాడు. చేయరాని పాపాలు చేసి మహాపాపి అనిపించుకొన్నాడు. అట్టివాడు ముక్తుడు కావడమేమిటి? పైగా అతనికి రణరంగంలో భగవత్తత్త్వస్ఫురణ, భగవద్భక్తి కలిగాయని చెప్పారు. భగవద్భక్తికి సత్త్వం అంతో యింతో ఉండాలి కదా! సత్త్వం ఉన్నంత మాత్రాననే ఫలం లేదు. దానిని ప్రోదిచేయాలి. సత్త్వం ప్రోదికొలది పెంపొంది శుద్ధసత్త్వంగా పరిణమించి ముక్తిసాధన మవుతుందని అంటారు. వృత్రుని చర్యలను బట్టి చూడగా అతనియందు సత్త్వసాధన ఉనికికే అవకాశమున్నట్లు తోపదు. ఈ నా సంశయాన్ని నివృత్తిచేయండి' అని అడిగాడు.

మునులారా! శుకమహర్షి ఆ మాటలు విని, 'రాజేంద్రా! నీకు కలిగిన సంశయమే తొలుత నాకూ కలిగింది. దానిని గూర్చి నా తండ్రి వేదవ్యాసులను, నారదమహర్షిని ఇద్దరినీ అడిగాను. వారొక ఇతిహాసాన్ని చెప్పి నా సందేహాన్ని తీర్చారు. దానిని నీకు చెబితే సరిపోతుంది, విను' అని ఇలాగన్నాడు.

## చిత్రకేతూపాఖ్యానం

రాజా! పూర్వం శూరసేనదేశాన్ని చిత్రకేతుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. అతనికి సర్వకామాలను భూమాతే పితుకుతుండేది. అతను కోటిమంది భార్యలను పెండ్లాడాడు. పుత్రోత్పాదన సామర్థ్యం అతనికి చక్కగా ఉన్నప్పటికీ ఒక్క భార్యయందయినా అతనికి సంతానం కలుగలేదు. ఆ కారణాన అతను సర్వసంపదలు కలిగీ వంశాంకురం లేమికి లేనివాని వలె కృశింపసాగాడు.

అలా ఉండగా, బ్రహ్మర్షి అంగిరసుడు లోకసంచారం చేస్తూ ఒకనాడు ఆకస్మికంగా చిత్రకేతువు ఇంటికి వచ్చాడు. ఆ రాజు యథావిధి మునీంద్రుని అర్చించి ఉత్తమాసనాన సుఖాసీనుని కావించి వినయవినమ్రుడై అతని యెదుట నిలిచాడు. అంగిరసుడు అతని నాదరించి 'రాజవర్యా! అనామయమే కదా! నీ ప్రజలందరూ సుఖులే కదా! రాజా! జీవుడు మహదాది సప్తప్రకృతిగుప్తుడై శుభాన్ని పొందినట్లు భూపాలకుడు స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలాలనే సప్తావరణాల చేత గుప్తుడై

ప్రకృతివశుడై శుభాలను చూరగొంటాడు. జీవపరిపాలితమైన దేహం వలెనే రాజపరిపాలితమైన రాష్ట్రం సుఖంగా ఉంటుంది. రాజా! అమాత్యులు మంత్రులు నీ మాట వెంబడిని మెలగుతారు కదా! సామంతరాజులు నీకు హితవర్తులే కదా! పౌరజానపదులు నీయందు వాత్సల్యం నెరపుతారు కదా! భార్యలు భర్తృభక్తివశలై నిన్ను ప్రాణపదంగా పూజిస్తారు కదా! పుత్రులు నీ మాట జవదాటక నీకు ప్రియాస్పదులై ఉన్నారు కదా!

రాజా! ఎవడు తన మనస్సును స్వాధీనపరచుకొంటాడో అతనికి లోకమంతా వశమై వర్తిస్తుంది. లోకమే కాదు. లోకపాలకులు కూడా అట్టివానిని అనువర్తించి నెనరు కలిగి ఉంటారు. నరేంద్రా! నీ ముఖచిహ్నాలను బట్టి నిన్ను ఏదో ఒక అసంతృప్తి కలవరపెడుతున్నట్లు తోస్తున్నది. అది స్వకృత ఫలమా? పరకృత ఫలమా?' అని అడిగాడు.

చిత్రకేతుడు చేదోయి జోడించి, 'ఋషిచంద్రమా! దివ్యజ్ఞానులకు మీకు దేహధారుల బహిరంతర్వృత్తాంతాలు తెలియనివి కావు. నా చింతాకారణాన్ని గ్రహించినా దానిని నా నోట పలికిస్తున్నారు. దాహంతో అలమటిస్తున్న వాడికి పూలదండలు, సుగంధద్రవ్యాలు ఇస్తే ఆ దాహం తీరనట్లు సంతానహీనునికి నాకు సామ్రాజైశ్వర్యభోగాలు లోకపాలక ప్రార్థనీయము లైనంతవైనా సంతోషాన్ని కలిగించటం లేదు. సంతానార్థం చింత దేనికి? అని నవ్వుతారేమో! సంతానహీనత్వం వలన నేను నా పూర్వులకు అధోగతి కలిగించిన వాడినయ్యాను. నా దుఃఖమంతా అందుకోసమే గాని నా తర్వాత సామ్రాజ్యరక్షణకు కాదు. మహాత్మా! నాకు సంతానాన్ని అనుగ్రహించి నన్నూ నా పెద్దలనూ నరకపతనం నుంచి రక్షించండి' అని వేడుకొన్నాడు. అంగిరసుడు అతనిని చూసి జాలిపడి త్వష్టృయాగం కావించి ఆ యజ్ఞశేషాన్ని రాజు భార్యలలో పెద్దది, యోగ్యురాలు అయిన కృతద్యుతి చేతికిచ్చి, రాజును ఆమంత్రించి 'నీ కొక్క సుతుడు జన్మిస్తాడు. అతని వలన నీకు హర్షశోకాలు రెండూ కలుగగలవు' అని చెప్పి యథేచ్ఛానివాసానికి వెళ్ళిపోయాడు.

## చిత్రకేతువుకు పుత్రోదయం

రాజా! ఆ యజ్ఞచరుశేషాన్ని కృతద్యుతి అమితభక్తితో సేవించి, అగ్నిదేవుని వలన కృత్తికవలె చిత్రకేతువు వలన కొన్నాళ్ళకు గర్భం ధరించింది. ఆ గర్భం శుక్లపక్షచంద్రుని వలె దినదినాభివృద్ధి గాంచింది. నెలలు నిండాయి. ఆమెకొక కుమారుడు ఉదయించి శూరసేన జనులందరికీ పరమానందాన్ని కలిగించాడు.

చిత్రకేతువు పుత్రప్రాప్తికి ఎంతో సంతోషించి స్నాన మాచరించి శుచిగా అలంకరించుకొని బ్రాహ్మణోత్తములను రావించి వారిచేత కొడుకుకు స్వస్తివాచక జాతకర్మాదులు చేయించి ఆ శిశువుకు ఆయుర్యశోధనాలు కలిగేందుకు గాను బ్రాహ్మణులకు స్వర్ణాభరణ వస్త్రాలను, గజహయగ్రామాలను, ఆరు అర్బుదాల ధేనువులను దానాలిచ్చి తదితరజనులకు సకలకామాలను వర్షించాడు.

రాజా! పేదకు కష్టార్జితం పైని ప్రేమ నానాటికీ పెంపొందే విధాన, రాజుకు కానక కన్న ఆ బిడ్డపై వలపు నానాటికీ పెచ్చుపెరగసాగింది. కృతద్యుతి కూడా తల్లిప్రేమ వల్ల ఆ పసివాడిని తన మోహకల్పఫలంగా భావించి తన ప్రేమనంతటినీ అతని మీద కురిపిస్తూ అతని తోడిదే లోకంగా ఉండేది.

## సవతుల సంతాపం

రాజా! కృతద్యుతి సంతానవతి అయిన నాటినుంచి చిత్రకేతువు యొక్క ప్రీతి ఆమెయందే మూర్తీభవించింది. ఆ రహస్యాన్ని తక్కిన భార్యలు గుర్తించి 'అయ్యయ్యో! సంతానం లేకపోయినది చాలక పతి ప్రేమకు కూడా దూరమయ్యాము కదా!' అని లోలోపలే దుఃఖింపసాగారు. వారి హృదయాంతరాలు నితాంతదుఃఖాగ్నికుండాలై ప్రజ్వలించాయి. ఒక్కొక్కరుగా వారు తమ అనపత్యతను తలచుకొని, 'ఛీ! సంతానహీనురాలికి సుఖమెక్కడిది? చివరికి భర్తకన్నా దానిమీద కనికారం ఉండదు. దానికి తోడు పుత్రవతి

అయిన సవతి తక్కినవారిని తన దాసీజనాల వలె పరిగణిస్తుంది. కాదు కాదు. దాసి అనికూడా అనడానికి వీలులేదు. ఏమంటే, దాసి తన స్వామికి సేవచేసి అతని మెప్పుపొంది సుఖంగా ఉంటుంది. పుత్రహీనురాలికి అంతటి భాగ్యమెక్కడిది? సవతి దాసికి దాసీజనులమై ఊడిగం చేసి బ్రతకాలని నొసట వ్రాసినది కాక మానుతుందా?' అని తమలో తాము కలత చెంది, 'అవును! మన యీ దుర్గతికి వీడే కదా కారణం' అని ఆ పసివాడిపై కోపగించి అసూయాద్వేషాలను పెంచుకోసాగారు.

## కృతద్యుతి పుత్రుని మరణం

రాజా! ఆ సవతి తల్లులు కొన్నాళ్ళు మంతనాలు సలిపి చిత్రకేతువు కొడుకున్నంత కాలం తమను చేరదీయడని నిశ్చయించుకొని ఆ బిడ్డకు విషం పెట్టారు. ఆ పాపడు కొంత వడికి ప్రాణాలను విడిచిపెట్టాడు. కృతద్యుతి ఆ కపటం ఎరుగక తన కొడుకు గాఢనిద్రలో ఉన్నాడని అనుకొని గృహకార్యాలలో నిమగ్నురాలై ఉన్నది. ఇంతలో పొద్దెక్కింది. పిల్లవాడు నిద్ర లేవలేదు. అతనికి పాలిచ్చే సమయం కూడా మించిపోయింది. కృతద్యుతి పనిమనిషిని పిలిచి, 'దాదీ! పొద్దెక్కి ఎంత సేపయినా లేవడేమిటి? బిడ్డకు పాలివ్వాలి. లేపి తీసుకొనిరా' అని పంపింది.

దాది వెంటనే ఊయెల దగ్గరికి వెళ్ళి శిశువును ఎత్తుకోవటానికి క్రిందికి వంగింది. ఆ పసివాడు కళ్ళు తేలవేసి పడి ఉన్నాడు. అది చూసి దాది ఆశ్చర్యపడి అతని ముక్కు దగ్గర వేలుంచి చూసింది. ఊపిరాడటం లేదని తెలిసింది. ఇంకేమున్నది? దాది అంతటితో పెద్దగా ఏడుస్తూ నేలకు చతికిలపడి రొమ్ము గుద్దుకొన సాగింది. ఆ ఏడుపు విని కృతద్యుతి పరిగెత్తుకొని వచ్చి మృతపుత్రకుని చూసి నేలబడి పొర్లి పొర్లి కేశపాశమూ చీరముడి వీడినది కూడా తెలియక ఎలుగెత్తి ఏడవసాగింది. ఆ రోదనలను విని అంతఃపురజనులు హుటాహుటిని పరిగెత్తారు. సవతులందరూ గుంపులు గుంపులై వచ్చి తమ తప్పు తెలియరాకుండా వగయేడ్పు లేడ్చారు.

## చిత్రకేతుని పాటు

రాజా! ఆ సంగతిని చిత్రకేతునికి తెలిపారు. ఆ మాటతోనే అతనికి చూపు తప్పింది. అతను క్రిందపడుతూ లేస్తూ మూర్ఛిల్లుతూ నేలబ్రాకుతూ వచ్చి ఆ శిశువు శవం పాదాలముందు వ్రాలాడు. అతని కన్నీరు వెల్లువ కట్టింది. నోటమాట రాలేదు. రాజు వెనుకనే విప్రాదులు వచ్చి సంగతి గ్రహించి ఎక్కడివారక్కడే కొయ్యబారి నిలిచారు.

## కృతద్యుతి విలాపం

కృతద్యుతి కన్నీట దోగాడుతూ విలపించి విలపించి, 'హా! ధాతా! సృష్టికర్తవని నిన్నంటారు. వృద్ధులు జీవించి ఉండగానే బిడ్డలకు చావు కూర్చిన నిన్ను ఏమనాలి? నీ కంటె దయలేనివాడు లోకంలో వేరొకడుంటాడా? నీవు చేసిన చేత లోకగర్హితమని నీకు తెలియదా? జననమరణాలు వారి వారి కర్మాధీనములని సమాధానం చెబుతావు కాబోలు! అలాగయితే జీవసర్గమంతా కర్మాధీనం కాకతప్పదు. ఆ పక్షాన నీ పనేమిటి? కర్మఫలప్రదుణ్ణి మాత్రమే అంటావా? కర్మఫలాలకు రాగద్వేషాలు కారణాలు. రాగద్వేషాలకు రజోగుణం మూలం. రజోగుణవృద్ధితో రాగద్వేషాల వ్యవహారాలు కలుగుతుంటాయి. ఆ వ్యవహారాలనే కర్మములని అంటారు. కర్మములను చేశాక ఫలం కూడా పుట్టకమానదు. కాబట్టి కర్మఫలం స్వతంత్రసిద్ధమే గాని నీచే కల్పితం కాదు. కర్మఫలం స్వతంత్రమయినా దాని అనుభవకాలాన్ని జీవరాశికి నేను విధిస్తున్నానని అంటావేమో? బురద తొక్కటం దేనికి? కాలు కడగటం దేనికి? రజోజనిత రాగాదిపాశాలను ఉత్తరించు. నీ క్లేశమూ తీరుతుంది; ప్రజాసర్గమూ వర్ధిల్లి సుఖపడుతుంది!' అని బ్రహ్మను తూలనాడి, దగ్గరున్న కొడుకు శవాన్ని చూసి 'తండ్రీ! దిక్కులేని నన్నూ, శోకవివశులైన నాన్నగారినీ విడిచి వెళ్ళటం నీకు తగిన పనేనా? నీ వలన మేమిద్దరమూ అనపత్యరూప దుస్తరఘోరనరకాన్ని నిస్తరించాలనే పేరాశతో ఉన్నవాళ్ళము. నిర్దయుడవై మమ్మల్ని యమునికి అర్పింపదలచావా? నాయనా! లేచి కన్నెత్తిచూడు. ఇదిగో నీ తోడి బాలకులు

క్రీడలకు రమ్మని నిన్ను పిలుస్తున్నారు. ఇంతసేపు పడుకోవచ్చునా? ఆకలితో ఉన్నావు. లేచి పాలు త్రాగు తండ్రీ! నాయనా! నీ ముద్దు పలుకు ఒక్కటీ వినిపించవేమిటి? కటికదైవం నిన్ను లోకాంతరాలకు తీసుకొనిపోయినందువల్ల నీ పలుకులు ఇంతదూరం మాకు వినబడవా?' అని పలువిధాల విలపింపసాగింది.

## నారదాంగిరోమునుల సమాగమం

రాజా! చిత్రకేతువు దుఃఖవివశుడై సత్తువ లేక పుత్త్రుని కళేబరం చెంతనే శవాకారంగా తానూ కూలబడ్డాడు. అతని చుట్టూ చేరిన వారందరూ ఆర్తనాదాలతో ఏడవటం మొదలుపెట్టారు. ఆ సమాయాన అంగిరసుడు నారద మహర్షితో కలిసి అక్కడికి వచ్చి ఈ విధంగా పలికాడు.

'రాజేంద్రా! ఎవరికోసం శోకిస్తున్నావు? నీవు శోకిస్తున్నవాడు నీకేమి కావాలి? నీవతనికేమి కావాలి? అతడు నీకు పుత్త్రుడు, నీవతనికి తండ్రివి అంటావా? ఈ పితృపుత్త్రభావం మీ ఇద్దరికి ఈ జన్మమందు కలిగినదా? లేక తత్పూర్వం కూడా ఉన్నదా? ఉత్తర జన్మలో ఉంటుందా? జన్మాంతరాలలో మీరేయే తీరుతెన్నుల వర్తించారో, ఇక ముందెలా వర్తింపగలరో చెప్పగలవా?

రాజా! పారుతున్న నదిలో పడిన కట్టెల వంటివి – కాలప్రవాహగత దేహులకు కలిగే సంయోగవియోగాలన్నీ. ఈ సంబంధ వియోగాలకు కారణమేమిటో తెలుసునా? బీజాలలో బీజాంతరాలు పుట్టడం, గిట్టడం, పుట్టకుండానే ఉండటం ఎటువంటివో భూతజాతానికి పుట్టుచావులు, పుట్టకుండానే ఉండటం వంటివి అటువంటివే. సర్వం పరమేశ్వర మాయావిలాసం చేత జరుగుతుంటుంది. మేము గాని నీవు కాని ఈ చరాచర సమస్తభూతాలు కాని ఉత్పత్తికి పూర్వం ఉన్నవారము కాము గదా! వినాశానంతరం ఉండము గదా! ఈ రెండింటి మధ్యకాలంలో కూడా మన స్థితి అటువంటిదేనని గ్రహించు.

రాజా! ఉత్పత్తిలయాలు దేనికి? ఇవి దేహాలకే గాని ఈ దేహాంతర్గతుడికి కావు. కారణమేమంటావా? అతను నిత్యుడు కాబట్టి అతనికి చావుపుట్టుకలు కలగవు. అతను పూర్ణసన్మాత్రవస్తువు కాబట్టి అతనికి జాతివిభాగం గాని వ్యక్తివిభాగం గాని కలగదు.

దేహవిభాగం ఏలాగున కలుగుతున్నదంటావా? కొయ్య కాలుతున్నప్పుడు దానిని దహిస్తున్న అగ్నిలో దీర్ఘత్వ హ్రస్వత్వ స్థూలత్వ కృశత్వాదులను చూస్తున్నాము కదా! అవి దారుధర్మాలా? అగ్నిధర్మాలా? సర్వావస్థల లోనూ అగ్నితత్త్వం ఏకరూపం గానే ఉంటుంది. మండుతున్న అగ్నిలో కానవచ్చే చిన్న, పెద్ద మొదలైన అవస్థలన్నీ దారుగతము లైనట్టివి. అలాగే దేహభేదాలు కూడా తద్భేదమూలకారణమైన ప్రారబ్ధ కర్మ భేదం వలన కలుగుతున్నాయి. మంటలలో చిన్నా పెద్దా కనిపించినా మంటలోని వహ్నితత్త్వానికి భేదం లేనట్లే, దేహాలకు ప్రారబ్ధవశాన జన్మనాశవృద్ధిక్షయాదులు కలుగుతున్నా ఆ దేహాలలో అంతర్గతుడై సాక్షిమాత్రంగా ఉంటున్న ఆత్మునికి కలుగవు.

రాజా! దేహసంబంధాలను ఆత్మసంబంధాలుగా భావించటానికి కారణమేమిటి? దేహాభిమానమే కారణం. ఈ అభిమానాన్ని అహంకారమంటారు. అహంకారమంటే 'నేను' అన్న భావం. అహంకారం ఫలమేమిటంటావా? 'నాది' అనే భావం కలగటమే దాని ఫలం. ఈ భావాన్ని మమకారమని అంటారు. మమకారఫలంగా సంసారం కలుగుతున్నది. సంసారమంటే జననమరణరూప ప్రవాహమని గ్రహించు. ఆ గ్రహణం ఎప్పుడు కలుగుతుందంటే, ఎప్పుడు 'నాది' అన్న భావం ఉదయిస్తుందో అప్పుడు ఆ వస్తువును స్వాధీనంలో ఉంచుకోవటమూ, దానిని భోగించటమూ తప్పక కలుగుతున్నాయి కదా? ఆ భోగానికి ఒక్కొక్కప్పుడు పెక్కు జన్మలు కావలసి వస్తాయి. ఫలభోగాంతంలో ఆ దేహం పతనమవుతుంది. దానినే మరణమంటున్నాము. ఫలభోగకాలంలో తత్తత్ఫల వాసనా ప్రేరితులై తద్విధకర్మలను ఆచరిస్తుంటారు. ఆ కర్మలకు ఫలం తప్పదు. ఆ ఫలభోగార్థం తదనురూపదేహధారణం విధి అవుతున్నది. ఇది ఒకనాటికీ తీరేది కాదు. ఈ

విధానాన్నే సంసారమని అంటారు.

ఈ సంసృతి తప్పటం ఎలాగనే ప్రశ్న వస్తుంది. 'నాది' అన్న భావం నశించినట్లయితే, అంటే మమకారం నశించినట్లయితే, సంసృతి నశిస్తుంది. మమకారం నశించటం ఎలాగంటావా? 'నేను' అనే భావం – అంటే 'అహంకారం' నశించితే మమకారం తనంతట తానే నశిస్తున్నది. ఇందుకు నిదర్శనం ఏమిటంటావా? గాఢనిద్రావస్థ మంచి నిదర్శనం. గాఢనిద్రలో జీవుడు ఉన్నప్పటికీ నీకు ఎటువంటి ప్రపంచజ్ఞానమూ కలగటం లేదు కదా? కారణం ఏమిటి? 'నేను' అనే బుద్ధివృత్తి అప్పుడు వ్యవహరించటం లేదు కాబట్టి నీకు ప్రపంచజ్ఞానం కలగటం లేదు. ఇది తార్కాణగా తత్త్వసారాన్ని గ్రహించి స్వస్థచిత్తుడవు కావాలి. రాజా! రెండవదొకటి ఉన్నదని తోచినప్పుడే భయాలు, భ్రాంతులు కలుగుతాయి. అది లేనప్పుడు భయాదులు కలుగవు. కాబట్టి ద్వితీయత్వ భావాన్ని మరిచి సర్వమూ ఏకమే అని, ఆ ఏకపదార్థమే భగవానుడని విశ్వసించి అతని యందు చిత్తాన్ని పాదుకొలుపు' అన్నాడు.

రాజా! చిత్రకేతువు ఆ మాటలను విని కొంత ఉపశాంతిని పొంది 'మహాత్ములారా! మీరెవరు? మీ అవధూతవేషాలను బట్టి తెలియటం లేదు. సనత్కుమారుడు, నారదుడు, ఋభుడు, అంగిరసుడు, అసితుడు, దేవలుడు, ఇప్పటి వేదవ్యాసుడు, మార్కండేయుడు, గౌతముడు, వసిష్ఠుడు, పరశురాముడు, కపిలుడు, శుకుడు, దుర్వాసుడు, యాజ్ఞవల్క్యుడు, జాతుకర్ణి, ఆరుణి, రోమశుడు, చ్యవనుడు, దత్తాత్రేయుడు, ఆసురి, పతంజలి, పరాశరుడు, మైత్రేయుడు, భరద్వాజుడు, వారుణి, దేవశిరసుడు, బోధ్యుడు, పంచశిఖుడు, హిరణ్యనాభుడు, కౌసల్యుడు, శ్రుతదేవుడు, ఋతధ్వజుడు మొదలుగాగల సిద్ధేశ్వరులు నా వంటి గ్రామ్యమతులకు బుద్ధిచెప్పగోరి భూసంచార మొనరుస్తారని వింటుంటాము. వారిలో మీరెవరో తెలియదు. ఎవరయితే నేమి? గాఢతమస్సులో పడి ఉన్న ఈ మూఢబుద్ధికి జ్ఞానదీపాన్ని అనుగ్రహించండి' అని ప్రార్థించాడు.

పరీక్షిన్నరేంద్రా! అంగిరసు డా మాట విని, చిత్రకేతువుతో 'రాజా! పుత్రకాముడవైన నీకు పుత్రుణ్ణి ఇచ్చిన అంగిరసునిగా నన్ను గుర్తింపలేదా? ఈతడు బ్రహ్మనందనుడు నారద మునీంద్రుడు. ఎందుకు వచ్చారని అడుగుతావేమో. భాగవతులెన్నడూ దుఃఖాలపాలు కాకూడదు. భాగవతుడవు కాబట్టి నిన్నుద్ధరింపగోరి వచ్చాము.

నృపాలా! పుత్రవంతులకు ఎంత సంతాపం కలుగుతుందో అనుభవానికి వచ్చింది కదా. ఆలాగుననే భార్యాగృహధనాదులు, వివిధైశ్వర్య సంపదలు, శబ్దాది విషయాలు, భోగాలు, ధాత్రీ బలకోశ భృత్యామాత్య సుహృదాదులు, ఇంతెందుకు? ప్రాకృత పదార్థాలన్నీ శోకమోహభయప్రదాలే అవుతాయి. అవీ నిత్యములా? అంటే, గంధర్వనగర స్వప్నమాయామనోరథాల వంటివి. వాటి కార్యమేమిటంటావా? అవి మనో విజృంభణను కలిగిస్తాయి. తత్ఫలంగా వాటిని పొందాలని కోర్కెలు, కోర్కెలు తీరేందుకు ప్రయత్నాలు కలుగుతాయి. ఆ ప్రయత్నాలనే కర్మములని అంటారు. కర్మములకు ఫలం తప్పదు. ఫలభోగాది విషయాలను గురించి తెలిపాను. కాబట్టి ఆధిభూతాధిదైవాధ్యాత్మిక రూపమూ, అభిమానికి బహువిధతాపకారణమూ అయిన ఈ దేహం పైని మమకారాన్ని వదలి వ్యాకులాన్ని మాని ఆత్మతత్త్వాన్ని విమర్శించి ద్వైతం అనిత్యమని గ్రహించి ఉపశాంతిని పొందు. ఇంత చెప్పినా నీ అభినివేశాన్ని తొలగించుకొనలేక పుత్రుణ్ణే కోరుకొంటే నీ పుత్రుణ్ణి మళ్ళీ నీకు గాను జీవితుని కావిస్తాను, చెప్పు' అని బోధించాడు.

## నారదుని ఉపదేశం

రాజా! అంతలోనే నారదమహర్షి అతని మాటనందుకొని, 'భూపాలా! నీకొక దివ్యమంత్రాన్ని ఉపదేశించబోతున్నాను. శుచివై దానిని గ్రహించు. ఆ విద్యాప్రభావం వలన నీకు ఏడు రాత్రులలో సంకర్షణ సందర్శనం కలుగుతుంది. ఏ దేవదేవుని పాదమూలాన్ని ఆశ్రయించి శర్వాదులైన తొల్లిటి పెద్దలు సంసృతి భ్రమణరూప ద్వైతాల నన్నింటినీ విడిచి ఆ పరమపూరుషుని ప్రాప్తిగొన్నారో, ఆ మహాత్ముడిని అచిరకాలం లోనే నీవు పొందగలవు' అని

చెప్పి, అక్కడ శోకిస్తున్న వారికి చచ్చి పడి ఉన్న రాజనందనుని శవాన్ని చూపి, ఆ శవం వంకకు మరలి, 'జీవాత్మా! శుభమగుగాక! నీ తల్లినీ తండ్రినీ కన్నెత్తి చూడు. నీకై గోడుగోడుమంటున్న నీ వాళ్ళను నీ స్నేహితులను బంధువులను ఓదార్చు. నీకు కాలమృత్యువు కలగలేదు; అపమృత్యువు దాపరించింది. కాబట్టి ఆయుష్కాలం నీకు శేషించి ఉన్నది. నీవు నీ కళేబరాన్ని ప్రవేశించి జీవితుడవై రాజ్యపీఠం ఎక్కి తండ్రి కూర్చిన భోగాలను అనుభవించు' అన్నాడు.

## రాజకుమారుని ప్రత్యుత్తరం

పరీక్షిన్నరేంద్రా! ఆ మాటల తోడ్తోనే మృతుడైన రాజపుత్త్రుడు కళ్ళు తెరిచి, 'బ్రహ్మర్షివర్యా! కర్మవశాన జీవులు దేవతిర్యఙ్నరదేహాలను ధరించి పరిభ్రమిస్తుంటారు. ఆ విధంగా సంసారచక్రంలో పడి వివిధ దేహాలతో తిరుగుతున్నవారికి కాలభేదాన్ని బట్టి ఆయాజన్మలలో బంధుజ్ఞాతులు, శత్రుమిత్రులు, మధ్యస్థద్వేష్యులు, ఉదాసీనులు కలుగుతుంటారు. సువర్ణాది పదార్థాలు బేహారుల వద్ద ఒక చేతినుంచి మరొక చేతికి మారుతున్నట్లుగా, జీవుడు కర్మవశుడై ఒక యోనినుంచి మరొక యోనిని పొందుతూ తిరుగాడుతుంటాడు. సువర్ణానికి పురుష పురుషాంతర సంబంధం ఏ విధంగా తాత్కాలికమో, అలాగే నిత్యపదార్థమైన జీవునికీ దేహ దేహాంతర సంబంధం తాత్కాలిక మవుతుంది. ఆ సంబంధం ఎవరికీ ఎప్పటికీ సార్వకాలికం కాదు. ఆ సంబంధం ఎంత కాలం ఉంటుందో అంత కాలం వరకే ఆ పదార్థాల పట్ల మమతాభిమానాలు ఉంటాయి. దేహత్యాగం సిద్ధింపగానే సర్వసంబంధాలు, తత్సంబంధకారణమైన మమకారం, తత్కారణమైన అహంకారం అన్నీ నశించిపోతాయి. దేహాన్ని ధరించిన జీవునికే ఆ దేహాన్ని గురించిన మమకారం లేనినాడు శవరూపమైన ఆ దేహానికోసం మీరు శోకించటం దేనికి?

జీవుడు పరమాత్మ కంటె వేరు కాడు. ఆ జీవుడు స్వశక్తియొక్క గుణాలచేత విశ్వసృష్టిని కావిస్తున్నాడు. అతనికి ప్రియాప్రియులు గాని తనవారు కాని పెరవారు కాని ఉండరు. అతడు అద్వితీయుడు; సంగరహితుడు. జనుల

గుణదోషాలు వారి వారి బుద్ధిగతమైనవి. బుద్ధులను బట్టి క్రియాఫలాలు కలుగుతుంటాయి. అవి జీవులకు అంటవు. అతను దేహాంతరమందు సాక్షిమాత్రుడై కార్యకారణాలు రెండిటినీ అవలోకిస్తూ భోక్త, పరతంత్రుడు ఏదీ కాక ఉదాసీనుని వలె ఉంటాడు' అని పలికి ఆ జీవుడు నిష్క్రమించాడు.

అక్కడున్నవారందరూ ఆ మాటలు విని విస్మితులై తత్త్వరహస్యం గ్రహించి భ్రాంతిని విడిచి స్నేహపాశాలను తెంచి శోకాన్ని అణచివేసి ఆ రాకుమారుని కళేబరానికి ఉచితసంస్కారక్రియలు జరిపారు. ఆ పసివాడిని చంపిన సవతులు ఆ పాతకం వల్ల తేజస్సు తరిగి సిగ్గుతో తలవంచుకొన్నారు. మనోవ్యథ నానాటికీ క్షోభకరం కాగా వారు పశ్చాత్తాపంతో కుమిలిపోయారు. పెద్దల నడిగి తెలిసికొని తమ పాపపరిహారార్థం బ్రాహ్మణనిరూపితవిధాన యమునాజలాలలో బాలహత్యావ్రతం నోచారు.

రాజా! చిత్రకేతుడు మహర్షి వచనాల వలన తత్త్వప్రబోధితుడై బురద గుంట నుంచి బయటపడిన మత్తేభరాజు వలె గృహాంధ కూపం నుంచి వెలువడి యమునాజలాలలో స్నానం చేసి పితృతర్పణాదులు కావించి ఆ మునీంద్రులకు ప్రణమిల్లాడు. ఆ విధంగా ప్రపన్నుడైన చిత్రకేతునికి నారదుడు సంకర్షణవిద్య నుపదేశించి అంగిరస్సహితుడై బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

## చిత్రకేతువుకు సంకర్షణ దర్శనం

రాజా! చిత్రకేతువు నారదోపదేశం ప్రకారం సమాహితచిత్తుడై జలాహారమాత్రుడుగా ఉండి ఆ మంత్రాన్ని ఏడు రాత్రులు జపించాడు. అతనికి సంకర్షణవిద్యాప్రభావం వలన ఏడవనాటి రేయి వేకువ కాలాన విద్యాధరపతి పదవి లభించింది. తర్వాత కొన్నాళ్ళకు అతనికి ఒక దివ్యమూర్తి సందర్శనం కలిగింది. శ్వేతశరీరుడు నీలాంబరధారి కిరీటకేయూరాది భూషణ ప్రకాశుడు అయి సిద్ధేశ్వరులు సేవిస్తుండగా రక్తనయన కాంతులతో దిక్కులను ఎరుపెక్కింపజేస్తూ సాక్షాత్కరించిన ఆ మూర్తిని చూసినంతనే చిత్రకేతుని పాపాలన్నీ నశించాయి. అతని అంతఃకరణం నిర్మలమయింది. అతను

సంతోషపులకిత శరీరుడై ఆ మహాత్ముని ఆనందబాష్పాలతో అభిషేకిస్తున్నవాని వలె సమార్ద్రనయనుడై నోటమాట రాక కొంతసేపుండి ఎట్టకేలకు కుదుట చెంది ఈ విధంగా స్తుతించాడు.

## చిత్రకేతుకృత సంకర్షణస్తుతి

దేవా! చిదాత్ములు సమబుద్ధులు అయిన సాధువులకు తప్ప అన్యులకు నీవు సాధ్యుడవు కావు. మరి నిష్కాములంటేనో? వాళ్ళు నిన్నేమీ అర్థింపరు కాబట్టి జితోస్మి అంటూ నీకై నీవు వారికి సమర్పించుకొంటావు.

స్వామీ! విశ్వ సృష్టి లయాదు లన్నీ నీ లీలలు మాత్రమే. సృష్టికర్తలు బ్రహ్మాదులు ఉన్నారంటావా? వారందరూ నీ అంశాంశమాత్రు లవుతారు. మేమధికులం మేమధికులమని వారు పరస్పర స్పర్థ చేయటం ఎందుకంటావా? అభిమాన వివశత్వం వారినలా ఆడిస్తున్నది.

దేవా! ఆదిమధ్యాంతాలు నీకు కలుగవు. నీ ఉనికి పరిమాణం ఇంతని చెప్పటానికి వీలులేని విరివి కలది. అత్యంతస్థూలపదార్థం మొదలు పరమాణువు వరకు నీవు లేని పదార్థమే ఉండదు. నీ ఆకారం తీరు తెలియగల వారెవ్వరూ లేరు. భూమ్యాదులు దశగుణోత్తరా లైనవి ఎన్నో కలిసి ఒక అండమవుతున్నది. అటువంటి అండాలు కోట్లకు కోట్లు కలిసి ఒక బ్రహ్మాండం. అంత బ్రహ్మాండం నీ ఉదరాంతరాన పరమాణుప్రాయమై ఉంటుంది. ఇటువంటి నీ యొక్క విస్తృతి ఇంత అని చెప్పటం శక్యమా? కనుకనే కదా, అనంతుడని నిన్ను పేర్కొంటారు.

స్వామీ! ఇంతటి మహానుభావుడవైన నిన్నెవ్వరూ ఉపాసించటం లేదు. అందుకు విషయతృష్ణాపరత్వ మొక్కటే కారణం. నీవు నీ శక్తిని అంశాంశాలు చేసి ఒక్కొక్క అంశానికి ఒక్కొక్క అధికారం ఇచ్చావు. ఆ అధికారులను దేవతలంటారు. వారు పాలింప నోచిన విషయాలు క్షణికమాత్రాలే అయినా సుఖప్రదాలు. విషయతృష్ణాపరులు సద్యఃఫలాలను కోరి తత్తత్ఫలాధికారులైన దేవతలను ఆశ్రయిస్తారు. అందువల్ల వారి దృష్టి నీ వంకకు మళ్ళదు.

స్వామీ! ఇంద్రాది దేవతలిచ్చే ఫలాలు క్షణికమాత్రాలే కాగలవు. రాజును ఆశ్రయించి సంపాదించిన ఫలం ఆ రాజకులం ఉన్నంత వరకే నిలిచి ఉంటుంది. ఆ రాజకులం నశించినంతనే వారిచ్చిన సంపదలు కూడా తొలగిపోతున్నాయి. ఇది లోకానుభవసిద్ధం. ఇంద్రాదిదేవతలు సయితం తాత్కాలికాధికారి మాత్రులు. వారికీ కాలనియతి లేకపోలేదు. అందుచేత వారిస్తున్న ఫలాలు కూడా తాత్కాలిక మాత్రములై నశించిపోతాయి.

దేవా! ఆ మందమతులే సకామశక్తితో నిన్నే సేవించితే కృతార్థులు కాగలరు. ఏమంటే, వస్తుశక్తి ఎన్నటికీ బుద్ధిని ఆశ్రయింపదు. ఆ శక్తి దాని స్వభావానుగుణంగా ఫలాన్నిస్తుంది. నీవు నిర్గుణుడవు. నిన్నాశ్రయించినపుడు ఆశ్రితుల కామబీజాలు గుణరహితాలై వేగిన గింజల వలె మొలకెత్తక నశిస్తాయి. వారు కాలక్రమాన కృతార్థులవుతారు. ఇక ఆత్మారాములై నిన్నే సేవిస్తున్న సనత్కుమారాదుల సంగతి చెప్పేదేమున్నది?

దేవా! బుద్ధి ఏకరూపమై ఉండగా తదాశ్రిత వస్తుధర్మాన్ని బట్టి ఫలభేదం కలుగుతున్నది. కాగా నీ ధర్మమైన భాగవత ధర్మానికి, తదితర కామధర్మాలకు ఎంతో భేదం ఉన్నది. భాగవత ధర్మం రాగద్వేషరహితం; కామధర్మం రాగద్వేషయుక్తం. నీ ధర్మానికి అహింస మొట్టమొదటి సూత్రం. కామధర్మానికి హింసాదులు ఊతగఱ్ఱలు. నీ ధర్మము వల్ల ఆర్జించినది శాశ్వతం. కామధర్మార్జితం నశ్వరమైనది. నీ ధర్మమందు బుద్ధి ఏకాగ్రమై ఉంటుంది. కామధర్మమందు నేను నాది, నీవు నీది మొదలైన భావాలు బుద్ధి నలమి దానిని పలువంకలకు లాగుతుండటం వల్ల అది అవ్యవసాయాత్మికయై నిలకడ లేనిదవుతుంది. ఏకాగ్రబుద్ధికి నీవు తప్ప వేరొకటి తోచదు. ఆ కారణాన అహంకార మమకారాదులకు తావు కలగదు. అవ్యవసాయాత్మిక బుద్ధి అహంకార మమకార వశమై పరపదార్థాలకు ప్రాకులాడుతూ ఇతరులకు చేటు కలిగించటమే కాక తుట్టతుదకు తాను సహితం చేటొందుతున్నది. ఏకాగ్రబుద్ధి నీ ధర్మపూతం అయినందువల్ల తాను మేలొంది పరులకు కూడా మేలు కూర్చుతుంది. నీ ధర్మపరులు నీ అనుగ్రహానికి పాత్రులవుతారు.

కామధర్మపరులు ఆత్మద్రోహులై నీ ఆగ్రహానికి గురి అవుతారు. దేవా! నీ ధర్మపరుల వెంట నీవెప్పుడూ ఉంటావు. కామధర్మపరులకు కోటి జన్మలెత్తినా నీ దర్శనభాగ్యం లభించదు. నీ ధర్మపరులకు ఆ ధర్మపరిత్యాగం ఏనాటికీ కలగదు. కామధర్మపరులకు ఎప్పుడో ఒకప్పుడు ధర్మచ్యుతి కలుగుతుంది. కామధర్మం బహుధనక్లేశసాధ్య మయినట్టిది. నీ ధర్మానికి కాసంత ద్రవ్యవ్యయం గాని గోరంత క్లేశం గాని కలగవు. నీ పేరొక్కసారి పిలిచినా విన్నా చాలు. కామధర్మాలకు నీతినియమాలు జాతి లింగ భేదాలు ఉన్నాయి. ధర్మాచరణలో ఏ మాత్రం లోపం కలిగినా వాంఛిత ఫలం దూరమవటమే గాక విపరీతఫలం కూడా కలుగుతుంది. నీ ధర్మానికి మనోనియతి గాక వేరొక్కటి అక్కరలేదు. చండాలుడే అయినా నీ ధర్మాన్ని ఆచరింపవచ్చును. ఎవరెంత చేస్తారో వారికంత ఫలం కలుగుతుంది. విపరీత ఫలం కలలోనైనా సంభవించదు.

దేవా! నీ సందర్శనభాగ్యానికి నోచి మాకు పరమచిత్తశుద్ధి ప్రాప్తించింది. మేము కృతార్థుల మైనాము. ఈ మహాభాగ్యం నీవాడైన నారదమహర్షి యొక్క కృపావిశేషం. నీ వారి మాటకు ఎన్నటికీ వమ్ము కలగదు. దేవా! నీవు జగదాత్ముడవు కాబట్టి చరాచర సమస్త భూతహృదయాంతర భావాలూ నీకు స్పష్టమే కదా. మా భావాలను వేరుగా విన్నవింప నక్కరలేదు. ఎవరి సంకల్పశక్తి మూలన విశ్వసర్గకారకులు సయితం చేష్టావంతులై వ్యవహరిస్తారో, ఎవని వీక్షణభాగ్యాన్ని పొంది జ్ఞానేంద్రియాలు జ్ఞానవంతములై స్వధర్మాలను నిర్వర్తిస్తుంటాయో, ఎవని ఫణాగ్రమందు ఆవగింజ వలె భూమండలం కానవస్తున్నదో, ఆ సహస్రశీర్షునికి సంకర్షణ మూర్తికి నీకు పునఃపునః ప్రణామాలు.

## చిత్రకేతువుకు సంకర్షణోపదేశం

పరీక్షిన్నరేంద్రా! ఆ శేషమూర్తి చిత్రకేతువు వినమ్రవాక్యాలకు ప్రీతుడై, 'విద్యాధరపతీ! నారదాంగిరసులు నీకు ఉపదేశించిన అనుశాసనవిద్యల ఫలంగా నీవు నా దర్శనభాగ్యాన్ని గన్నావు. సిద్ధపురుషుడ వైనావు. నేను

భూతాత్ముడను, భూతభావనుడను; సర్వభూతములు నేనే. నాకు రెండు మూర్తులు ఉన్నాయి. శబ్దబ్రహ్మము, పరబ్రహ్మము అని వాటిని పేర్కొంటారు. అవి రెండూ శాశ్వతమైనవి. నేను భోగ్య ప్రపంచంలో అనుగతుడనై భోక్తృరూపాన ఉంటానని కొందరు, ప్రపంచమే భోగ్యరూపంలో నా యందు వ్యాపించి ఉన్నదని కొందరు, అన్నింటికి కారణాత్మకుడనై భోగ్య భోక్తృరూపాలతో రెండింటి యందు వ్యాపించి ఉన్నవాడనని కొందరు అంటుంటారు.

ఈ భేదాలన్నీ నా యెడ కల్పితములే గాని వాస్తవాలు కావు. ఈ భేదదృష్టికి బుద్ధియొక్క అవస్థాభేదమే కారణం. జీవులు స్వప్నదశలో వివిధాంశలను చూస్తారు. మేల్కొన్నప్పుడు అందులో ఏ ఒక్కటీ కానరావటం లేదు కదా! అందువలన పదార్థమొక్కటే అయినా అవస్థానభేదం కారణంగా దర్శనభేదం కలుగుతున్నది. బుద్ధియొక్క అవస్థాభేదాలంటే – జాగరణము, స్వప్నము, సుషుప్తి – ఈ మూడూ మూడు అవస్థాభేదాలు. అవి ఆత్మమాయా మాత్రాలు. ఈ రహస్యాన్ని గ్రహించి ఈ అవస్థలలో బుద్ధికి గోచరించినవాటిని వదిలి ఈ మూడవస్థలకు పరమందున్నట్టి సర్వసాక్షిని పరాత్ముడిని చింతించటం మేలు.

పరమాత్ముడిని తెలిసికొనటం ఎలా గంటావా? నిద్రాకాలంలో ఆత్మభూతుడై స్వప్నరూపంలో ఇంద్రియ సుఖాన్ని ఎవడనుభవిస్తున్నాడో అతనినే పరమాత్మగా గుర్తెరుగు. నిద్రాకాలంలో జ్ఞానమెక్కడిదంటావా? గాఢనిద్ర నుంచి లేచినప్పుడు నేను హాయిగా నిద్రించాను; ఇప్పుడు మేల్కొన్నాను అనటం లోక సహజమే కదా; ఇది జ్ఞానము కాదా? ఈ నిద్రాజాగరణావస్థలు రెండిటినీ అంటిపెట్టుకొని, ఆ రెండిటినీ గమనిస్తున్నదేదో ఒకటుండకపోతే ఆ విధమైన జ్ఞానానికి అవకాశమే లేదు. కాకుంటే నిద్రాజాగరణావస్థలన్న భేదం కూడా ఏర్పడదు. ఆ విధంగా తెలుసుకొంటున్న శక్తి విశేషమే పరబ్రహ్మమని గ్రహించు.

ఆ తత్త్వాన్ని గ్రహించటం ఎలాగనే ప్రశ్న వస్తుంది. పరబ్రహ్మం జ్ఞానస్వరూపం. జ్ఞానమంటే ప్రకాశం. ఎప్పటికి ఆ ప్రకాశం సోకుతుందో అప్పుడే బుద్ధి మాలిన్యరహితమై స్వచ్ఛతను పొందుతుంది. అట్టి స్వచ్ఛబుద్ధి యందు తత్ప్రకాశం శుద్ధదర్పణమందలి సూర్యకాంతి వలె ప్రతిబింబిస్తుంది. ఆ బింబదర్శనానుభవమే ఆత్మానుభవం అనబడుతుంది. బుద్ధీంద్రియం జడమని, జడమునకు జ్ఞానశక్తి ఎక్కడిదని అడగవచ్చు. సూదంటు రాయి సన్నిధినున్న లోహశకలం తాను కూడా ఆ శక్తిని పొందటం చూశావు కదా! అదే విధాన జ్ఞానశక్తి చేత ప్రకాశితమైన బుద్ధి జ్ఞానవంత మవుతున్నది.

విద్యాధరేశ్వరా! జ్ఞానమంటే 'ఇది యిట్టిదని తెలిసికొనటం' అని భావం. జ్ఞానమూలాన వ్యక్తమైన వస్తువును అనుభవించటం వలన కలిగే ఫలానికి విజ్ఞానమని పేరు. ఈ రెండూ మనుష్య జన్మానికి మాత్రమే లభిస్తాయి. అటువంటి మానవజన్మ లభించినా ఆత్మని తెలియనివాడు ఎన్నటికీ శుభాలను పొందలేడు. ఆ దురదృష్టవంతుడు జననమరణ ప్రవాహరూప సంసారంలో మునిగి దరిగానక పరిభ్రమిస్తుంటాడు.

జన్మమన్నది ప్రారబ్ధఫలభోగార్థం కలుగుతున్నదని; జన్మము కలిగినప్పుడు ఫలభోగం అనుభవించటమూ, తత్ఫలవాసనాప్రేరితులై తద్విధకర్మలను చేయవలసిరావటమూ ఏర్పడుతుండగా దానినుంచి తప్పించుకోవటం ఎలాగని ప్రశ్నిస్తారు. కర్మములంటే ఏమిటి? ఇంద్రియ వ్యాపారాలు. ఇంద్రియము లన్నవి మనఃప్రేరితములై వర్తిస్తున్నవి. మనస్సున్నంత కాలం కోరికలు తప్పవు.

కోరికలను కోరటం దేనికి? ప్రీతి కోసమే గదా! ప్రీతినిస్తున్న వస్తువులలో ఉత్తమోత్తమమైన దానిని ఒక్కసారి మనస్సుకు రుచిచూపిస్తే ఇక దానికి అన్యవస్తువుల యందు రుచి కలుగదు. ఎప్పుడు మనస్సలా ఏకాగ్రమవుతుందో అప్పుడు దాని ప్రేరేపణ

స్తంభించిపోతుంది. ఇంద్రియాలు పరప్రేరణ లేక స్వభావానుసారంగా వర్తిస్తాయి. అప్పుడు ఇంద్రియవ్యాపారం కామరహితం అవుతుంది. అప్పటి కర్మ నిష్కామకర్మ మవుతుంది.

నిష్కామకర్మ ఫలం కర్తకు చెందదు. అది భగవదాయత్త మవుతుంది. కర్మఫలం కర్తకు కలుగనప్పుడు ఫలానుభవార్థం ఏర్పడే జన్మధారణ తప్పుతుంది. అంతట శుభార్థనిరూఢి కలుగుతుంది. విద్వాంసులు తద్విధంగా నిర్వర్తించి కృతకృత్యులవుతారు.

మరొక రహస్యం. సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి అన్నవాటిని చలిచీమ మొదలు బ్రహ్మపర్యంతం కోరుతుంటారు. అందుకు కర్మములను ఆచరిస్తారు. కర్మాచరణరహస్యం తెలియనందువలన వారికి తలచిన దొకటి, సంప్రాప్తమైనది వేరొకటిగా ఉంటున్నది. కర్మాచరణ తత్త్వరహస్యాన్ని గ్రహించి ఐహికాముష్మిక విషయసుఖలాలసను మాని నిష్కామబుద్ధితో స్వధర్మానుష్ఠానశీలురై వర్తించేవారు క్రమక్రమంగా జ్ఞానవిజ్ఞానసంతుష్టులై తురీయమైన సూక్ష్మగతిని ఆశ్రయించి స్థానత్రయ విలక్షణమైన ఆత్మను గ్రహింపగలుగుతారు. ఈ ప్రకారం చేయటమే భక్తి. ఈ భక్తిచేసినవాడే భక్తుడు.

ఈ విధానాన్ని భక్తియోగమని అంటారు. యోగమంటే రెండింటి సంధానమని అర్థం.

విద్యాధరనాథా! రెండు వస్తువులు కూడి ఏకం కావటానికి ఆ రెండింటి గుణమూ ఏకంగా ఉండాలి. భిన్నగుణపదార్థాలు ఎన్నడూ స్వరూపభేదరహితంగా కలియవు. ఆత్మకు పరమాత్మతో ఏకత్వం కలగాలంటే అవి రెండూ ఏకస్వభావం కలిగినవి కావాలి. పరమాత్మ అన్నదో ప్రేమైక స్వరూపం. ఆత్మమన్నదీ వాస్తవానికి ప్రేమస్వరూపమే అయినా కోరికలను బట్టి భిన్న భిన్న రూపాలను ధరిస్తున్నది. దానితో స్వపరభేదభావాలు

కలుగుతున్నాయి. అటువంటి భేదభావాలను నిర్మూలించినప్పుడు ఆత్ముడు నైజస్వభావయుక్తు డవుతాడు. అంటే ప్రేమైక స్వరూపుడవుతాడన్నమాట. ఆత్మ, పరమాత్మ రెండూ ప్రేమస్వరూపాలైనప్పుడు వాటికి సులభంగా కలయిక సిద్ధిస్తుంది. అది అభేదరూపాన్ని సంతరించుకొంటుంది. ఆ కలయికకే యోగమని పేరు.

రాజన్యా! నేను వచించినది చక్కగా విమర్శించి మనస్సుకు తృప్తికావించి మెలగు. మనస్సును తృప్తిపరచనిదే మనోజన్యమైన మాలిన్యాలు తొలగవు. కాబట్టి మనస్సమాధానం మొట్టమొదటి కర్తవ్యం. మనస్సమాధానం వలన ఏకాగ్రబుద్ధి, తత్ఫలంగా జ్ఞానము, తత్ఫలంగా విజ్ఞానమూ చేకూరి శీఘ్రసిద్ధిని పొందగలవు.'

పరీక్షిన్నరేంద్రా! సంకర్షణమూర్తి ఆ విధంగా పలికి అంతర్హితుడైనాక చిత్రకేతు వంతట భగవానుడు తిరోగతుడైన దెసకు మొక్కి హరికీర్తి గానంచేస్తూ ప్రియురాండ్రను కూడి కాలం గడపసాగాడు.

## పార్వతీదేవి శాపం

పరీక్షిన్నరేంద్రా! చిత్రకేతువు గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణపరుడై ఒకానొకనాడు భార్యలతో విమానమెక్కి కులగిరిసానుప్రదేశాలలో విహరిస్తూ కైలాసానికి వచ్చాడు. ఆ గిరిశిఖరాన మహేశ్వరుడు పార్వతీదేవిని తొడపైని కూర్చుండబెట్టుకొని కౌగిట చేర్చి పేరోలగం తీరి ఉన్నాడు. శివుని పరివేష్టించి మునిముఖ్యులు సభను అలంకరించారు. సిద్ధచారణులు నలువంకల తీరి సేవలు కావిస్తున్నారు.

చిత్రకేతుడు విమానం నుంచి ఆ సభవంక దృష్టిసారించి, 'ఓహో! ఇదేమిటీ వింత! మహేశ్వరుడంటే సాక్షాల్లోకగురుస్థానీయుడు కదా! అతని వలన సర్వధర్మాలను శరీరధారులు గ్రహింపవలసి ఉన్నది. అటువంటి మహాత్ముడు నిండు సభలో భార్యను చంకకెక్కించుకొని అధిష్ఠించి ఉండటం వింత కాదా?

ప్రాకృతులు కూడా ఇటువంటి అనౌచిత్యానికి పాల్పడరు. ఈ మహానుభావునికి మాత్రం ఇది చెల్లుతుందా?' అని సాశ్చర్యంగా పలికాడు.

ఆ మాటలు కర్ణపుటాలను సోకినా మహేశ్వరు డేమీ మాటాడక చిరునవ్వు దాల్చి మౌనంగా ఉండిపోయాడు. పార్వతీదేవి ఆ పల్కులను విని, 'వీడి గర్వం ఏమనాలి? జితేంద్రియుడననే దురభిమానం వీడి కన్నుగప్పింది కాబోలు. కాకపోతే ఇతను మహాదేవుని మహిమనే ఎరగడా? తెలిసి తెలిసి ఇటువంటి ప్రల్లదాలా మాట్లాడటం? ఈశ్వరుడు పార్వతిని తన అంకతలాన నిలిపిన రహస్యాన్ని ప్రశ్నప్రతివచనాలతో చెప్పింపదలచాడా? కాదు కాదు; నాబోటి సిగ్గరులను శాసింపగోరి లోకానికి నేనే దండధారి ననుకొంటున్నాడు కాబోలు! ఇతనెరిగినంత ధర్మాన్ని బ్రహ్మదేవుడెరుగడా? భృగు నారద సనత్కుమారులు గ్రహింపరా? కపిలాదియోగులు తెలిసికొనలేరా? వారందరూ ఎరుకగల వారయితే హరుని కార్యం ధర్మబాహ్యమని వారింపరా? బ్రహ్మాదులు నిరంతరం మహేశ్వరుని పాదారవిందాలను పూజిస్తారు. ఎన్నడూ వారికిటువంటి తలంపే రాదు. ఇతని మాటలు సర్వభువన మంగళాత్మకుని యెడ తిరస్కారవచనాలు గాని వట్టి మాటలు కావు. ఇంత దురభిమానం కలవాడు హరిపాదసేవకుడు కాగలడా?' అని తలపోసి, 'దుర్మతీ! నీ నోట వచ్చిన మాటలు దురహంకార ప్రేరితాలని తెలుస్తూనే ఉన్నది. నీ దురాలాపాల వల్ల పెద్దలకు తీరని అపచారం చేశావు. ఎంతటి కఠిన శిక్ష విధించినా నీవు పాత్రుడవే. అయినా నా వాక్కుకు, వాత్సల్యం అడ్డుపడుతున్నది. అసురుడవై జన్మించు' అని శపించింది.

## చిత్రకేతువు ప్రార్థన

రాజా! ఆ శాపంతో చిత్రకేతుడు తటాలున విమానం దిగి పార్వతీదేవి పాదాలకు మోకరిల్లి, 'తల్లీ! నీ శాపాన్ని దోసిట బట్టి తలదాలుస్తాను. అమర్త్యుల నోట మర్త్యులను గూర్చి వెలువడే వాక్కు మర్త్యుల పురాకృతకర్మాయత్తమే గాని ఆగ్రహోదితం కాదు. ప్రాణి అజ్ఞానవశుడై

సుఖాభిలాషతో గొంతెమ్మ కోరికలు కోరుతూ ఆ కోరికల సిద్ధికోసం కర్మలను చేసి తత్ఫలభోగరూపమైన సంసారచక్రాన ఇరుకున పడి ఎండమావుల వంటి సుఖదుఃఖాలను వెంటాడుతుంటాడు. వాస్తవాన్ని విచారించితే ప్రాణి అనుభవించే సుఖదుఃఖాలకు తాను గాని మరొకడు గాని కర్తలు కారు. కర్మమును చేస్తున్నది మనుష్యుడే. అయితే మనుష్యుని కర్తృత్వం నిమిత్తమాత్ర మవుతుంది. అంతే కాని అతను వాస్తవకర్త కాడు. తల్లీ! ఈ సంసారం గుణప్రవాహరూపం కాబట్టి ప్రవాహజలాల వలె నిలకడ లేక క్షణక్షణం మారుతుంటుంది. శాపానుగ్రహాలు స్వర్గనరకాలు సుఖదుఃఖాలు అంటే ఏమిటో వాటి వాస్తవస్థితి ఏమిటో అందుకు కారణం ఏమిటో ఎవరికీ తెలియదు. కర్త లేనినాడు కార్యమూ కలుగదు కాబట్టి సర్వసృష్టికర్తయే వాటికీ కర్త కాడా? అని ప్రశ్నిస్తారు. భగవానుడు నిష్కళుడు, అద్వితీయుడు; అతనికి శత్రువులూ మిత్రులూ అని ఉండరు. ఎందుకంటే, రాగద్వేషాలు కలగటానికి రెండవ వస్తువొకటి ఉండాలి. భగవానుడు అద్వితీయుడు అనగానే రెండవ వస్తువు లేదని స్పష్టమే కదా. రెండవది లేనప్పుడు రాగద్వేషాలకు అవకాశ మెక్కడుంది? అట్టివాడు భూతకోటిని సృజించి ఆ భూతములకు సుఖదుః ఖాదులను కలిగిస్తున్నాడనే మాటకు అర్థం లేదు. సంసారమందు సుఖదుః ఖాలను హితాహితాలను బంధమోక్షాలను కళ్ళారా చూస్తున్నామని, వాటికి కర్త ఎవరని, కర్త లేక కార్యం ఎట్లా కలుగుతుందని వాదిస్తారు.

తల్లీ! కర్తలేక కార్యం కలగదనే మాట సత్యమే. ఆ పక్షాన సంసారానికి కర్త ఎవరనే ప్రశ్న వస్తుంది. కర్మమే కర్త అవుతుంది. కర్మమంటే ఈశ్వరశక్తి వ్యవహారమే కదా? అది ఎప్పుడు పుట్టింది? అంటే, ఈశ్వరసంకల్పం తోనే జనించింది. కాబట్టి సర్వం కర్మాయత్తమని తాత్పర్యం.

భగవానుడు కేవల దయాస్వరూపుడైనప్పుడు అతని శక్తి కార్యం కూడా దయాస్వరూపంగా ఉంటుదని, లోకంలో చూడనైన నిర్దయాత్మకకర్మములు ఈశ్వరకృత్యాలనటం ఎలా పొసగుతుందని శంకింపవచ్చును. ఈశ్వరమాయ రజస్తమోగుణాత్మికయై వర్తిల్లుతుంది. ఏ గుణం ఎప్పుడు వర్తిస్తుందో ఆ

గుణానికి తగిన కర్మము జరుగుతుంది. గుణవ్యవహార తారతమ్యాన్ని బట్టి కర్మతత్త్వతారతమ్యం, దానిని బట్టి ఫలభేదం కలుగుతుంటాయి. ఏకశక్తి యందు త్రివిధగుణాలు దేనికి కలగాలని శంకిస్తారు. శక్తియొక్క స్వభావమే అటువంటిది. అట్లా కానినాడు ఎటువంటి వ్యవహారానికీ తావులేదు. వ్యవహారమే లేనినాడు సృష్టి అన్నదే కలగదు. ఏమంటే శక్తివిస్తారమే కదా సృష్టి అనబడుతున్నది? ఆ శక్తి విస్తరించటమంటే దానియొక్క గుణాలు విస్తరించటమని భావం. ఆ గుణాలు ఒకదానితో ఒకటి వేర్వేరు గతులలో కలిసి విస్తరిస్తాయి. అటువంటి పలుతెరగుల కలయికల మూలాన వివిధ గుణరూప పదార్థాలు ఏర్పడుతున్నాయి. ఆ పదార్థాల వ్యవహృతిని బట్టి సృష్టివైచిత్రి, కర్మవైచిత్రి కలుగుతున్నాయి. ఆయా గుణాల స్వభావం ప్రకారం నడుచుకొనటం స్వధర్మమవుతుంది. దానికి మార్పాటు కలిగించటం విధర్మమవుతుంది. సృష్టించటం అసలెందుకని అడిగితే, ఏమో! ఆ రహస్యం సృష్టిస్వరూపిణివైన నీకే తెలియాలి.

తల్లీ! మూడు గుణాలలో సత్త్వము జ్ఞానసాధనమని, తక్కిన రెండిటినీ సంస్కరింపనిదే సత్త్వస్థితి యథాగతిని వర్తించి జ్ఞానయోగ్యతను కలిగింపదని, గుణసంస్కారానికి పూనుకొనటం విధర్మం కదా? అని శంకిస్తుంటారు. గుణసంస్కారం తప్పక జరగాలి. అయితే దానికోసం విచ్చలవిడిగా ప్రవర్తింపకూడదు. పద్ధతి ప్రకారం చేయాలి. ఆ విధంగా చేసినప్పుడది క్రమక్రమంగా శుద్ధిపొంది ఉత్తమస్థితిని గాంచుతుంది. ఆ చేయటాన్ని సత్కర్మమని అంటారు. దానికి విరుద్ధంగా చేయటం దుష్కర్మమని పేర్కొనబడుతుంది. ఆ దుష్కర్మఫలంగా దుఃఖాదులు, సంసారబంధనం కలుగుతున్నాయి.

తల్లీ! నీ శాపం నా యొక్క కర్మఫలం కనుక, దానిని నేను అనుభవిస్తే గాని అది నశింపదు కనుక నేను నిన్ను శాపమోక్షం ఇమ్మనటం లేదు. తల్లీ! ఏవో తెలిసీతెలియని మాటలన్నాను. నా అవినయాన్ని సైరించి నన్ను మన్నించు' అని పలికి నమస్కరించి విమానారూఢుడై వెళ్ళిపోయాడు.

## పరమేశ్వరుని సమాధానం

పరీక్షిన్నరేంద్రా! చిత్రకేతువు వచనాలు పార్వతికి మహాశ్చర్యాన్ని, కలిగించాయి. మహేశ్వరుడా సంగతి గ్రహించి, 'ప్రేయసీ! హరిభక్తు లెంత ధీరులో చూశావు కదా? నారాయణపరులు దేనికీ భయపడరు. వారికి స్వర్గాపవర్గాలూ నరకమూ అన్నీ ఒకటే.

కళ్యాణీ! దేహికి దేహసంబంధంతో పాటు ద్వంద్వాలు వస్తాయి. దేహిదేహాల సంయోగానికి కారణమేమిటి? భగవల్లీలయే కారణం. ద్వంద్వములు దేహి సంబంధములా? లేక దేహ సంబంధములా? అని అడిగితే, అవి దేహ సంబంధాలే కాని దేహి సంబంధాలు కావు. అయితే వాటిని దేహి సంబంధాలుగా భావిస్తుంటారు. వాస్తవస్థితి తెలియకపోవటమే అందుకు కారణం. అదే అజ్ఞాన మనబడుతున్నది. రజ్జుసర్పన్యాయమే అందుకు నిదర్శనం.

ప్రేయసీ! ఈ భ్రాంతి తొలగాలంటే మార్గం లేకపోలేదు. దీపపు కాంతివలన రజ్జుసర్పభ్రాంతి ఎట్లా తొలగుతున్నదో అట్లాగే జ్ఞానప్రకాశం వలన భ్రాంతి నశిస్తుంది. దైవభక్తి ఫలంగా అటువంటి జ్ఞానం ఉదయిస్తుంది.

> పార్వతీ! భక్తి అన్నది ప్రేమస్వరూపం. ప్రేమించాలనుకొనేవారికి ప్రేమింపబడే వస్తువు యొక్క తత్స్వరూపగుణాల యొక్క జ్ఞానం సంపూర్ణంగా కలగాలి. భగవానుని ప్రేమించాలంటే అతని స్వరూపగుణాలు ఎటువంటివో తెలియాలి. అయితే భగవత్స్వరూపం ఎట్టిదో కళ్ళారా చూసినవారు లేరు. నీకు తెలియదా? అని అడుగుతావేమో. నేను గాని బ్రహ్మ గాని సనత్కుమారాదులు గాని ఎరుగము. కారణమేమంటావా? భగవత్స్వరూపం కేవల చిన్మాత్రమైనది. అది సూక్ష్మాతిసూక్ష్మం. దేహధారులందరూ వస్తువును వారి ఇంద్రియశక్తి వలన గ్రహింపగలుగుతారు. సూక్ష్మాతిసూక్ష్మ తత్త్వగ్రహణానికి

ఇంద్రియశక్తి చాలదు. మేమూ అటువంటి దేహధారులమే కనుక ఇంద్రియాలకు గోచరించిన అతని విభూతులను మాత్రమే చూడగలిగాము. ఈ మాటకు తార్కాణమేమంటావా? కలకండ రుచిలో మాధుర్యమున్నది. ఆ మాధుర్యం స్వరూపాన్ని చెప్పగలవా? దేనితోనో పోల్చిచెప్పవచ్చును గాని అది నిజంగా ఆ తీయదనాన్ని రుచిచూసినట్లు కాదు. అందుచేత ఆ మాధుర్యవిభూతి అయిన కలకండను సంపాదించి దాని రుచిచూసి మాధుర్యతత్త్వాన్ని గ్రహింపమని మాత్రమే మనము చెప్పగలము. భగవద్విషయం కూడా అటువంటిదే. భగవంతుడు సర్వకళ్యాణగుణమూర్తి. అతను సర్వభూతప్రియుడై సర్వాత్మునిగా ఉన్నవాడు.

ఈ చిత్రకేతువు సంగతి ఏమంటావా? ఇతను భగవద్భక్తులకు భక్తుడై వర్తించాడు. తత్ఫలంగా అతనికి శాంతి, సమదృష్టి సిద్ధించాయి. అందువల్ల అతను నీ శాపానికి కలవరపడడు. భగవద్భక్తులందు ఇది వింత కాదు. ఇంతెందుకు? నేను కూడా ఆ అచ్యుత ప్రియుడనై వర్తిస్తాను సుమా!' అని పలికి ఆమెను సమాధానపరిచాడు.

రాజేంద్రా! చిత్రకేతువుకు ప్రతిశాపం ఇచ్చే శక్తి ఉన్నది. అంతటివాడయితే ప్రతిశాపం ఎందుకివ్వలేదని అడగవచ్చు. అదే కదా సాధుజన పరమలక్షణం!

## చిత్రకేతుని పునర్జన్మ

నరేంద్రా! ఆ చిత్రకేతువే పార్వతీశాప ఫలంగా వృత్రాసురుడై జనించాడు. వృత్రాసురుని చరిత్ర విన్నావు కదా!

రాజా! ఈ ఇతిహాసం విష్ణుభక్తి ప్రభావాన్ని చాటిచెబుతుంది. దీనిని ప్రతిదినం ప్రాతఃకాలాన శ్రద్ధావాఙ్నియమవంతులై పఠించేవారు హరిస్మరణపరులై బంధవిముక్తి కలిగి పరమగతిని చూరగొంటారు.

## సవిత్రాదుల వంశం

సవితృనికి పృశ్నియందు సావిత్రి, వ్యాహృతులు ముగ్గురు, అగ్నిహోత్ర పశు సోమాలు, చాతుర్మాస్య పంచమహాయజ్ఞాలు ప్రభవించి అచిరకాలంలో అతను ముక్తిపదాన్ని చేరుకొన్నాడు. భగునికి సిద్ధి యందు మహిముడు, విభుడు, ప్రభుడు అని ముగ్గురు కొడుకులు ఆశీస్సనే పేరిట ఒక కుమార్తె జన్మించారు. ధాతకు కుహువు, సినీవాలి, రాక, అనుమతి అని నలుగురు భార్యలుండేవారు. వారిలో కుహువుకు సాయంకాలుడు, సినీవాలికి దర్శనుడు, రాకకు ప్రాతఃకాలుడు, అనుమతికి పూర్ణమాసులు జన్మించారు. విధాతకు క్రియ అనే భార్యయందు చిత్యగ్నులు, పురీషులని అయిదుగురు పుట్టారు. వరుణునికి చర్షిణి యందు పునర్జన్ముడై భృగువు, వల్మీకమందు వాల్మీకిమహర్షి ఉదయించారు. మిత్రునికి దేవకి వలన ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు పుట్టారు. ఒకప్పుడు మిత్రావరుణు లిద్దరూ ఏకకాలంలో ఊర్వశిని కామించారు. ఆ ఇరువురికి ఏకకాలంలో రేతస్సు స్రవించింది. ఆ రేతోరాశిని కలశంలో ఉంచారు. అందుండి వసిష్ఠుడు, అగస్త్యుడు ఉద్భవించారు. వారిరువురూ కలశం నుంచి పుట్టినందువల్ల వారికి కలశసంభవులని, మైత్రావరుణులని పేరు వచ్చింది. ఇంద్రునికి పౌలోమి యందు జయంతుడు, ఋషభుడు, విద్వాంసుడు ప్రభవించారు. మాయావామనుడైన ఉరుక్రమునికి కీర్తి యందు బృహచ్ఛ్లోకులు, సౌభగాదులు కలిగారు. కాశ్యపునికి అదితి యందు వామనమూర్తి ఉదయించాడు. వామనచరిత్ర తర్వాత చెబుతాను.

## దితి సంతానం

దితి కాశ్యపుని వలన హిరణ్యకశిప హిరణ్యాక్షులను గన్నది. హిరణ్యకశిపుడు జంభుడనే దానవుని పుత్రికను కయాదువును పెండ్లాడి ఆమె వలన ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అని నలుగురు కొడుకులను, సింహిక అనే కుమార్తెను పొందాడు. సింహికను విప్రచిత్తి పెండ్లాడాడు. వారికి రాహువు పుట్టాడు. ఆ రాహువు దొంగతనంగా సురలతో

అమృతాన్ని త్రాగబోయాడు. అప్పుడతని తలను హరి తన చక్రాయుధంతో ఖండించాడు.

అనుహ్లాదుడు ఊర్మ్య వలన బాష్కల మహిషులను గాంచాడు. సంహ్లాదుడు గతివలన పంచజనుడనే కొడుకును కన్నాడు. హ్లాదునికి దమని వలన వాతాపి, ఇల్వలుడు కలిగారు.

ప్రహ్లాదునికి విరోచనుడు, అతనికి బలి పుట్టారు. బలి అశనను పెండ్లాడి ఆమెయందు బాణుడు మొదలైనవారిని నూరుగురు కొడుకులను కన్నాడు. బలి ప్రభావం ఏమని చెప్పను? అతని మునివాకిట హరి ఇప్పటికీ ద్వారపాలకుడై నిలిచి ఉన్నాడంటే అతని ప్రభావం ఎంతటిదో ఊహించు. బలి చరిత్రను ప్రత్యేకించి నీకు తర్వాత చెబుతాను. బాణుడు శంకరుని ఆరాధించి ఈశ్వరగణముఖ్యు డయ్యాడు. రాజా! దితికి హిరణ్యకశ్యపాదులే కాక మరుత్తు లనేవారు నలభై తొమ్మిది మంది జన్మించి ఇంద్రసారూప్యాన్ని పొందారు. వారికి సంతానం కలగలేదు.

## సప్తమరుద్గణ జననం

మునులారా! పరీక్షిత్తు శుకయోగిని విని, 'మునివర్యా! మరుత్తులు పుట్టుకను బట్టి అసురులు. అసురులకు సురలకు ఎప్పుడూ వైరమే కాని పొత్తు కుదిరినట్లు కనిపించదు. మరుత్తులు ఏ తీరున ఇంద్రసారూప్యాన్ని గడించారు? వారేమి పుణ్యం చేసి ఆ పదవిని సాధించారు? ఈ సందేహం నాకు మాత్రమే కాదు. ఈ సభ నలంకరించి ఉన్న మునులకు సయితం కలిగింది' అని అడిగాడు. ఆ నరేంద్రుని వచనం మితాక్షరమైనా అమితార్థవంతం అయినందువల్ల శుకుడు అతనితో ఈ విధంగా అన్నాడు:

'నరేంద్రా! ఇంద్రుడు దితి కొడుకులను చంపిన సంగతిని విన్నావు కదా. పుత్రశోకం దితి హృదయాన్ని కలచివేయసాగింది. ఆమె కొడుకులను తలచుకొని గుండె నీరు కాగా, 'నా సుతులు ఇంద్రునికి అన్నదమ్ములవుతారు. ఆ సంగతి కూడా గణింపక అతను వారిని చంపాడు. ఇంతకన్న క్రూరుడు,

కఠినశిలాహృదయుడు ఉంటాడా? ఈ పాపాత్ముడు మన్నంత కాలం నాకు కంటికి నిద్రరాదు. శరీరం ఎప్పుడో ఒకనాడు మట్టి పాలో అగ్గి పాలో కాక మానదు. ఈ విధికి పదవు లెన్నడూ అడ్డుపడబోవు. తుచ్ఛమైన శరీరప్రీతి కోసం ఎంతటి భూతద్రోహానికైనా వెనుదీయకుండటం మూఢబుద్ధులకు చెల్లవచ్చునేమో గాని సురరాజైనవాడికి తగిన పనేనా? తెలిసి ఇంతటి ఘోరానికి ఒడిగడతాడా? అవును లే. ఇంద్రియపరత్వం ఎంతటివారినయినా వదలదు. అందులోనూ దుర్మతి దేనికైనా తెగిస్తాడు. ఇంద్రుడిటువంటి మదవశుడై కన్నూ మిన్నూ కానరాకుండా ప్రవర్తించాడు. అతని మదాన్ని అణగద్రొక్కాలి. ఆ మదం సురరాజపదవి వల్ల వచ్చింది. ఆ పదవిని తొలగిస్తే కాని ఇతను ఒళ్ళుతెలిసి ప్రవర్తించడు. వీడిని కాలదన్నే మహావీరుడిని సుతునిగా పొందుతాను గాక. ఈ కోర్కె నెరవేరటానికి నాకు నాథుడే శరణం' అని నిశ్చయించి కశ్యపుని నిండారిన ప్రేమభావంతో భక్త్యనురాగాలతో పరిచరిస్తూ స్మేరకటాక్షవీక్షణమృదుభాషణలను నెరపుతూ ఆయన మనసుకెక్కే రీతిని వర్తింపసాగింది.

## స్త్రీ నిర్మాణం

రాజేంద్రా! భూతజాతం తొలుత నిస్సంగబుద్ధితో వర్తిల్లుతుండేది. అందువల్ల ప్రజావృద్ధి కలుగలేదు. పరమేష్ఠి అది గ్రహించి పురుషుల చిత్తాన్ని హరించేందుకు తన దేహార్థం నుంచి స్త్రీ మూర్తిని నిర్మించాడు. అది మొదలు పురుషుల నిస్సంగబుద్ధి పట్లు సడలింది. వారు స్త్రీవశులయ్యారు. దానితో ప్రజాసర్గం వృద్ధిగాంచింది.

## దితికి వరదానం

దితి ఈ విధంగా కశ్యపుని మనసెరిగి నడుచుకొంటూ సమయం వేచి ఒకనాడు పతిని సమీపించి, 'నాథా! నాకొక కోరిక కలిగింది' అని విన్నవించుకొన్నది. కశ్యపు డా మాటకు నవ్వుతూ, 'కాంతామణీ! పతి ప్రేమను విలిచిన సతికి పొందరాని కోరిక ఉన్నదా? సతికి పతియే పరమదైవం. సతుల

భక్తికి పతుల భక్తికి ఎంతో అంతరువు కనిపిస్తుంది. పురుషులు భగవానునికి నానారూపాలను వికల్పించి ఆయా రూపాలలో ఆరాధిస్తారు. సతులు పతిరూపాననే ఆ భగవంతుని అనన్యభావంతో భజిస్తారు. అందువలన వారి భక్తి పూర్ణభక్తి కాదగి ఉన్నది. నీవు నన్నటువంటి భక్తియోగాన పూజించావు. నీ వర్తన నా మనస్సును చూరగొన్నది. నీ యెడ ప్రీతి కలిగింది. నీ ఇచ్ఛవచ్చిన కోరికను కోరవచ్చును. తప్పక తీరుస్తాను' అన్నాడు.

దితి అందుకు ఎంతో సంతోషించి, 'మహాత్మా! మీరు సంకల్పిస్తే దుర్లభమైనది లేదు. నా కొడుకులను ఇంద్రుడు చంపిన సంగతి ఈనాటిది కాదు. ఆ దుఃఖం నన్ను కలచివేస్తున్నది. ఇంద్రునికి అదే గతి పట్టినంతదాకా నా దుఃఖం తీరదు. అందుకు సమర్థుడైన ఒక్క కుమారుని నాకు అనుగ్రహించండి' అని కోరింది.

## కశ్యపుని ఆత్మనింద

రాజా! ఆ మాట చెవిసోకినంతనే కశ్యపుడు చింతాక్రాంతుడై, 'ఔరా! స్త్రీ రూపమాయకు చిక్కిన తర్వాత నిరయం తప్పదు. ఇందుకు స్త్రీ లను నిందించటం తగదు. వారు వారి స్వభావాన్ని అనుసరిస్తారు. ఇంద్రియారాముడనై నేను చెడ్డాను. ఇది నాకు స్వకృతాపరాధఫలం. స్త్రీల స్వభావం స్వార్థాన్ని తప్ప వేరొకటి తలపదు. ఆత్మార్థం వా రెంతటికైనా సాహసింపగలరు. స్త్రీ సాహసం అని అననే అన్నారు. రజోగుణం స్త్రీ రూపు దాల్చింది. ఆ స్వభావం వారికి పుట్టుకతో వచ్చింది. వారు మాత్రం ఏమిచేయగలరు? మాట యిచ్చాను. తప్పించుకొనే వీలులేదు. ఇంద్రహననానికి గత్యంతరం లేదా?' అని కొంతసేపు తనలో తాను వితర్కించుకొన్నాడు.

## పుంసవన వ్రతోపదేశం

కశ్యపుడది ఆలోచించి, చివరికి ఒక నిశ్చయానికి వచ్చి, 'కళ్యాణీ! నీ కోరికను తీర్పగల ఒక వ్రతం ఉన్నది. దానిని ఉపదేశిస్తాను. ఆ వ్రతాన్ని ఒక

యేడాదికాలం నియమానుసారం జరపాలి. నీవు కోరిన సుతుడు నీకు కలుగుతాడు. వ్రతాచరణలో ఎటువంటి లోపమూ కలుగకూడదు. పొల్లుపోయిందో నీ సుతుడు సురవైరి కాకపోగా పైగా అతనికి మిత్రుడవుతాడు' అని పలికాడు. దితి ఆ పలుకులు విని చేతులు జోడించి 'బ్రహ్మర్షివర్యా! మీ ఆనతి జవదాటను. వ్రతానుష్ఠానమప్పుడు కర్తవ్యాలేమిటో నిషేధాలేమిటో వ్రతహానికరాలేమిటో సెలవీయండి' అని అడిగింది.

## పుంసవన వ్రత నియమాలు

కశ్యపు డా మాట విని, 'కళ్యాణీ! వ్రతకాలంలో ఏ ప్రాణికీ ఏలాటి హింసనూ చేయకూడదు; అసత్యం పలుకకూడదు; నఖాలను రోమాలను ఛేదింపకూడదు; అమంగళద్రవ్యాలను తాకకూడదు; నీటిలో మునిగి స్నానమాడరాదు; విడిచిన చీర కట్టకూడదు; వాడిన పూలు ముడువకూడదు; మాంసాన్ని, శూద్రులు తెచ్చిన అన్నాన్ని, రజస్వల దృష్టిపారిన అన్నాన్ని భుజింపకూడదు; దోసిటబట్టి నీరు త్రాగకూడదు; ఉచ్ఛిష్టస్పర్శ కలిగితే వెంటనే జలప్రక్షాళనం చేయాలి; ముడివీడిన వెంట్రుకలతో తిరుగకూడదు; అలంకారరహితంగా ఉండకూడదు; మొండిమొలతో ఉండకూడదు; ఇరుసంధ్యలలో బయట సంచరింపకూడదు; అలుక వహింపకూడదు; దుర్జనులతో మాటాడకూడదు; మౌనం ధరించాలి; ఇక పాదప్రక్షాళన చేసికొనకుండటం, శుచితప్పి చరించటం, తడిబట్ట కట్టుకోవడం, పశ్చిమోత్తరదిశల తలపెట్టి పరుండటం, ఇతరులతో కూడి పరుండటం, సంధ్యా సమయాలలో శయనించటం – ఇవేవీ తగవు.

కళ్యాణీ! నిషిద్ధాలను చెప్పాను. ఆచరణీయాలు విను. సూర్యోదయవేళకు లేచి దినకృత్యాలు తీర్చి జలకమాడి శుచియై సర్వ మంగళ చిహ్నాలను ధరించి గోబ్రాహ్మణులను లక్ష్మీనారాయణులను పూజించి సువాసినులను గంధపుష్పాలంకృతుల చేత అర్చించి పతిని బహిరంతర్భూతునిగా ఆరాధించి పతి భుజించిన తర్వాత తాను భుజించాలి.

ప్రేయసీ! ఈ వ్రతాన్ని పుంసవనమని అంటారు. దీనిని సంవత్సర పర్యంతం జరిపితే నీవు కోరిన సుతుడు ఉదయిస్తాడు' అని చెప్పాడు. దితి ఆ ఉపదేశాన్ని శిరసావహించి నిండుమనస్సుతో వ్రతం మొదలుపెట్టింది.

## ఇంద్రుని పన్నాగం

రాజా! ఆ సంగతి ఇంద్రునికి తెలిసింది. అతను తహతహలాడి, 'అయ్యయ్యో! ఈ వ్రతం కొనసాగితే నాకు ముప్పు తప్పదు. ఎలాగైనా దీనికి భంగం కావించాలి. ఏమిచేస్తే బాగుంటుంది?' అని కొంతసేపు ఆలోచించి, కృతనిశ్చయుడై మారువేషంలో దితిని చేరి అనుదినం సకాలంలో ఫలపుష్ప మూలాలను, నిత్యపూజకు కావలసిన సమస్తద్రవ్యాలను వనాంతరాల నుంచి సంతరించి తెచ్చిపెడుతూ, సర్వ సంభారాలనూ సమకూర్చుతూ ఆమెకు పరిచర్యలు చేస్తూ ఆమె వ్రతలోపానికోసం ఎదురుచూస్తూ లేడి కొరకు వేచిన బోయలాగా పొంచి ఉన్నాడు. దినాలు గడిచిపోతున్నాయి; నెలలు దాటి పోయాయి. ఇంద్రునికి ఎందులోనూ సందుచిక్కలేదు. చింతాపరితాపాలు నానాటికీ ఎక్కువ కాసాగాయి.

## దితి గర్భభేదనం

దితి కూడా పట్టుదలతో వ్రతనియమాలను తప్పక నెలల తరబడి ఆచరించినందువల్ల చిక్కి సగమయింది. ఒకనాడామె పరాకున ఎంగిలి ముట్టి పాదప్రక్షాళన చేసికొనటం మరిచి అలసటతో మేనువాల్చి మైమరిచి నిద్రపోయింది. వ్రతారంభం నాటికి ఆమె గర్భవాసాన పిండం ఉద్భవించి క్రమంగా పెరుగుతూ వస్తున్నది. ఇంద్రుడా నియమభంగం సందుచూసుకొని ఆత్మయోగమాయాబలంతో ఆమె గర్భాన్ని ప్రవేశించి అందులో పిండాకృతిలో ఉన్న శిశువును తన వజ్రాయుధంతో ఏడు ముక్కలు చేశాడు. ఆ ఖండాలు గర్భంలో ఎలుగెత్తి రోదింపసాగాయి. ఇంద్రుడా తునియలను 'మా రుద! మా రుద!' అని సముదాయిస్తూ ఒక్కొక్క దానిని మళ్ళీ ఏడేసి ముక్కలుగా నరికాడు.

రాజా! 'మా రుద' అంటే ఏడవకు అని అర్థం. ఇంద్రుడు ఆ విధంగా గర్భస్థపిండంతో మాట్లాడినందువల్ల వాటికి మరుత్తులని పేరువచ్చింది. ఆ మరుత్తులు వజ్రాయుధం వేటులకు నొచ్చుకొని కేలుమోడ్చి 'ఇంద్రా! మేము నీకు తమ్ముళ్ళము. మమ్మల్నెందుకు చంపుతావు?' అని మొరపెట్టుకొన్నారు. అంతట సురపతి ఆ ఖండనకృత్యాన్ని మాని, 'తమ్ములారా! భయపడకండి. అనన్యభావులై మీరు నా పార్షదులవుతారు గాక! మిమ్మిక మరుద్గణమని పిలుస్తారు' అని పలికి వారిని సముదాయించాడు.

రాజేంద్రా! ఖడ్గఖండితులు బ్రతకటం సాధ్యమా? అని అడుగుతావేమో. వాసుదేవుని కరుణ కలిగితే అసాధ్యం ఏముంటుంది? అశ్వత్థామ యొక్క బ్రహ్మాస్త్రం నుంచి నువ్వు బతకలేదా? అలాగే మరుత్తులు కూడా భగవత్కరుణ వలన జీవించారు. దితి అంతటి కఠినవ్రతం పూని తదేకచిత్తంతో సంవత్సరపర్యంతం కావించిన పూజాఫలం రిత్తపోతుందా?

## ఇంద్రుని ప్రార్థన

రాజా! దితి కొంతసేపటికి మేలుకొని ఇంద్రునితో కూడి అగ్నుల వలె తేజరిల్లుతూ తన మ్రోలనున్న పసికందులను చూసుకొని సంతోషించి, 'ఇంద్రా! అదితి సంతతికి కీడుచేయజాలిన సుతుడొక్కడిని కోరి దుశ్చరమైన ఈ కఠోరవ్రతాన్ని ఆచరించాను. వీరెవరో నలభైతొమ్మిదిమంది నీ వెంటనున్నారు. నిజం దాచక ఏమి జరిగినదీ వివరంగా చెప్పు' అని అడిగింది.

ఇంద్రుడు సవతి తల్లికి మొక్కి 'అమ్మా! నీ నిశ్చయం నాకు తెలిసింది. రానున్న ముప్పును తప్పింపగోరి ఉపాయం పన్ని నీ కడచేరి నిన్ను సేవిస్తూ కాచుకొని ఉన్నాను. నీవు ఎంగిలిని తాకి పరాకున పాదప్రక్షాళన మరిచి నిద్రించావు. అది నిమిత్తంగా నేను నీ గర్భాన్ని ప్రవేశించి అందులో ఉన్న పిండాన్ని మొదట ఏడు ముక్కలు చేసి మళ్ళీ ఒక్కొక్క దానినీ ఏడేసి ముక్కలు చేశాను. ఆ నలభైతొమ్మిది శకలాలు చావక నీ గర్భం వెలువడి వచ్చాయి. ఆ తునకలే ఈ నలభైతొమ్మిది మందీ. వీరు చావకపోవటానికి నీవు కావించిన

పరమపూరుష పూజావిశేషమే కారణమనుకొంటాను.

తల్లీ! మోక్షఫలమైనా కోరక పరమాత్ముని భజించేవారే ఉత్తములు. విషయభోగాలు నరకప్రాపకాలు మాత్రమే. అటువంటి తుచ్ఛభోగాలను కోరి ఆ మహాత్ముని భజించేవారుంటారా? అమ్మా! నేను చేసినది మూఢబుద్ధికృతమే గాని నీకు అపకారం చేయాలని కాదు. నా కుత్సితాన్ని మన్నించు. నీ గర్భం మృతప్రాయమైనది, నీ భాగ్యవశాన మళ్ళీ ప్రాణం పోసుకొన్నది' అన్నాడు.

దితి ఇంద్రుని శుద్ధభావానికి మెచ్చి 'నాయనా! పోయిరావయ్యా' అన్నది. అతనామెకు నమస్కరించి ఆ మరుత్తులను వెంటగొని స్వర్గానికి వెళ్ళిపోయాడు. మరుత్తులు త్రిదివాలయంలో ఇంద్రునికి పార్షదులై సోమపానాధికృతులయ్యారు.

## పుంసవన విధానం

రాజా! ఈ వ్రతాన్ని మార్గశీర్ష శుక్ల పాడ్యమి నాడు ప్రారంభించాలి. వ్రతోద్యమానికి ముందుగా ఇల్లాలు పతి అనుమతిని తీసుకోవాలి. పతి ఆజ్ఞను పొందిన పిమ్మట మార్గశీర్ష శుక్ల పాడ్యమినాడు తెల్లవారుజామున లేచి ఈ మరుజ్జన్మచరిత్రను విని బ్రాహ్మణులను నిమంత్రించి దంతధావన స్నానాదులు ముగించుకొని శుచియై తెల్లని వస్త్రాన్ని ధరించి సాలంకృతగా ప్రాతరాహారానికి పూర్వమే శ్రీ మహాలక్ష్మీసహిత శ్రీ మహావిష్ణువును పూజించాలి.

## పూజోపక్రమం

రాజా! పూజ మొదలుపెట్టే ముందు శ్రీ లక్ష్మీనారాయణులకు మ్రొక్కి నిలిచి 'పూర్ణకామా! నిరపేక్షకా! సిద్ధసంకల్పా! లక్ష్మీనాథా! ఇదే నీకు నమస్కారం. దేవా! కృప, భూతి, తేజస్సు, సహస్సు, ఓజస్సు, సత్యసంకల్పాదులు ఈశ్వరుని గుణాలు. అవి నీ యందు పూర్ణములూ, శాశ్వతములూ కనుక నిన్ను భగవంతుడని అంటారు.

'దేవీ! లక్ష్మీ! విష్ణుపత్నీ! మహామాయాస్వరూపిణీ! మహాపురుష లక్షణోల్లాసినీ! ప్రియధామమహాభాగాతిశాయినీ! లోకజననీ! ఇదే నీకు నమస్కారం.'

అని స్తుతించి ఆ స్తుతివచనాల భావాన్ని మనసారా చింతించాలి. తర్వాత 'ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ మహావిభూతిపతయే సహ మహావిభూతిభి ర్బవి ముపహరాణి' అనే మంత్రాన్ని జపించాలి. ఈ మంత్రాన్ని పూట పూట జపించాలి.

ఆ తర్వాత శ్రీ మహావిష్ణువుకు ఆవాహనం, ఆసనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనీయం, స్నానం, వస్త్రం, ఉపవీతం, భూషణం, గంధం, పుష్పం, ధూపదీపనైవేద్యాదులతో యథావిధి సమాహితపూర్వకంగా ఉపచారాలు చేయాలి. తర్వాత నివేదితశేషాన్ని వహ్నిముఖాన పన్నెండాహుతులు వేల్చాలి. వేల్చేటప్పుడు 'ఓం నమో భగవతే మహాపురుషాయ మహావిభూతయే స్వాహా' అని మంత్రాన్ని జపించాలి.

పూజానంతరం భక్తినమ్రహృదయ పూర్వకంగా సాష్టాంగప్రణామం కావించి పై మంత్రాన్ని పదిసార్లు జపించి లేచి ఈ విధంగా స్తోత్రపఠన చేయాలి.

'జగన్మాతాపితలారా! ఈ విశ్వానికి మీరిద్దరే పరమకారణములు, ఈశ్వరులు అయినవారు. తల్లీ! లక్ష్మీ నీవు సూక్ష్మప్రకృతివి, అనుల్లంఘనీయ మాయాశక్తివి అయినదానవు. తండ్రీ! నారాయణా! ఈ దేవికి నీవు సాక్షాదీశ్వరుడవు. ఈ తల్లి యజ్ఞ లౌకికక్రియ తానై ఉండగా; నీవు ఫలభోక్తవైనావు. సర్వయజ్ఞాత్మకా! ఈ తల్లి గుణవ్యక్తి కాగా; నీవు వ్యంజకుడవై ఫలాన్ని భోగిస్తావు. ఈ తల్లి శరీరుల యొక్క ఇంద్రియాలను ఆశ్రయించుకొని ఉంటుంది. నీవు ఆ శరీరాలకు అంతర్వర్తియై ఆత్మరూపాన ఉంటావు. ఈ మహాశక్తి నామరూపాల పరిణామాన్ని పొందుతుంది. నీవు ఉపాశ్రయుడవై వాటిని ప్రకాశింపజేస్తావు. మీరిద్దరూ ముల్లోకాలకూ వరాలను

అనుగ్రహిస్తారు. పుణ్యశ్లోకా! ఈ సత్యానసే మా ఈప్సితాలు సత్యము లగుగాక!' అని ప్రస్తుతించి నివేదనాన్ని తొలిగించి ఆచమనీయం సమర్పించి నిండుభక్తితో వారిని వివిధ స్తోత్రాలతో ఆరాధించి నివేదిత శేషాన్ని ఆఘ్రాణించి మళ్ళీ పూజించాలి. అటుపిమ్మట వ్రత పరాయణురాలైన సతి తన భర్తను పరమేశ్వరభావంతో పూజించి కర్తవ్యోపచారాలను కావించాలి. భర్త తన సతిని నిజప్రేమమూర్తినిగా పాటించాలి.

ఇలా ఒక సంవత్సరం వ్రతాన్ని ఆచరించి, మరుసటి కార్తికమాసాన కడపటి దినం వేకువనే లేచి స్నానశౌచాదులు తీర్చి పాయసాన్నాన్ని నేతితో కలిపి పార్వణ స్థాలీపాకవిధంగా పన్నెండాహుతులు వేల్చి పన్నెండుగురు బ్రాహ్మణులకు మృష్టాన్నభక్ష్యభోజ్యాది పూర్వకంగా సంతర్పణ కావించి తిలోదఘటగోవుల నర్పించి ప్రీతిగొలిపి వారు ప్రేమపూర్వకంగా ఇచ్చిన ఆశీర్వచనాలను తలదాల్చి వారికి మొక్కి వారి అనుజ్ఞను పొందాలి. తర్వాత భర్తను ఆచార్య బంధువులపంక్తిలో భుజింపచేయాలి. చివరిగా చరుశేషాన్ని భార్య సేవించాలి.

ఈ వ్రతాన్ని సతీపతు లిద్దరూ ఆచరింపవచ్చును. ఇద్దరికీ వీలుకాకపోతే వారిలో ఎవరైనా ఆచరింపవచ్చును. పురుషుడు అనుష్ఠించినట్లయితే అతనికి అభీష్టార్థాలు సిద్ధిస్తాయి. భార్య అనుష్ఠించితే ఆమెకు సిరిసంపదలు సంతానసౌభాగ్యాలు సౌమంగళ్యం సద్గుణసత్కీర్తులు కలుగుతాయి. కన్య అనుష్ఠించితే సర్వలక్షణసంపన్నుడైన భర్త లభిస్తాడు. విగతభర్తృక అనుష్ఠించితే పుణ్యగతులు కలుగుతాయి. మృతసంతానవతి అయిన స్త్రీ అనుష్ఠించితే జీవత్పుత్రులను పొందుతుంది. ధనవంతురాలైనా కర్మవశాన దౌర్భాగ్యానికి లోనైన స్త్రీ అనుష్ఠించితే సౌభాగ్యవతి అవుతుంది. జాడ్యగ్రస్తురాలై విరూపి అయిన స్త్రీ అనుష్ఠించితే ఆరోగ్యవతియై సుఖంగా ఉంటుంది. భర్త రోగంచేత బలహీనుడయితే ఇంద్రియపాటవాన్ని దేహదార్ఢ్యాన్ని పొంది భోగింపగలుగుతాడు.

రాజా! దీనిని అభ్యుదయకాలాలలో పఠించితే దేవ పితృదేవతలకు పరమతృప్తి కలుగుతుంది. ఈ మహామంత్ర హోమాంతంలో అగ్నిదేవుడు, శ్రీమన్నారాయణుడు ప్రీతులై ఇష్టార్థాలను సంతోషంగా ప్రసాదిస్తారు. రాజా! నీవడిగిన అర్థాన్ని విశదంగా చెప్పాను. సావధానంగా విన్నావు కదూ!' అన్నాడు.

# సప్తమ స్కంధం

## భగవంతునికి రాగద్వేషాలు

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకయోగి వచనాలను పర్యాలోచించి, 'మునిచంద్రమా! భగవానుడు సాక్షాత్పరమానంద స్వరూపుడు, నిఖిలభూతప్రియుడు, సుజన సుహృత్తు అయినవాడని, భగవంతునికి అందరూ సములే అని చెప్పారు. ఋషివర్యా! ఒకరిని దగ్గరకు చేర్చుకొనటం రాగకార్యం. ఒకరిని చంపటం లేదా చంపించటం, కీడుచేయటం ద్వేషకార్యమవుతుంది. భగవానుడు ఇంద్రుని చేరదీసి అతనికోసం అసురులను సంహరిస్తే అందులో రాగద్వేషలక్షణాలు లేవా? ఆ విధంగా వ్యవహరించిన వాడు రాగద్వేషరహితుడు, నిఖిలభూతప్రియుడు, సర్వసమభావనుడు ఎలా అవుతాడు?

ఇంకొకటి. ఒకరివలన ఏదైనా ఫలాన్ని అపేక్షించినప్పుడు వారి యెడ రాగం జనిస్తుంది. అలాగే ఒకరి వలన ఏదైనా అపకారాన్ని శంకించినప్పుడు వారి పట్ల ద్వేషం పుట్టుకొస్తుంది. భగవానుడు సర్వ సంపూర్ణుడు. అతనికి కోరదగినది పొందతగినది అంటూ లవలేశమైనా ఉండదు. ఆ ఘనుడు లోకైక నాథుడు కనుక అతనికి ఎవ్వరివల్లనూ భయం కలగదు. ఆ పరమాత్ముడు సురల వల్ల ఏ అర్థాన్ని అపేక్షించి వారిని చేరదీశాడు? అసురుల వల్ల ఏ భయాన్ని శంకించి వారియెడ పగబూనాడు?

## సుఖదుఃఖాలకు కారణం

సమస్తజీవరాశి యొక్క సుఖదుఃఖాలకు వారి సుకృత దుష్కృతకర్మలే కారణమని, కర్మఫలాన్ని మాత్రమే భగవానుడు నియమిస్తాడని ఎన్నోసార్లు చెప్పారు. కర్మమంటే గుణవ్యవహారఫలం. గుణము ప్రత్యేకించి కారణమవుతుందా? లేక కర్మము ప్రత్యేకించి కారణమవుతుందా? కాకపోతే రెండూ కలిసి నిమిత్తాలుగా వ్యవహరిస్తాయా? కర్మములు మాత్రమే కారణాలని గుణములు హేతువులని అంటారా? లేక గుణములు మాత్రమే నిమిత్తాలని, కర్మములు గుణాల వ్యక్తరూపాలు మాత్రమేనని అంటారా?' అని అడిగాడు.

శుకమహర్షి సావధానంగా విని, 'రాజా! సంకల్పం తోనే కర్మము ప్రారంభిస్తున్నది. దానికి గుణాలు నానాత్వాన్ని కలిగిస్తున్నాయి. గుణాలను బట్టి ఫలనానాత్వం కలుగుతున్నది. సంకల్ప మనగానే అది ఆరంభకమైన ఫలవాసనా రూపంలో ఉదయిస్తుంది. కాబట్టి భోగ్యవాసనలే కర్మ ప్రారంభకాలన్నమాట. సంకల్పం ముందా? వాసన ముందా? అన్న ప్రశ్న చెట్టు ముందో విత్తు ముందో చెప్పమన్నట్లుగా ఉంటుంది' అన్నాడు.

దానికి పరీక్షిత్తు శ్రద్ధగా వింటున్నవాడు వెంటనే, 'మునీంద్రా! రాగద్వేషాలు రజోగుణసముద్భవాలని, రాగద్వేషవంతులకు శాంతి చేకూరదని, శాంతి లేనినాడు ఆనందం సిద్ధింపదని అంటారు. మరి భగవానుడు నిరంతరానందమూర్తి అన్నారు. ఈ రెంటికీ సమన్వయం ఏమిటో బోధపడదు' అన్నాడు.

శుకుడు దానికి సమాధానం చెప్పాడు. 'రాజా! ఇవన్నీ గుణవశులకు వర్తించే మాటలు. భగవానుడు గుణాతీతుడు కాబట్టి అతనియెడ గుణకార్యాలు వర్తింపవు. పైగా రాగద్వేషాదులు వర్తించాలంటే తత్సాధనభూతములైన దేహేంద్రియాదులు ఉండాలి. భగవంతుడు నిరాకారుడు, అవ్యక్తుడు అయినందువల్ల దేహాద్యవయవాల అవసరం ఎన్నడూ

రాదు. అయితే శరీరాంతరమైన రాగద్వేషాలు ఆయనలో ఉన్నాయి కదా? అనవచ్చును. భగవానుడు సర్వశక్తిమంతుడు. అతని శక్తి ప్రకృతి అని, మాయ అని పేర్కొంటారు. ఆ శక్తి శక్తిమంతుడైన భగవానుని ఎడబాయక ఆయనను అంటిపెట్టుకొని ఉంటుంది. నిప్పు, దాని వేడిమి ఇందుకు నిదర్శనాలు. ఆ శక్తి దాని వ్యవహారావస్థలో సత్త్వాది గుణత్రయరూపాన వ్యవహరిస్తుంది. దానికి స్వాతంత్ర్యం లేదు. స్వాతంత్ర్యం లేకపోతే వర్తించటం ఎలాగంటావా? కాలప్రేరితయై వర్తిస్తుంటుంది. కాలప్రేరణలు కర్మఫలపరిపక్వతను బట్టి ఉంటాయి. శక్తికి శక్తిమంతులకు అవినాభావం ఉన్నందువల్ల కాలం కూడా శక్త్యంశమే కావటం వలన, శక్తి ఏ రూపంలో వ్యవహరించినా అది శక్తిమంతుని వ్యవహారమే అవుతుంది కదా? అని శంకిస్తావేమో. రాజా! శక్తి అన్నది గుణాలను ప్రేరేపించదు. శక్తి సాన్నిధ్యంలో గుణాలు శక్తిమంతములై తమ తమ స్వభావానుగుణంగా వర్తిస్తాయి. సూదంటు రాయి సాన్నిధ్యాన ఇనుప ముక్కలు వ్యవహరించటమే ఇందుకు నిదర్శనం. ఇనుప ముక్కల వ్యవహారఫలాలు సూదంటు రాతికి అంటనట్లే గుణకార్యాలు శక్తికి గాని శక్తిమంతునికి గాని చెందవు.

రాజా! స్వభావమన్నది ప్రారబ్ధకర్మఫల సముచ్చయం అని చెప్పాను. స్వభావమన్నా ప్రకృతి అన్నా రెండూ ఒకటే. ఆ స్వభావం త్రిగుణాత్మికం అయినందువల్ల గుణవ్యవహారం ప్రారబ్ధకర్మఫలవాసనల అధీనంలో ఉంటుంది. ఆ వ్యవహారం గుణానురూపంగా వ్యక్తమవుతుండటం వల్ల వ్యవహారమైన కర్మము గుణాధీనమని అన్నారు.

## కాలప్రేరణ విధానం

రాజా! కాలప్రేరణ ఎటువంటిదనే ప్రశ్నకు సమాధానం చెప్పాలి. ప్రకృతిశూన్యమైన ఉపాధి అంటూ ఉండదు కదా! ఉపాధులు కర్మఫలానుభవార్థం కలుగుతున్నాయి. కర్మఫలాలు గుణవ్యవహారాన్ని బట్టి సాత్త్విక రాజస తామసికాలలో ఏదో ఒకటవుతుంది. ఏ ఫలానికి

భోగ్యావసరం వచ్చిందో ఆ ఫలానికి కారణమైన గుణం దాని అదను వచ్చినప్పుడు వ్యవహరిస్తుంది. ఈ విధానాన్నే కాలప్రేరణ మంటారు.

సత్త్వప్రకృతిని దైవమని, రాజస ప్రకృతిని ఆసురమని, తామసిక ప్రకృతిని రాక్షసమని అంటారు. సత్త్వప్రకృతి ప్రధానంగా కలవారిని దేవతలని, ఋషులని; రజఃప్రకృతి ప్రధానంగా కలవారిని అసురులని; తమఃప్రకృతి ప్రధానంగా కలవారిని యక్షరాక్షసులని వారి వారి గుణాలను బట్టి వర్గీకరించారు. చంద్రోదయాన్ని చూసి సముద్రం ఉప్పొంగినట్లు కాలం వచ్చినప్పుడు ఆయా గుణాలు వృద్ధి చెందుతాయి. గుణాల వృద్ధిక్షయాలన్నీ జీవుల కర్మవిపాకకాలాన్ని బట్టి కలుగుతుంటాయి.

రాజా! భగవానుడు సర్వగతుడని చెప్పాను. ఆ పక్షాన భగవానుడు సర్వశరీరాల లోనూ ఉన్నాడని ఏర్పడుతుంది. రాగద్వేషాలు, సుఖదుఃఖాలు భగవన్నిర్మితాలే అయితే భగవానుడు సర్వోపాధులలోనూ ఉన్నవాడు కాబట్టి ఆ రాగద్వేషాదిఫలాలను అనుభవింపక తప్పదంటావా? కొంచెం ఆలోచించి చూడు. ఎవడైనా దుఃఖాన్ని కోరి తెచ్చుకొని అనుభవించేవాడు ఉంటాడా? కనుక రాగ ద్వేష సుఖ దుఃఖాదులు భగవన్నిర్మితాలు కావు.

అవి ఎవరు నిర్మిస్తేనేమి, ఉపాధిగతులు దానిని అనుభవింపకుండా తప్పించుకోలేరని అంటావేమో. మంటలో రకరకాల కర్రలను వేస్తారు. ఆ కర్రల గుణదోషాలు అగ్నికి అంటుతాయా? అవి దేనికి వ్యాపిస్తున్నాయి? అంటే, అగ్నికి ఉపాధిగా ఉన్న మంటకు వ్యాపిస్తున్నాయి. అందువల్లనే మంట అనేక పరికరాల మూలాన మండుతున్నది. అదే విధంగా భగవానుడు అంతర్యామియై ఉన్నా గుణకార్యాలు శరీరానికి వ్యాపిస్తాయేగాని అంతర్యామికి మాత్రం తగలవు.

రాజా! ఆ గుణత్రయంలో ఒకటి వృద్ధి పొందినప్పుడు తక్కినవి తలవంచుకొని ఉంటాయి. ఈ వృద్ధిక్షయాల పోరాటమే యుద్ధ మనబడుతుంది. ఈ గుణాలు మార్చి మార్చి వృద్ధిక్షయాలు కాలానుసారంగా కానవస్తుండటం వలన అప్పుడప్పుడు యుద్ధాలు సంభవిస్తుంటాయి.

రాజా! ఈ మూడు గుణాలలో సత్త్వం శాంతిరూపంలో ఉంటుంది. దానివలన అన్యులకు అపకారం కలగదు. అందుచేత సత్త్వం రక్షింపబడితే ప్రపంచరక్షణ సిద్ధిస్తున్నది. సత్త్వానికి హాని కలిగినప్పుడు ప్రపంచహాని కలుగుతున్నది. ప్రపంచమంటే ఏమిటని అడగవచ్చు. భగవంతుని విస్తృతికే ప్రపంచమని పేరు. అంటే అవ్యక్తావస్థ నుంచి వ్యక్తావస్థకు చేరుకొనటం. ప్రపంచానికి ముప్పు రాకూడదని భగవత్సంకల్పం. ప్రపంచం భగవంతుని శరీరం కదా. శరీరహాని కావాలని ఎవరు మాత్రం ఆశిస్తారు?

సత్త్వానికి దేవాదుల శరీరాలు, రజస్సుకు అసురశరీరాలు, తమస్సుకు యక్షరాక్షసశరీరాలు నైజాశ్రయాలని చెప్పాను. అందువల్ల లోకప్రశాంతి కావాలంటే సత్త్వాశ్రయాలైన దేవాదిశరీరాలను రక్షించుకోవాలి. ఒకదానిని రక్షించాలంటే దానికి భంగకరంగా ఉన్నవాటిని తొలగించటం విధి కాబట్టి సురలను రక్షించటం కోసం తద్వ్యతిరిక్తులైన అసురులను సంహరింపవలసి వస్తున్నది. ఆ పని భగవంతుడు చేయగా రాగ ద్వేషాది కార్యం ఎందుకు కాలేదని అడిగావు. భగవత్కృత్యం రాగద్వేషయుక్తం కాదు. పైరుతో పాటు కలుపు కూడా పెరుగుతున్నది. కలుపును విడిచిపెడితే లోకోపకారమైన పైరు నశించిపోతుంది. పైరును కాపాడాలంటే కలుపును తీసివేయాలి. దుష్టశిక్షణం శిష్టరక్షణార్థమే గాని రాగద్వేషాలపై ప్రీతి కానేరదు. శిక్షకు సామదానభేద దండాలని నాలుగు ఉపాయాలు ఉన్నాయి. మొదటి మూడు ఉపయోగింపనినాడు నాల్గవ దాని ప్రయోగం తప్పనిసరి అవుతున్నది. లోకంలో ఎవడు గాని తన సత్త్వాభివృద్ధిని కోరినప్పుడు రజస్తమస్సులను ఉపాయాంతరాలతో అణచివేయటం చూస్తుంటాము కదా! రజస్తమస్సులు బలవత్తరంగా ఉన్నప్పుడు కర్తవ్యం ఏమిటి? కఠినోపాయాలను అనుసరించటమే కదా! రాజా! నీ సంశయం తీరాలంటే నారదమహర్షి వచనాలను విను.

## శిశుపాల వధ

రాజా! మీ తాతగారు ధర్మనందనుడు రాజసూయ యాగాన్ని తలపెట్టాడు. ఆ మఖానికి ఋషీంద్రులు దుర్యోధనాది కౌరవులు రాజులు సామంతరాజులు వచ్చారు. చేదిదేశవల్లభుడైన శిశుపాలుడు కూడా వచ్చాడు. అప్పుడు శిశుపాలుడు శ్రీకృష్ణ భగవానుని తూలనాడాడు. భగవానుడు చక్రాన్ని ప్రయోగించి శిశుపాలుని తల తరిగాడు. శిశుపాలుడు వాసుదేవునిలో సాయుజ్యమందాడు.

అదిచూసి సభాసదులందరూ మహాశ్చర్యవశులైనారు. ధర్మనందనుడు సైతం ఆ విపరీతానికి ఆశ్చర్యపోయి, 'ఏమిటిది! శిశుపాలుడు భగవానునికి పరమ విద్వేషి. అట్టివానికి మహాభాగవతదుర్లభమైన వాసుదేవసాయుజ్యం ఎలా లభించింది? ఇంతకంటె వింత ఉంటుందా?' అని తలపోసి చెంతనున్న నారదుని వంక మరలి 'పూర్వం వేనుడు భగవన్నింద కావించాడని తత్ఫలంగా తమోగ్రస్తు డయ్యాడని చెప్పుకుంటారు. భగవద్ద్వేషవిషయంలో శిశుపాల దంతవక్త్రులు వేనుడికి ఎంతమాత్రమూ తీసిపోరు. మాటలు నేర్చినది మొదలు వీరు భగవానుని గూర్చి తిట్టని తిట్టు లేదు. శ్రీకృష్ణుని పేరెత్తినా వీరు సహింపరు. ఈ దుష్టులు పరమాత్ముని గురించి పలికిన కారుకూతలు విన్నవారందరూ 'ఈ పరమనీచుల నాలుక మీద పుండు పుట్టదా? ఈ ఘోరాత్ములకు నరకమైనా కలుగదా?' అని చింతిస్తుంటారు. అటువంటిది నేడీ నిండు సభలో శిశుపాలుడు సాయుజ్యమందటం వింతగా ఉన్నది. ఈ వింతను చూసినది మొదలు నా మనస్సు గాలికి దీపశిఖ ఊగిసలాడినట్లు అల్లకల్లోలంగా ఉన్నది. దీని రహస్యమేమిటో తెలియజెప్పగలరని ప్రార్థిస్తున్నాను' అని అడిగాడు. నారదమహర్షి అతనితో ఇలా అన్నాడు:

'ధర్మనందనా! భగవన్నిందాపరులకు నరకమే శరణమని భావిస్తున్నావు కాబోలు! నింద అంటే ఏమిటి? పరుల దోషాలను ఎన్నటం నింద అనబడుతుంది. స్తుతి అంటే ఏమిటి? పరుల సుగుణాలను కీర్తించటం. పూజాద్రవ్యాల చేత ఒకరు మరొకరిని గౌరవించటం సత్కార మవుతుంది.

మాటల చేతనో చేతల చేతనో ఒకరిని అవమానిస్తే అది తిరస్కారం. ఈ నిందాస్తుతులు, సత్కార తిరస్కారాలు ఎవరికి అన్వయిస్తాయి? అంటే, శరీరానికా? లేక శరీరాంతర్గతుడైన భగవంతునికా? శరీరాంతర్గతుడైన భగవంతునికి రూపనామాలు కలుగవు. కాబట్టి అవి భగవానునికి అన్వయింపవు. అవి శరీర సంబంధాలే అనుకోవాలి.

శరీరాదులు ప్రకృతికార్యాలు. శరీరాంతర్గతుడైన పురుషుడో? పరాత్పరుడు. ప్రకృతి పురుషుల తత్త్వాన్ని గ్రహింపలేక ప్రకృతినే పురుషుడని భావిస్తారు. అట్టి భావం కేవలం అజ్ఞానజనితమైనది. ఆ భావం ఉదయింపగానే 'నేను, నాది' అన్న అభిమానం కమ్ముకొంటుంది. తత్ఫలంగా శరీరానికి కలిగే నిందాస్తుతులు గాని రక్షణ వధలు గాని శరీరాంతర్గతమైన ఆత్మకు కలిగేవిగా ఎంచి రాగద్వేషాల పాలవుతారు.

రాజా! అటువంటి అభిమానం జనింపనినాడు రాగద్వేషాలు, స్నేహవైరాలు కలగనే కలగవు. భగవానుడు నిరభిమానుడు, సర్వసముడు. కాబట్టి భగవానునికి రాగద్వేషాలు కలుగవు. అట్టివాడు పరులకు దండనాదులను విధించటం దేనికంటావా? ఆ విధంగా చేయటం ప్రాణుల మేలుకోసమేనని గ్రహించు. అందువల్ల భగవంతునికి హింసాదులను మూటగట్టవద్దు. దేహాభిమానత్వం ఎలా కలుగుతున్నదంటే, జీవుని అనాది పుణ్య పాపకర్మలు దేహాభిమానానికి మూలం. భగవంతునికి కర్మలు లేవు. అందువల్ల కర్మఫలరూపాలైన పుణ్యపాపాలు గాని తత్ఫలభోగసాధనాలైన దేహాలు గాని తదభిమానతలు గాని అతనికి కలుగనేరవు. దండన మన్నది కర్మ అయితే దండన క్రియాఫలం కర్తకు తగలదా? అని అడగవచ్చు. అభిమానమున్నప్పుడు కర్తృత్వం కలుగుతుంది. అది లేనినాడు కర్తృత్వం గాని తత్ఫలభోగావసరం గాని ఎలా కలుగుతాయి? ఇంతెందుకు? అభిమానరహితులు చేసే కర్మములు కర్మములే కావని గ్రహించు.

## సాయుజ్యం

ధర్మనందనా? సాయుజ్యమంటే ఏమిటి? ఐక్యభావానికి సాయుజ్యమని పేరు. ఐక్యమన్నప్పుడు రెండు వస్తువులు ఉండాలి. ఆ రెండింటి తత్త్వమూ పరస్పర సంయోగానుకూలంగా ఉండాలి. విరోధతత్త్వాలకు ఐక్యం ఎన్నటికీ కుదరదు. చక్కెరకూ లవణానికీ ఐక్యం కలుగుతుందా? ఈ సంగతి ముందు గ్రహించు.

## సాయుజ్యం దేనికి?

శిశుపాలుడు సాయుజ్యాన్ని పొందటం చూశారు కదా! సాయుజ్యం పొందినది అతని శరీరమందామా? శరీరం ఇక్కడే పడి ఉన్నది. కాబట్టి శరీరసాయుజ్యం కలగలేదు. మరి దేనికి సాయుజ్యం కలిగింది? శిశుపాలుని శరీరం నుంచి ఒక తేజోరూపం వెలువడి శ్రీకృష్ణభగవానునిలో ప్రవేశించటం చూశారు కదా! ఆ తేజస్సుకే ఆత్మ అని పేరు. ఆత్మ అంటే పరమాత్మ అంశమే కాబట్టి అది దానిలో కలవటం సాధ్యమయింది. ఈ విధంగా మన ఆత్మ పరమాత్మతో తాదాత్మ్యాన్ని పొందటమే సాయుజ్యం.

## తాదాత్మ్య కారణం

తాదాత్మ్యాన్ని గురించి చెబుతున్నాను. ఎప్పుడు బుద్ధి నిరంతర తత్పరతను, తన్మయత్వాన్ని పొందుతుందో అప్పుడు తాదాత్మ్యం కలుగుతుంది. ఈ తత్పరత అన్నది వైరం వలన కొందరికి, భక్తి చేత కొందరికి, భయం మూలాన కొందరికి, స్నేహం వల్ల కొందరికి, కామం వల్ల కొందరికి – ఈ విధంగా మూలవస్తువు పైననే బుద్ధి కుదురుకొని తన్మయతను చెందుతుంది. తత్ఫలంగా సాయుజ్యం అలవడుతుంది. వైరం వలన శిశుపాలాదులకు, భక్తియోగం కలిమిని మా బోంట్లకు, భయం చేత కంసునికి, స్నేహం వలన పాండవులైన మీకు, ప్రేమ వలన గోపికలకు తన్మయత కలిగింది.

ధర్మనందనా! ఈ అయిదింటిలో వైరానుబంధం వలన కలిగినంత

శీఘ్రతరంగా తన్మయత తక్కిన నాల్గింటి చేత కలుగదని నా నమ్మకం. ఇందుకు భ్రమర కీట న్యాయమే నిదర్శనం. కారణమేమంటావా? భక్తి మొదలైనవాటిలో బుద్ధి ఎప్పుడో ఒకప్పుడైనా పరముఖం కావచ్చును. వైరం అట్టి భావానికి చోటివ్వదు. ఎప్పుడేమి కలుగనున్నదో అని సర్వకాల సర్వావస్థల లోనూ బుద్ధి తదేక చింతామయమై ఉంటుంది. శిశుపాలుడు వైరనిమిత్తాన నిద్రాహార సమయాలలో కూడా కేవలం శ్రీకృష్ణ భగవానునే స్మరిస్తూ అతని తోడిదే లోకంగా ఉండేవాడు. అందువల్ల అతనికి శీఘ్రసాయుజ్యం లభించింది. ప్రేమపూర్వక సామ్రాజ్యం సౌమ్యమైనది. ఇది కొంత కష్టసాధ్య మనిపిస్తుంది. ఇక వేనుడంటావా? అతను ఈ అయిదింటిలో దేనికీ చెందడు. అందుచేతనే అతనికి సద్గతి దూరమయింది. వేనునికి మాత్రం అటువంటి భావం ఎందుకు కలగలేదు? అంటే, ఏ భావమయినా ఆ వ్యక్తి యొక్క ప్రారబ్ధకర్మ ఫలానుసారంగా ఉంటుంది. శిశుపాలుని ప్రారబ్ధకర్మ ఫలవిశేషం ఏమిటని అడగకముందే, ఆ సంగతి చెబుతాను విను.

## శిశుపాల దంతవక్త్రుల చరిత్ర

ధర్మనందనా! ఈ శిశుపాల దంతవక్త్రులు పూర్వం శ్రీమహావిష్ణుపార్షదులుగా ఉండేవారు. బ్రహ్మమానసపుత్త్రులు సనక సనందనాదులు ముల్లోకాలూ సంచరిస్తూ ఒకానొకనాడు విష్ణులోకానికి ఆకస్మికంగా వచ్చారు. వారికప్పటికి ఏండ్లు పూండ్లు గడిచినా ఏడేండ్ల బాలకులుగా కనబడేవారు. అదీ కాక వారు దిగంబరులుగా ఉన్నారు.

అప్పుడు విష్ణుపార్షదులుగా ఉండిన ఈ శిశుపాల దంతవక్త్రులు వారిని చూసి శిశుప్రాయులైనదానికి తోడుగా దిగంబరులుగా ఉన్నవారు శ్రీవిష్ణుదర్శనానికి యోగ్యులు కారని తలచి వారిని లోనికి రానీయక అడ్డుపడ్డారు. ఆ మహర్షులు పార్షదుల చర్యను చూసి 'ఏమీ! శ్రీ మహావిష్ణువు పాదమూలంలో రజస్తమస్సులకు ప్రవేశమా?' అని లోలోన తలచి, 'ఓరి బాలిశులారా! మీ చర్య రజస్తమోమూలక మైనది. కేవల సత్త్వప్రధానమైన

శ్రీవిష్ణుస్థానానికి మీరు రక్షకులుగా ఉండతగరు. మీ గుణాలకు తగినట్లుగా పరమపాపిష్ఠమైన ఆసుర జన్మ పొందుతారు గాక!' అని శపించారు. ఆ దౌవారికులు భయచకితులై, 'ఓ మహాత్ములారా! దిగంబరులు రాజదర్శనయోగ్యులు కారని మిమ్ము వారించాము. మీ మాహాత్మ్యం ఎరుగని మా అజ్ఞానాన్ని సైరించి మాకు శాపమోక్షణను అనుగ్రహించండి' అని ప్రార్థించారు. ఋషీంద్రులు అప్పటికి శాంతించి వారికై జాలిపడి, 'మా శాపం తప్పదు. సురజన్మలు ఏడో అసురజన్మలు మూడో ఎత్తి తర్వాత మీ స్థానాలకు చేరుకోగలరు' అన్నారు. సురభోగా లనుభవిస్తూ ఏడు జన్మల పర్యంతం భగవద్వియోగాన్ని భరించే కన్న అసురవృత్తిలోనే మూడు జన్మలు గడిపి శీఘ్రంగా భగవత్సన్నిధికి చేరుకొనటం మేలని ఆ పార్షదులు నిశ్చయించుకొన్నారు.'

రాజా! నారదుడు ఆ విధంగా జరిగిన వృత్తాంతాన్ని చెప్పగా, ధర్మనందనుడు విని, 'ఋషివర్యా! విష్ణులోకం సత్త్వగుణభూయిష్ఠులకు తప్ప అన్యులకు సాధ్యం కాదంటారు. ఆ ద్వారపాలకులు సత్త్వగుణు లైనందువల్లనే కదా, వారికంతటి స్థానం లభించింది? అంతటి సత్త్వస్వభావులైన వారు ఆనాడు సనకాదుల యెడ అవినయాన్ని చూపిన కారణమేమిటి?' అని ప్రశ్నించాడు. నారదుడు చెప్పాడు.

'కుంతీనందనా! శరీరాలన్నీ గుణత్రయంతో కూడుకొని ఉంటాయి. ఈ గుణాలు ఎప్పుడు గాని ఒకదానికొకటి ప్రత్యేకించి ఉండవు. వాటి ఉనికిని ముప్పిరిత్రాటితో సాటిచేయవచ్చు. వాటిలో సత్త్వగుణం ప్రధానమైనప్పుడు ఉత్తమ లోకస్థితి, రజస్సు ప్రధానమైనప్పుడు మధ్యమ లోకస్థితి, తమోగుణం ప్రధానమైనప్పుడు అధోలోక స్థితి తగి ఉంటాయి. విష్ణులోక స్థితికి సత్త్వం ప్రధానమన్నమాట నిజమే. అయితే సత్త్వగుణం ప్రధానమనగానే తక్కినవి రెండూ అసలుండవని అనుకోకు. అవి రెండూ పాము పడగ క్రింది కప్పలలాగున అణిగిమణిగి సమయం వచ్చినప్పుడు వాటి స్వభావాన్ని అంతో యింతో ప్రకటించక మానవు.

మరొక విషయాన్ని కూడా గుర్తుంచుకోవాలి. ఆ ద్వారపాలకుల సత్త్వగుణం విష్ణులోక నివాసమాత్రానికి యోగ్యమయిందే కాని అంతకు మించిన శక్తి దానికి లేదన్నమాట. వారి ద్వారపాలకోద్యోగమే అందుకు కొంతకు కొంత సూచకం. వారి సత్త్వగుణం తావన్మాత్రమే అయినా ఆ వేళకు సన్నగిల్లి రజోగుణవ్యవహారానికి తావిచ్చింది.

ఇంకొక విషయం. ప్రభుదర్శనానికి కొన్ని మర్యాదలంటూ ఉండకపోవు. దర్శనార్థులు యుక్తవయస్కులుగా ఉండాలి. వారి వేషం యథోచితంగా కనిపించాలి. సనకాదులు వయస్సును బట్టి, వేషాన్నిబట్టి ప్రభుదర్శన మర్యాదకు బాహ్యులుగా ఉన్నారు. ఆ కారణం విష్ణుపార్షదుల రజోగుణాన్ని ఉద్రేకింపజేసింది.

ధర్మనందనా! ఇదంతా నిమిత్తమాత్రం. వారి ప్రాక్తనకర్మఫలం అప్పటికి ఫలోన్ముఖమై ఆ కర్మఫలాన్ని అనుభవింపవలసి ఉండటం వల్ల ఆ సమయంలో వారికి అటువంటి బుద్ధి పుట్టింది. ఆ ఫలాన్ని అనుభవించి పరిశుద్ధులు కావటానికి భగవానుడు వారికి ఆ విధంగా అవకాశాన్ని కలిగించాడు. వారు ఆ కర్మఫలం అనుభవించి ఎప్పటి చోటికి చేరుకొన్నారు.

## శాపఫల జన్మలు

ఆ పార్షదులు మొదట దితికి హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా జన్మించారు. రెండవ జన్మలో విశ్రవసువుకు కైశికి వలన రావణ కుంభకర్ణులు గాను, మూడవ జన్మలో మీ మేనత్తకు శిశుపాల దంతవక్త్రులు గాను పుట్టారు. ఇది వారి కడపటి జన్మం; శాపం తీరింది. వారు వారి స్థానాలకు వెళ్ళిపోయారు.

## హిరణ్యకశిపుని చరిత్ర

'ధర్మనందనా! హిరణ్యాక్షుడు భూమండలాన్ని చాపగా చుట్టి లోకదుర్నిరీక్ష్యంగా రూపొందాడు. అప్పుడు భగవానుడు వరాహావతారమెత్తి అతనిని సంహరించి భూమిని నీటిలోనుంచి పైకి లేవనెత్తాడు. హిరణ్యకశిపుడు

తన తమ్ముని చంపిన పగను తీర్చికొనగోరి ఘోరతపస్సు చేసి బ్రహ్మ వలన దుస్తరమైన వరాలను పొందాడు.

హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడనే కొడుకు ఉన్నాడు. అతను పుట్టిన దాదిగా విష్ణుభక్తుడై తదేక స్మరణాయత్తచిత్తంతో నిత్యపరవశుడై ఉండేవాడు. హిరణ్యకశిపుడు తనకు గల విష్ణువు మీది పగవల్ల ప్రహ్లాదుడు తన కొడుకే అయినా విష్ణుభక్తుడైన కారణానికి అతనిని పెట్టరాని బాధలు పెట్టాడు. ఎంత బాధించినా ప్రహ్లాదునికి బుద్ధి మారలేదు. ఎట్టకేలకు అతనిని చంపజూశాడు. భగవత్తేజోరక్షితుడైన ప్రహ్లాదుని యెడ దానవయత్నాలు కొనసాగలేదు.'

రాజా! ధర్మనందనుడు అంతవరకు విని, 'మునివర్యా! పుత్రుడెంత దుర్మార్గుడైనా తల్లిదండ్రులకు ప్రీతిపాత్రుడే కదా. మరి ప్రహ్లాదుడు భగవద్భక్తుడన్నారు. అటువంటివాడు పితరులకు ప్రియతముడు కావాలి. లోకవిధానం ఇలా ఉండగా హిరణ్యకశిపుని వర్తన లోకవిరుద్ధంగా ఉండటానికి కారణమేమిటి?' అని అడిగాడు. నారదమహర్షి అతనితో –

ధర్మనందనా! హిరణ్యకశిపుడు తన భ్రాతృవధ వల్ల కలిగిన శోకరోషాలతో పరితప్తుడై పగదీర్చుకోవాలని నిశ్చయించి దానవ దైతేయాగ్రణులతో సభతీర్చాడు. 'యోధానుయోధులారా! విష్ణువును సర్వసము డంటారు. అతనికి ఎటువంటి అపకారం చేయమైతిమి. అతను తన బంట్లయిన సురల మాట నమ్మి నిష్కారణంగా నా తమ్ముణ్ణి చంపాడు. ఈ కపటాత్ముణ్ణి మననీయకూడదు. నా శూలానికి అతనిని బలిపెట్టి ఆ రక్తధారలతో నా తమ్మునికి తర్పణలిస్తే గాని నా మనోవ్యథ తీరదని నిశ్చయించాను. అతనితో పాటు గీర్వాణులందరూ మొదలు నరికిన చెట్ల కొమ్మలలాగా నశిస్తారు. నా పనితీర్చుకొని నేను తిరిగి వచ్చేదాకా మీకొక మాట చెబుతున్నాను. నా మాటను జవదాటక చెప్పినట్లు చేయండి. మనమొక శత్రువును జయించాలంటే ముందుగా అతనికి తోడు రాగల బలాలను నాశనం చేసి ఆ తర్వాత వైరిని ఢీకొనాలి. ఆ విష్ణువుకున్న బలమేమిటో మనకు తెలుసు. యజ్ఞధర్మాలు, దేవర్షిపితృభూతధర్మాలు అతనికి ఊతగర్రలు. ఆ

ధర్మాలను బ్రాహ్మణులు నిలబెడతారు. ధాత్రీమండల మంతా కలయదిరిగి ఎక్కడెక్కడ తపోయజ్ఞస్వాధ్యాయ వ్రతదానపరులున్నారో వెతికిపట్టుకొని వారందరినీ నరికి పోగులు పెట్టండి. గోబ్రాహ్మణవర్ణాశ్రమ క్రియల అభివృద్ధి ఎక్కడ కనిపిస్తే అక్కడ పల్లెలనక పట్టణాలనక ఊరు ఊరంతా కాల్చి బూడిదచెయ్యండి' అని కోపారుణిత నేత్రాలతో నిప్పులు కురిపిస్తూ ప్రళయకాలవిస్ఫూర్జిత జలదగర్జానిస్వనంతో ఆజ్ఞాపించాడు.

## జననీ దుఃఖోపశమనం

దైతేయవీరులకు కర్తవ్యాన్ని ఆజ్ఞాపించిన తర్వాత హిరణ్యకశిపుడు తమ్మునికి తిలోదకదానాదులు కావించి తల్లిని మరదలిని చేరబోయి, 'హిరణ్యాక్షుడు వీరమరణాన్ని పొందాడు. శూరులకు అంతకంటె కావలసినది శుభదాయకం మరొకటి లేదు. దుఃఖాన్ని దిగమ్రింగి కర్తవ్యాన్ని ఆలోచించండి. చలిపందిరిలో బాటసారులు గుమిగూడినట్లు లోకంలో జీవులందరూ కొంతకాలం కలిసి విడిపోతుంటారు. ఈ పరస్పర శరీర సంయోగ వియోగాలు జీవులకు తాత్కాలికమే గాని శాశ్వతం కాదు. శాశ్వతమైనది ఆత్మ ఒక్కటే. ఆ ఆత్మపురుషుడు నిత్యుడు అవ్యయుడు శుద్ధుడు సర్వగతుడు సర్వజ్ఞుడు అన్నింటికీ పరాన ఉన్నవాడు. అతను మాయోపాధిని కూడినప్పుడు అతని సాన్నిధ్యం వల్ల సుఖదుఃఖాదులు కలుగుతున్నాయి. ఆ సుఖదుఃఖాలను ఆత్మరూపుడే సంసారోపాధిగా ఉన్న లింగశరీరంతో అనుభవిస్తున్నాడని తోపవచ్చును గాని అది వాస్తవస్థితి కాదు. కొలని గట్టున ఉన్న వృక్షాలు నీటిలో ప్రతిబింబించినప్పుడు నీళ్ళలో అలల కదలిక వల్ల ఆ చెట్ల ప్రతిబింబాలు కూడా కదలాడుతున్నట్లు మనకనిపిస్తుంది. జలబింబితవృక్షాల చలనాన్ని బట్టి ఆ బింబాలకు మూలమై గట్టుపై ఉన్న చెట్లుకూడా కదులుతున్నాయని అంగీకరిస్తామా? అలాగే ఆత్ముడు నిర్వికల్పుడైనా మనోగుణభ్రాంతి వలన ఆ గుణధర్మమైన వైకల్యాన్ని తాను పొందుతున్నట్లుగా భావిస్తుంటాడు. అభిమానమే ఇట్టి భ్రాంతి కారణం. ఈ అభిమాన వ్యవహారం వలన అనాత్మభూతమైన దేహాన్ని ఆత్మగా ఊహించటం; దేహసంబంధములైన

ప్రియాప్రియ సంయోగవియోగాలు, కర్మసంసారం, శోకమోహాలు, విషయచింతలు, వివేకవిస్మృతి, జననమరణాలు తనవిగా భావించటం మొదలైనవి ఏర్పడుతున్నాయి.

## శోకహేతువులు

తల్లీ! శోకమన్నది ఏదో బలమైన కారణం లేకుండా మన మనస్సులలో ఊరికే నిష్కారణంగా ఎందుకు కలుగుతుంది? దీనికేదో ప్రబలమైన హేతువు ఉండి ఉండాలని ఆలోచిస్తున్నావు కదూ? ఈ విషయమై పూర్వం యమునికి, ప్రేతబంధువులకు కొంత వాదం జరిగింది. ఆ ఇతిహాసం విను.

## యమ ప్రేతబంధువుల సంవాదం

ఒకప్పుడు ఉశీనరదేశంలో సుయజ్ఞుడనే రాజొక డుండేవాడు. ఒకనాడతనికి శత్రువులతో యుద్ధం సంభవించింది. ఆ సమరంలో అతను భుజాలు తెగి బాణనిర్భిన్నహృదయుడై ఔడుగరిచి నేలకొరిగాడు. అతని భార్యలు పొలికలనికి వచ్చి గుండెలు బాదుకొంటూ, 'నాథా! ఈ బ్రహ్మదేవు డెంత దయాశూన్యుడు! ప్రాణేశ్వరుడవైన నీతో మాకు వియోగాన్ని నొసట వ్రాశాడు. నాథా! ఉశీనరుల కందరికీ వృత్తిని కలిగించి లోకసుఖవర్ధనుడివని పేరెన్నిక గన్నావు. అటువంటి నీవే వారికి నేడు శోకవర్ధనుడవు కావటం తగిన పనేనా? అయ్యో! నీ ప్రేమాదరాలకు నోచుకొని నీ చల్లని నీడలో బ్రతుకు సేదదీరి సంతోషంగా ఉన్న మమ్మల్ని విషాదసాగరంలో ముంచి వెళ్ళిపోయావు. ఇక మాకు దిక్కెవ్వరు? నిన్ను విడిచి ఈ లోకంలో మేమిక బ్రతకలేము. నీతో పాటే వస్తాము మమ్మల్నీ తీసుకొని వెళ్ళు. అలాగైనా మాకు నీ సేవాభాగ్యాన్ని ప్రసాదించు' అని పరిపరివిధాల విలపిస్తూ రాజు శవాన్ని సంస్కారార్థం తీసుకొనిపోనీయక, దుఃఖాన్ని భరించలేక గొంతెత్తి ఏడ్వసాగారు.

యముడు వారి శోకార్తనాదాలను విని 'ఓహో! ఇంతకంటె అజ్ఞానం ఉంటుందా? సంవత్సరాల తరబడి జీవితానుభవాన్ని సంపాదించి లోకస్థితిని పరిశీలించి ఇంకా వీరు వ్యామోహంలో కొట్టుమిట్టుకులాడటం వింతగా

ఉన్నది. పుట్టిన వస్తువులు ఎట్టకేలకు అవి పుట్టిన చోటికే పోకమానవు. వీరికి కూడా ఆ గతి తప్పదు. ఈ రహస్యాన్ని గుర్తింపలేక వీరందరూ శోకిస్తున్నారు' అని తలపోయసాగాడు. అంతలో సూర్యుడస్తమించాడు.

అప్పుడు యముడు బాలుని వేషం ధరించి అక్కడికి వచ్చి, 'అబలలారా! మీరిక్కడ దేనికోసం విలపిస్తున్నారు? మిమ్మల్ని రక్షిస్తూ వచ్చిన రక్షకుడు పోయాడని ఏడుస్తున్నారా? మీరు తల్లి గర్భంలో ఉన్నప్పుడు ఎవరు రక్షించారు? అంత మాత్రం ఆలోచింపరెందుకని? అప్పుడెవరు రక్షించారో మీకు తెలుసా? ఏ పరమాత్ముడు తన ఇచ్ఛాప్రకారం సృష్టిస్థితిలయాలను కావిస్తున్నాడో ఆ పరమాత్ముడే సర్వజీవకోటినీ కాపాడుతున్నాడు. అతనికి ఈ విశ్వమంతా క్రీడాసాధనం. దైవరక్షితమే రక్షితమని, తదితర రక్షితాలెన్నటికీ రక్షితాలు కావని, దారిలో జారవిడుచుకొన్న వస్తువు దైవరక్షితమైతే చెక్కుచెదరదని, దైవరక్షితం కానినాడు గృహ్యాభ్యంతరంలో దాచిన వస్తువు కూడా మాయమవుతుందని గ్రహించండి. మరి భగవద్రక్షితుడు గహనాంతరంలో ఘోరమృగాల మధ్య చిక్కుకొన్నా సుఖంగానే ఉంటాడు. ఈశ్వరోపహతుడు గృహాంతరసీమలో దాగి ఎటువంటి రక్షకుడు రక్షించినా బతకడు. నిగ్రహానుగ్రహాలు రెండింటికీ ఆ ఈశ్వరుడే దిక్కు.

## దేహోత్పత్తి నాశాలు

అబలలారా! దేహాలు ఏ విధంగా కలుగుతున్నాయి? నాశనానంతరం వాటి స్థితి ఏమిటి? దేహాలన్నీ త్రిగుణాత్మకపరమాణువుల సంయోగం వలన ఏర్పడి, ఆ సంయోగకారణబలం ఉన్నంత కాలం నిలిచి తర్వాత పరస్పర వియోగంతో పూర్వగతిని పొందుతున్నాయి. నిదర్శన మేమంటారా? మట్టి అన్నది పరమాణువుల రూపంలో ఉంటుంది. ఆ అణువులను చేర్చి ముద్దచేసి గోడలు కడతారు. ఆ పరమాణువులకు వాటి సంయోగశక్తి ఉన్నంత కాలం గోడ నిలిచి ఉంటుంది. ఆ శక్తి సడలినంతనే గోడ తనంత తానుగా కూలిపోతున్నది. ఇది స్వానుభవసిద్ధమే కదా!

మూఢాంగనలారా! ఎవరి కోసమని ఏడుస్తారు? సుయజ్ఞునికై విలపిస్తున్నామంటారా? ఏ శరీరాన్ని మీరు సుయజ్ఞుడని పిలుస్తుండేవారో ఆ శరీరం మీ యెదుట మీ చేతులలోనే ఉన్నది. వస్తువును అరచేతిలోనే ఉంచుకొని పోయినదని ఏడవటం వెర్రితనం కాదా? ఏ సుయజ్ఞుడు మీ మాటలు వింటూ, మీకు బదులు చెబుతూ, మిమ్మల్నందరినీ ఆనందసాగరంలో ఓలలాడించేవాడో ఆ సుయజ్ఞుని కోసం ఏడుస్తున్నా మంటారా? అతనిప్పుడు లేడు. అతని దేహగతమైన ప్రాణం కోసం దుః ఖిస్తున్నామంటారా? ప్రాణం వినదు, మీకు బదులు చెప్పదు. దానికి అటువంటి శక్తిలేదు. దేహకార్యాలు ఇన్నాళ్ళూ దేనివల్ల జరిగాయి? ఆత్మడు దేహాంతరంలో ఉన్నప్పుడు అతని అధిష్ఠానమాత్రాన దేహేంద్రియాదులు వర్తిల్లుతున్నాయి. ఆ వర్తననే కర్మమంటారు. ఆత్మడు అభిమానం ఉన్నంతకాలం దేహాంతర్వర్తియై ఉంటాడు. ఆ అభిమానాన్నే జీవత్వ మంటారు. అభిమానం ఉండటమే బంధం. అది నశించటమే బంధనాశం' అని పలికి అంతర్ధానం చెందాడు.

తల్లీ! ఈ సంవాదసారం ఏమిటంటే దేహం ఉన్నంతకాలం గుణాలు ఉంటాయి. గుణాలు ఉన్నంత కాలం వాటి వ్యవహారం తప్పదు. ఆ వ్యవహార ఫలాల ఆనుకూల్యాన్ని సుఖమని, ప్రాతికూల్యాన్ని దుఃఖమని అంటారు. అవి వస్తూ పోతూ ఉండేవి కాబట్టి పరమార్థాలు కావు. ఇంద్రియాలకు బాహ్యపదార్థాలతో సంయోగం కలిగినప్పుడు ఆ సంయోగ ఫలాల ఇష్టానిష్టాలను బట్టి సుఖదుఃఖాలు ఏర్పడుతుంటాయి. ఇవి నిత్యమైన ఫలజనకాలు కావు. నిత్యములు కావు కాబట్టి ఈషద్వైషమ్యంతో స్వప్నదృష్టములైన సుఖదుఃఖాల వంటివే. ఈ రహస్యాన్ని గుర్తించినవారు దేహ జననమరణ సుఖదుఃఖాదులకు చింతించరు. ఈ సంగతి ప్రతినిత్యం లోకంలో చూస్తూనే ఉన్నా తమకు సంభవించినప్పుడు ఎందుకు తలక్రిందులవుతారంటే, వారి జ్ఞానం శ్రవణజన్యజ్ఞానమే కాని అనుభవరూప జ్ఞానం కాదన్నమాట. ఏ విషయమైనా విన్నంత మాత్రాన ఫలదాయకం కాదు. విన్నదానిని మననం

చేసి నిశ్చయించి ఆ ప్రకారం వర్తించి విన్నదానితో స్వీయానుభవం సరిపోతున్నది లేనిది పరామర్శించి నిగ్గుతేల్చటమే నిజమైన అనుభవం. అదే ఫలకారి అవుతుంది. తల్లీ! చచ్చినవారికోసం చావనున్నవారు దుఃఖించటాన్ని గురించి మరొక ఇతిహాసం ఉన్నది.

## బోయ - పిచ్చుకల జంట

ఒక బోయవాడు పిట్టలను పట్టి తెద్దామని అడవికి పోయి వల పరిచి ఒక చెట్టుచాటున దాగి నిలబడ్డాడు. పిచ్చుకల జంటొకటి ఆహారార్థం అటూ యిటూ తిరుగుతుండి వాటిలో ఆడపిచ్చుక ఆ వలలో చిక్కింది. మగపిచ్చుక అది చూసి, 'అయ్యో! నా తోడిదే లోకంగా ఉన్న నా భార్యను పరమేశ్వరుడు నా కళ్ళెదుటనే కొనిపోతున్నాడు. ఇంతకంటె కసాయితనం ఉన్నదా? ఏ అర్థాన్ని కోరి అతనింత పనికి తెగించాడో? నన్ను కూడా తీసుకొనిపోకూడదా? భార్య భర్తకు అర్ధాంగి అంటారు. ఒక అర్ధభాగం పోయిన తర్వాత రెండవ అర్ధభాగం ఉండి మాత్రం ఫలమేమిటి? అయ్యో! మా బిడ్డలకు రెక్కలన్నా రాలేదు. తల్లిలేని పిల్లలను ఎవరు మాత్రం దయదలిచి ఎన్నాళ్ళని సాకుతారు? ఆ పసికూనలు దుఃఖం కలిగినప్పుడల్లా తల్లికోసం నిలువెల్లా కళ్ళుచేసుకొని ఎదురుచూస్తారు. వారి గతేమిటి?' అని వాపోవసాగింది. అంతలో బోయ విల్లెక్కుపెట్టి బాణం వదిలాడు. ఆ ములికి తాకి మగపిచ్చుక చచ్చి పడింది. బాణం దానిని తాకేసరికి భర్త పాటు చూసి ఆడపిచ్చుక ప్రాణాలు వదిలింది. బోయవాడు రెండు పిట్టలనూ ఇంటికి తీసుకువెళ్ళి వండుకొని తిన్నాడు.

తల్లీ! అజ్ఞానులు తమకు రానున్న ముప్పును మరచి పరుల ముప్పును చూసి విలపిస్తారు. పోయినవాళ్ళు నూరేళ్ళు చింతించినా తిరిగివస్తారా? తల్లీ! సుయజ్ఞుని భార్యలు యముని వచనాలను విని తత్త్వసారాన్ని గ్రహించి స్వస్థచిత్త లయ్యారు. సుయజ్ఞునికి పరలోకక్రియలు చేయబడ్డాయి.

తల్లీ! స్వకీయము, పరకీయము అంటే ఏమిటో, ఇది మనది - ఇది ఇతరులది అన్న భావం ఎందుకు కలుగుతున్నదో మనసులో ఆలోచిస్తే చక్కగా

గ్రహించగలము. అభిమానమే అట్టి భావానికి కారణం. ఆ అభిమానం అజ్ఞానఫలం. అజ్ఞానమంటే విపరీతజ్ఞానం.'

ధర్మరాజా! హిరణ్యకశిపుడు ఆ విధాన తత్త్వాన్ని వివరించి తల్లిని, మరదలిని ఓదార్చి వారికి శాంతిని కూర్చాడు. వారు యథార్థాన్ని గ్రహించి దుఃఖాన్ని మాని తత్త్వచింతకు పూనుకొన్నారు.

## హిరణ్యకశిపుని తపోదీక్ష

ధర్మసుతా! హిరణ్యకశిపుడు ఆ విధంగా నిజానుచరులకు ఆజ్ఞాపించి తల్లిని మరదలిని ఓదార్చి తపోవ్రతుడై మందరగిరికి యుక్తప్రదేశాన్ని ఏర్పరచుకొని పాదాంగుష్ఠాన నిలిచి చేతులెత్తి, 'నాకు ముదిమి గాని చావు గాని కలుగకూడదు; నాకు శత్రువులుండరాదు; ఏకరాజత్వం సిద్ధించాలి' అని సంకల్పించుకొని మింట దృష్టి నిలిపి తీవ్రమైన తపస్సును మొదలుపెట్టాడు. కాలక్రమాన అతని జటాకాంతులు ఎరుపెక్కి ప్రళయార్కకిరణదీప్తులను మరపించాయి. అతని ఔదల నుంచి తపోవహ్ని ధూమ సహితంగా వెలువడి భూనభోంతరాళ దిశలన్నింటినీ క్రమ్మివేసింది. ఆ వేడిమికి సముద్రాలు తప్తలోహం మీద నిలిచిన జలబిందువుల వలె ఆవిరులు గ్రక్కి సంక్షోభింపసాగాయి; ధాత్రీతలం కంపించింది; గ్రహనక్షత్రాలు అల్లల్లాడాయి; దిగ్దిశాంతరాలలో మంటలు రేగాయి.

## దేవతల విన్నపం

ధర్మజా! హిరణ్యకశిపుడు రాజ్యాన్ని పరిపాలిస్తుండగా అతనికి భయపడి దేవతలు భూతలాంతరాన దాగి ఉన్నారు. అతను తపోనిష్ఠుడైన సంగతి విని వారు కొద్ది కొద్దిగా ధైర్యం తెచ్చుకొని తమ తమ నెలవులకు చేరుకొన్నారు. హిరణ్యకశిపుని తపోవహ్నిజ్వాలలు సురలోకం వంకకు నాలుకలు చాచాయి. ఆ వేడిమికి నిర్జరులు కమిలి నిలబడలేక హుటాహుటిని బ్రహ్మలోకానికి పరిగెత్తారు. 'రక్ష రక్ష ప్రభో! హిరణ్యకశిపుని తపోవహ్నికీలలు దిక్కులకు ప్రాకి

లోకాలను దహించివేస్తున్నాయి. నాకలోకంలో మాకింక నిలువనీడ లేదు. పితామహా! ఆ జ్వాలలను వెంటనే చల్లార్పకపోతే నీకు జరిగే పూజావిధానాలు సమసిపోతాయి. హిరణ్యగర్భా! ఆ దైత్యేశ్వరుడింత ఘోరతపం చేయ బూనిన తలంపు నీకు తెలియనిది కాదు. అయినా మేము విన్నది విన్నవిస్తాము. 'బ్రహ్మదేవుడు మొట్టమొదట ఏ తపోనిష్ఠ చేత చరాచరసమస్తసృష్టిని కావించి సర్వోన్నతమైన సత్యలోకాన్ని అధిష్ఠించాడో అటువంటి తపోయోగనిష్ఠను పూని నేను కూడా ఆ పితామహుని స్థానాన్ని సాధిస్తాను గాక! ఆత్మ, కాలం – ఈ రెండే నిత్యములైనవి. నా ఈప్సితం నేడు కాకపోతే వేయిసంవత్సరాలకైనా సిద్ధింపక మానదు. సిద్ధికి తగినంత ప్రయత్నం మాత్రం చేసి తీరాలి. అప్పుడిక అసాధ్యమన్న మాటకు తావుండదు. యత్నోపకరణాలు సమర్థములైతే సర్వం సిద్ధిస్తుంది. సత్యలోకాన్ని అధిష్ఠించి బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేస్తాను. ధ్రువాదిస్థానాలు కాలవశాన కూలిపోయేవి. అటువంటి తుచ్ఛసుఖాలు నాకెందుకు?' అన్న దృఢసంకల్పంతో అతను తపోదీక్షను గైకొన్నాడట! మాకేమిచేద్దామన్నా తోచడం లేదు. ఏ నీ పాదం గోబ్రాహ్మణజనసుఖైశ్వర్య యోగక్షేమాలకు మూలమో ఆ నీ దివ్యపాదాంభోజమే దిక్కని ఇక్కడికి వచ్చాము. కర్తవ్యాన్ని ఉపదేశించు' అని సాగిలబడ్డారు.

## బ్రహ్మదేవుని సాక్షాత్కారం

ధర్మనందనా! పరమేష్ఠి నిర్జరుల దీనాలాపాలను ఆలకించి జాగుచేయకూడదని నిశ్చయించి భృగుదక్షాదులను వెంటగొని మందరాద్రికి వెళ్ళి హిరణ్యకశిపుడు ఎక్కడున్నాడో అని ఆ పర్వతవనాంతరాలన్నీ వెతికాడు. ఆ అసురేశ్వరుని పొలకువే కానరాలేదు. బ్రహ్మదేవు డంతటితో మిన్నకుండక మళ్ళీ వెతకటం మొదలుపెట్టి చూస్తూండగా దట్టమైన వెదురుపొద ఒకటి కానవచ్చింది. పితామహు డా పొదను సమీపించి పరిశీలింపగా దాని నడుమనే పెద్దపుట్ట ఒకటి ఉన్నది. ఆ పుట్టనుంచి చీమలు బారులు పెట్టి వెలికివస్తూ లోపలికి పోతున్నాయి. బ్రహ్మాదులు మెల్లగా సందుచేసుకొని ఆ వల్మీకాన్ని చేరి దాని లోపలికి తొంగిచూశారు. అందులో ఒక శల్యపంజరం

పడి ఉన్నది. చతురాస్యుడు దానిని చూసి విస్మయపడి, 'ఓహో! హిరణ్యకశిపుడా ఇక్క డున్నది!' అంటూ తన చేతి కమండలువు లోని జలాలు ప్రోక్షించి 'కశ్యపాత్మజా! లేవయ్యా! నీ తపస్సు పండింది; నీకు వరాలనిచ్చేందుకు వచ్చాను. నీ ఇష్టమైన వరమేమిటో చెప్పు. నీ ధైర్యస్థైర్యసాహసాలు పరమాద్భుతాలు. ఇంత దారుణ తపం ఎన్నడూ కనీ వినీ ఎరుగము. ఔరా! గరిటెడు నీరయినా ముట్టక నూరు దివ్యవర్షాలు మేనిలో ప్రాణాలు నిలువరించావు. ఈ పని నీకు గాక ఎవరికి సాధ్యమవుతుంది? దైత్యవల్లభా! నీ అమోఘదీక్ష, నీ తపోనిష్ఠ నన్ను నీకు వశుని కావించాయి. ఏది కోరినా వెంటనే ఇస్తాను కదా! మర్త్యులకు అమర్త్యుల సందర్శనం నిష్ఫలం కాదు. నీకు శుభమవుతుంది గాక!' అని పలికాడు.

## హిరణ్యకశిపుని వేడికోలు

ధర్మజా! హిరణ్యకశిపుడా వల్మీకాంతరంలో ఉన్నప్పుడు అతని చర్మమాంసరక్తమేదస్సులను చీమలు తిన్నందువల్ల అతను శల్యపంజరమో అన్నట్లున్నాడు. బ్రహ్మ కమండల జలాలు పైని సోకినంతనే అతను ఓజోబలాన్విత యౌవనశరీరుడై ఆ పుట్టనుంచి వెలికి వచ్చి తన యెదుట అంతరిక్షాన హంసవాహనారూఢుడై ఉన్న పరమేష్ఠికి సాష్టాంగం చేసి చేతులు జోడించి ఆనందబాష్పాలను వర్షిస్తున్న కందోయిని పైకెత్తి చూపును నలువ వైపు నిలిపి పులకాంకితశరీరుడై డగ్గుత్తికతో ఇలా అన్నాడు:

'ఏ స్వప్రకాశుడు కల్పాంతకాలంలో జగత్తును కప్పి ఉన్నట్టి గాడాంధకారాన్ని తన తేజఃప్రకాశంతో పటాపంచలు చేసి విశ్వానికి వెలుగు ప్రసాదిస్తాడో, ఏ మహానుభావుడు త్రిగుణాత్మకమైన ఆత్మమయాబలంతో సృష్టిస్థితిలయాలను కావిస్తాడో, ఆ త్రిగుణధామునికి సాష్టాంగం. ఏ పరమాత్ముడు ఆదిపూరుషుడు, సర్వబీజాత్ముడు, విజ్ఞానమూర్తి అయినట్టివాడో, ఏ అగోచరుడు ప్రాణేంద్రియ మనోబుద్ధివికారవ్యక్తరూపానికి ఉపాదానుడో అతనికి నమస్కారం. దేవా! చరాచరాలకు సూత్రాత్మరూపంలో నియామకుడవై

ఉన్నావు గనుక నీ ఆజ్ఞకు లోబడి ప్రజాచిత్తాలు, తత్పరిణామభూత చైతన్యము, మనస్సు, ఇంద్రియాలు వ్యవహృతిని పొందుతున్నాయి. అందువలన భూతవిషయ వాసనలకు మూటికీ ఈశ్వరుడవు నీవు. నీవే నీ త్రయీశరీరాన చాతుర్హోత్రవిద్యాత్మకమైన అగ్నిష్టోమాన్ని, అత్యగ్నిష్టోమాన్ని, ఉక్థ్యము షోడశి వాజపేయము అతిరాత్రము అప్తోర్యామము అనబడే సప్తతంతువులను నిర్మిస్తావు. నీకు ఆద్యంతాలు లేవు. అఖండమూర్తివి, సర్వజ్ఞుడవు, అట్టివాడవై ఉండి దేహధారులకు ఆత్మభూతుడవై వారియందు ప్రకాశిస్తావు. నిర్వికారుడవయినా కారణకార్యరూపవికారాలను పొంది చరాచరాకృతిని ధరిస్తావు. ప్రాణాత్ముడవై ఉండి ప్రాణుల ఆయువును లతాదిసూక్ష్మావయవాల చేత హరిస్తావు. నిరాకారుడవు అయినా బ్రహ్మాండకోశాన్ని నీ గర్భంలో ధరిస్తావు. దేవా! నీ వలన నీ శక్తియైన ప్రకృతి వెలువడి తదాత్మకగుణత్రయాన్ని ఊతగొని దృశ్యమంతటినీ కల్పిస్తున్నా నీవు దానికి పరుడవై ఆ లీలలను చూస్తూ ఉంటావు. ఆ కారణాన నిన్ను పరబ్రహ్మస్వరూపుడంటారు. నీ శక్తికార్యమైన జగత్తు నీకు స్థూలశరీరమై నీ విషయానుభవానికి సాధనమవుతుంది.

దేవా! నీ అనుభవప్రకారం సామాన్యులకు అగమ్యగోచరం. నీవు పరమైశ్వర్యస్వరూపమైన నీ ఆత్మలో ఉండి ఆ విషయాలను భోగిస్తుంటావు. ఆ కారణాన నిన్ను నిరుపాధిక బ్రహ్మాత్ముడు, అవ్యక్తపదవాచ్యుడు అంటారు. నీ రూపు జగత్తులను ఆవరించి ఉన్నదయినా మనోవాక్కులకు గోచరింపదు. చిదచిత్తులు రెండూ నీ శక్తులే అవుతాయి. అట్టి శక్తివిలాసం చేత నీవు సర్వాత్మకుడవై విలసిల్లుతున్నావు. అట్టి భగవంతునికి నీకు నమస్కరిస్తున్నాను.

## హిరణ్యకశిపుని వరాలు

దేవా! వరాలు కోరుకొమ్మన్నావు. వరదోత్తమునికి నీకిది నైజమే గదా. ఇదే కోరుతున్నాను, చిత్తగించు. సురాసురమహోరగుల వలన గాని, నరుల వలన గాని, మృగాల వలన గాని, ఆయుధాల చేత గాని, జడ చేతన పదార్థాలతో

దేనివలన గాని, ఇంతెందుకు? నీవు సృజించిన భూతజాతం వలన, లేక మరిదేనివలన నైనా, రాత్రులలో గాని, పవళ్ళలో గాని, బహిర్భాగంలో గాని, గృహాంతరంలో గాని నేలమీద గాని ఆకసాన గాని నాకు మృతి కలుగరాదు. యుద్ధంలో నాకు ప్రతివైరి లేకుండా పోవాలి. సకల లోకపాలకుల అణిమాదిసమస్తైశ్వర్యాలు నాకు కావాలి. ఏకరాజత్వాన్ని నేను కాంక్షిస్తాను. దేవా! నా కోరికలను తెలిపాను. వాటిని ప్రసాదించు' అని ప్రార్థించాడు.

ధర్మజా! దైత్యేశ్వరుడు కోరిన వరాలను పరమేష్ఠి విని ఆశ్చర్యాన్ని పొంది, తల పంకించి, 'అసురేశ్వరా! నీవు కోరిన వరాలు పురుషులకు అతి దుర్లభమైనవి. నీ తపస్సు మెచ్చాను; నీవు కోరిన వరాలను ఇచ్చాను' అని పలికి అతని పూజలంది తన లోకానికి వెళ్ళిపోయాడు.

## హిరణ్యకశిపుని దిగ్విజయం

ధర్మజా! హిరణ్యకశిపుడు వరాలను పొంది స్వస్థానం చేరాడు. ఆ లోగా అతని అనుచరులు రాజాజ్ఞను అక్షరాలా నిజం చేశారు. పట్టణాలు పాడుబడ్డాయి; ఊళ్ళు బుగ్గిపాలయ్యాయి; గ్రామాలు తగలబడ్డాయి; మందలన్నీ మంటగలిశాయి; ఆరామాలు అంతరించాయి; దేశం నాశనమైంది.

హిరణ్యకశిపుడు రాజధానిని చేరుకొన్నాక విష్ణువు మీద పగసాధించే సంవిధానాన్ని నిశ్చయించి దిగ్విజయం చాటి ముల్లోకాలమీదికి దండెత్తాడు. మొట్టమొదట నరలోకం అతనికి జోహారన్నది. దానివెంట సురలోకం దేవాసుర గరుడ గంధర్వ సిద్ధ చారణ విద్యాధర సహితంగా తలవంచింది. ఋషులు మునులు పితృదేవతలు గత్యంతరం లేక లొంగిపోయారు. యక్ష రాక్షస పిశాచ భూత ప్రేత పతులందరూ దాసోహమన్నారు. హిరణ్యకశిపుడు విశ్వవిజయుడై లోకపాలకుల స్థానాన్ని హరించి విశ్వకర్మ నిర్మితమైన త్రైలోక్యలక్ష్మీనివాసాన్ని స్వర్గాన్ని ఆక్రమించాడు.

## మహేంద్రసింహాసనం

ధర్మజా! స్వర్గాన్ని ఆక్రమింపగానే హిరణ్యకశిపుడు మహేంద్రుని భవనం లోనికి ప్రవేశించి అక్కడి విద్రుమ సోపానాలను, మరకత కుట్టిమాలను, స్ఫటిక కుడ్యాలను, విచిత్ర వితానాలను, పద్మరాగపీఠాలను, దంతనిర్మితమౌక్తిక జాలాలంకృత మంచ తతిని చూసుకొంటూ లోనికి నడిచాడు. అంతఃపురంలో సురసుందరీమణులు తమ స్వరూపవేషాలను మణిస్తంభాలలో ప్రతిబింబింపగా చూసి సవరించుకొంటూ స్వేచ్ఛగా సంచరిస్తున్నారు.

ఆ విధంగా మహేంద్రభవనసౌభాగ్యాన్ని తిలకిస్తూ హిరణ్యకశిపుడు తుదకు అమరేశ్వరసింహాసనాన్ని అధిష్ఠించాడు. కమలభవ కమలాక్ష కమలహస్తులు ముగ్గురూ తప్ప తక్కిన లోకపాలకముఖ్యులందరూ కానుకలను తెచ్చి సమర్పించారు. ఆ దనుజేశ్వరుని కీర్తిని విశ్వావసుడు, తుంబురుడు, మా బోంట్లు పాడాలని నిశ్చయించారు. అప్సరసలు నృత్యం చేశారు. గంధర్వులు గొంతెత్తి పాడారు. సర్వవర్ణాశ్రమాల వారు వారి యజ్ఞాలలోని హవిర్భాగాలను అతనికి అందజేశారు.

ధర్మజా! అతని ఆజ్ఞకు భయపడి సప్త ద్వీపాత్మక భూమండలమంతా దున్నక మునుపే పండసాగింది. అతను కోరిన కోర్కెలను స్వర్లోకం కురియజొచ్చింది. నభోలోకం అతనికి సర్వవినోదాలను కూర్చింది. సాగరాలు తమ గర్భాంతరరత్నాలను తరంగహస్తాలతో తెచ్చి నజరు పెట్టాయి. అతని క్రీడాప్రదేశం ఎప్పుడు చూసినా పుష్పాదిశోభాయమానంగా ఉండేటట్లు ఏర్పాటుచేయటమే ఋతువుల విధిగా మారింది. అతను లోకైకనాయకుడై జితేంద్రియుడు కానందువల్ల మహైశ్వర్యమత్తుడై తన మాటే శాస్త్రప్రమాణంగా సాగిస్తూ యథేచ్ఛాభోగాలలో తేలియాడసాగాడు.

## దేవతల మొర

ధర్మజా! అతని పరిపాలన నానాటికీ మహోగ్రమై నిరంకుశం కాసాగింది. లోకపాలకాదులు దానిని భరింపలేక విష్ణువు తప్ప వేరొక గతిలేదని

నిశ్చయించారు. కాని వారందరూ లోకపాలనోద్యోగంలో నిమగ్నులై ఉన్నందువల్ల కొలువు చాలించి ఆ దేవదేవుని సందర్శనార్థం వెళ్ళగల అవకాశం వారికి కలుగలేదు. మార్గాంతరం లేక వారు తమ తమ స్థానాలనుంచి శ్రీమహావిష్ణువున్న దెసకు మరలి, 'దేవా! ఇదే నీకు ప్రణామం' అని చేతులెత్తి మొక్కి నిద్రాహారాలు వర్జించి నియతాత్ములై ఆ సర్వేశ్వరుని లోలోన స్మరింపసాగారు. తమ మనోభావం బహిర్గతమైతే దైత్యేశుని వల్ల ముప్పు తప్పదని తెలిసి వారు అంతర్గతప్రార్థనలు చేయసాగారు.

కొన్నాళ్ళ తర్వాత ఒక శుభదినాన గగనతలం నుంచి, 'దేవతరాలా! భయపడకండి. అంతా మేలే జరుగుతుంది. ఆ దైత్యాధముని దుర్వృత్తికి శాంతి కావిస్తాను. ఒక్కింత కాలం ఓపికపట్టండి. గోబ్రాహ్మణవేదాలను సురలను సాధుజనధర్మాలను నన్ను ద్వేషించేవాడు శీఘ్రనాశం పొందక మానడు. నా చేతనే అతను చావనున్నాడు' అన్న పల్కులు వినవచ్చాయి. ఆ మాటలు చెవిసోకినంతనే సురలు కొంత శాంతినొంది ఆ పరమేశ్వరునికి నమస్కరించి మంచికాలం రానున్నదని ప్రతీక్షింపసాగారు.

## ప్రహ్లాద ఘట్టం

ధర్మజా! హిరణ్యకశిపునికి నలుగురు కొడుకు లుండేవారు. వారిలో ప్రహ్లాదుడు పెద్దవాడు. అతను పుట్టుకతోనే సద్గుణసంపన్నుడై సర్వభూత ప్రియత్వం సాధుసేవ పితృవాత్సల్యం దీనజనానుకంపామతి కలిగి జితేంద్రియుడై విద్యామదం ధనమదం అభిజనమదం రూపమదాలకు ఎడమీయక పరమేశ్వరసేవాహేవాకమే నిత్యకర్మగా ఉండేవాడు. అంతెందుకు! సాధువెవరంటే పగవారు కూడా అతనినే తలచుకొనేవారు కదా!

## ప్రహ్లాదుని బాల్యవర్తనం

ధర్మజా! ఆటపాటలంటే బాలకులకు పోయిన ప్రాణాలు లేచివస్తాయి. ప్రహ్లాదుడు తన తోడి బాలురను కూడి క్రీడాప్రదేశాలకు పోయినప్పుడు సహచరులు క్రీడావినోదాలలో ఉండగా అతను జడప్రాయుని వలె ఒకచోట

కదలక మెదలక కూర్చొని ఉంటాడు. తానెక్కడున్నది, తనతో వచ్చినవారు ఏమిచేస్తున్నదీ అతనికి తెలుసుకోవాలనిపించదు. పైకి చూడటానికి అందరి వలెనే అతను కూడా భోజనం వేళకు భోజనానికి వస్తాడు, శయనిస్తాడు, తిరుగుతాడు, కూర్చుంటాడు, మాట్లాడతాడు, అన్యుల కర్మేంద్రియాలు ఎలాగో అతని కర్మేంద్రియాలు కూడా తమ తమ విధులను నిర్వర్తిస్తుంటాయి. కాని తత్కార్యాలలో ఏ ఒక్కటీ అతనికి మనోగతం కాదు. ఏదో పరధ్యానంలో ఉండి అతనొకసారి నవ్వుతాడు; ఒకసారి అనభ్యస్త మాధుర్యం తొణికిసలాడే కంఠస్వరంతో లలిత లలితంగా గానాలాపనలు వినిపిస్తాడు. ఒకసారి పరవశించి నృత్యం చేస్తాడు; ఒకసారి భగవంతుని అనుకరిస్తాడు; ఒకసారి బిగ్గరగా అరుస్తాడు; ఒకసారి పులకరింతలతో మైమరచిపోతాడు; ఒకసారి ఆనందబాష్పాలు చిప్పిల్లగా ప్రఫుల్లవదనుడై నవ్వులను కురిపిస్తాడు. ఇవన్నీ ప్రహ్లాదుడు బుద్ధిపూర్వకంగా చేస్తున్నాడని జనులనుకొనేవారు గాని అతనికి మాత్రం తానలా చేస్తున్న సంగతే అసలు స్మరణకు రాదు. మనస్సు దేనిపట్లనో లీనమై ఉన్నప్పుడు బాహ్యేంద్రియవృత్తులు తెలియరాకపోవటం సహజమే కదా! ప్రహ్లాదుని చిత్తం భగవదాయత్తమై తదేకవృత్తితో చరింపసాగింది. ఆ వృత్తిలో ఉన్న చిత్తావస్థితి ఏమిటని అడుగుతావేమో. అప్పుడది ఆత్మానందాన్ని బహువిధాల అనుభవిస్తూ అన్య విషయాలను మరచిపోతుంది. ఆ ఆనందం తనంత తానుగా పొంగి పొరలినప్పుడు ఆ తరంగాల వేగానికి భక్తుని శరీరావయవాలు గగుర్పొడుస్తాయి. అటువంటి మహానుభావుడు హిరణ్యకశిపునికి వెగటయ్యాడు. ఆ దైత్యేశ్వరుడు పుత్రమమకారాన్ని సయితం విస్మరించి ప్రహ్లాదునికి చేసిన ద్రోహం వర్ణనాతీతం' అని చెప్పాడు.

పరీక్షిన్నరేంద్రా! ఆ మాట వినగానే ధర్మజునికి నిలువెల్లా పులకోద్గమం కలిగింది. ఆ పాండవాగ్రజుడు వెంటనే సమాధానం చెంది, 'దేవర్షివర్యా! పుత్రులు దుష్టులైనప్పుడు వారిని శిక్షింపగోరిన తల్లిదండ్రులు కోపపడటం సహజమే. అంతే కాని బిడ్డలకు ద్రోహాన్ని తలపోయరు. ప్రహ్లాదుడు పరమసాధువని మీరన్నారు. అట్టి పుత్రరత్నాన్ని అక్కున జేర్చుకొని తల్లిదండ్రులు ఎంతైనా ఆనందింపవచ్చు. హిరణ్యకశిపుని వర్తన

విపరీతంగాను, గర్వంగాను ఉన్నది. అతను ఆ విధంగా ఎందుకు వర్తించాడో తెలియజెప్పండి' అన్నాడు. నారదుడు చెప్పాడు.

## ప్రహ్లాదుని విద్యాభ్యాసం

'ధర్మనందనా! ప్రహ్లాదుని చరిత్రను పూర్తిగా వింటే గాని నీ సంశయం వీడదు. సావధానంగా విను.

అసురులకు శుక్రాచార్యుడు పురోహితు డన్న మాట వినే ఉంటావు. శుక్రాచార్యునికి చండామార్కు లని ఇద్దరు కొడుకు లుండేవారు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదునికి విద్యనేర్పమని ఆ ఇద్దరినీ నియమించాడు. వారు దైత్యాధీశుని మందిరాననే నివసిస్తూ ప్రహ్లాదునికి, అతని తోడి బాలురకు దండనీతి మొదలైన విద్యలను బోధింపసాగారు. ప్రహ్లాదునికి పుట్టుకతోనే సర్వనీతులూ హృదయంగమాలు. అంత మాత్రాన అతను గురువులను ఉల్లంఘింపక వారు చెప్పిన పాఠాలను శ్రద్ధగా వింటూ చదువుతూనే ఉన్నాడు. కాని ఆ చదువులు అతనికి ఎంత మాత్రమూ రుచించేవి కావు. ఏమంటావేమో? చదువులన్నీ సాధారణంగా 'నీవు, నేను' అనే అభిమానాన్ని ఆశ్రయించుకొని ఉంటాయి. ప్రహ్లాదుడు ఆ మెట్టు దాటి సర్వసమబుద్ధితో ఉన్నవాడు కాబట్టి అతనికి మిథ్యాభినివేశ పూర్వకంగా ఏర్పడిన నీత్యాదిక విద్యలు రుచింపలేదు.

## విద్యాపరీక్ష

ఒకనాడు హిరణ్యకశిపుడు పుత్రుడేమాత్రం చదివాడో తెలుసుకోవాలని కుతూహలపడి కొడుకును రప్పించి తొడపై కూర్చుండబెట్టుకొని, 'నాయనా! నీవు చదివిన చదువులలో ఏది నీకు ఉత్తమమని తోచిందో చెప్పు' అని లాలించాడు. ప్రహ్లాదు డా మాట విని, 'తండ్రీ! సంసారము 'నేను, నాది' అనే భావాల వలన కలుగుతున్నది. అది శాశ్వతం కాదు. ఈనాడున్నది రేపు లేకపోవటం చూస్తూనే ఉన్నాము కదా! ఎండమావుల వంటి ఈ సంసారంలో కొంతకాలం గడిపినా ఆత్మదాహం తీరదు. జీవరాశి ఆనందార్థమై

ప్రాకులాడుతుంటుంది. అది దాని స్వభావం. ఆనందాన్ని కోరుకొనటం యుక్తమే గాని శాశ్వతానందాన్ని కోరుకోవాలి. శాశ్వతానందాన్ని పొందటానికి శాశ్వతపదార్థాన్ని ఆశ్రయించాలి. ఆ పదార్థమేదో తెలియక జీవరాశి సంసారమే ఆనందాశ్రయమన్న భ్రాంతితో ఎండమావుల కోసం ఎగబ్రాకుతున్నది. అట్టి శాశ్వతమైన పదార్థం హరిపాదం తప్ప వేరొకటి లేదు. అదే అందరికీ ఆశ్రయణీయం కాబట్టి అంధకూపతుల్యమైన సంసారాన్ని వదలి వనాంతరం చేరి హరిని ఆశ్రయించట మొక్కటే ఉత్తమమని, అదే ఉత్తమ విద్య అని నా భావం' అని చెప్పాడు.

ధర్మజా! ఆ మాటలు వినగానే హిరణ్యకశిపుని నిలువు నిలువునా మంటలెగశాయి. అతను తహతహ పడుతూ 'ఔరా! ఈ పసికూన మనస్సును ఎవరో దురాత్ములు చేరి చెరిచారు. ఈ పని విష్ణుపక్షపాతులు చేసి ఉంటారు.' అని ఊహించి, తన ఆగ్రహాన్ని లోలోపలే అణచుకొని గురువులను రప్పించి 'ఒజ్జలారా! ఈ పసికూనకు చక్కని విద్య బోధించండి' అని హెచ్చరించి ప్రహ్లాదుని వారికి అప్పజెప్పాడు.

## గురువులతో సంవాదం

చండామార్కులు ప్రహ్లాదుని విద్యామందిరానికి తీసుకొనివెళ్ళి సంగతి విచారించారు. ప్రహ్లాదుడు జరిగిన, ఉదంతాన్ని వారికి చెప్పాడు. ఆ మాటలకు వారతనిని బుజ్జగించి, 'నీతో కలిసి ఇంతమంది చదువుతున్నారు. మీ అందరికీ ఒక్క తీరుననే చదువుసాములు చెబుతున్నాము. వారికి కలుగని ఈ బుద్ధిభేదం నీకెలా జనించింది? ఇది తనంతట నీకు కలిగిందా? పరులెవరైనా వచ్చి నీకు బోధించారా? సత్యం దాచక చెప్పు' అని అడిగారు.

ప్రహ్లాదుడు వారితో 'గురువర్యులారా! స్వపరభేదమన్నది మిథ్యాభూతం. అది సత్యం కాదు. మోహఫలం వలన అటువంటి భేదభావం కలుగుతున్నది. ఆ మోహం భగవన్మాయాయోగం వలన జనిస్తున్నది. మోహమంటే వట్టి పశుబుద్ధి మాత్రమే. ఆ మోహం ఉన్నంత కాలం శాంతి కలగదు. శాంతి

లేనినాడు సుఖం ఎక్కడినుంచి వస్తుంది? మోహకార్యమేమిటంటే అది వట్టి కోర్కెలను పెంచి ఆకాశాని కెత్తుతుంది. కోర్కెలకు తనివి తీరటం ఉండదు. సుఖాన్ని కోరేవాడు మొట్టమొదట మనశ్శాంతి సాధించాలి. శాంతిని పొందాలంటే ప్రప్రథమంగా మిథ్యాభూతమైన పశుబుద్ధిని ఉన్మూలించివేయాలి. అది పైకి సులభసాధ్యంగా కనిపించినా సామాన్యకార్యం కాదు. అందుకు పరమేశ్వరానుగ్రహమే పరమసాధనం. ఆ భగవానుడు ఎవరిని అనుగ్రహిస్తే వారు స్వపరభేదబుద్ధిరహితులై కృతార్థులవుతారు.

పరమాత్మను ఆశ్రయించినవారికి బుద్ధి స్వపరభేదాన్ని కోల్పోతుంది. బుద్ధి ఒక వస్తువును ఆశ్రయించినప్పుడు ఆ వస్తుశక్తి బుద్ధియందు వ్యాపిస్తుంది. ఇది అనుభవైకవేద్యమే కదా. పరమాత్ముడు భేదరహితుడు, సర్వాంతర్యామి అయినవాడు. అందువల్ల భగవంతుని త్రికరణశుద్ధిగా ఆశ్రయిస్తే ఆ తత్త్వమే బుద్ధియందు వ్యాపిస్తుంది. అది భేదరాహిత్యస్థితిని పొందుతుంది. భగవచ్ఛక్తి యొక్క తత్త్వాన్ని గ్రహింపలేక లోకం ఎల్లవేళల 'నీవు, నేను' అనే భావాలలో తగుల్కొని పడరానిపాట్లు పడుతున్నది. ఈ విషయంలో వేదవాదులకే భ్రమ కలుగుతుంటే సామాన్యుల సంగతి అనుకోవటం ఎందుకు?

గురువర్యులారా! బుద్ధిభేదాన్ని బట్టి మతభేదం ఏర్పడుతుంది. నా దృష్టి వేరుగా మీ దృష్టి వేరుగా ఉన్నది. దానిని బట్టి నాకు మతభేదం కలిగిందని, దాని నెవరో బోధించి ఉంటారని మీ అనుమానం. ఇట్టి బుద్ధిని పరమాత్ముడే నాకు కలిగించాడు. అన్యులెవరో కాదు. సూదంటు రాయి చెంతనుంచిన ఇనుపముక్క వలె ఆ లోకధాముని చెంతనుంచిన నా హృదయం అటువైపే లాగుతున్నది. ఈ విధంగా యదృచ్ఛాపరిణామాన్ని గన్న నా చిత్తం మీ ఉపదిష్టాలకు వేరుగా ఉంటుంది. గురువర్యులారా! మీరడిగినదానికి కల రూపును విన్నవించాను' అని చెప్పాడు.

ధర్మజా! గురువులు ఆ మాటలు విని కోపపడి, 'ఓరీ! బెత్తం తీసుకొనిరండి! ఇతను కులహాని కోసం పుట్టినట్లున్నది. వీడివల్ల మనకు చెడ్డపేరు వచ్చింది. ఈ దుర్మతిని దండించి దారికి తీసుకొని రావాలి. ఔరౌరా!

దానవవంశమనే చందనవనానికి విష్ణువు పెనుగొడ్డలి వంటివాడు. ఆ గొడ్డలికి వీడు పదునుపెడుతున్నాడు' అని అదరింపులు బెదరింపులు పూర్తయాక మళ్ళీ అతనికి త్రివర్గవిద్యను నయభయాల బోధించారు.

## తండ్రితో ద్వితీయసమావేశం

కొన్నాళ్ళ తర్వాత గురువులు హిరణ్యకశిపుని వద్దకేగి 'దానవేశ్వరా! నీ కుమారుడు దండనీతిని సమగ్రంగా నేర్చుకొన్నాడు' అని చెప్పారు. దైత్యనాథు డందుకు ఎంతో సంతోషించి పుత్త్రుని ప్రతిభ తెలిసికోవాలని ఉవ్విళ్ళూరుతూ అతనిని వెంటబెట్టుకొని రమ్మని ఆజ్ఞాపించాడు.

దైత్యకుమారులు ప్రహ్లాదునికి నలుగు పెట్టించి జలకమార్చి మంచి దుస్తులు తొడిగి సర్వసిద్ధంగా అతనిని దైత్యేశుని వద్దకు తీసుకొని వెళ్ళారు.

ప్రహ్లాదుడు తండ్రి పాదాలకు నమస్కరించాడు. హిరణ్యకశిపుడు కొడుకును కౌగిలించుకొని ఎత్తుకొని ముద్దాడి మనసారా దీవించి తొడపై కూర్చుండబెట్టుకొని శిరస్సు మూర్కొని ఆనందాశ్రువులు వర్షింపగా 'నాయనా! ప్రహ్లాదా! గురువులతో ఇంతకాలం చదివావు కదా! నీవు నేర్చినదాని సారమేమిటో చెప్పు' అన్నాడు.

ప్రహ్లాదుడు తండ్రి వంక మరలి, 'నాయనా! జీవునికి ఆనందానుభవేచ్ఛ నైజం. ఆ అనుభవానికి కల మార్గాలను చదువు బోధిస్తుంది. ఆ మార్గాలలో ఏది నిత్యానందానికి దారితీస్తుందో గ్రహించి వర్తిల్లటం పురుషుల కర్తవ్యం. ఆ మార్గాన్ని నిశ్చయించటం కష్టమేమీ కాదు. మనలో అంతఃకరణమనే ఇంద్రియం ఒకటున్నది. అది నాలుగు వృత్తులతో వర్తిల్లుతుంది. అవి బుద్ధివృత్తి అహంకారవృత్తి మనోవృత్తి చిత్తవృత్తి అని పేర్కొనబడతాయి. యుక్తాయుక్తాలను నిశ్చయించేది బుద్ధివృత్తి. ఆ నిశ్చయాన్ని జ్ఞానమంటారు. ఆ జ్ఞానాన్ని అహంవృత్తి స్వీకరించి వర్తిస్తుంది. దానికి విజ్ఞానమని పేరు.

తండ్రీ! ఆనందాన్ని అనుభవించాలంటే ముందుగా ఆనందాత్మక పదార్థం ఒకటుండాలి. ఆ పదార్థం కంటికి గోచరింపదు. దాని విలాసాలు రూపనామాలను దాల్చి విశ్వరూపాన పరిణమించి ఉంటాయి. ఆనందార్థులు విశ్వంలోని పదార్థాలను వారి వారి రుచుల ప్రకారం ఆశ్రయించి ఆనందిస్తారు. ఆ వస్తువులలోని ఆనందాంశలు వివిధగతులలో ఉంటాయి. అంశలు ఎన్నడూ పూర్ణఫలాన్ని ఇవ్వలేవు. అందువల్ల జీవులు తుమ్మెదల వలె ఒకదానిని చేరి దానిని విడిచి మరొకదానికి పరుగులు తీస్తుంటారు. వారికి గమ్యస్థానం ఎప్పుడూ దూరంగానే ఉంటుంది.

దీనిని బట్టి లోతుగా ఆలోచిస్తే క్షణభంగురమైన విశ్వమందలి వస్తువుల వలన కలిగే ఆనందం కూడా పరిమితమూ, క్షణికమూ అవుతుందని స్పష్టపడుతుంది. కాబట్టి ఆనందాన్ని పొందగోరినవారు శాశ్వతానందానికే ప్రయత్నించాలి. ఆ ప్రాప్తికి భక్తియే పరమసాధనం.

ఈ భక్తి వలన చేకూరే ఫలం ఏమిటంటే, బుద్ధిని క్రమ్ముకొని ఉండే మలినాలన్నీ తొలగి అది స్వచ్ఛమవుతుంది. అప్పుడు దాని నిశ్చయశక్తి సమగ్రము, ప్రమాదరహితము కాగలుగుతుంది. అట్టి బుద్ధి నిశ్చయించిన విషయాన్ని అహంవృత్తి గ్రహించి అనుభవించేటప్పుడు ఆ అనుభవం నిర్వికల్పంగా శాశ్వతంగా పరిఢవిల్లుతుంది.

భక్తికి భజనీయపదార్థం ఉండాలి. శాశ్వతానందాన్ని కోరినప్పుడు భజనీయమైన వస్తువు కూడా పూర్ణము, శాశ్వతము అయినదిగా ఉండాలి. ఆ వస్తువేది? అని అడుగుతావేమో. ఏ వస్తువు యొక్క ఆనందవిలాసం విశ్వరూపాన పరిణమించి జీవుని ఆనందాంశలకు ప్రలోభింపజేసి పరిభ్రమింపజేస్తున్నదో ఆ వస్తువొక్కటే భజనీయం. ఆ పరమార్థవస్తువేది? అంటే, శ్రీమహావిష్ణువే ఆ పరమార్థవస్తువు. వేరొకటి కానేరదు.

తండ్రీ! ఇదే నా చదువుల సారం' అని విన్నవించాడు.

## గురుపుత్ర నింద

ధర్మజా! ఆ మాటలకు హిరణ్యకశిపుడు మహోగ్రహోదగ్రుడై గురుపుత్రుల వంకచూసి పండ్లు పటపట గీటి, 'బ్రాహ్మణాధములారా! నేను దయ తలిచిన కూడు తిని బట్ట కట్టి నన్ను మోసగించినది చాలక నా సుతునికి నా శత్రువునందు భక్తి కలిగిస్తారా? ఇంతకంటె నాకు వేరే ద్రోహం ఉన్నదా? అసాధువులు కపటవేషధారులై లోకానికి కీడు చేస్తారు. ఆ మోసానికి ఫలం చిట్టచివరికి చేసినవారికే తగులుతుంది. అది మరిచి కదా మోసాలు చేయటం? బ్రహ్మహత్యాదులకు ఫలంగా తీరని రోగాలు కలుగుతున్నట్లే లోకవంచకులకు తత్తత్కర్మోచితమైన ఫలం తప్పదు' అని రోషకషాయస్వరంతో హుంకరించాడు.

## గురుపుత్రుల సమాధానం

ధర్మజా! గురుపుత్రులు ఆ కఠిన వచనాలను విని, 'ఇంద్రారీ! నీ సుతుడు చెప్పిన విశేషార్థం మేము గాని పరులుగాని బోధించినది కాదు. అయితే ఎక్కడ నేర్చాడంటావేమో. అది ఒకరు నేర్పిన విద్య కాదు. అతని స్వభావమే అతనికి ఆ అర్థాన్ని భాసింపజేసింది. ఇందులో మా తప్పు గాని, మరొకరి తప్పు గాని లేదు. కాబట్టి కోపాన్ని మాను. నీ కూడు తిని నీ గుడ్డకట్టి నీకు ద్రోహం తలపెట్టే మందభాగ్యులము కాము. లేని తప్పులను మాకు మూటగట్ట వద్దు' అన్నారు.

## పునర్వివాదం

అప్పుడు దనుజేశ్వరుడు పుత్రుని వంక చూసి, 'దురాత్ముడా! ఈ బుద్ధి నీకెక్కడి నుంచి వచ్చింది?' అని గద్దించి పలికాడు. ప్రహ్లాదుడు జంకుగొంకులు లేక, 'తండ్రీ! ఇంద్రియాలకు లొంగి సంసారజంబాలంలో చిక్కుకొని తిన్న మురికి కోసమే మళ్ళీ ఆశపడే గృహాసక్తులకు హరిమీది భక్తి స్వయంగా కాని, పరోపదేశాల వల్ల నైతేనేమి, కోటిజన్మలెత్తినా రాదు. ఆ బుద్ధి స్వయంగా ఎక్కడి నుంచి వస్తుందంటే, ఆ సంగతి ముందే చెప్పాను. అయినా మళ్ళీ

విన్నవిస్తాను. చలిచీమ మొదలు బ్రహ్మపర్యంతం సకల శరీరాల లోనూ దీపము వలె భగవంతుడు వెలుగుతుంటాడు. ఆ జ్యోతిని అంతఃకరణం కప్పి ఉంచుతుంది. అంతఃకరణమంటే భోగ్యఫల వాసనా సముచ్చయం. అది భోగ్యఫలాలను బట్టి శుద్ధము గానో మాలిన్యవంతం గానో ఉంటుంది. అది శుద్ధమయితే దానిలో ఉన్న దీపపు కాంతి మురికి లేని గాజుకుప్పె లోని దీపపు వెలుగు వలె వెలికి ప్రసరిస్తుంది. ఆ వెలుగులో బుద్ధ్యాదులకు స్వరూపజ్ఞానం కలుగుతుంది. ఆ స్వరూపజ్ఞానానికే బోధ అని పేరు. అంతః కరణం మలినవాసనాసమాక్రాంతమయితే లోపలి జ్యోతి స్వయం ప్రకాశమానం అయినప్పటికీ మురికి గాజుకుప్పెలోని దివ్వె పోలికను బహిః ప్రకాశమానం కాలేదు. బుద్ధి యొక్క ప్రకాశాప్రకాశాలు దాని శుభ్రతాశుభ్రతలను బట్టి ఉంటాయని, ఆ శుభ్రతాశుభ్రతలు భోగ్య ఫలవాసనలను బట్టి ఉంటాయని తెలిసినప్పుడు బుద్ధివికాసం స్వయమో పరకీయమో ఊహింపవచ్చు.

తండ్రీ! బుద్ధి అంతఃకరణమాలిన్యం వలన స్వచ్ఛంగా లేనప్పుడు దానిని మోహం ఆవరిస్తున్నది. అందువల్ల మంచి చెడుగులను నిర్ణయింపలేక మంచిని చెడుగా, చెడును మంచిగా పొరబడటం జరుగుతున్నది. చెడును మంచిగా గ్రహించి దాని మూలాన ఆనందాన్ని పొందాలనుకోవటం విషయాసక్తికి కారణం. అట్టివారు వేదసూత్రానికి కట్టుబడి విషయప్రపంచం లోనే తిరుగులాడుతుంటారు. వారిని అనుసరించేవారి గతి అంధానుసరణమాత్ర మవుతుంది. అట్టివారికి మంచి ఎన్నటికీ కలుగదా? అంటే, మహాత్ముల పాదపద్మపరిమళం వారిని సోకితే వారి అంతఃకరణమాలిన్యం తొలగిపోతుంది. తత్ఫలంగా లోపలున్న భగవత్ప్రకాశం వారి బుద్ధిదర్పణంలో యథాస్థితంగా వెలుగొందుతుంది. ఆ వెలుగులో యుక్తాయుక్తాలను గ్రహించి అయుక్తాలను వదలి యుక్తాలను స్వీకరించాలి. దీనినే విషయవిరక్తి భగవద్భక్తి అంటారు’ అని చెప్పి ఊరుకొన్నాడు.

## పుత్రవధకు ఆదేశం

ధర్మజా! దైతేశుడు ఆ మాటలకు భగ్గున మండిపడి తొడపై ఉన్న ప్రహ్లాదుణ్ణి పడద్రోసి కన్నుల నిప్పులు కురిపిస్తూ భటుల వంక మరలి, 'రక్కసులారా! ఈ పాపాత్ముడు తన పినతండ్రిని చంపినవారి పాదాలకు మ్రొక్కుతున్నాడు. నా శత్రువును పూజించేవాడు నాకు భ్రాతృఘాతకునితో సమానం. తల్లిదండ్రులకు ఏది మేలో చూడడట. కని పెంచినవారికే కీడు సంకల్పించిన ఈ ద్రోహిని విష్ణువెలా నమ్ముతాడో నమ్మి చేరదీస్తాడో చూద్దాము. అహితుడు సుతుడైనా త్యాజ్యుడే; హితుడు శత్రువైనా మనకు మాన్యుడే కదా! చెడిన అంగాన్ని ఖండించి శరీరాన్ని కాపాడినట్లు దుష్టుడైన పుత్రుని విసర్జించి కులాన్ని రక్షించుకోవాలి. ఆరేండ్ల పసివాడంటారా? విషసర్పం చిన్నదని విడవవచ్చునా? పైగా వీడు అహితుడైనది చాలక కొడుకు కూడా అయినందువల్ల హితశత్రువు కాకమానడు. ఈ కుమతిని తెగటార్చి వచ్చి నాకు చెప్పండి' అని ఆజ్ఞాపించాడు.

## ప్రహ్లాదుని బాధలు

ధర్మజా! ఆ మాటతో రాక్షసులు నిర్దయాత్ములై వాడి యీటెలతో సూదిమొన బల్లెములతో తీక్ష్ణఖడ్గాలతో ప్రహ్లాదుని పొడిచి గ్రుచ్చి నరికారు. ఆ శిశువు 'శ్రీహరీ' అంటూ తలవంచుకొని ఉండిపోయాడు. భటులు ముందుకు వచ్చి ఎన్ని పర్యాయాలు నరికినా అతని శరీరం కసుగందలేదు. అది దైత్యేశ్వరుడు చూసి ఆశ్చర్యపడి, 'ఇంకా ఏమి కానున్నదో తెలియదు. ఏమైతేనేమి? ఇతనిని మననీయరాదు' అని నిశ్చయించి ఆ పసివాడిని మత్తేభాల చేత త్రొక్కించాడు; విషసర్పాల చేత కరిపించాడు; పర్వతశిఖరాగ్రాల నుంచి కిందికి తోయించాడు; నేల బొరియలో పూడ్పించాడు; గరళం తాగించాడు; మంచుగడ్డలలో పాతించాడు; నీటిలో ముంచాడు; అగ్నిలో పడవేయించాడు, అయినా ప్రహ్లాదుని ఏమీ చేయలేకపోయాడు. అంత దానవేశ్వరుడు మారణహోమ ప్రయోగాలను, నిరసనశిక్షలను కావించాడు. ఇక పెట్టదగిన బాధలే లేవన్నంత దాకా బాధించి చూశాడు.

## హిరణ్యకశిపుని మనోవ్యథ

ధర్మజ్ఞా! తన ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతుంటే చూసి దైత్యరాజు, 'ఆహా! ఇతని యెడ మహా ఘోరయత్నాలు కూడా చెల్లరానివైనాయి. ముక్కుపచ్చలారని పసివాడై ఉండి బాధలకు తొణకడు. విన్నబాటు చెందడు. ఏమిటిది! ఇతని ప్రభావం అమేయంగా ఉన్నది. ఇతనితోడి వైరం నా అంతానికే వచ్చిందేమో' అని కలవరపడి తలదించుకొన్నాడు.

## చండామార్కుల ఊరడింపు

ధర్మజా! చండామార్కు లా వింతలన్నీ చూసి ఆశ్చర్యపడి హిరణ్యకశిపుని సమీపించి, 'దనుజేశ్వరా! ముల్లోకాలను ఏకాతపత్రంగా పరిపాలిస్తున్న నీకు చింతా కారణం కలుగరాదు. పుత్రకుని గురించి చింతిస్తున్నానంటావా? పసిబిడ్డల గుణదోషాలు పరామర్శకు తగవు. ఒక్కటి మా మనసులో ఉన్నమాట చెబుతున్నాము. భార్గవు డిక్కడికి రానున్నాడు. అందాకా ఇతను పారిపోకుండా వరుణపాశంతో బంధించి ఉంచు. ఆ గురువర్యుడు మహాప్రభావశాలి. ఇతనికి బుద్ధిగరపి నీతిమంతుని కావిస్తాడు. గురు సేవ వలన కాలక్రమాన బుద్ధి కుదురు కొంటుంది. మా మాట కాదనకు' అని చెప్పారు. హిరణ్యకశిపు దందుకు సమ్మతించి 'గురుకుమారులారా! ఇతనికి రాజధర్మాలను, గృహస్థధర్మాలను చక్కగా బోధించండి' అని చెప్పి ప్రహ్లాదుని వారి వెంట పంపాడు.

## ధర్మార్థకామ శాస్త్రబోధనల తత్త్వం

ధర్మజా! గురుకుమారులు అతనిని వెంటగొనిపోయి ధర్మార్థకామశాస్త్రాలను పూసగుచ్చినట్లు బోధించారు. ప్రహ్లాదుడు గురువుల బోధనలను విని 'అయ్యో! వీరి బోధనలు సారాన్ని వీరే గ్రహింపలేకపోతున్నారు. ఈ ధర్మాలన్నీ ద్వంద్వమతులై దుఃఖంలో ఉన్నవారికి తాత్కాలికోపశాంతికి గాను కల్పింపబడినవని వీరికి తెలియదా? ఈ ధర్మాల మూలాన లోకప్రవృత్తి జరుగుతుంది. అవి బోధించే బోధనలు

అసద్వస్తువిషయికాలు. ఈ రహస్యాన్ని గ్రహింపక ఆ బోధనలే పరమార్థ బోధనలుగా జనులు భావించి భ్రాంతచిత్తు లవుతున్నారు' అని లోలోన చింతిస్తుండేవాడు.

## సహపాఠకులకు తత్త్వబోధనం

ధర్మజా! గురువులు ప్రతిదినం బడివేళ ముగిసిన తర్వాత వారి గృహకృత్యాలను తీర్చుకోవటంలో నిమగ్నులై ఉంటారు. అప్పుడు విద్యార్థులు ఆటపాటలతో ప్రొద్దుపుచ్చుతారు. అట్టి విరామకాలాలలో ప్రహ్లాదుడు క్రీడలలో పాల్గొనక తన తోడి బాలురను చేరదీసి వారికి తత్త్వాన్ని ఉపదేశింపసాగాడు. ఒకనాడు అదే విధంగా బాలకులందరూ ఒకచోట సమావేశ మయ్యారు. మాటల మధ్య అనేక తత్త్వరహస్యాలను చర్చించారు.

*ప్రహ్లాదుడు:-* మిత్రులారా! మనతో కలిసి మరికొందరు బాలకులు కూడా చదువుకొంటుండేవారు. వారిప్పుడేరీ? చనిపోయారట కదా! దీనిని బట్టి ఏమని తెలుస్తున్నది? శరీరాలు శాశ్వతాలు కావని, ఎవరికెప్పుడు ఏ విధంగా చావు కలుగుతుందో తెలియరాదని, దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకొనాలనే సామెత ప్రకారం ప్రాణమున్నప్పుడే మనకు శ్రేయమైనదానిని సంపాదించాలని, ఎన్నడూ ఏమరి ఉండరాదని ఏర్పడుతున్నది కదా!

*బాలకులు:-* ప్రహ్లాదా! మనుష్యుల ఆయుష్కాలం నూరేండ్లని అంటారు. మనతోడి బాలకులు ఇంత చిరుతప్రాయంలో ఎందుకు చనిపోయారు?

*ప్రహ్లా:-* మిత్రులారా! ఆయుష్కాలమంటే ఏమిటి? జీవుడు తన భోగ్యకర్మఫలాన్ని ఏ తనువుతో ఎంతకాలం అనుభవింపవలసి ఉన్నదో అంత కాలం ఆ తనువులో ఉంటాడు. ఆ కాలాన్ని ఆయుష్కాలం అంటారు. ప్రారబ్ధకర్మ ఫలానుభవానికి గాను తత్తదుచిత శరీరాలు కలుగుతుంటాయి. ఫలభోగపర్యంతమే ఆ శరీరం ఉంటుంది. ఆ తర్వాత నిమిషమాత్రమైనా నిలిచి ఉండదు. కర్మముల గతి ఒక్క రూపున లేదు. కొన్ని కర్మల ఫలాలు బహుకాలం అనుభవిస్తే గాని తీరవు. కొన్నిటి ఫలాలు స్వల్పకాలం లోనే

భుక్తమై నశించిపోతాయి; కొన్నిటి ఫలాలు కొన్ని సంవత్సరాల కాలం అనుభవింపగానే పూర్తవుతాయి. ఫలానుభవ కాల తారతమ్యాన్ని బట్టి జీవుని శరీర స్థితికాలం ఉంటుంది. అందువలన జీవితకాలం స్వల్ప మధ్యమ దీర్ఘావస్థలు కలదవుతున్నది. జననమరణతత్త్వం ఇట్టిదని గ్రహించాలి. ఎవరి కర్మఫలం ఎంత కాలం భోగ్యమవుతుందో ముందుగా స్థూలదృష్టికి బోధపడదు. తత్త్వవేత్తలు దివ్యదృష్టితో పరిశీలించి సామాన్యంగా కర్మఫలం మర్త్యశరీరంతో భోగ్యం కావలసివచ్చినప్పుడది నూరేండ్ల భోగ్యంతో సమాప్తమవుతుందని అన్నారు. అది సామాన్య వాక్య మన్నమాట. ఒక్కొక్కరు నూరేండ్లకు మించి జీవించటం కూడా ఉన్నది కదా! ఆ శరీరాలతో అనుభవింపనైన కర్మఫలభోగం ముగిసింది కాబట్టి వారు ఆ శరీరాలను బాలప్రాయంలోనే వదలటం జరిగింది.

*బాల:*– ప్రహ్లాదా! కొందరు గొప్ప ధీమంతులుగా ఉంటారు; కొందరు గాఢ మందమతులుగా ఉంటారు. కొందరు కోటీశ్వరులుగా ఉంటారు. కొందరు నిత్యదరిద్రులుగా ఉంటారు. కొందరు గొప్ప ఆరోగ్యవంతులుగా ఉంటారు. కొందరు నిరంతరవ్యాధిగ్రస్తులై ఉంటారు. ఈ తారతమ్యాలకు కారణం ఏమిటి?

*ప్రహ్లా:*– మిత్రులారా! అన్ని కర్మలకు సంకల్పం ప్రధానం. సంకల్పాను రూపంగా కర్మము, ఫలోదయం కలుగుతాయి. మీరు చెప్పిన భేదాలన్నీ వారి వారి పూర్వజన్మకృతసంకల్పాల, కర్మముల భేదాలే తప్ప ఈనాడు సరికొత్తగా తెచ్చుకొన్నవి కాదు. విత్తొకటి నాటితే చెట్టొకటి మొలవదన్న సామెత మీరు వినలేదా?

*బాలు:*– పురుషప్రయత్నం చేత ఫలాలను మార్చటానికి వీలులేదా?

*ప్రహ్లా:*– పురుషప్రయత్నమంటే ఏమిటి? అహంకార పూర్వకంగా చేసే ప్రయత్నం పురుషప్రయత్నం కాదు. ఎందుకంటారా? లోకంలో ఎవరయినా సుఖంగా ఉండాలనుకొంటారు గాని దుఃఖాలు కావాలని అనుకోరు కదా! సుఖార్థమై చేయరాని పనులు చేస్తూ పడరానిపాట్లు పడుతుంటారు. ఆ

ప్రయత్నాలన్నీ ఫలకారు లవుతున్నాయా? 'ధనమూల మిదం జగత్' అనే మాటను నమ్మి ధనార్జన కోసం ప్రాణాలను కూడా కుదవబెడతారు. అంతమాత్రాననే ధనికు లవుతున్నారా? ఒక్కొక్కరికి తలవని తలంపుగా ధనం నిర్నిమిత్తంగానే సమకూడుతున్నది. వీటిని బట్టి చూస్తే ఫలాఫలాలు యత్నాధీనాలు కావని స్పష్టం.

*బాల:–* అలాగని ఊరికే ఉండమంటావా? రోగం వచ్చినప్పుడు మందు తీసుకోవటం లేదా? అది నయమైతే పురుషప్రయత్నఫలం కాదా?

*ప్రహ్లా:–* మిత్రులారా! మందు తీసుకొన్నవారందరికీ రోగనివృత్తి అవుతున్నదా? ప్రఖ్యాతవైద్యులు కూడా రోగగ్రస్తులై చనిపోవటం లేదా? వారి యెడ పురుషప్రయత్నం ఫలిస్తున్నదా? కాబట్టి కర్మఫలం భుక్తమై నశించాలే కాని దానికి మార్పును కలిగించటం వీలు కాదు. మీరన్న పురుష ప్రయత్నాలన్నీ తాత్కాలిక దుఃఖోపశాంతికి కొంత తోడ్పడతాయే గాని ఫలభోగవిధానాన్ని మార్చలేవు. ఇటువంటి దుఃఖోపశాంతి సాధనాలలో పరమ సాధనం ఒకటున్నది. దానిని సాధింపగలిగితే సర్వదుఃఖాలు ఉపశమిస్తాయి. అదేమిటంటారా? భగవదనుగ్రహమే సర్వదుఃఖోపశాంతికీ పరమౌషధం. దుఃఖాలన్నీ దేనికి కలుగుతున్నాయి? శరీరానికి కలుగుతున్నాయి. ఆ దుఃఖాలు మనకు ఎప్పుడు తెలిసివస్తున్నాయి? మనస్సు శరీరపరమైనప్పుడే అవి అవగత మవుతున్నాయి. నిద్రాసమయంలో ఎట్టి బాధలూ తెలియరాకుండటమే ఇందుకు నిదర్శనం. అందుకు కారణమేమంటారా? ఆ సమయంలో మనస్సు శరీర విముఖమై ఉండటమే కారణం. దీని వలన ఏమని తెలుస్తున్నది? సుఖదుఃఖాలన్నీ మానసికావస్థా విశేషములు మాత్రమే అని ఏర్పడుతున్నది. మనస్సు భగవన్ముఖ మైనప్పుడు అది శరీరాన్నే మరచిపోతుంది. అప్పుడు శరీరం పడే పాట్లు దానికి తెలియవు. భగవదనుగ్రహఫలంగా మనస్సుకు శాంతీ సుఖమూ కలుగుతాయి. మనస్సును ఆ విధంగా భగవత్పరం చేయటమే పురుషప్రయత్నం. అందుకు అహంకారం పూర్తిగా రహితం కావాలి. అహంకార రాహిత్యం శ్రవణ మనన

సాధుసేవా గురూపదేశాదుల వలన సిద్ధిస్తుంది. అందుకు కూడా పూర్వకృత శుభకర్మఫలం అంతో యింతో ఉండాలి. ఆ శుభకర్మఫలోదయ మైనప్పుడు అటువంటి బుద్ధి కలగటమూ దానికోసం ప్రయత్నించటమూ జరుగుతాయి.

*బాల:*– పూర్వకర్మశుభఫలం బొత్తిగా లేనివారి గతేమిటి?

*ప్రహ్లా:*– అంతో యింతో శుభకర్మఫలం భోగ్యమైనది లేనిదే మర్త్యజన్మ కలగదు. జీవితకాలంలో ఎప్పుడు ఆ శుభకర్మఫల భోగావసరం వస్తుందో అప్పుడతను తత్ఫలానుసారంగా శుభమతి అవుతాడు. అట్టి శుభచిత్త మందు అంతర్గతమై ఉన్న భగవంతుని యొక్క ప్రకాశం బయటికి వస్తుంది. ఆ వెలుగు ప్రభావం వలన అతను మేలుకొని భగవన్మార్గాన్ని ప్రవేశించి క్రమక్రమంగా గమ్యస్థానాన్ని చేరుకొంటాడు. కాబట్టి మర్త్యుడు నిరుత్సాహపడవలసిన అవసరం లేదు.

*బాల:*– అయ్యా! గురూపదేశం మేలుచేస్తుందంటే, మన గురువులు చెప్పినట్లు ఎందుకు చేయరాదు?

*ప్రహ్లా:*– మిత్రులారా! గురువాక్యానుసరణం తప్పక మేలుచేస్తుంది. అందులో సందేహం లేదు. ఒక్కటి మాత్రం మరవకండి. అందరూ గురువులు కారు. ఎవడు ఆత్మజ్ఞాని అయినవాడో అతడే గురు పదవికి తగినవాడు. అతని మాటను శిరసావహించాలి. ఆ విధంగా కాక కేవల శాస్త్రజ్ఞానమాత్రాన అజ్ఞాననిద్రలో ఉన్నవారి చిలుక పలుకులను నమ్మి నడుచుకొనే వారు అంధుని ఆశ్రయించిన అంధుని గతికి పాత్రులవుతారు.

*బాల:*– అటువంటి గురువు ఎలా లభిస్తాడు?

*ప్రహ్లా:*– మిత్రులారా! అటువంటి గురువును వెతక నవసరం లేదు. లోకైక గురువైన భగవానుడు మనలోనే అంతర్యామియై నిలిచి సర్వదా మనకు ఉపదేశిస్తూనే ఉన్నాడు. అహంకారవిమూఢులమై మనమతని ఉపదేశాన్ని చెవిబెట్టక వర్తించి భ్రష్టులమవుతున్నాము. ఆ గురువును శరణు కోరండి.

*బాల:*– ప్రహ్లాదా! నీ ఉపదేశసారాంశ మేమిటి?

*ప్రహ్లా:–* మిత్రులారా! జను లనుభవించే సుఖదుఃఖాదులు వారి పూర్వకర్మ ఫలాలు. వాటిని దైవికములని అంటారు. వాటిని అనుభవించి తీరాలి. ఆ అనుభవం శరీరానికే గాని శరీరాంతరమందున్న ఆత్మునికి కాదు. ఆత్ముడు నిర్వికారుడు నిస్సంగుడు పూర్ణుడునై నిత్యానందస్వరూపంలో ఉంటాడు. ఆ స్వరూపజ్ఞానాన్ని పొందటం ప్రతివ్యక్తికీ ప్రథమవిధి. ఆ కార్యం శరీరం ఉన్నప్పుడే చేయాలి. శరీరం క్షణభంగురం. కార్యనిర్వహణకు రేపుమాపు గాని కౌమారాద్యవస్థలు గాని నిరీక్షిస్తూ కాలాన్ని వ్యర్థపరచకూడదు. యుక్తాయుక్తాలను వివేచించి ఏ ధర్మం పరమార్థ ప్రదమయితే దానిని ఆచరించాలి. ఆ ధర్మమేదని అడుగుతావేమో? అదే భాగవత ధర్మం. అహంకార మమకారాలను వదలి సర్వాత్మకంగా భగవంతునికి సమర్పించు కొనటమే ఆ ధర్మవిధానం. అయితే దేహ పోషణాదుల మాటేమిటంటారేమో? సర్వాత్మ సమర్పకుల యోగక్షేమాలను భగవంతుడే సమకూరుస్తాడు. అందుకు రవ్వంతయినా చింతింప నక్కరలేదు. మిత్రులారా! మనుష్యజన్మ లభించటమే అతిదుర్లభం. అనేక సహస్రజన్మల సుకృతపరిపాకంగా మర్త్యజన్మ కలుగుతున్నది. అటువంటి జన్మను – పొందరానిదాన్ని పొంది, భాగవత ధర్మాలను ఆచరింపక ఆయుష్కాలమంతా క్షణికార్థాల కోసం వృథాపుచ్చటం కన్నా దుష్కర్మ ఏముంటుంది? కాబట్టి ఈ శరీరం ఉన్నప్పుడే ఆత్మక్షేమాన్ని సంపాదించాలి. ఇదే నా సందేశం.

*బాల:–* అందరూ క్షేమం కలగాలనే శ్రమిస్తుంటారు. నీవు చెబుతున్న క్షేమంలో ఉన్న విశేషమేమిటి?

*ప్రహ్లా:–* నేను చెబుతున్న క్షేమం ఆత్యంతికం. అందుకు మించినది లేదు. మీరంటున్నది క్షణికమైన ఇంద్రియపరమైన క్షేమం. ఇంద్రియాలను జయిస్తే గాని నేను చెప్పినది సాధ్యం కాదు. ఈ రెండిటికీ ఎంత భేదం ఉన్నదో చూశారా? జితేంద్రియుల జీవితకాలం పరమానందాబ్ధిలో ఓలలాడుతూ గడుస్తుంది. ఇంద్రియారాముల జీవితకాలం సగం నిశానిద్ర చేతను సగం బాల్యాద్యవస్థల చేతను హృతమవుతున్నది. బాల్యాద్యవస్థల కాలంలో నైనా

శాంతి కలుగుతుందా అంటే, ఆ కాలమంతా తీరని కోరికలతో గడిచిపోతున్నది. ఎట్టకేలకు జీవితం బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

*బాల:–* ప్రహ్లాదా! భాగవత ధర్మాలను వివరించి చెప్పు.

*ప్రహ్లా:–* మిత్రులారా! భాగవత ధర్మాలను తెలుసుకోవాలంటే భగవంతుడెవరో, ఎట్టివాడో ముందుగా తెలియాలి. ఏ తత్త్వం బ్రహ్మాదిస్థావరపర్యంతం వ్యాపించి ఉన్నదో, ప్రధాన మన్నది ఏ తత్త్వశక్తి వికారమో, ఏ తత్త్వం దాని శక్తివికారాలైన చరాచరాలలో ఉండటం వలన అవన్నీ తానే అవుతున్నదో, ఏ తత్త్వానికి జననాదిషడ్వికారాలు కలుగవో, ఏ తత్త్వం తన వ్యాప్యత్వాన్ని దృశ్యప్రపంచరూపం లోనూ, తన వ్యాపకత్వాన్ని ప్రత్యగాత్మస్వరూపం లోనూ ప్రకటపరుస్తూ తన ఉనికిని గోచరం చేస్తున్నదో, ఏ తత్త్వానికి జాతి గుణ లింగాది భేదాలు కలుగవో, ఏ తత్త్వం తన శక్తి యోగం వలన గుణసర్గకారణమవుతూ కార్యములైన గుణసర్గాలలో అవినాభూతమై ఉంటూ తదీశ్వరత్వాన్ని వహించి ఉంటుందో ఆ తత్త్వాన్ని భగవానుడు అంటారు. భగవానునికి పరమాత్మ నారాయణాది నామాంతరాలు ఉన్నాయి.

ఆ భగవానునికి సంతోషకరమైన పనులను చేయటం, ప్రీతికరాలు కాని వాటిని త్యజించటం భాగవతుల ధర్మం. భగవానునికి ప్రీతి కలిగించే పనులేమిటని అడుగుతారేమో? ఆ సంగతి తెలియటానికి మొదట మన బుద్ధి భగవత్పరం కావాలి. అందుకు మనలో ఉన్న ఆసురభావం అడ్డు వస్తుంటుంది. ఆ భావాన్ని ప్రప్రథమంగా త్యజించాలి. అప్పుడు యుక్తాయుక్తజ్ఞానం కలుగుతుంది.

*బాల:–* ధర్మకామార్థాలు పురుషార్థాలని, ఆ పురుషార్థాలను నిర్వర్తించేందుకు దండనీతి మొదలైనవాటిని తెలుసుకోవాలని మన ఆచార్యులు ఉపదేశించారు. ఆ సంగతేమిటి?

*ప్రహ్లా:–* మిత్రులారా! దండనీతి నయదమాలను వివరిస్తుంది.

వేదపూర్వభాగమైన త్రయీధర్మం కర్మవిధానాన్ని బోధిస్తుంది. అన్వీక్షకి (అనగా తర్క విద్య) హితాహిత విచార దక్షతను నేర్పుతుంది. వార్త అంటే జీవికా జ్ఞానజనకశాస్త్రం. అది కృష్యాదులను నెరవేర్చే విధానాన్ని, అంటే ఎవరెటు వంటి జీవికావృత్తికి అర్హులో దానిని బోధిస్తుంది. ఇవన్నీ ఆత్మార్థమై కాక భగవత్ప్రీత్యర్థమై ఆచరిస్తే సార్థకమవుతాయి. కాకుంటే నిరర్థకమవుతాయి. ఏమంటారా? స్వార్థమన్నప్పుడు భిన్నబుద్ధి, దానితోపాటు కామ మోహ లోభాలు పైబడుతున్నాయి. అన్ని క్లేశాలకూ స్వార్థబుద్ధి మూలం. కాబట్టి దానిని మొదట సంస్కరించాలి. అందుకు శాస్త్రం తోడ్పడుతుంది. అటువంటి సంస్కృతబుద్ధితో వారు వారు స్వధర్మాలను నిర్వహించాలి. ఆ ధర్మాలన్నీ ఫలకాంక్షారహితంగా చేయబడేవి కాబట్టి వాటి ఫలం భగవదర్పితమవుతుంటుంది. అటువంటి సర్వసమర్పణ బుద్ధితో వారి వారి ధర్మాన్ని నిర్వహిస్తూ సర్వకాల సర్వావస్థలలోనూ భగవంతుని విస్మరింపకపోవటమే మర్త్యులకు పరమధర్మం.

*బాల:* – ప్రహ్లాదా! ఇంతటి జ్ఞానం నీకెలా కలిగింది.

*ప్రహ్లా:* – మిత్రులారా! ఈ జ్ఞానాన్ని శ్రీమన్నారాయణుడు నారదమహర్షికి ఉపదేశించాడు. నారదమహర్షి వలన నేను దానిని గ్రహించాను.

*బాల:* – ప్రహ్లాదా! చిన్ననాటి నుంచి మనమందరమూ ఒకచోటనే ఉన్నాము. మమ్ము వదలి నీవు నారదుని ఎప్పుడు సేవించి ఈ జ్ఞానాన్ని పొందావు.

*ప్రహ్లా:* – మిత్రమా! సంగతి విను. నా తండ్రి సుర రాజ్యాన్ని ఆక్రమించాడు. సురలు నా తండ్రికి భయపడి భూలోకానికి పారిపోయి అక్కడ నేలబొరియలలో దాగి మంచికాలం కోసం ఎదురు చూడసాగారు. తర్వాత నా తండ్రి తపస్సుకోసం మందరాద్రికి వెళ్ళి ఎంత కాలానికీ తిరిగిరాలేదు. కొన్నాళ్ళకు నా జనకుడు చనిపోయాడనే వార్త వ్యాపించింది. ఆ మాటకు

సురలు సంతోషించి బొరియల నుంచి బయటపడి సురలోకానికి తిరిగివెళ్ళి అసురులను పారద్రోలి తమ తమ స్థానాలను ఆక్రమించారు. అసురులు స్వప్రాణ రక్షణార్థులై ఆలుబిడ్డలను కూడా వదిలి నలుదెసలకూ పారిపోయారు.

అంతట దేవేంద్రుడు విజయోల్లాసంతో రాజమహిషి అయిన నా తల్లిని చెరపట్టి నాకలోకానికి తీసుకొనిపోతున్నాడు. మార్గమధ్యంలో అతనికి నారదమహర్షి ఎదురై 'ఇంద్రా! వీరపత్ని, పతివ్రత, ఈమెను వదిలిపెట్టు' అని చెప్పాడు. ఇంద్రుడా మాట విని 'ఋషివర్యా! ఈమె గర్భంలో అసురేంద్రుని తేజం ఉన్నది. ప్రసవం వరకు కాచుకొని పని తీర్చి ఈమెను పంపివేస్తాను' అన్నాడు. నారదుడు అతని భావం గ్రహించి, 'ఇంద్రా! ఈమె గర్భంలో పరమభాగవతు డున్నాడు. ఆ పుణ్యమూర్తి నీ చేత చావడు' అని నచ్చజెప్పాడు. దేవేంద్రుడు ఋషివాక్యాన్ని మన్నించి నా తల్లిని విడిచిపెట్టాడు. నారదమహర్షి ఆమెను తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి, 'అమ్మా! నీ భర్త వచ్చేవరకు ఇక్కడే ఉండు' అని చెప్పాడు. నా తల్లి సరేనని పతి రాకకోసం నిరీక్షిస్తూ గర్భరక్షణార్థం తాను కలలు కన్న చరితార్థుడైన కొడుకు పుట్టుక కోసం ఎదురుచూస్తూ ఆ మునివర్యుని పరమభక్తితో సేవిస్తూండేది.

ఆ మహర్షివర్యుడు నా తల్లికి ధర్మతత్త్వాన్ని, జ్ఞానతత్త్వాన్ని ఉపదేశించాడు. ఆ ఉపదేశాన్ని నేను గర్భస్థుడనై ఉండి గ్రహించాను. మా తల్లి కాలక్రమాన ఆ ఉపదేశసారాన్ని మరచిపోయింది. అది స్త్రీలకు స్వాభావికమే కదా! నాటినుంచి నేటివరకు ఆ స్మృతి నా మనస్సులో ఇప్పటికీ ప్రత్యక్షరం నిలిచి ఉన్నది.

మిత్రులారా! బీజం ఉన్నప్పుడు పత్రపుష్పఫలాదులు పుట్టుతూ రాలుతూ ఉంటాయి. బీజం లేనప్పుడు అవేవీ ఉండవు. అలాగే కర్మము ఉన్నందువల్ల ఈ శరీరానికి జనన స్థితి వృద్ధి పరిణామ క్షయ వినాశాదులు కలుగుతున్నాయి. ఋతువు వచ్చినప్పుడు పత్ర పుష్పఫలాదులు పుట్టటం రాలటం చూస్తున్నాము. అలాగే ఫలభోగ్యకాలం వచ్చినప్పుడు శరీరజననాదులు కలుగుతూ

పోతున్నాయి. పుష్పాదు లే విధంగా జీవధర్మాలో, శరీరోత్పత్తి మొదలైనవి అదే విధంగా కర్మధర్మాలు. కాలశక్తి అన్నది బీజము వలెనే కర్మమును కూడా అంకురింపజేస్తున్నది. కాలశక్తి అంటే ఈశ్వరశక్తి అనే అర్థం.

మిత్రులారా! ఆత్మధర్మాలు అంటే ఏమిటని సందేహం కలుగుతుంది. ఆత్మధర్మాలు అతివిశిష్టమైనవి. నిత్యత్వము, అవ్యయత్వము, నిరవయవత్వము, అద్వితీయత్వము, క్షేత్రజ్ఞత్వము, ఆశ్రయత్వము, అవికారత్వము, స్వప్రకాశత్వము, కారణత్వము, వ్యాపకత్వము, అసంగత్వము, అనావృతత్వము అనే ఈ పన్నెండు ధర్మాలూ ఆత్మధర్మాలు. ఈ లక్షణాలలో ఏ ఒక్కటీ దేహానికి అన్వయించదు. కాబట్టి దేహం అంటే ఆత్మ కాదన్నమాట. ఈ రహస్యం బుద్ధిస్థ మైనప్పుడు దేహాత్మరూపమైన భ్రాంతి నశిస్తుంది. భ్రాంతితో పాటు దానికి కారణమైన అహంకారం మాయమవుతుంది. అహంకారం లేనివాడు 'నేను, నాది' అనే భావం ఉండదు. ఆ భావం లేనినాడు సర్వమూ తానే అవుతుంది. అప్పుడు దృశ్యము అని తనకంటె భిన్నంగా వేరొకటి కానుపింపదు. దీనినే అద్వితీయత్వ మంటారు.

మిత్రులారా! ప్రహ్లాదా! అని నిన్ను పిలిచేటప్పుడు మీ భావం ఏమిటి? అంటే శరారాన్ని ఉద్దేశించి పిలిచారా? లేక మరొకదాన్ని ఉద్దేశించారా? శరీరాన్ని ఉద్దేశించినట్లయితే నా శరీరం, నా కన్ను, నా కాలు అంటున్నాము. అంటే శరీరాదులు వేరని, నేను అన్న పదార్థం వేరని ఏర్పడుతున్నది కదా! ఆ నేను అనే పదార్థం ఏమిటంటారా? శరీరాంతరస్థమై జీవుడని ఏది చెప్పబడుతున్నదో అదే నేను అనబడే పదార్థం. శరీరాలు భిన్నభిన్నాలుగా అనేకములుగా ఉన్నందువలన శరీరాంతరస్థులైన జీవులు కూడా పెక్కుమంది ఉండాలి కదా! అని శంకిస్తారు కాబోలు. అంటే జీవనానాత్వం ఏర్పడుతున్నదని అంటారు కాబోలు. ఆ భావం సరికాదు. మధ్యాహ్నవేళ ఎండ కాస్తున్నప్పుడు పది గిన్నెలను నీటిలో నింపి ఆరుబయట ఉంచండి. ప్రతి గిన్నెలోనూ సూర్యబింబం కానవస్తుంది. ఘటజలంలో ప్రతిబింబించిన సూర్య ప్రతిబింబాల సంఖ్యను బట్టి సూర్యులు కూడా పెక్కుమంది అవుతారా? అన్ని

ఘటాలలో ప్రతిబింబించినది ఒక్క సూర్యుడే కదా! అలాగే నానా శరీరాలలోనూ ఆత్మ ఒక్కడే ప్రతిబింబిస్తున్నాడు. శరీరనానాత్వాన్ని బట్టి ఆత్మనానాత్వాన్ని భావించకూడదు.

శరీరనాశనం కలుగగానే ఆత్మనాశ మవుతున్నదని, అన్ని శరీరాలలో ఒక్క ఆత్మే ఉంటున్న పక్షాన ఒక్క శరీరనాశనంతో తక్కిన శరీరాలు నశించటం లేదని, ఆ విధంగా నశింపని శరీరాలలో జీవాలు ఉంటాయని, దీనిని బట్టి జీవనానాత్వం ఏర్పడుతున్నదని వాదింపవచ్చు. పది గిన్నెలలో ఒక గిన్నె పగిలినప్పుడు ఆ గిన్నెలో మాత్రమే సూర్యప్రతిబింబం కానరాకుంటుంది. తక్కిన తొమ్మిదింటిలో సూర్యప్రతిబింబం కానవస్తుంటుంది కదా! అలాగే ఒక శరీరం నశించినప్పుడు ఆ శరీరాంతర జీవుడు మాత్రమే కనిపించడు గాని తక్కిన శరీరాంతరజీవులు కనుపిస్తూనే ఉన్నారు. దీనిని బట్టి కూడా జీవనానాత్వం సాధించే వీలులేదు.

అన్ని శరీరాలలోనూ ఉన్నది ఒక్క ఆత్మే అయినప్పుడు ఒక్కరి సుఖ దుఃఖాలు అందరికీ కలగాలని, ఆ విధంగా కలగటం లేదు కాబట్టి జీవనానాత్వం సిద్ధిస్తున్నదని అంటారేమో? పది గిన్నెలలో ఒక్క గిన్నెలోని నీటిలో ఏదో ఒక రంగును కలపండి. అప్పుడు ఆ ఘట (కుండ) జలంలో ప్రతిబింబించిన సూర్యబింబం మాత్రమే జలవర్ణాన్ని బట్టి వివర్ణంగా కనబడుతుంది. తక్కిన ఘటాలలో యథాస్థితిని కానవస్తుంది. దీనిని బట్టి ఏమని తెలుస్తున్నది? ఉపాధివర్ణాన్ని బట్టి సూర్య ప్రతిబింబానికి వివర్ణత కలిగినట్లు కనబడుతున్నదే గాని వాస్తవంగా సూర్యబింబానికి వివర్ణత కలుగలేదని తెలుస్తున్నది. అంటే సుఖదుఃఖాలు ఉపాధిసంబంధాలని, ఉపాధిభేదాలను బట్టి వాటిలో భేదాలు కలుగుతాయని, సుఖదుఃఖాలు ఒక్క ఉపాధికి కలిగిన మాత్రాననే అవి సర్వోపాధులకు వ్యాపింపవని ఏర్పడుతున్నది. శరీరాల నానాత్వానికి కారణం ఏమిటి? అంటే భోగ్యఫలనానాత్వమే కారణం.

మిత్రులారా? ఆత్మ వేరు దేహం వేరు అనే జ్ఞానం ఏ విధంగా కలుగుతుంది? అని ప్రశ్నిస్తుంటారు. బంగారు గనిలో నుంచి రాళ్ళను తెచ్చి పిండిచేసి కరిగించి ఊదినప్పుడు స్వర్ణేతరపదార్థాలు పోయి స్వర్ణం తేలుతున్నది. అలాగే బుద్ధి అనే వహ్నికుండంలో దేహాత్మభావాన్ని వేసి కరిగించినప్పుడు ఆత్మ వేరవుతున్నది. అదే ఆత్మజ్ఞానం అనబడుతున్నది.

మిత్రులారా! దేహమంటే ఏమిటి? భగవచ్ఛక్తి అవ్యక్తావస్థ నుంచి వ్యక్తావస్థకు వచ్చినప్పుడు కొంత మార్పు చెందుతుంది. ఆ మార్పు ప్రకృతి అని, వికృతి అని రెండు విధాలు. మూలప్రకృతి, మహత్తు, అహంకారం, ఆకాశ వాయు తేజో జల పృథ్వీ తన్మాత్రలు అయిదు కలిసి ఈ ఎనిమిదీ ప్రకృతి యొక్క అవస్థా విశేషాలు. పంచమహాభూతాలు, పాదాది పంచ కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియ పంచకం, బుద్ధి అనే ఈ పదహారూ గుణత్రయ వికృత్యవస్థలు. వీటియొక్క సంఘాతమే శరీర మనబడుతున్నది. వీటి సంయోగభేదాలను బట్టి శరీర భేదాలు ఏర్పడుతున్నాయి. ఆ దేహాలు స్థావరములు జంగమములు అని రెండు విధాలు. వీటిలో నిజానికి దేనికీ స్వతంత్ర చైతన్యశక్తి లేదు. భగవానుడు వారిలో ప్రవేశించినప్పుడు మాత్రమే వాటికి ఆ శక్తి కలుగుతున్నది. ఏ శక్తి వలన ఆ ఉపాధులకు చైతన్యత్వం కలుగుతున్నదో అదే ఆత్మ అని గ్రహించండి. ఆ ఆత్మదే ఉపాధులలో సాక్షిరూపంలో ఉంటాడు.

మిత్రులారా! కర్మవైషమ్యానికి కారణం ఏమిటని అడగవచ్చు. కర్మవైషమ్యానికి గుణవైషమ్యమే కారణం. గుణములు సత్త్వరజస్తమస్సులని మూడు విధాలు. ఏ గుణం ప్రకాశించినప్పుడు కర్మము జరుగుతుందో ఆ కర్మము ఆ గుణాలతో కలిసి, ఆ గుణానురూపమైన ఫలాన్ని ఇస్తుంది. దాని వలన కర్మవైషమ్యం, ఫలవైషమ్యం ఏర్పడుతున్నాయి.

భగవానుడు శరీరగతుడై ఉన్నప్పుడు శారీరకవాసనలు అతనిని తాకకుండా ఎలా ఉంటాయి? అని అడుగుతారు. వాయువు సర్వగతమై వీస్తున్నది. ఒక చోటి గాలి సుగంధమయంగా ఇంకొక చోట గాలి

దుర్గంధపూరితంగా ఉంటుంది. ఈ సుగంధ దుర్గంధాలు ఆయా ప్రదేశవిశేషాలే కాని గాలికి సంబంధింపవు కదా! సంబంధించినవి అయితే గాలి సర్వత్ర ఒకే తీరున సుగంధాత్మకం గానో దుర్గంధాత్మకం గానో ఉండాలి. అలా ఉండటం లేదు కదా! అలాగే భగవానుడు సర్వగతుడై సమస్తశరీరాలలో ఉన్నా అతనికి శారీరక విశేషాలతో సంబంధం కలుగదు. ఆ సంగతి తెలియక శారీరక విషయాలను అతని యందు ఆరోపిస్తారు. అది అజ్ఞాన ఫలం. అంతే కాని వాస్తవికం కాదు.

సంసారానికి మూలం ఏమిటి? అని మీరడగవచ్చు. సంసారానికి గుణాలు మూలం. గుణాన్ని బట్టి బుద్ధి వ్యవహరిస్తుంది. ఆ వ్యవహార ఫలంగా కర్మములు ఏర్పడుతున్నాయి. ఆ కర్మఫలాలను అనుభవించేందుకు జననమరణాలు కలుగుతున్నాయి. ఈ విధానమే సంసార మనబడుతుంది.

జీవుడు నిస్సంగుడైతే సంసార బద్ధుడు కావటానికి కారణం ఏమిటి? సంగము లేనినాడు బంధకత్వం కలగదు. ఆత్ముడు నిస్సంగుడని చెప్పాను. కనుక అతనికి సంగమన్నది కలిగే అవకాశం లేదు. అయితే ఈ సంగము దేనికి కలుగుతున్నది? ఆత్మసాన్నిధ్యంలో వర్తించే అహంవృత్తికి కలుగుతున్నది. తత్ఫలంగా బంధ ముక్తులు ఏర్పడ్డాయి. ఈ రహస్యాన్ని గుర్తింపలేక అహంకార బంధ ముక్తులను ఆత్మయందు ఆరోపిస్తుంటారు. అది అజ్ఞానకార్యం. అజ్ఞానం పోవాలంటే భక్తి ఒక్కటే పరమసాధనం.

> భక్తి స్వరూపం ఏమిటి? భక్తి కలిగినవారు చేయవలసిన పనులేమిటి? అని అడుగుతుంటారు. 1. ఆత్మవేత్త అయిన గురువును త్రికరణశుద్ధిగా శుశ్రూషించటం 2. ఏది ప్రాపించినా భగవదర్పణ చేయటం 3. సాధువులైన భక్తులతో కలిసి ఉండటం 4. భగవంతుని ఆరాధించటం 5. భగవల్లీలలను వినటం 6. భగవద్గుణకర్మాలను కీర్తించటం 7. భగవత్పాదాలను నిరంతరం ధ్యానించటం 8. పుణ్యక్షేత్రాలకు పోయి అక్కడ వెలసిన భగవన్మూర్తులకు పూజా వందనాదులు కావించటం

9. సర్వభూతజాతం లోనూ భగవంతుడే ఉన్నాడని నమ్ముకొని భూతసేవయే భగవత్సేవగా భావించి సమస్తభూతాలను ఆదరించటం – ఈ తొమ్మిది భక్తికి ముఖ్యాంగాలు. వీటిని శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మసమర్పణము అని పేర్కొంటారు. ఆ విధంగా చేస్తూ ఉండగా భక్తి గాఢమవుతుంది. తత్ఫలంగా అజ్ఞానవాసనలు నశించి జ్ఞానవంతుడవుతాడు. జ్ఞానికి భగవత్ప్రాప్తి స్వతస్సిద్ధం.

మిత్రులారా! గాఢభక్తుని జీవితం లోక స్వభావానికి కట్టుబడి ఉండదు. లోకవిషయంలో అతని వర్తన విపరీతంగా కనబడుతుంది. తామరాకు మీద నీటి బిందువున్నట్లు గాఢభక్తుని జీవితం విషయసంగాలకు అతీతంగా ఉంటుంది. అతని చిత్తం నిరంతరమూ భగవత్పరమై అదే లోకంగా ప్రవర్తిల్లుతుంది. ఏనాడు భగవద్గుణ కర్మాలను, భగవల్లీలావతార చేష్టితాలను గాఢభక్తుడు విననోచడో ఆనాడతనికి దుర్దినం. భగవద్గుణకర్మాలను, భగవల్లీలావతార చేష్టితాలను వింటున్నప్పుడు అతని మేను గగుర్పొడుస్తుంది; కన్నులు హర్షాశ్రువులను వర్షిస్తాయి; నోట మాటరాదు; మైమరపు కలుగుతుంది; అతను అప్రయత్నంగా భగవంతుని గూర్చి గానం చేస్తాడు; గొంతెత్తి ఆలపిస్తాడు; ఒళ్ళు మరిచి గంతులు వేస్తాడు; దయ్యం పట్టినట్లు ఆక్రోశిస్తాడు; కనబడిన వారందరికీ నమస్కరిస్తాడు; నిట్టూరుస్తాడు; లజ్జాభయాలు మాని హరిహరీ అని కేకలు వేస్తాడు. అలా చేస్తున్నానని అతనికి ఎంతమాత్రమూ తెలియదు.

భగవద్భజన అందరూ చేయవచ్చునా? అని అడుగుతుంటారు. అందరూ చేయవచ్చును. అందుకు అందరూ తగినవారే. జాతి కులమతభేదాలు గాని స్త్రీపురుషభేదాలు గాని లేవు. పశుపక్షిమృగాదులు కూడా భగవంతుని భజించి కడతేరటం ఉన్నది. పరమపాపాత్ముడు కూడా భగవద్భజన చేసి పునీతుడై ఉత్తమగతిని పొందుతాడు.

మిత్రులారా! భగవంతుడు తన భక్తుల యోగక్షేమాలను అనాయాచితంగా తానే సమకూర్చుతాడు. అంతేకాదు. పరమభక్తుణ్ణి తన మూపున మోస్తాడు. అతని కష్టాలను తనవిగా భావించి ఆదుకొంటాడు. దానిని బట్టి అతని దయానురాగాలు ఎటువంటివో మీరే ఊహింపగలరు. మిత్రులారా! మనము కూడా జంకుగొంకులు మాని ఏకాంత భక్తితో భగవంతునికి సమర్పించుకొని ఆ మహాత్ముడు నడిపినట్లు నడుద్దాము. ఇదే పరమపురుషార్థం. ఇంతకన్న మీకు చెప్పవలసినది లేదు.'

ధర్మజా! ప్రహ్లాదుడు ఆ విధంగా చెప్పగా దైత్యకుమారు లందరూ విని, విన్న విషయాన్ని యథామతి విమర్శించి అతని వచనాలు పరమసత్యాలని భావించి అతని ఉపదేశానుసారం వర్తిల్లసాగారు.

## తండ్రితో తృతీయవివాదం

ధర్మజా! ప్రహ్లాదుడు తనతోడి విద్యార్థులకు చేస్తున్న బోధలు, వారు తదనువర్తనులైన సంగతి చండామార్కులకు తెలిసింది. వారు భయకంపితులై హుటాహుటిని పోయి వృత్తాంతాన్ని హిరణ్యకశిపునికి నివేదించారు. రాక్షసేశ్వరుడు కోపావేశుడై, 'ఔరా! తాచెడ్డ కోతి వన మంతా చెరచినట్లయింది. ఇక వీడిని పుత్రునిగా భావింపకూడదు,' అని నిశ్చయించి ప్రహ్లాదుని రప్పించి అతనిని మాటలతో పరిపరి విధాల ఒప్పింపజూశాడు. ప్రహ్లాదు డా మాటలకు ఏమాత్రం చలింపక కేలుమోడ్చి వినయవినమ్రుడై ఊరుకొన్నాడు. అంతట దైత్యనాథుడు తోకతొక్కిన నల్లతాచులాగా బుసలుకొట్టుతూ క్రూర కుటిల దృష్టి, నెరపుతూ రుసరుసలాడి, 'ఓరీ దుర్వినీతుడా! మందబుద్ధీ! కులనాశనానికే సంకల్పించా వన్నమాట. నా శాసనాన్ని తృణీకరించిన నేరానికి ఇదిగో నిన్ను యమపురానికి తరలిస్తున్నాను. నేను కనుబొమ్మ చిట్లిస్తేనే ముల్లోకాలు లోకపాలకులతో సైతం గడగడలాడతారు. మూర్ఖుడా! ఎందులోనూ నా కెదురులేదు. అటువంటి నన్ను నీవు లెక్కచేయకపోగా ధిక్కరించావు. ఎవరి అండ చూసుకొని ఇంతకు తెగించావు? అని మేఘగర్జాభీషణంగా పలికాడు.

ప్రహ్లాదు డా పలుకులకు బెగడు పడక నెమ్మది వహించి, 'దానవేశ్వరా! ఎవడు సర్వలోకశరణ్యుడో, ఎవని వశమై స్థావరజంగమాత్మక నిఖిల ప్రాణికోటి ఆబ్రహ్మపర్యంతం వర్తిల్లుతుందో, ఎవడు కాలాత్ముడై సమస్తవిశ్వాన్ని తన ఆజ్ఞచేత నడిపిస్తున్నాడో, ఎవని పరాక్రమం నిర్వక్రమై లోకాలోకాలకు వ్యాప్తమయిందో, ఓజస్సత్త్వజితేంద్రియాలన్నీ ఎవని ఆత్మప్రకాశకాలో, ఎవడు నిజశక్తుల చేత జగత్సృష్టిస్థితిలయాలను కావిస్తాడో ఆ పరమాత్ముడే నాకు శరణం. తండ్రీ! ఇంతటితోనైనా నీవు ఆసురభావాన్ని వదలి మనశ్శాంతిని వహించు. ప్రాణులకు బహిశ్శత్రువులు శత్రువులు కానే కారు. నిక్కమైన, మహాపకారకమైన శత్రువు మనలోపలనే ఉన్న ఉత్పథప్రవృత్తచిత్తం. కట్టుబాటు లేని చిత్తాన్ని మించిన బలవచ్ఛత్రువు వేరొకటి లేదు. దానిని జయించినవారితో మూడు లోకాలూ మనసిచ్చి చెలిమిచేస్తాయి. మనస్సును సమీకరించటమే భగవత్సమారాధనం. తండ్రీ! ముల్లోకాలనూ జయించానంటావా? త్రైలోక్యదిగ్విజయం విజయమే కాదు. మనలో ఆరుగురు శత్రువులు దాగి మన కళ్ళెదుటనే సర్వస్వం అపహరిస్తుంటారు. వారిని జయించటం శతకోటి దిగ్విజయాలతో సమానం' అని మృదుస్వనంతో విన్నవించాడు.

ధర్మజా! హిరణ్యకశిపుడు ఆ పల్కులను విని, 'మూర్ఖుడా! చావుకోరి ఈ భట్రాజు పొగడ్తలు ప్రేలుతున్నావు. నిర్భాగ్యుడా! లోకేశ్వరుడనై నేనుండగా జగదీశుడు వేరొకడున్నాడని వాదిస్తావు. నీ మాటే నిజమైతే ఏడీ, అతనెక్కడున్నాడో చూపిస్తావా?' అని గద్దించి పలికాడు. ప్రహ్లాదుడు ఆ ఎత్తిపొడుపువిని, 'తండ్రీ! –

**క. ఇందుఁ గలఁ డందు లేఁడని**
**సందేహము వలదు చక్రి సర్వోపగతుం**
**డెందెందు వెదకి చూచిన**
**నందందే కలఁడు దానవాగ్రణి వింటే.'**

అని చెప్పాడు. దనుజేంద్రు డా మాట విని 'ఓరీ! నీ హరి అన్ని చోట్ల ఉన్నవాడంటివే, ఈ సభాంతర స్తంభంలో ఉంటాడా?' అని నర్మగర్భితంగా అడిగాడు. ప్రహ్లాదుడు అతని భావాన్ని గ్రహించి –

**శా. అంభోజాసనుఁ డాది గాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముడై**
**సంభావంబున నుండు ప్రోడ విపులస్తంభంబునం దుండఁడే?**
**స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు; ని**
**ర్దంభత్వంబున నేఁడు గానబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్.**

అని చెప్పాడు.

హిరణ్యకశిపుడు పండ్లు కొరికి, 'ఓరీ! నీ దురాలాపాలు చాలించు. ఇదే నీ తల తెగ వేస్తున్నాను. నీ హరి ఎక్కడున్నాడో ఎలా అడ్డు పడతాడో చూడు' అంటూ దిగ్గున సింహాసనం నుంచి లేచి బలమంతా మూర్తీభవింప జేసి బిగి పిడికిట ఆ స్తంభాన్ని మోదాడు.

## శ్రీ నృసింహావతారం

ధర్మరాజా! ఆ వేటుతో స్తంభాంతరం నుంచి మహాఘోషం ఉప్పతిల్లింది. ఆ శబ్దాన్ని విని బ్రహ్మాండకటాహం బ్రద్దలవుతున్నదని తలచి అక్కడి వారందరూ చెల్లాచెదరయ్యారు. బ్రహ్మాదులు తమ లోకాలకు ప్రళయం రానున్నదని అదిరిపడ్డారు. హిరణ్యకశిపుడు పుత్రవధైక చింతాపరుడై ఉన్నందువల్ల ఆ ఘోరనాదాన్ని వినీవిననట్లు ఉండిపోయాడు.

అంతలో స్తంభాంతరం నుంచి భయానకమైన వికృతాకారం ఒకటి వెలువడింది. తప్తసువర్ణకాంతులను వెలిగ్రక్కుతున్న వీక్షణాలతో, కరాళదంష్ట్రాప్రభలతో, ఖడ్గధారావీక్షణ జిహ్వాతో, కుటిల భ్రుకుటితో, నిక్కిన చెవిదోయితో, గిరి గుహను పోలిన మహావక్త్రంతో ఒప్పారుతూ హ్రస్వపీవర కంఠం విశాల వక్షోమండలం సూక్ష్మమధ్యం శశికిరణధవళరోమకూపం అర్ధచంద్రాకారంగా వంగి ఉన్న వాడిగోళ్ళు సహస్రభుజాలు కలిగి మిన్నొరసి నిలిచిన ఆ నరకేసరి రూపాన్ని మహాభయంకరమైన దానిని దానవేశ్వరుడు

చూసి 'ఏమిటిది? నరుడు కాదు. మృగం కాదు. ఉభయాత్మకమై ఉన్నది. ఈ రూపాన్ని ఎన్నడూ కనీవినీ ఎరుగము. మహామాయావి హరి నాకు మృత్యువై వెలసినట్లున్నది. కానీ, నన్నేమి చేయగలడో చూస్తాను' అని సింహనాదం కావించి గదను చేబూని ఉరవడించాడు. హిరణ్యకశిపుని తేజం నృసింహమూర్తి తేజంలో పడి నిప్పు లోనికి దూకిన మిడత వంటిదయింది. ఆ నరకేసరి ఆ దైత్యవల్లభుని పురుగును పట్టుకొన్నట్లు పట్టుకొని నలిపాడు. గరుత్మంతుని పట్టు విడిపించుకొన్న పాములాగా హిరణ్యకశిపుడు ఆ పట్టు తప్పించుకొని కత్తిని డాలును పట్టుకొని వేగోద్ధతుడై ఆ నరకేసరిపై దూకాడు.

## దానవసంహారం

అంత నరసింహమూర్తి దారుణాట్టహాసం కావించి అతనిని ఒడిసి పట్టి పగలూ కాని రాత్రీ కాని సంధ్యాసమయాన ద్వారమధ్యంలో తన తొడపైపరుండబెట్టి వాడిగోళ్ళతో అతని పొట్ట చీల్చి పేగులు తెంచి మెడలో వేసుకొన్నాడు. ధర్మజా! ఆ మహామూర్తి సటాజాలం తాకిడికి మేఘాలు చెక్కుచెదరక కొయ్యబారి నిలుచున్నాయి; విమానాలు సంకులపాటు నొందాయి; అతని చూడ్కి వేడిమికి ఓర్వలేక గ్రహాలు తప్పుకొన్నాయి; నిట్టూర్పు గాడ్పులకు జలధులు కలగబారాయి; ఘోరనాదానికి దిగ్గజాలు ఉలికిపడి మదధారలను విడిచాయి; పాదఘట్టనానికి భూతలం క్రక్కదిలింది; కొండలు కూలాయి; భూనభోంతరాళమంతా తేజోమయమయింది; రాక్షసులు తలకొక దిక్కుగా పారిపోయారు.

నరహరి అప్పుడు దైత్యేశ్వరుని సింహాసనం అధిష్ఠించాడు. కోపాగ్నులను వర్షిస్తున్న ఆ మూర్తి ఎదుట నిలువలేక అక్కడున్నవారందరూ దూరదూరంగా దాగి నిలిచారు. లోకవిషమజ్వరమైన దైత్యుడు తెగటారిన సంగతి దేవలోకానికి ప్రాకింది. సురకాంతలు స్వస్థచిత్తలై ఆ నరసింహమూర్తిపై పుష్పవృష్టి కురిపించారు. ఖేచరవిమానాలు ఆకసాన క్రిక్కిరిసి కనిపించాయి; దేవదుందుభులు మ్రోగాయి; గంధర్వులగానాలు, అప్సరసల నృత్యాలు చెలరేగాయి.

## బ్రహ్మాదుల స్తుతులు

ధర్మజా! ఆ భీకరమూర్తిని సమీపించటానికి జంకి ఋష్యాదులు సైతం దవ్వుదవ్వుల నిలబడ్డారు. అంతలో బ్రహ్మ రుద్రులు వచ్చారు. వారిని పురస్కరించుకొని ఇంద్రాది దేవతలు, సిద్ధ విద్యాధర గంధర్వ నాగ యక్ష కిన్నర కింపురుష భూత భేతాళాదులు, పితృదేవతలు, మనువులు, ప్రజాపతులు, అప్సరసలు, విష్ణుపార్షదులు ఒకరి వెంట ఒకరు వచ్చి గుమిగూడి కొంత దూరంగా నిలబడి ఆ రూపాన్ని చూస్తూ నిశ్చేష్టులై చేతులు జోడించి ఏమనాలో తెలియక ముఖాముఖాలు చూసుకొంటున్నారు.

## బ్రహ్మ స్తుతి

అంత బ్రహ్మదేవుడు ముందుకు వచ్చి 'దేవా! నీ యీ అవతారమాహాత్మ్యం ఇటువంటిదని ఊహింపగల శక్తి సృష్టికర్త ననబడే నాకే చాలదనగా ఇతరుల సంగతి చెప్పేదేమున్నది? దేవాదిదేవా! నీవు సర్వాంతర్యామివని నీ భక్తుడు ప్రహ్లాదుడు నొక్కి నొక్కి పలికాడు. అతని మాటను రూఢిచేయాలని స్తంభమధ్యం నుంచి అవతరించావు. ఓహో! నీ భక్తజనానుగ్రహం ఎంతని చెప్పగలము? దేవా! ఈ విచిత్రరూపం కలలో నైనా నాకు స్ఫురించలేదు. ఆ దైతేయుడు కోరరాని విచిత్రవరాలను కోరి సంపాదించి తన కెందులోనూ చావులేదని విర్రవీగాడు. ఆ వరాలన్నీ పొల్లుచేసి నా తెలివి ఎంతటిదో నాకు తెలిపావు. ఇంద్రాదులకు ఇచ్చిన అభయవచనాన్ని పాటించావు. దేవా! అనంతశక్తి సంపన్నుడవు. నీ ప్రభావం మహాత్ములకు సహితం గోచరించదు. అవ్యయమూర్తివైనా గుణాలను అధిష్ఠించి రూపాలను ధరించి వ్యయమూర్తి వలె కానవస్తూ లోకాళికి భ్రాంతి కలిగిస్తావు. నిర్మత్సరుడ వైనా లోకసంగ్రహార్థం భీకరకార్యాలు నెరవేరుస్తావు. దేవా! నీ మాహాత్మ్యాన్ని బుద్ధి ఊహింపజాలదు; వాక్కు పలుకనేరదు. ఇదే నమస్కారం' అని నమస్కరించాడు.

## రుద్ర స్తుతి

అంతట రుద్రుడు ముందు నిలిచి, ‘భక్తవత్సలా! నీ కోపానికి సహస్రయుగాంత సమయం తగినట్టిది. ఇప్పుడు దానికి అవసరం కాదు. ఈ అసురకారణాన ఆగ్రహమూర్తిని తాల్చినా, ఆ అల్పుడిప్పుడు తెగటారాడు. అతని కొడుకును ఈ నీ భక్తుని అనుగ్రహించు. శాంతించు’ అని పలికాడు.

## ఇంద్ర స్తుతి

రుద్రుని వెంబడి ఇంద్రుడు నిలిచి, ‘పరమపురుషా! ఏ దైవాధముడు మా కరతలాల నుంచి హవిర్భాగాలను ఒడిసి లాగుకొని మాకు చెప్పరాని క్షుధార్తిని కలిగించాడో ఆ హవిర్భాగాలను మాకు మళ్ళీ ప్రసాదించావు. అతని వలని భయం నీ యందు నిలిచిన మా హృదయాలను లాగి యీడ్చి అతని కాళ్ళమీద పడవేసింది. గత్యంతరం లేక అతనికి ఊడిగాలు చేయవలసి వచ్చింది. ఆ దౌర్భాగ్యాన్ని తొలగించి నీ పాదసేవాభాగ్యాన్ని మాకు మళ్ళీ ప్రసాదించావు. అదే మాకు పదివేలు. సురలోకభోగాలన్నీ కాలగ్రస్తములై ఏదో ఒకనాటికి నశించేవే. నీ ప్రసాదభాగ్యం వేల వేల జన్మల పుణ్యఫలమై సిద్ధించి దినదినాభివృద్ధి గాంచి చిరస్థాయి కాగలదు. అందువలన నీ సేవాశ్రీని వర్తిస్తాము. అది మాకు ముక్తికన్న అభిలషణీయం. మహాత్ములు కూడా నీ పరిచర్యాభాగ్యమే మహోత్తమమని, దానినే వరిస్తారు. మా బోంట్లు కోరితే వింత కాదు’ అని సాష్టాంగపడ్డాడు.

## ఋషిజనుల స్తుతి

ఇంద్రుని వెంట ఋషివర్యులు నిలిచి కేలుమోడ్చి, ‘లోకశరణ్యా! ఏ నీ సుప్రభావం నీలో లీనమై ఉన్న విశ్వాన్ని బహిర్గత మొనరుస్తుందో ఆ నీ ప్రభావాన్ని ధ్యానించటమే పరమతపమని ఉపదేశించావు. అదే మహాతపంగా మేమున్నాము. మా తపస్సులకు ఇతను భంగకారి అయ్యాడు. ఉపాయం తోపక పరితపింపసాగాము. నేటితో మా పరితాపాన్ని చల్లార్చి పూర్వపు మా

తపోరూప భాగ్యాన్ని మళ్ళీ మాకు ప్రసాదించావు. మా కృతజ్ఞతను దండప్రణామాలతో వెల్లడిస్తున్నాము' అని సాగిలబడి లేచారు.

## పితృదేవతల స్తుతి

అప్పుడు పితృదేవతలు, 'జగద్రక్షకా! మా సంతతివారిచ్చే శ్రద్ధాపిండాలను, తీర్థకృత తిలోదకాలను మాకు అన్నపానాలుగా కూర్చావు. వాటితో మేము జీవింప నోచాము. ఈ అసురుడు మా అన్నపానాలను హరించి మమ్మల్నందరినీ కూటికి నీటికి దూరంచేసి మాడ్చాడు. నోరు విప్పి మా గతి చెప్పుకొందామన్నా భయపడ్డాము. లోలోపలే క్రుంగి కృశించిపోతున్నాము. నేటికి నీ వలన మా గోడు తీరింది. ధర్మరక్షకా! ఇదే సాష్టాంగం' అని నేలవాలి మొక్కారు.

## సిద్ధుల స్తుతి

ఆ తర్వాత సిద్ధులు, 'యోగీశ్వరా! మా యోగసాధనాలన్నీ నీ అనుగ్రహం వలన ఫలకారులైనాయి. అష్టసిద్ధులను పొందాము. ఈ దానవేశ్వరుడు వరదానోద్ధతుడై ఆ బలయోగంతో మా సిద్ధులను లాగికొని మమ్మల్ని రిక్తహస్తులను చేశాడు. దిక్కుతోచక మేము కుమిలిపోతున్నాము. మా గోడు తీర్చావు. ఇవే మా కృతజ్ఞతాంజలులు' అని నమస్కరించారు.

## విద్యాధరుల స్తుతి

అంతట విద్యాధరులు ముందుకు వచ్చి, 'మహాత్మా! మేము ధారణాశక్తిని ఆశ్రయించి అంతర్ధానాది విద్యలను గడించి సుఖంగా ఉంటిమి. ఈ దుర్మార్గుడు తన వీర్యదర్పాలతో మా విద్యలను అరికట్టి మమ్మల్ని నిర్వీర్యులను చేశాడు. నేడు మా సొమ్మును మాకు అనుగ్రహించావు. ఇవే మా అభివాదనాలు' అని ప్రణామం చేశారు.

## నాగుల స్తుతి

ఆ పిమ్మట నాగులు ముందు నిలిచి, 'దేవా! ఈ పాపాత్ముడు మా శిరోరత్నాలనే గాక మా స్త్రీ రత్నాలను కూడా హరించి మాకు తీరని వ్యధ కలిగించాడు. అతని బాధ తప్పించావు. ఈ సుకృతాన్ని కూర్చిన నీకు పదివేల దండాలు' అని సాగిలపడ్డారు.

## మనువుల స్తుతి

'దేవా! నీ ఆజ్ఞాకరులు మనువులు నమస్కరిస్తున్నారు. ఈ దురాత్ముడు కేవలం అహంబుద్ధిని ఆశ్రయించి ప్రకృతిధర్మాన్ని కూడా తిరస్కరించి వర్ణాశ్రమమర్యాదలను తుడిచిపెట్టాడు. అతనిని తెగటార్చి ధర్మాన్ని నెలకొల్పావు. మా కర్తవ్యాన్ని శాసించు' అని మనువులు ప్రస్తుతించారు.

## ప్రజాపతుల స్తుతి

'స్వామీ! మమ్ము ప్రజేశ్వరులనుగా నియమించావు. ఈ దురాత్ముని ఉపద్రవానికి వెరచి సృష్టికార్యాన్ని విరమించే గతి మాకు కలిగింది. ఈ దుండగీడు నేడు నీ నఖాగ్రాలకు బలి అయ్యాడు. లోకమంగళావతారా! ప్రణామం' అని ప్రజాపతులు నమస్కరించారు.

## గంధర్వాదుల స్తుతి

ఈశ్వరా! నీ నటగాయకులను మమ్మల్నందరినీ వీడు స్వబలవీర్యోద్ధతుడై దాసానుదాసులనుగా చేసుకొన్నాడు. ఎప్పుడెవరికి ఎటువంటి దశ కలుగుతుందో అని లవలేశం ఆలోచించినవాడు కాడు. దుష్టులకు దీర్ఘశుభాలు కలుగుతాయా?' అని గంధర్వులు మ్రొక్కారు. 'హరీ! నీ పాదసేవకులమైన మా చేత ఇతను తన పాదాలకు సేవలందాడు. భవాపవర్గమైన నీ చరణసేవను మాకు మళ్ళీ కరుణించావు. కృతార్థులము' అంటూ చారణులు నుతించారు. 'దేవా! ఏనాడో మనోజ్ఞకర్మలను చేసి తత్ఫలంగా నీ పరిచారకులలో

ముఖ్యులమైనాము. మా చేత ఇతడు తన పల్లకిని మోయించాడు. నీవు చతుర్వింశతితత్త్వ నియామకుడవు కాబట్టి నీ తత్త్వవ్యతిరేక వర్తనుని పరిమార్చి లోకపరితాపాన్ని తీర్చావు' అని యక్షులు శ్లాఘించారు. 'మహాపురుషా! కింపురుషులు ప్రణామపూర్వకంగా విన్నవించుకొంటున్నారు. ఈ దానవుని హరించటమంటే ప్రాణుల యెడ నీకు గల కారుణ్యాతిశయాన్ని ప్రకటించడమే కదా! ఇదే నమస్కారం' అని కింపురుషులు ప్రణతులర్పించారు. 'దేవా! వైతాళికులము మేము నీ నిర్మలకీర్తిని సభాసత్రాదులలో గానం చేసి సత్కృతులమై సంతోషంగా ఉన్నవాళ్ళము. నిన్ను పాడిన నోటనే ఈ దురాత్ముని పాడవలసిన దుర్గతి మాకు సంభవించింది. అది నేటితో ముగిసింది' అని వైతాళికులు వందనాలు చేశారు. 'నరసింహా! నీ కీర్తిపాఠకులను కిన్నరులను మమ్మల్ని ఈ దురాత్ముడు చెరపట్టి వెట్టిచాకిరీలు చేయించుకొన్నాడు. మేము పడిన పాట్లు ఇన్నీ అన్నీ కావు. నేటితో మా దురదృష్టం తీరింది' అని కిన్నరులు ప్రశంసించారు.

'లోకశరణ్యా! నీ పార్షదులమై ఉండి ఈ నీ అద్భుతరూపాన్ని ఎప్పుడూ చూసి యెరుగము. ఇతను తొలుత నీ పార్షదుడుగా ఉండి విప్రశాపహతుడై అసురుడుగా జన్మించాడు. అతని శాపమోక్షార్థమూ, సర్వలోకమంగళార్థమూ నీవిప్పుడు నరసింహాకృతిని అవతరించావు. ఇతనిని చంపటం ఇతనిని అనుగ్రహించటమే గాని నీ ఆగ్రహవర్తనం కాదు. నీవే దిగివచ్చి ఇతనికి ధన్యతను కూర్చావు' అని పార్షదులు పలికారు.

## నృసింహుని క్రోధశాంతి

ధర్మనందనా! బ్రహ్మాదులందరూ దవ్వుదవ్వుల నిలిచి ఆ విధంగా ప్రశంసించారే కాని ఆ ఉగ్రమూర్తిని సమీపింప లేకపోయారు. ఎట్టకేలకు వారు శ్రీదేవిని ఆశ్రయించారు. ఆమె కూడా అటువంటి ఘోరరూపాన్ని అంతకుముందెన్నడూ కనీ వినీ యెరుగదు. అందువల్ల భయభ్రాంతురాలై ఆమె సాహసం చేయలేక పోయింది. బ్రహ్మాదులకు ఉపాయాంతరం తోచలేదు. చివరికి వారు ప్రహ్లాదుని చేరబిలిచి, 'నాయనా! లోకేశ్వరునికి ఈ కోపం నీ

తండ్రి కారణంగా కలిగింది. నీవే ఈ జగత్పతిని శాంతింపజేయగల వాడవు' అన్నారు.

అంతట ప్రహ్లాదుడు మెల్లమెల్లగా కదిలి ఆ భయంకరమూర్తి పాదాల మ్రోల వ్రాలాడు. భగవానుడు ఆ అర్భకుడిని లేవనెత్తి అతని శిరస్సుపైని తన కరపద్మాన్ని ఉంచాడు. హరి కరస్పర్శ కాంచినంతనే ప్రహ్లాదునికి చిత్తనిర్వృతి, బ్రహ్మ సాక్షాత్కారం కలిగాయి. అతని హృదయం పరమానంద రసాత్మకమై విరాజిల్లింది. ఆ ఆనందరసం చిత్తపద్మాన చోటు చాలక వెలికి ఉరవడించినట్లు అతని కందోయినుంచి బాష్పధారలు స్రవించాయి. అతను తన్మయుడై ఈ విధంగా స్తుతించాడు.

## ప్రహ్లాదకృత నృసింహస్తోత్రం

'దేవా! సర్వేంద్రియాలను అంతర్ముఖం కావించి క్రోడీకరించి ఏకాగ్రమొనరించి నిన్ను గూర్చి మనన చేసే మునులు గాని, సాంఖ్యయోగంలో ఆరితేరి తత్త్వసారాన్ని పుడిసిట బట్టి సంతృప్తులైన జ్ఞానులు గాని, నిరంతరం నీ సందర్శన సల్లాపాదుల భాగ్యానికి నోచుకొన్న సురలు గాని, సర్వసృష్టికి కర్తృత్వాన్ని వహించి నీ తత్త్వ విశేషాన్ని నాల్గుమోముల నాల్గు వేదాలుగా ప్రకటించిన బ్రహ్మ గాని నిన్ను స్తుతింప సమర్థులు కానినాడు, ఈ వరాటుడు అజ్ఞాని బాలుడు రజస్తమః ప్రధాన రాక్షసకులజుడు నిన్ను వర్ణింపగలడా? సత్కుల జననం, సౌందర్యం, తపశ్శక్తి, పాండిత్యం, సర్వేంద్రియనైపుణ్యం, తేజః ప్రతాపాలు, బల పౌరుషాలు, ప్రజ్ఞ అనే పన్నెండు గుణాలు కలవారు మాత్రమే నిన్ను ఆరాధించే యోగ్యత కలవారని అంటారు. ఇందులో ఒక్కటీ నాకు లేదు. ఏమని నీకు పరితోషాన్ని కూర్చగలను?

స్వామీ! నీ ఆరాధకులకు కులీనత్వాది ద్వాదశగుణాలు కలిగినా భక్తి లేకపోతే అవి ఫలకారులు కానేరవు. భక్తి హీనుడైన విప్రుని కంటె భక్తి గలిగిన చండాలుడే వేయి విధాల ఉత్తముడు. భక్తి గోరంత కలిగిన మాత్రాన శ్వపచుడు కూడా తాను పునీతుడు కావటమే గాక తన కులమంతటినీ

పవిత్రీకరిస్తున్నాడు. గర్వం కలవాడు విప్రుడైనా తాను భ్రష్టుడైనది చాలక తన కులాన్ని కూడా దిగజారుస్తున్నాడు. పైగా భక్తి లేనినాడు కులీనత్వాది గుణాలు మనశ్శుద్ధికరాలు కాకపోగా గర్వదాయకంగా పరిణమిస్తాయి. ఇంతెందుకు? భక్తిహీనుని కంటె పరమనీచుడు వేరొకడు పుట్టబోడు.

దేవా! ధనాదుల చేత ప్రకృతులు సన్మానితులై పరితోషిస్తుండగా భగవంతుడవైన నీవు మాత్రం సంతోషింపవు. ప్రాకృతులు ఆత్మాభిమానులు. ఆ అభిమానం వారికి స్వల్పసుఖాలకే సంతసాన్ని కలిగిస్తుంది. నీవు నిరభిమాన పూర్ణుడవు. కోరినవారికి కోరినట్లు ఒనగూర్చుతావు. నీవు కోరనైనది, పొందనైనది అణుమాత్రమైనా కలుగనేరదు. ఆ కారణాన ప్రాకృతబుద్ధి నీ వంక తలయెత్తలేదు.

దేవా! ఏది సమర్పించినా అంగీకరించని నీకు పరితోషాన్ని కలిగించే పరమసాధనం భక్తి ఒక్కటే. కరుణాసముద్రుడవైన నీవు భక్తిలేనివారి పూజలను సైతం వారిని అనుగ్రహింపగోరి అంగీకరిస్తావు. నీ పూజలన్నీ పూజాతత్పరులకే గాని నీకు కావు. ముఖమండలాన్ని తిలకాదుల చేత అలంకరించుకొని అద్దంలో చూసినప్పుడు ఆ అలంకారాన్నీ ప్రతిబింబార్థమైనట్లు నిన్ను పూజించటమంటే పూజకుల మేలుకోసమే అన్న మాట. దేవా! నీవు భక్తిపరితోషమూర్తివి. నా భక్తి నన్ను మిన్నకుండనీయదు. నా అల్పమతికి తోచినట్లు నిన్ను నుతింప సాహసిస్తాను. నా సాహసానికి భక్తి మాత్రమే కారణం కనుక నన్ను మన్నించు.

దేవా! ఈ బ్రహ్మాదులందరూ నీ శాసనపాలకులైన భగవద్భక్తాగ్రేసరులు. మేమో? అసురజాతులమైన నీ వైరికోటిలోని వారము. అటువంటిది బ్రహ్మాదిభక్తులు కూడా నీ యీ ఘోరావతారాన్ని చూసి బెగ్గడిల్లుతున్నారు. నీ అవతారాలు ఎట్టివైనా లోకక్షేమసుఖప్రదానానికే గాని భయాన్ని కలిగించేందుకు కావు. ఎవని వధార్థం ఈ రూపాన్ని ధరించావో అతను కడతేరాడు. దుష్టశిక్షణ మూలాన శిష్టరక్షణ జరిగింది. మూడు లోకాలు

సంతసించాయి. దేవా! నీ నరసింహ రూపధ్యానం సర్వభయశాంతికరం కాగలదు. అయినా దానిని సందర్శింపలేక క్రోధప్రశాంతిని ప్రార్థిస్తున్నారు.

**మ. ఖరదంష్ట్రాభ్రుకుటీసటానఖయు నుగ్రధ్వానయున్ రక్తకే**
**సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయు నైన నీ**
**నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ; బూర్ణక్రూరదుర్వార దు**
**ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు నీ పాదాశ్రయుం జేయవే.**

దేవా! నా సంగతేమిటంటావా? నా భయం తీరే మార్గమేమింటావా? నీ చరణ శరణం ఒక్కటే నా భయాన్ని తీర్పగలదు. ఆ నీ పాదానికి చేరరమ్మని ఎప్పుడంటావో అని నిరీక్షిస్తాను.

స్వామీ! ఇష్టానిష్ట వియోగసంయోగ కర్మఫలమైన ఈ బహుజన్మ రూప శోకానలం దేహధారులను నిట్టనిలువున దహించివేస్తున్నది. ఆ అగ్నిని చల్లార్పగోరి వివిధయత్నాలను కావిస్తారు. అవన్నీ ఆ అగ్నిని చెలరేపి పునర్దుఃఖ కారణాలవుతున్నవే కాని దుఃఖోపశాంతిని కూర్పలేవు. ఎందుకంటే అనాత్మవస్తువులందు ఆత్మ భావన చేయటమే ఆ దుఃఖానికి మూలం. ఆ విధమైన భావాన్ని అనుసరించి మోహం పైకొంటుంది. మోహఫలంగా సర్వదుఃఖాలూ సంప్రాప్తిస్తున్నాయి. ఆ దుఃఖానికి ప్రతీకారం దాస్యం ఒక్కటే. నీ దాసులపై నీవు కృపారసాన్ని వర్షిస్తావు. దానితో దుఃఖాగ్ని చల్లారుతున్నది. దేవా! సుఖదుఃఖాలు గుణముల యొక్క కార్యాలని, గుణవ్యవహారం ఉన్నంత కాలం అవి తప్పవని శంకిస్తారు. ఎవరు నీ పాదపద్మాన్ని హంస రీతిని ఆశ్రయిస్తారో వారు గుణాతీతులవుతారు. బిడ్డలకు తల్లిదండ్రులు, రోగికి ఔషధం, సముద్రమగ్నునికి నౌక దుఃఖ ప్రతీకారాలు అయినట్లుగా తత్తద్విధదుఃఖానికి తత్తదనుకూల ప్రతీకారం ఉంటుందని, దుఃఖాలు బహువిధాలు కావటం వల్ల ఏకమూలికా ప్రయోగం చేయరాదని శంకిస్తారు. నీ అనుగ్రహవీక్షణం ప్రసరింపనప్పుడు ఎన్ని సాధనాలున్నా ఉపయోగింపవు. మహావైద్యుల చికిత్సను పొందినా చావక తప్పటం లేదు కదా! గొప్ప గొప్ప పడవల నెక్కి సముద్రాంతరాన నావతో మునిగి నశిస్తున్నారు కదా! కనుక

అవేవీ స్వతంత్రించి మేలు గూర్పవు. నీ అనుగ్రహం కలిగిననాడు గడ్డిపరకే సంజీవి అవుతుంది.

దేవా! సంతానకారకులైన తల్లిదండ్రులు, సృష్టికారకులైన బ్రహ్మాదులు వారి బిడ్డల దుఃఖాదులను తీర్చటం లేదా? అంటే, ఏకకాలంలో నైనా, ఏ కారణం వల్ల నైనా ఏ ఉపాదానం చేత నైనా, ఏ సంప్రదాయప్రకారంగా నైనా, దేనికైనా, ఎవరయినా కర్తగా భావింపబడితే వారు నీ స్వరూపాలే గాని తదన్యులు కారు. ఏ విధంగా చూసినా నీ కంటె వేరు రక్షకులు కలుగరు కాబట్టి నీవే నాకు గతి.

దేవా! నీ శక్తియందు మూడు గుణాలు ఉన్నాయి. ఎప్పుడు నీ అనుగ్రహం వీక్షణరూపాన నీ శక్తి వంకకు ప్రసరిస్తుందో, అప్పుడు శక్త్యాత్మకమైన గుణత్రయం వ్యవహరిస్తున్నది. ఆ వ్యవహార ఫలంగా మనఃప్రధానమైన లింగశరీరం కలుగుతున్నది. ఆ శరీరభోగార్థమై శక్తిరూపమైన నీ మాయ షోడశ వికారాలను కలిగిస్తున్నది. ఈ మనఃపరిభ్రమణమే సంసారమనబడుతున్నది. ఈ సంసారాన్ని తరించాలంటే దానికి మూలమైన నీ శక్తిని జయించాలి. నీ శక్తిని జయించాలంటే శక్తిమంతుని నిన్ను గాక మరెవ్వరి నాశ్రయించాలి? అన్యులను ఆశ్రయించితే ఫలం ఉంటుందా? నాకు వలెనే నీకు కూడా మాయాసంబంధం ఉన్నది కాని నీ మాయాశక్తి నీకు వశీకృతయై నిన్నాశ్రయించి వర్తిల్లుతుంది. నేనంటేనో ఆ శక్తి గుణాలకు దాసానుదాసుడనై సంచరిస్తాను. ఇదే మన యిద్దరికీ ఉన్న తారతమ్యం.

దేవా! లోకపాలకులు కూడా భోగార్థులే కాబట్టి, పిత్ర్యమైన రాజ్యాన్ని అధిష్ఠించి రాజభోగాలను అనుభవించమని, సంసారాన్ని వదలటం తగదని అంటావేమో? స్వామీ! లోకపాలకుల పుట్టుపూర్వాలను, వారి ఐశ్వర్యాదులను పరికించాను. అవి నా తండ్రి కనుబొమలు విరిచినంత మాత్రాన రూపుమాస్తుండేవి. నా తండ్రి అంతటి శక్తిమంతుడైనా నీ కొనగోటికి చాలలేదు కదా! కాబట్టి రాజ్యం, భోగం నాకు చెప్పవద్దు. అవే కావు, బ్రహ్మభోగాలు కూడా నాకు వద్దు. ఏమంటావా? అవన్నీ కాలగ్రస్తములే అవుతాయి. దేవా!

ఈ భోగాలన్నింటినీ అనుభవించేది ఏది? శరీరం కదా! శరీరం క్షణభంగురం. అట్టిదానికి భోగాలెందుకు? పైగా భోగాలెటువంటివి? వీనులకు విందై ఎండమావుల వలె మిథ్యాభూతాలైన మనోరథాలను భోగాలని అంటారు. సుఖాలన్నవో? మధుబిందువుల వంటివి. వాటివలన కామాగ్ని చల్లారుతుందా?

దేవా! నా కోరికను చెప్పమంటావా? నీ భృత్యానుభృత్యుల పాదాల వద్ద పడి ఉంటాను. సత్త్వమూర్తులైన నీ భృత్యులెక్కడ? రాక్షసకులంలో రజోగుణం ప్రధానంగా పుట్టిన నేనెక్కడ? అంటావేమో. శ్రీదేవికి, బ్రహ్మదేవునికి, భవునికి, దేవతలకు సైతం దుర్లభమైన నీ కరసరోజస్పర్శ ఎప్పుడు నా శిరస్సునకు కలిగిందో అప్పుడే నా మాలిన్యాలన్నీ అంతరించటం, నేను నీ కరుణకు పాత్రుడను కావటం సంభవించాయి.

**ఉ. శ్రీమహిళామహేశసరసీరుహగర్భుల కైన నీ మహో**
**ద్దామకరంబుచే నభయదానము సేయవు నేను బాలుడం**
**దామసవంశసంభవుఁడ దైత్యుఁడ నుగ్రరజోగుణుండ ని**
**స్సీమదయం గరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్య మీశ్వరా.**

కాబట్టి నేను నీ భృత్యదాస్యరూపాన నీకు దాస్యం చేయతగును.

దేవా! నీవు సర్వాత్ముడవు. సకల లోక సుహృదుడవు. ఉత్తమ మధ్యమాధము లన్న మతిభేదం నీ యందు కానరాదు. లోకమందంతటా నీ వొక్కడవే వ్యాపించి ఉన్నవాడవేని, నీకు వైషమ్యభావం కలుగదేని లోకమందలి వైషమ్యాదులకు కారణం ఏమిటని కొందరు శంకిస్తారు. నీ ప్రసాదం అందరికీ ఒక్క రూపున లభింపని మాట సత్యమే. అయితే ఆ తారతమ్యానికి లోకులే కారకులు గాని నీవు కారకుడవు కాదు. ఏమంటావా? నిన్ను సేవించిన వారికి నీ ప్రసాదం అనుగ్రహిస్తావు. సేవింపనివారికి ఏదీ కలుగబోదు. కోరిక లీడేర్చటం కల్పవృక్ష ధర్మం. ఫలప్రాప్తి అన్నదో? అర్థుల స్వాధీనం. కోరకనే ప్రయత్నింపకనే ఫలం ఇవ్వలేదని కల్పద్రుమాన్ని నిందింపవచ్చునా?

దేవా! అర్థులకు నీ ప్రసాదం ఏకరూపాన కలగటం లేదని మరికొందరు సంశయిస్తారు. సేవానురూపంగా ప్రసాదం ఉంటుందని తెలియక అలాగనుకొంటారు. అందరూ ఏకఫలాన్నే కోరటం లేదు; వారి సేవాదారుఢ్యం ఒక్క రూపాననే ఉండడం లేదు. ఎవరు దేనిని ఎంత భక్తితో కోరుకొంటే వారికి దానిని అంత మాత్రమే ఇస్తావు. కోరటం వారి కార్యం; ఈడేర్చటం నీ కార్యం. ఇది కోరమని గాని, ఇంతే కోరమని గాని నీవెన్నటికీ అనవు; కోరుకొమ్మని పిలవవు. ఇది గుర్తింపక వైషమ్యాదులను నీకు మూటగడతారు. ఇంతకన్న అజ్ఞానం ఉన్నదా?

**సీ. నీ గృహాంగణభూమి నిటలంబు మ్రోవంగ**
**మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని**

**నీ మంగళస్తవనికరవర్ణంబులు**
**పలుమాఱు నాలుక బలుకఁడేని**

**నీ యధీనములుగా నిఖిలకృత్యంబులుఁ**
**బ్రియభావమున సమర్పింపఁడేని**

**నీ పదాంబుజముల నిర్మల హృదయుఁడై**
**చింతించి మక్కువ జిక్కఁడేని**

**తే. నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవ**
**సేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందగలఁడె**
**యోగియైనఁ దపోవ్రతయోగి యైన**
**వేదియైన మహాతత్త్వవేది యైన.**

స్వామీ! నీ సేవను కోరక నీ భృత్యుల సేవను కోరటం ఎందుకంటావా? జనన మరణ రూప మహావిషసర్పమయమైన సంసార కూపంలో కామాభిహతుడనై వచ్చి కూలాను. అప్పుడు నీ భక్తుడు నారదమునీంద్రుడు నన్ను అనుగ్రహించి నీ ఆశ్రయాన్ని నాకు చూపాడు. ఆయన మూలాన నీ అనుగ్రహానికి పాత్రుడనైనాను. నా యీ భాగ్యం నీ భక్తుని కరుణావిశేషం

కాబట్టి ఆయన మార్గాన్నిప్పుడు వదలటం కృతఘ్నత కదా? అంతే కాదు. నీ భృత్యులు అనుభవ శాలులు. వారిని సేవించటం వలన నీ ప్రాప్తికి సౌలభ్యం కలుగుతుంది. అందుకే నీ భృత్య సేవను కోరుతున్నాను.

స్వామీ! నా తండ్రి ఖడ్గహస్తుడై, 'ఓరీ! నా కంటె వేరొకడు ఈశ్వరుడు ఉన్నాడంటివి. ఇదే నిన్ను వధింపబోతున్నాను. నిన్ను రక్షించేవాడు ఎక్కడున్నాడో రమ్మను' అని నా పైకి ఉరికాడు. అప్పుడు నీవు ఈ రూపంలో అవతరించావు. ఆ కారణాన ఈ నీ అవతారం ప్రహ్లాదరక్షణార్థమని భావింపవచ్చు. అది స్తవమే కావచ్చుగాని వాస్తవం కాదు. ఈ వరాటుని రక్షించటమంటే నీకెంతమాత్రపు పని? అందుకోసం ఈ విధంగా అవతరించాలా? నీ భృత్యుడైన ఋషి వచనాన్ని నిలుపగోరి నేలకు దిగివచ్చావు. అది కాకతాళీయన్యాయంగా నా రక్షణార్థం కూడా కలిసివచ్చింది.

స్వామీ! భక్తరక్షణ దుష్టశిక్షణలు సర్వసముడికి పక్షపాతచిహ్నాలు కావా? అని ప్రశ్నిస్తారు. రక్షణ శిక్షణలు వారి వారి పుణ్య పాప ఫలాలు. ఆ ఫలాలు వారి వారికి స్వతస్సిద్ధాలు. నీ మాయా శక్తి కాలానుగుణంగా ఫలోదయం కావిస్తుంది. అప్పటికి ఫలాలు భోగ్యము లవుతాయి. నీ శక్తికార్యం కూడా నిమిత్తమాత్రమే. శక్తికి, శక్తిమంతునికి అవినాభావం కాబట్టి నీ శక్తికార్యాన్ని నీయందు ఆరోపించి నిన్ను స్తుతినిందలకు గురిచేస్తారు.

స్వామీ! మాయాకార్యాలకు ఆద్యంతాలు ఉన్నాయి. నీవేమో తత్కార్యపూర్వపరాలు రెండింటిలోనూ యథాస్థితిని ఉంటావు. మఱ్ఱిచెట్టుకు బీజం కారణమవుతుంది. ఆ బీజం పృథ్వీతన్మాత్ర జలతన్మాత్రల సమ్మేళనఫలం. ఆ బీజం వలన వృక్షమయింది. ఆ చెట్టు కొన్నాళ్ళుండి నశిస్తున్నది. నశించి ఏ తన్మాత్రనుంచి తాను ఏర్పడినదో ఆ తన్మాత్రలలోనే అది లయిస్తున్నది. ఆ తన్మాత్ర లెక్కడినుంచి వచ్చినవి? అంటే, అవి నీ శక్తివిశేషాలు. నీ శక్తికి నీవు ఆశ్రయుడవు. బీజోత్పత్తికి పూర్వాన,

వృక్షనాశానికి పరమందు నీ శక్తి అలాగే ఉన్నది. నీ శక్తి ఉన్నదంటే నీవున్నావనే కదా అర్థం!

వటవృక్షానికి కారణము కార్యము నీవే ఎలాగైనావో అదే విధంగా సమస్తసృష్టికి నీవు కారణకార్యాత్ముడవు. కారణానివైనా కార్యానికి పరుడవై వెలసి ఉంటావు. స్వామీ! సర్వము నీవే అయి ఉండగా నేను నాది నీవు నీది అనే భావాలు ఎలా కలిగాయని, బీజమందు లేని వైషమ్యం వృక్షంలో మాత్రం ఉంటుందా? అని శంకిస్తారు. నిజానికి జగత్తులో అసలు వైషమ్యమే లేదు. వైషమ్యబుద్ధి కేవలం మోహజనకం. పసిరికల కంటికి తెల్లటి వస్తువు పచ్చగా కనిపిస్తుంది. మోహబుద్ధి కూడా అటువంటిదే. ఈ మోహానికి కారణం ఏమిటి? ప్రారబ్ధకర్మమే కారణం. కర్మమో? అనాది అయినట్టిది. అనాది అయిన దానిని గూర్చి తదనంతరం వచ్చిన నేనేమి చెప్పగలను?

స్వామీ! నీ యందు విశ్వోత్పత్తి జరుగుతున్నది. నీవు నిష్క్రియుడవు కాబట్టి ఆత్మానందంలో మగ్నుడవై ఉంటావు. అప్పుడు నీ శక్తి నీ యందు నిద్రిస్తుంటుంది. దీనిని నీ యోగావస్థ అంటారు. ఇచ్ఛవచ్చినప్పుడు కనువిచ్చి చూస్తావు. దీనిని నీ జాగ్రదవస్థ అంటారు. ఈ రెండవస్థలూ నీకు స్వాభావికాలు. నీవు ఉండటమే అటువంటి దన్న మాట. యోగావస్థ నుంచి జాగ్రదవస్థను నీవు కాంచినప్పుడు నీలో లీనమై ఉండిన నీ శక్తి వ్యవహారముఖ మవుతుంది. ఆ వ్యవహారం పెక్కు రూపాలలో జరుగుతుంది. ఆ రూపాలలో కాలం ఒకటున్నది. కాలశక్తి ప్రేరేపణ వల్ల ప్రకృతి, ప్రకృతిధర్మాలైన సత్త్వాదిగుణాలు వ్యవహరిస్తాయి. అప్పుడు జగద్బీజం నీ నాభిపద్మాన అంకురిస్తున్నది. ఆ పద్మం నుంచి బ్రహ్మదేవుడు తొలుదొల్త జన్మించాడు. అతనట్లు జన్మించినవాడు నాల్గు దెసలు పరికించి ఎక్కడేమున్నదీ కానరాక తానున్న పద్మానికి జననస్థానం ఏదో తెలియగోరి వెతికి వెతికి వేసారాడు. మొలక మొలిచిన తర్వాత బీజం కనిపిస్తుందా? ఆ విధంగా విఫలమనోరథుడై బ్రహ్మదేవుడు మరొకటి తోపక తదేకధ్యానగతుడయ్యాడు. అప్పుడు పృథ్విలో గంధమట్లు అతని ఆత్మలో సన్మాత్రరూపాన నీవు సాక్షాత్కరించావు. ప్రపంచ

కల్పనావయవాలను అతను నీ యందు వీక్షించి ఆ సాధనాలను గ్రహించి జగత్సృష్టి కావించాడు. విశ్వం ఆ విధంగా ఉత్పన్నమైనదని పెద్దలంటారు.

దేవా! బ్రహ్మదేవుని చర్యవలన నేను నీ అనుగ్రహప్రాప్తికి నీ ఉపాసనమే పరమసాధనమని గ్రహించాను. నీ అనుగ్రహం నీ భక్తులయెడ ఎల్లకాలం ఉంటుందా? అన్న శంకకు తావులేదు. మధుకైటభులను మర్దించి బ్రహ్మకు వేదాలను నీవు తెచ్చియిచ్చినదే నిదర్శనం. నిన్ను నమ్మినవారికి ఎన్నటికీ లోటు కలుగదు.

స్వామీ! నీ అవతారాలకు కాలనియతి గాని దేశనియతి గాని రూపనియతి గాని కలుగదా? అని ప్రశ్నిస్తారు. ధర్మరక్షణ నీ కార్యం కాబట్టి ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ ధర్మగ్లాని అధర్మవృద్ధి జరిగితే అప్పుడు ఆ చోట నీవు అవతరిస్తావు. ఏ రూపంలో ధర్మదూరుని సంహరించాలంటే ఆ రూపాన్ని ధరిస్తావు. అందుకు నీ యీ విలక్షణరూపమే నిదర్శనం. ఇంతకు ముందు సురలు తిర్యక్కులు ఋషులు మత్స్య కూర్మ వరాహాది అవతారాలను ధరించి మత్స్యావతారాలను ధరించి ధర్మాన్ని ఉద్ధరించావు కదా! కృతత్రేతాద్వాపరాలలో రూపధారివై ఆవిర్భవిస్తావని, ఆ కారణాన నిన్ను త్రియుగు డంటారని, కలియుగంలో ప్రచ్ఛన్నుడవై వర్తింపగలవని పెద్దలంటారు.

తండ్రీ! ధర్మరక్షణార్థమై ఇన్ని అవతారాలను ధరిస్తూ నీ అనుగ్రహామృతాన్ని ఇంతగా వెదజల్లుతున్నా లోకం దానిని గ్రహింపక వివిధదుఃఖాల పాలు కావటం చూస్తుంటే ఆశ్చర్య విషాదాలు కలుగుతున్నాయి. దీనికంతటికీ అజ్ఞానమే కారణం. ఏమంటే సుఖలాలసత ప్రాణులకు నైజం. ఆ సుఖం ఎక్కడున్నదో తెలియక భార్యాపుత్త్రాదులను పట్టి ప్రాకులాడతారు. ఎంత కాలం జనుల మనస్సు బహిర్ముఖమై గృహాదులందు తగిలి తదానందవశమై ఉంటుందో అంత కాలం వారికి నిత్యానందం లవమాత్రమైనా లభింపదు. నిక్కమైన ఆనందాన్ని కోరుకొనేవారు నిన్నే ఆశ్రయించాలి. నిన్ను

ఆశ్రయించాలంటే, బుద్ధి మొట్టమొదట నీ వంకకు మళ్ళాలి. అందుకు నీ కథా కర్ణనం ఎంతగానో తోడ్పడుతుంది. నీ చరిత్రలను వింటుండటం వలన నీ యెడ రాగం ఉదయిస్తుంది. అప్పుడు బుద్ధి దానియందు లగ్నమై నిన్నెడబాయదు. అట్టి బుద్ధిగలవారే నీ తత్త్వవిచారానికి తగినవారు. అన్యు లే నాటికీ తగరు.

తండ్రీ! ఇంద్రియప్రేమయే లోకుల ఈ దుర్గతికి కారణం. గృహపతిని భార్య ఆకర్షించినట్లు ఇంద్రియారాములను జిహ్వాత్వక్శ్రోత్రఘ్రాణ శిశ్నేంద్రియాలు, కర్మేంద్రియాలు పలువంకలకు ఈడుస్తుంటాయి. వారందులో తగుల్కొని అవి నడిపించినట్లు నడుస్తూ, తత్తదింద్రియాలకు ప్రీతి కలిగించేందుకు వివిధవస్తువులను ఆర్జించే ప్రయత్నాలు చేస్తూ, తమ యత్నాలకు అనుకూలించేవారిని మిత్రభావం తోను, ప్రతికూలించేవారిని శత్రుభావం తోను పరిగణిస్తూ, విశ్రాంతి లేని ఆ ప్రయాస ఫలంగా వ్యాధులకు లోనై ఎట్టకేలకు తీరని కోర్కెలతో మరణిస్తారు. వారి కర్మములన్నీ సకామము లైనందున వాటికి ఫలం తప్పదు. ఫలానుభవానికి తత్తదుచిత శరీరధారణం తప్పదు. శరీరధారి భోగ్యఫలాలను అనుభవిస్తూ, తద్వాసనాప్రేరితుడై మళ్ళీ అటువంటి కర్మలనే ఆచరిస్తాడు. ఆ కర్మములు మళ్ళీ ఫలాల నిస్తాయి. ఆ ఫలభోగార్థం మళ్ళీ శరీరధారణ తప్పదు. ఇటువంటి జననమరణరూప సంసారవైతరణి ప్రవాహంలో పడి ఈదులాడే జనులంటే ఎంతో పరితాపం కలుగుతున్నది. తండ్రీ! నీవు దయాస్వరూపుడవు. ఆర్త బాంధవుడవు. ఈ దీనులు నీ అనుగ్రహానికి పాత్రులు.

తండ్రీ! ఇట్టి దీనులను ఉద్ధరించాలంటే సదుపదేశం ఒక్కటే మార్గం. అందుకు మునిముఖ్యులు లేరా? అంటే, వారు కూడా తమ కోరికలను పూర్ణంగా జయింపలేక నిర్జనారణ్యాలను బట్టి ప్రాకులాడుతుంటారు. ఇంట గెలవలేని వారు రచ్చ గెలుస్తారా?

తండ్రీ! 'ఈ దీనుల సంగతి నీకెందుకు? నీకు మాత్రం ముక్తినిస్తాను' అని చెప్పకు. వారిని కాదని నాకేమి ఇచ్చినా నేను గ్రహింపలేను. ముందు వారిని

అనుగ్రహించు. అందరికీ నీవే కదా శరణాగతివి. వారిని ముందు కడతేర్చు. వారి చిత్తాల లోని గృహస్థత్వరూపమైన జిడ్డును మొట్టమొదట కడిగివేయాలి. అందుకు శ్రుతము, అధ్యయనము, స్వధర్మాచరణము, వివిక్తదేశనివాసం, మౌనం, జపతపోవ్రతాలు, సమాధియోగం అనే అపవర్గహేతువులు ఉన్నమాట నిజమే కాని అవన్నీ జితేంద్రియులకు ఆచరణీయాలు. అజితేంద్రియులు వాటిని పాటించలేరు. కాదని ఒకవేళ వాటిని అనుష్ఠిస్తున్నారంటే జీవనోపాయార్థం వేషధారులై జనులను మోసగిస్తున్నా రనుకోవాలి.

తండ్రీ! కొయ్యలను ఒకదాని నొకటి రగిలిస్తే కాని అగ్ని జనింపదు. అలాగే కార్యకారణాలను మథించితే కాని నీవు ప్రత్యక్షుడవు కావు. ఆ మథనానికి అధ్యయనాది వాగ్వ్యవహారాలన్నింటినీ కట్టిపెట్టి సమాధియోగాన్ని ఆశ్రయించాలి. అందుకు భక్తి ఎంతో తోడ్పడుతుంది. ఆ భక్తియోగానికి ప్రణామ ప్రణుతి పూజా పరిచర్యా కథా శ్రవణములనే ఆరు అంగాలు ఉన్నాయి. వాటి మూలకంగా నిన్ను సేవించిన నాడు భక్తి కలుగుతుంది. భక్తి కలుగగానే తక్కినవన్నీ స్వతస్సిద్ధాలే కదా' అని సాష్టాంగం చేశాడు.

## భగవానుని పరీక్ష

ధర్మజా! భగవానుడు ప్రహ్లాదుని మాటలు విని, 'నాయనా! నీ భావం తెలుసుకొన్నాను; ఎంతో సంతోషించాను. నా దర్శనమే అందుకు నిదర్శనం. నన్ను మెప్పింపని వారికి ఎన్నటికీ నా దర్శనం లభింపదు. శుభాన్ని కోరినవారు సర్వభావాల నన్ను మెప్పించాలి. నీ భక్తికి మెచ్చాను. నీ ఇచ్చవచ్చిన వరాలను అడుగు. నీవు కోరినవన్నీ ఇస్తాను. నన్ను సందర్శించి నా వలన అభీష్టసిద్ధి పొందక రిక్తహస్తాలతో పోవటం మర్యాద కాదు' అని పరిపరి విధాల ప్రహ్లాదుని ప్రలోభపెట్టాడు.

ప్రహ్లాదుడు భగవద్వచనాలను విని, 'తండ్రీ! మర్త్యుడు స్వభావం చేతనే కామాసక్తుడై ఉంటాడు. అతని కోరికలన్నీ మనోవిభ్రాంతికరములై

ఏకాంతభక్తికి అంతరాయాలుగా ఉంటాయి. ముల్లోకాల నిస్తానన్నా నాకు వద్దు. మోక్షాన్ని కోరి నిన్నాశ్రయించాను. హృదయబంధనాలు, పునస్సంసారబీజాలు అయిన కోరికలకు నీ దాసుని నీవు పురికొల్పటం అతని మనోబలపరీక్షార్థమే కదా! అదే కాకపోతే కరుణాసముద్రుడవు నీవు నిన్నాశ్రయించినవారిని అనర్థాలకు ప్రేరేపిస్తావా? మరి నీకు భక్తుడనని ఒకవైపున అంటూ ఆ నోటితోనే కోరికలిమ్మని నిన్ను కోరుకొనేవాడు బేరగాడు కావచ్చు గాని నిజమైన భక్తుడు కాలేడు. అంతే కాదు. స్వప్రయోజనార్థం ప్రభువును సేవించేవాడు ఎన్నటికీ విశ్వాసపాత్రుడు కాడు. అలాగే తన స్వామిత్వరక్షణార్థం భృత్యుల కోర్కెలను తీర్చేవాడు స్వామి పదవాచ్యుడు కాడు. స్వామి భృత్యు లిద్దరూ గుణగ్రాహులుగా ఉండాలి. నేను నిష్కామభక్తుడను; నీవో ఫలాభిసంధిరహితుడవైన సర్వేశ్వరుడవు. మన యిరువురికీ కామఫలాభిసంధులు వద్దు.

తండ్రీ! లోకేశ్వరుడవైన నీవు స్వయంగా వచ్చి కోరమన్నప్పుడు కోరకపోతే తిరస్కారమవుతుందని అంటావేమో. అలాగైతే నిన్నొక్కటి అర్థిస్తాను. నా మదిలో ఎటువంటి కోరిక అంకురింపని వరాన్ని అనుగ్రహించు. కామం తలయెత్తినదంటే వెనువెంటనే మనఃప్రాణేంద్రియ దేహధర్మాలు పైకొని ధృతిమతిశ్రీహ్రీలను, తేజస్సత్త్వస్మృతులను పారద్రోలుతాయి. తత్ఫలంగా మర్త్యుడు భ్రష్టుడవుతున్నాడు. కోరికలను త్యజిస్తే ఐశ్వర్యం ఎక్కడినుంచి వస్తుంది? అని అడుగుతావేమో? జితకాముడు నీతో సమానమైన ఐశ్వర్యసంపద కలవాడు. అతనికి కొదవ ఏముంటుంది? నా ప్రార్థనను మనస్కరించు' అని నమస్కరించాడు.

## భగవానుని ఆనతి

ధర్మజా! భగవానుడు ప్రహ్లాదుని మనోనిశ్చయానికి మెచ్చి, 'నాయనా! ఏకాంతభక్తులకు ఐహికభోగాలే కావు ఆముష్మికసుఖాలు కూడా రుచింపవు. అయినా నీ కర్తవ్యం ఒకటున్నది విను. ప్రకృత మన్వంతరాంతం వరకు నీవు

దైత్యేశ్వర భోగాలను అనుభవిస్తూ ఇక్కడే ఉండు. ఈ భోగానుభవం నీకు బంధకారణ మవుతుందని భయపడవద్దు. ప్రతి నిత్యం నా కథాశ్రవణలతో ఏకరూపాన సర్వాంతర్యామినై ఉన్న నా యందు నీ చిత్తాన్ని పాదుకొలిపి, వివిధయజ్ఞాలతో నన్ను ఆరాధిస్తూ కాలం గడుపు. సర్వకర్మఫలాలను నాకు సమర్పిస్తావు కాబట్టి నీవు కావించే యజ్ఞాది కర్మముల ఫలాలు నీకు ప్రతిబంధనాలు కానేరవు. పుణ్యకర్మాచరణ వలన పాపాలు నశిస్తాయి. అంతట శరీరం తనంత తానే రాలిపోతుంది. లోకసంగ్రహార్థం నిన్నీ విధంగా ఆజ్ఞాపిస్తున్నాను. మన్వంతరాంతంలో నీవు నన్ను చేరుకొంటావు. నీ కీర్తి ముల్లోకాలకు వ్యాపిస్తుంది. నీవు చేసిన ఈ స్తోత్రాన్ని విన్నవారు, కీర్తించిన వారు నన్ను స్మరింపక మానరు. ఆ స్మరణ శక్తి ఫలంగా వారు యథాకాలం బంధముక్తి నొందగలరు' అని పలికాడు.

## ప్రహ్లాదుని ప్రార్థన

ధర్మనందనా! ప్రహ్లాదుడు భగవదాజ్ఞను తలదాల్చి, 'స్వామీ! నా తండ్రి తన తమ్ముని చావుకు నీవు కారణమని భ్రమించి నీ మీద నీ భక్తుల మీద విరోధం పూని లోకగురుని నిన్ను నిందించి తీరని పాపానికి ఒడిగట్టాడు. నీ ప్రశాంతదృష్టిని అతనిపై సారించి అతని నుద్ధరించు' అని వేడుకొన్నాడు. భగవానుడు అతని ప్రణయాన్ని విని, 'సాధువర్యా! నీ జననం తోనే నీ తండ్రి, అతని పూర్వులైన కశ్యప మరీచిబ్రహ్మలు పునీతులైనారు. అంతే కాదు. పూర్వకల్పం లోని మీ పూర్వులు ఇరవై ఒక్క తరాల వారు కూడా పావనులైనారు. కులపావనుని జన్మ సామాన్యమైనది కాదు.

ప్రహ్లాదా! నా భక్తుల భక్తులు కూడా నా భక్తులే అవుతారు. భక్తి అన్నది ప్రేమస్వరూపం. ప్రేమకు ప్రేమింపబడే పదార్థం ఉండాలి. ఆ పదార్థం అవ్యయమై సర్వాత్మకంగా ఉన్నప్పుడు అది సర్వవిధప్రేమలకు తరగని ఆకర్షణ స్థానం కాగలదు. ఆ పదార్థం నేను తప్ప వేరొకటి లేదు. నా భక్తుడు గాని నా భక్తభక్తుడు గాని ఏవిధంగా ప్రేమించినా ప్రేమింపబడే పదార్థం ఒకటే కాబట్టి

తుట్టతుదకు అందరూ నాకే భక్తి చేసినట్లవుతుంది. కాబట్టి నా భక్తభక్తులు కూడా నాకు నా భక్తులతో సమానమే. ప్రహ్లాదా! నీ భక్తితత్త్వం అవ్యగ్రము, పరిపూర్ణము అయినట్టిది కనుక నీవు భక్తకోటికి దర్శకుడవు కాగలవు. భక్తితత్త్వాన్ని తెలియగోరినవారు నిన్నే ఆదర్శమూర్తినిగా గ్రహిస్తారు.

నీ తండ్రి సంగతి ఏమంటావా? ఎప్పుడు నా గాత్రస్పర్శ అతనికి సోకిందో అప్పుడే అతను స్పర్శవేది సోకిన రాగివలె పరిశుద్ధుడైనాడు. అతనికి ప్రేతకార్యాలు తీర్చి ఈ సింహాసనం అధిష్ఠించి వేదజ్ఞులైన విప్రుల ఉపదేశప్రకారం స్వధర్మాలను నా యందలి తాత్పర్యంతో నిర్వర్తించు' అని చెప్పాడు. ప్రహ్లాదు డంతట తండ్రికి ఉత్తరక్రియలు జరిపాడు.

## బ్రహ్మ విజ్ఞాపనం

ధర్మజా! శ్రీ నృసింహమూర్తి ఆ విధంగా ప్రశాంతుడు కాగానే బ్రహ్మదేవుడు తదితర దేవతలతో ఆ మహాత్ముని సమీపించి 'దేవాదిదేవా! నిఖిలాధ్యక్షా! భూతభావనా! సర్వపూజ్యకా! లోకసంతాపకరుడైన ఈ రాక్షసుని వధించి మా తాపం చల్లార్చావు. ఇతను ఘోరతపస్సు చేసి త్రైలోక్యాన్ని జ్వలింపజేశాడు. ఆ వేడిమికి తాళలేక అతను కోరిన వరాలను ఇచ్చివేశాను. ఈ దుర్మార్గుడు వరోద్ధతుడై సమస్తధర్మాలను తారుమారు చేశాడు. ధర్మహాని కూడదన్న కారణాన కన్న కొడుకును కూడా వధింపబోయాడు. ప్రహ్లాదుడు పరమ భాగవతుడు కనుక నీ కరుణకు పాత్రుడై బ్రతికాడు. దేవా! హిరణ్యకశిపుడు అంతటి పాపవర్తనుడైనా నీ ఉత్సంగమందు లయ మందినందువల్ల అగ్నిపుటంలో బంగారు రీతిని నిర్మలత్వాన్ని పొంది ధన్యధన్యు డైనాడు' అని విన్నవించి యథోచిత పూజలు కావించాడు.

## భగవానుని సందేశం

ధర్మనందనా! భగవానుడు బ్రహ్మ పలుకులను విని 'పద్మసంభవా! కన్నులు మూసుకుని వరాలను ఇవ్వకూడదు. వరదానానికి పాత్రాపాత్రవిచారం ముఖ్యం. ఆసురస్వభావులకు వరాలివ్వటం నల్లత్రాచును

పాలతో పెంచటం వంటిదే కదా' అని చిరునవ్వుతో మందలించి అంతర్హితుడైనాడు.

## ప్రహ్లాద పట్టాభిషేకం

ప్రహ్లాదు డంతట బ్రహ్మాదులను పూజించాడు. బ్రహ్మదేవుడు భార్గవాది మునులను కూడి ప్రహ్లాదునికి పట్టాభిషేకం చేయించి ఆశీర్వదించి దేవతలతో కలిసి యథాస్థానానికి వెళ్ళిపోయాడు. ప్రహ్లాదుడు సింహాసనం అధిష్ఠించి వసుమతి రాజన్వతిగా ప్రజలను పాలించాడు.

## భ్రమరకీట న్యాయం

పాండునందనా! శాపగ్రస్తులైన విష్ణుపార్షదులు తొలి జన్మలో దితికి పుత్రులై జనించి భగవంతుని యొక్క వరాహ నృసింహావతారాల చేత హతులైనారు; రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగా పుట్టి రామబాణాలకు గురియై మరణించారు; మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగా జనించి భగవంతుని చేత ఈ విధంగా సంహరింపబడ్డారు.

ఈ మూడు జన్మలలోనూ వీరి చిత్తాలు నిరంతరం భగవత్పరాలు గానే విరాజిల్లాయి. ఆ తత్పరత్వం ప్రేమపూర్వకం కాక వైరాత్మకంగా రూపొంది క్షణక్షణాభివృద్ధిని గాంచింది. భాగవతులు భక్తియోగం వలన పొందినట్లుగానే చైద్యాదులు వైరానుబంధం వలన తాదాత్మ్యాన్ని పొందారు. తాదాత్మ్యానికి వస్తు నిరంతర చింతనమే ప్రధానం. ఆ చింతన ప్రేమపూర్వక మయితే సౌమ్యంగా తాదాత్మ్యం లభిస్తుంది. వైరపూర్వక మయితే భ్రమరకీట న్యాయానుసారం భయక్లేశాది పూర్వకంగా ఎట్టకేలకు తాదాత్మ్యం కలుగుతుంది.

## భగవత్ప్రీతి ప్రభావం

ధర్మనందనా! నీ ప్రశ్నకు సమాధానం చెప్పాను. ఒక్క సంగతి విను. లోకపావనులైన మహాత్ములకు ఎటువంటి కోరికలు కలగవు. అట్టివారు మీ యింటికి ప్రతినిత్యం వచ్చి పోతున్నారు. కారణమేమిటి? పరమాత్ముడు

మానుషరూపంలో ప్రచ్ఛన్నుడై మీ యింట ఉన్నందువలన అతని సందర్శనార్థం వస్తూ పోతూ ఉంటారు. భగవత్సాన్నిధ్యశ్రీ వలన, మహాత్ముల సందర్శనాదికం వలన మీరు నరలోకంలో మహాభాగులైనారు. వాసుదేవుడు మీకు మేనమామ కొడుకు మాత్రమే కాక ప్రియుడు, చెలికాడు, గురువు, ఆజ్ఞాకరుడు కావటానికి మీరు నోచిన పుణ్యం ఇంతింతనరానిది. ఇదంతా పరమాత్ముని భక్తవాత్సల్య విశేషమే సుమా. భగవానుని వాత్సల్యం చూరగొన్నవారికి ఏ లోటూ ఉండదు. పూర్వం భవుడంతటివాడు క్లేశవశుడై భగవత్ప్రీతి కావించి ముప్పుబాసి కీర్తి గన్నాడు. ఎంతటివారికైనా భగవత్ప్రీతి ముఖ్యం' అన్నాడు.

మునులారా! ధర్మసుతుడు నారదుని తుదివాక్యం వినగానే 'మునీంద్రా! భవుని కీర్తికి ఎటువంటి ఆపద కలిగింది? భగవానుడు అతనిని ఏ విధంగా రక్షించాడు? ఆ సంగతి వినాలని కుతూహలంగా ఉన్నది' అన్నాడు. నారదుడు చెప్పాడు.

## త్రిపురాసుర చరిత్ర

ధర్మరాజా! పూర్వం దేవాసురులకు పోరు జరిగింది. దేవతలు హరి బలాన్ని పేర్చారు. అసురులు వారి చేతిలో ఓడిపోయి మాయలకు గురువైన మయుని శరణువేడారు. మయుడు బంగారుతో వెండితో ఇనుముతో వేరు వేరుగా మూడు పురాలను మహావిచిత్రంగా గగనమార్గాన సంచరించే విధంగా నిర్మించి వారికి అందజేశాడు. దానవులు ఆ పురాలను అధిష్ఠించి ముల్లోకాలలో విహరిస్తూ దేవతలను ఉద్దుడికించారు. అసురులను మార్కొనేందుకు దేవతలు వివిధోపాయాలను పన్నారు. ఆ పురాలు కంటికి కానరాక సంచరించేవి కావటం వలన నిర్జరుల పన్నాగాలు సాగలేదు.

దేవతలు గత్యంతరం కానక శంకరుని చరణాలకు సాగిలపడ్డారు. శంకరుడు అల్పసంతోషి కాబట్టి అమరులకు అభయం పలికి యుద్ధోన్ముఖుడై వచ్చి త్రిపురాల పైని అగ్నివర్ణబాణాలను కురిపించాడు. ఆ దివ్యశరాలు సూర్యకిరణాల వలె పురత్రయాన్ని కప్పివేశాయి. ఆ శరాల వేడిమికి లోనున్న

అసురులందరూ చచ్చిపడ్డారు.

మయుడు గొప్పయోగి కాబట్టి సిద్ధామృతరసకూపాన్ని నిర్మించి ఆ మృతకళేబరాలను అందులో ముంచాడు. ఆ రసప్రభావం వల్ల వారందరూ పునర్జీవితులై వజ్రసారులై వైద్యుతాగ్నుల వలె తేజరిల్లారు. ముక్కంటి అది చూసి, 'అయ్యో! నా సంకల్పం భగ్నమయింది కదా' అని కలత చెందసాగాడు. ఆ సంగతి విష్ణుదేవుడు గ్రహించి ఉపాయం ఊహించి తాను గోరూపాన్ని ధరించి బ్రహ్మను దూడగా చేసి దానిని వెంటగొని మధ్యాహ్నవేళ మయనిర్మితమైన బావిని చేరి అందులోని రసాలను త్రాగివేశాడు. గోవత్సాలు కూపజలాలను గ్రోలుతుంటే అసురులు కళ్ళారా చూస్తూ పశువులనే భ్రాంతితో అడ్డుచెప్పక ఊరుకొన్నారు. కాలమోహాన్ని తప్పించుకొనలేము కదా ధర్మజా! ఆ సంగతి కూపపాలకులు మయునికి వెళ్ళి చెప్పారు. అతను వారి మాటలను విని 'దైవగతిని తప్పించటం ఎవరి తరమూ కాదు. అనివార్యానికి శోకించినా ఫలం లేదు' అని వారిని ఊరడించాడు.

భగవాను డంతట తపోవిద్యాక్రియాది స్వశక్తులను స్మరించాడు. స్మరింపగానే రథ్య సారథి ధనుర్బాణ కవచాది సాధన సంపూర్ణమైన దివ్యరథం ఒకటి వచ్చింది. దానిని శ్రీకంఠునికి ఇచ్చాడు. త్రిశూలి ఆ రథం అధిరోహించి అభిజిన్ముహూర్తవేళ త్రిపురాలను ఎదుర్కొని బాణప్రయోగం చేశాడు. ఆ శరఘాతానికి పురత్రయం ఒక్కుమ్మడిని దగ్ధమై రూపుమాసింది. ఆ సంతోషసమయాన దేవదుందుభులు మ్రోగాయి; పుష్పవర్షం కురిసింది; జయ జయ ధ్వనులు చెలరేగాయి. ధర్మజా! మహాదేవుడు ఆ విధంగా తన కీర్తిని దక్కించుకొని నిజధామానికి వెళ్ళాడు.

ధర్మనందనా! హరిలీలా విడంబనాలు లెక్కలేనన్ని ఉన్నాయి. అవి ఊహాతీతాలు. వాచామగోచరాలు. బ్రహ్మాదులకు కూడా ఆయన ఎప్పుడు ఎవరికి ఏ విధంగా ఏమిచేస్తాడో అనూహ్యం. ఈ లీలలన్నీ లోకమంగళార్థమే గాని కర్మవశాలు కావు. ఆ లీలాత్మకచరిత్రలను సావధానమతులై విననోచినవారికి పావనత్వం చేకూరుతుంది. భగవత్ప్రభావం ఎంత

మహిమోపేతమో ఊహించు' అన్నాడు.

## భక్తిజ్ఞానవృద్ధికి తగిన ధర్మాలు

మునులారా! ధర్మపుత్రుడు ఆ కథ విని 'మునీంద్రా! భగవంతుని ప్రసాదాన్ని పొందటమే పరమప్రాప్యమని అన్నారు. అందుకు భక్తి, జ్ఞానం ఉండాలంటారు. భక్తి జ్ఞానాలు ప్రయత్నించి పొందదగినవే కాని తమంత తాము ఎక్కడో ఆకాశం నుంచి ఒడిలోనికి వచ్చి రాలవు. ఆ ప్రయత్నాలను ధర్మములని అంటారు. ఏయే ధర్మాలను అనుష్ఠించి భక్తిజ్ఞానాలను పొందవచ్చునో నాకు చెప్పండి. ఋషివర్యా! సాక్షాద్బ్రహ్మమానసపుత్రులు, తపోయాగసమాధినిష్ణాతలు, నిరంతర నారాయణ ధ్యానపరులు కాబట్టి సమస్తధర్మాలు మీకు కరతలామలకాలు. అందుకే మీరు చెప్పాలనటం' అని విన్నవించాడు. నారదుడు ధర్మసుతునితో ఇలా అన్నాడు.

## ధర్మనిర్ణయానికి ప్రమాణాలు

ధర్మనందనా! భగవంతుడు తన అవ్యక్తావస్థ నుండి వ్యక్తావస్థను పొందాడు. దానినే సృష్టి అన్నారు. ఆ సృష్టి యథాక్రమం కొనసాగటానికి భగవంతుడే కొన్ని నియమాలను ఏర్పరిచాడు. ఆ నియమాలను ధర్మములు అంటారు. అవి ప్రవృత్తిధర్మాలు, నివృత్తిధర్మాలు అని రెండు విధాలు. ఆ ధర్మాలను భగవానుడు వేదముఖంగా ప్రతిపాదించాడు. ఆ వేదాల నుంచి మన్వాదులు తాము గ్రహించినంత మేరకు స్మృతుల రూపంలో వెల్లడించారు. ఆ స్మృతులు ధర్మనిర్ణయానికి ప్రమాణాలు. ధర్మమంటే ఏమిటి? ఏది ఉద్ధరించేదో అది ధర్మ మనబడుతుంది.

ఆ ధర్మాలను లోకప్రచారం కావింపగోరి భగవానుడు నారాయణావతార మెత్తి బదరీవనంలో తపస్సు చేస్తుండగా ఆయనను సందర్శించి ఆయన ముఖతః నేను సకల ధర్మాలను తెలుసుకొన్నాను. నేను విన్నది వివరిస్తాను విను.

## ధర్మవిభాగం

ధర్మనందనా! ధర్మాలు సాధారణ ధర్మాలు, స్వధర్మాలు, విశేషధర్మాలు అని మూడు విధాలు. సామాన్య ధర్మాలను అందరూ అనుష్ఠించాలి. జాతి కుల మతాది భేదాలు గాని, ఆశ్రమభేదాలు గాని సాధారణ ధర్మాచరణలో లేవు. స్వధర్మాలంటే వృత్తిధర్మాలు. విశేషధర్మాలను మోక్షధర్మాలని పేర్కొంటారు.

సామాన్యధర్మాలలో సత్యం ప్రధానం. దానితో దయ, అహింస ఉంటాయి. దయాసత్యాలు సుస్థిరం కావాలంటే అంతఃకరణ శుద్ధినొందాలి. అందుకు తక్కిన ధర్మాలైన 1. శౌచము 2. బ్రహ్మచర్యము 3. యమము 4. తపము 5. శమము. 6. వివేకము 7. తితిక్ష 8. స్వాధ్యాయము 9. దానము 10. ఋజువర్తనము 11. సంతుష్టి 12. సాధుసేవనము 13. అసంగత్వము 14. నిరహంకారము 15. మౌనము 16. ఆత్మ విమర్శనము 17. దానము 18. సమత్వ బుద్ధి 19. భక్తి అన్నవి సామాన్య ధర్మాలు. భక్తికి శ్రవణ కీర్తన స్మరణ సేవార్చన వినీతి సఖ్యతా దాస్య ఆత్మసమర్పణలు ముఖ్యాంగాలు. ఈ ధర్మాలను అనుష్ఠించటం వలన చిత్తశుద్ధి కలుగుతుంది. శుద్ధచిత్తమందు రాగద్వేషాలు జనింపవు. తత్ఫలంగా లోకం పరస్పర వైరాది వైషమ్యాలు లేక చల్లగా ఉంటుంది.

## స్వధర్మాలు

సమాజవ్యవహారానికి యోగ్యమైన ధర్మాలు స్వధర్మాలు. సమాజం వివిధ గుణవ్యక్తులతో కూడా ఉన్నందువల్ల ఏయే గుణవ్యవహారానికి ఏది తగినదో అది వారికి స్వధర్మ మవుతుంది. మొత్తం మీద స్వధర్మాలన్నీ వృత్తి ధర్మాలు.

## వర్ణ విభాగం

ప్రకృతి అంటే ఈశ్వరశక్తి. అది సత్త్వరజస్తమోగుణాల రూపంలో వ్యవహరిస్తుంది. ఆ మూడు గుణాలు ప్రతి దేహంలోనూ ఉంటాయి. అవి లేని దేహమే ఉండదు. అయితే వాటి స్థితి ఏకరూపం కాక హెచ్చుతగ్గులుగా

ఉంటుంది. ఆ హెచ్చుతగ్గులను బట్టి వర్ణవిభాగం కల్పింపబడింది. ఆ వర్ణాలు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర నామాలతో సుప్రసిద్ధాలు. సత్త్వం ప్రధానమైనది బ్రాహ్మణ వర్ణం; రజస్సు ప్రధానమైనది క్షత్రియ వర్ణం; రజస్తమోగుణులు వైశ్యులు; తమఃప్రధానులు శూద్రులు. ప్రాధాన్య గుణస్థితినే స్వభావమంటారు.

ఏ వర్ణానికి ఏ వృత్తి అనుకూలమో దానిని చేపట్టడం మంచిది. ఆ విధంగా చేయనినాడు దుఃఖం తప్పదు. బ్రాహ్మణస్వభావంలో శమదమాదులు ప్రధానం కాబట్టి దానికి యజనాధ్యయనాది కర్మలు సహజవృత్తు లవుతాయి; క్షత్రియస్వభావంలో శౌర్యాదులు ప్రధానం. కాబట్టి అందుకు పరిపాలనాది కర్మలు సహజం; వైశ్య స్వభావంలో రాగం ప్రధానం కనుక కృషివ్యాపారాదు లందుకు తగినవి; శూద్రస్వభావంలో యుక్తాయుక్త వివేకజ్ఞానం తక్కువ కాబట్టి పరతంత్రమై ఉంటుంది. ఆ పారతంత్ర్యాన్నే శుశ్రూష, సేవకావృత్తి అని పేర్కొంటారు.

ధర్మజా! వృత్తిభేదాన్ని బట్టి ఆత్మభేదం కలగదు. అన్ని ఉపాధులలోనూ ఉన్నది ఒక్క ఆత్మేనని గ్రహించాలి. ఆ గ్రహణతో కావించే వర్తనమే సమదృష్టి అనిపించుకొంటుంది. వృత్తిభేదాన్ని బట్టి హెచ్చుతగ్గులు పాటించితే వైషమ్యాలు కలిగి సమాజకళ్యాణానికి భంగం, ఆత్మకళ్యాణానికి చేటు సంభవిస్తాయి.

## విశేష ధర్మాలు

విశేషధర్మాలన్నీ మోక్షసాధనాలు. ఆ సాధనాలు యోగములు అంటారు. అవి జ్ఞానము, కర్మము అని రెండు విధాలు. భక్తి అన్నది ప్రత్యేక యోగమని కొందరంటారు గాని, భక్తి అన్నది ఏదీ ఫలించదు కాబట్టి అన్ని యోగాలకూ అది ప్రాణం వంటిది. అందుచేత దానికి ప్రత్యేకావస్థాదికల్పం అక్కరలేదు.

ఈ రెండు యోగాలను నాలుగు వర్ణాల వారు వారి వారి యోగ్యతల ప్రకారం పూర్వావస్థలో స్వధర్మాలుగా ఆచరించాలి. పరావస్థకు చేరుకొన్నాక

వారి వారి రుచుల ప్రకారం వర్తింపవచ్చును. ఏ అవస్థలో నైనా స్వధర్మం ఆచరించేటప్పుడు బుద్ధి భగవత్పరమై ఉండాలి.

## ధర్మానుష్ఠాన ఫలం

ధర్మజా! వృత్తినియమాలన్నీ స్వభావ సంస్కారార్థం కల్పింపబడ్డాయి. లోహాలు పుటపాక సంస్కారం వలన శుద్ధిపొంది ఉత్తమస్థితికి వస్తున్నట్లే స్వభావం కూడా నియమపూర్వక సంస్కృతి ఫలంగా ఉత్తమస్థితికి రాగలుగుతుంది. సంస్కారం లేనినాడు స్వభావం మారదు.

## ఆపత్కాల వృత్తులు

జీవాధారమైన స్వవృత్తికి ఆటంకం కలిగే సమయం వచ్చినప్పుడు దానిని ఆపత్కాలమని అంటారు. అటువంటి సమయాలలో బ్రాహ్మణుడు ధనధాన్యాలను యాచించి గాని శిలోంఛవృత్తిని స్వీకరించి గాని జీవికను గడపవచ్చు. పంట భూములలో భూస్వామి విడిచిపెట్టిన వెన్నులను ఏరుకొనటం శిలావృత్తి. అంగళ్ళ ముందు పడి ఉన్న గింజలను ఏరుకొనటం ఉంఛవృత్తి. ధనయాచన కంటె ధాన్యయాచన, దానికంటె శిలావృత్తి, అంతకంటే ఉంఛవృత్తి మేల్తరాలు.

ఆపత్కాలాలలో తప్ప ఇతర సమయాలలో ఎన్నడుగాని తమ వర్ణవృత్తిని వదలి పరుల వర్ణవృత్తిని స్వీకరింపకూడదు. అలా స్వీకరించినట్లయితే అది స్వభావధర్మవిరుద్ధం కాబట్టి సంస్కారం కానేరదు. తత్ఫలంగా సాంకర్యాలు సంభవిస్తాయి.

శిలోంఛవృత్తి ప్రాప్తాన్ని ఋతమని, అయాచితప్రాప్తాన్ని అమృతమని, నిత్యయాచనాప్రాప్తమైనది మృతమని, కృష్యాది ప్రాప్తం ప్రమృతమని, వాణిజ్యప్రాప్తం సత్యానృతమని, నీచసేవను శ్వవృత్తి అని పేర్కొంటారు. వృత్తులన్నింటిలోను శ్వవృత్తి అధమాధమం. ఆ వృత్తి నింద్యవర్తనతో కూడుకొని ఉంటుంది. బ్రాహ్మణులకు బొత్తిగా కూడదు.

## వర్ణ నిర్ణయం

ఏ వ్యక్తి ఏ వర్ణానికి చెందుతాడో నిర్ణయించేందుకు వారి వారి స్వభావమే ముఖ్యమైన ప్రమాణం. పుట్టుక ప్రధానం కాదు. గంగోదకాన్ని మట్టి పాత్రలో ఉంచినంత మాత్రాన అది చెడిపోదు. మురికి నీటిని బంగారు గిన్నెలో ఉంచినంతమాత్రాన అది శుద్ధజలం కాలేదు. ఉపాధులు కర్మవశాన కలుగుతాయి. మహాత్ములు కొందరు నీచయోనులలో జన్మించటమే ఇందుకు నిదర్శనం. స్వభావంతో పాటు ఉపాధి కూడా శుద్ధమైనదయితే మరింత యోగ్యం.

## వర్ణ లక్షణాలు

ధర్మనందనా! ప్రతివర్ణానికీ స్వభావాన్ని బట్టి ప్రత్యేకలక్షణాలు ఉంటాయి. శమదమతపశ్శౌచాలు, క్షాంతి సంతోషార్జవజ్ఞానాలు, దయాసత్యాలు, భగవదాత్మత్వం ఏ వ్యక్తియందు ప్రధానలక్షణాలై కనబడితే ఆ వ్యక్తి బ్రాహ్మణ వర్ణానికి; శౌర్యవీర్య ధృతి తేజస్త్యాగాలు, ఆత్మజయక్షమారక్షణప్రసాదాలు, బ్రహ్మణ్యత ప్రధానంగా ఉన్న వ్యక్తి క్షత్రవర్ణానికి; గో గురు దేవ భక్తి ఆర్యభక్తి, త్రివర్ణపరిపోషణ, ఆస్తిక్యం, నిత్యోద్యమం, నైపుణ్యం ప్రధానములైన వ్యక్తివైశ్యవర్ణానికి; వినయ శౌచ నిష్కాపట్యాలు, చౌర్యాది లోభబుద్ధిరాహిత్యం, దైవభక్తి కలిగిన వ్యక్తి శూద్రవర్ణానికి సంబంధించినవారని గ్రహింపవచ్చు.

## స్త్రీల ధర్మాలు

ధర్మజా! స్త్రీలకు వారి స్వభావాన్ని బట్టి ధర్మాలు ప్రత్యేకంగా ఉన్నాయి. శుచిగా ఉండటం, ప్రియపూర్వకంగా సత్యం పలకటం, పతిభక్తి – ఇవి ప్రధానధర్మాలు. స్త్రీలకు కర్తవ్యాలన్నీ ముఖ్యంగా ఇంటిలోనే కావటం వల్ల గృహశుద్ధి, గృహోపకరణ శుద్ధి, యథాప్రాప్తసంతుష్టి, ప్రమాదాలస్యాలు లేక వర్తించటం – వీటన్నిటినీ వారు పాటించవలసి ఉంటుంది.

## సంకర జాతులు – వారి ధర్మవృత్తులు

రజకులు, చర్మకారకులు, నటులు, కైవర్తులు, భిల్లులు – వీరు ప్రధాన సంకరజాతుల వారని చెప్పవచ్చు. చండాలురు, పుల్కసులు, మాతంగులు మొదలైనవారు అంత్యజుల కోవ లోనికి వస్తారు. వీరికి హింసాది పాపవృత్తులు, చౌర్యమూ తప్ప తక్కిన కులానుగతవృత్తులే ధర్మవృత్తులు.

## యుగభేదాలు – వృత్తిభేదాలు

ధర్మజా! సత్య, త్రేతా, ద్వాపర కలియుగాలనే పేర్లతో యుగాలను నాల్గుగా విభజించారు. యుగభేదాలను బట్టి స్వభావభేదాలు కలుగుతుంటాయి. వేదదర్శనులు తత్తద్యుగస్వభావానికి తగినట్లుగా వృత్తులను విధించారు. ఆ వృత్తులే ఆయా యుగజనులకు ధర్మవృత్తులుగా ఉన్నాయి. ఆ ధర్మవృత్తులను నిర్వహిస్తూ వస్తే కాలక్రమాన స్వభావం ఎటువంటిదైనా శుద్ధిగాంచి ఎట్టకేలకు శుభం కలుగుతుంది.

స్వధర్మం గుణహీనంగా కనిపించినా దానిని విడిచిపెట్టకూడదు. స్వధర్మనిష్ఠులై సద్గతి గాంచినవారెందరో ఉన్నారు. యయాతి సౌభరి ప్రముఖులను నిదర్శనగా గ్రహింపవచ్చు.

## మహోత్కట దుర్వాసనలు

పూర్వదుర్వాసనలు మహోత్కటంగా ఉన్నవారి గతేమిటి? అని సందేహం కలగటం సహజమే. అటువంటి వాసనలను ఆపటం సాధ్యం కాదనే చెప్పాలి. క్షేత్రంలో నిరంతరం బీజాలను చల్లుతూ వస్తే కొంతకాలానికి అది నిర్వీర్యం అవుతుంది. అందులో చల్లిన గింజ మొలవక నశిస్తుంది. అలాగే దుర్వాసనా మతులు ఇష్టం వచ్చినట్లు వర్తించి వర్తించి తుదకు విసుగు చెందుతారు. ఆ విసుగుతో వారి కామాసక్తి నశిస్తుంది. అంతే కాదు. కామలతలు మళ్ళీ జనింపవు. అంతటితో వారు సన్మార్గవర్తులై మేలు పొందుతారు. ఇందుకు

నిదర్శన మేమిటని అడుగుతావేమో? అగ్నిలో ఘృతాన్ని మితంగా పోసినప్పుడు ఆ అగ్ని ప్రజ్వరిల్లుతుంది. ఆ ఘృతాన్నే కుండపోతగా కుమ్మరిస్తే అదే అగ్ని చల్లారుతున్నది కదా. అలాగే మహోత్కట వాసనలు కూడా నిరంకుశంగా విజృంభించి విహరించి సత్త్వాన్ని కోల్పోయి తమంత తామే నశిస్తాయి. ఈ క్రమానికి ఎంతో కాలవ్యవధి కలుగుతుంది. అందువల్ల వారు బహుజన్మలకు గాని శుభాన్ని పొందలేకపోతారు.

## ఆశ్రమ ధర్మాలు

ధర్మజా! బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం, అని ఆశ్రమాలు నాలుగు విధాలు. ఒక్కొక్క ఆశ్రమానికీ ధర్మాలు ప్రత్యేకించి ఉన్నాయి.

## బ్రహ్మచర్యాశ్రమ ధర్మాలు

బ్రహ్మచారి గురువు ఇంటిలోనే నివసించి దాంతుడై గురువుకు దృఢసౌహార్ద పూర్వకంగా దాసుని వలె నమ్రతతో హితాన్ని ఆచరిస్తూ ప్రతిదినం ప్రాతస్సాయంకాలాలలో గురుపూర్వకంగా అగ్న్యాదిత్య సురోత్తములను ఉపాసించాలి. సంధ్యాత్రయగాయత్రీ జపవర్తియై ప్రాతస్సంధ్యలలో మౌనవ్రతాన్ని అనుష్ఠించాలి. గురువు పిలిచినప్పుడు వినయంతో సమీపించి ఆయన పాదాలకు తలసోకునట్లుగా సాష్టాంగనమస్కారం ఆచరించాలి. వేదాధ్యయనానంతరం తిరిగి వెళ్ళేటప్పుడు మళ్ళీ సాగిలపడి మ్రొక్కి ఆయన అనుజ్ఞను పొందిన తర్వాత అక్కడి నుంచి బయలుదేరాలి.

బ్రహ్మచారి మేఖల (మొలత్రాడు) అజిన (కృష్ణాజినమంటే జింక చర్మం) కౌపీన దండ కమండలాలను, యజ్ఞోపవీత పవిత్రాలను (దర్భలను) ధరించాలి. మేఖలాది ధారణలో వర్ణాలను బట్టి వస్తుభేదం ఉన్నది. బ్రాహ్మణ బ్రహ్మచారి పాలాశదండాన్ని ధరించాలి. అలాగే ఇతర వస్తుధారణలో కూడా

వర్ణోచిత విధివిధానాలు ఉన్నాయి. బ్రహ్మచారికి కేశసంస్కారం కూడదు. ప్రాతస్సాయంవేళలలో విహితగృహాలకు భిక్షార్థం పర్యటించి భిక్షాన్నాన్ని గురువుకు నివేదించి ఆయన అనుమతిని గైకొన్నాక తాను భుజించాలి. గురువు అనుమతింపని నాడు ఉపవసించాలి. సౌశీల్యం మితాహారం దక్షత శ్రద్ధ జితేంద్రియత్వం వీటి యెడ ఎన్నడూ పరాకు చెందకూడదు. స్త్రీలతో కాని స్త్రీవశులతో కాని ఎప్పుడైనా పనిపడితే తత్కార్యపర్యంత కాలం మాత్రమే అక్కడ ఉండాలి. అంతకు మించి వ్యవహరింపకూడదు. కేశసంస్కారం ఉన్మర్దనం జలకం అభ్యంజనం మొదలైన క్రియలను వయసులో ఉన్న స్త్రీలచేత ఎన్నటికీ చేయించికొనరాదు. ఎందుకంటావా?

**ఆ. పొలఁతి దాపవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు**
**కరగకుండరాదు కడిగెవేని**
**బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టక మానఁడు**
**వడుగు కింతి పొత్తు వలదు వలదు.**

ధర్మజా! ద్వైతభావం ఎంత కాలం నిలిచి ఉంటుందో అంతకాలం ఇటువంటి ప్రమాదాలకు అవకాశం తప్పక ఉంటుంది. ఆత్మస్వరూపసాక్షాత్కారం కలిగినప్పుడు ద్వైత భావం నశిస్తుంది. అప్పుడు స్త్రీపురుషాది లింగభేదం తొలగిపోతుంది. భేదజ్ఞానం ఉన్నంత వరకు గుణాధ్యాసం, దానితో భోగ్యతాబుద్ధి అంటిపెట్టుకొని ఉంటాయి. ధర్మజా! కాంతలతో ఏకాంతవాస వర్జ్యం సర్వాశ్రమాల వారికీ అన్వయిస్తుంది. అంజనాభ్యంజన స్త్రీసంగమ చిత్రకర్మ మధుపాన మాంసభక్షణాదులు, స్రక్చందనాద్యలంకారాలు, స్వేచ్ఛావిహారాలు వ్రతధరులను అధోగతికి దిగజారుస్తాయి. ఋతుకాముడు గురువృత్తిలో ఉంటే ఉండవచ్చు.

బ్రహ్మచారి ఆ విధంగా గురుకులంలో నివసించి వేదవేదాంగాలు పఠించి అధ్యయనకాలం ముగిసిన తర్వాత గురువుకు కోరిన దక్షిణను యథాశక్తి సమర్పించి ఆయనచే అనుజ్ఞాతుడై మరలివచ్చి తక్కిన మూడు ఆశ్రమాలలో

తనకు అభీష్టమైనదానిని స్వీకరింపవచ్చు. లేదా, నిత్యబ్రహ్మచారిగా ఉండిపోవచ్చు.

## సర్వాశ్రమ పరమధర్మం

ధర్మజా! ఏ ఆశ్రమంలో ఉన్నవారైనా అనునిత్యం విచారింపదగిన ముఖ్యధర్మం ఒకటున్నది. అదేమంటే – ఏ ఆత్ముడు గురువులో అగ్నిలో సర్వభూతాలలో తనలో జీవరూపాన ఉంటూనే ఉండనివాడుగా భాసించే ఆ ఆత్మని తత్త్వాన్ని విచారించాలి. పెద్దలు చెప్పిన అనుభవసారాన్ని విచారపూర్వకంగా సమన్వయించుకొని తత్త్వపరులై చరించేవారు ఏ ఆశ్రమంలో ఉన్నా చివరికి పరబ్రహ్మాన్ని చేరుకొంటారు. అన్ని ఆశ్రమాలకూ ఇదే పరమధర్మం.

## గృహస్థాశ్రమ ధర్మాలు

గృహస్థులకు స్వధర్మాలే వారు ఆచరింపదగిన కర్మము లవుతాయి. ఆ కర్మలను వారు ఫలాభిసంధిరహితంగా నిర్వర్తిస్తూ యథాప్రాప్తసంతుష్టులై మెలగాలి. వారు పరమేశ్వర ప్రీత్యర్థం కావించే కర్మలన్నీ యజ్ఞాలేనని తెలుసుకోవాలి.

## వానప్రస్థ ధర్మాలు

వనస్థుని ధర్మాలన్నీ మునిధర్మాలు. వాటిని ఆచరించేవారు ఋషిలోకాన్ని పొందుతారు. వనస్థులకు అగ్న్యారాధనం ఉన్నది కాబట్టి వారు తద్రక్షణార్థం గుహనో కుటీరాన్నో ఆశ్రయిస్తారు.

వారికి ఆహారనియతి ఉన్నది. దున్ని చల్లగా పండిన పంట పదార్థాలను తినకూడదు; ఋతుకాలానికి ముందుగా పండిన దానిని తినకూడదు. అగ్నిపక్వమైన పదార్థాన్ని గాని అపక్వపదార్థాన్ని గాని భుజింపరాదు. సూర్యతప్తమై పక్వమైన దానిని మాత్రమే భుజించాలి. భోజనపదార్థం క్రొత్తది లభించినప్పుడు తత్పూర్వం తన వద్ద ఉన్నదానిని విసర్జించాలి.

వనస్థులు శాస్త్రోక్తనిత్యకర్మలను మాత్రమే చేయాలి. ఆ కర్మనిర్వహణకు కావలసిన చరు పురోడాశాది నిర్వపణాలను ఆరణ్యకాలను మాత్రమే గ్రహించాలి. ఎండవానలను గాలినిప్పులను సహించాలి. కేశముండన చేయకూడదు. జడలు ధరించాలి. గోళ్ళు మీసాలు కత్తిరించకూడదు. నలుగు పెట్టి స్నానం చెయ్యకూడదు. వల్కలాజినాలు దండ కమండలాలను ధరించాలి.

వనస్థులు పన్నెండు సంవత్సరాలో ఎనిమిది సంవత్సరాలో నాలుగేండ్లో రెండేండ్లో చివరికి ఒక్క సంవత్సరమైనా తపోవ్రతులు కావాలి. ఆ తపస్సు క్లేశపూర్వకంగా ఉండకూడదు. ఆ విధంగా తపస్సు చేయనివారి బుద్ధి ఏకాగ్రం కాదు. జరాజాద్యాదుల వలన బలహీనత కలిగి నియామానుష్ఠానాలను నెరవేర్ప లేనినాడు బ్రహ్మవిద్యను అభ్యసించాలి. అందుకు శక్తి లేకపోతే నిరశనాదులను ఆచరింపవచ్చును.

## నిరశన వ్రతం

ధర్మజా! నిరశనవ్రతం స్థూలదేహ లయార్థం చేయబడుతున్నది. ఆ వ్రతాచరణ విధానం విను. అనశనవ్రతధారి మొట్టమొదట అహంకార మమకారాలను త్యజించి అగ్నులను ఆత్మసమారోపణం చేసి పంచభూతాల వలన ఏర్పడిన దేహాన్ని తద్భూతకారణాలైన ఆకాశాదులలో లయించాలి. ఆ క్రమాన్ని విను. ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి అన్నవి పంచభూతాలు. ఆకాశతత్త్వం దేహరంధ్రాల రూపాన, వాయుతత్త్వం నిఃశ్వాసరూపాన, తేజస్తత్త్వం ఊష్మరూపాన, జలతత్త్వం రక్తశ్లేష్మ పూయరూపాల లోను, పృథ్వీతత్త్వం అస్థిమాంసాది కఠిన పదార్థరూపం లోనూ ఉంటుంది. ఏది దేనికి కారణమో దానిని అందులోనికి లయించాలి. ఇది కార్యాన్ని కారణం లోనికి లయించే విధానం.

## లింగదేహలయం

స్థూలశరీరంలో లింగశరీరం ఉన్నది. అది అధ్యాత్మత్రయరూపంలో

ఉంటున్నది. ఆ మూడింటిని వాటికి కారణాలైన రాజసాహంకారాదులలో లయించాలి. అద్వితీయజ్ఞానసిద్ధికే లయ భావమని పేరు.

లింగశరీర లయ ప్రకారం విను. వాక్కును దాని కార్యమైన వక్తవ్యంతో తదధిష్ఠానదేవత అయిన అగ్ని యందు, హస్తాలను వాటి లక్షణమైన శిల్పంతో ఇంద్రుని యందు, పాదాలను గతితో ఉపేంద్రుని యందు, ఉపస్థాన్ని రతితో ప్రజాపతియందు, పాయువును ఉత్సర్గంతో మృత్యువునందు, శ్రోత్రాన్ని నాదంతో దిక్కులందు, త్వక్కును స్పర్శంతో వాయువునందు, రూపాన్ని చక్షుస్సుతో ఆదిత్యుని యందు లయించాలి.

తర్వాత రసనను ప్రచేతసునితో జలములందు, ఘ్రాణాన్ని అశ్వినులతో పృథ్వియందు, మనస్సును మనోరథంతో చంద్రునియందు, బుద్ధిని బోధ్యాలతో బ్రహ్మయందు, అహంకారాన్ని కర్మములతో తత్క్రియానిమిత్త రుద్రునియందు, చిత్తాన్ని చేతనతో క్షేత్రజ్ఞునియందు, క్షేత్రజ్ఞుని గుణాలతో నిర్వకారబ్రహ్మ మందు లయింపజేయాలి.

అనంతరం పృథ్విని జలాలలో, జలాన్ని తేజస్సులో, తేజస్సును వాయువులో, వాయువును ఆకాశంలో, ఆకాశాన్ని అహం తత్త్వంలో, దానిని మహత్తత్త్వంలో, మహత్తత్త్వాన్ని ప్రధానంలో లయింపజేయాలి.

ధర్మజా! పరమాత్ముని నుండి ప్రధానాదులన్నీ అనులోమ క్రమంగా పృథ్వీపర్యంతం ఉత్పన్నమైనవి కాబట్టి వాటిని విలోమక్రమంలో ఆ పరమాత్ముని యందు తిరిగి చేర్చటమే లయకార్యతాత్పర్యం. ఉపాధులన్నీ లయించిన తర్వాత అక్షరుడు, చిన్మాత్రుడు అయిన తాను మాత్రం శేషిస్తాడు. ఆ భావం స్థిరమైనంతనే ద్వైతం నశిస్తుంది. అంతటితో అతను కూడా కొయ్య కాలిపోయిన తర్వాత అణగారిన అగ్ని వలె విరమిస్తాడు. వట్టి దేహం మాత్రమే మిగులుతుంది. ఆ దేహనాశనార్థం నిరశనాది వ్రతాలను ఆచరించాలి.

ధర్మజా! కొందరు కార్యార్థులై అన్నపానాదులను వర్జించి హఠయోగానికి పూనుకొంటారు. హిరణ్యకశిపు రావణాదు లిందుకు నిదర్శకులు. హఠయోగం

కేవల తామసికం. అందువల్ల హఠయోగులకు కార్యసిద్ధి కలిగితే కలగవచ్చును గాని పరమార్థయోగసిద్ధి ఎన్నటికీ చేకూరదు. పైగా అటువంటి యోగంతో వారు తమలో ఉన్న పరమాత్ముని కృశింపజేస్తారు. అది పరమాత్మహత్యాసదృశ్యం. అందుకు ఫలాన్ని అనుభవింపక తప్పదు. ఆత్మకళ్యాణం లోకకళ్యాణం కోరినవారు ఆసురమైన ఈ వ్రతాన్ని అనుష్ఠింపకూడదు. కాదని అనుష్ఠించితే తాము చెడినది చాలక విపరీత మార్గ ప్రదర్శకులై మూఢలోకాన్ని చెడగొడతారు. తా చెడ్డ కోతి వనమెల్ల చెరచెనని సామెత ఉన్నది కదా.

## యతి ధర్మాలు

ధర్మజా! వనస్థుడు జ్ఞానాభ్యాససమర్థు డైతే అతనిని యతి అంటారు. అతను దేహాతిరిక్తాలు అన్నింటినీ త్యజించి ఏ గ్రామంలోనైనా ఒక్క రాత్రి కంటె అధిక కాలం నివసింపకుండా నిరపేక్షబుద్ధితో ఏకాకిగా భూసంచారం కావిస్తూ నిరంతరం ఆత్మారాముడై ఉండాలి. ఆత్ముడు కారణ కార్యాతీతుడని, సదసద్రూపవిశ్వమంతా తన్మయమేనని స్థిరవిశ్వాసం కలిగి శాంతుడు, సర్వభూతహితుడు అయి ఉండాలి. సుషుప్తిప్రబోధ సంధులలో తమోవిక్షేపం కలుగుతుంది. దానికి అవకాశం రానివ్వకూడదు. మృత్యువు నిత్యమని, జీవితం అనిత్యమని, బంధమోక్షాలు మాయా మాత్రములని, సర్వభూతోత్పత్తిలయాలకు కాలమే కారణంగా ఉన్నదని గ్రహించి శరీరవియోగానికి సంసిద్ధుడై ఉండాలి.

యతి యొక్క లోకవ్యవహారం బహుజాగరూకంగా ఉండాలి. ఎటువంటి సందర్భంలోనూ అనాత్మవిషయికాలు అయిన శాస్త్రాలను తిలకింపకూడదు; జీవితార్థకళలను ఆశ్రయించకూడదు; వితండవాదాలకు దూరంగా ఉండాలి; పక్షాభిమానానికి తావివ్వకూడదు; శిష్యులను ఆవర్జింపకూడదు; బహుగ్రంథపఠన గాని వ్యాఖ్యానవ్యవహారం కాని చేయకూడదు; యత్యాశ్రమానికి శాంతి, సమబుద్ధి మూలస్తంభాలు; ఆ ఆశ్రమాన్ని

స్వీకరించటం మోక్షార్థమే గాని ధర్మార్థం కాదు. అతని నియమాలన్నీ మోక్షానుకూలంగా ఉండాలి.

## యతి భేదాలు

ధర్మజా! యతులలో ఉత్పన్నజ్ఞానులు, అనుత్పన్నజ్ఞానులు అని రెండు తెగలవారు ఉన్నారు. సిద్ధులు మొదటి తెగకు, సాధకులు రెండవ తెగకు చెందుతారు. మొదటి తెగవారికి దండధారణ విధి కాదు. వారు కేవలం ఆత్మనిష్ఠులై ఉంటారు. కాబట్టి బాలోన్మత్తమూకాదుల వలె గోచరిస్తారు. ఇందుకు నిదర్శనగా ఒక ఇతిహాసం ఉన్నది విను.

## ప్రహ్లాద పరమహంసల సంవాదం

ధర్మజా! పరమభాగవతుడైన ప్రహ్లాదుడు లోకతత్త్వాన్ని తెలిసికొనగోరి కొందరు మంత్రులతో భూసంచారం బయలుదేరి సహ్యాద్రి సానుప్రదేశంలో పారుతున్న కావేరీనది చెంతకు వెళ్ళాడు. ఆ నదీతీరాన ఒకానొకవ్యక్తి ధూళిధూసరిత దేహుడై పడుకొని ఉన్నాడు. అతని యెడ వర్ణాశ్రమలక్షణాలలో ఏ ఒక్కటీ కానరానందువల్ల అతనెవరో తెలియరాలేదు.

ప్రహ్లాదుడు అతని పాదాలపై వ్రాలి యథావిధిగా పూజించి, 'అయ్యా! శరీర మాద్యం ఖలు ధర్మసాధనం అన్నారు. శరీరాలు అన్నపోషితాలై యథాసుఖం ఉంటాయి. నీ ఉనికి చూడగా సర్వం వర్జించినట్లు కనిపిస్తున్నది. నీ దేహపాటవం చూస్తే శక్తిమంతమై మహాద్భుతకరంగా ఉన్నది. దీని రహస్యమేమిటి? దేహంలో శక్తి ఉన్నప్పుడు అది ఊరకుండనీయదు. ఏదో ఒక కార్యానికి ప్రేరేపిస్తుంది. దేహికి దేహధారణ ప్రధానం. దేహధారణకు పదార్థాలు కావలసి వస్తాయి. అవన్నీ ధనమూలకంగా లభించేవి. ధనార్జనకు విద్యాదక్షతలు, చాతుర్యం, లోకరంజక కథాకథన ప్రావీణ్యం సహకారులు. ఈ శక్తులు ఏ కొంత సమకూడినా లోకులు కార్యతత్పరులై చరిస్తారు. నీ యందు ఇట్టి శక్తులు సమగ్రంగా ఉన్న సత్యాన్ని నీ తేజస్సు చెప్పకనే

చెబుతున్నది. ఇంతటి వాడవు లోకవర్తనను పరికిస్తూ ఉదాసీనుని వలె శయనించి ఉన్నావెందుకు?' అని అడిగాడు.

ధర్మజా! ప్రహ్లాదుని వినయ మృదు మధుర భాషణలకు ఆ మహాత్ముడు చిరునవ్వుతో, 'అసురోత్తమా! నారాయణుడు భక్తుల భక్తియోగానికి సంతుష్టుడై వారి హృదయాంతరాలలో ప్రకాశించి సూర్యుడు అంధకారాన్ని వలె వారి అజ్ఞానాన్ని తొలగిస్తాడు. నీవు నారాయణభక్తుడవు కాబట్టి జనుల ప్రవృత్తినివృత్తులకు ఆధారమేమిటో నీ అధ్యాత్మదృష్టికి స్పష్టమే. సంగతి తెలిసి నన్నడిగావు. అడిగినప్పుడు మిన్నకుండకూడదు. ఈ విషయమై పెద్దలవలన నేను విన్నది చెబుతాను విను.

'అయ్యా! నేను తొలుదొల్త సంసార ప్రవాహంలో పడి ఈప్సితార్థాల కోసం సర్వగతుల ప్రాకులాడిన వాడనే. ఎన్నాళ్ళు గడిచినా తనివి కలుగదయ్యెను. అంతే కాదు. తృష్ణ నానాటికి పెరిగి పెంపొంది కన్నదాని వెంట విన్నదానివెంట నన్ను పరుగెత్తింపసాగింది. తృష్ణాపరితోషార్థం వివిధకర్మలను చేశాను. కర్మములకు ఫలం కలుగుతుండటం, ఫలభోగం తప్పనిసరి కావటం వల్ల ఫలభోగార్థం ఫలానురూప జన్మలు ప్రాప్తమైనాయి. తిర్యగాది జన్మలెన్నో ఎత్తాను. చివరికి స్వర్గాపవర్గాలకు కారణమైన మనుష్యజన్మ కలిగింది.

మర్త్యజన్మ వచ్చిన తర్వాత గృహస్థుల స్థితిగతులు పరిశీలించాను. భార్యాభర్తలు సుఖప్రాప్తికి, దుఃఖనివృత్తికి వివిధకర్మలను సాగించటం, వారికి విపరీతఫలాలు కలుగుతుండటం గమనించాక నాకు సంసారవిరక్తి జనించింది. అప్పుడు జీవస్వరూపాన్ని విచారించే తలంపు కలిగింది. నాలో నేనే విచారించటం మొదలుపెట్టాను. జీవుడు సుఖస్వరూపి అని, సర్వకామాలు నివర్తించినప్పుడే దాని స్వరూపప్రకాశం అవుతుందని, ప్రారబ్ధకర్మ ఫలభోగార్థం శరీరం కలుగుతున్నదని, దాని ఫలాన్ని ఆ దేహంతో భోగించి తీరాలని బోధపడింది. ఆ భావం స్థిరమైనాక ఫలభోగార్థం శరీరాన్ని అప్పగించాను. ఫలభోగవాసనలు తలయెత్తి నప్పుడల్లా వాటిని అణచివేయసాగాను. వాసనాప్రేరేపణలు క్రమక్రమంగా సన్నగిల్లి

నశించిపోయాయి. దానితో కర్మేంద్రియవ్యాపారం స్తంభించింది. అంతటితో నూతన కర్మకలాపం ఉడిగిపోయింది.

అయ్యా! అంత మాత్రాననే సంసృతి తప్పుతుందా? అని అడుగుతావేమో. సంసృతి అంటే ఏమిటి? జనన మరణరూప భ్రమణం. ఆ భ్రమణానికి కారణం ఏమిటి? భ్రాంతి ఒక్కటే కారణం. భ్రాంతి అంటే ఎటువంటిది? ఒక విషయాన్ని వేరొకటిగా తలపోయటం భ్రాంతి. దాని ఫలమేమిటి? ద్వైతభావం కలగటమే దాని ఫలం. ద్వైతభావం నశించి బుద్ధి ఏకాగ్రమైతే సత్యం స్ఫురిస్తుంది. సత్యస్ఫురణతో జీవుడు సుఖస్వరూపుడని బోధపడుతుంది. అటువంటి బోధ కలిగినప్పటి నుంచి సుఖార్థప్రయత్నం ఆగిపోతుంది. సుఖస్వరూపునికి సుఖాన్ని గురించిన తలంపు వ్యర్థమే కదా. ఆ ప్రయత్నాలే కదా కర్మములంటే? కర్మములు ఉడిగిపోవటమే నిస్సంసారత్వం. ఒక నిదర్శన విను. జలమన్నది నైజశుద్ధం. పరవస్తుసంయోగం వల్ల జలాలలో పాచిపుట్టి ఆ జలాలను కప్పివేస్తున్నది. తెలివిగలవారు ఆ పాచిని తొలగించి జలాలను గ్రోలి సుఖపడతారు. అజ్ఞాను లది తెలియక ఆ నీటిని విడిచి ఎండమావులను చూసి భ్రాంతులై వాటివెంట తిరిగి తిరిగి విఫలమనోరథులై దుఃఖాన్ని పొందుతున్నారు. అలాగే జీవుడు సుఖస్వరూపుడై ఉండగా అతనిని ఆవరించిన వాసనావిశేషాల వలన జీవస్వరూప స్థితిని తెలిసికొనలేక సుఖార్థం తిరిగి తిరిగి విఫలమనోరథులై దుఃఖభాగు లవుతున్నారు.

ప్రహ్లాదా! దేహేంద్రియాదులు కర్మాయత్తములని, కర్మవశ్యుడు సుఖలాభ దుఃఖనివృత్తులను కోరి పాటుపడటం సహజమేనని అంటావా? అలాగే అనుకొందాము. వాటి ప్రయత్నఫలం ఎంత మాత్రమని నీ ఉద్దేశం? అతి కష్టం మీద అర్థాన్ని ఆర్జించి దానితో కామాలను తీర్చుకొని మనస్సంతుష్టి కలగాలని ప్రయత్నిస్తాడు. అంత మాత్రాననే మానసికమైన అధ్యాత్మికాది దుఃఖం నివృత్తి కాదు. అది కానినాడు ఫలం ఏమిటి? మరొక సంగతిని కూడా గ్రహించాలి. ఎంతదాకా మనస్సు తత్సంబంధములైన అధ్యాత్మికాది దుఃఖాలకు దూరం కాదో అందాక లోభం, ఇంద్రియవశత్వం తప్పవు.

ఇంద్రియవశులను ఎల్లప్పుడు శంకాభయాలు వెన్నంటి ఉంటాయి. తత్ఫలంగా వారు నిద్రాసుఖం కూడా లేకుండా తల్లడిల్లుతుంటారు. ధనవంతులై ఉండి ఈ గతికి పాల్పడటం కళ్ళారా చూస్తున్నాము కదా!

పైగా ధనవంతునికి హితశత్రువులు పెక్కుమంది అనభ్యాహితంగా కలుగుతారు. ఒక ప్రక్క రాజులు ఒక వంక చోరులు ఒకచాయ వైరులు ఒక వలను జ్ఞాతులు ఒకవైపు యాచకులు అతనిని నిరంతరం బాధిస్తారు. అంతటితో కాలేదు. పశుపక్షులు కూడా అతనిని విడిచిపెట్టవు. వీటి బాధలన్నీ అటుంచితే కాలం వెన్నంటి తరుముతుంటుంది. ధనవంతుల వలెనే ప్రాణవంతులు వివిధ శోక మోహ భయ క్రోధ రాగ వైక్లబ్య శ్రమాది శత్రువృతులై పరితపిస్తారు. ధనార్థులకు ధనకాంక్ష ఎటువంటిదో ప్రాణార్థులకు ప్రాణకాంక్ష ఇన్ని కడగండ్లకు కారణ మవుతున్నది. ఆ కాంక్ష నశిస్తే దుఃఖం నశిస్తుంది. సుఖం స్వతస్సిద్ధమవుతుంది.

## తేనెటీగ - పురుషప్రయత్న ఫలం

ప్రహ్లాదా! ఈ రహస్యాన్ని నాకు ఎవరుపదేశించారో చెప్పనా? జుంటీగ, అజగరం నా పరమగురువులు. తేనెటీగ దుర్గమవనాంతరాలు దూరి దూరి పడరాని పాట్లు పడి అనేక పుష్పరసాలను సేకరించి తేనెను సమకూర్చుకొంటుంది. ఎవడో ఒకడు హఠాత్తుగా వచ్చి ఆ యీగను చంపి పుట్టతేనెను హరిస్తున్నాడు. దీనిని చూసి పురుషప్రయత్నఫలం కూడా ఇంతే కదా అని గ్రహించాను.

## అజగరం - యదృచ్ఛాలాభ సంతుష్టి

కొండచిలువ తానున్న చోటునుంచి కదలక అప్రయత్నంగా నోటివద్దకు వచ్చినవాటిని తిని తృప్తిచెంది జీవిస్తున్నది. దానిని చూసి పుట్టించినవాడు పెట్టక మానడని, యదృచ్ఛాలాభసంతృప్తి సర్వదుఃఖహరమని గ్రహించాను.

## పరమహంస ధర్మాలు

ప్రహ్లాదా! తేనెటీగ గతిని చూసి విషయాసక్తి అనర్థదాయకమని గ్రహించి విసుగు చెందాను. అజగరం స్థితిని చూసి ఊహలు వదిలి దొరికిన దానితో తృప్తిపడుతూ దొరకనినాడు ధీరుడనై ఉపవసిస్తుంటాను. ప్రాప్తించినది కొద్ది మాత్రమేనని దిగులుపడను. బహుళమైననాడు సంతోషంతో బూరటిల్లను. అది సంపన్నం కానీ; రసహీనం కానీ; రేపటిదో మాపటిదో ఎప్పటిదో కానీ ఆ సంగతులే స్ఫురింపవు. వస్త్రధారణ మాటేమిటంటావా? దుకూలమో ధౌతాంబరమో చర్మమో వల్కలమో ఏది దొరికితే దానిని ధరిస్తాను. శయనవిషయ మేమంటావా? కటికనేల అయినా శ్మశానవాటి అయినా ఎక్కడో ఒకచోట కునుకుతీస్తాను. శ్మశానవాటిలో శయనానికి, ప్రాసాదాంతర పర్యంక మృదుశయనాలకు భేదం నా మనస్సుకు పొడకట్టదు. జలకాలాడించి పట్టు పుట్టాలు కట్టి అలంకరించి గంధాలు పూసి గజాశ్వరథాలను ఎక్కించి తిప్పితే తిరుగుతాను. అట్లాకానినాడు దిగంబరుడినై చరిస్తాను. నిందాస్తుతులకు వ్యసన సంతోషాలను పొందటం, ప్రతినిందాస్తుతులను చేయటం రెండూ లేవు. కోరికలేమీ లేవా? అంటావేమో. సర్వభూత హితాన్ని భగవదేకాత్మకత్వాన్ని కోరుతుంటాను. మరొకటి నా మనస్సులోకి రానేరదు.

ప్రహ్లాదా! ఈ స్థితి కలగాలంటే మనోవ్యాపారం పూర్తిగా నశించాలి. మనోవ్యాపార మంటే జాతిరూపాది వికల్పమన్నమాట. అటువంటి వికల్పం నశించినప్పుడు మనస్సు వృత్తిరహితం అవుతుంది. అందుకు మనస్సును సాత్త్వికాహంకార మందు లయింపజేయాలి. అప్పుడు మనోవిభ్రమం నశిస్తుంది. ఆ వైకారికాన్ని మూలప్రకృతి లోను, దానిని ఆత్మానుభూతి యందు లయింపజేయాలి. అప్పుడు తత్త్వదర్శనం అవుతుంది. దానితో వాంఛలు నశిస్తాయి. అనంతరం తత్త్వమనన శీలుడు కాగలుగుతాడు. తత్ఫలంగా స్వాత్మభూతినిష్ఠ సిద్ధిస్తుంది. అప్పుడు విరతి కలుగుతుంది. లయము అంటే అనుసంధానం చేయటమని భావం.'

ధర్మనందనా! ఆ యతి అంతటితో విరమించాడు. ప్రహ్లాదుడు పరమహంస ధర్మాలను విని సంప్రీతుడై ఆ యతిని పూజించి స్వస్థానానికి వెళ్ళాడు. ధర్మజా! యతివృత్తి అంటే అజగరవృత్తి వంటిదే కాబట్టి ఆ యతిని అజగరు డన్నారు. అజగరం వాయుభక్షణతో ప్రాణాలు నిలుపుకొంటుంది.

## గృహస్థుడు - జ్ఞానసంపాదనం

మునులారా! ధర్మనందనుడు ప్రహ్లాద పరమహంస సంవాదం విని 'దేవర్షిసత్తమా! మీరు వచించిన పదవి నా వంటి మూఢమతులకు గృహస్థులకు లభ్యమవుతుందా?' అని అడిగాడు. నారదుడు అతనితో ఇలా అన్నాడు.

'ధర్మసుతా! నీ ప్రశ్న లోకోపకారమైనది; విను. గృహస్థులకు కర్మాచరణం తప్పదని, కర్మలతో ఫలోదయం, ఫలభోగార్థం శరీరధారణ, ఆ శరీరంతో పునఃకర్మలు, మళ్ళీ ఆ ఫల భోగార్థమై శరీరధారణమూ ప్రవాహసరణిని జరుగుతుంటాయి కాబట్టి కర్మవిరతి, జ్ఞానోదయం అసాధ్యమని భావిస్తున్నావు కాబోలు! ఆ సందేహం వద్దు.

గృహస్థులకు కర్మాచరణం విధివిధానమే అయినా ఆ కర్మఫలానుభవం ఎప్పుడు కలుగుతుంది? కర్మలను ఫలాభిసంధితో చేసినప్పుడు మాత్రమే తత్ఫలభోగావసరం కలుగుతున్నది. గృహస్థులు దీని స్వరూపాన్ని గ్రహించి స్వాశ్రమోచిత కర్మలను ఫలాభిసంధిరహితంగా ఆచరించాలి. అప్పుడు కర్మఫలం భగవదర్పిత మవుతుంది. కర్మలను ఆ విధంగా ఫలాభిసంధిరహితంగా చేసే శక్తి అభ్యాసబలం వలన సిద్ధిస్తుంది.

## అభ్యాస సాధనక్రమం

ఆ అభ్యాస సాధనక్రమం ఏమిటంటే గృహస్థులు కర్మతత్త్వజ్ఞులను ఉపాసించి కర్మస్వరూపాన్ని తెలుసుకోవాలి. ఉపశాంతులను సేవిస్తూ,

భగవదవతార కథలను కాలోచితంగా వింటుండాలి. సత్పురుషసాంగత్యం వల్ల చిత్తం భగవదాయత్త మవుతుంది. పుత్ర కళత్ర దేహాదులు శాశ్వతం కావని గ్రహించి వాటియెడ మమకారం విడిచి దేహధారణమాత్రపరుడై రాగద్వేషరహితంగా వర్తించటమే సాధనక్రమం.

## త్రివిధ విత్తాలు

ధర్మజా! విత్తములు దైవాలని భౌమాలని ఆంతరిక్షాలని మూడు విధాలు. వర్షాదుల వలన జనించే సస్యాదుల ఫలం దైవవిత్తం. ఖనిజాదులు భౌమవిత్తం. అనాయాచితంగా లభించినవి ఆంతరిక్షవిత్తాలు.

త్రివిధ విత్తాలను విహితకర్మములందే వినియోగించాలి. గృహస్థుడు కర్మత్యాగం చేసి ఊరికే కూర్చుంటే ఉదరపోషణ ఎలా జరుగుతుంది? అందువలన కర్మత్యాగమంటే ఏమీ చేయకుండా ఊరికే కూర్చోవడం కాదన్నమాట. ఉదరపోషణార్థం తగిన వృత్తిని కల్పించుకొని దాని ఫలాన్ని దేహధారణకు కావలసినంత మాత్రమే ఉపయోగించాలి. ఎన్నటికీ భోగపరుడు కాకూడదు. విశేషించి భోగించటం చౌర్యంతో సమానం. దానికి దండన తప్పదు.

ధర్మజా! గృహస్థుడు మృగ పక్షి కీట పర్యంతం సకలప్రాణులను ఆత్మసామాన్య పుత్ర తుల్యంగా చూడాలి. వాస్తవం విచారించితే మర్త్యులకు మక్షికాలకు ఉపాధి భేదం తప్ప వేరొక భేదం ఉన్నదా? గృహస్థుడు స్వార్జితంలో స్వప్రయోజనార్థం పోగా శేషించిన దానిని సర్వభూతాలకు ఆచండాల శునకాంతం పంచిపెట్టాలి. మూటగట్టకూడదు. అతిథి సత్కారానికి గాను కామోపహత కాని సతిని నియోగించాలి. కామోపహత అయితే ఆమె ఆ పనికి తగదు.

ధర్మజా! కొందరు భార్యకోసం ధనప్రాణాలను కూడా లెక్కచేయకపోవటం, గురువునైనా తండ్రినైనా చంపివేయటం, ఆ విలాసవతికి దాసానుదాసులై వర్తించటం మనం చూస్తూనే ఉన్నాము. ఇదంతా దేని

నిమిత్తమై చేస్తున్నదీ ఎప్పుడైనా విచారించావా? కేవలం రతిసుఖార్థమే కదా! ఆ సుఖం దేనికి? దేహానికా? ఆత్మకా? దేహమంటే జడప్రాయం. దానికి సుఖజ్ఞానమెక్కడిది? ఆత్మకే అని అంటావేమో. నిరంతరానందమూర్తి అయిన ఆత్మకు సుఖాంతరం ఏముంటుంది? ఆ సుఖం దేహానికీ ఆత్మకూ కాకపోతే మరి దేనికి కలుగుతున్నది? అంటే అభిమానం ఆ సుఖాన్ని అనుభవిస్తున్నది. అభిమానమే సర్వానర్థాలకూ మూలం. దానిని త్యజించాలి. అభిమాన స్వరూపం ఏమిటని అడిగితే, 'నేను, నాది అన్న భావమే అభిమానస్వరూపం.' ఈ అభిమానం పోవాలంటే వైరాగ్యం, త్యాగభావం కలగాలి. ఈ రెండింటి వల్ల అభిమానం నశిస్తుంది. మొట్టమొదట గృహస్థుడు 'నాది' అనే భావాన్ని త్యజించి అనుదినం దేవ ఋషి నర భూత పితృగణాన్ని దానధర్మపూర్వకంగా యజించాలి. ఇవి గృహస్థులకు నిత్యయజ్ఞాలు.

## యజ్ఞ విధానం

ధర్మజా! యజ్ఞాదులకు కొన్ని విధులున్నాయి. తత్సంబంధిత గ్రంథాన్ని వితానమని అంటారు. ఆ ప్రకారం చేయబడే కర్మలను వైతానికములు అంటారు. గృహస్థులు తమ వర్ణకర్మములను వైతానికంగా నిర్వర్తించాలి.

## దానాదిక యోగ్యదినాలు

ధర్మజా! గృహస్థుడు భాద్రపద శుక్ల పక్షాన మాతాపితలకు, వారి బాంధవులకు యథాశక్తి మహాలయశ్రాద్ధం కావింపవలసి ఉంటుంది. ఉత్తరాయణ దక్షిణాయన ప్రారంభ దివసాలు, విషువు లనబడే మేషతులాసంక్రాంతులు, వ్యతీపాత దినక్షయాలు, సూర్య చంద్ర గ్రహణ దినాలు, ద్వాదశీశ్రవణాలు, అక్షయతృతీయ, కార్తిక నవమి, హేమంత శిశిరాల లోని అష్టకాచతుష్టయం, మాఘమాసాంతర రథసప్తమి, మాఘపూర్ణిమ, మాసనక్షత్ర సహిత పూర్ణచంద్రరాక, న్యూన చంద్రయుక్త అయిన అనుమతి, అనూరాధా శ్రవణోత్తరాత్రయ యుక్త ద్వాదశి, ఏకాదశి, జన్మనక్షత్ర శ్రవణాయుక్త దివసాలు సర్వవిషయ శ్రేయోదాయక పుణ్య

వాసరాలు కాబట్టి ఆ శుభ దినాలలో గృహస్థుడు స్నాన జప హోమ తపో దేవ ద్విజార్చనలు, పితృభూతాల పేర దానాలు చేసినట్లయితే ఆయుర్వృద్ధి, అంతశ్శ్రేయోవిశేషాలు కలుగుతాయి. ఇవి కాక భార్యా పుంసవన దినం, పుత్త్రజాత కర్మసమయం, తన యజ్ఞదీక్షా కాలం, ప్రేతసంస్కార కాలం, పితృసాంవత్సరిక మృతాహస్సులలో కావించే శుభకర్మలు ఎంతో మేలుచేస్తాయి.

## దానాది శుభకర్మయోగ్య ప్రదేశాలు

ధర్మజా! దానాదులకు కాల నిర్ణయమే గాక దేశనిర్ణయం కూడా ఉన్నది. కాలనిర్ణయం సరే దేశనిర్ణయం అంటే ఏమిటో చెబుతాను, విను. సత్పురుషుడంటే భగవద్బింబమే కదా! అటువంటివాడు ఎక్కడుంటే ఆ ప్రదేశం పుణ్యతీర్థ మనబడుతుంది. భగవత్పూజలు జరిగే ప్రదేశాలు, పురాణప్రసిద్ధ గంగాది నదులు ప్రవహించే ప్రదేశాలు, పుష్కరసరోముఖ్య ప్రదేశాలు, కురుక్షేత్రం, హయశిరః ప్రయాగ పులహాశ్రమాలు, నైమిశం, ఫల్గునం, సేతువు, ప్రభాస క్షేత్రం, కుశస్థలి, వారణాసి, మధుపురం, పంపా సరోవరం, బిందుసరస్సు, బదరీనారాయణాశ్రమం, సీతారాములు నివసించిన ఆశ్రమాదులు, మలయ మహేంద్రాదులు, శ్రీహరి విగ్రహాలు నెలకొన్న స్థానాలు, తపో విద్యా దయామయ బ్రాహ్మణనివాసాలు పుణ్యతమ స్థానాలు. శ్రేయస్కాములు ఆ పుణ్యతీర్థాలను సేవించాలి. అక్కడ కావించే ధర్మాలు శతగుణంగా ఫలాన్ని ప్రసాదిస్తాయి.

## దానాలకు పాత్రనిర్ణయం

ధర్మజా! పాత్రమెరిగి దానం చేయాలి. అపాత్రదానం వలన చేటు కలుగుతుంది. లోకంలో ఉత్తమపాత్ర మెవరంటే చరాచరమయు డైన ఆ భగవంతుడే మహోత్తమ పాత్రుడని విబుధులు నిర్ణయించారు. ఒకరి మాటెందుకు? నీ రాజసూయయాగానికి సురలు సిద్ధులు బ్రాహ్మణులు సనకాది మహామునులు కూడా వచ్చారు. ఇంతమంది మహాత్ములందరూ కలిసి

అగ్రపూజకు ఎవరిని నిశ్చయించారు? శ్రీకృష్ణ భగవానుడినే కదా. ఆయనకే కదా అగ్రపూజను చేశావు. భగవంతుని పూజిస్తే సర్వభూతాలను పూజించినట్లే అవుతుంది. భగవానుడు నిఖిల జీవరాశి సంకీర్ణ విశ్వమహావృక్షానికి మూలమై వివిధ జీవకోటిని సృజించి ఆ ఉపాధులలో పురుషుడనే పేర ఉన్నాడు. అందువల్లనే భగవత్పూజ అంటే సర్వప్రాణి కోటి పూజనమని అన్నాను. ఆ ఉపాధు లన్నింటిలో దేనియందు జ్ఞానాధిక్యం కానవస్తే అది సత్పాత్రమని గ్రహించాలి.

## పూజా విధానం

ధర్మజా! అంతర్యామి పూజ మొట్టమొదట ప్రచారంలో ఉండేది. తర్వాత ఉపాధి తారతమ్యాన్ని బట్టి అంతర్యామి స్వరూపంలోనూ తారతమ్యాలను కల్పించారు. తత్ఫలంగా న్యూనతాధికతలు, రాగద్వేషాలు, పరస్పర స్పర్ధలు సంభవించాయి. త్రేతాయుగంలో పెద్దలిది గ్రహించి పూజార్థం భగవత్ప్రతిమలను ఏర్పరిచి తత్ప్రతిమాపూజలను విధించారు. నాటినుంచి కొందరు ప్రతిమాదులలో భగవంతుని ఉపాసించటం మొదలుపెట్టారు. ప్రతిమలు బహువిధాలుగా కనిపించినా వాటిలో అంతర్యామి భగవంతు డొక్కడే ఉన్నాడు. విగ్రహభేదాలను బట్టి భగవద్భేదాల నూహించి పూజింపకూడదు. భేదభావాలతో చేసిన పూజలు నిరర్థకాలు.

## బ్రాహ్మణ మాహాత్మ్యం

ధర్మజా! వేదం భగవన్ముఖం నుంచి జనించినందు వలన అది కూడా భగవన్మూర్తి విశేషమే అవుతుంది. ఆ మూర్తిని తపో విద్యా పరితోషపూర్వకంగా ఎవరు ధరిస్తే వారు బ్రాహ్మణులవుతారు. ఆ కారణాన వారు పురుష లందరిలో ఉత్తమపురుష లనబడుతున్నారు. ఇందుకు నిదర్శన మేమంటావా? ఎవని పాదపరాగం ముల్లోకాలకు పవిత్రతను కూర్చుతున్నదో ఆ కృష్ణభగవానునికి బ్రాహ్మణుడు పరదైవమట. ఇక చెప్పాలా?

ధర్మజా! మోక్షమన్నది పరమ ప్రాప్యం. అన్ని ధర్మాలూ మోక్షార్థమే కాబట్టి

మోక్షాన్ని సర్వధర్మసారమని అంటారు. మోక్ష ప్రాప్తికే లోకులు వారి వారి వర్ణాశ్రమరుచులను బట్టి, మనః పరిణతిని బట్టి సాధనాలను గ్రహిస్తారు. ఆ కారణాన కొందరు కర్మమును కొందరు తపస్సును కొందరు స్వాధ్యాయాన్ని కొందరు అధ్యాపనాన్ని కొందరు జ్ఞానాన్ని ఆశ్రయిస్తారు.

కర్మపరులైన ద్విజులకు శ్రాద్ధాదులలో హవ్యకవ్యాలు విధివిధానాలుగా ఉపదేశింపబడ్డాయి. దేవతోద్దేశంగా ఇవ్వబడేది హవ్యమని, పితృదేవతల నుద్దేశించి ఇవ్వబడేది కవ్యమని చెప్పబడుతున్నది. ఆ రెండింటిని జ్ఞాననిష్ఠుల కిచ్చినప్పుడే ఫలం కలుగుతుంది. జ్ఞాననిష్ఠులు లభింపనినాడు యోగ్యతను విచారించి అన్యులను ఆహ్వానించాలి.

శ్రాద్ధక్రియకు నిమంత్రణ నియమం ఉన్నది. దైవస్థానంలో ఇద్దరిని, పితృస్థానంలో ముగ్గురిని లేదా ఒక్కరిని నిమంత్రింపవచ్చు. శ్రాద్ధవిస్తారం ఎట్టి పరిస్థితిలోనూ తగదు. కలిమి ఉన్నదని శ్రద్ధాద్రవ్యాన్ని ఇష్టం వచ్చినట్లు వెచ్చించటం విధి ధిక్కార మవుతుంది. శ్రాద్ధాన్నం హరిదైవతంగా ఇవ్వబడుతున్నది. ఒక్కొక్కప్పుడు నీవారాన్నం ఇవ్వవలసి వస్తుంది. అది దోషం కాదు. దేనినైనా పాత్రమెరిగి భక్తితో సమర్పించాలి. భక్తి పూర్వకంగా చేసినప్పుడే అది అక్షయమై ఈప్సితాలను సమకూర్చుతుంది. అన్నాన్ని దేవ ఋషి పితృ భూతాదులకు మొదట సమర్పించి తర్వాత బంధుజనులకు తృప్తి చేసి శేషాన్ని కర్త వినియోగించాలి. ఆ చేసేటప్పుడు సర్వము భగవద్రూపమే అన్న భావనతో చేయాలి. ధర్మతత్త్వవిదులు శ్రాద్ధక్రియలో మాంసాన్ని వడ్డించకూడదు; తాము తినకూడదు. హింసాత్మకాన్నం కంటె నీవారాల (ఊచబియ్యం) తో వండిన అన్నాన్నే శ్రాద్ధదేవతలు వరిస్తారు.

## హింసా తత్త్వం

హింస అన్నది మానసికం వాచికం కాయికం అని మూడు విధాలు. ధర్మపరులు త్రివిధ హింసను వర్జించాలి. 'అహింసా పరమో ధర్మః' అని శాస్త్రం ఉద్ఘోషిస్తున్నది. అహింస కన్న ఉత్తమమైన ధర్మం వేరొకటి లేదు. అందువల్లనే యజ్ఞవేత్తలైన జ్ఞానులు కర్మయజ్ఞాలను వదలి నిష్క్రియులై జ్ఞానదీపితమై ఆత్మ

సంయమరూప యజ్ఞాన్ని ఆచరిస్తారు. భూతజాతం ద్రవ్యయజ్ఞపరులను చూసి, 'అయ్యో! వీరికి ఆత్మ తత్త్వవిచారం అణుమాత్రమైనా లేదు. కరుణ అన్నది వీరిలో వెతికినా కనిపించదు. నిట్టనిలువున ప్రాణాలు తీయటానికి వెనకాడరు. మా ప్రాణాలకు ఎప్పుడు ముప్పు రాబోతున్నదో' అని తీరని వ్యధ చెందుతుంటాయి. ధర్మమే ప్రధానం. వస్తువు ప్రధానం కాదు. ఏది ప్రాప్తమో అదే ధర్మానికి యోగ్యమనుకోవాలి. ఎవరు ప్రాప్తాన్ని సంతుష్టితో నిత్య నైమిత్తిక క్రియలలో వినియోగిస్తారో వారే ధర్మవిదులు.

## అధర్మ విచారం

ధర్మజా! అధర్మం ఎన్నటికీ తగదు. దానికి విధర్మ పరధర్మ ఆభాసధర్మ ఉపమాధర్మ ఛలధర్మాలని అయిదు శాఖలున్నాయి. ఏది స్వధర్మహాని కలిగిస్తుందో అది విధర్మం. తనకు కూడనిది, పరులకు యోగ్యమైనది పరధర్మం. వేదవిరుద్ధమై పాషండాదుల చేత ఆచరింపబడేది ఉపమాధర్మం. బాహ్య దృష్టికి ధర్మం వలె కానవచ్చినా ధనార్థమై లోకం కన్నుగప్పి దంభపూర్వకంగా చేసే శాస్త్రానుమతం కాని స్వేచ్ఛాప్రమాణ కార్యం ఆభాసధర్మం. ఛలధర్మంలో మోసగించటమే పరమాభిప్రాయం. అది అర్థచ్ఛలమని శబ్దచ్ఛలమని రెండు విధాలు. గోదానం ప్రకటించి చావబోతున్న గోవునిచ్చి గోదానధర్మం చేశాను కదా అనుకోవటం అర్థచ్ఛలం. పదుగురి దాకా భోజనం పెడతానని మాటయిచ్చి ఒకరికి పెట్టి, చెప్పినట్లుగానే భోజనం పెట్టాను కదా అనటం శబ్దచ్ఛలం. ఈ అధర్మపంచకాన్ని కలలో కూడా అనుకోకూడదు.

## స్వధర్మ ప్రభావం

ధర్మజా! స్వధర్మమంటే స్వభావ విహితమైన ధర్మం. అది తన శాంతికే గాక పరోపశాంతికి కూడా పనికివస్తుంది. స్వధర్మం కావించి అది చాలదేమో అని భ్రాంతి చేతనైనా పరధర్మాన్ని ఆచరింపకూడదు. స్వధర్మానికి మారుగా పరధర్మాన్ని ఆచరించితే హితఫలం సిద్ధించకపోవటమే గాక విపరీత ఫలం

కూడా సంప్రాప్తిస్తుంది.

ధర్మానికి, యాత్రాదులకు స్వధనాన్నే వినియోగించాలి. ధనం లేని నాడు ఊరుకోవాలి. అంతే కానీ పరులను ఎంత మాత్రం అర్థింపకూడదు. దారిద్ర్యం వలన ధర్మం చేయలేని వారి గతేమిటి? అంటే, వారు ఆత్మారాముని సేవించాలి. అది కోటిధర్మాల పెట్టు కాగలదు. వారికి పూట గడవటం ఎలాగని అడుగుతావేమో? అజగర చరిత్ర విన్నావు కదా! నిత్యసంతుష్టునికి లోకమంతా శివమయమే అవుతుంది. సంతుష్టి అన్నది ఉంటే భోజనం దొరకనినాడు కూడా దోసెడు నీరు త్రాగి తృప్తి చెందగలడు. ఇక కృపణులున్నారు. వారెవరంటే జిహ్వోపస్థల సుఖం కోరేవారన్నమాట. వారి గతి కుక్క గతి అవుతుంది.

ధర్మజా! లోకమన్నది ఎవరికీ ఎన్నటికీ తగదు. కామక్రోధాలకైనా అంతం ఉన్నది గాని లోభానికి మాత్రం మేరలేదు. కామ మన్నది అన్నోదకాల ఆకృతిని కలిగి ఉంటుంది. అన్నోదకాల చేత కామాన్ని తనుపవచ్చు. క్రోధమంటే హింసాత్మకం. వైరివధతో అది చల్లారుతుంది. లోభానికి అంతం కనిపించదు. దిగ్జయం కలుగుతుంది గాక; సర్వలోకాధిపత్యం చేకూరుతుంది గాక; లోభం తీరదు. రాజా! బహుజ్ఞులు సంశయనివర్తకులు సదసద్విభులు అని పేరుపడ్డ పండితులు కూడా సంతుష్టి లేకపోవటం వలన అధఃపతితులైనారంటే లోభశక్తి ఎటువంటిదో వేరే చెప్పాలా? లోభ ఫలం ఏమిటంటావా? అసంతుష్టి, తేజో విద్యా తపో యశస్సులకు హాని కలగటం ఇవి రెండూ సద్యఃఫలాలు.

## కామాది జయోపాయం

ధర్మజా! కామాది వైరులను జయించటం ఎలాగో విను. సంకల్ప త్యాగం వలన కామం, కామత్యాగం వలన క్రోధం, దృశ్య మిథ్యాత్మ జ్ఞానం వలన లోభం, అద్వైతానుసంధానం వలన భయం, ఆత్మానాత్మ వివేకం వలన మోహశోకాలు, సత్సాంగత్యం వలన దంభం, మౌనం వలన యోగాంతరాయ లోకవార్తాదులను, దేహాభిమాన త్యాగం వలన హింసను, కృపాపూర్వక

హితాచరణ వల్ల భౌతిక దుఃఖాన్ని, సమాధి వలన దైవిక దుఃఖాన్ని, ప్రాణాయామాది శక్తి వలన దైహిక దుఃఖాన్ని, సాత్త్వికాహారాది సేవ వలన నిద్రను, సత్త్వం వలన రజస్తమస్సులను, ఉపశమం వలన సత్త్వాన్ని, గురుభక్తి వలన సర్వాన్ని జయింపవచ్చును.

## గురుభక్తి ప్రభావం

ధర్మజా! గురుభక్తికి అంత ప్రభావం ఉన్నదా? అని శంకిస్తున్నావా? గురువు జ్ఞానదీపికను అనుగ్రహిస్తాడు. జ్ఞానదీపికను ఇచ్చేవాడు సాక్షాద్భగవత్స్వరూపుడే కాని మానవ మాత్రుడు కాడు. అంతటివానిని లోక సామాన్యునిగా భావించటానికి కారణం ఏమిటి? అంటే అజ్ఞానమే కారణం. అందుకు నిదర్శనార్థం వేరే ఎక్కడో వెతకవలసిన పని లేదు. ఇదిగో నీ ముందున్న శ్రీకృష్ణ భగవానుడే నిదర్శనం. సాక్షాద్భగవంతుడిని ప్రధానపురుషేశ్వరుని లోకైక గురువును శ్రీకృష్ణ పరమాత్మను మనుష్య మాత్రునిగా భావించి వర్తించటం నీకు కూడా స్పష్టమే కదా. ఈ మహాత్ముడు సామాన్యులకు సామాన్యుడే అయినా యోగీశ్వరులకు ధ్యానమూర్తి అయినట్లు గురువు అతని పుత్రాదులకు నరమాత్రుడే అయినా శిష్యులకు సాక్షాత్పరమాత్ముడే.

## మోక్ష సాధనలు

ధర్మనందనా! మోక్షానికి కామాది జయం, నియతేంద్రియత్వం, ఆత్మధ్యానపర్వతం ముఖ్యమైన సాధనాలు. శాస్త్రాలు వల్లించినంతనే ఫలం లేదు. శాస్త్రమన్నది మార్గదర్శకం మాత్రమే. ఆ మార్గాన్ని బట్టి నడిస్తే కదా గమ్యస్థానాన్ని చేరుకోవటం? కృష్యాదులు, ఇష్టా పూర్తాదులు తగవా? అంటే, కర్మములు ఎట్టివైనా కర్తకు బహిర్ముఖత్వాన్ని కలిగించి అతనిని సంసారం లోనికి లాగుతాయి. ఏ నియమాలు ధ్యాన ధారణ సమాధులను కూర్చగలవో అవి మాత్రమే మోక్షసాధనాలని తెలుసుకోవాలి.

## మనో జయం

రాజా! మనస్సు చంచలాతి చంచల మైనదని, అటువంటి దానిని నిలవరించటం ఎలాగని అడగవచ్చు. బహిర్వస్తుసంయోగం కలిగినప్పుడు మనశ్చాంచల్యం కలుగుతుంది. ఆ సంయోగం కలగకుండా ఉండాలంటే నిర్జనమైన ప్రదేశంలో ఏకాకిగా ఉండాలి. ఆ ప్రదేశంలో సమస్థలాన్ని శుభ్రపరిచి స్థిరసుఖాసనాన్ని కల్పించుకొని వంకర లేకుండా కూర్చొని ప్రణవ పూర్వకంగా యోగనిష్ఠను పూని యథాప్రాప్త భిక్షాన్నంతో దేహధారణ చేస్తూ వచ్చినట్లయితే కాలక్రమాన మనోమర్కటవ్యాపారాలు శమిస్తాయి.

## ప్రాణాయామ ప్రకారం

ధర్మజా! యోగారంభానికి పూర్వం ఘటశుద్ధి చేయాలి. దానినే ప్రాణాయామ మంటారు. అది రేచక కుంభక పూరకములని మూడు విధాలు. ఆ విధంగా ప్రాణాపానాలను నిరోధించి నాసాగ్రాన్ని చూస్తున్నట్లుగా దృష్టి నిలిపి యోగాన్ని ఆరంభించాలి. ప్రారంభంలో మనస్సు నిలకడ లేక అటూ యిటూ పరుగులు తీస్తుంటుంది. దానిని యథేచ్ఛగా పోనివ్వాలి. బలవంతంగా అదిమిపెట్టాలని చూడకూడదు. కొంత కాలం తిరిగి తిరిగి అలసట చెంది చివరికి స్వస్థానం చేరుకొంటుంది. అప్పుడు దానిని బంధించాలి. ఆ విధంగా అభ్యాసం చేస్తూ రాగా కొంత కాలానికి ఏకాగ్రత సిద్ధిస్తుంది.

## మిథ్యా సన్న్యాసం

రాజా! గృహనివాసమే ధర్మార్థకామాలకు ఆధారం. గృహస్థులు ఆ మూడింటిని శాస్త్రానుసారం సేవిస్తూ క్రమక్రమంగా వాటిని సన్యసించటం క్రమసన్యాస పద్ధతి. అటువంటి సన్యాసం స్థాయియై ముక్తిదాయకం అవుతుంది. కొందరు శాస్త్రజ్ఞానం ప్రేరణ వల్లనో ఆపదల బాధ వల్లనో శ్మశానవైరాగ్యం కలిగి ఇల్లు విడిచి సర్వం సన్యసించినట్లు కొంత కాలం గడిపి

మళ్ళీ గార్హస్థ్యానికి తిరిగివస్తారు. అట్టి వారి వర్తన కక్కిన దానినే మళ్ళీ తినటం వంటిది. కార్య సాధనకు యోగ్యత లేనినాడు దానిని మొదలుపెట్టకూడదు. పచ్చి కాయను తెచ్చి పండవేస్తే ఫలమవుతుందా?

## నిషిద్ధ త్యాగాదులు

రాజా! గృహస్థునికి కర్మత్యాగం, వటువుకు వ్రతత్యాగం, వనస్థుడికి గ్రామ సేవాభిరతి, యతికి ఇంద్రియపరత్వం నిషేధింపబడ్డాయి. నిషిద్ధాలను సేవించే ఆశ్రమకులు రెంటికీ చెడ్డ రేవడు లవుతారు.

## జ్ఞాని – దేహపోషణం

ధర్మజా! జ్ఞాని అయితే మాత్రం దేహపోషణ జరగాలి కదా? అనవచ్చు. దేహధారణకు, దేహపోషణకు భేదం ఉన్నది. పోషణ శబ్దంలో భోగభావం గర్భితమై ఉన్నది. భోగమనగానే కామితాలను సంతరించుకొని యథేచ్ఛగా అనుభవించటం జరుగుతుంది. దానికి ఆద్యంతాలు ఉండవు. పైగా దేహాత్మ భావం దానిని అంటిపెట్టుకొని ఉంటుంది. ఆ భావం కలవాడు జ్ఞాని కాలేకపోతాడు. జ్ఞాని శబ్దానికి అర్థమేమిటో విచారించి చూడు. దేహము, ఆత్మ వేర్వేరని; ఆత్మకు జనన మరణాలు, ఇచ్ఛాక్రియలు మొదలైనవి లేవని; దేహమన్నది ప్రారబ్ధకర్మ ఫలభోగార్థం నిర్మించిన ఘటమాత్రమని; భోగానంతరం దేహం నిలువనేరదని నిశ్చయభావం కలిగి, ఆ దేహధారణకు తగినంత మాత్రమే గ్రహిస్తూ ఆత్మభావన కావించేవాడు జ్ఞాని. అట్టివాడు ప్రాప్తించిన దానితో సంతుష్టిని పొందుతాడు. అంతేకాని పదార్థ సేకరణ క్రియాపరుడై తత్ఫలంగా విషయవాసనా వశుడు కాడు.

## జీవుని విజయ యాత్ర

ధర్మజా! శరీరమనే రథానికి ధర్మాధర్మాభిమానాలనే చక్రాలను రెంటిని తగిలించి, దశవిధ ప్రాణరూపమైన అక్షాన్ని కూర్చి, ఇంద్రియాలనే గుర్రాలను పూన్చి, బుద్ధిని సారథిగా నియమించి, పగ్గాన్ని పట్టుకొని చిత్తాన్ని

పెనుబంధంగా చేసి, ప్రణవ ధనుర్ధరుడై శుద్ధజీవుని అమ్ముగా సంధించి జీవుడు ఆ రథాన్ని అధిష్ఠించి పరబ్రహ్మాన్ని లక్ష్యంగా నిలిపి, శబ్దాది విషయ జయరూపమైన గమ్యస్థానానికి తరలి వెళ్ళాలని, ఆ జీవుని రజస్తమస్సత్త్వ ప్రకృతులు రాగ ద్వేష లోభ శోక మోహ భయ మద మానావమానాసూయలు మాయా హింసా మత్సర రజః ప్రమాదాలు క్షున్నిద్రలు మొదలైన పరివారంతో మార్గమధ్యంలో అడ్డువస్తాయని, అతనప్పుడు భగవద్బలాన్ని ఆశ్రయించి, జ్ఞానఖడ్గంతో వైరులను సంహరించి గమ్యస్థానం చేరి ఆత్మానందపీఠి నధిష్ఠించి ఉపశాంతుడై రథాది సకల పరికరాలను పరిత్యజిస్తాడని పెద్దలంటారు. రథికుడు జాగరూకుడు కాకపోతే, అతని సారథి అసద్బుద్ధివశు డవుతాడు. రథ్యాలు అసదింద్రియపరాలు అవుతాయి. సారథి, అశ్వాలు, ఆజ్ఞకు లోబడక తప్పుదారి త్రొక్కి విషయశత్రువులకు అప్పగిస్తారు. ఆ శత్రువులు జీవుని అతని పరికరాలన్నింటితో వశపరచుకొని పట్టి సంసార కూపం లోనికి త్రోసివేస్తారు.

## కర్మ విభాగాలు

ధర్మజా! కర్మము వైదికమని, లౌకికమని రెండు విధాలు. లౌకిక మంటే జీవికావృత్తి రూపమైనది. వైదికం మళ్ళీ ప్రవృత్తం, నివృత్తం అని రెండు విధాలు. ప్రవృత్తం పునారావృత్తికి, నివృత్తం అమృతత్వానికి హేతువులవుతాయి. శ్యేనాది హింస కర్మద్రవ్యమయ కర్మలు, కామ్యకర్మలు, ఆసక్తిపూర్వకాగ్నిహోత్రాదులు, దర్శపూర్ణమాసాలు, చాతుర్మాస్యం, పశుయజ్ఞం, సోమయాగం, వైశ్వదేవం, బలిహరణం ఇష్టరూపకర్మలు. దేవాలయ వన కూప తటాకాది నిర్మాణాలు పూర్తరూప కర్మలు.

## జీవుని మజిలీలు

రాజా! ప్రతి కర్మానికి ఫలం కలుగుతుందని, ఫలకాంక్షతో కర్మమును చేసినప్పుడు తత్ఫలాన్ని కర్త అనుభవింపక తప్పదని చెప్పాను. ఫలాలు చిత్రవిచిత్రాలుగా ఉంటాయి. ఫలాన్ని బట్టి అనుభవ విధానం బహురీతులుగా

ఉంటుంది. అనుభవానికి తగిన స్థానాలు కూడా ఉన్నాయి. ఆ స్థానాలను చేరుకొనటానికి నడుమ నడుమ మజిలీలు ఉంటాయి. ఒక్కొక్క మజిలీకి ఒక్కొక్క అధిదేవత నియమింపబడి ఉన్నది.

పురోడాశాది ద్రవ్యయజ్ఞ ఫలాన్ని కోరిన జీవుడు స్థూలశరీరాన్ని వదలిన వెంటనే లింగ శరీరం దాల్చి ధూమాంతరమనే మజిలీని చేరుకొంటాడు. అక్కడున్న అధిదేవత ఆ జీవుడిని వెంటగొనిపోయి రాత్ర్యధిదేవతకు అప్పగిస్తుంది. ఆ అధిదేవత అతని నక్కడి నుంచి తరలించి కృష్ణపక్షాధిదేవతకు అప్పగిస్తుంది. ఆ దేవత మళ్ళీ అతని నక్కడినుంచి తరలించి దక్షిణాయనాధి దేవతకు అప్పగిస్తుంది. ఆ దేవత అతనిని సోమలోకానికి తరలిస్తుంది.

## జీవుని పునర్జన్మ

జీవుడక్కడ తా ననుభవింప వలసిన భోగఫలాలను అనుభవిస్తాడు. భోగానుభవం తీరినంతనే అతని లింగశరీరం నశించిపోతుంది. అతను కేవల సూక్ష్మశరీరంతో ఉంటాడు. ఆ శరీరం వర్షంతో కలిసి భూమికి వచ్చి ఓషధులను, వీరుధాదులను చేరుతుంది. జీవుడు తన కర్మఫలానుసారంగా ఎటువంటి ఉపాధిని గ్రహింపవలసి ఉన్నదో అటువంటి ఉపాధి గల తల్లిదండ్రులు – నరులు లేదా పశుపక్ష్యాదులు – ఆ ఓషధులను భుజించటం జరుగుతుంది. ఓషధులు ఆ విధంగా భుక్తమైనాక ఉపాధులలో రక్తరూపాన్ని దాల్చి రేతస్సుగా మారి పిండాకృతిని వహించి యథాకాలానికి బహిర్గత మవుతాయి. రాజా! పురోడాశాది ద్రవ్య ఫలాలు ఆ విధంగా పరిణామం చెంది దేహాంతరారంభకాలు అవుతున్నాయి.

## నివృత్తి పరజీవుల ప్రయాణం

రాజా! నివృత్తిపరుల ఇంద్రియాలు జ్ఞానదీపితాలుగా ఉంటాయి. ఆ జ్ఞాన శక్తి బలం వలన వారు తమ ఇంద్రియాలను సంకల్పాత్మక మనస్సులో లయింపజేస్తారు. మనస్సు వికారాత్మకం. దానిని విద్యాలక్షణమైన

వాక్కునందు, దానిని వర్ణ సమామ్నాయమందు, దానిని సర్వాత్మకమైన ఓంకారమందు, దానిని ప్రాణమందు లయింపజేస్తారు. ప్రాణాన్ని సూత్రాత్మ అంటారు. సూత్రాత్మను బ్రహ్మమునందు సమన్వయిస్తారు.

అనంతరం జీవుడు శరీరాన్ని వదలి అగ్నిదేవతను చేరుకొంటాడు. ఆ దేవత ఆ జీవుని సూర్యాభిమాని దేవతకు, అది అహరభిమాని దేవతకు, అది పూర్వాహ్ణాభిమాని దేవతకు చేరుస్తాయి. ఆలాగున జీవుడు శుక్లపక్ష పూర్ణిమోత్తరాయణాభిమాని దేవతలను క్రమంగా గడిచి బ్రహ్మలోకం చేరుకొంటాడు. తర్వాత బ్రహ్మతోపాటు ముక్తిని పొందుతాడు.

## శరీర త్రయం

రాజా! శరీరం స్థూలము సూక్ష్మము కారణము అని మూడు విధాలు. ఆ మూడూ ఒకదానిలో ఒకటి ఇమిడి ఉంటాయి. స్థూల శరీరాన్ని విశ్వుడని, సూక్ష్మశరీరాన్ని తైజసుడని, కారణశరీరాన్ని ప్రాజ్ఞుడని అంటారు. స్థూలము సూక్ష్మమందు లయిస్తుంది. సూక్ష్మము కారణమందు లయిస్తుంది. అంటే, ప్రాణం వెడలి నంతనే స్థూల మందలి శక్తులు సూక్ష్మాన్ని చేరుకొంటాయి. స్థూలము శవాకారమందే పడి ఉంటుంది. దానికి దహనాది క్రియలను చేస్తారు. సూక్ష్మము ప్రయాణమై పోతుంది. అది కొంత దూరం వెళ్ళి తర్వాత పోలేక తన శక్తులను కారణంలో లయింపజేసి తాను నశిస్తుంది. ఆ కారణం కర్మభోగాలను అనుభవించి పునర్జన్మాంకుర మవుతుంది (ఈ విషయంలో మతభేదాలు ఉన్నాయి). నివృత్తి మార్గపరుల కారణశరీరం సాక్షిస్వరూపంలో ఉన్న తురీయమందు లయిస్తుంది. తురీయమే ఆత్మ దనబడుతున్నది. ఆ ఆత్ముడు స్వస్వరూపంలో ఉండటమే ముక్తి అనబడుతున్నది.

## యాన ద్వయం

రాజా! ప్రవృత్తిపరుల మార్గం ధూమాదియానమని, నివృత్తిపరుల మార్గం అగ్న్యాదికమని చెప్పాను. ధూమాదియానాన్ని పితృయానమని, రెండవ దానిని దేవయానమని పేర్కొంటారు. ఈ రెండిటిని వేదం బోధిస్తున్నది. వాటిని

శాస్త్రదృష్టి చేత పరిశీలించిన వాడు దేహస్థుడైనా మోహవశుడు కాడు. కారణ మేమంటావా? జ్ఞానమే కారణం. జ్ఞాన కార్యమేమంటావా? సర్వవ్యాపి అయిన ఆత్ముడుంటాడు. అతని బింబం శరీరాంతరంలో ప్రతిఫలించి నప్పుడు ఆ ప్రతిబింబాన్ని జీవుడంటారు. ప్రతిబింబానికి స్వతస్స్థితి కలగదు. ఈ రహస్యాన్ని జ్ఞానం బోధిస్తుంది. ఇంద్రియార్థాలన్నీ ఆభాస మాత్రాలే తప్ప పరమార్థాలు కావని జ్ఞానబోధ చేతనే స్పష్టపడుతుంది.

రాజా! వృక్షాన్ని నిదర్శనగా తీసికొందాము. వృక్షం పంచభూతాల వలన ఏర్పడుతున్నది. వృక్షమున్నప్పుడు దానికి నీడ ఉంటుంది. ఆ నీడ యొక్క తత్త్వమేమిటి? అది పంచభూత సంఘాతమూ, తద్వికారము, తత్పరిణామము, తద్భిన్నము, తదన్వితాలలో ఏదీకాదు. అలాగే దేహాదికం కూడా. అంటే అది మృషాభూత మన్నమాట. పంచభూతాలన్నో అవి సావయవాలు. అంటే మహాసూక్ష్మములైన అవయవాల చేత ఏర్పడుతున్నవి. అవయవాలు లేకపోతే అవయవి కలుగడు. అవయవి ఉన్నప్పుడు అవయవాలు ఉండక తప్పదు.

## భ్రాంతి కారణం

రాజా! సాదృశ్యాన్ని బట్టి భ్రాంతి కలుగుతున్నది. పూర్వం ఒకప్పుడు చూసిన వస్తురూపాన్ని వేరొక వస్తువునందు ఆరోపించటాన్ని సాదృశ్యమంటారు. ఈ భ్రాంతి అవిద్యాఫలం. అవిద్య నశించినప్పుడు అది కూడా నశించిపోతుంది. జగత్తు అన్నది భ్రాంతిఫలం కాబట్టి దానిని మిథ్య అంటారు.

సర్వం మిథ్య అయితే విధి నిషేధ శాస్త్రాల గతేమిటని అడుగుతావేమో. స్వప్నావస్థను నిదర్శనగా తీసుకొందాము. స్వప్నమే అసలు మిథ్య. ఆ స్వప్నంలోనే మరొక స్వప్నమూ, జాగరణమూ కలుగుతున్నాయి. మిథ్య అయిన స్వప్నంలో మళ్ళీ స్వప్న జాగరణావస్థలు కలుగుతున్నట్లే మిథ్యాజగత్తులో ఇది విధి, ఇది నిషేధం అని శాస్త్రం బోధిస్తున్నది.

## అద్వైత భావ శాఖాత్రయం

రాజా! 'ఏకమేవ అద్వితీయమ్' అన్నప్పుడు భగవానుడు తప్ప వేరొకటి కలుగదని భావం. దీనినే అద్వైత భావమని అంటారు. అది భావాద్వైతమని, క్రియాద్వైతమని, ద్రవ్యాద్వైతమని మూడు విధాలు. వస్తువులందు భేదబుద్ధి లేకపోవటం భావాద్వైతం. నూలు దారాలతో గుడ్డను నేస్తున్నాము. దారాలు కారణం, గుడ్డ కార్యం అన్నమాట. గుడ్డ ఏర్పడిన తర్వాత కారణకార్యాలు ఏకమై ఒక్క రూపవుతాయి. అలాగే ప్రపంచం వేరు, తత్ప్రపంచ కర్త వేరు అని మొదట అనుకొంటాము. లోతుగా విచారించినప్పుడు ఆ వేర్పాటు భావం పోయి రెండూ ఒక్క రూపమేనని తెలుస్తుంది. అంటే ప్రత్యేకభావాలు నశించి ఏకభావం ఏర్పడుతుంది. దీనినే భావాద్వైతమంటారు. అధికారి భేదం వలన కర్మభేదం కలుగుతుందని భావింపక పోవటం క్రియాద్వైతం. కర్మములన్నీ మనోవాక్కాయముల చేత జరుగుతుంటాయని, ఆత్మ ప్రేరేపిస్తుంటుందని తలపోయక సర్వం సాక్షాత్పరబ్రహ్మమందు సమర్పించటం క్రియాద్వైతం. సత్కర్మలొనర్చి సాధించే ఫలాలు ఆత్మైక భోగ్యాలనే బుద్ధి లేకుండటం ద్రవ్యాద్వైతం. తన దేహం వలెనే సర్వప్రాణుల దేహాలు పంచభూతాత్మకములని, భోక్త ఆ పరమాత్ముడేనని ఆలోచించి అందరి అర్థకామాలను ఏకరూపాన చూడటం ద్రవ్యాద్వైతం. ఆత్మతత్త్వానుసంధానం వల్ల ఈ మూడు భేదబుద్ధులూ నశిస్తాయి.

## క్రియాసమయ వివక్ష

ధర్మజా! ఆపత్సమయాలలో ఒక్కొక్కప్పుడు స్వకర్మలను మాని పరకర్మలను చేయవలసిన పరిస్థితి వస్తుంది. అప్పుడు కూడా నరులు ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపకూడదు. ఏ కర్మము ఎక్కడ ఎవరికి నిషిద్ధం కాదో దానిని మాత్రమే చేయాలి. ఆ చేసేటప్పుడు కూడా భగవత్పరబుద్ధి తోనే చేయాలి. అది దోషం కానేరదు.

ధర్మజా! ధర్మాచరణ నిష్ఠ, భగవద్భక్తి కలిగినప్పుడు దుస్తరమైనవి కూడా సుసాధ్యాలు కావటమే గాక శుభఫలం తప్పక సంప్రాప్తమవుతుంది. మీరు పడరాని పాట్లు పడి, చెప్పలేనన్ని ఆపదలకు లోనైనవారు దిగ్విజయం చేసి రాజసూయ యాగం చేయనోచిన మూలకారణం ఏమిటి? మీ స్వధర్మనిష్ఠ, భగవద్భక్తి ఇవి రెండే కదా మూలకారణాలు.

ధర్మనందనా! గృహస్థుడు సన్యాసికి లభించే సద్గతిని పొందాలంటే ఏ విధంగా వర్తింపవలసి ఉంటుందో వివరించాను. ఆ ధర్మాలను అనుష్ఠించే గృహస్థులకు కళ్యాణం సిద్ధఫలం. కాబట్టి వేరు చింతలు మాని మీరు మీ స్వధర్మనిష్ఠులై వర్తించండి.

ఎవ్వడు లోకైకధ్యేయుడై మానుషవేషాన్ని ధరించి మీ యింట ప్రచ్ఛన్నగతిని ఉన్నందు వలన మీవద్దకు మహామునులు కూడా నిరంతరం వచ్చిపోతుండటం జరుగుతున్నదో, ఎవ్వని నిమిత్తంగా మీకటువంటి పరమసేవాభాగ్యం కలిగిందో, ఎవ్వని రూపనామక్రియలు హర విరించ్యాదులకు సహితం అగోచరాలో, ఆ పరమాత్ముడు మీకు ప్రియుడు, సుహృదుడు, మాతులుడు, సూనుడు, గురువు, ఆజ్ఞాకరుడు అయినప్పుడు మీ కంటె భాగ్యవంతులుంటారా? సాత్వతపతి నా యెడ ప్రసన్నుడై నన్ను కరుణిస్తాడు గాక!

పరీక్షిన్నరేంద్రా! ధర్మజుడు నారదుని పలుకులకు మహాశ్చర్యానందాలను పొంది వాసుదేవుని పూజించాడు. అంతట నారదుడు కృష్ణుని ధర్మజుని వీడ్కొని దేవలోకానికి వెళ్ళాడు.

మహా మునులారా! శుకమహర్షి ఆ విధంగా దేవాసుర మనుష్యాది సకల చరాచర ప్రపంచ ప్రవర్తకాలైన దక్షకన్యావంశాలను పరీక్షిన్నరేంద్రునికి వివరించి అతనికి సంతోషాన్ని కలిగించాడు.

# అష్టమ స్కంధము

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకయోగి పలుకులను విని, 'మహాత్మా! స్వాయంభువ మనువంశాన్ని, చాతుర్వర్ణ్య ధర్మాలను, విశ్వసృష్టి విశేషాలను వినిపించారు. ఈ కల్పంలో ఎన్ని మన్వంతరాలు ఉన్నాయి? ఎన్ని మన్వంతరాలు గడిచాయి? ఇప్పుడే మన్వంతరం జరుగుతున్నది? ఏయే మన్వంతరాలలో భగవానుడు ఏయే అవతారాలను ధరించి ఏయే కార్యాలను నెరవేర్చాడు? వాటన్నిటినీ వినాలని కుతూహలంగా ఉన్నది' అని అడిగాడు. అతనితో శుకమహర్షి ఇలా అన్నాడు.

## మన్వంతరాలు

'రాజేంద్రా! కల్పమంటే బ్రహ్మకు ఒక్క పగటికాలం. ఆ కాలంలో పధ్నాలుగు మన్వంతరాలు, పదిహేను మన్వంతర సంధియుగాలు గడుస్తాయి. ఇవన్నీ కలిసి వేయి మహాయుగాలవుతాయి. 1. స్వాయంభువ 2. స్వారోచిష 3. ఉత్తమ 4. తామస 5. రైవత 6. చాక్షుష 7. వైవస్వత 8. సావర్ణి 9. దక్షసావర్ణి 10. బ్రహ్మసావర్ణి 11. ధర్మసావర్ణి 12. భద్రసావర్ణి 13. దేవసావర్ణి 14. ఇంద్రసావర్ణి ఈ సమయంలో మనువులై విలసిల్లుతారు. ప్రస్తుత కల్పంలో ఇప్పటికి ఆరు మన్వంతరాలు గడిచి ఏడవ మన్వంతరం వైవస్వత మన్నది ప్రవర్తిల్లుతున్నది. వైవస్వతంలో ఇప్పటికి 27 మహాయుగాలు

గతించి 28-వ మహాయుగంలో సత్య త్రేతా ద్వాపరాల తర్వాత కలియుగం ప్రారంభమై, ఇప్పుడు నడుస్తున్నది.

భగవానుడు స్వాయంభువ మన్వంతరంలో కపిలావతారం, యజ్ఞావతారాలను ధరించాడు. స్వారోచిష మన్వంతరంలో విభువనే అవతారమెత్తాడు. ఉత్తమ మన్వంతరంలో సత్యసేనావతారం, తామస మన్వంతరంలో హరి అవతారం, రైవత మన్వంతరంలో వైకుంఠావతారం, చాక్షుష మన్వంతరంలో కూర్మావతారం, వైవస్వత మన్వంతరంలో వామనావతారం ధరించాడు. ఇక జరుగనున్న సావర్ణి మన్వంతరంలో సార్వభౌమావతారం, దక్షసావర్ణి మన్వంతరంలో ఋషభావతారం, భద్రసావర్ణి మన్వంతరంలో సత్యతాపసావతారం, దేవసావర్ణి మన్వంతరంలో దైవహౌత్ర్యవతారం, ఇంద్రసావర్ణి మన్వంతరంలో బృహద్భానువు అవతారం కలుగుతాయి.

## 1. స్వాయంభువ మనువు - అవతారకార్యాలు

రాజేంద్రా! స్వాయంభువ మన్వంతరంలో భగవానుడు దేవహూతి గర్భాన కపిలుడనే పేర జన్మించి ధర్మజ్ఞానాలను లోకానికి ఉపదేశించాడని చెప్పాను.

## యజ్ఞావతారం

నరేంద్రా! స్వాయంభువ మనువు బహుదీర్ఘకాలం రాజ్యపాలన చేసి కామభోగవిరక్తుడై రాజ్యత్యాగం కావించి భార్య అయిన శతరూపతో బయలుదేరి తపోవనం చేరి సునంద చెంత ఒంటికాలిపై నిలిచి తీవ్రతపస్సు మొదలుపెట్టి సమాధినిష్ఠుడయ్యాడు. 'ఎవడు సర్వశరీరాలలో అనన్యగోచరుడై ఉంటాడో, ఎవని మూలాన విశ్వానికి చైతన్యం కలుగుతున్నదో, ఎవనికి అన్యముల వలన చైతన్యం కలగదో, జగమంతా నిద్రావివశమైనప్పుడు కూడా ఎవడు తానుమాత్రం మేలుకొని ఉంటాడో, ఎవడు నిరంతరం లోకాలను రక్షిస్తుంటాడో, జగత్తు ఎవని ఉనికిని ఎరుగలేకున్నదో, ఎవని సత్తాచైతన్యాలు జగద్రూపంలో వ్యాప్తిగాంచాయో, ఎవనికి ఆద్యంతాలు గాని స్వపర భేదాలు

గాని బహిరంతరాలు గాని కలుగవో, ఎవడు తానే విశ్వకర్త విశ్వశరీరుడు అయినా నిరీహునిగా ఉంటాడో, ఎవని మార్గానుసారం ఋషులు స్వధర్మాలను నైష్కర్మ్యబుద్ధితో ఆచరించి కర్మముక్తులై ఆ రహస్యాన్ని లోకానికి తెలియజెప్పారో, ఎవడు పరిపూర్ణుడు నిష్కాముడు అయి లోకమార్గదీపనార్థం అవతరించి స్వధర్మాన్ని స్వయంగా నడిపి నరులకు సర్వధర్మ శిక్షకుడైనాడో, ఎవ డనుగ్రహించినది ఎంతైతే అంతటితో మనము తృప్తిచెందవలసి ఉంటుందో, ఆ సర్వరక్షకునికి పురాణునికి అనంతనామకునికి ప్రణామం, అని మంత్రోపనిషద్వచనాలను స్మరిస్తూ నూరేళ్ళు ధ్యానిస్తూ ఉండిపోయాడు.

ఆ సమయాన అసురులు, యాతుధానులు క్షుధార్తులై సమాధినిష్ఠలో ఉన్న స్వయంభువును భక్షించాలని వచ్చారు. భగవానుడు వారి దుష్టభావాన్ని చూసి ఆకూతి గర్భంలో యజ్ఞమూర్తియై జన్మించి తన సుతులైన యామాదులతో అక్కడికి వచ్చి ఆ దుష్టులను సంహరించి త్రిదివాన్ని పరిపాలించాడు.

## సప్తఋష్యాదులు

రాజేంద్రా! ప్రతి మన్వంతరంలోనూ ఋష్యాదులు వేర్వేరుగా ఉంటారు. స్వాయంభువుడు మనువుగా ఉన్నప్పుడు ప్రియవ్రతోత్తానపాదులు మనుసుతులు గాను, యామాదులు దేవతలు గాను, మరీచిప్రముఖులు సప్తర్షులు గాను ఉన్నారు. భగవదవతారమైన యజ్ఞుడు దేవేంద్రునిగా ఉన్నాడు.

## 2. స్వారోచిషమనువు – విభువు అవతారం

నరేంద్రా! అగ్నికుమారుడు స్వారోచిషుడు రెండవ మనువై భూతలాన్ని పరిపాలించాడు. అతనికి ద్యుమంత సుషేణ రోచిష్మంతులని ముగ్గురు కొడుకులున్నారు. ఊర్జస్తంభాదులు సప్తర్షులుగా, తుషితాదులు సురలుగా, రోచనుడు ఇంద్రునిగా నెలకొన్నారు.

ఆ మనువు కాలంలో భగవానుడు వేదశిరసునికి తుషతయందు విభుడనే పేర అవతరించి కౌమారబ్రహ్మచారియై ఎనభైఅయిదుమంది

మునుల వలన ఆ వ్రతాన్ని ఆచరింపజేసి దానిని నెలకొల్పాడు.

## 3. ఉత్తముడు – సత్యసేనావతారం

రాజా! ప్రియవ్రతునికి ఉత్తముడనే సుతుడు జన్మించి మూడవ మనువయ్యాడు. అతనికి ముగ్గురు కొడుకులు – భావనుడు సృంజయుడు యజ్ఞహోత్రుడు పుట్టారు. ఆ మనువు కాలంలో వసిష్ఠుని సుతులు ప్రమాదాదులు సప్తర్షు లైనారు. సత్యదేవ శ్రుతభద్రులు దేవతలుగా, సత్యజితుడు ఇంద్రునిగా ఉన్నారు.

ఉత్తముని కాలంలో యక్షరాక్షసులు దారితప్పి అసత్యవ్రతులు, దుశ్శీలురు, దుర్వర్తనులు కావటం మూలాన భూతగణం భూతద్రోహం చేయసాగింది. అప్పుడు భగవానుడు ధర్మునికి సూనృతయందు సత్యసేనుడనే పేర అవతరించి సత్యవ్రతం అనుష్ఠించి సత్యజితునికి సుఖాన్ని కూర్చి ఆ దుష్టులందరినీ సంహరించాడు.

## 4. తామసుడు – హర్యవతారం

రాజా! ఉత్తమునికి తామసుడనే సోదరుడున్నాడు. అతను నాల్గవ మనువయ్యాడు. అతనికి వృషాఖ్యాతి, నరుడు, కేతువు మొదలైనవారు పదుగురు పుత్రులు జన్మించారు. త్రిశిఖునికి ఇంద్రపదవి లభించింది. జ్యోతిర్వ్యోమాదులు సప్తర్షులైనారు. పూర్వం వేదరాశి నశించినప్పుడు విధృతి తనయులు వైధృతులు తమ తేజస్సులో దానిని ధరించారు. వారిప్పుడు సురవాసాన్ని చేరుకొన్నారు. ఈ తామసుని మన్వంతరంలో భగవానుడు హరిమేధసునికి హరిణ యందు హరి అనుపేరిట అవతరించి మకరగ్రస్తుడై చావనున్న గజేంద్రుని రక్షించాడు.

## 5. రైవతుడు – వైకుంఠావతారం

రాజేంద్రా! తామసుని అనంతరం అతని సోదరుడు అయిదవ మనువు అయ్యాడు. అతనికి అర్జున ప్రతివింధ్యాదులు సుతులైనారు. విభుడు

ఇంద్రుడైనాడు. భూతదయాదులు అమరులయ్యారు. హిరణ్య, రోమ, వేదశిర, ఊర్ధ్వబాహు ప్రముఖులు సప్తర్షులయ్యారు.

ఆ మన్వంతరాన భగవానుడు శుభ్రుడనే అతనికి వికుంఠయందు వైకుంఠులనే సురోత్తములతో నిజాంశతో వైకుంఠు డనేపేర అవతరించాడు. వైకుంఠాన్ని నిర్మింపమని రమాదేవి అతనిని ప్రార్థించింది. భగవానుడామె కోర్కెను నెరవేర్చి ఆమెను సంతోషింపజేశాడు.

## 6. చాక్షుషుడు – కూర్మావతారం

చక్షుస్సుని పుత్త్రుడు చాక్షుషుడు ఆరవ మనువయ్యాడు. అతనికి పురువు, పురుషుడు, సుద్యుమ్నుడు మొదలైనవారు జన్మించారు. మంత్రద్యుమ్నుడు ఇంద్రుడయ్యాడు. ఆప్యాదులు సురలైనారు. హవిష్మద్వీరకాదులు సప్తర్షులయ్యారు.

ఆ మన్వంతరంలో భగవానుడు వైరాజునికి సంభూతియందు అజితుడనే పేర అవతరించాడు. చాక్షుషుని కాలంలోనే క్షీరసాగర మథనం సంభవించింది. ఆ పాలకడలిని మథించటానికి మందరగిరిని కవ్వంగా సంతరించారు. ఆ పర్వతం మహాభారవంత మైనందువల్ల సముద్రంలో క్రుంగిపోసాగింది. అప్పుడు భగవానుడు కూర్మమై ఆ మంథాన పర్వతాన్ని మూపున నిలిపాడు. దేవతలు దుగ్ధాబ్ధిని మథించారు. అందుండి అమృతం ఉద్భవించింది. ఆ సుధను భగవానుడు దేవతలకు ఇచ్చాడు.

## 7. వైవస్వతుడు – వామనావతారం

రాజా! వివస్వంతుని పుత్త్రుడు వైవస్వతుడు ఏడవ మనువయ్యాడు. అతనికి శ్రాద్ధదేవుడని కూడా పేరున్నది. అతని మన్వంతరం ఇప్పుడు జరుగుతున్నది.

వైవస్వతునికి ఇక్ష్వాకుడు, నృగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశుడు, పృషధ్రుడు, వసుమంతుడు అని పదిమంది పుత్త్రులు. పురందరుడు ఇంద్రుడు. వసువు, రుద్రుడు, ఆదిత్యుడు, విశ్వదేవుడు,

నాసత్యుడు, మరుత్తు సురలయ్యారు. కశ్యపుడు, అత్రి, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు సప్తర్షులు. భగవానుడు కశ్యపునికి అదితియందు వామనరూపాన్ని ధరించి అవతరించాడు.

## 8. సావర్ణి – సార్వభౌమావతారం

రాజా! విశ్వకర్మకు సంజ్ఞ, ఛాయ అని ఇద్దరు కుమార్తెలు జన్మించి వివస్వంతుని భార్యలయ్యారు. వివస్వంతునికి బడబ అనే మూడవ భార్య కూడా ఉన్నదంటారు. సంజ్ఞకు యముడు, యమి, శ్రాద్ధదేవుడు జనించారు. ఛాయకు సావర్ణి, తపతి, శనైశ్చరుడు కలిగారు. బడబకు అశ్వినులు ఉదయించారు. సావర్ణి ఎనిమిదవ మనువు కానున్నాడు.

సావర్ణికి నిర్మోహ విరజస్కాదులు పుత్రులవుతారు. సుతపసులు విరజులు అమృతప్రభువులు సురలుగా, విరోచనసుతుడు బలి ఇంద్రుడుగా ఉంటారు. గాలవుడు, దీప్తమంతుడు, పరశురాముడు, అశ్వత్థామ, ఋశ్యశృంగుడు, నా తండ్రియైన బాదరాయణుడు సప్తర్షులవుతారు. వీరందరూ ఇప్పుడు ఆత్మయోగనిష్ఠులై తమ తమ ఆశ్రమాలలో ఉన్నారు.

ఆ మన్వంతరంలో హరి వేదగుహ్యా అయిన సరస్వతి యందు సార్వభౌముడనే పేర అవతరించి ఇంద్ర పదాన్ని పురందరుని నుంచి తీసి బలికి ఇస్తాడు. పూర్వం భగవానుడు వామనమూర్తి ధరించి బలిచక్రవర్తిని మూడడుగుల నేల అడిగాడు. బలి అతనికి భూలోక మంతటినీ సమర్పించాడు. ఆ దానఫలంగా బలికి ఇంద్రలోక పదవి రానున్నది. బలి ఇప్పుడు సుతల లోకంలో ఉన్నాడు.

## 9. దక్షసావర్ణి – ఋషభావతారం

వరుణుని పుత్రుడు దక్షసావర్ణి తొమ్మిదవ మనువు. ధృతకేతువు, దీప్తికేతువు మొదలైన వారతనికి పుత్రులుగా జన్మిస్తారు. పర మరీచి గర్గాదులు సురలుగా, అద్భుతుడు ఇంద్రునిగా, ద్యుతిమంతాదులు సప్తర్షులుగా ఉంటారు. ఆయుష్మంతునికి అంబుధార వలన ఋషభు డనేపేర భగవానుడు

అవతరించి అద్భుతునికి త్రైలోక్యలక్ష్మిని అనుగ్రహిస్తాడు.

## 10. బ్రహ్మసావర్ణి – వైశ్వసృడవతారం

ఉపశ్లోకుని సుతుడు బ్రహ్మసావర్ణి దశమ మనువుగా జన్మింపనున్నాడు. అతనికి భూరిషేణుడు మొదలైనవారు పుత్రులవుతారు. విబుధాదులు సురలుగా, శంభుడు ఇంద్రునిగా, హవిష్మంతుడు మున్నగు వారు సప్తర్షులుగా ఉంటారు. భగవానుడు తన అంశాంశతో విశ్వసృజునికి విషూచియందు జనించి ఇంద్రునిగా ఉంటాడు. శంభునికి శక్తినిస్తాడు.

## 11. ధర్మసావర్ణి – ధర్మసేతునామావతారం

ధర్మసావర్ణి పదకొండవ మనువు అవుతాడు. అతనికి సత్యధర్మాదులు పదిమంది సుతులు ఉదయిస్తారు. విహంగమాదులు సురలుగా, వైధృతుడు ఇంద్రునిగా, అరుణాదులు సప్తర్షులుగా ఉంటారు. భగవానుడు సత్యతపసునికి సూనృతయందు నిజాంశతో సూర్యునికి ధర్మసేతువనే పేరిట జన్మించి వైధృతునికి త్రైలోక్య సామ్రాజ్యాన్ని ఇస్తాడు.

## 12. భద్రసావర్ణి – సత్యతాపసావతారం

భద్రసావర్ణి పన్నెండవ మనువు అవుతాడు. అతనికి దేవమతాదులు కుమారులవుతారు. ఋతధాము డింద్రుడుగా, వరితాదులు సురలుగా, తపోమూర్త్యాదులు సప్తర్షులుగా ఉంటారు. భగవానుడు సత్యతపసునికి సూనృత యందు నిజాంశతో అవతరించి సత్యతాపసుడనే పేర చెన్నొంది ఆ మన్వంతరాన్ని సాధిస్తాడు.

## 13. దేవసావర్ణి – దైవహౌత్ర్యవతారం

దేవసావర్ణి పదమూడవ మనువు అవుతాడు. అతనికి విచిత్రసేనాదులు సుతులవుతారు. సుకర్మాదులు సురలుగా, దివస్పతి ఇంద్రుడుగా, నిర్మోహ తత్త్వదర్శనాదులు సప్తర్షులుగా ఉంటారు. భగవానుడు దేవహోత్రునికి బృహతి యందు దైవహౌత్రి అనుపేర జనించి దివస్పతికి సంపదలను కలిగిస్తాడు.

## 14. ఇంద్రసావర్ణి - బృహద్భానువ్వవతారం

ఇంద్రసావర్ణి ఈ కల్పానికి కడపటి మనువు. అతనికి గంభీరాదులు సుతులవుతారు. పవిత్రాదులు సురలు, శుచి ఇంద్రుడు, అగ్నిబాహ్వాదులు సప్తర్షులు అవుతారు. భగవానుడు సత్రాయణుడనే సత్పురుషునికి బృహద్భాను డనేపేర అవతరించి కర్మ విధానాలను విస్తరిస్తాడు.

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి పలుకులను విని, 'మహాత్మా! తామస మన్వంతరంలో కరి మకరులకు పోరు కలిగినప్పుడు భగవానుడు వారి పోరు తీర్చి గజేంద్రుని రక్షించాడని తెలిపారు. కరి మకరులకు పోరెందుకు కలిగింది? ఆ పోరును భగవానుడు ఏ విధంగా తీర్చి గజేంద్రుని రక్షించాడు? మునీంద్రా! ప్రాయోపవేశం చేశాను. శ్రీహరి చరిత్రలను విని తరించటం కంటె వేరొక కార్యం నాకు కలుగదు' అని విన్నవించాడు. శుకమహర్షి వివరించాడు.

# గజేంద్రమోక్షఘట్టం

## త్రికూటపర్వతం

రాజేంద్రా! క్షీరసముద్రాంతరంలో త్రికూటమనే పర్వతం ఉన్నది. అది పదివేల యోజనాల నిడుపు, అంతటిదే వెడల్పు కలిగిన మహాశైలం. ఆ మహాద్రికి రత్నధాతుమయ విచిత్ర శిఖరాలు అనేకం ఉన్నాయి. వాటిలో సువర్ణ శిఖరం, రజత శిఖరం, అయశ్శిఖరం ప్రసిద్ధమైనవి. ఆ మూడు శిఖరాలను బట్టి ఆ పర్వతానికి త్రికూటమని పేరువచ్చింది.

ఆ నగరాజం పాలకడలి మధ్యభాగంలో ఉండటం వల్ల సాగరవీచికలు ఎల్లవేళల ఆ కొండ అడుగు భాగాన్ని తాకుతూ, క్షీరసాగరుడు తన కల్లోలమాలికలతో ఆ పర్వతరాజు పాదాలను ప్రక్షాళిస్తున్నట్లుగా చూడ ముచ్చటగా ఉంటుంది. ఆ గిరియందలి మరకతమణుల దీప్తికి పరిసర భూభాగమంతా శ్యామలమై సందర్శకుల కోసం పచ్చని పట్టుకంబళులు పరిచినట్లు కానవస్తుంటుంది. సిద్ధచారణ గంధర్వులకు, విద్యాధర

మహోరగులకు, కిన్నరాప్సరోరత్నాలకు ఆ నగకందర ప్రదేశాలు క్రీడానిలయాలై సంగీతనాదాల ప్రతిధ్వను లీనుతూ శోభిల్లుతుంటాయి. ఆ ప్రతిధ్వనులను గుహాంతర సింహాలు విని ప్రతిసింహగర్జనలుగా భావించి మళ్ళీ గర్జనలు చేస్తుంటాయి.

ఆ నగేంద్రం నానావనమృగవ్రాతసంకుల జలాశయసమలంకృతమై విచిత్ర ద్రుమసురోద్యానాలతో మనోహరంగా విలసిల్లుతుంటుంది. అందలి సరస్సులు స్వచ్ఛజలాలతో నిండి రత్నమణిశోభితాలైన ఇసుకమేటలతో, వన్నెలద్దిన తిన్నెలతో మనోహరంగా భాసిల్లి స్నానార్థం వచ్చిన సురసుందరీమణుల మైపూత గంధవాసనలతో పరవశింపజేసే నునుగాడ్పులకు చిరుకెరటాల నీనుతూ నెత్తావులను వెదజల్లుతుంటాయి.

## ఋతుమంతవనం

ఆ పర్వతద్రోణితలాన ఋతుమంత మనే వరుణోద్యానవనం ఉన్నది. అది నిరంతర పుష్పఫలభరితమైన మందార పారిజాత పాట లాశోక చంపక చూత ప్రియాళు పనసామ్ర క్రము కామ్రాత నారికేళ ఖర్జూర బీజ పూరక మధూక సాల తాల తమాల రస నార్జు నోదుంబ రారిష్ట ప్లక్ష వట కింశుక చందన పిచుమంద కోవిదార సరళ సురదారు ద్రాక్షేక్షు రంభా జంబూ బదర్యక్షా భయామల బిల్వ కపిత్థ జంబీర భల్లాతక వృక్షాక్రాంతమై పొదయెండలకు కూడా వలనులేక అమరీమణీ విహారమనోహరమై అలరారుతున్నది.

ఆ ఉద్యాన వనాంతరాన విశాలమైన సరోవరం ఒకటున్నది. అది కనక కమలాలతో కుముదోత్పల కల్హారాలతో నిండి పూదేనెలను కురిపిస్తుంటుంది. తుమ్మెదలు ఆ తేనెలను గ్రోలి మైమరచి కావించే ఝుంకార గీతాలు, శకుంత మధుర రుతాలు, హంస కారండవ చక్రవాక సారస జలకుక్కుట కోయష్టికాదుల కలకలకూజితాలు వీనులకు విందు చేస్తుంటాయి. ఆ కొలను నీరు తదంతర మత్స్య కచ్ఛపాది సంచార చలితాలైన పద్మాల నుంచి జారిన పుప్పొడుల వలన అపూర్వరుచిరమై ఎంత గ్రోలినా తనివి తీరని మాధుర్యాన్ని కలిగినది. ఆ సరోవర తీరాలు కుంద కురవ కాశోక శిరీష కుటజేంగుద కుబ్జక

స్వర్ణయూథి నాగ పున్నాగ మాలతీ మల్లికా మాధవీ జాలకాది లతా పాదప సమాకీర్ణాలై లక్ష్మీ నివాస మన్నంత దర్శనీయంగా ఉంటాయి.

## గజేంద్రుడు

రాజా! ఆ వనాంతరంలో ఒక గజరాజు నివసించేవాడు. అతను వేసవికి వేగి ఒకనాడు తోడి గజయూథాన్ని వెంటబెట్టుకొని కంటక కీచక వేణు వేత్ర నిబిడమై విశాల గుల్మ సంకీర్ణంగా ఉన్న ఆ కాననంలో విహరింపసాగాడు. ఆ కరిరాజు గాలిసోకి వ్యాఘ్ర ఖడ్గ చమరీ శరభాదులే కాక సింహాలు కూడా భయపడి పారిపోయాయంటే ఇక క్షుద్రమృగాల సంగతి వేరే చెప్పాలా?

నరేంద్రా! ఆ ఏనుగుల గుంపు ఆ విధంగా విహారపరమై అడ్డువచ్చిన చెట్లన్నిటినీ విరిచివేస్తూ కొంతసేపు సంచరించి దప్పిగొన్నది. అంతలో కమలసౌరభ సుభగ శీతవాతం వీచింది. ఆ ఏనుగురాయడు ఆ సడిని బట్టి తోడి గున్నలతో కలిసి ఆ వలను ప్రయాణించి అక్కడ కొలనొకటున్నదని చూడగానే దాహాతురత వల్ల గబగబ లోనికి దిగి బంగారు తామర పుప్పొడులతో కమ్మగా ఉన్న ఆ నీరాలను తొండంతో దప్పితీరా తాగి ఒంటిపైని జల్లులాడి సేదతీరాక వెంట వచ్చిన కరభ కరేణులకు గృహాసక్తుల వలె స్నాన పానాదులను కూర్చి తాపాన్ని తీర్చి వాటిని మూర్కొని కూర్మి నెరపసాగాడు.

## కరి మకరుల పోరు

రాజా! ఆ కొలనులో ఒక మొసలి చాలా కాలంగా ఉంటున్నది. ఆ ఏనుగు చెంతకు వచ్చి కాలుపట్టి లోపలికి లాగసాగింది. మొసలి పట్టును విడిపించుకొనేందుకు గజేంద్రుడు తన శక్తినంతటినీ వినియోగించాడు. ఫలం లేకపోయింది. తోడి ఏనుగులు కూడా గుమిగూడి తమ నాయకుని బయటికి లాగేందుకు సర్వప్రయత్నాలు చేసి చూశాయి. ఆ యత్నమూ నిష్ఫలమయింది. అవన్నీ కలిసి ఆక్రోశింపసాగాయి.

రాజా! మొసలి లోపలికి ఈడుస్తుంది; ఏనుగు బయటపడాలని ప్రయత్నిస్తుంది. ఈ లాగులాటలు కరిమకరులకు మహాఘోరంగా వేయి

సంవత్సరాలు జరిగాయి. ఆ పోరుచూసి సురలు కూడా ఆశ్చర్యపడ్డారు. కాలక్రమాన గజరాజుకు శరీరబలం, ఇంద్రియ పాటవం సన్నగిల్లాయి. ఉత్సాహం తగ్గిపోయింది. మకరం బలోత్సాహంతో విజృంభించింది. గజేంద్రునికి దిక్కుతోచక –

**శా. ఏ రూపంబున దీని గెల్తు? నిట మీఁ దే వెంటఁ జింతింతు? నె**
**వ్వారిం జీరుదు? నెవ్వ రడ్డ మిఁక? ని వ్వారిప్రచారోత్తమున్**
**వారింపం దగువార లెవ్వ? రఖిలవ్యాపార పారాయణుల్**
**లేరే? మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.**

అని చింతింపసాగింది. గజేంద్రునికి మదం ఉడిగి అహంకార స్వాతంత్ర్య భావం సడలినంతనే అతనికి పూర్వజన్మాభ్యాసం స్ఫురించింది. అతనంతట ఏకాగ్రమతియై –

**ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై**
**యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం**
**బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైన వాఁ**
**డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.**

**క. ఒకపరి జగముల వెలి నిడి**
**యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై**
**సకలార్థసాక్షి యగు న**
**య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్.**

**క. లోకంబులు లోకేశులు**
**లోకస్థులుఁ దెగిన దుది నలోకంబగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం**
**డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.**

**క. నర్తకుని భంగి బె క్కగు**
**మూర్తులతో నెవ్వఁ డాడు మునులును దివిజుల్**

గీర్తింప నేర రెవ్వని
వర్తన మొరు లెఱుంగ రట్టివాని నుతింతున్.

ఆ. ముక్తసంగులైన మునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుమతులు
నసదృశవ్రతాఢ్యు లై కొల్తు రెవ్వని
దివ్యపదము; వాఁడు దిక్కు నాకు.

సీ. భవము దోషమును రూపంబుఁ గర్మంబు నా
హ్వాయములు గుణము నెవ్వనికి లేవు
జగములఁ గలిగించు సమయించుకొఱకునై
నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు

ఆ పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికినిఁ
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటలను నెఱుకల మనములఁ జేరంగ
గాని శుచికి సత్యగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైన వాని నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు.

సీ. శాంతున కపవర్గసౌఖ్యసంవేదికి
నిర్వాణభర్తకు నిర్విశేషు
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి
సౌమ్యున కధిక విజ్ఞాననిధికి

నఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రి
య జ్ఞాపకునకు దుఃఖాంతకృతికి

ఆ. నెఱి నసత్య మనెడి నీడతో వెలుగుచు
నుండు నెక్కటికి మహోత్తరునకు
నిఖిల కారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచు కొఱకు.

క. యోగాగ్ని దగ్ధ కర్ములు
యోగీశ్వరు లే మహాత్ము నొండెఱుఁగక స
ద్యోగవిభావిత మనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్.

సీ. సర్వాగ మామ్నాయజలధికి నపవర్గ
మయునికి నుత్తమమందిరునకు
సకల గుణారణిచ్ఛన్న బోధాగ్నికిఁ
దనయంత రాజిల్లు ధన్యమతికి
గుణలయోద్దీపిత గురుమానసునకు సం
వర్తిత కర్మ నిర్వర్తితునకు
దిశలేని నా బోఁటి పశువుల పాపంబు
లడచువానికి సమస్తాంతరాత్ముఁ

ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ
వంతునకుఁ దనూజ పశుఁనివేశ
దార సక్తులయినవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు.

సీ. వరధర్మ కామార్థ వర్జిత కాములై
విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు; చేరి కాంక్షించువారి క
వ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ

ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు
రానంద వార్ధి మగ్నాత్ము లగుచు

నేకాంతు లెవ్వాని నేమియుఁ గోరక
భద్రచరిత్రంబుఁ బాడుచుందు

ఆ. రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగ గమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మ మైనఁ వానిఁ బరుని నతీంద్రియు
నీశు దూరు సూక్ష్ము నే భజింతు.

సీ. పావకుం దర్చుల భానుండు దీప్తుల
నెబ్భంగి నిగిడింతు రె ట్లడంతు

రా క్రియ నాత్మకరావళి చేతఁ బ్ర
హ్మాదుల వేల్పుల నఖిలజంతు

గణముల జగముల ఘననామరూప భే
దములతో మెఱయించి తగ నడంచు

నెవ్వఁడు మనము బుద్ధీంద్రియములుఁ దాన
యై గుణసంప్రవాహంబు నెఱపు

తే. స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక
తిర్యగమర నరాది మూర్తియును గాక
కర్మగుణభేద సదసత్ప్రకాశి గాక
వెనుక నన్నియుఁ దానగు విభుఁ దలంతు.

క. కలఁ డందురు దీనుల యెడఁ
గలఁ డందురు పరమయోగిగణముల పాలం
గలఁ డందు రన్ని దిశలను
గలఁడు కలం డనెడివాఁడు గలఁడో లేఁడో.

**సీ. కలుగఁడే నా పాలి కలిమి సందేహింపఁ**
**గలిమిలేములు లేక కలుగువాఁడు**

**నా కడ్డపడరాఁడె నలిన సాధువులచేఁ**
**బడిన సాధుల కడ్డపడెడువాఁడు**

**చూడడే నా పాటుఁ జూపుల జూడక**
**చూచువారలఁ గృపఁ జూచువాడు**

**లీలతో నా మొఱాలింపఁ డే మొఱఁగుల**
**మొఱ లెఱుంగుచు దన్ను మొఱఁగువాఁడు**

**తే. అఖిల రూపముల్ దన రూప మైనవాఁడు**
**నాదిమధ్యాంతములు లేక యడరువాఁడు**
**భక్తజనముల దీనుల పాలివాఁడు**
**వినఁడె చూడఁడె తలపఁడె వేగ రాఁడె.**

**క. విశ్వకరు విశ్వదూరుని**
**విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మప్రభు**
**నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్.**

రాజా! గజేంద్రునికి అంతలో సర్వ శక్తులు సన్నగిల్లాయి. అతను నింగివంక చూపు నిలిపి –

**శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్**
**నీవె తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్**
**రావే? యీశ్వర! కావవే? వరద! సంరక్షింపు భద్రాత్మకా!**

అని ప్రార్థించాడు.

రాజా! గజేంద్రుని ప్రార్థన నిర్విశేష బ్రహ్మాన్ని గూర్చినది కావటం వలన మూర్తిభేదం స్ఫురింపలేదు. ఆ ప్రార్థనను బ్రహ్మాదిమూర్తులు విని కూడా 'ఇతను నన్ను ప్రార్థింపలేదు; ఇతను నన్ను ప్రార్థింపలేదు' అనుకొని త్రిమూర్తులలో ఎవ్వరూ అతని విన్నపాన్ని మన్నింపక ఊరుకొన్నారు. అప్పు డఖిలాత్ముడైన భగవానుడు ఆ దీనాలాపాలను ఆలకించి క్షణకాలం జాగుచేసినా అతనికి ప్రమాదం వాటిల్లనున్నదని గ్రహించి

**మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే**
**పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తర ధమ్మిల్లము జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీ కుచో**
**పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.**

గరుత్మద్రథాన్ని అధిరోహించి హుటాహుటి వచ్చి గజేంద్రుని ఎట్టయెదుట గగనతలాన నిలిచాడు. కరినాయకుడు చక్రాన్ని చేతబట్టి తన కన్నులముందు నిలిచిన ఆ దివ్యమూర్తిని చూసి బలహీనత వల్ల మెల్లగా తొండంతో ఒక కమలాన్ని ఒడిసిపట్టి పైకెత్తి 'నారాయణాఖిలగురో భగవ న్నమస్తే' అని ఆ పద్మాన్ని స్వామి పాదాల చెంతకు విసిరివేశాడు.

ఆ విధంగా కష్టస్థితిలో ఉన్న అతనిని భగవానుడు కనికరించి గరుడుని మూపునుండి దిగివచ్చి కొలనులో ఉన్న మొసలిని వెలికి లాగి దాని శిరస్సును సుదర్శనాయుధంతో ఖండించి గజరాజును రక్షించాడు. ఆ అద్భుతకార్యాన్ని ఋషులు ప్రశంసించారు. దేవదుందుభులు మ్రోగాయి. సిద్ధచారణులు కీర్తించారు.

రాజా! మకరరాజు ఆ విధంగా చక్రహతుడై ఆ మొసలి శరీరాన్ని విడిచి గంధర్వ రూపాన్ని ధరించి శిరస్సు నేలసోకగా మోకరిల్లి, 'దేవాధీశా! నేను తొలుత హూహూ నామక గంధర్వుడనై ఉన్నప్పుడు ఒకనాడు గంధర్వాంగనలతో జలక్రీడ లాడుతుండగా దేవలమహర్షి తీర్థార్థం వచ్చి ఆ కొలనులో మునిగాడు. హేళనార్థం నేనతనిని కాలుపట్టి యీడ్చాను. నా

అకార్యానికి మునీంద్రుడు కోపించి, 'మూర్ఖుడా! మొసలి పని చేశావు కాబట్టి మొసలివే అవుతావు గాక' అని శపించాడు. శాపాంతం చెప్పమని ప్రార్థించాను. ఆ దయానిధి నా మొర విని జాలిపడి, 'గంధర్వా! నీవు మొసలివై కొలనులో ఉండగా ఒక గజపతి అక్కడికి వస్తాడు. నా వలెనే అతనిని కూడా నీవు కాలుపట్టి యీడ్చి బాధిస్తావు. అతను దిక్కుతోచక భగవానుని ప్రార్థిస్తాడు. పరమేశ్వరుడు వచ్చి అతనిని రక్షిస్తాడు. అది నిమిత్తంగా నీకు శాపమోక్ష మవుతుంది' అని పలికాడు. స్వామీ! ఆ ప్రకారమే ఇప్పుడు జరిగింది అని చెప్పి ప్రదక్షిణ చేసి ప్రభుని అనుమతి గైకొని వెళ్ళిపోయాడు.

## గజేంద్రుని పూర్వవృత్తాంతం

రాజా! ఆ గజేంద్రుడు పూర్వ జన్మలో ఇంద్రద్యుమ్నుడనే పాండ్యుడు. ద్రవిడ సత్తముడు. విష్ణుపరాయణవ్రతునిగా ఉండేవాడు. తపస్సు కోసం అతను మలయాద్రికి పోయి ఆశ్రమం నిర్మించుకొని తపోవ్రతుడై ఒకనాడు తీర్థమాడివచ్చి జపపరుడై మౌనవ్రతం పూని భగవానుని పూజిస్తుండగా అగస్త్యమునీంద్రుడు శిష్యులతో యాదృచ్ఛికంగా అక్కడికి వచ్చాడు. ఇంద్రద్యుమ్నుడు పూజాపరత వల్ల ఆ వచ్చిన ఋషికి పూజలు కావింపక మిన్నకున్నాడు. అగస్త్యుడు అతని ఉదాసీనవర్తనకు ఆగ్రహించి, 'దురాత్ముడా! నీ బుద్ధి సుశిక్షితం కాదా? సాధుత్వాన్ని పాటింపవా? ఏనుగు వలె మొద్దువై ఉంటావేమిటి? బ్రాహ్మణావమానం చేయతగునా? నీ యీ అకార్యఫలంగా గజ జన్మమెత్తి తమోమూర్తివై ఉంటావు గాక' అని శపించి శిష్యులతో యథేచ్ఛగా వెళ్ళిపోయాడు.

ఇంద్రద్యుమ్నుడు తన శాపం విధి విధానమని తలపోసి కుంజర జన్మనెత్తాడు. అయినా అతనికి పూర్వజన్మ మందలి భగవత్ స్మృతి సుస్థిరమై సమయం రాగానే ప్రతిఫలించింది. తత్ఫలంగా అతనప్పుడు ఆ విధంగా భగవంతునికి సర్వాత్మ సమర్పణ కావించటమూ, తదనుగ్రహ పాత్రుడై జీవించటమూ జరిగింది.

## గజేంద్రునికి హరిపార్షదత్వం

రాజా! భగవానుడు ఆ విధంగా మకరికి శాపమోక్షం అనుగ్రహించి గజేంద్రుని శిరస్సుపయిని తనచేతి నుంచాడు. ఆ హస్తస్పర్శ కలిగినంతనే గజేంద్రుడు తన అజ్ఞానబంధాన్ని బాసి భగవత్సారూప్యం దాల్చి పీతాంబరుడు చతుర్భుజుడుగా మారి హరిపార్షదునిగా వెలసి, గరుడారూఢుడై నిజలోకానికి తరలిన భగవంతుని అనుగమించాడు. ఆ అద్భుతాన్ని కొనియాడుతూ సుర సిద్ధ గంధర్వాదులు వారిని అనుసరించారు.

పరీక్షిన్నరేంద్రా! భగవదనుగ్రహాన్ని సంపాదించటానికి వేదనము, రోదనము అని రెండు మార్గాలు ఉన్నాయి. వేదనము జ్ఞానపూర్వకం; రోదనము ప్రేమపూర్వకం. బిడ్డలు తల్లి కోసం ఏడ్చినట్లు భక్తులు భగవంతునికై రోదిస్తారు. వేదన పరులకు నెమ్మదిగా ప్రీతిగూర్పవచ్చు. రోదనపరుల యెడ జాగుచేయటం వీలుకాదు. ఏమంటావా? ఆ రోదన మితిమీరి ప్రాణాపాయానికి దారితీయవచ్చు. ఆ కారణం వల్లనే భగవానుడు గజేంద్రుని రోదనం వినీ వినగానే హుటాహుటిని రావటం జరిగింది.

## గజేంద్ర చరిత్ర మాహాత్మ్యం

రాజేంద్రా! గజేంద్రమోక్షమంటే శ్రీకృష్ణ ప్రభావ ప్రదర్శనమే గాని లోకసామాన్య కథ కాదు. ఈ చరిత్రను విన్నవారికి దుస్స్వప్ననాశం, పాపహృతి, యశోవృద్ధి, స్వర్గప్రాప్తి సిద్ధిస్తాయి. శ్రేయస్కాములు ప్రతిదినం ప్రాతఃకాలాన శుచులై దీనిని పఠిస్తారు.

రాజేంద్రా! భగవానుడు ఆ విధంగా గజేంద్రునికి పార్షదపదాన్నిచ్చి, 'గజరాజా! ఎవరు తెల్లవారి నిదురలేచి శుచులై సమాహితబుద్ధితో నన్ను ధ్యానించి నిన్ను, నీ సరోవరాన్ని, గిరిగుహారారణ్యవిలసితమూ వివిధసురతరు సమాకీర్ణమూ మీదుమిక్కిలి బ్రహ్మనివాసమైన ఆ గిరిశిఖరాలను, ఆ నగశిఖరాన ఉన్న శివస్థానమైన నా నికేతాన్ని, క్షీరసాగరాన్ని, నాకు ప్రియప్రదేశమైన శ్వేతద్వీపాన్ని స్మరించి, నేను ధరించే శ్రీవత్స కౌస్తుభ

వనమాలా కౌమోదకీ సుదర్శన పాంచజన్యాలను తలంచి గరుత్మంతుని భావించి, నా అంశభూతుడైన శేషుని, నన్నాశ్రయించి ఉన్న శ్రీదేవిని, నారద ప్రహ్లాద భవ బ్రహ్మలను, మత్స్య కూర్మ వరాహాద్యవతారాలను తలపోసి నేను చేసిన పుణ్యకర్మలను తలపోసి, రవిచంద్రాగ్నులకు మ్రొక్కి, ప్రణవాన్ని సత్యస్వరూపాన్ని సంభావించి, మాయను స్మరించి, గోవిప్రులను ఆత్మగతమొనర్చి, అవ్యయమైన ధర్మాన్ని, ధర్మనిరతులైన దాక్షాయణులను, సోమ కశ్యపుల భార్యలను, గంగా సరస్వతీ నందా కాళిందీ నదులను, ఐరావతాన్ని, ధ్రువుని, సప్తర్షులను, పుణ్యశ్లోకులైన మానవులను స్మరించి, అవన్నీ నా విభూతులుగా విశ్వసించి భక్తిపూర్వకంగా నన్ను స్మరిస్తారో, వారు సర్వపాపవిముక్తు లవుతారు. అనుదినం ప్రభాతవేళ మేల్కొంచి గజేంద్రమోక్షణపూర్వకంగా నన్ను స్తుతించితే ప్రాణావసాన కాలంలో విస్మృతి నొందరు' అని చెప్పి ఆ మాట తప్పదనటానికి నిదర్శనగా పాంచజన్యాన్ని పూరించాడు. రాజా! ఈ చరిత్ర మహిమ ఎంతటిదో నీవే ఊహింపగలవు' అన్నాడు.

## కూర్మావతార చరిత్ర ఘట్టం

మునులారా! గజేంద్ర చరితను విని పరీక్షిన్నరేంద్రుడు పరమానందవివశుడై భగవంతుని ధ్యానించి 'మహాత్మా! భగవల్లీలలను విన్నకొద్దీ మరింత వినాలని కుతూహలం పెరుగుతున్నది. దేవాసురులు క్షీరసాగరాన్ని మథించారని అన్నారు. మథన కారణ మేమిటి? ఏ తీరున మథించారు? భగవానుడు కూర్మావతారమెత్తి మందరాద్రిని ఏ విధంగా మోశాడు? సురలకు అమృతం ఎలా దక్కింది? ఆ అవసరాన ఇంకా ఏయే అద్భుతాలు సంభవించాయి? ఇవన్నీ వినాలని కోరికగా ఉన్నది. నా విన్నపాన్ని మన్నించండి' అన్నాడు. అప్పుడు శుకమహర్షి చెప్పాడు.

## ఇంద్రునికి దుర్వాసశాపం

రాజేంద్రా! పూర్వం దేవేంద్రు డొకనాడు ఐరావత గజాన్నెక్కి వస్తుండగా దుర్వాస మహర్షి ఎదురై అతని కంఠసీమనున్న పూదండను తీసి సురేంద్రునికి

ఇచ్చాడు. అమరేశ్వరుడు సంపద్గర్వోన్నతి వల్ల ఆ పుష్పమాలికను తాను ధరింపక ఏనుగు కుంభస్థలం మీద పడవేశాడు. ఆ గజం దానిని నేలకు విసిరి కాలితో త్రొక్కి నుగ్గునుగ్గు చేసి అవతలికి తోసింది. దుర్వాసుడు తన కట్టెదుటనే జరిగిన అవమానాన్ని చూసి క్రోధంతో కన్నుల వెంబడి నిప్పులు కురిపించి, 'ఇంద్రా! ఇంత అనాదర భావం తగదు. నీవు చూపించిన ఐశ్వర్య గర్వానికి ఫలితంగా నిశ్శ్రీకుడవు అవుతావు గాక' అని శపించి వెళ్లాడు. ఆ శాపఫలంగా యజనాది క్రియలు నశించాయి. దానితో దేవతలకు బలం క్షీణించింది. అది సందుగా దానవులు చెలరేగి సురల మీదికి దండెత్తారు.

## దేవాసుర యుద్ధం

రాజా! దేవదానవులకు ఘోరయుద్ధం జరిగింది. అమరులు చచ్చిపడ్డారు. సురల దుర్గతిని ఇంద్ర వరుణాదులు చూసి చింతాక్రాంతులై ప్రతీకారమార్గం తోచక మేరునగానికి వెళ్ళి నిండు సభలో పేరోలగం తీరి ఉన్న బ్రహ్మకు నమస్కరించి తమ ఆపదలను విన్నవించారు. చతురాస్యుడు వారి మొర విని, 'అయ్యో! ఇంద్రాదులు సత్తువ లేక ద్యుతిని కోల్పోయారు; లోకమంతా అమంగళప్రాయంగా ఉన్నది; అసురులు చెలరేగారు. ఏమిచేస్తే బాగుంటుంది?' అని తలపోసి సమాహితచిత్తుడై పురుషోత్తముని స్మరించాడు. ఆ స్మరణఫలంగా బ్రహ్మకు అంతఃకరణ వికాసం కలిగి విషయం బుద్ధిగ్రస్తమయింది.

## దేవతల శరణాగతి

అంత బ్రహ్మదేవుడు బహిర్ముఖుడై, 'దేవతలారా! చరాచర సకల భూతరాశి, మీరు, భవుడు, నేను భగవానుని అంశలు, అంశాంశలు, కళలు, కళాంశలమై వర్తిస్తున్నాము. మీకు కలిగిన ఆపద అంశసంభవులమైన మాబోంట్లకు తీర్పరానిది. సర్వపూర్ణు డైనవానినే ఆశ్రయించాలి. పరమ పూరుషునికి వధ్యావధ్యులు, తనవారు పెరవారు అన్న భేదం ఉండదు. అందరూ అతనికి సములే. అయినా భగవానుడు సర్గస్థితిసంయమార్థం సమయం వచ్చినపుడు తన శక్తిని ప్రేరేపిస్తాడు. అది సత్త్వరజస్తమోగుణాల

రూపుగొని యథోచితగతిని ప్రవర్తిల్లుతుంది. ఇప్పుడతనికి పరిపాలనావసరం ఏర్పడినందువల్ల అతని వలన మనకు మేలు జరుగుతుంది' అని చెప్పాడు. పరమేశ్వరుని దర్శనార్థం అందరూ బయలుదేరారు. చతురాస్యుడు వెంట తరలి దేవదేవుని పదాన్ని చేరి, శ్రీ వాసుదేవ పరబ్రహ్మమును సన్నుతించాడు.

## బ్రహ్మకృత పరబ్రహ్మస్తుతి

'దేవా! ఆద్యంతరహితా! అవికారా! నిత్యస్వరూపా! మనోవాగగోచరా! అవిచింత్యా! నిరుపాధికా! సర్వాంతరా! సర్వోత్తమా! ఇదే నీకు నమస్కారం. స్వామీ! ప్రాణమనోబుద్ధ్యహంకార విజ్ఞాతవు, విషయేంద్రియ రూపాలలో అభాసమానుడవు అయిన నీవు అజ్ఞానము గాని శరీరాదులు గాని లేక అక్షరుడవై ఉంటావు. జీవుల పక్షపాత నిష్పక్షపాతాలకు అవిద్యావిద్యలు మూలకందాలు. అవి రెండిటికీ నీవు అందరానివాడవు.

దేవా! దశేంద్రియ పంచప్రాణములనే పదిహేను ఆకులతో, అష్టప్రకృతులనే ఎనిమిది ఆకులతో కూడి గుణత్రయమన్న మధ్యాన్ని కలిగి మనః ప్రధానంగా ఒప్పారుతూ మాయాప్రేర్యమాణమై మెరుపుకంటె వేగంగా చరించే జీవ శరీరాత్మక చక్రానికి ఎవ్వడధిష్ఠాతగా ఉన్నాడో, ఎవడు జ్ఞానైకస్వరూపంతో ప్రకృతికి పరంగా అదృశ్యగతిని వెలుగుతున్నాడో, ఎవడు తాను దేశ కాలాపరిచ్ఛిన్న నిర్వికల్పబ్రహ్మస్వరూపు డైనా పూనుకొని జీవులను నియమిస్తున్నాడో, ఎవ్వనిని ధీరులు యోగసాధన పూర్వకంగా ఉపాసిస్తున్నారో, ఎవ్వడు ఆత్మస్వరూపాన్ని ఆవరించి సకలజనులకు మోహాన్ని ఒదవిస్తున్నాడో, ఎవని మాయను ఎంతెంతవారయినా దాటనేరరో, ఎవ్వడు తన మాయను, ఆ మాయాశక్తులను వశీకరించుకొని సర్వభూతసమవర్తిగా ఉన్నాడో, అట్టి అగమ్యచరితునికి నీకు నమస్కారం.

మహాత్మా! తత్త్వశరీరం నీకు ప్రియావహం. ఆ శరీరాన మేము సృజింపబడ్డాము. అంత ఉత్తమ జన్మను పొందినా మేము నీ బహిరంతః ప్రకాశమాన నిరుపాధిక స్వరూపాన్ని కనుగొనేందుకు

నోచుకొన్నవారము కాము. ఇక రజస్తమః ప్రధానులైన అసురాదులు నిన్ను చూడలేకపోవటంలో వింత ఏమున్నది?

స్వామీ! చతుర్విధ భూతసర్గానికి ఆధారమైన భూమి ఎవనికి పాదతలమో, ముజ్జగాలకు, తత్పాలకులకు సిద్ధజీవన వృద్ధికారణమైన జల మెవ్వని తేజోరూపమో; దేవతలకు బలాయురన్న విధాత, వృక్షకోటికి ప్రభువు, జనులకు ఆప్యాయనకారి అయిన సోముడెవ్వనికి మనస్సుగా ఉన్నాడో; క్రియాప్రతిపాద్య కర్మనిమిత్తుడై సముద్రాంతరాన స్వధాదులకు పరిపాకాన్ని కూర్చునట్టి అగ్ని ఎవనికి వదనస్థానమో; అర్చిరాదిమార్గదేవత, త్రయీమయుడు, బ్రహ్మోపాసనాస్థాన ముక్తిద్వారం, అమృతమృత్యుమూలం అయిన సూర్యుడెవనికి లోచనమో; భృత్యులకు సమ్రాట్టు వలె మాకు బుద్ధ్యాద్యధిష్ఠాతలకు ఎవ్వడు ఉపాసనీయుడో; ఎవని ప్రాణమూలాన చరాచరాదులకు ఓజోబలధర్మాత్మకప్రాణం కలుగుతున్నదో; ఎవని శ్రోత్రమందు దిశలు హృదయాన, దేహగత వివరాలు నాభివలన, ప్రాణేంద్రియ మనఃప్రాణ శరీర నికేతనమైన నభస్సు జనించిందో; ద్రవ్య కాల కర్మ గుణ భౌతిక ప్రపంచాలు ఎవని మాయా కల్పితాలని బుధులంటారో; ఎవని మాయ ఇట్టిదని ఊహింపనైనా సాధ్యం కాదో; ఎవడు పరమోపశాంతుడు, నిత్యపూర్ణుడు అయినా – మాయాదర్శిత గుణముల యెడ దర్శనాది వృత్తుల వ్యవహరిస్తుండినా – వాయువు లీలమై ఏమాత్రం తగులకున్నాడో – అట్టి మహావిభూతిఖ్యాతునికి నీకు పునఃపునర్నమస్కారాలు.

దేవా! దరహాస కందళ సుందరమైన నీ ముఖపద్మాన్ని చూపి మాకు కనుపండువు కావించు. మాకు సాధింపరాని కార్యాలను నీ అంతట నీవు పొనర్చేందుకు తత్తద్రూపాలను తాల్చటానికి ఏ ప్రేమరసం నిన్ను ప్రోత్సహిస్తున్నదో, ఆ ప్రేమరసాన్ని ఒక్కింత మాకు అనుగ్రహించు. ప్రభూ!

విషయాసక్తు లెంతటి మహాకర్మలను చేసినా వాటిని ప్రీతితో నీకు సమర్పింపనినాడు అవన్నీ ఫలశూన్యాలవుతాయి. వారికి క్లేశం మాత్రమే మిగులుతుంది. చెట్టు మొదట నీరు పోసినప్పుడు ఆ జలం కొమ్మలకు రెమ్మలకు అంతటికీ ప్రాకినట్లు నీ ఆరాధన సర్వారాధనగా పరిణమిస్తుంది. నీ శరణుజొచ్చాము. నీవే మాకు గతి' అని సాష్టాంగం చేశాడు.

## శ్రీ మహావిష్ణు సందర్శనం

రాజేంద్రా! చతురాస్యాదులు ఆ విధంగా ప్రణమిల్లి లేవగానే వారి యెదుట ఒక విధమైన అపూర్వతేజస్సు కానవచ్చింది. వేయిమంది సూర్యులు ఒక్కపరి వెలుగుతున్నట్లుగా ఉన్న ఆ కాంతికి బ్రహ్మాదుల దృష్టి చెదిరింది. భూమ్యాకాశాలు గాని దిక్కులు గాని వారికి కానరాలేదు. ఆ జ్యోతిర్మధ్యంలో ఒక దివ్యమూర్తి మరకత శ్యామల నిర్మలదేహంతో పద్మారుణలోచనాలతో సువర్ణ సవర్ణ పీతాంబరంతో మణి కిరీట కేయూర కాంచీకలాప వలయ హార నూపుర శోభాయమాన ప్రసన్న చారుసర్వాంగ సుందరుడై రత్నకుండల ప్రభలు చెక్కిళ్లపై మిరుమిట్లు గొలుపుతుండగా, లక్ష్మీ కౌస్తుభాలు పేరురాన వెలుగుతుండగా, కంఠసీమను వనమాల దాల్చి చక్రాయుధాన్ని హస్తతలాన అలంకరించి ధగద్ధగాయమానుడై తేజరిల్లుతున్నాడు. బ్రహ్మాదులు కొంతసేపటికి సమదాయించుకొని ఆ అపూర్వమూర్తిని చూసి ఆశ్చర్య పరవశులై సాగిలబడ్డారు. అంత బ్రహ్మదేవుడు ముందుకు వచ్చి ఈ విధంగా స్తుతించాడు.

## శ్రీ మహావిష్ణు స్తోత్రం

'దేవా! ఏ నీ దివ్యరూపం శ్రేయస్కాములకు వైదిక తాంత్రిక యోగాల చేత పూజనీయమై ఉన్నదో – ఆ మంగళరూపాన్ని మాకు ఒక్కింత దర్శనయోగ్యం కావించి మా మొర ఆలకించినట్లు సూచించావు. మేము ధన్యులమైనాము. విశ్వమూర్తివైన నీలో ఉన్న ముజ్జగాల యెడ, మాయెడ నీ కటాక్షవీక్షణం నిరంతరం ప్రసరిస్తుంటుంది కనుక నీవెరుగనిది గోరంతయినా ఉండదు. దేవా! ఈ జగత్తు నీ యందే జనన స్థితిలయాలను పొందుతున్నది. ఘటానికి మృత్తిక

వలె జగత్తుకు నీవే ఆదిమధ్యాంతమవు. స్వామీ! జగదుత్పత్తికి ప్రధానము కారణమని కొందరంటారు. నీవు ప్రధానము కంటె పరుడవై ఉండి ప్రధానమూలాన సృష్టి కావించటం వారెరుగరు. ప్రధానమంటే నీ మాయాశక్తియే కదా! శక్తిమంతుడు లేనినాడు శక్తి ఎక్కడ నుంచి వస్తుంది? శక్తి వ్యవహారమంటే శక్తిమంతుని వ్యవహారమే కదా? ఆ నీ శక్తి వ్యవహారం స్వగుణ పరిణామాన్ని పొందుతుంది. ఆ పరిణామమే జగత్తని చెప్పబడుతున్నది. ఈ రహస్యం శాస్త్రజ్ఞులైన యోగులకు మాత్రమే స్పష్టం. పుడకను తరిచినందువల్ల నిప్పు, గోవును పితికినందువల్ల ఘృతం, భూమిని దున్ని విత్తినందువలన అన్నం, యంత్రాదుల వలన నూతినీరు, ఈ విధంగా వివిధోపాయాల వలన జీవికావృత్తి నరులకు కలుగుతుంది. అదే తీరున పండితులు బుద్ధిచేత గుణాలను మథించి నిన్ను కనుగొంటారు' అని ప్రణమిల్లాడు.

## దేవతల ప్రార్థన

'దేవా! వివిధ క్లేశాల పాలై నీవే దిక్కని చిరకాలంగా ప్రార్థిస్తున్నాము. దావాగ్నికి పరితపించిన ఏనుగులకు గంగాజలం వలె దుఃఖార్తులకు మాకు నీ దర్శనం లభించింది. లోకపాలకులైన మాకు కొరతేముంటుందని అనుకొంటారు. బహిరంతరాత్మునికి సర్వసాక్షికి నీకు తెలియనిదేమున్నది? దేవా! అగ్నినుంచి విస్ఫులింగాల వలె నీ నుంచి మేమందరమూ ఉదయించాము. అందువలన నీకంటె అన్యులము కాము. అయినా వేర్వేరుగా విభావిస్తాము. ఆ కారణాన మాకందరికీ ఏది మేలో తెలిసికొనలేక పోతున్నాము. మాకు శుభం కలిగే ఉపాయాన్ని బోధించు' అని దేవతలు దోయిలొగ్గి నిలిచారు.

## శ్రీ మహావిష్ణు బోధ

రాజేంద్రా! ఆ మహానుభావుడు వారి తలపు గ్రహించి, 'వీరి కోరికను తీర్చటం ఒక పని కాదు. సముద్రమథనాదుల విహరించే కోరిక కలుగుతున్నది. అందుకు వీరిని నిమిత్తమాత్రులను కావించాలి' అని లోలోన

నిశ్చయించి, 'కమలసంభవా! శర్వా! సురలారా! మీకు హితవు చెబుతాను వినండి. కాలానుసారంగా కార్యసాధన చేయాలి. కాలం మంచిది కానినాడు తాడే పామై కరుస్తుంది. వైరిబాధలు ఓర్వలేక పోతున్నామని అన్నారు. విషమసమయం వచ్చినప్పుడు వైరితో సంధి చేయటం ఉత్తమం. ముప్పు తప్పిన తర్వాత ఆ సర్పమూషిక భావం ఉండదు కదా. ఇది మీకు మంచికాలం కాదు. దైత్యదానవులతో సంధిచేసి క్లేశాలను బాపుకొనండి.

సురలారా! ప్రాణులకు మృత్యువు తప్పదు. తప్పించుకోవాలంటే అమృతపాన మొక్కటే ఉపాయం. అమృతాన్ని గ్రోలినవాడు మృత్యుగ్రస్తుడైనా చావడు. కాబట్టి అమృతోత్పాదనకు యత్నించండి. ఆ అమృతం క్షీరసాగరంలో ఉన్నది. సర్వలతావీరుధులను తృణౌషధులను తెచ్చి ఆ పాలకడలిలో వేసి దానిని మథించాలి. సముద్ర మథనానికి తగిన కవ్వం మందరపర్వతం ఒక్కటే. మందరాద్రిని కవ్వంగా వాసుకిని రజ్జువుగా అమర్చి సముద్రాన్ని మథించండి. నేను కూడా మీకు తోడవుతాను.

ఈ మథనకార్యంలో అసురులు కూడా పాల్గొనగోరితే అందుకు మీరు సమ్మతించండి. సామానికి సాధ్యపడే కార్యం సంరంభానికి కాదు. సముద్రమథన సమయంలో అందులో నుంచి కాలకూట విషం ఉద్భవిస్తుంది. అందుకు భయపడకండి. వస్తువుల యెడ కామలోభరోషాలను వహింపకూడదు' అని బోధించి అంతర్హితుడయ్యాడు. బ్రహ్మ, భవుడు ఆ మహాత్మునికి మ్రొక్కి తమ తమ స్థానాలకు వెళ్ళారు.

## దేవాసురులకు సంధి

రాజేంద్రా! ఆ సమయంలో బలిచక్రవర్తి దైత్యదానవులకు రాజై సర్వ జయ శ్రీ సమున్నతుడుగా ఉన్నాడు. మహేంద్రుడు సురలను వెంటబెట్టుకొని బలిచక్రవర్తి వద్దకు పోయి మృదుమధురవచనాలతో సంధి కార్యం వివరించాడు. ఆ మాటలను బలి అనుచరులైన శంబరాది దైత్యులు మెచ్చుకొన్నారు. బలచక్రవర్తి కూడా సంధి విగ్రహ సమయవేది కాబట్టి సంధికి

సమ్మతించాడు. తోడ్తోనే దైత్యభటుల విజృంభణలు చల్లారాయి. ఉభయపక్షాల వారు సంధి ప్రతిజ్ఞలు చేశారు.

## మందరపర్వతం

సంధి ప్రతిజ్ఞలలో మందరపర్వతం ముఖ్యమైనదిగా ఉన్నది. ఇరుతెగలు మందరాద్రికి పోయి భుజబలాలు దీపింపగా ఆ గిరీంద్రాన్ని పెకలించి ఊర్పులు పేర్పులతో దానిని క్షీరాబ్ధి గట్టుకు తీసికొని రాసాగారు. కొంత దూరం వచ్చేసరికి వారికి అలసట కలిగింది. తత్ఫలంగా కొండ బరువు మోయరానిదయింది. శక్ర వైరోచనాదులు ఆ పర్వతాన్ని నడిదారిలో పడవేశారు. ఆ పాటు వడికి సురాసురులు కొందరు కాళ్లు విరిగి తొడలు తెగి మెడలు వాలి నుగ్గునూచ మయ్యారు. ఏమిచేయాలో దిక్కుతోచక అందరూ చింతింపసాగారు. ఆ సమయంలో నారాయణుడు సన్నిధి కావించి దివ్యకటాక్షవీక్షణ సుధావర్షం కురిపించాడు. చచ్చిపడిన వారందరూ పునర్జీవితులై లేచి కూర్చొన్నారు. అంతట భగవానుడు ఆ పర్వతాన్ని ఒక్క చేతితో పైకెత్తి గరుడుని వీపున ఉంచి క్షీరాబ్ధిమార్గం పట్టాడు. సురాసురులు అతని వెంట నడిచారు. అందరూ పాలకడలి చేరిన తర్వాత గరుడుడు ఆ కొండను దించి అక్కడుంచి హరి అనుజ్ఞ గైకొని అక్కడి నుంచి నిష్క్రమించాడు.

## క్షీరసాగర మథనం

రాజా! సురాసురు లంతట వాసుకి వద్దకు వెళ్ళి, 'పన్నగేశ్వరా! క్షీరసాగరమథనం సంకల్పించి మందరాద్రిని కవ్వంగా తీసికొనివచ్చాము. కవ్వానికి త్రాడు కావాలి. అందుకు నీ వంగీకరించాలి. ఫలభాగం ఇస్తాము' అన్నారు. వాసుకి సమ్మతించి క్షీరాబ్ధికి వచ్చాడు. అతనిని కవ్వపు తాడుగా అమర్చి సురాసురులు మథనోన్ముఖులయ్యారు.

భగవానుడు వాసుకి ముఖభాగాన్ని పట్టాడు. అతని వెంబడిని సురలు పట్టుకొన్నారు. దైత్యు లది చూసి, 'అయ్యయ్యో! పాము తోక చెప్పరానంత అమంగళకరం. స్వాధ్యాయ శ్రుత సంపన్నులము, విఖ్యాత జన్మ కర్ములము

అయిన మనము సర్పపుచ్ఛాన్ని పట్టుకోవటం తగని పని' అంటూ దూరమై నిలిచి ఊరుకున్నారు. భగవానుడు వారి మనోభావం గ్రహించి ఎలనవ్వు దాల్చి తల వంక వదలి తోకను పట్టుకొన్నాడు. అతని ననుసరించి సురలందరూ వచ్చి నిలిచారు. అసురులు వాసుకి ముఖభాగాన్ని పట్టారు.

నరేంద్రా! సురాసురు లంతట మహాప్రయత్నపరులై పయోధిని మథింపసాగారు. కవ్వంగా నైనా మందరగిరి ఆధారం లేనందువల్ల క్రిందికి జారిపోసాగింది. అందుకు ఉభయపక్షాలు చిన్నబోయి, 'దైవబలం లేనినాడు వట్టి పౌరుషం కొనసాగుతుందా?' అంటూ ఒకరిముఖాలొకరు చూసుకొన్నారు. భగవానుడు వారిని చూసి లోలోపల నవ్వుకొంటూ కూర్మరూపం ధరించి తన వీపుపయిన ఆ గిరీంద్రాన్ని ఉంచి దానిని లేవనెత్తి నిలిపాడు. లక్షయోజన విస్తీర్ణమైన ఆ కూర్మం వీపుపైని ఆ మందరపర్వతం ఒక ద్వీపమాత్రమై కానుపించింది.

సురాసురులు మళ్ళీ చిలకసాగారు. కొంతసేపటికి కొండ రాపిడి వల్ల ఆ కూర్మం వీపుకు కండూతి కాజొచ్చింది. కార్యపరుల వీర్యోత్సాహాలను బట్టి ఫలప్రాప్తికాలం ఉంటుంది కాబట్టి భగవానుడు ఇరుపక్షాలవారిని ఆవేశించి ఒక చేతిని కొండ మీద ఉంచి రెండవ కొండవలె మహాప్రమాణంతో కానవచ్చాడు. భగవానుడు ఆవేశించినందువలన సురాసురులు బలోన్నతులై పోటీలు పడి సముద్రాన్ని చిలికారు. ఆ వడికి సాగరాంతర మకర మత్స్య కచ్ఛపాది జంతువులు గిలగిలలాడాయి. వాసుకి సహస్రముఖాల నుంచి శ్వాసానలధూమం వెలికి ప్రాకింది. ఆ వేడిమికి ఆ వైపున ఉన్న దైత్యులు తేజస్సు లుడిగి కార్చిచ్చు క్రమ్మిన సరళ వృక్షాల వలె కమిలిపోయారు. ఆ శ్వాసానలతాపం సురలకు కూడా కొంత సోకి వారు ధరించిన వస్త్రమాలికాదులను కమరించింది. వారి దురవస్థను భగవానుడు చూసి మేఘాలను స్మరించాడు. వెనువెంటనే వాన కురిసి చల్లని గాలి వీచి సాగర వీచీ శీకరాలను పైజల్లింది. వారు తాపాలు తీరి రెట్టించిన పూనికతో మథింపసాగారు. ఎంత మథించినా సముద్రం నుంచి ఏదీ వెలువడలేదు.

## కాలకూట విషోత్పత్తి

రాజా! వారు మరీ మరీ పట్టుదలతో మథించటం మొదలుపెట్టారు. కొంతకాలానికి సముద్ర జలాలు ఉడ్డుడికి సాగరాంతర మత్స్య కచ్ఛప మకరాది యాదోగణం కలగి తబ్బిబ్బు పడసాగింది. జలధినుంచి హాలాహల విషం పుట్టి దిక్కులకు వ్యాపించి దుస్సహం కాజొచ్చింది. ఉభయపక్షాలవారు దిక్కుతోచక నిర్విణ్ణులయ్యారు. పరమశివుడే దిక్కని వారికి స్ఫురించింది. ప్రజాపతులు కైలాసగిరికి పరిగెత్తి అక్కడ సర్వమంగళా దేవీ సహితుడై లోక మంగళార్థం తపోయోగాన ఉన్న పరమేశ్వరునికి సాగిలబడి లేచి,

## ప్రజాపతుల ప్రార్థన

'భూతాత్మా! భూతభావనా! హాలాహల విషం ముజ్జగాలను దహిస్తున్నది. నీవే దిక్కు; రక్షించు. సర్వలోక బంధ మోక్షణాలకు నీవే ఈశ్వరుడవని, ప్రపన్నార్తి హరుడవని, గురుడవని పెద్దలు నిన్ను పూజిస్తారు. అద్వితీయుడవైనా గుణమయ అయిన నీ శక్తి నధిష్ఠించి మూడు రూపాలు దాల్చి సర్గ స్థితి లయాలను కావిస్తావు. మూర్తిభేదాన్ని బట్టి, కార్యభేదాన్ని బట్టి బ్రహ్మవిష్ణుమహేశ్వరులనే పేర్లు నీయెడ కల్పితములైనాయి. విశ్వమంతా నీ శక్తిపరిణామఫలం. సర్వజ్ఞానాలకు మూలమైన వేదానికి నీవు మూలకందానివి కాబట్టి స్వతస్సిద్ధజ్ఞానుడవు. మహత్తత్త్వం, ప్రాణేంద్రియ ద్రవ్యకారణమైన త్రివిధాహంకారం, కాలము, సంకల్పం నీ కంటె వేరైనవి కావు. త్రివర్ణాత్మకమైన ప్రణవం నీ ప్రకాశకమై ఉన్నది.

దేవా! అగ్ని ముఖమని, భూమి పాదమని, కాలము గతి అని, దిక్కులు కర్ణాలని, వరుణుడు రసన అని, నభస్సు నాభి అని, వాయువు శ్వాసమని, సూర్యుడు నేత్రమని, జలము రేతస్సని, పరాపర జీవాశ్రయం అహంకారమని, సోముడు మనస్సని, దివము శిరస్సని, సముద్రాలు కుక్షి అని, గిరులు అస్థులని, నిఖిలౌషధవీరుధులు రోమాలని, ఛందస్సులు సప్త ధాతువులని, ధర్మము హృదయమని, తత్పురుష అఘోర సద్యోజాత వామదేవ ఈశానరూప

మంత్రాలైన ఉపనిషత్పంచకం ముప్పైఎనిమిది మంత్రవర్గ కారకాలైన ఆస్యాలని, స్వయంజ్యోతి ఉపరతావస్థ అని, దంభ లోభాత్మక విసర్గం ఛాయ అని, మూడు గుణాలు అంతర్నేత్రాలని, ఛందోరూప సనాతన వేదం వీక్షణమని నీ విశ్వరూపాన్ని వర్ణిస్తారు.

> దేవా! ఇది నీ వ్యక్తస్వరూపం. నీ అవ్యక్తస్వరూప మన్నదో అది గుణత్రయ రహితమై భేదశూన్యమై బ్రహ్మాత్మకమై పరమజ్యోతీరూపాన వెలుగుతున్నదంటారు. ఆ రూపం లోకపాలకులకు గాని బ్రహ్మవిష్ణ్వాదులకు గాని, ఇంతెందుకు? రూపధారు లెవరికీ గోచరింపదు. నీ మహిమ వర్ణనకు గాను దక్షాధ్వరధ్వంసం, త్రిపురసంహారం, మృత్యునిగ్రహం మొదలైన వాటిని పేర్కొంటారు. నీవు సృజించిన విశ్వాన్ని కన్నారా చూస్తూ నీ స్వల్ప లీలలను పరిష్కరించి నీ మహిమను వర్ణించటం కన్న వెర్రితనం ఉన్నదా?

దేవా! లోకకళ్యాణాన్ని కలిగించటం నీకు వ్రతమై ఉన్నది. ఆ వ్రతాంశగా కాలకూటవిషాన్ని మ్రింగనున్నావు. ఇదీ నీ స్తుతివిషయం కాదు. ప్రళయకాలంలో నీ కంటి మంటల చేత జగత్తులను భస్మసాత్కరించి ఏమీ తెలియనట్లుంటావు. ఈ నీ తత్త్వం నిజానికి సన్నుతిపాత్రం. ఈ నీ రహస్యాన్ని ఆత్మారాములు సైతం గ్రహింపలేక నిరీహులై తమ హృదయాంతరాలలో నీ పాదారవిందాలను ధరించి నిన్ను ధ్యానిస్తారు.

దేవా! నీ తత్త్వం ఇట్టిదై ఉండగా, భవానీదేవిని ఒడిలో చేర్చి నిరంతరం క్రీడాలోలుడవై ఉండే మహాకాముకుడవని, వల్లకాట తిరిగే పిశాచానివని, నిన్ను గురించి కొందరంటారు. అంతకంటె అజ్ఞానులుంటారా? వారి అజ్ఞానం వింతకాదు గాని తమ అజ్ఞానానికి వారెంత మాత్రం సిగ్గుపడకపోవటం వింతే.

దేవా! బ్రహ్మాదులు నిన్ను గూర్చి పల్కిన పలుకుల సారాన్ని మేము గ్రహించి అనుభవించి చవిగొన్నాము. ఆ రుచి ప్రేరణ వలన మా కృతజ్ఞతను

ఈ విధంగా విన్నవించుకొన్నాము. అంతే కాని నీ తత్త్వాన్ని నిర్ణయించి చెప్పడం కాదు. మా అవినయాన్ని మన్నింప గోరుతున్నాము' అని స్తుతించారు.

## మహాదేవుని విషాశనం

రాజేంద్రా! మహాదేవుడు వారి మొర విని సర్వభూతసుహృదుడు కాబట్టి జాలిపడి, తన సతివంక చూసి, 'భవానీ! క్షీరసాగరాన్ని మథించటం, అందులో నుంచి కాలకూటవిషం పుట్టి ప్రజలకు కీడువాటిల్లటం చూశావు కదా? పూజింపబోతే గుడి నెత్తిన వాలినట్లయింది. మేరలేని కోరికలు కోరకూడదు; మించిన పని చేపట్టకూడదు. ఆ సంగతి ఇప్పుడు అనుకోవటం గతజల సేతుబంధన మవుతుంది. ప్రాణార్తులై వచ్చారు.

దీనరక్షణ ప్రభువులకు ధర్మం. పరుల ప్రాణాలను రక్షించేందుకు సాధువులు తమ ప్రాణాలను సైతం ధారపోస్తారు. కృపాపరునికి భగవంతుడు కృపచేస్తాడు. భగవంతునికి ప్రీతి కలిగితే సర్వలోక ప్రీతి కలుగుతుంది. జాగు చేయకూడదు; విషాన్ని మ్రింగబోతున్నాను. ఈ కార్యం సర్వ శుభదాయకం' అన్నాడు. భవాని అందుకు ఎంతో సంతోషించింది. రాజా! ఈశ్వరుడు భవానీలోలుడో స్వతంత్రుడో చూశావా?

కాలకూటం ఆ విధంగా ఉద్భవించి క్షణక్షణానికి విశ్వమంతటా వ్యాపింపసాగింది. లోకేశ్వరుడు దానిని తన అరచేతిలోనికి గ్రహించి మ్రింగి కంఠదేశాన ఉంచాడు. ఆ విషం మహాదేవుని కంఠప్రదేశాన్ని నల్లగా మార్చివేసింది. అది మొదలు శివునికి కాలకంఠుడని పేరువచ్చింది. వస్తువు నైజగుణాన్ని చూపుతుంది కదా! పరమేశ్వరుని సాహసం భవానీ బ్రహ్మ నారాయణులకు ప్రశంసాపాత్రమై అలరారింది. మహాదేవుడు ఆ విషాన్ని మ్రింగేటప్పుడు అందులో కొంత చెదిరి చిందిపడింది. ఆ బిందువులను సర్పాలు, విషౌషధులు గ్రహించటం లోకోపకారకం అయింది.

రాజేంద్రా! ప్రతికర్మానికి దానికి తగిన ఫలం పుట్టక మానదు. పుట్టిన ఫలాన్ని కర్త భోగింపక తీరదు. కర్తల స్వభావాలను బట్టి కర్మములు, తత్కర్మ ఫలాలు శుభాశుభాలుగా ఉంటాయి. అశుభ ఫలాలు భోగ్యాలైనప్పుడు భోక్తలు ఆ బాధను ఓర్వలేక పూర్వసుకృతలేశం ఇంకా మిగిలి ఉండటం వల్ల భగవంతుని ప్రార్థిస్తారు. భగవానుడు వారి మొరలు విని వారి తాపాన్ని తీర్చాలనుకొంటాడు. భోగ్యకర్మఫలం భుక్తం కానిదే నశింపదు కాబట్టి భోక్త లనుభవింపవలసిన కర్మఫలాన్ని భగవంతుడు స్వీకరిస్తాడు. తత్ఫలంగా భోక్తలకు ఉపశాంతి కలుగుతుంది. మలిన కర్మఫలాలు మలినాలుగా ఉంటాయి. కాబట్టి అవి భగవంతుని చేరినా వాటి తీవ్రత తగ్గేదాకా భగవంతునియందు కూడా నిలిచి ఉంటాయని, భగవంతుడు సర్వశక్తిమంతు డైనందున ఆ కర్మఫలాలు అతని కుక్షిలో ఉన్న ఇతర చరాచర లోకానికి ప్రాకనీయక తానే హరించుకొంటాడని ఈ విషగ్రహణకథ బోధిస్తున్నది. భగవంతుని దయ ఎంత గొప్పదో చూడు.

## కామధేన్వాదుల జననం

రాజా! పరమేశ్వరానుగ్రహఫలంగా దేవదానవులు ఆర్తిని బాసి మళ్ళీ సముద్రాన్ని మథించారు. కామధేనువు జనించింది. దానిని బ్రహ్మవాదులైన ఋషులు చూసి, 'బ్రహ్మలోకప్రాప్తికి యజ్ఞాలు ముఖ్యసాధనలుగా ఉన్నాయి. యజ్ఞాలకు హవిస్సు కావాలి. అది గోవుల వలన సిద్ధిస్తుంది' అని దానిని తీసుకొన్నారు. తర్వాత తెల్లటి అశ్వమొకటి పుట్టింది. చెవులు పెద్దవిగా ఉన్నందువల్ల దానిని ఉచ్చైశ్శ్రవం అన్నారు. అది బలి చిత్తాన్ని హరించింది. ఇంద్రుడు కూడా దానిని అపేక్షించాడు. హరి ఇంద్రుని నివారించి, ఆ అశ్వాన్ని బలికి ఇప్పించాడు. అనంతరం కైలాసగిరి అంత పెద్ద తెల్లని ఏనుగు, దాని వెంబడి పారిజాతం, అప్సరసలు, రమాదేవి క్రమంగా ఉద్భవిల్లారు. రమాదేవీ రూపసౌందర్యాతిశయాలు సురాసురుల చిత్తాలను ఆకర్షించాయి.

## రమా మహాభిషేకం

ఆ తల్లికి మహేంద్రుడు ఉత్తమాసనాన్ని సమర్పించాడు. ఉత్తమవాహినులు రూపుదాల్చి తమ జలాలను హేమకుంభాలతో తెచ్చియిచ్చాయి. అభిషేకయోగ్యమైన ఓషధిగణాన్ని భూమి సమకూర్చింది. గోవులు పవిత్రమైన పంచగవ్యాలను, వసంతుడు చైత్ర వైశాఖ మాసాలలో జన్మించిన ఫలపుష్పాదులను సమర్పించారు. ఋషులామెకు యథావిధిని అభిషేకాన్ని కల్పించారు. దిగ్గజాలు పూర్ణకుంభాలతో అభిషేకించాయి. గంధర్వ మంగళగానాలు, అచ్చరల నృత్యాలు ఎక్కడ చూసినా ప్రజలను సంతోషపెట్టాయి. మేఘుడు గంభీరధ్వనులతో ఆ మంగళకార్యాన్ని ప్రకటించాడు. బ్రాహ్మణులు సూక్తవాకాలను పఠించారు.

సముద్రుడు పీతకౌశేయవస్త్రద్వయాన్ని, వరుణుడు దివ్యపరిమళ మాల్యాన్ని, విశ్వకర్మ వివిధ విచిత్రభూషణాలను, సరస్వతి అనర్ఘమైన హారాన్ని, బ్రహ్మదేవుడు పద్మాన్ని, నాగులు మణికుండలాలను సమర్పించారు. ఆ దేవి వాటిని గ్రహించి అలంకరించుకొని పూమాలను చేతదాల్చి లోకోత్తర సౌందర్యరాశియై భాసురిల్లింది. ఆ దేవి ఆ విధంగా మణికుండల దీప్తిదీపిత కపోల ముకురాలతో, లజ్జాలలిత మందహాస సుందర ముఖారవిందంతో, కుంకుమ చందన పంక సంకలితమైన ఉత్తుంగ స్తనయుగళితో, స్తనభారానికి అసియాడుతున్న నెన్నడుముతో, అందెలరవళితో స్వర్ణలతిక వలె నడయాడుతూ తనకు ఆశ్రయుని వరింపగోరి తరుగులేని సద్గుణవంతు డెవడో అని ఆ సభాంతరాన వెతకసాగింది.

## రమా స్వయంవరం – వరలక్షణాలు

చెలికత్తె ఒకతె ఆమె వెంట నిలిచి సభాంతరాన ఉన్న గంధర్వ యక్ష సుపర్వాణ సిద్ధ చారణాదులను ఒక్కొక్కరినే చూపుతూ, ఒకచోట 'సుందరీ! ఇతను మహాతపోధనుడు' అన్నది. ఇతను పరమకోపనుడని ఆ దేవి అతనిని దాటి ముందడుగు వేసింది. 'ఇతను పరమజ్ఞాని' అని మరొకరిని చూపితే అతని జ్ఞానం సంగరహితం కాలేదని అతనిని త్యజించింది. ఇంకొకరిని చూపి,

'ఇతను మహాత్ముడు' అనగానే, జితకాముడు కాదని అతనిని నిరసించింది. ఇంకొకని చూపించి, 'ఇతను ప్రభువు' అంటే అతని ప్రాభవం పరాశ్రయ సాపేక్షమే గాని స్వతంత్రం కాదన్నది. 'ఇతను ధర్మబుద్ధి' అని వేరొకరిని చూపితే అతని బుద్ధి భూతదయార్ద్రం కాదని తిరస్కరించింది. 'ఇతను త్యాగి' అని మరొకరిని చూపగా త్యాగం ముక్తికారణం కాదని నిరాకరించింది. 'ఇతను వీర్యవంతు' దని ఇంకొకరిని చూపిస్తే అతని వీర్యం కాలవేగనశ్వర మన్నది. 'ఇతను గుణసంగవర్జితుడు' అని వేరొకరిని చూపగానే అతనికి ద్వితీయత్వమంటే ఆదరువు లేదని నిరాదరించింది. 'ఇతను చిరాయు' వని వేరొకరిని చూపగా అతనికి శీలమంగళం కలుగదన్నది. 'ఇతను పరమశీలి' అని మరొకరిని చూపించినప్పుడు అతని ఆయువు స్థిరం కాదన్నది. 'ఇతను ఆయుశ్శీలవంతుడు' అని ఒకరిని చూపగా వాడు అమంగళుడని అన్నది. 'ఇతను సర్వసుగుణ మంగళమూర్తి' అని ఇంకొకరిని చూపితే అతను ఆత్మారాముడు కాబట్టి నన్ను కోరడు లెమ్మన్నది.

ఆ విధంగా శ్రీదేవి అందరినీ ఉపేక్షించి ఏకాగ్రమతియై, 'ఏ మహనీయుడు గుణాతీతుడయినా నిత్యానపాయి సద్గుణాలన్నింటికీ ఏకాశ్రయుడు కాగలడో ఆ పురుషోత్తముడు నిరపేక్షుడైనా అతనినే వరిస్తాను' అని తలపోసి తన చేతి పూలమాలను పద్మనాభుని కంఠదేశాన అలంకరించి లజ్జాలలిత మందహాస చంద్రికలను ప్రసరింపజేస్తూ అతని వక్షోభాగం తనకు నివాస స్థానమని అపాంగవీక్షణాలతో సూచిస్తూ చెంత నిలిచింది. లోకజనకుడు ఆ జగజ్జనని మనసు గ్రహించి తన ఉరోభాగాన్ని ఆమెకు నివేశ స్థానంగా అనుగ్రహించాడు. ఆ దేవి లోకేశ్వరుని హృదయమందిరంలో వసించి కరుణా కటాక్షవీక్షణాలను సారించే సరికి ముజ్జగాలలో పెంపుసొంపులు ఇంపుమీరాయి. సురసుందరీమణులు తమ ఆనందాన్ని నృత్యగీతవాద్యాలతో వెల్లడించారు. బ్రహ్మరుద్రాది విశ్వస్రష్టలు వైష్ణవమంత్రాలతో దంపతులను ప్రస్తుతించి పుష్పవర్షం కురిపించారు. ప్రజాపతులందరూ శ్రీ కటాక్ష భాగ్య పాత్రులై ఆనంద వివశులయ్యారు. రాజా! లక్ష్మి ఏ చోటును వరించి స్థిరస్థాయిని అయినదో గ్రహించావు కదూ?

రాజేంద్రా! లక్ష్మి ఆ విధంగా ఉపేక్షించినందువలన దైత్యదానవులు సత్త్వహీనులు, నిస్తేజస్కులు అయినది చాలక నిత్యలుబ్ధు లయ్యారు. తర్వాత వారుణి కన్యకారూపంతో జన్మించింది. ఆమెను దితిసుతులు హరి అనుమతితో గ్రహించారు.

## అమృతోదయం

రాజేంద్రా! దేవాసురులు మళ్ళీ సాగరాన్ని మథించారు. అప్పుడు సాగర గర్భం నుంచి ఒక పురుషుడు, పీనాయతబాహుదండాలను కంబుకంఠాన్ని పద్మారుణలోచనాలను విశాలవక్షఃప్రదేశాన్ని సుస్నిగ్ధకేశజాలాన్ని నీలగాత్రతేజాన్ని కలిగి, పీతాంబరం కట్టి, మణికుండలాలు ధరించి, పుష్పమాలికా సమలంకృతుడై హస్తతలాన అమృతకలశాన్ని దాల్చినవాడు ఆవిర్భవించాడు. అతను విష్ణుదేవుని అంశాంశ వలన పుట్టినవాడని, యజ్ఞభాగ భోజనుడు ఆయుర్వేదజ్ఞుడు మహనీయుడని బ్రహ్మాదులు గ్రహించి అతనికి ధన్వంతరి అని పేరు పెట్టారు.

అసురులు ఆ అమృతకలశాన్ని చూడగానే హితాహితాలు వదిలి ఆ కలశాన్ని అతని చేతిలో నుంచి హఠాత్కరించి ఒడిసి లాగి తీసికొని దూరానికి పరిగెత్తారు. అది చూసి దేవతలు తెల్లబోయి ఖిన్నహృదయాలతో భగవానుని శరణిల్లారు. దేవదేవుడు సురల దుఃస్థితిని చూసి 'దేవతలారా! దుఃఖింపకండి. ఆ అమృతం మీకు దక్కుతుంది' అని ఊరడించి, అంతర్హితుడయ్యాడు.

## అసురుల పరస్పర కలహం

రాజేంద్రా! దొంగలు దొంగిలించే వరకు ఏకభావంతో వర్తిస్తారు. దొంగసొమ్ము పంపకానికి వచ్చినప్పుడు వారిలో తగవులేర్పడి తత్ఫలంగా వారి దొంగతనం వెల్లడవుతుంది. ఆనాడు అసురుల స్థితి అలాగే అయింది. అమృతమంతా తనకే దక్కాలని వారిలో ఒకడు తెగవేసి చెప్పాడు. నాకు మాత్రం వద్దా అని ఇంకొకడన్నాడు. ఇది ధర్మం కాదని, మనవలెనే సురలుకూడా అమృతార్థం పడరానిపాట్లు పడ్డారని ఇంకొకడు ఆక్షేపించాడు.

సత్త్రయాగంలో వలెనే అందరూ సమభాగార్హులని మరొకడు వాదించాడు. దుర్బలుల కేకలు ఎక్కువయ్యాయి. బలవంతులు వారిని ధిక్కరించారు. ఒకరితో ఒకరు చేతులు కలిపి పోరాడుతూ కింద మీద పడసాగారు.

## మోహిని అవతారం

రాజేంద్రా! ఆ సమయానికి ఒక కన్యామణి మెరుపు తీగె మిరుమిట్లు గొలిపినట్లు జగన్మోహనాకారంతో అక్కడికి వచ్చింది. ఇందీవరశ్యామగాత్రంతో పూర్ణేందుబింబాననంతో మణిదర్పణాలను పోలిన కపోల తలాలతో సంపెంగ పువ్వును మెచ్చని నాసికాపుటంతో నిండుజవ్వనపు నీటునిగ్గుల చందోయితో సౌందర్య రత్నాకర వీచి వలె ఇంపుకులుకుతూ నిర్మలాంబరం కట్టి క్రీగంటి చూడ్కి వెన్నెలలు విరజిమ్ముతూ కేశపాశాన ముడిచిన పూల నెత్తావికి మూగుతున్న తుమ్మెదలను తప్పించుకొంటూ గాలికి తొలగుతున్న పైటను సవరించుకొంటూ అసియాడే నెన్నడుముతో అందెల చిరుమ్రోతలతో రాయంచ నడకలతో వచ్చిన ఆ కామినీమణి కంటబడే సరికి దేవదానవుల కళ్ళు సుధాభాండం మీదనుంచి మళ్ళి ఆ జగన్మోహినిపై లగ్నమైనాయి. అమృతహరణార్థం జనించిన చోరబుద్ధి ఆ మదవతీహరణార్థం మరలింది. 'ఓహో! ఎక్కడి రూపం! ఎక్కడి లావణ్యం! అని ఒక్కొక్కరు లోలోపలే ఆశ్చర్యపడుతూ ఒకరినొకరు తోసుకుంటూ ఆ ఇంతిని చేరబోయారు.

ఆ విధంగా వాళ్ళు ఆమెను సమీపించి, 'కమలాక్షీ! ఎవతెవు?' అని ఒకడు, 'తలోదరీ! ఎవరిదానవు?' అని ఒకడు, 'కామినీ! ఎక్కడి నుంచి వస్తున్నావు?' అని మరొకడు, 'చంద్రముఖీ! ఇక్కడికి దేనికోసం వచ్చావు?' అని వేరొకడూ ప్రశ్నించారు. 'జగన్మోహినీ! మా మనస్సులను మథిస్తున్నావు. ఎవతెవో చెప్పు' అని కొందరన్నారు. 'ఓహో! ఇది గోరు తాకని పుష్పం' అని ఒకడు ముక్కుమీద వేలుంచాడు. 'దేహధారులకు సకలేంద్రియ ప్రీతి కలిగించే నిమిత్తం సృష్టికర్త నిన్ను సృష్టించి దిద్ది తీర్చి ఇక్కడికి పంపించాడా?' అని ఒకడు లోలోపలే ఆశ్చర్యపడసాగాడు. కొందరు తెంపు చేసి ఆమెను సమీపించి, 'సుందరీ! మేము కశ్యపమహర్షి సుతులము. పౌరుషవంతులము. ఒక వస్తువు కోసం

అన్నదమ్ములకు మాకు స్పర్ధలు జనించాయి. మాకు పరస్పరవిభేదాలు కలుగకముందే ఆ వస్తువును న్యాయంగా పంచి పుణ్యం కట్టుకోవూ?' అని ప్రాధేయపడ్డారు.

రాజేంద్రా! ఆ సుందరీమణి దరహాస కటాక్ష వీక్షణాలతో వారి మాటను ఆదరించి, 'ఆర్యులారా! కశ్యపాత్మజు లెక్కడ? స్వైరిణి యందు మీ దృష్టి లగ్నం కావటం ఏమిటి? పండితులెన్నడూ కామినులను నమ్మరు కదా! వృకాలకు, వనితలకు నూతనప్రియత్వం నైజమని మీకు తెలియదా? ధర్మవిదులకు స్త్రీలతోడి చెలిమి నీటిమూటతో సమానం' అన్నది. ఆ తేనెతీపి తేటపలుకులు వారికి ఎంతో నచ్చాయి. ఆ మాటలకు వారు నవ్వుతూనే సుధాభాండాన్ని ఆ ఇంతి చేతికిచ్చారు. ఆ హొయలమారి ఆ కలశాన్ని తీసికొని, 'నేర్పుకొద్దీ పంచిపెడతాను. అది ఒప్పో తప్పో ఒప్పుకుంటేనే మీ కోరిక తీరటం అని ముసిముసి నవ్వులతో పలికింది. ఆ మాటలలోని భావాన్ని గ్రహింపలేక వారందరూ, 'నీ ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు. నీవేమి చేసినా మాకు సమ్మతమే' అన్నారు. 'అలాగైతే మీరందరూ శుచిగా రావాలి' అని ఆ మాయలాడి వారితో అన్నది.

## అమృత విభాగం

ఆ రమణీమణి మాటలకు ముగ్ధులై సురాసుర దైత్య దానవులు ఉపవసించి తీర్థస్నానం చేసి ధౌతవస్త్రాలు ధరించి హోమాదులను ముగించి గోవులకు, భూతాలకు గ్రాసాలను సమర్పించి విప్రులకు యథోచితదానాలిచ్చి వారి ఆశీర్వాదాలను పొంది సురభిధూప ధూపితమూ ఆజ్యదీప దీపితమూ అయిన శాలను ప్రవేశించి తూర్పు ముఖంగా తీర్చి ఉంచిన కుశాసనాల మీద బంతులు తీరి కూర్చున్నారు.

అంతలో ఆ కాంతామణి నూతన వస్త్రాలు ధరించి సుధాభాండాన్ని చేతదాల్చి మదవిహ్వల వీక్షణాలను సారిస్తూ శింజినీరవ మనోహరమైన మందమందగమనాలతో శాలాంతరంలోకి వచ్చింది. ఆ లోకమోహనాంగి

కనబడే సరికి అసురులు మోహవశులై అదే లోకంగా స్వప్న లోకాలలో విహరింపసాగారు. ఆ లలితాంగి లోపలికి వచ్చి బంతులు తీరి ఉన్నవారిని చూసి, 'అసురులు జన్మక్రూరులు; వారికి అమృతాన్ని ఇవ్వడమంటే పాముకు పాలు పోసినట్లే' అని నిశ్చయించి, సురాసురులను వేర్వేరు బంతులుగా తీర్చి తియ్యని మాటలతో క్రీగంటి చూపులతో ముసిముసి నవ్వులతో దైత్యులను మాటలలో పెట్టి అమృతాన్ని దేవతలకు పంచింది. ఆ జగన్మోహిని చేస్తున్నదానిని చూస్తూ మాట దాటకూడదని కొందరు, స్త్రీలతో కలహం కూడదని కొందరు, నోరెత్తితే ప్రణయభంగ మవుతుందేమోనని కొందరు అసురులు లోలోన జంకుతూ ఊరుకొన్నారు.

## రాహుశిరశ్ఛేదం

రాజా! ఆ తరిని రాహువనే దానవుడు సురవేషం ధరించి సురల పంక్తిలో కూర్చుండి తన చేతికి అందిన సుధను తనివితీరా తాగుతున్నాడు. అతనికి ఇరుప్రక్కల కూర్చొని ఉన్న సూర్యచంద్రులు ఎలాగో ఆ కపటనాటకాన్ని గ్రహించి సౌంజ్ఞ చేశారు. వెనువెంటనే చక్రాయుధం తటాలున వచ్చి రాహుకంఠాన్ని ఖండించింది. తల ఒకప్రక్కను మొండెం ఒకప్రక్కను పడ్డాయి. అతను అమృతం త్రాగిన నోటితోనే ఉన్నందువలన అతని తల మాత్రం అమృతత్వాన్ని పొందగలిగింది. ఆ నాటినుంచి ఆ శిరస్సు గ్రహమై పగపట్టి పర్వకాలాలలో సూర్యచంద్రులను కబళిస్తుంటుంది.

## ఏకరూపకర్మకు ఫలభేదం

రాజేంద్రా! సురాసురు లిద్దరూ ఒకే చోట ఒకే కాలాన చేరి ఒకే వస్తువుకోసం సముద్రమథనరూపమైన ఏకరూపకర్మను ఆచరించారు. కర్మ ఏకరూపమే అయినా వారికి ఫలభేదం ప్రాప్తించింది. కారణ మేమిటో గ్రహించావా? సురలు భగవంతుని ఆశ్రయించారు. అసురులు భగవంతుని ఆశ్రయింపక స్వశక్తిని విశ్వసించి వర్తించారు. అసురుల భావమేమిటి? కర్మమే ఫలాన్నిస్తుందని వారి విశ్వాసం. కర్మము జడము కాబట్టి దానికి స్వతంత్రశక్తి

లేదు. ఫలాన్ని ఇవ్వగలిగిన శక్తి సర్వేశ్వరునికి మాత్రమే ఉన్నది. భగవానుడు తనను ఆశ్రయించినవారి కోరికలను నెరవేరుస్తాడు.

> రాజా! దేహధారులకు కర్మాచరణ తప్పదు. కర్మములన్నీ మనోవాక్కాయముల చేత జరుపబడేవి. సంకల్పాన్ని బట్టి ఫలప్రాప్తి ఉంటుంది. సంకల్పం స్వార్థమో స్వజనార్థమో అయితే అది అహంకార మమకారపూర్వకం అవుతుంది. పైగా దానిని భేదభావం అంటిపెట్టుకొని ఉంటుంది. అటువంటి సంకల్పంతో కూడిన కర్మముల ఫలం శుభంకరమూ శాశ్వతమూ కానేరదు. ఆ కర్మములనే అభేదదృష్టితో భగవదర్పణగా నెరవేర్చితే సర్వజ్ఞుడైన భగవానుడు ఎవరికి ఎప్పుడు ఏది మేలో దానినే అనుగ్రహిస్తాడు. ఆ ఫలం శుభాన్ని చేకూరుస్తుంది. మర్త్యులకు స్వధర్మ రూపకర్మలను చేయటానికి మాత్రమే అధికారం ఉన్నది. ఫలప్రాప్తి ఈశ్వరాధీనం. ఈ రహస్యాన్ని తెలుసుకొని వర్తించేవారికి మేలే జరుగుతుంది.

రాజేంద్రా! భగవానుడు ఆ విధంగా కన్యారూపాన్ని ధరించి తనను ఆశ్రయించిన సురలకు అమృతాన్ని చెందజేసి అందరూ చూస్తుండగా గరుడారూఢుడై స్వస్థానానికి వెళ్ళిపోయాడు.

## దేవాసుర యుద్ధం

అసురులు భగ్నమనోరథులై జరిగినదంతా సురల కపటనాటకఫలమని నిశ్చయించి ఆయుధపాణులై వారిని మార్కొన్నారు. సురలు కూడా అమృతప్రభావం వలన ధైర్యోత్సాహాలు కలిగి వెనుదీయక శస్త్రాస్త్రాలతో అసురులను ఢీకొన్నారు. భేరీశంఖవాద్యనాదాలు, గజబృంహితాలు, హయహేషలు, రథనేమిధ్వానాలు, భటుల ఆరభటులు చెలరేగి తుములమై మారుమ్రోగాయి. రథికులు రథికులతో గజాలు గజాలతో హయాలు హయాలతో కాల్బలం కాల్బలంతో ఎదుర్కొన్నారు. ఇరుపక్షాలలోనూ కొందరు

మాయాబలాన్ని ఆశ్రయించి వివిధమృగరూపాలను ధరించి ఏ జాతితో ఆ జాతి పోరాడసాగింది.

చిత్రధ్వజాలు చిరిగి చింపులై రాలాయి; శ్వేతాతపత్రాలు చెల్లాచెదరయ్యాయి; చామరవ్యంజనాలు వజ్రమయదండాలతో పుష్పరజమై నేలకు విరిగిపడ్డాయి; ఉత్తరీయాలు వాతోద్ధూతాలై గాలి పడగల వలె నింగికి ఎగిరాయి; రత్నకిరీటాలు రాలి పాదఘట్టనాల వలన తుత్తుమురై రూపుమాశాయి.

అసురేశ్వరుడైన బలి యుద్ధానికి సన్నద్ధుడై తనకోసం మయుడు నిర్మించి ఇచ్చిన కామగమనమైన వైహాయసవిమానం అధిరోహించి సర్వసేనాసమేతంగా రణరంగానికి తరలివచ్చాడు. అతనిని పరివేష్టించి సేనానాయకులు నముచి శంబర బాణ విప్రచిత్తులు, అయోముఖ ద్విమూర్ధ కాలనాభ హేతి ప్రహేతులు, ఇల్వల శకుని భూతసంత్రాసన వజ్రదంష్ట్ర విరోచన హయగ్రీవ శంకుశిరః కపి లోగ్రదృష్టులు, మేఘ దుందుభి తారక శుంభ నిశుంభ జంభులు, ఉత్తల అరిష్ట అరిష్టనేమి మయులు, పౌలోమ కాలకేయ నివాతకవచాదులు నడిచారు. ఆర్పులు పేర్పులు మెండయి అంతరాళాన్ని బద్దలుచేశాయి.

అసురవిజృంభణను చూసి దేవేంద్రుడు ఐరావతాన్ని అధిరోహించి సంగరానికి బయలు దేరాడు. వాయు వహ్ని వరుణాదులు తమ తమ వాహనాలను అధిష్ఠించి సర్వాయుధ సమగ్రంగా సురేశ్వరుని వెంబడించారు. ఉభయసేనలు తలపడ్డాయి. వీరులు తమ తమ పేర్లు చెప్పి వైరివీరులను పోరికి పిలిచారు. మహావీరులు జతలై ఒకరినొకరు తాకారు.

దేవేంద్రుడు బలిని ఢీకొన్నాడు; స్కందుడు తారకుని ఎదుర్కొన్నాడు; వరుణుడు హేతిని, మిత్రుడు ప్రహేతిని, యముడు కాలనాభుని, విశ్వకర్మ మయుని, త్వష్ట శంబరుని, సవితృడు విరోచనుని, పరాజితుడు నముచిని, అశ్వినులు వృషపర్వుని, సూర్యుడు బాణప్రముఖ బలిసుతశతాన్ని, సోముడు

రాహువును, అనిలుడు పులోముని, భద్రకాళి శుంభనిశుంభులను, వృషాకపి జంభుని, విభావసుడు మహిషుని, బ్రహ్మ తనయులు ఇల్వలవాతాపులను, కామదేవుడు దుర్మర్షుని, మాతృగణం ఉత్కలుని, బృహస్పతి భార్గవుని, శని నరకుని, మరుత్తులు నివాతకవచులను, వసువులు కాలకేయులను, విశ్వదేవులు పౌలోములను, రుద్రులు క్రోధవశులను మార్కొన్నారు. ఆ విధంగా వారు జంటజంటలై మార్కొని జిగీషాసముత్సుకులై బాణ కృపాణ తోమర పరశు పరిఘ ప్రాసాలను మార్చి మార్చి ప్రయోగించారు.

రథికుల మస్తకాలు తెగి రాలాయి; గజాంగాలు తునిగిపడ్డాయి; తురంగగాత్రాలు ఛిన్నాభిన్నమయ్యాయి; మావటీంద్ర తలలు తెగి నేలకూలాయి; కాల్బలం నుగ్గునూచమై సోలిపడింది; రథాలు తుత్తునియలై ఒరిగాయి; ఆయుధాలు ముక్కలైపోయాయి; భూషణాలు చెల్లాచెదరుగా పడి రణక్షోణి రుధిరసిక్తమై దుర్నిరీక్షమయింది. సైన్యపాదఘట్టనల ధూళి చెలరేగి రవిమండలాన్ని కప్పివేసింది; చీకట్లు వ్యాపించాయి. కొందరు చచ్చిపడినా చేతులలోని ఖడ్గాలను వదిలిపెట్టలేదు. కొందరు తలలు తెగిపడినా మొండెం తోనే వైరుల మీదికి పాకుతుండటం కనిపించింది.

## బలి దేవేంద్రుల యుద్ధం

రాజా! బలి దేవేంద్రుని ఎదుర్కొని అతనిమీద పది బాణాలను, అతని ఏనుగు మీద మూడు శరాలను, ఆ గజపాద రక్షకులు నలుగురి పైని నాల్గు తూపులను, మావటీవాడిపై ఒక ములుకును ప్రయోగించాడు. ఇంద్రుడు బలిని చూసి నవ్వుతూ ప్రతిశరాలను వేసి అతని శరాలన్నింటినీ మార్గమధ్యం లోనే త్రుంచివేశాడు. అంతట బలి శక్తిని చేతబట్టాడు. కొరివికట్టెలా మండుతూ భయంకరంగా ఉన్న ఆ సాధనాన్ని బలి చేతిలో ఉండగానే ఇంద్రుడు తెగనరికాడు. బలి మహోగ్రుడై శూలతోమరాదులను ఒక్కొక్కటే గ్రహింపసాగాడు. ఇంద్రుడు వాటన్నిటినీ ఖండించాడు.

నరేంద్రా! బలి ఆ విధంగా తన ఆయుధాలన్నీ వట్టిపోవటం చూసి ముఖాముఖి యుద్ధాల వలన ప్రయోజనం లేదని తలపోసి అంతర్ధానుడై అసురమాయను పుట్టించాడు. తత్ఫలంగా పెనుకొండ ఒకటి మంటలు మండుతుండగా వచ్చి సురసేన మీద పడింది. దాని పాటుకు సురసైన్యం పొడిపొడి అయిపోయింది. పైగా ఆ కొండమీది నుంచి సింహ వ్యాఘ్ర వరాహ దందశూక వృశ్చికాది క్రూరజంతువులు తండోపతండాలుగా ఉప్పతిల్లి హతశేషమైన నిర్జరసేనను చంపసాగాయి. యాతుధానులు శూలాలను పట్టుకొని దిసమొలలతో రణరంగాన్ని ప్రవేశించి అరుపులు పెడబొబ్బలతో నిబ్బరంగా తిరగటం మొదలుపెట్టారు. కారుమేఘాలు క్రమ్ముకొని ఫెళఫెళ ఉరుముతూ తళతళ మెరపులీనుతూ అంగారకాలను కురిశాయి. వాయువు ప్రచండగతి నొందింది. నిప్పు గాడ్పులు భోరున వీచాయి. సాగరం మహాకల్లోలాభీలమై పొంగిపొరలింది. దైత్యమాయా విశేషాలు దురూహాలుగా విజృంభించాయి.

ఇంద్రాదులు దానికి ప్రతిక్రియ ఏమిటో తెలియక దిగాలుపడి భగవంతుని తలచుకొంటూ ఎక్కడివారక్కడ కొయ్యబారి నిలబడ్డారు. భగవానుడు గరుడారూఢుడై సన్నిధి చేశాడు. అతని రాకతో దైత్యమాయలన్నీ మాయమయ్యాయి.

## కాలనేమ్యాదుల సంహారం

కాలనేమి హరిని చూసి సింహారూఢుడై శూలాన్ని ఎత్తి పట్టుకొని సత్తువ కొద్దీ భగవానుని మీదికి విసిరాడు. సర్వేశ్వరుడు ఆ శూలాన్ని అందుకొని దానితోనే కాలనేమిని, అతని వాహనాన్ని తుదముట్టించాడు. కాలనేమి పాటు చూసి మాలి, సుమాలి క్రోధమూర్ఛితులై గదలుపట్టి విజృంభించారు. భగవానుడు చక్రంతో మాలి తలను ఖండించాడు. సుమాలి వెన్నుచూపి చావు తప్పించుకొన్నాడు. లోకనాథుని కారుణ్య విశేషం వలన సురలు పునర్జీవితులై లేచి నూత్నబలాన్ని పొందారు. సురాసురులకు మళ్ళీ జంట పోరాటమయింది.

## బలిదేవేంద్రుల సంవాదం

రాజా! ఇంద్రుడు వజ్రాన్ని పైకెత్తి బలిమీద వేయబోయాడు. హాహాకారాలు మిన్నుముట్టాయి. సురనాథుడు ఆ ధ్వనులు విని బలిని సమీపించి, 'మూర్ఖుడా! వంచకులు పసివాళ్ల కన్నుమూసి వారి సొమ్ములు హరించినట్లు నీవు మమ్మల్నందరినీ నీ మాయలతో గెలుద్దామని అనుకొన్నావు. మాయేశ్వరులమైన మా వద్ద నీ టక్కులు సాగుతాయా? దొంగలు కొందరు మాయలు పన్ని స్వర్గాన్ని చేపట్టాలని ప్రయత్నిస్తుంటారు. వారిని కిందికి విసిరికొడుతుంటాము. నీ దుర్మాయాఫలాన్ని నీవు అనుభవింపక తీరదు. ఇదే నా వజ్రాయుధం వేటు పడి నీ వారిని చేరు' అని అధిక్షేపాలు పలికాడు. బలి అతని మాటలను విని, 'లోకంలో ఎవరైనా కాలచోదితులై తత్తత్కర్మలను ఆచరిస్తారు. మనమూ అలాగే కాలచోదితులమై సంగ్రామకర్మకు ఉపక్రమించాము. సంగ్రామ పరులకు జయకీర్తులో పరాజయమృత్యువులో ఏదో ఒకటి తప్పదు. ప్రాణులు ఈ విధంగా కాలపాశబద్ధులై వర్తిస్తున్న సంగతిని గుర్తించి పండితులు గెలుపోటములకు హర్షశోకాలను చెందరు. జయాపజయాలు స్వశక్తిని బట్టి కలుగుతాయని కొందరు భావిస్తుంటారు. అది తెలివిగలవారి తలపు కాదు. అజ్ఞానుల ఎత్తిపొడుపులను మేము లెక్కింపము' అని బదులు పలికి విల్లుపూని తీవ్రబాణాలను సంధించి ఆకర్ణాంతం లాగి సురేంద్రుని పైకి వదిలాడు. బలి నిరసనోక్తులు గజేంద్రునికి తగిలిన తీవ్రాంకుశహతుల వలె సూటిగా సురేంద్రుని తాకాయి. ఇంద్రుడంతట వజ్రాయుధాన్ని బలి మీదికి ప్రయోగించాడు. దాని స్పర్శకు రెక్కలు తెగిన కొండలా బలిచక్రవర్తి వాహనంతోపాటు నేలకొరిగాడు.

## జంభాసుర దేవేంద్రుల యుద్ధం

జంభాసురుడు బలి పాటు విని, 'ఔరా! నా మిత్రుడికి ఇటువంటి దుర్విపాకమా?' అని వ్యసనాగ్రహాలను పొంది గదపూని సింహవాహనం

అధిష్ఠించి ఇంద్రునితో తలపడి అతని మూపుపైని గదతో మోది ఐరావతాన్ని తాకాడు. అతని దెబ్బకు ఐరావతం అలవు తప్పి మోకాళ్ళు నేలకు మోపి ఒరిగి మూర్ఛపోయింది. అంతలో మాతలి వేయి గుఱ్ఱాలను పూన్చిన మహారథంతో ఇంద్రుని ఎదుట నిలిచాడు. సురపతి ఆ రథాన్ని అధిరోహించాడు. జంభుడది చూసి, 'మాతలీ! నీ పని మేలుమే' లని నవ్వుతూ అగ్నిజ్వాలాభీల శూలాన్ని చేతబట్టి అతని మీదికి విసిరాడు. దాని తాకు దుస్సహమైనప్పటికీ మాతలి బాధను ఓర్చుకొన్నాడు. ఇంద్రుడు మాతలికి కలిగిన శ్రమకు జాలిపడి వజ్రంతో జంభుని శిరస్సును ఖండించాడు.

## నముచ్యాదుల యుద్ధం

జంభుని మరణవార్తను అతని జ్ఞాతులు నముచి బల పాకులు నారదుని వలన విని మహోగ్రమూర్తులై ఇంద్రుని పైకి ఉరికి కొండ మీద మేఘాలు వర్షించినట్లు బాణవర్షాన్ని అతని మీద కురిపించారు. బలుడు స్వహస్త లాఘవం సముద్దీపితంగా వేయి శరాలను ఒక్క పెట్టున సారించి ఇంద్రుని మీదికి ప్రయోగించి మరి వేయి బాణాలతో అతని రథ్యాలను నొప్పించాడు. పాకుడు బాణాల సంధాన మోక్షక్రియలు కంటికి కనబడని చందాన రెండువందల అమ్ములను మాతలి పైకి గుప్పించి వేనవేల శరాలను ప్రయోగించి రథాన్ని కంపింపజేశాడు. నముచి సువర్ణపుంఖసాయక పంచకాన్ని ఇంద్రునిపై గురిచూసి వదిలి మేఘగర్జన చేశాడు.

ఆ విధంగా దానవులు ముగ్గురూ కలిసి సురనాయకుని అతని రథ రథ్య సారథులతో పాటు శరవర్షాన ముంచెత్తటం వలన దేవేంద్రుడు వర్షఋతువున మేఘాలు ఆవరించిన సూర్యుని వలె కనిపించక పోయేసరికి అమరులు తమ నాయకుని కానక భయవిహ్వలులై దిక్కుతోచక కొయ్యబొమ్మల వలె నిశ్చేష్టులై నిలబడ్డారు. శత్రువ్యూహం ముట్టడించింది. సురలు సముద్రమధ్యంలో మునిగిపోయిన పడవలో ఉన్న వణిజుల గతినొంది భయపడసాగారు. అంతలో ఇంద్రుడు తనను ఆవరించి ఉన్న శరపంజరం నుంచి

రథరథ్యసారథులతో ఉదయార్కుని వలె వెలువడి నింగినంతటినీ వెలుగొందచేస్తూ వచ్చి శత్రుహస్తగతులై గోడు గోడుమంటున్న తన సైన్యాన్ని చూసి కోపవివశుడై వజ్రం ఎత్తి బలపాకులు ఇద్దరి తలలనూ నరికివేశాడు.

నముచి అదిచూసి శోకకోపవివశుడై ఇంద్రుని ఢీకొని, 'ఓరీ! చచ్చావు చూడు' అంటూ ధగధగ మెరుస్తున్న బంగారుశూలాన్ని అతనిపైకి విసిరి సింహనాదం చేశాడు. ఆ శూలం ఘంటా నినాదాలతో తన మీదికి వస్తూంటే ఇంద్రుడు చూసి అనేక బాణాలను ప్రయోగించి నడిదారిలోనే దానిని ముక్కలు చేసి నముచి మీదికి వజ్రాయుధాన్ని విసిరాడు. మహాశక్తిమంతమైన ఆ వజ్రాయుధం నముచిని తాకినా అతని చర్మాన్ని కూడా గీటలేకపోయింది. అందరూ ఆశ్చర్యచకితులై ముందుకు వచ్చి చూడవచ్చారు. ఇంద్రుడు తన ఆయుధం అలాగయినందుకు భీతిల్లి, 'అయ్యో! ఏది పర్వతరాజుల రెక్కలను త్రుంచి ప్రజలకు మేలుకూర్చిందో, ఏది వృత్రాసురు దంతవానిని తెగటార్చిందో, ఏది మహాబలశాలులైన యోధాగ్రేసరులను నిస్సత్త్వలను కావించిందో ఆ వజ్రాయుధం నేడీ అల్పుని యెడ శక్తిహీనం అయినదంటే ఎంతో వింతగా ఉన్నది. దధీచి మునివర్యుని బ్రహ్మతేజం నిస్తేజమయిందో, దైవయోగం ఏమి కానున్నదో ఊహకందదు' అని విషణ్ణచిత్తుడై లోలోన చింతింపసాగాడు.

అంతలో 'ఇంద్రా! ఈ దానవుడు ఆర్ద్రశుష్కాలతో చావడు. అది నా వరం. ఉపాయాంతరం చింతించు' అని గగనవాణి వినబడింది. దేవేంద్రుడు ఆ పలుకులాలించి కొంతసేపాగి శుష్కమూ కాని, ఆర్ద్రమూ కాని వస్తువేమిటో అని ఆలోచించి జలఫేనం అటువంటిదని నిశ్చయించి నురుగుతో వజ్రాన్ని అభిమంత్రించి ప్రయోగించాడు. నముచి తల తెగి నేలకు రాలిపడింది. ఋషుల ప్రస్తుతులు విశ్వావసు పరావసునామ గంధర్వుల కీర్తనల విరిజల్లులు ఇంద్రునిపై కురిశాయి. అంతట వాయు వహ్ని వరుణాదులు చెలరేగి సింహవ్యాఘ్రాదులు మృగాలను సంహరించినట్లు కనబడిన అసురులందరినీ చీల్చి చెండాడారు.

## నారదాగమనం

ఆ సమయానికి నారదుడు బ్రహ్మదేవుడు పంపగా అక్కడికి వచ్చి, 'సురలారా! శ్రీమన్నారాయణుని భుజాశ్రయం చూరగొని అమృతాన్ని సాధించారు. ఇక మీకు పోరెందుకు?' అని చెప్పి యుద్ధం మాన్పించి దానవ క్షయం వారించాడు. అమరులు క్రోధం మాని స్వర్లోకానికి వెళ్లారు.

హతశేషులైన దానవులు నారదుని అనుమతి తీసుకొని బలినెత్తుకొని అస్తాద్రికి వెళ్ళారు. శుక్రుడు బలిని స్పృశించాడు. అతను లేచి జరిగిన దానిని గుర్తుకు తెచ్చుకొని లోకతత్త్వజ్ఞుడు కాబట్టి ఓటమికి దిగులుపడక ధైర్యంగా కర్తవ్యం ఆలోచించాడు. శుక్రుడు సంజీవనీవిద్యామహిమ వలన తలలూడిన దైత్యదానవులను బ్రతికించాడు.

## శివుని కోరిక

రాజేంద్రా! శ్రీమహావిష్ణువు మోహినీ రూపంలో కావించిన అమృతవిభాగ కార్యమంతా శివునికి తెలిసింది. ముక్కంటి దేవదానవు లందరూ మెచ్చుకొంటున్న ఆ రూపాన్ని దర్శించాలని ఉత్కంఠుడై ఉమాసమేతంగా హరి వద్దకు వచ్చాడు. హరి పార్వతీపరమేశ్వరులకు సాదర సత్కారాలు జరిపి సుఖాసనాసీనులను కావించాడు. మహేశు డంతట హరివంక చూసి, 'దేవదేవా! జగద్వ్యాపివి, జగన్మయుడవు, జగదీశ్వరుడవు అయిన నీ వలన సర్వభావాలు జనించి పెంపొందుతాయి. నీవు జగదాదిమధ్యాంతకుడవు. నీకు మాత్రం ఆదిమధ్యాంతాలు కలుగవు. నీ చిద్రూపం బ్రహ్మరూపాన్ని ధరించింది. ద్రష్ట, దృశ్యము, భోక్త, భోగ్యము నీ రూపాంతరాలే గాని స్వతంత్రాలు కావు. శ్రేయస్కాములకు నీ చరణారవింద భజనమే తప్ప వేరొక గతి కలుగదు. ఐహికాముష్మిక సంగాలను త్రుంచివేసి కేవల నిష్కాములైనవారికి మాత్రమే నీ పాదారవింద భజనభాగ్యం లభిస్తుంది. ఎటువంటి కోరికలూ నీకు కలుగవు. కోరినవారికి కోర్కెలిస్తావు. సర్వమూ నీవే

అయినా సర్వాతిశాయివై ఉంటావు. అన్నిటికీ కారణానివి నీవే. నీకు కారణం కలుగదు. సువర్ణం భూషణాలలో ఉన్నట్లు కారణము కార్యమందు ఉంటుంది. కారణ కార్యైకదృష్టి అద్వైతాన్ని, కారణ కార్య ప్రత్యేకదృష్టి ద్వైతాన్ని తోపింపజేస్తుంది. అంతేకాని దృష్టిభేదం వల్ల వస్తుభేదం సిద్ధించదు. ఆ విధంగానే నీవు నీ కార్యమైన జగత్తులో నెలకొంటావు. జగత్తు భగవదన్యం కాదనే భావనతో దృష్టిని నీ యందే నిలిపి ఉంచటం అద్వైత మవుతుంది. నిన్నూ నీ కార్యాన్నీ ప్రత్యేకించి చూడటం ద్వైతమవుతుంది. ఆ రెండింటిని వేరుచేసి అవి రెండూ స్వతంత్రపదార్థాలని భావించటం అజ్ఞానమవుతుంది.

దేవా! బ్రహ్మమని కొందరు, ధర్మమని కొందరు, పరుడని కొందరు, నవశక్తిమంతుడని కొందరు, మహాపురుషుడని కొందరు నిన్నొక్కడినే వివిధరీతుల పేర్కొంటారు. అందుకు వారి వారి జ్ఞాన రుచుల భేదమే కారణం. నీ తత్త్వాన్ని సమగ్రంగా గ్రహించలేకపోవటానికి కారణం లేకపోలేదు. సత్త్వప్రధానులని నన్ను, బ్రహ్మను, మరీచ్యాదిఋషులను శ్లాఘిస్తారు. అట్టి మాకు సైతం నీ విశ్వరచనావిధానం, నీ మాయా విలాసాలు గోచరింపవంటే రజస్తమః ప్రధానుల సంగతి చెప్పేదేమున్నది? ఆకాశవాయువుల వలె నీవు చరాచరజాతాన్ని వ్యాపించి ఉన్నవాడవు. దేవా! నీ గుణక్రీడలైన అవతారాలను చూశాను. నీ మోహినీ రూపాన్ని చూడాలని కోరిక కలిగి సతీసమేతంగా వచ్చాను' అన్నాడు.

భగవానుడు శివుని మాట విని, 'చంద్రశేఖరా! దైత్యులు సుధాభాండాన్ని హరించారు. ఆ అమృతాన్ని సురలకు చెందజేయాలని నారీరూపం ధరించాను. అసురులు కామవశులు కాబట్టి ఆ రూపం వారిని కామాంధకార కూపం లోనికి త్రోసివేసింది. అది నిమిత్తంగా సురలకు అమృతాన్ని అందజేశాను. ఆ రూపాన్ని చూడాలని ఇంతదూరం వచ్చావా?' అంటూ అదృశ్యమైపోయాడు. భవుడు భవానీద్వితీయుడై అటూయిటూ చూడసాగాడు.

## శివునికి మోహినీ సందర్శనం

పరీక్షిన్నరేంద్రా! ఆ చేరువనే ఉపవనం ఒకటున్నది. ఆ వనాంతరంలో ఒకానొక సుందరీమణి లీలాకందుకంతో క్రీడిస్తుంటే ఆమె గుండెలు ఎగసిపడుతూ కన్నులపంటగా గోచరించింది. నెన్నడుము ఉత్తుంగ కుచభారానికి కృశించి ఉండటమూ, కందుకం పాదతలాన్ని తాకినప్పుడు ఆమె చరణరాగరంజితమై ఎరుపు రంగును పొందటమూ, పైకెగిరినప్పుడు ఆమె నయనాల నీలచ్ఛాయ వలన నైల్యాన్ని వహించటమూ మహాచిత్రంగా కనిపించింది. ఆ బంతివెంట హంసగమనాలతో నడయాడుతున్న ఆ లావణ్యలహరి ద్వగ్విలసనాలు వర్ణనాతీతంగా భాసించాయి. ఆట వడికి ఆమె దుకూలం పట్టుదప్పి జారిపోతున్నది; జడముడి వీడింది; ముంగురులు నెమ్మోముపై అసియాడుతుండగా ఆమె కేళిపరయై ఒక చేతితో చీరను, ముంగురులను సవరించుకొంటూ మరొక చేతితో బంతిని పట్టుకొని ఆటలాడుతున్నది. అంతలో బంతి చేయి జారి దూరానికి పోయింది. ఆ సుకుమారి దాని వెంట పరుగెత్తబోయింది. ఆ వేగానికి మొలనూలు సడలింది. సన్నని చీరె గాలికి సడలి క్రిందికి జారింది.

శివుడు ఆ మనోజ్ఞమూర్తి లీలాచేష్టలను చూస్తుండగానే అతనికి వలపు పైకొన్నది. తెలివి తప్పినట్లయింది. మనస్సు అపూర్వమైన పారవశ్యాన్ని పొందగా సిగ్గు విడిచి ఉమాదేవి చెంతనున్న సంగతి కూడా మరచి ముక్కంటి ఆ నీటుకత్తె చన్నుగవనుతాకగోరి హుటాహుటి ముందుకు నడిచాడు. పురుషుడు చేరికగా వస్తుంటే చూసి ఆ కాంత వస్త్రహీన కాబట్టి సిగ్గుతో నవ్వుతూ పొదల చాటున దాగింది. శివుడు కామోన్మథితుడై ఆ వగలాడిని సమీపించి ఆమె వద్దు వద్దంటున్నా వినక కౌగిటగూర్చి ఆమెను ముద్దాడబోయాడు. ఆ హొయల బొమ్మ కొంత పెనుగులాడి అతని కౌగిలి తప్పించుకొని ముందుకు నడిచింది. కరిరాజు కరేణువును వెన్నాడినట్లు ముక్కంటి ఆ కన్యామణిని అనుసరించాడు. అతని రేతస్సు స్ఖలించి దారిలో పడింది. అది పడిన చోట్లల్లా బంగారు, వెండి క్షేత్రాలైనాయి. రేతః

స్ఖలనానంతరం శివుడు కొంత స్వస్థత చెంది జరిగినదంతా విష్ణుమాయావిలాసమని గ్రహించి తల పంకించి సిగ్గుపడ్డాడు.

అంతలో శ్రీమహావిష్ణువు సన్నిహితుడై, 'మహేశ్వరా! నా మాయకు మోహపడినా ఆత్మశక్తిని వెలయించి స్వనిష్ఠను వహించావు. నీ కంటె అన్యులెవరూ నా మాయను దాటగలవారు కారు. నేను కామరూపుడను; నా శక్తి గుణాత్మకయై నన్ను ఆశ్రయించుకొని ఉంటుంది. ఆ మాయ నిన్నెప్పుడు వంచింపదు' అని పలికి శివునికి యథోచితసత్కారాలను చేశాడు. మహాదేవుడు విష్ణునికి వీడ్కొలిపి ఉమాద్వితీయుడై స్వస్థానానికి వెళ్ళాడు.

## శివపార్వతుల సంభాషణ

రాజేంద్రా! ఒకనాడు శివుడు భవానీ సహితుడై ఉండగా ఋషులక్కడికి వచ్చారు. శివుడు భార్యవంకకు తిరిగి ఋషులు వింటుండగా 'దేవీ! పరమపురుషుని మాయావిలాసాన్ని చూశావు కదా? సకలకళలకు ఈశ్వరుడనని, ఆత్మవశుడనని నన్నంటారు. అటువంటిది నేను కూడా అతని మాయకు మోహాన్ని పొందాను. అస్వతంత్రుల గతి చెప్పేదేమున్నది? సఖీ! వేయేండ్లు నేను యోగనిష్ఠను పూని దీక్ష చాలించినప్పుడు 'దేవా! ఎవ్వని గూర్చి ఇంత నిష్ఠ వహించా? వని ఆనాడు నీవు నన్నడిగినమాట జ్ఞాపకం ఉన్నదా? నా ధ్యానక్రమం ఆ పురాణపురుషుని గురించే అని గ్రహించు. అతని మహిమలు కాలానికి కూడా అగమ్యగోచరాలు' అని చెప్పాడు.

పరీక్షిన్నరేంద్రా!

**శా. పారావారముఁ ద్రచ్చుచో గిరిసముద్యద్భారమై కచ్ఛపా**
**కారుం డైన రమేశు వర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం**
**సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొంది వి**
**స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్ భూవరా!**

**మ. ఎలమిన్ దైత్యుల నాడు రూపమున మోహింపించి పీయూషముం**
**జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని**
**ర్మల రేఖన్ విలసిల్లు శ్రీవిభుని ద న్మాయావధూరూపముం**
**దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్కరూపంబుగన్.**

## మన్వాదుల వర్తనలు

రాజేంద్రా! ప్రతిమన్వంతరంలోనూ మను, మనుపుత్ర, సుర, సురేంద్ర, సప్తర్షులు భగవంతుని శాసనాన్ని నడుపుతారు. భగవంతుని శాసనమంటే ధర్మరక్షణకు మార్గోపదేశక మన్నమాట. ధర్మానికి సత్యము, దయ, శాంతి, అహింస అని నాలుగు పాదాలు. యుగాలు నాలుగని చెప్పాను. సత్యయుగంలో ధర్మం నాలుగు పాదాల, త్రేతయందు దయాదులైన మూడు పాదాలు, ద్వాపరమందు శాంత్యహింసలనే రెండు పాదాలు, కలియుగంలో అహింస అనే ఒక్కపాదమూ వర్తిల్లుతాయి. నాలుగు యుగాలు గడిచినంతనే సంధికాలం వస్తుంది. అప్పుడు ధర్మం కాలగ్రస్తమై లుప్తమవుతుంది. ధర్మప్రవర్తకాలైన శ్రుతులు మూలబడతాయి. అప్పుడు సప్తర్షులు శ్రుతులకు పునఃప్రచారం కావిస్తారు. ఆ శ్రుతిధర్మాలను మనువు ప్రవర్తింప జేస్తాడు. మనుపుత్రులు రాజులై ఆ ధర్మప్రకారం ప్రజలను పాలిస్తారు. యజ్ఞాదులు జరుగుతాయి. దేవతలు యజ్ఞభాగాలను గ్రహించి సుఖంగా ఉంటారు. ఇంద్రుడు భగవద్దత్తమైన త్రైలోక్యరాజ్యలక్ష్మిని అనుభవిస్తూ కాలవర్షాలను కురిపిస్తూ లోకాప్యాయనం కలిగిస్తూ ముజ్జగాలను పాలిస్తుంటాడు.

ధర్మానికి సత్యాదులు నాలుగు పాదాలు ఉన్న సంగతి వివరించాను. వాటిలో సత్యానికి పదకొండు అంగాలు: అబద్ధం చెప్పకపోవటం, అన్న మాటను నిలబెట్టుకోవటం, ప్రియవచనమే చెప్పటం, గురుసేవ, దృఢవ్రతుడై ఉండటం, ఆస్తిక్యబుద్ధి, సాధుసంగమం, తల్లిదండ్రులకు ప్రియమైన పని చేయటం, బాహ్యాభ్యంతర శౌచం, లజ్జాగుణం, ధనసంచయబుద్ధి లేకుండటం అన్నవి. పరోపకారం, దానం, స్మిత వచనం, వినయం, న్యూనతా భావస్వీకారం, సమతామతి – ఈ ఆరూ దయకు శాఖలవుతాయి. అసూయ

లేకుండటం, అల్పసంతోషం, ఇంద్రియ సంయమనం, అసంగత్వం, మౌనం, దైవభక్తి, నిర్భయత్వం, గాంభీర్యం, స్థైర్యం, అరూక్షత, నిఃస్పృహత్వం, దృఢమతి, వివర్జనం, సమత్వబుద్ధి, అస్తేయం, బ్రహ్మచర్యం, క్షమ, ఆతిథ్యం, జప హోమ తీర్థసేవనం, అగ్రపూజ, అమాత్సర్యం, బంధమోక్షజ్ఞానం, సన్న్యాసభావన, సహిష్ణుత్వం, అకార్పణ్యం, అమౌఢ్యం అన్నవి శాంతికి శాఖలవుతాయి. ఆసన జయం, పరపీడావివర్జనం, శ్రద్ధ, అతిథి సేవ, శాంతి, సర్వాత్మైక బుద్ధి అన్నవి అహింసకు లక్షణాలు.

భగవానుడు ప్రతియుగం లోనూ ఋషిరూపాన కర్మమును, యోగేశరూపాన జ్ఞానాన్నీ ప్రతిపాదిస్తూ ప్రజాపతి రూపంలో సర్గాన్ని, రాజరూపంలో చోరసంహారాన్ని, కాలరూపంలో లయాన్ని కావిస్తుంటాడు. భగవానుడు ఆ విధంగా సిద్ధేశ్వర రూపాలను ధరించి భిన్న భిన్న గుణాలతో వ్యవహరిస్తుంటాడు. భగవానునికి రూపనామాలు కలుగవు. అతని శక్తి మాత్రమే రూపనామాలను దాల్చి వ్యవహరిస్తుంది. శక్తివ్యవహారాన్ని మాయ అంటారు. మాయామోహితులు కావటం వల్ల జనుల దృష్టి ఆ మాయారూపాలలో తగుల్కొని ఉంటుందే కాని మాయేశ్వరుని వంక చూడదు. జనులను మాయ నుంచి ఉద్ధరించి భగవన్ముఖులను కావించేందుకు నానాశాస్త్రాలు ప్రవర్తిల్లుతున్నాయి.

## వామనావతార ఘట్టం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి మాటవిని, 'మహాత్మా! భగవానుని చరిత్రలు విన్న కొద్దీ వింతలవుతాయి. పరమేశ్వరుడు వైవస్వత మన్వంతరంలో వామనావతారం ధరించాడని అన్నారు. ఆ అవతారకార్యాన్ని వివరించండి' అని అడిగాడు. శుకయోగి చెప్పాడు.

## విశ్వజిన్మహాయాగం

రాజేంద్రా! దేవాసురయుద్ధంలో బలిచక్రవర్తి ఇంద్రజితుడై అసువులు కోల్పోయి భార్గవుని చేత బ్రతికిన సంగతి తెలిపాను. బలి ఆ విధంగా

పునర్జీవితుడై ఆ ఉపకార ప్రతిఫలంగా తన సర్వార్థాలను భృగువంశజులకు సమర్పించి వారికి శిష్యుడయ్యాడు. వారు బలి సేవకు మెచ్చి 'దానవేశ్వరా! స్వర్గజయాన్ని కోరుతున్నావు. నీ కోరిక తీర్ప నిశ్చయించాము' అని చెప్పి అతని చేత విశ్వజిన్మహాయాగాన్ని చేయించి యజ్ఞాంతంలో మహాభిషేకం చేశారు.

భార్గవుల మంత్రాహుతి ప్రభావం వలన వైనతాగ్నికుండం నుంచి సువర్ణాలంకృత రథం, ఉచ్చైశ్రవానికి సాటి వచ్చే రథ్యాలు, సింహధ్వజం వెలువడ్డాయి. ప్రహ్లాదుడు కాంచన కార్ముకాన్ని, అక్షయతూణీరాన్ని, ఒక దివ్యకవచాన్ని, వాడని పూమాలికను బలికి బహుకరించాడు. శుక్రుడు శంఖాన్ని ఇచ్చాడు. బ్రాహ్మణులు స్వస్తివాచకాలతో అతనిని దీవించారు. బలి విప్రులకు ప్రదక్షిణనమస్కారాలు కావించి ప్రహ్లాదునికి మ్రొక్కాడు. అందరూ బలిని ఆశీర్వదించి తమ తమ నివాసాలకు బయలుదేరారు.

## ఇంద్రునిపై దాడి

బలి అంతట ఆ దివ్యమాలను ధరించి ధనుర్బాణతూణీరాదులు గైకొని ఆ దివ్యరథం ఎక్కి ఆహవనీయాగ్ని వలె తేజరిల్లుతూ ఇంద్రపురజయార్థం బయలుదేరాడు. దైత్యవీరులు వేల కొలదిగా యథార్హరథాలెక్కి అతనిని అనుసరించారు. వారి కేకలకు రోదసీకుహరం చీలినట్లయింది.

## స్వర్గవర్ణనం

అందరూ స్వర్గాన్ని చేరుకొన్నారు. ఆ పురం నందనాద్యుపవనాలతో నిండి ఉన్నది. ఆ ఉపవనాలలో మందార పారిజాతాది వృక్షాలు కొమ్మలు సాచి చల్లగా నీడనిస్తూ తలిరుజొంపాలతో కోయిలలకు విందు చేస్తూ పూతేనెలతో తేటిగములకు ఆమెతలు అందిస్తూ శుకపికాలకు తియ్యని పండ్ల రసాలను సమకూరుస్తూ నిరపేక్షక భూతహితమే పరమధర్మమని చాటుతున్నట్లుగా విరాజిల్లుతున్నాయి. కోయిలలు పంచమస్వర నాదాలతో తుమ్మెదలు మధురగీతాలతో చిలుకలు ముద్దుపలుకులతో కృతజ్ఞతను తెలియజేస్తున్నాయి.

వనాంతర సరోవరాలు వికసించిన కలువపూలతో చూడముచ్చటగా సురనారీజలక్రీడా యోగ్యము లన్నట్లుగా అలరారుతున్నాయి. హంస సారసాదులు సరోవరాల లోని ఎర్రకలువలపై ఊయల లూగుతూ చూసే కొద్దీ ఇంకా చూడాలనిపించేటట్లు అలరారుతున్నాయి. మందాకినీనది ఆ పురాన్ని చుట్టి శత్రువులకు కంటగింపయిన అగడ్త వలె ప్రవహిస్తున్నది. పురాంతరం తీర్చిదిద్దినట్లున్న విశాల వీథులతో, వీథులకు ఇరుప్రక్కల వహ్నివర్ణ ప్రాకార పరివృతాలు సువర్ణకవాట ద్వార శోభితాలు స్ఫటికమయోన్నత గోపురాలు నయనపర్వంగా ఉన్న సౌధాలతో లక్ష్మీనివాస మన్నట్లున్నది. చతుష్పదాలు వజ్రవిద్రుమాది రత్నరచితవేదికలతో నిండి ఉన్నాయి. విపణులన్నీ నానారత్నరాశులతో మార్గాలను కిమ్మీరకాంతులతో వెలుగొందజేస్తూ పథికులకు విభ్రమాలు గొలుపుతున్నాయి.

అమరకాంతలు చిత్రవస్త్రాలను ధరించి శిఖావిరాజితాగ్నుల వలె చూపరులకు నేత్రోత్సవం కావిస్తూ పురవీథుల విహరిస్తున్నారు. సీమంతినీమణులు వినీలకేశపాశాలలో ముడిచి తీసివేసిన పూదండల నెత్తావులను దొంగిలించి మందమారుతుడు నక్కి నక్కి తారాడుతున్నట్లు మందమందగతుల హాయిగొలిపే వాయుప్రసారం స్వర్గభోగాలను పరిచయం చేస్తున్నట్లుగా ఉన్నది. సౌధాల సోరణగండ్లనున్న పావురాలు పథికులను గొంతెత్తి పిలిచి, అంతఃపురాల నుంచి వెలువడుతున్న అగరు ధూపాలతో పూజిస్తున్నట్లుగా ఉన్నది. ఆ పురసౌభాగ్యలక్ష్మి తన విలాసాలను ప్రకటింపగోరి నిలిచినట్లుగా మేడలపైని పతాకలు వెలిశాయి. మందిరద్వారాలు వివిధ ముక్తామణిదామశోభితాలై గీర్వాణపతుల కలిమిని వేనోళ్ళ చాటి చెబుతున్నాయి. పురశాలలు వీణా వేణుగానాలకు అభినవ నాట్యకళాప్రదర్శనలకు నెలవులై ఒప్పారుతున్నాయి. ఎటు చూసినా అమరావతి స్వతేజోనిరస్త పరతేజఃపుంజమై ద్రోహులకు శఠులకు అధర్మకాములకు ఇక్కడ చోటులేదని చాటిచెబుతున్నది.

## ఇంద్రాదుల పలాయనం

రాజేంద్రా! బలి ఆ పట్టణాన్ని ముట్టడించి శుక్రాచార్య దత్తమైన శంఖాన్ని పూరించాడు. అతని వెనుక సేనాధీశులు తమతమ శంఖాలను ఊదారు. భేరీభాంకారాలు మ్రోగాయి. ఇంద్రుడు ఆ ధ్వనులు విని బలి ఉద్యమాన్ని గ్రహించి అమరులను వెంటబెట్టుకొని సురగురువు వద్దకు వెళ్ళి నమస్కరించి, 'గురువర్యా! బలిదైత్యుడు పూర్వవైరాన్ని పురస్కరించుకొని సురపురికి దండెత్తి వచ్చాడు. అతని తేజస్సు దుస్సహంగా ఉన్నది. అతనికి సాటిరాగల వీరులున్నట్లు లేదు. ప్రళయాగ్ని వలె మండిపడుతున్న అతనిని చూడగా స్వర్గాన్నే కాక ప్రపంచమంతటినీ దహింపబోతున్నట్లుగా ఉన్నది. దేవతలందరూ భయపడుతున్నారు. అతనికి ఇంత బలతేజాలు ఎక్కడినుంచి వచ్చాయో, స్వర్గం మీదికి ఎందుకు వచ్చాడో తెలియడం లేదు' అన్నాడు.

బృహస్పతి తన చెంతనున్నవారందరినీ కలయజూసి, 'అమరులారా! బలి ఔన్నత్యానికి అతని గురువైన భార్గవుల ప్రసాదం కారణమని గ్రహించండి. సురేశ్వరా! నీవు గాని నీకు మించినవాడు గాని అతనిని ఇప్పుడెదిరించటం వీలుకాదు. ఏ విప్రుని బలం వలన అతనికింత బలవిక్రమాలు కలిగాయో, ఆ విప్రుని మూలంగానే అతను సబాంధవంగా నశిస్తాడు. అంతదాకా మీరు వేచి ఉండాలి. కాలం విపరీతమైనప్పుడు తొందరపడితే మంచి కూడా చెడుగా మారుతుంది. కాలాన్ని ఎదిరింపగలమా? ప్రస్తుతానికి మీరు మీ ఊరు విడిచి ఎక్కడైనా తలదాచుకోవటం మంచిది' అని హితవు చెప్పాడు.

## బలికి ఇంద్రసింహాసనలబ్ధి

రాజా! బృహస్పతి కాలజ్ఞు డైనందున అతని మాటను సురలు తలదాల్చి కామరూపాలు ధరించి స్వర్గాన్ని వదిలిపెట్టి పారిపోయారు. ఆ సంగతి తెలిసి బలి అమరపురాన్ని నిరాతంకంగా ప్రవేశించి ఇంద్రపీఠిని అధిష్ఠించి తన ఆజ్ఞను ముల్లోకాలలో చాటింపజేశాడు. భార్గవులు తమ శిష్యుని విశ్వవిజయానికి సంతసించి అతని చేత నూరు అశ్వమేధయాగాలు

చేయించారు. బలి కీర్తి దశదిశలకు వ్యాపించింది. అతను విప్రప్రసాదితలక్ష్మీ విభవుడై కృతకృత్యుడనని భావించి తారామధ్య పూర్ణచంద్రుని వలె దైత్యదానవలోక మధ్యాన తేజరిల్లాడు.

## అదితి విలాపం

నరేంద్రా! అదితి సంతానం సురలన్న సంగతి నీకు తెలుసుకదా. అమరుల పాటు చెవిని పడగానే బిడ్డల కోసం అదితి అనాథ వలె పరితపింపసాగింది. కొన్నాళ్ళకు కశ్యపుడు సమాధియోగాన్ని ముగించుకొని దేశాంతరం నుంచి అదితి ఉన్న ఆశ్రమానికి అరుదెంచాడు. ఎటుచూసినా ఆశ్రమం అతనికి ఉత్సవానంద రహితంగా కానవచ్చింది. సంగతేమిటో అనుకుంటూ కశ్యపుడు లోనికేగాడు. అదితి భర్తకు సముచిత సత్కారాలను కావించింది. అతను సమాసీనుడై, ఆప్యాయనంగా ఆమెను పలకరించాడు. 'కళ్యాణీ! గోవిప్రధర్మాలకూ లోకానికీ అశుభమేమీ జరగలేదు కదా. గృహమేధినీ! గృహాలు యోగహీనులకు కూడా యోగఫలాన్ని కూర్చేవి కనుక గృహాలలో త్రివర్గాలు నిర్వికల్పంగా సాగుతున్నాయి కదా. కుటుంబినులకు కుటుంబవ్యాపారాలు తరిగేవి కావు. అటువంటి వ్యాపారపరత వల్ల అతిథిపూజలు ఉపేక్షింపబడటం లేదు కదా. అతిథులెవ్వరు గాని అలిగి వెళ్ళలేదు కదా. కళ్యాణీ! ఎవరి ఇంటిలో అతిథిపూజారూప సత్క్రియ చివరికి జలదాన మాత్రమయినా చేయబడదో ఆ ఇల్లు నక్క బొరియగా మారుతుంది. నేను దేశాంతరం వెళ్లినందుకు ఖిన్నమతివై ఆ కారణాన సకాల నిత్యాగ్నిహోత్ర కార్యాన్ని ఉపేక్షింపవు కదా. గృహస్థులకు అగ్నిపూజ వలననే సర్వకామ సిద్ధి, ఉత్తమలోక సిద్ధి కలుగుతాయి. విప్రుడంటే అగ్నితో సమానం. శ్రీమహావిష్ణుదేవునికి ముఖం. విప్రులను ఆరాధించటమంటే భగవంతుని ఆరాధించినట్లే అవుతుంది. ప్రేయసీ! నీ తనయులకు కుశలమే కదా. నీ ముఖంలో దైన్యం కనబడుతున్నది. కారణమేమిటి? ఏదైనా అస్వస్థత కలిగిందా? సంగతేమిటో చెప్పు' అని అడిగాడు.

అదితి భర్తృవచనాలు విని 'బ్రహ్మర్షివర్యా! విప్రులు, గోవుల గోధర్మాలకు, లోకానికి కుశలమే. గృహస్థాశ్రమం ధర్మార్థకామాలకు క్షేత్రమని మరిచిపోను; అటువంటి క్రియలలో ఏమరుపాటు చెందను. అగ్నిపూజ, అతిథి పూజ, భృత్యభరణం, భిక్షుపోషణ మిమ్మల్నే ధ్యానిస్తూ నిర్వర్తిస్తాను కాబట్టి ఏ కొరతా ఏర్పడటం లేదు. ఋషిచంద్రమా! ధర్మమూర్తులు మీరుండగా మీరు తలపెట్టిన ధర్మాలకు లోపం కలుగుతుందా? దేవా! సత్త్వరజస్తమో గుణాశ్రయులైన సురాసురులు మీ మనశ్శరీరాల నుంచి జన్మించారు. పరమేశ్వరుడు తన భక్తులనే కరుణిస్తాడు. మీరు అందరినీ ఒకే తీరున కరుణిస్తారు. నా సుతులైన సురలు సిరినే గాక ఇల్లూ వాకిలీ లేక నిలువనీడ లేనివారయ్యారు. ఇటువంటి దుర్గతి నాకెందుకు కలిగినదని ఆలోచించాను. వైరులు నిమిత్తమాత్రులు. విప్రబలమే కారణం. కష్టాల పాలైన మీ బిడ్డలను మీరు కాకపోతే మరెవరు కాపాడుతారు?' అని విన్నవించింది.

## సతీ సాంత్వనం

కశ్యపుడు భార్య మాటలకు నవ్వుతూ ఆమెను ప్రణయవచనాలతో ఓదార్చాడు. 'ప్రేయసీ! భగవన్మాయాబలం ఊహింపనైనా వీలుకానిది. అది విశ్వమంతటినీ స్నేహపాశంతో కట్టి ఆటలాడిస్తుంది. దేహాలు పంచభూత నిర్మితాలని అంటారు. పంచభూతాలు ఎక్కడి నుంచి వచ్చాయి? దేహరచనాశక్తిని వాటికి ఎవరిచ్చారు? అన్నిటికీ ఆద్యుడొకడు ఉన్నాడు. అతడే అందరికీ శరణం.

అదితీ! భార్యాబిడ్డలు, కొడుకు కోడళ్ళు, ఎవరూ భగవదన్యులు కారు. వారిని భగవదన్యులుగా భావించటం భ్రాంతిమూలకం. భ్రాంతికి మోహమే కారణం. మోహాన్ని వదలి భగవానుని ఆశ్రయించు; నీ కోర్కెలు నెరవేరుతాయి. భగవత్సేవ ఒక్కటే అమోఘఫలకారి. తక్కినవన్నీ ఎండమావులు' అని చెప్పాడు. అదితి ఆ వచనాలను విని, 'దేవా! జగద్గురువును ఏ విధంగా ఉపాసించాలో, ఏమి చేస్తే ఆ దీనవత్సలుడు కరిగి నా బిడ్డల కష్టాలు మాన్పి నాకు మనశ్శాంతి కలిగిస్తాడో సెలవీయండి' అని ప్రార్థించింది.

## పయోవ్రత విధానం

నరేంద్రా! కశ్యపుడు ఆమె ప్రణయాన్ని మనస్కరించి, ఆమెకు వ్రతాచరణ విధిని బోధించాడు. 'కళ్యాణీ! భగవంతుని పయోవ్రతవిధానంతో పూజించితే త్వరగా నీ కోర్కె నెరవేరుతుంది. ఆ వ్రతవిధానం చెబుతాను విను.

మాఘమాసాంతంలో అమావాస్య గడిచిన తెల్లవారుజామున ఫాల్గుణ శుక్లపక్షం మొదలవుతుంది. శుక్లపక్ష ప్రథమదివసాన వేకువను లేచి అడవిపందులు కుళ్ళగించిన మట్టిని శరీరానికి పూసుకొని ఏటిలో స్నానం చేసి గట్టున నిలిచి భూదేవిని సంకల్పించి, 'ఏ దేవి వరాహమూర్తి చేత ఉద్ధృతయై స్వస్థానం చేరినదో ఆ దేవికి నమస్కారం. తల్లీ! నా పాపాలను పరిహరించు' అని చెప్పి మళ్ళీ స్నానం చేసి నిత్యనైమిత్తికకర్మలను తీర్చి సమాధానచిత్తంతో 'ఓం భగవతే నమః, ఓం పురుషాయ నమః, ఓం మహీయసే మమః, ఓం సర్వభూతనివాసాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం సాక్షిణే నమః, ఓం అవ్యక్తాయ నమః, ఓం సూక్ష్మాయ నమః, ఓం ప్రధానపురుషాయ నమః, ఓం చతుర్వింశ గుణజ్ఞాయ నమః, ఓం సాంఖ్య ప్రవర్తకాయ నమః, ఓం ద్విశీర్షాయ నమః, ఓం త్రిపాదాయ నమః, ఓం చతుశ్శృంగాయ నమః, ఓం ఫలవిస్తారాయ నమః, ఓం సప్తహస్తాయ నమః, ఓం యజ్ఞాయ నమః, ఓం త్రయీవిద్యాత్మాయ నమః, ఓం శివాయనమః, ఓం రుద్రాయనమః, ఓం శక్తిధరాయ నమః, ఓం సర్వవిద్యాధిపతయే నమః, ఓం భూతపతయే నమః, ఓం హిరణ్యగర్భాయ నమః, ఓం ప్రాణాయనమః, ఓం జగదాత్మాయ నమః, ఓం యోగైశ్వర్య శరీరాయ నమః, ఓం యోగహేతవే నమః, ఓం ఆదిదేవాయ నమః, ఓం దేవదేవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం ఋషయే నమః, ఓం నరాయ నమః, ఓం హరయే నమః, ఓం మరకత శ్యామాంగాయ నమః, ఓం అధిగతశ్రీకాయ నమః, ఓం కేశవాయ నమః, ఓం పీతాంబరాయ నమః' అని ప్రార్థించి సాష్టాంగం చేసి ఏకాగ్రబుద్ధితో 'వరేణ్యా! వరదర్షభా! సర్వవరప్రదుడవు కాబట్టి శ్రేయస్కాములు నీ చరణోపాసన కావిస్తారు. నీ పాదపద్మాలను ఆశ్రయించాను. ప్రసన్నుడవు కావయ్యా' అని మొరపెట్టుకోవాలి.

భగవానుడు పిలవగానే వస్తాడు. ఈ ప్రకారం ప్రార్థించి అతనికి పాద్యాల నిచ్చి పాలతో అభిషేకం చేసి ఆచమన వస్త్ర చందన మాల్యాభరణాదులు సమర్పించి నివేదించాలి. కలిమి గలవారయితే శాల్యన్నం పాలతో వండి బెల్లం నెయ్యి కలిపి పాయసంగా నివేదించటం మేలు. నివేదనానంతరం 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అని ద్వాదశాక్షర మంత్రాన్ని జపించి జగదీశునికి ఆచమనీయం ఇచ్చి తాంబూలం సమర్పించి మూలమంత్రాన్ని నూటయెనిమిది పర్యాయాలు జపించి స్తుతించి ప్రదక్షిణపూర్వక సాష్టాంగప్రణామం చేసి ఆ దేవదేవుని అర్చించిన పుష్పాలను తలదాల్చి భగవానునికి ఉద్వాసం చెప్పి పాయసాన్నాన్ని ఇద్దరికి తక్కువ కాకుండా బ్రాహ్మణులకు యథోచితంగా నివేదించి వారి ఆజ్ఞనొంది శేషాన్ని తన ఇష్టజనులతో కలిసి భుజించాలి.

ఆ తర్వాత వ్రతాంతం వరకు బ్రహ్మచర్యం భూశయనం త్రికాల స్నానం తప్పవు. వ్యర్థప్రసంగాలకు పోకూడదు. భోగాలన్నింటినీ ఉజ్జగించాలి. భూతహింస మనోవాక్కాయములలో దేని చేతనైనా నిషిద్ధం. నిరంతరం వాసుదేవపరాయణ బుద్ధి కలిగి హరికథలతో కాలం గడపాలి.

పన్నెండు రోజులకు వ్రతం పూర్తయిన తర్వాత త్రయోదశినాడు పంచగవ్యాలతో భగవానుని అభిషేకించి ఉదారబుద్ధితో శాస్త్రప్రకారం మహాపూజ చేసి శిపివిష్ట విష్ణు దేవతాకంగా చరునిర్వపణం చేసి పురుషసూక్తాన వేల్చి నివేదించి జ్ఞాని అయిన ఆచార్యునికి ఋత్విజులకు వస్త్రాభరణ ధేనుదానాలు కావించి వారికి మృష్టాన్నతృప్తి కలిగించి అభ్యాగతులకు ఆబ్రాహ్మణచండాలాంతం విందు చేయాలి. అన్నదానం చేసేటప్పుడు దీనాంధ బధిరాదికృపణులకు ముఖ్యంగా వడ్డించాలి. తర్వాత తాను సబాంధవంగా కూర్చొని భుజించాలి. అది శ్రీవిష్ణుప్రీణన మవుతుంది.

కళ్యాణీ! ఈ వ్రతాన్ని నాకు నా పితామహుడు ఉపదేశించాడు. ఈ వ్రతపూర్వకంగా శుద్ధచిత్తంతో భగవంతుని ఆరాధించు. ఇది సామాన్యవ్రతం కాదు. ఇందులో సర్వయజ్ఞాలు సర్వవ్రతాలు సర్వదానాలు అంతర్భూతమై ఉన్నాయి. ఇంతెందుకు? ఇది తపస్సారమైన మహావ్రతం. దీనిని ఆచరించితే

భగవానుడు సంతసించి అచిర కాలంలోనే నీ మనోరథాన్ని సమకూర్చుతాడు’ అని చెప్పాడు.

## అదితికి భగవానుని వరం

రాజేంద్రా! అదితి కశ్యపుడు చెప్పినట్లుగా వ్రతనిష్ఠ పూని బుద్ధి అనే సారథిని వశపరచుకొని ఆ సారథి చేతికి మనస్సనే పగ్గాన్ని ఇచ్చి ఇంద్రియాలనే పొగరు గుఱ్ఱాలను బిగియబట్టించి ఏకాగ్రమతితో ఆ వ్రతాన్ని పన్నెండు దినాలు పొల్లుపోనీక నడిపి పదమూడవ నాడు యథావిధి కర్తవ్యాలను నెరవేర్చింది. భగవానుడు ఆ దేవమాతకు దర్శన భాగ్యాన్ని ప్రసాదించాడు.

చతుర్భుజాలలో శంఖచక్రగదాదులను ధరించి పీతాంబరం కట్టుకొన్న ఆ దివ్యమంగళమూర్తి నేత్రగోచరమైనంతనే అదితి సంతోషవివశురాలై సాగిలబడి లేచి చేతులు జోడించి ఏదో అనబోయి ఆనందాతిశయం వల్ల నోరాడక కొంతసేపటికి తాల్మివహించి,

**సీ. యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణమం**
**గళ నామధేయ! లోకస్వరూప!**

**యాపన్న భక్తజనార్తివిఖండన!**
**దీనలోకాధార! తీర్థపాద!**

**విశ్వోద్భవ స్థితి విలయకారణభూత!**
**సంతతానంద! శశ్వద్విలాస!**

**యాయువు దేహంబు ననుపమలక్ష్మియు**
**వసుధయు దివముఁ ద్రివర్గములను**

**తే. వైదికజ్ఞానయుక్తియు వైరిజయము**
**నిన్ను గొలువని నరులకు నెఱయఁ గలదె**
**వినుతమందార! గుణహార! వేదసార!**
**ప్రణుతవత్సల! పద్మాక్ష! పరమపురుష!**

**ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి**
**నాక మేలుచున్న నాఁటనుండి**
**కన్న కడుపు గాన కంట గూరుకు రాదు**
**కడుపు మంట మాన్పి కావవయ్య.**

అని నుతించి నతించింది. భగవానుడు ఆమె మొర విని, 'దేవజననీ! వైరులు నీ కొడుకుల సిరిని హరించి వారిని స్థానభ్రష్టులను చేసి తరిమివేయటం, నీవు నీ బిడ్డలకోసం పరితపించటం నేనెరుగుదును. నీవు కోరినట్లు నీ సుతులకు యథాపూర్వవిభవాన్ని ఇచ్చి వారిని సుఖింపజేస్తాను. అసురులు కాలబలం వలన, విప్రసాహాయ్యం వలన వృద్ధిలోకి వచ్చారు. వారి బలాన్ని అణచివేయటానికి ఇది సమయం కాదు. నీవు ఎంతో కఠినవ్రతం పూని నన్ను ఆరాధించావు. నీ వ్రతానికి మెచ్చి నీకు ప్రత్యక్షమయ్యాను. ప్రత్యక్షమైనాక నీ కోరికను తీర్పకపోవటం భావ్యం కాదు. నేను నా అంశతో నీకు సుతుడనై జన్మించి మారీచ తపోవ్రతం అనుష్ఠించి నీ సుతులకు మేలు కావిస్తాను. నీవు నన్ను ధ్యానిస్తూ నీ పతిసేవలో నిమగ్నురాలివై ఉండు. ఇది దేవరహస్యం. ఇతరులకు చెప్పవద్దు. దేవ రహస్యాలు సురక్షితంగా ఉంటే సాధువులకు మేలు కలుగుతుంది' అని చెప్పి అంతర్హితుడయ్యాడు.

రాజా! ఆ వచనాలను అమృతాయమానంగా గ్రోలి కశ్యపగృహిణి సంతుష్టురాలయింది. 'ఓహో! భగవానుడు నా గర్భాన జనిస్తాడట! నా జన్మ చరితార్థమయింది!' అని మహానందపడి పతిసేవాతత్పరురాలై ఉన్నది. కశ్యపుడు తన యోగమహిమ వల్ల జరిగిన వృత్తాంతం గ్రహించి యథాకాలానికి తన వీర్యాన్ని అదితిగర్భంలో ఉంచాడు. భగవానుడు అది నిమిత్తంగా అదితి గర్భాన్ని ప్రవేశించిన సంగతి తెలిసి బ్రహ్మ తద్గర్భస్థమూర్తిని స్తుతించి, 'స్వామీ! స్వర్గభ్రష్టులైన దేవతలకు మేలు కూర్చు' అని ప్రార్థించాడు.

## వామనావతారం

అదితి గర్భం కాలక్రమాన పెంపు గాంచింది. భాద్రపద శుక్ల ద్వాదశీ శ్రవణానక్షత్రంలో గ్రహనక్షత్రతారకలు శుభస్థానాలలో ఉండగా సూర్యుడు

మధ్యందినగతుడుగా ఉన్నప్పుడు అభిజిన్ముహూర్తాన భగవానుడు శంఖ చక్ర గదా కమల కలిత చతుర్భుజాలతో వినీల నిర్మల దేహంతో పద్మాయత నేత్రాలతో పీతాంబరంతో మకర కుండల కాంతి విలసిత వదనారవిందంతో శ్రీవత్సలాంఛనంతో కిరీటాంగద విభూషణాలతో వనమాలా కౌస్తుభాలతో అవతరించాడు.

భగవదవతార శుభఘటనకు భూమ్యాకాశాలు తేజరిల్లాయి; దెసలు ప్రసన్నములైనాయి; సరస్సులు నిర్మలమయ్యాయి; ప్రజలకు అకారణసంతోషం కలిగింది; దేవదుందుభి మృదంగాదులు మ్రోగాయి; అదితి ఆశ్రమంలో పుష్పవృష్టి కురిసింది; కశ్యపుడు భగవన్మాయాయోగానికి విస్మితుడై జయ వచనాలు పలికాడు. అది సుతద్వాదశి, విజయ ద్వాదశి అని పేరుపొందింది.

భగవానుడు అదితి గర్భవాసం నుంచి అవతరించిన వెనువెంటనే ఆ దివ్య మంగళ స్వరూపాన్ని ఉపసంహరించి వామన రూపం ధరించాడు. మహర్షులు కశ్యప పురస్సరంగా వచ్చి అతనికి జాతకర్మలు చేశారు. వామనుడు క్రమక్రమంగా పెరిగి యుక్తవయస్కుడు కాగానే అతనికి ఉపనయనాది సంస్కారాలను కావించారు. ఆ తరిని సవితృడు అతనికి సావిత్రిని బోధించాడు; బృహస్పతి బ్రహ్మసూత్రాన్ని, కశ్యపుడు మేఖలను, ధాత్రి కృష్ణాజినాన్ని, సోముడు దండాన్ని, దివస్సు ఛత్రాన్ని, బ్రహ్మదేవుడు కమండువును, సప్తర్షులు కుశ(శిఖ)లను, సరస్వతి జపమాలను, కుబేరుడు భిక్షాపాత్రను ఇచ్చారు. తల్లి అదితి అతనికి కౌపీనాన్ని కట్టబెట్టింది. ఆ వటువు దేవత లందరూ కొలువుతీరిన ఆ సభలో బ్రహ్మ తేజో విరాజమానుడై అగ్నిముఖం ఆచరించి పరిస్తరణసమూహం కావించి సమిద్గణం వేల్చి అగ్నికార్యం జరిపాడు.

## బలియజ్ఞం - వామనప్రవేశం

రాజా! ఆ నర్మదానది ఉత్తర తీరంలో పరమపవిత్రమైన భృగువత్సమనే క్షేత్రం ఉన్నది. అక్కడ బలిచక్రవర్తి శాలను నిర్మించి భార్గవుల ఆధ్వర్యంలో

హయమేధయాగానికి ఉపక్రమించాడు. శాలాంతరమంతా విప్రాదులతో కిటకిటలాడింది. యజ్ఞకార్యం జరుగుతుండగా మహాతేజోవంతుడైన ఒక వ్యక్తి అక్కడికి వస్తుండటం కనిపించింది. అతనిని యజమాన ఋత్విక్సదస్యులు దవ్వులనుంచి చూసి సూర్యుడో, అనలుడో, సనత్కుమారుడో యజ్ఞసందర్శనార్థం వస్తున్నాడని లోలోన తలపోయసాగారు.

జడలు దాల్చి మౌంజిని, ఉపవీతాన్ని ధరించి కృష్ణాజినం కట్టి ఛత్ర దండకమండలాలు పట్టి వచ్చిన ఆ వ్యక్తికి భార్గవులు అగ్నితో ఎదురేగి మర్యాదలు సలిపి అతనిని లోనికి కొనివచ్చారు. యజమానుడు అతని రాకకు పరమసంతోషమంది ఉచితాసనం ఇచ్చి అతనిని కూర్చుండబెట్టి స్వాగత పూర్వక నమస్కారం ఆచరించి కాళ్ళు కడిగి పూజించి ఆ జలాలను తలపై చల్లుకొని,

**మ. వడుగా! యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్య? ది**
**య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్**
**గడు ధన్యాత్ముఁడ నైతి, ని మ్మఖము యోగ్యంబయ్యె, నా కోరికల్**
**గడతేరెన్ సుహుతంబులయ్యె శిఖులుం గళ్యాణ మిక్కాలమున్.**

**మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో**
**హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో**
**కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో**
**ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురోత్తంసమా!**

అని వినయమధురంగా పలికాడు.

రాజా! ఆ వ్యక్తి వైరోచనుని ధర్మోక్తులకు ఎంతో సంతోషించి, 'రాజోత్తమా! నీ వచనాలు సత్యాత్మకాలు, ధర్మసహితాలు అయినందువల్ల నీకు కీర్తి నివ్వగలవు. ఎవని కులానికి భార్గవులు ఆముష్మికధర్మ ప్రమాణభూతులో, ఎవనికి ప్రహ్లాదుడు పితామహుడో, ఎవని వంశంలో సత్త్వహీనుడు గాని, కృపణుడు కాని, అర్థులకు లేదనేవాడు గాని, ఇస్తానని చెప్పి మాట తప్పేవాడు

గాని, దాన యుద్ధ సమయాలలో వెనుకాడేవాడు గాని ఇంతవరకు జన్మింపలేదో, ఎవని కులమందు ఆకాశంలో చంద్రుని వలె ప్రకాశమానుడై ఉన్న ప్రహ్లాదుడు, ఏకైకవీరుడై భూచక్రాన్ని అప్రతిభటంగా పరిపాలించిన హిరణ్యాక్షుడూ  జన్మించారో, ఆ నీ కులానికి తగినట్లుగా పలికావు.

దానవేశ్వరా! విష్ణువు భూమి నుద్ధరింప దలచి హిరణ్యాక్షుని అతికష్టం మీద గెలిచినా అతని వీర్యశౌర్యాలను స్మరించి తానొక మహాజయశాలినని అనుకోడు. తమ్ముని చావుకు హిరణ్యకశిపుడు విష్ణువుపై క్రోధం వహించి అతనిని రూపుమాపుతానని శపథం చేసి దండెత్తినప్పుడు విష్ణువు ఆ వార్త విని తన కోసం మృత్యువు వస్తున్నదని భయపడి కాలజ్ఞుడు కాబట్టి ముప్పును తప్పించుకొనగోరి ఎక్కడా సందులేక సూక్ష్మతనువు ధరించి ఆ అసురేశ్వరుని ఘ్రాణరంధ్రం నుంచి అతని హృదయాంతరం లోనికి ప్రవేశించి అక్కడ దాక్కొని ఉన్నాడు. హిరణ్యకశిపుడు ఆ విష్ణువు కోసం భూనభోంతరాలు, సముద్ర పాతాళాంతరాలు కలియజూచి వెతికి వేసారి చివరికి ఎక్కడా కనిపించక, 'నా భ్రాతృవధకుడు ఎక్కడున్నాడో ఎదుటికి రాడేమిటి? బ్రతికి ఉంటే అతని జాడ తెలియకుండానే ఉంటుందా? వైరం మరణాంతమంటారు కదా' అని నిశ్చయించి, సమాహితచిత్తు డైనంత మహావీరుడు. దేవతలు విప్రవేషధరులై నీ తండ్రి విరోచనుని వంచకబుద్ధితో అతని ఆయువు నిమ్మని అడిగారు. మీ తండ్రి వారి వంచనను గుర్తించినా అర్థార్థులకు తన ఆయువును దానం చేసి ప్రహ్లాదపుత్రత్వానికి వన్నెతెచ్చిన సద్వర్తనుడు. ఇక నీవు శూరులు, కీర్తిమంతులు అయిన  గృహస్థుల ధర్మాలను ఎడబాయని వాడవు.

దైత్యేశ్వరా! నేను ఎవరివాడనని, ఎక్కడినుంచి వచ్చానని అడిగావు.

**సీ. ఇది నాకు నెలవని యే రీతిఁ బలుకుదు**
**నొక చోటనక యెందు నుండనేర్తు**

**ఎవ్వని వాఁడ నం చేమని పల్కుదు**
**నా యంతవాఁడనై నడవ నేర్తు**

**ఈ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ**
**బూని ముప్పోకల బోవనేర్తు**
**అది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ**
**నేరుపు లన్నియు నేన నేర్తు**

**ఆ. ఒరులు గారు నాకు నొరులకు నేఁనౌదు**
**నొంటివాఁడ జుట్ట మొకఁడు లేడు**
**సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా టెంకి**
**సుజనులందు దఱుచు సొచ్చియుందు.**

దానవినోదా! ఏమి కావాలో కోరుకొమ్మని నీ ధర్మశీలానికి అనురూపంగా ప్రసంగించావు.

**ఆ. ఒంటి వాఁడ నాకు నొకటి రెండడుగుల**
**మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల**
**గోర్కి దీఱ బ్రహ్మ కూఁకటి ముట్టెద**
**దానకుతుకసాంద్ర! దానవేంద్ర!**

అని చెప్పాడు. బలి అందుకు మహాశ్చర్యపడి 'అయ్యా! అడిగినప్పుడు దాత పెంపు సొంపులను గుర్తుంచుకోవాలి కదా' అన్నాడు. వటుడు అతని భావం గ్రహించి 'దానవాధిపా! నీవు జగదీశ్వరుడవు, మహాదాతవు అని నాకు తెలుసు. అయితే యాచనావృత్తికి కొన్ని నియమాలు ఉన్నాయి. ఎంత కావాలో అంత మాత్రమే కోరాలి. అంతకంటే ఎక్కువడగటం చౌర్యంతో సమానం. అధికార్థి దండనీయుడు. నేను నాకు కావలసినంత మాత్రమే అర్థించాను' అన్నాడు. బలిచక్రవర్తి ఆ పలుకులు విని, 'విప్రనందనా! లోకైక నాయకుడను, ద్వీపాలు అడిగితే ఇస్తాను. నాకు చేయిచాపిన వాడు తర్వాత ఇతరులను అడగవచ్చునా? బాలుడవు కాబట్టి స్వార్థమంటే నీకు తెలియదు. జీవికకు వలసినంత భూమినయినా అడుగు' అన్నాడు. ఆ విప్రకుమారుడు అతని మాటలను శ్రద్ధగా విని,

**మ. గొడుగో జన్నిదమో కమండులువొ నాకున్ ముంజియో దండమో**
**వడు గే నెక్కడ? భూము లెక్కడ? కరుల్ వామాక్షు లశ్వంబు లె**
**క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షామితం బైన మూ**
**డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్.**

**క. వ్యాప్తిం బొందక వగవక**
**ప్రాప్తంబగు లేశమైన బదివే లనుచుం**
**దృప్తిం జెందని మనుజుఁడు**
**సప్తద్వీపముల నైనఁ జక్కం బడునే.**

**శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా**
**రాశిప్రావృతమేదినీవలయ సామ్రాజ్యంబు సేకూడియుం**
**గాసిం బొందిరి గాక వైన్యగయభూకాంతాదు లింతేనిఁ గా**
**మాశం బాయగ నేర్చిరే? మును నిజాశాంతంబులం జూచిరే?**

రాజేంద్రా! జీవులకు సుఖమే పరమ ప్రాప్యం. ఆ సుఖం యదృచ్ఛా ప్రాప్తసంతుష్టులకు లభిస్తుంది. ఆ తృప్తి కలగటానికి ఇంద్రియాలను జయించాలి. జితాత్ములు కానివారికి ముల్లోకాలు లభించినా తృప్తి జనింపదు. తనివి లేనినాడు సుఖానికి చోటుండదు.

దానవేశ్వరా! పురుషుని జననమరణ రూప సంసారానికి కారణమేమిటో ఆలోచించావా? అర్థకామాల పట్ల తనివి, తృప్తి వలన కలిగే సంతోషం లేకపోవటమే సంసార కారణం. ముక్తి కారణం ఏమిటని అడుగుతావేమో? యదృచ్ఛాలాభంగా తృప్తి సంతోషాలను పొందటమే ముక్తికారణం. తృప్తిసంతోషాలు కలవారికి తేజోవృద్ధి కలుగుతుంది. సంతోషహీనుని తేజం నీటిలో అగ్ని వంటిది. ఆర్యవాక్యం ఇలా ఉన్నది కాబట్టి నాకు మూడడుగుల నేల చాలు' అన్నాడు.

## బలి శుక్రాచార్యుల సంవాదం

పరీక్షిన్నరేంద్రా! బలిచక్రవర్తి ఆ విప్రకుమారుని వచనాలు విని అతను కోరినట్లు భూదానం చేయగోరి జలపాత్రను చేతిలోనికి తీసుకోబోతున్నాడు. శుక్రాచార్యుడు అడ్డుపడి, 'వైరోచనా! ఈతడు వటుమాత్రుడు కాడు; దేవకార్యార్థం శ్రీమహావిష్ణువే ఈ రూపంలో వచ్చి నిన్ను అర్థిస్తున్నాడు. రానున్న ముప్పును ఊహింపలేక మాటయిచ్చావు. నీవు చేయనున్నది దైత్యసంపదలకు చేటు కలిగించేది. యాచనకు వచ్చినవాడు మాయావటుడు. క్షణంలో విశ్వశరీరుడై మూడడుగులలో ముల్లోకాలను ఆక్రమించి నీ సిరిసంపదలను, నీ యశస్సును, నీ తేజస్సును హరించి ఇంద్రునికి ఇవ్వబోతున్నాడు. మూర్ఖుడా! సర్వస్వం ధారపోసి ఇంకెట్లా బ్రతుకుతావు? బ్రతుకు మాట అటుండనివ్వు. ఒక అడుగులోపల సమస్త భూమండలం అణిగిపోతుంది. రెండవ అడుగుతో త్రిదివం చాలీచాలనిదవుతుంది. ఇతని శరీరానికి అంతరాళం చాలదు. మూడవ అడుగును ఎక్కడ పెట్టాలి? నీ తలమీద పెట్టాలి. నీ నొసట నరకం తప్పదని వ్రాసి ఉన్నందువల్ల నీకిటువంటి బుద్ధి పుట్టింది.

రాజేంద్రా! అన్నమాట తప్పవచ్చునా? అని అడుగుతావేమో. బహ్వృచగీత ఏమంటున్నదో విను. 'నోటిమాటను పాటించటం సత్యమని, మాట తప్పటం అసత్యమని అంటారు. ఇది సామాన్యవాచకం. తాననే వృక్షానికి అనృతమే మూలం. దానికి సత్యం పుష్పఫలాల వంటిది. మూలం నశించిననాడు పుష్పఫలాలు కలుగనేరవు. వృక్షానికి మూలం వలెనే తన స్థితికి అనృతమే మూలం. వృక్షానికి పుష్పఫలాల వంటిదే తన జీవికకు సూనృతం. పైగా అనృతానితో అంతో ఇంతో కలియనట్టి సత్యం ఎక్కడా ఉండదు. ఇంకొకటి కూడా గ్రహించాలి. మూలమన్నది ఒకటుంటే అది మళ్ళీ చిగురించే అవకాశం ఉంటుంది. ఫలపుష్పాలు చాలునని మూలచ్ఛేదం చేయవచ్చునా? పురుషుడు తన్నుమాలిన ధర్మానికి పాల్పడకూడదు. సత్యధర్మాలను దేశకాలాలను బట్టి యుక్తవిధంగా నడుపుకోవాలి.

**అ. వారిజాక్షులందు వైవాహికము లందు**
**బ్రాణ విత్త మాన భంగమందుఁ**
**జకితగోకులాగ్రజన్మరక్షణ మందుఁ**
**బొంక వచ్చు నఘము వొంద దధిప.**

అని పెద్దలన్నారు. ఆ విధంగా చేయటం ఆపద్ధర్మాలలో ఉన్నదే.

**మ. కులమున్ రాజ్యము దేజమున్ నిలుపు మీ కుబ్జుండు విశ్వంభరుం**
**డలతిం బోఁడు త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండమున్**
**గలఁడే మాన్ప నొకండు? నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్**
**వల దీ దానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా!**

అని బోధించాడు.

## బలి ప్రతివచనం

పరీక్షిన్నరేంద్రా! బలిచక్రవర్తి శుక్రుని మాట విని, తన మనసులోని మాటను నిస్సంకోచంగా చెప్పాడు. 'గురువర్యా! అర్థకామయశోవృత్తులకు ముప్పుకావింపని గృహస్థధర్మాన్ని నిరూపించారు. ఆ విషయమై మీరన్నమాట సత్యమే. ప్రహ్లాదుని వంశంలో పుట్టాను; మాట యిచ్చాను; అదే నోటితో లేదనటం ధర్మమేనా? సత్యమొక్కటే ఉత్తమోత్తమ ధర్మమని, ఎంత భారమైనా సహిస్తాను గాని అసత్యవాది బరువును మాత్రం మోయలేనని పూర్వం భూదేవి అన్న మాట విన్నాము కదా? గురువర్యా! భూధనాదులు పురుషునికి నిత్యస్థితాలు కావు. అవి ఎప్పుడో ఒకప్పుడు చెప్పకుండానే విడిచిపోతాయి. మాట నిలుస్తుంది పూట గడుస్తుంది అంటారు కదా.

**శా. కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?**
**వా రేరీ? సిరి మూటగట్టుకొని పోవంజాలిరే? భూమిపై**
**బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై**
**యీరే కోర్కెలు? వారలన్ మఱచిరే యిక్కాలమున్? భార్గవా!**

గురువర్యా! 'దేహి అన్నంతనే దేహాన్ని కూడా దానం చేసే నెరదాతలున్నారు. పాత్రభూతుడైన అర్థి లభించటమే దుర్లభం. అంత మహాపాత్రభూతుడు నాకు నేడు లభించటం నిజంగా నా భాగ్య విశేషం.

గురువరేణ్యా!

**శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ**
**బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ**
**ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁదై నా కరంబుంట మే**
**ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?**

**మ. నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనం బైన దు**
**ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము పోనిమ్ము పో**
**హరుఁ డైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ**
**దిరుగ న్నేరదు నాదు జిహ్వ వినుమా, ధీవర్య! వేయేటికిన్**

గురువర్యా! శ్రీమహావిష్ణువు నన్ను బంధింప గోరి ఈ రూపంలో వచ్చాడని మీరన్నారు. బంధిస్తే బంధించనివ్వండి. ఈ విప్రరూపం నా చేతులను కట్టివేసింది. మాట దాటలేను. ఆత్మభంగానికి వెరచి అసత్యదోషానికి పాల్పడటం నాకు సమ్మతం కాదు' అన్నాడు.

శుక్రాచార్యుడు అతని నిశ్చయాన్ని విని, 'మూర్ఖుడా! చెడుకాలం దాపరించి నీ నోట అనర్థాలను పలికిస్తున్నది. గురుశాసనాన్ని ఉల్లంఘించావు. సిరి నీకు దూరమవుతుంది గాక!' అని శపించాడు.

## వటునికి భూదానం

పరీక్షిన్నరేంద్రా! ఆచార్యుడు ఆ విధంగా శపించినా బలిచక్రవర్తి జంకుగొంకులు లేక సత్యనిష్ఠుడై భూదానం చేయబూనాడు. ఆ దానవేశ్వరుని పత్ని వింధ్యావళి జలపూర్ణ సువర్ణపాత్రను పతికి అందించింది. బలి ఆ కలశాన్ని అందుకొని వామనుని పాదాలు కడిగి ఆ నీటిని తలపైని చల్లుకొని

పదత్రయభూమిని అతనికి దానం చేశాడు. సుర సిద్ధ గంధర్వాదులు బలి సత్యసంధతను ప్రశంసించారు.

## వామనుని విశ్వరూపం

వామనుడు దానం పట్టి నిజగుణ త్రయాత్మకమైన విశ్వరూపాన్ని సంకల్పించి,

**శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియు దా నింతై నభోవీథిపై**
**నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై**
**నంతై చంద్రున కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై**
**నంతై సత్యపదంబు దాఁకె నటు బ్రహ్మాండాంతసంవర్ధియై.**

**మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై**
**శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర**
**ప్రవరంబై పదపీఠమయ్యె వటుఁ డా బ్రహ్మాండమున్ నిండగాన్.**

రాజేంద్రా! ఆ విధంగా పెరిగిన ఆ మహామూర్తికి చరణతలాన పాతాళం, పాదతలాన ధాత్రీతలం, జంఘల మహీధ్రాలు, జానువుల పక్షిజాతం, ఊరువుల వాయుగణం, వాసస్థలాన సంధ్య, గుహ్యమందు ప్రజాపతులు, జఘన స్థలాన దనుజులు, నాభియందు నభస్సు, కుక్షిదేశాన సాగరాలు, ఉరస్సున తారామాల, హృదయాన ధర్మము, స్తనద్వయాన ఋతసత్యాలు, మనస్సున చంద్రుడు, వక్షమందు లక్ష్మి, కంఠాన సామాదిసమస్త వేదాలు, భుజము లందు ఇంద్రాదిదేవతలు, కర్ణముల దిక్కులు, శిరస్సున సురలోకం, శిరోజాలలో మేఘాలు, నాసాపుటాన వాయువు, నేత్రములందు రవి, ముఖమండలాన వహ్ని, వాణియందు ఛందస్సులు, రసన యందు వరుణుడు, భ్రూయుగాన విధి నిషేధాలు, రెప్పల దివారాత్రాలు, లలాటమందు క్రోధం, అధరాన లోభం, స్పర్శయందు కామం, రేతస్సున జలం, పృష్ఠమందు అధర్మం, శ్రవణాలలో యజ్ఞాలు, ఛాయయందు మృత్యువు, హాసమందు మాయ,

రోమాలలో ఓషధీవర్గం, నాడులందు నదులు, నఖములందు శిలలు, బుద్ధియందు బ్రహ్మ, ఇంద్రియాలలో దేవర్షి గణాలు, గాత్రమందు చరాచరవర్గం కానవచ్చాయి.

ఆ సర్వాత్మకునిలో భువన మంతటినీ చూసి అసురులు భయపడ్డారు. అంతలో శంఖ శార్ఙ్గ చక్ర గదాదండ ఖడ్గ తూణీర బాణాలు సాక్షాత్కరించాయి. సునంద నందాది పార్షదులు, లోకపాలకులు కొలువుతీరి నిలిచారు.

భగవానుడు విశ్వాన్ని అతిక్రమించి ఒక్క అడుగున భూమండలాన్ని ఆక్రమించి రెండవ పాదాన్ని పైకెత్తాడు. ఆ పాదం మహర్లోక జనలోక తపోలోకాలను దాటి సత్యలోకం దాకా వ్యాపించింది. భగవత్పాద నఖశిఖర దివ్యతేజం ముందు బ్రహ్మాదుల తేజం అస్తమించింది. మరీచ్యాదిమహర్షులు, సనకాదియోగులు బ్రహ్మలోకాన్ని సాధించిన మహాత్ములు ఆ పాదపద్మానికి నమస్కరించారు. వేదోపవేదాదులు మూర్తిమంతాలై ఆ చరణకమలాన్ని అర్చించాయి. బ్రహ్మదేవుడు కమండల జలాలతో కాళ్ళు కడిగాడు. ఆ నీరు కిందికి పారి గంగ అని పేరు వహించి త్రైలోక్యపావని అయింది. లోకనాథులు చందన మాల్య ధూప దీప లాక్షాక్షత ఫలాలతో ఆ పాదద్వయాన్ని పూజించారు. స్తోత్రవచనాలు జయశబ్దాలు మారుమ్రోగాయి. ఆ విజయోత్సవాన్ని జాంబవంతుడు మనోజవంతో నలుదిక్కుల చాటి చెప్పాడు. భగవాను డంతట యథాపూర్వం వామనాకృతిని ధరించాడు.

## అసుర విష్ణుపార్షదుల యుద్ధం

రాజేంద్రా! భగవానుడు మూడడుగుల నేల నడిగి భూమ్యాకాశాలను ఆక్రమింపగానే అసురులు చూసి క్రోధవివశులై బలి వంకకు మరలి, 'ఇతను నిజమైన విప్రుడు కాడు. విష్ణువు ఈ రూపంలో దేవకార్యాన్ని తీర్చేందుకు వచ్చాడు. ఈ మాయ లెరుగక నీవు ఇల్లు గుల్లచేశావు. సత్యవ్రతుల యెడ ఆడిన మాట తప్పటం తప్పేమో గాని మోసగాని ముందు తప్పు కాబోదు.

మీదుమిక్కిలి ఒప్పవుతుంది. వంచకు లెంత గొప్పవారయినా దండ్యులే. నీవు యజ్ఞాదీక్షానియతి వల్ల దండాన్ని వదిలావు. రాజసేవకులము మేము మా ధర్మాన్ని నిర్వర్తించక తప్పదు. ఈ మాయలమారిని మట్టుపెట్టటం మాకు మాన్యమవుతుంది' అంటూ బలి ఆజ్ఞను పొందకుండానే కత్తులు దూసి వామనుని పైకి ఉరవడించారు.

దైత్యవీరుల ఉద్ధతికి నంద సునంద జయ విజయ కుముద కుముదాక్ష గరుడ సాత్వతాది విష్ణుపార్షదులు నవ్వుకొని ఆయుధాలను చేపట్టి వారిని ఢీకొన్నారు. పార్షదుల వేటులకు దైత్యదానవవీరులు కలవరపాటు చెందారు.

బలిచక్రవర్తి తన భటులను పిలిచి, 'అసురవీరులారా! నా మాట వినండి. ఆచార్యశాపహతులమైన మనకు అవమానం తప్పదు. ఏ లోకేశ్వరుడు సర్వభూతాలకు సుఖదుఃఖాల నిస్తున్నాడో, ఆ జగన్నాథుని ఎదిరించటం మన తరం కాదు. నాడు మనకు మేలు, సురలకు కీడు జరగాలనుకొన్నాడు. నేడు సురలకు మేలు, మనకు కీడు సంకల్పించాడు. ఇదంతా కాల విశేషం. కాలమహిమ ముందు బహు బుద్ధిబలాలు గాని మంత్రౌషధాలు గాని సామ దానదండోపాయాలు గాని సాగవు. మీ చేతిలో ఓడిపోయిన వాళ్ళిప్పుడు రెట్టించిన బలంతో వచ్చి గెలిచారు. ఇదంతా దైవయోగం కాకపోతే మరేమిటి? దైవం ప్రసన్నమైననాడు మీరే మళ్ళీ వీళ్ళను గెలవగలుగుతారు. మంచికాలానికి, ఎదురుచూస్తూ తలవంచుకొని ఉండక తప్పదు' అని బోధించాడు. దైత్యదానవులు అవమానంతో అక్కడ ఉండలేక రసాతలానికి వెళ్ళారు.

అంత గరుత్మంతుడు భగవానుని మనోభావాన్ని గ్రహించి బలిని వరుణపాశాలతో బంధించాడు. భూనభోంతరాళాలు హాహాకారాలతో దద్దరిల్లాయి. వైరోచనుడు ఆ విధంగా నష్టశ్రీకుడు, పాశబద్ధుడు అయినా చలింపకుండటం చూసి వామనుడు, 'అనఘాత్మా! మూడడుగుల నేల నిచ్చావు. భూమ్యంతరిక్షాలు రెండడుగులకే చాలలేదు. ఇక మూడవదానికి చోటెక్కడున్నది? మాట తప్పుతానంటావా? అలాగైతే నీ గురువు అనుమతి

తీసుకొని వెళ్ళి మూడడుగుల నేల అడిగినందుకు నీ గొప్పతనాన్ని పురస్కరించుకొని నవ్వావు. ఇప్పుడేమంటావు?' అని పలికాడు.

## బలి శిరోదేశం

రాజేంద్రా! భగవంతుని వచనాలు పుండుమీద కారం చల్లినట్లయింది. ఆ ఎత్తిపొడుపులకు బలి కోపతాపాలు చెందక 'దేవా! మాట తప్పలేను. పదవీచ్యుతి, పాశబంధాలు, దుస్సహవ్యసనాలు, అర్థవినాశం దేనికీ నేను భయపడను; పలికి బొంకాడన్న అపకీర్తికి మాత్రం భయపడతాను. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, మంచివారు, సుహృదులు విధించే దండన మేలుకోసమేనని నా నమ్మకం. దండ్యులు మదాంధకారం వలన వారికి దండనసమయంలో దండవిధాయకులు శత్రువులుగా కనబడతారు. చిట్టచివరికి వారే దండితులకు గురువులు, మహోపకారకులు అని తెలుస్తుంది. నీవు సకల లోకదండనుడవు; మదాంధుల మదాన్ని పోగొట్టి జ్ఞాననేత్రాన్ని ప్రసాదిస్తావు.

దేవా! అసురులెందరో మొదట నీ యెడ గాఢరూఢవైరానుబంధులై ఉండి చివరికి నీ వలననే ఏకాంతభక్తులకు ప్రాప్యమైన ఉత్తమపదాన్ని పొందారు కదా. నన్ను నిగ్రహించినా వరుణపాశంతో బంధించినా నాకే మాత్రం బాధలేదు. ఈ బంధన నన్నుద్ధరించటానికే గాని కట్టివేయటానికి కాదు. నాకు ప్రత్యక్షమయ్యావు. ఇంతకన్న నాకు శుభదాయకం ఏముంటుంది?

**సీ. చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు**
**కాంతలు సంసార కారణములు**
**ధనము లస్థిరములు తను వతి చంచల**
**కార్యార్థు లన్యులు గాల మెడచు**

**ఆయువు సత్వర మైశ్వర్య మతిశీఘ్ర**
**మని కాదె తన తండ్రి నతకరించి**
**మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుఁడు**
**నీ పాదకమలంబు నియతిఁ జేరె**

**తే. భద్రుఁడతనికి మృతిలేని బ్రదుకు గలిగె**
**వైరులై కాని తొల్లి మా వారు గాన**
**రర్థి వై వచ్చి నీవు నన్నడుగు టెల్ల**
**బద్మలోచన! నా పుణ్యఫలము గాదె.**

దేవా! ఈ జీవితం ఎల్లవేళల మృత్యుహస్తగతమై ఉంటుంది. ఆ సంగతి తెలియక అది నిత్యమని తలచి భ్రాంతులై వర్తిల్లుతారు. అట్టి భ్రాంతికి వైరివయిన నిన్ను ఆశ్రయించాను' అన్నాడు.

## ప్రహ్లాదుని ఆగమనం

రాజేంద్రా! అంతలో అక్కడికి ప్రహ్లాదుడు వచ్చాడు. బలి తనను కట్టి ఉంచిన వరుణపాశబంధన వల్ల చేతులు పైకెత్తలేక అతనిని చూసి తలవంచి మ్రొక్కాడు. ప్రహ్లాదుడు అతనిని ఆదరించి వామనమూర్తిని సమీపించి తల నేలసోకగా వంగి నమస్కరించి ఆనందాశ్రువులు నించి 'దేవా! నీవిచ్చిన ఇంద్రపదవిని నీవు మళ్ళీ గైకొనటం ఇతని మంచికే ఒనగూడింది. సిరి ఎంతవారినయినా మోహవశులను కావిస్తుంది. అట్టి దాని నుంచి ఇతనిని తప్పించటమంటే అనుగ్రహించినట్లే కదా. సిరిని వదులుకొనలేనివాడు ఆత్మగతిని ఎన్నటికీ పొందదు' అని విన్నవించాడు.

## వింధ్యావళి ప్రార్థన

ప్రహ్లాదుని మాట నందుకొని విరించి ఏదో చెప్పబోతుండగా అంతలో బలిపత్ని వింధ్యావళి ముందుకు వచ్చింది. బ్రహ్మ అది చూసి ఊరుకొన్నాడు. వింధ్యావళి కన్నీరు పెట్టుకొని 'దేవా! నీవు నీ లీల కొరకు జగత్త్రయాన్ని కల్పిస్తావు. ఆ లోకాలకు నీవే ప్రభుడవు కాని ఇతరులు కారు. అది తెలియక మూఢులు లోకాలు తమవేనని, వాటికి తామే రాజులమని వృథాభిమానం పొందుతారు. సృష్టిస్థితిలయకరునికి నీకు ఎవరు మాత్రం ఏమని ఇవ్వగలరు? నీకిస్తున్నామని అనుకోవటం కంటె సిగ్గుమాలినతనం ఉన్నదా?' అని విన్నవించి ప్రక్కకు జరిగింది.

అప్పుడు బ్రహ్మ ముందుకు వచ్చి, 'దేవదేవా! నీ కాళ్ళు కడిగి గడ్డిపరక నన్నా తెచ్చి సమర్పించిన వారికి మహోత్తమగతి కలుగుతుంది. కాదనక లేదనక మాట మరలింపక ముల్లోకాలను నీకు సమర్పించిన ఈ వైరోచనుడు వ్యసనపడ కూడదు' అన్నాడు.

## వామనుని అనుగ్రహం

భగవానుడు బ్రహ్మవచనాలు విని, 'పద్మజా! పురుషుడు ధనగర్వితుడై లోకాన్నీ నన్నూ తిరస్కరిస్తాడు. ధనం పోయిన వెంటనే మదం కూడా దిగిపోతుంది. జీవునికి స్వాతంత్ర్యం లేదు. అస్వతంత్రుడై అతను కర్మలను చేస్తూ ఫలానుభవయోగ్యమైన శరీరాన్ని ధరించేందుకు వివిధ యోనులలో సంచరిస్తుంటాడు. పరమేష్ఠీ! నరజన్మ మహాదుర్లభం. అట్టి ఉత్తమజన్మ సంప్రాప్తమైనా విద్యావయోరూప జనన కర్మ ధ నైశ్వర్యాది మదం వెనువెంటనే వదిలేది కాదు. ఆ మదం 'నేను, నాది' అన్న భావాన్ని పుట్టించి కన్నుగప్పి అతనిని నా వంకకు చూడనీయదు. అందరూ నాకు సములే కాబట్టి నా అనుగ్రహం అందరియందు సమానంగానే ఉంటుంది. అయితే రవి ప్రకాశానికి మేఘాలు అడ్డువచ్చినట్లు మదం నా అనుగ్రహప్రాప్తికి ఆటంక మవుతుంది. అందువల్ల నేనెవరిని అనుగ్రహింపదలిస్తే వారిని మొట్టమొదట ధనహీనులను చేస్తాను. శ్రేయః ప్రతికూల జన్మాదులు గాంచినా నా భక్తుడు ఎట్టి దురవస్థలోనూ మోహాన్ని పొందడు. చతురాననా! ఈ వైరోచనునికి సంపదలు వెడలించాను; స్థానచ్యుతి కలిగించాను; వరుణ పాశంతో కట్టించాను; స్వకీయుల నుంచి దూరం చేశాను; గురువు అదలించాడు; శపించాడు; నేనూ కఠినోక్తులతో మనసు నొప్పించాను. ఇన్ని ఆపదలు ఒక్కసారిగా చుట్టుముట్టినా ధీరుడై ఇతను సత్య ధర్మ సన్మార్గాలను విడిచిపెట్టలేదు. నా యీ కఠిన పరీక్షకు నిలిచిన ఇతనిని నా స్థానానికి చేర్చుతాను.

ఆ తర్వాత ఇతను ఎనిమిదవ మనువైన సావర్ణియొక్క మన్వంతరంలో ఇంద్ర పదవిని పొందుతాడు. అంతదాకా విశ్వకర్మనిర్మితమైన సుతలం ఇతనికి

నివాసస్థలం అవుతుంది గాక. అక్కడ నా కటాక్షవీక్షణ ప్రసారం వలన ఆధివ్యాధులు లేని సుఖజీవనం కలుగుతుంది' అని చెప్పి; బలితో 'ఇంద్రసేన మహారాజా! నీకు శుభమగుగాక! స్వర్గవాసులకు సైతం దుర్లభమైన సుతలాన్ని చేరి అక్కడ నీ జ్ఞాతులతో కలిసి సుఖంగా ఉండు. లోకేశ్వరులు కూడా నిన్ను బాధింపలేరు. నీ మాటకు దైత్యులెవరైనా ఎదురాడితే వారు నా చక్రహతులై నశిస్తారు. అక్కడ నేను నిన్ను సర్వవిధాల రక్షిస్తాను. ఇన్ని మాట లెందుకు? అక్కడ నీకు నేను నిత్యసన్నిహితుడనై ఉంటాను. ఎల్లప్పుడు నీకు నా దర్శనం కలుగుతుంది. దైత్యదానవ సంసర్గజన్యమైన అసురభావదోషం నా సన్నిధిలో నిన్ను తాక నేరదు' అని చెప్పాడు.

రాజేంద్రా! బలిచక్రవర్తి ఆ పలుకులను ఆలించి, 'దేవా! నీకు భక్తిపూర్వక ప్రణామం తప్ప ఏమీ సమర్పింపలేని శరణార్థుడను. ఇదే నీకు తలతో మ్రొక్కుతున్నాను. లోకపాలకులకు కూడా దుర్లభమైన నీ అనుగ్రహానికి నన్ను పాత్రుని కావించావు. ఇంతకన్న నాకు కావలసిన దేమిటి?' అని త్రిమూర్తులకు నమస్కరించాడు. వెనువెంటనే అతని కట్లు వీడిపోయాయి.

కులోద్ధారకుడైన మనుమని చూచి ప్రహ్లాదుడు సంతోషపడి భగవంతునికి చేతులు జోడించి, 'దేవా! అసురులమైన మాయెడ నీవు చూపిన ఈ అనుగ్రహాన్ని బ్రహ్మభవులే గాక రమాదేవి సయితం పొందజాలదు. నీ విభూతి దర్శనార్థం మహాత్ములు ప్రాకులాడుతుంటారు. అట్టిది మాకు ప్రాప్తించింది. ఇంత మహాభాగ్యానికి మేమేమి నోచుకొన్నామో తెలియదు. నీ చరిత్ర మహాచిత్రమైనది. నీ మాయావిలాసానికి విశ్వమే నిదర్శనం. సర్వసముడవు. అర్థిజనకల్పకానివై వెలుగొందుతావు. లోకమందలి వైషమ్యగతులను నీకు మూటగడతారు. ఇంతకన్న అజ్ఞానం వేరొకటి ఉండదు' అని విన్నవించాడు.

## బలికి సుతలనివాసం

భగవానుడు ప్రహ్లాదుని మెచ్చి, 'నాయనా! చిరసుఖాన్ని పొందు. నీవు నీ

మనుమనితో సుతలానికి వెళ్ళి సర్వజనసౌఖ్య ప్రతిపాదివై ఆనందించు' అన్నాడు.

ప్రహ్లాదుడు భగవద్వచనాన్ని శిరసావహించి భగవానునికి ప్రదక్షిణ సాష్టాంగం చేసి బలిని వెంటగొని సుతలానికి వెళ్ళాడు.

## బలి యజ్ఞసమాప్తి

భగవానుడంతట తన సన్నిధికి ఇంద్రుని రప్పించాడు. 'సురేశ్వరా! స్వర్గాన్ని సాధించి ఇచ్చాను. సుఖివై మెలగు' అని చెప్పి, అదితిని చూచి, 'తల్లీ! నీ కోరిక తీర్చాను' అని పలికి భార్గవుని పిలిచి, 'అయ్యా! కర్మలోపం జరగకూడదు. యజ్ఞసమాప్తి కావించు. కర్మవైషమ్యం కలిగితే చింతిల్లవలసిన పనిలేదు. బ్రాహ్మణానుగ్రహం వలన సర్వలోపాలు తొలగిపోగలవు' అన్నాడు.

శుక్రాచార్యులు భగవదాజ్ఞ విని, 'దేవా! కర్మములకు, యజ్ఞములకు నీవే ఈశ్వరుడవు. నిన్ను పూజించినప్పుడు కర్మవైషమ్యం ఎందుకు కలుగుతుంది? ఎంత జాగరూకతతో కర్మలను చేసినా మంత్ర తంత్ర దేశ కాల ద్రవ్యాదులలో దేని వల్లనో ఛిద్రాలు కలుగవచ్చు. నిన్ను తలచినంతనే అన్నీ చక్కబడతాయి. నీ ఆజ్ఞ నాకు శిరోధార్యం. నీ ఆనతిని తలదాల్చటం కంటె పరమశ్రేయోమార్గం మనుష్యులకు వేరొకటి లేదు' అని విన్నవించి, యజ్ఞసమాప్తి కావించాడు.

## వామనుని ఉపేంద్రత్వం

పరీక్షిన్నరేంద్రా! వామనావతారకార్యం పూర్తయిన తర్వాత బ్రహ్మ, సనత్కుమారాదులు, దేవర్షులు, మనువులు, దక్ష భృగు ముఖ్యులు, భవుడు వామనుని చూడవచ్చారు. 'దేవా! ఇంద్రుడు ముల్లోకాలకు ప్రభువు కావచ్చును గాక. వేదాలకు, ధర్మాలకు, రక్షణ కావాలి. అవి సురక్షితంగా ఉంటే సర్వభూతాలకు శుభం కలుగుతుంది. తద్రక్షణార్థం నీ వామనావతార తేజోంశను నెలకొల్పగోరుతున్నాము. ఆ మూర్తి ఉపేంద్రు డనే పేర జగన్మంగళదాయకం కాగలదు' అని ప్రార్థించారు. భగవానుడు వారి

ప్రార్థనను ఆమోదించాడు. ఇంద్రుడంతట బ్రహ్మాదుల అనుమతితో తన విమానం మీద ఆ వామనుని స్వర్గలోకానికి కొనిపోయాడు. బ్రహ్మాదులు తమ తమ స్థానాలకు వెళ్ళారు.

## త్రివిక్రమ చరిత్ర మాహాత్మ్యం

కురునందనా! ఈ త్రివిక్రమ చరిత్రను విన్నావు కదా. ఇసుకరేణువుల నైనా లెక్కింపవచ్చును గాని భగవల్లీలలను గణించటం శక్యం కాదు. పూర్ణుడు, స్వతంత్రుడు అయిన ఆ పురుషోత్తముని మహిమ ఇట్టిదని గాని ఇంత మాత్రమేనని గాని ఇప్పటివరకు గ్రహించినవారు లేరు. ఇకముందు కూడా ఉండరు. ఈ మాట మంత్రదర్శి వసిష్ఠభగవానుడు తెలిసి చెప్పిన మాట. దీనిని విననోచినవారు ఉత్తమగతిని పొందుతారు. దైవ పిత్ర్య మానుషకర్మలు జరుగుతున్నప్పుడు ఈ చరిత్రను పఠించితే ఆ కర్మలు చక్కగా నెరవేరుతాయి' అన్నాడు శుకయోగి.

## మత్స్యావతార ఘట్టం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు వామన చరిత్ర విని మహాశ్చర్యానందాలు పొంది, 'మునివర్యా! భగవల్లీలలకు అంతం లేనట్లే ఆ కథలను వినేవారికి ఎంత విన్నా తృప్తి తీరదు. భగవానుడు తొలుదొల్త మత్స్యావతారం ఎత్తాడని అన్నారు. మత్స్యరూపం తమఃప్రధానమైన స్వభావం కలిగినది. మహాదుస్సహమై ఏవగింపు గొలిపేది. ఎంతో పాపం చేస్తేనే కాని అటువంటి రూపు కలగదంటారు. సర్వేశ్వరుడు, మీదు మిక్కిలి కర్మాతీతుడు అయిన మహాత్ముడు అటువంటి నింద్యరూపాన్ని ఎందుకు గ్రహించాడు?' అని అడిగాడు. శుకమహర్షి చెప్పాడు.

'రాజేంద్రా! భగవానుడు విశ్వాన్ని సృజించి ఆ విశ్వరక్షణార్థం కొన్ని నియమాలను కల్పించాడు. వాటినే ధర్మములని అంటారు. కాలక్రమాన కామోద్రేకం వలన అనుష్ఠాతలు చక్కగా వర్తింపని పరిస్థితి ఏర్పడుతుంది. తత్ఫలంగా ధర్మగ్లాని, లోకకల్యాణభంగం కలుగుతుంటుంది. ఆ విధమైన

దోషం వేరొకరిచే సరిచేయరాని దయితే భగవానుడు తానే అవతరించి ధర్మరక్షణ కావిస్తాడు.

కార్యసాధనోపాయాలు దేశకాలాదులను బట్టి ఉంటాయి. భగవానుడు రూపం ధరించి వివిధభూతజాతులతో మెలగినప్పుడు అతనికి భేదభావం, కర్మాసక్తి, అందువల్ల ఫలభోగావసరం ఇతర ప్రాణులకు వలె కలుగవా? అని శంకింపవచ్చు. వాయువు ఎక్కడ చరించినా తత్తత్పదార్థ గుణసంబంధం దానికి సోకనట్లు భగవంతుడు ఎన్ని రూపాలు దాల్చినా, ఎన్ని కర్మలను చేసినా ఏవీ అతని నంటవు. సంబంధదోషం ఎప్పుడు జనిస్తుంది? వేరొక వస్తువు ఉన్నదనే భావం ఉదయించి అది నాకు కావాలని కోరినప్పుడు దానితో సంబంధం ఏర్పడుతున్నది. ఈ విధమైన ద్వైతభావం, అహంకార మమకారాలు భగవానునికి కలుగవు. ఆ మహాత్ముడు నిరంతర నిర్లిప్తుడు; అభేద దర్శనుడు; సర్వసమవర్తనుడు. అట్టివాడు ఏ రూపాన్ని ధరించినా, ఏమి చేసినా ప్రకృతి గుణసంసర్గానికి దూరంగా ఉంటాడు.

## మత్స్యావతార కారణం

రాజేంద్రా! కాలాన్ని కల్పాదులుగా విభజించటం, ప్రతికల్పంలోనూ ఒక్కొక్క బ్రహ్మ ఉండటం, కల్పాంతం బ్రహ్మకు నిద్రావసరం కావటం, బ్రహ్మ శయనించినంతనే భూరాదిలోకాలు మున్నీట మునగటం, బ్రహ్మ శయనించబోయే తరిని పునస్సృష్టి కొరకు వేదాలు అతని ముఖాల నుంచి వెలువడటం, బ్రహ్మ మేల్కాంచినంతనే ఆ వేదాలను గ్రహించి అందలి విధుల ప్రకారం మళ్ళీ సృష్టి కావిస్తుండటం వివరించాను.

గడిచిన కల్పాంతంలో బ్రహ్మ శయనించే వేళ అతని ముఖం నుంచి వేదాలు వెలువడ్డాయి. ఆ నిగమాలను హయగ్రీవుడనే దానవుడు అపహరించి సముద్రగర్భంలో దాగాడు. ఆ నిగమాలను సంపాదింపగోరి భగవానుడు మత్స్యావతారం ఎత్తవలసి వచ్చింది.

అదే సమయంలో సత్యవ్రతుడనే రాజర్షి భగవంతుని గూర్చి తీవ్రతపస్సు చేశాడు. అతనికి మేలు కలిగేందుకు భగవదవతారం నిమిత్తమయింది.

సత్యవ్రతుడు ద్రవిణేశ్వరుడు. ఒకప్పుడతను కృతమాలానదీతీరాన జలతర్పణం చేయదలచి ఆ నదీజలాలను దోయిలిలోనికి తీసికొన్నాడు. ఆ నీటితో ఒక చేపపిల్ల అతని చేతిలోకి వచ్చింది. అతను ఆ చేపను మళ్ళీ నీటిలో జారవిరిచాడు. అప్పుడది చిత్తవిభ్రమాన్ని ప్రకటించింది. 'రాజేంద్రా! పెద్ద చేపలు చిన్న చేపలను భక్షిస్తుంటాయి. ఆ ముప్పుకు భయపడి దీనవత్సలుడవని నీ అంజలి లోనికి ప్రవేశించాను. దిక్కులేని నన్ను మళ్ళీ వాటికి బలిపెడతావా?' అని వేడుకొన్నది. ఆ రాజు జాలిపడి చేపను తన కలశజలాలలో ఉంచి ఆశ్రమానికి కొనివచ్చాడు.

ఆ రాత్రి చేపపిల్ల పెద్దదయింది. దానికి కలశంలో చోటు చాలలేదు. అది రాజును పిలిచి 'అయ్యా! ఈ కమండలం నాకు సరిపోవటం లేదు. నేను సుఖంగా ఉండటానికి తగిన చోటేదయినా ఉన్నదేమో చూడు' అన్నాడు. సత్యవ్రతుడు దానినొక బావిలో ఉంచాడు. ముహూర్తకాలంలో ఆ మీను మూడు మూరల పొడవు పెరిగింది. 'అయ్యా! ఈ కూపమూ నాకు చాలదు; తగిన చోటు చూపించు' అన్నది. అతను దానిని తీసుకొని వెళ్ళి ఒక కొలనులో వదిలాడు. ఆ మీను మేనుపెంచి సరస్సును ఆక్రమించి, 'అయ్యా! ఇదీ నాకు చాలదు. పైగా కొలను నీరు ఇంకిపోక తప్పదు. తరుగులేని నీరుండే తావు చూపు' అన్నది. సత్యవ్రతుడు కొంతసేపు ఆలోచించి సముద్రం తప్ప వేరొక చోటు తగదని నిశ్చయించి దానిని కొనిపోయి సముద్రంలో వదిలిపెట్టాడు. ఆ పెనుచేప అతనిని చూసి 'అయ్యా! ఇందులో మొసళ్ళు, తిమింగలాలు మెండు. అవి మహాబలం కలిగినవి కాబట్టి నన్ను కబళిస్తే దిక్కులేదు. ఇంకెక్కడయినా సురక్షితప్రదేశంలో నన్ను వదిలిపెట్టితే పుణ్యం ఉంటుంది. ఇక్కడ వదిలి ఆ జలజంతువులకు బలిపెట్టకు. ఇది సత్పురుషులకు తగిన పనేనా?' అని మొరపెట్టింది.

సత్యవ్రతుడు ఆ మాటలు విని ఆశ్చర్యపోయాడు. 'అయ్యా! గోరంతవాడవు కొన్నినాళ్ళలోనే నూరుయోజనాలు పెరిగావు. ఇంతటి మత్స్యాన్ని ఎవరూ కనీ వినీ ఉండరు. నీవెవరివి? చేప రూపంలో వచ్చి మాకు మోహభ్రాంతులను

కలిగింపగోరావేమో. భూతానుగ్రహార్థం భగవానుడు వివిధ రూపాలను ధరిస్తాడని అంటారు. భగవానుడవు నీవు మత్స్యరూపాన్ని గ్రహించినట్లున్నది. దేవా! ఇదే నీకు నమస్కారం. ఈ రూపగ్రహణానికి కారణం ఏమిటి? నా పూజాఫలంగా మహాద్భుతమైన నీ దర్శనభాగ్యం ఈ రూపంలో నాకు ప్రాప్తమయింది. నీ సేవ ఎట్టిదైనా వ్యర్థం కాదు గదా' అని నమస్కరించాడు.

పరీక్షిన్నరేంద్రా! మత్స్యం అతని మాట విని, 'రాజోత్తమా! నేటికి ఏడవ నాడు ముల్లోకాలు మున్నీట మునుగుతాయి. అప్పుడొక పెద్ద ఓడ నీ వద్దకు వస్తుంది. నీవు సర్వౌషధులను, సర్వబీజాలను సంతరించి సప్తర్షులను, సర్వసత్త్వాలను వెంటగొని ఆ నావ ఎక్కి ఏకార్ణవంలో నిర్భయంగా సంచరించు. అప్పుడు పెనుగాలి సుడిగొట్టి వీస్తుంది. నీ నావకు ముప్పు రాకుండా వాసుకిని త్రాడుగా చేసి ఆ ఓడను నా కొమ్ముకు గట్టిగా కట్టు. బ్రహ్మకు రాత్రి గడిచినందాక ఆ నావను నేను మున్నీటిలో నడిపిస్తుంటాను. అప్పుడు నీవు పరబ్రహ్మాత్మకమైన నా మహిమను గూర్చి అడగవచ్చు. నీకు వివరంగా సమాధానం చెబుతాను. అంతట నీకు నా ప్రభావం గోచరిస్తుంది' అని చెప్పి అంతర్ధానమయింది.

రాజేంద్రా! సత్యవ్రతుడు ఆ మాటలకు మహాశ్చర్యసంతోషాలు పొంది అక్కడే సంధ్యవార్చి ప్రాచీముఖాగ్రంగా ఆ మత్స్యరూపాన్ని ధ్యానిస్తూ కాలానికై నిరీక్షింపసాగాడు.

ఏడవ నాడు మేఘాలు మహాభీకరంగా గర్జించి కుంభవర్షం కురిసింది. సముద్రం మహోత్తుంగతరంగ కల్లోలాభీలమై పొంగి పొరలి భూమండల మంతటినీ ముంచివేసింది. ఆ తరిని సత్యవ్రతుని వద్దకు ఒక నావ వచ్చింది. ఓషధీ బీజాలతో, సప్తర్షులతో అతను నావనెక్కాడు. అంతలో ప్రచండ వాయువులు వీచాయి. ఆ గాలి వడికి పడవ తలక్రిందు కానున్నట్లు కంపింపసాగింది. నావలోని వారందరూ ప్రాణాలపై ఆశ వదులుకొన్నారు. సప్తర్షులు వారి భయాన్ని గ్రహించి భగవంతుని ధ్యానింపమని ఆదేశించారు. సత్యవ్రతుడు ధ్యానింపసాగాడు. అతనికి నిడుపాటి చేపకొమ్ము, వాసుకి త్రాడు

కనిపించాయి. ఆ రేడు భగవదాజ్ఞను తలంచి వాసుకి సర్పాన్ని తాడుగా నావకు తగిలించి రెండవ కొసను చేప కొమ్ముకు కట్టి,

**మ. తమలోఁ బుట్టు నవిద్య గప్పికొనుడుం ద న్మూలసంసారవి**
**భ్రములై కొందఱు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో**
**గము నందే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై**
**ప్రమదం బందుదు రట్టి నీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా!**

**ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ**
**జన్న తెఱంగు మూఢునకు సమ్మతిఁ దా గురుడౌట; సూర్యుఁడే**
**కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను**
**ద్యన్నయమూర్తివై గురువవై యల సద్గతి జాడఁ జూపవే?**

**క. ఇంగలము తోడి సంగతి**
**బంగారము వన్నె గలుగు భంగి న్నీ సే**
**వాంగీకృతుల యఘంబులు**
**భంగంబులఁ బొందు ముక్తి ప్రాపించు హరీ!**

**క. హృదయేశ! నీ ప్రసన్నత**
**పదివేలవ పాలి లేశభాగము కతనన్**
**త్రిదశేంద్రత్వము గలదట**
**తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా!**

**క. పెఱవాఁడు గురువటంచును**
**గొఱగాని పదంబు సూప గుజనుండగు నీ**
**నెఱత్రోవ నడవ నేర్చిన**
**నఱమఱ లేనట్టి పదమునందు దయాబ్ధీ!**

**మ. చెలివై చుట్టమవై మనస్థితుడవై చిన్మూర్తివై యాత్మవై**
**వలనౌ కోర్కెల పంటవై విభుఁడవై వర్ధిల్లు ని న్నొల్లకే**

**పలువెంటం బడి లోక మక్కట! వృథాబద్ధాశమై పోయెడిన్**
**నిలువ న్నేర్చునె హేమరాశిc గనియున్ నిర్భాగ్యుc డంభశ్శయా!**

అని ప్రార్థించి, 'దేవా! జ్ఞానావబోధ నిమిత్తం నిన్ను ఆశ్రయించాను. నా హృదయగ్రంథిని భేదించి ఆత్మప్రకాశన కావించు' అని ప్రణమిల్లాడు. భగవానుడు అతని ననుగ్రహించి సాంఖ్యయోగక్రియాపురస్సరంగా అతనికి ఆత్మతత్త్వ రహస్యాన్ని బోధించాడు. దీనిని గురించి విశదీకరించి చెప్పిన పురాణానికి మత్స్య పురాణమని ప్రసిద్ధి కలిగింది.

రాజేంద్రా! బ్రహ్మదేవుడు నిద్రించే సమయాన అతని ముఖం నుంచి జనించిన వేదరాశిని హయగ్రీవుడనే దైత్యుడు అపహరించాడని చెప్పాను. భగవానుడు అతనిని చంపి వేదాలను మళ్ళీ బ్రహ్మకు అప్పగించాడు.

ఈ మత్స్యావతార చరిత్రను ప్రతిదినం చదివినా కీర్తించినా కోరికలీడేరి పరమగతి సిద్ధిస్తుంది. ఏ మహానుభావుడు నిఖిల కారణుడై ఉన్నవాడో, ఆ మాయామత్స్యమూర్తికి నమస్కరిస్తాను. రాజేంద్రా! ఆ సత్యవ్రతరాజర్షి తర్వాత వైవస్వత మను వయ్యాడు. అతనికి ఇక్ష్వాకువు మొదలైనవారు జన్మించారు.

**తత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్య మావిష్కృతం**
**తచ్ఛృణ్వ న్విపఠ న్విచారణపరో భక్త్యా విముచ్యే న్నరః.**

**కస్మై యేన విభాసితో౽ య మతులో జ్ఞానప్రదీపః పురా**
**తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయ తద్రూపిణా**
**యోగీన్ద్రాయ తదాత్మనాథ భగవద్రాతాయ కారుణ్యత**
**స్తచ్ఛుద్ధం విమలం విశోక మమృతం సత్యం పరం ధీమహి.**

**నమస్తస్మై భగవతే వాసుదేవాయ సాక్షిణే**
**య ఇదం కృపయా కస్మై వ్యాచచక్షే ముముక్షవే.**
**యోగీన్ద్రాయ నమస్తస్మై శుకాయ బ్రహ్మరూపిణే**
**సంసారసర్పదష్టం యో విష్ణురాత మమూముచత్.**

**భవే భవే యథా భక్తిః పాదయో స్తవ జాయతే**
**తథా కురుష్వ దేవేశ నాథస్త్వం నో యతః ప్రభో.**

**నామసజ్కీర్తనం యస్య సర్వపాపప్రణాశనమ్**
**ప్రణామో దుఃఖశమన స్తం నమామి హరిం పరమ్.**

# నవమ స్కంధము

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి పలుకులను విని 'మునీంద్రా! వైవస్వతమనువు వంశజుల చరిత్ర వినగోరుతున్నాను' అన్నాడు. శుకుడు చెప్పాడు.

## వైవస్వత మనువంశం

'రాజేంద్రా! కల్పాంతరవేళ విశ్వమంతా లయమవుతుందని, భగవంతు డొకడే మిగిలి ఉంటాడని, అనంతరీయ కల్పారంభాన భగవానుని నాభిప్రదేశమందు స్వర్ణమయకమలకోశం ఉదయిస్తుందని, అందులో నుంచి బ్రహ్మదేవుడు జన్మిస్తాడని, పద్మగర్భం నుంచి పుట్టినందువలన బ్రహ్మకు పద్మభవుడని పేరు వచ్చిందని, అతడే ప్రకృతకల్పాన్ని సృజించాడని విశదీకరించాను.

బ్రహ్మకు మానసపుత్రుడై మరీచి జన్మించాడు. అతనికి కశ్యపుడు పుట్టాడు. అతనికి దక్షుని కుమార్తె అదితియందు వివస్వతుడు కలిగాడు. వివస్వతునికి సంజ్ఞయందు శ్రాద్ధదేవుడనే పుత్రు డుదయించాడు. అతనే ఇప్పటి వైవస్వత మనువు.

## మైత్రావరుణ యాగం

వైవస్వతుడు శ్రద్ధాదేవిని భార్యగా గ్రహించాడు. వారికి సంతానం కలుగలేదు. వైవస్వతుడు పుత్రార్థియై వసిష్ఠుని ఆచార్యునిగా వరించి మైత్రావరుణమనే గొప్ప యాగాన్ని సంకల్పించాడు. అతని భార్య శ్రద్ధాదేవి పాలు మాత్రమే ఆహారంగా స్వీకరించి దీక్ష వహించింది. యజ్ఞాన్ని ప్రారంభించారు. ఆ సమయంలో శ్రద్ధకు పుత్రికావాంఛ జనించింది. ఆమె తన మనోభావాన్ని హోతకు తెలిపింది. అధ్వర్యుడు హోమార్థం హవిస్సును తెచ్చి హోతకు ప్రేష యిచ్చాడు. హోత దానిని అందుకొని శ్రద్ధాభావాన్ని మనస్సులో ఉంచుకొని పుత్రికా జననాన్ని కోరి ఆజ్యదేవత నుద్దేశించి మంత్రపురస్సరంగా వౌషట్కారం చెప్పాడు. అధ్వర్యుడు వేల్చాడు. హోత అర్థించిన ప్రకారం వైవస్వతునికి శ్రద్ధ యందు ఇళ  అనే కూతురు జనించింది.

## ఇళా సుద్యుమ్నత్వం

వైవస్వతుడు పుత్రికోదయాన్ని మెచ్చక వసిష్ఠునితో, 'మహాత్మా! ఒకటి తలిస్తే వేరొకటి జరిగింది. బ్రహ్మవాదులు చెప్పిన మంత్రాలు కూడా ఈ విధంగా సంకల్ప భిన్న ఫలాల నిస్తాయని ఇప్పుడే తెలిసింది' అని దీన స్వనంతో పలికాడు. వసిష్ఠుడు దివ్యదృష్టితో పరికించి చూసి, 'నాయనా! ఇది మంత్రాల దోషం కాదు. మంత్రాలెన్నడూ సంకల్పభిన్నఫలాల నివ్వవు. పుత్రికాజననాన్ని కోరి హోత మంత్రధ్యానం చేశాడు. చింతించి ఏమి ప్రయోజనం? నా తేజోబలంతో నీ కుమార్తెకు పురుషత్వం సాధిస్తాను' అని చెప్పి భగవానుని ప్రార్థించాడు. ఆదిపూరుషుడు వసిష్ఠుని ప్రార్థనకు హర్షించి ఇళకు పుంస్త్వాన్ని ప్రసాదించాడు. ఆ పుత్రిక మగసిరి వహించి సుద్యుమ్నుడనే పేరిట వెలయగా తండ్రికి సంతోషం కలిగింది.

## సుద్యుమ్నాదులకు స్త్రీత్వం

పరీక్షిన్నరేంద్రా! సుద్యుమ్నుని ప్రతిష్ఠాన దేశానికి రాజును చేశారు. అతను ఆ దేశాన్ని పరిపాలిస్తూ ఒకనాడు మంత్రులతో వేటకు బయలుదేరి

ఉత్తరదిశగా ప్రయాణించి మృగాలను పట్టి చంపుతూ వెళ్ళి వెళ్ళి మేరుగిరి ప్రాంతంలో ఉన్న కుమారవనాన్ని చేరుకొన్నాడు. ఆ వనంలో అడుగుపెట్టగానే వారందరూ స్త్రీలయ్యారు. వారి గుర్రాలు కూడా ఆడ గుర్రాలుగా మారాయి. ఒకరి నొకరు చూసుకొని అందరూ తెల్లబోయారు.

## కుమారవన ప్రభావం

రాజేంద్రా! ఈ వైపరీత్యానికి కారణ మేమంటావా? పూర్వం ఒకనాడు ఋషులు చంద్రశేఖరుని సందర్శించాలని అక్కడకి వచ్చారు. ఆ సమయంలో చంద్రచూడుడు ఉమాదేవితో ఉన్నాడు. వివస్త్రయై ఉన్న ఆ దేవి ఋషులను చూసి సిగ్గుపడి భర్త తొడ మీది నుంచి లేచి దుస్తులు ధరించింది. ఉమామహేశ్వరులు రతిలో ఉన్నారని ఋషులు గ్రహించి అందుండి మరలి నరనారాయణాశ్రమానికి వెళ్ళారు. మహేశ్వరుడు తన సతికి ప్రీతిగూర్చ దలచి 'ఇకపైని ఇక్కడ ఎవరు అడుగు పెట్టినా స్త్రీ రూపాన్ని పొందుతారు గాక!' అన్నాడు. నాటినుంచి అక్కడికి పురుషులెవరూ పోరు. మహేశ్వరుని శాపకారణాన సుద్యుమ్నాదులకు స్త్రీత్వం సంభవించింది.

## పురూరవ జననం

సుద్యుమ్నుడు స్త్రీరూపాన్ని పొంది తక్కినవారితో కలిసి వనవనాంతరాలు తిరుగుతూ కొన్నాళ్ళకు బుధుని ఆశ్రమాన్ని చేరుకొన్నారు. బుధుడు ఆ రూపాన్ని చూసి కామించాడు. వారికి పురూరవుడు జన్మించాడు.

## సుద్యుమ్నునికి స్త్రీత్వపురుషత్వాపాదనం

సుద్యుమ్నుడు తనకు కలిగిన స్త్రీత్వానికి దుఃఖపడి కులగురువైన వసిష్ఠుని ధ్యానించాడు. ఆ మునీంద్రుడు ప్రసన్నుడై సుద్యుమ్నుని దురవస్థకు చింతించి ఈశ్వరుని వద్దకేగి, 'దేవా! సుద్యుమ్నునికి ఎప్పటివలెనే పుంస్త్వాన్ని అనుగ్రహించు' అని ప్రార్థించాడు. ఈశ్వరుడు వసిష్ఠుని రాకకు సంతసించి, 'మునీంద్రా! నా మాటకు తిరుగులేదు. నీవుగా వచ్చి ఇంత కోరుతుంటే

కాదనలేను. వైవస్వతాపత్యం ఇదిమొదలు ఒక మాసం స్త్రీగా, ఒక మాసం పురుషునిగా ఉండే వరాన్ని ప్రసాదించాను. ఆ రూపంలోనే అతను రాజ్యపాలన చేయవచ్చును' అన్నాడు. సుద్యుమ్నుడు గురుప్రసాదం వలన స్త్రీత్వాన్ని, పురుషత్వాన్ని పొందుతూ రాజ్యం చేయసాగాడు.

## తపోదీక్ష

నరేంద్రా! ఉభయలింగధారి అయిన సుద్యుమ్నుని పరిపాలన ప్రజలకు నచ్చలేదు. అతనికీ వయస్సు మీరింది. అతను ప్రజాభిప్రాయాన్ని గ్రహించి తన కుమారులైన ఉత్కలుడు, గయుడు, విమలుడు అనే ముగ్గురిని ఉత్తరాపథానికి రాజులుగా చేసి పురూరవునికి పట్టాభిషేకం జరిపించి తపోదీక్ష గైకొన్నాడు.

## నృగాదుల జననం

రాజా! వైవస్వతుడు పుత్రసంతానం కోరి మళ్ళీ యమునాతీరానికి వెళ్ళి భగవానుని గూర్చి నూరేండ్లు తపస్సు చేశాడు. భగవదనుగ్రహఫలంగా అతనికి శ్రద్ధయందు నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూశకుడు, నరిష్యంతుడు, పృషధ్రుడు, నభగుడు, కవి అని తొమ్మిది మంది కొడుకులు పుట్టారు. నభగునికి నాభాగుడని కూడా పేరున్నది.

## పృషధ్రుడు

పృషధ్రుడు తన గురువైన వసిష్ఠుని ఆశ్రమంలో వసించి అతని గోగణాన్ని రక్షిస్తుండేవాడు. ఒక యేడాది వర్షాకాలంలో కారుమబ్బులు క్రమ్మి కటిక చీకట్లు ముసిరి వాన కుండపోతగా కురిసింది. ఆవులు కొట్టంలో చలికి వణుకుతూ ఒకదానినొకటి అంటిపెట్టుకొని పడుకున్నాయి. ఆ రాత్రి మందలోకి ఎక్కడినుంచో ఒక పెద్దపులి వచ్చి ఒక ఆవును పట్టుకొన్నది. గోవులన్నీ ప్రాణభయంతో బొబ్బలు పెట్టాయి. పృషధ్రుడు ఆ కలకలాన్ని విని తటాలున గోష్ఠం లోనికి వెళ్ళాడు. గాఢాంధకారంలో కన్ను పొడుచుకొన్నా

ఏమీ కనిపించలేదు. అతను కత్తి పైకెత్తి పులి అనుకొని అడ్డుతగిలిన జంతువును మోదాడు. ఆ వేటు దూసుకొని ఒక ఆవు తల తెగిపడింది. ఖడ్గం కొన తగిలి పులి చెవి తునిగి రాలింది. వ్యాఘ్రం పెద్ద పెట్టున అరిచింది. పులి చచ్చినదనుకొని అతను తిరిగి వెళ్ళిపడుకున్నాడు.

తెల్లవారింది; నిజం బయటపడింది. పృషధ్రుడు ఖిన్నుడై ప్రాన్పడి నిలిచాడు. వసిష్ఠునికి సంగతి తెలియజెప్పారు. ఆ మునీంద్రుడు విని ప్రమాదఫలమని మన్నింపక, 'దుర్మార్గుడా! క్షత్రియుడు చేయకూడని పని చేశావు. ఇది శూద్రకృత్యం. శూద్రుడవు కా' అని శపించాడు.

పృషధ్రుడు గురువు శాపానికి తలవంచి బ్రహ్మచర్యవ్రతం పూని భగవానుని యందు ఏకాంతభక్తి కావించి యదృచ్ఛాలబ్ధం జీవికగా జడాంధ బధిరుల వలె భూసంచారం చేస్తూ కొంత కాలానికి ఒకానొక అరణ్యంలో మండుతున్న దావాగ్నిలో పడి కాలి బ్రహ్మపదాన్ని పొందాడు.

## కవి

రాజా! కవి అనేవాడు బాల్యంనుంచి విషయవైరాగ్యం పెంచి గృహాదులన్నిటినీ త్యజించి భగవత్పరచిత్తుడై పరమగతిని పొందాడు.

## కరూశ ధృష్టుల సంతానం

కరూశునికి కారూశు లనేవారు పుట్టారు. వారందరూ బ్రాహ్మణ భక్తులు. అందరూ ధర్మపరాయణులు. తండ్రి తర్వాత వారు ఉత్తరాపథాన్ని పరిపాలించారు.

ధృష్టునికి జన్మించిన కొడుకులకు ధార్ష్టులని పేరువచ్చింది. వారందరూ వేదధర్మాన్ని అవలంబించి బ్రాహ్మణులయ్యారు.

## నృగుని సంతానం

నృగువుకు సుమతి, అతనికి జ్యోతిస్సు, అతనికి వసువు, వసువుకు ప్రతీతుడు, ప్రతీతునికి ఓఘవంతుడు జన్మించారు. ఓఘవంతునికి ఒక

కొడుకు, కూతురు పుట్టారు. కూతురుకు ఓఘవతి అని తండ్రి పేరు పెట్టారు. ఆమెను సుదర్శనుడు వివాహం చేసుకొన్నాడు.

## నరిష్యంతుని సంతానం

నరిష్యంతునికి చిత్రసేనుడు, అతనికి దక్షుడు, అతనికి మాఢ్వాంసుడు, అతనికి శర్వుడు, అతనికి ఇంద్రసేనుడు, అతనికి వీతిహోత్రుడు, అతనికి సత్యశ్రవుడు, అతనికి ఉరుశ్రవుడు, అతనికి దేవదత్తుడు, అతనికి అగ్నివేశుడు జన్మించారు.

అగ్నివేశునికి కానీనుడని, జాతుకర్ణుడని పేర్లు కలిగాయి. ఆ మహర్షి వలన అగ్నివేశ్యాయన మనే బ్రహ్మకులం ఆవిర్భవించింది.

## దిష్టుని సంతానం

రాజా! దిష్టుని కొడుకు పేరు నాభాగుడు. కర్మవశాన అతనికి వైశ్యత్వం కలిగింది. అతనికి హలంధనుడు, అతనికి వత్సప్రీతి, అతనికి ప్రాంశువు, అతనికి క్రమతి, అతనికి ఖమిత్రుడు, అతనికి చాక్షుషుడు, అతనికి వివింశతి, అతనికి రంభుడు, అతనికి ఖనినేత్రుడు, అతనికి కరంధనుడు, అతనికి అవిక్షితుడు, అతనికి మరుత్తుడు పుట్టారు.

## మరుత్తుడు

మరుత్తుడు చక్రవర్తి అయిన తర్వాత అంగిరఃపుత్రుడైన సంవర్తుడనే మహాయోగీశ్వరుని యాజకునిగా వరించి గొప్ప యజ్ఞం చేశాడు. ఆ యాగంలో హిరణ్యపాత్రలు తప్ప వేరొక పాత్రను ముట్టుకొని ఎరుగనంత వైభవంగా జరిగింది. ఇంద్రుడు స్వయంగా వచ్చి ఆ యజ్ఞంలో సోమపానం చేసి మత్తుగొన్నాడు; మరుత్తులు పరివేషం కావించారు; విశ్వేదేవతలు సదస్యులుగా వచ్చి కూర్చున్నారు; ద్విజులు దక్షిణలను మోయలేకపోయారు. ఆ యజ్ఞానికి సాటిరాగల యజ్ఞం మళ్ళీ ఈనాటి వరకు జరగలేదంటే ఎంత వైభవోపేతంగా జరిగిందో ఊహింపగలవు.

## మరుత్తుని సంతానం

మరుత్తునికి దముడు, అతనికి రాజవర్ధనుడు, అతనికి సుధృతి, అతనికి నరుడు, అతనికి కేవలుడు, అతనికి బంధుమంతుడు, అతనికి వేగవంతుడు, అతనికి బంధుడు, అతనికి తృణబిందుడు కలిగారు.

## తృణబిందుని సంతానం

తృణబిందువును అలంబస అనే అప్సరస వరించింది. వారికి పెక్కుమంది సుతులు, ఒక కుమార్తె ఇలబిల జన్మించారు. ఇలబిలను విశ్వావసువు గ్రహించాడు. వారికి కుబేరుడు పుట్టి తండ్రితో చదివి విద్వాంసుడయ్యాడు.

కుబేరునికి విశాలుడు, శూన్యబంధుడు, ధూమ్రకేతుడు అని కొడుకులు పుట్టారు. విశాలుడు తనపేర ఒక పట్టణాన్ని నిర్మించాడు. దానిని విశాలపురమంటారు.

విశాలునికి హేమచంద్రుడు, అతనికి ధూమ్రాక్షుడు, అతనికి సహదేవుడు, అతనికి కృశాశ్వుడు, అతనికి సోమదత్తుడు జనించారు. సోమదత్తుడు అశ్వమేధయాగాలు చేసి యజ్ఞేశ్వరుని ఆరాధించి ఉత్తమగతిని పొందాడు. సోమదత్తునికి సుమతి, అతనికి జనమేజయుడు జన్మించారు. విశాలుని వంశీయులందరూ తృణబిందుని కీర్తిలతల వలె నేల నాలుగు చెరగులకూ కలయబ్రాకారు.

## సుకన్య చరిత్ర

రాజా! వైవస్వతుని కుమారుడు శర్యాతి వేదాంత తత్త్వవేత్తయై ఒకప్పుడు అంగిరుని యజ్ఞంలో రెండవ నాటి విహితకర్మను వచించినవాడు. అతనికి సుకన్య అని పుత్రిక జనించింది. ఒకనాడతను సుకన్యను వెంటబెట్టుకొని చ్యవనాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ పెరిగిన ఆశ్రమవృక్షాలను తిలకిస్తూ అటూ యిటూ తిరుగుతూ ఆమె తనకు చేరువనే ఉన్న ఒక పుట్టలో మిణుగురుల వంటి రెండు వెలుగులు కనబడుతుంటే వింతగా అనిపించి ముల్లు తీసుకొని ఆ

వెలుగులను పొడిచి చూసింది. ఎప్పుడు సుకన్య ఆ విధంగా చేసిందో అదే క్షణాన రాజసేనలకు మలమూత్రనిరోధం కలిగి కడుపుబ్బి బాధకలిగింది. కాంతిగోళాల నుంచి నెత్తురు కారి పుట్టమట్టి ఎర్రబడింది. రాజసైనికులు గిలగిలలాడటం మొదలు పెట్టారు. శర్యాతి అది చూసి ఆశ్చర్యపడి పరిచరులను పిలిచి, 'మీలో ఎవరైనా భార్గవ మునీంద్రునికి అపచారం చేసి ఆశ్రమమర్యాదలను మీరలేదు కదా?' అని ప్రశ్నించాడు. సుకన్య అంతలో అక్కడికి వచ్చి తాను చేసిన పని చెప్పింది. శర్యాతి ఆ మాటవిని ఉద్విగ్నుడై పుట్టదగ్గరికి వెళ్ళి చూసి, సంగతి గ్రహించి, 'మునివర్యా! నా కుమార్తె సుకన్య చిన్నతనం వల్ల తెలియక నీకు అపచారం చేసింది. దానిని కరుణించి అనుగ్రహించు' అని ప్రాధేయపడ్డాడు. పుట్టలో ఉన్న చ్యవనమహర్షికి, శర్యాతికి కొంత సంభాషణ జరిగింది. శర్యాతి ఆ మునీంద్రుని ఉద్దేశం గ్రహించి సుకన్యను అతనికిచ్చి పెండ్లి చేసి కొన్నాళ్ళుండి ఆజ్ఞ గైకొని రాజధానికి బయలుదేరాడు.

## భార్గవునికి నవయౌవనం

రాజా! భార్గవుడు పరమకోపి అయినా సుకన్య అతని మనసు గ్రహించి రెప్పవాల్చక పరిచర్యలు చేస్తూ చిరకాలం అతనిని సేవించింది. ఒకనాడు అశ్వినులు ఆ ఋష్యాశ్రమానికి వచ్చారు. చ్యవనుడు యథావిధి వారి నర్చించి, 'దేవవైద్యులారా! యజ్ఞభాగాలలో సోమపానానికి అధికారం మీకు లేదు కదా. దానిని మీకు కల్పిస్తాను. అందుకు మారుగా జవరాండ్రకు ఇంపుగొలిపే జవ్వనాన్ని నాకివ్వండి' అని అడిగాడు. వారందుకు సమ్మతించి, 'మునీంద్రా! ఇదిగో ఈ చెంతనున్న సిద్ధ సరస్సులో స్నానం చెయ్యి' అన్నారు.

చ్యవనుడు ముసలితనం వల్ల కదిలే పాటి సత్తువ లేక నీరసించి ఉన్నాడు. పైగా శరీరమంతా ముడతలు పడి చూడటానికి అసహ్యంగా ఉన్నది. అశ్వినులతనిని లేవనెత్తి తీసుకొని పోయి ఆ కొలనులో తమతో పాటు ముంచారు. వెంటనే అందులో నుంచి ముగ్గురు పురుషులు ఏకరూపులు రవితేజస్కులు బయటికి వచ్చారు. ముగ్గురూ రూపరేఖలే కాక దివ్యవస్త్రమాలికాదులను

కూడా ఏకరూపం కలవానినే ధరించి ఎవరెవరో తెలియరానట్లు కనిపించారు. ఆ విధంగా వెలువడి వారు సుకన్య దగ్గరికి వెళ్ళి ఆమె ముందు నిలబడ్డారు. లోకోత్తర సౌందర్యగాత్రాలతో తన యెదుట సాక్షాత్కరించిన వారిలో తన భర్త ఎవరో నిశ్చయింపలేక ఆమె అశ్వినులను ప్రార్థించింది. ఆమె పతివ్రతాధర్మానికి వారు మెచ్చి ఆ సాధ్వీమతల్లికి భర్తను చూపి ఆ ఋషివర్యుని వద్ద సెలవు తీసుకొన్నారు.

## అశ్వినులకు సోమభాగం

రాజా! శర్యాతి కొన్నాళ్ళకు ఒక యాగాన్ని సంకల్పించి కూతురును, అల్లుణ్ణి ఆహ్వానిద్దామని చ్యవనాశ్రమానికి వచ్చాడు. అక్కడ తన కుమార్తె, ఆమె చెంత రవితేజుడైన ఒక నవయువకుడు కూర్చొని ఉన్నారు. సుకన్య తండ్రికి నమస్కరించింది. శర్యాతి అందుకు సంతసింపక, 'ఇదేమి పని? లోకపూజితుడైన నీ భర్త వృద్ధుడని అతనిని విడిచిపెట్టి జారిణి వయ్యావా? సత్కులంలో పుట్టి అసద్గతికి పూనుకొన్నావా? భర్తృవంశానికి, పితృవంశానికి మాయరాని మచ్చ తెచ్చావు' అని రోషకషాయస్వరంతో గద్దించి పలికాడు. సుకన్య ఆ మాటలకు చిరునవ్వు నవ్వి 'తండ్రీ! ఈయన నీ అల్లుడు భార్గవుడు. పరపురుషుడు కాడు' అని జరిగిన వృత్తాంతాన్ని పూసగ్రుచ్చినట్లు వివరించింది. శర్యాతి ఆ సంగతి విని పరమానందవశుడై కుమార్తెను కౌగిలించుకొని అల్లుని అభినందించి ఇద్దరినీ యాగార్థం తనతో తీసుకుని వెళ్ళాడు. చ్యవనుడు మామగారి యాగాన్ని చేయించి అందులో సోమభాగాన్ని తన తేజోమహిమ వల్ల అశ్వినులకు అందజేశాడు.

అందుకు ఇంద్రుడలిగి చ్యవనుని చంపాలని వజ్రాన్ని అందుకొన్నాడు. భార్గవుడు దేవేంద్రుని భుజాన్ని వజ్రంతోపాటు స్తంభింపజేశాడు. రాజా! అశ్వినులు వైద్యులని వారిని సోమపానానికి అన్నాళ్ళుగా బహిష్కరించి ఉంచారు. నాటికి చ్యవనుని కృత్యం అందరికీ సమ్మతమయింది. ఆ నాటినుంచి అశ్వినులకు సోమగ్రహణ పాత్రత కలిగింది.

## రేవతి

రాజా! శర్యాతికి ముగ్గురు కుమారులు ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు జన్మించారు. ఆనర్తునికి రైవతుడు పుట్టి సముద్రమధ్యంలో కుశస్థలి అనే పట్టణాన్ని నిర్మించి అది రాజధానిగా ఆనర్తాదిదేశాలను పరిపాలించాడు. అతనికి కకుద్మి మొదలైనవారు నూరుగురు కొడుకులు, రేవతి అనే కుమార్తె కలిగారు. అతను రేవతికి వివాహం చేయగోరి తగిన రాకుమారులను విచారింపసాగాడు. రేవతికి వారెవ్వరూ నచ్చలేదు. అతను చివరికి తన కూతురికి తగిన వరుడెవరో బ్రహ్మనే అడగాలని నిశ్చయించి రేవతిని వెంటబెట్టుకొని బ్రహ్మలోకానికి వెళ్ళాడు.

అప్పుడు బ్రహ్మసభలో గాంధర్వగానం జరుగుతున్నది. రైవతుడది చూసి బ్రహ్మసందర్శనానికి అది యోగ్యసమయం కాదని సభ ముగిసే దాకా వేచి ఉండి అదను కలిగినంతనే నలువను సందర్శించి నమస్కరించాడు. బ్రహ్మదేవుడు నవ్వుతూ, 'అయ్యా! నీవు వచ్చిన కార్యమేమిటో నాకు తెలుసు. మీరు భూలోకాన్ని విడిచిపెట్టి ఎంతకాలం గడిచిందో నీకు తెలుసా? ఇప్పటికి ఇరవైఏడు మహాయుగాలు గతించాయి. ఎవరెవరికి నీ కుమార్తెను ఇద్దామనుకొన్నావో వారు వారి పుత్రపౌత్రప్రపౌత్రులు అందరూ కాలగర్భంలో కలిసిపోయారు. వారి వంశాలు కూడా ఇప్పుడు లేవు. ఇక నీ కుమార్తెకు తగిన వరుడెవరంటావా? భూభారాన్ని తగ్గించేందుకు భగవానుడు నిజాంశతో బలభద్రుడను పేర ధాత్రిలో అవతరించాడు. ఆ మహనీయునికి నీ కుమార్తె నిచ్చి పెండ్లిచెయ్యి' అన్నాడు.

రైవతు డా మాట విని పరమేష్ఠి అనుమతిని పొంది కుశస్థలికి వచ్చాడు. ఆ లోగా అతని అన్నలు యక్షభయం వలన ఊరు విడిచి స్వర్గానికి పారిపోయారు. ఎక్కడా తనకు తెలిసిన వారెవరూ అతనికి కనిపించలేదు. అతను బలభద్రుని కలుసుకొని రేవతి విషయం ప్రస్తావించి మంచి ముహూర్తంలో వారిద్దరికీ వివాహం చేసి తపోవ్రతుడై నారాయణాశ్రమానికి వెళ్ళాడు.

## నాభాగుని చరిత్ర

రాజా! వివస్వంతుని సుతుడైన  నభగునికి నాభాగుడు మొదలైనవా రనేకులు కొడుకులు జన్మించారు. నాభాగుని అధ్యయనార్థం గురుకులంలో వదిలిపెట్టారు. అతను విద్యనేర్చి నైష్ఠిక బ్రహ్మచారి అయ్యాడు. అంతలో అతని సోదరులు పిత్రార్జితాన్ని పంచుకొన్నారు. నాభాగుడు అధ్యయనాంతానికి వచ్చి తన పాలిమ్మని అన్నల నడిగాడు. వారామాట విని 'నీ తండ్రే నీ భాగం' అన్నారు. అతనంతట తండ్రివద్దకు వెళ్ళి, 'నా అన్నలు నిన్ను నా భాగానికి పంచారు' అని చెప్పాడు. నభగుడామాట విని 'నాయనా! నీకు రావలసిన భాగాన్ని పంచియివ్వక నన్ను నీ భాగమంటారేమిటి? పోనీ అలాగే కానివ్వు. బాధపడకు. నేను నీకు వృత్తి చూపిస్తాను. నీవు సుఖంగా ఉండవచ్చు. ఇదిగో ఈ ఆంగిరసులు మహామేధావంతులు. సత్త్రయాగం చేస్తున్నారు. ఆ యాగంలో ఆరేసి దినాలకు పృష్టాహుతులను జరపాలి. దాని కర్మకలాపం అతివిస్తృతమైనది. ఎంతటి వారయినా అందులో పొరపడతారు. నీవక్కడికి వెళ్ళి సమయం చూసి వైశ్వదేవ సూక్తాలు రెండు వారికి చెప్పు. వారు యజ్ఞాంతంలో స్వర్గానికి పోతూ సత్త్రశేషాన్ని నీకిస్తారు. అది నీ జీవికకు కావలసినంత' అని చెప్పాడు. నాభాగుడు పితృవచనానుసారం వర్తించాడు. ఆంగిరసులు సత్త్రశేషాన్ని అతనికిచ్చి స్వర్గానికి వెళ్ళారు.

## నాభాగ శంకరుల సమావేశం

నాభాగుడు సత్త్రశేషంగా లభించిన ద్రవ్యాన్ని తీసుకొని వస్తుండగా నల్లటి పురుషుడొకడు అతనిని అడ్డగించి 'సత్త్రశేషం' నాది అని తగవుకు వచ్చాడు. నాభాగుడు 'అయ్యా! ఇది ఋషులు నాకిచ్చిన ద్రవ్యం. నీదెలా అవుతుంది?' అని అడిగాడు. ఆ వచ్చినవాడు అతని మాటను చెవిబెట్టక, 'మన వాదాన్ని గురించి నీ తండ్రికి చెప్పి అతను తీర్మానించినట్లు చేద్దాము పద' అన్నాడు. ఇద్దరూ నభగుని వద్దకు వెళ్ళి జరిగిన సంగతి వివరించారు. నభగుడు వారి మాటలను విని పుత్త్రుని వంక మరలి, 'నాయనా! యజ్ఞశేషమంటే రుద్రుని

భాగం కదా. నీతో వాదుకు వచ్చిన ఈ మహాత్ముడు సర్వజ్ఞుడైన రుద్రుడని గ్రహించు. ఈ లోకపూజ్యుడు సర్వాధికారి' అని చెప్పాడు. నాభాగుడు రుద్రునికి నమస్కరించి 'దేవా! ఇది నీ సొమ్మని నా తండ్రి తీర్మానించాడు. ఇక నీ యిష్టం' అన్నాడు. శ్రీ రుద్రుడు అతనిని చూసి 'నీ తండ్రి పుత్రవాత్సల్యం చేతనైనా ధర్మం తప్పనివాడు. దారిద్ర్యం వెన్నాడుతున్నా నీవు ఆడిన మాట తప్పలేదు. ఎంత కష్టం వచ్చినా అసత్యం చెప్పకూడదు. సత్యవర్తనమంటే నేనెంతో సంతోషిస్తాను. సత్యవంతుడు నాకు పరమప్రియుడు. ఇదిగో సత్రశేషమంతటినీ నీకే ఇచ్చివేస్తున్నాను. ఇంతేకాదు. నీవు మంత్రజ్ఞుడవు కాబట్టి సనాతన బ్రహ్మజ్ఞానాన్ని కూడా ఇచ్చాను' అని పలికి ఆ జ్ఞానాన్ని ఉపదేశించి శంకరుడు అంతర్హితుడయ్యాడు.

## అంబరీష చరిత్ర

రాజా! నాభాగునికి అంబరీషుడు జనించి సప్తద్వీపాయత ధాత్రీమండలానికి ఛత్రాధిపతి అయ్యాడు. సిరిసంపదలు గరిగొన్నాయి. అయినా అతనికవి రుచింపక, 'ఈ విభవాలు తమస్సు కోసం తెరిచిపెట్టిన గుమ్మాలు. దృశ్యజాతాలు స్వప్నశ్రీల వంటివి. జగత్తు లోష్టసమానం. అట్టిదానిని పట్టుకొని ప్రాకులాడటం వెర్రితనం' అని నిశ్చయించాడు.

**'సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద**
**పలుకులు హరి గుణపఠనమంద**

**కరములు విష్ణు మందిర మార్జనము లంద**
**శ్రవములు హరి కథాశ్రవణమంద**

**చూపులు గోవింద రూపవీక్షణమంద**
**శిరము కేశవ నమస్కృతుల యంద**

**పదము లీశ్వర గేహపరిసర్పణములంద**
**కామంబు చక్రి కైంకర్యమంద**

**తే. సంగ మచ్యుత జన తను సంగమంద**
**ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద**
**రసన తులసీదళములంద రతులు పుణ్య**
**సంగతుల యంద నా కింక సాగుగాక!'**

అని నిశ్చయించి సర్వేశ్వరార్పణగా స్వధర్మాలను నిర్వర్తిస్తూ ఈశ్వరభక్తులు చెప్పినట్లు రాజ్యపాలన చేస్తూ సరస్వతీ తీర పుణ్యదేశంలో వసిష్ఠగౌతమాసిలాదులు ఆధ్వర్యం వహింపగా హయమేధాలను మహావిభూతితో కావించి యజ్ఞేశ్వరుని ఆరాధించాడు. రాజేంద్రా! ఆ మహాభాగుని యజ్ఞాలలో పాల్గొన్న ఋత్విగాదులందరూ నిర్జరసమానరూపులై అనిమిషత్వాన్ని పొందారు. స్వారాజ్యసుఖాదివిషయాలు సిద్ధులకు కూడా దుర్లభాలయితే కావచ్చును గాని భగవద్భక్తులకు మాత్రం అవి ముంగొంగు పసిడిమూటల వంటివి. భక్తిసుధారసమే పరమప్రేయంగా కలిగిన వారెవరూ ఆ సుఖాన్ని వదులుకొని తుచ్ఛసుఖాలకు ప్రాకులాడరు.

రాజా! అంబరీషుడు ఆ విధంగా భక్తియోగాన్ని తపఃపూర్వకంగా పెంపొందించుకొంటూ భార్యాగృహాదులను క్రమక్రమంగా త్యజించి నిర్మలుడు, నిశ్చలచిత్తుడు అయ్యాడు. భగవానుడతని భక్తికి మెచ్చి భీతరక్షణ శత్రుశిక్షణ సమర్థమైన చక్రాన్ని అతని కిచ్చాడు.

## అంబరీషుని ద్వాదశీవ్రతం

ఆ రాజచంద్రు డంతట సంవత్సరాత్మక ద్వాదశీవ్రత మూలకంగా శ్రీవిష్ణుదేవుని ఆరాధింపదలచి, తోడునీడ వలె అన్నింటిలో తనకు సహధర్మచారిణిగా ఉన్న భార్యకు తన సంకల్పాన్ని తెలియజేశాడు. సతీపతులిద్దరూ దీక్ష వహించారు. వ్రతం ముగిసింది. కార్తికమాసంలో మూడు రాత్రులు ఉపవసించి మరునాడు తెల్లవారుజామున కాళిందీ జలాలలో స్నానం చేసి మధువనంలో మధుసూదనుని సకలోపకరణ పూర్వకంగా అభిషేకించి గంధమాల్యాదులను అర్పించి ఆంతరభక్తితో

ధ్యానించి పదికోట్ల ధేనువులను రప్పించి వాటి కొమ్ములకు బంగారు కొమ్ములను, గిట్టలకు బంగారు గిట్టలను తొడిగి వస్త్రమాల్యాదులు అలంకరించి వాటిని సవత్సకంగా బ్రాహ్మణోత్తములకు విధివిధాన పూజాపురస్సరంగా దానాలిచ్చి మృష్టాన్నసంతర్పణ కావించాడు. విప్రవర్యులు పరమప్రీతులై భుజించి అంబరీషునికి పారణకు అనుజ్ఞనిచ్చారు.

## దుర్వాస సమాగమం

ఆ రాజు పారణ చేస్తున్నాడు. సరిగా అదే సమయానికి దుర్వాసుడు అతిథియై వచ్చాడు. అంబరీషుడు మునీంద్రునికి సముచిత పూజలు చేసి అతనిని భోజనానికి రమ్మన్నాడు. ఆ తపస్వి అంగీకరించి మాధ్యాహ్నికక్రియలు నిర్వర్తించటానికి కాళిందీనదికి వెళ్ళి అందులో మునిగి బ్రహ్మధ్యానం మొదలుపెట్టినవాడు ఎంతసేపటికీ బయటికి రాలేదు. ద్వాదశి ఘడియలు ఒక్క అర్ధముహూర్తకాలం మాత్రమే శేషించి ఉన్నది. ఆ లోపల పారణ జరగాలి. బ్రాహ్మణులను కాదని భుజింపకూడదు. అతిథి రాడు. ధర్మసంకటం ఏర్పడింది. అంబరీషుడు చింతాక్రాంతుడై వ్రతానికీ ధర్మానికీ భంగం కాని మార్గమేమిటని ఆలోచించి భగవంతుని ధ్యానించి జలపారణ కావించి ముని రాకకోసం నిరీక్షింపసాగాడు.

## దుర్వాసుని ఆగ్రహం

దుర్వాసుడు నెమ్మదిగా తన కృత్యాలు తీర్చి కొంతసేపటికి భోజనశాలకు వచ్చాడు. అంబరీషుడు చేతులు జోడించి ఎదుట నిలబడ్డాడు. ఆ మునీంద్రుడు దివ్యజ్ఞానం వలన సంగతి గ్రహించి కోపవశుడై మోము చిట్లించి, 'నృశంసుడా! అతిథిని భోజనానికి పిలిచి అతను వచ్చే లోగానే కడుపు నింపుకొని ఏమీ తెలియనట్లు నటిస్తున్నావు. ఐశ్వర్యమదమత్తుడివై ధర్మోల్లంఘనానికి కూడా జంకవేమిటి? దీనికి ప్రతిఫలం అనుభవించు' అని పలికి తలనుంచి ఒక జటను ఊడబెరికి నేలమీదికి విసిరికొట్టాడు. ఆ దెబ్బకు కాలాగ్ని వంటి ఒక కృత్య జన్మించి కత్తి ఝళిపిస్తూ అంబరీషుని పైకి

ఉరవడించింది. అంబరీషుడు ఇంచుకయినా చలింపక విష్ణుధ్యానమగ్నుడై నిలిచాడు. అంతలో విష్ణుచక్రం వచ్చి ఆ కృత్యకను దహించి దుర్వాసుని మీదికి విజృంభించింది. ఆ మునిసత్తముడు భయభ్రాంతుడై ప్రాణరక్షణార్థం దెసల బడి పరిగెత్తటం మొదలుపెట్టాడు. ఆ చక్రం అతనిని వెంబడించింది.

## దుర్వాసుని పరుగులు

**మ. భువి దూఱన్ భువిదూఱు నబ్ధి జొర నబ్ధుల్ సొచ్చు నుద్వేగియై**
**దివి బ్రాఁకన్ దివి బ్రాఁకు దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ జి**
**క్కి వెసన్ గ్రుంకినఁ గ్రుంకు నిల్వ నిలుచుం గేడింపఁ గేడించు నొ**
**క్క వడిన్ దాపసు వెంటనంటి హరి చక్రం బన్యదుర్వక్రమై.**

రాజా! దుర్వాసుడు ఆ విధంగా లోకాలు తిరిగి లోకపాలకులను ఆశ్రయించి ఎక్కడా దిక్కు తోచక బ్రహ్మ వద్దకేగి అభయం వేడాడు. పరమేష్ఠి అతని మొర విని దీర్ఘాలోచన కావించి, 'ఏ మహాత్ముడు కాలాత్ముడై ఈ విశ్వాన్నే గాక స్థానాన్ని కూడా కనుసన్న మాత్రాన పుట్టించి లయింపజేస్తున్నాడో, ఎవ్వని ఆజ్ఞలను తలదాల్చి నేను, ఈశ్వరుడు, దక్షాది ప్రజాపతులు, సురపతులు, భూపతులు లోకహితాన్ని ఆచరిస్తున్నామో, ఆ మహాత్ముని చక్రాన్ని మరలించటం అసాధ్యం' అని చెప్పాడు. దుర్వాసుడంతట బ్రహ్మను వీడ్కొని హుటాహుటి కైలాసానికి పరిగెత్తి శంకరుని శరణుకోరాడు. గౌరీనాథుడు సాంతం విని అతనిని చూసి, 'మునీంద్రా! ఎవడు కాలాత్ముడో, ఎవడు నిమిత్తమాత్రుడు కాగా చరాచర భూతలోకమంతా కనబడుతూ మాయమవుతున్నదో, ఎవనిచే నిర్మింపబడిన బ్రహ్మాండాలలో మేము పరిభ్రమిస్తున్నామో, ఎవని మాయాస్వరూపం ఇట్టిదని సనత్కుమార బ్రహ్మ నారద కపిల దేవల ధర్మాదులు గాని మరీచి ప్రముఖ సిద్ధేశ్వరులు గాని తుదకు నేను గాని గ్రహింపలేక దానికి లోబడి వర్తిల్లుతున్నామో, ఆ మహాత్ము డెక్కడ? గోటికి కొరగాని మా ప్రాభవం ఎక్కడ? అతని ముందు మా ఆటలు సాగవు. అతనినే శరణు వేడు. సర్వేశ్వరుడు పరమదయామూర్తి. నీకు తప్పక మేలు చేస్తాడు' అని చెప్పాడు.

## శ్రీమహావిష్ణు శరణాగతి

రాజా! ఆ మునీంద్రు డంతటితో అడియాసలన్నీ వదిలి వైకుంఠానికి పరిగెత్తి నిట్టూర్పులతో వడవడ వణుకుతున్న కృశదేహంతో వైకుంఠుని పాదాలపై వ్రాలి, 'దేవా! విశ్వధామా! నీ భక్తుల ప్రభావం తెలియక తప్పుచేశాను. నా తప్పు మన్నించి నన్ను రక్షించు' అని వేడుకొన్నాడు. భగవానుడు దుర్వాసుని మాట విని, 'అయ్యా! నా చిత్తాన్ని ఆకర్షించిన భక్తులకు నేను పరాధీనుడనై ఉంటాను. నాకు స్వాతంత్రం లేదు. వారికి మంచి చేయాలని ఎల్లప్పుడు వారి దగ్గరే ఉంటాను. నేను వారికి వశపడినట్లే వారు నాకు సర్వసంగ పరిత్యాగం చేసి నేనే పరమగతినని నమ్మి నాకు సమర్పించుకొంటారు. సాలోక్యాది ముక్తులను ఇస్తానన్నా మాకు వద్దంటారు. భక్తులు నా హృదయమూ, నేను భక్తుల హృదయాన్నీ అయినందు వల్ల మాకు ప్రత్యేకస్థితులు కలుగవు. మునీంద్రా! తమ మహిమలను సాధుజనులకు అపకారార్థం వినియోగించేవారు వారి ప్రభావం చేతనే ప్రతిహతులై చెడిపోతారు. తపోవిద్యలు లోకంలో ప్రశస్తమైనవి. వాటివలన సాధువులకు మేలు, దుర్వినీతులకు కీడు కలుగుతాయి. ఆత్మశక్తిని దేశకాలపాత్రాలను బట్టి ఉపయోగించాలి. విప్రవర్యా! నీవు వెంటనే వెళ్ళి ఆ భాగవతుని ప్రసన్నం చేసుకోవాలి. అప్పుడు నీకు ప్రశాంతి కలుగుతుంది' అన్నారు.

## భాగవత శరణాగతి

రాజా! శ్రీహరి వాక్యాలను మనసులోనికి తెచ్చుకొన్నాక దుర్వాసునికి భయం తగ్గి ప్రాణం లేచివచ్చింది. అతను వెంటనే అంబరీషుని వద్దకు వచ్చి అతని పాదాలకు మోకరిల్లాడు. ఆ పరమ భాగవతుడు శరణువేడిన మునీంద్రుని కరుణించి శ్రీ విష్ణుచక్రాన్ని గురించి ధ్యానగతుడై –

## శ్రీచక్రరాజ స్తవం

'ఏ చక్రం రవిచంద్రాగ్ని పంచభూత తన్మాత్రేంద్రియాత్మకమో, ఏ చక్రం ధర్మ ధృతి సత్య యజ్ఞ యజ్ఞేశ్వర యజ్ఞభోజన లోకపాలక తేజస్సామర్థ్య

సామగ్రీ సమగ్రమో, ఏ చక్రం నిఖిలధర్మసేతువు అధార్మిక వర్గ ధూమకేతువు అయి పరిశుద్ధతేజః ప్రకాశమానంగా మనోజవంతో మహాశ్చర్యకార్యాలను నెరవేర్చుతూ ముల్లోకాలను పరిపాలిస్తున్నదో, ఏ చక్రం నిజధర్మ తేజస్సుతో తమస్సును పరిహరిస్తున్నదో, ఏ చక్రతేజం మహాత్ముల ప్రకాశస్వరూపమో, ఏ చక్రం దురత్యయ మహామహిమోన్నతమో, ఏ చక్రరూపం కార్యకారణ పరాత్పరమో, ఏ చక్రం హరిప్రయుక్తమై దైత్య దానవ బలాల కంఠపాదహస్తమస్తకాలను ఉత్తరించి రణరంగ విహరమాణమై ఉన్నదో, ఏ చక్రం జగద్రక్షణార్థమై భగవానుని చేత నిర్మింపబడినదో, ఆ సుదర్శనచక్రమా! ఇదే నీకు నమస్కారం. ఈ విప్రునికి మేలు కావించు. ఆ విధంగా చేయటం నీవు నన్ననుగ్రహించినట్లు గానే భావిస్తాను. నేనెన్నడయినా దానాలిచ్చి యజ్ఞాలు చేసి ఆ రూపంలో భగవంతుని ఆరాధించి ఉంటే నేను ధర్మనిష్ఠుడ నన్నమాట నిజమైతే, మా కులానికి బ్రాహ్మణుడు దైవమయితే, సర్వగుణాశ్రయుడు భగవంతుడు సర్వభూతాత్మభావంతో నాయెడ ప్రీతుడయితే, ఈ బ్రాహ్మణునికి వచ్చిన ఉపద్రవం తొలగిపోతుంది గాక' అని స్తుతించాడు. విష్ణుచక్రం శాంతించింది.

## హరిదాసుల మహిమ

రాజా! దుర్వాసుడప్పుడు స్వస్థత చెంది భక్తి మహిమను గ్రహించాడు. 'ఓహో! హరిదాసుల మహిమ ఎంతటిదో నేటికి చూడగలిగాను. చెడు చేసినవారికి కూడా మంచినే కోరటమన్నది హరిదాసులకే తగును. అందుకే కదా పార్వతీశ్వరుడు వారికి వశవర్తిగా ఉన్నది. ఎన్ని తపస్సులు చేసినా భక్తి లేనినాడు బూడిదలో పోసిన పన్నీరుతో సమానం. భక్తి ఉన్నచోట దురభిమానానికి తావుండదు. అభిమానం నశిస్తే కాని భక్తి నిర్వ్యాజమూ, నిష్కళంకమూ కానేరదు.

**మ. ఒకమా టెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్**
**సకలాఘంబులుఁ బల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స**
**త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశు ని**
**ట్లకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ!**

రాజేంద్రా! నా తప్పును తలంపక నా ప్రాణాలను కాపాడి నన్ను అనుగ్రహించావు. ఇందుకు తగిన ప్రత్యుపకారం ఏమి చేయగలనో తెలియదు. ఇదే నేనిచ్చిన దీవెనలను గ్రహించు' అని ఆశీర్వదించాడు.

పరీక్షిన్నరేంద్రా! దుర్వాసుడు చక్రభీతికి పరిగెత్తిననాటి నుండి తిరిగి అంబరీషుని వద్దకు తిరిగి వచ్చేనాటికి ఒక సంవత్సరం గతించింది. అంతదాకా అంబరీషుడు భుజింపక నిరాహారుడై ముని రాకకోసం నిరీక్షిస్తున్నాడు. దుర్వాసుడు స్వస్థచిత్తు డైనాక అంబరీషుడు ఆయన పాదాలు కడిగి తృప్తిగా భోజనం పెట్టి ఆయన అనుమతి గైకొని తానూ భుజించాడు. అనంతరం దుర్వాసు డతనిని వీడ్కొన్నాడు.

నరేంద్రా! అంబరీషుడు ఆ విధంగా భగవంతుని యెడ సర్వాత్మక సమర్పణబుద్ధి నెరపుతూ కేవల నిష్కామబుద్ధితో కొంతకాలం రాజ్యమేలి, బ్రహ్మాదిలోకాలు కూడా నిరయప్రాయాలని నిశ్చయించి రాజ్యాన్ని పుత్రులకు అప్పగించి ధీరుడై తపోవనానికి వెళ్ళాడు.

## అంబరీష వంశాదికం

రాజేంద్రా! అంబరీషునికి విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అని ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో విరూపునికి పృషదశ్వుడు అతనికి రథీతరుడు జన్మించారు.

రథీతరునికి సంతానం కలుగలేదు. అతను తన అనపత్యదోషాన్ని పోగొట్టుకొనగోరి భార్యతో కలిసివెళ్ళి అంగిరసుని ప్రార్థించాడు. ఆ మునివలన అతనికి సంతానం కలిగింది. అతని కొడుకులకు రథీతరులని, బీజసంబంధాన్ని బట్టి ఆంగిరసులని పేరుకలిగి వారందరూ బ్రాహ్మణులయ్యారు.

## ఇక్ష్వాకు జననాదికం

రాజా! వైవస్వతమనువు ఒకనాడు తుమ్మినపుడు అతని నాసికా రంధ్రం నుంచి పురుషుడొకడు వెలువడ్డాడు. అతనికి ఇక్ష్వాకువు అని పేరుపెట్టారు.

ఇక్ష్వాకువుకు వికుక్షి, నిమి, దండకుడు మొదలైన వారు నూర్గురు కొడుకులు జనించారు. అతను తన రాజ్యాన్ని నూరు మండలాలుగా విభజించి తూర్పువంక ఇరవై అయిదు మందిని, పడమర ఇరవై అయిదు మందిని, మధ్యప్రదేశంలో ముగ్గురిని, దక్షిణోత్తరాలలో తక్కిన వారిని మండలాధిపతులను చేశాడు.

## ఇక్ష్వాకుని పితృశ్రాద్ధం

కొన్నాళ్ళకు ఇక్ష్వాకువు అష్టకమనే శ్రాద్ధాన్ని సంకల్పించాడు. అందుకు మృగమాంసం కావలసి వచ్చింది. అతను తన పెద్దకొడుకు వికుక్షిని పిలిచి మాంససంపాదనకు నియోగించాడు. వికుక్షి అడవికి పోయి శ్రాద్ధక్రియకు తగిన మృగాలను పెక్కింటిని వధించి అలసిసొలసి ఆకలితో సొమ్మసిల్లి అవస్థపడ్డాడు. వెంటవచ్చిన వారు అతను చంపిన జంతువులలో ఒక కుందేలు మాంసాన్ని వండి అతనికి పెట్టారు. వికుక్షి దానితో కొంత తేరుకొని తాను వధించిన మృగాలన్నింటినీ తెచ్చి తండ్రికి సమర్పించాడు. శ్రాద్ధం మొదలయింది. వసిష్ఠుడు శ్రాద్ధపదార్థ సంస్కారార్థం ప్రోక్షింపబోయి సంగతి గ్రహించి ఇక్ష్వాకువును పిలిచి వికుక్షి చేసిన పని తెలిసి, 'అయ్యా! ఇది ఎంగిలి దోషం వలన కర్మయోగ్యం కాదు' అని తిరస్కరించాడు. ఇక్ష్వాకువు ఆ మాట విని కోపం తెచ్చుకొని వికుక్షికి దేశబహిష్కారశిక్ష విధించాడు. శ్రాద్ధ శశమాంసాన్ని తిన్నందువలన వికుక్షికి శశాదుడని పేరు వచ్చింది.

## వికుక్షి

ఇక్ష్వాకుని తర్వాత వికుక్షి రాజయి బహుయజ్ఞాలు చేసి భగవంతుని ఆరాధించి చిత్తశుద్ధిని అలవరచుకొన్నాడు. అతనికి వసిష్ఠుడు జ్ఞానోపదేశం చేశాడు. అంతట వికుక్షి యోగమార్గాన్ని అవలంబించి శరీరాన్ని త్యజించి పరమపదం చేరుకొన్నాడు. అతని కొడుకు పురంజయుడు.

## పురంజయుడు

రాజా! దేవదానవుల యుద్ధం సంగతి విన్నావు కదా. దేవతలు దైత్యులను ఎదిరింపలేక పురంజయుని సాయానికి రమ్మని అడిగారు. దేవేంద్రుడు తనకు వాహనమయితే తోడ్పడతానని అతను వారితో అన్నాడు. ఇంద్రుడందుకు సమ్మతింపలేదు. భగవానుడు ఇంద్రునికి నచ్చజెప్పి ఆ పనికి అతనిని సమ్మతింపజేశాడు. ఇంద్రుడు వృషభరూపం ధరించి వాహనంగా కుదురుకొన్నాడు. పురంజయుడు ఆ వాహనం కకుదం (మూపు) మీద కూర్చొని విష్ణుతేజోరక్షితుడై పశ్చిమ దిశనున్న దైత్యపురాన్ని ముట్టడించి అసురులను జయించి వారి సంపదను తెచ్చి ఇంద్రునికి అప్పజెప్పాడు. ఆనాటినుంచి పురందరునికి ఇంద్రవాహుడని, కకుత్థ్సుడని పేర్లు కలిగాయి.

పురంజయునికి అనేనసుడు, అతనికి పృథుడు, అతనికి విశ్వగంధుడు, అతనికి యువనాశ్వుడు, అతనికి శవస్తుడు జనించారు. శవస్తుడు తనపేర శాస్తి అనే పురాన్ని నిర్మించాడు. అతని కొడుకు కూడా శాస్తి అనే పేరు పెట్టాడు. అతనినే బృహదశ్వుడని పేర్కొంటారు. అతనికి కువలయాశ్వుడు పుట్టాడు.

## కువలయాశ్వుడు

రాజా! కువలయాశ్వునికి ఇరవై ఒక్క వేల మంది తనయులు పుట్టారు. ఒకప్పుడు ఉదంకునికి కువలయాశ్వుని సాయం కావలసివచ్చింది. కువలయాశ్వుడు కొడుకులందరినీ వెంటబెట్టుకొని ధుందుడనే రాక్షసుని మీదికి దండెత్తి అతనిని చంపి ఉదంకునికి ప్రీతి కలిగించాడు. ధుందువును చంపినందువల్ల అతనికి ధుందుమారుడని పేరు వచ్చింది. ఆ యుద్ధంలో కువలయాశ్వుని కొడుకులు దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అన్నవారు తప్ప తక్కినవారందరూ చనిపోయారు.

ధృఢాశ్వునికి హర్యశ్వుడు, అతనికి నికుంభుడు, అతనికి బర్హిణాశ్వుడు, అతనికి కృతాశ్వుడు, అతనికి సేనజితుడు, అతనికి యువనాశ్వుడు జనించారు.

## యువనాశ్వుడు

రాజా! యువనాశ్వుడు నూరుగురు కన్యలను పెండ్లాడాడు. వారిలో ఒకతె కూడా సంతానవతి కాకపోయింది. అతను వారందరినీ అరణ్యానికి వెంటబెట్టుకొని వెళ్ళి వనవాసులైన ఋషులను సంతానార్థం ప్రార్థించాడు. ఋషులు అతని దైన్యానికి జాలిపడి ఇంద్రదేవతాకమైన పుత్రకామేష్టిని అతని చేత చేయించారు.

## యువనాశ్వునికి గర్భోదయం

యువనాశ్వుడు భార్యలతో దీక్షితుడై యజ్ఞం చేస్తుండగా ఒకనాటి రాత్రి అతనికి దప్పిక కలిగింది. అందరూ గాఢనిద్రలో ఉన్నారు. చేరువలో ఎక్కడా నీరున్నట్లు కనిపించలేదు. అతను దాహతీవ్రతను సహింపలేక యజ్ఞకలశం లోని మంత్రజలాన్ని తాగి దప్పిక చల్లార్చుకొన్నాడు.

తెల్లవారగానే ఋషులు యజ్ఞకార్యముఖులై కలశాన్ని చూడగా అందులో నీరు కానరాలేదు. వారది చూసి, 'ఈ కలశంలో పుంసవనజలం నింపాము. ఆ జలాన్ని ఎవరు త్రాగారు?' అంటూ దివ్యదృష్టితో చూసి సంగతి గ్రహించి, దైవప్రేరితం తప్పింపరానిదని భగవంతునికి ప్రణమిల్లారు.

ఆ సలిలపానఫలంగా యువనాశ్వునికి గర్భమయింది; ప్రసవకాలం వచ్చింది. అతని కుక్షిని చీల్చి పుత్రుడొకడు ఉదయించి ఏడవటం మొదలు పెట్టాడు. ఋషులు ఆ ఏడుపు విని, 'అయ్యో! ఈ బిడ్డకు తల్లిలేదు. ఏమి తాగి బ్రతుకుతాడో' అని విచారపడసాగారు. అంతలో ఇంద్రుడు వచ్చి 'నాయనా! ఏడవకు' అని ఓదార్చి 'మాం ధాతా' అని తన చూపుడువ్రేలిని అతని నోటిలో ఉంచాడు.

'మాం ధాతా' అంటే 'నన్ను కుడువగలడు' అని అర్థం. ఆ కారణాన యువనాశ్వశిశువుకు మాంధాత అని పేరుపెట్టారు. దేవబ్రాహ్మణ వరప్రసాదం వలన యువనాశ్వుని ఉదరం యథాస్థితిని పొందింది. కొంతకాలానికి అతను తపస్సుచేసి సిద్ధిపొందాడు.

## మాంధాత

రాజా! మాంధాత చక్రవర్తి అయిన తర్వాత సప్తద్వీపాయత ధాత్రీమండలాన్ని పరిపాలిస్తూ అనేక యజ్ఞాలతో భగవంతుని ఆరాధించాడు. అతని విక్రమం రావణాది దస్యులకు త్రాసాన్ని కలిగించినందువలన అతనికి 'త్రసదస్యుడు' అనే బిరుదనామాన్ని ఇంద్రుడిచ్చాడు.

మాంధాత శశిబిందుని కుమార్తె బిందుమతిని పెండ్లాడాడు. వారికి పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు అని ముగ్గురు కొడుకులు, యాభైమంది కుమార్తెలు కలిగారు. ముచుకుందుడు యోగమార్గాన్ని అవలంబించి సిద్ధిపొందాడు.

## సౌభరి మహర్షి

ఆ కాలంలో సౌభరి అనే బ్రాహ్మణుడొకడు తపోవ్రతుడై ఒకనాడు స్నానార్థం యమునాతీరానికి వెళ్ళి నీళ్ళలో మునిగినప్పుడు, ఒక చేప ఆడచేపతో కూడి సుఖిస్తుండటం అతని కంటబడింది. అది చూడగానే సౌభరికి దాంపత్య సుఖాభిలాష జనించింది. అతను మాంధాత వద్దకు వెళ్ళి కన్యనిమ్మని యాచించాడు. ఆ చక్రవర్తి అతనితో, 'మునీంద్రా! నాకు యాభైమంది కుమార్తెలున్నారు. నీకు నచ్చినదానిని స్వయంవరరూపాన గ్రహించు' అన్నాడు. సౌభరి ఆ మాట విని 'ఓహో! ముసలితనం దాస్తే దాగేది కాదు. తలనెరిసి దేహం వణుకుతున్న నన్ను చూసి తన కుమార్తెలకు ఏవగింపు కలుగుతుందని ఇతను స్వయంవరాన్ని ప్రస్తావించాడు. కపటోపాయాన నోటితో అవునని, నొసటితో కాదన్నట్లయింది. కానీ చూతాము' అని తలపోసి, 'రాజా! నీవన్నట్లే కానివ్వు' అన్నాడు.

అంతట ప్రతీహారి సౌభరిని కన్యాంతఃపురానికి తీసికొని వెళ్ళాడు. ఆ ఋషి లోపలికి అడుగుపెట్టే ముందు నవమన్మథసుందరాకృతిని దాల్చాడు. మాంధాత కుమార్తెలు అతనిని చూడగానే, 'ఇతను నాకు తగినవాడు' అని ఒకరినొకరు ఈసడించుకొంటూ అతని పైనే చూపు నిలిపి మనస్సులను అతని

కర్పించారు. ఆ మునివర్యుడు వారందరినీ పెండ్లాడి రాజగృహంలోనే నివసించి రాజోపచారాలను అందుకొంటూ భార్యలతో విహార జలక్రీడాది వివిధ భోగాలను అనుభవిస్తూ వారితోడిదే లోకంగా ఉన్నాడు.

కొన్నాళ్ళకు సౌభరికి తన తపోభంగ కారణం జ్ఞప్తికి వచ్చి, అతను చింతాక్రాంతు డయ్యాడు. 'అయ్యో! మీనసంగమదర్శనం నిమిత్తమై చిరకాలంగా అనుష్ఠించిన తపోవ్రతం చేటుపడింది. మోక్షకాములకు ఇంద్రియనిగ్రహం ప్రథమకార్యమని; మనోవిక్షేపం కలుగకుండేందుకు ఏకాంతవాసం, నిరంతర హరిధ్యానం కర్తవ్యాలని; కాంతల తోడి ప్రసంగం కూడా మానుకోవాలని పెద్దలు చెవినిల్లుగట్టుకొని చెప్పిన మాటలలోని సారం ఇన్నాళ్ళకు తెలిసివచ్చింది. చేపల మైథునవృత్తి నా మనస్సును చెడగొట్టింది. ఒకరూ ఇద్దరూ కాదు, యాభైమందిని కట్టుకొని కామక్రీడాపరుడి నయ్యాను. వారిలో ఒక్కొక్కరికీ నూర్గురేసి కొడుకులు పుట్టారు. అయిదువేల మందికి తండ్రినయ్యాను. ఇవన్నీ మాయాగుణవిలాసాలు. ఇందులో ఒక్కటీ పురుషార్థప్రదం కాదు' అని లోలోన పశ్చాత్తాపపడి విరక్తినొంది తపోవనాలకు వెళ్ళాడు. అతని భార్యలు పతినే దైవంగా భావించినవారు కాబట్టి అతని ననుసరించారు. సౌభరి తన పూర్వవ్రతాన్ని అనుష్ఠించి ఆత్మవిదుడై ఆత్మపరమాత్మైక్యం కావించాడు. పతి ఆ విధంగా బ్రహ్మతాదాత్మ్యం పొందటం చూసి భార్యలు అతనిని అనుగమించారు.

## మాంధాతృ వంశం

మాంధాతృపుత్రులలో ఒకడైన అంబరీషుని అతని పితామహుడు యువనాశ్వుడు స్వపుత్రునిగా పరిగ్రహించాడు. అంబరీషునికి యౌవనాశ్వుడు, అతనికి హారీతుడు జనించి మాంధాతృగోత్రానికి ప్రవర్తకులయ్యారు. మాంధాతృపుత్రులలో పురుకుత్సుని సర్పకుమారులు నాగలోకానికి కొనిపోయి అతనికి తమ చెల్లెలు నర్మదనిచ్చి పెండ్లిచేశారు. అతను ఉరగలోకంలో పెక్కుమంది గంధర్వులను వధించి వారికి శత్రుభయం

లేకుండా చేశాడు. అందుకు నాగకుమారులు సంతోషపడి, 'అయ్యా! నీ కథను విన్నవారికి సర్పభయం ఉండదు' అని వరమిచ్చారు.

## త్రిశంకుడు

రాజా! పురుకుత్సునికి త్రసదస్యుడు, అతనికి అనరణ్యుడు, అతనికి హర్యశ్వుడు, అతనికి అరుణుడు, అతనికి త్రిబంధనుడు, అతనికి సత్యవ్రతుడు జనించారు. ఆ సత్యవ్రతుడే త్రిశంకుడని ప్రసిద్ధి పొందాడు. ఆ సంగతి విను.

సత్యవ్రతునికి వసిష్ఠమహర్షి శాపం వలన చండాలత్వం కలిగింది. అతను విశ్వామిత్రుని ఆశ్రయించాడు. ఆ మునీంద్రుడు తన తేజోమహిమ వలన సత్యవ్రతునికి సశరీరస్వర్గాన్ని కలిగించాడు. అతను స్వర్గానికి వెళ్ళగానే దేవతలు క్రిందికి తోశారు. అతను స్వర్గం నుంచి తలక్రిందులుగా పడుతూ పెద్దగా ఆర్తనాదం చేశాడు. కౌశికుడు తన తపోబలం వలన మింట నిలిపాడు. అప్పటి నుండి అతను ఆకాశంలో నేటికీ అగపడుతున్నాడు.

## హరిశ్చంద్రుడు

రాజా! త్రిశంకునికి హరిశ్చంద్రుడు జనించి రాజై రాజసూయ యాగం చేశాడు. విశ్వామిత్రుడు ఆ యాగానికి వచ్చి దక్షిణ నెపంతో హరిశ్చంద్రుని సర్వస్వం హరించి అతని నోట అబద్ధం చెప్పించాలని అతనిని పడరానిపాట్లకు గురిచేశాడు. వసిష్ఠుడందుకు కోపించి విశ్వామిత్రుని గద్దవు కమ్మని శపించాడు. విశ్వామిత్రుడు కొంగవు కమ్మని వసిష్ఠునికి మారుశాపం ఇచ్చాడు. ఆ విధంగా హరిశ్చంద్రుని నిమిత్తంగా అన్యోన్య శాపహతులై పక్షిరూపాలను ధరించి పరస్పరకలహాలతో వారు అనేక సంవత్సరాలున్నారు.

## వరుణదేవారాధన

హరిశ్చంద్రునికి కొడుకులు పుట్టలేదు. పుత్రార్థం అతను నారదమహర్షిని ఆశ్రయించి అతని వలన వరుణమంత్రాన్ని పొంది విధిప్రకారం ఆ మంత్రాధిదేవతను ఆరాధించాడు. వరుణుడు ప్రత్యక్షమయ్యాడు.

హరిశ్చంద్రుడు అతనికి ప్రణమిల్లి, 'దేవా! నాకు పుత్రుని అనుగ్రహించు. ఆ సుతుని పశువుగా చేసి నరమేధయాగాన నిన్ను పూజిస్తాను' అని ప్రార్థించాడు. వరుణుడు అతని కోరిక నెరవేర్చాడు. అతనికి రోహితుడని కొడుకు పుట్టాడు.

## హరిశ్చంద్రుని పుత్రవాత్సల్యం

రాజా! హరిశ్చంద్రునికి పుత్రోదయం కాగానే వరుణుడు వచ్చి అతని వాగ్దానవిషయం జ్ఞప్తికి తెచ్చాడు. హరిశ్చంద్రుడది విని, 'దేవా! జాతాశౌచ దినాలు పదీ యజ్ఞయోగ్యాలు కావు' అన్నాడు. వరుణుడు మరలిపోయి పదిరోజులు నిదానించి వచ్చి మళ్ళీ గుర్తుచేశాడు. ఆ నరేంద్రుడు అతని మాట విని, 'అయ్యా! పండ్లు రానివాడు మేధ్యానికి తగడు కదా' అన్నాడు. వరుణుడు మరలిపోయి కొంతకాలం తర్వాత వచ్చి మళ్ళీ అతనికిచ్చిన మాట సంగతి ప్రస్తావించాడు. 'అయ్యా! పాలపండ్లు రాలితేగాని పిల్లవాడు అర్హుడు కాడు' అన్నాడు. హరిశ్చంద్రుడు ఆ విధంగా పుత్రవాత్సల్యంతో ఏదో ఒక నెపం కల్పించి వరుణునికి సమాధానం చెప్పసాగాడు. వరుణుడు ఆ సమాధానాలను అంగీకరిస్తూ చాలాకాలం నిరీక్షించాడు.

## రోహిత దేవేంద్రుల సమాగమం

అంతలో రోహితుడు కొంత పెద్దవాడై తండ్రి ఆలోచన గ్రహించి ఇంటిలో ఉంటే ప్రాణోపద్రవమని నిశ్చయించి శరచాపాలు పట్టి వనాంతరానికి వెళ్ళాడు. వరుణు డది విని హరిశ్చంద్రుని నిగ్రహించాడు. రాజును మహోదరవ్యాధి బాధింపసాగింది. ఆ సంగతి రోహితుడు విని ఇంటిముఖం పట్టాడు. మార్గమధ్యంలో ఇంద్రుడు ప్రత్యక్షమై, 'నాయనా! ఒక్క భూసంచారం కావిస్తూ  పుణ్యతీర్థ పుణ్యక్షేత్రాలను సేవించి తరువాత ఊరికి వెళ్ళు. అంతదాకా వెళ్ళకు' అని చెప్పాడు. రోహితుడు అలాగే ఒక సంవత్సరం గడిపి ఇంటికి బయలుదేరాడు. ఇంద్రుడు వృద్ధవిప్రుని వేషంతో వచ్చి ఇంకొక యేడు భూపర్యటన చేస్తే మంచిదని చెప్పాడు. అతను అలాగే చేసి మళ్ళీ ఇంటిదారి పట్టాడు. ఇంద్రుడు మళ్ళీ అతని దగ్గరకు వచ్చి ఇంకొక సంవత్సరం

గడువుపెట్టాడు. ఆ విధంగా ఐదు సంవత్సరాలు గడిచాయి. ఇంద్రుడు మళ్ళీ మారువేషంతో వచ్చి మరొక ఏడు గడువు పెట్టాడు. రోహితుడు ఆ ఏడాది కూడా గడిపి అజీగర్తుని నడిమికొడుకును శునశ్శేఫుడనే అతనిని పిలిచి అతనిని వెంటబెట్టుకొని రాజధానికి తిరిగి వచ్చి నరమేధానికి గాను శునశ్శేఫుని తండ్రి కిచ్చాడు.

## నరమేధ యాగం

రాజా! హరిశ్చంద్రుడు వెంటనే శునశ్శేఫుని పశువుగా చేసి విశ్వామిత్రుడు హోతగా, జమదగ్ని అధ్వర్యుడుగా, వసిష్ఠుడు బ్రహ్మగా, ఆయాస్యుడు ఉద్గాతగా ఏర్పాటు చేసి నరమేధం కావించి వరుణునికి ప్రీతి కలిగించాడు. ఆ యజ్ఞఫలంగా హరిశ్చంద్రుని ఉదరవ్యాధి నివర్తించింది. ఇంద్రుడు హరిశ్చంద్రునికి కనకరథం ఇచ్చాడు. రాజా! శునశ్శేఫుని మాహాత్మ్యం తరవాత విందువు గాని.

## హరిశ్చంద్రుని నిర్యాణం

విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని నిష్ఠకు మెచ్చి అతనికి ఆత్మజ్ఞానాన్ని అనుగ్రహించాడు. హరిశ్చంద్రుడు మనస్తత్త్వాన్ని పృథ్వీతత్త్వమందు, దానిని జలతత్త్వంలో, దానిని తేజస్తత్త్వంలో, దానిని వాయుతత్త్వంలో, దానిని ఆకాశతత్త్వంలో, దానిని అహంకారతత్త్వంలో, దానిని మహత్తత్త్వంలో క్రమంగా లయింపజేసి విషయాకారవృత్తిని విసర్జించాడు. తత్ఫలంగా అతనికి విషయ విర్జన కలిగింది. దానితో జ్ఞానాంశ స్ఫురించింది. జ్ఞానోదయంతో సంసారకారణమైన ప్రకృతి భస్మమయింది. తత్ఫలంగా నిర్వాణసుఖపారవశ్యం తెలిసివచ్చింది. అతను పరగతిని పొందాడు.

## హరిశ్చంద్రుని వంశ కథనం

రోహితుని కొడుకు పేరు చంపువు. అతని పేర చంపానగరం నిర్మింపబడింది. అతనికి సుదేవుడు, సుదేవునికి విజయుడు, విజయునికి

రురుకుడు, అతనికి వృకుడు, అతనికి బాహుకుడు పుట్టారు.

బాహుకుడు రాజయి పెక్కుమంది భార్యలను గ్రహించినా సంతానం లేనందువల్ల తదేక చింతాపరుడు కాసాగాడు. శత్రురాజులు దండెత్తి అతని రాజ్యాన్ని ఆక్రమించారు. బాహుకుడు తన భార్యలతో వనగతుడై కొంతకాలానికి అక్కడుండగానే చనిపోయాడు. అతని పట్టపుదేవి సతీధర్మాన్ని తలపోసి పతిని అనుగమింపబోయింది. ఆ సంగతి ఔర్వమహర్షికి తెలిసి, 'అమ్మా! నీవు గర్భవతివి కాబట్టి నీకు సహగమనం ధర్మం కాదు' అని చెప్పి సతీసహగమనాన్ని మాన్పించాడు.

## సగరుడు

ఆమె గర్భవతిగా ఉన్న సంగతి సవతులు విని తమ గొడ్రాలితనానికి ఖేదపడి ఈర్ష్యవల్ల నీటిలో విషం కలిపి ఆమె చేత త్రాగించారు. ఆ విషం ఆమె గర్భాన్ని ఏమీ చేయలేకపోయింది. కొంతకాలానికి నెలలు నిండి ఆమెకు మగశిశువు పుట్టాడు. ఆ బిడ్డ గరము (విషము)తో జన్మించినందున సగరుడని పేరు పెట్టారు.

సగరుడు పెరిగి పెద్దవాడయి రాజ్యానికి వచ్చి సుమతి, కేశిని అనేవారిని పెండ్లాడాడు. అతని ఉన్నతికి ఓర్వలేక శక యవన హైహయ బర్బర తాలజంఘాదులు శత్రువులయ్యారు. సగరుడు వారందరినీ ఓడించి పట్టి బంధించి చంపబోయాడు. అతని గురువు వచ్చి, 'నాయనా! శత్రువులను చంపవద్దు' అని చెప్పి అతనిని మరలించాడు. సగరుడు గురువాక్యాన్ని పాటించి వైరులను తలలు గొరిగి, జుట్లు కోసి, మీసాలు తీయించి, దిగంబరులను చేసి తరిమికొట్టాడు.

రాజా! సగరుడు తన గురువైన ఔర్వుని బోధ ప్రకారం అనేక హయమేధయాగాలు చేసి భగవానుని ఆరాధించాడు. సగరునికి సుమతి యందు అరవై అయిదుగురు, కేశినియందు అసమంజసుడు జనించారు.

## సగరపుత్త్రుల మరణం

రాజా! సగరుడు హయమేధాలను చేస్తుంటే మహేంద్రుడు చూసి తన పదవికి ఎసరు పెట్టాడేమోనని ఒక యాగంలో మేధ్యాశ్వాలను అపహరించాడు. ఆ గుర్రాలను వెతికి తెమ్మని సగరుడు సుమతీపుత్త్రులను ఆజ్ఞాపించాడు. వారు భూమండలమంతటా కలయదిరిగి యాగాశ్వం ఎక్కడా కనబడక పాతాళశోధనకు భూమిని త్రవ్వి లోపలికి వెళ్ళి అక్కడ ఒక మునిని, అతని చెంత యజ్ఞాశ్వాన్ని చూసి, 'ఇదిగో యజ్ఞాశ్వం. ఈ దొంగ దీనిని అపహరించి తెచ్చి ఏమీ తెలియనట్లు కళ్ళుమూసుకొని, తపస్సు నటిస్తున్నాడు. వీడిని చంపక తప్పదు' అని నిశ్చయించి, కత్తులు దూసి ఒక్కుమ్మడిని ఆ మునిపైకి విరుచుకపడ్డారు. రాజా! అక్కడ తపోవ్రతుడై ఉండిన మునీంద్రుడు ఎవరో సామాన్యుడు కాడు, సాక్షాత్తూ కపిలమహర్షి. ఆ మహర్షి అంతలో కళ్ళు తెరిచాడు. అతని వీక్షణాగ్నికి సగరపుత్త్రులు దగ్ధులై బూడిదయ్యారని అంటారు.

రాజా! సగరపుత్త్రులు కపిలమహర్షి కోపాగ్నికి దగ్ధులైనారని అంటారు గాని ఆ మాటలో నిజం లేదు. కపిలుడు పరమ సత్త్వమూర్తి, లోకహితాత్ముడు. అట్టివాడెక్కడ? కోపకారణమైన తమోగుణం ఎక్కడ? ఎవడు లోకోపకారతత్పరమతియై మనుష్యులు మృత్యుసాగరాన్ని తరించటానికి గాను సాంఖ్యవిద్య అనే నావను నిర్మించి ఇచ్చాడో, అట్టి మహాత్మునికి భేదబుద్ధి జనింపగలదా? సగరపుత్త్రుల ప్రారబ్ధఫలం ఆ విధంగా జరగాలని వ్రాసి ఉన్నది. ఫలోదయానికి నిమిత్తం కలుగక మానదు. కపిలుడు వారి చావుకు నిమిత్తమాత్రుడు; అంతే. ఆ రహస్యం తెలియక నిష్కారణంగా నిందలను ఆరోపిస్తారు.

## అసమంజసుడు

అసమంజసుడు పూర్వజన్మలో మహాయోగి. సంగమదోషం వలన యోగభ్రష్టుడై ఆ దోషఫలానుభవార్థం సగరునికి కేశిని యందు జనించాడు. అతను పుట్టినది మొదలు జ్ఞాతిశిశువులతో కలహిస్తూ, తోటివారిని

సరయూజలాలలో తోసి చంపుతూ భరింపరాని అల్లరి చేసేవాడు. ప్రజలకు అతనంటే ఏవగింపు కలిగింది. ఆ సంగతి సగరుడు గ్రహించి అసమంజసుడు కన్నకొడుకుని కూడా తలపక అతనిని రాజ్యం నుంచి బైటికి పొమ్మని ఆజ్ఞాపించాడు.

అసమంజసునికి పూర్వస్మృతి ఉండటం వల్ల అతను తండ్రి ఆజ్ఞను విని తాను తత్పూర్వం నదిలోకి తోసి చంపిన బాలకు లందరినీ తన యోగప్రభావంతో బ్రతికించి వారివారి తల్లిదండ్రులకు అప్పగించాడు. ఆ సంగతి క్షణంలో దేశమంతటా ప్రాకింది. అతని ప్రభావానికి అయోధ్యావాసు లందరూ ఆశ్చర్యపడ్డారు. అసమంజసుడు ప్రభావశాలి అయినా తండ్రి ఆజ్ఞను పాటించి దేశం వదిలి వెళ్ళిపోయాడు. కొడుకు గతి చూసి సగరుడు ఎంతో పశ్చాత్తాపంతో పరితపించాడు.

## కపిలాశ్రమం

రాజా! అసమంజసునికి అంశుమంతుడనే కొడుకు ఉండేవాడు. అతను తన తాతకు ప్రీతి కలిగింపగోరి యజ్ఞాశ్వాన్ని వెతుకుతూ తన పినతండ్రులు త్రవ్విన మహాఖాతం లోనికి ప్రవేశించి పాతాళానికి వెళ్ళి అక్కడ భస్మరాసులను, వాటి చెంత అశ్వాన్ని, కపిలమహర్షిని చూసి ఆ మునీంద్రునికి సాష్టాంగప్రణామం కావించి, 'మహాత్మా! బ్రహ్మదేవు డంతటివాడు సమాధిదృష్టితో ప్రయత్నించినా నీ మహాప్రభావాన్ని గ్రహింపలేడు. కేవలం స్వమనోబుద్ధి గుణాశ్రయులమై అజ్ఞానులమై వర్తించే మా సంగతి వేరే చెప్పాలా? దేవా! నీవు సర్వదా అంతర్వర్తివై దేహులలో నివసిస్తుంటావు. నీ మాయకు చిక్కినవారు గుణప్రధానులై దేహులు తమలోనే ఉన్న నిన్ను కనుగొనలేకపోతున్నారు. నీవు కనరాకపోవటానికి భేదమోహాలే కారణం. అందుకు నీ మాయాగుణమే కారణం. ఎవరు నీ మాయను నిరసిస్తారో వారికి నీవు ప్రత్యక్షుడవు కాగలవు. నీ మాయా నిరసనానికి స్వభావబలం తప్ప వేరొక మార్గం లేదు. అది కలగటానికి నిన్నే ఆశ్రయించాలి. సనకాదు లందరూ ఇందుకు నిదర్శకులుగా ఉన్నారు.

దేవా! లోకోద్ధరణార్థం జ్ఞానోపదేశం కావింపబూని దేహాలను ధరించావు. నీ మాయ అనగా నీ శక్తియే గాని స్వతంత్రం కాదు. నీ మాయాశక్తి చిత్రవిచిత్ర రూపాలలో వ్యవహరిస్తుంది. ఆ చిత్రాలను చూసి తద్వశులై తమ తమ అభిరుచుల ప్రకారం వాటియెడ రాగద్వేషాలను ప్రదర్శిస్తారు. తత్ఫలంగా ఈర్ష్యామోహాలు జనించి చిత్తవిభ్రాంతిని పుట్టిస్తున్నాయి. ఆ భ్రాంతి వలన వాస్తవంగా నిత్యములు, సుఖదాయకములు గాని గృహాదులందు వస్తుబుద్ధిని జనింపజేసి వాటికోసం ప్రాకులాడేటట్లు చేస్తుంది. కటికచీకటిలో తడుముకొనేవాడు వెతుకుతున్న పదార్థం కనబడక వెతుకులాడినట్లు భ్రాంతచిత్తులు సంసారకూపంలో చిక్కుకొని దారితోచక పరితపిస్తుంటారు.

దేవా! నా పూర్వపుణ్యఫలం వలన నేడు నీ దర్శనభాగ్యానికి నోచుకొన్నాను. నన్ను బంధించి ఉంచిన మోహపాశం సడలి నశించింది. ధన్యుడనయ్యాను. ఇదే నీకు పునస్సాష్టాంగం' అని సాగిలబడ్డాడు.

రాజా! కపిలుడు అతని ననుగ్రహించి, 'నాయనా! నీ పితామహుని యజ్ఞాశ్వం ఇదిగో తీసుకొనివెళ్ళు. ఇదిగో నీ తండ్రుల భస్మరాసులు. గంగోదకం చల్లితే తప్ప వీటికి పావనత్వం కలుగుదు' అని చెప్పాడు. అంశుమంతు డంతట ప్రదక్షిణ నమస్కారాలు చేసి కపిలాచార్యుని అనుజ్ఞగొని యజ్ఞాశ్వాన్ని తెచ్చి తాతకు ఇచ్చాడు. సగరుడు యజ్ఞాన్ని పూర్తిచేసి రాజ్యభారాన్ని అంశుమంతునికి అప్పజెప్పి సర్వబంధనాలను విడనాడి గురూపదిష్ట మార్గానుసారం నిష్ఠవహించి ఉత్తమగతిని పొందాడు. అంశుమంతుడు కపిలమహర్షి వాక్యాన్ని స్మరించి గంగాజలాన్ని భూమికి తెచ్చేందుకు తపస్సు చేసి అభీష్టఫలం సిద్ధించే లోగానే కాలధర్మం చెందాడు.

## భగీరథుడు- గంగావతరణం

అంశుమంతునికి భగీరథుడు జనించి తండ్రి సంకల్పాన్ని నెరవేర్పగోరి గంగను గూర్చి ధ్యానిస్తూ పెక్కు సంవత్సరాలు తీవ్రతపస్సు చేశాడు. గంగాదేవి అతనికి ప్రత్యక్షమై –

**మ. వినువీథిం బఱితెంచి నేలఁబడ నా వేగంబునన్ నిల్ప నో**
**పినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళముం**
**జనుదున్ వచ్చితి నేని నా జలములన్ సంస్నాతులై మానవుల్**
**ననుఁ బొందించు నఘవ్రజం బెచట నే నాశంబు నొందించెదన్?**

అని పలికింది. భగీరథుడు ఆ మాట విని –

**మ. పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తమఃపారీణు లార్యుల్ ఘనుల్**
**పురుషశ్రేష్ఠులు వచ్చి, తల్లి! భవదంభోగాహముల్ సేయఁగా**
**నరసంఘాఘము నిన్ను బొందునె? జగన్నాథుండు నానాఘసం**
**హరు డా విష్ణుడు వారి చిత్తముల దానైయుంట మందాకినీ!**

**మ. తనలో నిన్ని జగంబులుం గలుగుటన్ దా నిన్నిటం గల్గుటన్**
**జననీ! తంతువులందు జీర గల యా చందంబునన్ విశ్వ భా**
**వనుడై యొప్పు శివుండు గాక మఱి నీ వారి న్నివారింప నే**
**ర్చినవా రెవ్వరు? నిన్ ధరించు కొఱకై శ్రీకంఠునిన్ గొల్చెదన్.**

అని విన్నవించాడు. ఆ దేవి అందుకు సమ్మతించి అంతర్హితురాలయింది. అంతట భగీరథుడు శశిశేఖరుని గూర్చి తపస్సు చేయసాగాడు. గౌరీనాథుడు అతనికి అల్పకాలంలోనే ప్రసన్నుడై అతని కోర్కెకు సమ్మతించాడు. గంగాదేవి నదీరూపాన్ని ధరించి పుడమికి దిగింది. భగీరథుడు వాయువేగమైన రథాన్నెక్కి గంగకు ముందు నడుస్తూ ఆ ప్రవాహాన్ని తన పితృవ్యుల బూదిరాసుల మీదుగా కొనివచ్చాడు. గంగాతోయస్పర్శ మాత్రాన సగరపుత్త్రులకు స్వర్గప్రాప్తి కలిగింది. ఓ రాజా!

**మ. హరు మెప్పించి మహాతపోనియతుఁడై ఆకాశగంగానదిన్**
**ధరకుం దెచ్చి నితాంత కీర్తిలతికాస్తంభంబుగా నవ్యసు**
**స్థిరలీలన్ బితృకృత్యమంతయు నొనర్చెన్ వారితానేక దు**
**స్తరవంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుడే?**

## భగీరథ సంతతి

భగీరథునికి శ్రుతుడు, అతనికి సత్యనాభుడు, అతనికి సింధుద్వీపుడు, అతనికి అయుతాయువు, అతనికి ఋతుపర్ణుడు జనించారు. ఋతుపర్ణుడు నలమహారాజుకు అక్షవిద్య నిచ్చి అతని నుంచి అశ్వవిద్యను నేర్చుకొన్నాడు. ఋతుపర్ణునికి సుదాసుడు, అతనికి మిత్రసహుడు జన్మించారు. మిత్రసహుడు మదయంతిని వివాహం చేసుకొన్నాడు. అతనికి వసిష్ఠుని శాపఫలంగా కల్మాషపాదత్వం, స్వకీయమైన అకృత్యఫలంగా అనపత్యదోషం సమకూడాయి.

## సౌదాస చరిత్ర

రాజా! మిత్రసహుడు సుదాసుని పుత్త్రుడయినందువల్ల అతనికి సౌదాసుడని ప్రసిద్ధి కలిగింది. ఒకనాడు సౌదాసుడు వేటకు వెళ్ళి ఒక రాక్షసుని చంపాడు. ఆ అసురుడు 'తమ్ముడా!' అని పెద్దగా అరుస్తూ చనిపోయాడు. ఆ అరుపు విని ఒక రాక్షసుడు వచ్చి చచ్చిపడి ఉన్న అన్నను చూసి దుఃఖించి 'ఈ రాజును వంచించి నా పగ తీర్చుకొంటాను' అని నిశ్చయించుకొని, మారువేషం ధరించి మిత్రసహుని ఇంట వంటవాడుగా కుదురుకొన్నాడు.

## సౌదాసునికి మునిశాపం

ఒకనాడు వసిష్ఠమహర్షి సౌదాసునికి అతిథిగా వచ్చాడు. మనుష్యమాంసం వండి అతనికి వడ్డించారు. వసిష్ఠుడు ఆ కపట కృత్యాన్ని గ్రహించి రాజుపై ఆగ్రహించాడు. 'ఓరీ! నరమాంసం తినని నాకు పెట్టిన నేరానికి నరాశనుడైన రాక్షసుడివికా!' అని శపించి, ఆ వెంటనే దివ్యజ్ఞానంతో జరిగిన సంగతి గుర్తించి, 'రాజా! ఇది నీ తప్పు కాదు. నీ వంటవాని రూపంలో మారువేషాన వచ్చిన రాక్షసుడు ఈ పని చేశాడు. అయితే నా శాపానికి తిరుగులేదు. పన్నెండు సంవత్సరాలు మాత్రం నీకు రాక్షసరూపం ఉండక తప్పదు' అన్నాడు. సౌదాసుడు ప్రతిశాపం ఇచ్చేందుకు నీటిని అందుకొన్నాడు. అంతలో అతని భార్య మదయంతి అడ్డుపడి వారించింది.

అతను మారాడక ఆ శాపోదకాన్ని జారవిడిచాడు. ఆ నీరు అతని పాదాలపై పడింది. ఆ జలాల వేడిమికి అతని పాదాలు కల్మాషితాలు అయ్యాయి. అతనికి కల్మాషపాదుడని పేరువచ్చింది.

కల్మాషపాదుడు మునిశాపవశాన రాక్షసభావాన్ని పొంది అడవులు పట్టి తిరుగుతూ ఒకనాడు క్షుధార్తుడై తినటానికి ఏమీ కనబడక నలువంకల పరికించి చూస్తుండగా ఒకచోట రతికేళిలో ఉన్న తాపసదంపతులు అతని కంటబడ్డారు. ఆ రాక్షసుడు క్షుద్బాధ వలన ఎగిరి గంతువేసి ఆ తపస్విని పట్టి మ్రింగబోయాడు. మునిపత్ని అడ్డుపడి, 'అయ్యా! నీవు సాక్షాత్తు ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడవు. మహాపతివ్రత మదయంతి నోముల పంటవు. కారణాంతరాన నీకిట్టి రాక్షసత్వం సంప్రాప్తమయింది. అధర్మం నీకు తగదు. నేను పుత్రభాగ్యం కోరుకొన్నాను; నా భర్తను విడిచిపెట్టు. మానుషదేహం సర్వార్థసంపాదనకు మూలకందం. ఈ మునిని చంపితే సర్వార్థాలను చంపినట్లవుతుంది. పైగా నీవు వధింపనున్నవాడు బ్రాహ్మణుడు, విద్వాంసుడు, తపశ్శీలగుణోన్నతుడు, సర్వభూతాత్మభావనుడు, మీదు మిక్కిలి నిఖల భూతాంతర్యామి అయిన పరమపూరుషునికి మహాభక్తుడు, అటువంటి బ్రహ్మర్షిని రాజర్షివైన నీవు చంపబూనటం కొడుకు తండ్రిని చంపటం వంటిది. ఏ పాపమూ ఎరుగని శ్రోత్రియుని, అందునా బ్రహ్మవాదిని చంపటం నోరులేని ఆవును చంపటంతో సమానం. ఈ సాహసం వద్దు. నా మాట విను. లేదంటే ముందుగా నన్ను తిను. పతి వియోగాన్ని నేను నిమిషమాత్రం కూడా భరించలేను. భర్త మరణిస్తే నేను శవాన్ని కాకమానను' అని దీనాతిదీనంగా విలపింపసాగింది. శాపవశాన రాక్షసుడయిన అతనిని ఆ దీనాలాపాలు కరిగింప లేకపోయాయి. బెబ్బులి వలె మునిమీదికురుకి అతనిని క్షణంలో కబళించివేశాడు. ఆ సాధ్వి అతని ఘోరకృత్యాన్ని చూసి, 'అయ్యా! కామార్తనైన నాకు గర్భాధానం చేయనున్న పతిని దూరం చేశావు కాబట్టి నీకు మిథునధర్మం మృత్యువవుతుంది గాక!' అని శపించి, పతితో సహగమనం చేసింది.

రాజా! సౌదాసునికి పన్నెండేండ్ల శాపకాలం గతించింది. అతనంతటితో శాపవిముక్తుడై ఇల్లుచేరి ఒకనాడు భార్యతో సంగమింపదలచాడు. మదయంతి భర్తృశాపం తెలిసినది కాబట్టి ఆ విషయాన్ని గుర్తుచేసి అతని మనసు మళ్ళించింది. అది మొదలు సౌదాసుడు స్త్రీసుఖాన్ని పరిత్యజించాడు.

మదయంతి భర్తకు కలిగిన అనపత్యదోషాన్ని పరిహరింపదలచి పతి అనుమతి గైకొని వసిష్ఠుని వలన గర్భం ధరించింది. ఆ గర్భం పన్నెండు సంవత్సరాలు గడిచినా ప్రసవముఖం కాకపోయింది. అందుకు మదయంతి విసిగిపోయి ఒకనాడు తన గర్భాన్ని రాతితో పొడుచుకొన్నది. అప్పుడు ఒక సుతుడు ఉదయించాడు. అశ్మకం (రాయి) వేటు వలన జన్మించినందున అతనికి అశ్మకుడని పేరుపెట్టారు. అతని మూలాన సౌదాస వంశం వెలసింది.

## అశ్మకునికి నామాంతరం

రాజా! ఆ కాలంలో పరశురాముడు క్షత్రియక్షయవ్రతాన్ని సంకల్పించి రాచబిడ్డలు ఎక్కడున్నా వెతికి వెతికి చంపటం మొదలుపెట్టాడు. పరశురాముని బారినుండి ఆ శిశువును అంతఃపుర స్త్రీలు కాపాడారు. అందువలన అతనికి నారీకవచుడని పేరు కలిగింది. పరశురాముడు క్షత్రవంశాన్ని నిర్మూలించిన తర్వాత నారీకవచుడు వంశకర్త అయ్యాడు. అందువలన అతనికి మూలకుడని కూడా పేరు వచ్చింది. అతనికి విశ్వసహుడు, విశ్వసహునికి ఖట్వాంగుడు జన్మించారు.

## ఖట్వాంగ చరిత్ర

పరీక్షిన్నరేంద్రా! ఖట్వాంగుడు చక్రవర్తి అయిన కొన్నాళ్ళకు దేవాసురులకు మళ్ళీ యుద్ధం పొసగింది. అమరులు ఖట్వాంగుని సాయం అడిగారు. అతను నిర్జరులకు తోడ్పడి దుర్జయులైన దైత్యులను వధించాడు. దేవతలు అతని బలపరాక్రమాలకు మెచ్చి అతనిని వరం కోరుకోమన్నారు. తనకింకా ఆయుష్కాలం ఎంత ఉన్నదో చెప్పమని అతను వారిని అడిగాడు. ఇంకా ఒక్క ముహూర్తం మాత్రమే ఉన్నదని వారన్నారు.

## బ్రహ్మ తాదాత్మ్యం

ఖట్వాంగుడు ఆ మాటతో మరలి తన ఇంటికి వెళ్ళి తన జీవితాన్ని నెమరు వేసుకొన్నాడు. 'బాల్యం నుంచి ఎన్నడూ నా బుద్ధి నీచభావనలు చేయలేదు. నాకు రాజ్యాది సంపదల కంటె భార్యాపుత్రుల కంటె బ్రాహ్మణకులం ప్రీతిపాత్రమైనది. ఆ పరమేశ్వరుని కన్న నేను భిన్న వస్తువును కానన్న నిశ్చయంతో నిరంతరం ఆ పరమాత్మునియందే మనసు నిలిపి మెలగుతున్నాను. త్రిభువనేశ్వరులు ఎన్నో వరాలను ఇస్తామన్నారు. నేను వద్దన్నాను. స్వర్గపతులు కూడా విషయమోహులై తమలోనే ఉన్న ఆత్మని కానలేక పోయారు. ఇక సామాన్యుల మాట దేనికి?

> భగవంతుని శక్తి జ్ఞానేచ్ఛాక్రియాత్మికయై ముప్పిరిత్రాటి వలె ఉంటుంది. జ్ఞానశక్తి ఆ అన్నింటిలోకీ స్వతఃప్రకాశమానం, నిత్యం, నిరంతరం అయినది. జ్ఞానశక్తిని అనుసరించి ఇచ్ఛాశక్తి, దాని ననుసరించి క్రియాశక్తి వర్తిల్లుతుంటాయి. ఇచ్ఛాశక్తి అవసరమైన సన్నిధానాలను సంతరిస్తుంది. క్రియాశక్తి అందుకు రూపాలను సమకూర్చుతుంది. జ్ఞానదృష్టి విముఖ మైనప్పుడు ఇచ్ఛాశక్తి స్తంభించిపోతుంది. దానితో క్రియాశక్తి వ్యవహారం ఉడిగి మిన్నకుంటుంది; వెనువెంటనే కల్పనలన్నీ మాయమవుతాయి. ఈ శక్తి ఇటువంటిదని నిర్వచన చేయటం అసాధ్యం కాబట్టి దీనికి మాయ అని పేరుపెట్టారు. ఈ మాయాశక్తి రచించినవన్నీ గంధర్వ నగరాలు. అట్టివి నిత్యములని భావించి వాటితో అదే లోకంగా ఉండటమంటే జీవితకాలాన్ని చేజేతులా పాడుచేసుకోవటమే. పరమేశ్వరుడు నా భ్రాంతులన్నిటినీ దూరం చేసి నాకు తన దివ్యపదాన్ని అనుగ్రహించాలి'

అని శ్రీమన్నారాయణైకనిష్ఠను వహించాడు. ఆ నిష్ఠాఫలంగా ఖట్వాంగుని అజ్ఞానలవలేశాలు కూడా క్రమక్రమంగా నశించాయి.

**మ. కలసెన్ సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ డ్రశాంతమై**
**కలదయ్యున్ మతి మీఁద లే దనెడిదై కళ్యాణమై యాత్మలో**
**దలఁపం బల్కఁగరానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ**
**జ్జలజాతంబుల వాసుదేవుఁ డని సంస్థాపించు నా బ్రహ్మమున్.**

## ఖట్వాంగుని వంశక్రమం

రాజా! ఖట్వాంగునికి దీర్ఘబాహుడు, దీర్ఘబాహునికి రఘువు, రఘుమహారాజుకు పృథుశ్రవుడు, అతనికి అజుడు, అజునికి దశరథుడు జనించారు.

## శ్రీరామాదుల జననం

పరీక్షిన్నరేంద్రా! ఆ కాలంలో దేవతలు రావణాసురుని వలన పెక్కు బాధలకు లోనై దిక్కుతోచక భగవానుని ప్రార్థించారు. సర్వేశ్వరుడు వారి ప్రార్థనను ఆలకించి తన మహిమలో అంశాంశను నాల్గుగా విభజించి శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను పేర దశరథునికి జన్మించాడు. శ్రీరామ చరిత మునిజనగీతమై ముల్లోకాలలో వ్యాప్తమై ఉన్నది. ఆ చరిత్రను ఇహపరతారక మైనదానిని ఎంతని వర్ణించమంటావు?

## శ్రీరామ చరిత్ర

రామా! నీ చర్యలో ఎన్నెన్ని వింత వింతలున్నాయి! విశ్వామిత్రుడు మఖరక్షణార్థం నిన్ను కోరగా తండ్రి పంపును తలదాల్చి కూకటి ముడికి కురులు కూడని పసితనాన్ని లెక్కచేయక తమ్ముని లక్ష్మణుని వెంటగొనిపోయి మారీచాదులను మట్టుపెట్టి ఆ ఋషీంద్రునికి మెప్పు గూర్చి ఆయన వలన వివిధ మహాస్త్రాలను పొందావు. అక్కడ సీతాస్వయంవరం వార్త చెవిసోకగానే ఆ మహోత్సవ విలోకనోత్సుకుడవై విశ్వామిత్ర ఋషివర్యుడు, తమ్ముడు లక్ష్మణుడు వెంటరాగా మిథిలానగర మార్గం మెట్టి దారిలో అహల్యను శాపవశాన రాయిగా పడి ఉన్నదానిని పాదస్పర్శ మాత్రాన ఉద్ధరించి ఆ

పుణ్యవతి కావించిన కృతజ్ఞతాపూర్వక స్తుతి నందుకొని జనకరాజ నగరాన్ని ప్రవేశించావు. అక్కడ స్వయంవర శాలకు మున్నూరుగురు మహాబలశాలులు మోయలేక మోసితెచ్చిన శివశరాసనాన్ని సభాస్తారులైన వీరాధివీరులు చూసి మోపెట్టలేక ముఖాముఖాలు చూసుకొంటూ అల్లనల్లన తిరిగివస్తుంటే చూసి, గుర్వాజ్ఞను శిరసావహించి నీవు సభామధ్యాని కేగి ఆ వింటిని ఎక్కుపెట్టి లాగి కలభరాజు చెరకుగడను విరిచినట్లు ఫెళ్ళున విరిచి, అందలి రాకుమారులకు తలవంపులు కావించి, నీ పేరురాన కాపురానికి గర్వించిన శ్రీదేవిని గేలిసేయటానికి పుట్టినట్లు రూపవయోవిలాసాలతో ఒప్పారుతున్న సీతాదేవి పాణిగ్రహణ చేశావు.

రామా! నీ చరిత్ర ఏమని చెప్పను? భూపుత్రిని ఆ విధంగా పెండ్లాడి భార్యను వెంటగొని తమ్మునితో అయోధ్యాపథం మెట్టి, మార్గమాధ్యంలో ఎదురైన భార్గవరాముని – క్షత్రబీజాన్ని ఇరవైఒక్కమార్లు వెతికి వెతికి నిర్మూలించిన మహాసత్త్వవంతుని – క్షణమాత్రాన దర్పహీనుని చేసి వైభవోపేతంగా పురప్రవేశం చేశావు. రామా! నీ తండ్రి దశరథుడు స్త్రీవశుడై చేసిన బాసను నిలుపగోరి చేతిలోని రాజ్యలక్ష్మిని నువ్వొత్తుగా త్యజించి తల్లీ, బంధుజనాదులూ తల్లడిల్లి ఎంత బతిమాలినా వినక సీతాలక్ష్మణులతో పురివెడలి ఘోరారణ్యానికి వెళ్ళావు. రామా! నీ పితృభక్తిని, నీ సత్యవ్రత ప్రతిజ్ఞను, నీ నిస్సంగత్వాన్ని ఎంతని చెప్పను?

రామా! ఆ అడవిలో శూర్పణఖ పేరుగల రక్కసి ఒకతె నీకు మరులుగొల్ప రాగా దాని ముక్కు చెవులు కోసి బుద్ధిచెప్పి నీ ఏకపత్నీవ్రతాన్ని చాటిచెప్పావు. ఆ రక్కసికై దాని బంధువులు ఖర దూషణ త్రిశిరః ప్రముఖులు నీ పయిని అక్కసపడి ఉక్కుమీరి పదునాల్గువేల రాక్షసబలంతో వచ్చి ఒక్కుమ్మడిని నిన్ను మార్కొనగా నీ వొక్కడవే వారిలో ఒక్కొక్కరికి ఒక్కొక్క రాముడవై రక్కసులను రూపుమాపావు. రామా! ఈ నీ మాహాత్మ్యం ఏమని ఉగ్గడింపను!

రామా! సౌధాంతరాలలో నివసించి ఎండ కన్నెరుగక వివిధ భోగాలను అవ్యాహతంగా చూరగొన్న నీ శరీరాన్నే గాక శిరీష కుసుమకోమలమైన

సీతాతనూలతికను కూడా ముండ్లపొదరిండ్ల పాలు చేసి విచ్చుకత్తుల వంటి కరకు రాళ్ళ మీద నడిపించి నిప్పుచ్చురాలతో కృశింపజేసి దేహనిరభిమానత్వాన్ని ప్రకటించి వనవాసులైన మునులకు సయితం పాఠం నేర్పావు. రామా! నీ వ్రతనిష్ఠను ఎంతని శ్లాఘింపగలను!

రామా! లంకేశ్వరుడు రావణుడు తన చెల్లెలు శూర్పణఖకు సంతోషాన్ని కలిగించి, ఆ నెపంతో తన వలపు తీర్చుకొనగోరి పాపచిత్తుడై పతివ్రతారత్నాన్ని నీ అర్ధాంగిని అపహరించేందుకు తెగించి ఉపాయం పన్ని మారీచుని మాయామృగాన్ని కావించి పంపి ఆ లేడి నిమిత్తంగా నీకూ నీ సతికీ ఎడబాటు కలిగించి, నీ బాణహతుడు మాయామృగమారీచుడు ఆక్రోశింపగా నీకై నీ తమ్ముడు నీ కోసం వెళ్ళినప్పుడు నీ సతిని లోకమాతను ఒంటరిగా ఉన్నదానిని హరింపగా నీవు తిరిగివచ్చి ప్రాణేశ్వరి అక్కడ లేనందుకు నీవొనరించిన శోకవిలాపాలు ఈనాటికీ ఆ వనాంతరాలలో మారుమ్రోగుతున్నాయి. రామా! రామా! ఇదంతా స్త్రీసంగుల గతిని ప్రకటించటానికి కాకపోతే నిస్సంగునికి నీకు సంగదోషం వర్తింపగలదా!

రామా! మాయామరీచమృగాన్ని వేటాడగోరి నీవు, నీ తమ్ముడు లక్ష్మణుడు వెళ్ళినప్పుడు నీ సతి సీతాదేవి ఏకైకగా ఆశ్రమాలలో ఉన్నది. అదే అదనుగా రావణుడామెను ఎత్తుకొని పోసాగాడు. జటాయువు ఆ అకార్యాన్ని ఓర్వలేక రాక్షసేశ్వరుని ఎదిరించి పోరాడి రెక్కలు తెగి నేలకూలాడు. నీవు మాయామృగాన్ని చంపి ఆశ్రమానికి వచ్చి భార్యను గానక పరితపింపసాగావు. ఆ కష్టకాలంలో జటాయువు సీతాహరణ వృత్తాంతాన్ని నీకు తెలిపి ప్రాణాలు విడిచాడు. ఆ పక్షీంద్రుడు నీకు సంగతి చెప్పటం మహోపకారకృత్యమని భావించి నీవతనికి బంధుకృత్యాన్ని కావించావు. రామా! నీ ధర్మపరతను, నీ కృతజ్ఞతాబుద్ధిని శ్లాఘింప తరమా!

రామా! సీతాన్వేషణపరుడవై తరలావు. దారిలో కబంధుడు నీకు అడ్డుపడ్డాడు. అతనిని వధించి ఉత్తమగతిని ప్రసాదించావు. వైరులకు సైతం మేలుచేయటం కంటె వింత ఏముంటుంది? నీవు రాగద్వేషాతీతుడ వనటానికి

వేరే తార్కాణ లెందుకు? రామా! కోతులతో చెలిమి చేసి సీతావృత్తాంతాన్ని తెలుసుకొన్నావు. ఉపాధిభేదాన్ని బట్టి ఆత్మభేదం ఊహింపరాదని స్వీయవర్తనపూర్వకంగా లోకప్రచారం చేయగోరి ఆ విధంగా ప్రవర్తించావే కాని సర్వాధ్యక్షునికి నీకు పరుల సాయం అవసరమా? రామా! సురలు ప్రార్థింపగా వారికై నీవు అవతరిస్తూ దేవతలను వారి వారి అంశలతో వానరులుగా జన్మింపమని ఆజ్ఞాపించావు. దేవేంద్రుని అంశతో వాలి వానరుడై జనించాడు. దైవతాంశతో జన్మించినవాడు సురశత్రువైన రావణాసురునితో చెలిమి చేశాడు. ధర్మాన్ని ఉల్లంఘించి తమ్ముని భార్యను చేపట్టాడు. అతనిని సంహరించి దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై నీవవతరించిన సంగతి చాటిచెప్పావు. రామా! కపిసైన్యాన్ని కూర్చావు; కోతి అయిన హనుమంతుని చేత సముద్రలంఘనం చేయించావు; లంకపయి దండు నడిపావు; సముద్రుడు మహోత్తుంగకల్లోలాభీలుడై దారి తొలగనందుకు కనలి కోపవీక్షణమాత్రాన అతని గుండె నీరుచేశావు; సేతువును బంధించావు. ఈ ఒక్కొక్క కార్యంలోనూ కల భావాన్ని ఊహించటం బ్రహ్మతరమా? రామా! విభీషణుడు తన అన్న చేతకు ఖిన్నుడై అతనికి హితవు పలికాడు. రాక్షసేశ్వరుడు తమ్ముని వైరికోటిలోని వానిగా భావించి అతనిని వెళ్ళగొట్టాడు. అతను దిక్కు కానక నీ పాదాల చెంత చేరవచ్చాడు. వానరులు వద్దని అడ్డుపడ్డారు. ఎవరి మాటనూ వినక నీవు విభీషణునికి శరణమివ్వటమే కాక 'రావణుడు వచ్చి శరణిల్లినా కాపాడగల' నన్నావు. అహో! నీ దయార్ద్రధర్మబుద్ధిని ఏమని వర్ణింపగలను? రామా! వానరభటులు చెలరేగి లంకాపురాన్ని నేలపాలు చేయటం పరికించావు. రాక్షసవీరులు కుంభ నికుంభ ధూమ్రాక్ష దుర్ముఖ దేవాంతక నరాంతకాదులు యుద్ధార్థులై విజృంభించి నీ పైకి రాగా వారందరినీ కోతిబంట్ల చేతనే చంపించి అహంకారోద్ధతి గరిక పోచకు సాటిరాదని వెల్లడించావు. రాక్షసుల పాటు చూసి కుంభకర్ణాదులు కయ్యానికి వచ్చారు. వారందరినీ లక్ష్మణ సుగ్రీవాంజనేయ గంధమాదన నీల అంగద జాంబవత్పనసాదులకు అప్పగించి మట్టుపెట్టి కుంభకర్ణుని మాత్రం అతని శాపవిమోక్షణార్థం నీవే సంహరించావు.

రామా! ఎట్టకేలకు రావణుడు పుష్పకవిమానారూఢుడై యుద్ధానికి వచ్చాడు. నీవు మాతలి తెచ్చిన ఇంద్రరథం ఎక్కి లంకాధిపతిని ఎదిరించి 'దురాత్మా! నేను లేనప్పుడు వచ్చి తోడునీడ లేని స్త్రీని అపహరించావు. ఇది అల్పకృత్యం కదా? ఇందుకు సిగ్గు కలగలేదా?' అని అతని అకార్యాన్ని తెలిపి ప్రబోధగర్భంగా పలికావు. దీని భావమేమిటి? మహాపాపాత్ముడయినా తన తప్పును అంగీకరించి శరణువేడితే రక్షింపగలవనే నీ లోకరక్షావ్రతాన్ని చాటి చెప్పటమే కదా? ఆ మూర్ఖుడు నీ హితోపదేశాన్ని గ్రహింపలేకపోయాడు. అంతట నీవతనిని చూసి, 'దుర్మార్గుడా! కర్మఫలం అనుభవింప తీరదు' అని చెప్పి అతనిపై ఒక బాణాన్ని ప్రయోగించావు. దశకంఠుడు పదిమోముల నెత్తురు గ్రక్కి పుణ్యభోగాంతాన దివి నుండి పడిన జీవుని వలె విమానం నుంచి నేలకొరిగాడు. రామా! నీ కాలజ్ఞతను, నీ శౌర్యాన్నీ, నీ శరణాగత వాత్సల్యాన్ని, నీ ప్రతాపాన్ని వేయితలల పన్నగేంద్రుడు కూడా వివరింపలేడు కదా!

రామా! రావణాదులు మరణించిన తర్వాత మండోదరి, ప్రముఖరాక్షసస్త్రీలు రణరంగానికి వచ్చి అక్కడ చచ్చిపడి ఉన్న వారివారి ప్రియుల కళేబరాలను కౌగిట జేర్చి 'అయ్యో! రావణా! మామాట వినవైతివి; ఒక్కని కామవివశత్వం మా అందరికీ వైధవ్యాన్ని తెచ్చి పెట్టింది కదా. అంతటితో కాలేదు. నీవూ ఇహపరాలకు దూరమయ్యావు. ఇక మాకు దిక్కెవ్వరు? ఈ లంకను ఎవరి పాలు చేశావు?' అని విలపింపగా వారికి ఓదార్పులు చెప్పించి హతులైనవారికి విభీషణాదుల వలన పరలోకక్రియలు చేయించావు. రామా! వైరి తోడిదే పగ అన్న మాటను పాటించిన నీ ధర్మబుద్ధికి ఇదే ప్రణామం.

రామా! పతివ్రతామణి అశోకవనంలో శింశుపావృక్షమూలాన భర్తృ వియోగవ్యాధిగ్రస్తయై చిక్కి చివికి ప్రాణాలను కన్నులలో నిలుపుకొని నీ రాకకోసం నిరీక్షిస్తున్నదో ఆ ప్రియతమను గ్రహించి నీవు పలికిన ఓదార్పుల భావం లోకమంగళకరం. రామా! నీ ఔదార్యాన్ని శ్లాఘింప తరమా?

రామా! విభీషణునికి లంకాపట్టం కట్టి అతనికి కల్పాంతాయువు ననుగ్రహించి సీతాలక్ష్మణాది సమేతంగా విమానారూఢుడవై చని, నీ మాట తలదాల్చి నీ పాదరక్షలను పూజిస్తూ నీ రాకకు ఎదురుచూస్తూ నందిగ్రామంలో ఉన్న నీ తమ్ముని జటాధారిని గోమూత్రపక్వాన్న భక్షణవ్రతుని భరతుని చేరి అతని యెడ నీవు నెరపిన సహోదరభావాన్ని, అతనికై నీవుపడిన పశ్చాత్తాపాన్ని వర్ణించటం వాల్మీకి మహర్షికే శక్యం కాలేదు. నేనేమని చెప్పగలను? భ్రాతృప్రేమ నీకే చెల్లు.

రామా! నీ పాదుకలను తలదాల్చి భరతుడు, చామరద్వయాన్ని పట్టుకొని సుగ్రీవ విభీషణులు, శ్వేతాతపత్రాన్ని వహించి హనుమంతుడు, శరాసన తూణీరాలను చేపట్టి శత్రుఘ్నుడు తోడురాగా జాంబవంతాదులు ముందు నడువగా తీర్థకమండలు హస్త అయిన జానకితో నీవు పుష్పకవిమానం ఆరోహించిన వైఖరిని చూసి ఆనందించాలే గాని మాటలలో చెప్పాలంటే మాటలెన్ని ఉన్నా చాలవు.

రామా! నీ అయోధ్యాప్రవేశంతో ఆ నగరవాసులకు నష్టమైన సంపద దొరికినట్లయింది. నీవు పురాంగణంలో కాలుపెట్టిన వెంటనే మొదట సవతి తల్లులకు మ్రొక్కి తర్వాత కన్నతల్లికి, గురువుకు మ్రొక్కావు. ఇందులోని నీతి ధర్మ రహస్యాలను వివరింప తరమా? రామా! నీ తల్లులొక్కొక్కరు నిన్ను కౌగిట చేర్చి శిరస్సు మూర్కొని ఆనందబాష్పాలతో అభిషేకించి వారు పొందిన హాయి ఇట్టిదని నీవు మాత్రం చెప్పగలవా?

రామా! రాజ్యభారం వహించాలని ఋష్యాదులు కూడా బోధించారు. ఎవరెన్ని చెప్పినా వినవైతివి. తుదకు భరతుడు వచ్చి ప్రార్థించాడు. అతని మాటకు కట్టుపడ్డావు. నీ పాలనలో వర్ణాశ్రమధర్మాలన్నీ ఉల్లసిల్లాయి; ప్రజలకు తండ్రివై ప్రేమను పంచియిచ్చావు. నీ పరిపాలన కాలంలో సరిత్సాగరాలు, వనగిరులు, వర్ష ద్వీపాలు ప్రజలకు సర్వకామాలను సమకూర్చాయి. ఆధివ్యాధులు గాని ఆకలి దప్పికల భయాలు గాని

కలుగలేదు; అనిచ్ఛామరణం ఎవ్వరినీ పలకరించలేదు. అవతారాలు ధర్మసంస్థాపనార్థమేనని చెప్పకుండానే చెప్పినట్లయింది.

రామా! నీవు యజ్ఞేశ్వరుడవే అయినా బహుయజ్ఞాలు కావించి హోతకు ప్రాగ్దిశను, బ్రహ్మకు దక్షిణ దిశను, అధ్వర్యునికి పశ్చిమ దిశను, ఉద్గాతకు ఉత్తర దిశను, ఆచార్యునికి మధ్యప్రదేశాన్ని యజ్ఞదక్షిణలుగా రాజ్యమంతటినీ ధారాగతం చేశావు. నీకు కట్టుబట్టలు, నీ సతికి సుమంగళీత్వం మిగిలాయి. నీ నిస్పృహత ఏమనవచ్చు!

రామా! ఋత్విజులు నీ బ్రాహ్మణభక్తికి, నీ నిస్సంగబుద్ధికి మెచ్చి 'జగత్ప్రభూ! నీ వలన మేము సర్వపదార్థసమృద్ధులము. భూమండల భారాన్ని మాపైని వేయటం ధర్మం కాదు. దానిని మేము మోయలేము. అందుకు నీవే తగినవాడవు. మా మనస్సులలోని చీకట్లను హరించి మాకు ఎంతో మేలు చేశావు. మాకింకా ఏమి కావాలి?' అంటూ నీవిచ్చిన రాజ్యాన్ని మళ్ళీ నీకే అప్పగించారు. రామా! నీ తత్త్వం ఎవరికి బోధపడుతుంది?

రాజా! ప్రజల మనోభావాలను తెలుసుకొంటూ వారికి ప్రేయాన్ని, శ్రేయాన్ని కలిగించటమే పరిపాలనవిధానమని తలచి తదర్థమై రాత్రులలో మారువేషాలతో సంచరించావు. రాజశబ్దానికి ప్రజారంజన అర్థమన్న విషయం నీ వలన రూఢికెక్కింది.

రామా! నిశాసంచారాలలో ఒకనాటి రాత్రి సీతాదేవిని గూర్చి దుర్జన దుర్వచనం ఒకటి నీకు వినవచ్చింది. ఆ మహాదేవి పరమపతివ్రత అని నీకు తెలిసినా, ఆమె పాతివ్రత్యాన్ని నీకు అగ్నిసాక్షికంగా లోకానికి ప్రకటించినా, లోకుల నోరుమూయటం ఎవరి తరం? లోకాపవాదాన్ని సాగనిస్తే ధర్మానికి చోటుండదని నిశ్చయించి గర్భవతిగా ఉన్న ఇల్లాలిని లోకార్థం త్యజించి కాననానికి సమర్పించావు. ఆ సతీమతల్లి నీకు మారాడక వాల్మీకిమహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆతని ప్రాపుగాంచి అక్కడే కుశలవులను కని నీ పాదధ్యానయై భూవివరాన్ని ప్రవేశించింది.

రామా! ఆమెకై నీవు పడిన దుఃఖం ఇంతా అంతా కాదు. నీ అపరాధానికి ప్రాయశ్చిత్తమన్నట్లు ఆ దేవి ప్రతిమను ద్వితీయగా గ్రహించి బ్రహ్మచర్య వ్రతివై పదమూడు సంవత్సరాలు గడిపావు. నీ సతీప్రేమ, నీ జితేంద్రియత్వం ఏమనవచ్చు?

ఎవడు దేవతలచే ప్రార్థితుడై లీలామానుషావతారం ధరించాడో, ఎవని చర్యలు నాటికీ నేటికీ ఏనాటికీ లోకాన్ని వివిధ రసాంబుధులలో ఓలలాడింప గలిగినవో, ఎవని కీర్తి ఋషిప్రోక్తమై రాజ సభలలో రచ్చబండల మీద ఏకరీతిని ప్రస్తూయమానమై ఉన్నదో, ఎవని నామం తారకమంత్రమై అలరారుతున్నదో, ఎవ్వడు నిండార భక్తితో పిలిచిన మాత్రాననే సన్నిధి గావించి ఆర్తిని మాన్పే ఆర్తత్రాణపరాయణుడో, ఎవని యందలి నిష్కామభక్తి సద్గతికి సోపానరూపమో, ఆ రామునికి లోకాభిరామునికి సాష్టాంగం.

క. **శ్రీరామా! శ్రీరామా!**
**శ్రీరామా! రామ! రామ! సీతారామా!**
**శ్రీరామా! శ్రీరామా!**
**శ్రీరామా! రామ! రామ! శ్రీ రఘురామా!'**

## శ్రీరాముని పరిపాలనా విధానం

మునులారా! శుకయోగీంద్రుడు ఆ విధంగా శ్రీరామచరిత్రను స్తవరూపంలో ప్రకటింపగా పరీక్షిన్నరేంద్రుడు విని, 'మునిచంద్రమా! శ్రీరామచరిత్ర మునుపెన్నోసార్లు విన్నదయినా మళ్ళీ మళ్ళీ వినాలనిపిస్తుంది. విన్నకొద్దీ కొత్త కొత్త చవులూరుతుంటాయి. శ్రీరాముడు ప్రజలను ఏ తీరున పరిపాలించాడో వినాలని కుతూహలంగా ఉన్నది' అన్నాడు. శుకమహర్షి అతనితో ఇలా అన్నాడు.

నరేంద్రా! రాజును చారదృష్టుడని అంటారు. అంతమాత్రమే చాలదు. అతను విచారదృష్టుడుగా కూడా ఉండాలి. గూఢచారులు రహస్యంగా ప్రజల భావాలను తెలుసుకొని వచ్చి తెలియజేస్తుంటారు. వారు తెలిపిన దానిని

విమర్శించి ప్రజాహితాన్ని నిశ్చయించి ఆ ప్రకారమే చేయాలి. చారుల వలన తెలిసికొనటం చారదృష్టి, విన్నదానిని విమర్శించటం విచారదృష్టి అవుతాయి. విచారింపక ఏ పనీ చేయకూడదు. కాదని చేయబూనితే అది గ్రుడ్డివాడి చేతి రాయి అవుతుంది. అంతే గాక రాజు ప్రజాభిప్రాయాలను స్వయంగా కూడా తెలుసుకొంటుండాలి. అందుకు గాను రాజు అందరికీ అందుబాటులో ఉండి తన దర్శనాన్ని అందరికీ అందజేస్తూ వారి మనోభావాలను గుర్తించాలి. ఆ గ్రహణవిధానాన్ని స్వదృష్టి అంటారు. శ్రీరాముడు చారదృష్టి, విచారదృష్టి, స్వదృష్టి అనే నేత్రత్రయం కలిగి పరిపాలించాడు.

రాజా! రాముడు అంతమాత్రంతో తృప్తిపడలేదు. ఏమంటావా? చారులు కల్పించి చెప్పవచ్చు. ప్రజలు మోమోటమి వలన సముఖాన తమ భావాలను చెప్పలేకపోతారు. అటువంటి ప్రమాదాలు కలగకుండా రాముడు రాత్రి వేళలలో మారువేషాలు ధరించి పురమంతటా సంచరించి ప్రజల ఆంతర్యాన్ని గ్రహిస్తుండేవాడు.

రాజా! రాముని రాజ్యకాలంలో సోమరితనానికి గాని ఉదరపోషణార్థమై కపటవేషాలకు గాని వంచకత్వానికి గాని చార చోర ద్యూతాలకు గాని అనృతభాషణకు గాని గోరంత చోటు కూడా దొరకలేదు. స్త్రీపురుషులందరూ దేశకాల స్వభావాశ్రమాదుల ప్రకారం స్వధర్మాన్ని అనుష్ఠించారు. ఎవ్వరూ ధర్మ వ్యతిక్రమానికి పాల్పడరు. ఏ వ్యక్తి అయినా దేహపోషణార్థం ఎంత అవసరమో అంతమాత్రమే అనుభవించాలి. భోగపరత్వం తగదు. అందరి ప్రవర్తనలు సర్వభూతాత్మభూత భావపూర్వకంగా ఉండాలి. స్వలాభపరత్వం ఎంతమాత్రమూ కూడదు.

నరేంద్రా! ఇంత వాగ్విస్తారం ఎందుకు? రాజు ప్రజాసేవకుడై ప్రజారంజనం ఏ విధంగా చేయవలసి ఉంటుందో రాముడు తాను నడిచి చూపాడు. రాముని కాలంలో ధర్మనిర్ణయ విషయమై కామలోభమదమాత్సర్యచిత్తులకు లవమాత్రావకాశమూ కలుగలేదు. నిస్సంగులైన ఋషీశ్వరులే ధర్మాన్ని నిర్ణయించేవారు. రాజ్యనిర్వహణార్థం ధనం

కావలసివస్తుంది కదా! ఆ ధనాన్ని రాజు తన యిచ్ఛవచ్చినట్లు సేకరింపకూడదు. ఆయా వృత్తులవారిని పిలిచి రాముడు ధనావసరాన్ని వారికి వివరిస్తాడు. వారు యుక్తాయుక్తాలు పరిశీలించి కావలసిన ధనాన్ని వారే ఆయా వృత్తులమీద విభజించి చేకూర్చి ప్రభుపరం చేస్తారు. ఆ ధనమంతా ప్రజార్థం సద్వినియోగం కావాలేగాని ఏ నెపాననో దుర్వ్యయం కాకూడదు.

రాజా! రాముడు ఆ విధంగా పరిపాలించి నందువల్లనే 'రామరాజ్యం' అన్న మాట లోకమంతటా మారుమ్రోగుతున్నది. రామునికి స్వపరభేదం లేదన్న సంగతిని సీతావృత్తాంతమే వేయినోళ్ళ చాటిచెబుతున్నది. ఇంకా ఏమి చెప్పమంటావు?

## శ్రీరామ వంశం

రామునికి సీతవలన కుశలవులని ఇద్దరు కొడుకులు వాల్మీకి మహర్షి ఆశ్రమంలో జన్మించారని చెప్పాను. లక్ష్మణునికి అంగద చంద్రకేతువులు, భరతునికి దక్ష పుష్కలులు, శత్రుఘ్నునికి సుబాహు శ్రుతసేనులు కలిగారు. కుశునికి అతిథి, అతిథికి నిషధుడు, నిషధునికి నభుడు, నభునికి పుండరీకుడు, పుండరీకునికి క్షేమధ్వజుడు, క్షేమధ్వజునికి దేవానీకుడు, దేవానీకునికి అహీనుడు, అహీనునికి పారియాత్రుడు, పారియాత్రునికి బలుడు, బలునికి జలుడు, జలునికి వజ్రనాభుడు, వజ్రనాభునికి శంఖణుడు, శంఖణునికి విధృతి, విధృతికి హిరణ్యనాభుడు జన్మించారు.

హిరణ్యనాభుడు జైమినిమహర్షికి శిష్యుడై అతని వలన యోగవిద్య గ్రహించి యోగాచార్యుడయ్యాడు. అతని వలన కోసల దేశానికి చెందిన యాజ్ఞవల్క్యుడు అధ్యాత్మవిద్యను నేర్చుకొన్నాడు. హిరణ్యనాభునికి ధ్రువసంధి, ధ్రువసంధికి సుదర్శనుడు, సుదర్శనునికి అగ్నివర్ణుడు, అగ్నివర్ణునికి శీఘ్రుడు, శీఘ్రునికి మరువు జన్మించారు.

## క్షత్రియ కులోద్ధరణం

రాజా! ఆ మనువు యోగసిద్ధుడై ఇప్పుడు కలాపగ్రామంలో గూఢవర్తిగా ఉన్నాడు. కలియుగాంతంలో నష్టమైన క్షత్రియకులాన్ని అతను ఉద్ధరిస్తాడు. అతనికి ప్రశుశ్రుతుడు, ప్రశుశ్రుతునికి సంధి, సంధికి అమర్షణుడు, అమర్షణునికి మహస్వంతుడు, మహస్వంతునికి విశ్వసాహ్వుడు, విశ్వసాహ్వునికి బృహద్బలుడు ఉదయించారు. ఆ బృహద్బలుని మీ తండ్రి అభిమన్యుడు భారతరణంలో సంహరించాడు. రాజా! ఇక్ష్వాకు రాజు లందరూ ఇప్పటికి గతించారు.

## భావికాలపు రాజులు

నరేంద్రా! ఇక రాబోయే రాజులను విను. బృహద్బలునికి బృహద్రణుడు, అతనికి ఉరుక్షతుడు, అతనికి వత్సప్రీతుడు, అతనికి ప్రతివ్యోముడు, అతనికి భానుడు, అతనికి దివాకసుడు, అతనికి వాహినీపతి, అతనికి సహదేవుడు, అతనికి వీరుడు, అతనికి బృహదశ్వుడు, అతనికి భానుమంతుడు, అతనికి ప్రతీకాశ్వుడు, అతనికి సుప్రతీకుడు, అతనికి మేరుదేవుడు, అతనికి సుతక్షత్రుడు, అతనికి ఋక్షసుడు, అతనికి అంతరిక్షుడు, అతనికి సుతపుడు, అతనికి అమిత్రజితుడు, అతనికి బృహద్వాజి, అతనికి బర్హిస్సు, అతనికి ధనంజయుడు, అతనికి రణంజయుడు, అతనికి సృంజయుడు, అతనికి శాక్యుడు, అతనికి శుద్ధాదుడు, అతనికి లాంగలుడు, అతనికి ప్రసేనజితుడు, అతనికి క్షుద్రకుడు అతనికి ఋణకుడు, అతనికి సురథుడు, అతనికి సుమిత్రుడు ఉదయిస్తారు. సుమిత్రునితో ఇక్ష్వాకు వంశం పరిసమాప్తమవుతుంది.

## నిమి చరిత్ర

రాజేంద్రా! ఇక్ష్వాకువు రెండవకొడుకు పేరు నిమి అని చెప్పాను. అతను సత్త్రయాగం చేయదలచి వసిష్ఠమహర్షిని ఋత్విక్కుగా వరించాడు. అంతకు పూర్వమే ఇంద్రుడు కూడా అదే యాగాన్ని చేయబూని ఆ ఋషీశ్వరునే

ఆహ్వానించి ఉన్నాడు. ఆ మహర్షి నిమి ప్రార్థనను విని, 'ఇంద్రునికి మాట యిచ్చాను. అతని కార్యం నెరవేర్చి వస్తాను. అంతదాకా వేచి ఉండు' అని చెప్పి ఇంద్రయాగానికి వెళ్ళాడు.

## నిమి వసిష్ఠుల శాపోదంతం

నిమి వసిష్ఠుని పలుకులను విని, 'శరీరాలు క్షణభంగురాలు. ఎప్పుడు అనుకొన్నది అప్పుడు చేసివేయటం మంచిది. కాలం మీరితే ఏమవుతుందో తెలియదు' అని తలపోసి అన్యులను ఋత్విక్కులనుగా వరించి యాగం మొదలుపెట్టాడు. నిమి యాగం జరుగుతుండగానే ఇంద్రుని యాగం సమాప్తమయింది. వసిష్ఠుడు నిమి ప్రార్థనను తలచి వాయువేగ మనోవేగాలతో నిమి ఉన్నచోటికి వచ్చి అక్కడ యాగం జరుగుతుండటం చూసి కోపవివశుడై, 'ఓరీ! శిష్యుడవై ఉండి కులగురువుకు అపచారం చేశావు. నీకు శరీర పతన మవుతుంది గాక!' అని శపించాడు. నిమి ఆ శాపాన్ని విని, 'అయ్యా! ధర్మాన్ని విచారింపక పోతివి. ధర్మాన్ని విచారింపని నీ దేహం పతనమవుతుంది గాక!' అని ప్రతిశాపం ఇచ్చాడు.

## నిమికి విదేహప్రాప్తి

రాజా! నిమి వసిష్ఠుల దేహాలు పరస్పరశాపహతాలై నేలకొరిగాయి. ఆ యాగానికి వచ్చిన మునులు నిమి దేహాన్ని గంధద్రవ్యాలలో ఉంచి కాపాడుతూ యాగసమాప్తి కావించి ఆ కళేబరాన్ని దేవతల వద్దకు కొనిపోయి నిమిని బ్రతికించమని అడిగారు. దేవతలు ప్రీతులై వారు కోరిన వరం ఇచ్చారు. నిమి సజీవుడైనాడే కాని భావిజీవితం పట్ల ఆసక్తిని చూపలేదు. 'సురలారా! ఈ దేహబంధం నాకు వద్దు. ప్రాజ్ఞులు భగవత్పదాబ్జయోగాన్ని అభిలషించినట్లు నశ్వరమైన దేహయోగాన్ని కోరుకొనరు. నీటిలోని చేపలకు వలె దుఃఖమోహభయవ్యాకులమైన సంసారంలో దేహానికి అన్నిటా మృత్యుభీతి వెన్నంటి ఉంటుంది' అన్నాడు. సురలది విని 'నీవు విదేహుడవై ప్రాణుల నేత్రాలలో నిమేషోన్మేష రూపంలో ఉండు' అన్నారు.

## జనకుని పుట్టుక

రాజా! నిమి విదేహు డైనందువలన అతని రాజ్యానికి అరాజకత్వం సంభవించింది. మహర్షు లదిచూసి నిమి దేహాన్ని మథించారు. అతని దేహం నుంచి పురుషుడొకడు జనించాడు. అతనికి జనకుడని పేరు పెట్టారు. జనకుడు విదేహునికి కలిగినందువల్ల విదేహుడని, మథన కారణాన జన్మించటం వలన మిథిలుడని పేర్లు వచ్చాయి. అతను నిర్మించిన నగరం మిథిలా నగరమయింది.

## వసిష్ఠుని కుంభసంభవత్వం

రాజా! వసిష్ఠుడు దేహాన్ని బాసి పునర్జన్మకు వేచి ఉండి మిత్రావరుణులను ఆవేశించాడు. ఒకప్పుడు వారు దేవవేశ్య ఊర్వశిని కామించి వీర్యస్ఖలనమై ఆ వీర్యాన్ని ఒక కుంభంలో ఉంచారు. అది నిమిత్తంగా వసిష్ఠుడు శరీరధారణ చేశాడు. కుంభంలో పుట్టినందువల్ల అతనికి కుంభసంభవుడని పేరు వచ్చింది.

విదేహునికి ఉదావసుడు, అతనికి నందివర్ధనుడు, అతనికి సుకేతుడు, అతనికి దేవరాతుడు, అతనికి బృహద్రథుడు, అతనికి మహావీర్యుడు, అతనికి సుధృతి, అతనికి ధృష్టకేతుడు, అతనికి హర్యశ్వుడు, అతనికి మరుడు, అతనికి ప్రతిబంధకుడు, అతనికి కృతరయుడు, అతనికి దేవమీఢుడు, అతనికి విధృతుడు, అతనికి మహాధృతి, అతనికి కీర్తిరాతుడు, అతనికి మహారోముడు, అతనికి స్వర్ణరోముడు, అతనికి హ్రస్వరోముడు, అతనికి సీరధ్వజుడు కలిగారు.

## సీతా జననం

రాజేంద్రా! సీరధ్వజుడు యజ్ఞార్థం భూమిని చదునుచేయగోరి దున్నసాగాడు. అతని నాగటి చాలులో సీతాదేవి ఉద్భవించింది. అతను ఇక్ష్వాకు వంశ్యుడు కావటం వల్ల మూలపురుషుని పేర అతనిని జనకుడని, విదేహుని రాజ్యాన్ని అధిష్ఠించినందువలన విదేహుడని అంటారు. భూమి నుండి పుట్టినందువలన భూసుత అని, విదేహుని ఇంటిలో పెరిగినందువల్ల

వైదేహి అని, నాగేటి చాలు నుంచి జన్మించటం మూలాన సీత (నాగలి చాలు) అని, జనకవంశపోషిత అయినందువల్ల జానకి అని, మిథిలానగర రాజు పేరు మీద మైథిలి అని, ఆమెకు పేర్లు వచ్చాయి.

## సీరధ్వజుని వంశం

సీరధ్వజునికి కుశధ్వజుడు, అతనికి ధర్మధ్వజుడు జనించారు. ధర్మధ్వజునికి కృతధ్వజుడు, మితధ్వజుడు ఉదయించారు. వారిలో కృతధ్వజునికి కేశిధ్వజుడు, మితధ్వజునికి ఖాండిక్యుడు పుట్టారు.

## కేశిధ్వజ – ఖాండిక్యులు

రాజా! కేశిధ్వజుడు ఆత్మజ్ఞాని. ఖాండిక్యుడు తండ్రి అయిన మిత్రధ్వజుని వలన కర్మతంత్రం నేర్చుకొన్నాడు. జ్ఞానకర్మలకు పొత్తు కుదరనందువలన ఖాండిక్యుడు కేశిధ్వజునికి వెరచి పారిపోయాడు.

## కేశిధ్వజుని వంశం

కేశిధ్వజునికి భానుమంతుడు, భానుమంతునికి శతద్యుమ్నుడు, శతద్యుమ్నునికి శుచి, శుచికి సనద్వాజుడు, సనద్వాజునికి ఊర్ధ్వకేశుడు, ఊర్ధ్వకేశునికి అజుడు, అజునికి కురుజితుడు, కురుజితునికి అరిష్టనేమి, అరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువుకు పార్శ్వకుడు, పార్శ్వకునికి చిత్రరథుడు, చిత్రరథునికి క్షేమాపి, క్షేమాపికి హేమరథుడు, హేమరథునికి సత్యరథుడు, సత్యరథునికి ఉపగురువు, ఉపగురునికి అగ్నితేజోంశతో సావనుడు, సావనునికి సువర్చసుడు, సువర్చసునికి సుభాషణుడు, సుభాషణునికి శ్రుతుడు, శ్రుతునికి జయుడు, జయునికి విజయుడు, విజయునికి ధృతుడు, ధృతునికి అనఘుడు, అనఘునికి వీతిహవ్యుడు, వీతిహవ్యునికి ధృతి, ధృతికి బహుళాశ్వుడు, బహుళాశ్వునికి కృతి, కృతికి మహావశి జన్మించారు.

రాజా! కేశిధ్వజుని వంశీయు లందరికీ మైథిలులని పేరు. వీరందరూ గార్హస్థ్య ధర్మంలో ఉంటూనే యాజ్ఞవల్క్యాది మహర్షులను సేవించి వారి

ప్రసాదం వలన ఆత్మజ్ఞానం పొంది ద్వంద్వాలను నిరసించి ముక్తిపథం చేరుకొన్నారు.

## చంద్రవంశం

రాజా! సూర్యవంశంలోని రాజుల వంశానుక్రమణికను చెప్పాను. చంద్రవంశక్రమం విను.

## చంద్రుని పుట్టుక

భగవంతుని నాభికమలం నుంచి బ్రహ్మ పుట్టిన సంగతి విన్నావు కదా. బ్రహ్మకు అత్రి జనించి సర్వవిధాల తండ్రికి దీటువచ్చాడు. ఆ మహాత్ముని నేత్రాల నుంచి ఆనందబాష్పం స్రవించింది. ఆ బాష్పంతో చంద్రుడు ఉదయించాడు. ఆనందాశ్రువులు అమృతాత్మకాలు కాబట్టి దానితో ఉదయించిన చంద్రునికి అమృతమయత్వం స్వభావసిద్ధమయింది. ఆ చంద్రుని బ్రాహ్మణులకు, ఓషధులకు, నక్షత్రాలకు అధిపతిగా బ్రహ్మ నియమించాడు.

## తారాహరణం

చంద్రుడు రాజయి ముల్లోకాలు గెలిచి రాజసూయ యాగం చేసి పదవీగర్వితుడై బృహస్పతి భార్య తార ఇంటికి వెళ్ళి ఆ సౌందర్యవతిని బలాత్కారంగా తీసుకొనివచ్చాడు. దేవగురువు ఆ సంగతి తెలిసి చంద్రుని వద్దకేగి తన భార్య నిమ్మని అర్థించాడు. చంద్రుడు నిరాకరించాడు.

## దేవదానవ యుద్ధం

ఆ సంగతి వేల్పులు విని గురువు పక్షం వహించారు. వేల్పుల గురువైన బృహస్పతికి, దానవాచార్యుడైన శుక్రునికి తీరని వైరం ఉన్నందువల్ల శుక్రాచార్యుడు చంద్రుని పక్షమయ్యాడు. అది నిమిత్తంగా దేవదానవులకు యుద్ధం జరిగింది. సురాచార్యుని పక్షం నీరసించింది.

## బృహస్పతి చేరిక

అప్పుడు హరుడు తన గురుపుత్రుడైన బృహస్పతి స్థితి విని భూతగణాలతో వచ్చాడు. మహేంద్రాదులు అతని వెంట నిలిచారు. ఉభయపక్షాలు హోరాహోరి పోరాడారు. సురాసురులకు ఘోరనష్టం వాటిల్లింది. రెండు కులాలూ రూపుమాసి పోగలవన్నంతగా పోరు జరిగింది. బృహస్పతి తండ్రి అంగిరసు డప్పుడు బ్రహ్మ వద్దకేగి సంగతి వినిపించాడు. బ్రహ్మదేవుడు వచ్చి చంద్రుని మందలించి తారను బృహస్పతికి ఇప్పించాడు. కోపతాపాలు చల్లారాయి.

## తారకు సుతోదయం

రాజా! ఆ సమయంలో తార నిండు గర్భవతిగా ఉన్నది. బృహస్పతి ఆమెను చూసి –

**ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియ కైవడి ధర్మకీర్తులన్**
**బొగ్గులుచేసి జారు శశి బొంది కటా! కడు పేలఁ దెచ్చుకొం**
**టెగ్గు దలంపఁగా వలదె? యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్**
**బ్రగ్గఁగఁ జేసెదన్ జెనటి! మానవతుల్ నినుఁజూచి మెత్తురే?**

అసతీ! స్త్రీవి అయినందువల్ల సంతానకాంక్షుడను కాబట్టి నిన్ను బూడిద చేయనైతిని' అని పరుషంగా మాట్లాడాడు. అంతలో ఆమెకు ప్రసవకాలం చేరువై ఆమె గర్భం నుంచి సువర్ణ సవర్ణ కాంతిమంతుడైన సుతుడు ఉదయించాడు.

## గురు చంద్రుల వివాదం

రాజా! ఆ బిడ్డను చూడగానే దేవగురువుకు, సోమునికి పుత్రవాత్సల్యం అతిశయించింది. 'ఇతను నా కొడుకు; ఇతను నా కొడుకు' అని వారిద్దరూ తగవులాడసాగారు. వారి తగవు తీర్చేందుకు ఋషులు వచ్చి తారను అవతలికి పిలిచి నిజం చెప్పమని అడిగారు. ఆమె సిగ్గుతో బదులు చెప్పలేక

తలవంచుకొన్నది. అప్పుడు ఆ బాలుడు తల్లిని చూసి, 'అమ్మా! సిగ్గెందుకు? ఉన్నమాట ఉన్నదున్నట్లు చెప్పవచ్చును కదా' అని కోపస్వరంతో పలికాడు. అంతలో బ్రహ్మ వచ్చి ఆ కాంతను ఏకాంతానికి పిలిచి –

**మ. చెలువా! నీ యెలసిగ్గు వాపి గురుడో శీతాంశుడో యెవ్వఁ డీ**
**లలితాకారుఁ గుమారుఁ గన్నయతఁ డేలా దాఁప? నిప్పాటు నీ**
**తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము కాంతల్ కాముకల్ గారె? మా**
**టల నిందేమియుఁ బోదుపో యొరుల తోడం జెప్ప విన్పింపవే?**

అని బుజ్జగించాడు. ఆ అబల బ్రహ్మకు మారు పలుకలేక 'ఈ బిడ్డ చంద్రునికి పుట్టినవాడు' అని రహస్యంగా చెప్పివేసింది.

## బుధుడు

అంతట చంద్రుడు ఆ బిడ్డను ప్రేమతో ఎత్తుకొని ముద్దాడి శిరసు మూర్కొని బుగ్గలు పుణికి లాలించాడు. పరమేష్ఠి చంద్రాత్మజునికి బుధుడని పేరుపెట్టాడు.

## పురూరవుడు

రాజా! బుధునికి ఇళయందు పురూరవుడు జన్మించిన సంగతి చెప్పాను. పురూరవుడు పుట్టుకతోనే రూపశీలౌదార్య విక్రమతేజోవిలాసుడై వన్నెకెక్కాడు.

## ఊర్వశికి శాపం

ఒకనాడు ఇంద్రలోకంలో దేవసభ జరిగింది. దేవతలు, మునులు అందరూ వచ్చారు. సురవేశ్యల నాట్యం మొదలయింది. ఆ సమయంలో నారదమహర్షి అక్కడికి వచ్చి ప్రస్తావవశాన పురూరవుని గుణ శీల రూపాతిశయాలను శ్లాఘించాడు. ఆ మాటలు ఊర్వశి చిత్తాన్ని ఆకర్షించాయి. అందుకు అక్కడే ఉన్న మిత్రావరుణులు ఆగ్రహించి మానుషరూపాన్ని పొందమని ఆమెను శపించారు.

## ఊర్వశీ పురూరవుల సమాగమం

రాజా! ఒకనాడు పురూరవుడు వనవిహారం చేస్తుండగా ఒక సుందరాంగి మిరుమిట్లుగొలిపే మెరుపు తీగ వలె అతని యెదుట సాక్షాత్కరించింది. ఆ రాజు ఆమె రూపవయోవిలాసాలకు హర్షపులకాంకితు డయ్యాడు. వెనువెంటనే మదనుడు అతని మనస్సు లోనికి అడుగుపెట్టాడు.

పురూరవుడు ఆ మనోహరికి స్వాగతం పలికి, 'రమణీ! నాతో పెక్కేండ్లు క్రీడించు' అన్నాడు. ఆ కాంత అతని చూపులలో చూపు నిలిపి, 'మోహనాకారా! నన్ను ఊర్వశి అంటారు. మన కలయిక జరగాలంటే కొన్ని నియమాలు ఉన్నాయి విను. నీ మనోదృష్టులు వేరొకతె వంకకు ప్రసరింపకూడదు. నాతో ఉన్న ఈ మేషాలు నాకు పుత్ర సమానమైనవి. ఆ రెంటిని విడిచి నేను ఉండలేను. వాటిని నీవు కాపాడాలి. ఘృతం మాత్రమే నాకు ఆహారం. ఇక సంగమకాలంలో తప్ప ఇతరవేళలలో దిసమొలతో నీవు నా కంట పడకూడదు. ఈ నియమాలు నీకు సమ్మతమైతే నీతో ఉంటాను. ఇందులో ఏది తప్పినా మనకు వియోగం తప్పదు' అని పలికింది. పురూరవుడు ఆ సమయాలకు అంగీకరించి ఆమెను పరిగ్రహించాడు. తనకు తానుగా వలచి వచ్చిన అప్సరసను కాదనే వాడుంటాడా?'

## కాముక విహారాలు

రాజా! ఆ కామినీ కాముకులు జతకూడి రత్నసౌధాంతరాలలో దేవతావనాలలో రత్నకూటాలలో కమలేందీవర సుందర సరోవరాలలో గిరకందరాలలో కందర్పభోగాలతో విహరింపసాగారు. ప్రేమాతిరేకంతో సర్వసుఖాలను అనుభవిస్తూ చీర చెంగు అడ్డువచ్చినా సహింపలేనంత దగ్గరయ్యారు.

## ఊర్వశీ పురూరవుల వియోగం

ఆ విధంగా పెక్కు సంవత్సరాలు గడిచాయి. అంతలో ఊర్వశికి శాపావసానమయింది. ఒకనాడు మహేంద్రుడు సభతీరి ఊర్వశి లేకుండటం

చూసి, 'అయ్యో! ఆ మనోహరి లేనిదే నా సభ రాణించదు' అని పలికి ఆ దివ్యాంగన ఎక్కడున్నా తీసుకొనిరమ్మని గంధర్వులను ఆజ్ఞాపించాడు. వారు ఆ మాటతో తరలి పురూరవుని పురాన్ని చేరుకొని ఆనాటి నడిరేయి కన్నుపొడుచుకొన్నా కనబడని చీకటిలో ఊర్వశి మేకలను అపహరించారు. ఆ మేషా లొక్క పెట్టున అరవసాగాయి. ఆ అరుపులు విని ఊర్వశి మేలుకొని, 'అయ్యో! నా బిడ్డలైన మేకలను ఎవరో అపహరించుకొని పోతున్నారు. ఇతను వీరాధివీరుడని నమ్మి నాథునిగా గ్రహించాను. నా బిడ్డలు గుండె లవిసేలా ఏడుస్తున్నా ఇతను పడక వదలడు. ఆడదాన్ని నాకన్నా భయం కాబోలు' అని వాపోతూ, 'అయ్యో! నీ బిగికౌగిలి వదులు; నన్ను విడువు; అతిలోలుడివి, పిరికివాడివి అని తెలియక మోసపోయాను' అని దుర్భాషలాడింది.

ఊర్వశి మాటలు పురూరవునికి వాడి తూపులై మదినాటాయి. శూలఘూతాలకు చలించిన మదపుటేనుగు వలె అతను చివుక్కున లేచి, నిద్రలో వస్త్రం జారిన మాటే యెరుగక కత్తిదూసి మేకల అరుపు వినిపించిన దిశకేగి దొంగలను తరిమి మేషయుగ్మాన్ని మరలించుకొని వచ్చాడు. తిరిగి రాగానే అతని నగ్నదేహాన్ని చూసి ఊర్వశి తమ సంకేతాన్ని గుర్తుతెచ్చుకొని మాయమైపోయింది.

## పురూరవుని విరహం

పురూరవుడు పాన్పు దగ్గరికి వచ్చి చూసేసరికి ఊర్వశి అక్కడ కనిపించలేదు. అతని గుండె ఝల్లుమన్నది. అతను మతి చలించిన వానివలె రాజ్యాన్ని విడిచిపెట్టి ఊర్వశి కోసం కలవరిస్తూ దేశదేశాలు తిరుగుతూ నిద్రాహారాలు మాని ఎదురుచూడసాగాడు.

## ఊర్వశీ సందర్శనం

రాజా! పురూరవుడు ఆ విధంగా భూమండలం అంతా తిరిగి తిరిగి ఒకనాడు కురుక్షేత్రానికి వచ్చి అక్కడ ఐదుగురు చెలికత్తెలతో విహరిస్తున్న ఊర్వశిని చూసి సంతోషపరవశుడై ఆ మనోహరిని సమీపించి 'ప్రియురాలా!

నిలువు నిలువు,, బాసతప్పటం నీకు తగునా? నన్ను విడనాడి పోవటం న్యాయమా? ప్రేయసీ! పద ఇంటికి పోదాము. నీ సల్లాపామృతంలో నన్ను మళ్ళీ బ్రతికించు. నీకై ఈ శరీరం ఇంత దూరం నడిచివచ్చింది. నీవు ఇప్పటికైనా ప్రసన్నురాలివి కాకపోతే నా దేహాన్ని కంక గృధ్రాలకు బలిచేస్తాను' అని దీనాతిదీనంగా వేడుకొన్నాడు.

ఊర్వశి అతని పలుకులను విని, 'రాజేంద్రా! శరీరత్యాగం చేస్తానంటావు. పౌరుషవంతుల మాటేనా అది? స్త్రీల స్నేహం శాశ్వతం కాదని నీకు తెలియదా? ప్రేమికుల హృదయం ఎంత సుకుమారమో అంత క్రూరం, దయాదాక్షిణ్యరహితం, నిత్యకోపనం అయిపోతుంది. స్త్రీసాహసం అన్నమాట లోకవిదితమే కదా. గోరంత నెపం దొరికితే చాలు వారు ఎంతకయినా తెగించగలరు. స్త్రీహృదయమంత చపలమైనది వేరొకటి లేదు. నూత్నప్రియత్వం వారికి పుట్టుకతో వచ్చిన విద్య కాబట్టి ఒకరిని ప్రేమిస్తూ మరొకరిని కామిస్తుంటారు. స్త్రీల మురిపాలు కోరిక చల్లార్చుకొనే సాధనాలు. ఈ సంగతి తెలియక అజ్ఞులు వారి ప్రేమ నిజమని నమ్మి నాశనమవుతారు. అయ్యో! సమయం వస్తే వారి భర్తను, తోబుట్టువునైనా చంపటానికి చంపించటానికి వెనుదీయరు. ఇప్పటికన్నా తెలివి తెచ్చుకొని మెలగటం మేలవుతుంది.

రాజేంద్రా! నీ దైన్యం చూస్తే ఎంతో జాలి కలుగుతున్నది. నీ కోసం ఒకమాట చెబుతాను విను. ఏటికేడాది తర్వాత ఒకరాత్రి నీవు నాతో గడపవచ్చు. నీకు సంతానమూ ప్రాప్తిస్తుంది. నిండుమనస్సుతో వెళ్ళి మళ్ళీ రా!' అని పలికింది. పురూరవుడు ఆమె గర్భవతిగా ఉన్నదని గ్రహించి గుండె దిటవు చేసికొని నగరానికి తిరిగి వచ్చాడు.

ఒక సంవత్సరం గడిచిన తర్వాత పురూరవుడు కురుక్షేత్రానికి పోయి పుత్రవతి అయిన ఊర్వశితో ఒకరాత్రి ఉన్నాడు. తెల్లవారగానే అతనికి వియోగసమయం గుర్తువచ్చింది. గుండె బరువెక్కి అతను తనకోసం అలమటిస్తుంటే చూసి ఊర్వశి, 'రాజా! ఈ గంధర్వులను ఉపసర్పించు. నీ

కోరిక నెరవేరుతుంది' అన్నది. పురూరవుడు గంధర్వులను వేడుకొన్నాడు. వారు కనికరించి ఒక అగ్నిస్థాలిని ఇచ్చారు. దానినే అతను ఊర్వశిగా భావించి దానిని తీసుకొని స్వపురానికి వచ్చి ఆ స్థాలిని ఉద్యానవనంలో ఉంచి ప్రతిదినం రాత్రిపూట దానినే చింతింపసాగాడు. ఆ చింతన ఫలంగా కర్మబోధకమైన వేదత్రయం అతని హృదయానికి స్ఫురించింది.

## వేద విభాగం

అప్పుడు పురూరవుడు స్థాలిని ఉంచిన చోటికి వెళ్ళి దానికోసం వెతికాడు. ఎక్కడా కనిపించలేదు. ఆ చోట ఒక శమీవృక్షం, దాని గర్భాన ఒక అశ్వత్థవృక్షం మొలిచి ఉన్నాయి. పురూరవు డది చూసి 'ఈ అశ్వత్థ మందే నేనుంచిన అగ్ని ఉండి ఉంటుంది' అని భావించి, ఆ రావిచెట్టు కొమ్మలు రెండు విరిచి క్రింది పుడక ఊర్వశిగాను, మీది పుడకను తనను గాను సంకల్పించి ఊర్వశీలోకకాముడై మథించాడు. ఆ మథనఫలంగా అగ్ని ఉదయించింది. అతను ఆ అగ్నిని పుత్త్రునిగా గ్రహించి అతనికి వేదవిహిత సంస్కార పూర్వకంగా గార్హపత్యాది రూపాలను మూడింటిని కూర్చి ఊర్వశీ లోకాన్ని కోరి యజ్ఞం చేసి యజ్ఞేశ్వరుని ఆరాధించాడు.

రాజా! కృతయుగంలో సర్వవాఙ్మయమైన ప్రణవమొక్కటే వేదంగా, నారాయణు డొక్కడే దేవుడుగా, అగ్ని ఏకరూపునిగా, హంస నామవర్ణం తప్ప ఏ ఇతర వర్ణం లేకుండా ఉండేది. త్రేతాయుగంలో పురూరవుని వలన ఆ విధంగా వేదత్రయం ఏర్పడింది. కారణ మేమంటావా? కృతయుగంలో సత్త్వం ప్రధానమైనందు వలన జనులందరూ ప్రాయికంగా ధ్యాననిష్ఠాపరులై ఉండేవారు. త్రేతాయుగంలో రజస్సు ప్రధానమైనందువల్ల జనుల చిత్తం ఏకాగ్రమై ధ్యానపరం కావటం కష్టసాధ్యమయింది. ఆ కారణాన వేద విభాగం కావింపబడి రజోగుణానుకూలమైన కర్మమార్గం ప్రకటితమయింది. అగ్నిని సంతానంగా పొంది పురూరవుడు గాంధర్వలోకాన్ని చూరగొన్నాడు.

## పురూరవుని సంతానం

రాజా! పురూరవునికి ఊర్వశి వలన ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, విజయుడు, జయుడు అని ఆరుగురు కొడుకులు పుట్టారు. వారిలో శ్రుతాయువుకు వసుమంతుడు, సత్యాయువుకు శ్రుతంజయుడు, రయునికి ఏకుడు, జయునికి అమితుడు, విజయునికి భీముడు జనించారు. భీమునికి కాంచనుడు, కాంచనునికి హూత్రకుడు, హూత్రకునికి జహ్నుడు ఉదయించారు. జహ్నుడు గంగాప్రవాహాన్ని తన పుడిసిట దాల్చి ఆచమించాడు. జహ్నునికి పూరుడు, పూరునికి బాలకుడు, బాలకునికి అజకుడు, అజకునికి కుశుడు జన్మించారు. కుశునికి కుశాంబుడు, ధూర్తయుడు, వసువు, కుశనాభుడు అని నలుగురు కొడుకులు పుట్టారు. వారిలో కుశాంబునికి గాధి జన్మించాడు.

## జమదగ్ని జననం

గాధి కుమార్తె పేరు సత్యవతి. ఆమెను ఋచికముని భార్యగా కోరి గాధిని అడిగాడు. గాధి ఆ మాట విని, 'ఔరా! ఇతను వనవాసి. కట్టుబట్టలు తప్ప తినటానికి తిండి లేనట్లున్నది. నా కుమార్తె ఎండ కన్నెరుగదు. రాజభోగాలలో పెరిగింది. ఇవ్వటానికి మనసొప్పదు. ఇవ్వకపోతే ఏమంటాడో తెలియదు' అని లోలోన వితర్కించి, 'మునివర్యా! శరీరమంతా ధవళమై ఒక్క చెవిమాత్రం నల్లగా ఉన్న ఉత్తమాశ్వసహస్రాన్ని కన్యాశుల్కంగా ఇచ్చిన వానికి నా కుమార్తెను ఇస్తానని సంకల్పించాను' అన్నాడు. ఋచికుడు వరుణుని ప్రార్థించాడు. ఆ దేవుడు గాధి కోరికను తీర్చాడు. ఋచికుడు ఆ గుర్రాలను గాధికి సమర్పించి అతని కుమార్తెను పెండ్లి చేసుకొన్నాడు.

అంత ఋచికుడు తన భార్యకు, అత్తకు పుత్త్రసంతానం కలగాలని సంకల్పించి యజ్ఞం చేసి మంత్రప్రభావంతో బ్రహ్మ క్షత్త్ర వర్ణాలకు తగినట్లుగా చరుద్వయాన్ని అమర్చి స్నానార్థం నదికి వెళ్ళాడు. ఆ సమయంలో గాధిపత్ని తన కుమార్తెను పిలిచి, 'అమ్మా! నీ భర్త మనకై చరుద్వయాన్ని కల్పించాడు.

వాటిని గ్రహిద్దాము. తీసుకొనిరా' అని చెప్పింది. ఋచికపత్ని ఆ చరుపాత్రలను తెచ్చింది. ఆ చరువులలో ఒకటి బ్రాహ్మణమంత్రాభిమంత్రితమై ఋచికుని భార్యకు, రెండవది క్షత్రమంత్రాభిమంత్రితమై సత్యవతికి సంకల్పింపబడినవి. ఆ సంగతి తెలియక ఆమె తనకు నిర్ణయింపబడిన చరువును తల్లికిచ్చి, తల్లికి నిర్ణయింపబడిన దానిని తాను పుచ్చుకొన్నది.

అంతలో ఋచికుడు స్నానం చేసి వచ్చి చరుయుగాన్ని కానక భార్యను పిలిచి అడిగాడు. ఆమె సంగతిని తెలిపింది. ఋచికు డది విని, 'అయ్యో! నీ కోసం సిద్ధపరిచిన దానిని నీ తల్లికి ఇచ్చావు; నీ తల్లికి అమర్చినదానిని నీవు గ్రహించావు. ఈ వ్యత్యాసఫలంగా నీకు ఘోరుడైన సుతుడు; నీ తల్లికి బ్రహ్మవేత్త అయిన కుమారుడు జన్మిస్తారు' అన్నాడు. ఋచికుని భార్య ఆ మాట విని దిగులొంది, 'మునీంద్రా! ఘోరుడైన కుమారుడు నాకు వద్దు' అని ప్రార్థించింది. ఋచికుడు కరుణించి, 'అలాగైతే నీ పౌత్రునికి ఆ గుణం సంక్రమిస్తుంది' అన్నాడు. కొన్నాళ్ళకు వారికి జమదగ్ని అని కొడుకు ఉదయించాడు. సత్యవతి తనుత్యాగం చేసి లోకపావని అయిన కౌశికీ నదిగా మారింది.

## పరశురామావతారం

ఆ జమదగ్ని రేణుపుత్రి రేణుకను పెండ్లి చేసుకొన్నాడు. వారికి వసుమన్వాదులు జనించారు. వారిలో కడపటివాడు వాసుదేవాంశతో రాముడనే పేర అవతరించి హైహయవంశాన్ని నిర్మూలించాడు.

ఆ కాలంలో క్షత్రియకులం రజస్తమోమలినాక్రాంతమై ధర్మదూరంగా ప్రవర్తిల్లుతుండేది. వారు భూమికి బరువయ్యారు. రాముడు క్షత్రకులాన్ని ఇరవైఒక్కమార్లు వెతికి వెతికి సంహరించి భూభారాన్ని తగ్గించాడు.

## క్షత్రసంహార కారణం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకుని మాటవిని 'మునిసత్తమా!

క్షత్రియులు రామునికి చేసిన అపకారం ఏమిటి? అతనికి వారిని నిర్మూలించాలనే కోరిక ఎందుకు కలిగింది?' అని అడిగాడు. శుకయోగి ఇలా అన్నాడు.

రాజేంద్రా! హైహయులలో కార్తవీర్యార్జునుడని ఒకడుండేవాడు. అతను నారాయణాంశజుడైన దత్తాత్రేయుని సేవించి అతని ప్రసాదఫలంగా సహస్ర బాహువులను, శత్రుదుర్జయత్వాన్ని, అవిచ్ఛిన్న తేజో బల యశో వీర్య శ్రీలను, అణిమాదియోగసిద్ధులను పొంది ఎదురులేక వాయువు రీతిని లోకసంచారం చేయసాగాడు.

అతను ఆ విధంగా సంచరిస్తూ ఒకనాడు స్త్రీ జనులతో బయలుదేరి జలక్రీడ లాడుతూ తన వేయి భుజాలను చాచి ఆ ప్రవాహాన్ని అడ్డగించాడు. ఆ నదీజలాలు పొంగి పొరలి తీరాన ఉన్న మాహిష్మతీపురాన్ని ముంచెత్తాయి. ఆ సమయంలో రావణు డక్కడ  శివపూజ చేసుకొంటున్నాడు. నదీజలం రావణుని శిబిరాన్ని ఆక్రమించింది. దానవేశ్వరు డా సంగతి విని పరవీర్యోత్సేకాన్ని సహింపలేక హైహయునితో కయ్యానికి కాలుదువ్వాడు. కార్తవీర్యుడు తన వేయి భుజాలలో దశముఖుని ఇరికించుకొని పురస్త్రీల మ్రోల అతనిని చేజిక్కిన కోతి రీతిని ఆటలాడించి ప్రాణాలతో విడిచిపెట్టాడు.

కార్తవీర్యు డొకనాడు వేటకోసం అడవికి వెళ్ళి యాదృచ్ఛికంగా జమదగ్ని ఆశ్రమానికి వచ్చాడు. హైహయుని రాకను గ్రహించి ఆ మునీంద్రుడు ఎదురేగి సేనావర్గసహితంగా లోనికి ఆహ్వానించి భోజనాదులను సిద్ధం చేయమని కామధేనువును ఆజ్ఞాపించాడు. ఆతిథ్యసత్కారాలు మహాద్భుతంగా జరిగాయి. కార్తవీర్యుడు ఆ చిత్రాన్ని చూసి, 'ఆహా! ఈ మునీంద్రుని యెదుట నాదీ ఒక వైభవమేనా?' అని తలపోసి దానిని పట్టి తెమ్మని రాజభటులను ఆజ్ఞాపించాడు. వారు బలదర్పాలతో దానిని దూడతో పాటు బంధించి గోవత్సాల అరుపులను కూడా లెక్కచేయక మాహిష్మతీపురానికి ఈడ్చుకొని పోయారు.

## కార్తవీర్యార్జున సంహారం

అంతలో జమదగ్ని సుతుడు పరశురాముడు ఆశ్రమానికి వచ్చాడు. అతనికి సంగతి తెలిసింది. ఆ మాట చెవిసోకినంతనే అతను పాదతాడిత మహా భుజంగసన్నిభుడై రేగి కవచం తొడిగి పరశువును పూని కోదండ తూణీరబాణాలను గైకొని ఏనుగు మీదికురికిన మృగరాజు వలె ఆ అర్జునుని చంపబోయాడు. ఆ విధంగా ధనుర్బాణ పరశువులను ధరించి మూర్తిగొన్న రవితేజం వలె ఉన్న ఆ జటాధారిని కార్తవీర్యుడు పదిహేడు అక్షౌహిణుల సైన్యంతో ఢీకొన్నాడు. ఉభయపక్షాలకూ మాహిష్మతీ నగర సమీపంలో యుద్ధం జరిగింది. పరశురాముడు విజృంభించి వైరిసైన్యాన్ని పరశువుతో ఎదిరించి కనురెప్పపాటు కాలంలో పదిహేడు అక్షౌహిణుల సైన్యాన్ని రూపుమాపాడు. యుద్ధరంగమంతా తెగిన శిరస్సులతో విరిగిన భుజాలతో చచ్చిన సారథులతో కూలిన రథాలతో మృతుల వాహనాలతో రుధిరప్లుతమై మహాఘోరంగా కనిపించింది.

కార్తవీర్యుడు తన సైన్యగతికి కోపవివశుడై ఐదువందల ఎడమ చేతులలోనూ ఐదువందల చాపాలు ధరించి ఐదువందల కుడి చేతులలో ఐదువందల పదునైనభల్లాలను పట్టుకొని సంధించి ఏకకాలంలో అన్నింటినీ రామునిపై గ్రుమ్మరించాడు. పరశురాముడు తన ఒక్క వింటితోనే ఐదువందల బాణాలకు ఐదువందల ప్రతిశరాలు వేసి వాటన్నిటినీ త్రుంచివేశాడు. అంతట హైహయుడు శిలలను, వృక్షాలను, పర్వతాలను పెరికి రామునిపై కురిపింపసాగాడు. రాముడు ప్రళయకాలరుద్రుడై తన కఠోరపరశువుతో హైహయుని పంచశతకరాలను కదళీస్తంభాల వలె తరిగి అతని శిరస్సును తెగనరికాడు. అర్జునుని పాటుచూసి అతని సుతులు పదివేల మందీ పారిపోయారు. పరశురాముడు కామధేనువును సవత్సంగా తీసికొని వెళ్ళి ఆశ్రమాన్ని చేరి గోవును తండ్రికి అప్పగించి జరిగిన సంగతి అతనికి విన్నవించాడు.

## పరశురామునికి పాపప్రాయశ్చిత్తం

రాజేంద్రా! జమదగ్ని ఆ సంగతి విని, కొడుకుకు హితబోధ చేశాడు. 'రామా! రాజంటే ఏమిటనుకున్నావు? సర్వవేదమయుడు. సామాన్యభూపాలకుడు కాడు. అట్టివానిని కేవల రోషవశుడవై చంపి పాపానికి ఒడిగట్టావు. మనము బ్రాహ్మణులము. క్షమాగుణం బ్రాహ్మణులకు కులానుగత లక్షణం. ఆ గుణాన్ని బట్టి మనకు పూజ్యత కలుగుతున్నది. శమమున్నచోట బ్రహ్మవర్చస్సు సూర్యప్రభ వలె ప్రకాశిస్తుంది. శమస్వభావం కలవారికి దుర్లభమైనది కలుగదు. లోకవిభుడు పరమేష్ఠి పదాన్ని అధిష్ఠించినది శమం వలననే కదా. భగవానుడు శాంతస్వభావులంటే మహాసంతుష్టుడవుతాడు.

నాయనా! మూర్ధాభిషిక్తుడై రాజపదవిని అలంకరించినవానిని చంపటం బ్రహ్మహత్యాదోషాన్ని మించిన దోషం. మహాపాతకం. అది సామాన్య ప్రాయశ్చిత్తాలతో తొలగేది కాదు. భగవానుని స్మరిస్తూ తీర్థసేవ చేసి దోషవిముక్తిని పొందు' అని చెప్పాడు. పరశురాముడు తండ్రి ఆజ్ఞను తలదాల్చి ఒక్క సంవత్సరకాలం తీర్థక్షేత్రాలు పర్యటించి ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

## రేణుకపై ఆగ్రహం

రాజేంద్రా! ఒకనాడు రేణుక స్నానార్థం గంగకు వెళ్ళింది. ఆ సమయంలో అక్కడ చిత్రరథుడనే గంధర్వుడు అప్సరసలతో కూడి జలక్రీడ లాడుతున్నాడు. రేణుక అతనిని చూసినంతనే ఆమె మనస్సు ఒక్కింత చలించింది. అతనినే రెప్పవాల్పక తిలకిస్తూ కొంతసేపు అక్కడ నిలబడింది. అంతలో హోమసమయం జ్ఞప్తికి వచ్చి, 'అయ్యో! ఆలస్యం చేశాను; మునీంద్రుడు శపిస్తాడేమో' అని చింతిస్తూ భయాకులిత మనస్కురాలై త్వరత్వరగా ఆశ్రమానికి వచ్చి తాను తెచ్చిన జలకలశాన్ని దింపి జమదగ్ని యెదుట చేతులు కట్టుకొని నిలిచింది.

ఆ మునీంద్రుడు రేణుక మానస వ్యభిచారాన్ని గ్రహించి కోపవశుడై కొడుకులను పిలిచి, 'నాయనలారా! ఈ పాపాత్మురాలిని కడతేర్చండి' అన్నాడు. తల్లిని చంపటం వారికి సమ్మతం కాలేదు. అతనప్పుడు పరశురాముని చూసి 'ఈ రేణుకను, దీని పుత్రులను వధించు' అని ఆజ్ఞాపించాడు. పరశురాముడు తండ్రియొక్క తపస్సమాధి ప్రభావం తెలిసినవాడు కాబట్టి మారుమాటాడక వారందరినీ చంపి, 'తండ్రీ! నీ ఆజ్ఞ నెరవేర్చాను; వీరందరూ పునర్జీవితులు కావాలని, వీరికి వధస్మృతి కలుగకూడదని వరం కోరుతున్నాను' అని ప్రార్థించాడు. జమదగ్ని ఆ వరాన్ని అనుగ్రహించాడు. రేణుకాదులు నిద్రనుంచి మేల్కాంచినట్లు లేచి యథాపూర్వకంగా ఉన్నారు.

## కార్తవీర్యుని పుత్రులు

రాజా! కార్తవీర్యుని పుత్రులు తమ తండ్రిని జమదగ్నిసుతుడు చంపినందుకు పగబూని ప్రతీకారం చేయాలని నిశ్చయించి అదను కనిపెట్టుకొని పొంచి ఉండి పరశురామాదులు అడవికి వెళ్ళిన సమయం చూసి జమదగ్ని ఆశ్రమంలో చొరబడి అగ్నిహోత్రగృహంలో భగవద్ధ్యానపరుడై ఉన్న ఆ మునీంద్రుని తల నరికి పారిపోయారు. రేణుక అది చూసి దుఃఖాన్ని దిగమ్రింగుకో లేక, 'రామా! రామా!' అని ఆక్రోశించింది. ఆ ఏడుపులు విని పరశురాముడు అన్నలతో తిరిగి వచ్చి తండ్రి గతి చూసి 'హా! తండ్రీ! మమ్మందరినీ విడిచి స్వర్గానికి వెళ్ళావా?' అని కొంత సేపు దుఃఖించి, 'సోదరులారా! పితృదేహాన్ని కాపాడుతూ మీరు ఇక్కడే ఉండండి. ఇప్పుడే వస్తాను' అని చెప్పి గొడ్డలి మూపున దాల్చి మాహిష్మతీ పురానికి వెళ్ళి హైహయులను వారి బంధుగణసమేతంగా వధించి వారి తలలు పురమధ్యంలో రాశి పోశాడు. వారి రక్తం ఏరులై ప్రవహించింది.

## శమంత పంచకం

రాజా! పరశురాముని క్రోధాగ్ని అంతటితో చల్లారలేదు. అతను ఇరవైఒక్క మార్లు భూమండలమంతా కలయదిరిగి క్షత్త్రియ కులాన్ని వెతికి వెతికి వధించి

వారి రక్తాలను తొమ్మిది మడుగులుగా శమంతపంచకంలో నిర్మించి కొంత కోపం చల్లారిన తర్వాత ఆశ్రమానికి వచ్చి తండ్రి తలను అతని బొందెకు తగిలించి వివిధయజ్ఞాలు చేసి యజ్ఞేశ్వరుని ఆరాధించి తాను సాధించిన భూమండలంలో తూర్పు భాగాన్ని హోతకు, దక్షిణ దిక్కును బ్రహ్మకు, పశ్చిమ దిశను అధ్వర్యునికి, ఉత్తర భాగాన్ని ఉద్గాతకు సమర్పించి తదితరఋత్విజులకు అవాంతర దిక్కుల నిచ్చి శేషించిన భాగాన్ని సదస్యుల పరం చేసి సరస్వతీనదీజలాలలో అవబృథాన్ని సలిపి పాపవిముక్తుడై మేఘాలు విచ్చిన సూర్యుని వలె తేజరిల్లాడు.

## జమదగ్నికి సప్తర్షి మండలావస్థానం

రాజా! పరశురాముని యజ్ఞప్రభావం వలన జమదగ్ని సజీవుడై సప్తర్షి మండలాన్ని అధిష్ఠించి అక్కడ సప్తమఋషియై నేటికీ అక్కడే ఉన్నాడు. పరశురాముడు రానున్న మన్వంతరంలో సప్తర్షులలో ఒకడై వెలయగలడు.

ఆ మహాత్ముడిప్పుడు దండాన్ని వదిలి మహేంద్ర నగరంలో ఉన్నాడు. రాజా! భగవానుడు భూభారాన్ని తొలగింపగోరి భార్గవ కులంలో పరశురామునిగా అవతరించి క్షత్రియ వంశక్షయం కావించాడు. పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు రజస్తమస్సుల వృద్ధి వినాశనానికే దారితీస్తుంది.

## విశ్వామిత్రుని చరిత్ర

రాజేంద్రా! ఋచికుని భార్యకు ఆ చరువు ప్రభావం వలన మహాతేజోవంతుడైన విశ్వామిత్రుడు జనించి, రాజయినా తీవ్రతపోవిశేషం వలన బ్రాహ్మణ్యాన్ని సాధించాడు. అతనికి నూటొక్కమంది కొడుకులు జన్మించారు. వారిలో నడిమి అతనికి మధుచ్ఛందుడని పేరుపెట్టారు. ఆ కారణాన వారందరికీ మధుచ్ఛందులని ప్రసిద్ధి కలిగింది. ఆ కాలంలో హరిశ్చంద్రుడనే రాజు యాగాన్ని సంకల్పించాడు. ఆ యాగానికి మనుష్యుని మేధ్యపశువుగా నిశ్చయించారు. అందుకు భార్గవుడైన అజీగర్తుని యొక్క కొడుకులలో నడిమివాడిని శునశ్శేఫుని కొంత ధనమిచ్చి తెచ్చారు. ఆ మఖానికి

సురలు సంప్రీతులై మేధ్యార్థం తేబడిన శునశ్శేఫునికి వరమిచ్చారు. అతను ఆ వరఫలంగా మేధ్యబాధ నుంచి తప్పించుకొని బ్రతికాడు. దేవతల చేత రక్షితుడైనందువల్ల అతనికి దేవరాతుడని పేరువచ్చింది.

## దేవరాతునికి కౌశికత్వం

విశ్వామిత్రుడు దేవరాతుని తన పుత్రునిగా భావించి వెంటగొని వచ్చి తన సుతులను పిలిచి, 'సుతులారా! ఈ దేవరాతుని నేను పుత్రునిగా గ్రహించాను. ఇతనిని మీరు జ్యేష్ఠభ్రాతగా గౌరవించండి' అన్నాడు. విశ్వామిత్రుని పుత్రులలో మొదటి యాభైమంది అందుకు సమ్మతింపలేదు. విశ్వామిత్రుడు ఆగ్రహించి 'ఛీ! మ్లేచ్ఛులవుతారు గాక!' అని వారిని శపించాడు. తర్వాత తక్కిన కొడుకులను కూడా అతను అదే విధంగా అడిగాడు. వారు తండ్రి మాటకు బద్ధులై దేవరాతుని అన్నగా గ్రహించి అతనిని అనుసరించారు. అందుకు విశ్వామిత్రుడు సంతసించి, 'పుత్రులారా! మీరు నా మాట పాటించి నాకు పుత్రత్వాన్ని నిలబెట్టుకొన్నారు. కాబట్టి మీరుకూడా పుత్రవంతులవుతారు గాక. ఈ దేవరాతుడు పుట్టుకను బట్టి భార్గవుడైనా నాకు పుత్రుడైన కారణాన కౌశికుడవుతాడు' అని పలికాడు.

రాజా! విశ్వామిత్రునికి మరికొందరు తనయులు అష్టకుడు, హరీతుడు, జయంతుడు, సుమదుడు మొదలైనవారు పుట్టారు. ఆ పుత్రులలో కొందరు తండ్రి శాపానికి, కొందరు అతని అనుగ్రహానికి పాత్రులయినందువల్ల, భార్గవుడైన దేవరాతుడు క్రొత్తగా వచ్చి వారిలో కలిసినందువల్ల వారి గోత్రం భిన్నప్రవరమయింది.

## పురూరవ వంశక్రమం

పురూరవునికి ఆయువు జన్మించాడు. అతనికి నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, అనేనుడు పుట్టారు. వారిలో క్షత్రవృద్ధునికి సుహోత్రుడు కలిగాడు. అతనికి కాశ్యుడు, కుశుడు, కృత్స్నమథుడు జన్మించారు. కృత్స్నమథునికి శునకుడు, అతనికి శౌనకుడు పుట్టారు. శౌనకుడు పెక్కు

యజ్ఞాలు చేసి మహాముని అయ్యాడు. కాశ్యునికి కాశి, అతనికి రాష్ట్రుడు, రాష్ట్రునికి దీర్ఘతపుడు, దీర్ఘతపునికి ధన్వంతరి పుట్టారు. ధన్వంతరి హరి అంశతో ప్రభవించి ఆయుర్వేదప్రవర్తకుడై యజ్ఞభాగార్హుడయ్యాడు.

ధన్వంతరికి కేతుమంతుడు, కేతుమంతునికి భీమరథుడు, భీమరథునికి దివోదాసుడు, అతనికి ద్యుమంతుడు పుట్టారు. ద్యుమంతునికి ప్రతర్దనుడని, శత్రుజితుడని, వత్సుడని, ఋతధ్వజుడని, కువలయాశ్వుడని బిరుదాంకాలు కలిగాయి. అతనికి అలర్కుడు మొదలుగా గల పెక్కుమంది సుతులు జన్మించారు. వారిలో అలర్కుడు అరవైఆరువేల సంవత్సరాలు యౌవనవంతుడుగా ఉండి సుభిక్షంగా పరిపాలన చేసి గొప్పకీర్తిని పొందాడు. అతనికి సన్నతి, అతనికి సునీతుడు, అతనికి సుకేతనుడు, అతనికి ధర్మకేతువు, అతనికి సత్యకేతువు, అతనికి దృష్టకేతువు, అతనికి సుకుమారుడు, అతనికి వీతిహోత్రుడు, అతనికి భర్గుడు, అతనికి భార్గభూమి ఉదయించారు. వీరందరూ కాశివంశ్యులైన క్షత్త్రవృద్ధులు.

రంభునికి రభసుడు, అతనికి గభీరుడు, అతనికి కృతుడు జన్మించారు. కృతుని వలన విప్రకులం ప్రభవించింది. అనేనునికి శుద్ధుడు, అతనికి శుచి, అతనికి త్రికకుత్తు పుట్టారు. త్రికకుత్తునకు శాంతరజుడు పుట్టి బ్రహ్మజ్ఞానియై చరితార్థుడయ్యాడు. రజికి మహాపరాక్రమవంతులైన ఐదువందల మంది కొడుకులు కలిగారు.

రజి కాలంలో దేవాసురులకు గొప్ప యుద్ధం జరిగింది. దేవతలు రజి సాయాన్ని కోరారు. అతను రాక్షసులను సంహరించి ఇంద్రునికి స్వర్గాన్ని ఇచ్చాడు. దేవేంద్రుడు రజి ఇంటికి వెళ్ళి, 'అయ్యా! నేను మళ్ళీ ఇంద్రపదవిని పొందటం ప్రహ్లాదునికి సమ్మతం కాదు. అతనంటే నాకు భయమున్నది. ఈ స్వర్గరాజ్యాన్ని నీవే పరిపాలించు. రాజ్యాన్నే కాదు, నన్ను కూడా పరిపాలించు' అని అతని పాదాలకు మోకరిల్లి తన రాజ్యాన్ని మళ్ళీ అతనికి అప్పగించాడు.

కొంతకాలానికి రజి చనిపోయిన తర్వాత ఇంద్రుడు స్వారాజ్యాన్ని తనకిమ్మని రజిపుత్త్రులను కోరాడు. వారు అతని అభ్యర్థనను నిరాకరించి

యజ్ఞభాగాన్ని సైతం తామే గ్రహింపసాగారు. అప్పుడు ఇంద్రుడొక అభిచారేష్టిని కావించాడు. ఆ ఇష్టిప్రభావం వలన రజిపుత్రులకు మనోభ్రంశం కలిగింది. ఇంద్రుడు వారిని హతమార్చి రజివంశాన్ని నిశ్శేషితం చేశాడు.

క్షత్రవృద్ధుని మనుమడైన కుశునికి ప్రీతి, ప్రీతికి సంజయుడు, సంజయునికి జయుడు, జయునికి కృతుడు, కృతునికి హర్యధ్వనుడు, హర్యధ్వనునికి సహదేవుడు, సహదేవునికి భీముడు, భీమునికి జయత్సేనుడు, జయత్సేనునికి సంకృతి, సంకృతికి జయుడు, జయునికి క్షత్రధర్ముడు జన్మించారు. వీరందరూ క్షత్రవృద్ధవంశ్య రాజులు.

## నహుష వంశం

రాజేంద్రా! ఇక నహుషుని వంశాన్ని విను. నహుషునికి యతి, మయాతి, సంయాతి, యయాతి, వియతి, ధృతి అని ఆరుగురు కొడుకులు; శరీరికి షడింద్రియాల వంటివారు జన్మించారు. వారిలో పెద్దవాడు యతి యుక్తవయస్కుడు కాగానే నహుషుడు అతనికి పట్టాభిషేకం చేయాలని సంకల్పించాడు. యతి తండ్రికి నమస్కరించి 'రాజ్యపాలన పరమార్థబోధకు ప్రతిబంధకం. అది నాకు వద్దు' అని చెప్పి జ్ఞానమార్గాన్ని అవలంబించి సిద్ధిగాంచాడు.

## యయాతి చరిత్ర

రాజా! నహుషుడొకనాడు శచీదేవిని తిరస్కరించాడు. అందుకు నహుషాదులు ఆగ్రహించి స్థానభ్రష్టుడవై కొండచిలువవు కమ్మని శపించారు. ఆ శాపకాలం వచ్చి నహుషుడు కొండచిలువగా మారాడు. అప్పుడు యయాతి రాజయి తమ్ములు నలుగురినీ పంపి చతుర్దిగ్విజయం కావించి శుక్రుని పుత్రికను, వృషపర్వుని కుమార్తెను పెండ్లి చేసుకొన్నాడు.

రాజేంద్రా! శుక్రుడు బ్రహ్మర్షి. యయాతి క్షత్రియుడు. వారి వివాహం ప్రతిలోమ వివాహం కాదా? అని శంకిస్తావు కాబోలు! సంగతి విను.

వృషపర్వుడు దానవేశ్వరుడు. అతని కుమార్తె శర్మిష్ఠ. శుక్రుడు దానవ గురువన్నది లోకవిదితమే. అతని కూతురు దేవయాని. ఒకనాడు శర్మిష్ఠ దేవయానితో తన సఖీజనాన్ని వెంటబెట్టుకొని పురోపవన విహారానికి వెళ్ళి అక్కడ పుష్పిత లతా తరువుల వలన నేత్రాలకు, శుకపికాదిమధురరుతాల వలన వీనులకు విందులు పొంది కొంతసేపు విహరించి వికచతామరాలతో, మృదులసైకతాలతో అలరారుతున్న సరోవరంలో జలక్రీడ లాడదలచింది. అందరూ చీరలు విప్పి ఒడ్డున ఉంచి కొలనులోకి దూకి ఒకరిపై ఒకరు నీళ్ళు చల్లుకొంటూ మునుగుతూ తేలుతూ విహారోత్సుకలై ఉన్నారు.

ఆ సమయంలో మహేశ్వరుడు పార్వతితో వృషభారూఢుడై ఆకాశంలో విహరిస్తున్నాడు. శర్మిష్ఠాదులు పార్వతీపరమేశ్వరులను చూసి సిగ్గుపడి తటాలున నీటినుంచి లేచి గబగబ చీరలు కట్టుకొన్నారు. ఆ వేగిరపాటులో శర్మిష్ఠ పొరపాటున దేవయాని చీరను కట్టుకొన్నది. జరగరాని పొరపాటే జరిగింది.

దేవయాని తన చీరను శర్మిష్ఠ కట్టినందుకు అలిగి చెలికత్తెలను పిలిచి, 'చెలులారా! మేము కట్టుకోదగిన చీరను మంత్రపూతపురోడాశాన్ని కుక్క ముట్టుకొన్నట్లు ఇది కట్టుకొన్నది. ఎవరు నిజతపస్సు చేత జగత్తులను సృజించిన పరమపూరుషునికి ఉన్ముఖులై నాలుగు వేదాలతేజాన్ని ధరించి లోకమార్గదీపకులై ఉన్నారో, ఎవరు లోకపతులైన సురేశ్వరులకు మాత్రమే గాక విశ్వాత్ముడైన హరికి కూడా పూజనీయులో, అట్టి బ్రాహ్మణకులంలో మీదు మిక్కిలి భార్గవ వంశానికి వన్నె తెచ్చిన గౌరవీయులము మేము. దీని తండ్రి మా తండ్రికి శిష్యుడు. ఇంతమాత్రమైనా విచారింపక తల పొగరెక్కి నా చీరను కట్టుకొన్నది. దీని వాలకం చూస్తే శూద్రుడికి వేదాన్ని కట్టబెట్టినట్లున్నది' అని నిందాపూర్వక వాక్యాలతో పరిహాసం చేసింది.

శర్మిష్ఠ ఆ కరుకు పలుకులకు దెబ్బతిన్న పన్నగి వలె రోజుతూ రొప్పుతూ ఔడుగరిచి, 'ఓసి గయ్యాళీ! కాకుల రీతి మా ముంగిట తారాడి పొట్టపోసుకొనే నీ గొప్ప వృత్తినే చెప్పుకోవాలి. నలుగురూ దానాలు చేస్తే మూటగట్టిన మీ

ఐశ్వర్యం సంగతి తెలియని దెవరికి? ఎవరిముందు ఈ ఆత్మస్తుతులు?' అని ఆ దేవయానిని అక్కడే సమీపాన ఉన్న ఒక పాడు బావి లోకి నెట్టి వస్త్రాలను తీసుకొని చెలికత్తెలతో నగరానికి వెళ్ళింది.

ఆ సమయంలో యయాతి వేటకోసం అడవికి వచ్చినవాడు యాదృచ్ఛికంగా ఆ బావిలో నగ్నంగా ఉన్న స్త్రీని చూసి జాలిపడి తన వల్లెవాటును లోనికి విసిరాడు. ఆమె ఆ వస్త్రాన్ని చుట్టుకొన్నది. అతనప్పుడు చేయూత నిచ్చి ఆమెను బావిలో నుంచి లేవదీసి గట్టుకు చేర్చాడు. ఆ కాంతామణి అతనియెడ మరులు గొని, 'పురుషాగ్రణీ! నీవు నా పాణిని గ్రహించావు. కాబట్టి నాకు భర్తవైనావు. వేరొకరిని పెండ్లాడను. బావిలో పడి దిక్కులేకున్న నాకు నిన్ను భర్తగా దైవమే సమకూర్చాడు. నేను శుక్రాచార్యుని కుమార్తెను; నన్ను దేవయాని అంటారు. నీవు క్షత్రియుడవని గ్రహించాను. మన వివాహం ప్రతిలోమమై అశాస్త్రమవుతుందని జంకవద్దు. పూర్వం ఒకప్పుడు నేను బృహస్పతి సుతుడైన కచుని శపించాను. నాకు బ్రాహ్మణుడు భర్త కాడని అతను ప్రతిశాపం ఇచ్చాడు. నా ప్రణయాన్ని నిరాకరింపకు' అని పలికింది. యయాతి ఆ మాటలు విని 'ఇదంతా దైవవిధానం. నా మనస్సు ఈమెకు అంకితమైపోయింది' అని నిశ్చయించి, 'కళ్యాణీ! నీ ఇష్టమే నా ఇష్టం' అని సమ్మతించాడు.

ఆ తర్వాత దేవయాని తనకు జరిగిన అవమానానికి ఏడుస్తూ తండ్రి దగ్గరకు వెళ్ళి సంగతి వినిపించింది. భార్గవుడు ఆ సంగతి విని, 'అయ్యో! నేను పురోహితవృత్తిలో ఉన్నందువలన కదా ఇటువంటి చేటు సంభవించింది' అని విచారించి, ఆ వృత్తిని విసర్జించి భిక్షావృత్తిని గ్రహించి, కుమార్తెతో కలిసి ఆ చోటు వదిలిపెట్టి దేవతలకు శుభం కోరసాగాడు. వృషపర్వుడది విని వెంటనే గురువు పాదాలకు సాగిలబడి ప్రార్థించాడు.

రాజా! భార్గవుడు దీర్ఘక్రోధి కాడు. అందువల్ల అతను వృషపర్వుని ప్రార్థనకు ప్రీతుడై 'దానవేశ్వరా! నా కుమార్తెను కష్టపెట్టలేను. ఈమె కోరికను ఈడేర్చితేనే తిరిగి వస్తాను' అని గట్టిగా చెప్పాడు. వృషపర్వుడు దేవయాని

వంక మరలి 'అమ్మా! నీ అభీష్టం ఏమిటో చెప్పు. తప్పక నెరవేరుస్తాను' అని మాటయిచ్చాడు. ఆ కన్యక దానవేశ్వరుని చూసి 'రాజా! నా తండ్రి నన్నెవరికిచ్చి వివాహం చేసినా శర్మిష్ఠ తన పరిచారికలతో నా వెంట రావాలి' అని కోరింది. వృషపర్వుడు రాజ్యశ్రేయం, కార్యభారం పర్యాలోచించి సరేనన్నాడు.

అంత భార్గవుడు యయాతికి దేవయాని నిచ్చి శర్మిష్ఠను ఆమెకు పరిచారికగా నియమించి, 'రాజా! ఎన్నటికీ నీ వీ శర్మిష్ఠను సంగమింపరాదు' అని ఆనపెట్టి వివాహం చేశాడు. యయాతి ఆ మాటకు సమ్మతించి దేవయానీ శర్మిష్ఠలతో సుఖంగా ఉన్నాడు.

ఒకనాడు యయాతి ఏకాంతంగా ఉన్న సమయంలో శర్మిష్ఠ అతని కంటబడి సంతానకాంక్ష వలన అతనిని తన భర్తగా వరించింది. యయాతి ఆమాట విని, 'ఈమె కామసుఖాన్ని గాక సంతానసుఖాన్ని మాత్రమే కోరుతున్నది. భార్గవుని ఆన తప్పరానిది. ఏమి చేయాలి?' అని ఆలోచించి, విధివిధానం ఎలాఉంటే అలా జరగక మానదని నిశ్చయించి శర్మిష్ఠ కోరికను తీర్చాడు.

రాజా! యయాతికి దేవయాని యందు యదువు, తుర్వసుడు అని ఇద్దరు కొడుకులు; శర్మిష్ఠ వలన ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అని ముగ్గురు కొడుకులు జన్మించారు. శర్మిష్ఠ తన భర్త మూలాన పుత్త్రవతి అయిన సంగతి విని దేవయాని అలిగి పుట్టింటికి వెళ్ళిపోయింది. యయాతి ఆమె వెనుకనే వెళ్ళి బహువిధాల ప్రార్థించి చివరికి ఆమె కాళ్ళమీద పడ్డాడు. దేవయాని కోపం చల్లారలేదు.

ఆలోగా శుక్రాచార్యులు తన కుమార్తె వలన జరిగిన కథ గ్రహించి, 'ఓరీ! స్త్రీవశుడవై ఆన తప్పావు. నీది కూడా ఒక పౌరుషమేనా? శరీరులకు ముసలితనం వల్ల వైరూప్యం కలుగుతుంది. అట్టిది నీకు ఇప్పుడే కలుగుతుంది గాక' అని శపించాడు. యయాతి ఆ శాపాన్ని విని, 'భార్గవా! నాకు నీ పుత్త్రిక యందు కామతృప్తి కలుగలేదు. నా ముదిమిని వేరొకరికిచ్చి వారి జవ్వనాన్ని

నేను గైకొని కామతృప్తిని పొందే విధంగా నాకు వరాన్ని అనుగ్రహించు' అని వేడుకొన్నాడు. భార్గవుడు అంగీకరించాడు.

అప్పుడు యయాతి రాజధానికి తిరిగివచ్చి పెద్దకొడుకు యదువును పిలిచి, 'నాయనా! నీ తాత వలన నాకు అకాలవార్ధక్యం సంభవించింది. ఈ ముదిమిని నీవు గ్రహించి నీ యౌవనాన్ని నాకివ్వు. నాకింకా విషయభోగేచ్ఛ తీరలేదు. కొన్ని సంవత్సరాలు రమించిన తర్వాత నీ యౌవనాన్ని నీకిచ్చి నా వార్ధక్యాన్ని నేను గ్రహిస్తాను' అన్నాడు. ఆ మాట యదువు విని, 'తండ్రీ! గ్రామ్యసుఖాలను భోగించినందాక పురుషునికి శాంతి కలుగదు. ఆ సుఖభోగానికి యౌవనం కావాలి. కాబట్టి నీ కోర్కెను నేను తీర్చలేను' అని తిరస్కరించాడు. తుర్వసుడు, ద్రుహ్యుడు అదే మాట అన్నారు. ఆ సంగతి తెలిసి పూరువు తండ్రి కోరికకు తన అంగీకారాన్ని తెలిపాడు. 'తండ్రీ! ఎవరి వలన నా యీ తనువు సిద్ధించిందో, ఆ నీకు దానిని సమర్పించటం కంటె ప్రత్యుపకారం ఏముంటుంది? తండ్రి ప్రసన్నుడయితే పుత్త్రునికి సమస్తం లభిస్తాయి. తండ్రి తలంపును గ్రహించి మెలగేవాడు ఉత్తమపుత్త్రుడు. తండ్రివలన చెప్పబడి చేసేవాడు మధ్యముడు; ఆ చేయదలచినది శ్రద్ధగా చేయనివాడు అధముడు; తండ్రి చెప్పినా చేయని నీచుడు, అసలు సుతుడే కాదు, అతను పితృపురీషప్రాయుడు' అని చెప్పి అతనికి తన యౌవనాన్ని ఇచ్చి అతని ముదిమిని తాను గ్రహించాడు. యయాతి మిక్కిలిగా సంతోషించి విషయసుఖాలను అనుభవింపసాగాడు. ఆమె కూడా అతని మనసెరిగి నడుచుకొన్నది. ఆ విధంగా సంతుష్టుడై యయాతి రాజ్యం చేస్తూ వివిధ జ్ఞానాలతో భగవంతుని ఆరాధించాడు.

కొంతకాలానికి యయాతికి నిర్వేదం ఉదయించింది. 'అయ్యో! ఆకాశంలోని మేఘాల వలె జగత్తు భగవానుని యందు జనించి లయించిపోతున్నది. అది భోగ్యదేశమని భావించి పడుతున్న కష్టాలన్నీ ఇంద్రియవృత్తి వలన కలిగినవి. ఆ వృత్తి అణగారితే ఇంద్రియజనిత భావం అణిగిపోతుంది. ఇటువంటి అశాశ్వతమైన దానికి చిక్కి ఆత్మహాని

చేసుకొన్నాను. ఇకనైనా మేలుకోవటం మంచిది' అని నిశ్చయించి దేవయానిని పిలిచి ఇలా అన్నాడు.

'భార్గవీ! పూర్వం మేకపోతొకటి అడవిలో తిరుగుతూ యాదృచ్ఛికంగా ఒక బావిదగ్గరకు పోయి అందులో పడి ఉన్న ఆడమేకను చూసి జాలిపడి దానిని తన కొమ్ములతో బావినుంచి పైకి లాగి ఒడ్డుకుచేర్చింది. ఆ ఆడమేక తనకు ప్రాణదానం చేసిన మేకపోతును కామించింది. ఆ రెండూ జతకూడి విహరింపసాగాయి. తక్కిన మేకలు కూడా విడవకుండా ఆ పోతునే అనుసరించాయి. ఆ పోతు మేకలను తృప్తిపరుస్తుండేది. బావిలోనుండి పైకి లేవదీసిన మేక అది సహింపక అలిగి ఆ పోతును వదిలిపోయింది. ఆ పోతు దానికోసం ఎంతో పరితపించి దానిని బ్రతిమాలుకొన్నది గాని ఆ మేక మనసు కరగలేదు. అప్పుడు ఆ పోతు చేసిన తప్పుకు గాను దాని వృషణాలను కోశారు. అది ప్రాయశ్చిత్తమని తెలియక మహాదైన్యమంది ఆక్రోశించింది. దాని గోడు చూడలేక దాని వృషణాలను మళ్ళీ అతికించారు. అంతటితో అది సంతోషించి బావిలో నుంచి లేవనెత్తిన మేకతో రమిస్తూ అదే లోకంగా ఉన్నది. ఏండ్లు పూండ్లు గడిచిపోయాయి. ఎన్నటికీ దానికి తృప్తి కలుగలేదు.

దేవయానీ! నా గతి కూడా ఇటువంటిదే కదా. మాయకు చిక్కి ఆత్మస్వరూపాన్ని మరిచాను. కామానికి మేర కనిపించదు. సృష్టిలో ఉన్న ధనధాన్యపశుస్త్రీలన్నీ లభించినా కాముకుడు సంతృప్తిపడడు. భోగించిన కొద్దీ కామం నెయ్యిపోసిన అగ్ని వంటిదై పెచ్చు పెరుగుతుండేగాని ఎన్నటికీ శమింపదు. కామకార్యం అదే కదా! కామం రాగద్వేషాదులను కలిగిస్తుంది. తత్ఫలంగా నేను, నీవు, నాది, నీది అన్న వైషమ్యం జనిస్తుంది. ఆ వైషమ్యమే సర్వానర్థాలకు మూలం. కామాన్ని జయించాలంటే దానికి లోబడక ఉండటమొకటే ఉపాయం. కామనిరసనాన్ని వైరాగ్య మంటారు. వైరాగ్యం పెంపుగాంచినకొద్దీ రాగద్వేషాలు సన్నగిలి నశించిపోతాయి. ఆ నాశంతో సమదృష్టి చేకూరుతుంది. సమదర్శునికి సుఖం స్వతస్సిద్ధం.

కాబట్టి సుఖాన్ని కోరినవాడు వెంటనే తృష్ణను త్యజించాలి. తృష్ణాపరిత్యాగానికి ఇంద్రియాలు వశపడాలి. ఆ పని అంత సులభం కాదు. మహావిద్వాంసులు కూడా ఇంద్రియాలను నిరోధింపలేక దాసోహమన్నారు. అన్ని ఇంద్రియాలలో ఉపస్థేంద్రియం మహాబలవత్తరమైనది. అందువల్లనే పురుషుడు ఏకాంతంగా తల్లితోగాని, తోబుట్టువుతోగాని చివరికి సొంత కూతురితో కాని ఉండటం మంచిది కాదన్నారు.

తలోదరీ! నీతో కలిసి వేయేండ్లు సమస్త విషయభోగాలను అనుభవించాను. క్షణక్షణం ఆ విషయాల పట్ల కోరికలు పెరగసాగాయి. ఒకనాటికీ తృప్తి కలిగే మార్గం కనిపించలేదు. ఆ సంగతిని పర్యాలోచించి వాస్తవ సుఖప్రాప్తికి మార్గమేమిటని విమర్శించాను. కోరికలను వదలటమే మార్గమని తోచింది. అంతట కోరికలను త్యజించాను. ఆ విధంగా కోరికలను విడిచినా మనస్సుకు నిలకడ కుదరలేదు. మనస్తత్త్వాన్ని విమర్శించాను. మనస్సుకు ఏదో ఒక ఆలంబన ఉండాలని, అది నిరాలంబంగా ఉండజాలదని తేలింది. ఉత్తమమైన ఆలంబనం ఏది? అని యోచించి, అవిచ్ఛిన్నమూ, శాశ్వతానందాత్మకమూ అయిన వస్తువు పరబ్రహ్మమే అని నిశ్చయించి బ్రహ్మమునందు మనస్సు నిలిపాను. వెనువెంటనే అహంకారం నశించింది; దానితో ద్వంద్వ భావన సడలింది. సంగమదోషం ఎంతవారినైనా కలచి పూర్వస్థితికి తెస్తుంది. ఆ దోషం తొలగాలంటే ఏకాంతవాసం ఎంతో అనుకూలిస్తుంది. అందువలన వనవాసినై మృగాలతో చరింపబోతున్నాను.

దేవయానీ! విషయసుఖం ఎంత గొప్పదయినా సరే మొదట కొంత సుఖదాయకంగా కనిపించినా అది క్షణికమే గాక దుఃఖపర్యవసాయకమని త్వరలోనే తెలిసివస్తుంది. సంసారమంటే విషయసంగరూపమే కదా. కనుక సంసారేచ్ఛ చిట్టచివరికి ఆత్మనాశకరంగా పరిణమిస్తుంది. ఈ సంగతి నెరిగి స్వానుభవసిద్ధం చేసికొన్నవాడు ఆత్మదర్శి అవుతాడు. అతని దృష్టి మళ్ళీ తుచ్ఛమైనవాటి వంకకు మళ్ళదు' అని చెప్పి పూరునికి అతనికి యౌవనం ఇచ్చి,

తాను ముదిమిని గ్రహించి, ద్రుహ్యుని పూర్వదక్షిణ దిగ్దేశానికి, యదువును దక్షిణ దేశానికి, తుర్వసును పశ్చిమ దేశానికి అనువును ఉత్తర దేశానికి పాలకులుగా నియమించి పూరువును సార్వభౌమ పదవికి అభిషేకించి అతని ననుసరించి మెలగాలని ద్రుహ్యాదులకు కట్టడి చేసి వానప్రస్థాన్ని స్వీకరించాడు.

రాజా! యయాతికి ఆత్మజ్ఞానం ఉదయించినంతనే తత్పూర్వం ఏండ్లుపూండ్లుగా అతను అనుభవించిన విషయసుఖాలన్నీ రెక్కలు వచ్చిన పక్షులు గూడు విడిచినట్లు లేచి మాయమై పోయాయి. అతను క్రమక్రమంగా శుద్ధ బ్రహ్మచిత్తుడై దివ్యపదాన్ని చేరుకొన్నాడు.

రాజా! యయాతి బోధించిన మేకపోతు కథ దేవయానికి మొదట ఎగతాళిగా కనిపించినా క్రమక్రమంగా అందులోని అంతరార్థం ఆమె మనస్సులో గట్టిగా నాటుకొన్నది. ఆమె దాని అర్థాన్ని పరిపరి విధాల ఆలోచించింది. 'ఆహా! ప్రాణుల సంయోగ వియోగాలు చలిపందిరిలోని బాటసారుల కలయికల వంటివి. అటువంటి మాయా విరచిత క్షణికాలను నమ్మినవారి గతి దుర్గతి కాకమానదు. జగత్తు సంగతి చూడగా స్వప్నప్రాప్తార్థమై ఉన్నది. ఇప్పటికన్నా నాకు ఈ మాత్రపు తెలివి అయినా కలగటం భగవంతుని అనుగ్రహమే' అని తలపోసి సర్వసంగపరిత్యాగం చేసి భగవంతుని యందు చిత్తాన్ని హత్తించి ఆత్మలింగాన్ని త్యజించింది.

రాజేంద్రా! సర్వభూతనివాసుడు శాంతుడు బ్రహ్మాత్ముడు సర్వకర్త అయిన వాసుదేవు డొక్కడే శరణం. ఇదే ఆయనకు నమస్కరిస్తున్నాను.

## పూరువంశం

రాజేంద్రా! ఏ వంశం నీ జన్మానికి కారణమైనదో, ఏ వంశం పెక్కుమంది బ్రహ్మవంశ్యులను రాజర్షులను కననోచి ప్రసిద్ధిని గన్నదో ఆ పూరువంశం సంగతి విను.

పూరునికి జనమేజయుడు, జనమేజయునికి ప్రాచిన్వంతుడు, ప్రాచిన్వంతునికి ప్రవిరోధనమన్యుడు, ప్రవిరోధనమన్యునికి చారుడు, చారునికి సుద్యుడు, సుద్యునికి బహుగతుడు, బహుగతునికి శర్యాతి, శర్యాతికి సంయాతి, సంయాతికి రౌద్రాశ్వుడు జన్మించారు. రౌద్రాశ్వునికి అప్సరస ఘృతాచి యందు ఋతేపుడు, కక్షేపుడు, సతేపుడు, కృతేపుడు, జతేపుడు, సన్నతేపుడు, ధర్మేపుడు, సత్యేపుడు, వ్రతేపుడు, వనేపుడు అని పదుగురు కుమారులు కలిగారు. వారిలో ఋతేపునికి అంతిసారుడు జన్మించాడు. అతనికి సుమతి, ధ్రువుడు, అప్రతిరథుడు అని ముగ్గురు కొడుకులు పుట్టారు. అప్రతిరథునికి కణ్వుడు, కణ్వునికి మేధాతిథి, అతనికి ప్రస్కందాదులు జనించి బ్రాహ్మణులయ్యారు. సుమతికి రైభ్యుడు, అతనికి దుష్యంతుడు పుట్టారు.

## దుష్యంత చరిత్ర

రాజా! దుష్యంతుడు రాజ్యపాలన చేస్తున్న రోజులలో ఒకనాడు మృగయా వినోదార్థం అరణ్యానికి వెళ్ళి యాదృచ్ఛికంగా కణ్వమహర్షి ఆశ్రమాన్ని ప్రవేశించి అక్కడొక కన్యారత్నాన్ని చూసి, 'ఏమిటిది! ఈ సుందరీమణి తన లావణ్య తేజో విశేషంతో దిక్కులకు కాంతిని కలిగిస్తున్నది. ఈ సుకుమారి రమాదేవి కాకపోతే స్త్రీరూపాన్ని ధరించిన దేవమాయ కాబోలు! ఈ మనోహరిని కాంచినంతనే వేట తమివల్ల కలిగిన ఆయాసమంతా తీరినట్లున్నది. ఈ కమలాక్షి సంగతి విచారిస్తాను గాక' అని నిశ్చయించి తనవెంట వచ్చిన సేనలను బహిర్నిలయంలో ఆపి, కొద్ది పరివారంతో లోపలికి పోయి ఆ సుందరాంగిని కలిసి, 'యువతీరత్నమా! ఎవ్వతెవు? ఎవ్వరిదానవు? నిర్జనమైన ఈ అరణ్యంలో ఏమి చేస్తున్నావు? రాజకన్యకవని భావిస్తాను. కాకుంటే నా మనస్సు నీయందు లగ్నం కాదు. పూరువంశజుల హృదయంలో ఎన్నడూ అధర్మానికి తావు లేదు' అని అడిగాడు. ఆ కన్య అతనితో 'అయ్యా! విశ్వామిత్రునికి మేనకయందు జన్మించాను. నన్ను శకుంతల అంటారు. నా పుట్టుపూర్వం భగవానుడు కణ్వమహర్షికి తెలుసు. ఇదుగో ఈ ఆసనాన్ని అలంకరించి మా పూజలంది నీవారాన్నం భుజించి సేదతీరండి. ఇంతలో మహర్షి రావచ్చు' అని పలికింది.

దుష్యంతుడు ఆ పల్కులకు సంతసించి, 'కాంతామణీ! కుశికవంశజులకు ఈ వినయోపచారసంపద నైజమే కదా. రాజకన్యకలు తమను ప్రేమించిన వరుని గాంధర్వవిధిని పెండ్లాడటం ధర్మసమ్మతమే. నీ యెడ నా హృదయం లీనమయింది. నా ప్రణయాన్ని కాదనకు' అని చెప్పి ఆమెను ఒడబరిచి గాంధర్వ వివాహం చేసుకొని గర్భం ప్రసాదించి తెల్లవారుజామున రాజధానికి తరలి వెళ్ళాడు.

రాజా! శకుంతల కాలక్రమాన కొడుకును కన్నది. అతనికి కణ్వమహర్షి రాజసుతునికి ఉచితమైన తీరున జాతకర్మాది సంస్కారాలు కావించి భరతుడని పేరుపెట్టాడు. ఆ బాలుడు భగవదంశతో పుట్టినందువలన చిన్ననాటి నుంచి మహావిక్రమోన్నతుడై సింహాలను పట్టి ఆడుకొనేవాడు. ఒకప్పుడు శకుంతల ఋషివచనం మేరకు అతనిని తీసుకొని దుష్యంతుని దగ్గరికి వెళ్ళింది. రాజుకు ఆమె మాటలపై నమ్మకం కలగలేదు. ఆకాశవాణి అప్పుడు, 'రాజేంద్రా! తల్లి అన్నది ఆధారం మాత్రమే. పుత్రుడు జనకుని రూపాంతరమేనని ఎరుగుదువు కదా! నీ కొడుకును అంగీకరించు. శకుంతలను అవమానింపవద్దు. ఈ బాలుడు నీకు వంశోద్ధారకుడవుతాడు. ఇతని వలన నీకు నరకప్రాప్తి తొలగుతుంది. ఈ పసివాడు సామాన్యుడు కాదు; వాసుదేవాంశజుడు. బ్రహ్మణ్యుడవు, సత్యసంధుడవు, గుణజ్ఞుడవు అయిన నీ కీర్తి వర్ధిల్లుతుంది. ఈ భరతుని భరించు' అని ఆదేశించింది. దుష్యంతుడు సమ్మతించి వారిని గ్రహించి సంతసించాడు.

## భరతుని చరిత్ర

రాజేంద్రా! భరతుడు భగవదంశతో జన్మించిన కారణాన అతని కుడిచేతిలో చక్రరేఖ, పాదాలలో పద్మకోశరేఖ కనిపించాయి. భరతుడు దుష్యంతుని తర్వాత రాజ్యాభిషిక్తుడై గంగాతీరంలో యాభైఅయిదు హయమేధాలను, యమునాతీరంలో డెబ్భైఎనిమిది హయమేధాలను దీర్ఘతపుని పౌరోహిత్యంలో కావించి అపరిమిత ధనాలను దానం చేసి కీర్తిపాత్రుడయ్యాడు. దీక్షాపూర్వకంగా అగ్నిచయనం నిర్వహించి

బ్రాహ్మణులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క ద్వంద్వం చొప్పున గోవులను ఇచ్చాడు. ద్వంద్వమంటే పదమూడు వేల ఎనభైనాలుగు గోవులు.

భరతుడు నూటముప్పైమూడు హయమేధాలను కావించిన సంగతి నిఖిలరాజలోకాన్ని మహాశ్చర్యచకితం చేసింది. అతను తుష్కార మందు చతుర్దశనియుత గజాలను, తెల్లటి దంతాలు కలవాటిని హిరణ్మయ భూషణాలతో దానం చేశాడు. భరతుడు కావించిన లోకోత్తరకార్యాలను తత్పూర్వరాజులు గాని తదనంతరరాజులు గాని చేసి యెరుగరు.

రాజా! భరతుడు దిగ్విజయం బయలుదేరి కిరాత హుణ యవన ఆంధ్ర వంగ శక కరూషాది రాజులను, అబ్రహ్మణ్యులైన రాజులను గెలిచాడు. పూర్వం అసురులు సురల నోడించి దేవాంగనలను అపహరించి రసాతల లోకంలో చెరపట్టి ఉంచారు. భరతుడు వారందరినీ చెర విడిపించి స్వర్గమందు స్వస్థానాలకు చేర్చాడు. అతని రాజ్యంలో ప్రజలకు భూమ్యంతరిక్షాలు తమంత తాముగా సర్వకామాలను వర్షింపసాగాయి. ఆ విధంగా భరతుడు అరవైవేల సంవత్సరాలు సామ్రాజ్యభోగాలను అనుభవించి ఐహికవస్తువులే గాక ప్రాణాలు సైతం అస్థిరమైనవని గ్రహించి కైవల్యపదాన్ని చేరుకొన్నాడు.

## భరతుని సంతానం

భరతుడు విదర్భరాజతనయలు ముగ్గురిని పెండ్లాడాడు. అతనప్పుడప్పుడు భార్యలతో 'నాకు పుట్టబోయే బిడ్డలు అసదృక్షులు' అంటుండేవాడు. ఆ మాటను అతని భార్యలు మనసులో ఉంచుకొని తాము కన్నకొడుకులు అసదృక్షులు (సాటిలేనివారు) కాకపోతే తమ యందు వ్యభిచారదోషాన్ని శంకిస్తాడేమోనని పుట్టిన బిడ్డలను చేజేతులా తల్లులే చంపి వేస్తుండేవారు. ఆ కారణాన భరతుని వంశం నిర్వంశం కాగల ప్రమాదం ఏర్పడింది. అతనప్పుడు పుత్రార్థం మరుత్సోమమనే యజ్ఞం చేసి యజ్ఞేశ్వరుని ఆరాధించాడు. మరుత్తులు భరతునికి సంతోషించి భరద్వాజుని అతనికి దత్తపుత్రునిగా ఇచ్చారు.

## భరద్వాజుడు

రాజేంద్రా! పూర్వం బృహస్పతి తన భ్రాతృభార్య మమత గర్భవతిగా ఉన్నప్పుడు కామించి గ్రామ్యధర్మానికి లోనయ్యాడు. పైగా ఆమె గర్భంలో ఉన్న శిశువు ఎంత వారించినా వినకపోగా ఆ బిడ్డను శపించి తన వీర్యాన్ని ఆమె గర్భంలో ఉంచాడు. నెలలు నిండి ఆమెకు కుమారుడు జన్మించాడు. అతనిని తాను పరిగ్రహిస్తే భర్త తనయందు జారత్వాన్ని శంకిస్తాడని భయపడి ఆమె ఆ శిశువుని విడిచి పోదలచింది. బృహస్పతి అది గ్రహించి, 'మూర్ఖురాలా! క్షేత్ర వీర్యాల సంయోగం వలన పుట్టినవాడు కాబట్టి ద్వాజుడని పిలువబడతాడు. ఇతనిని భరించు' అన్నాడు. మమత ఆ మాట విని 'ఇతను మన ఉభయులకు పుట్టినవాడని అన్నావు కాబట్టి ఇతనిని నీవే భరించు' అన్నది. పరస్పరం వారు వివాదపడుతుంటే చూసి మరుత్తులు ఆ బిడ్డను తెచ్చి పెంచి భరతునికి వంశక్షయం కాకుండా నిలిపేందుకు దత్తపుత్రుని కావించారు.

## భరతవంశం

భరతవంశం వితథమైన తర్వాత వచ్చినందువల్ల ఆ పుత్రునికి వితథుడు అని పేరు వచ్చింది. ద్వాజుడై మరుత్తుల చేత భరింపబడినందువల్ల భరద్వాజుడని ప్రసిద్ధి కలిగింది.

భరద్వాజునికి మన్యుడు జనించాడు. మన్యునికి బృహత్క్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అనేవారు పుట్టారు.

నరునికి సంస్కృతి జనించాడు. అతనికి కురుడు, రంతిదేవుడు ఉదయించారు.

## రంతిదేవుడు

పరీక్షిన్నరేంద్రా! రంతిదేవుని చరిత్ర మహాద్భుతం. అతనిని గురించి చెప్పాలంటే యుగాలు క్షణాలుగా దొర్లిపోతాయి. నిదర్శనార్థం ఒకటి చెబుతాను విను. ఇది సంపాదించాలని గాని ఇది దాచుకోవాలని గాని కలలో

కూడా అతను అనుకోడు. ఏమంటావా? సర్వం ప్రారబ్ధాధీనమని అతని నిశ్చయం. అతను ఎప్పటికి ఏది దైవోపలబ్ధం అయితే దానిని భుజించి సంతోషపడతాడు. ధనార్జన, ధనరక్షణ భావాలు లేనందువల్ల ఎల్లవేళల నిష్కించనుడై ఉంటాడు. అతనే కాదు; అతని కుటుంబం కూడా నిరంతరం క్లేశాలనే వరిస్తుండేది.

## భగవంతుని పరీక్ష

ఒకనాడతనికి ఘృత పాయస సంయావ తోయాలు లభించాయి. అతను ఆ విధంగా ప్రాప్తమైన దానిని కుటుంబసహితంగా భుజింపబోతున్నాడు. ఆ సమయంలో ఒక ద్విజుడు క్షుత్పిపాసాతురుడు కేవల దుర్బలత్వం వలన వడవడ వణుకుతున్నవాడు ఇంటిముందు వచ్చి నిలిచాడు. రంతిదేవుడు ఆ అతిథిని మహాదరంతో పూజించి, 'ఆహా! భగవానుడు సర్వప్రాణిజాతంలోనూ ఉన్నవాడు ఈ రూపంలో నేడు నాకు అతిథిగా వచ్చాడు. ఇంతకంటె భాగ్యమేముంటుంది?' అని భావించి తనకు లభించిన దానిని అతనికి పెట్టాడు. ఆ అతిథి దానిని భుజించి వెళ్ళాడు.

అంతట రంతిదేవుడు శేషించిన దానిని కుటుంబానికి పంచిపెట్టబోతున్నాడు. అంతలో ఒక శూద్రుడు 'హరీ! శ్రీహరీ!' అంటూ అన్నం పెట్టమని వచ్చాడు. శేషాన్నాన్ని మొదట అతనికి పెట్టి మిగిలిన దానిని రంతిదేవుడు కుటుంబసహితంగా భుజింపబోయాడు. అంతలో ఒకడు కుక్కలను వెంటబెట్టుకొని వచ్చి, 'రాజేంద్రా! నేను, నా కుక్కలు ఆకలితో చావబోతున్నాము. ఆహారం పెట్టు' అని అడిగాడు. రంతిదేవుడు మిగిలిన అన్నాన్ని అతనికి, అతని కుక్కలకు పెట్టి 'సర్వం హరిమయం' అని అతనికి నమస్కరించాడు. అతను తన కుక్కలతో పాటు ఆ అన్నాన్ని తిని వెళ్ళాడు.

రాజేంద్రా! ఆ రోజు అతనికి గ్రుక్కెడు నీరు మాత్రమే మిగిలింది. అతను అదే పదివేలని త్రాగబోతున్నాడు. అంతలో ఒక చండాలుడు వచ్చి 'రాజా!

దాహం, గ్రుక్కెడు నీరి' మ్మని అరిచాడు. రంతిదేవుడు అతని దైన్యానికి జాలిపడి, 'దేవా! కొందరు అణిమాదిసిద్ధులను కోరుకొంటారు. కొందరు మోక్షం కావాలంటారు. అవేవీ నాకు వద్దు. సకలభూతాలకు సుఖాన్ని కూర్చి, తద్భూత దుఃఖాన్ని నాకు అనుగ్రహించు' అని లోలోన ధ్యానించి, 'అయ్యో! ఇతను పిపాసాతురుడై చావనున్నాడు. తన ప్రాణాలను ధారపోసి అయినా దీనులను రక్షించటం కంటె వేరొక ధర్మమూ, పుణ్యమూ లేవు. ఇతని ప్రాణాలను నేను కాపాడగలిగితే నా ఆకలిదప్పులే గాక నా శరీర శ్రమవిభ్రమాలు, దైన్యక్లమాలు, శోక మోహ విషాదాలు సమసిపోగలవు' అని నిశ్చయించి తాను చావబోతున్నా ఆ చండాలునికి నీటిని ధారపోశాడు. ఆ చండాలుడు నీళ్లుతాగి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లయి మహాసంతోషంతో వెళ్ళాడు.

రాజేంద్రా! రంతిదేవునికి తర్వాత నలభైరోజులు పుడిసెడు నీళ్ళు కూడా దొరకలేదు. అట్టి దురవస్థ సంప్రాప్తమైనా అతను చలింపలేదు. అప్పుడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురూ అతని చెంతకు వచ్చి, 'రంతిదేవా! నీ మనోబలాన్ని, నీ సమదృష్టిని పరీక్షింపదలచి నిన్ను కష్టపెట్టాము. నీ నడవడి మాకెంతో మెచ్చుగొలిపింది' అన్నారు. రంతిదేవుడు వారిని పూజించి నిస్సంగుడు, నిస్పృహుడు అయినందున వారినేమీ కోరక తదేకభక్తితో ఉన్నాడు. ఆ విధంగా అతను నిష్కాముడై చిత్తాన్ని ఈశ్వరార్పణ చేసిన ఫలంగా గుణమయి అయిన మాయ స్వప్నసన్నిభమై తనంతట తానే తొలగిపోయింది. ఆ రాజు కృతార్థుడయ్యాడు.

రాజేంద్రా! మరొక విశేషం. రంతిదేవుని సంసర్గం వలన అతని అనుచరులు కూడా భగవన్ముఖులై యోగసిద్ధిని గాంచి కృతార్థులయ్యారు. సంసర్గబలం ఎంతటిదో ఊహించు. రాజా! సత్సంసర్గం వలన శుభాలు కలిగినట్లే దుస్సంసర్గం వలన కీడు కలుగుతుంది. ఈ రహస్యం తెలిసి సత్సంసర్గం చేయమని బుధులంతగా ప్రబోధించారు.

## గర్గ మహావీర్యాదుల వంశాలు

రాజా! గర్గునికి శిని, అతనికి గార్గ్యుడు జనించారు. మహావీర్యునికి త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అని ముగ్గురు కుమారులు పుట్టి వారు కూడా బ్రాహ్మణులయ్యారు. బృహత్క్షత్రునికి సుహోత్రుడు, అతనికి హస్తి జన్మించారు. హస్తి తనపేర హస్తినాపురాన్ని నిర్మించాడు. హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు పుట్టారు. అజమీఢునికి ఒక భార్య వలన ప్రియమేధాదులు జనించి బ్రాహ్మణు లయ్యారు; వేరొక భార్య వలన బృహదిషుడు జన్మించాడు. అతనికి బృహద్ధనుడు, అతనికి బృహత్కాయుడు, అతనికి జయద్రథుడు, అతనికి విశ్వజిత్తు, అతనికి సేనజిత్తు కలిగారు. సేనజిత్తుకు రుచిరాశ్వుడు, దృఢహనుడు, కాశ్యుడు, వత్సుడు జన్మించారు. రుచిరాశ్వునికి ప్రాజ్ఞుడు, అతనికి పృథుసేనుడు, అతనికి పారుడు, అతనికి నీపుడు ఉదయించారు. నీపునికి పెక్కు మంది భార్యలుండేవారు. ఆ భార్యల వలన అతనికి నూర్గురు కొడుకులు, శుకకన్య అయిన కృత్వి అనే భార్య యందు బ్రహ్మదత్తుడు పుట్టారు. బ్రహ్మదత్తుడు సరస్వతి యందు విష్వక్సేనుడనే కొడుకును కన్నాడు. అతను జైగీషవ్యుని ఉపదేశాన్ని పొంది యోగీశ్వరుడై యోగతంత్రాన్ని రచించాడు. విష్వక్సేనునికి ఉదక్సేనుడు, బలాదులు జన్మించి బృహదిషు కులానికి మూలపురుషులయ్యారు.

ద్విమీఢునికి యవీనరుడు, అతనికి కృతిమంతుడు, అతనికి సత్యధృతి, అతనికి దృఢనేమి, అతనికి సుపార్శ్వుడు, అతనికి సుమతి, అతనికి సన్నతిమంతుడు, అతనికి కృతి జన్మించారు. కృతి హిరణ్యనాభునితో యోగవిద్యను అభ్యసించి ప్రాచ్యసామ సంహితాషట్కం గానం చేసి ప్రసిద్ధుడయ్యాడు. కృతికి ఉగ్రాయుధుడు, అతనికి క్షేమ్యుడు, అతనికి సువీరుడు, అతనికి పురంజయుడు, అతనికి బహురథుడు ఉదయించారు. పురమీఢునికి సంతానం కలుగలేదు.

అజమీఢునికి నళిని అనే వేరొక భార్య వలన  నీలుడు పుట్టాడు. అతనికి శాంతి, అతనికి సుశాంతి, అతనికి పురుజుడు, అతనికి అర్కుడు, అతనికి

భర్మ్యాశ్వుడు కలిగారు. భర్మ్యాశ్వునికి ముద్గలుడు, యవీనరుడు, బృహదిషుడు, కాంపిల్యుడు, సంజయుడు జనించారు. ఆ పంచసుతులు పంచవిషయాలకు చాలినవారని భర్మ్యాశ్వుడు అన్నందువలన ఆ అయిదుగురినీ పాంచాలురని అన్నారు. వారిలో ముద్గలుని సంతానం బ్రహ్మమయంగా మారింది. అతని పేరుమీదుగా మౌద్గల్య గోత్రం ఏర్పడింది.

ముద్గలునికి దివోదాసుడు, అహల్య కలిగారు. అహల్యను గౌతముడు గ్రహించాడు. అతనికి శతానందుడు, శతానందునికి సత్యధృతి జనించారు. సత్యధృతి ధనుర్వేదవిశారదు డయ్యాడు. అతనికి శరద్వంతుడు పుట్టాడు. ఆ శరద్వంతుడు ఒకనాడు ఊర్వశిని చూసి కామింపగా ఆ ఉద్రేకం వలన రేతస్ఖలనం జరిగింది. అదే సమయంలో మృగయావినోదార్థం అక్కడికి వచ్చిన శంతనుడు శరద్వంతుని వీర్యాన్ని ఒక రెల్లుగడ్డి పరకలో సంతరించాడు. దానిలో నుంచి కృపాచార్యుడు, కృపి ప్రభవించారు. కృపిని ద్రోణాచార్యుడు గ్రహించాడు.

దివోదాసునికి మిత్రాయువు, అతనికి చ్యవనుడు, అతనికి సుదాముడు, అతనికి సహదేవుడు, అతనికి జంతుడు పుట్టారు. జంతునికి నూర్గురు కొడుకులు పుట్టారు. వారిలో కడపటివాడు పృషదునికి ద్రుపదుడు జనించాడు. ద్రుపదునికి ద్రౌపది, ధృష్టద్యుమ్నుడు మొదలైన వారు కలిగారు. ధృష్టద్యుమ్నునికి దృష్టకేతుడు పుట్టాడు. ద్రుపదాదులకు పాంచాలురని పేరు వచ్చింది.

అజమీఢునికి ఋక్షుడని మరొక కొడుకు ఉండేవాడు. అతనికి సంవరణుడు, అతనికి కురువు కలిగారు. కురువుకు పరీక్షిత్తు, సుధనువు, జహ్నుడు, నిషధుడు పుట్టారు. పరీక్షిత్తుకు సంతానం కలుగలేదు. సుధనువుకు సుహోత్రుడు, అతనికి కృతి, అతనికి ఉపరిచర వసువు జనించారు. ఆ వసువుకు బృహద్రథుడు కుసుంభుడు, మత్స్యుడు, ప్రత్యగ్రుడు, చేదిషుడు మొదలైనవారు జన్మించి చేదిదేశానికి అధిపతులయ్యారు.

బృహద్రథునికి వేరొక భార్యయందు కుశాగ్రుడు, అతనికి ఋషభుడు, అతనికి సత్యహితుడు, అతనికి పుష్పవంతుడు, అతనికి జహుడు; మరొక భార్య కడుపున రెండు శకలాలు పుట్టాయి. జహుపత్ని ఆ ఖండాలను పారవేసింది. వాటిని జర అనే పేరుగల ఒకతె తీసుకొనిపోయి ఒకటిగా అతికించింది. ఆ ముక్కలను దగ్గరకు చేర్చినంతనే ఆ మూర్తి పురుషాకారాన్ని ధరించి జీవవంతుడయ్యాడు. అతను జరచేత సంధింపబడి జీవించటం వల్ల జరాసంధుడని పేరు పెట్టారు. అతనికి సహదేవుడు, అతనికి సోమాపి, అతనికి శ్రుతశ్రవుడు పుట్టారు.

రాజా! పరీక్షిత్తు తమ్ముడైన జహ్నునికి సురథుడు, అతనికి విదూరథుడు, అతనికి సార్వభౌముడు, అతనికి జయత్సేనుడు, అతనికి రథికుడు, అతనికి అయుతాయువు, అతనికి క్రోధనుడు, అతనికి దేవాతిథి, అతనికి ఋక్షుడు, అతనికి భీమసేనుడు, అతనికి ప్రతీపుడు జన్మించారు. ప్రతీపునికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు పుట్టారు. దేవాపి తండ్రి రాజ్యాన్ని త్యజించి వనవాసానికి వెళ్ళాడు. అతని తర్వాతివాడు శంతనుడు రాజయ్యాడు. ఆ శంతనుడు పూర్వజన్మలో మహాభిషుడని పేరుగలవాడు. శంతనుడు చేతితో తాకితే చాలు ఎటువంటి ముసలివారైనా నవయౌవనవంతులు, పరమశాంతులుగా మారేవారు. ఆ కారణాననే అతనికి శంతనుడని పేరు వచ్చింది.

శంతనుడు రాజ్యమేలుతుండగా ఒకానొకప్పుడు తొమ్మిది సంవత్సరాల అనావృష్టి కలిగింది. వర్షం కురవలేదు. అప్పుడు బ్రాహ్మణులు శంతనుని చెంతకు వచ్చి, 'రాజా! రాజ్యం జ్యేష్ఠపుత్రునికి చెందాలి. అతను జీవించి ఉండగా అతని రాజ్యాన్ని నీవు గ్రహించావు; అందుమూలాన నీవు పరివేత్తకు దీటువస్తావు. అట్టి రాజు పాలనలో వానలు పడవు' అన్నారు. శంతనుడు బయలుదేరి వనవనాంతరాలు వెతికి ఎట్టికేలకు దేవాపిని కనుగొని సంగతి తెలిపి రాజ్యాన్ని గైకొనమని ప్రార్థించాడు. అయితే శంతనుడు అతనిని కలుసుకొనే లోగానే మంత్రి కొందరు బ్రాహ్మణులను దేవాపి వద్దకు

పంపాడు. వారతనికి పాషండ మతాన్ని బోధించారు. అతను మనోభ్రాంతిని పొంది వేదనింద కావింపసాగాడు. ఆ సంగతి వెల్లడయింది. వేదనిందకుడు రాజ్యార్హుడు కాడని జనులు దేవాపిని నిగ్రహించి శంతనుడే న్యాయమైన ప్రభువని నిశ్చయించారు. ఆ విధంగా శంతనుని దోషం పరిహృతమయింది. యథారీతిగా వానలు కురిశాయి.

రాజేంద్రా! దేవాపి యోగనిష్ఠుడై ఇప్పుడు కలాపగ్రామంలో ఉన్నాడు. కలియుగం సమాప్తమై కృతయుగం ప్రారంభించినప్పుడు అతను ప్రక్షీణమైన సోమవంశాన్ని ఉద్ధరిస్తాడు.

బాహ్లికునికి సోమదత్తుడు, అతనికి భూరి, భూరిశ్రవుడు, శలుడు పుట్టారు. శంతనునికి గంగానది వలన భీష్ముడు పుట్టి వీరయోధాగ్రేసరుడై భార్గవుని యుద్ధంలో మెప్పించాడు. మహావిద్వాంసుడు, ధర్మవేత్త, పరమ భాగవతుడు అని శాశ్వతకీర్తిని పొందాడు. శంతనుడు సత్యవతిని పెండ్లాడి ఆమె వలన చిత్రాంగద విచిత్రవీర్యులని ఇద్దరు కొడుకులను కన్నాడు. చిత్రాంగదుడు చిత్రాంగదుడనే గంధర్వునితో పోరాడి మరణించాడు.

ఆ సమయంలో కాశీరాజుకు అంబిక, అంబాలిక అని ఇద్దరు కుమార్తెలున్నారు. వారికి స్వయంవరం ప్రకటించారు. భీష్ముడు వెళ్ళి ఆ కన్యలిద్దరినీ తెచ్చి విచిత్రవీర్యునికి పెండ్లిచేశాడు. అతను వారితోడిదే లోకంగా ఉండి రోగపీడితుడై నిస్సంతానంగా కాలధర్మం చెందాడు. వారి వంశం లుప్తమవుతుందని భయపడి సత్యవతి తన పుత్రుడైన బాదరాయణుని రప్పించి వంశాన్ని నిలుపగోరి విచిత్రవీర్యుని భార్యలైన అంబిక, అంబాలికలను నియోగించింది. బాదరాయణునికి వారి క్షేత్రాలలో ధృతరాష్ట్రుడు, పాండువు, విదురుడు జన్మించారు.

రాజేంద్రా! బాదరాయణుడు సత్యవతికి పుత్రుడెలా అయ్యాడని శంకిస్తావేమో. సత్యవతి శంతనుని వివాహమాడక పూర్వం పరాశరమునీంద్రుని వలన భగవదంశసంభూతుడైన నా తండ్రిని

బాదరాయణుని కన్నది. వేదరక్షకుడైన ఆ మహర్షి పరమగుహ్యమైన ఈ పురాణాన్ని రచించి పైలుడు మొదలైన శిష్యులెందరో ఉండగా నాకు మాత్రమే బోధించాడు.

ధృతరాష్ట్రునికి గాంధారి యందు దుర్యోధనాదులు నూరుగురు కొడుకులు, దుస్సల అని కూతురు పుట్టారు. పాండురాజుకు కుంతి, మాద్రి అని ఇద్దరు భార్యలు. అతను మునిశాప వశాన మైథునక్రియకు దూరుడైనందున సంతానం కలిగే వీలు లేకపోయింది. కుంతి పతి నియోగాన ధర్మదేవతను ఉపాసించి యుధిష్ఠిరుని, మరుత్తును ఉపాసించి భీమసేనుని, సురేంద్రుని ఉపాసించి అర్జునుని కన్నది. మాద్రి కూడా అదే విధంగా అశ్వినులను ఉపాసించి నకుల సహదేవులను కన్నది. ఆ ఐదుగురు ద్రౌపదిని ధర్మపత్నిగా గ్రహించారు. ద్రౌపది యుధిష్ఠిరుని వలన ప్రతివింధ్యుని, భీమసేనుని వలన శ్రుతసేనుని, అర్జునుని వలన శ్రుతకీర్తిని, నకులుని వలన శతానీకుని, సహదేవుని వలన శ్రుతకర్ముని కన్నది.

యుధిష్ఠిరునికి పౌరవతి అను భార్యయందు దేవకుడు ఉదయించాడు. భీమునికి హిడింబ వలన ఘటోత్కచుడు, కాళి అనే పేరుగల భార్యయందు సర్వగతుడు జన్మించారు. నకులుడు కరేణుమతి యందు నిరమిత్రుని, సహదేవుడు పార్వతియైన విజయ వలన సుహోదరుని కన్నారు. అర్జునునికి ఉలూపి అనే నాగకన్య వలన ఐరావంతుడు, మణలూరు దేశరాజు కూతురైన చిత్రాంగద వలన బభ్రువాహనుడు, శ్రీకృష్ణుని చెల్లెలు సుభద్ర వలన అభిమన్యుడు పుట్టారు. అభిమన్యుడు పసిప్రాయంలోనే శస్త్రాస్త్ర విద్య నేర్చుకొని అతిరథులకు అతిరథుడై వీరాగ్రేసరుడని జగత్ప్రసిద్ధి వహించి ఉత్తర అనే అమ్మాయిని, మీ అమ్మను వివాహం చేసుకొన్నాడు. ఆమె గర్భవతిగా ఉండగా కురుపాండవులకు యుద్ధం సంభవించింది. ఆ యుద్ధంలో అభిమన్యుడు వీరస్వర్గాన్ని అలంకరించాడు.

ఉభయపక్షాలవారు పద్దెనిమిది అక్షౌహిణుల సేనలు ఆ రణంలో మరణించారు. కౌరవవంశంలో ధృతరాష్ట్రుడు, పాండవ వంశంలో

పంచపాండవులు మిగిలారు. పాండవుల యెడ ద్రోణసుతుడు అశ్వత్థామ పగబూని పాండవ వంశాన్ని నిర్వంశం చేయగోరి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడు నీవు నీ తల్లి గర్భంలో ఉన్నావు. శ్రీకృష్ణభగవానుడు ఆ మహాస్త్రం బారినుంచి నిన్ను రక్షించాడు. నీవు సుఖంగా జన్మించావు. సరే; జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు నీ కుమారులున్నారు.

## భవిష్యద్రాజక్రమం

రాజేంద్రా! నీ వంశక్రమాన్ని వివరించాను. భవిష్యద్రాజుల వంశక్రమాన్ని సూచిస్తాను విను.

నీకు తక్షకుని వలన మృతి కలుగుతుంది. నీ అనంతరం నీ జ్యేష్ఠపుత్రుడు జనమేజయుడు రాజయి నీ మృతికి కారణమైన తక్షకుని మీది క్రోధం వలన సర్పకులక్షయాన్ని సంకల్పించి సర్పయాగం చేస్తాడు. ఆ యాగంలో పెక్కు సర్పాలు హోమకుండాగ్నిలో పడి భస్మీపటలమై నశిస్తాయి. ఆ తర్వాత అతను కావషేయుడైన మరువనే అతనిని పురోహితునిగా వరించి అశ్వమేధ యాగం చేసి దిగ్విజయుడై అనేక యజ్ఞాలను అనుష్ఠించి యజ్ఞేశ్వరుని ఆరాధిస్తాడు.

జనమేజయునికి శతానీకుడు జన్మించి కృపాచార్యునితో అస్త్రవిద్యను, యాజ్ఞవల్క్యునితో వేదాన్ని అభ్యసించి క్రియాజ్ఞానసంపన్నుడై శౌనకుని కొలిచి ఆత్మజ్ఞానాన్ని పొందుతాడు. అతనికి అనీకకృష్ణుడు, అతనికి నిచకుడు ఉదయిస్తారు. అప్పుడు హస్తినాపురం గంగాప్రవాహంలో మునుగుతుంది. నిచకుడు కౌశాంబీపురాన్ని నివాసంగా చేసుకొంటాడు.

నిచకునికి ఉప్తుడు, అతనికి చిత్రరథుడు, చిత్రరథునికి శుచిరథుడు, శుచిరథునికి వృష్టిమంతుడు, వృష్టిమంతునికి సుషేణుడు, సుషేణునికి సుపీతుడు, సుపీతునికి నృచక్షుడు, నృచక్షునికి శుభానిలుడు, శుభానిలునికి పరిప్లవుడు, పరిప్లవునికి సునయుడు, సునయునికి మేధావి, మేధావికి నృపంజయుడు, నృపంజయునికి దూర్వుడు, దూర్వునికి నిమి, నిమికి

బృహద్రథుడు, బృహద్రథునికి సుదాసుడు, సుదాసునికి శతానీకుడు, శతానీకునికి దుర్దమనుడు, దుర్దమనునికి విహీనరుడు, విహీనరునికి దండపాణి, దండపాణికి మిత్రుడు, మిత్రునికి క్షేముడు ఉదయిస్తారు. రాజేంద్రా! బ్రహ్మక్షత్త్రమూలమై దేవర్షిమాన్యంగా వెలసిన ఈ నీ మహనీయవంశం కలియుగంలో క్షేమకునితో అంతరిస్తుంది.

## మాగధ వంశం

తర్వాత మాగధులు వస్తారు. ఆ వంశక్రమాన్ని విను. మాగధులలో జరాసంధుని సంగతి చెప్పాను. అతనికి సహదేవుడు, సహదేవునికి మార్జారి, అతనికి శ్రుతశ్రవుడు, అతనికి అయుతాయువు, అతనికి నరమిత్రుడు, అతనికి సునక్షత్త్రుడు, అతనికి బృహత్క్షత్త్రుడు, అతనికి కర్మజిత్తు, అతనికి శ్రుతంజయుడు, అతనికి విప్రుడు, అతనికి శుచి, అతనికి క్షేముడు, అతనికి సువ్రతుడు, అతనికి ధర్మనేత్రుడు, అతనికి శ్రుతుడు, అతనికి దృఢసేనుడు, అతనికి సుమతి, అతనికి సుబలుడు, అతనికి సునీతుడు, అతనికి సత్యజిత్తు, అతనికి పురంజయుడు జన్మిస్తారు. ఈ రాజుల పరిపాలన వేయేండ్లు జరుగుతుంది. ఇది పూరువంశ వృత్తాంతం.

## అనువంశక్రమం

పరీక్షిన్నరేంద్రా! యయాతి పుత్త్రులలో అనువు శర్మిష్ఠ రెండవ కొడుకని చెప్పాను. అనువుకు సభానరుడు, చక్షుడు, పరోక్షుడు అని ముగ్గురు కుమారులు జనించారు. వారిలో సభానరునికి కాలనాథుడు, అతనికి సృంజయుడు, అతనికి పురంజయుడు, అతనికి జనజమేయుడు, అతనికి మహాశాలుడు, అతనికి మహామనుడు కలిగారు. మహామనునికి ఉశీనరుడు, తితిక్షుడు పుట్టారు. ఉశీనరునికి శిబి, వనుడు, క్రిమి, దర్పుడు జనించారు. వారిలో శిబికి వృషపర్వుడు, సువీరుడు, మద్రుడు, కేకయుడు పుట్టారు. తితిక్షునికి రుశద్రథుడు, అతనికి హేముడు, అతనికి సుతపుడు, అతనికి బలి కలిగారు. బలికి సంతానం కలుగలేదు. అతని క్షేత్రంలో దీర్ఘతపునికి అంగ

వంగ కళింగ సింహ పుండ్ర ఆంధ్రు లనేవారు ఆరుగురు పుట్టారు. వారి పేర ఆయా దేశాలు ఏర్పడ్డాయి.

అంగునికి అనుమంతుడు, అతనికి విరథుడు, అతనికి చిత్రరథుడు జన్మించారు. చిత్రరథుడు మహాధర్మరతుడై ప్రసిద్ధికెక్కాడు. అతనికి రోమపాదుడనే నామాంతరం కూడా ఉన్నది. రోమపాదుడు దశరథునికి పరమమిత్రుడుగా ఉండి తనకు సంతానం లేనందువల్ల దశరథుని కుమార్తె శాంతను పుత్రికగా గ్రహించాడు.

రాజా! ఆ రోమపాదుని దేశంలో వానలు కురవక పంటలు వట్టిపోయాయి. ఋశ్యశృంగుడు వచ్చినట్లయితే వానలు పడతాయని అన్నారు. రోమపాదుడు ఋశ్యశృంగుని తీసుకొనిరమ్మని వేశ్యలను పంపాడు. వారు తమ నాట్య సంగీత విభ్రమాలింగనాలతో ఋశ్యశృంగుని వశపరచుకొని అతనిని తమ దేశానికి కొనివచ్చారు. అతను కాలుపెట్టగానే వానలు కురిశాయి. రోమపాదుడు తన పుత్రికను శాంతను ఋశ్యశృంగుని కిచ్చి పెండ్లిచేశాడు. ఆ ఋశ్యశృంగుని దశరథుడు తన రాజ్యానికి తీసుకొని వచ్చి అతనిచే పుత్రకామేష్టి జరిపించి సుతులను పొందాడు.

తర్వాత రోమపాదునికి చతురంగుడు జన్మించాడు. చతురంగుని కొడుకు పృథులాక్షుడు. అతనికి బృహద్రథుడు, బృహత్కర్ముడు, బృహద్భానుడు జన్మించారు. బృహద్రథునికి బృహన్మనసుడు, అతనికి జయద్రథుడు, అతనికి విజయుడు ఉదయించారు. విజయునికి సంభూతి యందు ధృతి, అతనికి ధృతవ్రతుడు, అతనికి సర్వకర్ముడు, అతనికి అతిరథుడు పుట్టారు.

అతిరథుడు ఒకప్పుడు గంగాతీరంలో విహరిస్తుండగా ఆ ఏటిలో ఒక పెట్టె కొట్టుకొని వచ్చింది. అతను ఆ పెట్టెను పట్టుకొని తెరిచి చూస్తే అందులో ఒక పిల్లవాడు ఉన్నాడు. అతను ఆ బాలుని ఇంటికి తీసుకొని వెళ్ళి అల్లారుముద్దుగా చూసుకొన్నాడు. ఇంతకీ ఆ బాలుడెవరని అడుగుతావేమో? కుంతీదేవి పాండురాజును పెండ్లాడక పూర్వం ఆమెకు సూర్యమంత్రాన్ని ఉపదేశించారు. ఆ మంత్రప్రభావం ఎటువంటిదో అన్న జిజ్ఞాస అతిశయించి

ఆమె సూర్యదేవుని ఉపాసించింది. ఆమెకు అక్కడికక్కడే సద్యోగర్భం కలిగి పుత్రుడు ఉదయించాడు. కుంతి అదిచూసి తన కన్యాత్వానికి కళంకం ఏర్పడుతుందని భయపడి ఆ శిశువు నొక పెట్టెలో ఉంచి గంగలో వదిలిపెట్టింది. ఆ పెట్టె అతిరథునికి లభించింది. ఆ పిల్లవాడే కర్ణుడని ప్రసిద్ధికెక్కాడు.

## ద్రుహ్యుని సంతతి

ద్రుహ్యునికి బభ్రుడు, అతనికి సేతువు, అతనికి ఆరబ్ధుడు, అతనికి గాంధారుడు, అతనికి ఘర్మ్ముడు, అతనికి ఘృతుడు, అతనికి దుర్మదుడు, అతనికి ప్రచేతసుడు ఉదయించారు. ప్రచేతసునికి నూర్గురు కొడుకులు పుట్టి మ్లేచ్ఛరాజులై ఉత్తరదిక్కును ఆక్రమించారు.

## తుర్వసు సంతతి

తుర్వసునికి వహ్ని, అతనికి భర్గుడు, భర్గునికి భానుమంతుడు, భానుమంతునికి త్రిసానుడు, త్రిసానునికి కరంధముడు, కరంధమునికి మరుత్తుడు జనించారు. మరుత్తుకు సంతానం కలుగలేదు. అతను పౌరవ్యుడైన దుష్యంతుని పుత్రునిగా స్వీకరించాడు. ఆ దుష్యంతుడు రాజ్యలోభం వలన మరుత్తును వదిలి మళ్ళీ పూరువంశంలో చేరాడు.

## యదువంశక్రమం

రాజేంద్రా! యయాతికి దేవయాని వలన యదువు, తుర్వసుడు జన్మించారని చెప్పాను. వారిలో తుర్వసుని వంశక్రమాన్ని తెలుసుకొన్నావు. ఇక యదువంశాన్ని విను. ఈ యదువంశంలో భగవానుడు మనుష్యరూపాన అవతరించాడు. అందువల్ల ఈ వంశచరిత్రను వినడమంటే భగవల్లీలలను ఆకర్ణించటమే. ఇది మహాపుణ్యవంతం, నిఖిలపాపహరం అని పెద్దలన్నారు.

యదువుకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుడు, రిపుడు అని నలుగురు కొడుకులు పుట్టారు. వారిలో సహస్రజిత్తుకు శతజిత్తు జన్మించాడు. అతనికి

మహాహయుడు, వేణుహయుడు, హేహయుడు జనించారు. హేహయునికి ధర్ముడు, అతనికి నేత్రుడు, అతనికి కుంతి, అతనికి సోభంజి, అతనికి మహిష్మంతుడు, అతనికి భద్రసేనకుడు ప్రభవించారు. భద్రసేనునికి దుర్మదుడు, ధనికుడు ఉదయించారు. ధనికునికి కృతవీర్యుడు, కృతాగ్ని కృతవర్మ, కృతౌజస్సు పుట్టారు.

కృతవీర్యునికి కార్తవీర్యార్జునుడు పుట్టి సప్తద్వీపాయత వసుంధరకు ఆధిపత్యాన్ని వహించి, దత్తాత్రేయ మహర్షి వలన యోగవిద్యను నేర్చుకొని మహోన్నతగుణసంపన్నుడై వెలుగొందాడు. యజ్ఞ దాన తపో యోగ శ్రుత వీర్య జయాదులలో అతనికి సాటి లేకపోయారు. రాజా! ధనం ఉన్నచోట మదం ఉంటుంది. మదం ఉన్నచోట దుర్గుణాలు తప్పవు. కార్తవీర్యార్జునుడు సమస్త ధనసమృద్ధి కలిగినా అతనికి స్మృతి వైదొలగలేదు. ధనమదవిమోహితుడు గాక ఒకవంక ఇంద్రియసౌఖ్యాన్ని చూరగొంటూనే హరిభక్తిని ఎడబాయక ఎనభై అయిదువేల సంవత్సరాలు రాజ్యపరిపాలన చేశాడు.

అతనికి వేయిమంది పుత్రులు జనించారు. వారిలో జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, ఊర్జితుడు అని ఐదుగురు మహావీరులై జగద్విఖ్యాతి గడించారు. జయధ్వజునికి తాళధ్వజుడు పుట్టాడు. అతనికి వీతిహోత్రుడు మొదలైనవారు నూర్గురు కొడుకులు పుట్టారు. మధువుకు వృకుడు ఉదయించాడు. అతనికి వృష్ణి మొదలైనవారు ప్రభవించారు. మధువు వంశ్యులు మాధవులని, వృష్ణి వంశ్యులు యాదవులని పేరు పొందారు.

యదువుకు క్రోష్టుడు, అతనికి వృజినవంతుడు, శ్వాహితుడు, అతనికి భేరుశేకుడు, అతనికి చిత్రరథుడు, అతనికి శశిబిందుడు ఉదయించారు. శశిబిందుడు యోగవిద్య నభ్యసించి చక్రవర్తియై చతుర్దశ మహారత్నాలను సంపాదించాడు. గజ హయ రథ స్త్రీ బాణ ధను ర్నిధి మాల్య వస్త్ర వృక్ష శక్తి పాశ మణిచ్ఛత్ర విమానాలు పధ్నాలుగూ చతుర్దశ మహారత్నాలు.

శశబిందునికి పదివేలమంది భార్యలుండేవారు. వారికి దశలక్షసహస్రపుత్రులు కలిగారు. వారిలో పృథుశ్రవుడు మున్నగువారు గణుతికెక్కినవారు. పృథుశ్రవునికి ధర్ముడు, అతనికి ఉశనస్సు కలిగారు. అతను నూరు హయమేధాలు చేశాడు. ఉశనసునికి రుచకుడు, అతనికి పురుజిత్తు, ద్రుముడు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుడు జనించారు.

జ్యామఘుని భార్య పేరు శైబ్య. అతనికి ఆమె యందు సంతానం కలుగలేదు. అతను వేరొకతెను పెండ్లాడదలచినా శైబ్యకు వెరచి ద్వితీయవివాహం మానుకొన్నాడు. ఒకనాడతను రథారూఢుడై పోతున్నప్పుడు ఒకానొక కన్య వైరిగృహం నుంచి తప్పించుకొని వస్తూ జ్యామఘునికి ఎదురయింది. అతను ఆమెను తన రథం ఎక్కించుకొని వస్తున్నాడు. శైబ్య అది చూసి మండిపడింది. 'కపటాత్మా! ఈ రథంలో నా తావును ఆక్రమించి కూర్చున్న ఈమె ఎవతె?' అని అడిగింది. అతను భార్యకు జంకి, 'ఈమె నీ కోడలు' అన్నాడు. శైబ్య ఆ మాటకు నవ్వు మొగంతో, 'అయ్యా! నేను గొడ్రాలిని. నాకు సవతులెవరూ లేరు. ఈమె నాకు కోడలెందుకవుతుంది?' అని అడిగింది. జ్యామఘుడు ఆమె ఎత్తి పొడుపుమాట విని, 'దేవీ! పుట్టబోయే సుతునికి ఈమె భార్యయై నీకు కోడలవుతుంది' అన్నాడు.

రాజా! జ్యామఘుడు బహుకాలంగా విశ్వదేవులను, పితరులను ఆరాధించిన వాడు కాబట్టి వారతని మాటను నిజం చేయదలిచారు. వారి అనుగ్రహఫలంగా శైబ్య గర్భాన్ని ధరించి కొడుకును కన్నది. అతనికి విదర్భుడని పేరుపెట్టారు. ఆ విదర్భునికి జ్యామఘుడు తెచ్చిన కన్యనిచ్చి పెండ్లి చేశారు.

విదర్భునికి ఆమె యందు క్రుధుడు, రోమపాదుడు జనించారు. రోమపాదునికి బభ్రుడు, అతనికి కృతి, అతనికి కుశికుడు, అతనికి చేది, అతనికి దమఘోషుడు ప్రభవించారు. క్రుధునికి కుంతి, అతనికి ధృష్టి, అతనికి నిర్వృతి, అతనికి శార్హుడు, అతనికి వ్యోముడు, అతనికి జీమూతుడు, అతనికి వికృతి, అతనికి భీమరథుడు, అతనికి నవరథుడు, అతనికి దశరథుడు, అతనికి

శకుని, అతనికి కుంతి, అతనికి దేవదాసుడు, అతనికి దేవక్షత్త్రుడు, అతనికి మధువు, అతనికి కురువశుడు, అతనికి అనువు, అతనికి పురుహోత్రుడు, అతనికి అంశువు, అతనికి సాత్వతుడు పుట్టారు.

సాత్వతునికి భజమానుడు, భజదివ్యుడు, వృష్ణి, దేవపృథుడు, అంధకుడు, మహాభోజుడు అని ఏడుగురు కొడుకులు పుట్టారు. భజమానుడు భార్యాద్వయాన్ని గ్రహించాడు. వారిలో ఒకామెకు నిమ్రోచి, కంకణుడు, వృష్ణి అనువారు; రెండవ ఆమెకు శతజిత్తు, సహస్రజిత్తు , అయుతజిత్తు అనేవారు ఉదయించారు. దేవాపృథువుకు బభ్రువు జనించాడు. రాజేంద్రా! దేవాపృథు బభ్రువుల ప్రభావం ఇంతింతనరానిది వారి కృపావిశేషం వలన పధ్నాలుగు వేల అరవైఒక్కమంది మోక్షభాగ్యాన్ని చూరగొన్నారంటే, నువ్వే ఊహించు!

మహాభోజుడు పరమధర్మాతుడు. అతని వంశీయులకు వారిభోజులని పేరున్నది. వృష్ణికి సుమిత్రుడు, అతనికి యథాజిత్తు, అతనికి శిని, అతనికి అనమిత్రుడు, అతనికి నిమ్నుడు జనించారు. నిమ్నునికి సత్రాజిత్తు, ప్రసేనుడు, శిని ప్రాదుర్భవించారు. శినికి సత్యకుడు, అతనికి యయుధానుడు, అతనికి జయుడు, అతనికి గుణి, అతనికి యుగంధరుడు పుట్టారు.

అనమిత్రునికి పృశ్ని; అతనికి శ్వఫల్గుడు, చిత్రకుడు; శ్వఫల్గునికి గాదిని యందు అక్రూరుడు, అసంగుడు, సారమేయుడు, మృదుకుడు, మృదుపదుడు, శివుడు, వర్మదృక్కు, ధృష్టవర్ముడు, క్షత్త్రోపేతుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధమాదుడు, ప్రతిబాహువు అని పదముగ్గురు కొడుకులు, ఒక కుమార్తె సుచారువు జన్మించారు. అక్రూరునికి దేవలుడు, అనుపదేవుడు కలిగారు. చిత్రరథునికి పృథువు, వృష్ణికి విదూరథాదులు పెక్కుమంది ఉదయించారు. అంధకునికి కుకురుడు, భజమానుడు, శుచి, కంబళ బర్హికులు జన్మించారు. కుకురునికి వృష్ణి అతనికి విలోమతనయుడు, అతనికి కపోతరోముడు, అతనికి అనువు కలిగారు. అనువుకు తుంబురునితో స్నేహం కలిసింది. ఆ అనువుకు దుందుభి, అతనికి రవిద్యోతుడు, అతనికి ఒక భార్య వలన పునర్వసువు, వేరొక భార్య వలన ఆహుకుడు, ఆహుకి అనే కుమార్తె జన్మించారు. ఆహుకునికి

దేవకుడు, ఉగ్రసేనుడు కలిగారు. దేవకునికి దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అని నలుగురు పుత్రులు, ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అని ఏడుగురు కుమార్తెలు ప్రభవించారు. ఆ కన్యకలు ఏడుగురిని వసుదేవుడు వివాహం చేసుకొన్నాడు.

ఉగ్రసేనునికి కంసుడు, సునాముడు, న్యగ్రోధుడు, కహ్వుడు, శంకువు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టిమంతుడు అని కొడుకులు; కంస, కంసవతి, కంక, సురభువు, రాష్ట్రపాలిక అని కుమారికలు కలిగారు. ఉగ్రసేనుని పుత్రికలను వసుదేవుని తమ్ములు పెండ్లాడారు.

అంధకుని కుమారుడైన భజమానునికి శూరుడు, అతనికి విదూరథుడు, అతనికి శిని, శినికి భోజుడు, భోజునికి హృదీకుడు పుట్టారు. హృదీకునికి దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ ఉదయించారు. దేవమీఢునికి శూరుడు, శూరునికి మారిష యందు వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, అనీకుడు, వత్సకుడు, వృకుడు జనించి మహానిష్కల్మషులని పొగడ్త గన్నారు. రాజా! శూరునికి వసుదేవుడు పుట్టినప్పుడు దేవదుందుభులు మ్రోగాయి. ఆ కారణాన అతనికి ఆనకదుందుభి అని నామాంతరం సిద్ధించింది. శూరునికి ఇంకా పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస్సు, రాజాధిదేవి అని ఐదుగురు కుమార్తెలు కలిగారు. వారిలో పృథను శూరుడు తన మిత్రుడైన కుంతికి పుత్రికగా దత్తత చేశాడు. ఆ కారణాన పృథకు కుంతి అని మారుపేరు వచ్చింది. ఆ కుంతి వివాహానికి పూర్వం కర్ణుని ప్రసవించిన సంగతి చెప్పాను.

శ్రుతదేవను కారూషుడైన వృద్ధకర్మ పెండ్లాడి మునిశాపవశాన దైత్యత్వాన్ని పొందాడు. అతనికి దంతవక్త్రుడు జన్మించాడు. శ్రుతకీర్తిని కేకయరాజు దృష్టకేతుడు వివాహమై ప్రతర్దనాది సుతులను పదిమందిని కన్నాడు. జయత్సేనుడు అవంతిదేశానికి రాజయి రాజాధిదేవిని పెండ్లాడి విందానువిందులని ఇద్దరు కొడుకులను కన్నాడు. దమఘోషుడు చేది దేశాధినాథుడై శ్రుతశ్రవను గ్రహించి శిశుపాలునికి తండ్రి అయ్యాడు.

వసుదేవుని తమ్ముడు దేవభాగుడు ఉగ్రసేనుని కుమార్తె కంసను పెండ్లాడి చిత్రకేతువు, బృహద్బలుడు అనువారిని పొందాడు. దేవశ్రవుడు కంసవతిని వివాహం చేసుకొన్నాడు. వారికి సువీరుడు, ఇషుమంతుడు జన్మించారు. కంకునికి కంకయందు బకుడు, సత్యజిత్తు, పురుజిత్తు ఉదయించారు. సృంజయుడు రాష్ట్రపాలిక వలన వృషుడు, దుర్మర్షణుడు మొదలైన వారిని కన్నాడు. శ్యామకునికి సురభూవి యందు హరికేశ హిరణ్యాక్షులు ప్రభవించారు. వత్సుడు మిత్రకేశి అనే అప్సరసను వరించాడు. వారికి వృకాది పుత్రులు కలిగారు. వృకునికి దూర్వాక్షి వలన దక్షుడు, పుష్కరుడు, సాల్వుడు మొదలైనవారు పెక్కుమంది సుతులు జన్మించారు. అనీకునికి సుదామ యందు సుమిత్రానీకబాణాదులు, ఆనకునికి కర్ణిక యందు ఋతుధామ జయులు ఉదయించారు.

## వసుదేవ వంశం

రాజేంద్రా! వసుదేవునికి పౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇళ, ధృతిదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి మొదలైనవారు భార్యలయ్యారు. వారిలో పౌరవికి సుభద్రుడు, భద్రబాహుడు, దుర్మదుడు, భద్రుడు, భూతుడు మొదలైనవారు పన్నెండుగురు; రోహిణికి బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు, కృతుడు మొదలైనవారు; భద్రకు కేకి అనే కొడుకు; మదిరకు నందోపనంద కృతక శూరాదులు; రోచనకు హస్త హేమంగదాదులు; ఇళకు ఉరువల్కాదులు; ధృతిదేవకు త్రిపృష్ఠుడు, శాంతిదేవకు ప్రశ్రమప్రశ్రితాదులు; ఉపదేవకు కల్ప వృష్ట్యాదులు; శ్రీదేవకు వసు హంస సుధన్వాది షట్కం; దేవరక్షితకు గదాదుగురు తొమ్మండుగురు; సహదేవకు పురూధ శ్రుతముఖ్యాదులు ఎనమండుగురు కలిగారు.

రాజా! దేవకి కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమదనుడు, భద్రుడు, సంకర్షణుడు అని ఏడుగురు కొడుకులను కని వారందరినీ కంసునికి అప్పగించింది. తర్వాత భగవానుడు ఎనిమిదవ సుతుడై

ఆ ధన్యురాలి గర్భవాసాన ఉదయించాడు. నీ పితామహి సుభద్ర భగవానునికి చెల్లెలై జనించింది.

రాజా! ఎప్పుడెప్పుడు ధర్మగ్లాని, అధర్మవృద్ధి కలిగితే అప్పుడల్లా భగవానుడు అవతరిస్తాడు. అంతే కాని సర్వశక్తిమంతుడైన భగవానునికి కర్మములు కలగటం కాని, తత్ఫలానుభవార్థం పుట్టటం కాని జరగవు.

ప్రాణులు కర్మవశాన జన్మిస్తాయి. భగవానుడో? తన యోగమాయను అధిష్ఠించి అవతరిస్తాడు. ప్రాణుల జన్మమరణాలకు వారు స్వతంత్రులు కారు. భగవానుని అవతారం అతని ఇచ్ఛాధీనమై ఉంటుంది. ఆ మహాత్ముని మాయాశక్తి దురత్యయగా అడ్డునిలుస్తుంది. దానిని దాటాలంటే పరమేశ్వరానుగ్రహం ఒక్కటే సాధనం.

భగవానుని శరణుకోరినవారికి భగవదనుగ్రహం సర్వసిద్ధం.

# శ్రీమద్భాగవత కథాముఖం

## దశమ స్కంధ  విశేషవివృతి

ఆంగ్లమూలం:  శ్రీ తపస్యానంద స్వామిజీ
తెలుగు సేత: డా॥ ఏల్చూరి మురళీధరరావు

శ్రీమద్భాగవత వివక్షితార్థానికి విశంకటవృత్తిరూపమైన ఈ దశమస్కంధం లోని తొంభైతొమ్మిది అధ్యాయాలలో మూడువేల తొమ్మిదివందల నలభైఆరు శ్లోకాలున్నాయి. భాగవతతాత్పర్యం సమగ్రంగా ప్రతిపాదితమైనదీ, భాగవత హృదయస్పందం శ్రవణానందకరంగా నినదిస్తున్నదీ అత్యంత రమణీయమైన ఈ బృహద్భాగం శ్రీకృష్ణ తత్త్వనిరూపకమైన అపాశ్రయము దీనిలో వర్ణింపబడినదని పెద్దలంటారు. కొందరు నిరోధము లేదా ప్రళయము దీనియందు ఇతివృత్తమని నిర్ణయించారు. ప్రళయము అంటే సర్గావస్థలో ప్రకృతి తత్త్వం నుంచి ఆవిర్భవించిన మనోబుద్ధీంద్రియాదులు ప్రతిలోమపరిణామాన్ని పొంది తమ కారణం లోనికి విలీనమైపోవట మన్నమాట. భగవల్లీలాకృత్యాలను నిరంతరం ధ్యానించటం వలన పురుషునికి గుణాలతో అనాదిసిద్ధంగా ఏర్పడిన అవిద్యాకృతమైన సంబంధం తొలగిపోయి

స్వరూపనిష్ఠ కలుగుతుంది. ఈ స్వరూపనిష్ఠకే కైవల్యమని పేరు. ఇదే ఆత్యంతికమైన లయం. దశమస్కంధంలో ప్రళయలక్షణం ఉన్నది కనుక అపాశ్రయాన్ని ద్వాదశ స్కంధంలో నిరూపించాలని వీరి అభిమతం. ఇతివృత్తనిర్మాణంలో ఉన్న నేర్పరితనాన్ని గ్రహించటానికే తప్ప భక్తులకు ఈ విమర్శలు ప్రకాశ్యార్థప్రకాశనకు ఎంత మాత్రం ఉపకరింపవు. భాగవతకథాఫలం భక్తి. భాగవతధర్మోద్దేశమూ అదే. చతుర్విధపురుషార్థాలుగా నిరూపింపబడుతున్న ధర్మార్థకామమోక్షాల కంటె అతీతమై, భగవత్సాయుజ్యరూపమైన మోక్షానికంటె ఉత్తమమై, సర్వశ్రేష్ఠమైన పంచమపురుషార్థం ఒకటున్నదని, దానిపేరు భక్తి అని, భక్తికి ఫలం భక్తేనని భాగవతసిద్ధాంతం. భగవంతుడు ముక్తినైనా ప్రసాదిస్తాడేమో కాని భక్తిని మాత్రం ప్రసాదించటం అరుదని శుకయోగి పరీక్షితునితో “భగవాన్ ముకున్దో ముక్తిం దదాతి కర్హిచిత్స్మ న భక్తియోగమ్” (భాగ. 5. 6. 18) అంటాడు. మహోన్నతమైన ఈ భక్తి శిఖరాన్ని చేరుకొన్న భక్తులకు భగవానుడు ‘తమవా’ డనే స్వచ్ఛందమైన ఒక అనుభూతి కలుగుతుంది. ఫలాఫలాల స్వార్థచింతనలను, జన్మపరంపర నుంచి విముక్తిని – అన్నింటినీ విస్మరించి అవ్యాహతంగా భగవత్సేవలో నిమగ్నులై తమను తాము మరిచిపోయే శుద్ధసత్త్వస్థితి చేకూరుతుంది. పరమేశ్వర సేవాభావమే జీవుని పరమలక్ష్యం అవుతుంది.

ఈ విశేషవివరణలన్నీ ఇంతకుమునుపు స్కంధాలలో వచ్చినవే అయినా వీటి సారనవనీతాన్ని దశమస్కంధంలో సరిక్రొత్తగా మనకు శ్రీకృష్ణుని జీవితం ద్వారా, ఆయన ఉపదేశాల ద్వారా, వివిధభక్తులతో ఆయనకు గల అనుబంధాలను బట్టి, ఆ భక్తులు సఖ్య–వాత్సల్య–దాస్యాది వివిధభావాలతో ఆయన యెడ భక్తినెరపిన తీరును బట్టి చవిచూపటం జరిగింది. అందుచేతనే శ్రీమద్భాగవత కథామందిరానికి స్వర్ణగోపురం వంటి దశమస్కంధంలో కథానాయకుడైన శ్రీకృష్ణుని సకర్మకజీవితోపదేశం అనవరార్థ్యంతో విరాజిల్లుతున్నది.

ఈ విధంగా ప్రామాణ్యవివక్షతో భాగవతతాత్పర్యాన్ని నిర్ణయించటానికి పూర్వం భాగవతకథాకథనం లోని అంతరార్థం ఏమిటో కొంత ఆలోచింపవలసి ఉంటుంది. భాగవతంలోని ఈ కథలన్నీ నిజంగా జరిగినవేనా? వీటి చారిత్రిక వాస్తవికత మాటేమిటి? అన్నది గ్రంథాన్ని ఆధునిక దృష్టితో చదివే పాఠకులకు ఎదురయ్యే మొట్టమొదటి చిక్కు ప్రశ్న. భగవల్లీలావతారాల విషయంలో ఇటువంటి ప్రశ్న నిరుపయోగమని ఇంతకు మునుపే మనము నిశ్చయించాము. భగవంతుని అవతారకథనాలన్నీ సాధకుల కోసం ఉద్దేశింపబడినవి. చారిత్రిక సత్యాసత్యాలతో వాటికి నిమిత్తం లేదు. ఒకవేళ ఉన్నా మనకు తెలిసిన చరిత్ర యొక్క పరిమితావగాహనతో వాటిని విమర్శింపబూనటం దుస్సాహసమే అవుతుంది. అందుచేత శ్రీకృష్ణ జీవితోపదేశానికి మనకు చరిత్రకారుల అంగీకారముద్ర అవసరం లేదు. మన భారతీయుల సంప్రదాయం ప్రకారం శ్రీకృష్ణుని అవతారసమాప్తి ద్వాపరాంతాన, నేటి పరిగణనను బట్టి క్రీ.పూ. 3102వ సంవత్సరం కలియుగ ప్రారంభ తరుణంలో సంభవించింది. ఆధునిక చరిత్రకారులు ఈ కలియుగాది విషయాన్ని అంగీకరింపకపోయినా, శ్రీకృష్ణుని ఉనికిని గురించి కాదనటానికి వీలులేని అనేక చారిత్రికాధారాలు లభిస్తూనే ఉన్నాయి. "ఏన్షియంట్ ఇండియన్ హిస్టారికల్ ట్రెడిషన్స్" అనే గ్రంథంలో పర్గిటర్ క్రీ.పూ. 900 తర్వాతి కాలంలో శ్రీకృష్ణుడు జీవించి ఉండాలని అభిప్రాయపడ్డారు. ఛాందోగ్యోపనిషత్తులో ఘోరాంగిరసుని శిష్యుడైన ఒక దేవకీపుత్ర కృష్ణుని ప్రస్తావన కనుపిస్తుంది. ఈ కృష్ణుని బోధనలన్నీ ప్రాయికంగా భగవద్గీతాహృదయంతో సంవదిస్తున్నవనే చెప్పాలి. "క్రీస్తుకు పూర్వం 7-వ శతాబ్దంలోనో, అంతకంటె పూర్వమో" రచితమైనదని ఆర్.జి.భండార్కర్ మహాశయుడు భావించిన అష్టాధ్యాయీ వ్యాకరణకర్త పాణిని తన గ్రంథంలో వాసుదేవుని భక్తులైన 'వాసుదేవకు' లను పేర్కొనటం వల్ల, పాణిని కాలం నాటికే వృష్ణికులంలో వసుదేవునికి పుత్రుడై జన్మించిన శ్రీకృష్ణుడు తత్త్వోపదేష్టగా, అవతార పురుషునిగా ప్రసిద్ధి కెక్కినవాడని, ఆయన భక్తులు ఆసేతుశీతాచలమే గాక పాణినికి స్వస్థానమైన గాంధారదేశం (నేటి

ఆఫ్ఘనిస్తాన్) వరకు వ్యాపించి ఉంటారని భావింపబడుతున్నది. ఈ విధంగా బహుప్రాచీన కాలానికే వైష్ణవధర్మం మనదేశంలో విశేషప్రచారంలో ఉన్నదనటానికి – గ్రీకురాయబారి మెగస్తనీసు (క్రీ.పూ. 4–వ శతాబ్ది) రచనలలోనూ; శ్రీవాసుదేవుని ఆలయానికి భగవత్ కైంకర్యంగా ప్రహరీగోడను కట్టించిపెట్టిన ఒక భాగవతుని ప్రస్తావన ఘోశుండి శిలాశాసనం (క్రీ.పూ.100) లోను; హెలడోరస్ అనే గ్రీకుభక్తుని పరమభాగవతునిగా ప్రశంసించిన బాస్నగర్ శాసనాల (క్రీ.పూ.100) లోను; వాసుదేవుని అధిదైవతంగా పేర్కొన్న నానాఘడ్ శాసనం (క్రీ.పూ. 100) లోను ఉదాహరణ లనేకం ఉన్నాయి.

శ్రీకృష్ణుని యొక్క మహాద్భుతమైన జీవితాన్ని విమర్శించేటప్పుడు లోకానికి ధర్మమార్గాన్ని ఉపదేశించిన ప్రవక్తగా, మధురను పరిపాలించిన రాజవంశాలలో ఒకప్పుడు ప్రసిద్ధుడైన వీరపురుషునిగా మాత్రమే కాక గమనింపవలసిన ముఖ్యవిషయం మరొకటున్నది. బాల్యవయోవస్థాకాలంలో గోపీగోపగణాలతో కలిసి కేళీకలాపాలతో దుగ్ధదోహనాలతో రాసక్రీడావిహారాలతో కాలం గడిపి వారికి అతీంద్రియమై అలౌకికమై అనిర్వచనీయమైన ప్రేమమాధుర్యాన్ని చవిచూపించిన లీలాకృష్ణుని జీవితంలో బృందావన ఖండానికి ఆ తర్వాత జరిగిన ఘటనలు పెక్కింటితో గాఢమైన అనుబంధం ఉన్నట్లు కనబడుతుంది. వైష్ణవమతచరిత్ర అధ్యేతలలో భండార్కర్ వంటివారు పాశ్చాత్యవిద్వాంసుల దృక్పథాన్ని తలకెత్తుకొని శ్రీకృష్ణుని జీవితం – ఛాందోగ్యోపనిషత్తులో ఘోరాంగిరసుని శిష్యుడైన వేదాంతి కృష్ణుడు; మధురానగర రాజవంశీయులలో ప్రసిద్ధుడైన వీర కృష్ణుడు; బృందావనసంచారియైన గోప కృష్ణుడు – అనే మూడు వేర్వేరు పాయలకు సంగమం వంటిదని వ్రాశారు. ఇటువంటి విశ్లేషణ స్థూలదృష్టికి చమత్కారజనకంగా ఉండవచ్చునేమో కాని సూక్ష్మంగా పరిశీలిస్తే ఇందులో కారణజన్ముడైన ఒక మహావ్యక్తి వ్యక్తిత్వాన్ని అనేకవ్యక్తుల సమాహారకల్పనగా చిత్రీకరించి, అతని మాహాత్మ్యాన్ని కాలక్రమంలో రూపుదిద్దుకొన్న కట్టుకథగా

త్రోసిపుచ్చి, అతనిని ఒక మనుష్య సామాన్య వ్యక్తిగా నిలిపి నవ్వులపాలు చేయాలనే ప్రయత్నం ఉన్నదనిపిస్తుంది. కన్నులకు మిరుమిట్లుగొలుపుతున్న ఒక సౌందర్యరాశిని చూసి, 'దీని నిర్మాణానికి పనికివచ్చిన మూలద్రవ్యాలు ఇవి, ఇందులో కర్బన పదార్థం ఇంత, ఇదిగో దీని శాతం ఇంత' అని విశ్లేషించటం ఎటువంటిదో, ఇదీ అటువంటిదే. సౌందర్యదిదృక్ష కంటె శల్యపరీక్షకు ప్రాధాన్యం. ఇటువంటి ఉపరిశోధనల వల్ల ఎక్కడో కొంత ఆసక్తిదాయకమైన సమాచారం దొరకవచ్చునేమో కాని, ఆ వ్యక్తి యొక్క వ్యక్తిత్వాన్ని లోతుగా పరిశీలించి, అతని తత్త్వాన్ని అర్థం చేసుకోవటానికి ఈ వివరాలు ఎంతమాత్రం పనికిరావు. పైగా వివక్షితార్థాన్ని మరుగుపుచ్చి తప్పుదారి పట్టించే ప్రమాదం ఉన్నది. కనుక ఈ విశ్లేషణ వల్ల కించిత్ప్రయోజనం ఉన్నదని మనము అంగీకరించినా, కృష్ణుని యొక్క చారిత్రికతను నిర్ధారించటానికి ఈ వివరాలు ఉపయోగపడవనే చెప్పాలి. శ్రీకృష్ణజీవితంలోని ఈ మూడు విశిష్టానుభవాలూ ముగ్గురు వేర్వేరు వ్యక్తులను తెచ్చి ఒక వ్యక్తిగా ప్రకల్పించారనే వాదానికి ఉపస్కారకాలు కావని, భాగవతంలో చిత్రింపబడిన శ్రీకృష్ణుని పాత్రను అర్థం చేసుకోగలిగితే గోప కృష్ణుడు, మధురానగర కృష్ణుడు, తత్త్వదర్శి కృష్ణుడు ఒక్కరేనని, శ్రీకృష్ణుని జీవితంలో ఈ మూడింటికీ పరస్పరవిరోధం ఎన్నడూ లేదని స్పష్టపడుతుంది.

ఈ విషయాన్ని ఇంకా వివరింపవచ్చును. దేవకీపుత్త్రుడు, వాసుదేవుడు – ఇద్దరూ వేర్వేరు వ్యక్తులనటానికి అసలు ఆధారమే లేదు. దేవకీ వసుదేవులు జననీజనకులుగా కలిగిన కృష్ణునికి దేవకీపుత్త్రుడు, వాసుదేవుడు అనే పేర్లుండటంలో వింతేమున్నది? ఈ పేర్లు భిన్నవ్యక్తులకు సూచకాలనటం పూర్తిగా అసంగతం. కాగా, శ్రీకృష్ణుడు జన్మించిన వృష్ణికులం వేదకాలం నుంచి వ్యాప్తిలో ఉన్న చంద్రవంశశాఖలలో ప్రధానమైనది. ఆ వంశాధినేతలలో ఒకడైన శ్రీకృష్ణుడు తన శక్తి చేత, తన ధర్మవర్తన చేత, తన ఉత్తమవ్యక్తిత్వం చేత, మహాభారతంలో చిత్రింపబడినట్లు తన కాలంనాటి సాంస్కృతిక రాజకీయరంగాలలో సూత్రధారునిగా తను వహించిన కీలకమైన పాత్ర వలన

ఆయనకు క్రమక్రమంగా ఆప్తులు, అభిమానులు, భక్తులు, భాగవతాగ్రేసరులు ఏర్పడి లోకవిడంబనార్థం ఆయన ప్రదర్శించిన లీలలన్నీ జానపదుల నోళ్ళలో కథలూ గాథలుగా రూపుదిద్దుకొని వైష్ణవదర్శనంలో సర్వేశ్వరుడైన శ్రీమహావిష్ణువు యొక్క అవతారమని పేరురావటం సహజమైన పరిణామమే. ఛాందోగ్యోపనిషత్తులో ఘోరాంగిరసుడు కృష్ణునికి సూర్యోపాసనను ఉపదేశిస్తాడు. వేదాలలో సూర్యునిగా వర్ణింపబడిన తేజోమూర్తితో విష్ణువుకు గల అభేదాన్ని పురస్కరించుకొని వేదోక్తమైన గాయత్రీమంత్రాన్ని సూర్యనారాయణాధిదేవతాకం గానే నిరూపించటం జరుగుతున్నది. కాలక్రమేణ విష్ణువు వైదిక దేవతలలో ముఖ్యునిగా పరిణమించి, పరబ్రహ్మాత్మకునిగా నిరూపింపబడిన తర్వాత వైదిక దేవతలలో ఒకప్పుడు ప్రధానులైన ఇంద్రవరుణాదులు ఉపదేవతలుగా మారవలసి వచ్చింది. శ్రీమహావిష్ణువు యొక్క గుణకీర్తనం కావిస్తున్న వైష్ణవ ధర్మానికి ఆలంబనగా నిలిచిన శ్రీకృష్ణుని వైష్ణవులు ఆ విష్ణువు యొక్క అవతారంగానే పరిగణించటం జరిగింది. మతధర్మాల చరిత్రలను పరిశీలిస్తే నానాయుగాలలో మతప్రవక్తలైన వారిని ఆ మతానుయాయులు తమ ఉపాస్యదేవత యొక్క అవతారాలుగా విశ్వసించటం మనం చూస్తూ ఉన్నదే.

శ్రీమద్భాగవతం లోని ముఖ్యసన్నివేశాలను శ్రీమద్భాగవత మహాభారత గ్రంథాలను బట్టి క్రోడీకరింపవచ్చును. మథురానగర రాజు కంసుడు అణగద్రొక్కటానికి ప్రయత్నిస్తున్న వృష్ణినాయకుడు వసుదేవునికి పుత్రునిగా శ్రీకృష్ణుడు కారాగారంలో జన్మించాడు. జన్మించిన వెంటనే తండ్రి అతనిని కంసుని చెరనుంచి గోకులంలో నందుడనే గోపముఖ్యుని ఇంటికి చేర్చాడు. ఆ నందగోకులం లోనే కృష్ణుని బాల్యమంతా గడిచింది. మొదట బృహద్వనం లోనూ ఆ తర్వాత బృందావనం లోనూ అల్లారుముద్దుగా పెరిగి పెద్దవాడయ్యాడు. అవతారపురుషుడైన కృష్ణుని లీలలలో అతిప్రముఖమైనవి కొన్ని ఆ పుణ్యస్థలాలలో జరిగినవే. బృందావనం నుంచి మథురానగరానికి తరలి, అక్కడ ప్రజాకంటకుడైన కంసరాజును వధించాడు. అప్పటినుంచి

అతను క్రమక్రమంగా వృష్ణికులముఖ్యులలో ఒకడై, రాజ్యాన్ని చేపట్టకపోయినా సర్వవిధాల రాజుతో సమానంగా మెలగి వారికి మార్గదర్శకు డయ్యాడు. తన కాలంనాటి దుష్టరాజులలో పెక్కుమందిని మగధరాజు జరాసంధుడు, శ్యాలసుతుడు కాలయవనుడు, శోణితపురానికి అధిపతి బాణాసురుడు, సాళ్వుడు, శిశుపాలుడు మొదలుగా గలవారిని తుదముట్టించి వృష్ణికులాన్ని ప్రబలమైన రాజవంశాలలో ఒకటిగా రూపొందించాడు. పశ్చిమసముద్రతీరాన ద్వారకాపురాన్ని రాజధానిగా నిర్మించి, భారతదేశ సాంస్కృతిక రాజకీయ రంగాలలో ప్రముఖమైన పాత్ర వహించి తన కాలంనాటి మహాపురుషులలో ఒకడై ప్రకాశించాడు. కురువంశంలో ధృతరాష్ట్ర పాండునందనులకు రాజ్యాధికారం నిమిత్తమై వివాదాలు పొడచూపి పంతాలు పెరిగి జిఘాంస రగుల్కొని వైరానలం ప్రజ్వరిల్లినప్పుడు సంభవించిన మహాభారత ఘోరసంగ్రామంలో స్వయంగా తాను పాల్గొనకపోయినా సూత్రధారుడై నిలిచి తనవారికి జయాన్ని సంపాదించి పెట్టాడు. జీవితమంతా ధర్మనిర్మాణకర్మలతో నిర్విరామంగా గడిపి, తత్త్వోపదేశకునిగా పరిఢవిల్లి భాగవత ధర్మమనే అభిఖ్యతో భగవద్గీతా భాగవత పురాణాలలో ప్రపంచితమైన భక్తియోగాన్ని జగత్తుకు ప్రసాదించాడు.

శ్రీకృష్ణోపదిష్టమైన భాగవత ధర్మం ఆబాలగోపాలం ఆచరింపదగిన అనుష్ఠాన వేదాంతమని ప్రచారంలోకి వచ్చింది. ప్రభుసమ్మితాలైన వేదాలు కేవలం పండితులకు మాత్రమే అందుబాటులో ఉండేవి. బ్రాహ్మణ క్షత్రియులు మాత్రమే అనుష్ఠింపదగిన యజ్ఞయాగాలతో సంక్లిష్టమైన కర్మకాండలుగా సంహితల మార్గం ఒక వైపున; యుక్తాయుక్తవివేకం, నైతికోన్నతి కలిగిన మేధావులకు మాత్రమే సుబోధమైన అతిగంభీర వేదాంతదర్శనాలతో ఉపనిషత్తుల మార్గం మరొక వైపున వ్యాపించి వేదవాఙ్మయం సామాన్యులకు దూరం కాసాగింది. ఆ విధంగా సర్వజనులకు అందుబాటులో సులభంగా ఆచరింపదగిన ధర్మనిర్దేశం ఒకటి అత్యావశ్యకమైన రోజులలో శ్రీకృష్ణావతారం

సంభవించింది. కర్మ జ్ఞాన భక్తి మార్గాలకు తుల్యప్రాధాన్యం ఇచ్చి సర్వేశ్వరుడైన శ్రీ భగవానుని భక్తిప్రేమలతో పొందవచ్చునని నిరూపించి, చిరకాలంగా సంసారార్ణవ తితీర్షతో పరితపిస్తున్న మానవాళికి భాగవతధర్మాన్ని ప్రబోధించి అగతికులకు సద్గతిని చూపిన ఘనత శ్రీకృష్ణునికే దక్కింది.

## పురాణాలలో శ్రీకృష్ణాతిమానుషతత్త్వం

శ్రీమద్భాగవత మహాభారత కథనాలను బట్టి అనుశీలింపదగిన శ్రీకృష్ణుని యొక్క చరిత్రాత్మికత విషయాన్ని అటుంచి, భాగవతంలో చిత్రితమైన శ్రీకృష్ణుని పాత్రను పరిశీలిస్తే శ్రీకృష్ణుడు మానవసామాన్యుడు, వీరాగ్రేసరుడు, వేదాంతి లేదా సచ్చరిత్రుడు మాత్రమే కాదని; పాపులను పరమ భాగవతులుగా, అజ్ఞానులను కోవిదగ్రామణులుగా, ఇంద్రియాసక్తులను బ్రహ్మానంద పరవశులుగా, చివరికి పశుపక్ష్యాదులను సైతం పరమపావన భగవన్మార్గరతులనుగా పరివర్తింపజేయగలిగిన మహనీయుడని; కేవల భగవత్స్వరూపుడని; లీలామనుష్యవిగ్రహుడైన సచ్చిదానందపరబ్రహ్మాత్మకుడని; ధ్యాన ధారణ సమాధి సంప్రజ్ఞాత యోగాలతో స్వస్వరూపానుసంధానం చేసికొనలేని అసంవిదులకు తన సంవిద్రూపదర్శన భాగ్యాన్ని ప్రసాదింపగోరి ఇంద్రియగ్రాహ్యమైన రూపాన్ని ధరించిన పరమ పురుషుడని; భూలోకావతీర్ణుడై జగన్నాటక సూత్రధారుడై ఆయన ప్రదర్శించిన లీలలన్నీ దుష్టశిక్షణ శిష్టరక్షణలతో ధర్మసంస్థాపన కావించి తన సమకాలంలోని సజ్జనులకు సర్వాతీతమైన సత్పదాన్ని ప్రసాదించటానికి మాత్రమే గాక జగత్తులలో ఏ కాలంలోని వారైనా తన లీలాకృత్యాలను స్మరించి సర్వార్పణశీలురై తననే ధ్యేయవస్తువుగా నిలుపుకొంటే, తన సమకాలంలోని భక్తులకు ఏ విధంగా మహానందాన్ని అందించాడో అదే విధంగా తనకు పరోక్షంగా ఉన్నవారిని కూడా శాశ్వతమహానందార్ణవంలో ఓలలాడించటానికి ఉద్దేశితాలని; ఆయన వివిధదేశకాలాలలో నిస్తేజమైన మానవాళిని ఆధ్యాత్మిక శక్తిసంపన్నం కావించటానికి అవతరించిన మహానుభావుడని; ఈశ్వరుని యొక్క అనుగ్రహశక్తియే భక్తజనోద్ధరణార్థం పురుషాకృతిని ధరించినదని,

అందుచేత భగవత్పురుషరూపం భక్తకల్పద్రుమాయమానమని, భగవంతుడు భక్తసులభుడని అర్థమవుతుంది.

ఈ పురాణాలలో జరుగుతున్నదేమంటే శ్రీకృష్ణుని యొక్క చారిత్రికమైన పాత్ర ఏమైనప్పటికీ, ఆ శ్రీకృష్ణుని అధ్యాత్మవస్తువు యొక్క వ్యక్తరూపంగా, సగుణబ్రహ్మము యొక్క అవతారంగా, భాగవతంలో 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్నట్లు శ్రీకృష్ణుడే భగవత్స్వరూపు దన్నంతగా అద్భుతమైన రూపకల్పన చేయటం జరుగుతున్నది. మతకర్తలు కొందరు ఈ దళాన్ని గోరంతలు కొండంతలుగా నిరూపించి శ్రీకృష్ణుడే భగవంతుడని, విష్ణువు యొక్క ఇతరావతారాలు శ్రీకృష్ణుని యొక్క అవతారాలేనని, శ్రీమహావిష్ణుపరతత్త్వాన్ని గుణీభూతం చేయటానికి ప్రయత్నించారు. ఇది వారి వారి స్వమతాభినివేశమే తప్ప సత్యదృష్టి అనిపించుకోదు. 'అహో మూలచ్ఛేదీ తవ పాణ్డిత్యమ్' అంటే ఇదే. 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్నమాట శ్రీకృష్ణుడు ఉపనిషత్తులు ఉద్ఘోషించిన సచ్చిదానంద పరబ్రహ్మము యొక్క మనుష్యరూపావతారమని మాత్రమే నిరూపిస్తున్నది. ఉపనిషత్తుల యొక్క గర్భాంతర్వర్తియై, శుద్ధసత్త్వస్వరూపమై, రాగద్వేషాది మలినశూన్యమై, మానవ మనోంతర్ధ్వాంతవిచ్ఛేదకమై, కేవలానుభవానంద స్వరూప తత్పరమైన జ్ఞానముచేత తెలియదగిన నిరుపాధికబ్రహ్మమే చరాచరాత్మకమైన జగత్తు యొక్క నిమిత్తోపాదాన కారణద్వయమని, ఈశ్వరుడు తనయందు ప్రకాశితమైన జగత్తులో ప్రకాశమానుడైన స్వయంప్రకాశమూర్తి అని, షడ్భావవికారరహితుడని, దేశకాలపరిచ్ఛేద శూన్యుడని, వ్యక్తావ్యక్తాత్మకుడని శ్రీమద్భాగవత తాత్పర్యం. బ్రహ్మము నుంచి ఆవిర్భవించిన సమస్తమూ బ్రహ్మస్వరూపమే. మానవజీవితంలో భాగవత కథాముఖంగా ఆవిష్కరింపబడిన సత్యము, స్వార్థత్యాగము, ప్రేమ, సేవాభావము వంటి మహోన్నతాదర్శాలకు ఎంత ప్రభావమున్నదో, వాటికి వ్యతిరేకరూపాలైన క్రౌర్యము, దారిద్ర్యము, స్వార్థము, సంకుచితస్వభావం, నైతికపతనం, పరపీడారతి మొదలైనవాటికి కూడా అంతే ప్రభావం ఉన్నది. ఈ సుఖ

దుఃఖాలనే వెలుగు నీడల నడుమ నిర్వికారుడై, నిర్వికల్పుడై నిలిచిన పరమపురుషుని యొక్క మహామహిమను శ్రీమద్భాగవతం అభివర్ణిస్తున్నది. ఉపనిషత్ ప్రతిపాదితమైన ఈ అధ్యాత్మతత్త్వమే మనుష్యరూపావతీర్ణుడైన శ్రీకృష్ణ పరమాత్మ. నానాక్లేశమయమైన ఈ సంసారంలో సర్వశుభలక్షణోపేతుడై విరాజిల్లిన ఆ పురుషోత్తముడు – పుంసాంమోహనమూర్తి – ప్రళయపయోధి జలాంతర్వటపత్రశాయి – భక్తాభీష్టవరదాత – శ్రీమన్నారాయణుడు స్వమాయావిలసితమైన జగత్తులో లీలానిమిత్తం మనుష్యరూపాన్ని ధరించి నిస్సంగుడై, నిత్యముక్తుడై ప్రదీపించాడు. ఆయన చర్యలు కర్మబద్ధుల చర్యల వలె కానుపించినా, అవి లోకవిడంబనకు మాత్రమే ఉద్దేశితాలు. నందగోకులంలో ఎదురైన ప్రకృతి వైపరీత్యాలకు, లోకోత్తరసౌందర్యం మూర్తీభవించిన కాంతాలలామల తోడి కేళీవిలాసాలకు, మోక్షాభిరతులైన సంయమీంద్రు లాచరింపదగిన కఠోరదీక్షావ్రతాలకు, రణరంగంలో జరిగిన దారుణ మారణహోమానికి, స్వీయాన్వయంలో తన కళ్ళయెదుటనే సంభవించిన కళత్రబంధుమిత్రపరివార సర్వనాశానికి, ఏ ఘటనకూ ఆయన వశుడు కాక తామరాకుపై నీటిబొట్టు వలె నడుచుకొన్నాడు. లోకవిడంబనార్థమై లౌకికవృత్తి నెరపినట్లు కానవచ్చినా, వాస్తవానికి ఆయన మనస్సు ఏనాడూ చలింపలేదు. సర్వదుఃఖాత్యంతిక లయస్వరూపుడైన ఆ మహానుభావుడు – తానే అన్నట్లు – ఆత్మనిస్సంగత్వాన్ని పూని నిత్యనిరాసక్తుడై కేవల సాక్షిమాత్రునిగా నిలిచి పైచూపులకు మాత్రం కర్మబద్ధుని వలె ప్రవర్తించాడు.

శ్రీకృష్ణుని యొక్క ఈ అతిమానుషతత్త్వాన్ని శ్రీమద్భాగవతం వేయి నోళ్ళతో ప్రశంసించినా, ఈ సత్యాన్ని చూడటం ఇష్టంలేని విమర్శకులు కొంతమంది, ఏవో కొన్ని దోషాభాసాలను ఆరోపించి, ఆయనకు గోపికలతో గల ప్రేమానుబంధాన్ని, షోడశసహస్రాధికంగా అనేక వివాహాలు జరిగి ఉండటాన్ని, అనేకాక్షౌహిణుల సైన్యమూ తత్పరిపాలక రాజన్యమండలమూ మరణించటానికి కారణమైన మహాసంగ్రామానికి రూపకల్పన చేయటాన్ని – ఆయన వర్తనలో లోపాలుగా నిరూపించి, ఆయనను సామాన్యుని వలె

చిత్రించాలని ప్రయత్నించేవారు ఇప్పటికీ ఉన్నారు. వారికి భగవంతునిలో కూడా నీతిబాహ్యమైన వర్తనే కనబడుతుంది. మంచిని త్రోసిరాజని చెడుదే పైచేయిగా ఉంటున్న లోకంలో స్వార్థము, హింస, పైశాచికప్రవృత్తి చేస్తున్న విలయతాండవాన్ని చూసి, వారు సృష్టినిర్మాతగా భగవంతుని పాత్రేమిటని ప్రశ్నిస్తుంటారు. ఈ వర్తన సమవర్తి వర్తన కాదని వీరి తాత్పర్యం. అయితే భగవత్తత్త్వమంటే ఏమిటో తెలిసినవారికి వీరి మాటలు హృదయ శల్యాయమానంగా ఉంటాయి. లోకంలోని సుఖదుఃఖాలన్నీ కర్మబద్ధులైన జీవుల యొక్క కైసేతలని, జగన్నిర్మాతయై ఆ జగదంతరితుడైన శ్రీ భగవానుడు కర్మఫలవాసనలకు, తత్ప్రేరణలకు అతీతుడని, ఆయన కేవలసాక్షిమాత్రుడని, జగత్తుయొక్క గుణదోషాలతో ఆయనకు నిమిత్తం లేదని గ్రహించినవారు భగవన్మాహాత్మ్యాన్ని మనసుకు తెచ్చుకొని, సర్వార్పణశీలంతో ఆ భగవానునికి భక్తిచేయ గలుగుతారు. వీరికి గల అవగాహనశక్తి లోపించిన విమర్శకులు తామే హేతువాదుల మనుకొని 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్న దళానికి సార్థకాన్వయం స్ఫురింపక భ్రమకు లోనై అజ్ఞానమోహితులవుతారు. శ్రీకృష్ణుని యొక్క ఈ అతిమానుషతత్త్వాన్ని అంగీకరించటం ఇష్టం లేక, ఆయనను మానవమాత్రునిగా పరిగణించి, మానవునిగా అతని జీవితాన్ని పరిశీలించాలనుకొనే వారు ఈ దశమస్కంధాన్ని చదవకపోవటమే మంచిది. కనీసం ఆశాభంగమన్నా తప్పుతుంది.

## భక్తి సిద్ధాంతాలు : భాగవతమతం

శ్రీమద్భాగవతంలో ప్రపంచితమైన భక్తిసిద్ధాంతాన్ని అర్థం చేసుకోవాలన్నా, ఇతరసిద్ధాంతాల వెలుగులో శ్రీమద్భాగవత వైదగ్ధ్యాన్ని తులనాత్మకంగా పరిశీలించాలన్నా, మొట్టమొదట మనము ఆ గ్రంథరచనకు పూర్వం లాక్షణికులు సంతరించిన నేపథ్యం ఏమిటో తెలుసుకోవాలి. అనాదిగా వేదకాలం నుంచి భారతదేశంలోని బ్రహ్మవిద్యాసంప్రదాయంలో ఈ భక్తిభావన మనకు పరిచితప్రాయమే. ఋగ్వేదసంహితలో భక్తిభావన తళుకొత్తే సూక్తాలనేకం ఉన్నప్పటికీ వాటికి కూడా ప్రాధాన్యవివక్ష చేత స్తోత్రాలుగా

కంటె యజ్ఞకర్మలలో పఠింపదగిన మంత్రాలు గానే గుర్తింపు లభిస్తూ వచ్చింది. ఈనాడు మనము "భక్తి" అంటున్న భావానికి వేదవాఙ్మయం తొలిదశలో ఉన్న పేరు భక్తి కాదు: శ్రద్ధ. వైదిక సూక్తాలన్నీ ప్రాయికంగా శ్రద్ధాపూర్ణమైనవే. ఈ సూక్తాలన్నీ నానామూర్తిభేదాలతో గోచరిస్తున్న సగుణబ్రహ్మాన్ని ఉద్దేశించినవే గాని పాశ్చాత్యవిద్వాంసు లన్నట్లు "ఇన్‌వోకింగ్ మెనీ గాడ్స్" అనే బహుదేవతోపాసన కానే కాదు. వేదలతాంతాలైన ఉపనిషత్తులలో మనకు కనిపించే జిజ్ఞాసాస్వరూపం ఇదే: ఏది జ్ఞానమో, దానిని సమగ్రంగా తెలుసుకోవాలనే సంకల్పతీవ్రత. సృష్టిరచనలో ఉన్న నానాత్వాన్ని చూసి విహ్వలింపక తదంతరితమైన ఆత్మముయొక్క ఏకత్వాన్ని స్వానుభవసిద్ధం చేసుకోవాలనే తహతహపాటు. జ్ఞానమంటే ఏమిటో, దేని జ్ఞానంవలన జ్ఞాతవ్యవిషయాలన్నీ జ్ఞాతవిషయాలు కాగలవో, శరీరస్థులను సర్వభయాలకు దూరం చేసి అభయదానం చేయగలిగిన ఆ వాస్తవ జ్ఞానంతో జీవకోటి అస్తిత్వంలోని ఏకసూత్రతను గుర్తించి సర్వాత్మభావాన్ని నెలకొల్పాలనే ఉత్తమ లక్ష్యం. బృహదారణ్యకం, ఛాందోగ్యం వంటి ఉపనిషత్తులలో జ్ఞానోపదేశంతోపాటు భక్తిమార్గోద్దీపన కూడా అగపడుతుంది. భగవత్కృపా విపాకాన్ని గురించి కౌషీతకీ కఠోపనిషత్తుల లోను, భక్తితత్త్వాన్ని గురించి శ్వేతాశ్వతరోపనిషత్తు లోను వర్ణనలున్నాయి. భగవంతుడు తనయెడ నిత్యభక్తి కావించి తనను ఆశ్రయించినవారి మొరాలింపగలడని; భగవంతుని యందు, గురువు నందు పరిపూర్ణమైన విశ్వాసం, భక్తిశ్రద్ధలు కలవారికి మాత్రమే ఉపనిషత్ప్రతిపాదితమైన జ్ఞానస్వరూపం బోధ్యమని శ్వేతాశ్వతరం అంటున్నది. ఇక పోతే పురాణాల లోనూ, తత్రాపి మన భాగవతం లోనూ జరిగినదేమంటే, వేదచోదితమైన భగవత్స్వరూపాన్ని ఉపాసించి, ఆ తత్త్వాన్ని స్వానుభవగోచరం చేసికొనగోరిన సాధకులకోసం ఆ వేదోపనిషత్తుల అర్థాన్ని విశదీకరిస్తూ, వాటి సారాంశాన్ని ఇతివృత్తముఖంగా వర్ణించి చెప్పడం మాత్రమే.

'భక్తి' అనే శబ్దం 'సేవించు', 'గౌరవించు', 'ప్రేమించు', 'అభిమానించు' అనే అర్థాలు కలిగిన 'భజ్' ధాతువు నుంచి ఏర్పడింది. వీటన్నింటినీ

భగవంతుని యెడ అన్వయించి, భక్తి అంటే భగవద్భక్తి అనే మనము అర్థం చెబుతున్నాము. అయితే వాఙ్మయంలో ఈ శబ్దం ప్రప్రథమంగా యాస్క నిరుక్తిలో 'ఆలంకారికము', 'శోభావహము', 'సంబంధము' అనే అర్థాలలో ప్రయుక్తమై ఉన్నది. చిరకాలంగా కవులు భక్తిసారస్వతంలో దీనిని భగవద్భక్తి అనే అర్థంలోనే ప్రయోగిస్తూ వచ్చారు. ఈ విధమైన అర్థ విపరిణామం ఆయన మతానుసారం 'మాహాత్మ్య బోధ' (భగవల్లీలల ఆధారంగా భగవంతుని గుణాలను తెలుసుకొని, తత్ప్రసాదనార్థం ఆ గుణాలను వినుతించటం; భగవత్సుందరరూపాన్ని ప్రేమించటం) అనేది భక్తిలక్షణాలలో మొట్టమొదటిది (ఏకాదశ భక్తిలక్షణాలు ఏవంటే :- గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తి అన్నవి). భగవన్మాహాత్మ్యాన్ని గుర్తింపనివారి మనస్సులలో మానవులకు పరస్పరం కలిగే ప్రేమభావాని కంటె ఎంతో ఉదాత్తమైన భగవదంకిత పరమప్రేమోదయానికి అవకాశం ఉండదు. 'అను' అనే ఉపసర్గకు సాతత్యార్థంలో 'అనవచ్ఛిన్న'మనే అర్థం కూడా ఉన్నది. భగవదనురక్తి తైలధార వలె అవిచ్ఛిన్నమని దీని భావం. భగవంతుడే కాదు; అసలు ఏ వస్తువును ప్రేమించాలన్నా, ఏ వస్తువుతో అనుబంధం ఏర్పడాలన్నా, మున్ముందు ఆ వస్తువుయొక్క ప్రాశస్త్యం, తద్గుణమాహాత్మ్యం మన మనస్సులలో ముద్రితం కావాలి. కనుక ఈ ఉపసర్గకు పూర్వోదాహృతమైన అర్థత్రయమూ అన్వర్థమేనని ఇక్కడ ప్రతిపాదింపబడుతున్నది. ఐహికానురక్తి కంటె పరానురక్తి విశిష్ట మనటానికి మరొక కారణం కూడా ఉన్నది. ఐహికమైన అనురక్తి విపరీతపరిస్థితులు ఎదురైనప్పుడు, వ్యక్తి స్వార్థప్రయోజనాలకు భంగం వాటిల్లినప్పుడు ప్రేమను ద్వేషంగా మార్చివేసే లక్షణం కలిగినది. భగవత్పరమైన పరానురక్తి అటువంటిది కాదు. భక్తులకు జీవితంలో ఎదురుదెబ్బలు తగిలి కష్టాలు చుట్టుముట్టినప్పుడు కూడా వారి మనస్సులలో ఆ కష్టాల ప్రభావం ఉండదు. భక్తిభావం చెక్కుచెదరదు. పైగా ఆ కష్టాలు వారి భక్తిభావాన్ని సాంద్రతరీకరించి, వారిని మరింత భగవన్మార్గరతులను కావిస్తాయి.

లాక్షణికనిర్దేశం ఇలా ఉండగా భాగవతంలో నిరూపితమైన భక్తిలక్షణం మరొక విధంగా ఉన్నది. సాంఖ్యతత్త్వాన్ని బోధించిన తర్వాత కపిలభగవానుడు తన తల్లి దేవహూతికి భక్తిరహస్యాన్ని వెల్లడిస్తాడు –

**దేవానాం గుణవిజ్ఞనా మానుశ్రవికకర్మణామ్**
**సత్త్వ ఏవైకమనసో వృత్తిః స్వాభావికీ తు యా.**
**అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్ధే ర్గరీయసీ**
**జరయత్యాశు యా కోశం నిగీర్ణ మనలో యథా.**

(భాగ. 3. 25. 32–33)

ఈ విధమైన భక్తిభావన బౌద్ధవాఙ్మయం నుంచి సంస్కృతంలోనికి ప్రవేశించినదని కొంతమంది అభిప్రాయపడుతున్నారు. భక్తిస్వరూపాన్ని ఉపదేశించిన లాక్షణికులలో ఉత్తమోత్తములైన నారద శాండిల్య మహర్షులలో నారదుడు, 'సా త్వస్మిన్ పరమప్రేమరూపా; అమృతస్వరూపా చ; యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి, అమృతో భవతి, తృప్తో భవతి; యత్ప్రాప్య న కిఞ్చిద్వాఞ్ఛతి, న శోచతి, న ద్వేష్టి, న రమతే, నోత్సాహీ భవతి; యద్ జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి, ఆత్మారామో భవతి' అనే సూత్రాలలో భక్తి స్వరూపాన్ని కరతలామలకంగా వివరించాడు. భక్తి అంటే భగవంతుని యందు పరమప్రేమరూపమైన అనన్యస్థితిమత్త్వం. భగవత్పాదారవింద నిత్యస్మరణ చేత భక్తునికి అమృతత్వసిద్ధి కలుగుతుంది; పరమ ప్రాపణీయమైన దానిని చూరగొన్నామన్న ధృతి చేకూరుతుంది. అసత్తు నుంచి సత్త్వానికి, తమస్సు నుంచి జ్యోతిస్సుకు, మృత్యువు నుంచి అమృతత్వానికి ప్రయాణించి సిద్ధపురుషుడై పరమతృప్తు డవుతాడు. భగవత్ప్రేమామృతపానమత్తుడైన అతని మనస్సులో కోరికలు మొలకెత్తవు. స్వర్గాపవర్గాలను, చివరికి కైవల్యాన్ని కూడా కాదని భక్తిని మాత్రమే కావిస్తుంటాడు. మనోలయం సిద్ధించి రాగద్వేషాలు నశిస్తాయి. నిత్యముక్తుడై కేవలానుభవానందస్థితిలో తన్మయు డవుతాడు. 'యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి, శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః' అనే గీతావాక్యాన్ని ఇక్కడ అనుసంధించుకోవాలి.

భక్తిరసామృతసింధువును గ్రోలి చిత్తాన్ని భగవదాయత్తం చేసి భగవత్ స్మృతి నిలిచినప్పుడు మత్తచిత్తుడై, భంగం వాటిల్లినప్పుడు సాంద్రవేదనా దోదూయమాన మానసుడై తదేకతానంగా జీవితాన్ని గడుపుతాడు. నారదుడు వర్ణించిన భక్తి పరమార్థం ఇది. ఇక శాండిల్యుడు భక్తి అంటే 'పరానురక్తి రీశ్వరే' అన్నాడు. నారద భక్తిసూత్రాల లోనూ 'ఆత్మరత్యవిరోధేనేతి శాణ్డిల్యః' అని ఉదాహరింపబడింది. 'అనురక్తి' అంటే భగవంతుని యందు అవిచ్ఛిన్నమైన ప్రీతి. 'అను' అనే ఉపసర్గకు 'దానిని అనుసరించి', 'తత్సామీప్యము' అనే అర్థాలున్నాయి. ఈ భగవద్రతి పూర్వజన్మ వాసనారూప సంస్కారవిశేషమని ఇక్కడ సూచింపబడుతున్నది. అంటే, బహుజన్మలుగా కావిస్తున్న ఉపాసన ఫలం ఈ రూపంలో వెన్నంటి వచ్చినదన్నమాట. భగవంతుని యొక్క లీలావిశేషాలను సాకల్యంగా ఆకర్ణించి, ఆయన అనుగ్రహశక్తిని, కరుణాతిశయాన్ని మనసా గ్రహింపగలిగితేనే ఐహికవిషయవిముఖమైన ఈ పరానురక్తి చేకూరుతుంది. ఈ విషయమై నారదుని వివరణ ఇంకా విపులంగా ఉన్నది.

"జ్ఞాన కర్మాదులైన ఇంద్రియశక్తు లన్నీ బాహ్యవస్తువులను ఆశ్రయించుకొన్న సుఖానుభవాలకు తహతహలాడటం మానుకొని, నిష్కామరతితో భగవంతుని యందు లగ్నమై శుద్ధసత్త్వస్థితిని సాధించినప్పుడు కలిగే మహానుభవమే భక్తి. అది ముక్తికంటె శ్రేష్ఠమైనది. మనస్సులో చిరకాలంగా నెలవుకొని ఉన్న అవిద్యాకోశాన్ని భస్మసాత్కరించే మహాశక్తి అదే" – అని పైని ఉదాహరించిన భాగవత శ్లోకభావం.

శ్రీమద్భాగవతంలోని వివిధ సన్నివేశాలలో ప్రస్ఫుటించే ఈ భక్తి వర్ణనలు నారద శాండిల్య మతానురోధకంగానే ఉన్నప్పటికీ, మనోబుద్ధీంద్రియాలకు ఐకాగ్ర్యాన్ని ప్రసాదించే ఒక నూతనోత్తేజనగా ప్రకాశించి భాగవత నిరూపితమైన భక్తిసిద్ధాంతం లాక్షణికుల నిర్వచనాల పరిధిని విస్తరింపజేసేదిగా రూపుదిద్దుకొన్నది. ప్రేమ, అనుబంధము అన్నవి సౌందర్య సౌగుణ్యాది శుభలక్షణాలతో వ్యక్తరూపాన్ని ధరించినవారియందు మాత్రమే

ఉదయించేవి కాగా; చిత్తైకాగ్ర్యము చేత, ధ్యాన ధారణాదుల చేత సమాధ్యవస్థను చేరుకోగలిగినవారు నిర్గుణ బ్రహ్మానుభవాన్ని కూడా పరమానురక్తిపూర్వకంగా అధిగమింప గలుగుతారు. ఈ అనురక్తి అనేది ఆసక్తి, భయము, వైరము మొదలైన భావవికృతుల వలన కూడా కలుగవచ్చును. తత్ఫలితంగా ఏర్పడే పరిణామాలు వైరభక్తి, జ్ఞానభక్తి, మూఢభక్తి అని మూడు విధాలు.

## భక్తి రూపాలు : వైరభక్తి

భక్త్యుత్ప్రేరకాలైన ఈ ఆసక్త్యాది భావాలలో భాగవతప్రతిపాదితమైన మొట్టమొదటి భావం వైరభక్తి. భక్తుడు భగవంతునికి విద్వేషరూపంలో భక్తిచేయటం అనే భావన ప్రాచీన భక్తి సూత్రకారుల దృష్టిపథంలో లేదు. అర్వాక్తనుల లోనూ మధుసూదనసరస్వతి, రూపగోస్వామి వంటివారు దీనిని ఆదరింపలేదు. లక్షణవేత్త లందరూ భక్తిమార్గంలో ప్రయాణించేవారికి – ప్రేమింపదగిన వ్యక్తి యందలి ఆనుకూల్యం వలన చిత్తైకాగ్ర్యం కలుగుతుందని, భక్తిభావోదయానికి పూర్వం తత్తదిచ్ఛానుచరణశీలం అనివార్యమని నిర్ణయించారు. అయితే వైరానలం రగుల్కొన్న తర్వాత విజయమో వీరస్వర్గమో అని యుద్ధానికి సిద్ధపడ్డ వ్యక్తియెడ ఈ ఆనుకూల్యమనే భావం కలగటానికే అవకాశం లేదు. భాగవతం మాట అటుంచి సామాన్యుల అనుభవానికి వస్తే, వారి జీవితంలో ఇంత గాఢమైన శత్రుభావం ఏర్పడే సన్నివేశాలుండవు. భాగవతంలో నైనా ఆ విధంగా భగవంతునితో పోరికి దారితీసినవారు సామాన్యులు కారు. హిరణ్యకశిపు రావణాసురుల వంటి వారు అసాధారణ బలసంపన్నులైన మానవాతీత వ్యక్తులు. వారైనా, ఒకప్పుడు భగవత్సన్నిధానవర్తులై తమ సేవాధర్మాన్ని విస్మరించి మహర్షులయెడ కావించిన అపచారానికి ఫలంగా శాపగ్రస్తులై వైకుంఠమందిరాన్ని విడిచి పాపపంకిలమైన జగత్తులోనికి వచ్చిపడ్డ విష్ణుసేవకులు. విష్ణుద్వేషులై భగవంతునితో కయ్యానికి కాలుదువ్వి మూడు జన్మల తర్వాత మళ్ళీ తమ స్థానానికి చేరుకొనవలసినవారు. ఆ మూడు

జన్మలలోనూ భగవదవతారమూర్తులతో మహాయుద్ధం చేసి భగవత్కరకమల సంజాత మోక్షపదవీ నదవీయసులై విరాజిల్లమని వారి నొసట వ్రాసి ఉన్నది. మునిశాపానుసారం వారి మనస్సులలో ప్రగాఢమైన విష్ణుద్వేషం, తీవ్రమైన వైరభావం ప్రజ్వరిల్లసాగాయి. వైరశుద్ధిని కోరి సర్వకాల సర్వావస్థల లోనూ వారు భగవంతుని రూపనామాలనే స్మరించేవారు. అటువంటి తదేకధ్యానం వలన మనస్సు పరివర్తన చెంది, ధ్యేయవస్తువు రూపాన్ని ధారణ చేయగలదని భాగవతం చెబుతున్నది–

**కీటః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమనుస్మరన్**
**సంరమ్భభయయోగేన విన్దతే తత్సరూపతామ్.**

**ఏవం కృష్ణే భగవతి మాయామనుజ ఈశ్వరే**
**వైరేణ పూతపాప్మాన స్త మాపు రనుచిన్తయా.**

(భాగ. 7. 1. 27 – 28)

తేనెపట్టులో చిక్కుకొన్న పురుగు ఆ గోడను చీల్చుకొని బయటికి రాలేక ప్రాణభయంతో కొట్టుమిట్టుకులాడుతూ ఆ తేనెటీగనే తలచుకొంటూ కొంతకాలానికి తానూ తేనెటీగగా మారిపోయినట్లు, మాయామానుషవేషధారి అయిన శ్రీకృష్ణ పరమాత్మనే సంస్మరిస్తూ తదేకధ్యానంగా మెలగిన (శిశుపాలాది) పాపవర్తనుల పాపకర్దమమంతా ప్రక్షాళితమై వారు భగవానుని చేరుకొన్నారు. పైగా వారు పరానురక్తి మార్గాన్ని స్వీకరించి ఉన్నట్లయితే వైరభక్తిలో వలె మూడు జన్మలలో కాక ఏడు జన్మలలో మోక్షాన్ని పొంది ఉండేవారని కూడా చెప్పబడింది. అంతేకాదు. భక్తుల అభీష్టానుసారమే భగవత్కృప పరిపక్వమయింది. తనతో వైరనిర్యాతనను కోరుకొన్న తర్వాతనే భగవానుడు వారితో వైరానికి అంగీకరించాడు. యుద్ధానికి సిద్ధపడి పోరు ఘోరంగా సాగినప్పుడు ఆయన వారి శస్త్రాస్త్రాలన్నింటినీ వమ్ముచేసి, సర్వపరివారాన్నీ తుదముట్టించి సర్వవిధాల వారు ప్రహతాహంభావులైన తర్వాతనే ఆయన వారిని 'కరుణించటం' జరిగింది. అపురూపమైన భక్తిమార్గాన్ని ఎన్నుకొన్నందుకు ఫలంగా వారు భగవత్కరకమలాలలో

మరణానికి నోచుకొన్నారు. భగవద్భతులైనప్పటి పుణ్యమే వారిని స్వస్థానానికి తిరిగి చేర్చింది. ఇంతకు మునుపు చదివిన స్కంధాలలో హిరణ్యాక్ష హిరణ్యకశిపు వధోదంతాలు ప్రసక్తింపబడినా, ఒక్క శ్రీకృష్ణావతారం లోనే బాలఘాతిని పూతన చన్నుగుడిపి నందశిశువును పొట్టన బెట్టుకోవాలని చూసినప్పుడు; శిశుపాల దంతవక్త్రులు శ్రీకృష్ణునితో అకారణ కలహం పెట్టుకొని అంతాన్ని చవిచూసినప్పుడు; మహారణాలలో ఆయనను ఎదిరించిన అసంఖ్యాక సేనానీకం వీరస్వర్గాన్ని అలంకరించినప్పుడు – అనేకానేక సన్నివేశాలలో ఈ వైరభక్తి యొక్క మాహాత్మ్యాన్ని శతధా సహస్రధా వర్ణించటం సంభవించింది.

దీని తాత్పర్యం ఏమిటో వేరే చెప్పనక్కరలేదు. వ్యక్తులయెడ వైముఖ్యము, విద్వేషము మొదలైనవి ప్రేమానురాగాల వలెనే మనస్సులో బలపడినప్పుడు తద్ధ్యేయవస్తువు ఆత్మసాత్కరింపబడటమనేది వింతేమీకాదు. శక్తిమంతమైన ఔషధాన్ని రోగి ఏ ఉద్దేశంతో సేవించినా అది తన ప్రభావాన్ని చూపక మాననట్లే, వైరానికి లక్ష్యం భగవంతు డైనప్పుడు అది వైరమే అయినా చిత్తైకాగ్ర్యానికి ఫలంగా భగవద్ధ్యానం సిద్ధించి ఆయన కరుణ ప్రసరింపకమానదు.

అయితే ఇది సామాన్యులను గురించిన ప్రసంగం కాదు. భగవంతు డంటేనే భయాన్ని కొన్ని మతశాఖలలో కలిగించే ప్రయత్నం జరిగినా ఆ భయం వైరభక్తికి దారితీయగలిగినంత ప్రగాఢంగా ఉండటమన్నది సామాన్యుల ఊహకందని విషయం. భగవంతుడంటే మహాశక్తిసంపన్నుడని, భగవదుపదిష్ట నియమాలను ఉల్లంఘించినప్పుడు పాపవర్తనులను ఆయన భూకంపాలు, అతివృష్ట్యనావృష్టులు మొదలైన ప్రకృతి వైపరీత్యాలతో శిక్షిస్తుంటాడని, ఒక్కొక్కప్పుడు మహాభయానకమైన తన శక్తితో ఘోరాకృతులను సృజించి పాపులను భయపెడుతుంటాడని చెప్పే మతాలున్నాయి. సృష్టికర్తగా, సృష్టిరక్షకునిగా ఆయన రూపం ఎంత ప్రసన్నమధురమైనదో, సంహర్తగా ఆయన రుద్రరూపం అంత భీతావహమైనదనే కల్పన ప్రసిద్ధమే. మానవులు

దురవగాహమైన, అతిమానుషమైన విషయాలను చూసినప్పుడు పొందిన భయాశ్చర్యాలే మతవిశ్వాసాలకు పునాది కావచ్చునని సిద్ధాంతీకరించటానికి ఇటీవలికాలంలో ప్రొఫెసర్ ఓట్టో గారు చాలా కృషి చేశారు. ఈ విధంగా ఒక అజ్ఞాతశక్తి యెడ భయవిస్మయాలను పొందటం ఆద్యదశలో మతవిశ్వాసానికి మూలరూపం కాగా, కొంత కాలానికి మానవుని ఆలోచనాసరళి హేతు – హేతుమద్భావాన్ని సంతరించుకొన్న తర్వాత ఆ భావం భగవంతుని యెడ ప్రేమగా, భక్తిగా క్రమవికాసాన్ని పొంది ఉంటుంది. ఈ నాటికీ ప్రపంచమంతటా వ్యాపించి ఉన్న అనేకమతాలలో భక్తినిభృత విశ్వాసానికి ఈ విధమైన భయవిస్మయతే ఉత్ప్రేరకంగా ఉంటున్నది. భాగవతంలో వర్ణితమైన వైరభక్తి సిద్ధాంతం భగవంతు దంతవానితో ఘర్షణకు సిద్ధపడగల మహాశక్తిమంతులకే తప్ప మనవంటి సామాన్యులకు అనువర్తితవ్యం కాకపోయినా, మొత్తం మీద ఏ మతాన్ని తీసుకొన్నా కొంతకు కొంత భగవద్భీతి అనేది లేకపోలేదని మాత్రం ఒప్పుకోవాలి.

ఇక హైందవేతర ధర్మాల విషయాన్ని పరిశీలిస్తే క్రైస్తవ మతంలో దేవునియెడ సైతానుకు వైరదృష్టి ఉన్నది కాని, అందులోని ఆధ్యాత్మిక చిత్రణతో భాగవతనిరూపితమైన భక్తిసిద్ధాంతానికి పోలిక లేనే లేదు.

అయితే ఒక్క విషయం: లోకసాధారణంగా మనకు కనిపించే మతవైషయిక ఔదాసీన్యం, నాస్తికత పేరిట మిడిమిడిజ్ఞానం, అనిశ్చయవాదం, ఆభాస మాత్రమైన అజ్ఞేయవాదం ఇత్యాదిగా మేధావుల మనుకొనే ప్రబుద్ధుల బుద్ధులను చూసి భాగవతంలో ప్రసక్తమైన వైరభక్తి ఇటువంటిదేనని పొరబడకూడదు. ఎందుకంటె భగవత్స్వరూపాన్ని గ్రహింపగల శక్తి చాలక ఉపేక్ష వహించటానికీ, ఆ తత్త్వగాంభీర్యాన్ని లోనారసి తెలిసికొనలేక ఉపరిశోధనలతో తృప్తిపడి భగవంతుడు లేడని చాటిచెప్పే హేతువాదుల కృతకపాండిత్యానికీ – తీవ్ర విద్వేషాత్మకమైన చిత్తైకాగ్ర్యానికి సాధనభూమిక అయిన ఈ వైరభక్తిభావానికీ హస్తిమశకాంతరం ఉన్నది.

## భాగవతోత్తముల జ్ఞానభక్తి

భాగవతోపదిష్టమైన భక్తిసిద్ధాంతంలో నారద శాండిల్య మతాలలో కంటె జ్ఞానానికి అగ్రతాంబూలం లభించి ఉండటం పరిశీలనయోగ్యమైన మరొక ముఖ్యవిశేషం. జ్ఞానమనేది ఏ శాస్త్రం, ఏ కళ, ఏ మనోభావన, లోకాలోకాలలోని ఏ విషయమైనా కానివ్వండి, దేనిని గురించిన జ్ఞానమైనా, జిజ్ఞాసువుకు ఉండవలసిన మొట్టమొదటి లక్షణం – ఆసక్తి లేదా కౌతూహలం. మొదట జిజ్ఞాస అంటూ ఉంటే జ్ఞానపరమార్థం ఏదో ఒకనాటికి తెలిసివస్తుంది. అందువల్లనే భగవద్గీత జిజ్ఞాసువు కూడా భక్తులలో ఒకడని పేర్కొంటున్నది.

**చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోర్జున**
**ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ, జ్ఞానీ చ భరతర్షభ.**

(భగవద్గీత 7–16)

భక్తుని యొక్క జిజ్ఞాస అంతర్ముఖీనమై ఆత్మతత్త్వాన్ని వివేకించితే, అదే అన్వితాభిధానమైన జ్ఞానయోగం అవుతుంది. ఆధునిక దృష్టి ప్రకారం ఈ అంతర్ముఖీనత మనస్తత్త్వశాస్త్రంలో ఒక భాగం. అయితే భక్తుని యొక్క ఈ జిజ్ఞాస బాహిరజగత్తుకు మళ్ళి ఈ దృశ్యమాన ప్రపంచమంతా మిథ్య అని, భగవంతు డొక్కడే సత్యమని, ఆ భగవంతుడు తానేనని, ఆ తాను పరబ్రహ్మస్వరూపమేనని, అణువునుండి బ్రహ్మాండం వరకు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని, సగుణోపాసనమందు సిద్ధి గడించిన తర్వాత నిర్గుణోపాసన కర్తవ్యమని, ఆ నిర్గుణోపాసన మూలాననే ఆత్యంతిక లయం సిద్ధింపగలదని విశ్వసించి భక్తుడు సాధన మొదలు పెట్టి సచ్చిదానందపరబ్రహ్మమును తెలిసికొనగోరినప్పుడు అదే శ్రీకైవల్యపదాన్ని చేరుకొనటానికి కావించే జ్ఞానభక్తి అని, స్వానుభవంలో తెలిసివస్తుంది. దీనినే మనము ఆధునిక కాలంలో పాశ్చాత్యతత్త్వవేత్తలలో అగ్రేసరుడైన స్పినోజా మహాశయుని మాటలలో చెప్పాలంటే "ఇంటలెక్చువల్ లవ్" అని అంటున్నాము. కేవల జ్ఞానయోగంలో

మనోబుద్ధ్యహంకారాలు ఆత్మమునందు లయింపగా, జ్ఞానభక్తియోగంలో అది భగవంతుని యందు విలీనం కావటం జరుగుతున్నది. పార్యంతికంగా రెండింటి అర్థమూ ఒకటే అయినా, జ్ఞానయోగం ఆచరణక్లిష్టమూ, అవాఙ్మనసగోచరమూ కాగా జ్ఞానభక్తి అనుష్ఠానసులభమై ఫలప్రాప్తిరూపమని చెప్పాలి.

ఈ విధమైన జ్ఞానభక్తిని లక్షణకారులలో అర్వాచీనులు "శాంతభక్తి" అని పేర్కొన్నారు. సర్వేంద్రియశమాన్ని సాధించిన భక్తుడు స్వస్వరూపాన్ని అనుసంధించుకోవటమే ఈ శాంతభక్తి యొక్క లక్షణం. శ్రీమద్భాగవతంలో ఈ విధంగా జ్ఞానభక్తి యోగానుష్ఠానంతో భగవత్సాయుజ్యానికి నోచుకొన్న సనక సనందన సనత్కుమార సనత్సుజాత ఋషభ ముచుకుంద భరత పృథు నారద శుకయోగి ప్రముఖ భక్తవతంసు లెందరో ఉన్నారు. భగవల్లీలాభిజ్ఞానం వలన భక్తి, భక్తితోపాటు భగవదర్పణశీలం అలవడుతాయి. భగవదర్పితులకు తన్మహాభక్తిఫలంగా భగవత్స్వరూప నిష్ఠ కలుగుతుంది. భగవత్సగుణ నిర్గుణ తత్త్వజ్ఞానం చేకూరుతుంది. అటువంటి గంభీరమైన ఐకాంతిక తత్త్వజ్ఞానాన్ని (యూనిటరీ కాన్షస్‌నెస్) శ్రీరామకృష్ణులు "విజ్ఞానము" అని పేర్కొని, విజ్ఞానమయుడైన జీవునకు భగవదైక్యానుసంధానము, భగవంతుని యందు పరమానురక్తి సిద్ధింపగలవని ఉపదేశించారు. భాగవతం కూడా ఈ సగుణ నిర్గుణతత్త్వాన్ని అంగీకరిస్తున్నది. అందుచేతనే శ్రీమద్భాగవతం అధ్యాత్మవిద్యా సంప్రదాయంలో జ్ఞానభక్తిమార్గాలకు సార్థకాన్వయాన్ని సాధింపగలిగింది.

అయితే భాగవతం జ్ఞానప్రాప్తి అనేది కేవలం బుద్ధివ్యాపారనిష్ఠితమనే వాదాన్ని అంగీకరింపలేదు. "ప్యూర్ ఇంటలెక్చువలిజమ్" అనే సిద్ధాంతం ధ్యానం కోసం పొట్టును దంచటం వంటిదని సూక్ష్మంగా మందలించి, ఈశ్వర పరమానురక్తి ఉన్నవారి హృదయాల లోనే బ్రహ్మజ్ఞానరూపమైన పరమసత్యం ప్రకాశింపగలదన్న శ్వేతాశ్వతరోపనిషద్వాక్యాన్ని ఔదల ఘటించింది.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై**

**తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం**
**ముముక్షుర్వై శ్రవణ మహం ప్రపద్యే.**

– శ్వేతాశ్వతరోపనిషత్తు.

భగవంతుని యందలి భక్తి మాత్రమే జ్ఞానపరమార్థాన్ని ప్రసాదించి సర్వమాలిన్యాలను పరిహరింపజేయగలదని భాగవతం నొక్కి వక్కాణిస్తున్నది. ఆకలిగొన్నవాడు అన్నపు ముద్దను తినీతినగానే రుచిమాధుర్యం వలన ఇంద్రియప్రీతి కలిగి ఉదరతాపం శమించి శరీరానికి లేని సత్తువ వచ్చినట్లుగానే భక్తిచేసి భగవదర్పితు లైనవారి మనస్సులలో భగవంతుని యందు పరమప్రేమ, భగవత్స్వరూపజ్ఞానం, ఇహాముత్ర సుఖభోగవిరాగం ఏకకాలంలో సంభవిస్తాయి. భగవల్లీలాకృత్యాల గాఢానురక్తి వలన శాంతభక్తి సిద్ధించి భక్తుడు తనను తాను త్రిశుద్ధికి సమర్పించుకొంటాడు; ఆ సమర్పణ వలన తత్త్వజ్ఞానం; తత్త్వజ్ఞానం వలన విశ్వప్రేమ అలవడుతాయి. ఇటువంటి విశ్వప్రేమకు తావలమైన తత్త్వజ్ఞానాన్ని అన్యసంకుచిత భక్తిమార్గాలతో సరిపోల్చి భాగవతం –

**సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః**
**భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః.**

**ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ**
**ప్రేమమైత్రీకృపోపేక్షా యః కరోతి స మధ్యమః.**

**అర్చాయామేవ హరయే పూజాం యః శ్రద్ధయేహతే**
**న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృతః స్మృతః.**

(భాగ. 11. 2. 45–47)

అంటున్నది. భాగవతుడు అనుష్ఠించే ధర్మాలేమిటని అడిగినప్పుడు ఉద్ధవునికి శ్రీకృష్ణుడు ఈ లక్షణాలను వివరించాడు. భక్తులు ఉత్తములని, మధ్యములని రెండు విధాలట. చరాచరసమస్తభూతాలలో భగవానుడు అంతర్యామియై ఉన్నాడని, ఉపాధి భేదాల వలన ఆత్మభేదాలు కలుగవని

గ్రహించి అన్నిటి యందు ఆత్మదృష్టి కలిగి సమదర్శియై ఉండటం, భగవత్తత్త్వం సర్వత్రపరిపూర్ణమని తెలిసి వర్తించటం ఉత్తమభక్తుని ధర్మాలు. భగవంతుని యెడ ప్రేమ, భగవద్భక్తులతో మైత్రి, మూఢుల యెడ కరుణ, శత్రువుల యెడ ఉపేక్ష కలిగినవాడు మధ్యమభక్తుడు. ఇతనికి భేదభావం ఉన్నందువలన స్వపరతారతమ్యం, సుఖదుఃఖాదులకై హర్షశోకాలు తప్పవు. ఇక భగవంతుని యెడ భక్తిదాల్చటమంటే విగ్రహారాధనమే కర్తవ్యమని భావించి, ప్రతిమాలగ్నమనస్కులై భక్తులను, తదితరులను ఉపేక్షించేవారు ప్రాకృతులు – అని ఈ ఉపన్యాససారం.

## మూఢభక్తి వైశిష్ట్యం

శ్రీమద్భాగవతం ఈశ్వరతాదాత్మ్యమే భక్తియోగలక్షణమని, అనిమిత్తోదితమైన ఆ భక్తి మోక్షాని కంటె గరీయస్తరమని నిరూపించటం వలన వైర – జ్ఞాన – భక్తిమార్గాలకు అతీతమై, శుద్ధమై, తత్త్వవిచారాదులతో సంబంధం లేని మూఢభక్తి అనే మూడవమతం ఒకటి సరిక్రొత్తగా అవతరించింది. ఇది అపరాభక్తిమార్గం. భగవల్లీలాకృత్యాల శ్రవణ మననాదుల పట్ల అభిరుచి, ఫలత్యాగరూపమైన నిష్కామకర్మయోగం మొదలైన సోపానాలను అధిరోహింపకుండానే భక్తిశిఖరాన్ని చేరుకొన్న ఈ అపరాభక్తులు భగవంతుడు 'తమవా' డనే ధృఢవిశ్వాసాన్ని కలిగి ఉంటారు. భక్తి లక్షణకారులలో అర్వాక్తనుడు, గొప్ప అద్వైత సంప్రదాయజ్ఞుడు మధుసూదన సరస్వతి ఒక శ్లోకంలో భక్తుని యొక్క అంతఃకరణపరిపాకాన్ని అనుసరించి ఈ భక్తి 'నేను అతని వాడను' (అహమస్య), 'అతను నా వాడు' (స మమ), 'నేనే అతను' (సోఽహమ్) అనే మూడు రూపాలను ధరిస్తుందని నిర్ణయించారు. భాగవతమతాన్ని బట్టి చూస్తే 'నేను అతనివాడను' (ఐ యామ్ హిజ్), 'అతను నావాడు' (హి ఈజ్ మైన్) అనే భావాలు ఇదే క్రమంలో కాకపోయినా, స్వతంత్రంగా ప్రవర్తిల్లి కొసకు 'నేనే అతను' (ఐ యామ్ హి) అనే తత్త్వజ్ఞానంగా పర్యవసింపగలవని తోస్తుంది. 'సోఽహమ్' అన్నది ఇంతకుపూర్వం వివరించిన జ్ఞానభక్తికి ప్రాతినిధ్యాన్ని వహిస్తుంది. 'స మమ' అనే నిశ్చయం

భగవంతుడు 'తమ వా' డనే దృఢవిశ్వాసం వలన మాత్రమే ఏర్పడగలదు. ఈ నిశ్చయం నరనరాలలో జీర్ణించుకొనిపోయి భగవంతుని యెడల ఆత్మీయతగా పరిణమించి, ఆ ఆత్మీయత మానవులకు పరిచితమైన ప్రేమమార్గాలలో ఒకటిగా రూపుదిద్దుకొని, భగవంతుడు యజమాని అయితే భక్తుడు సేవకునిగా, భగవంతుడు తండ్రి అయితే భక్తుడు సుతునిగా, భర్త అయితే భార్యగా, ప్రియుడయితే ప్రేయసిగా భావించటం జరుగుతుంది. ఆ సమయంలో భక్తునికి భగవంతుడు నిర్విశేష పరబ్రహ్మము, సవిశేష నిరాకారబ్రహ్మము అన్న ధ్యాసే ఉండదు. భగవంతుని యొక్క దివ్యరూపాలను, అవతారాలను స్మరించి, ఆ రూపసౌందర్యాన్ని మనోమయకోశంలో నిలుపుకొంటాడు. ఆ విధంగా తన మనస్సులో నిలిచిన రూపమే పరతత్త్వమని ఐక్యానుసంధానం చేసికొని, ఆ ఆత్మీయమూర్తిని తన ప్రభువు, తల్లి, తండ్రి, అనుగు నెచ్చెలి, ప్రాణనాథుడు, ప్రియసఖుడు అని భావించటమే భక్తి పరమార్థం. భగవంతుని రూపం ఏ రూపమైనా కావచ్చును గాని, ఈ విధమైన ఆత్మీయతాబంధానికి అత్యంతపరిచితమూ, కేవల మానవీయమూ, సౌందర్య సౌగుణ్య సౌభాగ్యాది సర్వశుభలక్షణ సముపేతమూ అయిన భగవదవతారరూపమే ఉపాసనకు అనుకూలంగా ఉంటుంది. ఆ విధంగా భగవంతుడు ధరించిన మూర్తు లన్నింటిలోనూ సకల గుణాశ్రయమైన శ్రీకృష్ణావతార లీలాపురుషవేషం అత్యంతభజనీయమైనది. పరమకళ్యాణగుణాకరమైన ఆ పవిత్రమూర్తితో భక్తుడు ఎట్టి భావమైనా కల్పించుకొనగలడు. ఆయనను ఏ విధంగా నైనా సంబోధింపగలడు. ఏ బంధాన్ని స్మరించినా, అటువంటి సన్నివేశం ఒకటి శ్రీకృష్ణుని జీవితంలో తప్పక ఉండి తీరుతుంది. భగవదవతారాలలో శ్రీకృష్ణావతారం సంపూర్ణావతారమని, అత్యంత విశిష్టమని శ్రీమద్భాగవతం ప్రమాణీకరించటానికి ఇదికూడా ఒక కారణం.

శ్రీమద్భాగవతం లోని ప్రత్యేకత ఏమిటంటే, కథానాయకుడైన శ్రీకృష్ణుని ఇతివృత్తాన్ని, వివిధ భక్తులు ఆయన యెడ కావించిన అనన్యభక్తిని

కుశలధోరణిలో చిత్రీకరిస్తూ ఆ మహాత్ముని జీవితంలో వెల్లివిరిసిన దివ్యప్రేమ దీధితులను పాఠకుల మనస్సుల లోనికి ప్రసరింపజేయటమే. గోపికల కథనే చూడండి. బాల్యవయోవస్థ నాటినుంచి శ్రీకృష్ణుడు ప్రదర్శించిన అసాధారణ లీలల వలన వ్రజవాసులకు ఆయన మహామహిమోపేతుడైన పరమపురుషుడని తెలిసివచ్చినా, అతను 'మనవాడు', 'మన సఖుడు', 'మన ప్రియుడు' అనే ఆత్మీయతాభావం పైకొన్నందువల్ల సర్వేశ్వరేశ్వరుని సన్నిధానంలో వారు చనువు గలిగి సంయోగ వియోగాత్మకమైన అనుబంధాన్ని కలిగి ప్రేమ గలిగి అధికారాన్ని కలిగి ముగ్ధభక్తిని కావింపగలిగారు. భక్తిసూత్రకారులు, మరీ ముఖ్యంగా నారదుడు, ఈ విధమైన ప్రేమ జాగతికబంధాల కంటె ఎంత విశిష్టమో, ఎంత పరమోదాత్తమో స్పష్టీకరించి చూపారు. మానవుల మధ్య తళుకొత్తే ప్రేమ స్వార్థప్రయోజనవంతమూ, సుఖభోగలాలసమూ కాగా భగవంతుని యందలి పరమప్రేమ ఆధ్యాత్మికానందబంధురమూ, నిఃస్వార్థపూరితమూ, సత్త్వోద్రిక్తమూ అని వివరింపబడింది. శ్రీకృష్ణలీలావతార మాహాత్మ్యబోధ గోపికలకు ఆజానజమని కూడా నారదుడన్నాడు. భాగవత కథాభిప్రాయమూ ఈ నిర్వచనతో సంవదిస్తున్నది. అనేక పర్యాయాలు గోపికలు –

**న ఖలు గోపికానన్దనో భవా**
**నఖిలదేహినా మన్తరాత్మదృక్**
**విఖనసార్థితో విశ్వగుప్తయే**
**సఖ ఉదేయివాన్ సాత్వతాం కులే.**

(భాగ. 10.31.4)

అంటూ శ్రీకృష్ణుడు దేవకీనందనుడు మాత్రమే కాడని, సర్వభూతాంతరాత్ముడని ప్రశంసించటమే ఇందుకు నిదర్శనం. మన్ను తినలేదని బాలకృష్ణుడు తల్లికి నోరుతెరిచి చూపినప్పుడు యశోద సకల బ్రహ్మాండభాండాన్ని తన కుక్షిగోళంలో నిక్షిప్తం కావించుకొన్న విరాట్పురుషుని సందర్శించింది. శ్రీకృష్ణుని అతిమానుషతత్త్వాన్ని నిరూపించే ఘటన

లెన్నింటికో గోపకులు సాక్షిమాత్రులుగా నిలిచారు. అటువంటి లోకాశ్చర్యకరమైన అనుభవపరంపర స్మృతిపథంలో నిలిచినంతకాలమూ ఆయన పరమపురుషుడనే అభిజ్ఞానం ఉన్నప్పటికీ, సన్నిధానవర్తియైన ఆ మోహనాకారుని మధురప్రేమకు గోపికలు పారవశ్యాన్ని చెందకుండా ఉండలేకపోయారు. అదే కాకపోతే, వారి మధురప్రేమకు శాంతభక్తితో అభేదాధ్యవసాయం సిద్ధించి ఉండేది. సమస్త చరాచర భూతజాతానికి నాయకస్థానీయుడైన మహానుభావుని నిత్యసాన్నిధ్యానికి నోచుకొని గోపికలు ఆయన 'మనవాడు', 'మన శిశువు', 'మన నెచ్చెలి', 'మన ప్రియుడు' అని మాత్రమే చేరువ కాగలిగారు. వారి ప్రేమభావం ఎంత వినిర్మలమైనా, ఎంత శ్రీకృష్ణ మాహాత్మ్యబోధపూర్వకమైనా, ఊనిక ఆ మాహాత్మ్యబోధ కంటె శ్రీకృష్ణుడు 'మనవాడు' అన్న మమత్వాభిమానంతో కూడినది. భాగవత మతాన్ని బట్టి వారి ప్రేమను దివ్యభక్తిభావనగా ఉద్దీపింపజేసినది వారి ప్రేమాధిక్యమూ, వారి రాగానుభక్తి ప్రభావమూ కాదు; లోకవిడంబనార్థం మనుష్యవేషాన్ని ధరించిన లీలాకృష్ణుడు, భగవత్సంపూర్ణావతారం, ఇనుమును బంగారుగా జీవాత్మను పరమాత్మగా పరిణమింపజేయగలిగిన రససిద్ధుడు, సర్వరసాత్మకుడు శ్రీ వాసుదేవుని యందు భక్తిచేసిన పరమభాగ్యమే. ఆ మహాత్ముడు సర్వాభీష్టవరప్రదాత తనను శిశువుగా భావించిన వారికి శిశువుగా, సఖునిగా సేవించినవారికి సఖునిగా, ప్రియునిగా ఆరాధించినవారికి ప్రియునిగా సాక్షాత్కరించాడు. తనదైన ఆకారమంటూ లేని నీటిని ఏ గిన్నెలో పోస్తే ఆ గిన్నె రూపును గైకొన్నట్లు నిర్గుణుడైన పరమాత్మ తనను ఏ రూపంలో ధ్యానిస్తే ఆ రూపంలో వారి కనులముందు నిలిచాడు. శ్రీకృష్ణార్పితచిత్తలై శ్రీకృష్ణపాదపద్మైక నిరంతర ధ్యానవివశలై శ్రీకృష్ణమయలైన మహాభాగ్యానికి శ్రీకృష్ణపరమాత్మ వారిని కరుణించాడు. శ్రీకృష్ణకరాంగుళిస్పర్శ వలన జన్మజన్మల పాపసంచయం పటాపంచలై మాంసలమైన ప్రేమ నిష్కళంక రాగానుభక్తిగా పరిణమించి ఆధ్యాత్మిక తత్త్వరహస్యాలను వారికి చూరలిచ్చింది. అందుచేతనే, ఏకాదశస్కంధంలో పరమభృత్యుడైన ఉద్ధవునికి సత్సాంగత్య ప్రభావాన్ని తెలియజెప్పి భగవానుడు కేవల భక్తిభావమాత్రాన

గోపికలు, చివరికి నోరులేని జంతువులు కూడా తనతోడి సాయుజ్యాన్ని పొందగలిగారని, విద్యాజ్ఞానం లేకపోయినా సత్సాంగత్యం ఉంటే చాలునని అంటాడు –

**తే నాధీతశ్రుతిగణా నోపాసితమహత్తమాః**
**అవ్రతాతప్తతపసః సత్సఙ్గా న్మాముపాగతాః.**
**కేవలేన హి భావేన గోప్యో గావో నగా మృగాః**
**యేన్యే మూఢధియో నాగాః సిద్ధా మామీయురఞ్జసా.**

(భాగ. 11. 12. 7–8)

అక్రూరుడు బృందావనానికి వచ్చి కంసుని పిలుపు గురించి తెలియజెప్పినప్పుడు గోపికలు నా వియోగాన్ని సహింపలేక పొందిన అవస్థ నాకు మరపు రాదు. వారు నా నుంచి కోరుకొన్నదేమీలేదు. నా కోసం ప్రాణాల నిమ్మన్నా అవలీలగా ఇచ్చివేస్తారు. సర్వకాల సర్వావస్థలలో నాతో ఉండటమే వారికి పరమానందం. ఎవరేమి అడ్డుచెప్పినా కాదని నా చెంతకు వచ్చి మనసులను నా యందే నిలిపి వారు స్వకీయులనే గాక స్వశరీరాలను కూడా విస్మరించారు. వారు విద్యావతులు కారు; ఎటువంటి శుశ్రూషలు ఎరుగరు; ఏ ఉపదేశభాగ్యమూ వారికి కలుగలేదు. కేవలమూ సత్సాంగత్య ఫలమే వారిని దరిచేర్చింది – అంటాడు. రాసలీలాతత్త్వాన్ని పరీక్షితునికి ఉపదేశించే సన్నివేశంలో శుకయోగి –

**కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృద మేవ చ**
**నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే.**

(భాగ. 10. 29. 15)

అని కామక్రోధాలు, భయస్నేహాలు, ఐక్యానుసంధానం – వీటిలో హరిని ఏ భావంతో స్మరిస్తే ఆయన వారిని ఆ భావంతో సమీపింపగలడని వివరిస్తాడు. గోపికలు కామభావంతో, కంసుడు భయం వలన, శిశుపాలుడు

ద్వేషం వలన, వృష్ణివీరులు బాంధవ్యం వలన, పాండవులు ఆత్మీయత వలన బహుభంగుల కొలిచి శ్రీహరికి ప్రీతిపాత్రులైనారని నారద యుధిష్ఠిర సంవాదంలో వచ్చింది.

**కామా ద్ద్వేషా ద్భయా త్స్నేహా ద్యథా భక్త్యేశ్వరే మనః**
**ఆవేశ్య తదఘం హిత్వా బహవ స్తద్గతిం గతాః.**

**గోప్యః కామా ద్భయాత్కంసో ద్వేషా చ్చైద్యాదయో నృపాః**
**సమ్బన్ధా ద్వృష్ణయః స్నేహా ద్యూయం భక్త్యా వయం విభో!**

(భాగ. 7. 1. 29–30)

నారద భక్తిసూత్రాల ప్రసక్తి ఇంతకు మునుపు వచ్చింది. నారదుడు –

1. **తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమవ్యాకులతేతి.**
2. **అస్త్యేవ మేవమ్.**
3. **యథా వ్రజగోపకానామ్.**
4. **తత్రాపి న మహాత్మ్యజ్ఞాన విస్మృత్యపవాదః.**
5. **తద్విహీనం జారాణా మివ.**

అని ఐదు సూత్రాలలో వ్రాశాడు. గోపికల మనస్సులలో మాహాత్మ్యజ్ఞాన విస్మృతి లేదని, అది జారులయందు మాత్రమే సాధ్యమని నారదుని అభిప్రాయం. నారదుని ఈ అభిప్రాయాన్ని ఖండింపగోరి కాబోలు భాగవతం శ్రీకృష్ణుని నోటనే ఈ మాటను అనిపించింది –

**మత్కామా రమణం జార మస్వరూపవిదో బలాః**
**బ్రహ్మ మాం పరమం ప్రాపుః సఙ్గచ్ఛతసహస్రశః.**

(భాగ. 11. 12. 13)

వేలాదిమంది గోపికలు తాను పరబ్రహ్మాత్మకుడని తెలియకపోయినా, జారభావంతో రత్యాసక్తలై తనను వరించి సత్సాంగత్యఫలంగా బ్రహ్మపదవిని

చూరగొన్నారని ఈ శ్లోకభావం. ఈ విధమైన అనుబంధాన్ని వర్ణించే సన్నివేశాలలో భాగవతం ఆ అనుబంధం శ్రీకృష్ణాంకితమే అయినా, ప్రేమికుల ఉజ్జ్వలశృంగారాన్ని తలపింపజేసే కామోద్దీపకమైన లలితశయ్యతో గోపీకృష్ణుల పాత్రలను చిత్రీకరించింది.

దీనిని బట్టి భాగవతంలో సాక్షాత్కరించే వ్యక్తులు లాక్షణికుల భక్తిభావ సూత్రాలకు కట్టుబడరని ప్రతిపాదింపబడుతున్నది. భగవల్లీలావతారంతో తమకు గల సన్నిహితత్వం వలన మాలిన్యక్షాళన జరిగి చిత్తవిచ్ఛిత్తిని సాధించి గోపికలు విగళితవేద్యాంతరమైన బ్రహ్మానందానుభవాన్ని చూరగొన్నారు. ఇటువంటి ఆధ్యాత్మిక సన్నివేశాలలో ప్రసక్తమైనది కర్మఫలవాసనలకు, జ్ఞానేచ్ఛాక్రియాశక్తులకు అన్నింటికీ అతీతమైన భగవత్కరుణ మాత్రమే.

పరమకారుణికస్వభావు డైన ఆ భగవానుని చూపే భక్తులకు దారిచూపే ఉజ్జ్వల దీపకళిక.

## శ్రీకృష్ణ గోపికావృత్తాంతం

ఈ విధంగా శ్రీకృష్ణునికి గోపికలతో గల మధురానుబంధాన్ని పురస్కరించుకొని ఆయన శీలౌన్నత్యాన్ని, ధర్మవర్తనను చులకన చేసి మిథ్యాదోషాలను ఆరోపించటంతో తృప్తిచెందని విమర్శకులు కొంతమంది భాగవతం వంటి భక్తిరసామృతసింధువులో నీతిబాహ్యమైన గోపీ – కృష్ణ రాసలీలాసన్నివేశానికి తావులేదని, అంగాంగవర్ణనలతో కూడిన తుచ్ఛ దైహికశృంగారాన్ని చిత్రించటం వలన అసలే వివాదాస్పదమైన వారి సంబంధం మరింత రసాభాసమవుతుందని వాదిస్తున్నారు. వీరి వాదాన్ని ఖండించటానికి లాక్షణికులు చూపిన ఉపపత్తులలో ముఖ్యమైన కొన్నింటిని పరిశీలిద్దాము:

### 1

గోపీకృష్ణుల వృత్తాంతమంతా వ్యంగ్యమర్యాదచే రచితమైన వేదాంతసారం. భక్తిరసనిధానమైన భాగవతంలో శాంతరసాన్ని భంజింపజేసే

ఘట్టాలకు తావులేదు. స్థూలదృష్టికి గోపికలు శ్రీకృష్ణునియెడ ప్రదర్శించిన భావం లౌకికమైన శృంగారం వలెనే గోచరిస్తుంది కాని సూక్ష్మంగా పరిశీలించినప్పుడు గోపికలు జీవాత్మకు, శ్రీకృష్ణపాత్ర పరమాత్మకు ప్రతీకలని; గోపికల విరహవేదనలో పరమాత్మ కరుణకోసం పరితపిస్తున్న జీవాత్మ తహతహపాటు ధ్వనిస్తున్నదని అర్థమవుతుంది. జీవాత్మ ప్రకృతిమూలకం అని చెప్పటానికి స్త్రీత్వ చిత్రణ జరిగినదని, ప్రకృతి పురుషతత్త్వమే భాగవతనిరూపితమైన గోపీ–కృష్ణ కథానకమని వీరి ప్రతిపాదన. ఈ మతం వారు ధ్వనితార్థాన్ని మాత్రమే గ్రహించి కథాపాత్రల చారిత్రిక విషయాన్ని గురించి అంతగా పట్టించుకోరు. కథ ఒకనాడు జరిగినా, జరగకపోయినా అందులో నిక్షిప్తమై ఉన్న జీవితసత్యాన్ని తెలుసుకొంటే చాలునని, సాహిత్య ప్రయోజనం అంతేనని వీరి అభిప్రాయం.

## 2

శ్రీకృష్ణగోపికావృత్తాంతం వర్ణితమైననాటికి భాగవత కథావర్ణనను బట్టి కృష్ణుని వయస్సు దాదాపు పది లేదా పదకొండు సంవత్సరాలలోపు మాత్రమే. అంతకుమించి ఉండదు. అందువల్ల యుక్తవయస్సు వచ్చిన గోపికల తోడి శృంగార మనిపించే వర్ణన గోకులంలోని బాలబాలికలతో అమాయకంగా ఆటలాడుకొన్న శ్రీకృష్ణుని బాల్యక్రీడలకు అతిశయోక్తిరూపం అయి ఉంటుంది. శ్రీకృష్ణారాధకులలో అధమాభిరుచి కలిగిన క్షీణ తాంత్రికశాఖల వారెవరో ఇటువంటి నిర్వేల శృంగారాన్ని జొప్పించి ఉంటారని ఈ రెండవ మతం వారు వాదిస్తున్నారు. వీరు శ్రీకృష్ణగోపికా వృత్తాంతం అయథార్థం కాదని ఒప్పుకొంటారు కాని నీతిబాహ్యమైన వర్తన విషయాన్ని మాత్రం అంగీకరింపరు.

## 3

ఇక తృతీయ మతం ఏమిటంటే ఈ మతానుయాయులు శ్రీకృష్ణ గోపికావృత్తాంత మంతా చారిత్రికమే కాని గోపికలు ఇంద్రియనిరాసక్తమైన

ఆధ్యాత్మిక ప్రేమభావంతో శ్రీకృష్ణునికి చేరువయ్యారని, ఆ ప్రేమలో మాంసలమైన వాంఛానురక్తి లేనే లేదని అంటున్నారు. ఇందుకు నిదర్శనంగా దశమస్కంధంలో

**నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితా స్తస్య మాయయా**
**మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః.**

(భాగ. 10. 33. 38)

అని గోపికలు శ్రీకృష్ణునితో రాసలీలానిమగ్నలై ఉన్న సమయంలో శ్రీకృష్ణుని మాయవలన గోపకులు తమ కాంతలు తమచెంతనే ఉన్నట్లుగా భావించారని రచితమైన శ్లోకాన్ని వీరు ఉదాహరిస్తున్నారు. మోక్షరతి కలిగిన ఈ ఉజ్జ్వలశృంగారం ప్రబర్హమనటానికి రాసలీలాసన్నివేశం ఉపక్రమణికలో ఉన్న శ్లోకాన్ని కూడా ఉదాహరింపవచ్చును –

**భగవానపి తా రాత్రీః శరదోత్ఫుల్లమల్లికాః**
**వీక్ష్య రన్తుం మనశ్చక్రే యోగమాయా ముపాశ్రితః.**

(భాగ. 10. 29. 1)

శరత్కాలంలో పూర్ణవికసితాలైన మల్లియల సుగంధాలు గుబాళిస్తున్న రాత్రులను చూసి ఆత్మారాముడైన భగవానుడు యోగమాయను పూని రాసకేళీరతు డయ్యాడని ఈ శ్లోక భావం.

## గోపికల ప్రేమ : భాగవత తత్త్వం

ఇంతకీ గోపికాప్రేమ వృత్తాంతాన్ని గురించి భాగవతాభిప్రాయం ఏమిటి? పైని చూపిన మూడు రకాల వివరణలకూ భాగవత మూలంలో ఆధారాలున్న మాట నిజమే కాని, ఈ అధ్యాయాలలో ప్రయుక్తమైన రమణీయ శైలిని, మనోజ్ఞమైన వర్ణనలను పరిశీలిస్తే కవ్యుద్దిష్టాన్ని బట్టి ఈ ఐతిహ్యం సర్వాత్మనా యథార్థమని, గోపీ–కృష్ణుల మధురప్రేమను పూర్వోక్తకోణాలలో ఏ కోణం నుంచయినా వ్యాఖ్యానింపవచ్చునని తేటతెల్లమవుతుంది. అందుచేతనే భాగవతకథాశ్రోత పరీక్షిత్తుకు కూడా ఈ విషయమై సందేహం

ఉదయించింది. "మునీంద్రా! జగదీశ్వరుడు ధర్మాన్ని స్థాపించి, అధర్మాన్ని పరిహరించటానికి నిజాంశతో అవతరించాడని అన్నారు. ఆ విధంగా అవతరించి ఒకప్రక్క ధర్మమర్యాదలను తెలియజేస్తూ, ఆ మర్యాదలను తానై కాపాడుతూ, మరొకప్రక్క తానే అధర్మాన్ని ఎందుకు చేయవలసివచ్చింది? గోపికలు పరదారలు. పరదారలను తాకటం కూడా అత్యంతమైన దోషమని భగవానుడే అన్నాడు. అట్టివాడే పరదారలైన గోపికలతో రమించాడు. ఇది అధర్మమూ, అత్యంతసాహసమూ కాదా? భగవానుడు ఆప్తకాముడని, కామతృప్తి కోసం ఆ విధంగా చేయలేదని, అందువలన అతనియందు దోషం లేదనీ అంటే ఎంత ఆప్తకాముడైనా లోకదృష్టికి నింద్యమైన పనిని చేయవచ్చునా? ఆయన మనోగతం ఏమిటి? ఎన్ని విధాల చూసినా సమాధానం నాకు అంతుపట్టటం లేదు" అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

**సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్య చ**
**అవతీర్ణో హి భగవా నంశేన జగదీశ్వరః.**

**స కథం ధర్మసేతూనాం వక్తా కర్తాభిరక్షితా**
**ప్రతీప మాచరద్బ్రహ్మన్ పరదారాభిమర్శనమ్.**

**ఆప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితమ్**
**కి మభిప్రాయ ఏతం నః సంశయం ఛిన్ది సువ్రత.**

(భాగ. 10.33.27-29)

అప్పుడు శుకమహర్షి కేవలం కథావిషయాన్ని చెప్పుకొని పోవటానికే కూర్చున్నవాడు కాడు కాబట్టి పరీక్షిత్తుకు కలిగిన సందేహమే లోకసామాన్యులకు కూడా కలుగవచ్చునని గ్రహించి, కథాపరమార్థాన్ని ఈ విధంగా వివరించాడు -

**ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాం చ సాహసమ్**
**తేజీయసాం న దోషాయ వహ్నేః సర్వభుజో యథా.**

నైతత్సమాచరేజ్జాతు మనసాపి హ్యనీశ్వరః
వినశ్య త్యాచరన్ మౌఢ్యా ద్యథా రుద్రోబ్ధిజం విషమ్.

ఈశ్వరాణాం వచః సత్యం తథైవాచరితం క్వచిత్
తేషాం యత్ స్వవచోయుక్తం బుద్ధిమాం స్తత్సమాచరేత్.

కుశలాచరితేనైషామిహ స్వార్థో న విద్యతే
విపర్యయేణ వానర్థో నిరహంకారిణాం ప్రభో.

కిముతాఖిలసత్త్వానాం తిర్యఙ్మర్త్యదివౌకసామ్
ఈశితు శ్చేశితవ్యానాం కుశలాకుశలాన్వయః.

యత్పాద పఙ్కజనిషేవ తృప్తా
యోగప్రభావవిధుతాఖిల కర్మబన్ధాః
స్వైరం చరన్తి మునయోపి న నహ్యమానా
స్తస్యేచ్ఛయాత్తవపుషః కుత ఏవ బన్ధః.

గోపీనాం తత్పతీనాం చ సర్వేషామేవ దేహినామ్
యోన్తశ్చరతి సో ధ్యక్షః క్రీడనేనేహ దేహభాక్.

అనుగ్రహాయ భూతానాం మానుషం దేహ మాస్థితః
భజతే తాదృశీః క్రీడాయాః శ్రుత్వా తత్పరో భవేత్.

నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితా స్తస్య మాయయా
మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః.
(భాగ. 10.33.30–38)

"దివ్యశక్తిసంపన్నులైన మహాత్ముల చర్యలు కొన్ని లోకదృష్టికి ధర్మ వ్యతిక్రమాలుగా, సాహసికాలుగా కనుపింపవచ్చును. దగ్ధవస్తువుల గుణదోషాలు అగ్నికి అంటనట్లు ధర్మవ్యతిక్రమాది దోషాలు తేజోవంతులకు అన్వయింపవు. అయితే శిష్టుల విశిష్టకార్యాచరణను చూసి సామాన్యులు కలలో నైనా ఆ మార్గాన్ని అనుకరించకూడదు. పెద్దల హితోపదేశాన్ని

తలదాల్చుటమే మంచిది కాని, వారు చేసినట్లే నేనూ చేయగలననుకోవటం మంచిది కాదు. ఈశ్వరుడు సముద్ర మథనజనిత హాలాహలాన్ని త్రాగాడని సామాన్యులూ విషం త్రాగితే ఏమవుతుంది? అందుచేత పెద్దల నడవడికను పరిశీలించి అందులో వారి ఉపదేశ వాక్యాలతో సరిపడిన కార్యాలను పిన్నలు తప్పనిసరిగా అనుసరించాలి. స్థూలదృష్టికి ధర్మవ్యతిక్రమాలుగా తోచినవాటిని పిన్నలు అనుసరింపకపోవటమే మంచిది. ఎందుకంటే మహాత్ములు అహంకార రహితులుగా ఉంటారు. అహంకార రహితులైనవారు కామసంకల్పవిరహితంగా ఆచరించే కార్యాల అర్థానర్థాలు వారికి చెందవు. అంతేకాదు. మనము పరిశీలిస్తున్నది సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుని యొక్క గుణావగుణాలను. సకల చరాచరభూతజాతానికి అధీశ్వరుడై, తాను జగత్తులో నిలిచి జగత్తులను తనలో నిలుపుకొన్న వాసుదేవునికి గుణదోషబంధనా లుంటాయా? ఆయన ఎంత అవాఙ్మనసగోచరుడో, అంత భక్తసులభుడు. ఆయన పాదపంకజపరాగధ్యానం వలన సంప్రాప్తించిన యోగనిరూఢితో మహామునులు సకలకర్మలను బాసి బంధనిర్ముక్తు లవుతారు. అటువంటి మహాత్ముడు, స్వలీలావిలసనార్థం మానుషవేషాన్ని ధరించినవాడు, పరమహంసలకు సైతం భవబంధాలను ఉన్మూలించి శాశ్వత సుఖాన్ని ప్రసాదింపగలవాడు కర్మబంధాలకు కట్టుబడతాడా? సర్వాంతర్యామియై, సమస్త గోపగోపీజనహృదయాంతర్వర్తియై, వారి మనోబుద్ధీంద్రియాలను నియమించినవాడు, సర్వమయుడు శ్రీకృష్ణుడే తలచుకొంటే సిద్ధింపని దేముంటుంది?

ఇంతకూ రహస్యం ఇది: దేహధారు లందరిపై తన కరుణాతిరేకాన్ని ప్రసరింపగోరి లీలాపురుషరూపాన్ని ధరించిన పరమాత్ముడు, ఆ దేహధారుల మనోభీష్టాలను గ్రహించి, వారికి రుచిగొలిపే తీరున ప్రవర్తించి, వారిని తనవైపుకు ఆకర్షించుకొన్నాడు. వారికి కామజయాన్ని ప్రసాదించాడు. ఆయన మహాప్రభావం వలన వ్రజౌకసులు తమ కాంతలు తమ చెంత నున్నట్లుగానే భావించారు. శ్రీకృష్ణుని వర్తన వారికి ఏనాడూ అసూయగొలుపలేదు" అని శుకమహర్షి వాక్యసారం.

దీనిని బట్టి జీవుల భావనల ప్రకారమే భగవంతుని అనుకంప సయితం వర్తిల్లుతుందని గ్రహించుకోవాలి. 'యద్భావం తద్భవతి' అంటే ఇదే. కంస శిశుపాలాదులు వైరశుద్ధిని కోరి తనయందు లగ్నమనస్కు లైనప్పుడు భగవానుడు ఆయుధాలను చేపట్టి తత్ప్రఘాతాలతో వారిని ఆధ్యాత్మికోన్నతశిఖరాలకు లేవనెత్తాడు. తన లోకోత్తరసౌందర్యానికి, జగన్మోహన వేణుగాన మాధుర్యానికి పరవశించి తనతోడి సంయోగాన్ని కోరి తన చెంతకు వచ్చిన గోపకాంతలకు రాసక్రీడ నెపంతో కామజయాన్ని అనుగ్రహించాడు. అవాప్తసమస్తకాముడైన తనకు సమీపానికి ఇంద్రియకామోద్దీపనతో కాక పరాభక్తిరసోద్దీపనచే వచ్చి చేరిన గోపవనితలకు ఏకాంతభక్తిని ప్రసాదించాడు. బహిర్ముఖ లైనప్పుడు శృంగార రసాకృష్టచేతస్కలైన గోపికలను ఆ మార్గాననే నడిపించి క్రమక్రమంగా వారిని అంతర్ముఖలను కావించాడు. సచ్చిదానంద పరబ్రహ్మ సగుణావతీర్ణుడైన మహానుభావుడు, 'త్వమాదిదేవః పురుషః పురాణ, స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్, వేత్తాసి వేద్యం చ పరం చ ధామ, త్వయాతతం విశ్వ మనన్తరూపమ్' అని గీతాశాస్త్రంలో ప్రశంసింపబడినవాడు, సర్వేశ్వరుడు శ్రీకృష్ణపరమాత్మ తనను అన్వేషిస్తూ వచ్చిన కాముకురాంద్రకు, అభిసారికలకు పరమప్రేమను ప్రసాదించి ఇంద్రియాతీతమైన మహానందాన్ని చూపి పరమహంసలకు మాత్రమే సాధ్యమైన స్వరూపనిష్ఠను అనుగ్రహించాడు. శ్రీకృష్ణగోపికావృత్తాంతం లోని ఈ పరమార్థాన్ని జ్ఞాపకం ఉంచుకొంటే ఏ అపార్థానికి తావుండదు. తత్త్వం ఇదని తెలియక ప్రతీకల మాటున తలదాచుకోవలసిన అవసరమూ ఉండదు. విమర్శకులు వివిధ కోణాల నుంచి చూపించిన ఆ రూపకల్పనమూ, ఆ ఇష్టార్థవ్యంజనలూ భాగవత పాఠంలో ఉన్నమాట నిజమే అయినా, ప్రధానోద్దేశం అది కాదని, **భక్తుడు భగవానుని ఏ పరిస్థితిలో, ఎటువంటి మనస్సుతో ఏ విధంగా ధ్యానించినా** భగవానుడు వారిని ఆ మార్గంలో నడిపించి తన చెంతకు చేర్చుకొని, తన స్పర్శతో పరమపదాన్ని అనుగ్రహిస్తాడని మాత్రం మరిచిపోకూడదు.

**నిభృతమరున్మనోఽక్ష దృఢయోగయుజో హృది య**
**న్మునయ ఉపాసతే తుదరయోఽపి యయుః స్మరణాత్.**

**స్త్రియ ఉరగేన్ద్రభోగభుజదణ్డవిషక్తధియో**
**వయమపి తే సమాః సమదృశోఽఙ్ఘ్రిసరోజసుధాః.**

(భాగ. 10.87.23)

అని భాగవతమే అంటున్నది. భగవానుని అంతరాత్మస్వరూపునిగా గుర్తెరిగి ధ్యానయోగంతో ఉపాసించిన యోగీంద్రులు, సర్వభూతమయునిగా గ్రహించి ఆరాధించిన మునులు, ప్రాణభయంతో వైరాన్ని తెచ్చిపెట్టుకొన్న రాక్షసులు, సర్వపరిత్యాగం చేసి ప్రేమభావంతో వచ్చి తన సంయోగాన్ని కోరిన గోపికలు – అందరూ ఆ సమదర్శి దృష్టిలో సమానమే. నిర్గుణుడు, నిష్క్రియుడు అయిన ఆ మహాత్ముని సగుణరూపాన్ని మనసుకు తెచ్చుకొని, ఆయన పాదసరోజాలను మనఃపీఠికపై నెలకొల్పి తదేకచిత్తులై ధ్యానించినవారికి ఆయన తన్మనోగతుల ననుసరించి తత్తదుచితరూపంలో సాక్షాత్కరించి కోరికలు నెరవేరుస్తాడు. శ్రీకృష్ణుని జీవితకావ్యాన్ని అధ్యయనింపగోరినవారు శ్రీమద్భాగవతం ఆయనను 'భగవాన్ స్వయం' అంటున్నదని, స్థూలసూక్ష్మాత్మకమైన ప్రపంచం ఆయననుండి వ్యక్తమైనప్పుడు – సవిశేషుడైన ఆతడు – ఉపాధిగత మైనప్పుడు జీవుడని, తదంతరాత్మ రూపంలో ఈశ్వరుడని; ఆయనయందు లీనమైనప్పుడు ఆయన నిర్విశేషుడై, అట్టి నిర్విశేషజ్ఞానానికి సహితం ఆధార మైనందువల్ల పరమసత్యమై విభాసిల్లుతుంటాడని, ఆయన శక్తి వలన చరాచరజీవరాశి ఉద్బోధితమై ఉపసంహృతమవుతున్నదని, ఆయన నిత్యముక్తుడని, నిస్సంగుడని, మాయాతీతుడని, అందుచేతనే ఈశ్వరసంజ్ఞితుడని విస్మరింపకూడదు. ఆ సర్వధర్మస్వరూపుని యందు దోషారోపణ కావించటమంటే, దురవగాహమైన లోకాన్ని చూసి దీని సృష్టిలో అసలు అర్థంలేదని అనటం వంటిదన్నమాట. కర్మబంధాలకు అతీతుడైన ఆయన లీలాకృత్యాలు భక్తుల తమో దుఃఖశోకాలను పరిహరించటానికేనని అర్థం చేసుకోవాలి. ఏకాత్మకుడై బహుధా వ్యక్తుడైన ఆ

పురుషధౌరేయుని తదుపజీవ్యులైన మానవులు తమకోసం తత్తత్కాలాలలో కల్పించుకొన్న ధర్మసూత్రాలు శాసింపగల వనుకోవటమే మోహలక్షణం.

## భాగవతంలో శృంగార కవిత

శ్రీమద్భాగవతం వంటి భక్తిరసోజ్జ్వల కృతిలో కామోద్దీపనను కలిగించే శృంగారవర్ణనలు అస్థానపతితాలని వాదించే విమర్శకులకు భాగవతంలోనే సరైన సమాధానం ఉన్నది. భగవానుడు శ్రీకృష్ణునిగా నేలకు దిగివచ్చినది కేవలం పండితులు, వేదాంతశిరోమణులు, సన్న్యాసులు, నీతివిచక్షణులు, శుద్ధాచారవాదుల కోసం మాత్రమే కాదు – తననే మనసారా నమ్ముకొని త్రిశుద్ధికి ఆరాధించేవారి ఆధ్యాత్మిక సాంస్కృతిక నైతిక స్థితిగతులు ఎటువంటివయినా – వారందరికోసమూ ఆయన అవతరించటం జరిగింది. అందరూ భక్తులే అయినా ఒక్కొక్కరి తత్త్వమూ ఒక్కొక్క తీరున ఉంటుంది. వేదాంతికి భగవద్భావన నిర్గుణతత్త్వాల పట్ల ఉన్న ఆసక్తి మహావీరుల పరాక్రమోదంతాలు, సాహసికగాథలంటే ఉండకపోవచ్చును. అదే ఒక పిల్లవాడినో, నిరక్షరాస్యుడైన వ్యక్తినో పలకరించండి: వాళ్ళకు వేదాంతం అనగానే విసుగనిపిస్తుంది. యోధానుయోధుల ధీరవిక్రమాలను, అద్భుతచర్యలను వినిపించండి: చెవికోసుకొంటారు. ఒక దౌత్యనిపుణుడు లేదా రాజకీయవేత్త అయితే ఈ కథల సంగతి అటుంచి రాజ్యపాలన, శాసనవిధినిర్వహణ, మానవ సంబంధాలను గురించి ఆసక్తికరమైన విషయాలేమైనా దొరుకుతాయేమోనని చూస్తారు. కళాకారుడో సౌందర్యారాధకుడో అయితే హృదయాన్ని మత్తెక్కించి ఆనందమయలోకాలలో విహరింపజేసే మధురప్రేమ వర్ణనలకు పరవశించి పోతాడు. నీతిబోధనలు, వేదాంతచర్చలు అతనికి కంపాన్ని పుట్టిస్తాయి. పూర్ణావతరితుడైన శ్రీకృష్ణభగవానుని జీవితం, ఉపదేశాలు ఈ అన్ని రకాల వారిని ఆకర్షించటానికి ఉద్దేశింపబడ్డాయి. అందువల్ల వేదాంతులు, ఉపాసకులు, అవధూతలు, అతిసామాన్యులు, గోపీగోపజనాలు, ప్రేమవివశలైన కాంతామణులు, క్రూరరాక్షసులు, నిరంకుశప్రభువులు, ధర్మపరిపాలకులు,

రాజనీతిజ్ఞులు మొదలుగా పరస్పరనిరుపమానులైన అనేకానేక వ్యక్తులతో ఆత్మీయత నెరపి వైవిధ్య విలసితమైన జీవితాన్ని గడిపి మానవచరిత్రలో అనేక చిరస్మరణీయ సన్నివేశాలకు రూపకల్పన చేసి స్వతఃప్రమాణుడై వర్తిల్లిన శ్రీకృష్ణభగవానుని అవతారకృత్యాలను ఆయన ప్రవచించిన భక్తిమార్గంలో నడిచే భక్తుల కోసం పురాణాలు వేయి నోళ్ళతో వినుతించటం వింతేమీ కాదు. ఆ మార్గాలలో ప్రేమభక్తిమార్గాన్ని అవలంబించి సంస్కృతసాహిత్యం లోని ఉత్తమోత్తమ గ్రంథాలలో ఒకటయిన గీతగోవింద కావ్యాన్ని రచించిన జయదేవుడు శ్రీకృష్ణగోపికామధురానుబంధాన్ని సంగీత సాహిత్య రసనిష్యంద ఋజీషప్రాయమైన మహోజ్జ్వలకవితలో భక్తిపర్యవసితంగా రూపొందించాడు. శృంగారరస ప్రధానమైన ఈ కావ్యం భారతదేశంలోని భక్తిమార్గాన్ని, లలితకళలను ప్రభావితం చేసి భక్తి అంటే ఏమిటో తెలియని వేలాదిమంది సహృదయులను శ్రీకృష్ణభక్తులనుగా మార్చివేసినదంటే కాదనేవారుండరు. ప్రథమదర్శనంలో నీతివిదూరమనిపించే ఈ ఘట్టాలను గురించి –

**అనుగ్రహాయ భూతానాం మానుషం దేహ మాస్థితః**
**భజతే తాదృశీః క్రీడాయాః శ్రుత్వా తత్పరో భవేత్.**

(భాగ. 10.33.37)

**విక్రీడితం వ్రజవధూభిరిదం చ విష్ణోః**
**శ్రద్ధాన్వితో ను శృణుయాదథ వర్ణయే ద్యః**
**భక్తిం పరాం భగవతి ప్రతిలభ్య కామం**
**హృద్రోగ మాశ్వపహినోత్యచిరేణ ధీరః.**

(భాగ. 10.33.40)

అని భాగవతం అంటున్నది. మానవోద్ధరణ కోసం మానవదేహాన్ని ధరించిన పరమాత్మ ఆ మానవులకు తనయందు ఆసక్తిని కలిగించి వారిని తన చెంతకు ఆకర్షించే లీలాకృత్యాలనే ప్రదర్శించాడు. ఆ పరంధాముని పాదపద్మాలను నమ్ముకొని గోపనితంబినులతో ఆయన నెరపిన కేళిలీలలను చదివినవారు, విన్నవారు, వ్రాసినవారు భగవానుని యందు పరాభక్తి కలిగి

కామమనే హృద్రోగం నుంచి విముక్తులై నిష్కామ భక్తిమార్గరతులు కాగలరని ఈ శ్లోకభావం.

ఈ వర్ణనలోని ఆకాంక్షితార్థం ఏమిటంటే శ్రీకృష్ణుని యందు భక్తి కావించే ముముక్షువులు మొదట ఇందులో చిత్రింపబడిన సంఘటనలను గురించి దీర్ఘకాలం ఆలోచింపక తప్పదు. క్రమక్రమంగా వారికి అందులోని నిగూఢ ఆధ్యాత్మిక తత్త్వస్వరూపం తెలిసివస్తుంది. గోపికల విరహవేదనలో పరమాత్మ సంయోగానికై తహతహలాడుతున్న జీవుని వేదన ధ్వనిస్తుంది. ఆ వేదనను ఆత్మసాత్కరించి భక్తుడు తానే గోపికయై, తానే శ్రీకృష్ణవిరహ వేదనాసంతప్తచిత్తుడై భగవత్కృపాలబ్ధి కోసం ఉవ్విళ్ళూరుతుంటాడు. శ్రీకృష్ణుని యెడ గోపికలకు కలిగిన ఈ విరహార్తి నైతికదృక్కోణం నుంచి అనంగీకారయోగ్యమని విమర్శించిన కొంతమంది శుద్ధాచారవాద (ప్యూరిటన్) శిష్యుల నుద్దేశించి ఆ వృత్తాంతం అయథార్థం కావచ్చునని ఏనాడూ శంకింపని శ్రీ రామకృష్ణపరమహంస,

> "గోపికల వర్తన మీకు నచ్చకపోతే ఆ సంగతిని మరిచిపొండి. అయితే ఆ గోపికలకు సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుని యందు గల రాగానుభక్తిలో నూరవ వంతు మీకు లభించినా మీ జన్మ ధన్యమైనట్లే!"

అని ఉపదేశించారు. భాగవత నిర్దేశం – ఏమిటంటే భగవత్ప్రతిస్థాయికమై అత్యంత విలక్షణమైన ఒక భక్తికుల్యను గోపికలు ప్రేమైకసాధనతో త్రవ్విచూపారు. ఆ పరమప్రేమ, ఆ రాగానుభక్తి, ఆ పరమవిరహార్తి కలగాలంటే భాగవతులు ఆ భక్తికుల్య ఉరవడిని తెప్ప నడిపితేనే కాని కష్టాలనుంచి తెప్పరిల్లటం సాధ్యం కాదు.

శ్రీమద్భాగవతాన్ని శ్రద్ధాసక్తులతో అధ్యయనించే పాఠకులు గోపికలకు శ్రీకృష్ణునియందు జనించిన ప్రేమానురాగాది భావాలు భగవద్విషయకమైన భక్తిభావనగా పరిణమించి బ్రహ్మానందానుభవానికి దారితీశాయని తేలికగానే

గుర్తింపగలరు. గోపికలు సామాన్యభక్తుల వలె భక్తిమార్గం లోనికి ప్రవేశించి సాధన మొదలుపెట్టి, ఒక్కొక్క మెట్టు దాటుకొంటూ గమ్యాన్ని చేరుకొన్నవారు కారు. సాక్షాత్పరమపురుషుడైన శ్రీకృష్ణపరమాత్మకు సమకాలంలో జన్మించటం వలన ఆయన సందర్శనభాగ్యానికి నోచుకొని, ఆయన సన్నిధానవర్తినులై పరమపదాన్ని పొందే మహాభాగ్యం వారికి అనాయాసంగా లభించింది. సామాన్యంగా ఆధ్యాత్మికపతనానికి మూలహేతువైన రతివాంఛ శ్రీకృష్ణాయత్త మైనందువల్ల వారి జీవితాలను పవిత్రీకరించి భగవదాకారతారూపమైన మానసవృత్తిని పోషించి పరమానందసాక్షాత్కారాత్మకమైన భక్తిరసాన్ని ప్రతీయమానం చేసింది. ఆయన వారి ప్రేమానురక్తికి స్పందించి, తన దివ్యసన్నిధిని అనుగ్రహించి, అంతలోనే గోకులం నుంచి మథురకు తరలివెళ్ళి మరి తిరగిరాక వారికి చిరవిరహాన్ని కలుగజేశాడు. “విరహార్తి ప్రేమానురక్తిని పెంపొందిస్తుంది. అనతికాలంలో మీకు యోగవియోగాలను సమచిత్తంతో దర్శింపగల బ్రహ్మానందానుభవం సిద్ధింపగలదు” అని వర్తమానం పంపించాడు.

చూడండి –

**ఏష్యామి ద్రా గనుపగమనం కేవలం కార్యభారా**
**ద్విశ్లేషేపి స్మరణదృఢతాసంభవా న్మాస్తు ఖేదః**
**బ్రహ్మానన్దే మిలతి న చిరా త్సఙ్గమో వా వియోగ**
**స్తుల్యో వా స్యా దితి తవగిరా సోఽకరో న్నిర్వ్యథా స్తాః.**

నారాయణీయము (76 :10)

చాలా సంవత్సరాల తర్వాత శ్యమంతపంచకంలో గోపికలు ఆయనను కలుసుకొన్నప్పుడు భరింపరాని విరహవేదన వారి భక్తిభావాన్ని మరింత బలపరిచినదని స్పష్టపడింది. అప్పుడు శ్రీకృష్ణుడు వారికి సమస్త చరాచరభూతజాతంలోనూ అంతర్యామియై వెలుగొందుతున్నది తానే నన్న అభిజ్ఞానాన్ని కలిగించాడు. తన చరమసందేశాన్ని వినిపించాడు –

**మయి భక్తిర్హి భూతానా మమృతత్వాయ కల్పతే**
**దిష్ట్యా యదాసీ న్మత్స్నేహో భవతీనాం మదాపనః.**

**అహం హి సర్వభూతానా మాది రన్తోన్తరం బహిః**
**భౌతికానాం యథా ఖం వాభూర్వాయు ర్జ్యోతి రఙ్గనాః.**

**ఏవం హ్యేతాని భూతాని భూతేష్వాత్మాత్మనా తతః**
**ఉభయం మయ్యథ పరే పశ్యతాభాత మక్షరే.**

(భాగ. 10. 82. 45–47)

ఇంద్రియప్రీతిపరం కాక ఆత్మప్రీతిపరమైన భక్తి నన్ను పొందటానికి పరమసాధనం మాత్రమే కాదు; భక్తులకది అమృతాన్ని కల్పిస్తుంది. అటువంటి పరాభక్తి మీకు నా యెడ కలగటమన్నది మీ చిరకాల భాగ్యవిశేషం. పంచభూతాల వలన భౌతిక పదార్థాలు సంభవిస్తూ తుదకు అందే లయిస్తున్నట్లు సర్వభూతాలు నా యందే పుట్టి నా లోనికే చేరుతున్నాయి. ఓ అంగనలారా! ప్రపంచమంతా చతుర్విధభూతమయమై ఉన్నది. ఆ భూతాలకు పంచ మహాభూతాలు కారణాలు. అందువలన చతుర్విధభూతాలు తమకు కారణాలైన పంచమహాభూతాలలో వర్తిల్లుతుంటాయి. భూతభౌతికరూపమైన ఆ భోగ్యానికి భోక్త ఆత్మవస్తువే. ఈ భోగ్య – భోక్తలు రెండూ పూర్ణుడనైన నాలోనే ఉంటాయి. ఆత్మమన్నది భోగ్యవస్తువులలో భోక్తృరూపంలో వ్యాపించి ఉన్నదే తప్ప అది వాటికి కారణం కాదు” అని శ్రీకృష్ణుడు వారికి అధ్యాత్మజ్ఞానం ప్రసాదించాడు.

దీనినిబట్టి మూఢభక్తి అంటే భగవన్మాహాత్మ్యబోధశూన్యమైన భక్తికాదని ఏర్పడుతున్నది. ఒకవేళ ఆదిలో ఆ విధంగా ఉన్నా, అంతంలో భగవన్మాహాత్మ్యబోధ, పూర్ణప్రజ్ఞ సిద్ధించి తీరుతాయి.

జ్ఞానం వలన భక్తి సన్నగిల్లదు; మరింత బలపడుతుంది.

## భక్తి : పంచమపురుషార్థం

భక్తిభావోద్దీపన వలన కూడా జ్ఞానోపలబ్ధి సాధ్యమని పూర్వాధ్యాయంలో నిశ్చయించాము. ఈ జ్ఞానమే భగవదైక్యానుసంధాన కారకమై 'సోహమ్' అన్న ప్రజ్ఞను జీవప్రజ్ఞలో ఉద్బోధింపజేస్తుంది. శ్రీకృష్ణగోపికావృత్తాంతంలో భక్తివివశలైన గోపికలు శ్రీకృష్ణతాదాత్మ్యాన్ని పొంది తామే శ్రీకృష్ణుల మైనట్లుగా భావించారని చెప్పబడింది. అప్పటి వారి మనఃస్థితిని శ్రీకృష్ణుడే స్వయంగా ద్వాదశాధ్యాయంలో –

**యత్పాదపాంసు ర్బహుజన్మకృచ్ఛ్రతో**
**ధృతాత్మభి ర్యోగిభి ర ప్యలభ్యః**
**స ఏవ యద్దృగ్విషయః స్వయం స్థితః**
**కిం వర్ణ్యతే దిష్టిమతో వ్రజౌకసామ్.**

(భాగ. 10. 12. 12)

అని అభివర్ణించాడు. "నా యందు పరానురక్తి సిద్ధించి, నా యందే లగ్నమనస్కలై గోపికలు – ఆత్మరతులైన యోగులు, సముద్రాన్ని చేరుకొన్న నదీజలాలు స్వరూపనాశాన్ని చెందినట్లు – సమస్తప్రపంచాన్ని, చివరికి తమను తాము కూడా మరిచిపోయి నన్నే భజించారు" అన్నాడు.

అయితే, జ్ఞానభక్తికి పరమలక్ష్యమైన సాయుజ్యమూ, ఈ తాదాత్మ్యమూ ఒకటి కావు. సాయుజ్యమంటే – సముద్రంలోకి ప్రవేశించిన తర్వాత నదీజలాలు సముద్రరూపాన్ని పొంది నదీధర్మాన్ని కోల్పోయినట్లు కేవల తత్త్వమైన శ్రీ భగవానుని యందు ఐక్యమైన జీవుడు తన జీవలక్షణాన్ని కోల్పోయి భగవంతుని తేజస్సులో విలీనమైపోతాడు. దీనినే ముక్తి అంటున్నాము. ముక్తి పొందిన తర్వాత జీవునికి జీవధర్మం ఉండదు. అయితే వ్రజౌకసులు, తదనువర్తులు అభ్యసించిన పరానురక్తి పథంలో ఈ విధమైన ముక్తిని పొందాలనే కోరికకు తావే లేదు. పరానురక్తిపథంలో భక్తి పరిపక్వమై, ఈశ్వరుని యందు వసిస్తున్న జగత్తులో ఈశ్వరుని యొక్క ఉనికిని గుర్తించి,

ఈశ్వరుడే సర్వమయుడన్న అభిజ్ఞానం కలగటం జరుగుతుంది. సాయుజ్యం అంటే జీవుడు భగవంతుని యందు లీనమై ఆత్యంతిక లయాన్ని పొందటం అన్నమాట. భక్తిపథంలో ఈ అత్యంతిక లయాన్ని ప్రశంసించటం జరగలేదు. భక్తునికి మోక్షకామన లేకపోవటమే దీనికి కారణం. భక్తి కావించటం వలన జీవునికి అనుస్యూతమైన భగవత్సేవాభావం, ఆయనతో ఒక వ్యక్తిగతమైన అనుబంధం ఏర్పడుతాయి. భక్తుడు భగవంతుని యొక్క నిత్యసేవకు డవుతాడు. జీవించి ఉన్నంత కాలమూ భగవత్సేవానిరతుడై భాగవతోత్తముడై సర్వవిధాల భగవంతుని అర్చించుకొంటూ, సమస్తభూతజాతాన్ని తదర్చామూర్తులుగా సంభావిస్తూ నిరీహుడై భక్తి సలుపుతాడు. కర్మబద్ధమైన శరీరం పతనమైన తర్వాత జన్మపరంపరకు కారణమైన ప్రాకృతిక సంచరం సిద్ధించి భక్తునికి శుద్ధసత్త్వస్థితి చేకూరుతుంది. దీనికే **భాగవతీ తనువు** అని పేరు. ఈ స్థితిలో భక్తుడు నిరతిశయ మహాతేజ ఆనందోజ్జ్వలమైన వైకుంఠమందిరంలో నిలిచి, భగవంతుడు ధర్మసంస్థాపనార్థం లీలావతారాలను ధరించినప్పుడు భగవదనుచరుడై నేలకు దిగిరావటం జరుగుతుంటుంది. ఈ విధంగా భాగవతోత్తములను సర్వోత్తములుగా పరిగణించి, భక్తిని మోక్షానికంటె గరీయమని నిశ్చయించటం వలన పురుషార్థాలలో తురీయాతీతస్థితిని అభినవంగా ప్రకల్పించి, భక్తిని ధర్మార్థకామమోక్షాలకు అతీతమైన పంచమ పురుషార్థం అన్నారు.

## భక్తి : ప్రీతి

ఈ అధ్యాయారంభంలో ప్రస్తరించిన వైరభక్తితోపాటు శ్రీమద్భాగవతంలో ఇంకా రెండు భక్తిమార్గా లున్నాయని మనమనుకొన్నాము.

సాధకుడు 'నేను భాగవతుడను; భగవదధీనుడను' అని సాధన మొదలుపెట్టి తత్ఫలంగా జ్ఞానాన్ని పొంది, భగవన్మాహాత్మ్యాన్ని గుర్తెరిగి అంతంలో భగవత్సాయుజ్యాన్ని చెందటం ఉన్నది. ఇది శాంతభక్తి మార్గం.

రెండవది 'భగవంతుడు నావాడు' అని నమ్మి, భగవంతుని యందు

పరమప్రేమను కలిగి ఉండటం. ఇది ప్రేమభక్తి మార్గం. ఈ కోవకు చెందిన వారు భగవంతుని పరమాప్తునిగా, ప్రభువుగా, శిశువుగా, సఖునిగా, పతిగా లేదా ప్రియునిగా భావించి గాఢానురక్తితో ఆయనను ప్రేమించటం జరుగుతుంది. భక్తునికి మొదట భగవంతునిపై శ్రద్ధ, తర్వాత సజ్జనసాంగత్యం, భజనము, అనర్థనివృత్తి, ఆ పైని నిష్ఠ, అభినివేశం, తన్మూలాన అత్యంతాసక్తి, అందువలన భావం, చివరికి ప్రేమ సిద్ధిస్తాయని భక్తిరసామృతసింధువు అంటున్నది.

చూడండి –

**ఆదౌ శ్రద్ధా తత స్సాధుసఙ్గోఽథ భజనక్రియా**
**తతోఽనర్థనివృత్తి స్స్యా త్తతో నిష్ఠారుచి స్తతః**
**అథాసక్తి స్తతో భావ స్తతః ప్రేమాభ్యుదఞ్చతి.**

ఈ విధంగా భావనీయమౌతున్న శాంత – ప్రేమ భక్తిమార్గద్వితయాన్ని సూక్ష్మేక్షికతో పరిశీలించిన డా॥ భట్టాచార్యగారు "ది ఫిలాసఫి ఆఫ్ ది భాగవత" అనే ఉద్గ్రంథంలో భగవత్సాయుజ్యానికి దారితీసే మార్గాన్ని జ్ఞానమిశ్ర భక్తిమార్గమని, మమత్వాభిమానంతో కూడిన భక్తిని ప్రీతి (నిష్కల్మష నిష్కామ ప్రేమపూర్వకంగా మహానందంతో భగవానుని సేవించి, ఆ సేవయే పరమార్థమని భావించటం) అని ప్రతిపాదించారు. వైష్ణవులలో చైతన్య మతానుయాయుల వలన ఈ 'ప్రీతి' అనే శబ్దానికి ఎంతో ప్రాధాన్యం వచ్చింది. అర్వాక్తనులలో భక్తిలాక్షణికులలో అగ్రేసరుడైన అద్వైతి మధుసూదన సరస్వతి జ్ఞానమిశ్రమైన భగవత్ప్రీతి శాంతభక్తి యొక్క పరిశుద్ధరూపమని నిశ్చయించారు. అనంత కళ్యాణగుణాకరుడైన భగవానుని దివ్యలీలలను నిరంతరం విన్నందువలన సాధకుని యొక్క మనస్సులో ఆయన మాహాత్మ్య బోధ కలుగుతుంది. భగవానుడు మహానందస్వరూపుడని విదితప్రాయ మవుతుంది. భగవత్సేవాహేవాకంతో భక్తుడు ప్రాప్తమనోరథు డవుతాడు. మమత్వ పరిధిని అతిగమించి ఈశ్వరుని సర్వమయునిగా భావించిన భక్తుని మనస్సులో భగవానుని యెడ పరానురక్తి స్థిరపడుతుంది.

అచ్చులో పోసిన మైనం బొమ్మగా మారినట్లు భగవంతుని యందు నెలకొన్న మనస్సు భగవదాకారిత మౌతుంది. ఈ క్రమాన్ని దృష్టిలో ఉంచుకొని శాంతభక్తియే భక్తి యొక్క విశుద్ధరూపమని మధుసూదన సరస్వతి నిర్వచించారు.

సర్వసంగాలను అవలీలగా విడిచిపెట్టి భగవంతుని యందు రతిస్థాయికమైన భక్తి చేయబూనినవారు మళ్ళీ ఆ భగవంతునితో ప్రాకృతిక బంధాలను కల్పించుకోవటం చిత్రంగానే ఉంటుంది. భగవంతుడు, భక్తుడు – వీరిరువురి సంబంధమూ వైయక్తికతను సంతరించుకొని స్వామి – సేవకభావంగా, పితాపుత్రభావంగా, పతిపత్నీభావంగా పరిమిత మైనప్పుడు ఆ బంధంలో ఆధ్యాత్మిక శక్తి లోపించి అది కేవలం ఒక ఆరాధన విధానం అవుతుంది. ప్రాకృతికంగా ముసురుకొన్న భావపరంపర దైవీభావనకు అడ్డునిలుస్తుంది.

అంతమాత్రాన భక్తులలో తారతమ్యభేదాలను ఆరోపించటం ఉచితం కాదు. శ్రీకృష్ణగోపికావృత్తాంతమే ఇందుకు నిదర్శనం. గోపికలు శ్రీకృష్ణుని ఆత్మేశ్వరునిగా భావించి ప్రేమభక్తిపరాయణలై భగవత్సాంగత్యఫలంగా పరమానందాన్ని చూరగొన్నారు. మోక్షాని కంటె శ్రీకృష్ణుని సన్నిధి సేవే జీవితపరమార్థమని భావించారు.

ఈ విధంగా ఐక్యభావతరళితమైన ఏకాంత భక్తిని, ఏకాంత సేవను వైష్ణవమతంలో చైతన్య సంప్రదాయంవారు ధన్యధన్యమని భావిస్తున్నారు. విశిష్టమైన ఈ భక్తిమార్గాన్ని ప్రపంచించినవారిలో జీవ గోస్వామి పేరు విననివారుండరు. ఆయన మాటల్లో పరబ్రహ్మమంటే సగుణ నిర్గుణాత్మకం. నిర్గుణమైన బ్రహ్మము సగుణాభివ్యక్తిని పొందినప్పుడు అనంత మహిమోపేతుడైన భగవానునిగా వ్యవహరింపబడుతున్నది. ఈ సగుణవ్యక్తినే భక్తులు పరమాప్తునిగా భావించి మమకారాన్ని పెంచుకొంటారు. ఇది ద్వైతభావశిష్టమై మమత్వాభిమానపూరితమైన భక్తి విధానం. వీరికి నిర్గుణమైన బ్రహ్మమును ఉపాసించటం కంటె మూర్తిసేవనమే ప్రధానతర మవుతుంది.

అనైకాంతిక మార్గాలన్నీ పరిసరీయాలని, ఏకాంతసేవనమే పరమాచరణీయమని అంటారు. జ్ఞానలబ్ధమైన శాంతభావంతో భగవానుని ఉపాసించటం వలన కేవలం తలపోలాన్ని మాత్రమే చేరుకొనగలమని, ఏకాంత భక్తిలో ఉన్న ఆత్మీయతానురాగాలు మరెక్కడా ఉండవని వీరి తాత్పర్యం. భగవానుని పరమాత్మీయునిగా భావించి, పరానురక్తిని పెంచుకొన్నప్పుడు మాత్రమే భక్తి భావన ఉద్దీప్తమై చిత్తవిచ్ఛిత్తి చేకూరి విగళితవేద్యాంతరమైన బ్రహ్మానందరసానుభవానికి అవకాశం ఏర్పడుతుంది. ఆ కేవలానుభవానందస్థితిలో భక్తుడు భగవానునితో ఏకత్వాన్ని భజిస్తాడు. ఇంద్రియాతీతమైన ఆ స్థితికీ నిర్గుణ బ్రహ్మానుభవానికీ అభేదం. అందువల్ల శాంతభక్తి మార్గానురోధకులు ఏ మమకారాన్ని జ్ఞానానికి అవరోధ మనుకొంటున్నారో, అదే మమకారం అంకురిత కోరకిత కుసుమిత ఫలిత లలితమై ఉదాత్తమైన ప్రీతిభావనగా రూపుదిద్దుకొని కేవలానందఘనుడైన భగవానునితో ఐక్యానుసంధానం కలిగిస్తున్నది. ఈ విధంగా ప్రీతిమార్గాన్ని భజించినవారు జ్ఞానసాధ్యమైన భగవత్సాయుజ్యాన్ని కూడా ఆధ్యాత్మిక వికాసానికి అడ్డుగానే పరిగణిస్తారు. సాధకుడు ఏకాంతభక్తి ప్రఫుల్లమైన పరిశుద్ధమనస్సుతో భగవంతుని త్రిశుద్ధికి ఆరాధించటమే పరమపురుషార్థసాధనమని ఈ మతసారాంశం.

శ్రీమద్భాగవతంలో జీవ గోస్వామి అభిప్రాయాన్ని సమర్థించే ఘట్టాలు అనేకానేకం ఉన్నాయి. “నా యందు మనసు లగ్నంచేసి సుఖదుఃఖ రాగద్వేషాది ద్వంద్వభావాలకు లోను గాక సర్వసమచిత్తులై భక్తికావించిన సాధువులకు నేను భార్య సేవలకు మెచ్చిన భర్త వలె వశవర్తినై ఉంటాను. నా సేవలో జీవితపరమార్థాన్ని దర్శించి నా భక్తు లైనవారు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాది రూపమైన మోక్షాన్నే కోరుకొనరు కదా, కాలగతికి నశించే సామాన్యవస్తువులను కోరుకొంటారా?” అని అంబరీషోపాఖ్యానంలో శ్రీకృష్ణుడు దుర్వాసునితో అంటాడు –

**మయి నిర్బద్ధహృదయాః సాధవః సమదర్శనాః**
**వశీకుర్వన్తి మాం భక్త్యా సత్స్త్రియః సత్పతిం యథా.**

**మత్సేవయా ప్రతీతం చ సాలోక్యాదిచతుష్టయమ్**
**నేచ్ఛన్తి సేవయా పూర్ణాః కుతోన్య త్కాలవిద్రుతమ్.**

(భాగ. 9. 4. 66–67)

భక్తి మాహాత్మ్యాన్ని ప్రబోధించే సత్ప్రసంగాలు శ్రీమద్భాగవతంలో ఇంకా అనేకం ఉన్నాయి. స్థలాభావం వలన కొన్నింటిని మాత్రమే ఇక్కడ పొందుపరుస్తున్నాము:

**1**

**స వై పుంసాం పరో ధర్మో యతో భక్తి రధోక్షజే**
**అహైతుక్యప్రతిహతా యయాత్మా సమ్ప్రసీదతి.**

**వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః**
**జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం చ యదహైతుకమ్.** (1. 2. 6–7)

**2**

**ప్రాయేణ మునయో రాజన్ నివృత్తా విధిషేధతః**
**నైర్గుణ్యస్థా రమన్తే స్మ గుణానుకథనే హరేః**
**ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్**
**అధీతవాన్ ద్వాపరాదౌ పితు ద్వైపాయనా దహమ్.**

**పరినిష్ఠితోపి నైర్గుణ్యే ఉత్తమశ్లోకలీలయా**
**గృహీతచేతా రాజర్షే ఆఖ్యానం యదధీతవాన్.** (2. 1. 7–9)

**3**

**నాత్యన్తికం విగణయ న్త్యపి తే ప్రసాదం**
**కిన్త్వన్యదర్పితభయం భ్రువ ఉన్నయై స్తే**

**యేఙ్గ త్వదఙ్ఘ్రిశరణా భవతః కథాయాః**
**కీర్తన్యతీర్థయశసః కుశలా రసజ్ఞాః.**

**కామం భవః స్వవృజినై ర్నిరయేషు నః స్తా**
**చ్చేతోలివ ద్యది ను తే పదయో రమేత**
**వాచశ్చ న స్తులసివ ద్యది తేఙ్ఘ్రిశోభాః**
**పూర్యేత తే గుణగణై ర్యది కర్ణరన్ధ్రః.** (3.15.48–49)

**4**

**యా నిర్వృతి స్తనుభృతాం తవ పాదపద్మ**
**ధ్యానా ద్భవజ్జనకథాశ్రవణేన వా స్యాత్**
**సా బ్రహ్మణి స్వమహిమన్యపి నాథ మాభూ**
**త్కిన్త్వన్తకాసిలులితా త్పతతాం విమానాత్.** (4.9.10)

**5**

**న కామయే నాథ తదప్యహం క్వచి**
**న్న యత్ర యుష్మచ్చరణామ్బుజాసవమ్**
**మహత్తమాన్తర్హృదయా న్ముఖచ్యుతో**
**విధత్స్వ కర్ణాయుత మేష మే వరః.** (4.20.24)

**6**

యస్యామేవ కవయ ఆత్మాన మవిరతం వివిధవృజిన సంసారపరితాపో పతప్యమాన మనుసవనం స్నాపయన్త స్తయైవ పరయా నిర్వృత్యా హ్యపవర్గ మాత్యన్తికం పరమపురుషార్థ మపి స్వయ మాసాదితం నో ఏవాద్రియన్తే భగవదీయత్వేనైవ పరిసమాప్తసర్వార్థాః

**రాజన్ పతి ర్గురురలం భవతాం యదూనాం**
**దైవం ప్రియః కులపతిః క్వచ కిఙ్కరో వః**

అస్త్వేవ మఙ్గ భగవాన్ భజతాం ముకున్దో
ముక్తిం దదాతి కర్హిచిత్స్మ న భక్తియోగమ్. (5.6.17-18)

**7**

ముక్తానా మపి సిద్ధానాం నారాయణపరాయణః
సుదుర్లభః ప్రశాన్తాత్మా కోటిష్వపి మహామునే. (6.14.5)

**8**

తుష్టే చ తత్ర కిమలభ్య మనన్త ఆద్యే
కిం తై ర్గుణవ్యతికరా దిహ యే స్వసిద్ధాః
ధర్మాదయః కి మగుణేన చ కాజ క్ష తేన
సారంజుషాం చరణయో రుపగాయతాం నః. (7.6.25)

**9**

ప్రత్యానీతాః పరమ భవతా త్రాయతా నః స్వభాగా
దైత్యాక్రాన్తం హృదయకమలం త్వద్గృహం ప్రత్యబోధి
కాలగ్రస్తం కియదిదమహో నాథ శుశ్రూషతాం తే
ముక్తి స్తేషాం నహి బహు మతా నారసింహో పరైః కిమ్.
(7.8.42)

**10**

నాహ మాత్మాన మాశాసే మద్భక్తైః సాధుభి ర్వినా
శ్రియం చాత్యన్తికీం బ్రహ్మన్ యేషాం గతి రహం పరా.

యే దారాగారపుత్రాప్తాన్ ప్రాణాన్ విత్తమిమం పరమ్
హిత్వా మాం శరణం యాతాః కథం తాం స్త్యక్తు ముత్సహే.

మయి నిర్బద్ధహృదయాః సాధవః సమదర్శనాః
వశీకుర్వన్తి మాం భక్త్యా సత్స్త్రియః సత్పతిం యథా.

మత్సేవయా ప్రతీతం చ సాలోక్యాదిచతుష్టయమ్
నేచ్ఛన్తి సేవయా పూర్ణాః కుతోన్య త్కాలవిద్రుతమ్.

(9.4.64–67)

**11**

న నాకపృష్ఠం న చ సార్వభౌమం
న పారమేష్ఠ్యం న రసాధిపత్యమ్
న యోగసిద్ధీ రపునర్భవం వా
వాఞ్ఛన్తి యత్పాదరజః ప్రపన్నాః. (10.16.37)

**12**

న వయం సాధ్వి సామ్రాజ్యం స్వారాజ్యం భౌజ్యమప్యుత
వైరాజ్యం పారమేష్ఠ్యం చ ఆనన్త్యం వా హరేః పదమ్.

కామయామహ ఏతస్య శ్రీమత్పాదరజః శ్రియః
కుచకుఙ్కుమ గన్ధాఢ్యం మూర్ధ్నా వోఢుం గదాభృతః.

(10.83.41–42)

**13**

దురవగమాత్మ తత్త్వనిగమాయ తవాత్తతనో
శ్చరితమహామృతాబ్ధిపరివర్త పరిశ్రవణాః
న పరిలషన్తి కేచి దపవర్గ మపీశ్వర తే
చరణసరోజ హంసకులసఙ్గ విసృష్టగృహాః. (10.87.21)

**14**

న పారమేష్ఠ్యం న మహేన్ద్రధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్
న యోగసిద్ధీ రపునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్. (11.14.14)

**15**

**అస్మింల్లోకే వర్తమానః స్వధర్మస్థోనఘః శుచిః**
**జ్ఞానం విశుద్ధ మాప్నోతి మద్భక్తిం వా యదృచ్ఛయా.**
(11.20.11)

**16**

**న కిఞ్చి త్సాధవో ధీరా భక్తా హ్యేకాన్తినో మమ**
**వాఞ్ఛన్త్యపి మయా దత్తం కైవల్య మపునర్భవమ్.** (11.20.34)

శ్రీమద్భాగవతంలోని ఈ బోధనలను అనుసంధించి వైష్ణవమతంలో చైతన్య సంప్రదాయానికి చెందిన అచింత్య భేదాభేదవాదులు నిజమైన వైష్ణవుడు సామాన్యజనుల వలె ధర్మార్థకామమోక్షాలతో చిక్కువడక ప్రీతిపూర్వకమైన భక్తి అనే పంచమ పురుషార్థాన్ని అనుష్ఠించాలని నిర్దేశించారు. వీరి మతానుసారం భక్తి అంటే భగవన్నిత్యసేవాపరాయణులై భగవానుని ఆత్మీయునిగా భావించి పరమప్రేమ నెరపటమని అర్థం.

ఈ విధంగా భక్తికి పరమోన్నత స్థానాన్ని ప్రకల్పించిన శ్రీమద్భాగవత మతం కేవలాద్వైతులలో పెక్కుమందికి రుచింపకపోవచ్చును. భక్తి అంటే మనస్సును పరిశుద్ధం చేసి జ్ఞాననిష్ఠకు అనురూపంగా మలిచే భావమాత్రమని, అందుచేత భక్తి జ్ఞానానికి గౌణమని వీరి తాత్పర్యం. ఈ మతానుయాయుల పరిభాషలో భక్తి శబ్దానికి ఉత్తరోత్తరా మనము చూడబోతున్న భక్తి పూర్వ దశలైన శ్రద్ధారత్యాదులనే పరిమితార్థం మాత్రమే ఉన్నది. భాగవతోపదిష్టమైన భక్తి శబ్దం వీరి ప్రయోగాలలో కంటె విశిష్టమైన అర్థంలో ఒక మహోన్నత స్థితికి ప్రాలంబనగా ఉపయుజ్య మౌతున్నది. అయితే చిక్కు ఎక్కడున్నదంటే భాగవతం ప్రాచీనాధునాతన మత సంప్రదాయ బోధనలను అనుసరింపక 'భేదభావం లేని ఒక విశిష్టత' – భక్తిలో ఉండాలంటున్నది. ఇది కేవలాద్వైత శుద్ధాద్వైత భేదాభేద విశిష్టాద్వైత సవిశేషద్వైతాలకు అతీతమైన ఒకానొక విశిష్టభావన. చైతన్య సంప్రదాయంలో అచింత్య భేదాభేదానికి ఈ భావం

సన్నిహితమే అయినా భాగవతానికి దానితోనూ ఐక్యానుమతి ఉన్నట్లు లేదు. ఏది ఏమైనప్పటికీ మతప్రవక్తలు, దేశికోత్తముల అనుభవాలను బట్టి చూస్తే వారందరూ ఏదో ఒక సమయంలో అద్వైతభావనకు, పంచమ పురుషార్థమైన భక్తి భావనకు నడుమ ఊగిసలాడి, రెండింటికీ సమన్వయాన్ని సాధింపబూనిన వారేనని తేటతెల్లమవుతుంది. శ్రీరామకృష్ణులనే అందుకు నిదర్శనగా పేర్కొనవచ్చును. అయితే, ఆయన ప్రవచించిన విజ్ఞాని దర్శనం ("డాక్ట్రిన్ ఆఫ్ విజ్ఞాని")లో అద్వైత – భక్తిమతాలకు పారస్పరికవిరోధం లేదు. మానవులు తమ వివేకపరిపాటిని అనుసంధించి 'నేతి, నేతి' భావంతో సృష్టిలో ఉన్న ద్వంద్వభావా లన్నింటినీ తిరస్కరించాలి. ప్రతిషేధాంతంలో ద్వంద్వాశ్రయాలైన సమస్తరూపనామాలు కరిగిపోయి సర్వసర్వాత్మకమైన శుద్ధసత్త్వము యొక్క అభిజ్ఞానం ఉదయిస్తుంది. అట్టి శుద్ధసత్త్వస్థితికి చేరుకొన్న అహంత మళ్ళీ ప్రాపంచికభావాన్ని చెందటం ఉండదు. నిర్వికల్పసమాధిలో బ్రహ్మము నందు లీనమైపోతుంది. అయితే "ఆ తల్లి సంకల్పాన్ని" (కొంతమంది వేదాంతు లంటున్నట్లు ప్రారబ్ధం వలన కాదు; కాళీమాత సంకల్పం వలన) అనుసరించి సాధకులు అహంప్రజ్ఞ లోనికి తిరిగి రావటం కూడా అరుదుగా జరిగిన ఉదాహరణ లున్నాయని శ్రీరామకృష్ణులు పేర్కొన్నారు. శ్రీమాత సంకల్పానుసారం పునరుద్భూతమైన ఈ అహంకారిక ప్రజ్ఞ పూర్తిగా పరిణతప్రకృతిని కలిగినట్టిది. మునుపటి దేహాత్మభావం స్థానంలో అధ్యాత్మతత్త్వం అవతరిస్తుంది. ఈ నూత్నచైతన్యాన్ని శ్రీరామకృష్ణులు "ఇగో ఆఫ్ నాలెడ్జ్" లేదా "రైప్ ఇగో" అనీ, తత్పూర్వదశను "ఇగో ఆఫ్ ఇగ్నోరెన్స్" లేదా "అన్‌రైప్ ఇగో" అని వ్యవహరించారు. జ్ఞానజనిత వివేకం వలన – కేవలమైన వస్తువు ఈశ్వర జీవ జగత్తులనే త్రిపుటిగా అభివ్యక్తమౌతున్న సంగతి స్పష్టపడుతుంది. ఆ స్థితిలో అహంత దైహికమై ఉన్నంత కాలం నిరతిశయ ప్రేమానురాగాలను కోరుకొంటుంది. అపునరుద్భవస్థితిలో అవిద్యాయుక్తులై ఉన్నంత కాలం అహంతకు ఆ ప్రేమానురాగాలు దేహాభిమానం వలన, దేహాన్ని ఆశ్రయించుకొని ఏర్పడిన బంధుమిత్రకళత్రాది భావాల వలన ఆభాసమాత్రంగా కలుగుతుంటాయి.

కాని చరాచరజీవరాశి యొక్క అస్తిత్వ సమభావాన్ని స్వానుభవంలో గ్రహించిన తర్వాత దీప్తావస్థలో ఉన్న జ్ఞానాహంత నశ్వరబంధాలను తృణీకరించి సర్వజగత్సృష్టిస్థితిలయ కారకుడు, సమస్త జీవజాతానికి మోక్షప్రదాత అయిన ఈశ్వరుని యందు పరానురక్తిని కావింపగలుగుతుంది. శ్రీమద్భాగవతంలో చిత్రింపబడిన ప్రేమభక్తిలో భగవంతుడు 'నా వాడు' అని మమత్వాభిమానంతో కూడిన ఆత్మీయతను నెరపటం ఉన్నది. భగవానుని యెడ మాతృత్వాన్ని, సఖ్యతను, ప్రేయోభావాన్ని చూపటం ఉన్నది. ఈ విధమైన అత్యంతానురక్తి జీవునికి భగవానుని యెడ ఉదయించిన నిఃస్వార్థ ప్రేమ వలన, మమకారం వలన మాత్రమే సాధ్యమవుతుంది. భగవానుడు మనకంటె అన్యుడని, ఆయనయందు గౌరవాదరాలను కలిగి మెలగాలని భావించేవారు ఆయన యెడ వినయ విధేయతలను ప్రదర్శింపగలరే కాని నిరతిశయ భక్తిప్రపత్తిని సాధింపలేరు. ఒక్క అనన్యభక్తి మాత్రమే ఇటువంటి సన్నిహితత్వానికి మార్గం చూపుతుంది. కేవల చిన్మయావస్థను సాధించిన విజ్ఞానహృదయుడు తన విజ్ఞానఫలంగా భక్తిసంపదను వదులుకొనక, ఐక్యానుసంధానం చేసికొని భగవన్నిత్యసేవాపరాయణుడై వెలుగొందుతాడు. అద్వైత జ్ఞానవిశిష్టులైన అటువంటి విజ్ఞానులకు, నిత్యసిద్ధులకు శ్రీమద్భాగవతంలో చిత్రీకరింపబడిన భాగవతోత్తములకు అభేదమనే చెప్పాలి. భాగవతాగ్రేసరుడైన శుకయోగీంద్రుడే ఇందుకు ప్రథమోదాహరణీయుడు. యోగమార్గంలో నిర్గుణబ్రహ్మాన్ని కనుగొన్న ఆ నిర్విక్రియోత్తంసుడు భగవానుని లీలాగుణాలచే ఆకర్షితుడై భక్తిమార్గాన్ని అవలంబించి భాగవతధర్మాన్ని పరీక్షిన్మహారాజుకు ఉపదేశించాడు.

అద్వైతమతబోధకులలో అగ్రేసరుడైన మధుసూదన సరస్వతి అభిప్రాయం కూడా ఉపర్యుక్త భాగవతధర్మానికి అనుగుణంగానే ఉన్నది. "అద్వైతమే పారమార్థిక సత్యం. ద్వైతం భక్తి సాధనకు భూమిక. భక్తిని సాధింపగల అదృష్టానికే నోచుకోగలిగితే, అది ముక్తి కంటె నూరింతలు మెరుగు. జ్ఞానోపలబ్ధికి పూర్వం ఉత్పన్నమైన ద్వైతభావన భ్రాంతికి మూలహేతువు.

అయితే జ్ఞాని అయిన తర్వాత ద్వైతవాసన శేషించి భక్తులైన వారు అద్వైతుల కంటె పరమోత్కృష్టులు" – అని ఆయన ఒక శ్లోకంలో ఉపశ్లోకించాడు.

**పారమార్థిక మద్వైతం**
**ద్వైతం భజనహేతవే**
**తాదృశీ యది భక్తిః స్యా**
**త్సా తు ముక్తిశతాధికా.**

**ద్వైతం మోహాయ బోధాత్**
**ప్రాగ్జాతే బోధే మనీష్యా**
**భక్త్యర్థం కల్పితం ద్వైతం**
**అద్వైతాదపి సున్దరమ్.**

ఫలితార్థం ఏమిటంటే, సాధకులు భక్తియొక్క ఉన్నతకక్ష్యల లోనికి ప్రవేశించి ఆత్యంతిక భక్తిని చేయగలగటమన్నది తత్త్వజ్ఞాన ఫలంగానో లేక భగవదనుగ్రహఫలంగానో మాత్రమే సాధ్యం. అంతవరకు జరిగేదల్లా ఇతరుల అనుభవాలను బట్టి వారి వారి భక్తిభావాలను అనుకరించటం వరకే.

## పోషణ లేదా పుష్టిఫలంగా ప్రీతి
### (భగవదనుగ్రహ నిరూపణం)

'ప్రీతి' అనే శబ్దముచేత ఉపలక్షితమైన నిరుపమాన భక్తివిధానం జీవులకు స్వాభావికదశలో సంభవించేది కాదు. ఇది సాధన చేసి సాధింపదగినదీ కాదు. సాధన వల్ల దాస్యభక్తిసనాథమైన శాంతభక్తిని సాధింపవచ్చును. ప్రీతి అన్నది భగవంతుడు దయచూచిన వారియందు మాత్రమే ఉదయించే భావవిశేషం. వైష్ణవమతంలోని చైతన్య సంప్రదాయస్థులు శ్రీకృష్ణుడే సచ్చిదానంద స్వరూపుడని; ఆయనముందు స్వరూపశక్తి, జీవ లేదా తటస్థశక్తి, మాయాశక్తి అని మూడు శక్తులున్నాయని నిర్ణయించారు. వీనిలో చివరిదైన మాయాశక్తి అనింద్రియ (జడ) వస్తువులు గాను, రెండవది సేంద్రియ జీవజాతం గాను అభివ్యక్తమవుతున్నాయి. ప్రాథమికమైన స్వరూపశక్తే

ఆయనకు స్వాభావికమైన తాత్త్వికావస్థ. ఇది సంధినీ, సంవిత్, హ్లాదినీ అని మూడు విధాలు. సంవిత్ శక్తి ఆయన యొక్క చిచ్ఛక్తి రూపుదాల్చి ఆయనకు, సమస్తప్రాణికోటికి స్వాత్మచైతన్యాన్ని కలిగిస్తున్నది. ఆనందాపరపర్యాయమైన హ్లాదినీశక్తి ఆయనను ఆనందఘనుని కావించి, ఇతరులకు ఆ ఆనందాన్ని నిభృతంగా అందజేస్తున్నది. అందుచేతనే ఆయనను రసాత్మకుడని (ఇది ఆనందానికి ఉపనిషత్తులలో ప్రయోగింపబడిన పర్యాయవాచకం), ఆత్మరసానందానుభవం వలన రసికుడని అభివర్ణించారు. ఆత్మరసానందాన్ని మాత్రమే కాక ఆయన జీవుల హృదయాలలో ప్రతిఫలించిన ఆనందరసాన్ని కూడా గ్రహిస్తున్నాడు. ఆయన తాను కరుణింపదలచిన జీవులయందు తన హ్లాదినీశక్తిని ప్రసరింపజేయగా, తత్ప్రతిఫలన జీవులయందు ఉత్తమ భక్తి లక్షణ లక్షితమైన ప్రీతిగా అభివ్యక్తమవుతున్నది. అనగా ఆయన హ్లాదినీశక్తియే జీవునియందలి ప్రీతిగా రూపాంతరం చెందినదన్నమాట. ఈ మహానుగ్రహానికి నోచుకొన్న పుణ్యాత్ములు ఆయన యెడ ప్రీతిపూర్వక నిష్కామ భక్తియోగాన్ని అనుష్ఠిస్తారు. ఈ ప్రకారం నిఃస్వార్థ ప్రేమగా, నిరుపమాన దాస్యభక్తిగా జీవునిలో అభివ్యక్తమైన హ్లాదినీశక్తి ప్రతిఫలనం జీవేశ్వరు లిద్దరికీ మహానందాన్ని కలుగజేసి, జీవునియందు స్వాంతస్సుఖానికై గాక భగవంతుని కొరకై నిఃస్వార్థచిత్తంతో కావించే నిష్కామసేవగా పరిణమిస్తుంది.

ఈ విధంగా శ్రీమద్భాగవతోపదిష్టమైన ప్రీతిభావాన్ని చైతన్య సంప్రదాయంలోని లాక్షణికులు శాఖోపశాఖలుగా విస్తరింపజేశారు. శ్రీమద్భాగవతం భగవంతుడు భక్తునికి ముక్తికంటె భక్తిని ప్రసాదించటమే అరుదని నొక్కి చెప్పినప్పటికీ భక్తిరసోదయానికి హ్లాదినీశక్తి కారకమన్న విషయాన్ని మాత్రం ప్రస్తావించలేదు.

**రాజన్ పతిర్గురురలం భవతాం యదూనాం**
**దైవం ప్రియః కులపతిః క్వచ కిఙ్కరో వః**
**అస్త్వేవ మఙ్గ భగవాన్ భజతాం ముకున్దో**
**ముక్తిం దదాతి కర్హిచిత్స్మ న భక్తియోగమ్.** (భాగ. 5. 6. 18)

ఈ శక్తిత్రయనిరూపణ కేవలం వైష్ణవ మతంలోని చైతన్య భక్తుల ప్రతిపాదనే. అయితే అటువంటి ఏ వివరణమూ లేని పక్షాన పరబ్రహ్మమును గూర్చి జీవుని మనస్సులో 'మమ' అనే భావం మొలకెత్తి పంచమ పురుషార్థమైన భక్తి మోక్షానికంటె గరీయమన్న విశ్వాసం ఎలా కలుగుతున్నదీ ఊహించటం సాధ్యం కాదు. అందువల్ల ఈ ఉపర్యుక్త వివరణలను మనస్సులో అనుసంధించుకొని జీవుడు ఈశ్వరానుభావమే తనయందు ప్రతిఫలిస్తున్నదని గ్రహించి, తత్ప్రతిబింబాన్ని ఇంకా స్పష్టతరం కావించుకోవాలనే సత్సంకల్పంతో మనస్సును పరిశుద్ధపరచి, ఆత్మనివేదనా పూర్వకంగా భక్తి సలిపి 'నేను నీ వాడను' అని భగవంతుని మ్రోల వినమ్రుడై నిలిచి భగవన్మహిమాతిశయాన్ని విస్ఫారితనేత్రాలతో విలోకింపగలడు. దాస్యభావసంపృక్తమైన శాంతభక్తి స్వరూపం ఇదే. ఈశ్వరసాయుజ్యమే దీని పరమలక్ష్యం. అయితే భగవన్మమకారప్రేరితమైన ప్రీతిభక్తి మాత్రం భగవానుని హ్లాదినీశక్తి యొక్క ప్రవేశఫలంగా తప్ప మరొక విధాన సాధ్యం కాదన్నది సుస్పష్టం.

ఎందుకంటే – సమస్తవిశ్వానికి సృష్టిస్థిత్యంతకారకుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, అనంతమహిమోపేతుడు, సకలకళ్యాణగుణాకరుడు అయిన భగవానునితో ఆత్యంతికపరిచయాన్ని కల్పించుకొని, ఆయనను తన శిశువుగా, సఖునిగా, ప్రియునిగా, పరమాప్తునిగా సంభావించి, ఆయన యెడ మమకారాన్ని పెంచుకోవటమన్నది జీవుని యొక్క పరిధికి లోబడిన సామాన్యభావం కాదు. భగవానుని తనవానిగా భావించాలంటే భగవల్లీలానుగుణాల పూర్ణపరిచయానికి తోడు ఆయనతో సన్నిహితత్వాన్ని కల్పించుకొనగల ఒక అపూర్వచైతన్యస్రవంతి జీవప్రజ్ఞలో పరవళ్ళు త్రొక్కాలి. భగవదనుగ్రహం ఉంటే తప్ప అది సాధ్యం కాదు. భగవన్మహానందస్వరూపిణి యైన హ్లాదినీశక్తి జీవుని యందు ప్రతిభాసించి, ఆ జీవుడు భగవానుని 'తనవానిగా' భావింపగల దివ్యశక్తికి పాత్రుడై భగవన్మహిమాతిశయానికి విముగ్ధుడు కాగల భక్త్యుద్రేకం అతనిలో కలగటాన్ని 'పోషణము' అంటారు. ఆ మహోన్నత స్థితికి చేరుకొన్న తర్వాత భక్తుడు భగవానుని కంటె తాను

పెద్దవాడినని భావించి, భగవానుని తన శిశువుగా లాలింపగలుగుతాడు. "నేను నా భక్తునికి వశుడనై ఉన్నందువలన స్వతంత్రుడను కాను. భక్తులంటే నాకు గల ప్రేమ కారణంగా నా మనస్సు ఎల్లవేళల వారికి అధీనమై ఉంటుంది" –

**అహం భక్తపరాధీనో హ్యస్వతన్త్ర ఇవ ద్విజ**
**సాధుభి ర్గ్రస్తహృదయో భక్తై ర్భక్తజనప్రియః**

(భాగ. 9. 4. 63)

అని భగవద్వాక్యం. ఈ వాక్యానికి ఉద్దీపనగా శ్రీకృష్ణుని జీవితంలో జరిగిన అనేకానేక సన్నివేశాలను భాగవతం రసవత్తరంగా చిత్రీకరించింది. ఆ విధంగా భగవదనుగ్రహానికి పాత్రులైన జీవులు నిత్యసిద్ధులై ఈషత్పరిశిష్ట ద్వైతభావనతో భగవత్సేవాపరులై కాలం గడుపుతారు. భక్తిసిద్ధాంతం నిరూపించిన పరమలక్ష్యం ఈ భగవద్భావనమే. అందుచేతనే భగవత్ప్రీతియుక్తమైన భక్తిని పంచమపురుషార్థం అన్నారు.

## పరకీయా భావము : అంతరార్థం

భగవానునియెడ భక్తులు నెరపే ఆత్మీయతా నిర్భరమైన భక్తివిధానంలో భగవానుని ప్రభువుగా, తండ్రిగా, శిశువుగా, ప్రియసఖుడుగా భావించి మమకారాన్ని కురిపించి స్వామి కరుణకు పాత్రులవటం ప్రసిద్ధమే అయినప్పటికీ – ఈ అన్ని బంధాల కంటె 1. ద్వారకలో శ్రీకృష్ణపత్నులు చూపిన కాంతభావం 2. బృందావనంలో గోపికలు చూపిన పరకీయా భావం అత్యంత విశిష్టమైనవని శ్రీమద్భాగవతం నిర్దేశిస్తున్నది. అందునా గోపికల ప్రేమ – ప్రీతియొక్క పరమోదాహరణమని చిత్రీకరింపబడింది.

భక్తి యొక్క చరమసీమ ఇదే. ఏకాంతంలో తన ప్రియుడు చేసిన బాసలను నమ్మి, అతడే తన ప్రాణనాథుడని భావించి, తన సర్వస్వాన్ని అతనికి సమర్పించి, బంధుమిత్రుల మాటలను పెడచెవినిబెట్టి ముందువెనుకలు చూడకుండా, తన ప్రేమ విఫలమైతే భవిష్యత్తు గతేమిటని ఆలోచింపక

ప్రాణనాథసేవాపరతంత్రయై తనను తాను మరచిపోయిన ప్రియురాలి వలె భక్తుడు తన సర్వస్వాన్ని విస్మరించి భగవదాయత్తచిత్తుడై ఏ కోరికలూ లేని ప్రశమితభావంతో భక్తి కావిస్తాడు. ఇది కాంతభావం కంటె ఉదాత్తమైన మనః స్థితి. ఎందుకంటే పరకీయ ప్రేమలో ఉన్న సర్వసమర్పణశీలం, నిష్కామయోగం, పూర్ణవిశ్వాసం, స్వార్థరాహిత్యం – స్తిమితమైన భార్యాభర్తల సంబంధంలో ఉండటానికి వీలులేదు. అందుచేతనే శ్రీమద్భాగవతంలో గోపికల ప్రేమభావానికి శ్రీకృష్ణపత్నుల భక్తినిర్భరత కంటె ప్రాకామ్యం, గౌరవాతిశయం కల్పింపబడ్డాయి.

ఆ మాటకొస్తే శ్రీకృష్ణపరమాత్మను ప్రేమించి శ్రీకృష్ణార్పితచిత్తలై సర్వపరిత్యాగం చేసిన గోపికలకూ ముక్తిశిఖరాగ్రాన నిలిచిన పరమహంసలకూ భేదం ఏమున్నది?

## బృందావనం : ఒక అతీంద్రియసత్యం

అయితే ఒక విషయం: శ్రీమద్భాగవతప్రకాశితాలైన ఈ సన్నివేశాలకు ప్రకాశ్యార్థప్రకాశన కావిస్తూ అభినవభాష్యాన్ని విరచించిన చైతన్య సంప్రదాయం వారు బృందావన ఖండంలో ఘటిల్లిన శ్రీకృష్ణగోపికావృత్తాంతం కేవల చారిత్రికవాస్తవికత మాత్రమే కాదని, ఒక అతీంద్రియసత్యానికి భౌతిక రూపకల్పనమని, అందుచేత వారి దివ్యప్రేమను అక్రమసంబంధ మనుకోవటం అనుచితమని వ్యాఖ్యేయార్థాన్ని స్పష్టీకరించారు. పరబ్రహ్మాత్మకుడు, సత్యైకరూపుడు అయిన శ్రీకృష్ణుని దివ్యనివేశం ఇంద్రియాగోచరమైన గోలోకంలో ఉన్నది. చరాచరసమస్తజీవరాశి ఆయన శక్తియొక్క విలసనమే. ఆయన స్వరూపం కేవలాద్వైతులు నిరూపించిన అద్వయతత్త్వము యొక్క దృగ్విషయికాభివ్యక్తి (సగుణావతారం) కాదు; ఆయనే ఆ అద్వయతత్త్వం. అద్వైతులు నిరూపించిన నిర్గుణ బ్రహ్మతత్త్వం ఈ అద్వయతత్త్వమందలి అంశాంశ మాత్రమే. శ్రీ గోలోకవిరాజమానుడైన ఆయనను పరివేష్టించి గోపికలు తత్పరికరాలుగా, పార్షదులుగా వెలసి

విలసిల్లుతున్నారు. ఆ గోపికలు ప్రత్యేకవ్యక్తులు కారు. శ్రీకృష్ణుని హ్లాదినీశక్తియే గోపికానికర రూపాన్ని దాల్చింది. ఇంద్రియాతీతు లైనందున వారికి పాంచభౌతిక శరీరాలు, తత్ శరీరగతాలైన కామనలు లేవు. శుద్ధసత్త్వమే వారి నిజస్వరూపం. ఆయన శక్తులుగా అవతరించిన వారందరికీ ఎల్లవేళల ఆయన సేవలో నిమగ్నమై ఉండటమే పరమధ్యేయం. వారి మూర్తిమత్త్వానికి కారణమూ అదే. స్థూలదృష్టికి గోపికల యందు నానాత్వం గోచరిస్తున్నప్పటికీ, వాస్తవానికి శ్రీకృష్ణ హ్లాదినీశక్తి రూపాంతరం అయిన రాధాతత్త్వం ఒక్కటే ఉన్నది. ఆ రాధాతత్త్వమే అనేక రూపనామాలతో గోపికలుగా వ్యక్తమవుతున్నది. శ్రీకృష్ణసేవా తత్పరత ఒక్కటే ఈ వ్యక్తరూపా లన్నింటికీ ప్రభవకారణం. గోపికలు శ్రీకృష్ణార్పితచిత్తలై తన్మయావస్థలో ఉన్నప్పుడు రాసలీలానర్తనగా రూపుధరిస్తుంది. అతీంద్రియమూ, అనశ్వరమూ అయిన ఆ దివ్యలీల శ్రీమద్భాగవత దశమస్కంధంలో శ్రీకృష్ణజీవితమందలి గోకుల బృందావనఖండాల అభివర్ణనలో మనకు కనుపిస్తుంది. ఈ వర్ణన చారిత్రికమని భావిస్తే కేవలవాచ్య మనుకోవాలి. వ్యంజన సూత్రితమని భావిస్తే, మరి పరిస్ఫుటార్థం మాటేమిటి? అందుచేత ఈ రెండూ అవిచారిత రమణీయాలేనని చైతన్యసంప్రదాయం అంటున్నది. వీరి మతానుసారం శ్రీకృష్ణగోపికావృత్తాంతం సామాన్యమైన ఒక చారిత్రిక ఘటనను పునాదిగా గ్రహించి, అందులోని కేవల చారిత్రికతకు, వ్యాఖ్యేయార్థప్రతిపత్తికి ప్రాకరమైన ఒక అతీంద్రియసత్యాన్ని వెల్లడించటానికి ఉద్దేశితమైనది. ఈ అతీంద్రియత చారిత్రికతకు మూలహేతువు; అంతే కాని చరిత్ర దృష్టికోణం నుంచి అతీంద్రియతను వ్యాఖ్యానించాలని ఉద్దేశం కాదు. ఆ వృత్తాంతంలో ప్రయుక్తమైన ఉజ్జ్వల శృంగార రసోచితరీతిలో మాంసలమైన కామోత్ప్రేరణ లేదు. ఒకానొక అనిర్వచనీయ రామణీయక స్థితిని నిరూపించటానికి అంతకంటె వేరొక ఉత్తమమైన సాధనం లేనందువల్ల సాహిత్యంలో సాధ్యమయినంత మనోహరశైలిని ప్రయోగించి తద్వారా ఆ అతిలోకసౌందర్యాన్ని అభివ్యంజింపజేయాలని శ్రీమద్భాగవత మతం. శ్రీకృష్ణ హ్లాదినీశక్తి వ్యక్తరూపాలైన గోపికలతో ఆయన శృంగారలీల కేవలం శక్తి –

శక్తిమంతుల కేళి మాత్రమే. అంతేకాదు. ఆ చిత్రణలో దైహికశృంగారం ప్రసక్తి లేదు. అదీగాక అతీంద్రియవిషయాలను ఇంద్రియబద్ధవిషయాల ద్వారా చిత్రించటమన్నది అసాధ్యం; ఇంద్రియబద్ధవిషయాలే ఒకానొక అతీంద్రియఘటనకు నీడలవంటివనటం కాదనటానికి వీలులేని సత్యం. ఆత్మారాముడై మహానందమగ్నుడైన ఆ శుద్ధసత్త్వాత్మకుని సన్నిధానంలో రాసలీలా సన్నివేశం నిరంతరాయితంగా కొనసాగుతూనే ఉంటుంది. ఆ ప్రభువు పూర్ణావతారుడై బృందావనానికి వచ్చినప్పుడు ఆయన సేవార్థమై సమస్తగోపికానికరమూ వెన్నంటి వచ్చింది. గోలోకనిభృతమైన రాసలీలను భూలోకవాసులకు చక్షూరమణీయంగా ఆవిష్కరించి గోపికలు లోకాదర్శకరమైన ప్రేమభక్తిమార్గాన్ని శ్రీమద్భాగవతముఖంగా విశ్వవ్యాపితం చేశారు.

ఆత్మమును పరమేశ్వరుని యొక్క శక్తిగా దర్శించినప్పుడు ఆ పరమేశ్వరుని పురుషునిగా, జీవుని తదాకర్షిత వనితగా సంభావిస్తున్నాము. ఈ విధమైన సంభావన వల్ల శ్రీకృష్ణగోపికావృత్తాంత మందలి గోపికలతో జీవుడు తాదాత్మ్యాన్ని అనుభవించి, ఆ గోపికల వలె విరహార్తిని చెంది శ్రీకృష్ణదర్శనాధ్వానికై పలవించటం జరుగుతున్నది. అయితే అంత మాత్రాన జీవేశ్వర సంబంధం శ్రీకృష్ణగోపికాసంబంధం అంతటి అతీంద్రియస్థాయిని చేరుకొంటుందని, సర్వకామనలను వారి వలెనే అవలీలగా అతిగమిస్తుందని భావింపకూడదు. ఆ స్థితి ఆధ్యాత్మికసాధన వలన, పరమపురుష కరుణాతిరేకం వలన మాత్రమే సాధ్యపడుతుంది. అంతవరకు గోపికాజీవితోదంతాన్ని ఒక ఆదర్శకల్పనగా, ఒక సత్యార్థనిరూపణగా, ఒక అతీంద్రియ సత్యావిష్కృతిగా వివేకింపవలసి ఉంటుంది.

ఈ విధంగా నవాధ్వన్యులు కావిస్తున్న ఇంద్రియాతీత సిద్ధాంతనిరూపణల వల్ల గోపికావృత్తాంత మందలి ఒకానొక నైతికశంకను పరిష్కరించటం సాధ్యమేమో కాని, తన్మూలాన శ్రీకృష్ణపరమాత్మ సన్నిధిసేవకు నోచుకొన్న పాపవర్తనులు కూడా పరమహంస శిరోవతంసాయమానులు, పావనధర్ములు

కాగలరన్న శ్రీమద్భాగవత సిద్ధాంతానికి అపవాదం ఏర్పడుతున్నది. శ్రీకృష్ణుని పూర్ణావతారంగా భావించటంలోని పరమార్థం ఏమిటో ఇంతకు ముందు అధ్యాయాలలో చర్చించాము. భగవానుని అనుగ్రహశక్తి సమగ్రమని, ఎవరు ఏ విధంగా ఆరాధిస్తే ఆయన వారికి ఆ విధంగానే ముక్తిని ప్రసాదింపగలడని శ్రీమద్భాగవతం ప్రతిపాదిస్తున్నది. ఉపర్యుక్త సిద్ధాంతంలోని గోపికా నిరూఢమైన అతీంద్రియత్వం శ్రీకృష్ణమాహాత్మ్యబోధకు వికల్పం అవుతున్నది. దీనివల్ల ఆయన అనుగ్రహశక్తి (దీనికే పోషణము లేదా పుష్టి అని పేరు) అన్న మాటే అస్థానపతితం అయిపోతుంది. స్వయంగానే శక్తిమంతులన్న తర్వాత ఇక భగవత్కరుణతో పనేముంటుంది? అందుచేత వైష్ణవమతంలో నవాధ్వనీనుల భాష్యం తీరు ఏదయినప్పటికీ, శ్రీమద్భాగవతం ప్రకారం గోపికలు స్వచ్ఛందజీవితానికి అలవాటుపడ్డ వ్రజవాసంలో జన్మించినవారని, శ్రీకృష్ణుని దివ్య సౌందర్య సౌగుణ్యాదులకు ఆకర్షితలై ఆయన చెంతచేరి తత్సాంగత్యమహాపుణ్యఫలంగా పవిత్రీకృతలై ముక్తి శిఖరాగ్రాన్ని అధిరోహించారని భావించటంలోనే ఔచిత్యం ఉన్నది. గోపికల భావశుద్ధిని చూసి మహాశ్చర్యభరితుడైన శ్రీకృష్ణభక్తాగ్రేసరుడు ఉద్ధవుడు "ఓహో! అరణ్యానులలో సంచరిస్తూ యథేచ్ఛావిహారాలకు అలవాటుపడ్డ ఈ సామాన్యవనితల భక్తిమాహాత్మ్యం ఎంత వింతగా ఉన్నది! కారడవులలో కాపురం ఉంటూ ఏ చదువులూ లేని చపలచిత్తలకు శ్రీకృష్ణపరబ్రహ్మమంటే రూఢభావం ఎలా సిద్ధించింది? తెలిసి మ్రింగినా తెలియక మ్రింగినా ఔషధశక్తి దేహంలో ప్రసరింపకమాననట్లు పరమపురుషసేవాభాగ్యం కలిమివలన కాకపోతే ఈ నిర్వ్యాజభక్తికి కారణం మరేమిటి?" అనుకొంటాడు –

**క్వేమా స్త్రియో వనచరీ ర్వ్యభిచారదుష్టాః**
**కృష్ణే క్వ చైష పరమాత్మని రూఢభావః**
**నన్వీ శ్వరోనుభజతో విదుషోపి సాక్షా**
**చ్ఛ్రేయ స్తనోత్యగదరాజ ఇవోపయుక్తః**

(భాగ. 10.47.59)

అని. దీనిని బట్టి పూర్ణావతారుడైన శ్రీకృష్ణుని మహిమాతిశయం ఎటువంటి భావాన్నైనా పరమపురుష ధ్యాన ధారణగా మార్చివేయగలదని, శ్రీమద్భాగవత తాత్పర్యం ఇదేనని, అంత మాత్రాన మాతృకలో అన్యమీమాంసలకూ స్థానం లేకపోలేదని, భక్తిసాధనలో ఏ మార్గమైనా ఒకటేనని గ్రహించాలి. అంతే కాదు. వైష్ణవమతంలోని చైతన్య సంప్రదాయం వారు వివరించిన గోపికామనోభావాన్ని శ్రీకృష్ణుని యెడ జీవులందరూ అనుసంధించటానికి వీలులేదు. వారు చేయగలిగినదల్లా ఆ గోపికల మనోవృత్తిలో ఉన్న సాంద్ర భక్తిభావాన్ని అనుకరించే ప్రయత్నం మాత్రమే. కనుకనే చైతన్య పరిభాషలో దానిని రాగాదిభక్తి అంటున్నారు. అనుకరణయోగ్యమైన రాగాన్ని అనుకరించటమనే దీని ఉద్దేశం. ఈ అనుకరణమే సాధన బలపడినకొద్దీ ప్రేమగా మారుతుంది. ఈ భక్తి విధాన్నే లాక్షణికులు పుష్టిమార్గం అన్నారు. ఈ మార్గాన్ని అవలంబించి సాధనను కొనసాగించినవారికి భగవదనుగ్రహఫలంగా ప్రీతిభావం ఉదయిస్తుంది.

## 5

## భక్తి సాధన : మార్గాలు

ఇంతవరకు మనము సాధకుని మనస్సులో వేర్వేరు దశలలో ఉదయించే భక్త్యనుభూతి యొక్క వివిధరూపాలను గురించి చర్చించాము. ఈ భక్తి శాంతరూపమైనా, ప్రీతి రూపమైనా – ప్రగాఢమైనప్పుడు భక్తుని మనస్సు ఉత్తుంగతరంగాలతో పరవళ్ళు త్రొక్కుతూ సముద్రోన్ముఖంగా పరుగెత్తే గంగానది వలె భగవదభిముఖంగా ప్రసరిస్తుందని శ్రీమద్భాగవతం అంటున్నది. భక్తి యొక్క ఆ పరమకాష్ఠ దశకు పరాభక్తి లేక సాధ్యభక్తి అని పేరు. అనేక జన్మలుగా జీవు డనుభవించిన దురంత యాతనాక్రమానికి దీనితో తెరపడుతుంది. జీవియొక్క దుర్భరవేదనానుభవం ముగింపుకు వస్తుంది. ఆ పరమకాష్ఠకు పూర్వం సాధకునిగా ఉన్నప్పుడు జీవి అనుష్ఠించే భక్తి విధాలలో సాధన భక్తి (నిత్యపూజాదికం), వైధీ భక్తి (శ్రుతిచోదిత క్రమాన్ని అనుసరించి భక్తికావించటం) మొదలైనవి అనేకం ఉన్నాయి.

శ్రీమద్భాగవతం అధ్యాత్మవిద్యకు భక్తియోగంలో భాగధేయాన్ని ప్రకల్పించింది. సాధనదశలో జీవి ఏ మార్గాన్ని అవలంబించినా, అంతిమలక్ష్యం భక్తిసాధనమే. 'నేను భక్తులకు సులభగమ్యుడను' అని శ్రీ భగవానుడే అన్నాడు. సామాన్యంగా ఉత్తమజీవితానికి గీటురాళ్ళయిన ఋజువర్తన, సత్యసంధత, దానధర్మాలు మొదలైనవన్నీ తప్పక అలవరచుకొనవలసిన సద్గుణాలే, అందులో ఏ సందేహమూ లేదు. అయితే, ఎన్ని సద్గుణాలున్నా మనస్సు భక్తిపరిపూతం కానప్పుడు ఆత్మశుద్ధిని సాధించటం కష్టమవుతుంది. భక్తి యొక్క మహాతేజస్సులో జీవాత్మదోషాలన్నీ భస్మీపటలమై శుద్ధసత్త్వం నిజస్వరూపంతో భాసింపగలదు.

శ్రీమద్భాగవత తాత్పర్యం భక్తి సందేశమే అయినప్పటికీ, భాగవతం జ్ఞాన–కర్మ–భక్తియోగాలు మూడింటికీ తత్తదుచిత స్థానాలను నిర్దేశించింది. కొన్నిచోట్ల అసలు యోగాలు రెండేనని, కర్మము ఈ రెండింటికీ ఉపక్రమాత్మకమని ప్రస్తావింపబడింది. సన్న్యాస ధర్మాన్ని స్వీకరించి సర్వసంగాలను విడిచిపెట్టిన వారికి జ్ఞానయోగం; కామనలకు బద్ధులైనవారికి కర్మయోగం; అప్రతర్కితంగా నైనా ఏదో ఒకనాడు శ్రీభగవల్లీలలను ఆకర్ణించే సదవకాశం ఏర్పడి, భగవానుని దివ్యగుణాలకు ముగ్ధులై తన్మయత్వాన్ని పొంది సంసారబద్ధులై ఉంటూనే ధ్యానధారణ చేయగలవారికి భక్తియోగం ఉపదేశింపబడ్డాయి:

**నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినామిహ కర్మసు**
**తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగోస్తు కామినామ్.**
**యదృచ్ఛయా మత్కథాదౌజాతశ్రద్ధస్తు యః పుమాన్**
**న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగో స్య సిద్ధిదః.**

(భాగ. 11. 20. 7–8)

దీని ఉద్దేశం భక్తిమార్గం తక్కువస్థాయి వారికోసమని కాదు. భక్తి పురుషార్థాల కంటె అతీతమైన పంచమపురుషార్థమని, ముక్తికంటె భక్తిదే ఉత్తమస్థానమని భాగవతమే అన్నది కదా! శుద్ధ, బుద్ధ ముక్త కేవలాఖండ

సచ్చిదానందపరబ్రహ్మమును కనుగొనటానికి భక్తిశ్రద్ధలు అవసరంలేదని, కేవలం బుద్ధి మాత్రమే చాలునని అనుకోవటం ధాన్యంకోసం పొట్టును దంచటం వంటిదనికూడా భాగవతం నొక్కిచెప్పింది –

**శ్రేయః స్రుతిం భక్తిముదస్య తే విభో**
**క్లిశ్యన్తి యే కేవలబోధలబ్ధయే**
**తేషా మసౌ క్లేశల ఏవ శిష్యతే**
**నాన్య ద్యథా స్థూలతుషావఘాతినామ్.**

(భాగ. 10. 14. 4)

భక్తి లేని సాధనవల్ల మిగిలేది శ్రమ మాత్రమేనని ఈ శ్లోకభావం. జ్ఞానయోగ మంటే, అది కూడా ఒక భక్తి విధమే. అయితే హృదయాని కంటె బుద్ధికే ప్రాధాన్యం. దీనిని “ఇన్‌టలెక్చువల్ లవ్ ఆఫ్ గాడ్” అందాము. జ్ఞాని భగవానునికీ, తనకూ అద్వైతమే అయినా తారతమ్యాన్ని అంగీకరించి సర్వగుణార్ణవుడైన భగవానునితో సాయుజ్యాన్ని కోరుకొంటాడు. అయితే ఈ విధమైన అభ్యాసానికి కావలసిన సాధనసంపత్తి, భక్తుని యొక్క చిత్తశుద్ధి, వైరాగ్యం చాలా ఉన్నతశ్రేణికి చెందినవి. అందరికీ ఆ విధమైన అభ్యాసం చేయాలంటే సులభం కాదు. అయితే ఇంతకుముందే చెప్పినట్లు భక్తికి ఈ సాధనసంపదతో ఎంతమాత్రమూ నిమిత్తం లేదు. పైగా జిజ్ఞాసువు తన స్వీయశక్తి పైని ఆధారపడి అభ్యాసం కొనసాగించాలి. భాగవతునికి ఆ పాటి సమస్య కూడా లేదు. అతనికి యుక్తమార్గాన్ని చూపించి తన దగ్గరకు చేరుకొన్నదాకా తోడు నిలిచి చేయూతనిచ్చే భగవానుని అండ ఉండనే ఉన్నది. ఈ సత్యాన్ని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి వెల్లడించాడు:

**బాధ్యమానోపి మద్భక్తో విషయై రజితేన్ద్రియః**
**ప్రాయః ప్రగల్భయా భక్త్యా విషయై ర్నాభిభూయతే.**

(భాగ. 11. 14. 18)

“ఒకవేళ నా భక్తుడు ఇంద్రియవశు డైనప్పటికీ, క్రమక్రమాన భక్తి ప్రవృద్ధమై ఇంద్రియప్రవృత్తి సన్నగిల్లుతుం” దని ఈ శ్లోకభావం. అంటే భక్తుని

ఎల్లవేళల కనిపెట్టి ఉండటానికి భగవానుని సాయం ఉండి తీరుతుందన్నమాట.

శ్రీమద్భాగవతం ఇహాముత్ర సుఖభోగవిరాగం, అధ్యాత్మశక్తి భక్తిమార్గంలో తమంత తాముగా సిద్ధిస్తాయని, ఆరంభంలో విఘ్నాలు ఎదురైనప్పటికీ పూర్ణవిశ్వాసంతో భక్తిచేయాలని సాధకులకు ఉపదేశిస్తున్నది. ఈ సందర్భంలోనే అన్నపు ముద్ద ఏకక్షణంలో క్షుద్బాధను తొలగించి, శరీరానికి బలాన్ని కలిగించి, భోజనతృప్తి (జిహ్వాప్రీతి) ఘటింపజేయటం పోలికకు వచ్చింది.

ఉక్తకారణాలను బట్టి రాజయోగ కర్మయోగాలు రెండూ భక్తియోగంలోని అంతర్భాగాలేనని వెల్లడవుతున్నది. రాజయోగం అంటే, చిత్తవృత్తిని నిరోధించి అంతర్ముఖీనుడై గాఢభక్తితో భగవానుని ధ్యానించి భగవన్మయుడు కావటం. కర్మయోగం భక్తిసాధనకు తొలిమెట్టని శ్రీమద్భాగవతం అంటున్నది. వేదాలు ఇహపర సుఖోపలబ్ధికి దారితీసే అనేక యజ్ఞయాగాలను, విస్తృతమైన కర్మకాండను ఉద్బోధిస్తున్నాయి. ఇవన్నీ కాక మానవులు దైనందినజీవితంలో తప్పక నిర్వహింపవలసిన విధినిషేధరూపమైన కర్మకలాపం ఉన్నది. ఈ రెండు విధులనూ శాస్త్రపరిభాషలో ధర్మమని అంటున్నాము. ధర్మమనే పవిత్రనామంతో ఆచరణీయమైన ఏ కర్మ అయినా భక్తిరసప్లావితం కానిదే నిష్ఫలమని శ్రీమద్భాగవతం అంటున్నది. కనుక వేదోక్తకర్మానుష్ఠానమంతా స్వర్గాదిఫలదాయకమన్న సూక్తి ఔపచారికం మాత్రమేనని, ఇంద్రియానురక్తులై జ్ఞాననిష్ఠులు కాలేకపోయిన సామాన్యుల కొరకు ఉద్దిష్టమని, పార్యంతికంగా భక్తుని మనస్సులో భగవద్భావనను బలపరచటమే దాని పరమార్థమని శ్రీమద్భాగవత తాత్పర్యం. వైదికకర్మల పరమోద్దేశమూ వైరాగ్యమే కనుక కర్మయోగం వలన నిత్యానుష్ఠానం, నిత్యానుష్ఠానం వలన భగవద్భక్తి, భక్తిఫలంగా భగవన్మయత సిద్ధిస్తాయని తెలుస్తున్నది.

## శ్రద్ధా రతి భక్తి దశలు : భాగవతధర్మం

సాధకుని మనస్సులో భక్తి రసోదయాన్ని, ఉల్బణతను వర్ణిస్తూ భాగవతం మూడు ప్రధానదశలను ప్రస్తావించింది:

**సతాం ప్రసఙ్గాన్మమ వీర్యసంవిదో**
**భవన్తి హృత్కర్ణరసాయనాః కథాః**
**తజ్జోషణా దాశ్వపవర్గవర్త్మని**
**శ్రద్ధా రతి ర్భక్తి రనుక్రమిష్యతి.**

(భాగ. 3.25.25)

"సాధువులను ఆశ్రయించి, వారి సాంగత్యంలో హృత్కర్ణరసాయనాలైన భగవత్కథలను నిరంతరం వింటుండటం వలన క్రమక్రమంగా సాధకునికి శ్రద్ధ (భగవంతుని యందు పూర్ణవిశ్వాసం), రతి (భగవంతుని తోడి సాన్నిధ్యభావం), భక్తి (భగవంతుని యందు పరమప్రేమ) పెంపొందుతాయి" అని ఈ శ్లోకార్థం. భగవంతుని యందు పరమప్రేమతో కూడిన భక్తిభావాన్ని సాధ్యభక్తి అంటారని ఇంతకు మునుపే అనుకొన్నాము. ఇకపోతే మొదటి రెండూ భక్తి భావతీవ్రతకు, పరిపాకానికి పూర్వదశలని, ఏ విధమైన భక్తిని వర్ణించినా ఈ రెండింటికీ అనంతరీయదశగా మాత్రమే వర్ణిస్తున్నామని గుర్తుంచుకోవాలి. నిజానికి మనచుట్టూ ఉన్నవారిలో చాలామంది భగవంతుడంటే విశ్వాసం ఉన్నదా? అని అడిగితే ఉన్నదంటారు కాని, ఆ విశ్వాసం ఏదో ఒక మహనీయశక్తి ఉన్నదనే విశ్వాసమే తప్ప, భగవత్స్వరూపాన్ని గ్రహించి తీరాలనే గాఢజిజ్ఞాసతో దీర్ఘకాలం కృషిచేసి, భగవంతుని ఉనికిని గుర్తించి, ఆయనయందు పరానురక్తిని కలిగి ఉండటం కాదు. భగవదన్వేషణలో ఆధ్యాత్మికజీవితాన్ని గడపటమూ కాదు. అందుకు భక్తుని మనస్సులో గాఢమైన భక్తిభావం ఉండాలి. భగవానుని కోసం సమస్త బంధాలను విడిచిపెట్టగల త్యాగశీలం ఉండాలి. అట్టి సంకల్పతీవ్రత వారికి సాధుసాంగత్యం వలన మాత్రమే కలుగుతుంది. అనుభవజ్ఞులైన సాధువుల సన్నిధిలో వారికి ఆధ్యాత్మికరహస్యాలు తెలిసివస్తాయి. భక్తిరసోదంచితమైన

వారి జీవితసారం కరతలామలకమై విరాజిల్లుతుంది. ఆ కథాశ్రవణం వలన సాధకుని భక్తి సాంద్రతరం కాగలుగుతుంది. సర్వసమర్పణ చేసి అనన్యభావంతో భక్తి చేయగలుగుతాడు. దీపాన్ని వెలిగించాలంటే మరొకదీపం ఉండక తప్పదు కదా! అందుకనే శ్రీమద్భాగవతం భక్తులకు సజ్జనసాంగత్యం అత్యావశ్యకమని, వారి సన్నిధానంలో భగవత్కథాశ్రవణ తత్పరులై విశేషార్థాలను గ్రహిస్తుండటం వలన భక్తిభావం మరింత ఉద్దీప్తమవుతుందని పదేపదే నొక్కి చెబుతున్నది. ఈ ప్రథమదశలో సాధకుని మనస్సులో ఒకానొక ఆధ్యాత్మికశక్తి యందలి విశ్వాసం కుదురుకొని, ఆ శక్తిసాధన కోసం ఎంతటి త్యాగమైనా చేయాలని, ఎంతటి కష్టమైనా అనుభవించాలని, తనకు పూర్వమే ఆ శక్తిని సాధించినవారి సాంగత్యాన్ని సంపాదించాలని, ఏ విధంగా నైనా భగవంతుని సేవించుకోవాలని సంకల్పం ఉదయిస్తుంది. సాధనాసిద్ధి చేకూరుతుంది.

శ్రద్ధాయుక్తులైన తర్వాత ద్వితీయ తృతీయదశలకు చేరుకొనదలచిన సాధకుల కోసం శ్రీమద్భాగవతం ఒక నూతనమైన మార్గాన్ని ఉపదేశిస్తున్నది. అదే భాగవతధర్మం. వేదశాస్త్రాలను అధ్యయనించి బహువిధయజ్ఞయాగాలను చేయటం కంటె అమితసులభమైన భాగవత ధర్మాన్ని అనుష్ఠించటం మేలని భాగవతం అంటున్నది –

**యే వై భగవతా ప్రోక్తా ఉపాయా హ్యాత్మలబ్ధయే**
**అఞ్జః పుంసా మవిదుషాం విద్ధి భాగవతాన్ హి తాన్.**

**యానాస్థాయ నరో రాజన్ న ప్రమాద్యేత కర్హిచిత్**
**ధావన్ నిమీల్య వా నేత్రే న స్ఖలేన్న పతేదిహ.**

**కాయేన వాచా మనసేన్ద్రియై ర్వా**
**బుద్ధ్యాత్మనా వానుసృతస్వభావాత్**
**కరోతి యద్యత్సకలం పరస్మై**
**నారాయణాయేతి సమర్పయేత్.**

# 6

# భక్తియోగ దర్శనం

పైని చెప్పిన నిగమనానికి ప్రోద్బలకంగా శ్రీమద్భాగవతంలో ఉదాహరింపబడిన నవవిధభక్తులను గూర్చి ఈ అధ్యాయంలో చర్చింపబడుతున్నది. లోకశిక్షాసంగ్రహార్థం గురుకులంలో చేరిన సహాధ్యాయులను ఉద్దేశించి సప్తమస్కంధంలో ప్రహ్లాదుడు ఈ మాటలన్నాడు :

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్**
**అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.**
**ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా**
**క్రియతే భగవత్యద్ధా తన్మన్యేధీత ముత్తమమ్.**

(భాగ. 7. 5. 23–24)

దీని ప్రకారం దేశికుల వద్ద సదుపదేశాన్ని పొందిన సాధకులు అభ్యసింపవలసిన విష్ణుభక్తి మార్గాలు తొమ్మిది:

**1. శ్రవణము** : సకలలోకేశ్వరుడైన శ్రీమహావిష్ణువు యొక్క లీలాకృత్యాలను, దివ్య మహిమలను ఆకర్ణించటం.

**2. కీర్తనము** : భగవన్నామాలను సంకీర్తించటం, భగవత్స్తోత్రాలను పఠించటం.

**3. స్మరణము** : పరమసుఖదాయకము లైన శ్రీహరి రూపనామాలను ఎడతెగక స్మరించటం.

**4. పాదసేవనము** : భగవానుని, భగవత్స్వరూపులైన వారిని శ్రద్ధాభక్తులతో సేవించటం.

**5. అర్చనము** : భగవానుని అర్చామూర్తులను ప్రతిదినం సకలోపచారాలతో పూజించటం.

**6. వందనము** : భగవంతునికి, భగవన్మయులైన పెద్దలకు నమస్కరించటం.

**7. దాస్యము** : భగవంతుని తన ప్రభువుగా భావించి, అప్రమత్తతతో నిత్యసేవాకైంకర్యాలు చేయటం.

**8. సఖ్యము** : భగవంతుని సాటిగుణాలను అలవరచుకొని, మానసికంగా ఆయనతో స్నేహభావాన్ని కలిగి ఉండటం.

**9. ఆత్మనివేదనము** : భారాన్ని భగవంతునిపై వేసి, భగవంతుని శరణాగతి నర్థించి తదేకనిష్ఠులు కావటం.

పైని ఉదాహరింపబడిన శ్లోకాలలో భక్తి లక్షణమంతా సూత్రప్రాయంగా ఇమిడి ఉన్నది. ఈ తొమ్మిది విధాల భక్తిమార్గాలు సాధకులు శ్రద్ధాళువులై అభ్యసింపవలసినవి కాగా, ఇంతకు మునుపు పేర్కొన్న నారాయణ స్మరణపూర్వక కర్మాచరణ మన్నది ఆధికారిక సూత్రమని, సర్వత్ర అనువర్తనీయమని గ్రహించాలి. సాధకుడు నవవిధ భక్తిమార్గాలలో దేనిని ఎన్నుకొన్నా, దానిని నారాయణ స్మరణపూర్వకం గానే అనుష్ఠించాలి. భగవదర్పితం కాని కర్మఫలం భోగరూపమై, భోగాంతంలో మళ్ళీ కర్మాచరణకు పూనుకొనవలసి వస్తుంది. అందుచేత సాధకుడు మనోవాక్కాయాలను, బుద్ధీంద్రియాదులను, సమస్తకర్మలను నారాయణీయములని భావించి, తాను నిమిత్తమాత్రుడుగా ఉండాలి. లేని పక్షంలో సాధన భంగమై చేసినదంతా నిష్ప్రయోజక మవుతుంది. భక్తిమార్గాలలో దీనిని ఎన్నుకోవటం మంచిదనే నియమం ఎక్కడా లేదు. సాధకుడు దేనినైనా ఎన్నుకొనవచ్చును. ఏ మార్గాన్ని ఎన్నుకొన్నా భక్తుని

మనస్సు మాలిన్యరహితమై, అతని సాధన మరింత ఏకాగ్రంగా కొనసాగుతుంది. ప్రతిరోజూ గొప్పగా నామజపాలు చేయటం, హరికథలూ పురాణకాలక్షేపాలకు వెళ్ళి నలుగురికీ కనబడటం, గుళ్ళూ గోపురాలను పునరుద్ధరించటం, ప్రతిమలను నెలకొల్పటం, పెద్దయెత్తున పూజాకార్యక్రమాలు నిర్వహించటం మొదలైన కార్యక్రమాల ద్వారా పేరుపొందటం సులభమే కాని భగవద్గీతలో అన్నట్లు ఆసురీసంపద పెంపొంది కామ క్రోధ లోభాదులతో స్వలాభానికి ప్రాధాన్యం ఇవ్వటం వలన అతని భక్తి చివరికి బూడిదలో పోసిన పన్నీరవుతుంది. అటువంటి ఆసురీసంపదను నిరోధించటమే భక్తియోగసాధానికి మూలమని గ్రహించి సాధకులు నిండుమనస్సుతో తమ కర్మలను, కర్మఫలాలను భగవంతునికి సమర్పించాలి. ఈ విధంగా సర్వకర్మలను భగవంతునికి సమర్పించినప్పుడు భక్తుని మనస్సులో తాను భగవదర్థమై ఆచరిస్తున్న కర్మలు మలినవాసనలతో కూడి ఉండరాదనే సంకల్పం ఉదయిస్తుంది. అందువలన భగవంతునికి అర్పింపదగిన సత్కర్మలను మాత్రమే చేయాలన్న శ్రద్ధాభావం బలపడుతుంది. దేహాత్మభావం ఉన్నవారికి భౌతికమైన దేహం ఉన్నంతకాలం ఆ భౌతికమైన విలువల పట్ల కలిగే ఆదరభావం అతీంద్రియాల పట్ల ఉండకపోవటం సహజమే. అందువల్ల ఏదో నిత్యకృత్యంగా ఆచరించే పూజాపురస్కారాల వలన, పుణ్యకర్మల వలన వాస్తవమైన భక్తి భావం కలుగుతుందని ఆశింపకూడదు. అవి కేవలం సాధనక్రమంలో ప్రాథమిక దశలు మాత్రమేనని గుర్తుంచుకోవాలి. అసురులకు దయ, మానవులకు దానము, దేవతలకు దమము కర్తవ్యాలని ఉపనిషత్తులలో ఉపదేశింపబడింది. వీటివలన ఆయా జీవులకు మాలిన్యక్షాళన జరిగి మనస్సు తేటపడుతుంది. అయితే మనుష్యులందరిలోనూ సాధారణంగా ఈ మూడింటి లోపమూ ఎంతో కొంత ఉండనే ఉంటుంది. స్వార్థానికి భంగం వాటిల్లినప్పుడు ఓపిక పట్టమంటే మనస్సుకు కష్టమనిపించటం సహజమే. అందువల్ల ఆసురీశక్తిని నిర్మూలింపగోరినవారు దకారత్రయాన్ని నియతంగా అనుష్ఠింపవలసి ఉంటుంది. పూజావిధుల వలన మనసుకు కొంత ఏకాగ్రత, నియమబద్ధత

సిద్ధించేమాట నిజమే కాని అంతటితో సరిపెట్టుకొనకూడదు. ఏ పని చేపట్టినా అది బ్రహ్మార్పితమన్న అంకితభావంతో చేయటం, సాటివారిని సేవించుకొనటం, దానధర్మాలు, వ్రతాచరణ, నిత్యనైమిత్తికాదుల అనుష్ఠానం– ఇవన్నీ అవసరమే. ఈ విధంగా కొద్దికొద్దిగా మలినభావనలను పరిహరిస్తూ, పరానురక్తిని సాధించటానికి ఎంతో దీర్ఘకాలం పట్టవచ్చును. భక్తి సిద్ధించటానికి ఒక నిర్ణీతవ్యవధి అంటూ ఏదీ లేదు. ఇంద్రియసుఖాల పట్ల విరక్తి జనించి, భగవద్ధ్యానంలో నిరతిశయమైన ఆనందం చేకూరేలోగా కనీసం భగవన్నామస్మరణ, సర్వులనూ భగవన్మయులుగా భావించి సేవించుకొనటం, సర్వకర్మలను భగవంతునికి సమర్పించటం వంటివి చేస్తుండాలి. మానకూడదు. ఈ విధమైన పావనకర్మలను జీవితాంతం కొనసాగించాలని భగవద్గీత అంటున్నది.

## నవవిధ భక్తులు

**శ్రవణము:**

శ్రవణము అంటే వైరాగ్య భక్తి జ్ఞానసంపన్నులైన భాగవతోత్తముల సన్నిధిలో భగవానుని లీలాగుణాలను పూర్ణశ్రద్ధతో ఆకర్ణించటం. నిజమైన శ్రవణం సజ్జనసాంగత్యం వలన మాత్రమే సిద్ధిస్తుంది. ఇందుకు పరీక్షితుని జీవితమే ఒక ప్రబల నిదర్శనం. ప్రాయోపవిష్టుడైన పరీక్షిత్తు పరమహంసలలో అగ్రేసరుడైన శుకమహర్షి చెబుతుండగా శ్రీమద్భాగవతాన్ని విన్నాడు. విన్నంత మాత్రాన అతనికి శాశ్వతమైన మోక్షపదవి లభించింది. ఆ మాటకు వస్తే శ్రవణము, సజ్జనసాంగత్యము ఒకటనే చెప్పాలి. అందువల్లనే శ్రీమద్భాగవతం సాధుసాంగత్యం భక్తిసాధనకు అత్యావశ్యకమని సహస్రజిహ్వాలతో పరికీర్తిస్తున్నది. భగవన్మాహాత్మ్యాన్ని స్వానుభవంలో గుర్తించిన సాధుపుంగవుల ఉపదేశాన్ని విన్నప్పుడు శ్రోత మనస్సులో భగవంతుని యందు పూర్ణవిశ్వాసం, ఆ విధంగా తానూ భక్తిచేయాలనే సత్సంకల్పం ఉదయిస్తాయి. ఆ మార్గంలో పయనించి వారూ కొంతకాలానికి గమ్యాన్ని చేరుకొంటారు. సాధువులు ఉపదేశించిన సత్యం వారు తమ జీవితంలో స్వయంగా ఆచరించి

చూపినదయితే, వారి మాటలకు మరింత బలం చేకూరుతుంది. ఆ అనుభవసారాన్ని స్వాయత్తీకరించుకొన్న సాధకునికి ఆ మార్గంలో పయనించటం సులభ మవుతుంది.

అయితే సకలసద్గుణోపేతులై సర్వవిధాల అనుకరణీయులైన మహాభాగవతోత్తముల సాంగత్యం లభించటమన్నది అందరికీ సాధ్యం కాదు. అందువల్ల తమకు వీలైనంతలో ఎరుక గలవారి సాంగత్యాన్ని సంపాదించి వారు పురాణాదులను చదువుతున్నప్పుడు శ్రద్ధగా విని, వారు చెప్పిన అర్థాన్ని మనసుకు తెచ్చుకోవాలి. భగవానుడైన శ్రీకృష్ణుడు హరికథకుని రూపంలో నిత్యప్రత్యక్షుడై, శ్రోతల కర్ణరంధ్రమార్గాన వారి హృదయాలను చేరుకొంటాడని శ్రీమద్భాగవతం అంటున్నది. ఆధునిక కాలంలో ముద్రణసౌకర్యాలు పెంపొంది గ్రంథపఠనకు అవకాశాలు పెరిగాయి. వెనుకటి రోజులలో ఉపదేశకులు తమ బోధనలను మౌఖికంగా ప్రచారం చేసినట్లు ఈనాడు రచయితలు గ్రంథరూపంలో ప్రకటిస్తున్నారు. అందువల్ల శ్రవణమంటే గ్రంథాధ్యయనమని కూడా ఈ రోజులలో అర్థం చెప్పుకోవాలి.

**కీర్తనము:**

కీర్తనము అంటే సాధకుడు భగవన్నామాన్ని సంకీర్తించటం, భగవంతుని యొక్క లీలాగుణాలను ప్రకటిస్తున్న రచనలను, స్తోత్రాలను గానం చేయటం అని అర్థం. ఈ కీర్తన ఒక్కడే కాక నలుగురితో కలిసి చేసినప్పుడు భక్తిపారవశ్యం సులభంగా కలుగుతుంది. సంగీతం, తాళవాద్యాలు, సామూహికనృత్యం కీర్తన యొక్క ప్రభావాన్ని ఇనుమడింపజేస్తాయి.

భక్తిమార్గ ప్రచారానికి పూనుకొన్న వారు, ఉపదేష్టలు సభాసమావేశాలలో కీర్తన మొదలుపెట్టి సభ్యులందరిచేత భగవన్నామాన్ని, తదీయలీలాకృత్యాలను సంకీర్తింపజేయటం సర్వసాధారణంగా జరుగుతూనే ఉన్నది. బృందగానాలు, సామూహిక నృత్యాల వలన ప్రగాఢమైన భక్తిభావాన్ని అతిసులభంగా ఉద్దీపింపజేయవచ్చును. ఈ కార్యక్రమాన్ని అనుభవజ్ఞులైన పెద్దల

సహాయంతో నిర్వహింపజేస్తే అనతికాలంలో మంచి ఫలితాన్ని పొందగలరు. కేవలం ప్రదర్శన కోసమే జరిపితే ప్రయోజనం ఉండకపోగా ఏకాగ్రత దెబ్బతిని సాధన భగ్నమయ్యే అవకాశం ఉన్నది.

కీర్తనకు ఎటువంటి రచననైనా ఎన్నుకొనవచ్చును. సహస్రనామాలు, స్తోత్రాలు, ఇతర గేయరచనలు, సంగీతకృతులు – అన్నీ అనువైనవే. సాధన తొలిదశలో మనస్సు అంతర్ముఖం కాలేక తరచు బహిర్విషయాలపై లగ్నం అవుతుంటే, అటువంటివారు ఈ విధమైన కీర్తన కార్యక్రమాలలో పాల్గొనటం వల్ల భక్తిభావం కుదురుకొని చిత్తైకాగ్ర్యం, ధ్యానధారణ సిద్ధిస్తాయి.

**స్మరణము:**

స్మరణము అంటే భగవంతుని స్మరించటమని, మనస్సును ఆయన లీలా గుణాలతో నింపుకోవటమని అర్థం. ఇంతకుముందు చెప్పిన శ్రవణ కీర్తనాదులు అన్యభక్తులతో కలిసి ఆచరింపవలసినవి కావటం వల్ల మనస్సును బాహ్యవిషయాల నుంచి మళ్ళించి అంతర్ముఖీనం కావించే అవకాశం అందులో తక్కువగా ఉంటుంది. ఈ స్మరణ మన్నది అటువంటిది కాదు. దీనిని ఏకాంతంగా అభ్యసించటం మంచిది. సాధన కొనసాగినకొద్దీ మనస్సు లోచూపు నలవరచుకొని ఏకాగ్రమవుతుంది. మౌనంగా కూర్చొని భగవత్స్మరణ కావించటం ప్రారంభంలో కష్టమనిపించితే భగవన్నామాన్ని జపింపవచ్చును. అందుచేతనే భారతీయసంప్రదాయంలో అష్టోత్తర శతనామావళులు, సహస్రనామస్తోత్రాలు ప్రచారంలోకి వచ్చాయి. ఎవరైనా ఒక వ్యక్తిని మనము పేరుపెట్టిపిలిస్తే అతను వెంటనే తిరిగి మన వైపుకు చూసినట్లుగానే భగవంతుడు కూడా పేరుపెట్టి పిలిస్తే వెంటనే పలుకుతాడని భాగవతం అంటున్నది. భగవానుని దివ్యనామాన్ని తదావాహన యోగ్యమైన బీజమంత్రాక్షరసంపుటితో అంతర్నిహితులై శ్రద్ధగా ధ్యానించాలి. దానికే జపము అని పేరు. ఒక్క జపసమయమందే కాక భగవన్నామాన్ని వీలైనప్పుడల్లా – ఇంకా అవకాశం ఉంటే ఎల్లవేళల – జపించటం మంచిది. నామజపం కొనసాగినంతకాలం భగవత్స్మరణమూ అవిచ్ఛిన్నంగా

కొనసాగుతుంది. అభ్యాసవశాన భగవదనురక్తి గాఢమై జపం చేయకపోయినా మనస్సు భగవంతుని యందే నిలిచి ఉండటం సాధ్యమవుతుంది.

మానవులు ఆధ్యాత్మికోన్నతికి భగవన్నామజపం ఎంత ముఖ్యమైనదో అజామిళుని చరిత్రలో మనము తెలుసుకొన్నాము. పాపానికి ఒడిగట్టి ఆ తర్వాత తమ తప్పు తెలుసుకొని పశ్చాత్తాపంతో బాధపడుతున్నవారికి, లేక మనస్సు చంచలమై ఏకాగ్రత లోపించినవారికి నామజపాన్ని మించిన ఉపాయం లేదు. శ్రీరామకృష్ణులు కూడా భగవద్భక్తికి గల సాధనాలన్నింటిలో నామజపం సర్వోత్తమ మైనదని ఎన్నోమార్లన్నారు. ఇతరమతాలలో వలె హిందూమతంలో చనిపోతున్న వ్యక్తికి చివరిక్షణాలలో పాపనిష్క్రియార్థమైన సంస్కారాన్ని నిర్వహింపజేసే ప్రక్రియ అంటూ ఏదీ లేదని విమర్శ ఒకటున్నది. ఆ విమర్శకు సమాధానం మనకు శ్రీమద్భాగవతంలో లభిస్తుంది. మృత్యుముఖంలో ఉన్న వ్యక్తి భగవన్నామాన్ని జపిస్తే పాపవిమోచన కలిగి పరమపదం చేకూరుతుందని శ్రీమద్భాగవతోపదేశం. పరమకిరాతకుడైన అజామిళుడు మరణ సమయాన 'నారాయణా' అన్నంతమాత్రాన అష్టాంగయోగ నిష్ఠాగరిష్ఠులైన మహాయోగులకు, పరమహంసలకు సైతం అప్రాపణీయమైన శాశ్వత విష్ణులోకానుభవం సమకూరింది.

**తై స్త్యాన్యఘాని పూయన్తే తపోదానజపాదిభిః**
**నాధర్మజం తద్ధృదయం తదపీశాఙ్ఘ్రిసేవయా.**
**అజ్ఞానా దథవా జ్ఞానా దుత్తమశ్లోకనామ యత్**
**సంకీర్తిత మఘం పుంసో దహేదేధో యథానలః.**
**యథాగదం వీర్యతమ ముపయుక్తం యదృచ్ఛయా**
**అజానతోప్యాత్మగుణం కుర్యా న్మన్త్రోప్యుదాహృతః.**

(భాగ. 6. 2. 7–19)

"మరణసమయం సమీపించినప్పుడు మనస్సు ఈశ్వరాయత్తమై శ్రీభగవన్నామాన్ని జపించిన వారికి బహుజన్మకృత మహాపాపసంచయం పటాపంచలవుతుంది. భగవన్నామాన్ని తెలిసి జపించినా, తెలియక జపించినా

దాని ఫలం ఒక్కటే. అగ్ని ఆహుతులను భుజించినట్లు భగవన్నామం సకలపాపాలను భస్మీకరిస్తుంది. శక్తిమంతమైన ఔషధాన్ని యదృచ్ఛాభావంతో గ్రహించినా దాని ప్రభావాన్ని చూపక మాననట్లు అజ్ఞానవశాన ఉచ్చరించిన నామమంత్రమైనా విజ్ఞానాన్ని కూర్చక మానదు" అని భావం.

అంతే కాదు. ఈ విధంగా నిరంతర భగవన్నామజపం, నిరంతర హరికథానుస్మరణం కలియుగంలో సర్వోత్తమ భక్తిసాధనాలని చెప్పబడింది. "కలియుగంలో శ్రీహరి నామాలను నిత్యం జపించి, ఇతరులచే జపింపజేసిన వారి భాగ్యమే భాగ్యం. పాపనిలయమైన కలియుగంలో జన్మించినవారికి ఒక్క లాభం ఉన్నది; కృతయుగంలో ధ్యానము, త్రేతాయుగంలో యజ్ఞయాగాలు, ద్వాపరయుగంలో ప్రతిమార్చన, కలియుగంలో నామసంకీర్తన మోక్షకారణాలు" అని శ్రీమద్భాగవతం అంటున్నది –

**కలే ర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః**
**కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసఙ్గః పరం వ్రజేత్.**

**కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః**
**ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరికీర్తనాత్.**

(భాగ. 12. 3. 51–52)

చూడండి –

**ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేర్చయన్**
**యదాప్నోతి తదాప్నోతి కలౌ సఙ్కీర్త్య కేశవమ్.**

**ధర్మోత్కర్ష మతీవాత్ర ప్రాప్నోతి పురుషః కలౌ**
**అల్పాయాసేన ధర్మజ్ఞా స్తేన తుష్టోస్మ్యహం కలేః**

– విష్ణుపురాణము (6. 2. 17–18)

మొత్తం మీద భాగవత పురాణ సారసంగ్రహం ఏమిటంటే, భగవన్నామసంకీర్తనమే భవనిస్తారకమైన పరమోపాయమని

సిద్ధాంతీకరింపవచ్చును. పాపవర్తనులు, పరమసాధువులు, అజ్ఞానులు, మహావిద్వాంసులు - ఎవరయినా సరే, పూర్ణవిశ్వాసంతో జపించినప్పుడు దివ్యనామమే వారిని భగవత్సమానశక్తిమంతమై భవజలధి నుంచి ముక్తి తీరానికి చేరుస్తుంది. భగవానుడు తన దివ్యనామప్రభావం వల్లనే సర్వజనసులభుడై వెలుగొందుతున్నాడు.

**పాదసేవనము:**

పాదసేవనము అంటే భగవానుని శ్రీచరణాలను సేవించటమని అర్థం. దీనికి పాదప్రక్షాళనమనే అర్థం కూడా వ్యాప్తిలో ఉన్నది. అయితే భగవానుడు మానుషవేషాన్ని ధరించి నేలకు దిగివచ్చినప్పుడు తత్తుల్యకాలీనులకు తప్ప అన్యకాలాలలో జన్మించినవారికి పాదసేవ కావించే ప్రత్యక్షావకాశం లభింపదు. అందువల్ల 'పాద' అనే శబ్దానికి 'భాగము' లేదా 'అంశము' ('పాద స్తురీయోభాగః' - అమరకోశం) అని అర్థం చెప్పుకోవాలి. విరాట్పురుషుని యొక్క మూర్తామూర్త రూపాలను అభివర్ణించే సందర్భంలో పురుషసూక్తం నాలుగు పాదాలను పేర్కొన్నది. ఆ విరాణ్మూర్తికి భూమి పాదములని చెప్పబడింది (భూః పాదౌ యస్య - చూ.). కాబట్టి భూమండలాన్ని ఆవాసంగా చేసుకొని ఉపజీవిస్తున్న చరాచర సమస్త జీవరాశిని భగవన్మూర్తులనుగా భావించి, తత్సేవ కావించుకొనటమే పాదసేవనమని అర్థం చేసుకోవాలి. భగవంతుని చరణకమలాలకు అర్పించినట్లుగా భావించి కావించే ఏ కర్మమైనా పాదసేవనమే అవుతుంది. భక్తియోగమంటే మనుషులను ఏదో లోకాతీతవ్యక్తులుగా మారుస్తుందనుకొనేవారు లోకసేవాదృక్పథం ప్రధానంగా కలిగిన ఈ భక్తివిధానాన్ని పరిశీలించటం మంచిది. భక్తి సంఘానికి ఎంత సహాయకమో తెలిసివస్తుంది. అంతేకాదు. సాధకుడు తన చుట్టూ ఉన్నవారి పట్ల సేవాభావాన్ని కలిగి నలుగురికీ మంచి చేయాలని ప్రయత్నించిన కొద్దీ అతనిలోని స్వార్థమాలిన్యం కరిగిపోయి మరింత ఆత్మోన్నత్యం చేకూరుతుంటుంది. స్వార్థచింతన ఉన్నంతకాలం వ్యక్తియొక్క ఆధ్యాత్మిక

పురోగతికి అడ్డువస్తూనే ఉంటుంది. స్వార్థం తొలగిన వెంటనే మనస్సు పరిశుద్ధమై పరతత్త్వానుభవానికి సన్నద్ధమవుతుంది. అయితే పాదసేవన చేయటంతో సాధకుడు తనపని ముగిసినదని భావింపకూడదు. అన్యభక్తి విధాలను కూడా అనుష్ఠించటం మొదలుపెట్టాలి. లేకుంటే భగవదనుస్మరణ లోపించి, తాను సేవిస్తున్నది భగవత్ప్రతికృతులననే భావం అణగారిపోతుంది. మాధవసేవగా భావింపక చేసే మానవసేవ సాధకుని మనస్సులోని దైవీసత్త్వసంపదను పెంపొందింపలేదు.

**అర్చనము:**

భక్తియోగమార్గాలలో ఐదవది అర్చనం. దీనినే నిత్యవ్యవహారంలో 'పూజ' అంటున్నాము. పూజ అంటే, మనము భగవన్మూర్తిగా భావించిన ప్రతిమకు (అర్చామూర్తికి) ఆగమప్రామాణ్యాన్ని అనుసరించి కల్పోక్తవిధానం ప్రకారం పూజావిధి నిర్వహించటం అన్నమాట. పూజకు సమకూర్చుకొన్న ద్రవ్యాలన్నీ పరిశుద్ధమైనవిగా ఉండాలి. భగవంతుడు మన యెదుట ఉన్నాడని భావించి, సర్వోపచారాలను శ్రద్ధగా చేయాలి. పూజాద్రవ్యాలన్నీ ఎంతో అర్థయుక్తంగా ఆలోచించి మన పెద్దలు ఏర్పాటు చేసినవి. మనము మన మనస్సునే సుమనస్సు (పువ్వు) గా సంకేతించి భగవంతుని పాదాలకు సమర్పిస్తున్నాము. పూజావిధానంలో ఉన్న ఉపచారాలన్నీ ఇదే విధంగా రూపొందింపబడ్డాయని గుర్తుంచుకోవాలి.

అయితే ఈ విధమైన పూజాకల్పమంతా విగ్రహారాధన సమ్మతమైనప్పుడు మాత్రమే ప్రసక్తమవుతున్నది. హిందూమతంలోని ప్రత్యేకతలలో ఇదొకటి. సాధకులు చిత్తైకాగ్ర్యాన్ని, అనన్యభక్తిభావాన్ని సాధించటానికి ఉపయోగపడే అనేకప్రక్రియలలో ఇది అపరిహార్యం కాకపోయినా, అత్యంతవిశిష్టమని మాత్రం చెప్పక తప్పదు. బౌద్ధమతంలోని కొన్ని శాఖలను మినహాయిస్తే మొత్తం మీద ప్రతిమార్చనను భక్తిసోపానాలలో ఒకటిగా అంగీకరించే మతం హిందూమతమేనన్న మాట అతిశయోక్తి కాదు.

సెమిటిక్ మతాలన్నింటిలోనూ (సెమిటిక్ భాషాకుటుంబానికి చెందిన అసీరియన్, ఆర్మీనియన్, హీబ్రూ, ఫోనీషియన్, అరబిక్, ఇథియోపియా ఈ మొదలైన జాతులవారు అవలంబించిన మతాలు), ప్రత్యేకించి ఇస్లామ్, సిద్ధాంతరీత్యా ఆలోచిస్తే క్రైస్తవమతంలో కూడా విగ్రహారాధన పట్ల వ్యతిరేకత ఉన్నది. భగవంతుడు ప్రకృతితత్త్వానికి పూర్తిగా అతీతుడని; అందువలన ప్రకృతిలోని మూర్తులను ఊతగాగొని చేసే చిత్రణలన్నీ భగవన్మూర్తులు కానేరవని; రాళ్ళూరప్పలతో చేసిన విగ్రహాలు, బొమ్మలు భగవత్ప్రతిమలు కాకపోగా, వాటిని పూజించటం భగవదపరాధమేనని – అవ్యక్తచేతనలో మొలకెత్తిన ఒకానొక విరోధాభాసమే – వీరి ఈ వ్యతిరేకతకు కారణమై ఉంటుంది. దీనికి విరుద్ధంగా హిందూమతం ప్రకృతి భగవంతుని యొక్క వ్యక్తరూపం మాత్రమేనని, భగవానుని యందు వసిస్తున్న ప్రకృతిలో భగవానుడు నివసించటం కద్దని, అందువల్ల దృశ్యమాన సమస్త వస్తుజాతమూ నిస్తులమైన భగవద్రూపమేనని, నిరతిశయ కరుణాంతరంగుడైన భగవానుడు భక్తజనోద్ధరణార్థం సుప్రతిష్ఠితాలైన ప్రతిమలలో భాసమానుడై భక్తులకు తన సన్నిధిని ప్రసాదించి, వారి ప్రార్థనలను ఆలకించి, సర్వాభీష్టాలను నెరవేరుస్తాడని బోధిస్తున్నది. భగవానుని ఆ పవిత్రమూర్తులను – మనము తరచు అంటున్నట్లు – విగ్రహాలు (ఐడల్స్) అనటం అసలు మహాపచారమని చెప్పాలి. అవి విగ్రహాలు కావు. అసంవిదులైన అతిసామాన్యులు కూడా పూర్ణవిశ్వాసంతో ఆరాధించి అధ్యాత్మవిద్యాపరమార్థాన్ని చూరగొనటానికి వీలుగా భగవంతుడు చూపిన మహానుగ్రహరూపాలు. సెమిటిక్ మతాలలో వలె ఒకానొక ఊహామాత్రతత్త్వాన్ని ఉద్దేశించి ప్రార్థనలు జరపటం కంటె, ప్రత్యక్షంగా కంటికి కనబడుతున్న ఒక మనుష్యాకారిత భగవద్రూపాన్ని ఆరాధించటం వలన అది వాస్తవమేనన్న భావన ఉదయించి, భక్తి కుదురుకొని కొంతకాలం తర్వాత మనస్సు విగ్రహం మీదినుంచి మళ్ళి అంతర్ముఖీనమై ధ్యానధారణ చేయగలుగుతుంది.

అయితే ఈ విగ్రహారాధన మితిమీరి పూజాపురస్కారాలే ప్రధానంగా పెట్టుకొని అసలు విషయాన్ని మరిచిపోతే పూజ నిరర్థకం కావటం మాట అటుంచి అదొక భక్తివిధానమే కాకుండా పోతుంది. నిజానికి ఈ విధమైన ఆరాధనలోని పరమార్థం ఏమిటంటే, భక్తుడికి భగవానుడు తన కట్టెదుటనే నిలిచి ఉన్నాడన్న మనోధైర్యం చేకూరుతుంది. పూజాదులు ఒక విధానం మాత్రమే; అదే పరమార్థ మనుకోకూడదు. వ్యవహారవిధులను బోధించే ఒక నియమావళి వలె ఈ పూజాదులు భక్తునియొక్క భక్తిభావాభివ్యక్తికి ఉపకరణలు గాను, అతని జీవితంలో ఒక క్రమశిక్షణను ప్రవేశపెట్టే సాధనాలుగాను పనికివచ్చే మాట నిజమే. అయితే పూజయొక్క పరమార్థం భక్తి అని, దైనందిన విధినిర్వహణ కాదని భక్తుడు మరిచిపోకూడదు. భగవానుడే గీతలో అన్నట్లు – పత్రం, పుష్పం, ఫలం, తోయం భక్తితో ఏది సమర్పించినా ఆయనకు ఆనందమే. భక్తి లేని పూజవల్ల శ్రమమాత్రమే మిగులుతుంది. ఫలితం శూన్యం.

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.**

(భగవద్గీత 9–26)

అంత మాత్రాన నిత్యపూజావిధులు కేవల నిరర్థకాలని భావింపకూడదు. అతిదీర్ఘకాలం జరుపదగిన యజ్ఞయాగాదులను నిర్వర్తిస్తూనే గాఢభక్తిపరులైన భాగవతోత్తముల కథలెన్నో ఉన్నాయి. భక్తియొక్క ఈ దృక్పథాన్ని విపులంగా తెలుసుకొనగోరినవారు శ్రీరామకృష్ణుల శిష్యబృందంలో ప్రాతఃస్మరణీయులైన శ్రీ రామకృష్ణానంద గారి జీవిత చరిత్రను తప్పక చదవాలి. ఈ విధమైన ఆరాధన కూడా భక్తుని మనస్సులో ఒకానొక ఆనందదీప్తిని వెల్లివిరియింపజేస్తుంది. అందువల్లనే నారదభక్తిసూత్రాలలో ప్రసక్తమైన 'పూజాది ష్వనురాగ ఇతి పారాశర్యః' అనే దళానికి భక్తినిర్వచనాలలో ఒకటిగా ప్రాకామ్యం ఏర్పడింది.

పూజాదికమంటే కర్మకలాపంలో ఒక సాంగసాధన ప్రక్రియ అనుకొన్నాము. అయితే కర్మకలాపానికి అతీతమైన పూజావిధానం కూడా ఒకటున్నది. దానికే సేవనమని పేరు. ఈ విధానంలో సాధారణ పూజాదులను పూర్తిగా మానివేయటమో, లేక నామమాత్రంగా నిర్వహించటమో చేస్తే చాలును. భగవత్ప్రతిమను దివ్యమంగళవిగ్రహుడైన శ్రీ భగవానుని యొక్క సాక్షాత్కృతి వలెనే భావించుకోవాలి. ఆ జీవత్పురుషవిగ్రహునికి పరమానురక్తితో భక్తి కావించాలి. అర్ఘ్యపాద్యాదులు, మంగళస్నానము, ఉజ్జ్వల వేషధారణ, మధురాహారపానీయాలు, సుప్రభాతం మొదలుకొని పవ్వళింపు సేవ వరకు సర్వోపచారాలను సహజప్రేమతో పరమానురాగంతో వినయవిధేయతలతో సలక్షణంగా నిర్వర్తించాలి. మనయింటిలో అడుగుపెట్టిన భగవానునికి ఏ విధంగా సకల మర్యాదలు చేసి ప్రసన్నుని కావించుకొంటామో, అదే విధంగా భగవత్ప్రతిమను ఆరాధించాలి. శ్రీ వల్లభాచార్య చైతన్యప్రభువులు ప్రబోధించిన భక్తివిధానాలలో ఇటువంటి మూర్తిసేవకు అగ్రతాంబూలం లభించింది.

ఆ విధంగా భగవత్సేవారతుడై నిత్యారాధనతత్పరుడై తనయింట వెలసిన మూర్తిని సేవించుకొంటున్న భక్తునికి తత్పూజాఫలంగా భగవద్భావనాసిద్ధి కలుగుతుంది. తన యెదుటనున్న దృశ్యాదృశ్యసమస్తమూ భగవద్రూపమేనన్న అభిజ్ఞానం కలుగుతుంది. సమస్తరూపంలో భగవత్సేవ, వ్యస్తరూపంలో భగవత్ప్రతిమల సేవ – సర్వమూ ఆ సర్వేశ్వరునికే అన్న ప్రజ్ఞ ఉదయిస్తుంది. ఈ విధంగా విగ్రహారాధనను విశ్వారాధనగా విస్తరింపజేయటమే భక్తుని పరమలక్ష్యమని భాగవతం అంటున్నది:

**యథా తరో ర్మూలనిషేచనేన**
**తృప్యన్తి తత్స్కన్ధభుజోపశాఖాః**
**ప్రాణోపహారాచ్చ యథేన్ద్రియాణాం**
**తథైవ సర్వార్హణ మచ్యుతేజ్యా.** (భాగ. 4. 31. 14)

పోతన గారి అనువాదం చూడండి :

**వ.“... సర్వేశ్వరుండు సమస్త శ్రేయ స్స్వరూపుండు, సమస్త శ్రేయోవధిభూతుండు, సర్వభూతావాసుండు, సర్వభూతాత్మప్రదుండు, సర్వభూతప్రియుండు, సర్వవ్యాపకుండును గావున.**

**మ. కమలాధీశ్వరుఁ బూజసేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహా**
**రము సర్వేంద్రియ తృప్తిహేతువును సర్వక్ష్మాజమూలాభిషే**
**కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్చన**
**క్రమమై యొప్పు ధరావరేణ్యసుతులారా! బుద్ధి నూహించినన్.**

(ఆంధ్ర భాగ. 4-952)

ఇదేవిధంగా –

**యథా హి స్కన్ధశాఖానాం తరో ర్మూలావసేచనమ్**
**ఏవ మారాధనం విష్ణోః సర్వేషా మాత్మనశ్చ హి.**

(భాగ. 8.5.49)

భక్తిపథానువర్తులలో కొంతమంది బ్రహ్మభావన లోపించిన సకర్మకవిధులన్నీ కేవల నిరర్థకాలని వేదవాఙ్మయం నొక్కిచెబుతున్నప్పటికీ, ఆ మాట మరచి పూజావిధులకే అధిక ప్రాధాన్యం ఇస్తుంటారు. ఇది ఆత్మవంచనతో సమానమని వేరే చెప్పనక్కరలేదు. అందుచేతనే, భాగవతోత్తములను గురించి ప్రసంగిస్తూ భాగవతం త్రివిధభక్తుల స్వభావాలను పేర్కొనవలసివచ్చింది. సర్వభూతాంతరాత్ముడైన పరమాత్మ ఒక్కడేనని, సర్వమూ ఏకమని భావించి భగవదైక్యానుసంధానం కావించిన పరాభక్తుడు ఉత్తమోత్తముడు. సాధువులు, దయామయులు, సహనమూర్తులు, సత్యైకజీవనులు, నిరవద్యచిత్తులు, సర్వసమభావనులు, సర్వోపకారకులు, నిష్కాములు, నిష్కల్మషులు, అకించనులు, మితాహారవ్యవహారులు అయి అంతఃకరణ పరిపాకానుసారం పరాభక్తిని అనుష్ఠించేవారు జ్ఞానమిశ్రభక్తులు. ఇక శుద్ధభక్తులు భగవత్తత్త్వవిచారమే చేయరు. అనన్యభావంతో

మనోవాక్కాయకర్మల భగవంతుని ఆరాధిస్తూ, భగవద్విభూతులను, భగద్భక్తులను సందర్శిస్తూ, భగవత్పూజాస్తుతిసేవాదులు కావిస్తూ, భగవల్లీలలను శ్లాఘిస్తూ, సర్వం భగవంతునికే సమర్పిస్తూ, భగవదర్పితచిత్తులై దేవాలయాలలో ఉత్సవాదులను జరుపుతూ, దివ్యక్షేత్రతీర్థయాత్రలు సలుపుతూ అభిమానము, గర్వాడంబరాదులు, ఆత్మప్రకటనము లేక నిఃస్వార్థచిత్తులై మెలగేవారు శుద్ధభక్తులు. ఈ రెండు తెగలవారూ అపరాభక్తులు అని భాగవతం అంటున్నది.

**సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావ మాత్మనః**
**భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః.**

**ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ**
**ప్రేమమైత్రీకృపోపేక్షా యః కరోతి స మధ్యమః.**

**అర్చాయా మివ హరయే పూజాం యః శ్రద్ధయేహతే**
**న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృతః స్మృతః.**

(భాగ. 11. 2. 45–47)

మానవసేవే మాధవసేవ అన్న మహాశయంతోనే శ్రీమద్భాగవతం ప్రతిమార్చనలను ఉపదేశించిన దనటానికి మేలైన ఉదాహరణ ఇంతకు మునుపు వచ్చిన కపిలోపదేశంలో ఉన్నది:

**అహం సర్వేషు భూతేషు భూతాత్మావస్థితః సదా**
**త మవజ్ఞాయ మాం మర్త్యః కురుతేర్చావిడమ్బనమ్.**

**యో మాం సర్వేషు భూతేషు సన్త మాత్మాన మీశ్వరమ్**
**హిత్వార్చాం భజతే మౌఢ్యా ద్భస్మన్యేవ జుహోతి సః.**

**ద్విషతః పరకాయే మాం మానినో భిన్నదర్శినః**
**భూతేషు బద్ధవైరస్య న మనఃశాన్తి మృచ్ఛతి.**

అహ ముచ్చావచై ర్ద్రవ్యైః క్రియయోత్పన్నయానఘే
నైవ తుష్యేర్చితోర్చాయాం భూతగ్రామావమానినః.

అర్చాదా వర్చయే త్తావ దీశ్వరం మాం స్వకర్మకృత్
యావ న్న వేద స్వహృది సర్వభూతేష్వవస్థితమ్.

ఆత్మనశ్చ పరస్యాపి యః కరో త్యన్తరోదరమ్
తస్య భిన్నదృశో మృత్యు ర్విదధే భయ ముల్బణమ్.

అథ మాం సర్వభూతేషు భూతాత్మానం కృతాలయమ్.
అర్హయే ద్దానమానాభ్యాం మైత్ర్యాభిన్నేన చక్షుషా.

(భాగ. 3. 29. 21–27)

సీ. నిత్య నైమిత్తిక నిజధర్మమున గురు
శ్రద్ధాగరిష్ఠతఁ జతుర పాంచ
రాత్రోక్త హరి సమారాధన క్రియలను
నిష్కామనంబున నెఱి మదీయ
విగ్రహదర్శన వినుతి పూజా వంద
న ధ్యాన సంశ్రవణములఁ గర్మ
సంగి గాకుండుట సజ్జనప్రకరాభి
మానంబు నొందుట హీనులందుఁ

తే. జాల ననుకంప సేయుట సములయందు
మైత్రి నెఱపుట యను నియమక్రియాది
యైన యోగంబు చేత నాధ్యాత్మికాధి
భౌతికాదులఁ దెలియుట పలుకుటయును.

వ. మఱియును.

క. హరి మంగళ గుణకీర్తన
పరుఁ డై తగ నార్జవమున భగవత్పరులన్
గర మనురక్తి భజించుట
నిరతధ్యానమున నుంట నిశ్చలుఁ డగుటన్.

క. ఇవి మొదలుగాఁ గలుగు భ
గవ దుద్దేశాభిధర్మకలితుం డై వీ
ని వలన బరిశుద్ధగతిం
దవిలిన మదిఁ గలుగు బుణ్యతముఁ డెయ్యెడలన్.

తే. గురుతరానేక కల్యాణగుణవిశిష్టుఁ
డనగ నొప్పిన నను బొందు నండగొనక
పవనవశమునఁ బువ్వుల పరిమళంబు
ఘ్రాణమున నావరించిన కరణి మెఱసి.

చ. అనిశము సర్వభూతహృదయాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞసేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనా విడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపఁడేని య
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాఁ డగున్.

సీ. అబ్జాక్షి! నిఖిలభూతాంతరాత్ముఁడ నైన
నా యందు భూతగణంబు నందు
నతిభేద దృష్టి మాయావు లై సతతంబు
పాయక వైరానుబంధ నిరతు
లగువారి మనములఁ దగులదు శాంతి యె
న్నటికైన నేను నా కుటిల జనుల

**మానక యెపుడు సామాన్యాధిక ద్రవ్య**
**సమితిచే మత్పదార్చన మొనర్ప**

**తే. నర్థి నా చిత్తమున ముదం బందకుందు**
**ననుచు నెఱిఁగించి మఱియు ని ట్లనియెఁ గరుణఁ**
**గలిత సద్గుణ జటిలుఁ డ క్కపిలుఁ డెలమిఁ**
**దల్లితోడ గుణవతీమతల్లి తోడ.**

(ఆంధ్ర భాగ. 3. 950-6)

**వందనము:**

వందనము అనే శబ్దానికి ప్రణామమని అర్థం. అర్చనోపాంగ మనుకొంటే దీనికి భగవత్ప్రతిమ ముందు దండవత్ప్రణామం ఆచరించటమని అర్థం. భక్తుడు భగవానుని యొక్క మహిమను గుర్తించి ఆయనకు సమర్పితుడు కావటాన్ని ఈ ప్రక్రియ సూచిస్తుంది. ఈ శబ్దం వ్యక్తులు ఒకరికొకరు నమస్కరించుకొనటం, మోకరిల్లటం, కరచాలనాదులతో పరస్పరం గౌరవ భావాన్ని వ్యక్తీకరించటం మొదలైన పెక్కు అర్థాలలోనూ ప్రయోగింపబడుతున్నది. భక్తివిధాలలో ఒకటిగా గుర్తించినప్పుడు దీనికి ప్రతిమారూపం లోనో చరాచరవస్తురూపం లోనో పరినిష్ఠితుడై ఉన్న భగవానునికి కావించే అభివాదమని విశేషార్థం చెప్పుకొంటున్నాము.

భాగవతసంప్రదాయంలోని ఈ వందన భక్తి దేవాలయం పరిధులను దాటి సమాజంలోనికి ప్రవేశించింది. అణువు నుంచి బ్రహ్మాండం వరకు వ్యాపించి ఉన్న భగవానుని ఉనికిని స్వానుభవంలో గుర్తించిన తర్వాత భక్తుడు ఆ విశ్వాత్మునికి ప్రణమిల్లని చోటంటూ ఉండదు. ప్రతిమావిష్టుడైన భగవానుని వలెనే ప్రకృతి సమస్తం ప్రత్యక్ష భగవద్రూపమని గుర్తించిన తర్వాత భక్తుని మనస్సు వినయనిర్భర మౌతుంది. వందనమంటే ఒక్క పూజాసమయంలో మాత్రమే ఆచరించే ప్రక్రియ కాదని, సర్వజీవులు వందనీయులేనని గ్రహిస్తాడు. కులమతాది వివక్షలేని సర్వసమతాభావంతో అతను అందరినీ

ఏకరీతిని గౌరవింపగలుగుతాడు. పాదసేవన వలెనే వందన భక్తిలోనూ కర్మకలాపాలను అతిగమించి జీవనవిధానంగా మారి మానవ సంబంధాలను సుప్రభావితం చేసే మహనీయశక్తి ఉన్నది.

## దాస్యము - సఖ్యము - ఆత్మనివేదనము

ఈ శబ్దాలకు భక్తుడు భగవానుని యెడ దాసభావాన్ని, మిత్రభావాన్ని, సర్వసమర్పణభావాన్ని కలిగి భక్తిచేయటమని అర్థం. ఈ మూడు భావాలలోనూ భక్తుని అహంభావాన్ని నశింపజేసే గుణం ఉన్నది. అయితే సామాన్యులైన వారికి భగవంతునితో సఖ్యభక్తి కావించటం, సంసారబంధాలను త్రెంచుకొని ఆత్మసమర్పణ చేయటం అంత సులభమైన భావాలు కావు. అందుకు ఎంతో విశిష్టమైన సంస్కారం అవసరమవుతుంది. దాస్యభక్తి మాత్రం అందరికీ అందుబాటులో ఉండే భావమే. ఒక విధంగా సర్వసామాన్యమని కూడా చెప్పవచ్చును. శ్రీకృష్ణుని జీవితంలో ఈ మూడువిధాల భక్తులను అనుష్ఠించి ఆయన కరుణకు పాత్రులైనవారి కథ లనేకం ఉన్నాయి.

ప్రపంచంలో ఉంటూ, ప్రపంచంతో సంబంధాలను పెట్టుకొన్నవాళ్ళు ప్రాపంచిక జీవితంలో 'అహం' భావాన్ని చంపుకొనటం అనుకొన్నంత సులభమేమీ కాదు. ఈ అహంభావము యొక్క లక్షణం ఏమిటంటే ప్రప్రథమంగా ఇది 'నేను' అంటే 'దేహము' అనే అధ్యాసను కలుగజేస్తుంది. జీవియొక్క సమస్తకార్యాలు ఈ దేహాత్మభావాన్ని ఆశ్రయించుకొనే జరుగుతుంటాయి. భక్తిభావన గట్టిపడి భగవన్మయత సిద్ధించేకొద్దీ ఈ అహంత సన్నగిలి క్రమక్రమంగా 'నేను భగవంతునికి పాదదాసుడను', 'భగవంతుడే నాకు దిక్కు', 'నేను భగవంతునికి ప్రీతిపాత్రుడను', 'సఖుడను', 'ప్రియుడను' మొదలైన భావాలు ప్రవేశించినప్పుడు సాధనలో ఉన్నతకక్ష్యలను చేరుకొంటున్నామని, మలినభావనలు ఒక్కొక్కటే తొలగిపోతున్నాయని గ్రహించాలి. సాధన పరిపక్వమై పూర్ణభక్తి సిద్ధించినప్పుడు భక్తునికి భగవదన్యమైన వస్తువేదీ లేదని తెలిసివస్తుంది. ఇది

పుస్తకాల నుంచి వచ్చే జ్ఞానం కాదు. సహజంగా, స్వచ్ఛందంగా భగవన్మాహాత్మ్య బోధ వలన కలిగే జ్ఞానం. ఈ స్థితిలో భక్తుని మనస్సులోని స్వార్థభావాలన్నీ కరిగిపోతాయి. స్వార్థరాహిత్యం వలన అతని జీవితం పరార్థప్రాపకమై అనతికాలంలో విశ్వశ్రేయోరచనగా పరిఢవిల్లుతుంది. ఇటువంటి ఆత్మసమర్పణశీలమే భక్తికి చివరిమెట్టు.

శ్రీకృష్ణగోపికావృత్తాంతంలో మనకు కనుపించే గోపికల మనఃస్థితి ఇదే. గోపికల పరమానురక్తిలో సర్వార్పణభావం ఉద్దీపించింది. శ్రీకృష్ణపాదసేవనలోనే జీవితపరమార్థాన్ని వారు దర్శింపగలిగారు. ఆ సేవలో ఫలాకాంక్ష, సుఖాసక్తి చివరికి మోక్షాభిలాష కూడా వారి మనస్సులో లేదు. సర్వసమర్పితలై వారు శ్రీకృష్ణపాదసేవనమే సేవకు పరమార్థమని భావించారు. శ్రీకృష్ణసేవానిరతిశయమహాపుణ్యవతులై త్రిశుద్ధికి మెలగి శ్రీకృష్ణపరబ్రహ్మాన్ని చేరుకొన్నారు. భక్తిభావోన్నతికి ప్రథమోదాహరణీయలైన వీరి అనన్యభక్తిని సర్వాంగీణ శోభతో అభివర్ణిస్తున్న దశమస్కంధాన్ని శ్రీమద్భాగవత కలశరత్నాకర నవోదిత పూర్ణసుధాకలశ మందాము.

## ఏకాదశ స్కంధం

శ్రీమద్భాగవతం ఏకాదశ స్కంధంలోని 31 అధ్యాయాలలో 1366 శ్లోకాలున్నాయి. దశమ స్కంధంలో ఉపబృంహితమైన శ్రీకృష్ణ పరమాత్మ జీవితోదంతం ఈ భాగంతో ముగింపుకు వస్తున్నది. సంసారఘోరదావానల తప్తులైన మానవులకు చతుర్థపురుషార్థాన్ని ఉపదేశించి జననమరణ చక్రభ్రమణం నుంచి శాశ్వతవిముక్తిని కలిగించటమే దీని పరమధ్యేయం. శ్రీమద్భాగవత మహాసౌధానికి ఈ దశమైకాదశ స్కంధసంపుటి స్ఫటికగోపురం వంటిదని చెప్పవచ్చును.

యాదవవంశ వినాశానికి అంకురార్పణ చేసిన పరిస్థితుల స్థూలచిత్రణతో ఈ పదకొండవ స్కంధం మొదలవుతున్నది. మునిశాపవశాన యదుకులంలో ముసలం పుట్టిన సన్నివేశాన్ని వర్ణించిన తర్వాత, ద్వితీయాధ్యాయంలో

శుకయోగి భాగవత ధర్మాన్ని పరీక్షితునికి బోధించాడు. ఒకనాడు వసుదేవుడు శ్రీకృష్ణదర్శనార్థమై ద్వారకకు వచ్చిన నారదమహర్షిని కొన్ని ధర్మసూక్ష్మాలు అడుగుతాడు. ఆ సందర్భంలో నారదునికి పూర్వం నవకవులు నిమిచక్రవర్తికి ఉపదేశించిన భాగవతధర్మం స్ఫురణకు వస్తుంది. విదేహను పరిపాలిస్తున్న ఋషభమహారాజుకు కవి హరి అంతరిక్షుడు ప్రబుద్ధుడు పిప్పలాయనుడు ఆవిర్హోత్రుడు ద్రుమిళుడు చమసుడు కరభాజనుడు అని తొమ్మిది మంది కొడుకులు జన్మించి, బాల్యవయస్సులోనే వేదశాస్త్రపారీణులై ఆత్మజిజ్ఞాస వహించి నివృత్తి మార్గాన్ని స్వీకరించారు. ఆ సమయాన భరతవర్షంలో నిమిచక్రవర్తి సత్త్రయాగం చేస్తున్న సంగతి విని వారక్కడికి చేరుకొంటారు. ఆత్మవిద్యావిశారదులైన ఆ మహానుభావులను నిమి ఆత్యంతికక్షేమమేదో తెలుపమని వేడుకొంటాడు. నవకవులు ఒక్కరొక్కరే ముందుకు వచ్చి భాగవతధర్మము, భగవద్భక్తుని లక్షణాలు, మాయాస్వరూపం, మాయాజయం, భగవత్స్వరూపం, కర్మయోగం, విరాట్పురుషావతారం, భక్తిహీనుల గతి, యుగధర్మాలు అనే తొమ్మిది విషయాలను ఉపదేశిస్తారు. నారదుడు ఉదాహరించిన ఈ ఉపాఖ్యానం సంస్కృతభాగవతంలో రెండవ అధ్యాయం మొదలుకొని ఐదవ అధ్యాయం వరకు విస్తరించింది. భక్తి జ్ఞానాల సమగ్రతత్త్వాన్ని వివేకించి భాగవతధర్మాన్ని పరమోపాయంగా నిర్ధారిస్తున్న ఈ సన్నివేశం శ్రీమద్భాగవతంలోని భక్తిరసోజ్జ్వల ఘట్టాలలో ఒకటి. ఒకవిధంగా శ్రీమద్భాగవత తాత్పర్యమూ ఇదే.

ఆరవ అధ్యాయంలో యాదవ వినాశం పునఃప్రసక్త మయింది. శ్రీకృష్ణావతార పరిసమాప్తికి నాందిగా దేవతలు వచ్చి భావికర్తవ్యాన్ని విన్నవించి భగవానుని ప్రార్థిస్తారు. ద్వారకలో అపశకునాలు పొడచూపి యాదవులకు దిగులు కలుగుతుంది. అక్కడికి చేరువనే ఉన్న ప్రభాసక్షేత్రానికి వెళ్ళి తీర్థస్నానాలు చేసి పుణ్యకర్మ లాచరింపవలసినదని శ్రీకృష్ణుడు వారికి ప్రబోధిస్తాడు.

శ్రీకృష్ణావతారం ముగియనున్నదని గ్రహించి శ్రీకృష్ణభక్తాగ్రేసరుడైన

ఉద్ధవుడు ఆయనను ఏకాంతంలో కలుసుకొని కర్తవ్యోపదేశం చేయమని అడుగుతాడు. సప్తమం మొదలుకొని ఇరవైతొమ్మిదవ అధ్యాయం వరకు ఉన్న భాగమంతా శ్రీకృష్ణోద్ధవుల సంభాషణమే. దీనికే ఉద్ధవగీత అని కూడా పేరున్నది.

భగవానుడు దాసవరేణ్యుడైన ఉద్ధవునికి పరమధర్మాన్ని బోధిస్తాడు. ఉపాధులన్నింటిలో మనుష్యుని ఉపాధి ఉత్తమోత్తమమైనది. ఆత్మదీప్తిప్రకాశం కలిగిన మనుష్యులు తక్కిన జంతువుల వలె క్షుత్పిపాసలతో తృప్తిచెందక యుక్తాయుక్తవివేకం, ఆత్మకల్యాణజ్ఞానం, తన్మార్గాన్వేషణ మొదలైన సాధనాలతో మోక్షాన్ని సాధింపగలుగుతున్నారు. సాధనాలు జడములై ఉన్నప్పటికీ సాధకుడు వాటిసాయంతో కార్యసిద్ధి పొందవచ్చునని అంటూ శ్రీకృష్ణుడు అవధూత యదుసంవాదాన్ని ఉద్ధవునికి వినిపిస్తాడు. అవధూత తనకు జ్ఞానబోధ కావించిన ఇరవైనలుగురు గురువులను పేర్కొని, ఎవరినుండి ఏ విషయాన్ని గ్రహించినదీ వివరించిన ఈ సన్నివేశం సప్తమం మొదలుకొని మూడు అధ్యాయాలకు ప్రాకింది. ఆ చతుర్వింశతి గురువులు, వారినుండి నేర్చుకొన్న విషయాలూ ఇవి:

1. **భూమి** – క్షమా పరార్థజీవికలు
2. **వాయువు** – జీవితనిర్వాహకత్వం, ఆత్మనిస్సంగత్వం
3. **ఆకాశము** – ఆత్మాపరిచ్ఛేద్యత
4. **జలము** – సహజ స్నిగ్ధ నిర్మల స్వభావం
5. **అగ్ని** – నిసర్గప్రకాశాదులు
6. **చంద్రుడు** – ఆత్మ నిర్వికారత్వం
7. **సూర్యుడు** – ఆత్మ ఏకము, శుద్ధము
8. **పావురములు** – మమకారమే పతనద్వారం
9. **అజగరము** – యథాప్రాప్తసంతృప్తి

| | |
|---|---|
| **10. సముద్రము** | – నిర్వికల్పస్థితి |
| **11. శలభము** | – సంసారకూప పతనం |
| **12. మధుకరము** | – గుణగ్రహణం |
| **13. గజము** | – ఆసక్తి దోషం |
| **14. మధుహారి** | – సంచయ ఫలం |
| **15. మృగము** | – ఇంద్రియవశత్వం |
| **16. మత్స్యము** | – ఆశాపరత్వం |
| **17. పింగళ** | – నైరాశ్యం |
| **18. కురరము** | – మమకారమే దుఃఖబీజం |
| **19. పసివాడు** | – పరమానందం |
| **20. కన్య** | – వివిక్తసేవత్వం |
| **21. ధనుర్విద్యాభ్యాసకుడు** | – యోగాభ్యాస క్రమం |
| **22. సర్పము** | – అనికేతాప్రమత్తాదులు |
| **23. ఊర్ణనాభము** | – సృష్టిస్థితిలయాలు |
| **24. కీటము** | – తత్సారూప్యం |

ఈ మూడు అధ్యాయాలలో ప్రస్తావింపబడిన ధర్మస్వరూపాన్ని గురించి ఇంకా తెలుసుకోవాలని కుతూహలం ఉన్నవారు నారాయణీయం 23–వ దశకంలో ఉన్న శ్లోకాలను కూడా చదివితే బాగుంటుంది. (నారాయణీయం – నారాయణభట్టాత్రి ప్రణీతమైన ఉత్తమ భక్తికావ్యం. రామకృష్ణమఠం వారు దీనిని తెలుగులో ప్రచురించారు.)

ఈ విధంగా భక్తిసాధనకు ఉపక్రమాత్మక విధులను అనుశాసించిన తర్వాత పదవ అధ్యాయంలో ఆత్మతత్త్వం, బంధముక్తుల స్వరూపం

చర్చింపబడ్డాయి. పదకొండవ అధ్యాయంలో ఉద్ధవుడు గుణబద్ధులైనవారికి, ముక్తులకు గల భావభేదం ఏమిటని అడుగుతాడు. శ్రీకృష్ణు డతనికి బంధముక్తుల తత్త్వాన్ని బోధించి కర్మముల యొక్క కర్తృత్వం, ఫలముల యొక్క భోక్తృత్వం తమవని భావించేవారు బద్ధులని, ఇంద్రియములు తమతమ వ్యాపారాలను కొనసాగిస్తుండగా తాను సాక్షిమాత్రుడనని భావించేవాడు ముక్తుడని, బద్ధుని ఉపాధిలోని జీవునికీ ముక్తుని ఉపాధిలోని జీవునికీ స్వగతభేదం లేదని, ఉన్నదల్లా భావభేదం మాత్రమేనని వివరిస్తాడు. అయితే వేదశాస్త్రాలను వల్లించి ఆత్మ నిస్సంగత్వాన్ని గురించి ప్రసంగించినంత మాత్రాన మోక్షసిద్ధి చేకూరదు. అందుకు సాధన ఒక్కటే సమాధానం. వేదప్రతిపాదిత తత్త్వాన్ని గ్రహించి, ఎవరికేది అన్వయిస్తున్నదో తెలుసుకొని, దానిని అనుష్ఠించి స్వానుభవసిద్ధం చేసుకోవాలి. ఈ క్రమాన్నే అనుష్ఠానమని అంటారు. అనుష్ఠానానికి శ్రవణమననాలు రెండూ రెండు మెట్లు. అందుకు సత్సాంగత్యం అవసరం. ఈ విధంగా భక్తిసాధనకు ఆవశ్యకమైన భాగవతధర్మాన్ని, భక్తుల మనోధర్మాన్ని వివరించటం జరిగింది. భాగవత సారోద్ధారమైన ఈ విషయం శ్రీకృష్ణోద్ధవుల వాకోవాక్యంతో పధ్నాలుగవ అధ్యాయం చివరిదాకా సాగింది.

పదిహేనవ అధ్యాయంలో సాధకులు అనుష్ఠింపవలసిన యోగాభ్యాసవిధానం, ధ్యానావస్థలు మొదలైన శాస్త్రవిషయాలను గూర్చిన సంగ్రహకథనం ఉన్నది. ఈ యోగాన్ని గురుముఖంగా అభ్యసించాలి. స్వతంత్రించి చేయటం మంచిది కాదు.

ఆ తర్వాత పద్దెనిమిదవ అధ్యాయంలో భగవద్విభూతుల నిరూపణం ఉన్నది. అనేకవిధాల ఈ అధ్యాయం భగవద్గీతలో విభూతియోగాధ్యాయాన్ని సరిపోలినది. సృష్టిలోని పరమాణువులనైనా లెక్కింపవచ్చును గాని విభూతులను గణించటం సాధ్యం కాదని శ్రీకృష్ణుడంటాడు. ఎక్కడెక్కడ తేజస్సు, శ్రీ, కీర్తి, ఐశ్వర్యము, లజ్జ, త్యాగము, సౌభాగ్యము, వీర్యము, తితిక్ష (ఓర్పు), విజ్ఞానము అన్నవి కనబడితే అక్కడల్లా భగవదంశ నిబిడమై ఉన్నదని

గ్రహించాలి. వాఙ్మనోబుద్ధీంద్రియాలను, ప్రాణశక్తిని, ఆత్మను నిగ్రహించటం అలవరచుకొన్నవారికి సంసారం నుంచి విడివడటమంటే నల్లేరుపై బండి నడక వంటి తేలిక పని.

**తస్మా న్మనోవచఃప్రాణాన్ నియచ్ఛేన్మత్పరాయణః**
**మద్భక్తియుక్త్యా బుద్ధ్యా తతః పరిసమాప్యతే**

(భాగ. 11. 16. 44)

అన్న శ్లోకంతో ఈ అధ్యాయం ముగుస్తున్నది. భగవానుడు సర్వవ్యాపకుడని, సర్వాంతర్యామి అని పాఠకులకు గుర్తుచేయటమే దీని పరమార్థం.

ఆ తర్వాత రెండు అధ్యాయాలలో మానవుడు ఆధ్యాత్మికోన్నతిని సాధించి ఉత్తమపౌరుడై సమాజాభ్యుదయానికి నిఃస్వార్థకృషి చేయాలనే ఆశయంతో ప్రాచీన భారతీయనాగరికతలో రూపుదిద్దుకొన్న వర్ణాశ్రమవ్యవస్థ సమగ్రస్వరూపం చిత్రింపబడింది. పందొమ్మిదవ అధ్యాయంలో జ్ఞాన భక్తి యోగాల సంక్షిప్తవర్ణన, యమనియమాదుల వర్ణన ఉన్నాయి. వర్ణాశ్రమధర్మనిష్ఠితులు ఈ లక్షణాలను గ్రహించి స్వానుభవసిద్ధం చేసుకోవాలి.

ఇరవైయవ అధ్యాయంలో కర్మ భక్తి జ్ఞాన యోగాల్ని అవలంబించే సాధకుల లక్షణాలు వివరించబడ్డాయి. మొత్తంమీద భక్తియోగమే అన్నింటిలో ఆచరణసులభమని ఇక్కడ ప్రతిపాద్యవిషయం. అంతేకాదు. యోగానుష్ఠానం మొదలుపెట్టి తెలిసో తెలియకో పొరపాట్లు చేసినవారు ప్రాయశ్చిత్తాల కంటె భక్తియోగాన్నే పూర్ణశ్రద్ధతో అనుష్ఠించి పాపాలను పోగొట్టుకోవాలని సూచింపబడింది. ఆ తర్వాత అధ్యాయంలో భక్తిజ్ఞానాదులను పెడచెవిని బెట్టి కాంక్షాపూర్తి కోసం తహతహలాడి దుఃఖాన్ని కొనితెచ్చుకొనేవారి విమర్శ ఉన్నది. వేదాలు ఇహపరసుఖాల నిచ్చే యజ్ఞయాగాలను బోధిస్తున్నందువల్ల సుఖమే జీవితపరమార్థమని వీరి అభిప్రాయం. గుణదోషాలన్నవి

నిత్యపరిణామశీలాలని, ఒకప్పుడు గుణమైనది వేరొకప్పుడు దోషం కావచ్చునని, ఈ విలువలన్నీ ఔత్పత్తికాలు మాత్రమేనని వీరంటారు. ఈ విమర్శ లన్నింటిని సహృదయంతో పరిశీలించి, దేనినీ తృణీకరింపక మృదూక్తులతో అసమ్మతిని ప్రతిపాదించి, వైదికకర్మలన్నీ ఇంద్రియవశులైనవారికి ఇహపరసుఖప్రాప్త్యాశను చూపించి కొసకు యోగమార్గానికి మళ్ళించటానికే ఉద్దేశింపబడ్డాయని, ఫలాసక్తి ఉన్నవారికి తాత్కాలికఫలాన్ని ముందుగా చూపి శాశ్వతఫలం వైపునకు ఆకర్షించటమే వీటి ధ్యేయమని, నివృత్తిధర్మాన్ని ఉపదేశించి సాధకులను ముక్తసంగులనుగా తీర్చిదిద్ది ఆత్యంతికక్షేమాన్ని ప్రసాదించటమే వేదతాత్పర్యమని నిర్ధారింపబడింది.

ఇరవై రెండవ అధ్యాయంలో ఆత్మ నిర్వికారత్వం విశదీకరింపబడింది. ప్రకృతి నుంచి ఆవిర్భవించే తత్త్వాలను, అధ్యాస సామగ్రిని పరిగణించే విషయమై తేడాలు వచ్చి ఆచార్యులలో మతభేదా లేర్పడ్డాయని, మతాలన్నింటి లక్ష్యమూ ఆత్మతత్త్వాన్ని నిరూపించటమేనని సిద్ధాంతీకరించిన తర్వాత మృత్యువుయొక్క విషయం, అవిద్యాస్వరూపం, ఆత్మజ్ఞానం మొదలైన విశేషాలు చర్చింపబడ్డాయి.

ఇరవై మూడవ అధ్యాయంలో బ్రహ్మము మాత్రమే సత్యమని, బ్రహ్మభిన్నమైనది అసత్యమని, అసత్యం అధ్యాస వలన సత్య మనిపిస్తున్నదని ప్రతిపాదించిన తర్వాత ఒకప్పుడు సంసారాసక్తుడై విరక్తిమార్గాన్ని అవలంబించిన ఒక సన్న్యాసియొక్క ఆత్మగతం ఉదాహరింపబడింది. ఈ భాగానికి భిక్షుగీత అని కూడా పేరున్నది. జీవియొక్క దుఃఖానికి కారణం స్వయంకృతమే తప్ప పరవిహితం కాదని, మన కష్టాలకు ఎవరో కారణ మనుకోవటం తగదని దీని తాత్పర్యం. మనోనిగ్రహానికి భగవద్భక్తి ఒక్కటే సాధనమని శ్రీకృష్ణుడంటాడు. ఆ తర్వాత ఇరవైనాలుగవది సాంఖ్యయోగాధ్యాయం. భగవానుడు జీవునియొక్క శరీరమందు నిలిచి ఉన్నందువల్లనే నిశ్చేతనాలు చేతనాలై మనోబుద్ధీంద్రియాహంకార సూత్రాత్మల

వ్యాపృతులన్నీ కొనసాగుతున్నాయి. సూత్రాత్మ ప్రకృతి (దీనికే ప్రధానమని కూడా పేరున్నది) వలన కలుగుతున్నది. పరమాత్మ అయిన జీవుడు మొట్టమొదట అవ్యక్తుడు, ఏకుడు అయి తన విశిష్టశక్తియైన ప్రకృతి నధిష్ఠించి కాలక్రమాన బహురూపనామాలను ధరిస్తాడు. ఈ రూపబహుత్వాన్నే విశ్వమంటున్నాము. జీవుని యొక్క బంధముక్తితత్త్వాలను విచారించటమంటే ఈ జీవాత్మ పరమాత్మ విచారమనే అర్థం.

ఇరవై ఐదవ అధ్యాయంలో మానవ స్వభావం చర్చింపబడింది. ఆపదలకు కాంక్ష, కాంక్షకు అజ్ఞానం, అజ్ఞానానికి మమకారం, మమకారానికి మనస్సు కారణాలు. మనస్సంటే ప్రారబ్ధకర్మవాసనాసముచ్చయం. వాసనలు త్రిగుణ వ్యాపారఫలాలు. వివేకవంతులు శాస్త్రజ్ఞాన సజ్జనసాంగత్యాదుల వలన రజస్తమస్సులకు దూరంగా ఉంటారు. యోగాభ్యాసం వలన సత్త్వగుణం వృద్ధి చెందుతుంది. త్రిగుణాలను జయించాలంటే భక్తి ఒక్కటే సాధనం.

ఆధ్యాత్మిక శక్తిసాధన మొదలుపెట్టినవారు దుర్జనులతో సహవాసం చేయకూడదు. ఇంద్రియార్థాలకు దూరంగా ఉండాలి. ఈ నియమాలను పాటింపలేకపోతే సాధకులకు కలిగే అంతరాయాలు, పర్యవసానమైన దురవస్థ ఇరవైఆరవ అధ్యాయంలో కన్నులకు కట్టి చూపబడ్డాయి. పురూరవుని వంటి మహారాజు ఊర్వశీసౌందర్యదాసుడై అధఃపతనం పాలు కావలసివచ్చింది. అంతంలో ఊర్వశి తనను విడిచివెళ్ళిన తర్వాత అతను పశ్చాత్తప్తుడై శరీరసుఖాలన్నీ క్షణికసుఖాలని, సజ్జనసాంగత్యం లేనందువల్లనే తనకు ఈ దురవస్థ వాటిల్లినదని గ్రహిస్తాడు. శ్రీమద్భాగవతంలో విరక్తి మార్గాన్ని ప్రబోధిస్తున్న ఈ పురూరవ గీతను కూడా చదివితీరాలి.

ఇరవై ఏడవ అధ్యాయమంతా క్రియాయోగాన్ని వివరిస్తుంది. సాధకులు ఒక విగ్రహాన్ని, ఒక మంచి పటాన్ని లేదా ఒక బొమ్మను సంపాదించి, ఉచితస్థలంలో దానిని ప్రతిష్ఠించి, భగవానుడే తమయెదుట నున్నాడన్న భావంతో సర్వోపచారాలను చేయాలి. భక్తిశ్రద్ధలతో చేసే అర్చన వల్ల సాధకునిలో దైవీసంపద పెంపొంది, ఐహికవిషయాల పట్ల విరక్తి జనిస్తుంది.

ద్వంద్వభావాలు నశిస్తాయి. భగవన్మయత సిద్ధిస్తుంది.

ప్రపంచస్ఫురణ స్థితప్రజ్ఞులు కొందరికి జీవితమధ్యకాలం లోనే పూర్తిగా అంతరించిపోతుంది. కొందరికి జీవితాంతం వరకు స్మృతిమాత్రంగా మిగిలి ఉంటుంది. మొదటివారిని జీవన్ముక్తులని, రెండవవారిని విదేహముక్తులని అంటారు. ప్రాణులందరికీ ప్రారబ్ధకర్మశేషం ఉన్నంతకాలం ఫలభోగాయ తనమైన శరీరమూ తప్పదు. ఈ నియమం ముక్తులకు కూడా అన్వయిస్తుంది. దేహమే ఆత్మ అని భావించినవారు ఆ శరీర సంబంధాలైన సుఖదుఃఖాలను అనుభవిస్తున్నామని అనుకొంటారు. జీవన్ముక్తులకు ఆ దేహస్మృతి కూడా ఉండదు. అసలు ముక్తి అంటే శరీరభావం నుంచి విడుదల పొందటమనే అర్థం. ఈ విడుదల వట్టి మాటలతో సిద్ధించేది కాదు. జీవితమంతా అనుష్ఠాన మొనర్చినప్పుడు సిద్ధించే ఒకానొక అంతఃకరణస్థితికే ముక్తి అని పేరు. ఇందుకు అనుష్ఠానంతోపాటు శాస్త్రజనితవివేకం అవసరమవుతుంది. యజ్ఞాదుల వల్ల సుఖాలు కలుగవచ్చును గాని ముక్తి మాత్రం చేకూరదు. నిజానికి కర్మకాండ వలె జ్ఞానకాండ కూడా ముక్తిసాధకం కాదు. ఇవి రెండూ అజ్ఞానులకే గాని జ్ఞానులకోసం కాదు. ఎందుకంటే, పరమార్థజ్ఞానం కలిగినప్పుడు జ్ఞానాజ్ఞానాలు రెండూ అంతరించిపోతాయి.

ఈ విశేషాలన్నీ ఇరవై ఎనిమిదవ అధ్యాయంలో సవిస్తరంగా చర్చింపబడ్డాయి.

భగవంతుడు బోధించిన అధ్యాస రహస్యాన్ని ఉద్ధవుడు శ్రద్ధగా విన్నాడు. ముక్తి సంపాదనార్థం బ్రహ్మవేత్తలు అనేకమార్గాలను ప్రతిపాదించారు. అందులో అన్ని మార్గాలూ ముఖ్యమైనవేనా? లేక ఏదో ఒకటి పాటిస్తే చాలునా? అని సందేహం కలిగింది. భగవానుడు భక్తి ఒక్కటే పరమసాధనమన్నాడు. తక్కినవన్నీ అనపేక్షితాలని ఆయన అభిప్రాయమా? ఏ మార్గాన్ని అనుసరిస్తే మనస్సు ఇంద్రియవిముఖమై లయాన్ని పొందగలదు? అని ప్రశ్నించాడు. ఉద్ధవుని ప్రశ్నకు భగవానుడు మళ్ళీ ఒకసారి భాగవత ధర్మాన్ని వివరించాడు. ఈ సమాధానంతో ఉద్ధవ గీత ముగింపుకు వచ్చింది.

అపరోక్షానుభూతికి, భగవత్సాక్షాత్కారానికి భక్తిమార్గమే ఉత్తమోత్తమ సాధనమని, తనయెడ పరాభక్తి కావించినవారు తనకు అత్యంత ప్రీతిపాత్రులని శ్రీకృష్ణుడంటాడు. తనను నమ్ముకొన్నవారికి ఏ ఆపదలూ కలుగవని అభయం ఇచ్చి, ఉద్ధవుని బదరికాశ్రమానికి వెళ్ళి తానుపదేశించిన విషయాలను మనసుకు తెచ్చుకొమ్మని ఆదేశిస్తాడు.

ద్వాపరాంతం చేరువ కాసాగింది. యాదవులు ప్రభాసక్షేత్రానికి వెళ్ళి కర్తవ్యకర్మలు నిర్వర్తించి, భోజనాదులు ముగించుకొని నలుగురూ చేరి కల్లు త్రాగటం మొదలు పెడతారు. కైపెక్కినకొద్దీ ఒకరినొకరు వేళాకోళాలు చేసుకొంటారు. కొంతసేపటికి పరిస్థితి అదుపుతప్పి, ఆయుధాలు చేతబట్టి కలహించుకొంటారు. చూస్తూ ఉండగానే యాదవకులం సమస్తం అంతమైపోతుంది. బలరామకృష్ణులు దేహాలను త్యజిస్తారు. ద్వారక సముద్రంలో మునిగిపోతుంది.

శ్రీకృష్ణనిర్యాణం జరిగిననాడే, నేటి పరిగణనను అనుసరించి క్రీ.పూ 3012 లో కలియుగం ప్రారంభమయిందని భారతీయుల విశ్వాసం.

భాగవతంలో ఉద్ధవ గీతకు ముఖ్యస్థానం ఉన్నది. ఒకవిధంగా ఇది ఆనాటి సర్వదర్శనసారసంగ్రహమని చెప్పవచ్చును. కురుక్షేత్రంలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి ఉపదేశించిన భగవద్గీతా శాస్త్రాన్ని, భాగవతం ఏకాదశ స్కంధంలోని ఉద్ధవ గీతతో సరిపోల్చి పెక్కుమంది వేదాంతవేత్తలు శ్రీమద్భాగవతం గీతాబోధను పరిపూర్ణిస్తున్నదని అంటారు. వైష్ణవతంత్రాల లోని కర్మకలాపం, శుద్ధాద్వైతం మొదలైన విశేషాలను బట్టి ఆ మాట కొంతవరకు సత్యమే ననిపిస్తుంది. జీవులయొక్క ఐక్యస్థితిని, దివ్యత్వాన్ని భగవద్గీత కూడా అంగీకరిస్తున్నప్పటికీ జగత్తు యొక్క ప్రాతిభాసికత విషయమై ఏమంటున్నదో నిర్ధారించటం కష్టం. బ్రహ్మపదార్థం ఏకము, అద్వితీయము అన్నప్పుడు వ్యక్తజగత్తుతో దానికి గల సంబంధాన్ని మనము రెండు విధాలుగా ఊహింపవచ్చును. జగత్తు సత్యమని, అయితే నిర్వికారమైన బ్రహ్మము యొక్క అద్వితీయలక్షణానికి బాధకం కాదని నిర్ణయించటం ఒక పద్ధతి. బ్రహ్మము

జీవజగత్తులుగా అభివ్యక్తమైన మాటను త్రోసిపుచ్చి ఈ రెండూ అవిద్యాకల్పితాలే అని నిశ్చయించటం మరొక పద్ధతి. ఆత్మ బ్రహ్మము, దృశ్యమూ బ్రహ్మమే అన్నప్పుడు బ్రహ్మభిన్నమైన వేరొకవస్తువు లేదని; ఆత్మ, దృశ్యము అన్నవి బ్రహ్మమునకు పర్యాయపదాలని; అనగా – ఒక్క పదార్థమే బ్రహ్మము, ఆత్మ, ప్రపంచము అనే మూడు పేర్లతో దైవారినదని వేదాంతసిద్ధాంతం. ఈ విషయాన్ని నిర్ధారించిన తర్వాత కూడా ఆధిభౌతికసమస్యలు కొన్ని అపరిష్కృతంగా ఇంకా మిగిలే ఉంటాయి. ఈ క్లిష్టపరిస్థితిని గుర్తించినందువల్లనే భగవద్గీత బ్రహ్మము యొక్క అద్వితీయలక్షణాన్ని స్థాపించటంతో ఈ ప్రస్తావనను ముగింపవలసి వచ్చింది. ఇరవై ఎనిమిదవ అధ్యాయంలో శ్రీకృష్ణుడు శుద్ధాద్వైతాన్ని నిరూపించిన తర్వాత ఉద్ధవుడు తనకు అర్థమైన దానికంటె సందిగ్ధతే ఎక్కువగా ఉన్నదని అంటాడు. అతని శంకానిరాసార్థమై శ్రీకృష్ణుడు శుద్ధభక్తుల స్థితి నిరూపించి, భాగవత ధర్మాన్ని పునఃప్రవచిస్తాడు. భగవానుడు సర్వజీవులలోనూ వెలుగొందుతున్నాడని, అందుచేత సాధకులు సర్వజీవులను భగవన్మూర్తులనుగా గ్రహించి లోకహితాన్ని ఆచరించాలని, ఏ పని చేసినా కర్తృత్వ భోక్తృత్వ రహితమైన నిష్కామబుద్ధితో భగవంతునికి అర్పించాలని, అదే భక్తిపరమార్థమని వివరిస్తాడు.

## ద్వాదశస్కంధం

శ్రీమద్భాగవత ద్వాదశస్కంధంలో అపాశ్రయమనే లక్షణం ఉపహితమైనదని పురాణ తత్త్వవేత్తలు నిర్ధారించారు. ఈ స్కంధంలోని 13 అధ్యాయాలలో 566 శ్లోకాలున్నాయి.

ఆశ్రయము అంటే పర్యవసానంగా బ్రహ్మమనే అర్థం. సృష్టిసామస్త్యానికీ బ్రహ్మమే ఆశ్రయం. ఈ ఆశ్రయం వ్యతిరేకరూపమని, అన్వయరూపమని రెండు విధాలు. మానవదేహానికి జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అని మాయాకల్పితాలైన మూడు అవస్థలున్నాయి. ఈ మూడవస్థలలోనూ క్రమంగా విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అనే పేర్లతో సాక్షిమాత్రుడై జీవవృత్తితో

ఉండటాన్ని అన్వయక్రమం అంటారు. సమాధి మొదలుగా గల అవస్థలలో బ్రహ్మమునకు, సంసారానికి ఎటువంటి సంబంధమూ లేదని, బ్రహ్మము కేవలాధిష్ఠానభూత మని నిర్ణయించటం వ్యతిరేకరూపమైన దృష్టి. బ్రహ్మము నుండి గుణోపేతమై ఆవిర్భవించిన సృష్టి మళ్ళీ ఆ బ్రహ్మమందే లయాన్ని పొందుతున్నది. ఈ క్రమాన్ని విపులార్థగౌరవంతో అభివర్ణిస్తున్న ద్వాదశ స్కంధమే శ్రీమద్భాగవతంలోని ఆధికారికేతివృత్తమని, తక్కినదంతా దీనికి వివృతిప్రాయమని కొందరంటారు. ప్రళయస్వరూప వర్ణన ఉన్నందువల్ల దీనిలో సంస్థ (ప్రళయము) అనే లక్షణాన్ని కొందరు నిరూపిస్తున్నారు. శ్రీమద్భాగవత కథాపరిశ్రయానికి మూలహేతువైన పరీక్షిన్మహారాజు ఈ స్కంధంలో ప్రారబ్ధకర్మానుసారం పాపరేడు తక్షకుని కోరలకు చిక్కి ప్రాణాలు విడుస్తాడు.

పురాణలక్షణాలను ఒక్కొక్క స్కంధంలోనూ ఒక్కొక్కటి వంతున అన్వయించటం సాధ్యం కాదని తొలుతనే మనము నిర్ధారించాము. ఆ దృష్ట్యా ద్వాదశ స్కంధం లోనూ లక్షణసంకీర్ణత కనుపిస్తున్నదని అంగీకరింపక తీరదు.

శ్రీకృష్ణావతారం తర్వాత కలియుగంలో వెలసిన రాజవంశాల వర్ణనతో ద్వాదశ స్కంధం మొదలవుతున్నది. ఈ రాజులలో ప్రద్యోతులు, శిశునాగులు, నందులు, మౌర్యులు, శుంగులు, కాణ్వులు ఉన్నారు. యవన తురుష్క శూద్రాది మ్లేచ్ఛవంశాల ప్రస్తావన కూడా ఉన్నది.

కలియుగం ప్రారంభమైననాటి నుంచి క్రమక్రమంగా అధర్మం ప్రబలసాగింది. మ్లేచ్ఛశక్తులు విజృంభించాయి. అన్యాయం పడగలు విప్పి ప్రళయనర్తనం మొదలుపెట్టింది. ఈ విధమైన పతనావస్థను మొదటి రెండు అధ్యాయాలలోనూ చదివి మనము వర్తమానపరిస్థితులతో సరిపోల్చి విభ్రాంతులము కాకతప్పదు. ఈ దురవస్థ పరాంకోటికి చేరుకొన్నాక కలియుగాంతంలో శ్రీమహావిష్ణువు కల్కిరూపాన్ని ధరించి మళ్ళీ ధర్మాన్ని పునరుద్ధరిస్తాడు.

ఇంత ధర్మభ్రష్టతకు నిలయమైనా కలియుగంలో జన్మించినవారికి ఒక సౌలభ్యం ఉన్నది. పూర్వయుగాలలో దురధిగమమైన భగవదపరోక్షానుభూతి కేవల సంకీర్తనమాత్రాన సంలబ్ధమవుతుంది. తృతీయాధ్యాయమంతా ఈ నామసంకీర్తన మహిమనే అధికరిస్తున్నది. లోకంలో ఎందరెందరో మహారాజులు జన్మించారు. లెక్కలేనన్ని రాజవంశాలు అవతరించాయి. అసంఖ్యాక ప్రజానీకం జన్మించి కాలగర్భంలో కలిసిపోయింది. ఈ సత్యాన్ని జ్ఞాపకం చేయటానికే శ్రీమద్భాగవతంలో అనేకానేక రాజుల కథలు వర్ణింపబడ్డాయి. జీవితం ఎంత అశాశ్వతమో, ఎంత క్షణభంగురమో నిరూపించటమే ఈ వర్ణనలోని పరమోద్దేశమని శుకయోగి అంటాడు –

**కథా ఇమాస్తే కథితా మహీయసాం**
**వితాయ లోకేషు యశః పరేయుషామ్**
**విజ్ఞాన వైరాగ్య వివక్షయా విభో**
**వచో విభూతీ ర్నతు పారమార్థ్యమ్.**

(భాగ. 12. 3. 14)

చతుర్థాధ్యాయంలో చతుర్విధ ప్రళయవర్ణన ఉన్నది. ఆ తర్వాత రెండు అధ్యాయాలలో పరీక్షితుని మరణం, అతని కొడుకు జనమేజయుని సర్పయాగం వర్ణింపబడ్డాయి. షష్ఠాధ్యాయం చివర నాదబ్రహ్మస్వరూపం, ఓంకార తత్త్వం, వేదావిర్భావం, వేదవిభాగకారణాదికం ప్రసక్తమైనాయి. ఆ తర్వాత అధ్యాయంలో పురాణ లక్షణకథనం ఉన్నది.

అష్టమాధ్యాయం మొదలుకొని దశమాధ్యాయం వరకు మృకండుసుతుడైన మార్కండేయుని చరిత్ర పరమాద్భుతమైన సంవిధానంతో విపులార్థగర్భితంగా అభివర్ణింపబడింది. భక్తాగ్రేసరుడైన మార్కండేయుడు ముక్తిని కూడా కాదని భక్తినే కోరుకొంటాడు. యోగమాయాప్రభావం వలన మార్కండేయునికి శ్రీమహావిష్ణువు ప్రళయ పయోధిజలాలలో వటపత్రశాయిగా ప్రత్యక్షమైన పరమాద్భుత సన్నివేశాన్ని చదివితీరాలి.

ఏకాదశాధ్యాయంలో మహాపూరుషపూజాక్రమానికి అనుబంధంగా మహాపూరుష రూపం, ఆ విరాణ్మూర్తి యొక్క అవయవ సంవిధానం, ఆభరణాదికం వర్ణింపబడ్డాయి. చతుర్మూర్తివ్యూహానికి ఉపలక్షణంగా ప్రత్యక్షదైవతమైన సూర్యనారాయణుని సంచారక్రమం, ద్వాదశ త్రయోదశాధ్యాయాలలో శ్రీమద్భాగవత విషయానుక్రమణిక, శ్రీమద్భాగవత కథాపరమార్థం, శ్రీమద్భాగవత కథాఫలశ్రుతి, శ్రీమద్భాగవత మాహాత్మ్యం, పురాణసంఖ్య, పురాణశ్లోకసంఖ్య ప్రవచింపబడ్డాయి.

అంతంలో సాధకులకు ఆధ్యాత్మిక తత్త్వసిద్ధిని, భక్తి పరివృద్ధిని ఆకాంక్షిస్తూ మంగళాంతంగా స్వస్తివాచనశ్లోకాలున్నాయి.

**సర్వవేదాన్తసారం హి శ్రీ భాగవత మిష్యతే**
**తద్రసామృత తృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్.**

**నిమ్నగానాం యథా గఙ్గా దేవానా మచ్యుతో యథా**
**వైష్ణవానాం యథా శమ్భుః పురాణానా మిదం తథా.**

**క్షేత్రాణాం చైవ సర్వేషాం యథా కాశీ హ్యనుత్తమా**
**తథా పురాణవ్రతానాం శ్రీమద్భాగవతం ద్విజాః.**

**శ్రీమద్భాగవతం పురాణ మమలం యద్వైష్ణవానాం ప్రియం**
**యస్మిన్ పారమహంస్య మేక మమలం జ్ఞానం పరం గీయతే**

**తత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్య మావిష్కృతం**
**తచ్ఛృణ్వ న్విపఠ న్విచారణపరో భక్త్యా విముచ్యే న్నరః.**

**కస్మై యేన విభాసితోఽయ మతులో జ్ఞానప్రదీపః పురా**
**తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయ తద్రూపిణా**

**యోగీన్ద్రాయ తదాత్మనాథ భగవద్రాతాయ కారుణ్యత**
**స్తచ్ఛుద్ధం విమలం విశోక మమృతం సత్యం పరం ధీమహి.**

**నమస్తస్మై భగవతే వాసుదేవాయ సాక్షిణే**
**య ఇదం కృపయా కస్మై వ్యాచచక్షే ముముక్షవే.**

**యోగీన్ద్రాయ నమస్తస్మై శుకాయ బ్రహ్మరూపిణే**
**సంసారసర్పదష్టం యో విష్ణురాత మమూముచత్.**

**భవే భవే యథా భక్తిః పాదయో స్తవ జాయతే**
**తథా కురుష్వ దేవేశ నాథస్త్వం నో యతః ప్రభో.**

**నామసఙ్కీర్తనం యస్య సర్వపాపప్రణాశనమ్**
**ప్రణామో దుఃఖశమన స్తం నమామి హరిం పరమ్.**

# శ్రీమద్భాగవతము

## మూడవ సంపుటము

(దశమ ఏకాదశ ద్వాదశ స్కంధములు)

*సరళాంధ్ర పరివర్తన:*

**డా॥ ఏల్చూరి మురళీధరరావు**

**రామకృష్ణమఠం**

దోమలగూడ, హైదరాబాదు-500 029.

# విషయానుక్రమణిక

## దశమ స్కంధం

### పూర్వభాగము

## ఏకాదశస్కంధము : 489

## ద్వాదశస్కంధము : 637

# దశమ స్కంధం

## పూర్వభాగము

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి వచనాలను ఆసాంతం విని, 'మహాత్మా! సూర్య చంద్ర వంశాల విస్తారాన్ని, ఆ వంశాలలో జన్మించిన రాజుల పరమాద్భుత చరితాలను తెలిసికొన్నాను. ధర్మవర్తనుడైన యదుని వంశ చరిత్రను వివరిస్తూ, అతని వంశంలో భగవానుడు నిజాంశతో అవతరించాడని మీరిందాక సూచనగా అన్నారు. భూతభావనుడు, విశ్వాత్మకుడు అయిన శ్రీమహావిష్ణువు ఆ విధంగా ఎందుకు అవతరింపవలసి వచ్చింది? ఆ అవతారంలో దేవదేవుని దివ్యలీలలను సాకల్యంగా ఆకర్ణించాలని ఎంతో కుతూహలం కలుగుతున్నది. ఆ లోకమంగళమూర్తి యొక్క గుణవర్ణన పశుహంతలకు తప్ప వేరే ఎవరికి రుచించదు?

మునిసత్తమా! జనులు ముక్తులు, ముముక్షువులు, విషయపరులు అని మూడు విధాలుగా ఉంటారు. ముక్తులు కేవలాత్మారాములు కాబట్టి వారికి విశ్వాత్మకుని కీర్తనం ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది. ముముక్షువుల దృష్టిలో భగవన్నామసంకీర్తన మంటే మోక్షానికి ప్రతిబంధకమైన పాపజాతాన్ని క్షయింపజేసే పరమోపాయం. లోకంలో ఈ రెండు తెగలవారి

సంఖ్య వ్రేళ్ళమీద లెక్కింపదగినదిగా ఉంటుంది. అత్యంత భోగ్యస్వభావవశులై ఆ కారణాన బద్ధులై ఉన్నవారు అసంఖ్యాకులు. అటువంటివారికి కూడా భగవత్కీర్తనం ఎంతో ఉపకారకం అవుతుంది. ఏమంటే భగవత్కీర్తనం స్వాభావికంగానే మనస్సుకు హత్తుకొనిపోయే లక్షణం కలది. అది వారి హృదయాంతరాల లోనికి ప్రవేశించి వారిలోని సంసారబీజాన్ని క్రమక్రమంగా ఉన్మూలించివేస్తుంది. తత్ఫలంగా వారు ముముక్షువులై ముక్తిపదాన్ని చూరగొంటారు. అందువల్ల భగవత్కృత్యాలు సర్వజనులకూ ప్రీతిపాత్రాలు.

మునిచంద్రమా! భగవత్కృత్యాలను వినిపించాను కదా, విన్నవాటినే మళ్ళీ మళ్ళీ వినగోరటం దేనికి? అని అడుగుతారేమో! భగవత్కృత్యాలను మరీ మరీ వినగోరటానికి కారణం ఉన్నది. భీష్ముడు దేవతలకు కూడా అజేయుడైన మహాపరాక్రమశాలి. భీష్మాది మహారథిక తిమింగిలపూర్ణమై ఎటువంటి ఎటువంటి వీరులు ఈదలేని కౌరవసేనాసాగరాన్ని మా పితామహులు భగవత్సాహాయ్యం వల్ల పిల్లకాలువను దాటినట్లు దాటగలిగారు. అశ్వత్థామ క్రోధోద్రిక్తుడై అపాండవం అయేటట్లు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అది మా తల్లి గర్భంలోనికి ప్రవేశించి అందులో కౌరవ పాండవ వంశాంకురంగా మిగిలి ఉన్న నా యీ తనువును దహింపబోయింది. అప్పుడు మా అమ్మ గత్యంతరం కానక 'త్వమేవ శరణ' మ్మని భగవంతుని వేడుకొన్నది. మాటతో ఆ పరమేశ్వరుడు చక్రహస్తుడై వచ్చి నా తల్లిగర్భాన్ని చొచ్చి ఆ బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించి నన్ను రక్షించాడు. ఆ సర్వాత్మకుడు సమస్తప్రాణుల లోపల ఉండి అంతర్దర్శనులకు అంతర్యామియై ముక్తిని ప్రసాదిస్తాడు; బహిర్దర్శనులకు కాలరూపంలో సంసారాత్మక మృత్యువును కలిగిస్తాడు. ఆ విధంగా మా కులాన్ని ఉద్ధరించి నాకు జీవప్రదానం కావించిన లోకాత్మకుని దివ్యచరితలను వినటమే తప్ప మరి ఏ విధంగా నేను నా కృతజ్ఞతను చూపగలను?

ఋషివర్యా! సంకర్షణుడు రోహిణీ గర్భంలో జనించాడని మీరన్నారు. అతను దేవకీ గర్భంలో ఉదయించాడనీ మీరే అన్నారు. ఒక్కడే ఇరువురి గర్భాలలో ఏకకాలంలో ఏ విధంగా ఉద్భవించాడో నా ఊహకు అందడం లేదు. ఈ సంశయాన్ని నివృత్తి చేయగలరని వేడుకొంటాను. ఆ తర్వాత భగవానుడు అవతరించినంతనే పితృగేహాన్ని వదలి వ్రజపురాన్ని చేరుకొన్నాడని అన్నారు. ఆ విధంగా ఎందుకు జరిగింది? ఆ వ్రేపల్లెలో ఆయన ఎక్కడ నివసించాడు? ఆయన అవతారకార్యాలేమిటి? వ్రజపురాన్ని వదలిన తర్వాత మథురకు వెళ్ళాడన్నారు. మథురలో ఏయే వింతలను చూపాడు? మేనమామ కంసుని సంహరించాడని చెప్పారు. మేనమామ అంటే తండ్రితో సమానం. అటువంటి వాడిని చంపవలసిన అవసరం ఎందుకు కలిగింది? ఈ సంగతులన్నీ వినాలని ఎంతో ఆతురతగా ఉన్నది.

అయ్యా! ప్రాయోపవేశ నియమవ్రతాన్ని వహించి మంచినీరయినా త్రాగకుండా నీరసించి ఉన్న నేను ఇటువంటి సమయంలో ఈ కథలను వినాలని ఉవ్విళ్ళూరటం తగునా? అని శంకించవద్దు. భగవత్కథామృతాన్ని ఆస్వాదింపగలిగితే క్షుత్పిపాసలే గాక సమస్తబాధలు తీరి శాంతి సిద్ధిస్తుంది. అందువల్లనే ఇంతగా అడుగుతున్నాను' అని వినయమధురంగా పలికాడు. శుకమహర్షి పరీక్షిన్నరేంద్రుని మనోభావాన్ని గ్రహించి ఈ విధంగా అన్నాడు.

## శ్రీకృష్ణావతార కారణం

'రాజేంద్రా! నీవు భగవత్కథాసక్తినిష్ఠుడ వైనావు కాబట్టి నీ బుద్ధి సమాహితం కావడం ఏమంత వింత కాదు. శ్రీమహావిష్ణుపాద వినిర్గత గంగాజలం దర్శనస్నానపానాలు మూడింటిచేత మానవాళిని ఏ తీరున పవిత్రీకరిస్తున్నదో ఆ తీరుననే ఆ దేవదేవుని చరితం కూడా అడిగినవారిని, చెప్పినవారిని, విన్నవారిని ముగ్గురినీ వినీతులను కావిస్తుంది. కాబట్టి నీ ప్రశ్న ఎంతో శ్లాఘ్యమైనది సుమా!

నరేశ్వరా! భగవానుడు శ్రీకృష్ణావతారం ధరించటానికి గల కారణాలను విను. దైత్యులు వేలకువేలమంది మదోన్మత్తరాజులుగా పుట్టి భూమిని ఆక్రమించి అసుర కార్యాలకు ఉపక్రమించారు. వారి దౌష్ట్యం భూదేవికి దుర్భరంగా పరిణమించింది. ఆ వేదనతో భూదేవి గోవు రూపాన్ని తాల్చి గోడుగోడున విలపిస్తూ బ్రహ్మ వద్దకు వెళ్ళి తనకు దాపరించిన కష్టాలను గురించి మొరపెట్టుకొన్నది. చతురాస్యుడు ఆమె ఆర్తాలాపాలను విని ఆమెను వెంటబెట్టుకొని సురలతో కలిసి శంకరుని వద్దకు వెళ్ళాడు. శంకరుడు వారి పలుకులను విని వారందరితోపాటు క్షీరాబ్ధికి వెళ్ళి అక్కడున్న సర్వలోకేశ్వరునికి సర్వాంతర్యామికి పూర్ణునికి వాసుదేవునికి నమస్కరించాడు. బ్రహ్మదేవుడు సమాహితచిత్తుడై ఆ దేవదేవుడిని పురుషసూక్తంతో ప్రస్తుతించాడు. భగవానుడు అనుగ్రహించి రానున్న సంగతిని గగనవాణి మూలకంగా తెలియజెప్పాడు. పరమేష్ఠి ఆ వచనాలను విని, సమాధి నుంచి లేచి – తనతో ఉన్న సురలతో ఇలా అన్నాడు:

'సురలారా! పరమేశ్వరుని వచనాలను ఆలకించాను. భూదేవి దురవస్థ మనకన్న ముందే భూతభావనునికి స్పష్టం. ఆమెకు కలిగిన ఆపదను తీర్పగోరి నారాయణుడు తన కాలశక్తి బలాన్ని అధిష్ఠించి భూతలాన యదువంశంలో వసుదేవుని యింట అవతరింపబోతున్నాడు. ఆ పరమాత్మునికి పూజలను కావించేందుకు అమరాంగనలు తమ తమ అంశలతో జన్మిస్తారు. మీరు కూడా మీ మీ అంశలతో యదుకులంలో ఉదయించాలి. సహస్రశీర్షుడైన భగవత్కళామాత్రుడు ఆదిశేషుడు భగవంతునికి ప్రీత్యాపాదకంగా తదగ్రజుడై ప్రభవిస్తాడు. భగవన్మాయ కూడా ఆయన నియోగం వలన లోకరక్షణ నిమిత్తం ధాత్రిలో జన్మింపబోతున్నది'.

రాజేంద్రా! బ్రహ్మదేవుడు ఆ విధంగా నిలింపులతో పలికి భూదేవిని ఊరడించి తన లోకానికి వెళ్ళాడు. భూదేవి, దేవతానీకం సంతాపాలు మాని తమ తమ స్థానాలను చేరుకొన్నారు.

## మథురా నగరం

ద్వాపరయుగాంతంలో యమునాతీర పరిసరప్రదేశాలలో వృష్ణులు యాదవులు భోజులు అంధకులు మొదలైన వారి క్షత్త్రవంశాలు అనేకం ఉండేవి. ఆ వంశాలన్నీ చిరకాలంగా పరస్పర సంబంధ బాంధవ్యాలు కలిగి సన్నిహితంగా ఉంటూ వచ్చాయి. ఆ వంశాలలో ఒకటైన యదువంశంలో శూరసేనుడు జన్మించి వీరుడై యమునాతీర మాగధ శూరసేన దేశాలను వశపరచుకొని మథురను రాజధానిగా చేసి పరిపాలింపసాగాడు. ఆనాటినుంచి మథురా నగరం యాదవరాజులకు ముఖ్యపట్టణం అయింది.

శూరసేనుని వంశంలో ఉగ్రసేనుడనే వాడు పుట్టి రాజయ్యాడు. అతనికి కంసుడనే పుత్త్రుడు జన్మించాడు. ఉగ్రసేనునికి దేవకుడనే తమ్ముడుండేవాడు. అతనికి దేవకి అనే కుమార్తె జన్మించింది.

మథురారాజ్యంలో అంధకమనే పేరిట యదువంశ శాఖ ఒకటుండేది. ద్వాపరాంతంలో ఆ అంధకవంశంలో దేవమీఢుడనే రాజు ఉదయించాడు. అతనిని శూరుడని కూడా పేర్కొంటారు. ఆ శూరునికి మారిష అనే భార్యయందు వసుదేవుడు జన్మించాడు.

## దేవకీ వసుదేవుల వివాహం

వసుదేవునికి దేవకి నిచ్చి సుముహూర్తంలో పెండ్లిచేశారు. వివాహానంతరం అతను భార్యను వెంటబెట్టుకొని మథురనుంచి తరలి స్వగృహానికి బయలుదేరాడు. భార్యాభర్తలు రథాన్ని అధిష్ఠించారు. కంసుడు తన చెల్లెలు దేవకికి ప్రీతికరంగా సారథ్యం వహించాడు. దేవకుడు పద్దెనిమిదివందల సువర్ణాలంకృత రథాలను, నాలుగువందల ఏనుగులను, పదివేల హయాలను, నానాభూషణభూషిత దాసీకన్యకలు రెండువందల మందిని కూతురికి అరణంగా ఇచ్చి వెంటనంపాడు. నూతన వధూవరులు మహావిభవంతో తరలారు. శంఖ తూర్య మృదంగ దుందుభిముఖ మంగళవాద్య ధ్వనులు మిన్నుముట్టాయి.

## ఆకాశవాణి

రాజేంద్రా! ఆ విధంగా వారందరూ పయనిస్తుండగా మార్గమధ్యంలో ఆకాశవాణి కంసుణ్ణి చూసి 'కంసా! ఈ దేవకి యొక్క ఎనిమిదవ గర్భం నీకు మృత్యువు కాబోతున్నది' అని పలికింది. ఆ మాటతో కంసుడు భయవిహ్వాలు డయ్యాడు. చెల్లెలన్న ప్రేమకంటె తన ప్రాణరక్షణం అతనికి ప్రధాన మనిపించింది. అతను కొంత ఆలోచించి, 'దేవకి నా చెల్లెలయినా దాని గర్భంలో పుట్టబోయేవాడు నాకు మృత్యువు కానున్నాడు. చెట్టునే నరికివేస్తే పండు పుట్టదు కదా' అని నిశ్చయించి, ఖడ్గాన్ని ఒకచేతబట్టి వేరొక చేతితో దేవకీ కేశపాశాన్ని పట్టి యీడ్చి ఆమె తలను తెగనరకబోయాడు.

## వసుదేవుని ప్రార్థన

వసుదేవుడు కంసుని మనస్సులో ఉదయించిన క్రూరభావాన్ని గ్రహించి, అడ్డుపడి, అతనిని పరిపరి విధాల ప్రాధేయపడ్డాడు. 'ఓ భోజకుల కీర్తిప్రదీపకా! శూరశ్లాఘ్యా! ఉగ్రసేన సుతా! ఆడదానిని, అందులోనూ నీ చెల్లెలిని, నవోఢను చంపబూనడం నీకు న్యాయమేనా? దీని అష్టమగర్భం నీకు మృత్యువు కాగలదని భయపడి ఆత్మరక్షణార్థం ఈ విధంగా చేస్తున్నానని అంటావేమో? పుట్టినవారందరూ ఎప్పుడో ఒకప్పుడు గిట్టక మానరు. మృత్యువును తప్పించుకొనడం ఎంతటి వారికైనా అలవి కాదు. ఈ గండం తప్పితే తరువాత చూసుకోవచ్చునంటావా? గండాన్ని తప్పించుకోవడానికి ఘోరపాపానికి ఒడిగట్టక తప్పదా?

కంసా! జీవుడు తన కర్మఫల భోగానికి అనుకూలించే శరీరాలను ధరిస్తుంటాడు. భోగ్యఫలం భుక్తమైనంతనే ఆ దేహాలు పండుటాకుల వలె రాలిపోతాయి. ఆ దేహం పతనం కాగానే ఆ జీవుడు తృణజలూక న్యాయాన్ని అనుసరించి ప్రారబ్ధ కర్మఫలాన్ని భోగించటానికి అనుకూలమైన వేరొక శరీరాన్ని ప్రవేశిస్తాడు.

దేహధారులు వివిధ విషయాలను వింటూ, కనుగొంటూ ఆ విన్నవాటిని, చూచిన వాటిని గురించి పరిపరి విధాల ఆలోచిస్తూ ఉంటారు. ఆ ఆలోచనలు వాసనల రూపంలో వారి అంతఃకరణను అలముకొంటాయి. అటువంటి వాసనలలో ఏది గాఢమై వీస్తుందో దాని ఫలం ముమ్ముందుగా భోగ్యమవుతుంది. దానిని అనుభవించేందుకు దేహధారులు ఉవ్విళ్ళూరుతుంటారు. వారికి తత్ఫలానుభవయోగ్యమైన శరీరం కలుగుతుంటుంది. ఆ శరీరం వచ్చిన వెంటనే అతనికి పూర్వపు దేహస్మృతి నశించిపోతుంది. ఆ కారణాన జీవులు పూర్వదేహాలలో పొందిన శుభాశుభాలను గ్రహించరు.

కంసా! తటాకాది జలాశయాలలో చంద్రాదుల బింబాలు ప్రతిఫలించడమూ, ఆ నీటితరగలు కదలాడినప్పుడు అందులో కానవచ్చే బింబాదులు కూడా చలించినట్లు కానరావడమూ అందరికీ అనుభవసిద్ధమే కదా! ఆ విధంగానే దేహి కూడా దేహగతమైనప్పుడు ఆ దేహధర్మాలు తన ధర్మాలుగా భావించుకొంటాడు. దానిని అన్యోన్య ధర్మాధ్యాసమని అంటారు. ఆ అధ్యాస మన్నది భ్రాంతిఫలమే తప్ప వాస్తవికం కాదు. ఏమంటావా? దేహి (జీవుడు) కేవలాత్మస్వరూపుడు. దేహము లన్నవో? మాయావిరచితాలైన అనాత్మభూతాలు. ఆ రెండింటికీ ఎటువంటి సంబంధమూ కలగదు. ఇది పరమార్థం. ఆత్మక్షేమాన్ని కోరినవారు ఈ అర్థాన్ని మరువకూడదు.

అంతే కాదు. ఆత్మపదార్థం ఏకము, అద్వితీయము అయినట్టిది. ఏకమైన ఆ ఆత్మే వివిధోపాధులలో ఉంటుంది. ఉపాధిభేదాన్ని బట్టి ఆత్మభేదం ఉండదు. ఒక జలాశయం లోని జలాన్ని వివిధఘటాలలో నింపితే ఘటభేదాలను బట్టి వాటిలోని జలానికి భేదం కలుగుతుందా? ఆత్మతత్త్వం ఇటువంటిదని గ్రహించినవారికి స్వపరభేదాలు కలగవు. ఎప్పుడటువంటి భేదభావం కలగదో అప్పుడు పరద్రోహభావానికి వారి మనస్సులో చోటుండదు. ఆ విధంగా కాక దేహాత్మ బద్ధులయితే వారికి

స్వపరతారతమ్యాలు తప్పవు. తారతమ్యబుద్ధి ఉన్నంతకాలం భయాదులు అంటిపెట్టుకొని ఉంటాయి. అపకారులకు ఇహలోకంలో శత్రుభయం, పరలోకంలో పాపఫలానుభవ భయం రెండూ తప్పవు. ఈ రహస్యాన్ని గ్రహించి నీ సంకల్పాన్ని మాను.

కంసా! మరొక మాట కూడా విను. ఈమె నీకు చెల్లెలు. మేలు కీళ్ళ స్వరూపం ఎరుగని అమాయకురాలు. నీవు సోదరుడవనే ప్రేమకొద్దీ ఇన్నాళ్ళూ నీ వర్తనమంటే ఆదరం కలిగి మెలిగింది. ఈ దీనురాలిని నీవు కన్నబిడ్డవలె రక్షింపవలసినవాడవు. అబల కాబట్టి ఈమె యెడ నీకు దారుణం తగదు'

అని సామభేదవచనాలతో ప్రసంగించాడు.

రాజా! కంసునికి ఆ సమయంలో రాక్షసభావం పైకొన్న కారణాన వసుదేవుని పలుకులు అతని చెవినాటలేదు. అతను యుక్తాయుక్తవిచారాన్ని మాని తాను తలపోసిన క్రూరకృత్యానికే తెగించాడు.

వసుదేవుడికి అతని ఉద్దేశం అర్థమయింది. 'ఈ పాపాత్ముడు తన నిశ్చయాన్ని మానడు. దుష్కాలం వచ్చిపడింది. అలాగని మిన్నకుండటం కార్యవిదుల లక్షణం కాదు. బుద్ధిబలం ఎంత ఉన్నదో అంతా వినియోగించి రానున్న ముప్పును తొలగింపబూనటం యుక్తం. బుద్ధిమంతులకు అదే విధివిధానం. ఎంత ప్రయత్నించినా ముప్పు తప్పదా, అప్పుడు స్వదోషం లేదనుకోవచ్చు. ప్రయత్నం పురుషకార్యం; ఫలాఫలాలు అతని అధీనాలు కావు. భగవంతుని నమ్మి యుక్తకర్మను చేయటమే నాకిప్పుడు కర్తవ్యం. ఈమె ఎనిమిదవ కానుపు కంసునికి చేటు కలిగిస్తుందని ఆకాశవాణి పలికింది. కంసు డా మాటను నమ్మి 'ఈమెను ఇప్పుడే తెగటార్చి నట్లయితే ఈమెకు సంతానం కలగడమూ వారిలో ఎనిమిదవ వాడు నాకు మృత్యువు కావడమూ రెండూ తప్పుతాయి' అని నిశ్చయించి, ఈ ఘోరకృత్యానికి పూనుకొన్నాడు. ఆకాశవాణి మాటను బట్టి చూసినా ఈమె ఎనిమిదవ బిడ్డ కంసునికి మృత్యువు కావాలి గాని ఈమె మృత్యువు కాదగి లేదు. ఈమెకు పుత్రులు కలుగుతారో

లేదో తెలియదు. ఒకవేళ పుత్రులు కలిగినా వాళ్ళెప్పుడు కలుగుతారో తెలియదు. అంతదాకా ఇతను జీవించి ఉంటాడని నమ్మకం ఏమిటి? ఆ లోపుననే ఇతను గతిస్తే కష్టాలన్నీ గట్టెక్కుతాయి. చింతలన్నీ సమసిపోతాయి. అందాకా బ్రతికితే అప్పటి సంగతి అప్పుడు చూసుకోవచ్చు. దైవగతిని దాటరాదు గదా. ఆసన్నమృత్యువును తప్పించుకొనడమే ఇప్పుడు కర్తవ్యం. శుభాశుభాలన్నీ అదృష్టాధీనాలు. గహనాంతరంలో దవాగ్ని రేగి చేరువనున్న చెట్లను వదలి ఎక్కడో దూరాన ఉన్న చెట్లను దహించడం కన్నారా చూస్తున్నదే కదా' అని తలపోశాడు. కాగల కార్యాన్ని నిశ్చయించి, హృదయాన్ని దహించివేస్తున్న దుఃఖాగ్నిని లోలోపలే అణిచిపెట్టి కపటవికాసం తాల్చి, అతనికి నచ్చజెప్పబోయాడు.

'కంసా! అశరీరవాణి పలుకులకు భయపడుతున్నావు కదూ? ఆ భయం నీకు వద్దు. ఏమంటావా? ఈమెకు జన్మించే పుత్రులలో ఎనిమిదవవాడు నీకు మృత్యువవుతాడని ఆకాశవాణి అన్నది. ఈమె కన్న బిడ్డలందరినీ పుట్టినవారిని పుట్టినట్లే నీ చేతిలో ఉంచుతాను. నా మాట నమ్మి భయం మాని, ఈ దారుణ కర్మను త్యజించు' అని నాటబలికాడు.

వసుదేవుడు మాట తప్పడని తెలిసిన కంసుడు ఆ పలుకులకు సమ్మతించి, తన పూనికను మాని మళ్ళీ రథాన్ని అధిరోహించాడు. వసుదేవుడు కృతజ్ఞుడై కంసుని ప్రశంసించి దేవకిని వెంటగొని అక్కడినుంచి నిష్క్రమించాడు.

## దేవకి సంతానం

రాజేంద్రా! దేవకి సామాన్య స్త్రీమాత్రురాలు కాదు. భగవంతుడే శరణమని నమ్మి త్రికరణశుద్ధికి వర్తిల్లిన ధన్యాత్మురాలు. సమస్త దేవతలు ఆమెను కంటికి రెప్పలా కనిపెట్టుకొని ఉన్నారంటే, వింత ఏమున్నది? అఖిలదేవతారూపిణి అయిన ఆమె కాలక్రమాన గర్భం ధరించి ఒక కొడుకును కన్నది. అతనికి కీర్తిమంతుడని పేరుపెట్టారు.

వసుదేవుడు తన మాటను నిలబెట్టుకోవాలని సాహసించాడు. పుత్రవినాశదుఃఖం అతని సత్యదీక్షకు అడ్డుపడింది. అయినా తెంపుచేసి దుఃఖాన్ని అవతలికి తోసి అప్పుడే కన్నువిచ్చిన ఆ నిసుగును తీసుకువెళ్ళి కంసునికి సమర్పించాడు. రాజేంద్రా! 'తల్లిదండ్రులు కన్నబిడ్డలను చేతులారా మృత్యువుకు అప్పగింపగలరా?' అని కాని, 'కంసు డంతటి ఘోరకృత్యానికి ఏ విధంగా తెగించాడో?' అని గాని విచారించకు. సాధువులకు దుస్సహమైనది, విద్వాంసులకు అనపేక్షితం, క్షుద్రులకు అకార్యం, ధర్మాత్ములకు దుస్త్యజం అన్నవి ఎన్నటికీ కలుగనేరవు. వసుదేవుడెంత సాధువయినా పుత్రలాలన సుఖాపేక్ష అతనికి కలుగదా? అని శంకిస్తావు కాబోలు. అతను సాధుమాత్రుడే గాక విద్వన్మూర్ధన్యుడు. భగవంతు డొక్కడే పరమతత్త్వమని, భగవద్భిన్నమైనది వేరొకటి లేదని విద్వాంసుని పరమానుభవం. అందువల్ల విద్వాంసులకు భగవదన్యమైన సుఖాపేక్ష కలగదు.

రాజా! కంసుడు వసుదేవుని సమభావ సత్యనిష్ఠలకు ఎంతో సంతోషించి, 'అయ్యా! మీ అష్టమపుత్రుని వలన నాకు మృత్యువు కలుగనున్నదని గగనవాణి తెలిపింది. ఈ శిశువు వలన నాకు చేటు వాటిల్లబోదు. నీవు తీసుకొని వెళ్ళవచ్చు' అంటూ కీర్తిమంతుని మళ్ళీ వసుదేవుని చేతికి అందించాడు. వసుదేవుడు ఆ బిడ్డనందుకొని, 'ఇతను జితేంద్రియుడు కాడు. అందువలన మాట నిలకడ పొంది పొసగదు. ఏ క్షణంలో ఏ ఆపద వస్తుందో కదా' అనుకొంటూ కొడుకును గుండెలకు హత్తుకొని ఇంటికి తిరిగివెళ్ళాడు.

## కంస నారద సమావేశం

రాజా! ఒకనాడు నారదమహర్షి కంసుని వద్దకు వచ్చి ప్రస్తావవశాన, 'కంసా! వసుదేవాదులైన అంధక వృష్ణివంశ్యులను, దేవకి మొదలుగా గల యదుస్త్రీలను, వారి బాంధవులను, వారి ననుసరించి వ్రేపల్లెలో ఉన్న నందాదిగోపాలకులను, వారి స్త్రీలను ఎరుగుదువు కదా. వారందరూ ఎవరనుకొంటున్నావు? నీవు, నీకు గల సుహృద్బాంధవానుసారులు ఎవరని

భావిస్తున్నావు? వసుదేవాదులందరూ దేవతాంశజులు. నీవు, నీ వారు అసురాంశతో పుట్టినవారు. అసురాంశ సంభూతులు కాబట్టి మీరు లోకబాధకు లయ్యారు. ఆ కారణాననే భూదేవి మిమ్మల్ని మోయలేకపోతున్నది. మీరు తొలగితేనే తప్ప భూభారం తగ్గదు. మీ సంహారార్థం రాక్షసాంతకుడు రానున్నాడు' అన్నాడు.

ఆ మాటతో కంసునికి గగనవాణి పలుకులు స్ఫురణకు వచ్చాయి. అతను భయవిహ్వలుడై, 'ఆ విష్ణువు నన్ను చంపబూని దేవకీ గర్భంలో జనింపనున్నాడు. ఇక జాగుచేయకూడదు' అని తలపోసి దేవకీ వసుదేవులను ఇనుప సంకెళ్ళతో బంధించి కారాగృహంలో నిలిపి వారికి పుట్టిన బిడ్డలను పుట్టినవారిని పుట్టినట్లుగా ఎప్పటికప్పుడు పట్టి చంపసాగాడు. స్వార్థపరులు తమ ప్రాణరక్షణ కోసం పరులనే గాక తల్లిదండ్రులను సైతం చంపడానికి వెనుదీయరు కదా!

## కంసుని పూర్వజన్మ

రాజా! కంసుడు తన పూర్వజన్మలో కాలనేమి అన్నపేరిట రాక్షసునిగా ఉన్నాడు. కాలనేమిని భగవానుడు సంహరించాడు. అతను ఈ జన్మలో కంసునిగా పుట్టాడు. అలాగే జరాసంధుడు ప్రలంబక లంబక చాణూర తృణావర్తాఘముష్టికారిష్ట ద్వివిద పూతనా కేశి ధేనుకాదులు, బాణ నరకాదులు అసురాంశతో జన్మించారు. వారి చెలిమి బలిమి వల్ల కంసుడు చెలరేగి సురాంశసంభూతులైన యాదవులతో విరోధించి యదుభోజాంధక రాజయిన తన తండ్రి ఉగ్రసేనుని సింహాసనం నుంచి తొలగించి తాను రాజయి యాదవులను పెట్టరాని కష్టాలు పెట్టాడు. యాదవులు దిక్కుతోచక వేలకువేలుగా మథురాపురాన్ని వదిలి కురు పాంచాల కేకయ సాళ్వ విదర్భ నిషధ విదేహ కోసల దేశాలకు పారిపోయారు. పారిపోలేక నిలిచిన అక్రూరాదులు ఏదో విధాన కంసుని కొలువు చేరి అతని పంచనే ప్రాకులాడుతున్నారు.

రాజా! కంసుడు ఆ విధంగా దేవకీ పుత్రులు ఆరుగురిని బలిగొన్నాడు. దేవకి మళ్ళీ గర్భం ధరించింది. భగవంతుని అంశమైన శేషుడు ఆమె గర్భంలోనికి అవతరించాడు. దేవకి తన ఆరుగురు కొడుకుల సంగతి తలచుకొని, 'అయ్యో! నా కడుపున గాచిన శిశువు గతి ఏమి కానున్నదో' అని దిగులుపడసాగింది.

## యోగమాయ

అక్కడ వ్రేపల్లెలో యాదవులకు కంసుని వలని భయం దినదిన గండంగా మారింది. వారు గత్యంతరం లేక భగవంతుడే శరణమని క్షణాలు యుగాలుగా కాలం గడుపుతున్నారు. భగవానుడు వారి మొరాలకించి తన యోగమాయను పరికించి, ఆమెకు కర్తవ్యాన్ని వివరించాడు.

'కళ్యాణీ! వ్రజపురంలో నందగోకులాన వసుదేవుని భార్య రోహిణి, మరి కొందరు కంసునికి భయపడి తలదాచుకొని ఉన్నారు. నా తేజోంశ ఇప్పుడు దేవకీగర్భంలో ఉన్నది. నీవిప్పుడే అక్కడికి వెళ్ళి దేవకీగర్భస్థమైన నా తేజోంశను ఆకర్షించి రోహిణీగర్భంలో నివేశించు. నేను నా అంశతో దేవకీ గర్భంలో అవతరిస్తాను. అంతలో నీవు నందుని భార్య యశోదకు జన్మించు. నీవు సర్వకామవరేశ్వరివి కాగలవు. మానవులు నిన్ను దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండి, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద అనే నామధేయాలతో వ్యవహరిస్తూ నీకు తగిన మందిరాలను నిర్మించి వివిధోపహారబలులతో నిన్ను ఆరాధిస్తారు. నీవు దేవకీ గర్భంలో ఉన్న నా అంశను సంకర్షించి రోహిణీ గర్భానికి చేర్చినప్పుడు ఆ తేజోంశకు నీ సంకర్షణ కారణాన సంకర్షణుడని పేరువస్తుంది. ఆ పురుషుడు లోకాభిరాముడైనందువల్ల రాముడని, బలశాలి అయినందువల్ల బలుడని ప్రసిద్ధి కలుగుతుంది" అని ఆదేశించాడు.

యోగమాయ ఆ పలుకులను తలదాల్చి భగవానునికి నమస్కరించి ధాత్రికి వచ్చి దేవకీగర్భాన్ని ఆకర్షించి రోహిణియందు చేర్చింది. దేవకికి

గర్భస్రావం జరిగిందని జనులు భావించి పరిపరి విధాల వాపోయారు. రాజా! బలరాముడు దేవకీ రోహిణీ గర్భాలు రెంటిలోనూ జనించిన ఉదంతాన్ని గ్రహించావు కదా?

## భగవల్లీల

రాజేంద్రా! భగవానుడు భూభారాన్ని తొలగింపగోరి పుడమిపై అవతరింపనున్నానని బ్రహ్మకు సూచించిన సంగతి చెప్పాను కదా. పరమేశ్వరుడు ఏతన్నిమిత్తమై వసుదేవుని హృదయంలోనికి ప్రవేశించాడు. తత్ఫలితంగా వసుదేవుడు సూర్యతేజస్కుడై సమస్తభూతాలకు దురాసదుడు, దుర్ధర్షుడు అయి విరాజిల్లాడు. కాలక్రమాన అతను ఆ తేజాన్ని దేవకీ గర్భంలోనికి నివేశించాడు. ఆమె ఆనాటినుంచి సుధాకరుని దాల్చిన తూర్పు దెసను పోలి మహాహ్లాదకారిణియై అలరారినా, కంసుని ఇంట బంధితురాలైనందున కుంభాంతరదీపశిఖ వలె, జ్ఞానఖలనిరుద్ధ సరస్వతి వైఖరిని, కళావిహీనంగా కనుపింపసాగింది.

## కంసుని విహ్వలత్వం

దేవకి ఆ విధంగా హరితేజఃప్రభావంతో పైకి కనరాకున్నా నూత్నదీధితులతో వెలుగొందుతున్నదని కంసుడు గ్రహించాడు. 'నా ప్రాణాపహర్త దీని గర్భంలో ఉన్నమాట నిజం. కాకపోతే ఈ అపూర్వమైన తేజం ఈమె ముఖరేఖలలో ప్రస్ఫుటించడం సంభవించదు. నేనిప్పుడు ఏమి చేయాలి? ఈమెను చంపివేయనా? స్త్రీవధ మహాదోషం. పైగా తోబుట్టువు, అందులోనూ ఆసన్నప్రసవ గర్భవతి. ఈ పరిస్థితిలో చంపడమంటే చేజేతులా ఆయుస్సును, సంపదను, యశస్సును ఉన్మూలించుకొనడమే అవుతుంది. లక్ష్మీహీనుడిని లోకం గడ్డిపోచకన్నా అల్పంగా పరిగణిస్తుంది. కీర్తిహీనుని పెద్దలు దరిదాపులకైనా రానీయరు. ఇక ఆయుర్హీనత వేరే వాటిల్లనక్కరలేదు. క్రూరకర్ములు బ్రతికినా చచ్చినవారితో సమానం. అట్టివారికి ఇహలోకంలో జనదూషణ, పరలోకంలో ఘోరప్రాప్తి తప్పవు' అని తలపోసి దేవకీ

వధోద్యమాన్ని విరమించుకొని, ఆమె ప్రసవకాలానికై ఎదురుచూడసాగాడు.

కంసుడా విధంగా కొంతకాలం నిబ్బరంగా ఉన్నా ప్రాణహాని తప్పదన్న భయం లోలోపల అతని మనస్సును కలచివేస్తూనే ఉన్నది. అతను నిలుచున్నా కూర్చున్నా నిద్రించినా మేల్కాంచినా సర్వకాల సర్వావస్థలలోనూ అతనికి భగవంతుని స్మరణమే తప్ప వేరొకటి లేకపోయింది. లోకమంతా అతనికి భగవన్మయంగానే గోచరింపసాగింది.

## దేవకీగర్భస్థ శిశుస్తోత్రం

రాజేంద్రా! ఒకనాడు బ్రహ్మదేవుడు, పరమేశ్వరుడు నారదాదిమహర్షులతో కలిసి దేవకీగృహానికి వచ్చారు. వారివెంట సురవర్గం, వారి పరిచరసముదాయం అరుదెంచింది. విరించి ముందు నిలిచి, ఈ విధంగా సన్నుతించాడు.

దేవా! పురుషోత్తమునికి నీకు ప్రణామం. ఎవని సంకల్పాలు సత్యాలనడానికి నేడీ అవతారమే నిదర్శనమై ఉన్నదో, ఎవనిని పొందటానికి సత్యమొక్కటే సాధనమై ఉన్నదో, ఎవడు సృష్టిస్థితిలయాలనే మూడు కాలాలలోనూ సత్యస్వరూపుడై వెలుగొందుతున్నాడో, ఎవడు సత్యత్వలక్షణాలైన పంచమహాభూతాలకు కారణమై వానియందు అంతర్యామి రూపంలో తేజరిల్లుతున్నాడో, అట్టి సత్యానికి సత్యమైనవానిని, సత్య సూనృతనామకుని, సర్వాత్మకుని నిన్ను శరణుకోరి వచ్చాను.

దేవా! ఎవని ప్రకృతిని ఆశ్రయించి ఈ సమష్టివ్యష్టి శరీరరూప ప్రపంచమనే మహావృక్షం మొలిచి, సత్త్వరజస్తమోగుణాలనే మూడు వ్రేళ్ళను వ్యాపింపజేసి, పంచమహాభూత మనోబుద్ధ్యహంకారాలనే కొమ్మలను ఎనిమిదింటిని చాపి, జ్ఞానేంద్రియ పంచకం దట్టమైన ఊడలుగా, చర్మ రక్త మాంస మేదో మజ్జాస్థి శుక్లాలనే ఏడు ధాతువులు త్వక్కులుగా, నవద్వారాలు సందులుగా, కోశాలు ఆరూ స్వభావాలుగా, నాగ కూర్మ కృకర దేవదత్త

ధనంజయ ప్రాణాపానవ్యానోదానసమానాలు పదీ ఆకులుగా, ధర్మార్థ కామమోక్షాలు నాలుగింటినీ రసాలుగా అమరించుకొని సుఖదుఃఖాలనే ఫలాలు రెండింటినీ ప్రసాదిస్తూ జీవేశ్వరులనే పక్షుల జంటకు నివాసస్థానమై అలరారుతున్నాడో, ఎవ డీ ప్రపంచమహావృక్షం యొక్క ఉత్పత్తి స్థితిలయాలు మూడింటికీ కారకుడో, అట్టి పరమాత్మునికి నీకు ప్రణమిల్లుతాను.

దేవా! నీ మాయ కప్పినప్పుడు జ్ఞానదీపికా ప్రకాశం కానరానందువల్ల నీ స్వస్వరూపాన్ని చూడలేక జనులు నిన్ను అనేకరూపాలలో దర్శిస్తారు. నీ అనుగ్రహప్రకాశం ప్రసరించినప్పుడు నీ తత్త్వం స్పష్టమై అది అభేదమని సాక్షాత్కరిస్తుంది.

దేవా! చరాచరాత్మక సమస్తలోకానికి కుశలక్షేమాలను సమకూర్చటమే స్వకర్మగా గ్రహించి దేశకాలానుగుణంగా సత్త్వమయమూర్తులను ధరిస్తావు. ఇవే నీ అవతార కారణకార్యాలు. లోకపాలనకృత్యం దుష్టశిక్షణ శిష్టరక్షణ రూపం కాబట్టి నీ అవతారాలకు దుష్టులు దుఃఖిస్తారు; శిష్టులు సంతోషిస్తారు. దేవా! పుణ్యాత్ములు సమాధియోగచిత్తులై నీ పాదమే తెప్పగా చేసి దానినెక్కి సంసారసాగరాన్ని గోష్పదీకరించి తాము తరించి అన్యులకు దారిచూపారు. నిన్ను నమ్మినవారికి ఆపదలు లేవు.

దేవా! ఈ రహస్యాన్ని గ్రహింపక కొందరు తపోబలాన్ని నమ్ముకొని పరిశ్రమిస్తారు. అట్టి శ్రమకు ఫలితంగా వారికి నీ పాదదర్శన మవుతుంది. వారి బుద్ధి నీ యందలి భక్తిసుధారసంలో పరిశుద్ధం కానందువల్ల వారు నీ చరణ నౌకను అధిరోహించేందుకు గాని, సంసారసాగరాన్ని తరించడానికి గాని శక్తిచాలక భ్రష్టులవుతారు. నిన్ను చేరుకొనేందుకు పరాభక్తి ఒక్కటే పరమసాధనం. నీ భక్తిని చేయూతగా గ్రహించినవారికి పతనాదులు, త్రోవతప్పడాలు కలుగనేరవు. నీ ప్రాపుగన్నవారు నిర్భయ నిర్విఘ్నక్రములై సంచరింపగలరు.

దేవా! భక్తికి మర్కటకిశోర న్యాయం, మార్జాలకిశోరన్యాయం అని రెండు విధాలున్నాయి. మొదటి మార్గంలో కోతిపిల్ల ప్రయత్నపూర్వకంగా దాని తల్లి పొట్టను కరుచుకొని ఉంటుంది. రెండవదానిలో తల్లి తన పిల్లను తానే కరుచుకొనిపోతుంది.

మొదటిదానిలో పురుషప్రయత్నం, రెండవదానిలో ఆత్మార్పణం ప్రధానంగా కనిపిస్తాయి. మొదటిదానిలో ప్రమాదానికి అవకాశం ఉన్నది. రెండవదానిలో సమస్తభారాన్ని నీవే భరిస్తున్నావు. కాబట్టి ఎట్టి ప్రమాదానికీ అవకాశం లేదు.

దేవా! చరాచరాత్మకమైన ఈ సమస్తసృష్టి గుణభేదాలను బట్టి నాల్గు తరగతులైన స్వభావం కలిగి నాలుగు వర్గాలుగా ఏర్పడింది. ఆ భేదాలనే చతుర్వర్ణాలని అంటారు. ప్రతివర్గంలోనూ బాల్యాద్యవస్థలు నాలుగు కలుగుతాయి. ఆ అవస్థలకు తగినట్లుగా స్వభావం వర్తిల్లుతుంది. ఆ వర్తనలనే ఆశ్రమాలన్నారు. చాతుర్వర్ణ్యం తత్తద్యోగ్యతను బట్టి వేదము క్రియ యోగము తపస్సు సమాధి అనే ధర్మాల అనుష్ఠానపూర్వకంగా నిన్ను ఆరాధిస్తుంది. ఆ ధర్మానుష్ఠానమే కర్మ మనబడుతున్నది.

దేవా! జనులు తమ ప్రారబ్ధానుసారం ఆచరించే కర్మములకు నీవే ఫలాన్ని ఏర్పరిస్తావు. కర్మఫలాలను ఏర్పరించటమే లోకసంగ్రహం. అందుకు కర్త ఉండాలి. కర్త సాకారుడుగా ఉండాలి. అందువలన నీవు నిరాకారుడవైనా శుద్ధసత్త్వమయ శరీరాన్ని తాల్చి సాకారుడవుగా తోచి జగచ్చక్రాన్ని నడుపుతున్నావు.

దేవా! నీవు సాకారత్వాన్ని వహించటం లోకానుగ్రహార్థమే కాని తదన్యతరం కాదు. ఏమంటే లోకం కన్నులారా చూచినదానినే నమ్ముతున్నది. లోకంలో ఏమి కానవస్తున్నది? గుణవ్యవహారం కానవస్తున్నది. ఆ వ్యవహారాన్ని పరిశీలించి బుద్ధిగతం కావించుకొనడమే అనుభవ మనబడుతున్నది.

గుణములన్నీ జడములని, జడములకు స్వతంత్ర శక్తి కలుగదని, శక్తిమంతాలు కాని గుణాలకు వ్యవహారం ఏ విధంగా కలుగుతుందని శంకింపవచ్చు. గుణాలు జడములైనా నీ శక్తిసంబంధాలు కాబట్టి నీ సాన్నిధ్యంలో అవి వ్యవహరిస్తున్నాయని, నీవు సాక్షిమాత్రుడవై ఉంటావని, సర్వశక్తిమంతమైన మూలతత్త్వం ఏదో ఒకటి లేనినాడు జగద్వ్యవహారానికే అవకాశం ఉండదని, జగద్వ్యవహారం నడుస్తున్న విషయం కన్నులయెదుట ఉన్నదే కాబట్టి ఈ సర్వానికీ మూలమైన తత్త్వమొకటి ఉండితీరాలని, ఆ పరతత్త్వం నీవేనని తత్త్వవేత్తలందరూ అనుమానవాక్యాలతో సమాధానిస్తారు.

అనుమాన ప్రమాణం చేత విద్వాంసులు కావించే ప్రతిపాదనలు స్థూలబుద్ధులకు విశ్వాసాన్ని కలిగింపలేవు. అందువల్ల వారు వాస్తవస్వరూపం ఇదమిత్థమని ఎరుకకు రాక అజ్ఞానవశులై వర్తిల్లుతారు. వస్తువును కన్నులారా కనుగొంటేనే తప్ప వారి అనుమానాలు తీరవు. వారి సందేహాలను తీర్పగోరి నీవు శుద్ధసత్త్వశరీరాన్ని ధరిస్తావు. అప్పుడు వారు నిన్ను కన్నారా చూసికొని సత్యాన్ని గ్రహించి నిన్ను భజించి కడతేరుతున్నారు. అందుచేత నీ అవతారం లోకానుగ్రహార్థమే కాగలదు.

దేవా! నీ స్వభావం మనోవాక్కులకు అందరానిది కాబట్టి నీ గుణకర్మ జన్మములను గాని, నీ నామరూపాలను గాని నిరూపించడం సాధ్యం కాదు. ఉపాసకులు వారి వారి రుచి ప్రకారం నీకు రూపాలను కల్పించి నిన్ను ఉపాసించటం జరుగుతున్నది. ఎవరేవిధంగా కోరుకొంటే నీవు వారికి ఆ విధంగా సాక్షాత్కరిస్తావు. ఆ అనుభూతిని ఊతగా గ్రహించి వారు నీకు నామాలను కల్పించి నిన్ను సంకీర్తిస్తారు. ఆ విధంగా వారు నీ పాదారవిందాలపై మనస్సును లగ్నం చేసి నీ స్మరణ కీర్తన పూజాదులొనర్చి మలినాలు వాసి పరిశుద్ధులై సర్వకామనలను పరిత్యజిస్తారు. కామనలు లేనినాడు తత్కామఫలానుభవం కాని, తదర్థ జన్మాంతరం కాని కలుగనేరవు. ఆ విధంగా నీ భక్తులు ముక్తులవుతారు.

దేవా! ఈ భూమి నీ పాదస్థానం. అట్టి స్థానం దుర్జనభూయిష్ఠమై ఉన్నది. ఆ భారం దుర్భరమై భూదేవి పరితపించిపోతున్నది. నీ పరమశోభన పదలాంఛన భాగ్యం ఎప్పుడు కలిగితే ఆ దేవి హృదయవేదన అప్పుడు తొలగుతుంది. నీ దయకు ఈ ధరాస్థలి నోచుకోవాలి గాక. మునుపు నీవు మత్స్య కూర్మ వరాహ నారసింహ హయ హంసరాజ విప్ర విబుధావతారాలను ధరించి ధాత్రీదేవి క్లేశాన్ని బాపి లోకమంగళాన్ని కావించావు. మళ్ళీ ఇప్పుడు లోకరక్షణావసరం ఏర్పడింది. మమ్మల్ని, ముల్లోకాలను రక్షించు. మాకు నీవే గతి' అని ప్రస్తుతించాడు. సురాదులు జయజయ వచనాలు పలికారు.

రాజేంద్రా! బ్రహ్మదేవుడు ఆ విధంగా భగవంతుని ప్రస్తుతించి, దేవకి వంక మరలి, 'దేవీ! సాక్షాద్భగవానుడు మనకు మేలు కలిగింపగోరి నీ కడుపున చేరాడు. ఆ మహనీయుడు నీకు పుత్రుడై జన్మించి యాదవుల దుఃఖాన్ని ఉపశమింపజేస్తాడు. కంసుని భయం ఇకమీద నీకుండదు' అని ఓదార్చి, దేవతలతో స్వర్గలోకానికి తిరిగివెళ్ళాడు.

## శ్రీకృష్ణావతారం

పరీక్షిన్నరేంద్రా! ఒకానొకనాడు ప్రకృతి సర్వగుణోల్లసితమై శోభాపూర్ణంగా అలరారింది. ఆనాటి రాత్రి రోహిణీనక్షత్రయుక్తమై ప్రశాంత గ్రహ నక్షత్ర తారకంగా ప్రకాశించింది; దిక్కులన్నీ ప్రసన్నములై విభాసిల్లాయి; గగనభాగం నిర్మలతారాగణోదయమై విలసిల్లింది; నిర్మలజలపూరితాలైన నదులతో, వికసిత వారిజాలైన కాసారాలతో, వివిధఫలపుష్పగుచ్ఛ మనోహరాలైన వనభాగాలతో, సర్వమంగళమయ పట్టణ గ్రామ గోపాలవసతులతో ధరాతలం శోభిల్లింది. మారుతాలు కుసుమవాసనాపూరితాలై మందమందగతుల చల్లగా వీచాయి. అగ్నిహోత్రాలు ప్రజ్వరిల్లాయి. సాధుజనహృదయాలు ప్రసన్నము లయ్యాయి. దేవదుందుభి ధ్వనులతో కిన్నర గంధర్వ సంగీతనాదాలతో సిద్ధ

చారణ ప్రస్తుతులతో విద్యాధరాప్సరసల నాట్యాలతో నింగి మార్మోగసాగింది. పుష్పవర్షం కురిసింది. కారుమబ్బులు క్రమ్మి కటికచీకట్లు ఆవరించాయి.

నాటి నిశీథిసమయంలో దేవకీ గర్భం నుంచి నిఖిలాంతర్యామి అయిన భగవానుడు ఉదయించాడు. భగవదుదయం ప్రాకృతశిశూదయం వలె మాతృగర్భ మలిన నిమజ్జనం కాక ప్రాచీదిశ పూర్ణచంద్రోదయాన్ని తలపింప జేస్తుండటమూ, పుట్టిన పాపడు నీలనీరదగాత్రంతో పుండరీకనేత్రాలతో శంఖచక్రగదాది సమంచిత చతుర్భుజాలతో శ్రీవత్సవక్షంతో ఒప్పారుతూ పీతాంబరం ధరించి కిరీట కుండల కాంచీ కంకణ కేయూర నవరత్నకాంతి కాంతుడై మందిరాంతరమంతా ఉద్దీపించటం వసుదేవుడు చూసి ఆశ్చర్యసంభ్రమానందాలు ముప్పిరిగొనగా కొంతసేపటికి తేరుకొని స్నానం చేసి బ్రాహ్మణులకు పదివేల గోవులను మనోదత్తం కావించి పురిటింటిలోనికి ప్రవేశించి నిజప్రభాసముద్భాసితుడై అందున్న ఆ శిశురూప భగవానునికి కైమోడ్చి నిర్భయుడై ఈ విధంగా ప్రస్తుతించాడు.

## వసుదేవకృత భగవత్సంస్తుతి

దేవా! నీవు ప్రకృతికి పరుడవైన సాక్షాత్పురుషుడవు కేవలానుభవానంద స్వరూపుడవు సర్వబుద్ధిసాక్షివి అన్న సంగతి నెరుగుదును. నీ శక్తిని మాయ అంటారు. అది నీ ఇచ్ఛానువర్తినియై వ్యవహరిస్తుంది. ఆ వ్యవహారం జ్ఞానేచ్ఛాక్రియారూపాలలో ఉంటుంది. ఆ మూటిని గుణత్రయమంటారు. నీ మాయావ్యవహారఫలంగా జగత్తు కలుగుతున్నది. శక్తి నెడబాసి శక్తిమంతుడుండడు కనుక, శక్తికార్యమందు శక్తి – దానితో శక్తిమంతుడు ఉండటం వలన – నీ శక్తికార్యమైన జగత్తునందు శక్తితోపాటు నీవుకూడా అనుస్యూతంగా ఉంటావు. ఆ విధంగా నీవుండటం నీవు జగత్ప్రవేశ మొనర్చినట్లు భావింపబడుతున్నది. దేవకీగర్భ మందలి నీ ప్రవేశం అటువంటిదే. ఈ రహస్యం గ్రహింపలేక నీవు దేవకీగర్భం ప్రవేశించి అందుండి జన్మించినట్లు భావిస్తారు. నిజానికి నీవు దేవకీగర్భజాతుడవు కావు.

ఆ పక్షాన 'తత్ సృష్ట్వా త దే వానుప్రవిశత్' అన్న శ్రుతివాక్యం సంగతేమిటంటే – ఆకాశం సర్వవ్యాపకం. అది లేని చోటులేదు. అయినప్పటికీ ఆకాశం జలమందు ప్రవేశించి ఉన్నట్లు సూర్యచంద్రాదుల వలన భాసిస్తుంది. ఇదే భావాన్ని పై శ్రుతి వాక్యం సూచిస్తున్నది.

మహత్తు మొదలైనవి పదహారు సృష్టికారణ తత్త్వాలు. ప్రతి తత్త్వంలోనూ దానికి అనుగుణమైన శక్తి ఉంటుంది. ఆ తత్త్వాలు ఒకదానితో ఒకటి కలియక వేర్వేరుగా ఉన్నప్పుడు వాటి శక్తులు కూడా ప్రత్యేకించి ఉంటాయి. శక్తులన్నీ కూడినప్పుడు కార్యం ఏర్పడుతుంది. అవి కూడనప్పుడు ఎటువంటి కార్యం ఏర్పడదు. ఆ పదహారింటి శక్తులు ఏకమైనంతనే అండం ఏర్పడింది. అంత మాత్రాననే అవి ఆ అండం లోనికి ప్రవేశించినట్లు భావింపకూడదు.

ఆ శక్తులు ప్రవేశింపలేదని చెప్పటానికి కారణం లేకపోలేదు. ఏ మహదాదుల కలయిక చేత సృష్ట్యండం ఏర్పడినదో, ఆ మహదాదులకూ వాటి శక్తులకూ వినాభావం ఎన్నటికీ కలిగేది కాదు. ఆ శక్తులు ఆ మహదాదులతో కలిసిమెలిసి ఉంటాయి. మహదాదులు ఒకదానితో ఒకటి కలియగా ఏర్పడిన పదార్థాలలో అవి ఉండనే ఉన్నవి కదా. అట్టి వాటికి పునః ప్రవేశ ప్రసక్తి ఎక్కడున్నది?

దేవా! కారణం నుంచి కార్యం కలుగుతున్నది. కార్యమున్నప్పుడు కారణం స్వతస్సిద్ధంగానే ఉన్నది. అట్టి కారణం తత్కార్యం వలన జనించిన దనటం సరికాదు. అదే విధంగా మహదాదులు కారణమైతే బ్రహ్మాండం కార్యమవుతుంది. బ్రహ్మాండమందు తత్కారణము లైన మహదాదులన్నీ అంతర్భూతాలు. మహదాదులన్నవో అవి నీ మాయాప్రాకృతులు. మాయా ప్రాకృతులలో మాయ, మాయలో నీవు అపృథగ్భావంతో ఉంటారు.

దేవా! పదార్థములన్నీ గుణముల యొక్క కార్యాలు. గుణాల లక్షణాలను అనుమేయించే శక్తి గుణాలకు కలుగదు. కాబట్టి నీవు గుణములలో ఉన్నా

అవి నిన్నెరుగవు. ఇంద్రియాలు లేవా? అంటే, ఇంద్రియాల శక్తి ఆయా పదార్థాలను గ్రహింపగలగటం వరకే పరిమితం. కాబట్టి నీవు ఇంద్రియాలకు కూడా అతీతుడవు.

స్వామీ! నీవు స్వరూపుడవు సర్వాత్ముడవు సర్వవ్యాపకుడవు సర్వవస్తుస్వరూపుడవు అయినట్టివాడవు. పదార్థభావ మన్నది ఏకదేశవర్తి పరిచ్ఛిన్నము వ్యాప్యము అవస్తువు అయి ఉన్నది. అట్టిది నిన్ను ఆవరింపగలదా? మరి నీ వెల్లప్పుడు అనావృతుడ వయినందువల్ల ఎల్లెడలా వ్యాపించి ఉంటావు. నీకు బాహ్యాభ్యంతరాలు కలుగవు. అట్టి నీవు పరిచ్ఛిన్నపదార్థాన్ని ప్రవేశించటం ఎలా పొసగుతుంది? ప్రవేశమనగానే ప్రవేశించేవాడు, ప్రవేశింపబడేది – రెండూ ప్రత్యేకంగా ఉండాలి. సర్వము నీవే అయినప్పుడు నీకంటె భిన్నమైనది వేరొకటి లేనప్పుడు ప్రవేశ శబ్దానికి తావెక్కడున్నది?

దేవా! గుణాలు వేరని, తద్గుణాలు గల గుణి వేరని కొందరు భావిస్తారు. అంతకంటె అజ్ఞానం మరొకటి లేదు. ఏమంటావా? ఆత్మ ఏకము అద్వితీయము సర్వాత్మకము అయినట్టిది. ఆత్మభిన్నమైన పదార్థమంటూ ఏదీ లేదు. దృశ్యపదార్థాల సంగతేమంటే దృశ్యాలలో ఆ పదార్థమని ఈ పదార్థమని వందల పేర్లతో పిలువబడేవన్నీ వాచారంభణలు మాత్రమే. పరమార్థదృష్టికి అవేవీ ప్రత్యేకవస్తువులు కావు.

దేవా! ఆత్మభిన్నమైన వస్తువే లేదు. ఆ పక్షాన జగత్తు సంగతేమిటంటే, సమస్త దృశ్యం నీవే గాని నీకంటె వేరైనది కాదు. నీవే జగద్రూపాన కాన్పిస్తావు. ఈ రహస్యం విచారబుద్ధికి మాత్రమే గోచరిస్తుంది. అట్టివారు మాత్రమే విద్వాంసు లవుతారు. భిన్నదృష్టి గలవారు ఎన్నటికీ విద్వాంసులు కాలేరు.

దేవా! మరొక విశేషం. ఏ నోట నీవు పూర్ణుడవని ఇచ్ఛారహితుడవని గుణత్రయ రహితుడవని నిర్వికారుడవని అంటున్నారో, ఆ నోటనే నీ వలన

సృష్టిస్థితిలయాలు జరుగుతున్నవని అంటారు. వారికి సత్యమేమిటో తెలియకపోవటమే అందుకు కారణం. లోకవ్యవహారాలను బట్టి చూస్తే కోరికతోపాటే గుణాలు వర్తిస్తున్నాయి. కోరిక లేనినాడు గుణాలు వ్యవహరింపవు. గుణాలు వ్యవహరింపనినాడు కార్యం జనింపదు. ఇది అందరికీ అనుభవంలో ఉన్నదే. ప్రపంచసృష్టిస్థితిలయాలు కంటికి స్పష్టంగా కనబడుతున్నాయి. కాబట్టి ప్రపంచమనే కార్యమున్నప్పుడు, కార్యమన్నది గుణవ్యవహారఫలం కనుక, గుణాలున్నప్పుడు గుణి ఉండితీరాలి గనుక – గుణి ఒకడున్నాడని నిశ్చయింపవలసి వస్తుంది. ఆ గుణి ఎవడనే సందేహం కలుగుతుంది. ఆ గుణి మరొకడు ఉన్నాడంటే నీ ఏకత్వానికి, అద్వితీయత్వానికి భంగం వాటిల్లుతుంది. ఆ గుణివి నీవే అందామంటే నీవు పూర్ణుడవు గుణరహితుడవు మొదలయిన వచనాలు వ్యర్థప్రలాపాలు కావాలి. ఇందుకు సమన్వయం కుదరక లోకమంతా తారుమారవుతున్నది.

దేవా! ఈ భ్రాంతి తొలగాలంటే ఒక్కటే మార్గం. నీ పరబ్రహ్మత్వ పరమేశ్వరత్వాలు బుద్ధిస్థాలయితే సర్వభ్రాంతులు సమసిపోతాయి. నీవు సర్వవ్యాపకుడవు సర్వేశ్వరుడవు సర్వశక్తిమంతుడవు అని చెప్పినప్పుడు నీకు అసాధ్యమైనది లేదనే కదా సారాంశం? అట్టి నీయందు గుణిత్వాదులు వింతలు కావు గదా. ఇక నీ సృష్ట్యాదికర్తృత్వాన్ని విచారింపగా అది ఉపచర్యామాత్రం. సర్వమూ నీ గుణాలు చేస్తుండేవే. ఆ గుణాలకు శక్తి ఎక్కడినుంచో రాలేదు. అన్ని గుణాలకు నీవే ఆశ్రయుడవు కాబట్టి నీ ఆశ్రయమాత్రాన వాటికి అటువంటి శక్తి కలిగింది. ఆ సంగతిని గ్రహింపక భృత్యుని కార్యాన్ని రాజునందువలె నీ గుణములయొక్క కార్యాన్ని నీ యందు ఆరోపించటం వలన ఇట్టి భ్రాంతికి అవకాశం ఏర్పడుతున్నది.

దేవా! నీ శక్తి యొక్క గుణాలు మూడింటికి ప్రత్యేక వర్ణాలున్నాయి. నీవు సృష్టిని సంకల్పించినప్పుడు రజోగుణం వర్తిస్తుంది. అది రక్తవర్ణం. లయాన్ని సంకల్పించినప్పుడు తమోగుణం వర్తిస్తుంది. అది కృష్ణవర్ణం. నీవు రక్షణను సంకల్పించినప్పుడు సత్త్వగుణం వర్తిస్తుంది. అది శుక్లవర్ణం. ఈ మూడు

వర్ణాలు మూడు తనువులను దాల్చి వర్తిస్తాయి. ఆ రూపాలను క్రమంగా బ్రహ్మ రుద్ర విష్ణువు లంటారు. ఇదంతా నీ శక్తివిలాసమే తప్ప స్వతంత్ర విలసన కాదు. ఇట్టి సంకల్పాలు జనించటానికి కారణమేమంటే, ఆ సంగతి నీకే తెలియాలి. ఇది నీకు స్వభావమని మా బోంట్లము సమాధానపడుతుంటాము. స్వభావమంటే నీ ఉనికి అనే కదా అర్థం!

దేవా! రాక్షసాంశజులు రాజభావాన్ని వహించి లోకకంటకు లైనారని వారిని హరించి భూభారాన్ని తగ్గింపగోరి నీవిప్పుడు మా యింట అవతరించావు. నీవు మా యింట జన్మించి కంసుని ప్రాణాలకు ముప్పురానున్నదని తెలిసి అతను నీకు ముందు పుట్టినవారు ఆరుగురి ప్రాణాలను బలిగొన్నాడు. నీ యీ అవతారం సంగతి వినగానే ఆ దురాత్ముడు కత్తిదూసి రాకమానడు" అన్నాడు.

అంతలో దేవకి స్మృతినొంది కనులు విప్పి ఎదుటనున్న కొడుకును చూడగానే కంసుడు జ్ఞాపకానికి వచ్చి భయంతో ఆమెకు ఒళ్ళు జలదరించింది. అంతలో ఆమెకు ఆ పుత్త్రకుని యందు మహాపురుషలక్షణాలు గోచరించాయి. ఆమె ముఖమండలం ప్రసన్నమై మందహాససుందర మయింది. ఆమె కొంత నెమ్మది వహించి, భగవంతుని ఈ విధంగా స్తుతించింది.

## దేవకీకృత భగవత్సంస్తుతి

'దేవా! నీవు సర్వకారణాలకు మూలకారణానివి. అది సూక్ష్మాతి సూక్ష్మం కాబట్టి స్థూలదృష్టికి అవ్యక్తమనే అనిపిస్తుంది. పరమాణువు కూడా ఇంద్రియగోచరం కాదు గనుక నీవు పరమాణు మాత్రుడవని నా ఉద్దేశం కాదు. పరమాణు వన్నది పరిచ్ఛిన్నం. నీవు సర్వవ్యాపివి కాబట్టి అపరిచ్ఛిన్నుడవు. ప్రధానము కూడా సర్వవ్యాపియే గనుక నీవు తావన్మాత్రుడవేనని నా భావన కాదు. ప్రధానము అచేతనం; నీవో చేతనుడవు. జ్ఞానగుణకం కూడా చేతనమేనని వైశేషికు లంటారు గాని నీవు

నిర్గుణుడవు కాబట్టి జ్ఞానగుణక పదార్థానివి కావు. జ్ఞానపరిణామివని మీమాంసకులు నిన్ను భావిస్తుంటారు. అయితే పరిణామం వికారమైనది. నీవో నిర్వికారుడవు. చేతన మన్నది కూడా శక్తివిక్షేపణ పరిణామమని పుష్కరాక్షాదులు చెప్పారంటే – చైతన్యము సత్తాశయం. నీవు సత్తామాత్రుడవు. సత్తామాత్రునికి కారణత్వం కలుగుతుందా? అంటే, నీ కారణత్వం సాన్నిధ్యమాత్రమే. నీవు నిరీహుడవై ఉంటావు.

దేవా! నీవు కాలాతీతుడవు. బ్రహ్మాదు లందరూ కాలబాధితులు. బ్రహ్మకు కాలనియతి ఉన్నది. అతని ఆయుష్కాలం నూరేండ్లు. ఆ నూటిలో మొదటి యాభైయేండ్లు పూర్వార్థమని, చివరి యాభైయేండ్లు పరార్థమని వ్యవహారం. ఆ నూరు సంవత్సరాలు గడిచినంతనే బ్రహ్మకు ప్రళయమవుతుంది. అప్పుడు చరాచరాత్మక లోకాలన్నీ నశిస్తాయి. మహాభూతాలు భూతసూక్ష్మంలో, ఆ సూక్ష్మం ప్రధానమందు, ప్రధానం కాలవేగంలోను లయిస్తాయి. అట్టి లయమును నాశనమంటారు. అంతేకాని లయమంటే స్వరూపనాశం కాదు. నీవు మాత్రం శేషించి ఉంటావు. అందువల్ల శేషుడనే పేరు నీకు కలిగింది.

దేవా! కాలమన్నది నిమేషాది వత్సరాంత విభాగాలతో వర్తిల్లుతూ విశ్వాన్ని వివిధమర్యాదాబద్ధంగా నడుపుతున్నదని అంటారు. కాలమంటే నీ లీలావిశేషమే గాని వేరొకటి కాదు. దేవా! మృత్యువనే క్రూరసర్పం వెన్నంటి తరుముతుంటే మర్త్యులు దానికి భయపడి ఆత్మరక్షణార్థం సర్వలోకాలను చుట్టితిరిగి ప్రదక్షిణలు చేసి ఎక్కడా భయనివృత్తి కలిగే ఉపాయం తోపక వేసరిల్లి తుదకు నీ చరణారవిందాన్ని ఆశ్రయించి ఊరట చెందుతారు. నేనూ అదే తీరున నీ పాదపద్మాన్ని ఆశ్రయించాను. ఇక నాకు మృత్యుభయం ఎక్కడిది?

దేవా! నీ రూపం ధ్యానాస్పదం. అట్టిదానిని కేవల మాంసదృష్టిగోచరం చేయవద్దు. కంసుడు క్రూరాత్ముడు. నీవు నాయందు జనించినది ఆ దుష్టునికి తెలియకూడదు. కుక్షిస్థ సర్వభువనుడవు నీవు నా కుక్షియందు అవతరించటం

మర్త్యలోక విడంబన మైనప్పటికీ మూఢు లది యెరుగక నిన్ను మానవమాత్రునిగా భావిస్తారు. అట్టి భావనకు కంసుడు లొంగి నీకు ఎగ్గుచేయాలని ప్రయత్నింపగలడు. అతనిప్పటికే నా కడుపున పుట్టినవారిని ఆరుగురిని బలిగొన్నాడు. నీయీ అలౌకికరూపాన్ని ఉపసంహరించు' అని పలికింది.

## భగవదాదేశం

భగవానుడు దేవకీవచనాలను ఆలకించి 'దేవీ! స్వాయంభువ మన్వంతరంలో నీవు పృశ్ని అనేపేర, ఈ వసుదేవుడు సుతపు డనేపేర జనించారు. బ్రహ్మ మీ యిరువురిని ప్రజాసర్గానికి ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞను తలదాల్చి మీరు మీ ఇంద్రియ గ్రామాన్ని నియమించి కాలగుణాలైన వర్ష వాత ఆతప హిమ ఘర్మాలకు తట్టుకొని ప్రాణనిరోధం కావించి మనోమలినాలను మాయించి తపస్సు చేశారు. మీ శ్రద్ధాభక్తులకు మెచ్చి అప్పుడు నా యీ రూపంలో నేను మీకు ప్రసన్నుడనై మీ కోర్కెలు తెలుపగోరాను.

అంతవరకు మీరు ఎటువంటి గ్రామ్యసుఖాలను ఎరుగరు; సంతాన వాంఛ కూడా ఉండేది కాదు. నా మాయ అప్పుడు మిమ్మల్ని మోహవశులను చేసింది. తత్ఫలంగా సంతానవాంఛ మీకు కలిగింది. ముక్తినికూడా తలంపక నావంటి కొడుకు నిమ్మని ముమ్మారు కోరారు. నాకు సాటి వేరొకరు లేనందున మీ మనోరథాన్ని తీర్పగోరి నేనే మీ గర్భవాసాన జనింపవలసి వచ్చింది.

ఆ జన్మమందు పృశ్నిగర్భుడనే పేర మీకు జన్మించాను. తర్వాత అదితి అనే పేరుతో నీవు, కశ్యపుడనే పేరుతో వసుదేవుడు జన్మించారు. అప్పుడు ఉపేంద్రు డనుపేర నేను మీకు పుట్టాను. ఆ తరిని నేను వామనాకారాన్ని ధరించినందువలన నన్ను వామనుడని పేర్కొన్నారు. ఇది మీ మూడవజన్మ. ఇప్పుడీవిధంగా మీకు పుట్టి నా మాట నిలబెట్టుకొని మీ కోరిక తీర్చాను. ఇక పూర్వజన్మ వృత్తాంతం మీ స్మరణకు రావటానికి వీలుగా నాడు మీరు చూసిన రూపాన్నే ఇప్పుడు ధరించాను. మీరు నన్ను పుత్రభావంతో బ్రహ్మభావనతో

నిరంతరం చింతిస్తూ నా తోడిదే లోకంగా ఉండి తత్ఫలంగా నన్ను పొందగలరు.

దేవీ! కంసుని భయం ఉన్నదంటే నన్ను వెనువెంటనే గోపకులానికి తీసికొనివెళ్ళి అక్కడ యశోదవద్దకు చేర్చండి. నా మాయ ఇప్పుడు యశోదకు పుత్రికగా జన్మించింది. ఆ శిశువును ఇక్కడికి చేర్చాలి. చెరసాల తలుపులు మూసి ఉన్నాయని జంకవద్దు. తలుపులు తమంతతామే తెరుచుకొంటాయి. యమునానది దాటడానికి వీలుగా మోకాలుబంటి లోతవుతుంది. మీరు వెళ్ళే మార్గంలో ఎటువంటి ఆటంకాలు కలుగవు" అని పలికి వారి కన్నుల యెదుటనే ప్రాకృతశిశువుగా మారాడు. ఆ సమయాననే యోగమాయ యశోద ఇంట జన్మించింది.

## వసుదేవుని ప్రయాణం

రాజా! వసుదేవు డంతట భగవదాజ్ఞ నొనర్ప నిశ్చయించి లేచి కాలు కదిలింపగానే పాదబంధాలు ఊడిపడ్డాయి. వసుదేవుడు శిశువు నెత్తుకొని చెరసాల గుమ్మాల వద్దకు వచ్చాడు. సూర్యోదయాన చీకట్లు విడిపోయినట్లు తలుపులు తమంతతాముగా విచ్చుకొన్నాయి. ద్వారపాలకులు గాఢ నిద్రావశులై మైమరిచి ఉన్నారు. కారుమేఘాలు ముసిరి గర్జనలతో పెనువర్షాన్ని కురిపించాయి. వసుదేవుడు వానకు వెనుదీయక ముందుకు సాగాడు. శేషుడు పడగవిప్పి గొడుగుపట్టి అతని మీద చినుకు వాలనీయక వెంటనడిచాడు.

వసుదేవుడు చెరసాల నుంచి వెలువడి పురమార్గం పట్టి యమునానది వంకకు నడిచాడు. నగరమంతా మాటుమణిగినట్లు కనిపించింది. అతను యమునాతీరాన్ని చేరాడు. ఆ నదీమతల్లి ఉత్తుంగతరంగాభీలమై నురుగులు తేరి మహావేగాన ప్రవహిస్తూ అత్యంతాకులంతో ఉన్నది. వసుదేవుడు నదిని సమీపించి నీటిలోనికి అడుగుపెట్టాడు. తొలుత సీతాపతికి సముద్రం దారినిచ్చినట్లు ఆ నదీమతల్లి అతనికి మార్గం ఇచ్చింది. అతను నిరపాయంగా

ఏరుదాటి నందగోకులాన్ని చేరుకొన్నాడు. అక్కడ గోపగోపీజనం మైమరిచి నిద్రాగతులై ఉన్నారు. వసుదేవుడు మెల్లమెల్లగా నందుని గృహాన్ని చేరుకొన్నాడు. తలుపులు తెరుచుకొన్నాయి. నందాదులు గాఢనిద్రలో ఉన్నారు. అతను యశోద ఉన్న పురిటిగది లోనికి వెళ్ళి తనచేతి శిశువును ఆమె ప్రక్కన పడుకోబెట్టి ఆమె కన్న కూతురి నెత్తుకొని స్వస్థానం చేరి తన భార్య పడుకొన్న చోట ఉంచాడు. చెరసాల తలుపులు యథాప్రకారం మూసుకొన్నాయి. అతని కాళ్ళకు మునుపు విచ్చుకొన్న సంకెళ్ళు మళ్ళీ పడ్డాయి.

## కంసుని తడబాటు

ఆ విధంగా వసుదేవుడు పసిబిడ్డను మంచంమీద పడుకోబెట్టిన ఆ శిశువు పెద్దగా రోదింపసాగింది. ఆ ఏడ్పువిని చెరసాల కాపరులు మేలుకొని తత్తరపడుతూ లేచి హుటాహుటిని పోయి దేవకీదేవి ప్రసవించిన సంగతిని కంసునికి తెలిపారు. ఆ మాటతో కంసునికి ప్రాణాలెగిరి నట్లయింది. అతని యెదుట మృత్యువు కనబడి నట్లయింది. అతను పాన్పునుండి దిగనురికాడు. గుండెదడ వల్ల నడక తడబడసాగింది. అతను విహల్వుడై జారుతున్న శిఖాబంధాన్ని ముడివేయటానికి తడవు లేనట్లు వడివడిగా పురిటింటికి నడిచాడు.

## దేవకి ప్రార్థన

కంసుడు కంటబడినంతనే దేవకీదేవి దీనాతిదీనంగా బిడ్డను చేతగైకొని –

**ఉ. అన్న శమింపుమన్న తగ దల్లుఁడు గాఁ, డిది మేనగోడ లా**
**మన్ననసేయు మన్న విను మానిని జంపుట రాచపాడి గా**
**దన్న సుకీర్తివై మనఁగదన్న మహాత్ములు వోవు త్రోవ బో**
**వన్న భవత్సహోదరి గదన్న నినున్ శరణంబు వేడెదన్.**

అన్నా! ఆరుగురు కొడుకులను పుట్టినవారిని పుట్టినట్లు చేజేతులా చంపావు. అది దైవప్రేరణ మనుకొని గుండెరాయి చేసుకొన్నాను. మాకూ వయసు పైబడుతున్నది. ఇది కడపడి బిడ్డ కాబోలు. దీనిని వదిలిపెడితే నాకు శిశుదానం చేసినవాడి వవుతావు. నన్ను దయచూడు; నా మొరాలించు' అని బ్రతిమాలింది.

## యోగమాయ

రాజా! దేవకి ప్రార్థనలు కంసుని చెవికెక్కలేదు. అతను నిర్దయావశుడై ఆమె చేతిలోని శిశువును ఒడిసి లాగి కాళ్ళు పట్టుకొని గిరగిర త్రిప్పి అక్కడే ఉన్న పెనుబండ పయిని మోదాడు. ఆ నిసువు నింగికెగిరింది. ధను శ్శూల గదా బాణ చర్మ ఖడ్గ చక్రాంచితాలైన ఎనిమిది హస్తాలతో దివ్యాంబరభూషణ మాల్యాలంకృత దేహంతో మహాదేవీరూపాన వెలసింది. ఆమెను చుట్టి కిన్నర గంధర్వాదులు ప్రస్తుతులు కావించారు. ఆ మహాశక్తి అంతట కంసుని చూసి

ఉ. **తెంపరివై పొరిం బొరిని దేవకి బిడ్డలఁ జిన్నికుఱ్ఱలం**
**జంపితి వంతనైన నుపశాంతి వహింపక ఱాలమీద నొ**
**ప్పింపగ నిస్సిరో యిదియు బీరమె? నా సరసన్ జనించి నిన్**
**జంపెడి వీరుడొక్క దెస సత్కృతి నొందెడివాఁడు, దుర్మతీ!**

అని పలికి అంతర్ధానమయింది.

## కంసుని పశ్చాత్తాపం

రాజా! కంసు డా మాటలు విని 'అయ్యో! అశరీరవాణి మాట బోటయింది. ఆ మాటలు నమ్మి నిట్టనిలువున బిడ్డలను చంపి మహాపాతకానికి ఒడిగట్టాను' అని లోలోన పశ్చాత్తాపంతో కుమిలి దేవకీ వసుదేవుల వంకమరలి, ఈ విధంగా అన్నాడు. 'సోదరీ! బావా! ఈ పాపాత్ముని రాక్షసబుద్ధి ఆవహించింది. ఇతను నిర్దయాత్ముడై సొంత మేనబిడ్డల గొంతుకోశాడు. ఆ పాపానికి వీడికి అధోలోకపతనం తప్పదు. అయ్యయ్యో!

దైవం కూడా చివరికి నన్ను మోసగిస్తుందని అనుకోనైతిని. కల్లలను నమ్మినవారి గతి దుర్గతి కాకమానదు.

మహాభాగులారా! మీ బిడ్డలను నేను చంపానని భావింపవద్దు. వారు వారి కర్మానికి లోనై దుర్మరణం పాలయ్యారు. నేను నిమిత్తమాత్రుడిని. వారికోసం దుఃఖింపకండి. ప్రాణులకు స్వాతంత్ర్యమన్నది ఎన్నడూ లేదు; వారందరూ దైవతంత్రాధీనులు. దైవతంత్రం దురూహమైనది. దానికి నియమ నిలయాలు లేవు. ఆ దైవతంత్రాన్నే కర్మమంటారు. దేహాలు పంచభూతసమ్మేళన ఫలాలు. ఆ భూతాదులు కూడా కర్మాధీనములై వర్తిల్లుతాయి. మట్టితో కుండను చేసినప్పుడు దానికి ఒకరూపం ఏర్పడటమూ, కుండ పగిలినప్పుడు ఘటరూపం మాత్రమే మారి ఘటనిర్మాణానికి ఆధారమైన మన్ను మారకపోవడమూ చూస్తున్నదే. దీనివలన గ్రహించిన దేమిటి? ఘట నిర్మాణానికి పూర్వమందు, ఘటము నిర్మితమై ఉన్నప్పుడు, ఘటము ధ్వంసమైనప్పుడు – మూడవస్థలలోనూ మన్ను యథారూపాననే ఉన్నది. ఈ విధానాన్ని త్రికాలాబాధితమని అంటారు. మరి కుమ్మరి మన్నుతెచ్చి తన యిచ్ఛప్రకారం దానికి రూపాన్ని, నామాన్ని ఏర్పరిస్తున్నాడు. అలా ఏర్పరచటాన్ని సృష్టి అంటారు. ఆ రూపనామాలు నశించటాన్ని లయము అంటారు. అలాగే భగవంతుడు తన ఇచ్ఛానుసారం ఆత్మపదార్థానికి విశ్వరూపాన్ని కలిగిస్తున్నాడు. విశ్వమంటే చరాచరాత్మక వివిధ రూప నామ విస్తారమే తప్ప వేరొకటి కాదు. ఆ రూపనామాలు ఏర్పడక పూర్వమందు, అవి ఏర్పడినప్పుడు, మళ్ళీ అవి నశించినప్పుడు – ఈ మూడవస్థలలోనూ ఆత్మపదార్థం పరిణామ విరహితంగానే ఉంటుంది. ఆ పదార్థానికి ఉత్పత్తిస్థితిలయాలు కలుగవు. ఈ రహస్యాన్ని గ్రహింపలేనివారు దేహాత్మబుద్ధికి లోనై భేదదర్శన వశులై శరీరోత్పత్తి శరీరనాశనాదులకు గాను సుఖదుఃఖాల పాలవుతుంటారు. ఆ పరితాపాన్ని సంసృతిక్లేశమని అంటారు. మరొక విశేషం. ఘటాదిరూపాలు వాటి వాటి ఉపయోగాలను బట్టి వివిధనామాలను పొందుతున్నాయి. శరీరాల సంగతి కూడా అంతేనని తెలుసుకోవాలి.

సోదరీ! శరీరాలకు స్వాతంత్ర్యం లేదని చెప్పాను. అందుకు కారణమేమిటి? శరీరాలు కర్మఫలభోగార్థం కలుగుతున్నాయి. ఏ కర్మఫలాన్ని ఎప్పుడు అనుభవింపవలసి వస్తే అప్పుడు అనుభవింపక తీరదు. భోగ్యాన్ని తప్పింపరాదా? అని వాదిస్తారు. భోగ్యార్థం వచ్చిన శరీరాన్ని భోగింపక తప్పుతుందా? భోగ్యం లేనట్లయితే శరీరోత్పత్తి గాని భోగ్యవిధానం గాని ఉండవని ఒప్పుకోవచ్చు. భోగ్యము అసలే ఉండకూడదంటే భోగాపేక్ష లేకుండా ఉండాలి.

సోదరీ! దేహమందు ఆత్మాభిమానం ఎంతకాలం ఉంటే అంతకాలం బాధ్య బాధక భావాలు దేహికి తప్పవు. అందువల్ల దేహి పరదుఃఖ కారకుడుగా, ఆత్మ దుఃఖవంతుడుగా ఉండటం జరుగుతున్నది. మీరు సాధువులు. నాయెడ బంధుప్రీతిని సారించి నా తప్పును క్షమించండి.'

అని దుఃఖాశ్రువులు చిప్పిల్లగా వారి పాదాలకు మోకరిల్లి సంకెళ్ళను తొలగించాడు.

## దేవకీ వసుదేవుల క్షమాగుణం

రాజా! కంసుని పశ్చాత్తాపానికి దేవకి జాలిపడి అతనియందలి కోపాన్ని జారవిడిచింది. వసుదేవుడు చిరునవ్వు దాల్చి, 'రాజా! అజ్ఞానవశాన శరీరులకు అహంభావం ఉదయిస్తుందని, దేహాత్మభావ ఫలంగా స్వపరభేదాలు కలుగుతాయని, నీవన్న మాటలన్నీ పరమసత్యాలు. భేదభావం వలన భూతజాతం శోకహర్షాలకు, భయద్వేషాలకు, లోభమోహమదాలకు లోనై అన్యభూతాలను చంపటం జరుగుతున్నది. ఇది బాహ్యదృష్టికి కనిపించే విషయం. పరమార్థదృష్టితో విచారించితే వీటన్నింటికీ ప్రేరకుడు వేరే ఉన్నాడని స్పష్టమవుతుంది. భూతాలు నిమిత్తమాత్రాలు' అన్నాడు.

కంసుడు దేవకీవసుదేవుల ముఖరేఖలను బట్టి వారి మనస్సు నిర్మలమని, కోపభావం లేదని గ్రహించి, సమాధానపడి తన మందిరానికి వెళ్ళిపోయాడు.

## కంసుని మంత్రాంగం

రాజా! సజ్జనుల సందర్శనాదులు కలిగినప్పుడు దుష్టస్వభావం కూడా తాత్కాలిక కోపశాంతిని పొందుతుంది. పామైనా పడగ వాలుస్తుంది. మళ్ళీ వారికి కొంత దూరంకాగానే అది స్వస్వరూపానికి వస్తుంది. సహచరు లందుకు తోడ్పడతారు.

కంసుడు మనస్సు కుదుటపడ్డ తర్వాత మందిరానికి వెళ్ళి ఏదో ఒక తీరున రాత్రి గడిపి మర్నాడు నిజమంత్రులను రావించి వారితో సంగతిని కదిలించాడు. అతని మంత్రులు దైత్యాంశజులు కాబట్టి వారు ఆ మాటలు విని తమ స్వభావానుసారంగా సమాధానం చెప్పారు.

'కంసరాజేంద్రా! నిన్ను హరించేవాడు పుట్టి ఎక్కడో ఉన్నాడని యోగమాయ అన్నదన్నావు. ఇక వేరే మాటలెందుకు? బ్రతుకుపై ఆశ ఉన్నదో లేదో నిశ్చయించుకో. బ్రతకాలనుకొంటే నీ ప్రాణహరు డెక్కడున్నాడో వెతికి వాడిని మట్టుపెట్టడం నీవు చేయవలసిన మొదటిపని. అతనెవరో ఎక్కడున్నాడో ఎలా ఉంటాడో తెలియదు కదా? అనకు. మనదేశమంతా ఊరూరా వెతికించి పురుడు తీరినవాళ్ళను, తీరనివాళ్ళను మగపిల్ల లందరినీ చంపటం మంచిది. దేవతలు అడ్డుపడతారంటావా? వారింతకుముందు పెక్కుమార్లు నీ చేత పరాభవాన్ని పొంది చేతులు జోడించి కొందరు పారిపోయి కొందరు ప్రాణాలు దక్కించుకొన్నవాళ్ళు. దొంగతనంగా ఎక్కడో పొంచి ప్రగల్భాలాడినంత మాత్రాన వారికి మనం భయపడవచ్చునా? ఇక హరి మాటేమిటంటావా? అతను కూడా నీకు భయపడి ఎక్కడో దాక్కున్నవాడే. అతని పొలకువే లేకుండా మాయమయ్యాడు. దొంగయై దాగినవాడిని గురించి ఆలోచనెందుకు? హరుడంటావా? అతను వల్లకాటికి వలసపోయినవాడు. బ్రహ్మ సంగతో? అతను నిరంతర తపోనిష్ఠుడై కదలక మెదలక ఉండేవాడు. ఇంద్రుడంటావా, అతని శక్తి అత్యల్పమని మనకు తెలిసినదే. కాబట్టి వారిలో నిన్నెదిరింపగలవాడు లేదు.

రాజేంద్రా! ఋణశేషం శత్రుశేషం ఉండరాదన్నారు. దేవతలు నీకు సవతితల్లి బిడ్డలు. సవతికి మల్లేనే సవితిబిడ్డలకు కూడా నీవంటే ఈర్ష్య ఉండకమానదు. వారిని ఉపేక్షించడం మంచిది కాదు. ఆజ్ఞయిస్తే వారందరినీ ఇప్పుడే నరికి పోగులు పెడతాము. రోగాన్ని పుట్టుకనాడే నిర్మూలించాలి. మొదట ఉపేక్షించితే తర్వాత దానిని లొంగదీయటం కష్టం. ఇంద్రియాలకు మొదట ఆటవిడుపు నిస్తే ఆ తర్వాత వాటిని నిగ్రహించటం ఎంత కష్టమో శత్రువుల విషయమూ అంతే.

రాజేంద్రా! దేవతలందరికీ విష్ణువు మూలం. ఎక్కడ ధర్మం ఉంటే అతనక్కడుంటాడు. వేదాలను గోబ్రాహ్మణులను తపోయజ్ఞాలను ధర్మస్థానాలని అంటారు. ఆ స్థానాలను తొలగిస్తే విష్ణువు నిరవకాశుడై నశిస్తాడు' అని మంత్రులందరూ ఏకగ్రీవంగా అన్నారు.

పరీక్షిన్నరేంద్రా! కంసుడు కాలపాశబద్ధుడై వారి మతాన్ని అంగీకరించి యుద్ధోత్సుకులైన కామరూపధరులను పిలిపించి సాధుసంహారానికి ఆజ్ఞాపించి సభ చాలించాడు. కంసుని అనుచరులు లోకం మీదికి బయలుదేరారు.

రాజా! సజ్జనద్వేషులకు మేలెన్నడూ కలుగదు. వారికి ఆయుశ్శ్రీలు, యశోధర్మాలు, సర్వశుభాలు దూరమవుతాయి. కాలం మంచిది కానినాడు చెడుబుద్ధులు పుడుతుంటాయి.

## నందసుతునికి జాతకోత్సవం

రాజేంద్రా! అక్కడ నందుడు పుత్రోదయానికి మహానందాన్ని పొందాడు. నందునికి కొడుకు పుట్టాడని తెలియగానే వ్రేపల్లె సంతోష వార్నిధిలో ఓలలాడింది. వ్రేతలందరూ తమతమ గృహాలను అలికి ముగ్గులు పెట్టి లేత చిగుళ్ళ తోరణాలు కట్టి చిత్రధ్వజపతాక లెత్తారు. గోవులు, గోవత్సాలు హరిద్రారసాలతో విచిత్రధాతువులతో నెమలిపురులతో పుష్పమాలలతో బంగరు జరీదువ్వలువలతో అలంకృతాలై వెలుగొందాయి.

గోపకులు స్నానాలు చేసి దివ్య వస్త్రాలు ధరించి కంచుకాలు తొడిగి ఉష్ణీషాలు పెట్టుకొని రత్నభూషణ భూషితులై కానుకల నెత్తించుకొని నందుని ఇంటికి వెళ్ళారు. గోపికలు మేలిచీరలు కట్టి కొప్పులలో పూమాలలు ముడిచి కనుకొలకుల కాటుకలను, ముఖమండలాలలో కుంకుమ బొట్టులను తీర్చి రత్నకటక కుండల హార నూపురాది భూషణాలను దాల్చి గంధం అద్దుకొని కానుకల పళ్ళేరాలతో నందుని ఇంటికి దారితీశారు. ఆనందోత్సాహాలతో గోపికలు వ్రేపల్లె దారులలో నడయాడుతుంటే వారి శ్రోణీతలాలు, ఉత్తుంగ పయోధరాల కదలికల ఆటలు, నెన్నడుముల అసియాటలు చూచిన కొద్దీ చూడాలనిపింపసాగాయి. వారి ముంగురులు గాలికి అల్లలనాడి ముఖమండలాన్ని ఆవరించటమూ, సిగల నుంచి క్రొవ్విరులు రాలిపడటమూ చూస్తుంటే మేఘాలు చంద్రమండలాన్ని కప్పి వర్షాబిందువులను రాల్చినట్లు కానవచ్చింది.

నందుడు స్నానం చేసి శుచిగా అలంకరించుకొని వేదవేత్తలైన బ్రాహ్మణ వర్యుల చేత పుణ్యాహవాచక పూర్వకంగా కుమారునికి జాతకర్మాన్ని, పితృదేవతార్చనను చేయించి విప్రులకు సాలంకృతగోవులను రెండులక్షలు, రత్న కనక వస్త్రసమేత తిలరాసు లేడింటిని దానాలిచ్చాడు. రాజా! దానాదుల వలని ఫలమేమిటో తెలుసా? మనుష్యశరీరంలో మనస్సు, ఆత్మ అని రెండున్నాయి. ప్రారబ్ధపాపం మలరూపంలో ఆ రెండింటిని ఆవరించి ఉంటుంది. ఆ మలాలు తొలగినప్పుడుగాని సత్యస్ఫూర్తి జనింపదు. ఆ మలములు వివిధరూపాలు. వాటిలో కొన్ని కాలక్రమాన, కొన్ని స్నానం వలన, కొన్ని శౌచం వలన, కొన్ని సంస్కారం వలన, కొన్ని తపస్సు చేత, కొన్ని దానం మూలాన తొలగుతాయి. అవి తొలగినంతనే మనశ్శుద్ధి కలుగుతుంది. ఆత్మ విద్య వలన ఆత్మశుద్ధి జనిస్తుంది. మనశ్శుద్ధి వలన సంతోషం, ఆత్మశుద్ధి వలన జ్ఞానోదయం కలుగుతాయి. అందువలన దానాలు చేస్తారు.

గోపకులు నందుని సమీపించి కానుక లర్పించి సంతోషాతిశయాన్ని ప్రకటించారు. గోపికలు యశోద వద్దకేగి శిశువును కళ్ళారా చూసి

'నాయనా! బహుకాలం మమ్మల్ని కాపాడు' అని దీవించి పసుపునూనెలు పూసి స్వచ్ఛజలాలలో స్నానమాడించి పాటలు పాడారు. మంగళవాద్యాలు మ్రోగాయి. గోపబాలకులు సంతోషపరవశులై వెన్న పూసుకొని తలంట్లు పోసుకొని యథేచ్ఛావిహారాలు సలిపారు.

నందుడంతట గోపకులను వస్త్రాభరణ గోధనాలతో సత్కరించి సూత మాగధాది చతుష్షష్టి కళాప్రవీణులను యథోచిత బహుమానాలతో గౌరవించాడు. యశోద గోపికలను యథార్హరీతిని పూజించింది. రోహిణీదేవి ఇంటిపెత్తనం వహించి ఉత్సవార్థం వచ్చినవారందరికీ తగిన మర్యాదలు జరిపింది. రాజా! భగవానుడు వ్రేపల్లెను ప్రవేశించినది మొదలు నందవ్రజం లక్ష్మీవిహారమందిరం వలె సర్వసంపన్నిలయమై శోభిల్లసాగింది.

## నంద వసుదేవుల సమావేశం

రాజేంద్రా! కంసునికి అతని రాజ్యంలోని ప్రముఖులందరూ ఏటేటా కానుకలు తెచ్చి సమర్పిస్తుంటారు. ఆ యేడు అందుకు తరుణం సమీపించింది. నందుడు కూడా మర్యాదకు బద్ధుడై గోపాలకులను గోకులరక్షణానికి నియమించి కప్పం తీసుకొని మథురకు వెళ్ళి దానిని కంసునికి అందజేసి అతనికి వీడ్కొలిపి ఆ ఊరిలోనే ఒకింట విడిదిచేశాడు. నందుడు వచ్చిన వార్తతెలిసి వసుదేవుడు అతని విడిదికి వెళ్ళాడు. వసుదేవుని చూసీచూడగానే నందునికి కొత్తప్రాణాలు వచ్చినట్లయింది. అతను తటాలున లేచి వసుదేవుని నిండుకౌగిట గూర్చి ఆదరించి కూర్చుండబెట్టాడు.

నందుని చూడగానే వసుదేవుని మనస్సు తన పుత్రుల వంకకు ప్రసరించింది. అతను కొంతసేపటికి సమాహితచిత్తుడయ్యాడు. 'అన్నా! నీకు వయస్సు పైబడింది. సంతానం కలుగుతుందనే ఆశ సన్నగిలజొచ్చింది. అట్టి నీకిప్పుడు సంతానోదయభాగ్యం సిద్ధించింది. ఈ శుభవార్త విని నేనెంతో సంతోషించాను. నేటి మన సమాగమం నాకు నూత్నప్రాణాలను సమకూర్చింది. మిత్రుల సమాగమం ఎంత ప్రియంకరమైనా వియోగాంతం

కాకమానదు. ఏటిలో పడ్డ గడ్డిపరకల వలె సంసార ప్రవాహంలో పడి చిత్ర విచిత్ర కర్మవాసనా తరంగ పరంపరాగతులై పరిభ్రమించే వారికి ఎంత కావాలనుకొన్నా సంయోగాలు స్థిరమైనవి కావు కదా. కారణమేమంటావా? వారివారి కర్మగతులే కారణం. కర్మలు వివిధాలై పలుదారుల వెంట వారిని లాగుతుంటాయి.

అన్నా! బృందావనం తృణ సలిల లతాసమృద్ధమై రోగాలు లేకుండా సర్వపశుహితంగా తనరారుతున్నది గదా. నీ సుహృదు లందరూ సుఖమే కదా. రోహిణీ యశోదలు, వారితో ఉన్న నా పుత్రకులు క్షేమమే కదా. వారు మీ ఉపలాలనలకు మీతో చనవుగొని ఉంటారు కదా. అన్నా! శాస్త్రవాక్యం ధర్మార్థ కామాలను బోధిస్తున్నది. ఏవి బంధుమిత్రాదులకు మేలుకూర్పగలవో అవి మాత్రమే వాస్తవమైన ధర్మార్థకామాలు. ఆత్మార్థ మాత్ర మైనవన్నీ నింద్యాలు సుమా' అని చెప్పి ఊరుకొన్నాడు.

నందుడు వసుదేవుని మాట విని, 'మిత్రమా! నీకు దేవకి వలన పుట్టిన కొడుకు లందరినీ ఆ క్రూరాత్ముడు కంసుడు బలిగొన్నాడు. చివరికి కట్టకడపటి కూతురినైనా బ్రతకనివ్వలేదు. ఇదంతా చూస్తుంటే ప్రాణికోటి కేవలం అదృష్టవశమై ఉన్నదన్నమాట నిజమనిపిస్తున్నది. ఈ సంగతి గ్రహించినవారు సుఖదుఃఖాలను గురించి భ్రాంతిపడరు. రాజా! వసుదేవుని మాటలలోని అంతరార్థం నందునికి తెలియదు. రోహిణీ యశోదాపుత్రకులు తన పుత్రకులే అని అతడనుకొంటున్నాడు.

వసుదేవుడు నందుని మాట విని, 'అయ్యా! రాజుకు ఈ యేడాది పన్ను చెల్లిద్దామని వచ్చిన కారణాన మిమ్మల్ని చూసే అవకాశం కలిగింది. వ్రేపల్లెలో ఉత్పాతాలు కనబడుతున్నాయి. ఇక జాగుచేయక మీరక్కడికి పోవటం మేలు' అన్నాడు. నందుడు ఆ మాట వినగానే లేచి వసుదేవుని వీడ్కొని సహచరులైన గోపాలకులతో బండినెక్కి, 'వ్రేపల్లె ఉత్పాతాలని వసుదేవుడు శంకించాడు. అతని నోట వెలువడినది సత్యం కాకమానదు. ఏమి జరుగనున్నదో ఏమిటో?'

అని దారిపొడవున కలవరపడుతూ అన్నిటికీ భగవంతుడే ఉన్నాడని సమాధానపడుతూ హుటాహుటిని ప్రయాణం సాగించాడు.

## పూతనా సంహారం

రాజా! కంసుని అధీనంలో పూతన అనే రాక్షసస్త్రీ ఒకతె ఉండేది. ఒకనాడు కంసుడు దానిని రప్పించి, 'పూతనా! నీకు కామరూపగమనాదిశక్తులు ఉన్నాయని మునుపు చెప్పావు. వాటిని ప్రదర్శించే సమయం వచ్చింది. నీవు వెంటనే బయలుదేరి ఊళ్ళు పొలాలు మందలు ఎక్కడెక్కడ మనుషులున్నా వెతికి పసిపిల్లలందరినీ హతమార్చాలి' అని ఆజ్ఞాపించాడు. ఆ మాటతో పూతన బయలుదేరి ఒకచోటి రూపవేషాలు మరొకచోట ధరింపకుండా పసిబిడ్డలను వెతికి వెతికి చంపసాగింది. బాలఘాతిని బిడ్డలను మింగుతున్నదనే వార్త దేశమంతటా అలముకొన్నది. ఆ దుర్వార్తకు తల్లులు తండ్రులు గుండె చేతబట్టుకొని ఎప్పుడేమి కానున్నదో అని తల్లడిల్లసాగారు.

నందుడు మథురనుంచి బయలుదేరిననాడు ఒక సుందరాంగి వ్రేపల్లెకు వచ్చి కుచభారానికి అసియాడుతున్న నెన్నడుముపై క్రొమ్మెరుగు వంటి చీరె కట్టి, కేశపాశంలో మల్లికాకుసుమాలు తురిమి కరతలాన కమలాన్ని పట్టుకొని యెలనవ్వు క్రీగంటి చూపుల కాంతులు నల్దిక్కుల వెలయింపజేస్తూ లోకమోహిని యెవరో నేలకు దిగివచ్చినట్లు అలనల్లన పురవీథిలో నడయాడసాగింది. ఆ కాంతను గోపికలు చూసి పతికోసం వెతుకుతూ వచ్చిన శ్రీదేవి కాబోలునని నివ్వెరపోయారు. ఆ తలోదరి మెలమెల్లగా ముందుకు నడిచి నందుని ఇంటిలోకి ప్రవేశించి అక్కడున్న పసివాడిని ఒడిలోనికి తీసుకొని చున్నుగుడుప సాగింది. రోహిణీ యశోదలు దానిని చూస్తూ వివశలై నిలబడ్డారు.

యశోదాకుమారుడు దాని చన్నులను గట్టిగా పట్టి బిగ్గపీల్చాడు. ఆ పీల్పుతో దాని జీవస్థానాలన్నీ చలించాయి. అది ఆ బాధకు తట్టుకొనలేక

'చాలు చాలు; వదులు వదులు' అని బిగ్గరగా అరుస్తూ కన్నులు గిరగిర తిప్పుతూ కాలుచేతులు కొట్టుకొంటూ దిగ్గుమని నేలకూలింది.

**మ. అదరెం గొండలతోడ భూమి గ్రహతారానీకముల్ మింటిపై**
**బెదరెన్ దిక్కుల మాఱుమ్రోత లెగసెన్ భీతిల్లి లోకంబులున్**
**గదలం బాఱెను వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతో**
**ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడినఁ ద ద్దీర్ఘోరు ఘోషంబునన్.**

ఆ భీషణధ్వనులకు పురజనులు భయమొంది పిడుగు వచ్చి మీదపడినట్లు నేలబడ్డారు.

రాజా! ఆ యింతి క్రిందపడినదే తడవుగా ఒక ఘోరరాక్షసాకృతిని దాల్చి, భయంకరమైన కోరలతో, గిరిగుహల వంటి నాసికా రంధ్రాలతో పెనుగొండల వంటి చందోయితో పాడుపడ్డ బావుల వంటి కన్నులతో ఇసుకదిన్నెల వంటి పిరుదులతో సేతువు తీరున ఉన్న భుజోరుపాదాలతో ఎండిన మడుగువంటి ఉదరభాగంతో విరియబారిన రక్తకేశపాశాలతో మహాభయంకరురాలై కోష్ఠబహిర్భాగాన ఉన్న నేలమొత్తాన్ని ఆక్రమించింది. దాని పాటు వడికి ఆ ప్రాంతంలో ఉన్న చెట్లన్నీ కూలిపోసాగాయి.

ఆ రక్కసి ఊర్పులకు భయవివశలైన గోపికలు కొంతసేపటికి తేరుకొని నందుని ఇంటికి వెళ్ళి అక్కడ పడి ఉన్న ఘోరరాక్షసిని, దాని రొమ్ము పట్టుకొని ఉన్న యశోద బిడ్డడిని చూసి మ్రాన్పడి నిలిచారు. అంతలో రోహిణీ యశోదలు కూడా తెప్పరిల్లారు. గోపికలు తటాలున ముందుకురికి ఆ శిశువును లాగి చేతులలోనికి తీసుకొని గోమూత్రాల నీరార్చి గోపుచ్ఛాలతో దృష్టితీసి గోరజాన్ని పూసి గోమయపిండాలతో దిష్టితీసి కేశవాది ద్వాదశ నామాలతో శిశులలాటాద్యవయవరక్ష కావించారు. 'నాయనా! నీ పాదాలను బ్రహ్మదేవుడు, జానువులను అణిముడు, ఊరువులను యజ్ఞుడు, కటిస్థలాన్ని అచ్యుతుడు, జఠరాన్ని హయగ్రీవుడు, హృదయాన్ని కేశవుడు, ఉరస్సును ఈశుడు, కంఠాన్ని సూర్యుడు, భుజాలను విష్ణువు, ముఖాన్ని ఉరుక్రముడు,

శిరస్సును శంకరుడు, పురోభాగాన్ని చక్రపాణి, పుచ్ఛభాగాన్ని గదాధరుడు, ఇరువంకలను ధనుష్పాణి కృపాణపాణి, కోణాలను శంఖధరుడు, ఉపరిభాగాన్ని ఉపేంద్రుడు, అధోభాగాన్ని గరుడవాహనుడు, ఎల్లెడల హలాయుధుడు, ఇంద్రియాలను హృషీకేశుడు, ప్రాణాలను నారాయణుడు, చిత్తాన్ని శ్వేతద్వీపపతి, మనస్సును యోగేశ్వరుడు, బుద్ధిని పృశ్నిగర్భుడు, ఆత్మను భగవంతుడు రక్షించాలి గాక. క్రీడా కాలాన గోవిందుడు, శయనకాలాన మాధవుడు, నడిచేటప్పుడు వైకుంఠుడు, కూర్చుండినప్పుడు శ్రీపతి, భోజన కాలాన యజ్ఞభోజనుడు, నిన్ను కాపాడుతారు గాక. మరి ఢాకినీ యాతుధాన కూశ్మాండ బాలగ్రహాలు, భూత ప్రేత పిశాచ యక్ష రక్షో వినాయకులు, కోటరా రేవతీ జ్యేష్ఠా పూతనా మాతృకాదులు, ఉన్మాదాపస్మారులు, స్వప్నదృష్ట మహోత్పాతాలు, వృద్ధ బాలగ్రహాలు హరినామకీర్తన మాత్రాన నశిస్తాయి గాక!' అంటూ అంగన్యాస కరన్యాస పూర్వకంగా రక్షకట్టారు. అప్పుడు యశోద పసివాడిని అక్కున జేర్చుకొని చన్నుగుడిపి నిద్రపుచ్చింది.

అంతలో నందుడు ఇల్లు చేరి అక్కడ పడిఉన్న ఆ రాక్షసి శవాన్ని చూసి, 'ఓహో! వసుదేవుడు సూచించిన ఉత్పాతం ఇదే కాబోలు. ఆ మహాత్ముడు ఋషి లేదా యోగి లేదా జ్ఞాని కాకపోతే అన్నది అన్నట్లు జరుగుతుందా?' అంటూ ఆశ్చర్యపడి కొడుకు  నెత్తుకొని ముద్దాడి ఆనందవశు డయ్యాడు. పురగోపకులు గొడ్డళ్ళతో ఆ శవాన్ని ముక్కలు చేసి ఊరివెలుపల నిప్పంటించారు. దాని చితినుంచి అగరువాసనలతో పొగలేచి ఊరంతటా వ్యాపించింది. వ్రజవాసులు ఆ ధూమాన్ని పీల్చి ఆశ్చర్యపోయారు. దాని కథలతో వారికి రోజులు గడిచాయి.

## భగవత్స్పర్శాదుల ప్రభావం

పరీక్షిన్నరేంద్రా! పూతనాదేహాన్ని దహించినప్పుడు అందులో నుంచి అగరువాసనలు వెలువడిన కారణమేమిటో ఊహించావా? నందకుమారుడు

భగవదవతారమన్న విషయం చెప్పాను. భగవత్పాదస్పర్శ మాత్రాన ముల్లోకాలు పవిత్రీకరింప బడుతున్నాయి. అట్టి పరమపవిత్రము లైన పాదాలతో దేవదేవుడు ఆ రక్కసి మేను ద్రొక్కాడు. ఆ తాకిడికి దాని జన్మ ధన్యమయింది. ఆ పుణ్యమూలాన దాని శరీరం నుంచి వెలువడిన పొగలు సుగంధాలను విరజిమ్మాయి. భగవత్పాదస్పర్శ సంగతి అటుండనివ్వు. భగవన్నామాన్ని స్మరించితే సర్వమలినాలు తొలగి మహాపవిత్రు లవుతారు. పవిత్రుల శరీరస్వేదాలు కూడా సురభిళపరిమళోపేతాలు. మరొక విశేషం. భగవంతునికి దేనినయినా ఎటువంటి భావంతో నైనా సమర్పించినట్లయితే అది వెంటనే శుద్ధమవుతుంది. తుచ్ఛభావంతో సమర్పించినది శుద్ధమవుతుందా? అంటే, అందుకు పూతన చరిత్రే నిదర్శనం. ఆ రాక్షసి దాని స్తనాలకు విషంపూసి ఆ చన్నులను త్రావనిచ్చింది. ఆ శిశువును చంపాలనే భావంతో చన్నుగుడిపింది కాని శిశుపోషణార్థం కుడపలేదు కదా. దాని చంటికి పూసిన విషం అమృతమయింది. అది సద్గతిని పొందింది. ఇక శ్రద్ధాభక్తులతో ప్రేమభావంతో భగవంతునికి పాలిచ్చిన తల్లుల, గోపగోపీజనాల సంగతి వేరే చెప్పాలా?' అన్నాడు.

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు పూతన చరిత్రను ఆదరంతో విని యోగివర్యా! భగవల్లీలలు చిత్రమైనవే గాక శ్రవణమనోహరంగా ఉంటాయి. ఆ కథలను విన్నవారికి మనోగ్లాని తీరుతుంది; తృష్ణలన్నీ చల్లారుతాయి; చిత్తశుద్ధి, హరిభక్తి, భాగవతసాంగత్యం లభిస్తాయి. అందువల్ల భగవద్ద్వివిధావతార కార్యాలను మాటిమాటికి వినాలని మరింతగా కుతూహలం కలుగుతున్నది. నా ప్రణయాన్ని మనస్కరింప గోరుతున్నాను' అని ప్రార్థించాడు. శుకయోగి ఆ రాజేంద్రుని తలంపు విని, 'రాజా! భగవల్లీల లిట్టివని గాని ఇన్ని అని గాని చెప్పతరం కాదు. ఆ లీలలలో ప్రధానమైనవి మాత్రం చెబుతాను విను.

## శకట భంగం

రాజా! బిడ్డలకు పొర్లాడే వయసు వచ్చినప్పుడు వారి తలిదండ్రులు వేడుకలు చేయటం ఉన్నదే. నందకుమారుడు పొర్లాడటం మొదలుపెట్టిన దినం అతని జన్మనక్షత్రయుక్తంగా కూడా కలిసి వచ్చింది. యశోదాదేవి తన కుమారునికి వేడుకలు జరపదలచి తగిన ఏర్పాట్లు చేసింది. గోపకామినులు వచ్చారు; మంగళవాద్యాలు, సంగీతరవాలు చెలరేగాయి; విప్రులు స్వస్తివచనాలు పలికారు.

గోపికలంతట యశోద ముద్దుబిడ్డనికి సుగంధజలాల శోభనస్నానం చేయించారు. ఆ శిశువంతలో కనులు మూయసాగేసరికి అతనిని ఊయెలలో ఉంచి జోలపాడి నిదురపుచ్చారు. యశోద బ్రాహ్మణులను వస్త్రాన్నమాల్యగోదానాలతో పూజించి, వారు వెళ్ళిన తర్వాత చుట్టాలను పంపించే పనిలో ఉన్నది. అంతలో ఉయ్యాలలోని బాలుడు ఏడుపు లంకించుకొన్నాడు. ఆమెకు పని తొందరలో ఆ ఏడుపు వినుపింపలేదు. ఆ పిల్లడు కొంతసేపు ఏడ్చి ఏడ్చి తల్లి రానందుకు అలిగినవాని వలె కాళ్ళు విదిల్చాడు. ఆ తరిని అతని చేరువలోనే బండి ఒకటున్నది. అతని కాలితాకు వడికి ఉయ్యాల ఊగి బండిని తాకింది. ఆ వేగానికి శకటం తల్లక్రిందయి చక్రాలతో విరిగి నేలకూలింది. ఆ ధ్వని విని యశోద, చుట్టాలు, నందుడు వేవేగ పరిగెత్తుకొని వచ్చి బండిపాటును చూసి అక్కడెవరూ కనబడక ఎందుకిలా అయిందా? అని ఆశ్చర్యపడ్డారు. పసివాడికి గండం తప్పిందిగదా అని గోపికలు సంతసించారు.

అంతలో దరిదాపులనే ఆటలాడుకొంటుండిన పిల్లలు వచ్చి, 'ఈ తొట్టెలో ఉన్నవాడు ఏడుస్తూ కాళ్ళు విదిలించాడు. ఆ వడికి ఉయ్యేల ఉగ్రూతలూగి బండిని తాకింది. బండి నేలకూలింది' అని వచ్చీరాని మాటలతో జరిగిన సంగతి చెప్పారు. వారి మాటలు విని

**శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభోభాగంబుపైఁ జేద్పడం**
**గాలం దన్నుట యెక్క డేల పడుచుల్ గల్లాడి రీ జడ్డు బ**
**ల్కే లోకంబున నైనఁ జెప్పబడునే యే చందమో గాక యీ**
**యాలాపంబుల విశ్వసింపఁదగ దూహాతీతముల్ గావునన్.**

అని గోపికా గోపకు లన్నారు. యశోద కొడుకును చేతిలోనికి తీసుకొని గ్రహమేదైనా సోకిందేమోనని అతనికి విప్రుల వలన స్వస్తివచనాలు కావించి రక్షచేయించి పాలిచ్చి మళ్ళీ ఉయ్యాలలో పడుకోబెట్టింది.

నందునికి అంతటితో తృప్తి కలుగలేదు. సత్యమూర్తులు, అహింసావ్రతులు, ఈర్ష్యాదిరహితులు అయిన విప్రముఖ్యులను రప్పించి, 'ఆర్యులారా! మహాత్ముల దీవెనలు వృథపోవు' అని పలికి వారి వలన ఋగ్యజుస్సామమంత్రాలతో జలాలను పవిత్రీకరించి అందులో దివ్యౌషధులు కూర్చి ఆ నీటితో కొడుకుకు మంగళస్నానం చేయించి స్వస్తివాచకరక్ష కావించి కొడుకు అభ్యుదయార్థం శాంతిహోమాలు చేయమని ప్రార్థించి యథోచిత మర్యాదాపూజలతో వారిని సాగనంపాడు. విప్రులు సంతుష్టులై ఆ శిశువును దీవించి వెళ్ళారు. రాజా! మహాత్ములు నిష్కళంకులు; వారి హృదయాంతరం నుంచి వెలువడిన వాణి ఎన్నటికీ రిత్తపోదు సుమా' అన్నాడు.

## తృణావర్త సంహారం

'రాజేంద్రా! కంసుడు శిశుసంహారార్థం తన పరివారాన్ని దేశం మీదికి పంపాడని చెప్పాను. వారిలో తృణావర్తు డనేవాడు ఒకనాడు వ్రేపల్లెకు వచ్చాడు. ఆ సమయంలో యశోదాదేవి ఇంటిముంగిట కూర్చుండి ముద్దుపట్టిని తొడమీద కూర్చొనబెట్టుకొని ముద్దాడుతున్నది. ఆ శిశువు క్షణక్షణానికి మోయరానంత బరువు కాసాగాడు. ఆమె బిడ్డను నేలకు దించి ఏదో పనిమీద ఇంటిలోకి వెళ్ళింది.

తృణావర్తుడు కామరూపు డైనందున సుడిగాలిగా మారి వీచాడు. పెంధూళులు రేగి నింగిని కప్పివేశాయి; చీకట్లు నిండాయి; రాళ్ళవాన

కురిసింది; దుమ్ము కమ్ముకొని కనులు కనిపింపని దశ యేర్పడింది; శిలావృష్టికి తల చూపతరం కాకపోయింది. ఆ విధంగా ఒక ముహూర్తకాలం పాటు ధూళివృష్టి కురిసి ఆగింది. చీకట్లు విచ్చుకొన్నాయి.

యశోదాదేవి అంతలో పరుగు పరుగున బిడ్డను విడిచిన చోటికి వచ్చింది. అక్కడ పసివాడు కనబడడు; నలుప్రక్కల వెతికి చూసింది. ఎక్కడా లేడు. ఆమె గుండెలు మోదుకొంటూ నేలబడి పొర్లాడుతూ దూడ తప్పిన గోవులా గోడుగోడు మన్నది. ఆ ఏడ్పు విని గోపికలు తత్తరపడుతూ వడివడిగా వచ్చి సంగతి గ్రహించి బిగ్గరగా ఏడుస్తూ గుండెలు మోదుకొంటూ నలుదెసలు వెతికారు. అంతలో పురవాసులు గుమిగూడి తలకొక విధంగా మాట్లాడటం మొదలుపెట్టారు. నందుడు వచ్చి ప్రాణంలేని కట్టెలా నిలబడ్డాడు. పెనుగోల కాసాగింది.

రాజా! వా రా విధంగా గగ్గోలు పడుతుండగా నింగిలో పెనురోదన ధ్వని పుట్టింది. సంగతేమిటోనని కలవరపాటుతో అందరూ తలయెత్తి మిన్ను కేసి చూడసాగారు. అంతలో ఆకాశం నుంచి పెనుభూతమొకటి తటాలున వారి మధ్యకు వచ్చిపడింది. గోపికలు బమ్మెరపోయి కొంతవడికి కనులు తెరిచి చూశారు. వచ్చి పెద్ద బండమీద పడినందువలన ఆ భూతం నుగ్గునూచమై కనబడింది. దాని చేతిని గట్టిగా పట్టుకొని నందనందనుడు వ్రేలాడుతున్నాడు. అతనిని చూడగానే గోపగోపీజనానికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది. వారందరూ ఒకరినొకరు తోసుకుంటూ ముందుకురికి పసివాడిని అక్కడినుంచి తప్పించి తెచ్చి యశోద చేతికిచ్చారు. ఆమె సంతోషపరవశురాలై ఆనందబాష్పాలు చిప్పిల్లగా నోట మాటరాక నిలిచింది. గోపికలు ఆమెతో

**మ. గతజన్మంబుల నేమి నోచితిమొ యాగశ్రేణు లేమేమి సే**
**సితిమో యెవ్వరి కేమి పెట్టితిమొ యే చింతారతిం బ్రొద్దు పు**
**చ్చితిమో సత్యము లేమి పల్కితిమొ యే సిద్ధప్రదేశంబుఁ ద్రొ**
**క్కితిమో పోయిన బిడ్డ మాకు నిదె దక్కెం గాదె చిత్రంబుగాన్.**

అంటూ వివిధరీతుల తమ ఆనందాతిశయాన్ని వెల్లడించారు. నందు డంతలో ప్రజ్ఞనొంది సంగతి గ్రహించి వసుదేవుని హెచ్చరికను మెచ్చుకొంటూ మనసులో ఆయనను తరచు స్మరింపసాగాడు.

## నామకరణోత్సవం

రాజేంద్రా! యాదవులకు గర్గుడనే విప్రోత్తముడు పురోహితు డున్నాడు. ఆ భూసురవరు డొకనాడు నందవ్రజానికి వచ్చాడు. నందు డెదురేగి యథోచిత సత్కారపురస్సరంగా ఆయనను స్వాగతించి, అర్ఘ్యాసనం పైని కూర్చుండబెట్టి, పూజలు కావించి, చేతులు జోడించారు. 'విప్రవర్యా! నీవు సంపూర్ణుడవు కనుక నీకెట్టి కొరతలు లేవు. అందువలన ఒకరికి చేయిజాపవలసిన అవసరం నీకు లేదు. అట్టివాడవు మాబోంట్ల యింటికి రావటం గృహస్థుల మంగళార్థమే తప్ప ఆత్మలాభార్థం కాదు. గృహస్థులే మీ యింటికి రాకూడదా? అని శంకింపవచ్చును. గృహస్థులు దీనచిత్తులు. గృహాలు వారి ముందరి కాళ్ళ బంధాలు. ఆ కారణాన వారు ఇల్లు విడిచి బయటికి రాలేరు. మహాత్మా! ఏ శాస్త్రం అతీంద్రియము లైన పూర్వజన్మ కర్మఫలాలను నిరూపింపగలదో ఆ శాస్త్రసాకల్యాన్ని దర్శించావు. మరి బ్రహ్మవిదులలో గణ్యతను గడించావు.

**శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి**
**ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వా కర్ణింపు నా పల్కు, ని**
**ర్ణీతుం డైన గురుండు మానవులకున్ విప్రోత్తముం డంద్రు, నీ**
**చాతుర్యంబున ని క్కుమారులకు సంస్కారంబుఁ గావింపవే.**

అని ప్రార్థించాడు.

గర్గాచార్యుడు నందుని ప్రణయాన్ని విని 'అయ్యా! దేవకియొక్క ఎనిమిదవ గర్భం కంసునికి మృత్యువు కానున్నదని ఆనాడు గగనవాణి తెలిపింది. కంసు డా మాటనమ్మి తనచావు తప్పుతుందని చేయరాని ఘోరాలు

చేశాడు. దేవకి మళ్ళీ గర్భం ధరించింది; పుత్రిక జనించింది. ఆడదాని వలన ప్రాణభయం లేదని అతను కొంతకు కొంత నెమ్మది వహించినా కర్మవశుడై ఆ అమ్మాయిని కూడా చంపబోయాడు. ఆమె యోగమాయగా మారి, 'ఓరి కంసా! నిన్ను చంపగలవాడు అప్పుడే పుట్టాడు' అని చెప్పి మాయమయింది. ఆ నాటినుంచి అతను శిశువు లందరినీ వెతికి మరీ చంపించటం నీకు తెలిసినదే కదా!

వ్రజేశ్వరా! నీకు వసుదేవునితో గల మైత్రి ఎటువంటిదో కంసుడెరుగును. నేను యదుకులానికి ఆచార్యుడననే విషయం దాచినా దాగేది కాదు. అట్టి నేను నీ కుమారునికి నామకరణం చేసినట్లయితే జరుగగల విపరీతపరిణామ మేమిటో ఊహించావా? నీ కుమారుడు వాస్తవానికి వసుదేవ కుమారుడని, ఆ శిశువు నీవద్ద ప్రచ్ఛన్నంగా ఉన్నవాడని కంసుడు గ్రహింపకపోడు. అట్టిదానికి అవకాశం నీ మూలాన కలగటం అనర్థదాయకం కాదా?' అని ప్రశ్నించాడు.

నందు డా పలుకులను విని, 'మహాత్మా! మీరన్నది సత్యమే. అయితే నా బిడ్డకు మీ వలన స్వస్తివాచక పూర్వకమైన సంస్కారం చేయించాలని నాకెంతో కోరికగా ఉన్నది. కావాలంటే పండుగ సంబరాలు మానివేద్దాము. గోకులం వారికి కూడా తెలియనంత పరమగోప్యంగా జరిపించండి' అని మరీమరీ అడిగాడు. గర్గాచార్యుడు సమ్మతించి, రోహిణీ యశోదాతనయులకు అతిరహస్యంగా నామకరణ సంస్కారం జరిపాడు.

'గోపనాయకా! రోహిణీ సుతుడు తన గుణసంపదచేత సజ్జనులను రమింపజేస్తాడు. కాబట్టి అతనికి 'రాము' డనే పేరు బాగుంటుంది. బలాధికుడు కాబట్టి 'బలు' డని; యాదవులకు పరస్పర భేదభావాలు కలుగకుండా వారందరినీ ఐకమత్యంతో సంకర్షిస్తాడు కాబట్టి 'సంకర్షణు' డని ఇతనికి పేరెన్నిక కలుగుతుంది. యశోదాతనయు డంటావా, అతడు యుగభేదాలను బట్టి శుక్లాది వర్ణాలను ధరిస్తుంటాడు. ఈ యుగంలో కృష్ణవర్ణాన్ని ధరించిన కారణాన 'కృష్ణు' డని ఇతనికి పేరు. వసుదేవునికి

జన్మించిన వాడు కాబట్టి వాసుదేవుడని కూడా అంటారు. నీ పేరిట నందనందనుడు కాగలడు. ఇతనికి గుణకర్మలను బట్టి అనేక నామధేయాలు కలుగుతాయి. ఆ నామాలలో 'ఈశ్వరుడు, సర్వజ్ఞుడు' మొదలైనవి గుణాలను బట్టి, 'గోవిందుడు, గోవర్ధనోద్ధారకుడు' మొదలైనవి కర్మములను బట్టి కలుగుతాయి.

ఈ బిడ్డ సంగతి లోకానికి తెలియదు; జాతకఫలాన్ని బట్టి నేను గ్రహించాను. ఇతని వలన గోకులం, నీవు సకలకష్టాలు తొలగి మేలుపొందగలరు. దేశం ఒకప్పుడు అరాజక మైనప్పుడు చోరాది దుష్టజనబాధ సహింపరానిది కాగా సాధువు లెవని ప్రాపొంది ఆ దస్యులను తెగటార్చి సుఖమొందారో, ఆ మహానుభావునికి నీ సుతునికి ప్రీతిగూర్చినవారు భయాది చింతారహితులై శాంతిసుఖాలను అనుభవింపగలరు. ఇంతెందుకు? ఈ పాపడు శ్రీమన్నారాయణుడే అని గ్రహించి ఇతనిని సమాహితబుద్ధితో పెంచు' అని చెప్పి, అతనిని వీడ్కొని నిజవాసాని కేగాడు. నందుడు తన అభీష్టసిద్ధికి సంతుష్టి చెందాడు.

## శ్రీకృష్ణుని బాల్యక్రీడలు

### దోగాటలు

రాజేంద్రా! రామకృష్ణులకు దోగాడే ప్రాయం వచ్చింది. వారు మొలకు కట్టిన గజ్జెల మ్రోతతో దోగాడుతున్నప్పటి విలాసాలు చూపరులను ఇట్టే ఆకర్షిస్తుండేవి. నానాటికి వారు కొంతసేపు అటూ యిటూ దోగాడి మోహభయభ్రాంతుల వలె బిరబిర ప్రాకులాడుతూ తల్లుల వద్దకు వస్తుండటం, ఆ తల్లులు చేస్తున్న పని ప్రక్కనబెట్టి చేసాచి కొడుకులను కౌగిట గూర్చి ముద్దాడి ఒంటికంటుకొన్న దుమ్ము దులిపి పాలుపట్టి వారి చిన్నారి మోములపై మెరిసే చిరునవ్వులను చూసి ఆనందించటం – కన్నులారా చూడవలసినదే గాని చెప్పతరం కాదు.

## నడయాటలు

రామకృష్ణులకు మరికొంత ఈడు ముదిరింది. వారు తెల్లవారగానే లేచి చుట్టు ప్రక్కల ఇండ్లకు పోయి ఆవుదూడలను పట్టిలాగటం, వాటితో ఆటలాడటం మొదలుపెట్టారు. వారి ఆటలకు గోపికలు వంతపాడుతూ ఇంటి పనులను కట్టిపెట్టారు.

రామకృష్ణులకు మరింత ఈడు ముదిరింది. వారొకచోట నిలిచి ఉండలేక ఇచ్చవచ్చినట్లు పరిగెత్తటం మొదలుపెట్టారు. రోహిణీ యశోద లదిచూసి 'అయ్యో! ఆవుల కొమ్ములు తగులుతాయో? శునకాదులు తాకుతాయో? ముండ్లు గుచ్చుకొంటాయో? కుంపటి నిప్పులు తగులుతాయో?' అని వాళ్ళు అల్లరిచేయకుండా పొద్దస్తమానం కనిపెట్టుకొని ఉండవలసి వచ్చింది. గృహకృత్యాలు మాని పిల్లలను చూసుకోవటమే పెద్ద పనయింది.

## చిలిపి కయ్యాలు

మరికొంతకాలం గడిచింది. రామకృష్ణులు తమకు ఈడుజోడుగా ఉన్న గోపకుమారులను చేర్చుకొని ఆటలాడటం మొదలుపెట్టారు. వారి ఆటలు గోపికలకు ముచ్చట గొలుపసాగాయి.

బాలకృష్ణుని చిలిపిచేష్టలు మితిమీరాయి. వేకువనే లేచి అకాలమనక దూడలను కుడుపుకని విడిచిపెడతాడు. అది చూసి గోపాంగనలు అతనిని అదలిస్తుంటారు. కృష్ణుడు నవ్వుతూ పారిపోతుంటాడు. గోపాలకుల ఇళ్ళుదూరి పాలు పెరుగు వెన్న దొంగిలించి తీసికొనిపోయి తాను తిని కోతులకు పెడతాడు. గోపికలు మేల్కొన్న తర్వాత పాలబానలను చూసి తీసిన వెన్న మాయమయేసరికి కలవర పడుతుంటారు. ఒక్కొక్కసారి పాలబానలు పగలగొట్టి పారిపోతే ఎవరిననాలో తెలియక బాధపడతారు.

కృష్ణుని దుండగాలకు భయపడి గోపకులు పాలకుండలు, పెరుగుకుండలను దాచిపెట్టడం మొదలయింది. కృష్ణుడా సంగతి గ్రహించి

గోపబాలకులతో ఆటలాడే నెపాన వారి ఇండ్లకు పోయి పిల్లలతో ఆడుతూ పాడుతూ ఎప్పుడో అదనుచూసి మెల్లగా వారిని గిల్లి ఏడిపిస్తాడు. గోపికలు గృహకృత్యాలలో పడి ఏమరచి ఉన్న వేళలలో కృష్ణుడు లోపలికి వెళ్ళి ఉట్ల మీద ఉన్న పాలకుండలకు తూట్లుపొడిచి తనకు కావలసినంత తీసుకొనిపోతాడు. తక్కిన పాలు నేలపాలవుతాయి. ఇంటివారంతలో వచ్చి, 'ఓరి దొంగా!' అని కేకలు వేస్తారు. 'మీరే దొంగ' లంటూ మాట్లాడుతూ వారి ఇండ్లలో మూత్రాలు విడిచి పరుగులు తీస్తాడు.

గోపికలు అతని చిలిపిపనుల కోర్వలేక యశోద వద్దకుపోయి మొరపెట్టుకొంటారు. కృష్ణుడు తల్లిచాటున దాగి ఏమీ తెలియని వానివలె ఉంటాడు. ఆ నేరాలన్నీ విని యశోద కొడుకు మోముచూసి నవ్వుతుందే గాని పల్లెత్తుమాట అనదు. గోపికలు 'అయ్యో తల్లీ! నీకు మా మాటలు నచ్చవులే, ఈసారి దొంగను పట్టుకొని నీవద్దకు తెస్తాము చూడు' అంటూ వెళ్ళిపోతారు.

## మాయాకృష్ణులు

రాజా! గోపిక లా విధంగా గుంపులు కట్టి యశోద వద్దకు వచ్చి తనమీద నేరా లారోపిస్తుంటే కృష్ణుడు చూసి నవ్వుకొని, ఒకనాడు ఏకకాలంలో పెక్కు కృష్ణరూపాలు తాల్చి గోపగృహాల లోనికి దూరి దొంగిలింపసాగాడు. ఒక్కొక్క గోపిక తన ఇంటిలో పట్టుబడిన కృష్ణుని గట్టిగా పట్టుకొని యశోద వద్దకు తెచ్చింది. ఒకటీ కాదు రెండూ కాదు వందలకొద్దీ కృష్ణరూపాలు యశోద ఇంటిముందు ప్రత్యక్షమైనాయి. గోపికలు తమ తమ కృష్ణులతో త్వరత్వరగా వచ్చి 'ఇదిగో నీ కృష్ణుడు; దొంగ దొరికాడు' అంటూ కన్నెత్తి యశోద వంక చూసేసరికి, ఆమె ఒడిలో కృష్ణుడు కూర్చొని ఉన్నాడు. గోపికలు పట్టితెచ్చిన కృష్ణులు మాయమయ్యారు. ఆ వింతకు గోపికలు సిగ్గుపడి తలవాల్చి వచ్చినదారి పట్టారు.

## యశోదకు విశ్వరూపదర్శనం

ఒకనాడు రామకృష్ణులు, గోపబాలకులు అందరూ జతకూడి ఆడుకొంటున్నారు. ఆనాడు కృష్ణుడు పిడికెడు మన్ను చేతగొని తిన్నాడు. అది రాముడు, గోపబాలకులు చూసి యశోదకు చెప్పారు. ఆమె వారి మాటవిని 'అయ్యో! బిడ్డకేమవుతుందో' అని భయపడి, బిరబిర వచ్చి కృష్ణుని చేయిపట్టుకొని గ్రుడ్లురిమి 'ఓరి చపలాత్ముడా! మన్ను తినడ మేమిటి? ఇంటిలో భోజ్యపదార్థాలు లేకనా?' అని మందలించింది. కృష్ణుడు భయం నటిస్తూ,

**శా. అమ్మా! మన్నుఁ దినంగ నే శిశువనో యాఁ కొంటినో వెఱ్ఱినో**
**నమ్మంజూడకు వీరి మాటలు మదిన్ న న్నీవు గొట్టంగ వీ**
**రి మ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా దేనిన్ మదీయాస్య గం**
**ధ మ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే.**

అని నోరు తెరిచి చూపాడు.

రాజా! అప్పుడు ఏమి కనబడిందనుకొన్నావు? బాలకృష్ణుని వక్త్రాంతరంలో నిఖిల నదీనద సాగర పర్వత ద్వీపారణ్యాలతో భూతలం, వాయువహ్నీంద్ర రవిచంద్ర తారాగణసమేత నభోభాగం జ్యోతిశ్చక్రం, రసాతలం, చరాచర సమస్తభూతజాలం, దేవతలు ఇంద్రియాలు మనస్సు తన్మాత్రలు గుణాలు సర్వభేదజనకాలైన జీవుల కాలకర్మాశయాలు, యశోద, వ్రేపల్లె, ఒకటి కాదు, విశ్వమంతా కానవచ్చింది. ఆ విచిత్రాన్ని చూసి

**మ. కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్యమో**
**తలపన్ నేరక యున్నదాననొ, యశోదా దేవిఁ గానో, పర**
**స్థలమో, బాలకుఁ డేడ, యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర**
**జ్వలమైయుండుట కేమి హేతువొ, మహాశ్చర్యంబు చింతింపఁగన్.**

అంతా కన్నులారా చూస్తున్నాను. తెలివితేటలు తప్పలేదు. ఇది కల్లకాదు; మరేదీ కాదు. ఇదంతా ఇతని ఆత్మయోగవిశేషం. ఇతనికిది నైజం అని

నిశ్చయించుకొని, 'అధిష్ఠానమూ సాధనమూ రెండూ తానే అయిన ఎవని మూలాన జగత్తు కలుగుతున్నదో; ఎవ్వని మాయాయోగం వలన ప్రజపతిని నా పతినిగా, నేనతని పత్నినిగా ప్రజపురాధీశ్వరినిగా గోపికాగోపగోధనాలన్నీ నావిగా ఈ బాలకుని నా సుతునిగా భావిస్తున్నానో; ఆ పరమేశ్వరుని శరణిల్లుతాను' అని లోలోన తలంప సాగింది.

రాజా! అంతలో భగవన్మాయ ఆమెను ఆక్రమించింది. యశోదాదేవి తత్పూర్వభావాన్ని మరచి లౌకికబుద్ధికి లోనయి పుత్రుని ఒడిలోనికి చేర్చి ముద్దాడి అతనితోడిదే లోకంగా ఉన్నది.

## యశోదానందుల పూర్వజన్మవృత్తాంతం

మునులారా! పరీక్షిన్నరేంద్రు డా అద్భుతాన్ని విని మహాశ్చర్యమంది, 'మునీంద్రా! ఏ పూర్వసుకృతఫలంగా యశోదానందులు భగవంతునికి తల్లిదండ్రులు కాగలిగారో' అన్నాడు. శుకయోగి అతని తలంపు విని, 'రాజా! పూర్వం వసుముఖ్యుడు ద్రోణు డుండేవాడు. అతని భార్య ధర. ఆ యిరువురిని గోరక్షణాదులకు బ్రహ్మదేవుడు నియమించాడు. బ్రహ్మ వచనాన్ని వారు తలదాల్చి, 'దేవా! నీవు నిర్దేశించినట్లే మేము మానవజన్మ మెత్తి గోరక్షణాదికం నిర్వహిస్తాము. ఆ తరిని మాకు దుర్గతినిస్తారకమైన హరిభక్తి చెదరకుండునట్లు వరాన్ని ప్రసాదించు' అన్నారు. చతురాస్యుడు వారికి వరదానం చేశాడు. అంతట ద్రోణుడు నందుడు గాను, ధర యశోదగాను జనించారు. భగవానుడు కృష్ణునిగా జనించి రామునితో కూడి తన లీలలచేత వారి నాకర్షించి భక్తిని పెంపొందించుతూ వారికి ప్రీతిగూర్చాడు' అని చెప్పాడు.

## యశోద ఆగ్రహం

రాజేంద్రా! ఒకనాడు గృహపరిచారికలు వారివారి పనులలో ఉన్నప్పుడు యశోద స్వయంగా పాలు చిలకడం తటస్థించింది. ఆమె నితంబాభోగ దుకూలాన్ని ఒడ్డాణంతో బిగించి, కర్ణకుండల కాంతులు దీపించుతుండగా కరకంకణాలు ఘల్లుఘల్లు మంటుండగా మాలతీపుష్పాలు కురులముడి

నుంచి రాలుతుండగా పుత్రవాత్సల్యాన కుచయుగం పాలుగారుతూ చలిస్తుండగా మోము చెమర్పగా కవ్వపు త్రాడు పట్టి కృష్ణ బాల్యలీలలు పాడుతూ చిలకసాగింది.

ఆ సమయంలో కృష్ణు డక్కడికి వచ్చి 'అమ్మా! పాలు పా' లంటూ కవ్వాన్ని పట్టుకొని చిలకటం ఆపాడు. యశోద క్షీరమథనం చాలించి కొడుకును తొడపయిని చేర్చి చన్నొసగింది. కృష్ణు డా విధంగా స్తన్యాన్ని గ్రోలుతుండగా ప్రక్క గదిలోని పొయ్యిమీదనున్న గిన్నెలో పాలు బుసబుస పొంగాయి. ఆమె ఆ సవ్వడి విని తటాలున కొడుకును దింపి పొయ్యిదగ్గరికి వెళ్ళింది. కృష్ణుడందుకు మొగమెర్రజేసి పండ్లుగీటి యేడుస్తూ చెంతనున్న సన్నెకంటి గుండ్రాయినెత్తి పెరుగుబాన మీద వేసి ఆ బానలో అప్పుడప్పుడే ఏర్పడుతున్న వెన్నను చేతినిండా తీసుకొనిపోయి ఆ ప్రక్కనున్న రోలుమీద కూర్చుండి ఆ వెన్నను కొంచెం కొంచెం తింటూ లేనవ్వులు విరియిస్తూ ప్రక్కనున్న కోతికి కొంచెం పెడుతున్నాడు.

యశోద పొయ్యిమీది పాలబానను దింపి తిరిగివచ్చి తాను చిలుకుతున్న పాలకుండ పగిలి పాలన్నీ నేలపాలై ఉండటం చూసి సంగతి గ్రహించి వెంటనే బయటికి వెళ్ళి అక్కడ రోలు మీదనున్న కొడుకును చూసి కోల చేతిలోనికి తీసుకొని అతని వంకకు నడిచింది. కృష్ణుడది చూసి తన దొంగపనికి జడిసినట్లు బిత్తరి చూపులు చూస్తూ పరిగెత్తసాగాడు. యశోద అతని వెనుకనే పరిగెత్తినా శ్రోణీభరం వలన వడివడిగా కదలలేకపోయింది. ఎలాగైతే నేమి ముందుకు నడిచి కొడుకును గట్టిగా పట్టుకొన్నది. కృష్ణుడు తన కాటుక కన్నులు కరతలాలతో నులుముకొంటూ తప్పుచేసినందుకు విలపిస్తున్న వానివలె కనిపించాడు.

యశోద అతనిని పట్టితెచ్చి రోటగట్టడానికి తాడొకటి తెచ్చి అతని మొలకు చుట్టింది. తాటి పొడవు రెండంగుళాలు తక్కువయింది. అప్పుడామె వేరొక తాడు తెచ్చి రెండిటినీ ముడివేసి మళ్ళీ కృష్ణుడిని కట్టబోయింది. ఆ తాడు

కూడా రెండంగుళాలు తగ్గింది. అంతటితో ఆమె ఊరుకొనక మరొక తాడు తెచ్చి ముడివేసి కట్టాలని ప్రయత్నించింది. అదీ రెండంగుళాలు తక్కువయింది. ఆమె ఎన్ని తాళ్ళుతెచ్చినా రెండంగుళాలు తగ్గుతూనే ఉన్నాయి. ఇంటిలోని తాళ్ళన్నీ అయిపోయాయి. ఏమిచేయటానికీ తోచక రొప్పుతూ చెమటలు గక్కుతున్న ఆమె పాటు చూసి గోపికలు నవ్వసాగారు. యశోద నివ్వెరపోయి నవ్వుతూ శ్రీకృష్ణుని చూస్తూ నిలబడింది. కృష్ణుడు తల్లిపాటుచూసి పెరగటం ఆపాడు. యశోద అతనిని రోటికి కట్టివేసి ఇంటి పనులకు వెళ్ళింది.

నరేంద్రా! జగమంతా భగవంతుని వశమని, భగవంతుడు భక్తుల వశమని అంటారు. ఆ మాట సత్యమని తెలుపగోరి భగవంతుడా చర్యను ప్రదర్శించాడు. గోపకాంత అయిన యశోద ఆ విధంగా పొందిన భగవత్ప్రసాదానికి సాటివచ్చే ప్రసాదాన్ని బ్రహ్మ గాని మహేశ్వరుడు గాని తుదకు ఆయన వక్షోభాగనివాసిని అయిన లక్ష్మి గాని పొందలేరు. దేవదేవుడు తన భక్తులకు వలె పరమజ్ఞానులకు కూడా సుబోధుడు, సులభప్రాప్యుడు కాడు గదా.

## యమళార్జున భంజనం

రాజేంద్రా! యశోదాదేవి కొడుకును బంధించి గృహకృత్యపరురాలై వెళ్ళిన తర్వాత కృష్ణుడు ఆ రోటినీడ్చుకొని అక్కడికి సమీపంలో ఉన్న మద్ది మ్రాకుల జంట సందున ఆవలికి పోబోయాడు. ఆ చెట్లనడుమ రోలు చిక్కుకొని కదలలేదు. కృష్ణుడు కొంత పూనికతో రోలు ఈడ్చాడు. ఆ ఈడ్పు బలిమికి రెండు వృక్షాలు ఫెళఫెళ ధ్వనితో వ్రేళ్ళతోపాటు పెకలి నేలకు కూలాయి. శమీగర్భం నుంచి అగ్నిచందాన ఆ తరువుల నుంచి సిద్ధపురుషులిద్దరు వెలువడి తమ తేజంతో దిక్కులను వెలిగిస్తూ శ్రీకృష్ణునికి సాష్టాంగప్రణామం చేసి ఈ తీరున స్తుతించారు.

'దేవా! వ్యక్తావ్యక్తమైన ఈ విశ్వమంతా నీ రూపమే అని తత్త్వవేత్తలు గ్రహిస్తారు. నీవే సర్వభూతనియామకుడవు. నీకంటె అన్యమైనది వేరొకటి లేదు. కాలము నిమిత్తమని, ప్రకృతి ఉపాదానమని, విశ్వమంతా ప్రకృతివలన ఉదయిస్తున్నదని, పురుషుడు తత్కర్త, నియంత అని లోకం భావిస్తుండగా నీవే కర్తవు, నియంతవు అని మేమనటం తద్విపరీతం కాదు. కాలమన్నది నీ లీలా ప్రకృతి యొక్క శక్తివిలాసమే తప్ప అది స్వతంత్రపదార్థం కాదు. పురుషుడు కూడా నీ అంశమే గాని వేరు కాదు. మహత్తనునది నీ కార్యమై ఉన్నది. ఎటుచూసినా చివరికి సర్వం నీవే అని తేలుతుంది. సర్వము నీవే అయినప్పుడు అట్టి జ్ఞానం సర్వులకు కలగకపోవటానికి కారణమేమని ప్రశ్నిస్తారు. నీవు జగత్కారణుడవు; నీ వలన ప్రకృతి, సమస్త వికారాలు కలిగాయి. కార్యములు తమ కారణాలను గ్రహింపగలవా? అట్టి సకలమహిమాస్పదుడవై ఉండి జగద్రక్షణార్థం వసుదేవునికి పుట్టావు. నీవు సర్వద్రష్టవు; ఆత్మప్రకాశకుడవు; నీ మహిమను ఆత్మప్రకాశము లైన స్వగుణాల చేత కప్పి వర్తిల్లుతావు.

ఎవడు శరీరరహితుడైనా సర్వశరీరాలలో ఉండి ఆ శరీర గుణకర్మలకు తగులక అసదృశ శక్తిసంపన్నములైన స్వకీయ వీర్యాతిశయాల మూలకంగా తన అవతార రహస్యాలను ప్రకటిస్తుంటాడో, ఎవడు సర్వలోకమంగళార్థం ఇప్పుడు నిజాంశతో నేలకు దిగివచ్చాడో, ఆ పరమకళ్యాణమూర్తికి విశ్వమంగళునికి శాంతునికి యదుపతికి వాసుదేవునికి పునఃపున స్సాష్టాంగాలు. దేవా! నీ అనుచరుని కింకరులమైన మాకు నారదమహర్షి అనుగ్రహఫలంగా నీ దర్శనభాగ్యం కలిగింది. దేవా! భవద్గుణకీర్తన కాలంలో మా వాణి నిలకడ చెందుతుంది గాక; నీ కథాకర్ణనసమయాన మా చెవిదోయి చెదరకుండు గాక; భగవత్సేవావేళలలో మా కరాలు, నీ పాదనమస్కృతులందు మా మనస్సు, నీ ఆత్మలైన సాధువులను

చూచేటప్పుడు మా దృష్టి, నీ నివాసస్థానమైన విశ్వానికి మ్రొక్కేటప్పుడు మా శిరస్సులు నిర్వక్రగతి నుండునట్లుగా అనుగ్రహించు' అని సాగిలబడి మ్రొక్కారు.

శ్రీకృష్ణభగవానుడు వారి పలుకులను విని, 'ధనమదాంధత్వం ఒకప్పుడు మీకిటువంటి పాటు కలిగించింది. నారదమహర్షి మీకు మేలు కూర్పనెంచాడు. మేలు కలగాలంటే దానికి అడ్డునిలిచిన ధనమదం తొలగాలి. దానిని తొలగించాలనే ఆ మహర్షి మీకు శాపమిచ్చాడు. ఆ శపించినది మీ యందలి అనుగ్రహభావమే తప్ప ఆగ్రహం వలన కాదు. ఈ రహస్యం నేనెరుగుదును. సూర్యదర్శనానంతరం చీకటి ఉండనట్లు నా భక్తులైన సాధువుల సందర్శన భాగ్యానంతరం బంధం ఉండదు. కైవల్యప్రద భక్తిని మీరడిగారు. మీ కోరిక నెరవేరుతుంది గాక. ఇక మీరు మీ స్థానాలకు వెళ్ళవచ్చును' అని ఆనతిచ్చాడు. వారు మళ్ళీ శ్రీకృష్ణునికి ప్రదక్షిణప్రణామాలు ఆచరించి మాయమయ్యారు.

## మద్దిచెట్ల వృత్తాంతం

రాజేంద్రా! కుబేరుని పేరు విన్నావు కదా. అతనికి నలకూబరుడు, మణిగ్రీవుడు అని ఇద్దరు కొడుకులు. వారికి రుద్రానుచర సంపద కలిగింది. ఆ కలిమికి వారు గర్వించి ఒకనాడు మందాకినీ పరిసరమనోహర కైలాసగిరి వనవిహారోత్సుకులై పూబోండ్లను కూడిచని అక్కడ ఆటపాటలతో అలసి మధువులు గ్రోలి మైమరచి ఆ నదీనీరాలలో దిగి ఆడు ఏనుగులతో కలిసి తిరిగే మదకరుల వలె తమ కాంతామణులతో జలవిహారం కావిస్తున్నారు. ఆ వేళ నారదమహర్షి యాదృచ్ఛికంగా అక్కడికి వచ్చాడు. ఆ మహర్షిని చూసి జలకాలాడుతున్న యక్షాంగనలు సిగ్గుపడి చోటుతొలగి చీరలు కప్పుకొన్నారు. ధనపతి పుత్రులిద్దరూ మధుపానవివశులై ఉన్నందువలన ఒంటిమీద గుడ్డలు లేవన్న స్పృహ కూడా లేక మహర్షిని ఉపేక్షించారు.

## నారదమహర్షి శాపం

నారదుడు వారిని చూసి, 'ఓహో! ఏమి వింత! రజోగుణబలం ఇంతింతనరానిది. దానికి రెండు విధాల దోహదాలు కనిపిస్తాయి. విషయసేవ ఒకటి, సత్కులజనన విద్యాధనాదికం రెండవది. అవి రెండూ బుద్ధిని చెరపగలవే. అయితే వాటిలో విషయసేవ వలె ధనాదులు అంత బలవత్తరమైనవి కావు. వీరియందు అవి రెండూ జతగూడాయి. ధనం వలన మదము, దానితో గర్వాంధత్వం, దానివెంట జారత్వ ద్యూతత్వాదులు పైకొంటాయి. ధనమదాంధులకు దేహమే శాశ్వత మనిపిస్తుంది; దయ, ఇంద్రియనిగ్రహం దూరమవుతాయి. శరీరపోషణమే వారికి పరమార్థంగా ఉంటుంది. దానికోసం వారు జీవహింస చేస్తారు.

నరదేవు డనబడుతున్న రాజుయొక్క శరీరమూ భూదేవుడని కీర్తిగాంచిన బ్రాహ్మణుని శరీరమూ ఎప్పుడో ఒకనాడు శునకాదులకో క్రిమికులానికో అగ్నికో భక్ష్యంగాక మానవు. అట్టి నశ్వరానికై భూతాలకు ద్రోహం తలపెడుతున్నారు. దేహములన్నీ అవ్యక్తము నుంచి పుట్టి మళ్ళీ అవ్యక్తమందే చేరుకొంటున్నవి. అట్టి నశ్వరదేహాలు వినశ్వరమైన ఆత్మ పదార్థం అనుకొని తదర్థమై ఇతరుల ప్రాణాలను ఆహరింప జూచేవాడు ఎంత మూర్ఖుడో చెప్పనలవి కాదు.

దరిద్రుడి సంగతి వేరు. అతను తన సుఖదుఃఖాల వలెనే పరుల సుఖ దుఃఖాలను సయితం సానుభూతితో చూడగలడు. ముల్లుగుచ్చుకొన్నవాడికి దాని బాధ తెలుసును కాబట్టి పరులకు ముల్లు గుచ్చుకొన్నప్పుడు ఆ బాధను అర్థం చేసుకొంటాడు. అదే విధంగా దరిద్రుడు కూడా స్వపరవిషయాలలో వర్తిల్లుతాడు.

ధనమదాంధత్వానికి ఔషధం లేదా? అంటే, లేకేమి, ఉన్నది. దారిద్ర్యమే దానికి పరమాంజనం. ఎలాగంటారా? దారిద్ర్యం వలన సర్వకష్టాలు ఏకకాలంలో దాపురిస్తాయి. చివరికి పట్టెడన్నం చేతికి రాదు. కూడులేక

ఇంద్రియాల మదం అణిగి జీవచ్ఛవాల వలె బ్రతకవలసి వస్తుంది. దానితో మదవ్యవహారం సన్నగిల్లుతుంది. అప్పుడు గత్యంతరం కానక రక్షకుల కోసం ప్రాకులాడుతారు. తత్పూర్వం నిరస్తులైన సాధువు లప్పుడు పూజ్యు లవుతారు. తత్సాంగత్యఫలంగా తృష్ణలు ఉడుగుతాయి. తత్ఫలంగా తమస్సు తొలగుతుంది. దానితో యథార్థం స్ఫురిస్తుంది.

ఈ నలకూబర మణిగ్రీవులు కుబేరుని కుమారులు. ఐశ్వర్యమదాంధులు. ఐశ్వర్య కారణాన వీరిని తమస్సు పైకొన్నది. దృష్టి మందగించింది. మర్యాదలను కూడా మరిచారు. వీరు కృపణీయులే గాని ఆగ్రహపాత్రులు కారు' అని ఆలోచించి, నారదుడు నలకూబర మణిగ్రీవులను పిలిచి, 'మీరు లోకపాలకునికి కుమారులై మట్టుమర్యాదల నుల్లంఘించారు. ఇది తమోగుణ కార్యం. ఇది నశించితే గాని మీకు మేలు కలుగదు. దీనులను అనుగ్రహించటం మా బోంట్లకు విధి. మేలు కలగాలంటే తద్విరుద్ధమైన దోషం తొలగాలి. దోషమన్నది ప్రాయశ్చితం వలన పరిహృత మవుతుంది. మీ దోషానికి పరిహారయోగ్యమైన ప్రాయశ్చిత్తం ఏమిటో వినండి. మీ యందుగల దోషం కేవల తమోరూపమైనది. అది క్రమక్రమంగా నశించాలి. ఏ విధంగానూ దానికి వ్యవహారయోగ్యతను కలిగింపకూడదు. అందువలన మీరు జ్ఞానహీన మయిన స్థావరాలుగా వృక్షాలుగా జన్మించి నూరు దివ్యవర్షాలు గడుపుతారు గాక. అప్పుడు మీకు వాసుదేవ సాన్నిధ్యం కలుగుతుంది. తత్ఫలంగా స్మృతి, పూర్వరూపం కలిగి సాధువులై భగవత్ప్రీతికి మీరు నోచుకొంటారు గాక' అని పలికి, నారాయణాశ్రమానికి వెళ్ళాడు. నారదమహర్షి వచఃఫలంగా నలకూబర మణిగ్రీవులు నందుని దొడ్డిలో యమళార్జున వృక్షాలుగా పుట్టటం మొదలయినవి సంభవించాయి.

## నందుని అనురాగం

రాజా! యమళార్జున వృక్షాలు ఫెళఫెళమంటూ విరిగి కూలిపడిన ధ్వని విని పిడుగు పడ్డదేమోనని వ్రేపల్లె వ్రేపల్లె అంతా ఉడ్డుడికి సర్వజనులు నందుని

ఇంటికి పరిగెత్తివచ్చి అక్కడ విరిగిపడిన మహావృక్షాల నడుమ రోటికి కట్టబడిన కృష్ణుడు ఇరుకుకొని ఉండటం చూసి, 'ఏమిటిది? సంగతేమిటి? మ్రాకులను ఎవరు కూల్చారు? అయ్యయ్యో! కృష్ణుడికి దెబ్బతగిలిందో ఏమిటో' అని తలక్రిందు లయ్యారు. యశోదానందులు కూడా వచ్చిచూసి నోటమాటరాక అప్రతిభులై నిలబడ్డారు.

ఆ చేరువనే ఆటలాడుకొంటుండిన కొందరు బాలకులు, 'అయ్యో! ఈ కుర్రవాడు రోటినీడ్చుకొని ఆ చెట్లసందున దూరాడు. రోలు చెట్లమధ్య ఇరుకొన్నది. ఇతను రోటిని బలవంతంగా ఈడ్చాడు. ఆ లాగిన బలానికి అంత పెద్ద చెట్లు వ్రేళ్ళతో సహా పెళ్ళగిలి కూలిపడ్డాయి. వాటిలోనుంచి ఇద్దరు దివ్యపురుషులు బయటికి వచ్చి మాయమయ్యారు. ఇదంతా మేము కళ్ళారా చూశాము' అని చెప్పారు.

ఆ మాటలు నందాదులు విని, 'పిల్లవాడేమిటి? చెట్లను కూల్చడం ఏమిటి? ఎక్కడన్నా కన్నామా? విన్నామా? వీళ్ళమాటలు నమ్మటానికి వీలులేదు' అని ఒకవంక, 'వీళ్ళు మనకు బాగా తెలిసిన వాళ్ళు. అబద్ధం చెబుతున్నారని ఎందుకను కోవాలి?' అంటూ మరోవంక వితర్కింపసాగారు. రోట గట్టిన తన కొడుకును నందుడు చేరబోయి అతను సురక్షితంగా ఉన్నందుకు సంతోషించి, నడుముత్రాడును విప్పి కౌగలించుకొన్నాడు. కృష్ణుడు తండ్రికి ఆనందాన్ని కలిగించి ఆ పిమ్మట గోపికాప్రేరితుడై ఆడుతూ పాడుతూ గంతులు వేస్తూ బాలచేష్టలతో వారిని ఉత్సవింపజేశాడు. అందరూ సంతోషంగా ఉన్నారు.

## పండ్లు రత్నాలు

ఆ సమయంలో, ఒకతె పండ్లగంప నెత్తుకొని, 'పండ్లోయమ్మ పండ్లో' అని అరుస్తూ ఆ దారిని నడిచింది. గోపబాలకు లందరూ పండ్లగంప చుట్టూ మూగారు. కృష్ణుడు తటాలున ఇల్లుదూరి దోసెడు బియ్యంతెచ్చి, 'ఇదిగో ఈ గింజలకు పండ్లివ్వు' అన్నాడు. ఆ పండ్లమ్ముతున్నామె ధాన్యాన్ని తన బుట్టలో

వేసుకొని కృష్ణుని దోసిలి నిండుగా పండ్లు పోసి అక్కడినుంచి తరలిపోయింది. కొంతదూరం వెళ్ళినాక అక్కడ పండ్లడిగారు. వారికి పండ్లనిచ్చే నిమిత్తం ఆమె తలమీదనుంచి పుటికను దించి అడిగిన వారికి ఇవ్వబోతున్నది. గంపలో ఒక్క పండయినా లేదు. పండ్లకు మారుగా వెలలేని రత్నాలు ధగధగధగ మెరుస్తున్నాయి. బుట్టనిండా రత్నాలున్నాయి. ఆ సొగసులాడి అదిచూసి తన కన్నులను తానే నమ్మలేక కొంతసేపటికి సంగతి గ్రహించి పరమసంతోషంతో ఇంటికి వెళ్ళింది.

## మాతృవాత్సల్యం

ఒకనాడు రామకృష్ణులు గోపబాలకులతో యమునాతీరానికి వెళ్ళి ఆటలాడుతున్నారు. రోహిణి అంతలో ఇంటివాకిట నిల్చి 'రామా! కృష్ణా! రా రండి' అని పిలిచింది. వారు రాలేదు. అప్పుడు యశోద అక్కడికి వెళ్ళి 'నాయనా! కృష్ణా! రా, నాయనా; ఎప్పుడనగా తిన్నావు? ఆకలితో ఉన్నావా తండ్రీ? వచ్చి పాలుతాగి సేదదీరు. రామా! నీవు కూడా దప్పిగొన్నావు. ఎప్పుడో తెల్లవారుజామున పిడికెడు తిని బయటపడ్డారు. మీ తండ్రి భోజనానికి వచ్చి మీ కోసం ఎదురుచూస్తూంటే మీరు రాకపోవటం తగునా? ఓ గోపాలకులారా! ప్రొద్దు కావస్తున్నది. మీరూ ఇండ్లకు పోయి అన్నాలు తినండి.

'నాయనా! కృష్ణా! ఈనాడు నీ జన్మనక్షత్రదివసం. కలిపిన చింతపండు పులుపు నూనె సిద్ధంగా ఉన్నది. స్నానంచేసి విప్రులకు గోదానాల నివ్వు. నీ యీడు పిల్లలందర్నీ వాళ్ళ అమ్మలు తలంట్లుపోసి ఎలా అలంకరించారో చూడు' అని బుజ్జగిస్తూ రామకృష్ణులను వెంటబెట్టుకొని ఇంటిలోపలికి తెచ్చింది.

రాజా! మాతృవాత్సల్యం యశోదకు కన్నుగప్పింది. అందువల్ల ఆమెకు మోహం పైబడింది. ఆ కారణాన విశ్వరూప స్మృతిజ్ఞానం తప్పింది. యశోద

ఆ విధంగా రామకృష్ణులను తీసుకొనివచ్చి స్నానాలు చేయించి నందునితోపాటు కూర్చొనబెట్టి భోజనాలు వడ్డించింది.

## బృందావనం

రాజేంద్రా! వ్రేపల్లెలో నాటివరకు జరిగిన విశేషాలను తలచుకొని గోపకులు అవి మహోత్పాతసూచకాలుగా భావించి ఒకనాడు అందరూ కలిసి కూర్చొని ఆలోచించారు. నలుగురూ తలొక ఉపాయం ఊహించారు. తలకొక ఊహ వెలువడింది. వ్రజపురంలో నివసించటం తమకూ, గోకులానికీ దినదినగండంగా మారుతున్నదని, ఎక్కడికయినా వెళ్ళి తలదాచుకోవటం మంచిదని, అందరూ అంగీకరించారు.

ఆ గోపకులలో వయోజ్ఞానవృద్ధుడు, దేశకాలార్థతత్త్వజ్ఞుడు ఐన ఉపనందుడనే వాడున్నాడు. గోపకు లందరూ అతనినే కర్తవ్యం నిశ్చయింపమని అడిగాడు. అతను వారి భావాలను విని, 'గోకులానికి మేలుకోరినవారయితే వెంటనే ఇక్కడినుంచి వైదొలగటం మంచిది. జరుగుతున్న ఉత్పాతాలను కళ్ళారా చూస్తున్నాము. ఇవన్నీ రానున్న ముప్పును సూచిస్తున్నాయి. ముందు ముందు ఏమి కలుగనున్నదో తెలియదు. బాలఘాతిని వచ్చి కృష్ణుని పొట్టబెట్టుకోవాలని చూసింది. ఎవరి భాగ్యాననో బిడ్డకు ముప్పుదప్పి బయటపడ్డాడు. అంతలో పసివాడిమీద బండివిరిగి పడబోయింది. భగవదనుగ్రహాన అదీ తప్పింది. సుడిగాలి హఠాత్తుగా వీచి పాపడిని పండుటాకులా తీసుకుపోయి నింగినుంచి చట్రాయి మీదికి తోసింది. ఏ అదృష్టమో పసిగందు కసుగందకుండా బ్రతికాడు. ఇకనైనా మనము మేల్కొనక తప్పదు. ఎక్కడికి పోగలమంటారా? ఏ చోటు మనకూ గోగణాలకూ అనుకూలంగా ఉంటుందో చూసుకొని అక్కడికి పోవడం మేలు. మన గోవులకు ముఖ్యంగా లేతపచ్చిక బయళ్ళు, నీటివసతులు చక్కజూడాలి. ఆ రెండూ బృందావనంలో సమృద్ధిగా ఉన్నాయి. ఆ చోటు సమీపంలోనే ఉన్నది. జాగులేకుండా అక్కడికి ఈనాడే బయలుదేరితే సరి' అని చెప్పాడు.

అందరూ సరేనన్నారు. పురోహితులు ముందునడిచారు. గోపబాలకులు విల్లమ్ములు గొని కొమ్ములూదుతూ మందలను వెంబడించారు. గృహోపకరణసంభారాలతో నిండిన శకటాలు వెన్నంటాయి. గోపవృద్ధులను స్త్రీలను బిడ్డలను మోసికొని బండ్లు కదిలాయి. గోపకాంతలు సింగారించుకొని కుంకుమరేఖలు తీర్చి వారివారి బండ్ల నధిష్ఠించి కృష్ణలీలలు పాడుతూ ప్రయాణం సాగించారు. రోహిణీ యశోదలు రామకృష్ణులతో శకటాన్నెక్కి వారిని అనుసరించారు. గోపబృందమంతా ఆ విధంగా తరలి బృందావనం చేరుకొన్నది. అక్కడ శకటాలను చంద్రాకారంగా తీర్చి అన్ని వసతులూ అమర్చారు.

## గోపకుల విహారాలు

బృందావనం, గోవర్ధనగిరి, యమునా సైకతతలం గోపబాలకులకు అత్యంతానందాన్ని కలిగించాయి. వారు క్రేపులను మేతకు విడిచి ఆటపాటలూ వేణుగానాలతో కొంతకాలం గడిపి ఆ వనంలో ఏపుగా పెరిగిన మారేడు చెట్లెక్కి ఫలాలను కోసి ఒకరిపయి ఒకరు విసురుకొంటూ వృషభాల వలె రంకెలు వేస్తూ పోట్లాడుకుంటూ చకోర చక్రాంగ బర్హి భరద్వాజాది పక్షుల కూతలను అనుకరిస్తూ సింహశార్దూలాలకు భయపడినట్లు నటిస్తూ కేళీవిహారాలు సలుపసాగారు.

## వత్సాసుర వధ

రాజా! ఒకనాడు రామకృష్ణులు గోపబాలకులను కూడి యమునా తీరంలో దూడలను మేపుతున్నారు. ఆ సమయంలో దైత్యుడొకడు రామకృష్ణులను చంప నిశ్చయించి దూడరూపం దాల్చి దూడల గుంపులో చేరి అదనుకోసం కాచుకొని ఉన్నాడు. కృష్ణు డదిచూసి బలరాముని పిలిచి 'అన్నా! అదిగో ఆ దూడ కనిపిస్తున్నదా? రాక్షసు డా రూపంలో వచ్చి మనను చంపగోరుతున్నాడు' అని రహస్యంగా పలికి, ఏమీ ఎరుగనట్లుండి, ఆ దూడ దగ్గరకు రాగానే తటాలున దాని వెనుగాళ్ళను తోకతోపాటు పట్టి గిరగిరా

తిప్పి చెంగటనున్న వెలగచెట్టు క్రింద పడేటట్లు విసిరికొట్టాడు. వెలగపండు రాలి ప్రీలినట్లు ఆ దూడ మాయమై దాని స్థానంలో రాక్షసశవం ఏర్పడింది. మాయారూపాలు ప్రాణంతోటే మాయమవుతాయి. గోపబాలకు లందుకు జేజేలు పలికారు. అమరులు మింటజేరి 'వత్సాసురుడు చచ్చా' దని హర్షధ్వనులు కావిస్తూ పుష్పవృష్టి కురిపించారు.

## బకాసుర వధ

రాజా! ఒకనాడు రామకృష్ణులు తెల్లవారగానే లేచి తోడి బాలకులను జతగట్టుకొని గోవత్సాలను తోలుకొని పోయి కాళిందీ జలాలలో నీరు త్రాగించి చద్దన్నాలు తిని ఇటూ అటూ తిరుగుతున్నారు. అక్కడ ఒకచోట కొండంత కొంగ ఒకటి కనిపించింది. గోపబాలకులు దానిని చూసి భయభ్రాంతులయ్యారు. అంతలో ఆ కొంగ బిరబిర వచ్చి ముక్కు చాచి నోరుతెరిచి తటాలున కృష్ణుని మ్రింగివేసింది. గోపబాలకు లదిచూసి నిశ్చేష్టులయ్యారు.

ఆ కొంగ గొంతుమూలానికి కృష్ణుడు వెళ్ళేసరికి దాని దవడలు దావాగ్నికి మల్లే మండసాగాయి. ఆ బాధకు ఓర్వలేక అది నోరువిప్పి కృష్ణుణ్ణి వెలిగ్రక్కి ముక్కుతో పొడవబోయింది. కృష్ణుడు కరద్వయాన్ని చాచి దాని తాలువులను పట్టి పూరిపుల్లను చీల్చినట్లు చీల్చాడు. అందుకు గోపకులందరూ సంతసించి ఆ వనంలోని పుష్పాలను కోసితెచ్చి కృష్ణునిపయి వర్షించి అతనిని కౌగిలించుకొన్నారు.

కొంతసేపటికి గోవత్సాలు ఇంటికి మళ్ళాయి. గోపకులు అతనితో ఇండ్లకు తిరిగివచ్చి జరిగిన సంగతిని తమవారందరికీ తెలియజెప్పారు. ఆ మాట చెవిసోకగానే గోపగోపీజనం విషాదమోదభరితులై 'భగవంతుడా! ఈ చిన్నవాడికి చావుగండా లెన్నో వచ్చాయి. అయినా ముప్పు తప్పిపోతూనే వచ్చింది. ఇతనికి కీడు తలపెట్టినవారందరూ అగ్నిలో పడిన శలభాల గతిని పొందారు. ఈ బిడ్డను గురించి దైవజ్ఞు లన్నమాట తప్పుతుందా?' అంటూ

లోలోన గుసగుసలాడారు. నందుడు గర్గాచార్యుని వచనాలను స్మరించి నెమ్మదిగా ఉన్నాడు.

నరేంద్రా! కంసుడు పంపించిన అతని అనుచరులు రాక్షసులు కాబట్టి కామరూపులు. ఒకడు వత్సరూపాన, మరొకడు బకరూపాన కృష్ణుని చంపేందుకు వచ్చారు. మాయేశ్వరుని ముందు రాక్షసమాయలు సాగుతాయా?

## అఘాసుర వధ

ఒకనాడు కృష్ణుడు వనభోజనం సంకల్పించి ఉదయాననే తోడిబాలకులను మేల్కొలిపి బూర ఊదుతూ ఆవుల మందతో బయలుదేరాడు. గోపబాలకులు వారివారి చద్దిమూటలను భుజాల కెత్తుకొని వేత్రవేణుశృంగాలు ధరించి లేగదూడలతో వెంట నడిచారు.

ఆ విధంగా అందరూ వనస్థలాన్ని చేరుకొని దూడలను మేతకు వదిలి ఆటలు మొదలుపెట్టారు. కొందరు చిగురుజొంపాలు ధరించి, కొందరు పూలమాలలు చుట్టుకొని కొందరు నెమలిపురి దండలను వేసుకొని ఆడిపాడి కొంతసేపు గడిపారు. ఒకడు ప్రక్కనున్నవాడి చద్దిమూటను దొంగిలించాడు. అతనిని 'దొంగా' అంటూ ప్రక్కనున్నవాడు పట్టుకొనబోయాడు. ఇద్దరూ పరుగులు తీస్తూ ఒకరినొకరు గేలిచేసుకొంటూ అరవసాగారు. కొందరు దాగుడుమూతలు ప్రారంభించారు. కృష్ణుడు కనుమరుగయ్యాడు. అతనిని పట్టుకొనటానికి నేను ముందంటే నేను ముందని పరిగెత్తారు. చిట్టచివరికి అతికష్టం మీద కృష్ణుడు వారి కంటబడ్డాడు. వారతని మీదపడి నేను ముందు తాకానని గోలచేసారు. కొందరు వేణువులు తీసి స్వరాలు మ్రోగించారు. కొందరు తుమ్మెద ఝుంకారాలు చేశారు. కొందరు కోయిల స్వరాలు పాడారు. కొందరు ఆకసాన ఎగురుతున్న పక్షుల నీడలను వెంబడించారు. కొందరు రాయంచ నడకలు నడిచారు. కొందరు కొంగలలా కూర్చున్నారు. కొందరు నెమలి నృత్యాలను అనుకరించారు. కొందరు కోతిగంతులు వేశారు. కొందరు వారివారి నీడలను వెక్కిరిస్తూ ఆటలాడారు.

రాజేంద్రా! కంసుని బంటు అఘాసురు డనేవాడు తన అక్క పూతనకు, అన్న బకునికి కృష్ణుని వలన కలిగిన చేటును మనసులో ఉంచుకొని మారువేషంలో అక్కడికి వచ్చి కృష్ణుని చూసి 'ఔరౌరా! ఈ అర్భకు డేమిటి? నా సోదరీసోదరులను చంపడమేమిటి? ఇదంతా వింతగా ఉన్నది. ఇదిగో! క్షణంలో ఇతనిని, ఇతనితో వచ్చినవారిని అందర్నీ ఒక్కసారే పరలోకానికి పంపుతాను. ఇతను పోగానే ఇతని తోడిదే లోకంగా ఉన్న గోకులం వారందరూ నిట్టనిలువున ప్రాణాలు విడిచిపెడతారు. అంతటితో నా ప్రభువు తాపం చల్లారుతుంది' అని లోలోన నిశ్చయించుకొని యోజనం పొడవున, కొండంత లావున కొండచిలువ వేషం ధరించి కొండగుహలా నోటిని తెరిచిపెట్టి కూటికోసం కాచుకొని ఉన్నాడు.

గోపబాలకులు అటూ యిటూ తిరుగుతూ ఆ అజగరాన్ని చూసి, 'ఇది ఏమి జంతువు? అబ్బో! దీని నోరెంత పెద్దది? దీని పైపెదవి రవికిరణరక్తమైన మేఘాన్ని, క్రింది పెదవి తన్మేఘచ్ఛాయారుణిత భూభాగాన్ని మరపింపజేస్తున్నాయి. దీని నాలుక పెద్ద వీథంత ఉన్నది. దీని నిట్టూర్పులు దవాగ్నితోడి చండమారుతాల వలె వేడిమీరి దరిదాపులకు రానీయకున్నాయి. మనను మింగటానికి నోరుతెరుచుకొని ఉన్నదా?' అని ఒక్కొక్కరూ ఒక్కొక్క అవయవాన్ని వర్ణిస్తూ చప్పట్లు కొట్టసాగారు.

కృష్ణుడు వారి మాటలు విని, 'అయ్యో! ఎంత వెర్రివాళ్ళు వీళ్ళు? రాక్షసుడు ఈ రూపుదాల్చి వచ్చిన సంగతి తెలియక ప్రమాదానికి గురికాబోతున్నారు' అనుకొంటున్నాడు. అంతలోనే గోపబాలకులు దాని నోటిలోనికి జొరబడ్డారు. అది వారెవరినీ మింగక చచ్చినట్లు పడిఉన్నది. ఆ అజగరం తనను మింగటానికే వేచి ఉన్నదని కృష్ణుడు గ్రహించి దాని నోటిలోనికి దూకాడు. సురలు నింగినుంచి హాహాకారాలు కావించారు. కృష్ణుడు దాని ముఖంలోకి దూకినవాడు శరీరాన్ని పెంచాడు. ఊపిరాడక ఆ మహాసర్పం గిలగిల కొట్టుకొనసాగింది. మూర్ధాన్ని చీల్చుకొని దాని ప్రాణాలు బయటికి వచ్చాయి. అప్పుడు కృష్ణుడు కూడా బయటికి వచ్చాడు. అతనితోపాటు తత్పూర్వం దాని

నోటిలోనికి జొరబడిన గోపబాలకులు కూడా బయటికి వచ్చారు.

రాజేంద్రా! కృష్ణుడలా బయటికి రావటమే తడవుగా అతనిలోనికి ఆ అజగరతేజం ప్రవేశించింది. మింటనున్న దేవతలు ఆ వింతచూసి ఆశ్చర్యవివశులై పుష్పవృష్టి కురిపించారు. గంధర్వగానాలు మంగళవాద్యాలు వందిమాగధస్తుతులు విప్రజయజయధ్వానాలు మిన్నుముట్టాయి.

బ్రహ్మదేవు డా ధ్వనులు విని వచ్చి కృష్ణుని చూసి ఆశ్చర్యవశుడయ్యాడు. ఆ చిలువ బొందె ఎండి పెనుబిలంగా మారింది. బృందావనవాసులు చాలా కాలం ఆ బిలంలో ఆటలాడుకొనేవారు.

అప్పటికి కృష్ణుడికి అయిదేళ్ళప్రాయం. ఆనాడు జరిగిన అఘాసుర వధ వృత్తాంతం తర్వాత సంవత్సరానికి వ్రేపల్లెకు తెలిసింది.

నరేంద్రా! అసురుడంటే మహాపాతకుడని, భగవానుడు నిత్యశుద్ధమూర్తి అని, శుద్ధమూర్తులకు పాపాత్ముల స్పర్శకూడా తగదని లోకం అనుకోవడం నీకూ తెలియనిది కాదుగదా. అటువంటి పాపాత్ముని తేజం నిత్యశుద్ధమూర్తి యందు ఏ విధంగా ప్రవేశించినదని శంకింప నవసరం లేదు. అగ్నిస్పర్శ చేత వస్తువు దాని మలినాన్ని బాసి పరిశుద్ధమై గ్రాహ్యమయినట్లు భగవంతుని అంగసంస్పర్శ మాత్రాననే ఉపాధిగత సర్వపాపాలు భస్మీభూతమవుతాయి. పాపపరిహారం కాగానే ఆ ఉపాధి విశుద్ధమవుతుంది. శుద్ధపాత్ర మందలి నీటివలె శుద్ధోపాధిస్థమైన తేజస్సు కూడా స్వప్రకాశమానమై తేజరిల్లుతుంది. సర్వతేజాలు భగవత్తేజోవిశేషాలే కాబట్టి, తేజస్సు యొక్క అంశాలకు భేదం లేదు కాబట్టి, ఆ రాక్షసతేజం ఆ విధంగా విశుద్ధినొంది ఆవరణరహితమై భగవన్మహాతేజంలో కలియగలిగింది. ఆ కారణాన అఘాసురుడు పరమయోగులకు కూడా దుర్లభమైన ఆత్మసామ్యాన్ని పొందాడు. నిత్యానందాత్మకుడైన భగవానుడు ముఖాంతరం లోనికి చొరగా లేనిది ఆ అసురుడు పరమానందాత్మకమైన ముక్తిని పొందటంలో ఆశ్చర్యమేమున్నది?' అని చెప్పాడు.

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రుని పలుకులను విని, 'మహాత్మా! సర్వశక్తిమంతుడైన భగవంతునికి అసాధ్యమైనది లేదు. అతని స్పర్శమూలాన అఘాసురుడు పావనుడై ముక్తికి నోచుకొనటం వింతకాదు. అఘాసుర వృత్తాంతం సంవత్సరానికి తర్వాత వ్రేపల్లెలో తెలియటానికి కారణం ఏమిటి? అదికూడా శ్రీకృష్ణుని మాయా విశేషమేనా? హరికథ లెన్ని మార్లు విన్నా తనివి తీరదు' అన్నాడు.

మునులారా! శుకమహర్షి అఘాసుర వృత్తాంతాన్ని తెలిపి, బాహ్యాన్ని మరచి కృష్ణగతచిత్తుడైనవాడు అప్పుడప్పుడే బహిర్ముఖుతు డవుతున్నాడు. అట్టి స్థితిలో పరీక్షితుని ప్రశ్న ఆయన చెవిసోకింది. ఆ మహాత్ముడంతట బహిర్ముఖుడై 'భాగవతోత్తమా! చక్కగా అడిగావు. హరికథ లెన్నిసార్లు విన్నా సరిక్రొత్తగానే ఉండటం వింతకాదు. కామినీలంపటులైన విటులకు కామినీ వార్తలు మనోవాక్కర్ణాలకు మధురమధురా లయినట్లు సాధుజనులకు హరికథలు రుచిర రుచిరాలుగా ఉంటాయి. ఇది నైజం. రాజా! గురువులు పరమరహస్యాలను సయితం పాత్రులైన శిష్యులకు దాచిపెట్టరు. నీ వడిగిన విషయం చెబుతాను విను.

## గోపక్రీడలు

కృష్ణు డా విధంగా గోపబాలకులను అఘాసురుని బారినుంచి తప్పించి వారితో కొంతసేపు ఆటలాడి, 'మిత్రులారా! అదిగో ఆ సైకత ప్రదేశం కనబడుతున్నది కదా? ఆ చోటు తెల్లని మెత్తని ఇసుకతో చూడముచ్చటగా ఉంటుంది. అక్కడున్న నిర్మలజలపూర్ణసరోవరాలు ఫుల్లారవిందాలతో నిండి కన్నులవిందు గొలుపుతుంటాయి. ఆ అరవిందాల మధురమధుర మకరందాల కోసం భ్రమరికలు, నానావిహంగాలు మూగి చేస్తున్న ఝుంకారనాదాలు ఆ సలిలాలలోనికి ప్రవేశించి ప్రతిధ్వనుల రూపంలో వెలికివస్తుంటే తీరవృక్షాలు విని సమాకులితాలయినట్లు మెలమెల్లగా ఊగులాడుతున్నాయి. మిత్రులారా! ఆటలలో పడి అలిసి ఆకలిగొన్నాము.

భోజనాలకు వేళయింది. మందలకు నీరు త్రాగించి మేతకు వదలి అక్కడికి పోయి హాయిగా భోజనాలు చేద్దాము' అన్నాడు.

గోపబాలకు లంతట తమ గోవులను, గోవత్సాలను నీరుత్రాగించి పచ్చికపట్లకు తోలుకొని వచ్చారు. అందరూ ఆ కనిపించిన సైకత స్థలం చేరుకొన్నారు. కృష్ణుడు సుఖాసనంలో కూర్చున్నాడు. గోపబాలకులు అతని చుట్టూ బంతులు తీరి కూర్చున్నారు. తమ్మిరేకుల విస్తళ్ళు వేశారు. గోపబాలకులు తమ తమ చద్దిమూటలు విప్పి ఆకులలో వడ్డించుకొని వ్యంజనరుచులను గురించి ముచ్చటించుకొంటూ నవ్వుతూ నవ్విస్తూ రుచు లారగిస్తున్నారు. కృష్ణుడు వారి నడుమ నిలిచి చంకలో బెత్తాన్ని, కొమ్మును ఇరికించుకొని వేణువును బొజ్జకు చుట్టిన వస్త్రంలో తగిలించి కుడిచేతిలో పెరుగన్నపు ముద్దపట్టుకొని వ్రేళ్ళ నడుమ పండ్లను గ్రుచ్చి నర్మవచనాలతో నవ్విస్తూ భుజింపసాగాడు.

ఆ ప్రకారం భుజిస్తుండగా గోవులు, గోవత్సాలు పచ్చిక వెంబడి క్రమక్రమంగా దూరానికి వెళ్ళిపోయాయి. కొందరు గోపబాలకులు లేచిచూసి 'ఆవులు చూపుమేరలో కన్పింపవేమిటి?' అనుకొన్నారు. ఆ మాట వారు పైకి అనీ అనగానే తక్కినవారు తింటున్న అన్నాన్ని వదిలి లేచిపోబోతున్నారు. కృష్ణుడు వారందరినీ ఆపి, 'సఖులారా! భయపడకండి. మెల్లగా తినండి. నేను వెళ్ళి మన పశువులను మళ్ళించుకొని వస్తాను' అని చెప్పి పెరుగుచేతితోనే బయలుదేరాడు.

## పరీక్ష

రాజేంద్రా! కృష్ణుడు వెళ్ళిన తీరుచూసి, 'ఇతని మహిమ ఏ మాత్రమో చూద్దా' మని బ్రహ్మ సంకల్పించి, అక్కడున్న గోవులను, ఇక్కడున్న గోపబాలకులను ఒక రహస్యప్రదేశంలో దాచి అంతర్హితుడయ్యాడు. కృష్ణుడు ముందుకు సాగి వనమంతా వెతికి ఎక్కడా గోగణాలు కనిపించక తిరిగి తిరిగి గోపబాలకులున్న చోటికి వచ్చాడు. అక్కడ వారూ లేరైరి. కృష్ణుడంతట

సమాహితచిత్తుడై, 'సరి సరి; ఇది బ్రహ్మమాయే గాని సామాన్యఘటన కాదు. ఇంతమాత్రాననే మునిగిపోదు. ఇక నా మాయ ఏమిటో చూపిస్తాను' అని నిశ్చయించి గోపకుమారులు ఎందరు ఎటువంటి రూపాలలో ఉన్నారో గోగోవత్సాలు ఎన్ని ఎన్నెన్ని రూపాలలో ఉన్నవో అన్ని రూపాలను ధరించాడు.

రాజా! ఒక వంక ప్రయోజన కర్త కృష్ణుడు; మరొక వంక ప్రయోజ్యకర్తలయిన గోపబాలకులు సాక్షాత్కరించారు. కర్మ కారక రూపాలైన గోగణాలు ముందు నిలిచాయి. ఆ విధంగా కృష్ణుడు తనను తానే కార్యార్థం నియమించుకొంటూ తన రూపాలనే తోలుకొని సాయంకాలానికి పల్లెచేరి ఆయా గోవులను వాటివాటి గోష్ఠాలకు పంపి గోపకుమారులను వారివారి తల్లిదండ్రులకు అప్పగించి తానూ తన గృహానికి వెళ్ళాడు.

గోపకుమారకులు ఆ విధంగా గృహాలను చేరుకొనగానే వారిని తల్లిదండ్రులు లాలించి అక్కున జేర్చుకొన్నారు. గోవులు తమతమ వత్సాలను అదే తీరున మన్నించాయి. గోపభామలకు తమ పుత్రులయందు, గోవులకు వత్సాల పట్ల గోరంత అనుమానం కూడా కలుగలేదు. ఆ ప్రకారం అయిదారు దినాలు తక్కువగా ఒక్క సంవత్సరం గడిచింది.

ఒకనాడు రామకృష్ణులు యథాపూర్వంగా మందలను మేతకు వదిలారు. గోవులు క్రమక్రమంగా పోయి గోవర్ధన పర్వతం దగ్గర పచ్చిక మేస్తూ అక్కడికి సమీపంలో ఉన్న ఆలమందలను చూసి తోకలెత్తి పరిగెత్తసాగాయి. గోపకు లడ్డుపడి ఎంత అడ్డగించినా అవి ఆగలేదు. వారుకూడా వాటిని వదలకుండా వాటి వెంటబడి ముళ్ళూ రాళ్ళూ గుచ్చుకొంటున్నా పరిగెత్తి గోవులు భూమిని అంటీఅంటని అతివేగంతో గమించిన కారణాన నేల నాల్గు గిట్టలకు మారు ద్విపాదచిహ్నితమై ఉన్నందువలన జాడ తెలియక వెనుదిరిగారు. ఆవులు గాలివేగంతో వెళ్ళి మందలను చేరి చన్నులు చేపి కుడుపుతూ వాటి ఒళ్ళు నాకసాగాయి. గోపాలకులు పడుతూ లేస్తూ అటూ ఇటూ తిరిగి తడబాటు చెంది చిట్టచివరికి ఆ ఆవులున్న చోటికి వచ్చి అక్కడున్న బాలకులను చూసి

వారిని దగ్గరకు తీసుకొని శిరసు మూర్కొని అనురాగమహార్ణవంలో ఓలలాడించారు.

రాముడది చూసి 'ఏమిటి ఈ వింత! వ్రేపల్లెలోని ప్రాణుల ప్రేమ కృష్ణుని యందు మాత్రమే మూర్తీభవించినదని అనుకొన్నాను. ఆ ప్రేమ ఈనాడు ఈ గోపబాలకుల యందు గోవత్సాల యందు ఏకరీతిగా కనబడుతున్నది. అంతేకాదు. ఆ ప్రేమ నేడు అపూర్వస్థితిని గాంచింది. కారణమేమై ఉంటుంది? ఇదంతా దేవమాయ అనుకోవాలా? రాక్షసమాయ అనుకోవాలా? వారి మాయలిలా ఉండవు. అవి నా యెడ సాగేవి కావు. నేటి స్థితి నా వంటివానికే భ్రాంతిని కలిగిస్తున్నది' అని కొంతసేపు తలపోసి, సమాధానచిత్తుడై జ్ఞానదృష్టితో పరిశీలించి, సంగతి గ్రహించి, కృష్ణుని వంకచూసి, 'ఈ గోగణాలు ఋషుల అంశలని, ఈ బాలకులు దేవాంశజులని భావించాను. ఇవన్నీ నీవే అని స్పష్టపడింది. 'సర్వం విష్ణుమయం జగత్' అన్న మాటకు నీ యీ విలాసం నిదర్శనప్రాయం కాబోలు. ఇన్ని రూపాలను నీవు ధరించిన కారణమేమిటో చెప్పు' అన్నాడు. కృష్ణుడు అతని మాట విని, 'అన్నా! బ్రహ్మ తన శక్తిని చూపగోరి పెద్ద పన్నాగమే పన్నాడు. అతని జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి క్రియాశక్తు లెంతమాత్రమో అతనికి తెలియజెప్పాను' అన్నాడు. బలరాముడు ఆ రహస్యాన్ని విని సంతోషించాడు.

## బ్రహ్మ విమోహం

నరేంద్రా! గోపబాలకులను గోవత్సాలను బ్రహ్మ దాచిన నాటినుంచి ఆ నాటికి దేవమానం ప్రకారం ఒక్క త్రుటికాలం గడిచింది. సన్న సూదితో తామరాకులో తూటుపొడవటానికి పట్టే కాలాన్ని త్రుటి అంటారు. బ్రహ్మకు త్రుటికాలం మర్త్యులకు ఒక సంవత్సరమన్నమాట. బ్రహ్మ అంతట తనలోకం నుంచి వ్రజానికి వచ్చి అక్కడ కృష్ణుడు గోపబాలకులతో గోవత్సాలతో యథాప్రకారం ఆటలాడుతుండటం చూసి, 'ఏమిటీ వింత! గోపబాలకులను గోవత్సాలను గోలోకంలో దాచిపెట్టాను. అక్కడ వారందరూ నా

మాయావశులై నిద్రిస్తున్నారు. ఈ బాలకులెవరు? ఈ క్రేపులెక్కడివి? రూపవర్ణాదులలో నేను దాచినవారికీ ఇక్కడున్నవారికీ అణుమాత్రమూ భేదం లేదు. వారిక్కడికి వచ్చారా? అంటే, వారింకా నిద్రలోనే ఉన్నారు కదా. వీరు వేరొకరు కావచ్చునా? వీరిని పుట్టించిన వారెవరు? నేను పుట్టింపలేదు కదా. మరొకరెవరయినా పుట్టించి ఉంటే సర్వవిధాల నేను దాచినవారివలెనే పుట్టింపగలరా? అణుమాత్రభేదం ఉండదా? వారికీ వీరికీ పాత కొత్తలు గాని సత్యకల్పితాలు గాని ఉన్నట్లు లేవు. ఈ వింతను గురించి తలపోసిన కొద్దీ నాకు కూడా బుద్ధిజాడ్యం కలుగుతున్నది' అని చింతిస్తూ ఉండిపోయాడు.

రాజా! బ్రహ్మదేవుడు తన మాయాశక్తిని నమ్మి భగవానుని మోసగింపనెంచి తుదకు తానే మోసపోయాడు. మాయాధీశ్వరుని మ్రోల అతని మాయచే నిర్మింపబడిన కీలుబొమ్మల ఆటలు సాగుతాయా? రేచీకటిలో మంచుమబ్బు లడగినట్లు, పగటివెలుగులో మిణుగురు కాంతులు లీనమయినట్లు పరమశక్తితో అల్పశక్తులు స్వరూపాన్ని కూడా కోల్పోతాయి.

రాజా! బ్రహ్మ ఆ విధంగా కొంతకాలం భ్రాంతిలోకంలో ఉన్నవాడు భ్రాంతి నుంచి బయటపడి కన్నువిప్పి తాను దాచిన గోపబాలకులు గోవత్సాల సంఖ్యను గుర్తుకు తెచ్చుకొన్నాడు. అంతలో అతని కన్నుల యెదుట అందరు కృష్ణమూర్తులు ప్రత్యక్షమయ్యారు. నీలమేఘచ్ఛాయ గలిగి పీతాంబరాలు ధరించి శంఖచక్రగదాపద్మాంచిత చతుర్భుజాలతో కిరీట కుండల వనమాలికలతో కౌస్తుభాంచిత వక్షోభాగాలతో ఆపాదకంఠం వ్రేలాడుతున్న తులసీదామాలతో అలరారుతూ లేనవ్వు వెన్నెలలు ప్రసరింపజేస్తూ అతనియెదుట ఆ దివ్యమూర్తులు వెలిశారు. వారిలో ఒక్కొక్క మూర్తిని చుట్టి వేనవేల బ్రహ్మలు, చరాచర లోకాలు పూజలు చేస్తుండటం కనిపించింది. ఆ మూర్తులలో ఒక్కొక్క మూర్తిని పరివేష్టించి దైవశక్తులు, చతుర్వింశతి తత్త్వాలు, దేశకాలస్వభావ గుణకామక్రియాఫలశక్తులు చేతులు కట్టుకొని వేచి ఉన్నాయి. కాలత్రయాతీతాలు సర్వజ్ఞానానందాత్మకాలు అయిన ఆ మూర్తులన్నీ ప్రకృతి పురుష భేదం లేక అద్వితీయపరతత్త్వాన్ని

స్ఫురింపజేస్తున్నాయి. ఆ తేజస్సు ముక్తులకు సయితం దురాసద మనగా అన్యుల సంగతి చెప్పేదేమున్నది?

ఆ అద్భుతాన్ని చూడగానే బ్రహ్మదేవుని ఏకాదశేంద్రియాలు తమ వ్యవహృతిని కట్టిపెట్టాయి. అతను నిశ్చేష్టుడై ఆ వ్రజేశ్వరుని సన్నిధిని నాల్గు మోముల కీల్బొమ్మ వలె నిలిచి తత్పరతత్త్వం వైపు దృష్టినికూడా సారింపలేకపోయాడు. శ్రీకృష్ణభగవాను డది గ్రహించి తన మాయను ఉపసంహరించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు పునర్జీవితుని వలె తెలివిలోకి వచ్చాడు. అతని ఇంద్రియాలు వ్యాపారింపసాగాయి. అతనికి బాహ్యార్థాలు గోచరించాయి. బృందావనం నానావృక్షశోభితమై ఉండటమూ ఆ వనాంతరంలో నైజవైరులైన గోవ్యాఘ్రాదులు పరస్పర మైత్రితో చరించటమూ గోపాలకులు వారి అరచేతులలో పెరుగన్నపు ముద్దలుంచి క్రేపులను వెతుకుతుండటం, తాను తనయెదుట పరమాత్ముడు ఉండటమూ గ్రహించి తన హంసవాహనం నుంచి తటాలున దిగి ఆ దేవేశ్వరుని చరణాంబుజాల మ్రోల సాగిలబడి ఆ మహనీయ పాదపద్మాలను ఆనందాశ్రువులతో అభిషేకించి లేచి కొంతసేపటికి స్వస్థచిత్తుడై డగ్గుత్తికతో ఇలా అన్నాడు.

## శ్రీకృష్ణ స్తోత్రం

'దేవా! ఇంద్రియాలకు అపూర్వమూ అపారమూ అయిన ఆనందం కలిగినప్పుడు అవి ఆ అనుభవాన్ని గురించి వాగ్రూపంలో వెల్లడించటం జరుగుతున్నది. ఆ వాక్సముదాయం తదానంద సంధాయి యొక్క గుణముల, కార్యముల కీర్తన మవుతుంది. దానిని స్తుతి అంటారు. ఆ స్తుతించటానికి స్తోతవ్యమైన వస్తు వొకటుండాలి. అది గుణ కార్యవంతమై ఉండాలి. దేవా! నీవు నిరాకారుడవు నిష్క్రియుడవు అయినట్టివాడవు. అట్టి నిన్ను స్తుతించటం ఎలాగు? స్తుతింపకుంటే ఆనందం తీరేదెలాగు?

దేవా! దీనిని బట్టి చూడగా నీ పరతత్త్వవిషయమై మనోవాక్కులు మౌనం వహిస్తున్నాయి. భక్తులకు చిత్తప్రీతిని కూర్పగోరి నీవు సాకారగుణమూర్తులను

ధరిస్తావు. నీలనీరదశ్యామశరీరం పైని క్రొక్కారు మెరుగువంటి వస్త్రాన్ని ధరించి, గురిజపూసలను కర్ణభూషణాలుగా అమర్చి, నుదుటిపయి నెమలిపురిని విభూషించి, కంఠహారాలుగా వన్యపుష్పాలను కూర్చి, ఒకకేల పెరుగన్నపు ముద్దను ఒకహస్తాన వేణుదండాన్ని పట్టి కక్షభాగాన వేణువిషాణాలను చేర్చి మృదుచరణాలను మెల్లమెల్లగా కదిలిస్తూ స్వేచ్ఛాయోగాన న న్ననుగ్రహింపగోరి ఇప్పుడీరూపం ధరించావు. ఈ దృశ్యరూపం కూడా నన్ను ఆనందసాగరంలో ముంచెత్తింది. నా ఆనందం కేవలానుభవాత్మక మవుతున్నదే గాని తననుతాను వాగ్రూపంలో వెల్లడింప లేకపోతున్నది. యోగుల భాషలో నిన్ను వర్ణించే ప్రయత్నం చేస్తాను.

దేవా! జననమరణరూపసంసారాన్ని తరించాలంటే నిన్ను పొందాలని అంటారు. నీవు జ్ఞానులకు మాత్రం సులభసాధ్యుడవా? లోకమా, అజ్ఞానులతో నిండి ఉన్నది. వారి గతేమిటనే శంక ఒకనాటికి తీరేదికాదు. నీవు దుర్లభుడవయినా సాధుజనులకు వశ్యుడవై వర్తిల్లుతావని, వారు తమ మనోవాక్కాయాలను నీకు వశం చేసి, నీ దివ్యచరిత్రలను పాడుతూ తద్రూపాన నిన్ను పూజిస్తారని, వారి మార్గాన్ని నిండారిన భక్తివిశ్వాసాలతో అనుసరించే వారు ఎంత మూఢులైనా నిన్ను పొందగలరని, భక్తిలేని జ్ఞానం ఎన్నటికీ నిన్ను సంపాదింపజాలదని, వడ్లు దంచినప్పుడు బియ్యం వస్తుందిగాని పొట్టును తెచ్చి ఎంత దంచినా బియ్యపు గింజయినా దొరకదని పెద్దలన్నారు. అనగా జ్ఞానులన్నప్పుడు శుష్కజ్ఞానం కలవారని భావింపకూడదని, భక్తితోడి జ్ఞానం కలిగినవారని ఏర్పడుతున్నది.

భక్తి అంటే ఏమిటి? నీయందు పరమప్రేమ కలిగి ఉండటమే భక్తి అన్నారు. అది ఎలా కలుగుతుంది? నీ కథలు వినటం వలన కలుగుతుందని అన్నారు. నీ కథ లెటువంటివి? నీ లీలలే నీ కథలన్నారు. కథాకర్ణన ఫలమేమిటి? పూర్వం ఉపేక్షాభావంతోనో వైముఖ్యభావంతోనో ఉన్న మనస్సు నీ కథలను విన్నదానికి ఫలంగా నీ వంకకు మళ్ళుతుందని, ఎప్పుడలా మనస్సు నీ వంకకు మళ్ళినదో అప్పుడే నీవు దానిని ఆకర్షిస్తావని,

సూదంటురాయి ఇనుపముక్కను ఆకర్షించటమే ఇందుకు నిదర్శనమని, మనస్సును నీవు ఆకర్షించటం ఎప్పుడు జరిగిందో అప్పటికప్పుడే తత్కృతకర్మలన్నీ నీకు సమర్పింపబడుతాయని, తత్ఫలంగా స్వార్థఫలకాంక్షలు నశింపగలవని, దానితో ఆత్మజ్ఞానం, పరమగతి సిద్ధిస్తాయని మహాయోగులు స్వానుభవాలను తెలిపారు. వారి అడుగుజాడలను అనుసరిస్తాను.

దేవా! నీ గుణాలను నీ కార్యాలను కీర్తించటమే నీ స్తోత్రమని అన్నాను. నీ గుణకార్యాలన్నవో? లెక్కకు మీరినవి. సైకతరేణువులనో నక్షత్రాలనో నీహారబిందువులనో ఏండ్లు పూండ్లు శ్రమించి లెక్కించినా లెక్కింపవచ్చును గాని నీ గుణకార్యాలు ఇట్టివని గాని ఇన్ని అని గాని చెప్పటం ఎంతవారికయినా అసాధ్యం. నీ అవతారాలు, నీ సకల లీలాకృత్యాలు జగద్రక్షణార్థం దేశకాలాలను బట్టి కలుగుతుంటాయి. అటువంటి అవసరాలు ఒక్క రూపంలో ఉండవు కాబట్టి నీ రూపాలు, నీ కార్యాలు కూడా ఒక్క రూపున ఉండవు. పైగా నీ సృష్టి ఎప్పుడు ప్రారంభమైనదో తెలియదు. నీ సృష్టి ఉన్నంతకాలం నీవు తప్ప వేరొకరుండరు. నీతో ఉండి నీ మహిమలను చూచినవాడు ఉన్నట్లయితే అతను కొంతకు కొంత ఆ విభవాలను గురించి పలుకగలడేమో. ఇన్ని కారణాలను బట్టి నీ చిత్రాలు సమగ్రబోధకాలు కావు. ఇక నిన్ను స్తుతించటమెలాగు? ఆయా జీవు లప్పుడప్పుడు తెలిపినవాటిని క్రోడీకరించి ఆ వచనాలనే స్తోత్రాలుగా గ్రహించి లోకం నడుచుకొంటున్నది. స్తోత్రాదు లెంతటివయినా సంపూర్ణఫలాన్ని ఇవ్వలేవు. గత్యంతరం ఏమిటి? అంటే, చాతకపక్షి వర్షబిందువు కోసం ఎదురుచూసినట్లు నీ దయకోసం ప్రతీక్షించటం ఒక్కటే అందుకు మార్గం; వేరొక మార్గం లేదు. అందుకు మనోవాక్కాయకర్మ లన్నింటినీ నీ పూజార్థమే వినియోగించాలి.

ఇక ప్రారబ్ధకర్మఫలభోగాల సమస్య ఒకటున్నది. అవి తమగతి ప్రకారం జరుగుతుంటాయి. వాటి వంకకు మనస్సును పోనివ్వకూడదు. కాదని వాటిని గురించి ఎంత చింతించినా ఫలం ఉండదు. అది వృథాయాసమే గాక జీవితకాలాన్ని రిత్త పుచ్చినట్లవుతుంది. ప్రారబ్ధకర్మఫలభోగావసరాల వేళలలో

కూడా మనస్సును నీయందు నిలిపితే అవి అవిదితంగానే సాగిపోతాయి; జీవుడు ప్రశాంతచిత్తు డవుతాడు.

ఇకపోతే జీవనం సంగతి ఉన్నది. స్వధర్మానుష్ఠానమే యుక్తజీవికను కలిగిస్తుంది. ప్రాప్తమెంతో దానితో తృప్తిపొందాలి. ఇట్లా చేయటం వలన అహంకారాన్ని ధిక్కరించినట్లవుతుంది. జితాహంకారులకు నీవు తోడునీడవై కాపాడుతుంటావు. వారికి ముక్తి స్వతస్సిద్ధము. నీ అనుగ్రహాన్ని చూరగొనటానికి ఇదే మార్గం.

దేవా! నీవు త్రివిధపరిచ్ఛేద రహితుడవు సర్వప్రపంచానికి ఉపాదానభూతుడవు మాయామోహకుడవు అయిన పరమాత్ముడవు. అట్టి నీ మ్రోల ఈ మూఢుడు తన శక్తి ప్రభావాన్ని చూపగోరాడు. ఇంతకంటె నేరమేమున్నది? స్వామీ! అగ్నినుంచి మంటవలె నీనుండి నేను వెలువడ్డాను. మంట దానికి మూలమైన అగ్నితో చెర్లాట లాడినట్లు నేను నీ శక్తిని పరీక్షించే సాహసం చేశాను. ఇదంతా నా యందలి రజోగుణ విజృంభణ వల్ల జరిగింది. పట్టపగటిపూటనే కనుచూపు గప్పింది; వివేకం సన్నగిల్లింది. నేనే జగత్కర్తనని, నాకంటే మిన్నలేదని గర్వించాను. నాయీ దురభిమానాన్ని మన్నించు. దాసోహమన్నాను. దాసునిపయి కరుణార్ద్రదృష్టి నెరపి దయతో కాపాడు.

**శా. ఏలా బ్రహ్మపదంబు వేదములకే నీక్షింపఁగా రాని ని**
**న్నీ లోకంబున ని వ్వనాంతరమునం దీ మందలో గృష్ణ! యం**
**చాలాపాది సమస్తభావములు నీ యందే సమర్పించు నీ**
**వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే.**

దేవా! నేను బ్రహ్మాండాకారుడనని, ఆ కారణాన నిన్ను సమగ్రంగా ఎరుగుదునని అనుకొనేవారున్నారు. బ్రహ్మాండమంటే ప్రకృతి మహదహంకార పంచభూతాత్మకం. అట్టి బ్రహ్మాండభాండాలు నీయందు లెక్కలేనన్ని ఉన్నాయి. అవన్నీ నీ రోమకూపాలలో తిరుగాడుతూ పరమాణువులు గవాక్షరంధ్రాలలో

సంచరించినట్లుగా ఉంటాయి. అంత అపరిమేయస్వరూపుని నిన్ను పరమాణు మాత్రుడనైన నేను గ్రహింప నోచినవాడను కాను. చలిచీమ శీతగిరిని మోయటం ఎటువంటిదో నాబోంట్లు నిన్ను గ్రహించటం అటువంటిది.

దేవా! వస్తుజాతమంతా స్థూల సూక్ష్మ కార్య కారణాది వివిధవ్యపదేశాలకు మూలమై అస్తినాస్తివ్యవహారగోచరం అవుతున్నది. ఆ వస్తువులన్నీ నీ కుక్షిలో ఒకమూల తల్లికడుపున నున్న శిశువువలె అణిగి ఉంటాయి. గర్భంలోని శిశువు కాలదన్నినా తల్లి కొంచెంకూడా కలతచెందనట్లు నీలో ఉన్న నేను నీయెడ కావించిన అవినయాన్ని మన్నించు.

దేవా! నేను నీకు పుత్రునిగా ప్రసిద్ధుడను. ప్రళయకాలంలో సర్వం జలరూపాన్ని ధరిస్తుందని, ఆ జలాలలో నీవు శయనించి ఉంటావని, 'జల' శబ్దానికి 'నార' శబ్దం, 'శయన' శబ్దానికి 'అయన' శబ్దం పర్యాయపదాలు కాబట్టి 'జలశాయి' పదానికి 'నారాయణ' పదం పర్యాయపదమని, ఆ కారణాన నీకు 'నారాయణుడు' అని పేరువచ్చిందని, అట్టి నారాయణుని నాభికమలం నుంచి బ్రహ్మనైన నేను పుట్టానని వేదాలు సముద్ఘోషిస్తున్నాయి. నేను నీ పుత్రుడ ననటానికి వేరే ప్రమాణాలెందుకు?

## నారాయణ శబ్దార్థం

దేవా! నారాయణ నామం నీకు కలిగినందుకు అనేక కారణాలను చెబుతుంటారు.

నార శబ్దానికి జీవమని కూడా అర్థం ఉన్నది. అలాగే అయన శబ్దానికి ఆధారమని అర్థం ఉన్నది. అందువల్ల నారాయణ శబ్దం జీవాధారత్వాన్ని బోధిస్తుంది. అనగా సర్వజీవములకు ఆధారభూతుడ వైనందువల్ల నీకు నారాయణుడనే పేరు కలిగిందని కొందరంటారు.

నారములంటే జీవములని, అయనమంటే ప్రవర్తకమని, సర్వజీవులను ప్రవర్తింపజేసేవాడవు నీవు కాబట్టి నీకు నారాయణ నామం వచ్చిందని మరికొంద రంటారు.

నారములంటే జీవములని, అయనమంటే చూడటమని, ఆ విధంగా నీవు సర్వజీవరాశికి సాక్షిభూతుడ వయినందున నీకు నారాయణుడనే వ్యవహారం ఏర్పడినదని కొందరంటారు.

దేవా! ఈ మతాలన్నింటిలోనూ ఏదో ఒకదోషం ఉన్నది. జలరాశియందు నీవు శయనిస్తావని అన్నప్పుడు నీకు పరిచ్ఛేదత్వం, పరిచ్ఛిన్నత్వం కలుగుతున్నాయి. సర్వమూ నీవే అని అన్న నోటితోనే నీకు మళ్ళీ హద్దులను కల్పించటం పొసగుతుందా? కాబట్టి మొదటి మతం నిరస్తమయింది. జలములు నీ అంశమాత్రములైనవి. నీవు నీ ఇచ్ఛామాత్రాన నారాయణావతారం ధరించావు. కనుక నారాయణమూర్తి కూడా నీ అపరిచ్ఛిన్న పరిపూర్ణతత్త్వం కానేరదు. నిత్యపూర్ణునికి, సర్వవ్యాపికి నీకు పరిచ్ఛిన్నత్వాదులు ఎన్నటికీ కలుగనేరవు. నీ మూర్తులన్నీ పరిచ్ఛిన్నమాత్రాలే. అవన్నీ నీ మాయాకల్పనలే.

దేవా! నీవు జలశాయి వన్నమాట సత్యమయితే నాడు నేను నీ నాభికమలనాళమార్గాన లోనికి జొచ్చి నిన్ను నూరేండ్లు వెతికి వేసారాను. నీవు జలములలో ఉన్నవాడవయితే నాకు కానరాకుంటావా? ఆనాడు నేను నీకోసం వెతికి వేసారి యథాస్థానం చేరి నీ దర్శనార్థినై తపస్సు చేశాను. అప్పుడు నీ పరిపూర్ణస్వరూపం నాకు మనోమాత్రగోచరమై అంతలో మాయమయింది. దీనినిబట్టి నీకు దేశవిశేషపరిచ్ఛేదత్వం కలుగనేరదని నిర్వివాదంగా వెల్లడయింది.

దేవా! నీ శరీరం సన్మాత్రస్వరూపం కాబట్టి అది బాహ్యదృష్టికి గోచరింపదని, అంతఃకరణ దృశ్యమాత్రమని, ఆ అంతఃకరణం తపః పూతమైనప్పుడే దానికి నీ స్వరూపం గోచరిస్తుందని స్వానుభవంతో గ్రహించాను.

## ప్రపంచ సత్యత్వ విచారం

దేవా! ప్రపంచం సత్యమని కొందరంటారు. ఏది త్రికాలాబాధ్యమో అది సత్యం. ప్రపంచమో? క్షణక్షణమూ మార్పుచెందుతున్నది. మార్పంటే ఏమిటి?

ఒకవస్తువు దాని రూపనామాలను కోల్పోయి పూర్వరూపాన కాన్పింపకపోవటాన్ని మార్పు అంటారు. ఆ ప్రకారం రూపనామాలను కోల్పోవటం వినాశ మవుతుంది. అట్టి వినాశాన్ని పొందుతుండే ప్రపంచం సత్యమెలా అవుతుంది? పైగా సత్యపదార్థాలు రెండు ఉన్నప్పుడు ఒకదానివలన మరొకదానికి పరిచ్ఛిన్నత్వం తప్పదు. అంతేకాదు. ఆ రెండు వస్తువులు స్వతంత్రములై ఉండాలి. ఆ పక్షాన నీ ఏకైకత్వం సర్వాధిష్ఠానత్వం, సర్వవ్యాపకత్వం బూటకాలని తేలుతుంది. దేవా! లోకులిట్టి శంకలకు లోనై నిజాన్ని గ్రహింపలేక తలక్రిందు లవుతుంటే చూసి వారి భ్రాంతిని పోగొట్టావు. ఆ పని ఎప్పుడో కాదు; ఈ అవతారంలోనే చూశావు. ఎవరికో కాదు; సమస్త బాహ్యప్రపంచం నీ గర్భాంతరంలో ఉన్న విషయాన్ని నీ తల్లి యశోదాదేవికి తెలియజెప్పావు కదా?

దేవా! బహిర్దృష్టమైన ప్రపంచం సత్యమేనని, నీ తల్లికి నీ ఉదరాంతరంలో కాన్పించిన ప్రపంచం ప్రతిబింబమాత్రమని, అది మాయావిలసితం కానేరదని కొందరనుకొంటారు. విశ్వము మాయావిలసితం కాని పక్షాన బాహ్యాభ్యంతరాలలో ఏకకాలాన కనుపించటం ఎలా పొసగుతుంది? ప్రతిబింబంలో వస్తువు విలోమస్థితిలో కనబడుతుంది. నీలో కనబడే ప్రపంచం అటువంటిది కాదు. కాబట్టి విశ్వం మాయాకల్పితమేనని, నీ ప్రతిబింబం కాదని తెలుస్తున్నది.

దేవా! నీ మాయావిశేషాన్ని గ్రహించటానికి అన్యనిదర్శన లెందుకు? ఈనాటి సంగతే చాలదా? నీ ప్రభావం ఎంతటిదో చూద్దామని వత్సాలను, వత్సపాలకులను దాచాను. ఎన్ని వత్సాలను ఏయే చిహ్నాలు గలవాటిని దాచానో, ఎందరు వత్సపాలకులను దాచానో అన్ని వత్సరూపాలను వత్సపాలకుల రూపాలను ధరించావు. అంతేకాదు. నీవు ధరించిన రూపాలన్నీ మాయామాత్రము లైనప్పటికీ గోవులు గాని గోపాలకులు గాని వాటి భేదత్వాన్ని గ్రహింపలేకపోయారు. ఆ వింతకు నేను ఆశ్చర్యచకితుడనై ఉండగా గోపాలకు లందరూ చతుర్భుజాది చిహ్నాలతో సాక్షాత్కరించారు.

అంతేకాదు. ఒక్కొక్క మూర్తిని ఒక్కొక్క బ్రహ్మ, సమస్తప్రపంచం ఉపాసిస్తున్నట్లు సేవావిధులను నిర్వర్తిస్తున్నట్లు కానుపించింది. అప్పుడు నా ఆశ్చర్యం మితిమీరింది. ఒకవంక ఆ దృశ్యాన్ని చూస్తూ ఆశ్చర్యపడుతుండగా మరొక వంక నీవు అనంత అద్వితీయబ్రహ్మానివై గోచరించావు. ఇట్టి నీ దర్శనభాగ్యానికి నోచుకొన్నవాడు నీ ఏకైకత్వ సత్యత్వాలను, దృశ్యమాన ప్రపంచమంతా నీ లీలామాత్రమన్న వాస్తవాన్ని కాదనటం ఉంటుందా?

## త్రిమూర్తులు

దేవా! సృష్టికాలంలో బ్రహ్మనైన నా రూపాన్ని, స్థితికాలంలో విష్ణురూపాన్ని, లయకాలంలో రుద్రరూపాన్ని ధరిస్తావు. నీ యీ రూపాలను బట్టి నీ యెడ భేదభావం చూపుతుంటారు. త్రిమూర్తులకు నీవే మూలానివి. అంతెందుకు? సమస్తం నీవే కదా. వాస్తవం విచారించితే జీవు డనబడేవాడు కూడా నీవే కదా. అయినా జీవుడు నీకంటె వేరైనవాడని భావిస్తారు. అందుకు నీవు ప్రకృతిబద్ధుడ వైనట్లు కాన్పించటం, నీ తత్త్వరహస్యాన్ని గ్రహింపలేని అజ్ఞానమౌఢ్యం ఇవి రెండూ కారణాలు.

దేవా! నీ వొక్కడవే సర్వలోక ప్రభుడవు సర్వేశ్వరుడవు అయిన మహాత్ముడవు. నీకు జననమరణాలు కలుగవు. దుష్టశిక్షణ శిష్టరక్షణలకు గాను ఆయా సమయాలలో కార్యోచితాలయిన దేవ ఋషి నర తిర్య గ్జల జంతు ప్రముఖరూపాలను ధరిస్తావు. నీ స్వరూపం సన్మాత్రము అపరిచ్ఛిన్నము అగోచరము అయినట్టిది. షడ్గుణైశ్వర్యాలు నీకు స్వభావసిద్ధాలు. యోగులకు కూడా పరమయోగివై అలరారుతావు. నీ లీలలకు దేశ కాల సంఖ్యానియతి కలుగదు. నీకు ఇచ్ఛగలిగినప్పుడు నీ యోగమాయతో క్రీడిస్తావు. ఆ క్రీడలన్నీ నీకు లీలామాత్రాలు.

జగదీశ్వరా! నిత్యసుఖబోధాత్ముడవు నిత్యుడవు కాబట్టి నీకు జనన మరణాదులు కలుగవు. సుఖస్వరూపుడవు కాబట్టి నీకు సుఖదాయక పరపదార్థమే లేదు. బోధాత్ముడవు కనుక సర్వమూ నీకు స్పష్టం. అట్టివాడవు

అయినా నీవు నీ మాయాయోగం వలన నీయందే చేతనాచేతనాది వివిధరూపాలతో ఆవిర్భవిస్తూ వ్యవహృతిని పొందుతూ లయాన్ని పొందుతుంటావు. ఈ నీ యోగఫలమే చరాచరసమస్త విశ్వమై ఉన్నది. ఇదంతా నీ మాయాకార్యమే తప్ప స్వతంత్రం కాదు.

ప్రభూ! నీ మాయాకార్యానికి వశపడి ఉన్నంతకాలం నిన్ను గుర్తించటం వీలుకాదు. నీ మాయను దాటిన వారికి నీవు గోచరిస్తావు. నీ మాయను దాటి నిన్ను కనుగొనటానికి ఒక్కటే మార్గం. సూర్యప్రకాశం వలన కన్నులు దృష్టిశక్తిని పొంది దృశ్యాన్ని చూడగలిగినట్లు గురు ప్రసాదం వలన జ్ఞానం ఉదయించి నిన్ను కనుగొనటం సాధ్యమవుతుంది. నీవు గోచరించటమనగా నీ తత్త్వరహస్యం స్పష్టపడటమనే ఉద్దేశం.

నీ తత్త్వరహస్యం తెలిసినప్పుడు నీవు సర్వాత్ములకు ఆత్ముడవు, అద్వితీయుడవు. నిత్య సత్య పురాణ పురుషుడవు, స్వయంజ్యోతివి, అనాద్యనంతాక్షరుడవు, నిరంజన నిరుపాధిక పూర్ణుడవు, ప్రత్యగాత్ముడవు, అమృతుడవు అని స్పష్టపడుతుంది. అట్టి జ్ఞానఫలంగా జనన మరణ రూప సంసారం సాగర తుల్య మనిపించినా చివరికి అనృతమని గ్రహించి దానిని తరింపగలుగుతారు.

దేవా! ఈ రహస్యాన్ని గ్రహింపనివారు ముంజీకటిలో రజ్జువును చూసి సర్పమని భావించి తారుమారయేవారి గతిని పొందుతారు. దీపప్రకాశం వలన సర్పభ్రాంతి తొలగిపోయినట్లు నీ జ్ఞానప్రకాశం వలన జగత్సత్యత్వ భ్రాంతి నశిస్తుంది. అప్పుడు ప్రశాంతి కలుగుతుంది. అదే మోక్షం.

## బంధ మోక్షాలు

దేవా! బంధమోక్షాలు రెండూ మాయాకల్పిత భావాలే గాని సత్యమైనవి కావు. నిత్యం కన్నారా చూస్తూ అనుభవిస్తున్న బంధమోక్షాలను కల్పితమనటం సమంజసమేనా? అంటే బంధమోక్షాలు ఎవరికి ఆరోపిస్తున్నాము? జీవునికి

ఆరోపిస్తున్నాము. జీవుడెవడు? ఆత్మయేగాని తద్భిన్నుడు కాదు. ఆత్మమో? నిత్య సత్య స్వయంప్రకాశకమైనది. అట్టిదానికి అనిత్యత్వం గాని అసత్యత్వం గాని పరప్రకాశం గాని కలుగనేరవు. దృష్టాంతమున్నదా? అంటే సూర్యుడే దృష్టాంతం. సూర్యుడు నిత్యప్రకాశకుడు. అతనికి ఒకప్పుడు ప్రకాశకత్వం, వేరొకప్పుడు అప్రకాశకత్వం కలుగవు. వాస్తవస్థితి ఇలా ఉన్నప్పటికీ దృష్టికి అనావరణావరణాలు కలిగినప్పుడు తేజస్తిమిరాలు వాటిల్లుతున్నాయి. ఆ అవస్థాద్వయం దివారాత్రము లనబడుతున్నది. అట్టి దివారాత్రాలను సూర్యునియందు ఆరోపించి అతనికి ఉదయాస్తమయాలు కలుగుతున్నట్లు భావిస్తారు. ఆ విధంగానే నిత్యశుద్ధుడవు, అఖండానుభూతి రూపుడవు అయిన నీ యందు సయితం అజ్ఞానం మూలాన బంధమోక్షాలు ఆరోపింపబడుతున్నాయి.

దేవా! మరొక విశేషం. నీవు సర్వాంతర్యామివి. ఆ రహస్యాన్ని తెలుసుకొనకపోగా ఎక్కడో మిన్నులు పడ్డచోట ఉన్నట్లు నీ కోసం వెతుకుతుంటారు. దానికి తోడు నీయందు దేహాదిభావాన్ని, దేహాదులందు ఆత్మభావాన్ని అధ్యసించి చీకాకుపడతారు.

దేవా! శరీరములన్నీ చిత్ జడాలు రెండింటి సంయోగం వలన ఏర్పడుతున్నాయి. ఆ రెంటిలో జడపదార్థాన్ని వేరుచేసి చూడగలిగితే చిత్పదార్థానివైన నీవు కనుపిస్తావు. పెద్ద లా విధంగా నిన్ను సందర్శిస్తారు. త్రాటిని చూసి పామని తలంచినప్పు డది పా మనే భావం తొలగనంతవరకు సర్పభ్రాంతి కూడా తొలగదు. అలాగే, అజ్ఞానవశాన అధ్యస్తమైన జడాత్మభావం తొలగనంతదాకా ఆత్మజ్ఞానం ఉదయింపదు. పరమార్థ విషయం కూడా అంతేనని గ్రహించాలి. దేవా! సర్వమూ నీవే అయినప్పుడు చిజ్జడాలు రెండు ఏవిధంగా కలిగాయని శంకింపవచ్చును గాని చిత్తు నీవే, జడమూ నీవే అని గ్రహించినప్పుడు ఆ శంకకు అవకాశం లేదు. చిజ్జడాలు రెండూ నీ అవస్థావిశేషాలే. రెంటికీ మూలానివి నీవే. నీ పరమార్థస్వరూపం ఇట్టిదని యెరిగినవాడే జ్ఞాని.

## ప్రసాద ఫలం

దేవా! ఈ జ్ఞానభాగ్యం నీ సుప్రసాదం వలన తప్ప వేరొక తీరున కలుగదు. నీ ప్రసాద లబ్ధికి నీ పాదసేవ ఒక్కటే పరమోపాయం. నీకు భక్తిచేయక కేవలం జ్ఞానాన్ని మాత్రమే ఆశ్రయించి కల్పాల తరబడి విచారమగ్నులయినా నీ తత్త్వం గోచరింపదు కాబట్టి నాకు ఈ జన్మలోనో తిర్యగాది జన్మాంతరాలలోనో నీ చరణాబ్జసేవా మహాభాగ్యాన్ని అనుగ్రహింపమని త్రికరణశుద్ధిగా నిన్ను వేడుకొంటున్నాను.

## ప్రసాదలబ్ధికి సాధనం

దేవా! నీ ప్రసాదలబ్ధికి యజ్ఞాది సాధనాంతరాలు కలవని కొందరు భావిస్తుంటారు. నీ కొరకు సృష్ట్యాదిగా ఎందరో ఎన్నో యజ్ఞాలను చేశారు. ఆ యజ్ఞాల వలన ఎన్నడయినా నీకు సంపూర్ణ తృప్తి కలిగిందా? అన్ని యజ్ఞభోజనాల చేత తృప్తిచెందని నీవు గోవత్సరూపాలను ధరించి గోక్షీరాలను గ్రోలి, గోపబాలకుల రూపాలను దాల్చి గోపకాంతల చనుబాలు త్రాగి – పరమసంతుష్టి నొందావు. ఆ గోవులు గోపికల భాగ్యం ఏమనాలి? గోగోపికలు కృతార్థులయ్యారు. నందాది గోపుల మాట ఇక చెప్పేదేమున్నది? పరమానందస్వరూపుడు, నిత్య సత్యానందుడు అయిన పరబ్రహ్మమే వారికి హితుడై సన్నిహితుడై ఆప్తబంధు వయ్యాడు. వారి భాగ్యమే భాగ్యం. ఎంత వర్ణించినా తనివితీరదు.

దేవా! గోపికలే కాదు. వారి మూలాన మేము కూడా మహాభాగ్యానికి నోచుకొన్నాము. నీవే ఒకప్పుడు ప్రాణుల మనోబుద్ధ్యహంకార చక్షురాదీంద్రియాలకు అధిష్ఠాతలుగా చంద్ర శంకరాదులమైన మమ్ము నియమించావు. ప్రాణులు నీ సేవాసుఖాలను తమ ఇంద్రియముఖాన పొందినప్పుడు తదింద్రియాధిష్ఠాతలమైన మేము కూడా నీ పాదపద్మ మకరందామృతాన్ని గ్రోలి దివ్యసుఖాన్ని చూరగొంటాము. సత్సాంగత్యం రిత్తపోదుకదా.

దేవా! మేమొక్కొక్కరమూ ఒక్కొక్క ఇంద్రియానికి మాత్రమే అధిష్ఠాతలము. అందువలన ఒక్కొక్కరికి ఒక్కొక్క ఇంద్రియం మూలంగా లభించే సుఖం మాత్రమే లభిస్తుంది. అంశాంశరూపమైన ఆ సుఖమే మాకు ఇంత తృప్తిని, సంతోషాన్ని కలిగిస్తుండగా, సర్వేంద్రియ సంతర్పణగా ఆ సుఖామృతాన్ని గ్రోలనోచిన గోగోపికల భాగ్యం ఎంతటిదో ఊహింపగలమా?

దేవా! ఎంతో పుణ్యం చేస్తే గాని మర్త్యలోకజన్మం లభింపదు. ఆ మర్త్యలోకంలో ఈ బృందావనంలో ఈ మందలో జన్మించినవారి పుణ్యమెంతటిదో కదా! దేవా! ఈ బృందావనంలో గడ్డిపరకగా నైనా పుట్టి గోపాలకుల పాదరేణు వొక్కదానిని ఔదల ఘటించే భాగ్యాన్ని నాకు ప్రసాదించు. ఇట్టి వరం నాకెందు కనుకొంటావేమో? ప్రభూ! ఏ మహాత్ముని పాద పరాగ రేణు కణ సంస్పర్శాధికారాన్ని పొందే మార్గం వేదవేదాంతాలలో వెతకబడుతున్నదో, ఆ భగవానుడే జీవిత సర్వస్వంగా వ్రేపల్లెలోని గోపాలకు లుంటారు. వారిని మించిన పుణ్యాత్ము లుంటారా? వారి పాదధూళి రేణువు సోకటం కన్న వేరే భాగ్యం ఉన్నదా?

## భగవంతుడు భక్తపరాధీనుడు

దేవా! నీవు సర్వఫలస్వరూపుడవు. అట్టి నీవు నీకుగా వ్రేపల్లెవారికి నిన్ను సమర్పించుకొన్నావు; స్వాతంత్ర్యానికి, సర్వశ్రీకి దూరమయ్యావు. వ్రేపల్లెవాసులు నీకు పరాభక్తిని కావిస్తున్నారు. పరాభక్తులు ఏ కోరికలనూ కోరరు. ఆ విధంగా వారు కోరకపోయినా వారికి ఎప్పుడు ఏది మేలో దానిని సమకూర్చటం నీకు నియతమై ఉన్నది. వారికి ఏది యెప్పుడు అందించాలో నీకే తెలియాలి. ఒకవేళ మాబోంట్లకు తెలియవచ్చినా సర్వం సమర్పించుకొని రిక్తహస్తాలతో ఉన్న నీవు వారికి ఇంకా ఏమివ్వగలవు?

## భగవత్కారుణ్యం

దేవా! నిన్ను వంచింపదలచి కుత్సితవేషం ధరించి నీ కడకు వచ్చిన మహాపాపాత్మురాలు పూతన నిన్ను చేరుకొన్నది. అంతే కాదు.

దానితోడివారందరూ నిన్ను పొందారు. ఈ గోపకులు తమ ధనగృహాదులను భార్యాపుత్రశరీరాలను నీకు సమర్పించటమే గాక ప్రాణాలను కోసియిమ్మన్నా తెచ్చి నీ పాదాల ముందు పడవేస్తారు. వారికి నీవు ఏమి ఇవ్వబోతున్నావో, వారు పొందే సుఖం ఎంతటిదో ఊహకు కూడా అందటం లేదు.

## అవినయ క్షమార్పణం

దేవా! గృహమంటే కారాగృహమని, మోహపాశం దృఢమైన సంకెల అని, రాగద్వేషాదులు పశ్యతోహరులని, వాటికి లోనయి లోకం పడరాని కష్టాలు పడుతున్నదని అంటారు. ఈ కష్టా లెప్పటిదాకా ఉంటాయంటే, నీ ప్రసాదలబ్ధి కలిగినంతవరకు ఉంటాయి. ఏ క్షణాన దుర్లభమైన నీ మహాప్రసాదం లభించినదో ఆ క్షణమందే ఆ కష్టాత్మకలోకమే మహానందదాయక మవుతున్నది. ఆ ప్రసాదాన్ని లేశమాత్రమైనా నాకు అనుగ్రహించు. నేను కృతకృత్యుడనవుతాను. మరి నీవు నిష్ప్రపంచుడవని, నీ మాయాయోగం వలన ప్రపంచవిడంబన మవుతున్నదని నాకు ఏనాటికీ మరపురాకుంటుంది గాక. నీ స్మరణ సేవా నమస్కార భాగ్యం నాకు నిరంతరాయితంగా సమకూడాలని ఆకల్పాంతం నీకు నమస్కరిస్తాను. దేవా! నేను దాచిన వత్సాలను, గోపబాలకులను యథాస్థానానికి చేర్చాను. నీ మహిమను తిలకించే కుతూహలంతో నేను కావించిన ఈ అవినయకృత్యాన్ని మన్నించు. ఆజ్ఞ నివ్వు' అని సాష్టాంగప్రణామాలు చేసి, అనుజ్ఞాతుడై స్వస్థానానికి నిష్క్రమించాడు.

## పునస్సమావేశం

పరీక్షిన్నరేంద్రా! శ్రీకృష్ణభగవానుడు ఆ విధంగా బ్రహ్మకు అనుజ్ఞనిచ్చి గోవత్స గోపబాలకులను పూర్వం పరమేష్ఠి హరించిన చోటికి వెళ్ళాడు. గోపబాలకులు శ్రీకృష్ణుని ఆప్యాయనంగా పలకరించి, 'కృష్ణా! నీవు వెళ్ళినది మొదలు ఇంతదాకా పూర్తిగా ఒక ముద్దకూడా మేము నోటబెట్టలేదు. ఇంతలో తిరిగివచ్చావా? క్షేమమే కదా! రావయ్యా, కలిసితిందాము' అని

పిలిచారు. శ్రీ భగవానుడు లోలోన నవ్వుకొంటూ వారితో కలిసి కూర్చొని ఎప్పటిలాగా బంతులు తీరి ఎంతో సంతోషంతో భుజించాడు.

రాజేంద్రా! గోపబాలకులకు శ్రీకృష్ణునితో వియోగం కలిగి నాటికి ఏటికేడాది గడిచింది. అయితే ఏ మాయ ఈశ్వరుని శక్తికార్యమై జగమంతటిచే యథార్థ్యాన్ని విస్మరింపజేస్తున్నదో, ఆ మాయ వారిని ఆవహించి ఉండటం వలన అది వారికి క్షణకాల మనిపించింది. మాయావృతులకు భ్రాంతి తప్పదు కదా.

రాజా! గోపాలకులు ఆ విధంగా కొంతసేపు గడిపి వ్రేపల్లెకు తరలివెళ్ళారు. వారట్లా వస్తుండగా దారిలో వెనుక వారికి తారసిల్లిన కొండచిలువ డొప్ప కనిపించింది. భగవానుడు దానిని వారికి చూపి, వారందరూ ఆశ్చర్యమగ్నులై ఉండగా మధుర మధుర వేణుగానాన్ని వినిపిస్తూ ధాతుచిత్రమండనంతో శిఖిపింఛ శృంగార లలాటాగ్రంతో దగద్ధగాయమానంగా వెలుగొందుతూ ఆ లోకమోహన సుందరాకారుడు వ్రజపురాన్ని ప్రవేశించాడు. గోపకుమారులు ఎన్నాళ్ళ తర్వాతనో బంధుమిత్రులందరినీ కలుసుకొని, 'మన కృష్ణుడు క్రూరసర్పాన్ని సంహరించి మమ్మల్ని బ్రతికించాడు' అంటూ తలకొకవిధంగా పురవాసులకు జరిగిన వృత్తాంతాన్ని వినిపించారు. ఆ సంగతి విని అందరూ శ్రీకృష్ణుని వేనోళ్ళ శ్లాఘించారు.

## పరీక్షిత్తు సందేహం

మునురాలా! శుకయోగి ఆ విధంగా ఉపన్యసింపగా పరీక్షిన్నరేంద్రుడు విని, 'యోగీశ్వరా! శ్రీకృష్ణుడు తన మాయ నధిష్ఠించి వివిధ గోపబాలకుల రూపాలను ధరించినప్పుడు గోపికలకు మాయాపుత్రుల యెడ కలిగిన ప్రేమ అనిర్వచనీయమని చెప్పావు. శ్రీకృష్ణుడు పరకాంతాపుత్రుడు. స్త్రీలు తమ సంతానం కంటె మరొక తల్లి కన్నకొడుకులను ప్రేమించటం లోకవిరుద్ధం కదా' అన్నాడు.

## భగవత్తత్త్వం

శుకమహర్షి అతని సంశయాన్ని విని, 'రాజేంద్రా! మనుష్యులం మనమే గాక జంతులోకం కూడా తనను తానే అత్యధికంగా ప్రేమించుకోవటమన్నది స్వభావసిద్ధం. అందుకు కారణమేమిటో ఊహించు. ప్రాణులు పుత్రాదివస్తువులను ఎందుకోసం ప్రేమిస్తున్నారంటావు? ఆ ప్రేమ తమ ప్రీతికేగాని పరవస్తువుల ప్రీతికోసం కాదు. 'నేను' అంటే దేహమేనని ప్రాణుల భావం. నిదర్శన మేమిటంటావా? 'నేను' 'నాది' అనే మాటలు అందరూ వాడుతున్నవే. అయితే అహమిత్యాదులను ఉచ్చరించినపుడు వారి దృష్టి శరీరపరంగా మాత్రమే ఉన్నది. కొంచెం విమర్శించి చూస్తే 'నేను' అనే పదార్థం వేరని, అది ఉన్న శరీరం వేరని ఏర్పడుతుంది. 'నా శరీరం' అన్నదానిని విమర్శించితే 'నేను' వేరుగా 'శరీరం' వేరుగా ఉన్నవని స్ఫురింపక మానదు.

దేహమే ఆత్మ (తాను) అని భావించే వారిని దేహాత్మబుద్ధు లంటారు. ఆ బుద్ధి ఉన్నంత కాలం సర్వమూ దేహార్థమనే వారు భావిస్తారు. కొంచెం విమర్శించితే – దేహం వేరని, దేహంలో ఉన్న 'నేను' అనేది వేరని స్ఫురించిన తర్వాత దేహార్థమైన ప్రీతి క్రమక్రమంగా సన్నగిలుతూ ఆత్మార్థమైన ప్రీతి ఎక్కువౌతుంటుంది. జ్ఞానోదయానికి ప్రాతిపదికం ఇదే.

జ్ఞానోదయంతో క్షణక్షణ శరీర జీర్ణస్థితి స్పష్టమవుతుంటుంది. శరీరం శిథిలప్రాయమవుతున్నా తాను చిరస్థాయిగా ఉండాలనే కోరిక బలపడుతుండటం స్వానుభవవేద్యమే కదా. దీని భావమేమిటి? దేహానికంటె ఆత్మే ప్రియతమమని భావం. అప్పుడు శరీరాల కంటె తదంతరితుడై ఉన్న ఆత్ముడు ప్రియతము డవుతాడు. శరీరాలే కాదు; చరాచరసమస్త ప్రపంచం ఆత్మార్థమై ప్రియతమం అవుతుంది.

ఆత్మ అంటే ఎవరు? భగవానుడే. ఆత్మ ఏకము, అద్వితీయము అయినట్టిది. అది వివిధ శరీరగత మైనంతనే భిన్న మయిపోదు. ఆకాశం వివిధఘటాంతరాలలో ఉన్నంత మాత్రాననే భిన్నభిన్నాకాశాలు కానట్లుగానే ఆత్మ వస్తువు కూడా భిన్నభిన్నాత్మలు కాదు. ఏకమైన పదార్థం వివిధోపాధుల వలన తనకు కలిగిన భిన్నత్వాన్ని సహింపదు. ఉపాధు లడ్డుపడుతున్నా ఆత్మ స్వస్వరూపాన్ని ధరింపగోరుతుంటుంది. ఆ కోరికనే ప్రీతి అంటున్నాము.

గోపికల శరీరాలలో ఉన్న ఆత్మాంశలు భగవదంశలే కాబట్టి, భగవానుడు గోపబాలకుల రూపాలను ధరించినప్పుడు అతని శక్తి తత్తద్రూపాలలో విశేషించి ప్రకాశించడం వలన, ఆ ప్రకాశం గోపికల హృదయాలను మరీ మరీ ఆకర్షించింది. తత్ఫలంగా వారిలోని ఆత్మాంశ విశేషంగా సమాకృష్టమయింది. ఆ సమాకర్షణ విశేషమే నీవడిగిన ప్రశ్నకు సమాధానం.

రాజేంద్రా! చరాచరసమస్త ప్రపంచం భగవద్రూపమే గాని వేరుకాదని గ్రహించటమే వస్తుతత్త్వాన్ని గ్రహించట మన్నమాట. ఆ విధంగా గ్రహించిన వారికి భగవద్భిన్నమైన వస్తువొకటుండదు. ఆ గ్రహింపు కలగాలంటే ఏమిచేయాలి? కారణమొకటి లేకుండా కార్యం కలుగదు కదా. ప్రపంచమంతా కార్యమయితే ఆ కార్యానికి కారణం ఉండితీరాలి. ఈ ప్రకారం కొంత ఆలోచిస్తే నేను చెప్పిన భావం కలుగుతుంది.

ఆ కారణాన్ని వారు వారు వారి వారి బుద్ధికీ రుచికీ తగినట్లుగా పేర్కొంటారు. ఆ పేర్లు ప్రకృతి అని, ప్రధానమని, ఆత్మ అని, పరమేశ్వరుడని, భగవానుడని అనేక విధాల వ్యవహారంలో ఉన్నాయి. నామభేదాలను బట్టి వస్తుభేదం ఏర్పడదు. ఆ వస్తువు పూర్ణం కాబట్టి దాని బుద్ధి రుచి ఎంతెంత గ్రహించితే దానిని బట్టి దానికి పేరు కలుగుతున్నది.

రాజేంద్రా! భగవత్తత్త్వం అటువంటిది గనుక విజ్ఞులైన మహాత్ములు భగవానుని దివ్యచరణాంబుజాలను ఆశ్రయిస్తూ సర్వపాపక్షయకరాలైన అతని

దివ్యచరిత్రలను కీర్తిస్తుంటారు. భగవత్పాదమనే తెప్ప నెక్కినవారికి సంసార సాగరం గోవత్సపాదమాత్ర మవుతుంది. ఆ తెప్పనెక్కి ప్రయాణిస్తున్నప్పుడు ప్రతికూల వాతాది విపత్తులెన్ని కలిగినా భగవానుడు వెన్నంటి ఉంటాడు కాబట్టి ప్రయాణికులు సురక్షితంగా గమ్యస్థానాన్ని చేరుకొంటారు. రాజా! నీవడిగిన సర్వార్థాలను విశదీకరించాను. దీనిని విన్నా చదివినా అభీష్టసిద్ధి కలుగుతుంది.

## గోరక్షణం

రాజేంద్రా! రామకృష్ణులకు కౌమారదశ అంటే ఐదేండ్ల ప్రాయం గడిచి, పౌగండ వయోదశ – అంటే ఆరవ యేడు వచ్చింది. ఐదేండ్లు దాటనంతవరకు గోపబాలకులు గోవత్సాలను మాత్రమే మేపవచ్చును. ఆరవ యేడు వస్తేగాని గోవులను మేపటానికి పెద్దలు వారికి అనుజ్ఞ నివ్వరు. రామకృష్ణులకు, వారితోడి గోపబాలకులకు ఆరవ యేడు వచ్చినందువల్ల గోవులను మేపవచ్చునని అనుజ్ఞ నిచ్చారు. వారు ప్రతిదినం చెలికాండ్రతో కలిసి ఆవులను తోలుకొని బృందావనాంతరాలకు వెళ్ళసాగారు. ఆనాటి నుంచి బృందావనాంతరాలు రామకృష్ణుల పాదస్పర్శ సోకి పావన మయ్యాయి.

## రామకృష్ణుల వనవిహారాలు

భగవానుడు గోపకుమారులకు వివిధ విహారోల్లాసాలను కూర్పదలచి ఒకనాడు బలరామ గోపాలకులను వెంటబెట్టుకొని ఆలమందను తోలుకొని బృందావనానికి వెళ్ళి వేణుగానం మొదలుపెట్టాడు. ఆ గానమాధుర్యానికి గోవులు గోపాలకులు మైమరచి ఎక్కడికి వెళ్తున్నదీ కూడా ఎరుగక ఒక వనంలోనికి ప్రవేశించారు. అక్కడ పుష్పవల్లికలు ఏచి పరచి నిండుగా పుష్పించి ఉన్నాయి. తుమ్మెదలు పూదేనెలను గ్రోలి వివశత్వాన్ని పొంది వినసొంపుగా ఝుంకారరవాలను ఆలపిస్తున్నాయి. వృక్షాలు ఫలభరనమ్రశాఖలతో సొబగారుతూ 'పరోపకారార్థమిదం శరీర' మ్మనే

మహోపదేశాన్ని పాటింపగోరి నునుగాడ్పులకు వీస్తున్న కొమ్మలనే కరాలతో పథికులను ఆహ్వానిస్తున్నట్లుగా ఉన్నాయి. శుకపికాది విహంగాలు ఫలసంతర్పణల వలని తమ ఆనందాలను చాటిచెబుతున్నట్లు శ్రవణమనోహర రుతాలను వినిపిస్తున్నాయి. సరోవరాలు ప్రసన్న నిర్మల నీర పూరాలతో సజ్జనమానసాల తత్త్వాన్ని ప్రకటిస్తున్నట్లు కన్నుల పండుగ చేస్తున్నాయి. సరస్సులలోని నీటిపై నుంచి వీస్తున్న శీతల మారుతకపోతాలు సరోజసౌరభాలను సంతరించుకొని వీవెనల వలె మెల్లమెల్లగా వీస్తూ పథికుల శ్రమను అపనయిస్తున్నట్లు గోచరించాయి.

## అన్యాపదేశ మహోపదేశం

కృష్ణుడప్పుడు బలరాముని చేరి, భంగ్యంతరంగా ప్రసంగించాడు. 'అన్నా! ఈ వనపాదపాలు తమ వృక్షజన్మానికి మూలమైన తమోగుణాన్ని బాపికొనగోరి తాము కష్టించి పూచి కాచిన ప్రసూనఫలాలను కానుక పెట్టి, ఆ ఫలపుష్పభారం నెపాన శిరస్సులను నేలకు మోపి సురలకు సయితం పూజ్యమైన నీ పాదపద్మాలకు మ్రొక్కుతున్నాయి కదూ!

అన్నా! ఈ భ్రమరాలను చూడు. ఇవి నిజానికి సాధారణభ్రమరాలు కావు. నీవు మనుష్యవేషాన ప్రచ్ఛనుడ వయినందువల్ల మునీంద్రులు భ్రమరరూపాలను ధరించి ఝంకారాలతో నీ కీర్తిని గానంచేస్తూ నిన్ను సేవింపగోరి ఇక్కడికి వచ్చారు.

అన్నా! ఈ మయూరాలను చూడు. నీ సందర్శన భాగ్యాన్ని చూరగొనటానికి రెండు కన్నులు చాలవని కాబోలు పురులను విప్పి నిలువెల్లా కన్నులను దాల్చాయి. ఈ కోకిలాలాపాలను విన్నావా? వీటి స్వరమాధుర్యాన్ని ఏమని శ్లాఘించాలి!

అన్నా! ఇంటికి వచ్చిన అతిథిని ఆదరించటం సజ్జనుల ధర్మం. అందుకు గ్రంథపరిశోధనలు గాని జ్ఞానాదులు గాని అవసరం లేదు. ఈ వనాంతర

లతా వృక్ష పిక మయూరాదులు విశేషజ్ఞానవిహీనాలయినా అతిథివైన నిన్ను చేరదీసి ఆదరించటమే అందుకు నిదర్శనం. వృక్షపక్షికీటకాదులు కూడా స్వధర్మాన్ని నెరపటం చూస్తుంటే ధర్మం ఎంత అనర్ఘమైనదో ఊహకు వస్తున్నది. ఇవి స్వధర్మానుష్ఠానం వల్లనే కదా ధన్యాధన్యా లైన వనిపిస్తున్నది.

అన్నా! నీ పాదపద్మాలు సోకినందువలన ఇందలి లతాతృణాలు, నీ నఖస్పర్శ వలన పాదపాలు, నీ కరుణావలోకనభాగ్యం వలన నిఖిల నదీ నద గిరి మృగ విహంగాలు కృతార్థత నొంది మహాపురుషుల సర్వాంగాలు లోకపవిత్రీకరణ సాధనాలని చాటిచెబుతున్నాయి. శ్రీ మహాలక్ష్మికి సహితం ప్రార్థనీయమైన నీ పరిష్వంగభాగ్యానికి నోచుకొని గోపికలు చరితార్థ లయ్యారు' అని చెబుతూ, ఆయా విశేషాలను చూపుతూ, పుష్పమధువులను గ్రోలి మైమరచిన మధుపాల వలె ఒక్కొక్క చోట పాడుతూ, ఒక్కొక్క చోట హంసకూజితాలు చేస్తూ, ఒక్కొక్క తావున మయూరనృత్యాలు కావిస్తూ, ఒక్కొక్క పట్టున చకోర చక్రాంగ క్రౌంచ భరద్వాజ పక్షుల రుతాలను అనుకరిస్తూ, అక్కడక్కడ సింహవ్యాఘ్రాలకు భీతిల్లినట్లు నటిస్తూ, అప్పుడప్పుడూ దూరాని కేగిన ఆవులను వేర్వేరుగా గంభీర మనోహరస్వనాలతో పిలుస్తూ, గోపబాలకులు ఆడిపాడి చేతులు కలిపి పోరాటాలు సాగిస్తుంటే చూసి జేజేలు పలుకుతూ, తానుకూడా వారితో మల్లయుద్ధాలు చేస్తూ ఇష్టకేళీవినోదాలతో కాలం గడిపాడు.

గోపబాలకులు ఆ ఆటపాటలతో అలిసిపోయారు. అందరూ కలిసి ఒక వృక్షమూలం చేరి అక్కడ రాలిపడిన చిగురుటాకులను చేర్చి పాన్పులుగా అమర్చుకొని కొంతసేపు పవళించారు. కృష్ణుడు కొంతసేపు బలరాముని పాదాలొత్తి అతనికి సేదదీర్చి ఒక గోపబాలకుని తొడమీద తల ఆనించి తానూ హాయిగా పవ్వళించాడు. కొందరు గోపబాలకులు అతని పాదాలొత్తారు. కొందరు పూవుటాకు లేగొమ్మ వీవనలు వీచారు. కొందరు శ్రీకృష్ణబలరామ కీర్తిగానాలు చేశారు. రాజా! రామకృష్ణుల విహారాలు ఆ విధంగా జరుగుతున్నాయి.

## ధేనుకాసుర సంహారం

రాజేంద్రా! ఒకనాడు రామకృష్ణులు గోపబాలకులతో వనవిహారోత్సుకులై బయలుదేరి అడవిలోనికి ప్రవేశించి స్వేచ్ఛగా నలువైపుల విహరింపసాగారు. ఆ సమయంలో శ్రీదాముడు, సుబలుడు, స్తోకకృష్ణుడు అనేవారు ఒక దెసను వెళ్ళి అక్కడినుంచి పరుగుపరుగున తిరిగివచ్చారు. 'రామా! రామా! కృష్ణా! కృష్ణా! అదిగో చూడు. అదే తాళవనం. అక్కడ పెద్దపెద్ద తాళఫలా లున్నాయి. వాటి మధురవాసనలు మమ్మల్ని ఆకర్షించాయి. ఇప్పుడే తినాలని నోరూరుతున్నది. ఆ వనంలోనికి జొరబడే సాహసం చేశాము కాని, అందులో ధేనుకుడనే రాక్షసుడు గర్దభాకారం ధరించి బహుబాంధవసమేతుడై పరులెవ్వరినీ రానీయక ఆ ఫలాలను తానూ తనవారూ మాత్రమే భోగించాలనుకొంటున్నాడని విని నిరాశతో తిరిగివచ్చాము. అదిగో! ఆ పండ్లనెత్తావులు ఇక్కడికి కూడా ఘుమఘుమలాడుతున్నాయి. ఆ పండ్లను తినాలని కోరిక ఈరిక లెత్తుతున్నది. మా మాట సరేనంటే మనమందరమూ అక్కడికి పోదాము' అన్నారు.

వారి ప్రణయాలను రామకృష్ణులు ఆలకించి, నవ్వి, వారి కోరిక నెరవేర్పగోరి అక్కడికి వెళ్ళారు. బలరాము డొక తాళవృక్షం మూలాన్ని పట్టి ఊగిసలాడించాడు. దాని పండ్లన్నీ జలజల రాలాయి. ఆ సడి విని ఆ వనాంతరం నుంచి పెద్ద గార్దభం ఒకటి బిగ్గరగా అరుస్తూ గబగబ వచ్చి వెనుగాళ్ళు రెండూ ఎత్తి బలరాముని రొమ్ముపయి తన్ని మళ్ళీ నాలుగడుగులు ముందుకు వెళ్ళి అక్కడినుంచి ఉరుకుల మీద వెనుకకు వచ్చి యథాపూర్వం వెనుగాళ్ళు రెండూ ఎత్తి జాడించింది. బలరాముడు ఆ కాళ్ళు రెండూ ఒడిచిపట్టి ఆ గాడిదను గిరగిరగిర త్రిప్పి ఒక తాటిచెట్టుపయి మోదాడు. ఆ దెబ్బకు అంతపెద్ద గర్దభం నెత్తురులు గ్రక్కి చచ్చిపడింది; తాళవృక్షం ఉగ్రటలూగింది; దాని తాకువడి చెట్టుచెట్టుకు ప్రాకి ఆ వనం వనమంతా ఊగిసలాడింది. ఫలవర్షం కురిసినట్లు ఆరముగ్గిన పండ్లన్నీ జలజల రాలాయి; తాళవృక్షాలు కొన్ని విరిగి పడ్డాయి.

ధేనుకుని పాటుచూసి అతని బంధువులు గుమిగూడివచ్చి రామకృష్ణుల మీదపడ్డారు. యదువీరులు ఆ గాడిదలను వెనుగాళ్ళబట్టి తాటిచెట్లకు మోదారు. అవి రక్తా లుమిసి ప్రాణోత్క్రమణకాలాన రాక్షసరూపాలు దాల్చి చచ్చిపడ్డాయి. వనమంతా రాక్షసశవాలతో రాలిన తాటిపండ్లతో కూలిన చెట్లతో నిండి మబ్బులు క్రమ్మిన ఆకసాన్ని తలపింపజేసింది. దేవతలు వారి సంతోషాతిశయాన్ని పుష్పవృష్టిముఖంగా తెలిపారు. అమరవాద్యాలు ప్రతిధ్వనించాయి. ఆనాటినుంచి ఆ వనంలోని తాళఫలాలు మనుష్యులకు, ఆ వనాంతరమందలి పచ్చికలు పశువులకు భోగ్యమై గోగోపగణాలు సంతోషంగా ఉన్నారు.

## వ్రేపల్లె ప్రవేశం

అంతట రామకృష్ణులు గోపబాలకులతో వ్రేపల్లెకు బయలుదేరారు. వారు వ్రజపురాన్ని చేరడమే తడవుగా ధేనుకాసుర వధ వృత్తాంతం పల్లె అంతటా క్షణంలో వ్యాపించింది. గోపికలు గుంపులు గూడి ఎదురేగి, గోధూళిధూసర కుంతలాలతో బర్హిబర్హాలతో వన్యప్రసూనమాలికలతో రుచిరేక్షణచారు మందహాసాలతో ఒప్పారుతూ మధుర మధురంగా వేణుగానం ఆలపిస్తూ గోపబాలక స్తుతి వచనాలను వింటూ సోయగాలను చిందిస్తూ వస్తున్న కృష్ణుని ముఖారవిందమకరందాన్ని లోచనభ్రమరికలతో గ్రోలి తాపాలను అపనయింప జేసుకొన్నారు. కృష్ణుడు కూడా ఆ గోపకాంతల వ్రీడా హాస కటాక్ష రూప సత్కారాలకు సంతోషంతో తలపంకిస్తూ వారియెడ కటాక్షవీక్షణాలను ప్రసరింపజేస్తూ పల్లెలోనికి కాలుపెట్టాడు.

రామకృష్ణులు ఇంటిలోనికి ప్రవేశింపగానే రోహిణీ యశోదలు వారికి నలుగుపెట్టి జలకమార్చి గంధాలద్ది పూదండలతో అలంకరించి రుచిరాన్నాలను వడ్డించి కడుపునిండా భుజించిన తర్వాత మార్గాయాసం తీరగా మెత్తని పాన్పులపయి పరుండబెట్టి నిద్రపుచ్చారు. రాజేంద్రా! బలరాము దంతపని చేయగలడా? అని శంకింపబోకు. అతను అనంతుని అవతారమన్న సంగతి చెప్పాను కదా.

## కాళియమర్దనం

రాజేంద్రా! బృందావనానికి సమీపంలో కాళింది అనే నది ఉన్నది. అందులోని ఒక మడుగులో కాళియుడనే పేరుగల సర్పం ఉండేది. ఆ నాగరాజు విషాలు మడుగు నీటి నంతటినీ విషవంతంగా చేశాయి. ఆ విషోద్ధతి ఏమని చెప్పను? పక్షులు మింట ఎగురుతున్నవి ఆ మడుగుమీదికి వచ్చీ రాగానే ఆ విషాగ్ని వేడిమికి కమిలి అందులో పడి చచ్చిపోతుండేవి. ఆ విషజలాల మీది గాలిసోకి చుట్టుప్రక్కల చెట్లూపుట్టలు, జీవరాశి కాలి బూడిదవుతుండేవి. అందువల్ల మడుగు నీరు త్రాగటానికి వీలులేనిదయింది. ఆ నీటిని శుద్ధిపరిచి జనోపయోగం కావించాలని భగవానునికి సంకల్పం ఉదయించింది.

వేసవి కాలంలో ఒకనాడు గోపాలకులు యథాప్రకారం గోవులను మేతకు తీసుకొనివెళ్ళారు. ఆనాడు సూర్యతాపం దుర్భరమయింది. ఆ వడకు గోవులు, గోపాలకులు దప్పిగొని తత్సమీపాన ఉన్న కాళిందీనదికి వెళ్ళి అక్కడి మడుగులోని నీళ్లను గుటగుట త్రాగారు. త్రాగినవారు త్రాగినట్లుగా గోవులు, గోపాలకులు విగతజీవులవలె తూలిపడ్డారు. భగవానుడు శ్రీకృష్ణుడు వారికోసం అక్కడికి వెళ్ళారు. అతని కటాక్షామృతం వర్షించినంతనే గోవులు, గోపాలకులు జీవితులయ్యారు.

ఆ మడుగు ఒడ్డున పెద్ద కదంబవృక్షం ఒకటి నిలువున ఎండి మ్రోడయి ఉన్నది. శ్రీకృష్ణుడు ఆ చెట్టునెక్కి కొసకొమ్మకు పోయి కాసె బిగించి భుజాస్ఫాలన కావించి మడుగులోనికి తటాలున దూకాడు. ఆ దూకు వడికి మడుగులోని నీరంతా కలగి విషకషాయ తరంగాభీలమై పొంగి చుట్టుప్రక్కల నూరమ్మల దూరానికి ఎగిరిపడింది. భగవానుడు ఆ మడుగు నడిమికి చేరి మత్తమాతంగం చిందులు త్రొక్కినట్లు క్రీడింపసాగాడు. అతని క్రీడావేగానికి మడుగంతా ఘూర్ణిల్లింది.

ఆ మడుగులో ఉన్న కాళియుడు జరుగుతున్న అల్లరిని చూసి, ఆ విపరీతానికి 'ఓహో!' అని క్రోధవివశుడై బుసబుసలాడుతూ వచ్చి అక్కడ క్రీడిస్తున్న శ్రీకృష్ణుని మర్మస్థానాలకు నాటే విధంగా కరిచి అతని శరీరాన్ని చుట్టి బిగించాడు. గట్టున ఉన్న గోపాలకులు శ్రీకృష్ణుని పాటుచూసి భయాక్రాంతులై గగ్గోలుపెడుతూ గుండె ఝల్లుమని మూర్ఛిల్లి నేలవ్రాలి పొర్లాడసాగారు. గోవృషభ వత్సాలు దీనాతిదీనంగా అరవసాగాయి.

ఆ సమయాననే వ్రేపల్లెలో పిడుగుపాటుల వంటి దివ్యోత్పాతాలు, భూకంపాది భౌమోత్పాతాలు తోచాయి. గోపకులకు వామభుజ నేత్ర కంపాదులు జనించాయి. నందగోపాదులు ఆ దుశ్శకునాలను చూసి ముప్పు శంకించి భయవిహ్వలులై కృష్ణుడు ఎక్కడున్నాడోనని ఆందోళన చెందసాగారు. ఆబాలస్త్రీవృద్ధంగా గోకులమంతా వ్రేపల్లెను వదలి కృష్ణునికోసం వెతుకుతున్నారు. రాముడు వారందరినీ చూసి లోలోపలే నవ్వుకొంటూ పైకి ఏమీ మాటాడక మౌనంగా వారిని అనుసరించాడు. రాజా! భ్రాంతులవలె సత్యగ్రాహకులు విహ్వలపాటు పొందరు కదా.

వ్రజవాసులు నెమ్మది నెమ్మదిగా శంఖ చక్రాది రేఖాలాంఛితాలైన శ్రీకృష్ణపదాల జాడలను అనుసరిస్తూ చివరికి యమునా (కాళిందీ) తీరం చేరి అక్కడున్న మడుగువంక చూశారు. ఆ మడుగులో కృష్ణుడు నిశ్చలుడై మోడుబారి ఉండటమూ, అతనిని పెనుబాము చుట్టలు చుట్టి ఊపిరికూడా ఆడకుండా గట్టిగా బిగించి ఉండటమూ, ఆ మడుగు ఒడ్డున గోవులు గోపకులు పడిఉండటమూ కనిపించింది. నందాదులు తమ కన్నులను తామే నమ్మలేకపోయారు. వారికి ముల్లోకాలు శూన్యమై తోచింది. యశోదాదేవి జీవన్మృతయై పడిపోయింది. నందాదు లెట్టకేలకు స్మృతిపొంది తెగించి మడుగులోకి దూకి కృష్ణుని రక్షింప సాహసించారు. బలరాముడు అడ్డుపడి ఎంతో బలవంతంగా వారిని వారించాడు.

గోకులమంతా ఆ విధంగా తన కారణాన దుఃఖమగ్న మవుతుంటే కృష్ణుడు చూసి, కొద్దిగా మేను పెంచాడు. కాళియుని శరీరమంతా సాగి నుకనుక లయింది. అతను కలవరపాటుతో పట్టు సడలించి క్రిందపడి పడగలు విచ్చి నాసారంధ్రాల నుంచి విషజ్వాలలను వెలిగ్రక్కుతూ నాలుకలు సాచి దౌడలను నాకుతూ బుసలుకొడుతూ నిప్పులు రాల్చుతున్న చూపులతో కృష్ణుని చురచుర చూడసాగాడు.

కృష్ణుడంతట ఆ మహాసర్పం ఎదుట నిలిచి అటూ ఇటూ దాగుతున్నట్లు నటనచూపుతూ దానిని కొంతసేపు ఆటలు పట్టించి చివాలున ఎగిరి దాని పడగల మీదికెక్కి నృత్యం చేయసాగాడు. అదిచూసి సిద్ధ చారణ గంధర్వ ముని దేవస్త్రీలు మృదుమధుర స్తోత్రపూర్వకంగా పుష్పోపహారాలు కురిపించారు. రాజా! కృష్ణుడొక శిరస్సు మీద కాలు మోపగానే ఆ పాపరేడు వేరొక శిరసు పైకెత్తి కృష్ణుని కాటువేయసాగాడు. కృష్ణు డదిచూసి ఆ పన్నగేంద్రుడు పడగ ఎత్తినపుడల్లా ఆ పడగమీదికి దూకి పాదతలంతో అణగద్రొక్కుతూ ఇంద్రియజయాన్ని కోరిన సాధకునికి ఒక్కొక్క విజృంభితేంద్రియాన్ని శమింపజేస్తున్న బోధకుని వలె గోచరించాడు.

శ్రీకృష్ణుని చిత్రకృత్యాలకు కాళియుని పడగలన్నీ ఒక్కటొక్కటిగా విరిగిపడ్డాయి. అతని శరీరమంతా నుగ్గునూచమయింది. ముఖాలనుంచి రక్తధారలు స్రవింపసాగాయి. ఆ విధంగా మదమంతా ఉడిగిన వెంటనే కాళియుడు కొంత తెలివితెచ్చుకొని తన శిరోపరిభాగాన ఉన్నవాడు సామాన్యుడు కాడని గ్రహించి, 'త్వమేవ శరణ' మ్మని ఆత్మలో తలచి, అతనిని ఆశ్రయించాడు. కాళియుని పాటుచూసి అతని పత్నులు చింతాక్రాంతలై వస్త్రాలు జారుతున్నది భూషణాలు రాలుతున్నది కేశబంధాలు వీడినది తెలియరాని తహతహపాటుతో బిడ్డలతో పరుగుపరుగున వచ్చి – దూరదూరాల నుంచే శరణు శరణంటూ కృష్ణునికి ప్రణమిల్లి కరకమలాలు జోడించి –

## భగవత్‌స్తోత్రం

శ్లో. నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే
భూతావాసాయ భూతాయ వరాయ పరమాత్మనే.

శ్లో. జ్ఞాన విజ్ఞాననిధయే బ్రహ్మణేఽనంతశక్తయే
అగుణాయావికారాయ నమస్తే ప్రాకృతాయ చ.

శ్లో. కాలాయ కాలనాభాయ కాలావయవసాక్షిణే
విశ్వాయ తదుపద్రష్ట్రే తత్కర్త్రే విశ్వహేతవే.

శ్లో. భూతమాత్రేంద్రియ ప్రాణ మనోబుద్ధ్యాశయాత్మనే
త్రిగుణే నాభిమానేన గూఢస్వాత్మానుభూతయే.

శ్లో. నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే.

శ్లో. నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే
ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమోనమః.

శ్లో. నమః కృష్ణాయ రామాయ వసుదేవసుతాయ చ
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాం పతయే నమః.

శ్లో. నమో గుణప్రదీపాయ గుణాత్మ ఛ్ఛాదనాయ చ
గుణవత్త్యుపలక్ష్యాయ గుణద్రష్ట్రే స్వసంవిదే.

శ్లో. అవ్యాకృతవిహారాయ సర్వవ్యాకృతసిద్ధయే
హృషీకేశ నమస్తేస్తు మునయే మానశీలినే.

శ్లో. పరాపరగతిజ్ఞాయ సర్వాధ్యక్ష్యాయ తే నమః
అవిశ్వాయ చ విశ్వాయ తద్ద్రష్ట్రే తస్య హేతవే.

దేవా! నీ అవతారలీలలన్నీ ధర్మరక్షణ నిమిత్తాలు. ధర్మపరిపాలన విషయంలో నీవు సర్వసముడవు. దుష్టులు శత్రువులైనా పుత్త్రులైనా భిన్నదృష్టిని పాటింపవు. సర్వజీవులకు యథార్హదండనలను విధిస్తావు. మా భర్త తప్పుచేసి తదనుగుణంగా శిక్షను పొందాడు. నీ శిక్ష బాహ్యదృష్టికి నిగ్రహమనిపిస్తే అనిపింపవచ్చును. ఆంతరదృష్టికి మాత్రం మహానుగ్రహ మవుతుంది.

దేవా! నీకు రాగద్వేషాలు లేవు. అందువలన తనవారు పగవారు అన్న భేదాలు నీకు తోపవు. రాగద్వేషరహితుల కార్యపరంపర లోకసంగ్రహార్థమే తప్ప ఆత్మార్థకం కానేరదు. అంతేకాదు. నీచేత శిక్షితులైనవారు తమ కల్మషాలను బాసి శుద్ధచిత్తులై సాధుత్వాన్ని పొందుతారు. బంగారానికి పుటపాకం దాని శుద్ధ్యర్థమేగాని స్వర్ణకారుని ప్రీత్యర్థం కాదన్న సంగతి లోకవిదితమే కదా.

**ఉ. ఎట్టి తపంబుఁ జేసెనొకొ యెట్టి సుకర్మము లాచరించెనో**
**యెట్టి నిజంబు వల్కెనొకొ యీ ఫణి పూర్వభవంబునందు ము**
**న్నెట్టి మహానుభావులకు నెన్నడు జేరువగాని నీవు నేఁ**
**డిట్టి వినోదలీల దల లెక్కి నటించెద వీ ఫణీంద్రుపై.**

**మ. బహుకాలంబు తపంబుఁ జేసి వ్రతముల్ వాటించి కామించి నీ**
**మహనీయోజ్జ్వల పాదరేణుకణ సంస్పర్శాధికారంబు శ్రీ**
**మహిళారత్నము తొల్లిఁ గాంచె నిదె నేమం బేమియున్ లేక యీ**
**యహి నీ పాదయుగాహతిం బడసె నేఁ డత్యద్భుతం బీశ్వరా.**

**ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా**
**నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము**
**న్నొల్లరు యోగసిద్ధి మఱి యొందుభవంబుల నొందనీని నీ**
**సల్లలితాంఘ్రిరేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్.**

దేవా! సాధుశోచనీయములైన స్త్రీజన్మలు మాకు దాపరించాయి. స్త్రీలకు నాథుడే శరణు. మా నాథుడు నీ తత్త్వం ఎరుగక మూఢబుద్ధికి లోనై నీ యెడ

అపచారం జరిగింది. బిడ్డ తప్పును గాచిన తండ్రివలె అతని తప్పును మన్నింపగోరుతున్నాము. నీ శక్తి తెలియని తప్పిదానికి ప్రాణోత్క్రమణదశ వచ్చింది. దయతో ప్రాణదానం చేసి యీ నీ దాసీజనాన్ని కాపాడు' అని ప్రార్థించారు.

## శ్రీకృష్ణుని అనుగ్రహం

రాజా! నాగపత్నులు ఆ విధంగా ప్రార్థింపగా భగవానుడు వారి మొరవిని కాళియుని విడిచిపెట్టాడు. అతను కొంతవడికి దీర్ఘనిఃశ్వాసం వదలి ప్రజ్ఞను పొంది, 'దేవా! చరాచరాత్మక సర్వజగత్తు నీ వలన సృజింపబడుతున్నది. ఆ విధంగా సృష్టమైన జగత్తు ఏకవిధాన ఉండక వివిధ స్వభావవీర్యాది గుణాలను కలిగి ఉన్నది. నాగులమైన మేముకూడా నీ సృష్టిలోనివారమే కదా. మాకు తామసక్రోధాలు పుట్టుకతోనే కలిగాయి. స్వభావం దుస్త్యజమైనది. దానికి లోనై వర్తించటం సహజం. అందువల్ల మేము చేసే తప్పులన్నింటికీ నిజానికి మేము కారణభూతులము కానేరము. సర్వజ్ఞునికి నీకు తెలియనిది ఉంటుందా? నాయెడ అనుగ్రహమో నిగ్రహమో నీ ఇచ్చవచ్చినట్లు కావించు' అని దీనాతిదీన స్వరంతో విన్నవించాడు.

శ్రీకృష్ణభగవానుడు కాళియుని పలుకు విని, 'నాగేశ్వరా! ఈ మడుగు జనులకు ఉపయోగకరం కానున్నది. దీని జలాలను దేవతాది తర్పణచేసినా, దీని తీరాన ఉపవాసవ్రతమో భక్తిపూర్వక భగవచ్చరణార్చనమో నిర్వర్తించితే, సమస్తపాపాలు సమసిపోతాయి. కాబట్టి నీ విక్కడ ఉండరాదు. ఎవరికి భయపడి నీవు రమణకద్వీపాన్ని త్యజించి ఇక్కడికి వచ్చి దాగి ఉన్నావో, ఆ గరుత్మంతుడిక నీ జోలికి రాడు. నీ స్థానానికి నీవిక వెళ్ళవచ్చును. నా యీ అనుశాసనాన్ని సంధ్యావేళలలో స్మరించేవారికి సర్పభయం కలుగదు' అని ఆజ్ఞాపించాడు. కాళియు డందుకు ఎంతగానో సంతోషపడి సపత్నీకంగా భగవంతునికి పూజానమస్కారాలు కావించి అతని ఆనతి గొని రమణకద్వీపానికి వెళ్ళిపోయాడు.

## స్వభావ తత్త్వవిచారం

మునులారా! స్వభావం దుస్త్యజమని, దానిని భగవానుడే ఇస్తున్నాడని, ఆ స్వభావం దుష్టంగానో శుభంగానో ఉండవచ్చునని, దుష్టస్వభావులు వారి చేతలకు వాస్తవమైన కర్తలు కారని కాళియుడు పలికాడు. ఆ పలుకులు పరమార్థాలని భావింపకండి. అతని మాటలు శాస్త్రవిరుద్ధమైనవే గాక అనుభవానికి కూడా సరిపోవు.

> స్వభావమంటే ఏమిటి? ప్రారబ్ధకర్మఫల వాసనల సముచ్చయం కదా. స్వభావం జడమైనప్పటికీ ఆత్మసాన్నిధ్యంలో అది వర్తిస్తున్నది. ఆ రహస్యం గ్రహింపలేక దానిని భగవంతుడు నడుపుతున్నాడని అనుకొంటారు. అంతకంటె వేరొక పొరబాటున్నదా? స్వభావానికి కర్మము, దానికి కామము, దానికి సంకల్పము కారణాలని భగవానుడే అన్నాడు. మొట్టమొదట సంకల్పం జనించటానికి కారణం ఏమిటో కనబడదు.
>
> స్వభావవాసనాజనితమైన కోరికను బట్టి ఫలము స్వార్థమో పరార్థమో అవుతున్నది. పరార్థ పరస్వభావ ప్రేరణలన్నీ లోకోపకారకాలుగా ఉంటాయి. లోకోపకారక కర్మము భగవత్పూజాత్మకం అవుతుంది. అట్టివారికి వారి కర్మఫలానుభవానికి కారణం ఉండదు. అందువలన పరమకళ్యాణమే వారికి స్వతస్సిద్ధం. వారినే జీవన్ముక్తులని అంటారు.

స్వార్థపరస్వభావం ఎల్లప్పుడు తత్తద్రూపకర్మలనే ప్రేరేపిస్తుంది. ఆ కర్మఫలాలను అనుభవింపక తప్పదు. అనుభవార్థం తత్తద్యోగ్యమైన శరీరధారణమూ తప్పదు. ఈ విధానాన్నే జననమరణ సంసారమని అంటారు.

స్వార్థపరుల స్వభావం మూడు విధాలుగా వర్తిస్తుంది. పరధనాదికాంక్ష గాని పరప్రకర్షాదులు గాని లేక స్వశక్తికొద్దీ పాటుపడి శరీరధారణావసర వస్తువులను సేకరించి జీవించటం ఒక పద్ధతి. ధర్మాధర్మవిచికిత్స లేక పరులకు బాధ కలిగించి అయినా ఏదో ఒక తీరున ఈప్సితార్థాలను పొందటం మరొక పద్ధతి. అవసరం ఉన్నా లేకపోయినా పరులను బాధించటమే ఆత్మసంతోషకార్యంగా భావించి నడుచుకొనటం ఇంకొక పద్ధతి. ఈ మూడింటిలో మొదటిది కేవల సత్త్వగుణప్రేరితంగాను, రెండవది రజోగుణప్రేరితంగాను, మూడవది తమోగుణప్రేరితంగాను ఉంటాయి.

మునులారా! పరమేశ్వరుడు చైతన్యాత్మకుడు. ఆ చైతన్యాన్ని శక్తి అన్నారు. ఆ శక్తి అన్నది జ్ఞానేచ్ఛాక్రియారూపాలలో వ్యవహరిస్తుంది. జ్ఞానము నిర్వికల్పకంగా ఏకరూపాన ఉంటుంది. ఇచ్ఛాశక్తి అనేదానికి మూడు అవస్థలున్నాయి. వాటిని గుణములని అంటారు. ఆ గుణాలలో సత్త్వము నిర్మలమైనది కాబట్టి దాని ప్రేరణము, ఆ గుణము చేత ప్రేరేపితమైన కార్యము ఉత్తమమార్గంలో ఉంటాయి. రజస్సు రాగాత్మకం కాబట్టి దాని ప్రేరణ భోగాత్మకం అవుతుంది. తమస్సు మౌఢ్యాత్మకం కాబట్టి దాని ప్రేరణాదులు ఆ విధంగానే ఉంటాయి.

ఈ విధంగా విమర్శించినప్పుడు శక్తిత్రయంలో ఇచ్ఛ వర్తించినప్పుడు మాత్రమే క్రియ ప్రారంభమవుతున్నది. ఏదో ఒకటి కావలసినప్పుడు దానిని పొందాలనే తలంపును కోరిక అంటున్నాము. భగవానుడు సర్వసంపూర్ణుడు. అతనికి కోరదగినది గాని, పొందదగినది గాని వస్తువొకటి ఉండదు. అట్టి భగవానునికి కోరిక జనించటమూ, దానిని పొందటానికి క్రియ చేయవలసి రావటమూ ఎలా పొసగుతుందనే సంశయం జనించింది. ఆ సంశయనివారణార్థమై తత్త్వవిమర్శకులు ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన ఉపపత్తిని చూపారు.

## సృష్టి విచారం

భగవంతునికి మొట్టమొదట ఇచ్ఛ ఎప్పుడు జనించినదనే ప్రశ్న వచ్చింది. ఏ విధంగా చూసినా దానికి సరైన సమాధానం కుదరలేదు. అందువలన ఇచ్ఛాజననం, దాని ఫలమైన సృష్టి అనాది అని నిశ్చయించారు. సృష్టి అంటే ఏమిటి? భగవత్తత్త్వం విస్తృతిని పొందటం సృష్టి అనబడుతున్నది. విస్తారఫలంగా వివిధ రూపనామాలు ఏర్పడుతున్నాయి. ప్రతిరూపమూ భగవదంశమే కాబట్టి శక్తిత్రయం అందులో అనుస్యూతమై ఉన్నది. శక్తివిస్తారఫలమైన సృష్టి మొత్తం ఏకరూపాన ఉండక వివిధాకృతులు ధరించటానికి కారణం ఏమిటి? అనే ప్రశ్న వచ్చింది. కారణాన్ని గురించి పెక్కుమంది పెక్కు విధాల దీర్ఘవిచారాలు చేశారుగాని యుక్తియుక్తమైన సారాంశం నాటికీ నేటికీ కూడా తేలలేదు. ఆ కారణాన దానిని అగమ్యమని అన్నారు. ఆ విచారం మాని 'స్థితస్య గతిః చింతనీయా' అనే న్యాయాన్ని అనుసరించారు.

మునులారా! సృష్టిలోని చరాచర సమస్త పదార్థాలలో శక్తిత్రయం అనుస్యూతంగా ఉన్నదని, వాటి ఉనికి అన్నింటిలోనూ ఏకరూపాన గాక వివిధరూపాలలో ఉన్నదని, ఆ వివిధత్వాన్ని బట్టి సృష్టియందు నానాత్వం ఏర్పడినదని, అందుకు కారణం అగోచరమని అనుకొన్నాము. వస్తుకోటి ఆ విధంగా నానారూపాలలో ఉన్నప్పటికీ, అవన్నీ దేనికదే హాయిగా ఉండాలనే కోరికతో నిండి ఉండటమూ, ఆ హాయికోసం అహరహం తహతహలాడుతుండటం మనము చూస్తున్న సంగతే. దీనినిబట్టి ఏమని ఏర్పడుతున్నది? ఆనందమనేది వస్తురాశికి నైజమని, ఏ కారణం చేతనో అది భ్రంశమైనందువలన దానిని మళ్ళీ పొందటానికి వస్తురాశి సర్వవిధాల ప్రబలప్రయత్నం చేస్తున్నదని తేలుతున్నది. కాగా ఆనందమన్నది జ్ఞానలక్షణం కాబట్టి ప్రతివస్తువు జ్ఞానాత్మకమని, జ్ఞానము భగవంతుని స్వరూప లక్షణం కాబట్టి భగవంతుడు ప్రతివస్తువులో ఉన్నాడని నిశ్చితమయింది.

మునులారా! శక్తివిస్తారం మొట్టమొదట మహద్రూపాన్ని ధరించింది. దానినుంచి ఆకాశతత్త్వం, దానినుంచి వాయుతత్త్వం, దానినుంచి జలతత్త్వం, దానినుంచి అగ్నితత్త్వం, దానినుంచి పృథ్వీతత్త్వం క్రమంగా జనించాయి. పృథ్వీతత్త్వం నుంచి సర్వోపాధులు కలిగాయి. అందువలన ప్రతి ఉపాధిలోనూ పృథ్వీతత్త్వం తక్కినవాటి కంటె విశేషించి ఉంటుంది.

మునులారా! కారణం లేక కార్యము కలుగదు కాబట్టి ఏకవస్తువు నుంచి నానార్థాలు ఏర్పడటానికి కారణం ఉండి తీరాలి. కారణం ఇదని తెలియకపోవచ్చును. అంతమాత్రాననే సర్వం నిష్కారణజనితమని భావింపకూడదు. సృష్టి అంటే భగవంతుని తమశ్శక్తివిస్తారం కాబట్టి, తమస్సు వలన కలిగిన ఉపాధులలో భగవంతుడు జీవరూపంలో ఉంటాడు కాబట్టి, జీవుడు భగవదంశతో ఆనందాత్మకుడై ఉన్నప్పటికీ తమస్సు యొక్క ఆవరణవిశేషం వలన తన వాస్తవస్థితిని మరచి ఆనందం అన్యపదార్థాల వలన లభిస్తుందని భావించి వాటికోసం ప్రాకులాడటం మొదలుపెట్టాడని, ఆ ప్రాకులాటల వలన అతనికి తృప్తి కలగలేదని, తృప్తి కలుగని కారణాన కోరికలు – ఆ కోరికల సాధనకు ప్రయత్నాలు నానాటికీ పెచ్చుపెరిగాయని, అట్టి కోరికల ఫలితంగా వివిధ శరీరాలు, ఆ శరీరాలకు యోగ్యమైన గుణకర్మలు కలుగుతున్నాయని పెద్దలు ఊహించారు.

మునులారా! ఈ దృష్టితో విచారించితే, కాళియుని స్థితిగతులకు అతని కోరికలే కారణభూతాలు గాని, భగవంతుని పక్షపాతం ఎంతమాత్రమూ లేదని స్పష్టపడుతుంది. మరొక విశేషం. ఏ ఉపాధి తొలుదొల్త అత్యంత క్రౌర్యవంతమూ, లోకోపద్రవాత్మకమూ అయినదో – ఆ ఉపాధే కాలాంతరంలో శుద్ధసత్త్వమయమూ, లోకకల్యాణాత్మకమూ అవుతుండటాన్ని వింటూ చూస్తూ ఉన్నాము. భగవంతునికే పక్షపాతబుద్ధి ఉంటే అట్టి ఉపాధులలో తానూ ఉన్నాడు కాబట్టి, వాటి పూర్వపరావస్థలను చూస్తూ ఊరుకొంటాడా? అవ్యగ్రబుద్ధితో విషయాన్ని పరిశీలించి సత్యాన్ని గ్రహించాలి. ఊహ ప్రపంచాన్ని మాత్రమే నమ్మి వర్తింపకూడదు.

## కాళియుని పూర్వవృత్తాంతం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు కాళియుని సంగతి విని, 'మునివర్యా! అతను పూర్వం ఒకప్పుడు రమణకద్వీపవాసి అని మీ మాటలను బట్టి తెలుస్తున్నది. ఆ ద్వీపాన్ని వదిలి అతను యమునాహ్రదానికి ఎప్పుడు వచ్చాడు? ఎందుకు వచ్చాడు?' అని అడిగాడు. అతనితో శుకమహర్షి ఈ విధంగా అన్నాడు.

'రాజేంద్రా! గరుత్మంతుడు తనకు సర్పాలు ఆహారమయ్యే వరాన్ని పొందాడని చెప్పాను. ఆ సంగతి విని సర్పాలు తమలో ఎవరికి ఎప్పుడు చావుమూడుతుందో అన్న భయంతో దినదినగండంగా ప్రాణాలను అరచేతిలో ఉంచుకొని ఆకులపడసాగాయి. ఎట్టకేలకు సర్పకులం వారందరూ కలిసి మంతనం కావించి, కార్యాన్ని నిశ్చయించి గురుడుని వద్దకేగి, 'అయ్యా! మాలో నెలకొక్కరి వంతున మీకు సమర్పించుకొంటాము' అని చెప్పి ఆ ప్రకారం చేయసాగారు.

అట్లా జరుగుతుండగా కొంతకాలానికి కాళియుని వంతు వచ్చింది. అతను తన విషవీర్యబలాదులను నమ్మి గరుత్మంతుని లెక్కచేయక తన వంతు వచ్చిననాడు ఇంటిలోనే ఉండిపోయాడు. వైనతేయుడు కాలవ్యవధిని చూసి కారణం ఊహించి కాళియుని వద్దకు వచ్చాడు. కాళియుడు గరుత్మంతుని చూసి పడగలు విప్పి అతని పయిబడి కసితీరా కరిచాడు. అందుకు గరుత్మంతుడు మహాగ్రహోదగ్రుడై ఎడమ రెక్కతో కాళియుని ఒక్క పెట్టున మోదాడు. ఆ రెక్క దెబ్బకు కాళియుడు విలవిలలాడి తెలివితప్పి నేలబడి తేరుకొన్న తర్వాత అక్కడి నుంచి పారిపోయి ఈ మడుగు చేరి ప్రాణాలను దక్కించుకొన్నాడు.

రాజా! పూర్వం గరుడుడు మత్స్యభోజనం చేయాలని ఈ మడుగు వద్దకు వచ్చి ఒక చేపను పట్టుకొన్నాడు. సౌభరిమహర్షి అక్కడ ఉండి ఆ దృశ్యాన్ని చూసి జాలిపడి, 'వైనతేయా! నీవు పట్టిన చేపను వదిలిపెట్టు' అన్నాడు.

గరుడుడు ఆ మహాత్ముని లెక్కచేయక మత్స్యాన్ని భక్షించాడు. సౌభరి అందుకు కోపించి, 'పతంగేశ్వరా! ఇది మొదలు నీ విక్కడికి వచ్చి ఇందలి చేపలను తిన్నట్లయితే వెంటనే మృతినొందగలవు జాగ్రత్త!' అని శపించి ఆ హ్రదంలోని చేపల పరితాపాన్ని తీర్చాడు. ఆ కారణాన మడుగు గరుత్మంతునికి చొరరానిదయింది. ఆ సంగతి కాళియునికి మాత్రమే తెలుసు. అందువల్లనే అతనక్కడికి చేరి ప్రాణాలను దక్కించుకోవటం జరిగింది.

## గోపకుల సంతోషం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు ఆ విధంగా కాళియుని ఆజ్ఞాపించి రమణకానికి పంపివేసి మడుగు వదిలి బయటికి వచ్చాడు. కృష్ణుని రాకకు గోపికా గోపకుల సంతోషం మితిమీరింది. యశోదా రోహిణీ నందులకు పోయిన ప్రాణాలు మళ్ళీ వచ్చినట్లయింది. బలరాముడు కృష్ణుని మహిమ తెలిసినవాడు కాబట్టి అనుజరూపంలో ఉన్న ఆ మహాత్ముడు తిరిగిరాగానే అతనిని కౌగిటచేర్చి మందహాసం చేశాడు. యశోద ప్రేమాతిరేకంతో కృష్ణుని సందిట జేర్చుకొని ఆనందాశ్రువులలో అతనిని జలకమాడించింది.

## దవాగ్ని

రాజా! అంతలో సూర్యాస్తమయమయింది. ఆ రాత్రికి అందరూ కాళిందీనదీ తటాన బసచేశారు. ప్రొద్దుటినుంచి అన్నపానాలు లేని కారణానికి తోడుగా కలిగిన దురవస్థ వల్ల అందరూ అలిసి ఉన్నారు. పెందలకడనే ఎక్కడివారక్కడ మైమరిచి నిద్రపోయారు.

అర్ధరాత్రివేళ తటాలున కార్చిచ్చు వనమంతటా అలముకొన్నది. మంటలు చెలరేగి గోపకులను, గోగణాలను చుట్టుకొన్నాయి. అగ్ని వేడిమికి ఆబాలగోపాలం తత్తరపాటుతో మేలుకొని, కళ్ళుతెరిచి చుట్టుకొనివస్తున్న మంటలను చూసి కాలుచేతులాడక 'కృష్ణా! కృష్ణా! రామా! రామా!' అని కేకలు వేయసాగారు. కృష్ణుడు వారి దీనాలాపాలు విని ఆ దవాగ్నిని

మ్రింగివేశాడు. క్షణంలో అంతటి మహానలం పొలకువే లేకుండా మాయమయింది. గోపకులందరూ ఆ వింతకు ఆశ్చర్యపోతూ తాము కళ్ళారా చూసినదీ అనుభవించినదీ అయిన ఆ ఘటన కల అనుకోవాలో కల్ల అనుకోవాలో అని చర్చించుకోవటం మొదలుపెట్టారు. ఆ చర్చలతో నిశాశేషం గడిచిపోయింది. తెల్లవారగానే అందరూ బయలుదేరి గోధనాలతో వ్రేపల్లెకు చేరుకొన్నారు.

## గ్రీష్మ ఋతువు

రాజేంద్రా! కొన్నాళ్ళకు గ్రీష్మఋతువు వచ్చింది. ఆ ఋతువు సాధారణంగా అంత ప్రియమైనది కాకపోయినా బృందావనంలో మాత్రం అది వసంతఋతువు వలెనే ప్రియంకరంగా ఉంటుంది. కారణమేమంటావా? ఆ వనంలో సెలయేళ్ళు, సరస్సులు అనేకం ఉన్నాయి. ఆ ప్రాంతం లోని వాయువు నదీసరోవరశీకరశిశిరమై వికచకమలకువలయ గంధరేణుబంధురమై మందమందగతిని హాయిగా వీస్తుంటుంది. ఏ చోట చూసినా పచ్చికబయళ్ళు విస్తరించి పచ్చపట్టు శాలువలను పరిచినట్లు కంటికి ఎండవేడిమిని తగులనీయక చల్లదనాలను విరజిమ్ముతుంటాయి. లతావితానాలు పూచి నెత్తావులను వెదజల్లుతుంటాయి. నానావిధమృగపక్షులు తమ ఆనందాతిశయాన్ని వెల్లడిస్తున్నట్లు చిత్రనాదాలను పలికిస్తుంటాయి. ఒకవంక తుమ్మెదలు పుష్పమధువులను గ్రోలి కైపెక్కి పాటలు పాడుతుండగా, ఒకచాయ నెమళ్ళు పురివిప్పుకొని క్రేంకారవాలు చేస్తూ నృత్యమాడుతుండగా, ఒకక్రేవ కోయిలల పంచమస్వరనాదాలు వీనులవిందు గొలుపుతుండగా జీవరాశికి అక్కడ గ్రీష్మవేదన మాటెక్కడిది?

## శ్రీకృష్ణుని గ్రీష్మవనవిహారం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు గ్రీష్మవనవిహారం సంకల్పించి ఒకనాడు తెల్లవారగానే లేచి బలరాముని వెంటగొని ఆలమందను కదలించి

శ్రవణమనోహరంగా పిల్లనగ్రోవి వాయిస్తూ బయలుదేరాడు. ఆ నాదం వినగానే గోపాలకులు వారివారి మందలతో వెంటకదిలారు. అందరూ బృందావనం చేరుకొని ఆవులను మేతకు వదిలారు.

అంతట వారు నెమిలి కుంచెలను, పుష్పమాలలను, గిరిధాతువర్ణాలను యథారుచి ధరించి నృత్యగానాలతో కొంతసేపు గడిపి కొంతసేపు ఆటలలో బలాబలాలు ప్రకటించి, గెలుపొందినవారికి మెప్పులు పలికి, పండ్లుతెచ్చి పిడికిళ్ళలో దాచి ఆడుతూ, పాడుతూ జింకపిల్లలలా చెంగుచెంగున గంతులు వేస్తూ పరుగులుపెడుతూ, పక్షులవలె ఎగరబోతూ, కప్పల వైఖరిని గుప్పించుతూ, పరిహాసాలు పలుకుతూ, కొమ్మలు పట్టి ఊయెలలూగుతూ, ఒకడిని రాజుగా చేసి తక్కినవారు అతనికి సేవలందిస్తూ, అంతలో అతనిని ఆటపట్టిస్తూ, నదులలో ఈతలుకొడుతూ, గిరిగుహలు దూరుతూ పొదరిండ్లు కదిలిస్తూ వివిధరీతుల విహరిస్తున్నారు.

## ప్రలంబాసుర విహారం

ఆ అదనుచూసి ప్రలంబుడనే అసురుడు రామకృష్ణులను చంపదలచి గోపబాలకుని రూపం ధరించి అక్కడికి వచ్చి వారి ఆటపాటలలో పాల్గొనదలిచాడు. కృష్ణుడు అతని కృత్రిమభావాన్ని గ్రహించినా అతని కోరికకు సమ్మతించి, గోపబాలకులను పిలిచి 'మిత్రులారా! మనము రెండు పక్షాలుగా ఏర్పడి ఆడుకొందాము. ఓడినవారు గెలిచినవారిని తమ మూపుమీదికి ఎక్కించుకొని మోయాలి' అన్నాడు. అందరూ సరేనన్నారు.

శ్రీదాముడు, వృషభుడు, బలరాముడు మొదలయినవారు ఒకవంక నిలుచొన్నారు. శ్రీదామునికి ఉద్దిగా కృష్ణుడు, వృషభునికి ఉద్దిగా భద్రసేనుడు, బలరామునికి ఎదిరిగా ప్రలంబుడు ఇంకా అదే విధంగా తక్కినవారు ప్రతిపక్షాలు తీరి ఆటకు సిద్ధపడ్డారు. ఆ ప్రకారం జతలు కూడినవారు ఆ చెంతనున్న భాండీరకమనే గొప్ప మర్రిచెట్టు చాయకు పోయి ఆటసాగించారు. కృష్ణుని పక్షం అపజయాన్ని పొందింది. పన్నిదం ప్రకారం కృష్ణుడు

శ్రీదాముని, భద్రసేనుడు వృషభుని, ప్రలంబుడు బలరాముని మూపులపయి ఎక్కించుకొని మోయసాగారు.

రాజా! కృష్ణుని చెంత తన ఆటలు సాగవని ప్రలంబుడు గ్రహించి యదువీరునికి దూరం కాదలచి, బలరాముని మోసికొని త్వరత్వరగా పరుగెత్తసాగాడు. ఆ పరిగెడుతున్నప్పుడు అడుగడుగున మూపుమీద బరువు అధికతరం కాసాగింది. ప్రలంబుడు అతికష్టం మీద బలరాముని దూరానికి తీసుకొనివెళ్ళి, మూపునుంచి క్రిందికి దించి, స్వరూపం ధరించి, కన్నుల నిప్పులు కురిపిస్తూ బొమలు ముడిచి నోరప్పళించి కోరలు బయటపెట్టి ఘోరదర్శను డయ్యాడు. బలరాము డదిచూసి 'ఏమిటీ వింత!' అని కొంత ఆలోచించి, 'ఓహో! వీడు అసురుడు; నన్ను చంపటానికి ఇంత దూరం వచ్చాడు; సరిసరి' అని లోలోన నిశ్చయించుకొని, దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాన్ని మోదినట్లు అతని మీదికి ముష్టిఘాతం ఒకటి సారించాడు. ఆ వ్రేటుకు తలపగిలి ముక్కలై ప్రలంబుడు నెత్తురులు గ్రక్కి నేలరాలి ప్రాణాలు విడిచాడు. గోపాలకు లదిచూసి హుటాహుటి బలరాముని వద్దకు పరుగులు తీసి అతనిని కౌగిటగూర్చి ఆదరించి దీవించి ప్రశంసించారు. దేవతలు పుష్పవృష్టి కురిపించి తమ సంతోషాన్ని ప్రకటించారు.

## ముంజారణ్యం

రాజేంద్రా! అప్పుడు రామకృష్ణులు, గోపాలకులు తిరిగి భాండీర వృక్షం చెంతజేరి ఆటలను మొదలుపెట్టారు. ఆలమందలు పచ్చికలు మేస్తూ వనంనుంచి వనానికి పోతూ క్రమంగా ముంజారణ్యంలోనికి ప్రవేశించాయి. గోపాలకులు కొంతసేపు ఆటలాడి అలసిసొలసి నలువైపుల పరికించారు. చూపుమేర దూరంలో ఆవులెక్కడా కానరాలేదు. వారు గోవులను వెతకటం మొదలుపెట్టి ఆవుల నోటినుంచి రాలిపడిన గడ్డిపరకలను, పచ్చికలమీద అక్కడక్కడ కానవచ్చిన అడుగులను బట్టి జాడలు తీస్తూ ఆ వనమంతా కలయదిరిగి గోగణం కనిపించక నిరుత్సాహు లయ్యారు.

శ్రీకృష్ణుడు గోపకుల పాటుచూసి ఆ చెంత మిన్నంటుతున్న మహావృక్షాన్ని ఎక్కి కొట్టకొనకు పోయి నలుదెసలు చూసి ఒకచోట గోవులున్నది కనుగొని కేకవేశాడు. అతని పిలుపు విని గోవులు మోరలెత్తి ఆ ధ్వనివచ్చిన వంకకు చూపు సారించి మారు అరిచాయి. గోపాలకులు ఆ సడినిబట్టి ఆవులకు ఏమీ కాలేదని గ్రహించి సంతోషపడ్డారు.

## మళ్ళీ దవాగ్ని

రాజేంద్రా! అంతలో ఆ వనాంతరంలో మహోగ్ర దవాగ్ని పుట్టి గాలికి చెలరేగి చరాచరభూతకోటిని మ్రింగబోతున్నట్లు మంటలు నాల్కలు చాచి నలుదెసలు వ్యాపించి అత్యంతఘోరాకారాన్ని ధరించాయి. గోవులు, గోపాలకులు ప్రాణాలమీద ఆశవిడిచి గోడుగోడుమన్నారు. దీనాక్రందనలను కృష్ణుడు విని 'భయపడవద్దు; కన్నులు మూసుకొనండి' అని పలికాడు. గోపాలకులు అతను చెప్పినట్లు చేశారు. యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు ఆ కార్చిచ్చును మ్రింగి ఆలమందలను, తత్పాలకులను నిమిషంలో భాండీరవృక్షఛాయకు చేర్చి 'కన్నులు విప్పి చూడండి' అన్నాడు. వారు కన్నులు తెరిచి తామూ తమ గోవులూ చెక్కుచెదరక భాండీరవృక్షం నీడనున్నది చూసి 'ఓహో! ఇది కృష్ణుని యోగమాయా ప్రభావమే గాని వేరుకాదు. ఈ పని మర్త్యమాత్రులకు సాధ్యం కాదు. మన కృష్ణుడు నిజంగా భగవంతుడే' అని ప్రశంసించారు.

## వర్షర్తు విహారం

రాజా! వేసవి వచ్చి లోకాన్నంతటినీ ఉడ్డుడికించి తన ప్రతాపాన్ని చూపింది. ఎండవేడిమికి చరాచరప్రపంచం తల్లడిల్లింది. ప్రపంచదురవస్థను తీర్పవచ్చినట్లు వర్షర్తువు అడుగుపెట్టింది. రాజుతో పటాలం బయలుదేరినట్లు ఋతువుతో పరివేషాది పరివారాలు తరలి ఆకసాన్ని ఆక్రమించాయి. నభోభాగం చలించింది; కారుమబ్బులు లేచి ఉరుములు మెరుపులతో

ముసురుకొన్నాయి. గుణాలకు చిక్కువడిన జీవబ్రహ్మము వలె మేఘాచ్ఛాదితాలై తేజోరాసులు కాంతిదప్పాయి. రాజభటుల చేత చిక్కిన దొంగమల్లుడు తన పరివారమూలకంగా తాను హరించిన ముల్లెను తిరిగి వారిచేతనే తెప్పించి యిచ్చినట్లు పర్జన్యరూపుడైన సూర్యుడు భూమినుంచి ఎనిమిది నెలల పర్యంతం నిజకిరణాల మూలాన హరించిన ఉదక ధనాన్ని తిరిగి తత్కిరణాల మూలాననే నేలకు అందజేయసాగాడు. భటులు తాము పట్టుకొన్న చోరాపహృతసంపదను పోగొట్టుకొన్నవారికి ఇచ్చినట్లు మేఘాలు సూర్యకిరణదత్త నీరాలను గ్రహించి ప్రచండ వాతాల నధిష్ఠించి వడివడిగా తెచ్చి భూమికి సమర్పించాయి. అర్థాన్ని కోల్పోయి దుఃఖవశుడై కృశించినవాడు తన సొమ్ము దొరికినప్పుడు ఊరట చెందినట్లు భూమికూడా జలధనాన్ని కోలుపడి ఎండ వేడిమికి పగిలి నెరియలుపడ్డది వర్షం కురిసే సరికి చల్లబడి ప్రశాంతిని పొందింది. వర్షకాలపు మునుమాపులలో గ్రహనక్షత్రాదుల కాంతులు తొరగినందువల్ల మిణుగురులు చెలరేగి మినుకు మినుకు కాంతులను ప్రకటిస్తూ – కలియుగంలో వేదప్రచారం ఉడిగినందువల్ల పాషండమార్గాలు విజృంభించే వైఖరిని తోపింపసాగాయి. ఉరుము ధ్వని విని కప్పలు బెకబెకలాడుతూ నిత్యకర్మాంతంలో గురుని ఆజ్ఞవిని శిష్యులు వేదాధ్యయనం మొదలుపెట్టిన క్రమాన్ని జ్ఞప్తికి తెచ్చాయి. ఎండ వేడిమికి నీటినంతటినీ కోలుపోయిన చిన్నికాల్వలు వర్షోదకంతో నిండి ఉబికి నానామార్గాల ప్రవహిస్తూ ఇంద్రియపరవశులైన జనుల నిరంకుశ వర్తనను స్ఫురింపజేశాయి. ధాత్రీతలం బాలతృణనీలమూ ఇంద్రగోపారుణమూ అయి పుట్టగొడుగుల నీడను అలరారుతూ రాజశ్రీని తోపజేసింది. కేదారాలు వర్షం కారణాన ఒకచోట సస్యశ్యామలాలు, ఇంకొకచోట నష్టసస్యాలు అయి కృషీవలులకు హర్షశోకాలను కలిగిస్తూ కేవలాహంకారచిత్తుని పోటుపాటులను ప్రకటించాయి. నీటను మెట్టను నివసిస్తున్న ప్రాణులు క్రొత్తనీటిని సేవించి రుచిరరూపాలు పొంది భగవత్సేవాపరులైన భాగవతుల మనఃపరిణామ విశేషాలకు నిదర్శనా లయ్యాయి. నదీసంగమం వలన సాగరం కల్లోలమాలికాభీలమై

కామాసక్తమైన అపక్వయోగి చిత్తజలజాతం విషయసంగం వలన పొందే పాటును చాటిచెప్పింది. గిరులు వర్షధారాహతులకు ఏ మాత్రం చలింపక భగవద్భక్తులు వ్యసనసమయాలలో సయితం నిబ్బరంగా ఉండాలన్న నియమాన్ని ప్రబోధించాయి. రాకపోకలు లేని కొన్ని మార్గాలలో పచ్చికలు మొలిచి సందిగ్ధాలై వల్లింపనందువల్ల కాలోపహతాలైన వేదాల స్థితిని తలపుకు తెచ్చాయి. చంచలసౌహృదాలయిన మెరుపులు లోకబంధువులైన మేఘాల పట్ల నిలకడ లేకుండా చరిస్తూ జారస్త్రీలు గుణవంతులైన పురుషుల పట్ల నడుచుకొనే విధాలను ప్రకటించాయి. గర్జాధ్వని గుణకమైన గగనతలాన గుణరహితమైన మహేంద్రచాపం తోచి గుణవ్యతికరాత్మక ప్రపంచంలో నిర్గుణపురుషుడు ఉదయించే తీరును తెలియజెప్పింది. చంద్రుడు స్వచంద్రికాభిరామ మేఘావృతి వలన తిరోహిత స్వప్రతిభాసుడై ఆత్మప్రకాశభాసితమైన అహంకారంతో నిండిన జీవుని స్థితిని చాటిచెప్పాడు. మయూరాలు నీరదసమాగమానికి ప్రమోదించి గృహనిర్విణ్ణులు భాగవతసమాగమం వలన పొందే సంతోషాన్ని వెల్లడించాయి. వృక్షాలు తమ వ్రేళ్ళతో నీరుగ్రోలి నూత్నవికాసాలను పొందటం చూస్తుంటే తపఃకృశీభూతులై ఆకలికి డస్సినవారు దైవప్రాప్తంగా ఇష్టార్థసిద్ధులను బడసినప్పుడు వారికి కలిగే మహోల్లాసం తలపుకు రాసాగింది. చక్రవాకాలు తాము వసిస్తున్న సరోవరాలు నీరింకి పంకకంటకాలతో నిండినా వాటిని విడువలేక అక్కడే అంటిపెట్టుకొని ఉంటూ గ్రామ్యజనులెన్ని కష్టాలు వచ్చినా వారి కుటుంబాలను విడువలేకపోవటాన్ని తెలిపాయి. నదులు ప్రవాహవేగం వలన కట్టలుతెగి పారటంచూడగా వేదాలు కలియుగంలో పాషండ దుర్వాదాలకు లోనై పొందే పాట్లు తలపుకు వచ్చాయి. వాయుసముద్దీపితాలై మబ్బులు క్రమ్ముకొని భూతజాతానికి అమృతాలను కురిపించటం చూడగా పురోహిత ప్రేరితులై రాజులు ప్రజాభీష్టాలను నెరవేర్చే తీరు స్ఫురించింది. బృందావనాంతర జంబూ ఖర్జూరాదులు జడివానల వలన కలిగిన ఆత్మానందాన్ని తెలుపుతున్నట్లు నిండుగా పూచి కాచి పండిన పండ్ల సుగంధాలను విరజిమ్మాయి.

రాజేంద్రా! ఆ వర్షాకాలంలో కృష్ణుడు ప్రభాతసమయాన లేచి ఆవులను పేరుపేరునా పిలిచి తాను ముందుగా దారితీస్తాడు. గోవులు పొదుగుల బరువుతో నడవలేక నడవలేక కృష్ణుని వెంబడిస్తాయి. ఆ వెనుక బలరాముడు, గోపకులు వారి వారి మందలతో బయలుదేరుతారు. ఆ విధంగా వారు వనాంతరం చేరుకొని పూవు తేనియలు కురిసే వనవీథులను కనుగొంటూ సెలయేళ్ళ గలగలలకు ఆనందిస్తూ, గిరికందరాలూ వృక్షకోటరాలలో దాగుడుమూతలాడుతూ, కందమూలఫలాదులను ఆరగిస్తూ కొంతసేపు గడిపి ఆకలికాగానే ఏటిఒడ్డున రాళ్ళపయి బారులుతీరి కూర్చుండి తమతమ పెరుగన్నపు మూటలు విప్పి కొంత కొంత భుజిస్తూ అక్కడినుంచి లేచి పచ్చికల మీద పద్మాసనాలు వేసుకొని భుక్తశేషాన్ని భుజిస్తుంటారు. కృష్ణుడప్పుడప్పుడు తన శక్తివిలాసం వలన సమస్తభూతాలకు కలుగుతున్న సుఖాన్ని చూసి లోలోపల ఎంతో సంతోషిస్తుంటాడు.

## శరదృతు విహారం

రాజేంద్రా! మింట మబ్బులు విరిసి కదలాడటం, జలాలు మలినాలను బాయటం, గాలి చల్లచల్లగా వీయటం, వర్షపాతానికి తలవంచి ఉన్న తమ్మివిరులు తలలెత్తటం, కాసారనీరాలు ప్రసన్నతరాలై యోగభ్రష్టుల మనస్సులు మహాత్ముల సేవాఫలప్రాప్తశుద్ధిని సూచించటం మొదలయిన లక్షణాలచేత శరత్కాలాగమం ప్రకటితమయింది.

ఆ విధంగా శరత్సమయం వచ్చి గగనభాగానికి కలిగిన నీరదావరణాన్ని, భూతాలకు సంభవించిన సాంకర్యాన్ని, ధాత్రికయిన పంకిలత్వాన్ని, జలాలకు ప్రాపించిన మలినాన్ని తొలగించి, భగవద్భక్త్యుదయం వలన బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ యత్యాశ్రమాల నాలుగు తెగలవారు క్రమంగా గుర్వర్థ జలాహరణకుంభశ్రములు, మలధారణక్లేశ విశిష్టులు, కామాదివాసనా మలినవిహీనులు అయిన విధాన్ని బోధించింది. జలదాలు తమ కలిమినంతటినీ త్యజించి శుభ్రతేజోవంతాలుగా వెలుగొందుతూ

మునీంద్రులు పుత్ర విత్త దారైషణలను విడిచిపెట్టటం వలన కిల్బిషరహితులై శాంతులు, శుభ్రతేజోవంతులు కావటాన్ని చాటాయి. గిరులు తమలోని నిర్మలోదకాలను ఒకచోట ఏకముఖంగా ప్రవహింపజేస్తూ, ఒకచోట పల్లవాలను నింపుకొంటూ, జ్ఞానులు జ్ఞానాన్ని అధికారితారతమ్యాన్ని బట్టి ఉపదేశించాలనే భావాన్ని బోధించాయి. జలచరాలు తమ నివాసాలయిన మడుగులలోని నీరు వడివడిగా ఇంకిపోతుండటాన్ని గ్రహింపక శరత్కాల తాపాన్ని అనుభవిస్తూ అక్కడే ఉంటూ మూఢులు వారి ఆయుష్కాలం క్షణక్షణానికి తరుగుతున్న సంగతి గ్రహింపక సంసారక్లేశాలను అనుభవిస్తుండటాన్ని ప్రబోధించాయి. నేలలు బురదలను బాసి, లతలు అపక్వతను కోల్పోయి జ్ఞానులకు దేహాద్యభిమానాలు క్రమక్రమంగా నశించటాన్ని వెల్లడించాయి. శరత్కాలం వచ్చినంతనే సముద్రం కల్లోలాన్ని మాని నిశ్చలమై, ఆత్మోపరతి కలిగినంతనే బుధులు వేదవిచారం మానటాన్ని సూచించింది. కృషీవలులు మళ్ళకు గనిమలు వేసి అటూ యిటూ పోయే నీటిని మళ్ళించి ఆ మళ్ళను నించుతూ యోగులు వారి ఇంద్రియాల ఆధారంగా కలుగుతున్న జ్ఞానాన్ని నిరోధించి ఆత్మవశం కావించే విధానాన్ని తెలియజెప్పారు. చంద్రుడు వెన్నెలలు విరజిమ్మి శరత్కాలసూర్యతాపాన్ని చల్లార్చి సర్వప్రాణులకు హాయిగొలుపుతూ శ్రీకృష్ణభగవానుడు తన ప్రబోధంచేత వ్రజాంగనలకు దేహాభిమానదుఃఖాన్ని పోగొట్టి సుఖాన్ని కూర్చటాన్ని తేటపరిచాడు. గగనతలం మబ్బులువాసి నిర్మలత నొంది విమలతారావిరాజితమై సత్త్వస్వభావులు పూర్వోత్తరమీమాంసల సారాన్ని గ్రహించి నిర్మలులు కావటాన్ని విశదీకరించింది. సుధాకరుడు తారాపరివృతుడై భూమండలమంతటినీ శోభిల్లజేస్తూ శ్రీకృష్ణభగవానుడు వృష్ణిసమూహాన్ని కూడి లోకానందకరుడన్న సత్యాన్ని ప్రకటీకరించాడు. వనమారుతం సమశీతోష్ణమై వీవనలవలె వీచి ప్రజాతాపాన్ని ఉపశమింపజేస్తూ శ్రీకృష్ణుడు మానసిక పరిష్వంగంతో గోపికల తాపాన్ని రూపుమాపిన ఘట్టాన్ని తోపజేసింది. గోవృషభాలు, స్త్రీపురుష మృగపక్షులు

సంతానార్థం పరస్పరం అనుసరిస్తూ కాలానుసారంగా కర్మయోగానుష్ఠాన తత్ఫలప్రక్రియను నేర్పాయి. సూర్యోదయాన కుముదాలు ముకుళించి కమలాదులు వికసించి రాజసందర్శనం దొంగలకు దుఃఖదాయకమూ తక్కినవారందరికీ ప్రియావహమూ కావటాన్ని స్పష్టపరిచాయి. భూమి సర్వసస్యాఢ్యయై భగవత్కళ తనయందున్న సంగతిని స్ఫుటగోచరం చేసింది. పురగ్రామాలలో బ్రాహ్మణుల ఇండ్లలో అన్నప్రాశనార్థ వైదికకర్మలు యథావిధిగా నడిచాయి. లౌకికులు మహోత్సవాలు కావించి ఇంద్రియతృప్తిని పొందారు. వర్షయోగం వలన తమ తమ వృత్తులను మందగించి ఇంటనున్న వణిజులు యతులు రాజులు బ్రహ్మచారులు ఇల్లు వెలువడి క్రమంగా వాణిజ్య స్వాచ్ఛంద్య విజయ విద్యాభ్యాసరూప స్వధర్మాలకు ఉపక్రమించి మంత్రయోగసిద్ధులు తమ ఆయుశ్శేషాన్ని ఇక్కడ గడిపి కాలం సమీపింపగానే తద్యోగసిద్ధిగమ్యము లైన దేవాదిశరీరాలను గ్రహించే తీరును గోచరింపజేశారు.

రాజేంద్రా! ఆత్మశక్తి ఆ విధంగా శరదృతురూపంలో సరోవరాలను స్వచ్ఛజలపూరితాలుగా కమలగంధబంధురాలుగా పరివర్తించి తదీయ గంధమిళితశీకరశీతలమరుదంకురాలను వీవజేసి పూలతీగెల చలువ పందిరులు తీర్చి మధుమత్తభ్రమరగీతాలు పాడించి ఆ ప్రదేశాన్ని శృంగారమంటపంగా అలంకరించి ప్రకృతివిలాస ప్రదర్శనరూపాన లోకానికి వివిధ ధర్మనీతిరహస్యాలను గరపినందుకు శ్రీకృష్ణుడు సంతసించి ఆ ఆనందాన్ని పట్టలేనట్లుగా పిల్లనగ్రోవి వాయించాడు.

## గోపికల మనోవిలాసాలు

ఒకనాడు శ్రీకృష్ణుడు బృందావనానికి పోదలిచి పచ్చని పీతాంబరం కట్టి వైజయంతిని ధరించి కర్ణాలకు కర్ణికార సుమాలను అలంకరించి నెమలిపురిని దాల్చి గోపాలకులతో కలిసి వేణుగానం చేస్తూ బయలుదేరాడు. ఆ గానం

చెవిసోకినంతనే గోపగోపీజనాలు ఇళ్ళలో నుంచి హుటాహుటిని వెలుపలికి వచ్చి కృష్ణుని చూసి తలకొక విధంగా వేనోళ్ళ ప్రశంసింపసాగారు.

'చెలులారా! కృష్ణుడు చెలులతో కలిసి ఆలమందలను ముందు నడిపిస్తూ వేణుగానం ఆలపిస్తూ ప్రేమపూరిత కటాక్ష వీక్షణాలను గోపకులపై ప్రసరింపజేస్తూ ఎలా వెళుతున్నాడో చూశారు కదా! ఓహోహో! కృష్ణుని కనులారా కనుగొన్న భాగ్యమే భాగ్యం కదా!' అని ఒకతె పలికింది.

'రామకృష్ణులు చిత్రవేషాలు ధరించి అరణ్యమనే నాట్యరంగంలో గోపాలకసభామధ్యాన వేణుగానపూర్వక నాట్యం ప్రదర్శిస్తూ లోకాభిరామదర్శనులై అలరారుతున్నారు' అని ఒక గోపవనిత అన్నది.

'చూడండే! గోపికాభోగ్యమైనట్టి శ్రీకృష్ణుని అధరామృతాన్ని వేణువు మునుముందుగా గ్రోలుతున్నది. దీని పుణ్యం ఏమనాలి?' అని వేరొక గోపాంగన పలికింది.

'అక్కా! ఆ వేణువుకు నీరొసగి దానిని పెంచిన నదులు ఆ వేణుముఖాన వెలువడిన గానానికని ఎంత సంతోషింపకపోతే ఆ ఆనంద రోమాంచాలను వికసించిన పద్మాల నెపాన ప్రకటిస్తున్నవంటారు?' అని ఇంకొకతె నుడివింది.

'చెల్లెలా! ఈ వేణువంశంలో పుట్టిన తరువులు మకరందమనే మహానంద పూర్వక బాష్పజాలాన్ని కురిపించటం చూస్తుంటే భాగవతులను కన్న పెద్దలు తమ ఆనందాన్ని నిలువెల్లా పులకరింతలతో ఆనంద బాష్పాలతో ప్రకటిస్తున్నట్లు అనిపించటం లేదూ!' అని ఒకతె వచించింది.

'సఖీ! కృష్ణుడు పదారవింద విన్యాసపూర్వక వేణుగానం చేస్తుంటే చూసి సన్నని ఉరుములతోడి నీలమేఘం కనబడుతున్నదని మయూరాలు భ్రాంతిపడి కలాపాలను విప్పార్చి నృత్యం సలుపుతాయి. గిరితటాల లోని జంతువులు తమతమ పనులుమాని ఆ నృత్యాన్ని తిలకించే భాగ్యానికి నోచుకొంటాయి' అని ఒకతె పలికింది.

'చెలీ! ఈ లేళ్ళు తిర్యగ్జాతి జంతువులే అయినా చిత్రవేషధరుడైన కృష్ణుని తిలకించి, అతని వేణుగానమాధుర్యాన్ని తనివితీరా గ్రోలి, కృష్ణసారాలతో కూడి తమ ప్రణయచకిత వీక్షణాలతో ఆ మహాజగదీశుని పూజించి కృతార్థం అవుతాయి' అని వేరొక గోపతరుణి పలికింది.

'సోదరీ! గోపబాలకుని రూపశీలాలు కాంతలకు కాంతదర్శనోత్సవకరాలు. నిదర్శన మేమంటావా? అదిగో చూడు. సురసుందరీమణులు విమానాల నెక్కి ఆకసాన ప్రయాణిస్తూ వేణుగానం విని అది వచ్చిన వంకకు చూపుసారించి కృష్ణుని పరికించి మదనపరవశలై ధైర్యాన్ని కోల్పడి దీనలయ్యారు. అటుచూడు కొందరికి పోకముడులు సడలాయి; కొందరి సిగలు వీడి పూలు రాలుతున్నాయి' అని ఒకతె చెప్పింది.

'చెలియా! అదిగో గోవులు చెవులెత్తి శ్రీకృష్ణుని వేణుగానాన్ని ఎంత ప్రీతితో వింటున్నవో చూడు. ఆ గానామృతాన్ని కర్ణపుటాలతో గ్రోలుతున్నాయి కాబోలు' అని ఒకతె అన్నది.

'సోదరీ! ఆవుదూడలను చూడు. నోట చన్ను తగిలించుకొని పాలు త్రాగటం మాని మైమరిచి కట్టెబొమ్మలలా నిలిచి ఆనందాశ్రువులను నించి రెప్పవాల్పక గోపకుమారులనే చూస్తున్నాయి' అని ఒకతె పలికింది.

'చెల్లీ! ఈ వనంలోని పక్షులు మునులై ఉండాలి. కాకపోతే తరుశాఖల నెక్కి ఇంద్రియాలను ఆకర్షిస్తున్న చిగురుటాకులు చుట్టూ పరుచుకొని ఉన్నా వాటివంక దృష్టినైనా సారింపక కృష్ణునందే మదినిల్పి వేణుగీతామాధుర్యపరవశత్వంతో తదేకబుద్ధితో శ్రీకృష్ణునే తిలకిస్తుంటాయా?' అని ఇంకొకతె పలికింది.

'చెలులారా! చేతనాత్మకాల సంగతి అటుండనివ్వండి. అచేతనాలైన ఆ నదులను చూడండి. అవి శ్రీకృష్ణగానాన్ని విని ప్రవహించటం మాని తమకు జనించిన మదనోద్వేగాన్ని సుడిగుండాల రూపంలో సూచిస్తూ తరంగహస్తాలను చాచి కమలాలతో శ్రీకృష్ణపాదాలను పూజిస్తున్నాయి' అని ఒకతె నుడివింది.

'అక్కలారా! అదిగో మేఘుని చదురులను చూడండి. శ్రీకృష్ణుడు రామునితో గోపకుమారులతో కలిసి ఆవులను మేపుతూ మేపుతూ ఎండ వేడిమికి అలసిపోయాడని కాబోలు మేఘుడు మబ్బుగొడుగు పట్టి చినుకులనే పూలుగా రాల్చుతూ అతనికి సేదదీర్చుతున్నాడు' అని ఒక గోపలలన పలికింది.

'సఖులారా! ఈ గిరిరాజం రామకృష్ణుల పాదస్పర్శమహాభాగ్యం కలిగిన పుణ్యాతిశయానికి తన రాతిగుండె కరిగి దయార్ద్రమైన కారణాన 'పరోపకారార్థ మిదం శరీరమ్' అనే భావాన్ని తలచి రుచిరతర కందమూల నీరతృణాలను తనయందు కూర్చి రామకృష్ణప్రముఖ గోపకులకూ గోవులకూ అయాచితంగా సమర్పించి తన హరిదాసతత్త్వాన్ని ప్రకటిస్తున్నది సుమా' అని వేరొకామె పలికింది.

'చెలులారా! ఈ చిత్రాన్ని చూశారా? జంగమాలకు చలనం ఉడిగింది; స్థావరాలు పులకితగాత్రాలై ఉన్నాయి. కారణం ఏమిటి? రామకృష్ణులు వారి తలలపై ఉరుద్రాళ్ళను (పాలు పితికేటప్పుడు ఆవుకాళ్ళను కట్టే త్రాళ్ళు) మోసుకొని పసులవెంట తిరగటాన్ని చూస్తుండటం వలన కలిగిన వింత చరాచరాలకు ఈ స్థితిని కల్పించిందా ఏమిటి?' అని ఒకతె అన్నది.

గోపికలు ఆ విధంగా వారివారి మనస్తత్త్వాల ప్రకారం కృష్ణలీలలను అన్యాపదేశంగా వర్ణిస్తూ తన్మయత్వాన్ని పొందారు.

## హేమంత ఋతువర్ణన

అంతలో హేమంత ఋతువు వచ్చింది. ఉత్తరపు గాలి వీచింది. చలికి భయపడినవానివలె సూర్యుడు తూర్పునుంచి పరచి పశ్చిమాద్రి మరుగు జొచ్చినందువలన పగటికాలం తగ్గింది. నిశలు పొడవెక్కాయి. త్రేతాగ్నులు వలిగొని ఒకటి శివుని కంటిలోనికి ఒకటి గృహస్థుల పొయ్యిలోనికి ఒకటి సముద్రజలాలలోనికి ప్రవేశించాయి.

## కాత్యాయనీ వ్రతం

ఆ ఋతువు ప్రథమమాసమైన మార్గశీర్షంలో గోపకుమారికలు కాత్యాయనీ వ్రతాన్ని ఆచరిస్తారు.

అరుణోదయంతో మేల్కొనటం, కాళిందీతోయాలలో స్నానమాడి గట్టుచేరటం, అక్కడ ఇసుకతో కాత్యాయని ప్రతిమను చేసి ఆ దేవిని ఆవాహనం చేసి సుగంధమాల్యాదుల నలంకరించి ప్రవాళ ఫల తండులాలతో అర్చించి వివిధోపహారాలను సమర్పించి ధూపదీపాల నిచ్చి

**శ్లో. కాత్యాయని మహామాయే మహాయోగి న్యధీశ్వరి**
**నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః.**

అని మంత్రాన్ని జపించి ఆ దేవిని ఆరాధించటం ఆ వ్రతసంప్రదాయం.

గోపకుమారికలు ఆ యేడుకూడా యథాప్రకారం ఆ వ్రతాన్ని ఆచరింపబూనారు. మార్గశీర్షమాస ప్రథమ దివసం వచ్చింది.

**మ. రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రండంచు నాత్మీయ నా**
**మములం జీరి కుచద్వయీభరములన్ మధ్యంబు లల్లాడగా**
**భ్రమదోద్దామగజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్**
**యమునాతీరముఁ జేరబోయిరి గృహీతాన్యోన్యహస్తాబ్జలై.**

ఆ విధంగా వారు కాళిందీతీరాన్ని చేరి వస్త్రాలు విడిచి గట్టున పెట్టి జలకాలాడసాగారు.

## గోపికావస్త్రాపహరణం

ఆ తరిని శ్రీకృష్ణుడు గోపబాలకులతో దూరాన ఉన్నాడు. గోపకుమారికల భావం అతని మనసుకు పొడకట్టింది. ఆ మహాత్ముడు వారి వ్రతాన్ని చెల్లింప సంకల్పించి గోపబాలకులను వెంటగొనివచ్చి మెలమెల్లగా చప్పుడు చేయకుండా పొదలమాటున పొంచి పొంచి ఒడ్డున ఉన్న చీరలను గైకొన్నాడు. అదిచూసి తోనున్న గోపబాలకులు నవ్వసాగారు. శ్రీ భగవానుడు

వారితో మేలపు మాటలాడుతూ వడివడిగా వెళ్ళి సమీపాన ఉన్న కడిమిచెట్టుపైకెక్కి 'అబలలారా! ఇవిగో మీ చీరెలు; ఇక్కడికి వచ్చి మీ మీ చీరెలను ఏరుకొండి; ఇది మేలమాడటం కాదు. మీరు వ్రతం మూలాన ఎంతో అలసిపోయి ఉన్నారు. మీతో మేలమాడటం, కలవరపెట్టడం నా ఉద్దేశం కాదు. జాగుచేయకండి. నా మాట తప్పేది లేదు. ఈ బాలకులే అందుకు సాక్షులు. మీరంతా కలిసివచ్చినా సరే; వేర్వేరుగా వచ్చినా సరే. మీ ఇష్టం' అని పెద్దగా అరిచాడు.

గోపబాలికలు ఆ మాట విని సంగతి గ్రహించి వారికి కృష్ణునియెడ గల ప్రేమాతిశయం వలన అతను చేసినదంతా పరిహాసమేనని భావించి ఒకరినొకరు చూసుకొని నవ్వుకొంటూ సిగ్గుతో బయటికి రాలేక కుత్తుక బంటి నీటిలోనే నిలిచి

**క. మా మా వలువలు ముట్టకు**
**మామా! కొనిపోకు పోకు మన్నింపు దగన్**
**మా మాన మేల కొనియెదు**
**మా మానసహరణ మేల? మానుము కృష్ణా!**

అని మాటిమాటికి మొరపెట్టుకొన్నారు. నిమిష నిమిషానికి చలి ఎక్కువ కాసాగింది. ఎంతసేపు గడిచినా కృష్ణుడు చీరలివ్వడయ్యెను. అప్పుడు గోపకుమారికలు తెంపుచేసి, 'సర్వం తెలిసినవాడివి! నందరాజుకు పుత్రుడవై అవతరించావు; వ్రేపల్లెవాసుల ఏకగ్రీవశ్లాఘనకు నోచుకొన్నావు. అటువంటి నీవు ఈ అకార్యం చేయవచ్చునా? చలి భరింపరాకుండా ఉన్నది. మా చీరలు మాకివ్వు. నీ దాసికలము; నీ ఆజ్ఞకు లోబడి నడుచుకొంటాము. మాయెడ నీ అల్లరి చేష్టలు తగవు. చీరలివ్వకపోతే రాజుగారికి చెబుతాము' అన్నారు.

కృష్ణుడు వారి పలుకులు విని, 'కామినులారా! నీ దాసికలమని చెప్పారు. ఆ మాట నిజమయితే నేను చెప్పినట్లు చేయాలికదా? ఇక్కడికి వచ్చి మీ మీ వలువలను గైకొమ్మన్నాను. ఆ ప్రకారం చేయండి. అప్పుడు మీ భక్తి

నిజమవుతుంది. మీరు రాకపోతే మీ చీరలివ్వను. ఇది ముమ్మాటికీ సత్యం. రాజుకు విన్నవిస్తామని అన్నారు. ఆ వగ్గముసలి నన్నేమి చేయగలదు?' అన్నాడు.

ఆ గోపకుమారికలు చలికోర్వలేక అయితేనేమి, గత్యంతరం తోపనందువల్ల అయితేనేమి, తెంపుచేసి గోప్యస్థానాలను కేలుదోయితో కప్పుకొని ఏటిలోనుంచి బయటికి వచ్చారు. వారలా కొంతకు కొంత అభిమానం జారవిడిచి వచ్చినందుకు కృష్ణుడు సంతోషించి, చీరలు భుజాన వేసుకొని చెట్టుదిగి, 'కళ్యాణులారా! మీరు వ్రతపరలై దిసమొల స్నానం చేశారు. ఇది దేవతాపరాధం. ఈ దోషం తగిన ప్రాయశ్చిత్తం వలన గాని తొలగదు. మీరు మీ కేల్దోయిని మీ శిరసున దాల్చి మ్రొక్కటం ఒక్కటే ఇందుకు తగిన ప్రాయశ్చిత్తం. ఆ ప్రకారం చేసి మీ మీ చీరలు తీసుకోవచ్చును' అన్నాడు.

శ్రీకృష్ణుని పలుకులు ధర్మయుక్తాలన్న సంగతిని గ్రహించి గోపబాలికలు గోప్యస్థానాలను ఒక కేల కప్పిపెట్టి రెండవకేలు శిరసునగూర్చి నమస్కరించారు. కృష్ణుడది చూసి, 'అభిమానం సంపూర్ణంగా నశించితే గాని భక్తి సమగ్రం కాదు. వీరిలో ఇంకా కొంత అభిమానం శేషించి ఉన్నది. దానిని కూడా తొలగిస్తాను' అని లోలోన తలపోసి, 'ముగ్ధలారా! దేవునికి ఒంటిచేత నమస్కరింపకూడదు. ఆ తప్పు చేసినవారి చేతిని ఖండించటమే అందుకు ప్రాయశ్చిత్తం. ఇది ధర్మశాస్త్రవచనం. దిసమొల తీర్థమాడి ఒక తప్పు చేశారు. అది చాలదని కాబోలు ఒంటిచేత మ్రొక్కి రెండవతప్పు చేశారు. ఈ తప్పుల వలని కీడు తప్పాలంటే సర్వదోషహరుడైన భగవానునికి చేతులు జోడించి మ్రొక్కండి' అన్నాడు.

గోపకుమారికలు తమ అపరాధాన్ని గ్రహించి పాపభయచిత్తలై రెండు చేతులూ జోడించి శిరసునగూర్చి నమస్కరించారు. శ్రీకృష్ణుడు వారి భక్తికి మెచ్చి చీరలిచ్చాడు.

కృష్ణుడు ఆ విధంగా వంచించి సిగ్గుబాపి గేలిచేసి బొమ్మల వలె ఆడించినా గోపకామినులు లేశమాత్రమైనా అసూయపడక చీరల నందుకొని కట్టుకొన్న తర్వాత ఆ పరమాత్ముని పయినే మనసు నిల్పి చిత్తరువుల వలె నిలబడ్డారు. కృష్ణుడు వారి స్థిరభక్తిని మెచ్చుకొన్నాడు. 'లజ్జావశాన మీరు చెప్పకపోయినా మీ పూజా సంకల్పం నాకు తెలుసు. మీ కోరిక సఫలమవుతుంది. ఒక్కమాట వినండి. ఈప్సితార్థమై అధికులను ప్రార్థిస్తుంటారు. వారు వారి అధికారం ప్రకారం ఫలాన్నిస్తారు. అంతకుమించి ఇచ్చే శక్తి వారికుండదు. ఏ భావంతో అధికులను ప్రార్థిస్తున్నారో ఆ భావంతోనే నన్ను ప్రార్థిస్తే వారు పొందే ఫలం కేవల కామభోగమాత్రం గాక ఎంతో అధికమవుతుంది.

అర్థులు హితాహితాలు తెలిసో తెలియకో లోభబుద్ధి పైకొన్నందువలననో కామ్యాలను కోరుకొంటారు. నాకు భక్తిచేసి కోరిన కోరిక హితమైనది కాకపోయినా దానియందుగల దోషాన్ని హరించి వారి మేలుగూర్చుతాను. వేపుడు గిన్నెలో వేసిన గింజలు బొరుగులై మొలకెత్తే శక్తిని కోల్పోయినట్లు నా యందు మదినిల్పినవారి కామం కేవల భోగరూపమైన ఫలాంకురశక్తిని కోల్పోయి పరిపాకాన్ని పొంది చిరసుఖఫలాన్నిస్తుంది. అన్ని కోరికలూ కేవలానందార్థమే కదా. ఆ ఆనందం క్షణభంగురం గాక చిరస్థాయి కావటం మరింత వాంఛనీయం కదా. ఇక వెళ్ళండి. ఒకరేయి నాతో విహరింపగలరు' అన్నాడు.

గోపకుమారికలు ప్రాప్తమనోరథలై శ్రీకృష్ణభగవానుని పాదారవిందాలను స్మరిస్తూ అక్కడి నుంచి వెళ్ళలేక వెళ్ళలేక వ్రేపల్లెకు వెళ్ళారు.

**ఆ.వె. లోన బయటనుండు లోకలోచనునకు**
**గానరాని దొకటి గలదె యెందు?**
**హ్రస్వదృష్టి జేసి యాత్మమర్మంబుల**
**దాఁచి మోసపోవు దారి గాక.**

## గోపిక లెవరు?

రామావతారంలో ఋషులు కొందరు మధురభక్తి రుచిని కోరారు. అన్ని కోరికలు తీరేవరకు ఎట్టివారికైనా జన్మరాహిత్యం కాదు. ఆ ఋషులు తమ వాంఛితఫలాన్ని అనుభవించటానికి గోపికలుగా జన్మించారు. ఆ సంగతిని భగవానుడు స్మరించి, ఈ విహారాన్ని కల్పించి, తన్మూలకంగా వారికి నిష్కామభజనను అనుగ్రహించాడు.

## గోపబాలకులకు జన్మసాఫల్యమార్గం

అంతట రామకృష్ణులు గోపబాలకులను కూడి గోవులను మేపుతూ బృందావనం దాటి ఒకానొక వనాన్ని ప్రవేశించారు. ఆ వనంలోని వృక్షాలన్నీ ఏపుగా పెరిగి ఆకుజొంపాలతో అలరారుతూ ఎండకు తావీయక చల్లని నీడలను నింపుతూ సొంపారుతున్నాయి. శ్రీకృష్ణుడు తోడిబాలకులను 'స్తోక కృష్ణా! అంశా! శ్రీరామా! సుబలా! అర్జునా! విశాలా! వృషభా! ఓజస్వీ! దేవప్రస్థా! వరూదథా!' అని పేరుపేరునా పిలిచి, 'ఈ తరువులను చూశారా! ఇవి గాలివానలు, మండుటెండలకు ఓర్చుకొంటాయి. తమ బాధను ఇతరులకు కలుగనీయవు. ప్రవాళపత్రపుష్పఫలాదులను కోరినవారికి కోరినట్లు మనసారా ప్రసాదిస్తున్నాయి. కట్టెలకోసం వీటిని తెగనరికి నాకిమ్మనవు. వీటి జీవితమే జీవితం. జీవులు తమ అర్థాన్ని మాత్రమే గాక మనోవాక్కాయప్రాణాలను కూడా పరులకిచ్చి ఉపకరించటమే జన్మసాఫల్యమని ఈ వృక్షాలు మౌనంగా కార్యరూపాన ప్రకటిస్తున్నాయి. వీటిని చూసి, లోకం జన్మసాఫల్యమార్గాన్ని గ్రహిస్తుంది గాక' అని అంటూ ఆ పాదపాలను మెచ్చుకొంటూ పల్లవ ప్రసూన ఫల భారంతో నేలబ్రాకుతున్న ఆ చెట్లకొమ్మల సందున దూరిదూరి కాళిందీనదికి పోయి అందులోని కమ్మని చల్లనీరు గోవులకు త్రాగించి తాముకూడా త్రాగి దాహం తీర్చుకొని పశువులను మేతకోసం ఉపవనానికి వదిలాడు.

## విప్రుల పరీక్ష

గోపబాలకులకు ఆకలి మెండయింది. ఆ క్షుద్బాధను ఓర్వలేక వారు రామకృష్ణుల వద్దకు వచ్చి 'ఆకలి పీడిస్తున్నది. ఈ బాధ తీరే మార్గాన్ని చూడు' అన్నారు.

కృష్ణుడు వారి మొరవిని 'గోపకులారా! ఇక్కడికి సమీపంలో బ్రహ్మవాదులైన విప్రులు స్వర్గకాములై ఆంగిరసమనే యాగాన్ని చేస్తున్నారు. మీరక్కడికి వెళ్ళి 'రామకృష్ణులు అన్నానికై పంపగా వచ్చాము' అని వారికి చెప్పండి' అన్నాడు. గోపబాలకులు కృష్ణుడన్నట్లుగా ఆ బ్రాహ్మణులకు సాష్టాంగనమస్కారాలు చేసి చేతులు జోడించి, 'భూసురోత్తములారా! మేము కృష్ణుని అనుచరులము. రామకృష్ణులతో వనానికి వచ్చాము. ఆకలవుతున్నది. ఆ సంగతి వారికి నివేదించాము. మీ వద్దకేగి తమమాటగా చెప్పి అన్నం అడిగి తీసికొనిరమ్మని ఆజ్ఞాపించారు. వేత్తలారా! దీక్షితాన్నం అభోజ్యమని శంకింపవద్దు. అది అగ్నీషోమీయ పశ్వాలంభం వరకు మాత్రమే అభోజ్యం. సౌత్రామణిసందర్భంలో కూడా ఈ అర్థమే అన్వయిస్తుంది. ఇతరకాలాలలో అది భోజ్యమే' అని పలికారు.

ఆ బ్రాహ్మణులు స్వర్గభోగాది క్షుద్రఫలాలను కోరి బహుకష్టాలకోర్చి ఆ యజ్ఞం చేస్తున్నారు. కర్మములంటే ఎటువంటివో, వాటిని ఎందుకు చేయాలో, ఎలా చేయాలో, పరమార్థమేమిటో వారికి బొత్తిగా తెలియదు. కృష్ణుడు పరమాత్ముడని, దేశాకాలాలు, చరుపురోడాశాది ద్రవ్యములు మంత్ర తంత్రాలు ఋత్విగగ్నిదేవతలు యజమానుడు క్రతువు ధర్మం అన్నీ భగవన్మయాలేనని ఆ పండితమ్మన్యు లెరుగరు. ఆ మహనీయుడు కేవల మనుష్యమాత్రుడని వారి భావం. ఆ కారణాన వారు భగవానుని యాచనను వినీ విననట్లు ఊరుకొన్నారు.

గోపబాలకులు కొంతసేపు వేచి చూశారు. ప్రొద్దు కాసాగింది. ఆ బ్రాహ్మణులు అన్నం ఉన్నదనిగాని లేదనిగాని పల్లెత్తుమాట చెప్పక వారి

పనిలో వారు మునిగిపోయారు. గోపబాలకులు చూసి చూసి ఆశలు వదులుకొని తిరిగివచ్చి జరిగిన సంగతిని రామకృష్ణులకు నివేదించారు. కృష్ణుడు వారి మాటలకు నవ్వుతూ 'మిత్రులారా! కార్యార్థులన్నాక తమ కార్యాన్ని ఏదో ఒక విధంగా సాధించాలి. వారు సమాధానం చెప్పలేదని ఊరుకొంటే కార్యం జరుగుతుందా? మీరు నిరాశచెంది ప్రయత్నం మానుకొనకూడదు. ఆ ఫలోదయం ప్రయత్నించి తీరాలి. ఈసారి మీరు వెళ్ళి ఆ దీక్షితుల భార్యలను సమీపించి మా మాటగా చెప్పి వారిని అన్నం అడగండి. ఆ దీక్షితపత్నుల చిత్తాలు మాయెడ స్నేహాయత్తాలుగా ఉన్నాయి. నామాట వినగానే వారు మీకు అన్నం పెడతారు' అని నచ్చజెప్పి వారిని మళ్ళీ పంపించాడు.

## దీక్షితపత్నుల భక్తి

గోపబాలకులు సరేనని యజ్ఞశాలను సమీపించి అక్కడ సాలంకృతలై కూర్చొని ఉన్న దీక్షితపత్నులను చూసి నమస్కరించి, 'అమ్మలారా! కృష్ణుడు, రాముడు గోగోపకులతో వచ్చి ఇక్కడికి సమీపంలోనే ఉన్నారు. ఆకలిగొని మీవద్దకు వెళ్ళమని మమ్మల్ని పంపించారు. క్షుధార్తుడైన కృష్ణునికి, అతనితో వచ్చినవారికి అన్నం పెట్టండి' అన్నారు.

ఆ దీక్షితుల భార్యలు నిత్యం కృష్ణుని కథలు వింటున్నందువల్ల అతని సందర్శన కోసం ఉవ్విళ్ళూరుతున్నారు. కృష్ణుడు సమీపంలో ఉన్నాడన్న మాట చెవిసోకగానే వారు మహోత్సాహవివశలై తటాలున లేచి పాత్రలలో రసవత్తర భక్ష్య భోజ్య లేహ్య చోష్య మధురాన్నాలు నింపి బయలుదేరారు. వారి భర్తలు, తండ్రులు, అన్నదమ్ములు అదిచూసి యజ్ఞసమాప్తి కాకముందు లేచి వెళ్లరాదని అంటూ అడ్డుపడ్డారు. ఆ కళ్యాణవతుల హృదయాలు భగవత్పరాలుగా ఉన్నందువలన, సముద్రంకేసి పారే నదులు చిరుకట్టలకు నిలువనట్లు వారు ఆ అడ్డంకులను లెక్కచేయక యమునాతటోపవనానికి

వచ్చి, అక్కడ గోపాలకుల మధ్య నీలమేఘశ్యామలదేహంతో పీతాంబరంతో బర్హిబర్హధాతుకిసలయాలతో సొబగారుతూ చెలికాని బుజాన దక్షిణహస్తాన్ని నిలిపి డాకేల కెందమ్మిని ధరించి లీలార్థం త్రిప్పుతున్న కృష్ణుని తిలకించి తన్మయత్వాన్ని పొందారు. శ్రీకృష్ణభగవానుడు వారి భక్తి ప్రేమాతిశయాలకు కలిగిన తన సంతోషాన్ని చిరునవ్వు మూలాన వెల్లడిస్తూ, 'కళ్యాణులారా! స్వాగతం; దూరం నడిచి అలసినట్లున్నారు; కూర్చొనండి. మమ్మల్ని చూడటానికి తెగించి ఈ విధంగా రావటం మీకే తగును. జీవులకు ఆత్మకళ్యాణాని కంటె మించినది లేదు. ఆత్మకళ్యాణం పొందటానికి ఫలాభిసంధిరహితమూ నిరంతరమూ అయిన భక్తి ఒక్కటే పరమసాధనం. వివేకులు ఈ రహస్యాన్ని గ్రహించి నాకు పరమభక్తి కావిస్తారు. భార్యాబిడ్డలు, బంధుమిత్రులు ధనాదులు మనోబుద్ధులు దేహప్రాణాలు ప్రియమైనవని కొందరంటారు. అవి ఎవరికి ప్రియాలు? ఆత్మార్థం మాత్రమే అవి ప్రియాలు. ఆత్మదెవడు? నేనేగదా, అందువల్ల నా కంటె ప్రియతముడు మీకు ఎవరున్నారు? అట్టి నాకు మీరు నిండారు భక్తిసలిపి ధన్యధన్యలైనారు. మీరున్నంతకాలం మీ పతులకు గృహస్థధర్మాలు జరుగుతాయి. వారిప్పుడు సత్రయాగం చేస్తున్నారు. మీరక్కడ లేకపోతే యాగాన్ని పూర్తిచేయటం సాధ్యంకాదు గనుక యజ్ఞశాలకు వెళ్ళండి' అని మృదుమధురంగా ప్రసంగించాడు.

## శ్రీకృష్ణ సేవాభాగ్యం

ఆ మాట చెవిసోకినంతనే విప్రవనితలు దుఃఖదీనలై, 'దేవా! నా భక్తులకు ఎక్కడా ఎన్నడూ ఆపద కలుగదు' అని ప్రతిజ్ఞ చేశావు. ఆ మాటనమ్మి మేము మా చిత్తాలను నీకు సమర్పించి నీ పాదమూలాన్ని ఆశ్రయించి నిన్ను సేవించుకోవాలని ఇక్కడికి వచ్చాము. అట్టి మాయెడ నీవిప్పుడు దయలేక పొమ్మనటం నీకు తగునా?

**మ. తగునే మాధవ! యిట్టి వాడిపలుకుల్ ధర్మంబులే మా యెడన్**
**మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ**
**చ్చిగ నీ యంఘ్రులు సేరినార మటచోఁ జేకొందురే వార లా**
**పగి దే మొల్లము కింకరీజనులుగా భావించి రక్షింపవే.**

మాకు వేరొక దిక్కులేదు. నా సేవాభాగ్యాన్ని మాకు ప్రసాదించు' అని ఒక్కుమ్మడిని ప్రార్థించారు.

## హితోపదేశం

శ్రీకృష్ణభగవానుడు వారి దీనవచనాలు విని వారికి ధైర్యం చెప్పాడు. 'ఓ కళ్యాణులారా! మీ పతులు, బంధుజనులు మిమ్మల్ని పరిగ్రహింపరనే భయం వద్దు. మీకు పుణ్యలోకాలు లభిస్తాయి. నా యీ ఆజ్ఞను ఇదిగో సురలుసయితం అనుమతిస్తున్నారు. నాయందు మనస్సంగం కావించినవారికి నా ప్రీత్యనురాగాలు లభించటం మాత్రమే కాదు; వారికి నాతో ఐక్యం కూడా లభిస్తుంది.

కళ్యాణులారా! నా సన్నిధిలో నిలిచి స్వయంగా నాకు సేవచేయటమే ఉత్తమ భక్తికి లక్షణమని మీరు భావించారు కాబోలు. భక్తి అంటే పూజించటమని భావం. ఈ పూజ బాహ్యమని ఆంతరమని రెండు విధాలు. బాహ్యపూజ అనేది కేవల పరిచర్యారూపమైనట్టిది. ఆంతరపూజ అన్నదో మానసికం మాత్రమే. భక్తి యొక్క ఫలం భగవంతునియందు మనస్సును లీనంచేయడమే కనుక, అట్టి మనోలీనత బాహ్యపూజల వలన కంటె ఆంతరపూజ వలన స్థిరంగా లభిస్తుంది గనుక, భక్తి యొక్క పరమఫలాన్ని కోరుకొనేవారందరూ ఆంతరపూజావిధానాన్నే స్వీకరిస్తారు. ఆంతరపూజకు వస్తుసామగ్రిని సంపాదించే క్లేశం ఉండదు. కాగా ఎక్కడున్నప్పటికీ ఆ పూజను చేయవచ్చును. ఆ పూజకు పూజ్యవ్యక్తి చెంతనే ఉండనవసరం లేదు. మరొక విశేషం. భక్తిచేయటానికి సన్నిధానం కంటె పరోక్షం పెక్కు విధాల మేలు.

మానినీమణులారా! ఒక వస్తువును ప్రేమించటానికి ఆ వస్తువుయొక్క గుణగణాలు ముందుగా తెలియాలి. ఒక వస్తువులో అనేక గుణాలుంటాయి. వాటిలో ఒక్కొక్కటి ఒక్కొక్కరికి రుచిస్తుంది. అతను దానిని గురించి మాత్రమే ఉగ్గడిస్తుంటాడు. ఆ విధంగా పదుగురు పది విధాల వారి వారి రుచి ప్రకారం ఆ వస్తుగుణాలను వర్ణించినప్పుడు విన్నవారికి దానియందు గౌరవప్రీతులు నానాటికి పెంపొందుతాయి. తత్ఫలంగా వారికి దానిని పొందాలనే కోరిక కలుగుతుంది. ఆ కోరిక వారి మనస్సును నిరంతరం ఆ వస్తువు వంకకు లాగుతుంటుంది. అందువల్ల మనస్సు దానియందే లీనమవుతుంది. ఈ విధానాన్ని శ్రవణమంటారు. ఈ శ్రవణానికి పరోక్షం ఎంతో సహకరిస్తుంది.

శ్రద్ధగా విన్నదానిని గురించి విచారించటాన్ని మననమంటారు. తర్వాత ఆ వస్తువును పొందాలనే ఆలోచన కలుగుతుంది. దానిని ధ్యానమంటారు. ధ్యానఫలంగా మనస్సు దానివంకకు తైలధారవలె ప్రసరిస్తుంది. దీనిని ధారణ అంటారు. ధారణాఫలంగా మనస్సు ఆ వస్తువునందు ఏకాగ్రమవుతుంది. దీనిని సమాధి అంటారు. సమాధిఫలంగా ఆ వస్తువు సిద్ధిస్తుంది. దీనిని ప్రాప్తి అంటారు. ఈ మాటలు మీరు మనసులో ఉంచుకొని మీ ఇండ్లకు వెళ్ళి యథోక్తంగా ఆచరించండి' అన్నాడు. వారు యజ్ఞశాలకు వెళ్ళారు. శ్రీకృష్ణుడు దీక్షితపత్నులు తెచ్చిన చతుర్విధానాన్ని అమితప్రీతితో గ్రహించి, గోపబాలకులకు పెట్టి తానూ భుజించాడు.

దీక్షితాదులు ఇంటికి తిరిగి వచ్చినవారందరినీ మహాదరంతో స్వీకరించి యజ్ఞసమాప్తి కావించారు. వారిలో ఒకడు తన భార్యను నిరాకరించాడు. ఆ సాధ్వీమణి భగవదుపదేశాన్ని స్మరించి భగవచ్చిత్తయై తనుత్యాగం చేసింది.

రాజేంద్రా! భగవానుడు ఆ విధంగా లీలామానుషవేషం ధరించి మర్త్యలోక విడంబనార్థం గోగోపగోపికలను తన రూపము చేత, మాటల చేత, కార్యముల చేత ఆకట్టుకొంటున్నాడు.

## దీక్షితుల విచారం

దీక్షితులు వారి యాగాన్ని సమాప్తి కావించి పత్నుల వలన సంగతి తెలుసుకొని, ఎంతో దిగులుపడ్డారు. 'అయ్యో! భగవానుడు నరరూపం దాల్చి మనను యాచించాడు. ఆ రహస్యాన్ని గ్రహింపలేక ఆయనను అనాదరించి మహాపరాధం చేశాము. ఓహో! స్త్రీమాత్రులైనవారికి భగవంతుని యెడ ఇంత భక్తి కుదిరింది. ఆ భక్తిలో ఆవగింజంత మాత్రమైనా మాకు కలుగకపోయింది కదా! మా వంటి పాపాత్ములకు బ్రతుకెందుకు? శౌక్ల్యము సావిత్రము దైక్షము అని జన్మలు మూడు విధాలు. భగవద్విముఖులకు ఇట్టి జన్మత్రయం కలిగినా వ్యర్థమవుతుంది. పోతే, భగవదనుగ్రహం కోసం కొందరు కఠిన బ్రహ్మచర్యవ్రతాన్ని ఆచరిస్తారు. కొందరు సర్వవేదాలను వల్లిస్తారు. కొందరు నిఖిలకర్మలను అనుష్ఠిస్తారు. గోరంత భక్తి లేనినాడు ఇవన్నీ నిరుపయోగాలు. అహో! భగవన్మాయను ఏమనవచ్చును! అది యోగులను కూడా మోహవశులను చేస్తున్నదనగా మాబోటి స్వార్థపరుల సంగతి వేరే చెప్పాలా? ఓహోహో! మా పత్నుల భాగ్యమే భాగ్యం. చూడటానికి వారు స్త్రీలు మాత్రమే; ఉపనయన సంస్కారం ఎట్టిదో ఎరుగరు; గురుకులవాసం చేయలేదు; ఎట్టి తపస్సులు చేసిన వారు కారు; ఆత్మవిచారమంటే ఏమిటో తెలియదు; శౌచ పుణ్యకర్మాదులు కావింపలేదు; ఇవన్నీ మనము చేసి చేసి అలసి సొలసి ఉన్నాము. ఇంతచేసినా మనకు భక్తి లేశమయినా కుదురుకొనలేదు. ఏమీ ఎరుగని స్త్రీలకు భగవానుని పయి స్థిరభక్తి కుదిరింది. మన యీ స్థితికి కారణమేమిటి? గృహాసక్తి మీరి స్వార్థమూఢులము కావటమే కారణం. ఈ కారణాన్ని మనకు భగవానుడు గోపకుమారకుల వచనాల మూలాన బోధించాడు.

భగవానుడు పూర్ణకాముడు, లోకేశ్వరుడు అయిన మహాత్ముడు. అట్టివాడు పిడికెడన్నంకోసం గోపకుమారులను మనవద్దకు పంపాడు. అతని భావాన్ని మనము గ్రహింపమైతిమి. ఆ పరమేశ్వరు డెక్కడ? మనను యాచించట మెక్కడ? దేశ కాల ద్రవ్య మంత్ర తంత్రాదులు, ఋత్విగ్యజమానాగ్ని దేవతలు,

క్రతుధర్మాలు ఎవని వ్యక్తరూపాలో, ఎవని పాదసేవకై సిరి తన చాంచల్యాన్ని మాని నిరంతరం పరితపిస్తుంటుందో, అట్టి యోగీశ్వరేశ్వరుడు భగవానుడు యదువంశంలో పుట్టిన సంగతిని చెవులారా వినికూడా మౌఢ్యం వలన తత్త్వం గ్రహింపక మోసపోయాము' అని లోలోపల కుమిలి, చేతులు జోడించి, 'కృష్ణా! నీ మాయామోహితులమై కర్మమార్గాన పడికొట్టుకొంటూ నీ ప్రభావం తెలియక నీయెడ మహాపరాధం కావించాము. మా యీ దోషానికి నీ మాయే కారణం గనుక నీవు మమ్మల్ని క్షమింపక తప్పదు. దేవా! నీవు ధరించిన రామకృష్ణరూపాలను కన్నులారా చూడాలనే కోరిక క్రేళ్ళురుకుతున్నది. కంసుని వలని భయం మమ్మిక్కడినుంచి కాలు కదపనివ్వదు. అందువల్ల ఇక్కడినుంచే నిన్ను భజిస్తాము' అని వేడుకొన్నారు.

రాజేంద్రా! భగవానుడు బ్రాహ్మణులకు క్రియాగర్వభంగం కావించి తెలివిగూర్చాడు. యజ్ఞదేవతలైన సురలు కూడా గర్వించి ఉండేవారు. భగవానుడు వారికి సయితం గర్వభంగం కావించి ఆ రూపాన జ్ఞానోపదేశం చేయాలని సంకల్పించాడు. అది చెబుతాను విను.

## ఇంద్రయాగోద్యోగం

గోపకులంవారు ప్రతిసంవత్సరం ఒక యాగంచేసి ఇంద్రుని పూజిస్తుండేవారు. ఆ యాగానికి ఇంద్రుడు అధిదేవతగా ఉన్నందువలన దానిని ఇంద్రయాగం అనేవారు. ఆ యేడాది ఇంద్రాగమానికి సమయం వచ్చింది. నందుడు గోపులు యాగసామగ్రీ సంపాదనాది క్రియాసంరంభంతో పనిపాట్లలో మునిగితేలుతున్నారు.

## కర్మఫల తత్త్వవిచారం

కృష్ణుడదిచూసి వీరందరూ తమ కార్యానికి ఫలదాత ఇంద్రుడని నమ్మి యాగానికి పూనుకొంటున్నారు. వీరి అజ్ఞానం ఏమని చెప్పాలి! వీరి సంగతి అటుండగా ఆ ఇంద్రుని సంగతి ఏమనుకోవాలి? అతను తన శక్తి యెంతో

ఎరుగక ఈ భ్రాంతులు కావించే కర్మలకు తానే ఫలదాతనని గర్వించాడు. అదీ చూద్దాము' అని ఆలోచించి, నందాదుల వద్దకు వెళ్ళి, 'తండ్రీ! గోపవృద్ధులారా! ఈ మహాసంరంభం ఏమిటి? దీనికి ఫలమేమిటి? ఫలదాత ఎవడు? ఈ యాగానికి అధికారి యెవడు? సాధనాలేమిటి? ఈ వివరాలను తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉన్నది.

## యాగాదుల విమర్శన

తండ్రీ! లోకంలో సమదర్శనులు, భేదదర్శనులు అని రెండు తెగలవారు ఉన్నారు. సమదర్శనులు సర్వాత్మభావనులు; వారికి మిత్రులు గాని శత్రువులు గాని ఉదాసీనులు గాని కలుగరు. అంటే సమదర్శనులు ఉపాధిభేదాన్ని బట్టి భ్రాంతులు కారు. అన్ని ఉపాధులలోనూ ఉంటున్న ఆత్మ ఒక్కటే అని వారి నిశ్చయం. ఆ కారణాన వారి దృష్టి ఆత్మ యొక్క అభేదతత్త్వమందే నిలిచి ఉంటుంది. అందువలన వారి వర్తనలో గోపనీయమైనది ఏదీ ఉండదు. శత్రువుల విషయంలో ఉదాసీనుల విషయంలో వారు ఏకరీతిగానే ఉంటారు. సుహృత్తు విషయంలో వారి సంగతేమిటంటారా? మిత్రుడు ఆత్మతుల్యుడే కాబట్టి అతనిని దూరంచేయరు.

భేదదర్శనుల దృష్టిగాని కార్యాలు గాని ఇందుకు విపరీతంగా ఉంటాయి. భేదభావంతో హెచ్చుతగ్గులు, పూజాసేవాదులు కలుగుతాయి. గ్రాహ్యాంశాలలో ఇది ముఖ్యమవుతుంది.

తండ్రీ! లోకంలోని జనులందరూ కర్మలను చేయక తప్పదు. కొందరు కర్మతత్త్వాన్ని, దాని ఫలాన్ని విచారింపక ఒకరిని చూసి ఒకరు చేస్తుంటారు. కొందరు కర్మతత్త్వఫలాలను తెలిసిచేస్తారు. ఆ విధంగా తెలిసి చేసినవారికి ఫలసిద్ధి కలుగుతున్నది. తెలియక చేసినవారికి కోరిన ఫలం సిద్ధించదు. కాబట్టి ఏ పనైనా విచారించి చేయటమే యుక్తం. ఎవరితో విచారించితే మంచిది? అంటే, విద్వాంసుడు తనకు శ్రేయోభిలాషి అయిన వ్యక్తితో విచారించి చేయాలి.

తండ్రీ! మీరిప్పుడేదో ఒక కార్యానికి పూనుకొన్నట్లున్నది. దానికి శాస్త్రప్రమాణం ఉన్నదా? కేవల లోకాచారాన్ని బట్టి ఈ పని చేయబోతున్నారా?' అని అడిగాడు.

నందాదులు ఆ మాటలు విని, 'నాయనా! లోకాచారాన్ని బట్టి మేమీ పని మొదలుపెట్టాము. లోకం కొంత విచారించి ఈ ఏర్పాటును చేసి ఉంటుందని, నిరర్థకంగా చేయలేదని మా విశ్వాసం. ఏమంటావా? ప్రాణికోటికి నీరు అత్యవసరం. ఇంద్రుడు పర్జన్యరూపం ధరించి, తనకు ప్రియమూర్తులైన మేఘాలను పురికొల్పి వర్షం కురిపించి సమస్త ప్రాణిరాశికి ప్రాణసంజీవన కావిస్తున్నాడు. దానితో జనులందరూ ఉపజీవితులై ఆ ఇంద్రుడిచ్చిన నీళ్ళను ఆధారం చేసికొని వ్యవసాయాదులు చేసి తన్మూలాన లభించిన పదార్థాలతో ఆ ఇంద్రుని అర్చించి, మిగిలినదానిని ధర్మార్థకామసిద్ధికి ఉపయోగిస్తారు. కృష్యాదులు పురుషప్రయత్నమాత్రాలు. ఫలసాధకుడు ఇంద్రుడని తేలింది. పురుషులెంత ప్రయత్నించినా వర్షం కురవకపోతే సస్యాదులు మొలవటం పెరగటం పండటం ఉండదు కదా. ఈ ధర్మం మొదటినుంచి ఉన్నదే. దీనిని అతిక్రమించినవారు కృతఘ్ను లనిపించుకొంటారు. ఒకరి వలన ఫలాన్ని పొంది దానిని ఉపేక్షించేవాడు కృతఘ్నతాదోషానికి ఒడిగట్టక తప్పదు కదా' అని చెప్పారు.

## కర్మఫలదాత ఎవరు?

కృష్ణునికి ఆ పలుకులను విని, కర్మముల ఫలస్వరూపాన్ని గురించి వివరింపవలసి వచ్చింది. 'తండ్రీ! జంతువులు తమ తమ ప్రారబ్ధకర్మఫలభోగానికి యోగ్యమైన శరీరాలను గ్రహిస్తూ ఆ శరీరాలతో అనుభవింపవలసిన సుఖదుఃఖాది ద్వంద్వాలను అనుభవిస్తూ ఫలభుక్తి కాగానే నశిస్తుంటారు కాబట్టి కర్మమే కర్త అవుతున్నదని కొందరంటారు.

కర్మములు జడస్వరూపాలని, జడములకు ఫలాన్నిచ్చే శక్తిలేదని, సమస్త కర్మలకు ఫలాన్నిచ్చే ఈశ్వరుడొకడు ఉన్నాడని కొందరు భావిస్తారు. ఈశ్వరుడు

స్వతంత్రుడే అయిన పక్షాన కర్మలను చేయకపోయినా ఫలాన్ని ఎందుకివ్వలేడని, కర్మమొకటీ ఫలమొకటిగా లోకంలో కనబడుతున్నది కాబట్టి ఈశ్వరుడు స్వతంత్రఫలదాత కాడని, కర్మము ననుసరించి ఫలాన్ని ఇస్తుంటాడని, అందువల్ల ఈశ్వరుడు కూడా కర్మాశ్రయుడే అయి కర్మాంగమాత్రునిగా ఉన్నవాడని కొందరు నిశ్చయిస్తారు.

## హేతువాదం - స్వభావం

తండ్రీ! కర్మమన్నది జడము కాబట్టి దానికి స్వతంత్ర ప్రవృత్తి కలుగదని, ఏదో ఒకశక్తి అంతర్యామియై కర్మమును నడిపిస్తున్నదని, ఆ శక్తికే దేవుడని పేరున్నదని, అందువలన కర్మము ఫలించటానికి దేవునితో పనిలేదనటం అనుచితమని కొందరంటారు. భూతములన్నీ తమ తమ స్వభావప్రేరితాలై ఆయా కర్మలను చేస్తున్నవి గాని పరప్రేరితాలై చేయటం లేదు. స్వభావం అంటే ఏమిటి? ప్రాణులు పూర్వం ఎన్నో జన్మలెత్తి ఎన్నో కర్మలను చేసి ఉంటాయి. ప్రతికర్మానికి ఫలం తప్పదు. కర్మములు వివిధాలుగా ఉంటాయి కాబట్టి ఫలాలు కూడా వివిధాలుగా ఉండక తప్పదు. ఫలాలను అనుభవించి తీరాలి. ఫలానుభవానికి శరీరం ఉండితీరాలి. ఫలాలు వివిధాలుగా ఉన్నప్పుడు వాటన్నిటినీ ఏకశరీరంతో అనుభవించటం సాధ్యం కాదు. శరీరం ఫలానుభవయోగ్యంగా ఉండాలి. పైగా కర్మలన్నీ ఒక్కసారిగా ఫలోన్ముఖాలు కావు. ఏయే కర్మలు ఫలోన్ముఖాలయితే ఆ ఫలానుభవానికి తగిన దేహం కావాలి. ఆ విధంగా వివిధదేహాలను ధరించటానికే జన్మలని పేరు. తండ్రీ! ఫలానుభవయోగ్యమైన దేహాన్ని ఎవరు నిర్ణయిస్తారని కూడా అడగవచ్చును. ఆ కర్మఫలాలే తమకు యోగ్యమైన దేహాన్ని నిర్ణయించి గ్రహిస్తాయి.

ప్రతి ఫలానికీ తత్తద్గుణాన్ని బట్టి వాసన ఉంటుంది. ఆ వాసనల సముచ్చయాన్ని స్వభావమని అంటారు. ప్రారబ్ధకర్మఫలభోగార్థం ఏ శరీరం కలిగితే ఆ శరీరమందు తత్తత్కర్మఫల వాసనాసముచ్చయం ఉంటుంది. కాబట్టి శరీరధారుల ప్రవృత్తి సమస్తం వారివారి స్వభావాధీనమై ఉంటుంది.

శరీరధారుల ప్రవృత్తికి, వారి శరీరాలలో ఉండే అంతర్యామికి ఎటువంటి సంబంధమూ లేదు. దీనిని బట్టి స్వభావ నిష్పన్న కర్మమే సర్వకారణం అవుతున్నది గదా.

స్వభావం కూడా జడమే కాదా? అంటే, స్వభావం జడమైనప్పటికీ అంతర్యామి సాన్నిధ్యం వలన అది వ్యవహరిస్తున్నది. సూదంటురాయి సాన్నిధ్యంలో ఇనుపముక్క చలించటం మనము చూస్తున్న విషయమే. జడమనగానే శక్తిరహితమని అనుకోకూడదు. జడపదార్థశక్తి లీనమై చలింపనిదిగా ఉంటుంది. అయస్కాంత సాన్నిధ్యం వలన ఇనుపముక్క యొక్క శక్తి లీనమై ఉన్నది వ్యవహారాన్ని పొందుతున్నది. ఆ సాన్నిధ్యం నిజానికి నిమిత్తకారణం మాత్రమే. ఇనుపముక్క శక్తిని 'ఈ విధంగా ప్రవర్తించు!' అని సూదంటురాయి కోరటం గాని ప్రేరేపించటం గాని లేదు. దాని శక్తి దాని స్వభావం ప్రకారం వర్తిస్తున్నది. ఆ విధంగానే భగవత్సాన్నిధ్యం సంగతిని, స్వభావవర్తన సంగతిని గ్రహింపవలసి ఉంటుంది.

తండ్రీ! ఈ స్వభావాన్ని బట్టి దేవాసుర మానుషాది దేహభేదాలు, క్రియాభేదాలు, శత్రుత్వ మిత్రత్వాదులు, గురుత్వ ప్రభుత్వాదులు సమస్తం ఏర్పడుతున్నాయి. స్వభావం లేని పదార్థమే ఉండదా? అంటే, స్వభావరహితమైన పదార్థం ఉండదనే సమాధానం.

దీనినిబట్టి ఏమని తేలింది? స్వభావం కర్మఫల వాసనాసముచ్చయం కాబట్టి మొత్తం మీద స్వభావమే అన్నింటికి కారణమవుతున్నది. ఫలితార్థం ఏమంటే కర్మపరులకు వారి స్వభావనిష్పన్నకర్మమును పూజించటం విధి అన్నమాట. ఆ చేసేటప్పుడు కర్తృత్వం వహింపనప్పుడు ఎట్టి కర్మమైనా ఒక్కటే.

## ప్రకృతి పూజ

తండ్రీ! మరొక విషయాన్ని కూడా జ్ఞాపకం ఉంచుకోవాలి. ఎవరికి ఏది వృత్తినిస్తుందో అదే వారికి దైవతం. ఒకదానివలన జీవిస్తూ వేరొకదానిని

సేవించేవాడు తన భర్తను వదిలి జారుని చేరిన జారవనిత వలె మేలుపొందే అర్హతను కోల్పోతాడు. ఎవరికి ఏది వృత్తి? అంటే వృత్తిని స్వభావమే నిర్ణయిస్తున్నది. బ్రాహ్మణస్వభావం వేదాధ్యయనాదులను వృత్తిగాను, క్షత్రియస్వభావం పరిపాలనాదికాన్ని వృత్తిగాను, వైశ్యస్వభావం వార్తను వృత్తిగాను, శూద్రస్వభావం సేవాదికాన్ని వృత్తిగాను నిర్ణయిస్తున్నది. వైశ్యవృత్తి అయిన వార్త కృషి వాణిజ్య గోరక్షా కుసీదములని నాలుగు విధాలు. ధనాన్ని వడ్డికిచ్చి ఆ వడ్డితో జీవించటం కుసీద మనబడుతుంది. మనకు గోరక్షణ వృత్తి అయింది. ఆ వృత్తిని ఏది పోషిస్తున్నదో అదే మనకు దైవతం. దానిని పూజించటమే మనకు కర్తవ్యం.

తండ్రీ! గోవులకు పచ్చికమేత అవసరమని, ఆ పచ్చిక వర్షం వలన కలుగుతున్నదని, వర్షాన్ని ఇంద్రుడు కురిపిస్తున్నాడని, దానిని బట్టి ఇంద్రదేవతారాధన యుక్తమని మీరందరూ అనుకొంటున్నారు కాబోలు. లోకము యొక్క ఉత్పత్తిస్థితిలయాలు మూడింటికీ రజస్సత్త్వతమోగుణాలు మూడూ క్రమంగా కారణాలుగా ఉన్నాయి. రజస్సు వలన భూతవ్యాపారం పొసగుతున్నది. ఆ వ్యాపారయోగం చిత్రవిచిత్రం. ఆ వైచిత్రిని బట్టి విచిత్రమైన జగత్తు కలుగుతున్నది. రజస్సు వలన మేఘాలు పుట్టుతూ కలుస్తూ విడిపోతుంటాయి. ఆ కలయికల ఫలంగా వర్షాలు కురుస్తుంటాయి.

తండ్రీ! వర్షమన్నది మన బృందావనం ఒక్కచోట మాత్రమే కురుస్తున్నట్లయితే మీరంటున్నట్లు మీ పూజాఫలంగా మీరు ఆరాధించినదైవ ప్రేరణ వలన కురిసినదని అనుకోవచ్చును. వర్షం సముద్రశైలవనాదులన్నిటా ఏకరీతిని కురుస్తున్నది. సముద్రాదులు జడములు; పూజాదులను చేస్తున్నవి కావు. అయినా సముద్రాదులలో కూడా వర్షం కురుస్తుండటాన్ని బట్టి మీ ఆలోచన యుక్తికి నిలవదు. మేఘాలు వాటి స్వభావం ప్రకారం వర్షిస్తున్నాయి. ఆ వర్షాఫలంగా జీవకోటి బ్రతుకుతున్నది. అంతే కాని మహేంద్రుడు చేసిన ఉపకారం ఇందులో ఏమీలేదు.

తండ్రీ! జీవుల యోగక్షేమాన్ని కోరితే దేవతాపేక్ష అవసరం కదా? అని భావింపవద్దు. మనకు దేశాలు గాని పురాలు గాని గ్రామాలు గాని చివరికి ఇళ్ళు గాని లేవు. మనము వనవాసులము. అడవులను కొండలను పట్టుకొని ప్రాకులాడుతున్నవాళ్ళము. మన యోగక్షేమాలకు వనశైలాదులే హేతువులన్నమాట ప్రత్యక్షసత్యం. ప్రత్యక్ష మహోపకారులను వదిలి పరోక్షాలను, ఊహనీయాలను మనమెందుకు ఆదరించాలి? మనకు, మన గోవులకు గోవర్ధన పర్వతం, గోవర్ధన ప్రాంతం లోని వనం నిజమైన ఉపకారం చేస్తున్నాయి. కాబట్టి వాటికి, బ్రాహ్మణులకు మన కృతజ్ఞతను చూపుదాము.

## ఉత్తమ యాగం

తండ్రీ! దేవేంద్రయాగం కోసమని వస్తుసంభారాలను సమకూర్చారు. ఆ సామగ్రిని నేను చెప్పినట్లు వినియోగించటం ఉత్తమం. సూప పాయసాది వివిధపదార్థాలను వండించండి. మన ఆవుల పాడిని గోధూమాది విక్రియాలకు వినియోగించండి. బ్రహ్మవాదులైన బ్రాహ్మణులను రప్పించి హోమాలు చేయించి వారిని మృష్టాన్న ధేను దక్షిణలతో సంతృప్తులను చేయండి. యాగక్రియకు భూతతృప్తి జీవగర్ర వంటిది. అందువల్ల వారూ వీరన్న భేదాలు లేకుండా చండాల పతితాదులకు, శునకాది జంతుజాలానికి కడుపునిండుగా భోజనాలు పెట్టండి. గోవులకు కావలసిన లేత పచ్చికలు తినిపించండి. ఈ గోవర్ధన పర్వతానికి బలిని సమర్పించండి. అందరూ తృప్తితీరా భుజించి వస్త్రమాల్యగంధాదులు ధరించి గోబ్రాహ్మణపర్వతాలకు ప్రదక్షిణలు చేయండి. ఇది గోబ్రాహ్మణ పర్వతప్రియమైన యాగం' అని చెప్పాడు.

## గోవర్ధన పర్వతోత్సవం

ఆ మాటలు నందాదులు సాంతం విని అదే మంచిదని భావించి చేయవలసిన కార్యక్రమాన్ని నిశ్చయించారు. బ్రాహ్మణులు స్వస్తివచనాలు పలికారు. ఇంద్రయాగసంభారాలతో సూప పాయసాది మృష్టాన్నాలు

సిద్ధమయ్యాయి. లేత పచ్చికలు మోపులు మోపులుగా తెచ్చి ఆవుల ముందుంచారు. పర్వతానికి బలియిచ్చి ఆబాలగోపాలం భోజనాలకు కూర్చొని తనివితీరా భుజించారు. శునకాదులకు తిన్నంత పెట్టారు. అందరూ సేదదీరాక అలంకరించుకొని ప్రయాణం కట్టారు.

గోపికలు పెద్దయెడ్లను గట్టిన బండ్లపయి కూర్చొని కృష్ణలీలలు పాడుకొంటూ బయలుదేరారు. గోధనం ముందు, దానివెంట గోపాలకులు నడిచారు. అందరూ తరలివెళ్ళి గోవర్ధనగిరికి ప్రదక్షిణ కావించారు. కృష్ణుడు ముందు నిలిచి, 'ఈ గిరిరాజు తనను అవమానించినవారిని కామరూపంలో హరిస్తాడు. మనకూ మన గోగణానికీ మేలుకోరి ఈ గిరికి మ్రొక్కుదాము' అని పలికి, 'అహో! పశ్యతి శైలోఽసౌ రూపినోఽనుగ్రహం వ్యధాత్' అని నమస్కరించాడు. అతని వెంట గోపగోపీజనం గోవర్ధనగిరికి ప్రణమిల్లారు. ఆ తర్వాత అందరూ వ్రేపల్లెకు తిరిగివచ్చారు.

## ఇంద్రుని ఆగ్రహం

మహేంద్రుడు అది చూసి మండిపడ్డాడు.

**మ. పెరుగుల్ నేతులుఁ ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్ మదాభీరులై**
**గిరిసంఘాతకఠోర పత్త్రదళన క్రీడాసమారంభ దు**
**ర్భరదంభోళిధరుం బురందరు ననుం బాటించి పూజింప క**
**గ్గిరికిం బూజలు చేసి పోయి రిదెపో కృష్ణుండు ప్రేరేపఁగన్.**

**క. గురుదేవహీను బాలుని**
**గిరిభూజప్రముఖవాసు గృష్ణు ననీశుం**
**బరిణామశీలు గులగుణ**
**విరహితుఁ జేపట్టి నన్ను విడిచిరి గొల్లల్.**

అని తలపోసి సంవర్తక మేఘాలను రావించి, 'పయోదరాజులారా! ఈ గోకులం వాళ్ళు దేవతలందరినీ అవమానించారు. సమస్త కర్మయజ్ఞాలకు నేనే

అధీశుడను. నా వలన అవి ఫలాలనిస్తాయి. నన్ను వదిలి చేసిన యజ్ఞాలు యజ్ఞాభాసాలు గాని యజ్ఞాలు కావు. అట్టి యజ్ఞాభాసాలను చేసి ఫలంకోసం ఎదురుచూడటం అధ్యాత్మవిద్యను వదలి సంసారార్ణవం దాటాలనుకోవడం వంటిది. ఇంత ఘోరానికి వ్రేలెడు బుడత కృష్ణుడనేవాడు కారణంగా ఉన్నాడు. అతనికి రవ్వంత జ్ఞానం లేదు. లేకపోగా తనను మించిన విద్వాంసుడు లేడని గర్వించి నోటికి వచ్చినట్లు వాగుతుంటాడు. ఆ వాచాలుడిని బాలిశుడిని స్తబ్ధుడిని అజ్ఞుడిని పండితమానుడిని నమ్మి వెర్రి గోపులు నాకింత అవమానం చేశారు. ఈ గొల్లవాళ్లను పైకొన్న గర్వాన్ని అణిచి పశువుల్లాగా వాళ్ళను గడగడలాడించండి. ఇదే నేను నా ఐరావతాన్ని అధిరోహించి మరుద్గణంతో గోకులసంహారార్థం వస్తున్నాను' అని పలికి ప్రళయేతరకాలాలలో సంచరింపకుండేందుకు ఆ మేఘాలకు కట్టిన బందాలను సడలించాడు.

## గోగోపకుల మొర

సంవర్తకమేఘాలు చెలరేగి కటిక చీకట్లు కమ్ముకొని ఉరుములు మెరుపులు సుడిగాడ్పులతో వడగండ్ల వర్షాన్ని గజతుండధారలను కుమ్మరించి వ్రేపల్లెను ముంచెత్తాయి. ఎటుచూసినా మిట్టపల్లాలు లేక నేలంతా జలమయం అయింది. గోపికాగోపకులు ఆబాలవృద్ధం చలికి గజగజలాడసాగారు. గోవులొకవంక వణుకుతూ దూడలను తలలతో కప్పి ప్రాణాలను బిగబట్టి బిక్కుబిక్కుమంటూ నిలబడ్డాయి. ఎంతకీ గత్యంతరం కనబడదు. 'హా! కృష్ణా! మహాభాగా! గోకులనాథా! మమ్మల్ని రక్షించు! ఇంద్రుడు మాపై ఆగ్రహించి శిలావర్షం కురిపించి మమ్మల్ని బాధిస్తున్నాడు. భక్తవత్సలా! నీవే మాకు గతి' అన్న ఆక్రోశాలు ప్రతిధ్వను లీనసాగాయి.

## గోవర్ధన పర్వతోద్ధరణం

శ్రీకృష్ణభగవానుడు ఆ మొరలు విని కాలం గాని కాలాన శిలామయమూ అతివాతమూ అయిన ఆ ఘోరవర్షం మహేంద్రుని దురాగ్రహ ఫలమని గ్రహించి, 'ఓహో! మహేంద్రుడు తానే లోకేశ్వరుడనని గ్రహించి తన

మౌఢ్యాన్ని ప్రకటించాడు. అతనిలాగే దేవతలందరూ గర్వాంధులై ఉన్నారు. సాత్త్వికులు, విశేషించి నా భక్తులు అయిన దేవతలకు ఇంతటి తమోభావన ఎక్కడినుంచి వచ్చింది? సరిసరి. ఆధిపత్యగర్వం ఇంత పని చేసింది. గర్వం సద్భావాన్ని కప్పిపుచ్చుతుంది. దానితో నా పైని భక్తికూడా మాయమౌతుంది. ఈ గర్వశాంతి కావించటం వారిని అనుగ్రహించటమే కాగలదు. నన్ను నమ్మి నా ప్రాపున చేరి నా తోడిదే లోకంగా ఉన్నవారికి ఎన్నడూ ఎక్కడా కీడుకలుగదు. ఇది నా వ్రతం కదా' అని ఆలోచించి, చిన్ని పిల్లవాడు పుట్టగొడుగు నెత్తినట్లు గోవర్ధన గిరిని ఒకచేతితో అవలీలగా ఎత్తిపట్టి, 'తల్లిదండ్రులారా! గోపకులారా! గోపికలారా! మీరు పుత్ర మిత్ర బంధు పరివారసమేతంగా గోగణాలతో వచ్చి ఈ కొండక్రిందికి చేరి కష్టాలను మర్చిపొండి' అన్నాడు.

గోకులం గోకులమంతా తరలి కొండక్రిందికి వచ్చిచేరింది. ఏడు అహోరాత్రాలు విరామం లేకుండా కుంభవర్షం కురిసింది. ఆ ఏడు దినాలు కృష్ణుడు ఆ కొండను ఎత్తిపట్టుకొనే ఉన్నాడు.

శ్రీకృష్ణయోగప్రభావాన్ని ఇంద్రుడు గ్రహించి అతని ముందు తన ఆటలు సాగవని నిశ్చయించి గర్వం ఉడిగి మేఘాలను నివారించాడు; మబ్బులు విడిపోయాయి; మిన్నులు తెల్లవారాయి; సూర్యుడు ఉదయించాడు.

కృష్ణుడు గోపకులను పిలిచి, 'వాన నిలిచింది; వరదలు తగ్గాయి. ఇక మీరు మీ తావులకు వెళ్ళవచ్చును' అని పలికాడు. గోపకులు స్త్రీబాలవృద్ధంగా గోగణంతో అక్కడినుంచి బయటికి వచ్చారు. కృష్ణుడప్పుడు గోవర్ధనాన్ని యథాప్రకారం నేల నిలిపాడు.

వ్రజవాసులు తమ ఆనందాతిశయాలను తెలియజేస్తూ కృష్ణుని మాటిమాటికి కౌగిలికి చేర్చుకొన్నారు. గోపికలు కృష్ణునికి పెరుగన్నాలు పెట్టి దీవించారు. సుర సిద్ధ చారణ గంధర్వులు పుష్పవర్షం కురిపించారు. దేవతల వాదిత్రధ్వనులు మారుమ్రోగాయి. తుంబురాదులు గానం చేశారు. కృష్ణుడు

వ్రేపల్లెకు దారితీశాడు. గోపికలు కృష్ణచరిత్రలు పాడుతూ అతని వెంట నడిచారు.

## గోపకుల ఆశ్చర్యం

శ్రీకృష్ణభగవానుడు తమ కళ్ళయెదుట కావించిన అలౌకికకార్యాలు గోపాలకులకు ఎంతో వింతగా తోచేవి. గోవర్ధన గిరిని ఒక్క చేతితో పైకెత్తి ఏడు అహోరాత్రాలు కదలిక లేకుండా పట్టుకొని గో గోపకులను రక్షించేసరికి వారి వింత మేరమీరింది. అందరూ కలిసి ఆలోచించి ఒకనాడు నందుని చేరబోయి

సీ. కన్నులు దెఱవని కడు జిన్న పాపఁ డై
దానవిఁ జనుబాలు ద్రావి చంపె,

మూడవ నెలనాఁడు ముద్దుల బాలుఁ డై
కోపించి శకటంబుఁ గూలఁ దన్నె,

నేడాది కుఱ్ఱఁడై యెగసి తృణావర్తు
మెడఁబట్టుకొని కూల్చి మృతునిఁ జేసె,

దల్లి వెన్నలకునై తను ఱోలఁ గట్టిన
గొమరుఁడై మద్దులు గూల నీడ్చె,

తే. బసులఁ గ్రేపుల గాచుచు బకునిఁ జీరె,
వెలగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె,
సబలుఁడై ఖరదైత్యుని సంహరించె
నితఁడు కేవలమనుజుఁడే? యెంచిఁ చూడ!

క. తెంపరియై రామునిచేఁ
జంపించె బ్రలంబు, మ్రింగెఁ జటులదవాగ్నిన్
సొంపు సెడఁ ద్రొక్కి కాళియుఁ
ద్రుంపక కాళింది వెడలఁ ద్రోలెన్ లీలన్.

**క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ?**
**క్రీడం గరి తమ్మి యెత్తు క్రియ నందఱముం**
**జూడ గిరినెత్తు టెక్కడ**
**వేడుక నొకచేత నేఁడు? వెఱఁగౌ గాదే.**

వ్రజేశ్వరా! కృష్ణుని ఈ విచిత్ర కార్యాలను చూడగా ఇతనెవరో, గ్రామ్యులమైన మనమధ్య గోకులానికి జన్మించటం ఎందుకో అంతుపట్టడం లేదు' అని తమ శంకాకులభావాన్ని మనసువిప్పి చెప్పారు.

## నందుని సమాధానం

నందుడు వారన్నది విని, 'గోపకుమారకులారా! కృష్ణుని గూర్చి మీకిటువంటి శంకలు కలగటం వింతేమీ కాదు. సంగతి చెబుతాను వినండి. కృష్ణునికి జాతకర్మలు కావించేందుకు గర్గమహర్షిని రావించాను. ఆ మహనీయుడు వచ్చి శాస్త్రోక్తంగా కార్యక్రమమంతా జరిపించి నాతో 'ఓ వ్రజేశ్వరా! భగవానుడు నాల్గుయుగాల లోనూ శుక్ల రక్త పీత కృష్ణవర్ణాలలో అవతరిస్తుంటాడు. ఇప్పటికి మూడు యుగాలు గడిచాయి. ఆ మూడింటిలో క్రమంగా మూడు వర్ణాలను దాల్చి ఆయన అవతరించాడు. నాల్గవ యుగం రానున్నది. శ్రీభగవాను డిప్పుడు కృష్ణవర్ణం దాల్చి అవతరించాడు. అందువల్ల ఈతనికి కృష్ణుడనే పేరు తగి ఉన్నది. ఇతను వసుదేవుని ఆత్మజుడు. అందువలన వాసుదేవుడని పేరువస్తుంది.

అంతేకాదు. ఇతని గుణాలను బట్టి, కర్మలను బట్టి ఇతనికి అనేక నామధేయాలు కలుగుతాయి. అవన్నీ నాకు స్పష్టమే కాని లోకానికి అంతగా తెలియదు. ఇతను మీ గోకులానికి గల దుర్గతులను తొలగించి మీకు మేలుగూర్పనున్నాడు. అరాజకత్వం వలన సాధువులు దస్యుపీడితులై తహతహపడుతున్నారు. ఇతని ప్రాపుగాంచి వారు దుష్టులను సంహరిస్తారు. ఇతనిని కూర్మించినవారియెడ దైత్యుల పన్నగాలు సాగవు. ఈ నీ కుమారుడు శ్రీ కీర్తి ప్రభావాదులలో నారాయణతుల్యుడు గాని సామాన్యుడు కాదు' అని

తెలిపి వెళ్ళాడు. గోపకులారా! కృష్ణుడు నారాయణాంశసంభవుడని నా నమ్మకం' అని చెప్పాడు. గోపకుమారులు గర్గ మహర్షి వచనాలను విని సంశయాలు తొలగి కృష్ణుని మనసారా పూజించారు.

## మహేంద్రుని క్షమాపణ

రాజా! మహేంద్రుడు శ్రీకృష్ణుని మాహాత్మ్యం చూసి ఆశ్చర్యపోయి తను చేసిన అకార్యానికి సిగ్గుపడి, ఆ మహనీయుని సందర్శించి క్షమాపణ వేడదలచి సమయం కోసం ఎదురుచూస్తున్నాడు. ఒకనాడు కృష్ణుడొక చోట ఒంటరిగా ఉన్నాడు. ఇంద్రు డదిచూసి తగినవేళ అదేనని కనిపెట్టి గోలోకం నుంచి కామధేనువును రప్పించి దానిని వెంట తీసుకొని వచ్చి శ్రీకృష్ణపాదకమలాలకు సాగిలిపడి మ్రొక్కి లేచి కేల్దోయి గూర్చి ఇలా అన్నాడు –

'దేవా! నీవు అద్వితీయుడవు శాంతుడవు తపోమయుడవు విశుద్ధసత్త్వుడవు కాబట్టి రజస్తమస్సులు నీ సమీపానికి కూడా రాలేవు. మాయాకార్యరూపము గుణప్రవాహము అయిన ఈ సంసారం అజ్ఞానులముగా ఉన్న మాకే గాని నీకు కలుగదు. నీకు సంసారమే కలుగదనగా సంసారమందలి ధర్మాలు గాని కామక్రోధలోభాలు గాని కలుగవని వేరే చెప్పాలా? అవి మాబోటి అజ్ఞానులను వదలవు. అట్టి సంసారాతీతుడవు నీవు దేహధారణ చేస్తావు. ధర్మరక్షణ దుష్టశిక్షణార్థం శరీరాన్ని ధరిస్తావు.

దేవా! శిష్టరక్షణ మనగానే దుష్టశిక్షణపూర్వకమని, ఆ దుష్టశిక్షణ దండనాది రూపమని, అట్టిది లోభాదికార్యమని, లోకులు భావించేది సత్యమని అందుకు నిదర్శనగా నీవు నాకు కావించిన మానదండనమే కానవస్తున్నది. నీ దండనాదులన్నీ దండితుల మేలుకోసమే గాని నీ క్రోధాది భావతృప్తికి గావు.

దేవా! గోపబాలకమాత్రు డెక్కడ? ఇంత శక్తి యెక్కడ? అని శంకించే వారూ ఉన్నారు. నీవు జగజ్జనకుడవు ఉపదేష్టవు నియంతవు అన్న సంగతి తెలియక వారట్టి భ్రమకు లోనవుతుంటారు. నేను చెప్పిన మూడు కారణాలను బట్టి దండధారణాధికారం నీకు సర్వవిధాల తగి ఉన్నది. నీ లీలావతారాలు లోకహితం కూర్చే జగదానందకారణాలు. గర్వోద్ధతులు నీచేత దండితులై గర్వం అణిగి సన్మార్గవర్తు లవుతారు. లోకహితమే నీ అవతార ప్రయోజనం.

**శా. నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషమున్ భీషణో**
**గ్రాసారంబున ముంచితిన్ మఖము నా కై వల్లవుల్ సేయరం**
**చో సర్వేశ! భవన్మహత్త్వమున నా యుద్యోగ మిట్లయ్యె, నీ**
**దాసున్ నన్నుఁ గృతాపరాధు గరుణన్ దర్శింపవే మాధవా!**

**మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు, జడతా నిష్ఠుండ లోకత్రయా**
**వన దుర్మానగరిష్ఠుఁడన్ విపుల దుర్వైదుష్యభూయిష్ఠుఁడన్**
**వినయత్యాగ వరిష్ఠుఁడన్ గుజన గర్విశ్రేష్ఠుఁడన్, దేవ! నీ**
**ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియం గా నెవ్వఁడన్? సర్వగా!"**

అని విన్నవించాడు.

## శ్రీకృష్ణుని ఉద్బోధ

శ్రీభగవానుడు దానికి చిరునవ్వు నవ్వి 'ఇంద్రా! దేవరాజైశ్వర్య మదాంధుడ వైనావు. మత్తుడు నన్ను చూడడు. నేనే కనికరించి తద్గర్వహరణరూపాన అతనిని అనుగ్రహిస్తుంటాను. సంపదలు గర్వానికి మూలహేతువులు. గర్వులను నేను అనుగ్రహింపగోరితే మొట్టమొదట వారిని సంపదలకు దూరంచేస్తాను. అంతటితో వారు దీనులై తత్త్వం గ్రహించి మసులుకొంటారు. మీరు మదింపక మీ మీ అధికారులను ధర్మప్రకారం నడపండి. ఇదే నా శాసనం; శుభం జరుగుతుంది' అని పలికాడు.

## కామధేనువు

అప్పుడు కామధేనువు ముందుకు వచ్చి, 'విశ్వాత్మా! విశ్వభావనా! నీ ప్రాపుగాంచి నా కులమంతా ఇంద్రుని బారినుంచి రక్షితమయింది. ఎవడు రక్షకుడో వాడే ఇంద్రపదవికి తగినవాడు. అన్యులు తగరు. నీవు గో విప్ర సుర సాధు రక్షకుడవు కాబట్టి నిన్నే ఇంద్రునిగా అభిషేకిస్తాను. భూభారాన్ని అపనయింపగోరి అవతరించిన జగత్పతికి నీకు ఈ అభిషేకాదు లెందుకంటావా? ఇది బ్రహ్మ ఆదేశం' అన్నది. కృష్ణు డా మాటలకు తల పంకించాడు. సురధేను వంతట నిజదివ్యక్షీరాలను గంగాజలమిశ్రితం కావించి శ్రీకృష్ణుని అభిషేకించింది.

## ఇంద్రుని సేవ

అప్పుడు దేవేంద్రుడు తన ఐరావతం తొండంతో తీసికొనివచ్చిన మందాకినీ జలాలను, ఋష్యాదులను ముందుంచుకొని కృష్ణుని అభిషేకించి, 'దేవా! నీవు గోవులను, గోలోకాన్ని పాలించేవాడవు కనుక 'గోవిందు' దనే పేరు నేటినుంచి నీకు కలుగుతుంది గాక' అన్నాడు. నారద తుంబుర గంధర్వాదులు భగవానుని స్తుతించారు; సురాంగనలు పాడారు; పుష్పవృష్టి కురిసింది; గోవులు పయోవృద్ధి నందాయి; నదులు నానారసాలను ప్రవహించాయి; వృక్షాలు తేనెలను చిలికాయి. పర్వతాలు తమలో ఉన్న మణులను వెదజల్లాయి; ఓషధులు దున్నకనే ఫలించాయి; క్రూరజంతువులు నైజక్రౌర్యాన్ని వదిలాయి; ముల్లోకాలు ఆనందించాయి. ఇంద్రుడంతట గోవిందునికి వీడ్కొలిపి సురగణంతో దేవలోకానికి వెళ్ళాడు.

## నందాపహరణం

నందుడు ఏకాదశీ వ్రతం ఆచరిస్తుండేవాడు. ఏకాదశి వచ్చింది. ఆనాడు నందుడు ఉపవసించి జనార్దనుని పూజించాడు. ఏకాదశీవ్రతులు ద్వాదశినాడు పారణ చేస్తారు. మర్నాడు ద్వాదశి గడియలు సూర్యోదయానికి

పూర్వమే ముగిసే విధంగా ఆనాటి తిథి అమరింది. ఆ లోపలే పారణ చేయాలని నియమం. నియమవ్యతిక్రమం జరిగితే వ్రతలోపం అవుతుంది. వేకువ వేళ అసురసమయం. అట్టి సమయాన ద్వాదశీస్నానం చేయటం శాస్త్రనిషిద్ధం. అది నందునికి తెలియదు. అతను వ్రతభంగం జరుగరాదని నియతి తెలియక వేకువనే లేచి యమునానదిలో మునకవేశాడు. ఆ అదనుచూసి అసురుడొకడు నందుని పట్టుకొని వరుణుని వద్దకు తీసికొనిపోయాడు. నందుడు నీటిలో మునిగి ఎంతసేపటికీ వెలికి రాకపోయేసరికి గోపికలు భయాకులితలై 'కృష్ణా! కృష్ణా!' అని గగ్గోలు పెట్టారు.

## శ్రీకృష్ణుని పూనిక

కృష్ణుడు ఆ కేకలు విని వారికి అభయం పలికి వరుణలోకానికి వెళ్ళాడు. కృష్ణుని రాకకు వరుణుడు పరమానందభరితుడై అతనిని వేవిధాల పూజించి 'దేవా! నేడు నాకు జన్మ సఫలం అయింది. సర్వార్థాలను చూరగొన్నాను. నీ పాదాన్ని ఆశ్రయించినవారికి సంసారసాగరం చిన్నకాలువ వంటిది.

**ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటి గప్పిన మాయ గప్పగా**
**నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకు ను**
**ద్దీపిత భద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ**
**తాపము వాయ మ్రొక్కెద నుదార తపోధన చక్రవర్తికిన్.**

నిరతిశయైశ్వర్యమూర్తీ! పరిపూర్ణా! పరమాత్మా! సర్వజీవనియంతా! నా భటుడు నీ ప్రభావాన్ని ఎరుగక నీ తండ్రి నిక్కడికి తీసికొని వచ్చాడు. ఇది మహాపరాధం. అజ్ఞానవశాన నా భటుడిటువంటి తప్పు చేశాడు. ఇది తప్పే అయినా దీని కారణంగా నాకు నీ పాదస్పర్శభాగ్యం కలిగింది. ఇదిగో నీ తండ్రి; నీ వెంట తీసికొనివెళ్ళు. మేము నీ బిడ్డలము. బిడ్డల తప్పును తండ్రి సైపక తప్పదుకదా' అని ప్రార్థించి, నందుని సమర్పించాడు. కృష్ణుడు నందునితో తిరిగివచ్చి గోపికలకు ప్రీతి కలిగించాడు. అందరూ వ్రేపల్లెకు బయలుదేరారు.

## ఆత్మలోకదర్శనం

నందుడు ఇల్లుచేరి, జరిగిన సంగతిని వ్రజవాసులకు తెలియజెప్పాడు. అది విని కృష్ణుని ఈశ్వరునిగా వారు భావించి, 'అయ్యో! మనకు ఆత్మ బ్రహ్మగతి నిస్తాడో లేదో' అని తలంపసాగారు. కృష్ణుడు వారి భావాన్ని గ్రహించి 'ప్రాణులు వారివారి అవిద్యాకామకర్మ కారణాన వివిధజన్మలలో పరిభ్రమిస్తూ తమ గతిని తెలిసికొనలేరు' అని తలపోసి, ఏ లోకం గుణాతీతులైన మునులకు దీర్ఘసమాధినిష్ఠాఫలంగా లభిస్తున్నదో, ఏ లోకం తమఃపరమయి ప్రకాశిస్తున్నదో, ఆ సనాతన సత్యజ్ఞానానంత బ్రహ్మాత్మక లోకాన్ని వారికి చూపించాడు. వ్రజవాసు లందులోకి ప్రవేశించి సంతోషించారు.

**మ. అనవద్యంబు మహాద్భుతంబునయి మాయాదూరమై జ్యోతియై**
**యనిరూప్యంబయి సత్యమై యెఱుకయై యానందమై బ్రహ్మమై**
**యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను నిత్యానంతలోకంబు జూఁ**
**పిన వారెల్లరుఁ గాంచి సంతసమునం బెంపొంది రత్యంతమున్."**

## శరద్రాకారాత్రి వర్ణన

శరత్కాలపూర్ణిమ వచ్చింది. చంద్రుడు సుధాకిరణాలను ప్రసరిస్తూ, దేశాంతరగతు డైన పతి ప్రోషితభర్తృకను చేరవచ్చినట్లు, ప్రాగ్దిశను చేరి ఉదయరాగకుంకుమను తన సుఖైక సుకుమారకరాలతో నాలుగు దిక్కుల వెదజల్లి ఐంద్రీముఖమండలాన్ని అలంకరించాడు. ఓషధులకు తాపగ్లాని చల్లారింది. ఉదయరాగమనోహరమైన పూర్ణచంద్రమండలాన్ని తిలకించి కుంకుమారుణ రమావదనసందర్శనం చేసినట్లు కుముదాలు సంతసించాయి. చల్లని వెన్నెలకు ఉప్పొంగినదన్నట్లు వనమంతా దర్శనీయమై రమణీయతరం కాసాగింది.

శ్రీ భగవానుడు ఆనాడు గోపికా వస్త్రాపహరణకాలాన 'ఒక రేయి నాతో మీరు విహరింపగలరు' అని వారితో చెప్పిన మాటను చెల్లించాలని

సంకల్పించాడు. రాజా! పరదారతోడి వినోదం భగవానునికి తగునా? అని శంకిస్తావు కాబోలు. భగవానుడు ఆత్మారాముడు. అట్టివాడు ఇతరాల వలన మనఃప్రీతిని కోరటం గాని, ఇతరములు అతనికి మనఃప్రీతిని ఇవ్వగలగటం గాని సంభవింపవు. ఆ మహామహుడు సాక్షాన్మన్మథుడు కాబట్టి యోగమాయను పూని మన్మథుని జయించే మార్గాన్ని చూపదలిచాడు.

## శ్రీకృష్ణ మధురగానం

శ్రీ భగవానుడు నాటిరేయి యమునా తటానికి వెళ్ళి దివ్యమురళీగానం ఆరంభించాడు. ఆ గానమాధుర్యం మన్మథునికేసందీపనం అయింది. గోపికలు ఆ మధుర గానాన్ని ఆకర్ణించి కృష్ణాయత్తచిత్తలై, పాలు పితుకుతున్నవారు పితకటం మానివేశారు; పాలు పొయ్యిమీద పెట్టబోతున్నవారు ఆ పని మరచిపోయారు; వండుతున్నవారు వంటముగిసినా దానిని పొయ్యినుంచి దించటం మానుకొన్నారు; వడ్డించేవారు వడ్డెనను వదిలారు; శిశువులకు పాలిస్తున్నవారు మధ్యలోనే చాలించారు; భర్తృపరిచర్యాపరలు ఆ మాటే మరిచారు; తింటున్నవారు తినటం ఆపారు; స్నానం చేస్తున్నవారు దానిని వర్జించారు; మైపూతలు దిద్దుకొంటున్నవారది వదిలిపెట్టారు; కంటికి కాటుక దిద్దుతున్నవారది ఉజ్జగించారు; భోజ్యాలను భుజించటం, కురులు చక్కనొత్తుకొనటం, స్తనాలకు గంధం అద్దుకోవటం, జారిన పయ్యెదలను సవరించుకొనటం అన్నీ మరిచారు. ఇంట కాలు నిలువని తహతహపాటు కలిగింది. దానితో వారందరూ సఖులకు చెప్పక మగలు మామలు మరుదులు బిడ్డలు అన్నదమ్ములు అడ్డుపడి నివారిస్తున్నా తలారింపక మన్మథవివశలై నీలిమేఘాల చాటునుంచి తటిల్లతల వలె మందనుంచి వెలువడి మందగమనలైనా అమందగమనంతో పరమానంద గోవిందసందర్శనార్థం ముందుకు నడిచారు. కామినులు కొందరికి ఇండ్లనుండి వెలువడి రావటానికి విఘ్నాలు కలిగాయి. వారు కృష్ణభావనాయుక్తలై గుణమయమైన దేహాన్ని పరిత్యజించారు.

రాజా! దేహాలు ప్రారబ్ధకర్మబంధనాలని, కర్మఫలం భుక్తమై నశించేదాక దేహబంధం వదలదని శాస్త్రం అంటున్నదంటావా? ఆ మాట నిజం. ఎప్పుడు భగవద్విషయవిరహతాపం తీవ్రమూ దుస్సహమూ అయినదో అప్పు డా తాపమే భోగ్యకర్మఫలాలనన్నింటినీ దహించివేస్తుంది. ఫలమంతా దగ్ధమైనప్పుడు భోగ్యశేషం లేదు కాబట్టి శరీరపతనం జరుగుతుంది. సద్బుద్ధితో చేసినప్పుడు ప్రారబ్ధం భుక్తమై నశించినా నశింపవచ్చును గాని, జారబుద్ధితో చేసినప్పుడు నశింపవచ్చునా? అని శంకింపనున్నావు కాబోలు. అమృతాన్ని నీరనుకొని త్రాగినా మద్యమనుకొని త్రాగినా ప్రీతితో సేవించినా ద్వేషంతో పరిగ్రహించినా ఫలితం ఒక్కటే. అమృతం అమృతఫలాన్నే ఇస్తుందిగాని వేరొక ఫలాన్ని ఇవ్వదు. వస్తుశక్తి బుద్ధిని అపేక్షింపదు గదా.

శ్రీకృష్ణభగవానుడు అవాప్తసమస్తకాముడు; సమస్తసృష్టికర్త. అతనికి పొందవలసినదిగాని పొందనైనది గాని కలుగబోదు. ఏ బుద్ధితో ఆశ్రయించినా భగవానుడు పరమార్థమే ఇస్తాడు. భగవానుని బ్రహ్మాభావంతో భజింపక గుణమయబుద్ధితో భజించినా గుణప్రవాహం శాంతించటమూ పరమార్థం సంప్రాప్తించటమూ ఎలాగంటావా? శిశుపాలుని చరిత్రే ఇందుకు నిదర్శనం. వైరభావంతో తలచినవారే ముక్తులవుతుండగా ప్రేమభావంతో ధ్యానించినవారి సంగతి వేరే చెప్పాలా?

భగవానునియందు భావం లీనమైనప్పుడు భావం ఎట్టిదయినా సంస్కృతమై నిశ్శ్రేయసప్రాప్తినే పొందగలదు. భక్తులకు ఏది మేలో భగవానుడు దానినే సమకూర్చుతాడు.

**ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ**
**బ్రీతినైనఁ బ్రాణభీతి నైన**
**భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు**
**జనులు మోక్షమునకు జనుదు రధిప!**

## గోపికాకృష్ణుల సంవాదం

రాజేంద్రా! గోపికలు ఆ విధంగా సంభ్రమాశ్చర్యాలతో రాగా కృష్ణుడు వారిని చూసి, 'భాగ్యవతులారా! స్వాగతం. వ్రేపల్లె సుఖమే కదా. మీరు వచ్చిన పనేమిటి? మీకేమి ప్రియాన్ని కలిగింపను? ఈ రాత్రివేళ మహాఘోరంగా ఉన్నది. క్రూరమృగాలు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయి. ఇంత సాహసించి మీరిక్కడికి రావచ్చునా? వచ్చారే అనుకొందాము. ఆడవారు ఈ చోట ఈ వేళ ఉండటం తగనిపని. మరలి వెళ్ళండి. తల్లిదండ్రులు అన్నదమ్ములు కొడుకులు కూతుళ్ళు భర్తలు మీరు కనుపింపక ఇప్పటికే వెతుకుతుంటారు. బంధువులకు వృథాభయం కలిగింపకూడదు.

కళ్యాణులారా! రాకాచంద్రకరస్పర్శను పొంది వనమంతా శోభాయమానంగా ఉన్నది. మందమారుతం యమునాతరంగిణీ లలితశిశిరశీకరమనోజ్ఞమై కలయవీస్తున్నది. లతాతతులు గాలికి చొక్కి కుసుమవాసనలు ప్రసరింపజేస్తున్నాయి. వనశోభ చూసిన కొద్దీ మరింత అభిరామంగా ఉన్నది. ఇక్కడికి మీరు వచ్చిన శ్రమకు ఫలంగా ఈ వనరామణీయకాన్ని తిలకించటం నెత్తావులకు పరవశించటం చిరుగాలికి హాయి చెందటం సిద్ధించాయి. మీ పతులు మీ కోసం నిరీక్షిస్తుంటారు. ఇంటిలో పిల్లలు పాలకు గాను ఏడుస్తుంటారు. స్నేహార్ద్రచిత్తలమై ఇక్కడికి వచ్చామని అంటారా? ప్రీతితో మీరిక్కడికి వచ్చినదే చాలు. ప్రీతి ఒక్కటే ప్రధానం. కామినులారా! నిష్కపటమైన పతిసేవ, ఆత్మజపోషణం స్త్రీలకు పరమధర్మాలు. ఆ ధర్మపాలన వలన మీ వారికి ప్రీతి, మీకు సుఖం కలుగుతాయి.

**క. నడవడి గొఱ కాకున్నను**
**బడుగైన గురూపి యైన బామరుఁ డైనన్**
**జడుఁ డైన రోగి యైనను**
**విడుచుట మరియాద గాదు విభు నంగనకున్.**

దీనికితోడు కులాంగనలకు జారునితో పొందు కష్టదాయకం భయానకం నింద్యం యశోహానికరం స్వర్గప్రతిబంధకం అయినట్టింది. అందుకు ప్రాలుమాలినా దానివల్ల కలిగే ఐహికసుఖమైనా ఏమీలేదు. ఏ విధంగా చూసినా జారభావం గర్హ్యమైనదే.

కళ్యాణులారా! నా సన్నిధానంలో మీకు మరింత మేలు కలుగుతుందని ఇంతదూరం వచ్చామంటారా? ఈ విషయంలో సన్నిధానం కంటె దూరాన ఉండటమే మేలు. ఏమంటారా? దూరాన ఉన్నప్పుడు నా కథలు వినడానికి, నన్ను కీర్తించటానికి ధ్యానించటానికి మీకెంతో అవకాశం ఉంటుంది. భక్తి సుస్థిరం కావటానికి కథాశ్రవణ కీర్తన ధ్యానాదులు ఉత్తమ సాధనాలు. అందుకు ప్రత్యక్షానికంటె పరోక్షమే అనుకూలం. మీరందరూ మీ మీ ఇళ్ళకు వెళ్ళండి' అన్నాడు.

ఆ మాటలకు గోపికలకు దుఃఖం పొంగివచ్చింది. సంకల్పభంగం కలిగినదని నిరాశతో నిట్టూర్పులు వెలువడ్డాయి; నిట్టూర్పుల వేడిమికి అధరబింబాలు పాడుబారాయి; మోములు వాడిపోయాయి; అశ్రుధారలు కుచకుంకుమరేఖలను కడిగివేశాయి. విషాదవిగ్రహలై వారు ఏమనాలో తోచక కాల నేల రాయసాగారు. అంతలో వారి అనురాగం పొంగిపొరలి వెల్లివిరిసింది. ఒక్కింత తెగింపు కలిగింది.

ఆ కాంతలు కన్నీరు మునిగొంగులతో తుడుచుకొని, 'నాథా! ఈ కరకు మాటలు మాయెడ నీకు పలుకదగునా? సర్వవిషయాలు నువ్వెత్తుగా విడిచిపెట్టి నీ పాదమూలాన్ని ఆశ్రయించాము. ఆది పూరుషుడు ముముక్షువులను అనుగ్రహించినట్లు కరుణించి మమ్ము పరిగ్రహించు. నీకై వచ్చినవారిని కాలదన్ని పొమ్మనటం న్యాయం కాదు.

పతిపుత్రసుహృదులను అనుసరించటం స్త్రీధర్మమని అన్నావు. సర్వధర్మవేత్తవు. నీకు తెలియని ధర్మాలు లేవు. ఉపదేశికులకు సైతం ఉపదేశికుడవు నీవు ఉపదేశించినది సముచితమే అయినా నీ మాట

కాదనము. భర్తృపుత్త్రాదులకు మేమొనరించే శుశ్రూషలన్నీ వారి దేహాలకా? ఆత్మలకా? దేహములు జడములు కాబట్టి అవి మా పరిచర్యలను పరిగ్రహింపనేరవు. కనుక మా సేవలన్నీ తద్దేహాంతరగతాలైన ఆత్మలకే అన్నది నిర్వివాదాంశం. అన్ని ఆత్మలకూ ఆత్మ పరమాత్మ కాగా ఆ పరమాత్మవు నీవేనని మా భావం. అట్టి నీ సేవ విడిచి వేరే సేవలు చేయమని మాకు ఉపదేశించటం దేనికి? పుత్రాదులు ప్రియులు కారా? అని అడుగుతావా? వారు ప్రియులే ఐనా ఆర్తికరులు మాత్రమే. నీవో? ప్రియుడవేగాక నిఖిలార్తిహరుడవు. అట్టి నిన్ను శుశ్రూషించటం మాని వారిని సేవించటం మాకెందుకు? కనుక ఆత్మభూతుడ వైన నీ యందే నిరంతరమూ రమిస్తాము.

పరమేశ్వరా! మా మొరాలించి మాయందు దయ ఉంచి బహుకాలంగా నిన్నాశ్రయించటం వల్ల మాలో పెరుగుతున్న ఆశాలతికలను చేతులారా త్రుంచివేయవద్దు. గృహభోగాలలో తేలియాడుతున్న మా హృదయాలను ఏలాగుననో హరింపనే హరించావు. ఇప్పుడా హృదయాలను నీ చెంత నిలిపి నిన్ను విడిచివెళ్ళాలంటే మాకు కాళ్ళు కదలవు. పోనీ ఎలాగో వ్రేపల్లెకు వెళ్ళినా నీ సేవ నుజ్జగించి ఏ పని చేయాలన్నా చేతులాడవు. ఏమి చేయాలో చెప్పు.

అయ్యో! మా విరహాగ్నిని నీ మధురగానం ఊది చెలరేపింది. నీ అధరామృతం వెదజల్లి నీ హాసావలోకనాలను ప్రసరింపజేసి ఆ అగ్నిని చల్లార్చు. సఖా! నీ తిరస్కారాన్ని సహింపలేము. ఇక్కడే ఇప్పుడే నీ అడుగుల మ్రోలనే నిన్ను ధ్యానించుతూ విరహానలానికి తనూలతలను అప్పగించి నీ పాదాలను చేరుకొంటాము.

ప్రియాతిప్రియా! నిన్ను విడిచి వేరొకరిని చేరమన్నావు. ఆ పని మేము చేయలేము. అది మా దోషం కాదు. ఎవరి దోషమంటావా? ఏ నీ పాదమూలం వనవాసులకు సయితం ప్రియమైనదో, ఏ నీ పాదమూలం

శ్రీదేవికి సహితం మహోత్సవాన్ని కలుగజేస్తున్నదో, ఆ పాదమూలాన్ని ఒక్కసారి తాకాము. ఆ తాకిన దోషం నేడు మమ్మిలా బాధిస్తున్నది. నాడు మొదలు నీయందే రమిస్తున్నవారము. కాబట్టి మాకీ దశను కల్పించిన దోషం నీ పాదమూలమందే ఉన్నది.

మనోహరా! నీ పాదమూలాన్ని ఆశ్రయించటం ఎందుకంటావా? చెబుతాము విను. సర్వభాగ్యనిధులైన సురలంతటివారు శ్రీకటాక్షవీక్షణ ప్రాప్తికి ప్రాకులాడుతుంటారు. అట్టి శ్రీదేవి వివిధాయాసాలకు ఓర్చి తపోవ్రతయై నీ వక్షఃస్థలాన్ని ఆక్రమింప నోచింది. పరమభాగవతసేవితమైన నీ పాదారవిందాన్ని అర్చింపగలిగే భాగ్యాన్ని వలచి వలచి తులసి అతికష్టం మీద చూరగొన్నది. లక్ష్మి అంతటి ఉన్నత పదవిని ఆక్రమించినా తులసి భాగ్యమే భాగ్యమని భావించి సవతి మచ్చరానికిలోనై నీ పాదసేవకు తహతహలాడుతున్నది. ఇక పశుప్రాయులమైన మా సంగతి ఏమి చెప్పమంటావు?

మాధవా! శ్రీదేవి వంటి లోకోత్తర సౌందర్యరాశికి ఏనాటికి విడువరాని రమణీయమైన నీ సుందరముఖారవిందం మా దృష్టిని ఆకర్షించింది. గో పక్షి మృగ వృక్షాదులకు సైతం దర్శనమాత్రాన మహానందంతో పులకలను అంకురింపజేసే నీ లోకమోహనమైనరూపం మా చిత్తాలను హరించింది. భక్తాభయప్రదమైన నీ బాహుయుగం మమ్మల్ని లొంగదీసింది; మేము నీ దాసికల మయ్యాము.

చిత్తచోరా! అవ్యక్తమధురమధురమైన నీ వేణుగానాన్ని విని ఆర్యచరిత్ర నుంచి అపసరిల్లని సుందరాంగిని ఒక్కతెనయినా ముల్లోకాలలో వెతికి వెతికి అయినా చూపగలవా? ఏ ఆదిపూరుషుడు సురలోకానికి సైతం రక్షకుడైనవాడో, ఆ ఆదిపూరుషుడు వ్రజవాసుల కష్టాలను తొలగింపగోరి నీ రూపాన అవతరించాడు. నీవు మా పాలిటి దైవానివి. నీకు దాస్యం చేయటం మాకు పవిత్రకర్తవ్యం. నాథా! ఇంతటితో నైనా కరుణించి నీ కరారవిందాన్ని

మా కుచమండలాల పైని ఉంచు. నీ సుకుమార కరాంగుళులతో మా శిరోభాగాన్ని స్పృశించి భావి జన్మలను తొలగించు. మా తాపాన్ని పోగొట్టు' అన్నారు.

శ్రీ భగవానుడు గోపికల పారవశ్య ప్రలాపితాలను విని దరహాస కటాక్షవీక్షణాలతో వారిని తిలకించాడు. ఆ చూపుతో గోపికల ముఖరేఖలు వికసించాయి. సుధాకరుడు తారానివహంతో కూడి విరాజిల్లుతున్న చందాన శ్రీకృష్ణుడు వారితో కలిసి ఆడుతూ పాడుతూ వారిని ఆడించుతూ పాడించుతూ క్రమక్రమంగా వనం నుంచి వనాంతరానికి తీసికొనిపోయి యమునాసైకత ప్రదేశానికి చేర్చాడు.

ఆ నదీతరంగడోలికలలో ఊగే పొందామరల పుప్పొడులను మందమారుతుడు కైకొనివచ్చి వారిపైన చల్లసాగాడు. కృష్ణుడు తన బాహుదండాలను వారి భుజాలపై నిలుపుతూ కౌగిట చేర్చుకొంటూ ముంగురులు సవరిస్తూ నర్మోక్తులాడుతూ నీవిని పరామర్శించుతూ నఖక్షతాలు వెలయిస్తూ చందోయిని తాకుతూ కళాస్థానాలను పులకింపజేస్తూ వివిధక్రీడలతో మన్మథోద్దీపన కావించి రమింపజేశాడు. ఆ ప్రసాదభాగ్యానికి గోపికలు సమస్తకామినీలోకంలో తామే ఎక్కువని ఉప్పొంగి విఱ్ఱవీగసాగారు.

## శ్రీకృష్ణుని అంతర్ధానం

శ్రీకృష్ణభగవానుడు గోపికల వివశతను చూసి, వీరు సౌభాగ్యమద మానవివశలై ఉన్నారు. ఇది వీరికి మేలు కాదు' అని తలచి వారికి శుభపరంపరలను కూర్పగోరినవాడై వారి మధ్యనే ఉన్నవాడు ఉన్నట్లుండి మాయమయ్యాడు. గోపికల గతి గజయూథపతిని గానని కరేణువుల గతి అయింది.

కృష్ణుని నడకలు, అతని రాగస్మిత విభ్రమేక్షణాలు మనోహరాలాప విహారవిభ్రమాలు గోపకాంతలకు విభ్రాంతిని గొలిపాయి. వారు

కృష్ణమయచిత్తలై తమనుతాము మరచి ముకుందుని స్మితవీక్షితభాషితాది కార్యాలను అనుకరిస్తూ, 'నేనే కృష్ణుడిని' అని ఒకరితో ఒకరు చెప్పుకొంటూ అతని విలాసాలను అభినయిస్తూ ఒకచోటినుంచి వేరొక చోటికి కృష్ణలీలామృతాన్ని పంచిపెడుతూ అతని కోసం నలుదిక్కుల అన్వేషిస్తూ వన వనాంతరాలలో పరిభ్రమింపసాగారు.

రాజేంద్రా! ఎవడు బహిరంతరా లన్నింటిలో నిండి సర్వభూతాంతర్యామియై ఉన్నవాడో, ఆ భగవానుడు బాహ్యదృష్టితో ఎక్కడ వెతికినా వారికి కానరాలేదు. ఆ విధంగా గోపకామినులు కృష్ణునికోసం వెతికి వెతికి వేసారి ఉపాయం తోపక ఆ వనవృక్షాలను అడిగయినా అతని పొలకువను కనుగొందామని ఆలోచించి, ఆ కనబడుతున్న వృక్షాలలో ఒక్కొక్కదానినీ పలకరించారు.

## గోపికల తన్మయ విభ్రమాలు

**సీ.** **పున్నాగ! కానవే పున్నాగవందితుఁ**
**దిలకంబ! కానవే తిలకనిటలు**

**ఘనసార! కానవే ఘనసారశోభితు**
**బంధూక! కానవే బంధుమిత్రు**

**మన్మథ! కానవే మన్మథాకారుని**
**వంశంబ! కానవే వంశధరునిఁ**

**జందన! కానవే చందనశీతలుఁ**
**గుందంబ! కానవే కుందరదను**

**తే.** **నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ**
**గువలవృక్షమ! కానవే కువలయేశుఁ**
**బ్రియక పాదప! కానవే ప్రియవిహారు**
**గాంచియున్నచో జెప్పుఁడీ కరముఁ గూర్తు.**

వటవృక్షమా! నందనందనుడు ప్రేమస్మితవీక్షణాలతో మా మనోధనాన్ని హరించి అదృశ్యమయ్యాడు.

చంపకమా! లేతనగవుల చేత మానినుల మానాన్ని అపహరించే నవనీతచోరుని చూచావా?

తులసీ! గోవిందుని చరణాలకు ఎంత దగ్గరిదానవు కాకపోతే, ఆ పరమపావనుడు నిన్ను తన చెంతకు చేర్చుకొనటమే గాక నీతో వచ్చిన తుమ్మెదలను సయితం భరిస్తాడంటావు? అతనికి నీ వంతటి ప్రియవు కాబట్టే అతను నీ కన్నుగప్పి ఏ చోటికీ పోదలపడు. ఆ టక్కులమారి ఎక్కడున్నాడో చెప్పు.

మాలతీ! మల్లికా! మాధవుడు మిమ్మల్ని చేతులారా తాకి దగ్గరకు తీసుకొని మీకు ప్రీతిగూర్చుతుంటాడు. అట్టి మీ ప్రియతముని కనుగొన్నారా?

చూతములారా! ప్రియాళు పనస కోవిదారములారా! జంబీర బిల్వములారా! లోకపావనియైన యమునానది ఒడ్డున మీరు జన్మించారు. పుట్టిన నాటి నుంచి మీరు మీ మహోన్నతాభిజన్యానికి తగినట్లు పరోపకారజీవులై అలరారుతున్నారు. మేము శ్రీకృష్ణవియోగ రిక్తచిత్తలమై ఉమ్మలించిన దయనీయలము. అతని జాడ తెలిపి మమ్మల్ని దయచూడండి.

భూదేవీ! నీవు దామోదర పాదస్పర్శకు నోచి మేనెల్లా పులకలు దాల్చిన పుణ్యాత్మురాలవు. ఏ తపస్సు చేసి ఇంతటి భాగ్యానికి నోచుకొన్నావో కదా. ఈ నీ కలిమి నేటి సేవాఫలమో, తొల్లింటి త్రివిక్రమ దేహాక్రమణఫలమో, లీలావరాహ రూపాలింగన పుణ్యఫలమో చెప్పగలవా?

కురంగీ! అచ్యుతుని చూడ్కులు నీ చూడ్కులకు మించినట్టివి. నీ గర్వోద్ధతిని అణచటానికి అతనిక్కడికి వచ్చి ఉంటాడు. అతనిని చూశావా? చూసీ ఈసుమీరి ఊసులాడకున్నావా?

తరువరములారా! మీరిలా వంగి ఉండటం దేనికి? కృష్ణుడొక చేతిని ప్రియురాలి బుజానిపై అలవోకగా నిలిపి వేరొక చేత లీలాకమలాన్ని పట్టుకొని ఇటురాగా అతనికి ప్రణమిల్లి నిశ్చేష్టులై ఉన్నారా?

తుమ్మెదలారా! ఏమని ఝుంకారాలు చేస్తున్నారు? కృష్ణుని కంఠసీమ నలంకరించిన తులసి తావిని ఆఘ్రాణించి మైమరచి రంతులాడుతున్నారా? లతలారా! మీ యెడ రోమాంచకంచుకితాలు నేడు విపరీతాలుగా ఉన్న కారణమేమిటి? ఇది వనస్పతి బాహ్యాలింగన ఫలం కాదని మాకు తెలుసు. కృష్ణనఖ స్పర్శ మీకు సోకింది కాబోలు. మా కృష్ణుడెక్కడున్నదీ చెప్పండమ్మా!'

ఆ విధంగా గోపికలు కృష్ణమయచిత్తలై అతనికోసం వెతుకుతూ ఉన్మత్తవచనాలు పలుకుతూ కొంతసేపు తిరిగారు. వారిని తన్మయత్వం పైకొన్నది.

ఒకతె పూతన అయింది; ఒకతె చిన్ని కృష్ణుడై ఆ పూతన కుచాన్ని అందుకొన్నది.

ఒకతె శకటం అయింది. ఒకతె కృష్ణుడై దానిని కాలద్రోసింది. ఒకతె తృణావర్తునిగా మారింది; వేరొకతె కృష్ణుడై ఆ దైత్య పాత్రధారిణిని త్రోసివేసింది.

ఇద్దరు రామకృష్ణు లయ్యారు. కొందరు గోగణం అయ్యారు. ఒకతె వత్సాసురుడై ఆ గోధనాన్ని హరించింది. రామకృష్ణాయితలు ఆ వత్సాసురాయితను పడద్రోశారు.

ఒకతె బకమయింది. వేరొకతె కృష్ణుడై దానిని అణచివేసింది.

ఒకతె కృష్ణుడై ఆవులను పిలుస్తూ ఈల వేసింది. ఒకతె పిల్లనగ్రోవి వాయించింది. ఒకతె కృష్ణుడై అతని నడకను చూపింది.

ఒకతె తన పైటకొంగును ఎగవేసి, 'ఇదిగో గోవర్ధనాన్ని పైకెత్తాను. దీని క్రిందికి రారండి. వానగాలి మిమ్మేమీ చేయలేదు' అని కేకవేసింది.

ఒకతె కృష్ణుడై, 'గోపాలులారా! కన్నులు మూసుకొనండి; దావాగ్ని భయం లేకుండా మిమ్మల్ని రక్షిస్తాను' అని పలికింది.

ఒకతె యశోదయై, 'ఓరి కృష్ణా! వెన్న దొంగిలించటమే గాక బానను కూడా పగులగొట్టావూ? ఇదిగో నిన్ను రోటగడతాను చూడు!' అంటూ పూదండను చేతబూని ప్రక్కనున్న వేరొకతెను పట్టి కట్టివేసింది.

రాజా! గోపికలు ఆ విధంగా కృష్ణమయలై అతని చర్యలను అనుకరిస్తూ వనమంతా సంచరిస్తుండగా ఒకచోట వారికి ఒక అడుగుల జాడ కానవచ్చింది. ఆ అడుగులు ధ్వజవజ్రాంకుశపద్మరేఖాలాంఛితాలై ఉన్నాయి. ఒక గోపిక ఆ చిన్నెలను ముందుగా చూసి, 'చెలులారా! ఇవిగో కృష్ణుని అడుగుజాడలు' అని చూపింది. అంతలో మరొకతె వేరొకచోట కొన్ని అడుగుజాడలు చూసి, 'ఇదిగో, ఇదిగో, చూడు! ఈ జాడలను బట్టి చూడగా కృష్ణుడొక కామినీమణి భుజంమీద వ్రాలి నడిచాడన్నది స్పష్టం. ఏమంటారా! ఆమె అడుగుజాడ ఎలా తడబడి ఉన్నదో చూడండి. తప్పకుండా కృష్ణుని వలలో వేసుకొనే ఉంటుంది. కాకపోతే మనందరికీ కన్నుగప్పి ఒంటరిగా దానితో విహరిస్తాడా? చెలులారా! ఇదిగో! ఇక్కడ దాని అడుగుజాడలు కనబడవు. కారణమేమిటో తెలుసా? సరి సరి, నేనే చెబుతాను. చూడండి. ఆమె వనవిహారక్లేశవివశ అయినందువల్ల కృష్ణుడు ఆమెను ఎత్తుకొని వెళ్ళాడు. అయ్యయ్యో! చూస్తుంటేనే మనసు కుతకుతలాడుతున్నది. చెలులారా! ఇవిగో ఇవి పరాగాలు. ఎవని పాదపద్మాలను బ్రహ్మేశ సుపర్వులే గాక లక్ష్మిసయితం సమస్తపాపపరిహారార్థం తలదాల్చుతున్నదో ఆ కృష్ణుని పాదస్పర్శ వలన ఈ ధూళి పులకరించి పైకెగురుతున్నది. దీనిని తలపై చల్లుకొని ఆ మాత్రమన్నా ధన్యతను గడిద్దాము. చెలులారా! ఇక్కడ ముంగాలి ముద్రలు మాత్రమే కనబడుతున్నాయి. మన కృష్ణుడు ప్రియురాలి కోసం ఎత్తైన లతల నందుకొని పూలుకోసి ఇచ్చాడని, ఆమె పొందుకోరి ఈ పని చేసి ఉంటాడని మనము దీనిని బట్టి గ్రహించాలి' అని పలికింది.

## స్త్రీ రజోగుణ దురాత్మత్వం

రాజేంద్రా! గోపికలందరూ ఈ విధంగా ఒకరినొకరు కృష్ణలీలలను చెప్పుకొంటూ పిచ్చివారివలె తిరుగాడసాగారు. భగవానుడు ఆత్మారాముడు, ఆత్మరతుడు అయినందున స్త్రీమనోవిభ్రమాలు అతనిని చలింపజేయవు. అట్టివాడు ఒక గోపికను తీసుకొనివెళ్ళి ఆమెతో క్రీడించాడు. ఆ క్రీడాభావం ఏమంటావా? కామినీదైన్యం ఎటువంటిదో, స్త్రీల దురాత్మత్వం ఎటువంటిదో నిరూపించాలని కృష్ణుడు ఆ పనిచేయవలసి వచ్చింది. కృష్ణుడంతటివాడు ఇతర గోపికలను విడిచి ఆమెను ఒక్కర్తినే తీసికొనివెళ్ళి కూర్మి పేర్మిలను చూపుతూ విహరించటం వల్ల ఆమె ఉబ్బి ఉబికి బూరటిల్లి, 'గోపికలలో నేనే ఉత్తమురాలిని' అని గర్వించి, 'మనోహరా! అలపు సొలపులు నన్ను కదలనీయనంటున్నాయి. ఇంక ఒక్క అడుగయినా కదలలేను. కావాలంటే నన్ను ఎత్తుకొని వెళ్ళు' అని పలికింది. కృష్ణుడు లోలోపలే నవ్వుకొంటూ, 'ప్రియా! నీవన్నట్లే అన్నీ జరగాలి కదా. నిన్ను నా భుజాలపైని కూర్చుండబెట్టుకోనా?' అంటూ మెరమెచ్చుమాట లంటుంటే ఆ హొయలాడి అతని మాటలకు సంతోషించి, కృష్ణునిపై కూర్చోవటానికి చీర సవరించుకొని సిద్ధపడింది. అంతలో కృష్ణుడు మాయమయ్యాడు. ఆ కోమలి కృష్ణుడు కనిపించక ఏడుపు లంకించుకొని, 'ప్రియా! ఎక్కడున్నావు? నన్నొక్కదాన్నీ విడిచి ఎక్కడికి వెళ్ళావు? నీ దాసిని నమ్మించి మోసపుచ్చటం నీకు తగునా?' అంటూ మొరపెట్టుకొన్నది. అంతలో గోపికలు కృష్ణాన్వేషణలై అక్కడికి వచ్చి ఆమెను చూసి, కృష్ణుని అభిమానాన్ని చూరగొన్నప్పుడు ఆమె గర్వించటమూ, గర్వభంగం కలుగగానే దుఃఖించటమూ చూసి ఆశ్చర్యపోయి ఆ విరహార్తను వెంటబెట్టుకొని వెన్నెలలో వనమంతా తిరిగి తిరిగి కాళిందీపులినతలం చేరి ఆ లీలామానవుని రాకకోసం ఎదురుచూస్తూ గీతాలు పాడటం మొదలుపెట్టారు.

## గోపికా గీతలు

ప్రియా! నీవు వ్రేపల్లెలో జన్మించినందు వలన నీతోపాటు శ్రీదేవి కూడా వచ్చి నివసించినట్లయింది. వ్రజమండలమంతా మహోత్కర్షాన్ని పొందింది.

గోపికలు నీవారు అయ్యారు. వారి ప్రాణాలు నీ యందు పాదుకొన్నాయి. నీవు కనుగప్పి మాయమయ్యావు. నీకై వెతికి వెతికి వేసారారు. ఇకనైనా కరుణించి కన్నుల ముందుకు రావయ్యా!

స్వామీ! నిన్ను వెతుకుతున్నది ఎందుకంటావా? ఏ భూషణాదులో కోరి నిన్ను వెతకటం లేదు. శరత్కాల సరసిజోదరశ్రీహరా లైన నీ కటాక్షవీక్షణభాగ్యాన్ని కోరి వెతుకుతున్నాము. అట్టివారిని కాదని కష్టపెట్టటం నీకు తగునా? అది ధర్మమా?

పురుషోత్తమా! విషం నిండిన కాళియ జలాల నుంచి రక్షించావు. అఘాసురుని బారినుంచి కాపాడావు. ఘోరవర్షానికి చిక్కి చావనున్న మాకు ప్రాణదానం చేశావు. సుడిగాలి నుంచి బ్రతికించావు. పిడుగు వాన నుంచి కాపాడావు. వృషభాసురుని వాతబడినవారిని తప్పించావు. అంతెందుకు? భయాభయాల నుంచి ఏ క్షణాని కా క్షణం ఇంతదాకా మమ్మల్ని రక్షించావు. ఇంత చేసి ఇప్పుడు కాదని ఉపేక్షింపవచ్చునా?

ప్రభూ! నిన్ను యశోదాపుత్రమాత్రునిగా తలచినందుకు ఆగ్రహించావా? సర్వప్రాణుల అంతరాత్మవై సాక్షిమాత్రునిగా ఉంటావు. అటువంటి నీవు గొల్లపల్లెలో ఎందుకు పుట్టావు? బ్రహ్మదేవుని ప్రణయాన్ని ఆలకించి విశ్వపాలనార్థం అవతరించావు. జగద్రక్షకుడవు నీవు నీ భక్తులను ఉపేక్షింపదగునా? మా యెడ నీకు ఉపేక్ష లేదంటే మా ప్రార్థనను మన్నించు.

దేవా! మా ప్రార్థన ఏమిటో విను. సంసృతిభయార్తలమై నీ శరణుజొచ్చాము. మాకు అభయాన్నివ్వు. ఏమి చేస్తే మీకు అభయదానం ఇచ్చినట్లవుతుంది? అంటావేమో. ఏ నీ పాణిపద్మం సమస్తవరదాయకమో, ఏ నీ పాణిపద్మంతో ఇందిరాదేవిని పరిగ్రహించావో, ఆ నీ పాణిపద్మాన్ని మా శిరసులపై ఉంచు. ఇది నీ అనుగ్రహానికి మొట్టమొదటి లక్షణం. స్మితోల్లసితమైన నీ సుందర ముఖారవిందాన్ని చూపు. స్త్రీలకు అంతకంటె సంతోషకరమైనది వేరొకటుండదు. ఇది ద్వితీయలక్షణం. ఏ నీ పాదకమలం

సిరికి నిలయమై కాళియఫణి ఫణార్చితమై గోగణానుగతమై ఒప్పారుతున్నదో, ఆ పవిత్ర పాదపద్మాన్ని మా కుచకుంభాలపై నిలుపు. నీ కోమల పాదపద్మాలు మా కుచకాఠిన్యానికి నొచ్చుకొంటాయని వెనుకాడబోకు. వాటిని సుతారంగా వక్షఃపీఠి పైని ధరిస్తాము. అంతతో మా మదనతాపం చల్లారుతుంది. ఇది తృతీయలక్షణం. తర్వాత మమ్ము గ్రహించి నీ అధరామృతాన్ని ప్రసాదించి మా మోహం తీర్చి మమ్మల్ని ఉజ్జీవింపజేయి.

ప్రభూ! నీ చరిత్రరసం తాపత్రయతప్తులకు జీవనామృతం. కవిజనవాక్యలతికలకు అవ్యయఫలం. కర్ణములకు పరమ రసాయనం. కీర్తించినవారికి వివిధ దానఫలం. శ్రీమంతమైన నీ కథాశ్రవణభాగ్యాన్ని మాకు కరుణించు.

నీ కథాశ్రవణ మాత్రాననే మాకు నిర్వృతి కలుగుతుండగా నీ దర్శనభాగ్యాన్ని ఎందుకు కోరుతున్నామని అడుగుతావేమో. ప్రభూ! నీ లేత నవ్వులు, నీ ప్రేమస్నిగ్ధ వీక్షణాలు, నీ ధ్యాన మంగళవిహారం, నీ సంకేత మర్మాలు మా హృదయాలను కలచివేస్తుండటం వలన నీ విలాసక్షుభితచిత్తలమై శాంతికి దూరమయ్యాము. మా మనఃక్షోభ నీ దర్శనభాగ్యలబ్ధిచే కాక వేరొక మార్గాన తీరేది కాదు.

ప్రాణేశ్వరా! నీవు వ్రేపల్లె నుంచి ఆవుల వెంట నడిచివెళ్తున్నప్పుడు నళినసుందరాలైన నీ పాదాలు శిలాతృణాంకురాలను తాకి నొచ్చుకొంటాయేమో అని మా మనస్సులెంత తహతహలాడుతుంటాయో మాటలలో చెప్పలేము. నీవు వెళ్ళినది మొదలు నీకై దుఃఖశంకితలమైన మేము సాయంకాలం నువ్వు ఎప్పుడు తిరిగివస్తావో, నీలకుంతలావృతమై గోరజచ్ఛురితమై అళిమాలాకుల పరాగసక్తపద్మాన్ని తలపించే నీ ముఖపద్మాన్ని కన్నులారా ఎప్పటికి చూడగలమో అని ఉవ్విళ్ళూరుతుంటాము. అటువంటి నీ దాసికలను మమ్మల్ని దూరం చేయకు.

ప్రాణనాయకా! మా కోరిక చెప్పమంటావా? ఏ నీ పాదపద్మం బ్రహ్మాదులకు సయితం అర్చనీయమో, ఏ నీ పాదపద్మం నిఖిల ప్రణతార్తిహరమో, ఏ నీ పాదపద్మం సేవాసమయాన సుఖావహమో, ఏ నీ పాదపద్మం ధ్యానమాత్రాన సర్వాపన్నివారకమో, అట్టి నీ పావన పాదపద్మాన్ని సమస్తలోకానికి అలంకారమైన దానిని, కామతాపశాంతికై మా వక్షోజాలపై నిలుపు. స్వరపూర్వక వేణునాదామృతవాసితమై సార్వభౌమత్వాదుల యందు సైతం ఇచ్ఛను మరిపించి సమస్తశోకాలను బాపి సురతానురక్తిని పెంపొందించే నీ అధరామృతాన్ని ప్రసాదించు.

ప్రాణేశ్వరా! పగలు నీవు మమ్మల్ని విడిచి వనానికి పోయినప్పుడు నిన్ను చూడని త్రుటికాలం మాకు యుగాయతంగా ఉంటుంది. భువనసుందరా! నీ కమనీయవదనాన్ని నిరంతరం కనుగొనాలన్నదే మా అభివాంఛితం. ఆ పాపపు విధి మా కన్నులకు రెప్పలిచ్చి రెప్పలార్పకుండా చూసేందుకు అడ్డు కలిగించాడు. ఆ విధిని ఏమని ఏమి ప్రయోజనం? నీ దర్శనాదర్శనాదుల వలని సుఖదుఃఖాలను చూసి నిరంతర సుఖప్రాప్తికోసం యతుల వలె సర్వసంగపరిత్యాగం చేసి అంతర్దృష్టితో నిన్ను చేరాము.

లోకమోహనా! నీ గీతానికి మోహవశులై రాత్రిపూట నీ చెంతకు వచ్చిన కాంతలను ఎంతో కఠినాత్ముడయితే తప్ప వేరొక పురుషుడు తిరిగి ఇంటికి పొమ్మంటాడా? ఏమి చేయాలంటావా? మా హృద్రోగానికి చికిత్స చెయ్యి. నీ రహస్య సంకేతనాలు మా శ్రవణేంద్రియాలకు అపూర్వమైన రుచిని కూర్చాయి. మదనసందీపనమైన నీ దరహాససుందరవదనం మా చూడ్కులను ఆకర్షించింది. నీ ప్రేమవీక్షణాలు మా మనోధైర్యాలను హరించివేశాయి. లక్ష్మీనివాసమైన నీ విశాలవక్షోభాగమందు వసించాలనే కోరిక జనించింది. ఆ కోరిక క్రమక్రమంగా పెరిగి హద్దు మీరింది. తత్ఫలంగా మాకు ఈ హృద్రోగం సంభవించింది. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నారు. అతికి పోయి ఈ గతిని తెచ్చుకొన్నాము.

కల్మషహరా! మా రోగానికి ఔషధ మేమంటావా? నిఖిలరోగహరునికి నీకు తెలియదా? అయినా చెబుతాము విను. ఏది వ్రజవాసులందరికీ దుఃఖహరమో, ఏది విశ్వమంగళకరమో, దానిని ఒక్కింత మా ఒడిలో పడవేయమని కోరుతున్నాము.'

## శ్రీకృష్ణ సందర్శనం

రాజేంద్రా! గోపవిలాసినులు ఆ విధంగా వివిధగతుల పాటలు పాడుతూ దీనాలాపాలు పలుకుతూ శ్రీకృష్ణ సందర్శన లాలసచిత్తలై పలవరిస్తుండగా భగవంతుడు కరుణించి వారి యెదుట నిలిచాడు. పీతాంబరం కట్టి పూలమాలలు తాల్చి చిరునవ్వు తేటలు వెదజల్లుతూ సాక్షాన్మన్మథ మన్మథుడై భగవానుడు ప్రత్యక్షం కాగా అతనిని చూచినంతనే గోపకామినులకు పోయిన ప్రాణాలు లేచివచ్చిన ట్లయింది. వారందరూ ఒక్కుమ్మడిని లేచి కృష్ణుడిని చుట్టుముట్టారు. ఒకతె కేల్దోయిని కూర్చి అతనికి కౌగిలింత నిచ్చింది; ఒకతె అతని భుజం పట్టుకొని తన ఒడిలోనికి లాక్కున్నది. ఒకతె అతని విడియానికి దోయిలించింది; ఒకతె అతని అంఘ్రికమలాన్ని విరహతప్తమైన తన చన్నుల పైన ఉంచుకొన్నది. ఒకతె ప్రేమసంరంభ విహ్వాలురాలై కనుబొమ్మ విరిచి కళ్ళెర్రజేసి సత్పురుషులు భగవత్పదం మీద దృష్టిని నిలిపినట్లు అతని వదనరాజీవం పైననే చూపులు నిలిపి తదేకంగా చూడసాగింది. ఒకతె తన కన్నుల ద్వారా అతనిని తన హృదయాంతరానికి లాక్కొని, కళ్ళు మూసి ధ్యానసమాధినిష్ఠుడైన యోగివలె మనసు లోపలే బంధించి మనసారా కౌగిలించుకొని ఆనందసముద్రంలో దొప్పదోగుతూ పులకాంకురశరీర అయింది.

రాజేంద్రా! ఆ కాంతామణులు ఆ విధంగా శ్రీకృష్ణదర్శన పరమోత్సవ నిర్వృతలై పరమేశ్వరుని పొందిన ముముక్షువుల వలె విరహతాపం నుంచి విముక్తిని పొందారు. పరమాత్ముడు తన శక్తులను కూడినట్లు శ్రీకృష్ణుడు ఆ గోపికలతో కూడి తేజరిల్లి కొంతసేపటికి వారిని అక్కడినుంచి యమునాసైకత ప్రదేశానికి తీసికొనివెళ్ళాడు.

యమునానది నిజతరంగహస్తాలు చాచి వారిని ఆహ్వానించింది. మందమారుతం కుందమందారపుష్పపరిమళాలను కూర్చి చల్లగా వీచింది. భ్రమరాలు రేగి మృదుగానాలు చేయసాగాయి. చంద్రుడు శరచ్చంద్రికా మరీచులను విరజిమ్మి చీకట్లను దూరం చేస్తున్నాడు.

అంతలో గోపికలందరూ ఒక తెల్లని ఇసుకతిన్నెపై చేరారు. శ్రుతులు కర్మకాండలో పరమేశ్వరుని కానక తత్తత్కామానుబంధాల వల్ల శాంతిలేక జ్ఞానకాండ వలన భగవత్సాక్షాత్కారాన్ని పొంది తదానందపూర్ణములై కామానుబంధాలను త్యజించి ఉల్లసిల్లిన తీరున గోపాంగనలు కృష్ణదర్శనాభావం వలన వివిధ మనోరథ పరితాపాలను పొందినవారు ఆయన దర్శనభాగ్యం లభించే సరికి ఆప్తసమస్తకామలై ఆత్మబంధువైన ఆ భగవానునికి కుచకుంకుమాంకితాలైన తమ పయ్యెద చెరగులను కోమలాసనంగా పరిచారు. ఆ భగవానుడు యోగీశ్వర హృదయాంతరంలోవలె ఆ ఆసనం పైని అధివసించాడు. గోపకాంతలు చుట్టూ కూర్చుండి త్రైలోక్యలక్ష్మీశోభతో తనరారుతుండిన ఆ మహాత్ముని వివిధపూజలతో అర్చించి స్మేరావలోకన భ్రూవిక్షేపాలతో ఆదరించి అతని సుకుమారకరచరణాలను తొడలపై నిలుపుకొని మెల్లమెల్లగా ఒత్తసాగారు.

## గోపికల నర్మగర్భోక్తులు

ఆ తీరున కొంతసేపు గడిచిన తర్వాత గోపకామినులు తాము కృష్ణుని వలన పొందుతున్న కృతజ్ఞతను లోలోపల అణచుకొనలేక, 'స్వామీ! కొందరు తమను భజించినవారిని చేరదీస్తారు. కొందరు తమను సేవించినవారిని గాని, సేవింపనివారిని గాని ఎవరినీ చేరదీయరు. ఈ విపరీతానికి కారణమేమిటి?' అని అడిగారు.

## శ్రీకృష్ణుని సమాధానం

గోపికలు లోకవృత్తాంతపర్యాయంగా తమ గూఢాభిప్రాయాన్ని వెల్లడింపగానే శ్రీకృష్ణ భగవానుడు వారి మనోభావాన్ని గ్రహించాడు.

'సఖీమణులారా! మీ మొదటి ప్రశ్న ఉపకార ప్రత్యుపకార తత్త్వపరమై ఉన్నది. ఒకడు ప్రత్యుపకారం అపేక్షించి వేరొకనికి మేలుచేస్తాడు. ఉపకృతుడు మళ్ళీ ఉపకారికి మేలుచేస్తాడు. ఇది లోకసహజం. ఈ విధానంలోని తత్త్వరహస్యం ఏమంటే? వారిద్దరూ కేవల స్వార్థపరులు. అంతేకాని వారి హృదయాలలో సౌహృదమనే భావం ఆవంతైనా ఉండదు. అందువల్ల వారి చేతలు ఎంత మాత్రం సౌహృదప్రేరితాలు కావు. ఈ విధంలో ఉన్న ధర్మమూ ఏమీ లేదు. ఇది గోమహిష్యాదులను పోషించటం వంటిదే.

రెండవ తీరువారిని గురించి ఇదే ప్రకారం విమర్శించి చూస్తే, వారు ప్రత్యుపకార నిరపేక్షంగా ఉపకరిస్తున్నవారు. ఈ తెగవారిని రెండు వర్గాలుగా విభజింపవచ్చును. 'పరోపకారార్థ మిదం శరీర' మనే భావంతో ఒక వర్గంవారు ఉపకరిస్తారు. వారు కేవల ధర్మదృష్టి మాత్రమే కలవారు. రెండవ వర్గంవారు కేవల కరుణావశులై ఉపకరించేవారు. తల్లిదండ్రులే ఇందుకు నిదర్శనమని చెప్పవచ్చును. ఇందులో మొదటివర్గంలో ధర్మం ప్రధానం గాను కరుణ ఆనుషంగికం గాను ఉంటాయి. రెండవ వర్గంలో కరుణ ప్రధానమై ధర్మం ఆనుషంగిక మవుతుంది.

ఇక మూడవ వర్గం వారి సంగతేమంటారా? ఈ తెగలో ఆత్మారాములు, పూర్ణకాములు, కృతఘ్నులు, కఠినులు అని అంతశ్శాఖలు నాలుగున్నాయి. ఆత్మ ఏకము, అద్వితీయము అయినందువలన, సర్వమూ ఆత్మమయం అయినందువలన, ఆత్మారాములు స్వపరభేదరహితులై అందరియెడ ఏకరూపాన ప్రవర్తిస్తారు. పూర్ణకాములు భోగేచ్ఛారహితులు కనుక వారిని విషయదర్శనం ఎంతమాత్రం బాధింపదు. అందువలన వారు సమచిత్తులుగా ఉంటారు. గురుద్రోహులు మొదలైనవారు మూడవ తరగతికి చెందుతారు. నాలుగవ శాఖవారి సంగతి చెప్పవలసిన పనిలేదు. ఎప్పుడో ఒకనాడు కాకపోతే ఒకనాడయినా రాళ్ళుకూడా కరుగుతాయి గాని వారి హృదయాలు మాత్రం కరగవు. నిలువెల్లా వెతికినా వారిలో దయాదాక్షిణ్యాలు ఏ కోశానా కనిపించవు' అన్నాడు.

రాజేంద్రా! కృష్ణుని కడపటి వాక్యం చెవిసోకగానే ఆ గోపాంగనలకు లోలోపల నవ్వు వచ్చింది. రెప్పవాల్పులు కలుగసాగాయి. భగవానుడు వారి మనోభావం గ్రహించి, 'కళ్యాణులారా! ఈ చెప్పిన తరగతులలో నేను ఏ తరగతివాడనో అని తెలిసికొనగోరుతున్నారు కదూ! చెబుతాను వినండి.

పేదవాడు కష్టపడి ద్రవ్యార్జన చేస్తాడు. ఆ ద్రవ్యాన్ని ఎవడో హఠాత్తుగా అపహరిస్తాడు. అప్పుడా రిక్తుని చింత ఎటువంటిదో ఊహించండి. అతని మనసులో ద్రవ్యనష్టచింత గాక వేరొకటుండదు. అన్నపానాలు కూడా తలపుకు రావు. ఆ విధంగా ఉండటాన్ని తదేకానువృత్తి అంటారు. అటువంటి అనువృత్తి కలిగే బీజాలేమిటి? మొట్టమొదట కొంత ధనం లభించింది. అతని బుద్ధి దానియందు లగ్నమయింది. చేతిలో ఉన్న ధనం చేజేతులా జారిపోయే సరికి బుద్ధి దాని వెంటబడి తత్పరమై అదే లోకంగా మారింది. ఈ సంగతిని నిదానంగా ఆలోచించి చూడండి. నేను మీతో కలిసి మెలిసి ఉండటం వలన మీరు నన్ను మీ వానినిగా తలిచారు. ఆ భావం మీయందు ఎంత రూఢంగా ఉన్నదో పరిశీలించాలని మీ కన్నుగప్పి వర్తించాను. ఇది చేరదీసినవారిని దూరంచేసినట్లు పైకి అగపడుతుంది. ఆ మాట నిజంకాదు. నన్ను భజించే వారి అనువర్తనం నాయెడ నిరంతరం అవ్యవహిత మయేందుకు ఈ విధమైన అవకాశం కలిగిస్తాను.

అబలలారా! నాకై మీరు ధర్మాధర్మాలను మాత్రమేగాక స్వజనులను, చివరికి లోకాన్ని కూడా విడిచిపెట్టారు. ఆ సంగతి నాకు తెలియనిది కాదు. మీ త్యాగాన్ని నేనెన్నటికీ మరువలేను. ధర్మాధర్మాలను త్యజించటం తగునా? అని శంకించేవారు ఉండవచ్చును. ధర్మాధర్మాలు ఉన్నంతకాలం ద్వైతబుద్ధి తప్పదు. ద్వైతభావం నశించితేగాని పరాభక్తి కుదురుకొనదు. పరాభక్తులకు నేను గాక వేరొకటుండదు. అటువంటి పరాభక్తుల వర్తన నిష్కళంకమై నిర్వ్యాజమై ధర్మాలకు ధర్మంగా ఉంటుంది. వారి మార్గం స్థూలదృష్టికి బోధపడదు.

చెలులారా! నా యీ పరోక్షం మీ తత్త్వాన్ని వెల్లడించింది. మీ ప్రేమాలాపాలను వీనులవిందుగా విన్నాను. మీరు నాకు చేసిన ఉపకారం నిరవద్య యోగపూర్వకమైనది. మీ రీ విధంగా నన్ను తీరని కృతజ్ఞతాబద్ధుని చేసుకొన్నారు. ఏండ్లకు పూండ్లకు అయినా మీకు తగిన ప్రత్యుపకారం నేను చేయలేను.

ప్రియలారా! ఇంటి సంకెళ్ళు తెంపరానివి. ఆ బంధాలను కూడా త్రెంచివేసి నా వద్దకు మీరు వచ్చారు. మీ యీ కృతికి మీ సౌశీల్యమే మీకు ప్రత్యుపకృతి అవుతుంది గాక. తత్ఫలంగా నాకు మీ ఋణవిముక్తి అవుతుంది గాక!' అని పలికాడు.

గోపికలు ఆ మృదుమధురోక్తులను ఆలకించి భగవత్సూర్యమే తదాశీస్సు కాగా విరహతాపం బాసి శాంతచిత్తలయ్యారు.

## రాసక్రీడ

పరీక్షిన్నరేంద్రా! ఆ గోపకామిను లప్పుడు సంతోషితస్వాంతలై రాసక్రీడకు ఉపక్రమించారు. పెక్కుమంది సుందరీమణులు కూడి వలయాకారంగా నిలిచి కావించే వృత్తవిశేషాన్ని రాసక్రీడ అంటారు.

వ్రజకలకంఠులు క్రీడార్థం మండలాకారంలో నిలిచారు. భగవాను డిద్దరిద్దరు మందగమనల మధ్య తాను నిలిచి ఆ యిరువురి కంఠాల పైని ఒక్కొక్క చేతిని ఆనించాడు. అందుమూలాన ప్రతిగోపాంగన తన ప్రక్కనే శ్రీకృష్ణ డున్నాడని భావించటం జరిగింది. భగవానుడు ఆ లలిత లతాంగనల మధ్య నిలిచి ఉండటాన్ని చూడగా సువర్ణాల నడుమ మరకతాలను పొదిగినట్లు శోభిల్లింది.

శ్రీకృష్ణుడు ఒక్కడే ఉండగా గోపకామినులు పెక్కుమంది ఉండగా ఒక్కొక్క జంటమధ్య ఒక్కొక్క కృష్ణుడుండటం ఎలా సాధ్యమవుతుందని

శంకింపవచ్చును. భగవానుడంటే అచింత్య శక్తిసంపన్నుడు; ఆయనకు అసాధ్యమైనది కలుగదు. ఒక్క భగవంతుడు పెక్కుమంది భక్తులకు వారివారి విశ్వాసాలను బట్టి వేర్వేరు రూపాలలో కనిపించటం లేదా?

లోకమోహనమైన రాసక్రీడామహోత్సవాన్ని తిలకింపగోరి ఖేచరులు వారి అంగనలతో విమానా లెక్కివచ్చి గగనతలాన క్రిక్కిరిసి నిలబడ్డారు. దేవదుందుభులు మ్రోగాయి; పుష్పవృష్టి కురిసింది. గంధర్వులు తమ ప్రియకాంతలతో గొంతుకలిపి ఆ లీలామానుష మహాపూరుషుని కీర్తిచరిత్రలు గానం చేశారు.

గోపభామినులు క్రీడామగ్నలై తాళలయాలకు తగినట్లుగా అడుగులు వేస్తూ కరముద్రలు పట్టుతూ లేనవ్వుతేటలను కుమ్మరిస్తూ బొమలు కదిలిస్తూ అభినయింపసాగారు. వారి నెన్నడుములు కుచభారానికి కంపించాయి; కట్టు కోకలు చెదిరాయి; నెమ్మోములు చెమర్చాయి; కొప్పు ముడులు వీడాయి; ఒడ్డాణాలు జారిపడ్డాయి. ఆ విధంగా వారు ఆడుతూ పాడుతూ లీలాకృష్ణరూపాల మధ్య నిలిచి మేఘమండలాంతరాన తళతళలాడే మెరుపు తీగెల వలె ప్రకాశించారు. ఆ హంసయానలకు శ్రీకృష్ణస్పర్శ మైమరపును కలిగించింది. వారు పరమానందవివశలై ఎలుగెత్తి వివిధరాగాలను ఆలపించారు. గగనాంగణం దివ్యసంగీతనాదాలతో మారుమ్రోగింది.

రాజేంద్రా! ఒక కలకంఠి తన కృష్ణునితో మధురస్వరాలాపం కావించింది. గోవిందుడు అది విని అభినందనలు పలికాడు. ఆ ముగ్ధ అందుకు ఉప్పొంగి ఆ ఆలాపాన్నే ధ్రువతాళంగా పాడి శ్రీకృష్ణ సన్మానాన్ని చూరగొన్నది. ఒక చంద్రముఖి రాసక్రీడా విశేషాన అలసి సొలసి తన కృష్ణుని మూపుపయిని తన కేల్దండ వైచి నిలిచింది. ఒక సొగసులాడి తన కంఠాన ఉన్న కృష్ణహస్తాన్ని సుగంధబంధురమైన దానిని మూర్కొని పులకితశరీరయై ముద్దాడింది. ఒక పూబోడి నాట్యచంచలిత కుండలకాంతిమండితమైన తన కపోలాన్ని శ్రీకృష్ణుని గండభాగానికి తాకించింది. కృష్ణుడు అమిత సంతోషంతో ఆమె అందించిన

తాంబూలాన్ని గ్రహించాడు. ఒక తలోదరి తన కాలి అందెలు, మొలనూలి చిరుగజ్జెలు మ్రోయగా ఆడి పాడి తన కృష్ణుని హస్తపద్మాల్ని ఒడిసిపట్టి తన కుచకుంభాన ఉంచుకొన్నది.

రాజేంద్రా! గోపకామినులు ఆ విధంగా కృష్ణబాహు సమాలింగితకంఠలై మధురసంగీతం పైపాట కాగా, భగవల్లీలలను గానంచేస్తూ రాసక్రీడ సలిపారు. బాలుడు తన ప్రతిబింబంతో ఆటలాడిన కైవడిని గోపాలుడు గోపికలతో ఆలింగన పాణిగ్రహణ వీక్షణవిలాస హాసాదుల రమించాడు. గోపాంగనలు శ్రీకృష్ణుని స్పర్శసోకి ఆనందపరవశేంద్రియలై వీడిన కొప్పులను ముడివేసికొనటం గాని, నీవీబంధాలను చక్కజూసుకోవటం గాని, పయ్యెదలు సవరించుకోవటం గాని, తెగిన హారాలను జారిన నగలను మళ్ళీ అలంకరించుకోవటం గాని మరచిపోయారు.

రాజా! గోపికల సంగతి అటుండనివ్వు. కృష్ణలీలలకు ఖేచరాంగనలు సైతం మోహపరవశ లయ్యారు. భగవానుడు ఆత్మారాము డైనవాడు లీలావినోదియై అక్కడ ఎందరు గోపాంగనలుంటే అంతమందికీ వారికి వారికి తగిన చందాన అన్ని లీలారూపాలనూ ధరించి విహరించాడు. ఆ కుసుమ కోమల గాత్రలు కొంతసేపటికి విరహాంత రతిపరిశ్రాంత లయ్యారు. కృష్ణుడు ఆ కాంత లొక్కొక్కరినీ గుండెలకు హత్తుకొని వారి ముఖపద్మాలను తన కరాంగుళులతో పుణికిపుచ్చాడు. గోపాంగనలు తమ ఆనందాన్ని మందస్మితరూపాన చూపి మాధవుని సన్మానించారు.

## మోహమంటే ఏమిటి?

రాజా! మోహము సాధారణ మోహము, అసాధారణమోహము అని రెండు విధాలు. సర్వప్రాణులకు సాధారణమైనది సాధారణమోహం. కరుణాదుల వలన కలిగేది అసాధారణమోహం.

ఆత్ముడు స్వప్రకాశపరమానందరూపుడు, సంసర్గరహితుడు అయిన

వాడు. అతనిని ఆవరించుకొని మూడు శరీరాలుంటాయి. అందులో మొదటిది స్థూలశరీరం. స్థూలశరీరంలో సూక్ష్మశరీరం ఉంటుంది. ఇది రెండవది. దీని లోపల దీనికి కారణమైన మరొక శరీరం ఉన్నది. దానిని కారణశరీర మంటారు. దానినే అవిద్యాశరీరమని కూడా పేర్కొంటారు.

సర్వసంసారధర్మాలు ఈ ఉపాధులు మూడింటికి సంబంధించినవిగా ఉంటాయి. ఆ సంగతి తెలియక ఈ ఉపాధిసంబంధ ధర్మాలన్నింటినీ ఆత్మకు ఆరోపిస్తుంటారు. ఆ విధంగా ఆరోపించటమే సాధారణ మోహ మనబడుతున్నది.

ప్రతిశరీరికీ అతని ప్రారబ్ధకర్మఫలంగా ఒక్కొక్క విధమైన కర్మము నైజమవుతుంది. దానినే స్వధర్మము అంటారు. అట్టి స్వధర్మం జీవికి ఒక్కొక్కప్పుడు అధర్మము వలె భాసిస్తుంది. దీనిని అసాధారణ మోహమంటారు.

## మోహ నివారణం

ఈ మూడు ఉపాధుల తత్త్వాన్ని మొదట వివేకించాలి. తత్ఫలంగా శుద్ధాత్మ ఎటువంటిదో బోధపడుతుంది. తత్ఫలంగా సాధారణమోహం నశిస్తుంది.

స్వధర్మం ఎంత ఘోరమనిపించినా అందులో అధర్మం ఏర్పడే అవకాశం లేదని బోధ కలిగినప్పుడు అసాధారణమోహం నశిస్తుంది. ఇందుకు శాస్త్రజ్ఞానాదులు పరమసాధనాలుగా ఉపకరింపగలవు.

## ఆత్మను గూర్చిన మతాంతరాలు

1. చైతన్యముతో కూడిన దేహమే ఆత్మ అని లోకాయతులంటారు. వీరికి చార్వాకులని కూడా నామాంతరవ్యవహారం ఉన్నది.

2. చార్వాకులలో ఏకదేశీయులని ఒక శాఖ ఉన్నది. ఇంద్రియాలు మనస్సు ప్రాణము – వీటి సముచ్చయమే ఆత్మ అని వారంటారు.

3. క్షణికవిజ్ఞానమే ఆత్మ అని సౌగతుల నిర్వచనం.

4. దేహపరిణామమై దేహాతిరిక్తంగా స్థిరంగా ఆత్మ ఉంటుందని దిగంబరులంటారు.

5. ఈ దిగంబరులలో వేరొకశాఖ ఉన్నది. 'మధ్యమపరిమాణస్య నిత్యత్వానుపపత్తేః నిత్యోఽణుః' అనే సూత్రాన్ని ఆధారం చేసికొని ఆత్మ అణుమాత్రము నిత్యము అని వారి నిర్ణయం.

6. వైశేషికులని మరొకమతం వారున్నారు. ఆత్మ నిత్యము విభవము అని వారంటారు.

7. తార్కిక మతం

8. మీమాంసక మతం అని మరి రెండు మతాలున్నాయి. ఈ విషయంలో వీరిరువురూ వైశేషికుల మార్గమే అవలంబిస్తున్నారు.

9. సాంఖ్యమతం అని వేరొక మతం ఉన్నది. 'ఆత్మ ఏకము, అద్వితీయము అనీ; అది నానా దేహాలలో నానావిధాలుగా ప్రస్ఫుటిస్తున్నా దేహభేదాన్ని బట్టి ఆత్మభేదం కలుగ' దనీ ఈ మతంవారు 'విప్రతిపద్యమానా అప్యాత్మనో గుణవత్వే ప్రతిదేహం భేదే న విప్రతిపద్యతే' అని సూత్రీకరించారు.

10. ఆత్మ అజము నిత్యము శాశ్వతము పురాణము అవినాశకము ఏకము సర్వగతము సర్వబీజము అయినప్పటికీ అవ్యక్తం కాబట్టి అచింత్యమని, ఆ కారణాన భిన్నభిన్న మతకల్పనలకు పాల్పడుతున్నదని, ఉపాధుల వికారాలు ఆత్మకు సంబంధింపవని, ఆత్మ ఎల్లప్పుడు అవికారి అనీ గీతామతం. ఇదే అద్వైతసిద్ధాంతం.

# జలక్రీడ

గోపికలు ఆ విధంగా రాసక్రీడలు సలిపి అలిసి సొలిసి చెమర్చటం కృష్ణభగవానుడు చూసి వారి ఆయాసాన్ని బాపదలచి కరేణువుల ముందున్న మాతంగం వలె వారిని వెంటగొని యమునలోని మడుగు వద్దకు బయలుదేరాడు. గోపకామినులు ఒకరినొకరు తాకుతూ పాటలు పాడుతూ భగవానుని అనుగమించారు. ఆ అంగనల పరస్పరతనూలతల ఒరయిక మూలాన వారి మైపూతలు, విరిదండలు కమ్మతావులను వెదజల్లాయి. ఆ తియ్యని వాసనలకు కొదమ తుమ్మెదలు మూగి కర్ణరసాయనంగా పాడసాగాయి.

కృష్ణుడు ఆ మడుగును సమీపించి తాను లోకమర్యాదలకు వేదమర్యాదలకు కూడా అతీతుడన్న సంగతిని తెలుపగోరినవాని వలె దాని గట్టుదాటి ఆ యెలనాగలతో లోపలికి ప్రవేశించి వారిపయిని శీతలజలాలను చల్లాడు. అందుకు వారందరూ ఎంతో సంతోషంతో ఒక్కుమ్మడిని కృష్ణునిపై దోసిళ్ళతో నీళ్ళు చల్లారు. భగవానుడు ఆత్మరతుడయినా ఆ కాంతలతోడి జలవిహారానికి పరమానందాన్ని పొందినట్లు నటించాడు.

# వనక్రీడ

ఆ తీరున కృష్ణుడు జలక్రీడ సలిపి ఆ నదీతీరోపవనానికి గోపికలతో వచ్చాడు. వారికి హాయిని కలిగింపగోరినట్లు నునుగాడ్పులు హ్రదాంతర కమలరజాన్ని మోసికొనివచ్చి వనం లోని వివిధ లతాతరుపుష్పపరాగంతో మేళవించి వారిపై చల్లాయి. భ్రమరాలు శ్రవణసుఖంగా సంగీతం వినిపించాయి. ఆ లీలాపూరుషుడు గోపకాంతలను కూడి కవిజనులు వేనోళ్ళ వర్ణింపదగిన శరచ్చంద్రచంద్రికారమణీయ రాత్రులలో విహారోత్సవాలతో ఆనందించాడు.

## ధర్మ వ్యతిక్రమారోపణం

మహర్షులారా! శుకయోగి ఆ ప్రకారం చెప్పినది పరీక్షిన్నరేంద్రుడు విని, 'ఋషివర్యా! జగదీశ్వరుడు ధర్మసంస్థాపనకు, అధర్మ నిర్మూలనకు తన తేజోంశతో అవతరించాడని అన్నారు. భగవానుడు ఆ విధంగా అవతరించి ఒకవంక ధర్మమర్యాదలు తెలియజేస్తూ, ఆ ధర్మాలను పరిరక్షిస్తూ మరొక వంక అధర్మానికి ఎందుకు తలపడ్డాడు? ఏమి అధర్మం చేశాడంటారా? గోపికలు పరదారలు; పరదారలను తాకటం కూడా అత్యంతమైన దోషమని భగవానుడే అన్నాడు. అన్నవాడే పరదారలైన గోపికలతో రమించాడు. ఇది అధర్మమూ సాహసమూ కదా?

భగవానుడు ఆప్తకాముడని, కామతృప్తికొరకు ఆ విధంగా చేయలేదని, అందువలన అందులో తప్పేమీ లేదని అంటారా? భగవానుడు ఆప్తకాముడే కావచ్చును గాక. ఈ పనిచేయటంలో అతని ఉద్దేశమేమిటి? ఉద్దేశ మేదయినా కానీ, లోకదృష్టికి నింద్యమైన పనిచేయవచ్చునా? 'గతానుగతికో లోకః' అన్నారు. జనులు ఒకరిని చూసి ఒకరు చేస్తారు. పెద్దలు నడిచిన దారిని పిన్నలు అనుసరిస్తారు. భగవంతుడు స్వయంగా చేసి చూపినదారి లోకమంతటికీ కీడుకాదా? ఎంత ఆలోచించినా సమాధానం అంతుపట్టడం లేదు' అన్నాడు.

## ధర్మవ్యతిక్రమ విచారం

మహర్షులారా! పరీక్షిత్తు భావాన్ని శుకయోగి గ్రహించి 'రాజేంద్రా! కొన్ని పనులు లోకదృష్టికి ధర్మవ్యతిక్రమాలుగా సాహసికాలుగా కనుపింపవచ్చును. ఈ ధర్మాధర్మస్థూలవ్యవస్థను కర్తను బట్టి చేస్తుంటారు. ప్రజాపతి మొదలుగా గలవారు సామాన్యులు. అటువంటి పెద్దల యందు సయితం లోకదృష్టి నియామకం వర్తింపదనగా పరమేశ్వరుని గురించి చెప్పాలా?

ఈశ్వరుడు మహాతేజోవంతుడు. అగ్ని సమస్తపదార్థాలను దహిస్తుంది. దగ్ధవస్తువుల గుణదోషాలు అగ్నికి అంటుతాయా? తేజోవంతుల సంగతి కూడా అంతేనని గ్రహించాలి. పెద్దల దారిలో పిన్నలు నడుస్తారన్నావు. సర్వత్ర ఇది అన్వయింపదు. ఈశ్వరుడు సముద్రమథనజనిత హాలాహలాన్ని త్రాగాడు. ఆ పని అందరూ చేయగలరా? ఒకవేళ సాహసించాడో ఆ సాహసానికి వెంటనే నశింపకుంటాడా? ఈ సంగతి మునుపే చెప్పాను.

పెద్దల హితోపదేశాన్ని పిన్నలు తలదాల్చవలసినదే కాని వారు నడిచారు కదా అని ఆ దారిలోనే నేను నడుస్తాననటం సరికాదు. ధర్మాలు సామాన్యములని, విశేషములని రెండు విధాలు. లోకానికి సామాన్య ధర్మాలు అన్వయిస్తాయి. ఆ ధర్మాలను పెద్దలు కూడా సామాన్యంగా అనుష్ఠిస్తారు. అట్టి ధర్మాలను మాత్రమే ప్రమాణంగా లోకం గ్రహించాలి.

రాజేంద్రా! కారణమేమంటావా? మహాత్ములు అహంకార రహితులు. అహంకార రహితంగా చేయబడే కార్యాలు కామసంకల్పరహితాలుగా ఉంటాయి. కార్యములు కామసంకల్పప్రేరితాలు కాని నాడు వాటి వలన కలిగే అర్థానర్థాలు కర్తకు చెందవు. కామసంకల్ప రహితులైన పెద్దలు కూడా అప్పుడప్పుడు ధర్మవ్యతిరిక్తాలు, సాహసికాలు అయిన పనులను చేయటం చూస్తున్నామంటావా? ఆ పనులు వారి బుద్ధిపూర్వకాలు కావు. మరేమిటంటావా? అవి వారి ప్రారబ్ధకర్మక్షపణమాత్రాలు. మహాత్ములు కూడా ప్రారబ్ధఫలాన్ని అనుభవించే తీరాలి. అది ఎంతటివారికైనా తప్పదు. ఎందుకంటావా? దాని అనుభవార్థమై ఆ శరీరం వచ్చింది. శరీరంతోపాటు వచ్చినదానిని శరీరం అనుభవింపక తీరుతుందా? కర్మఫలం శారీరభోగ్యమాత్రం అయినట్టిది. ఫలము భోగ్యమైనప్పుడు దానికి తగిన శరీరాలు కలుగుతున్నాయి. ఆ శరీరం ఫలభోగానుగుణంగా వర్తిస్తున్నది. సామాన్యుల బుద్ధి ఇంద్రియపరమై కర్తృత్వ భోక్తృత్వాలను తనయందు ఆరోపించుకొని వ్యవహరిస్తూ తత్ఫలానుషంగి అయిన భావిజన్మలకు

బీజాలను సమకూర్చుతున్నది. జితేంద్రియుల బుద్ధి అటువంటిది కాదు. వారి బుద్ధి వారి శరీరకార్యాలకు సాక్షిమాత్రంగా ఉంటుంది.

**మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్త యో**
**గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం**
**ధనిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు రా దివ్యశో**
**భనుఁ డెట్లుండిన నుండెఁగాక, కలవే బంధంబు లుర్వీశ్వరా!**

రాజా! మరొక విశేషం.

**ఆ. గోపజనములందు గోపిక లందును**
**సకలజంతులందు సంచరించు**
**నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?**
**సర్వమయుఁడు లీల సలిపెఁ గాక.**

## కామ ప్రేమముల విచారం

కామానికి, ప్రేమకు ఉన్న తారతమ్యాన్ని చక్కగా గ్రహించితే ఇట్టి విపరీతభావాలు జనింపవు. కామమన్నది తనకు తన ఇంద్రియప్రీతి యెడ కలిగిన కోరిక అన్నమాట. ప్రేమమన్నదో? పరేంద్రియప్రీతి కలగాలనే కోరిక. తన తృప్తిమాత్రమే కామోద్దేశ్యం. ప్రేమకు ప్రేమింపబడినవారి తృప్తే పరమోద్దేశ్యం. గోపికలకు వారి ఇంద్రియతృప్తి అనే ఆకాంక్ష అణుమాత్రమైనా లేదు. శ్రీకృష్ణునికి తృప్తి కలిగించటమే వారి పరమభావం. ఆ కారణాన వారు వారి సర్వావయవకార్యాలను శ్రీకృష్ణారాధనపరం చేసివేశారు. వారు నెరపినట్టి పరమప్రేమలో ఆవంతయినా మచ్చలేదు. గోపికాకృష్ణుల సంయోగం కాయికమైనది కాదు. ఆత్మాత్మల సమావేశం. ఆ సమాచరణలో వారు లోకధర్మాన్ని, దేహధర్మాన్ని, లజ్జాదులను పాటించినవారు కారు. ఆ నియమాలన్నీ దేహాత్మబుద్ధి కలవారికి మాత్రమే వర్తిస్తాయి. కామదృష్టితో గోపికల చర్యలను పరిశీలింపకూడదు.

## భక్తి విభాగాలు

భక్తి అన్నది పర్యవసానంలో అంతా ఒకటే అయినా, పదకొండు రూపాలలో ఆచరింపబడుతున్నది. ఆ పదకొండింటిలో 1. గుణమాహాత్మ్యాన్ని కొందరు, 2. భగవద్రూపాన్ని కొందరు, 3. భగవత్పూజను కొందరు, 4. స్మరణను కొందరు, 5. దాస్యాన్ని కొందరు, 6. సఖ్యాన్ని కొందరు, 7. కాంతాసక్తిని కొందరు, 8. వాత్సల్యాసక్తిని కొందరు, 9. ఆత్మనివేదనాసక్తిని కొందరు, 10. తన్మయతాసక్తిని కొందరు, 11. పరమ విరహాసక్తిని కొందరు ప్రీతి కావిస్తుంటారు. ఈ ఏకాదశాసక్తులను గోపికలు నెరపారు.

(1) నారద వేదవ్యాస శుక యాజ్ఞవల్క్య కాకభుశుండి శేష సూత శౌనక శాండిల్య భీష్మ పరీక్షిత్ పృథు జనమేజయాదులు గుణమాహాత్మ్యాసక్తిని చూపారు.

(2) మిథిలానగర స్త్రీపురుషులు, జనకుడు, దండకారణ్య ఋషులు భగవద్రూపాసక్తిని నెరపారు.

(3) లక్ష్మి, అంబరీషుడు, భరతుడు పూజాసక్తిని నెరపారు.

(4) ప్రహ్లాదుడు, ధ్రువుడు, సనకాదులు స్మరణాసక్తిని నెరపారు.

(5) హనుమంతుడు, అక్రూరుడు, విదురుడు మొదలయినవారు దాస్యాసక్తిని చూపారు.

(6) అర్జున ఉద్ధవ సంజయ శ్రీదామ సుదామాదులు సఖ్యాసక్తి ప్రదర్శించారు.

(7) శ్రీకృష్ణుని అష్టభార్యలు కాంతాసక్తిని,

(8) కాశ్యపాదులు, వృష్ణీసుతపులు, శతరూపామనువులు, కౌసల్యా దశరథులు, యశోదానందులు దేవకీవసుదేవులు వాత్సల్యాసక్తిని చూపారు.

(9) బలి విభీషణ శిబి ప్రముఖులు ఆత్మనివేదనాసక్తిని,

(10) యాజ్ఞ్యవల్క్యాదులు తన్మయతాసక్తిని,

(11) వ్రజాంగనలు పరమవిరహాసక్తిని నెరపినవారు.

ఇవన్నీ జీవుల భావనావిశేషాలు. ఇందులో భగవంతుని కార్యమేమీలేదు. భావనల ప్రకారం కర్మలు, ఆ కర్మలకు ఫలాలు కలుగుతుంటాయి. సూర్యప్రకాశం ఒక్కొక్కనికి ఒక్కొక్క విధమైన ఫలాన్నిస్తుంది. ఈ ఫలతారతమ్యం దేశకాలాదులను బట్టి ఉంటుంది. సూర్యునియందు లేశమాత్రం కూడా లేదు. ఈ రహస్యాన్ని చక్కగా గ్రహించాలి.

## భక్తోద్ధరణ లీల

రాజా! భగవానుడు ఆప్తకాముడు, సర్వాంతర్యామి అయితే కావచ్చు గాని నిందితప్రవృత్తి ఆయనకు మాత్రం తగునా? అని శంకిస్తావేమో. జనులు బహిర్ముఖులై శృంగారరసాకృష్టచేతస్కులై ఉండటం సహజం. అట్టివారికి బుద్ధిభేదం కలిగింపకూడదు. ఆ మార్గాననే వారిని నడిపించి క్రమక్రమంగా వారిని అంతర్ముఖులనుగా చేయాలి. ఇది నైజము, సులభము అయిన ఉపాయం. భగవానుడు తన భక్తులను ఈ విధాననే అనుగ్రహిస్తాడు.

## క్రీడారహస్యం

అంతలో తెల్లవారింది. గోపకామినులు కృష్ణుని అనుమతిని పొంది ఎంతో కష్టంమీద అతనిని వీడ్కొని తమ ఇండ్లకు వెళ్ళారు. రాజేంద్రా! ఈ క్రీడలు స్థూలకాయిక మైనవికావు. గోపికల స్థూలదేహాలు ఆ క్రీడాసమయాలలో వారి భర్తల చెంతనే ఉండేవి. అవి ఇంద్రియకామోద్దీపితాలు కావు. కేవల పరాభక్తి రసోద్దీపితాలు. ఆత్మ పరమాత్మ లొకదానితో ఒకటి ఆనందించటమే ఇందులోని రహస్యం. భగవానుడు రాసక్రీడావ్యాజాన గోపికలకు కామజయాన్ని అనుగ్రహించాడు. వారికి ఏకాంతభక్తి సుస్థిరమయింది.

వారందరూ యథాసుఖం ఉన్నారు. ఆత్మానందానికి ఏకాంతభక్తి ఉత్తమోత్తమ సాధనం.

**సీ. నీ గానవివశలై నిన్ను వెన్నాడుచు**
**గోపకాంతలు వచ్చి కూడు వింత,**

**ఒక్కొక్క యింతి కొక్కొక్క కృష్ణుండవై**
**సరస రాసక్రీడ సలుపు వింత,**

**ఉన్నట్టులే యుండి కన్నుమొఱంగిపోయి**
**యబలల విరహంబు లరయు వింత,**

**నీతో రమించుచు నీ కడ నుండియు**
**నప్పుడే పతులతో నలరు వింత,**

**ఆ. తలఁచి తలఁచి జనులు తబ్బిబ్బు పడనేల?**
**వింత లన్నిటికిని వింతయైన**
**నీదు సృష్టి వింత నెమ్మది దలపోయ**
**నివియు వింత లగునె? యిద్ధచరిత.**

రాజేంద్రా! స్వప్నావస్థలో స్థూలశరీరాలు గృహాంతరశయ్యలపై పడి ఉంటాయి. సూక్ష్మశరీరాలతో జీవులు దేశాంతర లోకాంతరాలలో విహరించటం అనుభవసిద్ధమే. జాగ్రదవస్థలో ఉన్నప్పుడు కూడా మనస్సు ఏదయినా ఒక వస్తువునందు లీనమైనప్పుడు ఆ వస్తువు దూరంగా ఉన్నట్లయితే జీవుడు సూక్ష్మశరీరంతో అక్కడికి వెళ్ళటం మొదలయినవి అనుభవంలో ఉన్న విషయాలే. అందువల్ల గోపికావిహారాలు కల్పితమైనవి కావు.

## గోపాలకుల దేవయాత్ర

రాజేంద్రా! కొన్నాళ్ళకు గోపాలకులు దేవయాత్రను సంకల్పించారు. కృష్ణుడందుకు సరేనని అంగీకరించాడు. ఒకనాడు గోపాలకులు

రామకృష్ణులతో బండ్లెక్కి అంబికావనానికి వెళ్ళి అక్కడ సరస్వతీ నదిలో స్నానాలు చేసి ఆహ్నికాలు తీర్చి పార్వతీ పరమేశ్వరులను మహాభక్తిపూర్వకంగా వివిధోపకరణాలతో పూజించి పరమేశ్వరప్రీతిగా విప్రులకు గోహిరణ్యాంబరమధురాన్నాలను ఆదరంతో అర్పించి వ్రతనియమం ప్రకారం జలమాత్రాహారులై ఆ రాత్రి నదీతీరాననే వసించారు.

## నందునికి ఆపద

ఆ రాత్రివేళ మహాసర్పం ఒకటి కట్టాకలితో బిరబిర వచ్చి నందుడిని కరిచి మింగబోయింది. నందుడు పన్నగగ్రస్తుడై, 'కృష్ణా! కృష్ణా! పాము మ్రింగివేస్తున్న' దని బిగ్గరగా అరిచాడు. అతని అరుపులకు గోపకులు తడబడుతూ లేచి పరిగెత్తి నందుని పాటుచూసి తత్తరిల్లి ఆ పన్నగాన్ని మండుతున్న కొరివితో తాటించారు. వారెంత కొట్టినా పాము నందుని విడిచిపెట్టలేదు. ఉపాయాంతరం తోచక వారు కూడా 'కృష్ణా! కృష్ణా!' అని కేకలు పెట్టారు.

## సుదర్శన శాపవిమోచనం

కృష్ణు డప్పుడు ముందుకు వచ్చి ఆ పామును కాలరాచాడు. భగవానుని పాదస్పర్శ సోకినంతనే ఆ పాము సర్పశరీరాన్ని విడనాడి విద్యాధరుడై కృష్ణుని పాదాలకు మ్రొక్కి నిలిచాడు. గోపాలకు లందరూ మహాశ్చర్యపరులై రెప్పవాల్పక ఆ వింతను చూడసాగారు.

## సుదర్శనునికి శాపం కలిగిన కారణం

కృష్ణు డప్పుడు ఆ విద్యాధరుని చూసి, 'అయ్యా! నీవెవడవు? ఈ దుర్గతి నీ కెందుకు కలిగింది?' అని అడిగాడు. అతడు కేలుమోడ్చి, 'దేవా! నేను సుదర్శనుడనే గంధర్వుడను. ఒకనాడు నేను విమానం ఎక్కి దిశాసంచారం చేస్తుండగా ఒకచోట అంగిరసమునులు ఎదురుపడ్డారు. వారి విరూపాలు నాకు నవ్వు కలిగించాయి. అదిచూసి వారు, 'విద్యాధరా! నీవు నీ రూపగర్వం

వలన మమ్మల్నందరినీ అపహాస్యం చేస్తున్నావు. నీ గర్వఫలంగా పామువై పడి ఉంటావు గాక' అని శపించారు.

అంత నేను వారి పాదాల వ్రాలాను. వారు నన్ను కరుణించి, 'విద్యాధరా! ఏనాడు నీకు శ్రీకృష్ణపాదస్పర్శభాగ్యం కలుగుతుందో ఆనాడు నీవు నీ స్వరూపాన్ని పొందగలవు' అని పలికారు. నేనలా మునిశాపహతుడనై సర్పరూపాన ఇంతదాకా ప్రాకులాడుతున్నాను.

**మ. నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్మూలమై క్రుస్సి పా**
**ప నికాయంబు వినష్టమౌనట భవత్పాదంబు నా మీఁదఁ బె**
**ట్టినఁ దద్బ్రాహ్మణ శాపసంజనిత కౌటిల్యంబు దా నిల్చునే?**
**వనజాతేక్షణ! నేడు వాసె నురగత్వం బెల్ల విశ్వేశ్వరా!**

అని ప్రదక్షిణ కావించి అనుజ్ఞ గైకొని వెళ్ళాడు.

గోపాలకులు ఆ మాటలు విని విస్మయాన్ని పొంది తదేకమనస్కులై కృష్ణలీలలను పాడి తమ వ్రతనియమాన్ని సమస్తవ్రతఫలదాత అయిన ఆ భగవానునందు సమాహతం చేసి వ్రేపల్లెకు బయలుదేరారు.

**తే. సకలఫలదాత యెప్పుడు సరస నుండ**
**వేఱు ఫలదాత కలడని వేగపడుచు**
**యాత్ర సలుపుట కడు వెఱ్ఱి యగు నటంచు**
**వ్రేల కెల్లఁ దేటపఱచె వెన్నుఁ డపుడు.**

## శంఖచూడ సంహారం

ఒకనాడు కుముదబాంధవుడు నిశాముఖమండలాన తీర్చిదిద్దిన కుంకుమబొట్టు వలె ఉదయించి శీతమయూఖాలను వెదజల్లాడు. అప్పుడు కృష్ణుడు బలరామునితోపాటు దివ్యాంబరాలను ధరించి అనర్ఘరత్నాభరణాలు దాల్చి సుగంధాలు పూసి గోపసుందరాంగనలను కూడి తారావృతచంద్రుని

వలె విరాజిల్లుతూ క్రీడ సలుపసాగాడు. సమీరాలు సంఫుల్లమల్లికాప్రసూనకల్హార నూత్నగంధాలను సేకరించి కాళిందీ శీతలశీకరాలను మేళవించి మోసితెచ్చి లేతెమ్మెర వీవనలు వారిపై వీచాయి. మధుర మరందాస్వాదన తుంద మిళింద సందోహాలు కలగీతికలు పాడసాగాయి. గోపకామినులు సర్వలోక మనశ్శ్రవణమంగళకరంగా గానాలాపన మొదలుపెట్టి ఆనందడోలికలలో ఊగిసలాడసాగారు.

ఆ విధంగా వారందరూ క్రీడాపరచిత్తులై ఉండగా కుబేరానుచరుడు శంఖచూడుడనే గుహ్యకుడు వచ్చి జంకుగొంకులు మాని ఆ గోపకాంతల నడుమ దూరి వారిని ఉత్తరదిశకు తరమసాగాడు. గోపికలు భయభ్రాంతలై 'కృష్ణా! రామా!' అని కేకవేశారు. ఆ కేకలు రామకృష్ణులు విని గోపికలకు అభయాలు పలుకుతూ చేరువనే ఉన్న చెట్లు పెరికి ఆ గుహ్యకుని వెంటబడ్డారు. కాలమృత్యువుల వలె తనను వెన్నాడుతున్న వారిని చూసి అతను ప్రాణరక్షణార్థియై ఆ గోపకాంతలను విడిచి పరిగెత్తసాగాడు. రామకృష్ణులు అతనిని వెన్నంటి తరిమి కదిసి పైబడి పిడికిటబట్టి అతని తల పగలగొట్టారు. శంఖచూడుడు తల ముక్కలు చెక్కలై నేలగూలి ప్రాణాలు వదిలాడు. అంత కృష్ణుడు అతని తలనున్న రత్నాన్ని ఊడలాగి తెచ్చి గోపకాంత లందరూ నివ్వెరపోయి చూస్తుండగా బలరామునికి ఇచ్చాడు.

## శ్రీకృష్ణ దివాకాలవియోగం

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుడు ప్రతిదినం ప్రొద్దుననే లేచి గోవులను తోలుకొని వనానికి పోయి సాయంకాలం వాటిని ఇంటికి తిరిగిరావటం జరుగుతుండేది. కృష్ణుడు పగటివేళలలో తమను విడిచి అడవికి పోయినప్పుడు గోపికలు అతని వియోగక్లేశాన్ని సహింపలేక తమలో తాము చర్చించుకొంటూ ఉండేవారు.

**శా. భ్రూవిక్షేపము తోడ డాపలిభుజంబుం జెక్కు గీలించి కె**
**మ్మోవిన్ వేణువు గూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ**
**ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సప్రాణేశులై యుండియున్**
**నీవీబంధము లూడఁ జొక్కుదురు వో నింగిన్ నిలింపాంగనల్.**

అని ఒకతె పలికింది. ఆమె మాటను వేరొకామె అందుకొని, 'అంగనలారా! మన దీనశరణ్యుని లేనగవు తేటకాంతులు అతని కంఠసీమను అలంకరించిన ముక్తాహారద్యుతులతో చెలిమిచేయటం చూసి అతని యెదనున్న సిరి అసూయ పడుతుంది కదూ' అని అడిగింది. ఆమె మాటను ఇంకొక గోపవనిత అందుకొని

**మ. నవమాధుర్యము గల్గు కృష్ణ మురళీ నాదామృత స్యందముల్**
**సెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై**
**యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో**
**దివికిం గంఠములెత్తి లో వదలుబో దేహేంద్రియవ్యాప్తులన్.**

అని పలికింది. ఆమె మాటను వేరొకతె అందుకొని, 'చెలులారా! ముకుందుడు నెమలిపురులు చిగురుటాకులు ధాతురాగం సింగారించుకొని మల్లవేషం దాల్చి రాముణ్ణి వెంటగొని వేణుగానంతో ఆవులను పేరు పేరునా పిలుస్తున్నప్పుడు ఆ గీతాన్ని విని నదీనదాలు తమ గతుల నుడిగి తత్పాదపరాగప్రాప్తికి కాబోలు తరంగ భుజాలను చాచి పెనగులాడుతున్నాయి' అన్నది. ఆమె వెంట మరొకతె ముందుకు వచ్చి, 'మానినులారా! నందనందనుడు తనతో ఉన్న గోపాలకుల స్తుతులను ఆలకిస్తూ ఆదిపూరుషుని వలె నిశ్చల శ్రీలతో అలరారుతూ వనచరుడై కొండభూములలో సంచరిస్తూ వేణుగానంతో గోవులను పిలిచే వేళ అక్కడి తరువులు ఆ పిలుపు విని, 'కృష్ణా! విష్ణుమూర్తి మాలో అంతర్యామియై ఉన్నవాడని నిరూపింపగోరి కాబోలు పుష్పభారనమ్రములై తన ఆనందాతిశయాన్ని తేనె సోన వానల రూపాన వెల్లడిస్తున్నవి కదూ' అన్నది. ఆ

మాటను ఇంకొకతె అందుకొని, 'చెలులారా! కృష్ణుడు తన గళస్థవనమాలికాగంధ మిళిత తులసీమరందానికి మూగిన భ్రమరాల ఝుంకారగీతికలను మెచ్చుకొంటూ తాను కూడా వేణుగానం చేయగా సరోవరాల లోని కలహంసాది విహంగాలు విని పారవశ్యం చెంది అతని చెంతకేగి మౌనముద్ర దాల్చి కన్నులు మోడ్చి మునివృత్తిని స్వీకరించినట్లుంటాయి' అన్నది. ఇంకొకతె లేచి, 'ఓ తలోదరులారా! మన కృష్ణుడు రామునితో కొండచరియలపై కూర్చుండి మధురమధుర మురళీగానంతో జగన్మోదాన్ని కూర్పగా జలధరుడు మింట చరిస్తూ ఆ గానాన్ని విని ఆవలి కేగలేక నిలిచి ముకుందునికి రవితాపం సోకకుండా తన శరీరాన్ని అమర్చి తన ఆనందాన్ని చిరుగర్జనలతో ప్రకటిస్తూ కుసుమవర్షాన్ని కురిపిస్తాడు' అన్నది. ఆ మాటను ఇంకొకతె అందుకొని, 'అమ్మా యశోదా! నీ సుతుని వేణుగానం స్వకల్పిత షడ్జాదిస్వరాలాపమంద్ర మధ్యమ తారభేదాలతో అత్యంత మనోహరం అయినందువల్ల బ్రహ్మరుద్రేంద్రాదులు, మహామునులు మెడవాల్చి చెవి ఒగ్గి వింటారే కాని అందులోని భేదాలను గ్రహింపలేక తారుమా రవుతుంటారు కదా' అని పలికింది. దానితో మరొకతె లేచి, 'అక్కలారా! వ్రజభూమి ఆవుల గిట్టత్రొక్కిళ్ళకు నలిగి వేదురుతుంటే చూసి కృష్ణుడు ధ్వజపద్మవజ్రాంకుశ రేఖాంచిత నిజపదారవిందమందగతులతో ఆ అలమటను తీర్చి వేణునాదంతో హాయిగూర్చినప్పుడు మనమందరమూ అతని విలాస విలోకనోదిత మదనవశలమై చేష్టలుడిగి కొప్పు వీడటం నీవి సడలటం ఇంచుకయినా తెలియక పరవశించి ఉంటాము కదూ' అన్నది. ఆ మాట వెంబడి ఇంకొకతె లేచి, 'చపలాక్షులారా! కృష్ణుడు మణిహారాలతో గోవులను అలంకరించి, తాను అలంకరించుకొని, మెడలోని తులసి దండల నెత్తావికి సంతసిస్తూ చెంతనున్న అనుచరుని భుజంపై చేయిమోపి వేణుగానం ఆలపింపగా హరిణకాంతలు ఆ మధురనాదం విని ఆ గుణగణార్ణవుని చేరబోయి అక్కడినుంచి పాదమైనా కదల్పక అక్కడే ఉండి, కృష్ణగానాపహృతచిత్తలై గృహాశను వదలి చని అక్కడే నిలిచిన గోపికలను

విడంబిస్తుంటాడు కదూ' అన్నది. అంత వేరొకతె లేచి, 'యశోదా! నీ సుతుడు గోపికాకౌతుకార్థం కుందకుసుమహారాలను ధరించి గో గోపాలకులతో యమునాతటాన విహరించే వేళలలో మందమారుతం మలయజస్పర్శశీతలమై ఇంపు కావించే నెపంతో అతనికి సేవ లందిస్తుంది; గంధర్వాదులు వాద్యగీతపుష్పవర్షాద్యుపచారాలతో అతనిని ఆరాధిస్తారు కదా' అన్నది. అప్పుడు ఇంకొకతె ముందుకు వచ్చి, 'సుదతులారా! కృష్ణుడు సాయంకాలం గోవులను తోలుకొని వచ్చేటప్పుడు దారిలో పెద్దలు ఉపాసింపగా అంగీకరిస్తాడే తప్ప అక్కడ ఆగడు; ఆవుల పాదధూళి ఒంటికంటుకొన్నా సరకుచేయడు; పగలంతా తిరిగినందువల్ల దేహం సొమ్మసిల్లినా లెక్కచేయడు. కారణ మేమంటారా? సుహృదుల కోర్కెలు తీర్చే తమి ఒక్కటే కారణం సుమా' అన్నది. అంత వేరొకతె చేయిచూపి, 'కాంతలారా! మదవిఘూర్ణలోచనాలతో, కనకకుండల కాంతికోమల గండభాగాలతో బదరపాండువదనంతో చంద్రుని వలె ప్రసన్నదర్శనుడై వ్రజవాసుల దురంత తాపపరిహారార్థం యదువల్లభుడు గజరాజు కరణిని దినాంతవేళ నడిచివచ్చే వైఖరిని చూడని కన్నుల కలిమి కూడా ఒక కలిమేనా?' అన్నది. మరికొందరు తలకొకవిధంగా అన్నారు:

**మ. లలనా! యేటికి దెల్లవాఱె? రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపై?**
**గలకాలంబు నహంబుఁగాక నిశిగాఁ గల్పింపఁ డా బ్రహ్మ, దా**
**వలతేఁడుం గృపలేఁడు, కీరములు దుర్వారంబు, లెట్లో కదే!**
**కలదే మాపటిఁవేళయుం గలుగునే కంజాక్షు సంభోగముల్.**

**ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు హరి యెప్పుడు గోవుల మేపివచ్చు నా**
**కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు నతండు వచ్చి న**
**న్నెప్పుడు గారవించుఁ, దుది యెప్పుడు మద్విరహాగ్నిరాశికిన్**
**జెప్పగదమ్మ బోటి! మరుచేతల నుల్లము తల్లడిల్లెడిన్.**

**మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁబాసి వనముం జేరంగ న య్యా క్షణం**
**బులు నా కన్నియు నుండనుండఁగడు నాపూర్ణంబులై సాగి లో**
**పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై**
**నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై.**

**మ. అదె భానుం డపరాద్రిఁ జేరె, నిదె సాయంకాల మేతెంచె, న**
**ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె బృందారణ్యమార్గంబునం**
**దిదె వీతెంచె వృషేంద్రఘోషము, ప్రియుం దేతెంచె వేవేగ రం**
**డెదు రేతెంచి సపర్యలం దనుపగా గృష్ణుం బ్రభావిష్ణునిన్.**

రాజేంద్రా! గోపికలు ఈ విధంగా సంకల్ప వికల్పరూపాలైన వారి మనస్సులను కృష్ణుని యందు లీనం చేసి అతనితోడితే జీవితమూ అతనితోడిదే సంతోషమూ కాగా అతని లీలలను పాడుతూ పగలుకూడా క్రీడింపసాగారు.

## వృషభాసుర సంహారం

ఒకనాడు మహావృషభం ఒకటి హఠాత్తుగా గోకులానికి వచ్చిపడింది. గిరిశిఖరాన్ని పోలిన మూపురంతో మిన్నంటుతున్న కొమ్ములతో రంపిల్లుతూ వస్తున్న ఆ వృషభం రంకెలకు గోవులూ గోపికల గుండెలవిసి ప్రాణాలెగసినట్లయింది. దాని గిట్టల ఘట్టనలకు బీటలువారి నేల అల్లాడసాగింది.

ఆ వచ్చిన వృషభం మునుగాళ్ళతో నేలను పెకలిస్తూ రంకెలువేస్తూ ఉండటం చూసి గోకులమంతా భీతిల్లి 'కృష్ణా! కృష్ణా!' అని కేకలు వేశారు. కృష్ణుడు వారికి అభయం పలికి ఆ వృషభాన్ని సమీపించి, 'ఓరీ! అరిష్ట రాక్షసా! దుష్టబుద్ధి వలన నీవు ఈ రూపాన్ని ధరించి వచ్చావు. దుష్టాత్ముల మదం అణుస్తాను. చేతనయితే న న్నెదిరించు' అంటూ చేతులు తట్టి పోరికి పిలిచి చెంతనున్న చెలికాని మూపుపయి బాహుదండం వేసి నిలబడ్డాడు. ఆ వృషభం కృష్ణుని మాటలకు కోపవివశమై కాళ్ళతో నేలగీటి తోకాడించి తలవాల్చి కొమ్ములు సూటిగా గురిపెట్టి కృష్ణుని మీది కురికింది. కృష్ణుడు కొమ్ములు

పట్టుకొని దానిని నెట్టాడు. ఆ నెట్టిన వేగానికి అది పద్దెనిమిది అడుగుల వెనుకకు పోయి తలక్రిందులుగా పడి లేచి మళ్ళీ ఒక్కుమ్మడిని దూకి కృష్ణుని మార్కొన్నది. నందకుమారుడు దానిని మళ్ళీ కొమ్ములను పట్టుకొని పడద్రోసి నుగ్గునూచం చేసి దాని శృంగం ఒకటి ఊడలాగి దానితో మోదాడు. ఆ వృషభం నెత్తురు కక్కి మూత్రపురీషాలు విడిచి గిజగిజ తన్నుకొని ప్రాణాలు విడిచింది.

సురలు కృష్ణుని స్తుతించి పుష్పవృష్టి కురిపించారు. గోకులమంతా భయంతొలగి ఆనందవార్నిధిలో ఓలలాడింది.

## నారద కంస ద్వితీయసమాగమం

రాజేంద్రా! ఒకనాడు నారదమహర్షి మథురానగరికి వచ్చి కంసరాజును సందర్శించాడు. మాటల సందర్భంలో కృష్ణుని ప్రస్తావన వచ్చింది. నారదుడు ఆ మాట పట్టుకొని, 'కంసా! దేవకీ గర్భసంజాతులను ఆరుగురిని చంపావు. అంత ఆమె ఏడవగర్భాన్ని ధరించింది. అనంతుడు అందులోనికి ప్రవేశించాడు. భగవానుడు తన యోగమాయను పిలిచి, నా తేజోంశ ఇప్పుడు దేవకీగర్భంలో ఉన్నది. దానిని ఆకర్షించి రోహిణీగర్భానికి చేర్చు. నేను దేవకీగర్భంలో ఎనిమిదవ చూలుగా జన్మిస్తాను. అదే వేళ నీవు నందుని భార్య యశోదకు కుమార్తెవై పుట్టాలి' అని ఆజ్ఞాపించాడు. యోగమాయ ఆ ప్రకారమే ఆచరించింది. ఇప్పుడు వ్రేపల్లెలో ఉన్న రోహిణీసుతుడు బలరాముడు దేవకి ఏడవకాన్పు; యశోదాపుత్రుడు కృష్ణుడు దేవకి ఎనిమిదవ కాన్పు. పూతనాదులను చంపినది ఆ రామకృష్ణులే. యోగమాయ సంగతి నీకు తెలిసినదే కదా.

## కంస జననరహస్యం

కంసా! నీ పుట్టుక సంగతి ఎరుగుదువా? నీ తల్లి ఒకనాడు ఋతుస్నానం చేసి అలంకరించుకొని ఉద్యానవనవిహారానికి వెళ్ళింది. అప్పుడామెకు పతితో

ప్రణయ వాంఛ కలిగింది. ఆ సమయంలో ద్రమిడుడనే గంధర్వుడు అక్కడ సంచరిస్తూ నీ తల్లి మనోగతాన్ని గ్రహించి నీ తండ్రి ఉగ్రసేనుని రూపంలో వచ్చి ఆమెతో సంగమించాడు.

సంగమానంతరం అతను అన్యపురుషుడన్న సంగతిని ఆ సాధ్వీమణి గుర్తించి, 'ఓరీ! ఈ అకార్యం నీకు తగునా?' అని క్రోధోదగ్రురా లయింది. అతను ఆమె కోపాన్ని చూసి, 'కాంతామణీ! నేను గంధర్వుడను; సామాన్యుడను కాను. నా తోడి కూటమి దోషం కాదు' అని సమాధానం చెప్పాడు. ఆ మాట మీ తల్లి విని 'ఓరీ! పంచభూతాలు, సూర్యచంద్రులు, దిక్కాలధర్మాదులు సర్వచేష్టితాలకు సాక్షులుగా ఉంటారు. వారి కన్నుగప్పి ఎవ్వరూ ఏ పనీ చేయజాలరు. అట్టి నిత్యసాక్షులను సహితం లెక్కచేయక విశృంఖలవృత్తి నవలంబించి జలమధ్యపద్మినిని మదాంధగజం వలె నన్ను తాకి నాకు మాలిన్యం ఆపాదించావు. ఈ దౌష్ట్యం చాలదన్నట్లు నీతులు మొదలుపెట్టి నన్ను మోసగించి నాకే ఉపదేశం చేయజూస్తున్నావు. ఇదా నీ గొప్పతనం' అని శపింపబోయింది.

ఆ గంధర్వుడు ఆమె శాపానికి భయపడి, 'కమలాక్షీ! మనుష్యాంగనతో దేవగంధర్వాదులు కావించే సంగమం అనులోమకం. దేవకాంతల తోడి నరుల సంగమం విలోమం. అనులోమ సంగమం శాస్త్రనిషిద్ధం కాదు. కాబట్టి నేను చేసినది దోషం కాదు. నా వీర్యం వృథాపోదు. శ్రీమంతుడు ధీమంతుడు మహోత్సాహి అయిన పుత్రుడు నీకు జన్మింపనున్నాడు' అన్నాడు.

కంసా! నీ తల్లి తనకు పాతివ్రత్య భంగం జరిగినందుకు ఎంతగానో దుఃఖించి, 'ఓరీ దుర్మార్గుడా! ధర్మమర్యాదను ఉల్లంఘించి ఉన్మాదవశుడవై చిత్తానికి వచ్చినట్లు చేశావు. నీవంటి పాపాత్మునికి జన్మించే సుతుడు క్రౌర్యసాహసాది దుర్గుణవంతుడు కాకమానడు. అట్టివాడు దేవ దివ్య తాపసుల అనుగ్రహానికి ఎలా నోచుకుంటాడు?' అని కఠోరంగా పలికింది. గంధర్వుడు ఆ పలుకులు విని, 'అలాగయితే నీ సుతుడు నీ వారికే

శత్రువవుతాడు' అని చెప్పి అంతర్హితు డయ్యాడు. నీ తల్లి ఆ వృత్తాంతాన్ని పరమగోప్యంగా ఉంచింది. ఆమె గర్భవతియై కొన్నాళ్ళకు నిన్ను కన్నది. కంసా! నీ తల్లి శాపకారణాన నీకు స్వజనులతో విరోధం తప్పదు' అని చెప్పాడు.

## వసుదేవ నిర్బంధం

రాజా! కంసుడంతట రామకృష్ణులకు గాను కోపవివశుడై ఖడ్గాన్ని చేబూని వసుదేవుని వధింపబోయాడు. దేవర్షి అతనిని వారించాడు. కంసుడు ముని వచనాన్ని కాదనలేక వసుదేవ వధ ప్రయత్నం మాని దేవకీవసుదేవు లిద్దరినీ ఇనుపసంకెళ్ళతో బంధించి చెరలో పెట్టాడు. నారదు డంతట కంసుని వీడ్కొని ఆకాశమార్గాన నిష్క్రమించాడు.

## కంసుని దుర్మంత్రాలు

నారదుడు వెళ్ళగానే కంసుడు 'కేశి' అనేవాడిని పిలిపించి, 'ఓయీ! రామకృష్ణ లని ఇద్దరు వ్రేపల్లెలో ఉన్నవారు మనకు ఆగర్భశత్రువులు. ఈ క్షణమే వెళ్ళి వారిని కడతేర్చి రా!' అని ఆజ్ఞాపించి అతనిని పంపివేసి, ముష్టిక చాణూరాదులను మావంతులను మంత్రులను రప్పించి, 'శ్రేయోభిలాషులారా! దేవకీ వసుదేవులకు పుట్టబోయే ఎనిమిదవ కాన్పు నాకు ప్రాణహరుడు కానున్నాడని ఆనాడు గగనవాణి పలికిన పలుకులను మీరు మరువలేదు గదా. దేవకీ సప్తమాష్టమ గర్భాలు నశించినవని నమ్మాను. ఆ సప్తమాష్టమ గర్భజనితులు సజీవులని, వారే రామకృష్ణులని, వ్రేపల్లెలో ఉన్నారని నారదమహర్షి చెప్పి వెళ్ళాడు. వారున్నంతకాలం నాకు మృత్యుభయం తప్పదు. ఏదో ఒక విధంగా వారినిక్కడికి రప్పించాలని సంకల్పించాను.

మంత్రులారా! రానున్న చతుర్దశినాడు ధనుర్యాగం జరుగుతుంది. అందుకు తగినట్లు శాలను నిర్మించాలి. మావంతులారా! మీరు కువలయాపీడ మత్తేభాన్ని రంగస్థానద్వారంలో నిలిపి రామకృష్ణులు వచ్చినంతనే ఆ గజాన్ని రెచ్చగొట్టండి.

**శా. విన్నాణంబునఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాది సం**
**పన్నుల్ మీరలు మేటి మల్లుగములన్ బ్రఖ్యాతులై పెంపుతో**
**మన్నా రా బలకృష్ణులం బెనకువన్ మర్దించి మత్ప్రీతి కా**
**సన్నుల్ గండు, పురీజనుల్ వొగడ నో చాణూర! యో ముష్టికా!"**

అని ఆజ్ఞాపించాడు. మంత్రులు యాగశాలానిర్మాణం మొదలుపెట్టారు. మావంతులు, చాణూర ముష్టికులు అదునుకోసం ఎదురుచూస్తూ తహతహలాడసాగారు.

## అక్రూర నియోగం

రాజేంద్రా! కంసుడు ఆ ప్రకారం కార్యవిధానం నిర్ణయించి రామకృష్ణులను రప్పించే మార్గమేమిటా అని లోలోపలే ఆలోచించి అక్రూరుని కోసం పిలువనంపాడు. కంసుని మాట విన్నంతనే అక్రూరుడు వచ్చాడు. కంసుడతని చేయి పట్టుకొని, 'దాశపతీ! మిత్రకార్యార్థం నిన్ను అడుగుతున్నాను. నా కోరికను త్రోసిపుచ్చక ఆదరించు. నిన్నే ఎందుకు అడిగానంటావా? వృష్ణిభోజులలో నీవొక్కడవే నాకు నిజమైన హితుడవు. అందువల్ల నిన్నడిగాను. సౌమ్యా! దేవేంద్రుడు విష్ణువును వలె నేను నిన్ను ఆశ్రయిస్తున్నాను. నాకు మృత్యువుగా రామకృష్ణులను దేవతలు నిర్దేశించారట. వారు వ్రేపల్లెలో నందుని ఇంట ఉన్నారట. నీ నేర్పు చూపి వారిని ఎలాగయినా ఇక్కడికి తీసికొనిరావాలి. వారికోసం ధనుర్యాగం చేయాలని సంకల్పించాను. ఆ యాగంలో వారు కువలయాపీడ గజానికి బలి అవుతారు. ఆ గజం బారినుంచి తప్పించుకొంటే ఏమిటి ఆలోచించావని అడుగుతావేమో? వారిని మన మల్లులకు అప్పగిస్తాను. మిత్రమా! రామకృష్ణులు ఉన్నంతకాలం నాకు మృత్యుభయం తప్పదు. వారు పోతే వారి బంధువులు ఊరుకొంటారా? అని శంకింపగలవు. రామకృష్ణులు కడతేరితే యదు వృష్ణి భోజ దశార్హాదులు ఒక లెక్కలోనివారు కారు. నా తండ్రి ఉగ్రసేనుడు చెరసాలకు కావలి ఉంటాడులే. నా పినతండ్రి దేవకుడు,

తదితరులైన నా వైరులు క్షణంలో రూపుమాయ నున్నారు. జరాసంధుడు నాకు గురువు; ద్వివిద శంబర నరక బాణప్రముఖులు నాకు మిత్రులు. వారి సాయంతో సురపక్షం వారందరినీ మట్టుపెడతాను. మహీమండలం నాకు నిష్కంటక మవుతుంది. నీవు నాకు ప్రాణానికి ప్రాణానివి కాబట్టి నా గుట్టు నీ చేతిలో పెట్టాను. ఈ రహస్యాన్ని నీ యెదలో దాచి వ్రేపల్లెకు పోయి ధనుర్మఖోత్సవం, మధురాపుర విభవం చూపించే నెపంతో రామకృష్ణులను వెంటబెట్టుకొనిరా!' అని చెప్పాడు.

అక్రూరుడతని మాటవిని, 'నరేంద్రా! నీ ముప్పు తప్పించుకోవటానికి నీవు పన్నిన ఉపాయం చక్కగా ఉన్నది. అయితే ఫలాఫలాలు దైవాయత్తమైనవి. అందుకు సిద్ధంగా ఉండు. కోరికలు కోరటం అవి ఫలించినప్పుడు సంతోషం, విఫలించినప్పుడు విచారం కలుగుతుండటం ఉన్నదే. రాజశాసన మన్నాక తలదాల్పక తప్పదు' అని పలికి అతనిని వీడ్కొని ఇంటికి వెళ్ళాడు.

## కేశిసంహారం

కంసుని ఆజ్ఞప్రకారం కేశి బయలుదేరి తన రాక్షసమాయను ఆశ్రయించి విపరీతమైన అశ్వరూపం ధరించి పుడమి బీటలువారగా ఖురఘట్టనలు కావిస్తూ సటాపటలాన్ని విదిలిస్తూ అత్యంత భయంకర హేషారవాలతో సకలిస్తూ వ్రేపల్లె లోనికి జొరబడ్డాడు. ఆ హయసటల విసురుకు మేఘాలు, విమానాలు చెల్లాచెదరయ్యాయి. దాని సకిలింతలకు గోపాలకులు మాత్రమే గాక గోకులంలో ఉన్న జంతుజాలమంతా జడిసి తడబడుతూ పరిగెత్తటం కనిపించింది.

ఆ మాయాహయం వడివడిగా వ్రేపల్లెలో అడుగుపెట్టి వీథులలోనికి జొరబడి కృష్ణుని వెదకసాగింది. కృష్ణుడది గ్రహించి ఎదురువచ్చి సింహనాదం కావించి దానిని పోరికి పిలిచాడు. ఆ గుర్రం నోరప్పళించి కుప్పించి వెనుగాళ్ళతో కృష్ణుని మీద పడింది. నందసూనుడు ఆ తన్ను తప్పించుకొని గరుత్మంతుడు పామును పట్టుకొన్నట్లు దాని వెనుగాళ్ళు రెండూ ఒడిసిపట్టి

లాగి వదిలిపెట్టాడు. ఆ ఊపుకు మాయాహయం నూరువిండ్ల దవ్వుకుపోయి క్రిందపడి మూర్ఛిల్లి కొంతసేపటికి సేదదీరి రోషంమీరి నోరుతెరిచి ఉరవడించి మళ్ళీ కృష్ణుని మార్కొన్నది. యశోదాతనయుడు తన వామభుజాన్ని ఆ తురంగం నోట జొనిపాడు. కొలిమిలో కాగుతున్న ఇనుప కమ్మిని పోలిన ఆ చేయి స్పర్శ తగిలినంతనే ఆ గుఱ్ఱం దంతాలు ఊడి జలజల రాలాయి. భగవానుని హస్తం చికిత్సచేయని రోగం వలె క్షణక్షణానికి పెరిగి ఆ గుఱ్ఱపు గొంతుక్రోవిని అడ్డగించింది. ఆ హయం ఊపిరాడక పొట్ట ఉబ్బి బూరటిల్లి చెమరుస్తూ గుడ్లు మిటకరిస్తూ లద్దె విడిచి నేలబడి తన్నుకొని ప్రాణాలు విడిచింది. దాని నోరు దోసపండులా బ్రద్దలయింది. అప్పుడు కృష్ణుడు దాని వక్త్రాంతరం నుంచి తన హస్తాన్ని వెలికి తీశాడు. ఆ అద్భుతానికి దివిజులు మహాశ్చర్యభరితులై ప్రస్తుతిపూర్వకంగా పుష్పవృష్టి కురిపించారు. వ్రేపల్లె మళ్ళీ కళకళలాడింది.

## నారద శ్రీకృష్ణుల సమావేశం

రాజేంద్రా! ఒకనాడు శ్రీకృష్ణభగవానుడు ఏకాంతంగా ఉన్న వేళ భాగవతోత్తముడు నారదమహర్షి వచ్చి, 'కృష్ణా! ఇటీవల కంసుని సందర్శించాను. నీ సంగతి ప్రస్తావనకు వచ్చింది. ఉన్నదున్నట్లు అతనికి చెప్పివేశాను. ఆ చెప్పటం మంచిదా? అని శంకింపవద్దు. భూమికి భారకులైన దైత్యులను సంహరించడానికి అవతరించావు. నీకు అన్యుల వలన భయమన్న మాటే తలయెత్తదు. నీ స్వరూపం అపరిచ్ఛిన్నం; నీ ప్రభావం అచింత్యం. విశ్వమంతా నీ నియమప్రకారం వర్తిల్లుతుంది. సర్వభూతాలలో అంతర్యామివై సర్వాశ్రయుడవై ఎల్లెడల ఉంటావు. సర్వశక్తిమంతుడవు.

> దేవా! అగ్ని కట్టెలయందు వలె ఆత్మరూపాన సర్వభూతాలలో నీవొక్కడవే ఉన్న సంగతి తెలియక భ్రాంతులు నిన్ను జీవమాత్రునిగా భావిస్తారు. నీవు సర్వసాక్షివై ఉన్నప్పటికీ నేత్రదృష్టికే గాక బుద్ధిదృష్టికి సయితం అందరానివాడవు. నీవు

సర్వాంతర్యామి వన్నందుకు దృష్టాంతం చెప్పనా? నీ ఈశ్వరత్వమే ఇందుకు నిదానం. ఈశ్వరుడు లేనినాడు పరతంత్ర జీవకోటికి ప్రవృత్తి కలుగదు కదా. సమస్తం నీ వలన ఈశితవ్యమన్న సంగతి తెలియాలంటే నీవు సర్వస్వతంత్రుడవని గుర్తించాలి. నీ శక్తిని మాయ అంటారు. ఆ మాయవలన గుణాలను పుట్టించావు. ఆ గుణాల వలన సమస్తసృష్టి ఉత్పత్తిస్థితిలయాలను పొందుతున్నది. సృష్ట్యాదులకు సాధన మేమిటని అడుగుతుంటారు. సృష్ట్యాదులకు నీ సంకల్పమే సాధనం. నీకు సాధనాంతరా లెందుకు? దేవా! సృష్టిచేయటమంటే నీ శక్తిని విస్తరింపజేయటమే గాని వేరొకటి కాదు. ఆ విస్తారమూ నీ సంకల్పాధీనమే.

## భావికార్యసూచనం

జగదీశ్వరా! కేశి అనే పేరుగల రాక్షసుడు హయరూపం ధరించి కావించిన హేషలకు స్వర్గం కూడా తల్లడిల్లింది. అంతటివాడిని త్రుటిలో సంహరించావు. నేటికి మూడవనాడు కువలయాపీడమనేమత్తేభాన్ని చాణూరముష్టికాదులైన మల్లులను కంసుని చంపనున్నావు. ఆ తర్వాత కంసానుచరులైన పంచజన యవన మురి నరకాదులను క్రమంగా సంహరిస్తావు. దేవేంద్రుని ఓడించి సురలోకం నుంచి పారిజాతాన్ని తీసికొని వస్తావు. వీర్యశుల్కం ఇచ్చి వీరకన్యలను పెండ్లాడుతావు. నృగునికి శాపవిముక్తి కలిగిస్తావు. శమంతకమణితోపాటు జాంబవతిని తెచ్చి ఆమెను వివాహం చేసుకొంటావు. మహాకాశపురంలో బ్రాహ్మణునికి ఆతని మృతపుత్త్రుని బ్రతికించి ఇస్తావు. పౌండ్రకుని పరలోకానికి పంపుతావు; కాశీపురాన్ని దహిస్తావు; దంతవక్త్రుని సంహరిస్తావు; ధర్మజుని రాజసూయయాగంలో శిశుపాలుని శిరశ్ఛేదం కావిస్తావు.

సర్వలోకరక్షకా! ఇంతటితో కాలేదు. నీవు ద్వారకను చేరి చేయవలసిన వింతలెన్నో ఉన్నాయి. సవ్యసాచికి సారథివై కురుక్షేత్రంలో అక్షౌహిణులకు అక్షౌహిణులను లయింపజేస్తావు.

## భగవత్కార్య రహస్యం

ఇవన్నీ లోకరక్షణార్థమే గాని ఆత్మార్థం కాదు. ఏమంటావా? ఆత్మపరమానంద నిష్ఠుడవు పరిపూర్ణుడవు అయిన నీకు కోరతగినది పొందతగినది ఏముంటుంది? మరొక విశేషం. ఈ పనులన్నీ నీవు చేయటం లేదు. నీ చిచ్ఛక్తి గుణప్రవాహరూపాన ఇవన్నీ కలుగుతున్నాయి. నీవు సత్యసంకల్పుడవు జ్ఞానైకమూర్తివి అయి సాక్షిమాత్రుడవుగా ఉంటావు. ఆ కారణాన నీ సంకల్పాలకు భోగ్యఫలోదయం; తత్ఫలానుభవార్థమై జననమరణరూప సంసృతీ రెండూ కలుగవు. ఇతరులకూ నీకూ ఉన్న భేదమిదే సుమా! దేవా! ఏతద్రూపనిరతిశయమూర్తిని ఆశ్రయిస్తున్నాను.'

అని పలికి నారద మహర్షి శ్రీకృష్ణునికి ప్రణమిల్లి ఆజ్ఞగైకొని తద్దర్శనానందనిమగ్నుడై తిరిగివెళ్ళాడు.

## అక్రూరుని ప్రార్థన

అక్రూరుడు కంసుని వలన ఆజ్ఞాపితుడై ఇంటికి వచ్చి వ్రేపల్లెకు ప్రయాణం కట్టి నాటి రాత్రి వేకువనే లేచి రథమెక్కి వ్రజపురమార్గం పట్టాడు.

రాజేంద్రా! అతను రథమెక్కినది మొదలు అతని మనస్సు వివిధ పరితాపాల పాలయింది. అతని భగవద్భక్తిలతిక క్షణక్షణానికి సాగి తీగలు వారజొచ్చింది. అతని మనస్సు చింతాక్రాంత మయింది.

'దేవా! ఏమి పుణ్యం చేసుకొన్నానో, ఎట్టి తపస్సుకు నోచుకొన్నానో, ఏ సత్పాత్రునికి ఎటువంటి దానం ఇచ్చానో నేడు నాకు నిన్ను సందర్శించే మహాభాగ్యం కలిగింది. శూద్రునికి వేదోచ్చారణవలె విషయాత్మునికి భగవద్దర్శనం దుర్లభం. ఏటిలో పడ్డ గడ్డిపరకలు ఒక్కొక్క వేళ ప్రవాహవేగానికి కొట్టుకొనివచ్చి గట్టుచేరుతుంటాయి. ఆ విధంగానే విషయాతురులు కూడా కాలగతి మూలాన యాదృచ్ఛికంగా భగవద్దర్శనభాగ్యాన్ని పొందగలుగుతారు. నేటితో నా అమంగళాలన్నీ

నశించాయి; నా జన్మ సఫలం అయింది. యోగిజనధ్యేయమైన నీ పాదపద్మాలకు ఇదే నమస్కారం.

నా అమంగళవినాశానికి తార్కాణ మేమంటావా? ఖలుడైన కంసుడు నాయెడ అత్యంతానుగ్రహాన్ని చూపటమే నిదర్శనం. అతని అనుగ్రహరూపం ఎట్టిదంటావా? నీ పాదపద్మాల చెంతకు నన్ను పంపించటమే అతని అనుగ్రహం. ఏ నీ చరణారవింద నఖకిరణాలు సోకినందువలన అంబరీషాదులు సంసృతిసాగరాన్ని తరింపగలిగారో, ఏ నీ పాదారవిందాలు బ్రహ్మాదులకు పూజనీయాలూ సిరికి ఆశ్రయాలూ మునీంద్రులకు భక్తినిధానాలూ అయి పరమైశ్వర్య సౌభాగ్య పరమపురుషార్థప్రదము లన్నమాటను ప్రకటిస్తున్నవో, ఏ నీ చరణారవిందాలు గోపాలననిమిత్త వనసంచార రూపాన భూదేవికి సంతాపాన్ని తీరుస్తున్నవో ఆ నీ పవిత్ర పాదారవిందాలను కన్నులారా చూసుకొని చేతులారా పూజించు కొంటాను. సుకపోలనాసికమూ స్మితావలోకారుణ కంజలోచన దీప్తిమంతమూ నీలకుటిల కుంతలావృతమూ సకల కళాపరిపూర్ణమూ అయిన నీ ముఖచంద్రమండలాన్ని తిలకించి ధన్యధన్యుడ నవుతాను.

**మ. అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్దామమై**
**జలజాక్షంబయి కర్ణకుండలవిరాజద్గండమై యున్న నీ**
**విలసద్దివ్యముఖంబుఁ జూచు కలిమిన్ వేఁ గాంతు బో నాకు నా**
**వల దిక్కేగుచునున్న వీ వనమృగవ్రాతంబు లీ త్రోవలన్.**

దేవా! మా బోంట్లవలె నీవు కూడా కర్తృత్వ భోక్తృత్వాది ధర్మాలతో ఉండటం చూసి నిన్ను సామాన్య మనుష్యమాత్రునిగా భావిస్తారు. ఈ భావం కేవల భ్రాంతిఫలమే గాని సత్యం తెలిసి ఏర్పరచుకొన్నది కాదు. భేదభావమే ఇట్టి భ్రాంతికి కారణం. అందుకు అజ్ఞానమే కారణం. అజ్ఞానమంటే ఏమిటి? యథార్థం తెలియక విపరీతంగా భావించటమే అజ్ఞానం. నీవు కేవల జ్ఞానస్వరూపుడవు, పూర్ణుడవు. నీవు చేయవలసినది గాని చేయనైనది గాని

అణుమాత్రం ఉండదు. అలాగయితే సృష్టి ఎలా జరుగుతున్నదని అడగవచ్చును. నీ కటాక్షవీక్షణమాత్రాన నీ మాయాయోగం నీయందే ప్రాణేంద్రియాలతో జీవులను రచిస్తున్నది. బృందావనం లోనూ గోపికామందిరాల లోనూ కానవచ్చేవారందరూ నీ మాయాకల్పిత జీవులే గాని స్వతంత్రులు కారు. నీవు వారిని గూడి లీలలు చూపటం నీవు నీ తోటే రమించట మన్నమాట. ఆ నీ లీలలను చూసి నిన్ను రక్తునిగా భావిస్తారు.

దేవా! నీ గుణకర్మజన్మములన్నీ సకలపాపహరాలు; పరమమంగళ ప్రదాలు అయినట్టివి. ఆ జన్మములలో నీ నోటినుండి వెలువడిన వాక్కులు జగానికి జీవన శోభన పావనత్వాలను కలిగిస్తాయి. అట్టి నీ పరమపావన వాక్కులను ఆకర్ణించే భాగ్యం నాకు కలుగబోతున్నది.

వేకువనే ఎన్నో శుభశకునాలు పొడచూపాయి. దారిలో కూడా అటువంటివే అనేకం కలిగాయి. ఎప్పుడు నా రథం వ్రేపల్లెకు చేరుతుందో, ఎప్పుడు జగదీశ్వరులైన రామకృష్ణుల చరణారవిందాల మ్రోల వ్రాలుతానో? ఎప్పుడా భగవానుని కరకమలం నా శిరస్సును తాకుతుందో? భగవానునితో ఉండే గోపాలకు లందరికీ మ్రొక్కటం ఎప్పుడో?

దేవా! నీ కరకమలాన్ని అర్చించి ఇంద్రుడు ఇంద్రపదవిని పొందాడు. ఆ కరాన్ని బలి తన తలపై ధరించిన ఫలంగా అతను భావికాలంలో ఇంద్రుడు కానున్నాడు. ఆ నీ పవిత్రపాణి వివిధవిహారశ్రాంతలైన వ్రేతల అలయికలు తీరుస్తున్నది. ఇక నా భాగ్యమెంతటిదో ఊహించగలవా?

దేవా! నీవు క్షేత్రజ్ఞుడవు గనుక నిఖిలభూతముల బాహ్యాభ్యంతరవృత్తులు నీకు స్పష్టం. కంసుడు పంపగా మాత్రమే వచ్చానని భావింపవద్దు. అతను క్రూరబుద్ధితో నన్ను పంపినమాట నిజం. అయితే నా ఉద్దేశం వేరు; అతని సంకల్పం వేరు. అతను నా యీ రాకకు నిమిత్తమాత్రుడయ్యాడు. నేను నీ పాదసేవార్థం బయలుదేరాను. నా బుద్ధి నిర్మలం. ప్రేరణ దుష్టమయితే

కావచ్చునుగాక. నా తలంపు విశుద్ధమైనది కాబట్టి ప్రేరణ దోషం నాకు అంటదు.

జగదీశ్వరా! నీ పాదాలకు మోకరిల్లి లేచి కైగూర్చినప్పుడు నీ కరుణార్ద్రస్మేరవిలోకనాలను నాయెడ ప్రసరించితే నేను సర్వపాపవిముక్తుడనై జంకువీడి పరమానందాన్ని పొందుతాను. నన్ను నీ దీర్ఘబాహువులతో చేరదీస్తే నా కర్మబంధాలన్నీ పటాపంచ లవుతాయి; నేను పరమపావనుడ నవుతాను. 'తాతా! అక్రూరా!' అని నన్ను ప్రేమగా పిలిస్తే నా జన్మ సఫలమవుతుంది.

దేవా! నీకు ప్రియాప్రియులు గాని సుహృత్తులు గాని ఉపేక్షణీయులు గాని కలుగరు. నిన్ను కొలిచినవారు కల్పవృక్షాన్ని ఆశ్రయించినవారి వలె యథార్థఫలాలను పొందుతారు. ఆ ఫలాలను నీ విప్వటం కాదు; అవన్నీ భక్తిస్వభావసిద్ధాలు. నీ అనుగ్రహం నిరంతర పూర్ణమై మహాసాగరం వలె ప్రసరిస్తుంది. ఎవరెంత పాత్రతో సముద్రజలాన్ని గ్రహిస్తే అంత మాత్రమే వారికి లభిస్తుంది. ఈ తారతమ్యం భక్తిపాత్రమందు ఉన్నదే తప్ప నీ యందున్నది కాదు.

రామా! నేను కేలుగూర్చి నీ యెదుట నిలువగా నన్ను దగ్గరకు తీసుకొని ప్రేమగా ఇంటిలోనికి తీసికొనివెళ్ళి యథార్థమర్యాదలు కావించి బంధువులలో మన్నిస్తావా? కంసునిభృత్యుడని చులకన చేస్తావా?'

రాజా! అక్రూరు డట్టి తలంపుల వలన మైమరచి ఉన్నందున రథం ఎంత దవ్వు వచ్చినదీ కూడా అతనెరుగడు. అంతలో సూర్యుడు అస్తమించే కాలమయింది. రథం వ్రేపల్లె చేరింది.

## అక్రూరుని భక్త్యుద్రేకం

రాజా! అక్రూరుని రథం వ్రేపల్లె పొలిమేరలకు వచ్చినది మొదలు నెమ్మది నెమ్మదిగా పోసాగింది. అతను పోతున్న దారిని కొన్ని విచిత్రమైన అడుగుజాడలు అతని కంటబడ్డాయి. అక్రూరుడు రథం దిగి ఆ జాడలను

పరీక్షించి అవి పద్మయవాంకుశాదిరేఖాలాంఛితము లన్న సంగతిని గుర్తించి భగవానుని అడుగుజాడలని నిశ్చయించి సంతోషపులకితశరీరుడై ఆనందాశ్రువులు పొంగివచ్చి ఆ చోట నేలబడి పొర్లాడసాగాడు. రాజా! దంభ భయ శోకాలు వీడి పరమేశ్వర శ్రవణ స్మరణ దర్శనోత్కంఠచిత్తులై తన్మయులైన పరమభక్తులు కావించే చేష్ట ఇదే. దేహధారులకు ఇదే పురుషార్థం.

## రామకృష్ణ సందర్శనం

అక్రూరుడు ఆ విధంగా చాలాసేపు ఆనందపారవశ్యంలో పొర్లిపొరలి ఆ మన్ను దోసిట ఎత్తి ఆపాదమస్తకం అద్దుకొని లేచి రామకృష్ణులుండే చోటు ఏదని దారినిపోయే వారినడిగి గోష్ఠమధ్యంలో వారున్నారని విని ఇంకా ప్రొద్దుండగానే రామకృష్ణులను సందర్శింపగోరి రథం ఎక్కి హుటాహుటిని వెళ్ళి గోదోహనస్థానం చేరుకొన్నాడు. అక్కడ నీల పీతాంబరాలు కట్టి శరత్కమలనేత్రాలతో పాండుర నీలశరీరాలతో శ్రీ విలాసపాత్రులై అలరారుతూ, పీవరాయత భుజాలు సుందరవదనాలు పెట్టని సొమ్ములై ఒప్పారగా, గజకలభవిక్రములై వనమాలాది మాల్యాలను ధరించి పుణ్యగంధా లద్దుకొని, ధ్వజ వజ్రాది రేఖాంచిత పాదకమలాలతో నడయాడుతున్న రామకృష్ణులను చూసి తటాలున రథం దిగి రజత మరకత పర్వతాల వలె శోభిల్లుతున్న ఆ ప్రధాన పురుషులను సమీపించి వారి అడుగుల మ్రోల సాగిలబడి తద్దర్శనజనితానందవిశేష రోమాంచితశరీరుడై సంతోషబాష్పాలు చిప్పిల్లగా డగ్గుత్తిక వలన తనను తాను పరిచయం చేసుకోవాలన్నా నోట మాటరాక నిలబడ్డాడు.

## కుశలానుయోగాలు

భక్తవత్సలుడైన భగవానుడు అక్రూరుని స్థితి గ్రహించి చక్రలాంఛిత మైన తన చేతితో అతనిని చేరదీసి కౌగిట చేర్చుకొన్నాడు. బలరాముడు కూడా అతనిని ఆలింగనపురస్సరంగా ఆదరించి అతని చేతిని తన చేతులలోనికి

తీసికొన్నాడు. అంతట రామకృష్ణులు ప్రీతిపూర్వకంగా అక్రూరుని ఇంటిలోనికి తీసికొనివెళ్ళారు. అక్కడ నందు డతనికి స్వాగతం పలికి ఉత్తమాసనం చూపి ఆదరంతో కూర్చుండబెట్టి విధిపూర్వకంగా పాదప్రక్షాళన కావించి గోపూర్వకమధుపర్కం సమర్పించి మార్గాయాసం తీరటానికి పాదాలొత్తి దప్పితీర్చి మృష్టాన్నసంతుష్టుని చేసి గంధమాల్యాదులతో సత్కరించి, 'దాశార్హవర్యా! తన ప్రాణరక్షణ కోసం చెల్లెలి బిడ్డలను చంపిన పాపాత్ముడికి బానిసలై కటికవాడి చెంతనున్న గొర్రెల వలె దినదినగండంగా బ్రతుకుతున్న మీ కుశలం ఏమని విచారించమంటారు?' అన్నాడు. అక్రూరుడు వారందరి సత్కృతులకు తనివిచెంది బడలికలువాసి పర్యంకాన సుఖాసీనుడై, 'నేను వస్తూ వస్తూ దారిపొడుగునా కోరుకొన్న కోరికలన్నీ నెరవేరాయి. భగవానుడు ప్రసన్నుడయితే పొందరాని కోరికలుంటాయా?' అని తలపోయసాగాడు.

రాజేంద్రా! నిజమైన భక్తులు భగవంతుడిని ఏమీ కోరుకొనరు. ఇది పరాభక్తి లక్షణం. భగవంతుడే అటువంటి భక్తులకు ఎప్పుడు ఏది అవసరమో నిశ్చయించి స్వయంగా అందజేస్తాడు.

## అక్రూర రామకృష్ణుల సంభాషణం

అంతలో రామకృష్ణులు రాత్రి భోజనాలు ముగించుకొని అక్రూరుని వద్దకు వచ్చారు. కృష్ణుడు అక్రూరుని చెంత కూర్చొని, 'తాతా! స్వాగతమే కదా. కంసుడు పంపితే వచ్చావు. అది సరే, సుహృజ్జనులు జ్ఞాతులు బాంధవులు అందరూ సుఖమే కదా. కంసుడు మాకు మేనమామే కాని నిజానికి మన కులానికి చీడపురుగులా దాపరించాడు. అతను బ్రతికి ఉండగా ప్రజలకు సుఖమన్న మాటెక్కడిది? అయ్యయ్యో! మా వలన మా తల్లిదండ్రులకు పుత్రమరణశోకం ఒక్కటేకాదు; చెప్పరాని కష్టాలు కలిగాయి. ఇంతకంటె శోచనీయం ఏముంటుంది? మా వాళ్ళందరినీ ఎప్పుడు చూద్దామా అని ఎప్పుడూ తహతహలాడుతుంటాము. సౌమ్యా! మీరు వచ్చిన పనేమిటి?' అన్నాడు.

అక్రూరుడు ఆ మాటవిని 'కృష్ణా! కంసునికి యాదవులతో గల వైరానుబంధం నీకు తెలియనిది కాదు. ఆ వైరాన్ని పురస్కరించుకొని అతను వసుదేవుని చంపదలచిన విషయమూ నీకు తెలిసినదే. ఇటీవల నారదమహర్షి అక్కడికి వచ్చాడు. అప్పుడు మీ ప్రస్తావన వచ్చింది. మీరు దేవకీవసుదేవుల పుత్రులన్నసంగతిని ఆ మహర్షి కంసునికి ఎరుకపరిచాడు. ఆ ఖలుడు మీయెడ ద్రోహం తలపెట్టి మధురకు మిమ్మల్ని వెంటబెట్టుకొని రమ్మని నన్ను పిలిచి ఆజ్ఞాపించాడు. కంసుని దూతనై ఇక్కడికి వచ్చాను' అని సమస్తం వివరించాడు.

## రామకృష్ణుల ప్రయాణం

రామకృష్ణులు ఆ మాటలకు చిరునవ్వు నవ్వి, 'నీవు కోరినట్లే మధురకు వస్తాము' అని సమ్మతించి రాజాజ్ఞను నందునికి తెలియజేశారు. అతను గోపాలకులను పిలిచి, 'తెల్లవారగానే మధురానగరానికి వెళ్ళాలి. రాజుకు కానుక లివ్వాలి. ఉపాయనార్థం గోక్షీరాదులను పంపిద్దాము. ప్రయాణానికి శకటాలను ఏర్పాటు చేయండి. అక్కడ ధనుర్యాగం జరుగుతుందట. దానిని చూడటానికి దేశవాసులందరూ వస్తారట. మనము కూడా ఆ వేడుకను చూసివద్దాము. మన ప్రయాణం సంగతి వ్రేపల్లె అంతటా చాటించండి' అని చెప్పాడు. వెంటనే చాటించారు.

## గోపికల విరహదుఃఖం

రామకృష్ణులు మధురకు బయలుదేరుతున్నారన్న మాట చెవిసోకగానే గోపికలకు గుండె ఆగినట్లయింది. వారి తనూలతలు క్షణంలో వాడి వత్తులైనాయి; ముఖపద్మాలు ముకుళించాయి; కొందరకు వస్త్రాలు జారాయి; కొందరకు కేశబంధాలు వీడాయి; కొందరు తమ తమ పనులు చాలించి బొమ్మలై నిలిచారు; కొందరు ముక్తుల వలె ఈ లోకాన్ని మరిచారు; కొందరు కృష్ణుని రాగాతిశయాలను, అతని హృదయంగమ వచనాలను తలచి తలచి మోహవశ లయ్యారు; కొందరు కృష్ణుని లోకమంగళకార్యాలను

చింతింపసాగారు. వియోగవ్యసనం వారి హృదయాంతరాలలో పొంగి పొరలి నేత్రగోళాల నుంచి అశ్రుధారలుగా వెలికి ప్రాకింది.

## గోపికల నిందాప్రలాపాలు

రాజేంద్రా! గోపికలు ఆ విధంగా విన్నబోయి, 'పరమేష్ఠీ! నీకు లేశమాత్రమయినా కరుణ లేదు. దేహులందరినీ మైత్రి కారణాన కొందరిని, ప్రణయకారణాన కొందరిని దగ్గరికి చేరుస్తావు. ఆ చేరినవారు ఒకరి నొకరు అర్థంచేసికొని నలుగురూ కలిసి మెలిసి భోగ్యభోగాలను యథాగతిని అనుభవింపకముందే తటాలున వారికి వియోగం కలిగిస్తావు. ఈ నీ చేతలన్నీ పిల్లవాని ఆటల వలె నిరర్థకాలు కదా. అసితకుంతలావృతమూ సుకపోలనాసికాసుందరమూ శోకాపనోదస్మితలేశమనోహరమూ అయిన ముకుంద వక్త్రబింబాన్ని చూపించావు. తన్మయులమై మేముండగా ఆ ముఖచంద్రబింబాన్ని మాకు అదృశ్యం చేయాలని సమకట్టావు. ఇది సాధుకార్యమేనా? చేతులారా ఇచ్చిన దానిని కాదని అపహరించడం కంటె దోషం వేరొకటున్నదా? ఆ దోషానికి ఒడిగట్టటం దేనికి? 'అక్రూరుడు రమ్మంటేనే వెళుతున్నాను; నేనయి వెళ్ళటం లేదుకదా?' అని సాకు చెబుతావేమో? అక్రూరుని నెపంతో నీవే ఈ పని చేస్తున్నావని మాకు తెలుసు. 'నేత్రదోషం వలన నన్ను అపార్థం చేసుకొంటున్నారు' అంటావా? అదీ నీ సృష్టి చమత్కారమే కదా. నీ తెరచాటు పనులు మాకు తెలియనివా?

కృష్ణా! నీ వయినా మా యెడ దయ చూపలేవా? అయ్యో! ఎంత మందమతులము! నీ సౌహృదం క్షణభంగురం. అది తెలియక మేము వెర్రివాళ్ళమై పతిపుత్త్రబాంధవగృహాదులను వదిలి నీకు ఊడిగపుకత్తెల మయ్యాము. నీవు నూత్నప్రియుడవు కాబట్టి జీర్ణవస్త్రాల వలె మమ్మల్ని త్యజింపబోతున్నావు.

మథురాపుర సుందరీమణులారా! మీ భాగ్యం ఏమనాలి? క్రీగంటి చూడ్కులతో లేనగవు దీప్తులతో సొంపారే కృష్ణముఖచంద్రబింబం వలన

రాత్రులన్నీ మీకు సుప్రభాతాలు కాబోతున్నాయి. మీ కోర్కెలన్నీ తీరబోతున్నాయి. 'కృష్ణుడు ఒకటి రెండు నాళ్ళు మాత్రమే కదా మా ఊరిలో ఉండేది' అంటారా? గోవిందుడు ధీరుడు కావచ్చును గాక; పిత్రాదిపరతంత్రుడే కావచ్చును గాక, నాగరిక విలాసినుల లజ్జాలలితవిభ్రమాలకు, మధురభాషితాలకు చిక్కి చొక్కినవాడికి మళ్ళీ మా వంటి గ్రామ్యులు స్మరణకన్నా వస్తారా?

పాంథులారా! శ్రీరమణుడు మథురకు పోయేటప్పుడు దారిలో అతనిని కన్నులారా చూచే భాగ్యానికి మీరు నోచుకొన్నారు. మీ కన్నుల కలిమి పండింది. మథురానగరవాసులారా! మీ పుణ్యమే పుణ్యం. ఏమయ్యా! అక్రూరా! కృష్ణుడు మాకు ప్రాణానికి ప్రాణం. మాకూ అతనికీ ఎడబాటు కలిగించాలని వచ్చావు. ఇంతకన్న క్రూరకార్యం ఉన్నదా? ఇంతటి క్రూరునికి నీకు అక్రూరుడని పేరెలా వచ్చిందయ్యా?

అయ్యయ్యో! బళ్ళు కట్టిస్తున్నారు. రథం సమాయత్త మవుతున్నది. కృష్ణుడు బయలుదేరబోతుంటాడు. అతనివెంట వృద్ధగోపకులు సన్నద్ధులవుతున్నారు. వీరి బుద్ధిని ముసలితనం మట్టుపెట్టింది కాబోలు. దైవమా! నీవుకూడా మాకు ప్రతికూలమైనావా? చెలులారా! ముకుందునికి సమర్పించుకొంటిమి. అతనిని బాసి రిక్తచిత్తలమై గుండెకోతతో బ్రతుకటం అసాధ్యం. మాధవుని అడ్డగిద్దాము. కులవృద్ధులు బాంధవులు మనపని సాగనీయరంటావా? సర్వం త్యజించినవాళ్ళము. తెగినవారికి అడ్డేమిటున్నది?

జగన్మోహకా! రాసక్రీడలలో మమ్మల్నందరినీ సుందరమందహాసాలతో, అపాంగవీక్షణాలతో గాఢాలింగనాలతో చొక్కించి సుఖింపజేశావు. రాత్రి గడుస్తున్నదని కూడా మేము గుర్తింపమైతిమి. ఇప్పుడు మమ్మల్ని త్యజింపబోతున్నావు. ఈ దురంత విరహదుఃఖాన్ని ఎలా సహింపమంటావు?

గోపికాప్రియా! నీవు సాయంవేళ గోపకుమారులతోను రామునితోను కలిసి గోవులవెంట వేణుగానం మధురమధురంగా ఆలపించుతూ

వస్తున్నప్పుడు నీకై వాకిళ్ళ నిలిచి ధూళి ధూసరిత కుంతలగ్రస్తమైన నీ ముఖారవిందాన్ని నిలువెల్లా కన్నులు చేసుకొని చూసి ఆనందసముద్రంలో ఓలలాడుతాము. ప్రభూ! నిన్ను విడిచి క్షణమైనా బ్రతుకలేము' అంటూ బహుకాలం పలవరించి వ్యసనవివశలై సిగ్గును కూడా విడిచి 'గోవిందా! దామోదరా! ముకుందా! అని యెలుగెత్తి భోరున విలపించారు. ఆ యేడుపుతో వారికి తెల్లవారింది.

## మథురానగరం

అక్రూరుడు సూర్యోదయానికి స్నానసంధ్యావందనాది కృత్యాలు నెరవేర్చి రథాన్ని ఆయత్త పరిచి తెచ్చి రామకృష్ణులను అందులో కూర్చుండబెట్టి సారథ్యం వహించాడు. నందాదిగోపకులు రాజుకు కానుక పెట్టటానికి వివిధ గోరసాలను సంగ్రహించి బండ్లకు నింపి కృష్ణుని రథం వెనుక బయలుదేరారు. గోపికలు గుమిగూడి కృష్ణుని రథం వద్దకు వచ్చి మాట్లాడటానికి కూడా శక్తిలేక బొమ్మల వలె నిలిచారు. కృష్ణుడు వారిని చూసి 'కళ్యాణులారా! త్వరగానే వస్తానుకదా' అని ఊరట పలికాడు. రథం కదిలింది. గోపికలు అక్కడే నిలబడి,

**చ. అదె చనుచున్నవాడు ప్రియుఁ డల్లదె తే రదె వైజయంతి య**
**ల్లదె రథఘోటకాంఘ్రిరజ మా దెస మార్గము జూడుఁడంచు లో**
**నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్**
**గదలక నిల్చి చూచిరటు కన్నుల కబ్బిన యంతదూరమున్.**

ఆ విధంగా గోపికలు శ్రీకృష్ణరథమార్గగతచిత్తలై కృష్ణుడు మళ్ళీ తిరిగిరాగలడన్న పేరాసతో బహుకాలం ఎదురుచూశారు. చూసి చూసి వారి కన్నులు వాచాయి. ఆశలను అడియాసలు చేసుకొని అందరూ ఇండ్లకు పోయి కృష్ణునియందే మనస్సులు నిలిపి వారి వారి రుచుల ప్రకారం భగవానుని చరిత్రల నిరంతర స్మరణతో, కీర్తనలతో వియోగవ్యసనాలను లోలోపలే అణుచుకొని కాలం గడపసాగారు.

## అక్రూరునికి భగవద్దర్శనం

రాజేంద్రా! కృష్ణుని రథం వాయువేగాన ప్రయాణించి యమునాతీరం చేరుకొన్నది. భగవానుడు రథం ఆపి రామునితోపాటు దిగి కాళిందీ నిర్మలమధురతోయాలను ఆచమించి జలాలను గ్రోలి చేరువనే ఉన్న వృక్షమూలాన కొంతసేపు కూర్చుండి రామునితో కలిసి మళ్ళీ రథం ఎక్కాడు. అక్రూరుడు వారు రథంలో కూర్చున్న తర్వాత వారి అనుమతి గైకొని స్నానార్థం నదివద్దకు వెళ్ళాడు.

రాజేంద్రా! అక్రూరుడు ఆ విధంగా నదీజలాలను సమీపించి వేదమంత్రాలు జపిస్తూ నీటిలో మునిగాడు. అక్కడతనికి రామకృష్ణులు కానవచ్చారు. అక్రూరుడు అదిచూసి, 'ఏమిటిది! రామకృష్ణులను రథంలో కూర్చుండబెట్టి కదా ఇక్కడికి వచ్చాను. ఇంతలో వారిక్కడికి ఎప్పుడు వచ్చారు?' అని ఆశ్చర్యపడుతూ నీటినుంచి లేచి రథంవంకకు చూశాడు. వారు రథంలో సుఖోపవిష్టులై ఉన్నారు. అతని ఆశ్చర్యం ఇనుమడించింది. అదంతా కళ్ళకు భ్రాంతి కాబోలునని అతను మళ్ళీ నీట మునిగాడు.

అక్రూరుడు నీటమునిగినంతనే, వేయితలలు వేయిపడగలు కలిగి బిసశ్వేతశృంగాలతో కైలాసగిరిని తలపిస్తున్న అనంతుడు, అతని ఉత్సంగాన కూర్చొని ఉన్న మేఘశ్యామమూర్తి అతనికి కనుపించారు.

ఆ దివ్యమూర్తి పీతాంబరం ధరించి చారు ప్రసన్నవదనంతో పద్మపత్రదీర్ఘనేత్రాలతో చతుర్భుజాలతో శోభాయమానభ్రూయుగంతో సమున్నత నాసికతో చారుకర్ణసుకపోలారుణాధరంతో వెలుగొందుతూ దరహాసనిరీక్షణాలను ప్రసరింపజేస్తున్నాడు. అతని విశాలవక్షోభాగాన కౌస్తుభం వనమాలిక శ్రీదేవి విరాజిల్లుతున్నారు. అతని ఉదరం రావిఆకును మరపిస్తూ వళిత్రయంతో సొంపారుతున్నది. ఆ దివ్యమంగళ విగ్రహునికి కంబుకంఠం నిమ్ననాభి బృహత్కటితట శ్రోణితలాలు కరభసదృశోరుద్వయం ఈషదున్నతగుల్ఫాలు కోమలాంగుళ్యంగుష్ఠదళారుణనఖాంచిత పాదపద్మాలు

పెట్టని భూషణాలై చెలువారుతున్నాయి. అతని కరకమలాలలో శంఖ చక్ర గదా పద్మాలు ఉల్లసిల్లుతున్నాయి. త్రైలోక్యవందితుడైన ఆ మహానుభావుని సునంద నందనాది పార్షదులు సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది మహాయోగులు బ్రహ్మాది గీర్వాణులు మరీచ్యాది ప్రజాపతులు ప్రహ్లాద నారదాది మహాభాగవతులు పరివేష్టించి ప్రస్తుతులు కావిస్తున్నారు. శ్రీ పుష్టి వాక్కు కీర్తి కాంతి తుష్టి ఇల ముక్తి సంస్కృతి హేతువులైన విద్యావిద్యలు మాయకు కారణమైన శక్తి ఆయనను చుట్టికొని సేవిస్తున్నారు.

ఆ దివ్యమూర్తిని చూచినంతనే అక్రూరునికి నిలువెల్లా గగుర్పొడిచింది. అతని ధైర్యం సన్నగిల్లింది. అతను మెలమెల్లగా నెమ్మది వహించి ఆ దివ్యమూర్తి భగవంతుడే అని నిశ్చయించి సాష్టాంగప్రణామం చేసి నిటలతటఘటిత హస్తయుగుడై గద్గదస్వరంతో ఈ విధంగా స్తుతించాడు.

## అక్రూర కృత భగవత్స్తుతి

'కృష్ణా! నీకు ప్రణామం. నీకంటె పెద్దవాడిని, మీదుమిక్కిలి నీకు మేనమామను అయిన నేను పిన్నవానికి నీకు నమస్కరించటం పాడికాదని శంకించవద్దు. ఆదిపూరుషుడవు; అనాదినిధనుడవు అయిన నీకు మ్రొక్కటం సర్వసమంజసం. ఆదిపూరుషుడని అనటానికి కారణమేమంటావా? పంచభూతాలు సర్వసృష్టికి హేతుభూతాలు. ఆ పంచభూతాలకు నీవు కారణాత్మకుడవు. నీకు వేరొక కారణం లేదు. కావున నీవు ఆదిపూరుషుడ వనదగి ఉన్నావు.

అఖిలకారణం నారాయణుడు గాని నేను కాదంటావా? నీవే ఆ నారాయణుడవు. నీ నాభికమలం నుంచి బ్రహ్మ ఉదయించాడు. ఆ బ్రహ్మవలన సమస్తసృష్టి కలిగింది. భూమ్యాది పంచభూతతన్మాత్రలు, అహంకారం, మహత్తత్వం, ప్రకృతి, పురుషుడు, మనస్సు, ఇంద్రియాలు, ఇంద్రియార్థాలు, దేవతలు జగత్కారణం అంటారు. ఇవన్నీ నీ అంశలే. కాబట్టి నీవే సమస్తకారణాలకు మూలకారణానివి.

దేవా! అవన్నీ జడములు, అనాత్మభూతాలు కాబట్టి నీ స్వరూపాన్ని ఎరుగవు. ఆత్మతుల్యుడు జీవుడున్నాడని, అతడయినా నీ స్వరూపాన్ని ఎరుగడా అని ప్రశ్నిస్తావేమో? జీవుడు అజుడు ఆత్మతుల్యుడు అన్నమాట నిజమే కాని అతను మాయాగుణబద్ధు డయినందువల్ల గుణాతీతుడవైన నీ స్వరూపాన్ని గ్రహింపలేడు.

దేవా! ఎవరు నిన్ను తెలిసికొంటే వారికి సంసారనివృత్తి అవుతుందని శాస్త్రం చెబుతున్నది. నిన్ను గ్రహింపగలవారెవ్వరూ కలుగరన్నాను. ఇక జీవులకు సంసారనివృత్తి ఎలాగంటావా? నిన్ను భజించేవారికి నీవు గమ్యుడవు గానే ఉంటావు. వారికి సంసార నివృత్తి సిద్ధిస్తుంది.

నీవు కంటికి గోచరింపవు; కంటికి గోచరింపనివానిని భజించటం ఎలాగంటావా? ఏదో ఒకరీతిని నిన్ను భజిస్తుంటారు. ఏ విధంగా భజిస్తున్నారంటావా? అధ్యాత్మాధిభూతాధిదైవసాక్షివై అంతర్యామివిగా ఉన్నావని హైరణ్యగర్భాదులు నిన్ను భజిస్తారు. ఇంద్రాది నానాదేవతారూపాలలో నీవున్నావని భావించి త్రయీవిద్యచే నానాయజ్ఞాలతో కర్మయోగులు భజిస్తారు. ఇంద్రాదులు పెక్కు మూర్తుల నిన్ను భజించేటప్పుడు నీ ప్రతి మూర్తియందు సర్వేశ్వరత్వాన్ని ఆరోపించి భజిస్తారు. ఏమంటావా? సర్వేశ్వరుడు ఒక్కడే గాని పెక్కుమంది ఉండరు.

దేవా! నీ భజనమందు మూర్తినామభేదమే గాని పరమార్థ తాత్పర్యభేదం ఉండదు. సాంఖ్యయోగులు నిఖిలకర్మలను నీ యందు సన్న్యసించి ఉపశములై జ్ఞానస్వరూపుని నిన్ను జ్ఞానయజ్ఞంతో ధ్యానిస్తారు. శైవ వైష్ణవులు తత్తన్మయత్వంతో దీక్షాపరులై తత్తదాగమోక్తప్రకారం చిన్మయులై నిన్నే ప్రధానమూర్తిగా చింతిస్తూ హరిహరాదిరూపా లన్నింటినీ నారాయణైక మూర్తికంగా భావించి యజిస్తారు.

దేవా! దేవతానీకం నామభేదాల వలన భక్తులు భిన్నమతులై నానాదేవతా భక్తులుగా కనిపించినప్పటికీ చిట్టచివరికి సర్వదేవతామయుని నిన్నే

పూజిస్తున్నారు. జనులు వివిధదేవతలను భజించేటపుడు వారి చిత్తాలు కూడా తత్తద్దేవతాత్మకములు కావటమూ, వారికి పరస్పర దేవతాధిక్షేప కలహవ్యాకులం సంభవించటమూ తప్పవు కాబట్టి అట్టివారి భజనమంతా 'ఏకము అద్వితీయము అయిన నీ భజనమెలా అవుతుంది?' అని అడగవచ్చును. బుద్ధిభేదమాత్రాననే వస్తుభేదం ఏర్పడదు. అన్ని మార్గాలూ ఎట్టకేలకు నీ యందే పర్యవసిస్తాయి. వర్షపు నీరు నానాపర్వతాల నుండి దొనలుగా కాల్వలుగా వాగులుగా నదులుగా నానారూపాలలో వివిధమార్గాలలో పెక్కు పేర్లతో ప్రవహించినా వాటిలోని నీరొక్కటే కాని వేరు కాదు. మరి అవన్నీ చిట్టచివరికి సముద్రాన్నే చేరుతున్నవి గదా. అలాగే భజనలు భిన్న భిన్న ప్రకారాలు, వివిధభావభావితాలు అయినప్పటికీ తుదికి అవన్నీ నిన్ను గూర్చినవే అయి నిన్ను చేరుతున్నాయి. ఇటువంటి భిన్నత్వానికి కారణం ఏమిటంటే, నీ శక్తే అందుకు కారణం. ఎందుకంటేనో? నీ శక్తిని ప్రకృతి అని పేర్కొంటారు. నీ ప్రకృతి అన్నదో? సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలతో పెనగొని ఉంటుంది. ఆ గుణాలు వాటి వాటి అదనువచ్చినప్పుడు వ్యవహరిస్తాయి. బ్రహ్మ మొదలు సైకతరేణుపర్యంతం సర్వోపాధులూ ఆ ప్రకృతి కార్యములై ఉన్నవి. జీవులు వారివారికి తోచిన ఉపాధులను జొచ్చినప్పుడు ఆయా ఉపాధియొక్క ప్రధానగుణం వారిని తత్తద్విధాన నడిపిస్తుంది.

దేవా! గుణభేదాలను బట్టి రుచిభేదాలు కలుగుతున్నాయి. ఈ రుచిభేదాలనే బుద్ధిభేదాలని అంటారు. ఉపాధులు క్రమక్రమంగా నశించి వాటికి మూలమైన ప్రకృతిని చేరుకొంటాయి. ప్రకృతి నీ శక్తే కాబట్టి ప్రకృతిని చేరినవారు నిన్ను చేరినవారే అవుతారు.

దేవా! నీ ప్రకృతి అన్నప్పుడు నీవు వేరని, నీ ప్రకృతి వేరని, ఆ విధంగా ప్రత్యేకపదార్థాలు రెండు కలవని, నీకుకూడా ప్రకృతిసంబంధం కలదని, ఆ పక్షాన నీకూ బ్రహ్మాదులకూ గల తారతమ్య మేమిటని శంకింపవచ్చును.

అయితే నీ బుద్ధి ఎందులోనూ లగ్నంకాదు; నీ దృష్టి అసక్తం. బ్రహ్మాదుల బుద్ధిదృష్టులు వస్తుసక్తాలు. ఇదే నీకూ జీవరాశికీ గల తారతమ్యం.

నీ బుద్ధ్యాదులు అసక్తములనటానికి కారణమేమిటో చెబుతున్నాను. నీవు సర్వాత్ముడవు. నీకంటె వేరైన వస్తువొకటి ఉండదు. వేరు వస్తువు ఉంటేగాని బుద్ధి దానియందు ప్రవేశింపదు. కనుక నీ బుద్ధి అసక్తమన్నాను. పైగా నీవు సర్వబుద్ధిసాక్షివిగా ఉన్నవాడవు. కనుక నీకు బుద్ధిలోపం కలుగనేరదు. దేవాదుల సంగతంటేనో వారు దేవమనుష్యాది దేహాభిమానులు. ఆ అభిమానకారణాన వారు అవిద్యాకృత సంసారమగ్ను లవుతారు. ఇదే నీకూ ఇతరజీవులకూ ఉన్న భేదం.

నీ సర్వాత్మకత్వం ఏమంటే – అగ్ని నీ ముఖం, భూమి నీ పాదం, సూర్యుడు నీ నేత్రం, నభస్సు నీ నాభి, దిక్కులు నీ శ్రవణాలు, దివస్సు నీ మూర్ధం, సురలు నీ భుజాలు, సముద్రాలు నీ కుక్షి, వాయువు నీ ప్రాణాలు, ఓషధులు వృక్షాలు నీ రోమాలు, మేఘాలు నీ కేశాలు, పర్వతాలు నీ అస్థినఖాలు, అహోరాత్రాలు నీ రెప్పపాటులు, ప్రజాపతి నీ మేఢ్రం, వర్షము నీ వీర్యం అవుతాయి.

ప్రపంచమంతా నీ అవయవభూతమైనప్పుడు ప్రపంచవికారాలు నీకు తగులవా? అని శంకిస్తుంటారు. ప్రపంచమన్నది నీ యందు కల్పితమే గాని స్వతంత్రం కాదు. అవ్యయాత్ముడవు పూర్ణుడవు అయి నీవు సర్వదా ఏకరాశివై ఉంటావు. నీటిలో ప్రాణిరాసులు ఏ విధమో మేడిపండులో పురుగులెలాగో అదే విధంగా మనఃప్రధానుడవైన నీ లోపల సమస్తజీవలోకప్రపూర్ణ బ్రహ్మాండాలు అసంఖ్యాకంగా చలిస్తుంటాయి.

దేవా! ఎన్ని విధాల పరిశీలించినా నీ స్వరూపం దురవగాహమే. వస్తువు బుద్ధికి గోచరించితే గాని అది ఇటువంటిదని గ్రహించటమూ చెప్పటమూ సాధ్యంకాదు. అది గోచరింపనినాడు దాని గుణ్యవ్యవహారాలను బట్టి తోచినట్లు చెబుతుంటారు. అలాగే నీవు బుద్ధికి గోచరింపవు. నీ

లీలావతారచర్యలను బట్టి నీ తత్త్వాన్ని ఊహించి నిన్ను సేవిస్తుంటారు. అంతేకాని నీ తత్త్వాన్ని సమగ్రంగా తెలిసికొని తదానందమగ్నులై నిన్ను సేవించేవారు అంటూ ఎవరుంటారు?

దేవా! నీ లీలావతారచర్యలు అనేకం. కారణమత్స్యరూపాన్ని ధరించి ప్రళయాబ్ధిని చరించావు. హయగ్రీవుడవై మధుకైటభులను సంహరించావు; కూర్మాకారం ధరించి మందరగిరిని మూపున వహించి క్షీరసాగరమథనకార్యాన్ని కొనసాగించావు; వరాహానివై భూమిని ఉద్ధరించి స్వస్థితిలో నిలిపావు; నరసింహమూర్తివై హిరణ్యకశిపుని హరించి సాధులోకభయాన్ని తొలగించావు; వామనుడవై మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించావు; పరశురాముడవై మదోన్మత్తక్షత్రియులను తునిమావు; రఘురాముడవై రావణాసురుని వధించావు; దుష్టశిక్షణ శిష్టరక్షణార్థం ఇప్పుడు యదుకులంలో వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధరూపాలతో అవతరించావు; దైత్యదానవులకు మోహాన్ని కలిగింపగోరి బుద్ధరూపంలో అవతరింపనున్నావు. మ్లేచ్ఛప్రాయులైన రాజులు ప్రబలి ధర్మాన్ని అణిచిపెట్టి అధర్మాన్ని పోషిస్తారు. అప్పుడు కల్కిరూపం దాల్చి ఆ దుష్టులను రూపుమాపి జగన్మంగళం కావిస్తావు. ఇట్టి దశావతారమూర్తికి నీకు సాష్టాంగం.

దేవా! లోకమంతా నీ మాయామోహితమై తత్త్వాన్నెరుగక 'నేను, నాది' అన్న అభిమానానికి చిక్కి అస్థిరపదార్థాలను పట్టుకొని ప్రాకులాడుతూ ఆ అశాశ్వత వస్తువుల ప్రాప్తి నిమిత్తమై కర్మమార్గాన్ని అవలంబించి పరిభ్రమిస్తున్నది. నేనుకూడా అదేవిధంగా స్వప్నతుల్యపదార్థాలైన దేహ పుత్ర కళత్ర బంధు విత్త గృహాదులను సత్యాలనుకొంటూ అదే లోకమనుకొంటూ తిరుగాడుతున్నాను. స్వామీ! దేహాదులన్నీ అనిత్యములన్న సంగతిని కన్నారా చూస్తూనే భార్యాదులు నిత్యమని నమ్మి వారి యోగక్షేమాలకై నిరంతరం పాటుపడుతుంటారు. ఇంతకంటె మౌఢ్యమేమున్నది? ఈ మౌఢ్యం వలన నిత్యసత్యుని ఆత్మప్రియుని నిన్ను గుర్తింపలేకపోయాను.

సంసారం దుఃఖమయమని తెలిసీ దానిని ప్రేమించటం ఎందుకు? అంటావా? నిర్మలజలపూరితమైన కాసారం కట్టెదుట కనిపిస్తున్నా దానిని కప్పి ఉన్న తృణాదుల మూలాన అందులో ఉన్న నీరు కనుపింపక నీటికోసం ఎండమావుల వెంటబడే వెర్రివానివలె, సర్వవ్యాపివై నీవు ఉన్నప్పటికీ నిన్ను గప్పిన మాయవలె దివాంధులమై యథార్థం గ్రహింపలేక నిన్ను విడిచి సంసార మరుమరీచికలలో పడి కొట్టుమిట్టులాడుతున్నాము.

దేవా! విషయములు అనిత్యములే గాక అనర్థదాయకములన్న సత్యం తెలిసినా వాటినే పట్టుకొని ప్రాకులాడటం ఎందుకని నవ్వుతావేమో? మనస్సు కామకర్మహతమై, ఈప్సితసిద్ధిసాధనాలైన ఇంద్రియాలను విషయాల వంకకు తరుముతున్నది. నేను స్వాతంత్ర్యహీనుడ నైతిని. ఆ కారణాన ఇంద్రియాలను నిరోధింపలేకపోతున్నాను. ఇదే కారణం.

స్వామీ! గత్యంతర మేమిటి? నీ పాదకమలమే గతి. వేరొకటి లేదు. ఇంద్రియవశుడై స్వాతంత్ర్యం కోల్పోయినవాడు నిన్ను శరణిల్లటానికి మాత్రం శక్తిమంతుడెలా కాగలుగుతాడు? ఈశ్వరా! ఆ శక్తికూడా నీ అనుగ్రహం వలననే కలగాలి. సత్పురుషసేవ వలన అటువంటి శక్తి కలుగుతుందని, నా అనుగ్రహం ఎందుకని అంటావా? ఎప్పుడు పురుషునికి సంసార మోక్షకాలాన్ని నీవు సంకల్పిస్తావో అప్పుడే అంతర్యామివైన నీవు మా బుద్ధిని సాధుసేవకు మళ్ళిస్తావు. అప్పుడు మేము సాధుసేవాపరులమై తన్మూలాన నీ పాదపద్మాలను ఆశ్రయిస్తాము. కాబట్టి అదీ నీ అనుగ్రహఫలమే అన్నమాట.

దేవా! నీ కృప కలుగనినాడు సాధుసేవాభాగ్యం కలుగదు. కాగా ఒక్క సాధుసేవాభాగ్యం కలిగినంత మాత్రాననే ఫలంలేదు. బుద్ధి నీ పరం కావాలి. అది నీ కృపవల్ల గాక వేరొక తీరున

కలుగదు. ఇవన్నీ కలిగినా ముక్తి అన్నది కేవలం నీ కృపావిశేషం మాత్రమే. కాబట్టి అన్ని శుభాలకూ నీ అనుగ్రహమే మూలం.

విజ్ఞానమూర్తీ! సమస్తజ్ఞానకారణా! సుఖదుఃఖప్రాపక కాలకర్మ స్వభావాధీశ్వరా! పరిపూర్ణా! ప్రకృతిపురుషకాలాత్మకా! చిత్తాధిష్ఠాత అయిన వాసుదేవుడనే పేరుతోను, సర్వభూతక్షయకారి అయిన అహంకారానికి అధిష్ఠాతగా సంకర్షణుడనే పేరుతోను, బుద్ధ్యాదులకు అధిష్ఠాత అయిన ప్రద్యుమ్నుడనే పేరుతోను, మనోధిష్ఠాత అయిన అనిరుద్ధుడనే పేరుతోను అలరారుతున్న సర్వప్రత్యయహేతువునకు నీకు నమస్కారం. ప్రపన్నుని నన్ను రక్షించు' అని సాగిలబడ్డాడు.

## అక్రూరుని సందేహం

రాజేంద్రా! అక్రూరుడు ఆ విధంగా జలాంతరమందు తనకు సాక్షాత్కరించిన భగవత్స్వరూపాన్ని ప్రస్తుతిస్తుండగా ఆ రూపం తటాలున మాయమయింది. అతను విస్మయచకితుడై నీటి బయటికి వచ్చి మాధ్యాహ్నికక్రియలు ముగించుకొని వడివడిగా వచ్చి రథం ఎక్కి సారథ్యం వహించాడు. భగవానుడతనిని చూసి, 'అయ్యా! నీ ముఖలక్షణాలలో మార్పు కనిపిస్తున్నది. కారణమేమిటి? ఏదైనా వింత నీ బుద్ధిని ఆకర్షించి నిన్నింతసేపు నిలిపిందా?' అని అడిగాడు. అక్రూరుడు ఆ మాటవిని 'పరమేశ్వరా! సర్వాద్భుతాలకు స్థానమైన నిన్ను కన్నారా చూస్తుండగా భూనభోజలాంతరాళాలలో కనుపించే చిత్రాలూ చిత్రాలేనా?' అని రథాన్ని కదిలించాడు.

## గ్రామవాసుల సత్కారం

రాజేంద్రా! రథం ఆ విధంగా మథురానగర మార్గం పట్టి వేగంగా ప్రయాణిస్తున్నది. కృష్ణుని రాక కర్ణాకర్ణిగా దారిలో ఉన్న గ్రామాలవారు విని అతని రాకకోసం వేచి ఉండి రథం వచ్చినంతనే గుంపులు గుంపులుగా చేరి

తమ ప్రేమాతిశయాలను వివిధరూపాలలో ప్రకటిస్తూ పరమానందాన్ని పొందారు. ప్రొద్దు పడమటికి వ్రాలింది. నందాదులు ముందుగా వెళ్ళి పురోపవనం చేరి రామకృష్ణుల కోసం ఎదురుచూడసాగారు. రథం మథురానగరోపవనానికి వచ్చింది.

## అక్రూరుని ప్రార్థన

రాజేంద్రా! కృష్ణుడంతట రథాన్ని ఆపించి అక్రూరుని చేయిపట్టుకొని చిరునవ్వు నవ్వుతూ, 'అయ్యా! మేము ఈనాటికి ఇక్కడ విడిదిచేసి ఊరిలోనికి రేపు వస్తాము. నీవు ముందు వెళ్ళు' అన్నాడు. గాందినీసుతుడు ఆ మాటవిని 'భక్తవత్సలా! మిమ్ము విడిచి నేను మథురాపురానికి పోలేను; నీ భక్తుని విడిచిపెట్టడం నీకూ తగదు సుమా. మీరిద్దరూ గోపాలకులతో వచ్చి మా యింటిలో అడుగుపెట్టి గృహమేధులమైన మమ్మల్నీ, మా గృహాలనూ నీ చరణరజంతో పవిత్రీకరించు. దేవదేవా! ఏ నీ పాదాలను ప్రక్షాళించిన నీటిబిందువులు పైసోకినంతనే పితృదేవతలు, అగ్నులు తృప్తిచెందుతారో, ఏ నీ పాదాలను కడిగిన ఫలంగా బలికి శాశ్వతపుణ్యకీర్తులు, మహేంద్రపదవీ మహైశ్వర్యం సమకూడటమే గాక పరమభక్తప్రాప్యమైన సుస్థానం సిద్ధించినదో, ఏ నీ పాదశౌచజలమయ అయినందువల్ల గంగానది శివుని తలకెక్కనోచినదో, సగరపుత్రులకు స్వర్లోకప్రాప్తిని ప్రసాదించినదో, అట్టి నీ పాదాలకు పదివేల ప్రణామాలు. నీ భక్తుని అనుగ్రహించు' అని ప్రార్థించాడు.

కృష్ణుడతని ప్రణయాన్ని విని, 'అయ్యా! ఇప్పుడు నేను నీ ఇంటికి రావటం తగదు. యాదవద్రోహి అయిన కంసుని రూపుమాపి సుహృజ్జనాన్ని సంతోషపెట్టి ఆర్యసమన్వితంగా నీకు అతిథినై నీ మనసుకు తృప్తిగూర్చుతాను. నీవు వెళ్ళటం మంచిది' అని బోధించాడు. అక్రూరుడు మారుమాటాడక కొంతసేపు వారిచెంతనే ఉండి ఎట్టకేలకు కృష్ణునివీడి మథురాపురానికి వెళ్ళి కంసునికి రామకృష్ణులు వచ్చిన వార్త తెలిపి తన యింటికి వెళ్ళాడు.

## మథురానగరం

మథురానగరం పరిఘావృతమై స్ఫటికరచిత సువర్ణకవాట తోరణాల తోను ధాన్యాగారహయశాలల తోను నిండి విరాజిల్లుతున్నది. నగరంలోని చతుష్పథాలు సువర్ణమయములై రాజ్యభాగ్యాన్ని ప్రకటిస్తుండగా, ధనవంతుల హర్మ్యాలు కనకరచితాలై ఆరామపరివృతాలై మిన్నంటుతుండగా, వలభీప్రదేశాలు వేదికలు వజ్ర వైడూర్య నీల విద్రుమ మౌక్తికమయములై సూర్యపరివేషకాంతులను ఈనుతుండగా, గవాక్షరంధ్రాలలో కుట్టిమాలలో పారావతమయూరాలు మంజులధ్వనులు కావిస్తుండగా, ఒక్కొక్క తెగవారికి ఒక్కొక్క సభామందిరం కలిగి ఆ నగరం మహాశోభాయమానంగా ఉన్నది.

ఆ పురవీథుల ఆ పణవీథుల చత్వరాలలో పన్నీరు చల్లి మాల్యాంకుర లాజతండులాలను అలంకరించారు. ద్వారదేశాలలో దధి చందన సిక్త పూర్ణకుంభాలను తీర్చి పండ్ల గెలలతో పుష్పమంజరులతో అరటి బోదెలను, పోకచెట్లను గుమ్మాలకు కట్టి పల్లవప్రసూన దీపావళి అమర్చిన ధ్వజపతాకలు నిలిపారు.

## రామకృష్ణుల పురప్రవేశం

అంతలో ప్రొద్దు చల్లబడింది. రామకృష్ణులు నగరాన్ని చూసేందుకు ఉత్సుకులై గోపాలమిత్రులతో తరలి

**మ. పరిఘల్ గోటలుఁ గొమ్మలుం బడగలుం బ్రాసాదముల్ వీథులున్**
**హరులుం దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్**
**తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్**
**గర మాశ్చర్యరుచిం దనర్చు మథురన్ గాంచెన్ విభుం డంతటన్.**

## పౌరకాంతల ఆప్యాయనం

రాజేంద్రా! రామకృష్ణులిద్దరూ నగరప్రవేశం చేసి ఆ వింతలన్నీ చూసుకొంటూ నడుస్తుంటే వారి సందర్శనార్థం ప్రజలు గుంపులు

గుంపులయ్యారు. వీథులలో రాకపోకలు ఆగిపోయాయి. పురస్త్రీలు వారి రాక సంగతి విని ఆలస్యమయితే వారు దూరమవుతారని ఒకరినొకరు పిలుచుకొంటూ తడబడుతూ సగంకట్టిన చీరెలతో కొందరు, ఒక కంటికి కాటుక పెట్టుకొని రెండవ కంటికి పెట్టుకొనక మునుపే కొందరు, తలంటుకొని ఇంకా నీళ్ళుపోసుకొనకుండానే కొందరు, వస్త్రాదులను సవరింపకనే కొందరు, పాలు త్రాగుతున్న బిడ్డలను క్రింద పడుకోబెట్టి కొందరు వడివడిగా మిద్దె లెక్కారు.

కృష్ణుడు రామునితో కలిసి గజేంద్రగమనుడై ఆ వీథులలో నడుస్తూ లీలాహసితేక్షణాలతో పురస్త్రీల చిత్తాలను ఆకర్షించాడు. ఆ స్త్రీలు వారి మందహాస సుధా లలిత విలోకనాలకు పాత్రలై–

**మ. చెలియా! గోపిక లీ కుమారతిలకుం జింతించుచుం బాడుచున్**
**గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షించుచున్ హస్తగా**
**మలకక్రీడకు దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందగా**
**దొలి జన్మంబుల నేమి నోచిరొ గదే దుర్గప్రదేశంబులన్.**

అని ఒండొరులతో చెప్పుకొంటూ మైమరపునొంది ఆ ఆనందమూర్తిని మానసాలలో ఆలింగన చేసికొని పులకాంకిత శరీరలై మనోవ్యథలు వీడి ప్రేమాతిరేకసముల్లసిత ముఖారవిందలై ప్రాసాదశిఖరాల నుంచి కృష్ణునిపై పుష్పవర్షం కురిపించారు. బ్రాహ్మణులు దధ్యక్షతగంధమాలాపూర్ణకుంభాలను కాన్కలుగా సమర్పించి పూజించారు.

## రజక వధ

రామకృష్ణులు ఆ విధంగా పురసౌభాగ్యాన్ని చూస్తూ పౌరుల మర్యాదలను అందుకొంటూ వీథిని పోతుండగా చాకళ్ళు ధౌతవస్త్రాల మూటలను మూపున వేసుకొని ఎదురువచ్చారు. కృష్ణుడు వారిలో ఒక రజకుని చూసి, 'చాకలీ! మాకు కట్టుకొనటానికి మంచి బట్టలివ్వు. నీకు మేలవుతుంది' అని

యాచించాడు. ఆ చాకలి కంసుని పరిచారకుడు. ఆ మాటకు వాడు మండిపడి, 'ఏమిటీ! కారడవులలో కొండలలో తిరిగే గొల్లలు ప్రతిదినం ఇటువంటి బట్టలే కాబోలు కట్టుకొనేది? ఇవి రాజుగారి వస్త్రాలు. రాజద్రవ్యాన్ని ఆశింపకూడదు. చాలు చాలు; తొలగిపొండి. బ్రతుకగోరినవారయితే ఈ కొరమాలిన కోరికలు మరిచిపొండి. ఈ మాట రాజభటులు వింటే మీకు చేటు మూడుతుంది' అని నోటికి వచ్చినట్లు మాట్లాడాడు.

భగవానుడు ఆ దుర్మదోక్తులను విని పిడికిలి బిగించి అతని తలపై ఒక్కటి వడ్డించాడు. వాడు తలపగిలి చచ్చాడు. అతని పాటు చూసి తక్కినవాళ్ళు మూపులనున్న బట్టల మూటలు చెల్లాచెదరుగా పారవేసి సందుగొందులు దూరి పారిపోయారు.

రామకృష్ణులు అప్పుడు ఆ మూటలలో తమకు నచ్చిన మేలివస్త్రాలను గైకొని ధరించి కొన్నింటిని గోపకుమారుల కిచ్చి మిగిలినవాటిని అక్కడే వదిలిపెట్టి ముందుకు కదిలారు.

## సాలెవాడి భక్తి

రామకృష్ణులు అక్కడినుంచి బయలుదేరి కొంతదూరం పోకముందే సాలెవాడొకడు చిత్రవిచిత్రాంబరాలను తీసికొనివచ్చి వారికి సమర్పించాడు. వారు ఆ వస్త్రాలను అందుకొని ధరించి పర్వసమయంలో అలంకరించిన గున్న యేనుగుల వలె వెలుగొందారు. భగవానుడు ఆ సాలెవాని భక్తిప్రేమలకు మెచ్చి ఇహలోకంలో విభవైశ్వర్యాలను, భగవత్ స్మృతిని, తరుగులేని ఇంద్రియపాటవాన్ని పరలోకంలో ఆత్మసారూప్యాన్ని అతనికి అనుగ్రహించాడు.

## మాలకరి సన్మానం

అంతట రామకృష్ణులు సుదాముడనే మాలాకారుని ఇంటికి వెళ్ళారు. అతను వారిని చూచినంతనే లేచి సాష్టాంగప్రణామం చేసి ఉత్తమాసనాలపై

కూర్చుండబెట్టి పాద్యం అర్ఘ్యం ఇచ్చి పూజించి సుగంధిగంధాలు పూసి పూదండలతో అలంకరించి తాంబూలం సమర్పించి వారివెంట వచ్చిన గోపకుమారకు లందరినీ ప్రీతిపూర్వకంగా యథార్హం సన్మానించి రామకృష్ణుల పాదాలచెంత కూర్చుండి, 'మీ రాకవల్ల నేడు నా జన్మ సార్థకమయింది. ఏడేడు తరాల మావారు సుపాలితులయ్యారు. నా పితృదేవతలకు అమితసంతోషం కలుగుతుంది. మీరు జగత్కారణభూతులు. లోకక్షేమోద్భవాల నిమిత్తం మీ మీ అంశలతో అవతరించారు. మీరు రజకుని చంపటమూ, సాలెవాడిని అనుగ్రహించటమూ చూసి మీకు విషమదృష్టి ఉన్నదని, అందువలన మీకు ఈశ్వరత్వం లేదని లోకం భావింపవచ్చును. అది కేవలం భ్రమే కాని వాస్తవం కాదు. మీరు జగదాత్ములు సుహృదులు సర్వభూతసమదృష్టులు అయినవారు. సమదృష్టికీ మిమ్ము భజించేవారిని మాత్రమే మీరు అనుగ్రహించటానికీ ఎంతమాత్రమూ సంబంధం లేదు. నేను మీకు భృత్యుడను. నన్ను తగిన పనికి నియోగింపగలరని వేడుకొంటున్నాను. మీ ఆజ్ఞను తలదాల్చటం కంటె పురుషులకు వేరే పరమార్థం ఏమున్నది?' అని విన్నవించాడు.

భగవానుడు అతని భక్తిభావానికి, మాలాకరణంలో అతనికి గల నేర్పుకు మెచ్చి, 'సుదామా! నీ ఇష్టం వచ్చిన వరం అడుగు' అన్నాడు. సుదాము డందుకు పరమానందభరితుడై –

**క. నీ పాదకమల సేవయు**
**నీ పాదార్చకుల తోడి నెయ్యము నితాం**
**తాపార భూతదయయును**
**దాపసమందార! నాకు దయసేయగదే.**

'స్వామీ! ఇదే నాకు పదివేలు' అన్నాడు. భగవానుడు అతని సద్భక్తికి సంతోషించి 'సుదామా! నీవు కోరిన వరాలిచ్చాను. వంశవృద్ధిని కలిగించే సిరిసంపదలు ఆయువు యశోబలకాంతులు నీకు కలుగుతాయి. సుఖంగా జీవించు' అని పలికి అక్కడినుంచి ముందుకు సాగాడు.

## కుబ్జకు సౌందర్యదానం

రాజేంద్రా! భగవానుడు మనస్సులో సుదాముని భక్తిభావాన్ని స్మరిస్తూ పురవీథిని సాగుతుండగా మార్గంలో ఒక గూనిపడుచు సుగంధద్రవ్యపాత్రలను మోస్తూ ఎదురువచ్చింది. కృష్ణుడామెను చూసి, 'ఓ సుందరీమణీ! నీ వెవ్వతెవు? ఈ గంధాలు ఎవరికోసం? మాకు కొంచెం ఇస్తావా? నీకు మేలవుతుంది' అని పలకరించాడు.

ఆ మాటలు విని ఆ కుబ్జ 'సుందరాకారా! చక్కదనం అందరికీ సమకూడే భాగ్యం కాదు. నేను దాసిని; నాకు మెడ ఱొమ్ము నడుము మూడూ వక్రంగా ఉండటం వల్ల నన్ను 'త్రివక్ర' అంటారు. కంసరాజుకు అనులేపనాదులు కూర్చటం నా పని. మా రాజుకు ఇవి ఎంతో ప్రియమైనవి. మీ వంటివారు తప్ప తక్కినవారు వీటికి తగరు' అంటూ వారికి మైపూత ద్రవ్యాలను ఇచ్చింది.

## శ్రీకృష్ణునియెడ మోహం

రాజేంద్రా! రామకృష్ణులు సితాసిత శరీరులు. ఆ అనులేపాలను వారు పూసికొన్నంతనే సితాసితులు అసితసితుల వలె కాన్పించారు. కృష్ణుడప్పుడు ఆమెయెడ కరుణవహించి ఆమె పాదాలమీద తన పాదాలు నిలిపి ఆమె గడ్డంక్రింద చేతినుంచి రెండు వేళ్ళ యెత్తుకు ఆమె శరీరాన్ని పైకెత్తాడు. ఆ దాసియొక్క కటివక్షఃకంఠస్థలాలు మూడింటి కుంటు అప్పటికప్పుడే తొలగిపోయింది. ఆమె అమితసౌందర్యవతియై కృష్ణుని ఉత్తరీయాన్ని ఒడిసి పట్టి, 'పురుషాగ్రణీ! మా యింటికి దయచేయి. నిన్ను చూసినంతనే నా మనస్సు నీయందు లగ్నమయింది. నీకే అంకితమయ్యాను; నన్ను అనుగ్రహించు. నిన్ను విడువలేను' అంటూ ప్రార్థించింది.

కృష్ణుడు ఆమె ప్రణయాలు విని బలరామ గోపకుల వైపు చూసి నవ్వుతూ 'తరుణీమణీ! నేను వేరొకపని కావలసి ఇక్కడికి వచ్చాను. ఆ పని ముందు నెరవేర్చి పురుషులకు పట్టి ఉన్న మనోవ్యాధులను పోగొట్టి ఆ తర్వాత నీ కోరిక

ప్రకారం మీ ఇంటికి వస్తాను. భార్యలేని బాటసారులకు నీవు పరమాశ్రయవు కదా. ప్రస్తుతం నీ పని పూర్తిచేసుకో' అని చెప్పి ఆమెను పంపివేసి మళ్ళీ బయలుదేరాడు.

## పౌరవణిజుల గౌరవాలు

ఆ విధంగా వారు అంగడి వీథిని చేరుకొనగానే వణిగ్వరులు చందన మాల్య తాంబూలాదులను వివిధవిధాల కాన్కలతో తెచ్చి వారికి సమర్పించారు. రామకృష్ణులు వారి మర్యాదలను అంగీకరిస్తూ మెల్లమెల్లగా అడుగులు వేస్తున్నారు.

## ధనుర్భంగం

రాజేంద్రా! కృష్ణుడావిధంగా దారితీస్తూ కంసుని ధనుశ్శాల ఎక్కడున్నదని పౌరులను అడిగాడు. వారు ధనుశ్శాలాప్రదేశానికి దారిచెప్పారు. కృష్ణుడు ఆ శాలకు వెళ్ళాడు. అక్కడొక పెద్ద విల్లు మహేంద్రచాపం వంటిది కాన్పించింది. దానిచుట్టూ పెక్కుమంది కావలివారు నిలబడి ఉన్నారు. కృష్ణుడు ఆ చాపం దగ్గరకు వెళ్ళాలని ప్రయత్నించాడు. వద్దు వద్దంటూ రక్షకులు అతనిని అడ్డగించారు. కృష్ణుడు వారిని లెక్కచేయక ఆ కోదండాన్ని సమీపించి దానిని చేతబట్టి నువ్వెత్తుగా ఎత్తి మదవేదండం ఇక్షుదండాన్ని విరిచినట్లు అలవోకగా నడిమికి విరిచి పారవేశాడు. ఆ కోదండం విరిగిన మహాధ్వని భూనభోంతరాళాలు నిండి ప్రతిధ్వనులీనింది. ఆ ధ్వనికి కంసుడు అదిరిపడి సంగతేమిటా? అని విచారింపసాగాడు.

అంతలో చాపరక్షకులు ఖడ్గపాణులై పట్టండి! కొట్టండి! అని కేకలువేస్తూ గగ్గోలుపెడుతూ రామకృష్ణుల చుట్టూ మూగారు. వసుదేవనందనులు ఆ వింటి తునకలను చెరొకటీ చేతబట్టి పైబడిన రక్షకులను నుగ్గునూచం చేశారు. అంతలో సంగతంతా విని కంసుడు మరికొంత మంది రక్షసులను పంపాడు. రామకృష్ణులు వారిని కూడా చితకగొట్టి ఆ శాలనుంచి బయటికి వచ్చి

యథాప్రకారం నగరసౌభాగ్యాన్ని తిలకిస్తూ సాయంకాలం వరకు తిరుగుతూనే ఉన్నారు.

**మ. గగనారణ్యచరాంధకారగజముం గాలాహ్వయవ్యాధుఁ డ**
**చ్చుగఁ బట్టం గమకించి మచ్చిడుటకై చూతాంకురశ్రేణిచే**
**నొగిఁ గల్పించిన కందుకం బనగ సూర్యుం దంత వీక్షింపగాఁ**
**దగె మందప్రభ తోడఁ బశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్.**

**క. తరుణుఁ డగు శీతకరునిన్**
**మరగి వియల్లక్ష్మి దన్నుమాని ముదుకఁడున్**
**ఖరకరుఁడు ననుచుఁ ద్రొబ్బిన**
**కరణిన్ రవి పశ్చిమాద్రి కడఁ గ్రుంకె నృపా!**

**ఆ. కళలు గలుగుఁ గాక కమలతోడగుఁ గాక**
**శివుని మౌళిమీదఁ జేరుఁ గాక**
**అన్యు నొల్లఁ దపనుఁ డైన మత్పతి యని**
**సాధ్వి భంగిఁ గమలజాతి మొగిడె.**

రాజేంద్రా! ఆ విధంగా సూర్యుడు అస్తమింపగానే రామకృష్ణులు గోపాలకులతో కలిసి వారి విడిదికి వెళ్ళి పాదప్రక్షాళనాదులు కావించి సేదతీరారు.

**సీ. ప్రాచీదిశాంగనాఫాలతలంబునఁ**
**దీపించు సిందూరతిలక మనఁగ**
**దర్పించి విరహుల ధైర్యవల్లులు ద్రెంప**
**దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ**
**నలిగి కాలకిలారుఁ డంధకారమృగంబు**
**ఖండింప మెఱయించు ఖడ్గ మనగఁ**

**గగనతమాలవృక్షము తూర్పుకొమ్మను**
**లలితమై మెఱయు పల్లవ మనంగఁ**

**ఆ. దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ**
**గడలి మిన్నుముట్టి కడలుకొనఁగఁ**
**బొడిచె శీతకరుఁడు భూరిచకోరక**
**ప్రీతికరుఁడు జారభీతికరుఁడు.**

ఆ ప్రకారం చంద్రోదయమైన కొంతసేపటికి రామకృష్ణులు క్షీరాన్నం ఆరగించి ఆ రాత్రి సుఖంగా గడిపారు.

## కంసుని జాగరణ స్వప్న దురవస్థలు

రామకృష్ణులు ఆనాడు కావించిన పనులన్నీ చారుల ద్వారా విని కంసుడు భయాశ్చర్యాలకు లోనవుతూనే ఏదో విధాన పగలంతా గడిపి, బ్రతుకుజీవుడా అని యథాప్రకారం రాత్రి పడక గదికి పోయి పడుకొన్నాడు. ఎంత ప్రయత్నించినా అతనికి నిద్రపట్టలేదు. ధనుర్భంగ శాలా రక్షకనాశనాదులు అతని తలపులను కలచివేయసాగాయి. అతను లేచి గదిలో అటూ యిటూ తిరుగుతుంటే అపశకునాలు గోచరించాయి.

**సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి**
**ప్రాణఘోషము వినబడక డిందెఁ**

**దోయాదికములందుఁ దొంగిచూచినయంతఁ**
**దల గానరాదయ్యె దనువు మీదఁ**

**గరశాఖనాసికాగ్రంబులై నిడిచూడ**
**గ్రహతారకలు రెండుగా నగపడె**

**వెలుఁగున నిలుచుండి వీక్షింపగా మేని**
**నీడ సరంధ్రమై నేలఁ దోఁచె**

**ఆ. అడుగుజాడ దృష్టమగుట లేదయ్యెను**
**దరువు లెల్ల హేమతరువు లగుచు**
**మెఱయుచుండెఁ గాలమృత్యువు దగ్గఱ**
**బుద్ధియెల్ల గలఁగె భోజపతికి.**

రాజేంద్రా! ఇవన్నీ జాగరణదశలో కానవచ్చే ఆసన్న మృత్యుసూచనలు. అతను ఏదో ఒక తీరున కాస్త కనుమూసినంతనే ప్రేతాలు తనను కౌగిలించినట్లు, తాను గాడిదె నెక్కినట్లు, విషం తిన్నట్లు, జపాకుసుమమాలను ధరించినట్లు, తైలాభ్యంగస్నానం చేసినట్లు, దిగంబరుడై ఉన్నట్లు కనిపించింది. ఇవి స్వాప్నిక దుర్నిమిత్తాలు. కంసు డిటువంటి దుర్నిమిత్తాలకు పాలై నిద్రకు పగవాడైనట్లు పగటి కోసం ఎదురుచూస్తూ రాత్రంతా వివిధోత్పాతాలతో మనసు మనసులో లేకుండా కాలం గడిపాడు.

రాజేంద్రా! రామకృష్ణులు ఆ రేయి హాయిగా గడిపి వేకువనే లేచి శౌచాదులు నెరవేర్చారు.

**సీ. పౌలోమి దనబాలు పాన్పుపైఁ గనుపట్టఁ**
**బన్నిన పవడంపు బంతి యనఁగ**
**నాయురర్థముల వ్యయంబు లొత్తిలి చాటు**
**కాలజాంఘికు చేతి ఘంట యనఁగ**
**ఘనజంతు జీవితకాలరాసుల విధి**
**కొలువ నెత్తిన హేమకుంభ మనఁగ**
**బశ్చిమదిక్కాంత పరగఁ గైసేయుచో**
**ముందట నిడుకొన్న ముకుర మనఁగ**

**గీ. గోకతాపోపశమ దివ్యఘుటిక యనఁగఁ**
**బద్మినీకాంత నోముల ఫలమనంగ**
**మూడు మూర్తుల సారంపు ముద్ద యనఁగ**
**మిహిరమండల ముదయాద్రి మీఁద నొప్పె.**

## మల్లరంగం

సూర్యోదయవేళ భేరీనిర్ఘోషాలు, మల్లధ్వనులు వినబడ్డాయి. రామకృష్ణులు బయలుదేరి ధనుర్యాగం జరుగుతున్న రంగస్థలద్వారానికి వచ్చారు.

**సీ. పాషాణ వల్మీక పంకాదిరహితంబు**
**మృదులకాంచన నిభ మృన్మయంబు**
**గమనీయ కస్తూరికాజలసిక్తంబు**
**బద్ధ చందనదారు పరివృతంబు**
**మహనీయకుసుమదామ ధ్వజతోరణ**
**మండితోన్నత మంచమధ్యమంబు**
**బ్రాహ్మణ క్షత్త్రాది పౌరకోలాహలం**
**బశ్రాంత తూర్యత్రయాంచితంబు**

**ఆ. నిర్మలంబు సమముఁ నిష్కంటకంబునై**
**పుణ్యపురుష మనముఁ బోలి కంస**
**సైన్య తుంగ మగుచు సంతుష్టలోకాంత**
**రంగమైన మల్లరంగ మొప్పె.**

ఆ చోట కంసుడు మంత్రులతో గూడి ఉన్నతాసనం మీద కూర్చొని ఉన్నాడు. అతని చుట్టూ సామంతరాజులు కూర్చొని ప్రస్తుతులు పలుకుతున్నారు. నందాది గోపకులు రాజుకు కానుక లర్పించి రాజానుమతులై వారివారికి తగిన పీఠాలను అలంకరించారు.

## రామకృష్ణుల ప్రవేశం

రామకృష్ణులు ద్వారం వద్ద అడుగిడినంతనే మావటీడు వారిని చూసి కువలయాపీడ గజానికి సైగచేశాడు. ఆ మత్తదంతావళం తొండం ఆడిస్తూ

దారికి అడ్డు నిలిచి మునుగాళ్ళతో ఉరకబోయింది. కృష్ణుడు సంగతి గ్రహించి మొలకట్టు బిగించి మోముపై వ్రాలిన ముంగురులు సవరించుకొని మావటీని వంక చూపు సారించి 'ఓరీ! దారికి నీ ఏనుగు అడ్డుగా ఉన్నది. ప్రక్కకు నడిపించు. కాదంటావా, నిన్నూ నీ గజాన్నీ యమపురికి పంపుతాను' అన్నాడు.

## కువలయాపీడ వధ

మావటీవాడు ఆ మాటకు కినిసి ఏనుగును కృష్ణుని మీదికి పురికొల్పాడు. అది హుటాహుటిని దూసుకొని వచ్చి తొండంతో కృష్ణుని లంకించుకొన్నది. కృష్ణుడు దాని పట్టును తప్పించుకొని ఒక్క తన్నుదన్ని దాని కాళ్ళ క్రిందికి దూరాడు. ఆ దంతావళం కృష్ణుని కానక అటూ ఇటూ చూసి వాసనను బట్టి తన కాళ్ళ సందున ఉన్న ఆ యదువీరుని తొండంతో పట్టుకొనబోయింది. కృష్ణుడు తటాలున దాని వెనుకకు పోయి దాని తోకపట్టి గట్టిగా లాగాడు. ఆ లాగిన ఊపుకు అంతటి ఏనుగూ ఇరవై అయిదు విండ్ల దూరం వెనక్కిపడి సముదాయించుకొని డాపలికి తిరిగి కృష్ణుని మళ్ళీ పట్టుకొనబోయింది. నందనందనుడు వలపలి ప్రక్కకు తప్పుకొన్నాడు. అది వలపలించినప్పుడు కృష్ణుడు డాపలించాడు. అది డాపలించితే కృష్ణుడు వలపలించాడు. అలా కొంతసేపు గోపబాలకుడు ఆ గజాన్ని గోవత్సాన్ని ఆడించినట్లు ఆడించి కుప్పించి యెగసి దాని కుంభప్రదేశాన్ని ముష్టిఘాతంతో అణగగొట్టాడు.

ఆ దెబ్బకు శుండాలం కోపోద్దీపితమై కాలజిమ్మింది. కృష్ణుడు నేలకు వాలి ఆ తాకు తప్పించుకొన్నాడు. కృష్ణుడలా నేలకు వాలినది చూసి ఆ యేనుగు తన వ్రేటుకే నేలగూలాడని భావించి దంతాలతో అతని రొమ్మును గుచ్చబోయింది. కృష్ణుడు దాని గురికి దూరంగా జరిగాడు. ఏనుగు దంతాలు నేలలో దిగబడ్డాయి. తన విక్రమమంతా వృథపోతున్నదని ఆ కరీంద్రానికి కోపం రెట్టింపయి మండిపడసాగింది. అందుకు తోడుగా మావటీడు దానిని మరీ మరీ పురికొల్పసాగాడు. ఆ మహాగజం దురాగ్రహదుర్నిరీక్షణమై కృష్ణుని

తాకింది. ఆ మహామహుడు దానిని తొండంతో పట్టిలాగి నేలకు త్రోసి సింహవిక్రమంతో పైకి కుప్పించి దంతాలు పెరికి తల చీల్చి మావంతులను కూల్చి నేలకు దుమికి,

**మ. కరిదంతంబులు మూపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోములన్**
**నెరయం గోపకు లంత నంత మలయన్ నిత్యావహస్థేము లా**
**హరిరాముల్ చనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా**
**మర మర్త్యాది జనాంతరంగము లస న్మల్లావనీరంగమున్.**

## జనుల ప్రశంసలు

రాజేంద్రా! కంసుడు కువలయాపీడ సంహారం విని తహతహ లాడసాగాడు. అంతలో రామకృష్ణులు అతని కంటబడ్డారు. కంసుడు మహాధీరుడయినా వారిని చూసి మహోద్వేగాన్ని పొందాడు. మంచెలపైని కూర్చున్న రాజులు, నాగర జానపదులు విచిత్రవేషభూషణ మాల్యాంబరధరులై నటుల వలె ఉన్న ఆ మహాభుజులను వారి అందమైన రూపాల వల్ల సమాకర్షితచిత్తులై నిలువెల్లా కన్నులు చేసికొని చూసి, 'ఓహో! వీరు సాక్షాత్తూ నారాయణాంశతో వసుదేవుని ఇంట అవతరించారని విన్నాము. వీరి ఆకృతులే ఆ మాటను రూఢిపరుస్తున్నాయి. దేవకి గర్భవాసాన జనించి, నందవ్రజానికి కొనిపోబడి, అక్కడ రహస్యంగా పెరుగుతూ పూతనను పోకార్చి తృణావర్తుని త్రుంచి మద్దిచెట్లను కూల్చి ధేనుకాసురుని తెగటార్చి కేశిని నాశనం చేసి శంఖచూడుని చంపి గోగోపకులను దవాగ్ని నుంచి తప్పించి కాళియుని గర్వం అణిచి గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా పైకెత్తి ఏడుదినాలు గోకులాన్ని కాపాడి ఇంద్రుని అహంకారం తొలగించి అపూర్వమైన కీర్తిగాంచిన బాలకుడు ఎటువంటివాడో చూడాలని ఉవ్విళ్ళూరుతుంటిమి. మన కన్నుల కలిమి నేడు పండింది. ఇతని సందర్శనభాగ్యం నిత్యం లభించటం వలన గోపికలు నిత్యానందభరిత లవుతారంటే వింతేమున్నది! ఈ మహాత్ముని ఆశ్రయించి సురక్షితమైన

యదువంశం శ్రీలకు నెలవై కీర్తిమహత్త్వాలను చూరగొని జగన్నుతిపాత్ర మైనదంటే చిత్ర మేమున్నది? కృష్ణుని అగ్రజుడు ప్రలంబ వత్స ధేనుకాదులను చంపినవాడని వింటాము. కృష్ణుని ప్రక్కనున్న ఇతనే అతను కాబోలు' అని లోలోపలే అనుకొనసాగారు.

## చాణూర ముష్టికుల ప్రవేశం

రాజేంద్రా! అంతలో తూర్యరవాలు వినిపించాయి. చాణూరుడు ముందుకు వచ్చి

**మ. వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్**
**బెనఁగన్ మిక్కిలి నేర్చినారనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా**
**మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీర బనిచెన్ మల్లావహక్రీడకుం**
**జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపగాన్."**

ఓయీ! రాజు సర్వభూతమయుడు. రాజు ప్రీతుడయితే భూతలమంతా మనకు ప్రసన్నం అవుతుంది. రాజుకు మనోవాక్కాయకర్మల ప్రియాన్ని కలిగించేవారు మేలొందుతారు. తక్కినవారు కీడొందుతారు. ఇది లోక విదితం.

**మ. జవసత్త్వంబులు మేలె? సాముగలదే? సత్రాణమే మేను? భూ**
**ప్రవరుం బోనన మి మ్మనంగవలెనే? పాళీ లభీష్టంబులే?**
**పవివో కాక కృతాంతదండకమవో ఫాలాక్షనేత్రాగ్నివో**
**నవనీతంబుల ముద్ద గాదు మెసఁగన్ నా ముష్టి గోపార్భకా!**

అని పలికాడు.

కృష్ణుడతని ప్రగల్భాలు విని, 'అయ్యా! వనాలన్నీ నీ భోజేశ్వరుని ఏలుబడిలో ఉన్నవి. ఆ వనాలలో తిరుగుతున్నవాళ్ళము కాబట్టి మేము కూడా అతని యేలుబడిలోని వాళ్ళమే అవుతాము. రాజుకు ప్రీతి కలిగించాలన్నది మాకూ విధివిధానమే. రాజుకు ప్రీతి కలిగించటం కంటె మాకు మాత్రం ఏమి

కావాలి? మల్లయుద్ధానికి రమ్మన్నావు. అది మాకు సమ్మతమే. అయితే కయ్యానికీ వియ్యానికీ సమత్వం కావాలని అంటారు. మేమా? బాలకులము. మా యీడు కానివారితో పోరాడటం తగునా? అందుకు ఈ సభలోనివారు అంగీకరిస్తారా?' అని ప్రశ్నించాడు.

చాణూరుడు ఆ మాటలు విని, 'అయ్యా! వేయి ఏనుగుల బలం కలిగిన కువలయాపీడాన్ని అవలీలగా కూల్చినవాడవు. నీవు బాలుడవో కాదో ఈ నీ కార్యమే చాటుతున్నది. అందువల్ల మీరు బలవంతులతో పోరాడగలవారే. ఇందులో అధర్మం ఏమీలేదు. మనమిద్దరమూ ఒక జంట; రాముడు ముష్టికునితో చేయి కలుపుతాడు' అన్నాడు. కృష్ణుడు ఆ మాటవిని, 'నేను అనుకొన్నట్లే ఇతను మాట్లాడుతున్నాడు' అని లోలోపల సంతసించి, చాణూరుని ఢీకొన్నాడు. బలరాముడు ముష్టికుని ఎదుర్కొన్నాడు.

## మల్లయుద్ధం

రాజేంద్రా! చాణూరకృష్ణులు జబ్బలు చరిచి తొడలు కొట్టి కదిసి కొంతసేపు గోదా నడుమ కలయదిరిగి ఒకరినొకరు మోచేతులతో మోచేతులను, మోకాళ్ళతో మోకాళ్ళను, తలతో తలను, రొమ్ముతో రొమ్మును పొడుచుకొంటూ రంగమంతా చిందులు తొక్కారు. చాణూరుడు కృష్ణుని పట్టి కిందికి తోశాడు. కృష్ణుడు లేచి చాణూరుని తోశాడు. అతను మళ్ళీ లేచి కృష్ణుని మెడను పట్టుకొనబోయాడు. కృష్ణు డా ఒడుపు తప్పించుకొన్నాడు.

## సభలోని స్త్రీల పరితాపం

ఆ విధంగా వాళ్ళు చాలాసేపు పోరాడుతుంటే స్త్రీలు చూసి, 'అయ్యో! ఈ సభలో ధర్మం విపరీతమయింది కాబోలు. ఇటువంటి అధర్మస్థానంలో ఒక్క క్షణం నిలిచినా అది దోషమే. సభాదోషం తెలియవచ్చినప్పుడు ప్రాజ్ఞుడు ఆ సభవంకకయినా వెళ్ళకూడదని, సభకు పోవటమే జరిగితే యథార్థం చెప్పాలే గాని తారుమారు మాటలు మాట్లాడకూడదని, ఒకవేళ మాట్లాడితే అది

మహాపాపమని అన్నారు. అయ్యయ్యో! కృష్ణుని ముఖం ఎలా ఉన్నదో చూడండి. స్వేదసిక్తమై జలబిందువుల తోడి సరోజం వలె ఉన్నది. బలరాముని ముఖం ఇప్పుడు రక్తం నిండి ముష్టికునిపై నిప్పులు కురిపిస్తున్న కన్నులతో హాససంరంభమై ఎలా ఉన్నదో చూడండి.

**ఉ. మంచికొమారులం గుసుమ మంజుశరీరులఁ దెచ్చి చెల్లరే**
**యంచిత వజ్రసారులు మహాద్రికఠోరులు నైన మల్లురం**
**గ్రించుల బెట్టి రాజు పెనగించుచుఁ జూచుచు నున్నవాఁడు వే**
**లించుక లేదు మాను మనఁ డిట్టి దురాత్ముని మున్ను వింటిమే?**

అని తలకొకరీతిగా పలుకుతూ పరితపింపసాగారు.

## చాణూర ముష్టికుల వధ

అంతలో కృష్ణుడు పిడుగుపాటు వంటి వ్రేటుతో చాణూరుని నుగ్గునూచం చేసి నొప్పించాడు. చాణూరుడు డేగ వలె ఎగిరి రెండు చేతులూ కూర్చి నందనందనుని ఱొమ్ముమీద మోదాడు. పూదండ వచ్చి మత్తేభాన్ని తాకినట్లు చాణూరుని వేటు కృష్ణునికి తోచింది. అతనప్పుడు చాణూరుని బాహువులను పట్టి గిరగిర తిప్పి నేలమోదాడు. ఆ వేటుకు చాణూరుడు మహేంద్ర ధ్వజం వలె కూలి ప్రాణాలు విడిచాడు. బలరాముడు ముష్టికుని అరచేతబట్టి బలంగా అదిమివేశాడు. అతను పెనుగాలికి మహావృక్షం విరిగిపడినట్లు నిట్టనిలువున కూలి నెత్తురుమిసి అసువులు విడిచాడు.

చాణూర ముష్టికుల పాటుచూసి వారితో ఉన్న శలతోసకులు కృష్ణుని, కూటుడు బలరాముని మార్కొన్నారు. కూటుడు బలరాముని ముష్టిఘాతానికి నేలకొరిగాడు. శలతోసకులు శ్రీకృష్ణుని పాదహతికి దవ్వునబడి మరణించారు. వారి గతి చూసి తక్కిన మల్లులు ప్రాణభీతులై ఊపిరి ఉంటే ఉప్పమ్ముకొని బ్రతుకవచ్చు ననుకొని సందుగొందుల వెంబడిని పారిపోయారు.

అంతటు రామకృష్ణులు గోపబాలకులను కూడి వాదిత్రనాదానికి సరిగా తమ నూపురధ్వనులు తాళలయలు కాగా విలాసనృత్యం కావిస్తూ రంగభూమి అంతటా విహరింపసాగారు. ఆ ఆటకు కంసుడు తప్ప సభాసదు లందరూ మెచ్చి జయజయధ్వనులు పలికి సంతోషించారు.

## కంసుని ప్రల్లదాలు

కంసుడు మల్లవీరుల చావును, తదితర మల్లులు పారిపోవటాన్నీ చూసి భయపడి వాద్యాలను నిలిపించి భటులవంక చూసి

**ఉ. వల్లవబాలురన్ నగరి వాకిటికిన్ వెడలఁగఁ ద్రొబ్బుడీ
గొల్లల ముట్టికోల్ గొనుఁడు క్రూరుని నందుని గట్టుఁ దుర్వికిం
దెల్లము గాఁగ నేడు వసుదేవుని జంపుఁడు తండ్రి గాఁడు వీఁ
డెల్ల విధంబులం బరుల కిష్టుఁడు కానకుఁ దుగ్రసేనునిన్."**

అని అతికఠోరంగా ఆజ్ఞాపించాడు.

## కంస సంహారం

రాజేంద్రా! కృష్ణుడు ఆ పలుకులు విని కంసుని మంచెమీదికి ఒక్క గంతున దుమికాడు. ఆ విధంగా మృత్యువు వలె తనమీదికి కృష్ణుడు వస్తుంటే కంసుడు చూసి తటాలున లేచి కత్తినీ డాలునూ అందుకొని యుద్ధసన్నద్ధుడై ఆకాశం నుంచి రివ్వున దూసుకొని వస్తున్న డేగ తాకిడిని తప్పించుకోవటానికి కోడిపిల్ల ప్రయత్నించినట్లు ఆ యదువీరుని బారినుంచి తప్పించుకోవాలని అటూ యిటూ పరుగులుతీస్తూ వాలు ఝళిపిస్తూ విఫలప్రయత్నం చేశాడు. గరుత్మంతుడు పన్నగాన్ని పట్టుకొన్నట్లు కృష్ణుడతని మెడను చేజిక్కించుకొని కిరీటం పడదన్ని సిగబట్టి లాగి రంగాన పడద్రోసి పైనబడి ఒళ్ళంతా కుమ్మి గొంతు నులిమి చంపి, సింహం ఏనుగును ఈడ్చినట్లు ఆ శవాన్ని పట్టి లాగాడు. రంగస్థల హాహాకారాలు మిన్నుముట్టాయి.

## కంసానుజుల సంహారం

కంసుని చావు చూసి అతని తమ్ములు కంక న్యగ్రోధకాదులు ఎనమండ్రుగురు కోపవివశులై భ్రాతృఋణం తీర్చటానికి ఒక్కుమ్మడిని కృష్ణునితో తలపడ్డారు. బలరాముడు చేరువనున్న ఇనుప గుదియను అందుకొని మృగేంద్రం పశువులను తరిమినట్లు వారందరినీ తరిమికొట్టి చంపాడు. దేవదుందుభులు మ్రోగాయి; బ్రహ్మాదులు కుసుమవృష్టి కురిపించి రామకృష్ణులను ఉగ్గడించారు. అమరకాంతలు నృత్యాలు చేశారు.

రాజేంద్రా! ఇందులో ఒక విశేషం ఉన్నది. నాడు గగనవాణి పలుకు విన్నది మొదలు నాటివరకు కంసుడు భోజన పాన గమన ఆసనసమయాల లోనే గాక శ్వాసోచ్ఛ్వాస కాలాలలో సైతం భయాధిక్యం వలన చిత్తాన్ని భగవానుని యందే పాదుకొలిపి ఉంచాడు. ఆ పుణ్యఫలం వలన అతనికి ఈశ్వర సారూప్యం కలిగింది.

## కంసపత్నుల విలాపాలు

కంసుని భార్యలు, అతని తమ్ముల భార్యలు మగల పాటు విని దుఃఖిస్తూ తలలు మోదుకొంటూ రంగప్రదేశానికి వచ్చి పతుల శవాలపైబడి కౌగిలించుకొని, 'ప్రాణనాథా! నీతో నేనూ నా బిడ్డలూ చచ్చినవారమైతిమి. నా వలెనే నగరం కూడా పతిహీనమై సకలశోభనాలకూ దూరమయింది. స్వామీ! కృష్ణుడు సర్వభూత జనన పాలన సంహార కారణ మైనవాడు. భూతజాతానికి కీడుచేయడమంటే సమస్తభూతకారణమైన భగవానునికి కీడుచేయటమే. భగవంతుని ఎదిరించినవాడు నెగ్గుకు రావడం ఎక్కడయినా ఉన్నదా?' అని ఒక్కొక్కరూ విలపింపసాగారు. కృష్ణుడు వారిని ఓదార్చి కంసాదులకు పరలోకక్రియలు కావింపజేశాడు.

## తల్లిదండ్రుల సాంత్వనం

ఆ తర్వాత రామకృష్ణులు చెరసాలకు వెళ్ళి అక్కడ బందీకృతులై ఉన్న దేవకీవసుదేవులకు సంకెలలు తప్పించి వారి పాదాలకు తలసోకగా మ్రొక్కి

సాష్టాంగపడ్డారు. రామకృష్ణులు ఈశ్వరులే గాని సామాన్యులు కారని దేవకీవసుదేవులు శంకించి వారిని దగ్గరకు తీసికొని కౌగిటజేర్చి దీవించటానికి వెనుకాడారు.

కృష్ణుడు వారి మనోభావం గ్రహించి, 'వీరికి పరమార్థం ఎరుకపడింది. ఇది ప్రత్యుపకారవిడంబనకు అడ్డుకాగలదు' అని లోలోన నిశ్చయించి ఆత్మమాయాయోగాన్ని వారిపై ప్రసరింపజేశాడు. 'జననీజనకులారా! మీరిద్దరు మాయెడ నిత్యోత్కంఠులై ఉన్నవారు. అయితే కాలకర్మవశాన మా బాల్య పౌగండ్య కైశోర క్రీడలను చూసి ఆనందించే అవకాశం మీకు రాలేదు. బిడ్డలు తండ్రియింట పెరుగుతూ వారి లాలనల చేత సంతోషాన్ని పొందుతూ సుఖంగా ఉండటం లోకసహజం. ఆ భాగ్యానికి మేము నోచుకొనలేదు. తల్లిదండ్రులారా! సర్వార్థాలను సాధించటానికి దేహమే పరమసాధనం. దేహం లేనినాడు సర్వార్థాలు నిరర్థకమే. అట్టి దేహాన్ని కని పెంచి పెద్దచేసిన తల్లిదండ్రుల ఋణం నూరేండ్లకయినా బిడ్డలు తీర్చగలిగినది కాదు. పుత్రుడు సమర్థుడై ఉండి తన దేహధనాల చేత తల్లిదండ్రులకు జీవికను కలిగింపకపోతే యమభటులు పరలోకంలో అతని మాంసం కోసి అతని చేతనే తినిపిస్తారు. మేము మీకై అటువంటి పరిచర్యలేవీ చేయక ధర్మహాని కావించాము. ఎవడు తన తల్లిని, వృద్ధుడైన తండ్రిని, పతివ్రత అయిన భార్యను, బాలప్రాయంలో ఉన్న పుత్రకుని, గురువులను, తనను ఆశ్రయించిన బ్రాహ్మణుని భరింపడో వాడు బ్రతికీ చచ్చినవాడితో సమానం. జననీజనకులారా! మీకు సేవలు చేయాలని మేమెంతో ఆశించాము. ఏమిచేయము?

**శా. కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా**
**వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా రాక ని**
**ష్కారుణ్యాత్ముల మైన క్రూరుల మహాకౌటిల్యసంచారులన్**
**సారాతిక్షములార! మమ్ము గొఱఁతల్ సైరించి రక్షింపరే?"**

అని వేడుకొన్నారు. దేవకీవసుదేవులు మాయామోహితులై ఉన్నవారు కాబట్టి ఆ మాటకు వారు ముగ్ధులై రామకృష్ణులను కౌగిటజేర్చి ముద్దాడి తొడపై కూర్చొనబెట్టుకొని ఆనందబాష్పాలతో వారిని ముంచెత్తి వాత్సల్యాతిశయం వల్ల కన్నీరు మున్నీరు కాగా గొంతులు బొంగురుపోయి పలుకాడక మౌనంగా ఉండిపోయారు.

## ఉగ్రసేన రాజ్యాభిషేకం

అంతట కృష్ణుడు మాతామహుడైన ఉగ్రసేనుని చెంతకేగి, 'మహారాజా! కంసునికి సంతానం కలుగలేదు. నీవు రాజువై నీ ప్రజలమైన మమ్మందరినీ కాపాడు. యయాతి శాపం వలన యాదవులు రాజ్యాధిపత్యానికి అర్హతను కోల్పోయారు. అందువలన మేము దానికి తగము. రాజ్యభారం వహించే శక్తి నాకు లేదుకదా! అని జంకవద్దు. మేము భృత్యులమై నిన్ను సేవిస్తుండగా నీకెటువంటి భయమూ ఉండదు. దేవతలు కూడా నీకు లొంగి బలి సమర్పిస్తారు. ఇతర రాజుల సంగతి వేరే చెప్పేదేమున్నది?' అని నొక్కి చెప్పాడు. ఉగ్రసేనుడు ఎట్టకేలకు సమ్మతించాడు.

రాజేంద్రా! అప్పుడు కృష్ణుడు వాయుదేవుని రప్పించి, 'అయ్యా! నీవు వెంటనే వెళ్ళి నా ఆనతిగా ఇంద్రునికి చెప్పి సుధర్మమనే ఇంద్రసభను తెచ్చి ఈ రాజుకు ఇవ్వు' అని ఆజ్ఞాపించాడు. వాయువు వెంటనే వెళ్ళి ఇంద్రునికి సంగతి చెప్పాడు. అమరాధిపుడు కృష్ణుని ప్రభావం తెలిసినవాడే గనుక మారుమాటాడక సుధర్మను ఇచ్చివేశాడు. మారుతుడు దానిని తెచ్చి కృష్ణుని యెదట ఉంచాడు. కృష్ణుడు ఆ ఉత్తమాసనం మీద ఉగ్రసేనుని కూర్చుండబెట్టి రాజభావంతో అతనిని పూజించాడు.

## జ్ఞాతి వందనం

కంసునికి భయపడిన జ్ఞాతులు, సంబంధులు అయిన యాదవులు, వృష్ణులు, అంధక మధుదాశార్హులు, కుకురాదులు మధురానగరాన్ని

విడిచిపెట్టి అప్పటికి దేశాంతర్గతులై ఉన్నారు. కృష్ణుడు వారందరినీ తిరిగి మధురకు రప్పించి బహుధనాది సత్కారాలు చేసి, వారందరినీ తిరిగి వారివారి ఇండ్లలో నివసింపజేశాడు. యాదవులు రామకృష్ణ భుజరక్షితులై మనోరథప్రాప్తినొంది దయార్ద్రవీక్షణ లక్ష్మీవిలాసమైన ముకుంద వదనారవిందాన్ని ప్రతినిత్యం సందర్శించే భాగ్యం లభించినందుకు అమితసంతోషాన్ని పొందారు. మాధవ వదనాంబుజ సుధారసాన్ని గ్రోలిన వృద్ధజనులు సయితం తేజోబలవిరాజమానులై యౌవనుల వలె సర్వసుఖాలను అనుభవింపసాగారు.

## నందాదులకు వీడ్కోలు

రాజేంద్రా! రామకృష్ణులంతట నందుని వద్దకు వెళ్ళి ఆయనను కౌగిలించుకొని, 'తండ్రీ! నీవు, యశోద ఎంతో ప్రేమతో మమ్మల్ని లాలించి పెంచి పెద్దచేశారు. తల్లిదండ్రులకు వారి శరీరాలకంటె పుత్రుల మీదనే ప్రేమ అత్యధికం. మేము దేవకీ వసుదేవుల పుత్రులమని ఏనాడూ అనుకోకండి. వారు మమ్మల్ని కన్నవారు; పెంచినవారు మీరే. కన్నవారికన్న పెంచినవారే నిజమైన తల్లిదండ్రులు. మీరు మమ్మల్ని పెంచిన తీరు లోకసాధారణమైనది కాదు. మీ కన్నబిడ్డల కంటె అధికమైన ప్రేమతో పెంచారు. ఇప్పటికే మా కోసం మధురకు వచ్చి మీకు చాలా ఆలస్యమయింది. వ్రేపల్లెలో అందరూ మీ కోసం ఎదురుచూస్తుంటారు. మేము కొంతకాలం ఇక్కడే ఉండి సుహృదులకు సుఖాన్ని కూర్చి మళ్ళీ మీ అందరినీ చూడటానికి వస్తాము. వాత్సల్యాతిశయం వియోగక్లేశాన్ని మరింత దుర్భరం చేస్తుంది. అందుకు చోటివ్వకండి' అని నచ్చజెప్పి, ధనకనకవస్త్రాలంకారాలతో సత్కరించి వారిని ప్రయాణం కట్టించాడు. నందుడు కూడా ప్రణయవిహ్వలుడై రామకృష్ణులను మాటిమాటికీ కౌగిట తీసుకొని కన్నీళ్ళు పెట్టుకొని ఎంతో కష్టం మీద బయలుదేరాడు. గోపకు లందరూ సముచితసత్కారాల నందుకొని కృష్ణుని విడువలేక విడువలేక నందుని వెంట వ్రేపల్లెకు వెళ్ళిపోయారు.

## రామకృష్ణుల ఉపనయనం

అందాకా రామకృష్ణులకు ఉపనయన సంస్కారం జరగలేదు. వసుదేవుడప్పుడు తన పురోహితు డైన గర్గాచార్యుని, మరికొందరు విప్రోత్తములను రప్పించి బ్రాహ్మణార్హమైన ఉపనయన సంస్కారం శాస్త్రోక్తంగా తన కొడుకులకు వారిచేత చేయించి, బ్రాహ్మణులకు సర్వాలంకారపూజలు కావించి సవత్స సాలంకృత సదక్షిణ గోదానాలు సమర్పించాడు. అదిగాక రామకృష్ణుల జననకాలాన వసుదేవుడు బ్రాహ్మణులకు కొన్ని గోదానాలు మనసులోనే దానం చేశాడు కాని కారాగృహంలో ఉన్నందువలన వాటిని అప్పటికి ఇవ్వలేకపోయాడు. అవన్నీ రాజకీయగోష్ఠం లోనే ఉండిపోయాయి. వసుదేవుడు ఆ గోవులను కూడా తెప్పించి వారికి సమర్పించాడు. బ్రాహ్మణులు సర్వవిధాల సత్కృతులై సంతోషించి వారిని దీవించి వెళ్ళారు.

## గర్గాచార్యుని ఆదేశం

రాజేంద్రా! గర్గాచార్యుడు రామకృష్ణులకు గాయత్రిని ఉపదేశించి, 'నాయనలారా! మీరు సర్వజ్ఞులు, సర్వలోకేశ్వరులు, సమస్తవిద్యాధారులు. మీ విజ్ఞానబోధ వినిర్మలమూ, సహజసిద్ధమూ అయినట్టిది. నరవేషాన్ని తాల్చినందున మీరు యథార్థస్థితిని మరుగుపుచ్చారు. లోకవిడంబనార్థం గురుకుల వాసం కావించి ధర్మమార్గప్రదీపకులు కావాలి' అని పలికాడు. రామకృష్ణులు గర్గవచనాన్ని శిరసావహించారు.

## రామకృష్ణుల విద్యాభ్యాసం

కాశీపురంలో సాందీపని అనే మహావిద్వాంసుడు అవంతీపురవాసి వేలకొలది శిష్యులకు తత్తదుచితవిద్యలను నేర్పుతూ విఖ్యాతుడై ఉన్నాడు. రామకృష్ణులు కాశీనగరానికి వెళ్ళి సాందీపనిని ఆశ్రయించి అత్యంతభక్తితో ఆయనను ఉపాసించారు. ఆ గురువర్యుడు కూడా వారి శమదమాది గుణసంపత్తిని, శుద్ధభావానువర్తనలను, సేవాధర్మజ్ఞతను పరికించి

ప్రీణితస్వాంతుడై వేద వేదాంగ వేదాంతాలను మంత్రదేవతాజ్ఞానసహితంగా బోధించి, ధనుర్వేదాన్ని మన్వాది ధర్మశాస్త్రాలను మీమాంసాది న్యాయశాస్త్రాలను షడ్విధ తర్కశాస్త్రాన్ని సంధి విగ్రహ యాన ఆసన ద్వైధ ఆశ్రయాలనే ఆరు అంగాలు గల రాజనీతిని బోధించాడు.

## చతుష్షష్టి కళలు

రాజేంద్రా! వారి ప్రజ్ఞావిశేషం సంగతి మాటలలో నేను వర్ణించి చెప్పగలనా? అరవై నాలుగు కళలను అరవైనాలుగు దినాలలో గ్రహించారు.

చతుష్షష్టి కళలంటే– (1) గీతము (2) వాద్యము (3) నృత్తము (4) నాట్యము (5) ఆలేఖ్యము (6) తిలకము (7) నానారచన (8) విశేషకభేద్యము (9) తండుల కుసుమ బలి వికారములు (10) పుష్పాస్తరణము (11) ఆదర్శనము (12) వసనాంగరాగములు (13) శేఖరాపీడలు (14) జననైపథ్య యోగములు (15) కర్ణపత్ర యోగములు (16) సుగంధ శుద్ధభూషణ యోజనలు (17) ఐంద్రజాలము (18) కౌచమార యోగము (19) హస్తలాఘవము (20) చిత్రశాఖాపూపముఖ భక్ష్యవికారక్రియలు (21) పానకరస రాగాసవ యోజనము (22) సూచీపానకర్మము (23) సూత్రక్రీడ (24) సర్వవస్తు ప్రతికృతి నిర్మాణము (25) వీణా డమరుక వాద్యములు (26) ప్రహేళిక (27) అరూప రచన (28) దుర్వంచన యోగము (29) పుస్తక వాచనము (30) నాటకాఖ్యాయికా దర్శనము (31) కావ్య సమస్యాపూరణము (32) పట్టికా వేత్ర బాణ వికల్పములు (33) తక్ష కర్మము (34) వాస్తువిద్య (35) రూప్య రత్న పరీక్ష (36) ధాతువాదము (37) మణి రాగ జ్ఞానము (38) ఆకర జ్ఞానము (39) వృక్షాయుర్వేద యోగములు (40) మేషకు క్కుట లావుక యుద్ధవిధి (41) శుకశారికాప్రలాపము (42) ఉత్సాదనము (43) కేశమార్జన కౌశలము (44) అక్షరముష్టికా కథనము (45) మ్లేచ్ఛితక వికల్పము (46) దేశభాషాజ్ఞానము (47) పుష్పశకటిక (48) నిమిత్త జ్ఞానము (49) యంత్రమాతృకా ధారణ (50) మాతృకా సంవాచ్యము

(51) మానసిక క్రియ (52) కాయక్రియ (53) అభిధాన కోశము (54) ఛందోజ్ఞానము (55) క్రియాకల్పము (56) ఛలిత యోగములు (57) వస్తుగోపనములు (58) ద్యూతవిశేషము (59) ఆకర్షణక్రీడ (60) బాలక్రీడనకము (61) వైనాయికా (62) వైజయికా (63) వైయాసికా (64) విద్యాజ్ఞానము లన్నవి మొత్తం అరవై నాలుగు.

## గురుదక్షిణ

రాజేంద్రా! రామకృష్ణులు ఆ విధంగా సమస్తవిద్యలు గ్రహించి, ఒకానొకనాడు గురువును సమీపించి, 'మహాత్మా! మీ వలన విద్యలన్నీ నేర్చుకొనగలిగాము. గురుదక్షిణ సమర్పింపనినాడు నేర్చిన విద్య ఫలింపదు. గురుదక్షిణగా ఏమి కావాలో తెలుపగలరని వేడుకొంటున్నాము' అని విన్నవించారు. సాందీపని ఆ మాట విని, 'ఓహో! వీరి మహిమ మహాద్భుతకరం; వీరి మతివిలాసం అలోకసామాన్యం. వీరిని కోరరాని కోరిక ఏముంటుంది? విద్యానిష్క్రియంగా ఏమి కోరితే బాగుంటుంది?' అని లోలోపలే అనుకొని, భార్యతో సంగతి చెప్పి కర్తవ్యం ఆలోచించాడు.

రాజేంద్రా! సాందీపనికి ఒక కొడుకు ఉండేవాడు. అతను ఒకనాడు ప్రభాసక్షేత్రానికి వెళ్ళి స్నానార్థం సముద్రంలో మునిగి మళ్ళీ తిరిగిరాలేదు. అది జరిగి ఎన్నో సంవత్సరాలు గతించాయి. అతనంటే సాందీపని భార్యకు ప్రేమ మరీ ఎక్కువ. ఆమె ప్రియపుత్ర వియోగక్లేశం వలన కృశించి ఉన్నది. సాందీపని తన భార్యతో గురుదక్షిణ విషయం ప్రస్తావింపగానే ఆమె, 'ప్రాణేశ్వరా! మన సుతుని తెచ్చి యివ్వటమే తగిన గురుదక్షిణ. పైగా ఇది వారికి ఏమంత గొప్ప కార్యం కాదు' అన్నది. అందుకు సాందీపని అంగీకరించి, రామకృష్ణులతో –

**శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున ము న్నస్మత్తనూసంభవుం**
**డంభోగాహము సేయుచున్ మునిగి రాఁ డయ్యెం గృపాంభోనిధుల్**

**శుంభద్వీర్యులు మీరు మీ గురునికిం జోద్యంబుగా శిష్యతన్**
**గాంభీర్యంబున బుత్త్రదక్షిణ యిడం గర్తవ్య మూహింపరే!**

అని పలికాడు.

## పాంచజన్యం

రామకృష్ణులు గురువు అనుజ్ఞను తలదాల్చి మహారథాలను అధిరోహించి ప్రభాసక్షేత్రానికి వెళ్ళి సముద్రతీరాన కొంతసేపు కూర్చున్నారు. సముద్రుడు పూజోపకరణాలతో వచ్చి వారిని పూజించాడు. కృష్ణుడు సముద్రుని చూసి, 'అయ్యా! మా గురుపుత్త్రుడు జలక్రీడకు వచ్చి నీలో మునిగి మళ్ళీ రాలేదట. అతను నీలోనే ఉండి ఉండాలి. వెంటనే అతనిని మాకు తెచ్చియివ్వు' అన్నాడు.

సముద్రుడు చేతులు జోడించి, 'మహాత్మా! మీ గురుపుత్త్రుని నేను దాచలేదు. పంచజనుడనే అసురుడు శంఖరూపధారి అతనిని తీసుకొనివెళ్ళాడు. అతనిప్పుడు జలగర్భంలో ఉన్నాడు. మీరు నీటిలోనికి ప్రవేశించి గురుపుత్త్రుని గ్రహించండి' అని విన్నవించాడు.

అప్పుడు రామకృష్ణులు మున్నీటిలో దూరి పంచజనుని వధించి అతని పొట్టచీల్చి చూశారు. అందులో గురుసుతుడు కనిపించలేదు. ఒక శంఖం మాత్రమే ఉన్నది. కృష్ణుడు గతాన్ని ఆలోచించి, 'గురుపుత్త్రుడు మృతుడై యమలోకానికి పోయి ఉంటాడు' అని నిశ్చయించి, ఆ అసురుని శరీరంలో లభించిన పాంచజన్యమనే శంఖాన్ని గ్రహించి అక్కడినుంచి అన్నతో యమపురికి పోయి భీషణంగా శంఖాన్ని ఊదాడు.

## యమునికి ఆదేశం

ఆ శంఖధ్వనికి యముడు అదిరిపడి లేచి, వెంటనే రామకృష్ణుల వద్దకు వచ్చి, సభక్తికంగా వారిని పూజించి, 'శ్రీమన్నారాయణుని లీలామూర్తులు మీరిక్కడికి వచ్చిన కార్యం ఏమిటో సెలవీయండి' అని వేడుకొన్నాడు. కృష్ణుడు అతనిని చూసి, 'నా గురుపుత్త్రుడు కర్మవశాన మృతుడై ఇక్కడికి

తీసికొనిరాబడినట్లు గ్రహించాను. అతను తన దోషఫలాన్ని అనుభవింపవలసి ఉన్నది. అయితే నా శాసనం వలన అతని దోషాలన్నీ నశించాయి. అతనిని తెచ్చియివ్వు' అన్నాడు. యముడు వెంటనే భగవానుడు చెప్పిన పని చేశాడు.

## గురుదక్షిణ సమర్పణ

రామకృష్ణులు గురుపుత్రుని వెంటబెట్టుకొని వెళ్ళి గురువుకు అప్పగించి, 'గురువర్యా! ఇంకేదయినా దక్షిణను ఇమ్మంటారా?' అని అడిగారు. సాందీపని వారి వినయసంపదకు మెచ్చి, 'వత్సలారా! గురునిష్క్రియంగా అడిగినదానిని తెచ్చియిచ్చారు. మీవంటి శిష్యులను సంపాదించుకొన్న గురువుకు కొరత ఏముంటుంది? వీరవరేణ్యులారా! మీ కీర్తి జగత్పావనం అవుతుంది. ఇక మీరు ఇంటికి వెళ్ళవలసిన తరుణం ఆసన్నమయింది' అన్నాడు.

## మథురాగమనం

రామకృష్ణులంతట ఆచార్యుని వీడ్కొని రథం ఎక్కి మథురకు బయలుదేరారు. వారి రథనేమి ఘోష పర్జన్యనినదం వలె మారుమ్రోగింది. వారు మథురానగరం చేరినంతనే పౌరజనులు గుంపులు గుంపులై వారిని సందర్శించి, పోయిన ధనం దొరికినట్లు పరమానందభరితు లయ్యారు.

## గోకులానికి సందేశం

రాజేంద్రా! వృష్ణికులప్రవరుడు ఉద్ధవుడు – బృహస్పతిని శుశ్రూషించి బుద్ధిసత్తము డైనవాడు – కృష్ణునికి ప్రియసఖుడు విశ్వాసపాత్రుడు జ్ఞాపకం ఉన్నాడు కదా!

శ్రీకృష్ణుడు మథురలోనికి ప్రవేశింపగానే ఉద్ధవుని పిలిచి ఆప్యాయంగా చేతిలో చేయివేసి, 'సౌమ్యా! ఉద్ధవా! నా తల్లిదండ్రులు యశోదా నందులు నా రాకకోసం నిరీక్షిస్తూ క్షణమొక యుగంగా గడుపుతుంటారు. గోపికలు నాకోసం పతిపుత్రబాంధవాదులనే గాక అన్నపానాదులను కూడా త్యజించి నా తోడిదే లోకమని భావించారు. అంతే కాదు. నన్నే ఆత్మగా వారు

భావించారు. నేను దూరమైనప్పుడు వారు ఎంత ఉత్కంఠతో నన్ను స్మరిస్తుంటారో ఊహించి చూడు.

మిత్రమా! నేను వ్రేపల్లె వదిలి వచ్చేరోజున వారు నా వియోగానికి ఎంత దుఃఖించారో చెప్పలేను. మళ్ళీ వస్తానని నమ్మబలికి ఇక్కడికి వచ్చాను. నా మాటను నమ్మి నాయందే మనసు నిల్పి నా కోసమే ఎదురుచూస్తూ ఎలాగో ఇంతదాకా మేనిలో ప్రాణాలు నిలుపుకొని ఉంటారు. మిత్రమా! నాకై లోకధర్మాన్ని త్యజించినవారిని నేను భరిస్తాను. ఇది నా వ్రతం. నీవు గోకులానికి వెళ్ళి నా తల్లిదండ్రులకు నా క్షేమం తెలిపి, గోపకాంతలకు నా మాటలు చెప్పి వారిని ఊరడించు' అన్నాడు.

## ఉద్ధవుని ప్రయాణం

రాజేంద్రా! ఉద్ధవుడు అప్పుడు కృష్ణుని వీడ్కొని రథం ఎక్కి సూర్యాస్తమయవేళకు నందవ్రజాన్ని చేరుకొన్నాడు. పశువులు కడుపారా మేసి మందలను చేరుకొంటున్నాయి. ఎదలైన పెయ్యల వెంట ఆబోతులు పరుగులు తీస్తూ ఒండొంటితో పోట్లాడుతూ దుమ్ము రేపుతున్నాయి. లేగటి ఆవులు పొదుగుల పాలుగార్చుతూ దూడల కోసం పరిగెత్తలేక పరిగెత్తుతున్నాయి. దూడలు తల్లులకోసం అరుస్తూ చెంగుచెంగున గంతులువేస్తూ కనువిందు చేస్తున్నాయి. గోపబాలకులు రామకృష్ణుల లీలలను పాడుకొంటూ గోవుల వెంట వస్తున్నారు. వ్రేపల్లెలోని సూర్యానలాతిథి పితృదేవార్చనల ధూపదీపమాల్యాల నెత్తావులు అక్కడి దాకా గుబాళిస్తున్నాయి. గోపమందిరోపవనాలు కమ్మని తావులను వీచి తమలో గల వివిధ లతా తరు పుష్పాదికవిశేషాలను ప్రకటిస్తున్నాయి. తుమ్మెదలు పూదేనెలు గ్రోలి మత్తిల్లి అభ్యాగతులకు స్వాగతాలు పలుకుతున్నట్లుగా మధురగీతాలను పాడుతున్నాయి. కలహంసాది విహంగాలు సరోవరాల లోని తామరతూండ్లను మెక్కి శ్రవణమనోహరంగా కూజితాలను వినిపిస్తున్నాయి.

## నందోద్ధవుల సంభాషణ

ఉద్ధవుడు ఆ విశేషాలను పరికిస్తూ గోధూళి వేళకు వ్రేపల్లె ప్రవేశించి నందుని ఇంటికి వెళ్ళాడు. వ్రజవతి అతనిని చూసి కృష్ణుని వలెనే కౌగలించి మర్యాదలు చేసి ఆదరించి పరమాన్నం కడుపు నిండుగా తిన్న తర్వాత పాన్పుపై పవ్వళింపజేసి పాదాలొత్తి మార్గాయాసం తీర్చి స్వస్థతచెందిన తర్వాత తలవైపు కూర్చుండి, 'మహాశయా! మా మిత్రుడు వసుదేవునికి కష్టాలన్నీ తొలగిపోయాయి. భార్యాపుత్రసుహృజ్జనంతో అతనిప్పుడు క్షేమంగా ఉన్నాడు కదా. యాదవులు సహజసాధువులు; మీదుమిక్కిలి ధార్మికులు. అటువంటి వారికి కంసుడు కీడు తలపెట్టని క్షణంలేదు. అతని పాపమే చివరికతనిని పొట్టన బెట్టుకొన్నది. అపకారులు తాత్కాలికంగా జయం పొందినట్లు అనిపించినా ఏదో ఒకనాటికి పతనం కాక మానరు.

మిత్రమా! వ్రేపల్లెలో అందరమూ కృష్ణునే నాథునిగా నమ్ముకొని ఉన్నాము. తల్లిదండ్రులు గాని సుహృత్సఖులు గాని, గోగోపాలకులు గాని, బృందావన గోవర్ధనగిరులు గాని ఎన్నడయినా అతనికి గుర్తువస్తుంటామా? గోవిందుడు ఆత్మీయులను చూడటానికి ఒక్కసారయినా ఇక్కడికి రాదలిచాడా? ఆ సుకుమారుని ముద్దు నవ్వుల నెమ్మోమును ఏ నాటికి చూడనున్నామో కదా!

మిత్రమా! ఆ మహాత్ముని ప్రతిక్షణమూ జ్ఞాపకం చేసికొనకుండా ఎలా ఉండగలము? మమ్మందరినీ దవాగ్ని నుంచి రక్షించాడు; వాతవర్షం నుంచి కాపాడాడు; సర్పభయం వృషభభయం కలిగినప్పుడు తానై అడ్డుపడి ప్రాణాలొడ్డి మమల్ని బ్రతికించాడు; ఇంతెందుకు! మృత్యుముఖం నుంచి ఎన్నో సార్లు తప్పించాడు. ఆ ముకుందుని విక్రమాన్ని తలచినా, అతని లీలాకటాక్షవీక్షణాలను స్మరించినా, అతని దరహాసవిలాసాన్ని భావించినా, అతని ముద్దు పలుకులను జ్ఞాపకం చేసుకొన్నా, మమ్మల్ని మేమే మరచిపోతాము. అతని పాదారవిందాలు సోకిన వనగిరి తలాలు, నదీనదాలు, విహారప్రదేశాలు దేనిని చూసినా మాకు తన్మయత్వం కలుగుతుంది.

మిత్రమా! రామకృష్ణులు దేవకార్యార్థం భూమిపై అవతరించిన శ్రీమన్నారాయణాంశసంభూతులని గర్గాచార్యుడు తెలిపాడు. ఆ మాట అక్షరాక్షరం సత్యమని అనుక్షణం అనుకొంటాము. అదే కానినాడు కృష్ణు డెక్కడ? బక తృణావర్తాది రాక్షసులను చంపటం, గోవర్ధన గిరిని ఒక్కచేత పైకెత్తి ఏడహోరాత్రాలు నిలిపి ఉంచటం, మూడు తాటిచెట్ల పొడవున్న మహాధనుస్సును పుల్లవలె విరిచివేయటం, కువలయాపీడాన్ని మట్టుపెట్టటం, చాణూరుని ఉవ్వెత్తున ఎగరగొట్టి ప్రాణాలు తీయటం, సహస్ర గజబలుని కంసుని హరించటం ఇవన్నీ ఎక్కడ? రాము డెక్కడ? ప్రలంబాదులను తెగటార్చటం ఎక్కడ?' అని చెప్పసాగాడు.

రాజా! అంతలో నందుని ప్రేమాతిశయం ఉబ్బి ఉబికి వెల్లివిరిసినందువలన నోట మాటరాక మాటలు చాలించి మౌనంగా ఉండిపోయాడు. యశోద పుత్త్రుని కథావర్ణనను ఆలకిస్తూ రొమ్ములు చేపి కన్నీరు పెట్టుకొని విలపింపసాగింది.

ఉద్ధవుడు యశోదానందుల ప్రేమాతిశయాన్ని చూసి, 'వ్రజనాయకా! మీకు నారాయణునియెడ గల అనురాగం మిక్కుటం; దేహధారు లందరిలో మీరు పరమశ్లాఘనీయులు. రామకృష్ణులంటే జగత్తునకు నిమిత్తోపాదాన కారణభూతులైన మహాపురుషులు. పురుషుడు, ప్రధానము అన్నవి రెండూ విశ్వానికి బీజము, యోని వంటివని అంటావా? ప్రధానమన్నది పురుషుని శక్తియే గాని వేరొక ప్రత్యేకవస్తువు కాదు. శక్తికి, శక్తిమంతునికి అవినాభావం. శక్తిమంతునితో శక్తి, శక్తితో శక్తిమంతుడు ఉంటారు. ఆ శక్తి శక్తిమంతుల వలన సృష్టి కలుగుతున్నది. ఆ ప్రకారం సృష్టమైన సమస్తభూతాలలో శక్తి శక్తిమంతులు ప్రవేశించి ఉంటుంటారు. వివిధ జీవకోటి తన్నియామకమై వర్తిల్లుతుంది.

అంతేకాదు. శక్తి శక్తిమంతులైన ప్రధాన పురుషులు అనాదులు కాబట్టి సర్వకారణులు, సర్వనియంతలు అవుతారు. ప్రాణవియోగసమయంలో వీరిపై

విశుద్ధమైనచిత్తం నిశ్చలంగా నిమిషమాత్రమయినా నిలిచినట్లయితే, ఆ జీవుని కర్మవాసనలన్నీ నశించటమూ అతనికి స్వరూపజ్ఞానసిద్ధి కలగటమూ శుద్ధసత్యమూర్తియై అతను పరమపదాన్ని పొందటమూ క్రమానుగతాలు కదా.

మహాత్మా! అట్టి నారాయణమూర్తి యందు మీరు మీ భావాన్ని నిరంతరం పాదుకొలిపారు. మీకిక కర్తవ్యం ఏమున్నది? భగవానుడు శీఘ్రకాలంలోనే వ్రేపల్లెకు వచ్చి పెంచి పెద్దచేసిన జననీజనకులకు ప్రీతి కావిస్తాడు. భగవానుడే మీకు స్వయంగా ఈ మాటను కంసహరణం నాడు రంగమధ్యాన చెప్పాడు కదా. అతని మాట తప్పదు. మీరు దుఃఖింపకండి.

మిత్రమా! సమిధలలో అగ్నివలె సర్వభూతహృదయాల లోనూ భగవానుడు నిత్యసన్నిహితుడై ఉంటాడు. సమిధలను మథించితే కాని అగ్ని వెలువడనట్లు భక్తిమథనం కావించితే గాని భగవానుడు కానరాడు. కృష్ణుడు మథురలో తన పిత్రాదులను అత్యంతప్రియు లైనవారిని విడిచి ఇక్కడికి వస్తాడా? అని శంకింపకండి. అతనికి ప్రియాప్రియులన్న భేదాలు లేవు. అతని దృష్టిలో అందరూ ఒక్కటే. ఇది లోకసహజం కాదంటావా? అన్ని భేదభావాలకూ కారణం ఏమిటి? అభిమానం. అది భగవానునికి కలుగనే కలుగదు. అభిమానం లేనివానికి జన్మ కర్మములు ఎలా కలిగాయి? తల్లిదండ్రు లుండటం ఎలా సంభవించింది? అంటావేమో. అతని జన్మకర్మములు సాధుజనరక్షణైక క్రీడలు మాత్రమే. ఎప్పుడెప్పుడు ధర్మాన్ని ఏయే విధంగా సంరక్షింపవలసి ఉంటుందో ఆయా కాలాలలో ఆయా యుగధర్మాలకు తగిన రూపనామాలను స్వేచ్ఛాపూర్వకంగా ధరించి దేవాది వివిధ యోనులందు ఆవిర్భవిస్తుంటాడు.

మిత్రమా! ఆ పరమపూరుషుడు నిరీహుడు. నిరీహు డెక్కడ? ఇచ్ఛాఫలమైన సృష్టి ఎక్కడ? అంటావేమో. సృష్టి సమస్తం అతనికి క్రీడ మాత్రమే. అట్టివానికి క్రీడ మాత్రం ఎందుకంటావా? అది అతనికి స్వభావం.

క్రీడాభావం జనించినప్పుడు అతని శక్తి విలసనం వల్ల సృష్టిస్థితిలయాలు కలుగుతున్నాయి.

ప్రజేశ్వరా! ఆ మహాత్ముడు మీ ఇద్దరికి మాత్రమే ప్రీతిభాజనుడు కాడు. సర్వలోకానికీ పరమప్రేమాస్పదుడు. ఏమంటావా? భూత వర్తమాన భవిష్యాలలో గల చరాచరాలు – సూక్ష్మం మొదలు మహత్తువరకు అన్నీ విష్ణుమయాలే. తద్భిన్నమైనది అణుమాత్రమూ లేదు. సర్వమూ ఆత్మమయం కనుక, ఆత్మకంటె ప్రియమైనది వేరొకటి కలుగదు గనుక, సర్వాత్ముడు సర్వానికీ ప్రేమాస్పదుడు కావటంలో వింతేమున్నది?

మిత్రమా! భగవానుడు అనాది, నిర్గుణుడు, అవ్యయుడు అయి సర్వశరీరాలలోనూ ఉన్నప్పటికీ ఎట్టి కర్మమును చేయడని, ఎట్టి కర్మఫలాన్ని అనుభవింపడని చెప్పాను. శరీరములు జడములని తెలుసు కదా. అవి ఏ కర్మమును చేయలేవు. కర్మఫలానుభవజ్ఞానం వాటికి కలుగదు. శరీరాలలో ఆత్మ తప్ప వేరొకటి ఉండటం గాని, కర్మలను చేయటం గాని, తత్ఫలాన్ని అనుభవించటం గాని లేవని అన్నాను. శరీరాలు కర్మలను చేస్తున్నాయి. కర్మఫలాలైన సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాయి. దీనికి కర్త ఎవడు? అంటావా? ఇవన్నీ స్వభావసంబంధులు. స్వభావమంటే ఏమిటని అడుగుతావేమో. ప్రారబ్ధకర్మఫల వాసనాసముచ్చయం ఆ వస్తురాశి యొక్క స్వభావం అనబడుతున్నది. స్వభావం కూడా జడమే కదా అని, జడానికి వ్యవహారం ఎలా సాధ్యమని అడుగుతావేమో? స్వభావం జడమన్నమాట నిజం. సూదంటురాయి సాన్నిధ్యంలో ఇనుప ముక్క వ్యవహరిస్తున్నట్లుగా ఆత్మ సాన్నిధ్యంలో స్వభావం వ్యవహరిస్తున్నది. ఇనుప ముక్క వ్యవహారఫలం సూదంటురాతికి ఏ విధంగా సంక్రమింపదో, స్వభావ వ్యవహారఫలం ఆత్మకు ఆ విధంగానే సంక్రమింపదు.

మిత్రమా! యథార్థతత్త్వం ఇలా ఉండగా భగవానుడే సర్వం చేస్తూ అనుభవిస్తూ ఉన్నాడని లోకం భావిస్తుంటుంది. కారణ మేమంటావా?

అజ్ఞానమే కారణం. ఎలాగంటావా? అజ్ఞానం వలన భ్రాంతి కలుగుతున్నది. కన్ను భ్రమసినప్పుడు భూమండలమంతా గిరగిర తిరుగుతున్నట్లు భ్రమ కలుగుతున్నట్లే భ్రాంతి పైకొన్నప్పుడు ఇటువంటి అనేక భావాలు కలుగుతుంటాయి. ఈ భ్రాంతి పోవటం ఎలాగంటావా? ఆత్మస్వరూప జ్ఞానం కలిగినప్పుడు ఈ భ్రాంతి తొలగిపోతుంది. ఇనుప ముక్కకు సూదంటురాయి శక్తి సంక్రమించినప్పుడు ఆ ఇనుప ముక్కకూడా సూదంటురాయి వలె వ్యవహరిస్తున్నట్లు జీవాత్మకు పరమాత్మ సంయోగం కలిగినప్పుడు అహంభావాదులు నశించి తాను కూడా పరమాత్మతత్త్వాన్ని పొంది నిరతిశయానంద పూర్ణమై ఉంటుంది. పరమహంస పరివ్రాజకులే ఇందుకు సాక్ష్యం. ఈ అర్థం ప్రయత్నానుభవసిద్ధమే గాని కుతర్కాలకు అందేది కాదు' అని చెప్పాడు. రాజేంద్రా! ఉద్ధవ నందులకు ఇటువంటి సంభాషణల తోనే రాత్రి గడిచిపోయింది.

## గోపికల తలపోతలు

రాజేంద్రా! ప్రభాత మైనంతనే గోపికలు మేల్కొంచి దీపాలు వెలిగించి ఇండ్లు చిమ్మి వాస్తుపూజ కావించి కృష్ణలీలలు పాడుతూ దధిమథనానికి ప్రారంభించారు. కవ్వాలు త్రిప్పుతున్నప్పుడు వారి హస్తకంకణధ్వనులు తాళమానాల వలె భాసించాయి. వారు పెరుగు చిలికే వేళకు సూర్యోదయం అయింది. అందరూ ఇళ్ళు విడిచి బయటికి వచ్చారు. ఊరి వాకిట రథం ఒకటి వారికి ఎదురుపడింది. దానిని చూసి గోపికలు 'ఇది ఎవరి రథం? కంసునికి అర్థసాధకుడై మాధవుని మథురకు తీసికొనివెళ్ళిన అక్రూరుడు మళ్ళీ వచ్చాడా? ఇంకా తన రాజుకోసం ఏమిచేయాలని వచ్చాడు?' అని తలకొక ఊహగా తలపోయసాగారు.

## ఉద్ధవ గోపికల సంభాషణలు

అంతలో ఒక వ్యక్తి దీర్ఘబాహువులతో నవసరోజవిలోచనాలతో వెలుగొందుతున్నవాడు పీతాంబరం కట్టి కమలమాల ధరించి దరహాసప్రభలు

చెక్కిళ్ళపైని మణికుండలకాంతులకు ప్రతికావింపగా మిరుమిట్లు గొలుపుతున్న వాడు అపూర్వతేజోమయుడు ఆ దారిని వచ్చాడు. గోపకాంతలు అతనిని చూసి, 'ఎవరితను? ఎక్కడినుంచి వచ్చాడు? అచ్యుతుని వేషభూషణాలు ధరించాడేమిటి?' అని లోలోపల వితర్కింపసాగారు. వారిని వారి ఉత్సాహానురక్తులు నిలువనీయలేదు.

ఇంకేముంది, గోపిక లందరూ ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళి, తలలొగ్గి సిగ్గుదొంతరలు వెల్లివిరిసే చూపులతో, నిండు వెన్నెలలు కురిసే చిరునవ్వులతో, ప్రియోక్తులతో అతనిని సత్కరించి కూర్చుండబెట్టి, 'అయ్యా! నీవు యదుపతి మాకోసం పంపగా వచ్చిన దూతవు కాబోలు. తల్లిదండ్రులకు సంతోషం కలిగించాలని నిన్ను పంపినట్లున్నది. మునులంతటివారికి కూడా తల్లిదండ్రులన్నా, ఆత్మీయులన్నా, స్నేహబంధం తెంచివేయలేనిది కదా. ఏదో ప్రీతికోసం కాకపోతే అతనికి ఈ గోకులంలో వేరే ఇష్టమైన వస్తువు ఏమున్నది గనుక?

అయ్యా! తుమ్మెదలు తేనెకోసం పువ్వుమీద వ్రాలటం, ఆ మకరం దాన్ని గ్రోలిన తర్వాత వచ్చిన పని ముగిసినందుకు సంతోషంతో ఆ పువ్వును వదిలిపెట్టి మళ్ళీ దానికేసి కన్నెత్తి అయినా చూడకపోవటం కళ్ళారా చూస్తూ ఉన్నదే. పురుషులు కూడా స్వప్రయోజనం కోసం స్నేహాలు చేసి పని తీరిన తర్వాత ఆ చెలిమి సంగతే మరచిపోతారు. ఇందుకు నిదర్శన కావాలా? వేశ్యలు ధనం చేజిక్కినందాక విటుని సేవిస్తుంటారు. అతను క్షీణధనుడని తెలియగానే అతనిని గడ్డిపరక కన్న హీనంగా విడిచిపెడతారు. ఎవడు సమర్థుడో కనిపెట్టి జనులు అతని చుట్టూ మూగుతారు; అసమర్థుని నీడకూడా చూడరు. శిష్యులు విద్య గడించినంతవరకే గురువును సేవిస్తారు; విద్య సమాప్తమైనంతనే ఆ గురువును వదిలివేస్తారు. ఋత్విజులు తమ దక్షిణ చేతిలో పడేవరకే యజమానుని ఆశ్రయిస్తారు. కాసు కరగతమైనంతనే అతనిని విడిచి పోతారు. పక్షులు పండ్లకోసం వృక్షాన్ని ఆశ్రయిస్తాయి. పండ్లు రాలిపోగానే ఆ చెట్టు వదిలి ఇంకొక గూడు వెతుక్కుంటాయి. అతిథులు

కడుపు నిండే వరకే దాతల ఇంటిలో తలదాచుకొంటారు. కడుపు నిండగానే ఆ ఇల్లు వదిలి వేరొక చోటు చూసుకొంటారు. మృగాలు కీకారణ్యాన్ని ఆశ్రయిస్తాయి. ఆ అరణ్యం దగ్ధమైననాడు అందులో కాలయినా మోపవు. విటుడు కామినిని భోగించి విడిచిపెడతాడు. ఇవన్నీ లోకదృష్టాలు కావా?' అన్నారు. రాజేంద్రా! అంతలో వారికి శ్రీకృష్ణుని బాల్య కైశోర చర్యలు జ్ఞాపకానికి వచ్చాయి. వారు మైమరచి విలపింపసాగారు. ఆ సమయంలో భ్రమరం ఒకటి ఝుంకారం చేస్తూ వారి చెంతకు వచ్చింది. గోపికలు దానిని నిమిత్తం చేసి సిగ్గువదిలి అన్యాపదేశంగా తమ భావాలను ఉద్ధవునికి ఈ విధంగా వెల్లడించారు.

## భ్రమరగీతలు

మధుపా! నీవు ధూర్తబంధుడవు కాబట్టి మా పాదాలను తాకవద్దు. నీ ధూర్తబంధుత్వం ఏమిటంటావా? ఆ సంగతి మమ్మల్ని అడగటం దేనికి? నీ మీసాల లోహితవర్ణాన్ని అడుగు. ఆ వర్ణం ఎక్కడినుంచి వచ్చిన దంటావా? సపత్నీజన కుచకుంకుమాంకితమైన నీ ప్రభుని వనమాలను తాకినందువల్ల నైజకృష్ణవర్ణము లైన నీ మీసాలు లోహితవర్ణానికి మారాయి. అటువంటి మీసాలతో వచ్చి మా పాదాలను తాకవద్దు. ఆ మానినీజనప్రసాదాన్ని ధరించి యదుపతి యాదవసభలో హాస్యపాత్రుడయితే కావచ్చును గాక. అతని దూతకు నీకూ ఆ గతి పట్టటం న్యాయమే కదా.

భ్రమరా! నీ మిత్రుడు మాకు చేసిన అపకారం ఏమిటని, అతనిని గూర్చి ఎందుకిలా అంటున్నామని, కారణం అడుగుతావు కాబోలు. అతను తన అధరసుధారసాన్ని మాకు గ్రోలనిచ్చి మమ్మల్ని, మోహవశులను చేసి వెళ్ళాడు. పుష్పరసాన్ని త్రాగి ఆ పుష్పాన్ని త్యజించే నీకిది తప్పుకాదు గదా.

అయ్యా! ఇంత అకృతజ్ఞుని పాదపద్మాలను శ్రీదేవి సేవించుకొంటున్నది; ఆమె ఎంత అమాయకురాలో గదా! సరి సరి, తెలిసిందిలే; ఆమె ఆ

ఉత్తమశ్లోకుని మాయలకు లొంగి అటువంటి గతికి చేరుకొన్నది. మేమంత వెర్రివాళ్ళము కాము.

షట్పదమా! ఆ యదుపతి గొప్పలను గురించి అంతగా పాడుతున్నావేమిటి? అతని సంగతి మాకు తెలియనిది కాదు. అతని మెరమెచ్చు మాటలకు ఎంత మాత్రం మోసపోము. ఆ విజయసుఖుని స్తుతిస్తున్నా నంటావా? అతని స్తుతులు విని ఆనందించేవారు ఇక్కడెవరూ లేరు. మథురానగరకామినుల వద్ద నీ పొగడ్తలను సాగించు. వారు నీ మిత్రునికి ప్రియసఖులై అతనివలన మనఃపీడను బాసినవారు కనుక అతని దూతవైన నిన్ను ఆదరించి మర్యాదలు చేసి, ఆ రూపేణ తమ కృతజ్ఞతను అతనికి తెలియజెప్పుకొంటారు.

'ఓహో! అతని కపట రుచిర హాస భ్రూవిజృంభణలకు లోనుగాని వనిత ముల్లోకాలలో ఉన్నట్లు లేదు. సిరి అంతటిది అతని అడుగులకు మడుగులొత్తుతుంటుంది. అటువంటివాడికి మేమొక లెక్కలోనివారము కాకపోయినా కృపణులకు మాత్రం మీ ప్రభువు ఒక్కడే ఉత్తమశ్లోకుడు. ఆ మాట మా మాటగా అతనికి జ్ఞాపకం చెయ్యి.

భ్రమరా! నీవు ముకుందశిక్షితుడవై చాటుకారితనంలో నేర్పు గడించి అతనికి దూతగా ఇక్కడికి వచ్చి అనునయవైదుష్యాన్ని ప్రకటించాలనుకొంటున్నావు కాబోలు. నీ నేర్పు ఎంతటిదో మేమెరుగుదుము. చాలు చాలు. మా పాదాలనుంచి నీ తలను తొలగించు. అయ్యో! అతనికి గాను మేము ఇహపరలోక సాధనసంపత్తి సమస్తం వదులుకొన్నాము. అతను మమ్మల్ని నట్టేట ముంచి మాయమయ్యాడు. ఆ చపలచిత్తునితో సంధానం కూర్చాలని నీ ప్రయత్నం. నీ రాయబారం సాగుతుందా? మీ ప్రభువు మహాధార్మికు డంటావా?

**శా. వాలిం జంపెను వేటకాని పగిదిన్ వంచించి, దైత్యానుజన్**
**లోలం బట్టి విరూపి జేసెను, బలిన్ లోభంబుతో గట్టి యా**

**త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్, ధర్మజ్ఞుఁడే? మాధవుం**
**డేలా షట్పద! యెగ్గు మా వలన నీ కెగ్గింపగా నేటికిన్.**

'అయ్యా! వేటగాళ్లు మాంసం కోసం వేటాడుతారు. మీ ప్రభువు వేటగాడు కాడన్నది లోకప్రసిద్ధం. అట్టివాడు వాలిని నిరర్థకంగా చంపాడు. ఎవరైనా వలచి వచ్చినప్పుడు కోరిక తీర్చటమో, కాదు పొమ్మనటమో చేస్తారు గాని కీడు చేయరు. శూర్పణఖ వలచి వచ్చింది. తాను ఏకపత్నీవ్రతుడనని ప్రియురాలికి ప్రదర్శించి ఆమెగారి మెప్పుపొందాలని అతను ఆ రక్కసి ముక్కుకోసి పాపం విరూపిని చేసి పంపాడు. బలిని మూడడుగుల నేల ఇమ్మన్నాడు. ఆ మహాదాత మొత్తం రాజ్యమే సమర్పించాడు. అడిగినది ఇచ్చినా ఇవ్వలేదని పాతాళానికి అణిచాడు. మీ ప్రభువు ధార్మికత్వం ఏమని పొగడగలము?

అయ్యా! నల్లనయ్యతో ఎన్నడూ చెలిమి చేయకూడదు. అలాగని ఊరుకుందామంటే మా ఇంద్రియాలు సమ్మతింపవు. కారణమేమంటావా? మా ఇంద్రియాలన్నీ అతని కథారసాన్ని గ్రోలి అతని యందే లీనమై మా మాట వినకపోవటమే కారణం. అతని కథలు త్రివర్గ లతాతతిని ఉన్మూలించి ద్వంద్వాదులను చీల్చి వైరాగ్యాన్ని పుట్టించేవే గాని రాగాదులను అంకురింపజేయవు అంటావా? అతని కథారసాన్ని బిందుమాత్రం గ్రోలినవారు కూడా భార్యాపుత్రవిత్తరూపక్లేశ సంసారాన్ని త్యజించి పక్షులవలె నిలువనీడ కూడా లేకుండా భిక్షాచరు లవుతారన్న మాట నిజమే. మా సంగతి ఏమంటావా?

**మ. కమనీయంబగు వేటకాని పలు కాకర్ణించి నిక్కంబుగాఁ**
**దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణనిర్భిన్నలై**
**యమితోగ్రవ్యథ నొందు భంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః**
**ఖములం జెందితి మంగజాస్త్రజనితోగ్రశ్రాంతి, నిందిందిరా!**

అయ్యా! ఇది ఎవరి దోషమంటావా? మా అజ్ఞానదోషమే కాని మీ మిత్రుని దోషం కాదు.'

రాజేంద్రా! గోపికలు ఈ విధంగా పలుకుతుండగానే భ్రమరం అక్కడి నుంచి ఎగిరి పోయి మరలి వచ్చి తిరిగి ఝుంకారం చేయసాగింది. గోపిక లదిచూసి, 'ప్రియసఖా! మా ప్రియుని సందేశాన్ని తీసుకొని మళ్ళీ వచ్చావా? మాకు నీవంటే ఎంతో గౌరవం. ఏమి కావాలో చెప్పు' అన్నారు. భ్రమరం ఝుంకరించింది. గోపికలు అది నిమిత్తం చేసి, 'ఏమిటీ! మా కోసం మమ్మల్ని వెంటబెట్టుకొని వెళ్ళాలని వచ్చానంటావా? అతని చెలిమి నీవూ చేశావు. అతనిని విడిచి ఉండటం ఎంత కష్టమో నీకూ స్వానుభవమే. నీవు మాత్రం అతని వద్దకు మమ్మల్ని ఎలా తీసికొని వెళ్ళగలవు? ఏమంటావా? లక్ష్మి ఆ మురళీధరుని హృదయపీఠిపై నిరంతరం నెలకొని ఉంటుంది. మేము వచ్చినా అక్కడ మాకు చోటేది? అదీగాక ఆమె మనసు నొచ్చుకొంటుందని భయపడి అతను మమ్మల్ని రానిస్తాడా? ఆ టక్కులమారి చేరదీయదలిచినా శ్రీకాంత సహిస్తుందా?' అని అడిగారు. ఆ తర్వాత ఉద్ధవుణ్ణి చూసి,

'సౌమ్యా! ఆర్యపుత్రుడు గురుకులవాసం ముగించుకొని వచ్చి మథురలో ఉన్నాడా? అతని తల్లిదండ్రులను గాని బంధువులను గాని గోపకులను గాని ఎన్నడయినా తలుచుకొంటాడా? అతని కింకరీజనమైనా కనీసం మమ్మల్ని గురించి ఏమైనా ప్రస్తావించటం జరుగుతుందా? అతని అగరుసుగంధిభుజాన్ని మా శిరోభాగాలపై ఆనించుకొనే భాగ్యం మాకు మళ్ళీ ఎన్నటికన్నా కలుగుతుందా?

**సీ. కాంచనరత్న సంఘటిత సౌధంబులే**
**మా కుటీరంబులు మాధవునకు**

**వివిధనరేంద్రసేవిత రాజధానియే**
**మా పల్లె యదువంశమండనునకు**

**సురభిపాదపలతాశోభితారామమే**
**మా యరణ్యము సింహమధ్యమునకు**
**గమనీయ లక్షణ గజతురంగంబులే**
**మా ధేనువులు కంసమర్దనునకు**

**తే. రూపవిభ్రమనైపుణరూఢ లైన**
**మగువలమె మేము మన్మథమన్మథునకు**
**నేల చింతించు మము గృష్ణుఁ డేల వలచు**
**బృథివి నధిపులు నూతనప్రియులు గారె!**

అని పలికారు.

## శ్రీకృష్ణుని సందేశం

రాజేంద్రా! ఉద్ధవుడు గోపికల మనోవేదనను గ్రహించాడు. వారి ప్రేమశీలానికి ముగ్ధుడయ్యాడు. 'కళ్యాణులారా! మీరు మీ హృదయాలను ఈ విధంగా భగవంతుడైన వాసుదేవునికి త్రికరణశుద్ధిగా సమర్పించినందువలన కృతార్థలు, లోకపూజితలు కాగలిగారు. కృష్ణుని యెడ స్థిరభక్తి కుదురుకొనటం అంత సులభసాధ్యం కాదు. అట్టి భక్తిని సాధింపగోరి కొందరు ధ్యానయోగాన్ని అభ్యసిస్తారు. కొందరు కఠోరవ్రతాలను ఆచరిస్తారు. కొందరు తీవ్రతపస్సులు చేయగా మరికొందరు జపహోమ స్వాధ్యాయపరు లవుతారు. ఎన్ని చేసినా ఏకాంతభక్తి కలగటమన్నది బహుదుర్లభం. వారి సంగతీ వీరి సంగతీ అనుకోవటమెందుకు? నిరంతర హరినామస్మరణపరాయణులైన మహామునులు సయితం అటువంటి భక్తికోసం ప్రాకులాడుతుంటారు. అనన్యమైన అట్టి భక్తిని మీరు సాధింపగలిగారు. మీ భాగ్యం ఏమని చెప్పను? మీ వలన ప్రేమభక్తితత్త్వాన్ని నేనిప్పుడు తెలుసుకొన్నాను. నన్ను మీరు ఈ విధంగా అనుగ్రహించినందు వలన నేను మీకెంతో కృతజ్ఞతాబద్ధుడనై ఋణపడి ఉన్నాను.

కళ్యాణులారా! నేను కృష్ణునికి పరిచరమాత్రుడినే కాదు; రహస్యకార్యకరుడ నైన అంతరంగమిత్రుడిని. అందువలన ఆ మహాత్ముడు తన సందేశాన్ని తెలియజెప్పమని నన్ను మీ వద్దకు పంపించాడు. ఏమి సందేశం తెచ్చావో వినిపించు? అని మీరడుగక ముందే చెబుతున్నాను వినండి.

'ప్రాణప్రియలారా! నేను మిమ్మల్ని విడిచివెళ్ళానని భావింపకండి. నాకు, నా భక్తులకు వియోగం ఎన్నడూ లేదు. నేనెక్కడో ఉండి వియోగం లేకపోవటం ఏమిటని అంటారేమో? నేను సర్వాత్ముడను. నేను లేని చోటులేదు. ఇప్పుడు మీవద్ద లేనంటారా? సమస్తచరాచరాలు పంచభూతముల చేత రచింపబడినవి; ఆ పంచభూతాలు నా మాయాశక్తి యొక్క కార్యాలు; నా శక్తికీ నాకూ వియోగం ఎన్నడూ లేదు. మేము వాగర్థాలవంటివారము. శరీరములన్నీ పంచభూత వినిర్మితాలు. పంచభూతాలతో అనుగతుడనై నేను ప్రతిశరీరం లోనూ ఉంటాను. అంతర్గతుడనైన నన్ను ఆశ్రయించి మనోబుద్ధీంద్రియాలు వర్తిల్లుతున్నాయి. మీలోనే ఉండి నేను మీ వ్యవహృతు లన్నింటినీ పరికిస్తూనే ఉన్నాను. కాబట్టి నేను మీయందే ఉన్నాను. మిమ్ము ఎడబాసి ఎక్కడో ఉన్నానని అనుకోవద్దు.

కళ్యాణులారా! నిత్యసిద్ధుడనైన నాకు సృజ్యాదిరూపత ఎక్కడిది? అంటే చెబుతున్నాను: అది బుద్ధీంద్రియాదుల రూపంలో ఉంటుంది. నిర్వికారునికి రూపవికారం ఎలాగంటారా? నా శక్తిప్రభావం వలన నేను రూపుదాల్చినట్లు కనుపిస్తుంటాను. వాస్తవానికి నాకు ఎటువంటి వికారమూ కలుగదు. రూపం దాల్చినప్పుడు తద్రూపసంబంధదోషాలు ఆ రూపంలో ఉన్న నాకు అంటవా? అని అడుగుతారేమో. కాని ఆత్ముడు నిత్యశుద్ధుడు; నిత్యశుద్ధునికి ఎటువంటి దోషాలూ అన్వయింపవు. దోషస్పర్శ కలిగితే అతను నిత్యశుద్ధుడు కావటం సంభవించదు. దోషభూయిష్ఠమైన శరీరంలో ఉంటూ ఆ దోషాలు అంటకపోవటానికి కారణం ఏమిటని అడుగుతారేమో? సంపర్కాదికం అంతా అజ్ఞానమూలకం. ఆత్ముడు జ్ఞానమయుడు. జ్ఞానమయుని యందు అజ్ఞానం

ఉండటానికి వీలులేదు. అజ్ఞానం ఎప్పుడు లేదో అజ్ఞానమూలములైన సంపర్కాదులు కూడా ఉండవని భావం. ఆత్మ స్వసంవేద్యం అయినప్పటికీ అది అహంప్రత్యయమని, అహం (నేను) అనే ప్రత్యయంతో పాటు నానావస్థత్వం తప్పదని, అట్టిదానికి శుద్ధత ఎలా కలుగుతుందని శంకిస్తారా? ఆత్ముడు నిత్యపరిశుద్ధుడై గుణసంబంధం లేక ఉంటాడు. శరీరంలో మనస్సనేది ఒకటున్నది. ఆ మనస్సుకు జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అనే మూడవస్థ లున్నాయి. వాటిని మనోవృత్తు లంటారు. ఆత్ముడు ఆయా మనోవృత్తులలో ప్రతీయమానుడై క్రమంగా విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అనే పేర్లతో ఉంటాడు. ఈ భేదాలన్నీ మనోవృత్తిభేదధర్మాలే గాని ఆత్మునియందు ఎటువంటి మార్పు ఉండదు. తెల్లని నల్లని పచ్చని రంగుల అద్దాలను దీపం ఎదుట ఉంచినప్పుడు ఆ అద్దాలలో ప్రతిబింబించే దీపం ఆయా అద్దాల రంగులో ప్రకాశించటం చూశారుకదా. ఈ వివిధ వర్ణాలు దీపంలో ఉన్నవేనా?

కళ్యాణులారా! ఈ మనోవృత్తులలో కానవచ్చే అర్థాలు సత్యాలుకావు. స్వప్నదృష్టాల వంటివి మాత్రమే. కాబట్టి ఇంద్రియార్థాలు ఎన్నటికీ సత్యాలు కావు. అసత్యాలను సత్యాలనుకోవటం వలన సర్వానర్థాలూ కలుగుతున్నాయి. సత్యమంటే ఏమిటంటారా? త్రికాలాలలోనూ మార్పులేనిది సత్యం. అర్థములన్నవి తాత్కాలిక సత్యాలు మాత్రమే. ఎందుకంటారా? వాటిలో మార్పు కలుగుతున్నది గనుక. కలలో కనబడిన వస్తువు ఆ సమయంలో సత్యమనే అనిపించినా మేల్కాంచినప్పుడది కనపడడం లేదు కదా. కలలోని వస్తువు కోసం జాగ్రదవస్థలో వెతకటం దుఃఖమాత్రమే గాని ఫలం ఉంటుందా?

కళ్యాణులారా! సత్యాన్ని గ్రహించటం ఎలాగంటారా? ఇంద్రియార్థాల నుంచి మనస్సును మరలించినప్పుడు సత్యము గ్రాహ్యమవుతుంది. ఆ విధంగా చేసినవారికి సర్వశుభాలూ

కలుగుతాయి. ఇంద్రియార్థాలను ధ్యానింపగానే మనస్సు తదర్థాలలో సంగాన్ని పొందుతుంది. సంగం వలన సర్వానర్థాలూ కలుగుతున్నాయి. కాబట్టి నిరోధాన్ని మొట్టమొదట సాధించాలి.

కళ్యాణులారా! ఈ మనోనిరోధార్థమై అష్టాంగయోగాన్ని కొందరు, ఆత్మానాత్మరూప సాంఖ్యయోగాన్ని కొందరు, సన్న్యాసం కొందరు, తపస్సు కొందరు, దమాన్ని కొందరు అనుష్ఠించటం ఉన్నది. ఏ మార్గంలో ప్రయాణించినా ఫలం మాత్రం ఒక్కటే. వర్షపు నీరు ఎన్ని వంకలై వాగులై నదులై ప్రవహించినా వాటన్నిటికీ గమ్యం సముద్రమే అయినట్లు సర్వయోగాలకూ మనోనిరోధమే ఫలం.

కళ్యాణులారా! మీరు నాయందే మదినిల్పి విహరించిన మాట నిజం. అట్టివారికి మీకు ఆత్మవిద్యను నేర్పి మిమ్ము ప్రలోభింప చేస్తున్నానని భావింపకండి. ప్రేమించిన వస్తువు దగ్గర ఉన్నప్పటి కంటె దూరాన ఉన్నప్పుడు దానిని మరీ మరీ కోరుకొనటమూ, దానిని పొందటానికి నిరంతర ధ్యానపరులు కావటమూ సహజమే. ఈ తత్త్వం స్త్రీలలో మరింత అధికం. ఆ మేలు మీకు కూర్పగోరి మీ చూడ్కికి కొంత దూరమయ్యాను.

సాధ్వీమణులారా! మీరు సర్వవృత్తులూ మాని మీ మనస్సులను నాయందే నిలిపి నన్ను ధ్యానిస్తూ నా తోడిదే లోకంగా ఉన్నారు. కాబట్టి నన్ను త్వరగా చేరుకొంటారు. మతి యెంతో గతి అంత.

మానినీమణులారా! నాటి రాత్రి రాసక్రీడార్థం నన్ను చేరుకొనటానికి మీలో కొందరు ప్రయత్నించినా భర్తల వలన ఆపబడి గత్యంతరం లేక నాయందే హృదయాలను నిలిపి ఇంట తహతహలాడారు. అందుకని వారు జంకుగొంకులు పడనక్కరలేదు. ఇంట నున్నప్పటికీ వారు నన్నే ధ్యానించారు. కనుక వారు కూడా నన్నే పొందుతారు.’

ఓ కళ్యాణులారా! ఈ మాటలు మీకు చెప్పమని శ్రీకృష్ణభగవానుడు నన్నిక్కడికి పంపాడు.'

## గోపికల దుఃఖం

రాజేంద్రా! ఉద్ధవుడు శ్రీకృష్ణుని నుంచి తెచ్చిన సందేశాన్ని వినిపింపగానే గోపికలు విని, 'అయ్యా! కంసుడు యాదవులకు కీడు వెతకటమే పనిగా ఉండేవాడు. అతను హితులతో పాటు తెగటారాడు. కృష్ణుడు తన ఆప్తులకు సర్వార్థాలను సమకూర్చాడు. ఆ నందనందనుడు ఇప్పుడక్కడ కుశలమే కదా. మధురానగర స్త్రీలు అతని ప్రేమకు నోచుకొన్నారు కదా. నాగరిక నారీమణుల మృదుమధుర వచనవిలాసాలకు తగులుకొనక ఎలా ఉంటాడులే? వారితోడిదే లోకం అనుకొనే గోవిందుడు గ్రామ్యస్త్రీలను మావంటివారిని పరాకున అయినా జ్ఞాపకం చేసుకొంటాడా? చల్లని వెన్నెలలో బృందావనంలో మాతో రాసక్రీడ జరిపిన రాత్రులు అతని మదిలో ఎన్నడైనా మెదులుతాయా? అతని వియోగమనే మహాగ్నిలో కనలుతున్న మమ్ము బ్రతికించటానికి ఆ దయానిధి వస్తాడా?

అయ్యో! మా పిచ్చి గాకపోతే మరేమిటి? నిశ్శాత్రవంగా రాజ్యం అతనికి దక్కింది; కోరిన రాచకన్యలు అక్కడెందరో ఉన్నారు. కృష్ణుడు వారితో అక్కడ హాయిగా కాలం గడపక ఈ పల్లె పట్టు గోపికల కోసం ఎందుకువస్తాడు? అయ్యా! ఆశలను వదులుకోవటమే అసలు సౌఖ్యమని పూర్వం పింగళ అనే స్వైరిణి తన అనుభవాన్ని ఒక్క మాటలో చెప్పిందట. ఆ మాట మాకూ ఈనాడు స్వానుభవంలో తెలిసివచ్చింది. అయ్యయ్యో! తత్త్వం ఇదని తెలిసినా మాకు కృష్ణునిపై కోరిక మాత్రం అణగారదు. ఇది మా తప్పు కాదు. ఎవరి తప్పంటావా? కృష్ణుని తప్పే. రమాదేవి అంతటి మహాభాగ్యురాలు. తనను కోరనివానిని కోరి ఏదో ఒక తీరున అతని మనసులో చోటుచేసుకొని ఆ చోటు చేజారకుండా అతని వక్షఃస్థలాన్ని ఆక్రమించింది. ఇక మాబోంట్ల సంగతి వేరే

చెప్పాలా? అతను ప్రేమించినా ప్రేమింపకపోయినా మేము మాత్రం ప్రేమింపకమానము.

అయ్యా! కృష్ణుడు బలరామసహితుడై సంచరించిన నదీనద వన గిరిప్రదేశాలను తలచినప్పుడు, నందనందనుడు కాచిన గోవులను చూచినప్పుడు, ఆతని వేణునాదాలను స్మరించినప్పుడు అతను మా కన్నుల ఎదుట ఉన్నట్లే ఉంటుంది. ఇదిగో! లక్ష్మీనివాసములైన అతని అడుగు జాడలు ఇంకా మాయనే లేదు. ఈ జాడలను చూస్తూ అతనిని ఎలా మరచిపోగలము? అతని రూపగమనాది విలాసాలు మా నయనేంద్రియాలను, అతని మృదుమధురవచనాలు మా కర్ణేంద్రియాలను, అతని లలిత దరహాసాలు మా హృదయాలను దోచుకొన్నాయి. అతని చూపులు మమ్మల్ని వివశలను చేశాయి. మేమతనికి సర్వేంద్రియ సమర్పణ కావించి రిక్తలమై సమస్తం మరచిపోయాము. ఇంకా ఏమి చెప్పమంటావు?' అని పలికి, 'నాథా! రమానాథా! వ్రజనాథా! ఆర్తిహరా! గోకులమంతా దుఃఖార్ణవంలో మునిగి ఉన్నది. ఇకనైనా ఉద్ధరింపవా?' అని ఉద్ధవుడే కృష్ణుడుగా కృష్ణుడే ఆత్ముడుగా భావించి ఆ ఉద్ధవుని పూజించారు.

**సీ. తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీద**
**నేలపై మేనులు నిలువ వనుము**

**నేలపై మేనులు నిలువక యటమున్న**
**ధైర్యంబు లొక్కట దలఁగు ననుము**

**ధైర్యంబు లొక్కట దలఁగిన పిమ్మటఁ**
**జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము**

**చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చిన**
**బ్రాణంబు లుండక పాయు ననుము**

**తే. ప్రాణములు వోవ మతివచ్చి ప్రాణవిభుఁడు**
**ప్రాణిరక్షకుఁ డగు తన్నుఁ బ్రాణులెల్లఁ**
**జేరి దూఱంగ మతియేమి సేయువాఁడు**
**వేగ విన్నప మొనరింపవే? మహాత్మ?'**

అని దుఃఖార్ణవమగ్నలై ప్రతిసందేశం ఇచ్చారు.

## ఉద్ధవుని ఆశ్చర్యం

రాజేంద్రా! ఉద్ధవుడు గోపికల భావశుద్ధికి మహాశ్చర్యపరుడై వారి మనః ప్రీతికి గాను కొన్ని నెలలు అక్కడే ఉండిపోయాడు. ఉద్ధవు దున్నంతకాలం వ్రజవాసులకు క్షణప్రాయంగా గడిచిపోయింది. ఉద్ధవుడు గోపికల తత్త్వాన్ని చక్కగా పరిశీలించి, 'ఓహో! మునులు సంసారవీతులై గోవింద పాదారవింద మకరందాన్ని కోరుకొంటారు. మా బోంట్లు భక్తి ప్రసాదనార్థం అతనిని ప్రార్థిస్తారు. ఈ గోపికలంటేనో, సంసారం వదలరు; ఏ కోరికలూ కోరరు; కృష్ణుని యెడ నిర్వ్యాజభక్తి వీరిది. వీరి జన్మ నిజంగా సార్థకం. భగవత్కథాసాత్ములకు శౌక్ల సావిత్ర యాజ్ఞికాలనే మూడు బ్రహ్మజన్మ లెందుకు? అట్టి రసాత్ములు కానివారికి ఆ జన్మలు కలిగి ఫలమేమిటి? ఈ గోపికలు కారడవులలో కాపురం చేస్తారు. ఏ చదువులూ చదివి యెరగరు. స్త్రీలు కాబట్టి వీరి స్వభావం చంచలమై ఉండటం సహజం. అటువంటిది వీరెక్కడ? భగవానుని మీద వీరికి గల ఈ పరమభక్తి ఎక్కడ? ఈశ్వరానుగ్రహానికి తెలివితేటలు గాని కులగోత్రాలు గాని ముఖ్యం కాదు. నిండు భక్తి ఒక్కటే చాలు.

ఓహో! వీరియెడ భగవత్ప్రసాదం అత్యపూర్వమై ప్రసరించింది. నిత్యైకాంతరత అయిన ఇందిరాదేవికి కూడా ఇంతటి మహాభాగ్యం కలుగలేదు. ఆనాడు రాసక్రీడలలో వీరికి ప్రాప్తమైన శ్రీకృష్ణబాహుదండ కంఠాలింగనఫలంగా ఇట్టి మహాప్రసాదం లభించిందే కాని వేరొక కారణం ఉన్నట్లు లేదు. కళ్యాణులారా! తమవారిని ఎడబాసి ఉండటం ఎంతటి

వారికయినా కష్టమే. అంతటి కష్టకార్యానికి కూడా మీరు వెనుదీయలేదు. సర్వార్థసాధనకూ ధర్మమే మూలం. దానిని కూడా మీరు త్యజింపగలిగారు. ఎట్టకేలకు శ్రుతిమృగ్యమైన ముకుందపదాన్ని చూరగొన్నారు. పరమపుణ్యవతులారా! మీ పాదరేణువు పైని సోకితేనే చాలు. అందుకుగాను నేను బృందావనంలో చెట్టుగానో, గుట్టగానో, తీగెగానో, ఓషధిగానో జన్మిస్తాను గాక. మీ బృందావన విహారవేళలలో మీ పాదధూళి నాపై పడుతుంది గాక!

ఏ పాదారవిందాన్ని ప్రాప్తకాములైన యోగీశ్వరులు కూడా నిత్యం అర్చిస్తుంటారో, ఏ పాదారవిందాన్ని శ్రీదేవి నిరంతరం సేవిస్తున్నదో, ఆ పరమపావన పాదారవిందాన్ని స్తనమండలాన మోపికొని సర్వసంతాపాలను తొలగించుకొన్నారు. అంతేకాదు. భగవానుని కథామృతాన్ని గ్రోలి తనివి చెందినది చాలక ముల్లోకాలకు చూరలిచ్చారు. మీవంటి ధన్యధన్యలు వేరొకరుండరు. ఇదే మీ చరణాలకు వందనం' అని లోలోపలే నమస్కరింపసాగాడు.

## మథురకు ప్రయాణం

ఆ విధంగా ఉద్ధవుడు కొన్నాళ్ళు వ్రేపల్లెలో గడిపి గోపికాగోపకులను, యశోదానందులను వీడ్కొని మథురాప్రయాణానికి సన్నద్ధు డయ్యాడు. నందాదు లతనికి పలువిధాల కానుక లర్పించి తమ అనురాగాతిశయాన్ని కన్నీటితో ప్రకటిస్తూ, 'మహాత్మా! మా మనోవృత్తులన్నీ శ్రీకృష్ణపాదకమలాలను ఆశ్రయించుకొని ఉన్నాయి. మా వాగ్వృత్తి శ్రీకృష్ణనామకీర్తనైకపరమై ఉన్నది. మా కాయవృత్తులు శ్రీకృష్ణనమస్కారైకపరాయణాలు. ఈ ప్రకారం మా మనోవాక్కాయాలు మూడూ అతనికి వశమయ్యాయి. మా కర్మానుబంధం ఎప్పుడు తీరుతుందో, అది తీరటానికి ఇంకా ఎన్ని జన్మలెత్తాలో, సంసారపరిభ్రమణ లెన్నింటిని అనుభవించాలో తెలియదు. ఎన్ని జన్మలెత్తినా సరే; ఏ శరీరం వచ్చినా సరే, ఈశ్వరానుగ్రహపాత్రులమై

మంగళాచారనియమాలు తప్పక దానశీలం ధర్మశీలం కలిగి కృష్ణాభిరాములము కావాలని మా కోరిక. ఇంకే కోరికా లేదు' అని చెప్పి, 'మహాశయా! ఇదే మా పరమప్రార్థనం' అంటూ శ్రీకృష్ణ భక్తి పరాయణులై అతనిని పూజించారు. ఉద్ధవుడు వారి పూజలు గ్రహించి, రథారూఢుడై మథురానగరం చేరి కృష్ణునికి ప్రణామం చేసి వ్రజవాసుల పరమభక్తిని ఆయనకు తెలిపి వారిచ్చిన కానుకలను సమర్పించాడు.

## త్రివక్రకు అభీష్టదానం

రాజేంద్రా! ఆనాడు కుబ్జ తన యింటికి కృష్ణుని రాగోరినదని చెప్పాను. కృష్ణుడు సర్వాత్ముడు సర్వదర్శనుడు కాబట్టి ఆమె మనోభావాన్ని గ్రహించి తప్పక వస్తానని మాటయిచ్చాడు. ఒకనాడు భగవానుడు ఉద్ధవుని వెంటబెట్టుకొని కుబ్జ ఇంటికి వచ్చాడు.

ఆ కుబ్జ గృహం వివిధ చిత్ర విచిత్ర గృహోపకరణాలతో కామోద్దీపక చిత్రపటాలతో ముక్తాహార కేతనాలతో వితానశయనాసనాలతో నిండి సురభి ధూప చందన మాలికాది వాసనలతో సుస్నిగ్ధదీపకాంతులతో పరమశోభావహంగా వెలుగొందుతున్నది. కృష్ణుడు దూరంనుంచి వస్తుండగా చూసి ఆ దాసి తత్తరపడుతూ లేచి సఖులతో ఎదురేగి ఇంటిలోనికి సగౌరవంగా ఆహ్వానించి ఉత్తమాసనం పైని కూర్చుండబెట్టి యథోచితపూజలొనర్చి ఉద్ధవునికి సత్కారాలు కావించి అతనికి కృష్ణునిచెంతనే ఒక అర్ఘ్యాసనం అమర్చింది. ఉద్ధవు డా ఆసనాన్ని చేతితో స్పృశించి కృష్ణుని వెంబడి నేలమీద కూర్చున్నాడు.

అంత కృష్ణుడు లోకవిడంబనను అనుసరించి ఆమె సిద్ధపరిచిన శయ్య వద్దకు నడిచాడు. ఆ యింతి అంతట నీరాడి దివ్యాంబరం ధరించి రత్నాభరణాలు దాల్చి సుగంధాలు అలదికొని నెత్తావి పువ్వులు తురిమి అమృతాన్ని పోలిన ఆసవాన్ని గ్రోలి తమ్ములం నములుతూ లజ్జాలలితలీలాస్మితము లైన క్రీగంటిచూపులతో కృష్ణునితో చూపులు కలిపి

నూత్నసంగమక్రీడావశాన జంకినదాని వలె వచ్చి ఒక ఓరున నిలబడింది. కృష్ణుడు చేయిజాపి ఆ మదవతి కంకణాలంకృతకరాన్ని అందుకొని చెంతకు జేర్చి మైపూత అలది పాన్పుపైకి చేర్చి రమించాడు. ఆ మగువ మాధవుని పాణిపల్లవాలను తన భుజలతలతో బంధించి చేతిలో చేయివేసి మదనతాపసంతప్తములైన తన గుండెల మీదకి చేర్చి వక్షఃస్థలాన దాల్చి కందోయిపై నిగిడ్చి గాఢంగా ముద్దుపెట్టుకొని కుచాంతరస్థు డైన ఆ ఆనందమూర్తిని బిగికౌగిట దాల్చి మన్మథతాపం శమించిన తర్వాత 'ఓ ప్రియతమా! నిన్ను విడువలేను. నాతో ఇంకా కొన్నాళ్ళు సుఖించు' అని ప్రార్థించింది. కృష్ణుడు సరేనని ఉద్ధవునితో కొన్నాళ్ళు ఆమె యింట నిలిచి ఆమె కోరిక తీర్చాడు. రవ్వంత గంధం పెట్టినందుకు గాను భగవానుడు ఆమెకు అంతటి ప్రీతిగూర్చాడు. అయినా త్రివక్ర వంటి నిర్భాగ్యురాలుండదు.

**క. ఏ వేదంబులఁ గానని**
**దేవోత్తము గాంచి ముక్తితెరు వడుగక రా**
**జీవేక్షణ రతి యడిగెను**
**భావింపఁ దదీయ కర్మఫల మెట్టిదియో!**

## అక్రూరుని ప్రార్థన

రాజేంద్రా! అక్రూరుడు రామకృష్ణులను మథురకు తీసికొనివచ్చినపుడు తనకు విందుగా రమ్మని వారిని కోరిన సంగతి చెప్పాను. కృష్ణ డా మాట మనసులో ఉండి అతని కోరిక నెరవేర్చాలని సంకల్పించాడు. అదీ గాక భగవానునకు అక్రూరునితో కొంత పని కూడా ఉన్నది. రెండూ ఒకసారే తీరుతాయని భగవాను డొకనాడు బలరామోద్ధవులను వెంటగొని అక్రూరుని ఇంటికి వెళ్ళాడు.

అక్రూరుడు దూరాననే ఆ ముగ్గురూ వస్తుండటం చూసి పరమసంతోషభరితుడై ఎదురేగి వారిని లోనికి ఆహ్వానించి పాదాలకు నమస్కరించి లేచి కౌగిట చేర్చి ఉత్తమాసనాలపై కూర్చుండబెట్టి కాళ్ళు కడిగి

ఆ పవిత్రజలాలను తలదాల్చి దివ్యాంబర చందన మాల్యాదులతో పూజించి రామకృష్ణుల పాదాలను తన తొడపై నిలుపుకొని మెల్లమెల్లగా ఒత్తుతూ వారితో ఈ విధంగా తన మనసులోని మాటను వెల్లడించాడు.

'ఆ కంసుడు మహాపాపాత్ముడు. ఏ భాగ్యవిశేషాననో అతను అనుచర సమేతంగా మీ చేతిలో చావటం జరిగింది. అతనిని చంపి దురంతకుల కష్టాలను తీర్చావు. మీ వలన కులమంతా వర్ధిల్లింది. మీరు జగత్కారణులు జగన్మయులు అయిన ప్రధానపురుషులు. మీకన్న పరమకారణం వేరొకటి కలుగదు; అపరమైన కార్యమూ లేదు. నా మాటలు ప్రత్యక్షసిద్ధానికి విరుద్ధాలు కావు.

> పరమేశ్వరా! కృష్ణా! నీవు నీ శక్తి నధిష్ఠించి విశ్వరూపాన్ని ధరించావు. అందువలన కారణ కార్యములు రెండూ నీవేనని చెప్పాలి. సృష్టికి నానాత్వం ఏ విధంగా కలిగినదనే ప్రశ్న ఉన్నది. పంచభూతాలు వివిధాంశలతో చరాచరములందు చేరి నానాప్రకారములుగా భాసిస్తున్నట్లు ఆత్ముడవైన నీవు నీ కారకములైన భూత భౌతిక నర మృగాదిరూపాలలోనూ బాలయువాద్యవస్థల లోనూ కానవస్తుంటావు. విశ్వ సృష్టి స్థితిలయ కార్యములన్నీ నీ శక్తిగుణకార్యాలు. ఆ విధంగా ఉన్నప్పటికీ నీవు తద్గుణబద్ధుడవు కావు. అయినా గుణబద్ధుని వలె గోచరిస్తావు. జీవుల అవిద్యే అందుకు కారణం. అవిద్య వలన భ్రాంతిపుట్టి నిన్ను గుణబద్ధుని వలె తోపింపజేస్తుంది. జ్ఞానోదయం అయితే అవిద్య, అవిద్యతో భ్రాంతి క్రమక్రమంగా తొలగిపోతాయి. నీ స్వరూపం బోధపడుతుంది.

స్వామీ! ఆత్మకు బంధముక్తు లన్నవి ఎన్నడూ లేవు. బంధముక్తులు బుద్ధిగతాలు. అజ్ఞులు బుద్ధిమాంద్యజనితోన్మాదులై బంధముక్తులను నీకు

ఆరోపిస్తున్నారు. దేహాద్యుపాధులన్నీ అనిత్యాలు, మిథ్యాపదార్థాలు అయినట్టివి. నిత్యునకు నీకు అనిత్యాలతో సంబంధం ఎందుకు కలుగుతుంది? సంబంధమే కలుగనేరనినాడు నీవట్టి ఉపాధులలో జన్మించటం ఎలా వీలవుతుంది? జన్మమే నీకు లేనప్పుడు ఉపాధిమూలక భేదాలు నీకెక్కడివి? పరమేశ్వరా! నీ తత్త్వం ఎరుగకపోవటం వల్లనే ఇన్ని భ్రాంతులు కలుగుతున్నాయి.

స్వామీ! జన్మమే నీకు కలుగదన్నంతనే నీ అవతారాల సంగతేమిటని అడుగుతారు. దురాచారులు కొందరు జన్మించి వారి కర్మఫలంగా పాషండమతపరులై పేలుతుంటే విని ఆ కువాదాలను నమ్మి అవిద్యోపహతులైన జనులు పురాణవేదమార్గానికి చేటుకావించినప్పుడు లోకహితార్థం నీవు నీ శక్తిని అధిష్ఠించి సత్త్వగుణాన్ని పూని అవతరిస్తుంటావు. ఈ రహస్యం నీవు తెలిపినదే. దీనికి వేరే సమాధానం ఎందుకు?

రాక్షసులు అక్షౌహిణీసంఖ్యాకంగా జనించి ప్రభువులై దుర్వృత్తి నవలంబించి భూమికి భారమయ్యారు. భూభారం తగ్గించటానికి నిజాంశతో వసుదేవుని గృహమందు అవతరించి యదుకులాన్ని అనుగ్రహించావు. విశ్వమూర్తీ! నీ పాదనిర్గతజలం గంగానదియై ముల్లోకాలనూ పవిత్రీకరిస్తున్నది. నీ పాదతోయజ అయిన గంగకే అంత శక్తి కలుగగా మీ పాదాల మహిమ ఏమని వర్ణింపగలను?

దేవా! నీకు వృద్ధిక్షయాలు కలుగవు. ఎల్లప్పుడు ఏకరాశివై ఉంటావు. నీవొక్కడవే నిక్కమైన సుహృదుడవు. భక్తులంటే ప్రాణం ఇస్తావు. నీకై ఇసుమంత చేసినా దానిని కొండంతగా భావించి వేయి మడుగు లుపకరిస్తావు. అడిగినది లేదనవు; ఆడినమాట తప్పవు. ఇట్టి నిన్ను కాదని వేరొక్కని ఆశ్రయించటం కంటె మౌఢ్యం ఉన్నదా? అంతకన్న దారిద్ర్యం ఉన్నదా? నీ దర్శనార్థం యోగీశ్వరు లంతటివారు ప్రాకులాడుతుంటారు.

**"శా. ఏ పుణ్యాతిశయప్రభావముననో యీ జన్మమం దిక్కడన్**
**నీ పాదంబులు గంటి నిన్నెఱిఁగితిన్, నీవుం గృపాళుండవై**
**నాపై నర్మిలిఁజేసి మాన్పఁగదవే నానాధనాగార కాం**
**తా పుత్త్రాదులతోడి బంధనము, భక్తవ్రాతచింతామణీ!"**

అని ప్రార్థించాడు.

## సాధుసేవామాహాత్మ్యం

రాజేంద్రా! అక్రూరుని పలుకులు కృష్ణుడు విని, 'ఆర్యా! నీవు మాకు శ్లాఘ్యబంధుడవే గాక పితృవ్యుడవు. అందువల్ల గురుదేవుడవు అవుతావు. మేము మీ బిడ్డలము; మీ దయారక్షణలకు పాత్రులము. శ్రేయస్కాములకు ఎంతో సేవనీయుడవు. దేవతలను సేవించటం లోకప్రసిద్ధమంటావా? దేవతలు స్వార్థపరులు. సాధువులో? పరార్థపరులు. కనుక దేవతల కంటె సాధువులే పరమ సేవనీయులని చెప్పాలి.

ఆర్యా! మట్టి బొమ్మలలో, రాతి విగ్రహాలలో వివిధ రూపాలలో ఉన్న దేవతలను సేవిస్తామంటావా? ఉన్నతులు ఏ రూపంలో ఉన్నా సేవింపదగినవారే. ఆ సేవించటం మృచ్ఛిలాదులను కాదు. వాటియందు ఆరోపింపబడిన దేవతాది తత్త్వాలను సేవించాలి. అట్టి సేవలన్నీ ఫలిస్తాయన్నమాట నిజమే. అయితే ఆ విధమైన సేవకు, సాధుసేవకు మహదంతరం ఉన్నది. ఏమంటావా? సాధుసేవ వెంటనే ఫలాన్నిస్తుంది. దేవతాదుల సేవ కాలాంతరంలో ఫలకారి అవుతుంది.

## శ్రీకృష్ణుని ఆదేశం

అక్రూరా! అట్టి సాధూత్తముని నిన్ను నీ సుహృదులమైన మేము ఒక్క కోరిక కోరుతున్నాము. పాండవులు మా మేనత్త కొడుకులన్న సంగతి నీకు తెలిసినదే కదా. వారు బాల్యంలోనే తండ్రిని కోల్పోవటం, తల్లితోపాటు ధృతరాష్ట్రుని పంచజేరి హస్తినలో ఉండటం ఆ విషయాలు నీకు తెలియనివి

కావు. ఆంబికేయుడు తన కొడుకులు చేయిదాటిపోతున్నా వారి మాట కాదనడట. అందువలన పాండవులకు సరియైన ఆదరం కలుగదట. నీవు కరిపురానికి పోయి పాండవుల కుశలక్షేమాలు తెలుసుకొని మనము విన్న వార్త నిజమో కాదో విచారించి రావాలి. నీవు వచ్చిన తర్వాత వారికి ఏది మేలో అదే చేద్దాము' అని చెప్పి బలరామోద్ధవులతో నిజగృహానికి మరలివెళ్ళాడు.

## పాండవుల స్థితిగతులు

రాజేంద్రా! అక్రూరు డందుకు అంగీకరించి, వెంటనే ప్రయాణమై కౌరవుల రాజధాని అయిన హస్తిపురం చేరుకొని ధృతరాష్ట్ర భీష్మ విదురులను కుంతీదేవిని బాహ్లిక సోమదత్తులను ద్రోణ కృపాచార్యులను అశ్వత్థామ కర్ణ దుర్యోధనులను పాండవులను తక్కిన మిత్రులను ఒక్కొక్కరినీ సందర్శించి కుశలప్రశ్నాదులు కావించి వారికి విందయి అక్కడే కొన్ని నెలలు వసించి తాను వచ్చిన సంగతిని గూర్చి యథామతి వివరించాడు. పాండునందనుల శౌర్య ధైర్య ప్రతాప వీర్యౌదార్యవినయాది సద్గుణాలకు ప్రజలు వారియెడ అత్యంతానురాగం నెరపుతుండటం, అది ధార్తరాష్ట్రులకు కన్నుకుట్టుగా ఉండటం, ఆ కారణాన వారు పాండవులకు విషాన్నం పెట్టటం మొదలుగా నానాబాధలకు గురిచేసిన సంగతులను అక్రూరుడు అక్కడక్కడ విని విదురునితో మాట్లాడి విన్నదంతా నిజమేనని రూఢిపరుచుకొన్నాడు.

## కుంతీ సందర్శనం

ఒకనాడు కుంతీదేవి అక్రూరుడు విడిదిచేసిన చోటికి వెళ్ళింది. అప్పుడు విదురుడు కూడా అక్కడే ఉన్నాడు. ఆమె అక్రూరుని చూసి కళ్ళనీళ్ళు పెట్టుకొని, 'సౌమ్యా! జననీజనకులు సోదరీసోదరులు బిడ్డలు కులస్త్రీలు సఖులు అందరూ సుఖమే కదా. ఎన్నడయినా వారికి మేము జ్ఞాపకం వస్తుంటామా? మా అన్న వసుదేవుని కొడుకులైన రామకృష్ణులు వారి మేనత్త కొడుకులను గురించి ఎప్పుడయినా ప్రస్తావిస్తుంటారా? తోడేళ్ళ నడుమ చిక్కిన

లేళ్ళవలె మేమిక్కడ చిక్కుకొని ఉన్నాము. ఈ పసివాళ్ళు తండ్రి లేనివారై పడరాని కష్టాలు పడుతున్నారు. కృష్ణుని ఊరడింపు కలిగే భాగ్యం నా నొసట వ్రాసి ఉన్నదో? లేదో?' అని ప్రసంగించి, 'కృష్ణా! నిన్నే నమ్ముకొన్నాను. ఈ పసికూనలను కాపాడు. సంసారమృత్యువునకు భయపడేవారికి నీవే దిక్కు. మోక్షదాయకములైన నీ పాదారవిందాలే మాకు శరణం; వేరొక మార్గం కనబడదు. నీవు పరమాత్ముడవు, అపరిచ్ఛిన్నుడవు, కేవల ధర్మస్వరూపుడవు అయిన మహాత్ముడవు. సర్వైశ్వర్యాలు నీ కనుసన్నల మెలగుతుంటాయి. నిన్ను నమ్మినదానను తండ్రీ' అని వలవల ఏడ్చింది.

పరీక్షిన్నరేంద్రా! మీ పితామహి అయిన కుంతీదేవి యొక్క ఏడ్పు విని విదురుడు, అక్రూరుడు కన్నీరు పెట్టుకొన్నారు. 'అమ్మా! ఏడవకు తల్లీ. పాండవులు దేవతాంశసంభూతులని నీకు తెలిసినదే కదా. వారికి ఎటువంటి ఆపదా కలుగబోదు. అన్నింటికీ ఆ భగవానుడే ఉన్నాడు' అంటూ ఓదార్చారు.

## అక్రూర ధృతరాష్ట్రుల సంభాషణ

ఆ తర్వాత అక్రూరుడు ధృతరాష్ట్రుని వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో ధృతరాష్ట్రుడు సుహృజ్జనంతో కొలువుతీరి ఉన్నాడు. అక్రూరుడు అతనిని సమీపించి, 'వైచిత్రవీర్యా! నీ తమ్ముడు పాండురాజు పరలోకగతు డయ్యాడు. అతని స్థానాన్ని నీవు అధిష్ఠించావు. ధాత్రిని ధర్మపూర్వకంగా పరిపాలించటం, శీలపరిరక్ష, ప్రజానురాగ సంపాదన, స్వజనులయెడ సమవర్తివై ప్రవర్తించటం అన్నవి పరిపాలనసౌష్ఠవానికి జీవగర్రలు. ఆ విధంగా రాజ్యాన్ని పరిపాలించినవారు యశఃకీర్తులు రెండింటినీ చూరకొన్నారు. సన్మార్గాన్ని తప్పినవారికి ఇహలోకంలో తీరని నింద, పరలోకంలో నరకం తప్పవు.

రాజా! పాండునందనులకు నీవే తండ్రివైనావు. వారిని నీ కొడుకులతో పాటు చక్కజూడు. తాను కన్నవారిని, పరులు కన్నవారిని ఒక్క రూపున

చూడటం ఎలాగంటావా? రాజేంద్రా! ఈ లోకంలో ఎవ్వరూ నిత్యసహవాసులు కారు. అంతెందుకు? నరునకు అతని దేహబంధమే నిత్యం కానినాడు భార్యాపుత్త్రాదుల సంగతి చెప్పేదేమున్నది? ప్రాణి పుట్టినప్పుడు అతనితో ఇతర ప్రాణులు పుట్టటం లేదు. ప్రాణి చచ్చినప్పుడు అతనితో ఇతర ప్రాణులు చావటం లేదు. ప్రతివ్యక్తి వారివారి సుకృత దుష్కృత ఫలాలను అనుభవింపక తప్పదు. ఇతరులెవరూ అందులో పాల్గొనే అవకాశం లేదు. భార్యాపుత్త్రాదుల కోసమని నరుడు అధర్మానికి సయితం భయపడక అర్థార్జనకు ప్రయత్నిస్తాడు. ఆ అర్థం ఉన్నంతకాలం వారు దానిని అనుభవిస్తారు. అంతేకాదు. 'చాలదు, చాలదు' అని కోరాటాలు పోరాటాలు కొనసాగిస్తుంటారు. వాస్తవం విచారించితే పుత్త్రుడే పుత్త్రనామ శత్రువేగాని ఆప్తుడేమీ కాదు.

రాజేంద్రా! అర్థం సమగ్రంగా ఉన్నంత కాలం అతనిని అతని భార్యాపుత్త్రాదులు ఆశ్రయిస్తుంటారు. ఏనాడు అర్థం సన్నగిల్లినదో ఆనాడే అతనిని ఆ భార్యాపుత్త్రాదులే నిర్దాక్షిణ్యంగా విడిచిపెడతారు. బ్రతికున్నాడా? లేడా? అని కూడా విచారింపరు? పైగా అర్థసంపాదనకు గాను అతను చేసిన పాపం అతనినే కట్టి కుడుపుతుంది గాని ఆ అర్థాన్ని భోగించినవారు అందులో గోరంత భాగమైనా పంచుకోరు. బంధువుల సంగతి ఏమంటారా? సిరిగలనాడు అందరూ బంధువులమనే అంటారు. లేనినాడు వారూ లేనివారే అవుతారు. ఆ విధంగా అతను చిట్టచివరికి సర్వజనపరిత్యక్తుడై ఇహపరసుఖాలు రెండింటికీ చెడి తాను చేసిన పాపఫలంగా ఘోరనరకాన్ని అనుభవిస్తాడు.

రాజేంద్రా! ఈ లోకమంతా కలలోని గొంతెమ్మ కోరికగా ఉన్నది. కాబట్టి తెలివిగలవాడు ఈ విషయాలను చక్కగా విచారించి తనను తానే నియమించుకొని ఎండమావుల వెంటబడటం మాని సముడు, శాంతుడు అయి జీవితాన్ని నిశ్చింతగా గడపాలి' అని చెప్పాడు.

ధృతరాష్ట్రుడు ఆ మాటలు విని, 'సౌమ్యా! నీ పలుకులు కళ్యాణకరాలే గాక అమృతోపమానంగా ఉన్నాయి. నీ వాక్యసుధను ఎంత గ్రోలినా తనివి తీరదు. అయ్యా! స్ఫటికశిలామయపర్వతాన మెరుపులున్నా కాంతి నివ్వనట్లు నీ సూనృతవాక్కులు పుత్రరాగవిషయికమైన నా హృదయంలో నాటుకొని కూడా ప్రతిఫలింపవు. సత్యం తెలిసీ ఇంత మహామోహం ఎందుకంటావా? ఈశ్వరవిధానాన్ని ఎవడు కాదనగలడు? ఈశ్వరకృతాన్ని ఆ ఈశ్వరుడే చక్కబెట్టాలి. భూభారాన్ని తొలగింపగోరి యదుకులంలో అవతరించిన వాడు, అనిర్వచనీయము దురూహము అయిన తన మాయాశక్తి వలన జగత్తును సృష్టించి అందులోనికి ప్రవేశించి గుణకర్మలను తత్ఫలాన్ని విభజించి యిస్తున్నవాడు ఎవడో, ఎవని విహారం దురవబోధమో, ఎవడు ఈ సంసారచక్రానికి ముఖ్యకారణమో, ఆ పరమేశ్వరునికి ప్రణమిల్లుతాను' అన్నాడు.

అక్రూరుడు అతని మనోభావం గ్రహించి, అతని అనుజ్ఞ గైకొని సుహృదులను వీడ్కొని మథురాపురం చేరి జరిగిన కథను రామకృష్ణులకు విశదపరిచాడు.

# దశమ స్కంధం

## ఉత్తరభాగము

### జరాసంధుని ఆగ్రహం

పరీక్షిన్నరేంద్రా! మగధరాజైన జరాసంధునికి అస్తి, ప్రాస్తి అని ఇద్దరు కుమార్తె లుండేవారు. ఆ ఇద్దరినీ కంసుడు పెండ్లాడాడు. కంసుడు చనిపోయిన తర్వాత ఆ ఇద్దరూ పతివియోగ దుఃఖమగ్నులై పుట్టింటికి పోయి తండ్రి ఒడిలో తలదాచుకొని తమ సంగతి చెప్పుకొని ఏడ్చారు. జరాసంధుడు వారి దుఃఖాన్ని చూడలేక శోకరోష మహోదగ్రుడై

**శా. ఏమీ! కృష్ణుఁడు కంసునిన్ రణములో హింసించె నో చెల్ల నా**
**సామర్థ్యంబు దలంపఁ డించుకయు మచ్చండప్రతాపానలో**
**ద్దామార్చుల్ వడి నేడు గాల్చు యదుసంతానాటవీవాటికిన్**
**భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్."**

అని పలికి వారిని ఓదార్చాడు.

## మథురపై దాడి

అంతట జరాసంధుడు ఇరవైమూడు అక్షౌహిణుల మహాదళంతో దండెత్తివచ్చి మథురానగరాన్ని ముట్టడించాడు. ఆ నగరవాసులు సముద్రం కట్టదాటి ఉప్పొంగినట్లు మీదికి వస్తున్న ఆ దండును చూసి భయాకులిత మతులయ్యారు. కృష్ణుడు వారి స్థితిని పరికించి, తన కారణమానుషత్వాన్ని, దేశకాలానుగుణతను, తన అవతారప్రయోజనాన్ని తలపోసి, 'మాగధుని సైన్యం భూమికి భారంగా ఉన్నది. ఈ సైన్యమంతటినీ ఇప్పుడే మట్టుపెట్టాలి. జరాసంధుని జోలికి ఎంతమాత్రం పోకూడదు. అతను మళ్ళీ సైన్యాన్ని సమకూర్చుకొని వస్తాడు. దానిని కూడా నాశనం చేస్తాను. ఆ విధంగా మరికొంత భూభారం తగ్గుతుంది. నా అవతారకార్యం కొంతవరకు సఫలం అవుతుంది' అని నిశ్చయించి ఆ సంగతి బలరామునికి చెప్పసాగాడు.

## బలరామునికి ప్రోత్సాహం

అంతలో రథోత్తమాలు రెండు సర్వోపకరణాలతో నింగినుంచి తటాలున పుడమికి దిగివచ్చాయి. కృష్ణ డా రథాలను బలరామునికి చూపి, 'అన్నా! యాదవులు నీ ప్రాపున ఇన్నాళ్ళూ సుఖంగా ఉన్నారు. వారికి నేడు కీడుమూడింది. ఇక జాగు చేయకూడదు. ఇదిగో నీ రథం దివ్యాయుధంతో అవతరించింది. ఈ తేరెక్కి వైరులను జయించి నిన్ను నమ్మినవారికి వగతీర్చి వారిని కాపాడు. ఇటువంటి దుష్టుల బారినుంచి సాధువులను రక్షించటానికే మనము అవతరించామన్న సంగతి నీకు గుర్తు చేయనక్కరలేదు కదా. ఈ దండు నశించటం వలన భూమికి ఇరవైమూడు అక్షౌహిణుల భారం తగ్గుతుంది' అన్నాడు. బలరాముడు సరేనన్నాడు.

## జరాసంధునితో యుద్ధం

అంత రామకృష్ణులు కవచాలు తొడిగి ఆయుధాలు ధరించి రథాలను అధిరోహించారు. వారిని కొద్దిపాటి సైన్యం మాత్రమే అనుగమించింది. రథాలు మహావేగంతో రణక్షోణిని చేరుకొన్నాయి. కృష్ణుడు శంఖారావం

కావించాడు. ఆ ధ్వని మహాభీకరమై వైరిసేనాహృదయాలను బీటలువారజేసింది. సైనికులు ససిచెడి తారుమారు కాసాగారు.

జరాసంధుడు తన సేనల దురవస్థను చూసి లోలోపల బాధపడుతూ వెలికి మాత్రం మహాగంభీరుని వలె దర్పాన్ని ప్రదర్శించి, 'కృష్ణా! నీవు పురుషాధముడవు; కంటికి కాన్పింపక దొంగవై చరిస్తావు; మందుడవు; బంధుద్రోహివి; దానికి తోడు ముక్కపచ్చలారని బాలుడవు. నీతో పోరాటమంటే నాకు సిగ్గుగా ఉన్నది. నువ్వటుండు' అని పలికి బలరాముని వంక మరలి, 'రామా! నీకు యుద్ధశ్రద్ధే గనుక ఉంటే పోరాటానికి సిద్ధపడు. నా బాణాలకు తెగిపడి నీవు స్వర్గానికి పోవటమో, నీ చేతిలో నేను చావటమో రెండిటిలో ఏదో ఒకటి నిగ్గుతేలితే గాని రణరంగం నుంచి కాలు మరల్పకూడదు' అన్నాడు. భగవాను డతని ప్రగల్భాలు విని, 'అయ్యా! శూరులు తమ పౌరుషాన్ని కార్యరూపంలో చూపాలిగాని వృథాప్రగల్భాల వలన ఒరిగేదేమున్నది? నీ మాటలన్నీ మృత్యుముఖంలో ఉన్నవాడి మాటలు. శక్తిమంతులు అటువంటి మాటలను పాటింపరు' అన్నాడు.

జరాసంధు డంతట తన బలగంతో రామకృష్ణులను ఎదుర్కొన్నాడు. వాయుమేఘాలు సూర్యుని వలె, పరాగం అగ్నిని వలె జరాసంధుని బలం రామకృష్ణులను కప్పివేసింది. గరుడకేతనాలు గల కృష్ణుని రథం, తాళధ్వజ చిహ్నితమైన బలరాముని రథం కంటికి కనిపించకుండా పోయాయి. పురస్త్రీలు ఆ చుట్టుపట్లనున్న గోపురాదుల మీదికెక్కి జరుగుతున్న పోరాటాన్ని చూస్తున్నవారు రామకృష్ణుల రథాలు ఆ విధంగా కనుమరుగయే సరికి వ్యసనకర్షితలై మోహవివశ లయ్యారు.

జరాసంధుడు విజృంభించాడు. యాదవసైన్యం డీలుపడింది. కృష్ణు డదిచూసి శార్ఙ్గాన్ని మ్రోగించి నారిపోసి నిశితబాణాలను గుప్పించాడు. బలరాముడు ముసలాన్ని గొని వైరివీరులను నుగ్గునూచం చేశాడు. ఆ శర ముసల హతులకు జరాసంధుని సైన్యంలోని మత్తేభాలు కుంభస్థలాలు పగిలి,

గుర్రాలు మెడలు విరిగి, రథికులు రథ్యసారథులు తలలు తెగి, కాల్బలం కాలుచేతులూడి ఎక్కడి కక్కడ మృతకళేబరాలు రాసులు పడ్డాయి. నెత్తురు వరదలు కట్టింది. ఆ నెత్తుటేటిలో తెగిన భుజాలు సర్పాలుగా, తలలు తాబేళ్ళుగా, ఏనుగుల మొండెములు లంకలుగా, గుర్రాలు మకరాలుగా, తొడలు చేపలుగా, కేశాలు పాచితీగెలుగా, విండ్లు తరంగాలుగా, ఆయుధాలు గుల్మాలుగా, పలకలు సుళ్ళుగా కొట్టుకొనివచ్చాయి. రణరంగమంతా మహాభీకరమై తోచింది. జరాసంధుని సైన్యం మహార్ణవం వలె ఘూర్ణిల్లి చెల్లాచెదరయింది. మగధపతి భగ్నరథుడై తోడురాగలవారు లేక నిస్సహాయంగా నిలబడ్డాడు. బలరాము డతనిని పట్టుకొని త్రాళ్ళతో బంధింపబోయాడు. కృష్ణు డదిచూసి 'ఇతని వల్ల ఇంకా కావలసిన పనులెన్నో ఉన్నాయి' అని తలచి, అతనిని విడిపించాడు. పరీక్షిన్నరేంద్రా! త్రిలోకకర్తకు పరమేశ్వరునికి జరాసంధుని సైన్యహరణ ఏ పాటిది గనుక! అయినా అది కేవల మర్త్యవిడంబన కాబట్టి అంతగా గొప్పగా చెప్పవలసివచ్చింది.

## జరాసంధుని వైరాగ్యం

అంతటితో జరాసంధుడు తన స్థితికి సిగ్గుపడి సర్వం త్యజించి తపోవనానికి వెళ్ళిపోవాలని ఉద్యమించాడు. తోడి రాజులు అడ్డుపడి 'వీరవర్యా! పరాభవాలు కర్మబంధ సంప్రాప్తాలు. యాదవు లందుకు నిమిత్తమాత్రులయ్యారు. ఇంత మాత్రానికి నిస్పృహ చెందకూడదు. ఫలాఫలాలు అన్ని వేళల ఒక్క తీరున ఉండవు. ఆ ఫలోదయం ప్రయత్నించటమే పురుషలక్షణం' అని అనేకానేక లౌకికన్యాయదృష్టాంతాలు పలికారు. మగధేశ్వరుడు తన పూనిక మాని కొందలపు డెందంతో నిజపురానికి వెళ్ళాడు.

## శ్రీకృష్ణునికి అభినందనలు

శ్రీకృష్ణభగవానుడు తన సైన్యాన్ని కసుగందనీయక వైరిసైన్యాన్ని మట్టుపెట్టినందుకు సురలు పుష్పవృష్టి కురిపించారు; పౌరులు వేనోళ్ల

శ్లాఘించారు. పురసౌధాలలో పౌరగృహాలలో పతాకలు లేచాయి. రాజమార్గాలు శీతలజలసిక్తము లయ్యాయి. భగవానుడు విజయలక్ష్మితో పురప్రవేశం చేసి పురంధ్రీమణు లిచ్చిన దధ్యక్షతాంకుర లాజనీరాజనాద్యుపచారాలను అందుకొని తన మందిరానికి వెళ్ళి యుద్ధంలో లభించిన వైరిభూషణధనాలను యదురాజైన ఉగ్రసేనునికి అర్పించి అన్నతో సుఖంగా ఉన్నాడు.

## జరాసంధుని ప్రయత్నాలు

జరాసంధుడు వెనుకకు వెళ్ళిన తర్వాత కొంతకాలం అణిగిమణిగి ఉన్నవాడు సామంతరాజాది ప్రేరితుడై సైన్యాన్ని సమకూర్చుకొని మళ్ళీ దాడికి వచ్చాడు. కృష్ణు డతనిని మునుపటి వలె మళ్ళీ ఓడించాడు.

అంతటితో జరాసంధుడు ఊరుకొనలేదు. తిరిగి తిరిగి పదిహేనుసార్లు దండెత్తివచ్చి ప్రతిపర్యాయం హతాశుడై పారిపోవలసి వచ్చింది.

## నారద కాలయవన సంభాషణ

రాజేంద్రా! అప్పుడు కాలయవను డనేవాడు యవనులకు రాజుగా ఉన్నాడు. ఒకనాడు నారదమహర్షి అతని వద్దకు వెళ్ళాడు. 'యవనేశ్వరా! జరాసంధుడు పదిహేడు పర్యాయాలు మథురమీదికి దాడిచేసి ప్రతిపర్యాయం ఓడిపోయి పారిపోతూ వచ్చాడు. నీ ప్రతాపం అప్రతిహతమని అంటారు. నీవు మథురను జయింపగలిగితే ఆ మాట నిజమంటాను' అని అతనిని పురికొల్పాడు. అతని మాటలకు కాలయవనుడు ఉబ్బి బూరటిల్లి మూడు కోట్ల మ్లేచ్ఛసైన్యాన్ని సమకూర్చుకొని మథురను ముట్టడించాడు.

## నూతన నగర నిర్మిమీష

కృష్ణు డదిచూసి, 'అయ్యో! ఒకవైపు జరాసంధుడు మరొకవైపు యవనుడు మథురపై కన్నువేశారు. ఇప్పుడు యవనుడు వచ్చి ముట్టడించాడు; నేడో రేపో జరాసంధుడు మ్లేచ్ఛులకు తోడువస్తాడు. ఇప్పుడు యవనులను ఎదుర్కొంటే

అది సందుగా జరాసంధుడు వేరొక ప్రక్కనుంచి వచ్చిపడి యాదవు లందరినీ చంపటమో బంధించటమో ఏదో ఒకటి చేస్తాడు. ఎటుచూసినా యాదవులకు సంకటకాలం వచ్చింది. సముద్రాంతరంలో వైరిదుష్ప్రవేశంగా ఒక దుర్గాన్ని నిర్మించి యాదవులను అక్కడికి చేర్చి తర్వాత యవనునితో యుద్ధం చేయటం మంచిది' అని నిశ్చయించాడు.

## ద్వారకా నిర్మాణం

కృష్ణుడంతట విశ్వకర్మను రప్పించి సంగతి అతనికి వివరించాడు. ఆ శిల్పివర్యుడు వెంటనే మొదలుపెట్టి సముద్రాంతరంలో ఒక పట్టణాన్ని వాస్తుశాస్త్రప్రకారం పన్నెండు యోజనాల పొడవు, అంతే వెడల్పు గల దానిని నిర్మించి, వీథుల ఇరుప్రక్కల వివిధతరువుల బారులు తీర్చి నాటి అక్కడక్కడ ఉద్యానవనాలను నెలకొల్పాడు. నగరమంతా మిన్నంటుతున్న శిఖరాలతో విశాల గోపురాట్టాలకాలతో మణిశిఖరవిద్యోతితాలైన ప్రాసాదాలతో నిండి శోభిల్లింది. నాలుగు వర్ణాల వారికి తగినట్లుగా వేర్వేరు ప్రదేశాలలో పౌరగృహాలు తీర్పబడ్డాయి. రాజులకు నివాసయోగ్యమైన మందిరాలు అమర్పబడ్డాయి. ద్వారక అని ఆ పట్టణానికి పేరు పెట్టారు.

రాజేంద్రా! ద్వారకానిర్మాణం సంగతి తెలిసి దేవేంద్రుడు సుధర్మ అనే సభాభవనాన్ని, పారిజాతాన్ని పంపాడు. ఒక్క చెవి మాత్రం నల్లగా తక్కిన శరీరమంతా తెల్లగా ఉండే ఉత్తమాశ్వాలు వేయింటిని వరుణు డర్పించాడు. కుబేరుడు అష్టనిధులను తెచ్చి నింపాడు. తక్కిన లోకపాలకులు వారి వారి ఆధిపత్యాలకు తగినట్లుగా విభవాలను సమకూర్చారు.

## ద్వారకా ప్రవేశం

అంతట భగవానుడు బలరామునితో ఆలోచించి మథురావాసు లందరినీ బయలుదేరదీసి వారికి రక్షకునిగా బలరాముని నియమించి

యోగమాయాప్రభావంతో వారందరినీ ఇతరులకు తెలియకుండా ద్వారకానగరానికి పంపాడు.

ఆ ప్రకారం కృష్ణుడు మథురావాసులను ఊరివెలుపలికి పంపించి తాను పద్మమాలను ధరించి నిరాయుధుడై వెనుజిక్కి తానొక్కడే ఊరిబయటికి వచ్చి నడవసాగాడు. పీతాంబరం కట్టి శ్రీవత్స కౌస్తుభ వనమాలలు దాల్చి నడిచివస్తున్న ఆ మేఘశ్యామశరీరుని యవనుడు చూసి

**శా. ఎన్నేనయ్యె దినంబు లీ నగరిపై నేతెంచి పోరాటకున్**
**మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుం డేఁగుదెం**
**చె న్నన్నోర్వగనో ప్రియోక్తులకునో శ్రీఁ గోరియో చూడుడం**
**చు న్నాత్మీయజనంబు తోడ యవనేశుం డిట్లు తర్కించెఁబో.**

## కాలయవనుని పరాజయం

ఆ ప్రకారం వితర్కిస్తుండగా కృష్ణుడు చతుర్భుజుడని నవపద్మనేత్రుడని నారదుడు చెప్పిన లక్షణాలు అతనికి స్ఫురించాయి. తనముందు పరిగెత్తుతున్న వ్యక్తియందు ఆ లక్షణాలను చూసి అతనే యదువీరుడని నిశ్చయించి, నిరాయుధునితో సాయుధుడై పోరాడటం అన్యాయమని చేతి కత్తిని పారవేసి పాదచారియై

**మ. యదువంశోత్తమ! పోకు పోకు, కంసాదులన్**
**గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్**
**విదితఖ్యాతులు వీటిఁ బోవ నరికిన్ వెన్నిచ్చి యిబ్భంగి నే**
**గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చుం జుమీ.**

**మ. బలిమిన్ మాధవ! నేడు నిన్ను భువన ప్రఖ్యాతిగాఁ బట్టుదున్**
**జలముల్ సొచ్చిన భూమి క్రిందఁ జనినన్ శైలంబుపై నెక్కినన్**
**బలిదండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్**
**జలధిం దాటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్.**

**మ. శరముల్ దూఱవు మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేర వా**
**హరిరింఖోద్ధతధూళి గప్ప దకటా హాస్యుండవై పాఱె దు**
**ర్వరపై నే క్రియ బోరితోఁ కదిసి మున్ వాతాశితోఁ గేశితోఁ**
**గరితో మల్లురతో జరాతనయుతో గంసావనీనాథుతోన్."**

అంటూ అతని వెంటబడ్డాడు. కృష్ణుడు వెంటవస్తున్న యవనునికి చిక్కీ చిక్కనట్లుగా నటిస్తూ అతనిని బాగా దూరానికి తీసికొనివెళ్ళి ఒక పర్వత గుహ లోనికి ప్రవేశించాడు.

## కాలయవన సంహారం

కాలయవనుడు అది చూసి

**ఉ. ఆలము సేయలేక పురుషాధమ! దుర్లభ కంటకద్రుమా**
**భీల మహాశిలాసహిత భీకర కుంజర ఖడ్గ సింహ శా**
**ర్దూల తరక్షు సంకలిత దుర్గపథంబునఁ బాఱుతెంచి యీ**
**శైలగుహన్ సనిద్రు క్రియఁ జాగి నటించినఁ బోవనిత్తునే.**

అంటూ వెంటాడి ఆ గుహలోనికి జొరబడ్డాడు. అక్కడొక వ్యక్తి నిద్రాముద్రలో ఉన్నాడు. యవనుడు ఆ వ్యక్తిని చూసి, 'ఓహో! వీడు నన్నింత దూరానికి లాగి పరమసాధువు అయినట్లు నిద్ర నటిస్తున్నాడు' అని పలుకుతూ ఆ వ్యక్తిని కాలదన్నాడు. అక్కడ బహుకాలంగా నిద్రిస్తున్న ఆ వ్యక్తి అతని పాదతాడనకు మేల్కొంచి కన్నువిచ్చి నలుదెసలు పరికించి ఆ యవనుని వంక కోపదృష్టిని ప్రసరింపజేశాడు. ఆ కోపాగ్నికి యవనుడు నిలువునా బూడిదయ్యాడు.

## ముచుకుందుని చరిత్ర

రాజేంద్రా! ఆ విధంగా గుహాంతరంలో ఉన్న వ్యక్తి ఎవరని, అతని చరిత్ర ఏమిటని అడగక మునుపే చెబుతున్నాను, విను.

ఇక్ష్వాకువంశసంభవుడు మాంధాత అనే రాజు ఉండేవాడు. అతనికి ఒక కొడుకు పుట్టాడు. అతనికి ముచుకుందుడని పేరుపెట్టారు. ఆ ముచుకుందుడు పుట్టినది మొదలు బ్రహ్మణ్యుడని సత్యసంధుడని పేరు పొందాడు.

ఆ కాలంలో దేవతలకు రాక్షసుల వలన భీతి భరింపరానిదిగా ఉండేది. ఇంద్రాదులు ముచుకుందుని కడకు వచ్చి తమ రక్షణార్థం అతనిని ప్రార్థించారు. ముచుకుందుడు దేవతల కోరిక నెరవేర్పదలచి భార్యాదులను, రాజ్యాన్ని వదలిపోయి అమరులకు రక్షణ కావింపసాగాడు. ఏండ్లూ పూండ్లూ గడిచాయి.

కొంతకాలానికి కార్తికేయుడు దేవతలకు సేనానాయకు డయ్యాడు. నిర్జరులు ముచుకుందుని వద్దకేగి, 'మహారాజా! నీవు మా రక్షణభారాన్ని బహుకాలం వహించి ఎంతో అలసట చెందావు. మా కోసం నీవు చేసిన త్యాగం వర్ణనాతీతం. నీ త్యాగాన్ని బట్టి నీవు జితకాముడవని అనటం గొప్ప కాదు. ఇక్కడికి నీవు వచ్చినప్పుడు నీ భార్యాపుత్రులను జ్ఞాతులను మంత్రిప్రభృతులను ప్రజలను విడిచి వచ్చావు. వారిలో ఇప్పుడొకరూ జీవించి లేరు. అందరూ కాలధర్మం చెందారు. కాలమంటే బలవంతుల కంటె బలిష్ఠమై పశుపాలకుడు పశువులను వలె ప్రాణులను తోలుతూ క్రీడించే మహాశక్తి కదా.

రాజవర్యా! నీ ఉపకారానికి తగిన ప్రత్యుపకారం చేయజాలము. అయితే నిన్ను రిక్తహస్తాలతో పంపటానికి మా మనసు అంగీకరింపదు. నీ ఇచ్చకు వచ్చినది కోరు. కైవల్యాన్ని మాత్రం కోరవద్దు. కైవల్యపదవి ప్రసాదించటానికి భగవానుడొక్కడే సమర్థుడు. మా బోంట్లకు అంతటి శక్తిలేదు' అన్నారు.

ముచుకుందుడు వారి మాటలు విని, 'అయ్యలారా! మీకు కాపరినైనది మొదలు ఈ నిమిషం వరకు నిద్ర అంటే ఎటువంటిదో ఎరుగను. నాకు నిద్రను వరంగా ఇవ్వండి' అని అడిగాడు. దేవతలు అతను కోరిన వరం

ప్రసాదించారు. ముచుకుందు డంతట వారిని వీడ్కొని ఆ కొండగుహలోనికి ప్రవేశించి నాడు మొదలు నేటివరకు నిద్రిస్తున్నాడు.

## భగవత్సందర్శనం

రాజేంద్రా! యవనుడు ఆ ప్రకారంగా బూడిద కాగానే శ్రీకృష్ణభగవానుడు ముచుకుందుని యెదుట నిలిచాడు.

**సీ.** **వనరుహలోచను వైజయంతీదామ**
**శోభితు రాకేందుసుందరాస్యు**
**మకరకుండల కాంతిమహితగండస్థలుఁ**
**గౌస్తుభాలంకృతు ఘనశరీరు**
**శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజ**
**మధ్యు జతుర్బాహు మందహాసుఁ**
**గాంచనసన్నిభకౌశేయవాసుఁ గాం**
**భీర్య సౌందర్యశోభితుఁ బ్రసన్ను**

**ఆ.** **న మ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది**
**తన్మనోజ్ఞదీప్తిఁ దనకుఁ జూడ**
**నలవి గాక చకితుఁడై యెట్టకేలకుఁ**
**బలికెఁ బ్రీతి నవనిపాలకుండు.**

'అయ్యా! నీవెవడవు? నీ పాదాలు కమలకోమలాలు. కంటకమయమైన ఈ అడవిలో తిరుగుతుంటే ఆ శ్రమకు ఎలా ఓర్చుకోగలవు? గుహకెందుకు వచ్చావు?

**మ.** **శశివో యింద్రుడవో విభావసుఁడవో చండప్రభారాశివో**
**శశిచూడామణివో పితామహుఁడవో చక్రాంకహస్తుండవో**
**దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబుఁ జూడంగ దు**
**ర్వశమై, యెవ్వఁడ వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై.**

మహాత్మా! నీ జన్మకర్మగోత్రాదులు వినగోరుతున్నాను. సమ్మతమైతే కపటం మాని సవిస్తరంగా వినిపించు. నేనెవడనంటావా? నేను ఇక్ష్వాకువంశ సంభవుడను; మా తండ్రిగారు మాంధాతమహీపతి. నన్ను ముచుకుందు డంటారు. బహుకాలం మేల్కొని ఉన్నందు వల్ల ఆ బడలిక తీరుతుందని నిశ్శబ్దస్థానమైన ఈ గుహలోనికి వచ్చి ఇక్కడ నిద్రకు ఉపక్రమించాను. ఎవడో నన్ను లేపాడు. నేను మేలుకొన్నాను. నన్ను లేపినవాడు ఆ పాపఫలంగా బూడిదయ్యాడు. ఆ వింతకు ఆశ్చర్యపడుతుండగా నీ దర్శనం అయింది. అయ్యా! నీ తేజస్సు దుస్సహంగా ఉన్నది. నిన్ను ఎక్కువసేపు చూడటానికి కన్నులు చాలవు; ఈ నీ తేజోవిశేషాన్ని బట్టి నీవు శరీరధారులకు పూజనీయుడవని తేటతెల్లమవుతున్నది' అన్నాడు.

## శ్రీ భగవానుని సమాధానం

రాజేంద్రా! ఆ విధంగా ప్రశ్నించిన ముచుకుందుని పలుకులను శ్రీ భగవానుడు చిరునవ్వు నవ్వుతూ, 'అయ్యా! నాకు జన్మకర్మములు రూపనామక్రియలు కలవని గాని లేవని గాని చెప్పనలవి కాదు. కలవు అనేవారి మతాన్ని అనుసరించితే నా జన్మ కర్మములకు రూపనామక్రియలకు లెక్క అన్నదే లేదు. నా జన్మాదులను లెక్కింపగోరిన మహర్షు లెందరో యత్నించి అంతుపట్టక చివరికి ఆ ప్రయత్నం మానుకొన్నారు. ప్రకృత జన్మమంటావా? దీని సంగతి విను.

రాక్షసులు రాజులై జనించి అధర్మాన్ని చెలరేపారు. తత్ఫలంగా భూమికి భారం మోయరానిదయింది. ఆ భారాన్ని పోగొట్టమని బ్రహ్మదేవుడు ప్రార్థించాడు. అతని మొర ఆలకించి ప్రచ్ఛన్నరాక్షసులను తెగటార్చి ధర్మాన్ని ఉద్ధరించి భూభారాన్ని తగ్గించటానికి యదువంశంలో వసుదేవునికి పుత్త్రునిగా అవతరించాను. ఆ కారణాన నన్ను వాసుదేవు డంటారు.

ప్రచ్ఛన్న రాక్షసు లెవరంటావేమో? కాలనేమి కంసునిగా జన్మించాడు. వాడు హతుడయ్యాడు. ప్రలంబాది దానవులు మరణించారు. ఈ యవనుడు నీ తీవ్రమైన తేజస్సుకు పరిదగ్ధ డయ్యాడు.

అయ్యా! తొల్లి నీవు నన్ను గూర్చి ఎన్నో ప్రార్థనలు చేశావు. నిన్ను అనుగ్రహింపగోరి ఈ గుహకు వచ్చాను. ఇచ్చవచ్చిన వరాన్ని అడుగు. నీ అభీష్టపూర్తి కావిస్తాను. నన్ను ఆశ్రయించినవారికి శోకం ఎన్నడూ లేదు' అన్నాడు.

## భగవత్ స్తుతి

రాజేంద్రా! ఆ మాటలు చెవిసోకినంతనే ముచుకుందునికి గర్గాచార్యుని వచనం జ్ఞప్తికి వచ్చింది. అతని సంతోషం మిన్నుముట్టింది. అతను చేతులు జోడించి పరమేశ్వరుని స్తుతించాడు.

'పరమేశ్వరా! నీ మాయాప్రభావం అపరిమేయమైనది. నీ మాయకు వశులైన స్త్రీపురుషులు పరమార్థసుఖస్వరూపుని నిన్ను గుర్తింపలేరు. సుఖమన్నాక అది అందరికీ ప్రాప్యమైనదే. అయితే అట్టి సుఖానికై గృహాదులను పట్టుకొని ప్రాకులాడుతుంటారు. గృహాదులు తుట్టతుదకు దుఃఖాలను ప్రభవింపజేస్తాయి. ఆ సంగతి తెలియక ఈ విధంగా మోసపోతుంటారు.

దేవా! కామసుఖాన్ని సూకరాదులు కూడా పొందుతుంటాయి. పరమసుఖప్రాప్తికి మనుష్యులకు మాత్రమే యోగ్యత ఉన్నది. ఏదో పుణ్యవశాన మనుష్యులై పుట్టి శరీరపటుత్వాదులను పడసినా పరమార్థసుఖప్రాపకమైన నీ పాదారవిందాన్ని భజించటం మాని విషయసుఖమతులై గృహాంధకూపాలలో గడ్డికోసం పశువుల వలె పడి పరితపిస్తుంటారు. నా గతికూడా అటువంటిదే అయింది. ఎలాగంటావా? రాజ్యశ్రీ నా కన్నుగప్పింది. మోహాంధకారం నన్ను ఆవరించింది. తత్ఫలంగా దేహాత్మభావం కలిగింది. దానితో అభిమానం తలయెత్తింది. తత్ఫలంగా భార్యాపుత్రులు, ఆస్తిపాస్తులు, భూవసతుల యందు ఆసక్తి జనించింది. అదే లోకమని భావించాను. ఆ భావనతో నా ఆశాలత దినదినాభివృద్ధి గాంచింది.

దానికి అంతు కనిపించలేదు. నిరంతర దురంత చింతలతో కాలమంతా వ్యర్థమయింది.

దేవా! దేహాలు ఘటకుడ్యాలను పోలినవి. అటువంటి జడవస్తువులందు రాజాభిమానాన్ని ఆరోపించాను; చతురంగసైన్యాలను కనుసన్నలలో నడిపించాను; దేశమంతా తిరిగాను; దీనితో నా కాలమంతా గడిచిందే కాని నిన్ను స్మరించే అవకాశం లేకపోయింది.

పరమేశ్వరా! ఎప్పుడయితే అభిమానం తలయెత్తిందో అప్పుడే హితాహితవివేకం సడలిపోతుంది; వెనువెంటనే లోభం వచ్చి పడుతుంది. ఆ లోభం తన తృప్తికై విషయాలను పట్టి ప్రాకులాడుతుంది. ఆ విషయాలను ఎంత కాలం అనుభవించినా తనివితీరదు. ఆ సంగతి గ్రహింపక ఆ లోభం మళ్ళీ మళ్ళీ ఆ విషయాల వంకకే మనస్సును లాగుతుంది. అంతలో నీవు కాలాత్ముడవై పన్నగం మూషికాన్ని తిన్నట్లు దేహాన్ని గ్రసించివేస్తావు. ఏ శరీరం తాను రాజునని సువర్ణరథం మీద మత్తేభాల మీద విహరించిందో ఆ శరీరమే చివరికి క్రిమికీటకాల పాలో, దహింపబడి భస్మమో అవుతున్నది. మనుజుడు తన ఆద్యంతాలను ఎరుగలేక దిక్చక్రవిజయానికి పూనుకొంటాడు. కొంత జయసిద్ధి కలుగగానే సామంతరాజులు చేరి వేనోళ్ళ వివిధ గతుల స్తోత్రగానాలు మొదలుపెడతారు. ఆ స్తుతుల పుణ్యమా అని మైమరచి మిథునసుఖమే పరమార్థమని తలచి మనసుకోరిన హొయలుకత్తెలకు లోనై వారికి క్రీడామృగం అవుతాడు.

దేవా! కొందరు మహేంద్రపదమే పరమార్థమని యెంచి తదర్థమై బ్రహ్మచర్యాతపోనిష్ఠాదులు పూని ప్రాప్తభోగాలను తృణీకరించి కామ్యకర్మలను కావిస్తారు. ఎంతకాలం దేహాత్మబుద్ధి ఉన్నదో అంతకాలం నిక్కమైన సుఖం దక్కదు. వారు పొందే సుఖమంతా మరుమరీచికల వంటి దవుతుంది.

దేవా! వాస్తవసుఖం అంటే నిన్ను చేరుకొనగలగటం ఒక్కటే వాస్తవ సుఖం. నిన్ను చేరినవారికి సుఖచ్యుతి ఎన్నటికీ కలుగదు. ఆ సుఖప్రాప్తికి సాధుసంగమం మొదటిమెట్టు. సాధుసంగఫలంగా సర్వసంగనివృత్తి కలుగుతుంది. ఇది రెండవ మెట్టు. సర్వసంగనివృత్తిఫలంగా కార్యకారణ నియంతవైన నీయెడ భక్తి జనిస్తుంది. ఇది మూడవ మెట్టు. ఆ భక్తి నానాటికి తీవ్రమై నిశ్చలమయితే నీ దృష్టి ఆ భక్తుని వంకకు మళ్ళుతుంది. నీ భక్తునికి అడగకముందే నీవే పరమకళ్యాణాన్ని అనుగ్రహిస్తావు.

దేవా! ఏ రాజ్యానుబంధ నివృత్తిని కోరి అఖండమండలేశ్వరులు గహనాంతరాలు జొచ్చి తీవ్రతపం ఆచరిస్తారో, ఆ నివృత్తి నాకు ఎట్టి తపస్సులు చేయకనే సమకూడింది. ఆ భాగ్యం నీ అనుగ్రహఫలమే కాని నా సంకల్పబలం కాదు. నన్ను వరం అడగమన్నావు. నీ పాదసేవాభాగ్యం నిరంతరం నాకు కలుగునట్లుగా అనుగ్రహించు. వేరొకటి నాకు వద్దు. ఏమంటావా? అన్యములు అవి ఎటువంటివైనా తుదకు ఆత్మబంధనాలవుతాయి. అట్టి తుచ్ఛములకై నిన్ను ఆరాధించటం గాని, నీవిస్తానన్నా నేను పుచ్చుకొనటం గాని వివేకవంతుని కార్యం కాదు.

పరమేశ్వరా! గుణత్రయ నిబంధనాలైన కామములు నన్ను చేరకుండాలి గాక. నీ ఆశ్రయం నాకెప్పుడూ కలుగుతుంది గాక. ఆత్మశత్రువులు బహుకాలం నన్ను బాధించారు; కర్మఫలవాసనలకు లొంగి నానావిధాల పరితపించాను. ఆపన్నుడ నయ్యాను. నీ పాదమూలం ఆశ్రయించాను. నన్ను కాపాడక తప్పదు' అని సాగిలబడ్డాడు. ఈ స్తుతి పరవశీకార వైరాగ్యాన్ని సూచిస్తుంది.

## వరప్రసాదం

రాజేంద్రా! భగవానుడు అతని ప్రార్థన విని, 'సార్వభౌమా! నీ మనః పరిపాకాన్ని పరీక్షించాలని నీ ఇచ్ఛవచ్చిన వరం అడగమన్నాను. ఆ ప్రలోభానికి నీవు లోబడవైతివి. దానితో నీ బుద్ధి కామవశం కాదని

స్పష్టమయింది. నా భక్తులెన్నడూ కామదుఃఖహతులు కానేరరు. చాంచల్యమన్నది మనోనైజం. ఆ చాంచల్యాన్ని నిరోధించటానికి ప్రాణాయామాది నియమాలు పాటిస్తుంటారు. భక్తి లేనినాడు ఆ నియమాలు ఎంత మాత్రం ఉపకరింపవు. భక్తిహీనుల మనస్సు ఎప్పుడో ఒకప్పుడు మదించి విషయపరం అవుతుంది. నీ మనస్సును భక్తిపూరితం కావించి నాయెడ నిలిపి ఇచ్చవచ్చినట్లు చరించటం తగునా? అని శంకింపవద్దు. ఎప్పుడు నీ మనస్సు నాయందు లీనమయిందో అప్పుడే అది దాని స్వాతంత్ర్యాన్ని వలస పుచ్చి నా ఇచ్ఛానుసారం వర్తిస్తుంది. నా ఇచ్ఛ ఎప్పటికీ శుభకరమే తప్ప కీడు చేసేదిగా ఉండదు. నీవు కోరినట్లు నీ భక్తి నాయందు నిరపాయం అవుతుంది గాక.

సార్వభౌమా! తొలుత నీవు క్షత్రియకులంలో జన్మించి క్షత్రధర్మాన్ని అనుసరించి వేటలాడి జంతువులను వధించి పాపానికి ఒడిగట్టావు. ఆ పాపం తీరవలసి ఉన్నది. నీ బుద్ధిని నాయందు నిలిపి ఉంచటమే తపస్సుగా చేసి నన్నాశ్రయించి చరించు. నీ పాపం పరిహృత మవుతుంది. నీకు ఇంకొక జన్మమున్నది. అప్పుడు నీవు బ్రాహ్మణుడవై జన్మించి సర్వభూతహితబుద్ధితో వర్తించి జీవితాంతాన నన్ను చేరుకొంటావు' అని అతనిని అనుగ్రహించాడు.

## ముచుకుందుని భక్తిసాంద్రత

ముచుకుందు డంతట శ్రీకృష్ణభగవానునికి ప్రదక్షిణనమస్కారాలు కావించి తదనుజ్ఞాతుడై గుహాంతరం నుంచి వెలువడి వచ్చి నలుదెసల పరికించాడు. ఎటుచూసినా లతావృక్షపశుమనుష్యాదిరూపాలు అన్నీ గుజ్జురూపంలో అతనికి కానవచ్చాయి. అతను ఆ రూపాలను చూసి 'ఈ మరుగుజ్జుతనం కలి లక్షణాలను సూచిస్తున్నది. ఔరా! కలి మొత్తానికి రానే వచ్చింది' అని తలపోసి, ధీరుడు నిస్సంగుడు ముక్తసంశయుడు అయి చిత్తాన్ని శ్రీకృష్ణాయత్తం చేసి తపస్సు చేయటానికి ఉత్తరదిశకు ప్రయాణించి గంధమాదన పర్వతం చేరుకొని అక్కడ నరనారాయణస్థానమైన పరమపావన బదరికాశ్రమంలో నివాసం ఏర్పరచుకొని ద్వంద్వాలను సహిస్తూ శాంతబుద్ధితో భగవంతుని ఆరాధింపసాగాడు.

## కాలయవన సైన్యసంహారం

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుడు ఆ విధంగా ముచుకుందుని వీడ్కొని మథురకు మరలివచ్చాడు. అక్కడ కాలయవనుని మ్లేచ్ఛసైన్యం ప్రభుని రాకకు నిరీక్షిస్తూ పట్టణాన్ని ముట్టడించి ఎదుర్కొనటానికి ఎవరూ లేక సందిగ్ధావస్థలో ఉన్నది. భగవానుడు ఆ సైన్యాలను తునుమాడి వారి ధనాదులను, మథురానగరంలో ఉన్న ధనాన్ని ప్రోదిచేసి ఎడ్లపైకెక్కించి రక్షకులను నియమించి ద్వారకకు తరలించి తాను కూడా ద్వారకకు బయలుదేరాడు.

## జరాసంధుని దండయాత్ర

రాజేంద్రా! రామకృష్ణులు మథుర నుంచి ద్వారకకు పోతుండగా జరాసంధుడు ఇరవైమూడు అక్షౌహిణుల బలంతో పదిహేడవసారి దండెత్తి వారికి ఎదురయ్యాడు. రామకృష్ణులు ఆ సైన్యాన్ని చూసి భయపడినట్లు నటిస్తూ పాదచారులై పరుగెత్తసాగారు. జరాసంధుడు సైన్యసమేతుడై వారిని వెంబడించాడు. యదువీరులు పరిగెత్తి పరిగెత్తి దశయోజనాల ఎత్తుగల ప్రవర్షణ పర్వతశృంగం ఎక్కి అక్కడినుంచి ఆవలి వంకకు దుమికి ద్వారకను చేరుకొన్నారు.

## ప్రవర్షణగిరి దహనం

రాజేంద్రా! ఆ ప్రవర్షణ గిరి మీద ఎల్లప్పుడు వర్షం కురుస్తూనే ఉంటుంది. రామకృష్ణులు ఆ గిరి ప్రదేశంలో దాగి ఉన్నారనుకొని జరాసంధుడు ఆ పర్వతం నలుప్రక్కల కట్టె గుట్టలు పేర్పించి నిప్పుపెట్టించాడు. ఆ నిప్పు మంటలు కొండపైకి ఎగబ్రాకాయి. ఆ వేడిమికి ఓర్వలేక రామకృష్ణులు బయటికి రాగలరని జరాసంధుడు నలుదెసల కాపుపెట్టి కాచుకొని ఉన్నాడు. ఎన్నాళ్ళకు వారు బయటికి రాలేదు. అది చూసి వారక్కడ దగ్ధులై ఉంటారని జరాసంధుడు భావించి నిశ్చింతగా సైన్యంతో మగధకు వెళ్ళిపోయాడు.

## రేవతీ బలరాముల వివాహం

రాజేంద్రా! ఆవర్త దేశాధీశుడైన రైవతుడు తన కుమార్తె రేవతిని బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం బలరామునికిచ్చి వివాహం చేశాడు. కృష్ణుడు రుక్మిణిని పెండ్లాడాడు.

**శా. కళ్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్తుఁడౌ**
**కల్యుం డెవ్వడు తృప్తుడౌ? నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు సా**
**కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే రుక్మిణీ**
**కళ్యాణంబు వినంగ నాకు మదిలో గౌతూహలం బయ్యెడిన్.**

అని అడిగాడు. శుకమహర్షి అతనికి వివరించాడు.

## రుక్మిణీ స్వయంవరం

రాజేంద్రా! భీష్మకుడనే రాజు కుండినపురం రాజధానిగా విదర్భదేశాన్ని పరిపాలించేవాడు. అతనికి రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మమాలి అని ఐదుగురు కొడుకులు, వారి తర్వాత రుక్మిణి అనే పుత్రిక జన్మించారు.

ఆ కన్యాలలామ రుక్మిణి శ్రీకృష్ణుని రూపవీర్యగుణశ్రీవిభవాలను విని ఆ మహాత్ముడే తనకు తగిన భర్త అని నిశ్చయించుకొన్నది. కృష్ణుడు కూడా రుక్మిణి రూపగుణబుద్ధి లక్షణాదులను విని ఆమెను పెండ్లాడదలచాడు. రుక్మిణీ కృష్ణులు పరస్పరానురాగబద్ధులని భీష్మకుడు విని వారి వివాహప్రయత్నాలు మొదలుపెట్టాడు.

## శ్రీకృష్ణునికి సందేశం

అయితే యాదవులతో బంధుత్వమన్న ఆలోచన రుక్మికి ఇచ్చగింపలేదు. రుక్మిణిని శిశుపాలునికిచ్చి వివాహం చేయాలని అతను నిశ్చయించాడు.

పుత్రికాభావం వేరుగాను పుత్రుని మతం మరొక విధంగాను ఉన్నందుకు భీష్మకుడు డోలాయమానమానసుడై మంత్రులతో ఆలోచించి రుక్మిణీ స్వయంవరాన్ని ప్రకటించాడు. రుక్మిణి తన అన్న చేస్తున్న ప్రయత్నాల సంగతి విని దైన్యతనొంది గత్యంతర మేమిటని తీవ్రంగా ఆలోచించి తనకు పరమాప్తుడైన బ్రాహ్మణుని రప్పించి తన నిశ్చయాన్ని కృష్ణునికి తెలియజేయటానికి అతనిని ద్వారకకు పంపింది.

## శ్రీకృష్ణ సందర్శనం

ఆ బ్రాహ్మణుడు హుటాహుటిని ద్వారకకు పోయి ప్రతీహారుల వలన తనరాక కృష్ణునికి తెలియజేసి ఆయనను సందర్శించాడు. కృష్ణుడు తాను కూర్చుండి ఉండిన పీఠం నుంచి లేచి ఆ విప్రవరుని కూర్చుండబెట్టి పూజించి మృష్టాన్నతృప్తుని జేసి పరుండబెట్టి మార్గాయాసం తీరిన తర్వాత అతని చెంత కూర్చొని పాదాలొత్తుతూ, 'ఆర్యా! సంతుష్టచిత్తుడవు కదా. పెద్దలు నియమించిన ధర్మాలు యథావిధి నిరాతంకంగా జరుగుతున్నాయి కదా. యథాప్రాప్తసంతుష్టుడై ఉండటమే బ్రాహ్మణునికి స్వధర్మమని సర్వశాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి. సంతుష్టచిత్తునికి సర్వార్థాలు తమంతట తామే వచ్చి సమకూడుతాయి. సంతోషి కానివాడికి మహేంద్రపదవి ఇచ్చినా చాలదు. అతను కోరికలనే ఎండమావుల వెంట ఎప్పుడూ పరిగెత్తటమే మిగులుతుంది. ఏ నాటికీ అతనికి సుఖం దక్కదు. యథాలాభసంతుష్టులు సాధువులు భూతదయాపరులు నిరహంకారులు శాంతులు అయిన విప్రుల పాదాలను నేను శిరసా వహిస్తాను. మీకు రాజబాధలు కలుగవు కదా. ఏ రాజు ప్రజారంజకంగా పరిపాలిస్తాడో అతనిని నేనెంతో అభిమానిస్తాను. అయ్యా! ఎంతో మార్గాయాసం ఓర్చి సముద్రం దాటి ఇంతదూరం వచ్చారు. మీరు వచ్చిన కార్యం రహస్యం కాకపోతే సెలవీయండి. నేను చేయగలిగినది చేస్తాను' అన్నాడు.

## రుక్మిణీ సందేశం

ఆ బ్రాహ్మణుడు కృష్ణుని ప్రసన్నతకు ఎంతో సంతోషించి, 'దేవా! విదర్భేశ్వరుని పుత్త్రిక రుక్మిణీదేవి నీకు దాసురాలన్న సంగతి నీకు చెప్పనక్కరలేదు. ఆమె వివాహాన్ని గురించి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ సందర్భంగా నీ కొక అభ్యర్థన విన్నవింపమని రుక్మిణీదేవి పంపగా వచ్చాను. ఆ భీష్మపుత్త్రికా సందేశం ఆలకించి కర్తవ్యం ఆలోచించు. నేనంటున్నవి రుక్మిణి మాటలే గాని నా మాటలు కావు. సందేశం ఏమంటావా?

**సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక**
**దేహతాపంబులు దీఱిపోవు**

**ఏ నీ శుభాకార మీక్షింపఁ గన్నుల**
**కఖిలార్థలాభంబు లబ్బుచుండు**

**ఏ నీ చరణసేవ లే ప్రొద్దు చేసిన**
**భువనోన్నతత్వంబుఁ బొందగలుగు**

**ఏ నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ**
**దడవిన బంధసంతతులు వాయు**

**తే. నట్టి నీ యందు నా చిత్త మనవరతము**
**నచ్చియున్నది నీ యాన నానలేదు**
**కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!**
**శ్రీయుతాకార! మానినీచిత్తచోర!**

భువనసుందరా! కులకన్యలు స్వతంత్రించి ఈ విధంగా వర్తిల్లటం మర్యాద అవుతుందా? అని శంకింపవద్దు.

**శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ**
**జన్య శ్రీ బలదాన సౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే**
**కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా**
**జన్యానేకపసింహ! నా వలననే జన్మించెనే మోహముల్?**

మనోహరా! రూపశీల విద్యావయో ధన తేజోవంతుని వరించటం కులకన్యాధర్మం కాబట్టి నేను నిన్ను పతిగా వరించి నీకు సమర్పించుకొన్నాను; నన్ను అనుగ్రహించు.

**ఉ. శ్రీయుతమూర్తి! యో పురుష సింహమ! సింహము పాలి సొమ్ము గో**
**మాయువు గోరు చందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ**
**ధ్యాయిని యైన నన్ను వడి దా గొనిపోయెదనంచు నున్నవాఁ**
**డా యధమాధముం డెఱుఁగ దద్భుతమైన భవత్ప్రతాపమున్.**

నాథా! ఇంతెందుకు?

**మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసేవల్ దానధర్మాదులున్**
**గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కళ్యాణుఁ గాంక్షించి చే**
**సితి నేనిన్ వసుదేవనందనుఁడు నా చిత్తేశు డౌఁగాక, ని**
**ర్జితులై పోదురు గాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్."**

నాథా! బంధువుల చేత చైద్యునికి నిర్ణయింపబడిన కన్యను గ్రహించటం ధర్మం కాదని శంకింపవద్దు. నేను నీకు దత్తనైనాను. నీ సొమ్మును నీవు తీసికొనిపోవటం అధర్మం ఎందుకవుతుంది?

నాథా! వివాహం రేపటి దినాన జరగాలని నిశ్చయించారు. ఆ లోపలే వచ్చి నీవు నన్ను తీసికొని వెళ్ళాలి. శిశుపాల జరాసంధాదులు తప్పక అడ్డుపడతారు. కాబట్టి తగినంత సైన్యంతో రావాలి. నీ వీరత్వమే కన్యాశుల్కంగా రాక్షసవిధానంతో నన్ను పెండ్లాడు.

నాథా! అంతఃపురంలో ఉండే నన్ను నా బంధువులను కాదని తీసికొనివెళ్ళటం సాధ్యమా? అని వెనుకాడవద్దు. పెండ్లికి ముందురోజు పెండ్లికూతురు కులదేవత అయిన సర్వమంగళాదేవిని ఆరాధించటం మా కులాచారం. ఆ దేవి ఆలయం పురబహిర్భాగాన ఉన్నది. ఆ దేవి సమర్చనకు నేను నగరు వెడలి పాదచారిణినై వస్తాను. అది అదునుగా నీవు నన్ను తీసుకొనిపోవచ్చును.

పద్మాక్షా! నా మనోరథం నెరవేర్పకపోతే నిరశన వ్రతం పూని ఈ శరీరాన్ని పరిత్యజిస్తాను. ఈ మాట ముమ్మాటికి నిజం. శరీరాన్ని త్యజించిన తర్వాత నా కోరిక సంగతేమిటంటావా? నూరు జన్మలెత్తి అయినా నిన్నే పెండ్లి చేసుకొంటాను.'

రాజేంద్రా! ఆ విధంగా బ్రాహ్మణుడు రుక్మిణీసందేశాన్ని వినిపించి, 'యదువల్లభా! నేను వచ్చిన కార్యం నెరవేరింది. ఇక నీ ఇష్టం –

**ఉ. ఆ యెలనాగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మా యుపా**
**ధ్యాయుల యాన పెండ్లియగుఁ దప్పదు, జాడ్యము లేల? నీవు నీ**
**తోయము వారిఁ గూడికొని తోయరుహాననఁ దెత్తుఁగాని వి**
**చ్చేయుము, శత్రులన్ నుఱుముసేయుము, సేయుము శోభనం బిలన్.**

అని ఆశీర్వదించాడు.

## శ్రీకృష్ణుని సమాధానం

కృష్ణుడు ఆ మాటలకు నవ్వుతూ అతని చేతిని తన చేతిలోనికి తీసికొని, 'ఆర్యవర్యా! రుక్మిణి నా యందు వలెనే నేను కూడా రుక్మిణియందు లగ్నమనస్కుడనై ఉన్నాను. ఆ కళ్యాణమయి సంకల్పానికి రుక్మి అడ్డుపడటం నాకు తెలుసు. ఎందరు అడ్డువచ్చినా రానివ్వు. అరణిని మథించి అగ్నిని గ్రహించినట్లు సమస్త వైరి సైన్యాలను మథించి మత్పరాయణ అయిన రుక్మిణిని పరిగ్రహిస్తాను. నా మాట తప్పదు' అని బాసచేశాడు.

## రుక్మిణీ స్వయంవరం

రాజేంద్రా! శ్రీ భగవాను డంతట దారుకుని పిలిచి, రథాన్ని తెమ్మని ఆజ్ఞాపించాడు. సారథి వెంటనే వెళ్ళి శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకాలనే గుర్రాలు నాల్గింటిని పూన్చి గరుడకేతనం తీర్చి వివిధాయుధాలు నింపి రథాన్ని సిద్ధంచేసి తెచ్చాడు. కృష్ణు డా రథంలో తనకోసం వచ్చిన ఆ విప్రుని కూర్చుండబెట్టి ఆయన తర్వాత తానూ అధిరోహించాడు. రథం వాయువేగ మనోవేగాలతో ప్రయాణించి ఆవర్త దేశం దాటి తెల్లవారేసరికి విదర్భపురం చేరుకొన్నది.

## నగరాలంకారం

భీష్మకుడు నగరాలంకారానికి ఆజ్ఞాపించాడు. రథ్యలు చతుష్పథాలు శీతలోదక సంసిక్తాలై పృథ్వీగంధాలు నలువైపుల గుబాళించాయి. ఇళ్ళు మేడలు చిత్రకేతనతోరణాలంకరణలతో నేత్రపర్వంగా కనిపించాయి. పౌరులు స్త్రీపురుషు లందరూ యథాస్థితి వస్త్రాభరణాది భూషితు లయ్యారు. స్వయంవరార్థం దేశదేశాల నుంచి రాజులు వచ్చి విడిది తీరారు.

## శిశుపాలాదుల రాక

చేది దేశాధీశుడు దమఘోషుడు తన కొడుకు శిశుపాలునికి మంత్రవేత్తల వలన మంగళ కార్యాలు చేయించి అతనితో చతురంగబలసమేతంగా కుండిన నగరం చేరుకొన్నాడు. విదర్భేశ్వరుడు ఎదురేగి సకలమర్యాదలతో వారిని తీసికొనివచ్చి విడిదిలో చేర్చాడు. వివాహసందర్భంగా కృష్ణునితో పోరు కలిగే అవకాశం ఉన్నదని, రుక్మిణిని ఏ విధంగా నయినా శిశుపాలునికి కట్టిబెట్టాలని చైద్యపక్షచరులు, శ్రీకృష్ణుని వైరులు అయిన సాళ్వ మాగధ దంతవక్త్ర విడూరథ పౌండ్రకాది రాజులు వేలకొద్దీ వచ్చారు. బలరాముడు యుద్ధం జరుగవచ్చునని అనుమానించి కృష్ణుడు ఒంటరిగా వెళ్ళటం చూసి వెనుకనే అనేక చతురంగ బలాలతో బయలుదేరి హుటాహుటిని కుండినపురం వచ్చిచేరాడు.

## పెండ్లికుమార్తె అలంకరణలు

భీష్మకుడు పితృదేవతల నర్చించి విప్రులకు మృష్టాన్నాలతో విందుచేసి స్వస్తివాచనం చేయించి రుక్మిణిని జలకమాడించి నూతనవస్త్రాలు కట్టించి వివాహోచితాలంకారాలతో అలంకరింపజేసి త్రయీమంత్ర పూర్వక రక్షాబంధం కావించి అథర్వణ మంత్రవేత్త అయిన పురోహితుని చేత క్రూరగ్రహశాంతికై హోమక్రియలు సలిపి సువర్ణ రౌప్య వస్త్రాలను బెల్లంతో నువ్వులను ధేనువులను బ్రాహ్మణులకు దానం ఇప్పించాడు.

## రుక్మిణీ పరితాపం

రాజేంద్రా! రుక్మిణి ద్వారకకు పంపిన విప్రుడు అప్పటికి ఇంకా విదర్భకు తిరిగిరాలేదు. ఏమి జరిగిందోనని ఆమె కలవరపడసాగింది.

**మ. ఘనుఁడా భూసురుఁ డేఁగెనో? నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో,**
**విని కృష్ణుండిది తప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం**
**డనుకూలింపఁ దలంచునో తలపఁడో? యార్యామహాదేవియున్**
**నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నా భాగ్య మెట్లున్నదో?**

అని కన్నీరు పెట్టుకొని శ్రీ కృష్ణాయత్తచిత్త అయింది.

## శుభసూచనలు

రాజేంద్రా! అంతలో రుక్మిణి ఎడమభుజం ఎడమతొడ ఎడమకన్ను అదిరాయి. ఆ శుభసూచకాలకు ఆమె కొంత నెమ్మది వహించి కన్నెత్తి చూడగా ఎదుట తాను పంపిన విప్రుడు అగుపించాడు. రుక్మిణి ఆ విప్రుని ముఖలక్షణాలు పరికించి దూతలక్షణవిదురాలు కాబట్టి మందహాసకందళిత ముఖారవిందయై ఏదో అడగబోయింది. అంతలో ఆ విప్రోత్తముడు ముందుకువచ్చి

**ఉ. మెచ్చె భవద్గుణోన్నతి కమేయధనావళు లిచ్చె నాకుఁ దా**
**వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురు లెల్ల నడ్డమై**
**వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ**
**సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించె రుక్మిణీ!**

అని శుభవచనాలు పలికాడు. ఆ మాటలు చెవిసోకినంతనే రుక్మిణికి సంతోషం పొంగిపొరలింది. కొంతసేపటికి మనసు కుదుటబరుచుకొని, 'ఓహో! ఈ విప్రోత్తముడు నాకై ఇంత శ్రమపడ్డాడు. ఈయన ఋణం ఎలా తీరుతుంది? ఈ మహనీయుడు భగవంతుని తప్ప వేరొకటి ప్రేమింపడే? ఏమి చేయాలి?' అని తలపోసి

**మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి నన్**
**నిలువంబెట్టితి నీ కృపన్ బ్రదికితిన్ నీ యంత పుణ్యాత్మకుల్**
**గలరే? దీనికి నీకు బ్రత్యుపకృతిం గావింపగా నేర నం**
**జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!**

అని సాష్టాంగ నమస్కారం చేసింది. పరీక్షిన్నరేంద్రా! లక్ష్మికి నమస్కరించినవారికి సకలసంపదలు కలుగుతాయి. ఆ లక్ష్మి తానే నమస్కరించినప్పుడు వారి భాగ్యం ఏమని వర్ణింపగలము?

## రామకృష్ణులకు మర్యాదలు

రాజేంద్రా! భీష్మకుడు రామకృష్ణులు వచ్చిన వార్త విని వస్త్రాద్యుపాయనాలు, మధుపర్కం తీసుకొని తూర్యనినాదాలతో వెళ్ళి స్వాగత వచనాలు పలికి విధివిహితంగా వారిని పూజించి ఊరికి పొలిమేరలోనే సర్వోపకరణ సముచితమైన విడిదిలో ప్రవేశపెట్టాడు. పెండ్లి పిలుపును గౌరవించి పెక్కుమంది రాజులు వచ్చారు. భీష్మకుడు వారికి కూడా వయః పదవీ బల భాగ్యాదుల ప్రకారం సర్వమర్యాదలు జరిపి తగిన వసతులలో వారిని నివేశింపజేశాడు.

## పౌరజన సంతోషాతిశయం

శ్రీకృష్ణుని రాక విని కుండినపురవాసు లందరూ గుంపులు గుంపులుగా వచ్చి ఆ యదునందనుని ముఖారవిందాన్ని కనులవిందుగా తిలకించి సంతుష్ట హృదయులై 'మేలు! మేలు! రుక్మిణికి కృష్ణుడు, కృష్ణునికి రుక్మిణి ఈడు జోడు అన్నిటా బాగున్నది. వీరి దాంపత్యం పుష్పానికి పరిమళం వలె పరస్పర శోభాకరం అవుతుంది. ఈ జన్మలో గాని పూర్వజన్మలో కాని మనం ఏ పుణ్యమైనా చేసుకొని ఉంటే త్రైలోక్యనాథు డైన భగవానుడు అందుకు సంతుష్టుడై వైదర్భీపాణిపద్మాన్ని శ్రీకృష్ణుడు గ్రహించే వరాన్ని ప్రసాదించి మనందరినీ అనుగ్రహించాలి గాక' అంటూ సంతోషాతిశయాలను వెల్లడించారు.

## సర్వమంగళాదేవి పూజ

అంత రుక్మిణీదేవి సాలంకృతయై తన హృదయాన్ని శ్రీకృష్ణుని పాదారవిందాలకు అంకితం చేసి సర్వమంగళాదేవి పూజకు అంతఃపురం నుంచి కాలినడకన బయలుదేరింది. సఖులు, పరిచారికలు వెంట నడిచారు. రాజభటులు సాయుధులై బారులు తీరారు. మృదంగ శంఖ పణవ తూర్య భేరీప్రముఖ వాద్యఘోషలు పెల్లుబికాయి. వారాంగనాముఖ్యలు వేలకొలది బంగారు పళ్ళెరాలలో నానావిధాల ఉపహార బలిపదార్థాలు నింపి ముందు కదిలారు. విప్రపత్నులు వస్త్రాభరణ పుష్పమాలా భూషితలై దేవీస్తోత్రాలు చేయసాగారు. గాయకుల గానరవాలు మిన్నుముట్టాయి. సూత మాగధ వంది స్తుతులు మారుమ్రోగాయి.

రుక్మిణీదేవి సంభ్రమాందోళనలతో పార్వతీదేవి ఆలయానికి వెళ్ళి పాదప్రక్షాళన కావించి చేతులు కడిగికొని ఉపస్పృశించి శుచియై ప్రశాంతమైన చిత్తంతో గుడిలోనికి అడుగుపెట్టి, వృద్ధబ్రాహ్మణాంగనలు చెప్పిన ప్రకారం పార్వతీపరమేశ్వరులకు అర్ఘ్యపాద్యగంధాక్షత ధూప దీపపుష్పమాలా భూషణాదులను భక్తిపూర్వకంగా సమర్పించి,

**ఉ. నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతిఁసేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నడును నాశము లేదు గదమ్మ, యీశ్వరీ!**

అని మ్రొక్కి కర్పూరహారతి నిచ్చి విప్రసువాసినులను లవణ అపూప తాంబూల కంఠసూత్ర ఫల ఇక్షు ప్రముఖాలైన ఉపహారాలతో పూజించి వారి మంగళాశీర్వాదాలను తలదాల్చి, ఆ అంగనలకు పార్వతీపరమేశ్వరులకు ప్రణమిల్లి మౌనవ్రతం వదలి రత్నముద్రికాశోభాయమానమైన తన చేతివ్రేలితో సఖీహస్తాన్ని పట్టుకొని అంబికాలయం నుంచి బయటికి వచ్చింది.

## స్వయంవర మండపం

రాజేంద్రా! ఆ తీరున రుక్మిణీదేవి సర్వమంగళాలయం నుంచి అంతః పురానికి దారిచూపుతున్న సఖీమణులను అనుసరించి నడవసాగింది. ఆ విధంగా వర్షఋతువేళ మేఘమధ్యం నుంచి మెరిసే మెరుపుతీగ వలె మిరుమిట్లు గొలుపుతూ, భర్మ కుండల కాంతులు తన చెక్కుటద్దాలలో ప్రతిఫలించి పండు వెన్నెల వెలుగులను విరజిమ్ముతుండగా, నితంబార్పిత మేఖలా నవరత్నదీప్తులు అపూర్వ తేజస్సులను వెల్లివిరియజేయగా, కుంద కుట్మలాలను పోలిన రదనాలు ఎర్రని దొండపండును పోలిన క్రిందిపెదవికి చిరునవ్వు నవ్వినపుడు వింతకాంతులను సంతరింపగా, గుబ్బ చన్నుల బరువుకు అసియాడుతున్న నెన్నడుముతో, కందోయి వాలుచూపులను కప్పివేస్తున్న ముంగురులతో, అందెల రవళితో కలహంస నడకలతో జగన్మోహిని వలె వస్తున్న ఆ సౌందర్యాధి దేవతను విస్ఫారితనేత్రాలతో తిలకించి అక్కడున్న వీరాధివీరులందరూ మోహపరవశులయ్యారు. నునుసిగ్గు దొంతరలు విరిసే ఆమె చూపులకు లోబడిన వారి చేతులలోని శస్త్రాస్త్రాలు నేలకు జారాయి. రథాల నుంచి దిగి వారంతా బారులు తీరి నిలిచారు.

రుక్మిణి శ్రీ భగవదర్పిత లావణ్యవతియై మెల్లమెల్లగా కదలివస్తున్నది. ఆమె కన్నులు శ్రీకృష్ణదర్శనానికై ఎదురుచూడసాగాయి. అంతలో ఆ రాజలోక మధ్యాన –

**మ. కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం గంఠీరవేంద్రావల**
**గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశ దే**
**హు నగారాతిగజేంద్ర హస్త నిభ బాహుం జక్రి బీతాంబరున్**
**ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్.**

ఆ విధంగా శ్రీకృష్ణుడు కంటబడి నంతనే రుక్మిణికి సంతోషం ఉబ్బి ఉబికి బూరటిల్లింది. 'జాగుచేయకు; శ్రీకృష్ణుని రథం ఎక్కు' అని ఆమె మనసు త్వరపెట్టసాగింది.

## రుక్మిణీ హరణం

శ్రీకృష్ణుడు రుక్మిణి మనోగతాన్ని గ్రహించి ఆ పెండ్లికూతురిని తన రథం మీది కెక్కించుకొని బలరామాదులతో తరలిపోయాడు. రాజలోకమంతా తెల్లపోయింది.

## జరాసంధాదుల పరాజయం

రాజేంద్రా! అంతలో జరాసంధాది వీరులు భ్రాంతి వదలి సంగతి గ్రహించి, 'ఏమేమీ! మృగరాజు భాగాన్ని నక్క లెత్తుకుపోయినట్లు – ఇంతమందిమి ధనుర్విద్యానిపుణుల మైన మన సొమ్మును ఆలకాపరులు హరించుకొని పోతున్నారు. ఇంతకంటె అవమానం ఉన్నదా? మా కీర్తి కీర్తి (బురద) పాలయింది. ఇక జీవించటం దేనికి?' అని క్రోధమూర్ఛితులై సంరంభించి ఒక్కరొక్కరూ తమ తమ వాహనాలెక్కి సకల సైన్యాలతో కృష్ణుని రథాన్ని వెంబడించారు.

ఆ విధంగా తరుముకొని వస్తున్న జరాసంధాదులను యాదవవీరులు చూచి ఎదురు నిలిచి ధనుష్టంకారాలు కావించి మేఘాలు గిరులపై

జలధారలను వర్షించినట్లు వారిపై శరవర్షం కురిపించారు. జరాసంధాదులు కూడా యాదవులపై తీవ్రబాణాలు గుప్పించారు. యాదవసైన్యమంతా తద్విశిఖ పరంపరావృత మయింది.

రుక్మిణి అది చూసి ఏమి జరుగుతుందో అన్న భయంతో సిగ్గుపడుతూనే ముఖం పైకెత్తి శ్రీకృష్ణుని ముఖపద్మం వంక దృష్టి సారించింది. భగవానుడామె మనోభావాన్ని ఊహించి, 'భీత హరిణేక్షణా! కలవరపాటు వద్దు. మనవారు వైరిబలాన్ని ఉవ్వెత్తుగా ఎగరగొట్టటం నీవే చూస్తావు కదా' అని చిరునవ్వుతో పలికి ఆమెను ఊరడించాడు.

అంతలో యదువీరులు గద సంఘర్షణాదులు తమపైకి దూసికొని వస్తున్న శరవర్షానికి కోపోద్దీపితులై విక్రమించి శత్రుదళాన్ని చీల్చి చెండాడారు. రథికులు తలలు పగిలి నేలకొరిగారు; అశ్వికులు గొంతులు తెగిపడ్డారు; ఏనుగులు తొండాలు తెగి నేలకూలాయి; చేతులు తెగి కాల్బలం పడిపోయింది.

ఆ విధంగా వైరిచతురంగబలం పండుటాకుల వలె నేలరాలే సరికి రణరంగమంతా రక్తసిక్తమై కిరీట కుండలాది మణిద్యుతులతో విరాజిల్లుతూ ఘోర మహాద్భుతావహమై కనుపించింది. జరాసంధాది హతశేషులు కొంతమంది యాదవసేనా విక్రమాటోపాలకు ఓర్వలేక దైన్యచిత్తులై శిశుపాలుని వద్దకు పరుగులు తీశారు.

## శిశుపాలుని సాంత్వనం

శిశుపాలుడు తన మిత్రుల ఓటమికి చింతాకులితస్వాంతుడై దైన్యంతో ముఖం దించుకొన్నాడు. జరాసంధుడు తోడిరాజులను వెంటబెట్టుకొని వచ్చి శిశుపాలుని స్థితిని చూసి, 'ఓ పురుషశార్దూలా! నీకు భార్యగా నిర్దేశింపబడిన కన్యను ఆ కృష్ణుడు అపహరించాడని దిగులుపడకు. దేహధారులకు ప్రియాప్రియాలు రెండూ సంభవిస్తుంటాయి. ప్రాణులకు స్వాతంత్ర్యమన్నది గోచరింపదు. జీవకోటి సమస్తం ఈశ్వర తంత్రమై బొమ్మలాటవాని చేతి

బొమ్మల వలె ఆడుతూ కాలానుగత సుఖదుఃఖాలను అనుభవిస్తుంటుంది. ఇందుకు నా సంగతే ప్రబలనిదర్శనం. ఇరవైమూడు అక్షౌహిణుల బలంతో పదిహేడు పర్యాయాలు కృష్ణునితో పోరాడి ఓటుపడ్డాను. అన్ని సారులు పరాజితుడి నైన నేనే పద్దెనిమిదవసారి ఆ కృష్ణుడినే తరిమికొట్టాను. ఓటుపడినప్పుడల్లా సుఖదుఃఖాలు కాలవశములే గాని మన చేతులలో ఉన్నవి కావని సమాధానం చెప్పుకొంటూ పునఃపునః ప్రయత్నాలు సాగించాను. లాభాలాభాలు కాలవశాలని నమ్మి వాటి కోసం సంతోషదుఃఖాలను ఎన్నడూ పొందలేదు. ఇంతెందుకు? మనమందరం వీరాధివీరుల మన్న సంగతి లోకవిదితం. మన సైన్యాలు లెక్కకు మించినవి. కృష్ణుడు మాయావియే కాని వీరుడు కాడు. అతని యాదవులు పిరికిపందలు; అల్పసంఖ్యాకులు. పరిస్థితి ఇలా ఉండగా ఈనాడు మనము వారిచేత పరాజయం పొందవలసి వచ్చింది. ఇదంతా కాలప్రభావం కాకపోతే మరేమిటి?

**మ. తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్య విఖ్యాత వి**
**క్రములన్ గెల్చిరి యాదవుల్ హరిభుజా గర్వంబునన్ నేడు, కా**
**లము మేలై చనుదెంచెనేని మనమున్ లక్షించి విద్వేషులన్**
**సమరక్షోణి జయింత మింత పనికై శంకింప నీకేటికిన్?**

అని ఉపశమనోక్తులు పలికాడు. శిశుపాలుడు ఆ మాటలు విని ఒకింత తేరుకొని సైన్యంతో చేదికి వెళ్ళిపోయాడు. హతశేషులైన రాజులందరూ తమ తమ దేశాలకు దారితీశారు.

## రుక్మితో సమరం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు ఆ విధంగా నలుగురూ చూస్తుండగా తన చెల్లెలిని రాక్షసవిధానంలో అపహరించి తీసుకొనిపోతుంటే చూసి రుక్మి క్రోధమూర్ఛితుడై ఎట్టకేలకు తేరుకొని, 'అయ్యయ్యో! ఇంతకంటె తలవంపు ఇంకా ఏముంటుంది? ఇతను నిష్కారణంగా వచ్చి తీరని విద్వేషం కలిగించాడు. ఈ యాదవాధముని చంపి నా చెల్లెలిని తిరిగి తెస్తాను. అది

కొనసాగనినాడు కుండినపురంలో అడుగుపెట్టను' అని శపథం చేసి స్యందనారూఢుడై అక్షోహిణి సేనతో బయలుదేరి, 'సారథీ! మన రథం క్షణంలో కృష్ణుని సమీపించాలి. ఆ దుష్టుడు చేసిన అకార్యానికి ఫలం ఇప్పుడే అనుభవించేట్లు చేస్తాను' అని ప్రేలాపన లాడాడు.

రుక్మి రథం హుటాహుటిని వెళ్ళి కృష్ణుని రథాన్ని సమీపించింది. భీష్మకసుతుడు కృష్ణుని చూసి, 'నిలువు నిలువు' అంటూ అతని మీదికి బాణాలు మూడు ప్రయోగించి, 'చోరాగ్రేసరా! కాకి వచ్చి యజ్ఞపురోడాశాన్ని అపహరించినట్లు నా చెల్లెలిని హరింపజూస్తావా? ఎక్కడికి పోదామనుకున్నావు? నీ మాయలు, నీ కూట యుద్ధాలు నా ముందు సాగవు. ప్రాణాలు నీకు తీపనుకుంటే నా చెల్లెలిని వదలి కాలికి బుద్ధి చెప్పు' అని అధిక్షేపాలు పలికాడు. కృష్ణుడు రుక్మి మాటలకు నవ్వుతూ అతని చేతి విల్లు విరిచి ఆరు బాణాలతో అతనిని నొప్పించి, ఎనిమిది బాణాలు అతని రథ్యాల పైకి సారించి, సారథిపై రెండింటిని ప్రయోగించి ధ్వజం మీద మూడమ్ములు వేశాడు. అంతటితో రుక్మి వేరొక శరాసనం అందుకొని కృష్ణుడి మీద ఐదు బాణాలు వేశాడు. కృష్ణుడు మళ్ళీ రుక్మి చేతి విల్లు విరిచాడు. అతను తిరిగి వేరొక శరాసనం చేత బట్టాడు. కృష్ణుడు దానిని కూడా విరగగొట్టాడు. అప్పుడతను పరిఘను గైకొన్నాడు. కృష్ణుడు దానిని సైతం భగ్నం చేశాడు. రుక్మి అంతటితో మిన్నకుండక పట్టిస శూల చర్మ కృపాణ శక్తి తోమరాదుల నొకదానివెంట ఒకటి అందుకొన్నాడు. కృష్ణుడు ఒక్కటొక్కటిగా అన్నింటినీ విరిచి వేశాడు.

రుక్మి మరింత కోపోద్దీపితుడై ఖడ్గాన్ని పూని రథం దిగి మిడత అగ్నిమీది కురికినట్లు కృష్ణుని మీదికి ఉరికాడు. కృష్ణుడు తీవ్రబాణాలు వేసి అతని ఖడ్గాన్ని నువ్వుగింజలంత తునకలు చేసి అతనిని రూపుమాపబోయాడు.

రుక్మిణీదేవి కృష్ణుని మనోభావం గ్రహించి అతని పాదాలపై వాలి, 'దేవదేవా! నా అన్నను రక్షించు' అని దీనస్వరంతో అర్థించింది. కృష్ణుడు

రుక్మిణీప్రణయాన్ని మన్నించి తన తలంపు మాని రుక్మిని గుడ్డతో బంధించి అతని మీసాలను కత్తితో కోసి అతనిని విరూపిని చేసి వదలిపెట్టాడు. ఆ లోగా యదువీరులు బలరామునితో రుక్మి సైన్యాన్ని ఢీకొని ఏనుగులు పద్మలతలను నుగ్గునూచం చేసినట్లు సైనికు లందరినీ చంపి కృష్ణుని వద్దకు వచ్చారు.

## బలరాముని పరామర్శ

రాజేంద్రా! బలరాముడు ఆ విధంగా విజయుడై వచ్చి రుక్మి స్థితిని చూసి జాలిపడ్డాడు. 'కృష్ణా! నీవు చేస్తున్నది అర్హితకృత్యం కాదు. ఇతను ఎటువంటి వాడయినా కానీ; రుక్మిణికి జ్యేష్ఠభ్రాత కదా ఆ కారణాన ఇతనిని మనము గౌరవించటం మరచిపోవచ్చునా? మిత్రునికి వైరూప్యం కలిగించటం వధతో సమానం కదా? నీ యీ చేతకు రుక్మిణి ఎంత బాధపడుతుందో ఆలోచించావా?' అని పలికి, రుక్మిణి వంక మరలి, 'సాధ్వీ! నీ అన్నకు కలిగిన పాటు చూసి మా యెడ ఆగ్రహింపకు. జీవులు వారి సుకృతదుష్కృతఫలాలను అనుభవింపక తీరదు. శుభాశుభ ఫలానుభవాలకు అన్యులు నిమిత్తమాత్రు లవుతారు. అంత మాత్రాననే వారు ఫలదాతలు కారు. ఫలాలు ప్రారబ్ధకర్మాధీనాలు. ఈ రహస్యం తెలియక నిమిత్తమాత్రులకు నిందాభూషలను మూటగట్టుతారు. ఒకరి వలన మరొకరికి సుఖదుఃఖాలు కలుగుతున్నాయనటం అజ్ఞానవచనం. ఇదంతా కాకతాళీయ న్యాయంగా జరుగుతుంటుంది.

కళ్యాణీ! బంధువులు వధార్హదోషం కావించినా వారిని చంపకూడదు; వదిలివేయాలి. వారి దోషమే వారిని హరిస్తుంది. లోకధర్మం ఈ విధంగా ఉంటే ఇక క్షత్రియధర్మం మహాదారుణం. క్షత్రియుడు స్వధర్మాన్ని పాలింపక తప్పదు. భ్రాత అయినప్పటికీ వధార్హుడయితే అతనిని క్షత్రియ ధర్మపాలకుడు వధింపక తప్పదు. ఇది విధి విధానం.

మానవులు స్వధర్మాన్ని విడిచి వర్తిల్లటానికి కారణమేమంటావా? అజ్ఞానమే కారణం. అజ్ఞానానికి హేతువేమిటి? మదం. ఆ మదోత్పత్తికి ధరా, ధన, రాజ్య, స్త్రీ దురభిమానాలు నిమిత్తకారణాలు. మనుష్యులు ఆ విధంగా మదాంధులై దేహమే ఆత్మ అనుకొని స్వధర్మాన్ని మరిచి వర్తిస్తారు. అట్టివారి వర్తనం పరపీడాకర మవుతుంది. అట్టి దుర్బలులను చూసి పరితపించటం కంటె ఏమి చేయగలము?

కళ్యాణీ! సూర్యుడొక్కడే అయినా వివిధఘటాలలో వివిధగతుల ప్రతిఫలించేటట్లు ఆత్మ ఒక్కడే అయినా వివిధదేహాలలో వివిధగతుల కానవస్తుంటాడు. ఘటభేదాలను బట్టి సూర్యభేదాలను ఎలా శంకింపకూడదో అలాగే ఉపాధిభేదాలను బట్టి ఆత్మభేదాలను శంకింపకూడదు. దేహాత్మాభిమానం వలన బుద్ధిమోహం జనించి ఉపాధిమాత్రాలైన శరీరాలే ఆత్మలని భావిస్తూ దేహభేదాలను ఆత్మయందు వ్యాపింపజేస్తూ తనవాడు పగవాడు అని వ్యవహరిస్తారు. ఆత్మ నిత్యం; దేహాలంటావా? పుట్టుతూ గిట్టుతుంటాయి. ఆత్మకు జనన మరణాదులు కలుగకపోయినా, దేహాలు అవిద్యాయోగం వలన ఆత్ముని యందు కల్పితం అవుతుండటం వల్ల దేహసంబంధమైన జననమరణరూప సంసారం ఆత్మయందు ఆరోపింపబడుతున్నది. తత్త్వవేత్తలు క్షణభంగురాలైన దేహాల కోసం శోకింపరు. శోకం వలన మనశ్శోషణ, తత్ఫలితంగా మోహం కలుగుతున్నాయి. ఆ మోహం జ్ఞానాన్ని కప్పుతున్నది. యథార్థాన్ని నీవు గ్రహించి ప్రశాంతంగా ఉండు'

అన్నాడు. రుక్మిణి ఆ వచనాలను పరామర్శించి స్వస్థచిత్తురాలయింది.

## భోజకటకపుర నిర్మాణం

రాజేంద్రా! రుక్మి ఆ విధంగా ప్రాణాలతో విడువబడినవాడై తేజోబలాదులుడిగి తన ప్రతిజ్ఞను తలచి తన వైరూప్యానికి సిగ్గుపడి కుండినపురానికి పోవటం మాని ఆ చోటనే భోజకటకమనే పురాన్ని నిర్మించుకొని అక్కడే ఉండిపోయాడు.

## రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహం

శ్రీకృష్ణుడు ఆ విధంగా రుక్మిణిని వెంటగొని ద్వారకా నగరానికి తిరిగిరాగానే వారికి శాస్త్రోక్త ప్రకారం కళ్యాణం కావింప నిశ్చయించారు. నగరమంతటా మహోన్నత పతాకాలు లేచాయి. గృహద్వారాలను నూతన పల్లవతోరణాల తోనూ వికచపుష్పమాలికల తోనూ అలంకరించారు. స్తంభాలకు పోకమ్రాకులను కూర్చారు. ద్వారాలలో మంగళపూర్ణ కుంభాలు తీర్పబడ్డాయి. సురభి ధూపదీపాలు వెలిశాయి. వీథులు చందనోదకసిక్తాలై మంగళతోరణాలతో సొంపుమీరాయి. ఆబాలవృద్ధులు యథోచితంగా అలంకరించుకొని నూత్నవధూవరులకు వివిధోపాయనాలు తెచ్చి సంతోషంతో సమర్పించారు.

కురు సృంజయ కేకయ విదర్భ యదు కుంతిరాజులు విలువైన కానుకలు తీసుకొని వచ్చారు. రాజమార్గాలు సందులు గొందులు క్రిక్కిరిశాయి. ఊరు ఊరంతా కళకళలాడింది. శ్రీకృష్ణుడు రాజవీరుల తలపై కాలూని రుక్మిణిని తెచ్చిన కథను తలకొక విధంగా చెప్పుకొంటూ ప్రజలు పరమసంతోష పరవశు లయ్యారు. వందిమాగధుల కీర్తనధ్వనులు మారుమ్రోగాయి. ఆ తీరున సర్వమంగళ శోభాయమానంగా రుక్మిణీకృష్ణులకు వివాహ మంగళకార్యాన్ని నిర్వహించారు. ద్వారకా నగరం పరమానందసాగరంలో ఓలలాడింది.

## ప్రద్యుమ్నోదయం

పరీక్షిన్నరేంద్రా! పూర్వం ఒకప్పుడు మన్మథుడు ముక్కంటి కంటి మంటకు బూదికావటం సంగతి వినే ఉంటావు. అతను మళ్ళీ శరీరప్రాప్తిని కోరి పరమేశ్వరుని ప్రార్థించి ఆ వరాన్ని పొంది శ్రీకృష్ణునికి రుక్మిణీదేవి యందు ప్రద్యుమ్నుడనే పేర జనించి అన్ని విధాల తండ్రికి సమానుడై వెలుగొందాడు.

## శంబరాసురుడు

రాజేంద్రా! ఆ సమయంలో శంబరుడనే రాక్షసు డొకడుండేవాడు. అతనికి శ్రీకృష్ణసుతుని వలన మరణం ఉన్నదని చెప్పారు. అత నా మాట నమ్మి ప్రద్యుమ్నుడు జన్మించటం విని, 'అయ్యో! నాకు శత్రువు పుట్టాడు. ఇతనిని వెంటనే రూపుమాపటం మంచిది' అని నిశ్చయించి కామరూపుడై వచ్చి పురుడు కూడా తీరని ఆ నిసువును తీసుకొనిపోయి సముద్రాంతరంలోనికి విసిరివేశాడు.

ఆ శిశువును నీళ్ళలో ఒక చేప మ్రింగింది. ఒకనాడు జాలరి సముద్రంలో వలవేయగా ఆ చేప అతని వలలో చిక్కింది. వాడు దానిని తీసుకొని వెళ్ళి శంబరాసురునికి కానుక ఉంచాడు. శంబరుని వంటవాడు ఆ చేపను కోసినప్పుడు దాని పొట్టలో ఒక పసివాడు కనిపించాడు.

రాజేంద్రా! పూర్వం మన్మథుడు దగ్ధమైనప్పుడు అతనికి పునశ్శరీరప్రాప్తి నభిలషించి మన్మథుని భార్య రతీదేవి మాయావతి అనే పేరుతో శంబరుని ఇంటచేరి అతని వంటకత్తెగా కుదురుకొన్నది. వంటలవాడు జాలరి తెచ్చిన చేపను దాని కడుపులో ఉన్న నిసుగుతో పాటు మాయావతికి అప్పగించాడు. మాయావతి ఆ శిశువును చూసి వింతపడసాగింది.

## నారద సందర్శనం

అంతలో నారదమహర్షి అక్కడికి వచ్చి, 'రతీ! ఆశ్చర్యపడవద్దు. నీ నాథుడు కామదేవుడు శ్రీకృష్ణునికి రుక్మిణీగర్భంలో జన్మించి శంబరాసురుని

వలన హరింపబడి సముద్రంలో పారవేయబడి చేపచేత మ్రింగబడ్డాడు. ఆ చేపను జాలరి పట్టితెచ్చి శంబరునికి కానుక చేశాడు. వంటలవాడు ఆ చేపను కోయగా ఈ పసివాడు దాని గర్భంలో ఉన్నాడు. అతను వెంటనే ఆ నిసుగును తెచ్చి నీ చేతిలో ఉంచాడు' అని చెప్పి వెళ్ళాడు.

## రతి ప్రద్యుమ్నుల సంభాషణ

మాయావతి నారదుని మాట విని ఆ శిశువు తన భర్తేనని గ్రహించి అతనియెడ భర్తృస్నేహం నెరపుతూ అతనిని పోషింపసాగింది. అతను కొంతకాలానికి యౌవనవంతుడయ్యాడు. కమలపత్రాల వంటి నేత్రాలు కలిగి పీనాయతభుజుడై సొంపారుతున్న ఆ సుందరమూర్తి పురుషులకే విభ్రమాన్ని గొలుపసాగాడు.

మాయావతి అతని యెడ రతి విలాసాలు చూపసాగింది. అతను ఆమె మనోభావాన్ని గ్రహించి, 'దేవీ! నీవు నాకు తల్లివంటి దానవు. నీ చూపులను బట్టి నన్ను కామిస్తున్నావని స్పష్టపడుతూనే ఉన్నది. ఇది నీకు తగునా?' అని అడిగాడు.

రాజేంద్రా! మాయావతి అతని ప్రశ్న విని, 'దేవా! నీవు తొల్లిటి మన్మథుడవు; నా పతివి. ఈశ్వరుని నేత్రాగ్నికి దగ్ధుడవయ్యావు. అది మొదలు నీ దేహప్రాప్తి కోసం మాయావతి పేర ఇక్కడున్నాను. నా భాగ్యఫలంగా నీవు శ్రీకృష్ణునికి రుక్మిణీదేవి యందు జనించావు' అని ఆ వృత్తాంతమంతా వివరించి, 'నేనెవరినో కాను, నీ సతియైన రతిని. మన దాంపత్యం అనాదిసిద్ధం. అనుమానం మాని నన్ను గ్రహించు. ఆ శంబరుడు మహామాయా విశారదుడు. అతను నీకు కీడు తలపెట్టినవాడు. సర్వమాయలను మాయింపగలిగిన మహామాయావిద్య నా వద్ద ఉన్నది. దానిని గ్రహించి నీ వైరిని సంహరించు. అదీ కాక రుక్మిణీదేవి నిన్ను కోల్పోయినది మొదలు నీ కోసం ఎంతో పరితపిస్తున్నది. ఆ దేవికి కనుపించి దుఃఖశాంతి కలిగించు' అని చెప్పి మహామాయావిద్య నిచ్చింది.

## శంబరాసుర వధ

రాజేంద్రా! ప్రద్యుమ్నునికి తన పుట్టుపూర్వాలు తెలియగానే అతను శంబరుని దుండగానికి తగిన ప్రతిక్రియ సంకల్పించి అతని దగ్గరికి వెళ్ళి నోటి కసితీరా తిట్టి అతనిని యుద్ధానికి పిలిచాడు. ఆ దూషణలకు శంబరుడు పాదతాడిత పన్నగం వలె మండిపడి గదాదండాన్ని చేతబట్టి ప్రద్యుమ్నుని పైకి విసిరాడు. ప్రద్యుమ్నుడు ఆ గదను దారిలోనే త్రుంచి తన గదను అతని మీదికి విసిరి సింహనాదం చేశాడు. ఆ గద మహావేగంతో తన మీదికి వస్తుండటం చూసి శంబరుడు మయుడిచ్చిన దైతేయమాయ నాశ్రయించి బాణవృష్టి కురిపించాడు. ప్రద్యుమ్నుడు ఆ శరవృష్టిని లెక్కింపక సర్వమాయావినాశిని అయిన సాత్త్విక మాయను ప్రయోగించాడు. అందుకు బదులుగా శంబరుడు గుహ్యక గంధర్వ పిశాచ పన్నగ రాక్షసాది వివిధ మాయలను ప్రయోగించాడు. ప్రద్యుమ్నుడు ఆ మాయలన్నింటినీ మట్టుపెట్టి నిశితఖడ్గాన్ని పూని శంబరుని తల నరికాడు. అతని శిరస్సు సకిరీటంగా నేలబడినంతనే నిర్జరులు సంతసించి పుష్పవృష్టి కురిపించారు.

## ద్వారకాగమనం

రాజేంద్రా! ఆ విధంగా శంబరాసురుని సంహరించిన తర్వాత ప్రద్యుమ్నుడు గగనచారిణి అయిన రతితో అంతరిక్షమార్గాన ద్వారకానగరానికి వెళ్ళి లలనాకోటి సంకులమైన శ్రీకృష్ణుని అంతఃపురం లోనికి మెరుపుతో వచ్చిన మేఘంలా అడుగుపెట్టాడు. అంతఃపుర కాంతాజనం హఠాత్తుగా వారిని చూసి పోలికలను బట్టి కృష్ణుడని భావించి కొందరు ప్రక్కలకు తప్పుకొన్నారు. కృష్ణునికీ అతనికీ ఉన్న కొద్దిపాటి వైలక్షణ్యాలను కొందరు పరికించి అతను కృష్ణుడు కాడని నిశ్చయించి దగ్గరికి వచ్చి స్త్రీద్వితీయుడై కనిపించేసరికి సంగతి అర్థంకాక తెల్లబోయారు.

రతిప్రద్యుమ్నులు రుక్మిణీమందిరానికి వెళ్ళారు. ప్రద్యుమ్నుని చూడగానే ఆమెకు చిరనష్టపుత్రకుడు స్మరణకు వచ్చి చందోయి చేపి పాలు కారసాగాయి.

అతనియందే దృష్టి నిలిపి ఆమె 'ఈ సుకుమారు డెవరి పుత్రుడో? ఏ పుణ్యవతి ఇతనిని కననోచిందో?' అని ఆశ్చర్యపోయింది.

**మ. అతిసంసిద్ధము నాటి బాలకున కీ యాకార మీ వర్ణ మీ**
**గతి యీ హాసవిలోకనస్వరము లీ గాంభీర్య మీ కాంతి, వీ**
**డతడే కాఁదగు, నున్నవారలకు నా యాత్మేశు సారూప్య సం**
**గతి సిద్ధింపదు, వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిన్.**

అయ్యో! పురిటింటిలో నుంచి హరింపబడిన నా పసినాయన ఇంతదాకా బ్రతికి ఉంటే వయోరూపాదులన్నీ అచ్చం ఇలాగే ఉండేవి' అని లోలోన తలంపసాగింది. అంతలో ఆమె వామభుజం అదిరింది. రుక్మిణి ఆ శుభసూచనకు పులకించి, 'ఏమిటిది! నా తలంపు అసత్యం కాదా? ఇతను నిజంగా నా సుతుడేనా?' అని చింతింపసాగింది.

## నారదాగమనం

అంతలో శ్రీకృష్ణుడు దేవకీవసుదేవులతో కలిసి అక్కడికి వచ్చాడు. వారి వెనువెంటనే నారదమహర్షి చనుదెంచి శంబరుని యింట జరిగిన సంగతిని వారికి తెలియజేశాడు. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడైనా ఏమీ తెలియని వానివలె నటించాడు. నారదుని మాట విని అంతఃపురాంగనలు మరణించినవాడు బహుకాలానికి బ్రతికి వచ్చినట్లు మహాశ్చర్యసంతోషాలను పొందారు. దేవకీదేవి, రామకృష్ణులు ఆ కుమారదంపతులను దగ్గరకు తీసుకొని మేరలేని ఆనందాన్ని పొందారు. రుక్మిణీదేవి అతనిని కౌగిలించుకొని–

**శా. అన్నా! నా చనుబాపి నిన్ను దనుజం డంభోనిధిన్ వైచెనే?**
**యెన్నో వర్షములయ్యెఁ బాసి సుత! నీ వే రీతి జీవించి యే**
**సన్నాహంబున శత్రు గెల్చితివో? యాశ్చర్యంబు సంధిల్లెడిన్**
**నిన్నుం గాంచితి నింత కాలమునకున్, నే ధన్యతం జెందితిన్.**

అంటూ అతనిని ముద్దాడింది. ద్వారకావాసులు ఆ సంగతి విని మహాశ్చర్యత్వరితులై గుంపులు గుంపులుగా వచ్చి ప్రియదర్శనుడైన ప్రద్యుమ్నకుమారుని చూసి 'అపరకృష్ణు' డని జేజేలు పలికారు.

## స్యమంతక మణి

రాజేంద్రా! ఆ కాలంలో ద్వారకలో సత్రాజితుడనే యదు ప్రముఖు డుండేవాడు. అతడు మహాశ్చర్యకరంగా నిండుభక్తితో సూర్యదేవుని ఆరాధించాడు. సూర్యుడు అతని భక్తికి మెచ్చి అతనితో మైత్రి చేయటమే కాక తన ప్రేమ చిహ్నంగా స్యమంతకమనే రత్నాన్ని అతనికి బహూకరించాడు.

సత్రాజితుడు ఆ రత్నాన్ని కంఠసీమలో అలంకరించుకొని ద్వితీయ సూర్యుని వలె విరాజిల్లుతూ ద్వారకా నగరానికి వచ్చాడు. ఆ రత్నకాంతులు ద్వారకావాసుల దృష్టిని మిరుమిట్లు గొలిపాయి. వారు సుదూరాన నుంచి ఆ వస్తున్నవాడు సూర్యుడని భ్రమించి కృష్ణుని వద్దకు పరుగు పరుగున వెళ్ళి, 'నారాయణా! శంఖచక్రగదాధరా! దామోదరా! అరవిందాక్షా! గోవిందా! యదునందనా! నమస్కారం. సూర్యుడు నిన్ను చూడాలని వస్తున్నాడు. అతని కాంతులు మా కన్నులు గప్పుతున్నట్లున్నాయి. నీవు యదుకులంలో ప్రచ్ఛన్నవేషధారివై ఉన్నావని తెలియక దేవతలు నిన్ను ముల్లోకాలలో వెతుకుతున్నారు కాబోలు. ఇక్కడున్నావని గ్రహించి సూర్యు డిప్పుడు వచ్చినట్లున్నాడు' అని విన్నవించారు.

ఆ సమయంలో కృష్ణుడు పాచిక లాడుతున్నాడు. ఆ భగవానుడు పౌరుల మాటలు విని వారి అజ్ఞానానికి నవ్వుతూ, 'అయ్యా! మీరు పొరబడ్డారు. ఆ వస్తున్నవాడు సూర్యుడు కాదు; మన సత్రాజితుడు. స్యమంతక మణిని వరంగా సంపాదించి ఇక్కడికి వస్తున్నాడు. ఆ రత్నప్రభలను చూసి మీకిటువంటి భ్రాంతి కలిగింది' అని తెలియజెప్పాడు. పౌరులందరూ సిగ్గుపడి కలకల నవ్వుకొంటూ వెళ్ళిపోయారు. అంతలో సత్రాజితుడు వచ్చి ఇల్లుచేరి

విప్రోత్తములను రావించి మంత్రపూర్వకంగా ఆ మణిని తన ఇంటిలోని పూజామందిరానికి చేర్చాడు.

రాజేంద్రా! ఆ మణి ప్రతిదినం ఎనిమిది బారువుల (బారువ అంటే దాదాపు 24 మణుగులు) బంగారాన్ని ఈనుతుంటుంది. ఆ మణిని పూజించే చోట దుర్భిక్షాలు గాని, అకాలమరణాలు గాని, అరిష్టాలు గాని, ఆదివ్యాధులు గాని మోసాలు మొదలయిన చెడుగులు గాని ఉండవు.

## శ్రీకృష్ణుని కోరిక

ఒకనాడు కృష్ణుడు సత్రాజితుని చేరబోయి, 'మిత్రమా! యాదవరాజైన ఉగ్రసేనునికి స్యమంతక మణి నివ్వు' అని కోరాడు. అతను అర్థలుబ్ధుడై భగవంతు డంతటివాడు అడుగుతున్నాడని కూడా సంకోచింపక కటువుగా నిరాకరించాడు. వస్తువు సర్వానిష్ట నివర్తకమైన గొప్ప వస్తువయినా దానిని భగవంతునికి సమర్పింపక ఎవరైనా ముందుగా భోగించితే ఆ వస్తువు అనిష్టహేతువే అవుతుంది. స్యమంతక మణి సంగతీ అంతే అయింది. ఆ వివరం విను.

## స్యమంతక హరణం

సత్రాజితునికి ప్రసేనుడనే తమ్ము డొకడున్నాడు. ఒకనాడతను ఆ మణిని కంఠాన ధరించి హయారూఢుడై వేటాడటానికి అడవికి వెళ్ళాడు. అక్కడొక సింహం అతనినీ అతని గుర్రాన్నీ చంపి స్యమంతకాన్ని తీసుకొని పర్వత తటాన పరిగెత్తసాగింది.

ఆ కొండ జాంబవంతుడు నివసిస్తున్న ప్రదేశం. అతను ఆ సింహాన్ని చంపి మణిని గ్రహించి తన గుహకు తీసుకొని వెళ్ళాడు.

## నిష్కారణ నింద

ప్రసేనుడు రెండురోజుల దాకా తిరిగి రాకపోయేసరికి సత్రాజితుడు కారణం తెలియక 'నా తమ్ముడు మణిని ధరించి వేటకు వెళ్ళినవాడు ఇంత

వరకు తిరిగిరాలేదు. కృష్ణు డా మణిని ఇమ్మని అడిగాడు. అతను నా తమ్ముని ప్రాణాలు పొట్టబెట్టుకొని దాన్ని హరించి ఉంటాడు' అని నలుగురితో అన్నాడు. ఆ మాట క్షణంలో ఊరంతా కార్చిచ్చులా వ్యాపించింది. భగవాను డది విని, 'అయ్యయ్యో! నిష్కారణంగా అపవాదు పుట్టింది. ఊరుకొందామంటే నలుగురూ ఇదే నిజమనుకొంటారు' అని కలవరపడి నగర ప్రముఖులు కొందరిని వెంటబెట్టుకొని ప్రసేనుడు వెళ్ళిన దారినే కొంత దూరం వెళ్ళాడు. అక్కడ ప్రసేనుడు గుర్రంతోపాటు చచ్చి పడి ఉన్నాడు. అక్కడి నుంచి సింహం ఒకటి కొండ వంకకు నడిచినట్లు అడుగు జాడలు కనిపించాయి. ఆ జాడలను బట్టి వారందరూ  పర్వతాగ్రం మీదికి వెళ్ళారు. అక్క దొకచోట సింహం చచ్చిపడి ఉన్నది. అక్కడి నుంచి భల్లూకం జాడ కనిపించింది. ఆ జాడను బట్టి పోగా ఒక కటిక చీకటి గుహ కనిపించింది. శ్రీకృష్ణుడు పౌరప్రముఖులను గుహాద్వారాన నిలిపి తానొక్కడే భయంకరమైన ఆ గుహ్వారం లోనికి ప్రవేశించాడు.

## శ్రీకృష్ణ జాంబవంతుల యుద్ధం

కృష్ణభగవానుడు గుహలోనికి ప్రవేశించి కొంతదూరం ముందుకు సాగిన తర్వాత అక్కడొక బాలుడు ఆ మణితో ఆడుకొంటున్నాడు. శ్రీకృష్ణుడు దానిని పరిగ్రహింపగోరి అతని సమీపానికి వెళ్ళాడు. అంతలో ఆ బాలకుని చెంతనున్న దాది ఆకస్మికంగా తమ యెదుట బడ్డ అపూర్వ పురుషమూర్తిని చూసి తత్తరపాటుతో కేకలు వేసింది. ఆ అరుపులు విని గృహాంతర్గతుడైన జాంబవంతుడు హుటాహుటిని వచ్చి కృష్ణునితో కలబడ్డాడు.

ఇద్దరూ ఆయుధాలతో కొంతకాలం పోరాడారు. ఆ తర్వాత రాళ్ళతో అడవిచెట్లతో మార్కొన్నారు. చివరికి బాహాబాహి యుద్ధానికి దిగారు. పిడికిలి పోట్లు పిడుగుపాటులను మరపించాయి. మాంసనిమిత్తమై కలహించిన డేగలకు వలె ఆ యిరువురికీ ఇరవైయెనిమిది అహోరాత్రాలు ఘోరయుద్ధం జరిగింది. కృష్ణుని ముష్టిఘాతాలకు జాంబవంతుని శరీరసంధి గ్రంథులన్నీ సడలిపోయాయి. నిలువెల్లా జిడ్డుచెమటలు కమ్మాయి. బలం వట్టిపోయింది.

జాంబవంతుడు అదిచూసి, 'ఏమిటీ వింత! నా పరాక్రమాన్ని చవిచూసి చలింపక నిలబడినవాడు ఇంత కాలానికి సాక్షాత్కరించాడు. ఇతను ప్రాకృతపురుషుడని భావించాను. అది సరి కాదేమో' అని పరిపరి విధాల తలపోయసాగాడు. అంతలో అతని బుద్ధి వికసించింది. అతని యెదుట నున్నవాడు శ్రీభగవానుడేనని అతనికి స్ఫురించింది. అతను కేలుమోడ్చి, 'దేవా! సర్వమునకు నీవే ఉపాదానభూతుడవు కాబట్టి పురాణుడవు పురాణపురుషుడవు సర్వభూత దేహేంద్రియ ప్రాణబలాధీశుడవు విష్ణుదేవుడవు అన్న సంగతి గ్రహింపలేక ఈ అజ్ఞాని కావించిన అపరాధాన్ని సైరించు. ఎవని కోపారుణ వీక్షణాలకు సముద్రం తిమి తిమింగలాది జంతువులతో ఉడ్డుడికి దారి చూపిందో, ఎవడు సేతువును బంధించి రావణాది రాక్షసులను సంహరించిన వాడో ఆ నా దైవం శ్రీరామచంద్రుడు నీ రూపుదాల్చి వచ్చాడు' అంటూ సాగిలబడ్డాడు. కృష్ణుడు అతని మాటలకు సంతసించి తన పాణిపల్లవంతో జాంబవంతుని నిలువెల్లా నిమిరి 'భల్లూకేశ్వరా! ఈ స్యమంతక మణిని నేను హరించానని అపవాదు పుట్టింది. దానిని బాపుకొనగోరి ఈ మణి వచ్చిన జాడలను బట్టి నీ బిలానికి వచ్చాను' అన్నాడు.

## జాంబవంతునికి పరాముక్తి

జాంబవంతుడు భగవద్వచనాన్ని విన్నంతనే స్యమంతక మణితో పాటు తన కుమార్తె జాంబవతిని భగవంతునికి సమర్పించాడు. శ్రీకృష్ణుడు ఆ మణిని, కన్యామణిని గ్రహించి భక్తాగ్రేసరుడైన జాంబవంతునికి పరాముక్తిని ప్రసాదించాడు.

## ద్వారకావాసుల దుఃఖం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు తనతో వచ్చిన పురప్రముఖులను బిలద్వారాన విడిచి ఒంటరిగా గుహలోనికి ప్రవేశించాడని చెప్పాను కదా. ఆ విధంగా వారక్కడ పన్నెండు దినాలపాటు కాచుకొని ఉన్నారు. ఎంతసేపు

ఎదురుతెన్నులు చూసినా కృష్ణుడు బిలాంతరం నుంచి బయటికి రాలేదు. నందనందనుడు గుహలోనే ప్రాణాలు విడిచి ఉంటాడని వారందరూ నిశ్చయించి మహాదుఃఖార్తులై అక్కడినుంచి మరలి ద్వారకకు వచ్చి సంగతిని తెలియజేశారు.

ఆ వార్త చెవిసోకి నంతనే దేవకీదేవికి రుక్మిణికి వసుదేవాదులకు ప్రాణాలు పోయినట్లయింది. నగరమంతా గగ్గోలయింది. అందరూ నోటికి వచ్చినట్లు సత్రాజిత్తును తిట్టిపోసి చంద్రభాగ అనే దుర్గాదేవిని చేరి 'తల్లీ! శ్రీకృష్ణుని సురక్షితునిగా మాకు చూపింపవమ్మా!' అని ప్రార్థించారు. ఆ దేవి వారి ప్రార్థనను అంగీకరించి, 'కృష్ణుడు త్వరలోనే తిరిగి వస్తాడు' అని సూచించింది.

## శ్రీకృష్ణాగమనం

అంతలో శ్రీకృష్ణుడు స్యమంతక మణిని జాంబవతీ కన్యామణిని వెంటగొని ద్వారకకు వచ్చాడు. అతనిని చూడగానే దేవకీదేవికి, రుక్మిణికి, వసుదేవాదులకు చచ్చినవాడు బ్రతికివచ్చినట్లయింది. వారి ఆశ్చర్య సంతోషాలకు మేర లేకపోయింది.

## రాజసభా సమావేశం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు ఆ విధంగా ద్వారకను చేరి రాజసభను తీర్చి సత్రాజితుని రప్పించి మణి వృత్తాంతం వినిపించి ఆ సభ వారందరూ చూస్తుండగా స్యమంతక మణిని అతని కందజేశాడు. సత్రాజితుడు తన అపచారానికి సిగ్గుపడి పశ్చాత్తాపంతో తలవంచుకొని మణిని గ్రహించి తన మందిరానికి వెళ్ళిపోయాడు.

## జాంబవతీ పరిణయం

ఆ తర్వాత జాంబవతీ కృష్ణులకు శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. నగరమంతా ఆనందార్ణవంలో ఓలలాడింది.

## సత్యభామా పరిణయం

శ్రీకృష్ణునిపై నిష్కారణంగా నిందమోపిన నాటినుంచి సత్రాజితుని హృదయం చింతాక్రాంత మయింది. ఆత్మాపరాధ దుఃఖితుడై అతను –

**మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చే**
**సితిఁ? బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండ దు**
**ర్మతి; నీ దేహముఁ గాల్పనే? దురిత మే మార్గంబునం బాయు? నే**
**గతి గంసారి ప్రసన్నుఁడై మనుచు, నన్ గారుణ్యభావంబునన్.**

అని లోలోపలే కుమిలిపోయాడు. 'నా తప్పు సామాన్యమైనది కాదు. స్యమంతకమణి లోభబుద్ధి నాచేత ఇంత చేయించింది. ఆ మణిని, దానితోపాటు నా పుత్రికను సత్యభామను శ్రీకృష్ణునికి సమర్పించితేనే నాకు మన్నన' అని నిశ్చయించి స్యమంతకాన్ని, సత్యభామను తెచ్చి భగవానునికి సమర్పించాడు. ఆ విధంగా సత్యభామ రూపం శీలం గుణగణం ఔదార్యం రాజపుత్రలోకాన్ని ఆకర్షించి ఆ కాంతామణిని ఎందరో కోరుతుండగా ఆమె శ్రీకృష్ణుని వశమయింది.

శ్రీకృష్ణుడు సత్యభామను మాత్రమే పరిగ్రహించాడు. సత్రాజిత్తును పిలిచి, 'అయ్యా! నీ మణితో నాకు పనిలేదు. అది సూర్యోపాసకుడవైన నీ చెంతనే రాణిస్తుంది. అది ఇచ్చే స్వర్ణరాశిపై మాకు అధికారం ఉన్నది కాబట్టి స్యమంతకమణి ఇచ్చే బంగారాన్ని మాకు ఇస్తే చాలు' అని చెప్పి ఆ మణిని మళ్ళీ అతనికే ఇచ్చివేసి సత్యభామను యథావిధిని పెండ్లాడాడు.

## బలరామకృష్ణుల ప్రయాణం

పరీక్షిన్నరేంద్రా! నీ ముత్తాత పాండురాజు మరణించిన తర్వాత నీ తాతలు ధర్మనందనాదులు నీ పెదముత్తాత ధృతరాష్ట్రుని పంచజేరటం, అక్కడ ధృతరాష్ట్రుని కొడుకులైన దుర్యోధనాదులు ధర్మనందనాదుల యెడ అసూయ వహించి వారిని పడరానిపాట్లకు గురిచేయటం మొదలైన సంగతులన్నీ నీవు

వినే ఉంటావు. కౌరవులకు పాండవులకు కలిగిన వైమనస్యాలు తీరాలంటే పాండవులను వేరుగా ఉంచటం మంచిదని ధృతరాష్ట్రుడు నిశ్చయించి వారికోసం ఒక గృహనిర్మాణాన్ని సంకల్పించాడు. కుటిలచిత్తు డైన దుర్యోధనుడు ఆ సంగతి విని ఆ యింటిని లక్కతో పొదివి కట్టేటట్లు రహస్యంగా ఏర్పాటు చేయించాడు. ఆ గృహనిర్మాణం పూర్తయిన తర్వాత అందులోనికి పాండవులను కుంతీదేవితో ప్రవేశపెట్టాడు. వారందరూ ఆ యింటిలో ఉండగా ఒకనాటి రాత్రి దానికి నిప్పుపెట్టారు. ఆ అగ్నిలో పాండవులు కుంతితోపాటు దగ్ధమయినట్లు వదంతి పుట్టింది.

ఆ సంగతి ద్వారకాపురికి తెలిసింది. ప్రజలందరూ హాహాకారాలు చేసారు. శ్రీకృష్ణభగవానుడు వాస్తవస్థితి తెలిసి మర్త్యవేషవిడంబనార్థం కులమర్యాద ననుసరించి ధృతరాష్ట్రాదులను పరామర్శించటానికి గాను బలరామునితో కలిసి కరిపురికి పోయి ధృతరాష్ట్రుని గాంధారిని భీష్మ విదుర ద్రోణాదులను చూసి ఆదరోక్తులతో ఉచితరీతిని భాషించి నలుగురినీ అనునయించాడు.

## స్యమంతకాపహరణం

రాజేంద్రా! సత్రాజితుడు పూర్వం తన కుమార్తె సత్యభామను కృతవర్మ యొక్క బంధువుకు ఇచ్చి వివాహం చేస్తానని మాటయిచ్చి ఆ తర్వాత మాటతప్పి ఆమెను కృష్ణుని కిచ్చి చేశాడు. ఆనాటి మొదలు అక్రూరుడు, కృతవర్మ సత్రాజిత్తును ద్వేషించటం మొదలుపెట్టారు. రామకృష్ణులు ద్వారకలో ఉన్నంత కాలం కృతవర్మాదులకు వారి పగ తీర్చుకొనే అవకాశం కలుగలేదు. రామకృష్ణులు ద్వారక వదిలి హస్తిపురికి బయలుదేరగానే అక్రూరకృతవర్మలు అంతకంటె మంచి అవకాశం మళ్ళీ రాదని గ్రహించి శతధన్వుని వద్దకు వెళ్ళి అతని చెవిలో ఇల్లుకట్టుకొని దుర్బోధలు చేసి 'అయ్యా! స్యమంతక మణిని చూసుకొని సత్రాజితుడు విర్రవీగుతున్నాడు. సత్యభామ విషయమై అతను మనకు చేసిన అపచారం ఇంతా అంతా కాదు. అందుకు ప్రతీకారం ఒక్కటే.

అతని వద్దనున్న మణిని గ్రహించి అతనిని అతని తమ్ముడు వెళ్ళిన చోటికే పంపిద్దాము. ఈ అవకాశం మళ్ళీ రాదు' అని శతపోరి చెప్పారు. ఆ ఉపదేశాన్ని పాపాత్ముడు శతధన్వుడు విని మతిచెడి ఒకనాటి రాత్రి సత్రాజితుని ఇంటికి వెళ్ళి గాఢనిద్రాపరుడై ఉన్నవాడిని కటికవాడు పశువును తెగనరికినట్లు నరికి స్యమంతక మణిని అపహరించాడు.

సత్యభామ తన తండ్రి దుర్మరణానికి ఎంతగానో దుఃఖించి, తనకు తానుగా ఊరడిల్లి తండ్రి శవం పాడవకుండా తైలద్రోణిలో పదిలపరిచి హస్తిపురానికి వెళ్ళి రామకృష్ణులకు జరిగిన సంగతంతా వివరించింది. గుణాతీతులై ఈశ్వరులైన శ్రీరామకృష్ణులు ఆ మాట విని మానుషవిగ్రహులు కాబట్టి లోకవిడంబనార్థం తామూ చింతావశులై శోకించి సత్యభామతో ద్వారకకు మరలివచ్చారు.

## శతధన్వుని వధ

రామకృష్ణులు ద్వారకకు వచ్చిన సంగతి చెవిసోకినంతనే శతధన్వునికి ప్రాణాలు నిలువున పైకెగిరినట్లయింది. అతను వారి చేతిలో తనకు చావు తప్పదని శంకించి ప్రాణరక్షణార్థం ఉరుకులు పరుగులతో కృతవర్మ ఇంటికి పోయి 'అయ్యా! నన్ను రక్షించు' అని వేడుకొన్నాడు. కృతవర్మ అతని ప్రార్థన విని 'అయ్యా! రామకృష్ణులంటే సామాన్యులు కారు. కేవల భగవత్స్వరూపులు. ఈశ్వరుని అవతారమూర్తులను ప్రతిఘటించటం ఎవరికి సాధ్యమవుతుంది? వారిని ప్రతికూలించి మేలొందగలమా? కంసుని సంగతి తెలియదా? జరాసంధుని గతి వినలేదా? నీ లాగా ఆలోచించటం నా వల్లకాదు' అని చెప్పివేశాడు. చేసేది లేక శతధన్వుడు అక్రూరుని వద్దకేగి మొరపెట్టుకొన్నాడు. అక్రూరుడు కూడా అతని పలుకులను విని 'అయ్యా! ఎవడు నిజలీలాయోగాన జగత్సృష్టిస్థితిసంహారాలు కావిస్తున్నాడో, ఎవని మాయామోహితమై జగత్తు ఆ విశ్వేశ్వరుని చేష్టలను ఎరుగజాలదో, పసికూన పుట్టగొడుగును పెరికి పైకెత్తినట్లు ఏడేండ్ల పసిప్రాయంలో గోవర్ధన గిరిని కొనగోట లేపి నిలిపాడో,

ఎవడు మూలభూతుడు కూటస్థుడు ఆత్ముడు భగవంతుడు అయినవాడో ఆ కృష్ణునికి పునఃపునస్సాష్టాంగాలు' అన్నాడు.

శతధన్వుడు ఆశాభంగానికి చింతించి గత్యంతరం లేక స్యమంతకమణిని శ్వఫల్కపుత్రుని వద్ద దాచి వడిగల గుర్రాన్నెక్కి ఉత్తరదిశబట్టి రోజులోపల వందయోజనాలు పారిపోయాడు. రామకృష్ణులు ఆ సంగతి విని అతనిని వెంబడించారు. శతధన్వుడు మిథిలానగరాన్ని సమీపించేసరికి అతని గుర్రం అలిసి నేలబడి చచ్చింది. అతనికి భయం మరింత కాసాగింది; ఏమిచేయాలో దిక్కుతోచలేదు. దిగ్భ్రాంతితో అతను కాలుసాగిన వంకబడి ప్రాణరక్షణార్థం పరిగెత్తసాగాడు.

అంతలో కృష్ణుడు చేరువకు వచ్చి చక్రాయుధంతో అతని తల తరిగాడు. శతధన్వుడు నేలకొరిగాడు. భగవాను డతనిని సమీపించి నిలువెల్లా వెతికిచూశాడు. అతని వద్ద మణిలేదని అర్థమయింది. ఆ సంగతి బలరామునికి చెప్పాడు. రేవతీపతి ఆ మాటవిని 'కృష్ణా! ఇతను ఆ మణిని ఎక్కడో తన ఆప్తుని వద్ద దాచి ఉంటాడు. నీవు ద్వారకకు వెళ్ళి విచారించు. ఇదిగో మిథిలానగరం పొలిమేర దాకా వచ్చాము. వైదేహుడు నాకు పరమప్రియుడు. సమీపానికి వచ్చి కూడా అతనిని చూడకపోవటం భావ్యం కాదు. నేను మిథిలకు పోయివస్తాను' అని చెప్పి వెళ్ళిపోయాడు.

## బలరాముని మిథిలానివాసం

బలరాముని ఆగమనం సంగతి మిథిలేశ్వరుడు విని యథోచితమర్యాదలతో ఎదురేగి అతనిని పూజించి సగౌరవంగా ఇంటికి తీసుకొనివెళ్ళాడు. బలరాముడు వైదేహుని సత్కారాల నందుకొంటూ అతనితో ఇష్టాగోష్ఠిగా కొన్ని సంవత్సరాలు నివసించాడు.

## దుర్యోధనుని శిష్యత్వం

రాజేంద్రా! బలరాముడు ఆ విధంగా జనకునికి అతిథియై ఉండగా దుర్యోధనుడు మిథిలకు పోయి, ఆ రాజు సన్మానానికి సంతుష్టుడై అక్కడే ఉండి

బలరాముని వద్ద గదాయుద్ధ ప్రకారమంతా నేర్చుకొన్నాడు.

## సత్రాజిత్తుకు పరలోకక్రియలు

శ్రీకృష్ణుడు ద్వారకకు మరలివచ్చి సత్యభామకు జరిగిన సంగతి వినిపించి ఆమెను ఊరడించి సత్రాజితునికి యథావిధిని పరలోకక్రియలు జరిపించాడు.

## అక్రూరాదుల పలాయనం

శ్రీకృష్ణభగవానుడు ద్వారకకు తిరిగి రావటం, శతధన్వుని మరణవార్త చెవిసోకగానే అక్రూర కృతవర్మలకు వారు పన్నిన దుర్మంత్రమే రూపుదాల్చి వారి మ్రోల నిలిచినట్లయింది. 'అయ్యయ్యో! శతధన్వుని చావుకు మనము కారణమయ్యాము. ఇక ద్వారకలో ఉండటం మంచిది కాదు' అని గుర్తించి వారు వెంటనే అక్కడినుంచి పలాయనం చిత్తగించారు.

## ద్వారకలో సంక్షోభం

అప్పుడు ద్వారకానగరంలో శారీరక మానసిక దైవిక భౌతిక తాపాలు కొన్ని పొడచూపాయి. అక్రూరుడు ద్వారకను వదిలి వెళ్ళిపోవటమే అందుకు కారణమని పురవాసులు కొందరు నిశ్చయించి శ్రీకృష్ణుని మందిరానికి వెళ్ళి 'దేవా! పూర్వం కాశీశ్వరుని రాజ్యంలో ఒకానొకప్పుడు వర్షాలు కురవని పరిస్థితి ఏర్పడింది. అప్పుడు ఆ ఊరిలోని వయోవృద్ధులు కాశీపతిని సందర్శించి 'రాజేంద్రా! శ్వఫల్కుని రావించి గాందినిని అతని కిచ్చి వివాహం జరిపించు. రాజ్యం మళ్ళీ సుభిక్ష మవుతుంది' అని చెప్పారు. కాశీపతి వారు చెప్పినట్లే చేశాడు. వర్షాలు కురిసి రాజ్యం చల్లబడింది. అక్రూరుడు ఆ శ్వఫల్కుని సుతుడు. అతనూ అంతటి మహానుభావుడే. అతను ద్వారకను వదిలి వెళ్ళినది మొదలు జనులకు మహోపద్రవాలు సంభవించాయి. అక్రూరుని మళ్ళీ రప్పించితే సమస్తతాపాలు తొలగిపోతాయి' అని విన్నవించారు.

భగవానుడు వారి పలుకులను శ్రద్ధగా విని, అవన్నీ అజ్ఞాన జల్పితాలని గ్రహించి 'పౌరులారా! అక్రూరుడు వెళ్ళినందువల్ల ఈ ఉపద్రవాలు కలగటం

కాదు. స్యమంతక మణి లేకపోవటమే ఇందుకు కారణం' అని వారికి నచ్చజెప్పి భయాన్ని తీర్చి అక్రూరుని కోసం దూతలను పంపాడు. భగవానుని పిలుపు విని అక్రూరుడు ద్వారకకు మరలివచ్చాడు. శ్రీకృష్ణుడు అతనిని సమ్మానించి సరససల్లాపాలతో కొంతసేపు గడిపి చిరునవ్వు నవ్వుతూ 'దాశపతీ! శతధన్వుడు స్యమంతక మణిని నీ వద్ద దాచిపెట్టడం నాకు తెలియనిది కాదు. సత్రాజిత్తుకు పుత్రసంతానం కలుగలేదు. అతనికి పిండోదక దానాలను అతని కుమార్తెలు జరిపి ఆస్తిపాస్తులను, అప్పులు సప్పులను సమానంగా విభాగించుకొనదలిచి ఉన్నారు. స్యమంతక మణి సత్రాజితుని సొమ్మయినా, దానిని అన్యులు భరింపలేరు. అందుకు సువ్రతుడవైన నీవే తగినవాడవు. ఆ మణి నీ వద్దనే ఉండతగినది. అయితే ఆ స్యమంతకాన్ని పురస్కరించుకొని నాకూ మా అన్నగారికీ వివాదం వచ్చి ఆయన నా మాట నమ్మని పరిస్థితి ఏర్పడింది. దానిని నలుగురికీ చూపించి బంధుమిత్రులకు మనశ్శాంతిని కలిగించు. మహాభాగా! నీవు తలపెట్టిన యజ్ఞాలు సువర్ణవేదికాంతరాలలో నిరంతరం అలరారుతాయి గాక' అని సామవచనాలు పలికాడు. అక్రూరుడు ఆ వచనాలకు సంతోషచిత్తుడై తన ఒడిలోనుంచి తీసి స్యమంతకాన్ని శ్రీకృష్ణునికి సమర్పించాడు. సూర్యప్రభలతో విరాజిల్లుతున్న ఆ దివ్యమణిని చూడగానే ప్రజలు, బంధుమిత్రులు, అందరి మనస్సులలో విపరీతభావాలు మారి నూత్నవికాసం పొడచూపింది. కృష్ణుడు తనయెడ జనించిన అపవాదు సమసిపోయినదని గ్రహించి, 'అక్రూరా! ఈ మణిని నీవద్దనే ఉంచు' అని దానిని అతని కిచ్చివేశాడు.

## ఇంద్రప్రస్థానికి ప్రయాణం

రాజేంద్రా! ఒకనాడు చారులు కృష్ణుని వద్ద కేతెంచి 'దేవా! కుంతీ పాండవులు లాక్షాగృహ దగ్ధులైనారన్న మాట నిజంకాదు. వారిప్పుడు ఇంద్రప్రస్థ పురంలో సుఖంగా ఉన్నారు' అని విన్నవించారు.

వెంటనే కృష్ణుడు సాత్యకి మొదలైనవారిని వెంటగొని ఇంద్రప్రస్థపురం చేరుకొన్నాడు. కృష్ణుని చూచినంతనే పాండవులకు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లయింది. కృష్ణుడు తనకు పెద్దవారైన యుధిష్ఠిర భీమసేనులకు నమస్కరించి, తన యీడువాడైన అర్జునుని కౌగిలించుకొని తనకంటె చిన్నవారైన నకులసహదేవులను దీవించాడు. పాండవులు కృష్ణుని యథావిధి సన్మానించి ఉత్తమాసనంపై కూర్చుండబెట్టారు. క్రొత్త పెళ్ళికూతురు ద్రౌపది సిగ్గుతో తలవంచుకొని మెల్లమెల్లగా వచ్చి కృష్ణునికి ప్రణమిల్లింది. సాత్యకి, తదితరులు పాండవులకు ప్రణామాదులు కావించి ప్రతిమర్యాదలంది తమకని తీర్చిన ఆసనాలలో సుఖోపవిష్టు లయ్యారు.

ఆ తర్వాత కృష్ణుడు కుంతిని సందర్శించి ఆమెకు నమస్కరించాడు. కుంతికూడా ప్రేమరసార్ద్రవీక్షణాలతో అతనిని ఎంతో ఆదరించింది. కృష్ణుడంతట 'అత్తా! కోడలితో సుఖంగా ఉన్నావు కదా' అన్నాడు. ఆ మాటతో కుంతికి పూర్వక్లేశాలు స్మరణకు వచ్చాయి. ఆమె అంతస్తాపం పొంగి పొరలి కన్నీటి ధారల రూపంలో వెలికి ప్రవహింపసాగింది. డగ్గుత్తిక అయింది. ఎట్టకేలకు తనను తానే కొంత సముదాయించుకొని –

'కృష్ణా! నీ వారమని యేనాడు నీవు మమ్ము స్మరించి మా కడకు అక్రూరుని కుశలానుయోగాలకు పంపించావో, ఆనాడే మేము రక్షకుడు కల భాగ్యానికి నోచుకొన్నామని తెలిసింది. ఆనాడే మాకు చిత్తశాంతి కలిగింది. నీవు విశ్వాత్ముడవు విశ్వసుహృదుడవు అయిన మహానుభావుడవు. నీకు స్వకీయులు పరకీయులు లేరు. అందరూ నీకు ఒక్కటే నని నాకు తెలుసు. అందరిలో ఉన్నప్పటికీ ఎవరు నిన్ను స్మరిస్తే వారిని నీవు కరుణిస్తావు. క్లేశాలను తొలగిస్తావు. మేము నిన్ను స్మరింపని క్షణం ఉండదు. అట్టి మాకు లోకంలో కొదవ ఏమున్నది?' అన్నది.

రాజేంద్రా! శ్రీకృష్ణుడు కుంతితో ప్రసంగిస్తున్న సమయంలోనే యుధిష్ఠిరుడు అక్కడికి వచ్చి–

**ఉ. పట్టగ లేరు నిన్నుఁ దమ భావములందు సనందనాదు లే**
**పట్టున నైన, నట్టి గుణభద్రచరిత్రుఁడ వీవు నేడు మా**
**చుట్టమవంచు వచ్చెదవు, చూచెద వల్పులమైన మమ్ము, మే**
**మెట్టి తపంబుఁ జేసితిమొ యీశ్వర! పూర్వశరీరవేళలన్.**

అని పలికి, 'కృష్ణా! కొంతకాలం మాతో గడిపి మమ్మల్ని అనుగ్రహించు' అని ప్రార్థించాడు. కృష్ణు డతని మాటను ఆదరించి వర్షర్తుమాసం ఇంద్రప్రస్థ పురంలో నివసించి ఆ పురవాసు లందరికీ నేత్రానందం కలుగజేశాడు.

## మయసభా నిర్మాణం

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుడు ఇంద్రప్రస్థపురం చేరిన తర్వాత ఆ పురవరాన్ని పరిష్కృతం చేయింపవలసినదని పాండవులు అతనిని కోరారు. భగవానుడు వారికి ప్రీతిదాయకంగా విశ్వకర్మను రప్పించి ఆ పురాన్ని చక్కగా దిద్ది తీర్చమని ఆదేశించాడు.

ఒకనాడు భగవానుడు అర్జునునికి సారథిగా బయలుదేరి ఖాండవవనాన్ని అగ్నిదేవునికి ఆహారంగా ఇప్పించాడు. అగ్నిదేవు డందుకు ప్రీతుడై అర్జునునికి గాండీవాన్ని, మహోత్తమరథాన్ని, శ్వేతరథ్యాలను, అక్షయతూణీరాలను, అభేద్యమైనకవచాన్ని బహూకరించాడు.

ఖాండవదహన కాలంలో మయుడు ఆ వనంలో చిక్కుపడి దగ్ధుడు కాబోతుండగా కృష్ణు డతనిని తప్పించి ప్రాణాలు రక్షించాడు. అందుకు ప్రత్యుపకృతిగా మయుడు విచిత్రమైన సభను నిర్మించి ధర్మరాజుకు కానుకగా ఇచ్చాడు. ఒకనాడు దుర్యోధనుడు ఆ సభకు వెళ్ళటం, అందులో స్థలభాగం జలభాగమని జలభాగం స్థలభాగమని అతను భ్రాంతి చెందటం నువ్వు వినే ఉంటావు.

## కాళిందీ పరిణయం

ఒకనాడు అర్జునుడు వేటాడదలచి కవచం తొడిగి అక్షయతూణీరాలు గైకొని శ్రీకృష్ణునితో రథం ఎక్కి వనంలోనికి ప్రవేశించి రురుశరభాలను గవయ

ఖడ్గాలను వ్యాఘ్ర సూకర మహిషాలను హరిణ శశ శల్యకాదులను మృగాలను చంపాడు. అందులో భోజ్యమైనవాటిని రాజభటులు ధర్మనందనుని వద్దకు తీసికొనివెళ్ళారు.

కృష్ణార్జునులు మృగయాశ్రమ వలన దప్పికతో యమునానది చెంతకేగి ఆచమించి మధుర జలాలను తాగి దాహం తీర్చుకొని విశ్రాంతిగా కూర్చున్నారు. ఆ సమయాన ఒకానొక కన్యామణి ఆ చేరువనే సంచరిస్తూ వారి కంటబడింది. ఆ సుందరాంగి ఎవరో తెలిసికొని రమ్మని కృష్ణుడు అర్జునుని పంపాడు. అర్జునుడు ఆ కాంతామణిని సమీపించి–

**మ. సుదతీ! యెవ్వరిదాన? వేమి కొఱ కిచ్చోటం బ్రవర్తించె? దె**
**య్యది నీ నామము? గోర్కి యెట్టిది? వివాహాకాంక్షతోఁ గూడి యీ**
**నదికిన్ వచ్చిన జాడ గానఁ బడె, ధన్యంబయ్యె నీ రాక, నీ**
**యుదయాదిస్థితి నెల్లఁ జెప్పు మబలా! యుద్యత్కురంగేక్షణా!**

అని అడిగాడు. ఆ యువతి 'అయ్యా! నేను సూర్యుని పుత్రికను. నన్ను కాళింది అంటారు. యమునాజలాలలో నా తండ్రి నాకు నివాసం ఏర్పరిచాడు. విష్ణుదేవుని పతిగా కోరి నేనిక్కడ తపస్సు చేస్తున్నాను. ఆ భగవానుడు తప్పక నన్ననుగ్రహింపగలడని, అంతవరకు ఇక్కడే వేచి ఉండమని నా తండ్రి ఆదేశం. ఆ ముకుందుని కృప నా యెడ ప్రసరిస్తుందని ఎదురుచూస్తున్నాను' అంటూ తన వృత్తాంత మంతా తెలియజెప్పింది. అర్జునుడు సంతోషంతో ఆ సంగతి కృష్ణునికి చెప్పాడు. కృష్ణుడు ఆ కన్యకను రథంమీద కూర్చుండబెట్టుకొని ధర్మనందనుని వద్దకు తిరిగి వచ్చాడు.

ఆ విధంగా కృష్ణుడు వర్షాకాలమంతా ఇంద్రప్రస్థ పురంలో గడిపి ధర్మనందనాదులను వీడ్కొని సాత్యకి మొదలైనవారితో ద్వారకకు వచ్చి శుభనక్షత్ర శుభయోగాది యుక్త శోభన లగ్నాన కాళిందిని శాస్త్రోక్తంగా వివాహం చేసుకొని బంధుమిత్రు లందరికీ పరమానంద మంగళదాయకుడై వెలుగొందాడు.

## మిత్రవిందా పరిణయం

రాజేంద్రా! ఆ సమయంలో విందానువిందులు రాజులై అవంతీదేశాన్ని పరిపాలిస్తున్నారు. వారికి మిత్రవింద అనే చెల్లెలుండేది. ఆమె కృష్ణుని మేనత్త అయిన రాజాధిదేవి కూతురు. ఆ కన్యామణి శ్రీకృష్ణుని ప్రేమించింది.

విందానువిందులు ఆ రమణీమణికి వివాహం సంకల్పించారు. దుర్యోధనుడు ఆ సంగతి విని మిత్రవిందకు స్వయంవరం చాటింపమని కోరాడు. విందానువిందులు దుర్యోధనునికి లోనై ఉన్నవారు గనుక అతని మాటను కాదని త్రోసిపుచ్చలేక మిత్రవిందకు స్వయంవరం చాటించారు. కృష్ణుడు ఆ స్వయంవరానికి వచ్చి రాజలోకమంతా నివ్వెరపోయి చూస్తుండగా మిత్రవిందను ద్వారకకు తీసికొని వెళ్ళి పెద్దలందరి సమక్షంలో అక్కడ వివాహం చేసుకొన్నాడు.

## నాగ్నజితీ పరిణయం

అదే సమయంలో కోసలదేశాన్ని నగ్నజితుడనే రాజు పరమధార్మికుడు పరిపాలిస్తున్నాడు. అతని కుమార్తె పేరు నాగ్నజితి. నగ్నజితుడు తన కుమార్తెకు వివాహం సంకల్పించి, వాడి కొమ్ములు గల వృషభేంద్రాలు ఏడింటిని పెంచాడు. అవి బాగా తిని మదించి పరపురుషుని వాసన కూడా నహింపని వయ్యాయి. ఎవడు ఆ వృషభాలు ఏడింటిని ఎదుర్కొని వాటిని నిర్జింపగలడో ఆ ధృతిమంతునికి తన కుమార్తె నిచ్చి పెండ్లిచేయగలనని నగ్నజితుడు చాటింపు వేయించాడు. ఆ మాటవిని రాజు లొక్కరొక్కరు వచ్చి ఆ వృషభాలను జయింపలేక మరలి పోతుండేవారు. ఆ కారణాన ఎన్నాళ్ళకూ నాగ్నజితికి వివాహం అయింది కాదు.

శ్రీకృష్ణభగవానుడు ఆ సంగతి విని సైన్యసమేతుడై అయోధ్యకు వెళ్ళాడు. కోసలాధీశుడు కృష్ణుని రాక విని సంతోషించి ఎదురేగి అర్చనాదులతో అతనిని సత్కరించి సకలమర్యాదలు చేసి

**మ. సిరియుం బద్మభవేశ దిక్పతులు మున్ సేవించి యెవ్వాని శ్రీ**
**చరణాంభోజపరాగమున్ శిరములన్ సమ్యగ్గతిం దాల్తు, రీ**
**ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళిమూర్తుల్ దయా**
**పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టి హరి కే భావంబునం గూర్తునో?**

అని విన్నవించాడు.

శ్రీకృష్ణు డతనితో ‘ఓ నరేంద్రా! స్వధర్మవర్తి అయిన రాజుకు యాచన తగదు. నీ సౌహృదాన్ని వాంఛించి తదర్థమై నీ పుత్రికను కోరుతున్నాను. సుంకమంటావా, సుంకమివ్వటం మా ఆచారం కాదు’ అని దరహాసపూర్వకంగా పలికాడు. కోసలాదిపుడు ఆ మాటలు విని ‘లోకేశ్వరా! నీవు సర్వగుణైకధాముడవు. శ్రీదేవి అంతటిది నిన్ను వలచి నీ యెదను వీడదు. అటువంటి నీ కంటె మహనీయుడు వరుడు నా కుమార్తెకు లభిస్తాడా? వరుని వీర్య మెంతటిదో పరీక్షించి నా కుమార్తె నీయదలిచి ఒక సంకేతం ఏర్పరిచాను. అందుకోసం వృషభాలను ఏడింటిని పెంచాను. అవి చెనకినవారిని గిట్టింపగల మహాబలం కలిగినవి. ఎంతమందో రాకుమారులు వచ్చి వాటితో ఢీకొనలేక హతులూ హతాశులూ అయ్యారు. ఆ సంకేతాన్ని కాపాడుతానంటే నా పుత్రికకు తగిన వరుడవు కాగలవు’ అన్నాడు.

కృష్ణుడు అతని సంకేతాన్ని విని వెంటనే ఏడుగురు కృష్ణుల రూపాలను ధరించి ఆ ఏడు  వృషభాలను ఢీకొని వాటిని అవలీలగా పట్టి మదం దిగగొట్టి త్రాళ్ళతో కట్టి పిల్లలు బొమ్మలను ఈడ్చినట్లు ఈడ్చాడు. కోసలేశ్వరుడు మహాశ్చర్యభరితుడై కృష్ణునికి తన కుమార్తె నిచ్చాడు. లోకేశ్వరుడు నాగ్నజితిని పరిగ్రహించాడు. పుత్రికకు తగిన వరుడు దొరికినందుకు రాజభార్యలు సంతోషవివశ లయ్యారు. బ్రాహ్మణాశీర్వాదాలు కురిశాయి. మంగళ వాద్యధ్వనులు మారుమ్రోగాయి. నగరమంతా ఆనందవార్ధిలో ఓలలాడింది.

ఆ తర్వాత కోసలేశ్వరుడు సాలంకృతలైన యువతీమణులు మూడువేలమందిని, తొమ్మిదివేల ఏనుగులను, తొంభైవేల రథాలను, తొమ్మిది

లక్షల గుర్రాలను, తొంభైలక్షల పదాతులను అరణంగా ఇచ్చి దివ్యరథం పయిని అల్లుని, కూతురిని ఎక్కించి ద్వారకకు పంపించాడు.

కృష్ణుడు ఆ విధంగా కన్యాన్వితుడై ద్వారకకు పోతున్నప్పుడు కొందరు రాజులు పూర్వం వృషభాలతో పోరాడి ఓడిపోయినవారు మార్గమధ్యంలో వారిని అడ్డగించారు. సింహం క్షుద్రమృగాలను తరిమికొట్టినట్లు అర్జునుడు వారిని పారద్రోలాడు. కృష్ణుడు ద్వారకకు చేరి ఆమెతో వివిధవిహార కేళీలోలుడై సుఖించాడు.

## భద్రా పరిణయం

రాజేంద్రా! కృష్ణునికి శ్రుతకీర్తి అనే మేనత్త మరొకామె ఉండేది. ఆమె కేకయరాజును వివాహమాడి భద్ర అనే కుమార్తెను, సుదర్శనాది పుత్రులను కన్నది. కేకయరాజు మరణించిన తర్వాత అతని పుత్రులు కేకయరాజ్యానికి అధిపతు లయ్యారు. వారు తమ చెల్లెలు భద్రను శ్రీకృష్ణుని కిచ్చి వివాహం చేశారు.

## లక్ష్మణా పరిణయం

మద్రరాజుకు లక్ష్మణ అనే కుమార్తె సర్వలక్షణాలంకృత వివాహోచిత వయస్కురా లున్నది. మద్రరాజు ఆమెకు స్వయంవరం చాటించాడు. నానాదేశాధీశులు స్వయంవరార్థం వచ్చారు. కృష్ణుడు కూడా స్వయంవరానికి వచ్చి దేవతలు చూస్తుండగా సుధను గరుత్మంతుడు కొనిపోయినట్లు రాజులందరూ చకితులై చూస్తుండగా లక్ష్మణను కొనిపోయి వివాహం చేసుకొన్నాడు.

## దేవతల విన్నపం

రాజరాజా! ఒకనాడు శ్రీకృష్ణ భగవానుడు సత్యభామ యింటనుండగా దేవేంద్రు డక్కడికి వచ్చి 'దేవా! ప్రాగ్జ్యోతిషపతి యైన నరకాసురుని బాధలను

ఓర్వలేకపోతున్నాము. అతను వరుణుని ఛత్రం హరించాడు. అదితిని బాధించి కుండలాలను గైకొన్నాడు. నిర్జరనిలయమైన మేరుపర్వతానికి పోయి అక్కడి మణిపర్వతాన్ని కొల్లగొట్టాడు. మాయెడ అనుగ్రహింపకపోతే మేము కాందిశీకులము కాబోతున్నాము' అని విన్నవించాడు.

## నరకాసుర సంహారం

శ్రీకృష్ణభగవానుడు ఆ విజ్ఞాపన విని భక్తవాత్సల్యం వలన వెంటనే ప్రయాణసిద్ధ దయ్యాడు. స్మరించిన క్షణంలోనే గరుడవాహనం వచ్చింది. కృష్ణుడు సత్యభామతో గరుత్మద్రథాన్ని అధిరోహించి ప్రాగ్జ్యోతిషపురానికి బయలుదేరాడు. ఆ పురవరం గిరిదుర్గం శస్త్రదుర్గం జలదుర్గం వహ్నిదుర్గం వాయుదుర్గం అనే దుర్గా లైదింటిచేత ఆవరింపబడి దుర్గమమై ఉన్నది. దానికితోడు ఆ పట్టణం చుట్టూ మురపాశాలను పన్ని పరజన ప్రవేశానికి అలవి లేకుండా కట్టుదిట్టం చేశారు.

శ్రీకృష్ణభగవానుడు పురోపకంఠాన్ని చేరి గదాదండంతో గిరులను భేదించి గిరిదుర్గం దాటి, బాణాలతో శస్త్రాలను త్రుంచి శస్త్రదుర్గం గడిచి, చక్రాయుధంతో తక్కిన దుర్గాలను రూపుమాపి, మురపాశాలను తుత్తునియలు కావించి పాంచజన్యాన్ని పూరించాడు. ప్రళయకాలపవిరవాన్ని మించిన ఆ మహాధ్వనికి యంత్రాలు సడలాయి. అసురవీరులకు గుండె ఝల్లుమన్నది.

## మురాసుర వధ

ఆ తరిని పంచశీర్షుడైన మురుడు నీటిలో నిద్రిస్తుండినవాడు ఆ ధ్వనికి ఉలికిపడి లేచి యుగాంతసమయ చండభాను జ్వలన జ్వాలలను వెలిగక్కుతున్న త్రిశూలాన్ని ధరించి పంచముఖాలతో లోకత్రయాన్ని కబళింపబోతున్న వానివలె ఒక్క ఉదుటున వచ్చి కృష్ణుని ఢీకొని బలంకొద్దీ శూలాన్ని గిరగిర త్రిప్పి గరుడునిపై విసిరి మహాభీకరంగా అట్టహాసం చేశాడు. ఆ ఊర్పు దశాదిశాక్రాంతమై బ్రహ్మాండకటాహం నిండి ప్రతిధ్వను

లీనింది. కృష్ణుడా శూలాన్ని మార్గమధ్యాననే బాణహతులతో మూడుముక్కలు చేసి మురాసురుని పంచవక్త్రాలలో బాణాలను గుప్పించాడు. మురుడు మహోదగ్రుడై గదయెత్తి కృష్ణునిపైకి విసిరాడు. గదాగ్రజు డా గదను తన గదాదండంతో తునిమివేశాడు. మురాసురు డంతట భుజాలు తట్టి చేతులు సాచి పైకొనవచ్చాడు. అచ్యుతుడు చక్రాయుధంతో అతని ఐదు తలలు తరిగాడు. మురాసురుడు శిరస్సులు తెగి వజ్రాయుధాహతికి శిఖరాలు తెగి నీటకూలిన పర్వతం వలె నేలకు కూలి ప్రాణాలు విడిచాడు.

## మురాసుర పుత్త్రసప్తక వధ

మురాసురుడు చచ్చినందుకు అతని కొడుకులు తామ్రుడు, అంతరిక్షకుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, అరుణుడు అనేవారు ఏడుగురూ శోకాగ్రహవివశు లయ్యారు. నరకాసురుడు వారిని పిలిచి పీఠుడనే వాడిని వారికి సేనాధిపతిగా నియమించి కృష్ణుని పైకి పంపాడు. వారు నిశితాయుధాలను చేతబట్టి కృష్ణుని సమీపించి అతనిపై బాణవర్షం కురిపించి ఖడ్గ గదా శక్తి శూలాది వివిధాయుధాలను గుప్పించారు. శ్రీకృష్ణభగవానుడు ప్రతిబాణాలను వర్షించాడు. అతని శరహతులకు వైరులు ప్రయోగించిన ఆయుధాలన్నీ నువ్వుగింజలంత ముక్కలై రాలిపడ్డాయి. అది చాలక శత్రుదళంలో కొందరు తలలు తెగి కొందరు తొడలు తునిగి కొందరు భుజాలు విరిగి కొందరు శరీరాలు నుగ్గునూచాలై నేలకూలారు. హతశేషులు వెనక్కి తిరిగి పారిపోయారు.

రాజేంద్రా! నరకాసురుడు తన సైన్యవినాశాన్ని చూసి క్రోధమూర్ఛితుడై సముద్రసంభవాలైన మత్తగజాలను కూర్చి మహాసైన్యంతో కృష్ణునితో తలపడి సూర్యమండలాంతరాన మెరుపుతోడి మేఘం వంటి తీరున గరుడునిపై కూర్చొని ఉన్న సత్యభామా సహిత భగవానుని పైకి శతఘ్నిని ప్రయోగించాడు. నరకుని సైనికులు క్రూరనారాచాలు గుప్పించారు.

శ్రీకృష్ణభగవాను డంతట సపక్ష శరాలను ప్రయోగించాడు. ఆ సాయకహతులకు నరకుని సైనికులు భుజాలు విరిగి తొడలు తెగి మెడలు తెగి శరీరాలు తూట్లుతూట్లయి పడ్డారు. గరుడుడు రెక్కలతో ముక్కుతో గోళ్ళతో మత్తేభదళాలను అడిచి పొడిచి చీల్చి తారుమారు చేశాడు. దంతావళాలు చీకాకై ఓర్వలేక పురమార్గం పట్టి పారిపోయాయి.

నరకాసురుడు తన సైన్యమంతా చిందరవందర అవుతుంటే చూసి అణుమాత్రమైనా చలింపక రణరంగాన నిలిచి గరుడుని మీదికి శక్తిని విసిరాడు. రాజేంద్రా! వజ్రాయుధాన్ని సరుకుచేయని గరుడునికి శక్తిప్రహారం ఏపాటిది? ఆ వేటు అతనికి పూదండ వచ్చి మెడలో పడినట్లనిపించింది. శక్తి ఆ విధంగా నిరర్థకం కావటాన్ని నరకుడు చూసి నిలువెల్లా జ్వలించుకొనిపోయే మహాశూలాన్ని ఎత్తి విసరబోయాడు. మురాంతకుడు అతని మనోభావం గ్రహించి చక్రాయుధంతో అతని తల నరికాడు. కిరీటకుండలాలతో ఆగని నెత్తుటి ధారతో నరకాసురుని తల నేలరాలింది. దాని పాటు చూసి జనుల హాహారవాలు చెలరేగాయి. ఋషులు సాధువాదాలు పలికారు. దేవతలు ప్రస్తుతించారు. పుష్పవృష్టి కురిసింది.

## శ్రీకృష్ణ స్తోత్రం

రాజశేఖరా! నరకాసురుడు భూదేవి పుత్త్రుడు. ఆ దేవి నరకుని కొడుకైన భగదత్తుని వెంటగొని కృష్ణుని వద్దకు వచ్చి పూర్వం తన కుమారుడు నరకుడు తెచ్చిన వరుణచ్ఛత్రాన్ని, అదితి కుండలాలను, మహామణిని, వైజయంతీ మాలికను, మేరుశిఖరాన్ని కృష్ణునికి సమర్పించి నమస్కరించి భక్తిసలిపి,

**'నమస్తే దేవదేవేశ! శంఖచక్ర గదాధర!**
**భక్తేచ్ఛోపాత్తరూపాయ పరమాత్మ న్నమోస్తుతే.**
**నమః పంకజనాభాయ నమః పంకజమాలినే**
**నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే.**

**నమో భగవతే తుభ్యం వాసుదేవాయ విష్ణవే**
**పురుషా యాదిబీజాయ పూర్ణబోధాయ తే నమః**
**అజాయ జనయిత్రేస్య బ్రహ్మణేనంత శక్తయే**
**పరాపరాత్మన్ భూతాత్మన్ పరమాత్మ న్నమోస్తుతే.**

దేవా! జగత్సృష్టికి గుణము కాలము ప్రధానము పురుషుడు కారణాలని అంటారు. ఆ పలుకులు భ్రాంతి జనితాలు. గుణ కాలాదులు సహితం నీ అంశలే కాని స్వతంత్రాలు కావు. అన్నింటికి నీవు పరుడవై అసంవృతుడవుగా తనరారుతూ సృష్టించేటపుడు రజస్సును, పాలించేటపుడు సత్త్వాన్ని, లయించే వేళ తమస్సును గ్రహిస్తావు. పంచభూతాలు తన్మాత్రలు దేవతలు మనస్సు ఇంద్రియాలు త్రివిధమైన అహంకార కార్యాలని, అహంకారం కారణమని మరికొందరంటారు. చరాచర సమస్త ప్రపంచం నీయందున్నదేనని కొందరు చెబుతారు. ఇవన్నీ భ్రమోక్తులు. నీవు అద్వితీయుడవు. సర్వము నీవుగా ప్రకాశించేవాడవు' అని మొక్కి భగదత్తునిచే మొక్కించి,

**చ. దయ నిటు చూడుమా నరక**
**దైత్యుని బిడ్డఁడు వీఁడు నీ దెసన్**
**భయమున నున్నవాఁడు గడు**
**బాలుఁ డనన్యశరణ్యుఁ డార్తుఁ డా**
**శ్రయరహితుండు తండ్రి క్రియ**
**శౌర్యము నేరఁడు నీ పదాంబుజ**
**ద్వయిఁ బొడగాంచె భక్తపర**
**తంత్ర సువీక్షణ! దీనరక్షణా!**

అని ప్రార్థించింది. భగవానుడు భగదత్తుని అనుగ్రహించి అతనికి అభయం ప్రసాదించాడు.

## ద్వివిద సంహారం

రాజేంద్రా! రామరావణయుద్ధంలో మైందుడనే ప్రసిద్ధ వానరవీరుని సంగతి వినే ఉంటావు. ఆ మైందునికి ద్వివిదుడనే సోదరుడు ఉండేవాడు. అతను సుగ్రీవునికి మంత్రియై పేరెన్నిక గన్నాడు. ఆ ద్వివిదుడు నరకాసురునికి ప్రియసఖుడు. శ్రీకృష్ణుడు ఎప్పుడయితే నరకాసురుని సంహరించాడో, ద్వివిదుడు తన మిత్రుని ఋణం తీర్చుకోవాలని నిశ్చయించి శ్రీకృష్ణునిపై పగబూని యాదవుల నివాసమైన ఆనర్తదేశానికి కీడు చేయదలచి పర్వతాలను పెకలించి తెచ్చి, ఎక్కడి కక్కడ నిప్పంటించి, ఆ దేశ పుర గ్రామాదు లన్నింటినీ నామావశిష్టాలు కావించాడు. ఊరూ వాడా నాశనమైన తర్వాత వాడు సాగరం లోనికి జొరబడి తన నాగాయుత బలం చూపి నీరంతా ఎగజిమ్మాడు. ఆ నీరు పొంగి పొరలి ఉప్పెన లేచి పరిసరగ్రామాలను ముంచి నాశనం చేసింది. అతనంతటితో ఊరుకొనక మహర్షుల ఆశ్రమాలలోనికి ప్రవేశించి అక్కడ పెరుగుతున్న వనస్పతులను ధ్వంసం చేసి వైతానికవేదులను పెరికివేసి హోమకుండాలలో మూత్రపురీషాలు విసర్జించి అందలి అగ్నులను చల్లార్చాడు. స్త్రీలను పట్టుకొనిపోయి కొండగుహలలో దాచాడు. గిరిశృంగాలను తెచ్చి గృహద్వారాలకు అడ్డుపెట్టి ఇళ్ళూ వాకిళ్ళూ మూసివేశాడు. కులకాంతలను దూషించాడు. వాడి అకార్యాలకు దేశమంతా అట్టుడికి పోయింది.

ఒకనాడు బలరాముడు రైవతగిరి మీద సంగీతవినోదం సంకల్పించి తన ప్రియురాండ్రతో అక్కడికి పోయి వారుణి గ్రోలి తదానందపరవశుడై తానూ పాడటం మొదలుపెట్టాడు. అతని చుట్టూ కాంతామణులు కూర్చుండి గానమాధుర్యానికి కలిగిన సంతోషాన్ని తల ఊపులతో తెలియజెప్పసాగారు. ఆ సంగీతధ్వని ద్వివిదుని చెవినిబడింది. అతను వెంటనే అక్కడికి పోయి కంటికి కనిపించిన చెట్టుపైకెక్కి కొమ్మలను కదిలించి కిచకిచమని అరిచి కోతిచేష్టలు చేయసాగాడు. బలరాముని ప్రియకాంతలు ఆ కోతిని చూసి తాముకూడా కోతి చేష్టలకు పూనుకొని పరిహసింపసాగారు. ఆ

వానరుడందుకు బదులుగా అతని పృష్ఠభాగాన్ని చూపుతూ వెకిలి చేష్టలు చేశాడు. బలరాముడు ఆ చేష్టకు కోపగించి ఒక రాయినందుకొని దానిపైకి రువ్వాడు. ఆ కోతి దెబ్బను తప్పించుకొని నేలకు దుమికి బలరాముని కల్లు ముంతను ఎత్తుకొనిపోయి పగలగొట్టి అతనిని వెక్కిరించి అతని చెంతనున్న స్త్రీల చీరలు చించి కొంగులు పట్టిలాగి కొరగాములు చేసింది.

బలరాముడు దాని దుడుకుతనం మితిమీరిన తర్వాత సహింపలేక పాట చాలించి లేచి సునందమనే హలాన్ని, ముసలాన్ని చేతబట్టాడు. ఆ కోతికూడా వెనువెంటనే ఒక పెద్ద వృక్షాన్ని పెరికితెచ్చి బలరాముని తలమీద పడవేసింది. బలరాముడు దాని వేటుకు చలింపక ముసలాన్ని గురిపెట్టి వానరుడి శిరస్సును అణిచాడు. ఆ దెబ్బకు కోతికి తలపగిలి నెత్తురు వెల్లువయింది. అంత దెబ్బ తగిలినా ద్వివిదుడు లెక్కచేయక మరొక వృక్షాన్ని పెల్లగించి ఆకులు విదిలించి ఆ చెట్టును బలునిపై మోదాడు. బలుడు దానిని శతసహస్ర ఖండాలు చేశాడు. ద్వివిదుడు మరొక భూరుహాన్ని తెచ్చి వేశాడు. దాని గతీ అంతే అయింది. ఆ విధంగా ద్వివిదుడు ఒక్కొక్క చెట్టును పెకలించి వేయటం, బలుడు దానిని నూరుముక్కలు చేయటం ఈ రెంటితో వనమంతా నిర్వృక్షమైపోయింది. అప్పుడు ద్వివిదుడు భూరిశిలావర్షం కురిపించాడు. బలుడు ఆ రాళ్ళన్నింటినీ పిండిచేశాడు. ద్వివిదుడు మార్గాంతరం లేక తాళమాత్రాలైన తన మహాబాహువులను త్రిప్పి పిడికిలి బిగించి బలుని రొమ్మున అడిచాడు. బలుడు ముసలాన్ని దిగవైచి ముష్టిఘాతాలతో ద్వివిదుని కంఠ బాహుమూలాలను గ్రుద్దాడు. ఆ వేటులకు ద్వివిదుడు నోట రక్తం ఉమిసి నేలకూలాడు. సుడిగాలికి మహాసముద్రాంతరాన చిక్కుకొన్న నావ వలె అతని పతనానికి రైవతకాద్రి వృక్షకందరాలతో ఉర్రట్లూగింది.

ద్వివిదుడు పడినంతనే గగనతలాన సురల జయజయధ్వనులు, ప్రణామప్రస్తుతులు సాధువాదాలు ప్రతిధ్వనులీనాయి. పుష్పవృష్టి కురిసింది. అంత బలరాముడు నగరు చేరాడు.

## రాజకన్యల విమోచనం

రాజేంద్రా! నరకాసురుడు తన సమకాలంలో ఉన్న నానారాజులను ఎదిరించి నానాట పదహారు వేలమంది రాచకన్నెలను తెచ్చి చెరలో ఉంచాడు. ఆ కాంతలు కారాగృహబంధితలై గోడుగోడుమంటూ 'మమ్ము రక్షించి ఏలుకొన' మంటూ పరిపరివిధాల భగవంతుని ప్రార్థిస్తుండేవారు. శ్రీకృష్ణుడా విధంగా భగదత్తునికి ప్రీతిగూర్చి నరకాసురుని అంతఃపురానికి పోయి అందులో బందీలుగా ఉన్న కన్నెలందరినీ విడిపించి, పల్లకీల లోని కెక్కించి వారితో నరకుని రథాశ్వకోశాదులను, ఐరావతవంశ సంభూత దంతావళాలు అరవైనాల్గింటిని ద్వారకాపురానికి తరలించాడు.

## పారిజాతహరణం

కృష్ణుడంతట సత్యభామతో ఇంద్రలోకానికి వెళ్ళి దేవతల తల్లియైన అదితికి ఆమె కుండలాలను అప్పగించి ఆమె, ఇంద్రుడు, అతని దేవేరి కావించిన సత్కారాలను సతీసమేతంగా అందుకొన్నాడు. ఆ తరిని సత్యభామకు ఇంద్రుని నందనోద్యానం చూడాలని కుతూహలం కలిగింది. కృష్ణుడు ఆమె ముచ్చటను తీర్పదలిచి ఆమెతో కలిసి నందనవనానికి వెళ్ళాడు. అక్కడ సత్యభామ పారిజాతాన్ని చూసి దానిని ద్వారకకు తీసికొనిపోదామని శ్రీకృష్ణుని ప్రేరేపించింది. కృష్ణుడు ప్రియురాలి ముచ్చట తీర్చాలని ముచ్చటపడి ఆ పారిజాతాన్ని వ్రేళ్ళతోపాటు ఊడబెరికి గరుడుని మూపున ఉంచి ప్రయాణోన్ముఖు డయ్యాడు. వనరక్షకులు ఆ సంగతి తెలిసి దేవేంద్రునికి తెలిపారు. ఇంద్రాది నిర్జరులు వచ్చి అడ్డగించారు. కృష్ణుడు వారందరినీ నిర్జించి ఆ కల్పవృక్షాన్ని తెచ్చి ద్వారకలో సత్యభామాగృహోపవనాన నాటాడు.

రాజేంద్రా! ఇంద్రాదుల పదవీ భోగాలన్నీ భగవదనుగ్రహ ఫలాలేనని గుర్తుంచుకోవాలి. వారికి ముప్పు వచ్చినపుడు ఏదో ఒక రూపంలో భగవంతుడు వారిని రక్షిస్తూనే ఉన్నాడు. అట్టి భగవానుడు స్వయంగా వచ్చి సత్యభామ కోరిక తీర్చాలని సంకల్పించినప్పుడు తదాశ్రితులైన నిర్జరులు

ఆయనను అడ్డగించటమంటే వింతగా ఉన్నది కదూ. లోకకల్పకమైన భగవానుని మ్రోల పారిజాతకల్పకం ఏపాటిదంటావు? జీవులు ధన పదవీ గర్వాంధులై మేలు కూడా మరిచి తమోవశులై ఎంత పాతకానికైనా ఒడిగడతారు. అయ్యయ్యో! అజ్ఞానాంధకారానికి చిక్కినవారికి హితాహితవివేకం గాని కృతజ్ఞత గాని కలిగే అవకాశం లేదు కదా!

## రాచకన్నెలతో వివాహం

శ్రీకృష్ణభగవానుడు ఆ విధంగా పారిజాతాన్ని తీసుకొని ద్వారకానగరం చేరి తాను పంపించిన పదహారువేలమంది రాచకన్నెలకు తగినట్లుగా వేర్వేరు గృహాలను నిర్మింపజేసి వారికి ఒక్కొక్క ఇంటిలో సుఖనివాసం కల్పించాడు. వారికి కృష్ణునితో కళ్యాణం నిశ్చయించారు. ఏకకాలంలోనే ముహూర్తం నిర్ణయింపబడింది. కృష్ణుడు పదహారు వేల కృష్ణరూపాలను ధరించి ఆ కన్యకల ఇండ్లలో సాక్షాత్కరించి వారందరినీ పెండ్లిచేసుకొన్నాడు. వారందరికీ అతను ప్రతిదినం ఒకే సమయంలో ఒక్కొక్క ఇంటిలో ప్రత్యక్షమౌతూ వారిని అభీష్టసుఖాలలో ఓలలాడిస్తూ అందరికీ ఏకరూప సంతోషాతిశయాలను కూర్పసాగాడు. వారిలో ప్రతిఒక్కరూ కృష్ణుడు తనవాడని, ఎల్లవేళల తనవద్ద మాత్రమే ఉంటున్నాడని భావించి గర్వపడసాగారు. వారందరూ రమాంశసంభూతులు కాబట్టి భగవానుడు ఆత్మానంద పూర్ణుడయినా సామాన్య గృహమేధి రీతిని వారితో గృహమేధి ధర్మాలను ఆచరిస్తూ క్రీడిస్తున్నవాని వలె భాసింపజేశాడు. రాజా! భగవద్విలాసాల స్వరూపం ఇట్టిదని ఊహించటం కూడా సాధ్యం కాదు.

ఆ రాజకన్యలు శ్రీపతిని పతిగా పొంది కూర్ములను అతనిపై కురిపిస్తూ లేనగవులు క్రీగంటి చూపులు మృదుమధుర భాషణలు లజ్జావిలాసచేష్టితాలతో అతనికి ప్రీతి కావిస్తూ తమ తమ పరిచారికల వలన ఉపచారాదులను చేయించుతూ పతి ఇంటికి వచ్చినప్పు డెదురేగి

భయభక్తులతో సేవించి ఉచితాసనాన కూర్చుండబెట్టి పాదప్రక్షాళన మొనర్చి విడియం ఇచ్చి చరణాలొత్తి వీవనలు వీచి చందనచర్చలు చేసి పుష్పమాలలు వేసి సిగదువ్వి జలకమాడించి ఇష్టాన్నతృప్తుని కావించి పాన్పుకుచేర్చి వివిధోపచారాలు చేస్తూ పరమానందచిత్త లవుతుండేవారు.

## ప్రద్యుమ్నాదుల వివాహం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు కావించిన అవమానానికి రుక్మి మనస్సులో తీరని క్రోధం ఉద్దుడుకుతున్నా అతను చెల్లెలు రుక్మిణిమీద అభిమానంతో తన కుమార్తె రుక్మవతిని ప్రద్యుమ్నునికిచ్చి వివాహం చేయాలని నిశ్చయించి స్వయంవరాన్ని చాటించాడు. నానాదేశాల నుంచి రాజులు వచ్చారు. ప్రద్యుమ్నుడు ఆ రాజులందరిని జయించి రుక్మవతిని పెండ్లిచేసుకొన్నాడు.

రుక్మిణికి చారుమతి అనే కుమార్తె జన్మించింది. ఆమెను కృతవర్మ పుత్రుడైన విశాలాక్షుని కిచ్చి వివాహం చేశారు.

ప్రద్యుమ్నునికి అనిరుద్ధుడు జన్మించాడు. తన దౌహిత్రుని మీది అభిమానంతో రుక్మి కొడుకు కూతురైన రోచన అనే కన్యకను రుక్మిణీ ప్రీత్యర్థం అతనికిచ్చి వివాహం చేయదలిచాడు.

అనిరుద్ధుని వివాహానికి రుక్మిణీకృష్ణులు బలరాముడు ప్రద్యుమ్న సాంబాది కుమారులతో భోజకటకపురానికి తరలివెళ్ళారు. వివాహం మహోత్సవంగా జరిగింది. కాళింగుడు మొదలుగా గల రాజులు, రుక్మి మిత్రులు కూడా పెండ్లికి వచ్చారు. పండుగ వేడుకలు చక్కజూస్తున్న రుక్మిని పిలిచి, 'అయ్యా! బలరాముడు జూదంలో నేర్పరినని విర్రవీగుతుంటాడు. అతనితో జూదమాడి గెలువు' అని వారు ప్రేరేపించారు. రుక్మికి అక్షవిద్య తెలియదు. అయినా అతను కాళింగాదుల ప్రోత్సాహానికి లోబడి బలరాముని జూదానికి రమ్మని పిలిచారు.

## ద్యూత కలహాలు

జూదం ఆట మొదలయింది. మొదట బలరాముడు నూరు వేయి పదివేలు చిన్న చిన్న మొత్తాలు పందెంగా పెట్టి ఆడాడు. వాటన్నింటినీ రుక్మి గెలుచుకొన్నాడు. అందుకు కాళింగుడు పండ్లికిలించి పకపక నవ్వాడు. బలరాముడు ఆ పరిహాసానికి కిమ్మనక ఊరుకొన్నాడు. రుక్మి అంతట ఒక లక్ష పందెం ఒడ్డి ఆడాడు. ఆ పందెం బలరామునికి దక్కింది. వాస్తవం ఇలా ఉండగా రుక్మి 'నేను గెలిచాను, నేను గెలిచాను' అని కేకలు వేశాడు. అందుకు బలరాముడు కోపవివశుడై కన్ను లెఱ్ఱజేసి బుసలుగొట్టుతూ పదికోట్ల పందెమొడ్డి ఆ ఆట గెలిచాడు. 'ఇది కూడా నేనే గెలిచాను; సదస్యులు మీరందరూ నిజం చెప్పండి' అని రుక్మి అరిచాడు. అంతలో గగనభాగం నుంచి, 'బలరాముడు ధర్మపూర్వకంగా ఆట గెలిచాడు. రుక్మి బొంకుతున్నాడు' అని ఆకాశవాణి పలికింది.

రుక్మి ఆ పలుకులను లెక్కచేయక, దుష్టరాజులు ప్రేరేపిస్తుండగా లేచి బలరాముని వంక మరలి, 'ఏమయ్యా! అడవులు పట్టి తిరిగే గోవుల కాపరు లెక్కడ? అక్షవిద్యావైశారద్యం బాణప్రయోగనైపుణ్యం వంటి నాగరకవిద్య లెక్కడ?' అని పరిహసించాడు. సభలో ఉన్న రాజులందరూ తలలూపి హర్షధ్వానాలు చేశారు.

## రుక్మి వధ

దానితో బలరాముడు కోపవివశుడై పరిఘ నందుకొని రుక్మిని ఒక్క వేటున కడతేర్చాడు. రుక్మి పాటును చూసి కాళింగాది రాజులు పరుగు లంకించుకొన్నారు. బలరాముడు కాళింగుని వెంబడించి పది అడుగులలోనే అతనిని పట్టుకొని పడద్రోసి 'ఏమిరా! పండ్లు కికురించుకొని నవ్వావు. ఆ పండ్లను చూపించు' అంటూ అతని నోరు తెరిచి పండ్లు రాలగొట్టి తల పగలగొట్టాడు. అంతటితో రుక్మిని వదిలి ఇతరరాజుల వెంటబడి కొందరిని

తలలు తరిగి కొందరి భుజాలు విరిచి కొందరి తొడలు చీల్చి చెల్లాచెదరు చేశాడు. చావగా మిగిలినవారు ఎక్కడివారక్కడ పరుగులు తీశారు.

బలరాముడు రుక్మిని చంపుతుండటం కృష్ణుడు చూస్తూనే ఉన్నా, మాట్లాడితే బలరామునికీ మాట్లాడకపోతే రుక్మిణికీ కోపం వస్తుందని గ్రహించి, 'ఊరుకున్నవాడికి ఊరంతా చుట్టాలే' అన్న సామెత ప్రకారం ఊరుకొన్నాడు. అంతా కుదుటబడిన తర్వాత రామకృష్ణాదులు నూతనవధూసహితంగా అనిరుద్ధుని రథం మీద కూర్చుండబెట్టి ద్వారకకు బయలుదేరారు.

## రుక్మిణితో విరసోక్తులు

రాజేంద్రా! ఒకనాడు శ్రీకృష్ణుడు రుక్మిణీమందిరానికి వెళ్ళి, మహేంద్ర నీల మరకతాది మణిస్తంభ వలభి విటంక పటల దేహళీ కవాట విరాజమానము, శాతకుంభ కుడ్య గవాక్ష వేదికాసౌపానము, విలంబమాన ముక్తాఫలదామ విచిత్ర కౌశేయవితానము, వివిధ మణిదీపికా విసర విభ్రాజమానము, మధుకర కులకలిత మల్లికాకుసుమ మాలికాభిరామము, జాలక రంధ్ర వినిర్గత కర్పూరాగరు ధూపధూమము, వాతాయన విప్రకీర్ణ శిశిరకిరణ స్తోమము, పారిజాతవనామోద పరిమళిత పవన మనోహరము అయిన అంతఃపురంలో శరచ్చంద్రచంద్రికాధవళ పర్యంకమధ్యాన సుఖాసీనుడై ఉండగా

**సీ. కుచకుంభముల మీది కుంకుమతో రాయు**
**హారంబు లరుణంబు లగుచు మెఱయఁ**

**గరపల్లవము సాచి కదలింప నంగుళీ**
**యక కంకణప్రభ లావరింపఁ**

**గదలిన బహురత్నకలిత నూపురముల**
**గంభీర నినదంబు గడలు కొనఁగ**

**గాంచన మణికర్ణికామయూరంబులు**
**గండపాలికలపై గంతు లిడఁగఁ**

**గీ. గురులు నర్తింపఁ బయ్యెద కొంగు దూఁగ**
**బోటి చేనున్న చామర పుచ్చుకొనుచు**
**జీవితేశ్వరు రుక్మిణి సేర నరిగి**
**వేడ్క లిగురొత్త మెల్లన వీవ దొడఁగె.**

## ప్రణయోపాలంభనలు

రాజేంద్రా! రమాదేవి పతికి అనురూపవతియై అనేక లీలావతారాలను ధరిస్తుంటుంది. ఆనాడు రమాదేవి రుక్మిణిగా అవతరించినదని చెప్పాను. కృష్ణుడు ఆమెయెడల ప్రీతుడై ఆనాడు ఈ విధంగా ప్రసంగించాడు :

**క. శ్రీయును గులమును రూపును**
**బ్రాయము శుభలక్షణంబు బాంధవవిద్యా**
**శ్రేయముఁ గల వరునకుఁ గ**
**న్యాయతగాఁ జేయవలయు నధికప్రీతిన్.**

అని పెద్దలన్నారు. లోకపాలక శ్రీమంతులై రూపగుణసౌందర్యాదులు ప్రసిద్ధికెక్కి ఉదారోన్నతులైన మహానుభావులు రాకుమారు లనేకులు నీ కోసం కలలు కన్నారు. మీ తండ్రిగారు, మీ అగ్రజుడు అట్టివారికే నిన్ను ఇవ్వాలని నిశ్చయించారు. శిశుపాలాదులు నిన్ను వలచి వచ్చారు. వారందరినీ నిరసించి నన్ను వరించావు. ఎందులోనూ నేను వారికి సాటి కాగలవాడను కాను. మేము రాజులము కాము; రాజ్యాసనానికి నాకు అర్హత లేదు. బలశౌర్యాల మాటో? రాజులకు భయపడి దొంగలమై సముద్రాంతరాన దాగినవారము. గొప్పవారిని నిరసించి నా బోటి సామాన్యుని వరించటం రాచకన్నెలకు ధర్మమేమా? ఎవరి ఆచారాలు తెలియరానివో, ఎవరి లోకగతులు వింతలుగా ఉంటాయో, అట్టివారిని కూడిన స్త్రీలు కష్టాల పాలుగాక తీరదు. మేమా అకించనులము; అకించనులకు ప్రీతిపాత్రు

లైనవారము. గొప్పవారు మా వంకనైనా చూడరు. లోకాచారానికి కట్టుబడము; మా జాడలు పరులకు తెలియరావు. ఇంత విచారింపక గుణహీనులము, భిక్షుసమ్మానితులము అయిన మా బోంట్లను వరించటమంటే దుఃఖాలను మూటగట్టుకొనటమే. ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఇకతోనైనా నీ తప్పు గ్రహించి ఉత్తమ పురుషుని పొంది ఇహపరాలు రెండింటిలోనూ అభీష్టకామాలను చూరగొను.

కాంతామణీ! రుక్మిణీ! చైద్య సాళ్వ జరాసంధ దంతవక్త్రాదులను, నీ అన్నను - ఇంతమందిని నిర్జించి ఎందుకోసం తెచ్చి పెండ్లిచేసుకొన్నానని అడుగుతావేమో. వారికి గర్వభంగం చేయదలిచానే కాని స్త్రీపుత్రార్థకామినై నిన్ను తీసికొనిరాలేదు. ఉదాసీనులమైన మాకు ఇటువంటి కోర్కెలు కలుగవు. జ్యోతిస్సు వలె క్రియారహితులమై ఆత్మలాభపూర్ణులమై ఉంటాము' అని ఉపాలంభాలు పలికాడు.

## రుక్మిణీ వైవశ్యం

రుక్మిణి మున్నెన్నడు అటువంటి అప్రియాలను ప్రియుని నోట విని యెరుగదు. కృష్ణుడు తన ప్రాణానికి ప్రాణమని, తాను పట్టపుదేవినని అంతవరకు ఆమె మనసులో గర్విస్తుండేది. కృష్ణుని మాటలు చెవిని పడగానే ఆమెకు దుఃఖం ముంచుకొని వచ్చింది. శరీరమంతా వణకసాగింది. కన్నీరుబికింది. కాలి కొనగోటితో నేలగీటుతూ నాథు దన్నమాట పరిహాసమని అనుకొనలేక వ్యసనవిశేషం వలన నోట మాటాడక తలవంచి మనసు గతితప్పి మైమరచి చేతి వీవన జారటమూ సిగముడి వీడుతుండటమూ తెలియరాక గాలికొదిగిన అరటిబోదె వలె నేలకొరిగింది.

## రుక్మిణీ సాంత్వనం

శ్రీకృష్ణు డదిచూసి, 'అవురా! ఈ అబల మేలపు మాటల పసయెరుగదు. ఈమె ప్రేమాతిశయం అనిర్వచనీయం' అని లోలోన తలంచి తటాలున

పాన్పునుంచి దిగి రుక్మిణిని లేవనెత్తి చెల్లాచెదరైన కురులను సవరించి తన కరారవిందంతో ఆమె ముఖారవిందం నిమిరి కన్నీరు తుడిచి కౌగిట చేర్చి వీవన విసిరి అలపు తీర్చి, 'వైదర్భీ! విరసాలు ఆడానని నాపై కోపగించుకొనకు. నన్నే పరాయణంగా నీవు నమ్మి ఉండటం నాకు తెలియని సంగతి కాదు. ప్రణయకలహమాధుర్యం ఎంతటిదో చవిచూడదలిచి నీతో మేలపు మాటలన్నాను. ఆ మాటలు నీటి మూటలని గ్రహింపక నిజాలని నీవు భావించినంతనే నీ ముఖారవిందం పొందిన మార్పు చూచి నాకెంత సంతోషం కలిగిన దనుకొన్నావు! హరిణేక్షణా! గృహస్థులు ప్రియులతో మేలమాడి ఆ శృంగారరసాన్ని చవిగొనాలని ఉవ్విళ్ళూరుతుంటారు. నీవింత బేలవని ఎరుగనే యెరుగను' అంటూ ప్రియోక్తులాడి ఆమెను ఓదార్చాడు.

## రుక్మిణీ సమాధానం

ఆ మాటలు చెవిసోకినంతనే రుక్మిణి ఆ మాటలు పరిహాసానికని గుర్తింపలేక ప్రియుడు తనయెడ విరసు డైనాడని భావించినందున సిగ్గుపడి, చిరునవ్వుతోడి క్రీగంటిచూపులను కృష్ణునియెడ ప్రసరింపజేస్తూ ఈ విధంగా అన్నది:

'పురుషోత్తమా! కయ్యానికీ వియ్యానికీ సమత్వమనేది ఉండాలని, ఆ సమత్వం లేని నిన్ను నేను వరించానని మీరన్నమాట ముమ్మాటికీ సత్యం. ఏమంటారా? మీరు గుణాతీతులు; నేనో గుణబద్ధురాలను. ఎందులోనూ నేను మీకు సాటికి రాగలదానిని కాను. అధీశ్వరినై శ్రీరూపాన జీవకోటికి ఆరాధ్యురాలి నంటారా? ఆ పని సకాములైన అజ్ఞులు కావించేది. సకాములకు అభిలషణీయనైన నేను నిష్కాములకు మీకెలా సాటిరాగలను?

రాజులకు భయపడి పారిపోయి సముద్రగర్భంలో దాక్కొన్నానని అన్నారు. ఆ మాట కూడా నిజమే. రజోగుణసముద్భవములై రాజులను పోలిన శబ్దాదులకు దూరవర్తులై, అగాధమై విషయాకార రహితమైన హృదయాంతస్సముద్రంలో చైతన్యఘనులై, నిశ్చలాత్మ స్వరూపాన

అద్వితీయులై చెన్నారుతున్న మహాత్మభావులు మీరు. రజోమూర్తులు రాజులకు మిమ్ము చేజిక్కించుకొనటం సాధ్యమా? బలవంతులకు ద్వేషి నయ్యానని అన్నారు. అదికూడా యథార్థమే. కుత్సితమూ బహిర్ముఖప్రణయమూ అయి ఇంద్రియగణం వర్తిల్లుతుంటుంది. ఇంద్రియవశులకు మీరు గోచరింపరు. ఆ కారణాన ఇంద్రియబద్ధులు మిమ్మల్ని ద్వేషిస్తుంటారు. ఇందులో వింతేమున్నది?

రాజాసనానికి మీకు అర్హత లేదన్నారు. అదీ సమంజసమే కదా. ఏమంటే రాజాసనం తమోంధమయమైనది. దానిని మీ పాదసేవకులు సైతం తృణీకరిస్తారు. ఇక మీ సంగతి వేరే చెప్పేదేమున్నది?

మీ జాడ లెవరికీ తెలియరాని వన్నారు. అదికూడా యుక్తమే. మీ పాదసరోజమకరందాన్ని గ్రోలి మైమరిచి మీ కొరకు వెతుకుతూ ప్రాకులాడుతుండే మునిసత్తము లంతవారికే మీ మార్గం అగోచరమై ఉండగా నరపశువుల సంగతి చెప్పటాని కేముంటుంది?

మీ భావం ఎరుకపడదన్నారు. ఆ మాట వాస్తవమే. మిమ్ము సేవించేవారి ఊహితమే అలౌకికమౌతుండగా మీ ఊహితాన్ని గురించి ఏమి చెప్పగలను?

అకించనుడి నన్నారు. మీకంటె అన్యమైనది వేరొకటి లేదు కనుక మీరు నిజంగా అకించనులే. మీరు నిష్కించనులైనా దరిద్రతాదోషం మీకు తగులదు. ఏమంటారా? లోకపూజ్యులైన బ్రహ్మాదు లంతటివారు మీరు కోరకనే మీకు బలి సమర్పించుతుండగా కొదవ దేనికుంటుంది? ఆఢ్యులు మీవంక కన్నెత్తి చూడరన్నారు. ఆఢ్యులంటే ఎవరు? ఇంద్రియ మదోన్మత్తులు. వారికి మీరు అంతకారులు కదా. అందుచేత మీ వైపు చూడటానికే వారు భయపడతారు. ఇది కొత్త కాదు. అకించనులకు నేను ప్రియుడ నన్నారు. అది మేలపు మాట కాదు. మీరు సమస్తపురుషార్థస్వరూపులు; పరమాత్మరూపులు. మీ పదాన్ని కోరి, ప్రజ్ఞావంతులు సర్వం పరిత్యజిస్తారు. అట్టివారితో సేవ్యసేవక భావ

లక్షణ సంబంధం మీకు సరిపడుతుంది గాని మిథునధర్మలోలులై సుఖ దుఃఖాకులాన పడి మ్రగ్గేవారి చెలిమిని మీరు ఇచ్ఛగిస్తారా?

భిక్షువులు మిమ్ము శ్లాఘిస్తారని అన్నారు. భిక్షువులంటే సర్వసంగపరిత్యాగులైన మునులు గాని సామాన్య యాచకులు కారు. అట్టివారికి మీకంటె శ్లాఘ్యు లెవరుంటారు? మిమ్ము నేను వరించటం తగదన్నారు. ప్రియమైనదానిని కోరటం మానవ నైజం. ఆత్మకంటె ప్రియమైనది వేరొకటి కలుగదు. మీరు జగదాత్ములు ఆత్ములు అయినట్టివారు. మిమ్ము వరించి పరిణయమాడటం దోషమెలా అవుతుంది?

శిశుపాలాదులను ప్రశంసించారు. బ్రహ్మాదులు సహితం మీరు ఒక్కింత బొమముడి వైచినంతనే కాలవేగధ్వస్తులై సర్వైశ్వర్యాలతో నశించిపోతారు. శిశుపాలాదుల సంగతిని చెప్పాలా? రాజులకు భయపడి సముద్రంలో దాగానన్నారు. శార్జ్గ చాప ఘోష మాత్రాన జరాసంధాది రాజులను ఓడించి నన్ను చేపట్టిన మీరెక్కడ? ఆ రాజమ్మన్యులెక్కడ? వారికి ఓటువడి భయభ్రాంతులై సముద్రంలో దాగారన్న మాటను లోకం నమ్ముతుందా?

జాడలు తెలియని మీ దారి త్రొక్కినవారు కష్టాల పాలవుతారని అన్నారు. అంగరాజు, పృథుచక్రవర్తి, భరతుడు, యయాతి, గయుడు మొదలయిన రాజులు సామ్రాజ్యవైభవాలను సైతం తృణప్రాయంగా పరిత్యజించి మీ పథాన్ని అనుసరించి రాలేదా? వారందరికీ కీడు కలిగిందా? వారందరూ మీ పదాన్ని పొందలేదా?

అనురూప వంతుని వరింపలేదని అన్నారు. ఎవరి పాదకమలం సమస్తగుణాలకు ఆలవాలమై ముక్తిదాయకము లక్ష్మీనివాసము సజ్జనవర్ణితము అయి ఒప్పారుతున్నదో అట్టి మహానుభావుని వదలి అర్థవివేకం గల కన్నె మరణధర్మకమూ నిరంతర భయాన్వితమూ అయిన శరీరాన్ని ధరించి కర్మబద్ధులను కామిస్తుందా? నిఖిల కామప్రదులు జగదీశ్వరులు అయిన మీకంటె అనురూపులు నాకెవరుంటారు? మిమ్ము

వరించటం నా బహుజన్మజన్మల సుకృతఫలం. దేవ తిర్యగాది జన్మరూప సంసారంలో పరిభ్రమించే నాకు భక్తసంసృతిహరణమైన మీ చరణమే శరణమవుతుంది గాక.

మహైశ్వర్య సంపన్నులైన భూపాలకులను ప్రశంసించారు. వారందరూ ఖర గో హయ బిడాల భృత్యప్రాయులై స్త్రీగృహాలలో బరువుమోసేవారు మాత్రమే. అమిత మాధుర్యోపేతమైన మీ దివ్యకథా సుధారసాన్ని ఆస్వాదించే అదృష్టంలేని నిర్భాగ్యులకు వారు పతులు కాదగి ఉంటారు. అట్టి దుర్భగలు వారి పతులుగా దేనిని భావిస్తారు? బాహ్యానికి కేశశ్మశ్రునఖరోమాలతో కూడి లోపల మాంసాస్థి రక్తక్రిమివిట్కఫ పిత్తవాతమయమై హేయమైన పురుషశరీరాలను భర్తలుగా వారు భావిస్తారు. అజ్ఞానురాంద్ర గతి అంతే కదా.

ఉదాసీనుడను అన్నారు. మీరు నిరపేక్షులు కాబట్టి ఉదాసీనత్వం మీకు నైజం. అయినప్పటికీ నాకు మీ చరణానురాగం నిరంతరం కలుగుతుంది గాక. ఆత్మరతులైన మీకు అన్యవస్తువులు రమణీయాలు కావంటారా? మీరు ఆత్మరతులయినా నేను మీ చరణానురాగవతినే. అదే నాకు పరమభాగ్యం.

ఏ విధంగా వర్తించితే నేను నిన్ను అనుగ్రహించినట్లవుతుంది? అని అడుగుతారేమో? విశ్వవృద్ధి నిమిత్తమై మీరు రజోగుణాన్ని గ్రహించినప్పుడు నాపై మీరు కృపాదృష్టి నెరపటమే మీనుండి నేను ఆశిస్తున్న మహానుగ్రహం.

**సీ. నీరదాగమమేఘ నిర్ముక్తపయఃపాన**
**చాతకం బేఁగునే చౌడిపడెకు**

**బరిపక్వ మాకంద ఫలరసంబులు గ్రోలు**
**కీరంబు చనునె దుత్తూరములకు**

**ఘనరవాకర్ణనోత్కలిక మయూరము**
**కోరునే కఠిన ఝిల్లీరవంబు**

**గిరికుంభ పిశిత సత్గ్రాసమోదితసింహ**
**మరుగునే శునక మాంసాభిలాషc**

**తే. ప్రవిమలాకార! భవదీయ పాదపద్మ**
**యుగ సమాశ్రయ నైపుణోద్యోగచిత్త**
**మన్యుc జేరునే తన కుపాస్యంబు గాగ?**
**భక్తమందార! దుర్భవ భవవిదూర!**

నాథా! నా మాటలు బూటకాలని, స్త్రీలకు చిత్తం ఒకరి యందు భక్తి వేరొకరి యందు ఉండటం నైజమని అనవద్దు. ఆ మాట అందరియెడ వర్తించేది కాదు. ఎవరో కొందరు అటువంటివారున్నారని అందరినీ శంకించటం న్యాయమా? పూర్వం భీష్ముడు హరించిన కాశీరాజకన్యలు అంబ, అంబాలిక, అంబిక అనే ముగ్గురిలో అంబ సాళ్వుని వరించిన ఉదంతం ఉన్నదే. అయితే స్వైరిణి వివాహమైనంత మాత్రాన భర్తృలగ్నమనస్క కాదు. నూత్నపురుషాభిరతయై వర్తిల్లటం ఆమెకు సహజలక్షణం. అట్టివారిని బుధజను లెన్నడు భరింపకూడదు. కాదని చేరదీస్తే ఎట్టకేలకు వారు ఉభయలోకభ్రష్టు లవుతారు' అన్నది.

## శ్రీకృష్ణుని ప్రేమోక్తులు

రాజా! శ్రీకృష్ణభగవానుడు రుక్మిణీ వచనాలను సాంతం ఆలకించి, 'సాధ్వీశిరోమణీ! ఈ మాట నీ నోట వినగోరి నీతో మేలపు మాటలాడాను. నా నర్మోక్తులకు నీ వ్యాఖ్యానం ఎంతయినా తగిఉన్నది. నీకు నా యెడ గల నిత్యైకాంతిక భక్తికి ఎంతో సంతోషపడ్డాను. ఏకాంతభక్తుల కోర్కెలన్నీ మోక్షరూపంలో పర్యవసిస్తాయి.

కాంతామణీ! బుద్ధిని చీకాకుపరిచే పలుకులు పలికినా నీ చిత్తం చెదరకపోవటం నీ భర్తృభక్తిని, నీ పాతివ్రత్యాన్ని తేటపరిచింది. భక్తి సకామము – నిష్కామము అని రెండు విధాలు. సర్వకామాలను సమకూర్చే

నన్ను సకామభక్తులు కామసంపదలను మాత్రమే ఇమ్మని అడుగుతారు. మాయ వారిని ఆ విధంగా మోహవశులను చేస్తుంది. అంతకంటె మందభాగ్యులు వేరొకరుండరు. గృహేశ్వరీ! నీ భక్తి నిష్కామపూర్వకమూ, కేవల భవమోచనార్థము అయినట్టిది. ఈ భక్తి ఖలులకు దుష్కరం. ఏమంటావా? వారు సర్వవేళల ఇంద్రియతృప్తిపరులై వర్తిల్లుతారు. ఇంద్రియపరులకు నిష్కామభక్తి అందని మ్రాని పండవుతుంది.

మానినీమణీ! వివాహవిషయంలో తండ్రి మాటను, అగ్రజుని మతాన్ని త్రోసిపుచ్చావు. నీ పాణిగ్రహార్థులై వచ్చిన రాజులందరినీ నిరాకరించావు. నీ భావం రహస్యంగా నాకు ఎరుకపరిచావు. నీ అన్నకు వైమనస్యం కలిగినా నోరెత్తి పలుకవైతివి. అనిరుద్ధుని వివాహవేళ ద్యూతసభలో నీ భ్రాతను వధించిన నాడు కూడా ఇదేమిటని అడుగలేదు. అంతెందుకు? ఈనాటి వరకు నా మనస్సుకు కించిన్మాత్రమైనా మనోవాక్కాయకర్మల వ్యతిరేకతను చూపవు. నీవంటి ప్రేమాస్పదగృహిణిని నేనెక్కడా చూడలేదు. ఎల్లవిధాల నేను నీచే పరాజితుడ నైనాను. నీ వివాహానికి నేను వస్తానో రానో అని, రానట్లయితే శరీరత్యాగం చేయనున్నానని విప్రదూతముఖంగా నీవు పంపిన సందేశం ఏనాటికీ నేను మరువలేను. నీ మనోనిశ్చయం వేరెవ్వరియందు కానరాదని నిశ్శంకగా చెప్పగలను. నీవెన్నటికీ నా హృదయరాజ్ఞివే' అని చెప్పి రుక్మిణి డెందాన్ని కందళింపజేశాడు.

రాజేంద్రా! విన్నావు కదా, దేవకీసుతుని ప్రేమలీలలు! నరలోక విడంబనార్థం ఆ విధంగా సంసారగతుని వలె భాసిల్లుతూ తక్కిన భార్యలతోనూ యథోచిత గృహస్థధర్మాలు నిర్వర్తిస్తూ శ్రీకృష్ణపరమాత్మ పడతులందరికీ మనఃప్రీతిని కలుగజేస్తున్నాడు.

## శ్రీకృష్ణుని పుత్త్ర పౌత్రసంతతి

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుడు ఆ విధంగా మాయామానుషవేషధారియై గృహస్థధర్మాలు నడుపుతూ భార్యలందరికీ అందరికీ అన్ని కృష్ణరూపాలలో

కనిపిస్తూ అందరియందు సమానానురాగం నెరపుతూ వెలుగొందసాగాడు. ఆ అబలలు శ్రీకృష్ణాతిమానుషతత్త్వాన్ని గ్రహింపలేక ప్రతికాంతా తనకొక్కర్తెకే కృష్ణుడు వశుడు ప్రియుడు అని నమ్ముతూ, అతని ముఖారవిందసందర్శన మహానందానికి సంతోషిస్తూ, బాహుపరిష్వంగ సుఖాతిరేకానికి ఉబ్బి తబ్బిబ్బులౌతూ, ప్రేమైక కటాక్ష వీక్షణాలకు సరసోక్తులకు సమ్మోహితలై లోలోని చిర్నగవులతో క్రీగంటి చూపులతో భావాలను వెల్లడిస్తూ, ప్రణయకలహాన్ని భ్రూభంగ రూపాన వ్యంజింపజేస్తూ సురతతంత్ర నైపుణ్యాలను మెరపుతూ వేరీతుల చొక్కింపసాగారు. వారి విభ్రమాలు నిత్యపూర్ణుడైన భగవానునికి గోరంత వికారాన్ని కూడా కలిగింపలేకపోయాయి. భగవానుడు ఇంటికి వచ్చినంతనే ప్రతి కాంతారత్నమూ ఎదురేగి తోడితెచ్చి ఆసనం సమర్పించి పూజనొనర్చి పాదాలు కడిగి అడుగులొత్తి వీవన వీచి కురులు దిద్ది నీరాడించి పీతాంబరాలను కట్టబెట్టి గంధమలది పూవులతో అలంకరించి ఉపహారాలు సమర్పించి శయనాన పవళింపజేసి మనసుతీరా సేవించుకొంటూ, ఆయన ప్రేమకు నోచుకొన్నామని ఉప్పొంగుతూ నూత్న సంగమ లజ్జాలలితలై స్తంభం చాటు చేరి క్రీగంట ఆ ప్రభువుని వీక్షిస్తూ తరివచ్చినప్పుడు నిజపాణిపద్మాలతో ఆ పద్మాక్షుని కన్నులను నవ్వులాటలకు మూసి కిలకిల నవ్వుతూ సర్వవిధాల ప్రభువునే ఉపచరిస్తుండేవారు. రాజేంద్రా! భగవన్నామోచ్చారణ సర్వక్లేశాలను హరించి సుఖాన్ని కూర్చే సంగతి అటుండగా వారు భగవంతుని పేరును పలుకనే పలుకరు; పిలవనే పిలవరు. ఏమంటావా? ఆ అంగజభంగభీతలై శ్రీ భగవానుని నామధేయాన్ని కూడా ఉచ్చరింపరు.

## అష్టమహిషుల సంతానం

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుని భార్యలందరికీ సంతానం కలిగింది. వారందరి పేర్లను స్మరించటం సాధ్యంకాదు. ఆ భార్యలలో రుక్మిణి మొదలైనవారు అష్టమహిషులని పేరెన్నికగన్నారు. వారి సంతతి చెబుతాను విను.

రుక్మిణీదేవికి ప్రద్యుమ్నుడు, చారుధేష్ణుడు, సుధేష్ణుడు, చారుదేవుడు, సుచారుడు, చారుగుప్తుడు, భద్రచారుడు, చారుభద్రుడు, విచారుడు, చారుడు అని పదుగురు పుత్రులు జనించారు.

సత్యభామకు భానుడు, సుభానుడు, స్వర్భానుడు, ప్రభానుడు, భానుమంతుడు, చంద్రభానుడు, బృహద్భానుడు, కలిభానుడు, శ్రీభానుడు అని పదుగురు పుత్రులు కలిగారు.

జాంబవతికి సాంబుడు, సుమిత్రుడు, పురుజిత్తు, శతజిత్తు, సహస్రజితుడు, విజయుడు, చిత్రకేతుడు, కీర్తిమంతుడు, ద్రవిణుడు, క్రతుడు అనేవారు పదిమంది కొడుకులు పుట్టారు.

నాగ్నజితికి భానుడు, చంద్రుడు, అశ్వసేనుడు, చిత్రగుడు, వేగవంతుడు, వృషుడు, ఆముడు, శంకుడు, వసుడు, కృతి అని తనయులు పదుగురు ఉద్భవించారు.

కాళిందికి శ్రుతుడు, కవి, వృషుడు, వీరుడు, సుబాహుడు, భద్రుడు, శాంతి, దర్శుడు, పూర్ణమాసుడు, సోమకుడు ప్రభవించారు.

లక్ష్మణకు ప్రఘోషుడు, గాత్రవంతుడు, సింహుడు, బలుడు, ప్రబలుడు, ఊర్ధ్వగుడు, మహాశక్తి నహుడు, తేజుడు, అపరాజితుడు అనేవారు పదుగురు సుతులు ఆవిర్భవించారు.

మిత్రవిందకు వృకుడు, అర్కుడు, అనిలుడు, గృధ్రుడు, బహ్వాన్నుడు, నాథుడు, మహాశుడు, వావసుడు, వహ్ని, సుధి అని పదుగురాత్మజులు కలిగారు.

భద్రకు సంగ్రామజిత్తు, బృహత్సేనుడు, శూరుడు, ప్రహరణుడు, అరిజిత్తు, యజ్ఞుడు, సుభద్రుడు, వాముడు, ఆయువు, సత్యకుడు అనేవారు కుమారులు పదుగురు ప్రభవించారు.

## కృష్ణ పౌత్రసంతతి

ప్రద్యుమ్నుడు తన మేనమామ భోజకటక పురవాసి అయిన రుక్మి కుమార్తెను రుక్మవతిని పెండ్లాడి, ఆమెయందు అనిరుద్ధుడనే తనయుని గాంచాడు. రాజా! కృష్ణుని భార్యలు పదహారువేలకు పైగా ఉన్నారు. వారి పుత్త్రులు పౌత్రులు కోటిసంఖ్యకు మించుతారు.

## బాణాసురుడు

రాజేంద్రా! బలిచక్రవర్తికి నూరుగురు పుత్త్రులు జనించారు. వారిలో బాణాసురుడు జ్యేష్ఠుడు. అతను పుట్టుకతోనే వేయి బాహువులతో పుట్టాడు. అతను శివుని తాండవోత్సవ సమయంలో బాహుసాహస్రంతో వివిధ వాద్యాలు వాయించి ఉమాపతిని మెప్పించాడు. పార్వతీధవుడు అతనికి ప్రీతుడై 'నీ దుర్గాన్ని సతతం నేను రక్షిస్తుంటాను' అని వరం ఇచ్చాడు. బాణాసురుడు ఆ వరానికి గర్వించి ఒకనాడు గౌరీపతి వద్దకేగి ఆయన పాదాలకు మ్రొక్కి 'దేవా! పురుషులకు కల్పవృక్షం వలె కోరిన కోర్కెలు సమకూర్చుతావు. పుట్టుకతోనే నాకు వేయి బాహువు లిచ్చావు. నన్ను మార్కొని నాతో పోరాడగలవారు లేనందువల్ల నా బాహుకండూతి దుర్భరమవుతున్నది. ఆ తీటపోవటానికి కొండలను పిండిచేశాను. అంతమాత్రానికి అది తీరలేదు. దిగ్గజాలను ఢీకొన్నాను. అవి భయపడి పారిపోయాయి. ఏమి చేయాలన్నా తోచదు. నా యీ భుజకండూతి తీరే ఉపాయం ఏమిటో ఆదేశించు' అని ప్రార్థించాడు. కైలాసేశ్వరుడు ఆ కుమతి దురాలోచనకు మనసులోనే నవ్వుకొని, 'ఓయి మూఢమతీ! ఏనాడు నీ టెక్కెం విరిగిపడుతుందో, ఆనాడు నీ భుజకండూతి తీరుతుంది; వెళ్ళు' అని చెప్పాడు. ఆ మాటకు బాణుడు పరమానందభరితుడై ఇంటికి వచ్చి సమయాని కోసం కాచుకొని ఉన్నాడు.

## ఉషాస్వప్నసంగం

రాజేంద్రా! బాణునికి ఉష అనే కుమార్తె ఉండేది. ఒకనాడామెకు ప్రద్యుమ్నుని పుత్త్రుడైన అనిరుద్ధునితో స్వప్నసాంగత్యం కలిగింది. ఆమె నిదుర

మేల్కొంచి తనతో రమించిన పూరుషశ్రేష్ఠుడు ఎదుట కానరాకపోయేసరికి 'నాథా!' అంటూ లేచి; తనగుట్టు చెలులకు చెప్పటానికి సిగ్గుపడి, లోలోపలే చింతింపసాగింది.

## ఉషా చిత్రలేఖల సంభాషణ

బాణునికి కుంభాండుడనే మంత్రి ఉన్నాడు. అతని కుమార్తె పేరు చిత్రలేఖ. ఆ చిత్రలేఖ ఉషకు ప్రాణసఖురాలయింది. ఒకనాడు చిత్రలేఖ ఉషవద్దకు వచ్చి ఆమె ముఖలక్షణాలను పరికించి 'సఖీ! నీ ముఖంలో విపరీతలక్షణాలు కానవస్తున్నాయి. కారణమేమిటి?' అని అడిగింది. ఉష తన రహస్యాన్ని ఇతరులకు చెప్పకపోయినా చిత్రలేఖకు చెప్పకపోవటం లేదు కనుక సిగ్గువిడిచి, 'చెలీ! ఏమని చెప్పేది. ఒక మహాపురుషుడు నాతో స్వప్నసంగం కావించాడు. అతని రతికి పరవశించి తన్మయురాలినై కొంతసేపుండి మేల్కొంచిన తర్వాత చూశాను. నా మనోహరుడు కానరాలేదు. అతనికోసం పరితపింపని క్షణం లేదు' అన్నది. చిత్రలేఖ ఆ మాటలు విని 'సఖీ! కలలు కల్లలే గాని నిజాలు కావు. శరీరధారికి జాగ్రత్స్వప్నసుషుప్తులనే అవస్థలు మూడు ఉంటాయి. జాగ్రదవస్థలో స్థూలశరీరం, స్వప్నావస్థలో సూక్ష్మశరీరం, సుషుప్తియందు కారణశరీరం వ్యవహరిస్తుంటాయి. శరీరధారులకు చెప్పరాని కోరికలు జనిస్తుంటాయి. ఆ కోరికలలో గాఢమైనట్టివి స్థూలశరీరానుభవ యోగ్యాలు కానందువల్ల సూక్ష్మశరీరం చేత స్వప్నావస్థలో భుక్తము లవుతుంటాయి. నీ స్వాప్నికానుభవం కూడా తద్రూపమైనది గానే ఉండరాదా? అయితే నీతో రమించిన అతనెటువంటివాడో చెప్పు' అన్నది. ఉష ఆ ప్రశ్న విని,

**ఆ.వె.** **కన్న యతఁడు గాఁడు విన్న యతఁడు గాఁడు**
**స్వప్నమందు నేను వానిఁ గంటి**
**అట్టి ఘనునిఁ గూర్చి యిట్టివాఁడని నీకు**
**నెట్లు చెప్ప నేర్తు నిందువదన.**

సఖీ! అతని శరీరం శ్యామసుందరమై అలరారుతున్నది. అతని లోచనాలు పూచిన కమలాల వంటివి. ఆ మనోజ్ఞమూర్తి బాహువులు జానువులను దాటి ఒప్పారుతుంటాయి. ఆ మనోహరుడు పీతాంబరం ధరించిన ఆ సొగసు మాటలలో వర్ణించి చెప్పటం అసాధ్యం. అతను తన అధరామృతమాధుర్యాన్ని నాకు చవిచూపి కన్నుగప్పి నన్ను వియోగాబ్ధిలో ముంచి వెళ్ళిపోయాడు. అతనిని వెతికి పట్టుకొనలేక పరితపిస్తున్నాను' అని చెప్పింది.

చిత్రలేఖ ఆ పలుకులు విని 'చెలీ! ఇంతమాత్రానికే దుఃఖిస్తావేమిటి? నీ మనోహరుడు ముల్లోకాలలో ఎక్కడున్నా వెతికితెస్తాను; శోకం మాను. లేఖారచనలో నేర్పును బట్టి నాకు చిత్రలేఖ అనే పేరు వచ్చిన సంగతి నీకు తెలిసినదే కదా. నేను నా చాతుర్యమంతా వినియోగించి దేవ గంధర్వ సిద్ధ చారణ పన్నగ దైత్య విద్యాధర యక్షులలో గల రూపవంతు లందరి ప్రతిమలను లిఖిస్తాను. వారిలో నీ మనోహరు డెవ్వడో చెప్పు' అని ఒక్కొక్క ప్రతిమను వ్రాసి చూపించింది. ఉష ఆ ప్రతిమలన్నిటినీ పరీక్షించి 'సఖీ! వీరిలో ఒక్కడైనా నా దయితుని కొనగోటికి సాటిరాడు' అన్నది. అంతట చిత్రలేఖ మనుష్య ప్రతిమలను లిఖించటం మొదలుపెట్టి కొందరు రాజకుమారకులను రచించి చూపింది. వారెవ్వరూ ఉషకు మెచ్చుగొలపలేదు. అంత వృష్ణివీరులను లిఖింప సమకట్టి మొట్టమొదటి శూరుని లిఖించింది. అతను కాడని ఉష పలికింది. తర్వాత వసుదేవుని లిఖించింది. అతడూ కాడని ఉష తెలిపింది. అనంతరం బలరాముని లిఖించి

**ఉ. శారద నీరదాబ్జ ఘన సార సుధాకర కాశ చంద్రికా**
**సార పటీరవర్ణు యదు సత్తము నుత్తమనాయకుం బ్రమ**
**త్తాది నృపాల కానన హుతాశన మూర్తి బ్రలంబదైత్య సం**
**హారుని గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా!**

అని ఆ ప్రతిమను చూపింది. ఉష ఆ ప్రతిమను చూసి 'ఈ మహనీయుడు నా పతి కా' దన్నది. అంతట చిత్రలేఖ కృష్ణుని చిత్రించి,

**శా. వర్ణింపన్ మము బోంట్ల కౌనె సఖి యీ ద్వారావతీవల్లభున్**
**అర్ణోరాశిసుతామనోహరుని విశ్వాత్మున్ స్థితివ్యాపృతున్**
**శీర్ణావిద్యహృదంబుజోదర మహాసింహాసనాధ్యాసునిం**
**బూర్ణుం గేవలుఁ గేళిమానుషతనున్ భోగీంద్రతల్పున్ హరిన్.**

అని పలికింది. ఉష ఆ ప్రతిమకు నమస్కరించి, ఈ మహాత్ముడు నాకు పూజ్యుడే; కాని పతి కాదన్నది. అంతట చిత్రలేఖ ప్రద్యుమ్నుని రచించి చూపింది. ఉష ఆ ప్రతిమను చూసి 'సఖీ! ఈ పురుషసత్తముని యందు నా పతిలక్షణాలు కొన్ని ఉన్నాయి. ఇతను నా పతిమాత్రం కాదు' అన్నది. చిత్రలేఖ అంతట అనిరుద్ధుని లిఖించి 'సఖీ! ఈతడు నీ మనోహరు డవునో కాదో చూడు' అన్నది. ఉష ఆ ప్రతిమను తిలకించి సిగ్గుపడుతూ మోము వంచి దరహాసకందళిత ముఖారవిందయై,

**ఉ. ఇంతి! మదీయమానధన మెల్ల హరించిన ప్రుచ్చు నిమ్మెయిం**
**బంత మెలర్ప వ్రాసి పట భాగనిరూపితుఁ జేసినట్టి నీ**
**యంతటి పుణ్యమూర్తి గొనియాడఁగ నేర్తునె? నీ చరిత్రముల్**
**వింతలె నాకు? నీ మహిత వీరు కులంబు బలంబుఁ జెప్పుమా.**

అని అడిగింది.

చిత్రలేఖ ఆ మాటకు కలకల నవ్వి, 'ఓ చెలీ! ఈతడు శ్రీకృష్ణుని పౌత్రుడు అనిరుద్ధుడు. ఇతనిని మీసాలు పట్టి తెచ్చియిస్తాను చూడు' అని చెప్పి యోగబలాన్ని ఆశ్రయించి గగనమార్గాన ద్వారకాపురానికి వెళ్ళి కృష్ణుని నివాససౌధానికి వెళ్ళి, అక్కడ అనిరుద్ధుడున్న ఇంటిలోనికి ప్రవేశించింది. అక్కడతను పాన్పుమీద కూర్చొని ఉన్నాడు. చిత్రలేఖ అతనిని యోగమాయామోహితుని చేసి పైకెత్తుకొని తిరిగి గగనమార్గం పట్టి బాణుని రాజధాని అయిన శోణితపురానికి వచ్చి ఉషకు అతనిని చూపింది. ఉష ఆ మనోహరమూర్తిని చూసి పోయిన ప్రాణం లేచివచ్చినట్లు ఉప్పొంగి అతనిని తన అంతఃపురంలో రహస్యంగా ఉంచి దివ్యాంబర చందన మాల్య ధూప

దీపాల చేత మృదుమధుర పాన భోజనాల చేత హంసతూలికా శయనాదుల చేత తన ప్రేమాతిశయం ఉట్టిపడగా అనేక రీతుల ఉపచరిస్తూ అతనితో సుఖంగా ఉన్నది. అనిరుద్ధుడు ఆమెతోడిదే లోకమని భావించి దినాలు మాసాలు గడిచినది తెలియకుండా కాలం గడుపుతున్నాడు.

## ఉషా గర్భచిహ్నాలు

రాజేంద్రా! ఆ విధంగా కొన్ని నెలలు గడిచాయి. ఉష గర్భవతి అయింది. ఆ రహస్యం ఎలాగో అంతఃపుర రక్షకవర్గం చెవినిబడింది. ఆ మాట విన్నంతనే వారికి ప్రాణాలు పోయినట్లనిపించింది. వారందరూ గుమిగూడి, 'ఇక మన జీవనాలే కాదు, జీవాలు కూడా దక్కవు. అహోరాత్రాలు కంటిమీద కునుకు లేకుండా చలిచీమ చొరరానంతగా నేర్పుతో అంతఃపురాన్ని కాపాడుతున్నాము. మన కాపులో ఈనాటి వరకు ఎటువంటి లోటు జరిగినట్లు లేదు. ఈనాడు తెలిసిన వార్త అంతకంతకీ వింతగా ఉన్నది. పరపురుషుడు ఏ మార్గాన ప్రవేశించాడో ఊహకందదు. ఈ సంగతి తెలిసీ, తెలియనట్లు ఎలా ఊరుకొంటాము? రాజుకు ఏమని వెళ్ళి చెబుతాము? ఇది దాచిపెట్టినా దాగేది కాదు. నేడు కాకపోతే రేపటికైనా బయటపడుతుంది. ఏదియేమైనా మన బ్రతుకు నేటితో బండలపాలయింది. నిందలకు చిక్కి చావటం కంటె విన్నది విన్నట్లు రాజు చెవిలో వేయటం మంచిది. మన ప్రారబ్ధం ఒకటున్నది కదా. కానున్నది కాక మానదు' అని నలుగురూ కూడబలుక్కొని బాణుని వద్దకు వెళ్ళి, 'ప్రభూ! ఇంతకాలం నీ అంతఃపురాన్ని నిరంతరం జాగరూకులమై కావలి కాస్తుంటిమి. చలిచీమకు చొరరాకుండా కట్టుదిట్టాలు చేశాము. నేటితో మా బ్రతుకులు మా ప్రాణాలు కడతేరినట్లే. నీ పుత్రికామణి పోకడలను బట్టి యేదో విరుద్ధాచరణను శంకిస్తున్నాము. ఎట్లా సంభవించినదో మాకు అంతుబట్టడం లేదు. ఆ పైని దేవరవారి చిత్తం' అని సాగిలబడ్డారు.

## అనిరుద్ధునికి బంధనం

ఆ మాటతో బాణుడు వ్యధాగ్రస్తుడై నివ్వెరగంది వెంటనే కుమార్తె అంతఃపురానికి పరిగెత్తాడు. ఆ సమయంలో ఉషానిరుద్ధులు పాచిక లాడుతున్నారు. నీలగాత్రుడు, పీతాంబరధారి, కుంతలకాంతులు స్మితావలోకనాలకు మెరుగులు దిద్దుతుండగా మన్మథాత్మజుని వలె ఉషతో క్రీడిస్తున్న ఆ పురుషుని చూచి 'ఓహో! ఎవడీ త్రైలోక్యసుందరుడు' అని బాణుడు విస్మితుడై అతనిపై ఉరవడింపబోయాడు. వేయి హస్తాలలో ఆయుధాలు ధరించి మహాభయంకరుడై మీదికి వస్తున్న బాణాసురుని చూసి అనిరుద్ధుడు పాచికలు వదలి పరిఘను, మౌర్యాన్ని చేతబట్టి అంతకుడైన దండధరుని వలె సిద్ధంగా నిలబడ్డాడు. అంతలో బాణుని సైనికులు అనిరుద్ధుని చుట్టుముట్టి పట్టుకోవాలని ప్రయత్నింపసాగారు. వరాహం కుక్కలను అదిలించినట్లు అతను వారిని ప్రక్కలకు నెట్టి పరిఘతో కొట్టి బాధించాడు. వారు తలలు పగిలి చేతులు కాళ్ళు విరిగి తొడలు తెగి పడ్డారు. హతశేషులు కాలికి బుద్ధిచెప్పారు. బాణుడు తన సైన్యం గతిచూసి క్రోధమూర్ఛితుడై ఆ ఉషాప్రియుని నాగపాశాలతో బంధించాడు. హృదయేశుని దురవస్థకు ఉష శోకవిహ్వలురాలై కన్నీరు కుక్కుకొని ప్రాణం లేని బొమ్మలా నిలబడింది.

## ద్వారకలో నారదాగమనం

రాజేంద్రా! అనిరుద్ధుడు ద్వారకను వదలినది మొదలు అతని ఉనికి జాడ తెలియక ద్వారకాపురవాసు లందరూ అతనికోసం వెతకటం మొదలుపెట్టారు. ఎంతకీ అతని కలరూపు సంగతి వారికి తెలియలేదు.

ఆ విధంగా వర్షమాసాలు నాలుగు గడిచాయి. ఒకనాడు నారదమహర్షి ద్వారకకు వచ్చి అనిరుద్ధుడు బాణాసురుని చెరలో నాగపాశ బంధితుడై ఉన్న విషయాన్ని తెలియజేశాడు.

## దుశ్శకునం

ఆ సంగతి వినీ వినగానే ప్రద్యుమ్న సాత్యకి గద సాంబ సారణ నందోపనంద భద్రాదులు పన్నెండు అక్షౌహిణుల బలగాన్ని సమకూర్చుకొని శోణితపురం మీదికి దాడి బయలుదేరారు. రామకృష్ణులు వారిని అనుగమించారు. అదే సమయాన బాణుని కోటబురుజుపై ఎత్తిపెట్టిన టెక్కెం నిర్నిమిత్తంగా విరిగి నేలబడింది.

## బాణాసుర యుద్ధం

యాదవవీరులు ఆ విధంగా వచ్చి ముట్టడించటం బాణుడు చూసి పన్నెండు అక్షౌహిణుల సైన్యాన్ని తీసుకొని కోట బయటికి వచ్చి వారిని ఎదుర్కొన్నాడు. యాదవసైన్యం శోణితపురం లోనికి చొరబడి పురోద్యానవనాల లోని వృక్షాలను పెకలించి బాణుని సేనలను నుగ్గునూచం చేసి ప్రాకారాల మీదికెక్కి గోపురాట్టాలకాల నేలను చదునుచేసి కంటికి కనిపించిన వారిని తరిమికొట్టారు.

## శివకేశవుల యుద్ధం

రాజేంద్రా! పూర్వం బాణాసురుడు శివుని సంతోషపెట్టి ఆయన వలన వరాన్ని పొందాడని చెప్పాను. అది మొదలు శివుడు బాణుని ఎంతో ఆదరపూర్వకంగా చూస్తుండేవాడు. యాదవులు శోణితపురాన్ని ముట్టడింపగానే రుద్రుడు స్కందాదిసుతులు, ప్రమథగణం వెన్నంటిరాగా నందినెక్కి కృష్ణుని ఎదుర్కొనటానికి వచ్చాడు. కృష్ణుడు రుద్రుని, ప్రద్యుమ్నుడు కార్తికేయుని, బలరాముడు కుంభాండ కూపకర్ణులను, సాంబుడు బాణపుత్రుని, సాత్యకి బాణుని ఎదుర్కొన్నారు. వారికి పోరు ఘోరంగా జరిగింది. ఆ యుద్ధాన్ని చూడటానికి బ్రహ్మాది దేవతలు మునులు సిద్ధ చారణ గంధర్వులు యక్షాప్సరోగణం విమానారూఢులై వచ్చి అంతరిక్షాన గుమిగూడారు.

రాజేంద్రా! శివపరివారమైన భూతప్రేత గుహ్యక ఢాకినీ యాతుధాన భేతాళ వినాయకులు మాతృ పిశాచ కూశ్మాండ బ్రహ్మరాక్షసులు ముందడుగు వేసి కృష్ణుని మీదపడ్డారు. కృష్ణుడు వారందరినీ మర్దించాడు. అంత శివుడు కృష్ణునిపై బాణవర్షం కురిపించాడు. కృష్ణుడు ప్రత్యస్త్రాలతో వాటన్నిటినీ హరించాడు. శివుడు వాయవ్యాస్త్రం వేశాడు. దానిని పర్వతాస్త్రంతో కృష్ణుడు అణచివేశాడు. శివుడు ఆగ్నేయాస్త్రం వేశాడు. దానిని పర్జన్యాస్త్రంతో కృష్ణుడు ప్రతిహతం కావించాడు. శివుడు బ్రహ్మాస్త్రం వేశాడు. కృష్ణుడు బ్రహ్మాస్త్రం వేసి దానికి శాంతిగూర్చాడు. అంత శివుడు పాశుపతాస్త్రం ప్రయోగించాడు. కృష్ణుడు నారాయణాస్త్రం వేసి దానిని పరిహరించి జృంభణాస్త్రం ప్రయోగించాడు. అది శివుని మోహవశుని చేసింది. శివుడు ఆ విధంగా తప్పుకొన్నాక కృష్ణుడు విజృంభించి బాణుని సైన్యాన్ని గదాఖడ్గశరజాలాలతో చీకాకు పరిచాడు.

## స్కందాదుల యుద్ధం

ప్రద్యుమ్నుని తీవ్రబాణహతులకు స్కందుని శరీరమంతా జల్లెడకంతలై నెత్తురులు కురిసింది. అతను ససిచెడి నిలువ శక్తిలేక మయూరవాహనం ఎక్కి రణభూమి నుంచి పారిపోయాడు. బలరాముని రోకటివేటులకు కుంభాండ కూపకర్ణులు గాయపడి నేలకొరిగారు. దైత్యయుద్ధవీరులు వైరివీరప్రహతులకు నిలిచే అలవు చాలక ఎక్కడివారు అక్కడినుంచి కాలికి బుద్ధిచెప్పారు.

## శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధం

బాణుడు తన సైన్యానికి పట్టిన దురవస్థను చూసి కలవరపాటుతో సాత్యకి తోడి పోరు వదిలి కృష్ణుని ఢీకొని ఐదువందల భుజాలతో ఐదువందల చాపాలను పట్టుకొని ఒక్కొక్క చాపానికి రెండేసి వంతున నిశితసాయకాలను సంధించి ఒక్కుమ్మడిని ప్రయోగింపబోయాడు. కృష్ణుడు ఒక్క నిమేషమాత్రాన

బాణుని ఐదువందల విండ్లను విరిచి అతని రథాన్ని నేలమట్టం చేసి హయాలను కూల్చి సారథిని చంపి పాంచజన్యాన్ని పూరించాడు.

రాజేంద్రా! బాణుని తల్లి కోటర అనే రాక్షసమాయ. అది పుత్రునికి ముప్పు శంకించి సిగ జారవిడిచి దిసమొలతో వచ్చి కృష్ణుని యెదుట నిలిచింది. దిగంబర అయిన ఆ స్త్రీని చూడలేక కృష్ణుడు మొగాన్ని ప్రక్కకు తిప్పుకొన్నాడు. అది సందుగా బాణుడు రణస్థలి వదిలి హుటాహుటి కోటలోనికి పరిగెత్తాడు.

## శైవజ్వర వైష్ణవజ్వరాల పోరు

రాజేంద్రా! శివుడు అంతలో మోహంనుంచి తేరుకొని తన భూతగణమంతా చెల్లాచెదరై ఉండటం చూసి శైవజ్వరాన్ని కృష్ణుని మీదికి పంపాడు. అది మూడు తలలు మూడు కాళ్ళు కలిగి మహాభయాకృతితో వచ్చి కృష్ణుని యెదుట నిలిచింది. కృష్ణుడు వైష్ణవజ్వరాన్ని పుట్టించి శైవజ్వరం మీదికి వదిలాడు. అవి రెండూ తలపడి హోరాహోరి పోరాడసాగాయి. ఎట్టకేలకు శైవజ్వరం బలం సన్నగిల్లి ఓటువడి వేరొక దిక్కుతోచక కృష్ణుని వద్దకు వచ్చి చేతులు మోడ్చి,

## శైవజ్వరకృత శ్రీకృష్ణస్తోత్రం

'దేవా! నీ శక్తి అనంతం. బ్రహ్మాదులు కూడా నీ నియమాన్ని తలదాల్చి నడుచుకొంటారు. సర్వాత్ముడవు. నిత్య శుద్ధ చైతన్యఘనుడవు అయిన నీవు జగదుత్పత్తిస్థితిలయాలకు కారణభూతుడవుగా విరాజిల్లుతావు. నీ బ్రహ్మస్వరూపం వేదవేద్యమే కాని స్థూలబుద్ధిగోచరం కాదు. ఏమంటావా? కార్యాలను బట్టి అతను అటువంటివాడు అని చెప్పటం జరుగుతుంది. నీవు సర్వక్రియా రహితుడవు కాబట్టి నీవు ఇట్టివాడవని చెప్పటానికి సాధనాంతరాలు కలుగవు. ఆ పక్షాన నీవు ఉన్నావని గాని నీ విట్టివాడవని గాని వేదాలు మాత్రం ఎలా చెప్పగలుగుతున్నాయి? అంటే వేదాలు నీ

వాక్యాలు. అవి బ్రహ్మముఖాన వెలువడటం వల్ల బ్రహ్మదేవుడు వాటికి కర్త అని వ్యవహారం ఏర్పడింది. నీ సంగతి నీవే చెప్పుకొన్నావు. ఆ మాటలను నమ్మి మేము నడుచుకొంటున్నాము. అందువలన నిన్ను వేదవేద్యు డన్నారు. నీవు సర్వేశ్వరుడవు. ఈశ్వరుడంటే ఈశిత్వం నెరపటానికి వస్తువిశేషం ఒకటుండాలి. నీవు తప్ప వేరొక వస్తువే కలుగదు. వేరు వస్తువులే లేనప్పుడు వేరు ప్రభువు లెక్కడినుంచి వస్తారు? పాల్యపాలకభావం ఎక్కడిది? కాబట్టి నీవు సర్వప్రభుడవు.

దేవా! సంసారం నీ మాయాశక్తి వలన కలుగుతున్నది. సర్వము నీ మాయాశక్తి వలన కలుగుతున్నది. నీవు రజోగుణప్రేరితుడ వైనప్పుడు తొలుత నీ శక్తి సంక్షోభిస్తుంది. దానినే కాలమంటారు. ఆ కాలం కర్మ నిమిత్తం అవుతున్నది. ఆ కర్మము ఫలాభిముఖం అవుతుంది. ఆ విధానం యొక్క తీరు ఇట్టిదని గోచరించేది కాదు. అందువలన దానిని అవ్యక్తము అన్నారు. అట్టి అవ్యక్తవిధానాన్ని దైవము అన్నారు. కర్మము ఫలాభిముఖం అయినప్పుడు స్వభావము అనబడుతుంది. ఆ స్వభావం కలవాడు జీవుడు అనబడుతున్నాడు.

భూతసూక్ష్మాలు ద్రవ్యం. ప్రకృతి క్షేత్రం. సూత్రానికి ప్రాణమని పేరు. అహంకారం ఆత్మ అనబడుతున్నది. ఏకాదశేంద్రియాలు వికారములు అనబడుతున్నాయి. ఆకాశవాయ్వాదులు మహాభూతాలు. ఈ మహాభూతాలు పదహారింటి సంఘాతమే దేహం. ఈ దేహానికి అంకురమైనది కర్మ. ఆ అంకురం నుంచి మరొక దేహం, ఆ దేహం వలన కర్మము, ఆ కర్మమునుండి తిరిగి మరొక దేహము కలుగుతుంటాయి. ఇది ప్రవాహరూపాన జరిగిపోతుంటుంది. ఇదంతా నీ మాయాశక్తి కార్యమేగాని వేరొకటి కాదు.

ఈ మాయను దాటాలంటే దానికి ఈశ్వరుడవైన నిన్నే ఆశ్రయించాలి. అందువల్ల నేను నీ పాదాలను ఆశ్రయించాను. దేవకీతనయుడనని, నరమాత్రుడనని, నాకిటువంటి భూతత్వారోపణ ఏ విధంగా చెల్లుతుందని అడుగుతావేమో? నీవు సర్వోపాధిరహితుడవై ఉన్నమాట వాస్తవం. లోకపాలన నిమిత్తం లీలావతారాలు ధరించి మత్స్యాది రూపాలు దాల్చి వర్ణాశ్రమధర్మాలు నియమించి తద్ధర్మశీలురను కాపాడుతూ హింసాత్ములై ధర్మగ్లాని కావించే దైత్యాదులను సంహరిస్తూ ఉంటావు.

ఇప్పుడైనా నీవు భూభారాన్ని తగ్గించి ధర్మాన్ని స్థాపించటానికి లీలామానుష విగ్రహాన్ని ధరించావే గాని నీవు దేవకీ నందనుడవూ కావు; మరొకడవూ కావు. అహంకారం పైకొనటం వల్ల నీ యీ వాస్తవతత్త్వాన్ని మరిచి వర్తించిన నా అజ్ఞానాన్ని మన్నించి నన్ను రక్షించు. నీవు పంపిన జ్వరబాధ నాకు రానురాను దుస్సహమైనదిగా ఉన్నది. జ్వరరూపాన పరపీడ కావించే నీకు ఇటువంటిది యుక్తమే, అంటావా? స్వామీ! మొదట గండకొవ్వుమీరి మైమరచి వర్తించినా తుట్టతుదకు నీ శరణుజొచ్చి నీ సేవా ప్రవృత్తులైనప్పుడు ఇటువంటిబాధ యుక్తమనిపింపదు. నీ శరణు వేడటమే ప్రాయశ్చిత్తం కాదా?'

అని ప్రార్థించింది.

రాజేంద్రా! భగవానుడు శైవజ్వరోదిత ప్రణయభావాన్ని గుర్తించి, 'త్రిశిరా! నీకు ప్రసన్నుడనయ్యాను. నా జ్వరభయం నీకు తొలగుతుంది గాక. ఈ మన సంవాదాన్ని స్మరించినవారికి నీ వలని భయం కలుగకుంటుంది గాక. ఈ నా ఆజ్ఞలు తలదాల్చి వర్తించు' అన్నాడు. శివజ్వరం కృష్ణునికి నమస్కరించి తప్పుకొన్నది.

## బాణబాహువిఖండనం

ఆ విధంగా బాణాసురుడు విరథుడై కోటలోనికి జారుకొన్నవాడు మరొక రథం ఎక్కి వివిధాయుధాలను కూర్చుకొని మళ్ళీ వచ్చి క్రోధోద్వేగం అతిశయింపగా కృష్ణునిపై శరవర్షం కురిపించాడు. గోవిందుడు అతనిని చూసి నవ్వుతూ అతని బాహువు లన్నింటినీ చిరుకొమ్మలను నరికినట్లు తెగగోశాడు.

## శివకృత కృష్ణస్తుతి

బాణుని గతిచూసి శివుడు జాలిగొని కృష్ణుని వద్దకేతెంచి, 'కృష్ణా! నీవు పరబ్రహ్మావు గాని అన్యుడవు గావు. నీ తత్త్వం ఎరుగక ఇతడు తెగించి నిన్ను ఎదుర్కొన్నాడు. ఇదంతా ఇతని అజ్ఞానఫలం. ఇతనికి ఇటువంటి అజ్ఞానం కలగటం వింత కాదు. ఏమంటావా? వేదాలే నిన్నెరుగలేనప్పుడు అన్యుల సంగతి ఏమిచెప్పాలి? వేదాలు గ్రహింపలేదంటే కారణమేమిటంటావా? వేదాలు నీ వలన ప్రకాశితాలైనవి. నీ వలన ప్రకాశితాలైనవి నిన్నెలా తెలిసికొనగలవు? అలాగయితే నీ ప్రతీతి సంగతేమిటంటావా? నీవు స్వతః ప్రకాశమూర్తివి. సర్వము నీ వలన ప్రకాశితమై ప్రకాశిస్తున్నది. మరి నీవు నిర్గుణుడవు. లీలామాత్రకంగా విరాడ్రూపం ధరించి ఆకాశం వంటి సర్వవ్యాపకత్వాన్ని వహించావు. ఆ విరాడ్రూపం కూడా ఇట్టిదని ఎరుగరానంత విరాడ్రూపం. మేడిపండులో పురుగులున్నట్లు సర్వజీవరాశి నీలో నిబిడమై ఉన్నది. లోపలి పురుగులు మేడిపండు తత్త్వాన్ని ఎరుగలేనట్లు నీలో ఉన్న జీవకోటి నిన్నెరుగదు. ఆ కారణాన మహాజ్ఞానులు, వేదాలు నీవిట్టివాడవని చెప్పలేక సర్వవ్యాపకుడవని మాత్రం పలికి ఆపైని మిన్నకుంటాయి.

## విరాడ్రూప వర్ణన

నీ విరాడ్రూపం ఎట్టిదంటావా? నభస్సు నాభిగా, అగ్ని ముఖంగా, జలము రేతస్సుగా, దివము మూర్ధంగా, దిక్కులు శ్రవణేంద్రియాలుగా,

భూమి పాదంగా, చంద్రుడు మనస్సుగా, సూర్యుడు నేత్రంగా, ఇంద్రాదిలోక పాలకులు భుజాలుగా, ఓషధులు రోమాలుగా, మేఘాలు కేశాలుగా, ప్రజాపతి మేఢ్రంగా, ధర్మము హృదయంగా, బ్రహ్మ బుద్ధిగా నీ విరాడ్రూపానికి విరాజిల్లుతారు. నేను అహంకారమై ఉన్నాను. ఈ విధంగా లోకావయవాలను కల్పించి విరాణ్మూర్తివై వెలుగొందుతున్నావు.

కృష్ణా! ప్రాదేశిక శరీరమాత్రుడనైన నేనెక్కడ? నీవు వచించిన విరాణ్మూర్తి ఎక్కడ? ఓ రుద్రా! నీ మాట చెల్లుతుందా? అని అంటావేమో? లోకాన్ని, లోకంలో నివారమైన మమ్మల్ని రక్షించటానికి నీవిప్పుడు ఈ విధంగా అవతరించావు. అంతేగాని ఇది నీ అప్రచ్యుతస్వరూపం కాదు. మాయెడ ఏమిచేస్తే నీ అనుగ్రహం వర్తించినట్లు కాగలదంటావా? నీవు మమ్మందరినీ పాలించటమే నీ అనుగ్రహం. ఆ ప్రకారం నీ వలన పాలితులమై సప్తలోకాలను మేము పరిపాలిస్తాము.

నీవు పరబ్రహ్మవని అన్నాను. ఆ నోటనే నీకు పాలకపాలితభావం మూటగట్టాను. బ్రహ్మానికి సజాతీయ విజాతీయ భేదం కలుగదు. పాలకునికి అటువంటి భేదం తప్పదు. ఇది అసంగతం కాదా? అని అడుగుతావేమో. నీవు ఏకము ఆద్యము అయినట్టివాడవు. అవస్థాత్రయాత్మకులైన పురుషులందరికీ ప్రకృతిభూతుడవు. అట్టి నీకు సజాతీయ విజాతీయాలు ఎక్కడివి? అద్వితీయైక స్వరూపుడవై నీవుండగా ద్వితీయమైన జీవరాశి ఎక్కడినుంచి వచ్చినదంటావా? అగ్నినుంచి విస్ఫులింగాలు పుట్టినట్లు నీ నుండియే ఉపాధియోగాన్ని పొంది జీవరాశి కలుగుతున్నది. జీవరాశి అంటే నీవే కాబట్టి నీవు సజాతీయరహితుడ వైనావు. అద్వితీయుడవు గనుక సర్వహేతుభూతుడవు గనుక విజాతీయరహితుడవు. నీకు హేతువు లేదా? అంటే, నీవు స్వయంభూతుడవు. నీకు మరొక హేతువు కలుగదు.

ప్రతి శరీరంలోనూ ఒక్కొక్క జీవుడున్నందువల్ల ఉనికినిబట్టి జీవభేదం స్పష్టంగా కనబడుతున్నది కదా? అని ప్రశ్నింపవచ్చును. సర్వవిషయ

ప్రకాశనార్థం నీ మాయను అధిష్ఠించి ఒక్కొక్క శరీరంలో ఒక్కొక్క జీవుడున్నట్లుగా గోచరిస్తావే గాని వేరొకటి కాదు. అదే నిజమయితే సంసారిత్వం నీకు కూడా ఉన్నట్లేనా? అని సందేహం కలుగుతుంది. సంసారిత్వం నీ కెన్నటికీ కలుగదు. సూర్యుని ఆ సూర్యుని ఛాయ అయిన మేఘాలు ఆవరించి అతను పరదృష్టికి కాన్పింపనట్లు చేసినా ఆ సూర్యుడు తనను కప్పిన ఛాయను ఆ చాయలోని నానావిధరూపాలను ప్రకాశింపజేస్తూనే ఉన్నాడు. అదే విధంగా నీ కార్యమైన అహంకారం నిన్ను మరుగుపుచ్చినా స్వప్రకాశుడవు కాబట్టి ఉపాధిభూతాలైన గుణాలను, ఆ గుణాలుగల జీవులను ప్రకాశింపజేస్తుంటావు. ఆ విధంగా సర్వప్రకాశకుడవు కావటం వల్ల సర్వసాక్షివి అవుతావు. సర్వసాక్షికి సంసారం ఎలా కలుగుతుంది?

## జీవేశ్వర విధానం

జీవుడు కూడా నీవేనని, నీకంటె వేరుకాదని అన్నాను. నీకు సంసారిత్వం లేదన్నాను. జీవునికి సంసారిత్వం ఉన్నమాట స్పష్టమన్నాను. ఆ పక్షాన జీవుడు – ఈశ్వరుడు అనే భేదం ఎందుకు కలిగింది? అంటే, నీ మాయామోహం అటువంటి భావాన్ని కలిగిస్తున్నది. ఆ మోహం వస్తుస్థితిని కప్పి పుత్ర కళత్ర గృహాదులు వేరనే భావాన్ని కలిగించి వాటియందు బుద్ధిని ప్రవేశింపజేస్తున్నది. తత్ఫలితంగా జనులు జననమరణరూప సంసారసాగరంలో మునుగుతూ తేలుతూ పరిభ్రమిస్తుంటారు. ఆ కారణాన జీవేశ్వర వ్యవస్థ కలుగుతున్నది. అంతేకాని నీవు వేరు జీవుడు వేరు అనే భావానికి అవకాశం లేదు.

## మోహ నివారణోపాయం

ఆ మోహం తీరే మార్గం ఏమిటి? అంటే మార్గం ఒక్కటే. ఎప్పుడు బుద్ధి ఇంద్రియ సుఖానికి విముఖమై నీ వంక మరలి నీ పాదారవిందాలను

భజించటం మొదలుపెడుతుందో అప్పటికప్పుడే ఆ మోహం నశిస్తుంది. శరీరాలు నీ వలన కలుగుతున్నాయి. ఆ శరీరాలు నీకు సేవచేయటమన్నది ధర్మం. నీ వలన కలిగిన శరీరాలు నీకు సేవచేయక అన్యాలను సేవించితే అది ఆత్మవంచన అవుతుంది. ఆత్మవంచకుల కంటె శోచనీయు లెవరుంటారు?

## భజన కారణం

ఆనందమన్నది అందరికీ కోరదగినదే కాని అట్టి ఆనందార్థమై జనులు వారి ఇంద్రియార్థాలైన పుత్రకళత్రాదులను పట్టుకొని ప్రాకులాడుతుంటారు. వాటివలన కలిగే ఆనందం శాశ్వతమైనది కాదు. అవన్నీ క్షణికానందదాయకాలు. ఆత్ముడవైన నీవొక్కడవే మేరలేని ఆనందాన్ని ఇవ్వగలవు. కాబట్టి ఆత్ముని కంటె ప్రియవస్తువు వేరొకటి కలుగదు. ప్రియాతిప్రియుడవైన నిన్ను వదలి అనాత్మవస్తువులను ఆశ్రయించేవాడు అమృతాన్ని ఏవగించి విషాన్ని ఇవ్వమన్నట్లు దుఃఖాన్ని తెచ్చిపెట్టుకొంటాడు. బ్రహ్మ దేవతలు మునులు నిర్మలాంతఃకరణులై ఈ రహస్యమెరిగి నిన్నే ప్రియతమునిగా ఆశ్రయిస్తారు. భూతదైవేశ్వరులు మూడూ నీవే అయి నీకంటె అన్యమైనది వేరొకటి లేక తనరారే నీకంటే భజనీయు లెవరుంటారు? కాబట్టి నేను కూడా నిన్నే భజిస్తున్నాను.

## ప్రార్థనీయ పదార్థం

కృష్ణా! ఎవరయినా మనసులో ఏదో ఒకటి కోరి భజిస్తారు. ఏమి కావాలనుకొని నేను నిన్ను భజిస్తున్నానంటావా? సమస్తానికి నీవు స్థానభూతుడవయినా, కోరినవారికి కోరినది ఇచ్చేవాడివి అయినా భవమోక్షార్థం నిన్ను భజిస్తాను. మరొక కోరిక లేదు.

జగదీశ్వరా! ఈ బాణుడు నన్ను మెప్పించి అభయాన్ని నా వలన వరంగా పొందాడు. ప్రహ్లాదుని వలె ఇతనిని కూడా నీవు ఆదుకోవాలి' అని చెప్పాడు.

## భగవానుని అనుగ్రహం

శ్రీకృష్ణభగవానుడు శంకరుని వచనాలను విని, 'దేవా! నీ ఇష్టప్రకారమే జరుగుతుంది గాక. ప్రహ్లాదవంశ్యులను వధింపమని మాటయిచ్చాను. ఆ కారణాన అతనికి పౌత్రుడైన ఈ బాణుడు నాకెలాగూ అవధ్యుడే. అయితే ఇతని దర్పోద్ధతి మితిమీరింది. ఇతని సైన్యం భూమికి భారమయింది. ఆ సైన్యాన్ని రూపుమాపాను. ఇతని గర్వాన్ని అణచివేశాను. ఇతనికి నాలుగు భుజాలు ఉంచాను. ఇతను చతుర్భుజాలు కలిగి జరామరణాలు లేక నీ పార్షదులలో ముఖ్యుడై మంచి పేరు తెచ్చుకొంటాడు' అని వరదానం చేశాడు.

ఆ విధంగా బాణుడు భగవత్కృపాపాత్రుడై అభయాన్ని పొంది శ్రీకృష్ణునికి సాగిలబడి తన పుత్రికను అనిరుద్ధునితో రథం ఎక్కించి అక్కడికి రప్పించి, దేవకీనందనునికి సమర్పించి ఆయన అనుజ్ఞను గైకొని మందిరానికి వెళ్ళి అల్లుడికి కూతురికి వివిధవస్త్రాభరణాలను అరణంగా ఎంపిక చేసి సర్వమంగళ వాద్యపురస్సరంగా తిరిగివచ్చి వారికిచ్చి రుద్రుని వీడ్కొని అనిరుద్ధుని, ఉషను నగరానికి తీసికొని వెళ్ళాడు.

రాజేంద్రా! ఎవడు ప్రతిదినం ప్రాతఃకాలాన లేచి ఈ శివకేశవ సంగ్రామాన్ని భగవద్విజయగాథను స్మరిస్తాడో, అతనికి పరాభయం ఎన్నటికీ కలుగబోదు.

## నృగోపాఖ్యానం

రాజేంద్రా! ఒకనాడు యదుకుమారులు ప్రద్యుమ్న సాంబ చారు భాను గదాదులు నగరోపవనవిహారార్థం బయలుదేరి అక్కడ చాలాసేపు విహరించారు. వారికి దప్పికయింది. నీటికై వారు వెతుకుతూ దూరానికి వెళ్ళారు. ఒకనోట బావి ఉన్న జాడ కనబడింది. దగ్గరికి వెళ్ళి వారందులోనికి తొంగిచూస్తే అందులో ఒక్క బొట్టయినా నీరులేదు. దానికి తోడు ఆ బావిలో ఊసరవెల్లి ఒకటి పడి ఉన్నది. వారు దానిని చూసి జాలిపడి చర్మాలతో

తంతువులతో త్రాళ్ళుపేని కట్టి ఆ ఊసరవెల్లిని పైకి లేవనెత్తటానికి సర్వవిధాల ప్రయత్నించారు. ఆ పని వారికి సాధ్యం కాకపోయింది. అప్పుడు వారు వెనక్కి వచ్చి కృష్ణునికి తెలిపారు. భగవానుడు ఆ మాటవిని ఆశ్చర్యం కనబరిచి వెంటనే ఆ కూపం దగ్గరికి వచ్చి ఎడమచేయి జాపి ఆ ఊసరవెల్లిని బయటికి తీశాడు.

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుని హస్తస్పర్శ కలిగినంతనే ఊసరవెల్లి తన రూపాన్నిబాసి దివ్యవస్త్రమాలాలంకృత నిర్జరుడై నిలిచాడు. కృష్ణుడు అతని వృత్తాంతమంతా ఎరిగినప్పటికీ లోకవిడంబనార్థం ఎరుగనట్లు నటించి, 'అయ్యా! నీ వెవ్వడవు? ఈ ఊసరవెల్లి రూపం నీకు కలిగిన కారణం ఏమిటి? ఇదంతా మాకెంతో చిత్రంగా ఉన్నది. వివరమేమిటో వినుపింప గోరుతున్నాను' అన్నాడు.

ఆ నిర్జరుడు కృష్ణునికి సాష్టాంగ నమస్కారం చేసి, 'దేవా! సర్వవ్యాపకుడవు, సర్వసాక్షివి అయి ఏనాడూ చూపు మాయని మహాత్మునికి నీకు తెలియని సంగతి ఉంటుందా? అయినా నీ ఆజ్ఞానుసారం చెబుతాను.

దేవా! ఇక్ష్వాకుతనయుడను; నన్ను నృగు డంటారు. నేను న్యాయరూపాన సంపాదించిన కపిలగోవులను సువర్ణశృంగ రజత ఖుర దుకూల మాల్య భూషణాలంకృతాలుగా చేసి గోగణాలతోపాటు సద్బ్రాహ్మణులకు, గుణశీలసత్యవ్రతులు తపస్స్వాధ్యాయవదాన్యులు అయిన పుణ్యాత్ములకు నా చేతనైనంతలో కోట్లకొలది దానాలు చేశాను. సకుటుంబులైన విప్రవరేణ్యులను రప్పించి గోభూహిరణ్యాశ్వ గజ గృహాదులను తిలరూప్యశయ్యాసనవస్త్రరత్నాలను రథాలను దాసదాసీజనాలను సమర్పించాను. వాపీకూపతటాకాది నిర్మాణాలు కావించాను. యజ్ఞాలు లెక్కలేనన్ని చేశాను. అంతెందుకు? ధాత్రీతలాన ఉన్న ఇసుకరేణువులను లెక్కించితే లెక్కింపవచ్చును; గగనమండలంలోని చుక్కలను ఎన్నితే ఎన్నవచ్చును; వర్షబిందువులను గుణించితే గుణింపవచ్చును గాని నేను చేసిన దానాలు ఇన్నని చెప్పతరం కాదు.

దేవా! ఒకనాడు నేనొక బ్రాహ్మణునకు గోవొకటి దానమిచ్చాను. అది యెలాగో తప్పించుకొని తిరిగి నా గోగణంలో కలిసింది. ఆ సంగతి తెలియక దానిని వేరొక బ్రాహ్మణునికి దానం ఇచ్చాను. మొదటి బ్రాహ్మణుడు తన గోవును వెతికివెతికి చివరికి రెండవ బ్రాహ్మణుని ఇంటిలో అది ఉన్నదని తెలిసి అతని వద్దకు వెళ్ళి 'ఈ గోవు నాది; నీ కెలా వచ్చింది?' అని అడిగాడు. 'దీనిని నృగమహారాజు నాకు దానంచేశా' డని రెండవవాడు చెప్పాడు. వారిద్దరూ వివాదపడుతూ నా వద్దకు వచ్చారు. మొదటి బ్రాహ్మణుడు నన్ను చూసి 'అయ్యా! నీవు గోవును నాకు దానమిచ్చి మళ్ళీ నీవే దానిని అపహరించటం తగునటయ్యా?' అని ఆక్షేపించాడు. అతని మాట రెండవ వాడందుకొని, 'దానమిచ్చిన అర్థాన్ని మళ్ళీ హరించి దానినే మరొకరికి ఇవ్వవచ్చునా?' అని నిలదీశాడు. ఆ మాటలు విన్నంతనే నన్ను భయభ్రాంతులు పైకొన్నాయి. కొంతసేపటికి నెమ్మది వహించి, 'ఆర్యులారా! యథార్థగతి తెలియక ప్రమాదం జరిగింది. ఇది బుద్ధిపూర్వకం కాదు' అని మొదటివిప్రుని వంక మరలి 'అయ్యా! ఈ గోవుకు మారుగా లక్ష గోవులిస్తాను. వాటిని తీసుకొని దీనిని వదులు' అన్నాను. అతనందుకు అంగీకరింపలేదు. అదే మాట రెండవవానితో అన్నాను. అతను అసలు వీలు లేదన్నాడు. ఇద్దరినీ ఎంతో ప్రార్థించాను. వారు తమ పట్టు వదలక నా ప్రార్థనలను చెవిపెట్టక నిష్ఠురాలాడి చిన్నబోయిన మొగాలతో అక్కడినుంచి వెళ్ళిపోయారు.

అంతలో నాకు అవసానకాలమయింది. దూతలు వచ్చి యమలోకానికి నన్ను తీసుకొని వెళ్ళారు. యముడు నన్ను చూసి 'కర్మములను బట్టి శుభాశుభ ఫలాలు కలుగుతుంటాయి. ఆ ఫలాలను అనుభవింపక తప్పదు. నీవు బహుదానాలొనర్చి అత్యంతపుణ్యాన్ని గడించావు. నీ పాపఫలం అత్యల్పం. మొదట పాపఫలాన్ని అనుభవిస్తావో శుభఫలానుభవాన్ని ఇచ్ఛగిస్తావో నిశ్చయించుకో' అన్నాడు. 'అల్పాన్ని ముందు రుచిచూసి తర్వాత బహుకాలానుభవయోగ్యమైన సుకృతఫలాన్ని అనుభవించటం మేలు' అని నేనన్నాను. పాపఫలానుభవార్థం అధోగతి పొందమని యముడు నన్ను క్రిందికి తోశాడు.

నేను యమలోకంలో నుంచి క్రిందికి జారుతూ ఊసరవెల్లి తనువు దాల్చి నీ దర్శనం కోసం ఎదురుచూస్తూ ఇక్కడున్నాను. నేను కావించిన సద్బ్రాహ్మణ దానఫలంగా ఈ నీ దాసునికి పూర్వస్మృతి చెడలేదు. యోగాలు అభ్యసించి చిత్తశుద్ధి గాంచిన యోగీశ్వరులకు సహితం నీ దర్శనం ఉపనిషదాత్మక జ్ఞానమాత్రమే గాని ప్రత్యక్షం కాదు. అట్టి నిన్ను ఊసరవెల్లి నైన నేను ఈనాడు కన్నులారా కనుగొన్నాను. నా భాగ్యం ఏమనను?

**ఆ.వె.** **కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!**
**యప్రమేయ! వరద! హరి! ముకుంద!**
**నిన్నుఁ జూడఁగంటి నీ కృపఁ గనుగొంటి**
**నఖిల సౌఖ్యపదవు లందఁ గంటి.**

స్వామీ! ఎక్కడున్నా, ఏ రూపాన ఉన్నా నా చిత్తం నిరంతరం నీ పాదాల మ్రోల స్థిరమై ఉండే వరాన్ని అనుగ్రహించు. ఆజ్ఞయిస్తే దేవగతికి పోతాను' అని మ్రొక్కి అనుజ్ఞాతుడై విమానమెక్కి వెళ్ళిపోయాడు. "విప్రు సొమ్ముకంటె విషము మేలు" అని అందుకే పెద్దలన్నారు.

రాజా! నృగుని చరిత్ర సాంబాదులకు మహావిచిత్రమయింది. భగవానుడు వారిని చూసి, 'నృగుని గతి విన్నారు కదా. అగ్ని సమాన తేజోవంతుడయినా బ్రహ్మస్వాన్ని జీర్ణించుకొనలేదు. ఇక రాజుల సంగతి చెప్పేదేమున్నది? కాలకూటవిషాని కైనా విరుపున్నది కాని బ్రహ్మస్వానికి ఉండదు. విషం దానిని తిన్నవాడిని మాత్రమే చంపుతుంది. నిప్పు ముట్టుకొంటే నీరుపోసి చల్లార్చవచ్చును. బ్రాహ్మణధన మన్నదో హరించినవాడినే గాక అతని కులమంతటినీ ఉన్మూలిస్తుంది. అదీ కాక బ్రాహ్మణుని సొమ్ము తెలియక తింటే నరకగతి కలుగుతుంది. అతని అనుమతి పొందకుండా భుజించితే అది మూడు పురుషాంతరాలను నశింపజేస్తుంది. బలాత్కరించి అపహరించి తిన్నట్లయితే అతనిని, అతని పూర్వులను పన్నెండు తరాల వరకు నశింపజేస్తుంది. బ్రహ్మస్వాన్ని కోరటమంటే నరకాన్ని

వరించటమన్నమాటే. ఉత్తముడు, మీదుమిక్కిలి దరిద్రుడు అయిన బ్రాహ్మణుడు తన సొమ్మును హరించినప్పుడు దుఃఖించితే అతని దుఃఖా శ్రువులు ఎన్ని ధరారేణువులను తడిపితే అన్ని సంవత్సరాలు ఆ ధనాపహారి, అతని వంశీయులు కుంభీపాకనరకంలో పడతారు. బ్రాహ్మణునకు తాను గాని అన్యుడు గాని ఇచ్చిన వృత్తిని అపహరించేవాడు అరవైవేల యేండ్లు విష్టలో పురుగై పరితపిస్తాడు. బ్రాహ్మణధనానికి రాజులు ఆశించితే వారు అల్పకాల జీవులై వైరి చేతబడి రాజ్యం కోల్పోయి నశించిపోతారు. అట్టి బ్రహ్మధనం ఏనాటికీ నన్ను చేరకుంటుంది గాక. సాంబాదులారా! బ్రాహ్మణుడు తప్పుచేసినా కొట్టినా తిట్టినా మీరు వారికి నమస్కరించడమే తప్ప కీడు చేయబోకండి. బ్రాహ్మణుడు ఎక్కడ కనిపించినా అతనికి నేను సాష్టాంగపడతాను. మీరూ అలాగే చేయండి. ఆ విధంగా చేయనివారిని నేను దండిస్తాను. బాలకులారా! నేను చెప్పిన ధర్మం అందరియెడ వర్తిస్తుంది; విప్రులయెడ విశేషించి వర్తిల్లుతుంది. ఏమంటారా! విప్రుడంటే సామాన్యుడు కాడు. ఎవడు పాపాల నుంచి తనను రక్షించుకొనటమే గాక ఇతరులను కూడా రక్షిస్తాడో అతనికే విప్రుడని పేరు' అని బోధించి తన మందిరానికి వెళ్ళాడు.

## వ్రేపల్లెకు బలరాముని ప్రయాణం

రాజేంద్రా! నందగోకులానికి పోయి అక్కడున్న బంధుమిత్రులను చూడాలనే కోరిక బలరామునికి మిక్కుటంగా కలుగసాగింది. వ్రజవాసులు కూడా బలరాముని చూడాలని ఎంతో ఉత్కంఠతో ఎదురుచూస్తుండేవారు. ఒకనాడతను రథం ఎక్కి ద్వారకనుంచి తరలి గోకులం చేరి యశోదానందులకు నమస్కరించాడు. వారు బలరాముని కౌగిటగూర్చి ఆదరించి దీవించి అంకానచేర్చి 'రామా! జగదీశ్వరా! నీవు నీ కూర్మితమ్ముడు కృష్ణుడు మమ్మల్ని చల్లగా చూడాలి తండ్రీ!' అని ఆనందబాష్పాలలో అతనిని జలకమాడించారు. అంత బలరాముడు గోపవృద్ధులకు ప్రణమిల్లి తక్కినవారికి వయస్సఖ్య సంబంధాలకు అనురూపంగా

ప్రణామాలింగనాశీర్వాదాలు చేసి గోపబాలకులను చేరదీసి వారితో చేతులు కలిపి సల్లాపాలాడి క్షేమలాభాలు విచారించి కొంతసేపు మార్గాయాసం తీర్చుకొని వచ్చి కూర్చున్నాడు. గోపాలురు అతని చుట్టూ చేరి 'రామా! మన బంధువు లందరూ కుశలమే కదా! మీరూ మీ భార్యాపుత్రులు సుఖమే కదా. ఎన్నడైనా మేము మీ మదికి వస్తుంటామా? మీరు కంసుని సంహరించి లోకానికి మేలుచేశారు. మాకు కూడా అతని వలని బాధ తొలగింది. మీ విజయాలు మా చెవినిబడి మమ్మల్ని ఎంతో సంతోషపెడుతుంటాయి. మీరు దుర్గమమైన ద్వారకను ఆశ్రయించారని విన్నాము' అంటూ ఏదో అడగబోతున్నారు.

అంతలో గోపకాంతలు హుటాహుటిని వచ్చి రాముని చూసి దరహాస వదనలై 'నగరనారీవల్లభుడు కృష్ణుడు సుఖంగా ఉన్నాడా? తల్లిదండ్రులను ఎప్పుడయినా జ్ఞాపకం చేసుకొంటాడా? మా పరిచర్యలన్నీ మరిచిపోయాడా? అయ్యా! బంధుత్యాగం ఎంత కష్టతరమైనదో నీకు తెలియనిది కాదు. తల్లిదండ్రులను, సోదరీసోదరులనే గాక భర్తలను కూడా అతని సన్నిధిని కోరి త్యజించాము. అటువంటి మమ్మల్ని విడనాడి అతను వెళ్ళిపోయాడు. అతని తేనె పల్కులు నమ్మి బేల కాని అతివ మాలో ఒకర్తె కూడా లేదంటే నమ్ము' అన్నారు. అంతలో ఒక గోపిక ముందుకు వచ్చి, 'అయ్యా! మేము నాగరికులము కాము; వట్టి పల్లెటూరివారము. అందుకే అతని ఇచ్చకాలకు మేము మోసపోవటం జరిగింది. నగరకాంతలైనా మేల్కొన్నారా? అంటే అదీలేదు. అంతటి కృతఘ్నుడు వేరొకడుండడు. అతని చిత్తం ఒకచోట నిలవదు. అయితే అతను మంచి మాటకారి; అంతటి చిత్రకథాచతురుడు మరొకడు లేడు. అతని మురిపాలకు, చిరునవ్వులకు నగరనారులు లోబడి ఉంటారులే' అన్నది. వేరొక గోపిక అందుకొని, 'అక్కలారా! అతని కథలు చాలు. ఇతర వృత్తాంతాలేవైనా ఉంటే చెప్పండి. మనము లేకపోయినా అతనికి కాలం ఎలా గడుస్తుందో అలాగే అతను లేకపోతే మనకు గడవదా ఏమిటి?' అని మూతిబిగించింది.

రాజేంద్రా! అంతలో కృష్ణుని దరహాసాలు కటాక్షవిలోకనాలు ప్రియభాషితాలు వర్తనవిశేషాలు ప్రేమపరిష్వంగాలు ఒక్కొక్కటిగా వారి మనసులో మెదిలాయి. వాటిని తలచినకొద్దీ వారికి విరహబాధ అధికం కాసాగింది. బలరాముడు శ్రీకృష్ణసందేశాలను వినిపించి వారిని ఊరడించాడు. ఆ విధంగా బలరాముడు బృందావనంలో కొంతకాలం ఉండి వెన్నెలరేలలో ఉపవనాలలో గోపికలతో కూడి కమ్మని పూతావుల వీచే మందమారుతాలను హాయిగా అనుభవిస్తూ చైత్రవైశాఖమాసాలు గడిపాడు.

## వారుణీ పానం

ఒకనాడు బలరాముడు ఆ ఉపవనంలో విహరిస్తుండగా అతని ప్రీతికై వరుణుడు ఒక వృక్షకోటరం నుంచి వారుణిని స్రవింపజేశాడు. దాని వాసన వనమంతా వ్యాపించి బలరామాదుల మనస్సును హరించింది. అతను గోపికలతో కూడి వారుణిని గ్రోలి ఐరావతం కరేణువులను కూడినట్లు వారితో విహారసుఖం అనుభవించాడు.

## యమునా నది

ఆ విధంగా బలరాముడు వారుణీ మదవివశుడై క్రీడించి క్రీడించి అలసిపోయాడు. అతని ముఖపద్మం పైని స్వేదబిందువులు మంచుబొట్ల వలె పొడచూపాయి. అంతలో అతనికి జలక్రీడావినోదం మీదికి మనసు మళ్ళింది. అందుకోసం అతను యమునను రమ్మని పిలిచాడు. ఆ నది ఎంతసేపటికీ చెంతకు రాలేదు. అతనదిచూసి 'ఏమిటీ! నా మాట అంటే అంత అలక్ష్యమా?' అని కోపించి, 'ఇదిగో నిన్ను నూరు చీలికలు చేస్తాను చూడు' అంటూ హలాగ్రంతో దానిని పట్టియీడ్చాడు. యమున భయపడి స్త్రీరూపం దాల్చివచ్చి బలరాముని పాదాలకు మ్రొక్కి, 'దేవా! ధాత్రీతల మంతటినీ ఒక్క భుజాన మోసిన మహావిక్రమశాలివని మరచి నేనుచేసిన తప్పును క్షమించు' అని వేడుకొన్నది. హలాయుధుడు యమునను కరుణించి తన ఉద్యమాన్ని

మాని గోపికలతో ఆ నదీతీరానికి పోయి మదమత్తేభం కరేణువులతో క్రీడించినట్లు ప్రియకాంతామణులతో జలక్రీడలాడి మనసు తీర్చుకొన్నాడు. ఆ సమయంలో లక్ష్మీదేవి నీలాంబరద్వయాన్ని, వైజయంతీ వనమాలికను, దివ్యాభరణాలను తెచ్చియిచ్చింది. బలరాముడు వాటిని ధరించి రెట్టించిన శోభతో కానవచ్చాడు.

రాజేంద్రా! ఆనాటినుంచి యమునాతరంగిణి మొసలి యీడ్చినట్లు ఆ మార్గాన ప్రవహిస్తూ బలరాముని విక్రమాన్ని నేటికీ గానంచేస్తున్నది.

## పౌండ్రక వాసుదేవుడు

రాజేంద్రా! కరూశదేశాన్ని వాసుదేవుడనే పౌండ్రుడు పరిపాలిస్తుండేవాడు. దుర్మతులు కొందరతని చుట్టూ చేరి, 'అయ్యా! వాసుదేవుడనే పేరు నీకొక్కడికే చెల్లుతుంది. గొల్లవాడొకడు నీ పేరు పెట్టుకొని ఉగ్రూత లూగుతున్నాడు. ఇది నీకు తలవంపులు కదా' అని ముఖప్రీతివచనాలు పలుకసాగారు. ఆ మాటలకు పౌండ్రుడు ఉబ్బి బూరటిల్లి తానే వాసుదేవుడనని భావిస్తూ గర్వంతో విర్రవీగసాగాడు.

## శ్రీకృష్ణునికి సందేశం

బలరాముడు బృందావనానికి పోయి ఉంటున్న రోజులలో ఒకనాడు పౌండ్రుని దూత ఒకడు ద్వారకకు వచ్చి కృష్ణుని కలుసుకొని, "అయ్యా! కరూశపతి దూతను వచ్చాను. మా ప్రభువు మాట విన్నవిస్తున్నాను: 'ధాత్రీక్షేమార్థం నేను వాసుదేవుడనై అవతరించాను. నిజమైన వాసుదేవుడను నేనే. నీవు నా పేరు పెట్టుకొని లోకాన్ని మోసపుచ్చుతున్నావు. ఇకనైనా నీవు నీ శంఖచక్రాది చిహ్నాలను వదలి పేరుమార్చుకొని నా శరణుకోరవలసినది. అది సమ్మతం కాదంటే బ్రతుకు మీది ఆశవదులుకొని యుద్ధానికి రా!' అని మా ప్రభువు చెప్పమన్నాడు" అని పలికాడు. కారూశుని అజ్ఞానవచనాలు ఉగ్రసేనాదులకు నవ్వుతెప్పించాయి. సభలోనివారందరూ తలకొక మాటగా

పరిహాసవచనాలు పలికారు. సభ నెమ్మది వహించిన తర్వాత కృష్ణుడు ఆ దూతను పిలిచి, "దూతాగ్రణీ! మీ రాజు మాటలకు ఎంతో సంతోషపడుతున్నాను. మీ రాజు నిజంగా వాసుదేవుడే కావాలి గాక. శంఖచక్ర చిహ్నాలను వదలమని నాకు చెప్పిపంపాడు కదా, 'ఏనాడు రణభూమియందు నీవు కుక్కలకు నక్కలకు బలి అవుతావో, ఆనాడు నా చిహ్నాలను విడిచిపెడతాను' అని నా బదులు మాటగా నీ రాజుకు చెప్పు" అని వచించి ఆ దూతను పంపివేశాడు.

## పౌండ్రక వాసుదేవుని వధ

కృష్ణుడు దూతనటు పంపి రథారూఢుడై కాశీపట్టణానికి బయలుదేరాడు. కృష్ణుడు తన ప్రాంతానికి యుద్ధార్థం వస్తున్న సంగతిని పౌండ్రకుడు విని అక్షౌహిణీద్వయదళంతో అతనిని ఎదుర్కొన దలిచాడు. పౌండ్రకుని మిత్రుడు కాశీరాజు మూడక్షౌహిణులతో అతనికి తోడువచ్చాడు. ఇద్దరూ కలిసి వస్తుంటే పౌండ్రకుని ముఖంచూసి కృష్ణుడు నవ్వసాగాడు. పౌండ్రకు డందుకు కోపవివశుడై గదాశూలాది నానాయుధాలను కృష్ణుని మీదికి విసిరాడు. పౌండ్రకులు యోధులూ చెలరేగి కృష్ణునిపై శరవర్షం కురిపించారు. కృష్ణుడు ప్రళయానిలుడో అన్నట్లు విజృంభించి పౌండ్రక కాశీనాథుల సైన్యాలను గజవాజిరథగణాలలో దేనినీ విడవకుండా నుగ్గునూచం చేశాడు. రణక్షోణి సమస్తం వైరిదళగాత్రఖండమండితమై భూతపతి క్రీడాప్రదేశం వలె కానవచ్చింది. అంత భగవానుడు పౌండ్రకుని వంకజూచి 'ఓరీ! ఏ అస్త్రాలను వదలమని దూతచేత నాకు చెప్పిపంపించావో ఆ చక్రాదులను ఇదిగో వదిలిపెడుతున్నాను. నీవు మదమెక్కి పెట్టుకొన్న మిథ్యానామం నేటితో నిన్ను వదిలిపెడుతున్నది. యుద్ధమొల్లనినాడు శరణిల్లమని చెప్పి పంపావు కదా. నీవు చెప్పినట్లే చేస్తున్నాను చూడు!' అని యెత్తిపొడిచి చక్రాయుధంతో అతని శిరసు ఖండించి కాశీపతి తలను తెగనరికాడు. గాలికి తమ్మిమొగ్గ వలె శరవేగానికి కాశీపతి శిరస్సు ఎగిరి కోటలో పడింది.

రాజేంద్రా! ఇక్కడొక విశేషం ఉన్నది. పౌండ్రకుడు ప్రేమతో కాకపోయినా మత్సరంతో అయినా భగవంతుని నిరంతరం స్మరిస్తూనే ఉన్నాడు. తత్ఫలంగా అతని పాపాలన్నీ నశించి శరీరపతనానంతరం అతనికి భగవత్ప్రాప్తి కలిగింది.

## కాశీరాజసుతుని ప్రతిక్రియ

కాశీపతి శిరస్సు ఆ విధంగా శ్రీకృష్ణ చక్రదళితమై కోటలోనికి వచ్చి పడేసరికి పౌరులందరూ గుంపులు గుంపులుగా వచ్చి ఎవరి శిరమై ఉంటుందా? అని చూడసాగారు. రాజు భార్యలు, వారి బంధుమిత్రులు వచ్చి చూశారు. ఆ తల రాజు తల అని తెలిసిపోయింది. రాణులందరూ గొల్లుమన్నారు.

కాశీపతికి సుదక్షిణుడనే పుత్రుడుండేవాడు. అతను తండ్రికి పరలోక క్రియలు కావించి తండ్రి ఋణం తీర్ప నిశ్చయించి గురువులతో ఆలోచించి సమాధిస్థుడై మహేశ్వరుని ఆరాధించాడు. ఉమాపతి అతనికి ప్రసన్నుడై ఏమి కావాలని అడిగాడు. సుదక్షిణుడు ఆ భూతపతికి మ్రొక్కి 'దేవా! నా తండ్రిని చంపినవారిని చంపాలని ప్రతిన పూనాను. ఉపాయం అనుగ్రహించు' అని ప్రార్థించాడు. ఈశ్వరుడు అతని తలంపు విని, 'ఋత్విక్కులను కూర్చి అభిచారవిధానంలో అగ్నిదేవుని ఉపాసించు. అతను ప్రమథగణాలతో నీకు ప్రసన్నుడై నీ కోర్కె తీర్పగలడు' అని ఆదేశించాడు.

అంత సుదక్షిణుడు ఋత్విజులను రావించి అగ్నిని గూర్చిన అభిచార హోమం కావించాడు. ఆ హోమకుండం నుంచి ఒక వికృతకృత్య ఆవిర్భవించి విరియబోసిన ఎర్రని వెంట్రుకలతో నిప్పులుమిసే నిడుద కన్నులతో వాడి కోరలతో బొమలు ముడివేసి నెత్తురు జొత్తిల్లిన నాలుక చాచి ఊర్పుగాడ్పులను వెలిజిమ్ముతూ తాళప్రమాణ పాదాలతో భూమిని కంపింపజేస్తూ దిక్కులను దహిస్తూ ద్వారకాపురమార్గాన్ని పట్టి త్రుటిలో ఆ పురాన్ని ఆక్రమించింది.

ఆ అభిచారాగ్నిని ద్వారకావాసులు చూసి దావాగ్నికి జడిసి పరచిన మృగాలవలె భీతిల్లి సుధర్మసభామధ్యాన ద్యూతక్రీడలో ఉన్న కృష్ణునివద్దకు

పరిగెత్తి 'దేవా! అగ్ని రగుల్కొని పురమంతటినీ దహిస్తున్నది. రక్షించు' అని ఆర్తారావాలు కావించారు. కృష్ణుడు వారిని చూసి 'భయపడవ' ద్దని ధైర్యం చెప్పి, అది కాశీరాజ పుత్రప్రేరిత అయిన మాహేశ్వర కృత్య అని గ్రహించి చక్రాయుధం చేతగొని దానిమీదికి ప్రయోగించాడు. ఆ ఆయుధం కోటిసూర్యప్రభావిభాసమానమై ప్రళయాగ్నిజ్వాలలతో రోదసీకుహరాన్ని వెలిగిస్తూ ఉరవడించి నిజమహోగ్రతేజంతో ఆ అగ్నిని చల్లార్చి కాశికి వెళ్ళి ఆ పట్టణంలోని గోపురాట్టాలక గోష్ఠ కోశ గజ వాజి రథాలను అన్నశాలలను సభాలయాలను ఆపణాదులను దగ్ధం చేసి అభిచారహోమం చేసిన ఋత్విజులను సుదక్షిణునితోపాటు బూదిచేసి మళ్ళీ శ్రీకృష్ణుని చేరుకొన్నది.

రాజేంద్రా! భగవానుని ఈ విక్రమం విన్నా వినిపించినా సకలపాపాలు సమసిపోతాయి.

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శ్రీకృష్ణప్రభావాలు విని 'మునీంద్రా! బలరాముడంటే అనంతుడు కదా. అతని అద్భుతకర్మలను కూడా వినాలని ఉన్నది' అన్నాడు. శుకమహర్షి చెప్పాడు.

## లక్ష్మణా స్వయంవరం

రాజేంద్రా! దుర్యోధనునికి లక్ష్మణ అనే కూతురుండేది. ఆ కన్యకకు వివాహాన్ని చాటించారు. స్వయంవరానికి రాజకుమారులు పెక్కుమంది వచ్చి విడిదితీరారు. జాంబవతీపుత్రుడు సాంబుడామెను వివాహమాడదలిచి అపహరించాడు. అందుకు కౌరవులు మండిపడి 'ఏమేమీ! ఈ ఆకతాయి దుర్వినీతిని ఏమనాలి? మన అమ్మాయి ఇతనిని వరింపలేదు. ఇష్టానిష్టాలు చూడకుండా ఇతను దుందుడుకుతనం చూపాడు. మనము ఇంత మందిమి ఇక్కడున్నామన్న లక్ష్యమైనా లేదు. ఇతని దృష్టికి మనమందరమూ నపుంసకులము కాబోలు. ఇట్టి అవినీతుని విడిచేది లేదు. పట్టుకొని కట్టండి!

ఓహో! యాదవులకు ఎంతలో కన్నులు నెత్తిమీదికి వచ్చాయి! మా అనుగ్రహఫలంగా వారికి రాజ్యాధికారం ఒనగూడిన సంగతే

మరిచిపోయారు. సాంబుని కట్టిపడవేస్తే ఆ సంగతి విని యదువృష్ణివీరులు మనపైకి దండెత్తివస్తారా? రానీ. యోగవిద్యాబలానికి ఇంద్రియాలు అణగారి శాంతినొందినట్లు మన బాణహతులకు వారు గర్వం ఉడిగి శాంతించి తమ స్థానం ఏమిటో తెలుసుకొంటారు.' అని ప్రగల్భాలు పలుకుతూ భీష్ముని ముందుంచుకొని కర్ణుడు శల్యుడు యజ్ఞకేతుడు సుయోధనుడు మొదలైన యోధులందరూ సాంబుని పట్టి బంధించటానికి ఉద్యమించారు.

## సాంబుని యుద్ధపరాక్రమం

సాంబుడు నిస్సహాయుడై ఉండి జంకుపాటు లేక సింహధైర్యం వహించి వారందరినీ ఎదుర్కొన్నాడు. కౌరవప్రముఖులు అయిదుగురూ కర్ణుని ముందుంచుకొని నిలునిలుమంటూ సాంబుని అదిలిస్తూ బాణవర్షం కురిపించారు. యదుసూనుడు కౌరవబాణాలను లెక్కచేయక వారి రథాశ్వాలు ఒక్కొక్కదానిని నాలుగేసి శరాలతో నొప్పించి ఒక్కొక్క సారథి మీద ఒక్కొక్క బాణం వేసి పడగొట్టాడు. సాంబుని ధనుర్విద్యాకౌశలం మహారథికులైన కర్ణాదులకు కూడా అమితాశ్చర్యం గొలిపింది. కౌరవు లారుగురు చేరి సాంబుని రథాశ్వాలు నాల్గింటినీ నలుగురు, అతని సారథిని ఒకడు, చేతివిల్లును ఒకడు తునియగొట్టి ఆ యదుకుమారుని చుట్టుముట్టి గట్టిగా పట్టుకొని లక్ష్మణతో పాటు నగరిలోనికి తీసుకొని వెళ్ళారు.

## బలరాముని సంధిప్రయత్నం

ఆ వృత్తాంతమంతా నారదుని వలన యాదవులకు తెలియవచ్చింది. ఉగ్రసేనానుమతులై వారు కౌరవుల మీదకి దండెత్తాలని నిశ్చయించారు. ఆ సంగతి బలరాముడు విని కౌరవులకు యాదవులకు జగడం మంచిది కాదని వృద్ధబ్రాహ్మణులు కొందరిని వెంటబెట్టుకొని రథారూఢుడై హస్తినాపురానికి పోయి ఆ నగర బాహ్యోపవనాన విడిదిచేసి ఉద్ధవుని పిలిచి 'అయ్యా! నీవు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి అతని మతమేమిటో తెలిసికొనిరా!' అని చెప్పి పంపాడు.

ఉద్ధవుడు వెళ్ళి ధృతరాష్ట్రుని భీష్మ ద్రోణులను బాహ్లిక దుర్యోధనాదులను కలుసుకొని బలరాముడు వచ్చిన సంగతి చెప్పాడు. ఆత్మీయుడు వచ్చినందుకు సంతోషించి కౌరవులు మంగళపదార్థాలతో ఎదురేగి బలరాముని యథావిధి గౌరవించి అర్ఘ్యం మధుపర్కం అర్పించి గోనివేదన కావించి సకలమర్యాదలతో అతనిని నగరానికి తీసుకొనివెళ్ళారు.

బలరాముడు ఆ విధంగా నగరానికి వచ్చిన తర్వాత అతని ప్రభావం ఎరిగినవారు అతనిని సందర్శించి నమస్కారాదులతో అర్చించారు. పరస్పర కుశలప్రశ్నలు జరిగాయి. అంత బలరాముడు సుఖోపవిష్టుడై కౌరవులను చూసి 'మిత్రులారా! ఉగ్రసేనుని ఆజ్ఞావచనాలను పలుకుతున్నాను. అతని వచనాలను మీరు సావధానచిత్తులై విని ఆ ప్రకారం చేయండి. ఒక్కడిని పెక్కుమంది చుట్టుముట్టి కట్టిపెట్టడం శాస్త్రసమ్మతం కాదు. విజ్ఞులు అధర్మం జరుగుతుంటే ఒప్పుకోరు. సాంబుని విషయమై మీరు ఎటుచూసినా తగని విధాన ప్రవర్తించారు. అయినా మన చుట్టరికాన్ని గుర్తుపెట్టుకొని మీ అకార్యాన్ని సహించాము. మా అబ్బాయిని వెంటనే అర్పించండి' అని చెప్పాడు.

బలరాముని వచనాలు అతని శక్తిప్రభావానికి, ఉత్సాహసంపదలకు ఎంత సరిపడినా, కౌరవులకు మాత్రం నచ్చలేదు. మీదు మిక్కిలి వాటి వలన వారికి కోపం ముంచుకొని వచ్చింది. కౌరవులు దురాగ్రహవశులై 'ఏమిటీ! కాలి చెప్పు నెత్తికెక్కినట్లున్నదే? ఇది కాలవిశేషమే తప్ప మరొకటీ మరొకటీ కాదు. బంధుత్వాన్ని తలచి ఆలకాపరులైన యాదవులకు సహభోజనశయనాసనాది గౌరవాలనే గాక రాజ్యాధిపత్యాన్ని కూడా కట్టబెట్టాము. మా తప్పుకు తగిన శిక్ష ఇదే కాబోలు! మాకూ వారికీ సమానమా? మా అనుగ్రహం కలిమి చేత వారు ఛత్రచామర కిరీట శంఖాది రాజలాంఛనాలను పొందటమే గాక రాజముఖ్యులలో ఒకరు కాగలిగిన సంగతి ఇంతలో మరపుకు వచ్చిందా? మమ్మల్ని ఆజ్ఞాపించడం నేర్చుకొన్నారా? సిగ్గయినా లేదూ? భీష్మద్రోణార్జునాది గుప్తమైన అర్థాన్ని

మేము మనసారా ఇచ్చి ఉండకపోతే దానిని పొందటం మహేంద్రునికైనా తరంకాదు. సింహగ్రస్తమైన మాంసాన్ని మేకపోతు కాంక్షిస్తున్నది. బళీ, బళీ! చాలు చాలు. ఉగ్రసేనుడిక రాజ్యాధిపత్యానికి ఎంతమాత్రం తగడు' అని తిరస్కరించి దుర్భాషలాడి అక్కడినుంచి వెళ్ళిపోయారు.

## హస్తిపురిపై ఆగ్రహం

కౌరవులు వచ్చి జనన బంధుత్వ శ్రీమదాలతో గర్వించి పలికిన పలుకులు విని బలరాముడు లోలోని ఆగ్రహాన్ని రక్తారుణనేత్రాలు వెల్లడిస్తున్నా, మనసారా నవ్వుకొని, "మదం ఎంతో దుర్గుణం అంతే" నంటారు. మదం ఉడిగితే గాని మనశ్శాంతి కలుగదు. పసరాలకు దుడ్డుకర్ర పశుతుల్యులైన మదోన్మత్తులకు దండం శాంతినిస్తాయి. ఈ మందభాగ్యులు కయ్యానికి కాలుదువ్వి తమ మాన్యత్వాన్ని ప్రకటిస్తూ నన్ను అవమానించారు. భోజాంధ వృష్ణీశ్వరుడైన ఉగ్రసేనుని మాటంటే లోకపాలకులు సైతం తలదాల్చుతారు. అట్టివాడు రాజపదవికి తగడట. ఎవడు సుధర్మమనే ఇంద్రసభను, పారిజాతాన్ని దేవలోకం నుంచి భూలోకానికి తీసుకొనివచ్చాడో, భక్తపావన తీర్థమైన ఎవని పాదాబ్జరేణువును బ్రహ్మ ఈశ్వరుడు లక్ష్మి నేను ఇంతమందిమి శిరసుల దాల్చి కృతార్థులమని భావిస్తామో, ఆ సర్వేశ్వరుడు కూడా రాజాసనార్హుడు కాడట. లోకైకేశ్వరు డెక్కడ? క్షుద్రమైన నరపాలాసనం ఎక్కడ? ఇంతకన్న కొవ్వెక్కిన మాటలుంటాయా? కౌరవులు దయదలిచి యాదవులకు చేరెడు నేలనిచ్చారట. కౌరవులు శిరాలట; మేము చెప్పులమట. ఎంతమాట; ఎంతమాట? ఈ పలుకులన్నీ ఐశ్వర్య దుర్మద ప్రేరితాలే గాని వేరొకటి కాదు. కానీ; కౌరవుల పేరు నేటితో మంటగలిసినట్లే' అంటూ త్రైలోక్యదాహనమూర్తి వలె క్రోధఘూర్ణ చిత్తుడై లాంగలాన్ని చేతబూని క్షణంలో హస్తినాపురాన్ని పెకలించి గంగలోనికి త్రోయబోతున్నాడు. ఆ పురం ఒకవంక ఒరిగి కొంతభాగం నీట మునిగింది. గంగాజలం పురమంతటినీ ఆక్రమించింది. నగరమంతా గొల్లుమన్నది.

కౌరవు లదిచూసి ఉపాయాంతరం తోచక సాంబుని లక్ష్మణతో పాటు తీసుకొనివచ్చి బలరామునికి ఒప్పగించి బద్ధాంజలులై, 'రామా! నీ ప్రభావం ఎరుగక మూఢులమై మహాపరాధం చేశాము. విశ్వ సృష్టిస్థితికి కారణానివని, లోకసృష్టి నీకు క్రీడార్థమని పెద్దలంటారు. నీ వేయి తలలతో సృష్టిచక్ర మంతటినీ పూబంతి వలె ఔదల ధరిస్తావు. నీవు ఆగ్రహించితే అది దుష్టశిక్షణార్థమే గాని మత్సరఫలం కాదు. రక్షించు! దయతో మమ్మల్ని కాపాడు!' అని ప్రణమిల్లారు. బలరాముడు వారికి ప్రసన్నుడై అభయం ఇచ్చి మొత్తానికి చల్లబడ్డాడు.

దుర్యోధనుడు అంతట లక్ష్మణా సాంబులకు వివాహం జరిపించి కూతురికి అల్లునికి అరణంగా షష్టివర్షప్రాయ దంతావళాలు వేయింటిని తురంగాలు పదివేలు సువర్ణరథాలు ఆరువేలు సాలంకృత దాసదాసీజనం వేలకొలదిగా ఇచ్చి బలరామునితో ద్వారకకు పంపించాడు. ఆ మహానుభావుడు ద్వారకను చేరి యాదవసభలో జరిగిన సంగతంతా వివరంగా చెప్పాడు. యాదవులు హర్షభరితు లయ్యారు.

రాజేంద్రా! మీ రాజధాని గంగలో వ్రాలినట్లు నేటికీ కనబడుతున్నది కదా. అందుకు కారణం ఏమిటనుకున్నావు? అది నేటికీ బలరాముని విక్రమానికి సూచకం సుమా.

## శ్రీకృష్ణ లీలా మహిమ

పరీక్షిన్నరేంద్రా! శ్రీకృష్ణభగవానుడు నరకాసురుని సంహరించి అతని చెరలో ఉన్న పదహారు వేలమంది కాంతామణులను తీసుకొనివచ్చి వారికి ద్వారకాపురంలో ప్రత్యేక నివాసాలు నిర్మించి ఆ అందరినీ ఒకనాడు ఏకముహూర్తాన వారి వారి మందిరాలలో అన్ని రూపాలను దాల్చి ప్రత్యక్షమై వివాహం చేసుకొన్నాడని చెప్పాను. ఆ వింత నారదమహర్షి విని కన్నారా చూడగోరి ఒకనాడు ద్వారకకు వచ్చి ద్విజాళికులకిలకిలారావ మనోహర పుష్పితారామాలతో, వికసితేందీవరాంభోజ కల్హార కుముదోత్పల పూర్ణములూ

హంససారసకూజితశోభాయమానములూ అయిన సరోవరాలతో, స్ఫటిక నిర్మితాలై సువర్ణరత్నమాణిక్య ప్రకాశాన్ని ఉద్దీపింపజేస్తున్న నవలక్ష ప్రాసాదాలతో, దిద్దితీర్చిన రథ్యాచత్వరాపణసభాశాలలతో, మిన్నంటుతున్న దేవతాయతనాలతో, చల్లని నీడలో కళ్ళాపి చల్లినందున తడిసి రంగురంగుల ముగ్గులతో అలంకరింపబడిన మార్గాంగణ వీథి గేహళీపంక్తులతో పొడయెండకూడా సోకనట్లు క్రిక్కిరిసి గాలికి రెపరెపలాడుతున్న మహోన్నత చిత్రకేతనాలతో సొబగారుతున్న ఆ నగరంలోనికి ప్రవేశించి; విశ్వకర్మ నిర్మాణనైపుణ్యపరమావధి వలె విరాజిల్లుతున్న శ్రీకృష్ణాంతఃపురం లోనికి సర్వలోకపాలకసమర్పిత మహాసౌధం లోనికి అడుగు పెట్టాడు. అక్కడ షోడశ సహస్ర సుందరీ మందిరాలకు మహేంద్రనీలాలతో గోడలను నిర్మించి ప్రవాళస్తంభాలు తీర్చి వైడూర్యఫలకాలను పరిచి వితానాలలో ముక్తాదామాలను వ్రేలగట్టారు. ఆ కాంతులు కన్నులకు మిరుమిట్లు గొలుపుతున్నాయి. ఆ మందిరాల చుట్టూ కంచుకోష్ణీషధరులైన భటులు కాపురం ఉన్నారు. మందిరాంతరాన ఒక్కొక్క గది మణిదంతమయాసనపర్యంకాలతో నిండి ఉన్నది. ఆ గదులలో పరిచారికలు దివ్యాంబరాభరణవిభూషితలై పచారించటం కనుపించింది. మణిదీపప్రభల వలన లోని చీకట్లు బయటికి తప్పుకొన్నాయి. అగరుధూప ధూమాలు లోపలినుంచి గవాక్షమార్గాల ద్వారా నల్లగా వెలికి ప్రాకుతుంటే చూసి మేఘాలని భ్రమించి నెమళ్ళు పురివిప్పి నృత్యం చేస్తున్నాయి.

నారదమహర్షి ఆ అందాలన్నిటినీ కనువిందుగా తిలకిస్తూ ఒక సుందరీమణి అంతఃపురంలోనికి ప్రవేశించాడు. అక్కడ శ్రీకృష్ణుడు రత్నపర్యంకాన కూర్చొని ఉన్నాడు. అతనిచెంత ఒక కమలాక్షి నిలిచి సువర్ణదండ చామరంతో మెల్లమెల్లగా వీవన వీస్తున్నది. ఆ కాంతామణిని దాసీసహస్రం వయోరూపగుణవేషాలలో ఒక్కరొకరిని పోలినవారు పరివేష్టించి సేవిస్తున్నారు. భగవానుడు నారదుని చూచినంతనే పాన్పుదిగి ఎదురువచ్చి కిరీటంతోనే శిరస్సు ఆ మహర్షి పాదాలకు సోకేటట్లుగా వంగి

నమస్కరించి అతనిని చేయిపట్టి నడిపిస్తూ యుక్తాసనం పైని సుఖోపవిష్టుని కావించి అతని పాదాలు కడిగి ఆ తీర్థాన్ని శిరసున చల్లుకొని యథోచితార్చనలు కావించి స్వాగతం అడిగి 'మహాత్మా! ఏమిచేయమంటావో ఆజ్ఞాపించు' అన్నాడు.

రాజేంద్రా! భగవానుడు జగదేకగురువు. సాధుజన శరణ్యుడు. అతని పాదోదకమైన గంగనందరూ తలదాల్చి పవిత్రీకృతు లవుతారు. అట్టివాడు నారద పాదప్రక్షాళనజలాన్ని తలదాల్చాడు. కారణమేమంటావా? భగవానుడు బ్రహ్మణ్యదేవుడంటారు. అది గుణకృత నామం. ఆ ధర్మాన్ని ఆచరించి లోకానికి మార్గోపదేశం చేయగోరి ఆయన మహర్షిపాద జలాన్ని తలజల్లుకొన్నాడు.

## భగవన్మాయావిలాసాలు

నారదుడు ఆ మృదుమధురామృతోక్తులు విని 'సర్వలోకనాథా! నీవు సర్వలోకమిత్రుడవు. ఆ మైత్రికి సూచకంగా ఇంత చేశావు గాని నన్ను ప్రత్యేకం గౌరవించటానికి కాదు. సర్వలోకమిత్రుడ నయితే కంసాదులను వధించాను కానా? అంటావేమో. ఖలదమనం నీ లోకమైత్రికి విరుద్ధం కాదు. ఖలులు ఉన్నంతకాలం జగద్రక్షణమూ కలుగదు. దానికోసం దుష్టులను శిక్షింపకా తీరదు. నీ దుష్టశిక్షణం తావద్రూపమే గాని ఆత్మలాభార్థమో మత్సరఫలమో కాదు. నీ అవతారమే అందుకోసం జరిగింది. కాబట్టి ఖలదమన పూర్వక సాధురక్షణం నీయెడ చిత్రరూపం కాదు. ఈ రహస్యం నాకు స్ఫుటగోచరం. అగాధబోధులైన బ్రహ్మాదులకు కూడా చింత్యమాత్రమై సంసారకూప పతితులకు పట్టుగొమ్మయై అలరారే నీ పాద యుగళాన్ని చూసి ధన్యధన్యుడ నయ్యాను. నీ స్మృతి నాకు సర్వకాల సర్వావస్థలలో ఉండేటట్లుగా అనుగ్రహించు. నిన్ను ధ్యానించుకొంటూ లోకసంచారం కావిస్తాను' అని పలికి అతనిని వీడ్కొని శ్రీకృష్ణుని మాయావిలసనాన్ని విలోకించాలని ముచ్చటపడి వేరొక శుద్ధాంత సుందరీ మందిరానికి వెళ్ళాడు. అక్కడ

భగవానుడు ప్రియురాలితో ఉద్ధవునితో పాచికలాడుతున్నాడు. శ్రీకృష్ణుడు తన మందిరానికి వచ్చిన నారదుని చూచి ఎదురేగి సప్రశ్రయంగా కూర్చుండబెట్టి మహాభక్తితో సకలమర్యాదలు జరిపి ఏమీ ఎరుగనివానివలె నటిస్తూ 'మహాత్మా! ఎప్పుడు విచ్చేశారు? మీరు పూర్ణులు. మేమో అపూర్ణులము. పూర్ణులకు అపూర్ణు లేమిచేయగలరు? అయినా కర్తవ్యం బోధించి మా జన్మను తరింపజేయండి' అని అడిగాడు. నారదమహర్షి ఆ మాటకు విస్మయమంది మాటాడక అతనిని వీడ్కొని వేరొక మందిరానికి బయలుదేరాడు. అక్కడ కృష్ణుడు పుత్రులను ఉపలాలిస్తున్నాడు. దేవర్షి అక్కడినుంచి వేరొకామె ఇంటికి వెళ్ళాడు. అక్కడ కృష్ణుడు జలకమాడబోతున్నాడు. ఆ విధంగా నారదుడు కాంతల మందిరాలు కలయదిరిగి

**సీ. ఒకచోట నుచితసంధ్యోపాసనాసక్తు**
**నొకచోట బౌరాణికోక్తికలితు,**

**ఒకచోట బంచయజ్ఞోచిత కర్ముని**
**నొకచోట నమృతోపయోగలీలు,**

**ఒకచోట మజ్జనోద్యోగానుషక్తుని**
**నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు,**

**ఒకచోట ధేనుదానోత్కలితాత్ముని**
**నొకచోట నిజసుతప్రకరయుక్తు**

**తే. ఒక్కచోటను సంగీతయుక్తచిత్తు**
**నొక్కచోటను జలకేళియుతవిహారు**
**ఒక్కచోటను బలభద్రయుక్తచరితు**
**సురమునీంద్రుఁడు చూచి యచ్చెరువు నొందె.**

అంతేకాదు.

**సీ. సకలార్థ సంవేది యొక యింటిలోపలఁ**
**జెలితోడ ముచ్చటల్ సెప్పుచుండు,**

**విపులయశోనిధి వేఱొక్క యింటిలో**
**సరసిజానన గూడి సరసమాడు,**

**బుండరీకదళాక్షుఁ డొండొక యింటిలోఁ**
**దరుణికి హారవల్లరులు గ్రుచ్చు,**

**మన్మథాకారుడు మఱియొక యింటిలో**
**సఖిఁగూడి విడియము సలుపుచుండు**

**ఆ. వికచకమలనయనుఁ డొక యింటిలో నవ్వుఁ**
**బ్రవిమలాత్ముఁ డొకటఁ బాడుచుండు,**
**యోగిజనవిధేయుఁ డొకయింట సుఖగోష్ఠి**
**సలుపు ననఘుఁ డొకటఁ జెలఁగుచుండు.**

ఆ భగవాను డొకయింట గజాశ్వరథాదులపై విహరిస్తూ ఒక గృహాన పాన్పుపయి పవళించి వందిమాగధస్తుతు లాలకించుతూ ఒక మందిరాన ఉద్ధవాది మంత్రులతో మంతనాలు జరుపుతూ ఒక నివాసాన వారముఖ్యసేవితుడై జలక్రీడలు సలుపుతూ, ఒకచోట ఇతిహాసమంగళ పురాణకథలను ఆకర్ణిస్తూ, ఒకచోట ధర్మాలను ఉపదేశిస్తూ, ఒకచోట అర్థకామాలను సేవిస్తూ, ఒకచోట సమాధియోగస్థుడై ప్రకృతికి ఆవల నున్న ఆత్మని ధ్యానిస్తూ, ఒకచోట గురుపరిచర్యలు సల్పుతూ, ఒకచోట కొందరితో విగ్రహం కావిస్తూ, ఒకచోట కొందరితో సంధిచేసుకొంటూ, ఒకచోట బలరామునితో సాధుజనక్షేమాలను ఆలోచిస్తూ, ఒకచోట పుత్రీపుత్రులకు తగిన సంబంధాలను అడిగి తెలుసుకొంటూ, ఒకచోట ఇంటికి వచ్చిన కూతుళ్ళను అల్లుళ్ళను మళ్ళీ వారివారి ఇళ్ళకు సాగనంపుతూ కనిపించాడు.

నారదుడవన్నీ ఒక్కటొక్కటిగా పరికించి నవ్వుతూ 'యోగేశ్వరా! యోగులకు సైతం అందరాని నీ యోగమాయావిలాసాలను కన్నులారా కనుగొన్నాను. భవ్యదృశః పరిపూరితాలైన లోకాలోకాలలో నీ పరమ పావనలీలలను పాడుకొంటూ కాలం గడుపుతాను. అనుజ్ఞ ఇవ్వు; వెళ్ళివస్తాను' అని విన్నవించాడు. కృష్ణుడు అతని మాట విని, 'బ్రహ్మణ్యా! లోకము ధర్మ నిబద్ధమై ఉన్నది. ధర్మరక్షణపూర్వకంగా లోకశిక్షార్థం ఈ తీరున వర్తిల్లుతాను. నాయనా! మోహవశుడవు కావద్దు' అని పలికి ఆనతిచ్చాడు. నారదుడు భగవానుని వీడ్కొని అతని విలాసాలను తలచుకొంటూ అక్కడినుంచి నిష్క్రమించాడు.

**చ. అనయము నిట్లు షోడశ సహస్ర వధూమణులం బ్రియంబునన్**
**మనసిజకేళిఁ దేల్చిన యమానుషలీల సమగ్రభక్తితో**
**వినినఁ బఠించినం గలుగు విష్ణుపదాంబుజ భక్తియున్ మహా**
**ధన పశు పుత్త్రమిత్ర వనితాముఖ సౌఖ్యములున్ నరేశ్వరా!**

## శ్రీకృష్ణుని ప్రాతఃకాలకృత్యాలు

రాజేంద్రా! రాత్రి కాగానే లోకమంతా తమోగ్రస్త మవుతుంది. తత్ఫలంగా జీవరాశి యొక్క ఇంద్రియవ్యవహారాలన్నీ శమిస్తాయి. ఆ స్థితిని నిద్ర అంటారు. ఆ నిద్రనుంచి లేచి మరునాటి వ్యవహారాలకు సంసిద్ధం కావలసినదని ఇంద్రియాలను ప్రబోధింపగోరి కుక్కుటాలను ప్రకృతి నిర్మించింది. ఆ కోళ్ళు ప్రతిదినం వేకువనే లేచి 'లేవండి, లేవండి' అని లోకానికి ప్రబోధం కలిగిస్తున్నాయి.

శ్రీకృష్ణభగవానుడు రేయి యథాసుఖం భుజించి హంసతూలికాతల్పాన ఆయా ప్రియురాండ్రను కూడి పరుండి నిద్రాగతుడౌతాడు. వేకువజామున కోడికూతలతో మందమారుతం మందారవాసనలను వీస్తుంది. ఆ గాలికి తుమ్మెదలు మేలుకొని మధురధ్వనులు కావిస్తాయి. ఆ రుతాలకు ప్రియలు మేల్కాంచి నాటికి ప్రియుని వియోగం సమీపించినదని విరహభరాన్ని సైపలేక

కంఠాలింగనాలను సడలించటం ఇచ్ఛగింపక ఆలోచనలలో మునిగి తేలుతుంటారు. అంతలో వందిబృందం వచ్చి స్తుతులు కావిస్తారు. కాంతలు గత్యంతరం లేక తమ కౌగిళ్ళను సడలిస్తారు. అంతలో బ్రాహ్మీముహూర్త మవుతుంది.

శ్రీకృష్ణుడు బ్రాహ్మీముహూర్తాన మేల్కాంచి పాణిపాదప్రక్షాళన కావించి ఆచమించి అంతఃకరణ ప్రసన్నత్వాన్ని కోరి బ్రహ్మమును ధ్యానిస్తాడు. ఆ బ్రహ్మధ్యానం ఎట్టిదంటావా? బ్రహ్మము ఏకము, అనగా అఖండమైనట్టిది. అందుకు కారణమేమంటే, అది నిరుపాధికం. ఉపాధి ఉన్నట్లయితే ఖండత్వం తప్పదు. ఉపాధి కలుగదు కాబట్టి బ్రహ్మము అఖండ మవుతుంది. అఖండము కాబట్టి దానికి వ్యయము అనగా జనన స్థితి క్షయవృద్ధిలయాది షడ్వికారాలు తప్పవు. అవ్యయము కాబట్టి అది నిత్య మనబడుతున్నది. బ్రహ్మము అద్వితీయము కాబట్టి దానిని ప్రకాశింప జేసే వేరొక వస్తువుండటం సాధ్యం కాదు. అది స్వయంజ్యోతీరూపమైనది. స్వయంజ్యోతి అన్నందుకు కారణమేమంటావా? బ్రహ్మమునకు అవిద్యాకల్మషం కలగకపోవటమే అందుకు కారణం. బ్రహ్మము ఉన్నదనటానికి నిదర్శనం ఏమంటావా? దాని భాసవలన విశ్వమంతా ప్రకాశితమై దృశ్యమవుతుండటమే దానికి ఉపలక్షణం. ఆ ప్రకారం జగద్భాసకారణమైనది గుణక్షోభానికి పూర్వం కేవలం సత్తామాత్రమై ఉంటుంది. ఆ బ్రహ్మము పరమానందాత్మకం. శ్రీకృష్ణుడు ఆ విధంగా శుద్ధాంతఃకరణుడై

**"ఏకం స్వయంజ్యోతి రనన్య మవ్యయం**
**స్వసంస్థయా నిత్యనివృత్తకల్మషమ్**
**బ్రహ్మాఖ్య మస్యోద్భవనాది హేతుభి**
**స్స్వశక్తిభి ర్లక్షిత భావనిర్వృతిమ్."**

అని తద్బ్రహ్మలక్షణాలను ధ్యానించి కాలకృత్యాలు తీర్చి స్నానం చేసి సంధ్యోపాసనాది క్రియాకలాపం కావించి అగ్నిహోత్రవిధి నడిపి మౌనందాల్చి

గాయత్రి జపించి ప్రొద్దుపొడిచేలోగా సూర్యోపస్థాన మొనర్చి తన అంశభూతులైన దేవర్షులకు పితృదేవతలకు తర్పణలిచ్చి బ్రాహ్మణులను పూజించి పాడిగోవులను సవత్సాలుగా సువర్ణశృంగ రజత ఖుర దివ్యాంబర మాల్యాలంకృతాలు కావించి జంటజంటలుగా వారికి దానాలిచ్చి, గోవులకు బ్రాహ్మణులకు దేవతలకు వృద్ధులకు గురువులకు పూజలు చేసి సకలభూతాలను మ్రొక్కి ఆత్మవిభూతులైన కపిలధేన్వాది మంగళవస్తువులను తాకి తానూ వస్త్రమాల్యాదులతో అలంకరించుకొని తన ప్రతిబింబాన్ని నేతియందు అద్దంలోనూ చూసుకొని బయటికివచ్చి ఆవులను బ్రాహ్మణులను దేవతాప్రతిమలను అవలోకించి అంతఃపురవాసులకు పౌరులకు కులవర్ణభేదాలరయక సర్వజనులకు కోరికలు కూర్చి స్రక్చందన తాంబూలాలు విప్రులకు సుహృత్తులకు భార్యలకు క్రమంగా ఇచ్చి శేషాన్ని తాను ఉపయోగిస్తాడు.

## సభాప్రవేశం

రాజేంద్రా! అంతలో దారుకుడు శైబ్య సుగ్రీవాది రథ్యాలను పూన్చిన రథాన్ని తెచ్చి యెదుట నిలిపి ప్రణామం ఆచరిస్తాడు. కృష్ణుడు సారథి కైదండగొని సాత్యకి ఉద్ధవులతో రథం ఎక్కి అంతఃపురకాంతాజన లలిత వీక్షణాలకు ప్రత్యుత్తరంగా దరహాసకాంతులను విరజిమ్ముతూ సభకు బయలుదేరుతాడు. రాజేంద్రా! ఇందులో ఒక విశేషం ఉన్నది. ఎందరు భార్యలున్నారో అందరు భార్యల మందిరాల నుంచి అందరందరు కృష్ణమూర్తులు వెలికివస్తారు. ప్రతికాంత నా నాథుడు సభకేగుతున్నాడని వీడ్కొలుపుతుంది. ఆ కృష్ణవిగ్రహాలు వారి మందిరాల నుంచి వెలికి వచ్చినంతనే మాయమైపోతాయి. ఒక్క కృష్ణుడు ఒక్క రథం మాత్రమే సభకు పోవటం విశేషం. ఈ లీలావిషయాన్ని ఊహింపమన్నా మనతరం కాదు.

ఆ విధంగా ఇలువెడలిన కృష్ణుడు సుధర్మసభామండపానికి వచ్చి అక్కడ కొలువు తీరిన యదువృష్ణిముఖ్యుల నతులందుకొని ఉత్తమాసనం

అధిష్ఠింపగానే సభ్యులందరూ తమతమ ఆసనాలను అలంకరిస్తారు. హాస్యకారులు వివిధహాస్యవినోదాలతో కృష్ణుని ప్రసన్నుని కావిస్తారు. వీణావేణువాద్యవిశేషాలు సర్వేంద్రియ తర్పణం ఒనగూర్చుతాయి. నటీనటులు తాళలయపూర్వకంగా నృత్యగానాలు ప్రదర్శిస్తారు. వందిమాగధ సూతులు స్తుతిగీతాలు కావిస్తారు. బ్రహ్మవాదులైన బ్రాహ్మణులు పుణ్యశ్లోకులైన పూర్వరాజుల చరిత్రలను వినిపిస్తారు. తర్వాత సభ ప్రారంభమవుతుంది.

## జరాసంధ బందీకృతుల వినతి

పరీక్షిన్నరేంద్రా! ఒకనాడు శ్రీకృష్ణభగవానుడు యథాపూర్వం సభతీరి ఉండగా నూతనపురుషుడొకడు వచ్చి తనరాకను ద్వారపాలకుని వలన భగవానుని కెరిగించి తదనుజ్ఞాతుడై లోనికి ప్రవేశించి చేతులు జోడించి, 'దేవా! జరాసంధుడు దిగ్విజయయాత్ర చేసి సమస్తరాజులను ఓడించి వశపరచుకొనటమూ, అతనికి లోబడనివారిని పట్టితెచ్చి బందీలుగా ఉంచటమూ దేవరవారికి తెలియనివి కావు. ఆ ప్రకారం గిరివ్రజాన బందీకృతులైన ఇరవైవేలమంది రాజులు పంపగా దూతనై వచ్చాను. వారి ఆర్తవచనాలను విన్నవిస్తాను విను:

"కృష్ణా! అప్రమేయాత్మా! ప్రపన్న భయభంజనా! భవభయార్తులమై మేము నిన్ను శరణిల్లుతున్నాము. మాకు భయం ఎందుకు కలిగినదంటావా? భేదదృష్టే అందుకు కారణం. లోకమంతా కర్మముతో పుట్టుతూ కర్మముతో నడుస్తూ తుదకు కర్మము వల్లనే నశిస్తుంటుంది. ఆ కర్మమును నిత్య నైమిత్తిక కామ్య నిషిద్ధాలని నాలుగు విధాలుగా నీవు విభజించావు. నిత్యనైమిత్తికాలకు ఫలం తాత్కాలికమే గాని పునర్జన్మభోగ్యం కాదు. కామ్యనిషిద్ధాల ఫలాలు అనేక జన్మలలో భుక్తం కావలసి ఉన్నవి. నిషిద్ధకర్మ అధోగతిని కలుగజేస్తుంది. తదనుభవార్థం నీచశరీరాలు కలుగుతాయి. మేము ప్రకృతం నరజన్మ ఎత్తిన వారము కాబట్టి మాకటువంటి భయాలు కలుగవు. మా

దోషాలన్నీ కామ్యకర్మఫలాలే అనుకొంటున్నాము. మే మా విధంగా కామ్యకర్మ వశులమై ఏది మాకు మేలో తెలియక మా ధర్మాన్ని మేము నిర్వర్తింపమైతిమి. మేము చేయవలసిన ధర్మమేదని అడుగుతావేమో? నీ పాదార్చన మొక్కటే మా చేతనైన, మేము చేయదగిన ధర్మం. దానిని ఉపేక్షించి ఈ గతికి వచ్చాము. ఏ విధంగా నిన్ను భజించాలో, పెద్ద లనేకవిధాల వేయినోళ్ళతో పూర్వం చెప్పినదే, వ్యవస్థీకరింపబడి ఉన్నది.

**"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్."**

అని నీవు శాసించిన వాక్యమే ఆ నోట యీ నోట మా నోటికి వచ్చింది. కామలోభం మా కన్నులకు గంతలు కట్టింది. మేము నీ పాదార్చన విధిని తప్పి చేసిన నేరానికి జీవితాశే మాకు దూరమయింది. కాలాత్ముడవు నీవు కరుణింపకపోతే మేము బ్రతకటం కల్ల.

లోకేశ్వరా! శిష్టరక్షణ దుష్టశిక్షణార్థం నీవు అవతరించావు. నీకు మ్రొక్కినవారికి ఎటువంటి బాధలు కలుగనేరవు. మేము నీ ఆజ్ఞను ఉల్లంఘించి ఈ గతికి వచ్చాము. ఇది మా కర్మఫలమే గాని నీ కార్యం కాదు. ఈ సంగతి పూర్వం గ్రహింపలేక మేము చేసిన తప్పు క్షమించి మమ్మల్ని కాపాడటం నీ కరుణకు నిదర్శనం. రాజ్యసుఖమన్నది స్వప్నతుల్యం. పైగా అది పరతంత్రం. ఈ శరీర మన్నదో, నిత్యభయగ్రస్త మైనందువల్ల ఉండినా ఊడినా ఒక్కటే. అట్టి యీ తుచ్ఛశరీరభోగార్థం తుచ్ఛాలైన పుత్త్రదారాది సుఖాలను వాంఛిస్తుంటాము. ఆ వాంఛ చింతారూపభారంగా పరిణమిస్తుందే గాని లేశమాత్రమైనా సుఖాన్ని కలిగింపదు. సుఖాలన్నింటిలో ఆత్మసుఖమొక్కటే నిత్యము నిర్మలము అయినది. అది నిష్కాములకు మాత్రమే లభ్యమవుతుంది. అటువంటి మహోత్కృష్ట సుఖాన్ని త్యజించిన దాని ఫలం నేడు మాకు స్వానుభవసిద్ధ మయింది. ఇదంతా నీ మాయాకార్యమే నన్న ఎరుక మాకు కలిగింది. నీ మాయ నీ వలన గాక ఇతరుల వలన తొలగదు. కాబట్టి మమ్మల్ని అనుగ్రహించు.

మాకిప్పుడు కలిగిన సంకటం ఏమిటంటావా? ప్రభూ! నీకు తెలియనిది కాదు. మాగధుడనే కర్మపాశానికి చిక్కి, బందీకృతులమై కుమిలిపోతున్నాము. మమ్మల్ని విడిపించు. జగన్నాథా! నీ చేత జరాసంధుడు పదిహేడు పర్యాయాలు ఓటమి చవిచూశాడు. పద్దెనిమిదవసారి ఎందుకో అతనిని బ్రతుకనిచ్చావు. విజయాన్ని కూర్చావు. అది నీ నరలోక విడంబనమే గాని నీ శక్తిలోపం కాదు. ఆ రహస్యం గ్రహింపక అతను నిన్ను జయించానని విర్రవీగుతూ నీ ప్రజలమైన మమ్మల్నందరినీ పడరానిపాట్లకు గురిచేస్తున్నాడు. అతనికి తగిన ప్రతిక్రియ తలపెట్టకపోతే జగత్తులో మానవకోటికి నిలువనీడ ఉండదు."

దేవా! బందీకృతుల విన్నపం వినిపించాను. వారు నీ దర్శనకాంక్షులై ప్రాణాలు పిడికిట బట్టి ఎదురుచూస్తున్నారు. దీనులు, శరణార్తులు అయిన నీ వారికి మేలుకూర్పవా?' అని ఆ దూత నివేదించి భగవానునికి ప్రణమిల్లాడు.

## రాజసూయానికి ఆహ్వానం

రాజేంద్రా! ఆ రాజదూత మాట్లాడుతుండగా ఆకస్మికంగా సభామందిరంలో అపూర్వమైన దీప్తిపుంజం వెల్లివిరిసింది. సభాసదులందరూ ఆశ్చర్యపడి చూడసాగారు. శ్రీమన్నారాయణ నామసంకీర్తన వినిపించింది. అంతలో నారదమహర్షి అక్కడ సాక్షాత్కరించాడు. ఆ దీప్తి నారద మునీంద్రుని తేజోవిశేషమని సభ్యులు గ్రహించి సంతోషపడ్డారు.

భగవానుడు లోకేశ్వరుడైనప్పటికీ ఆ మునీంద్రుడు వచ్చినందుకు లోకవిడంబనార్థం తన ఆసనం నుంచి లేచి ఉత్తమాసనం పై అతనిని కూర్చుండబెట్టి యథావిధిగా పూజించాడు. సభ్యులు అనుచరులు తమ ప్రభువును అనుసరించారు. నారదుడు సుఖాసీనుడైన తర్వాత కృష్ణుడతని చెంతకూర్చొని, 'మునీంద్రా! మీరు త్రిలోకసంచారులు. మీకు తెలియని లోకవృత్తాంతం ఉండదు. ముల్లోకాలకు ఎక్కడా ఎటువంటి ఉపద్రవమూ కలుగలేదు కదా. పాండవులు ఏమిచేస్తున్నారు?' అని అడిగాడు.

నారదమహర్షి ఆ మాటవిని 'కృష్ణా! దారువు లోపల అగ్ని ఉన్నట్లు సర్వభూతాలలో నీవు నీ శక్తులను దాచి వర్తిల్లుతావు. భూతాలలో అంతరాత్మవై నీవున్నప్పటికీ భూతాదులు నిన్నెరుగలేవు. ఎందుకంటావా? నీ మాయచేత మోహింపబడి అజ్ఞానంలో పడి ఉండటమే కారణం. నీ మాయ దురంతరం. అట్టి నీ మాయను నేను కన్నారా చూశాను. అది బ్రహ్మదేవునికి సైతం మోహాన్ని కలిగిస్తుంది. నీ మాయను చూచిన నన్నిప్పుడు ఈ విధంగా ప్రశ్నించావని నేను చిత్రపడను. కృష్ణా! ఇంతెందుకు? నీ మాయాప్రభావానికి విశ్వమే నిదర్శనం కదా.

లీలాపురుషోత్తమా! ఈ జగత్తు పారమార్థికదృష్టికి అసత్పదార్థం. అట్టిదానిని నీ మాయావిశేషం వలన సత్పదార్థం వలె భాసింపజేస్తున్నావు. ఇంత మాయామయుని చర్యలను గుర్తెరగటం ఎవరి తరమవుతుంది? నీ తత్త్వమా అచింత్యం. జీవుడా అవిద్యచే ఆవరింపబడి శరీరం అనర్థావహమైనప్పటికీ దానినే మోహించి అందులోనికి ప్రవేశించి అందులోనే పరిభ్రమిస్తూ అక్కడి నుంచి మోక్షోపాయం ఏమిటో తెలుసుకోలేకపోతున్నాడు. అతనికి మార్గదీపంగా నీవు అనేక లీలావతారాలు ధరించి భవత్కీర్తిదీపికలను వెలుగొందజేస్తావు. నీ చరిత్రలన్నీ అటువంటి దీపికలే. ఆ దీపికల కాంతిలో జీవుడు మోక్షమార్గం ఏదో తెలుసుకొని ఆ మార్గాన ప్రయాణించి ముక్తుడవుతాడు. అటువంటి మహాత్ముని నిన్ను ప్రణామపూర్వకంగా ఆశ్రయిస్తున్నాను.

కృష్ణా! పాండవుల సంకల్పం నీకు తెలిసినదే. అయినా మానుషవేషధారివై ఏమీ యెరుగనివానివలె నటించటం నీకు వినోదం కాబట్టి నీ అనుయోగానికి నేను సమాధానం చెబుతున్నాను. నీ మేనత్త కొడుకు, పైగా నీకు భక్తుడు అయిన ధర్మనందనుడు సామ్రాజ్యాన్ని సాధింపగోరి రాజసూయ యాగముఖాన సర్వయజ్ఞేశ్వరుడవైన నిన్ను ఆరాధింప బూనాడు. అతని ఉద్యమాన్ని అనుమోదించి నీ వక్కడికి విచ్చేయాలి. ఆ మహాయాగానికి నీవు రాగలవని, నీ దర్శనం కాగలదని పుణ్యకీర్తులైన రాజులు, దేవతలు

అభిలషిస్తున్నారు. నీ కథాశ్రవణమో నీ నామకీర్తనమో నీ మూర్తిధ్యానమో ఏ ఒక్కటి లేశమాత్రం లభించినా చండాలురు కూడా పరమపావను లౌతారంటే నిన్ను కన్నారా చూసినవారికి, నీ పాదస్పర్శ పొందినవారికి కలిగే మేలు వర్ణనాతీతం కాదా?

జగన్మంగళ స్వరూపా! నీ యశశ్చంద్రిక దిగ్దిగంతరాలను వెలిగించి త్రైలోక్యవితాన మనదగి శ్లాఘాస్పద మవుతున్నది. నీ పాదోదకం స్వర్లోకాన మందాకిని అనే పేర, భూలోకంలో గంగ అను పేర, పాతాళంలో భోగవతి అనే పేర ప్రవహిస్తూ ముల్లోకాలకు పావనత్వాన్ని కూర్చుతున్నది. నీవు విజయం చేస్తే సర్వమూ మంగళకరమై ధర్మరాజుసభ దేదీప్యమానం అవుతుంది' అన్నాడు.

## సభ్యుల భిన్నభావాలు

రాజేంద్రా! ఆ సభలో ఉన్న యదువీరులు జరాసంధుని జయించాలని అహమహమికతో ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తున్నారు. వారికి నారదుని మాట ఇంపుగొలపలేదు. భగవానుడది గ్రహించి ఉద్ధవుని వంక మరలి 'అయ్యా! మంత్రార్థతత్త్వాన్ని విశదీకరింప గల నీవు మాకు నేత్రానివి. నీ చూపే మాకు దారిచూపుతుంది. ఇప్పుడు మనకు కర్తవ్యమేమిటో బాగా ఆలోచించి చెప్పు' అని అడిగాడు. ఉద్ధవుడు భగవంతుని ఆజ్ఞ తలదాల్చి సభ్యుల మతం నారదుని మతం కృష్ణుని అభిప్రాయం సమగ్రంగా పరిశీలించి ఇలా అన్నాడు:

## ఉద్ధవుని తీర్పు

'దేవా! ఒకవంక రాజదూత జరాసంధ సంహారం కోరుతున్నాడు. అందుకు యాదవులు మునుగాళ్ళ మీద సిద్ధంగా ఉన్నారు. ఒకవంక దేవర్షియైన నారదుడు ధర్మజుని రాజసూయాధ్వరాన్ని కొనసాగింప మంటున్నాడు. ఏకకాలంలోనే ఈ రెండు కార్యాలూ తటస్థించాయి. ఈ రెండు

మతాలలో దేవర్షి మతం మేలని నేనంటాను. ఎందుకంటావా? రాజసూయానికి దిగ్విజయం పూర్వాంగమై ఉన్నది. జరాసంధుని జయింపనిదే దిగ్విజయం పూర్తికాదు. కాబట్టి యాగానికి వెళ్ళినందువల్ల యాదవ పాండవులకు ఉభయులకు తృప్తికలుగుతుంది. రెండు పనులూ నెరవేరుతాయి. అర్థగౌరవం, కీర్తి మనకు కలుగుతాయి.

దేవా! జరాసంధుడు నాగాయుతబలుడు. అతనిని ద్వంద్వయుద్ధంలో జయించాలే గాని సేనాబలం చేత జయింప వీలుకాదు. ఆతనిని మార్కొనగల వాడు భీమసేనుడు తప్ప మరొక వీరుడు లేడు. పైగా జరాసంధునికి భీముని చేతిలో మరణం విహితమై ఉన్నది. అతను సైన్యంతో వస్తాడు గాని ఒక్కడూ రాడే; భీమునితో ద్వంద్వయుద్ధం ఎలా సాధ్యపడుతుందని శంకింపవద్దు. మాగధుడు బ్రహ్మణ్యుడు. బ్రాహ్మణులు యాచించినప్పుడు ఏది ఇమ్మన్నా లేదనడు. రజోగుణం అలా చేయిస్తుంది. భీముడు బ్రాహ్మణవేషం ధరించి జరాసంధుని ఎదుటపడి ద్వంద్వయుద్ధం అడగాలి. భీముడు, జరాసంధుడు సమానబలులు కాబట్టి ఒకవేళ ద్వంద్వయుద్ధం సమకూడినా మాగధుడు ఓడిపోతాడనే ఎందుకనుకోవాలి? అంటే, ఓ ప్రభూ! భీముడు నిమిత్తమాత్రుడు. నీ సన్నిధానంలో సర్వమూ ఫలకారిగా పరిణమిస్తుంది. నీ సన్నిధానానికి అంతటి శక్తి ఉన్నదనటానికి ప్రమాణం ఏమిటో చెప్పనా? దేవా! సృష్టివిజయాన్ని పరిశీలించితే ఇది స్పష్టపడుతుంది. సృష్టిసంహారాలకు బ్రహ్మరుద్రులు కారకులని అనుకొంటారు. ఆ మాట వాస్తవస్థితి యెరుగని వారి మాట. ఆ బ్రహ్మరుద్రులు నిమిత్తమాత్రులు. అరూపుడవు ఐనా కాలాత్ముడవై సర్వమూ నీవే నిర్వహిస్తావు. సర్వసంహారకుడవు నీవుండగా జరాసంధుని వధ ఏపాటి కార్యం?

దేవా! ఆ మాగధుడు బంధించిన రాజులు నిన్నే పూజిస్తున్నారు. ఆ రాజుల భార్యలు కన్నీరు మున్నీరుగా విలపిస్తూ వారి బిడ్డలు ఏడ్చినపుడల్లా నీ పాటలు పాడి, 'కృష్ణుడు వస్తున్నాడు; మీ తండ్రులను విడిపిస్తున్నాడు. నేడో

రేపో మీ జనకులను మీరు చూడబోతున్నారు. ఏడవకండి' అంటూ ఓదారుస్తున్నారు. ఇది వింత కాదు. శంఖచూడుని వధ, గోవర్ధనోద్ధరణం మొదలుగా గల నీ చరితలను గోపికలు పాడుకొంటూ సంతోషిస్తుండటం ఈనాటికీ మనము వింటున్న విషయమే కదా. గజేంద్రుడు నీ వలన ముక్తుడై కావించిన స్తోత్రం లోకానికి దినగీతిక కాదా? రావణ సంహారాత్మకమైన నీ కథ ఊరూరా కీర్తింపబడటం లేదా? అంతదాకా ఎందుకు? కంసుని చంపి జననీ జనకులకు బంధమోక్షం కావించి మాకూ లోకానికీ ప్రశాంతిని కూర్చిన నీ చర్యను మేమే పరికీర్తించటం లేదా?

దేవా! రాజుల పాపకర్మఫలం పరిపక్వమయింది. తత్ఫలంగా జరాసంధునికి చావు తప్పదు. అందుకు రాజసూయం నిమిత్త మవుతున్నది. కాబట్టి అక్కడికి వెళ్ళటమే మనకు ధర్మం. నా మతం విన్నవించాను. సభవారేమంటారో?'

ఉద్ధవుని పలుకులు విని దేవఋషి, యదువృద్ధులు అందరూ మేలుమేలని అంగీకరించారు. కృష్ణుడు సరేనన్నాడు.

## రాజసూయానికి ప్రయాణం

రాజేంద్రా! అంత దేవర్షి నారదుడు కృష్ణుని సపర్యలందుకొని అతనిని వీడ్కొని శ్రీకృష్ణ పరమాత్మను చిత్తవీథిలో పాదుకొల్పి శ్రీకృష్ణ నామ కీర్తన పరాయణుడై గగనమార్గాన నిర్గమించాడు. శ్రీకృష్ణభగవానుడు రాజదూత వంక మరలి, 'అయ్యా! మీ రాజులకు శుభం జరుగుతుంది. ధైర్యంగా ఉండమని నా మాటగా వారికి చెప్పు' అని పలికి అతనిని పంపివేసి, బలరాముని వద్దకేగి అతని అనుమతిని పొంది ప్రయాణం సమకట్టి తన సేవకులైన దారుక జైత్రాదులకు ఆజ్ఞాపించి అంతఃపుర కాంతలను, పుత్రపౌత్రాదులను బయలుదేరమని ఆదేశించాడు.

చతురంగబలాలు సిద్ధమై నిలిచాయి. శంఖానకభేరీ ప్రముఖవాద్యాల మంగళరావాలు మిన్నుముట్టాయి. సారథి గరుడకేతనాయత్తమైన రథాన్ని తెచ్చి నిలిపాడు. శ్రీకృష్ణుడు రథం అధిరోహించాడు. రుక్మిణీ సత్యభామాది శుద్ధాంతకాంతలు సాలంకృతలై పల్లకీలు అధిరోహించారు. కుమారవర్గం హయారూఢు లయ్యారు. అంతఃపుర పరిచారికలు, వారాంగనలు వారివారికి తగిన యానాలను ఎక్కి కూర్చొన్నారు. రక్షకులు సాయుధులై బారులు తీరారు. భృత్యులు ఒంటెల పైన గర్దభ వృషభాదుల పైన పటకుటీరసామగ్రిని కంబళాంబరాదులను నింపి ముందు కదిలారు.

ఆ విధంగా కృష్ణుడు పయనమై ఆవర్తసౌవీరకకురుదేశాలు, కురుక్షేత్రం, నదీనదగిరులు, పురగ్రామవ్రజాలు చూసుకొంటూ దృషద్వతీ సరస్వతులను దాటి మత్స్యపాంచాల భూములు నిస్తరించి ఇంద్రప్రస్థపురం చేరుకొన్నాడు. ధర్మనందనుడు కృష్ణుని రాక విని గురువులను తమ్ములను సుహృజ్జనాలను వెంటగొని మంగళవాద్యాలతో ఎదురేగి ఇంద్రియాలు ప్రాణాన్ని విడువలేనట్లు బహుకాలానికి వచ్చిన కృష్ణుని చూసి బిగికౌగిట జేర్చి ఆనందబాష్పాలు జారగా పులకిత శరీరుడై లోకాన్ని మరచి భగవన్మయుడై పరమ సుఖాన్ని పొందాడు. కృష్ణుడు ధర్మనందన భీములకు ప్రణమిల్లి అర్జునుని కౌగిట చేర్చి నకులసహదేవుల మొక్కులంది వారిని దీవించి బ్రాహ్మణులకు, కురువృద్ధులకు నమస్కరించి ఇతరులను యథోచిత పరిరంభ సంభాషణాదులతో, సత్కరించి, కుశలమడిగి అక్కడినుంచి పురద్వారానికి మరలి వందిమాగధ సూతస్తుతులు గాయనీగాయన గానాలు నటీనటనర్తనాలు వీణావేణు మృదంగ వాద్యనాదాలకు తలపంకిస్తూ గంధగజమదసిక్తమై చిత్రకేతన తోరణాలంకృతమై పూర్ణకుంభరంభాస్తంభాలంకృత ద్వారదేశమై బలిధూపదీప రాజ విరాజిత గృహోపరిభాగమై సువర్ణశృంగ సౌధమండితమైన రాజవీథిని ప్రవేశించాడు.

## పురస్త్రీల పూజాదికం

ఆ విధంగా వస్తున్న శ్రీకృష్ణుని పౌరతరుణీమణులు దూరంనుంచి చూసి–

**"సీ. విశ్వగర్భుండు నా వెలయు వే ల్పిల యశో**
**దానందులకుఁ బ్రియసూనుఁ డయ్యె,**
**బ్రహ్మాది సురలకు భావింపగా రాని**
**బ్రహ్మంబు గోపాలబాలుఁ డయ్యె,**

**వేదశాస్త్రంబులు వెదకి కానగలేని**
**గట్టి వ్రేతల ఱోలఁ గట్టఁ బడియె,**
**దివిజుల కమృతంబు దవిలి యిచ్చినవాఁడు**
**తొడరి తాఁ బెను వెన్నదొంగ యయ్యె,**

**తే. సిరికిఁ గూడ జిత్తంబీని పరమమూర్తి**
**గొల్ల యిల్లాండ్ర హృదయంబు నిల్లుచేసె**
**నెవ్వఁ డా లోకనాథుండు నిటకు వచ్చెఁ**
**గన్నులారఁ జూతము రండు కాంతలార!"**

అంటూ తత్తరపడుతూ ఒకరినొకరు పిలుచుకొంటూ హుటాహుటిని మేడ లెక్కి ఆ భువనసుందరమూర్తిని చూసి స్మేరవిలోకనాలతో స్వాగతం అడిగి కృతార్థులమని భావించి పుష్పవృష్టి కురిపించి చంద్రుని వెంట తారకల వలె అతని వెంట మేనాలపై వస్తున్న అతని దేవేరులను కనుగొని, 'ఆహా! ఈ పుణ్యవతులు ఎంత తపస్సు చేసినవారో! కాకుంటే సామాన్యురాండ్రకు ఈ పరమపూరుషుని ప్రేమ కటాక్ష వీక్షణ భాగ్యం సమకూడుతుందా?' అని తలకొక విధంగా తలపోసి, అయాచితంగా తమకు లభించిన శ్రీకృష్ణ ముఖమండలసందర్శన మహాభాగ్యానికి ఆశ్చర్యపరవశ లయ్యారు. పౌరులు, వణిక్పుంగవులు మంగళ వస్తుపాణులై ఎదురువచ్చి భగవానుని పూజించి ఆత్మదోషాలను బాపుకొన్నారు. భగవానుడు వారి పూజలను అంగీకరిస్తూ ధర్మసుతుని నగరులోనికి అడుగుపెట్టాడు.

రాజేంద్రా! ధర్మనందనుడు ఆ విధంగా కృష్ణుని తనయింటికి తీసుకొనివచ్చినవాడు పరమానందపరవశుడై ఆ అతిథికి యథావిధి పూజలను చేయటం కూడా మరిచిపోయాడు. కృష్ణుడంతట మేనత్త అయిన కుంతి ఇంటికి వెళ్ళి ఆమెకు నమస్కరించాడు. ఆమె అతనిని దగ్గరకు తీసుకొన్నది. ద్రౌపదీసుభద్రలు అతనికి నమస్కరించి దీవెనలు పొందారు. కుంతీదేవి పాంచాలిని పిలిచి శ్రీకృష్ణుని భార్యలు వచ్చారన్నది. ఆ మాటతో ద్రౌపది కదిలి రుక్మిణి సత్యభామ జాంబవతి భద్ర కాళింది మిత్రవింద లక్ష్మణ నాగ్నజితి అందరినీ పేరుపేరునా పలకరించి అందరినీ అర్ఘ్యసత్కారాలతో గౌరవించి వారివెంట వచ్చిన ముత్తైదువులకు పుష్ప చందన తాంబూల వస్త్రాలంకారాలను సమర్పించి, శక్త్యనుసారం వారిని సత్కరించింది. శ్రీకృష్ణుడు వారందరి ఆదరాభిమానాలను చూరగొంటూ భార్యలతో బంధుమిత్రపరివారంతో పాండవులకు అతిథిగా కొన్ని నెలలు అక్కడే ఉన్నాడు.

## రాజసూయ ప్రస్తావన

రాజేంద్రా! ఒకనాడు ధర్మనందనుడు కొలువుతీరాడు. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు, కులవృద్ధులు, జ్ఞాతి సంబంధి బాంధవులు, మునులు, ఆచార్యులు, తమ్ములు సభను అలంకరించారు. కృష్ణుడు కూడా వచ్చి తన స్థానంలో కూర్చున్నాడు. ఆ తరిని కుంతీనందనుడు దేవకీనందనుని వంక మరలి, ఆయనను మనసారా సర్వజనసమక్షంలో ప్రశంసించాడు. 'గోపాలా! అమరులు నీ అంశజులు. వారిని రాజసూయ యాగం చేసి పూజించాలనే కోరిక నాకు కలిగింది. నీ అంశలను పూజించితే నిన్ను పూజించటమే అవుతుంది. ఆ యాగరాజాన్ని నిర్వర్తించే మార్గం ఏమిటో ఆలోచించు. నిన్నడగటం దేనికంటావా? కామితార్థాలన్నీ నీ అడుగులలో ఉన్నాయి. ఎవరు నీ పాదపద్మాలను మనోవాక్కాయాల చేత ధ్యాన కీర్తన సేవారూపాలలో ఆశ్రయిస్తారో, వారు ముక్తిని చూరగొంటారు. ఇక ఐహికాల సంగతి

చెప్పేదేమున్నది? నిన్ను ఆశ్రయింపనివారు చక్రవర్తులైనా మేలు పొందలేరు. నీ పాదారవిందభజనమాహాత్మ్యం లోకానికి వెల్లడి కావాలి.

దేవా! కౌరవ సంజయులు, అటువంటి వారే మరికొందరు నిన్ను కొలిచీకొలవక వర్తించేవారున్నారు. అట్టివారి స్థితి లోకానికి ఎరుకపడుతుంది. బ్రహ్మాత్ముడవైన నీవు కొందరికి కోర్కెలిచ్చి మరికొందరికి ఇవ్వకపోవటం భేదభావ సూచకం కాదా? అని అంటారేమో.

స్వామీ! నీకెన్నడూ స్వపరభేదమన్న మాటే ఉదయింపదు. ఏమంటావా? భేదభావానికి రాగాదులు బీజభూతాలు. నీవు నిరుపాధికుడవు; సర్వాత్ముడవు; సమదృశివి; ఆత్మసుఖానుభూతుడవు; మీదు మిక్కిలి పరబ్రహ్మాత్ముడవు. అట్టి నీయెడ వైషమ్యభావం ఎలా కలుగుతుంది? ఆ పక్షాన సేవించేవారికి మాత్రమే ఫలం కలిగి, సేవింపని వారికి ఫలం కలగకపోవటం ఎలా పొసగుతుంది? అంటారు. ఫలమంటే అది కర్మానురూపమైనది. ఎవరెంత సేవించితే అంత ఫలాన్ని పొందుతారు. కల్పతరువు తనను ఆశ్రయించినవారికి మాత్రమే, వారు కోరినంత మాత్రమే ఇస్తున్నది. కర్మము జడము కాబట్టి స్వతంత్రించి ఫలాన్ని ఇవ్వలేదని శంకింపవచ్చును. నీ శక్తి ప్రసారం వలన జడమైన కర్మము శక్తిమంతమై ఫలాన్నిస్తున్నది. కర్మము ఒక్కరూపయినా ఫలభేదం కలగటానికి కారణ మేమంటావా? అది కర్తృబుద్ధిని బట్టి ఉంటుంది. శుద్ధబుద్ధికృత కర్మము శుభఫలాన్ని, అశుద్ధబుద్ధికృత కర్మము అశుభఫలాన్ని ఇస్తాయి. విత్తొకటి అయితే చెట్టు వేరొకటి కాదు కదా. అశుద్ధబుద్ధి మారాలంటే మార్గమేమిటి? అంటే, నీ అనుగ్రహం తప్ప వేరొక మార్గం లేదు' అని పలికాడు.

## కృష్ణుని నిర్ణయం

భగవానుడు ధర్మనందనుని వచనాలకు హర్షించి, 'అరిందమా! నీ సంకల్పం ఎంతయినా శ్లాఘనీయం. నీ శుభకీర్తి లోకవ్యాపకమై విలసిల్లుతుంది. నీ యాగం ఋషి పితృ సుర సుహృత్కోటికీ మాకూ

సర్వభూతాలకు ఎంతో సమ్మతమైనది. రాజమండలమంతా నీ వశమవుతుంది. ధరాచక్రం నీ కనుసన్నలలో మెలగుతుంది. సర్వసంభారాలను కూర్చి యాగం ఆరంభించు. రాజవిజయం ఎలా సాధ్యమవుతుందంటావా? లోకపాలాంశ సంభూతులైన నీ తమ్ములు చతుర్భుజాల వలె నిన్ను సేవిస్తుంటారు. నీవు జితేంద్రియుడవు. జితేంద్రియులకు నేను వశీకృతుడనై ఉంటాను. అకృతాత్ములు నిన్ను జయింపలేరు. ఇట్టి నీకు పరాభిభవశంక ఎందుకు? నన్ను నమ్మినవారికి యశశ్శ్రీవిభూతుల లోటుండదు. వారిని దేవతలు సైతం నొప్పింపలేరు. ఇక మనుష్యమాత్రుల సంగతి ఏమి చెప్పను?' అన్నాడు.

## పాండవ దిగ్విజయం

ఆ విధంగా ధర్మరాజు భగవన్నియుక్తుడై సంతోషమంది విష్ణుతేజోవిశేషోపబృంహితు లైన తమ్ములు నలుగురినీ పిలిచి సహదేవుని సృంజయసైనికంతో దక్షిణ భాగానికి, నకులుని పశ్చిమ దిశకు, ధనంజయుని ఉత్తర దిక్కుకు, భీముని మత్స్యకేకయమద్రకులతో తూర్పు దెసకు దిగ్విజయార్థం పంపించాడు. వారందరూ బయలుదేరి ఆయా రాజులను గెలిచి ధర్మజుని యాగార్థం విశేషధనాన్ని సంపాదించి తెచ్చియిచ్చారు. జరాసంధుడు మాత్రం జయింపరాక మిగిలాడు. అతనిని కూడా ఓడిస్తే కాని దిగ్విజయం జరిగినట్లు కాదు. అందుకు ధర్మనందనుడు ఉపాయం తోచక చింతాక్రాంతు డయ్యాడు. కృష్ణుడతని మనోభావం గ్రహించి, 'నరేశ్వరా! జరాసంధుని విషయమై చింతపడకు. అతనిని జయించే మార్గం ఉన్నది. ఎలాగంటావా? అతను మహాదాత అని పేరుపొందినవాడు. దాతృత్వం నైజంచేతనే శుభఫలాన్నిస్తుంది. అది సత్యపూర్వకమయితే ప్రశాంతిరూప శుభఫలం ఈ జన్మలోనే కలుగుతుంది. రజఃపూర్వకమైతే కాలాంతరంలో ఇచ్ఛాసిద్ధిరూప శుభాన్నిస్తుంది' అంటూ ఉద్ధవుడు తెలిపిన మార్గం సూచించి ధైర్యం చెప్పాడు.

## శ్రీకృష్ణుని యాచనం

శ్రీకృష్ణభగవానుడు ధర్మరాజుకు మనశ్శాంతిని కలిగించి అతనిని వీడ్కొలిపి భీమార్జునులతో గిరివ్రజపురం చేరి బ్రాహ్మణవేషాలు ధరించి జరాసంధుడు అతిథులను సత్కరించే సమయం తెలుసుకొని ఆ వేళకు అతని యెదుటపడి, 'రాజప్రముఖా! అతిథులము; దూరదేశం నుంచి వచ్చాము. మేము కోరినదానిని ఇస్తే నీకు మేలు కలుగుతుంది. శాంతులకు సైరింపరానిది, దాతలకు ఈయరానిది, సమదర్శనులకు స్వపరభావాలు, అసాధువులకు చేయరానిది లోకంలో లేవు. శరీరాలు అనిత్యాలు. శరీరం ఉన్నప్పుడే నిత్యకీర్తిని ఆర్జించుకోవాలి. సమర్థుడైనవాడు ఆ పని చేయకపోతే నింద్యుడు, జీవన్మృతుడు అవుతాడు. విశ్వామిత్రునికి చేసిన బాసకు కట్టుబడి హరిశ్చంద్రుడు రాజ్యాన్ని అప్పగించినది చాలక భార్యాపుత్రులను కూడా విక్రయించి చండాలత్వాన్ని సహించటం లోకవిదితమే కదా. రంతిదేవుడు సకుటుంబకంగా దాహార్తుడై పుడిసెడు నీరు దొరకక రోజులకు రోజులల్లాడి చిట్టచివరికి ఎక్కడో కొంచెం నీరు పుట్టిన తర్వాత ఆ నీటిని త్రాగబోతుండగా ఒక అతిథి వచ్చి 'నీరో నీరో' అని మొరపెట్టుకోవటం, ఆ రాజు వెంటనే తనకు లభించిన నీటిని ఆ అతిథికిచ్చి దప్పికతో ప్రాణాలర్పించటం నీకు తెలియదా? ముద్గలుడు ఉంఛవృత్తిని స్వీకరించి జీవిస్తూ ఆరుమాసాలు అన్నం కంటబడక తపించి తపించి చివరికి దోసెడన్నం దొరికి దానిని తినబోతుంటే ఆ సమయాననే ఒక అతిథి వచ్చి, 'అన్నమో రామచంద్రా' అనేసరికి చేతిలో ఉన్న ఆ దోసెడన్నాన్నీ తినబోతున్న వాడల్లా అతిథి చేతిలో పెట్టటం నీవెరుగవా? డేగలు మాంసార్థం కపోతాన్ని వెన్నాడిరాగా అది గత్యంతరం తోచక శిబిచక్రవర్తి శరణుజొచ్చితే అతను తన మాంసాన్ని కోసి ఆ డేగలకిచ్చి కపోతాన్ని రక్షించిన కథ వినలేదా? బ్రాహ్మణవేషధారి అయిన వామనునికి బలిచక్రవర్తి తన సర్వస్వం ధారపోసిన సంగతి చెప్పుకోరా? వ్యాధుడొకడు మాంసార్థమై రాగా కపోతమొకటి తననే గాక తన భార్యనుకూడా అర్పించటం, వ్యాధుడది చూసి నిర్విణ్ణుడై మహాప్రస్థాన మొనర్చి తుదకు

శరీరాన్ని అగ్నికి అప్పగించాడని వినలేదా? రాజేంద్రా! ఇటువంటి మహాపురుషుల చరిత్ర లెన్నో ఉన్నాయి. వీరందరూ శరీరాలు అధ్రువాలని గ్రహించి వాటిని లెక్కచేయక శాశ్వతలోకాలను సంపాదించారు' అని ప్రసంగించాడు.

## జరాసంధుని అంగీకారం

జరాసంధుడు ఆ వచనాలు విని వారిని నిలువెల్లా పరికించి, 'స్వరాలను బట్టి ఆకృతులను బట్టి వీరు రాజన్యుల వలె కానవస్తారు. పైగా వీరి చేతులు జ్యాఘాతకిణాంకితాలై కనబడుతున్నాయి. దీనిని బట్టి కూడా నా సందేహం నిజమే అనిపిస్తున్నది. వీరు విప్రవేషధారులైన విప్రులే గాని రాజులు కారు. ఎక్కడో వీరిని చూసినట్లు లీలగా పొడగడుతున్నది. ఏదడిగినా అడగనీ; నా శరీరాన్ని ఇమ్మన్నా ఇస్తాను. విష్ణువు వామనుడై అర్థించినప్పుడు అడిగినది ఇస్తానని బలిచక్రవర్తి మాటయిచ్చి శుక్రాచార్యుడు అడ్డుచెప్పినా నా మాట తిరగదని గురువును సైతం కాదని సర్వస్వం ధారపోశాడు. ఆ చక్రవర్తి శరీరం రాలిపోయినా అతని కీర్తి లోకోత్తరమై ఉన్నది. దేహమన్నాక నేడో రేపో పతనం కాకమానదు. కీర్తి అన్నదో శాశ్వతం. అటువంటి కీర్తి కావాలనుకొన్న వాడికి దానయోగ్యం కానిదేమున్నది?' అని లోలోన తలపోసి 'విప్రులారా! మీ కోరిక ఏమిటో చెప్పండి. తలనైనా ఇస్తాను' అని మాటయిచ్చాడు.

## దాన స్వీకారం

శ్రీకృష్ణుడతని మాట తీసుకొని, 'రాజేంద్రా! యుద్ధార్థులమై వచ్చాము. ద్వంద్వయుద్ధం కోరుతున్నాము. ఇతను భీముడు; ఇతను అర్జునుడు. నేను వీరికి మేనత్త కుమారుడను. నా పేరు కృష్ణుడు. నీ పగవాడనన్న సంగతి నీకు తెలియనిది కాదు' అని పలికాడు. జరాసంధుడు పకపక నవ్వి, 'అదా సంగతి! మీరడిగినట్లు యుద్ధమే ఇచ్చాను. యుద్ధంలో ఓడి ప్రాణార్థం మథురను విడిచి పారిపోయి సముద్రగర్భాన దాగిన పిరికిపందవు నీతో యుద్ధంచేయటం నా గౌరవానికి తగనిపని. అర్జునుడు పిన్నవాడే గాక బలహీనుడు. అతనితో

పోరాడటం ధర్మం కాదు. వియ్యానికీ కయ్యానికీ సమత్వం ఉండాలన్నారు. నాతో పోరుకు భీముడొక్కడే తగినవాడు' అన్నాడు.

## భీమ జరాసంధుల యుద్ధం

రాజేంద్రా! జరాసంధుడు ఆ మాట అంటూనే ఒక పెద్ద గదను భీముని కిచ్చి తానూ ఒక గదను అందుకొని నగరునుంచి బయలుదేరి పురబహిర్భాగాన ఉన్న రణరంగస్థానంలో నిలబడి యుద్ధసంసిద్ధుడయ్యాడు. భీముడా గదను మూపున దాల్చి వాసుదేవార్జునుల మధ్య జరాసంధునికి ఎదురై నిలిచాడు. ఇద్దరూ తలపడ్డారు. గదలు తిప్పుతూ మండలగతులలో తిరుగుతూ ఒకడు డాపలించితే మరొకడు వలపలించుతూ అతను వలపలించితే ఇతను డాపలించుతూ పరస్పరం గదలతో కొట్టుకొనసాగారు. గదలు ఒకదానినొకటి తాకినప్పుడు ఒరుసుకొన్న పటాపటా శబ్దాలు పిడుగుపాట్ల వలె తోచాయి. భీముడు జరాసంధుని కటిపాదహస్తాలను, తొడలను భుజస్కంధాలను సంధి బంధాలను నొప్పించాడు. జరాసంధుడూ భీముని అదే చోట్ల కొట్టాడు. ఆ మహాఘాతాలు వారికి పూలమాలలు పైబడినట్లు తోచాయి. కొంతసేపటికి గదాదండాలు విరిగిపడ్డాయి. దానితో వారు పిడికిటి పోట్లకు దిగారు. ఒక్కొక్క పోటు వజ్రపాతంలా మహాధ్వను లీనసాగింది. ధైర్యంలో బలంలో నైపుణ్యంలో దేనిలోనూ ఒకరికొకరు తీసిపోక సమానులై పోరసాగారు.

రాజేంద్రా! ఆ వీరులావిధంగా సమానబలులై పోరాడటం కృష్ణుడు చూసి, 'జరాసంధు డిటువంటి దెబ్బలకే కాదు, పిడుగువచ్చిపడినా చావడు. ఇతను పూర్వం రెండు ముక్కలుగా జనించాడు. ఆ ముక్కలను జర అనేదొకర్తె నిలువున సంధించింది. తత్ఫలంగా ఇతను జీవవంతు డయ్యాడు' అని తలపోసి ఒక పుల్లను చేతిలోనికి తీసుకొని భీముడు చూస్తుండగా ఆ పుడకను రెండుగా చీల్చి అవతల పారవేశాడు.

## జరాసంధ వధ

ఆ సంజ్ఞాభావం గ్రహించి భీముడు జరాసంధుని నేలకు పడద్రోచి అతని కాలొకటి తన కాలితో త్రొక్కిపట్టి రెండవ కాలు పట్టుకొని గట్టిగా మత్తేభం వృక్షశాఖను చీల్చినట్లు చీల్చి అవతల పారవేశాడు. జరాసంధుడు నిలువున చీలి వ్యత్యస్తాలైన పాదోరుహస్త భుజనేత్రకర్ణాలతో రెండు చీలికలై పడ్డాడు. ఆ తునకలను చూసి జనులు హాహాకారాలు చేశారు.

జరాసంధుడు చచ్చిపడినంతనే వాసుదేవార్జునులు భీముని కౌగలించుకొని మెచ్చుకోళ్ళతో ఎంతో ఆదరించారు. శ్రీకృష్ణభగవాను డంతట జరాసంధుని సుతుడైన సహదేవుని రప్పించి అతనికి మగధరాజ్యాభిషేకం జరిపించి, చెరలో ఉన్న రాజులందరినీ విడిపించాడు.

## శ్రీకృష్ణుని స్తుతి

రాజేంద్రా! జరాసంధునికి బందీలై ఉన్న రాజులు రెండువేల ఎనిమిదివందల మంది ఆకలి దప్పులకు లోగి అస్థిపంజరాల వలె కృశించి కొనఊపిరితో కొట్టుమిట్టాడుతున్నవాళ్ళు, మాసి చిరిగి జీర్ణమైన వస్త్రాలతో ఉండీ లేని ప్రాణాలతో వచ్చి ఘనశ్యాముడు పీతకౌశేయవాసుడు శ్రీవత్సాంకుడు పద్మపత్రాయతేక్షణుడు, స్ఫురన్మకరకుండలుడు, చారుప్రసన్నవదనుడు, గదాశంఖచక్రాద్యలంకృత చతుర్బాహుడు, కిరీట హార కటక కటిసూత్రవిరాజమాన కోమల శ్యామలగాత్రుడు అయి వనమాల ధరించి శోభిల్లుతున్న శ్రీకృష్ణుని కనుగొని కన్నుల గ్రోలటమో జిహ్వతో ఆస్వాదించటమో బాహువులతో కౌగిలించటమో అన్నట్లుగా పరమానంద చేష్టావిహ్వలులై ప్రణమిల్లి, 'దేవా! జగదీశ్వరా! మా పాపాలు కడతేరిన కాలానికి నీ దర్శనమయింది. నిన్నాశ్రయించాము. ఘోరసంసృతి నుంచి మమ్మల్ని కాపాడు. జరాసంధుడు మమ్ము చెరగొన్నాడని మా కతనిపై ఆగ్రహం లేదు. అతను మాకెంతో మేలే చేశాడు. రాజ్యమదాంధులమై అనిత్యాలైన భోగాలను నిత్యాలుగా భావించి పసిపిల్లలు నీళ్ళకోసం

ఎండమావుల వెంట తిరిగినట్లు మేము ప్రవర్తించాము. దేవా! శ్రీ మదం బుద్ధిని మందగిస్తుంది. నష్టబుద్ధులకు క్షణికాలు శాశ్వతమనే భావన కలుగుతుంది. దానిని సాధించాలని ప్రయత్నిస్తారు. పరస్పరస్పర్థలు జనిస్తాయి. ప్రజలను చంపుతారు. మృత్యురూపంలో నీవు ముందున్న సంగతి గ్రహింపరు. ఇందుకు మేమే నిదర్శనం. జరాసంధుడు మా గర్వాన్ని అణిచివేశాడు. మేము తెలివితెచ్చుకొన్నాము. ఇదంతా నీ అనుగ్రహమే గాని వేరొకటి కాదు. భక్తవత్సలా! శరీరాలు నశ్వరాలే గాక తీరని రోగాలకు ఉనికిపట్లవుతాయి. అట్టి తుచ్ఛశరీరాలతో భోగింపనైన రాజ్యసుఖం మృగతృష్ణారూపమై ఉన్నది. అందుకు ప్రాలుమాలితే ఆ సుఖం రుచిజనక మాత్రమే తప్ప రుచికరమైనది కాదు. ఆ భోగాదులను చవిచూశాము. రోత పుట్టింది. అట్టివిక మాకు అక్కరలేదు. నీ పాదసేవ మాకు చాలు.

**"ఉ. వేదవధూశిరోమహిత వీథులఁ జాల నలంకరించు మీ**
**పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని**
**త్యోదితభక్తియై తగిలి యుండు నుపాయ మెఱుంగఁ బల్కఁ దా**
**మోదర! భక్త దుర్భర పయోనిధి తారణ! సృష్టికారణా!"**

అని సాగిలబడి మ్రొక్కారు.

## సంసారుల ధర్మం

శ్రీకృష్ణభగవానుడు వారిని కరుణించి, 'రాజులారా! ఎప్పుడు మీకిట్టి బుద్ధినిశ్చయం కలిగిందో, అప్పుడే మీకు నాయందు భక్తికూడా దృఢమైనదని భావించండి. ఐశ్వర్యమదం నరులకు ఉన్మాదాన్ని కలిగిస్తుందనే మాట ముమ్మాటికీ సత్యం. నరులకే కాదు, దేవతలకూ దానివల్ల మనోభ్రాంతి కలుగుతుంది.

కార్తవీర్యుడు గర్వోన్నతుడై కామధేనువును హరించి పరశురాముని చేత సపుత్రంగా నాశనాన్ని పొందాడు. నహుషుడు దేవేంద్రత్వాన్ని పొంది ఉన్మత్తుడై

శచీదేవిని చెరబట్టదలిచి పదవీభ్రష్టుడు కావటంతో సరిపోక అజగరత్వాన్ని పొందవలసి వచ్చింది. వేనుడు మదాంధుడై బ్రాహ్మణుల నధిక్షేపించి వారి హుంకారానికి బలి అయ్యాడు. రావణుడు రాక్షసేశ్వరుడై సర్వభోగాలకు అధినాథుడై కామంతో కళ్ళుమూసికొనిపోయి సీతను చెఱపట్టి రాఘవుని చేత మరణించాడు. నరకాసురుడు అదితి కుండలాదులను హరించిన ఫలంగా నాచేత రూపుమాశాడు. శ్రీమదాంధులై తత్ఫలంగా స్థానచ్యుతి నొందిన దేవతలు దైత్యులు రాజులు ఎందరో ఉన్నారు.

రాజులారా! దేనికి పుట్టుక ఉన్నదో, అది తప్పక నశిస్తుంది. ఈ మాట మీరు మనసుకు తెచ్చుకొంటే, ఎన్నటికీ ప్రమాదపడరు. ఇక జాగరూకులై యాగాలు చేస్తూ ఆ యజ్ఞేశ్వరరూపాన నన్ను ఆరాధిస్తూ ప్రజాపరిపాలన కావిస్తూ ప్రజాసంతతి వృద్ధిపొందుతూ ఉండండి. సుఖదుఃఖాలు కాలప్రాప్తంగా వచ్చిపోతుంటాయి. వాటిని యథాప్రాప్తం అనుసరింపక తప్పదు. కాదని తోసిపుచ్చినా అవి పోయేవి కావు. ఈ భావాన్ని గ్రహించి వాటికోసం తబ్బిబ్బు కాక నాయందు మదినిల్పి మీ మీ ధర్మాలలో చరించండి. ఎవరు దేహాదులయెడ ఉదాసీనులై చిత్తాన్ని దృఢభక్తిపూర్వకంగా నాయందు నిలిపి చరిస్తారో, వారు చిట్టచివరికి ఆత్మారాములై నన్ను చేరుకొంటారు' అని ఊరడించి, సహదేవుని పిలిచి, 'జరాసంధతనయా! ఈ రాజులకు స్నానపానాది పరిచర్యల నిమిత్తం పరచారికలను నియమించు' అని ఆజ్ఞాపించాడు.

సహదేవుడు ఆ మాట తలదాల్చి రాజోచితంగా వారికి స్నానపానాది సకలోపచారాలు చేయించాడు. వారు స్నానమాడి నూత్నవస్త్రమాల్యానులేపన భూషణాదులు ధరించి కృష్ణుని కడకు వచ్చి అతని ఆనతి గొని వర్షాంతాన గ్రహాల వలె తేజరిల్లుతూ మణికనకరథాలు ఆరోహించి శ్రీకృష్ణధ్యానమతులై తమ తమ దేశాలకు పోయి తాము పడిన పాట్లు, శ్రీకృష్ణభగవానుని చేత విముక్తి గాంచటం మొదలయినవి వివరించి భగవద్బోధిత పథం తప్పక పరిపాలన చేయసాగారు.

## ఇంద్రప్రస్థానికి ప్రయాణం

రాజేంద్రా! భగవానుడు ఆ ప్రకారం జరాసంధుని తెగటార్చి సహదేవుని పూజలంది భీమార్జునులతో ఇంద్రప్రస్థానికి పోయి శంఖం పూరించాడు. ఆ నాదం చెవిసోకినంతనే జరాసంధుడు మరణించాడని పురవాసులందరూ గ్రహించి సంతోషించారు; ధర్మరాజు తన మనోరథం ఈడేరినదని భావించాడు. అంతలో శ్రీకృష్ణుడు భీమార్జునులతో నగరు ప్రవేశించి ధర్మరాజుకు ప్రణమిల్లి జరిగిన సంగతి విశదీకరించాడు. పాండవాగ్రజుడు ఆ మాట విని, 'ఓహో! భగవత్కరుణకు నోచుకొన్నాను గదా' అని ఆనందబాష్పాలు చిప్పిల్లగా కొంతసేపు నోట మాటాడక అతనినే చూస్తూ ఉండిపోయాడు.

## ధర్మరాజు ప్రశంస

రాజేంద్రా! ధర్మనందనుడు ఆనందపరవశత్వం నుంచి తేరుకొని ఇంద్రియార్థాలు తెలిసిన తర్వాత శ్రీకృష్ణుని చూచి, 'జగదీశ్వరా! నీ శాసనాన్ని లోకగురువులు, లోకేశ్వరులే శిరసావహిస్తారు. దీనులైన మానవమాత్రుల అనుశాసనాన్ని నీవు తలదాల్చటం కేవల విడంబనార్థమని నే నెరుగుదును. సూర్యుని తేజస్సునకైనా ఉదయాస్తమయాలలో వృద్ధిక్షయాలు ఉన్నవి గాని నీ తేజానికి వృద్ధిక్షయా లెన్నడూ లేవు. అజ్ఞులు 'నేను, నాది; నీవు, నీది' అనే భేదభావాలకు వశపడి వాటికోసం ప్రాకులాడుతుంటారు. నీ భక్తులకు అట్టి శారీరకవిషయ భేదభావం ఉండదు. అది నీ అనుగ్రహవిశేష ఫలమే' అని తన అంతర్భావాన్ని వెల్లడించాడు.

## రాజసూయ యాగం

రాజేంద్రా! అంత కొంతకాలానికి యాగారంభసమయం వచ్చింది. ధర్మనందనుడు శ్రీకృష్ణానుమోదితుడై యాగానికి ఉపక్రమించాడు.

ధర్మరాజు యాగానికి ద్వైపాయనుడు భరద్వాజుడు సుమంతుడు గౌతముడు అసితుడు వసిష్ఠుడు చ్యవనుడు కణ్వుడు మైత్రేయుడు కవషుడు త్రితుడు విశ్వామిత్రుడు వామదేవుడు సుమతి జైమిని క్రతువు పైలుడు పరాశరుడు గర్గుడు వైశంపాయనుడు దుర్వాసుడు కశ్యపుడు ధౌమ్యుడు భార్గవరాముడు ఆసురి వీతిహోత్రుడు మధుచ్ఛందుడు వీరసేనుడు అకృతవర్ణుడు మొదలుగా గల బ్రహ్మవాదులైన బ్రాహ్మణులు ఋత్విజులుగా వరింపబడ్డారు.

భీష్మ ద్రోణ కృప విదురాదులకు, సపుత్రకంగా ధృతరాష్ట్రునికి ఆహ్వానాలు వెళ్ళాయి. వారందరూ వచ్చారు. ఆ మహాయజ్ఞాన్ని చూసే వేడుకతో సర్వవర్ణాలవారు విచ్చేశారు. పురవీథులన్నీ జనసందోహంతో క్రిక్కిరిసి ఇంద్రప్రస్థానికి కొత్త కళ వచ్చింది.

అంతట ఋత్విజులు బంగారు నాగళ్ళతో యజ్ఞభూమిని దున్ని వేదికను సంస్కరించారు. ధర్మనందనుడు యజ్ఞదీక్ష వహించాడు.

రాజేంద్రా! పూర్వం వరుణుడు రాజసూయ యాగం చేసినప్పుడు ఆ యాగంలో సర్వోపకరణాలను బంగారుతో చేసి ఉపయోగించారు. ఆ ప్రకారమే ధర్మజుని రాజసూయంలోనూ సర్వోపకరణాలను సువర్ణంతో చేసి ఉపయోగించారు.

ఇంద్రాది లోకపాలకులు, బ్రహ్మ, మహేశ్వరుడు, సిద్ధ గంధర్వ విద్యాధర నాగ యక్ష రాక్షస ఖగ కిన్నర చారణాదులు, మునులు, అందరూ వచ్చారు. రాజులు సకుటుంబ పరివారంగా ఆహ్వానింపబడి ఒక్కరొక్కరూ వచ్చి సకాలంలో విడిదితీరారు. క్రతువు శాస్త్రోక్తప్రకారం నడిచింది. అధ్వరప్రయోగాన్ని అందరూ ఏకగ్రీవంగా శ్లాఘించారు. దేవతలు వరుణుని యాజకత్వం వరించిన నాటిని స్మరింపజేస్తూ ఋత్విజులు ఆ అజాతశత్రుని యాగానికి యాజకత్వం వహించారు.

## అధికారుల నియమనం

దుర్యోధనుడు ధనాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు. భీముడు పాకశాలాధ్యక్షు డయ్యాడు. నకులుడు వస్తుసంపాదనకు, సహదేవుడు యాగార్థం వచ్చినవారిని యథోచితరీతుల మర్యాదలు చేయటానికి నియుక్తులయ్యారు. అర్జునుడు సాధుపరిచర్య, కృష్ణుని పాదసేవ పనిగా పెట్టుకొన్నాడు. ధృష్టద్యుమ్నుడు వంటల వడ్డనకు విచారణాధికారం వహించాడు. కర్ణుడు దానాలిచ్చే పనిని, సాత్యకి వికర్ణుడు కృతవర్మ విదురుడు బాహ్లికపుత్రులు సంవర్ధనాదులు యజ్ఞసంబంధితాలైన ఆయా పనులలో కుదురుకొన్నారు.

## అగ్రపూజా విచారం

రాజేంద్రా! క్రతువు నిర్విఘ్నంగా ముగిసే రోజు వచ్చింది. ఆ రోజు మొదట అగ్రపూజ చేసి అనంతరం తక్కినవారిని పూజింపవలసి ఉంటుంది. ధర్మరాజు సభాంతరాన లేచి సభాస్తారులకు నమస్కరించి, 'ఆర్యులారా! అగ్రపూజార్హు లెవరో సెలవీయ గలరని ప్రార్థన' అన్నాడు. సభలో వివిధ మతాలవారు ఉండటం వలన ఇదమిత్థమని చెప్పలేక అందరూ ఒకరి మొగం ఒకరు చూసుకొంటూ ఊరుకొన్నారు. సహదేవు డదిచూసి లేచి సభాంతరాన నిలిచి, 'సదస్యులారా! దీనికింత ఆలోచన దేనికి? ఎవడు సర్వదేవతామయుడో, దేశకాలధనాత్మకు డెవడో; క్రతువులు అగ్నులు ఆహుతులు మంత్రాలు మాత్రమే గాక విశ్వమంతా ఎవని ఆత్మకమై ఉన్నదో; సాంఖ్యాన్ని కేవలంగా గ్రహించి సవిశేషమైన యోగాన్ని ఆశ్రయించి విశేషణభూత మైనట్టి ఏ సర్వప్రపంచాత్మభూతుని ఉపాసించి యోగసిద్ధిని పొందుతారో అట్టి అద్వైతాద్వితీయ పరమపూరుషుడు వాసుదేవుడు ఉన్నాడు. జగమంతా అతని ఆత్మకమే. అతనికి మరొకటేదీ ఆశ్రయం కాదు. ఆ మహాత్ముడు ఆత్మాశ్రయుడై సృష్టిస్థితిలయాలను కావిస్తాడు. అతని అనుగ్రహవిశేషం వలన కర్మములు ధర్మములు సమస్తం జరుగుతున్నాయి.

సర్వశ్రేయాలు అతని వలన ప్రాప్తము లవుతాయి. అట్టి వాసుదేవుడు శ్రీకృష్ణరూపాన కట్టెదుటనే ఉన్నాడు. అతనికి ప్రథమపూజ చేయటమే మనకు ధర్మం. ఈ మహాత్ముని పూజించితే సర్వభూతాలను సత్కరించి నట్లవుతుంది. ఇందులో అతిశయోక్తి లేదు. ఈ భగవానుడు సర్వభూతాలకు ఆత్మభూతుడు కాబట్టి ఇతనిని పూజించటం సర్వభూతపూజాచరణ మవుతుంది. ఎవడు సర్వభూతాత్మభూతుడు అభేద దర్శనుడు దాంతుడు పూర్ణుడు అయినవాడో, అతనికి సమర్పించినప్పుడే ఆ అర్పణకు అనంతఫలం చేకూరుతుంది. శ్రీకృష్ణుడు అట్టివాడు కాబట్టి అగ్రపూజ అతనికే కావించాలి' అని చెప్పాడు.

సహదేవుని పలుకులు సమంజసంగా ఉన్నాయని సభాస్తారులందరూ జయజయధ్వానాలతో తమ ఆమోదాన్ని తెలియజేశారు. ధర్మరాజంతట పూజాద్రవ్యాలు చేతగొని ఆ దేవదేవుని సమీపించి అతని పాదారవిందాలు కడిగి విశ్వపావనాలైన ఆ జలాలను తాను తలదాల్చి భార్యాసోదర కుటుంబ మంత్రివర్గాలచే తలదాల్పజేసి పీతకౌశేయాంబరభూషణాదులను అర్పించి పూజ కావించి పరమానందవశు డయ్యాడు. రాజులందరూ ఒక్కరొక్కరుగా వచ్చి శ్రీపతి చరణారవిందాలకు ప్రణమిల్లారు. జయశబ్దాలతో సభామండపమంతా మారుమ్రోగింది పుష్పవృష్టి కురిసింది.

## శిశుపాలుని అధిక్షేపం

పరీక్షిన్నరేంద్రా! భగవానుని గూర్చి సహదేవుడు పలికిన పలుకులు సభాగతుడై ఉన్న శిశుపాలునికి ములుకులై తగిలాయి. వాసుదేవునికి కావించిన అగ్రపూజ దమఘోషసుతుడికి అత్యంత కోపావేశం కలిగించింది. రాజులందరూ కృష్ణునికి ప్రణమిల్లటం తనను అవమానించినట్లేనని అతను భావించాడు. శిశుపాలుడు ఆ విధంగా దురాగ్రహం పొంది తాను కూర్చుండిన గద్దెమీదినుంచి లేచి చేయి పైకెత్తి, 'సభాసదులారా! అన్నిటిని కాలమే నియమిస్తుంటుంది. కాలము దురవ్యయం. ఈ మాట శ్రుతులలో ఉన్నమాటే. ఆ మాటలో ఎంత నిజం ఉన్నదో ఈనాడు తెలిసివచ్చింది.

లేకపోతే పిల్లవాడి కూతలను పెద్దలందరూ మెచ్చుకోవటం జరుగుతుందా? విజ్ఞులారా! అగ్రపూజకు ఎవడర్హుడో మీరెరుగుదురు. ధర్మబుద్ధితో పాత్రలక్షణాలను విమర్శించి యుక్తాన్ని స్వీకరించండి. దాశార్హునికి పూజార్హత ఎప్పటి నుంచి వచ్చింది? తపోవిద్యావ్రతులు జ్ఞాననిరస్తకల్మషులు లోకపాలకపూజితులు బ్రహ్మనిష్ఠులు అయిన పరమర్షులు ఇందరిక్కడుండగా వారిని కాదని కులపాంసనుడైన ఈ గోపాలకుని పూజింపవచ్చునా? యజ్ఞపురోడాశానికి కాకి తగినట్లయితే ప్రథమపూజకు ఇతను తగిన వాడు. ఇతనికి మారుపేరు కలుగదు. ఎన్నికకు ఒక్క గుణం లేదు. వర్ణాశ్రమాలను పాటించడు. ధర్మా లన్నింటినీ అతిక్రమించి ఇష్టానువర్తిగా వ్యవహరిస్తుంటాడు. ఇటువంటివాడు పూజార్హుడా? పైగా ఇతని వంశమంతా యయాతి శాపఫలంగా కులబహిష్కారాన్ని పొందింది. ఆ కారణాన సాధువు లందరూ ఇతనిని దూరంగా ఉంచుతారు. యాదవులు దొంగలు కాబట్టి బ్రహ్మర్షిసేవితమైన దేశంలో అడుగు పెట్టే చోటులేక అబ్రహ్మవర్చసమైన సముద్రంలో దాగారు. అట్టి చోరులు పూజ్యులా? అంతటితో కాలేదు. వారు దుర్గాన్ని ఆశ్రయించి ప్రజలను బాధిస్తారు. ప్రజాకంటకులు కూడా పూజ్యులేనా?' అని నోటి కసిదీరా ప్రలాపాలు పలికాడు.

## శిశుపాల వధ

రాజేంద్రా! భగవన్నిందాపరాలైన ఆ పరుషవచనాలను సహింపలేక సభాసదులు రెండు చేతుల రెండు చెవులు గట్టిగా మూసుకొని శిశుపాలుని దూషిస్తూ అక్కడినుంచి లేచిపోయారు. భగవంతుని గాని భగవద్భక్తులను గాని నిందించేవారిని వారించటం మంచిది. అది చేయలేనినాడు అక్కడినుంచి తప్పుకోవటం మేలు. అదీ చేయనివారికి పాపక్షయమే గాక నిరయం కూడా కలుగుతుంది.

నరేంద్రా! శిశుపాలుని కారుకూతలను పాండునందనులు మత్స్యకేకయ సృంజయాది భూమిపతులు సైరింపలేక సాయుధులై ఆ చేదీశ్వరుని మీదికి ఉరకబోయారు. శిశుపాలుడు ఖడ్గధారియై వారిని ఎదుర్కొన్నాడు. అంతలో శ్రీకృష్ణుడు ఆ రాజులను నివారించి చక్రాయుధం ప్రయోగించాడు. చేదీశ్వరుని తల తెగి కిందపడింది. సభామండపమంతా కోలాహలంతో నిండిపోయింది. శిశుపాలుని అనుచరులైన రాజులు ప్రాణాలు గుప్పిట పెట్టుకొని పరుగులు తీశారు.

## భవాభవ కారణం

రాజేంద్రా! శిశుపాలుని శిరసు తెగినంతనే అతని శరీరం నుంచి అపూర్వమైన ఒక తేజస్సు బయలుదేరి గగనతలం నుంచి నేలకూలిన కొరవి చందాన వెలుగొందుతూ కృష్ణునిలోనికి ప్రవేశించింది. శిశుపాలుడు హరిమయత్వాన్ని పొందాడు.

రాజేంద్రా! యావజ్జీవం పాపకర్మలనే చేసిన శిశుపాలుడు అంతంలో పరమసిద్ధులకు అతీతమైన కైవల్యపదాన్ని పొందటానికి కారణమేమిటో ఆలోచించావా? శిశుపాల దంతవక్త్రులు పూర్వం విష్ణుపార్షదులు. బ్రాహ్మణశాపవశాన వారు మొదటి జన్మలో హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా, రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగా, మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగా ఉద్భవించారు. ఈ మూడవ జన్మలో వారికి శాపావసానకాలం. మూడు జన్మలలో వారు భగవన్నిందాపరులై బ్రతికారు. అయినప్పటికీ తుది జన్మలో వారికి భగవన్మయత్వం కలిగింది. భగవన్నిందాపరులకు కూడా అంతపుణ్యం కలుగుతుందా? అని సందేహింపకు. దేనిని సదా భావించితే జీవులు ఆ ధ్యేయాకారాన్ని పొందుతారు. ఆ భావన నయమో నయగారమో మిత్రత్వమో వైరమో ఏదయినా కావచ్చు. భ్రమరకీటన్యాయం తెలియదా? కాబట్టి భావమే భవాభవ కారణమని పెద్దలన్నారు.

**"మ. మధుదైత్యాంతకు మీది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా**
**వధి యే ప్రొద్దుఁ దదీయరూపగుణ దివ్యధ్యాన పారీణ ధీ**
**నిధి యౌటన్ శిశుపాలభూవిభుఁడు దా నిర్ధూత సర్వాఘుఁడై**
**విధి రుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె, నుర్వీశ్వరా!**

**చ. జనవర బంధమోక్షణము చైద్యవధంబును పాండురాజనం**
**దన మఖరక్షణంబును నుదారతఁ జేసినయట్టి దేవకీ**
**తనయు చరిత్ర భాసుర కథా పఠనాత్ములు గాంతు రిష్ట శో**
**భన బహుపుత్ర కీర్తులును భవ్యవివేకము విష్ణులోకమున్."**

## అవభృథస్నానం

రాజేంద్రా! ధర్మరాజు ఆ విధంగా మహావైభవంతో రాజసూయ యాగం ముగించి, దేవర్షి పితృ గంధర్వాదుల సన్మానాలను అందుకొని వివిధాలంకార సమలంకృతులైన రాజులు వెంట రాగా, ఋత్విక్సదస్యాది ధరామరుల తోనూ సుహృజ్జనం తోనూ నానామంగళవాద్యపురస్సరంగా శ్రీకృష్ణుడు ముందు నడవగా, పత్నీయుతుడై అవభృథ స్నానార్థం గంగానదికి బయలుదేరాడు. పరమపావనమైన ఆ స్నానం చేయాలనే కోరిక తోనూ ఆ మహావిభవాన్ని చూడాలనే కుతూహలంతోనూ పౌరులు జానపదులు లక్షల కొద్దీ అతని వెంటనడిచారు. వారకాంతలు కాముకులతో నదీనీరాల లోనికి దూకి ఒకరితో ఒకరు జల్లులాడుతూ ప్రియులు పూసిన హరిద్రాకుంకుమగంధాలు ఘుగఘుగ వాసనలు వీచి తరుణపురుషుల దృష్టులు తమమీదనే నిలిచి ఉండటం చూసి మరింతగా హొయలు ప్రదర్శింపసాగారు. రాజభార్యలూ పల్లకీలెక్కి భటరక్షితలై ఆ నదికి పోయి అక్కడ మేనమామ కొడుకులతో చెలులతో బావమరదులతో కూడి జలకాలాడి, తడిసి గాలికి చలించిన పయ్యెదల సందున స్తనమధ్యభాగాలు కానవస్తుండగా, ముడి వదులై సిగలనుండి పూదండలు నీటజారుతుండగా విహారాలు చేశారు. కామబంధుర చిత్తులకు వారి విహారాలు విలాసకరంగా కనిపించాయి.

ధర్మనందనుడు ఆ విధంగా సామ్రాజ్యలక్ష్మితో గంగాతీరం చేరుకొని రథం దిగాడు. ఋత్విజులు పత్నీసంయాజ అవభృథస్నానాంగకార్యాలు నెరవేర్చి, యజమానునికి ద్రౌపదితో ఆ పుణ్యవాహినిలో అవభృథస్నానం చేయించారు. దేవదుందుభులు మర్త్యదుందుభులు కలిసి మ్రోగాయి. సకలవర్ణాలవారు ఆ అవభృథపుణ్యస్నానం చేశారు. దేవర్షులు పితృదేవతలు అమర్త్యులు పుష్పవృష్టి కురిపించారు.

అంత ధర్మనందనుడు నూతన వస్త్రాలంకృతుడై ఋత్విజులకు సదస్యులైనవిప్రులకు బంధువులకు జ్ఞాతులకు రాజన్యులకు సుహృదాదులకు యథోచితంగా వస్త్రాభరణాది సత్కారాలు చేసి శ్రీభగవానుని పూజించాడు. పురుషులు నవదుకూలాలు కట్టుకొని కంచుకాలను తొడిగి మణికుండల మాలికాదులను ధరించి ఉష్ణీషాలు ధరించి ఉల్లసిల్లారు. స్త్రీలు వివిధ వర్ణాంబరాలు కట్టుకొని రత్నతాటంకాలు కూర్చి పాపటలు తీర్చి సువర్ణభూషలతో దేవతాంగనలను మరపింపజేశారు.

స్నానాదులు ముగిసిన తర్వాత ఆ యాగార్థం వచ్చిన ఋత్విజులు సదస్యులు బ్రహ్మవాదులైన బ్రాహ్మణులు దేవర్షి పితృ భూతపతులు రాజులు లోకపాలకులు ధర్మరాజును వీడ్కొని తమతమ స్థానాలకు బయలుదేరారు.

శ్రీకృష్ణుడు కూడా ద్వారకకు ప్రయాణమయ్యాడు. పాండవులు ఆయనకు అడ్డుపడి మరీ మరీ ప్రార్థించారు. దేవకీనందనుడు వారి ప్రీతికి గాను తన ప్రయాణం ఆపుకొని ప్రద్యుమ్న సాంబాదు లందరినీ పంపివేసి ఇంద్రప్రస్థపురంలో కొన్ని నెలలు గడిపాడు.

## దుర్యోధనుని విద్వేషం

రాజేంద్రా! పాండవుల పేరు వింటేనే దుర్యోధనునికి చిన్ననాటినుంచి అసూయ అన్నమాట నీవు వినే ఉంటావు. ధర్మజుని రాజసూయయాగ వైభవం మాట విని ధార్తరాష్ట్రుడికి కన్నుకుట్టింది. ఒకనాడతను

మయబ్రహ్మనిర్మితసభావిభవం చూడాలని వేడుకపడి ఆ మందిరానికి వెళ్ళాడు. ఆ సభాభవనం దేవేంద్ర దైత్యేంద్ర నరేంద్ర వివిధవిభవసమృద్ధమై శోభిల్లుతున్నది. శుద్ధాంతకాంతాపరిచారికలు వివిధాభరణభూషితలై దివ్యాంగనల వలె భాసిల్లుతున్నారు. ధర్మనందనుడు తమ్ములతో బాంధవులతో కొలువుతీరి ఉత్తమాసనం అలంకరించి వందిజనప్రస్తుతులను అందుకొంటూ దేవేంద్రవిభవంతో అలరారుతున్నాడు. శ్రీకృష్ణుడు కూడా ఆ సభ నలంకరించి ఉన్నాడు.

రాజేంద్రా! ఆ సభాభవనం మయుని నిర్మాణవిద్యకు పతాకాగ్రాయమై సొబగారుతూ స్ఫటికాది వివిధదీప్తులు స్థలభాగాన్ని జలభాగంగా జలభాగాన్ని స్థలభాగంగా తోపజేస్తుండటం వలన వాస్తవస్థితి ఇదని తెలియక భ్రాంతి పొంది ఎందరో పడి తలకిందులయ్యారు. ఆనాడు దుర్యోధనుడు సాలంకృతుడై వచ్చి ఆ సభలో నడుస్తూ స్థలభాగాన్ని జలప్రదేశంగా భావించి వస్త్రాన్ని ఎగగట్టి నాలుగడుగులు వేసి తన భ్రాంతికి సిగ్గుపడుతూనే ఎదుటనున్న జలప్రదేశాన్ని స్థలప్రదేశంగా భావించి పైకి కట్టిన వస్త్రాన్ని జారవిడిచి రెండడుగులు ముందుకు నడిచి ఆ నీళ్లల్లో జారిపడ్డాడు. అతని కట్టుబట్ట తడిసింది. అసలే సిగ్గుతో తత్తరపడుతున్న అతనిని చూసి భీముడు, రాజులు పకపక నవ్వారు. దుర్యోధనుడు పుండుమీద కారం చల్లినట్లు అవమానభారంతో మరీ క్రుంగి తలవంచుకొని వెలవెలబోయిన మొహంతో అక్కడి నుంచి హస్తినకు వెళ్ళిపోయాడు. ఇదంతా భగవానుడు చూస్తూ, రానున్న దానికిది మూలమని తెలిసి మౌనంగా ఉండిపోయాడు.

## సాళ్వుని తపస్సు

నృపాగ్రణీ! రుక్మిణీ పరిణయవేళ శిశుపాలుని మిత్రుడు సాళ్వుడు కృష్ణునిచే పరాజితుడై రణభూమి నుంచి పారిపోయాడని చెప్పాను. అదిమొదలుగా అతను యాదవులపై పగబూని 'యాదవకులమంతటినీ నిర్మూలిస్తాను గాక' అని తోటిరాజుల ముందు ప్రతిజ్ఞ చేసి ఆ మాట

నెరవేర్చుకొనటానికి శివునిగూర్చి తపోవ్రతుడై ప్రతిదినం పిడికెడు మన్నుతిని దేహయాత్ర జరుపుతూ మహోగ్రతపం ఆచరించాడు. గౌరీపతి అతని తపస్సుకు మెచ్చి వచ్చి ఏమికావాలో కోరుకోమన్నాడు. సాళ్వుడు శివుడికి మొక్కి, 'దేవా! దేవదానవనరగంధర్వోరగాదులకు భేదింపరానిది, కామగమనం కలిగినది అయిన విమానం ఒకటి అనుగ్రహించు' అని కోరాడు. గిరీశ్వరుడు అత్యల్పసంతోషి గనుక సరేనని విశ్వకర్మను ఆజ్ఞాపించాడు. విశ్వకర్మ గౌరీపతి ఆజ్ఞను తలదాల్చి అయోమయమూ తమోనిలయమూ దురాధర్షమూ అయిన సౌభకమనే విమానం, కామగమనం కలదానిని, నిర్మించి సాళ్వునికి అందజేశాడు.

## ద్వారకపై దండయాత్ర

సాళ్వుడా విమానం ఎక్కి చతురంగ బలాలను సమకూర్చుకొని కృష్ణుడు లేని సమయం కనిపెట్టి ద్వారకానగరాన్ని ముట్టడించాడు. అతని సేనలు ఊరిలోనికి జొరబడి ఉద్యానవనాలను రూపుమాపి గోపురాలను నేలకూల్చి ప్రాసాదాట్టాలకాదులను పడద్రోసి పురమంతటినీ చెరిచి చిందరవందర చేసి విమానం నుంచి శిలావృక్షాలను శస్త్రశర్కరాపాంసుజాలాలను పెనుగాలితోపాటు కురిపించారు. పూర్వం త్రిపురాసురమర్దన వేళ ధాత్రీతలం అల్లాడినట్లు ద్వారకానగర మంతా సంక్షోభించింది. జనులు హాహాకారాలు చేశారు.

## శత్రుసేనల యుద్ధం

ప్రద్యుమ్నుడు వారికి అభయం పలికి సాత్యకి చారుధేష్ణుడు సాంబుడు అక్రూరుడు కృతవర్మ భానువిందుడు గదుడు శుకుడు సారణుడు మొదలైన తోబుట్టువులను తదితరులను వెంటబెట్టుకొని చతురంగబలాలతో యుద్ధానికి సిద్ధపడ్డాడు. సాళ్వసైన్యానికీ యాదవసైన్యానికీ దేవదానవయుద్ధం జరిగింది. సూర్యుడు రేచీకటిని పారద్రోలినట్లు ప్రద్యుమ్నుడు సాళ్వుని మాయలన్నింటినీ నిమిషమాత్రాన అడగించి నిశితబాణాలు సంధించి ఇరవైఅయిదింటితో

సాళ్వుని ప్రధాన సేనాపతిని, పదింట తక్కిన సేనాపతులను, మూడింట వాహనాలను నొప్పించాడు. ప్రద్యుమ్నుని శరవిద్యానైపుణ్యాన్ని ఇరుపక్షాలవారు శ్లాఘించారు.

## సాళ్వుని మాయలు

సాళ్వుడు తన మాయావిభవాన్ని చూపసాగాడు. సౌరభవిమానం ఉన్నట్లుండి ఒక దిక్కున పెక్కు విమానాలుగా కనబడుతుంది; ఒకవైపు ఒక్కటిగా మాత్రమే కనబడుతుంది; అంతలో అదృశ్యమవుతుంది; మళ్ళీ తటాలున ప్రత్యక్షమవుతుంది; ఒకసారి భూమిమీద వ్రాలినట్లు; అంతలో గగనభాగానికి ఎగిరినట్లు పొడగట్టుతుంది. ఒకసారి పర్వతాగ్రాన దృశ్యమవుతుంది; దానిని చూస్తుండగానే నీటిలో కానవస్తుంది. అంతలో గిరగిర తిరుగుతున్న కొరివిలా భగభగ మండుతూ మీదికి వస్తుంది.

## ద్యుమంత ప్రద్యుమ్నుల యుద్ధం

యదువీరులు ఆ విమానగతులను కనిపెట్టి దానిపైకి సూర్యాగ్ని ప్రభావిభాసురాలైన క్రూరనారాచాలను ప్రయోగించారు. సాళ్వుని సేనకూడా విజృంభించింది. ఉభయసేనలు తెగించి జయించితే ఇహలోకభోగం, చనిపోతే స్వర్గలోకసుఖం యుద్ధవీరులకు కలుగుతాయనే మాటను ప్రమాణంగా పెట్టుకొని చావుబ్రతుకులను లెక్కచేయక ఘోరంగా పోరాడారు. సాళ్వుని మంత్రి ద్యుమంతు డనేవాడు ప్రద్యుమ్నుని ఎదుర్కొని అతని చేతి గదను పడగొట్టి పెనుకేక వేశాడు. ఆ గద తాకిడికి రొమ్ము అదిరి ప్రద్యుమ్నుడు మూర్ఛపోయాడు. దారకుని సుతుడైన సారథి రథికుని పాటు చూసి రథాన్ని తొలగించాడు.

ప్రద్యుమ్నుడు కొంతసేపటికి తెప్పరిల్లి రణక్షోణికి రథం దూరంగా ఉన్న సంగతి గ్రహించి, “సారథీ! రణరంగం నుంచి నన్ను తప్పించటమన్నది సరికాదు. నీవిప్పుడు చేసినపని నాకు తీరని కళంకాన్ని తెచ్చిపెట్టింది. నేను

తప్ప యదుకులంలో పుట్టినవారెవరైనా ఈ విధంగా యుద్ధభూమి నుంచి తొలగటమన్నది నీవెప్పుడైనా విన్నావా? 'ప్రద్యుమ్నా! రణభూమినుంచి పారిపోయావట?' అని నా తండ్రులు రామకృష్ణు లడిగినప్పుడు ఏమి చెప్పమంటావు? ఈ సంగతి నా తమ్ముల భార్యలువిని 'ఏమిటీ? ఏమిటీ?' అని ఏమని గుసగుస లాడతారో ఊహించావా? ఇది వీరపురుషధర్మమా?" అని గద్దించాడు. సారథి ఆ వచనాలు విని, 'శూరాగ్రణీ! సారథి తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి. రథికునికి ముప్పురానున్న తరుణం గుర్తించి రథాన్ని తప్పించటం సారథికి పరమధర్మం. గద వేటు తగిలి నీవు మూర్ఛిల్లావు. అటువంటివేళ నా విధిని నేను నిర్వహింపక తప్పుతుందా?' అన్నాడు.

అంతట ప్రద్యుమ్నుడు కొంత నెమ్మది వహించి కవచం తొడిగి శరాసనం చేతబట్టి, 'సారథీ! మన రథాన్ని కదిలించి ద్యుమంతుని కట్టెదుట నిలుపు' అన్నాడు. సారథి రథాన్ని రణక్షోణికి మళ్ళించాడు. ప్రద్యుమ్నుడు ద్యుమంతుని ఎనిమిది బాణాలతో నొప్పించి అతని రథాశ్వాలు నాల్గింటిని నాలుగు శరాలతో పడగొట్టి సారథిని ఒక్క బాణంతో చంపి, ఒక్కదానితో కేతనాన్ని పడద్రోసి మరొకదానితో వైరి చేతి విల్లును తునిమి ఇంకొక బాణం ప్రయోగించి అతని తల తెగవేశాడు. గదుడు సాత్యకి సాంబుడు తదితర యాదవవీరు లందరూ చెలరేగి బాణవర్షం కురిపించారు. ఆ బాణహతులకు సాళ్వుని సేనలు తలలు తెగి సముద్రంలో పడ్డాయి.

## ద్వారకకు శ్రీకృష్ణుని రాక

అదే రోజు శ్రీకృష్ణుడు పాండవులకు వీడ్కోలు పలికి ద్వారకామార్గంలో ప్రయాణిస్తున్నాడు. దారిలో అతనికి దుర్నిమిత్తాలు ఎక్కువయ్యాయి. కృష్ణుడు ఆ దుర్నిమిత్తాలను చూసి, 'ఏమిటిది? నేను లేని సమయం చూసి చైద్యుని మిత్రులు ద్వారక మీదికి దండెత్తారో ఏమిటో?' అని లోలోన తలపోసి హుటాహుటిని ప్రయాణం సాగించాడు. సాళ్వ యాదవ యుద్ధచిహ్నాలు

వారికి దూరంనుంచే కనుపించాయి. ఆ లక్షణాలను చూసి కృష్ణుడు 'సారథీ! పదపద; కంగారుపడకు. మన రథాన్ని సాళ్వుని యెదుట నిలుపు' అని ఆదేశించాడు. సారథి వాయువేగంతో రథాన్ని ముందుకు దూకించాడు. గరుడకేతనంతో వస్తున్న ఆ రథాన్ని చూసి వాసుదేవుడు వస్తున్నాడని ఉభయసైన్యాలలో అలజడి కలిగింది.

## శ్రీకృష్ణ సాళ్వుల యుద్ధం

రాజేంద్రా! శ్రీకృష్ణుడు కంటబడినంతనే సాళ్వుని బలైశ్వర్యాలు సన్నగిల్లాయి. అతను తెంపుచేసి కృష్ణుణ్ణి ఎదుర్కొని అతని సారథిపై మహోగ్రశక్తిని ప్రయోగించాడు. ఆకాశం నుంచి మండుతున్న కొరివి మీదికి వస్తున్నట్లు ఆ శక్తి వచ్చి దారుకునిపై పడబోయింది. కృష్ణుడు శరపరంపరలు గుప్పించి ఆ ఘోరసాధనాన్ని మార్గమధ్యాననే నూరుముక్కలు చేసి పదహారు బాణాలతో సాళ్వుని నొప్పించి అతని విమానాన్ని భల్లపంజరంతో కప్పివేశాడు. ఆ విమానం మేఘావృతమైన సూర్యబింబం వంటిదయింది. సాళ్వుడు మహాగ్రహమూర్తియై తీవ్రసాయకాలను ప్రయోగించి కృష్ణుని వామహస్తాన్ని బాధించాడు. శౌరిచేతిలోని విల్లు క్రిందకు జారింది. అది చూసి ఖేచరులు హాహాకారాలు చేశారు.

రాజేంద్రా! కృష్ణుని చేతి విల్లు క్రిందికి జారటం తనకు జయలక్షణమని సాళ్వుడు భావించి దేవకీసుతుని చూసి, 'మందమతీ! నా మిత్రునికి గాను నిశ్చితమైన కన్యను మా యెదుటనే అపహరించి నా మిత్రుని చంపావు. నీ కండ కావరం తీరుస్తాను. పునరాగమనం లేని చోటికి పంపివేస్తాను. మగతనం ఉంటే నా యెదుట నిలువు' అని కారుకూతలు ప్రేలాడు. శ్రీకృష్ణుడు అతని మాట విని 'శూరులు తమ పౌరుషాన్ని కార్యాల మూలంగా నిరూపిస్తారు. అధికప్రసంగాలు మందమతులు లక్షణం. వృథా వాదాలెందుకు?' అని గదతో అతని మూపుల మధ్య మోదాడు. ఆ వేటుకు సాళ్వుడు నెత్తురు కక్కి అదృశ్యమైపోయాడు.

## సాళ్వుని మాయలు

రాజేంద్రా! ఆ సమయంలో ఒక పురుషుడు కృష్ణుని వద్దకు వచ్చి నమస్కరించి, 'కృష్ణా! కృష్ణా! పితృవత్సలా! నీ తల్లి దేవకీదేవి పంపగా వచ్చాను. కటికవాడు పశువును బంధించినట్లు సాళ్వుడు నీ తండ్రిని బంధించి తీసుకొనిపోయాడు' అని పలికి వలవల ఏడ్చాడని; ఆ కఠోరవార్త చెవిసోకగానే సర్వసమచిత్తుడైన కృష్ణునంతటి వాడు ప్రాకృతుని వలె డీలుపడి, 'అయ్యో! సురాసురులకు అజేయుడైన బలరాముని సైతం గెలిచి ఈ అల్పుడు సాళ్వుడు నా తండ్రిని చెరపట్టాడా? విధి బలం ఎంత దురవ్యయమైనది!' అని చింతాక్రాంతుడయ్యాడని; అంతలో సౌభకపతి ఎదుటికి వచ్చి వసుదేవుని పోలిన ఒక మనుష్యాకృతిని చూపి, 'కృష్ణా! వీడే నీ తండ్రి; నీ కన్నుల ఎదుటనే ఇతని తల తెగనరుకుతున్నాను. పరాక్రమశాలివైతే కాపాడుకో; లేకపోతే బ్రతికి ఉండటం దేనికోసం?' అని కత్తిదూసి అతని తలనరికి విమానంలోనికి వెళ్ళాడని, కృష్ణు డంతలో స్వస్థచిత్తుడై 'ఓహో ఇవన్నీ సాళ్వుని అసురమాయలే' అని గ్రహించేసరికి దూత గాని తండ్రి కళేబరం గాని కానరాలేదని, అప్పుడు కృష్ణుడు సౌభకంలో ఉన్న సాళ్వుని చంపివేయాలని నిశ్చయించుకొన్నాడని ఐతిహ్యం ఒకటున్నది.

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుడు సాళ్వుని మాయలకు మోసపోయి ఆ విధంగా చింతాక్రాంతుడై ఉంటాడని భావించటం యుక్తియుక్తమూ సమంజసమూ అయిన మాటకాదు. శ్రీకృష్ణుడు భగవానుడని చెబుతూ, మళ్ళీ అదే నోటితో అతనిని కేవల మనుష్యమాత్రునిగా భావింపజేయటం స్వవచోవ్యాఘాతం అవుతుంది. శోకమోహాలు, స్నేహభయాలు అజ్ఞానసంభవాలు. ఈ అజ్ఞానసంభవా లెక్కడ? అఖండిత విజ్ఞాన జ్ఞానైశ్వర్యమూర్తి అయిన భగవాను డెక్కడ? భ్రాంతులన్నీ దేహాత్మబుద్ధులకు అనువర్తించేవి. ఆ దేహాత్మబుద్ధి అనాదిసిద్ధం. ఆ భ్రాంతి తొలగాలంటే ఆత్మవిద్య ఒక్కటే శరణ్యం. అది భగవత్పాదారవింద భజనచేత గాక మరొక దానిచే లభించేది కాదు. సత్పురుషులు ఈ రహస్యాన్ని గ్రహించి జగదీశ్వరుని

చరణకమలాలను భజించి ఆత్మవిద్యను గ్రహించి భగవన్మయు లవుతారు. భక్తులకు భ్రాంతిని తొలగించే భగవానునికి భ్రాంతిమత్త్వాన్ని అంటగట్టడం అజ్ఞానకార్యం కాకపోతే మరేమిటి? ఈ భాగవత ప్రవచనంలో కొన్ని అసందర్భ వచనాలు అక్కడక్కడ వినిపిస్తుంటాయి. అవి కర్ణపరంపరాప్రాప్త ప్రమాదాలు కావచ్చును. ఐనా నేను విన్నవాటిని విన్నవించి అందులోని యుక్తాయుక్తాలను విమర్శించాను.

## సాళ్వ వధ

సాళ్వునితో శూరులు తమ ప్రతాపాన్ని మాటలచేత గాక చేతలలో చూపించాలని అన్న తర్వాత భగవానుడు గదనందుకొని సౌభకవిమానాన్ని ఒక్క పెట్టుపెట్టాడు. అది ముక్కలు చెక్కలై సముద్రంలో కూలిపోయింది. సాళ్వుడంతట గదాహస్తుడై కృష్ణునిపైకి ఉరికాడు. త్రివిక్రముడు విక్రమించి చక్రాన్ని చేతగొని సాళ్వుని శిరస్సు నరికాడు. దేవదుందుభులు మ్రోగాయి.

## దంతవక్త్రుని వధ

నృపాలా! శిశుపాల సాళ్వ పౌండ్రరాజుల దుర్గతిని చూసి వారి మిత్రుడు కరూశపతి దంతవక్త్రుడు క్రోధమూర్తియై కవచం తొడిగి గదను చేతబట్టి కృష్ణుడు నేటితో కృతాంతనికేతనానికి పోవటం తప్పదని హుంకారాలు చేస్తూ తానొక్కడే అక్కడికి వచ్చాడు. కృష్ణుడు రథం దిగి తాను కూడా గదాహస్తుడై అతనిని ఎదుర్కొన్నాడు. దంతవక్త్రుడు వాసుదేవుని చూచి, 'కృష్ణా! మేనమామ కొడుకువని ఇన్నాళ్ళూ నిన్ను సహించాను. మిత్రద్రోహివి నీకు బ్రతికే అర్హతలేదు. ఇదిగో నా గదాదండాన నీ ప్రాణాలు హరించి నా మిత్రుల ఋణాన్ని తీర్చుకొనబోతున్నాను. దేహాన పుట్టిన రోగం దేహానికే హానికరంగా పరిణమించినట్లు మా కులంలో పుట్టిన నీవు ఆ కులానికే చేటుతెచ్చి పెట్టావని నిన్ను చంపక తప్పటం లేదు. బంధురూపశత్రువును క్షమింపకూడదు' అంటూ ప్రల్లదాలు పలికి గదయెత్తి యాదవేశ్వరుని తలను మోదాడు. కృష్ణుడు ఆ గదాప్రహారాన్ని లెక్కచేయక తన చేతనున్న కౌమోదకితో

దంతవక్త్రుని వక్షోమధ్యాన్ని పగలగొట్టాడు. ఆ దెబ్బకు వాడు నెత్తురులు కక్కి సిగ జారవిడిచి కాళ్ళుచేతులు తేలవేసి ప్రాణాలు పోయి నేలకు వ్రాలాడు. శిశుపాలుని శరీరం నుంచి వచ్చినట్లే అతని శరీరంనుంచి ఒక జ్యోతి వెలువడి హరిలో అంతర్లీనమైపోయింది.

## విదూరథ సంహారం

దంతవక్త్రునికి పట్టిన గతిని అతని తమ్ముడు విదూరథుడు చూసి కృష్ణుని చంపుతానంటూ మీదికి వచ్చాడు. భగవానుడు చక్రాయుధంతో అతని శిరస్సును ఖండించాడు.

## శ్రీకృష్ణుని ద్వారకాప్రవేశం

రాజేంద్రా! భగవానుడు ఆ విధంగా సాళ్వ దంతవక్త్ర విదూరథులను సంహరించి వారి సైన్యాన్ని రూపుమాపి పురవాసులకు సంతోషం కలిగించి సురమునిప్రముఖుల స్తుతులందుకొని ద్వారకాపురంలో అడుగుపెట్టాడు.

భగవానుడు నిత్యజయుడు. అతనికి జయపరాజయాలన్న ప్రసక్తి లేదు. జనులు తమ తమ గుణదోషాలను భగవంతుని యందు ఆరోపించి భగవత్కృత్యాలను తమకు గల పరిమితదృష్టితో పరిశీలించి తమకు తోచిన భావాలను వెల్లడిచేస్తుంటారు. విజ్ఞులు యుక్తాయుక్తాలను వివేకించి సత్యాన్ని గ్రహించాలి.

## బలరాముని తీర్థయాత్ర

పరీక్షిన్నరేంద్రా! కౌరవపాండవులకు రానురాను విద్వేషాగ్ని రగుల్కొని నానాటికీ పెరిగి ప్రజ్వలింపసాగింది. ఉభయులు యుద్ధోద్యోగులై బలాలను సమీకరించటం మొదలుపెట్టారు. ఆ సంగతి దేశమంతటా తెలిసి రాజులు తమతమ పక్షాలను నిర్ణయించుకొని యుద్ధానికి సిద్ధం కాసాగారు. బలరాముడది విని ఏ పక్షానికీ సాయపడటం ఇష్టంలేక మధ్యస్థభావం వహించి

ద్వారకలో ఉండటం సాధ్యం కాదని గ్రహించి తీర్థయాత్ర నెపంతో బయలుదేరి ప్రభాసక్షేత్రానికి వెళ్ళి అక్కడ పుణ్యస్నానం చేసి దేవర్షి పితృ మానవతర్పణలు కావించి కొందరు బ్రాహ్మణులను వెంటబెట్టుకొని ప్రతిలోమవాహిని అయిన సరస్వతీ నదీతీరం వెంబడిని ప్రయాణిస్తూ పైకి నడిచి మధూదకం బిందుసరస్సు తృణకూలం సుదర్శనం విశాలం బ్రహ్మతీర్థం చక్రతీర్థాలను సేవించి ఆ నది పూర్వముఖియై ప్రవహించే చోటును చేరుకొని అక్కడ స్నానంచేసి అక్కడినుంచి కదిలి గంగాయమునానదులలో ఉన్న పుణ్యతీర్థాలన్నింటిలో స్నానాలు ముగించుకొని నైమిశారణ్యం చేరాడు.

## రోమహర్షణ సూతహత్య

అక్కడ పరమమునులు దీర్ఘసత్త్ర యాగదీక్షితులై విశ్రాంతి సమయంలో పురాణకాలక్షేపం చేస్తున్నారు. బలరాముడు రాగానే వారందరూ లేచి నమస్కరించి అతనిని ఉత్తమాసనం మీద కూర్చుండబెట్టి యథోచితరీతిని పూజించారు.

ఆ సభామధ్యంలో వ్యాసమహర్షి శిష్యుడు రోమహర్షణుడనే సూతుడున్నాడు. అతను కూర్చొని ఉన్నవాడు బలరాముడు వచ్చినా లేచి నిలబడి నమస్కారం చేయక చూసీచూడనట్లు ఊరుకొన్నాడు. బలరాము డదిచూసి 'మహాత్ములారా! మీరందరూ బ్రాహ్మణులై ఉండి ధర్మపరిపాలనార్థం నన్ను చూచినంతనే లేచి నిలబడ్డారు. ఇతను మిమ్మల్ని చూసి తెలివితెచ్చుకొన్నా బాగుండేది. బాదరాయణమహర్షికి శిష్యుడై ఇతిహాసాలు ధర్మశాస్త్రాలు పురాణాలు ఎన్ని నేర్చినా ఇతనికి శాంతివినయాది సద్గుణాలు లేశమాత్రమైనా అలవడినట్లు లేదు. ప్రతిలోము లన్నాక జాతితత్త్వం ఒక పట్టున మారదుకదా. నటులకు వలెనే పండితమ్మన్యులకు తాము నేర్చిన విద్యవల్ల ఎటువంటి సంస్కారమూ కలగదు. ధర్మధ్వజులైన కపటనాయకులను తెగటార్చడానికే నేను అవతరించాను. యాత్రార్థినై ఉన్నందువల్ల దుష్టసంహారం చేయకూడదనుకొన్నాను. ఇప్పుడితని మూలాన ధర్మమర్యాదను

కాపాడటం కోసం ఆ వ్రతాన్ని మానక తప్పటం లేదు' అంటూ చేతిలోని కుశాగ్రంతో సూతుని తలను తెగ నరికాడు.

## బలరామునికి ప్రాయశ్చిత్తవిధి

మునులందరూ హాహాకారాలు చేసి, 'అయ్యా! పురాణం వినిపిస్తుంటే మేమితనిచుట్టూ చేరి భగవద్విషయాలు తెలుసుకొంటున్నాము. ఇతను కూర్చున్నది బ్రహ్మాసనం; పరమపవిత్రమైన సుస్థలం. పైగా ఇతను సూతు డైనప్పటికీ విలోమజుడు కాడు. సూతులు జాతిసూతులని, వృత్తిసూతులని రెండు తెగలు. వృత్తిసూతు లందరూ ఉత్తమవర్ణులే. అటువంటి ఉత్తముల వధ బ్రాహ్మణవధతో సమానం. ఇతను వృత్తిసూతుడు. మా సత్త్రయాగం జరుగుతున్నంత కాలం ఇతనికి శరీరపాటవం గాని ఆయువు గాని తరగరాదని నిశ్చయించాము. ఇతని వధ బ్రహ్మవధతో సమానం. నీవు యోగేశ్వరుడవు. వేదాలు నీ నిఃశ్వసితాలు. నీ వలన పుట్టిన వేదాలు నిన్ను నియమింపలేవు. అయితే ఆ వేదాలు, ధర్మాలు నీవు నిర్మించినవే కాబట్టి వాటిని నీవే త్రోసిపుచ్చితే లోకం అగతిక మవుతుంది. శ్రేష్ఠుడు ఆచరించినదానినే ఇతరులు అనుసరిస్తారు కదా!' అని విన్నవించారు. శ్రీకృష్ణాగ్రజుడు వారి పలుకులను విని, 'మునులారా! నాకు బ్రహ్మహత్యాదోషం ఆపాదితవ్యం కాకపోయినా లోకానుగ్రహార్థం బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తం చేసుకొంటాను. ఏమి చేయమంటారో చెప్పండి. ఇతనికి దీర్ఘాయురారోగ్యబలాలు, ఇంద్రియపటుత్వం కావాలంటారా? యోగమాయాప్రభావంతో వాటిని సాధించి ఇస్తాను' అన్నాడు. ఋషులామాట విని, 'మహాత్మా! నీ అస్త్రమాహాత్మ్యం వమ్ము కాకూడదు; ఇతనికి మృత్యువు కారాదు; మాకెటువంటి వైకల్యమూ కలుగకూడదు. అందుకు తగినట్లు నీవేమిచేసినా మాకు సమ్మతమే' అన్నారు. బలదేవుడు వారి కోరిక విని, 'మునివర్యులారా! 'ఆత్మా వై పుత్త్రకనామాసి' అని శ్రుతి పలుకుతున్నది. కనుక ఇతని పుత్త్రుడు ఆయుష్మంతుడు,

సకలేంద్రియబలవంతుడు అయి మీకోసం పురాణప్రవచనం కావిస్తాడు. మీరడిగిన మూడు కోరికలూ నెరవేరినట్లవుతుంది. ఇంకా ఏదైనా చేయదలిస్తే చెప్పండి. తెలియక చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం విధించండి' అన్నాడు. ఋషులు వారిలో వారు సంప్రదించుకొని, 'రామా! ఇల్వలుని పుత్రుడు పల్వలుడనే దానవుడున్నాడు. అతను ప్రతిపర్వాన ఇక్కడికి వచ్చి చీము నెత్తురు మలమూత్రాలు కల్లు మాంసం వర్షించి మా సత్రశాలలను పాడుచేస్తున్నాడు. అతను పోతే గాని మాకు మేలు జరగదు. అతనిని సంహరించి భారతవర్షమంతా ప్రదక్షిణం కావిస్తూ కామక్రోధాలను త్యజించి తీర్థస్నానాలు చేస్తూ సాంతపనాదులైన వ్రతాలను పాటిస్తూ పన్నెండు నెలలు గడిపితే పాపవిముక్తి కలుగుతుంది' అని చెప్పారు.

## పల్వల సంహారం

రాజేంద్రా! బలరాముడు నైమిశంలో ఉండగానే పర్వదినం వచ్చింది. దానితో ప్రచండ వాతోద్ధూతాలుగా ధూళిపటలాలు లేచి యాగశాలలను కప్పివేశాయి. వెనువెంటనే అమేధ్యవృష్టి కురిసింది. ఆ వృష్టితో కాటుకకొండ వంటి నల్లటి వ్యక్తి ఒకడు రక్తశిరోజాలతో ఎఱ్రటి మీసాలతో నిడుదకోరలతో భయంకరాకృతిని దాల్చి ఆ యజ్ఞశాలలో సాక్షాత్కరించాడు. అదిగో అదిగో పల్వలుడని ఋషులు కేకలువేశారు. బలరాము డతనిని చూడగానే హల ముసలాయుధాలను స్మరించాడు. స్మరించిన వెంటనే అవి చేతులలోనికి వచ్చాయి. పల్వలుడు గగనాని కెగిరి బలరాముని ఢీకొనాలని సంకల్పించాడు. అతనికి ఆ అవకాశం లభించే లోగానే యాదవవీరుడు నాగలితో అతనిని లాగి తలపై ముసలంతో ఒక్క వేటు వేశాడు. ఆ వేటుకు తలపగిలి నెత్తురులు కక్కి భయంకరంగా అరిచి అతను నేలకూలాడు. నైమిశవాసులు మహానందాన్ని పొంది బలరాముని ఆశీర్వదించి వృత్రసంహారానికి దేవతలు మహేంద్రుని అభిషేకించినట్లు అతనికి మహాభిషేకం కావించి వైజయంతి అనే మాలికను, దివ్యాంబరాభరణాలను సమర్పించారు.

## భూప్రదక్షిణ

బలరాముడు దానవసంహారానంతరం మునులను వీడ్కొని కౌశికనదికి వెళ్ళి అందులో స్నానం చేసి సరయూనది ఆవిర్భవించిన సరోవరానికి వెళ్ళి అక్కడ తీర్థవిధు లాచరించి ఆ ప్రవాహతీరం వెంబడిని ప్రయాగకు వచ్చి అక్కడ స్నానం చేసి దేవర్షి పితృదేవతలకు తర్పణాలిచ్చి పులహుని ఆశ్రమాన్ని సందర్శించి అక్కడినుంచి బయలుదేరి క్రమంగా గోమతి, గండకి, విపాశ, శోణనదాలలో నిమజ్జనలు చేసి గయకు ప్రయాణించి తన తండ్రి చెప్పిన ప్రకారం పితృదేవతలకు తర్పణాలు వదిలి గంగాసాగరసంగమం సేవించి మహేంద్రగిరి చేరి అక్కడ భార్గవరామునికి ప్రణమిల్లి సప్తగోదావరీ ప్రవాహాలలోను వేణీపంపాభీమరథుల లోను జలకమాడి కార్తికేయుని సందర్శించి అక్కడినుంచి శ్రీశైలానికి వచ్చి శివుని సేవించి అటునుండి ద్రవిడదేశానికి మళ్ళి పరమపవిత్ర వేంకటాచలేశ్వరుని ఆరాధించి శివకంచి విష్ణుకంచీక్షేత్రాలను సందర్శించి కావేరీనదిలో తీర్థమాడి శ్రీరంగం ఋషభాద్రి దక్షిణ మధురలను సేవించి సేతువుకు వెళ్ళి అక్కడి బ్రాహ్మణులకు దశసహస్ర గోవులను దానంచేసి కృతమాల లోను తామ్రపర్ణిలోను కృతస్నాతుడై మలయాద్రికి వెళ్ళి అగస్త్యుని పూజించి అతని అనుజ్ఞ గైకొని కన్యాకుమారి చేరి అక్కడ వెలసి విలసిల్లుతున్న దుర్గాదేవిని పూజించి ఇంకా ముందుకు సాగి అనంతశయనునికి మ్రొక్కి శ్రీవిష్ణునివాసమైన పంచప్రసర సరోవరంలో స్నానమాడి కేరళ త్రిగర్తక దేశాలు దాటి గోకర్ణక్షేత్రంలో శంకరభగవానుని చేరి ప్రార్థనలు చేసి ద్వీపవాసిని యైన పార్వతీదేవి నర్చించి శూర్పారకం చేరుకొని తాపీపయోష్ణీనిర్వంధ్యానదులలో మునిగి దండకారణ్య మార్గాన మాహిష్మతీపురానికి సాగి అక్కడ నర్మదను సేవించి మనుతీర్థంలో నీరాడి ప్రభాసక్షేత్రాన్ని చేరుకొన్నాడు.

## కురుక్షేత్రం

బలరాముడు ప్రభాసక్షేత్రంలో అడుగుపెట్టిన వార్త తెలియగానే బ్రాహ్మణులు వచ్చి కౌరవపాండవులకు హోరాహోరి పోరు జరిగిందని,

సర్వరాజన్యక్షయం అయిన తర్వాత భీమదుర్యోధనులకు గదాయుద్ధం జరుగబోతున్నదని అతనికి చెప్పారు. బలరాముడు ఆ వార్తవిని సర్వరాజలోకం అంతరించి భూభారం తగ్గినందుకు సంతోషించి, భీమదుర్యోధనుల యుద్ధాన్ని ఆపదలిచి కురుక్షేత్రానికి వెళ్ళాడు.

## ధర్మోపదేశం

రాజేంద్రా! బలరాముడు కురుక్షేత్రం చేరిన వెంటనే ధర్మరాజు, కృష్ణార్జునులు అతనికి ప్రణమిల్లి అర్ఘ్యసత్కారాలు కావించి అతని నోటిమాట కోసం వేచి ఉండి చేతులు జోడించి నిలబడ్డారు. బలరాముడు భీమదుర్యోధనుల యుద్ధరంగాన్ని సమీపించి అక్కడ పరస్పర జయాభిలాషులై అమితసంరంభాన మండలగతులలో పరిభ్రమిస్తూ గదాయుద్ధం చేస్తున్న ఆ ఇద్దరినీ చూసి, 'దుర్యోధనా! భీమా! మీలో ఒకరికి బలం, ఒకరికి విద్యాకౌశలం ఎక్కువ కనుక మీరిద్దరూ సమానబలులు. మీకు జయాపజయాలు ఏర్పడవు. ఈ వృథాయుద్ధం మానండి' అని ప్రబోధించాడు. అయితే చిన్ననాటి నుంచి బలపడుతూ వచ్చిన వైరానలం ఉపశమించే చివరి తరుణం చేతికంది పరస్పరం అపకారభావంతో బద్ధమత్సరులై ఉన్న భీమదుర్యోధనులు బలరాముని పలుకులు లెక్కచేయక పోరాటాన్ని కొనసాగించారు. బలరాముడు వారి మతాన్ని గ్రహించి దైవప్రాప్తవిధిని తప్పించటం ఎవరి శక్యమూ కాదని గుర్తించి ఉదాసీనుడై ద్వారకకు తిరిగివెళ్ళి అక్కడనుంచి మళ్ళీ నైమిశారణ్యం చేరుకొన్నాడు.

## బలరాముని ద్వారకాప్రవేశం

నైమిశంలో మునీంద్రులు బలరాముని ఆదరించి అతనితో అనేకక్రతువులను చేయించారు. బలరాముడు వారికి ఆత్మవిద్యను ఉపదేశించి రేవతీసమేతంగా అవభృథస్నానం ఆచరించి చంద్రికతోడి చంద్రుని వలె వెలుగొందుతూ ద్వారకకు మరలివచ్చి బంధు జ్ఞాతి సుహృద్వర్గాన్ని కలుసుకొని ఎప్పటివలె సుఖంగా ఉన్నాడు.

రాజవరేణ్యా! అనంతుడు అప్రమేయుడు మాయామానవుడు అనంత బలశాలి అయిన బలదేవుని అద్భుతకర్మలను నానాడు స్మరించినవారు శ్రీమహావిష్ణుప్రీతిపాత్రులై విరాజిల్లగలరు సుమా!

## భగవన్మహిమాకర్ణనం

శౌనకాదిమహర్షులారా! శుకయోగీంద్రుడు శ్రీ బలరామావతార ప్రశంసను చేయగా పరీక్షిన్నరేంద్రుడు ఆలకించి, 'ఓ యోగిచంద్రమా! భగవానుని మహిమలతో నిండిన చరిత్రలను ఎంతవిన్నా తనివితీరదు. మనుష్యులకు హస్తపాదాద్యవయవాలు జంతువులకు వలెనే ఉన్నాయి. అవి వాటి ధర్మాలను చేసుకొని పోతుంటాయి. ఈ విషయంలో మానవులకు, పశువులకు భేదం లేదు. ఉన్నదల్లా ఒక్కటే. ఆ అవయవాలను సద్వినియోగం చేసే శక్తి. అది నరుల కొక్కరికే ఉన్నది. వాక్కు చేత భగవంతుని అనంతగుణాలను కీర్తించటం, హస్తాల చేత భగవత్పరిచర్యలు చేయగలగటం, మనస్సుతో ఆ పరమపూరుషుని ధ్యానించటం, చెవులతో అతని పుణ్యకథలను ఆకర్ణించటం, శిరస్సుతో భగవల్లింగాలైన స్థావర జంగమాలకు మ్రొక్కటం, కన్నులతో అతని మూర్తులను అవలోకించటం, అంగాలతో భాగవతుల పాదోదకాన్ని సేవించటం, ఈ కృతులు అవయవ సద్వినియోగానికి నిదర్శనలు. ఆ విధంగా ఆచరిస్తేనే జన్మసాఫల్యం కలుగుతుంది. భగవద్దత్తాలైన అవయవాలను భగవదర్థం వినియోగింపనివారి కంటె కృతఘ్నులు, పాపాత్ములు వేరొకరుండరు. అల్పమైన నా జీవితశేషం భగవత్పరమై ఆ భగవత్సేవలో గడిచిపోవాలని నా ఆశయం. ఆ ప్రకారం భగవన్మహిమలను వినిపించి నన్ను చరితార్థుని చేయండి' అని ప్రార్థించాడు.

శుకమహర్షి అతని భక్తిభావానికి ప్రీతుడై అతనికి భగవన్మహిమలను బోధించాడు:

## కుచేలోపాఖ్యానం

రాజేంద్రా! కృష్ణునికి బాల్యసఖుడు సుదాముడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆ విప్రోత్తముడు ఇంద్రియార్థాలయెడ విరక్తిచెంది జితేంద్రియుడై తన్మూలాన చిత్త ప్రశాంతిని సాధించి దొరికినదానితో తృప్తిపడుతూ గృహాశ్రమధర్మం నడుపుతుండేవాడు. ఆ బ్రహ్మవిదునికి ప్రారబ్ధపుణ్యవశాన గుణవతి, పతివ్రతాచరణమతి అయిన భార్య లభించింది.

ఆ దంపతులు పుట్టుదరిద్రులైన దానికి తోడుగా బహుసంతాన వంతులయ్యారు. దారిద్ర్యదోషం వలన అతనెన్నడూ జీర్ణమై మాసిన చింపిగుడ్డ తప్ప వేరొకంటికి గతిలేక జీవింపవలసి వచ్చింది. ఒంటిగుడ్డనే చిరుగులు దాచి మాసికలు వేసి కట్టుకొంటూ ఉండటం వలన అతనికి కుచేలుడని పేరు వచ్చింది.

## అర్థకామన

ఒకనాడు కుచేలుని భార్య అతని చెంతజేరి, 'మనకు కుటుంబభారం నానాటికి దుర్భర మవుతున్నది. కట్టుబట్టలేక తినటానికి తిండిలేక బిడ్డలు అల్లాడుతున్నారు. వారి బాధను చూడలేకుండా ఉన్నాము. మీరు బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యులని పేరు. సాక్షాల్లక్ష్మీపతికి బాల్యసఖులై ఆయనతో కలిసి చదువుకొన్నారు. ఆ యాదవేంద్రుడు కామితార్థకల్పతరువు బ్రాహ్మణవత్సలుడని, శరణాగతరక్షకుడని లోకం వేయినోళ్ళ ప్రశంసిస్తున్నది. సాధుజనాశ్రయుడైన ఆ మహానుభావుని సందర్శింపరాదా? మన దారిద్ర్యక్లేశాలన్నీ ఆయన కడకంటిచూపుతో తొలగిపోతాయి. తన పాదపద్మాలను స్మరించిన వారికి తనను తానే అర్పించుకొనే మహాభాగుడు ఆ ప్రభువును సందర్శించి నోరుతెరిచి అడిగితే ఫలించని అర్థకామాలు వేరే ఉంటాయా? మిత్ర దర్శనం, భగవత్పాదసేవ, ఇష్టార్థపూర్తి ఏకకాలంలో సంభవింపగలవు. మనకోసం కాకపోతే పిల్లల కోసమైనా ఏదో మార్గం ఆలోచించాలి కదా?' అని బహువిధాల భర్తను ప్రార్థించింది.

## కుచేలుని నిర్ణయం

కుచేలుడు భార్యాప్రణయాన్ని విని, 'ఓహో! భగవద్దర్శన మహాపుణ్యానికి నా పత్నీప్రణయం నిమిత్తమయింది. ఇంతకంటె ఏమికావాలి!' అని లోలోపల సంతోషించి, 'కళ్యాణీ! నీ వడిగినట్లే చేస్తాను. పెద్దలను దర్శించేటపుడు వట్టి చేతులతో పోకూడదు. ఏదో ఒక ఉపాయనం వారికి అర్పించాలి. మన యింటిలో ఇవ్వటానికి ఏమున్నదో చూసి కట్టి యివ్వు' అని ఆదేశించాడు.

కుచేలపత్ని ఆ మాటవిని ఇంటిలో ఆ పూటకు తినటానికే ఏమీ లేవని భర్తతో మళ్ళీ అనలేక ఇరుగు పొరుగు విప్రుల భార్యలను ఆశ్రయించి నాలుగు పిడికిళ్ళ అటుకులు పోగుచేసితెచ్చి మూట గట్టటానికి ఇంటిలో గుడ్డపేలిక కూడా లేనందున చిరిగి వ్రేలాడుతున్న పతి వస్త్రం కొంగుకే దానిని ముడివేసింది. పేదబ్రాహ్మణుడు పాపం ఆ మూటను పదిలంగా పట్టుకొని ప్రయాణమై మెల్లమెల్లగా కొన్నాళ్ళకు ద్వారకకు చేరాడు.

## శ్రీకృష్ణ దర్శనం

రాజేంద్రా! అతను ద్వారకను చేరి తన దుస్తులను చూసుకొని, 'అయ్యో! ఈ చింకిగుడ్డలతో దుమ్ముకొట్టుకొని ఉన్న నన్ను లోపలికి రానిస్తారా? పోనీ బ్రతిమిలాడి లోపలికి వెళ్ళినా కృష్ణుడు ఈ దరిద్రుడిని రమ్మంటాడా? ఇదేమిటి నీ స్నేహితుడని అతని భార్యలు అతనిని చూసి పరిహసింపరా?' అని లోలోపలే కుమిలిపోతూ పురాభిముఖంగా ఉన్న రాజమార్గం దాటి మూడు కక్ష్యాంతరాలు దాటి అంధక వృష్ణివీరుల దుర్గమందిరాల నడుమబడి షోడశసహస్రకాంతా సౌధాలను అతిక్రమించి, శ్రీమంతమైన ఒక నిశాంతం కనిపిస్తే అటునడిచి గుమ్మందాటి లోపలికి అడుగుపెట్టాడు.

శ్రీకృష్ణభగవానుడు దూరంనుంచే కుచేలుని గుర్తించాడు. దిగ్గున పాన్పుమీదినుంచి లేచి పెద్ద అంగలతో ఎదురు వచ్చి చేతులు జాచి భుజాల చుట్టూ వేసి గట్టిగా కౌగిటజేర్చుకొని బుగ్గలు నిమిరి ఆనందబాష్పాలు

జారుతుండగా ఆ పేదబ్రాహ్మణుడి కన్నులు తుడిచి చేతులు పట్టుకొని నెమ్మదిగా నడిపిస్తూ లోనికి తీసికొనివెళ్ళి తన పాన్పుమీద కూర్చుండబెట్టి స్వయంగా పూజాద్రవ్యాలను తెచ్చి పాదాలు కడిగి లోకపావనమైన ఆ విప్రపాదతీర్థాన్ని తలపై చల్లుకొని దివ్యచందనం అద్ది పుష్పమాల లర్పించి ధూపదీపాలిచ్చి తాంబూలాన్ని, గోవును నివేదించి, 'మిత్రవర్యా! స్వాగతమే కదా' అని అడిగాడు.

## రుక్మిణీదేవి పరిచర్యలు

రాజేంద్రా! శరీరమంతా శుష్కించి కేవలం నరాల పోగు వలె ఉన్న ఆ నిరుపేదవాడిని, గోచిపాతరాయడిని శ్రీకృష్ణునంతటివాడు అంతటి భక్తి ప్రీతులతో అర్చించటం రుక్మిణీదేవి చూసి ఆశ్చర్యచకితురాలైనా పతివ్రతామణి కాబట్టి భర్త హృదయాన్ని గ్రహించి తానూ చామరాన్ని చేతబట్టి వీస్తూ ఆ విప్రునికి ఉపచారాలు చేయసాగింది. ఆ విధంగా శ్రీకృష్ణుడు, రుక్మిణీదేవి కూటికి గతిలేని ఆ బ్రాహ్మణునికి వినయవిధేయప్రీతిపూర్వకంగా సేవలు చేస్తుంటే అంతఃపురస్త్రీలు చూసి, 'ఏమిటీ వింత! ఈ బ్రాహ్మణుడు చూడటానికే రోతగొలుపుతున్నాడు. అట్టివాడు కంటబడినంతనే త్రైలోక్యగురుడైన శ్రీనివాసుడు పాన్పున తనతో ఉండిన రమామూర్తిని రుక్మిణీదేవిని పట్టపురాణిని వదిలిపెట్టి దిగ్గున లేచి వడివడిగా నడిచి ఈ బిచ్చగాడిని కడుపున పుట్టినవాని వలె కౌగిలించుకొని ఆదరించి తానే నడిపించి తెచ్చి పాన్పుమీద కూర్చుండబెట్టి భార్యాసహితంగా సకలోపచారాలు చేస్తున్నాడు. లోకులు దరిద్రులను దగ్గరకే రానీయరే, ఈ రిక్తుడు ఏ మహాపుణ్యం చేసినవాడో?' అని ఆశ్చర్యపడసాగారు.

## బాల్యలీలానుమోదం

అంతలో శ్రీకృష్ణుడు కుచేలుని పూజ ముగించి, అతని చెంత కూర్చుండి అతని చేతులను చేతుల లోనికి తీసుకొని, 'బ్రాహ్మణోత్తమా! గురుకులవాసం సమాప్తమైన తర్వాత గురుదక్షిణ సమర్పించి సమావర్తన కావించాము. నీవు

ఇంటికి వెళ్ళిన తర్వాత ధర్మజ్ఞురాలైన పత్నిని గ్రహించావా? మనము గురుకులవాసం చేసిన రోజులలో నీ మనస్సు కామపరం కావటం గాని, నీయందు గృహధనాశా లక్షణాలుండటం గాని ఎన్నడూ కనుపించలేదు. కామం లేనివారు పెండ్లిచేసుకొని గృహక్లేశాల పాలు కారు కదా? అని అడుగుతావేమో! కామవశులు కాకపోయినా కొందరు గృహాశ్రమధర్మాన్ని స్వీకరించి కర్మలను ఆచరిస్తారు. అట్టివారి కర్మాచరణం లోకసంగ్రహార్థమే గాని ఆత్మభోగార్థం కాదు. అందుకు నేనే నిదర్శనం. మిత్రమా! సంసారాన్ని నిస్తరించాలంటే పరమాత్మ తత్త్వజ్ఞానాన్ని సంపాదించాలి. అటువంటి జ్ఞానం గురుకులవాసాన తప్ప వేరొక తీరున లభించదు. పురుషులకు తండ్రులు ముగ్గురంటారు. వారిలో మొదటివాడు జనన కారకుడు; ఉపనయనాదిపూర్వకంగా వేదవిద్యను ఉపదేశించినవాడు రెండవవాడు; బ్రహ్మజ్ఞానం ఉపదేశించినవాడు మూడవ తండ్రి అవుతాడు. ఈ ముగ్గురిలో మొదటివాని కంటె రెండవవాడు, అతని కంటె మూడవవాడు ఉత్తములు. మూడవవాడు నాకు ప్రతిరూపమే. వర్ణాశ్రమధర్మపరులలో గురూపదేశాన్ని త్రికరణశుద్ధిగా అనుష్ఠించేవారు అవలీలగా భవాబ్ధిని దాటగలరు. అట్టి వారు మాత్రమే ఇహపరార్థాల తత్త్వాన్ని గ్రహించిన వారవుతారు. గురువులందరికీ నేను లోకగురువును. లోకగురుని కంటె సేవ్య డింకొకడు లేడు. లోకగురుత్వం నా యందు ఏ విధంగా సిద్ధించినదంటావా? జగదాత్ముడనై సర్వజనుల హృదయాంతరాలలో సాక్షిమాత్రుడనై నివసిల్లుతూ వారివారిని తత్తత్కర్మలకు ప్రేరేపిస్తుంటాను. అందువలన లోకైకగురువు నవుతాను. నన్ను సంతోషింపజేయటానికి కొందరు యజ్ఞ అధ్యయనరూప కర్మలను ఆచరిస్తుంటారు. నేను గురుసేవకు తృప్తిపడినట్లు అన్యవిధులకు తృప్తిపడను. గురుసేవ అంటే ఏమిటని అడుగుతావేమో? నేను చెప్పిన మాట జవదాటక నడుచుకొనటమే గురుసేవ అని నా మనోగతం.

మిత్రమా! మనము గురుకులవాసం చేసే రోజులలో ఒకనాడు గురుపత్ని ఇంధనాలు తెమ్మని మనను పంపించటం, మనము ఘోరారణ్యానికి పోయి

ఇంధనాలను సేకరిస్తుండగా తటాలున మేఘాలు క్రమ్ముకొని కారుచీకట్లు చుట్టుముట్టి కన్నుపొడిచినా కనబడని అంధకారంలో ఉరుములు మెరుపులతో గాలివాన కుంభించటం, అంతలో పొద్దుగుంకటం, ఆ గాఢాంధకారంలో మిట్టపల్లాలు కనబడక మనము ఒకరి చేతినొకరు ఆధారం చేసుకొని కొంతసేపు కొట్టుమిట్టుకులాడి ఆ అరణ్యంలోనే అడుగులో అడుగు వేస్తూ ఆకలిదప్పికలు మరచి రాత్రంతా గడపటం, మనము గురుకులానికి చేరలేదని దిగులుపడుతూ మన గురువు సాందీపని తెల్లవారుజామున అడవికి వెతుకుతూ వచ్చి ఒకచోట మనను చూసి, 'నాయనలారా! ప్రాణులకు దేహం ప్రియాతిప్రియమైనది. అట్టి దేహాన్ని సైతం మీరు నా యందలి అభిమానంతో లెక్కచేయక పడరానిపాట్లు పడ్డారు. గురువుకు సర్వార్థాలనే కాదు; దేహాన్ని సయితం విశుద్ధభావనతో సమర్పించటమే ఉత్తమ గురుదక్షిణ. మీ భక్తికి మెచ్చాను; మీరు నేర్చిన వేదాలు ఇహపరాలలో మీకు మేలుచేస్తాయి. మీ మనోరథాలు నిండారగలవు' అని మనను ఆశీర్వదించటం, గుర్తున్నాయా? మన గురుకులవాసంలో ఎన్నో ఇటువంటి ఘటనలు జరిగాయి. వాటన్నింటినీ తలచుకొంటావా? గుర్వనుగ్రహం వలన పురుషుడు పూర్ణుడౌతాడు. అట్టి పూర్ణపురుషుడే నా కత్యంత ప్రీతిపాత్రుడు' అంటూ పలకరించాడు.

కుచేలుడు ఆ మాటలలోని ప్రసన్నతకు ముగ్ధుడై, 'జగద్గురువుతో గురుకులవాసానికి నోచుకొన్నాను. నాకింకా ఏమి కావాలి? వేదమయమూర్తీ! నీ గురుకులవాసం కేవల విడంబనమే కాని మత్పూర్వపుణ్యఫలరూపమై నన్ను ధన్యధన్యుని కావించింది' అని మాత్రం అనగలిగాడు.

## అటుకుల ఆరగింపు

రాజేంద్రా! వారలా సంభాషణాసక్తులై ఉండగా కుచేలుని చేలాంచలం కృష్ణుని కంటబడింది. కృష్ణు డదిచూసి, 'విప్రోత్తమా! నాకోసం ఏదో ఉపహారం తెచ్చావు కదూ? భక్తులు అణుమాత్రం అర్పించినా అది

నిండుప్రేమతో అర్పింపబడినది కాబట్టి నాకు కొండంతగా అనిపిస్తుంది. భక్తిలేని అర్పణ మేరువైనా నాకు ప్రీతిగూర్పదు. పత్రమో పుష్పమో ఫలమో చివరికి గరిటెడు నీరో భక్తితో దేనినిస్తే దానినే మహాప్రీతితో అందుకొంటాను. భక్తే ప్రధానం; పదార్థగురుత్వం ప్రధానం కాదు' అని ఉత్సుకతతో అన్నాడు. కుచేలు డా మాటలు విని 'జగదీశ్వరు డెక్కడ? నేను తెచ్చిన అటుకులెక్కడ? ఇవి శ్రీపతికి ఏమని సమర్పించను?' అని సిగ్గుపడి తలవంచి నోటమాటాడక ఊరుకొన్నాడు. భగవాను డతని మనోభావం గ్రహించి, 'ఈ బ్రాహ్మణుడు పతివ్రతయైన పత్ని బలవంతపెట్టగా సంపదర్థియై ఇక్కడికి వచ్చాడు. ఇతనికి దేవదుర్లభశ్రీల నిస్తాను' అని నిశ్చయించి, అతని కొంగున నున్న మూటవిప్పి అందులో అటుకులుండటం చూసి, 'ఓహో మిత్రమా! ఇంతకంటె నాకేమి కావాలి? నాకిష్టమైన అటుకులే తెచ్చావు' అంటూ పిడికెడు తీసుకొని ఉదరతృప్తిగా భుజించి మరొక పిడికెడు అందుకొనబోయాడు. రుక్మిణీదేవి అదిచూసి భర్త చేయిపట్టుకొని 'విశ్వాత్మా! మీరారగించిన పిడికెడు అటుకులతో ఈ మహాపుణ్యునికి ఇహపరాలు రెండింట సర్వసంపత్సమృద్ధి చేకూరింది; మీ సంకల్పం నెరవేరింది' అని అడ్డువచ్చింది.

## స్వగృహానికి ప్రయాణం

ఆ విధంగా సత్కృతుడై కుచేలుడు భగవానుని మందిరంలో స్నానపానభోజనాది సుఖాలను యథాప్రీతిగా అనుభవించి స్వర్గలోకంలో ఉన్నవాని కంటె అధికభోగాలతో ఆనాటి రాత్రి గడిపి తెల్లవారుజామున లేచి దినకృత్యాలు తీర్చి తన గృహానికి బయలుదేరి ప్రయాణానికి సిద్ధమయ్యాడు. భగవానుడు వినయమధుర వచనాలతో బాల్యమిత్రుని మరీ మరీ అభినందించి, కొంతదూరం అతని వెంటనడిచి అతనిని సాగనంపాడు.

## శ్రీకృష్ణస్తోత్రం

రాజేంద్రా! కుచేలుడు భార్యాప్రేరితుడై ధనార్థం భగవానుని సందర్శించీ, నోరుతెరిచి అడగటానికి సిగ్గుపడి అడగలేకపోయాడు. భగవాను డతనికి

ధనరూప సత్కారం చేయలేదు కదా! కుచేలుడు రిక్తహస్తాలతో ఇంటికి తిరిగివెళ్తూ, 'కృష్ణా! నీవు బ్రహ్మణ్యదేవుడ వన్నమాట స్వానుభవంలో తెలిసివచ్చిందయ్యా. శ్రీవక్షోభాగుడవైన జగన్నాయకుడవు నీవు నిరుపేదను నన్ను మనసారా కౌగిలించుకొని దగ్గరకు తీసుకొన్నావు. దరిద్రుడనైన నేనెక్కడ? లక్ష్మీనివాసుడ వైన నీవెక్కడ? విప్రుకులజుడ నని నన్ను కౌగిట చేర్చి గౌరవించి ప్రియురాలి పాన్పుపయి కూర్చుండబెట్టినది చాలక పట్టపుదేవి చేత చామరం పట్టించి నీవై నా పాదాలొత్తి వివిధపరిచర్యలు కావించి దేవుడిని అర్చించినట్లు నన్ను ఆదరించావు. కృష్ణా! నీ పాదారవిందాలను నమ్ముకొన్నవారికి ముల్లోకాలలోని విభవైశ్వర్యాలు కలగటమే గాక స్వర్గాపవర్గాలు కూడా సమకూడుతాయి. అట్టి నిన్ను ధనార్థినై నేను సందర్శించాను. కాసయినా నీవు నా చేతబెట్టలేదు. దరిద్రుడికి ధనం అబ్బితే మదం ఉబ్బి మైమరుపు కలుగుతుందని భావించావు కాబోలు' అనుకొంటూ వడివడిగా నడక సాగించి తన ఊరు చేరుకొన్నాడు.

## కుచేలుని దృగ్భ్రాంతి

రాజేంద్రా! ద్వారకనుంచి బయలుదేరినది మొదలు శ్రీకృష్ణసఖుడు కుచేలుడు శ్రీకృష్ణాయితచిత్తుడై తన ఊరి గవను చేరి తలయెత్తి చూశాడు. అతని కుటీరం ఎక్కడున్నదో, ఎటుచూసినా అతనికి కానరాలేదు. పూర్వం తన ఇల్లున్న చోట సూర్యానలేందుసంకాశ మహోత్తుంగ విమానాలతో నానావిహగ కలకలనాద సంకులోపవనాలతో సముత్ఫుల్ల కుముదాంభోజకల్హారోత్పల పూర్ణసరోవరంతో సొబగారుతున్న దివ్యమందిరం ఒకటున్నది. ఆ మందిరాంతరాన స్త్రీలు పురుషులు విచిత్రవేషభూషణాలు ధరించి వారి వారి పనులలో నిమగ్నమై ఉన్నారు.

ఆ మందిరాన్ని చూసి కుచేలుడు నిశ్చేష్టుడై, 'ఏమీ! దారితప్పి ఇటు రాలేదుగదా?' అని నలుదెసలు పరికించి, 'దారి తప్పలేదు. పరిసర గృహాలను బట్టి నేను వచ్చినది నా యింటి తావులకే అని తెలుస్తున్నది. ఈ

దివ్యమందిరం నా ఇల్లు కాదు. నా యింటిపట్టున ఇదెప్పుడు లేచింది? నా వాళ్ళంతా ఏమయ్యారు?' అని కలవరపడుతూ దిగ్భ్రమతో అక్కడ నిలబడ్డాడు.

అంతలో ఆ మందిరాంతరం నుంచి దేవతలో అన్నట్లున్న పురుషులు స్త్రీలు కొందరు గీతవాద్యాలతో ఎదురేగి కుచేలుని ఆ విచిత్రమందిరం లోనికి తీసుకొనివెళ్ళారు. అతని భార్య అపరలక్ష్మీదేవి వలె సర్వాభరణభూషితయై అతనిని సమీపించి ప్రేమరసం కందోయిని అరమోడ్పు కావింపగా వచ్చి నమస్కరించి మనసారా ఆలింగనం చేసుకొన్నది. కుచేలుడు తెల్లబోయి ఆశ్చర్యపరవశుడై కొంత సేపుండి నెమ్మదిగా తేరుకొని భార్యతో ఇంటిలోనికి నడిచి సువర్ణఖచిత దంతపర్యంకాలతో, పాలమీగడ వలె స్వచ్ఛములై కాంతులీనుతున్న మేలిపాన్పులతో కాంచనదండచామరాలతో హేమపీఠాలతో ముక్తాదామాలతో మరకతరత్నరచిత సాలభంజికలతో స్ఫటిక కుడ్యాలంకృత నానామణిదీపాలతో మిరుమిట్లు గొలుపుతున్న ఆ మందిరసౌభాగ్యాన్ని చూసి, 'నిత్యదరిద్రుడనైన నాకీ సర్వసమృద్ధులు ఇంతలో ఎలా సమకూడాయి? ఇదంతా భగవత్సందర్శనఫలం కాకపోతే మరేమిటి? పర్జన్యుడు ప్రార్థింపకపోయినా తరుణం వచ్చినప్పుడు మరుభూములలో కూడా వర్షిస్తాడు. భగవానుడూ అంతే. నోరుతెరిచి అడగకపోయినా పేదల కొరత తీరుస్తాడు. భక్తులిచ్చినది పట్టెడే అయినా పుట్టెడుగా భావిస్తానని భగవానుడు నాతో అన్న మాటకు ఇదే నిదానం. మహానుభావా! నీ భక్తవాత్సల్యాన్నీ, నీ నిష్కారణదయాపరత్వాన్నీ ఏమని శ్లాఘింపగలను? స్వామీ! ప్రతి జన్మమందు నీయెడ ప్రీతి, నీయెడ మైత్రీహితచింతన కలిగి నీకు దాస్యం చేసుకొంటూ నీ భక్తుల సహవాస సంపద కలిగి ఉండునట్లుగా నన్ను అనుగ్రహించు.

దేవా! సర్వసంపదలు ఇచ్చానే? ఇంకా ఏమిటి నీ ప్రార్థన? అంటావేమో. రాజైశ్వర్యాదులు మదాన్ని పెంచి మనోవిభ్రాంతిని కలుగజేస్తాయి. నేనా అవివేకుడను. ఈ సంపదలు నా కన్నుగప్పి నీ అనుగ్రహానికి నన్ను దూరం చేస్తాయేమో అని భయమవుతున్నది. అందువల్లనే నీ చరణారవిందభక్తిని

ఇంతగా ప్రార్థిస్తున్నాను' అని లోలోపల పునఃపునః నమస్కారాలు అర్పించి ఆ సంపదలకు బలిగాక యథోచితంగా జీవితం నడుపుతూ సుఖస్థితినుండి ఎట్టకేలకు భగవత్పదాన్ని చేరుకొన్నాడు.

రాజేంద్రా! భగవానుడు అన్యులకు అజితుడైనా భక్తులకు జితుడై వారికి ఉపకరిస్తాడు. ఆ మహాత్ముడు జగదీశ్వరుడై ఉండి బ్రాహ్మణులు తనకు ఈశ్వరులని భావిస్తాడు. భగవంతుని బ్రాహ్మణవాత్సల్యాన్ని ప్రతిపాదించే ఈ ఉపాఖ్యానాన్ని విన్నవారికి భక్తి చేకూరి సర్వ కర్మ బంధాల నుంచి విముక్తి కలుగుతుంది.

## శ్రీకృష్ణాదుల గ్రహణస్నానాలు

రాజేంద్రా! ఒకనాడు సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చింది. ఆ పుణ్యకాలాన భరతవాసులందరూ స్నానదానాదులను కావించటం విధిగా జరుగుతున్నది. అందుకు కురుక్షేత్రం ఉత్తమస్థానంగా భావింపబడుతున్నది. పూర్వం అక్కడ పరశురాముడు క్షత్రియరుధిరంతో అయిదు మడుగులను నిర్మించాడు. ఆ చోటికి స్యమంత పంచకం అని పేరు.

యాదవులు వసుదేవుడు అక్రూరాదులు కురుక్షేత్రానికి ప్రయాణమయ్యారు. రామకృష్ణులు భార్యలతో గదప్రద్యుమ్నసాంబాదులతో అక్కడికి వెళ్ళాలని సంకల్పించి, అనిరుద్ధుని ద్వారకాపుర పాలనకు నిలిపి; అతనికి తోడుగా సేనాపతియైన కృతవర్మను, శుకసారణులను నగరరక్షణకు నియమించి చతురంగబలసమేతంగా బయలుదేరారు.

ఆ విధంగా వారందరూ కొంత కాలానికి కురుక్షేత్రం చేరుకొని పుణ్యకాలంలో స్నానాలు చేసి ఉపవసించి విప్రులకు వస్త్రమాల్య కనకాలంకృత గోవులను దానమిచ్చి ఆరామసరస్సులలో మళ్ళీ తీర్థస్నానాలు చేసి భోజనాలు ముగించుకొని చల్లని చెట్లనీడలో కూర్చొన్నారు.

## కుంతీదేవి రాక

ఆ రోజు పుణ్యతీర్థస్నానార్థం ఉశీనర కోసల విదర్భ కురు సృంజయ కాంభోజ మద్ర కుంతి కేకయారట్టకేరళ మత్స్యదేశాధిపతులు, యాదవపక్షం వారు, నందాదిగోపకులు, గోపికలు తదితర రాజులు అక్కడికి వచ్చారు. ద్వారకావాసులైన యాదవులు, నందాది గోపకులు, గోపికలు బహుకాల పరస్పరసందర్శనానంద వివశులై పురుషులను పురుషులు, స్త్రీలను స్త్రీలు కౌగిలించుకొని కుశలప్రశ్న లడిగి పెద్దలకు నతులు, పిన్నలకు దీవెనలు అందించి శ్రీకృష్ణచరితలను చెప్పుకొంటూ సంతోషసాగరంలో ఓలలాడారు.

ఆ సమయాన కుంతీదేవి తన భ్రాతలైన వసుదేవాదులను, వారి పత్నులను చెలియండ్రను వారి బిడ్డలను చూసి బహుకాల వియోగక్లేశం అపనయింపగా వసుదేవుని వంక మరలి, 'అన్నా! లోకోత్తరులని మిమ్ము నమ్ముకొని ఉన్నదానను. ఆపత్కాలాలలో కూడా మా మాట మీ మనస్సులకు రాదని నాకు తెలుసు. అందుకు మీపై నాకు కోపంలేదు. దైవం దాయగా ఉన్నప్పుడు తల్లిదండ్రులు కూడా కన్నబిడ్డలనే మరచిపోతారు. అది లోకసహజం' అంటూ పలకరించింది. వసుదేవుడు చెల్లెలి మాట విని, 'అమ్మా! మానవులందరూ దైవం చేతిలోని కీలుబొమ్మలై అతను ఆడించినట్లు ఆడక తప్పదు. మానవులకు స్వాతంత్ర్యం లవలేశమైనా లేదు. మేము కంసుని వలన పడ్డ పాట్లను వినే ఉంటావు. అతని బారికి భయపడి దిక్కులు పట్టాము. ఇప్పుడిప్పుడే స్వస్థత కలుగుతున్నది. నాటి దైవగతి ఆ విధంగా – నేటి దైవగతి ఈ విధంగా ఉన్నది, చూడు!' అని బదులు చెప్పాడు.

అంతలో భీష్ముడు, ద్రోణుడు, గాంధారితో కలిసి ధృతరాష్ట్రుడు, పాండవులు, వారి భార్యలు, సంజయ విదుర కృప కుంతిభోజులు, విరాట భీష్మక నగ్నజిత్పురుజిత్తులు ద్రుపది శైబ్య ధృష్టకేతు కాశిరాజులు, దమఘోష విశాలాక్ష మైథిల మద్ర కేకయ యుధామన్యులు, సుశర్మ, బాహ్లికుడు, అతని కొడుకులు, పాండవానుసారులైన రాజులు శ్రీకృష్ణుని చూడాలని వచ్చారు. రామకృష్ణులు వారిని యథోచితంగా సత్కరించారు. వారు యాదవులను

చూసి, 'మీ జన్మలకు సాఫల్యం కలిగింది. మీ అంత పుణ్యాత్ము లుండరు. ఏమంటారా? ఎవరి దర్శనార్థమై యోగిపుంగవులు సయితం ప్రాకులాడుతుంటారో, ఎవని కీర్తిని వేదాలు వేయి నోళ్ళ ప్రకటిస్తున్నవో, ఎవ్వని పాదశౌచజలం లోకపావనకరమైనవో, ఆ భగవానుని అంటిపెట్టుకొని ఉండటం, అతని దర్శన స్పర్శన గోష్ఠీసల్లాపాలు, అతనితోడి భోజన శయన వివాహ జ్ఞాతిసంబంధాలు మీకు కలగటం మీ పుణ్యాతిశయం. అంతటివాడు మీ యింట ఉదయించాడంటే ఎంత భాగ్యమో ఆలోచించండి. ఇంతకంటె భాగ్యం వేరే ఏమి కావాలి?' అని ప్రశంసించారు.

యాదవులు రామకృష్ణులతో అక్కడికి వచ్చిన సంగతి నందగోపుడు విని సకలసంభారాలూ బండ్ల మీద వేసుకొని వచ్చాడు. నందుని చూచినంతనే యాదవులకు ప్రాణం లేచివచ్చినట్లయింది. వారందరూ లేచి నిలబడి యదునాయకుని బిగికౌగలింతలతో ఆదరించారు. నందుని కనుగొన్నంతనే వసుదేవునికి అతను కంసుని వలన పడిన బాధలు, తన బిడ్డలను నందుని వద్దకు పంపించటం, యశోదానందులు వారిని తమ బిడ్డలుగా పెంచి పెద్దచేయటం మొదలైనవన్నీ స్మరణకు వచ్చాయి. అతను ప్రేమగౌరవాతిశయాలను గాఢపరిష్వంగపూర్వకంగా తెలియజేసి ఆప్యాయనంగా పలకరించాడు. రామకృష్ణులు తల్లిదండ్రులైన యశోదానందులకు నమస్కరించి ప్రేమాశ్రువులు జాలువారగా వారి చెంతజేరి కన్నులతో కుశలానుయోగాలు కురిపించారు. యశోదానందులు ఆ కుమారులను పర్యంకాలకు చేర్చుకొని సందిటగూర్చి శిరసు మూర్కొని చిరకాల వియోగతాపాన్ని అపనయింప జేసుకొన్నారు. రోహిణి, దేవకి యశోదను కౌగలించి ఎంతో ఆదరంతో, 'వ్రజేశ్వరీ! ఎప్పుడూ నీవు మా కన్నులలో మెదులుతూనే ఉంటావు. రామకృష్ణులను కన్నది మేముగాని, తల్లిదండ్రులు మీరే అయ్యారు. మీ అండన పెరిగి వాళ్ళు పెద్ద పెద్దవాళ్ళయ్యారు. కన్నబిడ్డల కన్న ఎక్కువగా కంటికి రెప్పలా కాపాడారు. మీ ఋణం వారికీ, మాకూ ఎన్నటికీ తీర్చరానిది' అని తమ కృతజ్ఞతను వెల్లడించారు.

## గోపికలకు ఆత్మజ్ఞానోపదేశం

అంతలో గోపికలు కృష్ణుని చుట్టుముట్టి అతనియందే దృష్టినిలిపి రెప్పవాల్చు కలిగినప్పుడు బ్రహ్మను నిందిస్తూ హృదయాలతో అతనిని కౌగలించుకొంటూ తదేకచిత్తలై నిలిచారు. కృష్ణుడు కూడా గోపికలను ఎంతో ఆదరించి అనామయం అడిగి, మందహాసపూర్వకంగా ప్రసంగించాడు:

'ప్రియగోపికలారా! స్వజనుల కార్యాన్ని చక్కబెట్టవలసి వచ్చింది. ఆ సందర్భంగా పగలేర్పడ్డాయి. ఆ పనిలో చిక్కి మీ వద్దకు రావాలంటే ఆలస్యమయింది; అంతమాత్రాన మమ్మల్ని మరచిపోలేదు కదా? మాకు కృతజ్ఞతలు కలుగవని కోపాలు రాలేదు కదా? వాయువు మేఘాదులకు వలె భగవానుడు సర్వభూతాలకు సంయోగ వియోగాలను కలిగిస్తుంటాడు. వియోగం వలన ప్రేమ వర్ధిల్లి సంయోగకాలాన ఫలప్రద మవుతుంది. ఈ ప్రేమ ఇంద్రియప్రీతిపరం కాకుండా ఆత్మప్రీతికరం కాగలిగితే, దానిని భక్తి అంటారు. ఆ భక్తి నన్ను పొందటానికి పరమసాధనం. అంతేకాదు. భక్తులకు ఆ భక్తే నిజమైన అమృతం. అట్టి పరాభక్తిని మీరు నా యెడ చూపగలగటం మీ భక్తివిశేషమే తప్ప సామాన్యం కాదు. పంచభూతాల వలన భౌతికపదార్థాలు పుట్టుతూ చివరికి అందులోనే లయిస్తున్నట్లు సర్వభూతాలు నా వలన జన్మిస్తూ నాయందే లీనమౌతుంటాయి. తేనెలో ఉన్న మాధుర్యం వలె నేను సర్వభూత బాహ్యాంభ్యంతరాలలో వ్యాపించి ఉంటాను.

కళ్యాణులారా! ప్రపంచమన్నది చతుర్విధ భూతమయమై ఉంటుంది. ఆ భూతాలకు పంచమహాభూతాలు కారణాలు. అందుమూలాన చతుర్విధభూతాలు తమకు కారణాలైన పంచ మహాభూతాలలో వర్తిల్లుతుంటాయి. భూత భౌతిక రూపమైన ఆ భోగ్యానికి భోక్తగా ఉన్నది ఆత్మవస్తువు. ఈ భోగ్య భోక్తలు రెండూ పూర్ణుడనైన నాలోనే ఉంటాయి. ఆత్మ అనేది భోగ్యవస్తువులలో భోక్తృరూపాన వ్యాపించి ఉంటుందే తప్ప ఆ భోగ్యవస్తువులకు అది కారణం కాదు. ఈ జ్ఞానాన్ని అధ్యాత్మవిద్యాజ్ఞానమని అంటారు' అని ఉపదేశించాడు.

## గోపికల పరమప్రార్థనం

గోపికలు ఆ ఉపదేశాన్ని విని తమ ఆత్మలతో పరమాత్మను సంయోగం కావించి, 'ప్రభూ! యోగీశ్వరులు అగాధబోధులై బంధాలను బాసి జననమరణరూప సంసారం నుంచి కడతేరటానికి నీ పాదారవిందాన్నే తెప్పగా గ్రహించి తరణిల్లుతున్నారు. సంసారమగ్నులమైన మా సంగతి అటువంటిది కాదు. మాకు నీ పాదసేవ తప్ప మరొక గతిలేదు. జ్ఞాన మన్నది నీ తత్త్వాన్ని వివరించి నిన్ను చేరుకొనే మార్గం ఏమిటో తెలియజెప్పుతుంది. మార్గం తెలిసినంత మాత్రాననే లాభంలేదు. ఆ మార్గాన్ని అవలంబించి ముందుకు సాగాలి. ఆ సాగటానికి భక్తి ఒక్కటే పరమసాధనం. ఆ భక్తి నిరంతరం మా మనస్సులను ఎడబాయకుండునట్లు నీవే మమ్మల్ని అనుగ్రహించాలి' అని ప్రార్థించారు.

## నమస్కృతి ఒక్కటే భగవంతునికి సమర్పణీయ వస్తువు

రాజేంద్రా! భగవానుడు గోపికలను అనుగ్రహించి, యుధిష్ఠిరాదులను కుశలం అడిగి సత్కరించాడు. వారు పరమప్రీతులై–

'దేవా! దేహధారు లందరినీ అవిద్య ప్రచ్ఛాదించుకొని ఉంటుంది. ఆ అవిద్య నీ చరణారవింద మకరందాన్ని గ్రోలితే గాని కడతేరదు. ఆ మకరందం కావాలంటే ఒక్కటే మార్గం. మహాత్ములు ఆ మకరందాన్ని గ్రోలి తమ హృదయాంతరాలకు మిక్కుటమైన దానిని ముఖమార్గాన వాగ్ధోరణిని వెలయిస్తారు. ఆ వచోమృతాన్ని నిరంతరాయితంగా త్రాగగలిగిన మా వంటి ధన్యాత్ములకు కుశలం కాకపోతే మరేమిటి?

అవస్థాత్రయమన్నది బుద్ధికల్పన మాత్రమే. ఆ కల్పన ఆత్మప్రకాశం వలన తొలగినప్పుడు స్వరూప జ్ఞానం స్వతస్సిద్ధ మవుతుంది. ఆ నీ స్వరూపము యొక్క వాస్తవస్థితి ఇటువంటిదని చెప్పనలవి కాదు.

ఏమంటే, ఒక వస్తువు దృశ్యవస్తువయితే దానిని చూడటం గాని, చూచినదాని యొక్క స్వరూపం ఇట్టిదని కాని వర్ణించటం సాధ్యమవుతుంది.

నీ స్వరూపం స్థూలమైన ఇంద్రియాలకు గోచరింపదు. బుద్ధీంద్రియం ఒక్కటే దానిని కొంతకు కొంత గ్రహింపగలుగుతుంది. బుద్ధీంద్రియగ్రహణమూ ఆయా ఇంద్రియాల పరిపాకాన్ని బట్టి ఉంటుంది. ఆ పరిపాకం అందులోని భక్తిని బట్టి ఉంటుంది. ఆ భక్తి కలిగినవారిని పరాభక్తు లంటారు. అట్టి పరాభక్తులు వారి బుద్ధిదృష్టితో నిన్ను పరికించి నీవు పరమానందస్వరూపుడవని, అపరిచ్ఛిన్నుడవని అఖండబోధుడవని నిర్ణయించారు. ఆ నిర్ణయించిన మాటలన్నీ పాక్షికాలే గాని సమగ్రమైనవి కావు. ఏమంటావా? నీ సమగ్రజ్ఞానం కలగటమే అత్యంత దుర్లభం. ఒకవేళ అంతటి సమగ్రజ్ఞానం కలిగినా దానిని సమగ్రంగా పేర్కొనటానికి వాక్కు చాలదు. రూపంగాని గుణంగాని తెలియనప్పుడు ఇక స్తుతించటానికి అవకాశం ఏముంటుందని కొంద రనుమానింప వచ్చునేమో? లోకానుగ్రహార్థం నీవు వేదాలను ప్రతిపాదించావు. కాలవశాన వేదోదిత మార్గానికి విప్లవం వాటిల్లుతుంది. ఆ మార్గాన్ని చక్కజేయటానికి నీవు యోగమాయను దాల్చి నేలకు దిగివచ్చి కార్యం నెరవేర్చి యథాస్థానానికి చేరుకొంటావు. నీ అవతారాలలో నీవు కావించిన మహాద్భుతకార్యాలను ఊతగొని నిన్ను కీర్తించి కడతేరటం జరుగుతున్నది. ఇప్పుడు నీవు అట్టి మహాకార్యాన్ని నెరవేర్చటానికే అవతరించావు. నీవు మా కన్నుల ఎదుటనే ఉన్నప్పటికీ నీ తత్త్వం మాకు బోధపడదు. పరమహంసలు మాత్రమే నిన్ను కొంతకు కొంత తెలిసికొనగలరు. నీకు మనసారా నమస్కరించటం కంటె మేము చేయగలిగినదేమీ లేదు. అభివాదనశీలురకు, వృద్ధోపసేవకులకు ఆయుర్విద్యాయశోబలాలు కలుగుతాయని నీవే ఏర్పరించావు. ఇదే నీకు నమస్కరిస్తున్నాము; అనుగ్రహించు' అని ప్రణమిల్లారు.

## ద్రౌపదితో కుశలప్రసంగాలు

రాజేంద్రా! శ్రీకృష్ణునితో అతని భార్యలు రుక్మిణి మొదలైనవారు వచ్చారని చెప్పాను. ద్రౌపది వారందరినీ సత్కరించి, 'శ్రీకృష్ణుడు పరమ మాయామూర్తి. అట్టివాడు మీ అందరినీ ఏ విధంగా వివాహం చేసుకొన్నాడు?' అని అడిగింది.

వారు తమతమ వివాహాలను గురించి క్రమంగా అన్ని విశేషాలను ఆమెకు వినిపించారు. యాదవ కౌరవాంగనలు కృష్ణ కథలు చెప్పుకొంటూ ఆనందార్ణవంలో ఓలలాడారు.

## శ్రీకృష్ణునితో మహామునుల సంభాషణ

ఆ సమయంలో రామకృష్ణులను సందర్శించటానికి వ్యాస నారద చ్యవనాసిత దేవల విశ్వామిత్ర భరద్వాజ గౌతములు, జామదగ్ని భృగు పులస్త్య పులహులు, అత్రి మార్కండేయ బృహస్పతులు, ద్వితత్రితులు ఏకరుడు అంగిరసుడు అగస్త్యుడు యాజ్ఞవల్క్యుడు వామదేవుడు మరికొందరు మహర్షులు వచ్చారు. పాండవులు, తదితరరాజులు ఆ మహామునులకు అభివాదం చేసి అర్చనలు కావించారు. రామకృష్ణులు నమస్కారపూర్వకంగా వారికి స్వాగతం పలికి యథోచితాసనాలపై కూర్చుండబెట్టి అడుగులు కడిగి సకలోపచారాలతో గారవించి ఇలా అన్నారు:

'మునీంద్రులారా! ఇంద్రియపరతంత్రులైన మందభాగులకు మీ దర్శనం అతిదుర్లభమైనది. దేవతలు కూడా మీ సందర్శనార్థం ఉవ్విళ్ళూరుతుంటారు. ఆ మహాభాగ్యం నేడిక్కడ సంప్రాప్తమయింది. మీ జపసాఫల్యానికి నోచుకొన్నాయి. ఆత్మకళ్యాణాన్ని కోరి కొందరు ప్రతిమల యందు దేవతామతిని కలిగి వివిధవ్రతాలను ఆచరిస్తుంటారు. ఆ సేవలు కాలాంతర ఫలకారులు కాగలవేమో కాని సద్యఃఫలకారులు కావు. మీ దర్శనాన్ని పొంది మీ పాదస్పర్శ పొంది మిమ్మల్ని సేవించేవారు జీవన్ముక్తు లవుతారు. మట్టితోను రాతితోను కర్రతోను చేసిన విగ్రహాలు దేవతలు కారు. జలపూర్ణులైన నద్యాదులు తీర్థాలు కావు. వాటియందు ఆరోపించే దేవతాబుద్ధి మాత్రమే ఫలాన్నిస్తున్నది. అయినా ఆ ఫలం పారమార్థికం కావటమన్నది మాత్రం అసాధ్యం.

కొందరు సూర్యచంద్ర తారకాగ్నులను, భూనభోవాయుజలాలను వాఙ్మనస్సులను ఉపాసిస్తుంటారు. ఆ ఉపాసనలన్నీ భేదభావకాలే కనుక

అజ్ఞానాన్ని హరింపలేవు. అజ్ఞానం నశించితే గాని భేదభావం నశింపదు. భేదభావం నశించితే గాని బుద్ధి ఏకాగ్రం కాదు. బుద్ధి ఏకాగ్రమైతే గాని ముక్తి కలుగదు; బుద్ధి ఏకాగ్రం కావటమే ముక్తికి ఉపలక్షణం. బుద్ధి ఏకాగ్రం కావటానికి సాధుదర్శన సేవలు ఎంతో ఉపకరిస్తాయి.

మునులారా! శరీరాలన్నీ వాతపిత్త శ్లేషాత్మిక అయిన ప్రకృతివలన కలుగుతున్నాయి. వాటికి నాశనం తప్పదు. అట్టి శరీరాల యెడ 'నేను' అనే బుద్ధిని, ఆ శరీరభోగ్యాలైన భార్యాదులందు 'నావి' అనే బుద్ధిని, మృత్పాషాణాది విగ్రహాలయెడ దేవతాబుద్ధిని, జలాల పట్ల తీర్థబుద్ధిని ఉంచి జనులు ప్రాకులాడుతారే కాని, జ్ఞానులను సేవించి వారివలన పరమార్థాన్ని తెలుసుకొని కడతేరుదామని ప్రయత్నింపరు. ఇట్టి మందమతులు చతుష్పాదులలో గార్దభాల వంటివారు' అన్నారు.

## మునీంద్రుల అజ్ఞానం

మునీంద్రులు ఆ పలుకులను సాంతం విని, అవి అవతారపురుషులాడదగిన మాటలే అని లోలోన సంతసించి, 'దేవా! తత్త్వవేత్తలలో మమ్ము ఉత్తములుగా పరిగణించావు. మేము మాత్రం నీ మాయలకు చిక్కలేదంటావా? విశ్వ సృష్టిస్థితిలయకర్తవు సర్వేశ్వరుడవు అవ్యక్తుడవు అయిన నీవు మాయా మానుషవేషాన్ని ధరించి వ్యక్తుడవై అనీశ్వరుని వలె భాసించి నీ నటనకౌశలాన్ని వెలయింపజేస్తావు. నీ నాట్యగరిమ మాకు భ్రాంతిని కలిగిస్తున్నది. ఆ కారణాన నీ యథార్థతత్త్వం మరుగుపడుతున్నది.

దేవా! నీ చర్యలన్నీ వింతలకు వింతలు. మన్ను ఘటాది వికారాత్మకమైన అనేక రూపనామాలతో వ్యవహరింపబడినట్లు నీవు కూడా అనేక రూపనామాలను ధరిస్తావు. నీ వస్తుతత్త్వం విద్వదగ్రణులకే అగమ్యగోచరమై ఉన్నది. నీకు కోర్కెలు లేవు. కోర్కెలెప్పుడు లేవో, అప్పుడే క్రియలూ లేవు. అట్టివాడవు నీవు వివిధ రూపనామాలను ధరించటం నరవేషవిడంబనార్థం

కాకుంటే మరేమనుకోవాలి? విడంబన మాత్రం ఎందుకంటే; ఎందుకో, ఆ రహస్యం నీకే ఎరుక. నీ చరిత్రలను బట్టి మేము పలువిధాల ఊహించి మాలో మేము తృప్తిపడుతుంటాము. నీ వలన కలిగిన మేము నీ తత్త్వాన్ని గ్రహింపగలమా?

దేవా! మా ఊహలంటే ఎటువంటివో విన్నవిస్తున్నాము. శూన్యము నుంచి దృశ్యం ఏర్పడదు. విశ్వము మా కంటికి గోచరీభూతమై ఉన్నది. దీనికి మూలం ఒకటుండాలి. ఆ మూలం జడమై ఉండటానికి వీలులేదు. మూలము జడపదార్థమైతే దానినుంచి ఉదయించిన విశ్వంకూడా జడమే కావాలి. మూలస్వభావానికి భిన్నమైనది దానినుంచి పుట్టదు. విశ్వమన్నదో చైతన్యాత్మకం. కనుక మూలంకూడా చైతన్యాత్మకమై ఉండక తప్పదు. ఆ మూలాన్ని గురించి ఎంత ఆలోచించినా అది సన్మాత్రపదార్థమని మాత్రమే మేము గ్రహింపగలిగాము. ఆ మూలం తప్ప వేరొకటి లేదుగనుక, ఆ మూలం నుంచి విశ్వం ఏర్పడుతున్నది కనుక ఆ మూలవస్తువు జ్ఞానేచ్ఛాక్రియాశక్తులతో కూడి ఉన్నదని నిశ్చయింపవలసి ఉంటుంది. ఆ పదార్థపరిమాణం ఇంత అని నిరూపింపరాక, సర్వవ్యాపకమై ఉన్నందువల్ల దానిని బ్రహ్మము అన్నారు.

ఆ ప్రకారం సత్యము, జ్ఞానానందము, ఏకము ఐన ఆ బ్రహ్మము విస్తరించటం – అంటే, వ్యక్తరూపాన్ని ధరించటం, మళ్ళీ లయం కావటం – అంటే, అవ్యక్తమవటం అనాదిగా జరుగుతున్నది. ఆ విస్తారమే సృష్టి అనబడుతున్నది. అది అవ్యక్తావస్థను పొందటమే లయము అనబడుతుంది. ఈ అవస్థాద్వయానికి కారణమేమిటని ఊహించాము. ఊహకు అందిన కారణాలలో ఏ ఒక్కటీ ముక్తికి నిలబడటం లేదు. అందువల్ల సరైన కారణం ఏమిటో మాకు అంతుబట్టక, ఆ పదార్థానికి ఇటువంటి అవస్థ లేర్పడటం స్వభావమై ఉండాలని నిశ్చయించాము. స్వభావము అంటే దానియొక్క స్థితి అని మాత్రమే మా అభిమతం.

ఈ సత్పదార్థం జ్ఞానేచ్ఛాక్రియా శక్తులతో నిండి ఉన్నదని అన్నాము. ఇచ్ఛాక్రియాశక్తులు నిరంతరం వర్తింపక ఏదో ఒకటిగా అప్పుడప్పుడు వ్యవహరిస్తుండటం వలన వాటికి మాత్రమే రెండవస్థలూ కనబడుతుంటాయి. జ్ఞానము నిరంతరం అవిచ్ఛిన్నంగా ప్రకాశిస్తూ తక్కిన రెండింటి అవస్థలను కూడా చూస్తూ ఉండటం వల్ల అది నిత్యము నిర్వికారము అవిచ్ఛిన్నము అని గ్రహించాము.

ఈ జ్ఞానం ఇట్టిదయితే, అజ్ఞానం ఎక్కడనుంచి వచ్చిందనే ప్రశ్న ఉన్నది. అజ్ఞానమన్నది అందరికీ, అన్నివేళల ఉండటం లేదు. ఎప్పుడు జ్ఞానప్రకాశం మందగిస్తే అప్పుడు అజ్ఞానం వెలికి వస్తున్నది. అజ్ఞానమంటే జ్ఞానముయొక్క అభావమని అర్థం కాదు; మందప్రకాశమని అర్థం. సూర్యుడు ఎల్లవేళల ప్రకాశమానుడై ఉన్నప్పటికీ మేఘాలు ఆవరించినప్పుడు సూర్యప్రకాశం మందమై లోకమంతటినీ కారుచీకటి క్రమ్ముకొంటున్నది కదా. అజ్ఞానమూ అటువంటిదేనని భావించాము.

జ్ఞానప్రకాశం సన్నగిల్లటానికి కారణమేమిటనే శంక మాకు కలిగింది. అహంకారం పైకొనటమే కారణమని స్వానుభవంలో తెలిసివచ్చింది. ఇచ్ఛాశక్తి అతిశయించటమే అందుకు కారణమని తేలింది.

దేవా! ఈ ఇచ్ఛాక్రియాశక్తులు నీకు వశమై వర్తించేవి కాబట్టి, నీ జ్ఞానం ఎన్నటికీ మరుగుపడదు. మానవుల విషయంలో ఆ నియమం వర్తింపదు. వారు సామాన్యంగా ఇచ్ఛాశక్తికి వశులై ఉంటారు. అందువలన వారియందు అహం వృత్తి పెంపొందటమూ, వారి జ్ఞానప్రకాశం మందగించటమూ సంభవిస్తున్నది.

దేవా! అవ్యక్తమైన నీ స్వరూపం వ్యక్తమైన ప్రపంచాకృతిని ఏ విధంగా పొందుతున్నదని విచారించాము. సూక్ష్మతమమైన వస్తువు సూక్ష్మతరమై సూక్ష్మమై స్థూలమై స్థూలతరమై స్థూలతమమై దృశ్యస్థితిని చేరుకొంటుంది. ఆ

ప్రకారం నీ వ్యక్తస్వరూపం కూడా మహత్తుగా ప్రపంచించి తర్వాత క్రమక్రమంగా ఆకాశ వాయు వహ్ని జల పృథ్వీ తత్త్వాలుగా ప్రపంచించి దృశ్యమవుతున్నదని, వీటినే పంచమహాభూతాలంటారని తెలుసుకొన్నాము. ఈ పంచమహాభూతాలు ఆకాశాదు లైదింటిలో ప్రతితత్త్వంలోనూ ఉన్నాయని, ఆకాశతత్త్వంలో ఆకాశభాగం విశేషం గాను తక్కినవి అల్పం గాను, అలాగే తక్కిన నాల్గింటిలోనూ ఈ విధానమే ఉన్నదని గ్రహించాము.

దేవా! నీ సృష్టియందు జడభాగం కొంత, జీవభాగం కొంత కానవస్తున్నది. జడభాగాన్ని అపరప్రకృతి అని, జీవభాగాన్ని పరాప్రకృతి అని పేర్కొంటారు. ఈ రెండు ప్రకృతులలో ఉంటూనే నీవు పూర్ణుడవుగా ఉన్నందువల్ల వీటిని మించిన ఉత్తమపూరుషరూపం నీ రూపమని స్ఫురించింది.

దేవా! అహంకారం విజృంభింప కుండటానికి ఉపాయం ఏమిటని, అందుకు నియమాలేవైనా నీచే ఏర్పరుపబడినవి ఉన్నాయా? అని వితర్కించాము. నీవు వచించిన వేదాల తాత్పర్యం అప్పుడు మాకు బోధపడింది. ఆ వేదమార్గాన్ని అనుసరించటం వలన నీ శక్తులు మనుష్యతత్త్వంలో యథాగతికాలుగా వర్తిస్తుండటం, మనుష్యులు శుభవృద్ధులను పొందుతుండటం స్వానుభవానికి సరిపోయింది. వేద నియమాలకే ధర్మాలు అని పేరు. నీ ధర్మం పరబ్రహ్మోనివైన నీ మతం కాబట్టి నీ మతప్రవర్తకులు బ్రాహ్మణులనే పేరిట ఒప్పారుతూ నీకెంతో ప్రీతిపాత్రులై ఉన్నారు. ఆ కారణాన నీవు బ్రాహ్మణకులాన్ని పూజిస్తున్నావు. అంతేకాదు. నీవు నీ అవతారవేళలలో ఆ ధర్మాలను స్వయంగా ఆచరించి లోకానికి మార్గోపదేశం కావిస్తున్నావు.

దేవా! అట్టి నీ తోడి సమాగమం పరమ నిశ్శ్రేయసమైనది మాకు నేడు లభించింది. మా విద్యా తపో జ్ఞానాలు మాత్రమే గాక మా జన్మములు కూడా సాఫల్యానికి నోచుకొన్నాయి.

దేవా! ఈ రాజులందరూ నీకు సమీపవర్తులై నీతో మెలగుతున్నా, నిన్నెరుగరనే చెప్పాలి. అంతెందుకు? నీతోటే నిత్యమూ నివసించే యాదవులు కూడా నిన్నెరుగరు. ఏమంటావా? నీవు యోగ మాయానిగూఢుడవై వర్తిల్లుతావు. ప్రజల దృష్టి ఎప్పుడూ నీ మాయాకార్యమై చిత్రవిచిత్రంగా భాసించే ఈ ప్రపంచం వంకకే ప్రసరించి నీ వంక తిరగకపోవటమే అందుకు కారణం. జనుల దృష్టి నీ వంక ప్రసరింపక పోవటానికీ కారణం లేకపోలేదు. నీవు పరమానందమూర్తివి. నీ అంశ లేని శరీరం ఉండదు. ఆ నీ అంశ స్వానందాన్ని అనుభవిస్తున్నా, తత్ప్రకాశం సోకి ఇంద్రియాలు ఆ ఆనందానుభవార్థం ప్రాకులాడుతూ శాశ్వతానంద పదార్థం ఏదో తెలియక నశ్వరాలైన ప్రాపంచిక పదార్థాలలో తగిలి అదే పరమార్థమని భ్రాంతి చెందటమే కారణం. విశ్వమంతా దర్పణదృశ్యమాన నగరమన్న సంగతి ప్రజలకు తెలియదు. ఎండమావుల వెంట తిరిగి తిరిగి ఇక తిరగలేక సొమ్మసిల్లిననాడు వారికి నీవే గతి వన్న విషయం స్ఫురిస్తుంది. అప్పుడు వారు సర్వపాప ప్రక్షాళనప్రభావం కలిగిన నీ పాదాలకు మోకరిల్లి కడతేర గలుగుతారు.

దేవా! అంత పవిత్రమైన నీ పాదయుగళాన్ని ఈనాడు కన్నులారా కనుగొనే భాగ్యం మాకు ప్రసాదించావు. నీ పాదభక్తి మాకెన్నటికీ తరుగకుంటుంది గాక! నిన్ను పొందటానికి నిర్మలభక్తి తప్ప వేరొక మార్గంలేదు. అందువల్ల మాలో ఉన్నట్టి జ్ఞానేచ్ఛాక్రియాశక్తుల అంశలు నిరంతరం నీ పరాలై వర్తించే వరాన్ని మాకు అనుగ్రహించు' అని విన్నవించి, శ్రీకృష్ణభగవానుని వీడ్కొని ధృతరాష్ట్రధర్మజాదులతో సంప్రదించి వారివారి ఆశ్రమాలకు బయలుదేరారు.

## వసుదేవుని ప్రార్థన

రాజేంద్రా! నారదాది మహర్షులందరూ భగవదాజ్ఞను గైకొని నిజాశ్రమాలకు బయలుదేరిన తరుణంలో వసుదేవుడు వారికి అడ్డుపడి, వారి

పాదాలు పట్టుకొని, 'మహాత్ములారా! పుట్టినది మొదలు నానావిధ కర్మలతో జీవితమంతా గడుస్తున్నది. ఒక్కనాడయినా మనశ్శాంతి కలిగిన జ్ఞాపకం లేదు. ఏమిచేయమంటారో చెప్పండి' అని వేడుకొన్నాడు. నారదమహర్షి అతని మాట విని మునులవైపు తిరిగి, 'ఋషివర్యులారా! గంగాతీరవాసి పరమపావనమైన గంగాజలాన్ని తన యెట్టయెదుట ఉన్నదానిని విస్మరించి ఆత్మశుద్ధికై ఎక్కడెక్కడో ఉన్న తీర్థాలను ఆశ్రయించినట్లు ఈ వసుదేవుడు తనయింట తనతో ఉన్న భగవానుని వదిలి ఆత్మశ్రేయానికి పరులను ఆశ్రయిస్తున్నాడు. ఇది వింత కాదు. పెరటిచెట్టు మందుకు ఉపయోగింపదనే సామెత మునుపటిదే. శ్రీకృష్ణభగవానుడు తనకు పుత్రమాత్రుడని భావించటమే ఇతని లోపం. కొన్ని వస్తువులు కర్కటికాదుల వంటివి కాలగ్రస్తాలై నశించిపోతాయి; విశ్వం లయోత్పాదాదుల చేత నశిస్తున్నది; విద్యుదాదులు తమంత తామే నశిస్తున్నాయి. ఘటాదులు ముద్గరాది కారణాంతరాల మూలాన నశిస్తున్నాయి. పాలు తోడుకొని పెరుగయినట్లు కొన్ని దేహాలు రూపాంతరం చెంది పూర్వరూపనాశాన్ని పొందుతున్నాయి. ఎవ్వడు కాలాదులలో ఎటువంటి దానిచేత ఎటువంటి మార్పునూ పొందక క్లేశ కర్మపరిపాక గుణప్రవాహాన్ని ఈదుతూ అవ్యాహతానుభావుడై ఆ కారణాన లోకేశ్వరుడై అద్వితీయునిగా ఒప్పారుతున్నాడో, ఆ భగవానుని మనుష్యమాత్రునిగా ఇతను పాటించడం ఎంతయినా చింతనీయం. అయితే అది ఇతని తప్పని భావింపకూడదు. మబ్బు గాని మంచు గాని గ్రహము గాని కప్పినప్పుడు సూర్యుడు కనుపింపనట్లుగానే భగవానుడు కూడా స్వకార్యాలైన ప్రాణాదులచేత ప్రచ్ఛన్నుడై నిజస్థితి యందు గోచరింపడు కదా!' అన్నాడు. మునులు ఆ మాటలు పరమసత్యాలని అంగీకరించి, వసుదేవుని పిలిచి రామకృష్ణులు, తక్కిన రాజులందరూ వింటుండగా తత్త్వ జ్ఞానార్థాన్ని విశదీకరించారు.

## మునులు కావించిన తత్త్వోపదేశం

(1) కర్మముచేత కర్మనిరాసం జరగదు

'వసుదేవా! చక్కగా అడిగావు. ఏ కర్మను చేసినా దానికి ఫలం కలుగక మానదు. ఆ కర్మఫలాన్ని అనుభవింపకా తీరదు. కర్మఫలభోగార్థం తుదుచిత శరీరధారణమూ తప్పదు.

ఆ విధంగా నూతనశరీరాన్ని ధరించి, ఆ శరీరము చేత భోగ్యమైన కర్మఫలాన్ని అనుభవిస్తున్నప్పుడు ఆ భోగ్యకర్మఫల వాసనలు తత్తద్రూపకర్మలకు మళ్ళీ ప్రేరేపిస్తుంటాయి. ఆ ప్రేరేపణ ప్రకారం దేహి కర్మలను చేయటం జరుగుతుంటుంది. ఆ కర్మములకు మళ్ళీ ఫలాలు ఉదయించటం, అవి భోగ్యమవటం, తదర్థమై శరీరాన్ని ధరింపవలసి రావటం, ఈ విధంగా ఏనాటికీ తుదిలేకుండా కొనసాగుతూనే ఉంటుంది. ఇలా ఎంతకాలం జరిగితే అంతకాలం మనశ్శాంతి ఉండదు. కాబట్టి కర్మముచేత కర్మనిరాసం కాదని గ్రహించాలి.

## నిష్కామకర్మమే పరమధర్మం

వసుదేవా! దేహధారులకు కర్మములు స్వాభావికములని, దేహధారులు ఆ కర్మములను చేయకుండా ఉండలేరని చెప్పాము. అంతమాత్రాననే కర్మపరులకు మనశ్శాంతి కలుగనేరదని నిస్పృహ చెందకు.

కర్మలను చేస్తూనే ఆ కర్మఫలాలకు బద్ధులు కాకుండే మార్గం ఒకటున్నది. దానిని నిష్కామ కర్మయోగమని అంటారు. ఆ యోగాన్ని అనుష్ఠించితే నీవు కోరిన మనశ్శాంతి నీకు కలుగుతుంది.

కర్మము నిష్కామమైనంత మాత్రాననే కర్మఫలం ఉదయింపకపోతుందా? అని శంకించటం సహజమే. ఫలం ఉదయింపక మానదు. ఆ మాట నిజమే. అయితే, ఫలానుభవాన్ని కోరినప్పుడు మాత్రమే నీవు చెప్పిన కష్టాలన్నీ వస్తాయి. ఫలాన్ని

ఈశ్వరార్పణబుద్ధితో చేసినప్పుడు కర్తకు ఆ ఫలానుభవం కలుగదు.

కర్మములంటే ఏమిటి? సర్వకర్మలు యజ్ఞాత్మకములే కదా! అందుచేత సర్వయజ్ఞాలను శ్రద్ధాభక్తులతో చేస్తూ, ఫలాన్ని యజ్ఞేశ్వరుడైన భగవంతునికి సమర్పిస్తుండాలి. ఈ విధంగా కర్మములను భగవత్పరం కావించినప్పుడు కర్మనిరాసం కలుగుతుందని పెద్దలు నిశ్చయించారు. అందు మూలాన చిత్తశాంతి, దానికి ఫలంగా మోక్షము సిద్ధిస్తాయి.

నాలుగు వర్ణాలవారిలోనూ తత్తద్గుణాశ్రమాలకు తగిన కర్మములు జరుగుతుంటాయి. ఆ కర్మములను నిష్కామబుద్ధితో ఆచరించి ఫలాన్ని భగవంతునికి సమర్పిస్తుండాలి. నిష్కామమైన ఆ యోగానుష్ఠానమే వారికి విహితధర్మం. ఆ ధర్మానుష్ఠానం సుఖదాయకం, ఆత్మోద్ధారకం కాగలదు. ఆ విధానాన్ని విజ్ఞులు శాస్త్రముఖాన ప్రకటించారు. తదనుష్ఠానం వలన కోరినంతగా ధనాదులు లభిస్తాయా? అని శంకింపకు. ధనాదులు ఈ జన్మలో నీవు చేసిన ప్రయత్నఫలంగా ఒనగూడటం లేదు. అవి ప్రారబ్ధకర్మవశాలు. అందువల్ల వాటికోసం ఏడ్చి ప్రయోజనం లేదు. ప్రాప్తమెంతో అంతటితో తృప్తిపడటం నేర్చుకోవాలి. తృప్తి కలిగినప్పుడు లేశమాత్రమైనా చాలు. ఆ ధనాన్ని యజ్ఞేశ్వరారాధనకు వినియోగించాలి. ఆ చేసేటప్పుడు ఇది కావాలి, అది కావాలి అనే కోరికలను కోరకూడదు. ఏమంటావా? కోరికలకు మేరలేదు. కోరికలు కోరేవారు ఎన్ని జన్మలెత్తినా శాంతిని పొందలేరు.

**"క. వ్యాప్తిం జెందక వగవక**
**ప్రాప్తం బది లేశమైన బదివేలనుచున్**
**దృప్తిం జెందని మనుజుడు**
**సప్తద్వీపముల నైన జక్కంబడునే?"**

అని వినలేదా? అంతేకాదు. నిష్కామదృష్టితో నీవు చేసే ప్రతికర్మమూ శ్రద్ధాభక్తులతో నిండి ఉండాలి. ఈ మార్గం గృహస్థులందరికీ శ్రేయోమార్గం.

మానవులు యజ్ఞదానాదులకు విత్తాన్ని, గృహభోగాదులకు దారసుతాదులను, మరణానంతర భోగార్థం స్వర్గసుఖాన్ని కోరటం ఉన్నది. ఈ మూడింటికీ ఏషణాత్రయమని పేరు. ఈ కోర్కెలను వదిలిపెట్టాలి. ఈ కోర్కెలున్నంతకాలం దేవతలకు సైతం మేలుకలుగదు. తెలివిగలవారు ఈ సంగతి గ్రహించి అట్టివానియెడ మమకారం మాని కేవల భగవదర్పణబుద్ధితో స్వధర్మాలను ఆచరిస్తారు. స్వధర్మాచరణ వలన కడతేరినవారు ఎందరో ఉన్నారు.

## ఋణవిమోచనం

వసుదేవా! మానవులకు – వారిలో ముఖ్యంగా ద్విజులకు – పితృఋణం, ఋషిఋణం, దేవఋణం అన్నవి పుట్టుకతోటే కలుగుతాయి. వాటిని తప్పక తీర్పవలసి ఉంటుంది. సంతానాన్ని పొందటం వలన పితౄణం, అధ్యయనం చేత ఋషిఋణం, యజ్ఞం మూలాన దేవఋణం తీరుతాయి. ఈ మూడు ఋణాలను తీర్పకుండా సన్న్యసింపకూడదు. ఆ విధంగా సన్న్యసించినవాడు పతితుడవుతాడు. నీవిప్పుడు పితృ ఋషిఋణాలను మాత్రమే తీర్చావు. యజ్ఞమాచరించి దేవఋణాన్ని తీర్చు. అప్పుడు సన్న్యసించటానికి యోగ్యత నీకు కలుగుతుంది. అయ్యా! నీవు నీ పూర్వజన్మమందు పత్నీసహితంగా భగవంతుని ఆరాధించావు. తత్ఫలితంగా భగవానుడు మీకు పుత్రుడుగా అవతరించాడు. ఇంతకంటె ఏమికావాలి?' అని బోధించారు.

## యజ్ఞేశ్వరారాధనం

రాజేంద్రా! మునుల ఉపదేశాన్ని వసుదేవుడు విని, 'మహాత్ములారా! మీరు కరుణించి ఋత్విజులై నాచేత యజ్ఞాలు చేయించి దేవఋణం నుంచి నాకు విముక్తిని కలిగించండి' అని వారికి ప్రణమిల్లాడు. ఋషులతని ప్రణయాన్ని

అంగీకరించారు. యజ్ఞవాటికాదులు కురుక్షేత్రంలోనే నిర్మింపబడ్డాయి. యాదవులు యజ్ఞసంభారాలను సంతరించి కృతస్నాతులై ఆయా కార్యభారాలను వహించారు. వసుదేవుడు తన పద్దెనిమిదిమంది భార్యలతో దీక్షాశాలను ప్రవేశించాడు. అతనికి కన్నుల కాటుక దిద్ది శరీరానికి వెన్నరాచి అభిషేకం చేసి నవదుకూలాలు ధరింపజేసి భార్యలతో దీక్ష ఇప్పించారు.

## యజ్ఞవిభాగం

నరేంద్రా! యజ్ఞాలు ప్రకృతికములు, వికృతికములు అని రెండు విధాలు. అగ్నిహోత్రం, జ్యోతిష్టోమం, దర్శపూర్ణమాసం మొదలయినవి ప్రకృతియజ్ఞాలు. సౌర్య సత్రాదిక యజ్ఞాలకు వికృతియజ్ఞాలని పేరు. వసుదేవుడు దీక్షవహించి ఆ రెండు విధాలైన యజ్ఞాలను ఆచరించి ద్రవ్య మంత్ర తంత్రాలు అన్నిటికీ ప్రభువైన యజ్ఞపూరుషుని భగవానుని ఆరాధించి, ఋత్విజులను శాస్త్రప్రకారం పూజించాడు. అంత ఋత్విజులు పత్నీసంయాజావభృథప్రక్రియ జరిపించి యజమానునితో శ్రీరామ ప్రాదాన అవభృథస్నానం చేశారు. వసుదేవుడు సంతుష్టుడై సకలజనులను ఇష్టమృష్టాన్నసంతృప్తులను కావించి వస్త్రాదులతో సన్మానించి విదర్భాది రాజులను, వారి భార్యలను యథోచిత పారితోషికాలతో మన్నించాడు. వారు పరమప్రీతులై శ్రీకృష్ణుని వీడ్కొని, తమతమ స్థానాలకు తరలివెళ్ళారు.

ధృతరాష్ట్రుడు విదురుడు భీష్ముడు ద్రోణుడు పాండవులు కుంతి స్నేహపాశాన్ని విడువలేక ఎంతో కష్టం మీద మనసు రాయి చేసుకొని యాదవులను వీడ్కొన్నారు. నారదాది మునులు రామకృష్ణుల అనుమతి గైకొని వెళ్ళిపోయారు.

## నందునికి సన్మానం

నందగోపుడు రామకృష్ణుని మాటలను మీరలేక అక్కడే కొంతకాలం ఉన్నాడు. ఒకనాడు వసుదేవుడు నందుని చేతిలో చేయివేసి, ‘అయ్యా!

స్నేహపాశాన్ని భగవానుడు నిర్మించాడు. దానిని తెంచివేయటానికి ఎంతటి శూరులైనా, యోగులైనా సమర్థులు కారని నే ననుకొంటాను. అదే కాకపోతే మహోత్తములైన మీరు స్వల్పులమైన మాయెడ ఇంత అసదృశమైన ప్రీతిని ప్రత్యుపకార రహితంగా ఉంచటం జరుగుతుందా? మన మైత్రి ఎన్నటికీ చెడకుండు గాక! అయ్యా! పూర్వం మా స్థితిగతులు బాగులేక మీకెటువంటి సత్కారమూ చేయలేకపోయాము. ఇప్పుడు శ్రీమదాంధత్వం మా కన్నులను నెత్తికెక్కించింది. మా దృష్టి మీ వంక ప్రసరించదు. రాజ్యవిభవం సజ్జనులను గాని స్వజనులను గాని చూడనీయదు. శ్రేయస్కాములకు అకృతజ్ఞత తగని పని. మీ ఉపకారాన్ని మాత్రం జన్మజన్మలకు మరచిపోను' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొని అమితాదరంతో అతనిని పూజించాడు. నందుడు నిత్యప్రయాణాలు సంకల్పిస్తూనే వసుదేవ రామకృష్ణులను విడచిపెట్టలేక మూడు నెలలు అక్కడే ఉండి, ఎట్టకేలకు వారిని వీడ్కొని గోపికాగోపకులతో మథురకు బయలుదేరాడు. అంతలో వానకారు సమీపించింది. రామకృష్ణులు యాదవులతో ద్వారకకు బయలుదేరారు. ద్వారకావాసులకు తీర్థయాత్రా వసుదేవయజ్ఞాదిక కథలతో కొన్నాళ్ళు యథాసుఖంగా గడిచిపోసాగాయి.

## వసుదేవుని తత్త్వవిచారం

పరీక్షిన్నరేంద్రా! మానవులు ఋణత్రయం తీర్చిన తర్వాత సన్న్యసింపవచ్చునని మునీంద్రులు వసుదేవునితో చెప్పటమూ, అతను యజ్ఞాలు చేసి శేషించి ఉన్న దేవఋణాన్ని కూడా తీర్చివేయటం మొదలైన విశేషాలను విన్నావు. ఋణవిముక్తి చెందిన తర్వాత వసుదేవునికి జ్ఞానోపదేశం పొందే పుణ్యసమయం చేరువయింది. ఒకనాటి ప్రభాతవేళ రామకృష్ణులు వచ్చి ఎప్పటివలె తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించారు. అప్పుడు వసుదేవునికి మహర్షుల వచనాలు జ్ఞప్తికి వచ్చాయి. అతను వారి ఉపదేశసారాన్ని మనసులో ఉంచుకొని – వారితో ఈ విధంగా అన్నాడు :

'కృష్ణా! రామా! జగత్తునకు ప్రధానము, పురుషుడు అని రెండు కారణాలు. ఆ రెండిటికి మీరు ఈశ్వరులై నా కడుపున పుట్టారు. కారణము లేనిదే కార్యమూ కలుగదు. కుండను చేయటానికి మన్ను, సారె మొదలయిన సామగ్రి అవసరం. కుండకు మట్టి ఉపాదాన కారణమని, సారె మొదలైన సామగ్రి నిమిత్తకారణమని వేదాంతుల పరిభాషలో అంటారు. ప్రపంచ మనేదొకటి కంటికి కనబడుతున్నది. దీనికి ఉపాదాన నిమిత్తకారణాలు ఏమేమిటని విచారించారు. అన్నిటికి మూలానివి నీవు తప్ప వేరొక కారణం కనబడలేదు. కనుక ఈ ప్రపంచానికి నీవే ఉపాదాన కారణానివి, నిమిత్త కారణానివి అని పెద్దలన్నారు.

అంతెందుకు? ప్రపంచమంటే నీ విస్తారమే గాని నీకంటె వేరైనది కాదు. అంతే కాదు. ఏదైనా ఒకటి ఉండటమంటూ జరిగితే అది ఎప్పుడున్నా, ఎక్కడున్నా ఏ రూపంలో ఉన్నా అది నీవేనని నిశ్చయించారు. నీవే భోగ్యపదార్థమైన ప్రకృతిరూపాన్ని, భోక్తయైన పురుషరూపాన్ని రెండింటినీ ధరించి భోగ్యభోగపరాయణుడవై, ఆ రెండింటికీ అతీతుడవై ఉంటావు.

ఏ వస్తువైనా ఉన్నది – లేదు అని నిశ్చయించటానికి ఇంద్రియాలు సాధనాలవుతాయి. నీవో? ఇంద్రియాలకు అందేవాడివి కావు. కాబట్టి నీ కలిమిలేములను ఇంద్రియపూర్వకంగా నిర్ణయించటం వీలుకాదు. ప్రతివస్తువుకు ఉత్పత్తిస్థిత్యాది వికారాలు ఆరు నిర్దేశింపబడ్డాయి. అవి నీకు లేవు. కనుక నీవట్టి షడ్వికార రహితుడవు. కాబట్టి శాశ్వతుడవు. నీ ఇచ్ఛాశక్తి సంకల్పించింది; నీ క్రియాశక్తి ప్రపంచంగా ఏర్పడింది; నీ జ్ఞానశక్తి అందులోనికి ప్రవేశించి సమస్తాన్ని వ్యవహరింపజేస్తున్నది. ప్రకృతాద్యులు వ్యవహరిస్తున్నవని అంటారు గాని బొమ్మలాడే ఆట ఎటువంటిదో ప్రకృత్యాదుల వ్యవహారం కూడా అటువంటిదే అనుకోవాలి. బొమ్మలను ఆడించిన తీరునుబట్టి బొమ్మలాట ఉంటుంది. అంతేకాని ఆ బొమ్మలకు స్వతంత్రశక్తి లేదు.

చంద్రుడు వెలుగుతున్నాడు; అగ్ని తేజరిల్లుతున్నది; సూర్యుడు ప్రకాశిస్తున్నాడు; నక్షత్రాదులు విరాజిల్లుతున్నాయి. చంద్రుని వెలుగు, అగ్ని తేజం మొదలయినవన్నీ వాటి స్వశక్తి కార్యాలు కావు; వాటిలో ఉన్న నీ శక్తి కార్యాలు మాత్రమే. ఏమంటావా? చంద్రాదిరూపాలన్నీ ప్రకృతివికారాలు. ప్రకృతి అనేది జడపదార్థం. జడానికి స్వతంత్రశక్తి లేదు. ఆ ప్రకృతిలో ఉన్న నీ శక్తి ఆ విధంగా చంద్రాదులలో ప్రకాశరూపాన వ్యవహరిస్తున్నది. కొండలకు చలనం లేదు. అదీ నీ శక్తికార్యమేనని గ్రహించాలి. భూమి సమస్తాన్ని భరించటం గాని, గంధాన్ని ఇవ్వగలగటం గాని నీ శక్తియొక్క కార్యాలే. జలమందు గల తర్పణ ప్రాణరసాలు గాని, వాయువులో ఉన్న బల సహ ఓజశ్చేష్టాగతులు గాని, అన్నీ నీ శక్తికార్యాలే అవుతాయి. అంతెందుకు? దిక్కులు, వాటి అవకాశం, ఆకాశం, దాని ఆశ్రయమైన స్ఫోటము, దానికి గల పరా పశ్యంతీ మధ్యమా వైఖరీత్వాలు అన్నీ నీ శక్తులే. నీకూ నీ శక్తికీ ప్రత్యేకత్వం లేదు కాబట్టి నీ శక్తి అన్నా, నీవన్నా రెండూ ఒక్కటే.

ఇంద్రియా లంటేనో, వాటి విషయప్రకాశ శక్తి ఆయా ఇంద్రియాలను వ్యవహరింపజేస్తూ ఏతదధిష్ఠాతృదేవత లనబడే శక్తులు, తదధిష్ఠాన శక్తి, అన్నీ నీవే. ఇక బుద్ధి సంగతి చూతామంటే – యుక్తాయుక్తవివేచనము, ప్రతిసంధానము అన్నవి దాని ధర్మాలు. ఆ రెండూ నీ శక్తి కార్యములే గాని వేరుకావు. అహంకారము సంగతి విచారిద్దామంటే, అది సాత్త్వికము రాజసము తామసము అని మూడు విధాల వ్యవహరిస్తున్నది. వాటిలో తామసాహంకారం భూతకారణంగా, రాజసాహంకారం ఇంద్రియకారణంగా, సాత్త్వికాహంకారం దేవకారణంగా కనబడతాయి. అవీ నీ శక్తులే. ఇక ప్రధానం సంగతి చూస్తే అది జీవసంసారానికి కారణమై ఉన్నది. అదికూడా నీ శక్తి మాత్రమే.

దేవా! ప్రకృతి యందు పుట్టినవన్నీ నశించటమూ జరుగుతున్నది. ఆ విధంగా నశించినప్పుడు అవి నీ రూపాంతరాలే కనుక వాటితోపాటు నీవు కూడా నశింపవలసిందేనా? అని ప్రశ్న వస్తుంది. మట్టిచేత ఘటం

నిర్మింపబడుతున్నది. బంగారుచేత ఆభరణాలు నిర్మింపబడుతున్నాయి. ఘటము నశించినప్పుడు తన్మూలమైన మన్ను నశించిందా! నగలను కరిగించి పోసినప్పుడు వాటికి మూలమైన బంగారం నశిస్తుందా? వికారాలు మాత్రమే కనబడకుండా పోతున్నవి కాని మూలద్రవ్యానికి ఎటువంటి నాశమూ కలగటం లేదు. అదే విధంగా నీ భావమాత్రాలైన ప్రపంచాదులు రూపుమాసినా, నీవు మాత్రం నిత్యుడవై ఉంటావు. నీ భావాలు మాత్రం ఎందుకు రూపుమాయాలి? అంటే, భావాలు ఎల్లప్పుడు గుణత్రయవృత్తులుగా ఉంటాయి. అవి ప్రతీతిమాత్రాలు. ప్రతీతులెప్పుడూ మిథ్యాకల్పితాలే కనుక ప్రతీతులకు నిత్యత్వమన్నది అసాధ్యం.

దేవా! ప్రపంచమనేది వేరొకటి నీకంటె భిన్నమైనది ఉన్నదని భావించినప్పుడు నీవు కారణమై ఆ ప్రపంచాన్ని అనుగమించినట్లు ఏర్పడుతున్నది. అంతేకాని పరమార్థదృష్టితో చూసినట్లయితే నీ వెల్లప్పుడు నిర్వికల్పుడవుగానే ఉన్నావు. నీకంటె వేరైన ప్రపంచం కలగటానికే ఆస్కారం లేదు. ఆ రహస్యం తెలియక ప్రపంచమనేది ఒకటున్నదని ఊహిస్తూ గుణప్రవాహంలో పడి వివిధకర్మలకు ఒడిగడుతూ జననమరణ చక్రంలో కొట్టుమిట్టుకులాడుతుంటారు.

దేవా! జన్మ లన్నిటిలో మర్త్యజన్మ దుర్లభం. మర్త్యుడనై జన్మించి ఆత్మార్థం ఏమిటో తెలియక జీవిత కాలమంతా నిరర్థకంగా గడిపివేశాను. సర్వస్నేహపాశాలకు 'నేను – నాది' అనే భావాలే నారపోచలుగా ఉన్నాయి. ఆ పోచలతో పెంచిన స్నేహాదిపాశాల చేత జగమంతా కట్టబడి ఉన్నది. ఆ బంధించటమూ నీవు చేసిన కార్యమే. ఈ మాటకు నిదర్శనమేమంటావా? నీవు పుట్టిననాడే నీ తత్త్వాన్ని నాకు వివరించావు. అంత వివరించినా నాకు నీయందు గల పుత్రవాత్సల్యబంధం తెగలేదు. ఇంతకన్న వేరే నిదర్శన మేమికావాలి? ఈ బంధన నీ అనుగ్రహవిశేషం వలన గాక వేరు విధాన నశింపదు. నీ విభూతి మాయలకు ఎవ్వరూ ఏ నాటికీ అంతు కనిపెట్టలేరు' అని పలికాడు.

## వసుదేవునికి తత్త్వోపదేశం

భగవానుడు ఆ పలుకులకు దరస్మేరవదనుడై, 'తండ్రీ! నీవు నీ పుత్త్రులమైన మాకు తత్త్వార్థసంగ్రహాన్ని ఉపదేశించావు. మీ వచనాలు ఎంతో సముపపన్నమైనవి. నేను గాని నా అన్న యీ బలరాముడు గాని మా తలిదండ్రులైన మీరు గాని ఈ ద్వారకావాసులు గాని అఖిలచరాచరాత్మక ప్రపంచం గాని సర్వమూ బ్రహ్మమే; ఆ బ్రహ్మభిన్నమైనది వేరొకటి లేదు. ఆకాశాది పంచభూతాలు, ఆ భూతకృతాలు, భౌతికాలు అయిన జలదర్పణాదులలో ప్రతిఫలించటాన్ని మీరు చూస్తున్నారు. అదే విధంగా పరబ్రహ్మము తనచే సృజింపబడిన గుణాలతో గుణకార్యాలైన దేహాదులలో నానారూపాలతో కనబడుతుంటుంది. చావు పుట్టుకలు గాని, ఆధిక్యానధికతలు గాని, ఏకత్వ నానాత్వాలు గాని సర్వమూ భగవద్విశేషాలే అని, అన్నీ తత్పరమార్థ తత్త్వాన్ని బోధించేవే అని తెలుసుకోవాలి. ఈ రహస్యాన్ని గ్రహించి భేదబుద్ధి వదలి వర్తించేవారికి అంతులేని సుఖం కలుగుతుంది' అని చెప్పాడు.

## దేవకీమృతపుత్త్రకుల రక్షాలీల

పరీక్షిన్నరేంద్రా! రామకృష్ణులు గురుకులవాసం చేసినప్పుడు గురుదక్షిణగా మృతపుత్త్రుని తెచ్చియిమ్మని గురుపత్ని అడగటం, రామకృష్ణులతనిని తీసుకొని రావటం విన్నావుగదా! ఆ సంగతి దేవకీదేవికి తెలియవచ్చింది. ఒకనాడామె తాను మొదట కని కంసుని చేతిలో మరణించిన బిడ్డలను తలుచుకొని దుఃఖవిహ్వలురా లయింది. ఆ తరిని రామకృష్ణు లామె వద్దకు వచ్చి, 'తల్లీ! నీ విన్నదనానికి కారణం ఏమిటి?' అని అడిగారు. ఆమె వారితో 'రామా! కృష్ణా! రాజులు శాస్త్రోల్లంఘన చేసిన ఫలితంగా దుర్మతులు, దుర్బలులు అవుతుండటం; తన్మూలాన వారు భూమికి భారంగా పరిణమించటం, భూభారాన్ని తగ్గింపగోరి ఆదిపురుషులైన మీరు నా గర్భవాసాన అవతరించటం నే నెరుగుదును. ఆదిమూర్తి అంశగా పురుష

దేర్పడుతున్నాడు. అతని అంశమాత్రమై మాయ నెగడుతున్నది. మాయ యొక్క అంశమాత్రాలై త్రిగుణాలు ఆవిర్భవిస్తాయి. ఆ గుణముల యొక్క పరమాణు మాత్రాంశ చేత విశ్వసృష్ట్యాదులు జరుగుతున్నాయి. అట్టి ఆదిమూర్తులైన మిమ్ము ఆశ్రయిస్తున్నాను. తల్లులకు బిడ్డలయందు మమకారం మెండు. ఎందరు బిడ్డలున్నా తల్లులకు ఎక్కువ కాదు. నాకు మొదట పుట్టిన బిడ్డలందరినీ కంసుడు చంపాడు. వారి కోసం నా మనస్సు తహతహలాడుతున్నది. వారిని తలుచుకోని క్షణం లేదు. వారిని చూడాలనే కోరిక నానాటికీ ప్రబలుతున్నది. మీ గురువుగారికి ఎన్నడో చనిపోయిన బిడ్డను తెచ్చియిచ్చిన మీకు ఈ కార్యమొక ఘనకార్యం కాకపోవచ్చును' అన్నది.

రామకృష్ణు లా మాట విని, 'తల్లీ! నీ కోరిక నెరవేరుస్తాము' అని మాటయిచ్చి, యోగమాయను వెంటబెట్టుకొని సుతలానికి వెళ్ళారు. అక్కడ బలిచక్రవర్తి రామకృష్ణులను చూచి మహానందభరితుడై వారికి సమస్తపూజలు చేసి, వారి పాదప్రక్షాళన పుణ్యజలాన్ని తాను తనవారందరితో తలదాల్చి, సంతోషాశ్రువులు వెల్లివిరియగా తనయింటికి వచ్చిన మహాపురుషులను గౌరవించి, 'అనంతమూర్తివైన రామా! పరమాత్ముడ వైన కృష్ణా! మీ దాసుని అనుగ్రహించటానికే మీరిక్కడికి వచ్చారు. మీ దయావిశేషం ఏమని చెప్పను? మీ దర్శనం కేవల శుద్ధసత్త్వులకు మాత్రమే సాధ్యపడుతుంది. రజోభావులకు ఎప్పుడో ఒకప్పుడు లభిస్తుంది. తమస్స్వభావులకు ఎన్నటికీ కలుగదు. అసురులమైన మేము రజస్తమస్స్వభావులము. అట్టి మాకు మీ దర్శనం నేడు సిద్ధించటం మా సుకృతపరిపాక ఫలమే గాని మీరు కార్యార్థులై రావటం కాదు. దేవాదిదేవా! ప్రీతికి లోకమంతా వశమవుతుంది. వైరం పెట్టుకొని ఎవ్వరినీ సాధింపలేము. నీ తత్త్వం ఇందుకు వైపరీత్యమై కనబడుతున్నది. నీ యెడ నిత్యవైరం సాధించిన వారిని కూడా నీవు అనుగ్రహింపక మానవు.

నా మాటలకు తార్కాణమేమంటావా? నీ యెడ పగబూని, అంతంలో నీ సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్యాలకు నోచుకొన్న దైత్యదానవులు

యక్షరాక్షస పిశాచ భూతనాయకులు ఎందరో ఉన్నారు. వారే నా మాటకు సాక్షులు. దేవా! మతి ఏదయితే గతికూడా అదేనని అంటారు. ఆ మతి గమనం కామపురస్సరం అవుతుంది గాక; వైరపూర్వకం కావచ్చును గాక; భక్తి సముజ్జ్వలం అవుతుంది గాక. కామాదులు అంత ప్రాధాన్యం గలవి కావు. మనస్స్థితి ఒక్కటే ముఖ్యం.

**"ఉ. వైరము చేతఁ జేదినృప వర్గముఁ, గామముచేత గోరికల్**
**మీఱిన భక్తి నాశ్రితులు మిమ్ము నహర్నిశమున్ మనంబులం**
**దారగనీక రూప గుణ తత్పరులై మిముఁబొందు కైవడిన్**
**భూరివివేక సత్త్వగుణముల్ గల దేవత లందనేర్తురే?"**

దేవా! నీ యోగమాయామహిమ ఇట్టిదని యోగీశ్వరులు సయితం గ్రహింపలేరు. ఇక మాబోంట్ల సంగతి వేరే చెప్పాలా? గృహాంధకూపాలలో పడిన మాకు నీ పాదారవిందాలకంటె వేరొక శరణు లేదు. గృహైశ్వర్యాల పట్ల ఏవ జనించింది. కోరిక లున్నంతకాలం నీ పాదయుగళ సేవాభాగ్యం లభించదు. ఎక్కడో ఒక వృక్షమూలాన్ని ఆశ్రయించి ఏ పండో కాయో తింటూ దేహయాత్ర గడుపుకొంటూ ప్రశాంతంగా నీ ధ్యానపరుడినై కాలం సద్వినియోగపరచుకొనే అవకాశం నాకు అనుగ్రహించు. జగదీశ్వరా! అల్పపుణ్యులకు ఇంతటి సద్భావన ఎలా కలుగుతుంది? ఎలా కలుగుతుందో, ఏమి చేస్తే కలుగుతుందో, అది నీవే ఆజ్ఞాపించాలి. నీ అనుశాసనాన్ని తలదాల్చినవారికి విధినిషేధచోదనలన్నీ దూరవర్తులు. వారు కింకర మాత్రులు' అని విన్నవించాడు.

శ్రీకృష్ణుడు బలి వచనాలు విని, 'వైరోచనీ! నేను వచ్చిన పని విను. స్వాయంభువ మన్వంతరంలో మరీచికి ఊర్ణయందు ఆరుగురు కొడుకులు స్మరుడు, ఉద్గీతుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభ్రువు, ఘృణి అనే పేర్లతో అలరారినవారు జన్మించారు. సరస్వతి బ్రహ్మకు కూతురే కదా! బ్రహ్మ తన పుత్రికతో మైథునం చేయగోరాడు. ఆ మరీచిపుత్రులు బ్రహ్మను

పరిహసించారు. ఆ పాపఫలంగా వారు అసురులై హిరణ్యకశపుడికి పుత్రులై ఉదయించారు. ఆ తర్వాత వారు దేవకీగర్భంలో కీర్తిమంతుడు మొదలయిన పేర్లతో మళ్ళీ జన్మించి కంసునిచేత మరణించారు. వారిప్పుడు నీవద్ద సుతలవాసులుగా ఉన్నారు. వారికి శాపావసానకాలం వచ్చింది. సద్గతిని పొందుతారు. వారి కోసమే వచ్చాను' అన్నాడు. బలిచక్రవర్తి వారిని తెచ్చి శ్రీకృష్ణపరమాత్మకు సమర్పించాడు.

రామకృష్ణులు వారిని వెంటబెట్టుకొని వచ్చి తల్లికి అప్పజెప్పారు. వారిని చూచినంతనే దేవకీదేవికి స్తనక్షీరధారలు పెల్లుబికాయి. ఆమె ఆ కుమారులను సందిటగూర్చి తొడపై కూర్చుండబెట్టుకొని ముద్దాడి పాలిచ్చి ఎంతో ఆనందాన్ని పొందింది. ఆ కుమారకులు శ్రీహరి త్రావిన స్తన్యాన్ని గ్రోలినందువలన, హరి శరీరస్పర్శ కలిగినందువలన గతకల్మషులై ఆత్మదర్శనం కలవారై శ్రీకృష్ణునికి దేవకీ, వసుదేవులకు నమస్కరించి సకలభూతసమక్షంలో అంతరిక్షమార్గాన ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోయారు. దేవకీదేవి తన చనిపోయిన కొడుకుల రాకపోకలకు విస్మితురాలై, 'అంతా భగవన్మాయ' అనుకొన్నది.

మునులారా! శుకమహర్షి ఆ తర్వాత పరీక్షితుని చూసి, 'ఓ రాజా! భగవానుని శక్తి అనంతం. అనంతశక్తిమంతుడైన అతని లీలలు కూడా అనంతంగా ఉన్నాయి. ఆ భగవల్లీలలలో నేను విన్నంతలో వివరించాను. లీలలన్నీ భగవానుని శక్తివిశేషాన్ని సూచించేవే. ఆ లీలలలో ప్రకటితమైన అంతటి శక్తిగల శక్తిమంతుడు ఎంతటివాడో ఊహించి చూడు. అట్టి శక్తిమంతుని ఆశ్రయించటం కంటె మేలైనది వేరేమున్నది? ఈ చరిత్రలను విన్నవారికి, చదివినవారికి మనస్సు విక్షేపరహితమై ఏకాగ్రమవుతుంది. అట్టివారికి పరమపదం కరతలామలకం కావటంలో వింతేమున్నది?' అన్నాడు. పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి వచనామృతాన్ని గ్రోలి, 'మునివర్యా! నా పితామహి, రామకృష్ణుల సోదరి అయిన సుభద్రను నా పితామహుడు

అర్జునుడు పెండ్లాడిన కథను చెప్పుకొంటుంటారు. ఆ వివాహోదంతం వినాలని కుతూహలంగా ఉన్నది' అని అడిగాడు. శుకమహర్షి చెప్పాడు.

## సుభద్రార్జునుల వివాహం

నృపాలాగ్రణీ! బలరాముడు తన చెల్లెలైన సుభద్రకు దుర్యోధనునితో వివాహం జరిపించాలని అనుకొంటుండేవాడు. అది కృష్ణునికి గాని, తదితరులకు గాని సమ్మతంగా ఉండేది కాదు. ఆ సమయంలో మీ పితామహుడు అర్జునుడు తీర్థయాత్రాశీలియై త్రిదండం ధరించి దేశమంతా తిరిగి ద్వారవతికి వచ్చాడు. ఆ త్రిదండయతి అర్జునుడని ఎవ్వరూ గుర్తింపలేకపోయారు. అతనిని బలరామాదులు సత్కరించి బహుమర్యాదలు చేశారు. అంతలో వర్షకాలం వచ్చింది. త్రిదండయతి ఆ వర్షకాలమంతా ద్వారకలోనే ఉన్నాడు.

ఒకనాడు ఆ యతిని ప్రార్థించి బలరాముడు ఇంటికి తీసుకొనివచ్చి అతనికి భిక్షాపరిచర్యలను చేయటానికి సుభద్రను నియమించాడు. సుభద్రను చూసి ఆ యతి, యతిని చూసి సుభద్ర పరస్పరానురాగవశు లయ్యారు.

ఇలా ఉండగా యాదవులు దేవయాత్ర సంకల్పించి పర్వతానికి ప్రయాణాలు కట్టారు. సుభద్ర కూడా ఒక రథంలో బయలుదేరింది. అది సమయంగా యతివేషధారి దేవకీ వసుదేవుల అనుమతి గైకొని, ఆ సుభద్ర ఉన్న రథంలోనికి ప్రవేశించి, అడ్డువచ్చిన భటులను తరిమివేసి సుభద్రను ఖాండవప్రస్థ పురానికి తీసుకొని వెళ్ళాడు.

ఆ సంగతి భటులు బలరామునికి తెలిపారు. అతను పర్వకాలసముద్రం వలె ప్రక్షోభించి, నమ్మించి తనను మోసంచేసిన ఆ కపటయతిని చంపటానికి బయలుదేరాడు. అప్పుడు కృష్ణుడు, మరికొందరు అతనికి అడ్డుపడి కాళ్ళుపట్టుకొని అసలు విషయం వివరించారు. బలరాముడు ఉపశమించి సుభద్రార్జునులకు వివాహం జరిపించాడు.

## శ్రీకృష్ణుని మిథిలాప్రయాణం

రాజవర్యా! శ్రీకృష్ణభగవానుడు చూపిన అద్భుతాలలో మరొకటి చెబుతాను విను. మిథిలారాజ్యాన్ని బహుళాశ్వుడనే రాజు పరిపాలిస్తుండే వాడు. అతను నిరహంకారుడు, భగవద్భక్తుడు.

ఆ మిథిలాపురంలో శ్రుతదేవుడనే బ్రాహ్మణు డుండేవాడు. అతను మహావిద్వాంసుడే గాక పరమశాంతిస్వరూపుడై యదృచ్ఛాలాభసంతుష్టితో చిత్తాన్ని భగవదాయత్తం చేసి గృహధర్మాలను యథావిధి నెరవేర్చుతూ లేనినాడు దిగులుపడక ఉన్ననాడు గర్వపడక నిత్యతృప్తుడై దేహయాత్ర గడుపుతుండేవాడు.

రాజు, బ్రాహ్మణుడు ఇద్దరూ భగవత్ప్రీతికి నోచుకొన్నారు. భగవానుడు వారికి మేలుచేయదలిచి ఒకానొకనాడు నారద వామదేవ అత్రి వ్యాస భార్గవరామాసి వారుణ బృహస్పతి కణ్వ మైత్రేయ చ్యవనాది మహర్షులతో విదేహ పురానికి తరలివెళ్ళాడు. నేనూ నా తండ్రియైన వేదవ్యాసుని వెంట అక్కడికి వెళ్ళాను.

అంతమందిమీ బండ్లుకట్టుకొని ఆనర్త మరు కురు జాంగల వంగ మత్స్య పాంచాల కుంతి మధు కేకయ కోస లార్ణవ దేశాలను చూసుకొంటూ ప్రయాణం సాగించాము. శ్రీకృష్ణభగవానుని రాక సంగతి తెలియగానే ప్రతిగ్రామంలో ప్రతిపట్టణంలో స్త్రీలు పురుషులు గుంపులు గుంపులై వివిధోపాయనాలను సమర్పిస్తూ వారి భక్తి ప్రేమలను కురిపిస్తుండే వారు. భగవానుడు వారందరినీ స్మేరవిలోకనాలతో ఆదరించి, వారివారి క్షేమాలను విచారించి, తత్త్వజ్ఞానం ప్రసాదించి భక్తులు కావించిన తన కీర్తిగీతాలాపనలను ఆలకిస్తూ ఆనందిస్తుండేవాడు.

కొంతకాలానికి మేమందరం నెమ్మది నెమ్మదిగా విదేహ దేశం చేరుకొన్నాము. పౌరజానపదులు పూజామంగళద్రవ్యాలతో ఎదురువచ్చి యథావిధిగా అందరినీ పూజించి మ్రొక్కి తమ భక్తిభావాన్ని తెలుపుకొన్నారు.

ఆనాడు బహుళాశ్వుడు, శ్రుతదేవుడు వచ్చి ఆ లోకైకగురుని పాదారవిందాలకు ప్రణమిల్లి, 'స్వామీ! మాయింట ఆతిథ్యం స్వీకరించండి' అని ప్రార్థించారు. భగవానుడు అంగీకరించాడు.

## భగవన్మాయ

భగవదనుమతిని పొంది బహుళాశ్వ శ్రుతదేవులు ఇండ్లకు వెళ్ళి పూజాద్రవ్యాలను సమకూర్చుకొన్నారు. భగవానుడు మమ్మల్నందరినీ వెంటబెట్టుకొని ఇద్దరి యిండ్లకు ఏకకాలాన బయలుదేరాడు. పరమేశ్వరుడు తన యింటికి వచ్చాడని బహుళాశ్వుడు సంతోషవివశుడై ఆనందబాష్పాలు నిండగా ఉత్తమాసనాలపై మమ్మల్ని కూర్చుండబెట్టి కాళ్ళు కడిగి ఆ జలాలను సకుటుంబంగా తలదాల్చి గంధమాల్యాదులతో అర్చించి షడ్రసోపేత మృష్టాన్నాలను వడ్డింపజేశాడు. మేమందరం కడుపు నిండుగా తిని విశ్రాంతి గైకొన్నాము. అప్పుడు బహుళాశ్వుడు భగవానుని సమీపించి, 'దేవా! నీవు సర్వభూతాత్ముడవు, సర్వభూతసాక్షివి అయి ఉండి భక్తులకు మాత్రం ఈ విధంగా దర్శనభాగ్యం ప్రసాదించటం చూస్తుంటే 'నాకు నా ఏకాంతభక్తుల కంటె ప్రియులు లే' రని నీవన్నమాటను సార్థకం చేయటానికే ఈ పని చేశావని నా కనిపిస్తున్నది. నీ భక్తవాత్సల్యాన్ని గోరంత చవిచూచినవాడు నీ పాదారవిందాలను ఎన్నటికీ విడువలేడు. నీ అనుగ్రహం నీ భక్తులందరి యెడ ఏకరీతిని ప్రసరిస్తుంది. భాగ్యవంతులు నీకు అధికప్రియులు కారు. పేదవారు నీ కటాక్షానికి దూరం కారు. అందుకు కౌపీనమాత్రవసను లైన ఈ మహామునులే నిదర్శనం. సంసారతాప తప్తులను ఉద్ధరించటానికి యదుకులంలో అవతరించి లోకవిచిత్రమహిమలను ప్రదర్శించావు. నీ మహిమలను కీర్తించినంతనే సర్వతాపాలు ఉపశమిస్తాయి. ఇదే నా సాష్టాంగప్రణామం. ఈ మహాత్ము లందరితో కొన్నాళ్ళు మా యింట వసించి నీ పాదపద్మపరాగంతో నిమికులానికి పావనత్వాన్ని ప్రసాదించు' అని ప్రార్థించాడు. భగవానుడు అతని ప్రణయాన్ని అంగీకరించి మిథిలానగరవాసులకు శుభం కూర్చుతూ కొంతకాలం అక్కడున్నాడు.

అదే సమయానికి భగవానుడు మహర్షులతో శ్రుతదేవుని ఇంటికి వచ్చాడు. శ్రుతదేవుడు తన కున్నంతలో దర్భాసనాలను, గడ్డిచాపలను పరిచి, వారికి ఎదురేగి స్వాగతం అడిగి భార్యతో కలిసి మ్రొక్కి కాళ్ళు కడిగి ఆ జలాలను అతను, అతని భార్య, కుటుంబంలోని వారందరూ శిరస్సుపై చల్లుకొని, రుచికరమైన పండ్లు వట్టివేరు నీరు తులసి కుశలు కమలాలు సమర్పించి సాత్త్వికాహారం నివేదించి, 'ఓహో! నేను గృహాంధకార మగ్నుడనై ఉన్నవాడను. నావంటివాడికి భగవానునితో, మహామునులతో సమాగమం కలిగినదంటే ఎంత అదృష్టం!' అని లోలోన తలపోయసాగాడు. మేమందరమూ కృతభోజనులమై విశ్రాంతిగా కూర్చున్నాము. శ్రుతదేవుడు భార్యాపుత్రబాంధవాదులతో వచ్చి భగవానుని పాదాలొత్తుతూ ఈ విధంగా ప్రసంగించాడు.

## భగవన్మహిమ

'దేవా! స్వప్నావస్థుడు ఆ అవస్థలో అతని అవిద్య కల్పించిన లోకాంతరాలలో సంచరించినట్లు నీవు నీ మాయాశక్తుల చేత ఈ జగత్తును నిర్మించి ఆత్మసత్తారూపంలో ఆ జగత్తులోనికి ప్రవేశించి అందులోనే విహరిస్తుంటావు. అట్టి నీవు నేడు మాకు దర్శనమివ్వటం మా భాగ్యవిశేషమే ననుకొంటాను. జగదీశ్వరా! నీవు లేనిచోటు లేదు. ఎవరు నీ కథలు వింటుంటారో, ఎవరు నిన్ను కీర్తిస్తారో, అర్చిస్తుంటారో, అభినందిస్తారో, నిన్నుగూర్చి సంభాషిస్తారో, వారందరి హృదయాంతరాళాలలో నిరంతరం వెలుగొందుతూ వారికి గోచరిస్తుంటావు. కేవల కర్మపరుల సంగతి వేరు. నీవు వారి హృదయాలలో ఉన్నప్పటికీ వారు నిన్ను కనుగొనలేక ఎక్కడో ఉన్న నిన్ను సంతృప్తుని చేయాలని ప్రయత్నిస్తుంటారు. వారి భావాలు కర్మవిక్షిప్తంగా ఉండటమే అందుకు కారణం. సర్వకర్మలకు నీవే కర్తవు భోక్తవు అని సామాన్యంగా లోకానికి తెలియదనే చెప్పాలి. దేహాద్యభిమానాలు లేక జీవబ్రహ్మము లొక్కటేనని గ్రహించి సంసారం ఎలా నడుపుకోవాలో ఆ

విధానంలో నీవే నడిచి మాకు మార్గాన్ని బోధిస్తావు. నీ దర్శనం లభింపనంతవరకే నరులకు క్లేశాలు. నీ దర్శనం సిద్ధింపగానే క్లేశాలన్నీ పటాపంచలై ఏకాంతికానందం సంప్రాప్తిస్తుంది. మేము నీ కింకరులము; ఆజ్ఞాపించు' అని పునఃపునస్సాష్టాంగాలు చేశాడు.

## విప్ర శబ్ద నిర్వచనం

భగవానుడు శ్రుతదేవుని చేతిని తన చేతిలోనికి తీసుకొని, 'విప్రోత్తమా! ఈ మునులు నిన్ను అనుగ్రహింప వచ్చినవారని గ్రహించు. వీరు నాతోపాటు తిరుగుతూ తమ పాదరేణువుల చేత లోకాలను పవిత్రీకరిస్తుంటారు. లోకులు ఆత్మపావనార్థులై దేవతలను పూజిస్తారు. తీర్థాలలో మునుగుతారు. ఆ కార్యాల ఫలం బహుకాలానికి కలుగుతుంది. ఆ ఫలం కూడా దేవతలకు స్వతఃశక్తి వలన కాదు; మహనీయుల సందర్శనభాగ్యం వలన వారికి ఆ శక్తి సమకూడుతున్నది. జీవరాశి అంతటికీ జన్మమును బట్టి, సంస్కారాన్ని బట్టి రెండు వర్ణాలు పేర్కొనబడ్డాయి. జననమాత్రమైనది ఉపాధిసంబంధం; సంస్కారరూపమైనది గుణసంబంధం. ఈ రెండూ బ్రాహ్మణులలో ఉత్తమంగా ఉంటాయి. ఆ కారణాన బ్రాహ్మణుడు జన్మమాత్రాననే ప్రాణులందరిలో ఉత్తము డనదగినవాడు. దానికి తోడుగా అతను తపస్సు విద్య బ్రహ్మోపాసన అనే శక్తులను ఆర్జింపగలిగితే అతని మహిమ వర్ణనాతీతం. అట్టి బ్రాహ్మణమూర్తి నాకు ప్రియమైనట్లు నా యీ చతుర్భుజరూపం కూడా నాకు ప్రియంకాదు. విప్రుడంటే సర్వవేదమయుడు; నేనూ సర్వవేదమయుడనే. కావున నేను విప్రరూప గురువును. ఆ సంగతి తెలియక విప్రుల యెడ ఈర్ష్యవహిస్తారు. ఆ చేత నాపై ఈర్ష్యవహించటం వంటిదే. విప్రుని యందున్న ఆధిక్యం ఏమిటో తెలియాలంటే, విప్ర శబ్దానికి ఎవరు యోగ్యులో ముందు తెలుసుకోవాలి. మహదాదులు విశ్వసృష్టికి కారణాలు. ఆ మహదాదులన్నీ నా అంశాలే. ఇది గ్రహించి విశ్వమంతా నా రూపమే అని విశ్వసించి ఎవడు సమదర్శియై వర్తిల్లుతాడో అతనికి విప్రుడని పేరు. ఈ మహర్షులందరూ అట్టి

మహాత్ములు. వీరిని నిత్యం ఆరాధించు. వీరిని ఆరాధించటం నన్ను ఆరాధించటమే అవుతుంది. ఆ విధంగా అర్చించటమే నా అర్చనగాని కొండలంత విభూతులివ్వటం కాదు' అని చెప్పి, ఆ భక్తులిద్దరికీ ప్రీతిగూర్చి బ్రహ్మపరత్వాలు, స్వయంప్రమాణాలు అయిన వేదాలను ఉపదేశించి ద్వారకకు తిరిగి వెళ్ళాడు. వారిద్దరూ భగవత్కృపకు పాత్రులై సద్గతికి చేరుకొన్నారు.

## అగమ్యుని గ్రహించే మార్గం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి వచనాలను సాకల్యంగా విని, 'మహాత్మా! భగవల్లీలాదులు వినిపించి నన్నెంతో చరితార్థుని కావించారు. అయితే ఒక్క సంశయం మాత్రం ఇంకా తీరలేదు. ఎవరైనా మీ వద్దకు వచ్చి, 'అయ్యా! రాము డెటువంటివాడు?' అని అడిగినప్పుడు మీరేమని చెబుతారు? రాముని గుణాలను, అతని అవతార కార్యాలను వివరిస్తారు. పృచ్ఛకుడు ఆ వచనాలను విని రాముని గురించి ఒక విధమైన మనోరూపాన్ని ఉపకల్పించుకొని, నా రాముడు ఇటువంటివాడు కదా అని తృప్తిపడతాడు. అంటే, వ్యక్తియొక్క గుణవృత్తాలను చెప్పటంవల్ల ఆ వ్యక్తిని గురించి చెప్పినట్లయింది. ఆ మాటలను బట్టి ఆ వ్యక్తి ఇటువంటివాడని భావించే అవకాశం కలుగుతున్నది.

భగవంతుడు ఎటువంటివాడు? అని అడిగినప్పుడు నిర్గుణుడు నిష్క్రియుడు నిరాకారుడు అని మీరన్నారు. గుణములు లేనివానిని గురించి గుణవర్ణన చేయబూనటం అసంభావితం. అలాగే క్రియాహీనుని గురించి అతను ఈ పనులను చేశాడు అని చెప్పటమూ అసంభావితమే. కాబట్టి గుణవృత్తులు లేనివానిని గురించి ఆ గుణవృత్తులనే ఆధారంగా పెట్టుకొని వర్ణించటానికి అవకాశమే లేదు కదా. సంగతి ఇలా ఉండగా, 'బ్రహ్మమును శ్రుతులు బోధిస్తున్నాయి' అన్నమాట ఎలా పొసగుతుంది? శ్రుతులకే గమ్యుడు కాని ఆ పరబ్రహ్మాన్ని నా వంటివాడు ఎలా తెలుసుకోవాలి?

## బ్రహ్మము శ్రుతులకు గమ్యమే

మహాత్మా! బ్రహ్మము శ్రుతులకు ఎందుచేత గమ్యుడు కాదు? అని అడుగుతారా? శ్రుతులన్నవి శబ్దములు మాత్రమే. శబ్దము తన భావాన్ని వృత్తిరూపంలో తెలుపుతుంది. ఆ శబ్దవృత్తులు ముఖ్యవృత్తి లక్షణావృత్తి గౌణవృత్తి అని మూడు విధాలు. వాటిలో ముఖ్యవృత్తి మళ్ళీ రూఢి అని, యోగమని రెండు విధాలు. రూఢివృత్తి స్వరూపాన్ని  గాని జాతిని గాని గుణాన్ని కాని తెలుపుతుంది. డిద్ధుడు అనే శబ్దం స్వరూపరూఢి వృత్తికి, గోవు అనే శబ్దం జాతి వృత్తికి, శుక్లము అనే శబ్దం గుణవృత్తికి ఉదాహరణలు. అంటే ఆ శబ్దముల వల్ల వస్తుస్వరూపాన్ని గాని జాతిని గాని గుణాన్ని గాని తెలుసుకొని ఆ వస్తువిట్టిది అని మనము గ్రహింపగలుగుతున్నాము. 'గంగలో గొల్లపల్లె' అనే వాక్యం లక్షణావృత్తికి ఉదాహరణీయం. గంగ లోపల గొల్లపల్లె ఉండటం సాధ్యంకాదు కనుక గంగ ఒడ్డున ఉన్నదని గ్రహించాలి. గొల్లపల్లెలు అనేకం ఉండవచ్చును. ప్రకృతం నిర్ణయింపవలసిన గొల్లపల్లె ఏది? అన్నప్పుడు, 'గంగ ఒడ్డున ఉండే గొల్లపల్లె' అని ఆ వృత్తిముఖంగా నిర్ణయింపబడుతున్నది. 'దేవదత్తుడు సింహము' అనేది గౌణవృత్తికి ఉదాహరణం. దేవదత్తుడు సింహం కాదు. కాకపోతే మరేమిటంటే సింహమువంటి పరాక్రమం కలవాడని అర్థం. పరాక్రమ గుణాన్ని తెలియజేసేది కాబట్టి దీనిని గౌణి అన్నారు. 'పంకజము' అనే శబ్దం యోగవృత్తికి ఉదాహరణ మవుతుంది. శబ్దవృత్తులు మూడింటి చేత తెలుపబడుతున్న పదార్థాలకు, ప్రకృతి ప్రత్యయాలకు గల సంబంధాన్ని యోగవృత్తి సూచిస్తుంది.

'బ్రహ్మము ఇట్టిదని నిర్దేశింపరాని పదార్థం' అని మీరన్నారు. రూఢివృత్తి అన్నది పదార్థాన్ని నిర్దేశిస్తుంది. అనిర్దేశ్యాన్ని ఎలా నిర్దేశింపగలుగుతుంది? కనుక బ్రహ్మమును గురించి మాట్లాడటానికి రూఢివృత్తి ఉపయోగింపదు. గుణవృత్తి సంగతి చూతామంటే, అది గుణాన్ని తెలుపగలిగినది. బ్రహ్మము నిర్గుణము అన్నారు కాబట్టి గుణవృత్తి పొసగదు. బ్రహ్మము సత్తునకు,

అసత్తునకు పరమై ఉండేదన్నారు. లక్షణా యోగవృత్తులు సంబంధాన్ని తెలుపగలవు. దేనితోను సంబంధం లేని బ్రహ్మమును సంబంధద్యోతాలైన లక్షణాయోగవృత్తులు తెలుపలేవు. బ్రహ్మము పదార్థం కాదు కాబట్టి పదార్థాన్ని బోధించే వృత్తులు గాని ఆ వృత్తులకు మూలములైన శబ్దాలు గాని బ్రహ్మమును తెలుపలేవు. అందువల్ల శబ్దరూపాలైన వేదాలు వాక్యార్థాలకు అందనట్టి బ్రహ్మమును ఎలా తెలుపగలుగుతున్నాయి?' అని అడిగాడు. శుకుడు అతని భావం గ్రహించి దానికి సమాధానం చెప్పాడు.

'రాజేంద్రా! శబ్దము వస్తువుయొక్క గుణక్రియలను మాత్రమే వర్ణింపగలదని, గుణక్రియలు లేని వస్తువును గురించి శబ్దం చెప్పగలిగినదేమీ లేదని, పరమాత్మ నిర్గుణుడు నిష్క్రియుడు కాబట్టి శబ్దము అట్టి నైర్గుణ్యాన్ని గురించి ఏమి చెప్పగలదని, వేదం శబ్దప్రమాణం కాబట్టి అది నిర్గుణుడు, నిష్క్రియుడు అయిన పరమాత్మను బోధిస్తుందనటం యుక్తియుక్తం కాదని, అందువల్ల భగవత్తత్త్వనిర్ణయం విషయంలో వేదం నిరుపయోగమని నీ మాటలలోని సారాంశం కదా. నీ సందేహాన్ని గురించి విచారిద్దాము.

వస్తువు గుణక్రియలతో కూడి ఉన్నప్పుడు శబ్దం చేస్తున్నదేమిటి? ఆ గుణక్రియలను వర్ణించటం మాత్రమే. గుణక్రియలకు అతీతమైన వస్తువు శబ్దానికీ అతీతమే. శబ్దము గుణక్రియలను వర్ణించినందువల్ల కలిగిన ఫలమేమిటి? ఆ వస్తువు ఇటువంటి గుణక్రియలు కలిగినదని నీకొక భావం ఏర్పడుతున్నది. అంతే కదా? ఆ వస్తువుకు గుణక్రియలు లేనప్పుడు ఏమని తెలుస్తున్నది? ఆ వస్తువు గుణక్రియారహితమైనది అని మాత్రమే భావింపబడుతుంది. ఈ రెండుపక్షాలలోనూ నీ బుద్ధియందు ఒక భావన ఏర్పడటం మాత్రమే జరుగుతున్నది. ఇందులో మొదటి పద్ధతిని అన్వయ క్రమమని, రెండవ పద్ధతిని వ్యతిరేక క్రమమని అంటారు. ఈ రెండు పద్ధతుల ప్రకారం ఏర్పడుతున్నది భావమే కాని మరొకటి కాదు కదా! ఈ రెండింటిలో

దేనివల్లనైనా వస్తుతత్త్వం నీకు బోధపడుతున్నదా? లేదా? వేదం సంగతి కూడా అంతేనని గ్రహించు. వేదము ఏమని చెబుతున్నదంటావా? అన్నిటికి మూలమైన సత్పదార్థం ఒకటున్నదని వేదం ప్రారంభిస్తున్నది. ఆ సత్పదార్థం ఎటువంటిది? అని అడిగినప్పుడు 'నేతి, నేతి' – అనగా నీ కంటికి కనబడుతున్న వస్తువులలో ఏ ఒక్కటీ ఆ సత్పదార్థం కాదని ప్రతిపాదిస్తున్నది. ఆ ప్రకారం చెప్పినప్పుడు నీ బుద్ధికి గోచరిస్తున్నదేమిటి? ఇంద్రియగోచరం కాని అతీంద్రియమైన ఒక పదార్థం ఉన్నదనే భావం నీకు ఏర్పడుతున్నదా? లేదా? ఆ భావాన్ని కలిగించినప్పుడు వేదం ఆ సత్పదార్థాన్ని చెప్పినట్లా? చెప్పనట్లా? రాజా! శబ్దప్రమాణమైన వేదం ఏ విధంగా సత్పదార్థాన్ని నిరూపించిందో గ్రహించావా? ఇంతెందుకు? సర్వం భావమాత్రమే కదా.

ఈ భావం ఎక్కడ ఏర్పడుతున్నది? నీ బుద్ధియందు ఏర్పడుతున్నది. అట్టి బుద్ధిని, మనస్సును, ఇంద్రియాలను, ప్రాణాన్ని భగవానుడు జీవునికి కల్పించాడు. ఈ నాలుగూ దేహికి ఉపాధులుగా ఉన్నాయి. ఈ ఉపాధుల సాహాయ్యంతో జీవుడు అర్థము ధర్మము కామము మోక్షము అనే పురుషార్థచతుష్టయాన్ని సాధింపగలుగుతాడు. వాటిలో అర్థము విషయభోగరూపం; ధర్మము కర్మానుష్ఠానరూపం; కామము ఆయా స్వర్గనరకలోకభోగరూపం; మోక్షము కైవల్యరూపం. ప్రాణం శరీరాన్ని నిలుపుతున్నది. ఇంద్రియాదులు శబ్దాలను గ్రహిస్తున్నాయి. మనస్సు వాటిని బుద్ధికి అందిస్తున్నది. బుద్ధి పరిశీలించి నిశ్చయానికి వస్తున్నది.

> రాజా! ఈ విధంగా వేదం కాని వేదలతాంతాలైన ఉపనిషత్తులు కాని తద్రూపాలే అయిన ఇతరశబ్దజాలం కాని నిర్గుణ నిష్క్రియుడైన బ్రహ్మమును గూర్చి వ్యతిరేకక్రమంలో ఒక భావాన్ని జీవులకు కలిగిస్తున్నాయి. ఆ భావాన్ని ఆధారంగా గ్రహించి జీవులు పురుషార్థాలను అనుభవిస్తుంటారు. శూన్యాన్ని గురించి చెప్పినప్పుడు అదీ ఒక భావమే కదా! కాబట్టి లోకమంతా భావమూలకమే తప్ప వాస్తవం కాదు.

## నారద నారాయణ సంవాదం

రాజా! ఈ విషయమై పూర్వం నారదునికి, నారాయణమునీంద్రునికి సంవాదం జరిగింది, అది చెబుతాను విను. నారదమహర్షి లోకసంచారం కావిస్తూ ఒకనాడు నారాయణమునీంద్రుని చూడటానికి బదరికాశ్రమానికి వెళ్ళాడు. నారాయణు డెవరంటావేమో? ధర్మము, జ్ఞానము, శమము –వీటి వలన జనులకు క్షేమ మోక్షాలు కలుగుతాయి. ఆ విధానాన్ని భారతవర్షజనులకు చూపగోరి భగవానుడు నారాయణఋషి రూపం దాల్చి కల్పాంత తపశ్చర్యావ్రతాన్ని పూని అక్కడ బదరికలో తపస్సు చేస్తున్నాడు. ఆ తరిని కలాపగ్రామవాసులైన మునులు ఆ మహర్షి చుట్టూ కూర్చొని ఉన్నారు. నారదుడు ఆ మహర్షిని సందర్శించి నీవడిగిన ప్రశ్ననే ఆయన నడిగాడు. ఆయన చెప్పిన సమాధానం ఏమిటంటే –

'నారదమునివర్యా! నీవు శ్వేతద్వీపానికి వెళ్ళి ఉండగా బ్రహ్మమానసపుత్రులు సనకాదిమునులు జనలోకంలో ఒకనాడు సమావేశమై బ్రహ్మసత్త్రానికి ఉపక్రమించి బ్రహ్మవిచారం కావించారు. సనకాదు లందరూ సమదృష్టులు పరస్పరసమానులు అని నీకు తెలుసు కదా. అయినా వారు జ్ఞానప్రమోదార్థం సనందనుని ప్రవక్తగా నియమించుకొని నీవు చేసిన ప్రశ్ననే అతని నడిగారు. సనందనుడు వారికి తత్త్వాన్ని ప్రబోధించాడు.

## సనందన కృత తత్త్వప్రబోధం

మునులారా! రాజు రాత్రి కాగానే నిద్రపోతున్నాడు. వేకువజామున స్తుతిపాఠకులు వచ్చి మేల్కొలుపులు పలుకుతున్నారు. ఏమని? ఆ రాజు కీర్తివిక్రమాలను వర్ణిస్తున్నారు. ఆ ధ్వనులకు రాజు మేల్కొంటున్నాడు. అదే విధంగా భగవానుడు జగత్ప్రళయకాలాన తన సర్వశక్తులను ఉపసంహరించి యోగనిద్రకు ఉపక్రమిస్తాడు. మళ్ళీ జగదుదయకాలం వచ్చేసరికి శ్రుతులు భగవచ్చరిత్రలను ఉగ్గడిస్తున్నాయి. శ్రుతులు అనాదులు. అనగా భగవంతుడు మొట్టమొదట అతని యోగనిద్రనుంచి మేల్కొన్నప్పుడు అతని నిఃశ్వాసం

ద్వారా అవి వెలువడ్డాయి. అది ఎప్పుడో చెప్పటం సాధ్యం కాదు గనుక వేదాలను అనాదులు అన్నారు.

## శ్రుతి గీతలు

శ్రుతు లేమంటున్నాయి? 'అజితా! జయోస్తు! చరాచరజీవరాశీ అవిద్యావృతమై ఉంటున్నది. ఆ అవిద్య గుణరూపం ధరించి జీవులకు స్వాభావికంగా సిద్ధించిన ఆనందాదులకు వారిని దూరం చేస్తున్నది. ఆ అవిద్యను నీవు హరించు! అంటున్నాయి. 'అవిద్యను హరించే శక్తి నాకుమాత్రం ఎక్కడి' దంటావా? నీవు సర్వశక్తిమంతుడవు. అన్ని శక్తులు నీకు అధీనాలై వర్తిస్తాయి. జ్ఞాన వైరాగ్యాలు కలిగిననాడు సర్వం వశమై ఉంటుందని, అట్టి జ్ఞాన వైరాగ్యాదులను సంపాదించి గుణశక్తులను, వాటికి మూలమైన అవిద్యాశక్తిని పారద్రోలవచ్చు నంటావా? సర్వశక్తులకు అంతర్యామివై ఆ శక్తులకు ఉద్బోధాన్ని కలిగించేది నీవే. కాబట్టి జీవుల జ్ఞానాదిశక్తులను కూడా నీవే ఉద్బోధింపవలసి ఉన్నది. ఎటు విచారించినా నీ అనుగ్రహం వలన గాక వేరొక మార్గాన మాయను గెలువలేమనే ఏర్పడుతున్నది. ఈ మాటకు ప్రమాణ మేమంటావా? వేదాలమైన మేమే ప్రమాణం. వేదాలకు ఆ ప్రామాణ్యం ఎక్కడిదంటావా? మేము నీ నిట్టూర్పునుంచి అవతరించాము. వేదాలు నా శ్వాసజనితాలైతే కావచ్చును గాని, అంత మాత్రాననే వాటికి నా యథార్థస్వరూపం ఎలా తెలుస్తుందంటావా? నీకు నిర్గుణరూపం, సగుణరూపం, రెండూ వున్నాయి. నీ నిర్గుణరూపం వర్ణనాతీతం. కాబట్టి దానిని మాటలలో చెప్పతరం కాదు. నీవు నీ మాయ నధిష్ఠించి ప్రపంచ రూపాన్ని దాల్చినప్పుడు, నీవు లీలావతారాల నెత్తినప్పుడు మాత్రమే వర్ణనయోగ్యుడవు కాగలవు. అప్పుడు నీవిట్టి వాడవని మేము చెప్పగలుగుతాము. ఆ చెప్పటం ఒక విధంగా నీ నిర్గుణరూపాన్ని కూడా చెప్పినట్లే అవుతుంది.

దేవా! 'ఇంద్రవరుణాది దేవతలను కూడా వర్ణిస్తున్నారు, వారి వర్ణనకు నా వర్ణనకు భేదమేమున్నది?' అని అడుగుతావా? ఘటాదులు ఏ విధంగా మృత్తువలన పుట్టి మృద్వికారంలో నుంచి తిరిగి మృత్తునందే లయమవుతున్నవో, అదే విధంగా ఇంద్రాదులే గాక దృశ్యసామస్త్యం నీ వలన జనించి నీయందే ఉండి తుదకు నీయందే లయిస్తున్నదని, సర్వము బ్రహ్మమే గాక తదితరమైనది ఏమీలేదని, సమస్తం లయించినప్పుడు కూడా నీవుమాత్రం శేషించి ఉంటావని, లయమంటే నీవు ధరించిన రూపనామాదుల లయమే గాని మూలవస్తు లయం కాదని, మూలమెన్నడు లయింపదని, జగదుత్పత్తి అనగా నీ వివర్తమే నని, మృద్వికారాలైన కుండలు మొదలయినవాటిని వర్ణించినప్పుడు మృత్తికాది ప్రభావాన్ని వర్ణించటమే ఫలితార్థం అయినట్లు, ఇంద్రాదులను వర్ణించటం కూడా నిన్ను వర్ణించటమే అవుతుందని మేమంటాము. మా వచనఫలం ఏమంటావా? మా వచనాలు విని సమస్తానికి నీవే వివర్తరూపంలో అధిష్ఠాతవని బ్రహ్మద్రష్టలు గ్రహించి మనోవాక్కాయాల చేత నీ ధ్యాన కీర్తన పూజాదులు నిర్వర్తిస్తుంటారు. వారి మార్గం ఇతరులకు ప్రదీపకం అవుతుంది. భూమిమీద రాళ్ళు పుల్లలు మొదలయినవి ఉంటాయి. వాటిలో దేనిమీద అడుగువేసినా భూమిమీద అడుగుపెట్టినట్లే కదా. ఆ రాళ్ళు మొదలైనవన్నీ భూమినుంచి పుట్టి భూమి మీద పరుచుకొని ఉంటాయి. వాటిమీద నడవటం వాటికి మూలభూతమైన పృథ్వీమీద నడవటమే కదా. అలాగే, నీ వలన జనించిన దేనిని చెప్పినా పరమార్థతః నిన్ను చెప్పినట్లే అవుతుంది.

## మాయా తరణోపాయం

దేవా! నీ మాయాప్రేరితులై నరులు శుభాశుభ భావక్రియలలో తగుల్కొని వర్తిల్లుతుంటారు. త్రిగుణాత్మికయైన మాయ నీ ఇచ్చవచ్చినట్లు నటిస్తుంది. నీ మాయనుంచి తొలగి వర్తించే మార్గమేమిటని వివేకులు ఆలోచించారు. నీ కథాసుధాసాగరంలో ఓలలాడటం వలన నీ మాయ తొలగిపోతుందని

నిశ్చయింపబడింది. ఆ విధంగా చేసి వారు కృతార్థులు కాగలుగుతున్నారు. నీ కథాకర్ణనమే అంత ప్రభావం కలిగినదై ఉండగా, నీ స్వరూపస్ఫురణ కాంచిన వారి సంగతి వేరే చెప్పాలా? రాగాదులన్నీ అంతఃకరణధర్మాలు; జరాదులన్నీ కాలధర్మాలు. నీ స్వరూపస్ఫురణ కలిగిన వారు ఆ రెండింటినీ లెక్కచేయరు. తత్ఫలంగా వారికి అఖండానందానుభవం లభిస్తున్నది. ఆ మహాభాగ్యుల భాగ్యమే భాగ్యం.

## సర్వసాక్షిత్వం

నీకు భక్తిచేయనినాడు ఇహపరాలు రెండింట గోరంత సుఖం కూడా కలగదు. నీకు భక్తి కావిస్తే జన్మ సఫలమవుతుంది. నీకు భక్తిచేయక జీవించి ఉండటం తోలు తిత్తుల మాదిరి బుసవిడుస్తుండటంతో సమానం. మహదాదులు ఈ అండాన్ని సృజించిన వంటారు. అవి స్వాభావికంగా జడాలు. వాటిలో నీవు ప్రవేశించినప్పుడే అవి కార్యకారులు కాగలవు. బ్రహ్మాండము సంగతే అలా ఉండగా దానిలో ఉన్నవారి సంగతేమనుకోవాలి?

దేవా! శరీరాలన్నీ అన్నమయాది పంచకోశాలతో కూడి ఉన్నాయి. ఆ కోశపంచకాన్ని నీవు ఆత్మని రూపంలో ప్రవేశించి అలముకొని ఉంటావు. ఆ తీరున లోనున్న నిన్ను మరచినవారికి శాంతిసుఖా లెక్కడినుంచి వస్తాయి? నీవు లోనున్నంత కాలమే పంచకోశాల స్థితి ఉండటం, ఆ కోశాల ఉనికి తెలియటం జరుగుతున్నది. ఏనాడు నీవు తొలగితే ఆనాడే పంచకోశాలు నశిస్తున్నాయి. అవి నశించినా నీకు నాశనం లేదు. నీవు సర్వాంతర్యామివై ఉన్నా నీకు దేనితోనూ సంబంధం కలుగదు. అంతెందుకు? ఏది మనోదృష్టమై ఉంటుందో అది సత్యం కానీ అసత్యం కానీ కారణం కానీ కార్యం కానీ ఆ అన్నింటికి ఆవల నీవుంటావు. దృశ్యమైనదానినల్లా 'ఇది కాదు, ఇది కాదు' అని విడిచిపెడుతూ పోగా చిట్టచివరికి నిలిచేది ఏదో, ఆ సన్మాత్రపదార్థానివై నీవుంటావు. ఆ పదార్థానికి సాక్షి ఎవరంటావా? సర్వభూతసాక్షివి నీవే

సాక్షివి. అనగా చూసేవాడివి, చూడబడేవాడివి రెండూ నీవే. నీకంటె అన్యమైనది వేరొకటుండదు.

## భగవత్ప్రాప్తిమార్గాలు

దేవా! నిన్ను పొందటానికి ఋషులు వివిధమార్గాలను అవలంబించారు. నాభిప్రదేశంలో మణిపూరకమనే చక్రం ఉన్నది. అందు బ్రహ్మరూపంలో నిన్ను కొందరు ఉపాసించటం జరుగుతుంది. వారిని శార్కరాక్షులంటారు. దహరాకాశంలో జ్యోతి రూపాన ఉంటావని కొందరు నిన్ను ఉపాసిస్తారు. వారిని ఆరుణు లంటారు. నీవు సర్వదేహాలకు ఉపాదాన కారణానివై ఆయా రూపాలను అనుకరిస్తావు. నీ అనుకరణ తారతమ్యం దారువులను బట్టి వహ్ని ఉన్నట్లుంటుంది. ఆ శరీరాలన్నీ అశాశ్వతాలైనా నీవు మాత్రం సత్యము నిర్విశేషము సన్మాత్రమునై శాశ్వతుడవుగా ఉంటావు. దర్శనం ఎప్పుడవుతుంది? అంటే, నీ స్వరూపం కర్మఫలాలలో మదినిల్పక నిర్మలచిత్తులై ఉన్నప్పుడు మాత్రమే గమ్యమవుతుంది. దేహాలన్నీ ప్రారబ్ధకర్మోపార్జితాలు. జీవుడు కార్యకారణావరణ రహితుడవు పూర్ణుడవు అయిన నీయొక్క అంశమాత్రుడై పురుషుడనే పేరితో శరీరాలలోనికి ప్రవేశించి భోక్తవలె ప్రవర్తిస్తాడు. విద్వాంసులు జీవతత్త్వం ఇదని శోధించి నీ తత్త్వం దుర్బోధమని తలచి నీ అవతార కథా సుధారసాన్ని గ్రోలి హంసలు పద్మములను నమ్ముకొన్నట్లు నీ పాదపద్మాలను ఆశ్రయించి సంసారాన్ని వదిలి నీ భక్తులను కూడి మోక్షాన్ని సైతం కోరక నీ తోడిదే లోకంగా ఉంటారు.

## భ్రాంతి నివారణోపాయం

దేవా! నిన్ను సేవించటానికి శరీరం పరమసాధనమై ఉన్నది. ఆ శరీరమందుండి దాని రక్షణభరణాదులను నీవు కావిస్తుంటావు. నీకన్న ప్రియుడు హితుడు శరీరధారులకు వేరొకడుండడు. ఎల్లప్పుడు వెంట నిలిచి ఇంత మహోపకారం నీవు కావిస్తున్నా నిన్ను మరిచి దేహలాలనలతో

జీవితాన్ని నిరర్థకం చేసుకొంటున్నారు. ఈ రిక్తకర్మాచరణమే నానాజన్మలకు, వివిధ శరీర ధారణలకు కారణ మవుతున్నది. ఇటువంటి దేహలాలనభావానికి కారణం ఏమిటి? ప్రారబ్ధకర్మవాసనలే కారణం. వాటిని అరికట్టే మార్గం ఏమిటి? మొట్టమొదట ప్రాణాన్ని నియమించాలి. ప్రాణవాయునియమంతో మనోనియమం సిద్ధిస్తుంది. దానితో ఇంద్రియాలు తమంత తామే నియమితా లవుతుంటాయి. ఈ విధానాన్నే యోగమని అంటారు. మునులు ఈ విధంగా యోగనిష్ఠులై హృదయాంతరాలలో నిన్ను సముపాసించి యోగసిద్ధి నొందుతారు. నీ స్మరణం నీకు సుముఖులైన వారికే గాక నీయెడ వైరభావం వహించినవారికి, రాగభావం వహించినవారికి పురుషులకు స్త్రీలకు ఏకరూపంలో నీ ప్రాప్తికి యోగ్యతను కలిగించింది. మేముకూడా సమదర్శనాన్ని సాధించి తత్ఫలితంగా నీ కృపకు నోచుకొని నీ చరణారవిందమకరందాన్ని గ్రోలగలిగాము.

## విపరీత మతాలు

దేవా! నీవు సర్వసృష్టికి పూర్వమందే ఉన్నావు. నీకు ఆద్యంతాలు కలుగవు. నీచే సృజింపబడినట్టి కాలవశులు నీ సంగతి ఇట్టిదని గుర్తించటం గాని వర్ణించటం గాని ఎలా సాధ్యపడుతుంది? నీ వలన మొట్టమొదట బ్రహ్మదేవుడు జనించాడు. అతని వెంబడి ఆధ్యాత్మిక తత్త్వపరులైన సనకాదులు, ఆదిభౌతిక ప్రాపకులైన మరీచ్యాదులు ఉదయించారు. తదనంతరం భూతజాతం ఉదయించింది. నీవు నీ సర్వశక్తులను లోనికి లాగుకొని యోగనిద్రను పూనినప్పుడు ఆకాశాది స్థూలవస్తువులు, మహదాది సూక్ష్మవస్తువులు, ఉభయార్థకమైన శరీరం, శరీరానికి నిమిత్తభూతమైన కాలవైషమ్యం, ప్రాణేంద్రియాలు, సర్వశాస్త్రాలు, జీవుడు నీలోనే ఉంటారు.

నీ యోగనిద్రా వేళ నిన్నుగూర్చి జ్ఞాపకం చేసే సాధనాలేవీ జీవునికి లభింపవు. ఆ కారణాన విపరీతభావనలకు లోనై శూన్యము నుండి జగత్తు ఏర్పడినదని వైశేషికులు, బౌద్ధులు; జగదుత్పత్తిలయాలు స్వాభావికాలని

చార్వాకులు నిర్వచించారు. అభావం నుంచి భావపదార్థం రాదని, సర్వం సత్పదార్థ ముఖంగా వచ్చినవేనని పాతంజలు లంటారు. దుఃఖభావమే మోక్షమని, మోక్షాన్నిచ్చేవాడు వేరొకడు లేదని నైయాయికులు చెబుతారు. సృష్టికి మూలం ప్రకృతి పురుషులని సాంఖ్యులు పేర్కొంటారు. కర్మసాధ్యములైన ఇహపరలోకాలు, ఆ లోకాలలోని భోగాలు – అనగా కర్మఫల వ్యవహారం – సత్యములని మీమాంసకు లంటారు. నీ సత్యస్వరూపాన్ని చక్కగా గ్రహింపలేకపోవటం వలన ఇన్ని భేదమతాలకు అవకాశం ఏర్పడుతున్నది.

మూడు గుణాలు ప్రపంచించటం వలన ప్రపంచం ఏర్పడుతున్నది. ఆ గుణాలన్నవో అవి మానసికాలు కాబట్టి ప్రపంచమూ మానసికమే అవుతుంది. అందువలన ప్రపంచం ఎప్పుడూ అసత్పదార్థమని అంటారు. అట్టి అసత్పదార్థం నీ అధిష్ఠానసత్త చేత సత్పదార్థం వలె గోచరిస్తుంది. ప్రపంచం ఒక్కటే కాదు. పురుషుని సంగతీ అంతే. ఇది పరిశీలించి తత్త్వవిదులు భోగ్యభోక్తృరూపంలో కనుపించే విశ్వమంతా ఆత్మకార్యమై ఆత్మరూపంలో ఉన్నదని, అంతటికీ ఆత్మయే ఉపాదానకారణమని, ఆత్మకు భిన్నమైన వస్తువు అణుమాత్రమైనా లేదని నిశ్చయించారు. ఆత్మరూపమైన విశ్వాన్ని చూసి విశ్వదృష్టిలో మునిగి దానికి మూలమైన నిన్ను నిరసించటం ఎలా ఉందంటే బంగారం కావాలనుకొన్నవాడు మంచి బంగారు నగ లభించినప్పుడు భూషణదృష్టిపరుడై, ఇందులో పనితనమే ఉన్నది గాని బంగారం లేదని అన్నట్లు నిర్హేతుకంగా ఉన్నది.

## భగవత్సేవకు ముఖ్యసాధనం

దేవా! నీవు సర్వభూతావాసుడవు. నిన్ను భజించేవారు చావును కూడా లెక్కచేయరు. నిన్ను సేవించటానికి భక్తి ముఖ్యం గాని పెద్దపెద్ద చదువు లవసరం కాదు. ఎంత విద్య నేర్చుకొన్నా నీకు భక్తిచేయలేనివారు పశువుల వలె బంధితు లవుతారు. మరొక విశేషం. నిన్ను ప్రేమించినవారు తాము

కడతేరటమే గాక ఇతరులను కడతేరుస్తారు. స్వతస్సిద్ధమైన జ్ఞానశక్తి వలన ప్రకాశిస్తుంటావు కాబట్టి నీ ప్రకాశానికి ఇంద్రియ సంబంధం లేదు. ప్రాణుల ఇంద్రియాలంటావా, వాటికి స్వతఃప్రకాశ శక్తి లేదు. అవి నీ ప్రకాశంచేత ప్రకాశితాలై వ్యవహరిస్తున్నాయి.

దేవా! మహామండలేశ్వరుని శాసనాలను ఖండమండలపతుల వలె సర్వేశ్వరుడ వైన నీ ఆజ్ఞలను బ్రహ్మ, ఇంద్రాదిదేవతలు అనువర్తిస్తూ నిన్ను భజిస్తుంటారు. చిన్న సంస్థానాధిపతులు పెద్ద సంస్థానాధిపతులకు, వారు మండలాధిపతులకు, వారు మహామండలేశ్వరునికి కప్పాలను చెల్లిస్తున్నట్లు జనులు హవ్యకవ్యాల రూపంలో బలులను దేవతలకు, బ్రహ్మకు ఇస్తారు. దేవతాదులు ఆ బలులను భుజిస్తూ నీ ఆజ్ఞా పరిపాలన రూపమైన బలిని నీకు సమర్పిస్తారు. నీ మాట అంటే వారికి ఈనాటికీ నిలువెల్లా వణుకేనని మాకు తెలియదా?

## శక్తి – శక్తిమంతుల క్రీడ

దేవా! నీవు నిత్యముక్తుడవు; నిస్సంగుడవు; మాయాతీతుడవు. అట్టివాడవు నీవు నీ మనసుకు తోచినప్పుడు నీ మాయాశక్తితో క్రీడించాలనుకొంటావు. అప్పుడు నీ దృష్టి నీ శక్తివంకకు మళ్ళుతుంది. తత్ఫలితంగా చరాచరజీవరాశి ఉద్బోధితమై తమకు తమకు యుక్తమైన కర్మలలో వ్యవహరిస్తుంది. దేవా! నీ అనుగ్రహం అపారం. ఆకాశం వలె నీవు అన్నిచోట్లలో సమానంగా ఉంటావు. ఆ జీవుడు ఈ జీవుడనే భేదం నీకు లేదు. నీవు మనోవాక్కులకు అందవు. స్థూలసూక్ష్మాత్మకమైన ప్రపంచం నీలో లయమైనప్పుడు నీవు నిర్విశేషుడవై వీనుమిగిలి ఉంటావు. అంతమాత్రాననే శూన్యమైనట్లు కాదు. అట్టి నిర్విశేషజ్ఞానానికి కూడా నీవే ఆధారభూతుడవు కనుక నీవు పరమసత్యానివని మా తాత్పర్యం.

## జీవులు నిత్యులా?

దేవా! అనంతమైన జీవరాశి నీ అంశమాత్రమే కనుక నీవలెనే జీవులు కూడా నిత్యులు, సర్వగతులు కావాలనే మాట సమంజసమా? కాదా? అని; జీవులు నిత్యులు, సర్వగతులు అయితే వారు నీకు సములవుతారు కదా? అని; ఆ పక్షాన సర్వశాసకుడనే బిరుదు నీకు సార్థకమవుతుందా? అని అనుమానిస్తారు. నీవే ఉపాధిగతమైనప్పుడు జీవనామంతో వ్యవహరిస్తుంటావు. జీవభేదత్వం సమానాధిక్యం కలిగిన ఉపాధుల వలన ఉద్భవ మవుతున్నది. ఆ కారణాన జీవరాశి నిత్యమే; ఈశ్వరుడవై నీవు వారిలో ఉండటమూ సత్యమే. అయితే జీవరాశి యందు నీవు ఏ రూపంలో ఉంటావో ఎవరికీ తెలియదు. ఏమంటావా? నీ ఉనికి ఇంద్రియగోచరం కాకపోవటమే అందుకు కారణం. నిన్ను కనుగొన్నామని కొందరు చెబుతుండటం ఉన్నది కదా? అంటే, ఆ చెప్పేవారు నిన్ను చూచినవారు కానేకారు. అయితే ఎందుకు చెబుతున్నారంటావా! నిన్ను చూచినట్లు ఊహించి, అది ఊహ మాత్రమేనని, తెలియక చూశామని అంటుంటారు. వస్తువులను గ్రహించేది బుద్ధిశక్తి. ఆ బుద్ధిశక్తి వివిధరూపాలలో ఉంటుంది. ఆ కారణాన వారి భావాలుకూడా పెక్కు విధాలుగా ఉంటాయి. భావభేదాలకు ఇదే కారణం.

## జీవరాశి పుట్టుక

దేవా! జీవరాశి నీ వలన ఉద్భవించిన దన్నప్పుడు నీవే ఆ రూపంలో పరిణామాన్ని పొందావని భావింపకూడదు. ప్రకృతి పురుషులకు రెంటికీ పుట్టుక ఎన్నడూ లేదు. ప్రకృతి పురుషులకు పుట్టుక లేకపోతే ప్రకృతి పురుషసమ్మేళనం వలన కలుగుతున్న జీవరాశికి పుట్టుక ఎలా వచ్చిందని అడుగుతారు. పుట్టుక దేనికి కలుగుతున్నది? ఉపాధులకు కలుగుతున్నది. నీరు, గాలి సంయోగం చెందినప్పుడు నీటిలో బుడగ కనబడుతున్నది. ఆ బుడగకు నీరు ఉపాదానకారణం, వాయువు నిమిత్తకారణం. ఆ రెంటికన్నా

భిన్నమైన స్థితి బుడగకు లేదు. అట్లాగే ప్రకృతి ఉపాదానకారణం, పురుషుడు నిమిత్తకారణం అయి సోపాధిక జీవజన్మం కలుగుతున్నది. ఈ ప్రకృతిపురుషుల కలయిక కూడా అన్యోన్యాధ్యాస మాత్రమే. తత్ఫలంగా జీవులకు రూపనామభేదాలు కలుగుతున్నాయి. నానాదిక్కుల నుంచి నదులు నానారూపనామాలతో ప్రవహిస్తూ వచ్చినా సముద్రంలో కలిసినప్పుడు వాటి నానాత్వం నశిస్తున్నది కదా. తేనెటీగలు వివిధపుష్పాల నుంచి వివిధరసాలను సేకరించి తెచ్చినా, ఆ రసాలు తేనెగా అయినప్పుడు వాటి నానాత్వం తెలియటం లేదు కదా. అదే ప్రకారంగా జీవులు నానావిధ కార్యకారణోపాధులు కలిగి వివిధరూపాలలో కాన్పించినా నీలో లయమైనప్పుడు వారికి నానాత్వం ఉండదు. కాబట్టి జీవభేదం గాని జీవుల ప్రత్యేకస్థితి గాని భ్రమలు మాత్రమే. మాయ నీ వశమై వర్తిస్తున్నదని చెప్పిన తర్వాత మాయాజనితజీవులు కూడా నీ వశమేనని మళ్ళీ చెప్పాలా?

### కాలం

దేవా! కాలంకూడా నీ శక్తివిశేషమే కనుక కాలానికి కూడా ఆద్యంతాలు కలుగవు. అయితే లోకవ్యవహార నిమిత్తం దిన మాస ఋతు సంవత్సరాదులుగా కాలాన్ని విభాగించారు. అవన్నీ నీయొక్క భ్రూభంగ విశేషాలేనని గ్రహింపవలసి ఉంటుంది. నీ మాయాబద్ధులైన వారికి తాము వేరనే భావమొకటి తప్పదు కనుక వారు సంవత్సరాది కాలానికి లోబడి జననమరణాది భయాలను కలిగి ఉంటారు. నిన్ను అనుసరించేవారికి ఏ భయాలూ కలుగవు. ఏమంటావా? ఎట్టి భేదభావం లేక సర్వం నీవేనన్న నిశ్చయంతో ఉండటమే వారి నిర్భీకతకు కారణం.

## మనోనిశ్చయ సాధనం

అట్టి మనోనిశ్చయం ఎప్పుడు కలుగుతుంది? అంటే, మనస్సనేది క్రొత్తగా తెచ్చిన గుర్రం వంటిది. దానిని నిలబెట్టటానికి కొందరు ప్రాణేంద్రియాలను నియమిస్తారు. వారు యోగులు. ఆ యోగులకు కూడా మనోనిరోధం

సాధ్యంకాదు. గత్యంతర మేమంటావా? గురుపాదసేవ ఒక్కటే అందుకు పరమోపాయం. గురుసేవ చేయనివారికి నావికుడు లేని ఓడనెక్కి సముద్రంలో ప్రయాణంచేసే వ్యాపారుల గతి పట్టి, సంసారసాగరంలో మునుగుతూ తేలుతూ ఒక్కనాటికీ అంతుబట్టక దరిలేని దురంత వ్యసనాలతో పరితపిస్తుంటారు.

## ఆనందప్రాప్తి సాధనాలు

దేవా! నీవు నిరతిశయానంద స్వరూపుడవు. అట్టి నీవు జీవరాశిలో ఉన్నందువల్ల ఆ రాశిమొత్తం ఆనందార్ద్రమై ప్రాకులాడుతున్నది. అది సహజం. జనులు తమలో ఉన్న ఆ ఆనంద ఘనాన్ని గుర్తింపలేక పుత్త్ర కళత్ర దేహగేహ ధన కనక వస్తు వాహనాలను పట్టుకొని ఆనందార్థం ఊగులాడుతుంటారు. ఒకవేళ వారికి దానివలన ఆనందం లభించినా, ఆ లభించినది తుచ్ఛమేగాక క్షణభంగురం కూడా అవుతుంది. భౌతికపదార్థసంబంధమైన ఆనందం ఏదో ఒకనాడు దుఃఖాంత మవుతుందే గాని నిజమైన నిత్యానందం కాదు. ఈ రహస్యాన్ని గ్రహించటానికి గురుసేవ, సత్సాంగత్యం, నీ చరిత్రాకర్ణనం ఎంతగానో ఉపకరిస్తాయి. ఎలా ఉపకరిస్తాయంటావా? చిత్తాన్ని తుచ్ఛవస్తువుల నుంచి మార్చి నీ వంకకు మళ్ళిస్తాయి. ఆ మళ్ళిన చిత్తం ఒకసారి నీ ఆనందరసరాశిలో ఒక్క బొట్టును చవిచూసినా మళ్ళీ నిన్ను వదిలిపెట్టదు. అందుకు నిదర్శనం ఏమంటావా? సామాన్యులకు సుఖైకస్థానాలుగా తోచే గృహాదులను మహర్షులు త్యజించి నీ తోడిదే లోకం అనుకోవటమే అందుకు నిదర్శనం.

## కారణకార్యవాదం

దేవా! ఒక వస్తువువలన మరొక వస్తువు కలిగినప్పుడు మొదటి వస్తువుయొక్క గుణం ఆ వస్తువు వలన కలిగినదానియందు ఉండటం సహజమే. దీనిని కారణ కార్యవాదమని అంటారు. నీవు సన్మాత్రుడవని, విశ్వము నీ వలన కలిగినదని, అందువలన విశ్వముకూడా సన్మాత్రమేనని

వీరంటారు. అంటే సత్యమైనదాని నుంచి కలిగినందువల్ల విశ్వము కూడా సత్యమేనని, మిథ్యకాదని ఈ మతభావం. కనకం నుంచి పుట్టిన ఆభరణం కనకమే అవుతుంది కదా! అని తమ మతానికి తార్కాణగా వారు స్వర్ణభూషణాల కారణకార్యైక్యాన్ని వివరిస్తుంటారు. అయితే ఈ మతాన్ని తర్కం అంగీకరింపదు. ఏమంటావా? కనకము ఉపాదాన కారణం. ఆభరణము కార్యం. ఉపాదాన కారణం కార్యమందు అభేదంగా ఉండి తీరాలనే నియమం ఎక్కడా లేదు. కారణకార్యాలకు మాత్రమే అభేదాన్ని చెబుతాము కాని తాదాత్మ్యాన్ని చెప్పటం లేదంటారా? ఇది కారణం, ఇది కార్యం అన్నప్పుడే భేదం ఉన్నదని స్పష్టపడుతున్నది. తండ్రికి పుత్రుడు కలుగుతున్నాడు. తండ్రి కారణం, పుత్రుడు కార్యం. తండ్రి గుణాలన్నీ పుత్రునిలో విధిగా కనబడుతున్నాయా? కర్రతో కుండను పగలగొట్టాము. కర్ర కారణం, కుండ పగలటం కార్యం. ఇందులో కారణకార్యాలకు ఏకత్వం ఉన్నదా?

## కారణ తత్త్వవిచారం

కారణమంటే ఉపాదాన కారణమే గాని నిమిత్త కారణం కాదంటారా? కొన్నిచోట్ల ఉపాదాన కారణం వలన కలిగిన కార్యం మిథ్యామాత్రంగా ఉంటున్నది. నిదర్శన మేమంటావా? రజ్జువును చూసి సర్పమని భ్రాంతిపడుతున్నారు. రజ్జువు ఉపాదాన కారణం. అది సత్యమే. సర్ప భావమో? అది మిథ్యామాత్రం. ఈ విషయంలో ఉపాదాన కారణం రజ్జువు మాత్రమే కాదని, అవిద్యతో కూడి అది కారణమవుతుందని అంటారా? ఆ పక్షాన ప్రపంచం కూడా అవిద్యతో కూడిన సత్పదార్థం వలన కలుగుతున్నదని గ్రహింపవలసి వస్తుంది. రజ్జువునందు సర్పభావం అసత్యమయినట్లే సత్పదార్థంలోని నామరూపాత్మక ప్రపంచం కూడా అసత్యమే అవుతుంది. లోక వ్యవహారార్థమై ప్రపంచసత్యత్వాన్ని చెబుతాము అంటారా? అలాగే

నంటాము. ఆ పక్షాన ప్రపంచం వ్యావహారికమాత్ర సత్యం; పారమార్థిక సత్యం కాదు.

## ఉభయయోగి కారణం

అవిద్యాయుక్తమైన ఉపాదానం కారణమన్నప్పు డది ఉభయయోగి కారణం అవుతుంది. ఉభయయోగి కారణం కార్యానికి కారణాత్మకత్వాన్ని కలిగింపలేదు. ఆ దృష్టితో పరిశీలించితే ఆ వస్తువుకు కారణత్వం; ఆ వస్తుకార్యాలకు అర్థక్రియాకారిత్వం ఎలా కలిగాయి? అంటే, అంధ పరంపరాన్యాయం వలన కలిగాయి. ఆ విధానాన్నే లోకవ్యవహారమని అంటారు. ఈ వ్యవహారం 'ఇప్పుడు ఈ విధంగా మొదలయింది' అని చెప్పటానికి వీలులేదు. కాబట్టి ఈ సృష్టిని అనాది అన్నారు.

## కర్మములను గూర్చిన వేదబోధ

కర్మములు, ఆ కర్మముల వలన పుట్టిన ఫలాలు సత్యమని వేదాలు చెబుతున్నాయి కనుకనే వేదవాక్కును నమ్మి జనులు కర్మపరులు, బహువృత్తి పరులుగా మారి సంసార తరణోపాయాన్ని కనుగొనలేకున్నారని, వేదోపదిష్టానికి విలువ లేదా? అని కొందరంటారు. అది మా వాక్కుల తాత్పర్యాన్ని చక్కగా గ్రహింపలేనివారి కుతర్కం. వేదములమైన మేము కర్మములను గురించి ఏమంటున్నాము? ఈ యీ కర్మలను ఈ విధంగా చేస్తే ఈ ఫలం కలుగుతుందని చెబుతున్నాము. అంతే కాని ఈ కర్మలను చేసినందువల్ల పరమార్థం కలుగుతుందని మేమెక్కడా అనలేదు.

ఆ విధంగా కర్మఫలాలను చెప్పటం మాత్రం ఎందుకు? భ్రాంతి కలిగించటానికే కదా? అని అంటావేమో. భ్రాంతిలో మునుగుతున్నవారిని లేవదీయటానికి మేమలా కర్మఫలాలను పేర్కొంటాము. అట్టి తత్త్వం కుదురుకొన్న తర్వాత క్రమక్రమంగా వారిని ఉద్ధరించటమే మంచిది. 'ఓ జనులారా! మీరు సుఖాన్ని కోరుతున్నారు కదా. ఊరికే ఉంటే సుఖమే కాదు;

చివరికి పొట్టకూటికి కూడా దిక్కుండదు. ఈ యీ కర్మలను చేస్తే మీకు ఈ యీ సుఖాలు కలుగుతాయి' అని వారికి మొట్టమొదట కర్మబోధను కలిగిస్తాము. వారు కర్మపథంలోనికి ప్రవేశించిన తర్వాత 'నాయనలారా! మీరు చేస్తున్న కర్మలను భగవత్పరాలు కావిస్తే మీకు సుఖం కలుగుతుంది' అని చెప్పి వారి కర్మలను భగవత్పరాలు కావిస్తాము. ఆ ప్రకారం చేస్తూ రాగా వారి బుద్ధి క్రమంగా నిష్కామకర్మపరం అవుతుంది. తత్ఫలంగా వారికి సత్యస్వరూపం గోచరిస్తుంది. ఎట్టకేలకు వారు కడతేరగలుగుతారు. జనుల మేలుకొరకే ఈ విధానం మేమనుసరించాము. అంతేకాని వారికి భ్రాంతి కలగాలని కాదు.

## విశ్వతత్త్వం

విశ్వాన్ని గురించి మేము చెప్పేది ఏమంటావా? సృష్టికి పూర్వం ఈ కనబడుతున్న విశ్వం లేదు. ప్రళయాంతంలో ఇది ఉండదు. సృష్టిప్రళయాలకు మధ్యకాలంలో విశ్వం ఉన్నట్లు కనబడటం సద్రూపుడవైన నీ ప్రతీతికి మాత్రమే. ఈ భావాన్ని నొక్కిచెప్పటానికి మృద్ఘటాలను, ఉక్కు కత్తులను, బంగారు కుండలాలను ఉదాహరిస్తాము. ఘటము మట్టేగాని మట్టి కంటె వేరైనది కాదు. కత్తి ఉక్కే గాని ఉక్కుకంటె భిన్నపదార్థం కాదు. కుండలం బంగారమే గాని తద్భిన్నం కాదు. ఘటఖడ్గకుండలాదులు మట్టి, ఉక్కు, బంగారు మొదలైనవాటికి నామభేదాలు మాత్రమే. అదే విధంగా ప్రపంచం కూడా నామమాత్రంగా నీకంటె వేరయినదన్నాము కాని వాస్తవంగానే భిన్నమని అనలేదు. మనోవిలాసమాత్రమైన ప్రపంచం నీకంటె వేరని, సత్యమని అనుకొనేవారు సంగతి తెలిసినవారు కారు.

## అజ్ఞాన కారణం

వారికి తెలివిలేకపోవటానికి కారణం ఏమిటి? దేవా! నీ మాయే అందుకు కారణం. నీ మాయ జ్ఞానప్రకాశాన్ని కప్పిపుచ్చుతుంది. తత్ఫలంగా దేహేంద్రియాదులు సత్యములనే భ్రాంతి జనిస్తుంది. ఎప్పుడయితే ఆ భ్రాంతి

కలిగిందో అప్పటినుంచి దేహాదుల జననమరణాలు తన జననమరణాలుగా అతను భావిస్తాడు. ఆ భావం ఉన్నంతకాలం అతనికి సంసృతి తప్పదు.

## మాయ - మహేశ్వరుడు

దేవా! పాము కుబుసాన్ని పుట్టిస్తూ, విడిచిపెడుతూ ఉంటుంది. కుబుసం పామునుంచి పుట్టినదే అయినా పాముకూ దానికీ ఎటువంటి సంబంధమూ ఉండదు. అలాగే మాయ గాని అవిద్య గాని నీ కారణాన కలిగినవే అయినా నీకూ వాటికీ ఎటువంటి సంబంధమూ లేదు. నీవు నిత్యైశ్వర్యుడవై ఉంటావు. అణిమామహిమాదులైన నీ అష్టైశ్వర్యాలకు ఎప్పుడూ తరుగులేదు. ఎవరు తమ హృదయగతాలైన ప్రారబ్ధకర్మవాసనలను ఉన్మూలింపరో వారు యతులే కానివ్వు, మరెవరో కానివ్వు, నీ దర్శనభాగ్యం వారికి చేకూరదు. అట్టివారు, తమ మెడలోని హారాన్ని మరచి దానికోసం లోకమంతా వెతికినట్లు, హృదయస్థుడవైన నిన్ను మరిచి నీకై లోకమంతా ప్రాకులాడుతుంటారు.

సన్న్యసించామనగానే ఫలంలేదు. వేషాడంబరాలను సన్న్యసించటం సన్న్యాసం కాదు. లోని వాసనలను సన్న్యసించినవారే నిజమైన సన్న్యాసులు. ఇంద్రియపరులై ఉన్నంతకాలం అతీంద్రియగమ్యమైన నీ పరమానందాన్ని పొందలేరు. ఏమంటావా? ఆ ఆనందం నీ పాదాలను ఆశ్రయించినవారికి మాత్రమే లభ్యమవుతుంది. మనస్సు ఇంద్రియార్థపరమై ఉన్నంతకాలం నీ పాదాశ్రయం వారికి కలుగదు. కాబట్టి ఇహపరాలలో దుఃఖమే వారికి మిగులుతుంది. ఇహభోగాలలో చూరలాడుతున్నామని వారనుకోవచ్చును; వారిని చూసి లోకులు పొరబడవచ్చును. వారి భోగాలు మరుమరీచికలు మాత్రమే. ఆ భోగాలకోసం ప్రయాణించిన వారు బయలుదేరిన చోటికే వచ్చిపడుతుంటారు.

## విజ్ఞాన ఫలం

దేవా! నీ విజ్ఞానఫల మేమంటావా? ప్రారబ్ధజన్మలో కలిగే సుఖదుఃఖాలన్నీ పూర్వకర్మఫలాలు మాత్రమేనని, ఆ ఫలాలను ఇచ్చేది నీవేనని,

ఆ ఫలాలు వారివారి పుణ్యపాపాలను బట్టి సుఖదుఃఖరూపాలలో కలుగుతుంటాయని, ఆ ఫలాలను అనుభవింపక తీరదని అతను మొట్టమొదట గ్రహిస్తాడు. ఆ గ్రహించినందుకు ఫలమేమంటావా? దేహసంబంధులై అవశ్యభోగ్యాలైన సుఖదుఃఖాలకు తారుమారు చెందడు. ఆ స్థితి ఎప్పుడయితే కలిగిందో, దేహాభిమానం మృతప్రాయమే అవుతుంది. దేహాభిమాన నాశనంతో అతనికి విధినిషేధబోధనలు కూడా నశిస్తాయి. అతని మనస్సు నిరంతరం నీ పరమై ఉంటుంది. అతనికి కళ్యాణవృద్ధులు స్వతస్సిద్ధాలు.

నీ తత్త్వరహస్యాన్ని సమగ్రంగా తెలియనివారు ఏమిచేయాలి? వారికి మార్గం లేదా? అంటే, యుగయుగాలుగా నీ వొనర్చిన లీలలను వింటే, వారు క్రమక్రమంగా సుఖాతీతులై నిన్ను చేరుకొంటారు. దేవా! మేము వచించే విధినిషేధాలు ఎవరికోసమంటావా? విజ్ఞానులు, భక్తులు కానట్టివారి కోసం విధినిషేధాలను మేము వివరించాము. మా వచనాలను నిరసించినవారు దుఃఖభాగులు కాకమానరు. రోగికి పథ్యం విధింపబడుతుంది. ఎందుకని? రోగనివారణకు ప్రాతికూల్యాలు కలుగకుండటానికే కదా. స్వస్థుడికి పథ్యమెందుకు?

## వింతలకు వింత

దేవా! నీ మహిమ ఇంతటిదని బ్రహ్మాదులకే తెలియదు. అది వింత కాదు. వింతలన్నింటికీ వింత మరొకటున్నది. ఏదంటావా? నీ సంగతి నీకే తెలియదు!! ఇది వింతలకు వింత కాదా? పరాగరేణువులను లెక్కించటం సాధ్యం కానట్లే, నీ వలన కలిగే బ్రహ్మాండాలను లెక్కించటమూ తరంకాని పని. పరాగం లేచి మింట తిరుగాడినట్లు బ్రహ్మాండజాలం నీలో పుట్టి, నీలోనే తిరుగుతుంటుంది. ఆ బ్రహ్మాండాలను సప్తావరణలు చుట్టుకొని ఉంటాయి. ఆ ఆవరణలు ఒకదానికంటె రెండవది పదింతలు పెద్దవిగా ఉంటాయి.

## వేదబోధసారం

దేవా! నీ తత్త్వాన్ని సగుణపరంగా చూడటం మొదలుపెడితే నీ గుణాలకు అంతం కనిపించదు. నిర్గుణపరంగా చూడాలంటే నీవు కనుపింపవు. అట్టి నీవిట్టివాడవని ఏమి చెప్పమంటావు? మా పనేమిటంటావా? ఏదేది దృశ్యమో, అది నీవు కాదని, ఆ అన్నింటికి అవతల నీవుంటావని, వ్యతిరేకమార్గాన నీ తత్త్వాన్ని సూచించి చిట్టచివరికి మేముకూడా నీలోనే కలిసిపోతాము. పర్యవసానంలో మా బోధలు తాత్పర్యవృత్తిగా ఫలిస్తాయి' అని శ్రుతులు సర్వేశ్వరుని సన్నుతించాయి.

## సత్త్రయాగ సంకల్పభావం

సనందుడు బోధించిన ఆత్మగతిని సనకాది సిద్ధులు విని అతనిని పూజించారు. నారదా! సకలశ్రుతిపురాణరహస్యసారాన్ని లోకప్రచారం చేయటానికే సత్త్రయాగం సంకల్పించారు. ఈ ఆత్మానుశాసన భావమేమంటావా? జీవుడు బ్రహ్మమేగాని తద్భిన్నుడు కాడనటమే దీని భావం. ఈ అనుశాసనాన్ని శ్రద్ధతో గ్రహించి నీ ఇచ్చవచ్చినట్లు నీవు సంచరింపవచ్చును' అన్నాడు.

రాజేంద్రా! నారదుడు ఆ ఉపదేశం విని కృతకృత్యుడనని భావించి, 'కృష్ణా! సర్వభూతాలకు అభయదానం చేయటానికి సత్త్వమూర్తులను దాల్చే నీ రహస్యం స్పష్టమయింది. ఇదే నీకు ప్రణామం' అని పలికి ఆ మునీశ్వరుని, అతని శిష్యులను వీడ్కొని, నా తండ్రియైన ద్వైపాయనుని ఆశ్రమానికి వచ్చి పూజితుడై సుఖంగా కూర్చుండి నారాయణమహర్షి బోధించినదంతా నా తండ్రికి వినిపించాడు.

## సర్వవేదాంతసారం

రాజేంద్రా! బ్రహ్మము ఇట్టిదని చెప్పరానిదై ఉండగా దానిని నిర్దేశించటం ఎలాగని నీవడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాను. శూన్యంనుంచి

భావపదార్థం పుట్టదు. పుట్టినదానికి కారణమైన మూలం కలుగకా మానదు. ఆ మూలకారణాన్ని మొట్టమొదట తెలుసుకోవాలి. ఆ తెలుసుకొన్నదానిని గురించి విచారించి నిరంతరం మనన చేయాలి. ఆ చేయటం వలన నిశ్చయం ఏర్పడుతుంది. ఆ నిశ్చితభావాన్ని గురించి నిత్యం స్మరణధ్యానాలు చేయాలి. కొంతకాలానికి నీ చిత్తము దానియందే లయిస్తుంది. తర్వాత భ్రమరకీట న్యాయంగా నేననే భావం నశించి ఆ వస్తువే నీవుగా అవుతావు. ఇదే ముక్తి అనబడుతున్నది. నీవు ఆ విధంగా ధ్యానసిద్ధుడవై జన్మసాఫల్యాన్ని పొందు! ఇదే సర్వవేదాంతసారసంగ్రహం.

## శివ కేశవులు

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి వచనాలను విని, 'ఓ మునివరేణ్యా! ధనాదిసంపదలు కోరినవారు శివుని ఆరాధించి కోర్కెలను నెరవేర్చుకొంటారు. విష్ణువు లక్ష్మీశ్వరుడైనా అతనిని సేవించేవారికి ధనాదిసంపదలు కలగవు. కారణం ఏమిటి? శివుని స్వభావం, విష్ణువు స్వభావం వేర్వేరా? సేవ్యుని స్వభావాన్ని బట్టి సేవకునికి కలిగే ఫలం ఉంటుందా? ఈ సందేహం తీర్చండి' అని ప్రార్థించాడు. అతనికి శుకయోగి సమాధానం చెప్పాడు.

## పరతత్త్వం ఒక్కటే

రాజేంద్రా! నిర్గుణుడు నిష్క్రియుడు అయిన ఆ పరమాత్ముని స్మరించేవారు, ధ్యానించేవారు వారువారు తమ ఇష్టానికి తగినట్లు అతని రూపనామాలను ఊహిస్తుంటారు. శివవిష్ణునామాలు కూడా అటువంటివే. ఆ దృష్టితో చూసినప్పుడు శివుడు, విష్ణువు అనే పేర్లు శబ్దభేదమాత్రకములే గాని వస్తుతత్త్వభేదకమైనవి కావు. శివశబ్దానికి పరమశుభమని భావం. విష్ణుశబ్దానికి సర్వవ్యాపకత్వమని అర్థం. ఆ పరమాత్ముని శక్తి అనంతం. ఆ శక్తిలో శుభత్వ వ్యాపకత్వాలు అంశల వంటివి మాత్రమే. కేవల శుభభావాన్ని ప్రధానంగా భావించినవారు ఆ పరమాత్మను శివుడన్నారు.

సర్వాంతర్యామిత్వాన్ని భావించినవారు ఆ పరమాత్మను విష్ణువన్నారు.

## అధికారి భేదాలు

ఇదికాక అధికారదృష్టితో వారికి గల భేదాన్ని తెలియగోరుతున్నావా? ఆ పక్షాన, 'యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్' అని శ్రీ భగవానుడే అన్నాడు. భజనాదులకు సగుణత్వం కావాలి. పైగా భక్తులు వారి వారి వాసనల ప్రకారం ధ్యేయాన్ని సంకల్పించి ఏది యెవరినుంచి కావాలనుకొంటే ఆయా కోరికలనిచ్చే శక్తిని ఆ ధ్యేయమందు ఆరోపించి ధ్యానించి, ఇష్టార్థాన్ని పొందుతుంటారు. భగవానుడంటే అఖిలసామ్రాజ్యాధీశ్వరు డన్నమాట. అతని ముందు శివకేశవులు మండలాధిపతుల వంటివారు.

సామ్రాజ్యపతి తన మండలాధిపతులలో ఒక్కొక్కరిని ఒక్కొక్క శాఖాధికారిగా నిలిపి వారికి తగినంత అధికారశక్తి నిచ్చినట్లుగా భగవానుడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులను, ఇంద్రాది దేవతలను తత్తత్ శాఖలకు నియమించి వారికి ఆయా అధికారాలను సమకూర్చాడు. శివుడు తన శక్తితో కూడి వ్యవహరిస్తాడు. ఆ కారణాన అతనిని అర్ధనారీశ్వరు డన్నారు. విష్ణువు తనశక్తి నధిష్ఠించి వ్యవహరిస్తాడు. అందువల్ల అతనిని లక్ష్మీశ్వరు డన్నారు.

ఆ శక్తివ్యవహారమంతా నిజానికి గుణవ్యవహారమే కదా. అహంకారం పైకొన్నప్పుడు గాని గుణాలు వ్యవహరింపవు. శివుడు స్వయానికి విషయభోగవిరాగి అయినా అతని శక్తి ఎల్లప్పుడు విషయభోగపరంగా ఉంటుంది. అతని శక్తి విషయభోగ పరమైనప్పుడు శివుని అహంకారం వైకారికము తైజసము తామసము అని మూడు విధాలు. మూడు విధాలైన ఈ అహంకారాన్ని త్రిలింగము అంటారు. లింగము అంటే లక్షణం. మూడు లింగాలను కలిగి ఉన్నందువల్ల శివునికి త్రిలింగుడని పేరువచ్చింది. ఒక్కొక్క విధమైన అహంకారం నుంచి పదహారు ఇంద్రియాలు పుట్టాయి. పంచభూతాలు మనస్సు పది ఇంద్రియాలు కలిసి షోడశేంద్రియాలు. ఒక్కొక్క

ఇంద్రియాన్ని నడిపేందుకు ఒక్కొక్క విధమైన శక్తి ముందుకు వస్తుంది. ఆ శక్తిని ఆ ఇంద్రియానికి అధిష్ఠానదేవత అంటారు. కామపరులు వారి వారి వాసనల ప్రకారం ఈ అధిష్ఠాన దేవతలను భజించి ఐహికభోగాలను అందుకొంటారు.

రాజేంద్రా! విష్ణుతత్త్వం ప్రకృతి అయిన శక్తికి పరమందు ఉంటుందని అన్నాను. అందువలన శక్తిగుణాలు అతనికి వశమై ఉంటాయే కాని, అతనిని కార్యానికి ప్రేరేపింపలేవు. సంపదలన్నీ గుణముల యొక్క కార్యాలు కనుక, విష్ణువు గుణాతీతుడు కనుక అతనిని భజించినవారు గుణాతీతులు కాగలుగుతారు. కాబట్టి గుణాతీతులు కాగోరి విష్ణువును సేవించినవారు గుణకార్యాలైన సంపదలను కోరరు. అడగనిదానిని ఇవ్వటం జరుగుతుందా?

రాజా! నీ పితామహుడైన ధర్మరాజు హయమేధయాగం చేసి భాగవత ధర్మాలను వినగోరాడు. ఆ సమయంలో అతనికి ఇటువంటి సందేహమే కలిగి శ్రీకృష్ణభగవానుని ఈ అర్థమే అడిగాడు. భగవాను డతని మనోభావం గ్రహించి, 'ధర్మనందనా! నా వంక దృష్టిమళ్ళటానికి మదం అడ్డువస్తుంటుంది. మదకారణాలలో ధనం మొట్టమొదటిది.

**"క. ధనమును విద్యయు వంశం**
**బును దుర్మదులకుఁ మదంబుఁ బొనరించును; స**
**జ్జను లైనవారి కడఁకువ**
**యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా!"**

నేను వారిని అనుగ్రహింపదలచితే వారికి మదకారణమైన ధనాన్ని మొదట వారినుంచి దూరం చేస్తాను. అందువల్ల నా భక్తులు ధనహీనులై ఉంటారు. వారు ధనార్థమై ప్రయత్నింపరా? అంటావేమో. ఒకవేళ ప్రమాదవశాన వారు ప్రయత్నించినా, వారి ప్రయత్నాలన్నిటినీ నేను భగ్నం చేస్తాను. అప్పుడు వారు నిర్వేదాన్ని పొంది నా భక్తులను చేరుకొంటారు. నా భక్తులు వారి నిర్వేదాన్ని తొలగిస్తారు. అంతట వారు అహంకార ప్రేరితాలైన

సకల కార్యాలను ఉజ్జగించి, 'త్వమేవ గతిః' అంటూ నన్ను శరణు వేడుకొంటారు. అప్పుడు వారికి పరమశ్రేయస్కరమేదో అదే నేనిస్తాను' అని చెప్పాడు.

రాజా! ఇతరదేవతలు అతిశీఘ్రతరంగా అల్పప్రయత్నం చేతనే సంతోషులవుతారు. ఆ రహస్యమెరిగి కామార్థులు వారిని భజించి వారివ్వగల రాజ్యభోగాదులను తెచ్చుకొని ఆ మూలకంగా మదాంధులై కన్నుగానక వరాలిచ్చిన వారినే అవమానిస్తారు.

రాజా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురూ శాపానుగ్రహాలకు సమర్థులే. వారిలో బ్రహ్మమహేశ్వరు లత్యల్పసంతోషులై కోరిన కోరికలన్నీ ఇస్తారు. విష్ణువు స్వల్పాలకు సంతోషింపడు. ఇందుకొక ఇతిహాసం ఉన్నది; చెబుతాను విను.

## వృకాసుర కథ

పూర్వం శకుని అనే దానవుడు ఉండేవాడు. అతనికి వృకుడనేవాడు జన్మించాడు. ఒకనాడు వృకునికి మార్గంలో నారదుడు ఎదురు పడ్డాడు. వృకుడు నారదుని పలకరించి, 'మునీంద్రా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురూ కామితార్థాలను ఇస్తారంటారు. వారిలో ఎవడు శీఘ్రపరితోషి?' అని అడిగాడు. ఆ ఋషి అతని మనసులో ఉన్నది గ్రహించి, 'అయ్యా! నీకు కార్యసిద్ధి కావాలనుకొంటే వెంటనే ఉమాపతిని ఆరాధించు. శివుడు గుణదోషాలు గోరంతలున్నా కొండంతలుగా భావిస్తాడు. రావణుడు బాణుడు ఎటువంటివారో వినే ఉంటావు. అట్టి వారు బట్టువుల వలె పొగడినంతనే శివుడు ఉబ్బి బూరటిల్లి అసమానైశ్వర్యాలను వారికిచ్చి తనకు తానే ముప్పుతెచ్చుకొన్నాడు' అని చెప్పాడు.

వృకుడంతట కేదారానికి పోయి అగ్నిని వెలిగించి తన మాంసాన్ని కోసి అందులో వేల్చి శివుని ఆరాధించాడు. ఆ విధంగా ఏడు రోజులు గడిచాయి.

ఎంతటికీ శివప్రసాదం కానరాలేదు. వృకుడు ఆతురపరుడై తడిసి విరబోసిన వెంట్రుకలతో ఉన్న తన శిరస్సును కోసి వేల్చాలని ఉద్యుక్తుడయ్యాడు. శూలి అతని తెగింపు చూసి దయచేసి వెంటనే ఆ అగ్నినుంచి బయటికి వచ్చి తలను తెగనరకనున్న వృకునిహస్తాలను గట్టిగా పట్టుకొన్నాడు. శివస్పర్శమాత్రాన వృకుని దేహం యథాస్థితిని పొందింది.

నిటలాక్షుడు ప్రసన్నాస్యుడై, 'వృకా! ఏమి వరం కోరుతావో చెప్పు. పుడిసెడు నీరు నాకు సమర్పించినా మహాప్రీతి నొందుతాను. నాకు నీ దేహాన్నే సమర్పింపబూనావు!' అని పలికాడు. వృకు డా మాటవిని, 'దేవా! నేను నా హస్తాన్ని ఎవరి తలపై ఉంచితే వారు భస్మమయేట్లు నాకు వరం ఇవ్వు' అని అడిగాడు. శివు డతని కోరికకు ఎంతో నొచ్చుకొని పాముకు పాలుపోసినట్లయింది కదా, అని లోలోపల చింతించి మాట తప్పటం ఇష్టంలేక 'వృకా! నీవడిగిన వరం అందుకో' అన్నాడు.

వృకు డా మాటవిని అది నిజమో బూటకమో పరీక్షింపదలచి తన చేతిని శివుని తలమీద పెట్టబోయాడు. గౌరీపతి తన తప్పు గ్రహించి భయంతో పరిగెత్తసాగాడు. వృకు డతని వెంటబడ్డాడు. విషకంఠుడు మూడు లోకాలు తిరిగి వృకుని బారినుంచి తప్పించుకొనే ఉపాయం తోపక వైకుంఠానికి పోయి నారాయణుని సందర్శించాడు. వైకుంఠుడు శివుని స్థితి గ్రహించి, తత్ క్షణమే మాయావామనుడై మేఖల చుట్టుకొని అజినం ధరించి అక్షమాలను తిప్పుతూ కుశపాణియై శివునికి మ్రొక్కి, 'మహాదేవా! దేహమున్నప్పుడే సకలార్థాలను సాధింపగలము. నీ దేహమెంతో అలమట చెందినట్లు కనబడుతున్నది. కొంచెం విశ్రమించి సేదతేరి నీవు వచ్చిన కార్యమేమిటో చెప్పు. జనుల పరస్పర సాహాయ్యం వలన కార్యసాధన సులభమవుతుంది. ఏమి కోరి వచ్చావో చెప్పు' అన్నాడు.

రాజా! అమృతం ఉట్టిపడుతున్న ఆ మాటలు చెవిసోకినంతనే త్రిశూలి గతశ్రముడై జరిగిన సంగతి వైకుంఠునికి తెలియజేశాడు. శ్రీమహావిష్ణువు

అతనికి ఊరటపలికి, వృకుని సమీపించి, 'అయ్యా! ఈ శివుడు దక్షశాపవశాన ప్రేతపిశాచపతి అయిన సంగతి నీవెరిగినదే కదా. పిశాచపతి వరమివ్వటం నీవు పుచ్చుకొనటం వింతగా ఉన్నది. అతని మాట సరే, అది నీవెలా నమ్మావో అర్థం కావటంలేదు. నమ్మబలికితే నమ్మేనంటావా? పరీక్షించకుండా నమ్మవచ్చునా? నీ చేతిని నీ తలపై ఉంచి చూడు. అప్పుడు శివుని పలుకుల సత్యాసత్యాలు వెల్లడికాగలవు. శివుని మాట తప్పయితే అసత్యవాది వధార్హుడు కనుక వెంటనే వధించు' అని చెప్పాడు. వృకు డా మాటలకు మోసపోయి స్వహస్తాన్ని తన తలపై పెట్టుకొన్నాడు. వెంటనే అతను నిలువెల్లా భగ్గుమని మండి బూడిద కుప్పగా నేలకొరిగాడు. వృకుడి మరణానికి నాకలోకంలో జయ శబ్దాలు నమోవాకాలు సాధువాదాలు మారుమ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది.

అంతట వైకుంఠుడు కైలాసపతిని చూసి, 'మహాదేవా! ఒకరికి అపరాధం చేయదలిచిన వాడు తన పాపానికి తానే చెడుతుంటాడు. ఇక పెద్దలకు అపరాధం చేయదలచినవాడి సంగతి వేరే చెప్పాలా? ఆలోచింపక చేసే పనుల వల్ల ప్రాణం మీదికి రాకమానుతుందా?' అని ఓదార్చాడు. శంకరుడు సంకటం తప్పినందుకు సంతోషంతో కైలాసానికి వెళ్ళాడు.

## వరము - అనుగ్రహం

రాజేంద్రా! వరానికీ అనుగ్రహానికీ ఎంతో తారతమ్యం ఉన్నది. కోరినవాడి కోరికను తీర్చటం వరమవుతుంది. ఏది మేలో గ్రహించి దానినివ్వటం అనుగ్రహ మవుతుంది. వరాన్ని కోరేవాడికి సర్వస్వాతంత్ర్యం ఉంటుంది. 'ఇది నేను కోరాను; దీనిని నాకివ్వు. ఇవ్వకపోతే నీ తల తెగనరుకుతాను' అనే మనస్తత్త్వం అహంకారపూర్వకమైనది అతనిలో నిండి ఉంటుంది. 'దేవా! దేహప్రాణాలతో సమస్తం నీ చేతులలో ఉంచాను. ఏది మేలో అది చెయ్యి' అని అడిగేవాడు ప్రపన్నుడు. వరార్థులకు హిరణ్యకశ్యప రావణాదులు, ప్రపన్నులకు భీష్మాదులు నిదర్శకులు.

వరం అడిగినవాడు ఆ వరాన్ని పొందిన తర్వాత వరగర్వంతో ఎలా కావాలంటే అలా ప్రవర్తింపవచ్చు. అనుగృహీతుని విషయం అట్టిది కాదు. అతను తన హృదయంలో భగవదాజ్ఞ ఎలా స్ఫురిస్తే అలా నడుచుకొంటాడు. లాభనష్టాలు, శుభాశుభాలు అతని దృష్టిలోనే ఉండవు. ప్రాప్తవరుడు తన వరబలాన్ని దుర్వినియోగం చేసి దుఃఖాల పాలు కావచ్చును. రెండవవాడు నిరంతరం భగవదాజ్ఞానుసారియై ఉంటాడు కనుక అతనికి దుఃఖమే కలగదు.

ఇక దాతల సంగతిని చూద్దామంటే, వరదాత పని వరాన్ని ఇవ్వటంతో ముగిసిపోతుంది. ప్రాప్తవరుడు తర్వాత ఏమయ్యాడన్న సంగతే దాతకు అవసరం లేదు; అతనూ ఆలోచించడు. భిక్షువుకు భిక్షవేయటం వంటిదే వరదాత భారం. అనుగ్రహించే అతని సంగతి వేరు విధంగా ఉంటుంది. అనుగృహీతుని క్షేమలాభాదిభారమంతా అతని తలపైన పడుతుంది. అహోరాత్రాలు కంటికి రెప్పవేయక అతనిని కాపాడవలసి వస్తుంది. ఆర్తులను గాని అర్థులను గాని కోట్లకొలది భరింపవచ్చును కాని ఒక్క ప్రపన్నుని భరించటం కష్టమని శ్రీకృష్ణభగవానుడే అన్నాడు.

వరాన్ని కోరేవాడు సాధారణంగా దేహసంబంధులైన ఐశ్వర్యాదులనో క్లేశనాశనాలనో కోరుకొంటాడు. రెండవవాని మనస్సులో ప్రపత్తి తప్ప వేరొక కోరికే ఉండదు. కాబట్టి ఏది మేలో అది నిశ్చయించే భారం దాతపైనే పడుతుంది.

రాజేంద్రా! వరానికి, అనుగ్రహానికి ఉన్న తారతమ్యాన్ని గ్రహించి నీ ప్రశ్నకు సమాధానం ఏమిటో నీవే ఊహించి చూడు.

## త్రిమూర్తులలో ఉత్కృష్టులెవరు?

రాజేంద్రా! పూర్వం ఒకప్పుడు సరస్వతీ తీరాన ఋషులు సత్త్రయాగం చేశారు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ జగత్కారణభూతులే అయినా వారిలో శ్రేష్ఠు డెవరనే ప్రశ్న అప్పుడు విచారణకు వచ్చి ఆ సంగతిని

తెలిసికొనిరమ్మని భృగుమహర్షిని పంపించారు. ఆ మునీంద్రుడు మొదట బ్రహ్మసభకు పోయి బ్రహ్మసత్త్వాన్ని పరీక్షింపదలచి అతనిని స్తుతింపక ఊరుకొన్నాడు. భృగుమహర్షి అవినయానికి బ్రహ్మ ఆగ్రహం పొందినా అతను పుత్రుడు కాబట్టి పుత్రవాత్సల్యం వలన శాంతి వహించాడు. అంతట భృగువు కైలాసానికి వెళ్ళాడు. మహేశ్వరుడు భ్రాతృభావంతో అతనిని కౌగలింపబోయాడు. భృగువు వెనుకకు జరిగి, 'అయ్యా! నీవు వేదనిందకుడవైన దురాచారుడవు; నన్ను తాకబోకు' అన్నాడు. ఆ మాటలకు శూలి మండిపడి శూలం అందుకొని భృగుమహర్షిని చంపబోయాడు. అంతలో పార్వతీదేవి అడ్డుపడి శివుని పాదాలకు మోకరిల్లి అతనిని ఉపశమింపజేసింది. భృగువు ఆ చోటు వదిలి వైకుంఠానికి వెళ్ళాడు. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు లక్ష్మి తొడపైని శిరసుంచి పవ్వళించి ఉన్నాడు. భృగువు అతని ఉపేక్షాభావాన్ని చూసి కాలెత్తి భగవానుని రొమ్ముమీద తన్నాడు. భగవానుడు లక్ష్మీసహితుడై లేచి పాన్పుదిగి భృగువుకు సాష్టాంగపడి, 'మహాత్మా! స్వాగతమే కదా? ఇదిగో ఈ ఆసనాన్ని అలంకరించండి. మీరు వచ్చిన సంగతి తెలియలేదు. నా తప్పును మన్నించాలి. మీ పాదోదకం తీర్థాలకు తీర్థమైనట్టిది. ఆ ఉదకంతో నన్ను, నా లోకాన్ని, నాయందే చిత్తం నిలిపిన లోకపాలకులను పవిత్రీకరించండి. మీ పాదస్పర్శ వలన నా వక్షఃప్రదేశం మహావిశుద్ధిని గాంచింది. నేడు నా లక్ష్మికి ఏకాంతమిచ్చి తదేకమగ్నుడనై ఉన్నాను. మీ రాక వలన వైకుంఠం పావనమయింది' అన్నాడు.

భృగుమహర్షి ఆ గంభీరవచనాలను విని నిర్వృతుడై భక్తిరసాశ్రువులు కన్నుల వెంబడి చిప్పిల్లగా నోటమాటాడక మౌనం వహించి సిగ్గుతో అక్కడి నుంచి మరలి సత్త్రశాలకు వచ్చి సంగతిని బ్రహ్మవాదులకు వినిపించాడు. ఋషు లా సంగతి విని, 'శాంతి, అభయం, ధర్మం, జ్ఞానం, వైరాగ్యం సర్వసమగ్రంగా ఎవనియందు ఉంటే వాడే అధికుడు. ఈ విశేషాలు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల యెడ ఎంతెంత మాత్రమో ఇప్పుడు

తెలుసుకొన్నాము. ఇట్టి గుణసంపన్నుని యశస్సు సర్వలోక మలినాన్ని హరిస్తుంది. అట్టివాడే శాంతులు సమచిత్తులు అకించనులు అయిన సన్న్యాసులకు ఆశ్రయణీయుడు. ఆ సత్త్వసంపద విష్ణువునందు ప్రధానమైనందువల్ల ఆ మంగళవిగ్రహుడే ముగ్గురిలో ఉత్కృష్టుడు' అని నిశ్చయించారు.

## విప్రసుతుని పునరుజ్జీవనం

రాజా! శ్రీకృష్ణుడు ద్వారకలో ఉండగా ఆ పురవరాన బ్రాహ్మణు డొక డుండేవాడు. అతనికి బిడ్డలు పుట్టి, పుట్టిన వెంటనే చనిపోతుండేవారు. ఆ విప్రుడు మృతశిశుకళేబరాలను రాజద్వారంలో ఉంచి 'రాజు ధర్మపరుడైతే రాష్ట్రమంతా సుఖంగా ఉంటుంది. అతను బ్రహ్మద్వేషి, శఠుడు, లుబ్ధుడు, విషయలోలుడు అయితే రాజదోషం ప్రజలకు ఆపాదిస్తుంది. రాజదోషం వల్ల నా కొడుకులు పుట్టుకతోనే మరణిస్తున్నారు' అని దీనాతిదీనుడై ఆక్రోశింపసాగాడు. ఆ విధంగా అతనికి ఎనమండ్రుగురు పుట్టీపుట్టగానే చనిపోయారు. ప్రతిపర్యాయం అతనలాగే ఏడ్చేవాడు. తొమ్మిదవ కొడుకు పుట్టి పుట్టగానే మరణించాడు. ఆ విప్రుడు ఎప్పటివలెనే శిశుశవాన్ని తెచ్చి రాజద్వారంలో ఉంచి గోడుగోడుమన్నాడు.

ఆ సమయంలో అర్జునుడు ద్వారకకు వచ్చి ఉన్నవాడు ఆ విప్రుని శోకాన్ని చూసి, 'అయ్యా! శోకింపవద్దు. ఈ ద్వారకలో శరాసనం పట్టగల వీరుడు లేడా? ఉంటే ఈ గతి వస్తుందా? ఇక్కడి రాజన్యులు సత్త్రయాగ బ్రాహ్మణులయ్యారు. ఏ రాజు దేశంలో బ్రాహ్మణులు ధన దాన సుతాదులను కోల్పోయి దుఃఖం పాలవుతారో, ఆ రాజు కుక్షింభరుడే కాని రాజు కాడు. నేను మీ దైన్యాన్ని తీరుస్తాను. లేదా వహ్నికి బలియై నా పాపాన్ని పోగొట్టుకొంటాను' అన్నాడు. బ్రాహ్మణుడు ఆ పలుకులు విని, 'అయ్యా! రామకృష్ణులంటే ఎవరనుకొన్నావు? జగదీశ్వరులు. ప్రద్యుమ్నానిరుద్ధులో అప్రతిమానధనుర్ధరులు. అంతటివారికి చేతకాని పనిచేయబూనావు. ఇది

కేవలం మౌఢ్యమే; నీ మాట నమ్మకూడదు' అన్నాడు. అర్జును డతనితో 'విప్రవర్యా! నేను నీవన్న రామకృష్ణాదులలో ఒకడిని కాను. ఇతను గాండీవి అని గ్రహించు. ముక్కంటిని మెప్పించిన నా విక్రమాన్ని సందేహింపకు. మృత్యువు నైనా జయించి నీ బిడ్డలను తెచ్చియిస్తాను' అన్నాడు.

విప్రు డా మాటలను విని అతను పార్థు డన్న విషయాన్ని గ్రహించి శాంతచిత్తుడై ఇంటికి తిరిగివెళ్ళాడు. అతని భార్యకు కొంతకాలానికి మళ్ళీ ప్రసవసమయం దగ్గరపడింది. అదిచూసి ఆ విప్రుడు హుటాహుటి పరిగెత్తి 'అర్జునా! అర్జునా! నా కొడుకును మృత్యువునుంచి కాపాడు' అని వేడుకొన్నాడు. అర్జునుడు ఆచమించి శుచియై మహేశ్వరునికి నమస్కరించి దివ్యాస్త్రాలను స్మరించి గాండీవం చేతబట్టి ఆ విప్రుని ఇంటికి వెళ్ళి ప్రసవగృహానికి సర్వదిక్కులలో దివ్యాస్త్ర యోజితశరాలను పరిచి పంజరం కట్టి కాచుకొని ఉన్నాడు. అంతలో విప్రుని పత్ని ప్రసవించింది. పుట్టిన వెంటనే ఆ బాలకుడు అదృశ్యుడై గగనమార్గాన ఎగిరిపోయాడు.

ఆ విప్రు డదిచూసి కృష్ణునియెదుట అర్జునుని పరిపరివిధాల నిందించి, 'అయ్యయ్యో! నపుంసకుని మాటనమ్మి మోసపోయాను. నేనెంత వెర్రివాడినో చూడు. రామకృష్ణులు గాని ప్రద్యుమ్నానిరుద్ధులు గాని రక్షింపలేనినాడు ఆ పని ఎవరికి సాధ్యమని ముందే చెప్పాను. అర్జునా! దైవోపహతుని కాపాడగలనని కల్లబొల్లి మాటలన్నావు. నీ ఆత్మశ్లాఘలకు నేనే దొరికానా? నీ గాండీవం తగలబెట్టనా?' అని నిష్ఠూరాలాడాడు.

## అర్జున గర్వభంగం

ఆ మాట మనసునాటి అర్జునుడు యమపురానికి పోయి మృతబాలకుని కోసం అక్కడ వెతికాడు. ఎంత వెతికినా అతను కనిపించలేదు. అంతట గాండీవి ఇంద్రాగ్నిసోమనిర్మతి వరుణవాయుపురాలన్నీ వెతికి విఫలమనోరథుడై అక్కడినుంచి స్వర్గపాతాళ లోకాలకు, తదితర ప్రదేశాలకు తిరిగి మూలమూలలు వెతికి వేసారి 'అయ్యో! నా ప్రతిజ్ఞ భగ్నమయింది అగ్ని

ప్రవేశం చేస్తాను' అని ఉద్యుక్తుడయ్యాడు. కృష్ణుడతనికి అడ్డుపడి, 'పార్థా! మాటపట్టింపు వద్దు. విప్రపుత్రులను నేను చూపుతాను. నవ్విన నాపచేను పండక మానుతుందా? నిన్ను నిందించిన నోటనే ఎన్ని పొగడ్తలు వింటావో చూడు' అని పలికి కిరీటిని తన రథంలో కూర్చుండబెట్టుకొని పశ్చిమభాగానికి తరలి సప్తద్వీపాలను సప్తసముద్రాలను సప్తకులపర్వతాలను దాటి లోకాలోకాన్ని అతిక్రమించాడు. దాని తర్వాత కటిక చీకట్లు కమ్మి కన్నుపొడుచుకొన్నా కనబడని చోటు వచ్చింది. కృష్ణుని రథాశ్వాలు పరిగెత్తలేకపోయాయి. కృష్ణు దదిచూసి తన చక్రాన్ని ముందు పంపాడు. ఆ చక్రతేజం వేయిమంది సూర్యుల తేజాన్ని మించి రామబాణం రాక్షససేనను హరించినట్లు గాఢాంధకారాన్ని విరియింపజేసి దారి చూపుతూ ముందునడిచింది. ఆ మార్గాన రథ్యాలు సాగాయి. ఆ తేజోవిశేషాన్ని చూడలేక అర్జునుడు కన్నులు మూసుకొన్నాడు. ఇంకా ముందుకు సాగిన తర్వాత వాతోద్ధూత తరంగాభీల జలాకరం ఒకటి కానవచ్చింది. దానిని దాటిన తర్వాత అక్కడొక దివ్యభవనం సహస్రమణిస్తంభాలు తీర్చి కట్టినది దేదీప్యమానమై అగుపించింది. కృష్ణార్జునులు ఆ భవనం లోనికి ప్రవేశించారు. అందొక మహాసర్పం కైలాసగిరి వలె శ్వేతవర్ణంతో వేయితలలు రెండువేల కన్నులు నల్లని జిహ్వాకంఠప్రదేశాలు కలిగినది కానవచ్చింది. ఆ పాపరాయని విశాల ఫణాగ్రదేశాన ఒకవ్యక్తి నీలమేఘచ్ఛాయాశరీరుడు పీతాంబరం ధరించి కిరీటకుండలాద్యాభరణాలు అలంకరించుకొని ఎనిమిది హస్తాలతో ఆయుధాలు తేజస్సులీనుతుండగా శ్రీవత్స కౌస్తుభ వనమాలలతో విరాజిల్లుతూ నగుమోము దయారసాన్ని వెల్లివిరియిస్తుండగా సుఖాసీనుడై ఉన్నాడు. అతనిని పరివేష్టించి సునందనందనాది పార్షదు లున్నారు. శ్రీదేవి పుష్టి కీర్తి మాయ సమృద్ధి మొదలైనవారు ఆయనను సేవిస్తున్నారు. చక్రాద్యాయుధాలు రూపుదాల్చి ఆయన సేవారతులై ఉన్నారు.

కృష్ణార్జునులు ఆయనకు నమస్కరించి అంజలిబద్ధులై నిలిచారు. ఆ మహానుభావుడు వారిని చూసి, 'మీరు నా అంశసంభూతులు. మిమ్ములను

చూడగోరి మీరిక్కడికి రావటానికి నిమిత్తంగా విప్రసుతులను నేనే ఇక్కడికి తెచ్చాను. మీరు మీ భూభారాన్ని తీర్చి త్వరలో నా వద్దకు రావాలి. మీరు నరనారాయణఋషులు; పూర్ణకాములు. మీరు కోరదగినది, పొందదగినది లేదు. లోకసంగ్రహార్థం లోకస్థితి నిమిత్తం ధర్మాన్ని ఆచరించండి' అని పలికాడు. కృష్ణార్జునులు తలలూపి విప్రసుతులతో ద్వారకకు వచ్చి ఆ శిశువులను వారి తండ్రి కిచ్చారు.

రాజేంద్రా! శ్రీమహావిష్ణుతేజాన్ని చూచినంతనే అర్జునుని తలంపులు వేయి విధాలయ్యాయి. 'అహో! పౌరుషమని లోకులు విర్రవీగుతారు. శ్రీకృష్ణుని కరుణ లేనినాడు గడ్డిపరకను కూడా కదిలింపలేరు. ఇది నాకు ఈనాడు స్వానుభవంలో అర్థమయింది' అని గాండీవి నిశ్చయించుకొన్నాడు.

భూపాలా! శ్రీకృష్ణభగవాను డిటువంటి దివ్యలీలలు ఇంకా అనేకం ప్రకటిస్తూ యజ్ఞకర్మలను ఆచరిస్తూ విషయభోగాలను అనుభవిస్తూ ఆశ్రితుల కోర్కెలు నెరవేరుస్తూ ధర్మదూరు లైనవారిని స్వయంగా సంహరిస్తూ అర్జునాదుల చేత హరింపజేస్తూ ధర్మాలను ధర్మరాజాదుల చేత సక్రమంగా నడిపించి లోకసంగ్రహ ధర్మస్థాపనలు కావించాడు.

## శ్రీకృష్ణలీలా సంగ్రహం

పరీక్షిన్నరేంద్రా! ద్వారకానగర సౌభాగ్యం ఇంతింతనరానిది. ఆ పురరాజవీథులు రేయింబవళ్ళు చతురంగ బలాల రాకపోకలతో క్రిక్కిరిసి ఉంటాయి. ఆ పట్టణం నలువైపుల ఉద్యానవనాలు విరాజిల్లుతుంటాయి. ఆ వనాలలో లతావృక్షాలు పూచి కమ్మని వాసనల నెగజిమ్ముతూ పుష్పమకరందాలకు కిసలయాలకు మూగిన తుమ్మెదలూ కోకిలాదుల మధురరుతాలు చెవులకు ఆమెతలిస్తుండగా ఎంతో మనోహరంగా ఉంటాయి. ఇంతెందుకు! ఆ నగరం సర్వసంపదలలో సాటిలేనిదని చెబితే సరిపోతుంది. శ్రీపతి అంతవాడికి నివాసమైన దంటే దాని సంగతి వేరే ఏమనాలి?

లోకైకవీరులైన యాదవులు ఆ పురనివాసమే తమకొనగూడిన పరమభాగ్యమని భావిస్తుంటారు. యౌవనవతులు మేడలెక్కి కందుకక్రీడలు సలిపేటప్పుడు వారి పయ్యెదలు చీరలు తొలగుతుండటమూ, వారి దేహకాంతుల క్రొమ్మెరుగులను తోపజేయటమూ అక్కడివారికి వింతకాదు.

శ్రీకృష్ణుడు షోడశసహస్ర కాంతామణులకు ఏకవల్లభుడై అందరి మందిరాలలో ఏకకాలాననే ఉంటూ తన్మందిరాంతర సరోవరాలలో ఒక్కొకర్తెను కూడి జలక్రీడాలోలుడై రాగాతిశయం వల్ల ఆ కాంతలు కౌగిట చేర్చుకొన్నప్పుడు వారి కుచకుంకుమ నూత్నకాంతిని ఆపాదింపగా తేజరిల్లుతుంటాడు. ఒక్కొక్క కోమలాంగి చిమ్మనగ్రోవి నీరు కృష్ణునిపై చల్లుతుంది. కృష్ణుడు తానొక క్రోవితో ఆ ఇందువదనపై నీరు విరజిమ్ముతాడు. ఆ లలనారత్నం కట్టుకొన్న నూత్నాంబరం తడిసి ఆమె కుచాదిప్రదేశాలు కానవస్తాయి. ఆమె సిగ్గుపడి జడముడి వీడగా విరులు రాలిపడగా వేవేగ వచ్చి ప్రియుని చేతి క్రోవిని లాగుకొనే నెపంతో అతనిని కౌగలించుకొంటుంది. ఆ ఆలింగనం మదనోదయకరం అవుతుంది. అదిచూసి కృష్ణుడు ఉల్లసిల్లగా కాంతాలలామల ముఖరేఖలలో వాంఛాంకురం పొడచూపుతుంది. జలకేళి కావించి అందుండి వెడలివచ్చి వారందరూ తాము ధరించిన వస్త్రాభరణాలను నట నర్తక గాయకాదులకు బహుమానాలుగా అందజేస్తారు.

రాజేంద్రా! ఆ ముగ్ధలు శ్రీకృష్ణుని గమన ఆలాప స్మిత వీక్షణ పరిరంభణాలకు పరవశించి అతనియందే చిత్తాలను హత్తించి ఉన్మత్త లవుతారు. ఒక్కొక్కరి ఉన్మత్తాలాపాలను విను. ఒక ముద్దుగుమ్మ తన పెంపుడు గొర్రెపిల్లతో అంటుంది: 'కురరీ! జీవరాశి ప్రజ్ఞను హరించింది. జగమంతా నిద్రావస్థలో మునిగిపోయింది. మేమతని స్మేరవిలోకనాలకు పరవశించి మైమరిచాము. మా సంగతి సరే. నీకెందుకు ఈ గతి పట్టింది? తక్కినవారు ఒక్కొక్కరి పలుకులను విను: చక్రవాకీ! రాత్రిపూట కన్నుమూశావేమిటమ్మా! నీ ప్రియుడు కానరాలేదని వాపోతున్నావా? అయ్యో!

నిన్ను చూసి మాకెంతో చింతగా ఉన్నది. నీ ప్రియుని వియోగానికి కాకపోతే ఈ దుఃఖం నీకు మరి దేనికి? అచ్యుతపాదసేవితమాలికను తలదాల్పగోరి తత్ప్రాప్తికై ఆచరిస్తున్న వ్రతమా? అతని దాసికలకు మాకుగాని నీకెందుకమ్మా ఈ పరితాపం?

సముద్రా? నిద్రమాని ఏమిటయ్యా నీ ఆక్రోశం? శ్రీకృష్ణుడు మా లాంఛనాలవలె నీ లాంఛనాలను కూడా హరింపగా ఈ దశకు వచ్చావా? చంద్రా! నీకు తెగులు మితిమీరి క్షయించావు కాబోలు. చీకట్లను పారద్రోలలేకపోవటానికి అదే కారణం కాబోలు. మాట్లాడవేమిటి? యదుపతి మాటల తేనె నీ గొంతుక్రోవిని అడ్డగిస్తున్నదా? మలయానిలా! నీకు మేము చేసిన అప్రియమేమిటి? ఊరికే మమ్మల్ని బాధిస్తావెందుకని? గోవిందుని కటాక్షవీక్షణాలకు పరవశమై చేస్తున్నానంటావా? మేఘుడా! నీ వెంతో శ్రీమంతుడవు. వన్నెను బట్టి యదుపతికి ప్రియుడవని మేమెరుగుదుము. నీ ప్రేమ మహోత్కంఠమే గాని నీ హృదయం చంచలాచపలమన్న సంగతిని నీవు ఆగి ఆగి కురిపిస్తున్న బాష్పధారలే ప్రకటిస్తున్నాయి. అతని ఊసు దురంత దుఃఖదమని మమ్మల్ని చూసయినా నేర్చుకో. కోకిలమా! నీ అమృతవాక్కు మృతసంజీవన మన్నమాట లోకవిదితం. అట్టి వాక్కుతో కృష్ణపదాలను మా ప్రశాంతి కోసం వినిపిస్తుంటావు. నీ ఋణం ఎలా తీర్చగలము? ధాత్రీధరమా! నీ బుద్ధి ఎంతో ఉదారమని మాకు తెలియనిది కాదు. ఉలుకు పలుకులు లేక ఏమని చింతిస్తున్నావు? మేము వాసుదేవుని పాదాలను మా స్తనాలపై దాల్చి నీ శిఖరాగ్రాలను నిరాదరించామనా? నదులారా! మీరు సింధుమహారాజుకు కూర్మి దేవేరులు. అట్టి మీరు ఈ విధంగా సొంపుతప్పి కాన్పించటానికి కారణమేమిటి? శ్రీకృష్ణుని ప్రేమవిలోకనాలకు దూరమై మేము కళతప్పినట్లే మీరుకూడా వానలు లేక మడుగులింకి నీరసపడ్డారా? మరాళమా! స్వాగతం. నీవు యదుపతి దూతవై వచ్చావని మాకు తెలుసు. కూర్చో; పాలుత్రాగు. మీ

రాజు సుఖమే కదా. మమ్మల్ని ఎప్పుడయినా తలుచుకొంటాడా? అయ్యో! చంచలాతిచంచలు డెక్కడ? మనసిచ్చే మైత్రిభావం ఎక్కడ? అతను కాముదుడంటావా? ఏదీ ఇక్కడికి రప్పించు. మా కామాలను తీర్చు. నీ మాట విలువెంతో తెలియదా? శ్రీదేవి ఒక్కతే తన యందు ఏకనిష్ఠరాలని అతని భావం. ఆ శ్రీని విడిచిపెట్టి మా దగ్గరికి వస్తాడా?'

రాజా! శ్రీకృష్ణపత్నులందరూ ఈ విధంగా భావన చేస్తుండేవారు. తత్ఫలితంగా వారు భగవద్భావనైక చిత్తలై సద్గతిని పొందారు. భగవంతుని గూర్చి వినే అదృష్టం ఉన్నా చాలు. శ్రవణమాత్రాననే హృదయాన్ని బలవంతంగా నైనా భగవానుడు ఆకర్షిస్తాడు. ఇక అతని భజనకు నోచుకొన్న వారి భాగ్యమే భాగ్యం. ఆ లోకగురుని పతిగా భావించటం, అతని పాదాలొత్తటం – ఈ మహాభాగ్యాలు ఎంత తపఃఫలాలో నీవే ఊహించి చూడు. మరొక విశేషం. గృహమే ధర్మార్థకామాలు మూడింటికీ తగినచోటని ఆ మహాత్ముడు గృహస్థధర్మాన్ని వేదమార్గ ప్రకారం తాను నడిచి మనకు చూపించాడు.

## శ్రీకృష్ణుని సంతానం

రాజా! శ్రీకృష్ణునికి షోడశసహస్ర భార్యలుండేవారని చెప్పాను. వారిలో రుక్మిణి మొదలైనవారు ఎనిమిదిమంది ప్రాధాన్యం వహించారు. కృష్ణునికి ఒక్కొక్క భార్యయందు పదుగురు పుత్రులు జనించారు. వారందరిలో ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, మిత్రుడు, బృహద్భానుడు, మిత్రవిందుడు, వృకుడు, అరుణుడు, పుష్కరుడు, దేవబాహుడు, శ్రుతదేవుడు, సునందనుడు, చిత్రభానుడు, వరూథుడు, కవి, న్యగ్రోధుడు అనే పద్దెనిమిది మంది ప్రసిద్ధులు. అనిరుద్ధుడు పౌత్రుడే కాని ప్రాధాన్యాన్ని బట్టి పుత్రులలో పరిగణింపబడ్డాడని గ్రహించు.

కృష్ణునికి త్రివక్రయందు ఉపశ్లోకు డనేవాడు పుట్టి నారదుని వలన జ్ఞానోపదేశం పొంది హరిభక్తులలో ఉత్తమపదవి గాంచి 'సాత్వత తంత్ర' మనే గ్రంథాన్ని రచించాడు. ఆ గ్రంథ తత్త్వాన్ని గ్రహించి అనుష్ఠించినవారికి ముక్తి కలుగుతుంది. ఆ మహాగ్రంథంలో స్త్రీలకు శూద్రులకు దాసులకు వైష్ణవ సంస్కారాన్ని విధించే మార్గం నిరూపింపబడింది.

శ్రీకృష్ణుని పుత్రులలో ప్రద్యుమ్నుడు కృష్ణునికి తుల్యుడై వెలుగొందాడు. అతను రుక్మి కుమార్తెను వివాహం చేసుకొన్నాడని, అతని కొడుకు అనిరుద్ధుడని చెప్పాను. అనిరుద్ధుడు రుక్మి పౌత్రిని పెండ్లాడి ఆమె వలన వజ్రుడనే సుతుని పొందాడు. ముసలం నిమిత్తమై యాదవకులమంతా నశించినా వజ్రుడు మాత్రం శేషించి వంశకరు డయ్యాడు. అతనికి ప్రతిబాహుడు, ప్రతిబాహునికి సుబాహుడు, సుబాహునికి ఉగ్రసేనుడు, ఉగ్రసేనునికి శతసేనుడు ప్రభవించారు. ధన్యతమమైన యాదవకులంలో ధనహీనులు గాని బహుశ్రుతులు కానివారు గాని, స్వల్పాయువులు గాని, అల్పవీర్యులు గాని, అబ్రహ్మణ్యులు కాని పుట్టరు.

రాజా! యదుజాతులను పేర్కొనటానికి అయుతశతసంవత్సరాలు కూడా సరిపోవు. యదుకుమారులకు విద్యనేర్పిన ఆచార్యుల సంఖ్యే మూడు కోట్ల ఎనిమిదివేల ఎనిమిది వందలుంటుంది. ఇక వారి శిష్యులెందరుంటారో ఊహించు. యాదవులలో ఆహుకు డొక్కడికే అయుతాయుతలక్షసుతులు జన్మించారట. యాదవులందరి సంతానం లెక్కించటం సాధ్యమా?

రాజా! దేవాసురయుద్ధంలో మరణించిన దైత్యులు మర్త్యులుగా జన్మించి జనులను పీడించటం మొదలుపెట్టారు. వారిని నిగ్రహించటానికి దేవతలు భగవదాజ్ఞ ప్రకారం యదుకులంలో నూటొక్క తెగలలో జన్మింపవలసి వచ్చింది. ఆ యాదవులు భగవదనుగ్రహం వలన వర్ధిల్లి సర్వకాల సర్వావస్థలలో శ్రీకృష్ణచిత్తులై సంతోషవివశత్వానికి, ఉభయలోక సౌఖ్యాతిశయానికి నోచుకొన్నారు.

## శ్రీకృష్ణుని యాగదీక్ష

రాజా! శ్రీకృష్ణుడు భగవానుడైనా నిఖిలదేహార్థ సంగ్రహాన్ని రచింపబూని భార్యలతో దీక్షబూని వ్యాసగార్గ్యులు, ఉద్ధవాదుల తోడ్పాటుతో కురుక్షేత్రాది పుణ్యక్షేత్రాలలో స్వమాయారచితాలైన అనేక క్రతువులను శాస్త్రోదితప్రకారం చేసి చూపాడు. ఇందులో ఒక రహస్యం ఉన్నది. భగవానుడు తానే కర్త, తానే భోక్త అయ్యాడు. యజ్ఞకర్తృత్వ యజ్ఞభోక్తృత్వాలను నిర్వహించి తనను తానే పూజించుకొన్నాడు.

రాజా! శ్రీకృష్ణు డవతరించటం, మహాద్భుత లీలలను ప్రదర్శించటం, గంగాజలమహిమ తన మహిమ కంటె విశేషమని ఆదేశించటం, సుహృదులైనవారిని తనకు సరూపులనుగా చేయటం, సర్వలోక సత్కృతయైన శ్రీదేవి చేత సేవలందటం, తనపేరు విన్నంతనే సర్వపాపాలు పటాపంచలయేట్లు చేయటం, ఋషివంశాలలో ధర్మప్రవృత్తిని నెలకొల్పటం, కాలచక్రాయుధుడై భూభారాన్ని తీర్చటం – ఇవేవీ గొప్ప వింతలు కావు. గొల్ల కులంలో పుట్టి అధర్మాన్ని అరికట్టి మూఢలైన గోపకాంతలకు మదనోద్దీపన రూపకంగా పరాభక్తిని కలిగించి చరాచర సమస్తభూత పాపాలను హరించి సర్వజనాశ్రయుడు కావటం ఎంత వింతో చూడు.

భగవానుడు తానేర్పరచిన ధర్మాలను రక్షించటానికి అదను వచ్చినప్పుడు లీలావతారం ధరించి తదనురూపంగా తాను వర్తించి ధర్మాన్ని ఉద్ధరిస్తుంటాడు.

భగవత్పదానువృత్తిని కోరేవారికి భగవచ్చరితలను వినటం ఎంతో అవసరం. భగవత్పదానువృత్తి పరాయణులకు భక్తియోగం క్షణక్షణాభివృద్ధిని గడిస్తుంది. తత్ఫలంగా భగవత్పదం సిద్ధిస్తుంది. రాజులంతటివారు కూడా భగవత్పద ప్రాప్తికై సర్వైశ్వర్యాలను త్రోసిరాజని అడవులను పట్టి ప్రాకులాడుతుంటారు. ఐశ్వర్యవంతులే అలా చేస్తుండగా, స్వల్పభోగాలు కలవారి సంగతి వేరే చెప్పాలా?

## శ్రీకృష్ణ జన్మసారాంశం

మునులారా! కలియుగంలో జనింపనున్న తన భక్తుల తమోదుఃఖశోకాలను దాటి కడతేరటానికి తన కీర్తిస్తుతి ఒక్కటే పరమసాధనమని భగవానుడు నిశ్చయించి ఆ భాగ్యాన్ని వారికి సమకూర్చటానికి తానే స్వయంగా అవతరించి తన మహిమలను ప్రకటించాడు. ఆ దేవదేవుని కీర్తిస్తోత్రం కర్ణామృతం వంటిది. ఆ పరమపావనమూర్తిని స్తుతించేవారు శుద్ధులై కర్మవాసన లన్నింటినీ జయించి గట్టెక్కుతారు. మణిమయమకర కుండల విభ్రాజమాన కర్ణయుగళంతో, దర్పణాలను పోలిన కపోలతలాలతో, లలితస్మితచంద్రికలతో నిత్యోత్సవాన్ని కలిగించే ఆ లోకమోహనమూర్తి వదనారవిందం పురుషులకే విభ్రాంతి గొలుపుతున్నదనగా, నారీమణులకు రెప్పపాటు తప్పుతుండటం ఒక వింతేనా?

మునులారా! భగవానుడు నరాకృతితో దేవకీ వసుదేవులకు అవతరించి వారి కోరిక నెరవేర్చాడు; నందవ్రజం చేరి అందలి గోపీగోపకులకు అభీప్సితాలను తీర్చాడు; భగవంతుడే భర్త కావాలని జన్మజన్మాంతరాల నుంచి వరపడుతున్న కాంతల వాంఛితాలను సమకూర్చాడు; తాను వేదమూర్తి అయినా లోకశిక్షార్థం యజ్ఞాలను కావించి ధర్మదీపాన్ని వెలిగించాడు; భూభారం తొలగించాడు; అర్జునుని నిమిత్తంగా చేసి కర్మతత్త్వాన్ని బోధించాడు; ఉద్ధవుని నిమిత్తంగా నిలిపి ఆత్మతత్త్వాన్ని ప్రకటించాడు. ఆ విధంగా భగవానుడు లోకానుగ్రహం చూపి నిజధామాన్ని చేరుకొన్నాడు.

# ఏకాదశ స్కంధము

## సృష్టిస్థితికి మూలం

పరీక్షిన్నరేంద్రా! భగవానుడు జగత్తును సృష్టించి ఆ సృష్టి నిలిచి ఉండేందుకు కొన్ని ధర్మాలను విధించాడు. ఆ ధర్మాలు ప్రవృత్తి ధర్మాలని, నివృత్తిధర్మాలని రెండు భాగాలు. ఆ రెండింటి పైని ఆధారపడి సృష్టి ఉన్నది. వాటిలో దేనికి లోపం వచ్చినా సృష్టిస్థితి యథాక్రమంగా జరుగక తారుమారవుతుంది.

పూర్వం దేవాసురయుద్ధంలో మరణించిన రాక్షసులు రాజులై పుట్టి అధర్మకార్యాలను వారి స్వభావానుసారం అడ్డులేకుండా చేయసాగారు. 'యథా రాజా తథా ప్రజాః' అన్నట్లు ప్రభువులెప్పుడు అధర్మవర్తన మొదలుపెట్టారో ప్రజలు కూడా వారిని చూసి అధర్మప్రవర్తకు లవుతారు. అధర్మం వృద్ధిచెందినప్పుడు ధర్మం సన్నగిల్లి మంచితనం మటుమాయ మవుతుంది. జగత్తు యొక్క స్థితి ధర్మానిపై నిలిచి ఉన్నదని చెప్పాను. ధర్మం సన్నగిల్లినప్పుడు జగానికి బరువు మోయరానిదయింది. భూభారాన్ని తొలగింపగోరి భగవానుడు శ్రీకృష్ణునిగా నేలకు దిగివచ్చాడని వివరించాను.

నరేంద్రా! శ్రీకృష్ణు డా విధంగా అవతరించి పూతనాదులను తాను

వధించి, రాజులుగా ఉన్న ప్రలంబాది రాక్షసులను బలరామాదుల చేత హరింపజేసి, భారాన్ని కొంత తగ్గించాడు. అప్పటికీ కొందరు మిగిలారు. వారిని సంహరింపవలసి కౌరవపాండవులకు కలహాన్ని కల్పించాడు. చిన్ననాడే కౌరవులు పాండవుల అభ్యున్నతిని చూసి ఓర్వలేక భీమునికి విషం పెట్టారు. లక్కయిల్లు కట్టించి అందులో పాండవులను ప్రవేశపెట్టి ఆ ఇంటికి నిప్పు పెట్టించారు. ఎన్ని క్రూరకార్యాలు చేసినా పాండవులకు అపాయం కలగలేదు. కౌరవు లదిచూసి శకునితో ఆలోచించి జూదం తలపెట్టి ధర్మనందనుని రావించి అతని నోడించి రాజ్యాన్ని వశపరచుకొన్నారు. ఆ జూదంలో ధర్మరాజు చివరికి తననే పందెంగా ఒడ్డి ఓడిపోయాడు. ధర్మనందనుడు తనను ఓడినట్లయితే అతని భార్యను కూడా ఓడినట్లే నని వికల్పార్థం తీసి ఆ నెపాన ద్రౌపదిని సిగబట్టి సభలోకి ఈడ్పించి వస్త్రాపహరణతో అవమానించారు. ఆ ఘోరకృత్యాలకు పాండవులు దీర్ఘక్రోధం వహించారు. తత్ఫలంగా కౌరవ పాండవులకు కురుక్షేత్రంలో మహాసంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో ఇరుపక్షాల రాజులు రాక్షసాంశసంభూతు లందరూ నశించారు. ఆ విధంగా భూభారహేతువు లైన రాజులు, వారి సైన్యమూ గతించి భూభారం తగ్గింది.

అవతారకార్యం తీరిన తర్వాత భగవానుడు తన మాయాశరీరాన్ని ఉపసంహరింప దలచాడు. యాదవులు శ్రీకృష్ణపరిరక్షితులై గర్వించి ఉన్నారు. వారందరూ దేవతలుగా ఉండి దేవకార్యార్థం యాదవకులంలో పుట్టినవారు. గర్వాంధులైన వారి ఉనికి సయితం భూమికి భారమని భగవానుడు నిశ్చయించాడు. అంతే కాక వారు వచ్చిన పని ముగిసింది కాబట్టి వారిని స్వస్థానాలకు చేర్పవలసి ఉన్నది. అప్రమేయుడు, సర్వశక్తిసంపన్నుడు అయిన భగవానునికి యాదవకులాన్ని సంహరించడం ఒక లెక్కలోని విషయం కాకపోయినా తానై చేజేతులా చంపడం అనుచితమని కాబోలు వారిని తాను హతమార్పలేదు. తాను చంపకపోయినా ఇంద్రాదుల చేత ఎందుకు చంపింప లేదు? అంటే, తనను ఆశ్రయించినవారిని తానుండగానే పరులు వచ్చి

చంపటం తన విభవానికి న్యూనతే కదా. యాదవసంహారం ఎలా జరిగిందంటావా? విను. అందుకోసం ఒక వ్యూహాన్ని పన్ని వహ్నితో వెదురుపొదను నాశనం చేసినట్లు యాదవ వినాశం కావించి లోకమంగళకరమైన తన అవతారాన్ని ఉపసంహరించాడు.

## యాదవులకు బ్రాహ్మణశాపం

రాజేంద్రా! యాదవనాశనార్థం భగవానుడు పన్నిన వ్యూహమేమిటో విను. ఒకనాడు విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దుర్వాసుడు, భృగువు, అంగిరసుడు, కాశ్యపుడు, వామదేవుడు, అత్రి, వసిష్ఠుడు, నారదుడు మొదలుగా గల మహర్షులు శ్రీకృష్ణసందర్శనార్థం వసుదేవుని సదనానికి వచ్చి గోవిందుని సందర్శించి అతనిని వీడ్కొని పిండారక క్షేత్రానికి పోబోతున్నారు. యదుకుమారులు ఆ ఋషులను చూసి సాంబునికి గర్భిణీస్త్రీ వేషం వేసి ఆ స్త్రీని వెంటబెట్టుకొని ఆ మునుల వద్దకు వెళ్ళి నమస్కరించి, 'మహాత్ములారా! ఈ గర్భవతి తనకు పుట్టనున్నది మగశిశువా? లేక ఆడశిశువా? అని తెలిసికొన గోరుతున్నది. ఆ సంగతి మిమ్మల్ని స్వయంగా అడగటానికి సిగ్గుపడి మాచేత అడిగిస్తున్నది. మీ విజ్ఞానం అమోఘమైనది. మా కోరిక తీర్చండి' అన్నారు. ఆ మహర్షులు వారి కృత్రిమభావాన్ని గ్రహించి, ఓహో! ఈ మూర్ఖులు మనను మోసంచేసి ఆటపట్టింపదలిచారు, కానిమ్మని లోలోన తలచి, 'దీని గర్భంలో కులనాశనకరమైన లోహమయ ముసలం పుట్టనున్నది' అని చెప్పి వెళ్ళిపోయారు.

ఋషులు చెప్పిన మాటలో సత్యం ఎంత ఉన్నదో చూద్దామని యాదవులు సాంబునికి తాము కూర్చిన కృత్రిమగర్భాన్ని విప్పి చూశారు. అందులో ఒక లోహమయ ముసలం ఋషులు చెప్పినట్లే ఉన్నది. వారు ఆ ముసలాన్ని చూసి, 'ఎంత మందభాగ్యులము? మనకు ఇటువంటి దురాలోచన ఎందుకు కలిగింది? ఋషులమాట తప్పదు. మన అకార్యం వలన మన కులమంతటికీ ముప్పు కలిగింది. ఈ సంగతి విని మనవారు ఏమంటారో కదా. ఏమైతే కానీ.

పెద్దలకు సంగతి చెబుదాము. మించిన పనికి వగచి లాభం లేదు' అని నిశ్చయించుకొని ఆ ముసలాన్ని తీసుకొని ఉగ్రసేనుని వద్దకు వెళ్ళి జరిగిన సంగతి విన్నవించారు. ఆ మాట వినగానే ద్వారకావాసు లందరూ ఆందోళన చెంది, 'అయ్యో! ఋషిశాపం తప్పదు. మనకు ఈ ముసలం వల్ల చేటు మూడుతుంది. దీనిని నాశనం చేస్తే సరి' అని నిశ్చయించి రాజానుమతిని పొంది, దానిని అరగదీసి సముద్రంలో కలిపారు. ఆ చూర్ణం సముద్రతరంగాలలో కొట్టుకొనివచ్చి తీరమంతా అలముకొని తుంగలై మొలిచింది. ఆ ముసలాన్ని అరగదీసినప్పుడు చివరిగా మిగిలిన ఒక చిన్న ముక్కను కూడా సముద్రంలో పారవేశారు. ఆ ముక్కను ఒక చేప మింగింది. ఆ చేప ఒక జాలరి వలలో చిక్కింది. అతను ఆ చేపను ఇంటికి తెచ్చి కోశాడు. దాని పొట్టలో ఆ ముక్క కనిపించింది. అతను దానిని తన బాణాగ్రానికి అతికించాడు.

రాజేంద్రా! శ్రీకృష్ణభగవానుడు ఈ వృత్తాంతమంతా తెలిసినవాడే కదా? రానున్న ముప్పును తప్పింపగల సామర్థ్యం అతనికి లేకపోలేదు. అయినా విప్రశాపం తప్పకూడదు. ఆ శాపనిమిత్తాన తన సంకల్పం నెరవేరవలసి ఉన్నది. అన్ని కారణాలను పురస్కరించుకొని భగవానుడు మౌనం వహించాడు.

## వసుదేవునికి నారదోపదేశం

రాజేంద్రా! శ్రీకృష్ణుని కొంతకాలం ఉపాసించాలనే కోరిక ఒకప్పుడు నారదునికి కలిగింది. అది కారణంగా ఆ మహర్షి ద్వారకాపురంలో నివసించాడు. నారదునికి, దక్షాదుల శాపం ఉన్నదని, ఆ శాపఫలంగా అతను ఒకచోట స్థిరంగా ఉండే వీలులేక సంచరిస్తూ ఉంటాడని, అట్టివాడు ద్వారకలో కొన్ని నెలల పాటు ఎలా ఉండగలిగాడని, శంకిస్తావేమో! దక్షాదులు నారదుని ఒకచోట నివసింపరాదని శపించిన మాట నిజం. ఎటువంటి ఘోరశాపమైనా భగవదుపాసనా విషయంలో అడ్డురాదు.

ఇంతెందుకు? ఇంద్రియవంతు లందరికీ మృత్యువు తప్పదు. అట్టి మృత్యువు సహితం భగవత్పాదసేవాపరులకు దూరమవుతుండగా శాపాదుల సంగతి ఏమి చెప్పమంటావు? అన్ని శాపాలూ భగవచ్ఛక్తినిరూపణలే గాని స్వతంత్రోక్తులు కావు. భగవంతుని ఆశ్రయించిన వారిని శాపశక్తి ఎంత గొప్పదయినా ఏమీ చేయలేదు. ఎందుకంటావా? శక్తమంతుని మీరి శక్తి ప్రవర్తిల్లదు కదా.

నారదుడా విధంగా ద్వారకలో ఉంటూ ఒకనాడు వసుదేవుని మందిరానికి వెళ్ళాడు. వసుదేవుడు ఆయనను యథావిధి సత్కరించి సుఖాసీనుని కావించి చేతులు జోడించి, 'మహాత్మా! తల్లిదండ్రుల రాక బిడ్డలకు మాత్రమే క్షేమదాయకం. మీబోంట్ల రాక సర్వలోకమంగళహేతువు. మీవంటి మహితాత్ములను దేవతలతో సాటిచేయడం దోషమే అవుతుంది. దేవతల వలన ఒక్కొక్క వేళ భూతజాతానికి కీడుసైతం కలుగుతున్నది. మీ వలన సర్వభూతమంగళమే తప్ప కీడెన్నటికీ కలుగనేరదు. వృష్ట్యాదులనే చూడండి. అవి దేవకార్యాలు. వృష్టి లోకోపకారకమే గాని అతివృష్టి లోకానికి ఎంతో బాధాకరం అవుతున్నది. అంతేకాదు. దేవతలు కర్మానుగుణంగా మాత్రమే ఫలాలను ఇవ్వగలరు. వృక్షమెంతో దాని నీడకూడా అంతేకదా. సాధువుల మాట వేరు. వారి సేవాఫలం అనంతమైనది. వారు దీనవత్సలులు కాబట్టి గోరంతసేవ చేస్తే మనసుకరిగి ఎంత ఫలమయినా ఇస్తారు. ఋషివరేణ్యా! వేయి మాటలెందుకు? మీ రాకవలననే మేము ధన్యులమయ్యాము. అయినా ఒక్క కోరిక ఉన్నది. నా విన్నపాన్ని మన్నింపగలరనే పేరాశతో మిమ్మల్ని ఒక్క కోరిక కోరుతున్నాను. మర్త్యులకు ఏ వంక చూసినా తీరని భయాలు చుట్టుముట్టి ఉన్నాయి. ముక్తి వలన తప్ప వేరొక తీరున ఆ భయాలు తొలగవు. ముక్తి అన్నదో? భాగవతధర్మాలను గ్రహించి తదనుగుణంగా నడుచుకొంటే గాని కలిగేది కాదు. కాబట్టి భాగవతధర్మాలను నాకు తెలియజెప్పమని ప్రార్థిస్తున్నాను. భగవంతుని ఉపాసించావు కదా? అంటారేమో. ఆ మాట నిజం. అయితే కైవల్యకాంక్షతో ఉపాసింపలేదు.

పుత్త్రలాభార్థం ఉపాసించి ఆ ఫలాన్ని పొందాను. కైవల్యార్థం ఎందుకు ఉపాసింపలేదని అడగవచ్చు. అప్పుడు నా బుద్ధి మాయామోహితమై కైవల్యభావం వంక కూడా దృష్టిని సాగనీయలేదు. మునీంద్రా! సంసారము సర్వతోభయమై ఉన్నది. అందుకు తోడు ఉన్న వ్యసనాలు లెక్కలేనన్ని. ఒకదానిలో చిక్కుకుంటే వెలికిరానీయనంత చిత్రంగా ఉంటాయి. ఈ సంసారం తొలగి మోక్షం కలగాలంటే ఉపాయమేమిటో శాసించండి' అని సంప్రార్థించాడు.

నారదు డా ప్రశ్న విని, 'అయ్యా! హరిగుణ వర్ణనీయమైన నీ ప్రశ్న నాకెంతో సంతోషదాయకం. భాగవతధర్మాలు లోకపావనకరాలు. ఆ శుభవాక్యాలను వినాలనే కోరిక నీకు కలగటం ఎంతయినా శ్లాఘ్యమే. భాగవత ధర్మాలను మించిన ధర్మం లేదు. ఆ ధర్మానికున్న మాహాత్మ్యం సామాన్యమైనది కాదు. దానిని విన్నా చదివినా చింతించినా గౌరవించినా అనుమోదించినా దేవద్రోహ, లోకద్రోహాదులన్నీ నశించి ఆ ద్రోహులు పావనశీలు రవుతారు. యాదవవర్యా! భాగవత ధర్మాలను చెప్పమని నన్ను నీవు కోరటం వలన నీవు నాకు చేసిన మేలు అనన్యం. ఏమంటావా? పరమకళ్యాణమూర్తి, పుణ్యశ్రవణకీర్తనుడు అయిన నారాయణుని నాచే స్మరింపజేశావు. ఇంతకంటె మహోపకారం ఏముంటుంది? భాగవత ధర్మ నిర్ణయాన్ని గురించి ఋషభమహర్షి పుత్త్రులకు, విదేహునికి సంవాదం జరిగింది. ఆ ఇతిహాసం సనాతనమై నా నోట నాటుకొని లోకానుమోదం గడించింది. దానిని చెబుతాను విను.

స్వాయంభువమనువుకు ప్రియవ్రతుడనే పుత్త్రుడు జనించాడు. అతనికి అగ్నీధ్రుడు, అతనికి నాభి, అతనికి ఋషభుడు క్రమంగా జన్మించారు. ఆ ఋషభుడు మోక్షధర్మాలను వివరించేందుకు భగవదంశతో జన్మించాడని అంటారు.

## ఋషభ సంతానం

ఆ ఋషభునికి నూర్గురు పుత్త్రులు జన్మించి అందరూ వేదపారంగతు

లయ్యారు. వారిలో పెద్దవాడు భరతుడు. అతనికి పూర్వం ఈ దేశానికి అజనాభమని పేరుండేది. భరతుని కాలం నుంచి ఈ దేశం అతని పేరుతో భరతవర్షమని పిలువబడుతున్నది. ఆ భరతుడు భూమండల రాజ్యమంతటినీ త్యజించి భగవానుని ఆరాధించి మూడు జన్మలలో పరమపదాన్ని సాధించాడు. ఋషభుని పుత్రులలో తొమ్మిదిమంది బ్రహ్మావర్తాది నవఖండాలకు రాజులయ్యారు. ఎనభైఒక్కరు కర్మమార్గప్రవర్తకులైన బ్రాహ్మణు లయ్యారు. తక్కిన తొమ్మిదిమంది పరమార్థతత్త్వవిచారపరులై వాయుభక్షణతో శరీరధారణ కావిస్తూ దిగంబరులై ఆత్మజ్ఞానార్థం శ్రమించి ఆత్మవిద్యావిశారదు లయ్యారు.

## నవకవులు

ఆ తొమ్మిదిమందిని కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోతుడు, ద్రమీళుడు, చమసుడు, కరభాజనుడు అని పేర్కొంటారు. వారిలో కవి పెద్దవాడయినందువల్ల అతని పేరిట వారందరినీ నవకవులని, ఋషభులని అంటారు. వారే, 'స్థూల సూక్ష్మాత్మకమైన చరాచరవిశ్వమంతా భగవద్రూపమేగాని తదన్యతరం ఒక్కటీ లేదు, భగవద్రూపం మాకంటె భిన్నమైనది కాదు' అని నిరూపించిన మహాత్ములు. ఆ విధంగా నిశ్చయించి వారు అభిమానరహితులై ఇచ్ఛానుగతిని సమస్తలోకాలలో విహరిస్తున్నారు.

## నిమి ప్రార్థన

ఆ సమయాన భరతవర్షంలో నిమి అనే రాజు సత్త్రయాగం చేస్తున్నాడు. యాగశాల మహర్షులతో నిండి ఉన్నది. నవకవులు లోకాలలో సంచరిస్తూ యాదృచ్ఛికంగా అక్కడికి వచ్చారు. సూర్యప్రభలతో వెలుగొందుతున్న ఆ పరమ భాగవతులను యజమానుడు, అగ్నులు, ఋత్విజులు, సదస్యులు, తదితరులు చూసి యథావిధి గౌరవించారు. అంతట నిమి వినమ్రుడై

ముందుకు వచ్చి, 'మహాత్ములారా! ఆత్మతేజంతో ప్రకాశిస్తున్న మీరు బ్రహ్మపుత్రసదృశులైన నారాయణపారిషదులని భావిస్తాను. విష్ణుభక్తులు లోకపావనార్థం సంచరిస్తారు. దేహములన్నీ క్షణభంగురా లన్నమాట నిజం. వాటిలో మానుషదేహం ఒక్కటే పురుషార్థసాధనకు యోగ్యమైనది. ఆ దేహం బహుజన్మల సుకృతపరిపాకం వల్ల కలుగుతుంది. అందుకనే మర్త్యదేహం దుర్లభమన్నారు. అట్టి బహుదుర్లభమైన దేహాన్ని పొందగలిగినా భాగవతుల దర్శనభాగ్యం కలగడమన్నది మరింత దుర్లభం. ఎలాగో మా భాగ్యవశాన మీ సందర్శనం మాకు నేడు లభించింది. మాకు ఆత్యంతిక క్షేమ మేమిటో చెప్పగలవారు మీరే. సత్సాంగత్యలాభం నిమేషార్థమయినా సంసారులకు తరగని మహానిధి వంటిది. భగవానుడు ప్రపన్నులకు కామితార్థాలనే గాక తనను తాను సైతం అర్పించుకొంటాడని అంటారు. మేము ప్రపన్నార్తులమై ఉన్నవారము. మా ప్రపన్నత నిర్వ్యాజమూ నిష్కల్మషమూ కావాలంటే భాగవత ధర్మశ్రవణ ముఖ్యసాధన మంటారు. ఆ ధర్మాలను గురించి వినాలని మా చిరకాలవాంఛితం. అందుకు మేము అర్హులమయితే తెలియజెప్పండి' అన్నాడు. నవకవులు ఆ మాటవిని, 'ఓ రాజసత్తమా! ఋత్విక్సదస్యులారా! మీ కోరికకు అభినందిస్తున్నాము. మీరడిగిన విశేషాలను సాకల్యంగా వినండి' అంటూ ఒక్కొక్కరుగా భాగవత ధర్మాలను వివరించారు.

## ఆత్యంతిక క్షేమం

ముందుగా ఋషభాగ్రజుడు కవి ప్రసంగించాడు. 'ఆర్యులారా! ఆత్యంతిక క్షేమమేదో మొదట చెబుతాను వినండి. క్షేమమంటే ఏమిటి? అశుభమన్నది లేకపోవటాన్ని క్షేమమంటారు. అశుభం దేనికి కలుగుతున్నది? దేహానికి కలుగుతున్నది. దేహం నిత్యమైనది కాదు. ఎప్పుడో ఒకనాడది రాలిపోక మానదు. అందువల్ల దేహాన్ని గురించి ఆత్యంతిక క్షేమం ఎన్నడూ కలుగదు. ఆత్మమంటేనో, అది నిత్యపదార్థం. ఎల్లప్పుడు క్షేమాత్మకంగా ఉండేది. అసత్పదార్థమైన దేహమే సత్పదార్థమైన ఆత్మ అనుకోవటం,

దేహసంబంధాలు ఆత్మసంబంధాలని తలపోయటం – ఈ రెంటివలన బుద్ధి ఉద్విగ్నమై లేని భయం కలుగుతున్నది. ఆ భయం తొలగిపోవటమే ఆత్యంతిక క్షేమ మనబడుతున్నది. ఆ భయం ఎలా తొలగుతుందంటే, బుద్ధి చక్కబడితే భయాలన్నీ పోతాయి. బుద్ధి చక్కబడాలంటే భగవత్పాదారవిందాల భజన మొక్కటే అందుకు పరమోపాయం. కనుక భగవంతుని భజించి బుద్ధిని చక్కబరచుకొన్నవారికి భయం ఎన్నడూ లేదు. వారు ఎప్పుడూ క్షేమంగానే ఉంటారు.

## భాగవత ధర్మాలు

భాగవత ధర్మలక్షణాలను అడిగారు. మన్వాదులు వర్ణాశ్రమ ధర్మాలను చెప్పారు. ఆ ధర్మాలు అందరికీ బోధపడలేదు. భగవాను దదిచూసి సర్వజనులు ఎటువంటి శ్రమ లేకుండా అనుష్ఠింపదగిన పరమోపాయాలను ఉపదేశించాడు. ఆ ఉపాయాలను భాగవత ధర్మాలని అంటారు. ఆ ధర్మాలను పాటించినవారికి ఆత్మలాభం ఎంతో సులభంగా సిద్ధిస్తుంది. అంతేకాదు. వారికి ప్రమాదం ఎన్నడూ కలుగదు. ఈ ధర్మమార్గంలో కన్నులుమూసుకొని పరిగెత్తినా పడరు. ఇతర ధర్మమార్గాలు అటువంటివి కావు. కర్మము కూడా ఒక మార్గమే కదా! ఆ కర్మమార్గాన్ని అవలంబించి యాగాదులను ఆచరిస్తారు. అందులో అణుమాత్రలోపం కలిగినా కర్మభంగం అయినది చాలక విపరీతఫలం కూడా కలుగుతున్నది. అందువల్ల భాగవత ధర్మమార్గంలో ఎట్లా నడిచినా ప్రమాదం లేదని అన్నాను.

శరీరధారులు, ముఖ్యంగా మనుష్యులు పుట్టినది మొదలు గిట్టిన దాకా ఏదో ఒక కర్మ చేస్తూనే ఉంటారు. ఆ కర్మలలో నడవటం మొదలయినవి దేహసంబంధులు; మాట్లాడటం మొదలయినవి వాగింద్రియ సంబంధులు. అలాగే కొన్ని మనస్సంబంధమయినవి, కొన్ని శ్రవణాదీంద్రియ సంబంధాలు, కొన్ని బుద్ధి సంబంధాలు, కొన్ని అహంకార సంబంధాలు ఉన్నాయి. ఇవి

శాస్త్రవిహితాలు గానో, అధ్యాసానుసృత స్వభావప్రేరితాలు గానో జరుగుతూనే ఉంటాయి. శాస్త్రప్రకారం చేసే కర్మములకు మాత్రమే ఈ నియతి అన్వయిస్తుందేమో? అని శంకింపవద్దు. లౌకికకర్మలకు కూడా అది అన్వయిస్తుంది.

**శ్లో. యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసి యత్,**
**యత్తపస్యసి, కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్.**

అని శ్రీభగవానుడే అన్నాడు. ఏ కర్మను చేసినా అది భగవదర్పణగా చేస్తే అదే భాగవత ధర్మం.

## జ్ఞానము - భక్తి

భయమన్నది అజ్ఞానకల్పితమని చెప్పాను. అజ్ఞానము జ్ఞానంవలన గాక వేరొకదానిచే తొలగదని, జ్ఞానోదయ మైనపుడు అజ్ఞానము, అజ్ఞాన కల్పితమైన భయమూ తొలగవలసి ఉండగా భగవద్భజన కర్తవ్యమని ఎందుకన్నావు? అని అడగవచ్చు. అజ్ఞానమంటే ఏమిటో తెలుసుకొంటే ఈ సందేహానికి తావుండదు.

అజ్ఞానమంటే విపరీతజ్ఞానమని అర్థం. ఒకదానిని మరొకటిగా పొరబడటాన్ని విపరీతజ్ఞాన మంటారు. ఈ వైపరీత్యానికి కారణమేమిటో చూద్దాము. అసలు వస్తువు దేనిచేతనయినా కప్పబడి స్వరూపస్థితి స్పష్టపడనపుడు ఆ వస్తువు మరొకటిగా కనబడుతున్నది. ఆత్మపదార్థాన్ని మాయగప్పినప్పుడు విపరీతమైన దేహాత్మభావం కలుగుతున్నది. ఆ పక్షాన మాయ ఈ విపరీతజ్ఞానానికి కారణమైనప్పుడు మాయను భజించి దానిని తొలగించుకొనటం యుక్తమవుతుంది గాని, మాయానివారణకు భగవద్భజన ఏ విధంగా సాధన మవుతుందని శంకింపవచ్చు. భయమన్నది దేహాత్మబుద్ధి వలన ఏర్పడటం లేదు. నేను వేరు – దేహము వేరు అనే అభినివేశం వలన కలుగుతున్నది. తత్ఫలంగా స్వరూపజ్ఞానం మరుగుపడుతున్నది. మాయ

అనేది భగవచ్ఛక్తి గనుకనూ, అది భగవదధీనయై వర్తించేది గనుకనూ, భగవంతుని స్మరిస్తే అతని మాయ మాయమవుతుందని అన్నాము. ఈ విషయమై

**శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,**
**మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే.**

అని భగవానుడే బోధించాడు. అందువల్ల భగవానుడే గురువని, అతడే దేవుడని ఏకభక్తితో అతనిని భజించాలి.

## ద్వైతభావం

రాజా! ద్వైతభావం సత్యమా? మిథ్యా? అని ప్రశ్నిస్తావు కాబోలు. ద్వైతప్రపంచం మిథ్య అన్నప్పుడు కుందేటికొమ్ము వలె బొత్తిగా లేనిదని కాదు. ద్వైతప్రపంచం వ్యావహారిక సత్యం మాత్రమే. పారమార్థిక సత్యం కాదు. దేనికి పుట్టుక, పెరుగుదల, నశించటం మొదలయిన షడ్వికారాలు ఉన్నవో అది పారమార్థిక సత్యపదార్థం. ప్రపంచానికి షడ్వికారాలు కలుగుతున్నమాట నిజం. అందువల్ల దానిని పరమసత్యం కాదన్నారు.

## ఏకాగ్రత

నిమి:– మహాత్మా! భగవానుని ఏకభక్తితో భజించాలని అన్నారు. చిత్తము నిశ్చలమైతే గాని భక్తి ఏకాత్మకంగా ఉండదు. చిత్తగతిని ఎంత అదుపులో ఉంచుదామన్నా ఒకచోట స్థిరంగా నిలవదు. ఎప్పుడూ ఏదో ఒక విషయం వంకకు ప్రసరిస్తూనే ఉంటుంది. అటువంటిది కుదుటబడాలంటే మార్గం ఏమిటి? భక్తి ఏకాగ్రతకు ఏమిచేయాలి? భయం తీరేదెప్పుడు?

కవి:– విషయాలు వాస్తవమైనవి కావు; అవి మనోవిలాసాలు మాత్రమే. మనస్సును నియమించినప్పుడు విషయాలు అదృశ్యమవుతాయి. ద్వైతప్రపంచం సంగతికూడా అంతవరకే. ప్రపంచమన్నది సృష్టికి

పూర్వం లేదు. అంటే, సంకల్పానికి పూర్వం లేదు. సంకల్పంతో పాటు కనబడుతున్నది. సంకల్పమనే వస్తువు మనస్సనే అద్దంలో ప్రతిఫలించినప్పుడు ఆ వస్తువును చూడగలుగుతున్నాము. మనోదర్పణాన్ని తీసివేసినప్పుడు ఆ వస్తువు కనబడదు కదా. మనము మనస్సును దానివంకకు ఎప్పుడు మళ్ళించామో అప్పుడే ఆ వస్తువు సాక్షాత్కరిస్తున్నది. దానిని గూర్చి స్మరింపనప్పుడు కనబడుతున్నదా? ప్రతివిషయం సంగతీ ఇంతేనని గ్రహించు. ఒక దృష్టాంతం చెబుతాను విను. మనమేదో ఒకదానిని మనసులో అనుకొంటూ తదేకమతులమై దారిని నడుస్తుంటాము. అప్పుడు మన కంటి యెదుట ఎన్నో వస్తువు లుంటాయి. అయితే మనోదర్పణం ఆ వంక లేనందున కంటికి కనబడుతున్నవి కూడా మనస్సులో ప్రతిఫలించడం గాని, వాటిని గురించిన జ్ఞాన మేర్పడటం గాని జరగటం లేదు. ఇది అందరికీ అనుభవంలో ఉన్నదే. కాబట్టి దృష్టపదార్థాలన్నీ మనోవిలాసాలు మాత్రమే. మనోనిరోధం వలన విషయసంగం తొలగిపోతున్నది.

మనస్సనేది ఉన్నంతకాలం – అంటే మనోనాశనమైతే తప్ప, దాని వ్యవహారం మానదంటారా? ఆ మాట నిజం. ఏదయినా ఒక వస్తువును ఆలంబనగా తీసుకొని మనస్సు వ్యవహరిస్తున్నది. మనోవ్యవహారానికి దృశ్యపదార్థాలు ఆలంబనలు మాత్రమే. మనస్సుకు ఆలంబన ఒకటుండాలి కాబట్టి, భగవత్పాదాలనే దానికి ఆలంబన కావించాలి. అప్పుడు మనస్సు తత్పరమై ఉంటుంది. ఈ విధానాన్నే మనోనిరోధ మంటారు.

మనస్సనేది ఆనందపదార్థమై ఒక వస్తువువంకకు ప్రసరిస్తుందని, ఆనందప్రదమైన వస్తువును వదిలి మనస్సు మరొక వైపుకు ఎలా మళ్ళుతుందని శంకింపవచ్చు. అయితే

దృశ్యపదార్థాలన్నీ స్వల్పమైన ఆనందాన్ని మాత్రమే ఇస్తాయి. ఆ కొద్దిపాటి ఆనందమైనా క్షణికమే గాని స్థిరంకాదు. భగవద్విషయమైనది నిరతిశయ నిర్వికల్ప ఆనందఘనం. అట్టి ఆనందాన్ని ఒక్కసారి రుచిచూసిన తర్వాత మనస్సు దాని నుండి ఇక మళ్ళదు. రుచిని బట్టి చూసినా, శాశ్వతానందాన్ని బట్టి చూసినా, లఘుత్వ గురుత్వాలను బట్టి చూసినా, శుభాశుభాలను బట్టి చూసినా సర్వవిధాల బ్రహ్మానందం ఉత్తమోత్తమ మైనది. అందువల్ల మనస్సును పరవిషయాల నుంచి నిరోధించి భగవత్పాదారవిందమకరందపానానికి మళ్ళించాలి.

ఆ విధంగా మనస్సును మళ్ళించే మార్గమేమిటి? ప్రేమరూప భక్తి ఒక్కటే మార్గం. ఆ ప్రేమ ఏ విధంగా కలుగుతుంది? వస్తుగుణాలను పదే పదే వింటుండటం వలన దానియందు ప్రేమ జనిస్తున్నది. ఇది లోకవిదితం. భగవత్కథలను వినటం వలన వాని యందు ప్రేమ జనిస్తుంది. కాబట్టి మీరందరూ భగవత్కథలను మనసారా వినండి.

భగవత్కథలంటే ఒకటీ రెండూ కావు, అన్నింటినీ సాకల్యంగా విని తెలుసుకోవాలంటే వీలవుతుందా? అని వెనకాడవద్దు. అన్నీ వినాలని ఎక్కడా లేదు. ప్రసిద్ధచరిత్రలను వింటే చాలు. ఆ చరిత్రలను విన్నంతనే మనస్సు తదాశ్రయుడైన భగవంతుని వంకకు ప్రసరిస్తుంది. అది సందుచేసుకొని భగవన్నామస్మరణ కావించండి. ఆ విధంగా చేస్తూ ఉండగా క్రమక్రమంగా అసంగత్వము, నిస్పృహత్వము కలుగుతాయి.

## అసంగి - సంసారధర్మం

నిమి:- మహాత్మా! మీరు చెప్పినట్లు అసంగత్వ నిఃస్పృహత్వాలు కలిగితే ఇక

సంసారధర్మాలు ఎలా జరుపగలుగుతాము?

కవి:- నేను, నాది అన్నటువంటి భావాలు ఉన్నంతవరకే ఇది ధర్మము, ఇది అధర్మము, దీనిని నేను ఆచరించాలి – అన్న భావాలు ఉంటాయి. తనను తాను భగవంతునికి సమర్పించుకొన్నవారికి ధర్మాధర్మవిచారమే అవసరం లేదు. భగవంతుడెలా నడిపిస్తే వారలా నడుస్తుంటారు. కర్తృత్వ భోక్తృత్వ భావాలు లేనినాడు ధర్మాధర్మ చింత లుండవు. ఆ పక్షాన అధర్మం చేయవచ్చునా? అని అడుగుతారేమో. భగవత్ప్రేరితుడై భక్తిపరులు నడిచే మార్గం ఎన్నటికీ అధర్మం కానేరదు. ఆ మార్గమే ధర్మాలకు కూడా ధర్మమార్గం. అందులో అధర్మప్రసక్తి లేదు.

## భక్తుని వృత్తం

నిమి:- అట్టి భక్తుని లోకవృత్తమెలా ఉంటుంది?

కవి:- భక్తుని లక్షణాలను విను. అతని హృదయం నిరంతరమూ భగవంతుని యెడ అనురాగంతో నిండి ఉంటుంది. అతను మధువు గ్రోలినవాని వలె మైమరచి భగవన్నామాలను కీర్తిస్తూ ఉన్మత్తుని వలె ప్రవర్తిస్తాడు. 'దేవా! నీ సందర్శనభాగ్యం కలిగినదయ్యా' అని ఒకసారి పకపక నవ్వుతాడు. 'ప్రభూ! నన్నింతకాలం ఉపేక్షించావా?' అని ఒకవేళ విలపిస్తాడు. 'దేవా! నన్ను అనుగ్రహించు' అని ఒకసారి ఆక్రోశిస్తాడు. 'స్వామీ! నన్ను అనుగ్రహించావా?' అని ఒకసారి పకపక నవ్వుతాడు. 'జితం జిత' మని ఒకసారి ఆనందాతిశయంతో నాట్యం చేస్తాడు. లోకవంచనార్థం కొందరలా డాంబిక వర్తన చేయవచ్చునంటారా? వర్తనం స్వవశమో, వివశమో చూడగానే స్పష్టపడుతుంది. భక్తులు పిశాచగ్రస్తుల వలె వివశులై వర్తిల్లుతారు. వారేమి చేస్తున్నదీ వారికే తెలియదు. ఈ చెప్పినవన్నీ ఆంతర లక్షణాలు.

ప్రపంచంలో ఆకాశాది పంచభూతాలు, తన్మాత్రలు, దిక్కులు, తరులు గిరులు నదులు సముద్రాలు మొదలుగా గలవి అనేకం ఉన్నాయి కదా. అవి వేర్వేరని సామాన్యులు భావిస్తారు. అవన్నీ భగవంతుని శరీరమేనని ఉత్తమభక్తుడు గ్రహించి అనన్యబుద్ధితో అన్నింటికీ నమస్కరిస్తాడు. ఇది బాహ్యలక్షణం.

నిమి:– మహాత్మా! మీరు చెప్పిన లక్షణాలన్నీ ఆరూఢయోగి లక్షణా లనుకొంటాను. ఆ స్థితి అనేకానేక జన్మలకు కూడా దుర్లభమని భగవానుడే అన్నాడు. అట్టి స్థితి భగవత్సంకీర్తన మాత్రాననే ఒక్క జన్మలో ఎలా సిద్ధిస్తుంది?

కవి:– అయ్యా! మనము భుజించేటప్పుడు ఒక్కొక్క ముద్ద మ్రింగినంతనే కొంతకు కొంత సుఖం, పొట్టనిండటం, ఆకలి తగ్గటం మూడూ ఒక్కసారే కలుగుతున్నాయి కదా. అలాగే శ్రీహరి భజన కావించేటప్పుడు ప్రతి భజనకు కొద్దికొద్దిగా భక్తి, భగవద్రూపమైన స్ఫూర్తి, గృహాది విషయాంతరాల పట్ల విరక్తి – మూడూ ఏకకాలంలోనే కలుగుతాయి. నిండారా భుజించినప్పుడు పరమతుష్టి ఎలా కలుగుతున్నదో అలాగే భక్తునికి భక్తియొక్కస్ఫూర్తి విరక్తులు నానాటికి పెరిగి ఎట్టకేలకు పరమప్రేమాదిసర్వమూ లభిస్తున్నది. అతనికి పరమశాంతి కలుగుతున్నది. భక్తి తీవ్రతను బట్టి ఫలోదయకాలం ఉంటుంది. తీవ్రభక్తులు ఒక్క జన్మలోనే సిద్ధిపొందుతారు. ఆ విషయమై సందేహం వద్దు. పిండి యెంతో రొట్టె అంతని ఉన్నదే కదా.

## భాగవతుని లక్షణాలు

ఆ తర్వాత ఋషభపుత్రులలో రెండవవాడు హరి ప్రసంగించాడు.

నిమి:- అయ్యా! భాగవతుడంటే ఎట్టివాడు? అతను అనుష్ఠించే ధర్మాలెటువంటివి? అతని స్వభావమెట్టిది? అతను లోకంలో చరించే తీరెటువంటిది? ఏ విధంగా క్షున్నివృత్తి కావించుకొంటాడు? ఏమి మాట్లాడుతాడు? అతను భగవత్ప్రియుడని గ్రహించటానికి గుర్తులేమిటి?

హరి:- అయ్యా! భక్తులు ఉత్తములని, మధ్యములని రెండు తరగతులు. చరాచర సమస్తభూతాలలో భగవానుడు అంతర్యామిగా ఉన్నాడని, ఉపాధి భేదాలు ఉన్నందువలన ఆత్మభేదాలు కలుగవని గ్రహించి అన్నిటిలోనూ ఆత్మదృష్టి గలిగి సమదర్శియై ఉండటం, సర్వభూతములు భగవంతునియందే ఉన్నవనే నిశ్చయాన్ని కలిగి ఉండట మంటే భగవత్తత్త్వం సర్వత్ర పరిపూర్ణమని యెరిగి వర్తించటం - ఇవి ఉత్తమ భాగవతుని లక్షణాలు. ఇంద్రియాలు ఇంద్రియార్థాలను గ్రహించినందువల్ల హితాహితాలను బట్టి రాగద్వేషాలు కలగటమనేది లోకసహజం. ఉత్తమ భక్తుని ఇంద్రియాలు ఇంద్రియార్థాలను గ్రహిస్తూనే ఉన్నప్పటికీ అతను రాగద్వేషాలను పొందడు. ఎందుకంటావేమో? సమస్తం విష్ణుమాయావిలాసమే గాని వేరొకటి లేదన్న భావనిశ్చయం వల్ల అతని చిత్తమెప్పుడూ భగవంతునియందే నిలిచి ఉంటుంది. అభేదదర్శనుడు కావటం మూలాన రాగద్వేషాలకు అతని మనస్సులో చోటుండదు. దేహానికి జన్మనాశనాలు స్వతస్సిద్ధమైనవి. దేహస్థితిగతుల విచారం కాని, ఆకలిదప్పులు గాని, భయతృష్ణలు గాని, ఇంద్రియాయాసం గాని పైకొన్నప్పుడు స్మృతి తత్పరమై వర్తించటం లోకసహజం. మిన్నువచ్చి మీదపడినా ఉత్తమ భక్తుని స్మృతి భగవంతుని వదిలి దేహాదులను ఏనాడూ స్మరింపదు. అంటే అతనికి స్మృతి మోహం కలుగనేరదని భావం. జనులు పెక్కు

కోరికలను కోరుతూ ఆ కోరికలు తీరటానికి వివిధకర్మలను ఆచరిస్తారు. ఆ కర్మములు సమయం వచ్చినప్పుడు ఫలిస్తాయి. ఆ ఫలాలను అనుభవించేందుకు తగిన శరీరాలు వస్తాయి. ఆ శరీరాలు ఆ ఫలాలను అనుభవించే సమయంలో తత్ఫలవాసనలు ఆ శరీరంలోనికి చేరి అంతఃకరణ మనే పేరిట నిలిచి సమయం వచ్చినప్పుడు పరిమళిస్తాయి. ఆ పరిమళాన్నే బుద్ధిప్రేరణ మంటారు. ఏయే వాసన ప్రేరేపిస్తున్నదో ఆయా విధాన ఇంద్రియాలు వర్తిస్తుంటాయి. ఆ ఇంద్రియ వ్యాపారాలను కర్మము లంటారు. ఆ కర్మములు మళ్ళీ కర్మరూపఫలాలను పుట్టిస్తాయి. ఆ కర్మఫలాలను భోగించటానికి మళ్ళీ యుక్తశరీరాలు కలుగుతాయి. ఆ శరీరాలు ఆ ఫలాలను భోగించేటప్పుడు తత్ఫలవాసనలు ఆ దేహంలో ఉండి మళ్ళీ అటువంటి కర్మరూప ప్రేరణలను కలిగిస్తాయి. మళ్ళీ ప్రేరణానురూపమైన కర్మలను ఆచరిస్తారు. ఇట్లా ఎడతెరిపిలేకుండా జరుగుతుంటుంది. ఇందుకు గాను కలిగే జననమరణాలనే సంసారము అంటారు. ఈ విషయంలో పరభక్తుడు ఏమి చేస్తాడు? అంటే, అయ్యా! కర్తృత్వ భోక్తృత్వాలు మనస్సులో కలిగినప్పుడే నరులకు భోగ్యావసరమూ, తత్కారణాన జననమరణాదులూ కలుగుతున్నాయి. మనస్సు అటువంటి భావాలకు తావీయక భగవత్పరమైనప్పుడు ఆ జన్మలోని వాసనాప్రేరితకర్మలన్నీ వేయించిన విత్తనాల వలె అంకురశక్తిని కోల్పోతాయి. అట్టివాటికి పునర్జన్మ కారణం లేనందువల్ల వారికి కర్మఫలభోగార్థం జననాదులు కలుగవు. ప్రారబ్ధకర్మఫలవాసనా ప్రేరితాలై ఇంద్రియాలు ఏమిచేస్తున్నప్పటికీ ఉత్తమభక్తుని చిత్తం నిరంతర భగవత్పరమై ఉండటం వలన ఇంద్రియకార్యాలు కూడా అతనికి తెలియరాకుంటాయి. ఒకవేళ ఎప్పుడయినా అటువంటి స్మృతి కలిగినా ఇంద్రియాలు ఇంద్రియార్థాలతో వ్యవహరించటం నైజమని, దానితో తనకెటువంటి సంబంధమూ లేదని, అతను

ఉపేక్ష వహించి ఉంటాడు.

నిమి:– సుఖదుఃఖాలకు హర్షశోకాలు చెందడా?

హరి:– సుఖదుఃఖాలు ప్రారబ్ధ కర్మఫలాలు. వాటిని అనుభవించటానికి ఆ శరీరం కలిగింది. అది వాటిని అనుభవించి తీరాలి. వాటిని తప్పింపలేము. అందువల్ల అతనికి తద్భోగకాలంలో హర్షశోకాలు కలుగవు.

నిమి:– దుఃఖం కలిగినప్పుడు అందుకు ప్రతీకారమేమిటో ఆలోచింపడా?

హరి:– ప్రతీకారాన్ని సంకల్పించటం, సంకల్పించకపోవటం ఈశ్వరేచ్ఛానుసారమై ఉంటుంది. భగవానుడు ఎటువంటి స్ఫురణను కలిగిస్తాడో ఇంద్రియాలు ఆ విధంగా వర్తిస్తాయి. ఉత్తమభక్తుడు తానుగా ఏమీ చేయడు. పైగా అతనికి అహంకారం ఉండదు కాబట్టి దేహ మమకార లక్షణములైన జన్మకర్మములందు గాని వర్ణాశ్రమజాతులందు గాని భేదభావం తలపోయడు. 'ఇది నాది, ఇది నాది కాదు' అనే చిత్తభేద భావం; 'నీవు, నేను' అనే ఆత్మభేద భావం అతనికి కలుగవు. అతను సర్వభూతసముడు. నిత్యశాంతియుతుడు. త్రైలోక్యరాజ్యాధిపత్యం ఇస్తానంటే నాకు వద్దంటాడు. ఎన్నటికీ అతని స్మృతి భగవత్పాదాలనుంచి తొలగదు.

నిమి:– మధ్యమ భక్తుని లక్షణాలేమిటి?

హరి:– భగవంతుని యెడ ప్రేమ, భగవద్భక్తులతో మైత్రి, మూఢుల యెడ కరుణ, శత్రువుల యెడ ఉపేక్ష కలిగినవాడు మధ్యమ భక్తుడవుతాడు. ఇతనికి భేదభావం ఉంటుంది. అందువల్ల స్వపర తారతమ్యం, సుఖదుఃఖాదుల కోసం హర్షశోకాలు తప్పవు.

## మాయాలక్షణాలు

ఆ తర్వాత హరిసోదరుడు అంతరిక్షుడు ముందుకు వచ్చి నిమి

ప్రశ్నలకు సమాధానం చెప్పాడు.

నిమి:– మహాత్ములారా! విష్ణుమాయ అని ఒకటున్నదని, అది మాయావులకు సయితం మోహాన్ని కలిగిస్తుందని అంటారు. దాని సంగతి వినగోరుతున్నాను.

అంత:– అయ్యా! మాయ ఇటువంటిదని స్వరూపనిరూపణ చేయటం వీలుకాని పని. ఆ పక్షాన దానిని గ్రహింపలేమనుకోకు. కార్యముఖాన దాని స్వభావాన్ని గుర్తింపగలము. బ్రహ్మము నిర్గుణపదార్థం కదా. ఆ నిర్గుణపదార్థం సగుణపదార్థ మవుతున్నది. అటువంటి విపర్యయం బ్రహ్మశక్తి వల్లనే కలుగుతున్నది. ఆ శక్తిని మాయ అంటారు. ఆ మాయ సృష్టిస్థితిలయాలు మూడింటికీ కారణం. మాయాకార్యములన్నీ తాత్కాలికమాత్రములై సత్యము లనిపిస్తాయి కాని లోతుగా విచారించి చూస్తే సత్యాలు కావని తెలుస్తుంది.

నిమి:– ఏది జాగ్రత్స్వప్నసుషుప్తులనే మూడవస్థలలో వికారమును చెందకుంటుందో అది సత్పదార్థమని అన్నారు. ఈ మూడింటిలోనూ జగత్తు కనబడుతూనే ఉన్నది. అట్టి జగత్తు మిథ్య ఎలా అవుతుంది? స్వప్నకార్యం మిథ్యేకదా, అంటారేమో? అది సరే కాని, జాగ్రత్సుషుప్తుల కార్యం మిథ్య ఎలా అవుతుంది?

అంత:– అయ్యా! జాగ్రత్స్వప్నసుషుప్తుల తత్త్వాన్ని మొదట గ్రహించాలి. జాగరమంటే ఏమిటి? చక్షురాదులను బాహ్యేంద్రియాలని అంటారు. అట్టి బాహ్యేంద్రియాలు వస్తువును గ్రహిస్తున్నట్లు మనకనిపిస్తున్నది. అంటే, ఏదయినా ఒక వస్తువు ప్రత్యేకంగా ఉన్నట్లు, ఆ వస్తువును ఇంద్రియాలు గ్రహిస్తున్నట్లు మనమనుకొంటాము. ఇది వట్టి భ్రమేగాని వాస్తవం కాదు. ఈ భ్రమను జాగరణ మంటారు.

నిమి:- జాగ్రదవస్థలో ప్రత్యక్షంగా ఉన్నవే గాక అనుమానాదులు కూడా భావితాలుగా ఉన్నాయి. అనుమానవస్తుగ్రహణలో బాహ్యేంద్రియ కార్యమేమీ ఉండదు. కాబట్టి భ్రమాలక్షణం సర్వవ్యాపకం ఎలా అవుతుంది?

అంత:- అనుమానవస్తుగ్రహణంలో కూడా బహిరింద్రియ లింగదర్శన సాపేక్షత్వం ఉంటుంది. కాబట్టి అనుమానవస్తుగ్రహణ భ్రమ కూడా పరంపరగా బహిరింద్రియజన్యమే అవుతుంది.

నిమి:- స్వప్నం మాటేమిటి?

అంత:- స్వప్నం అంతఃకరణ భ్రమ మాత్రమే. పూర్వానుభవం స్వప్నహేతు సంస్కారజనక మవుతున్నది. ఆ సంస్కారం లోలోపలే ఉండటం వలన దానికి బహిరింద్రియజన్యత్వం కేవలముగా కాని పరంపరగా కాని కలుగదు. జాగ్రత్స్వప్నాల వాసనలు సర్వజ్ఞానవిరోధరూపంలో పరిణమించిన భ్రమనే సుషుప్తి అంటారు. ఏతావతు మూడవస్థలూ భ్రమావిర్భూతాలే కాబట్టి, ఆ అవస్థలలో మనము చూచినవన్నీ మిథ్యలే అవుతాయి.

నిమి:- ఆ పక్షాన సర్వమిథ్యాత్వం ఏర్పడుతున్నది కదా?

అంత:- జాగరాదులు మూడింటిలోనూ అనువర్తించి, వాటిని చూస్తూ ఉండే తురీయమూర్తి ఉంటాడు. ఆ మూర్తినే ఆత్మ అంటారు. ఆ ఆత్మ ఒక్కటే త్రికాలాబాధితమై సత్యమయినట్టిది. ఆ ఆత్మకు సత్యం స్వరూపలక్షణం. జ్ఞానము అనంతము బ్రహ్మము అన్నవి తటస్థ లక్షణాలు. ఆ విశుద్ధజ్ఞానం ఏకమైనప్పటికీ మాయాయోగం వలన మూడు విధాలుగా గోచరిస్తుంది.

నిమి:- స్వప్నంలో ఆత్ముడు అధిష్ఠాన మంటారు. ఆ ఆత్మునియందే చూచేవాడు – చూడటం – చూడబడే పదార్థం మూడూ ఉన్నప్పటికీ

మేలుకొన్నప్పుడు అవేవీ కనుపింపవు కాబట్టి స్వప్నానుభూతి మిథ్య అనడం సమంజసంగానే ఉన్నది. తక్కిన రెండింటి సంగతేమిటంటారు?

అంత:- జాగ్రదవస్థలో గ్రాహక గ్రహణ గ్రాహ్యముల వలన ఏర్పడే సంవేత్తృ సంవేద సంవేద్యాలు మూడూ సుషుప్తిలో ఉండవు కాబట్టి ఆ మూడూ తాత్కాలికాలే గాని సార్వకాలికాలు కావు. ఆ కారణాన అవి మూడూ మిథ్యేనని గ్రహించాలి. శ్రుతికూడా అలాగే చెబుతున్నది. సుషుప్తికూడా అటువంటిదే.

నిమి:- భగవానుడు జగత్తును సృజించాడన్నారు. సృష్టికి కారణమేమిటి?

అంత:- జీవప్రసిద్ధికై జగత్తును సృజించాడు. జీవులు స్వాంశసంభూతులు. ఆ జీవుల మోక్షార్థం జగత్సృష్టి కావించాడు. సృష్టిసమస్తం జీవుల జీవనోపకరణార్థమే ఏర్పడింది. భగవానుడు మొదట పంచమహాభూతాలను, వాటిద్వారా నానావిధభూతాలను సృజించి తాను వాటిలో అంతర్యామియై నిలిచి మనస్సు, దశేంద్రియాలు అనే రూపాలుగా తనను తాను విభజించుకొని ఆయా విషయాలను ప్రకాశింపజేస్తాడు. జీవుడు ఆ ఇంద్రియాలతో ఇంద్రియార్థాలను భోగిస్తూ తత్పరుడై స్వరూపజ్ఞానాన్ని మర్చిపోతాడు. తత్ఫలంగా అతనికి శరీరమే తాననే భావన కలుగుతుంది. ఎప్పుడయితే ఆ భావన కలిగిందో అప్పుడు శరీరావయవాలు చేసే కర్మములన్నీ తానే చేస్తున్నానని అనుకొంటాడు. ఎప్పుడు అటువంటి భ్రమ కలిగిందో అప్పటినుంచి కర్మఫలాలయిన సుఖదుఃఖాలు శారీరికాలని గ్రహింపక వాటిని తానే అనుభవిస్తున్నట్లు భావించటం మొదలవుతుంది. కర్మమనగానే చేసినదానికి ఫలితం తప్పదు కాబట్టి ఆ ఫలానుభవార్థం అందుకు మళ్ళీ దానికి యుక్తమైన శరీరాన్ని పొందవలసి వస్తుంది. ఫలాలను అనుభవించే సమయంలో తత్ఫలవాసనలు మళ్ళీ తత్తద్రూపకర్మలకు

ప్రేరేపిస్తాయి. ఆ కర్మలను మళ్ళీ చేస్తారు. ఈ విధంగా ఒకదానివెంట మరొక కర్మను ఆచరిస్తూ ఆ కర్మఫలానుభవార్థం శరీరాలను ధరిస్తూ కర్మఫలాలను భోగిస్తూ సంసారంలో కొట్టుమిట్టుకులాడుతుంటారు.

నిమి:- ఈ సంసారభ్రమణం ఎంతకాలం జరుగుతుంది?

అంత:- ప్రళయం వరకు జరుగుతూనే ఉంటుంది. ప్రళయలక్షణ మేమిటో తెలుసా? భగవానుడు స్థూల సూక్ష్మరూప ప్రపంచమంతటినీ ఆకర్షిస్తాడు. అది అవ్యక్తములో చేరుతుంది. అప్పుడు సూర్యుడు మహోగ్రతేజస్సుతో నూరేండ్లు ప్రకాశిస్తాడు. ఆ వేడిమికి ముల్లోకాలు దగ్ధమవుతాయి. దుర్భరమైన అనావృష్టి కలుగుతుంది. సంకర్షణముఖాగ్ని పాతాళం నుంచి లేచి ఊర్ధ్వశిఖాజ్వాలలతో మండుతూ లోకాలను ఉడ్డుడికిస్తుంది. ఆ అగ్నికి ప్రళయ ఝంఝూనిలం తోడ్పడుతుంది. ప్రళయమేఘుడు గజతుండాలను పోలిన ధారలను తెంపులేకుండా నూరేండ్లు వర్షిస్తాడు. లోకమంతా జలమయ మవుతుంది. ఆ జలాలలో బ్రహ్మాండం మునుగుతుంది. విరాట్పురుషుడు అంతటితో అండాన్ని వదిలి తాను మొదట దేనినుండి వచ్చాడో ఆ అవ్యక్తాన్ని ప్రవేశిస్తాడు.

అంతలో ప్రళయవాయువు వీచి భూమియొక్క గంధగుణాన్ని హరిస్తుంది. ఎప్పుడయితే తననుంచి గంధము నశించిపోయిందో అప్పుడు భూమి ఆ గంధతత్త్వాన్ని వీడి జలరూపాన్ని పొందుతుంది. ఆ వాయువు జలమందలి రసాన్ని హరిస్తుంది. జలము రూపుమారి తేజస్సులో లీనమవుతుంది. తేజస్సుకూడా వాయువు వలన రూపుచెడి వాయువులో చేరుతుంది. అప్పుడు వాయువుకు గల స్పర్శగుణం నశిస్తుంది. అది ఆకాశాన్ని చేరుతుంది. కాలాత్ముడు ఆకాశ శబ్దగుణాన్ని హరిస్తాడు. ఆకాశం తామసాహంకారమందు లయిస్తుంది. బుద్ధీంద్రియాలు రాజసాహంకారంలో లయిస్తాయి.

మనస్సు, దేవతలు సాత్త్వికాహంకారంలో లయిస్తారు. అహంకారం త్రివిధములైన స్వకార్యాలతో మహత్తత్త్వంలో లయిస్తుంది. మహత్తత్త్వం ప్రకృతిలో లయిస్తుంది. ప్రకృతి బ్రహ్మమునందు లయిస్తుంది.

ఇవన్నీ మాయాలక్షణాలు. సృష్టికాలంలో బ్రహ్మమునుంచి మహత్తత్త్వాదులు అనులోమక్రమంలో వెలువడుతాయి. ప్రళయకాలంలో విలోమక్రమంలో అవి మళ్ళీ బ్రహ్మమునందు లయించిపోతాయి.

గంధము పోయినవెంటనే భూమి; రసము నశింపగానే జలము; తేజస్సు పోగానే అగ్ని; స్పర్శము పోయినంతనే వాయువు; శబ్దము నశించినంతనే ఆకాశము తమతమ స్వరూపాలను కోల్పోతాయని చెప్పాను. అంటే భగవచ్ఛక్తి గంధాదిరూపంలో ఆయా తత్త్వాలను చేరి ఉన్నప్పుడే ఆ తత్త్వాలకు రూపముంటుందని, ఆ శక్తి తొలగిననాడు రూపు నశిస్తుందని భావం.

## మాయాజయం

అనంతరం నవకవులలో నాల్గవవాడు ప్రబుద్ధుడు నిమిచక్రవర్తి ప్రశ్నలకు సమాధానం చెప్పాడు.

నిమి:- మహాత్ములారా! ఈశ్వరమాయ దురత్యయమని చెప్పారు. ఆ మాయను దాటే ఉపాయం ఏమిటి? మాయను దాటలేనప్పుడు మోక్షమే కలగదు కదా.

ప్రబు:- అయ్యా! జీవులందరికీ సుఖం కావాలి. పరమప్రాప్యమైనది అదే. సుఖమన్నది స్వతస్సిద్ధం. స్వతస్సిద్ధమైన సుఖాన్ని అనుభవించటానికి

దుఃఖాలు అడ్డుపడుతుంటాయి. ఆ దుఃఖాలను పోగొట్టుకోవాలని రకరకాలుగా ప్రయత్నిస్తుంటారు. ఆ ప్రయత్నాలనే కర్మము లంటున్నాము. జనులు అటువంటి కర్మలను ఆచరించే ప్రయత్నంలో పరస్పర సాహాయ్యార్థం మిథునధర్మాలకు ఉపక్రమిస్తారు. 'ధనమూల మిదం జగ' త్తనే నానుడిని అనుసరించి మొట్టమొదట ధనార్జన చేస్తారు. అందుకు గాను ప్రాణాలకు తెగించి కష్టపడుతుంటారు. ఇంత శ్రమపడి ఆర్జించినా ఆ ధనం నిలిచేది కాదు. అది దానికి నైజం. అప్పుడు ధనంవల్ల దుఃఖనివృత్తి కాదని తెలిసివస్తుంది. భార్యాపుత్ర్ర గృహ పశ్వాదుల సంగతి కూడా అంతేనని వారికి అనుభవం మీద స్పష్టపడుతుంది.

జనులు ఆ విధంగా దుఃఖనివృత్తి కోసం విషయాలను ఆశ్రయించినప్పుడు తమతో సమానులైన వారియెడ స్పర్ధ, తమను మించినవారంటే అసూయ కలిగి – వారిని అణచివేయాలనే బుద్ధి జనిస్తుంది. దానితో భయం మొదలవుతుంది. తత్ఫలంగా దుఃఖాలు అతిశయిస్తాయి.

నిమి:– అయ్యా! లౌకికకర్మలు దుఃఖప్రదాలు కావచ్చు. వైదికకర్మల సంగతేమిటి?

ప్రబు:– వైదికకర్మల వలన స్వర్గలోకభోగాలు కలుగుతాయి. అయితే ఆ భోగాలన్నీ నశ్వరాలే కదా. భోగాంతంలో మళ్ళీ శరీరధారణ తప్పదు. ఏ విధంగా చూసినా కర్మముల వలన కలిగే ఫలాలు దుఃఖాన్ని వృద్ధిచేస్తాయే గాని దుఖఃనివృత్తిని కలిగింపలేవు.

నిమి:– దుఃఖనివృత్తికి మార్గమేమిటి?

ప్రబు:– భక్తి ఒక్కటే మార్గం.

నిమి:– చిత్తశుద్ధి కలిగితేగాని భక్తి కుదురుకొనదు. చిత్తశుద్ధి కలగాలంటే

ఇంద్రియాలు వశం కావాలి. ఇంద్రియాలు వశం కావాలంటే అహంకారం నశించాలి. అహంకారాన్ని జయించటం సాధ్యం కాదు. అట్టి వారికి ఉపాయాంతరం ఏదయినా ఉన్నదా?

ప్రభు:– భక్తితప్ప వేరొక మార్గం లేదు. అకృతాత్ములు కూడా భక్తిని సాధింపవచ్చు. భగవద్భక్తికి విషయవైరాగ్యం మొదటి మెట్టు. ఈ వైరాగ్యం ఎలా కలుగుతుందో చూడు. విషయాలను సేవించటం వలన దుఃఖనివృత్తికి బదులుగా దుఃఖం అతిశయిస్తుండటం అందరికీ అనుభవంలో ఉన్నదే. అయినప్పటికీ వారు ఆ అనుభవాన్ని గ్రహింపకపోగా ఈప్సితసిద్ధి కోసం మరింత కర్మపరులై శ్రమిస్తారు. అట్లా శ్రమింపగా శ్రమింపగా అన్ని చోట్ల విపరీతఫలం ప్రాప్తించి విసిగి చివరికి గత్యంతరం ఏమిటోనని దిగులు పడుతుంటారు. అట్టివారు సద్గురువును ఆశ్రయించాలి.

అయ్యా! లోకంలో అందరూ గురువులు కాలేరు. వేదపరినిష్ఠుడై బ్రహ్మాపరోక్షానుభూతిని పొంది ఉపశాంతి గాంచిన మహాత్ము డెవరో ఆయనే సద్గురువు కాగలడు. అలా కాని గురువును సేవించినప్పుడు సంశయాలు తీరవు. తీరనిది చాలక విపరీతజ్ఞానం కలిగినా కలగవచ్చు.

గురుసేవ అంత సులభం కాదు. గురువే ఆత్ముడు, దైవం అని త్రికరణశుద్ధిగా విశ్వసించాలి. అటువంటి విశ్వాసంతో శిష్యుడు తననుతాను గురువుకు సమర్పించుకోవాలి. గురుశాసనాన్ని తలదాల్చి భాగవత ధర్మాలను ఆచరించాలి.

గురూపాసనాఫలంగా మొట్టమొదట అసంగబుద్ధి జనించి వృద్ధిపొందుతుంది. సాధుసంగమప్రీతి జనిస్తుంది. తక్కువవారి యెడ దయ, సమానుల యెడ మైత్రి, పెద్దలపట్ల వినయం, నిఖిల

భూతాల యెడ యథోచితవృత్తి అలవడుతాయి.

ఇవిగాక బాహ్యాభ్యంతర శౌచం, స్వధర్మాచరణం, తితిక్ష, మౌనం, స్వాధ్యాయం, ఆర్జవం, ద్వంద్వసహిష్ణుత – అనగా శీతోష్ణసుఖదుఃఖాదుల యందు హర్షవిషాదాలు చెందక సహింపగలగటం, ఋతుకాల భార్యాసంగమరూప బ్రహ్మచర్యం, అహింస, తనలో ఉన్న ఆత్మవస్తువును సంవిద్రూపాన చూడటం, పరమాత్మ సర్వనియంత అని భావించటం, ఏకాంతశీలత్వం, గృహాదులందు అభిమానం వదిలి ఎప్పుడు ఎక్కడ ఉండటం తటస్థపడితే అక్కడ తలదాచుకొనటం, ఎవ్వరూ లేనిచోట ఒంటిగా ఉండటం, మంచిగుడ్డ గాని చింపిగుడ్డ గాని ఏది దొరికితే అది ధరించటం, ఎప్పుడేది దొరికితే అదే పదివేలుగా భావించి సంతసించటం, భాగవత శాస్త్రశ్రద్ధ, అన్యశాస్త్రాలను నిందింపకుండటం, మనశ్చాంచల్యాన్ని ప్రాణాయామం చేత వాక్చాంచల్యాన్ని మౌనంచేత కర్మచాంచల్యాన్ని వాంఛానియతి చేత నియమించటం, సత్యసంధత, శమము – అంటే అంతఃకరణ నిగ్రహం, దమము – అంటే బాహ్యేంద్రియ నిగ్రహం, భగవంతుని అవతారాలను కర్మములను గుణాలను వినటం, కీర్తించటం, ధ్యానించటం, సర్వకర్మలను భగవత్ప్రీతికై చేయటం, యజ్ఞ దాన జప తపః కర్మములను ఎన్నడు స్వార్థానికి తలపెట్టక ఈశ్వరార్పణబుద్ధితో చేయటం – ఇవి ముఖ్యం. అంతే కాదు. ఏదేది తనకు ప్రియమవుతుందో దానినల్లా భగవదర్పణ చేయాలి. చరాచర సమస్తభూతకోటికి భాగవతసౌహృదంతో పరిచర్యచేయాలి. పెద్దల సేవ అత్యంత ముఖ్యం. భగవల్లీలలను స్మరించటం, సమయం వచ్చినప్పుడు ఆ లీలలను ఒకరికొకరు చెప్పుకోవటం అలవాటు కావాలి. ఈ విధంగా చేస్తూ నిరంతరం

త్రిశుద్ధికి భగవంతుని స్మరిస్తూ ఉంటే భగవదనుగ్రహం కలుగుతుంది. ఎప్పుడయితే భగవదనుగ్రహం కలిగిందో అప్పుడే మాయ తనంతట తానే తొలగిపోతుంది.

నిమి:- ఇట్టి భక్తుల ప్రవర్తన ఎలా ఉంటుంది?

ప్రబు:- అట్టి భక్తుల వర్తన మెటువంటిదో ఇంతకుముందే చెప్పబడింది కదా.

## భగవత్స్వరూపం

ఆ తర్వాత పిప్పలాయణుడు నిమిరాజు ప్రశ్నలకు సమాధానం చెప్పాడు.

నిమి:- మహాత్ములారా! భగవంతునికి భక్తిచేయాలని అన్నారు. భగవంతుడు ఇట్టివాడని తెలిస్తేగాని మనస్సు అతనియందు లగ్నంకాదు. అందువల్ల భగవత్స్వరూపాన్ని తెలుపమని ప్రార్థిస్తున్నాను.

పిప్ప:- ఎవనికి హేతువు లేదో, ఎవడు విశ్వసృష్టిస్థితిలయాలకు కారణమైన వాడో, ఎవడు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూడింటికీ అతీతుడై ఆ మూడింటిని చూస్తుంటాడో, ఎవడు సమాధ్యాదులందు ప్రకాశిస్తున్నవాడో, ఎవని వలన దేహేంద్రియప్రాణమనస్సులు శక్తిగలిగి తమతమ విషయములందు ప్రవృత్తిని పొందుతున్నవో, ఆ పరతత్త్వమే భగవానుడని గ్రహించు. భగవానుని బ్రహ్మమని, పరబ్రహ్మమని, పరమాత్మ అని, నారాయణుడని వివిధ నామాలతో పేర్కొంటారు. ఆ పరతత్త్వం ఇటువంటిదని చెప్పక ఈ విధంగా చెప్పటం వల్ల బుద్ధిగోచరం కాదంటావా? అది కంటికి కనిపించేది కాదు. అందువల్ల ఇలా ఉంటుందని చెప్పటం సాధ్యంకాదు. ఊహిద్దామంటే మనస్సుకు అందదు. ఊహాతీత మయినందువల్ల బుద్ధికి కూడా గోచరింపదు. బుద్ధికి గోచరింపనిదానిని గూర్చి ఏమని చెప్పగలము? క్రియాశక్తి అయిన ప్రాణానికి తెలుసా? అంటే

దానికి కూడా గోచరింపదు. ఏమంటే ప్రాణాదులు గాని, ఇంద్రియాలు గాని ఆ పరతత్త్వశక్తి యొక్క అంశలు. అంశలు మూలాన్ని ప్రకాశింపజేయలేవు. అగ్నివలన పుట్టిన విస్ఫులింగాలు తమ ఉత్పత్తిస్థానమైన అగ్నిని ప్రకాశింపజేయగలవా? అగ్నివలన పుట్టి ప్రకాశితాలై విస్ఫులింగాలు ఏ విధంగా ప్రకాశిస్తున్నవో ఆ విధంగానే పరతత్త్వం వలన పుట్టి సర్వం ప్రకాశిత మవుతున్నది. పరతత్త్వానికి తప్ప దేనికీ స్వప్రకాశమానత్వం కలుగదు. మనస్సు మొదలయినవన్నీ జడములు కదా. పరతత్త్వ ప్రకాశితములై అవి తమతమ వృత్తులలో చరిస్తున్నవి. కనుక జడానికి పరతత్త్వం విషయమెందుకవుతుంది?

నిమి:- పరతత్త్వం శబ్దగోచరమంటారు కదా?

పిప్ప:- శబ్దము తనకు మాత్రమే ప్రమాణమవుతుంది. అందువల్ల శబ్దము (వేదము) పరతత్త్వాన్ని తాత్పర్యరూపంలో బోధిస్తున్నదే కాని ఇది ఇటువంటిదని సాక్షాత్తుగా చెప్పలేదు.

నిమి:- శబ్దము ఎలా బోధిస్తున్నది?

పిప్ప:- ఏది నీకు దృశ్యమో, ఏది నీకు ఊహ్యమో అదంతా పరమాత్మ కాదని, ఆ విధంగా సమస్తాన్ని నిషేధింపగా ఏది శేషిస్తున్నదో అదే పరబ్రహ్మమని నిషేధరూపంలో వేదం పరతత్త్వాన్ని బోధిస్తున్నది. బ్రహ్మమును గూర్చి శబ్దానికి గల బోధనాశక్తి అంతమాత్రమే.

నిమి:- ఎటువంటి ప్రమాణాలకూ విషయం కాని వస్తు వొకటి ఉన్నదని ఎలా నమ్మమంటారు?

పిప్ప:- కారణము లేకుండా కార్యమూ ఉండదు. విశ్వమనే స్థూలకార్యాన్ని చూస్తున్నాము. దీనికి కారణం ఉండి ఉండాలి కదా. ఆ కారణమే పరతత్త్వం. ఇంతకంటె ప్రమాణం ఏమి కావాలి?

నిమి:- విశ్వము బహురూపాలుగా ఉన్నది. వాటన్నిటికీ అనేక కారణాలు

ఊహింపగలము. అన్నిటికీ ఒక్క పరతత్త్వమే కారణమని ఎలా చెప్పగలరు?

పిప్ప:- పరతత్త్వ మొక్కటే మొదటి కారణం. ఆ పరతత్త్వంలో సర్వశక్తులు సమన్వయిస్తాయి. ఆ విధంగా సమన్వయించిన శక్తిని పరాశక్తి అంటారు. ఆ శక్తి మొట్టమొదట సత్త్వ రజస్తమోరూపాలను ధరించింది. ఆ మూడింటిని త్రిగుణము లంటారు. వాటి సమ్మేళనాన్ని ప్రధానము అన్నారు. తరువాత క్రియాశక్తి వెలువడింది. దానిని సూత్రాత్మకం అన్నారు. ఆ తరువాత జ్ఞానశక్తి వెలువడింది. దానిని మహాతత్త్వం అన్నారు. ఆ వెనుక అహంకార శక్తి వెలువడింది. దానిని జీవనోపాధి అన్నారు. జ్ఞానశక్తి తత్తద్దేవతాశక్తులుగా, క్రియాశక్తి తత్తదింద్రియశక్తులుగా, అర్థశక్తి విషయాలుగా, ఫలశక్తి సుఖాదులుగా పరిణమించాయి. ఈ శక్తులు, వాటి పరిణామశక్తులు అన్నీ ఆయా రూపాలలో ఉన్న బ్రహ్మమే. అంతేకాని అవి స్వతంత్ర శక్తులు కావు. అవి బ్రహ్మముకంటె వేరైనవని చెప్పటానికి ప్రమాణాలు లేవు.

నిమి:- కార్యము లన్నింటికీ జన్మాది వికారములు కలుగుతున్నాయి. కాబట్టి ఆ కార్యములకు కారణమైన బ్రహ్మానికి కూడా వికారాదులు కలిగినట్లే కదా. ఆ పక్షాన బ్రహ్మము నిర్వికారమనటం ఎలా చెల్లుతుంది?

పిప్ప:- మనుష్యులకు బాల్య యౌవనాదులు వస్తూ పోతూ ఉన్నాయి. ఆ అవస్థలన్నింటికి సాక్షిభూతుడై లోపల అంతర్యామిగా ఉన్న పరమాత్మకు కూడా బాల్య యౌవనాద్యవస్థలు కలుగుతున్నవా? లేదు కదా. అలాగే కార్యజాతానికి రాకపోక లున్నంతమాత్రాన అందుకు కారణమైన పరమాత్మకు జననమరణాది వికారాలు కలుగవు.

నిమి:- ఈ పరమాత్మ యెటువంటివాడు?

పిప్ప:- ఉపద్రష్ట మాత్రుడు.

నిమి:- క్షణికమాత్రుడా?

పిప్ప:- పరమాత్మ - అనగా బ్రహ్మము - సర్వకాల సర్వదేశాలలోనూ ఉన్నాడు. అంతేగాక బ్రహ్మము ఉపలబ్ధిమాత్రుడు - అనగా జ్ఞానమాత్రుడని చెప్పాను. ఇది నల్లనిది, ఇది తెల్లనిది అన్నది కూడా జ్ఞానమేనని, అలాగే జ్ఞానములన్నీ తత్కాలానికి ఒకానొకప్పుడు కలిగి ఆ తర్వాత మాసిపోతున్నవని, బ్రహ్మము జ్ఞానమాత్రు డన్నప్పుడు జ్ఞానానికి ఉత్పత్తినాశనాలు కనబడుతున్నవి కాబట్టి బ్రహ్మమునకు కూడా ఉత్పత్తినాశము లుంటాయని శంకింపవద్దు. నలుపు తెలుపు మొదలయినవి ఆకారవృత్తులు. వృత్తులకు ఉత్పత్తినాశాలు ఉన్నాయి గాని వాటిని గురించిన జ్ఞానానికి ఎన్నడూ లేవు. ఆ జ్ఞానం ఏకాకారితమై నిరంతరం ఉండేది. ప్రాణమే ఇందుకు నిదర్శనం. జీవులు జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు అని నాలుగు విధాలు. వీటన్నింటిలోనూ ప్రాణం జీవుని అనువర్తించి ఉంటుంది. జీవుల వికారాన్ని బట్టి ప్రాణం వికారాన్ని చెందటం లేదు. బ్రహ్మము కూడా అటువంటిదేనని గ్రహించు. జాగ్రత్స్వప్నాలలో ఇంద్రియగణం అహంకార ప్రవృత్తమై వర్తిస్తుంది. సుషుప్తిలో అహంకారం లయిస్తుంది. దానితో ఇంద్రియగణము యొక్క వృత్తి కూడా లయించిపోతుంది. అప్పుడు ఆత్ముడు కూటస్థుడై నిర్వికారస్థితిలో ఉండటం అనుభవసిద్ధమే కదా. ఏమంటే వికారములన్నీ ఉపాధులకే గాని ఉపాధిగతునికి కాదు. ఇంద్రియాదులు శారీరికాలు. ఉపాధిమాత్రంగా ఉన్నటువంటివి. ఉపాధులకు లయోత్థానాలు తప్పవు. అవి ఉపాధిస్థునికి లేవు. ఉపాధిస్థుడు నిర్వికారుడై ఉండటం వల్లనే ఉపాధులకు

లయోత్థానాలు కలిగే అవకాశం ఏర్పడుతున్నది.

నిమి:- అహంకారపర్యంతం సర్వమూ లయమైనప్పుడు శూన్యమేగదా శేషిస్తున్నది? శూన్యమన్నప్పుడు కూటస్థుడు ఆత్ముడెలా ఉండగలడు?

పిప్ప:- సుషుప్తిలో అది నేను చూశాను, ఇది బాగున్నది మొదలయిన జ్ఞానవిశేషాల యొక్క జ్ఞానముండదే కాని అసలు జ్ఞానం లోపించటం లేదు కదా. గాఢంగా నిద్రించి లేచినప్పుడు 'ఇంతసేపు హాయిగా నిద్రించాను, అప్పుడు నాకేమీ తెలియలేదు' అంటున్నాము. దాని భావం ఏమిటి? హాయిగా నిద్రించాననే జ్ఞానం, ఏమీ తెలియలేదు అనే జ్ఞానం మిగిలే ఉన్నది కదా. ఆ విధంగా జ్ఞానమే గనుక శేషించి ఉండకపోతే అటువంటి మాట ఎలా అనగలుగుతున్నాము? సుషుప్తిలో ఆత్మకు విషయసంబంధం ఏర్పడదు. అది కేవలమై ఉంటుంది.

నిమి:- సుషుప్తిలో కూటస్థానుభవం కలిగినప్పుడు అవిద్య, అవిద్యాసంస్కారాలు అన్నీ నశించిపోతాయి కదా, మేలుకొన్నప్పుడు ఆ సంస్కారాలన్నీ తలయెత్తి వ్యవహరిస్తున్నవి కదా, ఒకసారి నశించినవి మళ్ళీ ఎలా ఉద్భవిస్తున్నాయి?

పిప్ప:- సుషుప్తిలో వృత్తులకు లయమే గాని నాశనం లేదు. లయించినది సమయం వచ్చినపుడు తలయెత్తక మానదు. నశించినదానికి పునరుత్పత్తి కలుగదు. ఆ కారణాన సుషుప్తి కాలంలో లయించిన వృత్తులు జాగ్రదవస్థలలో తలయెత్తి వ్యవహరిస్తుంటాయి. లయమంటే ఏమిటని అడుగుతావేమో? ఇంద్రియవృత్తులన్నీ సంస్కారరూపంలో ఉండటాన్ని లయమంటారు. నాశనమప్పుడు సంస్కారాలు కూడా ఉండవు. లయమందలి సంస్కారాలు బీజాలుగా మళ్ళీ పుడుతుంటాయి. నాశనమందు సంస్కారాలు కూడా లేనందువల్ల వృత్తులకు పునరంకురం కలగదు.

నిమి:- వృత్తినాశనం ఎలా కలుగుతుంది?

పిప్ప:- విత్తనం శక్తిమంతమై ఉన్నా దానికి తగిన ఆవరణ లేకపోతే మొలకెత్తదు. సంస్కారరూప బీజాలు మొలకెత్తటానికి మలమనే ఒక ఆవరణ ఉన్నది. మలమంటే కోరిక అని భావం. ఆ కోరిక విత్తాదులందు తగులుకొని ఉంటుంది. ఆ కోరికనే ఐషణమంటారు. ఈ ఐషణం ఎప్పుడయితే తొలగిందో అప్పుడు బీజం మొలకెత్తటానికి తగిన వసతి లేక తనంతటతానే నశించిపోతుంది. ఐషణరూపమలాన్ని తొలగించాలంటే ఏమి చెయ్యాలి? అని అడగవచ్చు. పుత్ర విత్తాదులందు గల ఏషణను భగవచ్చరణసరోజమందు హత్తించాలి. భగవచ్చరణం కూడా ఒక ఆవరణమే కదా? అని శంకిస్తావేమో. అగ్నికూడా ఒక ఆవరణమే. అయితే అగ్నిలో వేసిన బీజం అగ్నిప్రభావం వలన దగ్ధమై స్వరూపనాశాన్ని చెందుతున్నది. భగవచ్చరణం కూడా అటువంటిదే. భగవచ్చరణం ఒక ఆవరణమే అయినా మలాదులను హరించే శక్తి దానియందు నిబిడమై ఉన్నది. అందువల్ల భగవచ్చరణైషణం మలాపహారమై చిత్తశుద్ధిని కలిగిస్తుంది. శుద్ధదర్పణంలో బింబ మెటువంటిదో అలాగే శుద్ధచిత్తంలో భగవత్స్వరూపం ప్రతిఫలిస్తుంది. ఆ విధానాన్నే ఆత్మసాక్షాత్కార మంటారు. రాజా! ఆత్మ నీలోను నాలోను సర్వజంతుజాలంలోను సర్వదా ఏకరూపంలో ప్రకాశిస్తూనే ఉంటుంది. మనోదర్పణం మాలిన్యవంత మైనప్పుడు ఆత్మబింబం దానిలో ప్రతిఫలింపదు. మలినాన్ని తొలగించితే ఆత్మబింబదర్శన మవుతుంది.

## కర్మయోగం

ఆ తర్వాత నిమి ప్రశ్నలకు ఆవిర్హోతుడు సమాధానం చెప్పాడు.

నిమి:- మహాత్ములారా! కర్మమంటే ఇంద్రియవ్యవహారమే కదా. ఆ వ్యవహారం పుట్టినది మొదలు గిట్టినదాకా ఏదో ఒక విధాన ప్రతిక్షణం జరుగుతూనే ఉంటుంది. కర్మ రహితమైతే గాని మోక్షం సిద్ధింపదన్నారు. ప్రతిక్షణం జరుగుతుండే కర్మ రహితమయ్యేదెప్పుడు? మోక్షం సిద్ధించేదెప్పుడు? నా తండ్రియైన ఇక్ష్వాకు రాజేంద్రుని వద్దకు ఒకనాడు సనకాదులు వచ్చారు. వారికి నా సందేహం విన్నవించి నైష్కర్మ్యసిద్ధి కలిగే మార్గాన్ని తెలుపమని ప్రార్థించాను. ఎందుకోగాని వారు నా ప్రణయాన్ని మన్నింపక ఊరుకొన్నారు. మీరయినా నా సందేహం నివారింపగలరని అడుగుతున్నాను.

ఆవి:- రాజా! కర్మతత్త్వం వేదైకగమ్యమనే కాని లౌకికబుద్ధికి అందదు. వేదం భగవంతుని వలన పుట్టింది. అందుకే దానిని అపౌరుషేయమన్నారు. పౌరుషేయ మంటే పురుషవాక్యం. ఎవరయినా ఏదయినా చెప్పినప్పుడు వక్తయొక్క అభిప్రాయాన్ని బట్టి అతని మనోభావాన్ని గ్రహింపవచ్చు. అదే అపౌరుషేయ మయితే వాక్యాల పౌర్వాపర్యాన్ని బట్టి తాత్పర్యం గ్రహింపవలసి ఉంటుంది. అందువల్లనే వేదభావాన్ని గ్రహించటం కష్టం. కనుకనే వేదతాత్పర్యం ఇదని నిశ్చయించే విషయంలో మహాపండితులు కూడా తబ్బిబ్బవుతుంటారు.

కర్మతత్త్వమంటే అంతదుర్జ్ఞేయం కాబట్టి, నీ వప్పుడు బాల్యదశలో ఉన్నావు కాబట్టి, నీవడిగినది చెప్పినా గ్రహింపలేవనే ఉద్దేశంతో ఆ మహర్షులు నీకు చెప్పలేదు కాబోలు.

నిమి:- వైదికకర్మలకు ఫలితార్థ మేమిటి?

ఆవి:- వేదం ఉపదేశించే కర్మలకు భోగమే ఫలమని, మోక్షం కాదని కొందరనుకొంటారు. ఆ భావన సరికాదు. పిల్లలకు మందు

త్రాగించేటప్పుడు ఆ మందుతోపాటు రుచికి గాను చక్కెరను కలిపి త్రాగిస్తుంటాము. చక్కెర రుచివల్ల పిల్లలు మందు త్రాగుతారు. ఆ విధంగా త్రాగిన మందు వారికి రుచించినా రుచింపకపోయినా దాని పని అది చేస్తుంది. అలాగే వైదికకర్మలను అనుష్ఠించేందుకు ఫలాభిరుచి కలిగింపబడింది. ఆ రుచితో ఆ కర్మలను ప్రారంభించి చేసినప్పుడు ఫలసారం మోక్షార్థమే అవుతుంది.

పరోక్షవాదముఖంగా వేదం కర్మలను విధిస్తున్నది. భావాన్ని దాచి కార్యానికి పురికొల్పటాన్ని పరోక్షవాదమంటారు. కార్యము జరిగినప్పుడు వస్తుశక్తి ప్రకారం ఫలము కూడా స్వతస్సిద్ధ మవుతుంది.

నిమి:- కర్మత్యాగమే మోక్షకారణ మన్నారు. అలాగయితే మొట్టమొదటనే కర్మలను ఎందుకు త్యజింపకూడదు?

ఆవి:- కర్మత్యాగానికి కావలసినది జితేంద్రియత్వం. లోకులందరూ జితేంద్రియులు కారు. అట్టివారికి మొట్టమొదటనే కర్మత్యాగం విధిస్తే పచ్చికాయను పండమన్నట్లు ఉంటుంది. అజ్ఞులకు క్రమక్రమంగా మనఃపరిణామాన్ని కలిగించినట్లయితే చివరికి వారే కర్మతత్త్వాన్ని గ్రహించి దానిని త్యజించి కృతకృత్యు లవుతారు.

నిమి:- కర్మము చేసినప్పుడు దానికి తగిన ఫలం తప్పక కలుగుతుంది. ఆ ఫలాన్ని అనుభవించి తీరాలి. ఆ ఫలభోగార్థం తత్తదుచిత శరీరాలు ధరింపక తప్పదు. కర్మతత్త్వం ఇలా ఉండగా కర్మలను ఆచరిస్తూ సర్వకర్మత్యాగఫలమైన మోక్షాన్ని పొందగలమా?

ఆవి:- ఫలాపేక్షతో ఎటువంటి కర్మచేసినా తత్ఫలం అవశ్యభోగ్య మవుతుంది. ఫలాపేక్ష లేనప్పుడు ఆ ఫలానికి భోగింపవలసిన అవసరం వంటివి కూడా కలుగవు. మొట్టమొదటనే ఫలాపేక్షను

పూర్తిగా విడిచిపెట్టడం అజ్ఞులకు వీలుకాదు. అందువల్ల కర్మలను చేస్తూనే కర్మఫలాన్ని భగవదర్పణ కావింపమని వేదం అంటున్నది. అలా చేస్తూ రాగా, క్రమక్రమంగా కర్మములన్నీ నైష్కర్మ్యము లవుతాయి. కర్మములకు స్వర్గాదిఫలాలు వస్తాయని వేదం ఎవరిని గూర్చి చెబుతున్నది? ఫలాలను కోరి తదుచిత కర్మలను చేసినప్పుడు తత్ఫలం కలుగుతుందని వేదం చెబుతున్నదే గాని, అట్టి కోరిక లేకుండా తత్కర్మలను చేసినప్పుడు కూడా స్వర్గాదిఫలాలు కలుగుతాయని ఎక్కడా చెప్పలేదు.

నిమి:– కోరిక యొక్క మంచిచెడ్డలను ఎలా నిశ్చయించాలి?

ఆవి:– ప్రేరణ బాహ్యమని, ఆంతరమని రెండు విధాలు. బాహ్యపదార్థ సంయోగంవలన ఇంద్రియాలకు కలిగే ప్రేరణ బాహ్యమైనది. 'తిను, త్రాగు, సుఖంగా ఉండు' అనే ప్రేరణలన్నీ బాహ్యప్రేరణలు. 'ముక్తికి అనుకూలమైన పనులను చెయ్యి' అని చెప్పే ప్రేరణ ఆంతరమైనట్టిది. దీనినే ఆత్మప్రేరణ మనికూడా అంటారు. వీటిలో మొదటిది రుచి; రెండవది ధర్మం.

ఈ రెండింటిలో ఏది ఆత్మప్రేరణమో, ఏది బాహ్యప్రేరణమో నిశ్చయించే మార్గమేమిటి? అనే ప్రశ్న వస్తుంది. మనకు కలుగుతున్న ప్రేరణ బాహ్యపదార్థ సంయోగం వలన కలుగుతున్నదో, మోక్షార్థం కలుగుతున్నదో విమర్శించుకొంటే దాని తత్త్వమేమిటో తెలిసివస్తుంది. ఆత్మ ప్రేరణమని తెలుసుకొనటమే ఆత్మజ్ఞానము లేక ఆత్మనిష్ఠ అని చెప్పాలి. ఈ నిష్ఠ ప్రకారం ప్రవర్తించటమే సన్మార్గం.

## తాంత్రిక కర్మ

నిమి:– మహాత్మా! జీవునికి అహంకారమనే హృదయగ్రంథి ఉన్నది. ఆ

ముడి వీడితేనే గాని అతనికి మమకారం తొలగదు. మమకారం నశించితే గాని కర్మఫలాన్ని భగవత్పరం చేయాలనే ఆలోచన రాదు. ఈ గ్రంథి వీడేదెన్నటికి?

ఆవి:- ఏ కార్యాన్నయినా ఉపాయం చేత సాధించాలి. వైదికకర్మలను తంత్రశాస్త్రోక్తప్రకారం చేస్తే హృదయగ్రంథి వీడిపోతుంది. తాంత్రిక పూజావిధానం ఏమిటని అడుగుతావేమో? విను.

మొట్టమొదట తంత్రశాస్త్రవిదుడైన గురువును సేవించి ఆయన ప్రీతిని సంపాదించాలి. ఆ గురువు శాస్త్రోక్తమైన అర్చనా విధానం ఉపదేశించిన తర్వాత ఆ ప్రకారం భగవంతుని ఆరాధించాలి.

అర్చనకు ఏదో ఒక మూర్తిని స్వీకరించాలి. భగవన్మూర్తులకు ఇన్నని లెక్క లేదు కదా. ఏ మూర్తి తన మనస్సుకు ఇష్టమయితే ఆ మూర్తిని గ్రహింపవచ్చును. ఏ మూర్తిని గ్రహించినా దానియందు పరతత్త్వాన్ని ఆరోపించి సమర్చించాలి.

సాధకుడు స్నానాదులొనర్చి శుచియై తన పూజ్యమూర్తి యెదుట కూర్చోవాలి. తర్వాత ప్రాణాయామం చేసి భూతబలి కావించాలి. అప్పుడతనికి దేహశోధన చేకూరుతుంది. తర్వాత అంగన్యాస కరన్యాసాలు చేయాలి. ఇవి శరీర రక్ష లవుతాయి. శరీరం ఆ విధంగా రక్షితమైనప్పుడు బాహ్యమైనవేవీ దానిని బాధింపనేరవని ఉద్దేశం. తర్వాత మనస్సును తన ముందున్న మూర్తియందు లీనం చేసి అర్చనకు ప్రారంభించాలి.

అర్చనాప్రారంభంలో జంతువులు మొదలైనవాటి శోధనను చేయాలి. అందువల్ల మూర్త్యారాధన నిమిత్తం తాను సేకరించిన పుష్పాదిద్రవ్యాలకు యోగ్యత కలుగుతుంది. తర్వాత మూర్తి ఉన్న చోటును శుభ్రపరచాలి. అనంతరం సాధకుడు తన మనస్సును

చెదరనీయక స్థిరంగా నిలపాలి. అటుపిమ్మట పూజామూర్తిని అభిషేకించటం, దానికి వస్త్ర మాల్య గంధాదులను అర్పించటం మొదలయిన ఉపచారాలను చేయాలి. తర్వాత ఆసనాన్ని ప్రోక్షించి పాద్యాది పాత్రలను అలవరించుకొని మూర్తిరూప భగవానుని ఆహ్వానించి హృదయాది న్యాస మంత్రాలు చదివి ఆ భగవానునికి, ఆయనను కొలిచి ఉండేవారికి మూలమంత్రపూర్వకంగా పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, స్నానం, వస్త్రాభరణాలు, చందనమాల్యాక్షతలు, ధూపదీపనైవేద్యాలను సమర్పించాలి. విష్ణుమూర్తిని అక్షతలతోను, పరమశివుని మొగలిపూవులతోను అర్చింపకూడదు. తర్వాత నామస్తోత్రాదులు చేయాలి. ఇదంతా పూర్తయిన తర్వాత సాష్టాంగప్రణామం చేసి తనను ఆ భగవన్మయునిగా ధ్యానించి నిర్మాల్యాన్ని తలదాల్చి ఆ పూజాదేవునికి సర్వసత్కారపూర్వకంగా ఉద్వాసన చెప్పి పూజాసమాప్తి కావించాలి.

భగవానుడు సర్వాత్ముడు గనుక పూజ నిమిత్తం అతనిని సూర్యానలజలాల లోనూ, అతిథియందు, తన హృదయం లోనూ అధిష్ఠింపజేసి పూజింపవచ్చును. ఆ ప్రకారం చేసిన వారు శీఘ్రకాలం లోనే ముక్తులవుతారు.

## భగవదవతారాలు

ఆ తర్వాత ద్రమీళుడు ప్రసంగించాడు.

నిమి:- మహాత్మా! భగవన్నామస్తోత్రం చేయాలని సెలవిచ్చారు. నామావళి అంటే భగవదవతార గుణ కర్మములనే కదా! వాటిని తెలుసుకొంటేగాని స్తుతించటం వీలుకాదు. భగవానుడు ఏయే అవతారాలను ధరించాడు? ఏయే అవతారంలో ఏయే కృత్యాలు నిర్వర్తించాడు? ఆ వివరాలు చెప్పండి.

బ్రమీ:- రాజా! భగవదవతారాలు కాలత్రయసంబంధులు, అందుచేత అనంతములు అయినట్టివి. అనంతములను గూర్చి ఎవరు మాత్రం చెప్పగలరు? కనుక సకలావతారగుణకర్మలను సాకల్యంగా చెప్పమంటే ఎవరి తరమూ కాదు. ఏండ్లుపూండ్లు శ్రమించి భూరేణువులను లెక్కించినా లెక్కింపవచ్చును గాని భగవంతుని గుణాలను లెక్కించటం సాధ్యంకాదు. ఎందుకంటావేమో? గుణములన్నీ శక్తివిలాసాలు. భగవంతు డంటేనో, సర్వశక్తికి ఆశ్రయ మైనవాడు. అతని శక్తి ఎప్పుడు ఏ విధంగా వ్యవహరిస్తుందో ఊహకైనా గోచరింపదు. అయినా నువ్వు కోరినట్లు భగవదవతారాలను సంక్షిప్తంగా వినిపిస్తాను.

## విరాట్పురుషావతారం

భగవానుడు మొట్టమొదట పంచభూతాలను సృజించాడు. ఆ భూతాల కలయిక వలన బ్రహ్మాండం ఏర్పడింది. ఆ అండంలోనికి భగవానుడు స్వాంశతో ప్రవేశించాడు. అప్పుడు విరాడ్రూపం ఏర్పడింది. ఆ రూపాన్నే నారాయణమూర్తి అని కూడా అంటారు. ఇదే భగవానుని ప్రథమావతారం. భగవానుడు ఆ విధంగా బ్రహ్మాండంలోనికి ప్రవేశించటం అతని భోగ్యార్థం కాదు. ప్రళయమందు తనలో లయించి ఉన్న పుణ్యజీవుల భోగ్యార్థం భగవానుడు చూపిన లీలావిశేషం అది.

ఆ విరాడవతారంలో భగవానుని గుణకర్మములను చెబుతాను. భువనత్రయం ఆ విరాణ్మూర్తి శరీరం కదా. ఆ మూర్తి ఇంద్రియాల వలన జ్ఞానకర్మేంద్రియాలు, వాటి స్వరూపసత్తాస్ఫురణతో జ్ఞానం, వాటి ప్రాణం వలన దేహేంద్రియక్రియాశక్తులు సమష్టి వ్యష్టి జీవరాశికి ఏర్పడ్డాయి.

వాటి సత్త్వరజస్తమోగుణాల వలన క్రమంగా జగదుత్పత్తిస్థితిలయాలు కలిగాయి. అందువల్లనే అతనిని ఆదికర్త అంటారు.

నిమి:- త్రిమూర్తుల అవతారం సంగతేమిటి?

ద్రమీ:- భగవంతుని రజఃక్రియాశక్తి బ్రహ్మరూపాన్ని, సత్త్వక్రియాశక్తి విష్ణురూపాన్ని, తమఃక్రియాశక్తి రుద్రరూపాన్ని ధరించి క్రమంగా సృష్టిస్థితిలయ కార్యాలకు అధికారిత వహించింది.

నిమి:- మహాత్మా! నరనారాయణుల అవతారాలెందుకు?

ద్రమీ:- రాజా! పూర్వం ఒకనాడు ధర్ముడనే పుణ్యాత్ముడు దక్షప్రజాపతి కుమార్తె మూర్తి అనే ఆమెను పెండ్లిచేసుకొన్నాడు. వారికి భగవానుడు నరనారాయణ రూపాలలో అవతరించి ఆత్మతపః ప్రశాంతులై నారదాదులకు నైష్కర్మ్యసిద్ధిని - అంటే ధర్మం ఆచరిస్తూనే ఆత్మస్వరూప బోధకస్థితిలో ఉండే మార్గాన్ని బోధించి, ఆ ధర్మాన్ని తాము స్వయంగా ఆచరిస్తున్నారు.

ఇలా ఉండగా వారిలో నారాయణఋషి తపస్సు చేస్తున్నది స్వర్గార్థమని ఇంద్రుడు శంకించి, కామదేవుని పిలిచి, 'అయ్యా! నారాయణ ఋషి నా ఇంద్రపదవిని కోరి ఘోరతపస్సు చేస్తున్నాడు. నీవు నీ పరివారమైన వసంత మందమారుత గంధర్వాప్సరోగణాదులతో అతని తపస్స్థానానికి వెళ్ళి కామినీకటాక్షబాణాలతో అతనిని కవ్వించి తపోవిఘ్నం కావించి వెనుదిరిగిరా!' అని చెప్పి పంపించాడు. మన్మథుడు ఆ ప్రకారంగానే చేసిచూశాడు. నారాయణుడు అదంతా ఇంద్రుని అపచారమని గ్రహించి చిరునవ్వు దాల్చాడు. మన్మథాదులు తమ ఆటలు సాగనందుకు చింతించి, మునీశ్వరుడు కోపంలో శపిస్తాడేమోనని

వెలవెలబోయారు. మునీశ్వరుడు వారిని చూసి 'మదనా! మందమారుతా! అప్సరసలారా! భయపడకండి. మా ఆశ్రమానికి అతిథులు రాక ఇన్నాళ్ళుగా వట్టిపోయినట్లున్నది. రాకరాక వచ్చినవారు మీరు మా అతిథులై ఆ దోషాన్ని పరిహరించండి' అని ఆహ్వానించాడు. ఆ మాటలకు కామదేవాదులు సిగ్గుపడి తలవంచుకొని 'లోకేశ్వరా! నీవు పరాత్పరుడవు. స్వాత్మారాములైన ధీరులెందరో నీ పాదపద్మాలను ఆశ్రయిస్తుంటారు. అట్టి నీవు మా చేష్టలకు చలింపకుండటం వింతకాదు. దేవతలు యజ్ఞభాగార్థులై యజ్ఞభాగం ఇచ్చినవారి పనులకు విఘ్నాలు కల్పించరు. స్వర్గాన్ని కూడా లెక్కచేయక నీ పరమపదాన్ని కోరి నిన్ను సేవించేవారికి సురలు అపకారం చెయ్యబోతారు. అది వారి స్వభావదోషం. సర్వరక్షకుడ వైన నీవుండగా సురల అపకారాలు గోరంత సాగవు. దేవా! నిన్ను భజించేవారికి ఎటువంటి భయాలు కలుగవు. నిన్ను భజింపక తపస్సు చేయబూనినవారు మాకో, క్రోధానికో వశపడక మానరు. మాకు వశులైనవారికి కామభోగాలన్నా లభిస్తాయి. క్రోధానికి వశులైనవారు భోగాలకూ, మోక్షానికీ రెంటికీ చెడినవారవుతారు. వారి తపస్సంతా అడవిగాచిన వెన్నెలవుతుంది' అని విన్నవించారు.

రాజా! అంతలో కొందరు నవయౌవనవతులు మహర్షి యోగమాయాబలం వలన జన్మించి దివ్యవస్త్రాభరణభూషితలై వచ్చి ఆ మహర్షులను శుశ్రూషింపసాగారు. ఆ కాంతల రూపలావణ్యాతిశయాలను చూసి 'ఓహో! వీరి కొనగోటికయినా మనము సాటిరాగలమా?' అని అప్సరసలు గర్వమణిగి, సాగిలబడి మ్రొక్కారు. ఆ మునీంద్రుడు నవ్వుతూ, 'మదనాదులారా! ఇంత దూరం వచ్చి మీరు రిక్తహస్తాలతో వెళ్ళకూడదు. ఈ

సుందరీమణులలో మీకు నచ్చినదానిని ఒకామెను మహేంద్రలోకాలంకరణార్థం తీసికొనివెళ్ళండి' అన్నాడు. వారు సరేనని ఊర్వశిని వెంటగొని స్వర్గానికి వెళ్ళి ఇంద్రునికి జరిగిన సంగతి విన్నవించారు. ఇంద్రుడు తెల్లబోయి తన తప్పిదానికి తలవంచుకొన్నాడు.

నిమి:– భగవంతుని యొక్క ఇతరావతారాల మాటేమిటి?

ద్రమీ:– భగవానుడు నిజాంశతో హంస, దత్తాత్రేయ, సనత్కుమార, ఋషభావతారాలు ధరించి లోకాలకు ఆత్మయోగాన్ని ఉపదేశించాడు. మధుదానవుడు వేదాలను హరింపగా భగవానుడు హయగ్రీవావతారమెత్తి మధువును చంపి వేదాలను తెచ్చియిచ్చాడు; మత్స్యావతారం ఎత్తి మనువును రక్షించాడు; కూర్మావతారం ధరించి మందరగిరిని మోచి అమృతమథనం కొనసాగించాడు; వరాహావతారం ధరించి సముద్రాంతరంలో మునిగిన భూమిని పైకి లేవనెత్తి హిరణ్యాక్షుని సంహరించాడు; వరదావతారమెత్తి గజరాజును రక్షించాడు; రాజా! వాలఖిల్య మహర్షులు కశ్యపుని కొరకు సమిధలు తేబోయి సముద్రంలో పడి ఇంద్రోపహసితులై మొరలిడగా వారిని రక్షించాడు; ఇంద్రుడు వృత్రాసురుని వధించి బ్రహ్మహత్యకు చిక్కి పరితపింపగా అతనిని బ్రోచాడు; నృసింహావతారం ధరించి హిరణ్యకశిపుని సంహరించి సాధువులకు అభయదానం ఇచ్చి ఆ అసురుడు బందిగొన్న దేవాంగనలను విడిపించాడు. ఇవిగాక మన్వంతరాలలో భగవానుడు దేవతల రక్షణార్థమై అవతరించి అనేక పర్యాయాలు రాక్షసులను పరిమార్చాడు. బలిచక్రవర్తి ఇంద్రుని రాజ్యాన్ని అపహరింపగా భగవానుడు వామనావతారం ధరించి బలిని యాచించి ఇంద్రునికి అతని రాజ్యం అప్పగించాడు. పరశురామావతారమెత్తి

హైహయులను సంహరించి అధర్ములైన క్షత్రియులను ఇరవైఒక్కమార్లు వెతికి వెతికి చంపాడు. శ్రీరామచంద్రుడై అవతరించి సేతువుగట్టి రావణాసురుని చంపి సీతను తెచ్చి లోకపావన కీర్తిమంతు డయ్యాడు. భూభారం దుర్భరమైనప్పుడు భూదేవి మొరలిడగా ఆలకించి యాదవకులంలో శ్రీకృష్ణుడై అవతరించి దేవతలకు కూడా సాధ్యంకాని మహాకార్యాలెన్నో నిర్వహించి భూభారాన్ని తగ్గిస్తున్నాడు. రాక్షసులు యజ్ఞాలు చెయ్యబోతున్నారు. వారికి యజ్ఞార్హత లేనందున వారి మనస్సును యజ్ఞకార్యాల నుంచి విముఖీకరించడానికి భగవానుడు బుద్ధావతారమెత్తి వాదాలు జరిపి కర్మకాండ నిరుపయోగమనే భ్రాంతిని వారికి కలిగిస్తాడు. ఈ యుగాంతంలో ధర్మహీనులైన శూద్రమతులు రాజులై సనాతన ధర్మాలకు ముప్పు కొనితెస్తారు. భగవానుడప్పుడు కల్క్యవతార మెత్తి వారిని సంహరించి ధర్మోద్ధరణ కావిస్తాడు.

## భగవద్భక్తిహీనుల గతి

అప్పుడు ఋషభాత్మజులలో ఎనిమిదవవాడు చమసుడు ప్రసంగించాడు.

నిమి:- ఋషివర్యా! సుఖానికై జీవరాశి ఎల్లవేళలా ప్రాకులాడుతూనే ఉన్నది. ఒకనాటికీ తనివిచెందినట్లు కనిపించదు. దీనికి కారణ మేమిటి?

చమ:- రాజా! సుఖాభిలాష చరాచర సమస్త జీవరాశికి నైజం. ఆ సుఖాన్ని పొందటానికి పెక్కు పోకడలు పోతుంటారు. సుఖమన్నది ప్రేమ ఫలం కాబట్టి ప్రేమించడానికి ప్రేమింపబడే వస్తువొకటి ఉండాలి. ఆ ప్రేమాస్పదవస్తువును భోగించినప్పుడు ఆ వస్తుగత ప్రియాత్మక తత్త్వం భుక్తమై సుఖార్థులకు సుఖాన్నిస్తున్నది.

లోకంలో ఏ గుణమయినా తన గుణంవంటిగుణాన్నే ఆకర్షిస్తుంది గాని విరుద్ధగుణాన్ని ఆకర్షింపదు. సృష్టి సమస్తం గుణత్రయవిలాసమే గాని వేరు కాదు. ఆ మూడు గుణాలలో కేవల సత్త్వగుణం కలిగినప్పుడు బ్రాహ్మణత్వం, రజస్సు ప్రధానం సత్త్వం అప్రధానం అయినప్పుడు క్షత్రియత్వం, తమస్సు ప్రధానం రజస్సు అప్రధానమైనప్పుడు వైశ్యత్వం, కేవల తమస్సు కలిగినప్పుడు శూద్రత్వం ఏర్పడగలవని గుణవిభాగం కావించి, ఆ గుణాలు కలిగిన జీవులను ఆయా జాతివారని వ్యవహరించటం మొదలయింది. ఈ గుణవిభాగం మనుష్య వర్గంలోనే కాక చతుష్పాత్తులలో వృక్షవర్గంలో ఖనిజవర్గంలో అన్నిటా ఉన్నది.

సత్త్వము సత్త్వరూపసుఖాన్ని పొందటానికి సత్త్వగుణవస్తువును ఆకర్షిస్తుంది. తక్కినవాటి విషయం కూడా అంతే. సుఖమన్నది ఆనందవిశేషమే తప్ప వేరేమీ కాదు. ఆనందాన్ని కోరినప్పుడు శాశ్వతానందాన్ని కోరితే మంచిది. అటువంటి శాశ్వతానందాన్ని ఇవ్వడానికి తత్పదార్థాలు సయితం శాశ్వతానంద ఘనాలుగా ఉండాలి. శాశ్వతానంద ఘనం భగవంతుడు తప్ప వేరొక పదార్థం ఉండదు. తక్కిన వస్తువులన్నీ ఆనందలేశాత్మకాలు మాత్రమే.

మర్త్యు లిటువంటి పరమానందాన్ని పొందాలంటే ఆయా గుణవంతులకు తగిన మార్గాలను వేదాలలో చెప్పారు. ఆ వేదభావాన్ని గ్రహించి తత్ప్రకారం నడుచుకొనడానికి కొంత వివేకం అవసరం. ఆ వివేకం గుణాల తారతమ్యాన్ని బట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర తత్త్వాలలో సహజంగానే ఉంటుంది. అందువలన వారు తత్తద్వ్యక్తములైన వేదోక్తకర్మలను సాధనలుగా గ్రహించి తత్కర్మముల ఫలమైన ఆనందరూపసుఖాన్ని యథోచితంగా పొందే అధికారాన్ని సంపాదించుకొంటారు. ఆ ప్రకారం వేదోక్తకర్మలను

కావించినప్పుడు క్రమక్రమంగా ఆనందఘన పదార్థాన్ని పొంది పరమతృప్తులై అన్యములను మరచిపోతారు. దీనినే మోక్షమని, భగవత్ప్రాప్తి అని పేర్కొంటారు.

ఈ వేదోక్తమైన కర్మవిధానానికే సంస్కారమని పేరు. సంస్కారమంటే కూడనిదానిని తొలగించటమని తాత్పర్యం. ఈ సంస్కారం ఆహార వ్యవహారరూపంలో ఉంటుంది. ఆ విధానాన్ని తప్పకుండా అనుసరించడాన్ని అభ్యాసయోగ మంటారు. వివేకం లేనివారి గతేమిటి? అని అడుగుతావేమో. అట్టివారు పెద్దల మార్గాన్ని అనుసరించాలి. లేనినాడు సంస్కారం కలుగదు. సంస్కారం లేనినాడు గుణస్థితి మారదు. గుణస్థితి మారనినాడు అధోగతి తప్పదు.

నిమి:- జ్ఞానకార్య మేమిటి?

చమ:- జ్ఞానానికి యథార్థమని, విపరీతమని రెండవస్థ లున్నాయి. యథార్థ జ్ఞానం ప్రాప్యానికి నడిపిస్తుంది. విపరీతం పతనానికి దారితీస్తుంది. ఈ విపరీతజ్ఞానులు వేదాలకు విపరీతార్థాలను కల్పిస్తారు. దానినే అర్థవాదమని అంటారు. ఆ వాక్యాలు సామాన్యులకు వారివారి గుణతత్త్వాన్ని బట్టి మధురమధురంగా ఉంటాయి. ఆ మాధుర్యానికి లోనై తద్రూపమైన విపరీత కర్మలను ఆచరిస్తారు. ఆ కర్మలు రజోగుణాన్ని పెంపొందిస్తాయి. ఆ గుణవృద్ధివలన సంకల్పాలు మరింత ఘోరమవుతాయి. ఆ సంకల్పాలను పొందితీరాలని కామం పెచ్చు పెరుగుతుంది. కామప్రాప్తికి నిరోధం కలిగినప్పుడు పాముకు కుబుసం ఉన్నట్లు క్రోధగుణం పైకివస్తుంది. ఆ క్రోధం కన్నుగప్పటం వల్ల సజ్జనులను కూడా కాటువేస్తారు.

అంతే కాదు. వారు ఆ కామతృప్తిని గృహ మైథునాది గ్రామ్యవస్తుసంప్రాప్తి వలన పొందజూస్తారు. ఆ వస్తువుల వలన

కలిగే తృప్తి నైచ్యమేగాక క్షణభంగురమై చివరికి దుఃఖంగా మారుతుంది.

రాజా! మైథునము మాంసభక్షణ మద్యపానం – ఈ మూడూ జంతువు లన్నింటికీ ఉన్నవే. అవి రాగంవలన కలిగి రాగాన్ని పెంచుతుంటాయి. ఆ రాగాన్ని వెంటనే రూపుమాపటం సాధ్యంకాదు. కాదని తొందరపడితే మొదటికి మోసం వస్తుంది. అందువల్ల ఆ రాగభావాన్ని క్రమక్రమంగా అణచివేయాలి. అందుకు గాను కొన్ని నియమాలను ఏర్పరిచారు. మైథునప్రీతికి వివాహం, మాంసభక్షణకు యజ్ఞయాగాలు, మద్యసేవకు సౌత్రామణి, ధనానికి ధర్మం నియమింపబడ్డాయి. ఈ విధులు నియామకాలే గాని పారమార్థికాలు కావు. నివృత్తి ఒక్కటే పరమార్థం. సురావిషయంలో గంధగ్రహణమాత్రమే విధిగాని త్రాగమని ఎక్కడా లేదు. మాంస భక్షణార్థం ఆలంబన మాత్రమే తప్ప పశువులను హింసింపకూడదు. ఆలంబనమంటే దేవతోద్దేశంతో పశువులను చంపటం. హింస అంటే కేవల మాంసార్థం పరప్రాణి గొంతుకోయటం. మైథునం సంతానార్థమే కాని ఇంద్రియతృప్తికి కాదు. ఇవన్నీ స్వధర్మ లక్షణాలు. వీటిని లెక్కచేయక కేవల జిహ్వాప్రీత్యర్థం పశువులను చంపేవారు పరలోకగతు లైనప్పుడు వారిని వారిచేత చంపబడిన జంతువులు హింసించి తింటాయి.

రాజా! ఇట్టివారికి అర్థకామాలే ప్రధానం. ధర్మం డాంబికానికి మాత్రమే. వారికి తత్త్వం ఎన్నటికీ తెలిసిరాదు. శాంతి ఏ నాటికీ సమకూరదు. ఆత్మఘాతుకులై చివరికి ఘోరసంతమసాన్ని జొచ్చి అల్లాడుతుంటారు. భగవద్భక్తి ఉంటే ఇటువంటి దురవస్థ ఉండదు.

## యుగభేదాలను బట్టి భగవత్పూజావిధానం

అనంతరం నవకవులలో చివరివాడు కరభాజనుడు ప్రసంగించాడు.

నిమి:- మహాత్ములారా! మానవులకు భగవద్భక్తి ఒక్కటే ప్రధానమని అన్నారు. భక్తి అంటే భగవంతునికి సమర్పించుకొని భగవంతుని గుణకర్మకీర్తనలు కావించడమని చెప్పారు. అందుకు భగవద్రూపం, శ్రీభగవన్నామాలు తెలియాలి. కాలాన్ని కృత త్రేతా ద్వాపర కలియుగాలనే పేరిట నాలుగు యుగాలుగా విభజించారు. ఈ నాలుగు యుగాలలో భగవానుడు ఏకవర్ణరూపాలతో ఉంటాడా? కాలభేదాన్ని బట్టి వర్ణరూపాలు మారుతుంటాయా? ఈ విషయం చెప్పండి.

కర:- రాజా! భగవానుడు యుగభేదాలను బట్టి బహువర్ణ రూప నామభేదాలను ధరిస్తుంటాడు. కృతయుగంలో భగవానుడు శుక్లవర్ణుడు చతుర్భుజుడు అయి వల్కలాలు గట్టి జడలు దాల్చి కృష్ణాజినం ధరించి ఉపవీతుడై అక్షమాలా దండ కమండలాలను చేతబూని యోగీశ్వరుడై ఉంటాడు. ఆ యుగంలో ప్రజలు శాంతులు, నిర్వైరులు, సమదర్శనులుగా ఉంటారు. అప్పుడు శమదమానుష్ఠానం, తపస్సు భగవత్పూజ లవుతాయి. భగవానుని హంసుడు, సుపర్ణుడు, వైకుంఠుడు, ధర్ముడు, యోగీశ్వరుడు, అమలుడు, ఈశ్వరుడు, పురుషుడు, అవ్యక్తుడు, పరమాత్ముడు అనే పేర్లతో వ్యవహరిస్తారు.

త్రేతాయుగంలో భగవానుడు రక్తవర్ణుడు, చతుర్బాహువు అయి యజ్ఞదీక్షాంగభూతమైన త్రిగుణమేఖలం ధరించి హిరణ్యవర్ణకేశాలను కలిగి ఉంటాడు. ఆ యుగంలో మనుజులు ధర్మిష్ఠులు, బ్రహ్మవాదులు, వేదత్రయోక్తకర్మలను ఆచరిస్తూ త్రయీరూపంలో భగవంతుని ఆరాధిస్తారు. అప్పుడు భగవానునికి

విష్ణువు, యజ్ఞుడు, పృశ్నిగర్భుడు, సర్వదేవుడు, ఉరుక్రముడు, వృషాకపి, జయంతుడు, ఉరుకాయుడు అనే పేర్లుంటాయి.

ద్వాపరంలో భగవంతుడు శ్యామవర్ణుడై పీతాంబరం కట్టి చక్రాద్యాయుధాలను ధరించి శ్రీవత్స కౌస్తుభాది పరిశోభితుడు, ఛత్రచామరాది మహారాజ లక్షణ లక్షితుడు అయి తేజరిల్లుతాడు. అప్పుడు మర్త్యులు భగవత్తత్త్వ జిజ్ఞాసువులై వైదికాగమ మార్గాలలో భగవంతుని ఆరాధిస్తారు. ఆ యుగంలో భగవంతుడు వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, భగవంతుడు, నారాయణుడు, ఋషి, పురుషుడు, మహాత్ముడు, విశ్వేశ్వరుడు, విశ్వుడు, సర్వభూతాత్ముడు అనే పేర్లతో అలరారుతుంటాడు. ముముక్షువులు ఆ నామాలను ఉచ్చరించి నమస్కరించి భగవానుని వివిధ తంత్రవిధానాలతో పూజిస్తారు.

కలియుగంలో భగవన్నామసంకీర్తనకు ఎంతో ప్రాధాన్యం ఉన్నది. ఈ రహస్యం తెలిసిన గుణజ్ఞులు నామసంకీర్తనపరులై సర్వార్థాలను పొందగలరు. వైదికకర్మకలాపాదులు లేక నామకీర్తన మాత్రాన సర్వార్థసిద్ధి కలగటం ఎంతో లాభదాయకం కదా. కలియుగంలో భగవత్ప్రాప్తి అంత సులభమయినందువల్ల కృతాది యుగాలలోని జనులు కలియుగంలో జన్మించాలని ఎంతో ఉవ్విళ్ళూరుతుంటారు.

రాజా! కలియుగజాతులు సామాన్యంగా నారాయణపరు లన్నమాట అటుండగా ద్రవిడదేశంలో కావేరి తామ్రపర్ణీ కృతమాలా నదుల తీరప్రాంతాన జన్మించినవారు ఆ తీర్థజలాలను గ్రోలి శుద్ధచిత్తులై హరిభక్తు లవుతారు. రాజా! జీవితంలో భేదభావాన్ని నిరసించి త్రికరణశుద్ధిగా భగవంతుని శరణుజొచ్చినవారు దేవఋణం ఋషిఋణం పితౄణం భూతఋణం ఆప్త నరఋణం మొదలయిన ఋణాలను వేరుగా

తీర్చనవసరం లేదు. అంటే వారికి విహితకర్మలను చేయవలసిన అవసరం కూడా లేదన్నమాట. ఒకవేళ పొరపాటున వారెప్పుడయినా నిషిద్ధకర్మలను చేసినా అందుకు ప్రాయశ్చిత్తం చేయవలసిన అవసరం కూడా ఉండదు. ఏమంటావా? భేదభావం మాని భగవంతుని ఆశ్రయించినవారి హృదయంలో పరమేశ్వరుడు నివసించి ఆ భక్తుల మనోమాలిన్యా లన్నింటినీ భగవంతుడు పరిహరిస్తుంటాడు. అందువల్ల ఆ భక్తుల హృదయంలో ఎటువంటి భయానికీ నిలువనీడ ఉండదు. భగవంతుడు కోరినది మాత్రమే ఇస్తాడు కదా, కోరనిదానిని ఎంత శ్రేయోభిలాషి అయినా ఇవ్వడు కదా, అందువల్ల ఎంత భక్తుడయినా పాపక్షయార్థం తనను ప్రార్థింప నప్పుడు భగవంతుడు అతని పాపాలను పరిహరింపజేస్తాడా? అని శంకింపవచ్చు. అయితే వస్తుశక్తి అర్థితుల బుద్ధినిబట్టి వ్యవహరింపదు. భగవచ్ఛక్తి నైజగుణం చేతనే సర్వపాపక్షయకారి. ఆ శక్తిని ఆశ్రయించినప్పుడు నైజప్రకారం కోరినా కోరకపోయినా ఫలసిద్ధి కలుగుతుంది'.

వసుదేవా! జయంతి (ఋషభ) పుత్రులైన నవకవులు ఆ విధంగా భాగవత ధర్మాలను బోధింపగా మిథిలేశ్వరుడు విని వారందరినీ ఎంతగానో మెచ్చుకొన్నాడు. ఆర్షభులు అతని పూజలందుకొని అంతర్ధానం చెందారు. నిమిచక్రవర్తి వారు చెప్పిన ప్రకారం భాగవత ధర్మాలను ఆచరించి పరమపదవిని పొందాడు. నీవుకూడా భాగవత ధర్మాలను శ్రద్ధాభక్తులతో అనుష్ఠించాలి. క్రమక్రమంగా నిస్సంగత్వం, తత్ఫలంగా పరమపదం సిద్ధింపగలవు.

భగవానుడు మీకు పుత్రుడై జన్మించినందువలన మీరు ధన్యులయ్యారు. మీ కీర్తి లోకపావన మయింది. నిత్యశ్రద్ధతో మీరు భగవానుని దర్శించటం, కౌగిలించుకొనటం, సల్లాపించటం, ఆయనతో శయనాసన భోజనాదులు కావించటం, అతనియెడ పుత్రవాత్సల్యం నెరపటం – వీటివలన మీకు ఆత్మశుద్ధి కలిగింది. శిశుపాల పౌండ్ర సాళ్వాదులు శ్రీకృష్ణ గతి విలాసాలను వైరభావంతో స్మరించినందుకే ముక్తులయ్యారు. అనురాగచిత్తంతో కావించిన

మీ సంగతి వేరే చెప్పాలా?

వసుదేవా! భగవానుడు భూభారభూతులైన దైత్యాంశరాజులను రూపుమాపి సాధురక్షణ కావింపగోరి మీకు పుత్రుడై అవతరించాడు. ఆ మహనీయుడు నీకు పుత్రుడని సాధారణదృష్టితో చూడకు. అతని యశస్సు లోకమంగళకరం కానున్నది సుమా!'

పరీక్షిన్నరేంద్రా! నారదుడు ఆ విధంగా బోధించి దేవకీ వసుదేవులను వీడ్కొని వెళ్ళిపోయాడు. మహర్షి ప్రబోధం వలన వారికి ఆత్మమోహం తొలగిపోయింది. ఈ ఇతిహాసం ఎంతో పుణ్యవంతమైనది. ఇందులోని ప్రబోధాన్ని సమాహితబుద్ధితో అనుష్ఠించిన వారు నిర్మోహులై బ్రహ్మభావాన్ని పొందుతారు.

## ద్వారకకు బ్రహ్మాద్యాగమనం

పరీక్షిన్నరేంద్రా! శ్రీకృష్ణభగవానుడు లీలామానుషవిగ్రహం ధరించి చూపిన మహిమలు నరలోకమందే గాక సురలోకంలో కూడా కీర్తింపబడి అతని యశశ్చంద్రికలు ముల్లోకాలకు వ్యాపించాయి. ఆయనను సందర్శించాలనే కోరిక జనించి, సనకాది మహర్షులను సురలను ప్రజాపతులను వెంటబెట్టుకొని బ్రహ్మదేవుడు, భూతగణాలతో మహేశ్వరుడు వచ్చారు. వారివెంట మరుదాదిత్య వసు విశ్వదేవ నాసత్య ఋభు భృంగిరసులు సిద్ధ సాధ్య గంధర్వాప్సరోగణాలు గుహ్యక చారణ విద్యాధర ఋషి పితృ కిన్నరాదు లందరూ వచ్చారు. వచ్చి శ్రీకృష్ణపరమాత్మను కన్నులారా తిలకించి పరమానందభరితు లయ్యారు. మహేంద్రుడు నందనోద్యానమందలి సురభిపుష్పాలు కూర్చిన దివ్య మాలికలను సమర్పించి భక్తిపూర్వకంగా నమస్కరించి ఈ విధంగా ప్రార్థించాడు.

## ఇంద్రాదుల వేడికోలు

'దేవా! ఏ నీ పాదారవిందాలు చింతన మాత్రాన కర్మబంధాలను

తెంచివేస్తాయో, ఆ పాదారవిందాలకు మనోబుద్ధీంద్రియప్రాణములు నాల్గింట సవినయంగా నమస్కరిస్తున్నాము. నేనుకూడా దృష్టాదృష్టకర్మములు చేస్తుండగా అట్టి నా పాదారవిందమాత్రచింతన కర్మబంధాలను ఎలా సడలింప గలుగుతుందని అంటావేమో? ప్రభూ! నీ వొనరించే కర్మములు దుర్విభావ్యాలు. వాటిలో స్థూల సృష్టిస్థితిలయాలు మాత్రమే మాకు కొంతకు కొంత ఇంద్రియగోచరితంగా ఉన్నాయి. నీ చేతలకు, మా చేతలకు ఎంతో భేదమున్నది. నీవు గుణాతీతుడవై ఆ గుణములచేతనే కర్మలను చేయిస్తుంటావు. మేమో, గుణబద్ధులమై కర్మలను చేస్తున్నవాళ్ళము. గుణాతీతు డన్నంతనే నీవు రాగాదిరహితుడ వన్నమాట స్పష్టం. రాగాదులు లేనినాడు కర్మములు బద్ధగింపవు. నీ పాదసేవ వలన మాలో ఉన్న రాగాదిమలినాలు తొలగిపోతాయి. దానితో కర్మముల బంధనస్వభావం కూడా తొలగిపోతుంది. ఆ కారణాన నీ పాదారవిందచింతనం మాకు కర్మవిమోచకం అవుతున్నది. దేవా! రాగాదులు నశించి సత్త్వం శుద్ధిపొందాలంటే విద్యాశ్రుతాధ్యయన దానతపఃక్రియలుండగా వాటిని వదిలి నీ పాదచింతన చేయటం ఎందుకంటావా? నీ పాదచింతనం మూలాన కలిగినట్లు చిత్తశుద్ధి శీఘ్రంగా నిర్మలతరంగా మరి దేనిమూలాన కలుగనేరదు. కనుక నీ పాదారవిందచింతనమే మాకు కర్తవ్యం. నీకు రాగాదులు కలుగనందుకు కారణం లేకపోలేదు. రాగాదులన్నీ ఆనందానుభవార్థం కలిగేవి. నీవో ఆనందమూర్తివై అలరారుతున్నవాడవు కాబట్టి రాగాదుల వలన నీవు పొందగలిగినదేమీ లేదు. మేమో ఆనందార్థం ప్రాకులాడుతూ రాగాదులను ఉపకరణలుగా గ్రహించి ఊగులాడుతున్నాము.

దేవా! నీ పాదమూలం సర్వవిషయవాసనలకు ధూమకేతువే గాక సకలచింతితార్థాలను ప్రసాదిస్తుంది. ఆ కారణాన మునులు మోక్షార్థం ప్రేమార్ద్రమనస్సుతో నీ పాదాలను భజిస్తారు. భక్తులు నీతో సమానమైన ఐశ్వర్యాన్ని కోరి వాసుదేవాది వ్యూహాలను అర్చిస్తారు. ఆత్మవేత్తలు

వైకుంఠప్రాప్తిని కోరి త్రికాలాలలో నిన్ను ఆరాధిస్తారు. ప్రణతపాణులు వేదనిరుక్తవిధానంలో అధ్వరాగ్నియందు పురోడాశం వేల్చి భజిస్తారు. ముముక్షువులు అధ్యాతయోగాన పూజిస్తారు. పరమభాగవతులు సర్వవిధాల నిన్ను ధ్యానిస్తారు.

వాత్సల్యనిధీ! మునులు, సాత్వతులు మొదలయిన షడ్విధాల వారిలో పరమభాగవతులే నీకు అత్యంతప్రీతిపాత్రులు. అందుకు తార్కాణ మేమంటావా? నీ వక్షోభాగం తనకొక్కదానికే నివాసస్థానమని భావించి లక్ష్మీదేవి ఎల్లవేళల అక్కడ వసిస్తున్నది. అట్టి పరమపవిత్రస్థానమందు లక్ష్మిని సైతం లెక్కచేయక పరమభాగవతు లర్పించే వనమాలను అలంకరించుకొంటావు. ఇంతకంటె వేరే సాక్ష్యమెందుకు?

నీ చరణం భక్తపక్షపాతం కలిగినదని చెప్పటానికి సాక్ష్యమున్నదా? అని అడుగుతారు. బలిని నిగ్రహించి సత్యలోకం దాటి నిన్నాశ్రయించిన సురల భయాన్ని పోగొట్టి సాధువులకు స్వర్గం, అసాధువులకు నరకం తప్పవని చాటిచెప్పేందుకు ఎత్తిన పతాకవలె గంగానదికి మూలమై నీ పాదపద్మం వెలసి విలసిల్లుతున్నది. ఇంతకంటె వేరే సాక్ష్యమేమున్నది? దేవాసురులు పరస్పరం కలహిస్తూనే ఉంటారని, కలహమన్నాక జయాపజయాలు వారి వారి శక్తిసామర్థ్యాలను బట్టి కలుగుతుంటాయని, ఇందులో నేను చేసినదేమిటని అంటావా? జయాపజయాలు కాలాత్ముడవైన నీ వశంలో ఉన్నవి గాని స్వతంత్రమైనవి కావు. ప్రకృతి పురుషులకు పరుడవై పురుషోత్తముడవై జగదుత్పత్తి స్థితిలయాలకు హేతుభూతుడవు, ప్రకృతి పురుష మహత్తత్త్వాలకు నియామకుడవు అయిన కాలస్వరూపునికి నీకు ప్రణామం. దేవా! కొందరు వేదబోధితమైన నీ కీర్తితీర్థంలో ఇంద్రియస్నానం కావించి పునీతులవుతారు. కొందరు నీ పాదాన పుట్టిన గంగాతీర్థంలో శరీరాన్ని ముంచి పవిత్రు లవుతారు. కొందరు నీవు విధించిన స్వాశ్రమ ధర్మనిష్ఠా తీర్థాదులందు గ్రుంకులాడి పుణ్యభాగు లవుతారు. సర్వతీర్థభూతుడ

వైన నిన్నాశ్రయించినవారి సంగతి చెప్పేదేమున్నది? ప్రకృతిపురుషులకు కూడా నీవు పరుడవై ఉంటావు. బ్రహ్మాదులు సయితం నీకు వశులై ముక్కుత్రాడుతో కట్టిన ఎడ్లరీతిని వర్తిల్లుతారు. జగదుత్పత్తి స్థితిలయాలకు హేతుభూతుడవు, ప్రకృతి పురుష మహత్తత్త్వాలకు నియామకుడవు అయి సర్వక్షయాంతంలో కాలరూపుడవై నిలిచి ఉంటావు. నీ వలన పురుష–శక్తులకు సంయోగం కలిగి మహత్తత్త్వం పుట్టి హిరణ్మయాండకోశాన్ని కలుగజేసింది. అందు నీవు ఆత్మరూపుడవై బహిరంతరాలను ఆవరిస్తావు. అందువలన నిన్ను చరాచరాలకు ఈశ్వరుడవని అన్నారు. ఇంద్రియవృత్తులన్నీ నీ మాయాకార్యాలు. ఆ వృత్తుల రూపంలో విషయాలను సేవిస్తావు. అయినా ఆ విషయాల అవలేపన నీకు కలుగదు. షోడశసహస్ర సుందరీమణుల దరహాసచంద్రికలు గాని, క్రీగంటి చూపులు గాని, అనుభావగంభీర భ్రూవిలాసాలు గాని, బహుళ రతి తంత్ర చాతుర్యాలు గాని, లోకమోహన కామకళలు గాని నీకు కించిన్మాత్రమయినా మనోవికారం కలిగింపలేవు. నీ కథాసుధాప్రవాహాలు లోకపావనకరములై విరాజిల్లుతున్నాయి. నీ కీర్తితీర్థం వేదబోధితమై శ్రవణేంద్రియాలను, నీ పాదాల నుంచి ఉద్భవించిన గంగాతీర్థం శరీరాన్ని పవిత్రీకరిస్తున్నందువల్ల స్వాశ్రమధర్మపరులు నిన్ను సేవించి కృతార్థు లవుతున్నారు. దేవా! ఇదే నీకు ప్రణామం’ అని దేవతలందరూ నమస్కరించారు.

## శ్రీకృష్ణ శతానందుల సమావేశం

అంతలో ఒకనాడు బ్రహ్మదేవుడు సురమునివర పురస్సరంగా ద్వారకకు వచ్చి, కృష్ణుని సందర్శించి వినయోక్తులతో అతనిని ప్రస్తుతించి, ‘లోకేశ్వరా! మా ప్రార్థనను అంగీకరించి లీలామనుష్యవిగ్రహుడవై అవతరించి భూభారాన్ని తగ్గించావు. నీవు అవతరించి నేటికి నూటఇరవైయేడు సంవత్సరాలు గతించాయి. నీ దర్శనభాగ్యం కోసమై వైకుంఠం ఉవ్విళ్ళూరుతున్నది. మరి యదుకులం శాపవినష్టమయ్యే సమయమూ సమీపించింది. ఇక నీవు వైకుంఠధామానికి విచ్చేయవలసినది’ అని

ప్రార్థించాడు. శ్రీకృష్ణు డతని పలుకులను విని, 'పితామహా! నేనూ దీనిని గురించే ఆలోచిస్తున్నాను. లోకసంగ్రహార్థం సురలు తమ అంశలతో యాదవకులానికి వచ్చి జన్మించారు. వారు స్వస్థానాలకు తిరిగివెళ్ళడానికి ఋష్యాదుల శాపాలు ఉపకరించాయి. ఆ శాపాలను నివారింపగలిగినా, అవి యాదవులు స్వస్థానగతులు కావడానికి తోడ్పడుతున్నాయని నేను ఊరుకొన్నాను. వారందరినీ వారి తావులకు చేర్చిన తర్వాత నీ కోరిక నెరవేరుస్తాను' అని చెప్పి బ్రహ్మాదులను పంపించాడు.

## యాదవముఖ్యుల ప్రయాణం

పితామహాదులు వెళ్ళిన తర్వాత కృష్ణుడు యాదవముఖ్యులను పిలిచి, 'మహోత్పాతాలను చూశారు కదా. ఇంకా ఇక్కడుండటం మంచిది కాదు. ప్రభాస క్షేత్రానికి వెళ్ళి అక్కడ తీర్థస్నానం చేసి దేవపితృతర్పణలు కావించి ఉత్తమదానాలిచ్చి బ్రాహ్మణ సంతర్పణలు జరిపి పాపాల నుంచి బయటపడితే మంచిది' అన్నాడు. అందరూ సరే అంటే సరే అని ప్రయాణసన్నాహం మొదలుపెట్టారు.

## ఉద్ధవుడు

శ్రీకృష్ణుడు పరమేష్ఠితో చెప్పిన సంగతి ఉద్ధవుడు విని ఏకాంతంగా శ్రీకృష్ణుని కలుసుకొని ప్రణామం చేసి, 'దేవా! ఈ లోకాన్ని త్యజింపనున్నావని వార్త వినవస్తున్నది. నీ పాదపద్మాలను వదిలి క్షణమయినా నిలువలేని ఈ భాగ్యహీనుని ఏమిచేయదలిచావు? ఈ దీనుని కూడా నీ వెంటబెట్టుకొని వెళ్ళు' అని ప్రార్థించాడు.

కృష్ణుడు అతనియెడ కనికరించి, 'ఉద్ధవా! నీవన్నది నిజం. నేను వచ్చిన పని పూర్తయింది. ఇక నేనిక్కడ చేయవలసినది లేదు. యాదవకులం శాపగ్రస్తమైన సంగతి నీకు తెలిసిందే. ఆ శాపఫలంగా వారు పరస్పరం కలహించి కొట్లాడి నశింపబోతున్నారు. నేటికి ఏడవరోజున సముద్రం పొంగి

ద్వారకను ముంచివేస్తుంది. నేను వెళ్ళిన క్షణాన కలి యీ లోకంలోనికి అడుగుపెడుతుంది. కలి ప్రేరణ వల్ల అధర్మం వర్ధిల్లుతుంది. కనుక నీవు కూడా ఈ చోటు విడిచిపెట్టాలి.

ఉద్ధవా! స్వజనబంధుస్నేహాన్ని త్యజించి సమస్తం విడనాడి నీ మనస్సును నాయందు నిలిపి సమదర్శనుడవై భూసంచారం కావించు' అని చెప్పాడు.

ఉద్ధవుడు:- స్వామీ! లోకమంతా గుణదోషాలతో నిండి ఉన్నది. ఒకప్రక్క గుణదోషాలను చూస్తూ, సమబుద్ధితో ఉండటం వీలవుతుందా?

కృష్ణుడు:- ఉద్ధవా! మనోవిక్షేపం వలన నానాత్వం కనబడుతున్నది. ఏదేది మనస్సు చేత స్మరింపబడుతున్నదో, ఏదేది కంటికి కనబడుతున్నదో, ఏదేది చెవికి వినవస్తున్నదో, ఇంతెందుకు? ఏదేది ఇంద్రియగోచరమో, ఆ సమస్తం నశించేదే కాని స్థిరంగా ఉండేది కాదు. ఐనా అవి సత్యముల వలె - అంటే నాశనం లేనివాని వలె కనబడుతుంటాయి. అందుకు ఆ వస్తువులన్నీ మనస్సు చేత కల్పింపబడి మనస్సుచేతనే గ్రహింపబడటమే కారణం. ఉద్ధవా! దృశ్యమని చెప్పబడుతున్న సమస్తం మనోమయమై ఉన్నదే. మనస్సు ఉన్నంతకాలం మనఃకల్పనలు కూడా ఉంటాయి. మనస్సు నశిస్తే దానితో మనస్సు కల్పించినవి కూడా నశిస్తాయి. దీనినే మాయ అంటారు.

ఉద్ధవా! ఈ మాయవలన నానాత్వం అవభాసిస్తున్నది. నానాత్వమంటే అది వేరు - ఇది వేరు అనిపించే భావం. ఆ భావాన్ని అంటిపెట్టుకొని మంచిచెడ్డలనే గుణదోషబుద్ధి, ఇది కర్తవ్యం ఇది అకర్తవ్యమనే హితాహిత వివేకం, పుణ్యపాపాల విచికిత్స కలుగుతుంటాయి.

ఈ ఆలోచనలన్నీ అజ్ఞానజనితభ్రమలు మాత్రమే. ఈ భ్రమలో ఉన్నంతకాలం శాంతి కలుగదు. శాంతి కలగాలంటే ఈ భ్రమనుంచి బైటపడాలి. ఎలాగంటే, ఇంద్రియాలన్నీ మనోవశాలై వర్తిస్తుంటాయి కదా, నీ

మనస్సును మొట్టమొదట బంధించి ఇంద్రియ పరాఙ్ముఖం చేసి దానిని నీ ఆత్మపరం కావించు. శాసించేవాడు లేనందువల్ల ఇంద్రియాలకు పరప్రేరిత వ్యాపారం అణగారిపోతుంది. దానితో మనస్సు విముఖీభావాన్ని చెంది బాహ్యప్రపంచమే నీకు తెలియరాకుంటుంది. అది నీకు శూన్యప్రాయమవుతుంది. అప్పుడు సృష్టి సమస్తం మనఃకల్పితమని నీకే తెలిసివస్తుంది. దీనినే సత్యస్ఫురణమని అంటారు. దానితో సర్వము ఆత్మేనని, ఆత్మభిన్నమైనది వేరొకటి లేదని నీకే అనుభవసిద్ధమవుతుంది. అట్టి జ్ఞానం ఎప్పుడు స్థిరపడుతుందో అప్పుడు ఆత్మభూతుడవు కాగలుగుతావు.

ఆత్మభూతుడైనవానికి 'నేను, నీవు' అన్న భేదభావం ఉండదు. ఎప్పుడయితే భేదభావన లేదో అప్పుడు సర్వం ఒక్కటే అవుతుంది. అట్టి స్థితిలో 'ఇతను హితుడు, ఇతను శత్రువు' అన్న వ్యవస్థే ఉండదు కాబట్టి ఒకరినతను నొప్పించటం గాని, ఒకరివలన అతను నొప్పింపబడటం గాని రెండూ ఉండవు.

ఇవన్నీ విజ్ఞానియొక్క లక్షణాలు. ఈ స్థితికి వచ్చినంతదాకా విహిత ధర్మాలను చేస్తూనే ఉండాలని, ధర్మాచరణ మూలంగానే క్రమక్రమంగా ఇటువంటి స్థితి కలుగుతుందని గ్రహించాలి.

ఇట్టి స్థితికి వచ్చినవారు గుణదోషాలకు అతీతంగా ఉంటారు. వారి చర్యలన్నీ అర్భకుని చర్యల వలె సంకల్పరహితాలై లీలామాత్రాలుగా ఉంటాయి. సామాన్యుల వ్యవహారాలన్నీ సంకల్ప ఫలాభిసంధులతో కూడుకొని ఉంటాయి. స్థితప్రజ్ఞుని వ్యవహారాలు సంకల్ప ఫలాభిసంధిరహితాలుగా ఉంటాయి.

మనుష్యుల ప్రవర్తన వారివారి ప్రారబ్ధవాసనల ప్రేరణను అనుసరించి ఉంటుంది. ఈ వాసనలనే సంస్కారములని అంటారు. సంస్కారములు శుభాశుభాలతో కూడుకొని ఉంటాయి. ఇవి సంకల్ప వికల్ప రూపాలలో ఉదయించి కోరికలుగా పరిణమించి వ్యవహారరూపంలో పర్యవసించేవిగా ఉంటాయి. ఈ

సంస్కారసముదాయాన్నే మనస్సు అంటారు.

మనస్సు వాసనాత్మకము కాబట్టి, వాసనలు నశించితే మనస్సు నశించినట్లే అవుతుంది. వాసనలు నశించటం ఎలాగంటావేమో, చూడు: ప్రతికూలవాసనల వృద్ధివలన మొదటి వాసనలు సన్నగిలి దగ్ధపటన్యాయంగా ఉంటాయి. ఆ ప్రకారం మొదటి వాసనలు నశించిన తర్వాత తద్వినాశనార్థం పెంచిన ప్రతికూలవాసనలను కూడా త్యజించివేయాలి.

ఉద్ధవుడా మాటలు సాంతం విని, 'స్వామీ! నీవు ఉపదేశించినది సర్వసంకల్పపరిత్యాగరూపమైన సన్న్యాసం. విషయవాసనలకు వశమై కోరికలతో నిండి మనసులో భక్తి ఉన్నా సంసారబంధాలను కాదనలేక నిస్సహాయులై ఉన్నవారికి నీవు బోధించిన మార్గాన్ని అవలంబించటం సులభసాధ్యం కాదనుకొంటాను. ఎవరి మాటో యెందుకు? నేనూ అటువంటివాడినే. ఎంత కాదనుకొన్నా దేహాభిమానం అంటిపెట్టుకొనే ఉన్నది. దానివల్ల భేదబుద్ధి కలిగింది. అది వద్దంటే పోయేది కాదు. నావంటి మూఢులకు నీ ఉపదేశం తలకెక్కుతుందా? నీవు చెప్పిన దారిలోనికి ప్రవేశించి, దూరాలు గమించి గమ్యం చేరుకోవటమంటే అందని పళ్ళకోసం అర్రులు చాచినట్లవుతుంది. నావంటి అల్పమతులకు సాధ్యమైన దారిని చూపు. సర్వజ్ఞుడవు కనుక ఎవరికేదిమేలో నిశ్చయింపగలవాడవు నీవు కాక వేరెవరున్నారు? బ్రహ్మాదులు లేరా? అంటే, వారుకూడా నీ వలె సర్వజ్ఞులు కారు. అందువలన శిష్యతత్త్వం తెలిసి బోధించే శక్తి వారికుండదు. పైగా బ్రహ్మాదులు సహితం మా వలెనే నీ మాయకు చిక్కి దృశ్యమే సత్యమని విశ్వసించినవారు. తమను తాము ఉద్ధరించుకోలేనివారు మమ్మల్ని ఉద్ధరింపగలరా? స్వామీ! అనవద్యుడవు అనంతుడవు సర్వజ్ఞుడవు బ్రహ్మాదులందరికీ మూలభూతుడవు అయిన నారాయణుని సర్వేశ్వరుని నిన్ను పాపసంతప్తుడైన ఈ ఉద్ధవుడు గత్యంతరం కానక వచ్చి శరణుజొచ్చాడు.

ఇంతకుమించి నాకు శరణులేదు. స్వామీ! దయచూడు' అని వేడుకొన్నాడు.

కృష్ణుడు చిరునవ్వు దాల్చి, 'ఉద్ధవా! ఇది వెర్రిగాక మరేమిటి? ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి గాని ఒకరిని మరొకరు వచ్చి ఉద్ధరించడం ఎప్పుడూ లేదు. దారిచూపవచ్చు నంటావా? అందుకు లోకం ఉండనే ఉన్నది. అంతకు మించిన గురువే లేడు. లోకంలోని చరాచరాల తత్త్వాన్ని పరిశీలించి యుక్తాయుక్తాలను నిశ్చయించి యుక్తాలను అనుసరించి అయుక్తాలను పరిహరించి క్రమక్రమంగా సిద్ధిపొందాలి.

ఉద్ధవా! అందుకు లోకస్వభావమేమిటో బాగా అర్థంచేసుకోవాలి. విషయం మనస్సుకు బోధపడితే దానియందు నమ్మకం కలుగుతుంది. అంతదాకా దానిని గ్రహింపలేరు. విషయబోధ ఎలా కలుగుతుంది? అంటే, ప్రత్యక్షంగా చూస్తుండటం వల్ల ఆ చూసినది మనసు కెక్కుతుంది. కొన్నింటిని అనుమాన ప్రమాణం వలన గ్రహింపవచ్చు. అనుమాన ప్రమాణమంటే ఏమిటో తెలుసుకదా. దూరంగా పొగ ఉన్నట్లు కనబడుతుంది. నిప్పులేనప్పుడు పొగ జనింపదు కాబట్టి పొగను చూసి అక్కడ నిప్పు ఉన్నదనటం అనుమాన ప్రమాణం. ఈ రెండిటినీ ఎవరికి వారే చేయాలి. వేరొకరు చూసినది, ఊహించినది ఆత్మనిశ్చయానికి తోడ్పడదు. ఈ రెండూ మనఃకార్యాలు కనుక ఎవరికి వారే గ్రహించుకొని తమను తాము ఉద్ధరించుకోవాలని చెప్పాను. గురువు సంగతేమిటంటే, అతను ఇది – అది అని బోధింపగలడే కాని అంతకు మించి సహాయం చెయ్యలేడు. ఎంత చక్కగా బోధించినా స్వానుభవంలో తెలుసుకొన్నదానికి సాటిరాదు కదా.'

ఉద్ధవుడు:– స్వామీ! మనస్సు జడమని అంటారు. జడానికి గ్రహణ బోధశక్తులు ఎలా కలుగుతాయి?

కృష్ణుడు:– ఉద్ధవా! ప్రారబ్ధకర్మవాసనల సముచ్చయమే మనస్సని ఇంతకుముందే వివరించాను. మనస్సు జడ మన్నమాట నిజం. అది జడమే అయినా శుద్ధమైనదయితే, శుద్ధదర్పణంలో,

సూర్యరశ్మి వలన వస్తువు ప్రతిబింబించినట్లు దానిలో ఆత్మసాన్నిధ్యం వలన సత్యము స్వయంగానే స్ఫురిస్తుంది. కనుకనే మనశ్శుద్ధి కలవారికి మాత్రమే సత్యము గోచరిస్తున్నది.

ఉద్ధవుడు:- స్వామీ! లోకాన్ని మించిన గురువు లేడన్నావు. లోకమంటే ఏమిటి?

కృష్ణుడు:- ఉద్ధవా! చరాచరాత్మకమైన సమస్తసృష్టిని లోకమంటారు. సృష్టి అంతటా పరమాత్మనైన నేను తేనెలో ఉన్న తీపి వలె అవినాభావంగా వ్యాపించి ఉంటాను. సృష్టి ఎలా ఏర్పడుతున్నదంటావా? పంచభూతాల కలయిక వలన ఏర్పడుతున్నది. పంచభూతాలు ఎక్కడివంటావా? నేనే పంచభూతాత్మికుడను.

ఉద్ధవుడు:- పరమాత్మను ఏకము, అద్వితీయము అంటారు. ఏకము నుండి వచ్చిన సృష్టియందు నానాత్వం ఎలా కలిగింది.

కృష్ణుడు:- జీవుల ప్రారబ్ధకర్మము నానాత్వంగా ఉంటుంది. నానాత్వమైన ఆ కర్మముల ఫలాన్ని అనుభవించటానికి నానావిధాలైన ఉపాధులు కలుగుతున్నాయి. నానావిధ కర్మఫలానుభవానికి ఏకరూపమైన ఉపాధి తగదు. ఉపాధుల వివిధత్వం వలన సృష్టియందు నానాత్వం కలుగుతున్నది. ఉపాధులు పంచభూతసమ్మేళన వలన కలుగుతున్నాయి. ఉపాధి తారతమ్యాన్ని బట్టి పంచభూతసమ్మేళన జరుగుతుంటుంది.

అన్ని ఉపాధులలో మనుష్యుని ఉపాధి ఉత్తమోత్తమం. ఏమంటే మనుష్యోపాధియందు మాత్రమే ఆత్మదీప్తి సులభంగా ప్రకాశిస్తుంది. ప్రారబ్ధకర్మఫలంగా ఆ ఉపాధి అటువంటి దవుతున్నది. కుండ మొదలు దర్పణం వరకు మట్టితోనే చేస్తారు.

అయితే దర్పణంలో ప్రతిఫలించినట్లు కుండపెంకులో బింబం ప్రతిఫలింపదు. ఎందుకని? దర్పణనిర్మాణానికైన కర్మఫలం ప్రతిఫలనయోగ్యమై ఉండటమే అందుకు కారణం. మనష్యోపాధిలో ఆత్మదీప్తి ఆ విధంగా ప్రతిఫలిస్తుండటం వల్ల మనుష్యులు తక్కిన జంతువుల వలె క్షుత్పిపాసలతోనే తృప్తిచెందక, యుక్తాయుక్తవివేకం ఆత్మకళ్యాణజ్ఞానం, ఆ జ్ఞానమార్గాన్వేషణం సిద్ధించి మోక్షాన్ని సాధింప గలుగుతున్నారు.

ఉద్ధవా! ఉపాధులు ఏకపాదులు ద్విపాదులు త్రిపాదులు చతుష్పాదులు బహుపాదులు అని నానావిధాలుగా ఉంటాయి. వాటిలో మనుష్యని ఉపాధి నాకు ప్రీతిపాత్రం సుమా.

ఉద్ధవుడు:- స్వామీ! పరమాత్మవైన నీవు చరాచరసృష్టి అంతటా వ్యాపించి ఉంటానన్నావు. నీ రూపాన్ని ఎలా తెలుసుకోవాలి?

కృష్ణుడు:- ఉద్ధవా! నా రూపం స్థూలదృష్టికి అందదు. దానిని జ్ఞాననేత్రం చేత చూడవచ్చును. ఏమంటావా? స్థూలదృష్టికి నేత్రం సాధనమవుతుంది. దానికి నన్ను చూడగలిగినంత శక్తిలేదు. అందుకు దానికంటె శక్తిమంతమైన సాధనం కావాలి. అంతటి శక్తి బుద్ధీంద్రియానికి ఉన్నది. దానిని సాధనంగా గ్రహించి నన్ను చూడవచ్చు. బుద్ధీంద్రియం జడమని, దానికి గ్రహణశక్తి ఉండదని శంకింపకు. సాధనములన్నీ జడాలే. వాటికి స్వతంత్ర శక్తి లేదు. అయితే సాధకునికి వాటి సాహాయ్యంతోనే కార్యసిద్ధి కలుగుతున్నది. అదే న్యాయం ఇక్కడా వర్తిస్తుంది. సాధకుడు ఎవరంటావా? నీలో ఉన్న జీవుడే సాధకుడు. అతను మూలంలో ఉండి బుద్ధీంద్రియ సాధనమూలకంగా ఆత్మస్థితిని గ్రహిస్తుంటాడు. సాధనం ఎంత పరిశుద్ధంగా ఉంటే వస్తుస్థితి అంత విస్పష్టంగా ఉంటుంది.

## అవధూత యదు సంవాదం

ఉద్ధవా! లోకం ఎందుకు ఉత్తమోత్తమగురువని అన్నానో బోధించే ఇతిహాసం ఒకటున్నది. దానిని 'అవధూత యదు సంవాద' మంటారు. అది చెబుతాను విను. నా పూర్వులైన యదువంశ రాజులలో నహుషుడనే రాజు మహాపరాక్రమశాలి ఉండేవాడు. ఆ నహుషునికి యయాతి, యయాతికి యదువు జనించారు. యదువు రాజయి పరిపాలిస్తున్న కాలంలో ఒక అవధూత అక్కడికి వచ్చాడు. అతని స్థితిగతులు విని యదురాజు పరమాశ్చర్యభరితుడై, అతనిని సందర్శించి,

'మహాత్మా! నీ వర్తన నాకెంతో వింతగా ఉన్నది. మానవులు సాధారణంగా ధర్మార్థకామాలను కోరి, వాటి సాధనకు యత్నిస్తుంటారు. కొందరు దీర్ఘాయువును కోరి, కొందరు ఐశ్వర్యాన్ని కోరి, కొందరు కీర్తిని కోరి, ఒకానొకరు జ్ఞానాన్ని కోరి పరిశ్రమించటం ఉన్నది. ఎవరెన్ని విధాల పరిశ్రమించినా వారి అంతరాంతరాలలో ఏదో ఒక కోరిక కదలాడుతూనే ఉంటుంది. ఆ కోరికకు అనుసారంగా వారి బాహ్యావ్యవహారం ఉంటుంది. వారు నిమిషమయినా రిత్తపుచ్చక నిరంతరం ఏదో ఒకటి తలపెట్టడమో అందుకు గాను కృషిచేయడమో జరుగుతుంటుంది.

నీ సంగతి విపరీతంగా ఉన్నది. నీవు పసివానివలె సంచరించడమే తప్ప ఏదో ఒక కోరికను పెట్టుకొని దానికోసం ప్రయత్నిస్తున్న లక్షణం నీయందున్నట్లు లేదు. వెర్రివాడ వందామంటే అట్టి చిహ్నమే నీయందు కనబడదు. బలహీనుడవా అంటే నీవు మహాబలశాలివని నీ దేహమే చెబుతున్నది. ప్రజ్ఞ లేదా అంటే నీ ముఖకళ జ్ఞానవిభవాన్ని ప్రకటిస్తున్నది. జడుడవో ఉన్మత్తుడవో పిశాచగ్రస్తుడవో అనడానికి అటువంటి లక్షణాలేవీ నీయందు కానరావు. లోకాలన్నింటినీ దహించే కామలోభదవాగ్ని నీ చెంతకైనా వచ్చినట్లు తోపదు. గంగాజలాలలో మునిగి తత్సుఖాన్ని అనుభవిస్తూ హాయిగా ఉండే గజరాజు వలె నీవు నిరంతర సంతోషమగ్నుడవని నీ ముఖలక్షణాలు చాటిచెబుతున్నాయి. నీ యీ

మహానందానికి కారణమేమిటో, దానిని ఏ విధంగా సంపాదించావో, విషయస్పర్శ నుంచి ఎలా తప్పించుకోగలిగావో అనూహ్యం. ఈ రహస్యాన్ని చెప్పగలవని అడుగుతున్నాను' అని అడిగాడు. ఆనాడు వారికి ఈ తీరున సంవాదం జరిగింది.

అవధూత:– రాజా! జీవితాన్ని ఎలా గడుపవచ్చునో తెలిసివచ్చేసరికి ఎంతో శ్రమయింది. చిట్టచివరికి లోకమే ఉత్తమగురువని గ్రహించి, దానినే శుశ్రూషించాను. నా శుశ్రూషాఫలంగా ఇట్టి స్థితి నాకు లభించింది. నా గురువులెవరో, ఎవరి వలన ఏమి నేర్చుకొన్నానో చెబుతాను విను.

## 1. భూమి – క్షమాపరార్థజీవికలు

మొట్టమొదట భూతత్త్వాన్ని పరిశీలించాను. భూమిని పలుతీరుల త్రవ్వి బాధపెడుతుంటారు. ఆ బాధలన్నింటినీ భూమి ఓర్చుకొంటున్నది. అంతేకాదు. తనను బాధించిన వారికి ప్రతిక్రియ చేయాలని ఎన్నడూ అనుకోదు. పైగా తన హృదయంలోనే నానావృక్షసస్యాదులను పెంచి తన అపకారులకే అది ఉపకరిస్తున్నది. ఈ భూమి పర్వతరూపాన, వృక్షరూపాన ఉన్నది. అందులో వృక్షాలను గొడ్డలితో నిట్టనిలువున నరుకుతారు. జనులు తమకెంత హాని కలిగించినా వృక్షాలు కిమ్మనకుండా మళ్ళీ కొమ్మలను పెంచి ఎండా వానల తీవ్రతను తామే భరిస్తూ తమను ఆశ్రయించిన వారికి చల్లని నీడలను, దివ్యఫలాలను ప్రసాదిస్తున్నాయి. ప్రతిఫలాన్ని అణుమాత్రం కూడా అడగటం లేదు. పర్వతాలు వృక్షగుల్మలతాతృణాలను పెంచుతూ నదీనదాలను ప్రవహింపజేస్తూ సమస్తం లోకానికి అందజేస్తున్నాయి. ఇదంతా పరిశీలన చేసి బుద్ధిమంతుడు సర్వసహనశీలి, పరార్థజీవి కావాలని నేను నేర్చుకొన్నాను.

## 2. వాయువు: జీవిత నిర్వాహకత్వం – ఆత్మ నిస్సంగత్వం

వాయువు ప్రాణవాయువని, బాహ్యావాయువని రెండు విధాలు. అందులో ప్రాణవాయువు ఆహారాది మాత్రంగా ఉండేది. లోకమంతా నిండి ఉన్నా జీవనార్థం ఎంత అవసరమో అంతే దానిని గ్రహిస్తుంటారు. అలాగే బుద్ధిమంతుడు ప్రాణరక్షణకు ఎంత అవసరమో అంతటితో సరిపుచ్చుకొని తృప్తిపడాలని, జిహ్వా చాపల్యంతో కనబడినదల్లా తినకూడదని, తిన్నా ఫలితం ఉండదని గ్రహించాను. ఆ వాయువు శీతోష్ణాది నానావిషయధర్మాలతో కలిసి వీస్తున్నా వాయువుకు వాటితో కూడిక కలుగదు. అది చూసి నిస్సంగత్వ విధానం అలవరచుకొన్నాను.

గాలి అన్నిచోట్ల వీస్తున్నా దానికి సువాసనలు గాని దుర్వాసనలు గాని ఉండటం లేదు. ఆ విధంగా ఆత్మ సర్వాంతర్యామియై వివిధ పార్థివదేహాలతో సంసర్గాన్ని పొందుతున్నా ఆ దేహ శుద్ధాశుద్ధతలు ఆత్మకు సోకవని వాయువు వలన గ్రహించాను.

## 3. ఆకాశం – ఆత్మాపరిచ్ఛేద్యత

ఆకాశం లేని చోటే లేదు. అది ఘటపటాదులు రెండింటిలోనూ ఏకవిధంగా ఉన్నది. అలా వేర్వేరులైన ఉపాధులలో ఉన్నా దాని ఏకత్వానికి భంగం కలగదు. అలాగే ఆత్మ భిన్నభిన్నోపాధిగతమైనప్పటికీ అది అపరిచ్ఛేద్యము, ఏకము అని ఆకాశం వలన గ్రహించాను.

## 4. జలము – సహజస్నిగ్ధ నిర్మలస్వభావం

నీరు స్వాభావికంగానే స్వచ్ఛము, స్నిగ్ధము, మధురము అయి తనను సేవించినవారందరినీ పునీతులను కావిస్తున్నది. అలాగే మర్త్యుడు సహజస్నిగ్ధ నిర్మల స్వభావం కలిగి అందరికీ ప్రీతిపాత్రుడై నిజసందర్శన సంభాషణ సంస్పర్శాదుల చేత అన్యులను పవిత్రీకరింప జేస్తుండాలని జలాల వలన నేర్చుకొన్నాను.

## 5. అగ్ని – నిసర్గప్రకాశాదులు

అగ్ని నిసర్గప్రకాశవంతమై చెనకరాక ఒకప్పుడు, నివురుగప్పి ఒకప్పుడు ప్రజ్వరిల్లుతూ ఆశ్రయించినవారికి సుఖాన్ని అందిస్తూ, ఎవరేది వేల్చినా అందుకొంటూ హోతల పూర్వాపరపాపాలను హరిస్తున్నది. అలాగే మర్త్యుడు తపస్తేజోవంతుడై దుర్ధర్షుడై తన మహిమను ప్రకటించుకొనక ఎవరేది ఇచ్చినా అంగీకరిస్తూ, తనను చేరినవారికి మేలుకూర్చుతూ, సేవించినవారి పాపాలను హరిస్తూ, వారికి ఉత్తమగతిని చూపుతుండాలని అగ్ని వలన గ్రహించాను.

అగ్ని తనలో వేసిన పుడకలను బట్టి వృద్ధిక్షయాలను పొందుతున్నా వహ్ని మాత్రం ఎప్పటివలె ఏకరాశిగా ఉంటుంది. మంట అగ్ని కాదు; పుడకల కాంతి మంట అవుతుంది. పుడకలు కొంతసేపటికి బూడిదవుతాయి. అలాగే భూతాదులకు కాలవశాన జననమరణాలు కలుగుతుంటాయని, అవి ఉపాధిసంబంధులేగాని దాని అంతర్వర్తి అయిన ఆత్మకు సంబంధించినవి కావని, ఆత్మకు చావుపుట్టుకలు లేవని, ఉపాధులకు జననమరణాలు సహజమని, జననమరణవశమైన ఉపాధి ఎన్నడూ శాశ్వతం కాదని, అగ్ని వలన గ్రహించాను.

అగ్నికి రూపమే లేదు. ఏయే పదార్థాన్ని దహించితే అది ఆయా పదార్థాకారాన్ని ధరిస్తున్నది. కాగా అగ్ని ఇతరుల కోరిక వల్లనే హవిస్సును గ్రహిస్తున్నది గాని తానయి కోరి గ్రహించటం లేదు. అలాగే మునివృత్తిని అవలంబించినవారు పరేచ్ఛాప్రేరితులై అన్నాదులను గైకొనాలే గాని తాము స్వయంగా తత్కాంక్షతో ఉండకూడదు.

## 6. చంద్రుడు – ఆత్మ నిర్వికారత్వం

కాలగతిని బట్టి చంద్రునియందు వృద్ధిక్షయరూపము లైన వికారాలు కలుగుతున్నట్లుగా మనకు అనిపిస్తుంది. విచారించి చూస్తే ఈ వృద్ధిక్షయాలు చంద్రకళలకే గాని చంద్రమండలానికి కాదని తెలుస్తుంది. ఆ విధంగానే

కాలవశాన షడ్భావవికారాలు పుట్టటం, పెరగడం, తరగడం, నశించడం వంటివి ఉపాధులకు కలుగుతున్నవే గాని ఉపాధిగతమైన ఆత్మకు కాదని చంద్రుని వలన గ్రహించాను.

## 7. సూర్యుడు – ఆత్మ ఏకము, శుద్ధము

సూర్యుడొక్కడే ఏకరాశిగా ప్రకాశిస్తున్నా అతని బింబం జలాశయాలలో ప్రతిబింబించినప్పుడు ఒక్కొక్కదానిలో ఒక్కొక్క సూర్యబింబం కనబడుతుంది. మరి జలతత్త్వాన్ని బట్టి ఆ ప్రతిబింబం స్వచ్ఛమైనది గానో మార్పుచెందినది గానో ఉంటుంది. దీనినిబట్టి ఆత్మ ఏకము, అద్వితీయము, స్వచ్ఛము అయినప్పటికీ ఉపాధులను బట్టి, వాటి గుణాలను బట్టి భిన్నములు గాను శుద్ధాశుద్ధమిశ్రమం గాను గోచరిస్తున్నదని గ్రహించాను.

## 8. పావురాలు – మమకారమే పతనద్వారం

ఒక అడవిలో ఒక చెట్టు మీద పావురాల జంట గూడుకట్టుకొని పరస్పరం ప్రేమానుబంధబంధితాలై ఒండొంటి తోడిదే లోకమన్నట్లు ఆహారవిహార శయనాసన సమయాలలో ఎన్నడు ఎడబాటు లేక కలిసిమెలిసి కాపురం చేస్తుండేవి. పెంటిపక్షి ఏది కావాలన్నా మగపక్షి తన ప్రాణాలైనా కుదువబెట్టి తెచ్చియిచ్చి దానిని సంతోషింప జేసేది. ఆడపక్షి కొన్నాళ్ళకు గుడ్లుపెట్టి పొదిగి పిల్లలను చేసింది. పెద్ద పక్షులు పిల్లల ముద్దుకూతలకు ఆనందిస్తూ వాటిని అల్లారుముద్దుగా పెంచసాగాయి.

ఒకనాడు పెద్ద పక్షులు పిల్లల ఆహారార్థం జంటగా వనాంతరానికి వెళ్ళిన సమయంలో ఒక బోయవాడు ఆ చెట్టు దగ్గరకు వచ్చి గూటిలో ఆడుకొంటున్న పిల్లలను చూసి వలపన్ని వాటిని పట్టుకొన్నాడు. అంతలో పెద్ద పక్షులు ఆహారం సేకరించుకొని గూటికి తిరిగివచ్చాయి. ఆడపక్షి ముందుగా గూటిలో దూరి పిల్లలు కనబడక చెట్టుక్రిందనున్న బోయను, అతని వలలో

చిక్కుకొని ఉన్న తన పిల్లలను చూసి గోడుగోడుమని ఏడుస్తూ వ్యసనవివశురాలై తానుకూడా వెళ్ళి ఆ వలలో ఇరుక్కొన్నది. మగపక్షి పెంటికోసం విలవిలలాడి, 'అయ్యో! ఎంత అల్పపుణ్యం చేశానోకదా! గృహమేధులకు ధర్మార్థకామాలు మూడూ కరతలామలకాలని అంటారు. ఆ మూడిటినీ తనివితీరా పొందకముందే నా గృహం (భార్య) చేజారిపోయింది. తన మురిపాలకు నన్నే ఇల్లుగా చేసి, నన్ను పరదైవతమని మన్నించి కన్నాకుగా చూసుకొన్న నా ప్రియురాలు, నా ప్రాణానికి ప్రాణం నన్ను విడిచి బిడ్డలతో దివికేగుతుంటే కళ్ళారా చూస్తూ జీవచ్ఛవాన్నై ఈ మొండి కట్టెతో పడి ఉండటం దేనికోసమని? ఈ శూన్యగృహం నాకెందుకు? భార్యాపుత్రులను కోల్పోయి దుఃఖజీవినైన నా బ్రతుకెందుకు?' అని, పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని అణచుకోలేక ఆ వలలోకే వెళ్ళి పడింది. బోయవాడు తనపంట పండినందుకు ఎంతో సంతోషంతో వాటిని తీసుకొని ఇంటికి వెళ్ళాడు.

రాజా! కుటుంబలోలుడు ఆ పక్షుల వలెనే వివిధమమకారాలకు లోనయి కలిమిలేములనే ద్వంద్వాలతో పెనుగులాడుతూ చివరికి సానుబంధంగా నశిస్తున్నాడని, ముక్తిద్వారమైన నరజన్మమెత్తి కూడా ఇంద్రియాసక్తుడయితే ఎంతటివారికైనా అధఃపతనం తప్పదని ఆ పక్షుల వలన తెలుసుకొన్నాను.

## 9. అజగరం – యథాప్రాప్తసంతృప్తి

రాజా! ఒక అడవిలో రెండు తలల పాముండేది. అది తానున్న చోటు వదలక ఆకలిదప్పులకు కూడా అడుగు తీసి అడుగు వేయకుండా పడి ఉండి యదృచ్ఛంగా ఏది యెప్పుడు తన నోటి ముందరికి వస్తే దానినప్పుడు పొట్టబెట్టుకొని జీవిస్తుండేది.

దానిని చిరకాలం పరీక్షించి, దేహికి సుఖదుఃఖాలు ప్రారబ్ధకర్మఫలాలుగా వచ్చిపోతుంటాయని, ప్రాప్తమైనవి ఎక్కడున్నా తప్పవని, అవి భుక్తములై నశింపవలసినవే తప్ప వద్దని తోస్తే తొలగేవి కావని, ఏది యెప్పుడు ఏ విధంగా ఎంత ప్రాప్తమో అంతటితో తృప్తిపడాలని, అధికలాభానికి

ప్రాకులాడటం వృథాయాసమని గ్రహించి, మనస్సును బ్రహ్మమునందే నిలిపి ఉంచాలని అజగరం వలన నేర్చుకొన్నాము.

## 10. సముద్రము – నిర్వికల్పస్థితి

రాజా! సముద్రం నిస్తరంగము, ప్రసన్నగంభీరము అయి చొరరాక, దాటగూడక అంతు తెలియక అక్షోభ్యంగా ఉంటుంది. అలాగే మర్త్యుడు ప్రసన్నచిత్తుడు, నిశ్చలమానసుడు అయి జ్ఞానవశాన తన అపరిచ్ఛిన్నతను గ్రహించి రాగద్వేషరహితుడై అక్షోభ్యుడుగా ఉండాలని, సముద్రం నదీ సంగమం వలన ఉబ్బటంగాని అది లేనప్పుడు తగ్గటం గాని లేనట్లే, భోగ్యవస్తు సంప్రాప్తికి పొంగటం, అప్రాప్తికి క్రుంగటం లేక సర్వకాల సర్వావస్థలలో ఏకరూపాన నారాయణపరచిత్తుడై నిర్వికల్పస్థితిలో ఉండాలని సముద్రం వలన గ్రహించాను.

## 11. శలభము – సంసార కూప పతనం

మిడత వెలుతురును చూసి భ్రమించి చేరబోయి ఆ వేడికి తాళలేక ప్రాణాలను కోల్పోతున్నది. అలాగే, ఇంద్రియవశుడు దేవమాయ నిర్మించిన స్త్రీ అనే మంటను చూసి దాని హావభావాలకు మోజుపడి అది సుఖదాయకమని భ్రమించి అగాధమైన సంసారకూపంలో పడి నశిస్తున్నాడని శలభం వలన నేర్చుకొన్నాను.

## 12. మధుకరము – గుణగ్రహణం

తుమ్మెద ఒక పువ్వునందే తగిలి ఉండక, కొంచెమని గొప్పదని వివేచింపక ప్రతిపుష్పం నుంచి దానికి కొంచెం కొంచెంగా మకరందాన్ని సేకరిస్తున్నట్లు యోగి ఒక్కరినే ఆశ్రయించుకొని ఉండక మధుకరవృత్తి పూని భాగ్యవంతుడనక బీదవాడనక ఒక్కొక్క యింట ఒక్కొక్క ముద్ద మాత్రమే స్వీకరిస్తూ జీవితాన్ని గడపాలని; శాస్త్రవాక్యం గొప్పదని, గొప్పది కాదని విమర్శింపక ఎక్కడెక్కడ గుణముంటే దానినల్లా గ్రహించాలని నేను తుమ్మెద

వలన నేర్చుకొన్నాను.

## 13. ఏనుగు - ఆసక్తి దోషం

మగయేనుగును పట్టుకోవడానికి ఆడయేనుగును అడవికి తీసుకొనివెళ్ళి ఆ రెండింటికి సందర్శన సమావేశాలను కల్పిస్తారు. ఆడదానిని చూసి మగది దానిని తాకి దానితోడిదే లోకంగా మైమరచిపోయి ముందుగా త్రవ్వి కప్పి ఉంచిన గోతిలోనికి జారిపడి బంధితమై స్వాతంత్ర్యాన్ని కోల్పోయి జీవితమంతా బానిసగా బ్రతుకుతున్నది. అందుకే ఆడబొమ్మనైనా పొరపాటున గాలితో కూడా భిక్షువు తాకకూడదని అన్నారు. ఏనుగు పాట్లుచూసి స్త్రీలు ప్రాజ్ఞులకు మృత్యువుతో సమానమని, స్త్రీల నుపసర్పించినవారికి ఏనుగు గతి తప్పదని గ్రహించాను.

## 14. మధుహారి - సంచయ ఫలం

తుమ్మెద పడరానిపాట్లుపడుతూ ఎక్కడెక్కడో తిరిగి తిండిమానుకొని సేకరించిన మకరందాన్ని హఠాత్తుగా ఎవడో వచ్చి హరించుకుపోతాడు. దానినిబట్టి తాను తినక ఒకరికి పెట్టక దాచిన ధనమంతా చివరికి పరుల పాలేనని భ్రమరం వలన గ్రహించాను.

## 15. మృగము - ఇంద్రియవశత్వం

జింకలకు మధురస్వరాలాపమంటే పరమప్రీతి కాబట్టి ఆ రహస్యం తెలిసినవారు వాటిని పట్టుకోవటానికి శ్రవణసుఖంగా మురళీగానం వినిపిస్తారు. ఆలాపగతికి జింకలు మైమరచి నిలిచి ఉంటాయి. ఇంద్రియవశులు కురంగాల వలె సుఖాలకు లొంగి నశిస్తారని తెలుసుకొన్నాను.

(భోజనం జీవనార్థమని జిహ్వాపరితోషార్థమని రెండు విధాలు. జీవనార్థభోజికి ఆకలి తీరటమొక్కటే కనబడుతుంది. అంతో ఇంతో తిని

ముగించగానే ఆకలి తీరుతున్నది. అంతటితో అతనికి తృప్తి కలుగుతున్నది. జిహ్వాచాపల్యం ఎన్నటికీ తీరదు. తినే కొద్దీ చాపల్యం పెరుగుతూనే ఉంటుంది. మితిమీరి తినటంవల్ల రోగాలు రావడమే గాక ఎంత సంపాదించినా చాలకపోవడం మొదలవుతుంది. చాలని నాడు అక్రమాలు చేయడం, దానితో క్లేశాల పాలు కావడం లోకవిదితమే. ఈ సంగతి గుర్తుంచుకొని సంయమాన్ని అలవాటు చేసుకోవాలి.

కలిమి భోగార్థమని, భోగార్థం పనికిరాని సంపద కాదని, సంపదలను యథేచ్ఛగా వినియోగింపనివారు పిసినారులై ఇహపరాలు రెండింటికీ చెడతారని ఉపదేశించే మతం ఒకటున్నది. ఈ మతం నానాటికి వ్యాప్తిగన్నందువల్లనే సకలపదార్థభూయిష్ఠమైన మనదేశం ప్రాణిపోషణకు సైతం చాలక తన బిడ్డలను దేశాంతరాల పాలుచేసి ఎన్ని కష్టాలు పడుతున్నదో ఈ నాటి స్థితిగతులే బోధిస్తున్నాయి. జిహ్వాచాపల్యఫలమైన భోగతృష్ణ అధ్యాత్మికాధిభౌతికాలు రెండిటికీ దూరం చేస్తున్నది. కాబట్టి రసాసక్తిని వదలి ప్రాణధారణనిమిత్తమై ఔషధవిధాన భుజించాలి)

## 16. మత్స్యము – ఆశాపరత్వం

జిహ్వ పడే క్షోభ ఇంతింతనరానిది. దానికి లొంగితే ఎరకోసం గాలానికి గుచ్చుకొన్న చేపల గతి తప్పదు. ఇది మత్స్యవృత్తిని చూసి గ్రహించాను.

## 17. పింగళ – నైరాశ్యం

రాజా! విదర్భనగరంలో పింగళ అనే పేరుగల వేశ్య ఉండేది. ఆమె తన కులాచారం ప్రకారం ధనానికి అమ్ముడవుతూ ద్రవ్యార్జనమే జీవితావధిగా కాలం గడుపుతున్నది. ఒకనాటి సాయంకాలం ఆమె చక్కగా సింగారించుకొని ఇంటివాకిట నిలిచి ఆ మార్గాన వచ్చిపోయే ధనవంతులను క్రీగంటి చూపులతో ఆహ్వానిస్తూ తెచ్చికోలు మరులు కురిపిస్తూ హొయల నేర్పులను ప్రకటిస్తున్నది. అర్ధరాత్రయింది. ఎవ్వరూ ఆ రోజు ఆమె వలలో పడ్డవారు

కారు. చూసి చూసి ఆమె కన్నులు అలిసిపోయాయి; నిద్రలేక ముఖం వాడిపోయింది; ఆశ తీరలేదని విసుగుతోపాటు ఏవగింపు కలిగింది.

పింగళ ఆ విధంగా భగ్నమనోరథురాలై, 'అయ్యో! ఇంటికూటికి, దారికూటికి రెంటికీ దూరమయ్యాను. నిద్రాసుఖం ఎలాగూ లేదు; ధనలాభ సంతోషం వట్టిమాటగా మిగిలింది. అయ్యయ్యో! ధనం వల్ల సుఖం కలుగుతుందనే పేరాశతో శరీరం అమ్ముకొన్నాను. పడరానిపాట్లు పడ్డాను. ఔగాములను కాదని ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించాను. ఇంతకంటె మూర్ఖత ఉన్నదా?' అని దుఃఖించింది.

'ధనకాంక్ష ఎందుకు? సుఖంకోసమే కదా? సుఖమంటే ఏమిటి? తినటం అలంకరించుకోవటం ఇది సుఖమవుతుందా? ఇదే సుఖమని ఇన్నాళ్ళూ అనుకొన్నాను. ఈ సుఖాలన్నీ ధనసాధ్యాలని భావించాను. ధనసంపాదనమే జీవితావధిగా ప్రవర్తించాను. ధనసాధ్యమైనవన్నీ భోగాలు మాత్రమే. భోగించేది ఎవరు? ఈ తనువు భోగిస్తున్నది. డబ్బుకోసం ఈ తనువునే విక్రయించాను. విక్రీతమైన తనువుకు స్వాతంత్ర్యం లేదు. అది లేనినాడు దాని భోగ్యం భోగమవుతుందా?

భోగమే సౌఖ్యమందామా? అంటే భోగానికి ఆధారమైన శరీరం శాశ్వతమైనది కాదు. శాశ్వతం కానిదాని కోసం ఇన్ని కష్టాలెందుకు? ఒకవేళ శరీరం శాశ్వతమే అనుకొన్నా, దాని భోగమే సుఖమనుకొన్నా, అది మా కాళ్ళముందు పడిఉండే ఈ నీచమానవుల వలన చేకూరుతుందా? అయ్యయ్యో! ఒకరు తమ సుఖాలకోసం వచ్చి మమ్మల్ని ఆశ్రయిస్తే నేను వారి వలన సుఖాలు పొందగలనని ఆశించాను. ఇది వెర్రి కాకపోతే మరేమిటి? సుఖాన్ని అనుభవించే వస్తువేది? దేహమా? దేహము జడప్రాయమైనది. దానికి జ్ఞానం లేదు. జ్ఞానం లేనిదానికి సుఖదుఃఖవివేకం ఉండదు. శవానికి సుఖదుఃఖాలు లేవుకదా! దానికి తోడు ఈ దేహం రక్తమాంసాస్థిమయమై హేయరూప మూత్రపురీషాదులతో నిండి ఉన్నది. ఎంత శుభ్రంచేసినా పైపూత లెన్ని పూసినా దాని నైజమాలిన్యం పోయేది కాదు. ఒకరోజు స్నానం

మానితే ఎవరి దేహం వారికే దుస్సహంగా ఉంటున్నది. ఇట్టి దేహం సుఖాన్ని అనుభవిస్తున్నదనే భ్రాంతితో దీనికోసం జీవితాన్ని పాడుచేసుకొన్నాను. ఎంత అవివేకం నాది!

ఈ భ్రాంతికి కారణమేమిటి? ఇది మానసిక కార్యమే తప్ప మరొకటి కాదు. మనస్సుకు ఇటువంటి ఆలోచన లెలా కలుగుతున్నాయి? ఆశాప్రేరణం వలన కలుగుతున్నాయి. కనుక అన్ని కష్టాలకూ మూలకారణం ఆశ ఒక్కటే. ఈ ఆశకు అంతమున్నదా? అంతముంటే లోకమంతా నా లాగే మరుమరీచికల వెంటబడి ఒక్కనాటికీ దరిగానక పరితపించట మెందుకు? అందువల్ల ఆశకు అంతులేదు; లక్షలుకోట్ల సంవత్సరాలు గడిచినా కోరికలు తీరటమూ తృప్తి కలగటమూ ఉండదు.

ఇక గత్యంతరం మేమిటి? దారిచూపే వారెవరు? ఎవరినో అడిగి ఏమిటి ప్రయోజనం? నా అంతరాత్మనే అడిగిచూస్తాను. అయ్యో! నా అంతరాత్మ నా దురాశలకు నవ్వుకొని నా పోకడలకు వగచి నా పాట్లకు జాలిపడి నాకు బుద్ధి చెబుతున్నది. నా ఆత్మకంటె నాకు హితులెవరున్నారు? ఇంతకాలం మదమోహగర్వితనై నా అంతరాత్మోపదేశాన్ని ఎండమావుల వెంటబడి వేసారాను. ఇకనైనా తెలివి తెచ్చుకొంటాను.

ఇందాక నేను కోరిన సుఖాలన్నీ ఇంద్రియపరమైనవని, ఇంద్రియసుఖాలు క్షణికమే గాక దుఃఖాంత మవుతాయని, నా అంతరాత్మ చెబుతున్నది. నా అనుభవం కూడా అందుకు సాక్ష్యమే.

మరి నిజంగా సుఖాన్నే కోరితే, శాశ్వత సుఖానికే ప్రయత్నించమని నా అంతరాత్మ బోధిస్తున్నది. అందుకు మార్గమేమిటి? మర్త్యుల వలన సాధ్యంకాదని స్వానుభవంలో నాకు తెలిసివచ్చింది. దేవతల నాశ్రయింపనా? వారుకూడా మర్త్యులవలె ఆద్యంతాలు కలిగి కాలానికి కట్టుబడి ఉన్నవారే. అటువంటి అశాశ్వతులు శాశ్వతసుఖాల నివ్వగలరా? ఇక ఎవరి నాశ్రయించాలి? శాశ్వతులనే ఆశ్రయించాలి.

శాశ్వతుడంటే ఎవడు శాశ్వతుడు? ఎవడు కాలాతీతుడో, ఎవడు చరాచర సమస్త భూతజాతానికి కర్త, పాలకుడు అయినవాడో, ఎవడు నిరవధిక అఖండసుఖసారమో, అతనే శాశ్వతు డనదగినవాడు. అట్టివాడు భగవంతుడు తప్ప అన్యులు వేరొకరు లేరు. భగవంతుడు శాశ్వతుడే గాక నిరవధిక అఖండసుఖస్వరూపుడు కాబట్టి ఆయన నడిగితే నేను కోరిన శాశ్వతసుఖం లభిస్తుంది. అందువల్ల భగవంతుడినే ఆశ్రయిస్తాను గాక!

ఓహో! నేనెంత భాగ్యవతిని. పూర్వమెన్నడో పరమేశ్వరుని ఏదో ఒక పుణ్యకర్మరూపాన ఆరాధించాను. తత్ఫలంగా నాకిప్పుడు భగవదారాధన బుద్ధి జనించింది. నిర్వేదహేతువులైన ఈ అనుబంధాలకు లొంగి పరితపిస్తున్న నాకు ఇంతమాత్రపు దారి కనిపించినదంటే ఇది ఆనాటి పుణ్యఫలం కాకపోతే మరేమిటి?

నా అంతరాత్మ ప్రబోధమే ఈశ్వరాజ్ఞగా తలదాల్చి గ్రామ్యసుఖాలను త్యజించి దురాశాపిశాచాన్ని తరిమివేసి ఈశ్వరుని శరణువేడుకొంటాను. భక్తి అనే పుష్పంతో భగవంతుని ఆరాధిస్తూ ప్రాప్తమయినదే పదివేలని తృప్తిచెందుతూ ఆత్మారామునితో రమిస్తుంటాను గాక. ఇదే శాశ్వతసుఖం.

ఇంద్రియాలు దారిదోపుడు పగటి దొంగల వంటివి. వాటిచేతిలో చిక్కి జ్ఞానధనాన్ని కోల్పోయి కాలసర్పం కాటు తిని సంసారకూపంలో పడి తల్లడిల్లుతున్న ఈ జీవుని ఆ పరమాత్మ తప్ప ఉద్ధరింపగలవారు వేరొకరు లేరు. ఏ వంక చూసినా జగత్తంతా కాలసర్పం నోట చిక్కి అల్లాడుతున్నది. అట్టి లోకం అన్యులను ఉద్ధరింపగలదా? అది వట్టి భ్రాంతి మాత్రమే. ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి' అని ఎంతోసేపు విచారించి కృతనిశ్చయురాలై దురాశను విడిచి శాంతిని పొంది పాన్పుజేరి హాయిగా నిద్రపోయింది.

రాజా! దుఃఖాలన్నింటిలో ఆశాదుఃఖం కాలసర్పం వంటిదని, ఆశాజయమే సమస్తసుఖబీజమని పింగళ వలన గ్రహించాను.

## 18. కురరము – మమకారమే దుఃఖబీజం

రాజా! కురరమొకటి (లకుముకి పిట్ట) ఎక్కడినుంచో మాంసఖండాన్ని సంపాదించుకొని వచ్చింది. అదిచూసి లకుముకి పిట్టలు సహింపలేక దానిని వెంబడించి తరమసాగాయి. ఆ పిట్ట తన మాంసఖండాన్ని దక్కించుకోవటానికి కనబడ్డచోటుకల్లా పరిగెత్తుతూ ఏవేవో ఉపాయాలు పన్నింది. కురరాలు దానిని విడిచిపెట్టలేదు. ఇక తప్పించుకొనే మార్గం లేదని గ్రహించిన తర్వాత ఉపాయాంతరం తోచక అది మాంసఖండాన్ని జారవిడిచింది. తక్కిన పిట్టలు దానిని నోటగరచుకొని వెళ్ళిపోయాయి. ఆ పిట్ట ప్రాణం దక్కింది.

రాజా! జనులు తమకు ప్రియమని తోచిన పదార్థాలను సర్వప్రయత్నాలతో సమకూర్చుకొంటారు. అంటే మమకారవశులై ప్రవర్తిస్తున్నా రన్నమాట. మమకారం చివరికి దుఃఖానికే దారితీస్తున్నదని, దానిని వదిలితే గాని అనంతసుఖం లభింపదని కురరం వలన నేర్చుకొన్నాను.

## 19. పసిబాలుడు – పరమానందం

రాజా! లోకంలో నిజంగా సుఖం అనుభవించేవారెవరని ఆలోచిస్తే పసిపిల్లవాడొకడు, గుణాతీతుడైన యోగి ఒకడు – వీళ్ళిద్దరే కనబడుతున్నారు. కారణమేమిటో ఊహించాను. బాలునికి లోకజ్ఞానం పూర్తిగా శూన్యప్రాయం. అందువల్ల అతనిని లోకం ఆకర్షింపలేదు. లోకమే శూన్యమయినందువల్ల పిల్లవాడు చింత అంటే ఏమిటో తెలియరాకుండా ఉంటాడు. చింత ఎప్పుడు లేదో, అదే పరమసుఖం.

వయోవంతులలో గుణత్రయం వ్యవహరిస్తుంటుంది. గుణాలు వివిధ భావాలను పుట్టించుతూ పెంచుతూ బాహ్యార్థాల వెంట మనిషిని తరిమికొడుతూ బహువిధ మనఃకల్లోలాన్ని కావిస్తుంటాయి. మనుష్యుడు ఆ సుడిలో పడి ఒడ్డు కనిపించక పరితపిస్తున్నాడే గాని అతను వాంఛించిన

సుఖాన్ని ఎన్నటికీ పొందలేడు. ఆ సుఖం నానాటికీ దూరమవుతూనే ఉన్నది. పసిపిల్లవాడిలో గుణవ్యవహారం కామప్రేరితం కాదు గనుక అతని కటువంటి పరితాపమే ఉండదు. ఇద్దరికీ ఉన్న తారతమ్య మిదేనని గ్రహించాలి.

గుణాతీతుడైన యోగిముందు గుణాల ఆటలు సాగవు. బాలకుని వలనే అతనికీ లోకం శూన్యప్రాయంగా ఉంటుంది. ఎప్పుడు లోకం శూన్యప్రాయమయిందో అప్పుడు పరమాత్మ మాత్రమే శేషిస్తుంది. పరమాత్మ అనగానే నిరవధికానందసుఖం కాబట్టి అందులో లీనమయిన యోగి ఆ సుఖాంబుధిలో మునిగి ఉంటాడు.

రాజా! పరమానందసుఖాన్ని కోరినవాడు గుణాతీతుడు కావాలని పసిబాలుని వలన గ్రహించాను.

## 20. కన్య – వివిక్తసేవత్వం

రాజా! ఒక ఊళ్ళో స్త్రీపురుషులిద్దరు పేదవారు ఉండేవారు. వారికొక కుమార్తె ఉండేది. ఆ పిల్లను వివాహార్థం కోరి యెందరో వస్తూ పోతూ ఉండేవారు. ఒకనాడు తల్లిదండ్రు లిద్దరూ కార్యాంతరం చక్కజూసుకోవడానికి ఎక్కడికో పోయి ఉండగా ఎవరో కొందరు ఆ పిల్లకోసం ఇంటికి వచ్చారు. అప్పుడామె వడ్లు దంచుతున్నది. ఆమె చేతి గాజులు గల్లుగల్లుమని చప్పుడవుతున్నాయి. గాజుల చప్పుడు విని వచ్చినవారు తమ దారిద్ర్యాన్ని గ్రహిస్తారు కాబోలునని ఆమె అనుమానించి ఒక్కొక్క చేతికి రెండురెండు గాజుల నుంచుకొని తక్కినవి పారవేసి వడ్లు దంపసాగింది. ఆ రెండు గాజులూ ఇంకా చప్పుడు చేస్తూనే ఉన్నాయి. ఆమె చేతికి ఒక్కొక్క గాజునే ఉంచి తక్కినవాటిని పగలగొట్టి యథాప్రకారం వడ్లు దంపసాగింది. గాజుల చప్పుడు సద్దుమణిగి ఆమె ఏమిచేస్తున్నదీ అన్యులకు తెలియరాలేదు.

రాజా! పదుగురున్నచోట కలహం తప్పదని, ఇద్దరున్నప్పుడు తప్పక వాదోపవాదాలు ఉంటాయని, ఏకాగ్రభావాన్ని అభ్యసింపగోరినవాడు ఏకాకిగా ఉండాలని, ఆ బాలిక వలన నేను నేర్చుకొన్నాను.

## 21. విలువిద్యాభ్యాసకుడు - యోగాభ్యాసక్రమం

రాజా! ఒకప్పుడొకవ్యక్తి బాణవిద్యాభ్యాసానికి సమకట్టి ఒకచోట స్థిరంగా నిలబడి శ్వాస నిరోధించి గురి మీదే చూపు నిలిపి మనస్సును బంధించి బాణాన్ని వదిలాడు. అది వెళ్ళి గురిని తాకింది.

ఏకాగ్రబుద్ధికై యత్నిస్తున్న యోగి కర్తవ్యమేమిటో ఆ బాణవిద్యాభ్యాసకుని వలన గ్రహించాను.

మనస్సు నిలకడ చెందటమంటే మనస్సులో ఉదయిస్తుండే అసంభావనా విపరీతభావాలు అణగిపోవటమేనని గ్రహించాలి. రజోగుణ వృద్ధివలన ఇట్టివి కలుగుతున్నాయి. రజస్సును అణచివేస్తే అవీ పోతున్నాయి. రజోగుణాన్ని అణచినంతనే సత్త్వగుణం వృద్ధిపొందుతుంది. అది క్రమక్రమంగా శుద్ధసత్త్వ మవుతుంది. అప్పుడు బాహ్యప్రపంచజ్ఞానం కాని, అంతఃప్రపంచజ్ఞానం కాని, అంటే సుఖదుఃఖాది ద్వంద్వజ్ఞానభావం ఏదీ ఉండదు. ద్వంద్వజ్ఞానం నశించి నంతనే మనస్సు ఆత్మనిష్ఠ యందు కుదురుకొంటుంది.

ఈ విధానాన్నే యోగపరిభాషలో ఆసనజయం, శ్వాసజయం, మనోజయం అంటారు. మనోవిక్షేపలయాలు విషయవాసనల వలన కలుగుతున్నవని, వాసన లున్నంతకాలం తత్ఫలితాలైన విక్షేప లయాలు తప్పవని శంకింపవచ్చు. మనస్సు పరానందరూపమైన భగవంతుని యందు నిల్పినంతనే వాసనలు నశించిపోతాయి. సుషుప్తిలో సైతం కర్మవాసనలు నశిస్తున్నవని, అప్పుడు మనస్సు లయమైనదేగాని భగవంతుని యందు లగ్నం కాలేదని, అదే విధంగా వాసనానాశనం వలన మనోలయం ఎందుకు కలుగకూడదని ప్రశ్నింపవచ్చును. రజస్సు విక్షేపానికీ, తమస్సు లయానికీ హేతువులు. రజస్తమస్సులతోపాటు వాటి కార్యాలు కూడా నశిస్తాయి. వృత్తిశూన్యమైనందువల్ల మనస్సు బ్రహ్మాకారిత మవుతుంది. దీనినే సంప్రజ్ఞాత సమాధి అంటారు.

## 22. సర్పము - అనికేతనత్వ అప్రమత్తాదులు

రాజా! సర్పం ఎప్పుడూ రెండవదానితో కలవక ఒంటరిగా మహాజాగరూకతతో సంచరిస్తుంటుంది. మెలకువకు సర్పజాగ్రత్త అనే నానుడి ఉన్నది. సర్పానికి ఇల్లే లేదు; ఎక్కడ బొరియ కనబడితే అందులో దూరి కూర్చుంటుంది. దాని సంచారక్రమం అతి రహస్యంగా, అతినిశ్శబ్దంగా కొనసాగుతుంది.

అదే విధంగా ముని అయినవాడు ఏకచారి, అనికేతనుడు, అప్రమత్తుడు, నిజమహిమలను ప్రకటింపనివాడు, అల్పభాషి, నిరాడంబరమూర్తి అయి అతని ఆచారవ్యవహారాలను బట్టి కూడా అతను ముని అవునో కాదో ఊహింపరానివాడుగా ఉండాలని, క్షణభంగురమైన దేహానికి గాను వ్యయప్రయాసలకు లోనై నగరాలు నిర్మింపవలసిన అవసరం లేదని, నీడ ఉన్నచోట తలదూర్చి కాలం గడపవచ్చునని పామును చూసి నేర్చుకొన్నాను.

## 23. ఊర్ణనాభము - సృష్టి స్థితి లయాలు

రాజా! నేను చెప్పబోయే విషయం చాలా ముఖ్యమైనది. దీనివలన అన్ని సంశయాలు తొలగిపోతాయి. కనుక సావధానుడవై విను.

సాలెపురుగు నెరుగుదువుగదా! అది దానికి ఇష్టం వచ్చినప్పుడు నోటిగుండా దారాన్ని బయటికి విడుస్తూ మళ్ళీ లోపలికి తీసుకొంటూ ఉంటున్నది. అది తంతువును విడిచినప్పుడు తరగటం గాని, దానిని లోనికి గ్రహించినప్పుడు పెరగటం గాని, రెండూ లేవు. తంతువు సాలెపురుగు కాదు. తద్భిన్నమూ కాదు. తంతువును విడిచి సాలెపురుగు, దానిని విడిచి తంతువు ఉండవు.

ఆ విధంగానే సృష్టి సమస్తం భగవంతుని వలన పుట్టుతూ మళ్ళీ అతనియందే లయిస్తున్నదని, సృష్టి అంటే భగవంతుడు గాని

భగవద్భిన్నమైనది గాని కాదని, సృష్టిలయాదులు ఈశ్వరేచ్ఛానుసారం ఉన్నవని, ఇచ్ఛాకారణం అనిర్వచనీయమని, భగవంతుడే సమస్తసృష్టికి ఆధారము, ఆధేయము రెండూ అయి ఉన్నాడని, సృష్టి సమస్తం భగవచ్ఛక్తికార్యమని, శక్తికీ శక్తిమంతునికీ అగ్నికి దహనగుణంతో ఉన్నట్లు అవినాభావమని, అందువలన భగవంతుని విడనాడి సృష్టి – సృష్టిని విడనాడి భగవంతుడు పృథగ్భూతాలుగా (వేర్వేరుగా) ఉండటం లేదని, సృష్టిలయం వలన భగవంతునికీ వృద్ధిక్షయాలు కలుగవని గ్రహించాను.

మరి, సాలెపురుగు ఉండటం మూలాన దానినుంచి తంతువు వెలువడుతున్నట్లే భగవంతుడనే ఆధారంనుంచి సృష్టి వ్యుత్పన్న మవుతున్నదని, నిరాధారం నుంచి సృష్టి కలిగినదనే మతం నిరాధారమని, సాలెపురుగునుంచి తంతువు ఎందుకు ఎప్పుడు ఏ విధంగా పుట్టినదీ చెప్పటం ఎలా సాధ్యం కాదో – అదే విధంగా భగవంతుని నుంచి ఎందుకు? ఎప్పుడు? ఏ తీరున? సృష్టి కలిగినదో చెప్పటం సాధ్యం కాదని, తంతువు సాలెపురుగుయొక్క వికారం గాని పరిణామం గాని కానట్లే సృష్టికూడా భగవంతుని యొక్క వికారం గాని పరిణామం గాని కానేరదని, సాలెపురుగు నుంచి తంతువు బయటికి రావటం, కొంతకాలం ఉండటం, మళ్ళీ దానిలోనికే పోవటం అది చూస్తూ ఎలా ఉంటుందో భగవంతుడు కూడా తననుండి కలుగుతున్న సృష్టిస్థితిలయాలకు సాక్షిమాత్రుడై ఉన్నాడని ఊర్ణనాభం వలన నేను గ్రహించాను.

సాలెపురుగు నుంచి తంతువు వెలువడి పురుగు, తంతువు రెండూ మనకంటికి గోచరిస్తున్నంత కాలం రెండూ సత్యాలే కాని తంతువు లోనికి పోయి పురుగు మాత్రమే శేషిస్తున్నందువల్ల తంతువు తాత్కాలిక సత్యమని, పురుగు పరమసత్యమని మనము గ్రహిస్తున్నట్లే భగవంతుడు – సృష్టి వేర్వేరుగా చూసినప్పుడు రెండూ సత్యములేనని, సృష్టి లయమై భగవంతుడు మాత్రమే శేషిస్తున్నాడు కాబట్టి భగవంతుడు పరమసత్యమని, సృష్టి తాత్కాలిక

సత్యమని నేను తెలుసుకొన్నాను.

భగవంతుడు సృష్టించడమంటే ఏమిటి? అతనియందున్న శక్తిని అతను విస్తరింపజేస్తున్నాడని అర్థం. 'ప్రపంచ' శబ్దం, 'సృష్టి' శబ్దం ఇదే భావాన్ని వెల్లడిస్తున్నాయి. అయితే సృష్టించటం ఎందుకు? అని అడగవచ్చు. 'నైకో రమతే' అన్న బృహదారణ్యకోపనిషత్తు లోని వాక్యాన్ని సాకల్యంగా విమర్శించితే సృష్టికారణం బోధపడుతుంది.

'అంతవంతం ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్' అన్నందువల్ల సృష్టిని సంపూర్ణంగా నిరసించాలా? అనే ప్రశ్నవస్తుంది. అసలు సృష్టిని నిరసించడమంటే ఏమిటి? సృష్టిని వదిలి అవతలకు వెళ్ళడమో, లేక సృష్టిలోనే ఉండి దాని జోక్యం కలిగించుకొనక పోవడమో ఈ రెండిటిలో ఒకటి కావాలి. సృష్టిని వదిలి అవతలకు పోదామంటే సృష్టిలేని చోటే లేదు. కనుక అది సాధ్యం కాదు. సృష్టితో జోక్యం వదులుకొందామా అంటే, దాని వ్యవహారం చరాచరభూతకోటిని ఆవరించి నిరంతరం జరుగుతూనే ఉన్నది. కనుక రెండవదీ సాధ్యంకాదు. సృష్టి వ్యవహారం ప్రవాహసరణిలో ఉన్నది. ఆ ప్రవాహంలో పడి లోకమంతా మునుగుతూ తేలుతున్నది. దానిని తప్పించుకొనే మార్గమే లేదు. గత్యంతరం లేదా? అంటే, తామరాకు మీది నీటిబొట్టు వలె సృష్టియందు మర్త్యుడు వర్తించాలి. అట్లా వర్తించేవారే జ్ఞానులు. ఆ వర్తన రహస్యాన్ని గ్రహించటమే జ్ఞానం.

జ్ఞానుల వర్తనమంతా బాహ్యదృష్టికి లోకాన్ని ఆశ్రయించుకొని ఉన్నట్లే కనిపించినా వారి మనస్సు మాత్రం భగవంతునియందే లగ్నమై ఉంటుంది. అందువల్ల వారి మనోవ్యాపారం లీలామాత్రంగా ఉంటుంది.

రాజా! భగవంతునికి రూపం ఎలా ఉంటుందని అడుగుతావేమో? భగవంతునికి రూపమే ఉండదు. రూపం కలగాలంటే ఉపాధి ఉండాలి. అన్ని ఉపాధులకు భగవంతుడే ఉపాధియై ఉన్నవాడు. అతనికి వేరుగా ఉపాధి లేదు. కాబట్టి భగవంతుని రూపం ఇట్టిదని చెప్పలేము (గీత. 2-25;

3-13).

అలాగయితే భగవంతుని తెలుసుకొనడం ఎలాగని, భగవంతు డిట్టివాడని తెలియనిదే భజించటం ఎలాగని అడగవచ్చు. అగ్నికి రూపం లేదని, ఏ వస్తువునది ఆశ్రయించి ప్రకాశిస్తుందో, ఆ వస్తువు రూపాన్ని అగ్నియందు ఆరోపించి చూస్తున్నామని ఇంతకు ముందే చెప్పాను. భగవంతుడు స్వతః నిరాకారు డైనప్పటికీ అవ్యక్తమూర్తి చేత సృష్టి అంతటా వ్యాపించి ఉన్నాడు కాబట్టి విశ్వమే భగవదాకారమని సాధనావస్థలో బుద్ధిగ్రాహ్యార్థం కల్పించుకోవాలి. అంటే విశ్వమే భగవద్వ్యక్తరూప మన్నమాట. అతని అవ్యక్తరూపం మాటేమిటంటే, అది కేవలాఖండానందాత్మకమై అనుభవైకవేద్యమాత్రమై ఉన్నది. దానిని అనుభవించినవారు గాని, అనుభవిస్తున్నవారు గాని భగవదవ్యక్తరూపం ఇటువంటిదని చెప్పరా? అంటే, అది వాక్కుకు, బుద్ధికి గోచరించేది కాదు. అట్టిదానిని నిర్వచించటం ఎలాగు? నిర్వచించినా గ్రహించటం ఎలా వీలవుతుంది? ఎందుకు వీలుకాదంటావా? గ్రహించటం, ఆ గ్రహించిన దానిని మాటలలో వివరించి చెప్పడం - ఇవన్నీ ఇంద్రియ కార్యాలు. అతీంద్రియవిషయాన్ని ఇంద్రియాలు గ్రహించటం, చెప్పటం ఎలా వీలవుతుంది? అందువల్లనే భగవద్రూపం అవాఙ్మానసగోచరమని అన్నారు. ఇదే భావం గీత (2-29) లో చెప్పబడి ఉన్నది.

## 24. కీటము - తత్సారూప్యం

రాజా! భ్రమరం ఒక పురుగును తెచ్చి తన గూటిలో ఉంచి దాని చుట్టూ తిరుగుతుంటుంది. ఆ పురుగు భయంవల్ల ప్రతిక్షణం ఆ భ్రమరం మీదే దృష్టి నిలిపి నిరంతరం దానినే చూస్తుంటుంది. ఆ విధంగా కొన్నాళ్ళు గడిచిన తర్వాత తదేకధారణ వల్ల ఆ కీటమూ భ్రమరమై ఎగిరిపోతుంది.

కాబట్టి మనస్సుకు దేనియందు నిర్వికల్పసమాధి కలిగితే దాని రూపాన్ని పొందుతుందని తెలుసుకోవాలి (గీత. 8-6). అందువల్ల ఉత్తమమైనదానిని

గురించి ధారణ చేసేవారు ఉత్తమస్థితిని, నీచమైనదానిని గురించి ధారణ చేసేవారు నీచస్థితిని పొందటం జరుగుతున్నది. ఉత్తమ గతిని కోరి అభ్యాసం మొదలు పెట్టినవారు ఉత్తమవస్తువునందే మనస్సును నిలిపి ఉంచాలని కీటకం వలన గ్రహించాను.

ఈ స్మరణమన్నది అంతకాలంలో కూడా చేయవలసి ఉంటుంది. ఇది ముఖ్యం. ఎందుకంటే అంతకాలంలో బుద్ధి దేనియందు నిలిచి ఉంటుందో ఆ స్థితి మరుజన్మలో కలుగుతుంది. అంతకాలంలో కూడా ఆ స్మరణ ఉండాలంటే యావజ్జీవం అభ్యాసాన్ని కొనసాగించాలి. (గీత. 8–7).

ఈ ధారణ స్నేహం వలన, భయం వలన, లేక ద్వేషం వలన కలిగే అవకాశం ఉన్నది. ఋష్యశృంగునికి స్నేహభావం వలన కలిగింది. గజేంద్రుడు భయగ్రస్తుడైనప్పుడు భగవద్ధ్యానం చేశాడు. శిశుపాలునికి వైరభక్తి వలన నిరంతరధ్యానంతో గడిచిపోయింది. ఈ మూడు ఉదాహరణలను బట్టి ధారణ ప్రధానమని, తత్కారణం అప్రధానమని గ్రహింపవచ్చును.

రాజా! ఇంతమంది గురువులను ఆశ్రయించి ఒక్కొక్కరి వలన ఒక్కొక్క సంగతి నేర్చుకొన్నాను.

## స్వదేహం – ప్రబోధిత జ్ఞానం

రాజా! దేహాలు జననమరణవశాలు కావడంవల్ల ఏదీ శాశ్వతం కాదు. దధిక్షీరఘృతాల చేత పోషించినా చివరికి అవి మృగాలు, పక్షుల పాలుకాక తప్పదు. ఇది తెలిసి కూడా దేహప్రీతికై ధనధాన్యాలను భార్యాపుత్రబంధుమిత్రాదులను గృహ పశు సేవకాదులను సమకూర్చు కొనేందుకు పడరానిపాట్లు పడేవారిని చూసి ఏమనుకోవాలి? ఎంత ధనమున్నా ఎందరు బంధుమిత్రాదులున్నా దేహపతనాన్ని తప్పింపలేరు. అంతేకాదు. ప్రాణం పోయిన తర్వాత కళేబరాన్ని ఒక్క నిమిషం కూడా

ఇంటిలో ఉండనివ్వరు.

దేహం క్షణిక మనుకొన్నాము. పోనీ అదైనా ఉన్నంతవరకు జీవితం ఏకరాశిగా గడిచిపోతుందా అంటే అదీ లేదు. స్వస్థతగా ఉంటుందా అంటే అందుకూ వీలులేదు. జిహ్వ ఒక వంకకు తృష్ణ ఒక వంకకు తక్కిన ఇంద్రియాలన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క వంకకు దానిని లాగుతుంటాయి. కర్మశక్తిని చూతామంటే అది మరొక వంకకు ఈడ్చుకొనిపోయి ఎక్కడో మిన్నులుపడ్డ చోట కూలద్రోస్తున్నది. దేహం ఆ విధంగా దశేంద్రియాలకు చిక్కి పదుగురు భార్యలమధ్య నలిగినవాడి గతిని అనుభవిస్తున్నది.

అలాగని దానిని విసర్జిద్దామా అంటే తత్త్వవిచారానికి, తత్ఫలమైన బ్రహ్మానందాన్ని చూరగొనటానికి దేహమే తప్ప మరొక సాధనం లేదు. పైగా ఆత్మహత్య మహాపాతకం. అందువల్ల దేహాన్ని కాపాడవలసి ఉన్నది.

రాజా! దేహాలన్నింటిలో మనుష్యదేహం ఉత్తమోత్తమ మైనది. భగవత్తత్త్వాన్ని గ్రహించి భక్తి చేయటానికి మర్త్యులకు తప్ప అన్యులకు వీలులేదు.

భగవంతుడు ప్రేమరూపుడని, అతనియెడ తన కృతజ్ఞతారూప ప్రతిప్రేమ స్వరూపం ఇట్టిదని గ్రహించే వివేకం, తద్విధమైన జ్ఞానపూర్వక ప్రతిప్రేమను భగవంతుని యెడ నెరపగల శక్తిమత్త్వం ఒక్క మనుష్యులకు మాత్రమే ఉన్నది. అందువల్ల మనుష్యుడు సమస్త సృష్టికి మకుటప్రాయుడని అంటున్నాము.

భగవంతుడు భక్తికి వశమైనట్లుగా మరొకదానికి వశుడు కాడు. మనుష్యులు తనయెడ ప్రతిప్రేమరూపమైన భక్తిని చూపగలిగేందుకు భగవంతుడు వారికి అనర్ఘమైన వివేకాన్ని ప్రసాదించాడు. వారు ఆ వివేకాన్ని సద్వినియోగం చేయనినాడు మహాకృతఘ్ను లవుతారు. భక్తితో ఉండటమే పూజ గాని పుష్పాదిసమర్పణ పూజ కాదు (6-67; 9-26).

రాజా! దేహం అశాశ్వతం. ఎప్పుడు రాలిపోతుందో తెలియదు. అందువల్ల కర్తవ్యనిర్వహణలో అలసత్వం తగదు. దీపమున్నప్పుడే ఇల్లు

చక్కబెట్టాలని అన్నట్లు దేహమున్నప్పుడే మోక్షాన్ని సాధించాలి. ఇంద్రియసుఖాలు ప్రాణికోటి అంతటికీ సహజసిద్ధాలు. దానికోసం అమూల్యమైన మనుష్యదేహమే అవసరం లేదు. మనుష్యదేహం బహుజన్మపుణ్యపరిపాకంగా కలుగుతున్నది. మనుష్యులకు మాత్రమే మోక్షాసక్తి ఉన్నది. ఈ విషయాన్ని బట్టి చూసినా నరజన్మను ఎలా ఉపయోగింపవలసినదీ స్పష్టపడుతుంది.

రాజా! నేనింతవరకు చెప్పినట్లు బహురీతుల వైరాగ్యవిజ్ఞానాలను సంపాదించి అహంకారాన్ని వదిలి ముక్తసంగుడినై ఆత్మసంస్థితి నొంది జగమంతటా సంచరిస్తుంటాను. ముక్తసంగుడను కాబట్టి నాకు దేనియందు ప్రీతి కలుగదు. అహంకార రహితుడను గనుక దేనియెడల నాకు ద్వేషం లేదు. ఆత్మసంస్థితుడను కాబట్టి అభేదబుద్ధితో వ్యవహరిస్తాను.(5-18)

రాజా! ఇంతమంది గురువులను సేవించటం ఎందుకంటావా? మర్త్యమాత్రుల మైన మనకు పూర్ణజ్ఞానం ఒకనాటికి కలిగేది కాదు. జ్ఞానాన్ని మధుకరవృత్తితో లోకంనుంచి సంపాదింపవలసి ఉంటుంది. దానివలన చిత్తశుద్ధి, అందువల్ల ఏకాగ్రబుద్ధి జనిస్తాయి. అట్టి బుద్ధితో భగవంతుని సేవించినవారికి ఆ మహనీయుడు పూర్ణావస్థను అనుగ్రహిస్తున్నాడు (10-10, 11).

ఉద్ధవా! ఆ అవధూత యదురాజుకు ఈ విధంగా బోధించి అతనికి వీడ్కొలిపి అక్కడినుంచి బయలుదేరాడు. యదురాజు అవధూత ఉపదేశానుసారం వైరాగ్యాధ్యాసలతో సమచిత్తుడై శాంతిసుఖాన్ని పొందాడు. ఇందులో చెప్పబడిన ఇరవైనాలుగు లక్షణాలు అవధూతల ముఖ్యలక్షణాలు.

## భగవత్ప్రపత్తి

ఉద్ధవా! భగవంతుని ఆశ్రయించటమంటే, ఆయన ప్రతిపాదించిన ధర్మాలను వర్ణాశ్రమానుసారం ఫలాభిసంధిరహితంగా ఆచరించడ మన్న

మాట. (18 - 65). స్వధర్మాచరణ వీటిలో మొట్టమొదటి ధర్మం (3-35; 18-47). ఈ ధర్మాన్ని పరిశుద్ధబుద్ధితో ప్రతిఫల నిరపేక్షకంగా ఆచరించాలి. ఆ విధంగా నిష్కామకర్మగా కాక ఇంద్రియతృప్తి కోసం చేసేవాడు తుదకు మోసపోతున్నాడు (3-16).

ఉద్ధవా! మర్త్యులు ఏవేవో కోరికలను పెట్టుకొని, ఆ కోరికల సాధనకోసం యావజ్జీవం ప్రాకులాడుతుంటారు. అంతమాత్రాననే వారికి ఇష్టసిద్ధి కలుగుతున్నదా అంటే ఒక్కడికైనా కలగటం లేదు. ఎందుచేత? లాభాలాభాలు, సిద్ధ్యసిద్ధులు ఇప్పటి ప్రయత్నానికి లోబడినవి కావు. అవి వారి ప్రారబ్ధకర్మఫలాలుగా అదను వచ్చినప్పుడు కలుగుతుంటాయి. అంటే ఈ జన్మలోని సుఖదుఃఖాది ద్వంద్వాలు ఈ జన్మమందలి కర్మఫలాలు కావని, పూర్వజన్మకర్మఫలాలు ఈ జన్మలో అనుభవార్థం కలుగుతున్నవని, వాటిని తప్పించటం అసాధ్యమని, తారుమారు చేయాలని చేసే ప్రయత్నాలన్నీ నిరర్థకాలని, గ్రహించి - ఇటువంటి ఆలోచనలను, ప్రయత్నాలను కట్టిపెట్టి ఎప్పటికేదివచ్చినా సహనభావంతో మనస్సును భగవంతుని యందు నిలిపి తదాజ్ఞానుసారం స్వధర్మాలను ఆచరించాలి. స్వధర్మం చక్కగా జరుగుతున్నదో లేదో అన్న ఆలోచనే తప్ప వేరొక ఆలోచన ఉండకూడదు.

## సత్యాసత్య వివేకం

ఉద్ధవా! నిద్రలో ఎన్నో చిత్రాలను చూసి అవన్నీ నిజమేననుకొంటారు. ఆ స్థితిలో ఒకప్పుడు సంతోషం కలుగుతుంది; ఒకప్పుడు దుఃఖం కలుగుతుంది. మేలుకొన్న తర్వాత అవన్నీ నిజంకాదని తెలిసి తానప్పుడు పొందిన సుఖ దుఃఖాదులకు సిగ్గుపడి నవ్వుకోవడం కూడా ఉన్నది. స్వప్నావస్థలో చూసిన దృశ్యాలు వాస్తవాలు కానట్లే ఇంద్రియగోచరమైన పదార్థాలన్నీ సత్యాలు కావని, మర్త్యుల జీవితమంతా పగటికల వంటిదని గ్రహించు.

అయితే ఏది సత్యం? ఏది త్రికాలాబాధితమై, మూడు కాలాలలోనూ

యథాస్థితిని ఉంటుందో, అది ఒక్కటే సత్యం. సత్యములు కావని అన్నంత మాత్రాన వాటికి అసలు ఉనికి లేదని అనుకోకూడదు. దృశ్యపదార్థములన్నీ క్షణక్షణం మార్పుచెందుతుంటాయని, అట్టి మార్పులకు లోనవుతున్న పదార్థాల వలన కలిగే ఫలముకూడా నిలకడ లేక మారుతూనే ఉంటుందని గ్రహించాలి. తాత్కాలిక మైనదానిని సార్వకాలిక మనుకొని దానికోసం జీవితాన్ని నిరర్థకం చేసుకొంటున్నారు. ఎప్పుడో అనుకున్నది మార్పుచెందినప్పుడు ఆశాభంగ మవుతున్నది. అదే దుఃఖం. అందువల్ల ఏది సార్వకాలికమో తెలుసుకొని దానికోసం ప్రయత్నించు. ఆశాభంగం, తత్ఫలమైన దుఃఖం కలగవు.

## కర్మము

ఉద్ధవా! సృష్టి కావించే వ్యాపృతిని కర్మము అంటారు (8–3). ఈ కర్మము మొట్టమొదట బ్రహ్మమునుంచే ప్రారంభమయింది. (3–15). ఎప్పుడు ప్రారంభమయింది? అంటే సంకల్పముతోపాటే కర్మము ప్రారంభమయింది. సంకల్పం ఎప్పుడు కలిగిందో చెప్పటంసాధ్యంకాదు.

ఈ వ్యాపారం ప్రవృత్తి పరమైనప్పుడు జననమరణరూప సంసారం ఫలమవుతున్నది; నివృత్తి పరమైనప్పుడు మోక్షము ఫలమవుతున్నది. ఈ వ్యాపృతిని ప్రవృత్తిపరం నుంచి నివృత్తిపరం చేయటానికి జ్ఞానమే సాధనం. ప్రవృత్తిపరమంటే సకామవ్యాపారం. నివృత్తిపరమైనది నిష్కామవ్యాపారం. ఈ మార్పును క్రమక్రమంగా తీసుకొనిరావాలి. పూర్తిగా కర్మలను మానుకోవటం ఎవరికీ సాధ్యం కాదు (18–11). జగచ్చక్రమంతా కర్మము వలననే నడుస్తున్నది.

కర్మము ప్రాణికోటికి నైజసిద్ధం. కనుక ప్రాణులన్నీ నైజకర్మవిరుద్ధాలుగా ఉన్నాయి. (18–60). నైజానికి విరుద్ధంగా నడుచుకోవటం సాధ్యంకాదు. కాదని ప్రయత్నించినా స్వభావం కదలనివ్వదు. (18–59). స్వభావజమైన కర్మమే స్వధర్మం. కర్మము ఎటువంటిదయినా దోషయుక్తమే (18–48).

అందుకని దానిని త్యజింపనూ కూడదు (18–47). దోషము కర్మమునందు లేదు; దానిని చూసే బుద్ధిలో ఉన్నది. ఎప్పుడు కర్మము ఫలాభిసంధితో కూడి ఉన్నదో, అప్పుడే అది దోషయుక్త మవుతున్నది. ఫలాభిసంధిని వదలి సహజమైన కర్మను – అది బాహ్యదృష్టికి క్రూరంగానో దోషంగానో కనిపించినా సరే – చేస్తుండాలి. అప్పుడు కర్మాచరణ వలన కలిగే దోషం సిద్ధించదు. దీనినే నైష్కర్మ్యసిద్ధి అంటారు. (18–49). అసక్తబుద్ధితో చేయడమే కర్మాచరణలోని పరమరహస్యం.

నైష్కర్మ్యసిద్ధికి సాధనక్రమం ఉన్నది. ఈ విషయం గీతలో (18–51, 52, 53) బోధింపబడి ఉన్నది. ఏ కర్మమును చేసినా భగవదర్పణగా చేయాలి. (18–56).

## స్వభావం

స్వభావం ప్రారబ్ధకర్మఫలానుసారం శుద్ధాశుద్ధమిశ్రమంగా ఉంటుందని, స్వభావప్రకారమే ప్రాణికోటి వర్తిస్తుందని చెప్పబడింది. అలాగయితే ప్రాణికి స్వాతంత్ర్యమే లేదా? అని అడగవచ్చు.

శుద్ధస్వభావం స్వయంగానే ప్రాణిని నైష్కర్మ్యసిద్ధికి ప్రేరేపిస్తుంది. మిశ్రస్వభావం సంగతేమిటంటే ఆ మిశ్రమంలో శుద్ధతత్త్వం విశేషించి ఉన్నట్లయితే బుద్ధికూడా తదనుగుణంగా నైష్కర్మ్యసిద్ధి సాధన లైన కర్మలకు ప్రేరేపిస్తుంది. అప్పుడు శాస్త్రజ్ఞానం, గురూపదేశం, సజ్జనసాంగత్యం దానికి తోడ్పడి బలాన్నిస్తాయి. అందువల్ల మిశ్రస్వభావానికి ఒకప్పుడైనా సత్కర్మాచరణకు అవకాశం ఉంటుంది.

అశుద్ధస్వభావం ఉన్నదే, అశుద్ధమనగానే అది సంపూర్ణంగా అశుద్ధమేనని భావింపకూడదు. అటువంటి అశుద్ధస్వభావం అసలు మనుష్యప్రవృత్తి లోనే లేదు. అశుద్ధస్వభావమంటే అందులో శుద్ధముకంటె అశుద్ధం పెక్కురెట్లు విశేషించి ఉన్నదని గ్రహించు. అశుద్ధస్వభావంలో ఉన్న

శుద్ధభావం కూడా అశుద్ధభావం లాగానే ఎప్పుడో ఒకప్పుడు దానిసమయం వచ్చినప్పుడు పైకి వస్తుంది. ఇది తప్పదు. అటువంటి సమయంలో బుద్ధి ఇంతో అంతో భగవంతుని వంకకు మళ్ళుతుంది. అది నిమిత్తంగా భగవానుడు భక్తుని క్రమక్రమంగా ఉద్ధరిస్తున్నాడు. (9–30, 31, 32).

ఉద్ధవా! నాకు భక్తులైనవారికి గర్వమూ, మాత్సర్యం అణుమాత్రమైనా ఉండకూడదు. నా భక్తుడు కార్యదక్షుడుగా ఉండాలి. ఫలాభిసంధి ఎంత మాత్రమూ ఉండకూడదు. అతని హృదయంలో ప్రేమరసం నిరంతరం పొంగిపొరలుతుండాలి. వేగిరపాటు తగదు. తత్త్వార్థజ్ఞాన సంపాదనంటే తీవ్రమైన అభిలాష ఉండాలి. అతని మనస్సులో అసూయకు చోటుండకూడదు. వ్యర్థాలాపాలతో కాలం గడపకూడదు. ఏ ఆత్మ తనయందున్నదో, అదే ఆత్మ భార్యాపుత్రాదుల లోను, చరాచర సమస్త ప్రపంచమందు నివేశితమై ఉన్నదని గ్రహించి అందరియెడ సమదర్శియై ఉదాసీనబుద్ధితో ప్రవర్తించాలి. (2–55, 56, 57).

## మాయ

ఉద్ధవా! మాయాస్వరూపం ఇట్టిదని ఇంతవరకు ఎరిగినవా రెవరూ లేరు. మాయ అంటే నా శక్తియే గాని వేరొకటి కాదు. భగవంతుడనైన నేను నా మాయాశక్తి నధిష్ఠించి కాలరూపుడనై, జీవాత్ముడనై, లోకస్వరూపుడనై, స్వభావుడనై, ధర్మాత్ముడనై నానావిధాల గోచరిస్తుంటాను. కాలరూపుడనై సుఖదుఃఖాల పరిమితిని నిర్ణయిస్తున్నాను; జీవరూపుడనై సుఖదుఃఖ భోక్తనుగా ఉన్నాను; స్వభావరూపుడనై దేహత్వాదులను కలుగజేస్తున్నాను; ధర్మరూపుడనై పూర్వరచిత పుణ్యకర్మలకు ఫలంగా స్వర్గాదినివాసం కల్పిస్తున్నాను.

## మాయాతరణోపాయం

నా మాయను దాటడం అంత సులభకార్యం కాదు. ఎవరు నాకు ప్రపత్తి కావిస్తారో వారుమాత్రమే నా మాయను దాటగలరు. నా మాయను

దాటడానికి ఇదే సులభోపాయం. (7-14). నాకు ప్రపన్ను లైనవారి హృదయంలో నేను జ్ఞానదీపికను వెలిగిస్తాను. దీపాన్ని వెలిగింపగానే వారిలో ఉన్న తమోరూపమైన అజ్ఞానం పటాపంచ లవుతుంది. (10-11). జ్ఞానోదయం కలుగగానే మాయాలీలలు, తత్ఫలమైన లోకము, స్వస్వరూపాన గోచరిస్తాయి. అంటే మాయ, తత్ఫలమైన లోకం - ఈ రెండూ మిథ్యలేనని స్పష్టమవుతుంది. మిథ్యలంటే కుందేటికొమ్ముువంటి వనుకోవద్దు; అవి నాకంటె భిన్నమైనవి కావని గ్రహించు. మాయను అనాది అన్నారు. ఎందుకో తెలుసా? మాయకు కారణాన్ని ఊహింపలేకపోవటమే అందుకు కారణం. దేనికి కారణం ఊహింపరాదో, దానిని అనాది అనక తప్పదు. మాయ అని ఒకటున్నదని, అది అనాది అని చెప్పినదంతా వ్యావహారికమే గాని పారమార్థికం కాదు. పారమార్థికదృష్టికి మాయ అన్నదే లేదు. మాయ అనేది నాకు వ్యతిరిక్తంగా ఒకటున్నదంటే పరమాత్మ ఏకము, అద్వితీయము, అఖండము, పూర్ణము కానేరదు.

జ్ఞానకార్యం అంతవరకు మాత్రమే ప్రవర్తిల్లుతుంది. ఆ తర్వాత జ్ఞానంకూడా 'జలే కతకరేణువత్' అన్న న్యాయాన్ని అనుసరిస్తుంది. కతకరేణువును నీటిలో వేసినప్పుడు కతకరేణువు నీటిలోని మురికిని నశింపజేసి తానుకూడా నశిస్తున్నది. ఆ తీరుననే జ్ఞానం అజ్ఞానాన్ని రూపుమాపి తానుకూడా నశించిపోతుంది.

## మాయ - అవిద్య

మాయ అన్నది శుద్ధసత్త్వం కాగా, అవిద్య రజస్తమస్సులతో కూడినందువలన మలినసత్త్వ మవుతున్నది. ఆ అవిద్య జీవులకు ఉపాధిభూతం. మాయ అన్నదో బ్రహ్మము చేత అధిష్ఠితమై ఉన్నది. అందువలన జీవుడు సోపాధికుడని, బ్రహ్మము నిరుపాధికమని అంటారు.

## చార్వాక మతం

ఉద్ధవా! బ్రహ్మమొక్కటే సత్యమని, నానాత్వమంతా మిథ్య అని, మాయ

వలన ఆ విధంగా గోచరిస్తున్నదని చెప్పాను.

జీవులందరూ ఒకరికొకరు వేర్వేరుగా ఉన్నారని, వారి కర్మములు కూడా వేర్వేరని, జీవులు తమ కర్మఫలాలైన సుఖదుఃఖాలను వేర్వేరుగా అనుభవిస్తున్నారని, అందువల్ల కొందరు సుఖవంతులుగా కొందరు దుఃఖజీవులుగా ఉన్నారని, బ్రహ్మము (ఆత్మ) ఏకము, అద్వితీయము అన్నమాట నిజమై సర్వకోశాలలోనూ ఉన్నది ఒక్క ఆత్మే అయిన పక్షాన ఇన్ని భేదాలు ఎందుకుండాలని, భగవంతుడొక్కడే ఇన్ని విధాల వర్తిస్తున్నాడన్న మాట తర్కానికే గాక అనుభవానికి కూడా విరుద్ధంగా ఉన్నదని, అందువల్ల భగవంతుడే లేడని, సర్వం స్వాభావికమేనని వాదించే మతం ఒకటున్నది. (16–8).

ఈ మతం ప్రకారం సుఖమే పరమతాత్పర్యం. సుఖానుభవానికి స్వాతంత్ర్యం మూలాధార మన్నమాట నిర్వివాదాంశం. దేహాలకు ఉత్పత్తి స్థితిలయాలు తప్పవని వారుకూడా అంగీకరిస్తారు. ఉత్పత్త్యాదులు తప్పవన్నాక దేహానికి స్వాతంత్ర్యమే లేదని స్పష్టం. స్వాతంత్ర్యమే లేనినాడు స్వాతంత్ర్య ఫలమైన సుఖం ఎలా కలుగుతుంది?

## సుఖవిచారం – మీమాంసకులు

సుఖమంటే ఏమిటి? ఇష్టం వచ్చినట్లు తినటం తిరగటం పరమసుఖమని మీమాంసకుల భావం. వారి మతానుసారం సుఖమంటే ఇంద్రియసుఖ మన్నమాట.

ఇంద్రియసుఖం తాత్కాలికం. అదయినా అవిచ్ఛిన్నంగా కలుగదు. ఎందుకు కలగదంటావేమో? దేహమున్నంతకాలమే ఇంద్రియాలు, ఇంద్రియ వ్యాపారాలు ఉంటాయి. పైగా దేహానికి చావు ఉన్నది. చావుతోటే వారు చెప్పే సుఖంకూడా నశించిపోతున్నది.

ఆ సుఖం సార్వకాలికం కాకపోతే సరే, ఉన్నంతకాలమైనా ఏకరాశిగా ఉంటుందా అంటే అదీ లేదు. మృత్యువు నోరుతెరిచి యెట్టయెదుట నిలిచి కసాయివాడు గొర్రెను ఈడ్చినట్లు ఈడ్చుకొనిపోతుంటే భయకంపాలకు, తల్లడిల్లేనాటి స్థితి దుఃఖమవుతుందా? సుఖమవుతుందా?

ఏది త్రికాలాబాధితమై ఉంటుందో, అదే వాస్తవసుఖం. అట్టిది మృత్యువును జయించితే గాని సిద్ధింపదు. మృత్యుజయం సాధ్యమేనా? అని ప్రశ్నింపవచ్చు. మృత్యువనగానే దేనికి కలుగుతున్నది? దేహానికి కలుగుతున్నది. అంతేకాని దేహస్థుడైన ఆత్మకు కలగటంలేదు. ఆ రహస్యాన్ని గ్రహించడమే మృత్యుజయం. జీవునికి మృత్యువు లేదని ఎందుకన్నామంటే జీవుడు పరమాత్మాంశమే తప్ప తద్భిన్నుడు కాడు. (2–20). పరమాత్మకు చావు పుట్టుకలు లేవు కాబట్టి తదంశమైన జీవునికి కూడా చావు పుట్టుకలు లేవు. జీవుడంటే ప్రత్యగాత్మ అని భావం.

ఉద్ధవా! ఇహలోకసుఖం సంగతి సరే, స్వర్గలోకసుఖం శాశ్వతం కదా అనవచ్చును. అయితే స్వర్గలోకసుఖం కూడా కర్మఫలమే. కర్మఫలం ఎక్కడున్నా అశాశ్వతమే గాని శాశ్వతం కాబోదు.

ఉద్ధవా! ఇంద్రియాలను జడములన్నాను. జడములు వ్యవహరించటం, ఫలాదులు పుట్టటం ఎలా జరుగుతున్నదని సందేహం రావచ్చు. సూదంటురాయి సాన్నిధ్యంలో ఇనుపముక్క వలె జీవాత్మ సాన్నిధ్యంలో జడములైన ఇంద్రియాలు వ్యవహరిస్తున్నాయి. వ్యవహారముతోపాటే ఫలం ఉదయిస్తున్నది'.

## బంధముక్తి తత్త్వవిచారం

శ్రీకృష్ణభగవానుని ఉపదేశమంతటినీ ఉద్ధవుడు విని, 'స్వామీ! దేహమున్నంతకాలం ఆ దేహగతములైన గుణములు కూడా ఉంటాయి. గుణము లున్నంతకాలం దేహస్థుడైన జీవుడు గుణబద్ధుడు కాకతప్పదు కదా!

జీవుడు ఆ విధంగా గుణబద్ధు డైనప్పుడు గుణకార్యాల నుంచి, తత్ఫలములైన సుఖదుఃఖాల నుంచి తప్పించుకొని ఎలా ఉండగలడు? స్వామీ! నీ మాటలను వినగా జీవులందరూ గుణబద్ధులనే అనిపిస్తున్నది. ముక్తులు కూడా ఉన్నారంటావేమో? ఆ ముక్తులకు, బద్ధులకు భేదమేమిటి? ముక్తులు లోకవ్యవహారాలలో ఏ విధంగా నడుచుకొంటారు? ఏమిటి తింటారు? ఎలా తింటారు? దేహకృత్యాలను ఎలా నిర్వర్తిస్తుంటారు? వారి శయనాసనగమనాదులు ఏ విధంగా ఉంటాయి? ఈ విషయాలలో బద్ధుల ప్రవర్తన ఎలా ఉంటుంది? స్వామీ! బద్ధుల యొక్క, ముక్తుల యొక్క బాహ్యవర్తనలో సామాన్యదృష్టికి ఎటువంటి భేదం కానరాకపోవడం వల్ల ఇటువంటి శంక కలుగుతున్నది.

స్వామీ! ఆత్మ ఏకము, అద్వితీయము అని చెప్పావు. అట్టి ఆత్మ ఒక ఉపాధిలో నిత్యబద్ధమై ఉండటం, వేరొక ఉపాధిలో నిత్యముక్తమవటం ఎలా సంభవిస్తున్నది? ఈ రహస్యాలను గ్రహింపలేక నా బుద్ధి మరింత భ్రమకు లోనవుతున్నది. నా యీ చింతాక్లేశాన్ని తీర్చగలవారు నీవు గాక వేరెవరున్నారు?' అని వేడుకొన్నాడు.

శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవుని సందేహం విని, 'మిత్రమా! జీవునికి గుణాలను బట్టి బంధముక్తులను చెబుతున్నారే కాని నిజానికి అతనికి బంధము, ముక్తి – ఈ రెండూ లేవు. గుణములు మాయామూలకాలని చెప్పాను. మాయ అంటే మిథ్య అనికూడా వివరించాను. మిథ్య అయిన మాయవలన ఏర్పడిన గుణాలు కూడా మిథ్యలే కదా. అందువల్ల గుణాలు మిథ్యలైనప్పుడు తత్కార్యములని చెప్పబడే బంధముక్తులు కూడా మిథ్యలే అవుతాయి. ఇక్కడ జీవశబ్దానికి ప్రత్యగాత్మ అనికదా అర్థం చెప్పుకొన్నాము!

కాబట్టి జీవుని బంధముక్తులు కేవలం వ్యావహారికాలని, వ్యవహారం అనగానే అజ్ఞానజనితమని, అట్టి అజ్ఞాన మున్నంతకాలం జీవుడు బద్ధునిగానే భావింపబడుతున్నాడని, జ్ఞానోదయం వలన అజ్ఞానం నశింపగానే

అజ్ఞానజనితమైన భ్రమపోయి జీవుడు అతని నిజస్వరూపంలో అంటే నిరంతరముక్తుడన్న భావనతో గ్రహింపబడతాడని తెలుసుకోవాలి. భ్రాంతిపడటం, సత్యాన్ని గ్రహించటం అహంకార జీవుని కార్యాలు.

ఈ జ్ఞానాజ్ఞానాలు రెండూ మాయా కార్యములైన స్థితులేనని చెప్పాను. మాయ అంటే పరమేశ్వరుని అనిర్వచనీయశక్తి అని తెలిపాను. పరమేశ్వరునికి ఆద్యంతాలు లేవు. మాయకు మాత్రం అంతమున్నది.

పరమేశ్వరునికి అంతంలేనప్పుడు అతని శక్తి అయిన మాయకు మాత్రం ఎలా ఉంటుందని అడుగుతావేమో? పరమేశ్వరుడు షడ్భావవికారరహితుడు. అతని శక్తి బహిర్గతమై ప్రాపంచిక రూపాన్ని వహించినప్పుడు సర్వవికారసహిత మవుతున్నది. వికారములు నశ్వరాలు కాబట్టి మాయకు అంతం ఉన్నదన్నాను. మాయకు అంతమున్నదంటే తద్వికారాలకు అంతమున్నదని అర్థం. (13-20, 21, 22).

ఉద్ధవా! పరమాత్మకు, జీవాత్మకు (ప్రత్యగాత్మకు) స్వగతభేదం లేదు. సూర్యుడొక్కడే ఉన్నా అనేక జలాశయాలలో ప్రతిఫలిస్తున్నట్లు పరమాత్మ ఒక్కటే అయినా వివిధోపాధులందు ప్రతిఫలిస్తున్నది. (13-34). జలాశయంలోని నీరు కదిలినప్పుడు అందులో ప్రతిబింబించిన సూర్యబింబం కూడా కదిలినట్లు కనబడుతుంది. నిజానికి సూర్యునికి చలనావస్థ అన్నది లేదు. ఇక నీటిలోని మాలిన్యం నీటిలోని రవిబింబం స్వప్రకాశాన్ని కొంత కప్పిపుచ్చుతున్నది. అలాగే ఆత్మ ఉపాధిగతమైనప్పుడు ఆ ఉపాధికార్యాలను ఆత్మ చేస్తున్నట్లుగా భావించటం ఉన్నది. వాస్తవానికి ఉపాధిమాలిన్యం తదంతర్గతమైన ఆత్మయొక్క ప్రకాశానికి అడ్డుపడుతున్నది. అంతేగాని ఆత్మకు అంటడం లేదు. (13-32, 33).

ఉద్ధవా! నూరు నీటిపాత్రలను ఒకచోట ఉంచితే నూరింటిలోనూ సూర్యబింబం ప్రతిఫలిస్తున్నది. అందులో ఒక పాత్రను తీసివేస్తే ఆ ఒక్క పాత్రలోనే సూర్యబింబం అదృశ్యమవుతుంది. తక్కిన పాత్రలలో అదృశ్యం కాదు. అలాగే ఆత్మ వివిధోపాధులలో ఉన్నప్పటికీ ఏ ఉపాధి నశిస్తే ఆ ఒక్క

ఉపాధియందు మాత్రమే ఆత్మప్రకాశం అదృశ్యమవుతున్నది. అంతేగాని అన్ని ఉపాధులలో అదృశ్యం కావటంలేదు. అంటే ఆత్మకు స్వపరభేదం లేదు.

ఉద్ధవా! బద్ధముక్తుల జీవితవిధానం అడిగావు. పరస్పరస్నేహం గల పక్షులు రెండూ ఒకచెట్టుమీదే నివసిస్తుండేవి. అందులో ఒక పక్షి ఆ వృక్షఫలాలను తింటూ మంచిపండ్లు దొరికినప్పుడు సంతోషిస్తూ పండ్లు దొరకనినాడు దుఃఖిస్తూ ఉండేది. రెండవది ఏ ఫలాన్నీ తాకక సాక్షిమాత్రమై ఉండేది. ఫలకాంక్ష లేనందువల్ల దానికి ఫలము యొక్క గుణాగుణాలను గూర్చి, భావాభావాలను గూర్చి ఎటువంటి చింత కలిగేది కాదు. చింత లేనందువల్ల దానికి ఎప్పుడూ సంతోషంగానే ఉంటుండేది. మొదటిది బద్ధాత్మునికి, రెండవది ముక్తాత్మునికి దృష్టాంతాలు.

ఉద్ధవా! ఈ విశ్వమే మహావృక్షం. జీవులే పక్షులు. ఫలాభిసంధిగల జీవుడు బద్ధుడై సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. ఫలాభిలాష లేని జీవుడు ముక్తుడై చిరసుఖాన్ని పొందుతున్నాడు.

ఉపాధులు కర్మభోగాయతనాలు కాబట్టి భోగ్యకర్మభేదాన్ని అనుసరించి ఉపాధిభేదం కలుగుతున్నది. ఉపాధులు వేర్వేరుగా ఉన్నా తదంతర్గతుడైన (ఆత్మ) జీవుడొక్కడే గాని భిన్నభిన్నమూర్తులనుకోకూడదు.

బద్ధుని ఉపాధిలోని జీవునికి, ముక్తుని ఉపాధిలోని జీవునికి స్వగతభేదం లేదు.

## బంధముక్తులు భావభేదమే

బంధము – ముక్తి అన్నవి భావాలు మాత్రమే. అవి రెండూ రెండు

మానసిక స్థితులు.

ఎవడు సర్వం తానే ఆచరిస్తున్నానని, ఫలం అనుభవిస్తున్నానని అనుకొంటాడో, అతనే బద్ధజీవుడు. ఎవడట్లు తలంపక ఇంద్రియాలు తమ తమ వ్యాపారాలను చేస్తున్నాయని, తాను సాక్షిమాత్రుడై చూస్తున్నవాడనని అనుకొంటాడో, అతనే ముక్తసంగుడు. (3-27, 28).

## బద్ధముక్తుల బాహ్యలక్షణాలు

ముక్తునికి శరీరాభిమానం ఉండదు కాబట్టి అతను తన శరీరానికి కలుగుతున్న పూజలను గాని తిరస్కారాలను గాని ఎరుగనే ఎరుగడు. బద్ధునికి శరీరాభిమానం ఉన్నది కాబట్టి శరీరానికి కలిగే సుఖదుఃఖాలకు అతను సంతోష శోకాలను పొందుతుంటాడు.

## ముక్త్యవస్థాద్వయం

ముక్తులలో సమాధ్యవస్థ, వ్యుత్థానావస్థ అని రెండు అవస్థలున్నాయి. సమాధ్యవస్థలో ప్రపంచజ్ఞానమే ఉండదు. వారు నిరంతరం ఆత్మారాములై ఉంటారు. (2-55). వ్యుత్థానావస్థలో ప్రపంచజ్ఞానం ఛాయామాత్రంగా ఉంటుంది. వారికి రాగ భయ క్రోధాదులు ఉండవు కాబట్టి దేనినీ కావాలనుకొనరు. అందువలన సుఖసంతోషాలు గాని దుఃఖద్వేషాలు గాని వారికి కలుగనేరవు. (2-56, 57).

> ముక్తుల లోకవర్తనమంతా తామరాకు మీది నీటిబొట్టు వలె అంటీఅంటనట్లు ఉంటుంది. మర్త్యులకు మనస్సు ఇంద్రియముఖం అయినప్పుడే ఇంద్రియకార్యఫలములైన సుఖదుఃఖాలు తెలియవస్తుంటాయి. ముక్తుల మనస్సు ఇంద్రియవిముఖం కాబట్టి వారికి ఇంద్రియవ్యాపారాల స్వరూపమే తెలియరాదని భావం. ఎప్పుడేది అప్రార్థితంగా లభిస్తే దానితోనే ముక్తునికి తృప్తి కలుగుతుంది. ఏదీ దొరకనినాడు దానికోసం చింతపడడు.

(4–22). ముక్తునికి కోరిక అన్నదే ఉండదు కాబట్టి దేనినిచ్చినా గ్రహింపడు. అతని చర్యలు బాహ్యదృష్టికి పిచ్చివాని చర్యలవలె కానవస్తాయి. ముక్తునికి ఫలకాంక్ష లేనందువల్ల అతను చేయవలసిన పనిగాని పొందవలసిన ఫలంగాని ఉండవు. అతనెప్పుడయినా ఏదయినా చేసినట్లు కనబడితే ఆ పని ఈశ్వరప్రేరితమైనదై లోకసంగ్రహార్థంగా ఉంటుందే గాని వాంఛాప్రేరితమై ఆత్మార్థంగా ఉండదు.

## అనుష్ఠాన ప్రాధాన్యం

ఉద్ధవా! ఈ విషయాలన్నీ లోకోపకారార్థం వేదాలలో విశదీకరింపబడ్డాయి. అలాగని వేదాలను వల్లించినంతనే ఫలితం ఉండదు. వేదాలలో ప్రతిపాదింపబడిన తత్త్వాన్ని గ్రహించి ఎవరికేది అన్వయిస్తుందో గుర్తెరిగి దానిని అనుష్ఠించి స్వానుభవసిద్ధం చేసుకోవాలి. ఈ క్రమాన్నే అనుష్ఠానం అంటారు. పాలు పితకని ఆవు, అసతియైన భార్య, పరాధీనమైన శరీరం, దుర్మార్గుడైన పుత్రుడు, పాత్రులకు చేయని దానం ఏ విధంగా దుఃఖకరాలో ఆ విధంగానే అనుష్ఠాత కానివాని వేదాధ్యయనం దుఃఖప్రదం అవుతుంది.

## శ్రవణము

అనుష్ఠానానికి శ్రవణం ప్రథమాంగం. మననం ద్వితీయాంగం. దేనిని తెలిసికోదలిచామో, దానియొక్క తాత్పర్యాన్ని పెద్దలద్వారా వినటం వల్లనో, శాస్త్రపరిచయం వల్లనో నిశ్చయించటాన్ని శ్రవణ మంటారు.

## మననము

ఇది ద్వితీయాంగం. విన్నదాని సత్యాసత్యాలను సాధక బాధక

యుక్తులచేత విమర్శించితే దాన్ని మననమంటారు. ముముక్షువుకు జీవాత్మ పరమాత్మలను తెలిసికొనటం ముఖ్యాంశం. జీవాత్మ అంటే ఏమిటి? అది ఎక్కడుంటుంది? అన్న విచారమే ఇక్కడ విమర్శింపబడుతున్న విషయం.

జీవాత్మ అంటే ఏదంటావేమో? ఏది మన శరీరాంతరం నుంచి బాహ్యాంతర విషయాలన్నింటినీ చూస్తున్నదో, అదే అని గ్రహించు. చూస్తున్నది కన్నుగదా అని శంకింపవచ్చును. నీ మనస్సు వేరొక మార్గాన ఉన్నప్పుడు నీ కంటియెదుటనున్న వస్తువు కూడా నీకు కానరాకపోయింది కదా, చూస్తున్నది కన్నే అయినప్పుడు ఆ వస్తువు కనుపింపక పోవటానికి కారణం ఏమిటి? కాబట్టి కన్ను సాధన మాత్రమే తప్ప చూసేది వేరొకటున్నదని స్పష్టమవుతున్నది. చూసేది కన్ను కాకపోతే ఏమిటంటావా? మనస్సు ఎక్కడుంటుందో అక్కడున్న వస్తువు నీకు కనబడుతున్నందువల్ల కంటిని ఊతగా గొని చూస్తున్నది మనస్సు అని ఏర్పడుతున్నది.

చూస్తున్నది మనస్సయితే, నిద్రావస్థలో మనస్సు దాని వ్యాపారాన్ని చాలించి ఉంటుందన్నమాట నిర్వివాదాంశం కాబట్టి ఆ స్థితిలో మనస్సు చూడటమనేది లేకపోవటం వల్ల ఏదీ మనకు తెలియరాదనుకోవాలి. అయితే అలా జరగటం లేదు. నిద్రింపక పూర్వం, నిద్రాసమయంలో, నిద్ర మేల్కాంచినపుడు – ఈ మూడు సమయాలలోనూ మనస్సు యొక్క అవస్థ మనకు తెలియవస్తూనే ఉన్నది. అందువలననే 'నేను ఇన్ని గంటలకు పడుకొన్నాను; ఇంతసేపు గాఢంగా నిద్రించాను; ఇన్ని గంటలకు మేల్కొన్నాను; గాఢనిద్రలో నాకేమీ తెలియలేదు' మొదలయిన సంగతులు, అనగా ఈ మూడు కాలాలలో మనస్సుకు కలిగిన అవస్థాభేదాలు మనకు తెలుస్తూనే ఉన్నాయి. కాబట్టి చూస్తున్నది మనస్సు కాదని, మనస్సు కంటె వేరొకటి ఉన్నదని ఊహ కలుగుతున్నది.

అది ఏది? అని విచారిస్తూపోగా అన్నింటికి అవతల ఏదో ఒకటి ఉండి సమస్తాన్ని చూస్తున్నదని స్పష్టపడుతుంది. దానినే జీవాత్మ అని, ప్రత్యగాత్మ అని అంటారు.

ఈ జీవాత్మ కేవలం దృక్కు మాత్రమే గాక ఇంతకు పూర్వం చెప్పినట్లు త్రికాలజ్ఞానాన్ని కలిగి ఉన్నది. దేనికి త్రికాలజ్ఞానం ఉన్నదో, దానికి జనన మరణాలు కలుగనేరవు. అందువలన జీవాత్మ కేవలం ద్రష్ట మాత్రమే గాక అవినాశి అని కూడా ఏర్పడుతుంది. ఈ జీవాత్మను చిదాత్మ అని, చిత్తని, ఆత్మ అని అంటారు. ఉపాధిగత మయినందువల్ల వ్యవహారార్థం పరమాత్మకు, దానికి భేదమున్నదని అంటూ ఆ విధంగా నిర్ణయించారు. ఈ ఆత్మ స్వయంప్రకాశమానమై స్వప్రకాశంతో సూర్యునివలె ఇతరవస్తువులను ప్రకాశింపజేస్తున్నది.

ఈ జీవాత్మను ఆవరించి అంతఃకరణ మొకటి ఉంటుంది. అది ఆయా సందర్భాలలో చేసే పనులను బట్టి బుద్ధి అని, మనస్సని, చిత్తమని చెప్పబడుతున్నది. ఈ అంతఃకరణ జడముగా ఉన్నది. జడమంటే ఏమిటని అడుగుతావేమో? చైతన్యశక్తి లేనిదని కాదు. చైతన్యశక్తికి లక్షణ మేమిటంటావా? స్వయంప్రకాశమానత్వమే లక్షణం. ఏది స్వయంప్రకాశమానము కాదో, ఏది అన్యముల వలన తెలియబడుతున్నదో, అది జడమని తాత్పర్యం.

ఈ అంతఃకరణ మంచిచెడుగులను విమర్శించి నిశ్చయించేటపుడు దానిని బుద్ధి అన్నారు. అది కర్తృత్వం వహించినప్పుడు – అంటే 'నేను చేస్తున్నాను' అని భావించినప్పుడు – దానిని అహంకార మన్నారు. అది పూర్వవిషయాలను జ్ఞప్తిచేసినప్పుడు దానిని స్మృతి అన్నారు. అది సంకల్ప వికల్పాత్మక మైనప్పుడు దానినే మనస్సు అన్నారు. కార్యకర్మానికి ప్రేరేపించినప్పుడు దానిని చిత్తము అన్నారు.

ఈ గుణాలన్నీ అంతఃకరణకు స్వతస్సిద్ధాలు కావు. అవి
చిదాత్మ యొక్క భాసవలన కలుగుతున్నాయి. ఈ చిద్భాస
సోకనట్లయితే అది ఆ పనులను చేయలేకపోతుంది. ఈ చిద్భాస,

అంతఃకరణలు రెండూ వహ్నితప్తమైన అయఃపిండమూ, తత్ప్రకాశాల వలె అవినాభావంతో ఉంటాయి. చిత్తు, అహంకారము కలిసి ఉన్నప్పుడు – అంటే చిద్భాస అహంకార మందు ప్రకాశితమై రెండూ కలిసి ఉన్నప్పుడు దానిని జీవము అంటారు. జీవమంటే జడరూపమైన అహంకారమనే ఉపాధితో కూడి అవిభాజ్యంగా ఉన్న చిత్తే అని భావం. ఈ చిత్సంబంధం కలిగినప్పుడు జడరూపమైన దేహం అంతఃకరణ మొదలుకొని ఆద్యంతం చైతన్యశక్తిని పొంది వ్యవహరిస్తున్నది. ఆ చైతన్య సాన్నిధ్యం కలిమివల్లనే ఈ జడదేహానికి సూదంటురాయి సాన్నిధ్యంలో అయఃఖండానికి కలిగినట్లు శక్తి కలుగుతున్నది. ఈ రహస్యాన్ని గ్రహింపలేక దేహవ్యవహారాన్ని చూసి దేహమే చైతన్యమని భావిస్తున్నారు. ఈ భావమే అజ్ఞాన మనబడుతున్నది. ఏది నిజంకాదో దానినే నమ్మటం అజ్ఞాన శబ్దతాత్పర్యం. ఈ అజ్ఞానానికి అధ్యాస కారణం. అజ్ఞాన ఫలమే అహంకారం.

ఈ అహంకారానికి మునుపు చెప్పినట్లు చిచ్ఛాయతోను, తన్మూలకంగా సాక్షిచైతన్యం తోను, దేహంతోను తాదాత్మ్యం కలుగుతున్నది. తాదాత్మ్యమంటే ఏకీభావం. ఈ తాదాత్మ్యం సహజమని, కర్మజమని రెండు విధాలు.

## సహజ తాదాత్మ్యం

ఎప్పుడు చిచ్ఛాయ, అహంకారం తాదాత్మ్యాన్ని పొంది ఆ చిచ్ఛాయాశక్తి వలన అహంకారం వర్తిస్తున్నదో అప్పుడు దానిని సహజ తాదాత్మ్యమన్నారు. ఆ తాదాత్మ్యఫలంగా 'నేను ఎరుగుదును' అన్న భావం పొటమరించి అనుభవసిద్ధ మవుతున్నది. ఇదే దానికి లక్షణం. 'నేను ఎరుగుదును' అన్నప్పుడు జ్ఞాతృత్వానికి 'నేను' అన్నది కర్త అవుతున్నది. అంటే అహంకారం

కర్తృత్వభావాన్ని వహిస్తున్నదన్నమాట. కర్తృత్వభావాన్ని వహించిన అహంకారానికి, తద్భావకారణమైన చిచ్ఛాయకు కలిగే తాదాత్మ్యం సహజమని తాత్పర్యం.

## కర్మజ తాదాత్మ్యం

ఆ అహంకారం పూర్వకర్మసిద్ధమూ, శుభాశుభరూపమూ అయిన ఉపాధితో కూడి వర్తించినప్పుడు దానిని కర్మజమని అంటారు. అప్పుడది 'నేను మనుష్యుడను' అన్న రీతిని, అనగా మనుష్యోపాధిని తానుగా భావిస్తుంది. ఇదే కర్మజతాదాత్మ్య లక్షణం.

## భ్రాంతిజన్య తాదాత్మ్యం

ఇదిగాక ఒకదానిని చూసి మరొక దానిగా భావించే అహంకారాన్ని భ్రాంతిజన్యమని అంటారు.

## భక్తుల విభజన

ఉద్ధవా! ఈ విషయం అనుభవసిద్ధం కావాలని కృషిచేస్తుంటారు. ఆ కృషినే భక్తి అంటారు. అది చేసేవారు పరాభక్తులని, అపరాభక్తులని రెండు తరగతులుగా ఉంటారు. పరాభక్తుడినే జ్ఞాని అనికూడా అంటారు. అపరాభక్తులు జ్ఞానమిశ్ర భక్తులని, శుద్ధ భక్తులని రెండు విధాలు.

## పరాభక్తుడు

పరాభక్తుడు ఉత్తమోత్తముడు. (7-17). పరాభక్తుడే జ్ఞాని. అతనికి, నాకు భేదమే లేదు. ఎందుకంటావేమో? భక్తి అంటేనే అది ప్రేమఫలం. ప్రేమించటానికి ప్రేమించేవారొకరు, ప్రేమింపబడేవారొకరు - ఇద్దరుండాలి. అంటే, ద్వైతవాసన ఉండాలి. పరాభక్తుని భక్తి కేవల జ్ఞానరూపమై ఉంటుంది.

ఎప్పుడయితే జ్ఞాని అన్నామో అప్పుడే 'సర్వమ్ ఏక' మనే భావన తప్ప రెండవదానికి చోటులేదు. అంటే అతనికి ద్వైతభావం వాసనామాత్రంగానైనా ఉండదన్నమాట. అందువల్ల అతను నాతో ఐక్యానుసంధానుడై ఉంటాడు. ఐక్యమైనప్పుడు భక్తికే అవకాశం లేదని, అట్టివానిని పరాభక్తుడని అనడమెందుకని అడుగుతావేమో? పరాభక్తి ఎక్కడ అంతమయిందో అక్కడ జ్ఞానం ఉదయిస్తున్నది. ఆ రెండింటికి అవస్థాభేదాన్ని కల్పించటం సాధ్యం కాదు. భక్తితత్త్వాన్ని బోధించేందుకు దానిని పరాభక్తి అన్నానే గాని అది వేరనే ఉద్దేశంతో కాదు. పరాభక్తుడే జ్ఞాని అని, జ్ఞానియే పరాభక్తుడని గ్రహించు.

## జ్ఞానమిశ్ర భక్తుడు

ఎవరు నా తత్త్వజ్ఞానం కొంతకు కొంత కలిగి నాకు భక్తికావిస్తే వారిని జ్ఞానమిశ్ర భక్తులని అంటారు.

జ్ఞానమిశ్ర భక్తులను సాధువులని కూడా పేర్కొంటారు. వారి లక్షణాలేమిటో విను. వారు పరమకృపాళువులుగా ఉంటారు. చలిచీమకు ద్రోహం చేయమన్నా చేయలేరు. అట్టివారు సహనమూర్తులై సత్యమే ప్రాణమని భావించి అనవద్యచిత్తులు, సర్వసములు, సర్వోపకారకులు అయి కామస్పర్శ లేని బుద్ధి, దాంతము, మార్దవం, శుచిత్వం, అకించనత్వం కలిగి మితాహారవ్యవహారులై నన్నే శరణుగొని నా తోడిదే మననంగా ఉంటారు. ఆకలిదప్పులు వారిని బాధింపనేరవు. వారు గుణదోషజ్ఞులై అంతఃకరణ పరిపక్వతానుసారంగా శాస్త్రనిబద్ధధర్మాలను కూడా విడిచిపెడుతూ చివరికి పరాభక్తుని అధిష్ఠింపగలరు.

పరాభక్తిని రాగానుభక్తి అనికూడా పేర్కొంటారు. ఆ స్థితిలోని ఆనందం వారికి ప్రియతరమై భాసిస్తుంది. వారికి రవ్వంత ద్వైతవాసన ఉంటుంది. అందువలన వారికి ద్వంద్వజ్ఞానం అంతో ఇంతో మిగిలి ఉండక తప్పదు. అయినా జ్ఞానం ఉన్నది కాబట్టి వారు ఆ ద్వైతవాసనకు లోనుగాక

వర్తిస్తుంటారు. (16 -1, 2, 3).

## శుద్ధ భక్తుడు

ఉద్ధవా! శుద్ధభక్తుడు నా తత్త్వవిచారమే చేయడు. అతను అనన్య భావంతో మనోవాక్కాయకర్మల నన్ను ఆరాధిస్తూ నా విభూతులను, నా భక్తులను సందర్శిస్తూ పూజిస్తూ సేవిస్తూ స్తుతులు చేస్తూ నేనొనర్చిన కార్యాలను శ్లాఘిస్తూ నా కథలను శ్రద్ధతో వింటూ నన్ను ధ్యానిస్తూ సర్వం నాకే సమర్పిస్తూ నాకు దాస్యం చేస్తూ మదర్పితచిత్తుడై నా అవతారచరిత్రలను పేర్కొంటూ నా పర్వదినాలలో నియమవ్రతుడై ఉంటూ నా దేవాలయాలలో నాకు ఉత్సవాదులను జరుపుతూ దివ్యతీర్థక్షేత్రయాత్రలు సల్పుతూ నా పేర దానాదులను ఇస్తూ వైదిక తాంత్రిక దీక్షలను నిర్వహిస్తూ నా విగ్రహాలను ప్రతిష్ఠింపజేస్తూ నాకై స్వయంగానో ఇతరుల సాయంతోనో ఉద్యానోపవనాలలో క్రీడాస్థానాలను, దేవాలయాలను నిర్మిస్తూ వాటియందు జరుగుతున్న కార్యక్రమాలను ద్రోహబుద్ధి లేక విచారిస్తూ నైచ్యభావాన్ని, అభిమానాన్ని, వదలి నా ఆలయాలలో నాకు ఊడిగాలు చేస్తూ శిథిలమైపోయినవాటిని పునర్నిర్మిస్తూ నిరంతరం నా కార్యాలలోనే నిమగ్నుడై ఉంటాడు.

శుద్ధ భక్తునికి అభిమానం గాని గర్వలేశం గాని ఆడంబరాలు గాని ఆత్మప్రకటనం గాని ఉండవు. నాకు అర్పించినదానిని తృణమాత్రమైనా తనకోసం అతను గ్రహింపడు. ఏదేది లోకులకు ఇష్టతమమో ఏదేది తనకు ప్రియతమమో దానినల్లా నాకే అతను సమర్పిస్తుంటాడు.

## ధ్యేయాకారస్థానం

ఉద్ధవా! ధ్యేయాకారానికి బహిస్థానమని అంతస్థానమని రెండు స్థానాలున్నాయి. సాధన ప్రథమావస్థలో ధ్యేయాకారాన్ని కన్నులయెదుట

ఉంచుకొని ధ్యానిస్తారు. దీనినే బహిస్థానమని అంటారు. సాధనసిద్ధులు ధ్యేయాకారాన్ని తమ హృదయస్థానంలో నిలుపుకొని ధ్యానిస్తారు. దీనినే అంతస్థానమని అంటారు. లోతుగా పరిశీలించితే హృదయస్థానమే ఉత్తమమని తెలుస్తుంది. ఏమంటావా? పరమాత్మ సర్వభూతహృదయాలను అధిష్ఠించి ఉన్నవాడు కాబట్టి అక్కడ ధ్యేయాన్ని పాదుకొలిపి చూపునిలిపి ధ్యానించటం భగవత్సాన్నిధ్యంలో ధ్యానించినట్లవుతుంది. (18 – 61, 62).

ఉద్ధవా! శరీరంలో సుషుమ్నమనే నాడి ఉన్నది. దాని ఎడమభాగాన్ని అంటుకొని నాభిప్రదేశానికి పన్నెండంగుళాల పై భాగంలో హృదయం తామర మొగ్గను సరిపోలి ఉంటుంది. తామరమొగ్గను పోలి ఉన్నందువల్ల హృదయాన్ని హృదయకమల మన్నారు. ఆ హృదయకమలం అధోముఖంగా – అంటే నాళం మీదికి, ముఖం క్రిందికి – ఉంటుంది.

దానికి ఎనిమిది దళాలు, కర్ణిక (దుద్దు) ఉన్నాయి. ధ్యానసమయంలో ఆ కమలం ఊర్ధ్వముఖంగా అధోనాళంగా దాని కర్ణికమీది సూర్యుడు, అతని లోపల చంద్రుడు, అతని లోపల అగ్ని ఉన్నట్లు, ఆ అగ్నిలోపల ధ్యేయమూర్తి ఉన్నట్లు భావించి ధ్యానించాలి.

## ధ్యాన పూర్వాంగం

ఉద్ధవా! ధ్యానం స్థూలము, సూక్ష్మము అని రెండు విధాలు. సాకారాన్ని గురించి ధ్యానించటం స్థూలమని, దయాదిగుణాలను గురించి ధ్యానించటం సూక్ష్మమని విధింపబడింది. ధ్యానానికి మనోనిశ్చలత్వం ప్రధానం. అది ప్రాణాయామం వలన సిద్ధిస్తున్నది. దానికి ఆసనం ప్రధానం. ఆసనాలు పెక్కు విధాలు. ఎవరికేది సుఖాసనమో దానిని అభ్యసించాలి.

ధ్యానసమయంలో శరీరం భూమికి తగిలితే శరీరతేజస్సు భూగతమై ధ్యానసిద్ధికి అంతరాయం కలుగుతుంది. అందువలన ధ్యాత సమోన్నతమైన పీఠంపైని కూర్చుండి ధ్యానానికి ఉపక్రమించాలి. భూసమాకర్షాన్ని ఇంకా నిరోధించాలని ఆ పీఠంమీద దర్భలను, వాటిమీద కృష్ణాజినాన్ని, దానిపైని

శుభ్రవస్త్రాన్ని పరిచి ఉంచుతారు. ఇందులో ఒక్కటొక్కటి భూ సమాకర్షాన్ని నిరోధింపగలవిగా ఉన్నాయి.

ఆ విధంగా కూర్చుండి శరీరం, శిరస్సు, కంఠనాళం – ఇవి మూడూ వంకరలేనట్లుగా సమమై ఉండేట్లుగా చేసి, తొడలపై కరతలాలను ఉంచి, దృష్టిని నాసికాగ్రమందుంచి స్తిమితంగా ధ్యానం మొదలుపెట్టాలి. దీనివల్ల ఏకాగ్రత సులభసిద్ధ మవుతుంది.

దృష్టి నిలిపిన తర్వాత పూరక కుంభక రేచకపూర్వకంగా అనులోమవిలోమక్రమంగా నాడీశోధనను క్రమక్రమంగా మెల్లమెల్లగా చేయాలి. దీనినే ప్రాణాయామ మంటారు. (6–10, 11, 12, 13, 14).

మనుష్యాదులు లోపలికి పీల్చుతూ విడిచిపెడుతూ ఉండే వాయువునే ప్రాణమని కొందరంటారు. అది నిజం కాదు. శరీరంలో ఒక విధమైన అంతశ్శక్తి ఉన్నది. అది శరీరావయవాలను వాటివాటి వ్యాపృతులలో ప్రవర్తింపజేస్తుంటుంది. ఆ శక్తికే ప్రాణమని పేరు. అది ప్రవాహసరణిని ప్రసరిస్తుంటుంది. దాని గమనానికి వాయువు తోడ్పడుతున్నది. ప్రాణానికి తోడ్పడుతున్నందువలన దానిని ప్రాణవాయువని అన్నాము.

ప్రాణరూపమైన ఆ శక్తిని హెచ్చుతగ్గులు లేక సక్రమగతిని ప్రవర్తిల్లజేయటమే ప్రాణాయామఫలం. ప్రాణాయామం కావించే సమయంలో ఆ ప్రాణాన్ని నఖశిఖపర్యంత సక్రమగతిని వర్తింపజేస్తున్నానని సంకల్పిస్తూ సాధకుడు ప్రాణగతి వెంట తన మనస్సును అనుసరింపజేయాలి. అభ్యాసవశాన ఇందులోని రహస్యాలు సాధకునికి స్పష్టపడుతుంటాయి.

## ప్రత్యాహారం

ప్రాణాయామ సాధనకాలంలో మనస్సును చలింపనీయక ఉంచడమే ప్రత్యాహారం. మనశ్చాంచల్య నిరోధం ఆకస్మికంగా ఉండకూడదు. నెమ్మది

నెమ్మదిగా మనస్సును అదుపులోకి తెచ్చి ప్రత్యాహారాన్ని సాధించాలి. (6-25, 26).

వాయువును విడిచిపెట్టడం రేచక మనబడుతుంది. అప్పుడు 'ఓం' అని మొదలుపెట్టి ఆ ప్రణవంతోపాటు వాయువును మూలాధారం నుంచి హృదయస్థానానికి తీసుకొనిరావాలి. ఓంకారస్వరం సన్నని ఘంటానాదం వలె ఉంటుంది. ఆ నాదం మూలాధారం నుంచి సుషుమ్న నాళం గుండా సన్నని పట్టుపోగులాగా పైకి ప్రాకివస్తుంది. ఈ నాదాన్ని అనాహతమంటారు. యోగాన్ని అభ్యసించేకొద్దీ ఈ నాదం వినవస్తుంటుంది.

ప్రణవయుక్తంగా ప్రతిదినం మూడు సంధ్యలలో ప్రాణాయామం చేస్తుండాలి. ఒక్కొక్క సంధ్యాసమయంలో పది ప్రాణాయామాలు చేస్తే చాలును. అలా ఒక్కమాసం నిర్విఘ్నంగా ప్రాణాయామం చేసినట్లయితే సిద్ధి కలుగుతుంది.

## ధ్యానావస్థలు

ఉద్ధవా! సాధకుడు తనదృష్టిని ధ్యానం ప్రారంభదశలో బాహ్యపదార్థాల నుంచి మళ్ళించి నా సర్వాంగస్వరూపమందు నిలిపి ఉంచాలి. అందుకు అతని మనోబుద్ధులే సహకారులు కాగలవు. ఇది ధ్యానప్రథమావస్థ.

తర్వాత దృష్టిని అక్కడినుంచి మరలించి సుస్మితాయతమైన నా ముఖారవిందమందు నిలపాలి. ఇది ద్వితీయావస్థ.

ఆ తర్వాత దానిని నా విశ్వరూపమందు చేర్చాలి. ఇది తృతీయావస్థ.

ఇంతవరకు చెప్పినది సగుణధ్యానపద్ధతి. తర్వాత దానిని నా నిర్గుణ బ్రహ్మతత్త్వమందు లయింపజేయాలి. ఇది తురీయావస్థ. దీనినే సమాధి అంటారు. ఈ సమాధ్యవస్థలో జీవాత్మ పరమాత్మనైన నాయందు, నేను జీవాత్మయందు జ్యోతిలో జ్యోతి కలిసినట్లు లీనమవుతాము. ఇదే అద్వైత

సిద్ధి. ఈ స్థితికి వచ్చినప్పుడు ద్రవ్య జ్ఞాన క్రియాభ్రమలన్నీ నశించిపోతాయి. అదే నిర్యాణం. (15-4).

## సత్సాంగత్యం

ఉద్ధవా! సంసారసాగరాన్ని తరించాలంటే భక్తిమార్గానికి మించిన సాధనం లేదు. ఆ మార్గం సర్వజనులకు సులభసాధ్యమైనది కావడంవల్లనే దానికి అంత ప్రాశస్త్యం ఏర్పడింది. భక్తికి సత్సాంగత్యం పుష్పానికి పరిమళం వంటిది. ఉద్ధవా! నీవు నాకు పరమభృత్యుడవే గాక సఖుడవు సుహృత్తువు కాబట్టి నీకు గోప్యాతిగోప్యమైన రహస్యాన్ని కూడా విప్పిచెప్పాను. (18-64).

ఉద్ధవా! యోగము, సాంఖ్యము, ధర్మము, స్వాధ్యాయము, తపస్సు, త్యాగము, ఇష్టాపూర్తము, దాన వ్రత యజ్ఞాలు, మంత్ర తీర్థయాత్రా యమనియమాదులు, తదితరసాధనాలు, వీటిలో ఏదీ వ్యష్టిగా కాని సమిష్టిగా కాని సాధుసాంగత్యానికి సాటిరావు. ఎందుకంటావా? నన్ను చేరటానికి సర్వసంగపరిత్యాగమే ముఖ్యాతిముఖ్యం. అది యోగాదుల వలన కాలక్రమంగా బహుకాలానికి గాని సిద్ధించేది కాదు. సాధుసాంగత్య మన్నదో వెంట వెంటనే అగ్ని లోహాన్ని పరిశుద్ధ మొనర్చినట్లు తత్త్వాన్ని శుద్ధిపరచి సర్వసంగపరిత్యాగబుద్ధిని కలిగిస్తుంది. సత్సాంగత్యం వల్ల రాజసిక తామసిక తత్త్వాలు సయితం మారి నన్ను పొందినందుకు నిదర్శనలెన్నో ఉన్నాయి.

## నిదర్శనాలు

వృత్రాసురుడు తొలిజన్మలో నారదాంగిరసుల సాంగత్యాన్ని పొందిన కారణంగా మరుజన్మలో సులభంగా కడతేరగలిగాడు. ప్రహ్లాదుడు రాక్షసునికి జనించినా గర్భస్థుడై ఉండగా నారదోపదేశాన్ని విన్న కారణాన పరమభక్తుడై సిద్ధిపొందాడు. వృషపర్వుడు సాధుజనపోషణ పుణ్యఫలంగా తరించాడు. బలిచక్రవర్తి రాక్షసుడైనా అతని తాత ప్రహ్లాదుని సాంగత్యం వలన కళ్యాణపదానికి నోచుకొన్నాడు. బలిచక్రవర్తి జ్యేష్ఠపుత్త్రుడైన బాణుడు

పరమశివుని సాంగత్యం కలిమి వలన శుభపరంపరలు పొందాడు. మయుడు ఇంద్రప్రస్థపురాన్ని నిర్మించినప్పుడు అతనికి పాండవులతో సాంగత్యం చేకూడిన కారణాన మేలుపొందాడు. విభీషణ సుగ్రీవులు హనుమత్సాంగత్యం వలన శ్రేయోభాగ్యాన్ని పొందారు. హనుమజ్జాంబవంతులు శ్రీరాముని సాంగత్యం వలన, నా సాంగత్యం వలన కృతకృత్యులయ్యారు.

ఉద్ధవా! శాపవశాన గజేంద్రుడు ఏనుగు గాను, అతని వైరి మొసలిగాను పుట్టారు. వారికి హోరాహోరి పోరు కలిగింది. గజేంద్రుడు లావు దక్కి చిక్కాడు. అతనికి గత్యంతరం తోచలేదు. అటువంటి క్లిష్టసమయంలో అతని పూర్వజన్మ సాధుసాంగత్యఫలం పరిమళించింది. అతని బుద్ధి నా వంకకు ప్రసరించింది. నేనతనికి బంధముక్తి కావించాను.

జటాయువు గరుడుని యొక్క, దశరథుని యొక్క సాంగత్యఫలంగా ముక్తికి అర్హుడయ్యాడు. తులాధారుడు శూద్రుడయినా నారదుని సాంగత్య ఫలంగా పరావాప్తి గన్నాడు. ధర్మవ్యాధుడు నీచవృత్తితో జీవిస్తున్నా అతని పూర్వజన్మలో అతనికి వైష్ణవుడైన ఒకానొక రాజుతో కలిగిన సాంగత్యఫలంగా సిద్ధినొందాడు. గోపికలు, మునిపత్నులు నా సాంగత్యాన కృతార్థినులయ్యారు.

ఉద్ధవా! గోపికలు ఏ చదువూ చదువుకోలేదు. ఆశ్రమవాసుల సేవలేమిటో ఎరుగరు. ఎటువంటి తపస్సులు చేసినవారు కారు. వారందరూ సత్సంగఫలంగా నన్ను చేరనోచిన సంగతి నువ్వు కళ్ళారా చూశావు. స్త్రీలు, సహజమూఢలు అయిన గోపికలే సత్సాంగత్యాన అటువంటివారు కాగా జ్ఞానుల సంగతి వేరే చెప్పాలా? మనుష్యులే అనెందుకు? గోవులు మృగాలు సర్పాలు చివరికి చెట్టుచేమలు సయితం వేనవేలుగా సత్సాంగత్యఫలంగా నాయెడ ప్రేమరూప గాఢభక్తిని నెరపి సిద్ధిపొందాయి.

ఉద్ధవా! నన్ను చేరటానికి కొందరు సాంఖ్యయోగాన్ని ఆశ్రయిస్తారు; కొందరు తపోవ్రతాలను ఆచరిస్తారు; కొందరు ధ్యాననిష్ఠను అవలంబిస్తారు; కొందరు స్వాధ్యాయాన్ని కొందరు సన్న్యాసాన్ని గ్రహిస్తారు. వీరందరికీ

ఏండ్లకు పూండ్లకు కూడా ఏది సాధ్యంకాదో అది భక్తికి సులభసాధ్య మవుతున్నది.(11-53, 54).

## భక్తి రహస్యం

ఉద్ధవా! భక్తివిషయంలో పరమరహస్యం ఒకటున్నది. నీకోసం దానిని సోదాహరణంగా వివరిస్తాను విను. కంసుడు నన్నూ బలరామునీ చంప నిశ్చయించి పన్నాగం పన్ని మా ఇద్దరినీ బృందావనం నుంచి శ్వఫల్గుని పుత్రుడైన అక్రూరుని మూలాన ద్వారకకు రప్పించిన సంగతి నీకు తెలిసినదే కదా. మేము బయలుదేరినప్పుడు గోపికలు నా వియోగాన్ని భరింపలేక పడిన ఆరాటం మరచిపోదామన్నా మరపుకు రాదు. వారు నానుంచి కోరిన కోరికలేమీ లేవు. నా కోసం ప్రాణాలిమ్మన్నా సంసిద్ధంగా ఉంటారు. కొందరు పుత్రభావనతోనూ, కొందరు సోదరభావం తోనూ, కొందరు స్నేహభావం తోనూ వారు తమతమ ఇష్టానుగుణంగా నాయెడ ప్రేమరసాన్ని కుమ్మరిస్తారు. వారు దేనినయినా సహింపగలరు కాని నా వియోగాన్ని మాత్రం సహింపలేరు. సర్వకాల సర్వావస్థలలో నాతో కలిసి ఉండటమే వారికి పరమానందదాయకం. తల్లులు వద్దు వద్దన్నా, తండ్రులు కూడదన్నా, సోదరు లడ్డగించినా, ఎవరేమిచేసినా నన్ను చూడని దినం వారికి దుర్దినప్రాయం. నన్ను సందర్శించటం, నాతో సల్లాపించటం, నాకు ప్రీతి కలిగించటం – ఇవి తప్ప అన్యకార్యాలు వారికి లేవు. వారి చిత్తాలు ఆ విధంగా ప్రేమాయత్తమై నాయందే లీనమైనందువల్ల వారు స్వకీయులనే గాక స్వశరీరాలను కూడా విస్మరించారు. యోగులు సమాధ్యవస్థలో నామరూపజ్ఞానహీనులై ఉన్నట్లు, నదులు సముద్రంలోకి కలిసినప్పుడు నామరూపరహితాలైనట్లు, గోపికలు నాయందే దృష్టి నిలిపి బాహ్యజ్ఞానశూన్యలుగా ఉంటారు.

ఉద్ధవా! గోపికలకు విద్యాజ్ఞానం లేదు. ఎవరి శుశ్రూషలు చేసి యెరుగరు. ఉపదేశభాగ్యాలు లేవు. ఐనా వారు నాయెడ ఆ విధంగా

ప్రవర్తించారు. ఇదంతా సాధుసాంగత్యఫలం కాకపోతే మరేమిటి?

ఉద్ధవా! నీకు విద్యాసంపద ఉన్నది; గురువులను సేవించావు; సాధువులతో కలిసి మెలిగావు; ఇంతటి మహాభాగ్యం చేకూరి నిరుపేద వలె దిగులు పడతావేమిటి? ఉద్ధవా! ఇన్ని మాటలెందుకు? ధర్మాధర్మాలను వర్జించి ప్రవృత్తి నివృత్తి మార్గభేదాలను మరిచి, జ్ఞానాజ్ఞానవిచారం మాని, నాకు సర్వాత్మసమర్పణపూర్వకమైన భక్తి జరుపు. అన్ని భయాలు తొలగి సుఖంగా ఉంటావు. (18–66).

## జీవప్రవేశం

శ్రీకృష్ణభగవానుని పలుకులను ఉద్ధవుడు సాంతం విని, 'స్వామీ! నాకింకా కొన్ని సందేహాలున్నాయి. పరమాత్మ సర్వవ్యాప్తియై ఉండి శరీరంలోనికి ఏ విధంగా ప్రవేశించి జీవాత్మ కాగలడో వివరింప గోరుతున్నాను' అన్నాడు.

అప్పుడు భగవానుడు ఉద్ధవునికి జీవాత్మవివేకాన్ని బోధించాడు. 'ఉద్ధవా! పరమాత్మ తన ప్రకృతి నధిష్ఠించి విశ్వరూపాన్ని ధరిస్తాడు. పరమాత్మ యొక్క ప్రకృతి పరాప్రకృతి, అపరాప్రకృతి అని రెండు విధాలు. జీవభూతసృష్టి సమస్తం పరాప్రకృతి, జడసృష్టి సమస్తం అపరాప్రకృతి అనబడుతున్నాయి. పరాప్రకృతిని అక్షరమని, అపరాప్రకృతిని క్షరమని కూడా అంటారు. పరాప్రకృతి వలన సమస్తజగమూ ధరింపబడుతున్నది. పరమాత్మ తన రెండు ప్రకృతుల నధిష్ఠించినా వాటి కంటె ఉత్తముడై పురుషోత్తమాఖ్యతో అలరారుతుంటాడు. జగద్ధారణ కారణాన పరమాత్మను ఈశ్వరుడని అంటారు. (7–4, 5, 7; 15–16, 17).

పరమాత్మ సృష్టిని కల్పించి అందులోనికి ప్రవేశించాడు. ఏ రూపంలో ప్రవేశించాడంటావా? ప్రాణరూపాన ప్రవేశించాడు. ఆ ప్రాణాన్నే జీవుడంటారు. ప్రవేశకాలంలో ఆ ప్రాణం సూక్ష్మాతిసూక్ష్మమైన నాదరూపంలో ఉంటుంది.

వెన్నెముకనంటి సుషుమ్నమనే నాళం ఉన్నది. దాని పొడవున అక్కడక్కడ ఆరుకమలాలు ఉన్నాయి. కమలమంటే నిలయస్థానమని అర్థం చేసుకోవాలి. ప్రథమ కమలం మూలాధారంలో ఉంటుంది. గుదస్థానానికి పైభాగాన్ని మూలాధారమని అంటారు. పరమాత్మ మొమ్మొదట ఆ మూలాధార కమలం లోనికి ప్రాణరూపంలో ప్రవేశిస్తాడు.

ప్రాణమంటే సూక్ష్మాతిసూక్ష్మ నాదరూపమని చెప్పాను. ఆ నాదం మూలాధారం నుంచి సుషుమ్నానాళద్వారాన క్రమక్రమంగా ఎగబ్రాకి నాభిప్రదేశంలో ఉన్న మణిపూర కమలాన్ని చేరుకొంటుంది. అప్పుడు ప్రాణవాయువు కొంత దిటవై పశ్యంతి అనబడుతుంది. అది మరికొంత దిటవుచెంది అక్కడినుంచి తరలి ఆ నాళ ద్వారాననే హృదయస్థానం లోని అనాహత కమలాన్ని చేరుతుంది. అప్పుడా పశ్యంతినే మధ్యమమంటారు. మధ్యమమే మరికొంత దిటవుగొని వైఖరి అనబడుతున్నది.

వైఖరీనాదం మొట్టమొదట మాత్రారూపంగా ఉండి స్వరరూపాన్ని పొంది తుదకు వర్ణరూపాన్ని ధరిస్తుంది. మాత్రారూపమైన నాదం హ్రస్వదీర్ఘాలయిన అచ్చులుగాను, స్వరరూపమైన నాదం ఉదాత్తానుదాత్తస్వరితాలు గాను, వర్ణరూపమైన నాదం క ఖ మొదలయిన అక్షరాలు గాను, వినబడుతుంది. ఈ వర్ణసముదాయాన్ని ఉచ్చరించటమే వాక్కు. దీనినిబట్టి ప్రాణానికి వాక్కు ప్రధానలక్షణమని ఏర్పడింది.

ఉద్ధవా! ఆ తీరున నేను పరారూపంలో శరీరాన్ని ప్రవేశించి వాగ్రూపంలో వ్యక్తమౌతాను. ఈ త్రివిధనాదాలలో పశ్యంతీ నాదం ప్రాణసంబంధమై మధ్యమ నాదం మనస్సంబంధమై వైఖరీ నాదం బుద్ధిసంబంధమై ఉంటాయి. దారువులో స్వతస్సిద్ధంగా అణిగి ఉండే అగ్నికి ప్రాణనాదాన్ని, దారువును తరచగా పుట్టిన నిప్పురవ్వకు పశ్యంతీనాదాన్ని, దృశ్యమయే మంటకు వైఖరీనాదాన్ని సరిపోల్చవచ్చును.

## జీవ లక్షణాలు

ఉద్ధవా! నేను శరీరగతుడనై ఉన్నట్లు ఎలా తెలుస్తుందని అడగవచ్చు. నేను శరీరస్థుడనై ఉండటం వల్లనే కర్మేంద్రియాలు వాక్కర్మగతి విసర్జనరూపమైన వాటివాటి వ్యాపృతులను, జ్ఞానేంద్రియాలు దర్శన స్పర్శన శ్రవణ రసన ఘ్రాణరూపమైన కార్యాలను, మనస్సు సంకల్పరూపమైన తన వ్యాపారాన్ని, బుద్ధిచిత్తాలు విజ్ఞానరూపమైన వ్యాపారాన్ని, అహంకారం అభిమానరూపమైన తన వ్యాపారాన్ని, సూత్రాత్మ గుణత్రయవ్యాపారాన్ని సాగిస్తున్నాయి. నేను శరీరగతుడనని తెలిసికొనడానికి ఈ చెప్పినవన్నీ లక్షణాలు. ఇందులో ఏ లక్షణం కనిపించినా నేను ఆ ఉపాధిలో ఉన్నానని గ్రహింపవచ్చును.

## సూత్రాత్మ

సూత్రాత్మ నా ప్రకృతివలన కలుగుతున్నది. నా ప్రకృతిని ప్రధానమని కూడా అంటారు. సూత్రాత్మకు ప్రాణమని, హిరణ్యగర్భుడని, మహత్తని, వాయువని నామాంతరాలున్నాయి. సూత్రాత్మను పౌరాణికభాషలో బ్రహ్మ అంటారు. ఈ బ్రహ్మకే సృష్టికర్త అని పేరు. సూత్రాత్మనుంచి మనస్సు (మేటర్) కలుగుతున్నది.

జీవుడు అన్న శబ్దానికి సమస్తాన్ని జీవింపజేసేవాడని అర్థం. నేనిందాక చెప్పినట్లు పరమాత్మ అయిన జీవుడు మొట్టమొదట అవ్యక్తునిగా, ఏకునిగా ఉండి తన విశిష్టశక్తి అయిన ప్రకృతిని అధిష్ఠించి కాలక్రమాన వివిధరూపాలను ధరిస్తాడు. ఈ రూపబహుత్వాన్నే సమిష్టిమీద విశ్వము అంటారు.

## విశ్వవృక్షం

విశ్వాన్ని మహావృక్షానికి సరిపోల్చవచ్చును. ఈ విశ్వవృక్షం
నిరంతర కర్మాత్మకమై ఉంటుంది. దానికి ధర్మాధర్మాలనే రెండు
బీజాలున్నాయి. ఈ వృక్షం కోరికలనే వేరుల ఆధారంతో నిలిచి

> గుణత్రయమనే మూలాన్ని కలిగి పంచభూతాలనే శాఖలతోను, కర్మేంద్రియాలనే ఉపశాఖలతో, పంచేంద్రియాలనే నాళాలతో పెరుగుతూ సుఖదుఃఖాలనే ఫలాలను కాస్తుంటుంది. పరమాత్మ జీవాత్మలనే పక్షులు రెండు దానిపై కాపురం ఉంటాయి.
>
> ఈ విశ్వవృక్షం సూర్యమండలం వరకు వ్యాపించి ఉంటుంది. ఆ పైని దానికి వ్యాప్తిలేదు. జీవుడు భూమండలగతుడై సకామకర్మలను ఆచరిస్తున్నంతకాలం ఆ కర్మఫలాలను భోగిస్తూ అక్కడే పర్యటిస్తుంటాడని, సత్కర్మాచరణాదుల వలన మహాపుణ్యాన్ని సంపాదింపగలిగితే భూమండలాన్ని వదిలి సూర్యమండలానికి పోతాడని, అక్కడకు వెళ్ళిన జీవునికి పునరావృత్తి లేదని గ్రహించు. (15-1, 2).

ఉద్ధవా! జీవుని బంధముక్తితత్త్వాన్ని విచారించడమంటే నేను చెప్పిన పక్షులు రెండింటి యొక్క - అంటే జీవాత్మ పరమాత్మల యొక్క విచారమే. జీవుడు గుణబద్ధుడయితే తత్ఫలంగా అతనికి కాంక్ష, తత్ఫలంగా ఇంద్రియవశత్వమూ తప్పవు. ఇంద్రియవశుడు తన కర్మములకు ఫలంగా కలిగిన సుఖదుఃఖాలను అనుభవిస్తూ జననమరణరూప సంసారి అవుతున్నాడు. పరమాత్మ ఆ వృక్షమందే ఉన్నప్పటికీ నిష్కాముడు, జితేంద్రియుడు కాబట్టి ఫలాశ లేక సుఖంగా ఉంటాడు.

## కాంక్షా బీజం

ఉద్ధవా! నిఖిలాపదలకు కాంక్షే మూలమని తెలిసినా మర్త్యులు కాంక్షావశవర్తులై విషయాల వెంట కుక్కల వలె పరుగులు తీయటం చూస్తున్నదే కదా. దీనికి కారణమేమిటో తెలుసా? అజ్ఞానమే కారణం. అజ్ఞానమంటే జ్ఞానం లేకపోవటమని కాదు. ఏది పర్యవసానంలో తనకు మేలుకాదో, అదే తప్పక మేలని భ్రమపొందటం అజ్ఞానలక్షణం. అట్టి విపరీతజ్ఞానానికి మమకారమే కారణం. ఆ మమకారానికి మనస్సు కారణం.

మనస్సు అంటే ప్రారబ్ధకర్మవాసనాసముచ్చయమని, వాసనలు శుద్ధాశుద్ధమిశ్రమాలుగా త్రిగుణవ్యాపారఫలాలుగా ఉంటాయని, మనస్సు దాని వ్యవహారవిశేషాలను బట్టి బుద్ధ్యాదినామాలను పొందుతున్నదని, ఆ బుద్ధ్యాదుల వ్యవహారము లెటువంటివో మునుపు వివరించాను.

బుద్ధికి హితాహితనిశ్చయశక్తి సహజం. బుద్ధి ఆ విధంగా నిశ్చయిస్తున్నా మలినవాసనలు మిక్కుటంగా ఉన్నప్పుడు వాటిముందు బుద్ధిచేసే బోధ వినబడదు. మర్త్యుడందువల్ల ఎంతచెప్పినా మలినవాసనాప్రేరణనే అనుసరించి చెడుతున్నాడు. బుద్ధిబోధ ఘంటాపథంగా వినబడాలంటే దానికి ఉపబలాన్ని చేకూర్చాలి. అట్టిది శాస్త్రజ్ఞాన సజ్జనసాంగత్యాదుల వలన సిద్ధిస్తుంది. శాస్త్రజ్ఞానాదులు రజస్సు యొక్క ఉద్ధతిని తగ్గించి సత్త్వాన్ని వృద్ధిపొందిస్తాయి. తత్ఫలంగా బుద్ధిశక్తి బలపడుతుంది. అప్పుడది గట్టిగా చెవిలో ఇల్లుకట్టుకొని బోధిస్తుంది. ఆ బోధను సులభంగా అవతలికి త్రోయలేక పోతారు. (14-7; 2-61, 63).

ఉద్ధవా! మనస్సు అందరికీ ఉన్నదన్నాను; అది త్రిగుణాత్మికమన్నాను; గుణములు తమ కార్యాలను చేస్తూనే ఉంటాయని అన్నాను. దానిని బట్టి లోకమంతా గుణబద్ధమై వర్తింపవలసినదే కాని వేరు మార్గాన్ని అవలంబించటం వీలుకాదని; లోకమంతా అట్టిదే అయినప్పుడు కొందరు గుణబద్ధులు, కొందరు గుణాతీతులు ఉండటం ఎలా సాధ్యమవుతుందని అనుమానిస్తావేమో? ఈ గుణాలు వివేకిని కూడా ఆకర్షిస్తూనే ఉంటాయి. (3-37, 39). అయితే వివేకియొక్క శక్తి శాస్త్రజ్ఞాన సజ్జనసాంగత్యాదుల వలన వృద్ధిపొంది ఉండటంవల్ల సులభంగా రజస్తమస్సుల కార్యాలకు లోబడి వర్తింపదు. ఒకవేళ ప్రమాదవశాన చిక్కుపడినా వెనువెంటనే మేల్కొని సవరించుకో గలుగుతుంది. రజస్తమస్సుల ఉద్ధతిని తగ్గించటానికి ప్రాణాయామం ఎంతో ఉపకరిస్తుంది. ప్రతిదినమూ త్రిసంధ్యలలో ప్రాణాయామం చేస్తూ క్రమక్రమంగా ఏకాగ్రతను అలవరచుకొని మనస్సును నా పరం కావించితే రజోగుణం సన్నగిలి సత్త్వగుణం వృద్ధిపొందుతుంది. (4-40, 41, 42, 43).

ఉద్ధవా! ఈ యోగాన్ని నేను మొట్టమొదట సనకాదులకు బోధించాను. వారు దానిని ఆశ్రయించి శుభాలను పొందారు. (4-1). ఎప్పుడు ఎలా బోధించానో వినాలని ఉన్నదా? (4-4). చెబుతాను విను.

## హంసోపదేశం

ఉద్ధవా! సనకాదులు బ్రహ్మమానసపుత్రులు. వారు బ్రహ్మ వద్దకు వచ్చి, 'తండ్రీ! ఇంద్రియాలు ఇంద్రియార్థాల వంకకు ప్రసరిస్తుంటాయి. ఇంద్రియార్థాలు ఇంద్రియాలను ఆకర్షిస్తుంటాయి. అవి ఈ విధంగా పరస్పర సమాకర్షణపరంగా నిరంతరం వర్తిస్తుండటం వలన మర్త్యులకు స్వాతంత్ర్యమన్నదే లేకుండా ఉన్నది. ఈ మల్లయుద్ధం మానే మార్గమేమిటి? మర్త్యులు వాటినుంచి ముక్తిపొందటం ఎన్నటికి?' అని అడిగారు. సర్వసృష్టికర్త అయిన బ్రహ్మకు కూడా సమాధానం స్ఫురింపలేదు. ఎంత ఆలోచించినా ఆ ప్రశ్నకు బీజమేమిటో అంతుపట్టలేదు. ఎందుకంటావేమో? అతని మనస్సు కూడా ప్రవృత్తిపరమై ఉండటమే కారణం. తత్త్వరహస్యం ఏదయినా బోధపడాలంటే మనస్సు ప్రవృత్తిపరాఙ్ముఖమై ఏకాంతస్థితిని వహించాలి.

అప్పుడు బ్రహ్మ నన్ను స్మరించాడు. నేను హంసరూపం దాల్చి ప్రత్యక్షమయ్యాను. సనకాదులు బ్రహ్మపురస్సరంగా నాకు నమస్కరించి, 'నీవెవరి' వని అడిగారు. వారితో ఈ విధంగా అన్నాను.

'మునులారా! 'నీవు' అన్నమాటకు అర్థమేమిటి? 'నీవు' అని నా ఆత్మ గురించి పలికారో, నా దేహాన్ని గురించి పలికారో ఆలోచిద్దాము. ఆత్మను గూర్చి పలికామని అంటారా, ఆత్మ ఏకము అద్వితీయము అపరిచ్ఛేద్యము కనుక 'నీవు, నేను' అని దానిని వేర్వేరు చేసి పలికే అవకాశం లేదు. దేహాన్ని గురించి పలికామంటారా, అది పంచభూతాత్మికం. పంచభూతాలు కూడా ఆత్మ వలెనే వేరుచేయరానివని మీకే స్పష్టం. ఎట్లాగంటారేమో? మీ దేహంలోని పంచభూతాలు, నా దేహంలోని పంచభూతాలు, వేరుగా లేవుకదా? కాబట్టి మీ ప్రశ్న ఆత్మ – దేహాలు రెంటికీ వర్తించే అవకాశమే

లేదు.

మునులారా! సృష్టి మొత్తం బ్రహ్మము, ప్రకృతి – ఈ రెండింటి సమ్మేళనఫలంగా ఉన్నది. ప్రకృతిని మనస్సని కూడా అంటారు. మనస్సు (ప్రకృతి) చక్షురాదులైన ఇంద్రియాల ద్వారకంగా వ్యవహరిస్తున్నది. ఇంద్రియాలు దేనిని చూసినా దేనిని విన్నా మాట్లాడినా నన్నే – అంటే బ్రహ్మమునే చూసినట్లు విన్నట్లు మాట్లాడినట్లు అవుతుంది. ఏమంటారా? నాకంటె ఇతఃపరం లేదు. సర్వం నేనే అయినప్పుడు రెండవది ఏముంటుంది? అజ్ఞానవశాన ఈ రహస్యం తెలియక వేరొకటి ఉన్నదని మనస్సు భావించి నంత మాత్రాన నా పరతత్త్వానికి భంగమేర్పడదు.

మునులారా! మనస్సుకు, ఇంద్రియార్థాలకు ఎడబాటు కలుగదు. మనస్సే జీవుడయితే జీవునికి ఇంద్రియార్థాలకు ఎడబాటు లేదని చెప్పక తప్పదు. అంటే, ఇంద్రియార్థాలతో కూడిన దేహం జీవునికి కూడా దేహమవుతుంది. అప్పుడు జీవునికి, దేహానికి వినియోగం లేకపోతుంది. తత్ఫలంగా దేహమే జీవుడు, జీవుడే దేహమని తేలుతుంది. దానివల్ల జీవదేహాలకు అవినాభావం సిద్ధిస్తుంది. జీవుడంటే పరమాత్మనైన నేనే అని చెప్పాను. కనుక దేహమే పరమాత్మ అవుతున్నది. దీనినే దేహాత్మబుద్ధి అంటారు. ఇది యెంత ప్రమాదజనితమో ఊహించండి.

ఈ భావం ఎలా కలుగుతున్నదంటారా? అధ్యాసం వలన కలుగుతున్నది. అధ్యాసమంటే ఏమిటంటారేమో? ఒకదానియందు మరొకదాని తత్త్వాన్ని ఆరోపించటం అధ్యాస మనబడుతుంది. అధ్యాసానికి కారణమేమిటంటే, మనస్సే కారణం. మనస్సు నిరంతరం గుణపరమై ఉండటంవల్ల గుణకార్యాలైన ఇంద్రియార్థాలలో తగులుకొని ఉంటుంది. అలా తగులుకొని తదేకస్థితిలో ఉండటంవల్ల గుణకార్యాలన్నీ తన కార్యాలనే భావం మనస్సుకు నైజమవుతున్నది. ఈ స్వభావం బలపడుతుండే సరికి మనోభాగాలలో ఒకటయిన అహంకారం తలయెత్తి కర్తృత్వ భోక్తృత్వా లన్నింటికీ తానే అధికారినని నిశ్చయిస్తున్నది.

ఈ అహంకారం జ్యోతిని క్రమ్ముకొన్న ధూమంవలె జీవుని ఆవరించి ఉంటుంది. అందువల్ల జీవాత్మ ప్రకాశం మందగిస్తున్నది. దీపప్రకాశం సోకని చోట చీకటి ఉన్నట్లు ఆత్మప్రకాశం అహంకారరూపమైన ఆవరణ వల్ల చక్కగా సోకక మనస్సు అజ్ఞానరూపతమస్సులో పడి ఆత్మముఖం కాక ఇంద్రియముఖమై వర్తిస్తున్నది.

రాజు మంత్రి సేవకుడు వీరు ముగ్గురినీ ఆత్మకు, అహంకారానికి, మనస్సుకు సాటి చేయవచ్చును. రాజాజ్ఞలను మంత్రి గైకొని సేవకునికి చెబుతాడు. ఇది లోకసహజం. రాజు గట్టివాడయితే అతని ఆజ్ఞలను మంత్రి యథారూపంలో సేవకునికి తెలియజేస్తాడు. వాడు తన దృష్టిని రాజునందే నిలిపి ఎప్పుడే ప్రమాదం కలుగుతుందో అన్న భయంతో రాజాజ్ఞలను నిర్వర్తిస్తుంటాడు. అదే రాజుకంటె మంత్రి గట్టివాడయితే సేవకుడు తన దృష్టిని మంత్రియందే నిలిపి నడుచుకొంటాడు గాని రాజును అంతగా లెక్కచేయడు. అలాగే అహంకారావరణ స్వల్పమయితే ఆత్మదీప్తి నిరాతంకంగా మనస్సు వరకు వ్యాపిస్తుంది. మనస్సు ఆత్మముఖ మవుతుంది. అహంకారావరణ దట్టమయితే ఆత్మదీప్తి మనస్సు వరకు వ్యాపింపలేకపోతుంది. మనస్సు తనకు సమీపాధికారి అయిన అహంకారం చెప్పినట్లు నడుచుకొంటుంది.

మునులారా! మనస్సు జడమని, మనస్సుయొక్క అంతర్భాగమని చెప్పదగిన అహంకారం కూడా జడమేనని, జడములకు స్వశక్తి లేదు కాబట్టి అవి స్వతంత్రించి వర్తించటమూ ఆరోపణాదులు చేస్తుండటమూ ఎలా వీలవుతుందని అడగవచ్చు. అయఃఖండానికి స్వశక్తి లేదు. ఎక్కడ వేస్తే అక్కడే పడి ఉంటుంది. సూదంటురాయి చేరిక దానికి కలిగినప్పుడది స్వతంత్రశక్తి ఉన్నదానివలెనే వర్తిస్తున్నది. ఇది మీకు స్వానుభవసిద్ధమే కదా. అలాగే మనస్సు, తత్సంబంధము లైన అహంకారాదులు నిసర్గజడాలు అయినప్పటికీ ఆత్మసాన్నిధ్యం వలన శక్తిమంతాల వలె వర్తిస్తున్నాయి. సూదంటురాతికి, అయఃఖండానికి మధ్య ఏదయినా ఉంటే దాని సాన్నిధ్యబలం చక్కగా అయః ఖండానికి సోకదు. మధ్యనున్న ఆ వస్తువు దట్టంగా ఉంటే అయఃఖండం

కదలనే కదలదు. అది సన్నపాటిదయితే సూదంటురాయి శక్తి ఒకపాటిగానైనా సోకి ఆ అయఃఖండం ఏ కొంచెమో చలింపగలుగుతుంది. కాబట్టి అయఃఖండము యొక్క చలనాచలనాలు మధ్యనున్న వస్తువును బట్టి ఉన్నాయన్నమాట. అలాగే మనఃకార్యాలు కూడా మనస్సుకు, ఆత్మకు నడుమ అడ్డంగా ఉన్న అహంకారము యొక్క బలాబలాలను బట్టి ఉంటుంది.

మునులారా! సృష్టి సమస్తం మనఃకల్పితమై కేవల విభ్రమమాత్రమై నిమిషనిమిషానికీ మారుతూ నిలకడ లేకుండా ఉన్నది. కొరివిని చక్రాకారంగా మహావేగంతో త్రిప్పినప్పుడు దాని మంట అవిచ్ఛిన్నంగా కనబడినట్లే సృష్టి కూడా దాని విభ్రమవేగం వల్ల అవిచ్ఛిన్నంగా కనబడుతుంది. ఈ రహస్యం తెలియక సృష్టి శాశ్వతమని అనుకొంటారు.

మునులారా! జగత్తు మిథ్య అయినప్పుడు అందులోని వ్యవహారం కూడా మిథ్యే కావాలి గదా; జగన్మిథ్యాభావం నిరంతరం హృదయస్థమై ఉంటుందా ఏమిటి; జగత్తునందలి వ్యక్తికోసమో సంఘం కోసమో పడే పాట్లన్నీ మిథ్యామాత్రాలే కదా; మిథ్యామూర్తి మిథ్యాజగత్తులో మిథ్యావ్యవహారం జరిపినట్లే కదా – అని ఈ విధంగా శంకింపవద్దు. మునులారా! మిథ్య అంటే అభావమని గాని శూన్యమని గాని భావింపకండి. అద్వైతియొక్క భాషాభావప్రపంచాలలో శూన్య – అభావాలు రెండూ లేవు. బ్రహ్మము వేరని, ప్రపంచము తద్భిన్నమని ద్వైతి వ్యవహరిస్తాడు. బ్రహ్మమే ప్రపంచమని అద్వైతి వ్యవహరిస్తాడు. అంటే, రూపనామాలు సత్యమని ద్వైతి భావింపగా రూపనామాలకు మార్పున్నది కాబట్టి అవి తాత్కాలిక సత్యములేగాని పారమార్థిక సత్యాలు కావని, రూపనామాలకు ఏది అనుష్ఠానమో అదొక్కటే సత్యమని అద్వైతి భావిస్తాడు. అద్వైతం భేదభావాన్ని మాత్రమే నిషేధిస్తున్నది గాని లోకవ్యవహారాన్ని నిషేధింపదు.

ద్వైతికి వలెనే అద్వైతికి కూడా క్షుత్పిపాసలు, జాగ్రన్నిద్రలు, దయాదాక్షిణ్యాలు ఉంటాయి. అయితే ద్వైతి వ్యవహారం స్వసంగ్రహార్థం కాగా అద్వైతి వ్యవహారం లోకకల్యాణార్థ మవుతుంది.

మునులారా! సంగతంతా విన్నారు కదా. అధ్రువము, మాయామయము అయిన సృష్టి వైపు నుంచి మర్త్యులు తమ దృష్టిని మరలించి ఆత్మపరం కావించి, ఆశలనే ఎండమావుల వెంట తగిలి బాధలు పడక చిరసుఖానుభవానికి ప్రయత్నించాలి. దృష్టిని ఎంత ఆత్మపరం చేసినా పూర్వవాసనలు అంతర్గతమై మనోరూపాన ఉన్నవి, అప్పుడప్పుడు దానిని బాహ్యముఖానికి లాగుతుంటాయి. అయినప్పటికీ స్థితప్రజ్ఞుడు వాసనాప్రయత్నాలను అప్పుడప్పుడే త్రోసివేస్తుంటాడు.

మునులారా! ప్రపంచస్ఫురణ కొందరు స్థితప్రజ్ఞులకు జీవితమధ్యకాలంలోనే పూర్తిగా అంతరిస్తుంది; కొందరికి జీవితాంతం వరకు స్మృతిమాత్రంగా ఉంటుంది. మొదటివారిని జీవన్ముక్తులని, రెండవవారిని విదేహ ముక్తులని అంటారు. ప్రపంచస్ఫురణమంటే ఏమిటో కాదు, దేహాభిమానమే. ఆ దేహాభిమానం స్మృతిరూపంలో ఉంటుంది. జీవన్ముక్తులకు అంతమాత్రపు స్మృతి కూడా లేనందువల్ల మదిరామదోన్మత్తులకు కట్టుగుడ్డ ఉన్నదీ లేనిదీ తెలియనట్లు వారి దేహం ఉన్నదీ పోయినదీ తెలియకుండా ఉంటుంది. దేహపాతం కాగానే ఆ స్మృతి అంతరించిపోతుంది. అట్టివారు సంపూర్ణముక్తు లవుతారు.

మునులారా! వారికి దేహపాతం ఎప్పుడవుతుందనే సందేహం ఉన్నది. ప్రాణులకు దేహం ఎందుచేత కలుగుతున్నది? ప్రారబ్ధకర్మఫలభోగార్థం ప్రాణులకు దేహావసరం కలుగుతున్నది. ఆ కర్మఫలం సంపూర్ణంగా భుక్తమైనంతవరకు ప్రాణికి ఆ దేహం ఉంటుంది. ఫలభోగం పూర్తయిన నిమిషాననే దేహపతనం జరుగుతున్నది. ఈ మర్యాద ముక్తులకు కూడా అన్వయిస్తుంది. దేహపతనం వరకు సుఖదుఃఖాది ద్వంద్వాలు సమస్తదేహాలకు కలుగుతూనే ఉంటాయి. అవి తప్పవు. దేహాభిమానం కలవారు ఆ ద్వంద్వాలను తాము అనుభవిస్తున్నామని అనుకొంటారు. వారు దేహమే ఆత్మ అని భావించటం వలన దేహసంబంధ మైనవన్నీ వారికి ఆత్మసంబంధ మైనవిగా పొడచూపుతుంటాయి. ముక్తుల సంగతి వేరు. వారు దేహధర్మాలు

యథాయోగ్యంగా జరుగుతుంటాయనే తలంపుతో దేహము వంకకే మనసు మళ్ళింపరు కాబట్టి దేహానికి కలిగే కష్టనష్టాలు వారికి తెలియకుండానే గడిచిపోతుంటాయి.

మునులారా! సాంఖ్య రహస్యాన్ని, కర్మయోగ రహస్యాన్ని రెండింటినీ మీకు వివరించాను. ఆత్మానాత్మవివేకాన్ని గురించి బోధించేది సాంఖ్యం. ఆత్మానాత్మవివేకాన్ని సాధనగా పెట్టుకొని ముక్తి సాధించే మార్గం యోగ మనబడుతున్నది. ముక్తి అంటే వట్టి మాటలతో సిద్ధించేది కాదు. జీవితమంతా సాంఖ్యప్రకారం అనుష్ఠించి సిద్ధిపొందినప్పుడే ముక్తి కలుగుతుంది. ముక్తి అంటే ఏమిటో అనుకోకండి. అది ఒక విధమైన అంతః కరణస్థితి మాత్రమే. ఈ పరమార్థాన్ని మీకు బోధింపగోరి విష్ణువునైన నేను హంసరూపంలో వచ్చాను' అని పలికి, వారి సంశయాలు తీర్చి, నేను స్వధామానికి వెళ్ళాను. ఉద్ధవా! సనకాదులకు ఎప్పుడు ఏ రూపాన తత్త్వబోధ చేశానో గ్రహించావా?' అన్నాడు.

ఉద్ధవు డా ఉపదేశాన్ని సవిస్తరంగా విని 'స్వామీ! బ్రహ్మము మాత్రమే సత్యమని, తక్కినదంతా అసత్యమని, అసత్యం అధ్యాస వలన సత్యమనిపిస్తున్నదని హంసోపదేశంలో సూచించావు. అధ్యాసమంటే ఏమిటో? ఎలా కలుగుతున్నదో? దానికి కారణమేమిటో? తెలియగోరుతున్నాను' అన్నాడు. భగవానుడు విని 'ఉద్ధవా! ఈ విషయమై గురుశిష్యసంవాదం ఒకటి చెబుతాను విను' అంటూ ఇలా వివరించాడు.

## అధ్యాసం

గురువు:– శిష్యా! ఒకదాని ధర్మాన్ని మరియొకదానియందు ఆరోపించడాన్ని అధ్యాసమని అంటారు. ఉదాహరణ విను. రాత్రిపూట త్రాటిని చూసి అది సర్పమని భావించటం ఉన్నది. త్రాడు ఎన్నటికీ సర్పం

కాదు. అయినా త్రాటియందు సర్పధర్మాన్ని ఆరోపించి త్రాటిని సర్ప మనుకొంటారు. ఈ భావమే అధ్యాస మనబడుతున్నది.

అధ్యాసము అర్థాధ్యాసమని, జ్ఞానాధ్యాసమని రెండు విధాలు. అందులో అర్థాధ్యాసం తిరిగి స్వరూపాధ్యాసమని, సంసర్గాధ్యాసమని రెండు విధాలు. ఆ రెంటిలో స్వరూపాధ్యాసం కేవల ధర్మాధ్యాసమని, ధర్మసహిత ధర్మ్యధ్యాసమని, అన్యపరాధ్యాసమని, సంబంధసహిత సంబంధ్యధ్యాసమని నాలుగు విధాలు. సంసర్గాధ్యాసం కేవల సంబంధాధ్యాసమని, అన్యోన్యాధ్యాసమని రెండు విధాలు.

అధ్యాసానికి మిథ్యావస్తువు, భ్రాంతిజ్ఞానం రెండూ ఉండాలి. ఆ రెండూ లేనినాడు అధ్యాసం కలిగే అవకాశం లేదు. రజ్జువును సర్పమనుకోవటం ఉన్నదే, అది మిథ్యాజ్ఞానం. సర్పము కాని రజ్జువు ఆ మిథ్యాజ్ఞానం వలన సర్పమవటం మిథ్యావస్తువు.

అందులో మిథ్యావస్తువును అర్థాధ్యాసమని, భ్రాంతిజ్ఞానాన్ని జ్ఞానాధ్యాసమని నిర్వచించారు. అర్థము అంటే పదార్థం. దానికి సంబంధమైనదానిని అర్థాధ్యాసమన్నారు. జ్ఞానానికి సంబంధించిన దానిని జ్ఞానాధ్యాసమన్నారు.

రజ్జువును చూసి సర్పమని భావించినపుడు రజ్జువు నందు అనిర్వచనీయమైన స్వరూపమొకటి ఉద్భవిస్తున్నది. అందువలన దానిని స్వరూపాధ్యాసమని అన్నారు. ఎటువంటి సంబంధమూ లేని రెండు పదార్థాలకు సంసర్గ మేర్పడినందువల్ల అనిర్వచనీయమైన మూడవపదార్థం ఒకటి ఉద్భవిస్తున్నది. దర్పణము – ముఖము ఈ రెండింటికీ సంబంధం లేకపోయినా వాటికి సంబంధాన్ని కలిగించినప్పుడు దర్పణంలో ముఖం

ప్రతిబింబిస్తున్నది. సంబంధము అంటే సంసర్గమని కూడా చెప్పవచ్చును. అట్టి సంసర్గ కారణాన అనిర్వచనీయమైన ప్రతిబింబం కలుగుతున్నది. అందువల్ల దానిని సంసర్గాధ్యాసము అని వ్యవహరించారు.

ఒక వస్తువు యొక్క ధర్మాన్ని మాత్రమే మరొక వస్తువు నందు ఆరోపించటం కేవల ధర్మాధ్యాసం. చూడటం వినటం మొదలయినవి ఇంద్రియ ధర్మాలు. ఆ ఇంద్రియ ధర్మాలను ఆత్మ ధర్మాలుగా భావించటం ఉన్నది. ఇక్కడ ఇంద్రియధర్మాలను మాత్రమే ఆత్మయందు ఆరోపిస్తున్నారు గాని ఇంద్రియాలను స్వరూపాలతో ఆరోపించటం లేదు. ధర్మాన్ని మాత్రమే ఆరోపించడం వల్ల దీనిని కేవలధర్మాధ్యాసమన్నారు. అలా కాకుండా ధర్మాన్ని, ఆ ధర్మానికి ఆశ్రయమైన వస్తువును రెండింటినీ ఆరోపించటం ధర్మసహిత ధర్మ్యధ్యాస లక్షణం. ఎలాగంటావేమో? అంతఃకరణానికి కర్తృత్వాదిధర్మాలు ఉన్నాయి. ఆ ధర్మాలన్నింటితో అంతఃకరణను గ్రహించి ఆత్మయందారోపించి ఆత్మయే కర్త అని తలచినప్పుడు ధర్మసహిత ధర్మ్యధ్యాసమవుతుంది.

అయఃపిండం – అగ్ని ఇవి రెండూ వేర్వేరయిన పదార్థాలు. అగ్నిలో ఆ పిండాన్ని కాల్చినప్పుడు అగ్నిపిండంగా కనిపిస్తున్నది. అంతేగాని దానికొక ప్రత్యేకావస్థ అంటూ ఏదీలేదు. అగ్ని, అయః పిండం ఒకదానిలో ఒకటి అధ్యస్తములు కావడమన్నమాట. దీనిని అన్యోన్యాధ్యాసమని అంటారు.

రెండు పదార్థాలలో ఒకటి అధ్యస్తానికి (అధ్యాసానికి) సాధ్యమే కాకపోవటము, రెండవది సాధ్యమైనదిగా ఉండటం మనకు తెలుసు. అధ్యాసానికి సాధ్యం కానిదాని యందు అధ్యాస సాధ్యమైనదానిని ఆరోపించటం అన్యతరాధ్యాస మవుతుంది.

ఉదాహరణకు ఆత్మ - అహంకారములనే రెంటిలో ఆత్మకు రూపమే లేదు కాబట్టి, రూపం లేనిదానిని ఆరోపించటం సాధ్యంకాదు గనుక, దానిని అహంకారమందు ఆరోపించే అవకాశం లేదు. అహంకార మన్నదో, అది ఆరోపణకు వీలుగా ఉన్నదే. అందువల్ల అహంకారాన్ని ఆత్మయందు ఆరోపించి అహంకారమే ఆత్మ అని భావిస్తారు. ఇది అన్యతరాధ్యాస లక్షణం.

ఆత్మయందు అనాత్మవస్తువు యొక్క సంబంధ స్వరూపాలు రెండింటిని ఆరోపించటం సంబంధ సహసంబంధ్యధ్యాసం. ధర్మసహిత ధర్మ్యధ్యాసలో ధర్మాన్ని ఆరోపిస్తారు; ఇక్కడ సంబంధిసంబంధాన్ని ఆరోపిస్తున్నారు. ఈ విధంగా రెండిటికీ భేదం ఉన్నది.

కేవల సంబంధాన్ని మాత్రమే ఆరోపించటం కేవల సంబంధాధ్యాస లక్షణం. కేవల ధర్మాధ్యాసానికి, దీనికి గల భేదాన్ని గ్రహించాలి.

సంబంధ సహసంబంధ్యధ్యాసం సంసర్గాధ్యాస సహిత స్వరూపాధ్యాసానికి, అన్యోన్యాధ్యాసం సంసర్గ స్వరూపాధ్యాసానికి అంతర్భూతాలుగా ఉన్నాయి.

## అధ్యాస సామగ్రి

అధ్యాసానికి (1) సత్యవస్తుజ్ఞానజన్యసంస్కారం (2) ప్రమాతృదోషం (3) ప్రమాణదోషం (4) ప్రమేయదోషం (5) అధిష్ఠానసామాన్యరూపజ్ఞానం (6) అధిష్ఠానవిశేషరూపాజ్ఞానం – అని ఆరు కారణాలున్నాయి.

(1) రజ్జువునందు సర్పభ్రాంతి కలగటానికి సర్పజ్ఞానం తత్పూర్వమే ఉండి తీరాలి. ఎన్నడూ సర్పాన్ని చూసి గాని, విని

గాని ఉండకపోతే రజ్జువును చూసినప్పుడు సర్పభ్రాంతి కలగటానికి అవకాశమే లేదు. సత్యసర్పజ్ఞానం ఉన్నందువల్ల ఆ జ్ఞానజన్యసంస్కారం రజ్జుదర్శనకాలంలో స్మృతిరూపాన ప్రతీతమై అధ్యాసను కలిగిస్తున్నది. అట్టి అధ్యాసకాలంలో సర్పము అధ్యసింపబడలేదని, సర్పజ్ఞానజన్యసంస్కారం మాత్రమే అధ్యస్త మైనదని గ్రహించాలి.

(2) ప్రమాత అంటే చూసేవాడు. అతనియందు భయాదులు కలగటం ప్రమాతృదోష మవుతుంది.

(3) చూడటం వినటం మొదలయిన వాటికి సాధనాలైన నేత్రాది ఇంద్రియాలలో పిత్తకామనాదులు కలగటం ప్రమాణదోషం.

(4) ప్రమాణజ్ఞానానికి విషయమైనది ప్రమేయం. ఎట్లాగో చూడు. సర్పభ్రాంతికి అధిష్ఠానమైనది రజ్జువు. రజ్జువే లేకపోతే సర్పభ్రాంతికి అవకాశమే లేదు. కాబట్టి ఆ రజ్జువు భ్రాంతికి విషయం. విషయమైన – అంటే అధిష్ఠానమైన రజ్జువుకు, అధ్యస్తమైన సర్పానికి సాదృశ్యం ఉండితీరాలి. సాదృశ్యమే లేకపోతే అధ్యాసమే కలుగదు కదా. అట్టి సాదృశ్యమే ప్రమేయదోషం.

(5) ఏది భ్రాంతి కాలమందు తోచినదో, ఏది తోపనప్పుడు భ్రాంతి కలుగదో అది అధిష్ఠానసామాన్యరూపజ్ఞానం.

(6) ఏది భ్రాంతికాలమందు కలుగదో, ఏది కలిగినందువల్ల భ్రాంతి తొలగుతున్నదో అది అధిష్ఠానవిశేషరూపాజ్ఞానం.

సామాన్యరూపజ్ఞానం, విశేషరూపాజ్ఞానం ఇవి రెండూ లేకపోతే అధ్యాసమే లేదు.

అధ్యాసానికి సత్యవస్తువు యొక్క జ్ఞానము నుంచి జన్యమైన సంస్కారం హేతువన్నప్పుడు, జ్ఞానము గాక జ్ఞానజన్యసంస్కారం ప్రధానమవుతున్నది. వస్తువు సత్యమైనదిగానే ఉండాలనే నియతి లేదు. అది మిథ్యావస్తువుగా ఉంటే ఉండవచ్చును. సజాతీయ వస్తువుగా మాత్రం ఉండక తప్పదు. విజాతీయ వస్తువయితే అధ్యాసానికి అవకాశం లేదు. సర్పభ్రాంతి కలిగినప్పుడు తత్పూర్వం సత్యమైన సర్పాన్నే చూసి ఉండాలనే నియమం లేదు. సర్పాన్ని పోలినదానిని చూసి సర్పం ఇలా ఉంటుందనే జ్ఞానసంస్కారం ఉంటే చాలు. ఆ సంస్కారం అవ్యవహితంగానే ఉండాలి. వ్యవహితమై విస్మృతిప్రాయమైతే అధ్యాసం కలుగదని తాత్పర్యం.

శిష్యుడు:– స్వామీ! అందుకు కారణం ఏమిటి?

గురువు:– అవిద్యే కారణం. అది ఎక్కడినుంచి వచ్చిందని ప్రశ్న. అనాది నుంచి ఉన్నది కాబట్టి దాని పుట్టుక అప్పుడు ఇప్పుడని చెప్పలేము. దానికి ఉనికి చోటే కాన్పింపదు. కాబట్టి అది అక్కడినుంచి ఇక్కడినుంచి వచ్చినదని చెప్పటం కష్టం.

శిష్యుడు:– స్వామీ! అవిద్యాకార్య మేమిటి?

గురువు:– ఏకమైన బ్రహ్మమునందు నానాత్వం ఆరోపించి ఆ విధంగా భావింపజేయటమే అవిద్యాకార్యం. ఈ అవిద్య కారణంగా జీవుడు ఏకము అద్వితీయుడు ఐనా తనయందు అధ్యస్తమైన ఉపాధితో ఐక్యభావాన్ని పొందుతున్నాడు. తద్భావనాఫలంగా ఉపాధికార్యాలైన కర్తృత్వ భోక్తృత్వాదులు తనవిగా భావిస్తున్నాడు. తన్మూలంగా జీవునికి సంసారిత్వం, సుఖదుఃఖాది భోక్తృత్వం కలుగుతున్నాయి. జీవుడు బద్ధుడు అన్నప్పటి ఉద్దేశం ఇదే.

శిష్యుడు:- స్వామీ! అవిద్యకు, మాయకు భేదమేమిటి?

గురువు:- నాయనా! అవిద్యనే మాయ అన్నారు. మాయ ఒక వస్తువు కాదు. కాబట్టి మాయ అంటే ఇటువంటిదని నిరూపించటం సాధ్యంకాదు. అందువల్ల మాయ బొత్తిగా లేదని అందామా? అంటే, మాయాకార్యమైన భ్రాంతి కలుగుతూనే ఉన్నది. మాయ సత్యమే అయితే అది త్రికాలాలలోనూ ఉండాలి. ఎప్పుడు సత్యజ్ఞానం ఉదయించిందో, ఆ క్షణమే మాయ మాయమవుతున్నది. కాబట్టి మాయకు సార్వకాలికస్థితి లేదని స్పష్టం. మాయ ఉన్నదని గాని, లేదని గాని చెప్పలేక దానిని అనిర్వచనీయమని అన్నారు. ఆ అనిర్వచనీయమైన స్థితినే మిథ్య అంటారు. మిథ్య అంటే భావాభావనిరూపణ సాధ్యం కానిదన్న అర్థమే గాని శూన్యమని కాదు.

శిష్యుడు:- స్వామీ! ఏది త్రికాలాబాధితమో, అది మాత్రమే సత్యమని చెప్పారు. అట్టిది బ్రహ్మము తప్ప వేరొకటి లేదన్నారు. మాయకూడా కాలబాధితమై నశించేది కాబట్టి మిథ్య అన్నారు. మిథ్యాత్మకం అయిన ఆ మాయ బ్రహ్మమం దారోపితమై నానాత్వభావాన్ని కలిగిస్తున్నదన్నారు. మిథ్యాసత్యాలకు చీకటి వెలుగులకు వలె బొత్తిగా పొత్తు కుదరదు కదా, సంబంధం ఎక్కడినుంచి వచ్చిపడింది? ఆ విధంగా వాటికి సంబంధం కలిగితే సత్యత్వానికి భంగం వాటిల్లదా?

గురువు:- నాయనా! నీవన్న సంబంధం వ్యావహారికమే గాని పారమార్థికం కాదు. రజ్జువునందు సత్యత్వాన్ని ఆరోపించినప్పుడు రజ్జుధర్మానికి భంగం కలగనట్లే బ్రహ్మము నందు మాయాత్వాన్ని ఆరోపించినప్పుడు బ్రహ్మత్వానికి భంగమేర్పడదు.

శిష్యుడు:- ఈ అధ్యాసము నశించే మార్గమేమిటి?

గురువు:- నాయనా! రజ్జువును చూసి సర్పమని భావించావు. దీపం తెచ్చి చూపించారు. దాని వెలుగులో అది పాము కాదని, రజ్జువని తెలిసివచ్చింది. ఆ వెంటనే నీకు మొదట కలిగిన సర్పభ్రాంతి నశించింది. అట్లాగే సత్యజ్ఞానోదయం వలన మిథ్యాభ్రాంతి అయిన అధ్యాసం నశిస్తున్నది.

శిష్యుడు:- సత్యజ్ఞానం ఎలా కలుగుతుంది? తీర్థయాత్రాదుల వలన కలుగుతుందా?

గురువు:- తీర్థయాత్రాదుల వలన చిత్తశుద్ధి కలుగుతుంది. అవి జ్ఞానోదయానికి సహకరిస్తాయి. అంతేగాని అవేవీ జ్ఞానజనకాలు కాలేవు. జ్ఞానమన్నది స్వతస్సిద్ధం. అది పూర్వం లేకుండాపోయి ఈనాడు క్రొత్తగా పుట్టుకొనివచ్చేది కాదు. జ్ఞానోత్పత్తి అంటే జ్ఞానాన్ని ఆవరించి దాని ప్రకాశాన్ని మందగింపజేస్తున్న అహంకార మమకార రూప మాలిన్యాలను, రాగద్వేషజనితాలైనవాటిని తొలగించడం మాత్రమే. ఆ మాలిన్యాలు తొలగినంతనే జ్ఞానం యథాగతిని ప్రకాశిస్తుంది. సత్యం స్పష్టపడుతుంది. జ్ఞానాన్ని ఆవరించిన మాలిన్యావరణం తొలగిపోవడాన్నే వేదాంతపరిభాషలో ముక్తి అన్నారు. ముక్తి అన్నా మోక్షమన్నా ఒక్కటే.

శిష్యుడు:- స్వామీ! ఒక వస్తుగుణాన్ని మరొక వస్తువునందు ఆరోపిస్తే అది అధ్యాసమన్నారు. అధ్యాసానికి రెండు వస్తువు లుండాలని ఆ వాక్యం వలన స్పష్టమే కదా. రజ్జుసర్పవిషయంలో రెండు వస్తువులు ఉన్నాయి కాబట్టి మీరన్నట్లు అధ్యాసానికి అవకాశం కలిగింది. సర్పధర్మాన్ని రజ్జువునందు ఆరోపించారు. బ్రహ్మము, జగత్తు - ఈ రెండింటిలో జగత్తు బ్రహ్మమందు ఆరోపింపబడుతున్నదా? బ్రహ్మము జగత్తు నందు ఆరోపింపబడుతున్నదా?

గురువు:- రజ్జుసర్పనిదర్శనలో సర్పధర్మాన్ని రజ్జువునందు ఆరోపించారు. పరిశీలించిన తర్వాత సర్పం మిథ్య అని ఏర్పడింది. అదే విధంగా బ్రహ్మమును జగత్తునందు ఆరోపిస్తే ఏమవుతుంది? సర్పరీతిని బ్రహ్మము మిథ్య అవుతుంది. బ్రహ్మమును సత్యమన్నారు కదా! అందువల్ల బ్రహ్మత్వాన్ని జగత్తునందు ఆరోపించే వీలులేదు. పోనీ జగత్తును బ్రహ్మమునందు ఆరోపిద్దామంటే బ్రహ్మము ఇంద్రియాతీత మైనది. ఇంద్రియాతీత మైనదానిలో ఇంద్రియగోచర కార్యం పొసగదు. కాబట్టి రెండవ ప్రతిపాదనమూ తర్కసహం కాదు.

శిష్యుడు:- రజ్జుసర్పనిదర్శనను బట్టి అధ్యాసానికి రెండు వస్తువులు వేరువేరుగా ఉండాలని తేలుతున్నది. కాబట్టి (1) బ్రహ్మము, జగత్తు ఈ రెండూ వేర్వేరు పదార్థాలా? ఆ రెండు పదార్థాలు సత్యములైతేనే కదా అధ్యాసానికి అవకాశం ఉండేది? (2) అందువల్ల బ్రహ్మము, జగత్తు రెండూ సత్యములేనా? (3) జగత్తు మిథ్య అన్నారు. మిథ్యకు ప్రత్యేకావస్థ అంటూ ఏదీలేదు. జగత్తు మిథ్య అయితే అధ్యాసానికి రెండవ వస్తువేముంటుంది? (4) ఆరోపణకు ఇది దీనియందు ఆరోపింపబడుతున్నదని తెలుసుకోవటానికి ఒకరుండాలి. ఆ వ్యక్తి ఎవడు? (5) జీవుడే అన్నట్లయితే, బ్రహ్మమే జీవుడన్న ప్రమాణం వల్ల తెలుసుకొంటున్నవాడు బ్రహ్మమేనని ఏర్పడుతుంది. బ్రహ్మము కేవల జ్ఞానస్వరూపమని అన్నారు. బ్రహ్మమే జీవుడు కాబట్టి జీవుడు కూడా కేవల జ్ఞానస్వరూపుడు కావాలి. జ్ఞానమంటే అన్నింటినీ తెలిసికొనే శక్తి అన్నారు. ఆ శక్తి తనయందు తానే అధ్యాసం చేసి పొరబడే అవకాశం ఉన్నదా? (6) పూర్వదృష్టమైన వస్తువుయొక్క సామ్యం జ్ఞప్తికివచ్చి అధ్యాసం కలుగుతున్న

దన్నారు. రజ్జుసర్పవిషయంలో సర్పజ్ఞానం పూర్వమే ఉండటం వల్ల రజ్జువును చూసినప్పుడు సర్పధర్మం స్ఫురించి ఆ కారణాన అధ్యాసం కలుగుతున్నది. బ్రహ్మము – జగత్తు ఈ రెండింటి విషయంలో ఏది పూర్వజ్ఞానం? ఏది అనంతరీయం? జగత్తుయొక్క జ్ఞానమే పూర్వమందామంటే జగత్తు బ్రహ్మమున కంటె పూర్వమైనది కావాలి. మరి బ్రహ్మమే ఆది అన్నారు. దానిని బట్టి జగత్సంబంధజ్ఞానం పూర్వతరం కానేరదు. జగత్సంబంధజ్ఞానం తర్వాతిదంటే పరజ్ఞానం అధ్యాసానికి అవకాశమివ్వదు. అధ్యాసానికి పూర్వజ్ఞానమే కావాలి.

గురువు:– నాయనా! జగత్తు మిథ్య అన్నప్పుడు మిథ్యాశబ్దానికి శూన్యమనే అర్థాన్ని భావింపకు. ఏది భూత వర్తమాన భవిష్యత్కాలాలు మూడింట షడ్భావవికారాలను చెందుతుందో దానిని మిథ్య అన్నారు. అందుమూలాన మిథ్యాశబ్దసూచితవస్తువుకు తాత్కాలిక సత్యత్వం ఉంటున్నది. దానినే వ్యావహారిక సత్యమని అన్నారు. అధ్యాసం జరిగినప్పుడల్లా ఆ వస్తువు సత్యమనే భావనతోనే అధ్యాసవ్యవహారం జరుగుతున్నది. ఈ మర్మాన్ని మనసులో ఉంచుకొని నీ ప్రశ్నలకు నేనిప్పుడు చెప్పబోతున్న సమాధానాలను గ్రహించు.

(1) బ్రహ్మము – జగత్తు వేర్వేరు పదార్థాలా? అన్నది నీ మొదటి ప్రశ్న. అధ్యాస కాలంలో రెండూ వేర్వేరు పదార్థాలు గానే భావింపబడుతున్నాయి.

(2) బ్రహ్మము – జగత్తు రెండూ సత్యాలేనా? అన్నది నీ రెండవ ప్రశ్న. బ్రహ్మమునకు పారమార్థిక సత్యత్వం, జగత్తుకు తాత్కాలిక సత్యత్వం చెప్పబడ్డాయి. కాబట్టి అధ్యాసకాలంలో

రెండూ సత్యాలే అనిపింపక మానదు.

(3) జగన్మిథ్యాత్వం పరిశీలనకు తర్వాత ఏర్పడుతున్నది. అధ్యాస కాలంలో అటువంటి భావమే లేదు. అందువల్ల జగత్తునకు అధ్యాస సమయంలో ప్రథమావస్థ, ద్వితీయత్వం రెండూ కలుగుతున్నాయి.

(4) వేరు వేరు పదార్థాలను ఒక్కొక్కప్పుడు అజ్ఞానవశాన ఒకటిగానే భావిస్తుంటాము. ఇది అందరికీ అనుభవసిద్ధమైన విషయమే గాని కొత్త కాదు. ఒక ఉదాహరణ విను. 'నా దేహం' అన్నప్పుడు 'నేను' అనే ఆత్మ, దేహం రెండూ వేర్వేరని జ్ఞానికి స్పష్టమే. అజ్ఞాని అందుకు విరుద్ధంగా తానే దేహము, దేహమే తాను అని విశ్వసిస్తున్నాడు. ఆత్మ ఒక వస్తువు కాదు; దానికి అవయవాలు లేవు. కాని 'నా దేహం' అన్నప్పుడు దేహలక్షణాలను ఆత్మయందు ఆరోపిస్తున్నారు. కారణమేమంటావా? అజ్ఞానమే కారణం. అది అనాదిసిద్ధమై అనిర్వచనీయ మైనదిగా ఉన్నది. ఆ విధంగా దేహాదులు ఆత్మయందు ఆరోపింపబడినప్పుడు ఆ ఆత్మ తాను కర్తనని భోక్తనని అవయవాలు కలదానినని భావించి వస్తువవుతున్నది. అధ్యాసకాలంలో ఆత్మయొక్క ఆ భావన వలన దానియందు దేహారోపణకు అవకాశం కలుగుతున్నది.

నాయనా! నిజానికి ఆత్మ ఎన్నటికీ జ్ఞేయపదార్థం కానేరదు. ఆత్మజ్ఞాన మన్నప్పుడు ఉపాధితో కూడిన ఆత్మయొక్క జ్ఞానమని తాత్పర్యం. అట్టి స్థితిలోనే అది సాధ్యమవుతుంది. ఆత్మను వస్తువు కాదన్నాము. వస్తువయితే గాని ఆరోపణకు అవకాశం లేదన్నాము. ఆత్మయందు దేహం ఆరోపింపబడుతున్న దన్నాము. ఈ వాక్యాలు పరస్పర బాధకాలుగా ఉండి విత్తుముందా? చెట్టుముందా? అనే నానుడిని గుర్తుచేస్తుంటాయి.

విత్తునుంచి చెట్టు పుడుతుంది. ఆ చెట్టువలన విత్తు కలుగుతుంది. ఇందులో మొదటిది విత్తనమా? లేక చెట్టా? అంటే చెప్పసాధ్యం కాదు. ఒక్కటి మాత్రం స్పష్టం. ఉపాధి కారణం వల్ల ఆత్మకు కర్తృత్వం, కర్మకు వస్తుత్వం రెండూ ఒకసారే కలుగుతున్నాయి.

అజ్ఞానం వలన అధ్యాసం కలుగుతున్నదని చెప్పాను. కాబట్టి ఆరోపింపదలచిన వస్తువు యొక్క జ్ఞానం సత్యజ్ఞానంగా వుండవలసిన అవసరం లేదు. ఆ పదార్థసంబంధమైన జ్ఞానం ఏదో ఒక విధంగా ఉంటే చాలు. అది మిథ్యాజ్ఞానమే కావచ్చును గాక. ఆత్మ ఉన్నదని మన అనుభవజ్ఞానమే తెలుపుతున్నది. ఆ జ్ఞానమే లేకపోతే, అంటే ఆత్మ ఉన్నదనే జ్ఞానమే లేకపోతే, ఇక లోకంలో తెలిసికోవటమన్నదే ఉండదు. దేనిని మనము తెలుసుకొన్నా ఆత్మమూలకంగానే తెలుసుకొంటున్నాము. ఆత్మ లేకపోతే అనుభవజ్ఞానమే ఉండదు. ఆత్మ ఉన్నదనటానికి తార్కాణ మేమిటంటావా? నన్నీ ప్రశ్నలడుగుతున్న నువ్వు ఉన్నావా? లేవా? ఉన్నానంటావా, ఆ ఉన్నదేదో అదే ఆత్మ.

నాయనా! దేనియందు ఆరోపింపదలిచామో అది మన కంటియెదుట ఉండవద్దా? అని ప్రశ్నించావు. నిజానికి అవసరం లేదు. ఏమంటావా? ఆకాశం కంటికి కనబడుతున్నదా? అది కంటికి కనబడేది కాకపోయినా, దానియందు నీలత్వాన్ని, వర్తులవతనాన్ని ఆరోపించి ఆకాశం నల్లగా వలయాకారంగా ఉన్నదనటం లేదా?

నాయనా! ప్రపంచ నానాత్వం ప్రత్యక్షసిద్ధమని, ప్రత్యక్షసిద్ధమైన జ్ఞానాన్ని కాదనే వీలులేదని అన్నావు. ప్రత్యక్ష జ్ఞానమంటే ఏమిటి? ఇంద్రియజ్ఞానమే గదా? ఇంద్రియజ్ఞానమే పరమజ్ఞానం కాదు. ఇంద్రియాల సామర్థ్యం ఎంతవరకో

అంతవరకే వాటిని ప్రమాణంగా అంగీకరింపవచ్చును గాని అంతకు మించి వాటికి విలువలేదు. పగటి పూట నక్షత్రాలు కంటికి కనిపించవు. భూతదర్పణంతో చూస్తే పగటి పూట కూడా నక్షత్రాలు కనబడుతున్నాయి. కాబట్టి నయనేంద్రియమే సర్వమనుకొని పగటి పూట నక్షత్రాలు లేవనవచ్చునా?

అధ్యాసానికి పూర్వవస్తుజ్ఞానం ఉండాలన్న మాట నిజం. అయితే ఒకటి మాత్రం మర్చిపోకు. అధ్యాస్యమాన మవుతున్నది ఆ పూర్వవస్తువు కాదు. తాదృశత్వం ఆరోపింపబడుతున్నది. కాబట్టి అధ్యాసానికి వాస్తవపదార్థం అక్కరలేదని, దాని జ్ఞానం మాత్రమే చాలునని గ్రహించు. ఆ అనుభవం భూతకాలికమైనదిగా ఉండాలి. దీనినిబట్టి ఏమని తెలుస్తున్నది? ఆరోపింపబడుతున్నది మిథ్యయే గాని వాస్తవం కాదని ఏర్పడుతున్నది. ఒక్కటి మాత్రం నిజం. అది దేనియందు ఆరోపింపబడుతున్నదో ఆ ఆధారం సత్యమైనదిగా ఉండాలి. అధ్యాస్యమాన వస్తుజ్ఞానం స్మృతిమాత్రంగా ఉంటేచాలు. అధ్యాసకాలంలో పూర్వదృష్టవస్తువు స్వస్వరూపంలో మనముందు నిలబడటం లేదు. ఆ వస్తువుయొక్క జ్ఞాపకం మాత్రమే అనగా సంస్కారం మాత్రమే వ్యవహరిస్తున్నది.

## మీమాంసకమతం

శిష్యుడు:– స్వామీ! మిథ్య అయిన వస్తువు అనుభవయోగ్య పదార్థం కాదని, వివిధజ్ఞానమయినా సత్యజ్ఞానమే కాని మిథ్యాజ్ఞానం కానేరదని, మిథ్యాజ్ఞానం సత్యజ్ఞానం అని రెండు జ్ఞానాలు ఉండవని, ఎటువంటి జ్ఞానమైనా మనలో నిశ్చయాత్మకబుద్ధిని కలిగిస్తున్నదని, అట్టిదానిని గూర్చి శంకించే అవకాశం లేదని, బుద్ధిని శంకించటం మొదలుపెడితే మనము శంకావశులమై నిశ్చయానికి రాలేకపోతామని, జ్ఞానమన్నది తాత్కాలికమో

సార్వకాలికమో తర్వాత అసత్యమో లేక మరేదయినాసరే అప్పటికది సత్యమేనని మీమాంసకులు వాదిస్తుంటారు. దీనిని గురించి మీ అభిప్రాయం ఏమిటి?

గురువు:- అనుభవమాత్రాననే పదార్థం సత్యం కానవసరం లేదని, అసత్యమైన పదార్థాన్ని గురించి కూడా అనుభవజ్ఞానం కలుగుతున్నదని ముందే వివరించాను. కాబట్టి మీమాంసకవాదం యుక్తికి నిలవదు.

## ప్రభాకరమతం

శిష్యుడు:- స్వామీ! అసత్యమనే దానికి ఉనికిలేదని, సత్యానితో పోల్చి సత్యం కానిదానిని అసత్యమంటారని, అసత్యపదార్థం అనుభవజ్ఞానాన్ని కలిగించేది కానే కాదని, కాబట్టి జగత్తు మిథ్య అయితే తత్సంబంధమైన జ్ఞానం ఎలా కలుగగలదని ప్రభాకర మతం వాదిస్తున్నది. దీని సంగతేమిటి?

గురువు:- ఎండమావిని నిదర్శనగా గ్రహించి ప్రభాకరసిద్ధాంతాన్ని విమర్శిద్దాము. సూర్యకిరణాలు వాయుమండలాలలో విలోమప్రతిబింబితా లైనందువల్ల మరీచిక కనబడుతున్నది. మరీచిక అన్నప్పుడు జలవ్యతిరిక్తవిషయమని వారి మతం ప్రకారమే సిద్ధిస్తున్నది. కాబట్టి మనము మరీచికను చూసినప్పుడు అది నీరు కాదని స్పష్టంగా తెలుస్తున్నది. అయినప్పటికీ మరీచికను చూసినప్పుడు జలభావం ఉదయిస్తూనే ఉన్నదికదా. మరీచిక లోని జలం సత్యమనటానికి గాని అసత్యమనటానికి గాని అవకాశం లేదు. సత్యమనటానికి అది నీరు కాదు. అసత్యమనటానికి అందులో జలభావం ఉదయిస్తున్నది. అట్టి స్ఫురణకు కారణమేమంటే అది అనిర్వచనీయం. అంటే మన బుద్ధికి గోచరించే విషయం కాదు.

పదార్థస్వభావం సత్యమని, అసత్యమని రెండు విధాలు. సత్యమైన పదార్థం స్వభావం చేతనే సత్యమైనది; దాని సత్యత్వాన్ని ఇతరప్రమాణాల సాహాయ్యంతో సాధింపవలసిన అవసరం లేదు. రెండవదాని సంగతి అటువంటిది కాదు. దాని నిరూపణకు అన్యపదార్థసాహాయ్యం కావలసివస్తున్నది.

నిదర్శన చెబుతాను విను. మరీచికా విషయంలో సూర్యకిరణాలు సత్యం; ఎందుకంటావా? సూర్యకిరణాల వల్లనే మరీచిక ఏర్పడుతున్నది. అవి లేకపోతే మరీచికా లేదు. ఆ కిరణాలు నీటివలె కనబడటం మాత్రం అసత్యం. ఆ కనబడటమైనా మరొకదానిని బట్టి – అంటే అంతకు మునుపెక్కడో నీటిని చూడటం వలన కలిగిన సంస్కారాన్ని బట్టి ఏర్పడుతున్నది. నీటిని చూసే ఉండకపోతే మరీచికను చూసినప్పుడు జలభావం అంకురింపనే అంకురింపదు. మరీచిక యందు జలభావం కలిగినా దగ్గరకు వెళ్ళి పరిశీలించిన తర్వాత అందులో నీరు లేదని, మనకు జలభావం కలగటం సంస్కారజనితమైన భ్రాంతి మాత్రమేనని తెలుస్తున్నది. దీనినిబట్టి సత్యములైన సూర్యకిరణాలు ఎప్పుడూ సత్యములు గానే ఉన్నవని, సత్యము లైనవాటిని అసత్యాలుగా, అంటే జలాలుగా భావించినప్పుడు ఆ విధంగా భావితమైన అసత్యరూపజలం తుదివరకు నిలవక మార్పుచెందుతున్నదని తెలిసింది.

సత్యమైన బ్రహ్మమెప్పుడూ సత్యంగానే ఉన్నది. దానికి ఎటువంటి మార్పులు లేవు. మాయ, మాయాకార్యఫలం ఇవి రెండూ బ్రహ్మమునందు ఆరోపితమై సత్యాలుగా భావింపబడుతున్నా అవి సత్యాలు కావు. వాటికి నిమిషనిమిషం మార్పు కలుగుతూనే ఉన్నది. ఆ విధంగా మారుతుండేవి సత్యాలు కానేరవు. కాని అవి మనకు అనుభావితాలుగానే

ఉన్నాయి. కాబట్టి జగత్తు సత్యమూ కాదు; అసత్యమూ కాదు; సత్యాసత్యమూ కాదు. దానిని ఇట్టిదని చెప్పటం కష్టం. అందుకే అనిర్వచనీయం అన్నారు.

## బౌద్ధమతం

శిష్యుడు:– స్వామీ! ఆత్మ అన్నది లేనేలేదని, రజ్జువును చూసి సర్పమనుకొన్నప్పుడు చూసే అతని విజ్ఞానం సర్పరూపం దాల్చి సర్పమనిపింపజేస్తున్నదని బౌద్ధులంటారు. ఇది యుక్తియుక్తమా?

గురువు:– నాయనా! విజ్ఞానమే సర్పరూపం దాల్చినట్లయితే, రజ్జువును చూసి సర్పభ్రాంతి కలుగుతున్నప్పుడు 'ఇది పాము' అన్న భావమే కలుగనేరదని; విజ్ఞానమెప్పుడు సర్పరూపాన్ని దాల్చిందో, అప్పుడే 'నేను పామును' అనిగాని, 'నా పాము' అని గాని ఏర్పడుతుందని; దేనిపై ఆరోపిస్తున్నామో దానికి, దేనిని ఆరోపించామో దానికి గల సహజభేదాన్ని గ్రహింపలేకపోవటం వల్ల ఇటువంటి ప్రమాదం కలుగుతున్నదని ప్రభాకర మతం ఈ విషయంలో బౌద్ధ మతాన్ని నిరసిస్తున్నది.

## నైయాయిక మతం

శిష్యుడు:– స్వామీ! నైయాయిక మతం తత్త్వమేమిటి?

గురువు:– వస్తుద్వయ తారతమ్య జ్ఞానాభావం కార్యానికి ప్రేరేపింపజాలదని, ముత్యపు చిప్పను చూసి వెండి అనుకొన్నప్పుడు ఆ వెండిని తీసుకొందామనే ఆలోచన వెనువెంటనే జనించటము, దానిని తీసుకోవాలని ప్రయత్నించటము లోకసహజాలని, సుషుప్తిలో జ్ఞానం ఉండదు కనుకనే ఎటువంటి వ్యాపారమూ జరగటం లేదని, సుషుప్తిలో జ్ఞానం లేకపోయినా జ్ఞప్తి ఉంటుంది కాబట్టి అది చాలదా?

అంటే జ్ఞప్తి యెన్నడూ వ్యాపారప్రేరకం కాదని, ముత్యపు చిప్పను చూసి వెండిగా తలచినప్పుడు వెండి విషయమైన జ్ఞప్తి మాత్రమే గాక వెండి అనే సత్యజ్ఞానం కూడా కలుగుతున్నదని, అందువల్ల ఒకదానియందు లేని లక్షణాలను ఉన్నట్లు నమ్మడమే అధ్యాసమని, అంటే కంటికి గోచరించే పదార్థానికి సంయోగం కలగటమే అధ్యాసమని, అధ్యాసకాలంలో రజతజ్ఞానం మాత్రమే వ్యవహరించటం కాదని, అది నిజంగా రజతమేనన్న నిశ్చయజ్ఞానం వ్యవహరిస్తున్నదని, పూర్వదృష్టమై పరోక్షంలో ఉన్న వెండికి ప్రత్యక్షంగా ఉన్న ముత్యపు చిప్పకూ కలుగుతున్న ఈ సంయోగాన్నే మాయ అంటారని, ఈ అనుభవమంతా సత్యమేగాని మిథ్య కాదని, ఇంద్రియాలకు ఇంద్రియార్థాలతో సంయోగమైనప్పుడే పదార్థజ్ఞానం కలుగుతుందని, ముత్యపు చిప్పను చూసి వెండిగా భావించినప్పుడు వెండి అప్పుడు సమీపంలో లేనందువల్ల నేత్రరజతసంయోగం లేనందువల్ల రజతజ్ఞానానికి అవకాశమే లేదని, అలౌకిక జ్ఞాన లక్షణసన్నికర్షణం వల్ల ఇంద్రియాలకు ఇంద్రియార్థాలతో సంయోగం కలిగి జ్ఞానోత్పత్తి కాగలదంటే ధూమాన్ని చూసి అగ్నిని ఊహించినప్పుడు ఆ లక్షణం ఎందుకన్వయింపదని, అది అన్వయిస్తుందంటే అనుమానంకూడా ప్రమాణమే అవుతుందికదా అని, అనుమాన ప్రమాణాన్ని నిరసించడ మెందుకని, ముత్యపు చిప్పను చూసి వెండిగా భావించినప్పుడు అనిర్వచనీయమూ తాత్కాలిక సత్యమూ అయిన రజతం సద్యః కల్పితమై ఇంద్రియగోచరమై రజతజ్ఞానాన్ని కలిగిస్తున్నదని, ఆ రజతం ఎక్కడో ఉండి ఇప్పుడు కనిపించినట్లు కాదని, తత్కాలమందే అది మనయెదుటనే కనబడుతున్నదని, ఆ విధంగా కన్పించిన రజతం అభావం కాజాలదని, అభావమయితే ఇంద్రియగోచరమే కాజాలదని, ముత్యపు చిప్పయందే రజత లక్షణం స్వతస్సిద్ధమై ఉన్నదంటే ఆ

రజతనిశ్చయజ్ఞానం కలిగిన తర్వాత స్వతస్సిద్ధలక్షణం నాశనమయేందుకు వీలులేదని, ప్రకృతవిషయంలో అది ముత్యపు చిప్ప అని తెలిసిన తర్వాత వెండి అనే భావన నశిస్తున్నది కాబట్టి ముత్యపు చిప్పయందు రజతలక్షణం ఆరోపితమే గాని స్వతస్సిద్ధం కానేరదని, ముత్యపు చిప్ప యందలి రజతత్వానికి త్రికాలాబాధితమైన వాస్తవస్థితి లేకపోయినా తాత్కాలికమాత్ర సత్యత్వం ఉన్నదని, అందుకు కారణం అనిర్వచనీయమని నైయాయికులు తమ మతాన్ని స్థాపిస్తూ ప్రభాకర మతాన్ని నిరసిస్తున్నారు.

## వేదాంతం - అన్యమతాలు

శిష్యుడు:- స్వామీ! ప్రపంచంలో ఎన్నో మతాలున్నాయి. ప్రతిమతమూ తనమాటే పరమసత్యమంటున్నది. ఈ మతాల ప్రతిపాదనలు ఒకదానికొకటి విరుద్ధంగా ఉంటాయి. దీనివలన బుద్ధి కలవరపడటమే తప్ప సత్యమిదీ అని గ్రహింపలేకపోతున్నది. గత్యంతరమేమిటి?

గురువు:- నాయనా! సత్యమొక్కటే ఉంటుందికాని తలకొక సత్యం ఉండదు. సత్యానికి జాతి మత లింగ భక్తి విశ్వాసాది భేదాలు లేవు. ఏది సమస్తలోకానికీ హితమో అదే సత్యమతం. తక్కినవన్నీ దానికి ఛాయామాత్రం గానో అంశమాత్రం గానో ఉంటాయి. మతకర్తలకు వారివారి అంతఃకరణ పరిణతిని బట్టి సత్యస్ఫురణ కలుగుతుంది. వారికి స్ఫురించినంతవరకు మాత్రమే అది సత్యం. అదే పూర్ణసత్యం కాదు.

శిష్యుడు:- స్వామీ! ఇది సత్యమని నిశ్చయించే మార్గమేమిటి?

గురువు:- ఏది పూర్ణమో అదే సత్యం. ఆ నిర్ణయానికి యుక్తి ఒక్కటే

పరమసాధనం. ఏది సర్వసత్వాలకు ఈ లోకంలోనే సుఖాన్ని, హితాన్ని కలుగజేస్తుందో అదే సత్యం. అదే పరమార్థం. ఈ సత్యస్వరూపం సర్వపరిత్యాగం వలన తప్ప కలిగేది కాదు. అందుకు ఐహికాముష్మిక సుఖపరిత్యాగం కూడా సరిపోదు. అభిమానత్యాగం చేస్తే సర్వపరిత్యాగం చేసినట్లవుతుంది. ఆ సర్వపరిత్యాగం ఒక్క ధీరుడు మాత్రమే చేయగలడు. అందరూ చేయలేరు. అందువల్ల సత్యం ఒక్క ధీరునికి మాత్రమే సమగ్రదర్శన మిస్తున్నది. ఆతడే కృతకృత్యుడు. అతని మతమే సత్యమతం. అదే వేదాంతం.

శిష్యుడు:– స్వామీ! వేదాంతం కేవలాదర్శప్రాయమే గాని అనుష్ఠానయోగ్యం కాదని, అది మిథ్యామతమని కొందరి భావం. భావాలు మాత్రమే సత్యమని, బాహ్యపదార్థాలన్నీ ద్వైతబుద్ధి ప్రతిపాదితాలే తప్ప సత్యాలు కావని మరికొందరంటారు. భావాలు సత్యములే అయినా వాటికి కూడా జననలయాలు కలవని, ఆ కారణాన దుఃఖలక్షణాలు భావాలను వెన్నంటి ఉంటాయని ఒకరంటారు. సార్వలౌకికమైన అఖండ మనస్సే భగవంతుడని వేరొకరంటారు. ఇందులో ఏది గ్రాహ్యం?

గురువు:– నాయనా! బ్రహ్మమొక్కటే సత్యం. సర్వము బ్రహ్మమే. బ్రహ్మ వ్యతిరిక్తమైనది లేదు.

శిష్యుడు:– జీవుని సంగతేమిటి?

గురువు:– బ్రహ్మవ్యతిరిక్తమైన ఉపాధి ఒకదానిని ఊహించారు. ఆ ఉపాధి యందు బ్రహ్మాంశను ప్రవేశపెట్టారు. ఆ జీవునికి జననమరణాలు కల్పించారు. జీవుడు తన స్వస్థానమైన బ్రహ్మమును చేరటానికి ఉపాయాలను చూపారు. ఇవన్నీ

పామర జనుల అజ్ఞానాన్ని తొలగించేందుకు పన్నిన ఉపాయాలు మాత్రమే. సత్పదార్థస్వభావాజ్ఞానం వలన విపరీతజ్ఞానం కలుగుతున్నది. తన్నివారణార్థం శాఖాచంద్ర న్యాయాన్ని ఆశ్రయించారు.

శిష్యుడు:– స్వామీ! వేదాంతసిద్ధాంతానికి మూలసూత్రాలేమిటి?

గురువు:– 'అయమాత్మా బ్రహ్మ', 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్నవి మూలసూత్రాలు. మొదటిసూత్రం 'ఆత్మయే బ్రహ్మము' అంటున్నది. రెండవసూత్రం 'ఇదం' అనగా దృశ్యము బ్రహ్మమంటున్నది. మొదటిసూత్రంలోని 'ఆత్మ' ను, రెండవదానిలోని దృశ్యాన్ని లుప్తం చేసినప్పుడు 'బ్రహ్మ' మాత్రమే శేషిస్తుంది. ఆ విధంగా శేషించినది ఏకము, అద్వితీయము అని స్పష్టం. ఆత్మ బ్రహ్మము, దృశ్యమూ బ్రహ్మమే అన్నప్పుడు బ్రహ్మ భిన్నమైనది వేరొకటి లేదనే గాక, ఆత్మ – దృశ్యము రెండూ బ్రహ్మమునకు పర్యాయపదాలేనని అర్థమవుతుంది. అంటే ఒక్క పదార్థమే బ్రహ్మమని ఆత్మ అని ప్రపంచమని మూడు పేర్లతో అలరారుతున్నది. ఇది వేదాంతసిద్ధాంతం.

## అధ్యాసము – అవిద్య

గురువు:– అధ్యాసము కారణం కాగా అవిద్య దాని కార్యం. అవిద్య అంటే విపరీతజ్ఞానమని, జ్ఞానాభావం కాదని గ్రహించాలి. ఈ విపరీత జ్ఞానం యథార్థజ్ఞానోదయం కాగానే నశించిపోతుంది. యథార్థజ్ఞానం యమనియమాదుల చేత శ్రవణ మనన నిదిధ్యాసల చేత కలుగుతున్నది.

అధ్యాసకారణాన అధ్యస్తవస్తువు యొక్క గాని, అధిష్ఠానవస్తువు యొక్క గాని సదసద్గుణాలు బాధింపబడవు. అవి యథాస్థితిలోనే ఉంటాయి. అందువలన సత్యజ్ఞానంతో

నశించిన అవిద్యకు – అంటే విపరీతజ్ఞానానికి పునరావృత్తి లేదు. కనుక ఏ విషయమై మొదట విపరీతజ్ఞానం కలిగినదో, అది సత్యజ్ఞానం వలన నశించిన తర్వాత మళ్ళీ అటువంటి విపరీతజ్ఞానం కలుగదని తాత్పర్యం. ముత్యపు చిప్పను చూసినప్పుడు మొట్టమొదట వెండి అనే విపరీతజ్ఞానం కలిగింది. నిజం తెలిసిన తర్వాత అది వెండి కాదని ఏర్పడింది. వెండి కాదనే నిశ్చయజ్ఞానం ఒకసారి కలిగిన తర్వాత అది వెండియేమోనన్న విపరీత జ్ఞానం మళ్ళీ ఉండదని భావం. ఆరోపితాలైన అనాత్మ లక్షణాల చేత (వెండి లక్షణం చేత) అధిష్ఠానమైన ఆత్మ లక్షణం (ముత్యపు చిప్ప లక్షణం) బాధితమై ఉంటే ఆత్మయందు అనాత్మ లక్షణాలలో కొన్నయినా వ్యాపింపకపోవు. అనాత్మలక్షణవ్యాప్తి కారణాన అవిద్య (విపరీత జ్ఞానం) తలయెత్తక మానదు. అవిద్య ఒకసారి నశించిన తర్వాత మళ్ళీ తలయెత్తే అవకాశం లేదు. అంటే నశించిన అవిద్యకు పునరావృత్తి లేదు.

అవిద్యాకార్యమైన ఈ అధ్యాసం వలన జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృభేదాలు, వాటిని బట్టి కర్మ జ్ఞాన శాస్త్రభేదాలు కలుగుతున్నాయి. అనుభవం అన్నిచోట్ల దేహాత్మబుద్ధి తోనే మొదలవుతున్నది. అట్టి బుద్ధి ప్రమాదఫల మైనందువల్లనే తత్ప్రమాదాపనోదనానికి (పోవటానికి) తదర్థప్రయత్నానికి అవకాశం కలుగుతున్నది. అట్టి బుద్ధిప్రమాదమే లేకపోతే శుద్ధాత్మ ఎల్లప్పుడు జ్ఞానస్వరూపం గానే ఉంటుంది. జ్ఞాత అనేవాడు ఉండడు. అంటే తప్పున్నప్పుడే అది తప్పని తెలిసికొనటమూ ఆ తప్పును తెలిసికొనేవాడూ ఉంటాడు. తప్పే లేనప్పుడు అటువంటి అవకాశమే లేదు. జ్ఞాత (తప్పు తెలిసికొన్నవాడు) లేనప్పుడు యథార్థ జ్ఞానసాధనాలైన శాస్త్రాదులకే అవకాశం ఉండదు.

సారాంశ మేమిటంటే శాస్త్రసాధనాదులన్నీ అవిద్యానిరసనకు ఉపకరించేవే. అవి అజ్ఞాని కోసమే గాని జ్ఞాని కోసం కాదు. పరమసత్యం ఎంతదాకా స్వానుభవసిద్ధం కాదో అందాకా శాస్త్రాదుల ఉపకరిస్తాయి.

కాబట్టి శాస్త్రజన్యజ్ఞానం నిజంగా జ్ఞానమే కాదు. అది అవిద్యతో సమానమే. అట్లాగని శాస్త్రజన్యజ్ఞానం నిరుపయోగమని భావించకు. శాస్త్రాదుల వలన ఒక విధమైన వివేకసంచలనం కలుగుతున్నది. తత్ఫలంగా మంచిచెడ్డలు తెలుస్తున్నాయి. మంచిచెడ్డలు తెలిసికొన్నాక మంచిని గ్రహించటం, చెడును నిరసించటం జరుగుతుంది.

ఈ వివేకం మర్త్యులకే గాక చతుష్పాదిసర్వప్రాణులకు సహజమేనని, అట్టి వివేకసంపద కలిగినందువల్లనే గోవు దండధరుని చూసి పారిపోవటం, గడ్డివేసినవానిని చూసి దగ్గరికి రావటం మొదలయినవి కలుగుతున్నాయని అంటావా? ఆ మాట నిజం. లౌకిక విషయాలలో మర్త్యులకు, పశ్వాదులకు వివేకవ్యత్యాసం కానరాకపోయినా, అధ్యాత్మవిషయంలో వ్యత్యాసం ఉన్నది. పశ్వాదులకు దేహాత్మబుద్ధి తప్ప వేరొకటి లేదు. శాస్త్రజ్ఞానజనిత వివేకచలనం వల్ల దేహము వేరని, ఆత్మ వేరని మర్త్యులలో ఒకభావం ఉదయిస్తున్నది. అట్టి భావం కలుగనందువల్ల దేహం ఇక్కడే పడిపోయినా లోకాంతరాలకు తాను గమించి సుఖమనుభవింపగల భాగ్యం ఉంటుందనే విశ్వాసంతో యజ్ఞాదులు చేయటం జరుగుతున్నది.

ఇట్టివారి జ్ఞానం అంతవరకే పరిమితం; అది వేదాంత ప్రతిపాదితమైన ఆత్మజ్ఞానం కాదు. యజ్ఞాదులు చేసేవారికి వేదాంతజ్ఞానం విషమిస్తుంది. ఎలాగంటావేమో? ఆత్మ కర్త గాని

భోక్త గాని కాదని వేదాంతజ్ఞానం చెబుతున్నది. యజ్ఞం చేసేవాడు ఆత్మయే కర్త అని, భోక్త అని భావించి ఆ బుద్ధితో వాటిని నెరవేరుస్తాడు. వేదాంతజ్ఞానం అటువంటి బుద్ధికి భంగకరమవుతుంది.

కర్మకాండం వలె జ్ఞానకాండం కూడా అజ్ఞానికే గాని జ్ఞానికి కాదు. ఎందుకంటే వేదాంతమంతా ద్వంద్వభావనాశనార్థమై ఉన్నది. ద్వంద్వవాసనలు అజ్ఞానికే గాని జ్ఞానికి కావు. అందువల్ల జ్ఞానకాండం కూడా అజ్ఞానికే అని చెప్పాను.

కర్మఫలమంతా స్వర్గాదిభోగసంబంధమై ఆ కారణాన అవిద్యాప్రాపంచిక సంబంధమైనదిగా ఉన్నది. జ్ఞానఫలం స్వరూపాన్ని క్రమక్రమంగా గ్రహింపజేసి తుదకు అజ్ఞానాన్ని నశింపజేసేదిగా ఉన్నది.

అజ్ఞానం వల్ల జ్ఞానోత్పత్తి జరుగుతుందంటే వింతగా కనిపించవచ్చు. చేతిలో ముల్లు గుచ్చినప్పుడు వేరొక ముల్లుతో దానిని తీసివేసి ఆ తర్వాత రెండింటినీ పారవేస్తారు. అలాగే వ్యావహారిక శాస్త్రజ్ఞానం అజ్ఞానమే అయినా సహజ అజ్ఞానాన్ని పోగొట్టి దానితోపాటు తానుకూడా పోతున్నది.

అనగా పరమార్థజ్ఞానం కలిగిన తర్వాత జ్ఞానాజ్ఞానాలు రెండూ నశిస్తాయి. అంత శాస్త్రజ్ఞానం ప్రమాణమే. (16–24).

ఇది అధ్యాసరహస్యం. దీని భావాన్ని సమాధానచిత్తంతో గ్రహించి తత్త్వార్థం తెలిసి నడుచుకోవాలి'.

ఉద్ధవా! నీవడిగిన అర్థాన్ని గురుశిష్య సంవాదరూపంలో వివరించాను. ఇంకా సందేహం ఉంటే అడుగు' అన్నాడు.

ఉద్ధవుడు ఆ మాట విని 'స్వామీ! ముక్తిసంపాదనకు బ్రహ్మవేత్తలు అనేక మార్గాలను ఉపపాదించారు. అన్ని మార్గాలు ముఖ్యమైనవేనా? అందులో

ఏదో ఒకటి చాలునా? నీవు భక్తినే ప్రశంసించావు. కాబట్టి తక్కినవన్నీ అనపేక్షితాలా? ఏదీ నిశ్చయింపలేకపోతున్నాను. ఏ మార్గాన్ని అవలంబిస్తే మనస్సు ఇంద్రియవిముఖమై నీరసమవుతుందో నాకు నిశ్చయించి చెప్పు' అన్నాడు. (3-2).

దానికి శ్రీకృష్ణభగవానుడు పర్యాలోచించి, 'ఉద్ధవా! ముక్తికి అంటే అపరోక్షానుభూతికి అనగా భగత్సాక్షాత్కారానికి భక్తిమార్గమే ఉత్తమోత్తమ సాధనం; తక్కినవన్నీ ఆనుషంగికాలు మాత్రమే. ఈ సంగతిని నేనే వివరించాను. నేను చెప్పిన విషయమే వేదం. అది ప్రళయకాలంలో నష్టమయింది. ఆ తర్వాతి కల్పారంభ సమయంలో దానిని బ్రహ్మకు మళ్ళీ ఉపదేశించాను. బ్రహ్మ వలన అతని పుత్రుడు మనువు, అతని వలన మరీచాద్యులు, వారివలన తత్సంతానమైన దేవాసుర సిద్ధ చారణ గంధర్వ గుహ్యక విద్యాధర కిన్నర కింపురుష యక్ష నాగ మర్త్యాదులు గ్రహించారు.

ఇన్ని తెగలు ఎట్లా ఏర్పడ్డాయని అడుగుతావేమో. స్వభావభేదాన్ని బట్టి చరాచరకోటిలో తెగ లేర్పడుతున్నాయి. స్వభావమంటే ప్రకృతి అని, ప్రకృతి గుణత్రయ రూపంలో వ్యవహరిస్తున్నదని, గుణసమ్మేళనం అంశాంశ తారతమ్యంతో చిత్రవిచిత్రంగా జరుగుతుంటుందని ముందే వివరించాను. అట్టి సమ్మేళన తారతమ్యాన్ని బట్టి ఉపాధులేర్పడుతున్నాయి. ఉపాధిని బట్టి మనోవృత్తి, బుద్ధిశక్తి ఉంటాయి.

ఉద్ధవా! నేను వచించిన వేదానికి భిన్నార్థాలు చెబుతుంటారని, అందుకు కారణమేమిటని శంకింపవచ్చును. బుద్ధిని బట్టి ఊహలుంటాయి. బుద్ధిభేదానికి కారణాలను చెప్పాను. అందువలన వేదాన్ని వారివారి బుద్ధికి తగినట్లుగా ఊహిస్తుంటారు. వారి భావాలు శిష్యప్రశిష్యుల ప్రచారంలో మరి కొంత కల్పనకు లోనై మార్పు చెందుతున్నాయి.

ఉద్ధవా! బుద్ధిని బట్టి రుచి ఉంటుంది. ఏది యెవరికి రుచికరమో అదే పరమార్థంగా వారికి కనబడుతుంటుంది. రుచిభేదం వలన మార్గభేదాలు గోచరిస్తుంటాయి. ఉదాహరణ విను. జీవికి ధర్మమే ఉత్తమమార్గమని

మీమాంసకు లన్నారు. యశఃకామాలు ప్రధానమని నైయాయికులు, వాత్స్యాయనాదులు పలికారు. శమదమసత్యాలు శ్రేష్ఠమని యోగులు చెప్పారు. యథాసంతుష్టసుఖమే పరమప్రాప్యమని చార్వాకులు నిర్వచించారు. యజ్ఞతపోదానాలు ముఖ్యమని కర్మఠులు బోధించారు.

ఉద్ధవా! వీరందరూ పలువిధాల బోధించినా వారి బోధనలలో సూక్ష్మార్థ మొకటున్నది. అదేమిటంటే వారి మార్గాలన్నీ కర్మసాధ్యాలుగా ఉన్నాయి. కర్మసాధ్యఫలం ఎంత గొప్పదయినా అది ఆద్యంతవంతమై చివరికి నశ్వరమే అవుతుంది. నశ్వరసుఖమంటే తాత్కాలికమే గాని శాశ్వతంగా లభించేది కాదు. సుఖాన్ని కోరినప్పుడు శాశ్వతసుఖాన్నే కోరరాదా? అది విషయబుద్ధికి లభింపదు. ఎందుకంటే విషయబుద్ధి కర్మపరం. కర్మఫలం వలన శాశ్వతసుఖం కలుగదని చెప్పనే చెప్పాను.

ఉద్ధవా! శాశ్వతసుఖాన్ని కోరినవాడు విషయార్థాలను ఉపేక్షించి మనస్సును నాయందే నిలపాలి. నాయందు చిత్తాన్ని నిలిపినవారికి సార్వభౌమపదవి లభించినా దేవేంద్రపదవి చేజిక్కినా చివరికి బ్రహ్మపదవి దొరికినా ఎంతమాత్రమూ రుచింపదు. వారు పునరావృత్తిరాహిత్యాన్ని సైతం లెక్కచేయరు.

ఉద్ధవా! మర్త్యులేదో ఒక అర్థాన్ని కోరి దానిని పొందటానికి గాను నన్ను భజిస్తారు. మద్గతచిత్తుడైనవాడు దేనినీ కోరడు. కేవలం ప్రేమార్థం నన్ను ప్రేమిస్తాడే తప్ప ప్రతిఫలాన్ని కోరినందువలన కాదు. ఇట్టి ప్రేమనే పరాభక్తి అంటారు. అటువంటి భక్తుడు బ్రహ్మకంటె శివునికంటె చివరికి లక్ష్మికంటె నాకు ప్రియతముడు. నేనతనిని ప్రేమించినంతగా నన్నుకూడా ప్రేమించుకొనను. అతని పాదధూళి నాపై సోకితే ఎంతో పవిత్రుడనౌతాననే తలంపుతో ఎప్పుడూ అతని అడుగుల వెంట ఉంటాను. నిఖిలజీవవత్సలుడు, నిష్కాముడు, నాయందే అనురక్తచిత్తుడు అయినట్టి భక్తుడు అనుభవించే ఆనందం ఇంతింతని చెప్పటానికి మాటలు చాలవు. ఇంద్రియపరులైనవారే నాకు భక్తిచేసి ఎంతో సుఖమందుతుండగా పరాభక్తుని సంగతి వేరే చెప్పాలా?

ఉద్ధవా! అగ్ని ఇంధనాలను వలె నా భక్తి సర్వపాపాలను భస్మీకరిస్తుంది. నేను స్థిరభక్తికి సాధ్యుడనైనంత సులభంగా సాంఖ్య యోగ ధర్మాదులకు వశపడను. నన్ను చేరుకొనడానికి శ్రద్ధాపూర్వక భక్తికంటె సులభమార్గం లేదు. నాయెడ నిష్ఠాభక్తి కలిగినట్లయితే ఉపాధి తన నైసర్గికమాలిన్యాలను వదిలించుకొని అగ్నితప్త లోహంవలె విశుద్ధ మవుతుంది. అందువలననే మలినోపాధులు గల శ్వపాకులు కూడా నాకు భక్తిచేసి పరిశుద్ధులై కడతేరుతున్నారు.

ఉద్ధవా! శుద్ధి అంటే చిత్తశుద్ధి అని గ్రహించు. చిత్తశుద్ధి దయా సత్య ధర్మ వర్తనల వలన కలుగుతుందని కొందరు, విద్యా తపస్సుల వలన సిద్ధిస్తుందని కొందరు అంటారు. చిత్తము నా భక్తివలన ఎంత త్వరగా సులువుగా పూర్ణంగా శుద్ధమవుతుందో, అంత త్వరగా సులువుగా మరి దేనివలన శుద్ధిపొందలేదు. నా భక్తిచేత శుద్ధమైన చిత్తానికి, పరసాధనాల చేత శుద్ధమైన చిత్తానికి ఎంతో తారతమ్యం ఉన్నది. నా భక్తిచేత శుద్ధమైన చిత్తం శిరీషకుసుమం కంటె శరచ్చంద్రిక కంటె చల్లనై ప్రేమామృతాన్ని కురిపిస్తుంటుంది. అట్టి నా భక్తుని నిలువు నిలువెల్లా నా మాట చెప్పినంతనే హర్షపులకాంకిత మవుతుంది. అతని నయనాలు నిర్భరానందాశ్రువులను వర్షిస్తాయి. అన్యసాధనాల చేత శుద్ధమైన చిత్తం కొలని వలె రసహీనమై ఎండిన మ్రాను వలె పల్లవపుష్పరహితమై ఉంటుంది.

ఉద్ధవా! వేదజ్ఞులకు మాత్రమే ముక్తి సాధ్యమనే భ్రాంతి నీకు వద్దు. విద్యావంతు లేమిటి, విద్యావిహీను లేమిటి, భాగ్యవంతుడైనా నిరుపేదవాడయినా, పురుషులైనా, స్త్రీలయినా ఎవరైనా గాని నన్నాశ్రయించినవారికే ముక్తి సాధ్యపడుతుంది గాని వట్టి తర్కాలకు ఆడంబరాలకు వేషధారణలకు అది సాధ్యంకాదు. నన్ను కన్నుగప్పి ఏ కొంతమాత్రం ప్రవర్తింపలేరు. ఎవరేపని ఏ భావంతో చేస్తున్నది అది అప్పటికప్పుడే వారి హృదయస్థుడ నైన నాకు స్పష్టమవుతుంటుంది.

ఉద్ధవా! అర్జునునికి కర్మయోగమే ప్రధానం చేసి చెప్పాను. నీకు

భక్తియోగాన్ని ప్రధానం చేసి ఉపదేశించాను. కారణ మేమంటావా? గురువు శిష్యుని మనస్తత్త్వాన్ని బట్టి ఉపదేశించాలి. వారికి బుద్ధిభేదాన్ని కలిగింపకూడదు. (3-2). అర్జునునిలో సత్త్వగుణం కంటె రజోగుణం ప్రధానంగా ఉండేది. అందువల్ల పార్థు డప్పుడప్పుడు స్వాతంత్ర్యం వహించి నాతో వాదప్రతివాదాలు చేయటమే గాక నా యుక్తులన్నింటిని లౌకికదృష్టితో నిరసించి, 'నీ వెన్నయినా చెప్పు; నేనెంతమాత్రం యుద్ధానికి రా' నని తిరుగుబాటు చూపి శరచాపాలను విడిచిపెట్టాడు. ఈ లక్షణాలన్నీ రజోగుణప్రవృద్ధిని చూపుతాయి. రజస్సు శమించి సత్త్వం వృద్ధిపొందితే గాని తత్త్వరహస్యం బుద్ధిస్థమై అనుష్ఠానానికి రాదు. నిష్కామకర్మ వలన గాని రజస్సు నశింపదు. అందువల్ల అతనికి జ్ఞానాన్ని పరమావధిగా చూపి, జ్ఞానసిద్ధికి భక్తి సాధన మవుతుందని చెప్పి, భక్తి కుదురుకొనటానికి చిత్తశుద్ధి కలగాలని బోధించి, చిత్తశుద్ధికి నిష్కామకర్మయోగమే పరమోపాయమని వివరించి కర్మయోగాన్ని సరహస్యంగా ఉపదేశించాను.

ఉద్ధవా! నీ తత్త్వం సత్త్వప్రధానమైనది. అందువలన నాకు మొట్టమొదటనే దాసోహ మన్నావు. నా ఉపదేశవాక్యాలను కిమ్మనక తలదాల్చావు. ఆ కారణాన నీ తత్త్వానికి అనురూపమైన భక్తిమార్గాన్ని నీకు బోధించాను. అదే ముక్తికి పరమసాధనం.

## ఉద్ధవుని ప్రయాణం

ఉద్ధవుడు శ్రీకృష్ణభగవానుని ఉపదేశమంతటినీ సమగ్రంగా ఆకర్ణించి ఆనందాశ్రువులు నిండగా భగవానుని పాదాలను కన్నుల కద్దుకొని పునః పునస్సాష్టాంగాలు చేసి కృతాంజలియై, 'ఓ ప్రభూ! మీ అనుగ్రహం వలన నా మోహాంధకారం తొలగింది. మీ పాదారవిందములందు నా భక్తి అవిచ్ఛిన్నమై ఉండే తీరున నన్ను కరుణించండి' అని ప్రార్థించాడు. భగవానుడు చిరునవ్వు దాల్చి, 'ఉద్ధవా! నన్ను నమ్మి నాకు తన ఆత్మ నర్పించిన వారికెన్నడూ ఆపదలు లేవు. నీవిక బదరికాశ్రమానికి వెళ్ళి అక్కడ సమాహితచిత్తుడవై నా ఉపదిష్టార్థాన్ని స్వానుభవసిద్ధం చేసుకోవాలి. మేలవుతుంది' అన్నాడు.

ఉద్ధవుడు బదరికాశ్రమానికి బయలుదేరాడు.

ఉద్ధవుడు పోవటం చూసి బలరాముడు అదే భావాన్ని వ్యక్తంచేశాడు. కృష్ణుడు అతనిని కూడా సాగనంపాడు.

## యాదవుల ప్రయాణం

రాజేంద్రా! అంతలో ద్వారకా నగరంలో భౌమోత్పాతాలు, అంతరిక్ష మహోత్పాతాలు కలుగసాగాయి. శ్రీకృష్ణుడు ఆ అశుభలక్షణాలను చూసి సుధర్మ అనే పేరుగల సభామంటపంలో సమావేశమైన యాదవులతో ఈ విధంగా అన్నాడు.

'ఆర్యులారా! ఈ ఉత్పాతాలను చూస్తున్నారు కదా. ఇవి యమకేతువుల వలె పొడగట్టుతున్నాయి. మన కులానికి అప్రతీకార్యమైన విప్రశాపం ఉన్న సంగతి నెరుగుదురు కదా. ఇక ఇక్కడ క్షణకాలమైనా నిలువకూడదు. స్త్రీలను పిల్లలను వృద్ధులను శంఖద్వారానికి తరలించి మనము సరస్వతీ తీరంలోని ప్రభాసక్షేత్రానికి పోయి అక్కడ తీర్థస్నానం చేసి శుచులమై ఉపవసించి చిత్తసమాధానపూర్వకంగా దేవపూజ కావిద్దాము. ఆ పిమ్మట మహాత్ములైన విప్రులను ప్రార్థించి వారిచేత శాంతికర్మలు చేయించి స్వస్తిగొని గోభూహిరణ్య వస్త్రగజాశ్వగృహాది దానాలతో వారికి అర్చావిధులను నెరవేరుద్దాము. దేవద్విజగోపూజలు సకలారిష్టాలను రూపుమాపుతాయి. అవి మనకు మంగళకరాలు' అని చెప్పాడు.

యదువృద్ధులందరూ శ్రీకృష్ణుని పలుకులను అంగీకరించారు. స్త్రీ బాలవృద్ధులందరూ శంఖద్వారానికి తరలింపబడ్డారు. యాదవులు ఓడలెక్కి సముద్రం దాటి రథాలెక్కి ప్రభాసక్షేత్రాన్ని చేరుకొన్నాక పాపపరిహారం చేసి శ్రేయస్సులను ప్రాపింపజేసే శుభకర్మలను భక్తిశ్రద్ధలతో నెరవేర్చారు.

## యాదవ వినాశం

రాజేంద్రా! ఆ తర్వాత యాదవులు భోజనాదులు సలిపి ఆనందార్థం

కల్లుతాగటం మొదలుపెట్టారు. కొంతసేపటికి ఆ తాగటం మితిమీరింది. తత్ఫలంగా మతి చలించి మైమరుపు కలిగింది. ఆ కైపు తలకెక్కి యుక్తాయుక్తాలు మాని పరస్పరం వేళాకోళంగా గేలిచేసుకోవటం మొదలయింది. ఆ పరిహాసాలు మీరి అన్యోన్యకలహాలను రేకెత్తించాయి. వారు క్రోధవశులై శరశరాసనాలు గదాఖడ్గతోమరకుంతాది మహాయుధాలు చేపట్టి తలకొని ఒకరినొకరు సంహరించుకొనసాగారు. ప్రద్యుమ్నుడు సాంబుని తోను, అక్రూరుడు భోజుని తోను, అనిరుద్ధుడు సాత్యకి తోను, సుభద్రుడు సంగ్రామజితుని తోను, సుచారుడు గదుని తోను, సుమిత్రుడు సురథుని తోను ఢీకొన్నారు. మరొక వైపున భిషదోల్ముకులు, సహస్రజిత్ శతజిత్తులు మొదలయినవారు జంటజంటలుగా ఒండొరులను మార్కొన్నారు.

ఆ విధంగా దాశార్హులు, భోజులు, అంధకులు, వృష్ణులు, సాత్వతులు మొదలయిన యాదవశాఖల వారందరూ బాంధవాది భావాలను మరిచి తండ్రులనక కొడుకులనక భ్రాతలనక పరస్పరం మార్కొని శరాదులన్నీ వట్టిపోయినదాకా పోరాడి ఆయుధాలు చాలక సముద్రతటంలో ఉన్న తుంగలను పెరికి పరస్పర వధోద్యుక్తులయ్యారు. రాజా! తొలుత సాంబుని గర్భవాసాన ముసలం పుట్టినది, దానిని పొడిచేసి సముద్రాన కలిపినది ఆ వృత్తాంతమంతా విన్నావు కదా. ఆ చూర్ణం నీటిలో కలవక ఒడ్డుచేరి తుంగలుగా మొలిచింది. ఆ తుంగలే అప్పుడు వారికి ఆయుధాలుగా చేజిక్కాయి.

కృష్ణుడు వారిని ఎంతగానో వారించి చూశాడు. అతని మాట చెవిబెట్టక పోయినది చాలక యాదవులలో కొందరు ఆ తుంగలతో కృష్ణుని మీదికి, బలరాముని మీదికి దూసుకొని వచ్చారు. రామకృష్ణు లందుకు క్రుద్ధులై కొన్ని తుంగలను పెరికి తామూ చేతబట్టి వాటితో యాదవులలో కొందరిని చంపారు. కార్చిచ్చు వెదురు పొదలను దహించినట్లు క్రోధానలం శాపగ్రస్తమైన యాదవవంశాన్ని రూపుమాపింది.

## బలరామ నిర్యాణం

రాజేంద్రా! ఋషిశాపం తప్పదు కదా. యాదవుల వినాశాన్ని శ్రీకృష్ణుడు పరికించి భూభారం తగ్గినదని నిశ్చయించాడు. బలరాము డంతట సముద్రతీరంలో ఒకచోట కూర్చుండి యోగాన్ని పూని మర్త్యలోకం త్యజించి పరమాత్ముని చేరుకొన్నాడు.

## శ్రీకృష్ణునికి జర బాణహతి

బలరాముడు నిర్యాణం పొందిన తర్వాత శ్రీకృష్ణభగవానుడు చేరువనున్న ఒక రావిచెట్టు మొదటజేరి చతుర్భుజరూపం తాల్చి కుడితొడమీద ఎడమ పాదం ఉంచి కూర్చొన్నాడు. ఆ తరిని జరుడనే బోయవాడు పూర్వం సాంబుని గర్భంలో పుట్టిన ముసలము యొక్క తునకను బాణాగ్రానికి కూర్చి వేటకై అటు తిరుగుతూ భగవంతుని పాదాన్ని దవ్వులనుంచి చూసి మృగమని భావించి ఆ పాదానికి గురిపెట్టి అమ్మువిడిచి చేరువకు పోయి తన పొరపాటును గ్రహించి పశ్చాత్తాపంతో కుమిలి వాసుదేవుని పాదాలకు వ్రాలి 'దేవా! తెలియక తప్పుచేశాను. ఎవని స్మరణమాత్రాన అజ్ఞానతమఃపటలం పటాపంచ లవుతున్నదో, ఆ లోకేశ్వరునిపట్ల ఈ పాపాత్ముడు మహాపకారం చేశాడు. ఈ దురాత్ముడు మళ్ళీ ఇటువంటి అకార్యాన్ని చేయకుండా ఇప్పుడే ఇతనిని కడతేర్చు' అని పరిపరివిధాల ప్రార్థించాడు.

భగవాను డతనిని లేవదీసి, 'జరుడా! భయపడకు. నేను కోరినట్లే నీవు నడచుకొన్నావు. యాదవకులంలో జన్మించిన నాకుకూడా ఋషిశాపం తప్పరాదు. సుకృతులు పొందనోచిన స్వర్గానికి వెళ్ళే అనుజ్ఞనిచ్చాను, వెళ్ళు' అని ఆజ్ఞాపించాడు. జరుడు భగవంతునికి ముమ్మారు ప్రదక్షిణ ప్రణామాలు చేశాడు. అంతలో గగనమార్గాన విమానమొకటి వచ్చింది. అతను దానినెక్కి స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు.

## దారకాగమనం

అంతలో శ్రీకృష్ణరథసారథి దారుకుడు భగవానుని వెదుకుతూ రథంతోలుకొని ఆ వంకకు వచ్చి అక్కడ తులసీదళ పరిమళాన్ని ఆనవాలు పట్టి ముందుకు నడిచి అశ్వత్థమూలాన ఉన్న భగవానుని గుర్తించి, రథందిగి అతని అడుగుల వ్రాలి, 'స్వామీ! నీ చరణారవిందం కానని కారణాన నా దృష్టిచెడి నేను గాఢతమస్సాగరంలో మునిగి ఉన్నాను' అని వెక్కివెక్కి ఏడ్చాడు. దారుకుడు చూస్తుండగానే అతను తోలుకొని వచ్చిన రథం శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకాలతో మింటి కెగసిపోయింది. దానివెంట చక్రాద్యాయుధాలన్నీ తరలివెళ్ళాయి. దారుకు డదిచూసి నిశ్చేష్టుడయ్యాడు.

## శ్రీకృష్ణుని ఆదేశం

శ్రీకృష్ణభగవానుడు దారుకుని చేరువకు పిలిచి 'సారథీ! నీవు ద్వారకకు వెళ్ళి మనవారందరూ ఒకరినొకరు చంపుకొన్న సంగతి, బలరాముని నిర్యాణవార్తను, నా యీ స్థితిని బంధువులకు తెలియజెప్పు. నేను నా తనువును విడిచినంతనే సముద్రుడు ద్వారకను నీటముంపనున్నాడు. మనవారెవరూ ద్వారకలో ఉండకూడదని చెప్పి నా తల్లిదండ్రులను, తక్కినవారిని వారివారి వస్తువులతో ఇంద్రప్రస్థపురానికి వెళ్ళి అక్కడ అర్జునుని ప్రాపున ఉండవలసినదని నా మాటగా చెప్పు. నీవు భాగవత ధర్మాన్ని ఆశ్రయించి జ్ఞాననిష్ఠుడవై దృశ్యమానసమస్తం నా మాయారచితమని గ్రహించి ఉదాసీనుడవై ఉపరతిని పొందు' అని ఆజ్ఞాపించాడు. దారుకుడు భగవానునికి ప్రదక్షిణ ప్రణామాలు పెక్కు కావించి విషణ్ణహృదయంతో అతనిని విడువలేక విడువలేక విడిచి ద్వారకకు వెళ్ళాడు.

## శ్రీకృష్ణుని వైకుంఠగమనం

అంతలో పార్వతీపరమేశ్వరులు బ్రహ్మ ఇంద్రాదిదేవతలు మహర్షులు ప్రజాపతులు పితృదేవతలు సిద్ధ చారణ గంధర్వ యక్షోరగరక్షః కిన్నరకింపురుషాప్సరోగణం ద్విజులు భగవన్నిర్యాణసందర్శనోత్సుకులై భగవజ్జన్మకర్మ కీర్తనలు పాడుతూ పుష్పవర్షం కురిపిస్తూ అక్కడికి వచ్చారు.

గగనతలమంతా విమానాలతో నిండిపోయింది.

భగవానుడు తన విభూతిభూతులైన వారందరినీ చూసి కలువకన్నులను మూసి నిజదివ్యమంగళవిగ్రహంతో శ్రీవైకుంఠానికి విచ్చేశాడు. అతనిని సత్య ధర్మ ధృతి శ్రీ కీర్తులు అనుగమించాయి. బ్రహ్మాదులు అక్కడే ఉన్నవారై ఉండి భగవానుని అగోచరగమనాన్ని గ్రహింపలేక విస్మయపరులై ఆ విధానాన్ని ప్రశంసించుకొంటూ తమతమ స్థానాలకు వెళ్ళారు.

రాజేంద్రా! భగవానుడు యాదవకులంలో ప్రభవించి అక్కడ ప్రదర్శించిన లీలలన్నీ నటుడు వేషధారియై వర్తించినట్లు మాయావిడంబనలే కాని కర్మబద్ధాలు కావు. భగవానుడు జగద్రూపం దాల్చి అందులో తాను అంతర్యామియై ఉండి, దానిని నడిపి, కట్టకడపట ఆ జగాన్ని ఉపసంహరించి ఆత్మమహిమోపరతు డవుతాడు. మర్త్యశరీరంతో యమలోకానికి పోయి గురుపుత్త్రుని తీసుకొనిరావటం, అశ్వత్థామ బ్రహ్మాస్త్రం నిన్ను తాకకుండా నీ తల్లి గర్భంలోనికి ప్రవేశించి నిన్ను రక్షించటం, బాణాసురయుద్ధంలో అంతకునికి కూడా అంతకుడైన త్రిపురహరుని జయించటం, జరునికి సశరీరస్వర్గప్రాప్తిని కూర్చటం మొదలుగా గల మహాద్భుతాలు చూసిన భగవానునికి స్వశరీర రక్షణం ఏపాటిది? జరుని బాణహతి వలన భగవానునికి అటువంటి స్థితికలిగినదని కలలో కూడా అనుకోకు. జగదుత్పత్తిస్థితిలయాలకు కారణమైనవాడు, సర్వశక్తులకు ఆశ్రయభూతుడైన మహాశక్తిమంతుడు ఆ మహానుభావుడు తన అవతారకార్యం నెరవేరగానే స్వస్థానం చేరుకొన్నాడు. రాజేంద్రా! ఈ కృష్ణనిర్యాణచరిత్రను ప్రతిదినం ప్రాతఃకాలమందు శుచియై నిండారిన భక్తితో కీర్తించినవారికి సద్గతులు కలుగుతాయి.

## ద్వారకానగరవాసుల పాట్లు

రాజేంద్రా! దారకుడు వెంటనే ద్వారకకు పోయి వసుదేవుని, ఉగ్రసేనుని

సమీపించి వారి అడుగులపై వ్రాలి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ జరిగిన సంగతంతా వారికి విన్నవించాడు. ఆ దుర్వార్త చెవిసోకినంతనే వారిద్దరూ నిలువునా నేలగూలారు. ద్వారకానగరమంతా దుఃఖరోదనలతో నిండి ప్రతిధ్వనులీనింది.

కొంతసేపటికి వసుదేవాదులు తెప్పరిల్లి యాదవ నిధనప్రదేశానికి హుటాహుటి తరలివెళ్ళారు. దేవకీ రోహిణులు పుత్రవియోగదుఃఖహతలై ప్రాణాలు విడిచారు. యాదవపత్నులు వారివారి పతుల చితులపై దూకి శరీర త్యాగం కావించారు. వసుదేవుని భార్యలు, కృష్ణుని కోడళ్ళు అదే విధంగా దేహాలను విసర్జించారు. శ్రీకృష్ణుని భార్యలు రుక్మిణి మొదలుగా గల వారందరూ శ్రీకృష్ణార్పితచిత్తలై అగ్నిప్రవేశం చేశారు.

అర్జునుడు కృష్ణవియోగానికి ఎంతో దుఃఖించి గీతార్థాన్ని తలచుకొని ఊరటపొంది చనిపోయిన బంధువులకు పరలోకక్రియలు చేయించాడు. అంతలో సముద్రం పొంగి ద్వారకానగరాన్ని నీటముంచింది. భగవదాలయం ఒక్కటి మాత్రం నీటిలోమునిగిపోక శేషించింది. ఆ మందిరంలో భగవానుడు నిత్యసన్నిహితుడై ఉంటాడు. ఆ మందిరాన్ని స్మరించినంతనే ఎంతటి ఘోరపాపాలయినా నశించి నిఖిలసన్మంగళాలు కలుగుతాయి.

## పంచపాండవప్రస్థానం

రాజేంద్రా! అర్జునుడు హతశేషులను, స్త్రీబాలవృద్ధులను ఇంద్రప్రస్థపురానికి తరలించి వారికి వజ్రుని రాజుగా అభిషేకించాడు. ధర్మరాజు మున్నుగా గల నీ తాతలు కృష్ణనిర్యాణ వార్త విని నీకు రాజ్యం అప్పగించి మహాప్రస్థానమార్గం ప్రవేశించారు.

రాజేంద్రా! భగవానుని అవతార చరితలను కీర్తించేవారు భగవద్భక్తి పరాయణులై ఇహపరసుఖాలను పొందుతారు' అని శుకమహర్షి పరీక్షిన్నరేంద్రునితో అన్నాడు.

# ద్వాదశ స్కంధము

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు భాగవతాన్ని సవిస్తరంగా విని, మహానందంతో శుకమహర్షిని ఋషిసత్తమా! శ్రీకృష్ణభగవానుడు వైకుంఠానికి వెళ్ళిన తర్వాత భూతలాన ఎవరి వంశం ప్రవర్తిల్లనున్నదో తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉన్నది' అని అడిగాడు. అప్పుడు శుకమహర్షి భవిష్యత్కాల రాజుల వృత్తాంతాలను వినిపించాడు.

## భవిష్యత్కాల రాజుల చరిత్ర

### 1. పురంజయ వంశపాలన

'రాజేంద్రా! సోమవంశంలో కాలక్రమాన అనేక శాఖలు కలిగి వాటిలో ఒకటయిన మాధవకులం లోని రాజులు రిపుంజయుని దాకా ఇరవైమంది పరిపాలించిన సంగతిని నవమ స్కంధంలో వివరించాను. ఆ తర్వాత విను.

రిపుంజయుడికి పురంజయుడని కూడా పేరున్నది. అతనికి శునకుడనే పేరుగల మంత్రి ఉంటాడు. ఆ శునకుడు పురంజయుని చంపి తన కొడుకు ప్రద్యోతనునికి రాజ్యాన్ని అప్పగిస్తాడు.

## 2. ప్రద్యోతన వంశపాలన

### 138 సంవత్సరాలు

ప్రద్యోతనునికి పాలకుడు, అతనికి విశాఖయూపుడు, అతనికి జనకుడు, అతనికి నందిర్ధనుడు క్రమంగా జన్మిస్తారు. ఈ అయిదుగురు నూటముప్ఫైఎనిమిది సంవత్సరాల కాలంపాటు భూమండలాన్ని పరిపాలిస్తారు.

## 3. శిశునాభ వంశపాలన

### 360 సంవత్సరాలు

తర్వాత శిశునాభుడు రాజవుతాడు. అతనికి కాకపక్షుడు, అతనికి క్షేమధన్వుడు, అతనికి క్షేత్రజ్ఞుడైన క్షత్రధర్మజుడు, అతనికి విధిసారుడు, అతనికి జాతశత్రుడు, అతనికి దర్భకుడు, అతనికి అజయుడు, అతనికి నందివర్ధనుడు, అతనికి మహానంది వరుసగా ఉదయించి ఈ పదిమంది రాజులు మొత్తం మూడువందలఅరవై సంవత్సరాలు భూపరిపాలన కావిస్తారు.

## 4. నంద వంశపాలన

### 100 సంవత్సరాలు

మహానందికి శూద్రాగర్భంలో నందుడు ఉదయిస్తాడు. అతను మహాపద్మసంఖ్యగల సైన్యానికి ఆధిపత్యాన్ని వహించి మహాపద్మపతి అని పేరెన్నిక గంటాడు. అతను చండశాసనుడై ధరణిని ఏకచ్ఛత్రంగా పరిపాలించి క్షత్రవంశాన్ని భార్గవరాముని వలె రూపుమాపుతాడు. అదిమొదలు రాజులు శూద్రప్రాయులు, అధార్మికులు అవుతారు.

మహానందికి సుమాలి మొదలైనవారు ఎనమండ్రుగురు క్రమంగా జన్మిస్తారు. ఈ మహానంది, అతని వంశీయులు ఎనిమిదిమంది కలిసి నవనందనులని ప్రసిద్ధులవుతారు. ఈ తొమ్మిదిమంది నూరేండ్లు రాజ్యపాలన

చేస్తారు.

## 5. మౌర్య వంశపాలన

### 130 సంవత్సరాలు

ఈ నవనందులను ఒక బ్రాహ్మణుడు చంపి మౌర్యవంశంలో జన్మించిన చంద్రగుప్తుని రాజును చేస్తాడు. చంద్రగుప్తునికి వారిసారుడు, వారిసారునికి అశోకవర్ధనుడు, అశోకునికి సుయశుడు, సుయశునికి సంగతుడు, సంగతునికి శాలిశూకుడు, శాలిశూకునికి సోమశర్ముడు, అతనికి శతధన్వుడు, శతధన్వునికి బృహద్రథుడు అనేవారు క్రమంగా జన్మించి రాజ్యపాలన కావిస్తారు. ఈ పదుగురి పరిపాలన నూటముప్ఫైయేండ్లు జరుగుతుంది.

## 6. శుంగ వంశపాలన

### 112 సంవత్సరాలు

మౌర్య బృహద్రథునికి శుంగవంశంలో జన్మించిన పుష్యమిత్రుడనే వాడు సేనాపతిగా ఉంటూ రాజును చంపి తానే రాజ్యాధిపతి అవుతాడు. అతనికి అగ్నిమిత్రుడు, అగ్నిమిత్రునికి సుజ్యేష్ఠుడు, సుజ్యేష్ఠునికి వసుమిత్రుడు, వసుమిత్రునికి పుళిందుడు, పుళిందునికి ఘోషుడు, ఘోషునికి వజ్రమిత్రుడు, వజ్రమిత్రునికి భాగవతుడు, భాగవతునికి దేవభూతి క్రమంగా జన్మించి నూటపన్నెండు సంవత్సరాలు రాజ్యపాలన చేస్తారు.

## 7. కణ్వుల పాలన

### 345 సంవత్సరాలు

శుంగవంశీయుల తర్వాత అల్పగుణులైన కణ్వులు రాజ్యానికి వస్తారు. భాగవతుని కొడుకు దేవభూతి స్త్రీలోలు డవుతాడు. అప్పుడతనిని అతని మంత్రి కణ్వవంశ్య వసుదేవుడు చంపి రాజవుతాడు. వసుదేవునికి భూమిత్రుడు, అతనికి నారాయణుడు, నారాయణునికి సుశర్మ క్రమంగా

జన్మించి కలియుగంలో కణ్వవంశంవారు భూమండలాన్ని మూడువందల నలభైసంవత్సరాలు పరిపాలిస్తారు.

## 8. బలివంశపాలన

### 456 సంవత్సరాలు

సుశర్మను అతని భృత్యుడు అంధ్రజాతీయుడైన బలి అనే శూద్రుడు హతమార్చి రాజవుతాడు. బలి తర్వాత అతని తమ్ముడు కృష్ణునికి రాజ్యం సంక్రమిస్తుంది. కృష్ణునికి శ్రీశాంతకర్ణుడు, అతనికి పౌర్ణమాసుడు, పౌర్ణమాసునికి లంబోదరుడు, లంబోదరునికి చిబిలకుడు, అతనికి మేఘస్వాతి, మేఘస్వాతికి అటమానుడు, అటమానునికి అనిష్టకర్ముడు, అతనికి హాలేయుడు, హాలేయునికి తిలకుడు, తిలకునికి పురీషభీరుడు, పురీషభీరునికి సునందనుడు, సునందనునికి చకోరుడు, ఇంకా ఎనిమిది మంది కొడుకులు ఉదయిస్తారు. సునందనుని ఎనిమిదవ కొడుకుకు శివస్వాతి జన్మింపనున్నాడు. ఆ శివస్వాతికి అరిందముడు, అతనికి గోమతీపుత్రుడు, అతనికి పురీమానుడు, పురీమానునికి మేదశ్శిరుడు, అతనికి శివస్కందుడు, శివస్కందునికి యజ్ఞశ్రీ, అతనికి విజయుడు, విజయునికి చంద్రవిజ్ఞుడు, చంద్రవిజ్ఞునికి సలోమధి అనేవారు ప్రభవింపగలరు. ఆ విధంగా ముప్ఫైమంది బలివంశ రాజుల పరిపాలన నాలుగువందల యాభై ఆరు సంవత్సరాల కాలంపాటు జరుగుతుంది.

## 9. ఆభీరాదుల పాలన

### 1099 సంవత్సరాలు

తర్వాత అవభృతిని రాజధానిగా చేసికొని ఆభీరవంశరాజులు ఏడుగురు, గర్దభులు పదిమంది, కంకవంశ్యులు పదహారుగురు రాజ్యపాలన చేస్తారు. వీరందరూ అతిలోలుపులై ధర్మవ్యతిక్రమానికి పూనుకొంటారు.

కంకుల తర్వాత ఎనిమిదిమంది యవనరాజులు, పధ్నాలుగురు

తురుష్కులు పరిపాలిస్తారు.

తురుష్క కులజుల తర్వాత రాజ్యపాలన క్రమంగా పదిమంది గురుండులకు సంక్రమిస్తుంది. వారి అనంతరం పదకొండుమంది మౌనులు రాజులవుతారు.

మౌనవంశీయులు కాక తక్కిన ఆభీరాదులు అరవైమంది వేయిన్నితొంభైతొమ్మిది సంవత్సరాలు రాజ్యపాలన కావిస్తారు. పదకొండుమంది మౌనులు మూడువందల సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలిస్తారు.

## 10. భూతనందాదుల పాలన

### 106 సంవత్సరాలు

ఆభీర తురుష్క యవన మౌనాదులందరూ మరణించిన తర్వాత భూతనందుడు, వంగిరి శిశునంది, అతని తమ్ముడు యశోనంది, ప్రవీరకుడు కిలికిలాపురం రాజధానిగా నూటఆరుసంవత్సరాలు పరిపాలిస్తారు.

## 11. ఖండమండలపతులు

భూతనందాదులకు బాహ్లికులనే పేరుగల సుతులు పదముగ్గురు జన్మిస్తారు. పుష్యమిత్రుడనే రాజుకు దుర్మిత్రుడు ప్రభవిస్తాడు. ఆంధ్రు లేడుగురు, కోసలు లేడుగురు, బాహ్లికసుతులు, విదూరపతులు, నిషధులు భూమిని విభజించుకొని ఖండమండలాధిపతు లవుతారు.

అప్పుడు విశ్వస్ఫూర్జి అనే పేరుగల రాజు మగధదేశాన్ని కైవసం చేసికొంటాడు. అతనికి జన్మించిన పురంజయుడు చాతుర్వర్ణ్యాన్ని పునర్వ్యవస్థీకరించి బ్రాహ్మణాది వర్గాలను పుళిందు యదు మద్రకులనుగా పరివర్తింపజేస్తాడు. అతని కాలంలో ప్రజలందరూ అధర్మవర్తను లవుతారు. పురంజయుడు మహావీర్యవంతుడై క్షత్రియులను తరిమివేసి పద్మవతీపురాన్ని రాజధానిగా చేసుకొని గంగాద్వారం మొదలు ప్రయాగ వరకు విస్తరించిన

విశాలభూభాగాన్ని పరిపాలిస్తాడు.

ఆ తర్వాత సౌరాష్ట్రులు, అవంతీకులు, ఆభీరులు, అర్బుదులు, మాళవులు ఉపనయనాదులను మాని శూద్రప్రాయులైనవారు రాజులవుతారు. మ్లేచ్ఛులు, శూద్రులు, అంత్యజులు మొదలైనవారు వేదాచారశూన్యులు పాలకులై సింధుతటదేశాన్ని, చంద్రభాగా ప్రాంతదేశాన్ని, కాంచీదేశాన్ని, కాశ్మీరాన్ని పరిపాలిస్తారు. వీరందరికీ అధర్మమన్నా అసత్యమన్నా పరమాదరం; దాదృత్వం సన్నగిల్లుతుంది; సహనం పూర్తిగా లోపిస్తుంది. స్త్రీలకు, బాలురకు, గోవులకు, ద్విజులకు వీరి కాలంలో ప్రాణమానాదులు దక్కవు. పరదార ధనాసక్తి వలన విచ్చలవిడిగా నడుచుకొంటారు. వీరందరూ అల్పసత్త్వులు, అల్పాయువులుగా ఉంటారు. అంతెందుకు! వీరు రాజవేషపిశాచాలై ప్రజలను పట్టిపీడిస్తారు. జనులు రాజభయం వలన తలవంచి వారి శీలాచారాదులే మేలుమేలని కొనియాడుతూ, లోలోపల క్రుగ్గిపోతూ పడరానిపాట్లు పడవలసివస్తుంది.

## కలిదోష లక్షణాలు

రాజేంద్రా! కలిదోషాలు నానాటికీ పెచ్చు పెరుగుతాయి. సృష్టిమొత్తం సత్యధర్మాలపైనే నిలిచి ఉంటున్నది కదా, అవి రెండూ నానాటికీ క్షీణించిపోతాయి. వాటితోపాటు క్షమాదయాదులు సన్నగిల్లుతాయి. తత్ఫలితంగా ఆయుర్బలం, ధృతిస్మృతులూ తగ్గుతాయి. మనుష్యుని ఉత్కర్షమన్నది జన్మమును బట్టి ఆచారాన్ని బట్టి అంతకంటె ముఖ్యంగా గుణాలను బట్టి ఉంటుంది. కలియుగంలో అటువంటి ప్రమాణవిచారానికి తావే ఉండదు. ఎవడు ధనవంతుడో, వాడు ఎంత గుణహీనుడైనా మహాగ్రస్థానం వహిస్తాడు. 'ధనమూలమిదం జగ' త్తని ఉన్న మాట ఒక్కటే పాటింపబడుతుంది. ధనబలాలు కలిగినవారి మాటే ధర్మవాక్యంగా న్యాయబద్ధంగా పరిగణింపబడుతుంది. స్త్రీలు పురుషులు కులగోత్రాది

నియమాలను, శాస్త్రాచారాలను పాటించక వారివారి రుచుల ప్రకారం యథామతి వర్తిల్లుతారు. వివాహాలు స్వీకార మాత్రాలు అవుతాయి. వాక్చాతుర్యమే వ్యావహారికదక్షత అనిపించుకొంటుంది. దండాజినాలు ధరించినవారందరూ సన్న్యాసులవుతారు. జితేంద్రియత్వం పాటింపబడదు. లంచాలను బట్టి జయపరాజయాలుంటాయి. వాచాలత్వమే పాండిత్యలక్షణ మవుతుంది. గుణశీలాలకు మన్నన ఉండదు. ఆఢ్యుడు సాధువుగా, అనాఢ్యుడు అసాధువుగా గణింపబడతారు. దూరస్థితజలమే పుణ్యతీర్థం, స్నానమే అలంకారం, ముంగురులను పెంచటమే లావణ్యకరం, పొట్టనించటమొక్కటే పురుషార్థం అని భావింపబడుతుంది. ధార్ష్ట్యం కలవాడే సభార్హు డవుతాడు. కుటుంబపోషణమే సామర్థ్యలక్షణం అవుతుంది. ధర్మాన్ని అనుష్ఠించిన వారయినా కీర్తికాంక్షే ప్రధానంగా ఉంటుంది గాని పరమార్థబుద్ధితో చేయరు. ఈ విధంగా దుష్టగుణాలు ప్రబలుతాయి.

## కలియుగ రాజత్వం

నాలుగు వర్ణాలలో ఎవరు బలవంతులో వారే రాజులవుతారు. ఆ రాజులు లుబ్ధులు, నిర్ఘృణులు, చౌర్యబుద్ధులు అయి ఏదో ఒక తీరున పరదారధనాదులను అపహరించడమే పరిపాలనశీలంగా వర్తిల్లుతారు. రక్షకులు లేక జనులు గ్రామాలను, జనపదాలను విడిచిపెట్టి గిరికాననాలను ఆశ్రయిస్తారు. అనావృష్టి ప్రబలుతుంది. తత్ఫలంగా దుర్భిక్షాలు, జరాదిపీడలు విజృంభిస్తాయి. ఒక్కొక్కసారి శీతవాతవర్షాలు మహాభయంకరంగా బాధిస్తాయి. ఎండలను భరించటం కష్టమవుతుంది. పంటలు లేక జనులు ఆకటికి చిక్కి శాకమూల మాంసభక్షకులై అవీ దొరకనినాడు ఉపవాసాలకు లోగి కృశదేహులై మరణిస్తారు. కలియుగంలో జనులకు ముప్పైసంవత్సరాలే పరమాయువుగా మారుతుంది.

కలిదోషం వలన శరీరుల శరీరాలు క్షయించి జరావ్యాధులు అల్పవయస్సులోనే పైకొంటాయి; వేదమార్గం రుచింపనందువల్ల

వర్ణాశ్రమధర్మాలు నశిస్తాయి. పాషండ మతం విస్తరిస్తుంది; రాజులే కపటరూప దస్యుప్రాయులైనందున జనులకు చౌర్యము అనృతం హింస మొదలయిన దుర్వృత్తులు నిత్యకృత్యా లవుతాయి; ఓషధులు లభించటం దుష్కరమవుతుంది; ఆవుపాలకు బదులు మేకపాలు వాడవలసి ఉంటుంది; ఆశ్రమాలు లుప్తమవుతాయి; స్వపరభావాలు చెడతాయి; వృక్షవర్గం నశిస్తుంది; జమ్మిచెట్లు వృద్ధిపొందుతాయి; మేఘాలు విద్యుత్ప్రాయము లవుతాయి; గ్రామ జనపదాలు వట్టిపోతాయి.

## కల్క్యవతారం

రాజేంద్రా! కలియుగం ఆ విధంగా గతప్రాయమవుతుంటే చూసి భగవానుడు దుష్టశిక్షణ శిష్టరక్షణరూప ధర్మప్రతిపాదకుడు కాబట్టి లోకమంగళార్థం శంబల గ్రామంలో విష్ణుయశుడనే విప్రునియింట అవతరించి హయారూఢుడై ధరిత్రీసంచారమొనర్చి రాజవేషధరులైన దొంగలను కోట్లకొలదిగా తెగటార్చి దుష్టప్రచారాన్ని అణచివేస్తాడు. ఖలసంహారఫలంగా అప్పటికి వీనుమిగిలి నిలిచి ఉన్న శిష్టుల బాధలుడిగి ప్రసన్నచిత్తు లవుతారు. చిత్తప్రసాదం కలగగానే వారి అంతర్యామియై ఉన్న భగవానుడు వారికి ప్రసన్నుడవుతాడు. ధర్మం మళ్ళీ తలయెత్తుతుంది. అప్పటికి కృతయుగం ప్రవేశిస్తుంది.

## కృతయుగ ప్రవేశకాలం

రాజేంద్రా! కృతయుగప్రవేశాన్ని గురించి విను. సూర్యచంద్ర బృహస్పతులు ఏకకాలంలో పుష్యనక్షత్రాన్ని ప్రవేశించినపుడు కృతయుగం ప్రవేశించినదని గ్రహించాలి. పన్నెండు సంవత్సరాలకు ఒకసారి బృహస్పతి కటకరాశిలో ఉండగా సూర్యచంద్రులు అందులోనికి ప్రవేశించి ఆ విధంగా ముగ్గురికీ ఏకకాలంలో పుష్యనక్షత్రంలో సంయోగమేర్పడటం ఉన్నది.

ఆలాగున కాక ముగ్గురూ ఏకకాలంలో పుష్యనక్షత్రం లోనికి అడుగుపెట్టాలి. అట్లా ప్రవేశించిననాడు కృతయుగం ప్రారంభమవుతుంది.

రాజేంద్రా! అతీతానాగత సోమసూర్యవంశాల రాజులను గురించి సంక్షేపంగా తెలిపాను. నీకు రాజ్యాభిషేకమైనది మొదలు నందునికి అభిషేకం జరిగేనాటికి మధ్యకాలం వేయినూటపదిహేను సంవత్సరాలు కావాలి. సప్తర్షిమండలం ఉన్నది. ఆ ఋషిసప్తకంలో ఎవరో ఇద్దరు ఉదయించే వేళ వారిమధ్య అశ్విన్యాదినక్షత్రాలలో ఆ నక్షత్రం ఉంటే అందులో వారు నూరు మర్త్యసంవత్సరాల కాలం ఉంటారు. నీవు రాజ్యం చేస్తున్న ఈ కాలంలో వారిద్దరు మఖలో ఉన్నారు. ఆ మహర్షులు మఖలో ఉండగానే శ్రీకృష్ణనిర్యాణం, కలిప్రవేశం జరిగాయి. ఆ మహర్షులు క్రమక్రమంగా మఖనుండి పూర్వాషాఢకు వస్తారు. మఖకు పూర్వాషాఢ పదకొండవ నక్షత్రం కాబట్టి వారక్కడికి చేరుకొనేనాటికి పదకొండువందల సంవత్సరాలు గతిస్తాయి.

## కలి ప్రవేశం

శ్రీకృష్ణనిర్యాణానికి పూర్వమే 112 సంవత్సరాల క్రితం కలి ప్రవేశించింది. అయినా అతని ప్రవేశం సంధ్యాకాల మైనందువలన, అప్పటికి శ్రీకృష్ణభగవానుడు ఉన్నందువలన కలిపురుషుని ఆటలు సాగలేదు.

రాజేంద్రా! కలి ప్రవేశకాలాన్ని తెలిపాను. అతని వృద్ధికాలాన్ని గూర్చి విను. కలి పూర్వాషాఢకు వచ్చినప్పుడు నందరాజ్యకాలం. కలిప్రభావం ప్రద్యోతనుని కాలంనుంచి నానాటికి వృద్ధిపొందుతూ నందాదుల కాలం నాటికి ప్రబలతర మవుతుంది. అందుకు ప్రమాణ మేమిటంటావేమో? శ్రీకృష్ణుడున్నప్పుడే కలి ప్రవేశించినా అతని ఆటలప్పుడు సాగకపోవటం, శ్రీకృష్ణనిర్యాణంతో కలి తలయెత్తటం కాలవిశేషజ్ఞులు పరికించి ఆ విధంగా అన్నారు. కలి ప్రవేశించిన తర్వాత రెండువేల దివ్యసంవత్సరాలు అంటే

మర్త్యమానంలో 4,32,000 సంవత్సరాలు ఉంటుంది. తర్వాత కృతయుగం ప్రారంభిస్తుంది. కృతయుగప్రవేశంతో నరులకు ఆత్మప్రకాశ మవుతుంది. ఇదే కృతయుగ ప్రారంభకాల లక్షణం.

## యుగభేదాలు - కులభేదాలు

రాజేంద్రా! యుగభేదాలను బట్టి నాలుగు వర్ణాలలోనూ గుణభేదాలు కలుగుతుంటాయి. కలియుగాంతంలో శంతనుని అగ్రసోదరుడైన దేవాపి, ఇక్ష్వాకు వంశజుడైన మరుడు మహాయోగబలులై కలాపగ్రామంలో భగవదాజ్ఞ ప్రకారం నివసిస్తూ వర్ణాశ్రమాచార ధర్మాలను మళ్ళీ ఎప్పటివలె నెలకొల్పుతారు.

## అజ్ఞానఫలం

రాజేంద్రా! ఎందరెందరో వ్యక్తులు రాజులు కావటం, వారు భూకాంక్షాపరులై మత్తిల్లి తుదకు మరణించటం విన్నావుకదా. రాజశబ్దం దేనికి అన్వయిస్తున్నది? శరీరానికి అన్వయిస్తున్నది. ఆ శరీరం ఏమవుతున్నది? ఎట్టకేలకు భస్మమో పురుగులపాలో అవుతున్నది. అంతమాత్రపు శరీరం కోసం ఎంతటి భూతద్రోహానికయినా ఒడిగడతారు. అట్టి వారికి స్వార్థమంటే ఏమిటో తెలియదు. అంతేకాదు. వారు తమ అకార్యానికి ఫలంగా ఘోరనరక కూపంలో పడతారు.

## భూదేవి పరిహాసం

అందుకు కారణమేమిటని అడుగుతావేమో? దేహమే ఆత్మ అని భావించి వర్తిల్లటమే కారణం. దేహమంటే పంచభూతాత్మకము, నశ్వరము అయిన పదార్థం. ఆత్మమో? శాశ్వతం. ఈ రహస్యాన్ని గ్రహింపలేక నరులు నానావిధమమకారాలకు లొంగి పలుపోకలు పోయి తుదకు చేడ్పడుతున్నారు. నీకు పూర్వం ఈ భూమిని ఎందరో రాజులు పరిపాలించారు. వారిలో ఒక్కడైనా ఈనాడు బ్రతికి ఉన్నాడా? ఆ రాజులు

చేరెడు నేలకోసం పరస్పరజయాలను కోరి మృత్యువుతో ఆటలాడారు.

అటువంటి మర్త్యులను చూసి, 'అయ్యో! దేహం నీటి మీది నురుగువంటిది. అట్టి దేహము శాశ్వతమని వాటిని సాధించాలని తహతహలాడుతారు. ఎంత విద్యావంతులయినా ఇటువంటి కోరికలు కలవారు దుఃఖభాగులు కాక మానరు. ఇంద్రియషడ్వర్గమనే వైరులను గెలువలేనివారు తమ ఇంటిలో ఉన్న మృత్యువును కానక ఎక్కడో ఉన్న పరవైరులను గెలిచి వారినుంచి నన్ను గెలుచుకొందామని వృథాయత్నాలు చేస్తారు. మరొక విశేషం. నా కొరకు గాను పితాపుత్రులకు భ్రాతలకు సైతం పరస్పరవిరోధాలు యుద్ధాలు మరణాలు కలుగుతున్నాయి. భూమండలం ఎన్నటికీ నరుల సొత్తు కాబోదు. పృథు పురూరవులు గాధి భరత నహుషులు, అర్జునుడు, మాంధాత, సగరుడు, రాముడు, ఖట్వాంగ దుందుమార రఘు తృణబిందు యయాతి శర్యాతి శంతను గయ భగీరథ కువలయాశ్వ కుకుత్స్థ నైషధ నృగ హిరణ్యకశిపు వృత్ర రావణ నముచి శంబర భౌమ హిరణ్యాక్ష తారకాదులు మహాశూరులు సర్వజ్ఞులు సర్వజయులు అయినా అందరూ మర్త్యధర్ములై నశించారు. వారిలో ఒక్కడయినా నన్ను శాశ్వతంగా పొందగలిగాడా?' అని భూదేవి పరిహసిస్తున్నది, చూడు!

## మనుష్యధర్మం

రాజేంద్రా! ఆ రాజులందరూ గొప్ప కీర్తిమంతులన్న విషయంలో ఎటువంటి సందేహమూ లేదు. అయితే అంతటి ప్రశస్తపదాన్ని సాధించిన వారు కూడా మమకారాన్ని మాత్రం గెలువలేకపోయారు. వీరిని పేర్కొనటం విజ్ఞాన వైరాగ్య వివక్షార్థమే కాని పరమార్థభావంతో కాదు.

అందుచేత మర్త్యులకు అవశ్యకర్తవ్య మేమిటో విను. భగవంతుని యెడ స్థిరభక్తిని కోరి దానిని సాధించాలి. సాధనమంటే భగవత్కథాశ్రవణమే పరమసాధనం. ఆ శ్రవణాన్ని ప్రతినిత్యం తప్పక చేస్తుండాలి.

## కలియుగ దోషహరణమార్గం

మునులారా! శుకయోగీశ్వరుడు ఆ విధంగా చెప్పగా పరీక్షిన్నరేంద్రుడు విని, 'మహాత్మా! కలియుగం దోషభూయిష్ఠమని అన్నారు. దోషపరిహారం జరిగితేనే కాని మనస్సు ఏకాగ్రమై భగవన్ముఖం కాదు. జనులు ఆ కలిదోషాలను ఏ విధంగా పరిహరింపగలుతారు?' అని అడిగాడు. శుకమహర్షి ఈ విధంగా చెప్పాడు.

## యుగ ధర్మాలు

రాజేంద్రా! జనులు ధర్మాన్ని అనుష్ఠించితే కలిదోషం పరిహృత మవుతుంది. ధర్మానికి సత్యము, దయ, తపస్సు, దానము అని నాలుగు పాదాలున్నాయి. ఆ నాలుగు పాదాలతో అది ప్రవర్తిల్లుతుంది. యుగలక్షణాన్ని బట్టి ఆ ధర్మస్వరూపం మారుతుంటుంది.

## కృతయుగం

కృతయుగంలో సత్యాదులను నాల్గింటిని జనులు భక్తిశ్రద్ధలతో పాటిస్తారు. తత్ఫలంగా జనులు కరుణ, మైత్రి, క్షమ, శాంతి, దాంతి సమకూడి సంతుష్టులై ఆత్మారాములై ఆత్మజ్ఞానాన్ని అభ్యసిస్తూ సమదర్శనులుగా ఉంటారు.

## త్రేతాయుగం

త్రేతాయుగంలో అధర్మమనే పాదం తలయెత్తి నడయాడటం మొదలుపెడుతుంది. అధర్మానికి అనృతము హింస అసంతోషము విగ్రహము అని నాలుగు పాదాలు. అధర్మప్రచారమంటే అనృతాదులు ప్రచరించటమని భావం.

అధర్మప్రచారానికి ఫలంగా ధర్మస్థితికి భంగం ఏర్పడుతుంది. ఆ

కారణాన త్రేతాయుగంలో ధర్మం మూడు పాదాలతో మాత్రమే వర్తిల్లుతుంది. తత్ఫలంగా జనులలో కొందరు మాత్రమే క్రియాతపోనిష్ఠులై విశేషించి హింస చేయక అధిక భోగలంపటులు గాక త్రివర్గపరులై సన్మార్గాన్ని అవలంబిస్తారు. ఆ యుగంలో బ్రాహ్మణులకు అధికత్వం కలుగుతుంది.

## ద్వాపర యుగం

ద్వాపరయుగంలో అధర్మలక్షణాలు మిక్కుటమై రెండు భాగాలు వ్యాపిస్తాయి. ఆ కారణాన ధర్మం రెండు భాగాలు తగ్గి రెండు పాదాలతో మాత్రమే వర్తిల్లుతుంది.

ద్వాపరయుగంలో యశస్సు శీలము అధ్యయనాసక్తి కుటుంబభరణ ప్రియతమా లవుతాయి. ఈ లక్షణాలు కలవారు బ్రాహ్మణులు క్షత్రియులు అని పిలువబడుతూ ఆధిక్యాన్ని పొందుతారు.

## కలి యుగం

కలియుగంలో ధర్మం నాల్గింట ఒక్కభాగం మాత్రమే ఉంటుంది. కలియుగాంతానికి అదికూడా నశించిపోతుంది. ఆ యుగంలో లుబ్ధత్వం దురాచారం నిర్దయ శుష్కవైరం దారిద్ర్యం తృష్ణావిశేషం విచ్చలవిడిగా వ్యవహరిస్తాయి. అటువంటి గుణాలను కలిగినవారు శూద్రులు సంకరజాతులు అనబడుతారు. అట్టివారి సంఖ్య మిక్కుట మయినందువల్ల వారిదే ప్రధానత్వ మవుతుంది.

## ధర్మవైషమ్య కారణం

రాజేంద్రా! యుగధర్మాలలో ఇటువంటి వైషమ్యం ఏర్పడటానికి కారణమేమంటావా? సత్త్వము రజస్సు తమస్సు అని ప్రకృతిసిద్ధమైనవి మూడు గుణాలు ఉన్నాయి. ఆ గుణాల వృద్ధిక్షయాలను బట్టి యుగధర్మాలలో వృద్ధిక్షయాలు కలుగుతుంటాయి. ఆ ప్రకారం ఎటువంటిదంటే, సత్త్వగుణం ప్రధానమైనప్పుడు యుక్తాయుక్త నిర్ణయకారి అయిన బుద్ధి, మనస్సు,

తదితరములైన ఇంద్రియాలు సత్త్వస్ఫూర్తిని కలిగి ఉంటాయి. తత్ఫలంగా తపోజ్ఞానాదులందు జనులకు రుచి మిక్కుటంగా ఉంటుంది. అలా ఉండే కాలాన్ని కృతయుగమని అన్నారు. రజస్సు ప్రధానమై వర్తించినప్పుడు జనులకు యశస్సు మొదలైనవానియందు రుచి అధిక మవుతుంది. వారు ధర్మార్థకర్మపరు లవుతారు. ఆ కాలాన్ని త్రేతాయుగమని అంటారు. రజస్తమస్సులు రెండూ సమానస్థితిని గాంచి సత్త్వాన్ని మించి వ్యవహరించినప్పుడు కామ్యకర్మాసక్తి ఉదయిస్తుంది. తత్ఫలంగా జనులు లోభులు అసంతుష్టులు మాన దంభ మత్సరపరులు అవుతారు. ఆ కాలాన్ని ద్వాపరయుగమని అంటారు. ఎప్పుడు తమోగుణం సత్త్వరజస్సులు రెండిటినీ మించి వర్తిస్తుందో అప్పుడు జనులలో మోహగుణం అధిక మవుతుంది. అందువలన మాయానృతాలు నిద్రాలస్యాలు హింసావిషాదాలు శోకభయదైన్యాలు విశేషించి అధర్మం తాండవిస్తుంది. ఆ కాలాన్ని కలియుగమని అంటారు.

## కలియుగ విశేషాలు

రాజేంద్రా! కలియుగంలో పురుషులు మందమతులు స్వల్పభాగ్యులు అధికాహారులు దరిద్రులు అయి ఎందునా కోరికలు తీరనివారై చరిస్తారు. స్త్రీలకు వ్యభిచారమే శీలమవుతుంది. దొంగలు మెండై దేశాన్ని గోడు కావిస్తారు. పాషండ మతం వ్యాప్తిస్తుంది. వేదమతం మూలపడుతుంది. రాజులు ప్రజారక్షకులు కావటానికి మారుగా ప్రజాభక్షకు లవుతారు. ద్విజులు నీతినియమాలు మాని శిశ్నోదరపరులై సర్వభక్షకులు, కంటబడినదానితో రమించేవారు అయి అదే పరమార్థంగా ఉంటారు. బ్రహ్మచారులు శౌచవ్రతాలను విడిచిపెడతారు. గృహస్థులు పనిదొంగలై భిక్షాటనమే జీవికగా బ్రతుకుతారు. వానప్రస్థాశ్రమం అరుదవుతుంది. అందరూ గ్రామవాసాన్నే కోరుకొంటారు. సన్న్యాసం వేషమాత్ర మవుతుంది. సన్న్యాసులు ధనలోలుపు లవుతారు. స్త్రీలు లజ్జావిహీనలై సాహసం వహించి

మాయావతులై చౌర్యానికి జంకక నోటికి వచ్చినట్లు మాటాడుతూ తిండిపోతులై అధికసంతానాన్ని కంటూ దుర్వృత్తులలో ఉంటారు. వణిజులకు ఆపత్సమయాలలో సాధునిందిత వాణిజ్యానికి కొంత ఎడమున్నప్పటికీ, అనాపత్సమయాలలో కూడా వారు మోసగించి వాణిజ్యం చేస్తారు. ఎవడు కాసులు మిక్కుటంగా ఇస్తే వాడే భృత్యులకు రాజవుతాడు. సేవకులు గుణతత్త్వాన్ని పాటింపరు. రాజులు వంశపారంపర్యంగా తమను సేవించిన భృత్యులయినా ఆపదలో ఉన్నారని తెలియగానే చేరదీయక పరిత్యజిస్తారు. ఆవులు పాడి ఉడిగినంతనే నిరసింపబడుతాయి. పురుషులు సురతాసక్తులై స్త్రీలకు వశవర్తులు కావడమే గాక ఆడబిడ్డల మాటలకు, బావమఱదుల మాటలకు లోనై వారి యిచ్ఛానుసారం వర్తిల్లుతూ తల్లిదండ్రులను, సోదరీసోదరులను ఉపేక్షిస్తారు. శూద్రులు తాపసవేషాలు ధరించి ప్రతిగ్రహాలను ఆశించటం, ధర్మతత్త్వం తెలియకపోగా ఉన్నతాసనాలపై కూర్చుండి ధర్మోపన్యాసాలు వల్లించటం సర్వసామాన్యమవుతాయి. వానలు లేక దేశం దుర్భిక్షాక్రాంత మవుతుంది. అన్నవస్త్రాలకు కరువు ఏర్పడుతుంది. జనులు నిలువనీడలేక కుడువ కూడు దొరకక పిశాచతుల్యులై సంచరిస్తూ రూకకోసం ప్రాణాలను సైతం బలిపెడుతూ లాభోపార్జనకు అవకాశం ఉన్నదంటే ఎంతటి చెలిమినయినా త్యజించి పగబూని శిశ్నోదర తృప్తికొరకు మాతాపితృ పోషణ భార్యాపుత్ర భరణ ధర్మాలను కూడా విస్మరిస్తారు. మనస్సులు పాషండమతగ్రస్తాలు అయినందువల్ల మనుష్యులకు భగవన్నమస్కారాదులు హేయము లవుతాయి. ఎవరి దివ్యనామాన్ని ప్రాణోత్క్రమణ కాలమప్పుడో, రోగబాధ కలిగినప్పుడో, జారిపడినప్పుడో, కారణ మేదయితేనేమి, బుద్ధిపూర్వకంగానో అబుద్ధిపూర్వకంగానో పలికినంత మాత్రాననే సమస్త కర్మబంధాలు తెగి ఉత్తమగతి కలుగుతుందో ఆ పరమపూరుషుని కలిజనులు పూజించటం మానుకొంటారు.

## భగవత్కీర్తనమే శరణం

రాజేంద్రా! భగవానుడు ఎల్లవేళల హృదయవర్తిగానే ఉంటాడు. ఆ సంగతి గ్రహించినంతనే ఆ వ్యక్తి హృదయం పరిశుద్ధ మవుతుంది. అటువంటి గ్రహణం భక్తివలన కలిగినట్లు విద్యాతపోయోగాదుల వలన గాని తీర్థ వ్రత దాన జపాదుల వలన గాని కలగదు. పరీక్షిన్నరేంద్రా! నీకు మరణసమయం ఆసన్నమయింది. అవహితుడవై చిత్తాన్ని భగవంతుని యందు పాదుకొలుపు, ఉత్తమగతి కలుగుతుంది. కలి నిఖిలదోషనిధానమే అయినా భగవత్కీర్తన శ్రవణ మాత్రాన దోషాలు తొలగి పరమపదాన్ని ప్రసాదిస్తుంది. కృతయుగంలో విష్ణుధ్యానం, త్రేతాయుగంలో వివిధయజ్ఞాచరణం, ద్వాపరంలో భగవత్సేవ ఎంత ఫలాన్ని కలిగిస్తాయో అంతకంటె అధికమైన ఫలం కలియుగంలో భగవత్కీర్తన మాత్రాన సిద్ధిస్తుంది.

## చతుర్విధ లయాలు

రాజేంద్రా! పుట్టినది గిట్టక మానదని సామెత విన్నావు కదా. అలాగే సృష్టికి లయం తప్పదు. ఈ లయమన్నది నిత్యము, నైమిత్తికము, ప్రాకృతికము, ఆత్యంతికము అని నాలుగు విధాలు.

## నిత్య ప్రళయం

బ్రహ్మాదిసర్వభూతజాతానికి ఎల్లప్పుడు ఉత్పత్తిప్రళయాలు తప్పకుండటం నిత్యప్రళయం అనబడుతున్నది.

## నైమిత్తిక ప్రళయం

రాజేంద్రా! కాలాన్ని పరమాణువుతో ప్రారంభించి పరార్ధద్వయం వరకు విభజించటము, ఆ విభాగం ప్రకారం నాలుగు యుగాలకు వివిధ మానాలు ఏర్పడటము ఇంతకు పూర్వం వివరించాను. వేయి చతుర్యుగాలు బ్రహ్మకు

ఒక్క పగలు. దానినే కల్పమంటారు. ఈ కల్పంలో పధ్నాలుగు మన్వంతరాలు గతిస్తాయి. బ్రహ్మకు రాత్రికాలం కూడా వేయి చతుర్యుగ పర్యంత మవుతుంది. బ్రహ్మకు రాత్రి కాగానే ముల్లోకాలకు ప్రళయం కలుగుతుంది. దీనిని నైమిత్తిక ప్రళయ మంటారు. ఈ ప్రళయకాలంలో బ్రహ్మ, నారాయణుడు సృష్టిని ఉపసంహరించి శయనిస్తారు.

## ప్రాకృతిక ప్రళయం

రాజేంద్రా! బ్రహ్మదేవునికి కూడా దేవమానం ప్రకారం నూరేండ్లే ఆయుః ప్రమాణం. ఆ నూరేండ్లలో సగాన్ని పరార్ధమని అన్నారు. అందువల్ల బ్రహ్మాయువు ద్విపరార్ధమని ఏర్పడుతున్నది. బ్రహ్మకు ద్విపరార్ధాయుష్కాలం తీరినంతనే మహదహంకార పంచతన్మాత్రలు ఉపసంహృతిని పొందుతాయి. తత్ఫలంగా అండకోశం లయిస్తున్నది. అంటే బ్రహ్మాండకోశం ఏర్పడటానికి మూలములైన మహదాదులు లయించటం వలన వాటి మూలాన ఏర్పడిన కోశం కూడా లయించిపోతున్నది. దీనినే ప్రాకృతిక ప్రళయ మంటారు.

ఈ ప్రళయసమయంలో పర్జన్యుడు నూరేండ్ల కాలం వర్షింపడు. వర్షాభావఫలంగా ఆహారపదార్థం జనింపదు. జనులు క్షుధార్తులై అన్నపదార్థం దొరకనందువలన ఒకరినొకరు చంపుకొని తిని క్రమంగా జీవులందరూ నశిస్తారు. సంవర్తక సూర్యుడు మహోగ్రుడై వెలుగొందుతాడు. అతని కిరణాల వేడిమికి స్థలజలాలలోనూ దేహాలలోనూ గల రసపదార్థమంతా ఇంకిపోతుంది. తత్ఫలంగా పాతాళాదిలోకాలన్నీ జంతుశూన్యాలుగా మారతాయి. ఆ సంవర్తకాగ్నికి వాయువు తోడై లోకాలను దహించివేస్తుంది. తత్ఫలంగా సమస్త బ్రహ్మాండమూ దగ్ధగోమయపిండాకృతిని పొందుతుంది.

ఆ సమయంలో ప్రచండగతిని మారుతప్రసారం జరుగుతుంది. ఆ వాతోద్ధతికి కాలిన గోమయపిండం వలె ఉన్న బ్రహ్మాండం రజోరూపాన్ని పొంది ఆకసాన్ని కప్పుతుంది. అంతలో మేఘాలు చిత్రవర్ణాల తోను

మహాభయంకర గర్జనల తోను శతసంవత్సరాలు గజతుండధారలను వర్షిస్తాయి. అప్పుడు బ్రహ్మాండగోళమంతా ఏకోదక మవుతుంది.

రాజేంద్రా! గంధగుణం భూమి రూపంలో ఉంటుంది. ఎప్పుడు గంధగుణాన్ని ఉదకాలు గ్రహిస్తాయో అప్పుడు భూమి లయించిపోతుంది. రసగుణం ఉదకరూపంలో ఉంటుంది. ఆ రసాన్ని తేజస్సు గ్రహిస్తుంది. అప్పుడు ఉదకాలు లయిస్తాయి. రూపము తేజోగుణకం. రూపాన్ని వాయువు గ్రహిస్తుంది. తేజస్సు రూపవిహీనమై లయిస్తుంది. స్పర్శము వాయుగుణకం. దానిని నభస్సు గ్రహిస్తుంది. తత్ఫలంగా వాయువు లయిస్తుంది. నభస్సు దాని గుణమైన శబ్దముతో తామసాహంకారమందు లయిస్తుంది. అది రాజసాహంకారం లోను, రాజసికం సాత్త్వికాహంకారం లోను, ఆ సాత్త్వికాహంకారం మహత్తత్త్వం లోను, అది సత్త్వాదిగుణాల లోను లయాన్ని పొందుతాయి. ఆ గుణాలు ప్రధానమందు లయిస్తాయి.

ఆ ప్రధానమునకు ఎటువంటి వికృతులు కలుగవు. అది ఆద్యంతరహితము అవ్యక్తము అవ్యయము ఏకరూపము కారణాత్మకము అయినట్టిది. సర్వకారణకారణమైన దాని స్వరూపం ఎటువంటిదని అడుగుతావేమో? అది మనస్సునకు సైతం అందనిది కాబట్టి దాని స్వరూపం ఈ విధంగా ఉంటుందని గ్రహించటం సాధ్యం కాదు. మనస్సుకు అందనిదానిని గూర్చి వాక్కు చెప్పలేదు కదా! గ్రహించటం ఎందుకు సాధ్యం కాదని అడగవచ్చు. గుణము లున్నట్లయితే గ్రహణానికి అనువుగా ఉంటుంది. అది నిర్గుణమైనప్పుడో? ఇంద్రియాదుల వలన గ్రహించటం సాధ్యంకాదు. ప్రాకృతలయంలో పురుషుని యొక్క, అవ్యక్తము యొక్క సర్వశక్తులు కాలవిద్రుతాలై స్వశక్తిని తప్పి లయాన్ని పొందుతున్నాయి.

## ఆత్యంతిక ప్రళయం

ఆత్యంతిక ప్రళయమంటే మోక్షమని భావింపబడుతున్నది. ఏమంటావా? ఎప్పుడు బ్రహ్మజ్ఞానం కలుగుతుందో అప్పుడు ప్రపంచమంతా

మిథ్యాభూతమని, అది బ్రహ్మభిన్నమైన వేరొకటి కాదని రూఢి అవుతుంది. అప్పుడు సర్వము బ్రహ్మమేగాని తద్భిన్నమైన వేరొకటి కలుగదనే భావం ఏర్పడుతుంది. అట్టి భావన ఏర్పడటమే మోక్షలక్షణం. అటువంటి భావన ఏర్పడినప్పుడు బ్రహ్మభిన్నమైన ప్రపంచమన్నదే ఉండదు కాబట్టి ఆత్యంతికప్రళయ మవుతుంది.

## ఆత్యంతిక లయ తత్త్వవిచారం

ఆత్యంతిక లయం జరిగినప్పుడు కూడా ఇది లయము ఇది కాదు అని గ్రహించే బుద్ధ్యాదీంద్రియాలు పనిచేస్తున్నందువలన గ్రహించినది, గ్రహింపబడనిది అన్న ఎఱుక ఉంటున్నది కాబట్టి అట్టి సందర్భంలో ఆత్యంతిక లయం ఏ విధంగా కలుగుతుందని శంకింపవచ్చు. కాని అప్పుడు బుద్ధీంద్రియాదు లేవీ స్వతంత్రించి వ్యవహరించవు. వాటన్నింటికీ ఆశ్రయభూతమైన జ్ఞానం ఒక్కటే ప్రకాశిస్తుంది. కారణమేమంటావా? కార్యము కారణానికి భిన్నం కాదు. ప్రపంచము కార్యం; పరమాత్మ కారణం. కారణము సత్యం. కార్యము మాయాభూతం. అంటే చూపులకు వేరుగా కాన్పించి పరిశీలించినప్పుడు ఆ విధంగా కనుపించకపోవటాన్ని మాయాభూతము అంటారు. ఆకాశంలో మేఘాలు దరిచేరుతూ విడిపోతూ ఉన్నట్లుగానే బ్రహ్మము నందు విశ్వము కూడా కనబడుతూ మాయమవుతుంటుంది. దారాలతో గుడ్డ నేయబడుతున్నది. వాస్తవానికి గుడ్డ దారం కంటె భిన్నమైనది కాదు. అయినప్పటికీ ఆ రెండూ వేర్వేరుగా ఉన్నట్లు కనిపిస్తాయి. అవయవి కంటె అవయవాలు వేరైనట్లు గోచరించటం భ్రమ మాత్రమే.

కార్యకారణాలకు అభేదం చెప్పినప్పుడు కార్యము అసత్పదార్థమయితే కారణము కూడా అటువంటిదే కావాలి కదా? అని శంక కలుగుతుంది. నిజానికి కార్యము కంటె కారణము వ్యతిరేకంగా ఉంటుందే కాని కారణము

కంటె కార్యము వ్యతిరేకంగా ఉండదు. కారణ మున్నప్పుడే కార్యము కలుగుతున్నది. ఈ కార్యమునకు ఉత్పత్తిలయాలు ఉన్నాయి. కారణానికి అటువంటివి కలుగవు. కాబట్టి కారణము సత్యమని కార్యము మిథ్యాభూతమని చెప్పబడుతున్నది. మిథ్యాభూతమంటే శూన్యమని కాదు. రాకపోకలు కలిగి ఆ కారణాన సర్వకాల సర్వావస్థలలో ఏకరూపం కలదిగా ఉండేది కాదని భావం.

బ్రహ్మము ఏ విధంగా ప్రకాశమానమో ప్రపంచము కూడా ఆ విధంగానే ప్రకాశమానమై ఉన్నదని, అందువల్ల బ్రహ్మము వలె ప్రపంచము కూడా సత్యమేనని వాదింపవచ్చు. కాని వాస్తవాన్ని విచారించి చూడు. ఆత్మప్రకాశం వలన ప్రపంచము ప్రకాశితమై ప్రకాశమానమైనట్లు గోచరీభవిస్తున్నది. ఆత్మప్రకాశం లభింపనినాడు ప్రపంచము ప్రకాశింపదు; ప్రపంచమన్న విషయమూ కానరాదు.

## నానాత్వ విచారం

ఆత్మపదార్థం సత్యము, అవికారము అయినట్లయితే దానికి నానాత్వము ఏ విధంగా కలుగుతున్నది? అని ప్రశ్నింపవచ్చు. అసలు నానాత్వభావమే అజ్ఞానజనితం. ఉపాధులను బట్టి ఇటువంటి భావం కలుగుతున్నది. ఉపాధులను వేరుచేసి అసలు వస్తువును పరిశీలించితే దీని రహస్యం స్పష్టపడుతుంది. ఇందుకు నిదర్శనగా ఘటాకాశ మహాకాశాలను, గగనస్థ సూర్యబింబాలను, బాహ్యాంతరవాయువులను గ్రహింపవచ్చు. గగనస్థ సూర్యబింబమూ నీటిలో ప్రతిఫలించిన సూర్యబింబమూ ఒక్కటే. అయినా నీటిలో ప్రతిఫలించినప్పుడు జలోపాధిని బట్టి తత్ప్రతిబింబిత సూర్యుడు వేరుగా కనబడుతూ నానా సూర్యత్వం కానవస్తుంటుంది. ఆ ప్రకారం గానే సర్వోపాధులలోనూ ఉన్నటువంటి బ్రహ్మము ఏకము, అద్వితీయము అయినా ఉపాధిభేదాలను బట్టి నానాత్వభ్రాంతి కలుగుతున్నది. బంగారుతో రకరకాల ఆభరణాలను చేస్తున్నాము. ఆ ఆభరణాలన్నీ సువర్ణమయాలే కాని అవి బంగారు కంటె వేరైనవి కావు. అయినా రూపనామాలను బట్టి వేరుగా

వ్యవహరింపబడుతున్నాయి.

## లోకవ్యవహార కారణం

ఈ వ్యవహారానికి కారణమేమిటి? అంటే, అహంకారమే కారణం. సర్వము బ్రహ్మమే అన్నప్పుడు అహంకారము కూడా బ్రహ్మాత్మకమైనది బ్రహ్మాత్మకమే అవుతుంది గాని బ్రహ్మమును కప్పిపుచ్చటం, బ్రహ్మమును వేరుగా తోపింపజేయటం ఎలా పొసగుతాయని శంకింపవచ్చు. మేఘము సూర్యప్రభవమై సూర్యప్రకాశితమై ప్రకాశిస్తున్నది కదా? చక్షువు కూడా సూర్యాంశభూతమే గాని వేరుకాదు. రెండూ సూర్యప్రభవము లైనప్పటికీ మేఘం సూర్యునికి నేత్రానికి అడ్డునిలిచి నేత్రావరణను కలిగిస్తున్నది. అలాగే అహంకారము కూడా బ్రహ్మకార్యము, బ్రహ్మప్రకాశితము అయినప్పటికీ బ్రహ్మస్వరూపాన్ని ఆవరిస్తుంటుంది. మేఘం అడ్డుతొలగినంతనే చక్షువు రవిని దర్శింపగలుగుతున్నది. అహంకారం తొలగిన వెంటనే బ్రహ్మాత్మానుసంధానం కలుగుతున్నది.

## అహంకార నాశనమార్గం

అహంకారం తొలగే మార్గం ఏమిటి? అన్నది తెలుసుకోవాలి. విచారము వల్ల అహంకారం తొలగిపోతుంది. విచారఫలంగా నిత్యానిత్యవివేకం ఏర్పడుతుంది. అట్టి వివేకము చేత అహంకారరూపమైన బంధన నిర్మూలితమవుతుంది. అప్పుడు బ్రహ్మాత్మానుభవం సిద్ధిస్తుంది. ఈ స్థితిని స్వరూపనిష్ఠ అంటారు. దీనినే ఆత్యంతిక ప్రళయము అంటారు.

రాజా! కాలానికి ఆది, అంతము ఉన్నాయి. కాలప్రవాహవేగంలో పరిణామి దేహాదులన్నీ హరింపబడుతూ ఉచ్చనీచాలను పొందుతుంటాయి. ఈ అవస్థలు కాలమందు ఆరోపింపబడి కాలావస్థలుగా ఎన్నబడుతుంటాయి. ఇందుకు చంద్రాదుల గమనాద్యవస్థలే నిదర్శనం. కాలగతిని కలుగజేసే

నిత్య నైమిత్తిక ప్రాకృతి కాత్యంతిక ప్రళయాలను గురించి చెప్పాను. మరి సర్వానికి మూలభూతుడైన భగవంతుని యొక్క లీలాకథలను సంగ్రహంగా వివరించాను. ఆ లీలావిశేషాలను సాకల్యంగా వర్ణించటం నలువకు, వేయినోళ్ళ చిలువకు కూడా అలవికాని పని.

రాజా! సంసారమంటే బహువిధ దుఃఖాగ్నిసాగరం. దానిని దాటడానికి భగవల్లీలా కథాసుధారసాన్ని గ్రోలటమొక్కటే పరమోపాయం.

## భాగవతప్రశంస

మునులారా! ఈ పురాణసంహితను పూర్వం నారాయణమహర్షి నారదమునీంద్రునికి బోధించాడు. ఆ మహర్షి దానిని బాదరాయణమహర్షికి బోధించాడు. బాదరాయణుని వలన శుకమహర్షి దీనిని గ్రహించి నాకు ఉపదేశించాడు. నేను నా నేర్చినంతలో దీనిని మీకు ఈ మహాదీర్ఘసత్త్రయాగంలో వివరించాను. ఈ భాగవత సంహిత వేదతుల్యమైనది. దీని మాహాత్మ్యమెంతటిదో ఊహింపగలరు.

## పరీక్షిత్తుకు పరబ్రహ్మోపదేశం

మునులారా! శుకమహర్షి ఆ పిమ్మట 'పరీక్షిన్నరేంద్రా! దేహమన్నది నడుమ వచ్చినదే గాని ఆది యందు లేదు. నడుమ వచ్చినా శాశ్వతమా అంటే శాశ్వతం కాదు. ఎప్పుడో అప్పుడు నశిస్తుంది. నీవో? నీవు పూర్వము లేనివాడవు కావు. ఎప్పుడో ఒకప్పుడు నశించేవాడవూ కావు. మరేమంటే, శాశ్వతుడవు. బీజము నుంచి అంకురరూపం, దానినుంచి మళ్ళీ బీజం ఉదయించి వర్ధిల్లుతున్నట్లుగా నీవే పుత్త్రాదిరూపాన జనించటము, వర్ధిల్లటమూ రెండూ లేవు. దేహము నుంచి దేహం ఉద్భవిస్తున్నది. పుట్టువు గలది తప్పక నశిస్తున్నది. నీవో? దేహానివి కావు. నిత్యసత్యస్వరూపుడవు. చావుపుట్టుకల సంగతి ఏమంటావా? అవి దేహసంబంధులు. కర్మఫల

భోగానుసారంగా దేహాలు పుట్టుతూ ఫలము భుక్తమైనంతనే నశిస్తుంటాయి. ఆత్ముని సంగతేమిటంటావా? అతనికి జననమరణాలు కలుగవు. భోక్త ఎవడంటావా? అహంకారరూప జీవుడు భోగిస్తాడు. ఆ జీవుడు ఒక దేహంనుంచి వేరొక దేహానికి పోతాడు. ఒక పుడకలోని అగ్ని ఆ పుడక దగ్ధమైనంతనే దాని చెంతనున్న వేరొక పుడకను చెందటం చూస్తున్నదే కదా. జీవుని గతి కూడా అటువంటిదేనని గ్రహించు. దేహనాశాన్ని ఆత్మ చూస్తూనే ఉంటుంది. స్వప్నంలో మనకు శిరశ్ఛేదాదిక మైనప్పుడు దాని నంతటినీ మనము చూస్తుండటమే ఇందుకు నిదర్శనం. దేహనాశనాన్ని ఆత్మనాశనంగా తలపోయటం భ్రమ అవుతుంది. ముక్తావస్థ సంగతి ఏమిటంటావా? ముక్తావస్థలో దేహపతనం కాగానే ఆత్ముడు బ్రహ్మముతో ఏకీభవిస్తాడు. ఘటము పగిలినప్పుడు ఘటాకాశం మహాకాశంతో అందుకొనటమే ఇందుకు నిదర్శనం.

## ఆత్మ – ఉపాధిసంబంధం

ఆత్మ నిరుపాధికం. అయితే మనస్సనేది ఉన్నది కదా! మనస్సు దేహగుణ కర్మముల చేత ఆత్మకు ఉపాధిని కలిగిస్తున్నది. మనస్సును ఏది నడిపిస్తున్నది? అంటే మాయవలన మనస్సు పుట్టుతున్నది. మాయవలన ఆత్మకు సంసారము కలుగుతున్నట్లు తోస్తున్నది. తైలముతోడి వత్తికి అగ్నితో సంయోగం కలిగినప్పుడు జ్వాలారూప పరిణామమైన దీపం కలుగుతున్న చందాన గుణత్రయవృత్తుల వలన దేహకృత సంసారం మనస్సునకు కలుగుతుంది. అంతేకాని ఆత్మకు ఎటువంటి సంబంధమూ కలుగదు. ఆత్మకు జననవృద్ధిక్షయాది వికారాలలో ఏ ఒక్కటీ లేదు. అట్టి ఆత్ముడు దేహంలో ప్రతీయమానుడు కావటం దేనికి? అంటావేమో. ఆత్ముడు నిర్వికారుడు, అనంతుడు, విభుడు, సర్వవ్యాపకుడు, స్వయంప్రకాశుడు అయి ఆకాశంవలె ఎల్లెడల నిండి ఉంటాడు. ఆత్ముడు సర్వవ్యాపకుడు కాబట్టి దేహంలో కూడా వ్యాపించి ఉంటాడు. ఆత్మయొక్క సర్వవ్యాపకత్వాన్ని మరచి దేహాంగతత్త్వాన్ని మాత్రమే తలపోయటం వలన దానికి దేహసంబంధ మున్నట్లు భ్రమ

కలుగుతున్నది. మరొక విశేషం. ఆత్ముడు సర్వవ్యాపకు డైనప్పటికీ సర్వానికి పరుడుగానే ఉంటాడు. అనుమాన ప్రమాణపూర్వక విచారం చేత, భగవచ్చింతన మూలాన సమ్యగ్విమర్శ చేసినవారికి తత్త్వం బోధపడుతుంది. కాబట్టి నీవుకూడా ఆ విధంగానే విమర్శించి సత్యాన్ని గ్రహించు.

## మృత్యువు

రాజా! విప్రశాపం వలన తక్షకుడు నిన్ను కాటువేస్తాడని, తద్విషాగ్నికి దగ్ధమై నశింపనున్నానని భయపడవద్దు. నీవు కేవలాత్మస్వరూపుడవు. మృత్యువునకు సయితం మృత్యువవు. అట్టి నిన్ను తక్షకుడు కరవడమూ, నీవు మరణించడమూ సంభవిస్తాయా? ఎంతకాలం నీకు దేహాత్మబుద్ధి నిలిచి ఉంటుందో అంతకాలం నీకు మృత్యుభీతి తప్పదు. 'బ్రహ్మాస్మి' అనే భావాన్ని ప్రవృద్ధం కావించు. ఆ విధంగా నిరుపాధిక బ్రహ్మస్వరూపంతో ఆత్మను ఏకీభవించి ఉపరతుడవు కావాలి. అప్పుడు సర్వం ఆత్మరూపమవుతుంది. ఆ స్థితిలో తక్షకుడు కాటువేయటం మొదలైనవి నీకు ఎరుకకు రావు.

రాజేంద్రా! నీవు అడిగిన ప్రశ్నలన్నింటికీ తెలిసినంతలో సమాధానాలు చెప్పాను. ఇంకా ఏదయినా వినగోరితే చెబుతాను' అన్నాడు.

## శుకయోగి నిర్గమనం

మునులారా! ఆ నరేంద్రుడు శుకమహర్షి పలుకులను విని, 'మహాత్మా! నా మొర ఆలకించి భగవన్మహిమలను తెలిపారు. మీ అనుగ్రహం వలన నేను కృతార్థుడనైనాను. ఇక మీరు సూచించిన పరబ్రహ్మాన్ని చేరగోరుతున్నాను. అనుజ్ఞ ఇవ్వండి' అని ఆయనకు సాష్టాంగప్రణామం చేశాడు. శుకమహర్షి అతనికి అనుజ్ఞ నిచ్చి అతను చేసిన పూజలందుకొని యథాస్థానానికి వెళ్ళిపోయాడు.

## బ్రహ్మభూయం

మునులారా! శుకమహర్షి ఆ విధంగా వెళ్ళిన తర్వాత పరీక్షిన్నరేంద్రుడు గంగాతీరాన ప్రాగగ్రంగా దర్భాసనాన్ని నిర్మించి తూర్పుదెసకు కూర్చుండి బుద్ధిచేత మనస్సును నియమించి సమాధిస్థితు డయ్యాడు. అతనికి సర్వసంగాలు తొలగిపోయాయి. అతను స్థాణువు వలె నిశ్చలుడైనంతనే ప్రాణాలు లీనమయ్యాయి. అతనికి తాదాత్మ్యానుసంధానరూప ధ్యానం సిద్ధించింది. తత్ఫలంగా అతడు బ్రహ్మభూతు డయ్యాడు.

## తక్షకాగమనం

అంతట తక్షకుడు మునిపుత్ర శాపప్రేరితుడై పరీక్షిన్నరేంద్రుని ప్రాణాలను హరింప సమకట్టి పయనమై రాసాగాడు. మార్గమధ్యంలో అతనికి కాశ్యపుడు ఎదురువచ్చాడు. తక్షకుడు ఆయనను, 'అయ్యా! నీవెక్కడికి వెళుతున్నావు?' అని అడుగగా, 'అయ్యా! తక్షకుడు పరీక్షిన్నరేంద్రుని కరిచి చంపాలని వస్తున్నాడట. నేను విషహరణ మంత్రప్రయోగ నైపుణ్యంతో ఆ నరేంద్రుని బ్రతికించి అతని వలన బహుళార్థాలను గ్రహింపబోతున్నాను' అని బదులుచెప్పాడు.

## తక్షక కాశ్యపుల సంవాదం

తక్షకుడా మాటవిని, 'అయ్యా! నేనే తక్షకుడిని. నా విషహతికి ఎటువంటి మందులు గాని మంత్రాలు గాని పనిచేయవు. ఈ వృథాయాసం నీకెందుకు? పరీక్ష చేయగోరుతావా? ఇదిగో ఈ వటవృక్షాన్ని కరుస్తాను. అది నా విషానలానికి బూడిద అవుతుంది. దానిని బ్రతికింపగలిగితే నీ శక్తిని మెచ్చుకొంటాను' అని ఆ మఱ్ఱిచెట్టును కరిచాడు. ఆ వృక్షం నిట్టనిలువున మహానలదగ్ధమై బూడిదయింది.

కాశ్యపుడు ఆ భస్మచయాన్ని పోగుచేసి తన మంత్రతంత్రశక్తి చేత ఆ వృక్షాన్ని ఎప్పటివలె బ్రతికించాడు. తక్షకు డదిచూసి ఆశ్చర్యపోయి, 'మహాత్మా! నీ విద్యాబలాన్ని గ్రహించాను. పరీక్షిన్నరేంద్రుడు

మునిశాపహతుడు కాబట్టి అతనియెడ నీ శక్తి ఫలింపదు. ధనార్థివై అక్కడికి బయలుదేరావు కదా. ఆ రాజేంద్రుడిచ్చే ధనానికంటె మిక్కుటంగా ఇదే నీకిస్తున్నాను. దీనిని గ్రహించి తిరిగివెళ్ళు' అని కోరాడు. కాశ్యపుడు జరుగుతున్న వృత్తాంతాన్ని దివ్యజ్ఞానంతో గ్రహించి, తక్షకు డిచ్చిన ధనరాశిని గొని మరలిపోయాడు.

## మాయావిప్రులు

ఆ తర్వాత తక్షకుడు నాగకుమారులను పిలిచి, 'మీరు విప్రవేషాలు ధరించి పరీక్షితుని వద్దకేగి మోదుగ ఆకు దొన్నెలనిండుగా సుగంధ పుష్పస్వాదుఫలాలను అతని కివ్వండి' అని చెప్పి తాను అదృశ్యరూపుడై వారివెంట బయలుదేరాడు.

## పరీక్షిత్తు మరణం

ఆ విప్రవేషధారులు ఋగ్యజుషపదక్రమాలు పఠిస్తూ రాజదర్శనార్థులై గంగాతీరానికి వెళ్ళారు. రాజు వారిని చేరబిలిచి సన్మానించి వారిచ్చిన ఫలపుష్పాదులను అందుకొన్నాడు. అంతలో ప్రొద్దుగ్రుంకబోతున్నది. అది చూసి పరీక్షిన్నరేంద్రుడు, 'మంత్రులారా! సూర్యాస్తమయం కానున్నది. నేటితో శాపదినాల గడువు పూర్తయింది. ఇంతవరకు జీవింపనోచాను' అని అంటూ విప్రవేషధారులు తెచ్చిన ఫలాలను మంత్రులు మొదలైనవారికి పంచి తానుకూడా ఒక పండును ఆరగింపదలచి దానిని కోశాడు. ఆ పండులో తక్షకుడు నల్లని పురుగు రూపంలో దాగినవాడు ఆ నిమిషాననే పామై అతనిని కరిచి చరచర అక్కడినుంచి తప్పుకొన్నాడు. విప్రవేషధారులు మాయమయ్యారు. తక్షకుని విషాగ్నికి నీ తండ్రి దగ్ధుడయ్యాడు.

ఆ సమయంలో భూనభోంతరాళాలు హాహారవాల సముద్ఘోషాలతో ప్రతిధ్వనించాయి. దేవతలు దైత్యులు మానవులు మహాశ్చర్యాన్ని పొందారు. విబుధమండలి సాధువాదాలు చెలరేగాయి. దేవదుందుభులు మ్రోగాయి.

పుష్పవృష్టి కురిసింది.

## జనమేజయుని సర్పయాగం

మునులారా! పరీక్షిన్నరేంద్రుడు తక్షకదష్టుడై ప్రాణాలు విడిచాడని అనగానే ఆ నరేంద్రుని కుమారుడు జనమేజయుడా మాట విని, 'అయ్యో! తక్షకుడు నా తండ్రికి చేసిన అపకారం క్షమింపరానిది. ఈ సర్పాలు ఉన్నంత కాలం ప్రాణులకు ముప్పు తప్పదు. సర్పకులాన్ని నాశనం చేయటమొక్కటే ఇందుకు సమాధానం' అని నిశ్చయించి, తత్కార్యదక్షులైన బ్రాహ్మణులను రావించి సర్పయాగం మొదలుపెట్టాడు. మహాసర్పాలు అనేకం తమంతట తాముగా వచ్చి హోమాగ్నిలో పడి చావసాగాయి. తక్షకుడు ప్రాణభయంతో ఇంద్రుని శరణుజొచ్చి, ఇంద్రరక్షితుడై ఆ గండాన్ని తప్పించుకొన్నాడు.

మునులారా! తక్షకుడు రాకపోవటం జనమేజయుడు చూసి కోపవిహ్వలుడై, ఋత్విజులతో 'ఓ మంత్రవిదులారా! దేవేంద్రుడు నా శత్రువుకు అభయదానం చేసి నాకు తీరని అపకారం చేశాడు. మీరు ఇంద్రునితో కలిపి తక్షకుడిని వేల్వకూడదా?' అని నొక్కి పలికాడు. ఋత్విజులు అతని సంకల్పాన్ని గ్రహించి ఇంద్రసహితంగా తక్షకుడు వచ్చి ఆ యజ్ఞాగ్నిలో పడేటట్లు మంత్రాలు చదివారు. ఆ మంత్రప్రభావం వలన ఇంద్రునికి స్థానచ్యుతి కలిగి అతను తన విమానం తోను తక్షకుని తోను కదిలి అంబరవీథి నుంచి ఆ సర్పయాగాగ్నిలో పడబోతున్నాడు. తక్షకుడు సంగతి గ్రహించి దిక్కుతోచక తలకిందు లయ్యాడు.

## బృహస్పతి సహాయం

మునులారా! సురగురువు బృహస్పతి ఆ సంగతి తెలిసి హుటాహుటి జనమేయుని యాగశాలకు వచ్చి, 'నరేంద్రా! ఈ తక్షకుడు అమృతాన్ని త్రాగినవాడు కాబట్టి అతనికి చావు కలుగదు. నీ ఉద్యమాన్ని విరమించు. ఏ అపరాధమూ చేయని పాములెన్నో నీ యాగం వలన మరణించాయి. అందుకు నీవు బాధ్యుడవని బాహ్యదృష్టికి తోపవచ్చు. తత్త్వదృష్టితో

పరిశీలించితే అందుకు నిన్నని ప్రయోజనం లేదు. ఏమంటే ప్రాణులకు జననమరణాలు వారి వారి కర్మఫలంగా కలుగుతుంటాయి. వేరొక కారణం లేదు. కర్మలు వివిధరూపాలలో ఉంటాయి. వాటి ఫలాలు కూడా ఆ విధంగానే పలువిధాలుగా ఉంటాయి. అందువల్ల సర్పదష్టులై కొందరు, చోరగ్రస్తులై కొందరు, వ్యాధిపీడితులై కొందరు, వహ్నిదగ్ధులై కొందరు, వారిమగ్నులై కొందరు, క్షుధాది పీడితులై కొందరు మరణిస్తుంటారు. ఈ సర్పదంశనాదులన్నీ నిమిత్తాలు మాత్రమే. వారి ప్రారబ్ధకర్మఫలం ఆయా రూపాలను ధరించి వారిని హరిస్తున్నది' అని బోధించాడు. జనమేజయుడు సురాచార్యుని మాటను పాటించి అంతటితో సర్పయాగం చాలించి ఇంటికి వచ్చిన అమరగురువును యథావిధి సత్కరించాడు. బృహస్పతి వలన ఇంద్ర తక్షకులకు గండం గడిచింది.

## దేహాదులు మోహఫలాలు

మునులారా! ప్రాణులన్నీ భగవదంశమాత్రములే కాని భగవదన్యపదార్థాలు కావు. అట్టి ప్రాణులకు క్షణభంగురాలయిన దేహాదులపై మోహం ఎందుకు కలుగుతున్నది? అంటే, ఈ మోహమన్నది గుణవృత్తులకు ఫలం. ఆ గుణవృత్తులేమేమిటని అడుగుతారేమో. మమకారాదులన్నీ గుణవృత్తులే. గుణములో? వాస్తవానికి సచేతనాలు కావు. జడాలు. అయినా విష్ణుమాయాశక్తి వలన వాటికి శక్తిమత్త్వం కలిగి వ్యవహృతిని పొందుతున్నాయి. ఆ మాయ సంగతి ఏమిటంటారా? అది ఇటువంటిదని చెప్ప సాధ్యంకాదు. మరి దానిని అడ్డగించటమూ సాధ్యంకాదు. పెద్దల వలన విన్నందుచేతనో శాస్త్రాలను చదివినందువల్లనో భగవత్తత్త్వాన్ని గ్రహించి చిత్తదారుఢ్యం అలవరచుకొని ఆ మాయను తరింపరాదా అని శంకిస్తారు కాబోలు. శ్రవణాదులకు అంతటి శక్తి లేదు. అలాగయితే మాయను తరించే మార్గమేమిటంటారా? వినండి.

## మాయాతరణోపాయం

శ్రీవిష్ణుస్వరూపాన్ని మొట్టమొదట నిరూపించుకోవాలి. ఆ స్వరూపాన్ని మనస్సులో అనుసంధించుకొని శ్రద్ధాపూర్వకంగా భజించాలి. తత్ఫలంగా మాయ అడగారుతుంది. మాయాకల్పితమైన కార్యజాతం నివర్తిస్తుంది. అది సాధ్యమేనా అని అడుగుతారేమో. మనలో బుద్ధి అనే అంతఃకరణ ఒకటున్నది. అది యుక్తాయుక్తాలను విమర్శించి నిశ్చయిస్తుంటుంది. ప్రారబ్ధకర్మఫలం నిర్దుష్టం కాని నాడు బుద్ధికూడా నిర్దుష్టం కానేరదు. అప్పుడది తనయెడ ప్రకాశించే భగవత్తేజస్సును చక్కగా ప్రతిఫలింపజేయలేకపోతుంది. తత్ఫలంగా ముంజీకటిలో రజ్జువు పామై తోచినట్లు మలినాత్మకబుద్ధియందు ప్రకాశించే భగవత్తేజం అందుకు భిన్నతరంగా అగపడుతుంది. ఆ విధంగా అగపడేదానినే అహంకారమని అంటారు. ఆ అహంకారమే జీవు డనబడుతున్నది. అహంకారం ఎప్పుడు తలయెత్తినదో అప్పుడే సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు వ్యవహరిస్తుంది. తత్ఫలంగా కర్మమునందు కారకవర్గమూ దానిని బట్టి సృజ్యస్రష్టృఫలమూ కలుగుతున్నాయి. ఇవన్నీ మాయాకార్యాలు. ఈ రహస్యం ఆత్మవిచారం వలన బోధపడుతుంది. అప్పుడు ఆత్మస్వరూపం బాధ్యబాధకరహితమైన తత్త్వమని తెలిసివస్తుంది. ఆ తత్త్వం బుద్ధియందు కుదురుకొన్న తర్వాత అహంకారాదులు సన్నగిలి నశించిపోతాయి. అతను ఆత్మరతు డవుతాడు.

## విష్ణుస్వరూప ప్రాప్తికి మార్గం

మునులారా! విష్ణుస్వరూపాన్ని సూచించాను. దానిని స్వానుభవంలో గ్రహింపగోరినవారు దేహాదికమైన అహంభావాన్ని నిరసించాలి; పుత్రకళత్రాది సర్వవిధ మమకారాన్ని పరిత్యజించాలి; ఆత్మకు భిన్నమై తోచే దృశ్యమంతటినీ వేరుగా తలపోయక సర్వము ఆత్మమయమేనని భావించాలి. దృశ్యము కూడా ఆత్మమయమే అయినా అది క్షణికమే కాబట్టి దానివల్ల కలిగే ఆనందము కూడా క్షణికమేనని గ్రహించాలి. మనశ్చాంచల్యాన్ని ఉడిగించి బుద్ధిని ఏకాగ్రపరిచి భగవద్ధ్యానగతుడై సమాధిస్థితిని పొందాలి. తత్ఫలితంగా

శ్రీవిష్ణుస్వరూపస్థితి కలుగుతుంది. అతివాదాల వలన చేకూరే ప్రయోజనమేమీ లేదు కాబట్టి వాద ప్రతివాదాల వంక బుద్ధిని మళ్ళింపకూడదు. మానావమానాలు దేహానికే గాని ఆత్మకు కావు గనుక స్వపరవిషయములందు వాటిని ఉపేక్షించాలి. దేహమంటే ప్రారబ్ధకర్మఫల భోగాయతనమని, కర్మఫలాలు వివిధ గతులలో ఉంటాయని, వాటిని అనుభవింపక తప్పదని గ్రహించి, దేహార్థం పరపీడాదికానికి జొరబడక స్వధర్మాచరణ నిష్ఠాపరుడై యథాప్రాప్తంతో జీవించాలి.

మునులారా! మీరడిగిన అర్థాన్ని విశదీకరించాను. నేను చెప్పినది స్వకపోలకల్పితం కాదు. ఈ పురాణసంహితను దివ్యమేధాసంపన్నుడైన వ్యాసమునీంద్రుడు నాకు బోధించాడు. ఆ మునీంద్రుని పాదారవిందాలకు పునఃపునస్సాష్టాంగ నమస్కారాలు.

## వేదవిభాగక్రమం

శౌనకాదులు సూతుని విని 'అయ్యా! వ్యాసుడు వేదాలను విభజించి పైలప్రభృతి శిష్యులకు చెప్పాడని అన్నావు. విభాగ విధానం మొదలయిన విశేషాలను వినాలని మాకు కుతూహల మవుతున్నది' అని అడిగారు. వారితో సూతుడిలా అన్నాడు.

'మునులారా! బ్రహ్మదేవుడు మొట్టమొదట సమాహితాత్ముడయ్యాడు. అతని హృదయాకాశం నుంచి ఒక నాదం జనించింది. ఈ సంగతిని పరీక్షింపదలచితే మీరు మీ కర్ణపుటాలను మూసికొని శ్రోత్రప్రవృత్తిని నిరోధించినట్లయితే మీకే స్పష్టపడుతుంది. ఆ నాదం మాహాత్మ్య మేమంటారా? యోగులు కొందరు ఆ నాదాన్ని ఉపాసించి ఆత్మకమలాన్ని ద్రవ్యక్రియాకారక త్రివిధమైన దానిని పరిహరించి జన్మరాహిత్యాన్ని పొందుతారు. వీనిలో ద్రవ్యరూపమలాన్ని అధిభూతమని, క్రియారూపమలాన్ని అధ్యాత్మమని, కారకరూపమలాన్ని అధిదైవమని అంటారు.

ఆ నాదం నుంచి 'ఓమ్' అన్నది ఉదయించింది. ఓంకారం

అవ్యక్తప్రభవమైనది కాబట్టి దానిని అవ్యక్తమైన పరమాత్మకు ఉత్తమోత్తమ ప్రతీకగా గ్రహిస్తున్నాము.

ఓంకారం త్రిమాత్రాకమైనది. అనగా అకార, ఉకార, మకారములతో కూడి ఉన్నది. దానిని ఉచ్చరించేటపుడు కంఠము, ఓష్ఠము మొదలైనవాని స్పర్శవలన ఆ నాదం వివిధ రూపాలను పొందుతుంది. ఆ రూపాలను అక్షర సమామ్నాయ మంటారు. అందుచేత అక్షరాలన్నీ ఓంకారంలో అంతర్భవించి ఉన్నాయి.

## పరమాత్మ ఉనికి

పరమాత్మ అంటే ఎవరని అడుగుతారేమో? జీవునికి విషయగ్రహణం ఇంద్రియాల మూలకంగా కలుగుతున్నది. నిద్రావస్థలో ఇంద్రియాలన్నీ లీనమై ఉంటాయి కాబట్టి అప్పుడు జీవునికి విషయగ్రహణ ఉండటం లేదు. ఆ సమయంలో పరమాత్ముడు శబ్దశ్రవణమూలకంగా జీవుని ప్రబోధిస్తాడు. ఆ విధంగా ప్రబోధించే పరతత్త్వమే పరమాత్మ అనబడుతున్నది. పరమాత్మకు ఎట్టి ఇంద్రియవర్తనలు లేవు. అతడు కేవల జ్ఞానస్వరూపుడుగా ఉన్నవాడు. అందువల్ల అతనికి సర్వకాల సర్వజ్ఞత్వం ఉన్నది. ఓంకారం పరమాత్మకు ఎల్లవేళల స్ఫుటము కాబట్టి దానికి స్ఫోటమని పేరువచ్చింది. ఆ ఓంకారము వలన వాగ్వృత్తి కలిగింది. దానిని వైఖరి అంటారు.

## ఓంకారతత్త్వం

ఆ ఓంకారం స్వాశ్రయభూతుడైన పరబ్రహ్మానికి వాచకం. వేదానికి బీజం, సర్వమంత్రాల రహస్యం ఓంకారమే. బీజంనుంచి మొక్క మొలకెత్తినప్పుడు బీజానికి వికారం కలుగుతున్నదని, అలాగే ఓంకారం నుంచి వేదాలు పుట్టాయన్నప్పుడు ఓంకారానికి కూడా వికారం తప్పదని శంకింపవచ్చును. అయితే ఓంకారం సర్వసనాతనమైనది కాబట్టి ఎల్లవేళల ఏకరూపంలో ఉంటుంది. అది బ్రహ్మరూపం. బ్రహ్మానికి వికారాదులు కలుగవు కాబట్టి

బ్రహ్మరూపమైన ఓంకారానికి కూడా వికారం కలుగదు.

ఓంకారం నుంచి సర్వప్రపంచమూ ఉద్భవించింది. ఓంకారనాదంలో అకార ఉకార మకారాలు అంతర్భూతాలుగా ఉన్నాయని చెప్పాను. ఆ మూడింటి వలన సత్త్వాది గుణత్రయం, ఋగ్యజుస్సామ వేదత్రయం, భూర్భువస్స్వర్లోకత్రయం, జాగ్రత్ స్వప్న సుషుప్తి నామక వృత్తిత్రయం కలిగాయి. పరమేశ్వరుడు ఆ ఓంకారము నుంచే అక్షర సమామ్నాయాన్ని సృజించాడు. ఆ అక్షరాలు అంతఃస్థములు, ఊష్మములు, స్వరములు, స్పర్శములు, హ్రస్వములు, దీర్ఘములు, జిహ్వామూలీయములు ఇత్యాదిగా ఉచ్చారణను బట్టి ఏర్పడుతున్నాయి. యరలవలకు అంతఃస్థములని, శషసహలు ఊష్మములని, అకారాదులు స్వరములని, కకారము మొదలు మకారం వరకు స్పర్శములని, అ–ఇ–ఉ–ఎ–ఒ లు హ్రస్వములని, ఆ–ఈ–ఊ–ఏ–ఐ–ఔ లు దీర్ఘాలని, ఙ్ఞాదులకు జిహ్వామూలీయములని వ్యవహారం.

## వేద జననం

ఋత్విక్కులు నాల్గుతెగలవారు నాలుగు విధాలైన కర్మలను చాతుర్హోత్రములు అనబడేవాటిని నెరవేర్చటానికి బ్రహ్మదేవుడు ఆ అక్షర సమామ్నాయాన్ని ఊతగొని నాల్గు ముఖాల నుంచి నాలుగు వేదాలను పలికాడు. వేదాలు లోకప్రచారం పొంది అనుష్ఠితాలైనప్పుడే ప్రయోజనకారు లవుతాయి. అందుచేత బ్రహ్మదేవుడు ఆ వేదాలను వేదోచ్చారణ నిపుణులైన తన పుత్త్రులు మరీచ్యాదులచే చదివింపజేశాడు. వారినుండి శిష్యప్రశిష్యాది పరంపరాక్రమాన అవి లోకప్రచారంలోనికి వచ్చాయి.

## వేదవిభాగ కారణాదికం

మునులారా! జనులు కాలవశాన స్వల్పాయువులు, స్వల్పబలులుగా రూపొందారు. తత్ఫలంగా వారి బుద్ధిశక్తి కూడా స్వల్పతరమయింది. అట్టి

స్వల్పబుద్ధులకు వేదపఠనం దుర్ఘటమయింది. భగవాను డదిచూసి వేదవిభాగం చేసి స్వల్పమతులకు వాటిని అందజేయటానికి ద్వాపరయుగంలో బ్రహ్మర్షులను ప్రేరేపించాడు. వారు భగవదాజ్ఞానుసారం వేదవిద్యను ఉపదేశింపసాగారు.

మునులారా! ఇప్పుడు వైవస్వత మన్వంతరం జరుగుతున్నది కదా. ఈ మన్వంతరంలో ధర్మం నానాటికీ సన్నగిలసాగింది. ఆ సంగతి బ్రహ్మ, ఈశానుడు, లోకపాలాదులు చూసి ధర్మరక్షణార్థం భగవంతుని ప్రార్థించారు. భగవానుడు వారి మొరాలకించి పరాశరునికి సత్యవతియందు అంశాంశకళతో అవతరించాడు. అతనిని కృష్ణద్వైపాయను డన్నారు. ఆ మహాత్ముడు ఋగ్యజుస్సామాథర్వ వేదరాశిని నాలుగు సంహితలుగా విభజించి చతుర్వేదాలను ఏర్పరిచాడు. వేదవిభాగకారణం వలన అతనికి వేదవ్యాసుడని పేరువచ్చింది. ఆ నాల్గు సంహితలను బహ్వృచ సంహిత, నిగదాఖ్య యజుర్గణ సంహిత, ఛందోగ సామ సంహిత, అథర్వాంగిరస్సంహిత అని పేర్కొంటారు. ఆ నాలుగు సంహితలను వ్యాసభగవానుడు తన శిష్యులైన పైల వైశంపాయన జైమిని సుమంతులకు క్రమంగా ఒక్కొక్కదానిని ప్రబోధించాడు.

## ఋగ్వేదసంహితా విభాగాలు

పైలుడు తన ఋగ్వేదసంహితను రెండుగా విభాగించి బాష్కలుడనే శిష్యునికి ఒక భాగాన్ని, ఇంద్రప్రమితి అనే శిష్యునికి ఒక భాగాన్ని బోధించాడు. బాష్కలుడు తన సంహితను నాలుగుగా విభాగించి బోధ్యుడు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు, అగ్నిమిత్రుడు అనే శిష్యులకు నలుగురికి ఒక్కొక్క భాగాన్ని నేర్పాడు. ఇంద్రప్రమితి తన సంహితను తన కుమారుడు మాండూకేయునికి చెప్పాడు. మాండూకేయుడు దానిని తన పుత్త్రుడైన శాకల్యుని చేత, శిష్యుడైన దేవమిత్రుని చేత చదివించాడు. శాకల్యుడు తన

సంహితను అయిదు భాగాలు చేసి ఒక్కొక్క భాగాన్ని వాచ్యునికి, మౌద్గల్యునికి, శాలీయునికి, గోబిల్యునికి, శిశిరునికి క్రమంగా ఉపదేశించాడు. శాకల్యునికి జాతుకర్ణుడని మరొక శిష్యుడు కూడా ఉన్నాడు. అతను తన సంహితార్థాన్ని ప్రకాశింపజేయగోరి దానికి నిరుక్తమనే వివరణను రచించి దానితో కలిపి తన సంహితను బలాకునికి, పైంగునికి, వైతాళికునికి, విరజునికి బోధించాడు. ఇక బాష్కలకుమారుడు సర్వశాఖలలో నుంచి వాలఖిల్యమనే సంహితను వేర్పరచి కూర్చి దానిని బాలాయని గార్గికాసారులకు నేర్పాడు. ఈ విధంగా బహ్వృచ సంహిత విభాగాలను పొందసాగింది.

## యజుర్వేదసంహితా శాఖలు

### చరక నామ నిరుక్తం

వైశంపాయనుడొక వ్రతాన్ని ఆచరించాడు. ఆ వ్రతాచరణ వల్ల బ్రహ్మహత్యాదోషం కూడా నశిస్తుంది. వైశంపాయనుని శిష్యులలో కొందరు ఆ వ్రతాన్ని అనుష్ఠించి చరకులనే పేర అధ్వర్యులయ్యారు. వారి వలన చరక నామ నిరుక్తం ఏర్పడింది.

## తైత్తిరీయ శాఖోత్పత్తి

వైశంపాయనునికి దేవరాతసుతుడు యాజ్ఞవల్క్యుడనే శిష్యుడొకడుండేవాడు. అతను గురువు వద్దకు వెళ్ళి 'మునీంద్రా! నీ శిష్యులలో కొందరు స్వల్పసారులు. వారాచరించిన వ్రతంకూడా అల్పసారమే కాగలదు. నేను మహాదుశ్చరమైన వ్రతాన్ని ఆచరిస్తాను' అని పలికాడు. వైశంపాయనుడు అతని పలుకులను విని, 'ఓరీ! అహంకారప్రేరితుడవై విప్రులను అవమానించావు. ఇట్టి అయోగ్యుడు వేదాన్ని ధరింపకూడదు. నాతో చదివిన వేదాన్ని వెంటనే పరిత్యజించు' అన్నాడు.

యాజ్ఞవల్క్యుడు ఆ మాట విని తాను గ్రహించిన యజుర్గణమంతటినీ వెంటనే క్రక్కివేశాడు. మునులు కొందరు వేదలోలుపమతులై దానిని

గ్రహింపదలచి, ఛర్దితమైనదానిని విప్రరూపంలో గ్రహించటం అనుచితమని భావించి తిత్తిరిపక్షుల రూపాన్ని ధరించి దానిని గ్రహించారు. ఆ కారణాన తైత్తిరీయ శాఖ ఉద్భవించింది. ఆ శాఖ బహువిస్తారమూ, అవాంతర భేదవివక్షితమూ, అతిరమణీయమూ అయినది.

## కాణ్వ మాధ్యందిన శాఖోత్పత్తి

వ్యాసుడు వేదభాగాలను కొన్నింటిని విభజించిన తర్వాత కూడా వైశంపాయనునికి నేర్పలేదు. వాటి స్వరూపం తెలియకపోగా వమనకారణంగా వేదాక్షరహీనుడైన వైశంపాయన శిష్యుడు యాజ్ఞవల్క్యుడు పరితప్తస్వాంతుడై వ్యాసమహర్షి చెప్పక వదిలిన విద్యను కూడా సంపాదించాలని సంకల్పించి సర్వవేదపతి అయిన సూర్యభగవానుని ఆరాధించాడు. సూర్యు డతనియెడ ప్రీతిచెంది వాజిరూపాన్ని దాల్చివచ్చి తత్పూర్వం అప్రకాశితాలుగా ఉన్న యజుర్వేద భాగాలను అతనికి బోధించాడు. సూర్యుడు వాజిరూపంలో బోధించినందువలన ఆ భాగానికి వాజసనేయమని పేరువచ్చింది.

యాజ్ఞవల్క్యుడు దానిని పదిహేను శాఖలుగా విభజించాడు. ఒక్కొక్క శాఖ నూర్లకొలది యజుర్వాక్యాలు కలిగి ఉంటుంది. వాటన్నిటినీ కణ్వుడు, మధ్యందినుడు మొదలయినవారు గ్రహించారు.

## సామవేద శాఖావిభాగం

మునులారా! జైమిని సామ సంహితను రెండుగా విభజించి ఒక భాగాన్ని తన కొడుకు సుమంతునికి, రెండవ భాగాన్ని సుమంతుని పుత్రుడైన సుకర్మునికి బోధించాడు. సుకర్ముడు తన సంహితకు వేయిశాఖ లేర్పరచి కోసలదేశీయుడైన హిరణ్యనాభునికి, పౌష్పింజునికి బోధించాడు. ఆ ముగ్గురికి అయిదు వందలమంది ఉత్తరదేశవాసులు శిష్యులై ఆ సంహితను అధ్యయన చేశారు. ఆ యేనూరుగురు ప్రాచ్యులని కొందరంటారు.

పౌష్పింజునికి లౌగాక్షి, లాంగలుడు, కుల్యుడు, కుసీదుడు, కుక్షి అనే ఐదుగురు శిష్యులై ఒక్కొక్కరు నూరేసి శాఖలు చదివారు. హిరణ్యనాభుడు తన సంహితను కృతుడనే విద్యార్థికి బోధించాడు. అతను తన శిష్యులకు చతుర్వింశతి సంహితను నేర్పాడు. ఆవంత్యుడు తక్కిన శాఖలను తన శిష్యులకు చెప్పాడు.

సుమంతుడు తన అధర్వభాగాన్ని కబంధుడనే శిష్యునికి బోధించాడు. అతను దానిని రెండుగా విభాగించి ప్రథ్యుడనే శిష్యునికి ఒక భాగాన్ని, వేదదర్శనుడనే అతనికి ఒక భాగాన్ని నేర్పాడు. పథ్యుడు తన సంహితను మూడు భాగాలు చేసి కుముదునికి ఒక భాగాన్ని, శుకునికి ఒక భాగాన్ని, జాబాలికి ఒక భాగాన్ని ఇచ్చాడు. వేదదర్శనుడు తన సంహితను నాల్గు భాగాలు చేసి శౌల్కాయని, బ్రహ్మబలి, నిర్ఘోషుడు, పిప్పలాయనుడు అనే నలుగురు శిష్యులచేత ఒక్కొక్క భాగాన్ని చదివించాడు. శునకుడు తన సంహితను రెండుగా విభజించి బభ్రునికి ఒక భాగాన్ని, సైంధవాయనునికి ఒక భాగాన్ని చెప్పాడు. సైంధవాయనుని శిష్యులు సావర్ణి మొదలైనవారు, అక్షత కల్పశాంతి కాశ్యప అంగిరసాదులు ఆ తర్వాత అధర్వణాచార్యులై ఆ వేదశాఖా ప్రవచనాన్ని కొనసాగించారు.

## పురాణోత్పత్తి

మునులారా! వ్యాసభగవానుడు, అతని శిష్యప్రశిష్యులు కావించిన వేదవిభాగాన్ని మీకు తెలియజెప్పాను. లోకకళ్యాణం పరమోద్దేశం. లోకంలోని జనులందరు వారివారి పురాకృతమైన కర్మఫలాన్ని బట్టి తెలివితేటలలో పలుతెగలుగా ఉంటారు. వేదభావాలు ప్రజ్ఞావంతులకు తప్ప తక్కినవారికి బోధపడవు. అందరూ వేదతాత్పర్యాన్ని గ్రహించి ఆ విధంగా నడుచుకొంటే గాని శుభం కలుగదు. వ్యాసభగవానుడు ఈ భావాన్ని మనసులో ఉంచుకొని వేదతాత్పర్యం సామాన్యజనులకు సైతం తెలిసేటట్లు పురాణాలను రచించి లోకోపకారం కావించాడు.

## పురాణ విస్తృతి

ఆ విధంగా రచింపబడిన పురాణాలు మొత్తం పద్దెనిమిది ఉన్నాయి. బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, లైంగము, గారుడము, నారదీయము, భాగవతము, ఆగ్నేయము, స్కాందము, భవిష్యము, బ్రహ్మవైవర్తము, మార్కండేయము, వామనము, వారాహము, మాత్స్యము, కౌర్మము, బ్రహ్మాండము – అని వాటి పేర్లు.

బ్రాహ్మము పదివేలు, పాద్మము యాభైఅయిదువేలు, వైష్ణవము ఇరవైమూడువేలు, శైవము ఇరవైనాలుగు వేలు, లైంగము పదకొండు వేలు, గారుడము పంధొమ్మిది వేలు, నారదీయము ఇరవై అయిదు వేలు, భాగవతము పద్దెనిమిది వేలు, ఆగ్నేయము పదిహేనువేల నాలుగువందలు, స్కాందము ఎనభైఒక్కవేలపై ఒక్కనూరు, భవిష్యత్తు పధ్నాలుగువేల అయిదువందలు, బ్రహ్మవైవర్తము పద్దెనిమిది వేలు, మార్కండేయము తొమ్మిది వేలు, వామనము పదివేలు, వారాహము ఇరవైనాలుగు వేలు, మాత్స్యము పధ్నాలుగు వేలు, కౌర్మము పదమూడు వేలు, బ్రహ్మాండము పన్నెండు వేల శ్లోకాలు కలిగి ఉన్నాయి. పురాణసమూహం ఈ విధంగా నాలుగు లక్షల గ్రంథపరిమితితో శోభిల్లుతున్నది.

## పురాణ లక్షణాలు

మునులారా! ఈ పురాణాలు మహాపురాణాలని, ఉపపురాణాలని రెండుగా విభాగింపబడ్డాయి. నేనిందాక పేర్కొన్నవన్నీ మహాపురాణాలు. ఈ పురాణానికి పది లక్షణాలు ఉన్నాయి. సృష్టి, విసర్గము, వృత్తి, రక్షణము, మన్వంతరములు, వంశము, వంశానుచరిత్రము, నిరోధము, హేతువు, ఆశ్రయము – అనే దశలక్షణాలు కలిగినది మహాపురాణం. వీటిలో సృష్టి, విసర్గము, మన్వంతరము, వంశము, వంశానుచరితములు అయిదు మాత్రమే కలది పురాణసంజ్ఞితం. ఈ తీరున బ్రహ్మర్షులు వేదశాస్త్రానుసారంగా పురాణ లక్షణాలను నిరూపించారు.

# పురాణ లక్షణ వివరణము

## 1. సర్గము

మునులారా! సృష్టి అంటే విస్తరించటమని భావం. సృష్టిశబ్దానికి సర్గమని, కారణసృష్టి అని నామాంతరాలు ఉన్నాయి. విస్తరించటమంటే ఏదయినా ఒకటి మొట్టమొదట లీనావస్థలో ఉండి తర్వాత పెద్దదయితే దానిని విస్తారమని అంటారు. ఆ విస్తారాన్నే ప్రపంచమని అంటారు. ఈ లీనావస్థ, ప్రపంచావస్థ దేనికి కలుగుతున్నాయి? వస్తువుకు కలుగవు. వస్తువు ఏకరూపాననే ఉంటుంది. మరి దేనికి కలుగుతుంది? అంటే వస్తుశక్తికి కలుగుతుంది. ఎవరయినా ఒక పనిని చేయదలచినప్పుడు అతను యథాస్థితుడై ఉండగా అతనిలో తత్పూర్వం లీనమై ఉన్న అతని శక్తిమాత్రమే ప్రపంచించటమూ, తత్ఫలంగా కార్యజాతం ఏర్పడటమూ స్వానుభవసిద్ధమే కదా.

ఆ వస్తుశక్తిని ప్రధానము అంటారు. శక్తి అనగానే గుణత్రయసమ్మిళితమన్న విషయం స్పష్టమే. ఆ గుణాలకు క్షోభం అనగా చలనం కలుగుతుంది. ఆ చలనం కలగటానికి కారణం ఏమిటి? అని అడుగుతారేమో. కారణం ఇది కావచ్చునేమో అని మహర్షులు కూడా ఊహించారేకాని నిశ్చయించి చెప్పలేకపోయారు. ఏదయినా మార్పు కలిగినప్పుడు ఆ మార్పును కన్నారా చూచినట్లయితే ఇటువంటి మార్పు ఎప్పుడు? ఎందుకు? ఏ విధంగా? కలిగినదన్న ప్రశ్నలకు సమాధానం చెప్పగలుగుతాము. సృష్టికర్త అనబడే బ్రహ్మదేవుడు సయితం సృష్టితో

వచ్చినవాడే కాని తత్పూర్వం ఉన్నవాడు కాడు. ప్రధానము నుండి గుణక్షోభఫలంగా కలిగిన మార్పును ఏ ఒక్కరు చూడలేదు కాబట్టి దానిని గురించి నిశ్చయించి చెప్పటం సాధ్యం కాదు. ఒక్కటి మాత్రం చెప్పవచ్చును. సంకల్పం లేనిదే గుణక్షోభం కలుగదు. కాబట్టి సంకల్పముతోనే గుణక్షోభము మొదలయినవి ప్రారంభమైనట్లు గ్రహింపగలము.

ఆ సంకల్పం దేనికంటారా? శక్తి (ప్రధానము) జడము. కాబట్టి సంకల్పము శక్తికి కలుగదు. మరెవరికి కలుగుతుంది? ఆ శక్తికి ఆశ్రయమైన తత్త్వానికి కలగాలి. ఆ తత్త్వాన్నే భగవానుడని పరమాత్మ అని అంటారు.

ఆ పరతత్త్వానికి అటువంటి సంకల్పం ఎందుకు కలిగింది? అని అడుగుతుంటారు. దానినిగూర్చి వివిధమతాలు ఉన్నాయి. ఎన్ని ఉన్నా అవన్నీ ఊహలే కాని చూసి చెప్పినవి కాదుగదా.

**'కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్**
**కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః'**

అన్న వేదవాక్యమే ఇట్టి ప్రశ్నలకు సమాధానం.

మునులారా! గుణక్షోభఫలితంగా మహత్తత్త్వము, దానినుండి అహంకారము, దానినుండి తన్మాత్రలు, వాటినుండి ఇంద్రియార్థాలు సంభవించాయి. ఈ విధానమంతటినీ సర్గము అన్నారు.

## 2. విసర్గము

చరాచరప్రాణివర్గం పుట్టుకకు విసర్గమని పేరు. ఈ ప్రాణివర్గం తమతమ పూర్వకర్మవాసనలను బట్టి నానారూపాలను పొందుతున్నారు. ఈ విధానమంతా మహదాదుల కార్యం. మహదాదులు కూడా ఈశ్వరానుగృహీతములై వర్తిల్లుతున్నవే. విత్తునుంచి మరొక విత్తనం పుట్టుతున్న చందాన అది జరుగుతుంటుంది.

## 3. వృత్తి

ప్రాణులకు జీవకల్పన వృత్తి అనబడుతున్నది. ఆ వృత్తి ఒకతీరున గాక ప్రాణుల స్వభావ కామ ప్రేరణానురూపంగా జరుగుతుంటుంది.

## 4. రక్షణము

వేదవిధులు ఎంతకాలం సక్రమంగా అనుష్ఠింపబడుతున్నవో అంతకాలం సృష్టి యథావిధిని జరుగుతుంది. ఆ విధులను ఉల్లంఘించి వర్తించినప్పుడు సృష్టిక్రమానికి ముప్పు వాటిల్లుతుంది. ఆ విధంగా సృష్టికి ముప్పుకావించేవారిని రాక్షసు లంటారు. రాక్షసతత్త్వం గల ప్రాణులు ప్రతియుగంలో తలయెత్తి వ్యవహరిస్తుంటారు. అట్టివారిని సంహరింపగోరి భగవానుడు యథావసరంగా దేవ ఋషి నర తిర్యగ్రూపాలను తాల్చి అవతారకార్యాన్ని నిర్వర్తిస్తుంటాడు. అవతారమంటే నేలకు దిగిరావటం. అట్టి భగవద్రూపాలను అవతారములని అంటారు. ఆ అవతారాల ఊహాలీలను రక్షణమంటారు.

## 5. మన్వంతరము

మన్వంతరంలో ఆరు విషయాలను పేర్కొంటారు. మనువు చరిత్ర; మనుపుత్రుల చరిత్ర; ఆ మనువు కాలంలోని దేవతలు, దేవేంద్రుడు, సప్తర్షులను గురించిన చరిత్రలు; ఆ మనుకాలమందలి భగవదంశావతారము యొక్క చరిత్ర – ఇందులో ప్రశంసింపబడతాయి.

## 6. వంశము

బ్రహ్మప్రభువులై శుద్ధాత్ములైన రాజుల అన్వయం వంశ మనబడుతుంది.

## 7. వంశానుచరిత్రము

ఆ రాజుల వలన ఏయే వంశాలు కలిగినది, ఆ వంశధరుల చరిత్ర – వంశానుచరిత్ర మనబడుతుంది.

## 8. నిరోధము

మునులారా! పుట్టినది గిట్టక మానదనే లోకోక్తి ఉన్నది కదా. విశ్వానికి ఉత్పత్తి నంటి పెట్టుకొని లయము కూడా ఉంటుంది. ఆ లయము నిత్యమని నైమిత్తికమని ప్రాకృతికమని ఆత్యంతికమని నాల్గు విధాలు. వాటి తత్త్వాన్ని గురించి తెలుసుకొన్నాము. నాల్గు విధాలయిన ఆ లయములను నిరూపించటం నిరోధ మనబడుతుంది.

## 9. హేతువు

సృష్టికి జీవుడు నిమిత్త మవుతున్నాడు. జీవుడే కలుగనిచో సృష్టికూడా కలుగదు. కాబట్టి జీవుడు హేతు వనబడుతున్నాడు. జీవునికి నిమిత్తత్వాన్ని ఏ విధంగా ఆరోపించావు. అంటే, అవిద్య మూలాన జీవుడు కర్మమునకు కర్తృత్వాన్ని వహించినందువల్ల నిమిత్త మవుతున్నాడు. ఈ నిమిత్తత్వం అనుశయాత్మకమని కొందరు, అవ్యాకృతమని మరికొందరు అంటారు. చైతన్యప్రాధాన్యం వలన అనుశయత్వము, ఉపాధిప్రాధాన్యం వలన అవ్యాకృతత్వము కలుగుతున్నాయి. చైతన్యాన్ని ప్రధానంగా గ్రహించి చెప్పినప్పుడు జీవుడు అనుశయమాత్రు డవుతాడు. ఉపాధిని ప్రధానంగా గ్రహించి చెప్పినప్పుడు జీవుడు అవ్యాకృతు డనబడుతున్నాడు.

## 10. ఆశ్రయము

స్వర్గానికీ బ్రహ్మమే ఆశ్రయం. ఆశ్రయం వ్యతిరేకరూపమని, అన్వయరూపమని రెండు విధాలు. జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అని మూడవస్థలు మాయాకల్పితాలై దేహానికి కలుగుతున్నాయి. ఈ మూడవస్థలలోనూ క్రమంగా విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అనే పేర్లతో ఆ మూడవస్థలను సాక్షిమాత్రుడై పరికిస్తూ జీవవృత్తితో ఉండటం అన్వయక్రమం. సమాధి మొదలయిన అవస్థలలో బ్రహ్మమునకు, సంసారానికి ఎటువంటి సంబంధమూ లేదని, బ్రహ్మము కేవలాధిష్ఠానభూతుడని ఏర్పడుతున్నది. ఆ దృష్టితో చూడటం వ్యతిరేకరూపం.

## పరమాత్మాశ్రయం

మృత్తిక చేత నానారూపనామాలు గల కుండలు బానలు మూకుళ్ళు చేస్తారు. బంగారంతో నానారూపనామాలు గల ఆభరణాలను చేస్తారు. కుండలు నానారూపనామాలతో ఉన్నా వాటన్నిటిలో ఉన్నది మృత్తిక ఒక్కటే కదా. ఆభరణాలు నానారూపనామాలతో ఉన్నా వాటన్నిటిలో ఉన్నది బంగారమే కదా. ఏ విధంగా వివిధ ఘటాలకు మృత్తిక, వివిధాభరణాలకు స్వర్ణమూ ఆశ్రయమై ఉన్నవో అదే విధంగా పరమాత్మ సర్వసృష్టికి సత్తామాత్రమై ఉంటుంది. సృష్టిసమస్తం ఆ సత్పదార్థ ప్రపంచమే గాని వేరుకాదు.

## అపాశ్రయం

ఆ పరమాత్మ గర్భాధానం మొదలు మరణ పర్యంతం ఉండే దేహానికి సర్వావస్థలలోనూ – అనగా నిషేకము, గర్భము, జన్మము, బాల్యము, కౌమారము, యౌవనము, వయోమధ్యము, ముసలితనము, మృత్యువు – అనే తొమ్మిది అవస్థలలోనూ ఉంటాడు. ఆ పరమాత్మ అధిష్ఠానమాత్రంగా ఉన్నట్లు భావించినప్పుడు సంయుతమని, సాక్షిమాత్రంగా ఉన్నట్లు భావించినప్పుడు అసంయుతమని చెబుతారు. ఈ విధానాన్నే అపాశ్రయ మంటారు.

## జీవుడు – సంసారనివృత్తి

జీవుడు వాస్తవంగా పరమాత్మాంశుడే అయినా అవిద్యావిశేషం వలన అహంకారం జీవత్వభ్రాంతిని పొందటం వల్ల జీవుడు తాను జన్మిస్తూ మరణిస్తున్నట్లు భావిస్తాడు. ఈ అవిద్యాకార్యం ఎప్పుడు నశిస్తుందో అప్పుడే భ్రాంతికూడా తొలగిపోతుంది. తత్ఫలంగా అతనికి స్వరూపజ్ఞానం కలుగుతున్నది. అదే సంసారనివృత్తి.

## అవిద్యా నాశనం

అవిద్య నశించాలంటే అందుకు కర్తవ్యమేమిటి? అని అడుగుతుంటారు.

చిత్తము దాని వృత్తిత్రయాన్ని దాటి శుద్ధమై ఏకాగ్రతను పొంది వాసుదేవపరం ఎప్పుడయిందో అప్పుడే అవిద్య నశించిన దవుతుంది. ఆ విధంగా చిత్తము ఒక్కొక్కప్పుడు తనంత తానుగా భగవత్పరం కావచ్చును. లేదా, యోగానుష్ఠానం వలన అట్టి స్థితిని పొందవచ్చును. జీవుని సంసారనివృత్తికి పరమోపాయం ఇదే.

## పురాణ ప్రచారం

మునులారా! శ్రీ వ్యాసభగవానుడు పురాణాలను రచించి వాటిని శుకమహర్షికి చెప్పి, ఆరు సంహితలను నా తండ్రి రోమహర్షణునికి బోధించి ఆ తర్వాత త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు, శాంశపాయనుడు, హరీతుడు అనే శిష్యులకు ఆరుగురికి ఒక్కొక్క పురాణాన్ని చెప్పాడు. వారందరూ తర్వాత పౌరాణికులయ్యారు. వారు ఆరుగురినీ ఆశ్రయించి ఆ ఆరు పురాణాలనూ నేను చదివాను. నేను, కాశ్యపుడు, సావర్ణి శుకమునీంద్రుని సన్నిధిలో నాలుగు మూలసంహితలను నేర్చుకొన్నాము. ఈ విధంగా పురాణం లోకప్రచారాన్ని గడించింది.

## పురాణ శ్రవణఫలం

మునులారా! ఈ పద్దెనిమిది మహాపురాణాలు గాక లఘుతరాలైన ఇతర పురాణాలు ఇంకా అనేకం ఉన్నాయి. మునులారా! ఈ పురాణాలను విన్నవారికి వ్యాసశిష్యప్రశిష్యులకు వలెనే బ్రహ్మవర్చసవృద్ధి కలుగుతుంది.

## మార్కండేయ చరిత్ర

సూతుడన్న మాటలను విని శౌనకాదులు 'మహాత్మా! దరిగానరాని సంసారసాగరంలో పడి పరిభ్రమిస్తున్నవారము. మాకు భాగవతాన్ని వినిపించి సంసారసాగరపారాన్ని చూపించావు. ఇలాగే లోకోపకారం చేస్తూ నీవు చిరకాలం చల్లగా ఉండాలి గాక!

సూతాగ్రణీ! ఈ కల్పంలో మా భృగుకులాన మృకండుమహర్షికి

మార్కండేయుడనే కొడుకు పుట్టాడని, కల్పాంత మైనప్పటికీ అతను నశింపక చిరంజీవిగా ఉంటాడని చెప్పుకొంటారు. కల్పాంతంలో జగమంతా నశిస్తుంది. జగమంతా నశించినప్పుడు మార్కండేయుడు శేషించి ఉండటం అసంభవం కాదా? మరి వర్తమానకల్పం ఇంకా ముగియలేదు; అది ముగిసే లోపల ప్రపంచప్రళయం కలుగదు. సంగతి ఇలా ఉండగా ప్రళయార్ణవం ఉప్పొంగడము, అట్టి ప్రళయార్ణవంలో మార్కండేయుడొక్కడు మాత్రమే శేషించి ఆ అర్ణోరాశిలో వటపత్రపుటాన ఏకాకిగా శయానుడై ఉన్న విచిత్రబాలకుని అతను సందర్శించటము, ఎంత విచారించినా మా బుద్ధికి గోచరింపనివిగా ఉన్నాయి. నీవు సకల పురాణవేత్తవు కాబట్టి నీకు తెలియని పౌరాణిక విషయాలు ఉండవు. ఈ వివరం మాకు తెలిపి మా సందేహాలను మాన్పు' అని అడిగారు.

సూతుడు వారి మనోభావాన్ని గ్రహించి, ఈ విధంగా సమాధానం చెప్పాడు. 'మునీంద్రులారా! మీరడిగిన అర్థం భగవత్కథాప్రవర్తక మైనది కాబట్టి కలిదోషాన్ని హరించి లోకానికి శుభాన్ని కలుగజేస్తుంది. ఆ చరిత్ర చెబుతాను, సావధానచిత్తులై వినండి.

మునులారా! మృకండుమహర్షికి మార్కండేయుడు పుట్టి ఉపనయన సంస్కారం జరిగినది మొదలు ధర్మవ్రతనిరతు డయ్యాడు. అతనంత చిన్నవయసులోనే వ్రతియై జటావల్కల దండకమండలువులను, ఉపవీత మేఖలా కృష్ణాజిన కుశాక్షమాలలను నియమవృద్ధికి గాను ధరించి, క్రమంతప్పక సంధ్యాకాలాలలో అగ్నిని సూర్యుని గురువును విప్రులను భగవద్భావంతో అర్చిస్తూ మౌనం వహించి సాయంప్రాతస్సమయాలలో భిక్షాన్నం కొనివచ్చి గురువునకు నివేదించి, ఆ మహనీయు డనుజ్ఞ ఇచ్చినప్పుడు శరీరధారణార్థం భుజిస్తూ, అనుజ్ఞ నీయనినాడు ఉపవసిస్తూ, తండ్రితో వేదాలను పఠించి తపస్స్వాధ్యాయనిరతు డయ్యాడు. అతని నియమయాథార్థ్యానికి బ్రహ్మ, శివుడు, భృగువు, దక్షుడు, తదితర బ్రహ్మపుత్రులు దేవ పితృ మనుష్యాదులు మహాశ్చర్యాన్ని పొందారు.

మునులారా! మార్కండేయుడు ఆ విధంగా నియమధారియై హిమాద్రి ఉత్తరపార్శ్వంలో పుష్పభద్రానదీతీరంలో ఆశ్రమాన్ని కల్పించుకొని భగవంతుని పూజింపసాగాడు. ఆరు మన్వంతరాలు గడిచి ఏడవ మన్వంతరం వచ్చింది. మార్కండేయుడు అంత సుదీర్ఘకాలం తీవ్రవ్రతుడై తపస్సుచేస్తుంటే దేవేంద్రుడు శంకించి తన పదవికి భంగం కలుగుతుందేమో అని తలపోసి, అతని తపస్సుకు విఘ్నం కలిగించాలని నిశ్చయించి తన్నిమిత్తమై గంధర్వాప్సరసలను కామ వసంత మలయమారుతులను లోభమదాలను నియమించాడు. వారు బయలుదేరి చిత్రశిలావిలసితమై దివ్య వృక్షలతామనోహరమూ పుణ్య వినిర్మలజలాశ్రయమూ చిత్రవిచిత్ర ద్విజకులసంకీర్ణమూ మత్తమధుపకోకిలాదిమృదుమధురధ్వని మనోజ్ఞమూ మయూరనృత్య శోభాయమానమూ అయిన ఆ మార్కండేయుని ఆశ్రమాన్ని చేరుకొన్నారు. మందానిలుడు తుషారశీకరార్ద్రవికచపుష్పాల నెత్తావులను కొనివచ్చి గుబాళింపజేశాడు. వసంతుడు లతాతరువర్గాన్ని మృదుకిసలయశోభితం కావించాడు. చంద్రుడు రజనీకాంతాముఖమండలాన్ని అలంకరించాడు. గంధర్వులు హృద్యగానాలను ఆలపించారు. మదనుడు పంచబాణాలను ఎక్కుపెట్టాడు. అప్సరసలు అభినయవిద్యలతో అతిమనోహరనాట్యాలను ప్రదర్శించారు. ఆ సమయంలో పుంజకస్థలి అనే అప్సరస ఆ మునిమ్రోల కందుకక్రీడ సలుపుతుండగా ఆమె వలిపపు చీర మొలనూలు పట్టుసడలి జారిపోయింది. అది సందుగా మన్మథుడు తన బాణాలను ప్రయోగించాడు. ఇంద్రప్రేరితులైన తదితరులు శక్త్యనుసారం ఆ మునిమనస్సును చలింపజేయబూనారు.

మునులారా! వారి ఆటలు ఆ మునీంద్రుని మ్రోల సాగలేదు. పైగా వారి సేవలన్నీ నిదురించే పామును మేల్కొలిపినట్లయినాయి. ఆ మహనీయుడు రవంత బహిర్ముఖుడైనంతనే అతని తేజోమండల ప్రభావహతులై మదనాదులందరూ చేష్టలుడిగి నిలబడ్డారు. కామాదుల శక్తి రిత్తకావటం ఇంద్రుడు చూసి ఆ బ్రహ్మర్షి మహానుభావానికి ఎంతో ఆశ్చర్యపోయాడు.

మునులారా! భగవానుడు మార్కండేయుని యోగానికి మెచ్చి అతని ననుగ్రహింపగోరి ఒకానొకనాడు నరనారాయణరూపాలను దాల్చి అతని కన్నులయెదుట వచ్చి నిలిచాడు. సమున్నతగాత్రాలతో చతుర్భుజాలతో అలరారుతూ, కృష్ణాజినవల్కలాలను కట్టి, త్రిగుణయజ్ఞోపవీతాలను ధరించి పవిత్రపాణులై వేణుదండ కమండలు జంతుమార్జనపద్మాక్షమాలలను చేపట్టి తపోవేదాలు మూర్తిగొన్న చందాన ప్రసన్నులైన ఆ పరమర్షుల దర్శనం కలుగగానే అతని కన్నులు ఆనందబాష్పాలను వర్షించాయి; అతని నిలువెల్లా నారుపోసినట్లు రోమాంచకంచుకిత మయింది. ఆ కారణాన తన కట్టెదుట నున్న మహాత్ములను కన్నులారా కనుగొనే భాగ్యం అతనికి దూరమయింది. అయినా అతను వారిని తన హృదయాంతరంలో ఆలింగన కావించి దండప్రణామం చేసి గద్గదస్వరంతో 'నమోనమ' అని పలికి కొంతసేపటికి తేరుకొని వారికి ఆసనపాద్యార్ఘ్య చందనార్చన మాల్యధూపాదులు సమర్పించి, 'దేవా! ప్రాకృతులకే గాక బ్రహ్మరుద్రులకు కూడా ప్రాణ మనోవాగింద్రియాలన్నీ భగవత్ప్రేరితాలై తత్తత్కార్యములందు ప్రవర్తిల్లుతున్నాయి. ఎవ్వరికి ఎటువంటి స్వాతంత్ర్యమూ కలుగదు. అస్వతంత్రులు సర్వతంత్ర స్వతంత్రుడ వైన నిన్ను ఏమని ప్రస్తుతింపగలరు? స్వామీ! ముల్లోకాల క్షేమార్థం తాపోపశాంత్యర్థం మృత్యుంజయార్థం నీవు రూపాలను ధరించి సాక్షాత్కరిస్తావు. సాలెపురుగు వలె నీవు నీ శక్తినధిష్ఠించి సృష్టిస్థితిలయాలను కావిస్తావు. అయినా ఆ గుణ కర్మ కాలమలాదులు నిన్ను బాధింపలేవు. ఇంతకంటె నిన్ను వర్ణింపగల శక్తి నాకు లేదు. ఇదే నీ పాదాలను ఆశ్రయించాను. ఎన్ని యోగాలను పూనినా నీ భక్తి లేనినాడవి నిరర్థకాలు. ప్రభూ! నీవు సర్వాంతర్యామివి కనుక ప్రతిప్రాణి యొక్క హృదయంలోనూ ఉంటావు. బుద్ధి మాయావృతమై ఆ రహస్యం తెలియక విక్షేపించి ఇంద్రియవశ మవుతుంటుంది. వేదాది శ్రవణభాగ్య మందిన ధన్యాత్ముడు ఎట్టకేలకు నీ తత్త్వాన్ని గ్రహించి నిన్ను శరణిల్లగలడు. అట్టి ఆత్మనిగూఢునికి నీకు పునఃపునర్వందనాలు' అని స్తుతించాడు.

మునులారా! నారాయణుడు అతని భక్తికి సంతోషించి, 'బ్రహ్మర్షివర్యా! నీ తపస్స్వాధ్యాయసంయమాలు, నీ సమాధియోగం నిరపాయభక్తిపూరితాలై ఫలకారు లైనాయి. నీవు సిద్ధుడవైనావు. నా యీ దర్శనం వృథపోరాదు. నీ యిచ్చవచ్చిన వరం వేడు' అని పలికాడు. మార్కండేయుడా మాట విని 'వరదేశ్వరా! బ్రహ్మాదులు సహితం భగవద్దర్శనార్థం ఎంతో శ్రమిస్తుంటారు. అట్టి దుర్లభమైన నీ దర్శనభాగ్యం నాకు లభించింది. నేను నీ అనుగ్రహపాత్రుడ నైనందుకు ఇంతకన్న వేరు నిదర్శనమేమున్నది? ఇంతకు మించిన వరమేమి కావాలి? దేవా! అయినా ఒక్క కోరిక ఉన్నది. నీవు ఏకము అద్వితీయము అయిన సత్పదార్థమాత్రుడవని వేదరాశి బోధిస్తున్నది. అనుభవజ్ఞులూ అదే మాట అంటారు. అట్టి నీయెడ లోకపాలాదు లంతటివారికి కూడా భేదబుద్ధి కలుగుతున్నది. ఇట్టి భేదదర్శనానికి కారణమేమిటని విచారించారు. నీ మాయనే కారణమన్నారు. ఆ నీ మాయ ఎట్టిదో చూడగోరుతున్నాను' అని విన్నవించాడు. ఆ ప్రార్థనకు నారాయణుడు చిరునగవు దాల్చి, 'అట్లే అగుగాక!' అని పలికి నరునితో బదరికాశ్రమానికి వెళ్ళాడు.

## భగవత్ప్రభావం

మార్కండేయుడు తదేకచిత్తుడై అన్నింటియందు భగవానుని ధ్యానం చేస్తూ మానసపూజ కావిస్తూ ఒకనాడు పుష్పభద్రానదీతీరానికి వెళ్ళి అక్కడ సంధ్యోపాసనకు ఉపక్రమించాడు. ఇంతలో ప్రచండవాయువులు వీచాయి; మేఘాలు ముసురుకొని భయానకంగా ఉరుములు మెరుపులతో రథచక్రప్రమాణ వర్షధారలను క్రుమ్మరించాయి. వాయువేగానికి చతుస్సముద్రాలు కల్లోలాభీలములై పొంగిపొరలి భూమండలాన్ని ఆక్రమించాయి. చతుర్విధ భూతజాతాలూ దిక్కుకానక ఆ ఏకార్ణవంలో మునిగిపోయాయి. మార్కండేయుని గతీ అదే అయింది.

మార్కండేయుడు ఆ విధంగా ఏకార్ణవంలో మునిగి అంధుని వలె జడలు

విచ్చి అందులో మునిగి తేలుతూ ఆకలిదప్పులకు చింతిల్లుతూ తిమితిమింగలాది జలజంతువుల బాధకు కంపిల్లుతూ గాలికి కొట్టుకొనిపోయి పడుతూ లేస్తూ దిక్కుగానక దురపిల్లసాగాడు. అంతలో కటికచీకట్లు కప్పి కన్నుపొడుచుకొన్నా కానరానట్లయింది. ఒకచోట శోకం, ఒక్కయెడ మోహం, ఒకవంక దుఃఖం, ఒక్కచాయ సుఖం, ఒకప్రక్క భయం, ఒక్కవైపు వ్యాధిపీడ ఒక్కుమ్మడిని వచ్చి పైకొన్నట్లు తోచింది. అంతలో మృత్యువు సమీపించినట్లయింది.

ఆ విధంగా అతనికి లక్షోపలక్షల సంవత్సరాలు గతించాయి. అతనలా పరిభ్రమిస్తుండగా ఆ మహార్ణవంలో ఒకచోట ఉన్నతప్రదేశ మొకటి కానవచ్చింది. అతను శ్రమకోర్చి దానిని సమీపించాడు. అక్కడ చిగిర్చి పండ్లతో నిండిఉన్న వటవృక్షమూ, దాని శాఖలలో ఈశాన్యదిశకు వ్యాపించిన కొమ్మపైని ఒక పత్రపుటంలో శయనించి కాలివ్రేలిని నోటిలో పెట్టుకొని ఉన్న బాలకుడూ అతని కంటబడ్డారు. ఆ బాలకుని చూచినంతనే మార్కండేయుని మనఃపద్మ నయనపద్మాలు వికసిల్లాయి; అతని మేను గగుర్పొడిచింది. మెల్లమెల్లగా అతను ఆ బాలకుని సమీపించాడు. అంతలో ఆ బాలకుడు దీర్ఘోచ్ఛ్వాసం కావించాడు. ఆ శ్వాసవేగానికి మార్కండేయుడు దోమవలె అతని నాసికారంధ్రం నుంచి ముఖమండలం లోనికి ప్రవేశించాడు.

మునులారా! ఆ బాలకుని వదనగహ్వరంలో నానాకల్ప కల్పనమైన కాలం అధిష్ఠించి ఉన్నది. అందులో గగనభాగం సూర్యచంద్ర నక్షత్రాదుల చేత ప్రకాశితమై మిరుమిట్లు గొలుపుతున్నది. భూమండలం సముద్ర నదీ పరిత్పర్వతాలతో ద్వీపాలుగా వర్షాలుగా విభక్తమై అరణ్య పుర గ్రామాదులతో నిండి వర్ణాశ్రమ వృత్తిపరులైన జనులతో కూడి చిత్రవిచిత్రంగా కనుపించింది. అంతే కాదు. అక్కడ హిమవత్పర్వతం, పుష్పభద్రానది, అతని ఆశ్రమం అగుపించాయి. మార్కండేయుడు ఆ వింతలన్నింటినీ కళ్ళింతచేసుకొని పరికిస్తుండగా ఆ బాలకుడు నిట్టూర్పు విడిచాడు. దానితో ఆ మునీంద్రుడు ముఖాంతరం నుంచి వెలువడి యథాపూర్వం ప్రళయార్ణవంలో పడి

అందులోనుంచి ఆ వృక్షశాఖాగ్రాన కోమలపర్ణాంతరాన ఉన్న ఆ బాలకుని కనుగొన్నాడు. ఆ కుమారుడు దరహాస కటాక్షవీక్షణాన్ని అతని వంక సారించాడు. మార్కండేయుడా పరమభాగ్యానికి పులకించి, 'ఓహో! ఈ పరమపావన మూర్తి నా హృదయాధిష్ఠితుడు గాని బాహ్యరూపుడు కాడు' అని గ్రహించి, మహాహర్షసముత్కంఠుడై ఆ బాలకుని కౌగిలించుకొనబోయాడు. అంతలో ఆ బాలకుడు అంతర్హితుడయ్యాడు. అతనితో ఆ వటవృక్షమూ ప్రళయార్ణవం అదృశ్యమయ్యాయి. మార్కండేయుడు యథాపూర్వం తాను తన ఆశ్రమమందే ఉన్నానని గ్రహించాడు.

## మహేశ్వరునిచే వరదానం

మునులారా! మార్కండేయుడా విధంగా భగవద్యోగమాయావైభవాన్ని అనుభవించి, కొంతసేపటికి స్వస్థచిత్తుడై, 'దేవా! నీ మాయ సహితం జ్ఞానము వలెనే వెలుగొందుతున్నది. నీ మాయాప్రకాశానికీ జ్ఞానప్రకాశానికీ భేదాన్ని కనుగొనటం మావంటివారికి అసాధ్యం. అందువల్లనే కదా, విద్వాంసులు కూడా నీ మాయామోహితు లవుతున్నది? నీ మాయను నిగ్రహించాలంటే నీ పాదమూలాశ్రయం ఒక్కటే పరమసాధనం' అని అంటూ భగవద్ధ్యానమగ్నుడయ్యాడు.

ఒకనాడు పార్వతీపరమేశ్వరులు వృషభారూఢులై పార్షదులతో గగనభాగాన సంచరిస్తుండగా మార్కండేయుడు ధ్యానగతుడై ఉన్నవాడు వారి కంటబడ్డాడు. ఉమాదేవి అతనిని చూచి గిరీశునితో 'దేవా! ఈ ముని దేహేంద్రియ మనోవృత్తులను నియమించి ఏ కదలిక లేని మహాసముద్రం వలె అతిగంభీరంగా ఉన్నాడు. దేనినికోరి ఇతనింత తీవ్రతపోవ్రతు డయ్యాడో! సర్వసిద్ధిప్రదులు మీరితని కోర్కె తీర్చండి' అన్నది. మహేశ్వరుడా మాటవిని 'దేవీ! ఇతను నిష్కామభక్తితో హరిని ధ్యానిస్తున్నాడు. మోక్షాన్ని కూడా కోరడు. కోరిక అంటూ ఉంటే దానిని కొనసాగింపగలము. ఏమీ కోరనివారికి

ఇవ్వదగినది ఏముంటుంది? ఇతను సాధూత్తముడు; సాధువులతోడి సంభాషణ సర్వానందకరంగా ఉంటుంది. ఇతనితో మాటాడుదాము' అని పలికి అతనిని చేరబోయాడు.

మునులారా! మార్కండేయుడు గాఢసమాధిస్థుడై లోకాలనే మరచి ఉన్నందువలన పార్వతీపరమేశ్వరులు తనను సమీపించిన సంగతినే గుర్తింపలేదు. మహేశ్వరుడా సంగతి గ్రహించి తన యోగమాయను అధిష్ఠించి గాలి రంధ్రంలోనికి చేరినట్లు అతని హృదయాకాశం లోనికి ప్రవేశించాడు. ఆ విధంగా తన హృదయాంతరంలో త్రిలోచనాలతో అలరారుతూ వ్యాఘ్రచర్మాన్ని గట్టి పింగజటాపటలం కలిగి శూలధనుర్బాణకోదండ కృపాణాక్షమాలా డమరుక కపాల పరశువులను తన అష్టబాహువులలో ధరించి అప్పుడే ఉదయించి వస్తున్న సూర్యునివలె తేజరిల్లుతున్నవానిని చూసి ఆ మునీంద్రుడు, 'ఏమిటి ఈ వింత! ఎక్కడి నుంచి వచ్చినది?' అని ఆశ్చర్యపోయి సమాధి చాలించి బహిర్ముఖుడై కనుదోయి విప్పాడు. అతని ముందట త్రిలోకగురువు మహేశ్వరుడు పార్వతీసహితుడై పార్షదులతో కూడి సాక్షాత్కరించాడు.

మునులారా! మార్కండేయుడు వారికి ప్రణమిల్లి యథార్హపూజాదికం కావించి, 'దేవా! నీవు పూర్ణకాముడవు; లోకోపకారవ్రతదీక్షితుడవు. అట్టి నీకు నేనేమి సమర్పింపగలను? స్వామీ! నీ ప్రస్తుతికి సయితం నేను స్వతంత్రుడను కాలేను. ఏమంటావా? తల్లిదండ్రుల వలె నీవు దేహబంధు మాత్రుడవు గాక ఆత్మబంధువై ఉన్నవాడవు. నీ ఆజ్ఞను పొంది ప్రాణాది సర్వేంద్రియాలు వ్యవహరిస్తాయి. దేహధారులు నీచేతి కీలుబొమ్మల వలె వర్తిల్లుతారు. కనుక నిన్ను స్తుతించేందుకు వాక్కుకూడా నీ ఆనతిని గ్రహించి బయల్వెడలవలసి ఉన్నది. ఈ విధంగా స్వాతంత్ర్యహీనుడనైన నేను నిన్నేమని సన్నుతింపగలను? ఇదే నీకు సాష్టాంగం' అని తలతో మ్రొక్కాడు.

మునులారా! మహాదేవుడు మార్కండేయునికి ప్రసన్నుడై, 'మునిసత్తమా!

బ్రహ్మ విష్ణు మహేశ్వరులము మేము ముగ్గురమూ వరదాతలము. మా దర్శనం వృథపోరాదు. నీ యిచ్చవచ్చిన వరాన్ని కోరు. అయ్యా! శాంతము, నిస్సంగత్వము, భూతవత్సలత, నిర్వైరము, సమలక్షణాలు – ఇవి భగవల్లక్షణాలు. ఇట్టి లక్షణాలు కలిగిన మర్త్యులు సాధువు లనబడుతారు. అట్టి సాధువులనే బ్రాహ్మణులని అంటారు. బ్రహ్మ గుణసంపన్నులు బ్రాహ్మణు లవుతారు. ఇట్టి సాధుగుణం ఏకాంతభక్తిచేత తప్ప మరొకట సిద్ధింపదు. ఇట్టి ఏకాంతభక్తులను లోకపాలాదులు సహితం ఉపాసిస్తారు. ఒకరి సంగతి దేనికి? త్రిమూర్తులము మేముకూడా అటువంటి సాధువులకు తలవంచుతాము. ఏ ఫలాన్ని కోరి భజిస్తున్నామంటావా? ఫలాన్ని కోరి కాదు; ఆనందవశులమై వారికి వశపడుతాము.

మునీంద్రా! ముమ్మూర్తుల మైనప్పుడు మాకు తనుభేదం కలుగుతున్నదని, భేదమూర్తులను ఆరాధించినప్పుడు భక్తులకు బుద్ధిభేదం తప్పదని శంకింపకు. తనుభేదము, తనుమద్భేదము అని భేదం రెండు విధాలు. శరీరభేదం స్వాభావికం. శరీరాలు భేదించినా శరీరాలలో ఉన్న ఆత్మ ఒక్కటే. ఆత్మభేదం లేదు. ప్రాకృతులు శరీరభేదాలను పట్టుకొని ప్రాకులాడుతారు. ఆ కారణాన వారికి భేదబుద్ధి, దానిని అంటిపెట్టుకొని ఉన్న ద్వంద్వాలూ తప్పవు. సాధువు లైనవారు శరీరభేదాలను పెద్దగా లెక్కచేయరు. వారిదృష్టి ఎప్పుడూ శరీరాంతఃస్థమైన ఆత్మయందే ఉంటుంది. ఆత్మ ఏకము, అద్వితీయము కాబట్టి సాధువులకు భేదదృష్టి కలగకపోవటము, మీదుమిక్కిలి సమదర్శనం ఉండటము నైజసిద్ధ మవుతున్నది. ఆ కారణాన సాధువులు మా ముగ్గురినీ అభేదబుద్ధితో భజిస్తారు. అట్టి స్వపరభేదాలు లేని సాధువులను మేము భజిస్తాము. జనులు తమ పావనత్వాన్ని కోరి తీర్థాలను, మట్టిబొమ్మలను, రాతివిగ్రహాలను సేవించటం ఉన్నది. ఆ సేవాఫలం దీర్ఘకాలానికి కలుగుతుంది. సాధుసేవ సంగతి అలా ఉండగా వారిని దర్శించినంత మాత్రాననే జన్మ ధన్యమవుతుంది. వారి తేజఃప్రభావానికి అంత

మహిమ ఉన్నది. సాధుదర్శన మాత్రాననే అంతటి మహాభ్యుదయం కలుగుతుండగా వారితోడి సంభాషణఫలం సంగతి చెప్పేదేమున్నది?' అని పలికాడు.

మునులారా! చంద్రమౌళి వచనామృతం ధర్మరహస్యసముపేతమై హితసమ్మితంగా ఉండటం వలన మార్కండేయుడు ఆ వాగమృతాన్ని గ్రోలి విష్ణుమాయాకృతమైన స్వాంతపరిభ్రమణాన్ని కొంత సవరించుకొని, 'దేవా! ఈశ్వరుల చర్యలు దేహధారులకు ఊహింపరానివి. మీరు నియమాలను ఆచరించటం బోధించటం అనుమోదించటం, అనుష్ఠాతలను ప్రస్తుతించటం దేహధారులను ధర్మానుష్ఠానపరులను కావించటానికే తప్ప వేరుకాదు. స్వామీ! ప్రణామాదులన్నీ ఆత్మమాయామయవృత్తికములే. అట్టి మీరు కావించినంతనే మీ ప్రభావానికి కొరత కలుగదు. ఎవడు సంకల్పమాత్రాన జగత్తును తన మనస్సులో సృజించి అందులోనికి ప్రవేశిస్తాడో ఎవని సాన్నిధ్యం వలన సర్వేంద్రియాలు ప్రవర్తిల్లుతున్నవో, ఎవడు సాక్షిమాత్రుడై తద్వ్యవహారసామస్త్యాన్ని పరికిస్తున్నాడో, ఎవనికి తాదృశ సాన్నిధ్యమాత్రాన కర్తృత్వాదికం కల్పింపబడుతున్నదో, త్రిగుణాత్మికమైన ఆత్మశక్తి ఈ విధంగా నానాత్వరచన గావించి వ్యవహరించుతున్నా ఎవడు కేవలుడు, అద్వితీయుడునై ఉన్నవాడో, అట్టి బ్రహ్మమూర్తికి లోకగురువుకు భగవంతునికి ప్రణామం. దేవా! వరం కోరమన్నావు. నీ దర్శనానికి మించిన వరమేమిటున్నది? నీ దర్శనమాత్రాననే దేహధారి పూర్ణకాముడు, సత్యకాముడు అవుతాడు కదా. అయితే ఒకటి అడుగుతాను. భగవంతుడవైన నీమీద నా భక్తి యెంత దృఢమో భాగవతులయెడ కూడా నా భక్తి అంతే దృఢమగునట్లుగా నన్ను అనుగ్రహించు' అని ప్రార్థించాడు. చంద్రమౌళి అతని సద్భక్తికి మెచ్చి, 'మహర్షిసత్తమా! శ్రీ మహావిష్ణు భక్తుడవు గనుక సర్వకామసిద్ధి నీకు స్వతసిద్ధం. విరక్తితోడి నీ జ్ఞానం సుస్థిర మవుతుందిగాక. తత్ఫలంగా నీకు త్రైకాలికజ్ఞానమూ బ్రహ్మవర్చసమూ నిర్వక్ర మవుతాయి. నీకు

అజరామరత్వాలు, పురాణాచార్యత్వం కలుగుతాయి. నీ కీర్తి కల్పాంతస్థాయి కాగలదు' అని వరాలిచ్చి అతనిని వీడ్కొని, తాను తొల్లిట అనుభవించిన విష్ణుమాయావిలాసాన్ని భవానికి వినిపిస్తూ కైలాస నివాసానికి వెళ్ళాడు.

మునులారా! సంసారమన్నది ఉత్పత్తిలయాలతో కూడి ఉన్నది. ఈ సంసారమే మాయాస్వరూపం. ఇట్టి మాయను భగవానుడు మార్కండేయునికి ప్రదర్శించాడు. ఆ మాయాఫలితంగా ఏకార్ణవాది ప్రళయలక్షణాలు మార్కండేయునికి ప్రస్ఫుటించాయి. అంతేకాని అది కల్పాంతరప్రళయం కాదు. ఈ రహస్యాన్ని గ్రహించి 'మార్కండేయుడు ప్రళయాంతంలో సైతం ఎలా జీవించా?' డన్న సంశయాన్ని పొందకండి.

మునులారా! సంసారమెన్నడూ కర్మాశ్రయంగా ఉంటుంది. సంసారాన్ని నిస్తరించాలంటే తగినట్టి మార్గాన్ని అనుసరించాలి. ఆ మార్గాన్ని మార్కండేయుని చరిత్ర బోధిస్తున్నది కాబట్టి దీనిని శ్రద్ధాభక్తులతో విన్నవారికి, చదివినవారికి సంసారనిస్తరణభాగ్యం లభిస్తుంది.

మునులారా! సంసారం కర్మాత్మకం కనుక కర్మమును విసర్జించినంతనే సంసారనివృత్తి కలుగుతుందని భావింపకూడదు. కర్మములన్నీ హస్తపాదాది కర్మేంద్రియాలతో చేయబడుతుండటం అందరికీ తెలిసినదే. హస్తాదులు జడములు కాబట్టి వాటికి స్వతంత్రశక్తి లేదు. ఈ కర్మేంద్రియాలను జ్ఞానేంద్రియాలు నడుపుతుంటాయి. సూక్ష్మదృష్టితో విచారించితే జ్ఞానేంద్రియాలు కూడా జడములేనని, వాటికి కూడా స్వాతంత్ర్యశక్తి లేదని, వాటిని నడిపే శక్తి మరొకటి ఉన్నదని ఏర్పడుతుంది. ఆ శక్తినే పరమాత్మశక్తి అనుకొన్నాము. ఆ శక్తికూడా స్వతంత్రించి వర్తింపదు. పరమాత్మ ఏమని సంకల్పించితే ఆ విధంగా వర్తిస్తుంది. కాబట్టి సర్వవ్యాపారానికి పరమాత్మయే మూలమని తేలుతున్నది.

పూర్వజన్మఫలాలను అనుభవించేందుకు అందుకు తగిన

అవయవసంస్థానంతో శరీరాలు వస్తుంటాయి. కర్మముల ఫలితం కర్తల సంకల్పాదులను బట్టి ఉంటుంది. సంకల్పాలు తత్కాల గుణవ్యవహారాలను బట్టి ఉదయిస్తాయి. గుణవ్యవహారాలు చిత్రవిచిత్రాలుగా ఉంటాయి. అందువల్ల సంకల్పాలు కూడా వివిధాలుగా ఉంటాయి. ఆ సంకల్పాలను బట్టి కర్మములు, కర్మములను బట్టి ఆ కర్మఫలాలు బహువిధాలుగా ఏర్పడుతున్నాయి. బహువిధకర్మఫలాలను ఏకరూపమైన ఉపాధితో భోగింపరాదు కాబట్టి బహురూపశరీరాలు తప్పనిసరి అవుతున్నాయి. ఈ ఉపాధి నానాత్వమే ప్రపంచనానాత్వానికి కారణం.

మునులారా! ప్రతిప్రాణి లోకంలో సుఖాన్ని కోరేవారే గాని దుఃఖాన్ని కోరుకొనేవారు ఉండరు. కాబట్టి సుఖము, ఆ సుఖాభిలాష ప్రాణులకు నైజసిద్ధాలు. అట్టి సుఖానుభవకాంక్షతో సర్వేంద్రియాలు వ్యవహరిస్తున్నాయి. అట్టి సుఖప్రాప్తికి అనుకూలమైన ఇంద్రియవ్యాపారాన్ని గ్రహించాలి; అందుకు ప్రతికూలమైనదానిని నిషేధించాలి. సుఖప్రాపకమైన ఇంద్రియవ్యాపారాన్ని ధర్మమని, దానికి ప్రతికూలవ్యాపారాన్ని అధర్మమని పేర్కొంటారు. ధర్మముకూడా అన్ని ఉపాధులకు ఏకరూపం కానేరదు. ఒక్కొక్క ఉపాధికి ఒక్కొక్క వ్యాపారం అనుకూలిస్తుంది. అది ఆ శరీరానికి యుక్తధర్మ మవుతుంది. దానిని స్వధర్మమని అంటారు. అనుకూలమార్గాన్ని త్రొక్కి పాటుపడినప్పుడు ఫలముకూడా విశేషశ్రమ లేకుండానే చేకూరుతుంది. ఆ కారణంవల్లనే ప్రతివ్యక్తి స్వధర్మాన్నే ఆచరించాలని చెప్పబడింది.

మునులారా! కర్మేంద్రియ జ్ఞానేంద్రియవ్యాపారాలు, అంటే – నడవటం, కూర్చుండటం, తినటం చూడటం, వినటం మొదలయినవి ఆ ఇంద్రియాలకు నైజాలు. ఆ క్రియలకు ఫలసిద్ధి లక్షణం ఉన్నది. ఆ ఫలం సంకల్పాన్నిబట్టి ఉంటుంది. కాబట్టి సంకల్పమెప్పుడూ పరిశుద్ధం గాను సుఖప్రాపకయోగ్యం గాను ఉండాలి. ఆ విధంగా చేసిన ఇంద్రియవ్యాపారం జీవికి స్వధర్మ మవుతుంది.

మునులారా! స్వధర్మరూపకర్మము కూడా ఫలాన్నిస్తుంది. కాబట్టి దానిని అనుభవింపక తీరదు. అందు నిమిత్తం జన్మధారణమూ తప్పదు. కర్మఫలానుభవము, తదర్థమైన జన్మధారణము ఎప్పుడు కలుగుతున్నాయి? 'నేను, నాది' అన్న భావంతో చేసినప్పుడే కలుగుతున్నాయి. కర్మములను చేయటం తప్పదు కాబట్టి కర్మలను చేస్తూనే తత్ఫలభోగ తదర్థ జన్మల నుండి తప్పించుకోవటం ఎలాగనే సందేహం కలుగవచ్చును. ఇక్కడే కర్మయోగ రహస్యమంతా నిగూఢంగా ఉన్నది. ఆ రహస్య మేమంటారా? 'నేను, నాది' అన్న భావాన్ని వదిలి స్వధర్మం ఆచరించినప్పుడు ఫలోదయం కలిగినప్పటికీ ఆ ఫలం కర్తకు చెందదు. ఆ ఫలం లోకోపకారార్థ మవుతుంది. దానినే భగవదర్పణమని అంటారు. అందువల్ల ప్రతివ్యక్తి తన నైజధర్మాన్ని భగవదర్పణబుద్ధితో చేయాలి. ఆ విధంగా చేసినవారు కృతకృత్యు లవుతారు.

మునులారా! సంకల్పాలు ప్రారబ్ధకర్మఫలవాసనల ప్రకారం ఉదయిస్తుంటాయని చెప్పాను. ఆ వాసనలు దుష్టములుగా ఉండవచ్చునని, అవి దుష్టకార్యాలకే ప్రేరేపిస్తాయని, దుష్టకార్యాలను చేసినప్పుడు శుభమెలా కలుగుతుందని శంకింపవచ్చు. దుష్టవాసనలు ఉదయించినప్పుడు వాటిని ఆటంకపరచి సన్మార్గానికి మళ్ళించాలి. స్వభావం వేరుగా ఉన్నప్పుడు ఎలా సాధ్యమవుతుందని అడుగుతారేమో. స్వభావశుద్ధి నిమిత్తమే సజ్జనసాంగత్యం మొదలయినవి చెప్పబడ్డాయి. అవీ సాధ్యపడనినాడు ఏమిచేయాలంటారా? భగవంతుని స్మరించి ఆ పనులు చేసినట్లయితే క్రమక్రమంగా బుద్ధి పరిశుద్ధమై తత్ఫలంగా కార్యఫలం కూడా భగవత్పర మవుతుంది. కర్తకు అన్వయింపదు. ఈ సంగతి శ్రీ భగవానుడు గీతలో నొక్కినొక్కి చెప్పి ఉన్నాడు. భగవద్వచనాలకు మించిన ప్రమాణం ఏమున్నది?

## మహాపూరుష పూజాక్రమం

శౌనకాదిమహర్షులు సూతుని మాటవిని 'పౌరాణికాగ్రణీ! భాగవత తత్త్వం నీకు కరతలామలకం గనుక దానిని మాకు వివరించావు. భగవానుడు కేవలుడు గదా. అట్టి నిరాకార నిర్గుణ చైతన్యమాత్ర తత్త్వానికి తాంత్రికులు పరిచర్యార్థమై పాదాద్యంగాలను గరుడవాహనాద్యుపాంగాలను సుదర్శనాద్యాయుధాలను కౌస్తుభాద్యలంకారాలను కల్పించి అర్చిస్తారని అంటారు. ఆ కల్పనావిధానాన్ని తెలియగోరుతున్నాము' అని అడిగారు.

సూతుడు వారి ప్రణయాన్ని విని విష్ణువిభూతులను వేదతంత్ర ముఖంగా వెల్లడించిన బ్రహ్మాదిగురువులకు మ్రొక్కి ఈ విధంగా అన్నాడు.

## మహాపూరుష రూపం

మునులారా! భగవంతుని పౌరుషరూపాన్ని వినగోరారు. చెబుతాను వినండి. విరాడ్రూపం భగవత్పురుషరూప మవుతుంది. పురుషశబ్దం శరీరవాచికం. భగవానుడు కేవల చైతన్యమాత్రుడు కదా. ఆ చైతన్యము శక్తిమంతం. ఆ శక్తి మొట్టమొదట వ్యవహరించింది. తత్ఫలంగా ప్రకృతి పురుష మహదహంకారాలు, ఆకాశాది పంచతత్త్వాల సూక్ష్మాంశలైన పంచతన్మాత్రలు మొత్తం తొమ్మిది ఉద్భవిల్లాయి. ఆ తొమ్మిది తత్త్వాలు తర్వాత పరిణామాన్ని పొందాయి. తత్ఫలంగా ఏకాదశేంద్రియాలు, పంచమహాభూతాలు జనించాయి. ఆ పదహారింటితో కూడి ఏర్పడిన రూపాన్ని విరాణ్మూర్తి అన్నారు.

## విరాడ్రూపము యొక్క అవయవసంవిధానం

ఆ విరాణ్మూర్తికి భూమి పాదాలుగా, దివము శిరస్సుగా, నభస్సు నాభిగా, సూర్యుడు నేత్రాలుగా, వాయువు నాసికలుగా, దిక్కులు కర్ణాలుగా, ప్రజాపతి మేఢ్రంగా, మృత్యువు అపానంగా, లోకపాలకులు బాహువులుగా, చంద్రుడు మనస్సుగా, యముడు కనుబొమలుగా, లజ్జ పై పెదవిగా,

లోభము క్రింది పెదవిగా, వెన్నెల దంతాలుగా, భ్రమము స్మయంగా, వృక్షములు రోమాలుగా, మేఘాలు కేశంగా కల్పించారు.

## విరాడ్మూర్తి ప్రమాణం

లోకంలోని ప్రతిపురుషుడు ఎంత పొడవు ఉంటాడని కొలిచినప్పుడు అతని జానతో అతను ఏడు జానల ఎత్తుంటాడు. అలాగే విరాట్పురుషుడు కూడా అతని జానతో ఏడు జానల ఎత్తు కలిగి ఉంటాడు.

## ఆభరణాలు

ఆ మూర్తియొక్క ఆత్మతేజస్సు కౌస్తుభరూపంలో అతనిని అలంకరిస్తుంది. ఆ కౌస్తుభకాంతి శ్రీవత్సమనే పేరుతో అతని విభూషగా అలరారుతుంది. గుణమయి అయిన అతని శక్తి ఛందోమయ పీతాంబర రూపంలో చూపట్టుతుంది. వర్ణత్రయాత్మకమైన ఓంకారం అతనికి బ్రహ్మసూత్రమై అమరింది. సాంఖ్య యోగాలు మకరకుండలాలుగా, బ్రహ్మలోకం మౌళిగా కల్పించారు.

## ఆసనాయుధాదులు

మునులారా! ఆ మహాపురుషునికి ప్రధానాత్మకము, ధర్మజ్ఞానాదికము అయిన సత్త్వగుణమే పద్మాసనం; ఓజస్సహోబలయుతప్రాణతత్త్వం కౌమోదకీ గద; ఉదకతత్త్వం పాంచజన్య శంఖం; తేజస్తత్త్వం సుదర్శన చక్రం; నభస్తత్త్వం నందకమనే ఖడ్గం; తమస్సు చర్మాయుధం; కాలము శార్ఙ్గ ధనువు; కర్మము తూణీరం; ఇంద్రియాలు బాణాలు; క్రియాశక్తితోడి మనస్సు రథం. భగవానుడు తన్మాత్రలు రూపుగొన్న రథాన్ని అధిష్ఠించి వరదాభయాదిముద్రలతో తత్తత్కార్యాలను నెరవేరుస్తుంటాడు.

మునులారా! సూర్యమండలం భగవత్పూజాస్థానంగా, మంత్రదీక్ష తత్పూజాసంసారంగా, భగవత్పరిచర్య భక్తుల దురితక్షయంగా

సంభావించాలి. భగమంటే ఐశ్వర్యాది షడ్భావాలు. షడ్భావరూప లీలాకమలాన్ని ధరించినందువలన అతనికి భగవంతుడని పేరువచ్చింది.

ఆ పైని ధర్మము చామరంగా, యశస్సు వ్యజనంగా, వైకుంఠలోకం నిర్భయాతపత్రంగా ఆ మహాత్ముని ఉపచరిస్తుంటుందని, త్రయీవేదం అతనిని వహిస్తుంటుందని, అతని ఆత్మశక్తి అయిన శ్రీదేవి నిరంతరం అతనిని అర్చిస్తుంటుందని, పాంచరాత్రాగమతంత్రాదులు విష్వక్సేనమూర్తి రూపంలో అతనికి పార్షదుడైనాయని, అణిమాదిసిద్ధులు నందకాదిరూపాలను ధరించి ఎనమండ్రుగురు ద్వారపాలకులుగా ఉంటారని భావిస్తారు.

## చతుర్మూర్తి వ్యూహం

ఆ మహాపురుషుడు వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నాల్గు మూర్తులతో ఉపాసనాదులకు స్థానమై వెలసి విలసిల్లుతుంటాడు. ఇంతకు పూర్వం చెప్పిన విధానమంతా భగవంతుని బాహ్యరూపం. ఆ భగవానుని ఆంతరరూపాలు విశ్వము, తైజసము, ప్రజ్ఞము, తురీయము అని నాలుగు ఉన్నాయి. ఆ భగవానుడు విశ్వరూపంలో బాహ్యార్థాలను, తైజసరూపంలో మనస్సును, ప్రజ్ఞారూపంలో అజ్ఞానకార్యాదికాన్ని వర్తింపజేస్తాడు. అతని తురీయరూపం జ్ఞానాత్మకమైనది ఆ మూడింటికి సాక్షిమాత్రమై ఉంటుంది.

మునులారా! భగవానుడు స్వప్రకాశుడు, స్వమహిమపూర్ణుడు, అనవచ్ఛిన్న జ్ఞానాత్మకుడు అయినప్పటికీ నిజమాయను అధిష్ఠించి బ్రహ్మవిష్ణుమహేశ్వర రూపాలతో భిన్నునిగా కనుపట్టుతూ విశ్వసృష్టిస్థితిలయాలను కావిస్తుంటాడు. ఆ పరమాత్ముని తాదాత్మ్యము చేత తప్ప వేరొక విధాన పొందశక్యంకాదు. తాదాత్మ్యస్థితి కలగాలంటే తత్పరులు కావాలి. ఎవరు వేకువజామున మేల్కాంచినంతనే –

**శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావనిధ్రు**
**గ్రాజన్యవంశదహనానపవర్గ వీర్య**
**గోవిన్ద గోపవనితావ్రజభృత్యగీత**
**తీర్థశ్రవః శ్రవణమఙ్గళ పాహి భృత్యాన్.**

'శ్రీకృష్ణా! అర్జునసఖా! వృష్ణివంశోత్తమా! భూద్రోహిరాజవంశదహనా! అక్షీణప్రభవా! గోవిందా! గోపాంగనాగీతపవిత్రకీర్తీ! శ్రవణమంగళా! నీ భృత్యులము మమ్ము కాపాడు' అని భగవదేకాగ్రచిత్తులై ప్రణతిపూర్వకంగా జపిస్తారో వారికి తత్ హృదయవర్తి అయిన భగవానుడు ప్రసన్నుడవుతాడు. తత్ఫలంగా వారికి హృదయాంతర్వర్తియైన భగవంతునితో తాదాత్మ్యం కాలక్రమాన కలుగుతుంది'.

## సూర్యచారం

శౌనకుడా మాట విని, 'సూత్రాగ్రణీ! సూర్యుడు సప్తగణాలతో కూడి ప్రతిమాసంలోనూ సంచరిస్తుంటాడని శుకమహర్షి పరీక్షిన్నరేంద్రునికి చెప్పాడన్నారు. గణాలను, గణాధిపతులను, రవిచార విశేషాలను వినాలని కుతూహలంగా ఉన్నది' అని అడిగాడు. సూతుడు ఈ విధంగా చెప్పాడు.

మునులారా! అన్నిటికి మూలమైనవాడు భగవానుడు. ఆ పరమేశ్వరుడు సర్వశరీరాలకు ఆత్ముడై ఉంటాడు. ఆ మహనీయుని మాయ సూర్యరూపాన్ని ధరించి లోకతంత్రప్రవర్తక మవుతున్నది. ఇంతెందుకు? భగవానుడే సూర్యరూపంలో లోకతంత్రాన్ని ప్రవర్తింపజేస్తున్నాడని గ్రహించండి.

ఆ భగవానుని శక్తి (1) కాలము (2) దేశము (3) క్రియ (4) కర్త (5) కరణము (6) కార్యము (7) ఆగమము (8) ద్రవ్యము (9) ఫలము అని నవవిధాల వ్యవహరిస్తున్నది.

భగవానుడు కాలరూపుడై చైత్రాది ద్వాదశమాసాలలో ఒక్కొక్క మాసంలోనూ ప్రత్యేక ద్వాదశగుణాలతో లోకతంత్రార్థం వర్తిల్లుతుంటాడు. చైత్ర మాసంలో సూర్యుడు ధాత అనే పేరుతో కృతస్థలి అనే అప్సరసతోను,

హేతి అనే రాక్షసునితో, వాసుకి నాగునితో, రథకృత్తు అనే యక్షునితో, పులస్త్యఋషితో, తుంబురు గంధర్వునితో మహారథగతుడై సంచరిస్తాడు. వైశాఖ మాసంలో అర్యముడనే పేర అప్సరస పుంజకస్థలి, పులహ రాక్షసుడు, ఓజస్సనే నాగుడు, ప్రహేతి యక్షుడు, నారద ఋషి, కంజవీర గంధర్వుడు వెంటరాగా సంచరిస్తాడు. జ్యేష్ఠమాసంలో మిత్రుడనే పేరితో మేనక, పౌరుషేయుడు, తక్షకుడు, హాహాగంధర్వుడు, అత్రిఋషి, రథస్వనుడు వెంటనడవగా నడయాడుతాడు. ఆషాఢమాసంలో వరుణుడనే పేరిట రంభా వసిష్ఠ సహజన్య హూహూగంధర్వ శుక్రచిత్వ స్వనులను కూడి చరిస్తాడు. శ్రావణమాసంలో ఇంద్రుని పేరితో విశ్వావసుడు, శ్రోత, ఏలాపుత్రుడు, అంగిరసుడు, ప్రమ్లోచ, చర్యుడు అనేవారు వెంటరాగా సంచరిస్తాడు. భాద్రపద మాసంలో వివస్వంతుడనే పేరిట ఉగ్రసేనుడు, వ్యాఘ్రుడు, ఆసారణుడు, భృగువు, అనుమ్లోచ, శంఖపాలుడు అనేవారితో సంచరిస్తాడు. ఆశ్వయుజ మాసంలో త్వష్ట అనే పేరుతో జమదగ్ని, కంబళాశ్వుడు, తిలోత్తమ, బ్రహ్మాపేతుడు, శతజిత్తు, ధృతరాష్ట్రుడు అనేవారితో సంచరిస్తాడు. కార్తీక మాసంలో విష్ణువనే పేరిట అశ్వతరుడు, రంభ, సూర్యవర్చుడు, సత్యజిత్తు, విశ్వామిత్రుడు, మఖాపేతులతో కలిసి సంచరిస్తాడు. మార్గశీర్ష మాసంలో అంశువనే పేరుతో కశ్యప తార్క్ష్య ఋతసేన ఊర్వశీ విద్యుచ్ఛత్ర మహాశంఖులతో సంచరిస్తాడు. పుష్య మాసంలో భగుడనే పేరుతో స్ఫూర్జుడు, అరిష్టనేమి, ఊర్ణువు, ఆయువు, కర్కోటకుడు, పూర్వచిత్త అనేవారితో సంచరిస్తాడు. మాఘమాసంలో పూషుడనే పేర ధనంజయ వాత సుషేణ సురుచి ఘృతాచి గౌతములతో సంచరిస్తాడు. ఫాల్గుణ మాసంలో క్రతువనే పేరుతో వర్చుడు, భరద్వాజుడు, పర్జన్యుడు, సేనజిత్తు, విశ్వుడు, ఐరావతుడు అనేవారిని కూడి సంచరిస్తాడు.

మునులారా! ఈ పన్నెండు విష్ణువుయొక్క సూర్యరూపవిభూతులు. సూర్యుని వెంబడించేవారిలో ఋషులు వేదత్రయాన్ని చదువుతుంటారు;

గంధర్వులు కీర్తిస్తుంటారు; అప్సరసలు నాట్యం చేస్తారు; నాగులు సూర్యరథాన్ని పూన్చి పరివేష్టించి ఉంటారు; యక్షులు రథయోజన కావిస్తారు; రాక్షసులు రథాన్ని వెనుకవైపునుంచి ముందుకు తోస్తుంటారు. వాలఖిల్యులనే పేరుగల బ్రహ్మర్షులు అరవైవేలమంది రథం ముందు నిలిచి సూర్యభగవానునికి అభిముఖులై త్రయీమూర్తిని సన్నుతిస్తారు.

మునులారా! ఆదిమధ్యాంతరహితుడైన పరబ్రహ్మము ప్రతికల్పంలోనూ ద్వాదశాత్మక వ్యూహాన్ని రచించి ఈ విధంగా లోకప్రవృత్తి కావిస్తుంటాడు. ఈ పన్నెండు సూర్యరూపవిభూతులను ప్రతి దినం ఉభయసంధ్యలలో స్మరించేవారికి పాపక్షయ మవుతుంది.

## భాగవతపురాణ సందేశం

(1) భగవంతుడు సర్వేంద్రియప్రేరకుడు సర్వజీవనియామకుడని (2) భగవన్నామసంకీర్తన సర్వజనులకు నియతధర్మమని (3) భగవంతుడు నిర్గుణుడు కాబట్టి అతని తత్త్వం సమగ్రంగా తెలియాలంటే అపరోక్షజ్ఞాన మొక్కటే సాధనమని (4) అట్టి జ్ఞానానికి భక్తియోగం పరమోపాయమని (5) భక్తియోగానికి వైరాగ్యం అవసరమని శ్రీమద్భాగవతపురాణం బోధిస్తున్నది.

ఆ బోధకు పరీక్షిజ్జన్మాదిక కథలు, సందర్భానుసారమైన ఉపకథలు ఊతగర్రలు. ఏ శబ్దజాలం భగవంతుని గూర్చి పలుకుతున్నదో ఆ శబ్దజాలమే పావనతరం; తదితరమైనది హంసపరిత్యక్త వాయసతీర్థ సన్నిభం. ఏ కర్మము భగవత్పరమో అదే ఉత్తమధర్మం. ఏ కాలము భగవత్కీర్తనస్మరణాదులతో గడుస్తుందో అదే పుణ్యకాలం. అందువల్ల శాశ్వతసుఖాన్ని కోరినవారు భగవత్పాదారవిందములందు మనస్సును లగ్నం చేయాలి. తత్ఫలంగా అన్ని అమంగళాలు తొలగిపోతాయి; చిత్తశుద్ధి, భక్తి, విరక్తి, జ్ఞానోదయం కలుగుతాయి. ఎట్టకేలకు అపరోక్షజ్ఞానసంపద చేకూరి ముక్తులవుతారు.

**నమో నమస్తుభ్య మసహ్యవేగ**
**శక్తిత్రయాయాఖిలధీగుణాయ**
**ప్రపన్నపాలాయ దురంతశక్తయే**
**కర్మేంద్రియాణా మనవాప్యవర్త్మనే.**

**ఓం తత్సత్**



జన్మ గుహ్యం భగవతో య ఏతత్ప్రయతో నరః ।
సాయం ప్రాతర్గృణన్ భక్త్యా దుఃఖ గ్రామాదిముచ్యతే ॥

వ్యాస భాగవతము: I-3-29

అతిరహస్యమైన హరిజన్మ కథనంబు, మనుజుఁ డెవ్వడేని మాపు రేపుఁ
జాలభక్తి తోడఁ జదివిన సంసార, దుఃఖరాశిఁ బాసి తొలఁగి పోవు.

పోతన భాగవతము: I-66

అత్యంత రహస్యాలైన భగవంతుని ఈ అవతారగాథలు, ఏ మానవుడు ఉదయము సాయంకాలమూ అత్యంత శ్రద్ధా భక్తులతో నిత్యము పఠిస్తాడో అతడికి దుఃఖమయమైన సంసార బంధం తొలగి పోతుంది.

CONQUER YOURSELF
ISBN 93-83142-67-5 (Set)
9789383142675

రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు - 500 029
email: publication@rkmath.org

www.rkmath.org
Srimadbhagavatam ₹ 400/- (set)